శ్రీః

శ్రీవాదిరాజతీర్థశ్రీచరణవిరచితః

# రుక్మిణీశవిజయః

ఆంధ్రవ్యాఖ్యాసహితః



ప్రకాశకులు

రావి మోహనరావు

404, జంజనం కాంప్లెక్స్, చీరాల.

శ్రీః

శ్రీవాదిరాజతీర్థశ్రీచరణవిరచితః

# రుక్మిణీశవిజయః

ఆంధ్రవ్యాఖ్యాసహితః

ప్రథమ ముద్రణ : తొలిఏకాదశి, 23.07.2018
ప్రతులు : 300
పుటలు : 1112
వెల : రూ.900/-


404, Janjanam Complex, Opp. I-Town Police Station,
CHIRALA - 523 155.
Cell : 94401 15411

DTP :
**P.PARVATHI**
Cell : 7416586775

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



శ్రీః

ఎందరో మహానుభావులు. అందరికీ వందనాలు.

**'స్వామిన్! వాదిరాట్తీర్థ! చరణౌ శరణం ప్రపద్యే'**

**– రామోరా, సంపాదకులు.**

## ఓ

# మాట

రుక్మిణీశవిజయ మొక మహాకావ్యం. భాగవత దశమస్కంధంలోని కృష్ణకథ ఇందులో ప్రతిపాద్య విషయం. అది 19 సర్గల మహాకావ్యంగా రూపాన్ని పొందింది.

రుగ్మిణీశవిజయమని కవివ్యవహరించినపేరు. తెలుగువారికి రుక్మిణి అన్న పదమే బాగా పరిచయం. అందుకే జశ్త్వరహితంగా రుక్మిణి అన్నపదాన్నే స్వీకరించటం జరిగింది.

శ్లోక వ్యాఖ్యకు సంబంధించి - పదచ్ఛేదాన్ని విడిగా ఇవ్వలేదు సాధారణస్థితిలో. బంధురయమకబంధమున్నచోట మాత్రమే పదచ్ఛేదాన్ని విడిగా చూపటం జరిగింది. ధాతువులు దాదాపుగా నిరనుబంధంగానే నిర్దేశింపబడ్డాయి. క్వాచిత్కంగా సానుబంధంగా కనిపించినా అవి అజనుబంధాలే.

శ్రీ రావి మోహనరావుగారి కోరికమేరకు రుక్మిణీశవిజయాన్ని వ్యాఖ్యానించాను. సంస్కృత వాఙ్మయానికి వారు వ్యక్తిగతంగా అందిస్తున్న వరివస్యకు మనసా, వాచా, కర్మణా అభినందనలు, కృతజ్ఞతలు చెల్లించి తీరవలసినదే.

తెలుగువారికి పోతనభాగవతం సుపరిచితం. అందుకే కాలదృష్ట్యా పోతనకు దగ్గరవాడైన వాదిరాజకావ్యంలో పోతనను కూడా పోల్చి చూపటం జరిగింది అవసరమనిపించిన తావులలో.

ఈ వ్యాఖ్య వ్రాయటానికి పట్టిన కాలం పదినెలలు. అంతే వేగంగా దీనిని ముద్రణకు సిద్ధం చేయించిన శ్రీ రావి మోహనరావుగారి ఉత్సాహాన్ని అగ్గింపక తప్పదు. వ్యాఖ్యను వ్రాసేటప్పుడు నా మానాన నన్ను వ్రాసుకోనిస్తూ సహకరించిన కుటుంబసభ్యులకు పెద్దలకూ, పిల్లలకూ కూడా ఆశీస్సులు.

రెండు సరళరేఖలు స్పృశించుకొంటే (ఖండించుకొంటే) బిందువేర్పడుతుంది. రెండు సంకల్పాలు (దైవ, మానుష) ఏకమైనపుడు ఒక కార్యం జరుగుతుంది. అలా ఈ వ్యాఖ్య సమకూరటానికైన దైవీ సంకల్పానికి నమస్సులు-

**శ్లో॥ మోహముద్గరవిభంగవారణా - నిస్తులాక్షి కిరదార్ద్రభావనా ।**
**కాలకీలకమతిప్రకాశనా - మామచోదయదనన్తభావనా ॥**

**- సూరం శ్రీనివాసులు.**



ఓం

శ్రీరామచన్ద్రాయ నమః

# శ్రీవాదిరాజస్వామి (1480-1600)

**శ్లో॥ హయగ్రీవమహాభక్తాన్ మాధ్వసిద్ధాన్తకోవిదాన్ ।**
**శతాధికగ్రన్థకర్తౄన్ వాదిరాజగురూన్ భజే ॥**

శ్రీ శంకర భగవత్పాదాచార్యులు ప్రతిష్ఠించిన '**యద్వైతము**'; భగవద్రామానుజాచార్యులు స్థాపించిన '**విశిష్టాద్వైతము**'; మధ్వాచార్య శ్రీచరణులు ప్రతిపాదించిన '**ద్వైతము**' సమస్త భారతదేశములో మతత్రయముగా సుప్రసిద్ధము లైనవి. మాధ్వవాఙ్మయచరిత్రలో శ్రీమధ్వాచార్యులు - జయతీర్థులు - వ్యాసతీర్థులు - విజయీంద్రతీర్థులు - రాఘవేంద్రతీర్థులు (మంత్రాలయము) మొదలగువారి కోవకుఁ జెందినవారు శ్రీవాదిరాజతీర్థులు.

వీరు శ్రీహయగ్రీవభక్తులు, మహాకవులు, ఉద్దండపండితులు, గొప్పతార్కికులు, సకలశాస్త్రకోవిదులు, సంగీతసాహిత్యవిశారదులు, దేశభాషాప్రియులు, మాధ్వపీఠాచార్యులు, శతాధికగ్రంథకర్తలు. వీరు రచించిన '**రుక్మిణీశవిజయ**' మహాకావ్యము విపులమైన తెలుఁగు వ్యాఖ్యానముతో నేఁడు పాఠకుల కరకమలముల నలంకరించి పఠింపఁబడుచున్నది.

(1) రఘునాథాచార్యులు రచించిన '**వృత్తసంగ్రహము**', (2) రామచంద్రాచార్యులు రచించిన '**వాదిరాజ-గురుచరితామృతము**', (3) షట్పురాచార్యులు రచించిన '**వాదిరాజగుణరత్నమాల**' శ్రీవాదిరాజస్వామి జీవితచరిత్రమును సంకీర్తించు ప్రధాన గ్రంథములు. '**శ్రీవాదిరాజుల చరిత్ర**' ను శ్రీ చౌళూరు రామరావుగారు తెలుఁగులో వచన గ్రంథముగా రచించినారు.

### జన్మస్థానము

దక్షిణకర్ణాటకదేశము నందలి కుందాపురమండలములోని కుంభాసి పుణ్యక్షేత్రము ప్రక్క నున్న 'హూవినకెరె' (పూలచెఱువు) గ్రామము వీరి జన్మస్థానము.

### వంశము

వీరు సామవేదులు. తులు (శివళ్లి) బ్రాహ్మణశాఖకుఁ జెందిన వారు. వాదిరాజతీర్థుల తల్లి 'గౌరీదేవి' (సరస్వతి). తండ్రి రామాచార్యులు. ఈ దంపతులకు శ్రీవాగీశతీర్థుల యనుగ్రహమువలన నిద్దఱు కొడుకులు జన్మించిరి. పెద్దవానిపేరు భూవరాహుఁడు. వాగీశతీర్థ-విద్యానిధితీర్థుల సన్నిధిలో భూవరాహాచార్యుఁడు 8వ సంవత్సరముల వయస్సులో సన్న్యసించి పిమ్మట శ్రీమధ్వాచార్యులు 'ఉడుపి'లో స్థాపించిన యష్టమఠములలో సోదేమఠమున కధిపతులై వాదిరాజతీర్థులుగా నాచార్యపీఠము నలంకరించిరి.

### సోదేమఠాచార్యపరంపర

| | | |
|---|---|---|
| 1. శ్రీ విష్ణుతీర్థులు | 2. వేదవ్యాస-1 | 3. వేదవేద్య-1 |
| 4. వేదగర్భ | 5. వరేశ | 6. వామన |
| 7. వాసుదేవ | 8. వేదవ్యాస-2 | 9. వరాహ |
| 10. వేదాంతాత్మ | 11. విశ్వవంద్య-1 | 12. రత్నగర్భ |

| | | |
|---|---|---|
| 13. వేదాంగ | 14. విద్యాపతి | 15. విశ్వవంద్య |
| 16. విశ్వ | 17. విట్ఠల | 18. వరదరాజ-1 |
| 19. వాగీశ | 20. **వాదిరాజ** | 21. వేదవేద్య |
| 22. విద్యానిధి | 23. వేదనిధి | 24. వరదరాజ-2 |
| 25. విశ్వాధిరాజేంద్ర | 26. వాదివంద్య | 27. విశ్వవేద |
| 28. విబుధవర్య | 29. విశ్వనిధి | 30. విశ్వాధీశ |
| 31. విశ్వేశ | 32. విశ్వప్రియ | 33. విశ్వాధీశ |
| 34. విశ్వేంద్ర | 35. విశ్వోత్తమ | |

36. విశ్వవల్లభతీర్థులు(ప్రస్తుతాచార్యులు)

సోదేమఠాచార్యపరంపరలో **శ్రీవాదిరాజతీర్థులు** 20వ యాచార్యులు.

**కాలము**

వాదిరాజస్వామి 120 సంవత్సరములు జీవించినట్లు ప్రసిద్ధి. శార్వరి సంవత్సర (క్రీ.శ. 1480) మాఘశుద్ధద్వాదశీ బుధవారము స్వాతీనక్షత్రమందు స్వామివారి జననము.

శార్వరి సంవత్సర (క్రీ.శ. 1600) ఫాల్గున బహుళతృతీయా (తదియ) గురువారమునాఁడు స్వామివారి పరమపదగమనము (బృందావనప్రవేశము)

శ్లో॥ స్వస్తిశ్రీజయశాలివాహనశకే సార్ధాత్ సహస్రాత్ పరం
ద్వావింశో శరదాం గతే ప్రభవతి శ్రీశార్వరీవత్సరే ।
మాసే ఫాల్గునకే సితేతరతృతీయాయాం తిథౌ విద్దినే
స్వాతీహర్షణసంయుతే హరిపదం శ్రీవాదిరాజో హ్యగాత్ ॥

అని శ్రీవాదిరాజగురువరచరితామృతము(6-72).

దీనినిబట్టి వాదిరాజులు 1480-1600 కాలములో జీవించినట్లు తెలియుచున్నది.

1571;1582;1593 సంవత్సరములలో లిఖింపఁబడిన 3 శాసనములు శ్రీవాదిరాజస్వామికి సంబంధించినవి లభించుచున్నవి.

**గురువులు**

వాగీశ తీర్థులు, విద్యానిధితీర్థులు వీరి విద్యాగురువులు. 'న్యాయామృతము', 'తర్కతాండవము', తాత్పర్యచంద్రిక మొదలగు గ్రంథములు రచించిన శ్రీవ్యాసరాజతీర్థులు (1460-1539) కూడ వీరి శాస్త్రగురువు లని దాసకీర్తనలను బట్టి తెలియుచున్నది.

**సమకాలికపండితులు**

వాదిరాజస్వామి సోదరుఁడు 'సురోత్తమతీర్థ'లను పేరుతో 'భండారకెరె' మఠములో 16వ యాచార్యులుగా నియమింపఁబడిరి. వీరు శ్రీవాదిరాజస్వామి రచించిన (1)'యుక్తిమల్లిక'కు, (2) 'పాషాండమతఖండనము'నకు (3) శ్రీవిష్ణుతీర్థులు రచించిన 'సన్న్యాసపద్ధతి'కి (4) శ్రీమధ్వాచార్యుల 'సదాచారస్మృతి'కి వ్యాఖ్యలు వెలయించిరి.

శతాధిక గ్రంథకర్తలైన శ్రీవిజయీంద్రతీర్థులు (1514-1595), సుప్రసిద్ధకన్నడ వాగ్గేయకారులైన పురందరదాసు, కనకదాసు మొదలగువారు కూడ వీరికి సమకాలికులు.

### ఆదరించిన చక్రవర్తులు

విజయనగర మహారాజులైన శ్రీకృష్ణదేవరాయలు (1509–1530); అచ్యుతదేవరాయలు (1530–1542); సోదే మండలాధిపతియైన యరసప్పనాయకుఁడు శ్రీవాదిరాజస్వామి నాదరించి గౌరవించిరి.

### బిరుదులు

**'కవికులతిలక'** – **'సర్వజ్ఞకల్ప'** – **'షడ్దర్శనషణ్ముఖ'** – **'ప్రసంగాభరణ'** – మొదలగునవి వీరి బిరుదములు.

### వాదిరాజస్వామి కృతులు

**1. వ్యాఖ్యాన గ్రంథములు :**

1. ఆథర్వణోపనిషద్భాష్యటీక
2. ఈశావాస్యోపనిషద్భాష్యటీకాటిప్పణి
3. కాఠకోపనిషద్భాష్యటీక
4. గీతాభాష్యటిప్పణి
5. తత్త్వప్రకాశికాగుర్వర్థదీపిక
6. తలవకారోపనిషద్భాష్యటీక
7. తంత్రసారటీక
8. తైత్తిరీయోపనిషద్భాష్యటీక
9. న్యాయసుధాగుర్వర్థదీపిక
10. పురుషసూక్తవ్యాఖ్య
11. ప్రశ్నోపనిషద్భాష్యటీక
12. భాగవతసంగ్రహవ్యాఖ్య
13. మహాభారతలక్షాలంకారము
14. మహాభారతతాత్పర్యనిర్ణయభావప్రకాశిక
15. మాండూక్యోపనిషద్భాష్యటీక
16. సనత్సుజాతీయవ్యాఖ్య.

**2. స్వతంత్రగ్రంథములు :**

1. అధికరణనామావళి
2. ఉపదేశరత్నమాల
3. ఏకాదశీనిర్ణయము (55 శ్లో?)
4. కల్పలత
5. చక్రస్తుతి (76 శ్లో.)
6. చింతాఖండనము (15)
7. తారతమ్యము (81 శ్లో.)
8. నయసిద్ధాంతసంగ్రహము
9. న్యాయరత్నావళి (901 శ్లో.)
10. పాషండమతఖండనము
11. పాషండఖండనవ్యాసస్తోత్రము
12. భూగోలనిర్ణయము (361 శ్లో.)
13. మాధ్వవాగ్వజ్రావళి
14. ముహూర్తరాజము
15. యుక్తిమల్లిక
16. వాయుస్తుతిపురశ్చరణవిధి
17. వివరణవ్రణము
18. శకునమాల
19. శ్రీమద్భాగవతనామానుక్రమణిక
20. శ్రుతితత్త్వప్రకాశిక
21. సదాచారస్మృతి
22. సంకల్పపద్ధతి
23. సంస్కృత–సూత్రార్థము
24. హరిభక్తలత

### యుక్తిమల్లిక

శ్రీవాదిరాజస్వామి రచించిన శాస్త్రవాదగ్రంథములలో **యుక్తిమల్లిక** గొప్ప గ్రంథము, పెద్ద గ్రంథము. యుక్తిమల్లికలో 1. **గుణ** 2. **శుద్ధి** 3. **భేద** 4. **విశ్వ** 5. **ఫలము**లను 5 సౌరభములు మొత్తము **5379** శ్లోకములు గలవు. దీనిలోఁ బరమతఖండనము, స్వమతస్థాపనము సమానముగాఁ గలవు.

1. గుణసౌరభములో శ్రీవిష్ణుమూర్తి సర్వగుణపూర్ణత్వము నిరూపింపఁబడినది. 2. శుద్ధి సౌరభములో విష్ణుమూర్తి నిర్దోషత్వము ప్రతిపాదింపఁబడినది. 3. భేదసౌరభములో బ్రహ్మసూత్రసమన్వయపూర్వకముగా

జీవేశ్వరభేదము స్థాపింపఁబడినది. 4. విశ్వ–సౌరభములో జగత్తు సత్యమని నిర్ణయింపఁబడినది. 5. ఫలసౌరభములో బ్రహ్మమీమాంసలో నాల్గవదగు సాధనాధ్యాయములోఁ జెప్పఁబడిన సాధనఫలము విస్తరింపఁ బడినది. గ్రంథారంభములో మాధ్వమతప్రమేయములు, ప్రమాణములు, వేదముల నిత్యత్వము, స్వతఃప్రామాణ్యము సాధింపఁబడినవి.

శ్లో॥ నాన్యం భజామి న స్తౌమి నానుయామి కదాచన ।
హరిం చ హరిపత్నీం చ సురాదీంశ్చ గురూన్ వినా ॥

శ్లో॥ పద్మాఖ్యసూత్రబద్ధేయం హృద్యా స్యాద్ యుక్తిమల్లికా ।
పద్మనాభస్య మధ్వస్య విద్యాయాశ్చ మనఃప్రియా ॥

శ్లో॥ ఆచార్యః పవనోఽస్మాక మాచార్యాణీ చ భారతీ ।
దేవో నారాయణః శ్రీశో దేవీ మంగలదేవతా ॥

నేను తక్కినదేవతలను భజింపను. స్తుతింపను. అనుగమింపను. శ్రీవిష్ణుమూర్తిని, లక్ష్మీదేవిని, దేవతలను, గురువులను మాత్రమే భజింతును. పద్యములను సూత్రములతో హృద్యముగా యుక్తిమల్లిక రచింపఁబడినది. శ్రీవిష్ణుమూర్తికి, మధ్వాచార్యులకు విద్యకు మనఃప్రియ యైనది **యుక్తిమల్లిక**. మాకు వాయుదేవుఁడాచార్యుఁడు. గురుపత్ని, ఉపాధ్యాయురాలు భారతి. శ్రీమన్నారాయణుఁడే దేవుఁడు. మంగళదేవత యగు మహాలక్ష్మియే దేవత– అను శ్లోకములతో గ్రంథము ముగింపఁబడినది.

**యుక్తిమల్లిక వాదిరాజసర్వస్వము.**

**3. స్తోత్రములు :**

1. అక్షరపంచకము (6 శ్లో.)
2. అభయసంస్తవము (13 శ్లో.)
3. అవతారత్రయస్తోత్రము
4. అష్టమహిషీయుక్తకృష్ణస్తుతి (9)
5. అపాదస్తోత్రము
6. ఉక్తి ప్రత్యుక్తి స్తోత్రము
7. ఋణమోచనస్తోత్రము
8. కురుస్తుతి (15)
9. చతుర్వింశతిమూర్తిభేదస్తోత్రము
10. త్రివిక్రమస్తోత్రము (18)
11. దశావతారస్తుతి (34)
12. దశావతారస్తోత్రము (9)
13. దుర్గాస్తవము
14. ధీశుద్ధిస్తోత్రము (12)
15. నరహర్యష్టకము
16. నవగ్రహస్తోత్రము (5)
17. పరమస్తుతి (9)
18. ప్రార్థనాదశకము (12)
19. మధ్వమునిప్రతాపాష్టకము (9)
20. మధ్వాష్టకము (9)
21. రమేశస్తుతి (4)
22. రౌప్యపీఠకృష్ణస్తుతి (9)
23. లక్ష్మ్యార్యావృత్తము (13)
24. వరాహహయవదనస్తోత్రము
25. విభీషణ–హనుమత్–సంవాదరూప వాయుస్తుతి.
26. విష్ణుస్తుతి
27. వేదవ్యాసాష్టకము
28. వేంకటేశమంగళాష్టకము
29. శ్రీకృష్ణస్తవము (9)
30. శ్రీకృష్ణస్తుతి (9)
31. శ్రీపాదరాజాష్టకము (9)
32. శ్రీరామ కవచము
33. శ్రీరామ దశకము
34. శ్రీరామ పంచకము
35. శ్రీశ్రీశగుణదర్పణము (19)

36. శ్రీహయగ్రీవస్తోత్రము
37. శ్లోకత్రయము
38. సప్తరాత్రోత్సవప్రకారము
39. సహస్రారస్తుతి (చక్రస్తుతి)(13)
40. స్వప్న గద్యము
41. హయగ్రీవస్తుతి (18)
42. హయగ్రీవసంపదాస్తోత్రము(39)
43. హయవదనధ్యానప్రకరణము (39)
44. హయవదనాష్టకము (9)
45. హయాస్యదశకము (11)
46. హయాస్యనుతిపంచకము (6)
47. హరిభక్తాష్టకము (9)
48. హర్యష్టకము (9)
49. హయగ్రీవదండకము మొదలగునవి.

శ్రీవాదిరాజతీర్థులు తమ యిష్టదైవమగు హయగ్రీవునిపై నెక్కువ స్తోత్రములు రచించిరి. వాదిరాజస్వామి యుడికించిన శనగలను నైవైద్యము పెట్టి యాప్రసాదమును బుట్టతోఁ దలపైఁ బెట్టుకొని ధ్యానము చేసినప్పుడు హయగ్రీవస్వామి ప్రత్యక్షముగా వచ్చి యా శనగలను భుజించెడివాఁడఁట!

శ్రీహయగ్రీవసాక్షాత్కారములో, సర్వతంత్రస్వతంత్రత్వములో, శతాధికగ్రంథకర్తృత్వములో శ్రీవాదిరాజస్వామికి **శ్రీ బెల్లంకొండ రామరాయకవీంద్రులే** సాటి.

వాదిరాజస్వామి రచించిన స్తోత్రములలో నశ్వధాటీనిబద్ధమైన **దశావతారస్తుతి** ప్రచురప్రచారము పొందినది. దీనిలో 34 శ్లోకములు గలవు. మచ్చునకు రెండు శ్లోకముల నుదాహరించుచున్నాను.

శ్లో॥ శ్రీరామ లక్ష్మణశుకారామభూరవతు గౌరామలామితమహో-
హారామరస్తుతయశోరామకాంతిసుతనో రామలబ్ధకలహ! ।
స్వారామవర్యరిపువీరామయర్ధికర చీరామలావృతకటే
స్వారామదర్శనజమారామయాగతసుఘోరామనోరథహర ॥ 12

శ్లో॥ గ్రీవాస్యవాహతనుదేవాండజాదిదశభావాభిరామచరితం
భావాతిభవ్యశుభధీవాదిరాజయతిభూవాగ్విలాసనిలయమ్ ।
శ్రీవాగధీశముఖదేవాభినమ్యహరిసేవార్చనేషు పఠతా-
మావాస ఏవ భవితాఽవాగ్భవేతరసురావాసలోకనికరే ॥ 34

**4. కావ్యములు :**

1. కవికదంబక కంఠభూష (శ్రీకృష్ణరామావతారచరితరత్నసంగ్రహము)
2. తీర్థప్రబంధము
3. రుక్మిణీశవిజయము
4. సరసభారతీవిలాసము

**5. కన్నడ గ్రంథములు :**

1. అవతారత్రయముక్తావళి
2. ఉగాభోగ (గళు)ములు
3. కేశవనామము
4. గుండక్రియ
5. దేవరనామ(గళు)ములు
6. నమస్కారస్తోత్రము
7. నైవేద్యప్రకరణము
8. భ్రమరగీతలు
9. లక్ష్మీశోభనము
10. వైకుంఠవర్ణనము
11. సుళాది
12. స్వప్నపదము

**6. తుళుగ్రంథము :** 1. దశావతారస్తుతి.

**కావ్యపరిచయము**

**1. కవికదంబకంఠభూష :**

ఇది చిన్న లఘు కావ్యము. 15 శ్లోకము లున్నవి. 13శ్లోకములలో శ్రీకృష్ణ చరిత్రము, 1 శ్లోకములో శ్రీరామస్తవము, చివర శ్లోకములో గ్రంథ-కవినామములు గలవు. మచ్చునకు 2 శ్లోకములు-

శ్లో॥ బ్రహ్మేశశక్రముఖదేవవరార్థితో యః
శ్రీదేవకీతనయతామధిగమ్య గోష్ఠే ।
ప్రాక్ పూతనాశకటవాతవినాశకారీ
భూత్వా బభంజ శిశురర్జునపాదపౌ ద్వౌ ॥ 2

శ్లో॥ కౌసల్యాసుత! తాటకామథ! మఖత్రాతర్! మునిస్త్రీహిత!
ఛిన్నేష్వాసన! జానకీవృత! వనావాసిన్! ఖరాద్యంతక! ।
మారీచఘ్న! హనూమదీశ! రవిజార్తిచ్ఛేద! బద్ధాంబుధే!
సేనాభ్రాతృసమేత! రావణరిపో! సీతేష్ట! రామావ మామ్ ॥

దీనికే **శ్రీకృష్ణరామావతారచరిత్రసంగ్రహ** మని మఱియొక పేరు.

**2. తీర్థప్రబంధము :**

శ్రీవాదిరాజస్వామి సంపూర్ణభారతయాత్ర చేసినప్పుడు సేవించిన పవిత్రక్షేత్రములు, పుణ్యనదులు దీనిలో వర్ణింపఁబడినవి. ఈ కావ్యములో 4 పరిచ్ఛేదములు గలవు.

1. పశ్చిమ (పడమర) దిగ్యాత్రలో - ఉడుపి, మధ్యతాలము, నరసింహక్షేత్రము, నేత్రావతీనది, కుమారధార, సుబ్రహ్మణ్యక్షేత్రము, పయస్వినీనది, సువర్ణ, కుంభాసి, సహ్యాద్రి, సోమేశ్వర-అశ్వత్థనారాయణదేవాలయములు, బంకాపురి, వరదానది, బనవాసి, మధులింగక్షేత్రము, సోదె, గోకర్ణము, కొల్హాపురము, తపతి, నర్మద, ప్రభాసము, ద్వారక, గోమతి, పుష్కరము (రాజస్థాన్-అజ్మేర్) - వర్ణింపఁబడినవి.

2. ఉత్తరయాత్రలో - కృష్ణవేణి, పండరీపురము, గోదావరి, యమున, ప్రయాగ, కాశి, బిందుమాధవము, విశ్వనాథస్వామి, గయ, గదాధర-విష్ణుపాదములు, మథుర, బృందావనము, అయోధ్య, నైమిశారణ్యము, హస్తినాపురము (ఢిల్లీ) కురుక్షేత్రము, బదరి వర్ణింపఁబడినవి.

3. పూర్వ (తూర్పు) యాత్రలో పూరీ-జగన్నాథము, అహోబలము, నివృత్తిసంగమము, తుంగభద్ర, విజయనగరములోని విట్ఠల-విరూపాక్షాలయములు, పంప, ఆనెగొంది, తిరుపతి, కంచిలోని యేకామ్రనాథ - కామాక్షీ - వరదరాజాలయములు, తిరువణ్ణామల, త్రివిక్రమాలయము (తిరుకోయిల), వృద్ధాచలము, శ్రీముష్ణము, కుంభకోణము వర్ణింపఁబడినవి.

4. దక్షిణదిగ్యాత్రలో శ్రీరంగము, దర్భశయనము, రామేశ్వరము, ధనుష్కోటి, తామ్రపర్ణి, కన్యాకుమారి, శుచీంద్రము, అనంతశయనము (త్రివేంద్రము) వర్ణింపఁబడినవి.

తీర్థప్రబంధము వేంకటాధ్వరి 'విశ్వగుణాదర్శము' వంటికావ్యము. సమరపుంగవదీక్షితుని 'యాత్రాప్రబంధము' కూడ నిట్టిదే.

**3. సరసభారతీవిలాసము :**

ఈ కావ్యములో 12 విలాసములు కలవు. శ్రీదేవత, బ్రహ్మ, వాణి, ప్రాణదేవత - వీరి స్వరూపము చెప్పఁ బడినది. భారతీదేవి త్రిమూర్తిస్వరూపిణిగా వర్ణింపఁబడినది.

## రుక్మిణీశవిజయము

శ్రీవాదిరాజస్వామి రచించిన శాస్త్రగ్రంథములలో "**యుక్తిమల్లిక**" యెంత గొప్పదో కావ్యములలో 'రుక్మిణీశవిజయ' మంత గొప్పది. యుక్తిమల్లిక వాదిరాజును మహాపండితుఁడుగా, రుక్మిణీశవిజయము మహాకవిగా మాధ్వవాఙ్మయచరిత్రలో మహోన్నత స్థానమును గల్పించినవి.

రుక్మిణీశవిజయములో 19 సర్గములు, మొత్తము 1222 శ్లోకములు నున్నవి. 1. శ్రీకృష్ణావతారము 2. శ్రీకృష్ణుని గోకుల ప్రవేశము 3. శ్రీకృష్ణుఁడు యశోదకు విశ్వరూపమును బ్రదర్శించుట 4. యమలార్జున భంజనము, వత్సాసుర-బకాసురవధ, కాళియమర్దనము 5. నీలాస్వయంవరము, గోపీ జలక్రీడ, గోవర్ధనోద్ధరణము 6. ఇంద్రశరణాగతి, శ్రీకృష్ణగోపీసల్లాపము 7. గోపికల విలాపము 8. రాసక్రీడ 9. రాసక్రీడావర్ణనము, శ్రీకృష్ణ బ్రహ్మచర్యము, 10. శంఖచూడ-అరిష్టాసుర-కేశి-రాక్షసవధ, అక్రూరసమాగమము, మథురాప్రవేశము 11. చాణూర-ముష్టిక-కంసవధ 12. బలరామకృష్ణుల యుపనయనము (వడుగు) , శ్రీకృష్ణుఁడు గురుపుత్రుని బ్రతికించుట, 13. ఉద్ధవ సమాగము, భ్రమరగీత 14. జరాసంధపరాభవము, ద్వారకానిర్మాణము, కాలయవనవధ, శ్రీకృష్ణుఁడు ముచుకుందు ననుగ్రహించుట, రుక్మిణీహరణము 15. రుక్మిపరాభవము, రుక్మిణీకృష్ణుల ద్వారకాగమనము, శ్రీకృష్ణుని కాశీయాత్ర 16. రుక్మిణీ స్వయంవరము, రుక్మిణీకల్యాణము 17. మునులు శ్రీకృష్ణుని స్తుతించుట, ద్వారకావర్ణనము, 18. శ్రీకృష్ణ-రుక్మిణీదేవుల వర్ణన 19. రుక్మిణీసౌందర్యము, శ్రీకృష్ణుఁడు జాంబవతి మొదలగు వారిని వివాహమాడుట, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, ప్రద్యుమ్న జననము, అనిరుద్ధ, వజ్రుల జన్మము, శ్రీకృష్ణమాహాత్మ్యము క్రమముగా వర్ణింపఁబడినవి.

**మహాకావ్యలక్షణములు :**

రుక్మిణీశవిజయములో మహాకావ్యలక్షణములు పుష్కలముగాఁ గలవు. ఇది సర్గబంధమగు మహాకావ్యము. ఇందలి నాయకుఁడు శ్రీకృష్ణుఁడు. రుక్మిణీదేవి నాయిక. కంసాదులు ప్రతినాయకులు. శృంగారము ప్రధానరసము. వీరము మొదలగునవి యంగరసములు. లేదా కావ్యమంతట ప్రధానరసము మధురభక్తి.

ఆలంకారికులు నిర్దేశించిన వర్ణనము లన్నియు నిందుఁ గలవు. 1. సూర్యోదయము (2 సర్గము); 2. సూర్యాస్తమయము (6స.); 3. చంద్రోదయము (6 స.); 4. వసంత ఋతువు (4 స.); 5. గ్రీష్మ-వర్ష-శరద్-హేమంతములు (5స.); 6. గోవర్ధనపర్వతము (6 స.); 7. నగర వర్ణనము (17 స.); 8. యుద్ధము (13 స.); 9. ప్రయాణము (1 స.,15 స.); 10. దౌత్యము (11 స.); 11. బృందావనము (4 స., 9 స.); 12. వివాహము (5-17-19 స.); 13. విప్రలంభము (6-7-8-13 స.); 14. రాసక్రీడ (9 స.); 15. గోపీ విలాపము (10 స.); 16. మంత్రము (12 స.); 17. నాయక-నాయికా సౌందర్యము (18 స.); 18. యాత్ర (19 స.); 19. గర్భము (19 స.); 20. పుత్రోత్పత్తి మొదలగునవి యన్నియు విస్తరముగా వర్ణింపఁ బడినవి.

**ఛందోవైవిధ్యము :**

సాధారణముగా సంస్కృతకావ్యములలో సర్గమంతయు నొకే వృత్తములో నుండి సర్గాంతమున విశేష-వృత్తముండును. చంపూ కావ్యములలో మాత్రము పద్య-గద్యములు కలిసియుండును గావున నొకే సర్గములో వివిధవృత్తములుండును. రుక్మిణీశవిజయము సంపూర్ణ పద్యకావ్యము. గద్యము లేదు. అయినను వాదిరాజస్వామి చంపూపద్ధతి ననుసరించి యొకే సర్గములో వివిధవృత్తములు ప్రయోగించినాఁడు.

1. అనుష్టుప్ (4-7); 2. ఆర్య (9-33); 3. ఇంద్రవజ్ర (1-4); 4. ఉపేంద్రవజ్ర. (1-8); 5. తురగరయము (6-41); 6. దోధకము (8-3); 7. ద్రుతవిలంబితము (4-38); 8. పథ్యావక్త్ర (1-3); 9. పుష్పితాగ్ర (10-37); 10. పృథ్వి (14-37); 11. ప్రియవాదిని (8-1); 12. మాలిని (4-3); 13. మందాక్రాంత (5-24);

14. వసంతతిలక (1-5); 15. వంశస్థము (2-34); 16. శార్దూలవిక్రీడితము (1-1); 17. శిఖరిణి (11-13); 18. స్రగ్విణి (8-7); 19. స్రగ్ధర (4-32) మొదలగునవి.

**అలంకారయోజనము :**

కావ్యలక్ష్మికి శబ్దార్థాలంకారములే సువర్ణాభరణములు. ఈ కావ్యములో యమక శ్లోకములు, నర్థాలంకారములు పుష్కలముగాఁ గలవు.

**యమకములు :**

ఇందలి 4వ సర్గములో యమకశ్లోకము లెక్కువగాఁ గలవు.

వనరమా నరమానసమండనమ్ (4-38)

అఖిలదర్పకదర్పకసాయకే (4-39)

పిబత మాబత మాన ఇహోచితః (4-40)

అలికులాలికులాభ్యుదితామితి (4-41) మొదలగునవి.

**అర్థాలంకారములు :**

1. అతిశయోక్తి (7-13); 2. అత్యుక్తి (17-31); ఆక్షేపము (6-56); 4. ఆశీః (1-6); 5. ఉత్ప్రేక్ష (1-2); 6. కావ్యలింగము (1-8); 7. క్రియాజాతి (1-16); 8. జాతి (3-16); 9. తుల్యయోగిత (2-9); 10. దీపకము (6-44); 11. నిదర్శనము (1-9); 12. దృష్టాంతము (5-33); 13. పరిణామము (1-3); 14. పర్యాయోక్తము (1-17); 15. ప్రతివస్తూపమ (5-37); 16. భ్రాంతిమంతము (6-1); 17. యుక్తి (1-47); 18. రూపకము (1-11); 19. వస్తుతత్త్వము - ఉత్ప్రేక్ష (1-35); 20. వాకోవాక్యము (3-12); 21. వినిమయము (6-18); 22. విభావన (1-57); 23. వ్యతిరేకము (14-59); 24. వ్యాజస్తుతి (5-12); 25. సమాసోక్తి (6-33); 26. సంకరము (2-24); 27. సంసృష్టి (4-23); 28. స్వభావోక్తి (1-4); 29. హేతువు - ఉపమామూలకము (18-1) మొదలగునవి.

**నిరుక్తి :**

శ్లో॥ యదా స పద్మాసనసంస్థితోఽలం - జజాప విద్యామితరైరవేద్యామ్ ।
తదా ప్రభృత్యేవ జగత్సు నూనం - బభూవ పద్మాసనశబ్దితోఽసౌ ॥ (1-17)

బ్రహ్మ పద్మాసనము వేసికొని విద్యను జపించెను. అప్పటి నుండియే బ్రహ్మకుఁ బద్మాసనుఁ డని పేరువచ్చిన దని భావము.

పద్మమాసనముగాఁగలవాఁడు కావున బ్రహ్మ పద్మాసనుఁ డైనాఁడు. ఇక్కడఁ బద్మాసనము వేసికొని యోగాభ్యాసము చేసి విద్యను జపించుటచేఁ బద్మాసనుఁ డైనాఁడని క్రొత్త నిర్వచనమును గల్పించుటచే **నిరుక్తి** యలంకారము.

శ్లో॥ నిరుక్తిర్యోగతో నామ్నామన్యార్థత్వప్రకల్పనమ్ ।
ఈదృశైశ్చరితైర్జానే సత్యం దోషాకరో భవాన్ ॥ అని చంద్రాలోకము.

ఇక్కడ వ్యాఖ్యాత - 'ఉత్ప్రేక్షాలంకారః । పద్మాసనశబ్దస్య శ్లిష్టత్వాత్ శ్లిష్టగర్భితోఽయమ్' - అని చెప్పుట సరిగాదు.

**ముద్రాలంకారము :**

శ్లో॥ లక్ష్మీశోఽనుకరోతి తత్ర విచరన్ శార్దూలవిక్రీడితమ్ (4-28)

ఇందు వృత్తనామము నాపద్యమునందే సూచించుటచే ముద్రాలంకారము.

శ్లో॥ సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః ।
నితంబగుర్వీతరుణీదృగ్యుగ్మవిపులా చ సా ॥

అని చంద్రాలోకము. ఇట్టి వానిని వ్యాఖ్యాత సూచించిన బాగుండును.

పాదాంతయమకము (7-58); ఏకాక్షరి (7-62); ద్వ్యక్షరి (7-54); పద్మబంధము (17-70); చక్రబంధము (19-36) మున్నగు చిత్రకవిత్వము గలదు.

రుక్మిణీశవిజయమును శ్రీవాదిరాజస్వామి పుణ్య (పూణే) పట్టణములో రచించెను. దీని కొక చిన్ని కథ కలదు. ఆ కాలములో 'దాదాజి' యను సర్దారుఁడు పూణే (పుణ్య-పూనా) పట్టణము నేలుచుండెను. ఆతఁ డొక వార్షికోత్సవములో దర్బారు చేసి సంస్కృతకావ్యములలో నేది యుత్తమమైన దని పండితులను ప్రశ్నించెనఁట. మాఘ మహాకవి రచించిన '**శిశుపాల వధ**' కావ్యము శ్రేష్ఠమైన దని పండితులు బదులు చెప్పినారఁట; అప్పుడా సభలో నున్న వాదిరాజస్వామి లేచి 'రుక్మిణీశవిజయ'మను కావ్యము కలదు. అది శిశుపాలవధ కంటె మిన్నయైనది. 19 దినములు గడు విచ్చినచో నా కావ్యమును దెచ్చి చూపెదనని చెప్పి తన నివాసమునకు వచ్చి 19 దినములలో 19 సర్గములు గల రుక్మిణీశవిజయమును రచించి రాజునకుఁ జూపెనఁట. ఆ కావ్యమును పండితులందఱు పఠించి మాఘకావ్యము కంటె గొప్పదని మెచ్చుకొనిరఁట. అంత దాదాజి చక్రవర్తి **రుక్మిణీశవిజయము**నకు సంస్కృతకావ్యములలో నగ్రస్థానమిచ్చి పూజించి వాదిరాజస్వామి నాదరించి '**కవికులతిలక**' బిరుదమిచ్చి సత్కరించెనఁట. మాధ్వసాహిత్యగ్రంథములలో నారాయణపండితుని 'సుమధ్వ విజయము' తరువాత రుక్మిణీశవిజయమే శ్రేష్ఠమైన కావ్యమని మాధ్వపండితుల భావన.

### రుక్మిణీశవిజయమా? రుగ్మిణీశవిజయమా?

శ్రీకృష్ణుని భార్య రుక్మిణీదేవి. రుక్మిణీశశబ్దము రుక్మిశబ్దమునుండి పుట్టినది.

'రుక్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదో2 స్త్రియామ్' - అని యమరము. రుక్మమ్ = బంగారము. రుక్మి(న్) = బంగారము గలవాఁడు. రుక్మిణి = బంగారము గలది.

రుక్మిన్.త్రి.-రుక్మం విద్యతేఽస్య ఇని । (1) స్వర్ణయుక్తే (2) భీష్మకరాజజ్యేష్ఠపుత్రే (3) రాజభేదే (భాగ-10-52) । రుక్మిరాజకన్యాయాం శ్రీకృష్ణపత్న్యాం స్త్రీ. జీష్-అని వాచస్పత్యము సంస్కృతనిఘంటువుల యందు, సకల గ్రంథములందు 'రుక్మిణీ' శబ్దమే కలదు. రుగ్మిణీ శబ్ద మెచ్చటను గానరాదు.

రుగ్ణుఁడు = జబ్బుపడినవాఁడు. 'రుగ్మత = జబ్బు' - అని లోకవ్యవహారము. కాఁబట్టి శ్రీకృష్ణుని భార్య 'రుక్మిణి' యే కాని 'రుగ్మిణి' కాదు. కాని వాదిరాజస్వామి తన కావ్యమునకు 'రుగ్మిణీశవిజయ'మని పేరుపెట్టినట్లు కావ్యమునందలి పద్మబంధ-చక్రబంధశ్లోకములను బట్టి తెలియుచున్నది.

శ్లో॥ **వా**చా యః కీర్తితోఽలం **ది**విజవరసభా**రా**ధితానాం మునీనాం
**జ**న్మాంతాద్యేనసాం యో **ర**చయతి విహతిం **చి**త్ఫలం సుప్రగీ**త**ః ।
**రు**గ్భేదీ ప్రౌఢసద్వాగ్మిషువివిధసువా**ణీ**విలాసైః ప్రతర్క్యః
**శ**స్తోఽస్యాదౌ తథాంతే **వి**మలయతితతేర్జల్పశుద్ధౌ సహా**య**ః ॥ 17-70

ఈ పద్మబంధశ్లోకములో "వాదిరాజరచితః రుగ్మిణీశవిజయః" అని కలదు.

శ్లో॥ వందా**రు**ద్విజవర్య**వా**ఞ్ఛితనిజ**ధ్యా**నక్షమా**శ**ఙ్కరః
స్వర్వాగ్మి**వ్ర**జవర్ణ్య**ది**గ్వితతి**కృ**త్కర్మౌఘ**రా**జత్కరీ ।
రుద్రా**ణీ** పతిమాన్య**రా**జితగ**తిః** సత్యాసహా**యః** సతాం
తాం రేమే వరదః స్వబంధురుచిరాం రక్షన్ పురీమద్భుతామ్ ॥ 19-36

ఈ చక్రబంధశ్లోకములో నాల్గవ వలయమునందు '**రుగ్మిణీశజయః**' అని; తొమ్మిదవ వలయమునందు 'వాదిరాజకృతిః' అని కలదు.

దీనినిబట్టి వాదిరాజస్వామి తనకావ్యమును '**రుగ్మిణీశవిజయ**'మనియే వ్యవహరించినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది.

వాదిరాజస్వామి యష్టమహిషీయుక్తశ్రీకృష్ణస్తోత్రములోఁగూడ '**రుగ్మిణి**' యనియే ప్రయోగించినాఁడు–

శ్లో॥ హృద్గుహాశ్రిత! పక్షీన్ద్రవల్గువాక్యైః కృతస్తవ! ।
తద్గరుత్కన్ధరారూఢ! రుగ్మిణీశ! నమోఽస్తుతే ॥ 1

రుక్మిణీశవిజయవ్యాఖ్యాత యగు నారాయణభట్టు–

'రుగ్మం కార్తస్వరం జాంబూనదమష్టాపదోఽస్త్రియామ్'

అని యమరకోశపాఠమును రుగ్మముగా మార్చి యుదాహరించినాఁడు.

**రుక్మ** శబ్దమే సాధువు కాని **రుగ్మ** శబ్దము సాధువు కాదు.

'రుచ' – దీప్తావభిప్రీతౌ చ – రుక్మమ్ – అని మాధవీయధాతువృత్తి.

రుచ –దీప్తౌ అభిప్రీతౌ చ – రుక్మమ్ । యుచి–రుచి–తిజాంకుశ్చ (ద.ఉ.–7–33) ఇతి మక్ప్రత్యయః । కవర్గశ్చాంతాదేశః । రోచతేఽతిశయే నేతి రుక్మం = సువర్ణమ్॥ అని బృహద్ధాతుకుసుమాకరము రుచ– ధాతువునుండి రుక్మ శబ్దము పుట్టినది. చకారమునకు–కకారము వచ్చి రుక్మమైనది. చకారమునకు 'గ'కారము వచ్చుట వ్యాకరణవిరుద్ధము. కావున వాదిరాజస్వామి 'రుగ్మిణీశవిజయ'మని పేరుపెట్టుట; వ్యాఖ్యాత 'రుగ్మం కార్తస్వరమ్' అని యమరకోశపాఠమును మార్చి యుదాహరించుట ప్రౌఢివాదము.

మాధ్వులభాష, యపూర్వశబ్దమాటసృష్టి; విచిత్రపదవిభాగములు, విపరీతార్థకల్పన, మొదలగునవి యీవిధముగానే యుండును. వాదిరాజబంధశ్లోకముల ననుసరించి శ్రీన్యాసంకరె ప్రభంజనాచార్యులు 'రుగ్మిణీశవిజయ'మనియే గ్రంథమును బ్రకటించినారు. శ్రీ H.K. శ్రీనివాసరావుగారు 'రుక్మిణీశవిజయ'మనియే గ్రంథమును బ్రకటించినారు. శ్రీ B.N.K. శర్మ మొదలగు మాధ్వవాఙ్మయచరిత్రకారులు రుక్మిణీశవిజయ మనియే వ్యవహరించినారు.

బంధశ్లోకములను బ్రక్కకు నెట్టి '**రుక్మిణీశవిజయ**' మనుటయే న్యాయ్యము.

**నారాయణభట్టు**

రుక్మిణీశవిజయమునకు 'గురుభావప్రకాశిక' యను విపులవ్యాఖ్యను రచించిన వారు శ్రీ నారాయణభట్టు. వీరు శ్రీవాదిరాజస్వామికి సాక్షాచ్ఛిష్యులు.

శ్లో॥ వాదిరాజోక్తిచాతుర్యమశక్యం జ్ఞాతుమంజసా ।
తథాఽపి వక్ష్యే తచ్ఛిక్షామనుసృత్యైవ లేశతః ॥

అని వ్యాఖ్యానారంభములోఁజెప్పుకొనినారు. ఈవ్యాఖ్య మల్లినాథవ్యాఖ్యానశైలిలో సాగినది. అన్వయక్రమముతో శ్లోకమునందలి ప్రతిపదమును వ్యాఖ్యానించుట, పదములకర్థ నిర్ణయముచేయుటలో నిఘంటువుల నుదాహరించుట, ఛందోలక్షణనిరూపణము, అలంకారసమన్వయము, విశేషవిషయముల నుట్టంకించుట యీ వ్యాఖ్యానపద్ధతి. నిజమునకీ వ్యాఖ్యానము లేనిచో నీ కావ్య మింత సులువుగా నర్థము కాదు.

నారాయణభట్టు వాదిరాజులు రచించిన తీర్థప్రబంధమునకుఁ గూడ గురుభావప్రకాశిక యను వ్యాఖ్యను సంతరించిరి.

# రుక్మిణీశవిజయః

## డా॥ సూరం శ్రీనివాసులు

వీ రాత్మజ్యోతి పాఠకులకు సుపరిచితులు. వీరు రచించిన తెలుఁగు వ్యాఖ్యతో వాదిరాజస్వామి 'దశావతారస్తుతి' (అశ్వధాటి) యాత్మజ్యోతిలో ధారావాహికముగాఁ బ్రకటింపఁబడుచున్నది.

వీరి తల్లి కడయింటి శేషమ్మగారు. తండ్రి సూరం హనుమంతయ్య గారు. ఈ పుణ్యదంపతులకు వీరు నెల్లూరులో 3.6.1951 నాఁడు జన్మించిరి. 20 సంవత్సరముల వయస్సు వఱకు వీరి చదువు నెల్లూరులోనే సాగినది. 1. సాహిత్యశిరోమణి(మూలపేఁట) 2. పి.జీ.ఎల్ వాల్తేరు 3. ఎమ్.ఏ - సంస్కృతము (వాల్తేరు) 4. ఎమ్.ఏ. - తెలుఁగు (వాల్తేరు) 5. పిహెచ్.డి. (వాల్తేరు) పరీక్షలలో నుత్తీర్ణులైరి.

1. చేకూరుపాడు పాఠశాలలో నుపాధ్యాయులుగా 2. ఏలూరు-చిననింద్రకొలను - పొన్నూరు-తాటికొండ-తిమ్మసముద్రము సంస్కృతకళాశాలలో నుపన్యాసకులుగా 3. ఆచార్య నాగార్జునవిశ్వవిద్యాలయములో నాచార్యులుగా నుద్యోగించిరి. తాటికొండ-తిమ్మసముద్రము సంస్కృత కళాశాలలోఁ బ్రిన్సిపల్ పదవికూడ నిర్వహించిరి.

1. సాహిత్య ఎకాడమి 2. ఆంధ్ర ప్రభుత్వము 3. శ్రీనాథపీఠము 4. లలితకళాపరిషత్-చీరాల 5. సహజసాహితి - చీరాల మొదలగు సంస్థల నుండి సత్కారములు, పురస్కారములు, బిరుదులు గడించిరి. విద్యార్థిదశ నుండియే యవధానముల నలవోకగాఁ జేయు నేర్పు వీరి కలవడినది. 100 అష్టావధానములు, 1 శతావధానము చేసిరి. '**అవధానిసుధాకర**', '**అవధానిశిరోమణి**' మొదలగు బిరుదములను బొందిరి.

వీరు సంస్కృతాంధ్రభాషలలో స్వయముగా ననేక గ్రంథములు రచించిరి. శ్రీతిప్పాభట్ల రామకృష్ణమూర్తిగారితోఁ గలిసి కొన్ని స్వతంత్రగ్రంథములు, వ్యాఖ్యానగ్రంథములు సంతరించిరి. 1. పూజాకుసుమమ్ 2. కరావలంబమ్ 3. ధూర్తానుభవభాణమ్ 4. గురువరరంజనభాణమ్ 5. కవిజనమండనభాణమ్ 6. నటసమాగమభాణమ్ మొదలగునవి వీరి సంస్కృతగ్రంథములు. మత్తవిలాసప్రహసనమును దెనిఁగించిరి. 1. సౌమనస్యము-ఖండకావ్యము 2. సున్నితపుత్రాసు- కవితలు 3. బొమ్మలకొలువు - నవల మొదలగునవి తెలుఁగు గ్రంథములు.

నన్నయ-తిక్క-న-యెఱ్ఱన భారతనిరుక్తులు; సంస్కృతభారతవిరాటపర్వవ్యాఖ్య; ఆంధ్రమహాభారత-విరాటోద్యోగపర్వముల వ్యాఖ్య; తిక్కన నిర్వచనోత్తరరామాయణవ్యాఖ్య వీరు తిప్పాభట్ల వారితోఁ గలిసి వెలయించిన గ్రంథములు.

సంస్కృతభాణ సాహిత్యము వీరికిఁ బేరు తెచ్చిన గ్రంథము. వీరు రచించిన **సంస్కృతప్రహసనసాహిత్యము** నాకు లభింపలేదు.

శ్రీ సూరం శ్రీనివాసులు శ్రీవాదిరాజస్వామి రుక్మిణీశవిజయమునకుఁ దెలుఁగులో విస్తృతవ్యాఖ్య నిబంధించిరి. ఇది గొప్ప కార్యము. శ్రీనివాసులు గారి వ్యాఖ్య యంతయుఁ బ్రాయికముగా నారాయణభట్ట సంస్కృతవ్యాఖ్య యడుగుజాడలలోనే నడచినది. 1. అవతారిక 2. పదవిభాగము 3.ప్రతిపదవ్యాఖ్య -నిఘంటూదాహరణము 4. అలంకార నిర్ణయము 5. ఛందోనిరూపణము 6. విశేషవిషయ వివరణము - అను ప్రణాళికతో నీ వ్యాఖ్య సాగినది. ప్రతిశ్లోకము చివర ధాతురూపములు, సమాసములు చూపఁబడినవి. ఇది సంస్కృత విద్యార్థుల కెక్కువగా నుపయోగపడును. వీరు సంస్కృతవ్యాఖ్యలోని విషయములనే కాక యనేక నూతన విషయములను వ్యాఖ్యలో వెల్లడించిరి. శ్రీవ్యాసంకెరె ప్రభంజనాచార్యులు టిప్పణిలో సూచించిన విషయములను గూడ సూరం వారు స్వీయవ్యాఖ్యలో జోడించిరి.

శ్రీనివాసులుగారు సంస్కృతాంధ్రభాషలలో నుద్దండ పండితులు. బహుగ్రంథపరిశీలకులు. ఈ వ్యాఖ్యానములో ననేకసంస్కృతాంధ్రగ్రంథములు, సంస్కృతశ్లోకములు, తెలుఁగు పద్యములు పుంఖాను పుంఖముగా వందలకొలఁ

ది యథాసందర్భముగా నుదాహరింపఁబడినవి.

**సంస్కృత శ్లోకములు :**

మందః కవియశః - రఘువంశము (1-9)
స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః - కుమారసంభవము (1-16)
చతుర్విధా భజంతే మామ్ - భగవద్గీత (2-42)
నివార్యతామాళి-కుమారసంభవము (2-51)
కృషిధాతుణకారాభ్యామ్ - నారాయణీయము (3-20)
ఆలక్ష్యదంత - అభిజ్ఞానశాకుంతలము (3-29)
అణిమా మహిమా చైవ - అమరకోశము (3-55)
శ్రియః పతిః శ్రీమతి - శిశుపాలవధ (3-56)
మిత్రాత్రిపుత్రనేత్రాయ - రసగంగాధరము (3-57)
కర్తాకారయితా చైవ - (4-41)
ఆస్ఫోటయామాస - వాల్మీకిరామాయణము (4-13)
వనాని దహతో వహ్నేః - సుభాషితరరత్నభాండాగారము (4-44)
యథావిధిహుతాగ్నీనామ్ - రఘువంశము (4-65) మొదలగునవి.

**తెలుఁగు పద్యములు :**

రుక్మిణీశవిజయకథ భాగవతదశమస్కంధము లోని దగుటచే సమానచ్ఛాయగల పోతన భాగవత పద్యములను వందలకొలఁది వ్యాఖ్యాత యుదాహరించినారు.

కామోత్కంఠత గోపికల్ (2-42)
మోక్షకామునకు (2-43)
ఎవ్వనిచే జనించు (3-6)
జననాథ యొకనాఁడు (3-16)
తనువున నంటిన ధరణీపరాగంబు (3-42)
నీ పద్యావళు లాలకించు చెవులున్ (4-11)

ఆంధ్రభాగవత పద్యములే కాక తక్కిన తెలుఁగు గ్రంథముల నుండి కూడఁ బద్యము లుదాహరింపఁ బడినవి.

అంకము చేరి - మనుచరిత్ర (2-3)
ఎన్నినుగూర్తునన్న - ఆముక్తమాల్యద (3-35)
దానము భోగము - సుభాషితరత్నావళి (4-4)
నానాసూనవితాన వాసనల - వసుచరిత్ర (5-5)
శివుఁడద్రిని; చాఁకివాని తోడ - చాటువులు (5-15)
హృదయగతప్రాణుఁ దేతెంచు - సీతారామాంజనేయ సంవాదము (5-20)
పాటలగంధిచిత్తమున - పారిజాతాపహరణము (5-45) మొదలగునవి.

దీనివలనఁ బాఠకునకు సంస్కృతాంధ్రసాహిత్యములతో సమానపరిచయము గల్గును.

### విశేషవ్యాఖ్యలు

**కృత్యా :** కృత్యాస్వరూపము శతపథబ్రాహ్మణోదాహరణ పూర్వకముగా వివరింపఁబడినది.

**కైముత్యము :** కైముతికన్యాయము; దండాపూపికాన్యాయము చెప్పఁబడినవి.

**శిక్షతి – శిక్షతే :** శిక్ష ధాతు వాత్మనేపది. 'శిక్షతే' యని యుండవలెను. వాదిరాజస్వామి 'శిక్షతి' యని పరస్మైపదముగాఁ బ్రయోగించినారు. దీని సమర్థన మిందుఁ గలదు.

**టిప్పణి జోడింపు :** ఆనందతీర్థమతమ్ (2–60)

ఇక్కడఁ బాదటిప్పణి ననుసరించి 'మధ్వవిజయము', 'అద్వైతకాలానలము' మొదలగు గ్రంథము లుదాహరింపఁ బడినవి.

సూరం వారి వ్యాఖ్యానములో నడుగడుగున నేదో యొక విశేషము కన్పట్టుచునే యుండును. స్థాలీపులాకన్యాయముగాఁ గొన్ని చూపఁ బడినవి. తక్కిన వానినిఁ బాఠకులే గ్రహింపఁగలరు. ఇన్ని యపూర్వవిశేషము లుండుట వల్లనే సంస్కృతవ్యాఖ్యానము కంటె నాంధ్రవ్యాఖ్యానము రెట్టింపు గ్రంథమైనది.

వాదిరాజస్వామి సందర్భము లేకపోయినను శ్రీశంకరాద్వైతమతమును విమర్శించినారు.

అద్వైతినస్తార్కికమానినో వా (2–48)

ఆనందతీర్థమతముజ్ఝితదోషజాతమ్ (2–60)

ఇక్కడ వ్యాఖ్యాత యథామూలముగా ద్వైతమతమును సమర్థించుచు వ్యాఖ్యానించినారు. ఏ వ్యాఖ్యాత యైనను చేయవలసిన దంతే. కానిచో 'అహో! మూలచ్ఛేదీ తవ పాండిత్య ప్రకర్షః' అన్నట్లగును.

కాని వీరు పనికట్టుకొని శ్రీశంకరభగవత్పాదాచార్యుల వివేకచూడామణిని విమర్శించుట వింతగా నున్నది. (3–32)

శ్రీ సూరం శ్రీనివాసులు గారు మిక్కిలి శ్రమమున కోర్చి యీ యాంధ్రవ్యాఖ్య నందించినారు. ఈ గ్రంథములో వీరి సంస్కృతాంధ్ర పాండిత్యము పుటపుటనై ప్రకాశించు చున్నది. ఇది సర్వాంగసుందరమగు సమగ్రవ్యాఖ్యానము.

శ్రీరుక్మిణీశవిజయకర్తలగు శ్రీవాదిరాజస్వామికి, సంస్కృత వ్యాఖ్యాతలగు శ్రీనారాయణ భట్టాచార్యులకు నా నమోవాకములు.

ఆంధ్రవ్యాఖ్యాతలగు శ్రీసూరం శ్రీనివాసులుగారికి, గ్రంథప్రకాశకులగు శ్రీ రావి మోహనరావు (రామోరా) గారికి నా శుభాభినందనములు.

శ్రీ రుక్మిణీ శ్రీకృష్ణులు మనల నెప్పుడు కాపాడుదురు గాక!

**సవినోదం సాట్టహాసం సుస్మితం సుస్వరాన్వితమ్ ।**
**సరహస్యం సప్రమాణం వాదిరాజవచోఽమృతమ్ ॥**
**శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు.**

ఇట్లు
సకలసుకవిబుధజనవిధేయుఁడు,
**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**
పుష్పగిరి మహాసంస్థాన పండితుఁడు.

విజయవాడ,
విళంబివైశాఖామావాస్యా
మంగళవారము.
15.5.2018

## శ్రీః

# విషయసూచిక



# శ్రీః

## శ్రీవాదిరాజతీర్థశ్రీచరణవిరచితః

# రుక్మిణీశవిజయః

## ఆంధ్రవ్యాఖ్యాసహితః

## ప్రథమః సర్గః

శ్లో॥ శ్రీవేదాన్తమహాచలం హి పరితః సంయోజ్య సూత్రాహిపం
సద్వాతాగమపోషితాత్మహృదయం తత్పూర్వపక్షాసురైః ।
సిద్ధాన్తోక్తిసురేశ్వరైశ్చ మథితో యః కృష్ణదుగ్ధాంబుధిః
స్వీయానామమృతం ప్రయచ్ఛతి స మాం పాయాద్గుణోద్యన్మణిః ॥ 1-1

**అవతారిక :** శ్రీవాదిరాజతీర్థరు తాను రచింపదలపెట్టిన రుక్మిణీశవిజయమహాకావ్యం నిర్విఘ్నంగా ముగియటానికై మంగళాచరణంతో కృష్ణస్తుతితో రుక్మిణీశవిజయమహాకావ్యాన్ని ప్రారంభిస్తున్నారు. -శార్దూలవిక్రీడితమ్.

**అన్వయక్రమం :** శ్రీ-వేదాంత-మహాచలం హి పరితః సద్వాతాగమపోషితాత్మ-హృదయమ్ సూత్రాహిపమ్ సంయోజ్య తత్పూర్వపక్షాసురైః సిద్ధాంతోక్తి-సురేశ్వరైః చ మథితః యః కృష్ణ-దుగ్ధాంబుధిః స్వీయానామ్ అమృతమ్ ప్రయచ్ఛతి సః గుణోద్యన్మణిః కృష్ణ-దుగ్ధాంబుధిః మామ్ పాయాత్.

**ప్రతిపదార్థం : శ్రీవేదాంతమహాచలమ్** : శ్రీ = పూజనీయమైన; వేద+అంత = వేదాంత (ఉపనిషత్తులనెడి)మనెడి; మహా+అచలమ్ = గొప్ప పర్వతానికి (మందరానికి) (శ్రియశ్చ తే వేదాంతాః, త ఏవ మహాన్ చ అసౌ అచలః, తమ్); హి = నిశ్చితంగా; పరితః = చుట్టూ; సద్...హృదయమ్ : సద్+వాత = ముఖ్యప్రాణదేవరకు సంబంధించిన, ఆగమ = ఆగమాలచేత (శాస్త్రాలచేత), పోషిత = వృద్ధిపొందింపబడిన, ఆత్మ = తనయొక్క, హృదయమ్ = అంతరంగం గల (సన్ చ అసౌ వాతః, తస్య ఆగమః, తేన పోషితమ్ ఆత్మనః హృదయం యస్య, తమ్.), సూత్ర+అహిపమ్ = సూత్రాలనే/ సూత్రమైన నాగరాజును (వాసుకిని)(సూత్రాణి ఏవ అహిపః, తమ్), సంయోజ్య = చక్కగా బిగించి చుట్టి , తత్+సురైః : తత్ = ఆ సూత్రాలకు (ఆ వాసుకికి), పూర్వపక్ష = ఖండన-

రూపులైన/ముందువైపునున్న, అసురైః = రాక్షసుల చేతను (తేషాం పూర్వపక్షాః, త ఏవ అసురాః, తైః), సిద్ధాం...రైః +చ : సిద్ధాంత+ఉక్తి = సిద్ధాంతవచనా లనే, సుర+ఈశ్వరైః+చ = దేవతాశ్రేష్ఠుల చేతను (సిద్ధాన్తే ఉక్తయః, త ఏవ సురాణామ్ ఈశ్వరాః, తైః ), మథితః = మధింపబడినచిలుకబడిన, యః = ఏ, కృష్ణ...బుధిః : కృష్ణ = కృష్ణు డనెడి, దుగ్ధ+అంబుధిః = పాలకడలి (కృష్ణ ఇతి దుగ్ధాంబుధిః ), స్వీయానామ్ = తనవారికి, అమృతమ్ = అమృతాన్ని, ప్రయచ్ఛతి = ఇచ్చునో (ప్రపూర్వకదాణ్ ధాతువు-యచ్ఛాదేశం-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సః = ఆ; గుణో...మణిః : గుణ = గుణాలనెడి, ఉద్యత్+మణిః (సన్) = గొప్ప మణులు గలదై (గుణాః ఏవ ఉద్యన్తః మణయః యస్య సః ), కృష్ణదుగ్ధాంబుధిః = కృష్ణుడనెడి పాలకడలి, మామ్ = నన్ను, పాయాత్ = రక్షించునుగాక. (పా రక్షణే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తాత్పర్యం :** కృష్ణుడనెడి పాలకడలి నన్ను కాపాడును గాత. పూజనీయమైన వేదాంత మనే మహాపర్వతాన్ని సూత్రాలు/శాస్త్రాలు అనే నాగరాజుతో పూర్తిగా చుట్టి, పూర్వపక్షా లనే రాక్షసుల చేత, సిద్ధాంతవచనాలనే దేవతలచేతను చక్కగా చిలుకబడినదా పాలకడలి. ఆ సూత్రాలు ముఖ్యప్రాణదేవర ప్రసక్తిచేత పోషింపబడిన నిజాంతరంగం గలవి. నాగరాజుపక్షంలో వాతాశనత్వంతో తనను తాను పోషించుకొనుట. అటువంటి కృష్ణరూపమైన పాలకడలి తనవారికి అమృతాన్ని అందించింది. ఆ పాలకడలి నన్ను కూడా కాపాడాలి. ఆ పాలకడలి గుణమణులు గలది కాబట్టి వాటినిచ్చి కాపాడగలదు. లేదా కాపాడే గుణం దానికి నైజం.

**విశేషాలు :** 1. కావ్యారంభంలో

**ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాఽపి తన్ముఖమ్ ।** **కావ్యాదర్శ : 1-14**

అని దండి సూచించాడు. ఆ మేరకు '**మాం పాతు**' అనటం ద్వారా వ్యక్తమయ్యే నమస్కృతి, కథానిర్దేశం కూడా ఈ శ్లోకంలో కనిపిస్తాయి.

2. శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించటమన్నది సంస్కృతసంప్రదాయం కాదువాస్తవంగా. కానీ అర్వాచీన కాలంలో ప్రాంతీయభాషాసాహచర్యాన్నిబట్టి శ్రీకారంతో ప్రారంభించటమన్నది అక్కడక్కడ సంస్కృతగ్రంథాలలో కూడా కనిపిస్తోంది.

3. గ్రంథాదిలో, గ్రంథమధ్యంలో, గ్రంథాంతంలో కూడా మంగళాచరణాన్ని శాస్త్రాలు నిర్దేశించాయి. శ్రీకారం సర్వమంగళస్వరూపమని విజ్ఞుల భావన.

4. ఈ శ్లోకంలో చక్కని రూపకాలంకారముంది.

**కృష్ణ-దుగ్ధాంబుధి :** అని కృష్ణునిలో క్షీరసాగరత్వాన్ని ఆరోపించుటం వలన ఇది **రూపకాలంకారం**. ఇది 'వేదాంత-మహాచల' 'పూర్వపక్ష-అసుర' 'సిద్ధాంతోక్తి సురేశ్వర' సమాసాలలో కూడా ఉంది. కాబట్టి ఇది సావయవరూపకం. సూత్ర-వాతాగమ పదాలలో శ్లేషాలంకారం కూడా. కాబట్టి **శ్లేషరూపకాలంకార** సాంకర్యమిది.

| | | | |
|---|---|---|---|
| **5.ప్రయచ్ఛతి :** | **ప్రయచ్ఛతి** | ప్రయచ్ఛతః | ప్రయచ్ఛన్తి |
| | ప్రయచ్ఛసి | ప్రయచ్ఛథః | ప్రయచ్ఛథ |
| | ప్రయచ్ఛామి | ప్రయచ్ఛావః | ప్రయచ్ఛామః. |
| **పాయాత్ :** | **పాయాత్** | పాయాస్తామ్ | పాయాసుః |
| | పాయాః | పాయాస్తమ్ | పాయాస్త |
| | పాయాసమ్ | పాయాస్వ | పాయాస్మ. |

*

**శ్లో॥ సచ్ఛాస్త్రోదితవర్త్మనా పదమిదం ధ్యాయన్ మదజ్ఞాజ్ఞితో**
**మన్మన్త్రం జప శాస్త్రసమ్పదమథో దాస్యామి భాగ్యైస్సహ ।**

**తత్తత్త్వాన్యపి బోధయామి తదను ప్రాప్యో మదఙ్ఘ్రిర్భవే-**
**దిత్యాఘోషయతీవ యః కరచయైస్తం వాజివక్త్రం భజే ॥ 1-2**

**అ :** హయగ్రీవ స్తోత్రం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సచ్ఛాస్త్రోదిత వర్త్మనా ఇదం పదం ధ్యాయన్ మదంకాంకితః మన్మంత్రం జప. అథో శాస్త్ర-సంపదం భాగ్యైః సహ దాస్యామి. తత్తత్త్వాని అపి బోధయామి తదను మదంఘ్రిః ప్రాప్యః భవేత్ ఇతి కర-చయైః యః ఆఘోషయతీవ (భవతి) తం వాజి-వక్త్రం భజే.

**ప్రతి :** సచ్ఛా...వర్త్మనా : సత్ = ఉత్తమమైన (సత్పదార్థ సంబద్ధమైన), శాస్త్ర = శాస్త్రాలచే, ఉదిత = చెప్పబడిన, వర్త్మనా = విధానంతో (సన్తి చ తాని శాస్త్రాణి చ, తేషు ఉదితం వర్త్మ, తేన), మద్+అంక+అంకితః = నా చిహ్నాలచే గుర్తింపబడుతూ (మమ అంకాః, తైః అంకితః), ఇదమ్ = ఈ (కనిపిస్తున్న), పదమ్ = కాలిని, ధ్యాయన్ = తలచుచూ, మత్+మంత్రమ్ = నా మంత్రాన్ని (మమ మన్త్రమ్), జప = జపించు. (జప వ్యక్తాయాం వాచి పరస్మైపది లోట్-మ.ఏ.) అథో = ఆ తరువాత, భాగ్యైః సహ = సంపదలతోపాటు, శాస్త్రసంపదమ్ = శాస్త్రా లనే సంపదను (శాస్త్రాఖ్యా సంపద్, తామ్), దాస్యామి = ఇవ్వగలను. (దా దానే పరస్మైపది-లృట్-ఉ.ఏ.). తత్-తత్త్వాని+అపి = ఆ శాస్త్ర తత్త్వాలను కూడా (తస్య తత్త్వాని), బోధయామి = తెలియజేయగలను. (బుధ బోధనే-ణిచ్-పరస్మైపది-లట్-ఉ.ఏ.). తద్+అను = ఆ తరువాత, మద్+అంఘ్రిః = నా చరణం (మమ అంఘ్రిః), ప్రాప్యః = పొంద దగినది, భవేత్ = కాగలదు. (భూ సత్తాయామ్ పరస్మైపది-విధి లిఙ్-ప్ర.ఏ.). ఇతి = అని, కర-చయైః = పెక్కు చేతులతో (కరాణాం చయః, తైః), యః = ఎవడు, ఆఘోషయతి+ఇవ = ప్రకటిస్తున్నట్లుండునో, తమ్ = ఆ, వాజి-వక్త్రమ్=హయవదనుని (వాజినః వక్త్రమివ వక్త్రం యస్య సః), భజే = సేవిస్తున్నాను. (భజ సేవాయాం పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా :** హయవదనుడు తన నాలుగు చేతులతో శంఖాన్నీ అక్షమాలనూ, పుస్తకాన్నీ, జ్ఞానముద్రనూ పట్టి ప్రకటిస్తున్నట్లున్నాడు. ఏమని? ఉత్తమశాస్త్రాలు చెప్పిన పద్ధతిలో నడుస్తూ, నా చిహ్నాలను మేనిపై ధరించి, నా మంత్రాన్ని జపిస్తే సంపదలతో పాటు శాస్త్రసంపదలను కూడా అందజేయగలను. ఆ శాస్త్రతత్త్వాలను కూడా తెలియజేయగలను. ఆ జ్ఞానం కలిగిన తరువాత మీరు సేవింపదగినది నా పాదమే.

ఆ రీతిగా ప్రకటిస్తున్న హయవదనుని నేను సేవిస్తున్నాను.

**వి :** 1. ఊర్ధ్వపుండ్రం, శంఖచక్రాదిచిహ్నధారణం, శారీరకమైన భక్తిప్రకటనలు, అధ్యయనం, ధ్యానం, మంత్రజపం ఆంతరంగికాలైన ఆరాధనలు. శాస్త్రసంపద జ్ఞానసంబంధ మైనది. రెండూ కలిస్తే భక్తిజ్ఞానయోగాల కలయిక.

2. ఆఘోషయతీవ - ప్రకటిస్తున్నట్లుగా - చేతులతో శంఖాదిధారణకు ఫలాన్ని ఊహిస్తున్నాడు కాబట్టి **ఫలోత్ప్రేక్ష. 'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలత్మనా'**

భాగ్యాలతోపాటు శాస్త్రసంపదను అనటం అందమైన సహభావం. **సహోక్త్యలంకారం. 'సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః'.**

| | | | | |
|---|---|---|---|---|
| 3. | **దాస్యామి :** | దాస్యతి | దాస్యతః | దాస్యన్తి |
| | | దాస్యసి | దాస్యథః | దాస్యథ |
| | | **దాస్యామి** | దాస్యావః | దాస్యామః |
| | **జప :** | జపతు/జపతాత్ | జపతామ్ | జపన్తు |
| | | **జప**/జపతాత్ | జపతమ్ | జపత |
| | | జపాని | జపావ | జపామ. |

| | | | |
|---|---|---|---|
| **బోధయామి :** | బోధయతి | బోధయతః | బోధయన్తి |
| | బోధయసి | బోధయథః | బోధయథ |
| | **బోధయామి** | బోధయావః | బోధయామః |
| **భవేత్ :** | **భవేత్** | భవేతామ్ | భవేయుః |
| | భవేః | భవేతమ్ | భవేత |
| | భవేయమ్ | భవేవ | భవేమ. |
| **భజే :** | భజతే | భజేతే | భజన్తే |
| | భజసే | భజేథే | భజధ్వే |
| | **భజే** | భజావహే | భజామహే. * |

**శ్లో॥ శ్రయే హయముఖం శ్రావ్యకావ్యమార్గసమాప్తయే ।**
**సరాగయోగిపూగోక్తస్తోత్రతోత్రవశం మహః ॥ 1-3**

**అ :** కావ్యపరిసమాప్తికోరుతూ హయవదనస్తుతి.

**అ :** సరాగ–యోగి–పూగోక్త–స్తోత్ర–తోత్ర–వశం హయ–ముఖం మహః శ్రావ్య–కావ్య–మార్గ–సమాప్తయే శ్రయే॥

**ప్రతి :** సరాగ... వశమ్ : సరాగ = అనురాగంతో కూడిన, యోగి = యతులయొక్క, పూగ = సమూహంచే (పూగః క్రముక బృందయోః–**అమరకోశః–**నానార్థ–21), ఉక్త = చెప్పబడిన, స్తోత్ర = స్తుతులనెడి, తోత్ర = కొరడాకు (తోత్రంతు ప్రాజనే వేణుకేఽపి చ–**విశ్వకోశః**ణంత–48), వశమ్ = లోబడెడి (సరాగాశ్చ తే యోగినః , తేషాం పూగః, తేన ఉక్తం స్తోత్రం, తదేవ తోత్రం, తస్య వశమ్), హయముఖమ్ = హయవదను డను (హయస్య ముఖమివ ముఖం యస్య తమ్), మహః = తేజస్సును, శ్రావ్య... సమాప్తయే : శ్రావ్య = శ్రవణీయమైన (వినదగిన), కావ్య = కావ్య మనెడి, మార్గ = బాటయొక్క, సమాప్తయే = ముగింపు కొరకు, (గమ్యం చేరటానికి) (శ్రావ్యః చ అసౌ కావ్యస్య మార్గః, తస్య సమాప్తిః, తస్యై ), శ్రయే = ఆశ్రయిస్తున్నాను. (శ్రిసేవాయాం ఆత్మనేపది–లట్–ఉ.ఏ.).

**తా ॥** అనురక్తులయిన యోగి సమూహాలచేత చేయబడిన స్తుతు లనే కొరడాకు లోనయ్యే హయవదను డనే తేజస్సును కావ్యమార్గసమాప్తి కోసం నేను ఆశ్రయిస్తున్నాను.

**వి :** 1. శ్లోకంలోని ద్వితీయార్థంలో వర్ణావృత్తి (గ) వలన అనుప్రాసాలంకారం. **(వృత్త్యనుప్రాసం).** ఈ కావ్యంలో వృత్త్యనుప్రాస ఎన్నో శ్లోకాలలో కనిపిస్తుంది. అనుప్రాస భేదాలయిన ఛేకానుప్రాస, లాటానుప్రాసలు కూడా.

2. ఈ శ్లోకంలో **పరిణామాలంకారం.** ఉపమానం ఉపమేయంగా మారి క్రియతో అన్వయించి నప్డు పరిణామాలంకారం (**పరిణామః క్రియార్థశ్చేత్ విషయీ విషయాత్మనా**) మహం (తేజస్సు) –అది ఛత్రంగా మారి మార్గసమాప్తికి తోడ్పడాలి కాబట్టి పరిణామాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **శ్రయే :** | శ్రయతే | శ్రయేతే | శ్రయన్తే |
| | శ్రయసే | శ్రయేథే | శ్రయధ్వే |
| | **శ్రయే** | శ్రయావహే | శ్రయామహే |

4. ఈ శ్లోకం **అనుష్టుప్** భేదాలలో ఒకటి – **పథ్యావక్త్రం.**

**శ్లో॥ వక్త్రం నాద్యాన్నసౌ స్యాతామబ్ధేర్యోనుష్టుభిఖ్యాతమ్ ।**
**యుజోర్జేన సరిద్భర్తుః పథ్యావక్త్రం ప్రకీర్తితమ్ ॥** **వృత్తరత్నాకరమ్,**

పాదానికి ఎనిమిది అక్షరాలు, మొదటి అక్షరం తర్వాత న,స,గణాలుండకూడదు. నాలుగవ అక్షరం తర్వాత యగణముండాలి. ఇది వక్త్రం. **నాలుగవ అక్షరం తర్వాత జగణ** ముంటే పథ్యావక్త్రం. *

**శ్లో॥ సిఞ్జన్నూపురశోభిపాదకమలాం మన్దస్మితోద్యన్ముఖీం**
**కఞ్జాక్షీం కుచభారభీరువిలసన్మధ్యాం క్వణత్కఙ్కణామ్ ।**
**శమ్భ్వాద్యైః పరిసేవితాం సువసనాం జామ్బూనదాలఙ్కృతా-**
**మంబాం తాం ప్రణతోఽస్మి కృష్ణరమణీం లంబాలకాం రుగ్మిణీమ్ ॥ 1-4**

**అ :** కృష్ణరమణి అయిన రుక్మిణి స్తుతి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సింజన్నూపుర-శోభి-పాద-కమలాం మంద స్మితోద్యన్ముఖీం కంజాక్షీం కుచ-భార-భీరు-విలసన్మధ్యాం క్వణత్కంకణాం శంభ్వాద్యైః పరిసేవితాం సువసనాం జాంబూనద+అ-లంకృతాం లంబాలకాం కృష్ణ-రమణీం అంబాం తాం రుక్మిణీం ప్రణతః అస్మి.

**ప్ర :** సింజ... కమలామ్:సింజత్ = శబ్దించుచున్న, నూపుర = గజ్జెలచే, శోభి = ప్రకాశిస్తున్న (సింజద్భిః నూపురైః శోభినౌ పాదౌ ఏవ కమలే యస్యాః తామ్), పాద-కమలామ్ = తామరలవంటి కాళ్ళు గలదియు, (పాదౌ కమలే ఇవ అని ఉపమితిసమాసం '**ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యా ప్రయోగే - అష్టాధ్యాయి 2-1-56**), మంద... ముఖీమ్ : మంద-స్మిత = లేత చిఱునవ్వుతో, ఉద్యత్ = వికసించిన, ముఖీమ్ = మోముగలదియు (మన్దం చ తత్ స్మితం, తేన ఉద్యత్ ముఖం యస్యాః తామ్), కంజ+అక్షీమ్ = తామరలవంటి కన్నులు గలదియు (కంజే ఇవ అక్షిణీ యస్యాః సా)(కంజే ఇవ అక్షిణీ యస్యాః తామ్), కుచ... మధ్యామ్ : కుచ = స్తనాల యొక్క, భార = బరువుచే, భీరు = పిరికితనంతో, విలసత్ = శోభిస్తున్న, మధ్యామ్ = నడుము గలదియు (కచానాం భారః, తేన భీరుశ్చ అసౌ విలసన్ చ మధ్యః యస్యాః తామ్ ), క్వణత్-కంకణామ్ = మ్రోయుచున్న గాజులు గలదియు (క్వణతీ కంకణే యస్యాః తామ్), శంభు+ఆద్యైః = శివుడు మొదలగు వారిచే (శంభుః ఆద్యః యేషాం తైః), పరిసేవితామ్ = సేవింపబడుతున్నదియు, సు-వసనామ్ = మేలి వస్త్రాలు గలదియు, జంబూనద+అలంకృతామ్ = బంగారు (నగలచే) అలంకరింపబడినదియు, (రుక్మం కార్తస్వరం జంబూనదమష్టాపదోఽస్త్రియామ్-**అమరకోశం**-21-వైశ్య-65), లంబ+ అలకామ్ = వ్రేలాడు వెంట్రుకలు గలదియు (లంబాః అలకాః యస్యాస్తామ్), కృష్ణ-రమణీమ్ = కృష్ణుని వల్లభయు (కృష్ణస్య రమణీ, తామ్), అంబామ్ = జగన్మాతయు అగు, తామ్ = ఆ, రుక్మిణీమ్ = రుక్మిణిని(కి), ప్రణతః+అస్మి = వినమ్రుడనై ఉన్నాను, (అస భువి పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా :** రుక్మిణి పాదకమలాలు రవళించే గజ్జెలతో ప్రకాశిస్తున్నాయి. ముఖం చిఱునవ్వుతో వికసిస్తోంది. కన్నులు తామరలవలె శోభిల్లుతున్నాయి. స్తనభారంతో నడుం కృశించి పోతోంది. చేతిగాజులు శబ్దిస్తున్నాయి. ఆమె కురులు నిడుపుగా అందగిస్తున్నాయి. శివుడు మొదలయిన దేవతలు ఆమెను సేవిస్తున్నారు. మేలిమివస్త్రాలు, సువర్ణాభరణాలను ఆమె అలంకరించుకొని ఉంది. ఆమె కృష్ణవల్లభ. కానీ జగన్మాత. ఆ రుక్మిణికి వినమ్రుడనై ఉన్నాను.

**వి :** 1. పాదాదికేశాంతంగా దేవతావర్ణన జరగాలని శాస్త్రవిధి. పద్యంలో వర్ణన 'సింజన్నూపుర' అంటూ ప్రారంభమై 'లంబాలకామ్' అంటూ ముగిసింది.

2. ఇది స్వరూప వర్ణన. ఉదాత్తాలంకారం ఇక్కడ కనిపిస్తుంది. శౌర్య-ఔదార్యాదిగుణాలు లేదా రూప వేషాదులలోని సమృద్ధి వర్ణనం ఉదాత్తాలంకార మవుతుంది. అయితే ఈ సౌందర్య వర్ణన భక్తికి అంగమవుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అస్మి :** | అస్తి | స్తః | సన్తి | |
| | అసి | స్థః | స్థ | |
| | **అస్మి** | స్వః | స్మః | * |

**శ్లో॥సత్సఙ్ఘమానససరోవరమధ్యవర్తీ - కృష్ణాఙ్ఘ్రిచారుకమలార్పితచిత్తవృత్తిః ।**
**శాస్త్రాతిమఞ్జుపదరఞ్జితరమ్యసంస-దాస్మాకహృత్సరసిజేఽస్తు స మధ్వహంసః ॥ 5**

**అ :** మధ్వాచార్య స్తుతి. -వసంతతిలక.

**అ :** సత్సంఘ-మానస-సరోవర-మధ్య-వర్తీ కృష్ణాంఘ్రి-చారు-కమలార్పిత-చిత్త-వృత్తిః శాస్త్రాతిమంజు-పద-రంజితరమ్యసంసద్ సః మధ్వహంసః ఆస్మాకహృత్సరసిజే అస్తు.

**ప్ర :** సత్సంగ... వర్తీ:సత్ = సజ్జనులయొక్క, సంఘ = సమూహ మను (చేరిమి యను), మానస = మనస్సనెడి, సరోవర = శ్రేష్ఠమైన సరస్సు యొక్క, మధ్య-వర్తీ = మధ్యలో నున్న వాడునూ (లేదా సజ్జనసముదాయ మను మానస సరోవరమధ్యలో ఉన్నవాడు) (సతాం సంఘః తస్య మానసం సరోవరమివ తస్య మధ్యే వర్తత ఇతి), కృష్ణా... వృత్తిః : కృష్ణ = కృష్ణుని యొక్క, అంఘ్రి = పాద మనెడి, చారు = అందమైన, కమల = పద్మంపై, అర్పిత = అర్పింపబడిన, చిత్త = మనస్సు యొక్క, వృత్తిః = ప్రవర్తన గలవాడునూ (కృష్ణస్య అంఘ్రీ ఏవ చారు కమలే తస్మిన్ అర్పితా చిత్తస్య వృత్తిః యస్య సః), శాస్త్రాతి... సంసద్ : శాస్త్ర = (తన) శాస్త్ర గ్రంథాలలోని, అతిమంజు = పరమ మనోహరాలయిన, పద = పదాలచే, రంజిత = ఆనందింప జేయబడిన, రమ్య = రమణీయమైన, సంసత్ = సభలు గలవాడునూ అయిన (శాస్త్రస్య అతిమంజుభిః పదైః రంజితా రమ్యా చ సా సంసద్ యేన సః), సః = ఆ, మధ్వహంసః = మధ్వాచార్యులనెడి రాజహంస, ఆస్మాక = మాకు సంబంధించిన, హృత్ = మనస్సనెడి, సరసి-జే = కమలమందు (ఆస్మాకమిదం చ తత్ హృత్ చ, తదేవ సరసిజం, తస్మిన్), అస్తు = ఉండును గాక.

**తా ॥** సజ్జనుల సాంగత్యమనే మానససరోవరంలో మధ్యభాగంలో నిలిచినవాడూ, కృష్ణపాదాలపయి సమర్పించిన చిత్తవృత్తిగలవాడూ, శాస్త్రవిషయాలకు సంబంధించిన మనోహరపదాలచే ఆనందింపజేయబడిన సభలు గలవాడూ మధ్వాచార్యులు. ఆ మధ్వరాజహంస నా హృదయకమలంలో నిలుచునుగాక.

**వి :** 1. **ఆస్మాకః** పదనిష్పత్తి. 'యుష్మదస్మదోరన్యతరస్యాం ఖఞ్చ' (4-3-1) 'తస్మిన్నణి చ యుష్మాకాస్మాకౌ' (4-3-2) అన్న సూత్రాలచే ఆస్మాకః (మనకు సంబంధించిన) అని అర్థం.

2. మొదటి పాదంలో మనస్సు సరస్సుతో (మానససరోవర), నాలుగవ పాదంలో మనస్సును సరస్సులో పుట్టిన పద్మంతోనూ (హృత్సరసిజే) పోల్చటం విశేషం. కార్యకారణాలు రెండింటితోనూ పోలిక మనస్సుకు.

3. సత్సంఘ-మానససరోవరం సత్సంఘమనే మానససరోవరం; సజ్జనుల మనస్సనే సరోవరం రెండురకాలుగా **రూపకాలంకారం**. కాబట్టి శ్లేషసహకారం. అంఘ్రికమలం, హృత్సరసిజమ్ అన్నచోట్ల కేవలం రూపకాలంకారం. ఉపమేయంలో ఉపమానాభేదాన్ని తాద్రూప్యాన్ని చెప్పటం రూపకాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 4. **అస్తు :** | **అస్తు** | స్తాత్ | సన్తు | |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త | |
| | అసాని | అసావ | అసామ. | * |

**శ్లో॥ తాటఙ్కద్వయశోభికర్ణయుగలం భ్రాజద్దయావీక్షణం**
**పూర్ణేన్దుద్యుతి విద్రుమాధరరుచా వ్యామిశ్రమన్దస్మితమ్ ।**

**ఈషత్కుఞ్చితకున్తలం సతిలకం నాసోల్లసన్మౌక్తికం**
**భూయాత్ కూర్మసదృక్షగణ్డయుగలం వాణీముఖం శ్రేయసే ॥ 1-6**

**అ :** శబ్దాకృతి అయిన కావ్యారంభంలో శబ్దస్వరూపిణి అయిన వాణిని స్తుతించుట. -శార్దూలవిక్రీడితం.

**అ :** తాటంకద్వయ-శోభి-కర్ణ-యుగలం భ్రాజద్దయా-వీక్షణం, పూర్ణేందు-ద్యుతి విద్రుమాధర-రుచా వ్యామిశ్ర మందస్మితమ్ ఈషత్కుంచిత-కుంతలం సతిలకం నాసోల్ల-సన్మౌక్తికం కూర్మ-సదృక్షగండయుగలం వాణీముఖం శ్రేయసే భూయాత్.

**ప్ర :** తాటంక... యుగలమ్ : తాటంక-ద్వయ = రెండు కర్ణపత్రాల (చెవి కమ్మల)తో, శోభి = ప్రకాశిస్తున్న, కర్ణ-యుగలమ్ = చెవుల జంట గలదియు (తాటంకయోః ద్వయం తేన శోభినోః, కర్ణయోః యుగలం యస్య తత్ తథా), భ్రాజ... వీక్షణమ్ : భ్రాజత్ = వెలుగుతున్న, దయా = కరుణామయమైన, వీక్షణమ్ = చూపు గలదియు (భ్రాజత్ దయాయుక్తం వీక్షణం యస్య తత్ తథా), పూర్ణ+ఇందు-ద్యుతి = పూర్ణచంద్రుని వంటి శోభ గలదియు (పూర్ణశ్చాసౌ ఇందుః తస్య ద్యుతిరివ ద్యుతిః యస్య తత్ తథా), విద్రుమ+అధర-రుచా = పగడాల వంటి పెదవుల కాంతితో (విద్రుమవత్ (విద్యమానః) అధరః, తస్య రుక్, తయా), వ్యామిశ్ర... స్మితమ్ : వ్యామిశ్ర = కలిసిన, మంద-స్మితమ్ = చిఱునవ్వు గలదియు (వ్యామిశ్రం మన్దం చ స్మితం యస్య తత్ తథా), ఈష... కుంతలామ్ : ఈషత్ = స్వల్పంగా, కుంచిత = మెలిదిరిగిన, కుంతలమ్ = కురులు గలదియు (ఈషత్ కుంచితాః కుంతలాః యస్య తత్), స-తిలకమ్ = తిలకంతో కూడినదియు, నాసో.. కమ్ : నాసా = ముక్కుపై, ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, మౌక్తికమ్ = ముత్యం గలదియు (నాసాయామ్ ఉల్లసత్ మౌక్తికం యస్యాస్తత్), కూర్మ... యుగలమ్ : కూర్మ = తాబేళ్ళతో, సదృక్ష = సమానమైన, గండ-యుగలమ్ = చెక్కిళ్ళ జంట గలదియు అగు, వాణీముఖమ్ = శారదావదనం (కూర్మస్య సదృక్షం గండయోః యుగలం యస్య తత్ వాణ్యాః ముఖమ్.), శ్రేయసే = శ్రేయస్సునకై, భూయాత్ = నిలుచుగాక. (భూ సత్తాయామ్-పరస్మైపది-ఆశీర్లిఙ్-ప్ర.ఏ.)

**తా :** శారదావదనం శ్రేయస్సును కలిగించును గాత (ఇది విధేయ వాక్యం). ఆ వదనం - రెండువైపుల చెవి కమ్మలతో విరాజిల్లుతోంది. కంటి చూపులలో దయ వెల్లివిరుస్తోంది. పూర్ణచంద్రుని వంటి కాంతి. పగడాల వంటి పెదవుల ఎఱ్ఱదనంతో కూడిన చిఱునవ్వు. కొంచెంగా ఉంగరాలు తిరిగిన కురుల కొనలు. నుదుటి తిలకం. ముక్కుకు ముత్యాల ముక్కెర. తాబేళ్ళ వంటి చెక్కిళ్ళు.

**వి :** 1. శ్లోకంలో వాణీముఖ వర్ణన. రుక్మిణిని సర్వాంగీణంగా వర్ణించిన కవి వాణీవర్ణనను ముఖానికి పరిమితం చేశాడు. 'ముఖే ముఖే సరస్వతీ' అని గదా నానుడి.

2. శ్రేయస్సును కలిగించుగాక అన్న ఆశీస్సు రచనకుపక్రమించిన కవికి, చదువుతున్న పాఠకులకూ కూడా అన్వయిస్తుంది.

3. శ్లోకంలో **ఆశీరలంకారం. ఆశీరపి చ కేషాంచిత్ అలంకారతయా మతా- భామహాలంకార 3/55.** ఆశీస్సు నందించుటే ఆశీరలంకారం.

| | | | |
|---|---|---|---|
| 4. **భూయాత్ :** | **భూయాత్** | భూయాస్తామ్ | భూయాసుః |
| | భూయాః | భూయాస్తమ్ | భూయాస్త |
| | భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |

*

**శ్లో॥ శ్రీనాథకీర్త్యమ్బుజసేవ్యగన్ధం - ప్రాణః స సఙ్గృహ్య విహర్తుమీష్టే ।**
**సోఽహం తదీయాగమవిస్తృతం త-ద్వాణీముఖం వాసయితుం వృణోమి॥ 1-7**

**అ :** కావ్యరచనాలక్ష్యం వాణీముఖవాసనం. –ఇంద్రవజ్ర.

**అ :** శ్రీనాథ–కీర్త్యంబుజ–సేవ్య–గంధం సంగృహ్య సః ప్రాణః విహర్తుమ్ ఈష్టే. సః అహమ్ తదీయాగమ–విస్తృతం తద్వాణీ–ముఖం వాసయితుం వృణోమి.

**ప్ర :** శ్రీనాథ... గంధమ్ : శ్రీనాథ = నారాయణునియొక్క (లక్ష్మీవల్లభునియొక్క), కీర్తి+అంబుజ = కీర్తి పద్మం యొక్క, సేవ్య = సేవింపదగిన, గంధమ్ = పరిమళాన్ని/కొంత భాగాన్ని (గంధో లేశేఽ ప్యక్తః – హలాయుధకోశః 793) (శ్రియః నాథః, తస్య కీర్తిః, సైవ అంబుజం, తేన సేవ్యశ్చాసౌ గంధః, తమ్), సంగృహ్య = సమీకరించుకొని (సమ్ పూర్వక గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సః ప్రాణః = ముఖ్య వాయువు, విహర్తుమ్ = విహరించుటకు (విపూర్వక హృధాతువుపై తుమున్ ప్రత్యయం), ఈష్టే = సమర్థుడగును (ఈశ ఐశ్వర్యే ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), సః+అహమ్ = ఆ నేను, తదీయ +ఆగమ–విస్తృతమ్ : తదీయ = ఆ ముఖ్య ప్రాణునకు సంబంధించిన, ఆగమ = ఆగమా(శాస్త్రా) లయందు, విస్తృతమ్ = విస్తరింపబడిన (తదీయేన ఆగమేన విస్తృతమ్), తద్–వాణీ–ముఖమ్ = ఆ మాటలను, వాసయితుమ్ = పరిమళింపజేయుటకై, వృణోమి = వరిస్తున్నాను (కావ్య రూపంలో వర్ణించటానికి), (వృ వరణే పరస్మైపది–లట్–ఉ.ఏ.)

**తా :** లక్ష్మీనారాయణుని యొక్క యశఃకమలామోదలేశం చేత ముఖ్యప్రాణుడు (వాయువు) విహరింపగలుగుతున్నాడు. (ఆ విషయంలో తనకు తెలియనిది లేదు). నేను ఆ ముఖ్య ప్రాణునకు సంబంధించిన ఆగమాలలో విస్తరింపబడిన ఆ మాటలను పరిమళింప జేయటానికి ఈ కావ్య రచనను వరిస్తున్నాను.

**వి :** 1. సోఽహమ్ – **ఆ** నేను ఇక్కడ 'ఆ' పదం అర్థాంతర సంక్రమితవాచ్యమై కవిలోని వినయశీలతను, ఆత్మ ప్రత్యయాన్నీ కూడా ప్రకటిస్తుంది.

2. మాధ్వసంప్రదాయంలో ముఖ్య ప్రాణ ప్రాధాన్యం ప్రధానాంశాలలో ఒకటి.

3. కీర్తి+అంబుజమ్ – కీర్తి అనే పద్మం – **రూపకాలంకారం**.

| | | | |
|---|---|---|---|
| 4. **ఈష్టే :** | **ఈష్టే** | ఈశాతే | ఈశతే |
| | ఈశిషే | ఈశాథే | ఈశిధ్వే |
| | ఈశే | ఈశివహే | ఈశిమహే |
| **వృణోమి :** | వృణోతి | వృణుతః | వృణ్వంతి |
| | వృణోషి | వృణుథః | వృణుథ |
| | **వృణోమి** | వృణువః | వృణుమః |

*

**శ్లో॥ హయాస్యనాసాపుటజాతవాత–విఘాతధూతాఘపలాలజాతః ।**
**మునీశవాగీశసుతః సురమ్యాం – హరేః కథాం శంసతి వాదిరాజః ॥ 1–8**

**అ :** కథాకథనోపక్రమణిక – స్వీయపరిచయం. –ఉపేంద్రవజ్ర.

**అ :** హయాస్య–నాసాపుట–జాత–వాత–విఘాత–ధూతాఘ–పలాల–జాతః మునీశ–వాగీశ–సుతః వాదిరాజః సురమ్యాం హరేః కథాం శంసతి.

**ప్ర :** హయాస్య... జాతః : హయ+ఆస్య = హయవదనుని యొక్క, నాసా–పుట = నాసికా రంధ్రం నుండి, జాత = పుట్టిన, వాత = గాలి యొక్క, విఘాత = దెబ్బచే (తాకిడిచే), ధూత = చెదరగొట్టబడిన, అఘ = పాపాలనెడి, పలాల = పొల్లు యొక్క, జాతః = మొత్తం గలవాడునూ (హయాస్యస్య నాసాపుటాత్ జాతస్య వాతస్య. విఘాతేన ధూతాని అఘాని ఏవ పలలాని, తేషాం జాతం యస్య సః), మునీశ... సుతః : ముని+ఈశ = యతివర్యుడైన,

వాగీశ = వాగీశు డను యతియొక్క, సుతః = కుమారుడైన (మునీశశ్చ అసౌ వాగీశః తస్య సుతః), వాదిరాజః = వాదిరాజు, సురమ్యామ్ = చాలా చక్కనిదైన, హరేః = విష్ణుమూర్తి యొక్క, కథామ్ = కథను, శంసతి = చెప్తున్నాడు. (శంస–స్తుతౌ దుర్గతౌ చ పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా :** వాగీశుడను యతిశ్రేష్ఠుని శిష్యుడైన వాదిరాజు రమణీయమైన హరికథను స్తుతిస్తున్నాడు. హయవదనుని ముక్కుపుటాల నుండి వెలువడిన గాలి వాదిరాజు పాపా లనే పొల్లును దూరంగా నెట్టి వేసింది. కాబట్టి వాదిరాజు అనఘుడై హరికథను రచిస్తున్నాడు.

**వి :** 1. తన అనఘత్వాన్ని – అదే కావ్యరచనకు తనకు ఇస్తున్న అధికారాన్ని, వాదిరాజు నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. అది ఆచరణీయమార్గం.

**నిర్మలత్వమెడద నిండువారెడుదాక**
**కలముబట్ట బులుపు కలుగరాదు**
**పంకదిగ్ధమైన ఁబన్నీట నైనను**
**జలకమాడ జగము జడముగాదు.** **(నా సౌమనస్య కావ్య పీఠిక)**

2. తమ కర్తృత్వాన్ని ప్రథమపురుషలోనే ప్రకటించటం కవుల కున్న అలవాటు. (వాదిరాజః శంసతి)

3. అఘ–పలాలజాతః అన్నచోట రూపకాలంకారం. పాపవినాశనానికి హయవదన భక్తిని హేతువుగా చెప్పటంవలన కావ్యలింగాలంకారం. వృత్త్యానుప్రాసరూపమైన శబ్దాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 4. **శంసతి :** | **శంసతి** | శంసతః | శంసన్తి |
| | శంససి | శంసథః | శంసథ |
| | శంసామి | శంసావః | శంసామః |

*

**శ్లో॥ అపణ్డితేనాపి మయా౽౽ర్జితేయం – ముకున్దలీలా కవికణ్ఠమాలా ।**
**అకౌశలేన గ్రథితేతి జాతి – ప్రసూనమాలాం కిము సన్త్యజన్తి ॥ 1–9**

**అ :** కవి వినయావిష్కరణం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అపండితేన అపి మయా ఆర్జితా ఇయం ముకుంద–లీలా కవికంఠ–మాలా (భవతు). అకౌశలేన గ్రథితా ఇతి జాతి–ప్రసూన–మాలామ్ సంత్యజన్తి కిము?

**ప్ర :** అపండితేన–అపి = పండితుడను కాకపోయినను, మయా = నాచేత, ఆర్జితా = సంపాదింపబడిన (కావ్యరూపంగా), ఇయమ్ = ఈ, ముకుందలీలా = కృష్ణవిలాసం (ముకుందస్య లీలా), కవి–కంఠమాలా = కవుల కంఠహారంగా (కవేః కంఠస్య మాలా), (భవతు) = అగుగాక. అకౌశలేన = నేర్పరికాని వాని చేత, గ్రథితా– ఇతి = గ్రుచ్చబడినదని, జాతి–ప్రసూన–మాలామ్ = జాతి కుసుమ మాలను (జాతి ప్రసూనానాం మాలా), సంత్యజన్తి కిము? = వదలిపెడతారా (సమ్ పూర్వక– త్యజ్–హానౌ–పరస్మైపది –లట్–ప్ర.బ.)

**తా :** నేను పండితుడను కాను. అయినా ఈ కావ్యాన్ని నిర్మిస్తున్నాను. ఈ ముకుందలీల కవులకు కంఠహారం కాగలదని భావిస్తున్నాను. (కంఠానికి అలంకారం). నేర్పులేని వాడు కూర్చినంతమాత్రాన జాతి కుసుమ మాలను పరిత్యజిస్తారా? (తన గొప్పతనం కాకపోయినా కృష్ణమహత్త్వం ఆదరణకారణ మవుతుందని భావం.)

**వి :** 1. కాళిదాసుకూడా రఘువంశ ప్రారంభంలో ఇలాగే వినయాన్ని ప్రకటిస్తాడు.

**మందః కవియశః ప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్ ॥**
**ప్రాంశులభ్యే ఫలే లోభాదుద్బాహురివ వామనః ॥**

2. నిదర్శనాలంకారం - '**వాక్యార్థయోః సదృశయోః ఐక్యారోపో నిదర్శనా**' ఒక అంశాన్ని ప్రస్తుతించి దానికి సమాంతరంగా మరొక అంశాన్ని ప్రదర్శించటం. ఇక్కడ ఉపమాలంకారం ధ్వని రూపంలో ఉంటుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **సంత్యజన్తి :** | సంత్యజతి | సంత్యజతః | **సంత్యజన్తి** |
| | సంత్యజసి | సంత్యజథః | సంత్యజథ |
| | సంత్యజామి | సంత్యజావః | సంత్యజామః |

*

**శ్లో॥ అపి ప్రమాదాగతదోషలేశా-మిమాం కవిత్వశ్రియమాద్రియధ్వమ్ ।**
**బుధా విదగ్ధైః కిముపేక్షణీయా - పయోఽబ్ధిజా చఞ్చలతాఖ్యదోషాత్ ॥1-10**

**అ :** స్వకావ్యానికి ఆదరణీయతను కవి వినయపురస్సరంగా ప్రకటించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** బుధాః ప్రమాదాగత-దోష-లేశాం అపి ఇమాం కవిత్వ-శ్రియమ్ ఆద్రియధ్వం పయోఽబ్ధిజా చంచలతాఖ్య-దోషాత్ విదగ్ధైః ఉపేక్షణీయా కిమ్?

**ప్ర :** బుధాః = పండితులారా!, ప్రమా... లేశామ్ - అపి : ప్రమాద = ఏమరుపాటువలన ('ప్రమాదోఽనవధానతా)-అమరకోశః-1-నాట్య-30), ఆగత = వచ్చిన (సంభవించిన), దోష = దోషాలయొక్క లేశామ్+అపి = కొలది కలదైనను (ప్రమాదేన ఆగతశ్చ అసౌ దోషః, తస్య లేశః యస్యా స్తామ్), కవిత్వ-శ్రియమ్ = కవిత్వశోభను/ కవిత్వలక్ష్మిని (కవిత్వస్య శ్రీః, తామ్), ఆద్రియధ్వమ్ = ఆదరించండి (ఆఙ్పూర్వక దృ-ఆత్మనేపది-లోట్-మ.బ.), పయః+అబ్ధి-జా = క్షీరసాగరకన్యక అయిన లక్ష్మి (పయసామ్ అబ్ధిః, తస్మిన్ జాయతే ఇతి), చంచలతా+ఆఖ్య-దోషాత్ = నిలకడలేని దను లోపం వలన, విదగ్ధైః = పండితులచే, ఉపేక్షణీయా కిమ్? = తిరస్కరింపదగినదా?

**తా :** అనవధానతవలన నా కవిత్వశోభ/లక్ష్మిలో స్వల్పదోషాలుండవచ్చు. అయినా పండితులారా! నా కవిత్వాన్ని ఆదరించండి. లక్ష్మి క్షీరసాగరజాత. ఆమెలో చంచలత్వమన్న దోషముంది. అయినా పండితులు ఆమెను తిరస్కరించటం లేదు గదా!

**వి :** 1. కవిత్వ-శ్రీ(లక్ష్మి) అంటే రూపకాలంకారం.

2. శ్లోకంలో సమానంగా కనిపిస్తున్న రెండు వాక్యాలకు ఏకరూపాన్వయముంది కాబట్టి నిదర్శనాలంకారం. **'వాక్యార్థయోః సదృశయోః ఐక్యారోపో నిదర్శనా'.**

3. 'ప్రమాదో ధీమతామపి' సంస్కృతలోకోక్తి. ధీమతామేవ అన్నా బాగుంటుందేమో! ధీమంతుడయితేనే పొరపాటు పదం.కాకపోతే తప్పులనే అంటాం. *

**శ్లో॥ అసఙ్ఖ్యపాపాచలకోటిభాజాం - దితేః సుతానాం వశమాగతేయమ్ ।**
**అసహ్యభారార్దితసర్వగాత్రీ - జగామ ధాత్రీ శరణం విరిఞ్చమ్ ॥ 1-11**

**అ :** కృత్యవతరణికను ముగించి వాదిరాజతీర్థరు కథాకథనానికి ఉపక్రమిస్తున్నారు. -ఉపేంద్రవజ్ర.

**అ :** అసంఖ్య-పాపాచల-కోటి-భాజాం దితేః సుతానాం వశమ్ ఆగతా ఇయం ధాత్రీ అసహ్య-భారార్దిత-సర్వ-గాత్రీ విరించం శరణం జగామ.

**ప్ర :** అసంఖ్య... భాజామ్ : అసంఖ్య = లెక్కింపరాని, పాప = పాపము లనెడి, అచల = పర్వతాలయొక్క కోటి = సమూహాలను, భాజామ్ = సేవించునట్టి (అసంఖ్యాని చ తాని పాపాని ఏవ అచలాః తేషాం కోటయః తాః భజన్తీతి, తేషాం), దితేః సుతానామ్ = దైత్యుల యొక్క, వశమ్ = అదుపులోనికి, ఆగతా = వచ్చినట్టి, ఇయమ్

= ఈ, ధాత్రీ = భూమి, అసహ్యా... గాత్రీ(సతీ) : అసహ్యా = ఓర్వరాని, భార = బరువుచే, అర్దిత = పీడింపబడిన, సర్వ = సమస్తమైన, గాత్రీ (సతీ) = తనువు గలదై (అసహ్యేన భారేణ అర్దితం సర్వం చ తత్ గాత్రం యస్యాస్సా), విరించమ్ = బ్రహ్మదేవుని యొక్క, శరణమ్ = ఆశ్రయాన్ని (రక్షకుని) (**'శరణం గృహ రక్షిత్రోః-అమరకోశః-3/52)**, జగామ = పొందినది/పొందెను. (గమ్ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** దితి కుమారులు (రాక్షసులు) చేసే పాపాలకు లెక్క లేదు. అవి పర్వతసమూహాలవలె పేరుకుపోయాయి. అటువంటి వారి అదుపులోనికి వెళ్ళింది భూమి. ఆ భూమి శరీరమంతా సహింపరాని బాధకు లోనయింది. ఆమె బ్రహ్మదేవుని ఆశ్రయించింది.

**వి :** 1. ఇయమ్ (ఈ) పదం అర్థాంతరసంక్రమితవాచ్యమై కవికీ, పాఠకులకూ, పాపకృత్యాలు చేస్తున్న దితిసుతులకూ కూడా ఆధారమైనది అన్న అర్థాన్ని ఇస్తుంది.

గాత్రీ - ధాత్రీ : ఛేకాను ప్రాసాలంకారం.

పాప+అచల - రూపకాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ ముకున్దవిద్వేషిభరేణ ఖిన్నా - బభూవ సా క్షాన్తియుతాఽపి ఖిన్నా ।**
**తథాహి లోకే పతినిన్దకేభ్యః - పతివ్రతానామపరః క్వ భారః ॥ 1-12**

**అ :** దైత్యుల చేష్టలు భూమికి ఖేదాన్ని కలిగించటాన్ని లౌకికంగా సమర్థిస్తూ ప్రతిపాదిస్తున్నాడు కవి.
-ఉపేంద్రవజ్ర.

**అ :** సా క్షాంతి-యుతా అపి ముకుంద-విద్వేషి-భరేణ ఖిన్నా ఖిన్నా బభూవ. తథాహి. లోకే పతివ్రతానాం పతి-నిందకేభ్యః అపరః భారః క్వ.

**ప్ర :** సా = ఆ (మె) భూమి, క్షాంతి-యుతా+అపి = సహనంతో కూడిన దయినను (క్షాంత్యా యుతా), ముకుంద... భరేణ : ముకుంద = విష్ణుమూర్తియొక్క (ముకుం(మోక్షాన్ని) దదాతి ఇతి ముకుందః.) విద్వేషి = శత్రువులయొక్క, భరేణ = బరువుతో (భారంతో) (ముకున్దం విద్విషన్తీతి, తేషాం భరేణ), ఖిన్నా = శిథిలమయినదై, ఖిన్నా = దుఃఖించినదిగా, బభూవ = అయినది. (భూ సత్తాయామ్ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తథాహి = అది తగినదే, లోకే = లోకంలో, పతివ్రతానామ్ = సతీమతల్లులకు, పతి-నిందకేభ్యః = భర్తను దూషించెడు వారినుండి (పతేః నిందకాః, తేభ్యః), అపరః = వేరొక విధమైన, భారః = బరువు (మోయరాని), క్వ = ఎలా వస్తుంది?

**తా :** భూమి సర్వంసహా. అన్నింటినీ భరించు సహనం గలది. అయినా విష్ణువును ద్వేషించు శత్రువుల భారంతో ఆమె శిథిలపడి, దుఃఖిస్తోంది. నిజమే గదా! పతివ్రతలకు పతినిందను మించిన భారం మరెలా కలుగుతుంది?

**వి :** 1. ముకుందుడంటేనే మోక్షమిచ్చేవాడు. ఆయనను నిందించేవారే భారకారకు లయ్యారు. ఇక భారమోక్ష మెలా? ముకుంద విశేష్యం సాభిప్రాయం కాబట్టి పరికరాంకురాలంకారం.

పూర్వార్ధం విశేషం, ఉత్తరార్ధం సామాన్యం. కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం. అనుప్రాసాలంకారం. భర్తృనిందను ఆత్మనిందగా భావించటం భారతీయభావన. మైత్రీబంధం కారణంగా అది విశ్వభావన కూడా.

| | | | |
|---|---|---|---|
| 2. **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ |

*

**శ్లో॥ నిశమ్య గోబ్రాహ్మణముఖ్యబన్ధుం - ధ్రువం ముకున్దం శరణం వ్రజన్తీ ।**
**బభూవ గోరూపధరా ధరా సా - తమార్తభారాపహరం చ దీనా ॥ 1-13**

**అ :** భూమి గోరూపాన్ని ధరించటానికి కారణాన్ని నిరూపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ముకుందం గో-బ్రాహ్మణ-ముఖ్య-బంధుం నిశమ్య శరణం వ్రజన్తీ సా ధరా ధ్రువం గో-రూప-ధరా బభూవ తమ్ ఆర్తభారాపహరం చ నిశమ్య దీనా బభూవ.

**ప్ర :** ముకుందమ్ = నారాయణుని, గో.. బంధుమ్ : గో = గోవులకు, బ్రాహ్మణ = విప్రులకు, ముఖ్య = ప్రధానమైన, బంధుమ్ = బంధువునుగా (గవాం బ్రాహ్మణానాం చ ముఖ్యశ్చ అసౌ బంధుః, తమ్), నిశమ్య = విని (ని పూర్వక శమ ధాతువుపై ల్యప్ ప్రత్యయం) శరణం-వ్రజన్తీ = శరణు కోరుతూ, సా-ధరా = ఆ భూమి, ధ్రువమ్ = నిశ్చితంగా, గో-రూప-ధరా = గోరూపాన్ని ధరించినదిగా (గోః రూపస్య ధరా), బభూవ = అయ్యెను. తమ్ = ఆయనను, ఆర్త... హరమ్ : ఆర్త = దీనులయొక్క, భార = బరువును /దుఃఖాన్ని, అపహరమ్ = తొలగించువానినిగా (ఆర్తానాం భారస్య అపహరః, తమ్), నిశమ్య = విని, దీనా = దీనురాలుగా, బభూవ = అయ్యెను, (భూ సత్తాయామ్ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా :** గోబ్రాహ్మణులకు ముకుందుడు ప్రధానబంధువని గ్రహించియే భూమి నిశ్చితంగా గోరూపాన్ని ధరించి ఆయనను శరణుకోరింది. అంతేకాదు - కృష్ణుడు ఆర్తులను ఆదుకొంటాడని కూడా విని ఆర్తురాలయింది.

**వి :** 1. ధ్రువం పదం ఉత్ప్రేక్షావ్యంజకం కాబట్టి ఉత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ **మన్యే శంకే ధ్రువం ప్రాయో నూన మిత్యేవ మాదిభిః ।**
**ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివ శబ్దోఽపి తాదృశః ॥**

2. రెండు ప్రకృత విషయాలకూ బభూవ అన్న క్రియాపదాన్ని అన్వయించినందువలన తుల్యయోగితాలంకారం.

3. ధరా. ధరా - ఛేకానుప్రాస శబ్దాలంకారం.

4. **బభూవ :** 1-12వశ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ విరిఞ్చవైరిఞ్చముఖామరేశాః - స్వపారతంత్ర్యం భువి దర్శయన్తః ।**
**హరిం ధరాకార్యకృతే గృణన్తః - పురాన్నిరీయుర్హృది తం స్మరన్తః ॥ 1-14**

**అ :** భూమి బ్రహ్మను శరణుకోరి అక్కడకు వెళ్ళిన తరువాత విషయాన్ని చెప్తున్నాడు కవి. -ఉపేంద్రవజ్ర.

**అ :** విరించ-వైరించ-ముఖామరేశాః స్వ-పారతంత్ర్యం భువి దర్శయంతః ధరా-కార్య-కృతే హరిం గృణంతః హృది తం స్మరంతః పురాత్ నిరీయుః ।

**ప్ర :** విరించ... రేశాః : విరించ = బ్రహ్మ, వైరించ = శివుడు (విరించస్య అపత్యం పుమాన్, వైరించః - బ్రహ్మసుతుడు), ముఖ = మొదలుగా గల (ముఖం ప్రధానే ప్రారంభౌ వక్త్రే నిస్సరణేఽపి చ - అభిధానరత్నమాల), అమర+ఈశాః = దేవతా పాలకులు (విరించః వైరించశ్చ, తౌ ముఖౌ యేషాం తే చ తే అమరాణామ్ ఈశాః), స్వ-పారతంత్ర్యమ్ = తమయొక్క పరాధీనతను (స్వేషాం పారతంత్ర్యమ్), భువి = లోకంలో, దర్శయంతః = చూపుతూ (ప్రకటిస్తూ), ధరా... కృతేః : ధరా = భూమియొక్క, కార్య - కృతే = పని కొరకు (ధరాయాః కార్యం, తత్కృతే), హరిమ్ (ఏవ) = విష్ణువునే, గృణంతః = (పరిగణించి) స్తుతిస్తూ, హృది = హృదయంలో, తమ్ = ఆ విష్ణువునే, స్మరంతః = తలచుకొంటూ, పురాత్ = నగరం నుండి, నిర్+ఈయుః = నిర్గమించిరి (వెళ్ళిరి) (నిర్-ఉపసర్గపూర్వకమైన ఇణ్ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** భూమి విరించిని రక్షకునిగా ఆశ్రయించినా ఆ బ్రహ్మ, శివుడు మొదలుగా గల దేవపాలకులు (దేవశ్రేష్ఠులు) తమ అస్వతంత్రతను ప్రదర్శిస్తూ, భూమిపని సఫలం కావటానికి హరినే అధికారిగా భావించి ఆయనను స్తుతిస్తూ, ఆయననే తలచుకొంటూ నగరం నుండి బయలు దేరారు.

**వి :** 1. స్వభారవిముక్తికై భూమి తనను ఆశ్రయించినా బ్రహ్మ తనను తానెరిగినవాడు కాబట్టి తన అస్వతంత్రతనూ, హరి అర్హతనూ భావించి ఇతరలోకపాలకులనుకూడా తన వెంట నడిపిస్తూ హరిచెంతకు బయలు దేరాడు.

శ్లోకంలో రకారం పదేపదే వినిపిస్తూ అనుప్రాసాలంకారానికి అవకాశమిచ్చింది.

దర్శయంతః, గృణంతః, స్మరంతః – ఇక్కడ శతృప్రత్యయావృత్తి కూడా శ్లోకానికి అందమిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **నిరీయుః :** | నిరియాయ | నిరీయతుః | **నిరీయుః** |
| | నిరియయిథ/నిరియేథ | నిరీయథుః | నిరీయ |
| | నిరియాయ/నిరియియ | నిరీయివ | నిరీయిమ. |

*

**శ్లో॥ సురావలీ సా శ్రుతివర్ణ్యవేషా – నభస్థలే నష్టతమిస్రజాలే ।**
**యయౌ యతీన్ద్రైరపి యత్ర గమ్యాం – పయోఽబ్ధివేలాం పతదూర్మిమాలామ్ ॥15**

**అ :** స్వపురం నుండి బయలుదేరిన దేవగణం సాగరతీరాన్ని చేరుతున్న సందర్భాన్ని వివరిస్తున్నాడు కవి.
–ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రుతి–వర్ణ్య–వేషా సా సురావలీ నష్ట–తమిస్ర–జాలే నభస్థలే యతీంద్రైః అపి యత్ర గమ్యాం (తత్ర) పతదూర్మిమాలాం పయోబ్ధి–వేలాం యయౌ.

**ప్ర :** శ్రుతి... వేషా : శ్రుతి = వేదాల చేత కూడా, వర్ణ్య = వర్ణింపదగిన, వేషా = ఆకృతి గల (శ్రుతిభిః వర్ణ్యః వేషః యస్యాస్సా), సా = ఆ (అలా బయలుదేరిన), సుర+ఆవలీ = దేవసమూహం (సురాణామ్ ఆవలీ), నష్ట... జాలే : నష్ట = అదృశ్యమైన, తమిస్ర = చీకటియొక్క, జాలే = సమూహం గల (వారి ఆభరణాల కాంతులచే చీకట్లు కనిపించకుండా పోయాయని భావం) (నష్టం తమిస్రస్య జాలం యస్మిన్ తత్), నభః–స్థలే = గగనతలాన (నభసః స్థలం, తస్మిన్), యతీంద్రైః+అపి = యోగివరులచేతకూడా (యతీనామ్ ఇంద్రాః), యత్ర = ఏ ప్రదేశం, గమ్యామ్ = చేరదగినదో (యత్రైః గమ్యా, తామ్), (తత్ర) = ఆ ప్రదేశాన్ని, పతద్+ఊర్మి–మాలామ్ : పతత్ = ఎగిసిపడుతున్న, ఊర్మి = అలలయొక్క, మాలామ్ = వరుసలు గల (పతతామ్ ఊర్మీణాం మాలా, యస్యాః, తామ్), పయోఽబ్ధివేలామ్ : పయః+అబ్ధి = పాలసముద్రం యొక్క, వేలామ్ = హద్దును (తీరాన్ని) (పయసామ్ అబ్ధిః, తస్య వేలా, తామ్), యయౌ = చేరెను (వెళ్ళెను).(యాప్రాపణే–పరస్మైపది– లిట్–ప్ర.ఏ.)

**తా॥** ఆ దేవతా సమూహం వేదాలుకూడా వర్ణింపదగిన వేషధారణ గలది. ఆ వేష విశేషం చేత గగనసీమలోని చీకట్లు తొలగిపోయాయి. ఆ స్థితిలో ఆ దేవగణం యతీంద్రులు కూడా ఆశ్రయింపదగిన క్షీరసాగరతీరాన్ని సమీపించింది. ఆ సాగరంలో అలలు ఎగిసి పడుతున్నాయి.

**వి :** 1. 'యతీంద్రైరపి' (యతిశ్రేష్ఠులచే కూడా) అని యతివరులను దేవతలకన్న ఒక మెట్టుపైన నిలిపాడు. దేవతలు సుఖాన్నే కాని సుఖవిముక్తినివ్వలేరు గదా!

ఏది గమ్యమో అని సర్వనామాన్ని వాడకుండా '**యత్ర**' అని అవ్యయపదాన్ని వాడటం ఒక సొగసు, విలక్షణ ప్రయోగం.

పతదూర్మిమాలామ్ – జలసముద్రానికయినా పొంగు తప్పనప్పుడు పాలసముద్రం గురించి చెప్పేదేముంది. **అనుప్రాసాలంకారం.**

| | | | | |
|---|---|---|---|---|
| 2.యయౌ : | **యయౌ** | యయతుః | యయుః | |
| | యయిథ/యయాథ | యయథుః | యయ | |
| | యయౌ | యయివ | యయిమ. | * |

**శ్లో॥ తతోఽబ్జభూః క్షీరపయోఽబ్ధితీరే - సమాధిమాస్థాయ సుసంయతాక్షః ।**
**స్థిరాసనః ప్రాణగణాన్ నియమ్య - ప్రచక్రమే ప్రాఞ్జలిరాత్మదీక్షామ్ ॥ 1-16**

**అ :** క్షీరసాగరతీరంలో బ్రహ్మ సమాధిస్థితిలో దీక్ష బూనటాన్ని కవి ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు.-ఉపేంద్రవజ్ర.

**అ :** తతః అబ్జ-భూః క్షీర-పయోఽబ్ధి-తీరే సుసంయతాక్షః సమాధిమాస్థాయ స్థిరాసనః (సన్) ప్రాణ-గణాన్ నియమ్య ప్రాంజలిః ఆత్మ-దీక్షాం, ప్రచక్రమే.

**ప్ర :** తతః = అటు (క్షీరసాగరతీరం) చేరిన తరువాత, అబ్(ప్) - జ - భూః = (కమలం నుండి పుట్టిన) బ్రహ్మ (అబ్జాత్ భవతీతి), క్షీర-పయః+అబ్ధితీరే = పాలకడలి యొద్దున (క్షీర-పయోధేః తీరమ్, తస్మిన్), సు-సంయత+అక్షః = చక్కగా నియంత్రించిన ఇంద్రియాలు గలవాడై, (ఖమక్షమింద్రియం స్రోతో హృషీకం కారణం స్మృతమ్- అభిధానరత్నమాలా-535) (సమ్యక్ (సుష్ఠు) సంయతే అక్షిణీ యేన సః), సమాధిమ్ = ఏకాగ్రతను (తదేకభావనను), ఆస్థాయ = పొంది (అఙ్పూర్వక స్థా ధాతువుపై ల్యప్ ప్రత్యయం) స్థిర+ఆసనః (సన్) = నిలకడగా (సుఖంగా) కూర్చొని (స్థిరసుఖమాసనమ్-పతంజలి యోగసూత్రాలు-2/46) (స్థిరమ్ ఆసనం యస్య సః), ప్రాణగణాన్ = శరీరంలోని ప్రాణ సముదాయాన్ని (ప్రాణానాం గణాః తాన్), నియమ్య = నియంత్రించి, ప్ర+అంజలిః = దోయిలి పట్టి, ఆత్మదీక్షామ్ : ఆత్మ = పరమాత్మపై (విష్ణువుపై) (దత్తందూర్వాససం సోమమాత్మేశ బ్రహ్మసంభవాన్- భాగవతం 4-1-15), దీక్షామ్ = పూనికను (నియమాన్ని) (ఆత్మనః దీక్షా, తామ్), ప్ర చక్రమే = ప్రారంభించెను. (ప్రపూర్వక క్రము పాదవిక్షేపే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** దేవగణమంతా క్షీరసాగరతీరాన్ని చేరిన తరువాత బ్రహ్మ ఇంద్రియాలను నియంత్రించు కొని, ఏకాగ్రతను పొంది, నిశ్చలంగా సుఖాసనంలో కూర్చొని, చేతులు జోడించి, విష్ణుదీక్షను ప్రారంభించాడు.

**వి : 1. సమాధి** యోగాంగాలలో ఒకటి. '**యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యాన- ధారణసమాధయః అష్టాంగాని**' (పతంజలి యోగసూత్రాలు 2/29), '**తదేవార్థమాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః**' (పతంజలి యోగసూత్రాలు 3/3)

**ప్రాణాలు :** ప్రాణం, అపానం, సమానం, వ్యానం, ఉదానం,

శ్లో॥ **హృది ప్రాణః గుదేఽపానః సమానో నాభిసంస్థితః ।**
**ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః ॥**

(హృదయంలో ప్రాణం, గుదంలో అపానం, నాభిలో సమానం, కంఠంలో ఉదానం, శరీరమంతా వ్యానం)

ఇది స్వభావోక్త్యలంకారం. '**స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనమ్**' - జాతి గుణక్రియాదులలో దేనినైనా ఉన్నదున్నట్లు చెప్పటం. ఇక్కడ క్రియా స్వభావోక్తి.

'క్షీరపయోఽబ్ధితీరే' - ఇక్కడ 'క్షీర - పయస్ - అప్' పదాల సార్థక్యాన్ని పరిశీలించాలి.

కాళిదాసు కుమారసంభవంలో(5-24) పార్వతీ తపస్సును వర్ణిస్తూ తొలకరి చినుకులు ఆమెపై జారటాన్ని వివరిస్తూ తపోదీక్షా స్థితిని ధ్వనింపజేశాడు.

**శ్లో॥ స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః**
**పయోధరోత్సేధనిపాతచూర్ణితాః ।**

**వలీషు తస్యాః స్థలితాః ప్రపేదిరే**
**చిరేణనాభిం ప్రథమోదబిందవః ॥**

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రచక్రమే :** | ప్రచక్రమే | ప్రచక్రమాతే | ప్రచక్రమిరే |
| | ప్రచక్రమిషే | ప్రచక్రమథే | ప్రచక్రమిధ్వే |
| | **ప్రచక్రమే** | ప్రచక్రమివహే | ప్రచక్రమిమహే. |

*

**శ్లో॥ యదా స పద్మాసనసంస్థితోఽలం – జజాప విద్యామితరైరవేద్యామ్ ।**
**తదా ప్రభృత్యేవ జగత్సు నూనం – బభూవ పద్మాసనశబ్దితోఽసౌ ॥ 1-17**

**అ :** బ్రహ్మకున్న 'పద్మాసన' పదంతో చమత్కరిస్తున్నాడు కవి. –ఉపేంద్రవజ్ర.

**అన్వ :** యదా సః పద్మాసన–సంస్థితః ఇతరైః అవేద్యాం విద్యామ్ అలం జజాప తదా ప్రభృతి ఏవ అసౌ జగత్సు నూనం పద్మాసన–శబ్దితః బభూవ.

**ప్రతి :** యదా = ఏ వేళలో, సః = ఆ బ్రహ్మ, పద్మా... సంస్థితః(సన్) : పద్మ+ఆసన = పద్మాసనమందు, సంస్థితః సన్ = చక్కగా వుండి (పద్మాసనే సంస్థితః), ఇతరైః = అన్యులచేత, అవేద్యామ్ = ఎరుగరాని, విద్యామ్ = విద్యను (పురుషసూక్తాన్ని అని 21వ శ్లోకంలో), అలమ్ = తగినంతగా (అలం–భూషణపర్యాప్తివారణేషు–మేదినీకోశః–2/56), జజాప = జపించెనో (జప వ్యక్తాయాం వాచి మానసే చ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తదా–ప్రభృతి+ఏవ = ఆ వేళనుండియే, అసౌ = ఆ బ్రహ్మ, జగత్సు = లోకాలలో, పద్మాసన – శబ్దితః = 'పద్మాసను'డని పిలవబడువాడుగా (పద్మాసన ఇతి శబ్దితః), బభూవ = అయ్యెను, (భూ సత్తాయామ్–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** బ్రహ్మ ఏ సమయంలో పద్మాసనంలో ఉండి ఇతరులెరుగని పౌరుషవిద్యతో నారాయణుని కీర్తించాడో ఆ సమయంనుండియే బ్రహ్మకు పద్మాసను దన్న పేరు లోకంలో వ్యవహారంలోనికి వచ్చింది.

**వి :** 1. నారాయణసూక్తాన్ని పఠించేముందు, పురుషసూక్తం ముగింపులోనూ...

శ్లో॥ **ధాతా పురస్తాద్యముదాజహార**
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః ।
తమేవం విద్వానమృత ఇహ భవతి
నాన్యః పన్థాః అయనాయ విద్యతే ॥ అని

చదవటం సంప్రదాయం. 'ఇతరైః అవేద్యామ్' అనటంలో ఆంతర్యమిదే కావచ్చు. ముందుగా ఆ నారాయణుని ఉదాహరించినది బ్రహ్మయే అని.

2. ఇది హేతూత్ప్రేక్షాలంకారం. బ్రహ్మ పద్మాసనుడు కావటానికి నాటి పద్మాసన స్థితి కారణం కాకపోయినా కారణంగా సంభావించటం హేతూత్ప్రేక్ష. నూనం పదం ఉత్ప్రేక్షా నిర్ధారకం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥

3. విధ్యలంకారం కూడా ఇక్కడ. '**సిద్ధస్యైవ విధానం యత్ తమాహుర్విధ్యలంకృతమ్**" – సిద్ధించినదానినే విధించటం. సిద్ధించిన పద్మాసనత్వాన్ని మరల సిద్ధింపజేస్తున్నాడు కాబట్టి విధ్యలంకారం.

| | | | |
|---|---|---|---|
| 4. **జజాప :** | **జజాప** | జేపతుః | జేపుః |
| | జేపిథ | జేపథుః | జేప |
| | జజాప/జజప | జేపివ | జేపిమ |

**బభూవ :** 1-12వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తదా తదన్యాన్యపహాయ హేయా-న్యరక్తచిత్తః స విరిఞ్చిపుత్రః ।**
**స్తువన్ గిరీశోఽపి గిరా మురారి-మనఙ్గజిద్దిగ్వసనో బభూవ ॥ 1-18**

**అ :** పరమశివుని గిరీశత్వ, అనంగజిత్త్వ, దిగ్వసనత్వాలను విధిస్తున్నాడు కవి. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదా సః విరించ-పుత్రః తదన్యాని హేయాని అపహాయ, అరక్త-చిత్తః గిరా మురారిం స్తువన్ దిగ్వసనః అనంగ-జిత్ గిరీశః బభూవ.

**ప్ర :** తదా = ఆ సమయంలో, సః = ఆ, విరించ-పుత్రః = శివుడు (విరించస్య పుత్రః), తద్+అన్యాని = ఆ విష్ణువుకన్న వేరయిన, హేయాని = పరిహరింపదగిన వానిని (ఓహాక్ త్యాగే ధాతువుపై యత్ ప్రత్యయం-నపుంసకబహువచనరూపం), అపహాయ = విడిచిపుచ్చి (అప-ఉపసర్గ పూర్వక ఓహాక్ ధాతువు-ల్యప్ ప్రత్యయం), అరక్త-చిత్తః(సన్) = కామం లేని మనోవృత్తి గలవాడై (అరక్తం చిత్తం యస్య సః), గిరా = వాక్కుతో (బ్రాహ్మీ తు భారతీ భాషా గీర్వాగ్వాణీ సరస్వతీ-అమరకోశః- 1/6/1), మురారిమ్ = విష్ణువును, స్తువన్ = స్తోత్రం చేస్తూ, దిగ్+వసనః = దిక్కులే బట్టలుగా గలవాడుగానూ (దిశః ఏవ వసనాని యస్య సః), అనంగ-జిత్ = మదనుని జయించినవాడుగానూ/మదన విజేతగానూ (అనంగం జితవాన్ ఇతి), గిరి+ఈశః = మాటయందు సమర్థుడుగానూ ('తత్పురుషే కృతి బహులమ్' అని అలుక్సమాసం), బభూవ = అయ్యెను (భూసత్తాయామ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ సమయంలో పరమశివుడు విష్ణుభిన్నమైనవి ఏవీ వద్దని బట్టలను కూడా వదలి, కామరహితమనస్కుడై, మాటతో విష్ణువునే స్తుతిస్తూ దిగంబరుడూ, మదనవిజేతా, గిరీశుడూ కాగలిగాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో కూడా హేతూత్ప్రేక్ష, విధ్యలంకారాలు ఉన్నాయి. పరమశివుడు దిగంబరుడు, అనంగజిత్తు, గిరీశుడు కావటానికి ఆనాటి సంఘటన కారణం కాకపోయినా కారణమనటం వలన హేతూత్ప్రేక్ష. అవి అంతకు ముందు సిద్ధించి ఉన్నా మరల వాటిని విధించటంతో విధ్యలంకారం.(లక్షణం - చూడుడు 17 శ్లో)

2. ఇక ఈ శ్లోకంలో గిరీశ, అనంగజిత్, దిగ్వసన కారణాలకు వ్యత్యస్తక్రమంలో ఆ లక్షణాలు వర్ణింపబడ్డాయి. కాబట్టి క్రమాలంకారంలోనే ఒక విశేషం. అన్వయక్రమంలో భావానుగుణంగా క్రమాన్ని స్వీకరించాం.

3.**బభూవ :** 1-12వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తదైవ శేషోఽజని వాయుభక్షః - సహస్రనేత్రోఽపి తదైవ నూనమ్ ।**
**శతక్రతుః సుప్తివిదూరభావా - బభూవురస్వప్నపదాశ్చ దేవాః ॥ 1-19**

**అ :**శేషాదుల తపోరూపాన్ని వివరిస్తున్నాడు కవి పూర్వశ్లోకాలవలెనే. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదా ఏవ శేషః వాయు-భక్షః అజని. తదా ఏవ సహస్ర-నేత్రః అపి నూనం శత- క్రతుః అజని. సుప్తి-విదూర-భావాః దేవాః చ అస్వప్న-పదాశ్చ బభూవుః ।

**ప్ర :** తదా+ఏవ = ఆ సమయంలోనే, శేషః = ఆదిశేషుడు (విష్ణుశయ్య), వాయు-భక్షః = గాలి భుజించే వాడుగా/ పవనాశనుడుగా (వాయుం భక్షతి ఇతి), అజని = అయ్యెను. (జనీ ప్రాదుర్భావే ఆత్మనే పది లుఙ్ ప్ర.ఏ.). తదా+ఏవ = ఆ సమయంలోనే, సహస-నేత్రః + అపి = దేవేంద్రుడు కూడా (సహస్రాణి నేత్రాణి యస్య సః), నూనమ్ = నిశ్చితంగా, శత-క్రతుః = నూరు యాగాలు చేసిన వాడుగా (శతం క్రతవః యస్య సః), అజని = అయ్యెను. దేవాః చ = దేవతలు కూడా, సుప్తి... భావాః : సుప్తి = నిదురకు, విదూర = ఎంతో

దూరంలో గల, భావాః = ఆలోచనలు గలవారై (సుప్తేః విదూరః భావః యేషాం తే), అస్వప్నపదాః = అస్వప్నులని పిలువబడేవారుగా (ఆదిత్యా ఋభవోఽస్వప్నాః–అమరకోశం 1/8) (అస్వప్నా ఇతి పదం యేషాం తే), బభూవుః = అయ్యారు. (భూ సత్తాయామ్ పరస్మైపది లిట్ ప్ర.బ.)

**తా॥** ఆ సాగరతీర సంఘటనలోనే ఆదిశేషువు తపోధర్మంగా గాలిని మాత్రమే భుజిస్తూ అప్పటినుండి వాయుభక్షుడయ్యాడు. సహస్రనేత్రుడైన ఇంద్రుడు హరికీర్తనతోనే ఆ సమయంలో శతక్రతు ఫలితాన్ని పొందాడు. దేవతలు కూడా పూజాధర్మంగా ఆ వేళలో జాగరణ చేస్తూ అప్పటినుండి అస్వప్నులయ్యారు.

**వి :** 1. ఇక్కడ కూడా గతశ్లోకంలో వలెనే ఆదిశేషువు వాయుభక్షత్వాన్ని, ఇంద్రుని శతక్రతుత్వాన్నీ, దేవతల అస్వప్నత్వాన్ని విధిస్తూ విధ్యలంకారాన్ని, హేతువు కాని దానిని హేతువుగా చేస్తూ హేతూత్ప్రేక్షను వర్ణించాడు కవి. నూనమ్ పదముండనే ఉంది.

అత్యంతమృదువుగా వర్ణావృత్తి కలిగి అనుప్రాసాలంకారం కూడా అందగిస్తోంది.

2. **బభూవుః :** 1–12వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ రసా పిపాసోగ్రభరాశనాయా – విషహ్య విష్ణుం మనసాఽచలేన ।**
**తదాఽనుధావన్త్యచలేతి సర్వం–సహేతి నూనం జగదే జగత్యామ్ ॥ 1–20**

**అ :** భూమికి అచలత్వాన్నీ, సర్వంసహాత్వాన్నీ విధిస్తున్నాడీ శ్లోకంలో కవి. –ఉపేంద్రవజ్ర.

**అ :** రసా పిపాసోగ్రభరాశనాయాః విషహ్య అచలేన మనసా విష్ణుమ్ అనుధావన్తీ జగత్యాం తదా సర్వంసహా ఇతి అచలా ఇతి నూనం జగదే.

**ప్ర :** రసా = భూమి (భూర్భూమిరచలాఽనంతా రసా విశ్వంభరా స్థిరా–అమరకోశః–2/2), పిపాసో... నాయాః : పిపాసా = దప్పికను (పాతుమిచ్ఛా పిపాసా), ఉగ్ర–భర = ఎక్కువయిన బరువును, అశనాయాః = ఆకలిని (అశితుమ్ ఇచ్ఛా అశనాయా – అశనాయోదన్యధనాయా బుభుక్షాపిపాసాదర్ధేషు – అష్టాధ్యాయి 7/4/34 ఆకలి అనే అర్థంలో 'అశనాయా' నిపాతం) (పిపాసా చ ఉగ్రశ్చాసౌ భరశ్చ అశనాయా చ), విషహ్య = సహించి (విపూర్వక సహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అచలేన = నిలకడగల, మనసా = మనస్సుతో, విష్ణుమ్ = నారాయణుని, అనుధావన్తీ = తలచుచూ (అనుపూర్వక ధావు ధాతువు–శతృప్రత్యయం–స్త్రీలింగం), జగత్యామ్ = లోకంలో, తదా = అప్పుడు/ అప్పటినుండి, సర్వంసహా ఇతి = సర్వంసహ (అన్నింటినీ భరించగలది) అనీ (సర్వం సహతే ఇతి), అచలా ఇతి = అచల (నిలకడ గలది) అనీ, నూనమ్ = నిశ్చితంగా, జగదే = పలుకబడెను. (గద వ్యక్తాయాం వాచి–కర్మణి–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** భూమి కూడా దప్పికనూ, అతిశయించిన భారాన్నీ, ఆకలినీ భరిస్తూ నిశ్చలమయిన మనస్సుతో ఆ నారాయణుని స్మరించింది. ఆ కారణంగా ఆనాటి నుండీ భూమిని 'సర్వంసహా' అని 'అచలా' అని లోకులు వ్యవహరించసాగారు.

**వి :** 1. ఇక్కడ కూడా ముందటిశ్లోకంలో వలెనే హేతూత్ప్రేక్షా, విధ్యలంకారాలు. సర్వంసహా–త్వానికి, అచలత్వానికి కారణం కాని వాటిని కారణాలుగా సంభావించటం హేతూత్ప్రేక్ష. సిద్ధించిన వాటినే విధించటం విధ్యలంకారం.

2. విషహ్య విష్ణుమ్; జగదే జగత్యామ్–అనుప్రాసాలంకారం.

3. సాధారణవ్రతాలో ఆకలిదప్పికలను భరించటముంటుంది. కాని ఇక్కడ భూమికాబట్టి భారాన్ని మోయటం కూడా ఒక భాగం శక్తిలేని సమయంలో.

| | | | | |
|---|---|---|---|---|
| 4. జగదే : | **జగదే** | జగదాతే | జగదిరే | |
| | జగదిషే | జగదాథే | జగదిధ్వే | |
| | జగదే | జగదివహే | జగదిమహే. | * |

**శ్లో॥ సహస్రకార్యేషు భవాన్ సమర్థః - సహస్రనేత్రాననపాణిపాదః ।**
**ఇతీవ విజ్ఞాపయితుం విరిఞ్చిః - స్తుతిం స పుంసూక్తగతాం తతాన ॥ 1-21**

**అ :** విరించికృతమయిన విష్ణుస్తుతి ప్రసక్తి ఈ శ్లోకంలో. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః విరించిః సహస్ర-నేత్రానన-పాణి-పాదః భవాన్ సహస్ర-కార్యేషు సమర్థః ఇతి విజ్ఞాపయన్నివ పుం-సూక్త-గతాం స్తుతిం తతాన.

**ప్ర :** సః = ఆ (క్షీరసాగరతీరంలో స్థిరాసనుడైన), విరించిః = బ్రహ్మ, సహస్ర... పాదః : సహస్ర = వేలకొలదిగ, నేత్ర = కన్నులూ, ఆనన = ముఖములూ, పాణి = చేతులూ, పాదః = కాళ్ళూ గల (సహస్రాణి నేత్రాణి ఆననాని పాణయః పాదాః చ యస్య సః), భవాన్ = నీవు, సహస్ర-కార్యేషు = వేల పనులలో (సహస్రాణి చ తాని కార్యాణి, తేషు), సమర్థః = శక్తి గలవాడవు, ఇతి = అని, విజ్ఞాపయితుం ఇవ = చెప్పడానికో అన్నట్లు, పుం-సూక్త-గతామ్ = పురుష సూక్తానికి చెందిన (పుంసః సూక్తం తస్మిన్ గతా, తామ్), స్తుతిమ్ = స్తోత్రాన్ని, తతాన = (మిక్కిలిగా) చేసెను. (తనూ విస్తారే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** విష్ణువు విశ్వతస్స్వరూపుడు. వేలకొలదిగ కళ్ళు, కాళ్ళు, మొగాలు, చేతులూ గలవాడు. వేలకొలది కార్యాలను నిర్వహిస్తున్నవాడు. విభిన్నావతారాలలో నిర్వహించవలసినవాడు. ఆ విషయాన్ని తలపింప జేస్తూ బ్రహ్మ పురుషసూక్తంతో విష్ణువును స్తుతింపనారంభించాడు.

**వి :** 1. **పురుషసూక్తం** ఋగ్వేదంలో దశమమండలం లోనిది (10/7/90). నారాయణ ఋషి కృతం. పురుషోద్దిష్టం.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్షః సహస్రపాత్ ।**
**స భూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠద్దశాంగులమ్ ॥**
**పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యమ్ ...**

భూతమూ, భవిష్యత్తూ కూడా తానే కాబట్టి ఆయననే స్తుతిస్తున్నాడు బ్రహ్మ.

2. ఇక్కడ 'విజ్ఞాపయితుమ్ ఇవ' అన్నచోట ఫలోత్ప్రేక్ష. బ్రహ్మస్తోత్రానికి ఫలితం విజ్ఞాపనం కాదు. అయినా అలా సంభావించుట ఫలోత్ప్రేక్షాలంకారం. "సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తు హేతు ఫలాత్మనా"

3. వర్ణావృత్తిరూపమైన అనుప్రాసాలంకారం.

4. మనోగతమయిన భక్తిభావానికి అనుభావరూపం స్తోత్రం.

| | | | | |
|---|---|---|---|---|
| 5. **తతాన :** | **తతాన** | తేనతుః | తేనుః | |
| | తేనిథ | తేనథుః | తేన | |
| | తతాన/తతన | తేనివ | తేనిమ. | * |

**శ్లో॥ తచ్చిత్తేఽఙ్కురితః సుభక్తిలతయా శ్లిష్టః ప్రమోదాశ్రుభిః**
**సిక్తః సత్పులకాలిమూలవితతః కాయప్రభాపల్లవః ।**
**ఈషన్మీలితనేత్రకుడ్మలయుతః శాఖాసహస్రోర్జితః**
**ప్రాప్తః శ్రీరమణద్విజేన ఫలితస్తద్ధ్యానకల్పద్రుమః ॥ 1-22**

**అ :** బ్రహ్మాదిదేవతాకృతమైన విష్ణుసమర్చాఫలప్రాప్తిని వర్ణిస్తున్నాడు కవి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** తద్ధ్యాన-కల్ప-ద్రుమః తచ్చిత్తే అంకురితః సుభక్తి-లతయా శ్లిష్టః, ప్రమోదాశ్రుభిః సిక్తః సత్పులకాలి-మూల-వితతః కాయ-ప్రభా-పల్లవః ఈషన్మీలిత-నేత్ర-కుడ్మల-యుతః శాఖా-సహస్రోర్జితః ఫలితః శ్రీరమణ ద్విజేన ప్రాప్తః.

**ప్ర :** తద్-ధ్యాన-కల్పద్రుమః : తద్ = ఆ దేవతలయొక్క, ధ్యాన = ధ్యానమనెడి, కల్పద్రుమః = కల్పవృక్షం (ఇది దేవతావృక్షం.

పంచైతే దేవతరవో మందారః, పారిజాతకః।

సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్ ॥ అమరకోశః 1/53)(తేషాం ధ్యానమ్ ఏవ కల్పద్రుమః), తత్+చిత్తే = వారి మనస్సు(ల)లో (తేషాం చిత్తే), అంకురితః(సన్) = మొలిచినదై (అంకురపదంపై 'తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్' (అష్టాధ్యాయి 5/2/36) ఇతచ్ ప్రత్యయం), సుభక్తిలతయా : సుభక్తి = సద్భక్తి అనెడి, లతయా = తీవెచే (శోభనా చ సా భక్తిః, సైవ లతా, తయా), శ్లిష్టః(సన్) = కౌగిలింపబడినదై (శ్లిష్ ఆలింగనే-క్త ప్రత్యయం), ప్రమోద-అశ్రుభిః = ఆనందబాష్పాలచే (ప్రమోదేన అశ్రవః, తైః), సిక్తః(సన్) = తడుపబడినదై (షిచ్ సేచనే-క్త ప్రత్యయం), సత్... వితతః (సన్) : సత్ = చక్కనైన (ఆనందంతో పుట్టిన), పులక+ఆలి = పులకరింతల వరుసలనే, మూల = పాదుచే, వితతః (సన్) = వ్యాపించినదై (వి-తనూ విస్తారే - క్త ప్రత్యయం) (సతాం పులకానామాలయః ఏవ మూలాని తైః వితతః), కాయ... పల్లవః : కాయ = శరీరాలయొక్క, ప్రభా = కాంతు లనెడి, పల్లవః = చిగురులు గలదియై (కాయస్య ప్రభా ఏవ పల్లవః యస్య సః), ఈష... యుతః : ఈషత్ = కొంచెముగా, మీలిత = మూయబడిన, నేత్ర = కను లనెడి, కుడ్మల = మొగ్గలచే, యుతః (సన్) = కూడినదై (ఈషత్ నిమీలితాని నేత్రాణి ఏవ కుట్మలాని, తైః యుతః), శాఖా... ర్జితః : శాఖా = వేదాలలో కన్పించే వివిధ శాఖలయొక్క/కొమ్మలయొక్క, సహస్ర = వేలచే, ఊర్జితః (సన్) = బలపడినదై (శాఖానాం సహస్రేణ ఊర్జితః), ఫలితః (సన్) = ఫలించినదై (ఫల నిష్పత్తౌ - క్త ప్రత్యయం), శ్రీరమణ-ద్విజేన = శ్రీకాంతుడు (విష్ణువు) అను పక్షిచే, ప్రాప్తః = పొందబడినది. (ప్రపూర్వక ఆప్ల్ వ్యాప్తౌ - క్త ప్రత్యయం- కర్మణి)

**తా ॥** బ్రహ్మ మొదలుగా గల దేవతల ధ్యాన మనే కల్పవృక్షం వారి మనస్సులలో అంకురించి, భక్తిలతతో చుట్టబడి, ఆనందబాష్పాలచే తడుపబడి, వారి పులకరింత లను పాదుతో విస్తరించి, వారి శరీర కాంతు లను పల్లవాలను పొంది, కొద్దిగా తెరిచిన వారి కన్ను లనే మొగ్గలనూ, వివిధ వేద విభాగాలకు చెందిన శాఖ లనే కొమ్మలనూ పొంది, ఫలించి కడకు శ్రీకాంతు డనే పక్షిచేత పొందబడినది.

**వి :** 1. భక్తి కల్పవృక్షం దేవతల మనస్సులలో మొలిచి పెరిగింది. ఫలితాన్ని మాత్రం శ్రీరమణుడు అందుకొన్నాడు. ఇది "అసంగత్యలంకారం" "విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వోరసంగతిః" కార్యకారణాలు భిన్న ప్రదేశాలలో ఉండటం.

2. ఇది సావయవరూపకాలంకారం. భక్తితో పాటు దాని అవయవాలలో కూడా వృక్షత్వ, తదవయవత్వాలను ఆరోపించాడు కదా! దానితో పాటు శాఖా - ద్విజ పదాలు రెండర్థాల నిస్తున్నాయి. కాబట్టి శ్లేషాలంకారం కూడా. శ్లేషానుప్రాణితరూపకం.

3. ఇక్కడ అశ్రువు, రోమాంచం అనే సాత్త్విక భావాలు కనిపిస్తాయి. భక్తికి ఇవి ప్రధానమైన సాత్త్విక భావాలు. మిగిలిన అనుభావాలు - భక్తిలతాశ్లేషణం, ఈషన్నేత్రోన్మీలనం - కూడా భక్తిని రక్తికట్టిస్తాయి.

4. ద్విజ ఫలప్రాప్తిని ముండకోపనిషత్తు ముచ్చటగా వర్ణించింది.

ద్వాసుపర్ణా సయుజా సఖాయా - సమానవృక్షం పరిషస్వజాతే ।
తయోరేకః పిప్పలం స్వాద్వ్య - త్తన్నశ్నన్నన్యో అభిచాకశీతి ॥ -ముండకోపనిషత్తు 3/1. *

**శ్లో॥ తతః ప్రసన్నః కరుణామ్బురాశిః సురాన్ సమాశ్వాస్య విరిఞ్చపూర్వాన్ ।**
**ధరాం గతక్లేశభరాం విధాయ స్వకీయమాయాం హరిరిత్యవోచత్ ॥ 1-23**

**అ :** అనుగ్రహించిన విష్ణువు తత్‌క్షణమే పనిలో పడటాన్ని ప్రకటిస్తున్నాడు కవి.

**అ :** తతః కరుణాంబురాశిః హరిః ప్రసన్నః (సన్) విరించ-పూర్వాన్ సురాన్ సమాశ్వాస్య ధరాం క్లేశ-భరాం విధాయ స్వకీయ-మాయామ్ ఇతి అవోచత్.

**ప్ర :** తతః = ఆ తరువాత, కరుణా-అంబురాశిః = దయాసముద్రుడైన (కరుణా అంబునః రాశిరివ యస్మిన్ సః), హరిః = విష్ణువు, ప్రసన్నః (సన్) = ప్రసన్నుడై, విరించ-పూర్వాన్ = బ్రహ్మ మొదలుగా గల (విరించః పూర్వః యేషాం తాన్), సురాన్ = దేవతలను, సమాశ్వాస్య = ఊరడించి (సమ్-ఆఙ్ పూర్వక శ్వస్ ధాతువు-ణిజంతం-పై ల్యప్ ప్రత్యయం), ధరామ్ = భూమిని, గత-క్లేశ-భరామ్ : గత = తొలగిన, క్లేశ = బాధలయొక్క, భరామ్ = భారంగల దానినిగా (గతః క్లేశస్య భరః యస్యాః, తామ్), విధాయ = చేసి (చేయటానికి సంకల్పించి అని భావం. విపూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వకీయ-మాయామ్ = తన మాయను (తో) (స్వకీయా చ సా మాయా, తామ్), ఇతి = ఈ (చెప్పబోవు) విధంగా, అవోచత్ = పలికెను (వచ్ పరిభాషణే-లుఙ్-ప్ర.ఏ.).

**తా ॥** దయాసముద్రుడై ప్రసన్నుడైన శ్రీహరి బ్రహ్మమొదలుగాగల దేవతలను ఓదార్చి, భూ భారాన్ని తొలగించటానికి సంకల్పించి ఆమెను తృప్తి పరచి, ఆపై తన మాయతో ఇలా అంటున్నాడు.

**వి :** 1. మాయా నారాయణీశానా - అని భాగవతం (10-3-13) మాయాపదం లక్ష్మీపర్యాయంగా వాడింది.

2. ఈ శ్లోకంలో ఓజస్సు అనే అర్థగుణం కనిపిస్తుంది, వేగంగా కథాసందర్భాన్ని చెప్పటం ద్వారా. అర్థస్య ప్రౌఢిరోజః -

**శ్లో॥ పదార్థే వాక్యరచనా వాక్యార్థే చ పదాభిధా ।**
**ప్రౌఢిర్వ్యాససమాసౌ చ సాభిప్రాయత్వ మస్య చ ॥** **(కావ్యాలంకారసూత్రాణి 3/2/2)**

| | | | |
|---|---|---|---|
| 3. **అవోచత్ :** | **అవోచత్** | అవోచతామ్ | అవోచన్ |
| | అవోచః | అవోచతమ్ | అవోచత |
| | అవోచమ్ | అవోచావ | అవోచామ |

4. ఛందస్సు - ఉపేంద్రవజ్ర. *

**శ్లో॥ దేవేషు ధాతా ప్రభురస్య లక్ష్మీస్తస్యాః ప్రభుః సోఽహమితీవ శంసన్ ।**
**ఆజ్ఞామజస్యైవ దదావదృశ్యో విజ్ఞేయమూర్తిః స్ఫుటమిన్దిరాయాః ॥ 1-24**

**అ :** విష్ణువు మాయ నాదేశించుట. - ఇంద్రవజ్ర.

**అ :** (హరిః) దేవేషు ధాతా ప్రభుః అస్య లక్ష్మీః ప్రభుః తస్యాః సోఽహం ప్రభుః ఇతి శంసన్ ఇవ అదృశ్యః(సన్), ఇందిరాయాః స్ఫుటమ్ విజ్ఞేయ-మూర్తిః (సన్) అజస్య ఏవ ఆజ్ఞాం దదౌ.

**ప్ర :** (హరిః = విష్ణువు), దేవేషు = దేవతలలో (ఇది నిర్ధారణ సప్తమి. 'యతశ్చ నిర్ధారణమ్' - అష్టాధ్యాయి 2/3/41) ధాతా = బ్రహ్మ, ప్రభుః = ప్రభువు/స్వామి, అస్య = ఈ బ్రహ్మదేవునకు, లక్ష్మీః = లక్ష్మి (ప్రభువు/స్వామిని), తస్యాః = ఆ లక్ష్మికి, సః+అహమ్ = ఆ (ఈ)నేను, ప్రభుః = స్వామిని, ఇతి = అని, శంసన్-ఇవ = చెప్తున్నట్లుగా, అదృశ్యః (సన్) = అగోచరుడుగానే నిలిచి, ఇందిరాయాః = లక్ష్మికి (ఇందిరా లోకమాతా మా

రమా మంగళదేవతా-అమరకోశః-1/29), స్ఫుటమ్ = స్పష్టంగా, విజ్ఞేయ-మూర్తిః = తెలియదగిన ఆకారం గలవాడయి (విజ్ఞేయా మూర్తిః యస్య సః), అజస్య+ఏవ = బ్రహ్మకే, ఆజ్ఞామ్ = ఆదేశాన్ని, దదౌ = ఇచ్చాడు (డుదాఞ్ దానే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** దేవతలకు ప్రభువు బ్రహ్మ. బ్రహ్మకు స్వామిని లక్ష్మి. లక్ష్మికి ప్రభువును నేను అని ప్రకటింప దలచి విష్ణువు తాను అదృశ్యుడై లక్ష్మికి మాత్రమే స్పష్టంగా కనిపిస్తూ బ్రహ్మ నిలా ఆదేశించాడు.

**వి :** 1. ఇక్కడ ఫలోత్ప్రేక్షాలంకారం. విష్ణువు అదృశ్యంగా వుండి మాటాడటానికి ఫలం తెలియదు. కానీ ఆఫలాన్ని ఊహిస్తున్నాడు కవి. అందుకే ఫలోత్ప్రేక్ష.

2. అదృశ్యంగా వుండి కూడా బ్రహ్మనే ఆదేశించటం, లక్ష్మికి మాత్రమే దృశ్యంగా వుండటం, లక్ష్మిని కూడా శాసించగలగటం బ్రహ్మ - లక్ష్మి - విష్ణువులలో ఉత్తరోత్తర ప్రాధాన్యాన్ని తెలుపుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 3.**దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః | |
| | దదిథ/దదాథ | దదథుః | దద | |
| | దదౌ | దదివ | దదిమ. | * |

**శ్లో॥ త్వమేత్య దేవక్యుదరస్థగర్భం నిధేహి రోహిణ్యుదరే స్వశక్త్యా ।**
**ఇతీరితా తం రమణం రమా సా ప్రదక్షిణీకృత్య తథాకరోత్తత్ ॥ 1-25**

**అ :** నారాయణాదేశమూ, నారాయణి ఆచరణమూ. -ఉపేంద్రవజ్ర.

**అ :** త్వం ఏత్య స్వ-శక్త్యా దేవక్యుదరస్థ-గర్భం రోహిణ్యుదరే నిధేహి. ఇతి ఈరితా సా రమా తం రమణం ప్రదక్షిణీకృత్య తత్ తథా అకరోత్.

**ప్ర :** త్వమ్ = నీవు, ఏత్య = (భూమికి) వెళ్ళి (ఆఙ్‌పూర్వక ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వశక్త్యా = నీ శక్తితో (స్వస్యాః శక్తిః, తయా), దేవ.. గర్భమ్ : దేవకీ = దేవకియొక్క (వసుదేవుని భార్య), ఉదర-స్థ = కడుపులోనున్న, గర్భమ్ = భ్రూణాన్ని (పిండాన్ని) (దేవక్యాః ఉదరే తిష్ఠతి ఇతి, స చ అసౌ గర్భః, తమ్), రోహిణీ+ఉదరే = రోహిణి (బలరాముని తల్లి) గర్భంలో (రోహిణ్యాః ఉదరే), నిధేహి = ఉంచుము. (నిపూర్వక ధా ధారణ పోషణయోః లోట్ మ.ఏ.). ఇతి = ఆ రీతిగా, ఈరితా (సతీ) = చెప్పబడినదై, (ఈర్ గతౌ ధాతువుపై క్త ప్రత్యయం-స్త్రీలింగం), సా - రమా = ఆ లక్ష్మి, తం - రమణమ్ = ఆ వల్లభుని, ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణం చేసి, తత్ = దానిని/ ఆపనిని, తథా = చెప్పినరీతిగా, అకరోత్ = చేసింది. (డుకృఞ్ కరణే-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** 'నీవు భూలోకానికి వెళ్ళి దేవకీగర్భంలో వున్న పిండాన్ని రోహిణీగర్భంలో ప్రవేశపెట్టు. నీ శక్తితో ఇది సాగించు' అని విష్ణువు పలుకగా ఆ లక్ష్మి వల్లభునకు ప్రదక్షిణంచేసి వెళ్ళి చెప్పిన పని పూర్తి చేసింది.

**వి :** 1. రమ విష్ణువుకు ప్రదక్షిణం చేయటంలో భర్తృభావన కన్న పరమాత్మభావన ఎక్కువ. తనకు వల్లభుడైనా జగత్తునకు పాలకుడు గదా!

| | | | | |
|---|---|---|---|---|
| 2. **నిధేహి :** | నిదధాతు | నిధత్తామ్ | నిదధతు | |
| | **నిధేహి**/నిధత్తాత్ | నిధత్తమ్ | నిధత్త | |
| | నిదధాని | నిదధావ | నిదధామ | |
| **అకరోత్ :** | **అకరోత్** | అకురుతామ్ | అకుర్వన్ | |
| | అకరోః | అకురుతమ్ | అకురుత | |
| | అకరవమ్ | అకుర్వ | అకుర్మ. | * |

**శ్లో॥ఆజ్ఞాపయామాస పురా సశేషం జజ్ఞే స రోహిణ్యుదరోదయాద్రేః ।**
**సంప్రేషయన్తి స్మ నరైర్నరేంద్రాః శయ్యాం స్వకీయాం పురతః ప్రయాణే ॥1-26**

**అ :** విష్ణుకృతమైన అవతరణ సన్నాహ ప్రకటన మీ శ్లోకంలో కనిపిస్తుంది. -ఇంద్రవజ్ర.

**అ :** సః పురా శేషమ్ ఆజ్ఞాపయామాస. సః రోహిణ్యుదయాద్రేః జజ్ఞే. నరేంద్రాః ప్రయాణే పురతః స్వకీయాం శయ్యాం నరైః సంప్రేషయంతి స్మ.

**ప్రతి :** సః = ఆ నారాయణుడు, పురా = ముందుగానే, శేషమ్ = ఆదిశేషుని, ఆజ్ఞాపయామాస = ఆదేశించాడు. (ఆఙ్‌పూర్వక జ్ఞప్ జ్ఞానే జ్ఞాపనే చ-లిట్-ప్ర.ఏ.), సః = ఆ ఆదిశేషుడు, రోహి... యాద్రేః : రోహిణీ = రోహిణి యొక్క, ఉదర = కడుపు అనెడి, ఉదయ+అద్రేః = తూర్పుమల నుండి (రోహిణ్యాః ఉదరమేవ ఉదయాద్రిః, తస్మాత్), జజ్ఞే=పుట్టాడు. (జనీ ప్రాదుర్భావే-లిట్-ప్ర.ఏ.), నర+ఇంద్రాః=జనపాలకులు (నరాణామ్ ఇంద్రాః), ప్రయాణే (సతి) = ప్రయాణ మేర్పడగా, పురతః = ముందుగానే (స్యాత్పురః పురతోఽగ్రతః-అమరకోశః-3/7), స్వకీయామ్ = తమదైన, శయ్యామ్ = పడకను, సంప్రేషయంతి స్మ = పంపుతూ ఉండేవారు గదా! (సమ్-ప్ర-పూర్వక ఇష ఇచ్ఛాయాం ధాతువు-ప్రేరణార్థకం-లట్-ప్ర.బ.. 'స్మ' యోగం. లట్ స్మే (అష్టాధ్యాయి 3/2/118) సూత్రం ద్వారా భూతకాలార్థం)

**తా ॥** విష్ణువు తాను అవతరించడానికన్న ముందు ఆదిశేషువును అవతరించమని ఆదేశించాడు. ఆదిశేషుడు రోహిణీగర్భమనే ఉదయాద్రిలో జన్మించాడు. ప్రయాణం నిర్ణయమైన తరువాత ప్రభువులు తమ శయ్యను తమకన్న ముందుగా మనుషులచేత పంపుతుంటారు గదా!

**వి :** 1. ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారముంది. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య-విశేషయోః**'. ఆదిశేషుని ముందుగా పంపటం విశేష విషయం. ప్రభువులు తమ కన్న ముందుగా పడకను పంపుతారన్నది సామాన్యం. కాబట్టి అర్థాంతరన్యాసం.

2. బలరామావతారానికి శయ్యను ముందుగా పంపటమన్నది కారణం కావటం ఊహామాత్రమే. అందుకే ఉత్ప్రేక్షాలంకారం కూడా.

3. **ఆజ్ఞాపయామాస :**

| | | |
|---|---|---|
| **ఆజ్ఞాపయామాస** | ఆజ్ఞాపయామాసతుః | ఆజ్ఞాపయామాసుః |
| ఆజ్ఞాపయామాసిథ | ఆజ్ఞాపయామాసథుః | ఆజ్ఞాపయామాస |
| ఆజ్ఞాపయామాస | ఆజ్ఞాపయామాసివ | ఆజ్ఞాపయామాసిమ |

| | | | |
|---|---|---|---|
| **సంప్రేషయన్తి :** | సంప్రేషయతి | సంప్రేషయతః | **సంప్రేషయన్తి** |
| | సంప్రేషయసి | సంప్రేషయథః | సంప్రేషయథ |
| | సంప్రేషయామి | సంప్రేషయావః | సంప్రేషయామః. |

*

**శ్లో॥ కేశాత్మనా సన్నిహితః స తస్మిన్ శ్రీశోఽగ్రజత్వం స్వయమేవ నూనమ్ ।**
**ధత్తే విధత్తే బలభద్రమాతుర్నిత్యం స్వమాతృత్వసుఖం సుఖాత్మా ॥ 1-27**

**అ :** బలభద్రుడు కృష్ణున కన్న అయినా కృష్ణునిలోనే జ్యేష్ఠత్వసిద్ధిని ప్రతిపాదిస్తున్నా డిందులో కవి. - ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రీశః తస్మిన్ కేశాత్మనా నిత్యం సన్నిహితః (సన్) స్వయమ్ ఏవ అగ్రజత్వం నూనమ్ ధత్తే. సుఖాత్మా సః బలభద్ర-మాతుః నిత్యం స్వ-మాతృత్వ-సుఖం విధత్తే.

**ప్ర :** శ్రీ+ఈశః = లక్ష్మీ వల్లభుడు, తస్మిన్ = ఆ బలరామునియందు, కేశ+ఆత్మనా = వెంట్రుక రూపంతో (కేశః ఏవ ఆత్మా, తేన), నిత్యమ్ = ఎల్లప్పుడూ, సన్నిహితః(సన్) = ప్రవేశించిన వాడై, స్వయమ్ ఏవ = తానే, అగ్రజత్వమ్ = పెద్దరికాన్ని, నూనమ్ = నిశ్చితంగా, ధత్తే = భరిస్తున్నాడు (ధా ధారణ పోషణయోః ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, సుఖ+ఆత్మా సన్ = సుఖ స్వరూపుడై, బలభద్ర-మాతుః = బలరాముని తల్లికి, (రోహిణికి) (బలభద్రస్య మాతా, తస్యాః), నిత్యమ్ = ఎల్లవేళలా, స్వ-మాతృత్వ-సుఖమ్ = తన తల్లిగా పొందగలిగిన సుఖాన్ని (స్వస్య మాతా, తస్యాః భావః, తస్య సుఖమ్), విధత్తే = కలిగిస్తున్నాడు. (వి పూర్వక ధా ధారణ పోషణయోః ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.).

**తా ॥** శ్రీకృష్ణుడు కేశరూపంలో బలరామునిలో నిత్యం నిలిచే వుంటాడు. అందువలన తన పెద్దరికాన్ని నిలుపుకొంటూనే వుంటాడు. బలరాముని తల్లి అయిన రోహిణికి నిత్యమూ స్వమాతృత్వసుఖాన్ని కలిగిస్తూనే వుంటాడు. తాను సుఖస్వరూపుడు.

**వి :** 1. విష్ణుపురాణంలో ఈ కేశాత్మస్థితికి ప్రమాణం కనిపిస్తోంది.

**శ్లో॥ ఏవం సంస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః ।**
**ఉజ్జహారాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే ॥**

**శ్లో॥ ఉవాచ చ సురానేతౌ మత్కేశౌ వసుధాతలే ।**
**అవతీర్య భువో భారక్లేశహానిం కరిష్యతః ॥** **(విష్ణుపురాణం 5/1/60,61)**

ఆ రీతిగా తెల్లవెంట్రుక బలరాముడయ్యింది. రోహిణి కృష్ణుడు తనకుమారుడు కావాలని తపించింది. ఆ కోరిక ఈ రీతిగా తీరిందామెకు.

2. ధత్తే - విధత్తే; సుఖం - సుఖాత్మా, ఛేకానుప్రాసాలంకారం.

3. **ధత్తే/విధత్తే :**

| | | |
|---|---|---|
| **ధత్తే** | దధాతే | దధతే |
| ధత్సే | దధాతే | దధ్వే |
| దధే | దధ్వహే | దధ్మహే |

*

## శ్లో॥ బలాత్ప్రగృహ్య స్వకవాటపాలౌ నిశాచరౌ భూతలమేత్య దృప్తౌ ।
## నృతస్కరౌ తౌ వినిహత్య విష్ణుర్నిజౌ నినీషన్నివ గాం గతోఽభూత్ ॥ 1-28

**అ :** విష్ణువు భూమిపై అవతరించి సాధించవలసిన ప్రయోజనాన్ని ఉత్ప్రేక్షిస్తున్నాడు కవి. -ఉపేంద్రవజ్ర.

**అ :** విష్ణుః స్వ-కవాట-పాలౌ బలాత్ నిగృహ్య భూతలమ్ ఏత్య దృప్తౌ నృ-తస్కరౌ తౌ నిశా-చరౌ వినిహత్య నిజౌ నినీషన్ ఇవ గాం గతః అభూత్.

**ప్ర :** విష్ణుః = నారాయణుడు, స్వ... పాలౌ : స్వ = తనయొక్క, కవాట = ద్వారానికి, పాలౌ = రక్షకులయిన (జయవిజయులను) వారిని (స్వస్య కవాటస్య పాలౌ), బలాత్ = ఒత్తిడితో, ప్రగృహ్య = బంధించి, (ప్రపూర్వక గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భూతలమ్ = భూలోకాన్ని, ఏత్య = పొంది (ఆఙ్పూర్వక ఇణ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం) దృప్తౌ = మదమెక్కియున్నవారును, నృ-తస్కరౌ = మనుష్యులను దొంగిలించువారును (అయిన) (నరౌ చ తౌ తస్కరౌ), నిశాచరౌ = రాక్షసులను/దొంగలను (నిశాయాం చరతః ఇతి), వినిహత్య = చంపి (వి-ని పూర్వక హన ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నిజౌ = తనవారిని, నినీషన్ ఇవ = కొనిపోవగోరినట్లుగా (సన్నంతమైన ణీ ధాతువుపై శతృప్రత్యయం = నినీషన్), గామ్ = భూమిని (విపులా గహ్వరీ ధాత్రీ గౌరిలా కుంభినీ క్షమా - అమరకోశః 2/3 అధికపాఠం), గతః = పొందినవాడుగా, అభూత్ = అయ్యెను. (భూ సత్తాయామ్-లుఙ్-(ప్ర.ఏ.).

**తా ॥** (జయవిజయులు నారాయణ ద్వారపాలకులు. సనకాదుల శాపం వలన భూలోకంలో పుట్టవలసి వచ్చింది రాక్షస రూపంతో)

ఆ రీతిగా బలపూర్వకంగా తనద్వారపాలకులను బంధించి భూలోకానికి తీసికొనిపోయిన ఆ పొగరుబోతు రాక్షసులను చంపి, మరల తన వారిని తాను తీసికొనబోగోరినట్లుగా విష్ణువు భూలోకంలో అవతరించాడు.

**వి :** 1. మామూలు దొంగలు వస్తువుల నపహరిస్తారు. కానీ వీరు నృతస్కరులు. మనుష్యుల నపహరించేవారు. కాబట్టి ఇక్కడ వ్యతిరేకాలంకారధ్వని కనిపిస్తోంది.

2. నృ తస్కరుల నుండి తనవారిని విడిపించి కొని పోవట మన్న అవతారఫలాన్ని ఊహిస్తున్నాడు కాబట్టి ఫలోత్ప్రేక్షాలంకారం.

3. వర్ణావృత్తి రూపమైన అనుప్రాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 4. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

**శ్లో॥ న గర్భవాసో మమ నిర్మలస్యేత్యదో బుధాన్ బోధయితుం హృదేవ ।**
**ఫణీశ్వరం గర్భగతం విధాయ పునస్స్వయం సన్నిహితో బభూవ ॥ 1-29**

**అ :** విష్ణువు తనకు గర్భవాసముండకూడదని దానికి తగినట్లుగా ప్రణాళికను రచించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** (విష్ణుః) నిర్మలస్య మమ గర్భ-వాసః న ఇతి (యత్) అదః బుధాన్ బోధయితుం హృదా ఇవ ఫణీశ్వరం గర్భ-గతం విధాయ పునః స్వయం సన్నిహితః బభూవ.

**ప్ర :** విష్ణుః = విష్ణువు, నిర్మలస్య = మలరహితుడనైన, మమ = నాకు, గర్భ-వాసః = గర్భాశయనివాసం (గర్భే వాసః), న = లేదు (అని), (యత్ = ఏది కలదో), అదః = దానిని, బుధాన్ = పండితులకు, బోధయితుమ్ - హృదా+ఇవ = తెలుపవలెనను తలపుతోనో అన్నట్లు, ఫణి+ఈశ్వరమ్ = ఆదిశేషుని (ఫణినామ్ ఈశ్వరః), గర్భ-గతామ్ = (దేవకీ) గర్భ నివాసునిగా, విధాయ = చేసి (విపూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పునః = ఆపై (పునరప్రథమే భేదే అమరకోశః-3/252), స్వయమ్ = తాను, సన్నిహితః = ప్రవేశించిన వాడుగా (సమ్-ని పూర్వక ధా ధాతువుపై క్త ప్రత్యయం. 'ధా'కు హి ఆదేశం "దధాతేర్హిః" అష్టాధ్యాయి 7-4-42), బభూవ = అయ్యెను. (భూ సత్తాయామ్-పరస్మైపది- లిట్-ప్ర.ఏ.)

**తా ॥** విష్ణువు నిర్మలుడు. అనగా అవతరించటానికి గర్భవాసాదులు అవసరమయినవాడు కాదు. ఆ విషయాన్ని పండితుల గ్రహింపునకు తేవాలి. తాను లోకమర్యాదను బట్టి అవతరించాలి. అందువలన తాను ముందుగా దేవకీగర్భంలో ఆదిశేషుని ప్రవేశపెట్టి ఆ తరువాత తానక్కడ సన్నిహితుడయ్యాడు.

**వి :** 1. హేతూత్ప్రేక్షా - అనుప్రాసాలంకారాలు.

2. విష్ణువు స్వీకరించిన ప్రసిద్ధావతారాలలో బాల్యకాలం - తచ్చేష్టలతో కూడినది కృష్ణావతారమమొక్కటే.

3. **బభూవ :** 1-12వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ గర్భేఽప్యదభ్రాత్మసుఖైకమూర్తిమభ్యేత్య పద్మాసనముఖ్యదేవాః ।**
**గీర్భిర్భవద్గర్భనివాసజార్తినిర్భంగసిద్ధ్యర్థమివాస్తువంస్తమ్ ॥ 1-30**

**అ :** విష్ణువునకు గర్భవాసజనితమైన ఆర్తిని పోగొట్టటానికి బ్రహ్మాది దేవతలు ఆయనను స్తుతించుట.- ఇంద్రవజ్ర.

**అ :** గర్భే అపి అదభ్రాత్మ–సుఖైకమూర్తిం తమ్ అభ్యేత్య పద్మాసన–ముఖ్య–దేవాః భవద్గర్భ–నివాస–జార్తి–నిర్భంగ–సిద్ధ్యర్థమ్ ఇవ గీర్భిః అస్తువన్.

**ప్ర :** గర్భే+అపి = గర్భమందునూ, అద... మూర్తిమ్ : అదభ్ర = అనల్పమైన (ప్రభూతం ప్రచురం ప్రాజ్యమదభ్రం బహుళం బహు – అమరకోశః–3/63). ఆత్మ–సుఖ+ఏక = ఆత్మ సుఖమే ప్రధానమైన, మూర్తిమ్ = స్వరూపుని (విష్ణువును) (అదభ్రం చ తత్ ఆత్మసుఖం, తదేవ ఏకా మూర్తిః యస్య తమ్), అభి+ఏత్య = సమీపించి (అభి+ఆ+ఇణ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పద్మ+ఆసన ముఖ్య దేవాః : పద్మాసన = బ్రహ్మదేవుడు, ముఖ్య = ప్రధానుడుగా గల (పద్మాసనః ముఖ్యః యేషాం తే), దేవాః = దేవతలు, భవద్... సిద్ధ్యర్థమ్ – ఇవ : భవత్ = కలుగ బోవు, గర్భనివాస+జ = గర్భనివాసంవలన పుట్టిన, ఆర్తి = దుఃఖము యొక్క, నిర్భంగ = సంపూర్ణవినాశనం యొక్క, సిద్ధ్యర్థమ్ ఇవ = సిద్ధికోసమో అన్నట్లు (భవన్ చ అసౌ గర్భే నివాసః తేన జాతాయాః ఆర్తేః నిర్భంగస్య సిద్ధిః, తదర్థం), గీర్భిః = వాక్కులతో, అస్తువన్ = పొగిడారు. (స్తు స్తుతౌ ధాతువు–పరస్మైపది–లజ్–ప్ర.బ.).

**తా ॥** విష్ణువు దేవకీగర్భాన సన్నిహితుడయినా తాను అనల్పాత్మసుఖస్వరూపుడే. బాధకవకాశం లేదు. బ్రహ్మమొదలయిన దేవతలు ఆ విష్ణువును సమీపించి భవిష్యత్తులో తమకు కలుగబోయే గర్భావాసదుఃఖాన్ని నశింపజేసుకోవటానికి ఆయనను  వాక్కులతో స్తుతించారు.

**వి :** 1. దేవతలకు గర్భావాసదుఃఖమేమిటని శంకింపబనిలేదు. “క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి” అని గీతావచనం. పుణ్యమున్నంతవరకే స్వర్గస్థితి. ఆ పై భూలోకవాసమే గతి.

2. విష్ణువు గర్భావాసంలో వున్నప్పుడు స్తుతించినందువలన తమకు కూడా అటువంటి దశలో సుఖప్రాప్తి అని దేవతల భావన.

3. ఈ శ్లోకరచనలో గాఢబంధరూపమైన ఓజోగుణం (శాబ్దం) అనుభవానికి వస్తుంది.

4. **అస్తువన్ :**

| | | |
|---|---|---|
| అస్తోత్/అస్తవీత్ | అస్తుతామ్/అస్తవీతామ్ | **అస్తువన్** |
| అస్తోః/అస్తవీః | అస్తుతమ్/అస్తువీతమ్ | అస్తుత/అస్తువీత |
| అస్తవమ్ | అస్తుత/అస్తవీవ | అస్తుమ/అస్తవీమ. |

*

**శ్లో॥ అథో జయన్త్యాముదభూన్నిశీథే – శశీవ దేవక్యుదరోదయాద్రేః ।**
**దిగష్టకే రాత్రిచరాన్ జిగీషో–స్తిథిర్నిశా సా చ గుణోచితైవ ॥ 1–31**

**అ :** జయంతినాడు శ్రీకృష్ణ జనన వర్ణన. – ఉపేంద్రవజ్ర.

**అ :** అథో జయన్త్యాం నిశీథౌ దేవక్యుదరోదయాద్రేః శశీవ ఉదభూత్. దిగష్టకే రాత్రి–చరాన్ జిగీషోః సా తిథిః (సా) నిశా చ గుణోచితా ఏవ ।

**ప్ర :** అథో = బ్రహ్మాదులు స్తుతించిన తరువాత (మంగళానంతరారంభ ప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ–అమరకోశః–3/246), జయన్త్యామ్ నిశీథే = కృష్ణాష్టమి రేయియందు, దేవ... ద్రేః : దేవకీ = దేవకి యొక్క, ఉదర = కడుపు అనెడి, ఉదయ+అద్రేః = తూర్పుమల నుండి (దేవక్యాః ఉదరమేవ ఉదయాద్రిః, తస్మాత్), శశీ+ఇవ = చంద్రునివలె, ఉదభూత్ = జన్మించాడు. (ఉత్ పూర్వక భూసత్తాయామ్–పరస్మైపది–లుజ్–ప్ర.ఏ.), దిగ్+అష్టకే = ఎనిమిది దిక్కుల యందు (దిశామ్ అష్టకమ్, తస్మిన్), రాత్రి–చరాన్ = రాక్షసులను (రాత్రౌ చరన్తి ఇతి, తాన్), జిగీషోః = గెలువగోరిన వానికి (జేతుమ్ ఇచ్ఛుః జిగీషుః, తస్య), సా తిథిః = ఆ అష్టమీ తిథి, సా నిశా చ = ఆ రాత్రివేళ కూడా, గుణ+ఉచితా+ఏవ = లక్షణాలకు తగినదే (సార్థకమే).

**తా ॥** బ్రహ్మాది దేవతల స్తుతుల నందుకొన్న తరువాత అష్టమినాటి రేయి తూర్పుమల నుండి చంద్రుడు ఉదయించినట్టు (కృష్ణుడు) దేవకి గర్భం నుండి పుట్టాడు. అష్టదిక్కులలోనూ నిశాచరులను జయించగోరిన విష్ణువు ఆ తిథిని, ఆ వేళను ఎన్నుకొని జన్మించటం సార్థకమే.

**వి :** 1. జయంతి :

శ్లో॥ కృష్ణాష్టమీ శ్రావణే తు ప్రదోషసహితాష్టమీ ।
జన్మాష్టమీ భవేత్ సైవ జయన్తీ రోహిణీయుతా ॥

2. శశీవ = చంద్రునివలె = ఉపమాలంకారం.

3. "**సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః** " (కువలయానందం) కార్యానికి తగిన కారణ వర్ణనం సమాలంకారం. ఎనిమిది దిక్కులలో రాత్రిచరులను గెలవాలి కాబట్టి అష్టమినాటి రాత్రి జననం.

4. కవి జయంతి కాల జననాన్ని సమర్థిస్తున్నాడు కాబట్టి కావ్యలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' (కువలయానందం). *

**శ్లో॥ ప్రథాం యశోదాసుత ఇత్యుదారాం - కరిష్యమాణో జననీమివాన్యామ్ ।**
**స దేవకీగర్భభవోఽనుగృహ్ణన్ - తతాన రోహిణ్యుదయప్రసిద్ధిమ్ ॥ 1-32**

**అ :** దేవకీ యశోదలతో పాటు రోహిణికి కూడా గుర్తింపు తేవటానికి కృష్ణుని పుట్టుకను నిరూపించుట.
- ఉపేంద్రవజ్ర.

**అ :** దేవకీ-గర్భ-భవః సః యశోదా-సుతః ఇతి ఉదారాం ప్రథాం కరిష్యమాణః అన్యాం జననీమ్ అనుగృహ్ణన్ ఇవ రోహిణ్యుదయ-ప్రసిద్ధిం తతాన.

**ప్ర :** దేవకీ... భవః : దేవకీ = దేవకి యొక్క, గర్భ = కడుపున, భవః = పుట్టుక గలిగిన (దేవక్యాః గర్భే భవః), సః = ఆ కృష్ణుడు, యశోదా-సుతః = యశోదకొడుకు అను (యశోదాయాః సుతః), ఉదారామ్ = గొప్పదయిన, ప్రథామ్ = ప్రసిద్ధిని, కరిష్యమాణః = సమకూర్చబోతూ (కృ కరణే - ఆత్మనేపది - శానచ్ ప్రత్యయం), అన్యామ్ = ఈ ఇద్దరూ కానీ వేరొక, జననీమ్ = తల్లిని, అనుగృహ్ణన్ - ఇవ = అనుగ్రహిస్తున్నట్లుగా, రోహిణీ+ఉదయ-ప్రసిద్ధిమ్ = రోహిణీ (నక్షత్రం)లో పుట్టుక అను ప్రఖ్యాతిని (రోహిణ్యామ్ ఉదయ ఇతి ప్రసిద్ధిః, తామ్), తతాన = విస్తరింపజేశాడు. (తనూ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు దేవకి కడుపున పుట్టినవాడు. ఆమె ప్రసిద్ధి కెక్కింది. యశోద కొడుకుగా పుట్టాడు. ఆమెకు గొప్ప అదృష్టం దక్కింది. మరొక తల్లిని కూడా అనుగ్రహించదలచిన ఆ కృష్ణుడు రోహిణీ నక్షత్రంలో పుట్టాడు. ఆ తల్లిపేరు గణన కెక్కింది.

**వి :** 1. అనుగృహ్ణన్ - ఇవ అనుగ్రహించటానికో అన్నట్లు - కాబట్టి ఇది సంభావన. ఉత్ప్రేక్షాలంకారం.

2. వాస్తవానికి కృష్ణుడు దేవకీగర్భసన్నిహితుడే కానీ అక్కడ ఫలదీకరణ చెందిన వాడు కాదు. యశోద విషయమూ అంతే. అటువంటి ప్రథనే రోహిణికి కూడా కల్పించాడు. ప్రథా పదమే వాస్తవభిన్నత్వాన్ని సూచిస్తుంది.

3. **తతాన :** 1-21వశ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యదా హరిః ప్రాదురభూత్కళాభి-స్తదా సమాయవ్యయవాంశ్చ చన్ద్రః ।**
**ప్రియాప్రియాప్త్యేవ నిజాన్వయోత్థ-ముకున్దవక్త్రేన్దుకలావలోకాత్ ॥ 1-33**

**అ :** శ్రీకృష్ణ జననకాల విశేష వర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** యదా హరిః ప్రాదురభూత్ తదా చంద్రః నిజాన్వయోత్థ-ముకుంద-వక్త్రేందు-కలావ-లోకాత్। ప్రియాప్రియాప్త్యైవ కళాభిః సమాయవ్యయవాంశ్చ బభూవ.

**ప్ర :** యదా = ఏ వేళలో, హరిః = శ్రీకృష్ణుడు, ప్రాదురభూత్ = పుట్టెనో, తదా = ఆ వేళలో, చంద్రః = శశి, నిజా... లోకాత్ : నిజ = తనయొక్క, అన్వయ = వంశమందు, ఉత్థ = పుట్టిన, ముకుంద = శ్రీకృష్ణుని యొక్క, వక్త్ర+ఇందు = ముఖచంద్రునియొక్క, (ఇందురివ వక్త్రమ్ = వక్త్రేందుః ఉపమితి సమాసం, 'ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యా-ప్రయోగే" (అష్టాధ్యాయి 2/1/56), కళా = కళలను/ కాంతులను, అవలోకాత్ = చూడటం వలన (నిజే అన్వయే ఉత్థితస్య ముకుందస్య వక్త్రేందోః కలానామ్ అవలోకనం, తస్మాత్), ప్రియ+అప్రియ+అప్త్యా+ఇవ = ఇష్టానిష్టాలను పొందుటవలననో అన్నట్లు (ప్రియస్య అప్రియస్య చ ఆప్తిః, తయా), కళాభిః = తన కళలచే (కళా తు షోడశో భాగః -అమరకోశః-1/3/15), సమ ఆయ+వ్యయవాన్+చ = రాకపోకలు సమానంగా కలవాడుగా కూడా (సమౌ ఆయః చ వ్యయశ్చ అస్య స్తః ఇతి), ప్రాదురభూత్ = అయ్యెను (ప్రాదుః+భూ సత్తాయామ్-లుఙ్-ప్ర.ఏ.). ('నామ ప్రకాశ్యయోః ప్రాదుః' అమరకోశః 3/255).

**తా ॥** శ్రీకృష్ణుడు జన్మించగానే చంద్రుడిలోని కళలు సగం మిగిలి సగం పోయినట్లయింది. దానికి కారణం శ్రీకృష్ణజననం తనకు అప్రియాన్నీ, ప్రియాన్నీ కూడా కలిగించటమే. దానికి కారణం శ్రీకృష్ణుని ముఖచంద్రునిలోని పరిపూర్ణకాంతిని చూడటమూ (అప్రియానికీ), తన వంశంలో (సోమవంశంలో) కృష్ణుడంతటి వాడు జన్మించటమూను (ప్రియానికి).

**వి :** 1. చంద్రకళలకు హ్రాసవృద్ధులు సహజాలు. కానీ ప్రియాప్రియాప్తి వలననేమో అని వర్ణించటం ద్వారా హేతువు కానిదానిని హేతువు చేయటం ద్వారా హేతూత్ప్రేక్షాలంకారానికి అవకాశమేర్పడింది.

2. **ప్రాదుః+అభూత్ :** 1-28వశ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తదైవ గంధర్వగణా జగుస్తం - తిలోత్తమాద్యా ననృతుస్తదైవ ।**
**స్వగీతనాట్యేన విజేష్యమాణం - తమాత్మసాత్కర్తుమివాశు బాల్యే ॥ 1-34**

**అ :** శ్రీకృష్ణ జననకాల విశేష వర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ-గీత-నాట్యేన విజేష్యమాణం తం, బాల్యే ఆశు ఆత్మసాత్ కర్తుమ్ ఇవ తదా ఏవ గంధర్వ-గణాః తం జగుః తదా ఏవ తిలోత్తమాద్యాః ననృతుః.

**ప్ర :** స్వ...నాట్యేన : స్వ = తనయొక్క, గీత-నాట్యేన = గాన నాట్యాలతో (గీతం చ నాట్యం చ, తయోః సమాహారః) (స్వేన గీతం, నాట్యం చ, తేన), విజేష్యమాణమ్ = గెలువబోవుచున్న (విపూర్వక జి ధాతువు 'విపరాభ్యాం జేః' అష్టాధ్యాయి 1/3/19 అని ఆత్మనేపదిత్వం, దానిపై శానచ్ ప్రత్యయం), తమ్ = ఆ శ్రీకృష్ణుని, బాల్యే = చిన్నతనంలో, ఆశు = వేగంగా, ఆత్మసాత్-కర్తుమ్ ఇవ = తమవానిగా చేసికొన గోరిరో అన్నట్లు, తదా+ఏవ = అప్పుడే (పుట్టినప్పుడే), గంధర్వ-గణాః = గంధర్వుల సమూహాలు (గంధర్వాణాం గణాః), తమ్ = అతనిని గురించి, జగుః = పాడారు (గై శబ్దే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తదా+ఏవ = ఆ సమయంలోనే, తిలోత్తమా+ఆద్యాః = తిలోత్తమ మొదలుగా గల అచ్చరలు (తిలోత్తమా ఆద్యా యాసాం తాః), ననృతుః = నృత్యం చేశారు. (నృతీ గాత్రవిక్షేపే-పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** కృష్ణుడు భవిష్యత్తులో రాసక్రీడలో తన వేణుగాననాట్యాలతో అందరినీ గెలవ బోతున్నాడు. అటువంటి వానిని బాల్యంలోనే త్వరగానే తమవానిగా చేసికోవాలన్న తపనతోనే అన్నట్లు కృష్ణుడు పుట్టగానే గంధర్వులు గానం చేశారు. తిలోత్తమ మొదలయిన అచ్చరలు నృత్యం చేశారు.

**వి :** 1. నృత్తం – నృత్యం – నాట్యం. అనుకరణలో ఇవి మూడు దశలు. తాళలయల ననుకరించటం **నృత్తం**. పదార్థాన్ని అభినయించటం **నృత్యం**. వాక్యార్థాన్ని అభినయించటం నాట్యం.

అవస్థానుకృతిర్నాట్యం...

**అన్యద్భావాశ్రయం నృత్యం, నృత్తం తాళలయాశ్రయమ్,** దశరూపకమ్ 1/7,9

2. ఆత్మసాత్ కర్తుమివ – ఇది ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **జగుః :** | జగౌ | జగతుః | **జగుః** |
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ. |
| **ననృతుః :** | ననర్త | ననృతతుః | **ననృతుః** |
| | ననర్తిథ | ననృతథుః | ననృత |
| | ననర్త | ననృతివ | ననృతిమ. |

*

**శ్లో॥ దిశో యశోభిః పరిపూరయిష్య–త్యుదగ్రచేష్టః స ఇతి ప్రహృష్టాః ।**
**రసా ప్రసన్నా కిల రఞ్జితాం మాం – కరిష్యతి స్వాఙ్ఘ్రితలశ్రియేతి ॥ 1-35**

**అ :** శ్రీకృష్ణ జననకాల విశేష వర్ణన – ప్రకృతి పులకరింత. – ఉపేంద్రవజ్ర.

**అ :** ఉదగ్ర–చేష్టః సః యశోభిః పరిపూరయిష్యతి ఇతి దిశః ప్ర–హృష్టాః. స్వాంఘ్రి–తల–శ్రియా మాం రంజితాం కరిష్యతి ఇతి కిల రసా ప్రసన్నా.

**ప్ర :** ఉదగ్ర–చేష్టః = భయంకరమైన పనులు గల (ఉదగ్రాః చేష్టాః యస్య సః), సః = ఆ కృష్ణుడు, యశోభిః = కీర్తులతో, పరిపూరయిష్యతి ఇతి = నింపబోవుచున్నాడని (పరి పూర్ పూరణే పరస్మైపది–లృట్–ప్ర.ఏ.), దిశః = దిక్కులు, ప్రహృష్టాః = ఆనందించాయి. (ప్రపూర్వక హృష్ ధాతువుపై క్త ప్రత్యయం), స్వా... శ్రియాః : స్వ = తనయొక్క, అంఘ్రితల = అరకాలి యొక్క, శ్రియా = కాంతితో (స్వస్య అంఘ్ర్యోః తలయోః శ్రీః, తయా), మామ్ = నన్ను, రంజితామ్ = ఎఱ్ఱగా, కరిష్యతి ఇతి కిల = చేయబోగలడనియో అన్నట్లు, రసా = భూమి, ప్రసన్నా = సంతసించింది.

**తా ॥** రాబోయే కాలంలో తన భయంకరకృత్యాలతో సాధించిన కీర్తులతో తమను నింపివేయ గలదని దిక్కులు సంతసించాయి. అరికాలిని మోపి ఆ కాంతితో కృష్ణుడు తనను రంజింప జేయబోతున్నాడని సంతసించిందో అన్నట్లు భూమి ప్రసన్నమయింది.

**వి :** 1. భూమి అచల. దానికి చేతనత్వాన్ని కల్పించటం పౌరాణికం. దిక్కులు అసలు సాపేక్షంగా తప్ప స్వతంత్రంగా ఉనికి కూడా లేనివి. వాటికి చేతనత్వాన్ని కల్పించటం కవి భావుకత్వం. రాబోయే వాటికి భయపడ్డట్లే ఆనందించటం కూడా ఆరోగ్యదాయకమే.

| | | | |
|---|---|---|---|
| 2. **పరిపూరయిష్యతి :** | **పరిపూరయిష్యతి** | పరిపూరయిష్యతః | పరిపూరయిష్యన్తి |
| | పరిపూరయిష్యసి | పరిపూరయిష్యథః | పరిపూరయిష్యథ |
| | పరిపూరయిష్యామి | పరిపూరయిష్యావః | పరిపూరయిష్యామః |

| | | | |
|---|---|---|---|
| **కరిష్యతి :** | **కరిష్యతి** | కరిష్యతః | కరిష్యన్తి |
| | కరిష్యసి | కరిష్యథః | కరిష్యథ |
| | కరిష్యామి | కరిష్యావః | కరిష్యామః |

*

శ్లో॥ తదైవ దేవా వవృషుః ప్రసూనై-ర్హృది స్మరంతో వచసా స్తువంతః ।
నగేన్ద్రమైన్ద్రం భువి నేష్యతోఽస్య - మనః సముద్బోధయితుం పురేవ ॥ 1-36

**అ :** కృష్ణ జనన సమయంలో పుష్పవృష్టి కురిసి మనసా వాచా స్తుతించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదా ఏవ దేవాః ఐంద్రం నగేంద్రం భువి నేష్యతః అస్య మనః పురా సముద్బోధయితుమ్ ఇవ హృది స్మరంతః వచసా స్మరంతః ప్రసూనైః వవృషుః.

**ప్ర :** తదా+ఏవ = ఆ (కృష్ణ జనన) కాలంలోనే, దేవాః = దేవతలు, ఐంద్రమ్ = ఇంద్రునకు చెందిన, నగ+ఇంద్రమ్ = గొప్ప చెట్టును (పారిజాత వృక్షాన్ని) (నగస్తు పర్వతే వృక్షే విశ్వలోచనకోశం-గాంత-9), భువి = భూలోకానికి, నేష్యతః = కొనిపోబోయెడి, అస్య = కృష్ణుని యొక్క, మనః = మనస్సును, పురా = ముందుగానే, సముద్బోధయితుమ్ ఇవ = గుర్తుచేయదలచిరేమో అన్నట్లు, హృది = మనస్సులో, స్మరంతః = తలచుకొంటూ, (స్మృ ధాతువుపై శతృప్రత్యయం), వచసా = మాటతో, స్తువంతః = పొగుడుతూ (స్తు ధాతువుపై శతృ ప్రత్యయం), ప్రసూనైః = (పారిజాత) కుసుమాలతో, వవృషుః = వాన కురిపించిరి. (వృష్ సేచనహింసాక్లేశనేషు-పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** కృష్ణుడు భవిష్యత్తులో సత్యభామకోసం పారిజాతవృక్షాన్ని భూలోకానికి తెచ్చే ప్రయత్నం చేస్తాడు. ఆ విషయాన్ని ముందుగానే గుర్తు చేస్తున్నట్లు దేవతలు మనసా కృష్ణుని తలచుకొంటూ, వచసా ప్రశంసిస్తూ పూలవాన కురిపించారు.

**వి :** 1. దేవతలు కృష్ణుని స్తుతించటానికి జరగబోయేది గుర్తు చేయటం కారణం గాదు. అయినా కారణంగా చెప్పినందువల్ల హేతూత్ప్రేక్షాలంకారం.

2. ఈ శ్లోకరచనలో ప్రసాదరూపమైన అర్థగుణం భాసిస్తోంది. **అర్థవైమల్యం ప్రసాదః** అని ప్రసాదగుణలక్షణం తేలికగా, స్పష్టంగా విషయం తెలియటం. (కావ్యాలంకార సూత్రాణి - 3/2/3; మాధుర్యరూపమైన శబ్దగుణం కూడా, "**పృథక్పదత్వం మాధుర్యమ్**" కావ్యాలంకార సూత్రాణి - 3/1/20).

| 3. **వవృషుః :** | వవర్ష | వవృషతుః | **వవృషుః** | |
|---|---|---|---|---|
| | వవర్షిథ | వవృషథుః | వవృష | |
| | వవర్ష | వవృషివ | వవృషిమ. | * |

శ్లో॥ పుత్రత్వాదిహ వాసుదేవపదవీ యద్యస్య శౌరేస్తదా
నః పుత్రత్వకృతాఽస్తు సేతి వసవో దేవాశ్చ హృష్టా ధ్రువమ్ ।
యద్యస్యానకదున్దుభీష్టశిశుతా సోఽస్మాకమేవం శిశు-
స్తర్హీత్యానకదున్దుభిధ్వనిరభూద్వ్యోమ్ని స్వయమ్భూదయే ॥ 1-37

**అ :** శ్రీకృష్ణ జనన సమయంలో వసు - దేవతల ఆనందాన్ని, ఆనకదుందుభిధ్వనులను వర్ణించుట.
- శార్దూలవిక్రీడితం.

**అ :** స్వయంభూదయే శౌరేః పుత్రత్వాత్ యది ఇహ అస్య వాసుదేవ-పదవీ (తర్హి) సా నః పుత్రత్వ-కృతా అస్తు ఇతి వసవః దేవాః చ ధ్రువం హృష్టాః. యది అస్య ఆనకదుందుభీష్ట-శిశుతా (తర్హి) సః అస్మాకం శిశుః ఇతి వ్యోమ్ని ఆనకదుందుభి-ధ్వనిః అభూత్.

**ప్ర :** స్వయంభూ+ఉదయే = నారాయణుడు పుట్టినప్పుడు (స్వయంభూ శంభురాదిత్యః - విష్ణుసహస్రనామస్తోత్రమ్),

శౌరేః = వసుదేవునకు, పుత్రత్వాత్ = కొడుకు కాబట్టి, యది = ఒకచో, ఇహ = ఈ లోకంలో, అస్య = కృష్ణునకు, వాసుదేవ-పదవీ = వాసుదేవుడను పేరు గలిగితే (వాసుదేవః ఇతి పదవీ), తర్హి = అప్పుడు, సా = ఆ వాసుదేవ పదవి, నః = మాకు కూడా, పుత్రత్వ-కృతా = కొడుకు కావటం చేత కలిగినదిగా, అస్తు = ఉండుగాక, ఇతి = అని, వసవః = వసువులు, దేవాః చ = దేవతలు కూడా, ధ్రువమ్ = నిశ్చితంగా, హృష్టాః = ఆనందించారు, (హృష్ ధాతువుపై క్త ప్రత్యయం), యది = ఒకవేళ, అస్య = ఈ కృష్ణునకు, ఆనకదుందుభి+ఇష్ట-శిశుతా = ఆనకదుందుభికి ఇష్టమైన పుత్రత్వముంటే (ఆనకదుందుభేః ఇష్టః శిశుః, తస్య భావః), తర్హి = అప్పుడు, అస్మాకమ్ = మాయొక్క, శిశుః ఇతి = కుమారుడు అని, వ్యోమ్ని = ఆకాశంలో, ఆనక- దుందుభిధ్వనిః = భేరీమృదంగధ్వని, అభూత్ = కలిగెను (భూ సత్తాయామ్-పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.)

**తా ॥** వసుదేవునకు కృష్ణుడు జన్మించాడు. **వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః** అని వ్యుత్పత్తి. వసుదేవ సుతుడు అయినందువలనన కృష్ణుడు వాసుదేవు డయితే మేము కూడా వసుదేవులమే. వసవశ్చ దేవాశ్చ వసుదేవాః. వసుదేవానామ్ అపత్యం పుమాన్ వాసుదేవః - అని వ్యుత్పత్తిని బట్టి ఆయన మాకు కూడా కుమారుడే అని వసువులు దేవులు ఆనందించారట.

అలా కాదు ఆనకదుందుభి కుమారుడు అనిపించుకోవటమే (వసుదేవునకు ఆనకదుందుభి అని కూడా పేరు. '**వసుదేవోఽస్య జనకః స ఏవానకదుందుభిః**' అమరకోశః-1-1-22) ఆయనకిష్టమయితే ఆయన మాకు కూడా కుమారుడే అవుతాడు అంటూ గగనసీమలో ఆనకదుందుభుల ధ్వని వినిపించిందట.

**వి :** 1. గత శ్లోకాలవలెనే ఇక్కడా హేతూత్ప్రేక్షాలంకారం.

2. వసు-దేవ-ఆనక-దుందుభి పదాలను తీసికొని కవిచూపిన చమత్కార విన్యాస మిది. కృష్ణుడు తమవాడుగా నిలవాలని ఎవరిమట్టుకు వారు పడే తపన ఇక్కడ వ్యక్తమవుతోంది.

| | | | |
|---|---|---|---|
| 3. **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |

**అభూత్ :** 1-28వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ శరీరకాన్త్యా జలదః స్వజైత్రం - నిరీక్ష్య కృష్ణం జలరాశితీరే ।**
**జగర్జ శక్త్యా రహితస్య పుంసో - జలాన్తికేష్వేవ హి గర్జితాని ॥ 1-38**

**అ :** కృష్ణ జనన సమయంలో వినిపించిన జలదగర్జనలను వర్ణించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** జలదః శరీర-కాన్త్యా స్వ-జైత్రం కృష్ణం నిరీక్ష్య జల-రాశి-తీరే జగర్జ హి. శక్త్యా రహితస్య పుంసః జలాంతికేషు ఏవ గర్జితాని.

**ప్ర :** జలదః = మేఘం (జలం దదాతి ఇతి), శరీరకాన్త్యా : శరీర = దేహంయొక్క, కాన్త్యా = వెలుగుతో (రంగుతో) (శరీరస్య కాంతిః, తయా), స్వ-జైత్రమ్ = తనను గెలిచిన (జేతృ శబ్దం మీద 'ప్రజ్ఞాదిభ్యశ్చ' (అష్టాధ్యాయి 5/4/38) సూత్రంతో అణ్ ప్రత్యయం) (స్వస్య జైత్రః, తమ్), కృష్ణమ్ = కృష్ణుని, నిరీక్ష్య= చూచి (నిర్ పూర్వక ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), జలరాశి-తీరే = సముద్ర తీరంలో (జలానాం రాశి, తస్య తీరే), జగర్జ = ఉరిమింది, (గర్జ శబ్దే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.) హి = అది యుక్తమే. శక్త్యా = సమర్థతతో, రహితస్య = లోపంగల, పుంసః = మనిషికి, జల+ అంతికేషు+ఏవ = జలసమీపంలోనే/జడుల దగ్గరనే (జలం గోకలనే నీరే హ్రీవేరేఽప్యన్యవజ్జడే -మేదినీకోశం తాంత-18), గర్జితాని = అరుపులు (వస్తాయి).

**తా ॥** శ్యామలమైన తన శరీరవర్ణంతో కృష్ణుడు మేఘాన్ని ఓడించాడు. అందుకని జలదం జల(డ) రాశితీరంలో ఉరిమింది. నిజమే మరి. శక్తిహీనులు జడులదగ్గరే ప్రగల్భాలు పలుకు తుంటారు.

**వి :** 1. తనను గెలిచిన కృష్ణుని చూచి మేఘం గర్జించిందన్న చోట హేతూత్ప్రేక్ష. అయితే ఊహ వాచ్యం కాలేదు కాబట్టి అలంకాలం ధ్వనిస్తుంది.

2. పూర్వర్ధం విశేషం. ఉత్తరార్ధం (జగర్జ తప్ప) సామాన్యం. రెండింటినీ కలిపి చెప్పుట అర్థాంతర న్యాసాలంకారం.

3. జల శబ్దానికి జడార్థంకూడా స్ఫురిస్తుంది. దానిలో శబ్దశక్తిమూలకమైన వ్యతిరేకాలంకారం ధ్వనిస్తుంది.

శ్లో॥ అక్షిప్త ఏవాలంకారః శబ్దశక్త్యా ప్రకాశతే ।
యస్మిన్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః ॥ ధ్వన్యాలోకం - 2/21

| 4. **జగర్జ :** | **జగర్జ** | జగర్జతుః | జగర్జుః |
|---|---|---|---|
| | జగర్జిథ | జగర్జథుః | జగర్జ |
| | జగర్జ | జగర్జివ | జగర్జిమ |

*

**శ్లో॥ సరః ప్రసన్నం నిశి సారసౌఘైః - స కామినీభిః సహ సంప్రవిశ్య ।**
**కరిష్యతీశో ముఖపద్మపుఞ్జై-రలఙ్కృతం మామితి శంసతీవ ॥ 1-39**

**అ :** కృష్ణజనన కాలంలోని సరస్సౌభాగ్యసౌందర్యవర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశః సః కామినీభిః సహ సంప్రవిశ్య ముఖ-పద్మ-పుంజైః మామ్ అలంకృతం కరిష్యతి ఇతి శంసతి ఇవ సరః నిశి సారసౌఘైః ప్రసన్నమ్ (అస్తి).

**ప్ర :** ఈశః = సమర్థుడైన, సః = ఆ కృష్ణుడు, కామినీభిః సహ = కాంతలతో కలిసి, సంప్రవిశ్య = ప్రవేశించి/దిగి (సమ్-ప్ర-పూర్వక విశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ముఖపద్మ-పుంజైః = (వారి) మోముతామరల మొత్తాలతో (ముఖాని ఏవ పద్మాని, తేషాం పుంజైః), మామ్ = నన్ను, అలంకృతమ్ = అలంకరిపంబడిన దానినిగా (అలమ్+కృ ధాతువు క్త ప్రత్యయం), కరిష్యతి-ఇతి= చేయబోతున్నాడు అని (కృ కరణే-పరస్మైపది-లృట్-(ప్ర.ఏ.), శంసతి+ఇవ = చెప్పున్నట్లుగా, సరః = సరస్సు, సారస+ఓఘైః = పద్మసమూహాలతో (ఓఘో వేగే జలస్య చ । వృందే పరంపరాయాం చ ద్రుతనృత్యోపదేశయోః-మేదినీకోశః-ఘాంత-2,3) (సారసానామ్ ఓఘాః, తైః), నిశి = రాత్రికూడా, ప్రసన్నమ్ (అస్తి) = నిర్మలంగా ఉంది. (ప్ర పూర్వక షద్-క్త ప్రత్యయం)

**తా ॥** సరస్సు రాత్రిపూట కూడా పద్మాలతో నిర్మలంగా కనిపిస్తోందట. అది భవిష్యత్తులో శ్రీకృష్ణ ప్రభువు కాంతామణులతో కలిసి, తనలోనికి దిగి వారి ముఖపద్మసమూహాలతో తనను అలంకరించబోతున్నాడని చెప్తున్నట్లుందట.

**వి :** 1. శంసతీవ - చెప్తున్నట్లుంది. ఇక్కడ ఇవ శబ్దం ఉత్ప్రేక్షావ్యంజకం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్య జ్యతే శబ్దై రివ శబ్దోఽపి తాదృశః ॥

2. శబ్దగుణం మాధుర్యం, అర్థగుణం ప్రసాదం ఇక్కడ శ్లోకానికి అందం తెచ్చాయి.

3. **కరిష్యతి :** 1-35వ శ్లోకవ్యాఖ్య చూడుడు.
**శంసతి :** 1-8వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ నభః ప్రసన్నోడుగణం తదాऽऽసీ - ద్విభుత్వధర్మేణ పురాऽద్వితీయమ్ ।**
**విలోక్య బాలం భువి తారహార-విభూషితస్వాంగమివ ప్రహర్షాత్ ॥ 1-40**

**అ :** కృష్ణ జననసమయాన నిర్మలంగా కనిపిస్తున్న ఆకాశాన్ని గూర్చి ముచ్చటిస్తున్న శ్లోకం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పురా విభుత్వ-ధర్మేణ అద్వితీయం (అధునా) భువి తార-హార-విభూషిత-స్వాంగం బాలం విలోక్య ప్రహర్షాదివ తదా నభః ప్రసన్నోడుగణమ్ ఆసీత్.

**ప్రతి :** పురా = (శ్రీకృష్ణుడు అవతరించుటకు) ముందు, విభుత్వ-ధర్మేణ = వ్యాపించుట అను లక్షణంతో (విభుత్వాఖ్యః ధర్మః, తేన), అద్వితీయమ్ = సాటిలేని వానిని (అధునా = ఇప్పుడు), భువి = భూలోకంలో, తార-హార-విభూషిత-స్వ+అంగమ్ : తార-హార = మేలిముత్యాలతో (తారో ముక్తాదిసంశుద్ధౌ తరణే శుద్ధమౌక్తికే - విశ్వకోశః - రాంత 19), విభూషిత = అలంకరింప బడిన, స్వ = తనయొక్క, అంగమ్ = శరీరం గల (తారైః హారైశ్చ విభూషితాని స్వస్య అంగాని యస్య సః), బాలమ్ = పసివానిని, విలోక్య = చూచి, ప్రహర్షాదివ = ఆనందం వలననో అన్నట్లు, తదా = (కృష్ణ జనన) సమయంలో, నభః = ఆకాశం, ప్రస... గణమ్ : ప్రసన్న = నిర్మలమైన, ఉడు = నక్షత్రాల యొక్క (తారాభం రాత్రిజం ధిష్ణ్యం తన్నక్షత్రముడుర్నా - వైజయన్తీ - జ్యోతిరధ్యాయః 38), గణమ్ = సమూహం గలదిగా (ప్రసన్నాః ఉడూనాం గణాః యస్మిన్ తత్), ఆసీత్ = అయ్యెను (అస భువి-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.).

**తా॥** కృష్ణ జనన సమయంలో ఆకాశం నిర్మలమైంది. నక్షత్రాలు చక్కగా కనిపించేటట్లు. దానికి కారణాన్ని కవి ఊహిస్తున్నాడు. బాలుడుగా అవతరించకముందు నారాయణుడు సర్వవ్యాపి. గగనతలాన్ని మించినవాడు. కానీ ఇప్పుడు తారాహారవిభూషణాలున్న పసివాడు. ఆకారం కుదించుకొని పోయింది. ఇక తనను మించడని ఆకాశం నిర్మలమైనదట.

**వి :** 1. శ్లో॥ యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేऽపి వా
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః -యజుర్వేదం - నారాయణసూక్తమ్.

2. ఈశ్లోకంలో కూడా హేతూత్ప్రేక్షాలంకారం.

3. **ఆసీత్ :**

| | | |
|---|---|---|
| **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ శిశుం వశీకర్తుమథో న భార - ఇతీవ బుద్ధ్యా తుతుషుః స్మ దేవాః ।**
**ఉపేక్షయిష్యంతి న చేత్ కృతార్థా - ఇతి స్వయం ప్రాజ్వలదగ్నిరేషామ్ ॥ 1-41**

**అ :** కృష్ణ జనన సమయంలోని దేవతల ఆనందాన్ని అగ్నిహోత్రుని ఆందోళనను వర్ణించటం.-ఉపేంద్రవజ్ర.

**అ :** అథో శిశుం వశీకర్తుం న భారః ఇతి బుద్ధ్యా ఇవ దేవాః తుతుషుః స్మ. న చేత్ కృతార్థాః ఉపేక్షయిష్యంతి ఇతి ఏషామ్ అగ్నిః స్వయం ప్రాజ్వలత్.

**ప్ర :** అథో = శ్రీకృష్ణ జననం తరువాత, శిశుమ్ = పసివానిని, వశీకర్తుమ్ = లోగొనుటకు, భారః న = కష్టం కాదు, ఇతి బుద్ధ్యా ఇవ = ఆ ఆలోచనతోనో ఏమో, దేవాః = దేవతలు, తుతుషుః స్మ = ఆనందించారు. (తుష్ తుష్టే-పరస్మైపది-లిట్-ప్ర.బ. - 'లట్ స్మే చ' సూత్రంతో భూతకాలార్థం), న చేత్ = అలా కాకపోతే, కృతార్థాః = ధన్యులయిన వీరు, ఉపేక్షయిష్యంతి ఇవ = తిరస్కరిస్తారేమో అని (ఉప- ఈక్ష దర్శనే ణిచ్-పరస్మైపది-

లృట్-(ప్ర.బ.), ఏషామ్ = వీరియొక్క, అగ్నిః = హోమాగ్ని, స్వయమ్ = తనంతగా, ప్రాజ్వలత్ = వెలిగింది. (ప్రపూర్వక జ్వల దీప్తౌ పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** గతంలో నారాయణానుగ్రహం కోసం చాలా శ్రమపడిన దేవతలు శిశువుగా ఉన్న కృష్ణుని అనుగ్రహం పొందటం (లోగొనటం) కష్టం కాదని ఆనందించారు. అంతటి అవకాశం దొరికిన తరువాత తానూరుకుంటే తనను నిర్లక్ష్యం చేస్తారేమో అని వారి హోమాగ్ని స్వయంగానే ప్రజ్వరిల్లిందట.

**వి :** 1. భీషోఽస్మాద్వాతః పవతే భీషోదేతి సూర్యః భీషోఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమః - తైత్తిరీయోపనిషత్ - స్వతహాగా పరమాత్మకు భయపడి అగ్ని జ్వలిస్తుంటాడు. ఇప్పుడు ఆందోళన కూడా తోడయింది.

2. దేవతల ఆనందానికి కాని కారణాన్ని కారణంగా చెప్పటం వలన హేతూత్ప్రేక్షాలంకారం.

3.

| | | | |
|---|---|---|---|
| **తుతుషుః :** | తుతోష | తుతుషతుః | **తుతుషుః** |
| | తుతోషిథ | తుతుషథుః | తుతుష |
| | తుతోష | తుతుషివ | తుతుషిమ |
| **ఉపేక్షయిష్యన్తి :** | ఉపేక్షయిష్యతి | ఉపేక్షయిష్యతః | **ఉపేక్షయిష్యన్తి** |
| | ఉపేక్షయిష్యసి | ఉపేక్షయిష్యథః | ఉపేక్షయిష్యథ |
| | ఉపేక్షయిష్యామి | ఉపేక్షయిష్యావః | ఉపేక్షయిష్యామః |
| **ప్రాజ్వలత్ :** | **ప్రాజ్వలత్** | ప్రాజ్వలతామ్ | ప్రాజ్వలన్ |
| | ప్రాజ్వలః | ప్రాజ్వలతమ్ | ప్రాజ్వలత |
| | ప్రాజ్వలమ్ | ప్రాజ్వలావ | ప్రాజ్వలామ. |

*

**శ్లో॥ ప్రసూనవృన్దాని వికమ్పయంస్త-ద్గృహం స్పృశన్ సారసవారిసఙ్గః ।**
**వవౌ మరున్మామసురాద్వియుక్తం - కరిష్యతీత్యర్చనధీరివాస్య ॥ 1-42**

**అ :** కృష్ణజనన సమయంలో ఆ శిశువును అర్చిస్తున్నట్లుగా కనిపిస్తున్న వాయు వర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** మరుత్ ప్రసూన-వృందాని వికంపయన్ సారస-వారి-సంగః తద్గృహం స్పృశన్ మాం అసురాద్ వియుక్తం కరిష్యతి ఇతి అస్య అర్చన-ధీరివ వవౌ.

**ప్ర :** మరుత్ = వాయువు, ప్రసూన-వృందాని = పూలమొత్తాలను (ప్రసూనానాం వృందాని), వికంపయన్ = కదిలిస్తూ (రాల్చివేయటం కాదు), సారస... సంగః(సన్):సారస=సరస్సులకు సంబంధించిన, వారి = నీటితో, సంగః(సన్) = కలిసినవాడై (తుంపరలతోనని భావం) (సరసః సంబంధి చ తద్ వారి తస్య సంగః యస్య సః), తద్-గృహం = కృష్ణుని ఇంటిని, స్పృశన్ = తాకుతూ, మామ్ = నన్ను (వాయువును), అసురాత్ = రాక్షసజాతినుండి, వియుక్తమ్ = ఎడబాసినవానినిగా, కరిష్యతి = చేయబోతున్నాడు (కృ కరణే పరస్మైపది-లృట్-(ప్ర.ఏ.), ఇతి = అని, అస్య = కృష్ణునియొక్క, అర్చన-ధీరివ = పూజను చేసే బుద్ధి కలిగిన వాడన్నట్లుగా (అర్చనే ధీః యస్య సః), వవౌ = వీచెను. (వా గతిగంధనయోః పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణ జనన సమయంలో గాలి పూలను కంపింప జేస్తూ, (వాటిని సౌరభాన్ని తనలో నింపుకొంటూ), సరస్సుల నీటి తుంపరలను తనతో కలుపుకొంటూ భవిష్యత్తులో తనను రాక్షసజాతినుండి విడిపించబోయే కృష్ణునికి అర్చన చేయాలన్న తలపు కలిగినట్లుగా వీస్తోంది.

**వి :** 1. రావణ తారకాదుల దౌష్ట్యాలను వర్ణిస్తూ గతంలో కవులు పంచభూతాలు కూడా అక్కడ వారికి లోబడి ప్రవర్తిస్తున్నట్లు వర్ణించారు. కృష్ణావతారంలో అటువంటి రాక్షస ప్రస్తావన లేకపోయినా అవతార ప్రయోజనంగా దుర్మార్గుల నుండి పంచభూత సంరక్షణను ముందుగా సూచిస్తూ వర్ణన సాగిస్తున్నాడు కవి.

2. ఇక్కడ కూడా హేతూత్ప్రేక్షాలంకారం. వాయుప్రవృత్తికి కారణాన్ని కల్పించటం ద్వారా.

3. గాలి కుసుమగుణాలను, సరోవరగుణాలను తాను స్వీకరించటం (స్వగుణ పరిత్యాగపూర్వక-పరగుణగ్రహణం) వర్ణించటం వలన తద్గుణాలంకారం. 'తద్గుణః స్వగుణత్యాగాదన్యదీయ గుణగ్రహః' (కు. 141).

| | | | |
|---|---|---|---|
| 4. వవౌ : | వవౌ | వవతుః | వవుః |
| | వవిథ/వవాథ | వవథుః | వవ |
| | వవౌ | వవివ | వవిమ. |

**కరిష్యతి :** 1-35వ శ్లోకవ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ జాతే హరౌ స్వర్పితపుష్పవర్షై-ర్గీర్భిః స్తువద్భిః సురసిద్ధసఙ్ఘైః ।**
**దూరే విధూతా ఇవ విఘ్నభీత్యా - మేఘా దిగన్తం యయురమ్బరాన్తాత్ ॥ 1-43**

**అ :** కృష్ణజనన సమయంలో దిగంతాలకు పయనిస్తున్న మేఘాల కదలికకు కారణాన్ని భావించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** హరౌ జాతే మేఘాః స్వర్పిత-పుష్ప-వర్షైః గీర్భిః స్తువద్భిః సుర-సిద్ధ-సంఘైః విఘ్న-భీత్యా దూరే విధూతా ఇవ అంబరాన్తాత్ దిగన్తం యయుః .

**ప్ర :** హరౌ = నారాయణుడు, జాతే (సతి) = (కృష్ణుడుగా) జన్మించగా, మేఘాః = మేఘాలు, స్వ... వర్షైః : సు = చక్కగా, అర్పిత = సమర్పింపబడిన, పుష్ప = పూలయొక్క, వర్షైః = వానలు గలవారును (సుష్ఠు అర్పితాని పుష్పాణాం వర్షాణి యైః తైః), గీర్భిః = మాటలతో, స్తువద్భిః = స్తుతిస్తున్న వారును అయిన (స్తు ధాతువుపై శతృ ప్రత్యయం), సుర-సిద్ధ-సంఘైః = దేవతలు, సిద్ధులయొక్క సమూహాలచే (సురాణాం సిద్ధానాం చ సంఘాః, తైః), విఘ్న-భీత్యా = ఆటంకం కలుగుతుందన్న భయంతో (విఘ్నే భీతిః, తయా), దూరే = దూరంగా, విధూతా ఇవ = తొలగింపజేయబడినవో అన్నట్లు, (ధూ ధాతువుపై క్త ప్రత్యయం) అంబరాంతాత్ = ఆకాశపు అంచు నుండి, దిగంతమ్ = దిక్కుల దగ్గరకు, (స్వరూపేన్తం మతం క్లీబం నస్త్రీ ప్రాంతేంతికే త్రిషు విశ్వలోచనకోశః - తాన - 2), యయుః = వెళ్ళినవి. (యా ప్రాపణే పరస్మై పది-లిట్ ప్ర.ఏ.).

**తా ॥** నారాయణుడు కృష్ణుడుగా అవతరించగానే సురసిద్ధసంఘాలు ఆ బాలుని స్తుతిస్తూ, పూలను కురిపించసాగాయి. మేఘాలు అక్కడే వుండి కురిస్తే ఆ వానలు పూలవానలను చెదరగొట్టవచ్చునన్న భయంతో వాళ్ళు మేఘాలను నెట్టివేశారేమో అన్నట్లు మేఘాలు ఆకాశపు అంచునుండి దిగంతాలవైపు వెళ్ళిపోయాయి.

**వి :** 1. విఘ్నభీత్యా విధూతా ఇవ - హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **యయుః :** | యయౌ | యయతుః | **యయుః** |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

**శ్లో॥ అజన్మనస్తస్య హి జన్మకాలే - చరాచరం తుష్టమభూత్ కిలేదమ్ ।**
**తథాహి తుష్టిర్భువి కస్య న స్యా-దదృష్టపూర్వస్య నిరీక్షణేన ॥ 1-44**

**అ :** కృష్ణజననం చరాచరజగత్తునకు ఆనందహేతువని వర్ణనం. - ఉపేంద్రవజ్ర.

**అ :** అజన్మనః తస్య జన్మ-కాలే హి ఇదం చరాచరమ్ తుష్టమ్ అభూత్ కిల. తథాహి భువి అదృష్ట-పూర్వస్య నిరీక్షణేన కస్య తుష్టిః న స్యాత్.

**ప్ర :** అజన్మనః = పుట్టుకయే లేని (నాస్తి జన్మ యస్య తస్య), తస్య = ఆ నారాయణుని యొక్క (నాస్తి జన్మ యస్య తస్య), జన్మ-కాలే హి = పుట్టిన వేళలోనే (జన్మనః కాలః, తస్మిన్), ఇదమ్ = ఈ (కనిపిస్తున్న), చరాచరమ్

(జగత్) = చరాచరప్రపంచం (చరం చ అచరం చ), తుష్టమ్ = ఆనందించినదిగా (తుష్ ధాతువుపై క్త ప్రత్యయం), అభూత్-కిల = అయినది గదా! (భూ సత్తాయామ్ పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), తథాహి = అది తగినదే. భువి = లోకంలో, అదృష్టపూర్వస్య = అంతకుముందు చూడని దానిని (దృష్టపూర్వం న భవతి ఇతి), నిరీక్షణేన = చూచుటచే, కస్య = ఎవరికి, తుష్టిః = ఆనందం (తుష్ ధాతువుపై క్తి ప్రత్యయం), న స్యాత్ = కలుగదు. (అస భువి-పరస్మైపది-విధిలిఙ్-(ప్ర.ఏ.).

**తా ॥** అసలు పుట్టుకయే లేని నారాయణుడు (పరమాత్మ) పుట్టినప్పుడు చరాచర ప్రపంచమంతా ఆనందించింది. నిజమేగదా! లోకంలో ఎప్పుడూ కనిపించనిది కనిపించి నపుడు ఎవరు ఆనందించరు?

**వి :** 1. అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణః - న హన్యతే హన్యమానే శరీరే । కఠోపనిషత్తు - 2/18

2. విశేషవిషయాన్ని (చరాచరజగత్తు ఆనందించటం) సామాన్యవిషయంతో సమర్థించి నందువలన ఇది అర్థాంతరన్యాసాలంకారం.

3. **అభూత్ :** 1-28వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ శరీరిణాం స్థావరజఙ్గమానాం - నిరీక్షణేనైవ విముక్తిదోఽహమ్ ।**
**ఇతీవ విఖ్యాపయితుం స దృష్టో - జహార పిత్రోర్నిగడస్య బన్ధమ్ ॥ 1-45**

**అ :** కృష్ణుడు తన జననం తర్వాత మొట్టమొదటగా తన అసాధారణశక్తిమత్త్వాన్ని ప్రకటించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** అహం స్థావర-జంగమానాం శరీరిణాం నిరీక్షణేనైవ విముక్తి-దః ఇతి విఖ్యాపయితుమ్ ఇవ సః దృష్టః (సన్) పిత్రోః నిగడస్య బంధం జహార.

**ప్ర :** అహమ్ = నేను (కృష్ణుడు), స్థావర-జంగమానామ్ = కదలనివి, కదిలేవి అయిన (స్థావరాశ్చ తే జంగమాశ్చ, తేషామ్), శరీరిణామ్ = దేహధారులకు, నిరీక్షణేన+ఏవ = చూచుటతోనే, విముక్తి-దః = మోక్షమివ్వ గలవాడను (విముక్తిం దదాతి ఇతి), ఇతి = అని, విఖ్యాపయితుమ్ ఇవ = తెలుపడానికో అన్నట్లు, (విపూర్వక (జ్ఞప్ జ్ఞానేజ్ఞాపనే చ) ధాతువు పై తుమున్ ప్రత్యయం), సః = ఆ బాలకృష్ణుడు, దృష్టః సన్ = చూడబడినంతనే (దృశ్ ధాతువుపై క్త ప్రత్యయం), పిత్రోః = తల్లిదండ్రుల యొక్క, నిగడస్య = గొలుసుయొక్క, బంధమ్ = కట్టుబాటును, జహార = తొలగించాడు (హృ హరణే పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.).

**తా ॥** చరాచరజగత్తునకు నన్ను దర్శించినంతమాత్రాన నేను ముక్తి నివ్వగలవాడను అని గట్టిగా నొక్కి చెప్పదలచుకొన్నట్టు కృష్ణుడు తనను చూచినంతనే తల్లిదండ్రుల శృంఖలా బంధాలను తొలగిపోయేట్లు చేశాడు.

**వి :** 1. ఇది సమాధి అనే అర్థగుణం - '**అర్థదృష్టిః సమాధిః**' '**అర్థో ద్వివిధః అయోనిరన్యచ్ఛాయాయోనిశ్చ**' కావ్యాలంకారసూత్రవృత్తి - 3/2/6,7. ఇక్కడ అన్యచ్ఛాయా యోని. కృష్ణుడు జన్మించగానే దేవకీ వసుదేవుల బంధనాలు తొలగిపోయాయన్న పురాణగాథ ఆధారంగా నిర్మించిన భావమిది. ప్రసాదగుణం కూడా ఇక్కడుంది.

2. తల్లిదండ్రుల నిగడవిముక్తి చేయటంలో తన మహిమను ప్రకటించటం కృష్ణుని ఉద్దేశం కాదు. అయినా దానిని హేతువుగా చెప్పినందున హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ |

*

**శ్లో॥ ఏతత్పితృత్వప్రథయా భయం స్యా-త్పాపాదితీద్యం పితరౌ గుణాఢ్యమ్ ।**
**జ్ఞానాత్మకస్త్వం ప్రకృతేర్విదూర-స్తావస్తుతాం తాత ఇతీశమస్య ॥ 1-46**

**అ :** దేవకీ వసుదేవులు బంధవిముక్తులై కృష్ణుని కీర్తించటం శ్లోకవిషయం. – ఇంద్రవజ్ర.

**అ :** తౌ పితరౌ ఏతత్పితృత్వ–ప్రథయా పాపాత్ భయం స్యాత్ ఇతి ఈడ్యమ్ ఈశం త్వం జ్ఞానాత్మకః ప్రకృతేః విదూరః అస్య తాతః ఇతి అస్తుతామ్.

**ప్ర :** తౌ–పితరౌ = ఆ తల్లిదండ్రులు (దేవకీ వసుదేవులు), పితృత్వ–ప్రథయా = కృష్ణుని తల్లిదండ్రుల మన్న ప్రసిద్ధితో (ఏతస్య పితృత్వమితి ప్రథా, తయా), పాపాత్ = పాపి అయిన కంసుని వలన, భయం–స్యాత్–ఇతి = (మరణ) భయం కలుగుతుందని, ఈడ్యమ్ = స్తుతింపదగిన, ఈశమ్ = స్వామిని (కృష్ణుని), త్వమ్ = నీవు, జ్ఞాన+ఆత్మకః = జ్ఞానస్వరూపుడవు, ప్రకృతేః = ప్రకృతికి, విదూరః = దూరంగా ఉండేవాడవు, అస్య = ఈ జగత్తునకు, తాతః = తండ్రివి (తాతస్తు జనకః పితా అమరకోశః 2/28), ఇతి = అని, అస్తుతామ్ = ప్రశంసించిరి. (స్తు స్తుతౌ పరస్మైపది–లఙ్–ప్ర.ద్వి.)

**తా ॥** కృష్ణుడు తమకుమారుడని తెలిస్తే పాపాత్ముడైన కంసుడు కృష్ణుని చంపివేస్తాడేమో అని భయపడి దేవకీవసుదేవులు కృష్ణునే "జ్ఞాన స్వరూపుడని, స్తుతింపదగినవాడని, ప్రభువు అని, ప్రకృతికి దూరమందుండువాడని ఈ జగత్తునకే తండ్రి" అని ప్రశంసించారు.

**వి :** 1. ఈ శ్లోకంలో అనుజ్ఞాలంకారం కనిపిస్తుంది. '**దోషస్యాభ్యర్థనానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్**' – గుణదృష్టితో దోషాన్నే కోరుకోవటం అనుజ్ఞ. పరమాత్మ అంతటివాడు కొడుకుగా పుడితే అది చెప్పుకోకూడదనుకోవటం దోషమే. అయితే అందులో ఒక గుణముంది. పసివాడి ప్రాణరక్షణ. అందుకే ఇది అనుజ్ఞాలంకారం.

2. **అస్తుతామ్ :** 1–30వశ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ య ఏష పుత్సంజ్ఞితనారకస్థాన్ – జనాన్ స్వనామస్మరణేన పాతి ।**
**స దృష్టిగస్సన్ వసుదేవపత్న్యాః – కథం న పుత్త్రః శతపత్రనేత్రః ॥ 1–47**

**అ :** కృష్ణునకు దేవకీపుత్రత్వాన్ని సమర్థిస్తూ చేస్తున్న వ్యాఖ్యానం. – ఉపేంద్రవజ్ర.

**అ :** యః పుత్సంజ్ఞిత–నారక–స్థాన్ జనాన్ స్వ–నామ–స్మరణేన పాతి సః ఏషః శత–పత్ర–నేత్రః వసుదేవ–పత్న్యాః దృష్టిగః సన్ పుత్త్రః కథం న భవేత్.

**ప్ర :** యః = ఎవడయితే, పుత్... నారకస్థాన్ : పుత్ = పుత్ – అని, సంజ్ఞిత = పేరుపెట్టబడిన, నారక–స్థాన్ = నరకంలో ఉన్న, (స్యాన్నారకస్తు నరకః అమరకోశః–నరక–1) (పుదితి సంజ్ఞితః స చ అసౌ నరకః తస్మిన్ తిష్ఠంతి ఇతి, తాన్), జనాన్ = జనులను, స్వ... ణేన : స్వ = తనయొక్క, నామ = పేరుయొక్క, స్మరణేన = తలంపు చేతనే (స్వస్య నామ్నః స్మరణం, తేన), పాతి = రక్షించునో (పా రక్షణే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), స ఏషః = అటువంటి ఈ, శతపత్ర–నేత్రః = కమలాక్షుడు (సహస్ర పత్రం కమలం శతపత్రం కుశేశయమ్–అమరకోశః–వారివర్గం–40) (శతపత్రే ఇవ నేత్రే యస్య సః), వసుదేవ–పత్న్యాః = వసుదేవుని భార్య (దేవకి)కు (వసుదేవస్య పత్నీ, తస్యాః), దృష్టి–గః సన్ = కనిపించి (దృష్టిం గచ్ఛతి ఇతి), పుత్త్రః = కొడుకు (పున్నామ నరకం నుండి తప్పించువాడు), కథమ్ = ఏ రీతిగా, న భవేత్ = కాకుండును. (భూ సత్తాయామ్ పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు తనను తలచినంతమాత్రం చేతనే పున్నామనరకంలో నున్న జనులను రక్షించగలడు. అటువంటివాడు ఆ కమలాక్షుడు వసుదేవపత్ని (దేవకి) కనులారా చూసిన తరువాత ఆమెకు పుత్త్రుడు కాకుండా ఎలా ఉంటాడు?

**వి :** 1. ఈ శ్లోకంలో కావ్యార్థాపత్తి – యుక్తి అని రెండు అలంకారాలు కనిపిస్తాయి. తలచినంతనే కాపాడేవాడు కనులారా చూచిన తరువాత ఎందుకు కాపాడదు అనటం కావ్యార్థాపత్తి "**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**" – (కు.59).

2. భోజుని అభిప్రాయం మేరకు ఇది యుక్తి.

శ్లో॥ అయుజ్యమానస్య మిథః శబ్దార్థస్య వా పునః ।
యోజనా క్రియతే యాసౌ యుక్తిరిత్యుచ్యతే బుధైః ॥ -సరస్వతీకంఠాభరణం -2/44.

కుదరటం కష్టమైన దానిని కుదర్చటం యుక్తి. దేవకికి పుత్రత్వాన్ని సమర్థించటం కుదర్చటం ఇక్కడ.

3. '**కలౌ సంస్మరణాన్ముక్తిః**' అని మన మనుకుంటుంటాం కానీ ఏ యుగమైన అది సంభవమే.

| 4. **పాతి :** | **పాతి** | పాతః | పాన్తి |
|---|---|---|---|
| | పాసి | పాథః | పాథ |
| | పామి | పావః | పామః |

*

**శ్లో॥ యదీయరూపం ప్రకటీకరోతి - పితా స తస్యేతి హి వేదవాదః ।**
**తథావిధస్యానకదుందుభేస్త-త్పితృత్వమప్యస్తు న తేన హానిః ॥ 1-48**

**అ :** ఆనకదుందుభికి శ్రీకృష్ణపితృత్వాన్ని అంగీకరింపజేస్తున్న శ్లోకమిది. -ఉపేంద్రవజ్ర.

**అ :**(యః) యదీయ-రూపం ప్రకటీకరోతి సః తస్య పితా ఇతి హి వేద-వాదః. తథావిధస్య ఆనకదుందుభేః తత్పితృత్వమ్ అపి అస్తు తేన హానిః న.

**ప్ర :** (యః) = ఎవరయితే, యదీయ-రూపమ్ = ఎవని యొక్క రూపాన్ని, ప్రకటీకరోతి = వ్యక్తపరుస్తాడో, సః = అతడు, తస్య = ఆ వ్యక్తపరుపబడినవానికి, పితా = తండ్రి, ఇతి హి = అని కదా, వేద-వాదః = వేదప్రతిపాదనం (వేదానాం వాదః). తథావిధస్య = ఆ పద్ధతిలో/కృష్ణుని ప్రకటింపజేసినందువలన, ఆనకదుందుభేః = వసుదేవునకు, తత్పితృత్వమ్ = ఆ కృష్ణునికి తండ్రియగుట, అస్తు = సంభవించుగాక. (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.). తేన = దానివలన, హానిః న = నష్టమేమీ లేదు.

**తా ॥** ఎవరి రూపాన్ని ఎవరు ప్రకటింపజేస్తారో ఆ ప్రకటింపజేసిన వాడు ప్రకటింపబడిన వానికి తండ్రి కాగలడు అని వేదవచనం. కాబట్టి వసుదేవుడు కూడా శ్రీకృష్ణుని శ్రీకృష్ణునిగా లోకానికి ప్రకటింపజేశాడు. కాబట్టి వసుదేవుడు కృష్ణునకు తండ్రి అవుతాడు. అయినంత మాత్రాన శ్రీకృష్ణుని అవతరణకు వచ్చిన హాని ఏమీలేదు.

| వి :1. **ప్రకటీకరోతి :** | **ప్రకటీకరోతి** | ప్రకటీకురుతః | ప్రకటీకుర్వన్తి |
|---|---|---|---|
| | ప్రకటీకరోషి | ప్రకటీకురుథః | ప్రకటీకురుథ |
| | ప్రకటీకరోమి | ప్రకటీకుర్వః | ప్రకటీకుర్మః. |

*

**శ్లో॥ ఏతేనైవ పురాత్మనాఽహమభవం త్వద్దృష్టిమార్గోఽధునా**
**తేనైవాసమితీరయన్ జనిమసౌ మేనే న సూనుః స్వకామ్ ।**
**మాతా తం కిల సంస్తువన్త్యభినవం విశ్వం యదిత్యాదినా**
**ప్రాజ్ఞోఽసౌ వినతః పితా చ విదితోఽసీత్యాదిభిస్తం గృణన్ ॥ 1-49**

**అ :** కృష్ణుడు దేవకీవసుదేవులు ముగ్గురూ కూడా కృష్ణుని జననాన్ని అంగీకరించకపోవటం హేతుబద్ధంగా.
- శార్దూలవిక్రీడితం.

**అ :** పురా ఏతేన ఆత్మనా ఏవ అహం త్వద్దృష్టిమార్గః అభవమ్ అధునా తేన ఏవ ఆసమ్ ఇతి ఈరయన్ అసౌ సూనుః స్వకాం జనిం న మేనే. మాతా అభినవం తం విశ్వం యద్ ఇత్యాదినా సంస్తువన్తీ (తస్య జనిం న మేనే). ప్రాజ్ఞః అసౌ పితా చ వినతః (సన్) విదితః అసి ఇత్యాదిభిః తం గృణన్ (తస్య జనిం న మేనే).

**ప్ర :** పురా = గతజన్మలో, ఏతేన = ఈ, ఆత్మనా-ఏవ = శరీరంతోనే, అహమ్ = నేను, త్వద్-దృష్టి-మార్గః = నీ కంటికి కనిపిస్తున్నవాడనై (తవ దృష్టేః మార్గః), అభవమ్ = ఉంటిని.(భూసత్తాయామ్- పరస్మైపది-లఙ్-ఉ.ఏ.), అధునా = ఈ జన్మలో, తేన-(ఆత్మనా)- ఏవ = ఆ రూపంతోడనే, ఆసమ్ = ఉంటిని (అస భువి పరస్మైపది-లఙ్-ఉ.ఏ.), ఇతి = అని, ఈరయన్ = పలుకుతూ (ఈర ణిచ్-ధాతువుపై శతృప్రత్యయం), అసౌ = ఆ, సూనుః = కొడుకు (కృష్ణుడు), స్వకామ్ = తనయొక్క, జనిమ్ = పుట్టుకను, న మేనే = అంగకరించలేదు. (మన్ అవబోధనే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), మాతా = తల్లి (దేవకి), తమ్-అభినవమ్ = అందగాడైన ఆ కృష్ణుని, విశ్వం యద్ - ఇత్యాదినా - 'విశ్వం యద్' మొదలుగా గలవాటితో, సంస్తువన్తీ = నుతిస్తూ, తస్య-జనిమ్-న-మేనే = ఆ కృష్ణుని పుట్టుకను అంగీకరించలేదు. కిల = నిజమే గదా! ప్రాజ్ఞః = పండితుడైన, అసౌ-పితా చ = ఆ తండ్రి కూడా, వినతః సన్ = వినమ్రుడై, విదితః+అసి-ఇత్యాదిభిః = 'విదితోఽసి' మొదలుగాగల వాటిచే, తమ్ = ఆ కృష్ణుని, గృణన్= స్తుతిస్తూ (గౄ - శబ్దే - ధాతువుపై శతృ ప్రత్యయం), తస్య-జనిమ్-న-మేనే = ఆ కృష్ణుని జననాన్ని అంగీకరించలేదు.

**తా ॥** 'గతజన్మలో కూడా నేను నీకు ఈ రూపంతోనే కనిపించాను. ఇప్పుడు కూడా అదే రూపంతో ఉన్నాను. కాబట్టి నేను నీకు మళ్ళీ పుట్టినట్టు కాదు' అని కృష్ణుడు (దేవకితో అంటూ) తన పుట్టుకను నిరాకరించాడు. దేవకి కూడా ఆ పసివానిని 'విశ్వం యత్' మొదలుగా గల వచనాలతో స్తుతిస్తూ కృష్ణుడు తనకు పుట్టాడన్న భావాన్ని అంగీకరించలేదు. తండ్రి వసుదేవుడు కూడా 'విదితోఽసి' మొదలయిన వాటితో కృష్ణుని స్తుతిస్తూ అతని పుట్టుకను అంగీకరించలేదు.

ఏతావతా తల్లిదండ్రులు, కుమారుడు కూడా ఆ అవతారాన్ని అదొక పుట్టుకగా అంగీకరించకపోవటం విశేషం.

**వి :** 1. వాదిరాజతీర్థరు ఈ కావ్యరచనలో భాగవతమార్గాన్ని స్పృశిస్తూ ఉంటారు. ఆ భాగవతంలోని శ్లోకాలనే ఇక్కడ ప్రస్తావిస్తున్నారు, 'విశ్వం యత్', 'విదితోఽసి' పదాలతో. వాటిని పూర్తిగా చూద్దాం-

శ్లో॥ **విశ్వం యదేతత్ స్వతనౌ నిశాన్తే యథావకాశం పురుషః పురో భవాన్ ।**
**బిభర్తి సోఽయం మమ గర్భగోఽభూదహో నృలోకస్య విడమ్బనం తత్ ॥ - భాగవతం 10/3/31**

**శ్లో॥ విదితోఽసి భవాన్ సాక్షాత్ పురుషః ప్రకృతేః పరః ।**
**కేవలానుభవానన్దస్వరూపః సర్వబుద్ధిదృక్ ॥ - భాగవతం 10/3/37**

2. **అభవత్ :**

| | | | |
|---|---|---|---|
| | **అభవత్** | అభవతామ్ | అభవన్ |
| | అభవః | అభవతమ్ | అభవత |
| | అభవమ్ | అభవావ | అభవామ |

**ఆసమ్ :** 1-40 వశ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **మేనే :** | **మేనే** | మేనాతే | మేనిరే |
| | మేనిషే | మేనాథే | మేనిధ్వే |
| | మేనే | మేనివహే | మేనిమహే. |

| | | | |
|---|---|---|---|
| **సంస్తువన్తి :** | స్తౌతి/స్తవీతి | స్తుతః/స్తువీతః | **స్తువన్తి** |
| | స్తౌషి/స్తవీషి | స్తుథః/స్తువీథః | స్తుథ/స్తువీథ |
| | స్తౌమి/స్తవీమి | స్తువః/స్తవీవః | స్తుమః/స్తువీమః |

*

**శ్లో॥ జానాతి మాతా పరమాత్మజాతం - నూనం పితాఽపి క్వచిదేవ లోకే ।**
**తాభ్యామనంగీకృతకృష్ణజన్మ - కో వా పుమాన్ సాధయితుం సమర్థః ॥ 1-50**

**అ :** తల్లిదండ్రులు కూడా అంగీకరించని కుమార జననాన్ని విశిష్టంగా నిరూపించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** లోకే క్వచిదేవ మాతా ఆత్మ జాతం పరం జానాతి. పితాఽపి (క్వచిదేవ ఆత్మజాతం పరం జానాతి) నూనం తాభ్యామ్ అనంగీకృత కృష్ణ జన్మ సాధయితుం కః పుమాన్ సమర్థః వా.

**ప్ర :** లోకే = లోకంలో, క్వచిద్+ఏవ = ఎక్కడో (కొన్ని తావుల) మాత్రమే, మాతా = తల్లి, ఆత్మ-జాతమ్ = తనకు పుట్టిన వానిని (ఆత్మనః జాతమ్), పరమ్ = పరమాత్మగా, జానాతి = గ్రహిస్తుంది. (జ్ఞా అవబోధనే పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), పితా+అపి = తండ్రికూడా, క్వచిదేవ ఆత్మజాతం పరం జానాతి : నూనమ్ = నిశ్చితం, తాభ్యామ్ = వారిద్దరిచే (తల్లిదండ్రుల చేత), అనంగీకృత-కృష్ణ-జన్మ = అంగీకరింపబడని కృష్ణుని పుట్టుక వంటి పుట్టుకను (అనంగీకృతం చ తత్ కృష్ణస్య జన్మ), సాధయితుమ్ = సాధించటానికి, కః పుమాన్ = ఏ పురుషుడు, సమర్థః వా = సమర్థుడో! (ఎవరూ కారని భావం).

**తా ॥** లోకంలో ఎక్కడో ఒకచోట మాత్రమే తల్లి తనకుమారుని పరమాత్మగా తెలిసికొన గలదు. తండ్రి కూడా అంతే. ఇలా తల్లిదండ్రులచేత కూడా అంగీకరింపబడని కృష్ణుని పుట్టుక వంటి పుట్టుకను ఏ పురుషుడు సాధించుకో గలడు?

**వి :** 1. కృష్ణుని పుట్టుకవంటి పుట్టుక (కృష్ణస్య జన్మ ఇవ జన్మ = కృష్ణజన్మ), ఇది లుప్తోపమాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **జానాతి :** | **జానాతి** | జానీతః | జానన్తి |
| | జానాసి | జానీథః | జానీథ |
| | జానామి | జానీవః | జానీమః. |

*

**శ్లో॥ స్తుతిం స్వపిత్రోరవధార్య యోఽసౌ - బభూవ పశ్చాచ్ఛిశువేషధారీ ।**
**అసూత తం కా ను తదా మృగాక్షీ - పురా పురాణాకృతిమప్రమేయమ్ ॥ 1-51**

**అ :** దివ్యశరీరాన్ని విడిచి పరమాత్మ శిశురూపాన్ని ధరించుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** యః అసౌ స్వ-పిత్రోః స్తుతిమ్ అవధార్య పశ్చాత్ శిశు-వేష-ధారీ బభూవ, పురా పురాణాకృతిమ్ అప్రమేయం తం తదా కా ను మృగాక్షీ అసూత.

**ప్ర :** యః అసౌ = ఏ కృష్ణుడయితే, స్వ-పిత్రోః = తన తల్లిదండ్రులయొక్క (స్వస్య పితరౌ, తయోః), స్తుతిమ్ = స్తోత్రాన్ని, అవధార్య = విని (అవపూర్వక ధృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పశ్చాత్ = ఆ తరువాత, శిశు-వేష-ధారీ = శిశురూపాన్ని ధరించినవాడుగా (శిశోః వేషం ధారయతి ఇతి), బభూవ = అయ్యెనో (భూ సత్తాయామ్ పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), పురా = అంతకు ముందు, పురాణ+ఆకృతిమ్ = తొల్లింటిరూపం గలిగి (పురాణా ఆకృతిః యస్య తమ్), అప్రమేయమ్ = కొలతకందని, తమ్ = ఆ పరమాత్మను/ ఆ శిశువును, తదా = అప్పుడు, కా ను మృగ+అక్షీ = ఏ కాంత (మృగస్య అక్షిణీ ఇవ అక్షిణీ యస్యాః సా), అసూత = ప్రసవించెను? (సూ ప్రాణిగర్భవిమోచనే-ఆత్మనేపది-లఙ్-(ప్ర.ఏ.).

**తా ॥** విశ్వాత్మగా దర్శనమిచ్చిన కృష్ణుడు తన తల్లిదండ్రులు చేసిన స్తోత్రాన్ని విని, మరల శిశువుగా మారి పోయాడు. అంతకుముందు అప్రమేయుడైన పురాణపురుషుడుగా కనిపించి ఇప్పుడు కృష్ణుడైన ఆ శిశువును అప్పుడు ఏ కాంత కన్నది?

**వి :** 1. భాగవతం మేరకు దేవకీవసుదేవులు '**ఉపసంహర విశ్వాత్మన్నదోరూపమలౌకికమ్**' అని నారాయణుని ప్రార్థించారు. అప్పుడు ఆ నారాయణుడు శిశు కృష్ణుడయ్యాడు.

2. ఈ సన్నివేశాన్ని బట్టియే ఆ ముగ్గురు (కృష్ణ దేవకీ వసుదేవులు) కృష్ణుని పుత్రత్వాన్ని అంగీకరించకపోవటం. కృష్ణుడు పురాణపురుషుడుగా పుట్టుకా? లేక శిశువుగానా? పురాణపురుషుడుగా అయితే అవతారప్రసక్తియే లేదు. శిశువుగా అందామా? అంటే తాను అలా మారాడు కానీ అలా పుట్టలేదు.

3. **బభూవ :** 1-12వశ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **అసూత :** | **అసూత** | అసువాతామ్ | అసువత |
| | అసూథాః | అసువాథామ్ | అసూధ్వమ్ |
| | అసువి | అసూవహి | అసూమహి |

*

**శ్లో॥ యదీహ జాతో వసుదేవవీర్యా-త్తదా కుతస్తస్య విభూషణాని ।**
**వరామ్బరం కౌస్తుభరత్నముద్య-త్సుదర్శనం శఙ్ఖగదాదిజాతమ్ ॥ 1-52**

**అ :** కృష్ణుని అజాతత్వాన్ని ప్రకారాంతంగా సమర్థించుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** యది ఇహ వసుదేవ-వీర్యాత్ జాతః తదా తస్య విభూషణాని వరాంబరం, కౌస్తుభ-రత్నమ్ ఉద్యత్సుదర్శనం శంఖ-గదాది-జాతం కుతః?

**ప్ర :** యది = ఒకవేళ, ఇహ = ఈ లోకంలో, వసుదేవ-వీర్యాత్ = వసుదేవుని శుక్రం నుండి (వసుదేవస్య వీర్యం, తస్మాత్), జాతః = పుట్టినట్లయితే (జనీ ధాతువుపై క్త ప్రత్యయం), తదా = అప్పుడు, తస్య = అతనికి, విభూషణాని = నగలు/ఆభరణాలూ, వర+అంబరమ్ = మేలిమి వస్త్రం (వరం చ తత్ అంబరమ్), కౌస్తుభ-రత్నమ్ = కౌస్తుభరత్నమూ, ఉద్యత్-సుదర్శనమ్ = ప్రకాశించే సుదర్శనచక్రమూ (ఉద్యచ్చ తత్ సుదర్శనమ్), శంఖ-గదా+ఆది-జాతమ్ = శంఖమూ, గదా మొదలగు వాని సమూహం (శంఖః, గదా చ ఆదిః యస్య, తస్య జాతమ్), కుతః? = ఎలా లభిస్తుంది?

**తా ॥** ఒకవేళ కృష్ణుడు వసుదేవుని వలననే ఈ లోకానికి వచ్చాడని నిర్ణయించేటట్లయితే ఆ కృష్ణునికి ఆ సమయంలో అలంకారాలు (నగలు), విలువైన బట్టలు, కౌస్తుభరత్నమూ, సుదర్శనచక్రమూ, శంఖం గద మొదలయిన వస్తు సముదాయం ఎలా వస్తాయి? *

**శ్లో॥ అహో పిశాచా అపి దేహిదేహే - గతాగతం శక్తియుతా లభన్తే ।**
**అనంతశక్తేః పరమస్య న స్యా-త్కుతో బహిర్నిర్గమ ఏవ తర్హి ॥ 1-53**

**అ :** కృష్ణుడు పుట్టకపోవటాన్ని మరొకవిధంగా సమర్థించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** పిశాచా అపి శక్తి-యుతాః దేహి-దేహే గతాగతం లభన్తే. తర్హి అనంత-శక్తేః పరమస్య బహిః నిర్గమః కుతః న స్యాత్.

**ప్రతి :** పిశాచాః అపి = పిశాచాలు (దుష్టగ్రహాలు) కూడా, శక్తి-యుతాః సన్తః = (అసాధారణ) శక్తులు గలవై (శక్త్యా యుతాః), దేహి-దేహే = ప్రాణుల శరీరంలో (దేహినః దేహః, తస్మిన్), గతాగతమ్ (గతమ్ చ ఆగతమ్ చ తయోస్సమాహారః = గతాగతమ్) = రాకపోకలను (గతం చ ఆగతం చ), లభన్తే = పొందును. (లభ ప్రాప్తే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.). తర్హి = అటువంటప్పుడు, అనంత-శక్తేః = అంతులేని శక్తి గల (అనంతా శక్తిః యస్య సః, తస్య), పరమస్య = పరమాత్మకు, బహిః = (దేవకిగర్భంనుండి) వెలుపలకు, నిర్గమః ఏవ = రావటం మాత్రమే, కుతః = ఎందులకు, న-స్యాత్ = లేకుండును? (అస భువి పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.).

**తా ။** దుష్టగ్రహాలయిన పిశాచాలకు కూడా ప్రాణుల శరీరాలలోనికి ఇతరులకు కనిపించకుండా రాకపోకలు జరిపే శక్తి వుంటుంది. అటువంటప్పుడు అనంతశక్తి స్వరూపుడైన పరమాత్మ దేవకి గర్భంలో నుండి బయటపడలేడా?

**వి :** 1. ప్రాణులు నాలుగు రకాలు. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజాలు, జరాయుజాలు. మిగిలిన మూడింటికి సంబంధించిన చర్చ ఎక్కడా కనిపించదు. జరాయుజాల విషయంలో మాత్రమే ఇటువంటి చర్చ. ఎందుకంటే – ప్రాచీనగాథలలో అయోనిజులుగా చాలా విశిష్ట పాత్రలుండటమే కారణం. యోనిజత్వాన్ని తక్కువ చేసి చూడటం కూడా అనాదిగా అలవాటయి ఉండటం.

| | | | |
|---|---|---|---|
| 2. **లభన్తే :** | లభతే | లభేతే | **లభన్తే** |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభా | లభావహే | లభామహే |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ యదా నృసింహాకృతిరావిరాసీత్ – పదాహతస్తంభవరాద్ధి పూర్వమ్ ।**
**తదా ను కా స్త్రీ సుషువే ముకున్దం – స కస్య వీర్యాదజనిష్ట కాయః ॥ 1–54**

**అ :** కృష్ణుడు దేవకీగర్భం నుండి పుట్టలేదనటాన్ని ఇతరావతారాలతో పోల్చి చూపి వివరించటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** పూర్వం యదా పదాహత–స్తంభ–వరాద్ నృసింహాకృతిః ఆవిరాసీత్ హి. తదా కా ను స్త్రీ ముకుందం సుషువే. స కాయః కస్య వీర్యాద్ అజనిష్ట.

**ప్ర :** పూర్వమ్ = గతంలో, పద+ఆహతాత్ = కాలితో కొట్టబడిన, స్తంభ–వరాత్ = శ్రేష్ఠస్తంభం నుండి (పదా ఆహతశ్చ అసౌ స్తమ్భవరః), నృసింహ+ఆకృతిః = నృసింహరూపం (నృసింహస్య ఆకృతిః), ఆవిరాసీత్ = పుట్టెను (ఆవిః+అస భువి పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.) (ప్రాదురావిః ప్రకాశే–వైజయన్తీ–శేషకాండ–18), హి = నిశ్చితమే. తదా = ఆ సమయంలో, కా–ను–స్త్రీ = ఏ స్త్రీ, ముకుందమ్ = నారాయణుని/ నృసింహుని, సుషువే = కనెను? (సూ ప్రాణిగర్భవిమోచనే–ఆత్మనేపది– లిట్–ప్ర.ఏ.), సః–కాయః = ఆ శరీరం, కస్య = ఎవనియొక్క, వీర్యాత్ = శుక్రం నుండి, అజనిష్ట = జన్మించెను? (జనీ ప్రాదుర్భావే ఆత్మనేపది–లుఙ్–ప్ర.ఏ.).

**తా ။** గతంలో కాలిదెబ్బతిన్న స్తంభం నుండి నృసింహరూపం పుట్టినప్పుడు నృసింహరూపుడైన ఆ నారాయణుని ఏ స్త్రీ కన్నది? ఎవరి వీర్యం నుండి ఆ శరీరం పుట్టింది?

**వి :** 1. నృసింహావతార సంఘటనలో హిరణ్యకశిపుడు, ఆయన కుమారుడు ప్రహ్లాదుడు ఈ ఇద్దరి మధ్య జరిగిన సంవాదంలో 'ఎందెందు వెదకి చూచిన అందందే కలదు విష్ణు'వని ప్రహ్లాదుడన్నపుడు హిరణ్యకశిపుడు ఇందులో చూపించమని ఒకస్తంభాన్ని కాలితో తంతాడు. ఆ విషయాన్ని గుర్తు చేశాడు కవి.

2. స్తంభవరాత్ – అన్నచోట వర విశేషణం సార్థకం. పరమాత్మను వెలువరించిన స్తంభం శ్రేష్ఠం కాకపోతుందా?

| | | | |
|---|---|---|---|
| 3. **సుషువే :** | సుషువే | సుషువాతే | సుషువిరే |
| | సుషువిషే | సుషువాథే | సుషువిఢ్వే (ధ్వే) |
| | సుషువే | సుషువివహే | సుషువిమహే |

| | | | |
|---|---|---|---|
| **అజనిష్ట :** | **అజనిష్ట/అజని** | అజనిషాతామ్ | అజనిషత |
| | అజనిష్ఠాః | అజనిషాథామ్ | అజనిధ్వమ్ |
| | అజనిషి | అజనిష్వహి | అజనిష్మహి |

*

**శ్లో॥ తథైవ మాయా హరిణోపదిష్టా - బభూవ నన్దస్య కళత్రరత్నే ।**
**హరిస్తుగిత్యాదివిమోహరాశే-ర్భవిష్యతోఽస్యామివ మూలభూతా ॥ 1-55**

**అ :** కృష్ణ జననంతో పాటు యశోదాగర్భం నుండి మాయాజననాన్ని వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అస్యాం భవిష్యతః హరిః తుక్ ఇత్యాది మోహ-రాశేః మూల-భూతా ఇవ హరిణా ఉపదిష్టా మాయా తథా ఏవ నందస్య కళత్ర-రత్నే బభూవ.

**ప్ర :** అస్యామ్ = ఈమె (యశోద) యందు, భవిష్యతః = ఏర్పడబోవు (భూ ధాతువుపై శతృప్రత్యయం), హరిః +తుక్-ఇతి+ఆది = హరి, కుమారుడు మొదలగు, (తుక్ తోకం తనయశ్చ నందనః ఇతి ప్రాజ్ఞైరపత్యం స్మృతమ్ - అభిధానరత్నమాల 497), మోహ-రాశేః = వ్యామోహ సంకులతకు (విమోహస్య రాశిః, తస్య), మూల-భూతా-ఇవ = పాదు అన్నట్లుగా, హరిణా = నారాయణుని చేత, ఉపదిష్టా = ఆదేశింపబడిన (ఉప ఉపసర్గపూర్వక దిశ ధాతువుపై క్త ప్రత్యయం) (హరిణా ఉపదిష్టా), మాయా = యోగమాయ, తథా+ఏవ = ఆదేశించినట్లుగనే, నందస్య = నందుని యొక్క, కళత్రరత్నే = ఉత్తమురాలైన భార్య యందు, (కళత్రం శ్రోణిభార్యయోః దురస్థానే నృపాదీనాం; విశ్వకోశః - రాంత -204), (రత్నం శ్రేష్ఠే మణావః విశ్వకోశః - నాంత-13) (కళత్రం చ తత్ రత్నమ్, తస్మిన్), బభూవ = నిలిచెను/ పుట్టెను. (భూ సత్తాయామ్ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణజననం వలెనే నారాయణుడు ఆదేశించినట్లుగా యోగమాయ నందుని కళత్ర-రత్నమయిన యశోద గర్భం నుండి జన్మించింది. ఆ మాయయే భవిష్యత్తులో యశోదకు కృష్ణునిపై వ్యామోహం, ఆ కృష్ణుడు తన కుమారుడో లేక పరమాత్మయో అర్థంకాని అయోమయస్థితీ కలగటానికి కారణం కాబోతుంది.

**వి :** 1. యశోదకు కృష్ణునిపై అపత్యప్రేమ, అసాధారణభక్తి ఏర్పడటానికి కారణం పసితనంలో కృష్ణుని చేష్టలే కానీ మాయ కాదు. కాని దానిని అయినట్లుగా ఊహించి వర్ణిస్తున్నాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం.

2. అపత్యవ్యామోహం అందరికీ సహజం. కానీ యశోదది విచిత్రస్థితి మరి.

3. **బభూవ :** 1-12 వశ్లోక వ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ యదీహ వాసో మమ తర్హి కంసః - సుహృద్వధక్లేశవిదూర ఏవ ।**
**యమాతిథిః స్యాదితి వీక్ష్య కృష్ణ-స్తతో వ్రజం ప్రత్యగమత్ స ధీమాన్ ॥ 1-56**

**అ :** కృష్ణుడు గోపకులంలో నివసించటానికి తాను భావించిన కారణాన్ని వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ మమ వాసః యది తర్హి కంసః సుహృద్వధ-క్లేశ-విదూరః ఏవ యమాతిథిః స్యాత్ ఇతి వీక్ష్య ధీమాన్ సః కృష్ణః తతః వ్రజం ప్రత్యగమత్.

**ప్ర :** ఇహ = ఇక్కడనే, మమ = నా యొక్క, వాసః యది = నివాసమయితే, తర్హి = అప్పుడు/ ఆ స్థితిలో, కంసః = కంసుడు, సుహృ... విదూరః+ఏవ : సుహృద్ = మిత్రుల యొక్క, వధ = సంహారంచేత కలిగిన, క్లేశ = బాధకు, విదూరః ఏవ = దూరమే అయి (సుహృదాం వధః, తేన క్లేశః, తస్య విదూరః), యమ+అతిథిః = యమునకు అతిథిగా (యమస్య అతిథిః), స్యాత్ = కాగలడు (అస భువి పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), ఇతి = అని, వీక్ష్య = భావించి (విపూర్వక ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ధీమాన్ = బుద్ధిమంతుడైన, సః కృష్ణః =

ఆ కృష్ణుడు, తతః = అక్కడ నుండి, వ్రజమ్ = గొల్లపల్లెకు, ప్రత్యగమత్ = వెళ్ళాడు. (ప్రతిపూర్వక గమ్ల్ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.).

**తా ॥** తాను దేవకీ వసుదేవుల దగ్గరనే ఉన్నట్లయితే (కంసనగరంలోనే) కంసుడు మిత్ర వధ వలన కలిగే బాధను అనుభవించకుండానే యమునకు అతిథిగా వెళ్ళవలసి వస్తుంది. (మరణించవలసి వస్తుంది) అని కృష్ణుడు యశోదా నందుల దగ్గరకు (గొల్లపల్లెకు) వెళ్ళాడట.

**వి :** 1. మరణానంతరం స్వర్గమా? నరకమా? మోక్షమా? అన్న నిర్ణయం చేయటం లౌకికులకు దాదాపు అసాధ్యం. కృష్ణుడు కాబట్టి కంసునకు నరకలోకగమనం తథ్యమని నిర్ణయించగలిగాడు.

2. **ప్రత్యగమత్ (ప్రతి+అగమత్) :**

| | | |
|---|---|---|
| **అగమత్** | అగమతామ్ | అగమన్ |
| అగమః | అగమతమ్ | అగమత |
| అగమమ్ | అగమావ | అగమామ. |

*

## శ్లో॥ న కంసభీత్యాఽభియయౌ వ్రజం స – స్వసంశ్రితానామభయస్య కర్తా ।
## స్వవల్లభాం నన్దకళత్రజాతాం – మనోరమామీక్షితుమేవ సోఽగాత్ ॥ 1–57

**అ :** కృష్ణుని వ్రజగమనాన్ని ప్రకారాంతరంగా సమర్థించటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ–సంశ్రితానామ్ అభయస్య కర్తా సః కంస–భీత్యా వ్రజం న అభియయౌ (కింతు) నంద–కళత్ర–జాతాం మనో–రమాం స్వ–వల్లభామ్ ఈక్షితుమ్ ఏవ సః అగాత్.

**ప్ర :** స్వ–సంశ్రితానామ్ = తనను ఆశ్రయించినవారికి (స్వం సంశ్రితాః, తేషామ్), అభయస్య = నిర్భయత్వానికి, కర్తా = కారకుడైన, సః = ఆ కృష్ణుడు, కంస–భీత్యా = కంసునివలని భయంతో (కంసాద్ భీతిః, తయా), వ్రజమ్ = గొల్లపల్లెకు, న అభియయౌ = వెళ్ళలేదు. (యా ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), (కింతు) = అయితే, నంద – కళత్ర – జాతామ్ = నందుని భార్య యందు పుట్టినదియు (నందస్య కళత్రే జాతా, తామ్), మనో–రమామ్ = మనస్సు నచ్చినదియు అయిన, స్వవల్లభామ్ = తన ప్రియసఖిని (స్వస్య వల్లభా, తామ్), ఈక్షితుమ్–ఏవ = చూడటానికే, అగాత్ = వెళ్ళాడు. (ఇణ్ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు జన్మించగానే దేవకీ వసుదేవులున్న తావు నుండి గొల్లపల్లెకు వెళ్ళాడు. అందుకు కారణం కంసుడంటే భయంకాదు. ఎందుకంటే తానే తనను ఆశ్రయించినవారికి అభయమివ్వగలవాడు మరి. నందుని భార్యకు పుట్టిన తన మనోవల్లభను చూడటానికే అక్కడకు వెళ్ళాడు.

**వి :** 1. ఇక్కడ పరిసంఖ్యాలంకారం కనిపిస్తుంది. ఒకచోట నిషేధించి మరొకచోట విధించటం పరిసంఖ్య.

'పరిసంఖ్యా నిషిధ్యైక మన్యస్మిన్ వస్తు యంత్రణమ్' (కు.113). కంస భయాన్ని నిషేధించి స్వవల్లభా దర్శనాన్ని విధించాడిక్కడ.

2. విధ్యలంకారం కూడా ఇక్కడుంది. కంసభయంతో కృష్ణుడు గొల్లపల్లెకు వెళ్లలేదన్నది అందరెరిగినదే. దానిని మరల సిద్ధింపజేయటం ఇక్కడ విధ్యలంకారం.

3. **అభి–యయౌ** :1–15వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ. |

*

**శ్లో॥ కవాటముద్ఘాట్య గృహాణి వర్త్మ - దదుః కిలాస్మై మమ బుద్ధిరిత్థమ్ ।**
**వనస్పతీశో బహిరభ్రసంస్థ-స్తదీక్షణార్థీ స్వయముద్బిభేద ॥ 1-58**

**అ :** కృష్ణుని పయనానికి అనువుగా తలుపులు తెరచుకోవటాన్ని కవి సంభావించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** గృహాణి కవాటమ్ ఉద్ఘాట్య అస్మై వర్త్మ దదుః కిల. మమ బుద్ధిః ఇత్థమ్ (అస్తి). బహిరభ్ర-సంస్థః వనస్పతీశః తదీక్షణార్థీ (సన్) స్వయమ్ ఉద్బిభేద.

**ప్ర :** గృహాణి = ఇండ్లు (చెరసాల, అది వున్న కట్టడాలు), కవాటమ్ = తలుపును, ఉద్ఘాట్య = తెరచి (ఉద్-ఘట చేష్టాయామ్ - ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అస్మై = కృష్ణుని (వసుదేవుని) కొరకు, వర్త్మ = దారిని (వర్త్మ నేత్రచ్ఛదేఽ ధ్వని; అమరకోశః 3/121), దదుః కిల = ఇచ్చాయి గదా! (దా దానౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), మమ = నా యొక్క, బుద్ధి = ఆలోచన, ఇత్థమ్ (అస్తి) = ఇలా ఉన్నది. బహిః + అభ్ర - సంస్థః = వెలుపలి ఆకాశంలో నున్న (బహిః అభ్రే సమ్యక్ తిష్ఠతి ఇతి), వనస్పతి+ఈశః= ఓషధీశుడైన చంద్రుడు ("**వానస్పత్యః ఫలైః పుష్పాత్ తైరపుష్పాద్వనస్పతిః**" - అమరకోశః - వనౌషధివర్గ - 6) (వనస్పతీనామ్ ఈశః), తద్+ఈక్షణ-అర్థీ (సన్) = ఆ కృష్ణుని చూడగోరిన వాడై (తస్య వీక్షణమ్ అర్థయత ఇతి), స్వయమ్ = తనంతతానుగా, ఉద్బిభేద = (తలుపు) పగులగొట్టాడు, (ఉద్ - భిద్ విదారణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణునితో వసుదేవుడు బయలుదేరిన వేళలో ఇళ్ళే తలుపులను తెరిచి దారినిచ్చాయట. కానీ నా (కవియొక్క) ఆలోచన అది కాదు. వెలుపల గగనతలంపై ఉన్న చంద్రుడు కృష్ణుని చూడగోరి తానే తలుపులను బ్రద్దలు చేశాడు.

**వి :** 1. వనస్పతీశః అన్న విశేష్యపదం సాభిప్రాయం. వనస్పతుల కధిపతి కాబట్టి వనస్పతులతో చేసిన తలుపులను సులువుగా బ్రద్దలు చేయగలడని. కాబట్టి పరికరాంకురాలంకారం. **సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః** (కు. 63).

2. హేతూత్ప్రేక్షాలంకారం, అనుప్రాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **దదుః :** | దదౌ | దదతుః | **దదుః** |
| | దదిథ/దదాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ |
| **ఉద్-బిభేద :** | **బిభేద** | బిభిదతుః | బిభిదుః |
| | బిభేదిథ | బిభిదథుః | బిభిద |
| | బిభేద | బిభిదివ | బిభిదిమ. |

*

**శ్లో॥ కరే నిధాయాద్భుతబాలమేన-మభూద్బహిర్నిస్సరతోఽస్య శౌరేః ।**
**న తద్గృహద్వారగణోఽన్తరాయః - కరస్థదేవస్య కుతోఽన్తరాయః ॥ 1-59**

**అ :** కృష్ణునితో ప్రయాణమైన వసుదేవుని ఏ తలుపులూ అడ్డగించలేదని వర్ణించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఏనమ్ అద్భుత-బాలం కరే నిధాయ బహిః నిస్సరతః అస్య శౌరేః తద్గృహ-ద్వార-గణః అంతరాయః న అభూత్. కర-స్థ-దేవస్య అంతరాయః కుతః?

**ప్ర :** ఏనమ్ = ఈ, అద్భుత-బాలమ్ = ఆశ్చర్యకరుడైన బాలుని (అద్భుతశ్చ అసౌ బాలః), కరే = చేతిలో, నిధాయ = నిలిపి (ని పూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), బహిః = వెలుపలకు, నిస్సరతః = వెళుతున్న,

అస్య = ఈ, శౌరేః = వసుదేవునకు, తద్-గృహ-ద్వార-గణః = ఆ ఇంటి ద్వారాల మొత్తం (తచ్చ తత్ గృహం చ, తస్య ద్వారాణాం గణః), అంతరాయః = అడ్డగింపుగా, న అభూత్ = నిలువలేదు (భూ సత్తాయామ్ పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), కర-స్థ-దేవస్య = చేతిలో ఉన్న దేవునకు/ దేవుడు చేతిలో నున్న వానికి (కర్మధారయసమాసమయితే కృష్ణుడు, బహువ్రీహి అయితే వసుదేవుడు) (కరస్థః దేవః యస్య తస్య), అంతరాయః = ఆటంకం (విఘ్నోంతరాయః ప్రత్యూహః; అమరకోశః-3-సంకీర్ణవర్గః- 19), కుతః? = ఎటునుండి కలుగుతుంది?

**తా ॥** అద్భుతబాలుడైన కృష్ణుని చేతిలో నిలుపుకొని బయలుదేరిన ఆ వసుదేవుని ఆ ఇంటి ద్వారాలు ఏవీ అడ్డగించలేదు. దేవుడు చేతనున్నవానికి ఆటంకాలు ఎలా కలుగుతాయి?

**వి :** 1. కరస్థదేవస్య ముచ్చటయిన పదం. కరస్థశ్చ అసౌ దేవః అని కర్మధారయ మయితే కృష్ణుడని అర్థం. కరస్థః దేవః యస్య సః అని బహువ్రీహి అయితే వసుదేవుడని అర్థం. చేతిలో ఉండటమంటే లోబడి ఉండటమని అర్థం.

2. పై మూడు పాదాలలో చెప్పిన అంశాన్ని చివరి పాదంతో సామాన్యవిషయంతో సమర్థించాడు కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం.

3. **అభూత్ :** 1-28వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ అగణ్యగోగోకులగోపనాశ-మభీప్సతా స్వేన కరిష్యమాణమ్ ।**
**అఘం హి పూర్వం పరిహర్తుమీష-ద్వవర్ష తస్మిన్ జలదోఽధిమార్గమ్ ॥ 1-60**

**అ :** కృష్ణ ప్రయాణ సమయంలో శుభసూచనగా వానతుంపరలు పడుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** జలదః అగణ్య-గో-గోకుల-గోప-నాశమ్ అభీప్సతా స్వేన కరిష్యమాణమ్ అఘం పూర్వం పరిహర్తుం హి అధిమార్గం తస్మిన్ ఈషద్ వవర్ష

**ప్ర :** జలదః = మేఘం (జలం దదాతి ఇతి), అగణ్య... నాశమ్ : అగణ్య = లెక్కింపరాని, గో = గోవులయొక్కయు, గోకుల = గోకులం యొక్కయు, గోప = గోపాలుర యొక్కయు, నాశమ్ = వినాశనాన్ని (అగణ్యాశ్చ తాః గావశ్చ, గోకులం చ గోపాశ్చ తేషాం నాశః, తమ్), అభీప్సతా = కోరుతూ (అభిపూర్వక ఆప్ - ప్రాప్తౌ - సన్నంతంపై శతృప్రత్యయం), స్వేన = తనచేత, కరిష్యమాణమ్ = చేయబడబోతున్న (కృ కరణే ధాతువుపై శానచ్ ప్రత్యయం), అఘమ్ = పాపాన్ని, పూర్వమ్ = ముందుగానే, పరిహర్తుం హి = తొలగించుకొనటానికే అన్నట్లు (పరిపూర్వక హృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), అధిమార్గమ్ = దారిలో ("అవ్యయం విభక్తిసమీపసమృద్ధి ..." అష్టాధ్యాయి (2-1-6) అవ్యయీభావ సమాసం), తస్మిన్ = ఆ కృష్ణునిపై, ఈషత్ = కొంచెంగా (తుంపరలుగా), వవర్ష = కురిసింది. (వృష్ సేచనహింసాక్లేశనేషు-పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.).

**తా ॥** భవిష్యత్తులో వర్షరూపంలో రాళ్ళవాన కురిసి గోవులను, గోపాలురను, గోకులాన్ని కూడా నాశనం చేసే తన ప్రయత్నం వలన రాబోయే పాపానికి ముందే పరిహారం చెల్లిస్తున్నట్లుగా మేఘం కృష్ణుడు ప్రయాణం సాగిస్తున్న మార్గంలో తుంపరలుగా కురిసింది.

**వి :** 1. భవిష్యత్తులో ఇంద్రుడు కోపించి తీవ్ర వృష్టిని కురిపించటం కృష్ణుడు గోవర్ధనగిరిని ఎత్తి వారం రోజులపాటు వారిని రక్షించటం జరుగుతుంది. దానినిక్కడ ప్రస్తావిస్తున్నాడు కవి.

2. ఇక్కడ హి పదం నిశ్చయార్థకంగా స్వీకరింపబడి అది ఉత్ప్రేక్షావాచకమవుతుంది. కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం. '**హి**' పదాన్ని అలా స్వీకరించకపోతే హేతూత్ప్రేక్షాలంకారధ్వని అవుతుంది.

3. **వవర్ష :** 1-36వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యదేష దేవేశితురగ్రజత్వం - బభార రోహిణ్యుదయాద్రిచన్ద్రః ।**
**అఘస్య తస్య ప్రశమేచ్ఛయేవ - పథి వ్రజన్తం ఫణిపః సిషేవే ॥ 1-61**

**అ :** కృష్ణ ప్రయాణసమయంలో ఆదిశేషుడు ఆ పసివానికి పడగపట్టడాన్ని వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఏషః ఫణి-పః రోహిణ్యుదయాద్రి-చంద్రః (సన్) దేవేశితుః యద్ అగ్రజత్వం. బభార తస్య అఘస్య ప్రశమేచ్ఛయేవ పథి వ్రజంతం సిషేవే.

**ప్ర :** ఏషః = ఈ, ఫణిపః = సర్పరాజు (ఆదిశేషుడు), రోహి... చంద్రః (సన్) : రోహిణీ = రోహిణి అనెడి, ఉదయ+అద్రి = తూర్పుమలపై నున్న, చంద్రః సన్ = చంద్రుడై (రోహిణీ ఏవ ఉదయాద్రిః, తస్మిన్ చంద్రః), దేవ+ఈశితుః = దేవతలకు స్వామి అయిన కృష్ణునకు (దేవానామ్ ఈశితా, తస్య), అగ్రజత్వమ్ = అన్నతనాన్ని, బభార = భరించెనో (భృఞ్ భరణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తస్య = ఆ, అఘస్య = పాపంయొక్క, ప్రశమ+ఇచ్ఛయా+ఇవ = తొలగింపును కోరుకొంటున్నాడో అన్నట్లు (ప్రశమే ఇచ్ఛా, తయా), పథి = బాటపై, వ్రజన్తమ్ = ప్రయాణిస్తున్న కృష్ణుని, సిషేవే = సేవించెను. (షేవృ సేవనే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** తూర్పుమలలో ఉదయించిన చంద్రునివలె బలరాముడు రోహిణీ గర్భంలో జనించాడు కృష్ణుని కన్న ముందు. ఆ బలరాముడు ఆదిశేషుడే. కృష్ణుని కన్న ముందు జన్మించి ఆయనకు అగ్రజుడు (అన్న) కాగలిగాడు. దేవతలకే ప్రభువైన కృష్ణునకు అన్నగా ముందు నిలవటం పాపమని భావించి, ఆ పాపాన్ని పరిహరించుకోవటానికి కృష్ణుడు గొల్లపల్లెకు బయలుదేరినప్పుడు ఆదిశేషుడు పడగ పట్టాడట.

**వి :** 1. అగ్రజత్వాన్ని ఒక బాధ్యతగా కాక ఒక గౌరవంగా భావిస్తే ఆదిశేషుని ఆలోచన సమంజసమే గదా! అగ్రజులలో చాలామంది అలా గౌరవాన్ని ఆశించేవారే గదా!

2. ప్రశమేచ్ఛయేవ - అన్నప్పుడు హేతూత్ప్రేక్షాలంకారం.

3. **బభార :**

| | | | |
|---|---|---|---|
| | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ |

| | | | |
|---|---|---|---|
| **సిషేవే :** | సిషేవే | సిషేవాతే | సిషేవిరే |
| | సిషేవిషే | సిషేవాథే | సిషేవిధ్వే |
| | సిషేవే | సిషేవివహే | సిషేవిమహే. |

*

**శ్లో॥ విరిఞ్చవైరిఞ్చముఖామరాలిః - ప్రబోధయన్తీవ తదా ననామ ।**
**పురాణపుంసః పురుషోత్తమస్య - నమస్కృతిం లోకవిడంబకస్య ॥ 1-62**

**అ :** కృష్ణ ప్రయాణ ప్రారంభవేళలో దేవతలందరూ వీడ్కోలు పూర్వకంగా నమస్కరించటాన్ని కవి ఉత్ప్రేక్షించుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** విరించ-వైరించ-ముఖామరాలిః పురాణ-పుంసః పురుషోత్తమస్య లోక-విడంబకస్య నమస్కృతిం ప్రబోధయంతీవ తదా ననామ.

**ప్ర :** విరించ... రాలిః : విరించ = బ్రహ్మ, వైరించ = శివుడు, ముఖ = మొదలుగాగల, అమర = దేవతలయొక్క, ఆలిః = వరుస (విరించిః వైరించశ్చ ముఖౌ యేషాం తే చ తే అమరాః, తేషామ్ ఆలిః), పురాణ-పుంసః = అనాది పురుషుడు (పురాణశ్చ అసౌ పుమాన్, తస్య), పురుష+ ఉత్తమస్య = క్షరాక్షరపురుషులకన్న ఉత్తముడు/

పురుషులలో ఉత్తముడు (పురుషేభ్యః ఉత్తమః, తస్య), లోక–విడంబకస్య = లోకాన్ని అనుకరిస్తున్న వాడు అయిన కృష్ణునకు (లోకస్య విడంబకః, తస్య), నమస్కృతిమ్ = నమస్కరించటాన్ని, (నమస్–కృధాతువుపై క్తిన్ ప్రత్యయం), ప్రబోధయంతీ+ఇవ = నేర్పుతున్నట్లుగా, తదా = కృష్ణప్రయాణకాలంలో, ననామ = నమస్కరించెను. (నమ ప్రహ్వీభావే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు ప్రస్తుతం పసివాడుగా కనిపిస్తున్నా ఆయన పురాణపురుషుడూ, పురుషోత్త–ముడూను. ప్రస్తుతం కృష్ణరూపంలో అవతరించి లౌకికమర్యాదలను అనుకరించ బోతున్నాడు. కాబట్టి వాటిలో భాగమైన నమస్కార విధానాన్ని ఆయనకు నేర్పుతున్నట్లుగా బ్రహ్మ, శివుడు మొదలయిన దేవతలందరూ కృష్ణప్రయాణప్రారంభంలో ఆయనకు నమస్కరించారు.

**వి :** 1. కృష్ణునకు నమస్కారవిధి, నేర్పుతున్నట్లుగా – అనటం ఫలోత్ప్రేక్షాలంకారం. నమస్కారఫలం ప్రబోధనమని సంభావించినందువల్ల.

2. శ్లోకరచనలో వైదర్భీరీతి (మాధుర్యసౌకుమార్యగుణసమ్మేళనం) సుస్పష్టం.

| | | | |
|---|---|---|---|
| 3. **ననామ :** | **ననామ** | నేమతుః | నేముః |
| | ననన్థ/నేనిథ | నేమథుః | నేమ |
| | ననామ/ననమ | నేమివ | నేమిమ |

*

**శ్లో॥ పురా స్వభర్తుః ప్రతిబన్ధకర్తు–ర్విశోషణం బన్ధనమర్కకన్యా ।**
**విచిన్త్య భీతేవ దదౌ మురారేః – ప్రవాహమారాత్ పరిహృత్య మార్గమ్ ॥ 1–63**

**అ :** కృష్ణునితో వసుదేవుడు బయలుదేరిన తర్వాత యమునానది దారినివ్వటాన్ని వర్ణించటం.–ఉపేంద్రవజ్ర.

**అ :** అర్క–కన్యా పురా ప్రతిబంధ–కర్తుః స్వ–భర్తుః విశోషణం బంధనం విచిన్త్య భీతా ఇవ ప్రవాహమ్ ఆరాత్ పరిహృత్య మురారేః మార్గం దదౌ.

**ప్ర :** అర్క–కన్యా = సూర్యసుత (యమున) (కాళిందీ సూర్యతనయా యమునా చ యమస్వసా–అమరకోశః–వారివర్గః–32) (అర్కస్య కన్యా), పురా = గతంలో (రామావతార సమయంలో), స్వభర్తుః = తన భర్త (సముద్రున)కు (స్వస్య భర్తా, తస్య), విశోషణమ్ = ఎండింపజేయుట, బంధనమ్ = కట్టుబాటుకు గురిచేయుట, విచింత్య = ఆలోచించి (విపూర్వక చితి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భీతా+ఇవ = భయపడినదో అన్నట్లు, ప్రవాహమ్ = ప్రవాహాన్ని, ఆరాత్ = దూరంగా (ఆరాద్దూరసమీపయోః–అమరకోశః–3/241), పరిహృత్య = ఉపసంహరించుకొని (పరిపూర్వక హృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం). మురారేః = కృష్ణునకు, మార్గమ్ = దారిని, దదౌ = ఇచ్చెను. (దా దానే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** గతంలో రామావతారంలో సముద్రుడు లంకామార్గాన్ని నిరోధించాడు. తత్ఫలంగా ఆయనను బాణాగ్నితో ఎండింపజేసి బంధించాడు. ఆ విషయాన్ని తలచుకొంది యమున. భయపడింది. తనకు ఎటువంటి పరిస్థితి కలుగుతుందో అని. అందుకే వెంటనే ప్రవాహాన్ని దూరానికి ఉపసంహరించుకొని మురారికి దారి ఇచ్చింది.

**వి :** 1. అర్కకన్యా (స్త్రీలింగం)–భర్తుః – ప్రతిబంధకర్తుః – బంధనం పదాలవలన శబ్దశక్తిచే ఆజ్ఞను ధిక్కరించిన ఒక పురుషుని శిక్షించటం ధ్వనిస్తుంది. అది ఉపమానంగా మారుతుంది కాబట్టి ఉపమాలంకారధ్వని. తన్మూలకంగా హేతుసంభావనచేత (భీతేవ) హేతూత్ప్రేక్షాలంకారం.)

2. **దదౌ :** 1–24వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ భవప్రవాహోఽపి తవైవమేవే-త్యుదీరయన్తీవ యమస్వసా సా ।**
**కరస్థకృష్ణాయ దిదేశ దూరే - ప్రవాహమాధాయ పదార్హపద్యామ్ ॥ 1-64**

**అ :** యమున వసుదేవుని గమనానికి అనువుగా దారి ఇచ్చుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** సా యమస్వసా తవ భవ-ప్రవాహః అపి ఏవమ్ ఏవ ఇతి ఉదీరయంతీవ ప్రవాహం దూరే ఆధాయ కరస్థ-కృష్ణాయ పదార్హ-పద్యాం దిదేశ.

**ప్ర :** సా యమస్వసా = ఆ యమసోదరి (యమున) (యమస్య స్వసా), తవ = నీకు (వసుదేవునకు), భవ-ప్రవాహః అపి = సంసారప్రవాహం కూడా (భవస్య ప్రవాహః), ఏవమ్-ఏవ = ఈ రీతిగానే (తరణీయం కాగలదు), ఇతి = అని, ఉదీరయంతీ+ఇవ = చెప్తున్నదో అన్నట్లుగా, ప్రవాహమ్ = ప్రవాహాన్ని, దూరే = దూరంగానే, నిధాయ = నిలిపి (ని పూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కర-స్థ-కృష్ణాయ = కృష్ణుడు చేతిలోగల వసుదేవునకు (కరస్థః కృష్ణః యస్య తస్మై), పద+అర్హ-పద్యామ్ = కాలిబాటను (పద్యాం గన్తుం యోగ్యా-పదార్హా, సా చ సా పద్యా, తామ్), దిదేశ = చూపెను. (దిశ అతిసర్జనే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** యమున వసుదేవునకు దారి ఇచ్చింది తనను దాటిపోవటానికి. ఆ ఇవ్వటం "వసుదేవా! నీకు సంసారసాగరతరణం కూడా ఇలాగే ఉంటుంది" అని చెప్తున్నట్లుగా ఉందట. ప్రవాహాన్ని దూరంగా నెట్టి వసుదేవుడు నడచి వెళ్ళటానికి కాలిబాటను చేసింది. మరి వసుదేవుని చేతిలో కృష్ణుడున్నాడు. ఇక తిరుగేముంది.

**వి :** 1. పరమాత్మ చేతిలో ఉంటే ఏదైనా సాధ్యమే అని వస్తుధ్వని. కరస్థ కృష్ణస్య అర్థవంతమైన ప్రయోగం.

2. ఉదీరయన్తీ ఇవ - చెప్తున్నదో అన్నట్లు అని సంభావన చేయటం ఉక్త విషయ వస్తూత్ప్రేక్ష.

| | | | |
|---|---|---|---|
| 3. **దిదేశ :** | **దిదేశ** | దిదిశతుః | దిదిశుః |
| | దిదేశిథ | దిదిశథుః | దిదిశ |
| | దిదేశ | దిదిశివ | దిదిశిమ |

*

**శ్లో॥ విభూషణేషు ప్రతిబిమ్బితాహిః - ప్రహృష్టపాణిద్వయరోమపత్రః ।**
**స కృష్ణవాహో వినతాఙ్గజాతః - పితా గరుత్మానివ వేగతోఽగాత్ ॥ 1-65**

**అ :** కృష్ణుని తలపై మోసికొనిపోతున్న వసుదేవుని గరుడునితో పోల్చి వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** విభూషణేషు ప్రతిబింబితాహిః ప్రహృష్ట-పాణి-ద్వయ-రోమ-పత్రః వినతాంగజాతః సః పితా కృష్ణ-వాహః (సన్) వినతాంగజాతః గరుత్మాన్ ఇవ వేగతః అగాత్ ।

**ప్ర :** విభూషణేషు = నగలయందు, ప్రతిబింబిత+అహిః = ప్రతిబింబించిన సర్పరాజు గల వాడును (ప్రతిబింబితః అహిః యస్య సః), ప్రహృష్ట... పత్రః : ప్రహృష్ట = ఆనందించిన/ఉప్పొంగిన, పాణి-ద్వయ = రెండు చేతులయందలి, రోమ = వెంట్రుకలే (రోమాంచమని భావం), పత్రః = రెక్కలుగా గలవాడును అయిన (ప్రహృష్టే పాణిద్వయే రోమాణి ఏవ పత్రే యస్య సః), వినతా+అంగ-జాతః : వినత = వినయంతో వంగిన, అంగ-జాతః = శరీరావయవాలు గలవాడును అయిన (వినతమ్ అంగానాం జాతం యస్య సః/ వినతాయాః అంగజాతః), సః పితా = ఆ (తండ్రి) వసుదేవుడు, కృష్ణ-వాహః సన్ = కృష్ణునకు అశ్వమై (వాహనమై)/ కృష్ణునకు వాహనమైన, వినతా+అంగజాతః : వినతా = వినతయొక్క, అంగ-జాతః = శరీరంనుండి పుట్టిన, గరుత్మాన్ ఇవ = గరుడుని వలె, వేగతః = శీఘ్రంగా, అగాత్ = వెళ్ళెను (ఇణ్ గతౌ ధాతువు-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.).

**తా ॥** వసుదేవుడు వేగంగా గరుడునివలె వెళ్ళాడు. గరుడుడు వినతాంగజాతుడు. వసుదేవుడు కూడా వంగిన శరీరావయవాలు గలవాడు. ఇద్దరూ కృష్ణునకు వాహనాలే. గరుడుడు సర్పభూషణుడు. వసుదేవుని ఆభరణాలపై

పైనున్న నాగరాజు ప్రతిబింబం కనిపిస్తోంది. కృష్ణస్పర్శ వలన కలిగిన రోమాంచం చేత నిక్కబొడుచుకున్న వెంట్రుకలే రెక్కలలాగా ఉన్నాయి వసుదేవునకు.

**వి :** 1. శ్లో॥ వాజివాహార్వగంధర్వహయసైంధవసప్తయః
ఆజానేయాః కులీనాః స్యుః వినీతాః సాధువాహినః ॥ – అమరకోశః/క్షత్రియవర్గం– 44

2. వినత+అంగజాతః – వినతా+అంగజాతః ఇది సభంగశ్లేష. పదచ్ఛేదనంలోని తేడాతో రెండు అర్థాలు చెప్పగలగటం సభంగశ్లేష – వాహ శబ్దం వాహనం, అశ్వం రెండర్థాలను అభంగంగానే ఇస్తుంది. కాబట్టి ఇక్కడ అభంగశ్లేష. రోమపత్రః అన్నచోట రోమములే రెక్కలని రోమాలలో పత్రత్వాన్ని ఆరోపించటం చేత రూపకాలంకారం.

గరుత్మానివ అన్నచోట గరుత్మంతునివలె అని ఉపమాలంకారం.

ఈ మూడు ఒకదానికొకటి ఉపేక్షించి ఉన్నాయి కాబట్టి వాటి సాంకర్యం/సంకరాలంకార మిక్కడ.

3. **అగాత్ :** 1–57వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ గర్జద్వార్వహదున్దుభిః పరిపతద్గన్ధర్వవన్దిధ్వని–**
**ర్హస్తాబ్జే ధ్వజచిహ్నితే స నివసన్ సత్పుష్పకశ్రీముషి ।**
**స్వర్ముక్తామలమాల్యచామరగణశ్ఛత్రాయితాహీశ్వరః**
**శక్రాద్యైః పరివారితః పథి యయౌ రాజాధిరాజప్రభః ॥ 1–66**

**అ :** సర్వాంగీణవైభవంతో సాగుతున్న కృష్ణ ప్రయాణవర్ణన. – శార్దూలవిక్రీడితమ్.

**అ :** గర్జద్వార్వహ–దుందుభిః పరిపతద్గంధర్వ–వంది–ధ్వనిః ధ్వజ–చిహ్నితే సత్పుష్పక–శ్రీ–ముషి హస్తాబ్జే నివసన్, స్వర్ముక్తామల–మాల్య–చామర–గణః ఛత్రాయితాహీశ్వరః, శక్రాద్యైః పరివారితః సః రాజాధిరాజ–ప్రభః పథి యయౌ.

**ప్ర :** గర్జ... దుందుభిః : గర్జత్ = ఉరుముతున్న, వాః+వహ = మేఘధ్వనియే, దుందుభిః = దుందుభిధ్వనిగా (గర్జన్తః వార్వాహాః ఏవ దుందుభయః యస్య సః), పరి... ధ్వనిః : పరిపతత్ = చక్కగా చదువుతున్న, గంధర్వ = గంధర్వులనెడి, వంది = వైతాళికులయొక్క, ధ్వనిః = (స్తుతి) శబ్దాలుగలవాడు (పరిపతన్తః గన్ధర్వాః ఏవ వందినః , తేషాం ధ్వనిః యస్య సః), ధ్వజ–చిహ్నితే = పతాక గుర్తులు గలదియు (ధ్వజేన చిహ్నితః, తస్మిన్), సత్పుష్పక... ముషిః : సత్ = మంచిదైన, పుష్పక = పుష్పక విమానంయొక్క, శ్రీ = శోభను, ముషి = దొంగిలించునదియు అయిన (సత్పుష్పకస్య శ్రియం ముష్ణాతీతి, తస్మిన్), హస్త+అబ్జే = కరకమలమందు (హస్తః అబ్జమివ, తస్మిన్), నివసన్ = వసిస్తూ (నిపూర్వక వస ధాతువుపై శతృ ప్రత్యయం), స్వ... గణః : స్వః = స్వర్గం నుండి (స్వరవ్యయం స్వర్గనాకస్త్రిదివ–స్త్రిదశాలయః – అమరకోశః 1–6), ముక్త = విడువబడిన (వెదజల్లబడిన), అమల = నిర్మలమయిన, మాల్య = పూలదండలే, (మాల్యాం మాలా స్రజౌ మూర్ధ్ని–అమరకోశః–ద్వితీయ–మనుష్యవర్గం–135), చామర = వింజామరలయొక్క, గణః = సమూహాలు గలిగియు, ఛత్రా... శ్వరః : ఛత్రాయిత = గొడుగువలె ప్రవర్తిస్తున్న, అహి+ఈశ్వరః = నాగరాజు గలవాడును, శక్ర+ఆద్యైః = ఇంద్రుడు మొదలుగా గల (దేవతలచే), పరివారితః = పరివారంగలవాడుగా చేయబడిన వాడును అయి, సః = ఆ కృష్ణుడు, రాజాధిరాజ – ప్రభః = కుబేరవైభవంతో (రాజాధిరాజాయ ప్రసహ్య సాహినే నమో వయం వైశ్రవణాయ కుర్మహే... కుబేరాయ వైశ్రవణాయ) (రాజాధిరాజస్య ప్రభా ఇవ ప్రభా యస్య సః), పథి = దారిలో, యయౌ = వెళ్ళెను (యా ప్రాపణే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** వసుదేవుని కరకమలంలో నున్న కృష్ణుడు కుబేరవైభవంతో ప్రయాణం సాగిస్తున్నాడు. మేఘగర్జనలే

దుందుభిధ్వనులు. గంధర్వుల స్తుతిగీతాలే వందిమాగధుల స్తోత్రాలు. వసుదేవుని చేతిలోని ధ్వజరేఖలే ధ్వజాలు. కరకమలమే పుష్పకవిమానం. దేవతలు స్వర్గం నుండి సమర్పిస్తున్న పూలమాలలే వింజామరలు. పడగపట్టిన నాగరాజే గొడుగు. ఇంద్రాది దేవతలే పరివారం.

**వి :** 1. రాజాధిరాజప్రభః – (రాజాధిరాజస్య ప్రభా ఇవ ప్రభా యస్య సః) లుప్తోపమా లంకారం. మిగిలిన శ్లోకంలో రూపకాలంకారం. మేఘాల ఉరుములలో దుందుభిత్వాన్ని, గంధర్వస్తుతులలో వందిమాగధ స్తోత్రత్వాన్ని, హస్తంలో అబ్జత్వాన్ని, మాల్యాలలో చామరత్వాన్ని ఆరోపించటం వలన రూపకాలంకారం. (**'విషయ్యభేదతాద్రూప్యరంజనమ్ విషయస్య యత్ రూపకమ్ తత్** ')

2. **యయౌ :** 1–43వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గోఽయమాద్యో ముదామ్ ॥ 1–67**

**అ :** సర్గోపసంహారశ్లోకం. – శార్దూలవిక్రీడితమ్.

**అ :**రోమ్ణామ్ హర్షణ–కారిణి శ్రవణతః పాపౌఘ–విధ్వంసిని ప్రేమ్ణా చింతయతాం విచిత్ర–విమల–శ్లాఘ్యార్థ–సందాయిని సద్వాదిరాజోదితే రుగ్మిణీశ–విజయే భువి సంజాతే సురమండలీషు మహితః ముదామ్ అయమ్ ఆద్యః సర్గః.

**ప్ర :** రోమ్ణామ్ = శరీరం మీది వెంట్రుకలకు, హర్షణ–కారిణి = పులకింతను (రోమాంచాన్ని) కలిగించెడిదియు (హర్షణం కరోతీతి, తస్మిన్), శ్రవణతః = వినుటద్వారా, పాప+ఓఘ–విధ్వంసిని = పాపసమూహాన్ని నాశనం చేయునదియు (పాపానామ్ ఓఘః తం విధ్వంసయతి ఇతి, తస్మిన్), ప్రేమ్ణా = అనురాగంతో/ఆసక్తితో, చింతయతామ్ = ఆలోచించువారికి, విచిత్ర... సందాయిని : విచిత్ర = ఆశ్చర్యకరమూ, విమల = పవిత్రమూ, శ్లాఘ్య = అభినందనీయమూ అయిన, అర్థ = ప్రయోజనాన్ని/అర్థాలను, సందాయిని = సమకూర్చునదియు అయిన (విచిత్రాన్ విమలాన్ శ్లాఘ్యాన్ చ అర్థాన్ సమ్యక్ దదాతి ఇతి తస్మిన్), సద్–వాదిరాజ+ఉదితే = ఉత్తముడైన వాదిరాజుచే చెప్పబడిన (సతా చ తేన వాదిరాజేన ఉదితా), రుగ్మిణీ+ఈశ–విజయే = శ్రీకృష్ణుని విజయం/ 'రుక్మిణీశ విజయ' మను కావ్యం (రుక్మిణ్యాః ఈశః తస్య విజయః తస్మిన్ ), భువి = లోకంలో, ఉదితే = ఉద్భవించగా, సుర–మండలీషు = దేవతాసముదాయంలో (సురాణాం మండల్యః, తాసు.), మహితః = గొప్పదియు, ఆద్యః = తొలిదియు అయిన, అయమ్ = ఈ, ముదామ్ = ఆనందం యొక్క (సమ్మదో ముత్తథా నందః శర్మ జోషం చ శం సుఖమ్ –హలాయుధకోశః–123), సర్గః = సర్గ/సృష్టి.

**తా ॥** శ్రీకృష్ణవిజయం – రుక్మిణీశవిజయమనే ఈ కావ్యం – రోమాంచాన్ని కలిగించేది. విన్నంతనే పాపసమూహాన్ని నాశనం చేయగలది. ప్రేమతో విచారణ జరిపే వారికి ఆశ్చర్యకరాలూ, పవిత్రాలూ, ప్రశంసనీయాలూ అయిన అర్థాలను (ప్రయోజనాలు – వాచ్యలక్ష్యవ్యంగార్థాలు) అందించగలది. యతిశ్రేష్ఠుడైన వాదిరాజ ప్రకటితమైన (విరచితమైన) ఈ రుక్మిణీశవిజయం లోకంలో ఆవిర్భవించగానే దేవతా సముదాయంలో ఆనందాల తొలిసృష్టి (ప్రథమసర్గ) జరిగింది.

**వి :** 1. రుక్మిణీశవిజయ మనే కథాంశాన్నీ, సర్గోపసంహారాన్నీ జోడించి శ్లోకరచన సాగించాడు కవి. రెండూ ప్రకృతాంశాలే. విశేషణాలు అన్నీ ఉభయత్ర వర్తించేవే. శ్లేషసహకారం బొత్తిగా అక్కరలేదు. అర్థశబ్దానికి మాత్రం

రెండర్థాలు చెప్పవచ్చు. అదీ ఐచ్ఛికమే. చెప్పకపోయినా ఇబ్బందిలేదు. దీనిని ప్రస్తుతాంకురాలంకారమంటారు.

**ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకురః** – (కు. 67).

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో ప్రథమసర్గ. *

**శ్రీః**





# శ్రీః
# ద్వితీయః సర్గః

శ్లో॥ తతో యశోదాం స్వకులస్య పుణ్య-లసద్యశోదాం హి కరిష్యమాణః ।
స గోకులం గోకులగోపపుఞ్జ-విభూషితం ప్రావిశదబ్జనేత్రః ॥ 2-1

అ : శ్రీకృష్ణుడు గోకులంలో ప్రవేశించుట (వసుదేవుని చేతి బిడ్డయై).

అ : తతః అబ్జ-నేత్రః సః యశోదాం స్వ-కులస్య పుణ్య-లసద్యశోదాం కరిష్యమాణః గోకుల-గోప-పుంజ-విభూషితం గో-కులం ప్రావిశత్.

ప్ర : తతః = అటుతర్వాత (వసుదేవుడు చెరనుండి బయల్వెడలి ప్రయాణించిన తరువాత), అబ్జ-నేత్రః = తామరలవంటి కన్నులు గల (అబ్జే ఇవ నేత్రే యస్య సః), సః = ఆ కృష్ణుడు, యశోదామ్ = యశోదను, స్వ... దామ్ : స్వ = తన యొక్క, కులస్య = వంశానికి (స్వస్య కులం, తస్య), పుణ్య = శ్రేయస్సుచే (ధర్మః పుణ్యం వృషః శ్రేయః సుకృతం చ సమం స్మృతమ్-హలాయుధకోశః-125), లసత్ = ప్రకాశించెడి, యశః+దామ్ = కీర్తిని కల్గించుదానినిగా (పుణ్యేన లసతి యశః, తత్ దదాతి ఇతి పుణ్యలసద్యశోదా - తామ్), కరిష్యమాణః సన్ = చేయబోవువాడై (కృ కరణే ధాతువుపై శానచ్ ప్రత్యయం), గోకుల... విభూషితమ్ : గో = గోవులయొక్క, కుల = సముదాయాలచేతను (సజాతీయైః కులమ్ - అమరకోశః-2/సింహాదివర్గ-41), గో-ప = గోపాలకులయొక్క, పుంజ = సమూహాల చేతను, విభూషితమ్ = అలంకరింపబట్టి (గవానాం కులైః, గోపానాం పుంజైః చ విభూషితమ్), గోకులమ్ = గోనిలయాన్ని, ప్రావిశత్ = ప్రవేశించెను (ప్ర-విశ ప్రవేశనే-పరస్మైపది-లజ్-ప్ర.ఏ.).

తా ॥ (వసుదేవుడు ప్రయాణమై ఏ ఆటంకమూ లేకుండా ప్రయాణాన్ని పూర్తిచేసిన) తరువాత కృష్ణుడు గోకులంలోనికి ప్రవేశించాడు. ఆ ప్రవేశంతో రాబోయే రోజులలో నందపత్ని అయిన యశోదకు తనవంశానికి కీర్తిని తెచ్చిపెట్టే అవకాశాన్ని కల్పిస్తున్నాడు. ఆ గోకులం గోవులతో, గోపాలకులతో శోభిస్తోంది.

వి : 1. కరిష్యమాణః అన్నచోట ఉత్ప్రేక్షాలంకార ధ్వని. అది వాచ్యంగా లేదు కాబట్టి.

2. ఆ పల్లెలో మనుషులకన్న గోవులు ఎక్కువ. మనుష్యులకన్న గోవులకే ప్రాధాన్యమెక్కువ. అందుకే అది గోకులం (గోశాల)

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రావిశత్ :** | **ప్రావిశత్** | ప్రావిశతామ్ | ప్రావిశన్ |
| | ప్రావిశః | ప్రావిశతమ్ | ప్రావిశత్ |
| | ప్రావిశమ్ | ప్రావిశావ | ప్రావిశామ |

4. ఛందస్సు – ఉపేంద్రవజ్ర. (సాధారణంగా సంస్కృతకవులు ఇంద్రవజ్రా+ ఉపేంద్రవజ్రలను కలిపి (ఉపజాతి) వాడుతుంటారు. కానీ వాదిరాజతీర్థరు దాదాపుగా దేనికదిగానే నిర్వహిస్తారు). *

**శ్లో॥ వికీర్ణపుష్పామ్బుదలమ్బిచన్ద్ర–మహఃపతాకా నవవారిసిక్తా ।**
**ఫణీన్ద్రకణ్ఠోదరరత్నకాన్తి–విచిత్రితా సా గృహవీథికాఽఽసీత్ ॥ 2–2**

**అ :** నందగ్రామంలో నందుని ఇంటి వీధిని వర్ణించుట. – ఉపేంద్రవజ్ర.

**అ :**సా గృహ–వీథికా నవ–వారి–సిక్తా వికీర్ణ–పుష్పా అంబుద–లంబి–చంద్ర–మహః–పతాకా ఫణీంద్ర– కంఠోదర–రత్న–కాంతి–విచిత్రితా(చ) ఆసీత్.

**ప్ర :** సా = ఆ, గృహ–వీథికా = ఇంటి సందు (గృహస్య వీథికా), నవ... సిక్తా : నవ = క్రొత్తవైన, వారి = నీళ్లచే, సిక్తా = తడిసినదియు (సిచ్ క్షరణే ధాతువుపై క్త ప్రత్యయం), (నవేన వారిణా సిక్తా), వికీర్ణపుష్పా : వికీర్ణ = చల్లబడిన (దేవతలచేత), పుష్పా = పువ్వులు గలదియు (వికీర్ణాని పుష్పాణి యస్యాం సా), అంబుద... పతాకా : అంబు–ద = మేఘాలనుండి, లంబి = వ్రేలాడుతున్న, చంద్ర = చంద్రునియొక్క, మహః = కాంతి అనెడి (మహ ఉత్సవ తేజసోః–మేదినీకోశః–హాన్త–7), పతాకా = ధ్వజాలు గలదియు (అంబుదేభ్యః లంబాని చ తాని చంద్రస్య మహాంసి, తాని ఏవ పతాకా యస్యాః సా), ఫణీంద్ర... విచిత్రితా : ఫణి+ఇంద్ర = ఆదిశేషుని యొక్క, కంఠ = పడగయొక్క, ఉదర = మధ్యభాగమందలి (ఆంధ్రశబ్దరత్నాకరము – మొదటిసంపుటం – 374), రత్న = రత్నం యొక్క, కాంతి = కాంతులచే, విచిత్రితా = పలువన్నెలు గలదియు (ఫణీంద్రస్య కంఠే ఉదరే చ (విద్యామానాని) రత్నాని – తేషాం కాంతిభిః విచిత్రితా), ఆసీత్ = అయ్యెను (అస భువి పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** నందగృహ మున్న వీథికకు ఏర్పడిన శోభ–మేఘాలు అప్పుడే కురిసి వీథిని తడిపాయి. దేవతలు పూలు చల్లారు. మేఘాల మాటునుండి క్రిందికి జారుతున్న చంద్రకాంతులు పతాకలవలె అలరారుతున్నాయి. పైనున్న ఆదిశేషుని పడగమీది రత్నకాంతులు పలు వన్నెలతో వీథికను కాంతిమంతం చేస్తున్నాయి.

**వి :** 1. శ్లోకంలో ముందు పూలు చల్లటం, ఆపై మేఘాలు కురియటం కనిపిస్తున్నా 'అర్థ– క్రమపాఠక్రమయోః అర్థక్రమః బలీయాన్' అన్న మీమాంసాన్యాయాన్ని బట్టి అన్వయించటం జరిగింది.

2. రాత్రిపూట కల్లాపిచల్లటం వగైరాలు వర్ణించటం ఒకనాటి గ్రామీణ వాస్తవికతను కళ్ళముందుంచినట్లయింది.

3. 'మహః పతాకా' అన్నచోట రూపకాలంకారం. మిగిలినదంతా క్రియాస్వభావోక్తి.

4. **ఆసీత్ :**

| | | |
|---|---|---|
| **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ ఫణావలీతోరణభాగ్విమాన–వితానయుక్తోరగరాజమౌలేః ।**
**పతత్పయోబిన్దుసితాక్షతా సా – స్థలీ నిశీథేఽపి విభూషితేవ ॥ 2–3**

**అ :** గోకుల స్థల వర్ణన ఆ సమయానికి తగినట్లుగా. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఫణావళీ–తోరణ–భాక్ విమాన–వితాన–యుక్తా ఉరగ–రాజ–మౌళేః పతత్పయోబిందు–సితాక్షతా సా స్థలీ నిశీథేఽపి విభూషితా ఇవ (బభూవ).

**ప్ర :** ఫణా... భాక్ : ఫణ = పడగలయొక్క, ఆవలీ = పంక్తు లనెడి, తోరణ = తోరణాలను, భాక్ = కలిగినదియు, విమాన... యుక్తా : విమాన = విమానా లనెడి, వితాన = మేలికట్లతో, యుక్తా = కూడినదియు,

(యుజ్ యోగే ధాతువుపై క్త ప్రత్యయం) (విమానాని ఏవ వితానాని, తైః యుక్తా), ఉరగ... మౌలేః : ఉరగ–రాజ = నాగరాజు యొక్క, మౌళేః = తలనుండి (ముకుటం నుండి) (ఉరసా గచ్ఛతాం రాజా, తస్య మౌళిః, తస్మాత్), పత... క్షతా : పతత్ = పడుతున్న, పయః = నీటియొక్క, బిందు = బొట్లనెడి, సిత = తెల్లని, అక్షతా = అక్షతలు గలదియు (అయి) (పతంతః పయసాం బిందవ ఏవ, సితాః చ తే అక్షతాః యస్యాః సా), సా స్థలీ = ఆ గోకుల ప్రాంతం, నిశీథే+అపి = రాత్రివేళలో కూడా, విభూషితా+ఇవ = అలంకరింపబడినదేమో అన్నట్లు, (బభూవ = అయ్యెను).

**తా ॥** సర్పరాజు పడగల వరుసలు తోరణాలుగా, పైన సంచరిస్తున్న దేవతల విమానాలే మేలికట్లుగా, సర్పరాజు ముకుటం నుండి జారిపడుతున్న జలబిందువులు తెల్లని అక్షతలుగా ఆ గోకులప్రాంతం రాత్రివేళలో కూడా అలంకరించుకొని ఉన్నట్లుంది.

**వి :** 1. అర్థరాత్రివేళ అలంకారాలు కనులకు కట్టాలంటే తెల్లదనం అవసరం. అందుకే సితాక్షతలు, విమానవితానాలూ, పడగల తోరణాలూ.

2. ఫణావళీ తోరణాలు, విమాన వితానాలు, పయస్సికతాక్షతలు రూపకాలంకారాలు. విభూషితేవ – ఉత్ప్రేక్షాలంకారం. *

**శ్లో॥ విముక్తవర్గాధిపతిం పతిం శ్రీః – శిశుం తమాలోక్య సులజ్జితేవ ।**
**ఇయేష దోషాన్తర ఏవ గన్తుం – స్వయం గృహీతార్భకరమ్యరూపా ॥ 2–4**

**అ :** ఆ సమయంలో మాయారూపంలో ఉన్న లక్ష్మి అక్కడ నుండి వెళ్ళదలచుకోవటం కవి ఊహలో. – ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రీః విముక్త–వర్గాధిపతిం పతిం తం శిశుమ్ ఆలోక్య సులజ్జితా+ఇవ స్వయం గృహీత+అర్భక–రమ్య–రూపా దోషాంతరే ఏవ గన్తుమ్ ఇయేష.

**ప్ర :** శ్రీః = లక్ష్మి, విముక్త... పతిమ్ : విముక్త = ముక్తుల (మోక్షమందినవారి) యొక్క, వర్గ = సముదాయానికి, అధిపతిమ్ = ప్రభువైన (విముక్తానాం వర్గః, తస్య అధిపతిః – తమ్), పతిమ్ = తన భర్తను,తమ్ = ఆ, శిశుమ్ = పసివానిని, ఆలోక్య = చూచి (ఆఙ్ పూర్వక లోకృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సు–లజ్జితా+ఇవ = చాలా సిగ్గుపడినదన్నట్లుగా, స్వయమ్ = తానుకూడా, గృహీ... రూపా : గృహీత = స్వీకరింపబడిన, అర్భక = శిశువుయొక్క, రమ్య = అందమయిన, రూపా = రూపంగలదై (గృహీతమ్ అర్భకస్య రమ్యం రూపం యయా సా), దోషాంతరే+ఏవ = అర్ధరాత్రమందే (అన్యా చ సా దోషా, తస్యాం), గన్తుమ్ = వెళ్ళుటకు (గమ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఇయేష = కోరెను (ఇష ఇచ్ఛాయాం పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** లక్ష్మీనారాయణుడు ముక్తినందినవారికందరికీ ప్రభువు. తనకు భర్త. ప్రస్తుతం బాలకునివలె ఉన్నాడు. అది చూసి లక్ష్మి సిగ్గుపడిందో అన్నట్లు తాను కూడా అర్భక రూపాన్ని ధరించి ఆ అర్ధరాత్రి సమయంలోనే అక్కడనుండి వెళ్ళాలనుకొంది.

**వి :** 1. నారాయణుడు అవతరించటం కానీ, లక్ష్మి అవతరించటం కానీ వ్యవస్థాబద్ధంగా జరుగుతోంది. కానీ కవి లక్ష్మి శిశువుగా ఉన్న భర్తను చూసి సిగ్గుపడినదేమో అన్నట్లుంది అని వర్ణించాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఇయేష :** | **ఇయేష** | ఈషతుః | ఈషుః |
| | ఇయేషిథ | ఈషథుః | ఈష |
| | ఇయేష | ఈషివ | ఈషిమ. |

*

**శ్లో॥ హరేః ప్రియా తద్భగినీత్వమద్య - హ్యుపేయుషీ తత్ర న సా స్థిరాఽఽసీత్ ।
మనోజ్ఞమూర్త్యన్తరతస్తదీయ - విశాలవక్షఃస్థలమేత్య తృప్తా ॥ 2-5**

**అ :** లక్ష్మి గోకులంలో నిలవలేకపోవటాన్నే మరో రీతిగా చెప్పటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సా (పూర్వం) హరేః ప్రియా అద్య తద్భగినీత్వమ్ ఉపేయుషీ హి తత్ర న స్థిరాఽఽసీత్. మనోజ్ఞమూర్త్యంతరతః తదీయ-విశాల-వక్షఃస్థలమ్ ఏత్య తృప్తా.

**ప్ర :** సా = ఆ దుర్గ (లక్ష్మి), పూర్వమ్ = అంతకుముందు, హరేః = నారాయణునకు, ప్రియా = వల్లభ. అద్య = ఇప్పుడు, తద్+భగినీత్వమ్ = ఆయనయొక్క సోదరీత్వాన్ని (తస్య భగినీత్వమ్), ఉపేయుషీ = పొందినదై, హి = కదా, తత్ర = అక్కడ, స్థిరా = స్థిరంగా, న+ఆసీత్ = నిలువ లేదు. (అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), మనోజ్ఞ-మూర్త్యంతరతః = అందమైన మరో శరీరం కావటం వలన ( అన్యా మూర్తిః మూర్త్యంతరం, మనోజ్ఞం చ తత్ మూర్త్యంతరం, తస్మాత్), తదీయ... స్థలమ్ : తదీయ = ఆయనయొక్క, విశాల = నిడుపయిన, వక్షః స్థలమ్ = ఎదురు రొమ్మును ( తదీయం చ తత్ విశాలం చ వక్షఃస్థలమ్), ఏత్య = చేరి, తృప్తా (ఆసీత్) = ఆనందించింది.

**తా ॥** లక్ష్మి అంతకుముందు వరకు హరివల్లభ. కానీ ఇప్పుడు ఆయన సోదరిగా పుట్టింది. అందువలననే అక్కడ స్థిరంగా నిలువలేక పోయింది. అయినా మరో మనోహర శరీరం కాబట్టి ఆ విశాల వక్షఃస్థలాన్ని చేరి తృప్తి పడింది. *

**శ్లో॥ ముకున్దసేవార్హఫలం స్మ తావ - ద్వహన్నివాథానకదున్దుభిస్తామ్ ।
శిశుస్వరూపాం కమలాం స్వహస్తే - స బిభ్రదభ్యాగమదాత్మవాసమ్ ॥ 2-6**

**అ :** వసుదేవుడు గోకులం నుండి నిర్గమించుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** ఆనక-దుందుభిః ముకుంద-సేవార్హ-ఫలం తావత్ వహన్నివ తామ్ శిశు-స్వరూపాం కమలాం స్వహస్తే బిభ్రత్ ఆత్మవాసమ్ అభ్యాగమత్.

**ప్ర :** సః ఆనకదుందుభిః = ఆ వసుదేవుడు, ముకుంద... ఫలమ్ : ముకుంద = కృష్ణుని యొక్క, సేవా = పరిచర్యకు అర్హ = తగినట్టి, ఫలమ్ = ఫలితమన్నట్లుగా (ముకుందస్య సేవాయాః అర్హం చ తత్ ఫలమ్), తావత్ = అంతవరకు, వహన్+ఇవ = మోస్తున్నట్లుగా, శిశు-స్వరూపామ్ = శిశురూపంలో ఉన్న (శిశోః స్వరూపం యస్యాః సా-తామ్), కమలామ్ = లక్ష్మిని, స్వ-హస్తే = తనచేతిలో (స్వస్య హస్తః, తస్మిన్), బిభ్రత్ = మోస్తూ (భృ ధారణపోషణయోః ధాతువుపై శతృ ప్రత్యయం), ఆత్మవాసమ్ = తన నివాసానికి (మధురలోని చెరసాలకు), అభి+ఆగమత్ = తిరిగివచ్చెను (అభి+గమ్ గతౌ-లుఙ్-ప్ర.ఏ.).

**తా ॥** వసుదేవుడు అంతవరకు కృష్ణుని మోశాడు. ముకుంద సేవా ఫలానికి తాను తగినవాడు. ఆ సద్యః ఫలం లక్ష్మి (సంపదలు) చేతికందటం. శిశురూపంలో ఉన్న ఆ లక్ష్మిని తన చేతనుంచుకొని వసుదేవుడు మరల తన నివాసమైన మధురలోని చెరసాలకు చేరుకున్నాడు.

**వి :** 1. ముకుం దదాతి ఇతి ముకుందః అని వ్యుత్పత్తి, ముకుం అంటే మోక్షాన్ని అని అర్థం. ముకుందుడు మరణానంతరం మోక్షమిచ్చేవాడైనా జీవించి యున్నంత కాలం సంపదలనిస్తాడు. అందుకే వసుదేవుని చేతికి అది వెంటనే లభించింది.

2. ఈ శ్లోకంలో స్మ పదం పాదపూరణార్థం. '**తు హి చ స్మ వై పాదపూరణే**' అని అమరకోశం.

3. ముకుందసేవాఫలం (మోక్షప్రదాతృసేవాఫలం) సంపత్ప్రాప్తికావటం విభావనాలంకారం - '**విరుద్ధాత్ (కారణాత్) కార్యసంపత్తిః దృష్టా కాచిద్విభావనా.**'

| | | | |
|---|---|---|---|
| 4. **అభ్యాగమత్ :** | **అభ్యాగమత్** | అభ్యాగమతామ్ | అభ్యాగమన్ |
| | అభ్యాగమః | అభ్యాగమతమ్ | అభ్యాగమత |
| | అభ్యాగమమ్ | అభ్యాగమావ | అభ్యాగమామ్. |

*

**శ్లో॥సుతం యశోదాశయనే నిధాయ - విరిఞ్చపూర్వామరముఖ్యతాతమ్ ।**
**వివేశ కంసస్య గృహం స శౌరిః - ప్రగృహ్య తన్మృత్యుమివామ్బికాం తామ్ ॥2-7**

**అ :** శిశువులను మార్చి వసుదేవుడు మరల కారాగృహం చేరుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** సః శౌరిః విరించి-పూర్వామర-ముఖ్య-తాతం సుతం యశోదా-శయనే నిధాయ తామ్ అంబికాం తన్మృత్యుమివ ప్రగృహ్య కంసస్య గృహం వివేశ.

**ప్ర :** సః శౌరిః = ఆ వసుదేవుడు, విరించిపూర్వ+అమరముఖ్యతాతమ్ : విరించి-పూర్వ = బ్రహ్మమొదలుగాగల, అమర-ముఖ్య = దేవతాశ్రేష్ఠులయొక్క, తాతమ్ = తండ్రిని (కృష్ణుని) (విరించిః ముఖ్యః యేషాం తే చ తే అమరాః, తేషాం ముఖ్యతాతః, తమ్), సుతమ్ = (యశోదయొక్క) కుమారుని, యశోదాశయనే = యశోద పడకపై (యశోదాయాః శయనం - తస్మిన్), నిధాయ = ఉంచి, తామ్ = ఆ, అంబికామ్ = దుర్గను, తత్+మృత్యుమ్+ ఇవ = ఆ కంసుని మృత్యువును వలె, ప్రగృహ్య = తీసికొని (పట్టుకొని), కంసస్య = కంసునియొక్క, గృహమ్ = ఇంటిలో, వివేశ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే పరస్మైపది లిట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు యశోదకు ప్రస్తుతం కొడుకు. కానీ తాను బ్రహ్మాది దేవతలకు కూడా తండ్రి వంటివాడు. అటువంటి కృష్ణుని యశోదశయ్యపై ఉంచి, కంసుని పాలిటి మృత్యువు వంటి దుర్గను తాను తీసికొని, మరల కంసుని గృహంలో ప్రవేశించాడు.

**వి :** 1. పరమాత్మ స్వరూపుడుగా సర్వసృష్టికి మూలం కృష్ణుడే. అందుకే విరించిపూర్వ ముఖ్యామరజనకునిగా ప్రస్తావన.

2. ఇది విషమాలంకారం. ఒకవైపు బ్రహ్మాది దేవతలకు తండ్రి అనీ, మరొకవైపు యశోదకు కొడుకు అని వర్ణించటం. '**విషమం వర్ణ్యతే యత్ర ద్వయోరననురూపయోః**'.

| | | | |
|---|---|---|---|
| 3. **వివేశ :** | **వివేశ** | వివిశతుః | వివిశుః |
| | వివేశిథ | వివేశథుః | వివేశ |
| | వివేశ | వివిశివ | వివిశిమ. |

*

**శ్లో॥ ప్రభాతకాలే ఖలమభ్రగా సా - ప్రబోధ్య బన్ధాత్పితరౌ వియోజ్య ।**
**హరేర్వియోగోదితచిత్తచిన్తాం - బిభేద మాతుః శయనీయసంస్థా ॥ 2-8**

**అ :** దుర్గ కంసుని హెచ్చరించి దేవకీవసుదేవులను బంధవిముక్తులను చేయుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సా ప్రభాతకాలే అభ్రగా ఖలం ప్రబోధ్య పితరౌ బంధాత్ వియోజ్య మాతుః శయనీయ-సంస్థా హరేః వియోగోదిత-చిత్త-చిన్తాం బిభేద.

**ప్ర :** సా = ఆ దుర్గ, ప్రభాత-కాలే = ఉదయవేళలో, అభ్ర-గా = ఆకాశంపై నిలిచి, ఖలమ్ = దుష్టుడైన కంసుని, ప్రబోధ్య = మేలుకొలిపి/హెచ్చరించి (ప్రపూర్వక బుధ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పితరౌ = తల్లిదండ్రులను, బంధాత్ = చెరనుండి, వియోజ్య = విడిపించి (విపూర్వక యుజ ధాతువుపై ల్యప్ ప్రత్యయం),

మాతుః = తల్లి (దేవకి) యొక్క, శయనీయ-సంస్థా = పడకపై ఉండి (శయనీయే సంస్థా), హరేః = విష్ణువు వలన కలిగిన, వియోగో... చిన్తామ్ : వియోగ = వియోగం చేత, ఉదిత = పుట్టిన, చిత్త-చిన్తామ్ = మనోగ్లానిని (వియోగేన ఉదితా చ సా చిత్తే చిన్తా-తామ్), బిభేద = తొలగించుకొనెను. (భిద్ విదారణే లిట్-ప్ర.ఏ.).

**తా ॥** తెల్లవారగానే దుర్గలేచి కంసుని మేలుకొలిపి (మరణకారకుడైన వాడు గోకులంలో పెరుగుతున్నాడని) హెచ్చరించి!, తల్లిదండ్రులను బంధవిముక్తులను చేసి, దేవకి శయ్యపై విశ్రమించి, హరివియోగం వలన పుట్టిన మనోగ్లానిని తొలగించుకొన్నది.

**వి :** 1. భాగవతపురాణం మేరకు కంసుడే దేవకీవసుదేవులను బంధవిముక్తులను చేస్తాడు.

'దేవకీం వసుదేవం చ విముచ్య ప్రశ్రితోఽభవత్' - భాగవతం 10/4/14.

| | | | |
|---|---|---|---|
| 2. **బిభేద :** | **బిభేద** | బిభిదతుః | బిభిదుః |
| | బిభేదిథ | బిభిదథుః | బిభిద |
| | బిభేద | బిభిదివ | బిభిదిమ. |

*

**శ్లో॥ స్నాత్వా పూర్వపయోనిధావచలసత్పీఠాధిరూఢః కరైః**
**పద్మాని ప్రతిగృహ్య సాన్ద్రతిమిరాణ్యున్మూల్య రాగావృతః ।**
**సింజత్పక్షిగణాన్నిశమ్య పరమం కృష్ణావతారం రవి-**
**స్తత్పూజార్థమివోదితో వ్రజగృహద్వారేషు తాన్ ప్రాహిణోత్ ॥ 2-9**

**అ :** సూర్యోదయ వర్ణనం. - శార్దూలవిక్రీడితమ్.

**అ :** రవిః సింజత్పక్షి-గణాత్ పరమం కృష్ణావతారం నిశమ్య పూర్వ-పయోనిధౌ స్నాత్వా అచల-సత్పీఠాధిరూఢః కరైః పద్మాని ప్రతిగృహ్య సాంద్ర-తిమిరాణి ఉన్మీల్య రాగావృతః (సన్) వ్రజ-గృహ-ద్వారేషు తత్పూజార్థమ్ ఉదితః ఇవ తాన్ ప్రాహిణోత్.

**ప్ర :** రవిః = సూర్యుడు, సింజ... గణాత్ : సింజత్ = శబ్దం చేస్తున్న, పక్షి = పక్షుల యొక్క, గణాత్ = సమూహంద్వారా (సింజన్ చ సః పక్షిణాం గణః - తస్మాత్), పరమమ్ = శ్రేష్ఠమైన, కృష్ణ+అవతారమ్ = కృష్ణుడు అవతరించటాన్ని, నిశమ్య = విని (ని+శమ్‌ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పూర్వ+పయోనిధౌ = తూర్పు సముద్రంలో (పూర్వః చ అసౌ పయసాం నిధిః, తస్మిన్), స్నాత్వా = స్నానంచేసి (స్నా ధాతువుపై క్త్వా ప్రత్యయం), అచల-సత్-పీఠ+అధిరూఢః : అచల = ఉదయ పర్వతమనే, సత్+పీఠ = మంచి పీటపై, అధిరూఢః (సన్) = కూర్చున్నవాడై (అచల ఏవ సమీచీనం పీఠం, తదధిరూఢః), కరైః = కిరణాలతో/ చేతులతో, పద్మాని = తామరలను, ప్రతిగృహ్య = స్వీకరించి (ప్రతి-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సాంద్ర-తిమిరాణి = దట్టమైన చీకటులను (సాంద్రాణి చ తాని తిమిరాణి), ఉన్మూల్య = పెకలించి (ఉత్-మూల ధాతువుపై ల్యప్ ప్రత్యయం) రాగ+ఆవృతః = ఎర్రదనం (అనురాగం)తో ఆవరింపబడి (రాగేణ ఆవృతః), వ్రజ-గృహ-ద్వారేషు : వ్రజ = గోకులంలోని, గృహ = ఇళ్ళ యొక్క, ద్వారేషు = ముంగిళ్ళ ముందుకు (వ్రజే గృహాణి, తేషాం ద్వారాణి, తేషు), తత్+పూజార్థమ్ = కృష్ణుని పూజకై, ఉదితః ఇవ = వచ్చినట్లుగా , తాన్ = ఆ కమలాలను, ప్రాహిణోత్ = పంపెను (ప్ర+హి గతౌ వృద్ధౌ చ-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.).

**తా ॥** పక్షి సమూహాల అరుపులద్వారా సూర్యుడికి గొప్పదైన కృష్ణావతారం జరిగిందని తెలిసింది. దానితో తూర్పుకడలిలో స్నానంచేసి, తూర్పుకొండ అనే మంచిపీటపై కూర్చొని కిరణాలతో (చేతితో) పద్మాలను తీసికొని, గాఢాంధకారాన్ని పెకలించివేసి అనురక్తితో కలిసి, వ్రజగృహద్వారాలముందు ఆ కిరణాలను (చేతులను)

ప్రసరింపజేశాదు (చాపాదు). అది ఆ కృష్ణునకు పూజ చేస్తున్నట్లుగా, అందుకే ఆయనను ఇంటింటా వెదుకుతున్నట్లుగా వుంది.

**వి :** 1. 'తత్పూజార్థమ్ ఉదిత ఇవ' – పూజకోసం వచ్చినట్లుగా – ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తు హేతు ఫలాత్మనా**' (కు–32)

అయితే ఇక్కడ కర, రాగపదాలపై ఉన్న శ్లేష (రెండర్థాలు) 'రవి' పదంలోని పుంలింగం, నామవాచకత్వం, తదితరచేష్టలూ అన్నీ పూజకుపక్రమించిన ఒక అర్చకుని చేష్టను తెలియజేస్తాయి. కాబట్టి రెండు ప్రకృతాంశాలయిన రవికీ, అర్చకుడికీ సమానధర్మాన్వయం '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' (కు–44) ధ్వనిస్తుంది. సూర్యుడికీ, అర్చకుడికీ బింబప్రతిబింబభావంతో పోలిక ధ్వనిస్తుంది. కాబట్టి దృష్టాంతాలంకారం '**చేద్ బింబప్రతిబింబిత్వం దృష్టాంతస్తదలంకృతిః**' – (కు. 52).

2. **ప్రాహిణోత్ :**

| | | |
|---|---|---|
| ప్రాహిణోత్ | ప్రాహిణుతామ్ | ప్రాహిణ్వన్ |
| ప్రాహిణోః | ప్రాహిణుతమ్ | ప్రాహిణుత |
| ప్రాహిణవమ్ | ప్రాహిణ్వ | ప్రాహిణ్మ. |

*

**శ్లో॥ సుమేరుసంస్థైరమరైరుపాయాత్ – సముద్ధృతం విష్ణుపదార్చనాయ ।**
**సముద్రవాపీస్థసహస్రపత్ర–మివోదితో భాతి సహస్రరశ్మిః ॥ 2–10**

**అ :** సూర్యోదయ వర్ణనం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఉదితః సహస్ర–రశ్మిః సుమేరు–సంస్థైః అమరైః విష్ణు–పదార్చనాయ సముద్ధృతం సముద్ర–వాపీ–స్థ–సహస్రపత్రమ్ ఇవ భాతి.

**ప్ర :** ఉదితః = ఉదయించిన (పొడిచిన), సహస్ర–రశ్మిః = వేయి వెల్గులవాడు (సూర్యుడు) (సహస్రం రశ్మయః యస్య సః), సుమేరు–సంస్థైః = మేరుపర్వతంపై నున్న (మేరుః సుమేరుః హేమాద్రీ రత్నసానుస్సురాలయః – అమరకోశః 1–49) (సుమేరౌ సంస్థాః–తైః), అమరైః = దేవతలచేత, విష్ణు–పద+అర్చనాయ = విష్ణుపాదాలను పూజించటానికై (విష్ణోః పదయోః అర్చనం – తస్మై), సముద్ధృతమ్ = కోసి పైకి తేబడిన, సముద్ర... పత్రమ్–ఇవ : సముద్ర = సముద్ర మనే, వాపీ = దిగుడుబావిలో, స్థ = ఉండిన, సహస్రపత్రమ్ – ఇవ = కమలం వలె (సముద్ర ఏవ వాపీ, తస్యాం తిష్ఠతి ఇతి సముద్రవాపీస్థమ్, తచ్చ తత్ సహస్రపత్రమ్), భాతి = ప్రకాశిస్తున్నాడు. ( భా దీప్తౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** విష్ణువును పూజించటానికై మేరుపర్వతంపై నున్న దేవతలు కమలాన్ని త్రుంచారట. అది సముద్రమనే దిగుడుబావిలోనిదట. ఉదయించిన సూర్యుడు ఆ కమలంవలె ఉన్నాడట.

**వి :** 1. ఈ శ్లోకంలో సూర్యునికి సముద్రవాపిలో నుండగా దేవతలు త్రుంచిన కమలంతో పోలిక. అది ఉపమాలంకారం. సముద్రంలో వాపీత్వంయొక్క ఆరోపణ. అది రూపకా–లంకారం.

2. ఈ శ్లోకంద్వారా విష్ణువుయొక్క ఔన్నత్యం వ్యక్తమవుతోంది. దేవతలు మేరుపర్వతం మీద నిలిచి విష్ణుపాదాలను అర్చిస్తున్నారు. అంటే విష్ణువు ఎంత ఉన్నతుడో గదా! ఆ అర్చనకై సముద్రవాపి నుండి కమలాన్ని కోసుకొంటున్నారు.

3. **భాతి :**

| | | |
|---|---|---|
| **భాతి** | భాతః | భాన్తి |
| భాసి | భాథ | భాథ |
| భామి | భావః | భామః. |

*

**శ్లో॥ దివి ద్యురత్నేఽభ్యుదితేఽమ్బుజాని - భువి ప్రసేదుర్భువనోదయాని ।**
**ఇహ ప్రజాతే యదువంశరత్నే - సురాననాబ్జాని చ నాకిలోకే ॥ 2-11**

**అ :** సూర్యోదయ వర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** దివి ద్యు-రత్నే అభ్యుదితే భువి భువనోదయాని అంబుజాని ప్రసేదుః. ఇహ (భువి) యదు-వంశ-రత్నే ప్రజాతే నాకి-లోకే సురాననాబ్జాని చ (ప్రసేదుః).

**ప్ర :** దివి = గగనమందు, ద్యురత్నే = ద్యుమణి (సూర్యుడు), అభి+ఉదితే = ఉదయించగా, భువి = భూమిపై, భువన+ఉదయాని : భువన = నీటికి (భువనం స్వాంబులోకేషు హలాయుధకోశః-648), ఉదయాని = కాంతినిచ్చు, అంబుజాని = పద్మాలు, ప్రసేదుః = వికసించాయి. ఇహ = భూమిపై, యదు-వంశ-రత్నే = యదుకులమణి, ప్ర-జాతే = పుట్టగా, నాకిలోకే = దేవతల లోకంలో, సుర+ఆనన+అబ్జాని చ = దేవతల ముఖాలు అనే పద్మాలు కూడా, (ప్రసేదుః) = వికసించాయి. (ప్ర-సద్ విశరణగత్యవసాదనేషు పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** గగనతలంలో సూర్యుడు ఉదయించగానే భూతలంలో జలాశయాలకే వన్నె తెచ్చే కమలాలు వికసించాయి. భూలోకంలో యదువంశమణి (కృష్ణుడు) ఉదయించగానే దేవలోకంలో దేవతల ముఖపద్మాలు వికసించాయి.

**వి :** 1. ఇది అన్యోన్యాలంకారం. '**అన్యోన్యం నామ యత్ర స్యాదుపకారః పరస్పరమ్**' పరస్పర సహకారంతో భావం స్పష్టంగానే ఉంది.

| 2. **ప్రసేదుః :** | ప్రససాద | ప్రసేదతుః | **ప్రసేదుః** |
|---|---|---|---|
| | ప్రసేదిథ/ప్రససత్థ | ప్రసేదథుః | ప్రసేద |
| | ప్రససాద | ప్రసేదివ | ప్రసేదిమ. |

*

**శ్లో॥ తరువ్రజే పక్షిగణాశ్చరన్తో - జగుర్నిరీక్ష్యోదయముష్ణరశ్మేః ।**
**వ్రజే చ దుష్టోష్ణలసన్మరీచేః - సమాగతా మాగధవన్దిసూతాః ॥ 2-12**

**అ :** సూర్యోదయవర్ణనకు ప్రకృతాంశంతో మేళవింపు. - ఉపేంద్రవజ్ర.

**అ :** తరు-వ్రజే చరన్తః పక్షి-గణాః ఉష్ణ-రశ్మేః ఉదయం నిరీక్ష్య జగుః. వ్రజే చ దుష్టోష్ణలసన్మరీచేః (ఉదయం నిరీక్ష్య) సమాగతాః మాగధ-వంది-సూతాః (జగుః).

**ప్ర :** తరు-వ్రజే = చెట్లగుంపులలో (తరూణాం వ్రజః, తస్మిన్), చరంతః = తిరుగుతున్న, పక్షి-గణాః = పక్షుల గుంపులు (పక్షిణాం గణాః), ఉష్ణ-రశ్మేః = సూర్యునియొక్క (ఉష్ణాః రశ్మయః యస్య తస్య), ఉదయమ్ = పొడముటను, నిరీక్ష్య = చూచి (నిర్-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), జగుః = అరిచాయి (గై శబ్దే-పరస్మైపది-లిట్-ప్ర.బ.), వ్రజే చ = గోకులంలో కూడా, దుష్టో... రీచేః : దుష్ట = చెడ్డవారికి, ఉష్ణ = సంతాపాన్ని కల్గించేటట్లు, లసత్ = ప్రకాశించు, మరీచేః = కాంతిగల కృష్ణునియొక్క, (దుష్టానామ్ ఉష్ణాః చ తే లసన్తః చ మరీచయః యస్య తస్య), ఉదయమ్ = పుట్టుకను, నిరీక్ష్య = చూచి, సమాగతాః = వచ్చినట్టి, మాగధ-వంది-సూతాః = మాగధులు, వందులు, సూతులు (వివిధ స్తోత్ర పాఠకులు) (మాగధాశ్చ వందినశ్చ సూతాశ్చ), జగుః = పాడిరి (స్తుతించారు).

**తా ॥** చెట్లగుంపులపై తిరుగుతున్న పక్షి సమూహాలు సూర్యుని ఉదయాన్ని గమనించి కూతలు మొదలు పెట్టాయి. గోకులంలో కూడా చెడ్డవారిని తపింపజేసే కాంతిగల కృష్ణుని పుట్టుకను విని, వందిమాగధసూతులు వచ్చి స్తోత్రాలు చేశారు.

**వి :** 1. ఈ శ్లోకంలో తుల్యయోగితాలంకారం కనిపిస్తుంది. "**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**" కేవలం ప్రకృతాలకు లేదా కేవలం అప్రకృతాలకు సమానధర్మాన్ని చెప్పటం తుల్యయోగిత. ఇక్కడ 'జగుః' అన్నది రెండు ప్రకృతాలకు సమానధర్మం.

| | | | |
|---|---|---|---|
| 2. **జగుః :** | జగౌ | జగతుః | **జగుః** |
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ. |

*

**శ్లో॥ తదా స్వవంశ్యైః సహ రాజహంస్యో - జనైర్వ్యదృశ్యన్త శనైశ్చరన్త్యః ।**
**బృహన్నితమ్బస్తనభారభీరు - తనుస్ఫురన్మధ్యయుతాశ్చ గోప్యః ॥ 2-13**

**అ :** సూర్యోదయ వర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** తదా స్వవంశ్యైః సహ శనైః చరంత్యః రాజహంసాః జనైః వ్యదృశ్యంత. బృహన్నితంబ- స్తన-భార-భీరు-తను-స్ఫురన్మధ్య-యుతాః గోప్యః చ శనైః చరంత్యః జనైః వ్యదృశ్యంత.

**ప్ర :** తదా = ఆ సూర్యోదయకాలంలో, స్వ-వంశ్యైః సహ = తమ వంశంలో పుట్టిన ఇతర పక్షులతో పాటు (స్వస్య వంశే భవాః-తైః), శనైః = మెల్లగా, చరంత్యః = వెళ్తున్న, రాజహంసాః = రాజహంసలు, జనైః = జనులచే, వ్యదృశ్యంత = చూడబడ్డాయి. (వి- దృశ్ ప్రేక్షణే-కర్మణి-లఙ్-ప్ర.బ.), బృహ... తాః : బృహత్ = పెద్దవైన, నితంబ = పిరుదుల యొక్కయు, స్తన = రొమ్ముల యొక్కయు, భార = బరువుచే, భీరు = బెదరిన, తను = సూక్ష్మమైన, స్ఫురత్ = ప్రకాశించు, మధ్య = నడుముతో, యుతాః = కూడుకొన్న, గోప్యః చ = గోపికలు కూడా, (శనైః = మెల్లగా, చరంత్యః = నడుస్తూ, జనైః = జనులచే, వ్యదృశ్యంత = చూడబడ్డారు.)

**తా ॥** సూర్యోదయవేళలో రాజహంసలు సాటి పక్షులతో కలిసి మెల్లగా సంచరిస్తూండగా ప్రజలు చూశారు. గోకులంలో కూడా నితంబస్తనభారంతో కృశించిన నడుములతో మెల్లగా నడుస్తున్న గోపికలను కూడా జనులు గమనించారు.

**వి :** 1. ఇక్కడ కూడా తుల్యయోగితాలంకారం. సూర్యోదయమూ, కృష్ణజననమూ రెండు ప్రకృతాంశాలే. దానికి సంబంధించి రాజహంసగమనాన్నీ, గోపికా గమనాన్నీ కూడా జనులు చూశారని ఒకే ధర్మంతో వర్ణించటం తుల్యయోగిత.

| | | | |
|---|---|---|---|
| 2. **వ్యదృశ్యంత:** | వ్యదృశ్యత | వ్యదృశేతామ్ | **వ్యదృశ్యంత** |
| | వ్యదృశ్యథాః | వ్యదృశ్యేథామ్ | వ్యదృశ్వధమ్ |
| | వ్యదృశ్యే | వ్యదృశ్యావహి | వ్యదృశ్యామహి. |

*

**శ్లో॥ కృష్ణం స్వకాన్తమధునైవ వశే విధాతు-**
**ముత్కాన్వితా ఇవ మనోహరకోమలాఙ్గ్యః ।**
**వ్యాలోలహారసరకుణ్డలకున్తలోద్య-**
**చ్చేలాన్తనూపురరుచః పథి తా విరేజుః ॥ 2-14**

**అ :** గోకులంలో గోపాలికల హడావుడి. - వసంతతిలక.

**అ :** మనోహర-కోమలాంగ్యః వ్యాలోల-హార-సర-కుండల-కుంతల+ఉద్యచ్చేలాంత-నూపుర-రుచః తాః స్వకాంతం కృష్ణమ్ అధునా ఏవ వశే విధాతుమ్ ఉత్కాన్వితా ఇవ పథి విరేజుః.

**ప్ర :** మనోహర-కోమల-అంగ్యః:మనోహర = అందమైన, కోమల = మృదువైన, అంగ్యః =

అవయవాలుగలవారును, (మనోహరాణి కోమలాని చ అంగాని యాసాం తాః), వ్యాలోల... రుచః : వ్యాలోల = కదలాడెడి, హారసర = ముత్యాల హారాల పేటలూ, కుండల = కమ్మలూ, కుంతల = కేశబంధాలూ (తద్బంధవిశేషాః స్యుః వేణీధమ్మిల్ల కుంతల కబర్యః-హలాయుధకోశః-530), ఉద్యత్ = ఎగురుతున్న, చేల+అంత = బట్టల అంచులూ, నూపుర = గజ్జెలూ-వీటియొక్క, రుచః = కాంతులుగల వారును అయిన, తాః = ఆ గోపాలికలు, స్వ-కాంతమ్ = తమ వల్లభుని, అధునా+ఏవ = ఇప్పుడే, వశే = అదుపులో, విధాతుమ్ = ఉంచుకొనుటకు, ఉత్క+అన్వితాః ఇవ = ఉత్సుకత వెంబడించిన వారివలె (ఉత్క ఉత్కంఠితః ప్రోక్తః - హలాయుధకోశః - 387), పథి = బాటలో, విరేజుః = ప్రకాశించారు. (వి+రాజృ దీప్తౌ-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ప్రభాతకాలంలో గోకులంలో గోపికల హడావుడి ఎక్కువైంది. అందమైన మృదువైన శరీరావయవాలు గలవారు ముత్యాలహారాలు, కమ్మలు, కొప్పులు, కట్టుబట్టల అంచులకు తగులుతున్న గజ్జెలు ధరించి అవి కదలాడేటట్లు నడుస్తూన్నారు, ఉత్సుకత వెంటబడి తరుముతున్నట్లు. దానికి కారణం వారు తమకు ప్రియుడైన కృష్ణుని ఇప్పుడే లొంగదీసుకోవాలన్న తపన.

**వి :** 1. ఇక్కడ ఫలోత్ప్రేక్షాలంకారం. ఉత్కంఠ వెంటబడి వారిని అనుసరిస్తున్నట్లు (ఉత్కాన్వితా ఇవ) అని సంభావించటం వలన. అయితే దాని ఫలం అప్పటికప్పుడే కృష్ణుని వశపరచుకోవాలన్న తపన. కాబట్టి ఇది ఫలోత్ప్రేక్ష.

2. **విరేజుః** :

| | | |
|---|---|---|
| విరరాజ | విరేజతుః/విరరాజతుః | **విరేజుః**/విరరాజుః |
| విరేజిథ/విరరాజిథ | విరేజథుః/విరరాజథుః | విరేజ/విరరాజ |
| విరరాజ | విరేజివ/విరరాజివ | విరేజిమ/విరరాజిమ. |

*

**శ్లో॥ సహస్రశో గోగణముష్ణదీప్తిః - సమర్పయామాస పదే మురారేః ।**
**సువర్ణభాసంవలితాంశ్చ నన్దః - స్వగోగణాన్ విప్రకులాయ దత్తాన్ ॥ 2-15**

**అ :** కృష్ణజనన సమయంలో నందుడు చేసిన గో-దానాన్ని ప్రస్తావించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఉష్ణ-దీప్తిః సహస్రశః గోగణం మురారేః సమర్పయామాస. నందః చ సువర్ణ- భా-సంవలితాన్ విప్ర-కులాయ దత్తాన్ స్వ-గో-గణాన్ మురారేః పదే సమర్పయామాస.

**ప్ర :** ఉష్ణ-దీప్తిః = వేడివెలుగులవాడు (సూర్యుడు) (ఉష్ణాః దీప్తయః యస్య సః), సహస్రశః = వేలకొలదిగ, గో-గణమ్ = కిరణసముదాయాన్ని (దిగ్దృష్టిదీధితిస్వర్గవజ్రవాగ్బాణవారిషు-హలాయుధకోశః-854) (గవాం గణః, తమ్), మురారేః పదే = గగనతలమందు (వియద్విష్ణుపదం వా తు పుంస్యాకాశవిహాయసీ-అమరకోశః 1-దిగ్వర్గ -2), సమర్పయామాస = కల్పించెను (సమ్-ఋ గతౌ-ణిచ్-లిట్-ప్ర.ఏ.), నందశ్చ = నందుడు కూడా, సువర్ణ-భా-సంవలితాన్ : సువర్ణ = బంగారు యొక్క, భా = కాంతితో, సంవలితాన్ = కూడియున్నదియు (సువర్ణానాం భాభిః సంవిలితాః - తాన్), విప్ర-కులాయ = బ్రాహ్మణ సమూహాలకు (విప్రాణాం కులమ్, తస్మై), దత్తాన్ = ఇవ్వబడినవియు (దా దానే ధాతువుపై క్త ప్రత్యయం) అయిన, స్వ-గో-గణాన్ = తన ఆవుల మందలను (స్వస్య గవాం గణాః - తాన్), మురారేః = కృష్ణునియొక్క, పదే = పాదం దగ్గర, సమర్పయామాస = సమర్పించెను.

**తా ॥** సూర్యుడు గగనతలానికి తన కిరణసముదాయాన్ని సమర్పించాడు. నందుడు కూడా బంగారుకాంతులతో మెరుస్తుండగా తాను బ్రాహ్మణులకు దానం చేసిన గోవులను కృష్ణ పాదాలకు సమర్పించాడు.

**వి :** 1. నందుడు గోదాన ఫలితాన్ని కృష్ణ పాదాల దగ్గర అర్పించాడని భావం. పూజాదికాలు నిర్వహించిన తరువాత వాటిని బ్రహ్మార్పణం చేయటం సంప్రదాయం. వైష్ణవ సంప్రదాయంలో అది కృష్ణార్పణం. ఈ పదం కూడా లోకంలో వాడుకలో ఉన్నదే.

2. సూర్యునికి నందునికి మురారిపదసమర్పణ మన్న ఏకధర్మాన్ని చెప్పటం వలన ఇది తుల్యయోగితాలంకారం. "గో" 'మురారేః పదే' – ఈ శబ్దాలపై గల శ్లేష దానికి సహకరిస్తుంది. కాబట్టి శ్లేషానుప్రాణిత తుల్యయోగితాలంకారం.

3. **సమర్పయామాస :**

| | | |
|---|---|---|
| **సమర్పయామాస** | సమర్పయామాసతుః | సమర్పయామాసుః |
| సమర్పయామాసిథ | సమర్పయామాసథుః | సమర్పయామాస |
| సమర్పయామాస | సమర్పయామాసివ | సమర్పయామాసిమ. |

*

**శ్లో॥ స నందగోపః ప్రదదౌ ద్విజేభ్యో – బహూని గోరూపధనాని విష్ణోః ।**
**తటీషు గోభిః సహ సఞ్చరిష్ణోః – సహస్రశస్తా ఇవ సాధయిష్యన్ ॥ 2–16**

**అ :** నందుడు చేసిన గోదానాన్ని ప్రకారాంతరంగా ప్రస్తుతించటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** సః నంద–గోపః తటీషు గోభిః సహ సంచరిష్ణోః విష్ణోః తాః సహస్రశః సాధయిష్యన్ ఇవ ద్విజేభ్యః గో–రూప–ధనాని బహూని ప్రదదౌ.

**ప్ర :** సః = ఆ, నందగోపః = నందగోపుడు (నందుడనే గోపాలుడు), తటీషు = (గోవర్ధనం యొక్క) చరియల యందు, గోభిః సహ = ఆలమందతో, సంచరిష్ణోః = తిరుగబోతున్న (సమ్ పూర్వక చర ధాతువుపై ఇష్ణుచ్ ప్రత్యయం), విష్ణోః = కృష్ణునకై, తాః = ఆ గోవులను, సహస్ర–శః = వేలకొలదిగ, సాధయిష్యన్ ఇవ = సంపాదింప దలచినట్లుగా, ద్విజేభ్యః = బ్రాహ్మణులకు, గో–రూప–ధనాని = గోరూపంలోని ధనాలను (గవాం రూపాణి – తాని చ తాని ధనాని), బహూని = మిక్కిలిగా, ప్రదదౌ = ఇచ్చాడు. (దా దానే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** భవిష్యత్తులో కృష్ణుడు గోవర్ధనగిరి సానువులపై గోవులతో సహా సంచరింపబోతున్నాడు. ఆ సమయంలో ఆలమందలు పెద్దవిగా ఉండాలన్న సంకల్పంతో నందుడు బ్రాహ్మణులకు గోరూపంలో ఉన్న ధనాన్ని మిక్కిలిగా ఇచ్చాడు.

**వి :** 1. భవిష్యత్తులో గోవులు ఎక్కువగా కావాలనుకొని ఉన్నవాటిని కూడా దానం చేయటం విచిత్రంగా కనిపిస్తుంది. అది విచిత్రాలంకారం. "**విచిత్రః తత్ ప్రయత్నశ్చేద్విపరీతః ఫలేచ్ఛయా**". మన కోరికకు వ్యతిరేకమైన ప్రయత్నాన్ని చేయటం.

అయితే గోదానఫలం ఇబ్బడిముబ్బడిగా ఫలితాలనివ్వగలదని చెప్పటం కవి తాత్పర్యం.

2. **ప్రదదౌ :**

| | | |
|---|---|---|
| ప్రదదౌ | ప్రదదతుః | ప్రదదుః |
| ప్రదదిథ/ప్రదదాథ | ప్రదదథుః | ప్రదద |
| ప్రదదౌ | ప్రదదివ | ప్రదదిమ. |

*

**శ్లో॥ విప్రర్షిదేవపితృవన్దిసుహృజ్జనేభ్యో**
**విత్తాన్యదాత్ కిల సుతుష్టమనాః స నన్దః ।**
**ఇత్థం మతిర్మమ విభోః పితృతాం స్వసంస్థా–**
**ముద్వీక్ష్య తాన్ ప్రహసతోఽభిముఖీచికీర్షుః ॥ 2–17**

**అ :** కృష్ణజనన వేళ నందుడు చేసిన దానాలను మరొకరీతిగా సమర్థించటం. -వసంతతిలక.

**అ :** సంతుష్ట-మనాః స నందః విప్రర్షి-దేవ-పితృ-వంది-సుహృజ్జనేభ్యః విత్తాని అదాత్ కిల. మమ మతిః ఇత్థమ్ స్వ-సంస్థాం విభోః పితృతామ్ ఉద్వీక్ష్య ప్రహసతః తాన్ అభిముఖీ- చికీర్షుః (విత్తాని అదాత్)

**ప్ర :** సంతుష్ట-మనాః = సంతసించిన మనస్సు గల (సంతుష్టం మనః యస్య సః), సః నందః = ఆ నందుడు, విప్ర... జనేభ్యః : విప్ర = బ్రాహ్మణులు, ఋషి = యతులు, పితృ దేవ = పెద్దలు, దేవతలు (వారినుద్దేశించి), వంది = స్తోత్రపాఠకులు, సుహృత్-జనేభ్యః = సజ్జనులు - వీరికందరికీ (విప్రాః ఋషయః దేవాః పితరః వందినః సుహృదః చ తే జనాః - తేభ్యః), విత్తాని = సొమ్ములను, **అదాత్** కిల = ఇచ్చాడు గదా (దా-దానే పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), (తత్ర) = ఆ విషయంలో, మమ = నా యొక్క, మతిః = బుద్ధి, ఇత్థమ్ = ఇలా (ఉంది), స్వ సంస్థామ్ = తన (నందుని)లో ఉన్న, విభోః = పరమాత్మయొక్క, పితృతామ్ = తండ్రిదనాన్ని, ఉద్వీక్ష్య = చూసి (ఉద్-వి-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ప్రహసతః = హేళనచేస్తున్న, తాన్ = వారిని, అభిముఖీ-చికీర్షుః = తనవైపునకు తిప్పుకొనగోరి..., (విత్తాని.అదాత్) = సొమ్ములు ఇచ్చాడు.

**తా ॥** కృష్ణ జననంతో ఆనందించిన నందుడు బ్రాహ్మణులకు, యతులకు, దేవతలకు, పితరులకు (వారినుద్దేశించి), వందులకు, సజ్జనులకు ఎన్నో దానాలు చేశాడు. ఎందుకంటే... నందుడిప్పుడు జగత్పితకు పిత. దానిని చూసి వారంతా హేళన చేస్తున్నారట. అటువంటి వారిని తనవైపునకు త్రిప్పుకోవటానికే (అయివుంటుంది).

**వి :** 1. అసాధారణ సంఘటనలు జరిగినప్పుడు ప్రజలు వాటిని గురించి రకరకాలుగా గుసగుసలు పోతారు. వారికి వారికిష్టమయిన వాటినిచ్చి తృప్తి కలిగించటమే దానికి పరిహారం. నందుని దానాలను కవి ఆ రీతిగా ఊహిస్తున్నాడు. అయితే దానిని మాటమాత్రంగా చెప్పలేదు. కాబట్టి ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **అదాత్ :** | **అదాత్** | అదాతామ్ | అదుః |
| | అదాః | అదాతమ్ | అదాత |
| | అదామ్ | అదావ | అదామ. |

*

### శ్లో॥ ధ్వజప్రభైరూర్ధ్వముఖైర్మయూఖై-రధోముఖైస్తోరణసమ్మితైశ్చ ।
### విభూషితా ద్యౌర్వ్రజభూశ్చ చిత్ర-ధ్వజైః స్ఫురత్తోరణసఞ్చయైశ్చ ॥ 2-18

**అ :** ప్రభాతవేళలోని సూర్యకాంతి పరివ్యాప్తిని వర్ణించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** ద్యౌః ధ్వజ-ప్రభైః ఊర్ధ్వ-ముఖైః తోరణ-సమ్మితైః అధో-ముఖైః చ మయూఖైః విభూషితా. వ్రజ-భూః చ చిత్ర-ధ్వజైః స్ఫురత్తోరణ-సంచయైః చ విభూషితా.

**ప్ర :** ద్యౌః = గగనతలం, ధ్వజ-ప్రభైః = ధ్వజకాంతులవంటి (ధ్వజానాం ప్రభా ఇవ ప్రభా యేషాం - తైః), ఊర్ధ్వ-ముఖైః = పైకి ప్రసరించే (ఊర్ధ్వం ముఖం యేషాం తైః), మయూఖైః = కిరణాలతోనూ, తోరణ-సమ్మితైః = తోరణాలవంటివై (తోరణైః సమ్మితాః - తైః), అధో-ముఖైః = క్రిందకుసాగే (అధః ముఖం యేషాం తైః), మయూఖైః చ = కిరణాలతోడనూ, విభూషితా = అలంకరింపబడింది. వ్రజభూః = గోకుల భూమి, చిత్ర-ధ్వజైః = వివిధవర్ణాలుగల పతాకలతో (చిత్రాశ్చ తే ధ్వజాః, తైః), స్ఫురత్-తోరణసంచయైః చ = ప్రకాశించే తోరణాల వరుసలతోనూ, విభూషితా = అలంకరింపబడింది. (వి పూర్వక భూష్ అలంకారే ధాతువుపై క్త ప్రత్యయం).

**తా ॥** ఆకాశంలో సూర్యకిరణాలు పతాకల కాంతులలాగా పైకి, తోరణాల వరుసలలాగా క్రిందికీ కూడా ప్రసరిస్తున్నాయి. గోకులంలో చిత్రపతాకలూ, తోరణాలూ వెలుగొందు తున్నాయి. వీటితో గగనతలం, గోకులం కూడా అలంకరింపబడ్డాయి.

వి : 1. ఈ శ్లోకంలో కూడా ప్రకృతాలయిన రెండింటికి (గగనతలం – గోకులం) 'విభూషితా' అని ఒకే ధర్మాన్ని చెప్పటం వల్ల తుల్యయోగితాలంకారం. *

**శ్లో॥ లసత్పతాకధ్వజకుమ్భతోరణై – ర్విభాసితాని వ్రజమన్దిరాణి తే ।**
**ప్రవేక్ష్యతీమాని స బాలలీలయా – విభుర్బతేతీవ వితేనురఞ్జసా ॥ 2-19**

అ : కృష్ణజననాన్ని గోకుల మింటింటి పండుగలా భావిస్తూ గృహాలను అలంకరించటం. –ఉపేంద్రవజ్ర.

అ : తే సః విభుః బాల–లీలయా ఇమాని ప్రవేక్ష్యతి బత ఇతి ఇవ వ్రజ–మందిరాణి లసత్పతాక–ధ్వజ–కుంభ–తోరణైః అంజసా విభాసితాని వితేనుః.

ప్ర : తే = ఆ గోపాలురు, సః విభుః = ఆ ప్రభువు (కృష్ణుడు), బాల–లీలయా = పసితనపు ఆటగా (బాలస్య లీలా), ఇమాని = ఈ, వ్రజ–మందిరాణి = గోకులంలోని ఇండ్లలోనికి (వ్రజే మందిరాణి), **ప్రవేక్ష్యతి** బత = చొరబడతాడేమో (ప్ర+విశ ప్రవేశనే–ల్యట్–ప్ర.ఏ.), ఇతి+ఇవ = అన్నట్లుగా, వ్రజ – మందిరాణి = గోకుల గృహాలను (గేహం కుటం మందిరమ్–హలాయుధకోశః–291), లసత్... తోరణైః : లసత్ = ప్రకాశించెడి, పతాక = జెండాకఱ్ఱలు, ధ్వజ = ధ్వజాలు, కుంభ = కలశాలు, తోరణైః = తోరణాలతో (లసంత్యశ్చ తాః పతాకాః ధ్వజాః కుంభాః చరణాని చ, తైః), అంజసా = చక్కగా, విభాసితాని = ప్రకాశింపజేయబడినవిగా, వితేనుః = చేసిరి. (వి+తనూ విస్తారే పరస్మైపది–లిట్–ప్ర.బ.).

**తా ॥** గోకులంలో పుట్టిన ఆ ప్రభువు (కృష్ణుడు) బాల క్రీడలలో భాగంగా తమ ఇంట చొరబడతాడేమో అన్నట్లుగా గోకులంలోని వారు అందరూ తమ ఇండ్లను పతాకలతో, పతాకధ్వజాలతో, కలశాలతో, తోరణాలతో చక్కగా అలంకరించారు.

వి : 1. కృష్ణజననమే గోకులాంకరణ హేతువు. కానీ కృష్ణుడు తమ ఇంట్లో ప్రవేశిస్తాడేమో అన్న దానిని హేతువుగా చూపటం హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **వితేనుః :** | వితతాన | వితేనతుః | **వితేనుః** |
| | వితేనిథ | వితేనథుః | వితేన |
| | వితతాన/వితతన | వితేనివ | వితేనిమ. |

*

**శ్లో॥ స పాలయిష్యన్ సదయావలోకై–రిమాన్ కృతార్థాన్ రచయిష్యతీతి ।**
**హృదేవ వత్సవ్రజగోవృషాదీ–నలమ్ప్రచక్రుః సహరిద్రతైలైః ॥ 2-20**

అ : కృష్ణజననవేళలోని గోకులాంలకరణ వర్ణనమే. – ఉపేంద్రవజ్ర.

అ : సః సదయావలోకైః ఇమాన్ పాలయిష్యన్ కృతార్థాన్ రచయిష్యతీతి హృదా+ఇవ వత్స–వ్రజ–గో–వృషాదీన్ సహరిద్ర–తైలైః అలంప్రచక్రుః.

ప్ర : సః = ఆ కృష్ణుడు, స–దయా+అవలోకైః = కృపాకటాక్షాలతో, ఇమాన్ = వీరిని, పాలయిష్యన్ = కాపాడుతూ, కృతార్థాన్ = కృతకృత్యులనుగా, రచయిష్యతి+ఇతి = చేయగలడను, హృదా+ఇవ = తలంపుతోనో అన్నట్లు, వత్స... దీన్ = వత్స = దూడల యొక్క వ్రజ = సమూహాలతో పాటు, గో = ఆవులు, వృష+ఆదీన్ = ఎద్దులు మొదలగువాటిని, స హరిద్ర–తైలైః = పసుపుతో కూడిన నూనెలతో, అలమ్ = చాలినట్లుగా, ప్రచక్రుః = అలంకరించారు. (ప్ర+కృఞ్–కరణే–పరస్మైపది–లిట్–ప్ర.బ.).

**తా ॥** ఈ కృష్ణుడు (భవిష్యత్తులో) తన కృపాకటాక్షాలతో కాపాడుతూ కృతకృత్యులను చేయగలడని భావించి గోపాలురు తమ ఆవులను, ఎద్దులను దూడలతో సహా పసుపు కలిపిన నూనెలతో అలంకరించారు.

వి : 1. ఇతి హృదా+ఇవ – ఆ తలపుతోనో అన్నట్లు అని హేతువును ఉత్ప్రేక్షించటం వలన హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రచక్రుః :** | ప్రచకార | ప్రచక్రతుః | **ప్రచక్రుః** |
| | ప్రచకర్థ | ప్రచక్రథుః | ప్రచక్ర |
| | ప్రచకార/ప్రచకర | ప్రచకృవ | ప్రచకృమ. |

*

**శ్లో॥ ఇత్థం త్వమత్ర శిశుభావముపేత్య సాక-మస్మాభిరీశ! విహరేతి వదన్నివాస్మై ।**
**దధ్నా ఘృతేన పయసా నవనీతజాతైః – స్నిగ్ధస్తదైత్య విజహార కుమారవర్గః॥2-21**

అ : గోపబాలకులు కృష్ణుని చూడవచ్చి ఆటలాడుకొనుట. – వసంతతిలక.

అ : ఈశ త్వమ్ అత్ర (వ్రజే) శిశుభావమ్ ఉపేత్య అస్మాభిః సాకం విహర ఇతి అస్మై వదన్ ఇవ స్నిగ్ధః కుమారవర్గః ఏత్య దధ్నా ఘృతేన పయసా నవనీత–జాతైః తదా విజహార.

ప్ర : ఈశ! = ప్రభూ! త్వమ్ = నీవు, అత్ర–వ్రజే = ఈ గోకులంలో, శిశు–భావమ్ = పసివానిరూపాన్ని (శిశోః భావః, తమ్), ఉపేత్య = పొంది (ఉప+ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అస్మాభిః **సాకమ్** = మాతో బాటు (సాకం సార్ధం సమం సత్రం సహార్థే సంప్రకీర్తితాః–హలాయుధకోశః–877), ఇత్థమ్–విహర = ఇలా ఆడుకొనుము, ఇతి = అని, అస్మై = ఆ కృష్ణునకు, వదన్+ఇవ = చెప్తున్నదో అన్నట్లు, స్నిగ్ధః = స్నేహశీలమైన, కుమార–వర్గః = బాలుర సమూహం (కుమారాణాం వర్గః), ఏత్య = వచ్చి (ఆ+ఇ గతౌ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), దధ్నా = పెరుగుతోను, ఘృతేన = నేతితోను, పయసా = పాలతోనూ, నవనీత–జాతైః = వెన్నముద్దలతోనూ (నవనీతానాం జాతాని, తైః), తదా = ఆ సమయంలో, విజహార = ఆడుకొనెను. (వి+హృఞ్ హరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** "స్వామీ! నువ్వు ఇక్కడే మా గోకులంలోనే పసివాడవై ఉండి ఇలాగే ఆడుకో" అని చెప్తున్నట్లుగా స్నేహశీలత గల గోబాలకుల సమూహం వచ్చి, పాలు పెరుగు వెన్న నేయిలతో అప్పుడు ఆడుకొన్నారట.

వి : 1. పాలు, పాలకు సంబంధించిన పదార్థాలలోనూ స్నిగ్ధత ఉంటుంది కాబట్టి అవే జీవికగా ఉన్న ఆ గోపబాలురలో కూడా అదే స్నిగ్ధత ఉంది. కారణ గుణాలు కార్యంలో సంక్రమించాయి. దానిని సమాలంకార మంటారు. "**సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః**".

| | | | |
|---|---|---|---|
| 2. **విజహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. |

*

**శ్లో॥ విధౌ ప్రశాన్తేఽభ్యుదితే జనోఽయ – మభుఙ్క్త భోగాన్ పునరుష్ణభానౌ ।**
**కరోతి ధర్మాంశ్చకితస్తథా తద్ – బిభేతి సర్వః పరుషాన్న శాన్తాత్ ॥ 2-22**

అ : సూర్యోదయవేళల ప్రజల కర్మ ప్రవృత్తిని సమర్థించుట. – ఉపేంద్రవజ్ర.

అ : ప్రశాంతే విధౌ అభ్యుదితే అయం జనః భోగాన్ అభుంక్త. పునః ఉష్ణ–భానౌ అభ్యుదితే చకితః ధర్మాన్ కరోతి. తత్ తథా. సర్వః పరుషాత్ బిభేతి శాంతాత్ న (బిభేతి).

ప్ర : ప్రశాంతే = ప్రశాంతంగా ఉన్న, విధౌ = చంద్రుడు, అభి+ఉదితే = ఉదయించగా, అయమ్ = ఈ, జనః = జనం, భోగాన్ = సుఖాలను, అభుంక్త = అనుభవించెను, (భుజ్ – పాలనాభ్యవహారయోః–ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.), పునః = ఆ తరువాత (మరల), ఉష్ణ–భానౌ = వేడి వెలుగుల వాడు (సూర్యుడు), (ఉష్ణాః భానవః యస్య తస్మిన్), అభ్యుదితే = ఉదయించగా, చకితః = భీతిల్లినదై, ధర్మాన్ = (శాస్త్రోక్త)ధర్మాలను, కరోతి = చేస్తోంది. (కృ కరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తత్ = అది, తథా = అలాగే, సర్వః = అంతయు (అందరు), పరుషాత్ =

క్రూరునివలన, బిభేతి = భయపడును (భీ భయే పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), శాంతాత్ = శాంతుని వలన, (న బిభేతి) = భయపడదు.

**తా ॥** ప్రశాంతంగా ఉండే చంద్రుడు ఉదయించినప్పుడే భోగాలను అనుభవించిన జనం వేడి వెలుగుల సూర్యుడు ఉదయించగానే మరల తమ విధుల వైపు తిరిగింది. అంతేమరి. లోకం పరుషంగా వుండే వాణ్ణి చూసి భయపడుతుంది. శాంతంగా వుండేవాడిని చూసి భయపడదు.

**వి :** 1. సూర్యచంద్రులు తమతమ నైసర్గిక లక్షణాలతోనే ప్రవర్తిస్తున్నారు. కానీ వాటిలో శాంతత్వ పరుషత్వాలను భావించటం మన ఆలోచనలను అక్కడ ప్రక్షేపించటమే.

2. ఇది అర్థాంతరన్యాసాలంకారం. విశేషాన్ని సామాన్యంతో సమర్థించటం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః**'.

| | | | |
|---|---|---|---|
| 3. **అభుంక్త :** | **అభుంక్త** | అభుంజాతామ్ | అభుంజత |
| | అభుంక్థాః | అభుంజాథామ్ | అభుంగ్ధ్వమ్ |
| | అభుంజి | అభుంజ్వహి | అభుంజ్మహి |
| **బిభేతి :** | **బిభేతి** | బిభీతః | బిభ్యతి |
| | బిభేషి | బిభీథః | బిభీథ |
| | బిభేమి | బిభీవః | బిభీమః. |

*

**శ్లో॥ నభః స్పృశన్నున్ముఖదీప్తివృన్దై - రసౌ క్రమేణోర్ధ్వమియాయ భాస్వాన్ ।**
**తథాహి తద్విష్ణుపదానుసక్త - కరః కథం నోర్ధ్వముపైతి లోకః ॥ 2-23**

**అ :** సూర్యుడు పైపైకి పోవటాన్ని వర్ణించుట. - ఉపేంద్రవజ్ర.

**అ :** అసౌ భాస్వాన్ ఉన్ముఖ-దీప్తి-వృందైః నభః స్పృశన్ క్రమేణ ఊర్ధ్వమ్ ఇయాయ. తథాహి తద్విష్ణుపదానుసక్త-కరః లోకః ఊర్ధ్వం కథం న ఉపైతి.

**ప్ర :** అసౌ= ఈ, భాస్వాన్ = సూర్యుడు, ఉన్ము... వృందైః : ఉన్ముఖ = ఊర్ధ్వముఖంగా ఉన్న, దీప్తి = కిరణాలయొక్క, వృందైః = సమూహాలతో, (ఉన్ముఖాశ్చ తాః దీప్తయః, తాసాం వృందాః, తైః), నభః = ఆకాశాన్ని, స్పృశన్ = తాకుతూ, క్రమేణ = క్రమంగా, ఊర్ధ్వమ్ = పైకి, ఇయాయ = వచ్చెను. తథాహి = అది యుక్తమే. తద్... కరః : తత్ =అ, విష్ణుపద = విష్ణు పాదాలపై/ ఆకాశంపై, అనుసక్త = తగుల్కొనినట్టి, కరః = చేయిగలిగిన/ కిరణాలు గలిగిన (విష్ణుపదే అనుసక్తాః కరాః యస్య సః), లోకః = లోకం, ఊర్ధ్వమ్ = పైకి, కథమ్ = ఎలా, న **ఉపైతి** = రాదు (ఉప- ఇ గతౌ ధాతువు పరస్మైపది- లట్-(ప్ర.ఏ.).

**తా ॥** సూర్యుడు ఊర్ధ్వముఖంగా ప్రసరిస్తున్న కిరణాలతో ఆకాశాన్ని తాకుతూ క్రమంగా పైపైకి వచ్చాడు. నిజమే మరి. విష్ణుపదాసక్తకరాలు ఉంటే ఎవరయినా పైకి వస్తారు గదా! (హరిపాదాలను శరణుజొచ్చితే అధోగతి కలుగదని భావం.)

**వి :** 1. ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారం. సూర్యగమనరూపవిశేషాన్ని నారాయణసేవా పరుడైన భక్తుని నడవడి అను సామాన్యంతో సమర్థించటం వలన అర్థాంతరన్యాసం. అయితే దానికి 'విష్ణుపద - కర' పదాలకు గల రెండు అర్థాలు సహకరిస్తాయి. కాబట్టి శ్లేషాలంకారంతో కూడిన అర్థాంతరన్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయంతి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః. |

*

**శ్లో॥ సోమాన్వయే జాతమినో నిరీక్ష్య - రామానుజం మన్యుమివాదధానః ।**
**రాగం పరిత్యజ్య బభూవ తీక్ష్ణః - శ్రేయోఽనుజస్యాపి న వై సహన్తే ॥ 2-24**

అ : సూర్యుడు క్రమక్రమంగా వేడిని పెంచుకొనటాన్ని కవి అన్యథా ఉత్ప్రేక్షించుట. -ఇంద్రవజ్ర.

అ : ఇనః సోమాన్వయే జాతం రామానుజం నిరీక్ష్య మన్యుమ్ ఆదధాన ఇవ రాగం పరిత్యజ్య తీక్ష్ణః బభూవ. వై అనుజస్య అపి శ్రేయః న సహన్తే.

ప్ర : ఇనః = సూర్యుడు, సోమ+అన్వయే = సోమ (చంద్ర) వంశంలో, జాతమ్ = పుట్టినట్టి, రామ+అనుజమ్ = బలరాముని సోదరుడు కృష్ణుని/ రాముని తమ్ముని లక్ష్మణుని, నిరీక్ష్య = చూసి (నిర్-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మన్యుమ్ = కోపాన్ని, ఆదధానః ఇవ = పొందుతున్నట్లుగా, రాగమ్ = ఎఱ్ఱదనాన్ని/ప్రేమను, పరిత్యజ్య = విడిచి, తీక్ష్ణః = వాడిగా, బభూవ = అయ్యెను (భూ సత్తాయాం-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), వై = యుక్తమే, అనుజస్య+అపి = తమ్మునిదే అయినను, శ్రేయః = శ్రేయస్సును, న **సహంతే** = ఓర్వలేరు (సహ మర్షణే-ఆత్మనేపది-లట్-ప్ర.బ.).

**తా ॥** రామానుజుడంటే రాముని తమ్ముడు. రాముని తమ్ముడు గతంలో (దశరథ తనయుడుగా) సూర్యవంశంలో పుట్టాడు. ఇప్పుడు (బలరాముని తమ్ముడుగా) చంద్ర-వంశంలో పుట్టాడు. దానితో సూర్యుడికి కోపం వచ్చిందేమో అన్నట్లు సూర్యుడు రాగాన్ని (ఎఱ్ఱదనాన్ని, ప్రేమను) వదలిపెట్టి తీక్ష్ణంగా మారాడు. అంతేమరి. తన తమ్ముడే అయినా ఎదుగుతుంటే సహించగలమా?

వి : 1. ఇక్కడ 'సమాధి' అనే అర్థగుణం. అన్యచ్ఛాయా యోని (పాతగాథలను తీసికొని స్వభావకల్పన చేయటం). ఈ శ్లోకంలో కనిపిస్తోంది. '**అర్థదృష్టిః సమాధిః**'. (కావ్యాలంకారసూత్రః 3-2-6)

2. ఈ శ్లోకంలో కూడా శ్లేషగర్భితమైన అర్థాంతరన్యాసాలంకార ముంది. 'మన్యుమ్ ఆదధాన ఇవ' అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం.

3. సూర్యుడికి రామానుజుడు చంద్రవంశంలో పుట్టాడని చంద్రునిపై కోపం. చంద్రుడు సూర్యుని తరువాత (రాత్రి) పుట్టాడు కాబట్టి సూర్యుని తమ్ముడని లౌకికవ్యవహారం.

| | | | |
|---|---|---|---|
| 4. **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ |
| **సహంతే :** | సహతే | సహేతే | **సహన్తే** |
| | సహసే | సహేథే | సహధ్వే |
| | సహే | సహావహే | సహామహే. |

*

**శ్లో॥ మ్లానం విధత్తే న ముఖం జనానాం - ఛాయాశ్రితానామపి తిగ్మభానుః ।**
**క్రూరోఽపి మర్త్యః స్వకళత్రసాన్ద్ర-సమ్బన్ధభాజాం న హి తాపదాయీ ॥ 2-25**

అ : సూర్యప్రవృత్తిని లౌకికజనప్రవృత్తిని అనుసంధానం చేసి వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

అ : తిగ్మ-భానుః అపి ఛాయాశ్రితానాం జనానాం ముఖం మ్లానం న విధత్తే. మర్త్యః క్రూరః అపి స్వ-కళత్ర-సాంద్ర-సంబంధ-భాజాం తాప-దాయీ న భవతి హి.

ప్ర : తిగ్మభానుః - అపి = తీక్ష్ణ కిరణాలు గల సూర్యుడు కూడా (తిగ్మాః భాసవః యస్య సః), ఛాయా +

ఆశ్రితానామ్ = నీడను చేరిన, తనభార్య అయిన ఛాయను ఆశ్రయించిన (ఛాయా కాంతిః సూర్యజాయా ప్రతిబింబమనా తపః-హలాయుధకోశః), జనానామ్ = జనులయొక్క, ముఖమ్ = ముఖాన్ని, మ్లానమ్ = వాడినదిగా (మ్లై హర్షక్షయే ధాతువుపై క్త ప్రత్యయం), న **విధత్తే** = చేయదు (వి+ధా ధారణపోషణయోః ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), మర్త్యః = మనిషి, క్రూరః(సన్)అపి = క్రూరుడైననూ, స్వ... భాజామ్ : స్వ = తనయొక్క, కళత్ర = భార్యతో, సాంద్ర = సన్నిహిమైన, సంబంధ = సంబంధాన్ని, భాజామ్ = కలిగివున్న వారికి (స్వస్య కళత్రం, తేన సాంద్రం సంబంధం భాజన్తే ఇతి సాంద్ర-సంబంధాభాజః, తేషాం), తాప-దాయీ = తాపం కలిగించువాడుగా (తాపస్య దాయీ), న **భవతి** హి = కాదు గదా! (భూ సత్తాయామ్ పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** నీడకు చేరిన వారి ముఖాలను కానీ, తన భార్యను ఆశ్రయించినవారి ముఖాలను కానీ సూర్యుడు వాడిపోయేటట్లు చేయదు. లోకంలో మనిషి క్రూరుడైనా భార్యకు సన్నిహితులయిన వారికి సంతాపాన్ని కలిగించదు గదా!

**వి :** 1. 'ఆలివైపు వారు ఆత్మబంధువులు' అన్నమాట లోకంలో ప్రసిద్ధం. అది కొన్ని బలహీనతలకు సంబంధించిన ఒక సామాజిక వాస్తవం. 'ఛాయా' శబ్దానికి గల రెండర్థాల (శ్లేష) సహకారంతో కవి సూర్యునిలో కూడా ఆ బలహీనతనే చూపిస్తున్నాడు.

2. ఇక్కడ శ్లేషాలంకారం, తన్మూలకమైన అర్థాంతరన్యాసాలంకారం స్పష్టంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 3. **విధత్తే :** | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | విధత్సే | విదధాథే | విదధ్ద్వే |
| | విధధే | విదధ్వహే | విదధ్మహే |
| **భవతి :** | **భవతి** | భవతః | భవన్తి |
| | భవసి | భవథః | భవథ |
| | భవామి | భవావః | భవామః. |

*

**శ్లో॥ యతో హి గోరూపధరాం ధరిత్రీం - స పాలయిష్యన్ హరిరావిరాసీత్ ।**
**సహానుకూలైరమరైః స్వకీయైః - తతస్స గోపాలకవంశజోఽభూత్ ॥ 2-26**

**అ :** కృష్ణుడు గోపాలక వంశంలో పుట్టడానికి హేతుబద్ధమైన సమర్థన.

**అ :** సః హరిః యతః గో-రూప-ధరాం ధరిత్రీం పాలయిష్యన్ ఆవిరాసీత్ తతః సః అనుకూలైః స్వకీయైః అమరైః సహ గో-పాలక-వంశజః అభూత్.

**ప్ర :** సః హరిః = ఆ కృష్ణుడు, యతః = ఎందువలన, గో-రూప-ధరామ్ = గో(భూ) రూపాన్ని ధరించిన (భూమికి గోవని కూడా పేరు), ధరిత్రీమ్ = భూమిని, పాలయిష్యన్ = రక్షించుటకు (పాల ధాతువుపై శతృ ప్రత్యయం), ఆవిరాసీత్ = పుట్టెనో (ఆవిః+అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.) (ప్రాకాశ్యే ప్రాదురావిః స్యాత్-అమరకోశం-అవ్యయవర్గం-12), తతః = అందువలన, సః = ఆ కృష్ణుడు, అనుకూలైః = తనకు తగినట్లుగా నుండి, స్వకీయైః = తనవారైన, అమరైః సహ = దేవతలతో కూడా, గో-పాలక-వంశ-జః = గోపాలుర వంశంలో పుట్టినవాడుగా, అభూత్ = అయ్యెను.(భూ సత్తాయామ్ పరస్మైపది- -లుఙ్-ప్ర.ఏ.).

**తా ॥** ధరిత్రి గోరూపాన్ని ధరించినది. ఆమెకు గోవని కూడా పేరు. ఆ గోరూపధరిత్రిని రక్షించబోతూ కృష్ణుడు జన్మిస్తున్నాడు. కాబట్టి తనకు అనుకూలురై తనవారుగా వుండే దేవతలతో కలిసి గోపాలురవంశంలోనే జన్మించాడు.

| **వి : 1. అవిః + ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ | |
|---|---|---|---|---|
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త | |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ | * |

**శ్లో॥ అజన్మనస్తస్య హి జాతకర్మ - విధాయ విప్రా విదధుర్విధిజ్ఞాః ।**
**మధోః కులేఽజాతమపి స్వమన్త్ర-మధుశ్రియా మాధవమాదిదేవమ్ ॥ 2-27**

**అ :** కృష్ణునకు జాతకర్మాదికాలను నిర్వహించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** విధిజ్ఞాః విప్రాః అజన్మనః తస్య జాతకర్మ విధాయ మధోః కులే అజాతమ్ అపి (తమ్) ఆదిదేవమ్ స్వమంత్రమధుశ్రియా మాధవం విదధుః హి.

**ప్ర :** విధి-జ్ఞాః = శాస్త్రమెరిగిన (విధిం జానన్తి ఇతి), విప్రాః = బ్రాహ్మణులు, అజన్మనః = పుట్టుకయే లేని, తస్య = ఆ కృష్ణునకు, జాతకర్మ = పుట్టినతర్వాత చేసే వైదికకర్మ (షోడశ సంస్కారాలలో ఒకటి), విధాయ = జరిపించి (వి పూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం). మధోః = మధువు యొక్క (మధువు ఒక యాదవుని పేరు), కులే = వంశమందు, అజాతమ్ అపి = పుట్టకపోయినను, తమ్ - ఆదిదేవమ్ = ఆ కృష్ణుని (ఆదిశ్చ అసౌ దేవః, తమ్), స్వమంత్రమధుశ్రియా : స్వ = తమ యొక్క, మంత్ర = మంత్రాలయొక్కయు, మధు = (జాతకర్మాంగంగా ఇచ్చిన) తేనె యొక్కయు, శ్రియా = వర్చస్సుతో (స్వేషాం మంత్రాణాం మధునశ్చ శ్రీః, తయా), మాధవమ్ = మాధవునిగా, విదధుః హి = చేసిరి గదా! (వి - ధా ధారణపోషణయోః-పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** శాస్త్రవిహితకర్మ స్వరూప మెరిగిన బ్రాహ్మణులు అసలు పుట్టుకయే లేకపోయినా శిశువుగా అవతరించి ఉన్నాడు కాబట్టి కృష్ణునకు జాతకర్మ జరిపించారు. తాను మధువంశంలో పుట్టకపోయినా తమ మంత్ర మధుకాంతితో కృష్ణుని మాధవుని చేశారు.

**వి :** 1. షోడశ సంస్కారాలు :

1. గర్భాధానం 2. పుంసవనం 3. సీమంతోన్నయనం 4. జాతకర్మ 5. నామకరణం 6. అన్నప్రాశనం 7. చౌలం 8. ఉపనయనం 9. ప్రాజాపత్యం 10. సౌమ్యం 11. ఆగ్నేయం 12. వైశ్వదేవం 13. గోదానం 14. సమావర్తకం 15. వివాహం 16. అంత్యకర్మ

1-15 = పూర్వ కర్మలు 16 = అపరకర్మ.

2. ఈశ్లోకంలో విధ్యలంకారముంది. మాధవుడింతకు ముందు కూడా మాధవుడే. ఇప్పుడు మరల ఆయనను మాధవుని చేయటం విధ్యలంకారం. '**సిద్ధస్యైవ విధానం యత్ తమాహుః విధ్యలంకృతిమ్**'

| 3. **దధుః :** | దధౌ | దధతుః | **దధుః** | |
|---|---|---|---|---|
| | దధిథ/దధాథ | దధథుః | దధ | |
| | దధౌ | దధివ | దధిమ. | * |

**శ్లో॥ తతః స కృష్ణః కృతజాతకర్మా - ప్రచక్రమేఽమ్బాస్తనపానకర్మ ।**
**స్వవీక్షణేనైవ ముహుః సృతం త-త్పయో ముధా స్యాదితి చిన్తయేవ ॥ 2-28**

**అ :** జాతకర్మానంతరం కృష్ణుడు యశోదాస్తన్యాన్ని గ్రోలటాన్ని వర్ణించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః కృత-జాత-కర్మా స కృష్ణః అంబా-స్తన-పాన-కర్మ స్వ-వీక్షణేన ఏవ ముహుః సృతం తత్పయః ముధా స్యాత్ ఇతి చిన్తయా ఇవ ప్రచక్రమే.

**ప్ర :** తతః = జాతకర్మ తరువాత, కృత-జాతకర్మా = చేయబడిన జాతకర్మ గల (కృతం జాతకర్మ యస్య సః), సః కృష్ణః = ఆ కృష్ణుడు, అంబా... కర్మ : అంబా = తల్లియొక్క, స్తన-పాన = రొమ్ము కుడిచెడి, కర్మ = పనిని (అంబాయాః స్తనయోః పానం, తచ్చ తత్ కర్మ), స్వ... నైవ : స్వ = తనయొక్క, వీక్షణేన+ఏవ = చూచుటతోనే (స్వస్య వీక్షణమ్, తేన), ముహుః = మాటిమాటికి, సృతమ్ = స్రవించిన (కారిన) (సృ ధాతువుపై క్త ప్రత్యయం), తత్ = ఆ యశోదయొక్క, పయః = పాలు, ముధా స్యాత్ = వ్యర్థమౌతాయను, చిన్తయా-ఇవ = ఆలోచనచేతనేమో అన్నట్లు, ప్రచక్రమే = ప్రారంభించెను. (ప్ర-క్రము పాదవిక్షేపే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** ఆ తరువాత కృష్ణుడు తల్లిపాలను త్రాగటం ప్రారంభించాడు. జాతకర్మ అయినా కాకముందే పాలను త్రాగటానికి ఉపక్రమించటానికి కారణం - అప్పటికే తనను చూడటంతోనే స్రవిస్తున్న ఆ యశోదాస్తన్యం వ్యర్థమై పోతుందేమో అన్న ఆందోళన.

**వి :** 1. తనను చూడటంతోనే స్రవించిన యశోదాస్తన్యం వ్యర్థమవుతుందేమో అని కృష్ణుడు స్తన్యపానానికి ఉపక్రమించాడని ఊహించటం హేతూత్ప్రేక్ష. కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ప్రచక్రమే :** | **చక్రమే** | చక్రమాతే | చక్రమిరే | |
| | చక్రమిషే | చక్రమాథే | చక్రమిధ్వే | |
| | చక్రమే | చక్రమివహే | చక్రమిమహే | * |

**శ్లో॥ పురా జనన్యాః స్తనపానజాత-సుఖానభిజ్ఞోఽజనిరేష కృష్ణః ।**
**పపౌ స్తనక్షీరమతృప్తకల్పః - ప్రియేషు నూత్నేషు హి కస్య తృప్తిః॥ 2-29**

**అ :** కృష్ణుడు తల్లిపాలు త్రాగటంలోని ఆదుర్దాను వర్ణించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** అజనిః పురా జనన్యాః స్తన-పాన-జాత-సుఖానభిజ్ఞః ఏషః కృష్ణః అతృప్తకల్పః స్తన-క్షీరం పపౌ. హి. నూత్నేషు ప్రియేషు కస్య తృప్తిః?

**ప్ర :** అజనిః = పుట్టుకలేనివాడై (నాస్తి జనిః యస్య సః), పురా = అంతకుముందు, జనన్యాః = తల్లియొక్క, స్తన... భిజ్ఞః : స్తన-పాన = రొమ్మునుండి పాలు త్రాగుట చేత, జాత = కలిగిన, సుఖ = సుఖాన్ని, అనభిజ్ఞః = తెలియని వాడైన (స్తనయోః పానేన జాతస్య సుఖస్య అనభిజ్ఞః), ఏషః కృష్ణః = ఈ కృష్ణుడు, అతృప్తకల్పః = తృప్తి కలుగని వానివలె, స్తనక్షీరమ్ = రొమ్ము పాలను (స్తనయోః క్షీరమ్), పపౌ = త్రాగెను (పా పానే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), హి = యుక్తమే. నూత్నేషు = సరిక్రొత్తవయిన, ప్రియేషు = ఇష్టవిషయాలలో, కస్య = ఎవరికి, తృప్తిః? = తృప్తి కలుగుతుంది?

**తా ॥** నారాయణునకు అసలు పుట్టుకయే లేదు. కాబట్టి అంతకుముందు ఎప్పుడూ స్తనపాన సుఖమంటే ఎలా ఉంటుందో ఎరుగడు. కాబట్టి జాతకర్మ ముగియగానే పాలు త్రాగాడు. అదీ తృప్తి కలుగనట్లుగా. నిజమే క్రొత్తగా నచ్చిన విషయాలపై ఎవ్వరికీ తృప్తి కలుగదు.

**వి :** 1. జాతకర్మ అయిన వెంటనే కృష్ణుడు తల్లిపాలు త్రాగాడనీ, అప్పటిదాకా అవి వ్యర్థంగా స్రవిస్తున్నాయని అనటం ద్వారా, పుట్టిన వెంటనే జరిగే కార్యక్రమమే జాతకర్మ. బహుశః బొడ్డుకోయటం జాతకర్మలో ప్రధానం కావచ్చు. నామకరణం కూడా బిడ్డ పుట్టిన పదకొండవరోజే చేస్తున్నాం. అంతకుముందే జరిగే పని బొడ్డుకోయటం, స్థానికంగా ఉండే మరేవయినా ఆచారాలూ.

2. నూత్నేషు ప్రియేషు కస్య తృప్తిః అన్నది ఒక అందమైన మనోవిశ్లేషణ. దాన్ని సామాన్యవిషయం చేసి విశేషాన్ని సమర్థిస్తున్నాడు కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **పపౌ :** | పపౌ | పపతుః | పపుః | |
| | పపిథ/పపాథ | పపథుః | పప | |
| | పపౌ | పపివ | పపిమ. | * |

**శ్లో॥ బహూని పుణ్యాని స నన్దపత్న్యా - హృది స్థిరీకర్తుమురోజదుగ్ధమ్ ।**
**పపౌ ప్రదేశార్థితయేవ శౌరి - ర్నచేత్ సుతృప్తస్య కుతస్తదిచ్ఛా ॥ 2-30**

**అ :** కృష్ణుడు యశోదాస్తన్యాన్ని గ్రోలటాన్ని పుణ్యప్రదానంగా ఉత్ప్రేక్షించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః శౌరిః నందపత్న్యాః హృది బహుని పుణ్యాని స్థిరీకర్తుమ్ ప్రదేశార్థితయా ఇవ ఉరోజ-దుగ్ధం పపౌ. న చేత్ సుతృప్తస్య (తస్య) తదిచ్ఛా కుతః?

**ప్ర :** సః శౌరిః = ఆ కృష్ణుడు, నంద-పత్న్యాః = నందుని భార్య అయిన యశోదయొక్క (నందస్య పత్నీ, తస్యాః), హృది = మనస్సులో, బహూని = చాలా, పుణ్యాని = పుణ్యకర్మల ఫలితాన్ని, స్థిరీకర్తుమ్ = నిలపటానికి, ప్రదేశ+అర్థితయా+ఇవ = చోటును వెతుకుతున్నాడో అన్నట్లు (ప్రదేశస్య అర్థితా ప్రదేశార్థితా, తయా), ఉరోజ-దుగ్ధమ్ = రొమ్ము పాలను (ఉరోజస్య దుగ్ధమ్), పపౌ = త్రాగెను. న చేత్ = కాకపోతే, సు-తృప్తస్య = నిత్యతృప్తుడైన, తస్య = ఆ పరమాత్మకు, తత్+ఇచ్ఛా = పాలు త్రాగాలన్న కోరిక, కుతః? = ఎలా కలుగుతుంది.

**తా ॥** కృష్ణుడు అవతరించిన పసివాడు. పరమాత్మ స్వరూపంతో తాను నిత్యతృప్తుడు (ఏ కోరికా లేనివాడు). అటువంటివాడు యశోదాస్తన్యాన్ని త్రాగాలని కోరటంలోని ఆంతర్యం? ఆమె హృదయంలో అనేక పుణ్యఫలాలను నిక్షిప్తం చేయటానికి ప్రదేశాన్ని అన్వేషిస్తున్నాడట.

**వి :** 1. తైత్తిరీయోపనిషత్తు బ్రహ్మానందస్వరూపాన్ని వివరిస్తూ 'శ్రోత్రియస్య చ అకామహతస్య' (కోరికలతో చెడని శ్రోత్రియుని ఆనందం) అంటూ ఆ స్థితిని కూడా బ్రహ్మానంద స్వరూపమన్నది. ఇక తానే బ్రహ్మానంద స్వరూపుడైనప్పుడు తనకు కోరిక లేమిటి? అంటే ఆ కోరిక పరహితానికి సంబంధించినదే కానీ స్వలాభానికి సంబంధించినది కాదు. యశోదాహృదయంలో స్థానాన్ని అన్వేషించటం అని కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు. ఇది ఫలోత్ప్రేక్షాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **పపౌ :** | పపౌ | పపతుః | పపుః | |
| | పపిథ/పపాథ | పపథుః | పప | |
| | పపౌ | పపివ | పపిమ. | * |

**శ్లో॥ విభుర్యశోదాఙ్కగతోఽపిబత్స - స్తనం ప్రగృహ్యాన్యమురోజదుగ్ధమ్ ।**
**దృశాఽమృతం దానఫలం తదైవ - దిశన్నివామ్బాననమీక్షమాణః ॥ 2-31**

**అ :** కృష్ణుడు తల్లిపాలను త్రాగటాన్ని వర్ణించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** సః విభుః యశోదాంక-గతః అన్యం స్తనం ప్రగృహ్య దాన-ఫలమ్ అమృతం తదా ఏవ దృశా దిశన్ ఇవ అంబాననమ్ ఈక్షమాణః ఉరోజదుగ్ధమ్ అపిబత్.

**ప్ర :** సః విభుః = ఆ కృష్ణుడు, యశోదా+అంకగతః(సన్) : యశోదా = యశోదయొక్క, అంక = ఒడియందు (క్రోడమంకస్తథోత్సంగః - హలాయుధకోశః - 528) (యశోదాయాః అంకం గతః), గతః సన్ = చేరినవాడై, అన్యమ్ = మరియొక, స్తనమ్ = రొమ్మును, ప్రగృహ్య = (చేత) పట్టుకొని (గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), దాన-ఫలమ్ : దాన = దానం యొక్క (యశోద తనకు పాలివ్వటం యొక్క), ఫలమ్ = ఫలితాన్ని (దానస్య ఫలమ్), తదా + ఏవ = ఆ సమయంలోనే, దృశా = చూపుతో, **దిశన్** + ఇవ = ఇస్తున్నట్లుగా (దిశ ధాతువుపై

శతృ ప్రత్యయం), అంబాననమ్ : అంబా = తల్లియొక్క, ఆననమ్ = ముఖాన్ని (అంబాయాః ఆననమ్), ఈక్షమాణః (సన్) = చూస్తూ (ఈక్ష ధాతువుపై శానచ్ ప్రత్యయం), ఉరోజ-దుగ్ధమ్ = రొమ్ముపాలను (ఉరః - జ = ఉరోజ - గుండె యందు పుట్టినది), (ఉరోజస్య దుగ్ధమ్), అపిబత్ = త్రాగెను. (పా పానే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు యశోద ఒడిలో చేరి ఒక చంటి పాలు త్రాగుతూ వేరొక రొమ్మును చేతబట్టి యశోద తనకు పాలనిచ్చిన (దాన)ఫలాన్ని అప్పటికప్పుడేచూపులతో అందిస్తున్నట్లుగా ఆమె ముఖాన్ని చూస్తూ పాలు త్రాగాడు.

**వి :** 1. 'అత్యుత్కటైః పాపపుణ్యైరిహైవ ఫలమశ్నుతే" - అంటే పుణ్యమో, పాపమో మరీ ఎక్కువ అయితే ఫలితం వెంటనే అనుభవానికి వస్తుంది అన్నది విశ్వాసం.

2. స్తన్యపానసమయంలో వేరొక స్తనాన్ని చేతబట్టటం తల్లి ముఖమే చూస్తుండటం బాల స్వభావం. అందుకే ఇది స్వభావోక్త్యలంకారం.

3. పెద్దన మనుచరిత్రలో గణేశపరంగా ఈ చేష్టనే వర్ణిస్తూ చక్కని పద్యం వ్రాశాడు.

ఉ. **అంకము చేరి శైలతనయాస్తనదుగ్ధములానువేళ బా**
**ల్యాంకవిచేష్ట ఁదొండమున నవ్వలి చన్గబళింపబోయి యా**
**వంక కుచంబుగాన కహివల్లభహారము గాంచి వే మృణా**
**ళాంకురశంకనంటెడు గజాస్యుని ఁగొల్తు నభీష్టసిద్ధికిన్ ॥**

| | | | | |
|---|---|---|---|---|
| 4. **పపౌ :** | పపౌ | పపతుః | పపుః | |
| | పపిథ/పపాథ | పపథుః | పప | |
| | పపౌ | పపివ | పపిమ. | * |

**శ్లో॥ పూర్ణస్యాపూర్ణతాం మత్వా గోపీ గోపీనమందిరా ।**
**క్షీరస్యతీతి క్షణశః క్షీరం పాయయతి ప్రభుమ్ ॥ 2-32**

**అ :** యశోద కృష్ణునకు నిరంతరాయంగా పాలు పట్టుట. - పథ్యావక్త్రమ్.

**అ :** గో-పీన-మందిరా గోపీ పూర్ణస్య అపూర్ణతాం మత్వా క్షీరస్యతి ఇతి క్షణశః ప్రభుం క్షీరం పాయయతి.

**ప్ర :** గో... మందిరా : గో = గోవులతో, పీన = బలిసిన (నిండిన), మందిరా = ఇల్లు గలిగిన (గోభిః పీనం మందిరం యస్యాః సా), గోపీ = ఆ యశోద, పూర్ణస్య = పరిపూర్ణుడైన (ఏ కోరికా మిగలని) కృష్ణునికి, అపూర్ణతామ్ = నిండనితనాన్ని, మత్వా = తలచి (భావించి) (మను ధాతువుపై క్త్వా ప్రత్యయం), క్షీరస్యతి ఇతి = ఇంకా పాలుత్రాగ కోరుతున్నాడని (క్షీరపదంపై క్యచ్ ప్రత్యయంతో ధాతుత్వసిద్ధి-క్షీరస్య-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), క్షణశః = ప్రతిక్షణమూ, ప్రభుమ్ = కృష్ణునకు, క్షీరమ్ = పాలను, పాయయతి = త్రాగిస్తోంది. (పా పానే ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** యశోదా మందిరం గోవులతో నిండి ఉంటుంది. కాబట్టి ఆమె నిరంతరాయంగా పాలు పట్టగలదు. పూర్ణకాముడైన కృష్ణుని అపూర్ణకామునిగా భావించి, ఆమె కృష్ణుడింకా పాలుత్రాగాలని అనుకొంటూనే ఉన్నాడని కూడా భావించి, క్షణక్షణమూ పాలు పడుతోంది.

**వి :** 1. అంతకుముందు కృష్ణుడు పాలుత్రాగుతూ తనవైపు తదేకంగా చూడటాన్ని యశోద గమనించి దానిని 'ఇంకా కావాలంటున్నాడు' అని భావించి వుంటుంది. అందుకే 'క్షణశః' త్రాగిస్తోంది. ఆ చూపులోని కవిభావన ముందే తెలిసింది. అసలదంతా బాలచేష్ట.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **పాయయతి :** | **పాయయతి** | పాయయతః | పాయయన్తి | |
| | పాయయసి | పాయయథః | పాయయథ | |
| | పాయయామి | పాయయావః | పాయయామః. | * |

**శ్లో॥ తతః కదాచిత్ పథి పూతనాఖ్యా - స్వమాయయా రూపమవాప్య రమ్యమ్ ।**
**తమఙ్కమారోప్య విషానుషక్త-కుచం ముదాఽపాయయదమ్బుజాక్షమ్ ॥ 2-33**

**అ :** పూతన గోకులంలో ప్రవేశించి కృష్ణునికి తన స్తన్యాన్ని అందించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః కదాచిత్ పూతనాఖ్యా పథి స్వమాయమా రమ్యం రూపమ్ అవాప్య తమ్ అంకమ్ ఆరోప్య విషానుషక్తకుచం ముదా అంబుజాక్షమ్ అపాయయత్.

**ప్ర :** తతః = అటు తరువాత, కదాచిత్ = ఒకానొకప్పుడు, పూతనా+ఆఖ్యా = పూతన అను పేరుగల స్త్రీ (రాక్షసీ) (పూతనా ఇతి ఆఖ్యా యస్యాః సా), పథి = దారిలో (బయలుదేరినప్పటి రూపం వేరే), స్వ-మాయయా = తన విచిత్ర శక్తితో (స్వస్య మాయా - తయా), రమ్యమ్ = అందమయిన, రూపమ్ = స్వరూపాన్ని, అవాప్య = పొంది (అవపూర్వక ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తమ్ = ఆ బాలుని, అంకమ్ = ఒడిలోనికి, ఆరోప్య = ఎక్కించుకొని (ఆ-పూర్వక రుహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విషా... కుచమ్ : విష = విషంతో, అనుషిక్త = పూయబడిన, కుచమ్ = స్తనాన్ని (విషేణ అనుషిక్తః, సః చ అసౌ కుచః తమ్), ముదా = ఆనందంతో, అంబుజ+అక్షమ్ = కమలాక్షుని (అంబుజే ఇవ అక్షిణీ యస్య తమ్), అపాయయత్ = త్రాగించెను (పా పానే-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు పాలు త్రాగటం అభ్యసించిన కొంతకాలానికి ఒకనాడు పూతన అను ఒక స్త్రీ తన మాయతో దారిలో అందమైన రూపాన్ని ధరించి, కృష్ణుని చూచి, తన ఒడిలోనికి తీసికొని, విషాన్ని పూసిన తన స్తనాన్ని ఆనందంగా కృష్ణుని నోటికందించింది.

**వి :** 1. పూతనను పూర్తిగా పరిచయంలేదు. భాగవతకథను బట్టి ఆమె రాక్షసి అని తెలుసుకుంటాం. 'అనుక్తమన్యతో గ్రాహ్యమ్' - ప్రసిద్ధ కథలను కావ్యీకరించేటప్పుడు ఇటువంటి జారుపాట్లు జరగవచ్చు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అపాయయత్:** | **అపాయయత్** | అపాయయతామ్ | అపాయయన్ | |
| | అపాయయః | అపాయయతమ్ | అపాయయత | |
| | అపాయయమ్ | అపాయయావ | అపాయయామ. | * |

**శ్లో॥ పరిస్ఫురన్నూపురకఙ్కణోజ్జ్వలా - లసన్నితమ్బార్పితరత్నమేఖలా ।**
**దృగన్తసంస్తమ్భితమానిమండలా - తదోర్వశీవాస్తి విలోలకుణ్డలా ॥ 2-34**

**అ :** పూతనా సౌందర్య వర్ణన. -వంశస్థమ్.

**అ :** పరిస్ఫురన్నూపుర-కంకణోజ్జ్వలా లసన్నితంబార్పిత-రత్న-మేఖలా దృగన్త-సంస్తమ్భిత- మాని-మండలా విలోల-కుండలా(సా) తదా ఊర్వశీ+ఇవ అస్తి.

**ప్ర :** పరిస్ఫుర... జ్జ్వలా : పరిస్ఫురత్ = అంతటా ప్రకాశిస్తున్న, నూపుర = కడియాలచే, కంకణ = గాజులచే, ఉజ్జ్వలా = వెలుగొందుతున్నదియూ (పరితః స్ఫురద్భిః నూపురైః కంకణైశ్చ ఉజ్జ్వలా), లసన్నితంబార్పితరత్నమేఖలా : లసత్ = ప్రకాశిస్తున్న, నితంబ = మొలయందు, అర్పిత = ఉంచమడిన, రత్నమేఖలా = రతనాలు పొదిగిన మొలనూలు గలదియు (లసతి నితంబే అర్పితా రత్నమేఖలా యయా సా), దృగంత... మండలా : దృగంత = కడకంటి చూపులచే, సంస్తంభిత = చేష్టారహితులుగా చేయబడిన, మాని = అభిమానవంతుల యొక్క, మండలా

= సమూహం గలదియు (దృశామస్త్రైః స్తంభితం మానినాం మండలం యయా సా), విలోల-కుండలా = కదులుతున్న కుండలాలు గలదియు (విలోలే కుండలే యస్యాః సా), (సా = ఆ పూతన), తదా = ఆ సమయంలో, ఊర్వశీ+ఇవ = ఊర్వశి వలె, అస్తి = ఉండెను.

**తా ॥** పూతన రమణీయరూపాన్ని ధరించింది. ఆమె ఊర్వశివలె విరాజిల్లుతోంది. ప్రకాశిస్తున్న కడియాలు, గాజులతో, మొలపై విలసిస్తున్న రత్నమేఖలతో, కదలాడుతున్న కుండలాలతో ఆమె అందగిస్తూ తన కడకంటి చూపులతో అహంకారవంతులయిన పురుషులను నిశ్చేష్టులను చేస్తోంది.

**వి :** 1. ఊర్వశి దేవవేశ్యలలో ఒకతె.

**శ్లో॥ స్త్రియాం బహుష్వప్సరసః స్వర్వేశ్యా ఊర్వశీముఖాః ।**
**ఘృతాచీ మేనకా రంభా ఊర్వశీ చ తిలోత్తమా**
**సుకేశీ మంజుఘోషాద్యాః కథ్యంతేఽప్సరసో బుధైః ॥** **- అమరకోశః 1-53.**

ఊర్వశి, ఘృతాచి, మేనక, రంభ, తిలోత్తమ, సుకేశి, మంజుఘోష-వీరంతా దేవవేశ్యలు.

2. శ్లోకంలో పూతనకు వాడిన నాలుగు విశేషణాలలో మూడు అలంకారవిశేషాలకు సంబంధించినవి. ఒకటి నైసర్గికమయిన అనుభావం (పురుషాహంకారం సన్నగిల్లేటట్లు చూడగలగటం.)

3. నాల్గు పాదాలలోనూ చివర 'లా' నిలిచి అంత్యానుప్రాస సౌందర్యాన్ని శ్లోకానికి కలిగించింది. *

**శ్లో॥ స పూతనోచ్చస్తనకుమ్భచుమ్బి - ముఖారవిన్దో హరిరాబభాసే ।**
**విషం బహిష్ఠం ప్రమదాన్తరఙ్గే - సుపూరయంస్తన్ముఖవర్త్మనేవ ॥ 2-35**

**అ :** కృష్ణుడు పూతనాస్తన్యాన్ని పానం చేయటాన్ని కవి ప్రకారాంతరంగా ఉత్ప్రేక్షించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** పూతనోచ్చస్తన-కుంభ-చుంబి-ముఖారవిందః సః హరిః బహిష్ఠం విషం ప్రమదాంతరంగే తన్ముఖ-వర్త్మనా సుపూరయన్ ఇవ ఆబభాసే.

**ప్ర :** పూతనో... విందః : పూతనా = పూతనయొక్క, ఉచ్చ = ఎత్తైన, స్తన కుంభ = కడవ వంటి చన్నును, చుంబి = ముద్దిడుతున్న /తాకుతున్న, ముఖ+అరవిందః = ముఖపద్మం గల (స్తనః కుంభ ఇవ స్తనకుంభః, ఉచ్చశ్చాసౌ స్తనకుంభః ఉచ్చస్తనకుంభః, పూతనాయాః ఉచ్చస్తనకుంభం చుంబతి ఇతి పూతనోచ్చస్తనకుంభచుంబి - తాదృశమ్ ముఖారవిందం యస్య సః పూతనోచ్చస్తనకుంభచుంబిముఖారవిందః), సః = ఆ, హరిః = కృష్ణుడు, బహి-ష్ఠమ్ = (బహిః తిష్ఠతీతి), వెలుపల ఉన్న, విషమ్ = విషాన్ని, ప్రమదా-అంతరంగే: ప్రమదా = స్త్రీ అయిన పూతనయొక్క, అంతరంగే = లోపలకు (ప్రమదాయాః అంతరంగం - తస్మిన్), తన్ముఖవర్త్మనా : తత్ = ఆ రొమ్ము యొక్క, ముఖ = చూచుకము నందలి, వర్త్మనా = దారిగుండా (తస్య ముఖం తన్ముఖం - తన్ముఖమేవ వర్త్మ - తేన), సుపూరయన్నివ = బాగా నింపుతున్నట్లుగా, ఆబభాసే = చక్కగా ప్రకాశించెను (ఆ-భాసృ దీప్తౌ ఆత్మనేపది - లిట్-ప్ర.ఏ.).

**తా ॥** 1. కృష్ణుడు పూతనయొక్క ఎత్తైన స్తనకుంభాన్ని తన ముఖారవిందంతో ముద్దు పెట్టుకొన్నాడు. అది ఎలా ఉన్నదంటే ఆమె స్తనానికి వెలుపల పూసుకొన్న విషాన్ని ఆమె చూచుకరంధ్రాల బాటగుండా అంతరంగంలో కూడా నింపుతున్నట్లుగా ఉంది.

2. కృష్ణుడు పూతన అంతరంగాన్ని కూడా వెలుపలి విషంతో నింపుతున్నట్లుగా ఆమె స్తనాన్ని తన ముఖంతో చుంబించాడు. చుంబనఫలం విషపూరణం. కాని ఫలాన్ని ఫలంగా ఉత్ప్రేక్షించాడు కాబట్టి ఫలోత్ప్రేక్షాలంకారం. **"సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా"** - (కు.32)

3. చిల్లుగుండా పాత్రను నింపాలని చేస్తున్న ప్రయత్నం పసితనానికి సంకేతం సాధారణదృష్ట్యా. అనితరసాధ్యమైన పరమాత్మ మహత్త్వానికి సంకేతం పారమార్థికంగా. నింపు కొన్నవారికి నింపుకొన్నంత.

| | | | |
|---|---|---|---|
| 4. **ఆబభాసే :** | ఆబభాసే | ఆబభాసాతే | ఆబభాసిరే |
| | ఆబభాసిషే | ఆబభాసాథే | ఆబభాసిధ్వే |
| | ఆబభాసే | ఆబభాసివహే | ఆబభాసిమహే. |

*

**శ్లో॥ రమాధరోష్ఠామృతపానజాత-మహానుభావేన న పూతనాయాః ।**
**ఉరోజసఙ్గ్యార్తికరో గరోఽసౌ - బభూవ బాలస్య బలానుజస్య ॥ 2-36**

**అ :** పూతనాస్తన్యంలోని విషం కృష్ణునిపై ప్రభావం చూపకపోవటానికి కారణాన్ని వ్యక్తీకరించుట.-ఉపేంద్రవజ్ర.

**అ :** పూతనాయాః ఉరోజసంగీ అసౌ గరః బలానుజస్య బాలస్య రమాధరోష్ఠామృతపాన- జాతమహానుభావేన ఆర్తికరః న బభూవ.

**ప్ర :** పూతనాయాః = పూతనయొక్క, ఉరః+జ-సంగీ = రొమ్మునంటిన (ఉరోజేన సంగీ), అసౌ = ఆ, గరః = విషం (విషం స్యాద్గరళం గరః-హలాయుధకోశః-641), బల+అనుజస్య = బలరాముని తమ్ముడైన (బలస్య అనుజః - తస్య), బాలస్య = పసివాడైన కృష్ణునకు, రమా... భావేన : రమా = లక్ష్మియొక్క, అధర+ఓష్ఠ = క్రింది పెదవి యందలి, అమృత = అమృతాన్ని, పాన = త్రాగుటచేత, జాత = పుట్టిన, మహా+అనుభావేన = గొప్ప ప్రభావం గల (అనుభావః ప్రభావే స్యాత్ = వైజయన్తీ-శేష-8) (రమాయాః అధరోష్ఠామృతస్య పానేన జాతః మహాన్ చ అసౌ అనుభావః - తేన), ఆర్తి-కరః = దుఃఖకరం (ఆర్తేఃకరః) (దుఃఖం పీడా వ్యథార్తయః - వైజయన్తీ - భూమి - బ్రాహ్మణం - 178), న బభూవ = కాలేదు. (భూ సత్తాయామ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** పూతన స్తనాలపై నున్న విషాన్ని కృష్ణుని ముఖం చుంబించినా కూడా ఆ విషం ఆ కృష్ణునికి దుఃఖాన్ని కలిగించలేక పోయింది. కారణం ఆ కృష్ణుని ప్రభావమది. ఆ ప్రభావానికి కారణం లక్ష్మియొక్క అధరామృతాన్ని అంతకుముందే త్రాగి వుండటం. (ముందే అమృతం త్రాగియున్న వానిని ఆపై విషపానమేమీ చేయలేదని భావం).

**వి :** 1. కృష్ణావతారంలోని విశేషమదే. మానవుడుగా జన్మించినా మానవాతీతశక్తి యుక్తులను ప్రదర్శించటం. తన వారితో కలిసి జన్మించటమే కాక తన మహానుభావత్వాన్ని కూడా వెంట తెచ్చుకోవటం. అవసరమయినప్పుడే దానిని ప్రదర్శించటం. అదీ శైశవంలోనే. పసితనంలో తన నిసర్గశక్తినీ, పెరిగిన తర్వాత తన యుక్తినీ వినియోగించుకొని కనిపిస్తాడు.

2. రమాధరామృతపానాన్ని అమృతానికి విరుగుడుగా వాదిరాజు ప్రదర్శిస్తే మరోకవి రమనే విషస్వరూపంగా, హేతుబద్ధంగా ప్రకటిస్తాడు.

**శ్లో॥ హాలాహలో నైవ విషం విషం రమా - జనాః పరం వ్యత్యయమత్ర మన్వతే।**
**నిపీయ జాగర్తి సుఖేన తం శివః - స్పృశన్నిమాం ముహ్యతి నిద్రయా హరిః ॥**

కువలయానందం - ప్రతీపాలంకారోదాహరణం

(హాలాహలం విషం కాదు - లక్ష్మియే విషం. జనులీ విషయంలో తారుమారుగా ఆలోచిస్తున్నారు. విషం త్రాగిన శివుడు సుఖంగా జాగరూకుడై ఉన్నాడు. లక్ష్మిని స్పృశిస్తూ విష్ణువు నిద్రలో ఒళ్ళుమరచివున్నాడు).

3. ఇక్కడ కావ్యాలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - సమర్థన అవసరమయిన

విషయాన్ని సమర్థించటం. విషాన్ని చుంబించినా కృష్ణునిపై అది పనిచేయలేదు. విషవైఫల్యాన్ని సమర్థించవలసిన అవసరముంది. అందుకే రమాధరామృతపానాన్ని కారణంగా చూపి దానిని సమర్థించాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 4. **బభూవ :** | బభూవ | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ మరిష్యతో భోజపతేర్న జన్మ - తమః-శ్రమార్హస్య భవిష్యతీహ ।**
**ఇతీవ ధాత్రీమవధీత్ స తస్య - వ్రతీన్ద్రవృన్దార్చితపాదపీఠః ॥ 2-37**

**అ :** కృష్ణుడు పూతనను సంహరించుట - కారణసంభావన.

**అ :** తమః-శ్రమార్హస్య మరిష్యతః భోజ-పతేః ఇహ జన్మ న భవిష్యతి ఇతి ఇవ వ్రతీంద్ర- బృందార్చిత-పాద-పీఠః సః తస్య ధాత్రీమ్ అవధీత్.

**ప్ర :** తమః - శ్రమ + అర్హస్య = (చీకటి) నరకంలోని శ్రమానుభవానికి తగినవాడై (తమసి శ్రమః - తస్య అర్హః - తస్య), మరిష్యతః = మరణించబోతున్న (మృ ప్రాణత్యాగే ధాతువుపై శతృ ప్రత్యయం), భోజ-పతేః = భోజరాజునకు (కంసునకు) (భోజానాం పతిః - తస్య), ఇహ = ఈ లోకంలో, జన్మ = (మరల) పుట్టుక, న **భవిష్యతి** = కలుగదు (భూ సత్తాయామ్ పరస్మైపది-ల్రుట్-ప్ర.ఏ.), ఇతి - ఇవ = అన్నట్లుగా, వ్రతీ... పీఠః : వ్రతి+ఇంద్ర = యతిశ్రేష్ఠులయొక్క, బృంద = సమూహాలచేత, అర్చిత = పూజింపబడిన, పాద-పీఠః = పాదుకలు గల (వ్రతీనామ్ ఇంద్రాః - తేషాం బృందైః - అర్చితం పాదపీఠం - యస్య - సః), సః = ఆ కృష్ణుడు, తస్య = ఆ కంసునియొక్క, ధాత్రీమ్ = ఉపమాత (ఆయా)ను (ధీయతే ఇతి - ధాత్రీ) (ధాత్రీ స్యాదుపమాతా - హలాయుధకోశః - 507), అవధీత్ = చంపెను.(హన హింసాగత్యోః పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.).

**తా ॥** కంసుడు మరలిరాని నరకలోకాన్ని పొందటానికి తగినవాడు. కాబట్టి మరల ఈ లోకంలో జన్మించే అవకాశం లేదు. అటువంటప్పుడు పెంచి పోషించటానికి ఉపమాతల (ఆయాల) అవసరం లేదు. ఆ భావంతో యతిశ్రేష్ఠులు సమర్పించే పాదపీఠికలు గల ఆ కృష్ణుడు కంసుని ఉపమాత అయిన పూతనను చంపివేశాడు.

**వి :** 1. ముక్తిర్నిత్యా తమశ్చైవ నావృతిః పునరేతయోః - మహాభారతతాత్పర్యనిర్ణయః-1/88

మోక్షం వలెనే అంధకారం (నరకం) కూడా నిత్యం. పునర్జన్మ లేనిది. అయితే ఈ లెక్కన మోక్షం అనంతసుఖం. నరకం అనంత దుఃఖం.

2. కృష్ణుడు పూతనను చంపటం అవతారసంబంధి విషయం. వ్రతీంద్రవృందార్చిత పాదపీఠత్వం అవతారానికి పూర్వవిషయం. రెండింటినీ కలిపి చూడవలసి రావటమే అవతార విశేషం.

3. ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తు హేతుఫలాత్మనా**'-

పూతనను కృష్ణుడు చంపటానికి కారణం తనను ఆమె చంపటానికి ప్రయత్నించటమే. తన ఆత్మరక్షణలో భాగమే. కానీ పునర్జన్మ లేనిరీతిలో కంసుడు మరణించబోతున్నాడు కాబట్టి ఇక ఆయన ఉపమాత అవసరం ఈ లోకంలో లేదని చంపివేశాడనటం లేని కారణాన్ని ఊహించటం. అందుకే హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 4. **భవిష్యతి :** | **భవిష్యతి** | భవిష్యతః | భవిష్యంతి |
| | భవిష్యసి | భవిష్యథః | భవిష్యథ |
| | భవిష్యామి | భవిష్యావః | భవిష్యామః |

| | | | | |
|---|---|---|---|---|
| **అవధీత్ :** | **అవధీత్** | అవధిష్టామ్ | అవధిషుః | |
| | అవధీః | అవధిష్టమ్ | అవధిష్ట | |
| | అవధిషమ్ | అవధిష్వ | అవధిష్మ. | * |

**శ్లో॥ వ్రజస్థబాలగ్రహపీడితా సా - విషప్రదానస్య ఫలం ప్రపేదే ।**
**తథాహి కృత్యా మహతి ప్రయుక్తా - స్వకీయమృత్యుత్వముపైతి పృథ్వ్యామ్॥2-38**

**అ :** పూతనా మరణాన్ని ఆత్మకృతదోషంగా కవి నిరూపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** వ్రజస్థ-బాల-గ్రహ-పీడితా సా విష-ప్రదానస్య ఫలం ప్రపేదే. తథాహి. పృథ్వ్యామ్ మహతి ప్రయుక్తా కృత్యా స్వకీయ-మృత్యుత్వమ్ ఉపైతి.

**ప్ర :** వ్రజ... పీడితా : వ్రజ = గోకులమందు, స్థ = ఉన్నట్టి, బాల = బాలుడనెడి, గ్రహ = గ్రహం చేత, పీడితా (సతీ) = బాధింపబడినదై (వ్రజే తిష్ఠతీతి వ్రజస్థః, బాల ఏవ గ్రహః = బాలగ్రహః వ్రజస్థశ్చ అసౌ బాలగ్రహః - తేన పీడితా), సా = ఆ పూతన, విష- ప్రదానస్య = విషమిచ్చినందులకు, ఫలమ్ = ఫలితాన్ని, ప్రపేదే = పొందెను. (ప్ర+పద్(4) విశరణ- గత్యవవసాదనేషు-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తథా హి = అది యుక్తమే. పృథ్వ్యామ్ = లోకంలో, మహతి = గొప్పవానియందు, ప్రయుక్తా (సతీ) = ప్రయోగింపబడినదైన, కృత్యా = క్షుద్రపూజల వలన పుట్టిన శక్తి (కృత్యా త్వభిచారజదైవతే - వైజయంతీ - లింగసంగ్రహ - 32), స్వకీయ-మృత్యుత్వమ్ = తనను ప్రయోగించినవాని యొక్క మరణరూపాన్నే (స్వకీయస్య మృత్యుః తస్య భావః), ఉపైతి = పొందును (ఉప+ఇ-గతౌ పరస్మైపది-లట్ -ప్ర.ఏ.).

**తా ॥** గోకులంలోనున్న బాలగ్రహపీడకు గురి అయిన ఆ పూతన తాను విషాన్ని ప్రయోగించిన దాని ఫలితాన్ని వెంటనే పొందింది. అంతేగదా! లోకంలో తమకన్న (శక్తి యుక్తులు గల) మహనీయుల మీదకు కృత్యను ప్రయోగిస్తే అది తన చావుకే తెస్తుంది.

**వి :** 1. కృత్య - అభిచారహోమాదులద్వారా పుట్టే క్షుద్రశక్తి. దానిని మనలను మించిన వారిమీద ప్రయోగిస్తే అది విధిలేక మనమీదకే వచ్చి మన ప్రాణాలకే ముప్పు తెస్తుంది. దుర్వాసుడు అంబరీషునిపై అటువంటి కృత్యనే ప్రయోగించాడు. తర్వాత దుర్వాసుని ప్రాణాల మీదకే వచ్చి (చక్రం ద్వారా) అంబరీషుడే గతి అయినాడు దుర్వాసునకు. (భాగవతం నవమస్కంధం)

కృష్ణుడు ద్వారకను పాలిస్తున్నప్పుడు చెలరేగిన కరూషాధిపతిని (పౌండ్రక వాసుదేవుని) సంహరించాడు. ఆయన కొడుకు సుదక్షిణుడు తపస్సు చేసి శివుని మెప్పించి ఆయన ఉపదేశంతో అగ్నినుండి కృత్యను సృష్టించి శ్రీకృష్ణునిపై ప్రయోగించాడు. అప్పుడు కృష్ణుడు కృత్యనూ, సుదక్షిణుని కూడా సంహరించాడు చక్రంతో.

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని మీదకూడా కృత్యను ప్రయోగింపజేశాడు. అది ప్రహ్లాదుని ఏమీ చేయలేక ముక్కలై ప్రయోగించినవారి మీదనే పడి వారి చావుకు వచ్చింది. ప్రహ్లాదుని స్పర్శతో వారు స్వస్థులయ్యారు.

(విష్ణుపురాణం 1/18)

2. **కృత్యా**

యదా వై **కృత్యా** ముత్ఖనన్త్యథ సాలసామోఘా భవతి తథోఽ ఏవైష ఏతద్యద్యస్మాఽ అత్ర కశ్చిద్ ద్విషన్ భ్రాతృవ్యః కృత్యాం వలగాన్నిఖనతి **తానేవైతదుత్కిరతి** - శతపథబ్రాహ్మణం 3/5/413

3. శిశుపీడలు, బాలపీడలు, వాటికి కారణమైన వివిధ శక్తులు, వాటి నివారణకై దిష్టి తీయటం మొదలయిన

వివిధ ప్రక్రియలు అనాదిగా ఉన్నాయి. ఇప్పుడూ కొనసాగు తున్నాయి. అయితే ఇక్కడ బాలుడే గ్రహమై ఆమెను పట్టి పీడించాడు.

4. ఈ శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకార ముంది. పూతన కృష్ణునిపై విషప్రయోగం చేయగా అది వికటించటం ప్రకృతవిశేషవిషయం. దానిని సామాన్యవిషయంతో తన కన్న గొప్పవారి మీద ప్రయోగించిన కృత్య తన చావుకే కారణ మవుతుందన్న దానితో సమర్థించటం వలన అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య-విశేషయోః" - (కు.122)

| | | | |
|---|---|---|---|
| 5. **ప్రపేదే :** | ప్రపేదే | ప్రపేదాతే | ప్రపేదిరే |
| | ప్రపేదిషే | ప్రపేదాథే | ప్రపేదిధ్వే |
| | ప్రపేదే | ప్రపేదివహే | ప్రపేదిమహే |
| **ఉపైతి :** | **ఉపైతి** | ఉపైతః | ఉపయంతి |
| | ఉపైషి | ఉపైథః | ఉపైథ |
| | ఉపైమి | ఉపైవః | ఉపైమః. |

*

**శ్లో॥ అపి ప్రదత్తే గరళే శిశుం త-మభీతమాలోక్య భుజఙ్గసఙ్ఘాన్ ।**
**విభీషయన్తీ సమగాదధః సా - న చేద్విపర్యస్తమృతిః కథం స్యాత్ ॥ 2-39**

**అ :** పూతన నేలగూలిన అంశాన్ని కవి మరోవిధంగా ఉత్ప్రేక్షించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** గరళే ప్రదత్తే అపి అభీతం తం శిశుమ్ ఆలోక్య భుజంగ-సంఘాన్ విభీషయంతీ సా అధః సమగాత్. న చేత్ విపర్యస్తమృతిః కథం స్యాత్.

**ప్ర :** గరళే = విషం, **ప్రదత్తే**+అపి = ఇవ్వబడినను (ప్రపూర్వక దా ధాతువుపై క్త ప్రత్యయం), అభీతమ్ = భయపడని, తమ్ = ఆ, శిశుమ్ = పసివానిని, ఆలోక్య = చూసి (ఆ+లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భుజంగ-సంఘాన్: భుజంగ = పాముల యొక్క (భుజగభుజంగకుంభీనసపన్నగనాగభోగినః - హలాయుధకోశః - 640), సంఘాన్ = సమూహాలను (భుజంగానాం సంఘాః - తాన్), విభీషయంతీ = బెదిరిస్తూ (వి-భీ-ధాతువుపై శతృ ప్రత్యయం), సా = ఆమె, అధః = క్రింది లోకాలకు, అగాత్ = వెళ్ళెను (ఇణ్ గతౌ-పరస్మైపది-లుఙ్ (ప్ర.ఏ.), న-చేత్ = కాకపోతే, విపర్యస్త-మృతిః = తారుమారైన మరణం (విపర్యస్తా చ సా మృతిః), కథం **స్యాత్** = ఎలా జరుగుతుంది? (అస- భువి-పరస్మైపది-విధి లిఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** విషమిచ్చినా కూడా మరణించని, కనీసం బెదరని ఆ శిశువును చూసిన తర్వాత పూతనకు ఆ విషాన్ని సృష్టిస్తున్న పాముల మీదనే కోపం వచ్చిందట. వారిని బెదిరించాలని నేల గూలిందట. మరి పాములు పాతాళంలో (భూమి క్రిందనే) కదా నివసించేది. అది నిజం కాకపోతే ఈ **తారుమారు** చావు ఎలా జరుగుతుంది? (ఒకరు విషం తింటే మరొకరు మరణించటం).

**వి :** 1. ఈ శ్లోకంలో అసంగత్యలంకారం కనిపిస్తుంది. '**విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వోరసంగతిః**" అని అసంగతి లక్షణం (కు.85). కార్యకారణాలు భిన్నప్రదేశాలలో వుంటే అది అసంగత్యలంకారం. ఇక్కడ విషలిప్తమైన స్తనాన్ని చుంబించింది కృష్ణుడు. ఇది కారణం. కానీ చనిపోయింది పూతన. ఇది కార్యం. రెండు క్రియలు వేరు వేరు చోట్ల.

| | | | |
|---|---|---|---|
| 2. **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ |

| | | | |
|---|---|---|---|
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ ఉత్తుఙ్గహస్తచరణాయతశైలశృఙ్గాం**
**విస్తారితాననవినిర్గతదీర్ఘదంష్ట్రామ్ ।**
**తుష్యత్తటాకసదృశోదరఘోరరూపాం**
**తర్క్యేఽతికర్కశరవోజ్జ్వలతాటకాం తామ్ ॥** **2-40**

**అ :** నేలగూలిన పూతనను కవి తాటకగా సంభావించుట. -వసంతతిలక.

**అ :** ఉత్తుంగహస్తచరణాయతశైలశృంగాం, విస్తారితాననవినిర్గతదీర్ఘదంష్ట్రాం, తుష్యత్తటాక- సదృశోదరఘోరరూపాం తామ్ (పూతనాం) అతికర్కశరవోజ్జ్వలతాటకాం తర్క్యే.

**ప్ర :** ఉత్తుంగ... శృంగామ్ : ఉత్తుంగ = బాగా ఎత్తైన, హస్త = చేతులు, చరణ = కాళ్ళు, ఆయత = విశాలమైన, శైల = కొండయొక్క, శృంగామ్ = కొమ్ములవలె నున్నదియు (ఉత్తుంగౌ హస్తౌ చరణౌ చ ఆయతాని శృంగాణి ఇవ యస్యాః తామ్) (శృంగం ప్రాధాన్య సాన్వోశ్చ - అమరకోశః - 3/నానార్థ/27), విస్తా... దంష్ట్రామ్ : విస్తారిత = తెరవబడిన, ఆనన = నోటినుండి, వినిర్గత = బయటపడిన, దీర్ఘ = పొడవైన, దంష్ట్రామ్ = కోరపల్లు గలదియు (విస్తారితాత్ ఆననాత్ వినిర్గతే దీర్ఘే దంష్ట్రే యస్యాః తామ్), తుష్యత్తటాక... రూపామ్ : తుష్యత్ = ఎండిపోతున్న, తటాక = చెరువుతో, సదృశ = సమానమైన, ఉదర = పొట్టతో, ఘోర = భయంకరమైన, రూపామ్ = ఆకృతి గలదియు అయిన (తుష్యతా తటాకేన సదృశేన ఉదరేణ ఘోరం రూపం యస్యాః తామ్), అతి... తాటకామ్ : అతికర్కశ = అతి క్రూరమైన, రవ = అరుపుతో, ఉజ్జ్వల = మండిపడుతున్న, తాటకామ్ = తాటకనుగా, తర్క్యే = భావిస్తున్నాను. (తర్క-వితర్కే-కర్మణి-ఆత్మనేపది-లట్-ఉ.ఏ.).

**తా ॥** నేలగూలిన ఆ పూతన చేతులు, కాళ్ళు ఎత్తైన కొండకొమ్ములవలె కనిపిస్తున్నాయి. నోరు తెరిచికొని పడివుంది. కోరపల్లు బయటపడ్డాయి. ఆమె కడుపు ఎండిపోయిన చెరువులాగా కనిపిస్తోంది. ఆమె ఎంతో కర్కశమైన అరుపులతో మండి పడుతున్న తాటకలా అనిపిస్తోంది.

**వి :** 1. పూతన ఊర్వశి వలె వున్నదని 34వ శ్లోకంలో వర్ణించాడు కవి. ఇప్పుడు ఈ శ్లోకంలో తాటకతో పోలుస్తున్నాడు.

ఆనాటి తాటక ఊర్వశిలో, ఆ ఊర్వశి నేటి పూతనలో ప్రవేశించి (ఆవేశించి) అంత సౌందర్యానికి కారణమైనదని **మహాభారతతాత్పర్యనిర్ణయం.**

**శ్లో॥ సా తాటకా చోర్వశీసమ్ప్రవిష్టా - కృష్ణావధ్యానాన్నిరయం సజ్జగామ ।**
**సా చోర్వశీ కృష్ణభుక్తస్తనేన - పూతా స్వర్గం ప్రయయౌ తత్క్షణేన ॥**

**శ్లో॥ సా తుంబురోః సంగమ ఆవివేశ - రక్షస్తనుం శాపతో విత్తపస్య ।**
**కృష్ణస్పర్శాత్ శుద్ధభావా పునర్దివం - యయౌ తుష్టే కిమలభ్యం రమేశే ॥**

**మహాభారతతాత్పర్యనిర్ణయ :12/88,89.**

2. తర్క్యే - భావిస్తున్నాను అనటంలోనే ఇది ఉత్ప్రేక్షాలంకారమని స్పష్టం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయః నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైః ఇవ శబ్దోఽపి తాదృశః ॥

అన్న శ్లోకంలోని 'మొదలగు' అన్న పదం తర్క్యే వంటి వాటిని స్వీకరించమనే. మన్యే – శంకే – ధ్రువం – ప్రాయః – నూనమ్ పదాలతో పాటు ఆ అర్థాన్నిచ్చే పదాలన్నీ ఉత్ప్రేక్షా సూచకాలే.

| | | | |
|---|---|---|---|
| 3. **తర్క్యే :** | తర్క్యతే | తర్క్యేతే | తర్క్యన్తే |
| | తర్క్యసే | తర్క్యేథే | తర్క్యధ్వే |
| | **తర్క్యే** | తర్క్యావహే | తర్క్యామహే. |

*

**శ్లో॥ ముకున్దవిద్వేషవిషానుసఙ్గా–ద్వియోజితాఙ్గీ కిల పూతనైకా ।**
**పపాత ధన్యా లలనాగ్రగణ్యా – జగామ చాన్యాఽమరలోకలోకమ్ ॥ 2-41**

**అ :** పూతన జీవద్వయ సన్నివేశాన్నీ, ఇద్దరు జీవులు పొందిన ఫలితాన్ని నిర్ధారించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** ముకుంద–విద్వేష–విషానుసంగాత్ వియోజితాంగీ ఏకా పూతనా పపాత కిల. అన్యా చ లలనాగ్రగణ్యా అమరలోకలోకం జగామ. (సా) ధన్యా.

**ప్ర :** ముకుంద... సంగాత్ : ముకుంద = కృష్ణుని మీది, విద్వేష = ద్వేషమనే, విష = విషంతో, అనుసంగాత్ = చేరిమి వలన (ముకుందే విద్వేషః, స ఏవ విషం, తేన అనుసంగః – తస్మాత్), వియోజితాంగీ = దేహాన్ని విడిచినదై/ (వియోజితమ్ అంగం యయా సా), ఏకా = ఒక, పూతనా = పూతన, **పపాత** కిల = పడిపోయింది గదా! (పత్ – గత్యామైశ్వర్యే –పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), అన్యా చ = మరొకటియు, లలనా+అగ్రగణ్యా = స్త్రీలలో ముందు లెక్కింపదగినదియై (లలనాసు అగ్రగణ్యా) ధన్యా = ధన్యురాలై, అమరలోకలోకమ్ = స్వర్గాన్ని (అమరాణాం లోకః తమ్), జగామ = చేరెను. (గమ్–గతౌ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** పూతన ముకుందుని మీద ద్వేషంతో తన శరీరాన్ని రెండు ముక్కలు చేసికొన్నది. ఒక పూతన పడిపోయింది (శ్లో.39). ఇప్పుడు రెండవ పూతన లలనాగ్రగణ్యగా ధన్యురాలుగా అమరలోకానికి వెళ్ళింది.

**వి :** 1. తాటక ఊర్వశిలో ప్రవేశించిందనీ, ఆ ఊర్వశి పూతనలో ఆవేశించిందనీ కాబట్టి పూతన శరీరంలో ఇద్దరు జీవులున్నారనీ, తాటకా స్వరూపుడైన జీవుడు (39వ శ్లోకంలో చెప్పినట్లు) అంధతామిస్ర లోకాలకు వెళ్ళాడని, ఊర్వశీ స్వరూపుడైన జీవుడు అమర లోకానికి వెళ్ళాడని చెప్పవలసి వుంటుంది. దేహత్యాగానంతరం జీవుడు మరో శరీరంలోనికి ప్రవేశించటానికి నియతి లేదు. ఐచ్ఛికంగా జరుగుతుంది. ఒకే శరీరంలో జీవద్వయ సన్నివేశం గానీ, ఒకే జీవుడు దేహద్వయంలో తన్నుతాను విభజించుకొని ఆవేశించటం కానీ సంభవమే. మానవులలోని భిన్న ప్రకృతులకూ, ఒక్కొక్కసారి పరస్పరం విభిన్న ప్రకృతులకూ కూడా జీవద్వయ బహుజీవ – సన్నివేశం కారణం కావచ్చు.

2. ముకుంద విద్వేషమే మోక్ష ప్రాప్తిని నిరోధించిందేమో! (ముకుం మోక్షం దదాతి ఇతి ముకుందః)

| | | | |
|---|---|---|---|
| 3. **పపాత :** | **పపాత** | పేతతుః | పేతుః |
| | పేతిథ | పేతథుః | పేత |
| | పపాత/పపత | పేతివ | పేతిమ |
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ యది ప్రభుర్విద్విషతోఽపి శౌరిః – ప్రసాదకృత్తర్హి కుతః సురారీన్ ।**
**విజిత్య భక్తాయ తదీయభాగ్యం – ప్రయచ్ఛతి స్వైరమిహావతీర్య ॥ 2-42**

అ : తనను ద్వేషించేవారికి కూడా కృష్ణుడు ముక్తినిస్తాడనే భావాన్ని వ్యతిరేకించుట. –ఉపేంద్రవజ్ర.

అ : ప్రభుః శౌరిః విద్విషతః అపి యది ప్రసాద–కృత్ తర్హి ఇహ స్వైరమ్ అవతీర్య సురారీన్ విజిత్య తదీయ భాగ్యం భక్తాయ కుతః ప్రయచ్ఛతి.

ప్ర : ప్రభుః = సమర్థుడైన, శౌరిః = కృష్ణుడు, విద్విషతః+అపి = ద్వేషించువానికి కూడా, ప్రసాదకృత్ = అనుగ్రహాన్ని ఇచ్చేవాడైతే (ప్రసాదం కరోతి ఇతి), తర్హి = అప్పుడు, ఇహ = ఈ లోకంలో, స్వైరమ్ = స్వచ్ఛందంగా (మందస్వచ్ఛందయోః స్వైరం – హలాయుధకోశః – 832), అవతీర్య = అవతరించి (అవ – తౄ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుర+అరీన్ = దేవతల శత్రువులను (సురాణామ్ అరయః – తాన్), విజిత్య = ఓడించి (వి+జి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తదీయ – భాగ్యమ్ = వారి సంపదను (తదీయం చ తద్ భాగ్యమ్), భక్తాయ = భక్తునకు, కుతః = ఎందువలన, ప్రయచ్ఛతి = ఇస్తున్నాడు? (ప్ర – దాణ్(1)–దానే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** తనను ద్వేషించే వారిని కూడా నారాయణుడు అనుగ్రహించటం నిజమే అయితే ఈ లోకం లోనికి తనంత తానుగా అవతరించి దేవతల శత్రువులను సంహరించి, వారి భాగ్యాన్ని భక్తుల పరం చేయవలసిన అవసర మేముంది?

వి : 1. తనను ద్వేషించేవారికి కూడా నారాయణుడు మోక్షమిస్తాడని పౌరాణిక గాథలు ప్రకటిస్తుంటాయి. దానిని ప్రశ్నిస్తున్నాడిక్కడ కవి.

**శ్లో॥ చతుర్విధా భజంతే మాం జనాస్సుకృతినోఽర్జున ।**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ! ॥ – గీత 7/16.**

అన్నచోట ద్వేషించేవారిని ప్రస్తావించలేదు కృష్ణుడు. బహుశః సుకృతులు కారేమో!

యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ – గీత – 4/11

ఇక్కడ నన్నెవరు ఎలా ఆశ్రయిస్తే వారినలా సేవిస్తాననటం ద్వేషిస్తే ద్వేషాన్నే చూపుతాననే కదా మరి.

భక్తిమార్గం ప్రవృద్ధి చెందినతరువాత భగవద్ధ్యానం ఏ రీతిగా చేసినా సత్ఫలమే అన్న అర్థవాదం ప్రబలింది. భాగవతంలో

శ్లో॥ కామోత్కంఠత గోపికల్ భయముచేఁగంసుండు వైరిక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపులున్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేమునిదె చక్రింగంటి మెట్లైనను
ద్దామధ్యానగరిష్ఠుడైన హరిఁ జెందన్‌వచ్చు ధాత్రీశ్వరా!

అని ద్వేషిస్తూ కూడా హర్యనుగ్రహాన్ని పొందవచ్చునని ప్రకటించాడు పోతన. అయితే ఇక్కడ హరి ప్రసాదానికి కారణం వైరమా? వైర ఫలితంగా ఏర్పడిన ఉద్దామధ్యానమా? వైరం ధ్యానానికి కారణమైందే కానీ అనుగ్రహానికి కాదు గదా!

2. **ప్రయచ్ఛతి :**

| | | |
|---|---|---|
| **ప్రయచ్ఛతి** | ప్రయచ్ఛత | ప్రయచ్ఛంతి |
| ప్రయచ్ఛసి | ప్రయచ్ఛథః | ప్రయచ్ఛథ |
| ప్రయచ్ఛామి | ప్రయచ్ఛావః | ప్రయచ్ఛామః. |

*

**శ్లో॥ ద్విషాం హరిర్యచ్ఛతి యర్హి మోక్షం – న తర్హి కస్మాదపవర్గమార్గః ।**
**అరిష్టవాతాసురవత్సకేశి–వినాశకాలే వివృతః శుకేన ॥ 2–43**

**అ :** విద్వేషులకు మోక్షప్రసాదనం కృష్ణసమ్మతం కాదనటాన్ని హేత్వంతరంతో సమర్థించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** హరిః యర్హి ద్విషాం మోక్షం యచ్ఛతి తర్హి అరిష్ట–వాతాసుర–వత్స–కేశి–వినాశ–కాలే అపవర్గ–మార్గః శుకేన కస్మాత్ న వివృతః?

**ప్ర :** హరిః = కృష్ణుడు, యర్హి = ఒకవేళ (యదా యర్హి తదా తర్హి తదానీం సర్వదా సదా వైజయంతీ–అవ్యయపర్యాయ–5), ద్విషామ్ = శత్రువులకు/ద్వేషించేవారికి (ద్విట్ శబ్దం షష్ఠీ బహువచనం), మోక్షమ్ = విముక్తిని, యచ్ఛతి = ఇచ్చేటట్లయితే, తర్హి = అప్పుడు, అరిష్ట... కాలే : అరిష్ట = అరిష్టుడు, వాతాసుర = తృణావర్తుడు, వత్స = వత్సుడు (దూడ రూపంలో వచ్చినవాడు), కేశి = కేశి (రాక్షసుడు) (వీరియొక్క), వినాశ–కాలే = మరణవేళలో (అరిష్టశ్చ వాతాసురశ్చ వత్సశ్చ కేశిశ్చ తేషాం వినాశస్య కాలః – తస్మిన్), అపవర్గమార్గః : అపవర్గ = మోక్షం యొక్క (అపునర్భవోఽ పవర్గో ముక్తిర్మోక్షః... హలాయుధకోశః – 124), మార్గః = బాట, శుకేన = శుకుని చేత, కస్మాత్ = ఎందుకు, న **వివృతః** = వివరింపబడలేదు (వి– వృ ధాతువుపై క్త ప్రత్యయం).

**తా ॥** తనను ద్వేషించే వారికి కూడా నారాయణుడు మోక్షమివ్వటం వాస్తవమే అయితే అరిష్టుడు వాతాసురుడు, వత్సాసురుడు, కేశి మొదలయిన రాక్షసులు చనిపోయినపుడు వారు మోక్షాన్ని పొందారని శుకుడెందుకు చెప్పలేదు?

శుకమహర్షి పరీక్షిన్మహారాజుకు భాగవతకథలు వినిపించినవాడు. ఏడురోజులలో మరణించబోతున్న పరీక్షిత్తుకు.

**ఆ. మోక్షకామునకును మోక్షంబు సిద్ధించు – భవభయంబులెల్లఁబాసిపోవు**
**యోగిసంఘమునకు నుత్తమవ్రతములు – వాసుదేవనామవర్ణనములు** – *భాగవతం 2/7*

అని చెప్పి వాసుదేవకథలు వినిపించి మోక్షార్హత కలిగించిన శుకమహర్షి అరిష్టుడు మొదలయిన రాక్షసుల మరణవృత్తాంతాన్ని చెప్పినప్పుడు ఎప్పుడూ వారు ముక్తి పొందారని చెప్పలేదు. పూతన విషయంలో అలా చెప్పడమంటే ఇక్కడి విధి ద్వారా అక్కడ నిషేధం స్పష్టమవుతోంది గదా!

2. పూతన శరీరంలో ఊర్వశి కూడా ఆవేశించి ఉన్నది. ఆ జీవి శుభఫలాలకు అర్హమైనది. కాబట్టి పూతనకు మోక్షసిద్ధి కలిగి వుండవచ్చునని కొందరు వ్యాఖ్యాతలు. *

**శ్లో॥ పతన్త్యధోఽనాదృతకృష్ణపాదా – న చేద్యమస్యాలయమేష్యసి త్వమ్ ।**
**స నైరృతం ధామ జగామ దైత్య – ఇతీరితా దుర్గతిరేవ తేషామ్ ॥ 2–44**

**అ :** హరిని శరణువేడని వానికి దుర్గతియే అని నిశ్చయించుట. – ఉపేంద్రవజ్ర.

**అ :** "అనాదృతకృష్ణపాదాః అధః పతన్తి". "న చేత్ త్వం యమస్య ఆలయమ్ ఏష్యసి". "సః దైత్యః నైరృతం ధామ జగామ." ఇతి తేషాం దుర్గతిః ఏవ ఈరితా.

**ప్ర :** అనాదృత... పాదా : అనాదృత = ఆశ్రయింపబడిన/ఆదరించని, కృష్ణ = కృష్ణునియొక్క, పాదాః = పాదాలు గలవాళ్ళు (కృష్ణుని పాదాలు పట్టనివాళ్ళు) (అనాదృతౌ కృష్ణస్య పాదౌ యైః తే), అధః = క్రిందకు (చీకటిలోనికి), పతన్తి = పడతారు (పత్–గతౌ–పరస్మైపది–లిట్–ప్ర.బ.), న చేత్ = లేకపోతే (దారి ఇవ్వకపోతే), త్వమ్ = నీవు, యమస్య = కాలుని యొక్క, ఆలయమ్ = నివాసగృహానికి, ఏష్యసి = చేరగలవు. (ఇణ్ గతౌ–పరస్మైపది–లృట్–మ.ఏ.), సః దైత్యః = ఆ రాక్షసుడు, నైరృతమ్ = నిరృతికి సంబంధించిన, ధామ = నివాసాన్ని, జగామ = చేరెను (గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ఇతి = అని, ఈరితా = చెప్పబడినది (ఈర్ ధాతువుపై క్త ప్రత్యయం), తేషామ్ = వారికి, దుర్గతిః+ఏవ = అధోలోకగమనమే.

**తా ॥** 'కృష్ణ పాదాల నాశ్రయించనివారు అధోగతిని పొందుతారు' 'లేకపోతే నిన్ను యమసదనానికి పంపుతాను', 'ఆ రాక్షసుడు నిరృతి నివాసానికి వెళ్ళాడు' – ఇలా చెప్పబడినదంటే వారికి దుర్గతియే అనే కదా భావం.

**వి ॥** 1. భాగవతంలో ఆయా సందర్భాలలో చెప్పిన శ్లోకాల ప్రస్తావన ఇది.

శ్లో॥ యేఽన్యేఽరవిందాక్ష విముక్తమానిన - స్త్వయ్యస్తభావాదవిశుద్ధబుద్ధయః ।
ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః - పతన్త్యధోఽనాదృతయుష్మదంఘ్రయః ॥- భాగవతం 10/3/33

శ్లో॥ అంబష్ఠాంబష్ఠ మార్గం నౌ దేహ్యపక్రామ మా చిరమ్ ।
నో చేత్ సకుంజరం త్వాఽద్య **నయామి యమసాదనమ్ ॥** **- భాగవతం 10/41/4**

**శ్లో॥ జగామ కృచ్ఛ్రం నిరృతేరథ క్షయం - పుష్పైః కిరన్తో హరిమీడిరే సురాః ।**

- భాగవతం 10/34/15

ఇటువంటి భాగవతవచనాలలో దుర్గతియే ప్రకటింపబడింది కానీ మోక్షప్రసక్తి లేదు. కాబట్టి కృష్ణుని ఆశ్రయించని వానికి మోక్షం లేదనియే నిర్ణయించాలి. శ్లోకరూపంలో ప్రతిపాదించిన సహేతుక సిద్ధాంత భాగమిది.

| | | | |
|---|---|---|---|
| 2. **పతన్తి :** | పతతి | పతతః | **పతన్తి** |
| | పతసి | పతథః | పతథ |
| | పతామి | పతావః | పతామః |
| **ఏష్యసి :** | ఏష్యతి | ఏష్యతః | ఏష్యన్తి |
| | **ఏష్యసి** | ఏష్యథ | ఏష్యథ |
| | ఏష్యామి | ఏష్యావః | ఏష్యామః |
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ విద్వేషమూలస్మరణేన తుష్టి - రిత్యప్యవద్యం న జహాతి పక్షః ।**
**హింసార్థమాలిఙ్గయతస్తరక్షోః - కిం చేష్టయా తుష్యతి కామధేనుః ॥ 2-45**

**అ :** వైరభక్తి భక్తి కాదని మరొక ఉదాహరణంతో తిరస్కరించటం. -ఇంద్రవజ్ర.

**అ :** విద్వేష-మూల-స్మరణేన తుష్టిః ఇతి అపి పక్షః అవద్యం న జహాతి. కామధేనుః హింసార్థమ్ ఆలింగయతః తరక్షోః చేష్టయా తుష్యతి కిమ్?

**ప్ర :** విద్వేష... స్మరణేన : విద్వేష = వైరం, మూల = కారణమైన, స్మరణేన = తలంపుతో (విద్వేషః మూలం యస్య, తచ్చ స్మరణం చ, విద్వేషమూలస్మరణం - తేన), తుష్టిః = ఆనందం (తుష ధాతువుపై క్తిన్ ప్రత్యయం), ఇతి+అపి-పక్షః = అనే వాదన కూడా, అవద్యమ్ = తప్పును (అర్వాణమణకమపసదమవమమవద్యం - హలాయుధకోశః - 337), న జహాతి = విడువదు (హా-త్యాగే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), కామధేనుః = దేవతా గోవు, హింసార్థమ్ = పీడించటానికి/చంపటానికి, ఆలింగయతః = కౌగిలించు కొనుచున్న, తరక్షోః = పులియొక్క (వ్యాఘ్రో దీపీ పుండరీక స్తరక్షుః - హలాయుధకోశః - 226), చేష్టయా = చర్యతో, తుష్యతి కిమ్? = ఆనందించునా? (తుష్ తుష్టే - పరస్మైపది -లట్-ప్ర.ఏ.).

**తా ॥** శత్రుత్వంతో కూడిన స్మరణ ద్వారా స్మరింపబడిన వానికి తృప్తి కలుగుతుందనేది కూడా తప్పే. పులి కామధేనువును హింసించడానికి కౌగిలించుకొన్నది. అక్కడ భావం ద్వేషం. చేష్ట కౌగిలింత. కామధేనువు ఆనందిస్తుందా?

**వి :** 1. మనం ఆలోచించని వానిమీద మనకు పగ, ద్వేషం ఉండవు. అవి స్మరణ మూలకాలే. ఆపై అవి స్మరణను స్థిరీకరిస్తాయి. ఆ స్మరణతో స్మరింపబడేవాళ్ళకు ఆనందం కలుగుతుందని అనగలమా?

2. శ్లోక పూర్వార్ధం విశేష విషయం. ఉత్తరార్ధం సామాన్య విషయం. రెండింటిని సమకక్ష్యలో చెప్పటం వలన ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' – (కు. 122.)

| | | | |
|---|---|---|---|
| 3. **జహాతి :** | **జహాతి** | జహితః/జహీతః | జహతి |
| | జహాసి | జహీథః/జహిథః | జహీథ/జహిథ |
| | జహామి | జహీవః/జహివః | జహీమః/జహిమః |
| **తుష్యతి :** | **తుష్యతి** | తుష్యతః | తుష్యంతి |
| | తుష్యసి | తుష్యథ | తుష్యథ |
| | తుష్యామి | తుష్యావః | తుష్యామః. |

*

**శ్లో॥ న చేద్గవాం విప్రశిఖామణీనాం – హతిశ్చ పుణ్యాయ భవేద్ధి మూఢాః! ।**
**తదఙ్గసంస్పర్శనదర్శనాద్యై – స్తదీయనామగ్రహణాదిభిర్వా ॥ 2-46**

**అ :** వైరభక్తిని భక్తి కాదంటూ తీవ్రంగా ఖండిస్తున్న విధానం. –ఉపేంద్రవజ్ర.

**అ :** న చేత్ మూఢాః తదంగ సంస్పర్శనదర్శనాద్యైః తదీయనామగ్రహణాదిభిః వా విప్రశిఖామణీనాం గవాం హతిః చ పుణ్యాయ భవేత్ హి.

**ప్ర :** న చేత్ = లేకపోతే (విద్వేషమూలస్మరణం భక్తి కాదు అని అంగీకరించలేకపోతే), మూఢాః = మూఢులారా! తదంగ... దర్శనాద్యైః : తత్ = వాటియొక్క, అంగ = శరీరావయవాలయొక్క, సంస్పర్శన+ఆద్యైః = తాకుట మొదలగు పనులచే (తేషామ్ అంగానాం సంస్పర్శనమ్ ఆద్యం యేషాం తైః), తదీయ... ణాదిభిః : తదీయ = వాటియొక్క, నామ–గ్రహణ+ఆదిభిః = పేరును పలకటం మొదలగు వాటిచేత (తదీయానాం నామ్నాం గ్రహణం ఆదౌ యేషాం తైః), విప్రశిఖామణీనామ్ = విప్రులలో శ్రేష్ఠాలయిన, గవామ్ = గోవులను, హతిః+చ = చంపటం కూడా, పుణ్యాయ = పుణ్యాన్ని ఇవ్వగలదిగా, భవేత్ హి = కాగలదు గదా! (భూ సత్తాయామ్ పరస్మైపది – విధిలిఙ్ – ప్ర.ఏ.).

**తా ॥** మూఢులారా! ద్వేషంతో అయినా నామగ్రహణంచేతనో, స్పర్శ చేతనో మోక్షం సిద్ధించేటట్లయితే గోవులను స్పృశించటం లేదా తన్నామ స్మరణం చేస్తూ వాటిపై వైరం పెంచుకుంటూ, దానిని వైరభక్తిగా పరిగణించుకొంటూ, వాటిని చంపినా కూడా పుణ్యమే రావాలి గదా!

**వి :** 1. భావం ముఖ్యమా? చేష్ట ముఖ్యమా? అన్న తీవ్రమైన చర్చ ఇది. బంధమోక్షాలకు మనస్సే మూలమనీ ఆ మనస్సును బట్టియే చేష్టలను పరిగణించాలనీ ఆర్యవచనం. స్మరించినా, స్పృశించినా లోపల వున్నది వైరమైనపుడు అది బాహ్య చేష్టలను బట్టి భక్తి కాలేదు. అనుభావాలు ఏ భావానికీ నియతాలు కావు. భక్తి లోపల నిలిచినపుడు దాని వ్యక్తీకరణకు స్మరణ స్పర్శనాదులే కానీ స్మరణ దర్శనాదుల మాత్రంచేత భక్తి నిరూపితం కాలేదు. అక్కడవి అనుభావాభాసాలే అవుతాయి. ఆభాస నవ్వులాటకే దారి తీస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **భవేత్ :** | **భవేత్** | భవేతామ్ | భవేయుః |
| | భవేః | భవేతమ్ | భవేత |
| | భవేయమ్ | భవేవ | భవేమ. |

*

**శ్లో॥ దోషం దురన్తం క్వ చ వర్ణయద్భి-ర్ద్వేషం హరేః క్వాపి తమోనిదానమ్ ।**
**ఈశాప్తివిఘ్నం క్వ చ నిర్ణయద్భి-రేతన్మతం విప్రతిషిద్ధమార్యైః ॥ 2-47**

**అ :** హరిపై ద్వేషాన్ని వైరభక్తి మార్గంగా భావించటం ఆర్యసమ్మతం కాదని ప్రతిపాదించటం. -ఇంద్రవజ్ర.

**అ :** హరేః ద్వేషం క్వ చ దురంతం దోషం వర్ణయద్భిః, క్వ అపి తమోనిదానం (వర్ణయద్భిః) క్వ చ ఈశాప్తివిఘ్నం నిర్ణయద్భిః ఆర్యైః ఏతన్మతం విప్రతిషిద్ధమ్.

**ప్ర :** హరేః = హరియొక్క (హరి విషయక మైన), ద్వేషమ్ = శత్రుత్వాన్ని, దురంతమ్ = అవధిలేని, దోషమ్ = తప్పుగా, క్వ చ = కొన్ని తావులలో, వర్ణయద్భిః = వర్ణిస్తున్న వారును, క్వ అపి = కొన్ని తావులలో, తమో - నిదానమ్ = చీకటికి (అంధతామిస్ర లోకాలకు) కారణంగా (తమసః నిదానమ్) (నిదానం త్వాదికారణమ్ - అమరకోశః - కాలవర్గం) వర్ణయద్భిః = వర్ణిస్తున్న వారును, ఈశ+ఆప్తి - విఘ్నమ్ : ఈశ = పరమాత్మ యొక్క, ఆప్తి = పొందుదలకు, విఘ్నమ్ = ప్రతిబంధకమని (ఈశస్య ఆప్త్యై విఘ్నః, తమ్), నిర్ణయద్భిః = నిర్ణయిస్తున్న వారునూ అయిన, ఆర్యైః = పెద్దలచే/శుకాది మునులచే, ఏతత్ = ఈ, మతమ్ = అభిప్రాయం (మతోఽ ర్చితేఽ ప్యనుమతౌ విశ్వలోచనకోశః - తాంత - 40), విప్రతిషిద్ధమ్ = నిషేధింపబడినది.

**తా ॥** హరిద్వేషాన్ని ఆర్యులెవరూ అంగీకరించరు. ఈ అభిప్రాయాన్ని వాళ్ళు ఖండించారు. పైపెచ్చు హరి ద్వేషాన్ని దురంత దోషం గానూ, తమో నిదానం గానూ, పరమాత్మ ప్రాప్తికి ప్రతిబంధకంగాను నిర్ణయించారు.

**వి :** 1. భాగవత గతాభిప్రాయాలను ఆధారంగా తీసికొని తన అభిప్రాయాన్ని సిద్ధాంతీకరిస్తున్నాడు కవి ఇక్కడ.

1. **శ్లో॥ యదనిందత్** పితా మహ్యం - త్వద్భక్తే మయి **చాఘవాన్ ।**
   తస్మాత్ పితా మే పూయేత - దురంతాద్దుస్తరాదఘాత్ ॥ భాగవతం 7/10/17
2. **శ్లో॥ భగవన్నిన్దయా వేనో -ద్విజైస్తమసి పాతితః ।**
   హిరణ్యకశిపుశ్చాపి - భగవన్నిందయా తమః ॥ - భాగవతం 4/19/46
3. శ్లో॥ తానహం **ద్విషతః శత్రూన్** సంసారేషు నరాధమాన్ ।
   క్షిపామ్యజస్రమశుభానాసురీష్వేవ యోనిషు ॥

   శ్లో॥ **మామప్రాప్యైవ** కౌంతేయ తతో **యాన్త్యధమాం గతిమ్ ॥** - భగవద్గీత -16/19,20

పై శ్లోకాలలో హరిద్వేషం మోక్షహేతువని సమర్థించకపోగా మోక్షప్రతిబంధకమనీ దురంతదోషమనీ సిద్ధాంతీకరిస్తున్నాయి. *

**శ్లో॥ అద్వైతినస్తార్కికమానినో వా - రాద్ధాంతమధ్యే పరవాదినాం వా ।**
**జ్ఞానం వినా యన్న హి బంధమోక్ష - స్తేనేదమాత్మీయవచోవిరుద్ధమ్ ॥2-48**

**అ :** హరిద్వేషం కూడా మోక్షహేతువన్న వారి భావాన్ని స్వవచోవ్యాఘాత దోషసహితమని నిరూపించుట. -ఇంద్రవజ్ర.

**అ :** అద్వైతినః తార్కిక-మానినః వా పర-వాదినాం రాద్ధాంత-మధ్యే వా జ్ఞానం వినా బంధ-మోక్షః న హి (ఇతి) యత్ తేన ఇదమ్ ఆత్మీయ-వచో-విరుద్ధమ్.

**ప్ర :** అద్వైతినః = అద్వైత సిద్ధాంత ప్రతిపాదకుని యొక్కయు, తార్కిక-మానినః వా = తార్కికునిగా తనను తాను భావించుకొను వాని యొక్కయు (తార్కిక ఇతి మానీ, తస్య), పరవాదినామ్ = ఇతరుల గురించి వాదించు వారి యొక్క, రాద్ధాంత - మధ్యే వా = సిద్ధాంతీకరించు సమయంలో ఖండనలయందు (రాద్ధాంతానాం మధ్యే),

జ్ఞానం వినా = జ్ఞానం లేక, బంధ–మోక్షః = బంధవిముక్తి (బంధస్య మోక్షః), న–హి = లేదు, ఇతి = అని, యత్ = ఏ సిద్ధాంతం కలదో, తేన = దానితో, ఇదమ్ = ఈ విధమయిన (ద్వేషభక్తి ద్వారా ముక్తి) సిద్ధాంతం, ఆత్మీయ–వచః +విరుద్ధమ్ : ఆత్మీయ = తమదైన, వచః = మాటకు, విరుద్ధమ్ = భిన్నమైనది (ఆత్మీయానాం వచసాం విరుద్ధమ్).

**తా ॥** అద్వైతులు లేదా తార్కికులు లేదా ఇతరుల వాదనలను ఖండించి స్వసిద్ధాంతాన్ని నిరూపించే వారు జ్ఞానం లేకుండా బంధవిముక్తి లేదని సిద్ధాంతీకరించారు. ఇప్పుడు ద్వేషమూ మోక్షహేతువంటే స్వవచో వ్యాఘాత మయినట్లే గదా!

**వి :** 1. ధాతా పురస్తాద్యముదాజహార – శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః ।
**తమేవం విద్వాన్ అమృత ఇహ భవతి – నాన్యః పన్థాః అయనాయ విద్యతే॥**

అనే వేదవచనం మోక్షానికి పరమాత్మజ్ఞానం తప్ప మరో మార్గం లేదని స్పష్టంగా చెపుతుంటే మార్గాంతరాన్నీ, అందునా ద్వేషరూపమయిన దారిని అంగీకరింపమనటం శ్రుతి విరుద్ధమే.

శ్లో॥ బహునాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి సమహాత్మా సుదుర్లభః ॥ – గీత 7/19

పురాణగాథలు అర్థవాదరూపంగా భగవద్భక్తిని పెంచే లక్ష్యంతో ఎన్నో కథలు చెప్పాయి. చివరకు భక్తి కన్న అర్థవాదాల మీద విశ్వాసం ఎక్కువైంది మనుష్యులకు. *

**శ్లో॥ జ్ఞానాన్యమార్గప్రతిషేధకర్త్ర్యా – శ్రుత్యా చ నిర్ణాయకసూత్రకర్త్రా ।**
**కిమేష మార్గః సులభో న దృష్టః – కిం వా తపస్యావ్రతకర్శితాఙ్గైః ॥ 2–49**

**అ :** హరిద్వేషం వాస్తవంగా మోక్షసాధకమైతే ప్రాచీనులెందుకు గుర్తించి లేదని ప్రశ్నించటం. –ఇంద్రవజ్ర.

**అ :** జ్ఞానాన్యమార్గప్రతిషేధకర్త్ర్యా శ్రుత్యా నిర్ణాయకసూత్రకర్త్రా తపస్యావ్రతకర్శితాంగైః వా చ ఏషః సులభః మార్గః న దృష్టః కిమ్?

**ప్ర :** జ్ఞానాన్య... కర్త్ర్యా : జ్ఞాన+అన్య = జ్ఞానభిన్నమైన, మార్గ = సాధనానికి, ప్రతిషేధ = నిషేధాన్ని, కర్త్ర్యా = చేస్తున్న (జ్ఞానాత్ అన్యః మార్గః = జ్ఞానాన్యమార్గః, ప్రతిషేధస్య కర్త్రీ ప్రతిషేధకర్త్రీ, జ్ఞానాన్యమార్గస్య ప్రతిషేధకర్త్రీ, తయా), శ్రుత్యా = వేదంచేత కానీ, నిర్ణా... కర్త్రా : నిర్ణాయక = నిర్ణయాత్మకమయిన, సూత్ర = సూత్రగ్రంథాలను, కర్త్రా = చేసిన (వ్యాసుని) వానిచేత కానీ (నిర్ణాయకానాం సూత్రాణాం కర్తా, తేన), తపస్యా... తాంగైః : తపస్యా = తపస్సు చేతను (తపస్యా నియమస్థితిః – హలాయుధకోశః – 776) వ్రత = దీక్షల చేతను, కర్శిత = కృశింపజేయబడిన, అంగైః వా = అవయవాలు గలవారి (మునుల) చేత కానీ (తపస్యయా వ్రతైశ్చ కర్శితాని అంగాని యైః తైః), ఏషః = ఈ (మీరు ప్రతిపాదిస్తున్న), సులభః = తేలికయిన, మార్గః = బాట, న **దృష్టః** కిమ్ = చూడబడలేదా? (దృశ్ ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** మోక్షసాధనకు జ్ఞానభిన్నమైన మార్గాన్ని నిషేధిస్తున్న వేదం కానీ, నిర్ణాయక సూత్రాలయిన బ్రహ్మసూత్రాలను వ్రాసిన వ్యాసుడు కానీ, తపోవ్రతదీక్షలతో శరీరాలను కృశింపజేసికొన్న మునులు కానీ, సులభమైన ఈ వైరభక్తి మార్గాన్ని చూడలేకపోయారా?

**వి :** 1. 'నాన్యః పంథా అయనాయ విద్యతే' అని తైత్తిరీయారణ్యక (శ్రుతి) వచనం. మోక్షసాధనకు జ్ఞానేతరమార్గం లేదంటోంది. **'అథాతో ధర్మజిజ్ఞాసా' 'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా'** అని వ్యాసుడు పూర్వోత్తరమీమాంసలు వ్రాశాడు. ఆయన కూడా జ్ఞానేతరమార్గాన్ని ప్రస్తావించలేదు. తపోవ్రతాలతో తమ్ము తాము కృశింపజేసికొన్న మునులు కూడా

జ్ఞానేతర మార్గ ప్రతిపాదన చేయలేదు. హరిద్వేషం అంత సులభమైన మార్గమయితే వారెవరికీ ఈ ఉపాయం స్ఫురించలేదా?

2. ఇక్కడొక విషయాన్ని గమనించాలి. రుక్మిణీశవిజయగ్రంథకర్త వాదిరాజతీర్థరు 15వ శతాబ్దానికి చెందినవారు. పురాణగాథలు, వాటిలోని అర్థవాదాలు అప్పటికింత ప్రచారంలో లేవు. అయినా వారు ఇంత తీవ్రంగా ఖండించవలసివచ్చింది. తెలుగు సాహిత్యంలో కూడా దాదాపు 14,15 శతాబ్దాల నుండి తీర్థమాహాత్మ్య క్షేత్రమాహాత్మ్య గ్రంథాల రచన విస్తృతమైంది. మరొక అంశం. రచనలు అన్నీ ఉన్నా వాటి ప్రసారం, ప్రచారం ఇప్పటిలా అంత ఎక్కువ లేదప్పుడు. ఆ పరిస్థితులలో కూడా పురాణాల అర్థవాద ప్రభావాన్ని అంతగా ఖండించవలసి వచ్చింది. ఇక ఈ రోజుల్లో అయితే ఎలా స్పందించేవారో? *

**శ్లో॥ అవైష్ణవానాం యతనైర్న మోక్షః - పతన్త్యధస్తామసవృత్తయస్తే ।**
**ఏతత్సమానార్థకభారతోక్తి-వ్రాతామతం తన్న మతం శుకస్య ॥ 2-50**

**అ :** విష్ణుభక్తిలేక మోక్షసిద్ధిలేదనీ, అది శుకసమ్మతమైన సిద్ధాంతమే అనీ ప్రతిపాదన. -ఉపేంద్రవజ్ర.

**అ :** అవైష్ణవానాం యతనైః మోక్షః న. తే తామసవృత్తయః (సన్తః) అధః పతన్తి. ఏతత్సమానార్థకభారతోక్తివ్రాతామతం తన్మతం శుకస్య మతం న.

**ప్ర :** అవైష్ణవానామ్ = విష్ణుభక్తిలేని వారికి, యతనైః = ఇతర ప్రయత్నాలచే, మోక్షః = బంధవిముక్తి, న = లేదు, తే = వారు, తామస-వృత్తయః (సంతః) = తామసవృత్తి గలవారై/ రాక్షసులై (తామసీ వృత్తిః యేషాం తే), అధః = క్రిందకు (చీకటిలోనికి), పతన్తి = పడుతుంటారు. ఏతత్స... తామతమ్ : ఏతత్ = దీనితో, సమాన = సమానమైన, అర్థక = అర్థం కలిగిన, భారత = మహాభారతమందలి, ఉక్తి = మాటలయొక్క, వ్రాత = సమూహాలకు, అమతమ్ = నచ్చని (ఏతేన సమానః అర్థః యాసాం తాః ఏతత్సమానార్థకాః తాశ్చ భారతే విద్యమానాః ఉక్తయః, తాసాం వ్రాతః , తస్య అమతామ్), తన్మతమ్ = ఆ హరిద్వేష మతం, శుకస్య = శుకమహర్షి యొక్క, మతమ్ = అభిమతం, న = కాదు.

**తా ॥** విష్ణుభక్తులు కాని వారికి మోక్షం లేదు. తామస ప్రవృత్తి గలవారు అధోలోకాలలో పడిపోతారు. ఈ భావాన్ని ప్రతిపాదించే మాటలు మహాభారతంలో చాలా ఉన్నాయి. వాటికి భిన్నమైన ఏ మతప్రతిపాదన మయినా శుకమహర్షికి సమ్మతం కాదు.

**వి :** 1. 1. శ్లో॥ వైకుంఠం నామ లోకం వై దివ్యం నిత్యం సనాతనమ్ ।
**అవైష్ణవానామప్రాప్యం** మహాయత్నవతామపి ॥

2. శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థాః మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థాః **అధో గచ్ఛంతి తామసాః ॥** - గీత 14/18

3. శ్లో॥ భవేద్ధి **మోక్షో** నియతం **సురాణాం - నైవాసురాణాం** చ కథఞ్చన స్యాత్।
ఉత్సాహయుక్తస్య చ తత్ప్రతీపం - భవేద్ధి రాహోరివ దుఃఖరూపమ్ ॥

- మహాభారతతాత్పర్యనిర్ణయ. 10/35

ఈ వాక్యాలన్నీ విష్ణుపారమ్యాన్నీ, తద్భిన్న ప్రవృత్తి కలిగివుంటే అధోగమనాన్ని నిర్దేశిస్తుంటే వీటికి భిన్నంగా హరిద్వేషం కూడా మోక్షసాధన మనటం అనుచితమని కవిభావన.

| 2. **పతన్తి :** | పతతి | పతతః | **పతన్తి** |
|---|---|---|---|
| | పతసి | పతథః | పతథ |
| | పతామి | పతావః | పతామః. |

*

**శ్లో॥ నిన్దాం ముకున్దస్య సకృన్నిశమ్య - మన్దః పతేత్ కిం పునరచ్యుతం తమ్।**
**నిన్దన్నితి హ్యాలపతః శుకస్య - కిం ద్వేషతో ముక్తిరితి స్మ హృద్యమ్ ॥ 2-51**

**అ :** హరిద్వేషం శుకాభిమతం కాదని మరల ప్రతిపాదించుట. -ఇంద్రవజ్ర.

**అ :** ముకుందస్య నిందాం సకృత్ నిశమ్య మందః (సన్) పతేత్ పునః అచ్యుతం తం నిందన్ కిమ్ హి ఇతి ఆలపతః శుకస్య ద్వేషతః ముక్తిః ఇతి హృద్యం స్మ కిమ్.

**ప్ర :** ముకుందస్య = విష్ణువు యొక్క (ముకుం దదాతి ఇతి ముకుందః), నిందామ్ = దూషణమ్ = దూషణను, సకృత్ = ఒక్కసారి అయినను, నిశమ్య = విని (వింటే) (ని పూర్వక శమ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మందః (సన్) = బుద్ధిహీనుడై, పతేత్ = అధోగతిని పొందును (పత్ల(1) - గతౌ పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), పునః = మరి, అచ్యుతమ్ = జారుబాటు లేని వానిని (కృష్ణుని), నిందన్ = నిందిస్తూ ఉంటే (నింద్ ధాతువుపై శతృ ప్రత్యయం), కిమ్? = చెప్పవలసిన దేముంది?, ఇతి హి = అని నిశ్చితంగా, ఆలపతః = పలుకుతున్న (ఆ - లప్ ధాతువుపై శతృ ప్రత్యయం), శుకస్య = శుక మహర్షికి, ద్వేషతః = వైరం ద్వారా, ముక్తిః ఇతి = మోక్షమనుట, హృద్యమ్ - స్మ - కిమ్? = నచ్చే విషయమేనా? (హృద్యం హరి మనోహరం చ రుచిరం కాంతం పరం సుందరం - హలాయుధకోశః - 689).

**తా ॥** ముకుందుని నిందించటాన్ని ఒక్కసారి **విన్నాకూడా** అతడు అధోలోకాలకు వెళతాడు. ఇక అచ్యుతుడైన ఆ కృష్ణుని **నిందిస్తే** చెప్పవలసినదేముంది? అని పలుకుతున్న శుకమహర్షికి ద్వేషంతో ముక్తి సిద్ధిస్తుందన్న మాట నచ్చేదేనా?

**వి:** 1. శ్లో॥ నిందాం భగవతః శృణ్వన్ తత్పరస్య జనస్య వా ।
తతో నాపైతి యస్సోఽపి యాత్యధః సుకృతాచ్చ్యుతః ॥ - భాగవతం 10/74/40

(భగవన్నిందను కానీ భగవద్భక్తుని నిందను కానీ వినవలసివస్తే అక్కడనుండి తప్పుకొని పోనివాడు పుణ్యాన్ని పోగొట్టుకొని పతనం చెందుతాడు) భగవద్భక్తుని నిందను విన్నా కూడా పాపమంటుంటే ఇక భగవన్నిందనే వింటే చెప్పవలసినదేముంది?

2. కాళిదాసు దీనిని సాధారణీకరించి మహాత్ములను నిందించేవాడితో పాటు విన్నవాడు కూడా పాపాన్ని పొందవలసి వుంటుందని పార్వతిచేత చెప్పిస్తాడు కుమారసంభవంలో-

శ్లో॥ నివార్యతా మాళికిమప్యసే వటు - పునర్విపక్షుః స్ఫురితోత్తరాధరః ।
**న కేవలం యో మహతోఽపభాషతే - శృణోతి తస్మాదపి** యస్స పాపభాక్ ॥

- కుమారసంభవం 5/83

3. ఈ శ్లోకంలో అర్థాపత్త్యాలంకారముంది. దాని లక్షణమిది '**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**'. (కు. 120), దీన్నే కావ్యార్థాపత్తి అనికూడా అంటారు. కైముతిక-న్యాయంతో (కిమ్ ఉత - ఇక చెప్పేదేముంది?) అర్థంసిద్ధిస్తే దాన్ని అర్థాపత్తి అంటారు.

| 4. **పతేత్ :** | **పతేత్** | పతేతామ్ | పతేయుః |
|---|---|---|---|
| | పతేః | పతేతమ్ | పతేత |
| | పతేయమ్ | పతేవ | పతేమ. |

*

**శ్లో॥ఆపోఽ బ్రువన్నితి సనాతనవేదవాక్యాత్-కిం వక్తృతా జడజలస్య తథా శుకోక్తౌ ।
కంసాదిమోక్షవచనాన్యపి యుక్తియుక్త-మానాన్తరోదితమనోమధురార్థభాఞ్జి ॥2-52**

అ : కంసాది రాక్షసులకు సంబంధించిన మోక్షసిద్ధిని గురించిన ప్రస్తావన. -వసంతతిలక.

అ : 'ఆపోఽ బ్రువన్' ఇతి సనాతనవేదవాక్యాత్ జడజలస్య వక్తృతా కిమ్? తథా శుకోక్తౌ కంసాదిమోక్షవచనాని అపి యుక్తి యుక్తమానాంతరోదితమనోమధురార్థభాంజి (భవన్తి)

ప్ర : ఆపః-అబ్రువన్ = 'నీళ్ళు చెప్పాయి', ఇతి = అనే, సనాతన... వాక్యాత్ : సనాతన = ప్రాచీనమైన, వేద = వేదమందలి, వాక్యాత్ = వాక్యం వలన (సనాతనం చ తత్ వేదే వాక్యమ్, తస్మాత్), జడజలస్య = జడపదార్థమైన నీటికి (జడం చ తత్ జలమ్ - తస్య), వక్తృతా = మాటకారితనం, కిమ్? = వస్తుందా?, తథా = ఆ విధంగానే, శుక+ఉక్తౌ = శుకుని మాటలు కూడా (శుకస్య ఉక్తిః, తస్యామ్), కంసాది... వచనాని : కంస+ఆది = కంసుడు మొదలగువారి యొక్క, మోక్ష= మోక్షానికి సంబంధించిన, వచనాని = మాటలు (కంసః ఆదౌ యేషాం తేషాం మోక్షస్య వచనాని), యుక్తియుక్తమానాంతర... భాంజిః : యుక్తి = యుక్తితో, యుక్త = కూడిన, మాన+అంతర = వేరొక ప్రమాణం చేత, ఉదిత = కలిగినవై, మనో = మనస్సునకు, మధుర = ఇష్టమయిన, అర్థ = అర్థాన్ని, భాంజి = పొందెడివి. (భాజి - భాజీ - భాంజి - భాక్ శబ్దం ప్రథమావిభక్తి బహువచనం).

**తా ॥** '**ఆపోఽ బ్రువన్**' మొదలయిన సనాతన వాక్యాలలో అప్పులను (నీళ్ళను) కర్తగా చేసి చెప్పటముంది. నీళ్ళు మాటాడాయి అని. వాస్తవానికి నీళ్ళు జడాలు. వాటికి మాటాడే శక్తి లేదు. కాబట్టి అక్కడ నీళ్ళు అంటే నీళ్ళకు సంబంధించిన దేవత అని అర్థం చెప్పుకొంటున్నాం. అలాగే శుకుని మాటల్లో కూడా కంసాది రాక్షసులకు మోక్షసిద్ధి అనే మాటలుంటే ఒకవేళ వాటికి ప్రమాణాంతరాలతో పరిష్కరించుకొంటూ సమన్వితమయ్యే అర్థాన్ని చెప్పుకోవాలి. ఆ మాటలు అటువంటి భావంతో కూడి ఉన్నవే.

వి : 1. కంసాదులకు కూడా కృష్ణుని ద్వేషించినా మోక్షసిద్ధి కలిగిందన్న మాటకూ, జ్ఞానంతోనే మోక్షం మరో మార్గం లేదు అన్న మాటకు సమన్వయాన్ని సాధించుకోవాలంటే జీవద్వయ సన్నివేశ సిద్ధాంతాన్ని ఆశ్రయించటమే మార్గం. కంసాదులలో రెండు రకాలుగా జీవులున్నారని సజ్జీవుడు విష్ణుభక్తుడనీ, అసజ్జీవుడు విష్ణుద్వేషి అని చెప్పుకోవాలి. ఈ విషయాన్ని ఇంతకు ముందే ప్రస్తావించుకొన్నాం. ఒకే దేహంలో విభిన్న జీవులుంటారనటాన్ని గరుడపురాణం కూడా ఇలా ప్రతిపాదించింది-

శ్లో॥ శుభజీవప్రకాశేన కదాచిచ్ఛుభబుద్ధయః ।
విపర్యయే చాన్యథా స్యుః శుభాస్తత్ర హరిం యయుః ॥

శ్లో॥ అశుభాస్తు తమో ఘోరం యది తత్రైవ మధ్యమాః ।
మధ్యమాం గతిమేవాపుః **ఏకదేహగతా అపి** ॥ - గరుడపురాణం 10/5/18

(ఒకే దేహంలో శుభజీవులు, అశుభజీవులు, మధ్యమ జీవులు ఉంటారు. శుభజీవ ప్రకాశంతో శుభ బుద్ధులు (శుభగతులు) అశుభజీవప్రకాశంతో అంధతామిస్ర లోకాలు, మధ్యమ జీవప్రకాశంతో మధ్యమగతులు కలుగుతాయి.)

*

**శ్లో॥ యథా గ్రహావిష్టకలేవరే ద్వౌ - కృతాభిమానావిహ చేతనౌ స్తః ।
తథైవ కంసాదిశరీరసంస్థౌ - శుభాశుభౌ ద్వౌ సుఖదుఃఖభాజౌ ॥ 2-53**

అ : పూతన శరీరంలో జీవద్వయసన్నివేశమున్నట్లే కంసాదుల శరీరాలలో కూడా జీవ ద్వయ సన్నివేశ ప్రతిపాదన. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ గ్రహావిష్ట-కళేబరే కృతాభిమానౌ ద్వౌ యథా స్తః తథా ఏవ కంసాది-శరీర-సంస్థౌ శుభాశుభౌ (జీవౌ) సుఖ-దుఃఖ-భాజౌ (భవతః).

**ప్ర :** ఇహ = ఇక్కడ (పూతనా విషయంలో), గ్రహ+ఆవిష్ట - కళేవరే = గ్రహం పట్టిన శరీరంలో (గ్రహేన ఆవిష్ఠ కళేవరః, తస్మిన్), కృత+అభిమానౌ = ఇష్టపడినట్టి (కృతమ్ అభిమానం యాభ్యాం తౌ), ద్వౌ = రెండు, చేతనౌ = జీవులు, యథా **స్తః** = ఎలా వున్నారో (అస - భువి - లిట్ - ప్ర.ద్వి.), తథా+ఏవ = అదేరీతిగా, కంస+ఆది-శరీర- సంస్థౌ : కంస+ఆది = కంసుడు మొదలైన వారి యొక్క, శరీర = దేహాలలో, సంస్థౌ = ఉండి (కంసః ఆదౌ యేషాం తేషాం శరీరేషు సంస్థౌ), శుభ+అశుభౌ = శుభాశుభులై (శుభశ్చ అశుభశ్చ), సుఖదుఃఖ-భాజౌ = సుఖదుఃఖాలను అనుభవించే (సుఖదుఃఖయోః భాజౌ), ద్వౌ (జీవౌ) = ఇద్దరు జీవులు, స్తః = ఉంటారు.

**తా ॥** ప్రస్తుతం బాలగ్రహావిష్టమై పడియున్న పూతన శరీరంలో ఆ దేహం పై అభిమానంతో వచ్చిన జీవులు ఇద్దరున్నట్లే కంసాది రాక్షసుల శరీరాలలో కూడా ఇద్దరు జీవులున్నారు. ఒకడు శుభజీవి. మరొకడు అశుభజీవి. శుభజీవి సుఖాన్ని అనుభవిస్తాడు. అశుభజీవి దుఃఖాన్ని అనుభవిస్తాడు.

**వి :** 1. శుభాశుభజీవులు ఇద్దరూ ఒకే శరీరంలో ఉండటాన్ని ఇలా అర్థం చేసికోవాలి. విభిన్న ప్రవృత్తులు, వేరు వేరు ఆలోచనలు, పరస్పరం భిన్నమైన ప్రవర్తనలు దాదాపు అందరిలో చూస్తుంటాం. అక్కడంతా ఇద్దరు లేక ఎక్కువమంది జీవు లున్నట్లు గాదు.

రస సిద్ధాంతమార్గంలో చెప్పాలంటే రెండు స్థాయి భావాలు ఒకే వ్యక్తిలో నిలిచి వుండటం రెండు జీవులకు సంకేతం. భావోదయ, భావశాంతి, భావసంధి, భావశబలతల వలె ఒకే స్థాయికి సంబంధించినవి ఎన్ని కనిపించినా అక్కడ జీవభేదాన్ని అంగీకరింప నవసరం లేదు. రెండు భిన్నస్థాయిభావాలు మనస్సులో కొనసాగుతుంటే అక్కడ జీవద్వయ సన్నివేశాన్ని భావించాలి.

ఆశ్రయభేదాన్ని బట్టి రెండురకాల ప్రవర్తనలు కనిపించినా అవి ఒకే జీవప్రవృత్తికి సంబంధించి నవే అని భావించాలి. తనపిల్లలపై ప్రేమ, ఇతర బాలురపై ప్రేమ లేకపోవటం వంటివి. జీవద్వయ సన్నివేశముంటే తనవారిపైనే భిన్న భావాలు అవీ స్థాయిభావస్థాయిలో ఉండాలి. అప్పుడు జీవద్వయ సన్నివేశానికి అవకాశం.

| 2. **స్తః :** | అస్తి | **స్తః** | సన్తి |
|---|---|---|---|
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | అస్వః | స్మః. |

*

**శ్లో॥ ద్విషన్తమేకం దితిజం విహాయ - హరిప్రియస్యాసురతా కథం స్యాత్ ।**
**క్వచిద్ద్విషన్తోఽపి కిమర్జునేన్ద్ర-పురోగమా దైత్యతయా నిరుక్తాః ॥ 2-54**

**అ :** దితి కొడుకులే దైత్యులు కానీ కారణాంతరాల వల్ల హరిని వ్యతిరేకించిన వారందరూ అసురులు కారనుట.

-ఉపేంద్రవజ్ర.

**అ :** ద్విషన్తమ్ ఏకం దితిజం విహాయ హరి-ప్రియస్య అసురతా కథం స్యాత్. క్వచిత్ ద్విషన్తః అపి అర్జునేంద్ర-పురోగమాః దైత్యతయా నిరుక్తాః కిమ్?

**ప్ర :** ద్విషన్తమ్ = ద్వేషిస్తున్న, ఏకమ్- దితిజమ్ = ఒక్క దితిసుతుని, విహాయ = వదిలి పెడితే, హరిప్రియస్య = విష్ణు భక్తునకు (హరేః ప్రియః, తస్య), అసురతా = రాక్షసత్వం, కథం స్యాత్ = ఎలా కలుగుతుంది?, క్వచిత్ = ఒకప్పుడు, ద్విషంతః (సంతః) అపి = ద్వేషిస్తున్న (నిందించిన) వారయినను, అర్జున+ఇంద్ర-పురోగమాః =

అర్జునుడు, ఇంద్రుడు మొదలగు వారు (అర్జునశ్చ ఇంద్రశ్చ తౌ పురోగమౌ యేషాం తే), దైత్యతయా = దితి సుతులుగా (రాక్షసులుగా), నిరుక్తాః కిమ్? = వ్యవహరింపబడ్డారా?

**తా ॥** హరిని ద్వేషించే దితిసుతులయిన అసురులు తప్ప హరిప్రియు లెవ్వరూ అసురులు కారు. అర్జునుడు, ఇంద్రుడు మొదలగువారు కూడా అప్పుడప్పుడు కృష్ణుని వ్యతిరేకించిన వారే. అంతమాత్రాన వాళ్ళను రాక్షసులు అంటున్నామా?

**వి :** 1. ద్వేషం, కోపం, నిష్ఠూరం, అధిక్షేపణం – ఇవన్నీ వేరు వేరు భావాలు, వ్యక్తీకరణలూ. కృష్ణుడు సత్యభామకోసం నందనవనం నుండి పారిజాతాన్ని తెచ్చే ప్రయత్నం చేసినపుడు ఇంద్రుడు కృష్ణునితో పోరాడాడు. అర్జునుడు గయుని కాపాడటానికి (కథ కల్పితం) కృష్ణునితో పోరాటానికి సిద్ధమయ్యాడు. అధిక్షేపించాడు. కంచర్ల గోపన్న (రామదాసు) కీర్తనలలో తన ఆరాధ్యదైవమైన రాముని నిష్ఠురవచనాలతో నిందించాడు. కాసుల పురుషోత్తమకవి ఆంధ్రనాయకశతకంలో వ్యాజస్తుతిరూపంగా శ్రీకాకుళాంధ్రమహా విష్ణువును నిందించాడు. విష్ణువల్లభ యయిన లక్ష్మిని చంచల అని ఎంతమంది కవులు ఎన్నిసార్లు ప్రకటించారో లెక్కేలేదు. అయితే ఇవన్నీ ద్వేషం మూలంగా జరిగిన చర్యలు కావు. కాబట్టి వ్యతిరేకవచనాలుగా కనిపిస్తున్నా, నిందగా అనిపిస్తున్నా వారిని కృష్ణ (విష్ణు) ద్వేషులుగా లేదా ఆయా దివ్యతత్త్వాలను నిందించిన వారుగా పేర్కొనలేము.

కాబట్టి ద్వేషం మూలపదార్థంగా గల దితి సుతులకే అసురపదం అన్వయిస్తుందని భావం.

2. **స్యాత్ :**

| | | | |
|---|---|---|---|
| | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ న చోగ్రశాపాదసురత్వమేషాం – విహాయ దుష్టం కమపి స్వనిష్ఠమ్ ।**
**యతోఽభిశప్తేఽపి నృపే తదేత-దభూత్పురా కిఙ్కరదైత్యయోగాత్ ॥ 2-55**

**అ :** శిశుపాలాదుల అసురత్వానికి కారణం వారిలోని ఆంతరప్రవృత్తియే అని నిరూపించటం.–ఉపేంద్రవజ్ర.

**అ :** ఏషామ్ అసురత్వం స్వనిష్ఠం కమపి దుష్టం విహాయ ఉగ్రశాపాత్ న. యతః పురా అభిశప్తేఽపి నృపే తత్ ఏతద్ కింకర–దైత్య–యోగాత్ అభూత్.

**ప్ర :** ఏషామ్ = ఈ శిశుపాలుడు మొదలయిన వారికి, అసురత్వమ్ = రాక్షసత్వం, స్వనిష్ఠమ్ = తనలోనున్న, కమ్+అపి = ఎవరో ఒక, దుష్టమ్ = దుష్టుని, విహాయ = వీడి (విహాయ అవ్యయమ్), ఉగ్ర–శాపాత్ = తీవ్రశాపం వలన (తీవ్రశ్చ అసౌ శాపః – తస్మాత్), న = కాదు, పురా = గతంలో, నృపే = రాజు (కల్మాషపాదుడు), అభిశప్తే+అపి = శపింప బడిననూ, తత్–ఏతత్ = ఆ అసురత్వం, కింకర... యోగాత్ : కింకర = కింకరుడనే, దైత్య = రాక్షసునితో, యోగాత్ = కలయిక వలన (కింకర ఇతి దైత్యః, తేన యోగః, తస్మాత్ : కింకరదైత్యయోగాత్), అభూత్ = కలిగెను (భూ సత్తాయామ్ పరస్మైపది – లుఙ్ ప్ర.ఏ.)

**తా ॥** శిశుపాలుడు మొదలయిన వారు స్వతహాగా నిర్దుష్టులై శాపవశాన అసురత్వాన్ని పొందిన వారు కారు. వారిలో అంతర్గతంగా ఉన్న ఏ దుష్టజీవుడో వారిచేత ఆ పనులు చేయించాడు. గతంలో కల్మాషపాదుడనే రాజుకు కూడా శక్తి శాపం కలిగినపుడు కింకరుడనే దైత్యుడు ఆయనను ఆవేశించాడు గదా!

**వి :** 1. కల్మాషపాదుడొక రాజు. శక్తి వసిష్ఠుని కుమారుడు. ఒకానొక అరణ్యంలో దారినివ్వటంలో ఈ ఇద్దరి మధ్య ఘర్షణ ఏర్పడగా శక్తి ఆ రాజును రాక్షసుడవు కమ్మని శపించాడు. రాజు ఆ తరువాత శక్తిని క్షమాభిక్ష

కోరాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన విశ్వామిత్రుడు ఒక రాక్షసుని (కింకరుని) శక్తి శరీరంలో ప్రవేశించమని ఆదేశించాడు.

శ్లో॥ స తు శప్తస్తదా తేన శక్తినా వై నృపోత్తమ ।
జగామ శరణ శక్తిం ప్రసాదయితుమర్థయన్ ॥

శ్లో॥ తస్య భావం విదిత్వా తు స నృపతేః కురుసత్తమ ।
విశ్వామిత్రస్తతో రక్షః ఆదిదేశ నృపం ప్రతి ॥

శ్లో॥ స శాపాత్ తస్య విప్రర్షేః విశ్వామిత్రస్య చాజ్ఞయా ।
రాక్షసః కింకరో నామ వివేశ నృపతిం తదా ॥ –మహాభారతమ్–ఆది–1/75

ఆ రీతిగా శాపంవలన అసురత్వమేర్పడినా లోన ఒక వాస్తవాసురత్వం అవసరమవుతోంది కాబట్టి శిశుపాలాదులలో స్వనిష్ఠుడైన దుష్టజీవుడే దుర్మార్గానికి కారణం.

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

**శ్లో॥ తవైవ చైద్యే జయనామకస్సన్ – తథా పరస్మిన్ విజయాభిధానః ।**
**నిరన్తరద్వేషఫలస్య మూలం – బలేన రక్షోఽపి చ తర్హి సిద్ధ్యేత్ ॥ 2–56**

**అ :** అన్యథానుపపత్తి ద్వారా శిశుపాలాదులలో రాక్షసస్థితిని సాధించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** తవ ఏవ చైద్యే జయనామకః సన్ తథా పరస్మిన్ విజయాభిధానః (సన్) తర్హి నిరంతరద్వేషఫలస్య మూలం రక్షః అపి బలేన సిద్ధ్యేత్ చ.

**ప్ర :** తవ+ఏవ = నీయొక్క మతమే..., చైద్యే = శిశుపాలునిలో, జయ–నామకః = జయుడను పేరుగలవారు (జయ ఇతి నామకః), సన్ = సత్పురుషుడు, తథా = ఆ రీతిగానే, పరస్మిన్ = మరొకరి (దంతవక్త్రుని)లో, విజయ+అభిదానః = విజయుడనే వాడు (విజయ ఇతి అభిధానం యస్య సః), సన్ = సత్పురుషుడే, తర్హి = అటువంటప్పుడు, నిరం... ఫలస్య : నిరంతర = ఎడతెగని, ద్వేష–ఫలస్య = ద్వేషమనే కార్యానికి, మూలమ్ = కారణం (నిరంతరస్య ద్వేషస్య ఫలమ్, తస్య), రక్షః + అపి = రాక్షసుడు కూడా, బలేన = తప్పని పరిస్థితిలో, సిద్ధ్యేత్ = సిద్ధిస్తాడు కదా! (సిధ్ సంరాద్ధౌ పరస్మైపది–విధిలిజ్–ప్ర.ఏ.).

**తా ॥** నీ మతం ప్రకారమే ఆలోచించినా శిశుపాలునిలో నున్న జయుడు సజ్జనుడు. దంతవక్త్రునిలో ఉన్న విజయుడు సజ్జనుడు. కానీ శిశుపాలదంతవక్త్రులలో నిరంతర హరిద్వేషానికి మూలమేమిటి? మరోదారి లేదు కాబట్టి వారిలో ఎవరో రాక్షసులు ఆవేశించారని అర్థం చేసుకోవడమే గదా!

**వి :** 1. జయవిజయులే మూడవ జన్మలో శిశుపాలదంతవక్త్రులుగా పుట్టారు. జయవిజయులు సజ్జనులే గదా!

శాపాలవలన మరోలోకంలో పుట్టినా, ప్రత్యేకించి లక్షణాలను శాపంలో నిర్దేశిస్తే తప్ప జీవునిలో మార్పు ఉండదు. శపింపబడిన ప్రాకృతిక రూపాన్ని స్వీకరించటం తప్ప. జీవుడు అనుభవింపవలసిన దాని ననుసరించి లేదా శాపాన్ని అనుసరించి దేహ స్వీకరణం, లేదా దేహాస్వీకరణం విహితమైనపుడు తదనుగుణంగా జీవలక్షణం ప్రసరించటం పరస్పర– పరిపూరకాలు.

| | | | |
|---|---|---|---|
| 2. **సిద్ధ్యేత్ :** | **సిద్ధ్యేత్** | సిద్ధ్యేతామ్ | సిద్ధ్యేయుః |
| | సిద్ధ్యేః | సిద్ధ్యేతమ్ | సిద్ధ్యేత |
| | సిద్ధ్యేయమ్ | సిద్ధ్యేవ | సిద్ధ్యేమ. |

*

**శ్లో॥ యదీహ చైద్యే దితిజో న వైరా - న్న తర్హి మోక్షః పరిచర్యయైవ ।**
**యదా తు సేవావిధురోఽపరోఽస్తి - తదా బలాత్ సిద్ధ్యతి జీవయుగ్మమ్ ॥2-57**

**అ :** శిశుపాలునిలో జీవద్వయ సన్నివేశాన్ని అన్యథానుపపత్తి ప్రమాణంతో సాధించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** యది ఇహ చైద్యే దితిజః న (అస్తి) తర్హి మోక్షః వైరాత్ న, పరిచర్యయా ఏవ. యదా అపరః సేవావిధురః అస్తి తదా బలాత్ జీవయుగ్మం సిద్ధ్యతి.

**ప్ర :** యది = ఒకవేళ, ఇహ = ఇక్కడ, చైద్యే = శిశుపాలుని శరీరంలో (చేదీనాం రాజా = చైద్యః), దితిజః = అసురుడు, న (అస్తి) = లేదు (అంటే), తర్హి = అప్పుడు, పరిచర్యయా+ఏవ = సేవ చేతనే, మోక్షః = బంధవిముక్తి. యదా తు = ఎప్పుడయితే, సేవా-విధురః = సేవలేని వాడు (సేవయా విధురః), అపరః = మరియొకరు, అస్తి = ఉన్నాడంటే, తదా = అప్పుడు, బలాత్ = తప్పనిసరిగా, జీవయుగ్మమ్ = జీవుల జత (జీవయోః యుగ్మమ్), సిద్ధ్యతి = సిద్ధించును. (సిధ్ - సంరాద్ధౌ - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.).

**తా ॥** శిశుపాలునిలో ఒకవేళ ఏ అసురుడూ లేదని భావిస్తే అప్పుడు పరిచర్య చేతనే మోక్షం సిద్ధించిందనవలసి వస్తుంది. ఒకవేళ పరిచర్య దృష్టి లేని వాడెవడో మరొకడు లోన నిలిచాడంటే ఇద్దరు జీవులున్నట్లు అంగీకరింపక తప్పదు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. సిద్ధ్యతి :** | **సిద్ధ్యతి** | సిద్ధ్యతః | సిద్ధ్యన్తి |
| | సిద్ధ్యసి | సిద్ధ్యథః | సిద్ధ్యథ |
| | సిద్ధ్యామి | సిద్ధ్యావః | సిద్ధ్యామః. |

*

**శ్లో॥ విద్వేషిజీవకృతసఙ్గమపి స్వభక్తం**
**కృష్ణో వ్యమోచయదహో కరుణామ్బురాశిః ।**
**కిన్నామ తద్రహితభక్తజనానితి స్మ**
**కైముత్యమూహయత సత్యవతీసుతోక్త్యా ॥ 2-58**

**అ :** కృష్ణుని పరమదయాసముద్రునిగా వర్ణించుట. -వసంతతిలక.

**అ :** కరుణాంబురాశిః కృష్ణః విద్వేషిజీవకృతసంగమ్ అపి స్వభక్తం వ్యమోచయత్. సత్యవతీ- సుతోక్త్యా తద్రహితభక్తజనాన్ (మోచయతీతి) కిన్నామ, కైముత్యమ్ ఊహయత.

**ప్ర :** కరుణా-అంబురాశిః = దయాసముద్రుడైన (కరుణాయాః అంబురాశిః), కృష్ణః = కృష్ణుడు, విద్వేషి... సంగమ్-అపి : విద్వేషి = తనను ద్వేషించే, జీవ = జీవునితో, కృత = చేయబడిన, సంగమ్+అపి = చెలిమి కలవాడయినను, (విద్వేషీ చ అసౌ జీవః, తేన కృతః సంగః యేన తమ్), స్వభక్తమ్ = తన భక్తుని, వి+అమోచయత్ = విడిపించెను (వి+ముచ్-ణిచ్ - పరస్మై పది - లఙ్ ప్ర.ఏ.), తద్రహిత... జనాన్ : తత్+రహిత = ఆ ద్వేషం లేని, భక్త-జనాన్ = భక్తులను (మనవంటి వారిని), మోచయతి+ఇతి = విడిపిస్తాడన్నది, కిం నామ = చెప్పవలసిన దేముంది? సత్యవతీ-సుత+ఉక్త్యా = వ్యాసవచనం ద్వారా, కైముత్యమ్ - 'కిముత' అను న్యాయాన్ని బట్టి, ఊహయత = ఆలోచించండి. (ఊహ వితర్కే - ణిచ్ - పరస్మైపది - లోట్ మ.బ.).

**తా ॥** కృష్ణుడు దయాసముద్రుడు. తన భక్తుడు తనను ద్వేషించే జీవునితో కలిసి వున్నాడని తెలిసి కూడా ఆ భక్తుని (శిశుపాలుని) బంధవిముక్తుని చేశాడు. ఇక ఆ ద్వేషభావన లేని వారిని విముక్తులను చేయటంలో చెప్పవలసిన దేమున్నది? వ్యాసవచనాలను బట్టి ఊహించండి.

**వి :** 1. **కైముత్యమ్** – సంస్కృతంలో కైముతిక న్యాయం/దండాపూపికా న్యాయం అని రెండు న్యాయాలు. కిముత – యొక్క భావం కైముతికం. దండాపూపికా న్యాయం దానిని సోదాహరణంగా చెప్పేది. దండం – అపూపం (రొట్టె) ఈ రెండంటికీ సంబంధించిన న్యాయం. ఒక దండానికి ఒక రొట్టెను గ్రుచ్చి దానిని ఎక్కడో వ్రేళాడ దీశాడట. కొద్దిసేపటి తర్వాత చూస్తే అసలు దండమే కనిపించలేదట. ఇక రొట్టెముక్క గురించి చెప్పవలసిన దేముంది? ఇది దండాపూపికా న్యాయం. దీని సిద్ధాంతరూపమే కైముతిక న్యాయం. ద్వేషించే వాడితో కలిసివున్న భక్తునికే విముక్తిని కలిగిస్తే ఇక భక్తి గలిగిన వారిని గురించి చెప్పవలసిన దేముంటుంది?

2. శ్లో॥ ద్వేషిజీవయుతం చాపి కృష్ణశ్చైద్యం వ్యమోచయత్ ।
అహోఽతికరుణా విష్ణోః శిశుపాలస్య మోక్షణాత్ ॥

ఇది మహాభారతశ్లోకంగా భాగవతతాత్పర్యంలో ఉదాహరింపబడింది (10/24/25)

| | | | |
|---|---|---|---|
| 3. **వ్యమోచయత్ :** | **వ్యమోచయత్** | వ్యమోచయతామ్ | వ్యమోచయన్ |
| | వ్యమోచయః | వ్యమోచయతమ్ | వ్యమోచయత |
| | వ్యమోచయమ్ | వ్యమోచయావ | వ్యమోచయామ. |
| **ఊహయత :** | ఊహయతు/ఊహయతాత్ | ఊహయతామ్ | ఊహయన్తు |
| | ఊహయ/ఊహయతాత్ | ఊహయతామ్ | **ఊహయత** |
| | ఊహయాని | ఊమయావ | ఊహయామ. |

*

**శ్లో॥ ద్వేషాభివృద్ధిం ద్విషతాం విధాతుం – వ్యాసశ్చ న స్పష్టమిదం ప్రమేయమ్ ।**
**ఊచే న చేద్భక్తజనైరగమ్యం – పాపైరసాధ్యం తమ ఆప్నుయాత్ కః ॥ 2–59**

**అ :** హరి విద్వేషం మోక్షహేతువు కాదను విషయాన్ని వ్యాసుడు కంఠోక్తిగా చెప్పకపోవటాన్ని సంభావించుట.
–ఇంద్రవజ్ర.

**అ :** ద్విషతాం ద్వేషాభివృద్ధిం విధాతుం వ్యాసః చ ఇదం ప్రమేయం స్పష్టం న ఊచే. న చేత్ భక్తజనైః అగమ్యం పాపైః అసాధ్యం తమః కః ఆప్నుయాత్.

**ప్ర :** ద్విషతామ్ = ద్వేషిస్తున్న వారిలో, ద్వేష+అభివృద్ధిమ్ : ద్వేష = ద్వేషం యొక్క, అభివృద్ధిమ్ = పెరుగుదలను (ద్వేషస్య అభివృద్ధిః, తామ్), విధాతుమ్ = కల్పించటానికై (వి పూర్వక ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), వ్యాసః చ = వ్యాసుడు కూడా, ఇదమ్ = ఈ, ప్రమేయమ్ = ప్రమాణంచే తెలియ దగిన అంశాన్ని, స్పష్టమ్ = స్పష్టంగా, న ఊచే = చెప్పలేదు (వచ పరిభాషణే – ఆత్మనేపది – లిట్ – ప్ర.ఏ.), న చేత్ = లేకపోతే, భక్త–జనైః = భక్తజనులచేత (భక్తాశ్చతే జనాః తైః), అగమ్యమ్ = పొందరానిదియు, పాపైః = పాపులచేత, అసాధ్యమ్ = సాధింపరానిదియు అయిన, తమః = చీకటి లోకాన్ని (నరకాన్ని), కః = ఎవడు, ఆప్నుయాత్ = చేరును? (ఆప్ల(5) వ్యాప్తౌ పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.).

**తా ॥** హరిని ద్వేషించేవారిలో ద్వేషాన్ని వృద్ధి పొందించటానికే కాబోలు వ్యాసుడీ విషయాన్ని నిశ్చయాత్మకంగా చెప్పలేదు. ఒకవేళ చెప్పివుంటే భక్తులకు అగమ్యమై, పాపులకు అసాధ్యమైన ఆ చీకటిలోకాలకు పోవాలని ఎవరు కోరుకొంటారు?

**వి :** 1. అధోలోకాలు వ్యర్థమవుతాయి కాబట్టి వ్యాసమహర్షి హరిద్వేషం పతనహేతువని నొక్కి చెప్పలేదన్నది కవి హృదయం. అసలు అధోలోకాల సృష్టి ఎందుకు? వాటిని సజీవంగా వుంచాలని హరిద్వేషాన్ని నిషేధించకపోవట మెందుకు? అంటే సృష్టి పరమాత్మ విలాస స్వరూపం. దానిలో మన ప్రమేయం లేదు. **పురాణాలు ఒక ఆదర్శ**

**జీవితాన్ని ఇవ్వటానికి చేసిన ప్రయత్నాలు**. వాటిలో మంచి చెడులు రెండూ వుంటాయి. ఏతావతా వ్యాసమహర్షి నొక్కి చెప్పినా చెప్పకపోయినా హరిభక్తులూ, హరిద్వేషులూ నైసర్గికంగానే వుంటారు.

| | | | |
|---|---|---|---|
| 2. **ఊచే :** | **ఊచే** | ఊచాతే | ఊచిరే |
| | ఊచిషే | ఊచాథే | ఊచిధ్వే |
| | ఊచే | ఊచివహే | ఊచిమహే |
| **ఆప్నుయాత్ :** | **ఆప్నుయాత్** | ఆప్నుయాతామ్ | ఆప్నుయుః |
| | ఆప్నుయాః | ఆప్నుయాతమ్ | ఆప్నుయాత |
| | ఆప్నుయామ్ | ఆప్నుయావ | ఆప్నుయామ. |

*

**శ్లో॥ ఆనన్దతీర్థమతముజ్ఝితదోషజాతం**
**స్వానన్దదాయి శిథిలీకృతమత్తమాయి ।**
**మానౌఘశోభి మమ దుర్జనపుఞ్జితోఽభీ-**
**ర్యేనేదృశీ మతిరభూత్ కవితోల్లసద్భూః ॥ 2-60**

**అ :** తనకు కవితాసిద్ధాంతవిషయాలలో నిర్భయత్వాన్ని కలిగించిన ఆనందతీర్థమత ప్రస్తుతి. -వసంతతిలక.

**అ :** స్వానందదాయి శిథిలీకృతమత్తమాయి మానౌఘశోభి ఆనందతీర్థమతమ్ ఉజ్ఝితదోషజాతమ్. యేన మమ దుర్జనపుంజితః అభీః ఈదృశీ కవితోల్లసద్భూః మతిః అభూత్.

**ప్ర :** స్వ+ఆనంద-దాయి = ఆత్మానందాన్ని ఇచ్చేది (స్వస్య ఆనందః, తం దదాతీతి స్వానందదాయి), శిథిలీ... మాయి : శిథిలీకృత = చెదరగొట్టబడిన, మత్త = ఉన్మత్తులైన వారియొక్క, మాయి = మాయలు గలది (శిథిలీకృతాః మత్తాః చ తే మాయినః యేన తత్ తథా), మాన+ఓఘ+శోభి : మాన = ప్రమాణాల యొక్క, ఓఘ = సమూహంతో (ప్రకరఘనౌఘసంఘ... హలాయుధకోశః – 686), శోభి = ప్రకాశించేది (మానానాం ఓఘః, తైః శోభత ఇతి), ఆనందతీర్థ – మతమ్ = ఆనందతీర్థరుయొక్క మతం (ఆనందతీర్థస్య మతమ్), ఉజ్ఝితదోషజాతమ్ : ఉజ్ఝిత = విడువబడిన, దోష = తప్పుల యొక్క, జాతమ్ = సమూహం గలది (ఉజ్ఝితః దోషాణాః జాతః యేన తత్), యేన = ఏ మతం చేత, మమ = నాకు (కవికి), దుర్జన పుంజితః = చెడ్డవారి గుంపు నుండి (దుర్జనానాం పుంజః, తస్మాత్), అభీః = నిర్భయత్వం, కవితోల్లసద్భూః : కవితా = కవితకు, ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, భూః = స్థానం (కవితాయాః ఉల్లసన్తీ భూమిః యస్యాం సా), ఈదృశీ = ఇటువంటి, మతిః = బుద్ధిః, అభూత్ = కలిగెనో!

**తా ॥** స్వానందాన్ని (మోక్షాన్ని) ఇవ్వగలదీ, ఉన్మత్తులు మాయావులు అయిన వారి మాటలను చెదరగొట్టగలదీ, నిర్దుష్టమయినదీ ఆనందతీర్థరు మతం.

ఆయన ప్రతిపాదించిన ఆ మతమే నన్ను నా అభిప్రాయాలు ప్రకటించటంలో నిర్భయుణ్ణి చేసింది. చెడ్డవారికిక భయపడను. నా కవిత్వానికి ఉజ్జ్వల స్థానాన్ని అందించిందీ, నాకు ఇటువంటి మతిని అందించిందీ కూడా ఆ ఆనందతీర్థరు మతమే.

**వి :** 1. ఆనందతీర్థరు అంటే ద్వైతమతాన్ని ప్రతిపాదించిన మధ్వాచార్యులే. పూర్ణప్రజ్ఞులని కూడా వీరికి నామాంతరం. 13,14 శతాబ్దాలకు చెందిన శ్రీమధ్వాచార్యులు మహాభారత తాత్పర్యనిర్ణయ మనే విశిష్ట గ్రంథానికి కర్త. మాధ్వులకు నేటికీ పరమప్రామాణికమైన గ్రంథం మహాభారతతాత్పర్యనిర్ణయమే. ప్రస్తుత గ్రంథ (రుక్మిణీశవిజయ) కర్త శ్రీవాదిరాజ తీర్థరు మహాభారతతాత్పర్యనిర్ణయానికి మంచి వ్యాఖ్యానాన్ని అందించారు.

ఈ శ్లోకం ద్వారా మధ్వసిద్ధాంతనిర్దుష్టతనూ, మోక్షప్రదాతృత్వాన్ని కవి ప్రస్తుతిస్తున్నాడు.

ఇంతకు ముందు శ్లోకాలలో పూతనాదుల శరీరాలలో జీవద్వయ సన్నివేశాన్ని యుక్తియుక్తంగా నిరూపించారు వాదిరాజతీర్థరు. తన ఆ ప్రతిపాదనకూ, సిద్ధాంతీకరణకూ ద్వైతమతమే మూలమని ప్రకృత శ్లోకంలో ప్రకటిస్తున్నాడు.

2. నాలుగు పాదాలలనో మత – జాత; దాయి – మాయి ; శోభి – అభీ; అభూ – భూ అని ఆ యా అక్షరాలను పునరుక్తాలను చేసి మృదువయిన సౌందర్యాన్ని సంపాదించాడు కవి.

3. స్వానందదాయి – ఈ అభిప్రాయం మధ్వవిజయ కావ్యంలో కనిపిస్తుంది.

శ్లో॥ ఆనందరూపస్య పరస్య పాత్రధీ – రానందసందాయి సుశాస్త్రకృత్ స యత్ ।
ఆనందతీర్థేతి పదం గురూదితం – బభూవ తస్యాత్యనురూపరూపకమ్ ॥

– నారాయణపండితాచార్యకృతం – మధ్వవిజయమ్ – 5/2

4. **ఉజ్ఝితదోషజాతమ్** : మధ్వమతంలో దైవం నిర్దుష్టం. సహజంగా నాలుగు దోషాలను భావించి వాటిని ఖండించి బ్రహ్మసూత్రభాష్యంలో (రెండవ అధ్యాయంలో) నిరూపిస్తారు మధ్వాచార్యులు. ఆ దోషాలివి 1. అనిత్యత్వం 2. దేహహాని 3. దుఃఖప్రాప్తి 4. అపూర్ణత్వం.

5. ఆనందతీర్థమతముజ్ఝితదోషజాతం స్వానందదాయి శిథిలీకృతమత్తమాయి – అన్న పదబంధం నారాయణాచార్య విరచితమైన అద్వైతకాలానలంలో కూడా కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 6. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

## శ్లో॥ తతః శుభౌత్థానికకర్మ కర్తు-మియేష నందః పురుషోత్తమస్య ।
## గృహాద్బహిర్దైత్యచమూం జిఘాంసు-రమంస్త తత్ స్వాచరణానురూపమ్ ॥2-61

**అ :** కృష్ణునకు ఔత్థానిక కర్మను నిర్వహించే ఆలోచన. –ఉపేంద్రవజ్ర.

**అ :** తతః నందః పురుషోత్తమస్య శుభౌత్థానికకర్మ కర్తుమ్ ఇయేష. గృహాత్ బహిః దైత్యచమూం జిఘాంసుః (కృష్ణః) తత్ స్వాచరణానురూపమ్ అమంస్త.

**ప్ర :** తతః ఆ తరువాత, నందః = నందుడు, పురుష+ఉత్తమస్య = శ్రీకృష్ణునకు, శుభ+ఔత్థానిక – కర్మ = శుభప్రదమైన ఔత్థానిక కర్మ (శుభం చ తత్ ఔత్థానికం కర్మ), కర్తుమ్ = చేయుటకు (కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఇయేష = కోరుకొనెను. (ఇష ఇచ్ఛాయాం – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), గృహాత్ = ఇంటి నుండి, బహిః = వెలుపల, దైత్య–చమూమ్ = రాక్షససేనను (దైత్యానాం చమూః తామ్), జిఘాంసుః = చంపదలచుకొన్న (హంతుమ్ ఇచ్ఛుః జిఘాంసుః), కృష్ణః = కృష్ణుడు, తత్ = ఆ ఔత్థానిక కర్మను, స్వాచరణానురూపమ్ : స్వ = తనయొక్క, ఆచరణ = పనికి, అనురూపమ్ = తగినదిగా (స్వస్య ఆచరణం తస్య అనురూపమ్), అమంస్త = భావించెను. (మన్ జ్ఞానే – ఆత్మనేపది – లుఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత నందుడు కృష్ణునకు శుభకరమైన ఔత్థానిక కర్మను జరిపించాలని తలచాడు. కృష్ణుడు కూడా ఇంటికి వెలుపల రాక్షసుల గుంపును చంపాలనుకొంటున్నాడు కాబట్టి ఆ కార్యక్రమం తాను చేయదలచిన దానికి అనుగుణమనే భావించాడు.

**వి :** 1. ఔత్థానిక కర్మను భాగవతం కూడా ప్రస్తావించింది. అయితే మన ప్రాంతంలో ఆ పేరుతో ఏ ఆచారమూ కనబడదు. జాతకర్మ తరువాత పదకొండవరోజు నామకరణం బాలసారె (బారసాల) కార్యక్రమాన్ని జరిపిస్తుంటారు. ఔత్థానిక కర్మ అటువంటిదే కావచ్చు.

**ద్వాదశేఽహని కర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహాత్ ।**
**తృతీయే హ్యర్థమాసే వా దర్శనార్థం రవేరపి ॥** **(రుక్మిణీశవిజయ వ్యాఖ్యానగతశ్లోకం)**

మూడు, పండ్రెండు, పదిహేనవ రోజులలో శిశువును ఇంటి నుండి వెలుపలకు తీసుకొని పోయే కార్యక్రమం జరిపించాలి. శిశువుల ఎదుగుదలలోని ప్రతిమార్పునూ (మలుపునూ) పండుగగా జరుపుకొనే అలవాటు కలిమిగల వారికుంది.

2. ఇక్కడ సమాధ్యలంకారముంది. '**సమాధిః కార్యసౌకర్యం కారణాంతరసన్నిధేః**' (కువలయానందం - 118) అని సమాధి లక్షణం. మనం చేయదలచుకొన్న పని మన ప్రమేయం లేకుండా ఇతర కారణాలతో సానుకూలపడితే అది సమాధ్యలంకారం.

ఇక్కడ రాక్షససంహారం కోసం కృష్ణుడు బయటకు వెళ్ళాలని ఆలోచిస్తూంటే ఔత్థానిక కర్మ పేరుతో నందుడే దానిని జరిపించాలనుకోవటం సమాధ్యలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **ఇయేష :** | **ఇయేష** | ఈషతుః | ఈషుః |
| | ఇయేషిథ | ఈషథుః | ఈష |
| | ఇయేష | ఈషివ | ఈషిమ. |
| **అమంస్త :** | **అమంస్త** | అమంస్తాతామ్ | అమంసత |
| | అమంస్థాః | అసంసాథామ్ | అమంధ్వమ్ |
| | అమంసి | అమంస్వహి | అమంస్మహి. |

*

**శ్లో॥ నిజం సమాహూయ స బన్ధువర్గం - పితా సుతం శ్రీపతిమభ్యషిఞ్చత్ ।**
**తదాప్రభృత్యుద్ధతదైత్యవర్గ-విఘాతదీక్షామివ తస్య బధ్నన్ ॥** **2-62**

**అ :** ఔత్థానిక కర్మ నిర్వహణ. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః పితా నిజం బంధు-వర్గం సమాహూయ సుతం శ్రీ-పతిమ్ అభ్యషించత్. తదాప్రభృతి ఉద్ధత-దైత్య-వర్గ-విఘాత-దీక్షాం తస్య బధ్నన్నివ.

**ప్ర :** సః పితా = ఆతండ్రి (నందుడు), నిజమ్ = తనదైన (నిజమాత్మీయనిత్యయోః - వైజయన్తీ - ద్వ్యక్షరకాండ - అర్థవల్లింగ - 9), బంధు-వర్గమ్ = బంధు సమూహాన్ని (బంధూనాం వర్గః - తమ్), సమాహూయ = పిలిపించి (సమ్- ఆ - హు ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుతమ్ = కుమారుడైన, శ్రీపతిమ్ = కృష్ణుని, అభి+అషించత్ = అభిషేకించెను. తదా - ప్రభృతి = అప్పటినుండి, ఉద్ధత... దీక్షామ్ : ఉద్ధత = పొగరెక్కిన, దైత్య = దితికుమారుల (రాక్షసుల) యొక్క, వర్గ = సమూహాన్ని, విఘాత = సంహరించు, దీక్షామ్ = దీక్షను, తస్య = ఆ కృష్ణునకు, బధ్నన్+ఇవ = కట్టుతున్నట్టుగా (అభిషేకించెను).

**తా ॥** కృష్ణుని తండ్రి అయిన నందుడు తనవారి నందరినీ పిలిపించి కుమారుడైన కృష్ణునికి తలంటు పోయించాడు. పొగరెక్కిన రాక్షసులను సంహరించే దీక్షను ఆ కృష్ణునకు కట్టబెడు తున్నట్లుగా ఆ కార్యక్రమ ముంది.

**వి :** 1. ఇక్కడ వస్తూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా**' ఇది ఉత్ప్రేక్షా లక్షణం. 'ఇవ' పదం సాక్షాత్తుగా ప్రయోగింపబడింది. అది ఉత్ప్రేక్షా వ్యంజకం.

| | | | |
|---|---|---|---|
| 2. **అభ్యషించత్ :** | **అభ్యషించత్** | అభ్యషించతామ్ | అభ్యషించన్ |
| | అభ్యషించః | అభ్యషించతమ్ | అభ్యషించత |
| | అభ్యషిచమ్ | అభ్యషించావ | అభ్యషించామ. |

*

**శ్లో॥ యదా సుహృత్సఞ్చయమర్చయన్తీ - సుతం న సస్మార ముదా యశోదా ।**
**తదైవ మాయీ శకటాసురస్తం - నిహన్తుకామోఽభిససార శూరః ॥ 2-63**

**అ :** శకటాసుర ప్రవేశ వర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** యశోదా ముదా సుహృత్సంచయమ్ అర్చయన్తీ యదా సుతం న సస్మార తదా ఏవ మాయీ శూరః నిహన్తు-కామః శకటాసురః తమ్ అభిససార.

**ప్ర :** యశోదా = యశోద, ముదా = ఆనందంతో (ముత్ శబ్దం తృతీయా + ఏకవచనం), సుహృత్-సంచయమ్ = ఆత్మీయ సమూహాన్ని (సుహృదాం సంచయః, తమ్), అర్చయన్తీ = గౌరవిస్తూ, సుతమ్ = కుమారుని, న **సస్మార** = గమనించలేదో (స్మృ చింతాయాం - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), తదా - ఏవ = ఆ సమయంలోనే, మాయీ = మాయావియు, శూరః = శూరుడును, నిహన్తు-కామః = చంపదలచిన వాడును అయిన (నిహన్తుం కామః యస్మిన్ సః), శకట+అసురః = శకటుడనే పేరుగల రాక్షసుడు (శకట ఇతి అసురః), తమ్ = ఆ కృష్ణుని, అభిససార= సమీపించెను (అభి+సృ గతౌ పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.).

**తా ॥** ఆత్మీయులందరూ రావటంతో యశోద వారి బాగోగులు విచారిస్తూ కృష్ణుని విషయాన్ని మరచి పోయింది. ఆ సమయంలోనే మాయావి, శూరుడు అయిన శకటాసురుడు కృష్ణుని చంపదలచి దగ్గరకు చేరాడు.

**వి :** 1. ఇది చాలా సహజమైన పరిణామం. ఇంట్లో సందడిగా వున్నప్పుడు పసిపిల్లలను గురించి పట్టించుకోక పోవటం సర్వసాధారణం.

| | | | |
|---|---|---|---|
| 2. **సస్మార :** | **సస్మార** | సస్మరతుః | సస్మరుః |
| | సస్మర్థ | సస్మరథుః | సస్మర |
| | సస్మార/సస్మర | సస్మరివ | సస్మరిమ. |

*

**శ్లో॥ మరిష్యమాణః సకలం స్వభాగ్య-మనేన కంసః సహ నేష్యతీతి ।**
**భియేవ పూర్వం శకటం మురారి-ర్బభంజ పాదేన సుకోమలేన ॥ 2-64**

**అ :** శకటాసుర భంజనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** మరిష్యమాణః కంసః సకలం స్వభాగ్యమ్ అనేన సహ నేష్యతి ఇతి భియా+ఇవ మురారిః పూర్వం సుకోమలేన పాదేన శకటం బభంజ.

**ప్ర :** మరిష్యమాణః = చనిపోబోతున్న (మృ ధాతువుపై శానచ్ ప్రత్యయం), కంసః = కంసుడు, సకలమ్ = సమస్తమైన, స్వభాగ్యమ్ = తన సంపదను, అనేన-సహ = ఈ బండి ఉపకరణంగా, నేష్యతి = కొనిపోతాడు (నీ ప్రాపణే పరస్మైపది - ౡట్ - ప్ర.ఏ.), ఇతి = అని, భియా+ఇవ = భయం చేతనో అన్నట్లు, మురారిః = కృష్ణుడు, పూర్వమ్ = ముందుగా, సుకోమలేన = చాలా మృదువయిన, పాదేన = కాలితో, శకటమ్ = శకటాన్ని (శకటాసురుని), బభంజ = విరిచాడు. (భంజ్ ఆమర్దనే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.).

**తా ॥** ముందు ముందు కంసుడు చావబోతున్నాడు. కానీ మరణించే లోపు తన భాగ్యాన్ని పూర్తిగా ఈ బండి (శకటాసురుడు) లోనే తీసికొని పోతాడేమో అన్న భయంకలిగినట్లు కృష్ణుడు ముందుగా శకటాసురునే తన మృదువైన పాదంతో విరగగొట్టాడు.

**వి :** 1. పసివాడుగా కనిపిస్తున్నా పసివాడని అనిపించని లీలలనే కృష్ణునిలో వర్ణిస్తూ 'భయంతోనేమో' అని కృష్ణపరంగా ఉత్ప్రేక్షించటాన్ని గూర్చి ఆలోచించాలి.

| | | | |
|---|---|---|---|
| 2. **నేష్యతి :** | **నేష్యతి** | నేష్యతః | నేష్యంతి |
| | నేష్యసి | నేష్యథః | నేష్యథ |
| | నేష్యామి | నేష్యావః | నేష్యామః |
| **బభంజ :** | **బభంజ** | బభంజతుః | బభంజుః |
| | బభంజిథ/బభంక్త | బభంజథుః | బభంజ |
| | బభంజ | బభంజివ | బభంజిమ. |

*

**శ్లో॥ తతస్స మాయామపహాయ దైత్యః - స్వరూపధారీ పునరావిరాసీత్ ।**
**తథాహి విష్ణోః పదయోగకాలే - కథం ను సా జీవితుముత్సహేత ॥ 2-65**

**అ :** శకటాసుర స్వరూప ప్రాప్తి. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః స దైత్యః మాయామ్ అపహాయ స్వరూప-ధారీ పునః ఆవిరాసీత్. తథా హి విష్ణోః పద-యోగ-కాలే సా కథం ను జీవితుమ్ ఉత్సహేత.

**ప్ర :** తతః = కృష్ణుడు భంగపరచిన తరువాత, సః దైత్యః = ఆ రాక్షసుడు, మాయామ్ = శకటరూపంలో కనిపిస్తున్న మాయను, అపహాయ = విడిచి (అప-హా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వరూపధారీ = తన రూపాన్ని ధరించినవాడై (స్వరూపస్య ధారీ), పునః = మరల, ఆవిః+ఆసీత్ = ఆవిర్భవించెను. తథా హి = అది యుక్తమే. విష్ణోః = కృష్ణుని యొక్క, పద-యోగ-కాలే : పద = కాలితో, యోగ = కలయిక ఏర్పడిన, కాలే = సమయంలో (పదేన యోగః, తస్య కాలః, తస్మిన్), సా = ఆ మాయ, కథం ను = ఏ రీతిగా, జీవితుమ్ = బ్రతకటానికి, ఉత్సహేత = ఉత్సాహం చూపగలదు? (ఉత్ సహ - మర్షణే - ఆత్మనేపది - విధిలిఙ్ - ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుని కోమల పాదతాడనంతో విరిగిన ఆ శకటాసురుడు మాయను పరిత్యజించి తన దైత్య రూపంతో నిలిచాడు. నిజమే. విష్ణుమూర్తి కాలితో కలయిక కలిగిన తర్వాత ఆ మాయ బ్రతకాలని ఎలా కోరుకొంటుంది?

**వి :** 1. '**జీవితుం కథముత్సహేత**' అనటంలో కాకుస్వరం వినిపిస్తుంది. కాకుస్వర మూలక మైన వక్రోక్త్యలంకారమిది. '**వక్రోక్తిః శ్లేషకాకుభ్యాం యదర్థాంతరకల్పనమ్**' - (కు.156), ఎలా జీవిస్తుంది? అన్న ప్రశ్నలో జీవించదు అనే భావం వ్యక్తమవుతుంది.

2. **ఆవిః+ఆసీత్ :** 2-26వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఉత్సహేత :** | **ఉత్సహేత** | ఉత్సహేయాతామ్ | ఉత్సహేరన్ |
| | ఉత్సహేథాః | ఉత్సహేయథామ్ | ఉత్సహేధ్వమ్ |
| | ఉత్సహేయ | ఉత్సహేవహి | ఉత్సహేమహి. |

*

**శ్లో॥ స కృష్ణపాదాభిహతాఖిలాఙ్గో - బభూవ దైత్యః కిల నిర్గతాసుః ।**
**అహన్తు మన్యే స్వకజాత్యయోగ్య-రథాఙ్గధారీ స మమార ధీరః ॥ 2-66**

**అ :** శకటాసుర మరణంపై కవి తన తీర్పును ప్రకటించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః దైత్యః కృష్ణ-పాదాభిహతాఖిలాంగః నిర్గతాసుః బభూవ కిల. అహం తు మన్యే సః ధీరః స్వక-జాత్యయోగ్య-రథాంగ-ధారీ మమార.

**ప్ర :** సః దైత్యః = ఆ రాక్షసుడు (శకటాసురుడు), కృష్ణ... లాంగః : కృష్ణ = కృష్ణునియొక్క, పాద = కాలిచే, హత = కొట్టబడిన (హింసింపబడిన), అఖిల+అంగః = అన్ని అవయవాలు గలవాడై (కృష్ణస్య పాదేన అభిహతాని

అఖిలాని అంగాని యస్య సః), నిర్గతాసుః = ప్రాణాలు పోయినవాడుగా, బభూవ కిల = అయ్యాడు గదా! అహన్తు = నేనైతే, మన్యే = (ఇలా) అనుకొంటున్నాను. (మన్ జ్ఞాన్ ఆత్మనేపది – లట్ – ఉ.ఏ.), సః = ఆ, ధీరః (సన్) = ధీరుడు అయినా, స్వక... ధారీ : స్వక = తనకు చెందిన, జాతి = జాతికి (రాక్షసజాతికి), అయోగ్య = తగని, రథాంగ = చక్రాన్ని, ధారీ = ధరించిన వాడై (ఆ కారణంగా) (స్వకాయాః జాతేః అయోగ్యం యత్ రథాంగం తస్య ధారీ) మమార = మరణించాడు. (మృ ప్రాణత్యాగే పరస్మైపది లిట్ ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని పాదం యొక్క తాకిడిచేత శకటాసురుని శరీరావయవాలన్నీ విరిగిపోయాయి. తాను ప్రాణాలు కోల్పోయాడు. నేనిలా అనుకొంటున్నాను. శకటాసురుడు తన జాతికి తగని రీతిగా చక్రాన్ని (చక్రాయుధాన్ని – బండి చక్రాన్ని) ధరించాడు. అందుకే మరణించాడు.

**వి :** 1. శ్లో॥శ్రేయాన్ స్వధర్మో విగుణః – పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః – పరధర్మో భయావహః ॥ – భగవద్గీత 3/35

అన్నది కృష్ణుడు చెప్పిన గీతావచనం. ఇక్కడ శకటాసురుడు పరధర్మాన్ని ఆశ్రయించి ప్రాణాల మీదకు తెచ్చుకొన్నాడని కవి భావం.

2. అహం తు **మన్యే** అని వాచా ప్రకటించాడు కాబట్టి ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే |
| **మమార :** | **మమార** | మమ్రతుః | మమ్రుః |
| | మమర్థ | మమ్రథుః | మమ్ర |
| | మమార/మమర | మమ్రివ | మమ్రిమ. |

*

**శ్లో॥ ధ్రువం పునర్విష్ణుపదస్య సఙ్గ–భయాత్సకృద్విష్ణుపదాహతోऽసౌ ।**
**అధః పపాతాసురమణ్డలీయం – వినాశకాలే హి విరుద్ధబుద్ధిః ॥ 2–67**

**అ :** శకటాసురుని అధఃపతనాన్ని ఉత్ప్రేక్షించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** సకృత్ విష్ణు–పదాహతః అసౌ పునః విష్ణుపదస్య సంగ–భయాత్ అధః పపాత ధ్రువమ్. ఇయమ్ అసుర–మండలీ వినాశ–కాలే విరుద్ధ–బుద్ధిః హి–

**ప్ర :** సకృత్ = ఒక్కసారి, విష్ణు–పద–ఆహతః : విష్ణు = కృష్ణునియొక్క, పద = కాలితో, ఆహతః (సన్) = కొట్టబడినవాడై (విష్ణోః పదం, తేన ఆహతః), పునః = మరల, విష్ణుపదస్య = ఆకాశం యొక్క (వియద్విష్ణుపదం వాతు పుంస్యాకాశవిహాయసీ – అమరకోశం – వ్యోమవర్గ – 2), సంగ–భయాత్ = చేరవలసివస్తుందన్న భయంతో (సంగే భయం, తస్మాత్), అధః **పపాత** = నేల గూలెను (పత్ –పతనే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), ఇయమ్ = ఈ, అసుర–మండలీ = రాక్షసుల గుంపు (అసురాణాం మండలీ), వినాశ–కాలే = నశించబోయే వేళలో (వినాశస్య కాలః, తస్మిన్), విరుద్ధ–బుద్ధిః హి=విపరీతమైన బుద్ధి కలది గదా!(విరుద్ధా బుద్ధిః యస్యాః సా)

**తా ॥** ఒక్కసారి కృష్ణుని కాలిదెబ్బ తిన్న ఆ శకటాసురుడు మరల దెబ్బతింటే విష్ణుపదానికి (ఆకాశానికి) వెళ్ళవలసి వస్తుందన్న భయంతో నేలమీద పడిపోయాడు. ఈ రాక్షసుల గుంపుకెప్పుడు వినాశకాలంలో బుద్ధి విపరీతంగా పనిచేస్తుంది.

**వి :** 1. ధ్రువం పదం ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారాన్ని సూచిస్తుంది. విష్ణుపద శబ్దానికి విష్ణుపాదం, ఆకాశం అని

రెండు అర్థాలు, పదాన్ని విరవకుండానే కాబట్టి అభంగశ్లేషాలంకారం. శకటాసురుని అధఃపతనరూపమైన విశేషాంశాన్నీ, రాక్షసులకు వినాశకాలంలో విపరీతబుద్ధి అన్న సామాన్యాంశాన్నీ కలిపాడు కాబట్టి అర్థాంతర న్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **పపాత :** | **పపాత** | పేతతుః | పేతుః |
| | పేతిథ | పేతథుః | పేత |
| | పపాత/పపత | పేతివ | పేతిమ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుక్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గో ద్వితీయో ముదామ్ ॥ 2-68**

ద్వితీయః సర్గః = రెండవ సర్గ అనేది తప్ప మిగిలినదంతా ప్రథమసర్గలోని 67వ శ్లోకం వలెనే.

ఇతి శ్రీమత్కవికులతిలకశ్రీమద్వాదిరాజతీర్థశ్రీచరణవిరచితే శ్రీరుక్మిణీశవిజయే మహాకావ్యే ద్వితీయః సర్గః.

**శ్రీః**





# శ్రీః
# తృతీయః సర్గః

**శ్లో॥ అథాపరో దైత్యకదమ్బకాసు-రివోద్ధతో వాతశరీరధారీ ।**
**ప్రగృహ్య కృష్ణం గగనం జగామ - స్వనాశయోగ్యస్థలకాఙ్క్షయేవ ॥ 3-1**

**అ :** తృణావర్తుడనే అసురుడు కృష్ణుని చంపే ప్రయత్నం చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథ అపరః ఉద్ధతః(సన్) వాత-శరీర-ధారీ దైత్య-కదంబకాసురివ కృష్ణం ప్రగృహ్య స్వనాశ-యోగ్య-స్థల-కాంక్షయా ఇవ గగనం జగామ.

**ప్ర :** అథ = అటు (శకటాసుర సంహరణం) తర్వాత, అపరః = మరియొక, ఉద్ధతః (సన్) = పొగరెక్కి, దైత్య-కదంబక+అసుః+ఇవ : దైత్య = రాక్షసులయొక్క, కదంబక = సమూహానికి, అసుః+ఇవ = ప్రాణవాయువువలె (దైత్యానాం కదంబకస్య అసుః - స ఇవ), వాత - శరీర -ధారీ : వాత = గాలి వంటి, శరీర = శరీరాన్ని, ధారీ = ధరించినవాడు (వాతస్య శరీరస్య ధారీ), కృష్ణమ్ = కృష్ణుని, ప్రగృహ్య = తీసికొని (ప్ర - పూర్వక గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వ... యా+ఇవ = స్వ-నాశ = తన వినాశనానికి, యోగ్య = తగినట్టి, స్థల = ప్రదేశం మీద, కాంక్షయా+ఇవ = కోరికతోనో అన్నట్లు (స్వస్య నాశః, తస్య యోగ్యం చ తత్ స్థలమ్, తస్య కాంక్షా, తయా), గగనమ్ = ఆకాశానికి, జగామ = వెళ్ళాడు.

**తా ॥** శకటాసురుని సంహరించిన తరువాత మరొక పొగరెక్కిన రాక్షసుడు వచ్చాడు. రాక్షస సమూహానికి ప్రాణవాయువులాగా గాలి రూపంలో వచ్చాడతడు. తన నాశనానికి తగిన ప్రదేశాన్ని కోరుకొంటున్నట్లు కృష్ణుని పట్టుకొని ఆకాశం పైకి వెళ్ళాడు.

**వి :** 1. వాయుర్వై వసురంతరిక్షసత్ (శతపథబ్రాహ్మణమ్ - 6/7/3/11) అంతరిక్షంలోని వసువే వాయువు. ప్రాణో హి వాయుః (తాండ్యబ్రాహ్మణమ్ - 4/6/8) వాయువు ప్రాణమే. అని శ్రుతులు ప్రకటిస్తున్నాయి. ఆకాశమే అతని నివాసం కాబట్టి ఆ ప్రదేశాన్ని వెతుక్కోవడానికేమో అన్నట్లు వెళ్ళాడు.

2. దైత్యకదంబకాసుః+ఇవ అన్నచోట (రాక్షసులకు ప్రాణవాయువువలె); స్వయోగ్య-స్థలకాంక్షయా ఇవ (తనకు తగినచోటు వెతకటానికి అన్నట్లు) అన్నచోట హేతూత్ప్రేక్షాలంకారాలు.

| | | | |
|---|---|---|---|
| 3. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

శ్లో॥ దుస్తర్కాయితశర్కరాభిరమలం చక్షుః స ముష్ణన్ గవా-
మావాసే వసతాం సతాముదురుతమో విస్తారయన్ వారయన్ ।
తద్వాక్యశ్రవణం కఠోరకుటిలధ్వానైర్యశోదాసుతం
దైత్యోఽగూహయదాగమాంతలలనాగర్భం కువాదీవ తమ్ ॥ 3-2

అ : తృణావర్తుడు కృష్ణుని లోగొనుట. -శార్దూలవిక్రీడితమ్.

అ : సః దైత్యః దుస్తర్కాయిత-శర్కరాభిః గవామ్ ఆవాసే వసతాం సతామ్ అమలం చక్షుః ముష్ణన్ ఉరుతమః విస్తారయన్ కఠోర-కుటిల-ధ్వానైః తద్వాక్య-శ్రవణం వారయన్ కువాదీ+ఇవ ఆగమాంత-లలనా-గర్భం తం యశోదా-సుతమ్ అగూహయత్.

ప్ర : సః దైత్యః = ఆ దితిపుత్రుడు (రాక్షసుడు), దుస్తర్కాయితశర్కరాభిః : దుస్తర్కాయిత = (హేత్వాభాసాలతో కూడిన) తర్కం వలె ఆచరిస్తున్న, శర్కరాభిః = ధూళికణాలతో (శర్కరా తు... సితాయాం శకలే గుడే వైజయన్తీ - స్త్రీలింగ - 28) (దుస్కర్కాయితాశ్చ తాః శర్కరాః - తాభిః), గవామ్ = గోవులయొక్క, ఆవాసే = శాలలలో, వసతామ్ = నివసిస్తున్న, సతామ్ = సజ్జనులయొక్క, చక్షుః = కంటిని (జాతిగతంగా ఏకవచన ప్రయోగం), ముష్ణన్ = కప్పుతూ (ముష్ ధాతువుపై శతృ ప్రత్యయం), ఉరుతమః = పెరుగుతూ, విస్తారయన్ = విస్తరిస్తూ, కఠోర-కుటిల-ధ్వానైః : కఠోర = వినరానివీ, కుటిల = భరింపరానివి అయిన, ధ్వానైః = అరుపులతో (కఠోరాః కుటిలాశ్చ తే ధ్వానాః, తైః), తద్వాక్యశ్రవణమ్ = వినికిడిని (తేషాం వాక్యాని, తేషాం శ్రవణమ్), వారయన్ = అడ్డగిస్తూ, కువాదీ+ఇవ = మాయావాదివలె (మొండివాదం చేసే వాడివలె), ఆగమ+అంతలలనాగర్భస్థమ్ : ఆగమ+అంత = ఉపనిషత్తులనెడి, లలనా = స్త్రీలయొక్క, గర్భ-(స్థ)మ్ = కడుపులలోనున్న (గర్భోఽపవరకే... కుక్షే కుక్షిస్థ జంతౌ చ - వైజయన్తీ - పుంలింగ - 21/22), తమ్ = ఆ పరమాత్మయైన, యశోదా-సుతమ్ = యశోదకొడుకును (యశోదాయాః సుతః, తమ్), అగూహయత్ = కప్పివేసెను. (గుహూ సంవరణే - ణిచ్ - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.).

తా॥ తృణావర్తుడనే ఆ రాక్షసుడు మొండివాదంచేసే తార్కికుడిలా కనిపిస్తున్నాడు. తన కువాదమనే దుమ్ముతో గోకులంలో నివసిస్తున్న సజ్జనులందరి కళ్ళు కప్పాడు. పెరుగుతూ విస్తరిస్తున్నాడు. భరింపరాని కఠోరమైన తన అరుపులతో గోకుల ప్రజల మాటలకు అడ్డుపడుతున్నాడు. వేదాంతగ్రంథా లనే స్త్రీలగర్భాలలోనున్న ఆ పరమాత్మను, ఆ యశోద కొడుకును కప్పివేశాడు.

వి : 1. భక్తుడు భగవంతుని స్థితినీ, భగవత్తత్త్వాన్నీ అనుభవిస్తే తార్కికుడు దానిని గురించి సాధ్యాసాధ్యవితర్కం ప్రారంభిస్తాడు. ఆ మాయావాది ప్రవృత్తి కూడా ఈ శ్లోకంలో స్ఫురిస్తుంది.

మాయావాది హేత్వాభాసంతో (హేతువులా కనిపిస్తుంది కానీ హేతువు కాలేదు) సచ్ఛాస్త్రాలలో విస్తరించి వున్న పరమాత్మ జ్ఞానాన్ని అపహరిస్తాడు. తాను ఎగిసి ఎగిసి ఉపనిషత్తులు అందించే పరమాత్మ జ్ఞానాన్ని ఆవరించి వేస్తాడు తన మిథ్యాజ్ఞానంతో. కనీసం ఆ శాస్త్రవచనాలను విననివ్వకుండా అడ్డుకొంటుంటాడు.

2. ఆ మాయావాది ప్రవృత్తి కూడా ఇక్కడ శ్లోకంలో వుండే విశేషణసామర్థ్యం వలన స్ఫురిస్తోంది కాబట్టి దీన్ని సమాసోక్త్యలంకారమంటారు. "**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్**" (కు.61), ప్రస్తుతవృత్తాంతవర్ణన ద్వారా అప్రస్తుత వృత్తాంత స్ఫూర్తి అదీ విశేషణ సామర్థ్యం వలన - సమాసోక్తి లక్షణం.

3. 'నైషా తర్కేణ మతిరాపనేయా' (కఠోపనిషత్తు) 'యతో వాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ' (తైత్తిరీయోపనిషత్తు) - ఇటువంటి ఉపనిషత్తులన్నీ పరమాత్మ స్వరూపం తర్కానికీ, మాటలకూ అందేది కాదని ప్రవచిస్తున్నాయి.

4. ఆగమ+అంత = ఆగమమంటే వేదం. ఆగమాంతాలు ఉపనిషత్తులు. వేదాలను నాలుగుగా విభజిస్తారు. 1. సంహిత 2. బ్రాహ్మణం 3. ఆరణ్యకం 4. ఉపనిషత్తు. ఉపనిషత్తు చివరిది కాబట్టి వేద+అంత మయింది. అక్కడ జ్ఞానం ప్రధానాంగం కాబట్టి జ్ఞానానికి సంబంధించిన ఏ ఆలోచననయినా, చర్యనయినా వేదాంత మంటున్నాం.

5. చక్షుః పదం జ్ఞానానికి బోధకం – '**చక్షుష్మత్తా తు శాస్త్రేణ సూక్ష్మకార్యార్థదర్శినా**' అంటాడు కాళిదాసు రఘువంశంలో. కన్నులుండటమంటే శాస్త్రజ్ఞానముండటమే అని.

| | | | |
|---|---|---|---|
| 6. **అగూహయత్ :** | **అగూహయత్** | అగూహయతామ్ | అగూహయన్ |
| | అగూహయః | అగూమయతమ్ | అగూహయత |
| | అగూహయమ్ | అగూహయావ | అగూహయామ. |

*

**శ్లో॥ తదా ఖలస్యోత్పతనం స శౌరి-ర్హృదాఽనుమేనే పతితస్య దూరాత్ ।**
**గిరీన్ద్రకల్పోత్పతితాత్మమూర్త్యా - శరీరమాచూర్ణయితుం ధియేవ ॥ 3-3**

**అ :** తృణావర్తుని తుత్తునియలు చేయాలని కృష్ణుడు భావించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** తదా సః శౌరిః దూరాత్ పతితస్య ఖలస్య ఉత్పతనం గిరీంద్రకల్పోత్పతితాత్మమూర్త్యా శరీరమ్ ఆచూర్ణయితుం ధియా ఇవ హృదా అనుమేనే.

**ప్ర :** తదా = ఆ సమయంలో, సః శౌరిః = ఆ కృష్ణుడు, దూరాత్ = దూరంగా, పతితస్య = పడినట్టి, ఖలస్య = చెడ్డవాడైన తృణావర్తునియొక్క, ఉత్పతనమ్ = పైకి లేవటాన్ని, గిరీంద్ర... మూర్త్యా : గిరి+ఇంద్ర = శ్రేష్ఠమైన పర్వతంతో, కల్ప = సమానంగా, ఉత్పతిత = పైకిలేచిన, ఆత్మ = తనయొక్క, మూర్త్యా = శరీరంతో (ఈషదూనః గిరీంద్రః గిరీంద్రకల్పః '**ఈషదసమాప్తౌ కల్పప్దేశ్యదేశీయరః**' – అష్టాధ్యాయి (5–3–67), శరీరమ్ = (తృణావర్తుని) దేహాన్ని, ఆ చూర్ణయితుమ్ = పొడిచేయాలన్న (ఆ–పూర్వక చూర్ణ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ధియా+ఇవ = తలంపుతోనో అన్నట్లు, హృదా = మనస్సుతో, అనుమేనే = అంగీకరించెను. (అను+మన్ అవబోధనే – ఆత్మనేపది – లిట్ – (ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు పర్వతంతో సమానమైన తన శరీరంతో తృణావర్తుని శరీరాన్ని పొడి చేయాలనుకొన్నాడేమో అన్నట్లు ఆ దుర్మార్గుడు తృణావర్తుడు దూరంగా పడి పైకి లేవటాన్ని అంగీకరించాడు.

**వి :** 1. హృదా+ఇవ, ధియా+ఇవ – ఈ రెండుచోట్ల హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **అనుమేనే :** | **అనుమేనే** | అనుమేనాతే | అనుమేనిరే |
| | అనుమేనిషే | అనుమేనాథే | అనుమేనిధ్వే |
| | అనుమేనే | అనుమేనివహే | అనుమేనిమహే. |

*

**శ్లో॥ హరిం స సంస్థాప్య హృది స్వకీయే - పరిభ్రమన్ వ్యోమ్ని ముహుః శ్వసంశ్చ ।**
**గరం నిపీయ భ్రమితాన్తరాత్మా - సరోధియాఽభ్రం ప్రవిశన్నివాస్తే ॥ 3-4**

**అ :** కృష్ణుని తీసికొని ఆకాశానికి ఎగిసిన తృణావర్తుని పరిస్థితి వర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** హరిం స్వకీయే హృది సంస్థాప్య సః వ్యోమ్ని పరిభ్రమన్ ముహుః శ్వసన్ చ, గరం నిపీయ భ్రమితాంతరాత్మా సరోధియా అభ్రం ప్రవిశన్నివ ఆస్తే.

**ప్ర :** హరిమ్ = కృష్ణుని, స్వకీయే = తనయొక్క, హృది = మనస్సులో, సంస్థాప్య = నిలుపుకొని (సమ్– స్థా – ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సః = ఆ తృణావర్తుడు, వ్యోమ్ని = ఆకాశంలో, పరిభ్రమన్ = తిరుగుతూ (పరి – భ్రమ్

– ధాతువుపై శతృ ప్రత్యయం), ముహుః = మాటిమాటికి, శ్వసన్ = నిట్టూర్చుతూ, గరమ్ = విషాన్ని (విషం స్యాద్గరళం గరః – హలాయుధకోశః – 641), నిపీయ = ఎక్కువగా త్రాగి (ని+పా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భ్రమితాన్తరాత్మా = చిత్తభ్రాంతికి లోనయినవాడై (భ్రమితః అన్తరాత్మా యస్య సః), సరోధియా = సరస్సు అనే బుద్ధితో (సరః ఇతి ధీః తయా), అభ్రమ్ = ఆకాశంలోనికి (అభ్రం సలిలదే వ్యోమ్ని వైజయన్తీ – నపుంసక-1), ప్రవిశన్+ఇవ+ఆస్తే = ప్రవేశిస్తున్నట్లు ఉండెను. (ఆస్ – ఉపవేశనే – ఆత్మనేపది – లిట్ – ప్ర.ఏ.).

**తా ॥** తృణావర్తుడు తన మనస్సులో కృష్ణుని నిలుపుకొని, ఆకాశంలో పరిభ్రమిస్తూ, మాటిమాటికీ నిట్టూర్చుతూ ఉన్నాడు. ఆ స్థితి విషం బాగా త్రాగినవాడు చిత్తభ్రాంతికిలోనై సరోవరమన్న భావంతో ఆకాశంలో ప్రవేశించినట్లుంది.

**వి :** 1. ఇక్కడ విషంతో కృష్ణుడికి పోలిక ధ్వనిస్తుంది. అది ఉపమాలంకారధ్వని. ప్రవిశన్నివ ఆస్తే – ప్రవేశిస్తున్నట్లు ఉంది. ఇది వస్తూత్ప్రేక్షాలంకారం. "సంభావనా స్యాదుత్ప్రేక్షా **వస్తు** హేతు ఫలాత్మనా" (కు.32)

| | | | |
|---|---|---|---|
| 2. **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే. |

*

**శ్లో॥ మురద్విషం మూర్ధ్ని నిధాయ విష్ణోః-పదం ప్రవేష్టుం త్వరయా గతోఽపి ।**
**అసౌ పపాతామరవైర్యధస్తా-దయోగ్యకామస్య కథం న పాతః ॥ 3-5**

**అ :** తృణావర్తుని అధోగతిని వర్ణించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** అసౌ అమరవైరీ మురద్విషం మూర్ధ్ని నిధాయ విష్ణోః – పదం ప్రవేష్టుం త్వరయా గతః అపి అధస్తాత్ పపాత. అయోగ్య-కామస్య కథం పాతః న?

**ప్ర :** అసౌ = ఈ, అమర-వైరీ = దేవతలకు శత్రువైన తృణావర్తుడు (అమరాణాం వైరీ), ముర- ద్విషమ్ = మురుని సంహరించిన కృష్ణుని (మురం ద్వేష్టి ఇతి = మురద్విట్ – తమ్), మూర్ధ్ని = తలపై, నిధాయ = నిలుపుకొని, విష్ణోః పదమ్ = ఆకాశంలోనికి, ప్రవేష్టుమ్ = ప్రవేశించడానికి, త్వరయా = వేగంగా, గతః+అపి = వెళ్ళినా కూడా, అధస్తాత్ = క్రిందకు, పపాత = పడెను. (పత్ గతౌ – పరస్మైపది లిట్ – ప్ర.ఏ.), అయోగ్య-కామస్య = తగని కోరిక గలవానికి, కథం పాతః న = పతన మెలా ఉండదు?

**తా ॥** దేవతలకు శత్రువయిన తృణావర్తుడు మురారి అయిన కృష్ణుని తలపై పెట్టుకొని ఆకాశంలోనికి ప్రవేశించటానికి త్వరపడినా నేలగూలాడు. తగని కోరికలున్న వాడు అధః పతనాన్ని పొందకుండా ఎలా ఉంటాడు?

**వి :** 1. విష్ణోః పదమంటే పదబంధానికి విష్ణుసన్నిధి – అనగా వైకుంఠం. అది తృణావర్తుని కోరిక. శ్లేషతో వైకుంఠం ధ్వనిస్తుంది. అది అయోగ్యకామన అని కవి అభిప్రాయ బడుతున్నాడు. అందుకే ఆ తగని కోరిక కారణంగానే తృణావర్తుడు నేలగూలాడని సమర్థిస్తున్నాడు. ఈ సమర్థన ద్వారా ఇది అర్థాంతరన్యాసాలంకార మవుతుంది. "**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః**" (కు.122)

| | | | |
|---|---|---|---|
| 2. **పపాత :** | **పపాత** | పేతతుః | పేతుః |
| | పేతిథ | పేతథుః | పేత |
| | పపాత/పపత | పేతివ | పేతిమ. |

*

**శ్లో॥ స వాతరూపో దితిజో ముకున్ద-భారాసహిష్ణుర్నిపపాత భూమౌ ।**
**తథాహి వాతస్య జవోఽధికోఽపి – కథన్ను విశ్వమ్భరముద్బిభర్తి ॥ 3-6**

**అ :** తృణావర్తుని పతనాన్నీ, పతనంలోని అనివార్యతనూ వివరిస్తున్న శ్లోకం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః వాత–రూపః దితి–జః ముకుంద–భారాసహిష్ణుః భూమౌ నిపపాత. తథాహి వాతస్య జవః అధికః (సన్) అపి విశ్వంభరం కథం ను ఉద్బిభర్తి.

**ప్ర :** సః = ఆ, వాతరూపః = గాలిరూపంలోనున్న, దితిజః = దితి సుతుడు (తృణావర్తుడు), ముకుంద... హిష్ణుః : ముకుంద = కృష్ణుని యొక్క, భార = బరువును, అసహిష్ణుః = భరించలేని వాడై (ముకుందస్య భారః, తస్య అసహిష్ణుః), భూమౌ = నేలపై, నిపపాత = పడెను, (నిపూర్వక పత్ – గతౌ – పరస్మై పది – లిట్ – (ప్ర.ఏ.), తథాహి = అది యుక్తమే, వాతస్య = గాలియొక్క, జవః = వేగం, అధికః (సన్) అపి = ఎక్కువగా వున్నా, విశ్వంభరమ్ = లోకాలనే భరించే నారాయణుని, కథం ను ఉద్బిభర్తి = ఎలాపైకి మోయగలదు? (ఉత్ – దుభృఞ్(3) ణే ధారణపోషణయోః లట్ – (ప్ర.ఏ.).

**తా ॥** గాలిరూపంలో ఉన్న ఆ రాక్షసుడు (తృణావర్తుడు) కృష్ణుని భారాన్ని సహించలేక నేలగూలాడు. తాను వాయురూపుడైనా, తనకెంత వేగమున్నా విశ్వంభరుని (తనలో లోకాలనన్నింటినీ భరించే వాడిని) ఎలా మోయగలుగుతాడు?

**వి :** 1.ఉ. ఎవ్వనిచే జనించు జగమెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందుcబరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు సర్వము తానెయైన వా
డెవ్వడు వానినాత్మభవునీశ్వరు నే శరణంబు వేడెదన్.

అని స్తుతించాడు పోతన. అటువంటి వానిని భరించటం ఎవరికి సాధ్యం? – భాగవతం – పోతన – 8/73

2. **పపాత :** 3–5వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఉద్బిభర్తి :** | **ఉద్బిభర్తి** | ఉద్బిభృతః | ఉద్బిభ్రతి |
| | ఉద్బిభర్షి | ఉద్బిభృథః | ఉద్బిభృథ |
| | ఉద్బిభర్మి | ఉద్బిభృవః | ఉద్బిభృమః. |

*

**శ్లో॥ చక్షుశ్చౌర్యఫలం జగామ పరివృత్తాక్షః ప్రభోరోజసా**
**విష్వక్సంభ్రమణేన దత్తతమసో విభ్రాన్తమూర్ధా ఫలమ్ ।**
**సాధూనాం హృదయార్తిదానఫలితం క్లేశం ప్రపన్నః క్షితౌ**
**మాతుః పాతకరః పరస్య స ఖలః పాషాణపృష్ఠేఽపతత్ ॥ 3–7**

**అ :** తృణావర్తుడు బండమీద పడిపోవటాన్ని వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** స ఖలః ప్రభోః ఓజసా పరివృత్తాక్షః చక్షుశ్చౌర్య–ఫలం జగామ. విభ్రాన్తమూర్ధా విష్వక్సంభ్రమణేన దత్త–తమసః ఫలం సాధూనాం హృదయార్తి–దాన–ఫలితం క్లేశం ప్రపన్నః పరస్య మాతుః పాతకరః పాషాణపృష్ఠే అపతత్.

**ప్ర :** సః ఖలః = ఆ దుర్మార్గుడు (తృణావర్తుడు), ప్రభోః = ప్రభువయిన కృష్ణునియొక్క, ఓజసా = బలంతో, పరివృత్త+అక్షః (సన్) = కళ్ళు తిరిగిన వాడై (పరివృత్తే అక్షిణీ యస్య సః), చక్షుశ్చౌర్యఫలమ్ : చక్షుః = కళ్ళయొక్క, చౌర్య = దొంగతనం యొక్క, ఫలమ్ = ఫలితాన్ని (చక్షుషాం చౌర్యం, తస్య ఫలమ్), జగామ = పొందాడు (గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.). విభ్రాంత–మూర్ధా (సన్) : విభ్రాంత = తిరుగుతున్న, మూర్ధాసన్ (సన్) = తల కలవాడై (విభ్రాంతం మూర్ధా యస్య సః), విష్వక్ భ్రమణేన : విష్వక్ = అంతటా, సంభ్రమణేన =

తిరుగుట ద్వారా, దత్త తమసః : దత్త = కల్పింపబడిన, తమసః = చీకటియొక్క (దత్తం చ తత్ తమః, తస్య), ఫలమ్ = ఫలితాన్ని, జగామ = పొందాడు. సాధూనామ్ = సజ్జనులకు, హృదయ+ఆర్తి – దాన – ఫలమ్ : హృదయ = మనస్సులకు, ఆర్తి = దుఃఖాన్ని, దాన = ఇచ్చినందులకు, ఫలమ్ = ఫలితమైన (హృదయేషు ఆర్తిః తస్యాః దానమ్ తస్య ఫలమ్), క్లేశమ్ = దుఃఖాన్ని, ప్రపన్నః (అభూత్) = పొందినవాడయ్యాడు. పరస్య = శత్రువైన కృష్ణుని యొక్క, మాతుః = యశోదకు, క్షితౌ = నేలపై, పాతకరః = పడుటను చేసినందులకు, పాషాణ–పృష్ఠే = బండపై (పాషాణస్య పృష్ఠం, తస్మిన్), అపతత్ = పడెను.

**తా ॥** కృష్ణుడు తన బలాన్ని వినియోగించగానే ఆ బలప్రభావంతో తృణావర్తుడికి కళ్ళు తిరిగాయి. అది తాను దుమ్ముతో గోకులప్రజల కళ్ళు కప్పిన ఫలితాన్ని పొందినట్లుంది. తల తిరిగింది తృణావర్తుడికి. అది తాను గోకులమంతా తిరిగి చీకట్లు వ్యాపింపజేసిన దాని ఫలితాన్ని పొందినట్లుంది. తృణావర్తుడికి దుఃఖం కలిగింది. అది తాను గోకుల ప్రజల మనస్సులకు ఆర్తిని కలిగించిన దాని ఫలితాన్ని పొందినట్లుంది. యశోదను తాను తన విజృంభణ ద్వారా పడగొట్టిన ఫలితాన్ని బండపై పడటం ద్వారా తృణావర్తుడు పొందాడు.

**వి :** 1. '**అత్యుత్కటైః పాపపుణ్యైరిహైవ ఫలమశ్నుతే**' అన్న ఆర్య వచనాన్ని ఇక్కడ స్మరించాలి. తృణావర్తుడు ఆ ఫలితాన్ని కూడా వెంటనే అనుభవించవలసి వచ్చింది. తృణావర్త రూపంలో గోకులంలో తాను కలిగించిన సంక్షోభానికి అనుగుణంగానే వెంటనే ఫలితాన్ని పొందాడు. సజ్జనులను పీడిస్తే ఫలితాన్ని వెంటనే పొందవలసి వస్తుంది.

2. తృణావర్తుడు గోకులంలో దుమ్ముతో వారి కళ్ళు కప్పటం వాస్తవం. ప్రస్తుతం కళ్ళు తిరిగి పడిపోవటమూ వాస్తవం. అయితే ఈ రెండింటికీ కార్య కారణ భావం వాస్తవమో కాదో ఎవరూ నిర్ణయించలేరు. కాబట్టి నిశ్చితకారణం కానిదాన్ని కారణంగా చెప్పటం, అదికూడా వ్యంగ్యంగా కావటంతో ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారధ్వని వుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః | |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ | |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ | |
| **అపతత్ :** | **అపతత్** | అపతతామ్ | అపతన్ | |
| | అపతః | అపతాతమ్ | అపతత | |
| | అపతమ్ | అపతావ | అపతామ. | * |

**శ్లో॥ ఆలోలహైమవరదామవతీం వితాన–**
**జాలావలమ్బిశుభమౌక్తికరమ్యమాలామ్।**
**డోలాం విధాయ తదుపర్యధిరోప్య బాలం**
**సాలోక్యసౌఖ్యమలభిష్ఠ హృదా యశోదా ॥** **3–8**

**అ :** కృష్ణుని ఉయ్యాలలో వేసి యశోద మురిసిపోవటం. –వసంతతిలక.

**అ :** ఆలోల–హైమ–వర–దామవతీం వితాన–జాలావలంబి–శుభ–మౌక్తిక–రమ్య–మాలామ్ డోలాం విధాయ తదుపరి బాలమ్ అధిరోప్య యశోదా హృదా సాలోక్య–సౌఖ్యమ్ అలభిష్ట.

**ప్ర :** ఆలోల… వతీమ్ : ఆలోల = కదలాడుతున్న, హైమ = బంగారుతో చేసిన, వర = శ్రేష్ఠమయిన, దామవతీమ్ = తోరణాలు (జాలరులు) గలదియు (ఆలోలాని హైమాని చ తాని వరదామాని అస్యాం సన్తి – ఇతి – తామ్),

వితాన... మాలామ్ : వితాన = మేలికట్లయొక్క, జాల = సమూహం నుండి, అవలంబి = జారుతున్న, శుభ = నిర్మలమయిన, మౌక్తిక = ముత్యాలతో చేసిన, రమ్య = అందమయిన, మాలామ్ = మాలలు గలదియు అయిన (వితానానాం జాలాత్ అవలంబిన్యః శుభాశ్చ తాః మౌక్తిక రమ్య మాలాః యస్యాః, తామ్), డోలామ్ = ఊయలను, విధాయ = ఏర్పాటుచేసి ( వి – ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తదుపరి = దానిపై, బాలమ్ = బాలుని, అధిరోప్య = నిలిపి, యశోదా = యశోదా, హృదా = మనసా, సాలోక్య – సౌఖ్యమ్ = చక్షుః ప్రీతిని/సాలోక్యమోక్ష సుఖాన్ని (సాలోక్యమితి సౌఖ్యమ్), అలభిష్ట = పొందెను. (లభ్ – ప్రాప్తౌ – ఆత్మనేపది – లుఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని ఉయ్యాలలో వేసి యశోద మనసా సాలోక్యముక్తిని పొందింది. ఆ ఉయ్యాలపై బంగారు జాలరులు కదలాడుతున్నాయి. మేలికట్ల నుండి మంచి ముత్యాల సరాలు వ్రేలాడుతున్నాయి. అటువంటి ఉయ్యాలనేర్పాటుచేసింది యశోద.

**వి :** 1. పూతన, శకటాసురుడు, తృణావర్తుడు ముగ్గురు కృష్ణుని పసితనంలోనే చంపటానికి వచ్చి, తామే ప్రాణాలు కోల్పోయారు. తృణావర్తుని మరణం తరువాత కృష్ణుని ఊయలలో వేశారు. ప్రస్తుతం ఆంధ్రప్రాంతంలో బిడ్డపుట్టిన 21వ రోజు ఊయ్యాలలో వేయటం ఆచారంగా వస్తోంది. అప్పుడు ఇదే లెక్క ఉందని కానీ ఉండాలని కానీ అనలేము కానీ ఊయలలో వేసే వయస్సు రాకముందే ఈ సంఘటనలన్నీ జరిగాయని మాత్రం అర్థం చేసికోవాలి.

2. వైష్ణవంలో ముక్తి నాలుగువిధాలు. 1. సాలోక్యం 2. సామీప్యం 3. సారూప్యం 4. సాయుజ్యం. సాలోక్య ముక్తి అంటే మనం ఉపాసిస్తున్న దేవత యొక్క లోకంలో ఉనికిని పొందటం. 2. ఉపాస్య దేవత సన్నిధానంలో నిలవగలగటం సామీప్యం 3. ఉపాస్య దేవత రూపంతో సమానమైన రూపాన్ని పొందగలగటం సారూప్యం. 4. ఉపాస్య దేవతలో లీనమై పోవటం సాయుజ్యం.

ఊయల ఊపుతున్న యశోద తనను తాను మరచిపోయి కృష్ణలోకంలోనే విహరిస్తోందని భావం.

| | | | |
|---|---|---|---|
| 3. **అలభిష్ట :** | **అలభిష్ట** | అలభిషాతామ్ | అలభిషత |
| | అలభిష్ఠాః | అలభిషాథామ్ | అలభిఢ్వమ్ |
| | అలభిషి | అలభిష్వహి | అలభిష్మహి. |

*

**శ్లో॥ డోలావిలాసచలితాలకశోభిఫాలం**
**బాలం శుచిస్మితసుధారసశోభితాస్యమ్।**
**శ్యామం సమీక్ష్య సమయం కిల శమ్మయం సా**
**తేనే క్వణత్కనకనూపురశోభిపాదమ్ ॥ 3–9**

**అ :** ఊయలలో నున్న కృష్ణుని చూసి యశోద కాలాన్నే సుఖంగా మార్చుకొని అనుభవించటం. –వసంతతిలక.

**అ :** డోలా–విలాస–చలితాలక–శోభి–ఫాలం శుచి–స్మిత–సుధా–రస–శోభితాస్యం క్వణత్కనక–నూపుర–శోభి–పాదం శ్యామం బాలం సమీక్ష్య సా సమయం శమ్మయం తేనే కిల.

**ప్ర :** డోలా... ఫాలమ్ : డోలా = ఊయల యొక్క, విలాస = కదలికలతో, చలిత = కదులుతున్న, అలక = కురులచే, శోభి = ప్రకాశిస్తున్న, ఫాలమ్ = నుదురుగల వాడును (డోలాయాః విలాసైః చలితైః అలకైః శోభతే ఇతి, తాదృశం చ తత్ఫాలం యస్య తమ్), శుచి... తాస్యమ్ : శుచి = శుభ్రమైన, స్మిత = చిఱునవ్వు అనెడి, సుధా–రస = అమృతరసంతో, శోభిత = ప్రకాశిస్తున్న, ఆస్యమ్ = నోరుగలవాడును, (శుచి చ తత్ స్మితమ్, తత్ ఏవ సుధారసః తేన శోభితమ్ ఆస్యమ్ యస్య తమ్), క్వణత్... పాదమ్ : క్వణత్ = శబ్దించుచున్న, కనక–నూపుర

= బంగారు కడియాలతో, శోభి = ప్రకాశిస్తున్న, పాదమ్ = కాళ్ళు గలవాడును (క్వణత్ కనకనూపురేణ శోభినౌ పాదౌ యస్య తమ్), శ్యామమ్ = ఇంద్రనీలం వంటి రంగు కలవాడును అయిన, బాలమ్ = శిశువును/కృష్ణుని, సమీక్ష్య = చూసి (సమ్- ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సా = ఆమె/ఆ యశోద, సమయమ్ = కాలాన్ని, శమ్మయమ్ = సుఖమయంగా, తేనే కిల = చేసికొన్నది గదా! (తనూ విస్తారే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** శిశుస్వరూపంలో కృష్ణుడు ఊయలలో ఉన్నాడు. ఊయాల కదలికలకు అనుగుణంగా కృష్ణుని ముంగురులు కదులుతున్నాయి. వాటితో నుదురు అందంగా వుంది. తనలో తాను నవ్వుకొనే చిఱునవ్వు అనే అమృతరసంతో ముఖం/నోరు ప్రకాశిస్తోంది. కాలికున్న బంగారు కడియాలు శబ్దం చేస్తున్నాయి. అటువంటి కృష్ణుని చూసి యశోద కాలాన్నే సుఖస్వరూపంగా మార్చుకొన్నది.

**వి :** 1. కాలాన్నే సుఖమయంగా చేసికొన్నది అనటంలో పరిపూర్ణత, నిరంతరాయత, అనన్యాపేక్షిత చక్కగా వ్యక్తమవుతాయి. వాటిద్వారా వ్యక్తమయ్యే భావం హర్షం. అది వాత్సల్యరసానికి పోషకమవుతుంది. ఇష్టవస్తుదర్శనం లేదా ఇష్టభావభావనం అక్కడ కారణమవుతుంది.

| 2. **తేనే :** | తేనే | తేనాతే | తేనిరే |
|---|---|---|---|
| | తేనిషే | తేనాథే | తేనిధ్వే |
| | తేనే | తేనివహే | తేనిమహే. |

3. నారాయణీయంలో నారాయణభట్టతిరి ఆ యశోద ధన్యత్వాన్ని ఇలా వర్ణించాడు.

శ్లో॥ స్నుతకుచభరమంకే ధారయంతీ భవంతీం
తరమతి యశోదా స్తన్యదా ధన్యధన్యా ।
కపటపశుపమధ్యే **ముగ్ధహాసాంకురం తే**
దశనముకుళహృద్యం వీక్ష్య వక్త్రం జహర్ష ॥ - (నారాయణీయమ్-45/5)*

**శ్లో॥గణ్డం వరాఙ్గుళిదలైర్లఘు చాలయన్తీ - మన్దస్మితాననమథో పరిరమ్భయన్తీ ।**
**సాన్ద్రస్తనస్నుతపయః కిల పాయయన్తీ - నన్దస్య రాజ్ఞ్యభవదిత్థమహర్నయన్తీ ॥3-10**

**అ :** యశోద కృష్ణుని మురిపాలతో కాలం గడుపుట. -వసంతతిలక.

**అ :** గండం వరాంగుళి-దళైః లఘు చాలయన్తీ అథో మంద-స్మితాననం పరిరంభయన్తీ సాంద్ర-స్తన-స్నుత-పయః పాయయన్తీ నందస్య రాజ్ఞీ ఇత్థమ్ అహః నయన్తీ అభవత్.

**ప్ర :** గండమ్ = చెక్కిలిని (గండోగల్లః కపోలశ్చ - హలాయుధకోశః - 522), వర+అంగుళి-దళైః : వర = శ్రేష్ఠమైన, అంగుళి = వేళ్ళయొక్క, దళైః = తునకల (అంచుల)తో (వరాశ్చ తాః అంగుళయః వరాంగుళయః, తాసాం దళాని, తైః), లఘు = తేలికగా, చాలయన్తీ = కదుపుతున్నదియు, అథో = ఆ తర్వాత, మంద-స్మిత+ఆననమ్ = చిఱునవ్వుతో కూడిన ముఖాన్ని (మందస్మితేన యుక్తమ్ ఆననమ్ యస్య తమ్), పరిరంభయన్తీ = కౌగిలించుకొను చున్నదియు, సాంద్ర... పయః : సాంద్ర = పూర్ణమైన, స్తన = రొమ్మునుండి, స్రుత = కారిన, పయః = పాలను, పాయయన్తీ = త్రాపుచున్నదియు అయి, నందస్య = నందుని యొక్క, రాజ్ఞీ = రాణి, ఇత్థమ్ = ఈ రీతిగా, అహః = పగటిని, నయన్తీ = గడుపుతున్నదిగా, అభవత్ కిల = అయినది గదా!

**తా ॥** యశోద తన వ్రేళ్ళ కొనలతో మెల్లగా కృష్ణుని బుగ్గలు పుణుకుతోంది. చిరునవ్వుతో వెలిగిపోతున్న ఆ ముఖాన్ని కౌగిలించుకుంటోంది. నిండుగా నున్న రొమ్మునుండి కారుతున్న పాలను త్రాగిస్తోంది. ఆ నందసతి ఈ రీతిగా రోజులు గడిపి వేస్తోంది.

**వి :** 1. ఇది ఒక తల్లి బిడ్డను లాలించి ఆనందించే విధానం. ఆ లాలన ఆలనా పాలనలలోనే పసివారికి భద్రతాభావం కలుగుతుంది. ఆ దేహంలో తాను కర్మఫలానుభవాన్ని పూర్తిచేసికోవచ్చున్న విశ్వాసం ఏర్పడుతుంది. స్వాభావికాలయిన మాతృచేష్టలను వర్ణించటం వలన ఇది స్వభావోక్త్యలంకారం. '**స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనమ్**' – (కు. 160)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అభవత్ :** | **అభవత్** | అభవతామ్ | అభవన్ | |
| | అభవః | అభవతమ్ | అభవత | |
| | అభవమ్ | అభవావ | అభవామ. | * |

**శ్లో॥ యాఽమర్త్యమర్త్యదితిజాలిభిరప్యభేద్యం**
**బ్రహ్మాణ్డభాణ్డమభినన్నఖకోటిమాత్రాత్ ।**
**స్వాఙ్గుష్ఠపుష్టసుభగాఙ్గులిమచ్యుతస్తాం**
**సంగృహ్య చుమ్బతి శిశుప్రకృతిః శయానః ॥ 3–11**

**అ :** కృష్ణుని శైశవచేష్టలను వర్ణించుట. –వసంతతిలక.

**అ :** శయానః అచ్యుతః శిశు–ప్రకృతిః (సన్) యా అమర్త్య–మర్త్య–దితిజాలిభిః అపి అభేద్యం, బ్రహ్మాండ–భాండమ్ నఖ–కోటిమాత్రాత్ అభినత్, తాం స్వాంగుష్ఠ–పుష్ట–సుభగాంగులిమ్ సంగృహ్య చుంబతి.

**ప్ర :** శయానః = పడుకొని యున్న (శీ ధాతువుపై శానచ్ ప్రత్యయం), అచ్యుతః = కృష్ణుడు (నాస్తి చ్యుతమ్ యస్య సః), శిశు–ప్రకృతిః సన్ = పసితనపు స్వభావం గలవాడై (శిశోః ప్రకృతిరివ ప్రకృతిః యస్య సః), యా = ఏదయితే, అమర్త్య... జాలిభిః : అమర్త్య = దేవతలచేతను (అమర్త్యా అమృతాంభసః – అమరకోశం – 1/8), మర్త్య = మానవుల చేతను, దితి–జ+ఆలిభిః+అపి = రాక్షస సమూహాల చేతను కూడా, అభేద్యమ్ = భేదింపరాని (బ్రద్దలు చేయరాని), అమర్త్యాః మర్త్యాః దితిజాః చ, తేషామ్ ఆలిభిః), బ్రహ్మ+అండ–భాండమ్ = బ్రహ్మాండమనే మూకుడును, నఖ–కోటి–మాత్రాత్ = గోటికొనచేతనే (అణిరశ్రిస్తథాకోటిరశ్రః కోణశ్చ కథ్యతే – హలాయుధకోశః – 727), (నఖస్య కోటిః తతః మాత్రచ్, తస్మాత్), అభినత్ = చీల్చివేసెనో (భిదిర్ – విదారణే పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.), తామ్ = దానిని, స్వ+అంగుష్ఠ–పుష్ట–సుభగ+అంగులిమ్ : స్వ = తనయొక్క, అంగుష్ఠ = బొటనవ్రేలిరూపంలో వుండి, పుష్ట = బలిసిన, సుభగ = అందమైన, అంగులిమ్ = వ్రేలిని (స్వస్య అంగుష్ఠమ్, స్వాంగుష్ఠరూపా చ సా పుష్టా సుభగా చ అంగులిః, తామ్), సంగృహ్య = పట్టుకొని (సమ్ – గ్రహధాతువుపై ల్యప్ ప్రత్యయం), చుంబతి = ముద్దిడుతున్నాడు. (చుమ్బ వక్త్రసంయోగే – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.).

**తా॥** (ఊయలలో) పడుకొని వున్న కృష్ణుడు తన కాలిబొటనవ్రేలిని పట్టుకొని ముద్దు పెట్టుకొంటున్నాడు. (అది విజయగర్వంతో కూడిన చేష్ట). ఎందుకంటే దేవతలకు, మానవులకు, రాక్షసులకు కూడా బ్రద్దలు చేయటం కుదరని బ్రహ్మాండ భాండాన్ని కొనగోటితో బ్రద్దలు చేయగల వ్రేలు అది. ఆ వేలు తనది.

**వి :** 1. ఈ శ్లోకంలో ఉదాత్తాలంకారముంది. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' (కు. 162) ధర్మబద్ధమైన సంపత్సమృద్ధిని వర్ణించటం ఉదాత్తాలంకారం. కృష్ణుని శౌర్యాన్నీ, శక్తినీ, ఆత్మానురక్తినీ గొప్పగా వర్ణించిన శ్లోకమిది.

2. ఈ శ్లోకం ద్వారా వ్యక్తమయ్యే పరాక్రమం కవిలోని కృష్ణభక్తికి అంగమై, కృష్ణభక్తికి స్థాయి భావాన్ని కలిగిస్తుంది.

3. ఈ శ్లోకభావాన్నే మరొక అందమైన శ్లోకం ఇలా అందిస్తుంది.

శ్లో॥ కరారవిందేన పదారవిందం – ముఖారవిందే వినివేశయన్తమ్ ।
వటస్య పత్రస్య పుటే శయానం – బాలం ముకుందం మనసా స్మరామి ॥

| | | | |
|---|---|---|---|
| 4. **అభినత్ :** | **అభినత్** | అభిన్తామ్ | అభిన్దమ్ |
| | అభిన్నః/అభినత్ | అభిన్తమ్ | అభిన్త |
| | అభినదమ్ | అభిన్ద్వ | అభిన్ద్మ |
| **చుంబతి :** | **చుంబతి** | చుంబతః | చుంబన్తి |
| | చుంబసి | చుంబథః | చుంబథ |
| | చుంబామి | చుంబావః | చుంబామః. |

*

**శ్లో॥ నిద్రామాశ్రయ కిం తదాశ్రయఫలం భుక్తం వ్రజేజ్జీర్ణతాం**
**నిద్రా కాఽమ్బ! నిమీలితాక్షియుగలః ప్రాజ్ఞం యదాలిఙ్గతి ।**
**అస్త్వేవం త్వితి ముద్రితాత్మనయనః స్వాంగం సమాలిఙ్గ్య తత్**
**సర్వం జీర్ణమథో దిశేతి జననీం శంసన్ నిజం సోఽవతాత్ ॥ 3–12**

**అ :** యశోదా కృష్ణుల మధ్య జరుగుతున్న సంవాదాన్ని నిరూపించే శ్లోకమిది. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** నిద్రామ్ ఆశ్రయ. తదాశ్రయఫలం కిమ్? భుక్తం జీర్ణతాం వ్రజేత్. అంబ నిద్రా కా? నిమీలితాక్షయుగలః ప్రాజ్ఞం యత్ ఆలింగతి (సా). అస్తు ఏవం తు ఇతి ముద్రితాత్మనయనః స్వాంగం సమాలింగ్య తత్ సర్వం జీర్ణమ్. అథో దిశ ఇతి జననీం శంసన్ సః నిజమ్ అవతాత్.

**ప్ర : యశోద** : నిద్రామ్ = నిద్రను, ఆశ్రయ = పొమ్ము (ఆ+శ్రి శ్రయే పరస్మైపది–లోట్–మ.ఏ.)

**కృష్ణుడు** : తత్+ఆశ్రయ–ఫలమ్ = దానిని ఆశ్రయించుటతో వచ్చే ఫలితం, కిమ్=ఏమిటి?

**యశోద** : భుక్తమ్ = తిన్నది (భుజ్ ధాతువుపై క్త ప్రత్యయం), జీర్ణతామ్ వ్రజేత్ = జీర్ణమవుతుంది. (వ్రజ గతౌ – పరస్మైపది – విధిలిఙ్ – ప్ర.ఏ.)

**కృష్ణుడు** : అంబ= అమ్మ, నిద్రా కా? = నిద్ర అంటే ఏమిటి?

**యశోద** : నిమీలితా+అక్షి–యుగలః(సన్) = రెండు కళ్ళనూ మూసికొన్నవాడై (నిమీలితమ్ అక్ష్ణోః యుగలం యేన సః), యదా = ఎప్పుడు, ప్రాజ్ఞమ్ = పరమాత్మను, ఆలింగతి = కౌగిలించుకొనునో (అది నిద్ర) (ఆ + లిగి గతౌ – పరస్మైపది – ప్ర.ఏ.)

**కృష్ణుడు** : అస్తు+ఏవమ్ = అలాగే, ఇతి = అని, ముద్రిత+ఆత్మ–నయనః (సన్) = తన కన్నులను మూసికొనిన వాడై (ముద్రితే ఆత్మనః నయనే యేన సః), స్వ+అంగమ్ = తన దేహాన్ని, సమాలింగ్య = తాను కౌగిలించుకొని (సమ్–ఆ–లిగి ధాతువుపై ల్యప్ ప్రత్యయం)

తత్ – సర్వం – జీర్ణమ్ = అదంతా అరిగిపోయింది, అథో = ఇంకా, దిశ = చూపించు (ఇవ్వు) (దిశ అతిసర్జనే – పరస్మైపది – లోట్ – మ.ఏ.), ఇతి = అని, జననీమ్ = తల్లికి, శంసన్ = చెపుతూ ( శంస ధాతువుపై శతృప్రత్యయం), సః = ఆ కృష్ణుడు, నిజమ్ = తనవారిని, అవతాత్ = రక్షించును గాక (అవ రక్షణేత్యాది – పరస్మైపది – లోట్ ప్ర.ఏ.).

**తా ॥** 'కృష్ణా! నిదురపో'. 'నిదురపోతే లాభమేమిటి?' 'తిన్నది అరుగుతుంది.' 'అమ్మ! నిద్రంటే ఏమిటి?' 'కళ్ళుమూసికొని పరమాత్మను ఆలింగనం చేసికోవటం.' 'అయితే సరే!' అని కళ్ళు మూసికొని, తనను తాను తాకి 'అమ్మ! అదంతా జీర్ణమై పోయింది. ఇంకా కావాలి' అని అమ్మతో పలికే కృష్ణుడు తన వారిని కాపాడుగాక.

**వి :** 1. అమాయకపు ప్రశ్నల ద్వారా, అద్భుతమైన ప్రదర్శన ద్వారా తల్లి యశోదను కృష్ణుడు ధన్యురాలిని చేస్తున్నాడు. 'ఎల్లయందును తా వసియించుట, ఎల్లయదియును తనయందు వసించుటం(డు వాసుదేవుడను పేరి కర్థంబు' – ఇది పోతనమాట. అన్నీ తనలో, తాను అన్నింట్లో నిలవటమే వాసుదేవుడంటే. ఆ విషయాన్ని లీలగా యశోదకు ధ్వనింపజేయటం కృష్ణ ప్రవృత్తి.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆశ్రయ :** | శ్రయతు/శ్రయతాత్ | శ్రయతామ్ | శ్రయన్తు |
| | **శ్రయ**/శ్రయతాత్ | శ్రయతమ్ | శ్రయత |
| | శ్రయాణి | శ్రయావ | శ్రయామ |
| **వ్రజేత్ :** | **వ్రజేత్** | వ్రజేతామ్ | వ్రజేయుః |
| | వ్రజేః | వ్రజేతమ్ | వ్రజేత |
| | వ్రజేయమ్ | వ్రజేవ | వ్రజేమ |
| **ఆలింగతి :** | **ఆలింగతి** | ఆలింగతః | ఆలింగన్తి |
| | ఆలింగసి | ఆలింగథః | ఆలింగథ |
| | ఆలింగామి | ఆలింగావః | ఆలింగామః |
| **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |
| **దిశ :** | దిశతు/దిశతాత్ | దిశతామ్ | దిశన్తు |
| | **దిశ**/దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ |
| **అవతు :** | **అవతు**/అవతాత్ | అవతామ్ | అవన్తు |
| | అవ/అవతాత్ | అవతమ్ | అవత |
| | అవాని | అవావ | అవామ. |

*

**శ్లో॥ మాతర్గాయసి కిం సదా జలనిధౌ శేషాఙ్గసంశాయినం**
**తాతాసౌ నను నిద్రయా పరివృతో దద్యాత్ తవాపీతి తామ్ ।**
**ఏవం చేద్గదితం త్వదీయమఖిలం తత్కర్ణదేశం కథం**
**యాతీతి ప్రతిపాదయన్ నిజమతం పాయాద్యశోదాసుతః ॥ 3-13**

**అ :** తల్లి పాడుతున్న జోలపాటను విని కృష్ణుడు ఆరాతీయటం – స్వీయతత్త్వాన్ని సూచించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** మాతః జల–నిధౌ శేషాంగ–సంశాయినం సదా కిం గాయసి? తాత! అసౌ నిద్రయా పరివృతః తవ అపి తాం దద్యాత్ నను ఇతి. ఏవం చేత్ త్వదీయమ్ అఖిలం గదితం తత్కర్ణ–దేశం కథం యాతి ఇతి నిజమతం ప్రతిపాదయన్ యశోదా–సుతః పాయాత్.

**ప్ర : కృష్ణుడు** : మాతః = అమ్మా! జల–నిధౌ = సముద్రంలో (జలానాం నిధిః, తస్మిన్), శేష+అంగ+సంశాయినమ్ : శేష = ఆదిశేషుని యొక్క, అంగ = శరీరంపై, సంశాయినమ్ = పడుకొనియున్న హరిని, సదా = ఎల్లప్పుడూ, గాయసి = పాడుతున్నావు? (గై శబ్దే – పరస్మైపది – లట్ – మ.ఏ.), **యశోద** : తాత = నాయనా!, నిద్రయా =

నిదురతో, పరివృతః = ఆవరింపబడియున్న, అసౌ = ఆ హరి, తవ+అపి = నీకు కూడా, తామ్ (నిద్రామ్) = ఆ నిద్రను, దద్యాత్ నను = ఇవ్వగలడు గదా ( దా దానే పరస్మైపది – ఆశీర్లిఙ్ – ప్ర.ఏ.), ఇతి = అని,

**కృష్ణుడు** : ఏవం చేత్ = అలా అయితే, త్వదీయమ్ = నీ యొక్క, అఖిలమ్ = సమస్తమైన, గదితమ్ = మాట (పాట), తత్ – కర్ణ – దేశమ్ = ఆయని చెవిలోనికి (తస్య కర్ణయోః దేశః, తమ్), కథమ్ = ఏ రీతిగా, యాతి = చేరగలదు (యా ప్రాపణే పరస్మైపది – లట్ – ప్ర.ఏ.), ఇతి = అంటూ, నిజ–మతమ్ = తన (పరమాత్మ) మతాన్ని (నిజస్య మతమ్), ప్రతిపాదయన్ = ప్రకటిస్తూ, యశోదా–సుతః = యశోద కొడుకు కృష్ణుడు (యశోదాయాః సుతః ), పాయాత్ = రక్షించునుగాక.

**తా ॥** అమ్మా! నువ్వెప్పుడు సముద్రంలో ఆదిశేషువుపై పడుకొన్న నారాయణుని గూర్చి ఎందుకు పాడుతున్నావ్.

నాయనా! ఆయన నిద్రలో మునిగి వుంటాడు గదా! నీకు కూడా నిద్ర తెప్పిస్తాడని.

అయితే అమ్మా! నీ మాటలు (పాటలు) అన్నీ ఆయన చెవికి ఎలా చేరుతాయి? అంటూ తన పరమాత్మతత్త్వాన్ని ప్రకటిస్తున్న కృష్ణుడు కాపాడును గాక.

**వి :** 1. ఈ సమాజంలో ఒకనాటి మాతృమూర్తులు పసివారి ఆలనాపాలనా చూసే వ్యవహారం, వారి దైనందిన చర్య ఇక్కడ కనిపిస్తాయి. ఎప్పుడూ శేషశాయిని గూర్చి పాడుతుండటాన్ని గమనించాలి. తెలుగువారు కూడా ఊర్మిళాదేవి నిద్ర, కుశలవకథ, బాలనాగమ్మ మొదలగు కావ్యాలను ఇతరేతర గీతాలనూ పాడుకుంటూ పనిపాటలు చేసికొనేవారు. ఆ గానమే జ్ఞానంగా పసివారి కందేది. జ్ఞానసాధనాలు పెరిగిన తర్వాత జ్ఞానసంపాదన తరుగుతోంది. ధోరణి పెరిగి ధారణ తగ్గుతోంది.

2. ఈ తల్లిబిడ్డల సంవాదం స్వాభావికమయిన అంశం. అందుకే ఇక్కడ స్వభావోక్త్యలంకారం. "**స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనమ్**" (కు. 160)

| | | | |
|---|---|---|---|
| 3. **గాయసి :** | గాయతి | గాయతః | గాయన్తి |
| | **గాయసి** | గాయథః | గాయథ |
| | గాయామి | గాయావః | గాయామః |
| **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ |
| **యాతి :** | **యాతి** | యాతః | యాన్తి |
| | యాసి | యాథః | యాథ |
| | యామి | యావః | యామః |
| **పాయాత్ :** | **పాయాత్** | పాయాతామ్ | పాయుః |
| | పాయాః | పాయాతమ్ | పాయాత |
| | పాయామ్ | పాయావ | పాయామ. |

*

**శ్లో॥ లోలత్కఙ్కణపాణిపద్మధృతయా నీలోల్లసత్కున్తలా**
**బాలాః స్రస్తదుకూలహారవలయా మౌలిస్ఖలన్మల్లికాః ।**
**లోలాఙ్గ్యః క్వణదఙ్ఘ్రిభూషణగణా ఈషచ్చలత్కుణ్డలా**
**వ్యాలోలం సహ దోలయా మృగదృశః కృత్వోపనిన్యుః ప్రియమ్ ॥ 3-14**

**అ :** కృష్ణుని డోలోత్సవ వర్ణనమే – గోపకాంతలు ఊయలనూపుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** నీలోల్లసత్–కుంతలాః స్రస్త–దుకూల–హార–వలయాః, మౌళి–స్ఖలన్మల్లికాః, లోలాంగ్యః క్వణదంఘ్రి–భూషణ–గణాః ఈషచ్చలత్కుండలాః మృగదృశః బాలాః లోలత్కంకణపాణిపద్మధృతయా డోలయా సహ వ్యాలోలం కృత్వా ప్రియమ్ ఉపనిన్యుః.

**ప్ర :** నీల+ఉల్లసత్ – కుంతలాః : నీల = నల్లగా, ఉల్లసత్ = ప్రకాశించెడి, కుంతలాః = కురులు గలవారును (నీలాః కుంతలాః యాసాం తాః), స్రస్త – దుకూల – హార – వలయాః : స్రస్త = జారిన, దుకూల = బట్టలును, హార = ముత్యాల హారాలును, వలయాః = గాజులును గలవారును (స్రస్తాని స్రస్తాః దుకూలాని హారాః వలయాశ్చ యాసాం తాః), మౌళి – స్ఖలత్ – మల్లికాః : మౌళి = తలనుండి, స్ఖలత్ = జారుతున్న, మల్లికాః = మల్లెలు గలవారును (మౌళేః స్ఖలంత్యః మల్లికాః యాసాం తాః), లోల+అంగ్యః : లోల = కదలాడెడి, అంగ్యః = శరీరావయవాలు గలవారును (లోలాని అంగాని యాసాం తాః), క్వణద్–అంఘ్రి–భూషణ–గణాః : క్వణత్ = శబ్దిస్తున్న, అంఘ్రి–భూషణ = పాదాలంకారాల (కడియాలు) యొక్క, గణాః = సమూహాలు గలవారును (క్వణంతః చ తే అంఘ్రీణాం భూషణానాం గణాః యాసాం తాః), ఈషత్–చలత్–కుండలాః : ఈషత్ = కొంచెంగా, చలత్ = కదులుతున్న, కుండలాః = చెవికమ్మలుగల వారును (ఈషత్ చలన్తి కుండలాని యాసాం తాః), మృగదృశః = జింకచూపులవంటి చూపులు గలవారును(మృగస్య దృశ ఇవ దృశః యాసాం తాః), అయిన, బాలాః = గోపబాలికలు, లోలత్... ధృతయా = లోలత్ = కదులుతున్న, కంకణ = గాజులు గల, పాణి–పద్మ = తామరలవంటి చేతులతో, ధృతయా = ధరింపబడిన (లోలయన్తి చ తాని కంకణాని యస్య పాణిపద్మస్య, తేన ధృతయా), డోలయా–సహ = ఊయలతోపాటు, వ్యాలోలమ్ = (ముందుకు) కదిలి, ప్రియమ్ = తమకిష్టుడయిన కృష్ణుని, ఉపనిన్యుః = సమీపించిరి (ఉప–నీ ప్రాపణే – పరస్మైపది – లిట్ – ప్ర.బ.).

**తా ॥** గోపికలు వచ్చి కృష్ణుడికి ఉయ్యాలను ఊపుతున్నారు. వారి కురులు నల్లగా వెలుగుతున్నాయి. వారి పైటలు, మెడలోని హారాలు జారుతున్నాయి. తలలు నుండి మల్లెపూలు జారిపడుతున్నాయి. కదలాడే అవయవాలతో, రవళిస్తున్న కాలి నూపురాలతో, మెల్లగా కదులుతున్న చెవికమ్మలతో ఆ గోపికలు ఊయలతో పాటు ముందుకు కదిలి కృష్ణుణ్ణి సమీపించారు.

**వి :** 1. చక్కని చిత్రణ. ఊయలలూపుతున్నవారి మనోహరచిత్రాన్ని కళ్ళ ముందుంచారు. గాజులు, పయ్యెదలు, తలనుండి పూలమాలలు జారుతున్నాయి. గాజులు, కడియాలు రవళిస్తున్నాయి. సౌందర్యమన్నది చైతన్యంలోనే స్థిరవస్తువుల కన్న మిన్నగా వుంటుంది. జారుబాటులలోనే అందముంటుంది. చలత్సౌందర్యమిది. అద్భుతమైన స్వభావోక్త్యలంకార మీ శ్లోకంలో వుంది.

2. ఈ శ్లోకంలో సహోక్త్యలంకారం కూడా వుంది. ఊయలతో పాటు గోపికలు కృష్ణుని సమీపించారనటం అందమైన సహభావం. '**సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః**' (కు.58) జనరంజకమైన సహభావ వర్ణనముంది కాబట్టి సహోక్తి.

3. కదులుతున్న ఊయలతో పాటు కృష్ణుని సమీపించటంలో గోపికలలోని భావం వ్యక్తమవుతుంది. '**నిర్వికారాత్మకే చిత్తే భావః ప్రథమవిక్రియా**'. నిశ్చలమనస్సులలోని తొలి కదలిక భావం.

| | | | |
|---|---|---|---|
| 4. **ఉపనిన్యుః :** | ఉపనినాయ | ఉపనిన్యతుః | **ఉపనిన్యుః** |
| | ఉపనినయిథ/ఉపనినేథ | ఉపనిన్యథుః | ఉపనిన్య |
| | ఉపనినాయ/ఉపనినయ | ఉపనిన్యివ | ఉపనిన్యిమ. |

*

**శ్లో॥ యే వై విట్ఠలసేవకాః శుభధియస్తేషాం స లభ్యస్త్వితి**
**ప్రాయో జ్ఞాపయితుం మురద్విషమితః సమ్ప్రాపయన్త్యేకదా ।**
**అన్యేషాం స హి దూరగస్త్వితి తతః ప్రాప్తం చ తం కుర్వతీ**
**డోలా సా మణిమణ్డితా విజయతే స్వానన్దమూర్తేః శిశోః ॥ 3-15**

**అ :** ఊయల అటూ ఇటూ కదలాడటాన్ని పరమాత్మకు దగ్గర కావటం, దూరం కావటంగా భావించి వర్ణించటం.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** శుభ-ధియః యే విట్ఠల-సేవకాః తేషాం సః లభ్యః వై ఇతి తు ప్రాయః జ్ఞాపయితుం ముర-ద్విషమ్ ఏకదా ఇతః సంప్రాపయన్తీ సః అన్యేషాం దూరగః హి ఏవ ఇతి (జ్ఞాపయితుం) తం తతః ప్రాప్తం చ కుర్వతీ మణి-మండితా స్వానందమూర్తేః శిశోః సా డోలా విజయతే.

**ప్ర :** శుభ-ధియః = శుభకరమైన బుద్ధి గలిగి (శుభా ధీః యేషాం తే), యే = ఎవరయితే, విట్ఠల-సేవకాః = విట్ఠలుని సేవింతురో (విదాన్ (శూన్యాన్) లాతి ఇతి విట్ఠలః), తేషామ్ = వారికి, సః = ఆ కృష్ణుడు, లభ్యః-వై = పొందదగినవాడు (లబ్ధుం యోగ్యః), ఇతి = అని, జ్ఞాపయితుమ్ తు = గుర్తు చేయుటకై (జ్ఞా ధాతువుపై - ణిచ్ - తుమున్ ప్రత్యయం), ముర-ద్విషమ్ = మురుని ద్వేషించే కృష్ణుని (మురం ద్వేష్టి - తమ్), ఏకదా = ఒకసారి, ఇతః = ఇటువైపునకు (ఊయలనూపే వారి వైపునకు), సంప్రాపయన్తీ = నడిపిస్తూ, సః = ఆ కృష్ణుడు, అన్యేషామ్ = ఇతరులకు (సేవించని వారికి), దూరగః ఏవ = దూరమైనవాడే (దూరే గచ్ఛతి ఇతి), ఇతి హి = అనీ,, జ్ఞాపయితుమ్ = గర్తుచేయుటకై, తమ్ = ఆ కృష్ణుని, తతః = వారివైపునుండి, ప్రాప్తమ్ = వెనుకకువచ్చినదిగా, చ = కూడా, కుర్వతీ = చేస్తూ (కృ ధాతువుపై శతృప్రత్యయం) మణి-మండితా = మణులచే అలంకరింపబడిన (మణిభిః మండితా), స్వ+ఆనంద-మూర్తేః = ఆత్మానందస్వరూపుడైన (స్వస్య ఆనందః, స ఏవ మూర్తిః యస్య తస్య), శిశోః = పసివాని (కృష్ణుని) యొక్క, సా డోలా = ఆ ఊయల, విజయతే = శ్రేష్ఠమై నిలుచును (వి-జి జయే - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ. - వస్తుతః పరస్మైపది అయిన జి ధాతువు '**విపరాభ్యాం జేః**' (1-3-19) అన్న సూత్రంతో ముందు 'వి' ఉంటే ఆత్మనే పదమవుతుంది).

**తా ॥** సద్బుద్ధి కలిగి విట్ఠలనాథుని సేవించే వారికే ఆ కృష్ణునికి దగ్గరగా నిలిచే అవకాశముంటుందని గుర్తు చేయటానికి ఆ ఊయల కృష్ణుని ఒకసారి తనను ఊపుతున్న వారి దగ్గరకు తీసికొని వెళ్తుంది. ఆ తర్వాత కృష్ణునకు దూరంగా ఉన్న వారికి కృష్ణుడు దూరం కాక తప్పదని తెలియజేస్తున్నట్లుగా ఊపుతున్న వారినుండి దూరంగా తీసికొని పోతోంది. ఆ ఊయల మణులతో అలంకరింపబడినది. శిశురూపంలోనున్న ఆత్మానంద-స్వరూపుని ఊపుతున్నది.

**వి :** 1. ఊయల అటుఇటూ ఊగుతుంటుంది. అది దానికి స్వాభావికమైన లక్షణం. అయితే దానికి కారణాన్ని సంభావిస్తున్నాడు కవి. సేవించేవారికి తాను దగ్గరట. దాన్ని నిరూపించటానికి వారికి దగ్గరగా వారున్న వైపునకు వస్తోంది. సేవించని వారికి దూరంగా వుంటాడు పరమాత్మ అన్నట్టు దూరమూ వెళుతోంది. తాను అటు ఇటూ ఊగటానికి ఫలితం సేవించిన వారికి దగ్గరగా, సేవించని వారికి దూరంగా నిలవటం కాబట్టి ఇది ఫలోత్ప్రేక్షాలంకారం. అయితే ఉత్ప్రేక్షావ్యంజకమయిన పదం లేదు కాబట్టి ఉత్ప్రేక్షాలంకార ధ్వని.

| | | | |
|---|---|---|---|
| 2. **విజయతే :** | **విజయతే** | విజయతే | విజయన్తే |
| | విజయసే | విజయేథే | విజయధ్వే |
| | విజయే | విజయావహే | విజయామహే. |

*

**శ్లో॥ స్తనోత్థదుగ్ధేన సుతృప్తమేనం - నిరూపయన్త్యాః స హరిర్జగన్తి ।**
**ప్రదర్శయామాస న తృప్తిరస్మా-దుదారదేహస్య మమేతి శిక్షన్ ॥ 3-16**

**అ :** చన్ను విడిచిన కృష్ణుని నోటిలో యశోదకు జగత్తును కనిపింపజేయుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః హరిః ఏనం స్తనోత్థ-దుగ్ధేన సుతృప్తం నిరూపయంత్యాః ఉదార-దేహస్య మమ అస్మాత్ న తృప్తిః ఇతి శిక్షన్ ఇవ జగంతి ప్రదర్శయామాస.

**ప్ర :** సః హరిః = ఆ కృష్ణుడు, ఏనమ్ = ఈ తనను, స్తన+ఉత్థ-దుగ్ధేన : స్తన = రొమ్ము నుండి, ఉత్థ = ఉబికిన, దుగ్ధేన = పాలతో (స్తనయోః ఉత్థం చ తత్ దుగ్ధం, తేన), సుతృప్తమ్ = తృప్తి పడిన వానినిగా (సు-తృప్ ధాతువుపై క్త ప్రత్యయం), నిరూపయన్త్యాః = అనుకొంటున్న తల్లికి, ఉదార-దేహస్య = విశాలమైన శరీరంగల (విశాలః దేహః యస్య తస్య), మమ = నాకు, అస్మాత్ = ఈ పాలద్వారా, తృప్తిః = తృప్తి, న = లేదు, ఇతి = అని, శిక్షన్+ఇవ = నేర్పుతున్నట్లుగా/స్పష్టం చేస్తున్నట్లుగా, జగన్తి = లోకాలను (జగత్ శబ్దం నపుంసకలింగం - ద్వితీయా - బహువచనం), ప్రదర్శయామాస = చూపెను. (ప్ర పూర్వక దృశ్ - ప్రేక్షణే - ణిచ్ - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు చనుబాలు త్రాగాడు. యశోద కృష్ణుడు తృప్తిగా పాలు త్రాగాడని అనుకొంటోంది. అప్పుడు విశ్వతోవ్యాప్తమైన శరీరంగల తనకు ఈ చనుబాలు తృప్తి కలిగించలేవని నిరూపిస్తున్నట్లుగా తననోట లోకాలనన్నింటినీ ప్రదర్శించాడు.

**వి :** 1. కొండంత దేవుడికి కొండంత పూజ చేయలేమని నానుడి. కృష్ణుడిని పాలతో తృప్తి పరచగలగటం సాధ్యమా! అలా భావిస్తున్న యశోదను ఆ భ్రాంతినుండి తాత్కాలికంగా దూరం చేయటానికి బాలకృష్ణుని ప్రయత్నమిది. పోతన భాగవతంలో ఇలా వర్ణించాడు.

సీ. జననాథ! యొకనాఁడు చన్నుచేఁపినఁదల్లి - చిన్ని ముద్దులకృష్ణుఁజేరఁదిగిచి
యెత్తి పెందొడలపై నిడికొని ముద్దాడి - చన్నిచ్చి నెమ్మోము చక్క నిమిరి
యల్లని నగవుతో నావులించిన బాలు - వదనగహ్వరమున వారినిధులు
దిశలు భూమియు నవద్వీపశైలంబులు - నేఱులు గాలియు నినుడు శశియు.

ఆ. దహను డాకసంబుఁదారలు గ్రహములు - నఖిలలోకములుఁ జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుట - జూచి కన్ను మోడ్చి చోద్యపడియె. -పోతనభాగవతం 10/279

2. **ప్రదర్శయామాస : ప్రదర్శయామాస** ప్రదర్శయామాసతుః ప్రదర్శయామాసుః
ప్రదర్శయామాసిథ ప్రదర్శయామాసథుః ప్రదర్శయామాస
ప్రదర్శయామాస ప్రదర్శయామాసివ ప్రదర్శయామాసిమ

జగంతి పదం ధాతురూపంగా కనిపిస్తుంది. కానీ అది ధాతురూపం కాదు. 'జగత్' శబ్దం. నపుంసకలింగం. ప్రథమా/ద్వితీయా విభక్తిరూపాలు-సమము.

జగత్ జగతీ జగన్తి - ద్వితీయా విభక్తి బహువచనం. *

**శ్లో॥ ముఖే స లోకాన్ ఖలు లోకయిత్వా - తదంతరేఽమ్బాం సగృహాం సనాథామ్ ।**
**అఖండయత్ పుత్రమతిం జనన్యా-మయోజయద్విశ్వపితృత్వబుద్ధిమ్ ॥ 3-17**

**అ :** కృష్ణుడు యశోదలో తనపై విశ్వపితృత్వ భావాన్ని కలిగించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ముఖే లోకాన్ లోకయిత్వా తదంతరే సనాథామ్ సగృహామ్ అంబాం - (లోకయిత్వా) జనన్యా పుత్రమతిమ్

అఖండయత్. విశ్వపితృత్వబుద్ధిమ్ అయోజయత్.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, ముఖే = నోటిలో (తుండం వదనం వక్త్రం లపనం ముఖమాస్యమాననం చ సమమ్ – హలాయుధకోశః – 518), లోకాన్ = లోకాలనూ/లోకులనూ (లోకస్తు భువనే జనే – అమరకోశః – 3/నానార్థ/2), లోకయిత్వా = చూపించి (లుక్ – ణిచ్ – ధాతువుపై క్త్వా ప్రత్యయం), తద్+అంతరే = ఆ లోన, సనాథామ్ = భర్తతోనూ/ప్రభువుతోనూ, స గృహామ్ = ఇంటితో సహా, అంబామ్ = తల్లిని, (లోకయిత్వా = చూపించి), జనన్యామ్ = తల్లిలోని, పుత్రమతిమ్ = పుత్రభావనను (పుత్ర ఇతి మతిః, తామ్), అఖండయత్ = నివారించెను (ఖండ్ ఖండనే పరస్మైపది – లఙ్ – ప్రథమ–పురుషైకవచనం), విశ్వ... బుద్ధిమ్ : విశ్వ = లోకాల యొక్క, పితృత్వ = తండ్రిదనము యొక్క, బుద్ధిమ్ = జ్ఞానాన్ని (ప్రేక్షోపలబ్ధిః చిత్ సంవిత్... అమరకోశః – ధీవర్గః – 1), (విశ్వస్య పితృత్వం, తస్మిన్ బుద్ధిః, తామ్), అయోజయత్ = కలిగించెను (యుజ్ యోగే– పరస్మైపది – ణిచ్ – లఙ్ – ప్ర.ఏ.).

**తా ॥** తల్లికి తననోటిలో ఆ రీతిగా సకలలోకాలనూ చూపించి ఆపై ఆమె ఇంటితో, యజమానితో పాటుగా ఆమెనూ చూపించి, తనపై నున్న పుత్రభావాన్ని నిరోధించి, తాను విశ్వపిత అన్న జ్ఞానాన్ని కలిగించాడు.

**వి :** 1. పుత్రమతిని పోగొట్టి విశ్వపితృత్వభావాన్ని కలిగించటంలోని ఆంతర్యం ఆమెలో ఇతికర్తవ్యతాభావాన్ని పెంచటమే. గురుతరమయిన బాధ్యత తన భుజాలపై నున్న విషయాన్ని ఆమె గుర్తెరిగేటట్లు చేయటమే.

| | | | |
|---|---|---|---|
| 2. **అఖండయత్ :** | **అఖండయత్** | అఖండయతామ్ | అఖండయన్ |
| | అఖండయః | అఖండయతమ్ | అఖండయత |
| | అఖండయమ్ | అఖండయావ | అఖండయామ. |
| **అయోజయత్ :** | **అయోజయత్** | అయోజయతామ్ | అయోజయన్ |
| | అయోజయః | అయోజయతమ్ | అయోజయత |
| | అయోజయమ్ | అయోజయావ | అయోజయామ. |

*

**శ్లో॥ న నామ కుర్వంతి మమేతి నూనం – స పూతనాదీన్ వినిహత్య మాతుః ।**
**ప్రదర్శ్య విశ్వం జఠరే స్వశక్త్యా – బహూని నామాని బభార బాలః ॥ 3-18**

**అ :** కృష్ణుడు అనంతనాముడు కావటానికి గల కారణాన్ని చమత్కారంగా సంభావించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** మమ నామ న కుర్వంతి ఇతి సః బాలః పూతనాదీన్ వినిహత్య జఠరే మాతుః విశ్వం ప్రదర్శ్య స్వశక్త్యా బహూని నామాని బభార.

**ప్ర :** మమ = నాకు, నామ = పేరును, న కుర్వంతి = పెట్టడం లేదు (కృ – కరణే – పరస్మైపది – లట్ – ప్ర.బ.), ఇతి = అని, నూనమ్ = నిశ్చితంగా, సః బాలః = ఆ శిశువు (కృష్ణుడు), పూతనా+ఆదీన్ = పూతన మొదలగు వారిని (పూతనా ఆదౌ యేషాం తాన్), వినిహత్య = చంపి (వి+ని+హన్ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మాతుః = తల్లికి, జఠరే = కడుపులో, విశ్వమ్ = లోకాన్ని, ప్రదర్శ్య = చూపి (ప్ర+దృశ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వశక్త్యా = తనశక్తితోనే (స్వస్య శక్తిః, తయా), బహూని = ఎన్నో, నామాని = పేర్లను, బభార = భరించాడు. (భృ – భరణే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.).

**తా ॥** (రోజులు గడుస్తున్నాయి) కానీ తనకింకా 'పేరు పెట్టలేదు' (నామకరణం జరిపించ లేదు.) అందుకని ఆ బాలకృష్ణుడు పూతన, శకటాసుర, తృణావర్తులను చంపీ, తన తల్లికి తనలోనే లోకాన్ని చూపి తనశక్తితోనే తాను ఎన్నో పేర్లు తెచ్చుకొన్నాడు.

శ్లో॥ పూతనాజీవితాహరః శకటాసురభంజనః ।
తృణీకృతతృణావర్తో యమలార్జునభంజనః ॥ - కృష్ణాష్టోత్తరశతనామస్తోత్రం.

వి : 1. నామకరణమన్నది మనిషికి జరిపించవలసిన షోడశ సంస్కారాలలో ఒకటి గదా! కాబట్టి ఆచారబద్ధంగా జరిపించవలసినదానిని జరిపించనందుకు కోపించటం సహజం. అందునా విష్ణుమూర్త్యవతారమైన శ్రీకృష్ణుని విషయంలో.

సర్వాగమనామాచారః ప్రథమః పరికీర్తితః ।
ఆచారప్రభవో ధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః ॥ -విష్ణుసహస్రనామ-ఉత్తరపీఠికా-17

2. పూతనాదులను సంహరించటం తాను పేరు తెచ్చుకోవటానికి కాదు. అది అవతారలక్ష్యంలో ఒక భాగం. అలాగే తనకు పేరింకా పెట్టలేదని కోపపడనూ లేదు. అయినా కవి అలా సంభావించాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం. నూనం పదం ఉత్ప్రేక్షా వ్యంజకం.

**శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।**
**ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥**

| | | | |
|---|---|---|---|
| 3. **బభార :** | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర బభృవ | బభృమ. | |

*

## శ్లో॥ అథైత్య గర్గః కిల రామకృష్ణౌ - చకార నామ్నా వినతౌ సుతౌ తౌ ।
## అహం తు మన్యే చకితస్తదీయ-గురుత్వకీర్త్యా జగృహే తదాఖ్యామ్ ॥ 3-19

**అ :** గర్గుడు గోకులానికి వచ్చి రామకృష్ణులకు పేరుపెట్టుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథ గర్గః ఏత్య వినతౌ తౌ సుతౌ రామకృష్ణౌ (ఇతి) నామ్నా చకార కిల. అహం తు మన్యే తదీయ-గురుత్వ-కీర్త్యా చకితః తదాఖ్యాం జగృహే.

**ప్ర :** అథ = ఆపై, గర్గః = గర్గుడు, ఏత్య = వచ్చి (ఆ+ఇ-ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వినతౌ = వినయం గల, తౌ-సుతౌ = ఆ కుమారులను, రామ-కృష్ణౌ = రామకృష్ణులు అని (రామశ్చ కృష్ణశ్చ), నామ్నా-చకార = పేరుపెట్టెను (కృ కరణే పరస్మైపది లిట్ - ప్ర.ఏ.), అహం తు = నేనయితే, మన్యే = భావిస్తున్నాను (మన్ జ్ఞానే ఆత్మనేపది - లట్ - ఉ.ఏ.), తదీయ... కీర్త్యా : తదీయ = తనకు సంబంధించిన, గురుత్వ = గురుత్వానికి (పెద్దరికానికి) చెందిన, కీర్త్యా = కీర్తితో, (తదీయా చ గురుత్వకీర్తిః, తయా), చకితః = భయపడినవాడై, తద్+ఆఖ్యామ్ = ఆ పేరును, జగృహే = స్వీకరించాడు. (గ్రహ ఉపదానే ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.).

**తా ॥** ఆపై ఒకసారి గర్గుడు (యాదవులకు పురోహితుడు) గోకులానికి వచ్చి వినయశీలురయిన ఆ కుమారులకు రాముడు - కృష్ణుడు అని పేరు పెట్టాడు. నాకనిపిస్తున్న దేమిటంటే కృష్ణునకున్న గురుత్వకీర్తిని చూసి భయపడి ఆలా పేర్లు పెట్టి వుంటాడని.

**వి :** 1. గర్గుడు పురోహితుడుగానే కీర్తింపబడుతున్నాడు. కృష్ణుని కీర్తి అప్పటికే ప్రజలనోళ్ళలో నానుతోంది. ఆ గొప్పతనం ముందు తనగొప్పతనం వెలవెలపోతోందని భావించి గర్గుడు బెదిరిపోయాడు.

2. 'అహం తు మన్యే' అంటూ కంఠోక్తిగా విషయ సంభావనను ప్రకటిస్తున్నాడు కాబట్టి ఉత్ప్రేక్షాలంకారం. మన్యే ఉత్ప్రేక్షావ్యంజకం.

**శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవ మాదిభిః ।**
**ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దై రివ శబ్దోఽపి తాదృశః ॥**

| | | | | |
|---|---|---|---|---|
| 3. **చకార :** | చకార | చక్రతుః | చక్రుః | |
| | చకార్థ | చక్రథుః | చక్ర | |
| | చకార/చకర | చకృవ | చకృమ | |
| **జగృహే :** | **జగృహే** | జగృహాతే | జగృహిరే | |
| | జగృహిషే | జగృహాథే | జగృహిధ్వే (ఢ్వే) | |
| | జగృహే | జగృహివహే | జగృహిమహే. | * |

**శ్లో॥ అనన్తనామాఽపి స కృష్ణసంజ్ఞా-మవాప్య తుష్టః కిల గర్గదత్తామ్ ।**
**తథాహి శబ్దేషు బహూదితేషు - ప్రియేరితః ప్రీతికరో హి లోకే ॥ 3-20**

**అ :** కృష్ణుడు కృష్ణనామంతోనే ఆనందాన్ని పొందటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః అనంత-నామా అపి గర్గ-దత్తాం కృష్ణ-సంజ్ఞామ్ అవాప్య తుష్టః కిల. తథాహి. లోకే బహూదితేషు శబ్దేషు ప్రియేరితః. ప్రీతికరః హి.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, అనంత-నామా-(సన్) అపి = ఎన్నో పేర్లు గలవాడైనను (అనంతాని నామాని యస్య సః), గర్గ-దత్తామ్ = గర్గుడు పెట్టిన (గర్గేన దత్తా, తామ్), కృష్ణ - సంజ్ఞామ్ = కృష్ణుడను పేరును (కృష్ణ ఇతి సంజ్ఞా, తామ్), అవాప్య = పొంది, (అవ+ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తుష్టః - కిల = ఆనందించాడు గదా!, తథాహి = అది తగినదే, లోకే = లోకంలో, బహు - ఉదితేషు = ఎందరో పిలిచే (బహుభిః ఉదితాః, తేషు), శబ్దేషు = పదాలలో/పిలుపులలో, ప్రియ+ఈరితః : ప్రియ = ఇష్టమైన వారిచే, ఈరితః = పలుకబడినది (ప్రియైః ఈరితః), ప్రీతి-కరః : ప్రీతి = ఆనందాన్ని (ముత్ప్రీతిః ప్రమదో హర్ష ప్రమోదామోదసంమదాః అమరకోశం - కాల - 26), కరః హి = కల్గించేది గదా! (ప్రీతేః కరః).

**తా ॥** కృష్ణుడికి ఎన్నో పేర్లున్నాయి. అయినా గర్గుడు పెట్టిన ఆ పేరుతో కృష్ణుడు తృప్తి చెందాడు. నిజం మరి. లోకంలో ఎవరికైనా, ఎన్ని పేర్లున్నా, ఇష్టమైన వాళ్ళు పిలిచే పేరంటేనే మక్కువ గదా!

**వి :** 1. "తొల్లి యీ శిశువు ధవళారుణపీతవర్ణుండై యిప్పుడు నల్లనైన కతంబునఁగృష్ణుడయ్యె... ఈ పాపనికి గుణరూపకర్మంబు లనేకంబులు గలుగుటంజేసి నామంబు లనేకంబులు గలవు" - పోతన భాగవతం 10/287

గుణాన్ని (రంగును)బట్టి గర్గుడు పేరు పెట్టాడు. కాని క్రియను బట్టి (కర్షతి ఇతి) అయితే ఆకర్షించువాడు/ తన వైపునకు లాగువాడు అని అర్థం.

శ్లో॥ కృషి ధాతుణకారాభ్యాం సత్తానందాత్మతాం కిలాఖిలపత్ ।
జగదఘకార్షిత్వం వా కథయదృషిః కృష్ణ నామ తే వ్యతనోత్॥ -నారాయణీయం 44/5

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది. "**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్య విశేషయోః**" (కు. 122), గర్గుడు పెట్టిన పేరునే కృష్ణుడిష్టపడటం సామాన్య విషయమయితే ఇష్టమైన వారు పెట్టిన పేరు నచ్చుటమన్నది సామాన్య విషయం. విశేష సామాన్యాలు రెండూ ఉండటం వల్ల అర్థాంతరన్యాసాలంకారం. *

**శ్లో॥ సపత్నపత్నీవదనోడురాజం - క్రమేణ యః క్షీణకలం కరోతి ।**
**సితేతరః పక్ష ఇవర్క్షనాథం - గుణోచితా తస్య హి కృష్ణసంజ్ఞా ॥ 3-21**

**అ :** కృష్ణుడన్న పేరునకు అన్వర్థత్వాన్ని కల్పించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** యః సితేతరః పక్షః ఋక్షనాథమ్ ఇవ సపత్న-పత్నీ-వదనోడురాజం క్రమేణ క్షీణ-కలం కరోతి తస్య కృష్ణ-సంజ్ఞా గుణోచితా.

**ప్ర :** యః = ఎవడయితే, సిత+ఇతరః = శుక్లపక్షం కంటె భిన్నమైన (సితాత్ - ఇతరః), పక్షః = పక్షం (కృష్ణపక్షం), ఋక్ష-నాథమ్ ఇవ = చంద్రునివలె (ఋక్షాణాం నాథః, తమ్), సపత్న... రాజమ్ : సపత్న = శత్రువు యొక్క, పత్నీ = భార్య యొక్క, వదన = ముఖ మనే, ఉడు-రాజమ్ = నక్షత్రాధిపతిని (సపత్నానాం పత్నీనాం వదనాని ఏవ, ఉడూనాం రాజా, తమ్), (జ్యోతిస్తారాధిష్ణ్యముక్షం తథోడు - హలాయుధకోశః - 51), క్షీణ-కలమ్ = కళాక్షయునిగా (క్షీణాః కలాః యస్య తమ్), కరోతి = చేస్తాడో, తస్య = అతనికి, కృష్ణ-సంజ్ఞా = కృష్ణ డన్న పేరు (కృష్ణ ఇతి సంజ్ఞా), గుణ+ఉచితా = గుణానికి తగినదే (గుణస్య ఉచితా).

**తా ॥** కృష్ణునిది గుణానికి తగిన పేరే. ఎందుకంటే కృష్ణపక్షం చంద్రుని కళావిహీనుని చేసినట్లు కృష్ణుడు కూడా శత్రుకాంతల ముఖచంద్రులను కళావిహీనులను చేస్తాడు కాబట్టి తన గుణాలకు తగినదే ఆ పేరు.

**వి :** 1. కృష్ణపక్షం చంద్రుని కళాహీనుని చేసినట్లు అన్న దానికి. కృష్ణుడు శత్రుపక్ష ముఖచంద్రులను కళాహీనులను చేయటంతో పోలిక. కాబట్టి ఉపమాలంకారం. (**ఉపమా యత్ర సాదృశ్యాలక్ష్మీరుల్లసతి ద్వయోః** - కువలయానందం - ః), వదన+ఉడు రాజమ్ అన్నచోట రూపకాలంకారం. (**విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్ తత్ రూపకం** - కు. 17).

| | | | |
|---|---|---|---|
| 2. **కరోతి :** | **కరోతి** | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః. |

*

**శ్లో॥ యతః స్వసన్దర్శనతో నరాణాం - వరాఙ్గనానాం సురచారణానామ్ ।**
**మనాంసి సర్వాణ్యపకర్షతీశ-స్తతోఽపి కృష్ణం ప్రవదన్తి సన్తః ॥ 3-22**

**అ :** కృష్ణ పద సార్థకతా వర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశః స్వ-సందర్శనతః నరాణాం వరాంగనానాం సుర-చారణానాం సర్వాణి మనాంసి యతః అపకర్షతి తతః అపి సంతః కృష్ణం ప్రవదంతి.

**ప్ర :** ఈశః = ప్రభువయిన ఆ కృష్ణుడు, స్వ-సందర్శనతః = తనను చూచుటవలననే (స్వస్య సందర్శనం, తస్మాత్), నరాణామ్ = నరులయొక్కయు, వర+అంగనానామ్ = ఉత్తమ స్త్రీల యొక్కయు, సుర-చారణానామ్ = సురలు, చారణుల యొక్కయు (సురాశ్చ తే చారణాశ్చ, తేషాం), సర్వాణి = వివిధ రూపాలలోని, మనాంసి = మనస్సులను, యతః = ఎందువలన, అపకర్షతి = లాగివేయునో (కృష్ - విలేఖనే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), తతః అపి = అందువలనకూడా, సంతః = సజ్జనులు, కృష్ణమ్ = కృష్ణుడని, ప్రవదన్తి = అంటున్నారు (ప్ర+వద వ్యక్తాయాం వాచి - పరస్మైపది - లట్ - ప్ర.బ.)

**తా ॥** తనను చూచినంతనే నరులు, ఉత్తమస్త్రీలు, దేవతలు, చారణులు వీరందరి మనస్సులను లాగివేసే సామర్థ్యంగల ప్రభువు కాబట్టి ఆయనను సజ్జనులందరూ కృష్ణుడని వ్యవ-హరిస్తున్నారు.

**వి :** 1. శ్లో॥ యతః కర్షసి దేవేశ నియమ్య సకలం జగత్ ।
అతో వదన్తి మునయః కృష్ణం త్వాం బ్రహ్మవాదినః ॥
- మహాకూర్మమ్ - గీతాభాష్యం (మధ్వాచార్య) - 5/1

| | | | |
|---|---|---|---|
| 2. **అపకర్షతి :** | **కర్షతి** | కర్షతః | కర్షన్తి |
| | కర్షసి | కర్షథః | కర్షథ |
| | కర్షామి | కర్షావః | కర్షామః |
| **ప్రవదన్తి :** | ప్రవదతి | ప్రవదతః | **ప్రవదన్తి** |
| | ప్రవదసి | ప్రవదథః | ప్రవదథ |
| | ప్రవదామి | ప్రవదావః | ప్రవదామః. |

*

**శ్లో॥ యతస్స పృథ్వీతలసంస్థితోఽపి - సుఖీ ధరణ్యాః సుఖదాయకశ్చ ।**
**తతోఽపి కృష్ణం ప్రవదన్తి కృష్ణం - సముల్లసత్కేశవకేశరూపమ్ ॥ 3-23**

**అ :** కృష్ణ నామ సార్థక్య నిరూపణమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః యతః పృథ్వీతల-సంస్థితః అపి సుఖీ ధరణ్యాః సుఖ-దాయకః చ తతః అపి కృష్ణం సముల్లసత్కేశవ-కేశ-రూపం ప్రవదన్తి.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, యతః = ఎందువలన, పృథ్వీ... సంస్థితః+అపి : పృథ్వీ-తల = భూతలంపై, సంస్థితః+అపి = నిలిచినవాడైనను (పృథ్వ్యాః తలమ్, తస్మిన్ సంస్థితః), సుఖీ = సుఖంగా వున్నాడో, ధరణ్యాః = భూమికి, సుఖ-దాయకః చ = సుఖాన్ని కల్గిస్తున్నాడో (సుఖస్య దాయకః), తతః+అపి = అందువలనకూడా, సముల్ల... రూపమ్ : సమ్+ఉల్లసత్ = చక్కగా ప్రకాశిస్తున్న, కేశవ = విష్ణువు యొక్క, కేశ = కేశం వంటి, రూపమ్ = రూపం గల, కృష్ణమ్ = నల్లని వానిని, కృష్ణమ్ = కృష్ణుడని, ప్రవదన్తి = చెప్తున్నారు. (ప్ర+వద వ్యక్తాయాం - వాచి - పరస్మైపది - లట్ - ప్ర.బ.).

**తా ॥** కృష్ణుడు భూతలానికి అవతరించి తాను సుఖంగా ఉన్నాడు. భూమికి సుఖాన్ని కలిగిస్తున్నాడు. తాను కేశవ కేశ స్వరూపుడై నల్లగా వున్నాడు. అందుకని కూడా కృష్ణుని కృష్ణుడంటున్నారు.

**వి :** 1. మన ఉనికి మనకూ, మనలనాశ్రయించిన వారికీ, మనకు ఆశ్రయమిచ్చిన వారికీ సుఖహేతువు కావాలి. అప్పుడే ఉనికికి సార్థకత.

2. కృషిర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతివాచకః ।
విష్ణుస్తద్భావయోగాచ్చ కృష్ణో భవతి సాత్త్వతః ॥ - మహాభారతమ్ ఉద్యోగ-70/5

3. **ప్రవదన్తి :** 3-23వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యతశ్చ దైతేయకదంబకక్ష(కుంజ)-చయస్య విధ్వంసవిధౌ మురారిః ।**
**వనాగ్నిమన్వేతి లయాగ్నికల్పం - తతోఽపి గాయన్తి హి కృష్ణమేనమ్ ॥ 3-24**

**అ :** కృష్ణపదో సార్థకతా వర్ణనమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** యతః మురారిః దైతేయ-కదంబ-కక్ష-చయస్య విధ్వంస-విధౌ వనాగ్నిమ్ అన్వేతి తతః అపి లయాగ్నికల్పమ్ ఏనమ్ కృష్ణం గాయన్తి హి.

**ప్ర :** యతః = ఎందువలనైతే, ముర+అరిః = కృష్ణుడు (మురస్య అరిః), దైతేయ... చయస్య : దైతేయ = రాక్షసుల యొక్క, కదంబ = సమూహా లనే, కుంజ = పొదలయొక్క (నికుంజ కుంజౌ వాక్లీబే - అమరకోశః -2/వనౌ/8), చయస్య = సమూహం యొక్క (దైతేయానాం కదంబాః, త ఏవ కక్షాః, తేషాం చయః, తస్య), విధ్వంస విధౌ :

విధ్వంస = నశింపజేసెడి, విధౌ = కర్తవ్యమందు (విధ్వంసః ఏవ విధిః), వన+అగ్నిమ్ = దావాగ్నిని, అన్వేతి = అనుకరిస్తాడో (అను – ఇణ్ గతౌ – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.), తతః+అపి = అందువలన కూడా, లయ+అగ్ని–కల్పమ్ = ప్రళయకాలాగ్నితో సమానమైన (లయే అగ్నిః, ఈషదూనః లయాగ్నిః, తమ్), ఏనమ్ = ఈ బాలుని, కృష్ణమ్ = కృష్ణునిగా, గాయన్తి = కీర్తిస్తున్నాడు. (గై శబ్దే పరస్మైపది – లట్ – ప్ర.బ.).

**తా ॥** రాక్షసు లనే పొదరిండ్ల సమూహాన్ని తగులబెట్టే పనిలో మురారి దావాగ్ని వలె వ్యవహరిస్తున్నాడు కాబట్టి ప్రలయాగ్ని వంటి ఆ బాలుని అందరూ కృష్ణపదంతో వ్యవహరిస్తున్నారు.

**వి :** 1. అగ్ని స్థానాన్ని బట్టి వ్యవహారభేదం. అరణ్యంలో పుట్టే అగ్ని దావాగ్ని. సముద్ర గర్భంలోని అగ్ని బడబాగ్ని. పర్వతాలలో నిలిచి వుండే అగ్ని లావాగ్ని. గృహస్థు ఇంటిలో నిర్వహించేవి త్రేతాగ్నులు. దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయం. యజ్ఞానికి సంబంధించిన అన్వాహారాన్ని వండే అగ్ని దక్షిణాగ్ని (దక్షిణ దిక్కున ఉంటుంది). యజ్ఞవేళలో హోమం చేయదగిన అగ్ని ఆహవనీయం (తూర్పు దిక్కున). యజమానితో నిత్యసంబంధంగా వుండే అగ్ని గార్హపత్యం (పడమటి దిక్కున). ఈ మూడింటితో పాటు అపసథ్యము (ఔపాసనాగ్ని), సభ్యము (హోమ రహితమైన అగ్ని), లను కలిపితే పంచాగ్నులు. చివరి రెండు అగ్నులు ఈశాన్యంలో వుంటాయి.

2. కృష్ణునకు మురారి అని వాడిన విశేష్య పదం అభిప్రాయ గర్భితం. దైతేయ విధ్వంసకుడు కాబట్టి కృష్ణుని మురారి అనటం సాఫల్య సూచన. విశేష్యం సాభిప్రాయమయితే అది పరికరాంకురాలంకారం. 'సాభిప్రాయ విశేష్యే తు భవేత్పరికరాంకురః' – (కు.63).

| | | | |
|---|---|---|---|
| 3. **అన్వేతి :** | **అన్వేతి** | అన్వితః | అనుయంతి |
| | అన్వేషి | అన్విథః | అన్విథ |
| | అన్వేమి | అన్వివః | అన్వివః |
| **గాయన్తి :** | గాయతి | గాయతః | **గాయన్తి** |
| | గాయసి | గాయథః | గాయథ |
| | గాయామి | గాయావః | గాయామః. |

*

**శ్లో॥ వ్రజాఙ్గనానాం స్మరతాం మునీనా–మభేద్యహృద్యప్రణయాఖ్యదామ్నా ।**
**నిబద్ధమృద్వంఘ్రిసరోజయుగ్మ–శ్చచార దోర్భ్యాం శుభజానుయుగ్మ్యామ్ ॥ 3–25**

**అ :** కృష్ణుడు దోగాడటాన్ని (మోకాళ్లతో పాకటం) వర్ణించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** వ్రజాంగనానాం స్మరతాం మునీనామ్ అభేద్య–హృద్య–ప్రణయ+ఆఖ్య–దామ్నా నిబద్ధ–మృదు+ అంఘ్రి–సరోజ–యుగ్మః శుభ–జాను–యుగ్మ్యాం దోర్భ్యాం చచార.

**ప్ర :** వ్రజ+అంగనానామ్ = గొల్లపడుచుల యొక్క (వ్రజే అంగనాః, తాసామ్), స్మరతామ్ = తలచుకొను, మునీనామ్ = మహర్షుల యొక్కయు, అభేద్య... దామ్నా : అభేద్య = ఛేదింపరాని, హృద్య = మనోహరమైన, ప్రణయ+ఆఖ్య = ప్రేమ అనే పేరుగల, దామ్నా = మాలచేత (అభేద్యం హృద్యం ప్రణయ ఇతి ఆఖ్యం చ దామ – తేన), నిబద్ధ... యుగ్మః : నిబద్ధ = బంధింపబడిన, మృదు = సున్నితమైన, అంఘ్రి–సరోజ = కాళ్ళనెడి తామరల, యుగ్మః = జంటగలవాడై, (నిబద్ధౌ మృదూ చ అంఘ్రీ ఏవ సరోజయోః యుగ్మం యస్య సః), శుభ–జాను–యుగ్మ్యామ్ : శుభ = కళ్యాణకరమైన, జాను = మోకాళ్ళతో, యుగ్మ్యామ్ = కూడినట్టి (శుభే చ తే జానునీ, తాభ్యాంయుక్ తాభ్యాం), దోర్భ్యామ్ = చేతులతో, చచార = కదిలెను. (చర గతౌ పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు దోగాడుతున్నాడు. (కాళ్ళు కట్టివేసి నప్పుడే దోగాడవలసిన అవసర మేర్పడుతుంది). ఇక్కడ కృష్ణుడు గోపకాంతలు, తనను నిరంతరమూ తలచుకొనే మునులు, (తాను యోగీశ్వరుడు గదా!) వాళ్ళ మనోహర ప్రణయమనే పూలమాలతో కట్టి వేయబడ్డాడు. కాబట్టి తను మృదువయిన పాద కమలాలు గలిగి మోకాళ్ళు సహకరిస్తున్న చేతులతో ముందుకు పాకుతున్నాడు. (దోగాడుతున్నాడు).

**వి :** 1.వ్రజాంగనలు, మునులు – వీరి ప్రణయదామంతో కృష్ణుడు బంధింపబడి నందువల్లనే దోగాడుతున్నాడా? కారణం కానిదాన్ని కారణంగా చెప్తున్నాడు, అయితే తన భావనను ధ్వనింపజేస్తూ. అందుకే ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారధ్వని. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తు హేతు– ఫలాత్మనా**' (కు.32)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చచార :** | **చచార** | చేరతుః | చేరుః | |
| | చేరిథ | చేరథుః | చేర | |
| | చచార/చచర | చేరివ | చేరిమ. | * |

**శ్లో॥ అనేకలోకానుదరే విధాయ – య ఏష శేతే స్మ లయాంబుమధ్యే ।**
**శిశుః స సందర్శయితుం సలజ్జః – కృశోదరం జానుచరో బభూవ ॥ 3–26**

**అ :** కృష్ణుడు దోగాడటాన్ని మరోరీతిగా భావించి వర్ణించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** యః ఉదరే అనేక–లోకాన్ విధాయ లయాంబు–మధ్యే శేతే స్మ సః శిశుః కృశోదరం సందర్శయితుం సలజ్జ జాను–చరో బభూవ.

**ప్ర :** యః = ఎవడయితే, ఉదరే = పొట్టలో, అనేక–లోకాన్ = చాలా లోకాలను (అనేకాన్ చ తాన్ లోకాన్), విధాయ=ఏర్పరచుకొని, లయ+అంబు–మధ్యే = ప్రళయ సాగరమధ్యలో (ప్రలయ ఇతి అంబు, తస్య మధ్యః, తస్మిన్), శేతే స్మ = శయనించి యుండెనో (శీఙ్ స్వప్నే – ఆత్మనేపది – లట్ – ప్ర.ఏ.), '**లట్ స్మే**' (అష్టాధ్యాయి 3/2/118) సూత్రం ద్వారా భూతకాలార్థంలో కూడా లట్ ప్రయోగం), స ఏషః = ఆ ఈ శిశువు, కృశ+ఉదరమ్ = చిన్ని పొట్టను (కృశం చ తత్ ఉదరం చ – తత్), సందర్శయితుమ్ = చూపటానికి, స– లజ్జః = సిగ్గుపడి వున్నట్లు, జానుచరః = దోగాడే వాడుగా (జానుభ్యాం చరతి ఇతి), బభూవ = అయ్యెను. (భూ సత్తాయామ్ – పరస్మైపది – లిట్ ప్ర.ఏ.)

**తా ॥** తన కడుపులో అనేక లోకాలను నిలుపుకొని ప్రళయపయోధి మధ్యలో శయనించి వుండే వాడు కృష్ణుడు. అంతటి ఉదరం గల తాను ఇప్పటి తన చిన్ని బొజ్జను చూపించటానికి సిగ్గుపడుతూ మోకాళ్ళతో దోగాడుతున్నాడు. (అప్పుడు పొట్ట కనపడదు గదా అని మనస్సులోని ఆలోచన)

**వి :** 1. దోగాడటం ఆ వయస్సుకు తగిన లక్షణం. శైశవంలో అందరూ చేసేపని. అయితే దానికి హేతువు కల్పించాడు కవి. తన పొట్టను ఇతరులకు చూపకుండా వుండాలని. కాబట్టి ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారం. అయితే ధ్వని రూపంలో.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **శేతే :** | **శేతే** | శయాతే | శేరతే | |
| | శేషే | శయాథే | శేధ్వే | |
| | శయే | శేవహే | శేమహే | |
| **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః | |
| | బభూవిథ | బభూవథుః | బభూవ | |
| | బభూవ | బభూవివ | బభూవిమ. | * |

శ్లో॥ కర్షన్నఙ్ఘ్రియుగం మునీన్ద్రమనసా సాకం వ్రజస్త్రీదృశా
జమ్బాలేన చ నీలనీలసుతనుర్లోలాలకశ్రీముఖః ।
అమ్బామ్బేతి హి యాముదీర్య పిబతి స్మాంకాధిరూఢః స్తనం
కిం వాఽతప్యత సా తపోఽస్య జననీ యస్యేదమీదృక్ఫలమ్ ॥ 3-27

అ : యశోదా పుణ్యఫల వర్ణన - కృష్ణ బాల క్రీడ. -శార్దూలవిక్రీడితమ్.

అ : అంఘ్రి-యుగం మునీంద్ర-మనసా సాకం కర్షన్ వ్రజ-స్త్రీ-దృశా జంబాలేన చ నీల-నీల-సుతనుః లోలాలక-శ్రీ-ముఖః యామ్ అంబా అంబా ఇతి ఉదీర్య హి అంకాధిరూఢః స్తనం పిబతి స్మ సా అస్య జననీ కిం వా తపః అతప్యత యస్య ఈదృక్ ఫలమ్ (భవతి) -

ప్ర : అంఘ్రి-యుగమ్ = కాళ్ళజంటను (అంఘ్ర్యోః యుగమ్), ముని+ఇంద్ర-మనసా సాకమ్ : ముని+ఇంద్ర = ముని శ్రేష్ఠులయొక్క, మనసా సాకమ్ = మనస్సుతో కూడా (జాత్యేకవచనం) (మునీనామ్ ఇంద్రాః, తేషాం మనః, తేన), కర్షన్ = లాగుతూ, వ్రజ -స్త్రీ-దృశా : వ్రజ = గోకులంలోని, స్త్రీ = కాంతలయొక్క, దృశా = చూపుతో (జాత్యేకవచనం) (వ్రజే స్త్రియః, తాసాం దృక్, తయా), జంబాలేన చ = బురదతో కూడా (జంబం ఆలాతి ఇతి, తేన) (జంబాలః కర్దమః ప్రోక్తః - హలాయుధకోశః - 678), నీలనీలసుతనుః : నీలనీల = మరీ నల్లనైన, సుతనుః = మంచి శరీరంగలవాడు (నీలనీలా శోభనా తనుః యస్య సః), లోలా... ముఖః : లోల = కదలాడెడి, అలక = ముంగురులతో, శ్రీ = శోభించెడి, ముఖః = మోముగలవాడును అయిన కృష్ణుడు (లోలాః చ తే అలకాః, తైః సహితం శ్రీముఖం యస్య సః), యామ్ = ఎవరిని, అంబా-అంబా+ఇతి = అమ్మా!, అమ్మ అని, **ఉదీర్య** హి = పిలిచియే (ఉత్+ఈర్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అంక+అధిరూఢః = ఒడిమీది కెక్కి (అంకమ్ అధిరూఢః) (ఉత్సంగ చిహ్నయోరంకః - అమరకోశః - నానార్థ - 4), స్తనమ్ = రొమ్మును, పిబతి స్మ = త్రాగుచుండెనో (పా పానే పరస్మైపది లట్ ప్ర.ఏ.) ('లట్స్మే' - అష్టాధ్యాయి సూత్రం ద్వారా లిడర్థం), సా = ఆమె, అస్య జననీ = ఇతని తల్లి, కిం వా = ఎటువంటి, తపః = తపస్సును, అతప్యత = తపించిందో (తప్ ఐశ్వర్యే - ఆత్మనేపది - లఙ్ - ప్ర.ఏ.), యస్య = ఏ తపస్సు యొక్క, ఫలమ్ = ఫలితం, ఈదృశమ్ = ఇంతటిదో!

**తా ॥** కృష్ణుడు దోగాడుతున్నాడు. తన పాదాలతో పాటు తన పాదాల మీదనే నిలిపిన మునీంద్రుల మనస్సును కూడా లాగుతున్నాడు. గోపకాంతల చూపులతో ముంగిట నున్న బురదతో - అసలే నల్లనైనవాడు - మరీ నల్లగా కనిపిస్తున్నాడు. నుదుటిపై కదలాడుతున్న ముంగురులతో శోభిస్తున్నాడు. అమ్మా! అమ్మా! అని పిలుస్తూ ఆమె ఒడిమీదికెక్కి రొమ్ముపాలు త్రాగుతున్నాడు. ఇంతటి అదృష్టఫలం దొరకటానికి ఆ తల్లి ఏ తపస్సు చేసిందో!

**వి :** 1. కృష్ణుడు దోగాడే సమయంలో తన కాళ్ళతో పాటు వాటినాశ్రయించిన మునీంద్రుల మనస్సులను కూడా లాగటం చక్కని సహభావం. కాబట్టి ఇది సహోక్త్యలంకారం. '**సహోక్తిస్సహభావశ్చేత్ భాసతే జనరంజనః**' (కు.58).

2. గోపకాంతల చూపులవలన, బురదవలన కృష్ణుని శరీరం నీలనీలంగా రంగు పులుముకోవటం ఉల్లాసాలంకారం. '**ఏకస్య గుణదోషాభ్యాముల్లాసోఽన్యస్య తౌ యది**' (కు.133), ఒకరి గుణదోషాలు మరొకరికి సంక్రమించటం ఉల్లాసాలంకారం.

3. **పిబతి :**

| | | |
|---|---|---|
| **పిబతి** | పిబతః | పిబన్తి |
| పిబసి | పిబథః | పిబథ |
| పిబామి | పిబావః | పిబామః |

| | | | |
|---|---|---|---|
| **అతప్యత :** | **అతప్యత** | అతప్యేతామ్ | అతప్యన్త |
| | అతప్యథాః | అతప్యేథామ్ | అతప్యధ్వమ్ |
| | అతప్యే | అతప్యావహి | అతప్యామహి. |

*

**శ్లో॥ వైగుణ్యం వివిధోదయైర్విమృశతాం విత్తైర్జగద్బాధ్యతాం**
**వైరూప్యం నిజతేజసా నిరుపమైరఙ్గైర్నిరాకారతామ్ ।**
**నీచైక్యఞ్చ నిరస్య నిర్మలధియాం నిత్యార్చయా విట్ఠలో**
**దిగ్భిన్నామ్బరధిక్క్రియార్థమభవద్దిగ్వస్త్రతాం దీపయన్ ॥ 3-28**

**అ :** కృష్ణ తత్త్వ నిరూపణ పరమైన శ్లోకం (అద్వైత ఖండన కూడా). -శార్దూలవిక్రీడితమ్.

**అ :** విట్ఠలః వివిధోదయైః వైగుణ్యం నిరస్య, విమృశతాం విత్తైః జగద్-బాధ్యతాం నిరస్య నిజ-తేజసా వైరూప్యం నిరస్య, నిరుపమైః అంగైః నిరాకారతాం నిరస్య నిర్మలధియాం నిత్యార్చయా నీచైక్యం చ నిరస్య దిగ్భిన్నాంబరధిక్క్రియార్థం దిగ్వస్త్రతాం దీపయన్ అభవత్.

**ప్ర :** విట్ఠలః = కృష్ణుడు, వివిధ+ఉదయైః = అనేక గుణాల అభ్యుదయంతో (వివిధాశ్చ తే ఉదయాః, తైః), వైగుణ్యమ్ = గుణరాహిత్యాన్ని, నిరస్య = నిరాకరించి (నిర్+అస్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వి మృశతామ్ = తనను (మనసా) పరామర్శించెడి వారియొక్క, విత్తైః = సొమ్ములతో, జగద్+బాధ్యతామ్ = విశ్వంయొక్క బాధింపబడుటను (జగతః బాధ్యతా, తామ్), నిరస్య = నిరాకరించి, నిజ-తేజసా = తన తేజస్సుతో (నిజస్య తేజః, తేన), వైరూప్యమ్ = రూపం లేకపోవటాన్ని (విరూపస్య భావః, తత్), నిరస్య = నిరాకరించి, నిరుపమైః = సాటిలేని (నాస్తి ఉపమా యేషాం తైః), అంగైః = అవయవాలతో, నిరాకారతామ్ = ఆకృతిలేదనటాన్ని, నిరస్య = నిరాకరించి, నిర్మల-ధియామ్ = నిష్కల్మషబుద్ధిగల వారియొక్క (నిర్మలా ధీః యేషాం తేషామ్), నిత్య+అర్చయా = నిత్యపూజచే (నిత్యా చ సా అర్చా, తయా), నీచైక్యమ్ = నీచులతో అద్వైతస్థితిని, నిరస్య = నిరాకరించి, దిగ్... యార్థమ్ : దిగ్+భిన్న = దిక్కులకన్న భిన్నమైన, అంబర = ఆకాశం యొక్క ఉనికిని, ధిక్+క్రియార్థామ్ = నిరాకరించుట కొఱకై, దిగ్+వస్త్రతామ్ = దిగంబరత్వాన్ని (దిక్కులే ఆకాశంగా నిలవటాన్ని), దీపయన్ = ప్రకాశింపజేస్తూ, అభవత్ = నిలిచెను. (భూ సత్తాయామ్ - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు వివిధాలయిన తన అభ్యుదయాలతో విగుణత్వాన్నీ, తనను సేవిస్తున్న వారి సొమ్ములతో విశ్వ బాధ్యతనూ, తన తేజస్సుతో నీరూపత్వాన్నీ, అసాధారణ శరీర సౌందర్యంతో నిరాకారత్వాన్నీ, నిర్మల మనస్కుల నిత్యపూజలతో నీచ (జీవ) సమైక్యాన్నీ, దిగంబరతతో దిక్కుల కన్న భిన్నమైన ఆకాశస్థితినీ నిరాకరిస్తూ ప్రకాశించాడు.

**వి :** 1. ఈ శ్లోకం అద్వైతతత్త్వాన్ని నిరాకరిస్తోంది.

అద్వైత సిద్ధాంతంలో '**బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః**' అన్నది ప్రధానంగా ప్రతిపాద్యవిషయం. దానికి ఉపబలకంగా పరమేశ్వరుని నిరాకార నిర్గుణాది లక్షణాలతో నిర్వచిస్తారు. వాటిని ఖండిస్తూ ఈ శ్లోకం సాగుతోంది.

కృష్ణుడు గోకులంలో అనేకరీతులలో అభ్యుదయ పరంపరను శైశవంలో సాధించాడు కాబట్టి ఆయనను గుణరహితుడు (నిర్గుణుడు) అనటం కుదరదు. తనను మనసా తలచుకొనేవారికి ఐశ్వర్యాన్ని కలిగిస్తున్నాడు. కాబట్టి జగత్తు మిథ్య అన్న సిద్ధాంతాన్ని నిరాకరిస్తున్నాడు. మిథ్యయే అయితే కోరినవారికి కొంగు బంగారం కాగలగటం, ఇతరులకు అది లేక పోవటం కుదరదు గదా! తన తేజస్సుతో రూపరహితుడు పరమాత్మ అన్న భావాన్ని నిరసిస్తున్నాడు. తేజస్సు నవద్రవ్యాలలో ఒకటి. గుణకర్మలకు ఆశ్రయంగా నిలవటం ద్రవ్యలక్షణం. రూపం గుణాలలో ఒకటి. కాబట్టి తేజస్సుద్వారా రూపరాహిత్యాన్ని నిరాకరిస్తున్నాడు. అసమానమైన తన

శరీరాకృతితో అవయవాలతో నిరాకారత్వాన్ని నిరసిస్తున్నాడు. నిర్మల మనస్కుల నిత్యార్చనల ద్వారా నీచైక్యాన్ని – జీవో బ్రహ్మైవ నాపరః – అన్న జీవ బ్రహ్మైక్యతత్త్వాన్నీ నిరసిస్తున్నాడు.

దిక్కులకు భిన్నంగా ఆకాశముంటుందన్న తార్కికవచనాలను దిగంబరత్వం (దిక్కులే ఆకాశమనటం)తో నిరసిస్తున్నాడు.

ఈ రీతిగా అద్వైత సిద్ధాంతాన్ని నిరాకరిస్తూ ద్వైతాన్ని, భక్తిపారమ్యాన్నీ రమణీయంగా ప్రతిపాదిస్తున్న శ్లోకమిది.

2. **అభవత్ :** 3–10వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ గోపీగృహాఙ్గణతలే రణదంఘ్రివేషో – గోవత్సకైః సహచరన్ రజసాఽనుషక్తః ।**
**దేహాభిమానరహితైర్దివి సంస్తువద్భి-ర్దేవైశ్చ దృశ్యవిభవో దయితాసమేతైః ॥ 3–29**

**అ :** బాలకృష్ణుని వ్రజసంచరణ వర్ణనం. –వసంతతిలక.

**అ :** రణదంఘ్రి–వేషః రజసా అనుషక్తః చ గోపీ–గృహాంగణ–తలే గోవత్సకైః సహచరన్ దేహాభిమాన–రహితైః దివి సంస్తువద్భిః దయితా–సమేతైః దేవైః దృశ్య–విభవః (అస్తు అని 31వ శ్లోకంలోని క్రియా (విధేయ) వాక్యం ఇక్కడ అన్వయిస్తుంది.)

**ప్ర :** రణ... వేషః : రణత్ = ధ్వనిస్తున్న (రణోఽస్త్రీ యుధి నా ధ్వనౌ – వైజయన్తీ – నానాలింగ – 68), అంఘ్రి = కాళ్ళయొక్క, వేషః = అలంకరణ గలవాడై (రణన్ అంఘ్ర్యోః వేషః యస్య సః), రజసా = దుమ్ముతో, అనుషక్తః = పూయబడిన వాడై, గోపీ... తలే : గోపీ = గోపకాంతలయొక్క, గృహ = ఇళ్ళయొక్క, అంగణ–తలే = ముంగిళ్ళ ప్రదేశంలో, గో–వత్సకైః సహ = ఆవుదూడలతో కలిసి, చరన్ = తిరుగుతూ (చర ధాతువుపై శతృ ప్రత్యయం), దేహాభిమానరహితైః : దేహ = శరీరం మీది, అభిమాన = స్పృహను, రహితైః = కోల్పోయినవారును (దేహేషు అభిమానం, తేన రహితాః, తైః), దివి = ఆకాశమందు, సంస్తువద్భిః = స్తుతించుచున్న, దయితా–సమేతైః = కాంతలతో గూడిన (దయితాభిః సమేతాః, తైః), దేవైః చ = దేవతలచేత కూడ, దృశ్య–విభవః = చూడబడినవైభవం గల (దృశ్యః విభవః యస్య సః), (సః శిశుః మే సదా హృద్గః అస్తు = ఆ బాలుడెప్పుడు నా మదిలో నిలుచుగాక)

**తా ॥** కృష్ణుడు కాళ్ళకు కడియాలు ధరించాడు. అవి రవళిస్తున్నాయి. శరీరమంతా దుమ్ము కొట్టుకొని వుంది. ఆ రూపంతో గోపకాంతల ముంగిళ్ళలో తిరుగుతున్నాడు. ఆకాశంలో కాంతలతో సహా విహరిస్తూ ఆ దృశ్యాన్ని చూసిన దేవతలు బాలకృష్ణుని ఒళ్ళు మరచి పోతున్నారు. (అటువంటి కృష్ణుడు నా మనస్సులో నిరంతరమూ నిలుచుగాక.)

**వి :** 1. పదరవళులతోడి సంచారాన్ని నారాయణభట్టతిరి – ఆ ధ్వని బలరామకృష్ణులకు మళ్ళీ మళ్ళీ వినాలనిపించి ఇంకా ముందుకు పోతున్నట్లు వర్ణించాడు.

అయి సబలమురారే! పాణిజానుప్రచారైః – కిమపి భవనభాగాన్ భూషయంతౌ భవంతౌ।
చలితచరణకంజౌ మంజుమంజీరశింజా–శ్రవణకుతకభాజౌ చేరతుశ్చారువేగాత్॥ –నారాయణీయమ్–45/1

2. పిల్లలు దుమ్ముకొట్టుకొని వున్నా పెద్దలు మురిపాలు కురిపించకమానరు. పైగా దానిని ఆనందంగా అంగీకరిస్తారు. **అభిజ్ఞానశాకుంతలం**లో భరతుని చూసిన తరువాత తన కొడుకని తెలియకముందే దుష్యంతుని ఆలోచనను గమనించండి–

శ్లో॥ ఆలక్ష్యదన్తముకుళాననిమిత్తహాసై – రవ్యక్తవర్ణరమణీయవచః ప్రవృత్తీన్ ।
అంకాశ్రయప్రణయినస్తనయాన్వహన్తో – ధన్యాస్తదంగరజసా మలినీభవన్తి ॥ – సప్తమాంకం – 18. *

**శ్లో॥ శార్దూలరమ్యనఖరఞ్జితకణ్ఠదేశః - సాసూయదానవనికాయవనే హుతాశః ।**
**హారస్ఫురత్కటకకఙ్కణనూపురశ్రీ-ర్హాసప్రకాశితదిశాపటలః స బాలః ॥ 3-30**

అ : కావ్యమధ్యంలో మంగళాచరణం. -వసంతతిలక.

అ : శార్దూలరమ్యనఖరంజితకంఠదేశః, సాసూయదానవనికాయవనే హుతాశః హారస్ఫుర-త్కటకకంకణనూపురశ్రీః , హాసప్రకాశితదిశాపటలః సః బాలః (సదా హృద్గః అస్తు)

ప్ర : శార్దూల... దేశః : శార్దూల = పులియొక్క, రమ్య = అందమయిన, నఖ = గోటితో, రంజిత = అలంకరింపబడిన, కంఠ-దేశః = మెడగలవాడును (శార్దూలస్య రమ్యేన చ తేన నఖేన రంజితః కంఠస్య దేశః యస్య సః), సాసూయ... వనే : స+అసూయ = తప్పుపట్టెడి స్వభావం గల (సూయా తు దోషారోపో గుణేష్వపి - అమరకోశః - నాట్య - 24), దానవ = రాక్షసుల యొక్క, నికాయ = సమూహమనే, వనే = అడవిలో, హుతాశః = అగ్నియు (అసూయయా సహితాః, సాసూయాః చ తే దానవాః, తేషాం నికాయః, స ఏవ వనం, తస్మిన్), హార... శ్రీః : హార = ముత్యాలపేటలయొక్కయు, స్ఫురతో = ప్రకాశించెడి, కటక = భుజకీర్తులయొక్కయు, కంకణ = గాజులయొక్కయు, నూపుర = కడియాల యొక్కయు, శ్రీః = శోభగలవాడును (హారానాం స్ఫురతాం కటకానాం కంకణానాం నూపురాణాఞ్చ శ్రీః యస్య సః), హాస... పటలః : హాస = నవ్వుతో, ప్రకాశిత = వెలుగొంద జేయబడిన, దిశా = దిక్కులయొక్క, పటలః = సమూహాలు గలవాడును (హాసై ప్రకాశితాః తాశ్చ తాః దిశాః తాసాః పటలం యస్య సః), సః బాలః = ఆ బాలుడు (కృష్ణుడు), (సదా హృద్గః అస్తు = ఎప్పుడూ నాలో నుండుగాక).

తా ॥ కృష్ణుని మెడలో అందమైన పులిగోరు అలంకరింపబడి వుంది. హారాలు, భుజకీర్తులు, గాజులు, కడియాలు వీటితో వెలిగిపోతున్నాడు. రాక్షస సముదాయమనే అడవికి నిప్పులాంటి వాడైన ఆ కృష్ణుడు తన నవ్వుతో దిక్కుల సమూహాన్ని ప్రకాశింపజేస్తున్నాడు. (అటువంటి ఆ బాలకృష్ణుడు నిరంతరమూ నా యెదలో నిలుచుగాక.)

వి : 1. పిల్లలకు రక్షగా పులిగోటిని మెడలో అలంకరించటం అనాదిగా వస్తున్న అలవాటు. పెద్దలకు కూడా అది ఆ తరువాత అలంకారమైంది. ఎలుగుబంటి వెంట్రుకలను కూడా తాయెత్తుగా చేసి పిల్లల చేత ధరింపజేయటం కూడా చాలా ప్రాంతాలలో అలవాటుగా వుంది. గిరిజనులలో చాలా తెగలు దంతం, లేదా లోహాలతో తయారుచేసిన ఆభరణాలతో శరీరంలోని చాలా భాగాన్ని కప్పుకుంటారు. అవి జంతువుల దాడినుండి తమను తాము కాపాడుకోవటానికి రక్షణ కవచాలు. *

**శ్లో॥ నవ్యస్ఖలద్వచననన్దితసర్వలోకః - సువ్యక్తకున్తలతతిః సుభగాగ్రగణ్యః।**
**దిగ్వస్త్రదర్శితకటిర్దినినాథదీప్తిః - హృద్గస్సదాఽస్తు స శిశుర్హృదయఙ్గమో మే ॥ 31**

అ : కావ్యమధ్యంలో చేస్తున్న మంగళాచరణం. -వసంతతిలక.

అ : నవ్యస్ఖలత్+వచననందితసర్వలోకః సువ్యక్తకుంతలతతిః సుభగ+అగ్రగణ్యః, దిక్+ వస్త్ర -దర్శిత-కటిః దిన-నాథ-దీప్తిః హృదయంగమః సః శిశుః సదా మే హృద్గః అస్తు.

ప్ర : నవ్య... లోకః : నవ్య = క్రొత్తవి అయి, స్ఖలత్ = జారుబాటుగా గురి అవుతున్న, వచన=మాటలచే, నందిత = ఆనందింపజేయబడిన, సర్వ = సమస్తమైన, లోకః = జనులు గలవాడునూ (నవ్యం చ తత్ స్ఖలత్ వచనం, తేన నందితః సర్వః లోకః యేన సః), సువ్యక్తః కుంతల తతి : సువ్యక్త = చక్కగా కనిపిస్తున్న, కుంతల = కురుల యొక్క, తతిః = సమూహం గలవాడును (సువ్యక్తా చ సా కుంతలానాం తతిః యస్య సః), సుభగ... గణ్యః : సుభగ = అందగాళ్ళలో, అగ్ర-గణ్యః = ముందుగా లెక్కింపదగిన వాడును (సుభగేషు అగ్రం గణ్యః), దిగ్వ... కటిః : దిగ్వస్త్ర

= దిక్కులే వస్త్రాలు కావటం వలన – దిసమొలతో, దర్శిత = చూపబడిన, కటిః = కటిప్రదేశం (మొల) గల వాడును (దిశః ఏవ వస్త్రమ్ – తేన దర్శితా కటిః యేన సః), దిన–నాథ–దీప్తిః : దిన–నాథ = పగటిరేనియొక్క – సూర్యుని యొక్క, దీప్తిః = వెలుగువంటి వెలుగు గల వాడును (దిననాథస్య దీప్తిరివ దీప్తిః యస్య సః), హృదయంగమః = మనస్సు చొచ్చెడి వాడును అయిన, సః శిశుః = ఆ పసివాడు (కృష్ణుడు), సదా = ఎల్లప్పుడు, మే = నా యొక్క, హృద్+గః = మనస్సులో నిలిచిన వాడుగా, అస్తు = అగుగాక. (అస భువి పరస్మైపది – లోట్ – ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు అప్పుడప్పుడే క్రొత్తమాటలు నేర్చుకొంటున్నాడు. వాటిని పలకటంతో తడబడుతున్నాడు కూడా. కానీ ఆ మాటలే అందరినీ ఆనందింపజేస్తున్నాయి. కురులు అప్పుడప్పుడే పెరుగుతూ చక్కగా కనిపిస్తున్నాయి. తాను అందగాళ్ళలో అగ్రగణ్యుడు (ఇంకా సిగ్గు అనేది తెలియదు) కాబట్టి దిసమొలతోనే తిరుగుతున్నాడు. సూర్యుడిలా వెలిగిపోతూ మనస్సును దోచివేస్తున్నాడు. ఆ శిశువు ఎల్లప్పుడూ నా మనస్సులో నిలుచుగాక!

**వి :** 1. 'కుంతల' పదం కేశబంధవిశేషాలలో ఒకటి అని హలాయుధకోశం చెప్తోంది. 'తద్బంధవిశేషాః స్యుః వేణీ ధమ్మిల్ల కుంతల కబర్యః' (530), వేణి (జడ) ధమ్మిల్లం, కబరి (కొప్పు) కుంతలం కూడా కురులను సవరించుకొనే పద్ధతులలో ఒకటి. కానీ బహుశః సాధారణ కేశార్థంలోనే కుంతల పదాన్ని వాడటం కవి లోకంలో కనిపిస్తుంది. 'అల్కమానవుగదా యికనైన **నరాళకుంతలా**' (పారిజాతాపహరణం). ప్రకృతశ్లోకంలో కూడా బంధవిశేషమని చెప్పటానికి 'తతి' పదం అడ్డుపడుతోంది. కాబట్టి సాధారణకేశార్థాన్ని తీసికోవలసివస్తోంది.

2. పసిపిల్లల వచ్చీరాని మాటలు చూపరులకు ఆనందాన్ని, వినోదాన్నీ కలిగిస్తాయి. ఆ మాటలను నేర్పటం లోనే భావబంధాలు, భవబంధాలు పెంచుతుంటాయి, పెరుగు తుంటాయి. పాండురాజు సంతానం లేకపోవటానికి బాధపడుతూ కుంతితో అంటున్న మాటలు చూడండి–

శ్లో॥ అహం కిమంబా కిమభీష్టతా పదే – తవేతి మాతుర్ధురి తాతపృచ్ఛయా ।
ప్రలోభతుల్యం ప్రవదంతమర్భకం – ముదా హసన్ జిఘ్రతి మూర్ధ్ని పుణ్యభాక్ ॥

(నీకు నేనంటే ఇష్టమా? అమ్మ అంటే ఇష్టమా? అని తండ్రి తల్లి ముందరే అడిగితే ఆ బిడ్డ వాళ్ళు పెట్టే ప్రలోభాలకు తగినట్లు ఇష్టాన్ని మార్చిమార్చి చెబుతుంటాడట. అటువంటి బిడ్డను నవ్వుతూ తలపై ముద్దుపెట్టుకొనే వాడు పుణ్యాత్ముడు గదా!)

నిజానికి అవి ముద్దుమాటలే కాదు. భాషా వ్యాకరణశాస్త్రాలు అక్కడ నుండే పుట్టుకొస్తాయి.

3. దిననాథదీప్తిః – దిననాథస్య **దీప్తిః** ఇవ దీప్తిః యస్య సః – ఇది లుప్తోపమాలంకారం (ఉపమాన లుప్త). దీప్తి వంటి దీప్తి. మొదటి దీప్తి – ఉపమానం – లోపిస్తుంది కాబట్టి ఉపమానలుప్త.

| | | | |
|---|---|---|---|
| 4. **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ. |

*

**శ్లో॥ నారీణామపి మోక్షదః కిమితి నో దద్యా విశుద్ధాత్మనా–**
**మస్మాకం త్వితి యోగిపూగమనసాం కోపం విధున్వన్నివ ।**
**గోపస్త్రీనికరస్య దుగ్ధజలధిం స్వం దాతుకామో హరి–**
**స్తద్గేహస్థితదుగ్ధమణ్డలమథో ముష్ణంశ్చచార వ్రజే ॥** **3–32**

**అ :** కృష్ణుడు గోపకాంతల ఇళ్ళలో పెరుగును దొంగిలించుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అథో నారీణామ్ అపి మోక్ష-దః విశుద్ధాత్మనామ్ అస్మాకం తు కిమితి నో దద్యాః ఇతి యోగి-పూగ-మనసాం కోపం విధున్వన్+ఇవ గోప-స్త్రీ-నికరస్య స్వం దుగ్ధ-జలధిం దాతు-కామః హరిః తద్గేహ-స్థిత-దుగ్ధ-మండలం ముష్ణన్ వ్రజే చచార.

**ప్ర :** అథో = అటు తర్వాత, నారీణామ్+అపి = స్త్రీలకు కూడా, మోక్ష-దః = ముక్తినిచ్చేవాడవు (మోక్షం దదాతి ఇతి), విశుద్ధ+ఆత్మనామ్ = నిర్మలమైన అంతఃకరణంగల, అస్మాకమ్ = మాకు, కిమ్+ఇతి = ఏ కారణం వలన, నో-దద్యాః = ఇవ్వటం లేదు (దా దానే పరస్మైపది - ఆశీర్లిఙ్ - మ.ఏ.), ఇతి = అని పలికే, యోగి... మనసామ్ : యోగి = యోగులయొక్క, పూగ = సమూహాలయొక్క, మనసామ్ = మనస్సుల యొక్క (యోగీనాం పూగః, తేషాం మనాంసి తేషామ్), క్రోధమ్ = కోపాన్ని, విధున్వన్+ఇవ = తొలగిస్తున్నట్లుగా (వి పూర్వక ధూ ధాతువుపై శతృప్రత్యయం), గోప... నికరస్య : గోప-స్త్రీ = గోపకాంతలయొక్క, నికరస్య = సమూహానికి (గోపాశ్చ తాః స్త్రియః, తాసాం నికరః, తస్య), స్వమ్ = తనదైన, దుగ్ధ-జలధిమ్ = పాలకడలిని (దుగ్ధానాం జలధిః, తమ్. జలధిశబ్దాన్ని రూఢిగానే స్వీకరించాలి), దాతు-కామః = ఇవ్వగోరినవాడై (దాతుం కామః యస్య సః), హరిః = కృష్ణుడు, తద్గేహ... మండలమ్ : తద్ = వారి యొక్క, గేహ = ఇళ్ళయందు, స్థిత = ఉన్నట్టి, దుగ్ధ = పాల యొక్క, మండలమ్ = సమూహాన్ని, ముష్ణన్ = దొంగిలిస్తూ (ముష్ ధాతువుపై శతృప్రత్యయం), వ్రజే = గోకులమున, చచార = తిరిగెను (చర గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ။** స్త్రీలకు కూడా మోక్షాన్ని ఇచ్చే కృష్ణుడు మనకెందుకివ్వడని నిర్మలాంతఃకరణం గల యోగిబృందాలు కోపాన్ని ప్రకటిస్తున్నాయట. వాళ్ళకోపాన్ని పోగొడుతున్నట్లుగా కృష్ణుడు తన పాలకడలిని వారికి ఇవ్వబోతున్నట్లుగా ప్రస్తుతం వారి ఇళ్ళలోని పాలను దొంగిలించి ఊరంతా తిరుగుతున్నాడు.

**వి :** 1. **నారీణామపి మోక్షదః** - స్త్రీలకు మోక్షాన్ని ఇచ్చేవాడవు. అద్వైతసిద్ధాంతమాత్రం స్త్రీలకు మోక్షార్హత లేనట్లు భావిస్తుంది. అందుకే ఆదిశంకరులు వివేకచూడామణిలో ప్రారంభంలోనే - జంతూనాం నరజన్మదుర్లభమతః **పుంస్త్వం** తతో విప్రతా - అంటూ నిర్దేశిస్తారు. ప్రాణులలో నరుడుగా పుట్టడం - అందునా మగవాడుగా పుట్టడం - అందునా బ్రాహ్మణుడుగా పుట్టడం అద్వైతభావానికి అవసరమా?

2. **దుగ్ధమండలమ్** - అన్న పదానికి పాలసమూహం అనటం కన్నా పాలకు సంబంధించినవన్నీ - పెరుగు, వెన్న, మీగడ మొదలయినవి అంటే బాగుంటుందేమో!

3. **కోపం విధున్వన్నివ** - ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం వాచ్యంగా కనిపిస్తుంది. స్వం దుగ్ధజలధిం ధాతుకామః - అన్నచోట హేతూత్ప్రేక్ష ధ్వని రూపంగా కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 4. **దద్యాః :** | దద్యాత్ | దద్యాతామ్ | దద్యుః |
| | **దద్యాః** | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ |
| **చచార :** | చచార | చేరతుః | చేరుః |
| | చేరిథ | చేరథుః | చేర |
| | చచార/చచర | చేరివ | చేరిమ. |

*

**శ్లో॥ హరౌ పయో ముష్ణతి కాపి తుష్టా - దధార మర్త్యాయ దదత్యమర్షమ్ ।**
**తథాహి తచ్ఛేషమనన్యయోగ్యం - హరస్తముద్వీక్ష్య కథం న మన్యుః ॥ 3-33**

**అ :** కృష్ణుని బాల్యచేష్టలు – పాలను దొంగిలుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** హరౌ పయః ముష్ణతి (సతి) తుష్టా (సతీ) కాపి మర్కాయ దదతి (సతి) అమర్షం దధార. తథాహి. అనన్యయోగ్యం తచ్ఛేషం హరన్తమ్ ఉద్వీక్ష్య కథం మన్యుః న (భవతి).

**ప్ర :** హరౌ = కృష్ణుడు, పయః = పాలను, ముష్ణతి సతి = దొంగిలిస్తుండగా, తుష్టా = ఆనందించిన (తుష్ ధాతువుపై క్త ప్రత్యయం), కా+అపి = ఒకానొక కాంత, మర్కాయ = పిల్లికి, దదతి సతి = ఇస్తుండగా, అమర్షమ్ = కోపాన్ని, దధార = వహించింది. (ధృ ధారణే పరస్మైపది లిట్ ప్రథమపురుషైకవచనం), తథాహి = అది తగినదే, అనన్య–యోగ్యమ్ = ఇతరులకు యోగ్యతలేని, తత్+శేషమ్ = ఆ మిగిలిన దానిని, హరంతమ్ = ఎత్తుకు వెళుతున్న దానిని, ఉద్వీక్ష్య = చూచి (ఉత్ – వి – ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కథమ్ = ఏ రీతిగా, మన్యుః = కోపం, న = లేకుండును?

**తా ॥** కృష్ణుడు పాలను దొంగిలిస్తుంటే చూస్తూ ఆనందించిన ఒకానొక స్త్రీ ఆ పాలనే పిల్లికి ఇస్తుంటే కోపాన్ని ఆపుకోలేక పోయింది. నిజమే మరి. కృష్ణ భుక్త శేషం ఇతరులకు దక్కరానిది. అటువంటిదాన్ని పిల్లి తీసికొంటుంటే భరించటమెలా?

**వి :** 1. మర్కశబ్దానికి పిల్లి అనే అర్థాన్నిస్తోంది నారాయణాచార్య వ్యాఖ్య. కానీ నిఘంటువులలో ఎక్కడా (నెనెరిగినంత మేర) మర్క శబ్దానికి పిల్లి అనే అర్థం లేదు. కానీ పాలకూ, పిల్లికీ వున్న అవినాభావసంబంధాన్ని బట్టి పిల్లి అనే అర్థాన్ని పూర్వవ్యాఖ్యానాన్ని అనుసరిస్తూ ఇవ్వవలసి వచ్చింది. ఇంకా నిఘంటుశోధన అవసరం. లేదా క్రొత్తగా చేర్చుకోవాలి మార్జారార్థాన్ని కూడా.

2. ఇష్టమైన వారి భుక్త శేషానికి ప్రత్యేకమైన ప్రతిపత్తి – విలువ వుంటాయి. "**కిం భుంక్తే భువనత్రయే ధృతిరసౌ భుక్తోజ్ఝితే యా గురోః**" అంటాడు జీమూతవాహనుడు నాగానంద నాటకంలో. కాబట్టి కృష్ణ భుక్త శేషాన్ని పిల్లి తీసికోవటం గోపిక భరించలేదు.

3. ఇక్కడ కావ్యలింగాలంకారం కనిపిస్తోంది. కృష్ణుడు దొంగతనం చేస్తే ఆనందించిన గోపిక మిగిలిన దానిని పిల్లి త్రాగితే కోపపడటాన్ని సమర్థించవలసి వస్తోంది. కాబట్టి సమర్థన అవసరమైనచోట సమర్థన చేస్తే అది కావ్యలింగాలంకారం. (**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్** – కు. 121).

| | | | |
|---|---|---|---|
| 4. **దధార :** | **దధార** | దధ్రతుః | దధ్రుః |
| | దధర్థ | దధ్రథుః | దధ్ర |
| | దధార/దధర దధ్రివ | దధ్రిమ. | * |

**శ్లో॥ ప్రగృహ్య ఘణ్టామపరేణ పాత్రం – కరేణ చాన్యేన పయః పిబన్తమ్ ।**
**నిశామ్య మిత్రాణి చ తర్పయన్తం – సువిస్మితా కాపి బభూవ తూష్ణీమ్ ॥ 3–34**

**అ :** కృష్ణుడు చతుర్భుజుడుగా గోపకాంతను ఆశ్చర్యానికి గురిచేయటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** కా అపి ఏకేన కరేణ ఘంటాం ప్రగృహ్య అపరేణ పాత్రం ప్రగృహ్య అన్యేన కరేణ పయః పిబన్తమ్, అపరేణ కరేణ మిత్రాణి తర్పయన్తం చ నిశామ్య సువిస్మితా తూష్ణీమ్ బభూవ.

**ప్ర :** కా+అపి = ఒకర్తుక, ఏకేన = ఒక, కరేణ = చేతితో, ఘంటామ్ = ఘంటను, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర–గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అపరేణ (కరేణ) = మరొక చేతితో, పాత్రమ్ = పాత్రను (కుండను), అన్యేన కరేణ = ఇంకొక చేతితో, పయః = పాలను, పిబన్తమ్ = త్రాగుతూ, అపరేణ కరేణ = వేరొక చేతితో, మిత్రాణి = స్నేహితులను, తర్పయన్తమ్ = (పాలతో) తృప్తి పరుస్తున్న కృష్ణుని, నిశామ్య = చూచి (ని–శమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సు

విస్మితా = చాలా ఆశ్చర్యానికి లోనై, తూష్ణీమ్ = స్పందన లేనిదిగా, బభూవ = అయ్యేను. (భూ సత్తాయామ్ లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఒకచేత్తో ఒకఘంటను పట్టుకొని, ఇంకొక చేత్తో గిన్నె పట్టుకొని, మరొక చేతితో పాలు త్రాగుతూ, ఇంకొక చేత్తో తన మిత్రులకు పాలు త్రాగిస్తున్నాడు. ఆ దృశ్యాన్ని చూసిన ఒక గోపిక పరమాశ్చర్యానికి లోనై మిన్నకుండిపోయింది.

**వి :** 1. చతుర్భుజుడైన శ్రీహరి కృష్ణుడుగా రెండు చేతులతో పుట్టాడు. ఇప్పుడు తన లీలా ప్రదర్శనలో భాగంగా నాలుగు చేతులతో నాలుగు పనులు చేస్తూ, గోపకాంతకు కనిపించాడు. ఇది ఆయన పూర్వ రూపం. దానిని పూర్వరూపాలంకార మంటారు. "**పునః స్వగుణసంప్రాప్తిః పూర్వరూపముదాహృతమ్**" (కు. 142), కోలుపోయిన గుణాన్ని తిరిగి పొందటం. అయితే ఇక్క డిది తాత్కాలికం.

2. **బభూవ :** 3–26వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ కరస్థభాస్వన్నవనీతమన్యా – విభీషయన్త్యన్వగమన్ముకున్దమ్ ।**
**స్వమౌళిమాలాచ్యుతపుష్పపుఞ్జైః – పదాని తస్యేశితురర్చయన్తీ ॥ 3–35**

**అ :** నవనీతచోరునకు శిరసావహించిన పూలతో పదార్చన. –ఉపేంద్రవజ్ర.

**అ :** అన్యా కర–స్థ–భాస్వన్నవనీతమ్ ముకుందం విభీషయన్తీ స్వ–మౌళి–మాలా–చ్యుత–పుష్ప–పుంజైః ఈశితుః తస్య పదాని అర్చయన్తీ అన్వగమత్.

**ప్ర :** అన్యా = మరొకస్త్రీ, కర–స్థ–భాస్వత్+నవనీతమ్ : కర–స్థ = చేతిలోనున్న, భాస్వత్ = ప్రకాశించెడి, నవనీతమ్ = వెన్నగల (కరస్థం చ తత్ భాస్వత్ నవనీతం యస్య, తమ్), ముకుందమ్ = కృష్ణుని, విభీషయన్తీ = భయపెట్టుచున్నదై, స్వమౌళి... పుంజైః : స్వ = తన యొక్క, మౌళి = తలమీది, మాలా = పూలమాలనుండి, చ్యుత = జారిన, పుష్ప = పూలయొక్క, పుంజైః = సమూహాలతో (స్వస్య మౌళౌ విద్యమానా మాలా, తస్యాః చ్యుతానాం పుష్పాణాం పుంజైః), ఈశితుః = ప్రభువైన, తస్య = ఆ కృష్ణుని యొక్క, పదాని = కాళ్ళను, అర్చయన్తీ = పూజిస్తూ, అను+అగమత్ = అనుసరించింది. (అను+గమ్ గతౌ – పరస్మైపది – లుఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు చేతిలో వెన్నముద్ద పెట్టుకొని పారిపోతుంటే ఒకగోపకాంత బెదిరిస్తూ తరుముతోంది. అప్పుడు ఆమె తలలోని పూలమాలనుండి పువ్వులు జారి ఆ కృష్ణుని పాదాలపై పడుతున్నాయి. అది గోపకాంత కృష్ణుని అర్చించినట్లుంది.

**వి:** 1. ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న విను మే మునుఁదా ల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము మున్ను గొంటి నే
వ న్ననదండయొక్క మగవాఁడిడ నేను దెలుంగురాయడఁన్
గన్నడరాయ యక్కొదువఁ గప్పు ప్రియాపరిభుక్తభాక్కథన్. –ఆముక్తమాల్యద 1/14

అని తెలుగు వల్లభరాయడు అడిగిమరీ రాయలు చేత తనకథ వ్రాయించుకొన్నాడు. అదే ఆముక్తమాల్యద. ఇప్పుడీ గోపకాంత తలలో ధరించిన పూలమాలతో కృష్ణ పదార్చన చేయగలిగింది తెలిసో తెలియకో. ఆ ఫలమెంతవుతుందో!

| 2. **అను+అగమత్ :** | **అన్వగమత్** | అన్వగమతామ్ | అన్వగమన్ |
|---|---|---|---|
| | అన్వగమః | అన్వగమతమ్ | అన్వగమత |
| | అన్వగమమ్ | అన్వగవావ | అన్వగవామ. |

3. విభీషయన్న్యన్వగమన్ముకుందమ్ - శైలి కృష్ణునికి చాలా దగ్గరగానే పరిగెత్తుతూ తరుముతున్నట్లుంది. *

**శ్లో॥ అధిక్షిపన్త్యాం సుకృతేన సాకం - దధీని ధీరః స చుచోర చోరః ।**
**అగణ్యపుణ్యాఖ్యధనాని దానీ - ప్రదాయ సోఽచూచురదానతాయామ్ ॥ 3-36**

**అ :** కృష్ణుడు అనుగ్రహిస్తే అగణ్యపుణ్యప్రాప్తి, ఆగ్రహిస్తే స్థితపుణ్యవినాశ మని ప్రకటించటం.-ఉపేంద్రవజ్ర.

**అ :** సః ధీరః చోరః అధిక్షిపంత్యాం (సత్యాం) సుకృతేన సాకం దధీని చుచోర. ఆనతాయాం (సత్యాం) దానీ సః అగణ్యపుణ్యాఖ్యధనాని ప్రదాయ అచూచురత్.

**ప్ర :** సః = ఆ, ధీరః = ధీరుడైన, చోరః = దొంగ, అధిక్షిపన్త్యామ్ (సత్యామ్) = (ఎవరో ఒకతె) తనను వ్యతిరేకించగా/ దూషించగా, సుకృతేన సాకమ్ = (ఆమె) పుణ్యంతో సహా (సాకం సార్ధం సమం సత్రం సహార్థే - హలాయుధకోశః - 877), దధీని = పెరుగులను, చుచోర = దొంగిలించాడు. (చుర స్తేయే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), దానీ-సః = దానశీలతగల ఆ కృష్ణుడు, ఆనతాయామ్ = తలవంచిన స్త్రీకి, అగణ్య... ధనాని : అగణ్య = లెక్కింపరాని, పుణ్య+ఆఖ్య = పుణ్యమను పేరుగల, ధనాని = సొమ్ములను, ప్రదాయ = ఇచ్చి (ప్రపూర్వక దా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అచూచురత్ = దొంగిలించాడు. (చుర స్తేయే పరస్మైపది - లుఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు పెరుగు తినబోయే సమయంలో ఎదిరించిన గోపకాంతయొక్క సుకృతంతో పాటు పెరుగును దొంగిలించాడు. తనను మన్నించిన గోపకాంతకు అగణ్యపుణ్యధనాలను ఇచ్చి, పెరుగు దొంగిలించాడు.

**వి :** 1. కృష్ణతత్త్వాన్ని వ్యతిరేకిస్తే సర్వస్వం కోల్పోతామనీ కృష్ణతత్త్వాన్ని అంగీకరిస్తే సమస్తాన్నీ పొందగలమనీ ఇక్కడ ధ్వని.

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ - భగవద్గీత 9/22

2. ఇక్కడ సహోక్త్యలంకారం. "**సహోక్తిస్సహభావశ్చేద్భాసతే జనరంజనః**" (కు.58), అందమైన సహభావాన్ని చెప్తే సహోక్తి. ఇక్కడ సుకృతంతో పాటు పెరుగును కూడా దొంగిలించటం సహభావం.

| | | | |
|---|---|---|---|
| 3. **చుచోర :** | **చుచోర** | చుచోరతుః | చుచోరుః |
| | చుచోరిథ | చుచోరథుః | చుచోర |
| | చుచోర | చుచోరివ | చుచోరిమ |
| **అచూచురత్ :** | **అచూచురత్** | అచూచురతామ్ | అచూచురన్ |
| | అచూచురః | అచూచురతమ్ | అచూచురత |
| | అచూచురమ్ | అచూచురావ | అచూచురామ. |

*

**శ్లో॥ అభూద్యశోదాతనయస్య పృథ్వ్యాం - వినిన్దితా తస్కరతాఽపి భూత్యై ।**
**తథాహి లక్ష్మీనయనాన్తభాజా-మసహ్యదోషోఽపి భవేద్గుణాయ ॥ 3-37**

**అ :** కృష్ణుడు చేసే దొంగతనాలు, ఆయనపై చేసే ఆరోపణలు శుభప్రదాలే. -ఉపేంద్రవజ్ర.

**అ :** పృథ్వ్యాం వినిందితా అపి యశోదా-తనయస్య తస్కరతా భూత్యై అభూత్. తథాహి. లక్ష్మీ-నయనాంత-భాజామ్ అసహ్య-దోషః అపి గుణాయ భవేత్.

**ప్ర :** పృథ్వ్యామ్ = లోకంలో, వినిందితా+అపి = నిందింపబడిననూ, యశోదా-తనయస్య = కృష్ణునియొక్క (యశోదాయాః తనయః, తస్య), తస్కరతా+అపి = దొంగతనం కూడా (తస్కరస్య భావః తస్కరతా), భూత్యై = సంపదకే, అభూత్ = అయ్యెను. తథా - హి = అది తగినదే. లక్ష్మీ... భాజామ్ : లక్ష్మీ = రమయొక్క, నయన+అంత = కనుకొనలను, భాజామ్ = సేవించే వారికి (లక్ష్మ్యాః నయనయోః అంతౌ భజంతి ఇతి, తేషామ్), అసహ్య-దోషః+అపి = అసహ్యించుకొనబడుట అనే దోషం కూడా, గుణాయ = సత్ఫలితాలకే, భవేత్ = కాగలదు.

**తా ॥** యశోదకొడుకైన కృష్ణుని దొంగతనం దోషారోపణలకు గురి అయినా అది సంపదలకే కారణమైంది. అది యుక్తమే. లక్ష్మికనుగొనులను ఆశ్రయించినవారికి అసహ్యమనే దోషం కూడా గుణంగానే పరిణమిస్తుంది.

**వి :** 1. నిందింపదగిన చౌర్యం (దొంగతనం) సంపదలకే కారణమైనదనీ, లక్ష్మీకటాక్షంలో నిలిచిన వారికి అసహ్యదోషం కూడా గుణమే అవుతుందనీ, దోషాలకు గుణత్వాన్ని ఆపాదించటం లేశాలంకారం. '**లేశః స్యాద్ దోషగుణయోః గుణదోషత్వకల్పనమ్**' (కు.138) దోషాలను గుణాలుగా, గుణాలను దోషాలుగా చిత్రించటం లేశాలంకారం.

శ్లోకంలో పూర్వార్ధంలోని విశేష విషయాన్ని, ఉత్తరార్ధంలోని సామాన్య విషయంతో సమర్థించటం అర్థాంతరన్యాసాలంకారం.

అయితే ఈ రెండింటికీ అన్యోన్యాశ్రితత్వం లేదు కాబట్టి అలంకారసంసృష్టి.

2. ఏ రూపంగా నయినా కృష్ణునితో సంబంధం కళ్యాణ కారకమని కవి తాత్పర్యం. ఆ రూపభేదం కృష్ణునకు సంబంధించినది భక్తునికి సంబంధించినది కాదు.

| | | | |
|---|---|---|---|
| 3. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **భవేత్ :** | **భవేత్** | భవేతామ్ | భవేయుః |
| | భవేః | భవేతమ్ | భవేత |
| | భవేయమ్ | భవేవ | భవేమ. |

*

**శ్లో॥ స్వకీయచౌర్యం నితరాం గృణద్భ్యో - దదౌ విముక్తిం కిల గోపబాలః ।**
**అహం స్వమర్మాలపతాం స చక్రే - ఫలేన వాగ్బంధమితి ప్రతర్కే ॥ 3-38**

**అ :** నిందించిన వారికి కూడా కృష్ణుడు ముక్తినివ్వటాన్ని ప్రస్తుతించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** గోప-బాలః స్వకీయ-చౌర్యం నితరాం గృణద్భ్యః విముక్తిం దదౌ కిల. అహం సః స్వమర్మ ఆలపతాం వాగ్బంధం ఫలేన చక్రే ఇతి ప్రతర్కే.

**ప్ర :** గోప-బాలః = గోపాలకుడైన నందుని కొడుకు (గోపస్య బాలః), స్వకీయ చౌర్యమ్ : స్వకీయ = తన యొక్క, చౌర్యమ్ = దొంగతనాన్ని గూర్చి (స్వకీయం చ తత్ చౌర్యం చ, తత్), నితరామ్ = ఎక్కువగా, గృణద్భ్యః = మాటాడేవారికి (గౄ శబ్దే ధాతువుపై శతృ ప్రత్యయం), విముక్తిమ్ = మోక్షాన్ని, దదౌ కిల = ఇచ్చాడు గదా! (దా దానే పరస్మైపది లిట్ ప్ర.ఏ.), అహమ్ = నేను, సః = ఆ కృష్ణుడు, స్వ-మర్మ : స్వ = తన యొక్క, మర్మ = తత్త్వాన్ని గురించి (హలాయుధకోశః - పుట 519), (స్వస్య మర్మ), ఆలపతామ్ = మాటాడుతున్న వారికి, ఫలేన = ఫలితమివ్వటం ద్వారా, వాగ్+బంధమ్ = నోరు మూయించటం (వాచాం బంధః, తమ్), చక్రే = చేసెను. (కృ కరణే - ఆత్మనేపది

– లిట్ – (ప్ర.ఏ.), ఇతి = అని, ప్రతర్కే = ఊహిస్తున్నాను. (ప్ర+తర్క్ తర్కే – ఆత్మనేపది – లట్ – ఉ.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన చోరతత్త్వాన్ని గురించి ఎక్కువగా మాటాడేవారికి కూడా విముక్తిని (మోక్షాన్ని) ప్రసాదించాడు. తన తత్త్వాన్ని గురించి పలుకుతున్నవారికి మాటలతో కాకుండా చేతలతోనే ఫలితాన్ని ఇచ్చి వారి నోరు మూయించాడని నేను ఊహిస్తున్నాను.

**వి :** 1. మాటాడేవారి నోరు మూయించటం ప్రతిక్రియ. కానీ వారికి సత్ఫలాన్ని ఇచ్చి నోరు మూయించటం ఉత్తమ ప్రతిక్రియ.

2. వాగ్బంధాన్ని కవి భావిస్తున్నందువలన (ప్రతర్కే) ఇది ఉత్ప్రేక్షాలంకారం. ప్రతర్కే పదం కూడా 'మన్యే,శంకే...' మొదలయిన పదాలలాగా ఉత్ప్రేక్షావ్యంజకమే.

| | | | |
|---|---|---|---|
| 3. **దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః |
| | దదిథ/దదాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ |
| **ప్రతర్కే :** | ప్రతర్కతే | ప్రతర్కేతే | ప్రతర్కన్తే |
| | ప్రతర్కసే | ప్రతర్కేథే | ప్రతర్కధ్వే |
| | **ప్రతర్కే** | ప్రతర్కావహే | ప్రతర్కామహే. |

*

**శ్లో॥ స్వభక్తపుఞ్జార్జితపాపవృన్దం – దివానిశం యో హరతి స్మ బాలః ।**
**గృహే గృహే దుగ్ధమసావముష్ణా – త్తథాహి కస్త్యక్ష్యతి సిద్ధవిద్యామ్ ॥ 3-39**

**అ :** కృష్ణునకు చౌర్యాన్ని సిద్ధవిద్యనుగా ప్రకటించి విశ్లేషించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** యః బాలః స్వ–భక్త–పుంజార్జిత–పాప–వృందం దివానిశం హరతి స్మ అసౌ గృహే గృహే దుగ్ధమ్ అముష్ణాత్. తథాహి సిద్ధ–విద్యాం కః త్యక్ష్యతి.

**ప్ర :** యః బాలః = ఏ బాలుడు (కృష్ణుడు), స్వభక్త... వృందామ్ : స్వ = తనయొక్క, భక్త = భక్తులయొక్క, పుంజ = సమూహాలచేత, ఆర్జిత = సంపాదింపబడిన, పాప = పాపాలయొక్క, వృందమ్ = సమూహాన్ని (స్వస్య భక్తాః, తేషాం పుంజాః, తైః ఆర్జితాని చ తాని పాపాని, తేషాం వృందమ్, తత్), దివా–నిశమ్ = పగలూ రేయి కూడా (దివా చ అహశ్చ తయోః సమాహారః), హరతి స్మ = అపహరించెనో (**'లిట్ స్మేచ'** అష్టాధ్యాయి 3/2/118) హృ హరణే పరస్మైపది – లిట్ – (ప్ర.ఏ.), అసౌ = ఆ కృష్ణుడు, గృహే గృహే = ఇంటింటా, దుగ్ధమ్ = పాలను, అముష్ణాత్ = దొంగిలించెను. (ముష్ స్తేయే పరస్మైపది – లఙ్ – (ప్ర.ఏ.), తథా హి = అది తగినదే, సిద్ధ – విద్యామ్ = చేత చిక్కిన విద్యను (సిద్ధా చ సా విద్యా – తామ్), కః = ఎవడు, త్యక్ష్యతి = విడువగలడు? (త్యజ్ హానౌ – లృట్ – (ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన భక్తులు ఆర్జించిపెట్టుకొన్న పాపాల కుప్పలను పగలూ, రేయీ అపహరిస్తుంటాడు. కాబట్టి గోకులంలో ఇంటింటా పాలను దొంగిలించాడు. నిజమే మరి. చేతచిక్కిన విద్యను ఎవడు వదులు కుంటాడు?

**వి :** 1. భక్తుల పాపాలను హరించటం మహావిద్య. పాలను దొంగిలించటం స్వల్పకృత్యం. మహాకార్యసిద్ధి పొందినవాడికి చిన్న పని ఎంత అని వస్తుధ్వని.

2. శ్రీకృష్ణుడు ఇంటింటా పాలుదొంగిలించటమనే విశేష విషయాన్ని, సిద్ధవిద్యను వదలకపోవటమన్న సామాన్యవిషయంతో సమర్థించినందువలన ఇది అర్థాంతర న్యాసాలంకారం. **'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః'** (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **హరతి :** | **హరతి** | హరతః | హరన్తి |
| | హరసి | హరథః | హరథ |
| | హరామి | హరావః | హరామః |
| **అముష్ణాత్ :** | **అముష్ణాత్** | అముష్ణీతామ్ | అముష్ణన్ |
| | అముష్ణాః | అముష్ణీతమ్ | అముష్ణీత |
| | అముష్ణామ్ | అముష్ణీవ | అముష్ణీమ |
| **త్యక్ష్యతి :** | **త్యక్ష్యతి** | త్యక్ష్యతః | త్యక్ష్యంతి |
| | త్యక్ష్యసి | త్యక్ష్యథః | త్యక్ష్యథ |
| | త్యక్ష్యామి | త్యక్ష్యావః | త్యక్ష్యామః. |

*

**శ్లో॥ హస్తః కిం నవనీతభాజనముఖే న్యస్తస్త్వయా శ్రీపతే!**
**దృప్తప్రస్తరసమ్మితాతికఠినావస్థాంతారాయా గృహే ।**
**యుక్తా న స్థితిరస్య కోమలహృదస్తత్తన్వి! చిత్తే మమ**
**ప్రీత్యా స్థాపయితుం మృగాక్షి! మృదునీత్యుక్త్వా హసన్ పాత్వసౌ ॥ 3-40**

**అ :** ఒక గోపకాంత ప్రశ్న - కృష్ణ సమాధానం - కవి ముక్తాయింపు. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** శ్రీపతే! త్వయా నవనీత-భాజన-ముఖే హస్తః కిం న్యస్తః? దృప్త-ప్రస్తర-సమ్మితాతి కఠినావస్థాంతరాయాః గృహే కోమలహృదః అస్య స్థితిః న యుక్తా తత్ తన్వి! మృగాక్షి! మృదుని మమ చిత్తే ప్రీత్యా స్థాపయితుమ్ ఇతి ఉక్త్వా హసన్ అసౌ పాతు.

**ప్ర : గోపకాంత** : శ్రీపతే = ఓ కృష్ణా! (శ్రియః పతిః, తస్మాత్ సంబుద్ధిః), త్వయా = నీ చేత, నవ... ముఖే : నవనీత = వెన్న నుంచుకొనే, భాజన = గిన్నె యొక్క, ముఖే = లోనికి (నవనీతస్య భాజనం, తస్య ముఖం, తస్మిన్), హస్తః = చేయి, కిమ్? = ఎందులకు, న్యస్తః = ఉంచబడినది? (ని+అస్ ధాతువుపై క్త ప్రత్యయం),
**కృష్ణుడు** : దృప్త... రాయాః : దృప్త = బండబారిన, ప్రస్తర = పాషాణంతో, సమ్మిత = సమానమైన, అతికఠిన = మరీ కఠినమైన, అవస్థా = పరిస్థితి గల, అంతరాయాః = మనస్సుగలదాని యొక్క (దృప్తా పాషాణసదృశా అతికఠినా చ అవస్థా యస్య, తత్ చ అంతరం చ యస్యాః, తస్యాః), గృహే = ఇంటిలో, కోమల-హృదః = సున్నితమైన మనస్సుగల (కోమలం హృత్ యస్య తస్య), అస్య = ఈ వెన్న యొక్క, స్థితిః = నిలకడ (స్థా ధాతువుపై క్తిన్ ప్రత్యయం), న-యుక్తా = తగదు, తత్ = కాబట్టి, మృగ+అక్షి = లేడి కన్నులు గలదానా! తన్వి! = కాంతా!, మృదుని = మృదువయిన, మమ = నా యొక్క, చిత్తే = హృదయంలో, ప్రీత్యా = ప్రేమతో, స్థాపయితుమ్ = నిలపటానికి, ఇతి = అని, ఉక్త్వా = పలికి (వచ ధాతువుపై క్త్వా ప్రత్యయం), హసన్ = నవ్వుతున్న (హస్ ధాతువుపై శతృ ప్రత్యయం), అసౌ = ఆ కృష్ణుడు, పాతు = కాపాడును గాత! (పా - రక్షణే - పరస్మైపది - లోట్ - ప్ర.ఏ.).

**తా ॥** 'శ్రీపతీ! నువ్వు వెన్న గిన్నెలో చెయ్యి ఎందుకు పెట్టావు?' గోపస్త్రీ ప్రశ్న. 'బండలాగా కఠినమైన మనస్సుగల దాని ఇంటిలో సున్నితమయిన మనస్సుగల వెన్న వుండటం తగదని మృదువయిన నా మనస్సులో ప్రేమతో నిలుపుకోవాలని దాన్ని తీస్తున్నాను' అని నవ్వుతూ చెప్తున్న కృష్ణుడు కాపాడును గాత!

**విశే :** 1. '**సాదృశ్యాత్ లక్షణా వక్రోక్తిః**' అని వామనుడు చెప్పిన వక్రోక్త్యలంకార లక్షణం. (కావ్యాలంకార సూత్రాణి 4-3-8) సాదృశ్య లక్షణ ద్వారా చేతన లక్షణాలను అచేతనాలలో ప్రతిక్షేపించటం వక్రోక్తి. '**కోమలహృదః**' - అని వెన్నను కోమలమైన మనస్సు గలదని వర్ణించటం వక్రోక్తి.

వెన్నను దొంగిలించటమనే తన చేష్టకు మరేదో కారణం చెప్పాలని కృష్ణుడు చేసే ప్రయత్నం వ్యాజోక్త్యలంకారం. '**వ్యాజోక్తిరన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్**' (కు. 153) అసలు కారణాన్ని కప్పిపుచ్చి మరో కారణం చెప్పటం వ్యాజోక్తి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **పాతు :** | **పాతు**/పాతాత్ | పాతామ్ | పాన్తు | |
| | పాహి/పాతాత్ | పాతమ్ | పాత | |
| | పాని | పావ | పామ. | * |

**శ్లో॥ యస్య శ్రీచరణామ్బుజేన శకటస్సంచూర్ణితాఙ్గో౽భవత్**
**తస్యాఙ్గే మృదుతా న యుక్తిసహితేత్యుక్తే ముదా యో౽వదత్ ।**
**బాల్యే మామధిరోప్య వక్షసి శిశుం సన్నర్తయన్త్యాస్తవ**
**స్థూలోరోజసమాగమేన తదితి ప్రౌఢిం స దద్యాన్మమ ॥ 3-41**

**అ :** పూర్వశ్లోకంలోని సంవాదానికే ఇది కొనసాగింపు. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యస్య శ్రీ–చరణాంబుజేన శకటః సంచూర్ణితాంగః అభవత్ తస్య అంగే మృదుతా న యుక్తి–సహితా ఇతి (తయా) ఉక్తే బాల్యే శిశుం మాం వక్షసి అధిరోప్య సన్నర్తయంత్యాః తవ స్థూలోరోజ–సమాగమేన తత్ ఇతి ముదా యః అవదత్ సః మమ ప్రౌఢిం దద్యాత్ ।

**ప్ర :** యస్య = ఎవని యొక్క, శ్రీ... జేన : శ్రీ = శోభావంతమైన, చరణ+అంబుజేన = తామరవంటి కాలితో, శకటః = శకటాసురుడు, సంచూర్ణిత+అంగః = పొడిచేయబడిన శరీర భాగాలు గలవాడు (సంచూర్ణితాని అంగాని యస్య సః), అభవత్ = అయ్యెనో, తస్య = ఆ నీ యొక్క, అంగే = శరీరంలో, మృదుతా = కోమలత్వం (ఉండటం), యుక్తి – సహితా = హేతుబద్ధం (యుక్త్యా సహితా), న = కాదు, ఇతి = అని, ఉక్తే = (ఆమెచే) చెప్పబడగా, బాల్యే = చిన్నతనంలో, శిశుమ్ = పసివాడనైన, మామ్ = నన్ను, వక్షసి = రొమ్ముపై, అధిరోప్య = ఎక్కించుకొని, సత్+నర్తయంత్యాః = చక్కగా ఆడిస్తున్న, తవ = నీ యొక్క, స్థూలో... మేన : స్థూల = లావైన, ఉరః+జ = స్తనాలతో, సమాగమేన = కలయికతో (వలన) (స్థూలే చ తౌ ఉరోజౌ, తయోః సమాగమః, తేన), తత్ = అది, ఇతి = అని, ముదా = ఆనందంతో, యః = ఎవడయితే, అవదత్ = చెప్పెనో, సః = ఆ కృష్ణుడు, మమ = నాకు, ప్రౌఢిమ్ = (కవితా సంబంధమైన) ప్రౌఢిమను, దద్యాత్ = ఇచ్చును గాక!

**తా ॥** నీ చరణాంబుజం శకటాసురుణ్ణి చూర్ణం చేయగలిగింది. అటువంటి నీ శరీరంలో మృదుత్వముందనడం యుక్తియుక్తం కాదు అన్నది గోపకాంత. దానికి కృష్ణుడేమి బదులిచ్చాడంటే 'నా పసితనంలో నన్ను నీరొమ్ముపైకి ఎక్కించుకొని ఆడించావు. ఆ నీస్తన స్పర్శచేత కాలికి కఠినత్వం అబ్బింది' అని. అలా నవ్వుతూ చెప్తున్న కృష్ణుడు కాపాడు గాత.

**వి :** 1. పసితనంలో తనను గుండెలపైకి ఎక్కించుకొని ఆడించటం వలన నీ స్తనస్పర్శ కారణంగా కాళ్ళకు కాఠిన్యమబ్బింది అనటం తద్గుణాలంకారం. తనకు సహజలక్షణం కోమలత్వం. స్తనస్పర్శవలన మృదుత్వప్రాప్తి. తనగుణాన్ని వదలి అన్యగుణాన్ని స్వీకరించటం. కాబట్టి ఇది తద్గుణాలంకారం. '**తద్గుణః స్వగుణ త్యాగాదన్యదీయగుణగ్రహః**' (కు. 141)

2. స్తనస్పర్శలన కాఠిన్యమబ్బినా సహజలక్షణం మాత్రం కరుణామయత్వమే. అందుకే

శరణం భవ కరుణాం మయి – కురు దీనదయాళో
కరుణారసవరుణాలయ – కరిరాజకృపాళో ॥ – తరంగాలు – అని ఆయనకు నిత్యకీర్తనలు.

| | | | |
|---|---|---|---|
| 3. **అభవత్ :** | **అభవత్** | అభవతామ్ | అభవన్ |
| | అభవః | అభవతమ్ | అభవత |
| | అభవమ్ | అభవావ | అభవామ |
| **అవదత్ :** | **అవదత్** | అవదతామ్ | అవదన్ |
| | అవదః | అవదతమ్ | అవదత |
| | అవదమ్ | అవదావ | అవదామ |
| **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ. |

*

**శ్లో॥ బధ్నామ్యద్య భవంతమంగ! కితవం సాధ్యం తతః కిం ప్రియే!**
**దుగ్ధానాం పరిరక్షణం కపటసన్నద్ధే నిబద్ధే త్వయి ।**
**ముగ్ధే! త్వం విరసా సముజ్ఝసి పరం స్నిగ్ధం న తన్మాం త్యజేత్**
**పద్మాక్షీత్యబలాముదీర్య వశయన్ బుద్ధిం స దద్యాన్మమ ॥ 3-42**

**అ :** అంగ! కితవమ్ అద్య భవంతం బధ్నామి ప్రియే! తతః సాధ్యం కిమ్? కపటసన్నద్ధే త్వయి నిబద్ధే (సతి) దుగ్ధానాం పరిరక్షణమ్. ముగ్ధే! విరసాత్వం సముజ్ఝసి పరం స్నిగ్ధం (దుగ్ధం) తత్ మాం న త్యజేత్ పద్మాక్షి!. ఇతి అబలామ్ ఉదీర్య వశయన్ సః మమ బుద్ధిం దద్యాత్.

**ప్ర : గోపకాంత** : అంగ = అయ్యో! అద్య = ఈనాడు, కితవమ్ = ధూర్తుడవైన, భవంతమ్ = నిన్ను, బధ్నామి = బంధిస్తాను (బంధ్ బంధనే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**కృష్ణుడు** : ప్రియే! = చెలీ!, తతః = నన్ను బంధించిన తర్వాత, సాధ్యం కిమ్? = ఏం సాధిస్తావు?

**గోపకాంత** : కపట–సన్నద్ధే = కపటమైన ఏర్పాటు గల (కపటాః సన్నద్ధాః యస్య తస్మిన్), త్వయి = నువ్వు, నిబద్ధే = బంధింపబడగా, దుగ్ధానామ్ = పాలయొక్క, పరిరక్షణమ్ = కాపాడుట, (భవతి = జరుగుతుంది).

**కృష్ణుడు** : ముగ్ధే = ముద్దరాలా, త్వమ్ = నువ్వు, విరసా = రసదృష్టిలేనిదానవు, పరమ్ = చాలా, స్నిగ్ధమ్ = స్నేహశీలతగల నన్ను, సముజ్ఝసి = వీడుతున్నావు (సమ్ – ఉజ్ఝ – ఉత్సర్గే – పరస్మైపది – లట్ – మ.ఏ.), పద్మ+అక్షి = తామరకనులుదానా! తత్ = ఆ పాలు, మామ్ = నన్ను, న త్యజేత్ = వీడదు (త్యజ్ – హానౌ – పరస్మైపది – విధిలిఙ్ – ప్రథమపురుషైకవచనం), ఇతి = అని, అబలామ్ = ఆ స్త్రీతో, ఉదీర్య = చెప్పి (ఉత్ – ఈర్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వశయన్ = లొంగ దీసుకొంటూ (వశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), సః = ఆ కృష్ణుడు, మమ = నాకు, బుద్ధిమ్ = బుద్ధిని, దద్యాత్ = ఇచ్చును గాక! (దా దానే –పరస్మైపది – విధిలిఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** "అరే! నువ్వు ధూర్తుడివి. నిన్ను ఈ రోజు కట్టివేస్తాను" గోపకాంత. "కట్టివేస్తే ఏం వస్తుంది" కృష్ణుడు. "దొంగవేషాలు వేసే నిన్ను కట్టివేస్తే పాలను కాపాడుకోవచ్చు" – గోపకాంత. "ముద్దరాలా! సరసత కోల్పోయి నన్ను వదులుకొంటున్నావు. కానీ పాలకు స్నిగ్ధత అంటే తెలుసు. అవి నన్ను వదిలిపెట్టవు" – అంటూ కృష్ణుడు ఆ గోపకాంతను లోబరచుకొంటున్నాడు. అటువంటి కృష్ణుడు నాకు బుద్ధిని ప్రసాదించుగాత.

**వి :** 1. పాలలో స్నిగ్ధత ఎక్కువ. ఆ స్నేహశీలత వలననే దానిలో మనం నీళ్ళు పోసినా కలపనవసరం లేకుండానే కలిసి పోతాయి. జీవితాలలో కూడా స్నిగ్ధత చాలా అవసరం.

శ్లో॥ దర్శనే స్పర్శనే వాపి శ్రవణే భాషణేఽపి చ ।
యత్రాంతరంగం ద్రవతి సస్నేహ ఇతి కథ్యతే ॥

అని పెద్దలు స్నిగ్ధతాలక్షణమైన స్నేహాన్ని నిర్వచించారు. అది ఆ గోపకాంతలో లేదని కృష్ణుని ఆక్షేపం.

పాలతో ఆమెకు నిత్యపరిచయమున్నా ఆ స్నిగ్ధత ఆమెకు అలవడకపోవటం ధ్వని. అది అతద్గుణాలంకారధ్వని. అన్యగుణస్వీకారానికి అవకాశమున్నా స్వీకరించకపోవటం అతద్గుణాలంకారం. "**సంగతాన్యగుణానంగీకార-మాహురతద్గుణమ్**" (కు. 144)

| | | | |
|---|---|---|---|
| 2. **బధ్నామి :** | బధ్నాతి | బధ్నీతః | బధ్నంతి |
| | బధ్నాసి | బధ్నీథః | బధ్నీథ |
| | **బధ్నామి** | బధ్నీవః | బధ్నీమః |
| **త్యజేత్ :** | **త్యజేత్** | త్యజేతామ్ | త్యజేయుః |
| | త్యజేః | త్యజేతమ్ | త్యజేత |
| | త్యజేయమ్ | త్యజేవ | త్యజేమ |
| **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ. |

3. ఇక్కడితో కృష్ణుని అల్లరి ముగిసింది. బాలక్రీడలు ముగిశాయి. కవి వైష్ణవపారమ్యాన్ని ప్రబోధించటానికి ఈ క్రీడలను వినియోగించగా తెలుగులో పోతన భాగవతంలో శివకేశవాభేదాన్ని సూచించటానికి ఈ సందర్భాన్ని వాడుకొన్నారు. చూడండి-

సీ. తనువున నంటిన ధరణీ పరాగంబు పూసిన నెఱిభూతిపూఁత గాఁగ
ముందట వెలుఁగొందు ముక్తాలలామంబు తొగలసంగడికాని తునుక గాఁగ
ఫాలభాగంబుపైఁబరగు గావలిబొట్టు కాముని గెల్చిన కన్ను గాఁగ
కంఠమాలికలోని ఘననీలరత్నంబు కమనీయ మగు మెడకప్పు గాఁగ.

ఆ. హారవల్లులురగహారవల్లులు గాఁగ - బాలులీల ప్రౌఢబాలకుండు
**శివుని పగిది నొప్పె శివునికిం దనకును - వేఱులేమిఁదెలుపవెలయునట్లు.**-పోతనభాగవతం-10/296*

**శ్లో॥ తతః క్వణన్నూపురశోభిపాదాః - స్త్రియో విదగ్ధైరనుమేయమధ్యాః ।**
**శుచిస్మితాః కుణ్డలశోభిగణ్డా - న్యవేదయంస్తచ్చరితాని మాతుః ॥ 3-43**

**అ :** గోపకాంతలు కృష్ణుని అల్లరిని యశోదకు తెలుపడానికి ఆమె దగ్గరకు వెళ్ళుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః క్వణన్నూపుర-శోభి-పాదాః విదగ్ధైః అనుమేయ-మధ్యాః శుచి-స్మితాః కుండల-శోభి-గండాః స్త్రియః తచ్చరితాని మాతుః న్యవేదయన్.

**ప్ర :** తతః = అటుతర్వాత, క్వణ... పాదాః : క్వణత్ = రవళించెడి, నూపుర = గజ్జెలతో, శోభి = ప్రకాశిస్తున్న, పాదాః = కాళ్ళు గలవారును (క్వణద్భిః నూపురైః శోభినః పాదాః యాసాం తాః), విదగ్ధైః = పండితులచే, అనుమేయ-మధ్యాః = ఊహింపదగిన నడుముగల వారును (అనుమేయాః మధ్యాః యాసాం తాః), శుచి-స్మితాః = నిర్మలమైన చిఱునవ్వుగలవారును (శుచి స్మితం యాసాం తాః), కుండల... గండాః : కుండల = చెవికమ్మలచే, శోభి = ప్రకాశిస్తున్న, గండాః = చెక్కిళ్లు గలవారును అయిన (కుండలైః శోభినః గండాః యాసాం తాః), స్త్రియః = కాంతలు,

తత్+చరితాని = ఆ కృష్ణుని చేష్టలను, మాతుః = తల్లికి, ని+అవేదయన్ = తెలిపిరి. (ని+విద – జ్ఞానే ణిచ్ – పరస్మైపది – లఙ్ – ప్ర.బ.)

**తా ॥** ఆ తరువాత గోపకాంతలు వచ్చి కృష్ణుని చేష్టలను తల్లి యశోదకు చెప్పారు. ఆ గోపకాంతల కాలిగజ్జెలు ఘల్లుమంటున్నాయి. వారి నడుములు ఊహలకంద వలసినవే. వారి నవ్వు నిర్మలంగా వుంది. వారి చెక్కిళ్ళు కుండలాల కాంతితో ప్రకాశిస్తున్నాయి.

**వి :** 1. ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, శబ్దం – అని నాలుగు ప్రధాన ప్రమాణాలు. వాటిలో అనుమాన ప్రమాణం విశిష్టమైనది. సద్ధేతువుల సహకారంతో అభీష్టవిషయాన్ని సాధించటం. ఇక్కడ ఆ కాంతల నడుముల ఉనికి ఊహింపదగినదే కానీ కళ్ళకు కనిపించటం లేదు. అంత సూక్ష్మత ఉందక్కడ.

2. కృష్ణుని అల్లరి పనులను గురించి చెప్పడానికి వస్తున్నారు వారు కానీ నవ్వుతూ (శుచిస్మితాః). అంటే ఆ అల్లరిని గురించి చెప్పటంలో కూడా ఏదో ఆనందముంది వారి మనసుల్లో.

3. **న్యవేదయన్ :**

| | | |
|---|---|---|
| న్యవేదయత్ | న్యవేదయతామ్ | **న్యవేదయన్** |
| న్యవేదయః | న్యవేదయతమ్ | న్యవేదయత |
| న్యవేదయమ్ | న్యవేదయావ | న్యవేదయామ. |

*

**శ్లో॥ యదాఽఽత్మజస్తే పిబతి స్మ దుగ్ధం – విభిద్య పాత్రాణి తదా మమాసీత్ ।**
**న మన్యురుత్సర్పితదీయదన్త–దృగన్తకాన్తిం హృది తర్కయన్త్యాః ॥ 3–44**

**అ :** పాత్రలోని పాలను కృష్ణుని దంతకాంతులుగా భ్రమించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** యదా తే ఆత్మజః పాత్రాణి విభిద్య దుగ్ధం పిబతి స్మ తదా ఉత్సర్పిత–దీయ–దంత–దృగంత కాంతిం హృది తర్కయంత్యాః మమ మన్యుః న ఆసీత్.

**ప్ర :** యదా = ఎప్పుడయితే, తే = నీ యొక్క, ఆత్మజః = కొడుకు, పాత్రాణి = గిన్నెలను (కుండలను), విభిద్య = పగులగొట్టి, దుగ్ధమ్ = పాలను, పిబతి స్మ = త్రాగెనో ( పా పానే – పరస్మైపది – లట్ – ప్ర.ఏ. '**లట్ స్మే**' అష్టాధ్యాయి – 3/2/118 – భూతార్థంలో లట్), తదా = అప్పుడు, ఉత్సర్పి... కాంతిమ్ : ఉత్+సర్పి = పైకి చిందుతున్న, తదీయ = ఆ కృష్ణునియొక్క, దంత = పళ్ళయొక్కయు, దృక్+అంత = కనుకొనల యొక్కయు, కాంతిమ్ = వెలుగునుగా (ఉత్సర్పిణీ చ తదీయానాం దంతానాం దృగంతస్య చ కాంతిః, తామ్), హృది = మనస్సులో, తర్కయంత్యాః = భావిస్తున్న, మమ = నాకు, మన్యుః = కోపం, న+ఆసీత్ = కలుగలేదు. (అస భువి పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** నీ కొడుకు కుండలను బ్రద్దలు చేసి పాలు త్రాగే సమయంలో నాకు కోపం రాలేదు. ఎందుకంటే కృష్ణుని దంతకాంతులు, దృగంతకాంతుల ప్రసారాలే కుండలో కనిపిస్తున్నాయని భ్రమకు లోనయ్యాను.

**వి :** 1. కోపం రాకపోవటానికి కారణం భ్రాంతి. పాలను చూసి పాలనుకోకుండా దంతకాంతులు, దృగంత కాంతులూ అనుకొన్నది. ఇది భ్రాంతిమదలంకారం. '**స్యాత్ స్మృతి భ్రాంతి సందేహైస్తదంకాలంకృతిత్రయమ్**' (కు. 24)

2. **పిబతి :**

| | | |
|---|---|---|
| **పిబతి** | పిబతః | పిబన్తి |
| పిబసి | పిబథః | పిబథ |
| పిబామి | పిబావః | పిబామః |

| | | | | |
|---|---|---|---|---|
| **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ | |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త | |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. | * |

**శ్లో॥ పయః ప్రముష్ణన్ సఖి! భర్త్సనార్థం - సమాగతానామపహృత్య చేతః ।**
**స్వకృత్యసాధ్యాన్యవలమ్బ్య కణ్ఠం - జిఘృక్షతి స్వైరమయం సుతస్తే ॥ 3-45**

**అ :** కృష్ణుని అల్లరిపనులను గోపిక యశోదకు ఎరిగించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సఖి! అయం తే సుతః పయః ప్రముష్ణన్ భర్త్సనార్థమ్ సమాగతానాం చేతః అపహృత్య స్వ-కృత్య-సాధ్యాని కంఠమ్ అవలంబ్య స్వైరం జిఘృక్షతి.

**ప్ర :** సఖి = చెలి యశోదా! అయమ్ = ఈ, తే-సుతః = నీ కొడుకు, పయః = పాలను, ప్రముష్ణన్ = స్పష్టంగా దొంగిలిస్తూ (ముష్ ధాతువుపై శతృ ప్రత్యయం), భర్త్సనార్థమ్ = బెదిరించుటకై, సమాగతానామ్ = వచ్చినవారి యొక్క, చేతః = మనస్సును (అందరి లక్ష్యమూ ఒకటే కాబట్టి ఏకవచన ప్రయోగం), అపహృత్య = అపహరించి (అప-హృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం - తుగాగమం), స్వ... సాధ్యాని : స్వ = తన యొక్క, కృత్య = ప్రయత్నంతో, సాధ్యాని = సాధింపవలసిన వాటిని (స్వస్య కృత్యం, తేన సాధ్యాని), కంఠమ్ = గొంతును, అవలంబ్య = పట్టుకొని, స్వైరమ్ = స్వేచ్ఛగా, జిఘృక్షతి = తీసికొనగోరు తున్నాడు. (గ్రహ-ఉపాదానే - సన్నంతం - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.) (గ్రహీతుమ్ ఇచ్ఛతి)-

**తా ॥** సఖీ! యశోదా! ఈ నీ కొడుకు పాలను దొంగిలిస్తూ తనను బెదిరించటానికి వచ్చిన గోపకాంతల మనస్సును కూడా దొంగిలించి, (వారు నిశ్చేష్టులు కాగా) వారి గొంతు పట్టుకొని పైకెగబ్రాకి తన ప్రయత్నంతో సాధించవలసిన వాటిని స్వేచ్ఛగా అందుకొన గలుగుతున్నాడు.

**వి :** 1. పాలతో పాటు వాళ్ళ మనస్సును కూడా అపహరిస్తున్నాడు కృష్ణుడు. అయితే ఆ విషయాన్ని వాచ్యంగా చెప్పలేదు కాబట్టి సహోక్త్యలంకారమిక్కడ ధ్వనిస్తుంది.

2. పాలను దొంగిలించటం బాలచేష్ట. మనస్సును దొంగిలించటం వాసుదేవ చేష్ట. మనస్సును కట్టిపడవేస్తే ఇక రాగద్వేషాలు రెండూ లేవు గదా! **విష్ణుసాయుజ్యమే** పరమగతి.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **జిఘృక్షతి :** | **జిఘృక్షతి** | జిఘృక్షతః | జిఘృక్షంతి | |
| | జిఘృక్షసి | జిఘృక్షథః | జిఘృక్షథ | |
| | జిఘృక్షామి | జిఘృక్షావః | జిఘృక్షామః. | * |

**శ్లో॥ యదీదృశం కర్మ కరోషి కృష్ణ! - న తర్హి నన్దస్య సుతస్త్వమన్యః ।**
**ఇతీరితే హన్త! హసన్ యశోదే! - బహూన్యనిష్టాని స నస్తనోతి ॥ 3-46**

**అ :** కృష్ణుడు తన అజాయమానత్వాన్ని ప్రకారాంతరంగా సూచించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** కృష్ణ! ఈదృశం కర్మ యది కరోషి తర్హి త్వం నందస్య సుతః న (కింతు) అన్యః ఇతి ఈరితే హంత! యశోదే! హసన్ సః నః అనిష్టాని బహూని తనోతి.

**ప్ర :** కృష్ణ = కృష్ణా!, ఈదృశమ్ = ఇటువంటి, కర్మ = పనిని, యది **కరోషి** = చేసినట్లయితే (కృ - కరణే - పరస్మైపది - లట్ - మ.ఏ.), తర్హి = అప్పుడు, త్వమ్ = నువ్వు, నందస్య = నందుని యొక్క, సుతః = కుమారుడవు, న = కాదు, అన్యః = ఇంకెవరో, ఇతి = అని, ఈరితే = చెప్పబడగా (ఈర్ ధాతువుపై క్త ప్రత్యయం), హంత =

అయ్యో! యశోదే! = యశోదా, హసన్ = నవ్వుతూ, నః = మాకు, అనిష్టాని = నచ్చని, బహూని = ఎన్నో (పనులను), తనోతి = విరివిగా చేస్తున్నాడు. (తను విస్తారే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** 'కృష్ణా! ఇటువంటి పనులు చేస్తుంటే నువ్వు నందుని కొడుకువే కావు. ఇంకెవరో' అని మేము అంటే తాను నవ్వుతూ మాకిష్టం లేని పనులు ఎన్నో చేస్తుంటాడు.

**వి :** 1. పెద్దవాళ్ళు పిల్లలను ఏడిపించటానికి పలికే మాటలివి. కానీ కృష్ణుడు ఆ మాటలకు నవ్వుతున్నాడు. ఇంకా అల్లరి చేస్తున్నాడు. విషయం తెలిసి కూడా మరెందుకు బెదిరించే ప్రయత్నం చేస్తారని కృష్ణుని ఆలోచన. "మాకిష్టం లేనివి అన్నారే" కాని అవి మంచివో కాదో చెప్పలేదు. మనకు ఉపయోగపడేవి చేయటం దైవకృత్యం. వాటి మంచి చెడ్డలను మనం నిర్ణయించలేం. కానీ ఊరుకోం. నిర్ణయించే ప్రయత్నం చేస్తూనే వుంటాం. అందుకే "**యచ్ఛ్రేయస్తదస్తు మే**" అని మాత్రమే కోరాలి దైవాన్ని, కోరకుండా నిలువలేని పక్షంలో.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **తనోతి :** | **తనోతి** | తనుతః | తన్వంతి | |
| | తనోషి | తనుథః | తనుధ | |
| | తనోమి | తనువః/తన్వః | తనుమః/తన్మః. | * |

**శ్లో॥ ఇదం హి దేవస్య సమర్పణార్హ–మితీరితే తర్హ్యహమేవ దేవః ।**
**స ఇత్థమాభాష్య తదేవ భుఙ్క్తే – న దేవి! పుత్రస్తవ దేవభక్తః ॥ 3–47**

**అ :** తానే దేవుడనని అల్లరి చేస్తూ కృష్ణుడు వాస్తవాన్ని తెలపటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఇదం దేవస్య సమర్పణార్హమ్ ఇతి ఈరితే తర్హి అహమ్ ఏవ దేవః ఇత్థమ్ ఆభాష్య సః తద్ ఏవ భుంక్తే. దేవి! తవ పుత్రః దేవ–భక్తః న (భవతి).

**ప్ర :** ఇదమ్ = ఇది, దేవస్య = దేవునకు, సమర్పణ+అర్హమ్ = సమర్పింపదగినది (సమర్పణాయ అర్హమ్), ఇతి = అని, ఈరితే = చెప్పబడగా (ఈర్ ధాతువుపై క్త ప్రత్యయం), తర్హి = అయితే, అహమ్ + ఏవ = నేనే, దేవః = దేవుడను, ఇత్థమ్ = అని, ఆభాష్య = పలికి (ఆ+భాష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం) సః = ఆ కృష్ణుడు, తద్+ఏవ = దానినే, భుంక్తే = తింటున్నాడు (భుజ్ – భోజనార్థే – ఆత్మనేపది – లట్ – ప్ర.ఏ.), దేవి! = దొరసానీ! యశోదా!, తవ = నీ యొక్క, పుత్రః = కొడుకు, దేవభక్తః = దేవుని యందు భక్తి గలవాడు (దేవస్య భక్తః), న (భవతి) = కాదు.

**తా ॥** 'ఇది దేవతలకు నివేదించటానికి' అని మేమంటే, 'అయితే నేనే దేవుడిని' అంటూ ఆ పదార్థాన్నే తింటుంటాడు. యశోదా! నీ కొడుకు దేవ భక్తుడు కాదు.

**వి :** 1. నిజమే. కృష్ణుడు దేవభక్తుడు కాదు. దేవుడే గదా! వారికి తెలియదు కానీ పలికినది వాస్తవమే. '**అజాయమానో బహుధా విజాయతే. తస్య ధీరాః పరిజానన్తి యోనిమ్**' అని పురుషసూక్తమంటుంది.

2. పోతన ఈ భావాన్ని కందంలో ఇమిడ్చాడు.

కం. వేలుపులటె నా కంటెను – వేలుపు మఱి యెవ్వఁ డనుచు వికవికనగి మా
వేలుపులగోడపైనో – హేలాలక! నీ తనూజుఁ డెంగిలి చేసెన్. – పోతనభాగవతం – 10/321

| | | | | |
|---|---|---|---|---|
| 3. **భుంక్తే :** | **భుంక్తే** | భుంజాతే | భుంజతే | |
| | భుంక్షే | భుంజాథే | భుంజధ్వే | |
| | భుంజే | భుంజ్వహే | భుంజ్మహే. | * |

**శ్లో॥ గృహే గృహేఽయం నవనీతదుగ్ధ-దధీని సర్వాణ్యపహృత్య భుఙ్క్తే ।**
**తథాపి తృప్తిం న సుతస్తవైతి - కిమస్య భూతాని వసన్తి కుక్షౌ ॥ 3-48**

**అ :** ఇంటింటా పాలూపెరుగూ త్రాగినా తృప్తి పడని కృష్ణ తత్త్వవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** అయం గృహే గృహే సర్వాణి నవనీత-దుగ్ధ-దధీని అపహృత్య భుంక్తే. తథాపి తవ సుతః తృప్తిం న ఏతి. అస్య కుక్షౌ భూతాని వసన్తి కిమ్?

**ప్ర :** అయమ్ = ఈ బాలుడు, గృహే గృహే = ఇంటింటా, సర్వాణి = అన్నింటినీ, నవనీత... దధీని : నవనీత-దుగ్ధ-దధీని = వెన్న, పెరుగు, పాలను, అపహృత్య = దొంగిలించి, భుంక్తే = అనుభవిస్తున్నాడు (భుజ్ భోజనార్థే ఆత్మనేపది - లట్ - (ప్ర.ఏ.), తథా + అపి = అయినా కూడా, తవ = నీ యొక్క, సుతః = కొడుకు, తృప్తిమ్ = తృప్తిని/చాలిమిని, న+**ఏతి** = పొందుటలేదు. (ఆ+ఇ గతౌ - పరస్మైపది - లట్ - (ప్ర.ఏ.), అస్య = ఇతని యొక్క, కుక్షౌ = పొట్టలో, భూతాని = భూతాలు, వసన్తి కిమ్ ? = ఉన్నాయా? (వస నివాసే పరస్మైపది - లట్ - (ప్ర.ఏ.)

**తా ॥** (యశోదా!) ఈ కృష్ణుడు ఇంటింటా వున్న వెన్న, పాలు, పెరుగు దొంగిలించి తినేస్తున్నాడు. అయినా తనకు తృప్తి లేదు. నీ కొడుకు కడుపులో భూతాలు ఉన్నాయా ఏమిటి?

**వి :** 1. ఉన్నాయా? అని వారి సందేహం. ఉన్నాయని వేదాంతుల నిర్ణయం. 'యతో వా ఇమాని భూతాని జాయన్తే. యేన జాతాని జీవన్తి. **యం ప్రత్యభిసంవిశన్తి'** (తైత్తిరీయో-పనిషత్)

2. ఇంటింటా వున్న పాలు, పెరుగు, వెన్నల మొత్తం చాలా ఎక్కువే వుంటుంది. సాధారణంగా ఒక ఇంటిలోనివి ఆ ఇంటికే కాక బయటవారికి కూడా కొందరికి సరిపోతాయి. అయితే అన్ని ఇళ్ళవీ కలిపినా ఒక్కడికి చాలకపోవటం విచిత్రం. ఆధేయమే పెద్దది. (అన్ని ఇండ్ల పదార్థాలు). అయినా ఆ ఆధారానికి సరిపోలేదు. ఇది అధికాలంకారం. "**పృథ్వాధేయాద్యదాధారాధిక్యం తదపి తన్మతమ్**" (కు.66)

3. **భుంక్తే :** 3-47వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఏతి :** | **ఏతి** | ఇతః | యన్తి |
| | ఏషి | ఇథః | ఇత |
| | ఏమి | ఇవః | ఇమః |
| **వసన్తి :** | వసతి | వసతః | **వసన్తి** |
| | వససి | వసథః | వసథ |
| | వసామి | వసావః | వసామః. |

*

**శ్లో॥ న ముఞ్చ వత్సాంస్త్వమిహేత్య బద్ధా - నితీరితే పుణ్యపదే! యశోదే! ।**
**స్మితోల్లసద్వక్త్రమదాత్సుతస్తే - స్వభావ ఇత్యుత్తరముత్తరజ్ఞః ॥ 3-49**

**అ :** కృష్ణుడు గోవత్సవాత్సల్యాన్ని ప్రకటిస్తూ ప్రవర్తించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** పుణ్య-పదే! యశోదే! త్వమ్ ఇహ ఏత్య బద్ధాన్ వత్సాన్ న ముంచ ఇతి ఈరితే ఉత్తరజ్ఞః తే సుతః స్మితోల్లసద్వక్త్రమ్ స్వభావః ఇతి ఉత్తరమ్ అదాత్.

**ప్ర :** పుణ్య-పదే! = పవిత్రస్థానం గలదానా! యశోదే! = యశోదా!, త్వమ్ = నువ్వు, ఇహ = ఇక్కడకు, ఏత్య = వచ్చి (ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), బద్ధాన్ = కట్టబడియున్న, వత్సాన్ = దూడలను, న **ముంచ** = విడువవద్దు (ముచ్ మోక్షణే పరస్మైపది - లోట్ - మ.ఏ.), ఇతి = అని, ఈరితే = చెప్పబడగా (ఈర్ ధాతువుపై క్త ప్రత్యయం),

ఉత్తర-జ్ఞః = సమాధానాలు చెప్పటంలో నేర్పుగల, తే = నీ యొక్క, సుతః = కుమారుడు, స్మిత+ఉల్లసద్-వక్త్రమ్ = నవ్వు మొగంతో, స్వభావ ఇతి = స్వభావమని, ఉత్తరమ్ = సమాధానాన్ని, అదాత్ = ఇచ్చెను (దా దానే పరస్మైపది - లుజ్ - ప్ర.ఏ.)

**తా ॥** పుణ్యపదా! యశోదా! 'ఇక్కడకు వచ్చి కట్టుబడివుండే దూడలను వదలవద్దు' అని మేము కృష్ణుడితో చెప్పాం. కానీ కృష్ణుడు నవ్వుతూ ఇది స్వభావమని సమాధానం చెప్పాడు.

**వి :** 1. స్వభావపదం ఇక్కడ అర్థగర్భితం. బాలస్వభావం. మాట వినకపోవటం, లేదా కట్లు విప్పి దూడలతో ఆడుకోవటం బాలస్వభావమని ఒక అర్థం. బంధవిముక్తి కలిగించటం కృష్ణ స్వభావమని మరొక అర్థం. '**స్వభావోఽధ్యాత్మముచ్యతే**' అని స్వభావ పదానికి అధ్యాత్మమని అర్థం (భగవద్గీత 8/3). వాస్తవానికి ఈ సృష్టి అంతా భగవత్క్రీడా విశేషమే కాబట్టి విముక్తి కలిగించటం ఆయన స్వభావమవుతుంది.

2. భాగవతంలో దీనికి మూలమిది, వివిధ చేష్టలతో కలిసి,

శ్లో॥ వత్సాన్ ముంచన్ క్వచిదసమయాన్ క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథ దధి పయః కల్పితైః స్తేయయోగ్యైః ।
మర్కం భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాణ్డం భినత్తి
ద్రవ్యాలాభే సగృహకుపితో యాత్యుపక్రోశ్య తోకాన్ ॥ - భాగవతం 10-9-29

| | | | |
|---|---|---|---|
| 3. **ముంచ :** | ముంచతు/ముంచతాత్ | ముంచతామ్ | ముంచన్తు |
| | **ముంచ**/ముంచతాత్ | ముంచతమ్ | ముంచత |
| | ముంచాని | ముంచావ | ముంచామ |

| | | | |
|---|---|---|---|
| **అదాత్ :** | **అదాత్** | అదాతామ్ | అదుః |
| | అదాః | అదాతమ్ | అదాత |
| | అదామ్ | అదావ | అదామ. |

4. ఇహ+ఏత్య = ఇహేత్య (ఏత్య-ఆ+ఇ ధాతువుపై ల్యప్) ఓయాజోశ్చ (సూ.6-1-92). *

**శ్లో॥ కస్మాదఙ్గ! నయస్యులూఖలమితో దుగ్ధస్య పాత్రాదధః**
**స్నిగ్ధం స్థాపయితుం తతశ్చ కిమితి ప్రోక్తే ప్రభుర్యోఽగదత్ ।**
**మధ్యస్యాగ్రసుజాతసుస్మితపయఃపాత్రాననస్యోపమాం**
**ముగ్ధే! వీక్షయితుం తవేతి స పటుర్దుష్కర్మణాం గూహనే ॥ 3-50**

**అ :** కృష్ణుని అల్లరి చేతలలో మరొకటి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అంగ! ఉలూఖలమ్ ఇతః కస్మాత్ నయసి? దుగ్ధస్య పాత్రాత్ అధః స్నిగ్ధమ్ ఉలూఖలం స్థాపయితుమ్.

తతః చ కిమ్ - ఇతి ప్రోక్తే యః ప్రభుః 'ముగ్ధే! అగ్ర-సుజాత-సుస్మిత-పయః-పాత్రాననస్య తవ మధ్యస్య ఉపమాం వీక్షయితుమ్' ఇతి అగదత్ సః దుష్కర్మణాం గూహనే పటుః.

**ప్ర : గోపకాంత** : అంగ = ఓయి! ఉలూఖలమ్ = రోటిని, ఇతః = ఈ చోటునుండి, కస్మాత్ = ఎందులకు, నయసి = కొనిపోతున్నావు (నీ ప్రాపణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.),

**కృష్ణుడు** : దుగ్ధస్య = పాలయొక్క, పాత్రాత్ = గిన్నెకన్న, అధః = క్రిందుగా, స్నిగ్ధమ్ = నునుపైన, ఉలూఖలమ్ = రోటిని, స్థాపయితుమ్ = నిలపటానికి (స్థా ధాతువుపై తుమున్ ప్రత్యయం),

**గోపకాంత** : తతః + చ = దానివలన, కిమ్ = ఏం లాభం?, ఇతి = అని, ప్రోక్తే = చెప్పబడగా (ప్ర+వచ్ ధాతువుపై క్త ప్రత్యయం - సప్తమీ), యః ప్రభుః = ఏ స్వామి, ముగ్ధే! = ముద్దరాలా, అగ్ర... పాత్రాననస్య : అగ్ర = పై భాగాన, సుజాత = చక్కగా ఏర్పడిన, సుస్మిత = చక్కని చిఱునవ్వు అనెడి, పయః = పాలకు, పాత్ర = యోగ్యమైన, ఆననస్య = ముఖం కలిగిన (అగ్రే సుష్ఠు జాతం సుస్మితమ్ ఏవ పయః, తస్య పాత్రమ్ ఆననం యస్య, తస్య), తవ = నీ యొక్క, మధ్యస్య = నడుముకు, ఉపమామ్ = పోలికను, వీక్షయితుమ్ = చూపించటానికి (వి+ఈక్ష్ ణిచ్ - తుమున్ ప్రత్యయం), ఇతి = అని, అగదత్ = చెప్పెనో (గద - వ్యక్తాయాం వాచి - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, దుష్కర్మణామ్ = అల్లరిచేతలను/ పాపాలను, గూహనే = కప్పిపుచ్చుటలో, పటుః = సమర్థుడు.

**తా ။** గోపిక : ఇక్కడినుండి రోటిని తీసుకొని వెళ్తున్నావ్. ఎందుకు?

కృష్ణుడు : దధిపాత్ర క్రిందుగా ఈ రోటిని పెట్టడానికి.

గోపిక : దానితో ఏం వస్తుంది?

అప్పుడు చెప్తున్నాడు కృష్ణుడు. నవ్వు అనే పాలకు ఆధారంగా నిలిచిన ముఖం కలిగిన నీ నడుముకు పెరుగు కుండను మీద నిలపగా శోభిస్తున్న ఈరోటితో వున్న పోలికను చూపించటానికి.

ఈ రీతిగా మాటాడుతూ తాను చేసే అల్లరిని కప్పిపుచ్చుకోవటంలో నేర్పుగలవాడు కృష్ణుడు.

**వి :** 1. రోటిని ఒకచోటనుండి మరొకచోటికి తరలించటం పసిపిల్లలకు సాధ్యమా? అని శంకింప పనిలేదు. కృష్ణుడు చూపిస్తున్న లీలలన్నీ అటువంటివే. ఆ విషయాన్ని గూర్చి ఆ గోపకాంతలు ఆలోచించకుండా మాయ చేస్తుంటాడు.

2. దుష్కర్మలను కప్పిపుచ్చటంలో సమర్థుడు కాబట్టే

శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ - భగవద్గీత -9/22

అని ప్రతిజ్ఞ చేయగలిగాడు.

| | | | |
|---|---|---|---|
| 3. **నయసి :** | నయతి | నయతః | నయన్తి |
| | **నయసి** | నయథః | నయథ |
| | నయామి | నయావః | నయామః |
| **అగదత్ :** | **అగదత్** | అగదతామ్ | అగదన్ |
| | అగదః | అగదతమ్ | అగదత |
| | అగదమ్ | అగదావ | అగదామ. |

*

**శ్లో॥ క్వచిత్కరేణైవ స దుగ్ధభాజనం - క్వచిచ్చ పాదేన సమీక్షతే సఖి! ।**
**సమాగతాః పశ్యతి పృష్ఠతస్తదా - స విశ్వతశ్చక్షురివాస్తి బాలకః ॥ 3-51**

**అ :** దొంగతనం చేసే సమయంలోని కృష్ణుని జాగరూకతను విశ్వతశ్చక్షుస్త్వంగా నిరూపించుట.-ఉపేంద్రవజ్ర.

**అ :** సఖి! సః క్వచిత్ కరేణ ఏవ దుగ్ధభాజనం సమీక్షతే. క్వచిత్ చ పాదేన సమీక్షతే. తదా పృష్ఠతః సమాగతాః పశ్యతి. సః బాలకః విశ్వతః చక్షుః ఇవ అస్తి.

**ప్ర :** సఖి! యశోదా! సః = ఆ కృష్ణుడు, క్వచిత్ = కొన్ని తావుల, కరేణ+ఏవ = చేతితోనే, దుగ్ధ-భాజనమ్ = పాలగిన్నెను, సమీక్షతే = గమనించును. (సమ్ - ఈక్ష్ దర్శనే - ఆత్మనేపది - లట్ - ప్రథమపురుషైకవచనం),

క్వచిత్ + చ = మరికొన్ని తావుల, పాదేన = కాలితో, సమీక్షతే = గమనించును, తదా = ఆ దొంగతనం చేసేటప్పుడు, పృష్ఠతః = వెనుకనండి, సమాగతాః = వచ్చిన మమ్ములను, పశ్యతి = చూడగలడు (దృశ్ ప్రేక్షణే పరస్మైపది – లట్ – ప్రథమపురుషైకవచనం), సః బాలకః = ఆ బాలుడు, విశ్వతః చక్షుః+ఇవ = అన్ని వైపులా కన్నులు గలవానివలె, అస్తి = ఉన్నాడు. (అస భువి పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ။** కృష్ణుడు కొన్నిచోట్ల చేతులతో పాలకుండలను గమనిస్తున్నాడు. కొన్నిచోట్ల కాళ్ళతో తడిమి గుర్తుపడుతున్నాడు. మేము వెనుకగా వెళ్ళినా మా రాకను గుర్తుపడుతున్నాడు. ఒళ్ళంతా కళ్ళులా కనిపిస్తున్నాడు.

**వి :** 1. చీకటిలో వస్తువులను వెతికేటప్పుడు కాలో చేయో సహకరిస్తాయి. వస్తు స్వభావాన్ని బట్టి దేనినైనా వాడవచ్చు. వెనుకనుండి అనుసరిస్తున్న వారిని గూడా గమనించగలగటం 'విశ్వతశ్చక్షుః' అనేందుకు అవకాశం.

శ్లో॥ విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో – విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।
సం బాహుభ్యాం ధమతి సం పతత్రై – ర్ద్యావాపృథివీ జనయన్దేవ ఏకః ॥

– శ్వేతాశ్వతరోపనిషత్తు – 3/2

సహస్రశీర్షం దేవం **విశ్వాక్షం** విశ్వశంభువమ్ విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్–

– యజుర్వేదం – నారాయణసూక్తమ్.

2. **విశ్వతశ్చక్షురివ అస్తి** – అనటం సంభావన. పారమార్థికంగా అది వాస్తవమయినా గోపికలకు సంబంధించినంతవరకు అది సంభావన. కాబట్టి ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **సమీక్షతే :** | **సమీక్షతే** | సమీక్షేతే | సమీక్షన్తే |
| | సమీక్షసే | సమీక్షేథే | సమీక్షధ్వే |
| | సమీక్షే | సమీక్షావహే | సమీక్షామహే |
| **పశ్యతి :** | **పశ్యతి** | పశ్యతః | పశ్యన్తి |
| | పశ్యసి | పశ్యథః | పశ్యథ |
| | పశ్యామి | పశ్యావః | పశ్యామః |
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః. |

*

**శ్లో॥ ఉలూఖలే తం యది బన్ధయామో – నయేత్ తదోలూఖలమేవ బాలః ।**
**ధ్రువం గృహస్తంభవరే నిబద్ధో – గృహాణ్యసౌ పాతయితుం సమర్థః ॥ 3–52**

**అ :** కృష్ణుని అమేయశక్తి సంపన్నతను గుర్తించినట్లుగ గోపకాంతల నిష్ఠురోక్తులు. –ఉపేంద్రవజ్ర.

**అ :** తం యది ఉలూఖలే బన్ధయామః తదా బాలః ఉలూఖలమ్ ఏవ నయేత్. గృహస్తంభవరే నిబద్ధః అసౌ ధ్రువం గృహాణి పాతయితుం సమర్థః.

**ప్ర :** తమ్ = ఆ కృష్ణుని, యది = ఒకవేళ, ఉలూఖలే = రోటికి, బన్ధయామః = కట్టివేస్తే (బన్ధ్ బన్ధనే పరస్మైపది – లట్ – ప్ర.బ.), తదా = అప్పుడు, బాలః = ఆ బాలకృష్ణుడు, ఉలూఖలమ్–ఏవ = రోటినే, నయేత్ = లాగికొని పోగలడు. (నీ ప్రాపణే పరస్మైపది – విధిలిఙ్ – ప్ర.ఏ.), గృహ–స్తంభ–వరే : గృహ = ఇంటియొక్క, స్తంభ–వరే = మేటి స్తంభానికి, నిబద్ధః = కట్టివేయబడితే, అసౌ = ఆ కృష్ణుడు, ధ్రువమ్= నిశ్చితంగా, గృహాణి = ఇళ్ళను,

పాతయితుమ్ = పడగొట్టడానికి (పత్ – ణిచ్ – ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః = శక్తి గలవాడు.

**తా ॥** ఆ కృష్ణుని రోటికి కట్టివేస్తే రోటిని కూడా లాగికోని పోతాడు. ఇంటిలోని గట్టి గుంజకు దేనికైనా కట్టివేస్తే ఇంటినే పడగొట్టగల శక్తిగలవాడు తాను.

**వి :** 1. ఇక్కడ గోపికల మాట రాబోయే మద్దిచెట్లు కూల్చే అంశాన్ని ధ్వనింపజేస్తుంది. నాటకీయ పరిభాషలో ఇటువంటి ప్రతిభకు మంచి గుర్తింపు ఉంది.

2. నృసింహావతారంలో తనకు ఆశ్రయమిచ్చి ధన్యమైనది స్తంభం. ఇప్పుడు దానికి భిన్నంగా ప్రవర్తించలేదు. రోలు ముందు ముందు ఉపయోగపడబోతోంది. కాబట్టి అది కృష్ణుని నేస్తమే.

| | | | |
|---|---|---|---|
| 3. **నయేత్ :** | **నయేత్** | నయేతామ్ | నయేయుః |
| | నయేః | నయేతమ్ | నయేత |
| | నయేయమ్ | నయేవ | నయేమ. |

*

**శ్లో॥ విశ్వంభరస్యాస్య హి బన్ధనాయ – దామాని సంపాదయితుం క ఈశః ।**
**బద్ధః కథంచిద్యది తర్హి బద్ధా – మధ్యే విలీనా వయమేవ నూనమ్ ॥ 3-53**

**అ :** కృష్ణబంధన మంత తేలిక కాదని నిరూపణ. –ఇంద్రవజ్ర.

**అ :** విశ్వంభరస్య అస్య బంధనాయ దామాని సంపాదయితుం కః ఈశః? యది కథంచిద్ బద్ధః తర్హి మధ్యే విలీనాః వయమేవ బద్ధా నూనమ్.

**ప్ర :** విశ్వంభరస్య = విశ్వాన్నే భరించునట్టి (విశ్వం బిభర్తి ఇతి), అస్య = ఈ కృష్ణుని, బంధనాయ = బంధించుట కొరకు, దామాని = పలుపులను (సందానం దామనీ దామ పశూనాం బంధనం మతమ్ – హలాయుధకోశః – 277), సంపాదయితుమ్ = సమీకరించటానికి, కః = ఎవడు, ఈశః = సమర్థుడు?, యది = ఒకచో, కథంచిత్ = ఏదో యొకరీతిగా, బద్ధః = కట్టబడినా, తర్హి = అప్పుడు, మధ్యే = కృష్ణుని మధ్యలో, విలీనాః = కలిసిపోయి, వయమ్+ఏవ = మేమే, బద్ధాః = బంధింపబడ్డాము, నూనమ్ = నిశ్చయం.

**తా ॥** విశ్వంభరుడైన ఆ కృష్ణుని బంధించటానికి ఎవడు కట్టుతాళ్ళను సంపాదించగలడు? ఒకవేళ ఏదో ఒక రీతిగా ఆ కృష్ణుని బంధించినా చివరకు మేమే బంధింపబడి మధ్యలో వుంటే మా చుట్టూ కృష్ణుడున్నట్లుంది.

**వి :** 1. విశ్వమేవేదం పురుషః –

శ్లో॥ యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః ॥ – యజుర్వేదం – నారాయణసూక్తమ్.

మనకు కనిపిస్తూ, వినిపిస్తూ వున్న ఈ విశ్వానికి లోనా, బయటా కూడా నారాయణుడే వ్యాపించి వున్నాడు. కాబట్టి ఆ గోపకాంతలు కృష్ణుణ్ణి చుట్టుముట్టినా వారి చుట్టూ ఆయనే వున్నట్లుంది.

2. అది గోకులం కాబట్టి వాళ్ళకు దొరికేవి పలుపు తాళ్ళే. అవన్నీ పోగేసినా చాలవు. భవిష్యత్తులో సుయోధనుడు కూడా ఇలా బంధించే ప్రయత్నం చేసి విఫలుడవుతాడు. *

**శ్లో॥ అహో! యశోదే! తవ బాలకోఽయం – గృహే గృహేఽత్త్యుష్ణమపీహ దుగ్ధమ్ ।**
**పిబన్న తాపం లభతే కదాపి – కిమస్య వక్త్రే జలరాశిరాస్తే ॥ 3-54**

**అ :** కృష్ణుని సాధారణ బాలచేష్టలలోని అసాధారణత్వాన్ని నిరూపించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** అహో! యశోదే! అయం తవ బాలకః గృహే గృహే అత్యుష్ణమ్ అపి ఇహ దుగ్ధమ్ పిబన్ అపి కదా+అపి తాపం న లభతే. అస్య వక్త్రే జలరాశిః ఆస్తే కిమ్?

**ప్ర :** అహో! = ఆశ్చర్యం, యశోదే! = యశోదా! అయమ్ = ఈ, తవ-బాలకః = నీ కొడుకు, గృహే గృహే = ఇంటింటా, అతి+ఉష్ణమ్+అపి = బాగా వేడిగా ఉన్నా, దుగ్ధమ్ = పాలను, పిబన్+అపి = త్రాగుతూ కూడా (పా ధాతువుపై శతృ ప్రత్యయం), కదా+అపి = ఎప్పుడూ కూడా, తాపమ్ = వేడిని, న **లభతే** = అనుభవించుట లేదు (లభ్ ప్రాప్తౌ - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), అస్య = ఇతని యొక్క, వక్త్రే = నోటిలో, జలరాశిః = సముద్రం (జలస్య రాశిః), ఆస్తే కిమ్? = ఉన్నదా ఏమి? (ఆస్ ఉపవేశనే ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** యశోదా! ఆశ్చర్యం మా ఇంటింటా ఎంతో వేడిగా ఉన్న పాలను త్రాగినా కూడా ఎప్పుడూ నోరు కాలుతున్నట్టు లేదు. నీ కొడుకు నోట్లో సముద్రముందా ఏమిటి?

**వి :** 1. ఆయన నోట్లో జలరాశి వున్నదా? నిజమే. తొలుదొల్త ఈ విశ్వంలో వున్నది నీరే కదా! అదీ పరమాత్మ గర్భంలో.

నాసదాసీన్నో సదాసీత్తదానీం - నాసీద్రజో నో వ్యోమా పరో యత్ ।
కిమావరీవః కుహ కస్య శర్మన్ - **అంభః కిమాసీద్గహనం గభీరమ్ ॥** - **నాసదీయ సూక్తమ్** - 1.

కృష్ణుని నోటనున్నది జల(డ)రాశి. ఆయన మాత్రం చైతన్యస్వరూపుడు.

2. వక్త్రే జలరాశిః ఆస్తే కిమ్? కాకుస్వరం. నాస్తి (లేదు) అని సమాధానం. ఇది వక్రోక్త్యలంకారం. '**వక్రోక్తిః శ్లేషకాకుభ్యామ్ అపరార్థప్రకల్పనమ్**' (కు. 159)

| | | | |
|---|---|---|---|
| 3. **లభతే :** | **లభతే** | లభేతే | లభన్తే |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభే | లభావహే | లభామహే |
| **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే. |

*

**శ్లో॥ విలోక్య దూరస్థితదుగ్ధభాణ్డ - ములూఖలాద్యైర్యతతే గ్రహీతుమ్ ।**
**శిశుః స తావత్ క్వచిదేధతేఽహో - కిమేష గూఢాష్టమహావిభూతిః ॥ 3-55**

**అ :** కృష్ణుని ప్రతిభావిశేషాలను ఆశ్చర్యపడుతూ గోపకాంతలు యశోదకు విన్నవించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః శిశుః దూర-స్థిత-దుగ్ధ-భాండం విలోక్య ఉలూఖిలాద్యైః గ్రహీతుం యతతే. క్వచిత్ తావత్ ఏధతే. అహో! ఏషః గూఢ+అష్ట-మహా-విభూతిః కిమ్?

**ప్ర :** సః శిశుః = ఆ పసివాడు (కృష్ణుడు), దూర... భాండమ్ : దూర = దూరంగా, స్థిత = ఉన్నట్టి, దుగ్ధ - భాండమ్ = పాలగిన్నెను, ఉలూఖల + ఆద్యైః = రోలు మొదలగు వాటితో (ఉలూఖలః ఆద్యః యేషాం, తైః), గ్రహీతుమ్ = చేగొనడానికి, యతతే = ప్రయత్నిస్తాడు. (యత - ప్రయత్నే - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), క్వచిత్ = ఒక్కొక్కచోట, తావత్ = ఆ పాలగిన్నె ఉన్నంతవరకు, ఏధతే = పెరుగుతాడు. (ఏధ వృద్ధౌ ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), అహో = ఆశ్చర్యం, ఏషః = ఈ కృష్ణుడు, గూఢ+అష్ట-మహా-విభూతిః : గూఢ = లోనదాగిన, అష్ట = ఎనిమిదైన, మహావిభూతిః = మహావిభూతులు గలవాడా (గూఢాః అష్టౌ చ తాః మహావిభూతయః యస్మిన్ సః), కిమ్? = ఏమి?

**తా ॥** నీ కొడుకు ఎత్తులో ఉన్న పాలకుండను చూచి రోలు మొదలగువాటి సహాయంతో అందుకొనే ప్రయత్నం చేస్తాడు. ఒక్కొక్కసారి వేటి సహాయం తీసికోకుండా ఉన్నచోటనే పెరిగిపెరిగి అందుకొంటాడు. అష్టమహావిభూతులు నీ కొడుకుకు ఉన్నాయా ఏమిటి?

**వి :** 1. అష్టమహావిభూతులు (అష్టసిద్ధులు)

శ్లో॥ అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా ।
ప్రాప్తిః ప్రాకామ్యమీశత్వం వశిత్వం చాష్టభూతయః ॥ – అమరకోశం.

1. అణిమ 2. మహిమ 3. గరిమ 4. లఘిమ 5. ప్రాప్తి 6. ప్రాకామ్యం 7. ఈశత్వం 8. వశిత్వం –

పాలగిన్నె వరకు సాగి దానిని అందుకొంటున్నాడు కాబట్టి మహిమ అనే సిద్ధి వున్నదేమో అని అనుమానం. రోలు ఎక్కి అందుకుంటే మామూలుగా పిల్లలు చేసే పనియే.

2. శ్లో॥ ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥ –కఠోపనిషత్తు–1-2-21

కాబట్టి ఆ కృష్ణుని అర్థంచేసికోవటం అందరికీ కుదరదు.

| | | | |
|---|---|---|---|
| 3. **యతతే :** | **యతతే** | యతేతే | యతన్తే |
| | యతసే | యతేథే | యతధ్వే |
| | యతే | యతావహే | యతామహే |
| **ఏధతే :** | **ఏధతే** | ఏధేతే | ఏధన్తే |
| | ఏధసే | ఏధేథే | ఏదధ్వే |
| | ఏధే | ఏధావహే | ఏధామహే. |

*

**శ్లో॥ న నిష్ఠురా వాక్సముదేతి వక్త్రాత్ – కరశ్చ నస్తాడయితుం యశోదే! ।**
**విలోలనేత్రం తవ పుత్త్రరత్నం – ధ్రువం సుతస్తే జగతాం నియన్తా ॥ 3-56**

**అ :** కృష్ణుని జగన్నియంతృత్వాన్ని గోపికలు మరో రీతిగా అంగీకరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** యశోదే! విలోల–నేత్రం తవ పుత్ర–రత్నం తాడయితుం నః కరః న సముదేతి నిష్ఠురా వాక్ వక్త్రాత్–న సముదేతి. తే సుతః ధ్రువం జగతాం నియన్తా (అస్తి).

**ప్ర :** యశోదే! = యశోదా!, విలోల–నేత్రమ్ = కదలాడే కన్నులు గల (విలోలే నేత్రే యస్య తమ్), తవ = నీ యొక్క పుత్త్రరత్నమ్ = మేటి కుమారుని, తాడయితుమ్ = కొట్టడానికి (తడ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), నః = మా యొక్క, కరః = చేయి, సమ్+ఉత్+ఏతి = పైకి లేవదు. (సమ్+ఉత్+అ–ఇ గతౌ – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.), నిష్ఠురా = మనస్సును గాయపరచే, వాక్ = మాట (నిష్ఠురా చ సా వాక్), వక్త్రాత్ = నోటినుండి, న సముదేతి = పైకి రాదు. తే–సుతః = నీ కొడుకు, ధ్రువమ్ = నిశ్చితంగా, జగతామ్ = లోకాలకు, నియన్తా = శాసకుడుగా, (అస్తి) = ఉన్నాడు.

**తా ॥** యశోదా! నీ కొడుకును మందలిద్దామంటే నిష్ఠురవాక్యాలు నోటినుండి రావటం లేదు. కొడదామంటే మా చేతులు లేవటం లేదు. నిజంగా నీ కొడుకు లోకాలకు శాసకుడిలా ఉన్నాడు.

**వి :** 1. నారాయణుని జగన్నియామకత్వాన్ని ప్రకటిస్తూనే మాఘుడు శిశుపాలవధ కావ్యాన్ని ప్రారంభించాడు.

శ్లో॥ శ్రియః పతిః శ్రీమతి శాసితుం జగ - జ్జగన్నివాసో వసుదేవసద్మని ।
వసన్ దదర్శాతరంతమంబరాత్ - హిరణ్యగర్భాంభభవం మునిం హరిః ॥ -శిశుపాలవధమ్-1/1

2. శ్లోకంలోని మొదటి మూడు పాదాలలో చెప్పిన అంశాన్ని నాలుగవ పాదంతో సమర్థించాడు కవి. కృష్ణుని కొట్టడానికీ, తిట్టడానికీ చేతులు, నోరు లేవకపోవటానికి కారణాన్ని చెప్పి సమర్థించినందువలన ఇక్కడ కావ్యలింగాలంకారం. "**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**" (కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **సముదేతి :** | **సముదేతి** | సముదితః | సముద్యంతి |
| | సముదేషి | సముదిథః | సముదిత |
| | సముదేమి | సముదివః | సముదిమః. |

*

**శ్లో॥ బతాన్ధకారార్పితదధ్యమత్ర - మపి స్వభాస్వన్నయనాన్తలక్ష్మ్యా ।**
**సమీక్షతే లోచనయోః కిమేష - బిభర్తి బాలస్తవ పుష్పవన్తౌ ॥ 3-57**

**అ :** కృష్ణుని కన్నులలో సూర్యచంద్రుల ఉనికిని గోపికలు శంకించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** బత! అంధకార+అర్పిత- దధి+అమత్రమ్ అపి స్వభాస్వన్నయన +అంతలక్ష్మ్యా సమీక్షతే. ఏషః తవ బాలః లోచనయోః పుష్పవన్తౌ బిభర్తి కిమ్?

**ప్ర :** బత = అయ్యో! అంధ... మత్రమ్ : అంధకార = చీకటిలో, అర్పిత = ఉంచబడిన, దధి+అమత్రమ్ = పెరుగు గిన్నెను కూడా (భాండమావపనేऽమత్రం భాజనే పాత్రమిత్యభే - వైజయన్తీ - పురా - 62), 'అంధకారే అర్పితం దధ్నః అమత్రమ్), స్వ... లక్ష్మ్యా : స్వ = తనయొక్క, భాస్వత్ = ప్రకాశించెడి, నయన+అంత = కనుకొనలయొక్క, లక్ష్మ్యా = వెలుగుతో (స్వస్య భాస్వతే నయనయోః అంతయోః లక్ష్మీః, తయా), సమీక్షతే = చక్కగా చూడగలుగుతున్నాడు (సమ్+ఈక్ష దర్శనే ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.) ఏషః = ఈ, తవ బాలః = నీ కొడుకు, లోచనయోః = కళ్ళలో, పుష్పవన్తౌ = సూర్యచంద్రులను (ఏకయోక్త్యా పుష్పవన్తౌ దివాకరనిశాకరౌ - అమరకోశః - కాల - 10), బిభర్తి కిమ్? = భరిస్తున్నాడా ఏమిటి? (భృ - భరణే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** అయ్యో! (యశోదా!) మేము చీకట్లో పెట్టిన పాల గిన్నెలను కూడా నీ కొడుకు తన కనుకొనలవెలుగుతో చక్కగా తెలిసికొనగలుగుతున్నాడు. నీ కొడుకు కళ్ళలో సూర్య-చంద్రులున్నారా ఏమిటి?

**వి :** 1. సూర్యచంద్రులు పరమాత్మకళ్ళలో వుంటారు. ఈ విషయాన్ని సూచిస్తూ జగన్నాథుడు చేసిన కృష్ణస్తుతిని గమనించండి.

శ్లో॥ మిత్రాత్రిపుత్రనేత్రాయ త్రయీ శాత్రవశత్రవే ।
గోత్రారిగోత్రజత్రాయ గోత్రాత్రే తే నమో నమః ॥ - రసగంగాధరం - ప్రథమాననం.

| | | | |
|---|---|---|---|
| 2. **సమీక్షతే :** | **సమీక్షతే** | సమీక్షేతే | సమీక్షన్తే |
| | సమీక్షసే | సమీక్షేథే | సమీక్షధ్వే |
| | సమీక్షే | సమీక్షావహే | సమీక్షామహే |

| | | | |
|---|---|---|---|
| **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథ | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః. |

*

**శ్లో॥ మన్త్రాత్మా స కవాటమాశు వివృతం కర్తుం సమర్థో వృథా**
**బన్ధం నిత్యవిముక్తిదో రచయితుం విశ్వమ్భరోऽయం జగత్ ।**

**వక్త్రే దర్శయితుం కఠోరవచసాం విస్మాపనం కర్హిచి-**
**ద్బద్ధః పాటయితుం చ తద్విటపినో కిం దేవి! కుర్మో వయమ్ ॥ 3-58**

**అ :** గోపకాంతలు కృష్ణుని సామర్థ్యాన్ని తెలిపి తమ నిస్సహాయతను వ్యక్తం చేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** మంత్రాత్మా సః కవాటమ్ ఆశు వివృతం కర్తుం సమర్థః. నిత్య-విముక్తి-దః బంధం వృథా రచయితుం సమర్థః . విశ్వంభరః అయం జగత్ వక్త్రే దర్శయితుం సమర్థః. కఠోర-వచసాం విస్మాపనం కర్తుం సమర్థః. కర్హిచిత్ బద్ధః తద్విటపినః పాటయితుం చ సమర్థః. దేవి! వయం కిం కుర్మః.

**ప్ర :** మంత్ర+ఆత్మా = మంత్రస్వరూపుడైన (మన్త్రః స్వరూపం యస్య సః), సః = ఆ కృష్ణుడు, కవాటమ్ = తలుపును, ఆశు = వేగంగా (తూర్ణం త్వరితమాశు శీఘ్రమ్ - హలాయుధకోశః - 697), వివృతం కర్తుమ్ = తెరవటానికి, సమర్థః = శక్తి గలవాడు, నిత్య-విముక్తి-దః : నిత్య = ఎల్లప్పుడూ, విముక్తి-దః = ముక్తినిచ్చే కృష్ణుడు (నిత్యం విముక్తిం దదాతీతి), బంధమ్ = కట్టుబడిని, వృథా - రచయితుమ్ = వ్యర్థం చేయటానికి (రచ ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః = శక్తిగలవాడు, విశ్వంభరః = విశ్వాన్నే తనలో భరించే (విశ్వం బిభర్తి ఇతి), అయమ్ = ఈ కృష్ణుడు, జగత్ = ప్రపంచాన్ని, వక్త్రే = నోటిలో, దర్శయితుమ్ = చూపించటానికి (దృశ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః = శక్తిగలవాడు, కఠోర-వచసామ్ = నిష్ఠురోక్తులు గల మాకు (కఠోరాణి వచాంసి యాసాం తాసాం), విస్మాపనమ్ = ఏమరపాటును, కర్తుమ్ = చేయటానికి / కలిగించటానికి (కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః = శక్తిగలవాడు. కర్హిచిత్ = ఏదో ఒక రీతిగా, బద్ధః = కట్టివేయబడినా, తద్+విటపినః = ఆ చెట్లను, పాటయితుమ్ = పడగొట్టడానికి (పత్+ ణిచ్ - ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః = సమర్థుడు, దేవి! = యశోదా!, వయమ్ = మేము, కిం **కుర్మః** = ఏమి చేయగలం? (కృ కరణే పరస్మైపది - లట్ - ప్ర.బ.)

**తా ॥** యశోదా! నీ కొడుకు మంత్రస్వరూపుడు. వేసిన తలుపును వెంటనే తీయగలడు. నిత్యమూ ముక్తి, విముక్తి కలిగించగల తనను కట్టివేసినా దానిని దండగ చేయగలడు. తాను విశ్వంభరుడు. అందుకే తన నోటిలోనే జగత్తును చూపించగలడు. నిష్ఠురంగా మాటాడే మమ్ము ఏమరపాటుకు గురిచేయగలడు. ఏదో ఒక రీతిగా మేము కట్టిపడవేసినా (తాళ్ళను కట్టిన) చెట్లనే కూలదోయగలడు. మేమిక ఏం చేయగలం?

**వి :** 1. ఇక్కడ కృష్ణుని అల్లరి చేతలను ప్రకటిస్తున్న గోపకాంతలు తమకు తెలియకుండానే ముందు జరగబోయే ఎన్నో సంఘటనలను, వాటిలో కృష్ణుడు ప్రదర్శించబోయే సమర్థతను వివరిస్తున్నారు.

ఆశ్చర్యహేతువులయిన కృష్ణచర్యలు ఇక్కడ స్ఫురించటం అద్భుతరసానికి అవకాశం. అయితే ఆ అద్భుతరసం ప్రకృతమైన గోపికాగతమయిన అమర్షకు అంగమవుతుంది. అది ప్రేయోలంకారం. రసవదాద్యలంకారాలలో ఒకటి.

శ్లో॥ ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః ।
కావ్యే తస్మిన్నలంకారో రసాదిరితి మే మతిః ॥ - ధ్వన్యాలోకం - 2/5

2. **కుర్మః :**

| | | | |
|---|---|---|---|
| | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | **కుర్మః**. |

*

**శ్లో॥ ఇతి స్మ సంకీర్త్య సురాధిరాజం - వ్రజస్త్రియో భావివిముక్తిబీజమ్ ।**
**విలోలనేత్రం తమవేక్ష్య వాచః - శనైరలంచక్రురనేకభావాః ॥ 3-59**

**అ :** గోపికలు శ్రీకృష్ణునిపై తమ ఆరోపణలను ముగించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** వ్రజ–స్త్రియః భావి–విముక్తి–బీజం సురాధిరాజమ్ ఇతి స్మ సంకీర్త్య విలోల–నేత్రం తమ్ అవేక్ష్య అనేక–భావాః వాచః శనైః అలంచక్రుః

**ప్ర :** వ్రజ–స్త్రియః = గోపస్త్రీలు (వ్రజే స్త్రియః), భావి... బీజమ్ : భావి = జరగబోయే, విముక్తి = మోక్షానికి, బీజమ్ = కారణమైన (హేతుర్నా కారణం బీజమ్ - అమరకోశః - కాలవర్గం - 12) (భావినీ చ సా విముక్తిః, తస్యాః బీజమ్), సుర+అధిరాజమ్ = దేవతాధిరాజును – కృష్ణుని (సురాణాం అధిరాజః – తమ్), ఇతి స్మ = ఇలా (స్మ – వాక్యాలంకారం), సంకీర్త్య = ప్రస్తుతించి (సమ్ – కౄ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విలోల–నేత్రమ్ = చంచల నయనాలు గల (విలోలే నేత్రే యస్య సః), తమ్ = ఆ కృష్ణుని, అవేక్ష్య = చూచి (అవ+ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అనేక–భావాః : అనేక = ఎన్నో, భావాః = అభిప్రాయాలు గల (అనేకే భావాః యాసు తాః), వాచః = మాటలను, శనైః = మెల్లగా, అలంచక్రుః = అలంకరించిరి. (అలమ్ – కృ కరణే – పరస్మైపది – లిట్ – ప్ర.బ.).

**తా ॥** ఈ రీతిగా గోపకాంతలు తమ భావి విముక్తికి మూలమైన ఆ కృష్ణుని విషయాలను ప్రస్తుతించి అక్కడే కనిపిస్తున్న ఆ చంచలనేత్రుని చూచి అనేకాభిప్రాయాలు గల మాటలతో ఆ కృష్ణుని అలంకరించారు.

**వి :** 1. అంతవరకు ఆ గోపకాంతలు తమ ఉద్విగ్నతవలన అక్కడ కృష్ణుని ఉనికిని గమనించలేదు. దాదాపు తమ ఆలోచనలన్నీ ముగిసే సమయానికి కృష్ణుని గమనించారు. మిన్నకుండిపోయారు.

ఇంతవరకు సాగిన ఈ ఆరోపణల పరంపర భావాంతరగర్భితమై మనోరంజకంగా సాగిపోయింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అలంచక్రుః :** | అలంచకార | అలంచక్రతుః | **అలంచక్రుః** |
| | అలంచకర్థ | అలంచక్రథుః | అలంచక్ర |
| | అలంచకార/అలంచకర | అలంచకృవ | అలంచకృమ. |

*

**శ్లో॥ సదా సదానన్దసుతృప్తవృత్తే–ర్భవద్గృహస్థైర్నవనీతముఖ్యైః ।**
**సమా మమైషా మృదితీవ శంసన్ – మృదం జఘాస స్వవశోఽఖిలేశః ॥ 3–60**

**అ :** కృష్ణుడు మట్టి తినటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ–వశః అఖిలేశః సదా సదానంద–తృప్త–వృత్తేః భవద్గృహస్థైః నవనీత–ముఖ్యైః సమా మమ ఏషా మృత్ ఇతి శంసన్ ఇవ మృదం జఘాస.

**ప్ర :** స్వ–వశః = స్వతంత్రుడైన (స్వస్య వశః), అఖిల+ఈశః = సర్వేశ్వరుడైన కృష్ణుడు, సదా = ఎల్లప్పుడు, సదానంద (సత్+ఆనంద) = జ్ఞానానందాలచేత, సుతృప్త = పరిపూర్ణ తృప్తి పొందెడు, వృత్తేః = ప్రవర్తనగల (సత్ చ ఆనందశ్చ, తాభ్యాం సుతృప్తా వృత్తిః యస్య తస్య), మమ = నాకు, భవద్+గృహస్థైః =నీ ఇంటనున్న (భవతీనాం గృహేషు తిష్ఠంతి ఇతి తైః), నవనీత–ముఖ్యైః = వెన్న మొదలగు వానితో (నవనీతం ముఖ్యం యేషాం తైః), ఏషా = ఈ, మృత్ = మట్టి, సమా = సమానం, ఇతి = అని, శంసన్ + ఇవ = చెప్తున్నట్లుగా (శంస్ ధాతువుపై శతృప్రత్యయం), మృదమ్ = మట్టిని, జఘాస = తినెను. (అద్ భక్షణే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు స్వతంత్రుడు, సర్వేశుడు, సదానందంతో సదా తృప్తిపడే ప్రవృత్తి గలవాడు. అటువంటి తనకు ఆ గోపకాంతల ఇళ్ళలో వుండే వెన్న, పాలు, పెరుగు లాంటివి మట్టితో సమానమని చెప్తున్నట్లు అప్పుడు కృష్ణుడు మట్టి తిన్నాడు.

**వి :** 1. జ్ఞానానందమయుడయిన వానికి పదార్థ భేదముండదు.

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః।
యుక్త ఇత్యుచ్యతే యోగీ **సమలోష్టాశ్మకాంచనః** ॥ - భగవద్గీత - 6/8

జ్ఞాన విజ్ఞానాల వలన తృప్తి పొంది, జితేంద్రియుడై నిర్వికారుడై బంగారాన్ని, మట్టిబెడ్డను, రాయిని కూడా సమంగా చూడగలవాడే యోగి. కృష్ణుడు యోగి - యోగీశ్వరుడు కూడా.

| | | | |
|---|---|---|---|
| 2. **జఘాస :** | **జఘాస** | జక్షతుః | జక్షుః |
| | జఘసిథ | జక్షథుః | జక్ష |
| | జఘాస/జఘస | జక్షివ | జక్షిమ. |

*

**శ్లో॥ గోపీభిరాపాదితచౌర్యకర్మా - మాతుస్సమక్షం మహితస్త్రిలోక్యామ్ ।**
**మృత్స్నాం కిలాదద్వసుదేవసూను-ర్నాత్రాస్తి చోరత్వమితీవ హిన్వన్ ॥ 3-61**

**అ :** కృష్ణుని మృత్తికా భక్షణమే. -ఇంద్రవజ్ర.

**అ :** మాతుః సమక్షం గోపీభిః ఆపాదిత-చౌర్య-కర్మా త్రి-లోక్యాం మహితః వసుదేవ-సూనుః అత్ర మమ చోరత్వం న అస్తి కిల ఇతి హిన్వన్ ఇవ మృత్స్నామ్ అదత్.

**ప్ర :** మాతుః = తల్లి యొక్క, సమక్షమ్ = సన్నిధిలో, గోపీభిః = గోపకాంతలచే, ఆపాదిత-చౌర్య-కర్మా : ఆపాదిత = ప్రకటింపబడిన, చౌర్య = దొంగతన మనే, కర్మా = పనిగలవాడును (ఆపాదితం చౌర్యమ్ ఇతి కర్మ యస్య సః), త్రిలోక్యామ్ = మూడులోకాలలోనూ (త్రయాణాం లోకానాం సమాహారః - తస్యాం), మహితః = గొప్పవాడును అయిన, వసుదేవ-సూనుః = వసుదేవుని కొడుకు (కృష్ణుడు) (వసుదేవస్య సూనుః), అత్ర = ఇక్కడ/ ఈ విషయంలో/ మట్టితినే విషయంలో, మమ = నాకు, చోరత్వమ్ = దొంగతనం, న-అస్తి-కిల = లేదు గదా అని, హిన్వన్ = గుర్తు చేస్తూ (హి ధాతువుపై శతృప్రత్యయం), మృత్స్నామ్ = మంచి మట్టిని (మృన్మృత్తికా ప్రశస్తాసౌ మృత్స్నా మత్స్నేతి కథ్యతే - హలాయుధకోశః - 159), ఆదత్ = తినెను. (అద భక్షణే - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** తల్లి సమక్షంలో గోపికలందరూ తనకు చౌర్యాన్ని ఆపాదించినందులకు కృష్ణుడు కినుక వహించినట్లు కనిపించాడు. ముల్లోకాలలోనూ మేటి అయిన తాను ఈ మట్టిని తింటే దొంగతనాన్ని ఆరోపించలేరు గదా అని వారికి గుర్తుచేస్తూ మంచి మట్టిని తిన్నాడు.

**వి :** 1. పరులది వారి అనుమతి లేకుండా ఏది తీసికొన్నా తప్పే. కానీ విలువయిన వాటిని తీసికొంటేనే దొంగతనమంటాం. అందుకే మట్టిని తింటే దొంగతనాన్ని ఆరోపించలేరులే అని కృష్ణుని చేష్ట.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆదత్ :** | **ఆదత్** | ఆత్తామ్ | ఆదన్ |
| | ఆదః | ఆత్తమ్ | ఆత్త |
| | ఆదమ్ | ఆద్వ | ఆద్మ. |

*

**శ్లో॥ మృదం సమాస్వాద్య జగన్తి మాతుః - ప్రదర్శయామాస కిలాస్యదేశే ।**
**అహం సుపాత్రే రసయా ప్రదత్తా - సహస్రధాఽసౌ ఫలితేతి మన్యే ॥ 3-62**

**అ :** శ్రీకృష్ణుడు తననోట విశ్వాన్ని ప్రదర్శించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** (కృష్ణః) మృదం సమాస్వాద్య ఆస్య-దేశే మాతుః జగన్తి ప్రదర్శయామాస. అహం సుపాత్రే రసయా ప్రదత్తా అసౌ సహస్రధా ఫలితా - ఇతి మన్యే.

ప్ర : మృదమ్ = మట్టిని, సమాస్వాద్య = తిని (సమ్ – ఆ – సద్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఆస్య– దేశే = నోటిలో, మాతుః = తల్లికి, జగన్తి = లోకాలను, ప్రదర్శయామాస = చూపెను (ప్ర–దృశ్ – ప్రేక్షణే – ణిచ్ – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), అహమ్ = నేను, సుపాత్రే = మంచి యోగ్యునకు, రసయా = భూమిచేత, ప్రదత్తా అసౌ = ఇవ్వబడిన అది (ప్ర –దా ధాతువుపై క్త ప్రత్యయం), సహస్రధా = వేయిరెట్లుగా, ఫలితా = ఫలించినది, ఇతి = అని, మన్యే = భావిస్తున్నాను. (మన్ – జ్ఞానే – ఆత్మనేపది – లట్ – ఉ.ఏ.)

**తా ॥** కృష్ణుడు తాను మట్టితిని తల్లికి తన నోటిలో లోకాలనన్నింటినీ చూపించాడు. కృష్ణుడు దానయోగ్యుడు. అతనికి భూమి ఇచ్చిన ఆ మట్టి వేయిరెట్లుగా లోన వృద్ధి చెందిందని నేను భావిస్తున్నాను.

**వి :** 1. మూలంలో విశ్వరూపసందర్శన మిలా ఉంది.

శ్లో॥ సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధిభూగోళం సవాయ్వగ్నీందుతారకమ్ ॥

శ్లో॥ జ్యోతిశ్చక్రం జలం తేజో నభః స్వర్వియదేవ చ ।
వైకారికాణీంద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥ – భాగవతే 10/8/37,38

పోతన తెలుగులో ఇలా వర్ణించాడు. అయితే వేరే సన్నివేశమది.

క. ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధిపర్వతవన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్. – పోతనభాగవతం – 10/339

2. **మన్యే :**

| | | | |
|---|---|---|---|
| | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే |
| **ప్రదర్శయామాస :** | ప్రదర్శయామాస | ప్రదర్శయామాసతుః | ప్రదర్శయామాసుః |
| | ప్రదర్శయామాసిథ | ప్రదర్శయామాసథుః | ప్రదర్శయామాస |
| | ప్రదర్శయామాస | ప్రదర్శయామాసివ | ప్రదర్శయామాసిమ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చింతయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుక్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గ స్తృతీయో ముదామ్ ॥ 3–63**

వ్యాఖ్యానమంతా మొదటి సర్గలోని 67వ శ్లోకం వలెనే. మూడవ సర్గ అని పరిగణనం మాత్రమే అదనం.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమయిన శ్రీరుక్మిణీశ విజయ మహాకావ్యమందు మూడవ సర్గ. *

**శ్రీః**



# శ్రీః
# చతుర్థః సర్గః

శ్లో॥ ఉద్గచ్ఛత్కబరీప్రసూననికరాం వైరాగ్యభాగ్యప్రియః
సద్గీతాత్మయశోఽనువర్ణనపరాం జ్ఞానానుమోదీ హరిః ।
దధ్నో నిర్మథనోద్యతాం సముదితప్రేమాశ్రుధారాం నిజ-
ప్రేమ్ణా మన్దముపాజగామ జననీం భక్తైకవశ్యః ప్రభుః ॥ 4-1

**అవతారిక :** యశోదాకృష్ణుల ప్రేమబంధవర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అన్వయక్రమం :** ఉద్గచ్ఛత్కబరీప్రసూననికరాం సద్గీతాత్మయశోఽనువర్ణనపరాం దధ్నః నిర్మథనోద్యతాం వైరాగ్యభాగ్యప్రియః జ్ఞానానుమోదీ భక్తైకవశ్యః ప్రభుః హరిః నిజప్రేమ్ణా మందమ్ ఉపాజగామ.

**ప్రతిపదార్థం :** ఉద్గ... నికరామ్ : ఉద్గచ్ఛత్ = పైకి లేచి పడుతున్న (ఉత్ గమ్ ధాతువుపై శతృ ప్రత్యయం), కబరీ = కొప్పులోని, ప్రసూన = పూలయొక్క, నికరామ్ = సమూహం (మాల) గలదియు, (ఉద్గచ్ఛన్తి చ తాని కబర్యాం ప్రసూనాని, తేషాం నికరః యస్యాః తామ్), సద్గీతా... పరామ్ : సత్ = సజ్జనులచే, గీత = పాడబడిన, ఆత్మ = తనయొక్క, యశః = కీర్తియొక్క, అనువర్ణన = తిరిగి వర్ణించుటలో, పరామ్ = ఆసక్తిగలదియు (సద్భిః గీతం చ తత్ ఆత్మనః యశః, తస్య అనువర్ణనే పరా - తామ్), నిజ-ప్రేమ్ణా = తనమీది స్నేహంతో (ప్రేమ స్నేహోఽథ దోహదమ్ - అమరకోశః - నాట్య - 27), దధ్నః = పెరుగు యొక్క, నిర్మథన+ఉద్యతామ్ : నిర్మథన = చిలుకుటకు, ఉద్యతామ్ = ఉపక్రమించినదియు (నిర్మథనాయ ఉద్యతా - తామ్), సముదితప్రేమాశ్రుధారామ్ : సమ్+ఉదిత = కారుతున్న, ప్రేమ+అశ్రు = ప్రేమబాష్పాలయొక్క, ధారామ్ = ధారగలదియు అయిన (సముదితా ప్రేమ్ణః అశ్రూణాం ధారా యస్యాః తామ్), జననీమ్ = తల్లిని, వైరాగ్యభాగ్యప్రియః : వైరాగ్య = విరాగిత్వమే, భాగ్య = ఐశ్వర్యంగా గలవారికి, ప్రియః = ఇష్టమైన వారును (వైరాగ్యమేవ భాగ్యం యేషాం తేషాం ప్రియః), జ్ఞాన + అనుమోదీ = జ్ఞానాన్ని ఇష్టపడువాడును (జ్ఞానస్య అనుమోదీ), భక్త+ఏక-వశ్యః = భక్తులకు మాత్రమే లోబడు వాడును, ప్రభుః = సమర్థుడును అయిన, హరిః = కృష్ణుడు, నిజప్రేమ్ణా = తనయందలి స్నేహంతో, మందమ్ = మెల్లగా, ఉప+ఆ జగామ = సమీపించాడు (ఉప-ఆ-గమ్ గతౌ - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.).

**తాత్పర్యం ॥** యశోద పెరుగు చిలుకుతోంది. కొప్పులోని పూలు ఆ కదలికలతో అటు ఇటూ ఊగుతున్నాయి.

ఆమె హరికీర్తిని గానం చేయటంలో మునిగి పోయింది. స్నేహబాష్పాలు చిందుతున్నాయి. అటువంటి ఆమె దగ్గరకు వైరాగ్యమే భాగ్యంగా భావించే వారికి ఇష్టమైన వాడూ, జ్ఞానమంటే ఇష్టపడేవాడూ భక్తజనసులభుడూ, సమర్థుడూ అయిన కృష్ణుడు తనయందలి స్నేహంతో మెల్లగా సమీపించాడు.

**విశేషాలు :**1. వేకువన పెరుగు చిలకడమన్నది పాడి ప్రధానమైన ఇళ్ళలో సాధారణకృత్యం. ఆ సమయంలో పల్లెపదాలు పాడుకోవటం, పరమాత్మ స్తుతి గీతాలు ఆలపించటం అంతే సహజమైన పని. పసిపిల్లలు ఆ వేళలో ఒకవేళ నిదురలేస్తే అమ్మను వెతుక్కుంటూ రావటం కూడా అటువంటిదే. అయితే ఇక్కడ కృష్ణుని రాకకు కారణం ఆమెలోని ఆ వైరాగ్య మనటం వలన ఇది విభావనాలంకారం. '**అకారణాత్ కార్యజన్మ చతుర్థీ స్యాద్విభావనా**' (కు. 80). అదేరీతిగా కారణం కాని దానిని కారణంగా కవి భావించటం వలన హేతూత్ప్రేక్షాలంకారం. అయితే అది వాచ్యంగా లేదు కాబట్టి ధ్వని.

2.యశోద పెరుగు చిలకటాన్ని పోతన వర్ణించినతీరు.

సీ. కరకమలారుణకాంతిఁగవ్వఁపుఁద్రాడు - పవడంబునునుఁదీఁగె పగిది మెఱయఁ
ద్రమముతోరజ్జువాకర్షింపఁబాలిండ్లు - వీడ్వడి యొండొంటి వీఁక నొత్తఁ
గుచకుంభముల మీఁద కొంగుజాఱఁగ జిక్కు-వడుచు హారావళుల్ బయలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము - మంచుపైఁబడిన పద్మంబుఁదెగడ

తే. కౌను నులియంగ గంకణక్వణనమెసఁగ
దుఱుము బిగివీడిఁగర్ణికాద్యుతులు మెఱయ
బాలునంకించి పాడెదు పాటవలన
దరువులిగురొత్తఁబెరుఁగింతి దరువఁజొచ్చె. -పోతనభాగవతము 10/354

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపాజగామ :** | ఉపాజగామ | ఉపాజగ్మతుః | ఉపాజగ్ముః |
| | ఉపాజగిథ/ఉపాజగన్థ | ఉపాజగ్మథుః | ఉపాజగ్మ |
| | ఉపాజగామ/ఉపాజగమ | ఉపాజగ్మివ | ఉపాజగ్మిమ. |

*

**శ్లో॥ అఙ్కోజ్ఝితేన్దుప్రతిమాననం త-మఙ్కం సమారోప్య ముహుర్మృజన్తీ ।**
**పఙ్కం మనోజ్ఞాఙ్గగతం క్షుధార్త-శఙ్కా స్తనక్షీరమపాయయత్ సా ॥ 4-2**

**అ :** యశోద కృష్ణునకు వేకువన చనుబాలనిచ్చుట. -ఇంద్రవజ్ర.

**అ :** అంక+ఉజ్ఝిత+ఇందు-ప్రతిమాననం తమ్ అంకమ్ సమారోప్య మనోజ్ఞ + అంక-గతమ్ పంకమ్ ముహుః మృజన్తీ సా క్షుధార్తశంకా (సతీ) స్తనక్షీరమ్ అపాయయత్.

**ప్ర :** అంక... మాననమ్ : అంక = కళంకం చేత (ఉత్సంగచిహ్నయోరంకః - అమరకోశం - నానార్థ - 4), ఉజ్ఝిత = విడువబడిన, ఇందు = చంద్రునితో, ప్రతిమ = సమానమైన (సదృక్ సమానః సదృశః సదృక్షః ప్రఖ్యః ప్రకాశః ప్రతిమః ప్రకారః - హలాయుధకోశః - 694), ఆననమ్ = ముఖంగలిగిన (అంకేన ఉజ్ఝితః చ అసౌ ఇందుః, తేన ప్రతిమమ్ ఆననం యస్య తమ్), తమ్ = ఆ కృష్ణుని, అంకమ్ = ఒడిలోనికి, సమ్ + ఆరోప్య = ఎక్కించుకొని (సమ్ - ఆ - రుహ్ - ణిచ్ - ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మనోజ్ఞ+అంగ-గతమ్ : మనోజ్ఞ - మనోహరమయిన, అంగ = శరీరం పై, గతమ్ = అంటియున్న (మనోజ్ఞాని చ తాని అంగాని, తేషు గతః, తమ్), పంకమ్ = బురదను, ముహుః = మాటిమాటికీ, మృజన్తీ = తుడుస్తూ (మృజ్ ధాతువుపై శతృ ప్రత్యయం - స్త్రీలింగం), సా = ఆ యశోద, క్షుధా+ఆర్త - శంకా (సతీ) : క్షుధా = ఆకలితో, ఆర్త = బాధపడుతున్నాడేమో

అను, శంకా (సతీ) = సంశయించినదై (క్షుదార్తం శంకతే ఇతి), స్తన-క్షీరమ్ = చనుబాలను (స్తనయోః క్షీరమ్), అపాయయత్ = త్రాగించెను. (పా పానే ణిచ్ - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు చంద్రునితో సమానమయిన ముఖం గలవాడు. కానీ మచ్చలేని చంద్రుడు. ఆ కృష్ణుని ఒడిలోనికి తెచ్చుకొని యశోద అందమయిన ఆ శరీరానికి అంటిన బురదను తుడుస్తూ ఆకలితో వున్నాడేమో అని అనుమానించి చనుబాలనిచ్చింది.

**వి :** 1. కృష్ణుడు దోగాడుతూ వచ్చాడా? లేకపోతే బురద ఎలా అంటింది? లేక గతరాత్రి ఆటలు ఆడి అలసి అలాగే పడుకొని నిదురపోయిన కృష్ణునకు అంటిన బురదను (మట్టిని) ఇప్పుడు తుడుస్తోందా నిద్రాభంగం చేయటమిష్టం లేక? మొదటిదయితే విలాసం. ఇప్పటికే గోపకాంతల ఇళ్ళకు కూడా వెళ్ళి దొంగతనాలు ప్రారంభించాడు కాబట్టి. రెండవది అయితే సహజం. తల్లీబిడ్డా ఇద్దరూ అలసిపోవటం సహజమే కాబట్టి.

2. అంకోఙ్ఘితేందుప్రతిమాననమ్ - ఇక్కడ వ్యతిరేకాలంకారం. మచ్చలేని చంద్రుడని ఉపమేయ పక్షంలో విశేషాన్ని చెపుతూ పోలిక చెప్పినందువల్ల '**వ్యతిరేకో విశేషశ్చేదుపమానో-పమేయయోః**' - (కు.57).

మాతృక్రియా స్వభావాన్ని వర్ణించినందువల్ల స్వభావోక్త్యలంకారం కూడా. '**స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనమ్**' - (కు.160) మాతృప్రేమ ఇక్కడ చక్కగా ధ్వనిస్తోంది.

ఈ భావాన్ని పోతన తనదైన శైలిలో బాలచేష్టా స్వభావాన్ని కూడా జోడిస్తూ రెండు కంద పద్యాలలో ఇమిడ్చాడు.

క. సుడియుచు వ్రాలుచుఁ గిదుకుచు - సడిగొట్టుచు 'నమ్మరమ్మ' చన్నిమ్మనుచున్
వెడవెడగంతులువైచుచు - గడవఁగదిసి బాలకుండు కవ్వముబట్టెన్.

క. కవ్వముఁబట్టిన ప్రియసుతు - నవ్వనరుహనేత్రి దిగిచి యంకతలమునన్
నవ్వుచు నిడికొని కూఁకటి -దువ్వుచుఁజన్నిచ్చె నతఁడు దూఁటుచుఁ గుడిచెన్.

- పోతనభాగవతం 10/356,357

| | | | |
|---|---|---|---|
| 3. **అపాయయత్ :** | **అపాయయత్** | అపాయయతామ్ | అపాయయన్ |
| | అపాయయః | అపాయయతమ్ | అపాయయత |
| | అపాయయమ్ | అపాయయావ | అపాయయామ |

*

**శ్లో॥ తదను దహనవేగాదుత్స్రవత్క్షీరలోభాత్**
**మధుజితమపహాయాజానతీ సా జగామ ।**
**హరిరపి సమయార్హాం హానిమస్యై ప్రదాతుం**
**వ్యభజత దధిభాండం క్షిప్తపాషాణఖణ్డః ॥ 4-3**

**అ :** చిలుకుతూ చిలుకుతూ యశోద వదలిన పెరుగుకుండను కృష్ణుడు పగులగొట్టడం. -మాలిని.

**అ :** తదను దహన-వేగాత్ ఉత్స్రవత్-క్షీర-లోభాత్ మధు-జితమ్ అపహాయ అజానతీ సా జగామ. హరిః అపి అస్యై సమయార్హాం హానిం ప్రదాతుం క్షిప్త-పాషాణ-ఖండః (సన్) దధి-భాండం వ్యభజత.

**ప్ర :** తద్+అను = ఆ తరువాత, దహన-వేగాత్ : దహన = అగ్నియొక్క, వేగాత్ = వేగం వలన (వేడి పెరిగినందు వలన) (దహనస్య వేగః, తస్మాత్), ఉత్స్ర... లోభాత్ : ఉత్స్రవత్ = పొంగుతున్న, క్షీర = పాలమీద, లోభాత్ = ఆశవలన (పాలు పొంగకుండా ఆపాలని), (ఉత్స్రవచ్చ తత్ క్షీరం, తస్మిన్ లోభః, తస్మాత్), మధు-

జితమ్ = కృష్ణుని (మధుం జితవానితి – తమ్), అపహాయ = విడిచి (అప హా–ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అజానతీ = తెలియనిదై, సా=ఆ యశోద, జగామ = వెళ్ళింది (గమ్ – గతౌ పరస్మైపది లిట్ – ప్ర.ఏ.), హరిః+అపి = కృష్ణుడు కూడా, అస్యై = ఆమెకు, సమయ+అర్హామ్ = అప్పటికి తగిన (సమయస్య అర్హా, తామ్), హానిమ్ = నష్టాన్ని, ప్రదాతుమ్ = ఇవ్వటానికి (ప్ర–దా ధాతువుపై తుమున్ ప్రత్యయం), క్షిప్త–పాషాణ–ఖండః(సన్) : క్షిప్త = వేయబడిన, పాషాణ = రాతియొక్క, ఖండః సన్ = ముక్క గలవాడై (క్షిప్తః పాషాణస్య ఖండః యేన సః), దధి–భాండమ్ = పెరుగుకుండను (దధ్నః భాండమ్), వి+అభజత = పగులగొట్టెను (వి–భజ్ సేవాయాం – పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.).

**తా ॥** యశోద అలా పాలిస్తున్నప్పుడు పొయ్యిలో వేడి పెరిగి మీద కాగుతున్న పాలు పొంగాయి. పొంగుతున్న ఆ పాలపొంగును ఆపాలన్న తొందరలో యశోద పాలుత్రాగుతున్న కృష్ణుని విడిచిపెట్టి వెళ్ళింది. ఆమె అలా చేసినందుకు వెంటనే ఆమెను శిక్షించాలనుకొన్న కృష్ణుడు – హాని కల్గించదలచి – ఒకరాతిముక్కను ఆ పెరుగు కుండలోనికి విసిరి దానిని పగులగొట్టాడు.

**వి :** 1. అజానతీ – తెలియనిదై – ఏమని? కృష్ణుని పరమాత్మ తత్త్వం తెలియనిదై – కారణం –

శ్లో॥ త్రయ్యా చోపనిషద్భిశ్చ సాంఖ్యయోగైశ్చ సాత్త్వతైః ।
ఉపగీయమానమాహాత్మ్యం హరిం సాఽమన్యతాత్మజమ్ ॥ –భాగవతం 10/9/45

ఆ మహాత్ముని ఆమె తనకుమారుడనే భావిస్తోంది మరి.

తెనుగుదనంతో కూడిన పోతన కథనాన్ని చూడండి.

మ. కడుపారంజనుబాలుద్రావని సుతున్ గంజాక్షి పీఠంబుపై
నిడి పొంగారెడు పాలుదించుటకునై యేఁగంగఁదద్బాలుఁడె
క్కుడు కోపంబున వాఁడిఱాత దధిమత్కుంభంబు వోఁగొట్టి తెం
పడరం గుంభములోని వెన్నదినె మిథ్యాసంకులద్బాష్పుఁడై. –పోతనభాగవతం10/358

ఈ రెండింటికి **మూలం**

శ్లో॥ తమంకమారూఢమపాయయత్ స్తనం – స్నేహస్రుతం సస్మితమీక్షతీ ముఖమ్ ।
అతృప్తముత్సృజ్య జవేన సా యయా–వుత్సిచ్యమానే పయసి త్వధిశ్రితే ॥

శ్లో॥ సంజాతకోపః స్ఫురితారుణాధరం – సందశ్య దద్భిర్దధిమండభాజనమ్ ।
భిత్త్వా మృషాశ్రుర్దృషదశ్మనా రహో – జఘాస హైయంగవమంతరం గతః ॥ –భాగవతమ్ 10/10/5,6

2. **జగామ :** 4–1వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **వ్యభజత :** | **వ్యభజత** | వ్యభజేతామ్ | వ్యభజన్త |
| | వ్యభజథాః | వ్యభజేథామ్ | వ్యభజధ్వమ్ |
| | వ్యభజే | వ్యభజావహి | వ్యభజామహి. |

*

**శ్లో॥ దదౌ బిడాలాయ జనన్యదృష్ట–స్తదా స్వనీతం నవనీతజాతమ్ ।**
**క్షిణోతి నూనం ధనలోభభాజాం – ధనాన్యనర్థాత్స్వితిదిశ్య దేవః ॥ 4–4**

**అ :** కృష్ణుని ఆంతర్యాన్ని కవి ప్రకటించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** (కృష్ణః), జనన్యదృష్టః (సన్) తదా స్వ-నీతం నవనీత-జాతం బిడాలయ దదౌ. దేవః ధన-లోభ-భాజాం ధనాని అనర్హత్సు అతిదిశ్య క్షిణోతి నూనమ్.

**ప్ర :** కృష్ణః = కృష్ణుడు, జననీ+అదృష్టః (సన్) = తల్లికి కనిపించకుండా (జనన్యాః అదృష్టః), తదా = అప్పుడు, స్వ+నీతమ్ = తాను తెచ్చిన, నవనీత-జాతమ్ = వెన్న ముద్దలను (నవనీతస్య జాతమ్), బిడాలయ = పిల్లికి, దదౌ = ఇచ్చాడు. (దా దానే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), దేవః = పరమాత్మ/నారాయణుడు, ధన-లోభ-భాజామ్ = ధనవిషయంలో పిసినారుల యొక్క (ధనే లోభః, తం భజన్తే ఇతి, తేషాం), ధనాని = సొమ్ములను, అనర్హత్సు = తగనివారికి, అతిదిశ్య = ఇచ్చి (అతి - దిశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), క్షిణోతి = నశింపజేయును. (క్షి హింసాయాం పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), నూనమ్ = నిశ్చితం.

**తా ॥** తల్లి కనుమరుగు కాగానే కృష్ణుడు ఆమెకు తెలియకుండా వెళ్ళి తాను తెచ్చిన వెన్న ముద్దలను పిల్లులకు పెట్టాడు. లోభుల ధనాన్ని తగనివారికి అందించి దేవుడు వాటిని నాశనం చేయటం నిశ్చితం కదా!

**వి :** 1. '**నీ పిండం పిల్లులకు పెట్టా**' అని తెలుగులో ఒక సామెత. పిల్లులకు పెట్టడమంటే అంత విలువలేకుండా చేయడమని అర్థం కావచ్చు. ఇక్కడ శ్లోకంలో కూడా కృష్ణుడు వెన్నముద్దలను పిల్లికి పెట్టాడట. అంటే ధనలోభంతో ఉన్నవారు కూడబెట్టిన ధనాన్ని దైవం అనర్హులకు అందజేస్తుందని భావమట. అంటే యోగ్యప్రాప్తి అన్న పుణ్యానికి కూడా అవకాశం లేకుండా చేయటం.

క. దానము భోగము నాశము
పూనికతో మూడు గతులు భువిధనమునకున్
దానము భోగము నెఱుగని
దీనుని ధనమునకు గతి తృతీయమె పొసఁగున్ - నీతిశతకం - ఏనుగు లక్ష్మణకవి.

తృతీయ మంటే - ఇక్కడ నశించిపోవటం.

ప్రకృతం యశోద దానభోగాలకు అతీతంగా వెన్నను కూడబెడుతోందా? లేదు. కానీ వెన్నమీది లోభంతో పరమాత్మను నిరాదరించింది. కాదు వెన్నమీది లోభంతో పాలు-త్రాగుతున్న పసివానిని ప్రక్కనపెట్టింది. పసివాడు పరమాత్మయే గదా!

2. ఈ శ్లోకంలో ఉత్తరార్ధంతో పూర్వార్ధాన్ని బలపరిచాడు కవి. పూర్వార్ధం విశేషం ఉత్తరార్ధం సామాన్యం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' (కు.122) సామాన్య విశేషాలను రెండింటినీ కలిపి చెప్పటం అర్థాంతరన్యాసం.

3. భాగవతం మూలంలో వెన్నను తానే తిని ఆ తరువాత ప్రక్క ఇంటిలో వెన్నను కోతికి పెట్టినట్లుంది.

శ్లో॥ ఉలూఖలాంఘ్రేరుపరి వ్యవస్థితం - మర్కాయ కామం దదతం యథేప్సితమ్ ।
హైయంగవం చౌర్యవిశంకితేక్షణం - నిరీక్ష్య పశ్చాత్ సుతమాగమచ్ఛనైః ॥ - భాగవతం 10/10/8

ఆ. వికచకమలనయన వేఱొక యింటిలో
వెలియ ఱోలు దిరుగవేసి యెక్కి
యుట్టిమీఁది వెన్న నులుకుచు నొక కోఁతి
పాలుసేయుచున్న బాలుఁగనియె. - పోతనభాగవతం 10/360

అయితే ప్రకృతకావ్యంలో కవి పిల్లికి పెట్టించటం కూడా జనసామాన్యంలోని అభిప్రాయం మేరకు మనోరంజకంగా కనిపిస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 4. **దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః | |
| | దదిథ/దదాథ | దదథుః | దద | |
| | దదౌ | దదివ | దదిమ. | |
| **క్షిణోతి :** | **క్షిణోతి** | క్షిణుతః | క్షిణ్వన్తి | |
| | క్షిణోషి | క్షిణుథః | క్షిణుథ | |
| | క్షిణోమి | క్షిణువః/క్షిణ్వః | క్షిణుమః/క్షిణ్మః. | * |

**శ్లో॥ విచారభారార్పితమానసాఽథో - విమర్శలభ్యం తమవేక్ష్య మాతా ।**
**అనువ్రజన్త్యస్పృశదప్యగమ్యం - పరానుయాత్రార్జితపుణ్యపాత్రీ ॥ 4-5**

**అ :** యశోద కృష్ణుని పట్టుకొనగలగటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథో విచార-భారార్పిత-మానసా మాతా విమర్శలభ్యం తమ్ అవేక్ష్య అనువ్రజన్తీ పరానుయాత్రార్జిత-పుణ్య-పాత్రీ (సతీ) అగమ్యమ్ అపి అస్పృశత్.

**ప్ర :** అథో = ఆ తరువాత, విచార... మానసా : విచార = ఆలోచనలయొక్క, భార = బరువుపై, అర్పిత = పెట్టబడిన, మానసా = మనస్సుగల (విచారస్య భారః, తస్మిన్ అర్పితం మానసం యయా సా), మాతా = తల్లి అయిన యశోద, విమర్శ-లభ్యమ్ = వెదుకులాటకు దొరికే (విమర్శైః లభ్యః - తామ్), తమ్ = ఆ కృష్ణుని, అవేక్ష్య = చూచి (అవ - ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అనువ్రజన్తీ = వెనుకనే నడుస్తూ (అను వ్రజ ధాతువుపై శతృ ప్రత్యయం), పరా... పాత్రీ :పర = పరమాత్మయొక్క, అను-యాత్ర = వెంటబడుట చేత, ఆర్జిత = సంపాదింపబడిన, పుణ్య = పుణ్యఫలానికి, పాత్రీ (సతీ) = తగినదై (పరస్య అనుయాత్రా - తయా ఆర్జితం చ తత్ పుణ్యం, తస్య యోగ్యా), అగమ్యమ్ - అపి = అందరాని వాడైనను, అస్పృశత్ = పట్టుకొనెను (స్పృశ్ సంస్పర్శనే - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** ఆ పై యశోద వెదుకులాటకు (అన్వేషణకు) మాత్రమే అందే స్వభావమున్న ఆ కృష్ణుని వెదకటం మీదనే దృష్టి పెట్టింది. ఆ పరమాత్మయొక్క వెంటబడటం (అనుసరణం) ద్వారా వచ్చే ఫలితాన్ని పొందటానికి అర్హతను పొందింది. కృష్ణుడు కనిపించాడు. అయోగ్యులు ఆయనను చేరలేరు. యశోద వెంటబడి పట్టుకొంది.

**వి :** 1. పరానుయాత్రచే సంపాదింపబడిన పుణ్యఫలితంగా కృష్ణుడు చిక్కినట్లు వర్ణించటం హేతు సంభావన. యశోద పసివాని వెంటబడి పట్టుకొన్నది మామూలుగా. దానిని పుణ్యకర్మఫలంగా చెప్పటం హేతూత్ప్రేక్షాలంకారం. **'సంభావనా స్యాదుత్ప్రేక్షావస్తు హేతు ఫలాత్మనా'** - (కు. 32)

తెలిసి చేసినా, తెలియక చేసినా పరానుసరణం ఫలప్రదమే.

2. విమర్శలభ్యుడు పరమాత్మ. విమర్శ అంటే అంతరన్వేషణ. సాధారణంగా భావించే తర్కం కాదు. ఎందుకంటే **'నైషా తర్కేణ మతిరాపనేయా'** అని పరతత్వం తర్కాని కందనిదని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి.

3. కృష్ణుని పట్టుకోవటానికి యశోద పడిన పాట్లను పోతన వర్ణించిన తీరు-

మ. స్తనభారంబున దస్సి క్రుస్సి యసదై జవ్వాడు మధ్యంబుతో
జనితస్వేదముతోఁ జలత్కబరితో స్రస్తోత్తరీయంబుతో
వనజాతేక్షణ కూడఁబాఱి తిరిగెన్ వారించుచున్ వాకిటన్
ఘనయోగీంద్రమనంబులున్ పెనుకొనంగా లేని లీలారతున్. - పోతనభాగవతం 10/369

| | | | |
|---|---|---|---|
| 4. **అస్పృశత్ :** | **అస్పృశత్** | అస్పృశతామ్ | అస్పృశన్ |
| | అస్పృశః | అస్పృశతమ్ | అస్పృశత |
| | అస్పృశమ్ | అస్పృశావ | అస్పృశామ. |

*

**శ్లో॥ యదీయనామ స్మరతాం జనానాం - బిభేత్యసహ్యోఽపి హి దణ్డపాణిః ।**
**అభీషయద్విశ్వసృజాం వరిష్ఠం - గృహీతదణ్డా కిల నన్దరాజ్ఞీ ॥ 4-6**

**అ :** యశోద కృష్ణుని బెదిరించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అసహ్యః దండ-పాణిః అపి యదీయ-నామ స్మరతాం జనానాం బిభేతి హి. (తం) విశ్వసృజాం వరిష్ఠం నందరాజ్ఞీ గృహీత-దండా (సతీ) అభీషయత్ కిల.

**ప్ర :** అసహ్యః = సహింపరాని, దండపాణిః+అపి = యముడు కూడా, (కాలో దండధరః శ్రాద్ధదేవో వైవస్వతోఽంతకః - అమరకోశం - స్వర్గ - 59), యదీయనామ : యదీయ = ఎవని యొక్క, నామ = పేరును (యదీయస్య నామ - తత్), స్మరతామ్ = తలచుకొనెడి, జనానామ్ = జనులకు, బిభేతి = భయపడునో (భీ భయే పరస్మైపది - లట్ - (ప్ర.ఏ.), తమ్ = అటువంటివానిని, విశ్వ-సృజామ్ = విశ్వసృష్టికర్తలలో (విశ్వం సృజన్తి ఇతి, తేషామ్), వరిష్ఠమ్ = శ్రేష్ఠుడైన కృష్ణుని, నంద-రాజ్ఞీ = నందుని రాణి (యశోద) (నందస్య రాజ్ఞీ), గృహీత-దండా = కర్రపట్టుకొన్నదై (గృహీతాః దండః యయా సా), అభీషయత్ కిల = భయపెట్టింది గదా! (భీ భయే ణిచ్ - పరస్మైపది - లఙ్ - (ప్ర.ఏ.)

**తా ॥** పాపకృత్యాలు చేసేవారు యముని సహింపలేరు. అటువంటి యముడు కూడా నారాయణనామస్మరణ చేసేవారిని చూచి భయపడతాడు. అటువంటి నారాయణ స్వరూపుడైన కృష్ణుని కూడా నందుని సతి యశోద చేత కర్ర పట్టుకొని దండింపగలిగింది గదా!

**వి :** 1. యశోద ఉత్కృష్టతను ఈ శ్లోకం వివరిస్తోంది. యముడు - విష్ణుభక్తులు (విష్ణురు) - యశోద ఈ ముగ్గురిలో ఉత్తరోత్తరం ఉత్కృష్టం. కాబట్టి ఇది సారాలంకారం. '**ఉత్తరోత్తరముత్కర్షః సార ఇత్యభిధీయతే**' - (కు.108). 'నందరాజ్ఞీ' అన్నది సాభిప్రాయ విశేష్యం. తాను రాజపత్ని కాబట్టి దండింపదగిన వారిని దండించే అధికారం తన కుంటుంది. అందుకే అల్లరిచేసిన కృష్ణుని దండించటానికి సిద్ధపడింది. ఇది పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయవిశేష్యే తు భావేత్పరికరాంకురః**' - (కు.63).

2. విష్ణుభక్తుని తాకటానికి తనకు కూడా అధికారం లేదంటూ యముడు ప్రకటించిన విధానం చూడండి-

శ్లో॥ వసతి మనసి యస్య సోవ్యయాత్మా - పురుషవరస్య న తస్య దృష్టిపాతే ।
తవగతిరథవా **మమాస్తి** చక్ర - పతిహతవీర్యబలస్య సోఽన్య లోకః ॥ - విష్ణుపురాణం-3/7/34.

| | | | |
|---|---|---|---|
| 3. **బిభేతి :** | **బిభేతి** | బిభితః/బిభీతః | బిభ్యతి |
| | బిభేషి | బిభిథః/బిభీథః | బిభిథ/బిభీథ |
| | బిభేమి | బిభివః/బిభీవః | బిభిమః/బిభీమః |
| **అభీషయత్ :** | **అభీషయత్** | అభీషయతామ్ | అభీషయన్ |
| | అభీషయః | అభీషయతమ్ | అభీషయత |
| | అభీషయమ్ | అభీషయావ | అభీషయామ. |

*

**శ్లో॥ అజాణ్డకోట్యాశ్రయరోమకూపం - తమాత్తకోపా కిల నన్దగోపీ ।**
**ఇయేష బద్ధుం న హి రోషరుద్ధం - మనో మినోత్యప్యమరానుభావమ్ ॥4-7**

**అ :** యశోద కృష్ణుని బంధింపగోరుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఆత్త–కోపా నంద–గోపీ అజాండ–కోట్యాశ్రయ–రోమ–కూపం తం బద్ధుమ్ ఇయేష. హి. రోష–రుద్ధం మనః అమరానుభావమ్ అపి న మినోతి.

**ప్ర :** ఆత్త–కోపా = కోపించిన (ఆత్తః కోపః యయా సా), నందగోపీ = నందగోపస్త్రీ/యశోద (నందగోపస్య ఇయం), అజా... కూపమ్ : అజ+అండ = బ్రహ్మాండాలయొక్క, కోటి = సమూహానికి, ఆశ్రయ = ఆధారమైన, రోమ = కురులయొక్క, కూపమ్ = మొదళ్ళు గల వాడయిన (అజస్య అండాని, తేషాం కోటిః, తస్య ఆశ్రయః చ అసౌ రోమ్ణాం కూపః, తమ్), తమ్ = ఆ కృష్ణుని, బద్ధుమ్ = కట్టివేయడానికి, ఇయేష = అభిలషించింది (ఇష ఇచ్ఛాయామ్ – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), హి = అది తగినదే, రోష–రుద్ధమ్ : రోష = కోపంచేత, రుద్ధమ్ = అడ్డగింపబడిన (రోషేణ రుద్ధమ్), మనః = మనస్సు, అమర+అనుభావమ్ : అమర = దేవతలకు కూడా, అనుభావమ్ = సామర్థ్యరూపుడైన కృష్ణుని కూడా (అమరాణాం అనుభావః యస్మాత్ తమ్), న మినోతి = లెక్క చేయదు. (మి ప్రక్షేపణే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.).

**తా ॥** కోటిబ్రహ్మాండాలకు ఆశ్రయమైన రోమకూపాలు గలిగిన ఆ కృష్ణుణ్ణి కట్టిపడ వేయాలనుకొన్నది ఆ యశోద. నిజమే మరి. రోషం మనఃప్రవృత్తిని అడ్డుకొంటే దేవతలకు కూడా శక్తిసంధాయకుడైన ఆదిదేవుని కూడా లెక్కచేయం.

**వి :** 1. శ్లో॥కామ ఏషః క్రోధ ఏషః రజోగుణసముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ – భగవద్గీత – 3/37

రజోగుణం నుండి పుట్టిన కామక్రోధాలు ఎంతతిన్నా కడుపు నిండనివి. అందుకే పరమాత్మను పరిగణించని స్థితికి తీసికొనిపోయింది యశోదను ఆ కోపం.

2. ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారముంది. యశోద పసివానిపై కోపంతో బంధించాలను కోవటం విశేషాంశం. మనస్సు కోపానికి లోనైతే పరమాత్మనైనా పరిగణించదన్నది సామాన్యాంశం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**' – (కు. 122). విశేష సామాన్యాలు రెండూ పరస్పరపూరకాలుగా ఉండటం వలన అర్థాంతరన్యాసం.

| | | | |
|---|---|---|---|
| 3. **ఇయేష :** | **ఇయేష** | ఈషతుః | ఈషుః |
| | ఇయేషిథ | ఈషథుః | ఈష |
| | ఇయేష | ఈషివ | ఈషిమ |
| **మినోతి :** | **మినోతి** | మినుతః | మిన్వన్తి |
| | మినోషి | మినుథః | మినుథ |
| | మినోమి | మినువః/మిన్వః | మినుమః/మిన్మః. |

*

**శ్లో॥ కృతాగసం తం కిల నైవ మాతా – శశాక బద్ధుం మమ తు ప్రతర్కః ।**
**తదీయరమ్యోదరమధ్యసంస్థ–విముక్తశక్త్యైవ న బన్ధ ఆసీత్ ॥ 4–8**

**అ :** యశోద కృష్ణుని బంధింపలేక పోవటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** మాతా కృతాగసం తం బద్ధుం న ఏవ శశాక కిల. మమ ప్రతర్కః తు తదీయ–రమ్యోదర–మధ్య–సంస్థ–విముక్త–శక్త్యా ఏవ బంధః న ఆసీత్.

**ప్ర :** మాతా = తల్లి అయిన యశోద, కృత+అగసమ్ : కృత = చేయబడిన, అగసమ్ = తప్పుగలిగిన (కృతమ్ అగః యేన తమ్), తమ్ = ఆ కృష్ణుని, బద్ధుమ్ = బంధించటానికి, న+ఏవ–**శశాక** = శక్తి చాలనిదయింది. (శక్ – శక్తౌ పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), మమ = నా యొక్క, ప్రతర్కః+తు = అభిప్రాయమయితే, తదీయ...

శక్త్యా–ఏవ : తదీయ = ఆ కృష్ణునియొక్క, రమ్య = అందమైన, ఉదర = పొట్టయొక్క, మధ్య = మధ్యలో, సంస్థ = ఉన్నట్టి, విముక్త = ముక్తినందినవారియొక్క, శక్త్యా+ఏవ = శక్తిచేతనే (తదీయం చ తత్ రమ్యం చ ఉదరం తస్య మధ్యే సంస్థితాః చ తే ముక్తాః, తేషాం శక్తిః, తయా), బంధః = కట్టుబాటు, న+ఆసీత్ = కుదరలేదు.

**తా ॥** కృష్ణుడు తప్పుచేసినా ఆ తల్లి యశోద తనను బంధించలేక పోయింది. ఎందుకంటే కృష్ణుని ఉదరంలో లోకాలున్నాయి గదా! ఆ లోకాలలోని విముక్తులందరూ అక్కడ ఉన్నారు. కాబట్టి అప్పటికే వారు విముక్తి నందినవారు కాబట్టి ఇక కృష్ణుణ్ణి బంధించటం కుదరలేదు.

**వి :** 1. భగవద్భక్తి కన్న భగవద్భక్తుల శక్తి మిన్న. కాబట్టి కృష్ణుడు బందీ కాకపోవటానికి కృష్ణుని శక్తికన్న కృష్ణభక్తుల శక్తియే కారణంగా నిలిచింది.

2. '**మమ తు ప్రతర్కః**' అంటూ తన ఊహగా వాచ్యంగానే చెప్పినందువలన ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం. కృష్ణుడు బంధింపబడకపోవటానికి కారణాన్ని తన ఊహగా కవి ప్రకటించటం చమత్కారం.

| | | | |
|---|---|---|---|
| 3. **శశాక :** | శశాక | శేకతుః | శేకుః |
| | శేకిథ | శేకథుః | శేక |
| | శశాక/శశక | శేకివ | శేకిమ |
| **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ సాశాం ముహుః స్వప్రసువం విధాతు–మీశత్వమప్యాత్మగతం ముకున్దః ।**
**బన్ధం రుణద్ధి స్మ తదాత్తదామ – సందర్శయన్ స్వాత్మని కిఞ్చిదూనమ్ ॥ 4–9**

**అ :** తన ఈశత్వానికి భంగం లేకుండా కృష్ణుడు తల్లి సంకల్పానికి కట్టుబడటం. –ఇంద్రవజ్ర.

**అ :** ముకుందః స్వ–ప్రసువం ముహుః సాశాం విధాతుమ్ ఈశత్వమపి ఆత్మ–గతం విధాతుం తదాత్త–దామ స్వాత్మని కించిదూనం సందర్శయన్ బంధం రుణద్ధి స్మ.

**ప్ర :** ముకుందః = కృష్ణుడు, స్వప్రసువమ్ = తన తల్లిని (స్వం ప్రాసూత ఇతి స్వప్రసూః, తామ్) (జనయిత్రీ ప్రసూర్మాతా జననీ – అమరకోశం – మనుష్య – 29), ముహుః = పదే పదే, సాశామ్ = ఆశతో కూడిన దానినిగా (ఆశయా సహితా సాశా, తామ్), విధాతుమ్ = చేయుటకు (వి–ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఈశత్వమ్+అపి = జగన్నియామకత్వాన్ని కూడా, ఆత్మగతమ్ = తనయందే నిలిచినదిగా, విధాతుమ్ – అపి = చేయటానికి, తద్–ఆత్త–దామ : తత్ = ఆ యశోదచే, ఆత్త = పొందబడిన, దామ = త్రాటిని (తయా ఆత్తం చ తత్ దామ), స్వ+ఆత్మని = తనలో, కించిత్+ఊనమ్ = కొంచెం తక్కువగా, సందర్శయన్ = చూపుతూ, బంధమ్ = కట్టును, రుణద్ధి (స్మ) = అడ్డగించాడు. (రుధ్ ఆవరణే పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన తల్లి ఆశను పదే పదే ఫలించేటట్లు చేయాలి. అదే సమయంలో తన ఈశ్వరత్వానికి భంగం కలుగకూడదు. అందుకని యశోద (ఒకదాని వెంట ఒకటిగా) త్రాళ్ళను కడుతున్నా తనకూ ఆ త్రాటికీ మధ్య రెండంగుళాల వ్యవధానముండేటట్లు చూసుకొంటూ కట్టుబడుతున్నాడు.

**వి :** 1."నా ముద్దియ ముద్దులపట్టి యుదరంబు గట్ట నదరుచుఁజదరంబుగఁ జక్క నొక్క త్రాడుసుట్టిన నది రెండంగుళంబులు గడమపడియె, మఱియు నొక్క బంధంబు సంధించి వలగొనిన నంతియ కొఱంత యయ్యె వెండియు నొక్క పాశంబు గూర్చి పరివేష్టించిన, వెల్తి సూపె." – పోతనభాగవతం 10/382

ఇదంతా యశోద కృష్ణుని బంధించటానికి చేసిన ప్రయత్నం. ఎన్నిత్రాళ్ళను తెచ్చి కట్టబోయినా ఏ త్రాడూ బొజ్జతిరిగి రాలేదట.

| | | | |
|---|---|---|---|
| 2. **రుణద్ధి :** | **రుణద్ధి** | రున్ధః | రున్ధన్తి |
| | రుణత్సి | రున్ధః | రున్ధ |
| | రుణధ్మి | రున్ధ్వః | రున్ధ్మః. |

*

**శ్లో॥ సుతో న మేఽయం హరిరేవ సాక్షా–దితి ప్రబోధేఽఙ్కురితే పురన్ధ్రీ ।**
**బబన్ధ నన్దస్య బలానుజం తం – బుధైర్నిబద్ధం ప్రణయాఖ్యరజ్జ్వా ॥ 4–10**

**అ :** యశోదకు పరమాత్మభ్రాంతిని క్షణం కలిగించి మరల వాస్తవస్థితికి తెచ్చుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** అయం మే సుతః న సాక్షాత్ హరిః ఏవ ఇతి ప్రబోధే అంకురితే నన్దస్య పురంధ్రీ బుధైః ప్రణయాఖ్య–రజ్జ్వా నిబద్ధం తం బలానుజం బబన్ధ.

**ప్ర :** అయమ్ = ఈ కృష్ణుడు, మే = నా యొక్క, సుతః = కొడుకు, న = కాదు, సాక్షాత్ = ప్రత్యక్షంగా, హరిః ఏవ = నారాయణుడే, ఇతి = అని, ప్రబోధే = జ్ఞానం, అంకురితే (సతి) = పుట్టగా, నన్దస్య = నందునియొక్క, పురంధ్రీ = కాంత (యశోద) (రామా వామా వామనేత్రా పురంధ్రీ – హలాయుధకోశః – 481), బుధైః = పండితుల చేత, ప్రణయ+ఆఖ్య–రజ్జ్వా = ప్రేమ అనే త్రాటిచే (ప్రణయ ఇతి ఆఖ్యా, సా చ అసౌ రజ్జుః, తయా), నిబద్ధమ్ = బంధింపబడిన (ని బధ్ ధాతువుపై క్త ప్రత్యయం), బల+అనుజమ్ = బలరామసోదరుని (కృష్ణుని), బబన్ధ = బంధించెను. (బధ్ – బంధనే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** ఇతడు నా కొడుకు కాదు. సాక్షాత్తూ శ్రీహరియే అన్న ఆలోచన క్షణకాలం పాటు కలిగింది. ఇంతలోనే జ్ఞానులు ప్రేమ అనే త్రాటితో కట్టిపడవేసే ఆ బలరామానుజుణ్ణి – కృష్ణుని – బంధించింది. (పరమాత్మ భ్రాంతి అంతలోనే తొలగిపోయిందని భావం.)

**వి :** 1. శ్లో॥ బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ వా మాం ప్రపద్యతే ।
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ – భగవద్గీత 7/19

పరప్రాప్తికి జ్ఞానమే సాధనమని కృష్ణుడు నొక్కి చెప్పిన మాట ఇది. యశోదకు కూడా జ్ఞానం కలిగిన తరువాతనే కట్టుబడ్డాడు కృష్ణుడు.

| | | | |
|---|---|---|---|
| 2. **బబన్ధ :** | **బబన్ధ** | బబన్ధతుః | బబన్ధుః |
| | బబన్ధిథ | బబన్ధథుః | బబన్ధ |
| | బబన్ధ | బబన్ధివ | బబన్ధిమ. |

*

**శ్లో॥ అసాధ్యభాగస్థితదుగ్ధచౌర్యే – విశారదం తం వినిబధ్య మాతా ।**
**ఉలూఖలస్యాపి బబన్ధ మధ్యం – సహాయభూతస్య తదీయకార్యే ॥ 4–11**

**అ :** కృష్ణుని రోటికి కట్టివేయుటలోని ఔచిత్యం. –ఉపేంద్రవజ్ర.

**అ :** మాతా అసాధ్య–భాగ–స్థిత–దుగ్ధ–చౌర్యే విశారదం తం వినిబధ్య తదీయ–కార్యే సహాయ–భూతస్య ఉలూఖలస్య అపి మధ్యం బబన్ధ.

**ప్ర :** మాతా = తల్లి అయిన యశోద, అసాధ్య... చౌర్యే : అసాధ్య = అందని, భాగ = ప్రదేశాల్లో, స్థిత = ఉన్నట్టి, దుగ్ధ = పాలను, చౌర్యే = దొంగిలించుటలో (అసాధ్యః చ అసౌ భాగః, తస్మిన్ స్థితం చ తత్ దుగ్ధమ్, తస్య

చౌర్యం, తస్మిన్), విశారదమ్ = నేర్పుగల, తమ్ = ఆ కృష్ణుని, వినిబధ్య = బంధించి (వి-ని-బన్ధ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తదీయ-కార్యే = ఆ కృష్ణుని పనిలో (తదీయస్య కార్యం, తస్మిన్), సహాయ-భూతస్య = సహకరించిన, ఉలూఖలస్య-అపి = రోటియొక్క కూడా, మధ్యమ్ = మధ్యభాగాన్ని, బబన్ధ = బంధించింది. (బన్ధ్ - బన్ధనే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** యశోద కృష్ణుని తాళ్ళతో బంధించి త్రాటి రెండవకొనను రోటిమధ్యభాగంలో కట్టింది. కృష్ణుడికి అందనంత ఎత్తులోనున్న పాలను అందుకోవటంలో రోలు సహకరించింది కాబట్టి దొంగతనంలో సహాయం చేసినందుకు రోటిని కూడా శిక్షించినట్లుంది.

**వి :** 1. శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోచకః ।
సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమభాగినః ॥

అని ఆర్యవచనం. చేసేవాడు, చేయించేవాడు, ప్రోత్సహించేవాడు, ఆమోదించేవాడు ఈ నలుగురూ మంచిలోనయినా, చెడ్డపనిలో అయినా భాగస్వాములు. అలాగే సహకరించినవాడు కూడా. ఇక్కడ రోలు (నిర్జీవమైనా సరే) సహకరించింది కాబట్టి దానికి కూడా '**శిక్ష**'. ఇక్కడ సహోక్త్యలంకారం ధ్వనిస్తుంది.

అచేతనమయిన రోటికి చేతనత్వాన్ని కల్పించటం వలన వక్రోక్త్యలంకారం. '**సాదృశ్యా-ల్లక్షణావక్రోక్తిః**' (కావ్యాలంకారసూత్రవృత్తి - 3-4-8) అని వక్రోక్త్యలంకార లక్షణం.

2. **బబన్ధ :** 4-10వ శ్లోకవ్యాఖ్య చూదుడు. *

**శ్లో॥ అనాహి యః కార్యవశాజ్జనన్యా - శనైరసౌ సాకములూఖలేన ।
విధాయ ఘృష్టం స్వకయోరనిష్ట-మభీప్సితం దాతుమివ ప్రతస్థే ॥ 4-12**

**అ :** కృష్ణుడు రోటితోపాటు కదులుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** యః జనన్యా కార్య-వశాత్ అనాహి అసౌ స్వకయోః అనిష్టం ఘృష్టం విధాయ అభీప్సితం దాతుమ్ ఇవ ఉలూఖలేన సాకం శనైః ప్రతస్థే ।

**ప్ర :** యః = ఏ కృష్ణుడు, జనన్యా = తల్లిచేత, కార్య-వశాత్ = పనిబడి (కార్యస్య వశః, తస్మాత్), అనాహి = బంధింపబడెనో (నహ బంధనే పరస్మైపది లుజ్ ప్ర.ఏ.) అసౌ = ఆ కృష్ణుడు, స్వకయోః = తనవారియొక్క, అనిష్టమ్ = పాపాన్ని, ఘృష్టమ్ = దంచబడినదిగా/నశింపజేయబడినదిగా (ఘృష్ ధాతువుపై క్త ప్రత్యయం), విధాయ = చేసి (వి-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అభీప్సితమ్ = ఇష్టమైన దానిని, దాతుమ్-ఇవ = ఇవ్వడానికన్నట్లుగా, ఉలూఖలేన సాకమ్ = రోటితో పాటు, శనైః = మెల్లగా, ప్రతస్థే = బయలుదేరాడు. (ప్ర-స్థా-గతినివృత్తౌ - ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** యశోద తనకు తెలియకుండానే కృష్ణుని భావికార్యంలో సహకరించింది. కృష్ణుని రోటికి బంధించింది. దానితో కృష్ణుడు తన భక్తులయిన నలకూబర మణిగ్రీవుల యొక్క పాపాన్ని పోగొట్టి వారి కోరికలను తీర్చడా అన్నట్లుగా ఆ రోటితోపాటు మెల్లగా బయలుదేరాడు.

**వి :** 1. ఉలూఖలేన సాకమ్ - ఇక్కడ సహోక్త్యలంకారం. రోటితో కూడా - రోటిని తీసికొని కాదు. అలా అయితే సహభావముండదు - బయలుదేరాడు కాబట్టి అంటే ఇద్దరిలో గమనకర్తృత్వం స్ఫురిస్తుంది కాబట్టి సహోక్తి. **సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః** - (కు.58)

అభీప్సితం దాతుమివ - ఇక్కడ కాని కారణాన్ని, కారణంగా సంభావించినందువలన హేతూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' - (కు.32)

| | | | |
|---|---|---|---|
| 2. **అనాహి :** | **అనాహి** | అనాహిషాతామ్ | అనాహిషత |
| | అనాహిథాః | అనాహిషాథామ్ | అనాహిధ్వమ్ |
| | అనాహి | అనాహివహి | అనాహిమహి |
| ప్రతస్థే : | **ప్రతస్థే** | ప్రతస్థాతే | ప్రతస్థిరే |
| | ప్రతస్థిషే | ప్రతస్థాథే | ప్రతస్థిధ్వే |
| | ప్రతస్థే | ప్రతస్థివహే | ప్రతస్థిమహే. |

*

**శ్లో॥ అసజ్జనేష్వాచరితోగ్రశిక్షాం - స్వభక్తపుఞ్జేషు కృతాం చ రక్షామ్ ।**
**నభస్యథో గాతుముభౌ చికీర్షన్ - విపాటయామాస స పాదపౌ ద్వౌ॥ 4-13**

**అ :** కృష్ణుని దుష్టశిక్షణ శిష్టరక్షణను పునః ప్రతిపాదించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథో అసజ్జనేషు ఆచరితోగ్రశిక్షాం స్వ-భక్త-పుంజేషు కృతాం రక్షాం చ నభసి గాతుమ్ ఉభౌ (గాయకౌ) చికీర్షన్ సః ద్వౌ పాదపౌ విపాటయామాస.

**ప్ర :** అథో = అటు తరువాత, అసజ్జనేషు = చెడ్డవారి విషయంలో (విషయసప్తమి), ఆచరిత+ఉగ్ర-శిక్షామ్ : ఆచరిత = పాటించిన, ఉగ్ర = తీవ్రమైన, శిక్షామ్ = శిక్షను (ఆచరితా ఉగ్రా చ సా శిక్షా - తామ్), స్వ-భక్త-పుంజేషు : స్వ = తనయొక్క, భక్త = భక్తులయొక్క, పుంజేషు = సముదాయాల విషయంలో (స్వస్య భక్తాః, తేషాం పుంజాః, తేషు), (నికరనికాయనివహవిసరవ్రజపుంజ - హలాయుధకోశః - 686), కృతాం రక్షామ్ = రక్షిస్తున్న తీరును, నభసి = ఆకాశంలో, గాతుమ్ = పాడటానికై, ఉభౌ = ఇద్దరుగాయకులను, చికీర్షన్ = చేయగోరి (కృ - ధాతువు సన్నంతం - శతృ ప్రత్యయం), ద్వౌ పాదపౌ = రెండు చెట్లను, విపాటయామాస = పెకలించెను/కూల్చెను. (వి-పట్- ణిచ్- పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు రెండు చెట్లను కూల్చాడు. అది తన కీర్తిని గగనసీమలో ఇద్దరు గానం చేయటానికి వీలుగా వుండేందుకు చేసిన పని. ఇద్దరెందుకంటే ఒకరు దుర్మార్గులను తాను శిక్షిస్తున్న తీరునూ, మరొకరు తాను సన్మార్గులను రక్షిస్తున్న తీరునూ గానం చేయటానికి.

**వి :** 1. ఇక్కడ '**ఏకక్రియా ద్వ్యర్థకరీ**' అన్నట్లు ఒకే పనిలో దుష్టశిక్షణ, శిష్టరక్షణ కూడా జరిగినట్లు భావించాలి. రెండు చెట్లు నలకూబర, మణిగ్రీవులకే కాక వారిని అంటిపెట్టుకొని వున్న ఇద్దరు రాక్షసులకు కూడా ప్రతినిధులు. గతంలో పూతనాదులను సంహరించినపుడు భావించినట్లే ఇప్పుడు కూడా. కాబట్టి నలకూబర, మణిగ్రీవులను - శిష్టులను - కాపాడటం, వారిని ఆశ్రయించియున్న అసురులను శిక్షించటం. ఇక్కడ రెండు ప్రయోజనాలు ఒకేసారి సిద్ధించాయి. అందుకే రెండింటినీ గానం చేయటానికి ఇద్దరి ఏర్పాటు.

తానాశ్రయించిన శరీరాన్ని బట్టికూడా జీవుడు ప్రభావితుడై తదనుగుణంగా ప్రవర్తిస్తాడు. వాల్మీకి శ్లోకాన్ని చూడండి.

శ్లో॥ ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం - ననన్ద చిక్రీడ జగామ ।
స్తమ్భానరోహన్నిపపాత భూమౌ - సందర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్॥

- రామాయణం - సుందరకాండ - 10/54

హనుమంతు డంతటివాడు తన కపి స్వభావాన్ని వ్యక్తంచేస్తూ వివిధ చేష్టలు చేశాడట. ఇక్కడ జీవలక్షణం, ఆ జీవుడున్న శరీరలక్షణం ప్రధానంగా కనిపిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **విపాటయామాస :** | విపాటయామాస | విపాటయామాసతుః | విపాటయామాసుః |
| | విపాటయామాసిథ | విపాటయామాసథుః | విపాటయామాస |
| | విపాటయామాస | విపాటయామాసివ | విపాటయామాసిమ. * |

**శ్లో॥ స్వభృత్యభీమానుజమద్వితీయం - ప్రియం విధిత్సుర్దయయేవ దేవః ।**
**స భూరుహావర్జునసంజ్ఞితౌ తౌ - బభఞ్జ కఞ్జాయతమఞ్జునేత్రః ॥ 4-14**

**అ :** అర్జుననామసామ్యాన్ని బట్టి కృష్ణుడు దయను ప్రదర్శించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** కంజ+ఆయత-మంజు-నేత్రః సః దేవః ప్రియం స్వ-భృత్య-భీమ+అనుజమ్ అద్వితీయం విధిత్సుః దయయా ఇవ అర్జున-సంజ్ఞితౌ తౌ భూరుహౌ బభఞ్జ.

**ప్ర :** కంజ+ఆయత-మంజు నేత్రః : కంజ = తామరలవలె, ఆయత = విశాలమై, మంజు = అందమైన, నేత్రః = కన్నులుగల (కంజే ఇవ ఆయతే మంజునీ చ నేత్రే యస్య సః), సః దేవః = ఆ కృష్ణుడు, ప్రియమ్ = తన కిష్టమైన, స్వ-భృత్య-భీమ+అనుజమ్: స్వ = తనయొక్క, భృత్య = సేవకుడైన, భీమ+అనుజమ్ = భీముని తమ్ముని (అర్జునుని) (స్వస్య భృత్యః తస్య భీమస్య అనుజః తస్య - స్వభృత్యశ్చ అసౌ భీమానుజశ్చ తస్య), అద్వితీయమ్ = సాటిలేని వానినిగా (నాస్తి ద్వితీయః యస్మాత్ - తమ్), విధిత్సుః (సన్) = చేయగోరినవాడై, దయయా ఇవ = దయచేతనో ఏమో, అర్జున-సంజ్ఞితౌ = అర్జుననామం కలిగిన, తౌ-భూరుహౌ = ఆ రెండు చెట్లను, బభంజ = కూల్చాడు.

**తా ॥** భీమసేనుని తమ్ముడయిన అర్జునుడు కృష్ణునకు ప్రియభృత్యుడు. ఆ అర్జునునిపై దయగలిగి తనను సాటిలేని వానినిగా (అద్వితీయునిగా) చేయదలచి అదేపేరున్న అర్జున వృక్షాలను కూల్చివేశాడు. (ఇవి వుంటే అర్జునుడు అద్వితీయుడు కాలేదు గదా!)

**వి :** 1. కృష్ణుడు అర్జున పక్షపాతాన్ని వహించటం భీమసేనుని కోసమే. అందుకే 'స్వభృతస్య భీమస్య' అని విగ్రహవాక్యం.

శ్లో॥ భీమార్థం కేశవోఽన్యే చ దేవాః ఫల్గుణపక్షిణః ।
ఆసన్ యథైవ రామాద్యాః సంగ్రహేణ హనూమతః ॥ -మహాభారతతాత్పర్యనిర్ణయః-15/51

రామావతారంలో హనుమంతుని కోసమే సుగ్రీవపక్షపాతం. కృష్ణావతారంలో భీముని కోసం అర్జునపక్షపాతం. ఆ ఇద్దరూ ముఖ్యప్రాణదేవర అయిన వాయువు కొడుకులు గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **బభంజ :** | బభంజ | బభంజతుః | బభంజుః |
| | బభంజిథ/బభఙ్క్థ | బభంజథుః | బభంజ |
| | బభంజ | బభంజివ | బభంజిమ. * |

**శ్లో॥ తదఙ్గబన్ధప్రతిబన్ధపుణ్య-బలేన సిద్ధౌ తత ఉత్థితౌ ద్వౌ ।**
**ప్రశంస్య బృన్దావనవల్లభం తం - తదేయతుస్తన్మనసౌ స్వలోకమ్॥ 4-15**

**అ :** నలకూబర మణిగ్రీవులు తమలోకానికి వెళ్ళుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదంగ-బంధ-ప్రతిబంధ-పుణ్య-బలేన సిద్ధౌ ద్వౌ తతః ఉత్థితౌ బృందావన-వల్లభం తం ప్రశంస్య తన్మనసౌ తదా స్వ-లోకమ్ ఈయతుః.

**ప్ర :** తదంగ... బలేన : తత్ = ఆ కృష్ణుని యొక్క, అంగ-బంధ = శరీరపు కట్టుబాటును, ప్రతిబంధ =

ఎదిరించుట చేత (రోటిని ఆపటం ద్వారా) పుట్టిన, పుణ్య = పుణ్యం యొక్క, బలేన = శక్తిచేత (తస్య అంగాని, తేషు ప్రతిబంధః, తేన జాతం పుణ్యం, తస్య బలం, తేన), సిద్ధౌ = సిద్ధిపొందిన, ద్వౌ = ఆ ఇద్దరు (నలకూబర మణిగ్రీవులు), తతః = కూలిన చెట్ల నుండి, ఉత్థితౌ = లేచినవారై, బృందావన - వల్లభమ్ : బృందావన = తులసివనానికి, వల్లభమ్ = అధిపతి అయిన (బృందావనస్య వల్లభః, తమ్), తమ్ = ఆ కృష్ణుని, ప్రశంస్య = నుతించి, తత్+మనసౌ = అతని యందే మనస్సు పెట్టి (తస్మిన్ మనసీ యయోః, తౌ), తదా = అప్పుడు, స్వలోకమ్ = తమలోకానికి, ఈయతుః = వెళ్ళిరి. (ఇ-గతౌ-పరస్మైపది - లిట్ - ప్ర.ద్వి)

**తా ॥** నలకూబర మణిగ్రీవులు కృష్ణుని కట్టినరోటిని అడ్డగించిన కారణంగా వారికి పుణ్యం దక్కింది. ఆ పుణ్యబలంతో వారు వెంటనే సిద్ధిని పొందారు. ఆ విరిగిపోయిన చెట్లనుండి లేచి బృందావనాధిపతి అయిన ఆ కృష్ణుని ప్రశంసించి, ఆయననే మనసా తలచుకొంటూ తమలోకానికి (గుహ్యక లోకానికి) వెళ్ళిపోయారు.

**వి :** 1. గుహ్యకులు కృష్ణుని ప్రశంసించటాన్ని పోతన ఇలా వర్ణించాడు.

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ ని న్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిసేయు హస్తయుగమున్ నీ మూర్తిపైఁ జూపులున్
నీ పాదంబులపొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్త్రేక్షణా. - పోతనభాగవతం 10/408

| | | | |
|---|---|---|---|
| 2. **ఈయతుః :** | ఇయాయ | **ఈయతుః** | ఈయుః |
| | ఇయేథ | ఈయథుః | ఈయ |
| | ఇయాయ/ఇయయ | ఈయివ | ఈయిమ. |

*

**శ్లో॥ బృహద్వనే స్వస్య హి సన్నిధానా-న్మహాపురీసామ్యముపేయుషీత్థమ్ ।**
**వనప్రియోఽసౌ చకమే రమేశో - మనోజ్ఞబృన్దావన ఏవ వాసమ్ ॥ 4-16**

**అ :** కృష్ణుని బృందావనవాసాభిరుచిని సమర్థించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇత్థమ్ బృహద్వనే స్వస్య సన్నిధానాత్ మహాపురీ-సామ్యమ్ ఉపేయుషి (సతి) అసౌ వన-ప్రియః రమేశః మనోజ్ఞ-బృందావనే ఏవ వాసం చకమే.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, బృహద్వనే = నందుని పల్లె (గోకులం)లో, స్వస్య = తనయొక్క, సన్నిధానాత్ - హి = ఉనికి వలననే, మహాపురీ-సామ్యమ్ = పెద్దపట్టణాలతో పోలికను (మహతీ చ సా పురీ, తయా సామ్యమ్), ఉపేయుషి (సతి) = పొంది యుండగా, వన-ప్రియః = వనాలను ఇష్టపడే (వనం ప్రియం యస్య సః), అసౌ = ఆ, రమా+ఈశః = రమావల్లభుడు (కృష్ణుడు), మనః+జ్ఞ-బృందావనే-ఏవ : మనోజ్ఞ = మనోహరమైన, బృందావనే ఏవ = బృందావనంలోనే (మనోజ్ఞం చ తత్ బృందావనమ్, తస్మిన్), వాసమ్ = నివాసాన్ని, చకమే = కోరుకొన్నాడు. (కము కాంతౌ - ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** బృహద్వనం నందనివాసగ్రామం. అది కృష్ణుని సన్నిధానంతో మహాపట్టణాలతో సమానమైనది. అందువలన వనప్రియుడైన కృష్ణుడు అందమైన బృందావనంలో నివసించాలని కోరుకొన్నాడు. (బృహద్వనం నుండి బృందావనానికి చేరాలనుకొన్నాడు.)

**వి :** 1. ఈ శ్లోకంలో సమాలంకారం కనిపిస్తుంది. '**సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయోరప్యనురూపయోః**' (కు.91) పరస్పరం తగిన వాటిని వర్ణించటం లేదా వివరించటం సమాలంకారం. వనప్రియుడైన రమావల్లభునికి ప్రకృతం కూడా బృందావనవా సాభిలాష కలిగింది కాబట్టి సమాలంకారం.

2. బృహద్వనం బృందావనం రెండూ వనాలే. అయినా బృహద్వనం ప్రస్తుతం మహాపట్టణంతో సమానమైంది కాబట్టి బృందావన ప్రయాణం. పుట్టిన నాటి నుండి కృష్ణుని జీవితంలో ఇటువంటి వలసలే కనిపిస్తాయి.

| | | | |
|---|---|---|---|
| 3. **చకమే :** | చకమే | చకమాతే | చకమిరే |
| | చకమిషే | చకమాథే | చకమిధ్వే |
| | చకమే | చకమివహే | చకమిమహే. |

*

**శ్లో॥ విరోధిదైతేయపరాభవేన - స్థిరేహ నోత్థాస్యతి బన్ధుతేయమ్ ।**
**ఇతి ప్రభుః స్వప్రియసాధ్వసాయ - వృకాననేకాంశ్చ ససర్జ రోమ్ణః ॥ 4-17**

**అ :** కృష్ణుడు నందగోకులంపై బృందావన ప్రయాణానికి పరోక్షంగా ఒత్తిడి తెచ్చుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** విరోధి-దైతేయ-పరాభవేన ఇహ-స్థిరా ఇయం బన్ధుతా న ఉత్థాస్యతి ఇతి ప్రభుః స్వప్రియ-సాధ్వసాయ రోమ్ణః అనేకాన్ వృకాన్ ససర్జ చ.

**ప్ర :** విరోధి... పరాభవేన : విరోధి = శత్రువులైన, దైతేయ = రాక్షసుల యొక్క (అసురా దైత్య దైతేయ... అమరకోశం - స్వర్గ - 12), పరాభవేన = ఓటమితో, ఇహ = ఇక్కడ (బృహద్వనంలో), స్థిరా = పాతుకుపోయిన, బంధుతా = బంధు సమూహం, న-ఉత్థాస్యతి = కదలదు (ఉత్ - స్థా పరస్మైపది - లృట్ - ప్ర.ఏ.), ఇతి = అని, ప్రభుః = కృష్ణుడు, స్వ-ప్రియ-సాధ్వసాయ : స్వ = తనకు, ప్రియ = ఇష్టులైన (బంధువులను) వారియొక్క, సాధ్వసాయ = భయానికై (భీతిర్భీః సాధ్వసం భయం - అమరకోశః -నాట్య - 21) (స్వస్య ప్రియాః, తేషాం సాధ్వసం, తస్మై), రోమ్ణః = వెంద్రుకనుండి, అనేకాన్ = ఎక్కువగా, వృకాన్ = తోడేళ్ళను, ససర్జ - చ = సృష్టించాడు కూడా. (సృజ - సర్జనే - పరస్మైపది - లిట్ ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణునిపై దాడిచేస్తున్న రాక్షసులందరూ మరణించారు కాబట్టి ఇక్కడ మనకేమీ భయం లేదని బృహద్వనంలోని బంధువులందరూ భావిస్తుండటంతో వారు అక్కడ నుండి కదిలేరా లేరని, వారిని కేవలం భయపెట్టడానికి కృష్ణుడు తన వెంట్రుకనుండి ఎన్నో తోడేళ్ళను సృష్టించాడు. (ఆ భయంతోనైనా కదలటానికి ఇష్టపడతారని)

**వి :** 1. తన వారినే భయపెట్టడానికి తోడేళ్ళను సృష్టించటం దోషంలో గుణాన్ని చూడగలగటం. భయపెట్టడం ఒక దోషం. దాని లక్ష్యం బృందావనవాసం. దానికై తోడేళ్ళను సృష్టించటం. గుణదృష్టితో దోషాన్నే కోరుకోవటం అనుజ్ఞాలంకారమన్నారు. (**దోషస్యాభ్యర్థ నానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్** - కు.137) దోషాన్నే పాటించటం కూడా - వాఙ్మాత్రమే కాదు క్రియారూపమైనా - ఆ అలంకారమే అవుతుంది. కాబట్టి ఇక్కడ అనుజ్ఞాలంకారం.

2. గోకులాన్ని - తనవారిని - భయపెట్టడానికి తోడేళ్ళను సృష్టించే సన్నివేశం భాగవతంలో కనిపించదు కానీ హరివంశంలోనూ, మహాభారత తాత్పర్య నిర్ణయం లోనూ కనిపిస్తుంది. తదాధారంగానే వాదిరాజతీర్థరు ప్రకృతశ్లోకాన్ని కూర్చారు.

శ్లో॥ ఏవం కథయతస్తస్య వాసుదేవస్య ధీమతః ।
ప్రాదుర్బభూవుః శతశో రక్తమాంసవసాశనాః ॥

శ్లో॥ ఘోరాశ్చింతయతస్తస్య స్వతనూరుహజాస్తదా ।
వినిష్పేతుః భయకరాః సర్వశః శతశో వృకాః ॥ - హరివంశే - 2/8/30,31

శ్లో॥ బృందావనంయియాసుః సన్ నందసూనుః బృహద్వనే ।
ససర్జ రోమకూపేభ్యో వృకాన్ వ్యాఘ్రసమాన్ బలే ॥ - మహాభారతతాతర్యనిర్ణయః

భాగవతంలోనూ, అంతవరకు జరిగిన సంఘటనలను బట్టియే ఉపనందుడు చోటు మారుదామని చెప్పినట్లుంది. పోతన కూడా ఆ దారిలోనే నడిచాడు.

ఉ. ఇక్కడ నుందురే మనుజు?లీ మన కృష్ణున కెగ్గు సేయఁగా
రక్కసురాలు చ న్నొసఁగె రా లపయిన్ సుడిగాలి వీచెఁబైఁ
గ్రిక్కిఱియం దరుల్ వడియెఁ గేశవు సత్కృపఁ దప్పెఁ జాలు నేఁ
డెక్కడి కైనఁ బోవలయు నింకిట గోపకులార వింటిరే? – భాగవతం 10/421

భయకల్పనకై భీకరవృకాలను సృష్టించకుండా ఉపనందునిలో భయాన్నే కల్పించటం ఇక్కడ ప్రత్యక్షం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉత్థాస్యతి :** | **ఉత్థాస్యతి** | ఉత్థాస్యతః | ఉత్థాస్యన్తి |
| | ఉత్థాస్యసి | ఉత్థాస్యథః | ఉత్థాస్యథ |
| | ఉత్థాస్యామి | ఉత్థాస్యావః | ఉత్థాస్యామః |
| **ససర్జ :** | **ససర్జ** | ససృర్జతుః | ససృజుః |
| | ససర్జిథ/సస్రష్ఠ | ససృజథుః | ససృజ |
| | ససర్జ | ససృజివ | ససృజిమ. |

*

**శ్లో॥ ఇహ స్వకీయాన్ నిహతాన్ నిశామ్య – న మాం వ్రజస్థం ప్రతియాన్తి దైత్యాః।**
**స ఇత్థమాలోచ్య విభుః స్వకీయాన్ – న్యయుఙ్క్త బృన్దావనమేవ గన్తుమ్ ॥ 4-18**

**అ :** కృష్ణుని బృందావనగమనాభిలాషను మరొకరీతిగా సమర్థించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ నిహతాన్ స్వకీయాన్ నిశామ్య దైత్యాః వ్రజస్థం మాం న ప్రతియాన్తి. ఇత్థమ్ ఆలోచ్య సః విభుః స్వకీయాన్ బృందావనం గన్తుమ్ ఏవ న్యయుంక్త.

**ప్ర :** ఇహ = ఈ బృహద్వనంలో, నిహతాన్ = చంపబడినట్టి, స్వకీయాన్ = తమ వారిని గూర్చి, నిశామ్య = విని (ని–శమ్– ణిచ్– ధాతువుపై ల్యప్ ప్రత్యయం), దైత్యాః = రాక్షసులు, వ్రజ–స్థమ్ = గోకులంలో వున్న (వ్రజే తిష్ఠతీతి, తమ్), మామ్ = నన్నుగూర్చి, ప్రతియాన్తి = ఎదిరింపరారు. (ప్రతి – యా ప్రాపణే – పరస్మైపది – లట్ – (ప్ర.బ.), ఇత్థమ్ = ఈ విధంగా, ఆలోచ్య = వితర్కించి, సః విభుః = ఆ కృష్ణుడు, స్వకీయాన్ = తనవారిని, బృందావనమ్ = బృందావనానికి, గన్తుమ్ ఏవ = వెళ్ళటానికే, న్యయుంక్త = నియోగించాడు. (ని–యుజ్ యోజనే – ఆత్మనేపది – లఙ్ – (ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు బృహద్వనంలోనే వుంటే ఇక రాక్షసులు రారు. ఎందుకంటే అక్కడకు వెళ్ళిన తమవారంతా అక్కడే చనిపోయారని వాళ్ళు విని వుంటారు. తాను రాక్షస సంహారం చేయాలంటే వాళ్ళు రావాలి. కాబట్టి చోటు మారటమే మంచిదని భావించి కృష్ణుడు తనవారు బృందావనానికి వెళ్ళటాన్నే నియోగించాడు (మనసా).

**వి :** 1. ఇక్కడ కృష్ణునిది తార్కికదృష్టి. ప్రాణుల మనస్సులలోని విశ్వాసాలను ఆధారంగా చేసికొని ఆలోచిస్తున్న విధానమిది. అవతారప్రయోజనం ఆద్యంతం నిర్వహింపబడటం కృష్ణుని లక్ష్యం.

| | | | |
|---|---|---|---|
| 2. **న్యయుంక్త :** | **న్యయుంక్త** | న్యయుంజాతామ్ | న్యయుంజత |
| | న్యయుంక్థాః | న్యయుంజాథామ్ | న్యయుఙ్గ్ధ్వమ్ |
| | న్యయుంజి | న్యయుంజ్వహి | న్యయుంజ్మహి. |

*

**శ్లో॥ భారాన్ స్వానధిరోప్య చారుశకటశ్రేణ్యామరణ్యాలయా**
**గోపా గోధనవృద్ధముగ్ధలలనాబాలాదిభిః సంయుతాః ।**

**వీణావేణుమృదఙ్గశృఙ్గనినదైః సమ్పూరితాశాః శనైః**
**రామశ్రీరమణాశ్రయాః ప్రతి యయుర్బృన్దావనం పావనమ్ ॥ 4-19**

**అ :** గోపాలకుల బృందావనప్రయాణం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** గో–ధన–వృద్ధ–ముగ్ధ–లలనా–బాలాదిభిః సంయుతాః రామ–శ్రీ–రమణాశ్రయాః అరణ్యాలయాః గోపాః స్వాన్ భారాన్ చారు–శకట–శ్రేణ్యామ్ అధిరోప్య వీణా–వేణు–మృదంగ–శృంగ–నినదైః సంపూరితాశాః శనైః పావనం బృందావనం ప్రతి యయుః.

**ప్ర :** గోధన… బాలాదిభిః : గో = గోవు–లనెడి, ధన = ధనం తోడను, వృద్ధ = ముసలివారితోడను, ముగ్ధ = అమాయకురాళ్ళయిన, లలనా = స్త్రీలు, బాల = పిల్లలు, ఆదిభిః = మొదలగు వారితోడను (గావః ధనం యేషాం, తే చ వృద్ధాః ముగ్ధాశ్చ, తాః లలనాః, తాశ్చ బాలాశ్చ ఆదౌ యేషాం తైః), సంయుతాః = కూడిన వారును, రామ–శ్రీరమణ+ఆశ్రయాః : రామ = బలరామునియొక్క, శ్రీ–రమణ=లక్ష్మీకాంతునియొక్క, ఆశ్రయాః = ఆశ్రయం గలవారును (రామశ్చ శ్రియః రమణశ్చ రామ శ్రీరమణౌ, తౌ ఆశ్రయౌ యేషాం తే), అరణ్య+ఆలయాః = అరణ్యం నివాసంగా గలవారును (అరణ్యం ఆలయః యేషాం తే) అయిన, గోపాః = గోపాలురు, స్వాన్ = తమ యొక్క, భారాన్ = బరువులను/సరుకులను, చారు–శకట–శ్రేణ్యామ్ : చారు = అందమైన, శకట = బండ్లయొక్క, శ్రేణ్యామ్ = వరుసపై (చారూణి చ తాని శకటాని, తేషాం శ్రేణీ, తస్యామ్), అధిరోప్య = ఎక్కించి, వీణా… నినదైః : వీణా = వీణెలయొక్కయు, వేణు = పిల్లనగ్రోవులయొక్కయు, మృదంగ = మృదంగాలయొక్కయు, శృంగ = కొమ్ముబూరలయొక్కయు, నినదైః = చప్పుళ్ళతో (వీణాశ్చ వేణవశ్చ మృదంగాశ్చ శృంగాణి చ, తేషాం నినదైః), సంపూరిత+ఆశాః : సంపూరిత = పూర్తిగా నింపబడిన, ఆశాః (సంతః) = దిక్కులు గలవారై (సమ్యక్ పూరితాః ఆశాః యై స్తే), శనైః = మెల్లగా, పావనమ్ = పవిత్రమైన, బృందావనమ్ ప్రతి = బృందావనాన్ని గూర్చి, యయుః = వెళ్ళారు. (యా ప్రాపణే పరస్మైపది – లిట్ – ప్ర.బ.)

**తా ॥** వనవాసులయిన గోపాలురు బలరామకృష్ణుల అండతో తమ గోధనాలు, ముసలివారు, స్త్రీలు, పిల్లలు వీరందరితో కలిసి తమ సామాను అంతా బండ్ల మీద కెక్కించి వీణలు, వేణువులు, మృదంగాలు, కొమ్ముబూరలు వీటి చప్పుళ్ళతో దిక్కులనన్నింటినీ పూర్తిగా నింపుతూ పవిత్రమైన బృందావనం వైపు మెల్లగా ప్రయాణం చేశారు.

**వి :** 1. వాద్య విశేషాలను మార్గంలో కూడా వాయించటం వినోదంతో పాటు రక్షణను కూడా కల్పిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **యయుః :** | యయౌ | యయతుః | **యయుః** |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

**శ్లో॥ జృంభచ్చమ్పకగుమ్ఫితోచ్చకబరీభారాశ్చలత్కఞ్చుకాః**
**సిఞ్జన్మఞ్జులభూరిభూషణధరా గోప్యః సమాప్య క్రియాః ।**
**కృష్ణస్యాద్భుతకర్మ రామచరితైః సాకం జగుః కృత్స్నశః**
**స్వాభీష్టాప్త్యుచితస్థలీగతిమివ ప్రేక్ష్య ప్రహృష్టాః పథి ॥ 4-20**

**అ :** బృందావనప్రయాణంలో గోపికాగానం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** జృంభచ్చంపక–గుంఫితోచ్చ–కబరీ–భారాః చలత్–కంచుకాః సింజన్మంజుల–భూరి–భూషణ–ధరాః గోప్యః క్రియాః సమాప్య స్వాభీష్టాప్త్యుచితస్థలీగతిమ్ ప్రేక్ష్య ఇవ ప్రహృష్టాః పథి రామ–చరితైః సాకం కృష్ణస్య అద్భుత–కర్మ కృత్స్నశః జగుః.

ప్ర : జృంభ... భారా : జృంభత్ = వికసిస్తున్న, చంపక = సంపెంగపూలుతో, గుంఫిత = చుట్టబడిన, ఉచ్చ = ఎత్తైన, కబరీ = కొప్పుయొక్క, భారాః = బరువు గలవారును (జృంభద్భిః చంపకైః గుంఫితః ఉచ్చః చ అసౌ కబర్యాః భారః యాసాం తాః), చలత్+కంచుకాః : చలత్ = కదలుతున్న, కంచుకాః = రవికలు గలవారును (చలన్తః కంచుకాః యాసాం తాః), సింజ... ధరాః : సింజత్ = ధ్వనిస్తున్న, మంజుల = మనోహరమైన, భూరి = స్వర్ణమయమైన, భూషణ = ఆభరణాలను, ధరాః = ధరించినవారును (సింజన్తి చ మంజులాని చ భూరీణి చ తాని భూషణాని, తేషాం ధరాః), గోప్యః = గోపకాంతలు, క్రియాః = (ఇంటి) పనులను, సమాప్య = ముగించి, స్వాభి... గతిమ్ – ఇవ : స్వ = తమకు, అభీష్ట = నచ్చిన దానిని, ఆప్తి = పొందుటకు, ఉచిత = తగినట్టి, స్థలీ = ప్రదేశానికి, గతిమ్ – ఇవ = ప్రయాణం వలె, ప్రేక్ష్య = చూచి (ప్ర–ఈక్ష్ – ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ప్రహృష్టాః (సత్యః) = ఆనందించిన వారై, పథి = బాటలో, రామ–చరితైః సాకమ్ = రామకథలతోపాటు (రామస్య చరితాని, తైః), కృష్ణస్య = కృష్ణుని యొక్క, అద్భుత–కర్మ = ఆశ్చర్యకరమైన పనిని (అద్భుతం చ తత్ కర్మ), కృత్స్నశః = పూర్తిగా, జగుః = పాడిరి. (గై శబ్దే పరస్మైపది – లిట్ – ప్ర.బ.)

**తా ॥** గోపకాంతలు పెద్దపెద్ద కొప్పులు చుట్టి కొప్పులనిండా సంపెంగపూలు పెట్టుకొని వున్నారు. వారి రవికలు కదులుతున్నాయి. మృదువుగా శబ్దించే నగలు ధరించారు. వారు తమకు నచ్చిన ప్రదేశానికి ప్రయాణ మవుతున్నామన్న ఆనందంతో ఇంటి పనులు అన్నీ ముగించుకొని బయలుదేరి దారిలో బలరామునితో కలిసి కృష్ణుని అద్భుతకర్మలను గూర్చి గానం చేశారు.

**వి :** 1. గోపాలుర ప్రయాణ సన్నాహం భాగవతంలో–

శ్లో॥ వ్రజాత్ స్వాన్ స్వాన్ పరిత్యజ్య యయూ రూఢపరిచ్ఛదాః ॥

శ్లో॥ వృద్ధాన్ బాలాన్ స్త్రియో రాజన్ సర్వోపకరణాని చ ।
అనస్స్వారోప్య గోపాలా యత్తా ఆత్తశరాసనాః ॥

శ్లో॥ గోధనాని పురస్కృత్య శృంగాణ్యాపూర్య సర్వతః ।
తూర్యఘోషేణ మహతా యయుః సహపురోహితాః ॥

శ్లో॥ గోప్యో రూఢరథా నృత్యత్కుచకుంకుమకాంతయః ।
కృష్ణలీలా జగుః ప్రీతాః స్నిగ్ధకంఠ్యః సువాససః ॥ – భాగవతం 10/11/30–33

| 2. **జగుః :** | జగౌ | జగతుః | **జగుః** |
|---|---|---|---|
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ. |

*

**శ్లో॥ గవాంఖురైర్గోపపదైరనోభిః – సముత్థధూళీ సవితుః కరౌఘమ్ ।**
**రురోధ దూరే కిల తాం స్వమూర్ధ్ని – స ఏవ వోఢుం ధ్రువమున్నినాయ ॥ 4–21**

**అ :** బృందావన గమన వర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** గవాం–ఖురైః గోప–పదైః అనోభిః సముత్థ–ధూళీ సవితుః కరౌఘం దూరే రురోధ కిల. సః ఏవ తాం స్వమూర్ధ్ని వోఢుం ధ్రువమ్ ఉన్నినాయ.

ప్ర : గవామ్ = గోవుల యొక్క, ఖురైః = గిట్టల చేతను, గోప–పదైః : గోప = గోపాలకుల యొక్క, పదైః = కాళ్ళచేతను, అనోభిః = బండ్లచేతను (అనః శతాంగః శకటః స్యందనం – హలాయుధకోశః – 444), సముత్థ–ధూళీ = పైకెగసిన దుమ్ము (సముత్థా చ సా ధూళీ), సవితుః = సూర్యునియొక్క, కర+ఓఘమ్ = కిరణ

సమూహాన్ని (కరాణామ్ ఓఘః, తమ్), దూరే = దూరం నుండియే, రురోధ-కిల = అడ్డగించింది కదా! (రుధి ఆవ్రవణే - పరస్మైపది - లిట్ - (ప్ర.ఏ.), సః+ఏవ = ఆ సూర్యుడే, స్వ-మూర్ధ్ని = తన తలపై (స్వస్య మూర్ధా, తస్మిన్), వోఢుమ్ = భరించటానికి (వహ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), తామ్ = ఆ దుమ్మును, ధ్రువమ్ = నిశ్చితంగా, ఉత్+నినాయ = పైకి కొనిపోయాడు (ఉత్+ణీ ప్రాపణే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** (బృందావనానికి అందరూ ప్రయాణమయ్యారు.) ఆ ప్రయాణంలో గోవుల గిట్టల వలన, గోపాలకుల నడకవల్లా, బండ్లు నడవటం వల్ల దుమ్ము లేచింది. అది ఎంతో దూరం పోయి సూర్య కిరణాలను అడ్డగించింది. సూర్యుడు ఆ దుమ్మును శిరసావహించటానికే నిశ్చితంగా దాన్ని పైకి తీసికొని పోయి వుంటాడు.

**వి :** 1. దుమ్ము పైకి లేవటానికి, సూర్యకిరణనిరోధానికి ఎటువంటి సంబంధమూ లేదు. అయినా ధూళీ నిరోధకర్తృత్వాన్ని చెప్పాడు కాబట్టి ఇది అతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు. 39).

ధూళిని శిరసావహించటానికే సూర్యుడు పైకి తీసికొని పోయాడనటం కవి సంభావన. కాబట్టి ఇది హేతూత్ప్రేక్షాలంకారం. కాని కారణాన్ని కారణంగా చెప్పటం.

2. ప్రకృతశ్లోకంలో దుమ్ము పైకెగయటాన్ని కవి రసరంజితం చేస్తే నారాయణీయంలో ఆ ధ్వనులను ఆస్వాదింపజేస్తున్నాడు కవి-

శ్లో॥ అనో మనోజ్ఞధ్వని ధేనుపాలీ - ఖురప్రణాదాంతరతో వధూభిః ।
భవద్వినోదాలపితాక్షరాణి - ప్రపీయ నాజ్ఞాయత మార్గదైర్ఘ్యమ్ ॥ - నారాయణీయమ్ 49/3

| | | | |
|---|---|---|---|
| 3. **రురోధ :** | **రురోధ** | రురుధతుః | రురుధుః |
| | రురోధిథ | రరుధథుః | రురుధ |
| | రురోధ | రురుధివ | రురుధిమ. |
| **ఉన్నినాయ :** | **ఉన్నినాయ** | ఉన్నిన్యతుః | ఉన్నిన్యుః |
| | ఉన్నినయిథ/ఉన్నినేథ | ఉన్నిన్యథుః | ఉన్నిన్య |
| | ఉన్నినాయ/ఉన్నినయ | ఉన్నిన్యివ | ఉన్నిన్యిమ. |

*

**శ్లో॥ పుష్పైర్వృక్షగణా మనోజ్ఞవచనైః కీరాః స్వరైః కోకిలా**
**నృత్తైః కేకివరా గజాశ్చ గతిభిః శైలాః ప్రవన్నిర్ఝరైః ।**
**సుచ్ఛాయైర్మణికుట్టిమస్థలచయైః సా భూర్మృగా వీక్షణైః**
**తద్బృన్దావనమచ్యుతార్హభవనం నూనం తదా తేనిరే ॥ 4-22**

**అ :** బృందావనాన్ని ప్రకృతి అంతా రాజభవనంగా తీర్చి దిద్దటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** వృక్ష-గణాః పుష్పైః కీరాః మనోజ్ఞ-వచనైః కోకిలాః స్వరైః కేకి-వరాః నృత్తైః గజాః గతిభిః, శైలాః ప్రవన్నిర్ఝరైః మృగాః వీక్షణైః సా భూః సుచ్ఛాయైః మణి-కుట్టిమ-స్థల-చయైః తదా తద్బృందావనమ్ అచ్యుతార్హ-భవనం నూనం తేనిరే.

**ప్ర :** వృక్ష-గణాః = చెట్ల గుంపులు (వృక్షాణాం గణాః), పుష్పైః = పూలతో, కీరాః = చిలుకలు, మనోజ్ఞ+వచనైః = తీయని పలుకులతో (మనోజ్ఞాని చ తాని వచనాని తైః), కోకిలాః = కోయిలలు, స్వరైః = (పంచమ) స్వరాలతో, కేకి-వరాః = మేటి నెమళ్ళు, నృత్తైః = చిందులతో (నృత్తం తాళలయాశ్రయమ్), గజాః = ఏనుగులు,

గతిభిః = నడకలతో, శైలాః = కొండలు, స్రవత్-నిర్ఝరైః = పాఱే సెలయేళ్ళతో, మృగాః = జింకలు, వీక్షణైః = చూపులతో, సా భూః = ఆ భూమి, సు-ఛాయైః = మంచి నీడలు గల, మణి... చయైః : మణి-కుట్టిమ = మణులు పొదిగిన (కుట్టిమం బద్ధభూమికమ్ - హలాయుధకోశః - 294), స్థల = ప్రదేశాల, చయైః = సమూహాలతో, తదా = అప్పుడు, తద్-బృందావనమ్ = ఆ బృందావనాన్ని, అచ్యుత+అర్హ-భవనమ్ = అచ్యుతునకు తగిన భవనంగా (అచ్యుతాయ అర్హం చ తద్ భవనమ్), తేనిరే = చేసాయి.. (తనూ విస్తారే ఆత్మనేపది - లిట్ - ప్ర.బ.)

**తా ॥** ఆ బృందావనమంతా శ్రీకృష్ణుడు అక్కడకు చేరే వేళకు ఆయనకు తగిన (రాజ) భవనంలాగా తీర్చబడింది. చెట్లు పూలతో, చిలుకలు తీయని పలుకులతో, కోకిలలు స్వరాలతో, నెమళ్ళు చిందులతో, ఏనుగులు నడకలతో, కొండలు సెలయేళ్ళతో, నేల మంచి నీడలుగల మణికుట్టిమ ప్రదేశాలతో, జింకలు చూపులతో ఆ బృందావనాన్ని విరాజిల్లజేశాయి.

**వి :** 1. సంపన్నతకు, సౌందర్యానికి, కళాప్రియత్వానికి, భోగలాలసతకు నిలయాలుగా నిలుస్తాయి రాజభవనాలు. ఇక్కడ కృష్ణునకు అటువంటి రాజోచితభవనాన్ని ప్రకృతియే తీర్చిదిద్దింది. ఆ సమృద్ధి అప్పుడు ఆ పరిసరాలకే ఉదాత్తతను తెచ్చిపెట్టింది. అందుకే ఉదాత్తాలంకారం. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' - కు. 162.

| 2. **తేనిరే :** | తేనే | తేనాతే | **తేనిరే** |
|---|---|---|---|
| | తేనిషే | తేనాథే | తేనిధ్వే |
| | తేనే | తేనివహే | తేనిమహే. |

*

**శ్లో॥ స లబ్ధజన్మా మధురాఖ్యపుర్యాం - వ్రజేఽభివృద్ధః కతిచిద్దినాని ।**
**ఉపేత్య బృందావనమేష కృష్ణ-స్త్రిధామతాం దర్శయతీవ దేవః ॥ 4-23**

**అ :** కృష్ణుని త్రిధామత్వ సార్థకతా నిరూపణ. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః కృష్ణః మధురా+ఆఖ్య పుర్యామ్ లబ్ధజన్మా. కతిచిత్ దినాని వ్రజే అభివృద్ధః (సన్) ఏషః బృందావనమ్ ఉపేత్య త్రిధామతాం దర్శయతీవ.

**ప్ర :** సః కృష్ణః = ఆ కృష్ణుడు, మధురా+ఆఖ్య-పుర్యామ్ : మధురా+ఆఖ్య = మధుర యను పేరుగల, పుర్యామ్ = నగరిలో (మధురా ఇతి ఆఖ్యా, మధురాఖ్యా చ సా పురీ, తస్యామ్), లబ్ధజన్మా = పుట్టినవాడై (లబ్ధం జన్మ యేన సః), కతిచిత్ = కొన్ని, దినాని = రోజులు, వ్రజే = గోకులంలో, అభివృద్ధః (సన్) = పెరిగినవాడై, ఏషః = ఇదుగో, బృందా-వనమ్ = బృందావనాన్ని, ఉపేత్య = చేరి (ఉప+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), త్రిధామతామ్ = త్రిధామ (త్రిభువన) తత్త్వాన్ని, దర్శయతి+ఇవ = ప్రదర్శిస్తున్నట్లుంది. (దృశ్ ప్రేక్షణే ణిచ్ - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు మధురానగరిలో పుట్టాడు. కొద్దిరోజులు బృహద్వనంలో పెరిగాడు. ఆ తర్వాత ఇప్పుడు బృందావనం చేరాడు. తన త్రికకుబ్ ధామత్వాన్ని ప్రదర్శిస్తున్నట్లు ఉంది ఇదంతా.

**వి :** 1. ప్రభూతస్త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్ ॥ - విష్ణుసహస్రనామస్తోత్రం-7

అని త్రికకుబ్ ధామత్వాన్ని - విష్ణువునకు - ప్రకటిస్తోంది విష్ణుసహస్రనామస్తోత్రం. దాన్ని ఇక్కడ కృష్ణరూపుడై ప్రదర్శిస్తున్నట్లుంది.

| 2. **దర్శయతి :** | **దర్శయతి** | దర్శయతః | దర్శయంతి |
|---|---|---|---|
| | దర్శయసి | దర్శయథః | దర్శయథ |
| | దర్శయామి | దర్శయావః | దర్శయామః. |

*

**శ్లో॥ ఫలైః ప్రసూనైః పయసా తృణేన - విధాయ గోగోపనికాయరక్షామ్ ।**
**వనం స్వనామానుగుణం బభాజ - హరౌ ప్రసన్నే కిమిహాస్త్యసాధ్యమ్ ॥ 4-24**

**అ :** బృందావన నామ సార్థక్యం - హరిప్రసాదవిశేషవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** వనం ఫలైః ప్రసూనైః పయసా తృణేన గో-గోప-నికాయ-రక్షాం విధాయ స్వనామానుగుణం బభాజ. హరౌ ప్రసన్నే ఇహ అసాధ్యం కిమ్ అస్తి.

**ప్ర :** వనమ్ = బృందావనం (బృందమ్ అవతి ఇతి బృందావనమ్), ఫలైః = పండ్లతో, ప్రసూనైః = పూలతో, పయసా = పాలతో, తృణేన = గడ్డితో, గో-గోప-నికాయ-రక్షామ్ : గో = గోవులయొక్క, గోప = గోపాలురయొక్క, నికాయ = సమూహంయొక్క, రక్షామ్ = రక్షణను (గవాం గోపానామ్ చ నికాయః, తస్య రక్షా, తామ్), విధాయ = కల్పించి (వి- ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వ-నామ+అనుగుణమ్ = తన పేరుకు తగ్గట్లు (స్వస్య నామ, తస్య అనుగుణః యథా భవతి తథా), బభాజ = సేవించింది. (భజ సేవాయాం పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), హరౌ = కృష్ణుడు, ప్రసన్నే సతి = అనుగ్రహించగా, ఇహ = ఈ లోకంలో, అసాధ్యమ్ = చేయలేనిది, కిమ్ అస్తి? = ఏమున్నది? (అస భువి పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** బృందావనం పండ్లతో, పూలతో, పాలతో, గడ్డితో, గోవుల, గోపాలుర సమూహాలను కాపాడి తన పేరును బృందావనాన్ని (సమూహాలను కాపాడేది) సార్థకం చేసికొన్నది. హరి అనుగ్రహిస్తే అసాధ్య మేముంటుంది?

**వి :** 1. గీతలో భగవద్వచన మిలా ఉంది.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతమ్ అశ్నామి ప్రయతాత్మనః ॥ - భగవద్గీత - 9/26

బృందావన మన్నీ ఇచ్చింది కృష్ణునకే కాక తనవారికి కూడా. అవి స్వీకరించాడు కాబట్టి ప్రసన్నుడైనట్లే. కృష్ణుడు ఆరగిస్తే ఏమవుతుందో కుచేలుని కథ ద్వారా అందరికీ తెలుసు. అందుకే బృందావనం ఆనందనిలయమైనది.

2. ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారం. బృందావనమందరికీ అన్నింటినీ ఇచ్చి కాపాడిందని విశేషవిషయాన్ని చెప్పి తదనుబంధంగా హరి అనుగ్రహిస్తే అసాధ్యమేముందని సామాన్య విషయన్యాసం చేసినందువల్ల అర్థాంతరన్యాసం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**' (కు.122)

| | | | |
|---|---|---|---|
| 3. **బభాజ :** | **బభాజ** | భేజతుః | భేజుః |
| | భేజిథ/బభక్థ | భేజథుః | భేజ |
| | బభాజ/బభజ | భేజివ | భేజిమ. |

| | | | |
|---|---|---|---|
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః. |

*

**శ్లో॥ తతః స గోరూపధరైర్నియుద్ధ్యం-శ్చచార చారూపలముత్క్షిపంశ్చ ।**
**వనేఽనుశిక్షన్నివ వత్సదైత్య-రణం తథోత్క్షేపణమేవ తన్వాః ॥ 4-25**

**అ :** వత్సాసుర సంహారణోద్యమ ప్రస్తావన. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః సః వత్స-దైత్య-రణమ్ అనుశిక్షన్నివ గో-రూప-ధరైః నియుద్ధ్యన్ తథా తన్వాః ఉత్క్షేపణం శిక్షన్నివ ఉపలం చారు ఉత్క్షిపన్ వనే చచార.

**ప్ర :** తతః = అటు తర్వాత, సః = ఆ కృష్ణుడు, వత్సదైత్యరణమ్ : వత్స = వత్సుడను, దైత్య = రాక్షసునితో, రణమ్ = యుద్ధాన్ని (వత్స ఇతి దైత్యః, తేన రణః, తమ్), శిక్షన్+ఇవ = నేర్చుకొంటున్నట్లు, గోరూప-ధరైః = వత్సరూపాన్ని ధరించిన గోపాలురతో, నియుద్ధ్యన్ = మల్లయుద్ధం చేస్తూ, తన్వాః = శరీరం యొక్క, ఉత్క్షేపణమ్ = విసిరి వేయుటను, శిక్షన్+ఇవ = నేర్చుకొంటున్నట్లు, చారు = అందంగా, ఉపలమ్ = రాతిని, ఉత్క్షిపన్+చ = పైకి విసురుతూ, వనే = బృందావనంలో, చచార = తిరిగాడు. (చర గతిభక్షణయోః పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** బృందావనం చేరిన తరువాత గోరూపాన్ని ధరించిన గోపాలకులతో ద్వంద్వ యుద్ధం చేస్తున్నాడు. అది భవిష్యత్తులో వత్సాసురునితో చేయబోయే యుద్ధానికి అభ్యాసంగా వుంటోంది. రాళ్ళను అందంగా పైకి రువ్వుతున్నాడు. అది వత్సాసురుని శరీరాన్ని విసిరివేయటం అభ్యాసం చేస్తున్నట్లుంది. ఇటువంటి కృత్యాలు చేస్తూ సంచరించసాగాడు కృష్ణుడు.

**వి :** 1. భాగవతంలో సూక్ష్మంగా చెప్పిన ఈ అంశాన్ని వాదిరాజతీర్థరు ఉత్ప్రేక్షించారు. వత్సునితో పోరాటానికి సిద్ధపడుతున్నట్లు.

శ్లో॥ క్వచిద్ వాదయతో వేణుం క్షేపణైః క్షిపతః క్వచిత్ ।
క్వచిత్ పాదైః కింకిణీభిః క్వచిత్ కృత్రిమగోవృషైః ॥

శ్లో॥ వృషాయమాణౌ నర్దంతౌ యుయుధాతే పరస్పరమ్ ।
అనుకృత్య రుతైర్జంతూన్ చేరతుః ప్రాకృతౌ యథా ॥ -భాగవతమ్ 10/11/39,40

పోతన దీనిని విస్తరిస్తూ సీసంగా మలిచిన తీరు మనోహరం.

సీ. వేణువు లూఁదుచు వివిధరూపములతో గంతులు వైతురు కౌతుకమున,
గురుకంబళాదుల గోవృషంబులఁబన్ని పరవృషభాము లని ప్రతిభటింతు,
రల్లులు ధట్టించి యంఘ్రుల గజ్జెలు మొరయఁ దన్నుదు రోలిముమ్మరముగఁ
బన్నిదంబులు వైచి ఫలమంజరులఁ గూల్చి వ్రేటు లాడుదురు ప్రావీణ్యమొప్ప,

తే. వన్యజంతుచయంబుల వాని వాని,
పదురు పదురుచు వంచించి పట్టఁబోదు,
రంబుజాకరములఁ జల్లులాడఁ జనుదు,
రా కుమారులు బాల్యవిహారు లగుచు. - పోతనభాగవతం 10/428

| | | | |
|---|---|---|---|
| 2. **చచార :** | **చచార** | చేరతుః | చేరుః |
| | చేరిథ | చేరథుః | చేర |
| | చచార/చచర | చేరివ | చేరిమ. |

*

**శ్లో॥ ప్లవఙ్గవేషైరనుగైః సమేతః - స సేతుబన్ధాదివిహారశీలః ।**
**చరన్నరణ్యే రఘురామరూపం - స్వకీయమాజ్ఞాపయతి స్మ దేవః ॥ 4-26**

**అ :** కృష్ణుడు రఘురామ క్రీడా విహారుడై తిరుగుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ప్లవంగ–వేషైః అనుగైః సమేతః సః సేతు–బంధాది–విహార–శీలః అరణ్యే చరన్ రఘురామ– రూపం స్వకీయమ్ ఆజ్ఞాపయతి స్మ.

**ప్ర :** ప్లవంగ–వేషైః = కపి వేషం కలిగిన (ప్లవంగానాం వేష ఇవ వేషః యేషాం తైః), అనుగైః = అనుచరులతో (అనుగచ్ఛంతి ఇతి – తైః), సమేతః = కూడినవాడై, సేతుబంధాదివిహారశీలః (సన్) : సేతు–బంధ = సముద్రానికి వంతెన కట్టడం, ఆది = మొదలుగా గల, విహార–శీలః = విహరణ స్వభావం గలవాడై (సేతోః బంధః ఆదౌ యస్య, సః స ఏవ విహారః శీలం యస్య సః), అరణ్యే = అడవిలో, చరన్ = తిరుగుతూ (చర్ ధాతువుపై శతృ ప్రత్యయం), సః దేవః = ఆ స్వామి (కృష్ణుడు), రఘురామ–రూపమ్ = రఘురాముని రూపాన్ని (రఘుశ్చాసౌ రామః, తస్య రూపమ్), స్వకీయమ్ = తనదిగా, ఆజ్ఞాపయతి స్మ = ఆదేశించుచుండెను. (ఆజ్ జ్ఞప – జ్ఞానజ్ఞాపనమారణతోషణ నిశాననిశామనేషు – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.) ('**లిట్ స్మే చ**' (అష్టాధ్యాయి – 3/4/118) సూత్రం మేర లిడర్థం.

**తా ॥** అనుచరులు కపివేషాలతో తనవెంటరాగా వంతెనలు కట్టడం మొదలయిన స్వభావం కలిగి, బృందావనం/అరణ్యంలో తిరుగుతూ రఘురాముడు తనరూపమే అని వారి దగ్గర ప్రకటిస్తున్నాడు.

**వి :** 1. రఘురామునిలోని మూడు లక్షణాలను ఇక్కడ ప్రస్తావిస్తూ – 1. కోతులు అనుసరించటం 2. సేతు బంధనం 3. అరణ్యసంచారం – తానూ అలాగే చేస్తున్నందువలన తానే రఘురాముడనటం (మూలభాగవతంలో లేదు) సంబంధం లేకపోయినా (లౌకికంగా) సంబంధాన్ని కల్పించటం కాబట్టి అతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' (కు.39)

| | | | |
|---|---|---|---|
| 2. **ఆజ్ఞాపయతి :** | **ఆజ్ఞాపయతి** | ఆజ్ఞాపయతః | ఆజ్ఞాపయంతి |
| | ఆజ్ఞాపయసి | ఆజ్ఞాపయథః | ఆజ్ఞాపయథ |
| | ఆజ్ఞాపయామి | ఆజ్ఞాపయావః | ఆజ్ఞాపయామః. |

*

**శ్లో॥ సహానుగైర్గాః కిల చారయన్తం – ఖలోఽభ్యగాత్ తం పశువేషధారీ ।**
**అహం మహాన్తం ప్రతియాస్యతోఽస్య – పశుత్వమాజానజమేవ మన్యే ॥ 4–27**

**అ :** వత్సాసురుడు ఆవుదూడరూపంలో కృష్ణునిపైకి వచ్చుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** అనుగైః సహ గాః చారయన్తం తం పశు–వేష–ధారీ ఖలః అభ్యగాత్. అహం మహాంతం ప్రతియాస్యతః అస్య పశుత్వమ్ ఆజానజమ్ ఏవ – (ఇతి) మన్యే.

**ప్ర :** అనుగైః సహ = అనుచరులతో కలిసి (అను గచ్ఛన్తి ఇతి అనుగాః, తైః), గాః = గోవులను, చారయన్తమ్ = మేపుతున్న, తమ్ = ఆ కృష్ణునికి, పశు–వేష–ధారీ : పశు = పశువుయొక్క, వేష = రూపాన్ని, ధారీ (సన్) = ధరించినవాడై, ఖలః = క్రూరుడైన రాక్షసుడు, అభి+అగాత్ = ఎదురు వెళ్ళెను. అహమ్ = నేను, మహాన్తమ్ = గొప్పవారిని, ప్రతియాస్యతః = ఎదురు వెళ్తున్న, అస్య = ఈ వత్సుని యొక్క, పశుత్వమ్ = పశుత్వము (వివేకశూన్యత), ఆజానజమ్+ఏవ = సహజాతమే, (ఇతి) = అని, మన్యే = అనుకొంటున్నాను. (మన్ జ్ఞానే – ఆత్మనేపది – లిట్ – ఉ.ఏ.)

**తా ॥** అనుచరులతో కలిసి సంచరిస్తున్న ఆ కృష్ణుని పశురూపం ధరించిన వత్సాసురుడు ఎదిరించాడు. మహాత్ములకు ఎదురువెళ్ళాలనుకొంటున్న ఆ పశుత్వం ఆ దుర్మార్గుడికి పుట్టుకతోనే వచ్చిందని నేననుకొంటున్నాను.

**విశే :** 1. వత్సాసురుడు జన్మతః అసురుడు. ప్రకృతం ఆవుదూడ వేషంలో వచ్చాడు. పుట్టుకతో వచ్చింది అసురత్వమే. కాని కవిభావనలో ఆ రాక్షసుడికి పశుత్వమే పుట్టుకతో వచ్చింది. కవి అలా సంభావన చేసినందువల్ల

ఇది ఉత్ప్రేక్షాలంకారం. అది వస్తుమాత్రం కావటంతో వస్తూత్ప్రేక్ష. **'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తు హేతుఫలాత్మనా'** (కు. 32)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే | |
| | మన్యసే | మన్యథే | మన్యధ్వే | |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే. | * |

**శ్లో॥ తద్బృన్దావనభూగణం పదరుచా ప్రాగఙ్కయన్ సోఽసకృత్**
**పశ్చాత్ తద్గమరుద్గణం చ వరయన్ కుర్వన్నివాన్తర్వనమ్ ।**
**సద్భాస్వద్గణశోభి లేఖసవయో హృద్ద్యోగణౌ చాశ్రయన్**
**లక్ష్మీశోఽనుకరోతి తత్ర విచరన్ శార్దూలవిక్రీడితమ్ ॥ 4-28**

**అ :** కృష్ణుడు బృందావనంలో వత్సవధవేళలో శార్దూలవిక్రీడితాన్ని అనుకరించుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** లక్ష్మీశః తద్బృందావనభూగణం ప్రాక్ పదరుచా అంకయన్ పశ్చాత్ తద్గమరుద్గణం పదరుచా అసకృత్ వరయన్ పదరుచా అంతర్వనం సద్భాస్వద్గణశోభి కుర్వన్, పదరుచా లేఖసవయః హృద్ద్యోగణౌ చ ఆశ్రయన్ తత్ర విచరన్ శార్దూలవిక్రీడితమ్ అనుకరోతి.

**ప్ర :** లక్ష్మీ+ఈశః = విష్ణువు, తద్-బృందా-వన-భూగణమ్ : తద్ = ఆ, బృందావన = బృందావనంలోని, భూగణమ్ = ప్రాంతాలను (బృందావనే భువాం గణః, తమ్), ప్రాక్ = ముందుగా, పద-రుచా = పాదకాంతితో (పదస్య రుక్, తయా), అంకయన్ = అలంకరిస్తూ (అంక్ ధాతువుపై శతృ ప్రత్యయం), పశ్చాత్ = ఆ తరువాత, తద్+గ-మరుద్+గణమ్ : తద్+గ = ఆ బృందావనంలోని, మరుద్+గణమ్ = గాలుల సమూహాలను, పద-రుచా = పాదకాంతితో, అసకృత్ = మాటిమాటికి, వరయన్ = ఇష్టపడుతూ, పదరుచా = పాదకాంతితో, అంతర్వనమ్ = వనమధ్యంలో, సద్+భాస్వద్-గణ-శోభి : సత్ = చక్కని, భాస్వత్-గణ = సూర్యుల సముదాయంతో, శోభి = ప్రకాశించునట్లు (సన్తః చ తే భాస్వతః గణాః, తైః శోభత ఇతి), కుర్వన్ = చేస్తూ, పదరుచా = పాదకాంతితో, లేఖ-సవయః : లేఖ = దేవతలవంటి, సవయః = సమవయస్కులను/గోపాలురను, హృద్ద్యోగణౌ =హృదయాకాశాలను, ఆశ్రయన్ = ఆశ్రయిస్తూ, తత్ర = ఆ బృందావనిలో, విచరన్ = తిరుగుతూ, శార్దూల విక్రీడితమ్ : శార్దూల = పులియొక్క, విక్రీడితమ్ = ఆటను, అనుకరోతి = అనుకరిస్తున్నాడు.

**తా ॥** కృష్ణుడు బృందావనంలోని భూగణాలను తన పాదకాంతితో అలంకరిస్తూ, అక్కడున్న చల్లని గాలుల సమూహాలను పదేపదే ఇష్టపడుతూ, వనాంతరాన్ని చక్కని సూర్యకిరణ సమూహంతో అలంకరింపజేస్తూ, దేవతల వంటి తనతోటివారి హృదయాకాశాలను ఆశ్రయిస్తూ శార్దూలవిక్రీడితాన్ని అనుకరించాడు.

**వి : 1. ఈ లక్షణాలు శార్దూలవిక్రీడితానికి కూడా సరిపోతాయి. ముందుగా పాదకాంతితో భూగణాన్ని (భూదేవతా సంబంధి మగణం), అలంకరిస్తూ, ఆ తరువాత వాయుదేవతకు సంబంధించిన సగణాలను ఇష్టపడుతూ, ఆ మధ్యలో సూర్యదేవునకు సంబంధించిన జగణాన్ని స్వీకరిస్తూ, ఆ తరువాత ఆకాశదేవతలకు సంబంధించిన త గణాలను రెండింటిని స్వీకరిస్తూ శార్దూలవిక్రీడితం సిద్ధమవుతుంది.**

2. ఇక్కడ ముద్రాలంకారముంది. **'సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః'** – (కు. 136) ప్రకృతార్థానికి సంబంధించిన పదాలను వాడుతూ మరొక అర్థాన్ని సూచించటం ముద్రాలంకారం. ఇక్కడ శార్దూలవిక్రీడితం పదం కృష్ణ చేష్టను వివరిస్తూనే పద్యం శార్దూలవిక్రీడితమని ధ్వనింపజేస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **అనుకరోతి :** | **అనుకరోతి** | అనుకురుతః | అనుకుర్వంతి |
| | అనుకరోషి | అనుకురుథః | అనుకురుథ |
| | అనుకరోమి | అనుకుర్వః | అనుకుర్మః. * |

**శ్లో॥ ఉదక్షిపత్ తం హరిరాత్మదోర్భ్యా-మధః పపాతాశు స వత్సదైత్యః ।**
**వ్రజాధినాథస్య స ఏష ధర్మో - గృహీతమాయస్య చ తస్య పాతః ॥ 4-29**

**అ :** వత్సాసురుని అధఃపతనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** హరిః తమ్ ఆత్మదోర్భ్యామ్ ఉదక్షిపత్. సః వత్సదైత్యః ఆశు అధః పపాత. వ్రజ+ అధినాథస్య సః ఏషః ధర్మః. గృహీతమాయస్య తస్య చ అధః పాతః.

**ప్ర :** హరిః = కృష్ణుడు, తమ్ = ఆ వత్సాసురుని, ఆత్మ-దోర్భ్యామ్ : ఆత్మ = తన యొక్క, దోర్భ్యామ్ = భుజాలతో (ఆత్మనః దోషౌ, తాభ్యామ్), ఉదక్షిపత్ = పైకి విసిరాడు (ఉద్ - క్షిప ప్రేరణే పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.), సః = ఆ, వత్సదైత్యః = వత్సాసురుడు (వత్స ఇతి దైత్యః), ఆశు = వేగంగా, అధః పపాత = నేలకూలాడు. (పత్ పతనే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), వ్రజ+అధినాథస్య = గోకులానికి ప్రభువైన కృష్ణునకు, సః ఏషః = ఆ ఇది (పైకి తీసికొని పోవటం), ధర్మః = ధర్మం (స్వాభావిక లక్షణం), గృహీత-మాయస్య = మాయను స్వీకరించిన (గృహీతా మాయా యేన తస్య), తస్య చ = అతనికి కూడా, పాతః = అధఃపతనం, ధర్మః = ధర్మం (స్వభావం).

**తా ॥** కృష్ణుడు వత్సాసురుని తన భుజాలతో పైకి విసిరాడు. వత్సాసురుడు వెంటనే నేలకూలాడు. గోకుల ప్రభువైన కృష్ణునకు ఉద్ధరించటం ధర్మం. మాయావి అయిన రాక్షసునకు అధఃపతనం లక్షణం.

**వి :** 1. తన శత్రువునయినా ఉద్ధరించగలగటం హరి లక్షణం. ఉద్ధరింపబడుతున్న వేళలో కూడా నేలగూలటాన్నే ఎంచుకోవటం రాక్షసునిలోని అజ్ఞానం. ఎవరికి వారికిగా రెండూ సరిపోయాయి. కానీ ఆ రెండూ కలిపి చూస్తే విషమంగా కనిపిస్తుంది. పరస్పరం అనురూపం కానీ రెండు విషయాలను వర్ణించటం విషమాలంకారం. '**విషమం వర్ణ్యతే యత్ర ద్వయోరననురూపయోః**' (కు. 88)

2. కృష్ణుడు వత్సాసురుని చంపిన తీరు క్రియాస్వభావోక్తి రూపంగా భాగవతంలో ఇలా కనిపిస్తుంది.

చ. **ఇది యొక మంచిలేఁగ, విను డెంతయు నొప్పెడి** నంచు డాసి, త
త్పదములుఁ దోఁకయున్ బిగియఁ బట్టి చెలంగి వెలంగ్రమానితోఁ
జదియఁగ నొక్క పెట్టుగొని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసున్
గుదులుకొనంగ బాలకులు గోయని యార్వ యఖర్వలీలతోన్. - పోతనభాగవతం 10/433

| | | | |
|---|---|---|---|
| 3. **ఉదక్షిపత్ :** | **ఉదక్షిపత్** | ఉదక్షిపతామ్ | ఉదక్షిపన్ |
| | ఉదక్షిపః | ఉదక్షిపతమ్ | ఉదక్షిపత |
| | ఉదక్షిపమ్ | ఉదక్షిపావ | ఉదక్షిపామ |
| **పపాత :** | **పపాత** | పేతతుః | పేతుః |
| | పేతిథ | పేతథుః | పేత |
| | పపాత/పపత | పేతివ | పేతిమ. * |

**శ్లో॥ స పాతయామాస పతన్ కపిత్థ-ఫలాని లోలద్రుమసఞ్చయేభ్యః ।**
**తథాహి కృష్ణప్రతిపక్షిపక్షః - కథం న పాతైకఫలస్త్రిలోక్యామ్ ॥ 4-30**

**అ :** వత్సాసురునితోపాటు వెలంగపండ్లుకూడా రాలిపోవటం. −ఉపేంద్రవజ్ర.

**అ :** సః పతన్ లోల−ద్రుమ−సంచయేభ్యః కపిత్థ−ఫలాని పాతయామాస. తథాహి కృష్ణ− ప్రతిపక్షి−పక్షః త్రిలోక్యాం పాతైకఫలః కథం న (భవతి)?

**ప్ర :** సః = ఆ వత్సాసురుడు, పతన్ = నేలగూలుతూ (పత్ ధాతువుపై శతృ ప్రత్యయం), లోల... సంచయేభ్యః : లోల = ఊగుతున్న, ద్రుమ = చెట్లయొక్క, సంచయేభ్యః = గుంపులనుండి (లోలాః చ తే ద్రుమాణాం సంచయాః, తేభ్యః), కపిత్థ−ఫలాని = వెలగపండ్లను (కపీనాం ప్రియత్వేన తిష్ఠన్తి ఇతి కపిత్థాః, తేషాం ఫలాని), పాతయామాస = పడగొట్టెను/ రాల్చెను. (పత్ − పతనే − ణిచ్ − పరస్మైపది − లిట్ − ప్ర.ఏ.), తథాహి = అది తగినదే. కృష్ణ... పక్షః : కృష్ణ = కృష్ణునియొక్క, ప్రతిపక్షి = శత్రువుల వైపు, పక్షః = మొగ్గుగలది (కృష్ణస్య ప్రతిపక్షిణః, తేషాం పక్షః) (అభియాతిరరాతిరమిత్రరిపూప్రతిపక్షవిపక్షవిరోధ్యరయః − హలాయుధకోశః−455), త్రిలోక్యామ్ = మూడులోకాలలోనూ (త్రయాణాం లోకానాం సమాహారః, తస్యామ్), పాత+ఏక−ఫలః = పతనమే ప్రధాన ఫలితం గలదిగా (పాత ఏవ ఏకం ఫలం యస్య సః), కథం న (భవతి)? = ఎందుకు కాదు.

**తా ॥** వత్సాసురుడు నేలగూలుతూ వెలగచెట్లకున్న పండ్లను కూడా రాల్చాడు. నిజమే మరి. శత్రుపతనంతోపాటు శత్రుపక్షం వైపు మొగ్గుచూపినవారు కూడా పతనంకాక తప్పదు గదా!

**వి :** 1. వెలగచెట్ల పండ్లుమాత్రమే ఎందుకు రాలాయి? కారణాన్ని తేలికగా ఊహించవచ్చు. ఆ వత్సాసురుని శరీరాన్ని వెలగ చెట్టుమీదికే విసిరాడు కాబట్టి. అది మూలంలో వుంది. కానీ ప్రస్తుతకావ్యంలో జారిపోయింది.

శ్లో॥ గృహీత్వాపరపాదాభ్యాం సహ లాంగూలమచ్యుతః ।
భ్రామయిత్వా కపిత్థాగ్రే ప్రాహిణోద్ గతజీవితమ్ ॥ − భాగవతం 10/11/43

వత్సాసురుడు కృష్ణుని చేతిలోనే చనిపోయాడు.

2. శ్లోక ప్రథమార్ధంలో వత్సాసురపతనంతోపాటు వెలగపండ్లు పడటం విశేషం. ద్వితీయార్ధంలో శత్రువుతో పాటు తత్పక్షమంతా నేలగూలటం సామాన్యం. విశేష సామాన్యాల రెండింటి కలయిక అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' (కు. 122)

3. **పాతయామాస :**

| | | |
|---|---|---|
| **పాతయామాస** | పాతయామాసతుః | పాతయామాసుః |
| పాతయామాసిథ | పాతయామాసథుః | పాతయామాస |
| పాతయామాస | పాతయామాసివ | పాతయామాసిమ. |

*

**శ్లో॥ అన్యోన్యాశ్రితరాగరజ్జువితతే సంసృత్యభేద్యద్రుమే**
**సంగృహ్యా ప్రతికల్పమబ్జజముఖాన్ భుజ్క్తే సుపర్ణానిహ ।**
**తం విశ్వాద్భుతలుబ్ధకం దితిసుతః శ్రుత్వా బకోఽభ్యాయయౌ**
**నూనం మీనతనుం తిమిజ్గలమివ వ్యత్యస్తబుద్ధిర్బకః ॥ 4−31**

**అ :** బకాసురుడు కృష్ణుని ఎదరింపవచ్చుట. −శార్దూలవిక్రీడితమ్.

**అ :** (యః) అన్యోన్య+ఆశ్రితరాగరజ్జువితతే సంసృతి+అభేద్యద్రుమే ప్రతికల్పమ్ అబ్జజ−ముఖాన్ సుపర్ణాన్ ఇహ సంగృహ్యా భుంక్తే తం విశ్వ+అద్భుతలుబ్ధకం మీనతనుం శ్రుత్వా దితిసుతః బకః తిమింగలమివ అభ్యాయయౌ. బకః నూనం వ్యత్యస్తబుద్ధిః.

**ప్ర :** యః = ఎవడయితే, అన్యోన్య+ఆశ్రిత... వితతే : అన్యః+అన్య = పరస్పరంగా, ఆశ్రిత = ఆశ్రయింపబడిన,

రాగ = అనురాగమనెడి, రజ్జు = త్రాటిచే/బంధంతో, వితతే = విస్తృతమైన (అన్యోన్యః ఆశ్రితశ్చ అసౌ రాగః, స ఏవ రజ్జుః, తయా వితతః, తస్మిన్), సంసృతి+అభేద్య-ద్రుమే : సంసృతి = సంసార మనే, అభేద్య = భంగపరచరాని, ద్రుమే = చెట్టుపై (సంసృతిః ఏవ అభేద్యశ్చ అసౌ ద్రుమః, తస్మిన్), ప్రతికల్పమ్ = ప్రతికల్పమందునూ (కల్పే కల్పే ప్రతికల్పమ్), అప్+జ-జ-ముఖాన్ = బ్రహ్మ మొదలుగా గల (అప్సు జాయత ఇతి అబ్జమ్, అబ్జే జాయత ఇతి అబ్జజః, సః ముఖం యేషాం తే, తాన్), సుపర్ణాన్ = పక్షులను, ఇహ = ఈ లోకంలో, సంగృహ్య = లోగొని (సమ్ – గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భుంక్తే = అనుభవిస్తాడో (భుజ – పాలనాభ్యవహారయోః – ఆత్మనేపది – లట్ – ప్ర.ఏ.), విశ్వ+అద్భుత-లుబ్ధకమ్ : విశ్వ = జగత్తునందే, అద్భుత = ఆశ్చర్యకరుడైన, లుబ్ధకమ్ = బోయవానిని (మత్స్యకారుని) (విశ్వే అద్భుతశ్చ అసౌ లుబ్ధకః, తమ్) (మృగయుర్లుబ్ధకో వ్యాధో బుధైర్వాగురికః స్మృతః హలాయుధకోశః – 596), మీన-తనుమ్ = మత్స్యావతారునిగా, శ్రుత్వా = విని (శ్రు ధాతువుపై క్త్వా ప్రత్యయం), దితి-సుతః = రాక్షసుడైన, బకః = బకుడు, తిమింగలమ్+ఇవ = తిమింగలాన్ని వలె (తిమింగలాన్ని ఎదిరించినట్లు), **అభి+ఆ-యయౌ** = ఎదురు వచ్చాడు. (అభి+ఆ-యా ప్రాపణే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), నూనమ్ = నిశ్చితంగా, బకః = బకుడు, వ్యత్యస్త – బుద్ధిః : వ్యత్యస్త = చెదరిన, బుద్ధిః = బుద్ధిగలవాడు. (వ్యత్యస్తా బుద్ధిః యస్య సః)

**తా ॥** సంసారమనే ఈ పెకలింపరాని చెట్టుపై ప్రతికల్పంలోనూ పరస్పరం రాగబంధం పెనవేసుకొన్న బ్రహ్మ మొదలుగా గల పక్షులను సృష్టించి, తనలో లీనం చేసికొనే అద్భుతమైన లుబ్ధకుడు నారాయణుడు. శ్రీ నారాయణుని కేవలం మత్స్యావతారునిగా భావించి బకాసురుడు తిమింగలాన్ని ఎదిరింపబూనినట్లు ఆయనను ఎదిరింపవచ్చాడు. నిజంగా బకుని బుద్ధి చెదిరింది. (కేవలం మీనాకృతునిగా భావించటం, అలా భావించినా ఆ స్థితిలో ఆ మీనం సాధించిన విజయాలను గుర్తించకపోవటం వలన)

**వి :** 1. శ్లోకంలో బక పదం తృతీయపాదంలోనూ, చతుర్థపాదంలోనూ కనిపిస్తోంది. అందుకే వాక్యభేదం చేసి రెండు వాక్యాలుగా శ్లోకాన్ని విభజింపవలసి వచ్చింది.

2. శ్లో॥ ద్వాసుపర్ణా సయుజా సఖాయా – సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య – నశ్నన్నన్యోఽభిచాకశీతి ॥ – ముండకోపనిషత్ 3/1/1

జీవాత్మ పరమాత్మలు కలిసి ఉండటాన్నీ, అనుభవాలు జీవాత్మకే కలగటాన్నీ పక్షులతో పోలుస్తూ చెప్పిన ఉపనిషద్వాక్యమిది. ఆ కోవలోనే ప్రకృత శ్లోకం సాగింది.

3. రాగరజ్జువు, సంసృతి ద్రుమం ఈ రెండుచోట్లా రూపకాలంకారం. రాగమనే రజ్జువు, సంసృతి అనే ద్రుమం అని ఉపమేయాలలో ఉపమానత్వాన్ని ఆరోపించినందువల్ల '**విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్ తద్రూపకం**' (కు.17), తిమింగలమివ అన్నచోట ఉపమాలంకారం మీనావతారుని ఎదిరించటాన్ని తిమింగలాన్ని ఎదిరించటంతో పోల్చి చూపటం. '**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**' – (కు.6). నూనం బకః వ్యత్యస్తబుద్ధిః – బకుని బుద్ధి నిశ్చితంగా చెదిరింది అన్నది వాక్యార్థహేతుకమైన కావ్యలింగా-లంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' (కు.121). తెలిసి తెలిసి బకుడు కృష్ణుని ఎందుకు ఎదిరిస్తున్నాడంటే బుద్ధి చెదిరింది కాబట్టి అని సమర్థనం. చేప అనే భావంతో తిమింగలాన్ని ఎదిరించవచ్చాడనటంలో జరగబోయే విషాదం ధ్వనిస్తోంది. ఆశించినదానికన్న భిన్న ఫలితాన్ని పొందటం విషాదనాలంకారం. '**ఇష్యమాణవిరుద్ధార్థ-సంప్రాప్తిస్తు విషాదనమ్**' – (కు.132). ఈ అలంకారాలు దేనికవే. ఒకదానితో మరొకదానికి సంబంధం లేదు. కాబట్టి అలంకార సంసృష్టి.

| | | | |
|---|---|---|---|
| 4. **భుంక్తే :** | **భుంక్తే** | భుంజాతే | భుంజతే |
| | భుంక్షే | భుంజాథే | భుంగ్ధ్వే |
| | భుంజే | భుంజ్వహే | భుంజ్మహే |

**అభ్యాయయౌ:**

| | | |
|---|---|---|
| అభ్యాయయౌ | అభ్యాయయతుః | అభ్యాయయుః |
| అభ్యాయయిథ/అభ్యాయయాథ | అభ్యాయయథుః | అభ్యాయయ |
| అభ్యాయయౌ | అభ్యాయయివ | అభ్యాయయిమ. |

*

**శ్లో॥ కృష్ణ! త్వన్నామ జిహ్వా న కథయతి మమేత్యాస్యమాదర్శయన్ స్వౌ**
**పక్షౌ నో కృష్ణపక్షస్త్వితి విశదయితుం ప్రోత్క్షిపన్నఙ్ఘ్రియుగ్మమ్ ।**
**పశ్చాద్భాగే విధున్వన్ హరినిలయమహీసఙ్గభీత్యేశకేశం**
**మత్వా వ్యోమాధ్వనాఽసౌ యదుకులతిలకం సత్వరోఽభ్యాజగామ ॥ 4-32**

**అ :** బకాసురుడు శ్రీకృష్ణునిపై దాడిచేయుట. -స్రగ్ధర.

**అ :** కృష్ణ! మమ జిహ్వా త్వన్నామ న కథయతి ఇతి ఆస్యం ఆదర్శయన్, కృష్ణపక్షః నో ఇతి విశదయితుం స్వౌ పక్షౌ ప్రోత్క్షిపన్, అంఘ్రియుగ్మం పశ్చాద్భాగే విధున్వన్, హరినిలయమహీ-సంగభీత్యా వ్యోమ ఈశకేశం మత్వా అసౌ సత్వరః వ్యోమాధ్వనా యదుకుల-తిలకమ్ అభ్యాజగామ।

**ప్ర :** కృష్ణ! = కృష్ణా!, మమ = నా యొక్క, జిహ్వా = నాలుక, త్వత్-నామ = నీ పేరును, న కథయతి = పలుకదు (కథ కథనే ణిచ్ - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), ఇతి = అని, ఆస్యమ్ = నోటిని, ఆదర్శయన్ = పూర్తిగా తెరచి చూపుతూ (ఆఙ్ - దృశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), కృష్ణ-పక్షః = కృష్ణుని వైపు వాడను (కృష్ణస్య పక్షః), నో = కాదు, ఇతి = అని, విశదయితుమ్ = స్పష్టం చేయటానికి (వి శద్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), స్వౌ = తన యొక్క, పక్షౌ = రెండు రెక్కలను, ప్ర+ఉత్క్షిపన్ = అల్లార్చుతూ (ఉత్ - క్షిప్ ధాతువుపై శతృ ప్రత్యయం), అంఘ్రి-యుగ్మమ్ = కాళ్ళజంటను, పశ్చాద్-భాగే = వెనుక వైపునకు, విధున్వన్ = చూపుతూ (వి-ధూ ధాతువుపై శతృ ప్రత్యయం), హరి... భీత్యా : హరి = కృష్ణునకు, నిలయ = నివాసమైన, మహీ = భూమియొక్క, సంగ = కలయికలో, భీత్యా = భయపడి (హరేః నిలయశ్చ సా మహీ, తస్యాః సంగే భీతిః, తయా), వ్యోమ = ఆకాశాన్ని, ఈశకేశమ్ = శివుని కేశంగా (వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః - అమరకోశః - స్వర్గ - 34) (ఈశస్య కేశః తమ్), మత్వా = భావించి, వ్యోమ+అధ్వనా = ఆకాశమార్గంలో (వ్యోమ ఏవ అధ్వా - తేన) **(వ్యోమ పదాన్ని వ్యోమ - వ్యోమాధ్వనా అని రెండు మార్లు వినియోగించటం అవసరం)**, సత్వరః = వేగవంతుడై, అసౌ = ఆ బకాసురుడు, యదు-కుల-తిలకమ్ = యదువంశ శ్రేష్ఠుని, అభి-ఆ-జగామ = ఎదిరించాడు. (అభి-ఆ-గమ్- గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నా నోరు నీ పేరు పలుకదు ఇదిగో చూడు అన్నట్టు నోరు పూర్తిగా తెరిచి చూపిస్తూ; నా రెక్కలు కృష్ణపక్షం వహించేవి కావు అని స్పష్టం చేయటానికి రెక్కలు అల్లార్చుతూ, (కయ్యానికి కాలుదువ్వుతున్నట్లు) కాళ్ళను వెనుకకు ఈడ్చుతూ, నేలకు హరితో చెలిమి వుంది కాబట్టి ఆ దారి క్షేమకరం కాదని, ఆకాశాన్ని శివకేశమని చెప్పివున్నారు కాబట్టి ఆకాశమార్గాన్ని ఎన్నుకొని ఆ బకుడు వేగంగా యదుకులతిలకుడైన కృష్ణునిపై దాడిచేశాడు.

**వి :** 1. శ్లోకంలో బకచేష్టావర్ణన ముంది. అది బకజాతికి చెందిన చేష్టా స్వభావం. కానీ దానికి కారణాన్ని అన్వేషించి ప్రతిపాదిస్తున్నాడు కవి తన ఊహను జోడించి. కాబట్టి స్వభావోక్త్యలంకార పురస్కృతమైన ఫలోత్ప్రేక్షాలంకార మిక్కడ వుంది. '**సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' - (కు.32)

2. పక్షిరూపంలో నున్న బకాసురుని ఆకాశగమనాన్ని సమర్థించటం శివకేశవ-భేదభావాన్ని, రాక్షసజాతికి సహజమైన విష్ణు శత్రుత్వాన్నీ, శివపక్షపాతాన్నీ ధ్వనింప జేస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 3. **కథయతి :** | **కథయతి** | కథయతః | కథయన్తి |
| | కథయసి | కతయథః | కథయత |
| | కథయామి | కథయావః | కథయామః |

| | | | |
|---|---|---|---|
| **అభ్యాజగామ:** | **అభ్యాజగామ** | అభ్యాజగ్మతుః | అభ్యాజగ్ముః |
| | అభ్యాజగమిథ/అభ్యాజగన్థ | అభ్యాజగ్మథుః | అభ్యాజగ్మ |
| | అభ్యాజగామ/అభ్యాజగమ | అభ్యాజగ్మివ | అభ్యాజగ్మిమ. |

*

**శ్లో॥ హరిం ప్రజగ్రాస తతః ఖలోఽసౌ - రురోధ కంఠశ్వసనం జ్వలన్ సః ।**
**పునశ్చ చచ్ఛర్ద స ఏవ నూనం - నిరక్రమీత్ తస్య హృదోఽఘపూర్ణాత్ ॥ 4-33**

**అ :** బకుడు కృష్ణుని మ్రింగటం, భరించలేకపోవటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః అసౌ ఖలః హరిం ప్రజగ్రాస. సః జ్వలన్ కంఠశ్వసనం రురోధ. పునః చ ఏవ చచ్ఛర్ద. సః ఏవ అఘపూర్ణాత్ తస్య హృదః నూనం నిరక్రమీత్.

**ప్ర :** తతః = ఆ పై, అసౌ ఖలః = ఆ దుర్మార్గుడు (బకుడు), హరిమ్ = కృష్ణుని, ప్రజగ్రాస = మ్రింగాడు. (ప్ర - గ్రస్ - అదనే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, జ్వలన్ = మండుతూ (జ్వల్ ధాతువుపై శతృ ప్రత్యయం), కంఠ-శ్వసనమ్ = కంఠం నుండి బయటపడవలసిన ఉచ్ఛ్వాసను, రురోధ = అడ్డగించాడు. (రుధ్ ఆ ప్రవణే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), పునః చ = మరలా కూడా, సః = ఆ బకుడు, చచ్ఛర్ద = వెలుగ్రక్కెను. (ఛర్ద్ - వమనే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.) సః ఏవ = ఆ కృష్ణుడే, అఘ-పూర్ణాత్ = పాపంతో నిండిన (అఘేన పూర్ణం తస్మాత్), తస్య = బకుని యొక్క, హృదః = హృదయం నుండి, నిర్+అక్రమీత్ = వెలువడ్డాడు. (నిర్ - క్రము పాదవిక్షేపే - లుఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** బకుడు కృష్ణుని మ్రింగాడు. కానీ కృష్ణుడు బకుని కంఠంలోనే నిలిచి ఉచ్ఛ్వాసను నిరోధించాడు. మండించాడు. బకుడు వెంటనే కృష్ణుని వెడల గ్రక్కాడు. కాదు. పాపపూర్ణమైన ఆ బకుని హృదయం నుండి కృష్ణుడే వెలుపలకు వచ్చాడు.

**వి :** 1. శ్లో॥నాహం వసామితి వైకుంఠే - యోగినాం హృదయే న చ ।
మద్భక్తా యత్ర గాయన్తి - తత్ర తిష్ఠామి నారద! ॥ అని భగవద్వచనం. భక్తుల హృదయాలలో తప్ప వైకుంఠవాసాన్నీ, యోగిహృదయనివాసాన్నీ కూడా కాదన్న హరి ద్వేషిస్తున్న వారి హృదయాలలో ఉండగలుగుతాడా?

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రజగ్రాస :** | జగ్రాస | జగ్రసతుః | జగ్రసుః |
| | జగ్రసిథ | జగ్రసథుః | జగ్రస |
| | జగ్రాస/జగ్రస | జగ్రసివ | జగ్రసిమ |
| **రురోధ :** | 4-21వ శ్లోకవ్యాఖ్య చూడుడు. | | |
| **చచ్ఛర్ద :** | **చచ్ఛర్ద** | చచ్ఛర్దతుః | చచ్ఛర్దుః |
| | చచ్ఛర్దిథ | చచ్ఛర్దథుః | చచ్ఛర్ద |
| | చచ్ఛర్ద | చచ్ఛర్దివ | చచ్ఛర్దిమ |

| | | | |
|---|---|---|---|
| **నిరక్రమీత్ :** | **నిరక్రమీత్** | నిరక్రమిష్టామ్ | నిరక్రమిషుః |
| | నిరక్రమీః | నిరక్రమిష్టమ్ | నిరక్రమిష్ట |
| | నిరక్రమిషమ్ | నిరక్రమిష్వ | నిరక్రమిష్మ. |

*

**శ్లో॥ ప్రాగ్బాలగ్రహరూపిణీం స శకటే సంకల్ప్య రజ్జుగ్రహం**
**తద్వాహాన్ ఖరకేశివత్సవృషభాన్ నిశ్శేషదైత్యాసువత్ ।**
**సంయోజ్యానిలరూపదైత్యమధునా తచ్చిహ్నమత్యద్భుతం**
**కృష్ణః ప్రేషయతీవ హస్తగబకో గాఢం తమః ప్రాపయన్ ॥ 4-34**

**అ :** రాక్షసుల నందరినీ అంధతామిస్రలోకాలకు పంపటం కృష్ణుడు చేసిన ఏర్పాటు. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** హస్తగబకః సః కృష్ణః గాఢం తమః ప్రాపయన్ ప్రాక్ శకటే బాలగ్రహరూపిణీం రజ్జుగ్రహం సంకల్ప్య తద్వాహాన్ ఖరకేశివత్సవృషభాన్ సంకల్ప్య నిశ్శేషదైత్యాసువత్ అనిలరూపదైత్యం సంయోజ్య అధునా అత్యద్భుతం తచ్చిహ్నం ప్రేషయతీవ (దృశ్యతే)

**ప్ర :** హస్తగ-బకః = బకుడు చేతఃజిక్కిన (హస్తం గతవాన్ ఇతి హస్తగః, స చ అసౌ బకః యస్య సః), సః కృష్ణః = ఆ కృష్ణుడు, గాఢమ్ = దట్టమయిన, తమః = చీకటిలోనికి, ప్రాపయన్ = పంపదలచి (ప్ర-ఆప్ ధాతువుపై శతృ ప్రత్యయం), ప్రాక్ = ముందుగా, శకటే = బండిలో/శకటాసురునిలో, బాల-గ్రహ-రూపిణీమ్ = బాలగ్రహరూపంలో నున్న పూతనను/తోకను పట్టుకొని అదిలించే దానినిగా (వ బయోః అభేదః), సంకల్ప్య = కల్పించి, తద్-వాహాన్ = ఆ బండిని మోయువానినిగా, ఖర-కేశి-వత్స-వృషభాన్ = గాడిద, గుర్రం, దూడ, ఎద్దులను/ఖరాసుర, కేశ్యసుర, వత్సాసుర, వృషభాసురులను, సంకల్ప్య = కల్పించి, నిశ్శేష-దైత్య- అసువత్ : నిశ్శేష = మిగులు లేకుండా, దైత్య = రాక్షసుల యొక్క, అసువత్ = ప్రాణాలవలె, అనిల-రూప-దైత్యమ్ = వాతాసురుని, సంయోజ్య = కుదిర్చి (ప్రయాణికునిగా), అధునా = ఇప్పుడు, అత్యద్భుతమ్ = అత్యాశ్చర్యకరుడైన, (బకమ్ = బకాసురుని), తత్-చిహ్నమ్ = ఆ శకటధ్వజ చిహ్నంగా, ప్రేషయతి+ఇవ = పంపుతున్నట్లుగా వుంది. (ప్ర+ఇష్ ఇచ్ఛాయాం ణిచ్ - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు రాక్షసులనందరినీ ఒక్కుమ్మడిగా గాఢాంధకార లోకాలకు పంపదలిచాడు. ముందుగా శకటాన్ని (శకటాసురుని చంపి) దానికి చాలకుని రూపంలో తోక పట్టుకొని అదిలించటానికి పూతనను సిద్ధం చేశాడు. ఆ తరువాత దానిని లాగటానికి నాలుగు ఎద్దులనుగా ఖరాసుర, కేశ్యసుర, వత్సాసుర, వృషభాసురులను సిద్ధం చేశాడు. వాతాసురుని దానిలో ప్రయాణం చేయటానికి సిద్ధం చేశాడు. ఇప్పుడు బకాసురుని ఆ శకటధ్వజచిహ్నంగా సమకూర్చాడు.

**వి :** 1. ఇది అతిశయోక్త్యలంకారం. '**రూపకాతిశయోక్తిః స్యాన్నిగిర్యాధ్యవసానతః**' (కు.36). ప్రకృతాంశాన్ని కప్పిపుచ్చి అప్రకృత విషయప్రస్తావన ద్వారా ప్రకృతాంశాన్ని స్ఫురింపజేయటం రూపకాతిశయోక్త్యలంకారం. ఇక్కడ శ్లోకంలో శకటాసురాదుల వృత్తాంతాన్ని వర్ణించటం, తద్ద్వారా శకటాసుర సంహారాదులు స్ఫురించటం అతిశయోక్త్యలంకార స్వరూపం. 'ప్రేషయతీవ' అని సంభావించటం వలన ఇది ఉత్ప్రేక్షాలంకారం కూడా. అది వస్తుమాత్రం కావటంతో వస్తూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రేషయతి :** | **ప్రేషయతి** | ప్రేషయతః | ప్రేషయన్తి |
| | ప్రేషయసి | ప్రేషయథః | ప్రేషయథ |
| | ప్రేషయామి | ప్రేషయావః | ప్రేషయామః. |

*

**శ్లో॥ పతత్త్రిణం తం పరిగృహ్య దోర్భ్యాం - విభిద్య తుండం వినిపాత్య భూమౌ ।**
**స యాతనామీనభుజం విధాతుం - న్యయోజయన్నారకవాపికాసు ॥ 4-35**

**అ :** కృష్ణుడు బకుని చంచువును చీల్చి సంహరించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః తం పతత్త్రిణం దోర్భ్యాం పరిగృహ్య తుండం విభిద్య భూమౌ వినిపాత్య యాతనా-మీన-భుజం విధాతుం నారక-వాపికాసు న్యయోజయత్.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, తమ్-పతిత్రిణమ్ = ఆ పక్షిని (పతన్పతంగః పతగః పతత్రీ - హలాయుధకోశః - 237), దోర్భ్యామ్ = చేతులతో, పరిగృహ్య = పట్టుకొని (పరి-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తుండమ్ = చంచూపుటాలను, విభిద్య = చీల్చి (వి-భిద్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భూమౌ = నేలపై, వినిపాత్య = పడగొట్టి (వి-ని-పత్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), యాతనా... భుజమ్ : యాతన = బాధలనెడి, మీన-భుజమ్ = చేపలు తినేవానిగా, విధాతుమ్ = చేయటానికి (యాతనా ఏవ మీనాః, తాన్, భునక్తి ఇతి, తమ్), నారక-వాపికాసు : నారక = నరకమనెడి, వాపికాసు = దిగుడు బావులలో (నరకమ్ - ఇతి వాపికాః - తాసు) (నిపానముదపానం చ నాప్యాహావశ్చ కథ్యతే - హలాయుధకోశః - 584), ని+అయోజయత్ = నియోగించెను.

**తా ॥** కృష్ణుడు ఆ బకాసురుని చేతులతో పట్టికొని, చంచూపుటాలను చీల్చి, నేలపై పడవేసి, యాతనలనే చేపలను భుజించటానికి నరకమనే దిగుడుబావులలోనికి పంపాడు.

**వి :** 1. యాతనలనెడి చేపలు, నరక మనే దిగుడుబావి - ఈ రెండుచోట్లా రూపకాలంకారం. యాతనలలో మీనత్వాన్నీ, నరకంలో వాపికాత్వాన్నీ ఆరోపించినందువల్ల రూపకాలంకారం. బకానికి మీనభక్షణం, వాపికానివాసం సహజాలే కాబట్టి పరిణామ మవసరం లేదు. '**విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్ తద్రూపకం**' - (కు. 17).

ఈ రూపకాలంకారం కవిప్రతిభాఫలం. అమూలకం. మూలంలో...

శ్లో॥ తమాపతంతం స నిగృహ్య తుండయోః - దోర్భ్యాం బకం కంససఖం సతాం పతిః ।
పశ్యత్సు బాలేషు దదార లీలయా - ముదావహో వీరణవద్దివౌకసామ్ ॥ -భాగవతం 10/11/51

అని మాత్రమే వుంది. కావ్యనిర్మాణం ఉక్తివైచిత్ర్యప్రతిఫలనమే గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **న్యయోజయత్ :** | **న్యయోజయత్** | న్యయోజయతామ్ | న్యయోజయన్ |
| | న్యయోజయః | న్యయోజయతామ్ | న్యయోజయత |
| | న్యయోజయమ్ | న్యయోజయావ | న్యయోజయామ. |

*

**శ్లో॥ తతః స పశ్యన్ పరితో వసన్త-శ్రియం మరున్మర్దితఘర్మబిన్దుః ।**
**చచార చామీకరచారువాసాః - ప్రసూనమృద్వంఘ్రితలోఽమ్బుజాక్షః ॥ 4-36**

**అ :** వసంతశోభా వర్ణనారంభం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః మరుత్+మర్దితఘర్మబిందుః చామీకరచారువాసాః ప్రసూనమృదు+అంఘ్రితలః అంబుజ+అక్షః సః వసంతశ్రియం పశ్యన్ పరితః చచార.

**ప్ర :** తతః = ఆ తరువాత, మరుత్... బిందుః : మరుత్ = గాలిచే, మర్దిత = అణచ బడిన, ఘర్మ = చెమట యొక్క, బిందుః = బిందువులు గల వాడును (మరుతా మర్దితాః ఘర్మస్య బిందవః యస్య సః), చామీకర చారు వాసాః : చామీకర = స్వర్ణమయమైన, చారు = అందమైన, వాసాః = వస్త్రాలు గలవాడును (చమీకరే భవం,

చామీకరవత్ చారు వాసః యస్య సః) (కార్తస్వరచామీకర కర్బురతపనీయనామాని - హలాయుధకోశః - 174), ప్రసూన-మృదు+అంఘ్రి-తలః : ప్రసూన = పూలవలె, మృదు = సున్నితమైన, అంఘ్రి-తలః = పాదాలు గలవాడును (ప్రసూనే ఇవ మృదునీ అంఘ్రితలే యస్య సః), అంబుజ+అక్షః = తామరకనులు గలవాడును అయిన (అంబుజే ఇవ అక్షిణీ యస్య సః), సః = ఆ కృష్ణుడు, వసంత-శ్రియమ్ = వసంత ఋతు శోభను (వసంతస్య శ్రీః, తామ్), పరితః = చుట్టూ, పశ్యన్ = చూస్తూ (దృశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), చచార = తిరిగెను. (చర -గత్యభివ్యవహారయోః - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** ఇంతలో వసంతఋతువు ప్రారంభమయింది. చల్లని గాలి చెమటను ఆర్చి వేస్తుంటే, బంగారు కలిసిన అందమయిన బట్టలు ధరించి, పూలవలె సున్నితమైన తన అరకాళ్ళను నేలమోపి అంబుజాక్షుడైన ఆ కృష్ణుడు వసంతశోభను చూస్తూ సంచరింపసాగాడు.

**వి :** 1. ప్రసూనే ఇవ మృద్వంఘ్రితలః, అంబుజే ఇవ అక్షిణీ యస్య సః - ఈ రెండు తావులలోనూ ఉపమను (పోలికను) చెప్పే ఇవ సమాసగతమై లోపించింది కాబట్టి ఇది లుప్తోపమాలంకారం.

**శ్లో॥వర్ణ్యోపమానధర్మాణాముపమావాచకస్య చ ।**
**ఏకద్విత్ర్యనుపాదానైర్భిన్నా లుప్తోపమాష్టధా ॥** - కువలయానందం - 7

మొదటిది వాచకలుప్త, రెండవది ధర్మవాచకలుప్త.

2. మహాకావ్యలక్షణాలుగా ఆలంకారికులు చెప్పిన వాటిలో కథాగమనకాలంలో వచ్చే ఋతువులను వర్ణించటం కూడా ఒకటి.

**శ్లో॥ నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్ ।**
**ఉద్యానసలిలక్రీడా మధుపానరతోత్సవాః ॥**

**శ్లో॥ విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్ ।**
**మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయా అపి ॥**

**శ్లో॥ ఏతాని యత్ర వర్ణ్యంతే తన్మహాకావ్యముచ్యతే ॥** **- ప్రతాపరుద్రీయమ్.**

| | | | |
|---|---|---|---|
| 3. **చచార :** | చచార | చేరతుః | చేరుః |
| | చేరిథ | చేరథుః | చేర |
| | చచార/చచర | చేరివ | చేరిమ. |

*

**శ్లో॥ బర్హాక్షీం ప్రసవాననామలికులోత్ఫుల్లాలకాం పల్లవ-**
**ప్రాన్తస్కంధభుజాం లతామృదుతనుం రక్తామ్బరారఞ్జితామ్ ।**
**మాద్యత్కోకిలసుస్వనాం శుకవచశ్చాటుం పలాశాధరాం**
**శక్తోఽభూద్వనదేవతామృతుమతీమప్యుజ్ఝితుం నో హరిః ॥ 4-37**

**అ :** వసంతశోభా వర్ణనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** బర్హాక్షీం ప్రసవ+ఆననామ్ అలికుల+ఉత్ఫుల్ల+అలకామ్ పల్లవ-ప్రాంత-స్కంధ-భుజాం లతా-మృదు-తనుం రక్త+అంబర+ఆరంజితామ్ మాద్యత్ కోకిల సుస్వనాం శుకవచః+చాటుం పలాశ+అధరాం వనదేవతామ్ ఋతుమతీమ్ అపి ఉజ్ఝితుం హరిః శక్తః నో అభూత్.

**ప్ర :** బర్హ+అక్షీమ్ = నెమలి ఈకలే కన్నులుగా గలదియు (బర్హాణి ఏవ అక్షిణీ యస్యాః తామ్), ప్రసవ+ఆననామ్

: ప్రసవ = పువ్వులే (పుష్పం ప్రసవః కుసుమం... హలాయుధకోశః – 186), ఆననామ్ = మోముగా గలదియు (ప్రసవాః ఏవ ఆననం యస్యాః, తామ్), అలి-కుల+ఉత్ఫుల్ల+అలకామ్ : అలి = తుమ్మెదలయొక్క, కుల = సమూహాలే, ఉత్ఫుల్ల = అందమైన, అలకామ్ = ముంగురులు గలదియు (అలీనాం కులమ్ ఏవ ఉత్ఫుల్లాః అలకాః యస్యాః, తామ్), పల్లవ-ప్రాంత-స్కంధ-భుజామ్ : పల్లవ = చివురులనెడి, ప్రాంత = కరమూలాలూ, స్కంధ = కొమ్మలనెడి, భుజామ్ = బాహువులు గలదియు (పల్లవాః ప్రాంతౌ యేషాం తే, తే చ తే స్కంధాః యస్యాః తామ్), లతా-మృదు-తనుమ్ : లతా = తీవెలనెడి, మృదు-తనుమ్ = సున్నితమైన శరీరం గలదియు, (లతా ఏవ మృద్వీ తనుః యస్యాస్తామ్), రక్త+అంబర+ఆరంజితామ్ : రక్త = ఎర్రనైన, అంబర = ఆకాశమనెడి వస్త్రంతో, ఆరంజితామ్ = అలంకరింపబడినదీ (రక్తమ్ చ తత్ అంబరం, తేన ఆరంజితా – తామ్), మాద్యత్-కోకిల- సుస్వనామ్ : మాద్యత్ = మత్తెక్కిన, కోకిల = కోయిలల యొక్క, సుస్వనామ్ = మంచి గొంతు కలదియు (మాద్యన్తః చ తే కోకిలాః, తేషాం సుస్వనాః – తామ్), శుక-వచః చాటుమ్ : శుక = చిలుకలయొక్క, వచః = మాటలనెడి, చాటుమ్ = ప్రియోక్తులు గలదియు (శుకానాం వచాంసి ఏవ చాటవః యస్యాః తామ్), పలాశ+ అధరామ్ : పలాశ = మోదుగుపూలనెడి, అధరామ్ = క్రింది పెదవి గలదియు అయిన (పలాశాని ఏవ అధరః యస్యాస్తామ్), వనదేవతామ్ = వనదేవతను, ఋతుమతీమ్-అపి = వసంత ఋతువుతో కూడినదైనను/ రజస్వల అయినను, హరిః = కృష్ణుడు, ఉజ్ఝితుమ్ = విడువటానికి, శక్తః = సమర్థుడుగా, నో-అభూత్ = కాకుండెను. (భూ సత్తాయామ్ పరస్మైపది – లుఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** వనదేవత వసంత ఋతుమతి అయింది. ఆ వనదేవతకు నెమలి ఈకలే కన్నులు. పూవులే వదనం. తుమ్మెదల పిండులే అందమైన కురులు. చివురుటాకులే కరమూలాలు. కొమ్మలే భుజాలు. లతలే సున్నితమైన శరీరం. చివురులచే ప్రతిబింబితమై ఎఱ్ఱబడిన ఆకాశమే వస్త్రం. కోకిలల కుహూకారాలే పలుకులు. చిలుకల పలుకులే ప్రియోక్తులు. మోదుగలే అధరం. అంత అందమైన ఆ వనదేవతను ఋతుమతి అయినా కూడా వీడలేకపోయాడు కృష్ణుడు.

**వి :** 1. ఇక్కడ కవి ప్రదర్శించిన పోలికలు కవిసమయసిద్ధాలే. వనదేవతకు స్త్రీకి సరిపోయేటట్లుగా శరీరావయవాలకు రూపకాలంకారంతో సాగిన రచన. అవయవితో పాటు అవయవాలలో కూడా ఆరోపణ కనిపిస్తోంది కాబట్టి ఇది సావయవరూపకాలంకారం. ఉపమానాభేదాన్ని ఉపమేయాలకు చెప్పినందువల్ల అభేదసావయవరూపకం. **విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్.** (కు. 17).

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

**శ్లో॥ సజలశీకరదక్షిణవాయునా - కుసుమసఞ్చయకమ్పనచఞ్చునా ।**
**వ్యజనపాణితలేవ తమన్వగా-ద్వనరమా నరమానసమణ్డనమ్ ॥ 4-38**

**అ :** వసంతర్తువులోని వనశోభను వర్ణించుట. -ద్రుతవిలంబితమ్.

**అ :** వన-రమా కుసుమ-సంచయ-కంపన-చంచునా సజల-శీకర-దక్షిణ-వాయునా వ్యజనపాణితలా+ఇవ నరమానస-మండనం తమ్ అను+అగాత్.

**ప్ర :** వన-రమా : వన = తోటయొక్క, రమా = శోభ (వనస్య రమా), కుసుమ... చంచునా : కుసుమ = పూలయొక్క, సంచయ = సమూహంయొక్క, కంపన = కదలికలచే, చంచునా = అందమైన (కుసుమానాం సంచయః, తస్య కంపనమ్, తేన చంచుః, తేన), సజల... వాయునా : సజల-శీకర = నీటి తుంపరలతో కూడిన, దక్షిణ-వాయునా = దక్షిణదిక్కు నుండి వీచుచున్న మలయానిలంతో (జలశీకరైః సహితః, సజల శీకరః

, స చ అసౌ దక్షిణః వాయుః, తేన), వ్యజన-పాణితలా+ఇవ : వ్యజన = చామరంతో కూడిన, పాణితలా-ఇవ = అరచేయి కలదానితో వలె (చామరాన్ని చేతబట్టినట్లు) (వ్యజనం పాణేః తలే యస్యాః సా - సా ఇవ), నరమానసమండనమ్ : నర = మనుష్యుల యొక్క, మానస = మనస్సులకు, మండనమ్ = అలంకారమైన (నరాణాం మానసాని తేషాం మండనామ్), తమ్ = ఆ కృష్ణుని, అను+అగాత్ = అనుసరించి నడిచింది. (అను+ఇ గతౌ - పరస్మైపది - లుఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** (కృష్ణుడు వనమంతా సంచరిస్తున్నాడు గదా!) ఆ సంచరణానికి అనుకూలంగా వనశోభ వింజామర చేతబట్టుకొని ఆయనను అనుసరిస్తున్నదట. ఆ గాలి పూల మొత్తాలను కదలింపజేయటంతో అందాలను కలిగిస్తోంది. నీటి తుంపురలను వెదజల్లే మలయానిలంతో కూడి వుంది. మానవమానసమండనాయమానుడైన కృష్ణుని ఆ వనరమ అనుసరించింది.

**వి :** 1. శ్లో॥ యత్ర యత్ర రఘునాథకీర్తనం - తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారిపరిపూర్ణలోచనం - మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥

అని వాయుసుతుడు శ్రీరాముని అనుసరించినట్లు. ప్రకృతం వాయువే కృష్ణుని అనుసరిస్తున్న వనశోభకు సహకరించటం మనోరంజకం.

2. వ్యజనపాణితలా-ఇవ - ఇది ఉత్ప్రేక్షాలంకారం. వస్తూత్ప్రేక్ష - అందునా వనరమా అని ఉపమేయాన్ని చెప్పి వుండటం వలన ఉక్తవిషయావస్తూత్ప్రేక్ష. ఇవ శబ్దం ఉత్ప్రేక్షా వ్యంజకం.

**శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।**
**ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥**

అని అలంకారిక మర్యాద. 'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా. ఉక్తానుక్తా స్పదాదార్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే' (కు. 32)

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః | |
| | అగాః | అగాతమ్ | అగాత | |
| | అగామ్ | అగావ | అగామ. | * |

**శ్లో॥ పరిలసత్సహకారనవాఙ్కురే - పికగణః శుశుభే శనకైర్ధ్వనన్ ।**
**స్మరరహస్యమనూనివ సఞ్జప-న్నఖిలదర్పకదర్పకసాయకే ॥ 4-39**

**అ :** వసంతర్తు గత వనవర్ణనమే. -ద్రుతవిలంబితమ్.

**అ :** పిక-గణః పరిలసత్సహకార-నవాంకురే శనకైః ధ్వనన్ అఖిల-దర్పక-దర్పక-సాయకే స్మర-రహస్య-మనూన్ సంజపన్ ఇవ శుశుభే.

**ప్ర :** పిక-గణః = కోయిలల మొత్తం (పికానాం గణః), పరిలసత్సహకార-నవాంకురే : పరిలసత్ = చక్కగా ప్రకాశిస్తున్న, సహకార = తియ్యమామిడిచెట్లయొక్క (ఆమ్రశ్చూతో రసాలోఽసౌ సహకారోఽతిసౌరభః - అమరకోశః - వనౌషధి - 33), నవ+అంకురే = క్రొత్తచివుళ్ళలో (పరిలసన్తః చ తే సహకారాః, తేషాం నవః చ అసౌ అంకురః, తస్మిన్), శనకైః = మెల్లగా, ధ్వనన్ = కూతపెడుతూ, అఖిల-దర్పక-దర్పక-సాయకే : అఖిల = అందరికీ, దర్పక = పొగరుపట్టించెడి, దర్పక = మదనుని యొక్క (దర్పకః శూపకారాతిరనంగో విషమాయుధః - హలాయుధకోశః - 33), సాయకే = బాణంపై (అఖిలానాం దర్పకశ్చ అసౌ దర్పకః, తస్య సాయకః, తస్మిన్), స్మర-రహస్య-మనూన్ : స్మర రహస్య = మన్మథరహస్యాలయొక్క, మనూన్ = మంత్రాలను, సంజపన్-ఇవ =

జపిస్తున్నట్లుగా, శుశుభే = శోభిల్లింది. (బాణాలను మంత్రపూతం చేస్తున్నట్లు ప్రకాశించింది) (శుభ – దీప్తౌ – ఆత్మనేపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ။** తీయమామిడిచెట్టు క్రొత్తచిగుళ్ళు పెట్టింది. అక్కడ కోయిలలు మెల్లగా కూత పెడుతున్నాయి. అది అందరికీ పొగరెక్కించగల మన్మథుని బాణాలను మంత్రపూతం చేస్తున్నట్లుగా కనిపిస్తోంది.

వి : 1. శ్లో॥ **అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా ।**
**నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః ॥**

అని మదనుని అయిదు బాణాలలో మామిడి కూడా ఒకటి. ప్రయోగించే ముందు అస్త్రాలను మంత్రించటం అస్త్రవిద్యాప్రయోజకులు చేసే పని. కోకిలలు ఆ పని చేస్తున్నట్లుంది.

2. కోకిల మంత్రజపం చేస్తున్నట్లుగా కనిపిస్తోందనటం ఉత్ప్రేక్షాలంకారం. ఇవ శబ్దం ఉత్ప్రేక్షావ్యంజకం. వాస్తవంగా అది చేస్తున్నపని తన సహజలక్షణంగా మెల్లగా కూతలు పెడుతుండటం. అది ఉపమేయం. జపం చేయటంతో పోలిక కాబట్టి అది ఉపమానం. రెండూ వాచా చెప్పబడ్డాయి కాబట్టి ఉపమేయాన్ని కూడా చెప్పినట్లయింది. కాబట్టి ఉక్తవిషయావస్తూత్ప్రేక్షాలంకారం ముందు శ్లోకంలో వలెనే.

3. వసంతకాలం కోకిలలకు తమ స్వత్వాన్ని నిరూపించుకొనే అవకాశం.

శ్లో॥ కాకః కృష్ణః పికః కృష్ణః కో భేదః పికకాకయోః ।
వసంతసమయే ప్రాప్తే కాకః కాకః పికః పికః ॥

అని కోకిల కాకినుండి తనను వేరుచేసికొని చూసుకొనే – చూపించుకొనే – అవకాశం వసంతంలోనే. అందుకే అది శ్రద్ధగా జపిస్తున్నట్లు కనిపిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 4. **శుశుభే :** | **శుశుభే** | శుశుభాతే | శుశుభిరే |
| | శుశుభిషే | శుశుభాథే | శుశుభిధ్వే |
| | శుశుభే | శుశుభివహే | శుశుభిమహే. |

*

**శ్లో॥ కుసుమచుమ్బనకృన్మధురధ్వనిః – ప్రియజనానితి శిక్షతి షట్పదః ।**
**మృదుగిరాఽబ్జముఖీసరసాధరం – పిబత మా బత! మాన ఇహోచితః ॥ 4–40**

**అ :** వసంత ఋతుశోభాంగంగా షట్పదధ్వనిని విశ్లేషించుట. –ద్రుతవిలంబితమ్.

**అ :** కుసుమ–చుంబన–కృత్ మధుర–ధ్వనిః షట్పదః మృదు–గిరా అబ్జ–ముఖీ–సరస+అధరం పిబత బత! ఇహమానః మా ఉచితః ఇతి ప్రియజనాన్ శిక్షతి.

**ప్ర :** కుసుమ చుంబన కృత్ : కుసుమ = పువ్వులను, చుంబన–కృత్ = ముద్దిడుతున్నదియు (కుసుమానాం చుంబనం కరోతి ఇతి), మధుర–ధ్వనిః : మధుర = మనోహరమైన, ధ్వనిః = ధ్వని (ఝంకారం) కలదియు అయిన (మధురః ధ్వనిః యస్య సః), షట్పదః = తుమ్మెద (షట్ పదాని అస్య), మృదు–గిరా : మృదు = సున్నితమైన, గిరా = మాటతో (మృద్వీ చ అసౌ గీః – తయా), బత = అరే! (నిందాయాం విస్మయే బత – హలాయుధకోశః – 878), అబ్జముఖీ–సరస+అధరమ్ : అబ్జ = తామరవంటి, ముఖీ = మోముగల కాంతలయొక్క, సరస = రసభరితమైన, అధరమ్ = క్రింది పెదవిని (అబ్జమ్ – ఇవ ముఖం యస్యాః సా అబ్జముఖీ, తస్యాః సరసశ్చాసౌ అధరః, తమ్), పిబత = ఆస్వాదించండి (పా పానే పరస్మైపది – లోట్ – మ.బ.) ఇహ = ఇక్కడ /అనుభవ వేళలో / ఈ వసంతంలో, మానః = అభిమానం (ఇష్టవస్తువును కూడా కాదనుకొనగలిగిన మానసికస్థితి),

మా+ఉచితః = తగదు, ఇతి = అని, ప్రియ-జనాన్ = ప్రేమికులకు (ప్రియాశ్చ తే జనాః, తాన్), శిక్షతి = నేర్పుతున్నది/ఉపదేశిస్తున్నది. (శిక్ష-విద్యోపాదానే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** తుమ్మెద రొద చేస్తోంది. కాదు. అది పూలను ముద్దిడుతూ, మధురధ్వనులు చేస్తూ ప్రేమికులకు ఉపదేశిస్తోందట. ఏమని? ప్రియాధరపానం చేయండి. ఇది కోపానికి అభిమానానికి సమయం కాదు అని.

**వి :** 1. ఈ శ్లోకంలో '**ఇహ**' (ఇక్కడ) పదం అర్థాంతరసంక్రమితవాచ్యమై అనేకార్థాలను ధ్వనింపజేస్తుంది. అర్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని (అనురణనధ్వని)కి చక్కని ఉదాహరణ.

2. **కుసుమచుంబనకృత్** - అని షట్పదానికి ప్రయోగించిన విశేషణం సాభిప్రాయం. ఎందుకంటే అది తాను ప్రేమికులకు ఉపదేశించబోతున్న విషయాన్ని ముందుగా తాను ఆచరించి ఆపై బోధిస్తోంది. **విద్యకు నాలుగు దశలు. అధ్యయనం, అవగాహనం, ఆచరణం, ప్రచారం**. తాను ఆచరించిన తరువాతనే పరులకుపదేశించాలి. ఆ పని షట్పదం చేస్తోంది. అందుకు ఆ విశేషణం సాభిప్రాయం. ఆలంకారికంగా దాన్ని పరికరాలంకారమంటారు. 'అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణే' (కు.62)

| 3. **శిక్షతి :** | **శిక్షతి** | శిక్షతః | శిక్షన్తి |
|---|---|---|---|
| | శిక్షసి | శిక్షథః | శిక్షథ |
| | శిక్షామి | శిక్షావః | శిక్షామః |

వాస్తవంగా శిక్ష ధాతువు ఆత్మనేపది '**శిక్షతే**' అనే ప్రయోగించాలి. కానీ కొన్ని ధాతువులు ప్రసిద్ధివలన - అది సార్వత్రికమయినా కావచ్చు. క్వాచిత్కమయినా కావచ్చు - స్వరూపాన్ని మార్చుకొంటాయి. '**అకర్మకాచ్చ**' (అష్టాధ్యాయి 1-3-26) సూత్రం మేరకు (అకర్మకాత్ - చ అని యోగవిభాగం చేయటం ద్వారా చ కారాన్ని విడిగా పరిగణిస్తే) అకర్మక ధాతువులను ఆత్మనేపదాలయినా పరస్మైపదంగా ప్రయోగించవచ్చు. అయితే అకర్మకత్వసిద్ధికి నాలుగు నియమాలు చెప్పారు.

శ్లో॥ ధాతోరర్థాంతరే వృత్తేః ధాత్వర్థే నోపసంగ్రహాత్ ।
ప్రసిద్ధేర**వివక్షాతః** కర్మణోఽకర్మికా క్రియా ॥

కాబట్టి ఈ నాలుగు కారణాలలో ఏ ఒకటి వున్నా దానిని అకర్మకధాతువుగా పరిగణించి ఆత్మనేపదమయినా పరస్మైపదంగా వడవచ్చు. కాబట్టి ఇక్కడ పరస్మైపదప్రయోగానికి ప్రసిద్ధి అయినా కారణం కావచ్చు. ప్రయోక్తకు కర్మవివక్ష లేకపోవటమైనా కారణం కావచ్చు. *

**శ్లో॥ మరుతి వాతి శుచా పథికాఙ్గనా - నయనవారి యుయోజ పథి స్పృశన్ ।**
**అముమవైతు పతిర్మమ వేదనా-మలికులాలికులాభ్యుదితామితి ॥ 4-41**

**అ :** వసంతర్తు ప్రభావంలోని ప్రోషితభర్తృకా పరిస్థితిని వర్ణించుట. -ద్రుతవిలంబితమ్.

**అ :** పథికాంగనా మరుతి వాతి (సతి) శుచా అముం పథి స్పృశన్ మమ పతిః అలికుల+అలికుల+అభ్యుదితామ్ వేదనామ్ అవైతు ఇతి నయన-వారి యుయోజ.

**ప్ర :** పథిక+అంగనా : పథిక = బాటసారి యొక్క (ఇంటిని విడిచివున్న వాని యొక్క (పన్థానం గచ్ఛతి ఇతి పథకః తస్య అంగనా), అంగనా = భార్య, మరుతి = గాలి, వాతి (సతి) = వీచుచుండగా, శుచా = బాధతో (మన్యుశోకౌ తు శుక్ స్త్రియామ్ - అమరకోశః - నాట్య - 25), అముమ్ = ఈ గాలిని, స్పృశన్ = తాకుతూ, మమ = నా యొక్క, పతిః = భర్త, అలి-కుల+అలి-కుల+అభ్యుదితామ్ : అలి-కుల = తుమ్మెదల పిందు అనే,

అలి–కుల = చెలుల సమూహం, అభి+ఉదితామ్ = కలిగిన, వేదనామ్ = బాధను, అవైతు = తెలుసుకొనుగాక అని (అవ – ఇ గతౌ – పరస్మైపది – లోట్ – ప్ర.ఏ.), నయన–వారి = కన్నీటిని, యుయోజ = విదిలించింది. (యుజ్ యోగే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** (చల్లని) గాలి వీస్తుంటే ప్రోషితభర్తృకకు భర్త తలపునకు వచ్చాడు. ఆమె ఆ బాటలో గాలిని స్పృశిస్తూ నా భర్త తుమ్మెదల సమూహమే చెలుల సమూహంగా గల నా బాధను అవగతం చేసికొనుగాక అని భావిస్తూ కన్నీటి చుక్కను విదిలించింది. (పంపుతున్నట్టుగా)

**వి :** 1. కావ్యలక్షణాన్ని అనుసరించి అష్టవిధశృంగారనాయికలలో ప్రోషితభర్తృక ఒకటి. స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిక, ప్రోషితభర్తృక, అభిసారిక – అని ఎనిమిది విధాలుగా శృంగార నాయికలను నిర్వచించారు ఆలంకారికులు.

శ్లో॥ నానాకార్యవశాద్యస్యాః దూరదేశం గతః పతిః ।
సా మనోభవదుఃఖార్తా భవేత్ప్రోషితభర్తృకా ॥ – సాహిత్యదర్పణః 3/84

వివిధకార్యకారణంగా భర్త దూరదేశాలకు వెళ్ళివుంటే మనోభవదుఃఖానికి లోనయ్యేది ప్రోషితభర్తృక.

| | | | |
|---|---|---|---|
| 2. **యుయోజ :** | యుయోజ | యుయుజతుః | యుయుజుః |
| | యుయోజిథ | యుయుజథుః | యుయుజ |
| | యుయోజ | యుయుజివ | యుయుజిమ |
| **అవైతు :** | **అవైతు** | అవైతామ్ | అవయన్తు |
| | అవేహి | అవైతమ్ | అవైత |
| | అవాయాని | అవాయావ | అవాయామ. |

*

**శ్లో॥ మధునియుక్తభుజఙ్గచయః స్తనే – రహసి నూత్నశివం రచయన్నివ ।**
**నఖపదేన్దుకలాం వసనచ్యుతిం – వితనుతేఽతనుతేజసి యోషితామ్ ॥ 4-42**

**అ :** వసంతర్తువులో విటచేష్టా వర్ణన. –ద్రుతవిలంబితమ్.

**అ :** మధు–నియుక్త–భుజంగ–చయః అతను–తేజసి యోషితాం స్తనే రహసి నూత్న–శివం రచయన్నివ నఖ–పదేందుకలాం వసన–చ్యుతిం వితనుతే.

**ప్ర :** మధు–నియుక్త–భుజంగ–చయః : మధు = వసంతునిచే, నియుక్త = నియోగింపబడిన, భుజంగ = విటుల యొక్క, చయః = సమూహం (మధునా నియుక్తః చ అసౌ భుజంగానాం చయః), అతను – తేజసి : అతను = మిక్కిలి అయిన, తేజసి = కాంతి గల, యోషితామ్ = స్త్రీల యొక్క, స్తనే = రొమ్ముపై, రహసి = రహస్యంగా (వివిక్త విజన చ్ఛన్న నిశ్శలాకాస్తథా రహః – అమరకోశః – క్షత్ర – 22), నూత్న–శివమ్ :క్రొత్త శివుని, రచయన్నివ = తయారు చేస్తున్నట్లుగా, నఖ–పద–ఇందు–కలామ్ : నఖ–పద = గోళ్ళ గుర్తులనెడి, ఇందు–కలామ్ = చంద్రకళను/నెలవంకను (నఖస్య పదమ్ ఏవ ఇందోః కలా – తామ్), వసన–చ్యుతిమ్ : వసన = వస్త్రంయొక్క, చ్యుతిమ్ = జారుబాటును, వితనుతే = కల్పిస్తోంది. (వి తనూ విస్తారే ఆత్మనేపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** వసంతుడు ఏర్పాటు చేసిన భుజంగసమూహం తేజస్సంపన్నులైన అంగనల వక్షోజాలపై నూతన శివరూపాన్ని చిత్రించాలనుకొని, గోటి గాట్లు అనే నెలవంకలను తీర్చి, ఆపై పయ్యెదలను తొలగింపజేశాడు.

**వి :** 1. శివుడు నెలతాల్పు కాబట్టి నఖపదచంద్రకళలూ, ఆయన దిగంబరుడు కాబట్టి వసనచ్యవనాలు

అవసరమయ్యాయి. నూత్నశివనిర్మాణానికి కారణం – వసంతుడు తనకు మిత్రుడైన మన్మథుని శివుడు భస్మం చేశాడు కాబట్టి తమకు అనుకూలంగా ప్రవర్తించే మరొక శివుణ్ణి – ఆ శివునకు ప్రతిద్వంద్విగా – నిర్మించాలని వసంత సంకల్పం.

2. నఖపదా లనే చంద్రకళ – ఇక్కడ రూపకాలంకారం. గోటి గుర్తులలో చంద్రకళాత్వారోపణం. '**విషయ్యాభేదతాద్రూప్యరంజనం విషయస్య**' – (కు. 17) '**రచయన్నివ**' – వ్రాస్తున్నట్లుగా. ఇది ఉత్ప్రేక్ష. అందునా వస్తూత్ప్రేక్ష.

నూత్నశివనిర్మాణానికి 'భుజంగ' సమూహాలను నియమించటంలో ఔచిత్యముంది. భుజంగ పదానికి విటుడనే కాక, సర్పమని కూడా అర్థం. శివునితో నిత్యసాహచర్యం కారణంగా సర్పాలకు శివాకృతి స్పష్టంగా తెలుసుకాబట్టి నిర్మాణం సులభమూ, నిర్దుష్టమూ అవుతుంది. ఈ భుజంగ (విశేష్య) పదం సాభిప్రాయం కాబట్టి ఇది పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః**'. (కు. 63)

| | | | |
|---|---|---|---|
| 3. **వితనుతే :** | **వితనుతే** | వితన్వాతే | వితన్వతే |
| | వితనుషే | వితన్వాథే | వితనుధ్వే |
| | వితన్వే | వితన్వహే/వితనువహే | వితన్మహే/వితనుమహే. |

*

**శ్లో॥ మృగమదేన సితేతరకణ్ఠతాం – కరయుగామ్బుజవేష్టితమూర్ధతామ్ ।**
**హృదయమన్దిరతాం సమదృశ్యతాం – రుచిరతాం చిరతాన్తముఖైః స్వకైః ॥ 4–43**

**అ :** వక్షోజానికి పరిపూర్తిగా శివాకృతిని కల్పించటం. –ద్రుతవిలంబితమ్.

**అ :** మృగమదేన సిత+ఇతరకంఠతాం, కరయుగ+అంబుజవేష్టిత మూర్ధతామ్–హృదయమందిరతాం సమదృశ్యతాం, స్వకైః చిరతాన్తముఖైః రుచిరతామ్ (వితనుతే).

**ప్ర :** మృగమదేన = కస్తూరితో (మృగనాభిర్మృగమదః కస్తూరీ చాథ కోలకమ్ – అమరకోశః – మనుష్యవర్గః – 129), సిత+ఇతర–కంఠతామ్ = నీలకంఠత్వాన్నీ (సితాత్ ఇతరః, స చ అసౌ కంఠః, తస్య భావః, తామ్), కరయుగః+అంబుజ–వేష్టిత–మూర్ధజామ్ : కర = చేతులయొక్క, యుగ = జంట అనెడి, అంబుజ = తామరలచే, వేష్టిత = చుట్టబడిన, మూర్ధతామ్ = తలకలిగియుండటాన్నీ, (కరయోః యుగమ్ ఏవ అంబుజం, తేన వేష్టితః మూర్ధా యస్య సః, తస్య భావః, తత్తా, తామ్), హృదయ–మందిరతామ్ = హృదయమే నివాసమందిరంగా ఉండటాన్ని (హృదయమేవ మందిరం, తస్య భావః తత్తా, తామ్), సమ–దృశ్యతామ్ : సమ = సమానంగా, దృశ్యతామ్ = చూడబడుటనూ, స్వకైః = తమవైన, చిర–తాంత–ముఖైః : చిర = చాలాకాలం నుండి, తాంత = బడలిన (శబ్దార్థకల్పతరుః 630 పుట), ముఖైః = చూచుకాలతో, రుచిరతామ్ = అందాన్నీ/మనోహరత్వాన్నీ, (వితనుతే) = కల్పించుచున్నది. (ఇక్కడ కూడా 'భుజంగచయః' అన్న ముందు శ్లోకంలోని పదాన్నే కర్తృపదంగా తీసికోవాలి.

**తా ॥** (నూత్న శివ నిర్మాణాన్ని ఇంకా కొనసాగిస్తోంది భుజంగ సమూహం) కస్తూరీ లేపనంతో వక్షోజానికి నీలకంఠత్వాన్ని కల్పించారు. చేతుల జంట అనే తామరలతో దాని శిరోభాగాన్ని కప్పారు. హృదయ మందిరంలో నిలిపారు. సమంగా కనిపించేలా తీర్చారు. చిరకాలం అలసిపోయిన అగ్రభాగాలతో అవి అందంగా కనిపిస్తున్నాయి.

*

**శ్లో॥ మదనవహ్నిసఖః ప్రియశీతలః – కుసుమగన్ధవహః కిల సేవ్యతే ।**
**మరుదుపారతమన్మథసజ్వరైః – స పరితః పరితప్తముఖైర్నరైః ॥ 4–44**

అ : వసంతవర్ణనమే శీతలపవనవిన్యాసాల ద్వారా. -ద్రుతవిలంబితమ్.

అ : మదన-వహ్ని-సఖః ప్రియ-శీతలః కుసుమ-గన్ధవహః సః మరుత్ ఉపారత-మన్మథ-సంగరైః పరితప్త-ముఖైః నరైః పరితః సేవ్యతే కిల.

ప్ర : మదనవహ్నిసఖః : మదన-వహ్ని = మదనాగ్నికి, సఖః = మిత్రుడును (మదన సంబంధీ అగ్నిః, తస్య సఖా), ప్రియ-శీతలః : ప్రియ = ఇష్టమైన వాడును, శీతలః = చల్లని వాడును (ప్రియశ్చ అసౌ శీతలః), కుసుమ-గన్ధ-వహః : కుసుమ = పూవుల యొక్క, గన్ధ = పరిమళాన్ని, వహః = మోయువాడును (కుసుమానాం గన్ధః, తం వహతి ఇతి) అయిన, సః మరుత్ = ఆ వాయువు, ఉపారత-మన్మథ-సంగరైః : ఉపారత = ముగింపజేయబడిన, మన్మథ = మదన సంబంధమైన, సంగరైః = పోరు గలవారును, పరితప్త-ముఖైః : పరితప్త = పూర్తిగా వాడిన, ముఖైః = ముఖాలుగల వారును అయిన, నరైః = మానవుల చేత, పరితః = అంతటా, సేవ్యతే కిల = సేవింపబడుతోంది గదా! (సేవ్ సేవనే - కర్మణి - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** గాలి (అగ్నికి మిత్రుడు సహజంగానే) ఇప్పుడు మదనాగ్నికి మిత్రుడు. అందరూ ఇష్టపడేవాడూ చల్లనివాడూను. పూలతావులను మోసుకొని వచ్చేవాడు. అటువంటి గాలి మదనసంగరాన్ని ముగించి వాడిన ముఖాలుగల మానవులచే సర్వాంగీణంగా సేవింప బడుతోంది.

వి : 1. గాలి అగ్నికి మిత్రుడూ, శత్రువూ కూడా. అది అగ్ని బలం మీద ఆధారపడుతుంది.

శ్లో॥ వనాని దహతో వహ్నేః సఖా భవతి మారుతః ।
స ఏవ దీపనాశాయ కృశే కస్యాస్తి సౌహృదమ్ ॥ - సుభాషితరత్నభాండాగారం - పు 162

అడవులను తగులబెట్టే అగ్నికి గాలి తోడవుతుంది. అదే చిన్న దీపమయితే దానిని ఆర్పివేస్తుంది. బలహీనులతో ఎవరికి చెలిమి వుంటుంది?

కాబట్టి ఇక్కడ గాలి అగ్నికి తోడయినదంటే అగ్ని శక్తిమంతంగా వుందని అర్థం. అందుకే వారికి చల్లని గాలి అవసరమైంది ఆశ్వాసన కోసం.

2. **సేవ్యతే :**

| | | | |
|---|---|---|---|
| | **సేవ్యతే** | సేవ్యేతే | సేవ్యన్తే |
| | సేవ్యసే | సేవ్యేథే | సేవ్యధ్వే |
| | సేవ్యే | సేవ్యావహే | సేవ్యామహే. |

*

**శ్లో॥ దాక్షిణ్యం ప్రకటీకరోతి మరుతా రాగం ప్రవాలైః పికై-**
**ర్మాధుర్యం ప్రియభాషణం శుకచయైర్గీతాని భృఙ్గైర్మధుః ।**
**స్నానం సన్మధునాఽర్చనం చ కుసుమైశ్ఛత్రం తరుచ్ఛాయయా**
**స్వాధీశం జనయిష్యతోఽస్య హృదయం వ్యగ్రం విధాస్యన్నివ ॥ 4-45**

అ : వసంత వర్ణనమే - వసంతకృత కృష్ణ సేవ. -శార్దూలవిక్రీడితమ్.

అ : మధుః స్వ+అధీశం జనయిష్యతః అస్య హృదయం వ్యగ్రం విధాస్యన్నివ మరుతా దాక్షిణ్యం ప్రవాళైః రాగం, పికైః మాధుర్యం, శుకచయైః ప్రియభాషణం, భృంగైః గీతాని, సన్మధునా స్నానం కుసుమైః అర్చనం, తరుచ్ఛాయయా ఛత్రం చ ప్రకటీకరోతి.

ప్ర : మధుః = వసంతుడు, స్వ+అధీశమ్ = తమ ప్రభువును (మన్మథుని), జనయిష్యతః= కనబోతున్న (ప్రద్యుమ్నునిగా), అస్య = ఈ కృష్ణునియొక్క, హృదయమ్ = మనస్సును, వ్యగ్రమ్ = అత్యాసక్తి గలవానినిగా

(శబ్దార్థకల్పతరుః పుట 1313), విధాస్యన్+ఇవ = చేయబోతున్నట్లు, మరుతా = గాలిచేత, దాక్షిణ్యమ్ = దక్షిణదిక్కున పుట్టి యుండటాన్నీ/ సరళత్వాన్నీ) (దక్షిణే జవః దాక్షిణ్యః, తమ్), ప్రవాళైః = చివురులతో, రాగమ్ = అనురాగాన్నీ, పికైః = కోకిలలతో, మాధుర్యమ్ = తీయదనాన్ని, శుక-చయైః = చిలుకల గుంపులతో, ప్రియ-భాషణమ్ = నచ్చిన సంభాషణనూ, భృంగైః = తుమ్మెదలతో, గీతాని = పాటలనూ, సత్+మధునా = మంచి మకరందంతో (మకరందో మధుః స్మృతః-హలాయుధకోశః-188), స్నానమ్ = స్నానాన్నీ, కుసుమైః = పూలతో, అర్చనమ్ = పూజనూ, తరు+ఛాయయా = చెట్లనీడతో ('**ఛే చ**' అష్టాధ్యాయి 6-1-73 సూత్రంతో తుగాగమం వస్తే తరుచ్ఛాయయా అని రూపం) ఛత్రమ్ = గొడుగును కూడా, ప్రకటీకరోతి = ప్రదర్శిస్తున్నాడు. (ప్రకటీ- కృ - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** వసంతుడు తమ స్వామి అయిన మదనుని ప్రద్యుమ్నరూపంలో కనబోతున్న కృష్ణుని పరమాసక్తుని చేయాలనుకొని మలయమారుతంతో దాక్షిణ్యాన్ని ప్రకటిస్తున్నాడు. చివురుటాకులతో అనురాగాన్నీ (ఎఱ్ఱదనం వల్ల), కోకిలల (కూతలతో) తీయదనాన్నీ, చిలుకల పలుకులతో సంభాషణనూ, తుమ్మెదల ఝుంకారాలతో గీతాలనూ, మంచి మకరందంతో స్నానాన్నీ, పూలతో అర్చననూ, చెట్లనీడతో గొడుగును అనుభవింపజేస్తూ ఉత్సాహ పరుస్తున్నాడు.

**వి :** 1. ఈ వర్ణించిన అంశాలన్నీ శృంగారానికి ఉద్దీపన విభావాలు. కృష్ణ పరంగా ఇంత వరకూ ఆలంబనవిభావమే లేదు. తానింకా బాలుడే, అయినా ఉద్దీపన విభావాలు కల్పించటమన్నది వసంతునిలోని అత్యాసక్తిని తెలియజేస్తోంది. సరియైన వాతావరణంలో ఎదిగే అటువంటి మానసిక స్థితితో పిల్లలను కన్నప్పుడే సత్సంతానప్రాప్తి అన్నది వైజ్ఞానికంగా సమ్మతమైన అంశం. అందుకని అటువంటి వాతావరణాన్ని కల్పించాలన్న త్వర ఇక్కడ ధ్వనిస్తుంది.

2. ప్రకృతవృత్తాంతం ద్వారా ఒక ప్రభువును ప్రజలు సేవించే అప్రకృతవృత్తాంతం స్ఫురిస్తుంది కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రకృతేఽప్రకృతస్య చేత్**' (కు.61) 'విధాస్యన్నివ' అనటంలో సంభావన కాబట్టి ఫలోత్ప్రేక్షాలంకారం. వాతావరణాన్ని కల్పించట మిక్కడ ఫలం. దానిని సమకూరుస్తున్నట్లు ఊహించినందువల్ల ఫలోత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మకా**' (కు.32)

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రకటీకరోతి :** | **ప్రకటీకరోతి** | ప్రకటీకురుతః | ప్రకటీకుర్వన్తి |
| | ప్రకటీకరోషి | ప్రకటీకురుథః | ప్రకటీకురుథ |
| | ప్రకటీకరోమి | ప్రకటీకుర్వః | ప్రకటీకుర్మః. |

*

**శ్లో॥ వసన్తకాలే వనితాసహాయం - లషన్తి మర్త్యా ఇతి కిం విచిత్రమ్ ।**
**యతస్సరాగాస్తరవోఽపి తన్వీ - ర్లతా న వాతాచలితాస్త్యజన్తి ॥ 4-46**

**అ :** వసంతవర్ణనమే - తరులతా సంగతిని విశ్లేషించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** మర్త్యాః వసంత-కాలే వనితా-సహాయం లషన్తి ఇతి విచిత్రం కిమ్? యతః తరవః సరాగాః అపి వాత+ఆచలితాః తన్వీః లతాః న త్యజన్తి.

**ప్ర :** మర్త్యాః = మనుష్యులు, వసంత-కాలే = వసంతర్తువులో (వసంతస్య కాలః, తస్మిన్), వనితా-సహాయమ్ = స్త్రీల సహకారాన్ని (వనితానాః సహాయం), లషన్తి = కోరుతున్నారు (లష కాంతౌ పరస్మైపది - లట్ - ప్ర.బ.), ఇతి = అంటే, విచిత్రం కిమ్? = ఆశ్చర్యమేముంది? యతః = ఎందువల్లనంటే, తరవః = చెట్లు, సరాగాః (సన్తః)+ అపి = ఎఱ్ఱదనంతో/అనురాగంతో కూడివున్నా, వాత+ఆచలితాః : వాత = గాలిచే, ఆచలితాః = పూర్తిగా కదలింపబడిననూ, తన్వీః = సన్ననైన, లతాః = తీగెలను, న త్యజన్తి = వీడుట లేదు (త్యజ - హానౌ - పరస్మైపది - లిట్ - ప్ర.బ.)

**తా ॥** వసంత ఋతువులో మనుష్యులు (పురుషులు) స్త్రీల సహాయం కోరటంలో ఆశ్చర్యమేమీ లేదు. ఎందుకంటే అనురాగంతో (చివుళ్ళ ఎఱ్ఱదనంతో) కూడివున్న చెట్లు కూడా గాలికి పూర్తిగా ఊగిపోతున్నా సన్నని తీగెలను విడిచి పెట్టలేక పోతున్నాయి.

**వి :** 1. వసంత ఋతువులోనే నరులు నారీసహకారం కోరుతున్నారన్నది కవిసమయ-సిద్ధమయిన అభిప్రాయమే. ఏ ఋతునియమాలూ లేకుండా ప్రవర్తించే ప్రాణి మనిషి. స్త్రీ సహకారాన్ని నిరంతరమూ కోరుతూనే వుంటాడు మనిషి. అయినా అంశాన్ని పురుషగతంగానే చెప్పటం అనాదిగా వస్తున్న సాంప్రదాయికాభిప్రాయమే కానీ అంతకు మించి వివక్షను శంకింపలేము.

2. ఇక్కడ వాస్తవానికి సామాన్యవిశేషసంవిధానంచేత ఇది అర్థాంతర న్యాసాలంకారం కావలసింది. కానీ కవి '**యతః**' పదాన్ని ప్రయోగించి పూర్వార్ధంలోని అంశానికి సమర్థనీయతను కల్పించాడు. అందువల్ల సమర్థనీయాంశసమర్థనరూపంగా ఇది **కావ్యలింగాలంకార** మవుతుంది. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' (కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **లషన్తి :** | లషతి | లషతః | **లషన్తి** |
| | లషసి | లషథః | లషథ |
| | లషామి | లషావః | లషామః |
| **త్యజన్తి :** | త్యజతి | త్యజతః | **త్యజన్తి** |
| | త్యజసి | త్యజథః | త్యజథ |
| | త్యజామి | త్యజావః | త్యజామః. |

*

**శ్లో॥ అధరపాణిపదూర్జితపల్లవో - మధురవేణురవః కలభాషణః ।**
**వదనగన్ధవహశ్వసనోఽజయత్ - సకుసుమః కుసుమాకరమచ్యుతః ॥ 4-47**

**అ :** కృష్ణుడు అచ్యుతుడు కాబట్టి వసంతాన్ని జయించాడని ప్రశంస. -ద్రుతవిలంబితమ్.

**అ :** అధర-పాణి-పదూర్జిత-పల్లవః మధుర-వేణు-రవః కల-భాషణః వదన-గంధవహ-శ్వసనః సకుసుమః అచ్యుతః కుసుమాకరమ్ అజయత్.

**ప్ర :** అధర... పల్లవః : అధర = క్రిందిపెదవియు, పాణి = చేతులు, పద = కాళ్ళు అనెడి, ఊర్జిత = సన్నద్ధమైన, పల్లవః = చివురులు గలవాడును (అధరః పాణీ పదౌ చ, తత్ ఏవ ఊర్జితః పల్లవః యస్య సః), మధుర-వేణు-రవః : మధుర = మనోహరమైన, వేణు = పిల్లనగ్రోవియొక్క, రవః = సవ్వడి గలవాడును (మధురః వేణోః రవః యస్య సః), కల భాషణః : కల = అవ్యక్తమధురమైన (కలశ్చ మధురోఽవ్యక్తః - హలాయుధ కోశః - 140), భాషణః = పలుకు గలవాడును (కలః భాషణం యస్య సః), వదన-గంధవహ - శ్వసనః : వదన = నోటినుండి వెలువడు, గంధవహ = గాలియే, శ్వసనః = ఊపిరిగా గలవాడును (ముఖే మారుతః, స ఏవ శ్వసనః యస్య సః), సకుసుమః = పూలతో కూడిన వాడును (కుసుమైః సహితః), అచ్యుతః = కృష్ణుడు (న భవతి చ్యుతం యస్య సః), కుసుమ+ఆకరమ్ = వసంతుని, అజయత్ = గెలిచెను. (జి జయే పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** అచ్యుతుడైన కృష్ణుడు వసంతునిపై గెలిచాడు. కృష్ణునకు కూడా సహజమైన పెదవి, కాళ్ళూ, చేతులూ అనే చివురులున్నాయి. వేణుగానమనే మధురధ్వనులున్నాయి. అవ్యక్తమధురాలయిన పలుకులున్నాయి. ముఖమారుతమనే చల్లని గాలి వుంది. తనకూ పూలున్నాయి ఒళ్ళంతా. కాబట్టి కృష్ణుడు వసంతుని గెలువగలిగాడు. లేదు. వసంతుడు కృష్ణుని కదల్పలేక పోయాడు.

**వి :** 1. వసంతునికి ఆ వైభవం రెండు నెలలకు పరిమితం – కానీ కృష్ణుడు నిత్య వసంతుడు. వసంత లక్షణాలనన్నింటినీ కవి కృష్ణునిలో ప్రదర్శించినది అందుకే. కాబట్టి నిత్యసంపన్నుని మధ్యంతరంగా సిరి సంక్రమించినవాడు మించిపోలేదు గదా!

2. విష్ణువు వనమాలి (విష్ణువుపేర్లలో ఒకటి) కాబట్టి సకుసుమత్వం సిద్ధిస్తోంది. వనమాలి – అంటే వనమాల గలవాడు. వనమాల అంటే నిలువెత్తు పూలమాల.

శ్లో॥ ఆపాదపద్మం యా మాలా వనమాలేతి సా స్మృతా – (గురుబాలప్రబోధిక పుట 28)

ఆ పూలమాల గలవాడు కాబట్టి కృష్ణుడు వసంతుని కన్న అధికుడే. అదీ నిత్యమూ వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **అజయత్ :** | **అజయత్** | అజయతామ్ | అజయన్ |
| | అజయః | అజయతమ్ | అజయత |
| | అజయమ్ | అజయావ | అజయామ. |

*

**శ్లో॥ వితతపల్లవఫుల్లవనే క్వచిత్ – తరుతటే వసతోఽస్య పదామ్బుజమ్ ।**
**ఉపచచార వరానుగమండలీ – భుజగతో జగతాఽభయసిద్ధయే ॥ 4–48**

**అ :** కృష్ణ పదాంబుజ ప్రశంస – గోపకృతపదసేవ. –ద్రుతవిలంబితమ్.

**అ :** క్వచిత్ వితత–పల్లవ–ఫుల్ల–వనే తరు–తటే వసతః అస్య పదాంబుజమ్ భుజ–గతః జగతః అభయ–సిద్ధయే వరానుగ–మండలీ ఉపచచార.

**ప్ర :** క్వచిత్ = ఒకానొకప్పుడు, వితత–పల్లవ–ఫుల్ల–వనే : వితత = ఎక్కువైన, పల్లవ = చివురులతో, ఫుల్ల = వికసించిన, వనే = తోటలో (విततః పల్లవః యస్య, తత్ చ ఫుల్లం చ వనం, తస్మిన్), తరు–తటే: తరు = చెట్లయొక్క, తటే = కొమ్మల మొదళ్ళలో (తరోః తటం, తస్మిన్), వసతః = ఉన్నట్టి, అస్య = కృష్ణునియొక్క, పద+అంబుజమ్ = పాద పద్మాన్ని (పద ఏవ అంబుజమ్ – తత్), భుజగతః = పామునుండి, జగతః = ప్రపంచానికి, అభయ–సిద్ధయే = అభయసిద్ధికోసం (అభయస్య సిద్ధిః, తస్మై), వర+అనుగ+మండలీ : వర = శ్రేష్ఠులైన, అనుగ = అనుచరులయొక్క, మండలీ = సమూహం, ఉపచచార = సేవించింది. (ఉపచర గతిభక్షణయోః పరస్మైపది లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొకసారి కృష్ణుడు చక్కగా చివురించి పుష్పించిన తోటలోని ఒక చెట్టుకొమ్మల మొదళ్ళపై కూర్చొని ఉన్నాడు. ఆయన అనుచరులు ఆయన పాదపద్మాన్ని సేవిస్తున్నారు. అదియే సర్పం నుండి కాపాడి జగత్తునకు అభయసిద్ధిని కలిగించగలదని భావిస్తున్నారు.

**వి :** 1. గోపాలురు కృష్ణుని మీది స్నేహభావంతో పాదసంవాహనం చేస్తున్నారు. దానికి మరొక కారణాన్ని ఊహించాడు కవి. సర్పం నుండి జగత్తునకు అభయకల్పనకోసం ఆ పాదాన్ని అర్చించినట్లు హేతువు ఉత్ప్రేక్షించినందువలన ఇది హేతూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' (కు. 32)

2. ఈ సన్నివేశాన్నే పోతన తనదైన భక్తిభావప్రదర్శన శైలిలో కనిపింపజేశారు.

ఉ. ఎన్నఁడునైన యోగివిభు లెవ్వరి పాదపరాగ మింతయున్
గన్నులఁ గాన రట్టి హరిఁ గౌఁగిటఁ జేర్చుచుఁ జెట్ట బట్టుచున్
దన్నుచు గ్రుద్దుచు న్నగుచుఁ దద్దయుఁ బైపడి కూడి యాఁడుచున్
మన్ననసేయు వల్లవకుమారుల భాగ్యము లింత యొప్పునే? –భాగవతం 10/459

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపచచార :** | **ఉపచచార** | ఉపచేరతుః | ఉపచేరుః |
| | ఉపచేరిథ | ఉపచేరథుః | ఉపచేర |
| | ఉపచచార/ఉపచచర | ఉపచేరివ | ఉపచేరిమ. |

*

**శ్లో॥ ఫణిఫణాఙ్కణనర్తనకౌశలా-భ్యసనధీరివ సర్వవిదాం వరః ।**
**స శిఖితాణ్డవమన్వకరోత్ క్వచి-ద్ధృతశిఖణ్డశిఖణ్డసుమణ్డితః ॥ 4-49**

**అ :** కృష్ణకృతమయూరనృత్యవర్ణన. -ద్రుతవిలంబితమ్.

**అ :** ధృత-శిఖండ-శిఖండ-సుమండితః సర్వ-విదాం వరః సః ఫణి-ఫణాంకణ-నర్తన-కౌశలాభ్యసన-ధీః ఇవ క్వచిత్ శిఖి-తాండవమ్ అన్వకరోత్.

**ప్ర :** ధృతశిఖండశిఖండసుమండితః : ధృత = ధరింపబడిన, శిఖండ = నెమలి ఈకలు గల, శిఖండ = కాకపక్షాలచే (కాకపక్షః శిఖండకః అమరకోశం - మనుష్య 96), సుమండితః = చక్కగా అలంకరింపబడిన వాడును (ప్రచలాకః శిఖండశ్చ కలాపో బర్హ ఉచ్యతే - హలాయుధకోశః - 242), సర్వ-విదామ్ = సర్వజ్ఞులలో (సర్వం విదన్తి ఇతి సర్వవిదః తేషామ్), వరః = శ్రేష్ఠుడును అయిన, సః = ఆ కృష్ణుడు, ఫణి - ఫణ+అంకణ... ధీః ఇవ : ఫణి = సర్పంయొక్క, ఫణా = పడగ అనెడి, అంకణ = ప్రదేశంపై, నర్తన = నృత్యంలో, కౌశల = నేర్పును, అభ్యసన = అలవరచుకొనవలెనను, ధీః - ఇవ = బుద్ధి గలవాడన్నట్లు (ఫణినః ఫణా ఏవ అంకణం, తస్మిన్ నర్తనం, తస్మిన్ కౌశలం, తస్య అభ్యసనే ధీః యస్య సః), క్వచిత్ = ఒకానొక చోట, శిఖి-తాండవమ్ : శిఖి = నెమలియొక్క, తాండవమ్ = నృత్యభేదాన్ని, అను+అకరోత్ = అనుకరించెను. (అను+కృ-కరణే - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు శిఖండాన్ని ధరించాడు. దానిపై నెమలి ఈకలను అలంకరించుకొన్నాడు. అవి అందగిస్తున్నాయి. (బాలుడై అవన్నీ ధరించినా) కృష్ణుడు సర్వజ్ఞులలో శ్రేష్ఠుడు. ఒక్కొక్కచో మయూరతాండవం చేస్తున్నాడు. అది రాబోయే కాలంలో పాము పడగపై నాట్యం చేసే నేర్పును అలవరచుకొంటున్నట్లుంది.

**వి :** 1. నృత్యం భావాన్ని ఆశ్రయించి వుంటుంది. పదార్థాభినయం ఇక్కడ ప్రధానం. ఇది మార్గపద్ధతి. ఇది రెండు రకాలు.

శ్లో॥ లలితోద్ధతభేదేన తద్ద్వయ ద్వివిధం పునః ।
లాస్యతాండవభేదేన నాటకాద్యుపకారకమ్ ॥ - (దశరూపకమ్ - 1/10)

నృత్య, నృత్తాలు లాస్య, తాండవ భేదంతో రెండు రకాలు. లాస్యం లలితం. తాండవం ఉద్ధతం. లాస్యాన్ని అందించింది పార్వతి. తాండవాన్ని అందించింది మహేశ్వరుడు. స్త్రీ నృత్యం లాస్యం. పురుషనృత్యం తాండవం. నెమలి జాతిలో మగనెమలి మాత్రమే నృత్యం చేస్తుంది. శిఖండం దానికే వుంటుంది. అందుకే కవి కృష్ణుడు మయూరతాండవాన్ని చేశాడని వర్ణించటం ఔచిత్యభరితం.

2. **అభ్యసనధీః ఇవ** - అనటం ఉత్ప్రేక్షాలంకారం. కృష్ణుడు ఆటలలో భాగంగా చేసిన మయూరతాండవాన్ని నర్తనకౌశలాభ్యాసబుద్ధితో అని కారణాంతరకృతంగా వర్ణించటం వలన హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **అన్వకరోత్ :** | **అన్వకరోత్** | అన్వకురుతామ్ | అన్వకుర్వన్ |
| | అన్వకరోః | అన్వకురుతమ్ | అన్వకురుత |
| | అన్వకరవమ్ | అన్వకరవావ | అన్వకరవామ. |

*

**శ్లో॥ మునిమనస్సరసీరుహహంసరాట్ - తదుచితస్వరశిక్షణధీరివ ।**
**అనుననాద స హంసకదమ్బక-శ్రుతిమనోఽతిమనోరమకూజితమ్ ॥ 4-50**

**అ :** కృష్ణ బాల్యచేష్ట - హంసధ్వన్యనుకరణం. -ద్రుతవిలంబితమ్.

**అ :** ముని-మనస్సరసీరుహ-హంస-రాట్ సః తదుచిత-స్వర-శిక్షణ-ధీరివ హంస-కదంబక-శ్రుతి-మనోఽతిమనోరమ-కూజితమ్ అనుననాద.

**ప్ర :** ముని-మన-స్సరసీరుహ-హంస-రాట్ : ముని = ఋషులయొక్క, మనః = మనస్సనెడి, సరసీ-రుహ = తామరలలో, హంస-రాట్ = హంసశ్రేష్ఠుడను (మునీనాం మనాంసి ఏవ సరసీరుహాణి, తేషు హంసానాం రాట్), సః = ఆ కృష్ణుడు, తత్+ఉచిత-స్వర-శిక్షణ-ధీః+ఇవ : తత్ = వాటికి, ఉచిత = తగినట్టి, స్వర = స్వరాలను, శిక్షణ = నేర్పాలనే, ధీః+ఇవ = బుద్ధిగలవానివలె (తేషామ్ ఉచితః స చ అసౌ - స్వరః, తస్య శిక్షణం, తస్మిన్ ధీః యస్య సః), హంస... మనోరమమ్ : హంస = హంసలయొక్క, కదంబక = సమూహం యొక్క, శ్రుతి = చెవులకు, మనః = మనస్సునకు, అతి-మనోరమ = చాలా ఇంపైన, కూజితమ్ = అరుపును (హంసానాం కదంబకాని, తేషాం శ్రుతేః మనసః చ అతి మనోరమమ్ - తత్), అనుననాద = అనుసరించి ఎలుగెత్తెను. (అను+నద అవ్యక్తే శబ్దే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు మునిమానసకమలహంసరాజు. ఆ హంసలకు వాటికి తగిన కూతను నేర్పిస్తున్నట్లుగా హంస సమూహాల కూజితాలను విని తాను వాటిని అనుకరిస్తూ అరుస్తున్నాడు.

**వి :** 1. మునిమనఃకమలాలలో హంసరాట్టు కాబట్టి స్వతః తనకున్న శుచిత రెట్టింపయి-నట్లయింది. అందుకే రాట్స్థితి. కాబట్టి రాజుగా తాను తనవారికి తగినవి నేర్పవలసి వుంది. కాబట్టి తాను వాటిని అనుకరించటం వాటికి స్వరాన్ని/కూజితాన్ని నేర్పినట్లున్నదని కవి సంభావన. అందుకే ఉత్ప్రేక్షాలంకారం. తాను అలా అనుకరించటానికి వాటికి నేర్పడం ఫలం కాబట్టి ఫలోత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా ।
ఉక్తానుక్తాస్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరౌ ॥ - కు. 32

| | | | |
|---|---|---|---|
| 2. **అనుననాద :** | **అనుననాద** | అనునేదతుః | అనునేదుః |
| | అనునేదిథ | అనునేదథుః | అనునేద |
| | అనుననాద/అనుననద | అనునేదివ | అనునేదిమ. |

4. ఇంతవరకు వర్ణించిన బాలకృష్ణచేష్టలన్నీ దాదాపు మూలభాగవతంలోనివే. వాటికి ఆలంకారికతను జోడించి ఉక్తి వైచిత్ర్యాన్ని ప్రదర్శించింది కవి ప్రతిభ. విభిన్న సంభావనలతో వాటిని అందగింపజేశాడు కవి. మూలాన్ని గమనించండి-

శ్లో॥ ఏవం బృందావనం శ్రీమత్ కృష్ణః ప్రీతమనాః పశూన్ ।
రేమే సంచారయన్నద్రేః సరిద్రోధస్సు సానుగః ॥ 9

శ్లో॥ క్వచిద్గాయతి గాయత్సు మదాంధాళిష్వనువ్రతైః ।
ఉపగీయమానచరితః స్రగ్వీ సంకర్షణాన్వితః ॥ 10

శ్లో॥ క్వచిచ్చ కలహంసానామనుకూజతి కూజితమ్ ।
అభినృత్యతి నృత్యంతం బర్హిణం హాసయన్ క్వచిత్ ॥ 11

శ్లో॥ మేఘగంభీరయా వాచా నామభిర్దూరగాన్ పశూన్ ।
క్వచిదాహ్వాయతి ప్రీత్యా గోగోపాలమనోజ్ఞయా ॥ 12

శ్లో॥ చకోరక్రౌంచచక్రాహ్వాభారద్వాజాంశ్చ బర్హిణః ।
అనురౌతి స్మ సత్త్వానాం భీతవద్ వ్యాఘ్రసింహయోః ॥ 13

శ్లో॥ క్వచిత్క్రీడాపరిశ్రాంతం గోపోత్సంగోపబర్హణమ్ ।
స్వయం విశ్రమయత్యార్యం పాదసంవాహనాదిభిః ॥ 14

శ్లో॥ నృత్యతో గాయతః క్వాపి వల్గతో యుధ్యతో మిథః ।
గృహీతహస్తౌ గోపాలాన్ హసన్తౌ ప్రశశంసతుః ॥15 -భాగవతం10/15*

**శ్లో॥ మధువశీకృతచిత్త ఇవోష్ణభా - వరుణపాలితదిజ్మృగలోచనామ్ ।**
**సమధిగమ్య దివః స్వమపీపత-ద్దురితవారితవాజిమనా ఇవ ॥ 4-51**

**అ :** సూర్యాస్తమయవర్ణనం. -ద్రుతవిలంబితమ్.

**అ :** ఉష్ణభాః మధు-వశీకృత-చిత్త ఇవ వరుణ-పాలిత-దిజ్-మృగలోచనామ్ సమధిగమ్య దురిత-వారిత-వాజి-మనాః ఇవ దివః స్వమ్ అపీపతత్.

**ప్ర :** ఉష్ణభాః = వేడి వెలుగులవాడు/ సూర్యుడు (ఉష్ణాః భాః యస్య సః), మధు-వశీకృత-చిత్తః ఇవ : మధు = వసంతునిచే, వశీకృత = లోగొనబడిన, చిత్తః+ఇవ = మనస్సు గలవానివలె (మధునా వశీకృతం చిత్తం యస్య సః), వరుణ-పాలిత-దిక్-మృగలోచనామ్ : వరుణ = జలాధిపతిచే, పాలిత = పాలింపబడుతున్న, దిక్ = దెస అనెడి, మృగలోచనామ్ = ఏణాక్షిని (వరుణేన పాలితా సా చ అసౌ దిక్, సా ఏవ మృగస్య లోచనే ఇవ లోచనే యస్యాః సా, తామ్), తూర్పు దిక్కును, సమ్+అధిగమ్య = పొంది, దురిత-వారిత-వాజి-మనాః - ఇవ : దురిత = పాపంచేత (దురితం పాతకం పాపం ... వైజయన్తీ - బ్రాహ్మణ - 168), వారిత = అడ్డగింపబడిన, వాజి = గుఱ్ఱాలయొక్క, మనాః+ఇవ = మనస్సు కలిగిన వాని వలె (దురితేన వారితాని వాజినాం మనాంసి యస్య సః - ఇవ), దివః = ఆకాశం నుండి, స్వమ్ = తనను, అపీపతత్ = పడద్రోసుకొనెను. (పత్ - ణిచ్ - పరస్మైపది - లజ్ - ప్ర.ఏ.)

**తా ॥** సూర్యుడు ఉష్ణకిరణుడు. ఆయన మనస్సు వసంతునికి లోనయింది. (మధు శబ్దానికి మద్యమనే అర్థం కూడా వుంది కాబట్టి మద్యపానం మత్తుకు లోనయ్యాడని కూడా ధ్వనిస్తుంది). ఆ మత్తులో వరుణపాలిత అయిన దిక్కు అనే కాంతను పొందాడు. ఆ పాపం చేత ఆయన గుఱ్ఱాల మనస్సులు నివారింపబడ్డాయి. దానితో తనను తాను ఆకాశం నుండి పడద్రోసుకొన్నాడు.

**వి :** 1. ఇక్కడ ప్రస్తుతమయిన సూర్యాస్తమయాన్ని వర్ణిస్తుంటే అప్రస్తుతమయిన ఒక త్రాగుబోతు/తిరుగుబోతు పతనం స్ఫురిస్తుంది. కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. **'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్'** (కు.61) అని సమాసోక్తి లక్షణం.

| | | | |
|---|---|---|---|
| 2. **అపీపతత్ :** | **అపీపతత్** | అపీపతతామ్ | అపీపతన్ |
| | అపీపతః | అపీపతతమ్ | అపీపతత |
| | అపీపతమ్ | అపీపతావ | అపీపతామ. |

*

**శ్లో॥ ముదితగోనికరైః పరివారితః - సఖిజనైస్సహ వేణుముదీరయన్ ।**
**నిజగృహం ప్రవిశన్ స నిశాముఖే - నరమణీ రమణీః సమహర్షయత్ ॥ 4-52**

**అ :** కృష్ణుడు సంజవేళలో ఇంటికి చేరటం. –ద్రుతవిలంబితమ్.

**అ :** ముదిత–గో–నికరైః పరివారితః సఖి–జనైః సహ వేణుమ్ ఉదీరయన్ నిశా–ముఖే నిజ–గృహం ప్రవిశన్ సః నర–మణీః రమణీః సమహర్షయత్.

**ప్ర :** ముదిత–గో–నికరైః : ముదిత = ఆనందింప జేయబడిన, గో = గోవులయొక్క, నికరైః = సమూహాలచేత (ముదితాః చ తాః గావః, తాసాం నికరాః, తైః), పరివారితః = చుట్టబడినవాడై (పరి వృ – ణిచ్ – ధాతువుపై క్త ప్రత్యయం), సఖి–జనైః సహ = చెలులతో కూడి, వేణుమ్ = పిల్లనగ్రోవిని, ఉదీరయన్ = ఊదుతూ (ఉత్–ఈర్ ధాతువుపై శతృ ప్రత్యయం), సః = ఆ, నరమణిః = పురుషోత్తముడు, నిశా–ముఖే = ప్రదోషవేళలో (నిశాయాః ముఖం, తస్మిన్), నిజ–గృహమ్ = తన ఇంటిలోనికి, ప్రవిశన్ = ప్రవేశిస్తూ (ప్ర–విశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), రమణీః = కాంతలను, సమ్+అహర్షయత్ = ఆనందింపజేసెను. (సమ్–హృష్ తుష్టౌ – ణిచ్ – పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** పగలంతా గోవులు ఆనందంతో గడిపాయి. కృష్ణుడు తోటిపిల్లలతో కలిసి వేణువును ఊదుకొంటూ బయలు దేరాడు. సంజెవేళలో తన ఇంటిలోనికి ప్రవేశిస్తూ ఆ పురుషోత్తముడు గోపికలను ఆనందింపజేశాడు.

**వి :** 1. నరమణిః+రమణీః, '**ససజుషోరుః**' అని విసర్గకు రేఫాదేశం, '**రోరి**' అనే సూత్రంతో దానికి లోపం, '**ఢ్రలోపే పూర్వస్య దీర్ఘో౽ణః**' అనే సూత్రంతో **మణీ** అని దీర్ఘం. దానితో న**రమణీ రమణీ** అని ఛేకానుప్రాసరూపమైన శబ్దాలంకారం సిద్ధించింది.

| | | | |
|---|---|---|---|
| 2. **సమహర్షయత్ :** | **సమహర్షయత్** | సమహర్షయతామ్ | సమహర్షయన్ |
| | సమహర్షయః | సమహర్షయతమ్ | సమహర్షయత |
| | సమహర్షయమ్ | సమహర్షయావ | సమహర్షయామ. * |

**శ్లో॥ ప్రతిగృహం ప్రమదాభిరితస్తతః – సకుతుకాభిరసౌ పరిసేవితః ।**
**స్మితకటాక్షమనోరమవిభ్రమః – స్మరజనీ రజనీశ ఇవాబభౌ ॥ 4–53**

**అ :** ఇంటింటా కృష్ణసంవేదన – కృష్ణప్రభ. –ద్రుతవిలంబితమ్.

**అ :** సకుతుకాభిః ప్రమదాభిః ప్రతిగృహమ్ ఇతః+తతః పరిసేవితః అసౌ స్మర–జనిః స్మిత–కటాక్ష మనోరమ–విభ్రమః సన్ రజనీశ ఇవ ఆబభౌ.

**ప్ర :** సకుతుకాభిః = కుతూహలంతో కూడిన (కౌతూహలం కౌతుకం చ కుతుకం చ కుతూహలమ్ – అమరకోశః – నాట్య – 31), ప్రమదాభిః = కాంతలచే, ప్రతిగృహమ్ = అన్ని ఇండ్లలో (గృహే గృహే ప్రతిగృహమ్) (కుతుకేన సహితాః సకుతుకాః), ఇతస్తతః = ఇటూ, అటూ, పరిసేవితః = సేవింప బడిన (పరి–సేవ్ ధాతువుపై క్త ప్రత్యయం), అసౌ = ఈ, స్మరజనిః = మదనుని తండ్రి/ కృష్ణుడు. (స్మరస్య జనిః యస్మాత్ సః), స్మిత – కటాక్ష–మనోరమ–విభ్రమః సన్ : స్మిత = చిఱునవ్వుతోనూ, కటాక్ష = కడగంటి చూపులతోనూ, మనోరమ = అందమైన, విభ్రమః(సన్) = విలాసాలు గలవాడై (స్మితాశ్చ తే కటాక్షాః, తైః మనోరమశ్చ అసౌ విభ్రమః యస్య సః), రజనీ+ఈశః ఇవ = రేరాజు వలె (రజన్యాః ఈశః), ఆబభౌ = ప్రకాశించాడు. (భా దీప్తౌ – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఏ ఇంటికి వెళ్ళినా అక్కడ గోపకాంతలూ అటూ ఇటూ చేరి కౌతూహలంతో చుట్టూ మూగుతున్నారు. చిఱునవ్వులతో కడకంటిచూపులతో ఆ కృష్ణుడు చంద్రునివలె భాసించాడు.

**వి :** 1. ఇక్కడ కూడా క్రిందటి శ్లోకంవలె **స్మరజనిః.రజనీశ** అన్నచోట సంధివశాన **స్మరజనీ రజనీశ** అని ఛేకానుప్రాస కవకాశ మేర్పడింది.

రజనీశ ఇవ ఆబభౌ – అనటం చక్కని ఉపమాలంకారం. రజనీశుడు ఉపమానం. కృష్ణుడు ఉపమేయం. ఇవ ఉపమా వాచకం. ప్రమదలు చుట్టూ మూగి వుండటం సమానధర్మం. ఇక్కడ ప్రమదలు అనటంలో తారలు అన్న ఉపమానాన్ని వీడి ఉపమేయాన్ని మాత్రమే చెప్పాడు కవి. స్మితకటాక్షమనోహరవిభ్రమత్వం కూడా సమానధర్మమే. కాబట్టి ఇది పూర్ణోపమాలంకారం. '**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**' (కు. 6) ఇది ఉపమాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆబభౌ :** | **ఆబభౌ** | ఆబభుతుః | ఆబభుః | |
| | ఆబభిథ/ఆబభాథ | ఆబభుథుః | ఆబభ | |
| | ఆబభౌ | ఆబభివ | ఆబభిమ. | * |

**శ్లో॥యదుపతిః స నిజైస్సహ నిర్మలం – స్వగృహమేత్య శనైరలసాం నిశామ్ ।**
**తనురుచా బహుదూరపలాయితాం – మహితయా హితయా వ్యతనోత్సతామ్॥4-54**

**అ :** ప్రాతఃకాలవర్ణనం – అంధకారపలాయనం. –ద్రుతవిలంబితమ్.

**అ :** సః యదు–పతిః నిజైః సహ నిర్మలం స్వగృహమ్ ఏత్య శనైః అలసాం నిశాం మహితయా సతాం హితయా తను–రుచా బహు–దూర–పలాయితాం వ్యతనోత్.

**ప్ర :** యదు–పతిః = యదువుల కధిపతి యైన (యదూనాం పతిః), సః = ఆ కృష్ణుడు, నిజైః సహ = తన చెలులతో కూడి, నిర్మలమ్ = పవిత్రమైన, స్వగృహమ్ = తన ఇంటికి, ఏత్య = వచ్చి (ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శనైః = మెల్లగా, అలసామ్ = సోమరి అయిన, నిశామ్ = రాత్రిని (నిశా నిశీథినీ రాత్రిః త్రియామా క్షణదా క్షపా–అమరకోశః), మహితయా = గొప్పదియు, సతామ్ = సజ్జనులకు, హితయా = మేలుచేసేదీ అయిన, తను–రుచా = శరీరకాంతితో, (తన్వాః రుచిః, తయా), బహుదూరపలాయితామ్ : బహు = ఎంతో, దూర = దూరంగా, పలాయితామ్ = పారిపోయిన దానినిగా, వ్యతనోత్ = చేసెను. (వి+తనూ విస్తారే పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన నెచ్చెలులతో కలిసి నిర్మలమైన తన ఇంటిలోనికి ప్రవేశించాడు. వచ్చి; గొప్పదీ, మేలు చేసేదీ అయిన తన శరీరకాంతితో ఆ రాత్రిని ఎంతో దూరంగా పారిపోయేటట్లు చేశాడు. (రాత్రి పారిపోయింది. తెల్లవారింది.)

**వి :** 1. ఇక్కడ రాత్రి అంధకారానికి ప్రతినిధి. కాబట్టి రాత్రిని పారిపోయేటట్లు చేయడమంటే చీకట్లను పారద్రోలటం. అందుకే శరీరకాంతి ఇక్కడ కరణమయింది. శరీరకాంతితో తరిమివేయటం.

2. మహితయా హితయా అని ఛేకానుప్రాసాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **వ్యతనోత్ :** | **వ్యతనోత్** | వ్యతనుతామ్ | వ్యతన్వన్ | |
| | వ్యతనోః | వ్యతనుతమ్ | వ్యతనుత | |
| | వ్యతనవమ్ | వ్యతనువ/వ్యతన్వ | వ్యతనుమ/వ్యతన్మ. | * |

**శ్లో॥ స్వతనయాం సరితం విషవర్జితాం – కరుణయా హరిరద్య కరిష్యతి ।**
**ఇతి ముదేవ గిరిం రవిరీక్షితుం – పరవశో రవశోభితమారుహత్ ॥ 4-55**

**అ :** సూర్యోదయం – సూర్యుడు ఉదయాద్రిని ఎక్కుట. –ద్రుతవిలంబితమ్.

**అ :** హరిః అద్య కరుణ యా స్వ–తనయాం సరితం విష–వర్జితాం కరిష్యతి ఇతి ముదా ఈక్షితుమ్ ఇవ పర–వశః రవిః రవ–శోభితం గిరిమ్ ఆరుహత్.

**ప్ర :** హరిః = కృష్ణుడు, అద్య = నేడు, కరుణయా = దయతో, స్వ–తనయామ్ = తన కూతురయిన, సరితమ్ = నదిని (యమునా నదిని), విష–వర్జితామ్ = విషం నుండి విడువబడిన దానినిగా (విషేణ వర్జితా – తామ్), కరిష్యతి = చేయబోతున్నాడు. (కృ కరణే – పరస్మైపది – ల్పట్ – ప్ర.ఏ.), ఇతి = అని, ముదా = ఆనందంతో, ఈక్షితుమ్+ఇవ = చూడటానికో అన్నట్లు, (ఈక్ష్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), పరవశః – పరవశుడైన/ తనను తాను మరచిన, రవిః = సూర్యుడు, రవ–శోభితమ్ : రవ = చప్పుళ్ళతో, శోభితమ్ = అందగించిన (రవైః శోభితః, తమ్), గిరిమ్ = కొండను, ఆరుహత్ = ఎక్కెను. (ఆ+రుహ్ బీజజన్మని ప్రాదుర్భావే చ – పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.).

**తా ॥ 'ఈ రోజు కృష్ణుడు దయతో నా కుమార్తెను – యమునానదిని – విషం నుండి విముక్తి చేయబోతున్నా'** డనే ఆనందంతో పరవశుడైన సూర్యుడు చప్పుళ్ళతో మనోరంజకంగా వున్న ఉదయగిరిపై కెక్కాడు.

**వి :** 1. రాత్రి ముగిస్తే సూర్యుడు ఉదయాద్రిని అధిరోహించటం ఒక నైసర్గిక ప్రక్రియ. కానీ తన కుమార్తె విషవిముక్తి కారణంగా (జరగబోయే) కలిగిన ఆనందాన్ని ఆ పర్వతారోహణకు కారణంగా సంభావించటం హేతూత్ప్రేక్షాలంకారం. రవశో రవశో – ఇది ఛేకానుప్రాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆరుహత్**(?) : | **ఆరుహత్** | ఆరుహతామ్ | ఆరుహన్ |
| | ఆరుహః | ఆరుహతమ్ | ఆరుహత |
| | ఆరుహమ్ | ఆరుహావ | ఆరుహామ. |

*

**శ్లో॥ తదను భోగికులాగ్రగమగ్రజం – స హి విసృజ్య తదన్వయసమ్భవమ్ ।**
**నమయితుం యమునామగమద్విభుః – సభుజగాం భుజగాన్తకవాహనః ॥ 4–56**

**అ :** కృష్ణుడు కాళియమర్దనానికై యమునకు బయలుదేరుట. –ద్రుతవిలంబితమ్.

**అ :** తదను భుజగ+అంతక–వాహనః సః విభుః భోగి–కుల+అగ్రగమ్ అగ్రజం విసృజ్య తదన్వయ–సంభవం నమయితుం సభుజగాం యమునామ్ అగమత్.

**ప్ర :** తద్+అను = ఆ తరువాత, భుజగ+అంతక–వాహనః = గరుడవాహనుడైన (భుజగానామ్ అంతకః, సః వాహనం యస్య సః), సః = ఆ, విభుః = ప్రభువయిన కృష్ణుడు, భోగి–కుల–అగ్ర–గమ్ : భోగి = పాముల యొక్క, (భుజగ భుజంగ కుంభీనస పన్నగ నాగ భోగినః – హలాయుధకోశః – 640), కుల = వంశంలో, అగ్ర–గమ్ = శ్రేష్ఠుడైన (భోగినాం కులే అగ్రే గచ్ఛతి ఇతి – తమ్), అగ్రజమ్ = అన్నను (బలరాముని), విసృజ్య హి = విడిచియే (వి–సృజ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తత్+అన్వయ–సంభవమ్ : తత్ = ఆ, అన్వయ = వంశంలో, సంభవమ్ = పుట్టినట్టి కాలియుని (తస్య అన్వయే సంభవః యస్య, తమ్), నమయితుమ్ = లొంగదీయుటకు (నమ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), స భుజగామ్ = పాముతో కూడిన (భుజగేన సహ వర్తతే ఇతి సభుజగా, తామ్), యమునామ్ = యమునా నదినిగూర్చి, అగమత్ = వెళ్ళెను. (గమ్ గతౌ లుఙ్ ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత భుజగకులాంతకుడైన గరుత్మంతుడు వాహనంగా గల కృష్ణుడు ఆ భుజగకులశ్రేష్ఠుడైన తన అన్నను – బలరాముని – విడిచి ఆ శేషవంశంలో పుట్టిన కాలియనాగాన్ని లొంగదీయటానికి ఆ సర్పమున్న యమునానది దగ్గరకు వెళ్ళాడు.

**వి :** 1. కృష్ణుని రాజనీతి చతురత ఇక్కడ నుండియే కనిపిస్తుంది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ కోసం పుట్టిన తాను

వేసే ప్రతిపదమూ దానికి తగినట్లుగానే వుంటుంది. పుట్టే సమయంలో ఆదిశేషుని సహకారాన్ని పూర్తిగా స్వీకరించాడు (ప్రథమసర్గ-29...) కానీ ఇప్పుడు ఆదిశేషుని విడిచి తాను మాత్రమే కాళియమర్దనానికి బయలుదేరాడు. కారణం? బలరాముడు ఆదిశేషావతారం గదా! ఆయన వంశంలో పుట్టినవాడు కాళియుడు. తీరా కాళియమర్దనానికి వెళ్ళినపుడు మోహానికి గురియై ఆ పనికి అడ్డుపడవచ్చు. నారాయణునిలో సగభాగమైన అర్జునుడే పనిబడినప్పుడు మోహానికి లోనయ్యాడు. ఇక బలరాముడెంత? అందుకే ఆయనను విడిచివెళ్ళాడు. ఇది రాజకీయ చతురత.

2. స**భుజగాం భుజగాంతక**వాహనః - ఛేకానుప్రాసాలంకారం.

| 3. **అగమమ్ :** | అగమత్ | అగమతామ్ | అగమన్ |
|---|---|---|---|
| | అగమః | అగమతమ్ | అగమత |
| | **అగమమ్** | అగమావ | అగమామ. |

*

**శ్లో॥ యది రసాతలమేతి తదైమ్యహం - దమయితుం తమితీవ స పాదపాత్ ।**
**అపతదమ్బుని విస్మయకారకః - స వయసాం వయసామివ వల్లభః ॥ 4-57**

**అ :** కృష్ణుడు చెట్టుపైనుండి కాళియుని మీదకు దూకుట. -ద్రుతవిలంబితమ్.

**అ :** యది (కాళియః) రసాతలమ్ ఏతి తదా అహం తం దమయితుమ్ ఏమి ఇతి ఇవ సవయసాం విస్మయ-కారకః సః పాదపాత్ అంబుని వయసాం వల్లభః ఇవ అపతత్.

**ప్ర :** యది = ఒకవేళ, రసాతలమ్ = పాతాళానికి (అధో భువన, పాతాళ బలిసద్మ రసాతలమ్ - అమరకోశః - పాతాళ - 1), ఏతి = వెళితే (ఆ+ఇ-గతౌ-పరస్మైపది లట్ (ప్ర.ఏ.), తదా = అప్పుడు, అహమ్ = నేను, తమ్ = అతనిని, దమయితుమ్ = అణచివేయుటకు (దమ్ ణిచ్ - ధాతువుపై - తుమున్ ప్రత్యయం), ఏమి = వెళ్ళెదను (ఆ+ఇ-గతౌ పరస్మైపది - లిట్ - ఉ.ఏ.), ఇతీవ = అని చెప్తున్నట్లుగా, వయసామ్ = నెచ్చెలులకు, విస్మయ-కారకః = ఆశ్చర్యాన్ని కల్గిస్తున్న (విస్మయస్య కారకః), సః = ఆ కృష్ణుడు, పాదపాత్ = చెట్టునుండి, అంబుని = నీటిపై, వయసామ్ = పక్షులయొక్క, వల్లభః ఇవ = ప్రభువువలె (గరుత్మంతునివలె), అపతత్ = పడెను/దూకెను. (పత్ - పతనే - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** కాళియుడు ఒకవేళ పాతాళానికి వెళ్ళినా (తన వారంతా అక్కడుంటారు కాబట్టి) నేను కూడా అక్కడకే వెళ్ళి అణచివేస్తాను అని తన నెచ్చెలులకు చెప్తున్నట్లు కృష్ణుడు తనవారికి ఆశ్చర్యాన్ని కలిగిస్తూ గరుత్మంతుడిలాగా చెట్టుమీదనుండి దూకాడు.

**వి :** 1. వయసాం వల్లభ ఇవ. గరుత్మంతుని లాగా అన్న పోలిక కృష్ణుని విజయాన్ని సూచిస్తుంది. గరుత్మంతుడు పాములకు శత్రువు. వాటి దగ్గర ఎప్పుడూ ఓడలేదు. అదే ఇక్కడ ధ్వనిస్తుంది పోలిక ద్వారా.

2. పోతన ఈ దూకటాన్ని వర్ణించాడిలా.

మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త
త్కుటశాఖాగ్రము మీఁద నుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుభగుభధ్వానం బనూనంబుగన్. - పోతనభాగవతం 635

| 3. **ఏతి : ఏమి :** | **ఏతి** | ఇతః | యన్తి |
|---|---|---|---|
| | ఏషి | ఇథః | ఇథ |
| | **ఏమి** | ఇవః | ఇమః |

| | | | |
|---|---|---|---|
| **అపతత్ :** | అపతత్ | అపతతామ్ | అపతన్ |
| | అపతః | అపతతమ్ | అపతత |
| | అపతమ్ | అపతావ | అపతామ. |

*

**శ్లో॥ కృష్ణాలిఙ్గనకాతరైః కరసమైరోఘైర్నివృత్తైరివ
స్వప్రాన్తస్థితతత్పదాఙ్కమురసా ధర్తుం ధియేవార్కజా ।
సుప్రేమామ్బుధిమిశ్రణాదివ జగద్వన్ద్యస్య పాతాదివ
స్నిగ్ధా తం మదనాకృతిం స్వహృదయేనాశ్లిష్య సాఽవర్ధత ॥ 4-58**

**అ :** కృష్ణుడు యమునలోని కురకగానే ఉప్పొంగిన యమున - కారణాభ్యూహనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్నిగ్ధా సా అర్కజా కృష్ణాలింగన-కాతరైః నివృత్తైః కర-సమైః ఓఘైరివ, స్వప్రాంత-స్థిత- తత్పదాంకమ్ ఉరసా ధర్తుం ధియా+ఇవ, సుప్రేమాంబుధి-మిశ్రణాద్+ఇవ జగద్వంద్యస్య పాతాద్+ఇవ మదనాకృతిం తం స్వహృదయేన ఆశ్లిష్య అవర్ధత.

**ప్ర :** స్నిగ్ధా = స్నేహశీల అయిన, సా అర్కజా = ఆ సూర్యసుత (యమున), కృష్ణ+ఆలింగన-కాతరైః : కృష్ణ = కృష్ణునియొక్క, ఆలింగన = కౌగిలింతలో, కాతరైః = భయపడి (కృష్ణస్య ఆలింగనం, తస్మిన్ కాతరాః, తైః), నివృత్తైః = వెనుదిరిగిన, కర-సమైః = చేతులు వంటి (కరైః సమాః, తైః), ఓఘైః ఇవ = ప్రవాహాల చేతనో అన్నట్లు (ముందుకే వెడితే కృష్ణాలింగన సౌఖ్య ముండదని భయం), స్వప్రాంత... తత్పదాంకమ్ : స్వ = తన యొక్క, ప్రాంత = అంచున (అన్త భాగే - శబ్దార్థకల్పతరుః - పుట 927), స్థిత = ఉన్నట్టి, తత్-పద-అంకమ్ = ఆ కృష్ణుని కాలి గుర్తును (స్వస్య ప్రాంతః, తస్మిన్ స్థితశ్చ అసౌ తస్య పదస్య అంకః, తమ్), ఉరసా = గుండెలతో, ధర్తుం-ధియా+ఇవ = ధరించాలన్న బుద్ధితోనేమో, సుప్రేమ+అంబుధి-మిశ్రణాత్+ఇవ : సుప్రేమ = సత్ప్రణయ మనే, అంబుధి = సముద్రంగల కృష్ణునితో, మిశ్రణాత్+ఇవ = కలయిక వలననో ఏమో (సుప్రేమ్ణః అంబుధిః, తేన సంగమః, తస్మాత్), జగత్+వంద్యస్య : జగత్ = లోకాలచే, వంద్యస్య = నమస్కరింపదగిన వానియొక్క (జగతాం వంద్యః, తస్య), పాతాత్+ఇవ = పడుటవలననో ఏమో, మదన+ ఆకృతిమ్ = మదనుని వంటి రూపం గల (మదనస్య ఆకృతిరివ ఆకృతిః యస్య తమ్), తమ్ = ఆ కృష్ణుని, స్వహృదయేన = తన గుండెలతో, ఆశ్లిష్య = కౌగిలించి, అవర్ధత = ఉప్పొంగెను. (వృధు వర్ధనే ఆత్మనేపది - లఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** (కృష్ణుడు చెట్టుమీదనుండి అలా దూకగానే) స్నేహశీల అయిన యమున మదన స్వరూపుడైన ఆ కృష్ణుని తన గుండెలతో కౌగిలించుకొని ఉప్పొంగింది. ఆ ఉప్పొంగటానికి కారణం - కృష్ణుని కౌగిలించుకొని ముందుకు వెళ్ళటానికి భయపడి వెనుదిరిగిన ప్రవాహాలో ఏమో! తన అంచున ఉన్న కృష్ణుని పాదముద్రలను గుండెలతో ధరించాలన్న ఆలోచనో ఏమో! సత్ప్రణయసముద్రుడైన కృష్ణుని కలయిక ఏమో! జగత్పూజ్యుడైన కృష్ణుడు దూకటమే ఏమో!

**వి :** 1. యమునకే కాళింది అని కూడా పేరు. కృష్ణునకున్న ఎనిమిది మంది భార్యలలో కాళింది ఒకటి. అయితే ఈ ఇద్దరూ ఒకటికాదు. కాళింది (యమున) వేరే. కృష్ణుని భార్య కాళింది వేరే. కాళిందిని కృష్ణుడు వివాహమాడే అంశాన్ని భాగవతమే ఇలా ప్రస్తావించింది-

శ్లో॥ తృట్పరీతః పరిశ్రాంతో బీభత్సుర్యమునామగాత్ ॥

శ్లో॥ తత్రోపస్పృశ్య విశదం పీత్వా వారి మహారథౌ ।
కృష్ణౌ దదృశతుః కన్యాం చరన్తీం చారుదర్శనామ్ ॥

శ్లో॥ తామాసాద్య వరారోహాం సుద్విజాం రుచిరాననామ్ ।
పప్రచ్ఛ ప్రేషితః సఖ్యా ఫాల్గునః ప్రమదోత్తమామ్ ॥

శ్లో॥ కా త్వం కస్యాసి సుశ్రోణి కుతోఽసి కిం చికీర్షసి ।
మన్యే త్వాం పతిమిచ్ఛన్తీం సర్వం కథయ శోభనే ॥

కాళింద ్యువాచ :

శ్లో॥ అహం దేవస్య సవితుః దుహితా పతిమిచ్ఛతీ ।
విష్ణుం వరేణ్యం వరదం తపః పరమమాస్థితా ॥

శ్లో॥ నాన్యం పతిం వృణే వీర తమృతే శ్రీనికేతనమ్ ।
తుష్యతాం మే స భగవాన్ ముకుందోఽనాథసంశ్రయః ॥

శ్లో॥ కాళిందీతి సమాఖ్యాతా వసామి యమునాజలే ।
నిర్మితే భవనే పిత్రా యావదచ్యుతదర్శనమ్ ॥

శ్లో॥ తథావదత్ గుడాకేశో వాసుదేవాయ సోఽపి తామ్ ।
రథమారోప్య తద్ విద్వాన్ ధర్మరాజముపాగమత్ ॥ - భాగవతం 10/58/16-23

ఈ కాళింది కూడా సూర్యసుతయే. తండ్రి యమునలో నిర్మించిన భవనంలో నివసిస్తూ విష్ణువును భర్తగా పొందగోరి తపస్సు చేస్తున్నది. అర్జునుడు ఆ విషయం కృష్ణునకు చెప్పగానే కృష్ణుడు ఆమెను చేపట్టాడు.

2. యమున ఉప్పొంగటానికి వరుసగా నాలుగు కారణాలను కవి సంభావించి నందువలన మాలాహేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **అవర్ధత :** | **అవర్ధత** | అవర్ధేతామ్ | అవర్ధన్త |
| | అవర్ధథాః | అవర్ధేథామ్ | అవర్ధధ్వమ్ |
| | ఆవర్ధే | అవర్ధావహి | అవర్ధామహి. |

*

**శ్లో॥ కలిలయన్తమపః పురుషోత్తమం - ఫణిపతిః కిల దంశితుమగ్రహీత్ ।**
**న హి స వేత్తి బలం శ్రవణోజ్ఝితః - పరమయా రమయా శ్రుతిభిః స్తుతమ్ ॥59**

**అ :** కాళియుడు కృష్ణుని కాటువేయబోవుట. -ద్రుతవిలంబితమ్.

**అ :** ఫణి-పతిః అపః కలిలయన్తం పురుషోత్తమం దంశితుమ్ అగ్రహీత్ కిల. హి. శ్రవణోజ్ఝితః సః పరమయా రమయా శ్రుతిభిః స్తుతం బలం న వేత్తి.

**ప్ర :** ఫణి-పతిః = సర్పరాజైన కాళియుడు (ఫణీనాం పతిః), అపః = నీటిని, కలిలయన్తమ్ = కలచివేస్తున్న, పురుష+ఉత్తమమ్ = పురుషశ్రేష్ఠుడైన కృష్ణుని, దంశితుమ్ = కాటు వేయటానికి, అగ్రహీత్ కిల = పట్టుకొన్నాడు గదా! (గ్రహ ఉపాదానే - పరస్మైపది - లుఙ్ - ప్ర.ఏ.), హి = అది తగినదే, శ్రవణ+ఉజ్ఝితః = చెవులు లేని (శ్రవణాభ్యామ్ ఉజ్ఝితః), సః = ఆ కాళియుడు, పరమయా = గొప్పదయిన, రమయా = లక్ష్మిచేత, శ్రుతిభిః = వేదాలచే, స్తుతమ్ = నుతింపబడిన, బలమ్ = శక్తిని, న వేత్తి = తెలియలేదు. (విద జ్ఞానే - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** పురుషోత్తముడైన కృష్ణుడు నీటిని కలచివేస్తుంటే కాళియుడు ఆయనను కాటు వేయటానికి పట్టుకొన్నాడు. నిజమే. వేదాలలో మహాలక్ష్మిచే నుతింపబడిన ఆ బలాన్ని చెవులులేని కాళియుడు ఎలా తెలిసికొన గలడు?

వి : 1. శ్లో॥న సన్దృశే తిష్ఠతి రూపమస్య - న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్ ।
హృదా మనీషా మనసాఽభిక్లప్తో - య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ - కఠోపనిషత్ - 3/9

అంటూ ఉపనిషత్తుల కళ్ళకు కూడా కనిపించని ఆ రూపాన్ని కళ్ళూ, చెవులూ ఒకటిగా వుండే కాళియుడు చూచి కాటువేయాలనుకోవటం అజ్ఞానం.

2. ఇక్కడ కావ్యలింగాలంకారముంది. మొదటి రెండు పాదాలలో కాళియుని ప్రయత్నాన్ని తప్పు పడుతున్నట్లుంది. తప్పు బట్టవలసిన అవసరమేమున్నది? కాటు వేయటం తన స్వభావమే గదా! చెవులు లేవు కాబట్టి శత్రువు బలం తెలియక దాడిచేశాడని సమర్థించటం వలన కావ్యలింగాలంకారం. 'సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్' - (కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **అగ్రహీత్ :** | **అగ్రహీత్** | అగ్రహీష్టామ్ | అగ్రహీషుః |
| | అగ్రహీః | అగ్రహీష్టమ్ | అగ్రహీష్ట |
| | అగ్రహీషమ్ | అగ్రహీష్వ | అగ్రహీష్మ |
| **వేత్తి :** | **వేత్తి** | విత్తః | విదన్తి |
| | వేత్సి | విత్థః | విత్థ |
| | వేద్మి | విద్వః | విద్మః. |

*

**శ్లో॥ ఉత్పాతచకితా గోపాః కృష్ణసన్దర్శనార్థినః ।**
**పురోధాయ యయూ రామం శేషమార్గగతా ఇవ ॥ 4-60**

అ : గోపాలకుల ఆందోళన - శేషమార్గగమనం. -పథ్యావక్త్రమ్.

అ : గోపాః కృష్ణ-సందర్శన+అర్థినః (సన్తః) ఉత్పాత-చకితాః రామం పురోధాయ శేష-మార్గ-గతాః ఇవ యయుః.

ప్ర : గోపాః = గోపాలురు (గాః పాంతి ఇతి), కృష్ణ-సందర్శన+అర్థినః : కృష్ణ = కృష్ణుని యొక్క సందర్శన = దర్శనాన్ని, అర్థినః (సంతః) = కోరుతున్నవారై (కృష్ణస్య సందర్శనమ్, తత్ అర్థయన్తి ఇతి), ఉత్పాత-చకితాః : ఉత్పాత = ఎగిరి దూకుటచేత, చకితాః = ఆశ్చర్యానికి లోనైన వారై (ఉత్పాతేన చకితాః), రామమ్ = బలరాముని, పురోధాయ = ముందుంచుకొని, శేష-మార్గ-గతాః+ఇవ = శేషమార్గంలో వెళ్ళువారి వలె (శేషస్య మార్గః, తస్మిన్ గతాః, త ఇవ), యయుః = వెళ్ళిరి. (యా ప్రాపణే - పరస్మైపది - లిట్ - ప్ర.బ.)

**తా ॥** కృష్ణుడు యమునలోనికి దూకటంతో ఆశ్చర్యానికి లోనైన గోపాలకులు కృష్ణుని చూడగోరి, బలరాముని ముందు నిలుపుకొని, శేషమార్గాన్ని అనుసరించేవారివలె యమునను చేరారు.

వి : 1. గోపాలకులు కృష్ణసందర్శనం కోరుతున్నారు కాబట్టి దర్శనోపాయాలయిన శేష, గరుడ మార్గాలలో శేషమార్గాన్ని ఎన్నుకొన్నారు, శేషుడు బలరామ రూపంలో తమకు సన్నిహితుడు కాబట్టి.

"స్వోత్తమప్రవేశద్వారా **శేషమార్గగరుడ**మార్గాభ్యాం గతానామ్" (రుక్మిణీశవిజయ వ్యాఖ్య - నారాయణచార్య పుట - 164)

2. **యయుః :** 4-19వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

3. యయుః+రామమ్ = యయూ రామమ్ (రోడిః, ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః) *

**శ్లో॥ వ్రజామ వ్రజగోపాలా యమునామమునాఽధ్వనా ।**
**పదాని పథి కృష్ణస్య లక్ష్యన్తే లక్షణైస్సహ ॥ 4-61**

**అ :** బలరాముని ముందుంచుకొని గోపాలకులు కృష్ణుని వెతుకుతూ యమునను చేరుట. –పథ్యావక్త్రమ్

**అ :** వ్రజ–గో–పాలాః అమునా అధ్వనా యమునాం వ్రజామః. పథి కృష్ణస్య పదాని లక్షణైః సహ లక్ష్యన్తే.

**ప్ర :** వ్రజగోపాలాః : వ్రజ = గోకులంలోని, గోపాలాః = గోపాలకులారా (వ్రజే గోపాలకాః, తస్మాత్ సంబుద్ధౌ), అమునా = ఈ, అధ్వనా = మార్గంలో, యమునామ్ = యమునను గూర్చి, వ్రజామః = వెళ్దాం. పథి = దారిలో, కృష్ణస్య = కృష్ణుని యొక్క, పదాని = కాలి అడుగులు, లక్షణైః సహ = గుర్తులతో పాటు, లక్ష్యంతే = గమనింప బడుతున్నాయి. (లక్ష దర్శనాంకనయోః – కర్మణి – ఆత్మనేపది – లట్ – ప్ర.బ.)

**తా ॥** 'గోపాలకులారా! ఈ దారిలో యమునకు వెళదాం. బాటలో కృష్ణుని అడుగులు లక్షణాలతో సహా కనిపిస్తున్నాయి' (గోపాలకులు అందరూ తమలోతాము అలా మాటాడుకొంటూ వెళ్ళారు.)

**వి :** 1. ఆ అడుగుజాడలలో నడిస్తే ఆయనను చేరటం తేలిక అన్న ఆలోచన.

| 2. **లక్ష్యంతే :** | లక్ష్యతే | లక్ష్యేతే | **లక్ష్యంతే** |
|---|---|---|---|
| | లక్ష్యసే | లక్ష్యేథే | లక్ష్యధ్వే |
| | లక్ష్యే | లక్ష్యావహే | లక్ష్యామహే. |

*

**శ్లో॥ ఇత్థం విమర్శతః ప్రాప్తాన్ దృష్ట్వా స్వాన్ సర్పమూర్ధ్ని సః ।**
**ననర్త కిల నర్నర్తి సుహృదాగమనే న కః ॥ 4–62**

**అ :** తనవారిని గమనించి కృష్ణుడు కాళియునిపై నృత్యం చేయుట. –పథ్యావక్త్రమ్.

**అ :** ఇత్థం విమర్శతః ప్రాప్తాన్ స్వాన్ దృష్ట్వా సః సర్ప–మూర్ధ్ని ననర్త కిల. సుహృదాగమనే కః న నర్నర్తి.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, విమర్శతః = తర్కించుకొంటూ, ప్రాప్తాన్ = దగ్గరకు చేరిన, స్వాన్ = తన వారిని, దృష్ట్వా = చూచి, సః = ఆ కృష్ణుడు, సర్పమూర్ధ్ని = పాము పడగపై (సర్పస్య మూర్ధా, తస్మిన్), ననర్త కిల = నాట్యమాడాడు గదా! (నృతీ గాత్రవిక్షేపే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), సుహృద్+ఆగమనే = మిత్రులు వస్తే, కః = ఎవడు, న నర్నర్తి = గంతులు వేయకుండును? (నృతీ – గాత్రవిక్షేపే – యఙ్ లుగన్తే – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** అలా ఆలోచించుకొంటూ గోపాలకులు యమునను చేరారు. వారిని చూడగానే కృష్ణుడు ఆ పాము పడగపై నాట్యం చేశాడు. నిజమే మరి. మిత్రులు దగ్గరకు వస్తే ఎవరు (ఆనందంతో) నాట్యం చేయడు?

**వి :** 1. శ్లో॥ న క్షుద్రోऽపి ప్రథమసుకృతాపేక్షయా గౌరవాయ ।
ప్రాప్తే మిత్రే భవతి విముఖః కిం పునర్యస్తథోచ్చైః ॥ – మేఘదూతమ్ – 1/17

కాళిదాసు మాట ఇది. మైత్రి విలువను ప్రకటిస్తుంది.

| 2. **ననర్త :** | **ననర్త** | ననృతుః | ననృతుః |
|---|---|---|---|
| | ననర్తిథ | ననృతథుః | ననృత |
| | ననర్త | ననృతివ | ననృతిమ |

| **నర్నర్తి :** | **నర్నర్తి**/నర్నృతీతి | నర్నృత్తః | నర్నృతతి |
|---|---|---|---|
| | నర్నృత్సి/నర్నృతీషి | నర్నృత్థః | నర్నృత్థ |
| | నర్నృర్మి/నర్నృతీమి | నర్నృత్వః | నర్నృత్మః |

*

**శ్లో॥ సరత్నకృష్ణాహిఫణాఙ్కణేషు - ననర్త కృష్ణః కిల లోకవన్ద్యః ।**
**పదం గరుత్మత్కరముఖ్యదైవ-మివౌషధం తద్దమనే విధిత్సన్ ॥ 4-63**

**అ :** కాళియుని పడగపై కృష్ణుని నృత్యం. -ఉపేంద్రవజ్ర.

**అ :** లోకవంద్యః కృష్ణః సరత్నకృష్ణాహిఫణాంకణేషు తద్దమనే గరుత్మత్కరముఖ్యదైవం పదమ్ ఔషధం విధిత్సన్+ఇవ ననర్త కిల.

**ప్ర :** లోక-వంద్యః - జగత్పూజ్యుడైన (లోకైః వంద్యః), కృష్ణః = కృష్ణుడు, స రత్న-కృష్ణ+అహి-ఫణ+అంకణేషు : స రత్న = రత్నాలతో కూడిన, కృష్ణ+అహి = నల్లత్రాచు యొక్క, ఫణా = పడగలయొక్క, అంకణేషు = ప్రదేశాలలో, తత్+దమనే = ఆయనను అణచుటలో (తస్య దమనం, తస్మిన్), గరుత్మత్-కర-ముఖ్య-దైవమ్ : గరుత్మత్ = గరుడుని యొక్క, కర = చేతుల యందున్న, ముఖ్య-దైవమ్ = ప్రధాన దైవానికి (విష్ణువునకు చెందిన) (గరుత్మతః కరౌ తయోః ముఖ్యం చ తద్ దైవం - తద్ యస్య - తమ్), పదమ్ = పాదాన్ని, ఔషధమ్ = మందునుగా, విధిత్సన్+ఇవ = నియమిస్తున్నట్లుగా, ననర్త కిల =నృత్యం చేశాడు గదా!. (నృతీ - గాత్రవిక్షేపే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు లోకపూజ్యుడు. రత్నసహితాలయిన కాళియుని పడగలపై నాట్యమాడాడు. ఆ కాళియుని అణచి వేయటానికి ఆ పాదాలే తగినవని నిరూపిస్తున్నట్లు. ఎందుకంటే ఆ పాదాలు గరుడకరాంకితాలు. (కృష్ణుడు గరుత్మంతుని భుజాలపై కూర్చున్నప్పుడు ఆ పాదాలు గరుడుని చేతిలోనే వుంటాయి గదా!)

**వి :** 1. పాముకాటుకు, పామువిషానికి విరుగుడుగా గరుడుని నియమిస్తున్నాడు కృష్ణుడు. గరుడజాతికి పుట్టుకతోనే పాములతో శత్రుత్వముంది. తమ తల్లి కారణంగా ఏర్పడిన దాస్యం నుండి విముక్తిని పొందటానికి గరుడుడు నాగమాతకు అమృతభాండాన్ని తెచ్చి అందజేయవలసివచ్చింది. ఇప్పటికీ పాము విషానికి విరుగుడుగా గరుడమంత్రాన్ని వినియోగిస్తుంటారు.

2. ఔషధం విధిత్సన్నివ - ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం. హేతువుకాని దానిని హేతువుగా చెప్పినందువల్ల.

3. **ననర్త :** 4-62వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఉన్నీయ కాలియఫణీన్ద్రవిరాజిపుచ్ఛం**
**భిన్నం మమర్ద విషదూషితమస్య వక్త్రమ్ ।**
**తస్యాంతరాశ్రితమశేషమసావసహ్యం**
**నిష్కాసయన్నివ విషం వినతాననేన ॥ 4-64**

**అ :** కృష్ణుడు కాళియుని నిర్విషుని చేయటం. -వసంతతిలక.

**అ :** అసౌ కాలియ-ఫణి+ఇంద్ర-విరాజి-పుచ్ఛమ్ ఉన్నీయ విష-దూషితం భిన్నమ్ అస్యవక్త్రమ్ తస్య అంతరాశ్రితమ్ అసహ్యం విషమ్ అశేషం వినతాననేన నిష్కాసయన్+ఇవ మమర్ద.

**ప్ర :** అసౌ = ఆ కృష్ణుడు, కాళియ... పుచ్ఛమ్ : కాళియ = కాళియుడను, ఫణి+ఇంద్ర = నాగరాజుయొక్క, విరాజి = ప్రకాశిస్తున్న, పుచ్ఛమ్ = తోకనూ (కాళియశ్చ అసౌ ఫణీనామ్ ఇంద్రః, తస్య విరాజితం చ తత్ పుచ్ఛం చ), ఉన్నీయ = పైకెత్తి (ఉత్+నీ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విష-దూషితమ్ : విష = విషంతో, దూషితమ్ = చెడినదియు (విషేణ దూషితం), భిన్నమ్ = నలిగినదియు అయిన, వక్త్రమ్ = ముఖాన్ని, తస్య = అతనియొక్క, అంతః+ఆశ్రితమ్ = లోనున్న, అసహ్యమ్ = భరింపరాని, విషమ్ = విషాన్ని, వినత+ ఆననేన : వినత =

వంచబడిన, ఆననేన = వదనంతో, నిష్కాసయన్+ఇవ = వెడలగ్రక్కిస్తున్నట్లు, మమర్ద = త్రొక్కెను (మృద్ క్షోదే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఆ కాలియుని అందమైన తోకను పైకి ఎత్తి విషదూషితమై నలగిన అతని ముఖాన్ని అణగద్రొక్కాడు. అది ఎలా వున్నదంటే చెమట పట్టి విషదూషితమై వున్న అతని ముఖాన్ని వంచి వంచిన ముఖంనుండి విషాన్ని క్రక్కిస్తున్నట్లుంది.

**వి :** 1. విషం నిష్కాసయన్ ఇవ - విషాన్ని వెడలగ్రక్కిస్తున్నట్లుగా - ఇది చక్కని సంభావన. కృష్ణుని మనస్సులో ఆ ఆలోచనకు కూడా అవకాశముండవచ్చును కానీ నిశ్చితం కాదు కాబట్టి ఇది సంభావనా మాత్రమే. అందుకే ఫలోత్ప్రేక్ష. విషనిష్కాసనం ఫలం.

| | | | |
|---|---|---|---|
| 2. **మమర్ద :** | **మమర్ద** | మమర్దతుః | మమర్దుః |
| | మమర్దిథ | మమర్దథుః | మమర్ద |
| | మమర్ద | మమర్దివ | మమర్దిమ. |

*

## శ్లో॥ స దన్దశూకస్య ముఖం విభిన్దన్ - తదీయపుచ్ఛం జగృహే కరేణ ।
## యథాపరాధం నను దణ్డదాతా - నిరాగసం కం వరయేన్న శౌరిః ॥ 4-65

**అ :** కాళీయమర్దనంలోని కృష్ణచేష్టావర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః దందశూకస్య ముఖం విభిన్దన్ కరేణ తదీయ-పుచ్ఛం జగృహే. శౌరిః యథాపరాధం దండ-దాతా నను నిరాగసం కం న వరయేత్?

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, దందశూకస్య = పాముయొక్క, ముఖమ్ = నోటిని, విభిన్దన్ = చీల్చుతూ (వి భిది ధాతువుపై శతృప్రత్యయం), కరేణ = చేతితో, తదీయ-పుచ్ఛమ్ = దాని తోకను (తదీయశ్చ చ అసౌ పుచ్ఛః, తమ్), జగృహే = పట్టుకొనెను. (గ్రహ ఉపాదానే - ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.), శౌరిః = కృష్ణుడు, యథా+అపరాధమ్ = దోషం మేరకు (అపరాధమ్ అనతిక్రమ్య), దండదాతా నను = శిక్షనిచ్చేవాడు గదా(దండస్య దాతా), నిరాగసమ్ = నిర్దోషిని (నాస్తి అగః యస్మిన్ తమ్), కమ్ = ఎవనిని, న వరయేత్ = స్వీకరింపదు. (వృ వరణే ణిచ్ - పరస్మైపది - విధి లిఙ్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఆ కాళియుని ముఖాన్ని చీల్చుతూ దాని తోకను మాత్రం చేతబట్టాడు. తప్పుచేసిన వాళ్ళను దండించే శౌరి నిర్దోషులను స్వీకరించకుంటాడా? (తప్పు చేసినది తల కానీ తోకకాదని భావం)

**వి :** 1. రఘువంశ రాజులను కూడా యథాపరాధదండదాతలని కాళిదాసు వర్ణించాడు.

శ్లో॥ యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినామ్ ।
యథాపరాధదండానాం యథాకాలప్రబోధినామ్ ॥ - రఘువంశం - 1/6

| | | | |
|---|---|---|---|
| 2. **జగృహే :** | **జగృహే** | జగృహాతే | జగృహిరే |
| | జగృహిషే | జగృహాథే | జగృహిధ్వే |
| | జగృహే | జగృహివహే | జగృహిమహే |
| **వరయేత్ :** | **వరయేత్** | వరయేతామ్ | వరయేయుః |
| | వరయేః | వరయేతమ్ | వరయేత |
| | వరయేయమ్ | వరయేవ | వరయేమ. |

*

**శ్లో॥ విదారయన్నప్యహిరాజమౌలిం - కరేణ పస్పర్శ తమార్తబన్ధుః ।**
**నిజేషు శిక్షాఽపి హి తస్య విష్ణోః - పరం పరానుగ్రహహేతురేవ ॥ 4-66**

**అ :** కాళియమర్దనం - కాళియానుగ్రహం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఆర్త-బంధుః అహిరాజ-మౌళిం విదారయన్+అపి తమ్ కరేణ పస్పర్శ. హి తస్య విష్ణోః నిజేషు శిక్షా+అపి పరం పరానుగ్రహ-హేతుః+ఏవ.

**ప్ర :** ఆర్త-బంధుః = ఆర్తిగొన్నవారికి ఆసరా అయిన ఆ కృష్ణుడు (ఆర్తానాం బంధుః), అహి-రాజ-మౌళిమ్ : అహి = పాములయొక్క, రాజ = రాజయిన కాళియునియొక్క, మౌళిమ్ = తలను (అహీనాం రాజా, తస్య మౌళిః , తమ్), విదారయన్-అపి = చీల్చుతూ కూడా, తమ్ = దానిని, కరేణ = చేతితో, పస్పర్శ = స్పృశించాడు. (స్పృశ్ స్పర్శనే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), హి = అది తగినదే, తస్య = ఆ, విష్ణోః = విష్ణువునకు, నిజేషు = తన వారియందు, శిక్షా+అపి = దండనకూడా, పరమ్ = మిక్కిలిగా, పర+అనుగ్రహ-హేతుః+ఏవ: పర = ఇతరుల యొక్క, అనుగ్రహ = ఆదరింపులకు, హేతుః+ఏవ = కారణమే! (పరైః అనుగ్రహః తస్య హేతుః)

**తా ॥** ఆర్తబంధువయిన కృష్ణుడు సర్పరాజుయొక్క తలను బ్రద్దలు చేస్తూకూడా చేతితో దానిని తాకాడు. నిజమే. విష్ణువునకు తనవారిపై గల అనుగ్రహం వారు మిక్కిలిగా ఇతరుల అనుగ్రహాన్ని పొందటానికి కూడా కారణమవుతుంది.

**వి :** 1. శ్లో॥ చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున ।
ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥ - భగవద్గీత - 7/16

నారాయణుని ఆశ్రయించెడి నలుగురిలో (ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని) ఆర్తుడొకడు. అందుకే ఆయన ఆర్తబంధువు.

| | | | |
|---|---|---|---|
| 2. **పస్పర్శ :** | **పస్పర్శ** | పస్పృశతుః | పస్పృశుః |
| | పస్పర్శిథ | పస్పృశథుః | పస్పృశ |
| | పస్పర్శ | పస్పృశివ | పస్పృశిమ. |

*

**శ్లో॥ నృత్యన్తమేనం నిజనాథమేత్య - భృత్యా భవాబ్జాసనముఖ్యదేవాః ।**
**విష్వగ్గృణన్తః కిల తస్థురార్త-సర్పాశ్రితాజ్ఞానమివాపహర్తుమ్ ॥ 4-67**

**అ :** కాళియునిపై కృష్ణుని నృత్యం చూడటానికి దేవతాగణాల రాక. -ఇంద్రవజ్ర.

**అ :** భృత్యాః భవ+అబ్జాసన-ముఖ్య-దేవాః నృత్యన్తమ్ ఏనమ్ నిజ-నాథమ్ ఏత్య విష్వక్ గృణన్తః (సన్తః) ఆర్త సర్ప+ఆశ్రితాజ్ఞానమ్ అపహర్తుమ్ ఇవ తస్థుః కిల.

**ప్ర :** భృత్యాః = సేవకులయిన, భవ+అబ్జాసన-ముఖ్య-దేవాః : భవ = శివుడు, అబ్జ+ఆసన = బ్రహ్మదేవుడు, ముఖ్య = మొదలయిన, దేవాః = దేవులు, నృత్యన్తమ్ = నృత్యం చేస్తున్న (నృతీ ధాతువుపై శతృప్రత్యయం), ఏనమ్ = ఆ, నిజ-నాథమ్ = తమస్వామిని (నిజానాం నాథః - తమ్), ఏత్య = చేరి (ఆ+ఇ- ధాతువుపై ల్యప్‌ప్రత్యయం), విష్వక్ = చుట్టూ మూగి, గృణన్తః = స్తుతిస్తూ (గృణ్ ధాతువుపై శతృప్రత్యయం), ఆర్త-సర్ప-ఆశ్రిత+అజ్ఞానమ్ : ఆర్త = దీనుడైన, సర్ప = నాగరాజును/కాళియుని, ఆశ్రిత = ఆశ్రయించి వున్న, అజ్ఞానమ్ = అజ్ఞానాన్ని, అపహర్తుమ్-ఇవ = పోగొట్టడాని కన్నట్లు, (అప-హృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), తస్థుః కిల = నిలిచారు గదా! (ష్ఠా గతి నివృత్తౌ - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** తమప్రభువయిన కృష్ణుడు నృత్యం చేస్తుంటే చూడటానికీ, శివుడు బ్రహ్మ మొదలుగా గల దేవతలందరూ

వచ్చి కృష్ణుని చుట్టుముట్టి స్తుతింపసాగారు. ఆ కాళియునిలోని అజ్ఞానాన్ని అపహరించడానికన్నట్లు కృష్ణుని చుట్టూ నిలిచారు.

| వి :1. **తస్థుః :** | **తస్థౌ** | తస్థతుః | **తస్థుః** |
|---|---|---|---|
| | తస్థిథ/తస్థాథ | తస్థథుః | తస్థ |
| | తస్థౌ | తస్థివ | తస్థిమ. |

*

**శ్లో॥ అనీనదత్ పద్మభవో మృదఙ్గం - జగౌ హనూమాన్ జగతామధీశమ్ ।**
**అదర్శయత్తాళగతీః కపర్దీ - ననర్త గోపాలకబాలమౌళిః ॥ 4-68**

**అ :** దేవతాసహితంగా కృష్ణుని ఆనందనృత్యం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పద్మ-భవః మృదంగమ్ అనీనదత్. హనూమాన్ జగతామ్ అధీశమ్ జగౌ. కపర్దీ తాళ-గతీః అదర్శయత్. గోపాలక-బాల-మౌళిః ననర్త.

**ప్ర :** పద్మభవః = బ్రహ్మ (పద్మే భవః), మృదంగమ్ = మృదంగ వాద్యాన్ని, అనీనదత్ = మ్రోయించెను. (నద-ణిచ్-పరస్మైపది - లుఙ్ - ప్ర.ఏ.), హనూమాన్ = హనుమంతుడు, జగతామ్-అధీశమ్ = లోకాధినాథుని, జగౌ = గానం చేశాడు (గ్రై శబ్దే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), కపర్దీ = శివుడు, తాళ-గతీః = తాళగతులను, ఆదర్శయత్ = ప్రదర్శించెను. (దృశ్ ప్రేక్షణే - ణిచ్ - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.), గోపాలక-బాల-మౌళిః = గోపాలబాలురలో శ్రేష్ఠుడైన కృష్ణుడు (గోపాలాశ్చ తే బాలాః, తేషాం మౌళిః), ననర్త = నృత్యం చేశాడు. (నృతీ గాత్రవిక్షేపే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** గోపాలబాలురలో శ్రేష్ఠుడైన కృష్ణుడు నృత్యం చేస్తుంటే బ్రహ్మ మృదంగం వాయించాడు. హనుమంతుడు జగన్నాథుని కీర్తించాడు. శివుడు తాళం వేశాడు.

| వి : 1. **అనీనదత్ :** | **అనీనదత్** | అనీనదతామ్ | అనీనదన్ |
|---|---|---|---|
| | అనీనదః | అనీనదతమ్ | అనీనదత |
| | అనీనదమ్ | అనీనదావ | అనీనదామ |
| **జగౌ :** | **జగౌ** | జగతుః | జగుః |
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ |
| **అదర్శయత్ :** | **అదర్శయత్** | అదర్శయతామ్ | అదర్శయన్ |
| | అదర్శయః | అదర్శయతమ్ | అదర్శయత |
| | అదర్శయమ్ | అదర్శయావ | అదర్శయామ |

**ననర్త :** 4-62వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తతోఽహిపత్నీప్రియమఞ్జువాక్యం - నిశమ్య తం నిర్భయమాశు చక్రే ।**
**తథాహి నారీమృదుభాషణేన - న కస్య చిత్తం మృదుతాముపైతి ॥ 4-69**

**అ :** కృష్ణుడు కాళియుని భార్యమాటలు విని ప్రసన్నుడు కావటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః (కృష్ణః) అహి-పత్నీ-ప్రియ-మంజు-వాక్యం నిశమ్య ఆశు తం నిర్భయం చక్రే. తథాహి నారీ-మృదు-భాషణేన కస్య చిత్తం మృదుతాం న ఉపైతి.

**ప్ర :** తతః = ఆ పై, కృష్ణః = కృష్ణుడు, అహి-పత్నీ-ప్రియ-మంజు-వాక్యమ్ : అహి = సర్పం యొక్క పత్నీ = భార్యయొక్క ప్రియ = ఇష్టమయిన, మంజు = మధురమైన, వాక్యమ్ = మాటను (అహేః పత్నీ, తస్యాః ప్రియం మంజు చ వాక్యమ్, తత్), ఆశు = వెంటనే (తూర్ణం త్వరితమాశు శీఘ్రతరమ్ – హలాయుధకోశః – 673), తమ్ = ఆ కాళియుని, నిర్భయమ్ = భయంలేని వానినిగా (నాస్తి భయం యస్య తమ్), చక్రే = చేశాడు. (కృ కరణే ఆత్మనేపది లిట్ – (ప్ర.ఏ.), తథాహి = అది యుక్తమే గదా!, నారీ-మృదు-భాషణేన : నారీ = స్త్రీ యొక్క, మృదు = సున్నితమైన, భాషణేన = మాటతో (నార్యాః మృదు చ తత్ భాషణం, తేన), కస్య = ఎవనియొక్క, చిత్తమ్ = మనస్సు, మృదుతామ్ = మార్దవాన్ని, న ఉప+ఏతి = పొందదు. (ఉప-ఆ+ఇ గతౌ లట్ – ప్ర.ఏ.)

**తా ॥** (కృష్ణుడు కాళియుని పడగలపై నృత్యం చేస్తుండగా) కాళియుని భార్య మధురంగా మనోరంజకంగా కృష్ణునితో మాటాడింది. ఆ మాటవిని కృష్ణుడు వెంటనే కాళియునిలోని భయాన్ని పోగొట్టాడు. నిజమే మరి. స్త్రీల మృదువచనాలను విని ఎవరి మనస్సు మెత్తబడదు?

**వి :** 1. కాళియుని భార్య మృదువచనాలు విని కృష్ణుడు మెత్తబడ్డాడు. ఇది విశేషం. స్త్రీల మెత్తని బాటలు విని ఎవరు మెత్తబడరు? ఇది సామాన్యం. కాబట్టి ఇది అర్థాంతన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః**' (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 2. **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే |
| | చక్రే | చకృవహే | చకృమహే |
| **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయన్తి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః. |

*

**శ్లో॥ విషాశ్రయత్వేన గుణేన నామ్నా – ద్వయోః స సామ్యేఽపి భుజఙ్గమం తమ్।**
**నిపీడ్య భాస్వత్తనయాం జుగోప – న కస్య యోషిత్సు హి పక్షపాతః ॥ 4-70**

**అ :** కృష్ణుడు కాళియుని శిక్షించి కాళిందిని కాపాడుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** విషాశ్రయత్వేన గుణేన నామ్నాః ద్వయోః సామ్యే అపి సః తమ్ భుజంగమం నిపీడ్య భాస్వత్తనయాం జుగోప. హి. యోషిత్సు కస్య పక్షపాతః న (భవతి)?

**ప్ర :** విషాశ్రయత్వేన : విష = విషానికి/నీటికి (పానీయం జీవనీయం కం జల మంబూదకం విషం... వైజయన్తీ – జల – 2) (విషం స్యాద్గరళం గరః – హలాయుధకోశః – 641), ఆశ్రయత్వేన = నిలయమైనందువలన, గుణేన = రంగుతో (నీలవర్ణంతో), నామ్నా = పేరుతో (కృష్ణపదంతో), ద్వయోః = ఇద్దరికీ (కాళియునికీ, కాళిందీనదికి), సామ్యే+అపి = పోలికలున్ననూ, సః = ఆ కృష్ణుడు, తమ్ = ఆ, భుజంగమమ్ = పామును (కాళియుని), నిపీడ్య = బాధించి (ని+పీడ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భాస్వత్+తనయామ్ = సూర్యుని కూతురును కాళిందిని (భాస్వతః తనయా, తామ్), జుగోప = రక్షించాడు. (గుపూ రక్షణే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), హి = యుక్తమే. యోషిత్సు = ఆడవారి యందు, కస్య = ఎవనికి, పక్ష-పాతః = మొగ్గు, న (భవతి) = ఉండదు.

**తా ॥** కాళియుడు కాళింది ఇద్దరూ విషానికి (గరళానికీ, జలానికీ) ఆశ్రయ మిచ్చినవారే. ఇద్దరికీ కృష్ణ అనే పేరుంది. ఇద్దరూ నల్లగానే వుంటారు. అయినా కృష్ణుడు కాళియుని బాధించి, కాళిందిని రక్షించాడు. అవును మరి! ఆడవాళ్ళవైపు ఎవరు మొగ్గు చూపరు?

**వి :** 1. ఆధేయసామ్యం, నామసామ్యం, గుణసామ్యం ఇద్దరిలో కనిపించినా చేష్టా సామ్యం సమానం కాకపోవచ్చు. అందరిచేతిలో ఒకవస్తువున్నా కొన్నవాడికీ, దొంగిలించిన వాడికీ తేడా వుంటుంది. కాబట్టి చేష్టాసామ్యముండక పోవచ్చు. అది శిక్షణ రక్షణలకు కారణం కావచ్చు. అయినా కవి స్త్రీత్వమే రక్షణకు కారణమని సామాన్యాంశాన్ని ప్రదర్శించటం వలన ఇది అర్థాంతరన్యాసాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జుగోప :** | **జుగోప** | జుగుపతుః | జుగుపుః | |
| | జుగోపిథ/జుగోప్థ | జుగుపథుః | జుగుప | |
| | జుగోప | జుగుపివ/జుగుప్వ | జుగుపిమ/జుగుప్మ. | * |

**శ్లో॥ ఆగస్కృతం నాగపతిం స కృష్ణః - పాదేన శిక్షన్నపి తత్కృతాఙ్కైః ।**
**తార్క్ష్యాద్భయం తస్య జహార భక్తే - క్రోధోఽపి దేవస్య వరేణ తుల్యః ॥ 4-71**

**అ :** కృష్ణుడు కాళియుని మర్దించి గరుడభీతిని తొలగించుట. -ఇంద్రవజ్ర.

**అ :** సః కృష్ణః ఆగస్కృతం నాగ-పతిం పాదేన శిక్షన్ అపి తత్కృత+అంకైః తార్క్ష్యాత్ తస్య భయం జహార. దేవస్య భక్తే క్రోధః అపి వరేణ తుల్యః (భవతి).

**ప్ర :** సః కృష్ణః = ఆ కృష్ణుడు, ఆగస్కృతమ్ = తప్పుచేసిన, నాగపతిమ్ = నాగరాజును, పాదేన = కాలితో, శిక్షన్ + అపి = దండిస్తున్నా కూడా, తత్-కృత+అంకైః = ఆ కృష్ణుడు చేసిన గుర్తులతో (తేన కృతాః తత్కృతాః - తే చ తే అంకాః, తైః), తస్య = ఆ కాళియునికి, తార్క్ష్యాత్ = గరుత్మంతుని నుండి (విహంగరాజో గరుడో గరుత్మాన్ తార్క్ష్యః - హలాయుధకోశః - 30), భయమ్ = భీతిని, జహార = తొలగించాడు. (హృ హరణే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), దేవస్య = దేవుడయిన విష్ణువునకు, భక్తే = భక్తుని యందు, క్రోధః + అపి = కోపం కూడా, వరేణ = వరంతోనే, తుల్యః = సమానం.

**తా ॥** కాళియుడు అపరాధి. ఆ అపరాధిని శిక్షిస్తూ కూడా కృష్ణుడు ఆయనకు మేలు చేశాడు. తన పాద ముద్రల ద్వారా ఆ కాళియునికి గరుడభీతిని తొలగించాడు. భక్తునిపై భగవంతుని క్రోధం కూడా వరంతో సమానం.

**వి :** 1. కృష్ణుడు తన పడగలపైకి ఎక్కి త్రొక్కడం కూడా కాళియునికి మేలే చేసింది. ఇది విశేషం. భగవంతుని కోపం కూడా భక్తులకు మేలే చేస్తుంది. ఇది సామాన్యం. కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః | |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర | |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. | * |

**శ్లో॥ స్వపక్షపాతిప్రియమక్షికర్ణ-విమర్దనాన్నూనమసౌ ప్రసాధ్య ।**
**విధాయ చాస్యాభయమఞ్జసాఽన్తే - ముదం స్వతల్పాయ దదావనల్పామ్ ॥4-72**

**అ :** కృష్ణుడు తనవారైన శేషగరుడులను ఇద్దరినీ సంతృప్తి పరచుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అసౌ అక్షి-కర్ణ-విమర్దనాత్ స్వ-పక్ష-పాతి-ప్రియం ప్రసాధ్య అన్తే అస్య అంజసా అభయం విధాయ చ నూనం స్వ-తల్పాయ అనల్పాం ముదం దదౌ.

**ప్ర :** అసౌ = ఆ కృష్ణుడు, అక్షికర్ణ - విమర్దనాత్ : అక్షి-కర్ణ = కన్నులే చెవులుగా గల సర్పాన్ని (కాళియుని) (అక్షిణీ ఏవ కర్ణౌ యస్య సః), విమర్దనాత్ = అణచుటద్వారా (అక్షికర్ణస్య విమర్దనం - తస్మాత్), స్వ-పక్ష-పాతి-ప్రియమ్ : స్వ = తనయొక్క/ తనమీద, పక్ష-పాతి = రెక్కలతో ఎగిరెడి/పక్షపాతంగల (గరుడునికి) వానికి,

ప్రియమ్ = ఇష్టమైన దానిని (పక్షాభ్యాం పాతః అస్య అస్తీతి పక్షపాతి, స్వస్య పక్షపాతీ, తస్య ప్రియం – పక్షే పతతి ఇతి పక్షపాతీ స్వస్మిన్ పక్షపాతీ – తస్య ప్రియమ్), ప్రసాధ్య = అనుగ్రహించి (ప్ర సాధ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అన్తే = చివరగా, అస్య = కాళియునికి, అంజసా = చక్కగా, అభయమ్ = భయరాహిత్యాన్ని, విధాయ = కల్పించి (వి ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నూనమ్ = నిశ్చింతగా, స్వ–తల్పాయ = తన శయ్య అయిన ఆదిశేషుడు (స్వస్య తల్పం తస్మై), అనల్పామ్ = ఎంతో, ముదమ్ = ఆనందాన్ని, దదౌ = ఇచ్చాడు. (దా దానే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు అక్షికర్ణుడైన కాళియుని అణగద్రొక్కి తన పక్షపాతి అయిన గరుడునకు ఆనందాన్ని కల్గించి, ఆపై కాళియునిలోని గరుడభీతిని తొలగించి, కాపాడి, తన శయ్య అయిన ఆదిశేషునకు ఆనందాన్ని కల్గించాడు.

**వి :** 1. మోక్షప్రాప్తికి రెండు మార్గాలు – శేషమార్గం, గరుడమార్గం. కాబట్టి రెండింటికీ సమానప్రాధాన్యాన్ని ఇవ్వవలసిన కర్తవ్యం నారాయణస్వరూపుడైన కృష్ణుని మీద వుంది. కాబట్టి ఆ మార్గాలకు రెండింటికీ ప్రతినిధులుగా తన ఆశ్రయంలో వున్న గరుడ శేషులకు ఇద్దరికీ ఆనందాన్ని కల్గించాడు కృష్ణుడు.

| | | | |
|---|---|---|---|
| 2. **దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః |
| | దదిథ/దదాథ | దదథు | దద |
| | దదౌ | దదివ | దదిమ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గశ్చతుర్థో ముదామ్ ॥ 4–73**

**తా॥** 'నాలుగవ సర్గ' అన్నది తప్ప మిగిలినదంతా 1వ సర్గలోని 67వ శ్లోకమే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో నాలుగవసర్గ. *

**శ్రీః**





# శ్రీః

# పఞ్చమః సర్గః

**శ్లో॥ స యామునామ్భస్యవగాహనోత్థ-శరీరశైత్యం శమయన్నివేశః ।**
**నిశి ప్రవృద్ధం నవకాననాగ్నిం - పపౌ దయాలుః స్వజనస్య గుప్త్యై॥ 5-1**

**అవతారిక :** కృష్ణుడు దావాగ్నిని మ్రింగుట. -ఉపేంద్రవజ్ర.

**అన్వయము :** దయాలుః ఈశః సః యామున+అంభసి+అవగాహన+ఉత్థ-శరీర-శైత్యం శమయన్+ ఇవ నిశి ప్రవృద్ధం నవ-కానన+అగ్నిం స్వజనస్య గుప్త్యై పపౌ.

**ప్రతిపదార్థం :** దయాలుః = కరుణామయుడైన, ఈశః = ప్రభువు అయిన, సః = ఆ కృష్ణుడు, యామున+అంభసి = యమున నీటిలో (యమునాయాః ఇదమ్ తచ్చ అంభశ్చ - తస్మిన్), అవగాహన+ఉత్థ-శరీర-శైత్యమ్ : అవగాహన = మునుగుటచేత, ఉత్థ = కలిగిన, శరీర = శరీరమందలి, శైత్యమ్ = చల్లదనాన్ని (అవగాహనేన ఉత్థం చ తత్ శరీరే శైత్యమ్), శమయన్+ఇవ = ఉపసంహరించుకొంటున్నట్లుగా, నిశి = రాత్రి, ప్రవృద్ధమ్ = చెలరేగిన, నవ-కానన+అగ్నిమ్ : నవ = క్రొత్తదైన, కానన+అగ్నిమ్ = దావాగ్నిని (నవశ్చ అసౌ కాననే అగ్నిః తమ్), స్వజనస్య = తనవారియొక్క, గుప్త్యై = రక్షణకై, పపౌ = త్రాగెను. (పా పానే భ్వాది పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తాత్పర్యము ॥** కృష్ణునకు యమునానదిలో మునిగినందువలన శరీరంలో చల్లదనం నిలబడిపోయింది. దానిని పోగొట్టుకొనటానికై ఆ రాత్రి చెలరేగిన దావాగ్ని మ్రింగి దయాళువై తనవారిని కూడా కాపాడాడు.

**విశేషాలు :** 1. ఈ శ్లోకంలో ఒక చమత్కారముంది. ఒక వాస్తవికతను మరొక ఊహను కలిపి చెప్పట మిక్కదుంది. '**శైత్యం శమయన్నివ**' అని పూర్వార్ధంలో అగ్ని పానానికి కారణాన్ని ఉత్ప్రేక్షించాడు కవి. ద్వితీయార్ధంలో 'స్వజనస్య గుప్త్యై' అని వాస్తవాన్ని ప్రకటించాడు. కారణం కళ్ళకు కట్టినట్టుంటే మరో కారణాన్ని కల్పించవచ్చా? అదే ఇక్కడ చమత్కారం.

| | | | |
|---|---|---|---|
| 2. **పపౌ :** | **పపౌ** | పపతుః | పపుః |
| | పపిథ/పపాథ | పపథుః | పప |
| | పపౌ | పపివ | పపిమ |

*

**శ్లో॥ స్తువన్తు సర్వే వనవహ్నిపాన-కృతానుభావం న వయం మురారేః ।**
**స్వజన్మభూమిం శిఖిని ప్రవిష్టే - క ఈశితుస్తేన కృతోఽనుభావః ॥ 5-2**

**అ :** కృష్ణుని అగ్నిపానకర్మను నైసర్గికమని కవి భావించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** మురారేః వన–వహ్ని–పాన–కృత+అనుభావం సర్వే స్తువన్తు. వయం న (స్తుమః). శిఖిని స్వ–జన్మ–భూమిం ప్రవిష్టే (సతి) తేన కృతః ఈశితుః కః అనుభావః.

**ప్ర :** మురారేః = కృష్ణునియొక్క (మురస్య అరిః తస్య), వన–వహ్ని–పాన–కృత–అనుభావమ్ : వన–వహ్ని = దావాగ్నియొక్క, పాన = పానంద్వారా, కృత = చూపబడిన, అనుభావమ్ = మాహాత్మ్యాన్ని (శబ్దార్థకల్పతరుః–పు 112) (వనే వహ్నిః తస్య పానం తేన కృతశ్చ అసౌ అనుభావః–తమ్), సర్వే = అందరు, స్తువన్తు = పొగడుదురు గాక (సు స్తుతౌ–పరస్మైపది–లోట్–ప్ర.బ.), వయమ్ = మేము, న = స్తుతింపము, శిఖిని = అగ్ని, స్వ–జన్మ–భూమిమ్ : స్వ = తనయొక్క, జన్మ–భూమిమ్ = పుట్టిన తావును (స్వస్య జన్మ, తస్య భూమిః, తమ్), ప్రవిష్టే (సతి) = ప్రవేశిస్తే, తేన = ఆ పనిద్వారా, కృతః = చేయబడిన, ఈశితుః = ప్రభువైన కృష్ణునియొక్క, కః? అనుభావః = మాహాత్మ్య మేమిటి?

**తా ॥** కృష్ణుడు దావాగ్నిని మ్రింగటాన్ని, తద్ద్వారా చూపిన ప్రభావాన్ని అందరూ పొగిడితే పొగడవచ్చును కానీ మేము పొగడం. అగ్ని తన జన్మభూమికి తాను చేరాడు? ఇందులో కృష్ణుని మాహాత్మ్యమేముంది?

**వి : 1. శ్లో॥ చంద్రమా మనసో జాతః చక్షోస్సూర్యో అజాయత ।**
**ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥ – ఋగ్వేదీయ పురుషసూక్తమ్.**

ఆ లెక్కన పరాత్పరుని ముఖంనుండి పుట్టిన అగ్ని మరల అక్కడకు చేరాడు. కృష్ణుని గొప్పతనమేమిటి?

2. ఇది వ్యాజస్తుత్యలంకారం. '**ఉక్తిః వ్యాజస్తుతిః నిందాస్తుతిభ్యాం స్తుతినిందయోః**'–(కు. 70) నింద ద్వారా స్తుతి, స్తుతి ద్వారా నింద వ్యక్తమయితే అది వ్యాజస్తుతి. అగ్నిని మ్రింగటం గొప్ప కాదనటం ద్వారా అగ్ని పుట్టుక కూడా తననుండియే అన్న స్తుతిని ధ్వనింపజేయటం.

| | | | |
|---|---|---|---|
| 3. **స్తువన్తు :** | స్తౌతు/స్తువీతు | స్తుతామ్/స్తువీతామ్ | **స్తువన్తు** |
| | స్తుహి/స్తువీహి | స్తువాథామ్ | స్తుధ్వమ్/స్తువీధ్వమ్ |
| | స్తవాని | స్తవావ | స్తవామ. |

*

**శ్లో॥ స్వజనైర్నిజపాదాబ్జభజనైః సహితస్తతః ।**
**వ్రజమార్జితసర్వార్థవ్రజం నివివిశేఽచ్యుతః ॥ 5–3**

**అ :** కృష్ణుడు తిరిగి బృందావనంలో/గోకులంలో ప్రవేశించుట. –పథ్యావక్త్రమ్.

**అ :** నిజ–పాద+అబ్జ–భజనైః స్వ–జనైః సహితః అచ్యుతః ఆర్జిత–సర్వ+అర్థ–వ్రజం వ్రజం నివివిశే.

**ప్ర :** నిజ పాద+అబ్జ–భజనైః : నిజ = తనయొక్క, పాద+అబ్జ = పాదపద్మాలను, భజనైః = సేవించెడి (నిజయోః పాదపద్మయోః భజనం యేషాం, తైః), స్వజనైః = తన వారి చేత, సహితః = కూడియున్న, అచ్యుతః = కృష్ణుడు, ఆర్జిత–సర్వ+అర్థ–వ్రజమ్ : ఆర్జిత = సంపాదింపబడిన, సర్వ+అర్థ = అన్ని అర్థములయొక్క, వ్రజమ్ = సమూహం గలిగిన (ఆర్జితః సర్వేషామ్ అర్థానాం వ్రజః యైః, తమ్), వ్రజమ్ = గోకులాన్ని, నివివిశే = ప్రవేశించాడు. (ని+విశ ప్రవేశనే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** తన పాదపద్మాలను ఆరాధించెడి తనవారితో కలిసి కృష్ణుడు గోకులంలో ప్రవేశించాడు, కాళియమర్దనం తరువాత. ఆ గోకులం సమస్తపురుషార్థాలనూ సంపాదించుకొనినది. (ధర్మం, అర్థం, కామం, మోక్షం – ఇవి నాలుగు పురుషార్థాలు)

**వి :** 1. శ్లో॥ ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్ కామీ మోక్షార్థీ మోక్షమాప్నుయాత్ ॥ – విష్ణుసహస్రనామ – ఉత్తరపీఠిక.

నామస్మరణ మాత్రం చేతనే నాలుగు పురుషార్థాలు లభించేటప్పుడు నిత్యసాహచర్య–ముండుటమంటే అవి లోబడి వున్నట్లే.

2. '**విశ**' ధాతువు వస్తుతః పరస్మైపదం 'ని' ఉపసర్గ పూర్వకమైనపుడు మాత్రం **నేర్విశః** (అష్టాధ్యాయి 1–3–17) సూత్రంతో ఆత్మనే పదమవుతుంది.

| | | | |
|---|---|---|---|
| **నివివిశే :** | **నివివిశే** | నివివిశాతే | నివివిశిరే |
| | నివివిశిషే | నివివిశాథే | నివివిశధ్వే |
| | నివివిశే | నివివివహే | నివివిమహే. |

*

**శ్లో॥ నిజబలకరమగ్నిం కృష్ణపీతం నిశమ్య**
**జ్వలిత ఇవ ససూర్యః ప్రాదురాసీన్నిదాఘః ।**
**స్వకృతిమథ సనామ్నా నిర్ణినీషుర్విచిన్త్య**
**ద్రుతమృతుపతినేవ ప్రాప గోపో వనాన్తమ్ ॥ 5–4**

**అ :** గ్రీష్మర్తువర్ణన. –మాలిని.

**అ :** నిజ–బల–కరమ్ అగ్నిం కృష్ణపీతం నిశమ్య జ్వలితః ఇవ నిదాఘః ససూర్యః ప్రాదురాసీత్. అథ గోపః స్వ కృతిం స్వ+నామ్నా ఋతుపతినా విచింత్య నిర్ణినీషుః ఇవ ద్రుతం వన+ అంతం ప్రాప.

**ప్ర :** నిజబలకరమ్ : నిజ = తనకు (గ్రీష్మానికి), బల = శక్తిని, కరమ్ = కల్పించే, **అగ్నిమ్ = దావాగ్నిని (నిజస్య బలమ్, తస్య కరమ్)**, కృష్ణ–పీతమ్ : కృష్ణ = కృష్ణునిచే, పీతమ్ = త్రాగబడినదానినిగా, (కృష్ణేన పీతం) నిశమ్య = విని, జ్వలితః+ఇవ = మండుతున్నట్లుగా, నిదాఘః = గ్రీష్మర్తువు, ససూర్యః = సూర్యునితో కూడి (సూర్యేణ సహితః), ప్రాదుః+ఆసీత్ = ఆవిర్భవించింది. (ప్రాదుః+అస భువి అదాది పరస్మైపది –లఙ్–ప్ర.ఏ.), అథ = ఆ పై, గోపః = కృష్ణుడు (గాః పాతి ఇతి), స్వకృతిమ్ = తాను చేసిన పనిని (స్వస్య కృతిః తామ్), స్వనామ్నా = తన పేరు వంటి పేరు గల (స్వస్య నామ ఇవ నామ యస్య, తేన), ఋతుపతినా = ఋతురాజు (గ్రీష్మం) తో, విచిన్త్య = ఆలోచించి, నిర్ణినీషుః ఇవ = నిర్ణయింపగోరిన వాని వలె (నిర్ణేతుమ్ ఇచ్ఛుః), ద్రుతమ్ = వేగంగా, వన+అంతమ్ = వనంలో మధ్యకు, ప్రాప = చేరెను.

**తా ॥** గ్రీష్మర్తువు తనకు బలాన్ని పెంచే అగ్నిని కృష్ణుడు త్రాగేశాడన్న కోపంతో కాబోలు సూర్యుణ్ణి వెంటబెట్టుకొని వచ్చాడు. అప్పుడు కృష్ణుడు తాను చేసిన పనిని గురించి వసంతునితో ఆలోచించి తదుపరి కర్తవ్యాన్ని నిర్ణయించాలనుకొని వెంటనే వనం మధ్యభాగానికి చేరాడు. (కృష్ణునికి, వసంతునికి మాధవ పదం సమానం)

**విశే :** 1. కృష్ణుడి మీద కోపంతోనే అన్నట్లు – గ్రీష్మం రావటం హేతూత్ప్రేక్షాలంకారం. గ్రీష్మం స్వతాహాగానే వేడిని పెంచుతుంది. దానిశక్తి పగలే ఎక్కువగా అనుభవంలోనికి వస్తుంది. దానికి సూర్యుడుంటే చాలు. అగ్నిని త్రాగిన కృష్ణుని మీద కోపం అవసరం లేదు. అయినా కోపాన్ని సంభావించినందువల్ల హేతూత్ప్రేక్షాలంకారం. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' (కు.32)

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రాదురాసీత్ :** | **ప్రాదురాసీత్** | ప్రాదురాస్తామ్ | ప్రాదురాసన్ |
| | ప్రాదురాసీః | ప్రాదురాస్తమ్ | ప్రాదురాస్త |
| | ప్రాదురాసమ్ | ప్రాదురాస్వ | ప్రాదురాస్మ |

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాప : | ప్రాప | ప్రాపతుః | ప్రాపుః | |
| | ప్రాపిథ | ప్రాపథుః | ప్రాప | |
| | ప్రాప | ప్రాపివ | ప్రాపిమ | * |

**శ్లో॥ తాపే తద్వనమాధవేన విజితే భాస్వత్ప్రభాసమ్భవే**
**దావే చ వ్రజమాధవేన దమితే గ్రీష్మో జజృమ్భే క్షణాత్ ।**
**కోపేనేవ వసన్తపుష్పనిచయం శుష్కం విధాయానిలం**
**తప్తం చమ్పకకమ్పితాంశ్చ మధుపాన్ మూకాన్ పికాదీన్ ఖగాన్ ॥ 5-5**

**అ :** గ్రీష్మర్తువర్ణన – వనపరిస్థితివర్ణన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** భాస్వత్ప్రభా–సంభవే తాపే తద్వన–మాధవేన విజితే (సతి) దావే వ్రజ–మాధవేన దమితే (సతి) గ్రీష్మః కోపేన ఇవ వసంత–పుష్ప–నిచయం శుష్కం విధాయ, అనిలం తప్తం (విధాయ) మధుపాన్ చంపక–కంపితాన్ (విధాయ) పిక+ఆదీన్ ఖగాన్ మూకాన్ (విధాయ) క్షణాత్ జజృంభే.

**ప్ర :** భాస్వత్ – ప్రభా – సంభవే : భాస్వత్ = సూర్యునియొక్క, ప్రభా = కిరణాలనుండి, సంభవే = పుట్టిన (భాస్వతః ప్రభాః, తాభ్యః సంభవః, తస్మిన్), తాపే = వేడి, తద్–వన–మాధవేన : తద్ = ఆ, వన = తోటలోని, మాధవేన = వసంతునిచే (మాధవునిచే), విజితే (సతి) = జయింపబడగా (వి+జి ధాతువుపై క్త ప్రత్యయం), దావే = దావాగ్ని, వ్రజ–మాధవేన = గోకులంలోని మాధవునిచేత, దమితే = అణచివేయ బడగా (దమ్ ధాతువుపై క్త ప్రత్యయం), గ్రీష్మః = గ్రీష్మర్తువు, కోపేన+ఇవ = కోపంతో కాబోలు, వసంత–పుష్ప–నిచయమ్ : వసంత = వసంతునకు చెందిన, పుష్ప = పూల యొక్క, నిచయమ్ = సమూహాన్ని (వసంతస్య పుష్పాణి తేషాం నిచయః తమ్), శుష్కం = ఎండిన దానినిగా (శుష్ ధాతువుపై క్త ప్రత్యయం భూతార్థంలో. '**శుషఃకః**' (అష్టాధ్యాయి – 8–2–51)), విధాయ = చేసి, అనిలమ్ = గాలిని, తప్తమ్ = ఎండిన దానినిగా (తప్ ధాతువుపై క్త ప్రత్యయం), విధాయ = చేసి, మధుపాన్ = తుమ్మెదలను (మధు పిబన్తి ఇతి – తాన్), చంపక–కంపితాన్ : చంపక = సంపెంగపూలనుండి, కంపితాన్ = కదిలింపబడినట్లుగా (కంప్ ధాతువుపై క్త ప్రత్యయం) (చంపకేభ్యః కంపితాః , తాన్), విధాయ = చేసి, పిక+ఆదీన్ = కోకిల మొదలుగా గల (పికః ఆదౌ యేషాం – తాన్), ఖగాన్ = పక్షులను, మూకాన్ = మూగవానినిగా, విధాయ = చేసి, క్షణాత్ = క్షణకాలంలో, జజృంభే = చెలరేగెను. (జృంభ్ గాత్రవితానే–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** సూర్యకిరణాలనుండి పుట్టినవేడిని వనమాధవుడు మ్రింగివేశాడు. దావాగ్ని నుండి పుట్టినవేడిని వ్రజమాధవుడు మ్రింగివేశాడు. దానితో కోపించిన గ్రీష్ముడు తోటలోని పూలను వాడజేసి, గాలిని వేడిచేసి, తుమ్మెదలను చంపకాలనుండి తరిమివేసి, కోకిలలు మొదలైన పక్షులను మూగవానినిగా చేశాడు.

**విశే :** 1. తుమ్మెదలకు సంపంగిపూలు నచ్చవట. అది కవి సమయం. నచ్చవు కాబట్టి ఆ చంపకాలనుండి తుమ్మెదలను పడగొట్టాడు గ్రీష్ముడు. అసలు అవి చంపకాలపై ఎందుకు వ్రాలినట్టు?

వసుచరిత్రలో రామరాజభూషణుడు ఈ తుమ్మెదల అనిష్టాన్నే మరొకరీతిగా వర్ణించాడు.

**శా. నానాసూనవితానవాసనల నా నందించు సారంగ మే**
**లా? నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బంది యో**
**షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాస మై**
**పూనెం బ్రేక్షణమాలికా మధుకరీ పుంజంబునిర్వంకలన్.**

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జజృంభే :** | జజృంభే | జజృంభాతే | జజృంభిరే | |
| | జజృంభిషే | జజృంభాథే | జజృంభిధ్వే | |
| | జజృంభే | జజృంభివహే | జజృంభిమహే. | * |

**శ్లో॥ పాథః శీతమశీతలోష్ణధరిణీం భాస్వద్బలేనోష్ణయ-**
**న్నూర్ధ్వం గన్ధవహం నయన్ త్రివృతమప్యమ్మాత్రపాత్రం వపుః ।**
**కుర్వన్ కృష్ణకృతేర్విరోధమివ తద్వాసం చ వాః శోషయన్**
**విశ్వం తస్య వశం దవేన చ దహన్ వైరీవ సోఽదృశ్యత ॥ 5-6**

**అ :** గ్రీష్మర్తు వర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సః కృష్ణకృతేః విరోధం కుర్వన్నివ శీతం పాథః అశీతలోష్ణధరిణీం **భాస్వద్-బలేన** ఉష్ణయన్, గంధవహమ్ ఊర్ధ్వం నయన్ త్రివృతం వపుః అమ్మాత్ర-పాత్రం కుర్వన్ అపి తద్వాసం వాః చ శోషయన్ తస్య వశమ్ విశ్వం దవేన దహన్ వైరీ+ఇవ అదృశ్యత.

**ప్ర :** సః = ఆ గ్రీష్ముడు, కృష్ణ-కృతేః=కృష్ణుని పని అయిన సృష్టికి(కృష్ణస్య కృతిః తస్యాః), విరోధమ్ = భిన్నంగా/విరుద్ధంగా, కుర్వన్+ఇవ = చేయదలచినట్లుగా, శీతమ్ = చల్లనైన, పాథః = నీటిని (అర్ణః పాథః కుశజలవనం-హలాయుధకోశః-648), అశీతల+ఉష్ణ-ధరిణీమ్ = అశీతలోష్ణస్థితిగల భూమిని (శీతలా చ సా ఉష్ణా చ శీతలోష్ణా - సా న భవతి ఇతి - సా చ అసౌ ధరిణీ చ - తామ్), భాస్వద్-బలేన = సౌరశక్తితో (భాస్వతః బలం తేన), ఉష్ణయన్ = వేడిగా చేస్తూ (ఉష్ణ ధాతువుపై శతృ ప్రత్యయం), గంధవహమ్ = గాలిని, ఊర్ధ్వమ్ = పైకి, నయన్ = నడుపుతూ (సుడిగాలికి ఊర్ధ్వగతి ఉంటుంది). త్రి-వృతమ్ = మూడింటితో నిండిన (నీరు, తేజస్సు, అన్నం), (త్రిభిః వృతమ్), వపుః = శరీరాన్ని, అప్+మాత్ర-పాత్రమ్ = నీటికి మాత్రమే తగినట్లుగా (జలపాత్రలాగా), కుర్వన్ = చేస్తూ (కృ ధాతువుపై శతృ ప్రత్యయం), తద్+వాసమ్ = కృష్ణుని నివాసస్థానాన్ని, వాః = నీటిని, శోషయన్ చ = ఎండింప జేస్తూ, తస్య = కృష్ణునికి, వశమ్ = లోనైన, విశ్వమ్ = ప్రపంచాన్ని, దవేన = దావాగ్నితో, దహన్ = మండిస్తూ (దహ ధాతువుపై శతృ ప్రత్యయం), వైరీ+ఇవ = శత్రువువలె, అదృశ్యత = కనిపించింది. (దృశ్ ప్రేక్షనే-కర్మణి-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** గ్రీష్ముడు కృష్ణ సృష్టికి విరుద్ధంగా ప్రవర్తించ గోరి చల్లనినీటినీ, అనుష్ణశీతలస్పర్శ గలిగిన భూమినీ సౌరశక్తితో వేడి చేస్తున్నాడు. గాలిని పైకి తీసికొని పోతున్నాడు. అన్నరసతేజస్సులతో కూడిన శరీరాన్ని రసానికి (నీటికి) పరిమితం చేసి పానపాత్రను చేస్తున్నాడు. కృష్ణనివాసాన్నీ, నీటిని ఎండింప జేస్తున్నాడు. శ్రీకృష్ణునకు లోబడి వున్న సమస్తజగత్తునూ దహిస్తున్నాడు. ఇలా చేస్తూ కృష్ణశత్రువులా కనిపించాడు.

**వి :** 1. మనకు నచ్చని పనులు చేసేవాడు మన శత్రువు కాదు. మనం చేసిన పనులకు వైపరీత్యాన్ని కలిగించేవాడు మన శత్రువు. గ్రీష్మమాపని చేస్తోంది, కృష్ణకృతికి వ్యతిరేకతను గలిగిస్తూ.

2. శరీరం పాంచభౌతికమయినా పంచభూతాలలోని మూడు మాత్రమే మూర్త పదార్థాలు. పృథివి - అప్పు - తేజస్సు. మిగిలిన రెండు వాయువు - ఆకాశం, అమూర్త పదార్థాలు. మూర్త పదార్థాలంటే రూపం గలవి. అందుకే అవి కనిపించగలవు. కనిపించే ఈ శరీరం మూర్త పదార్థాల (అన్నం - పృథివికి ఉపలక్షకం - నీరు - తేజస్సు (వేడి)) సమావేశం. దానినే త్రివృతమన్నాడు కవి.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అదృశ్యత :** | **అదృశ్యత** | అదృశ్యేతామ్ | అదృశ్యన్త | |
| | అదృశ్యథాః | అదృశ్యేథామ్ | అదృశ్యధ్వమ్ | |
| | అదృశ్యే | అదృశ్యావహి | అదృశ్యామహి. | * |

**శ్లో॥ సుచ్ఛాయైః శుకమణ్డితైః శుభఫలైరుద్యత్ప్రసూనోద్గమై-**
**ర్వృక్షైర్మాధవపక్షగైః ప్రశమితే ఖేదే నిదాఘోద్భవే ।**
**దైత్యః కోऽపి తరుత్వమేత్య వరతస్తత్పక్షపాతీవ త-**
**చ్ఛాయావాససుఖాత్ సహస్రగుణితం శోకం వితేనే వనే ॥ 5-7**

**అ :** గ్రీష్మ ఋతు వర్ణనమే. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సుచ్ఛాయైః శుక-మండితైః, శుభ-ఫలైః ఉద్యత్ప్రసూనః+ఉద్గమైః మాధవ-పక్ష గైః వృక్షైః నిదాఘ+ఉద్భవే ఖేదే ప్రశమితే వనే కోऽపి దైత్యః వరతః తరుత్వమ్ ఏత్య తత్పక్షపాతీ+ఇవ, తచ్ఛాయావాస-సుఖాత్ సహస్ర-గుణితం శోకం వితేనే.

**ప్ర :** సు+ఛాయైః = మంచి నీడగలవియు (సు+ఛాయా – '**ఛేచ**' (అష్టాధ్యాయి 6-1-72) సూత్రంతో తుగాగమం – సుచ్ఛాయా), శుక-మండితైః : శుక = చిలుకలచే, మండితైః = అలంకరింపబడినవియు (శుకైః మండితాః, తైః), శుభ-ఫలైః = మంచి పండ్లు గలవియు (శుభాని చ తాని ఫలాని యేషాం, తైః), ఉద్యత్-ప్రసూన+ఉద్గమైః : ఉద్యత్ = వికసిస్తున్న, ప్రసూన = పూలయొక్క, ఉద్గమైః = విచ్చుటలు గలవియు (ఉద్యన్తి చ తాని ప్రసూనాని యేషాం, తైః), మాధవపక్షగైః : మాధవ-పక్ష-గైః = వసంతుని పక్షం వహించేవి అయిన (పక్షే గచ్ఛన్తి ఇతి పక్షగాః – మాధవస్య పక్షగాః తైః), వృక్షైః = చెట్లచే, నిదాఘ+ఉద్భవే : నిదాఘ = గ్రీష్మంచేత (నిదాఘః కథ్యతే గ్రీష్మః-హలాయుధకోశః-116), ఉద్భవే = పుట్టిన (నిదాఘేన ఉద్భవః తస్మిన్), ఖేదే = బాధ, ప్రశమితే = శమింపజేయబడగా, కః+అపి = ఒకానొక, దైత్యః = రాక్షసుడు, వరతః = వరం వలన, తరుత్వమ్ = వృక్షస్వరూపాన్ని (తరోః భావః), ఏత్య = పొంది (ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తత్-పక్షపాతీ – ఇవ : తత్ = ఆ గ్రీష్మం వైపు, పక్షపాతీ – ఇవ = మొగ్గుచూపుతున్నట్లుగా (తస్య పక్షే పతతి ఇతి తత్పక్షపాతీ స ఇవ), తచ్ఛాయా... సుఖాత్ : తత్ = ఆ (వసంత పక్షంలోని) చెట్లయొక్క, ఛాయా వాస = నీడవలన కలిగెడి (తస్యాః ఛాయాః సుఖం తస్మాత్), సుఖాత్ = సుఖం కన్న, సహస్ర-గుణితమ్ = వేలరెట్లు గల, శోకమ్ = బాధను, వితేనే = కల్పించాడు. (వి+తనూ విస్తారే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అక్కడ దాదాపు అన్ని చెట్లు దట్టమైన నీడలతో, పలికే చిలుకలతో, సత్ఫలాలతో, వికసిస్తున్న పూలతో వసంతపక్షపాతం వహిస్తూ వేసవివేడివలన కలిగిన తాపాన్ని తగ్గిస్తున్నాయి. కానీ ఒక్క చెట్టు – ఎవడో రాక్షసుడు వరప్రభావంతో ఆ చెట్టు రూపాన్ని పొందటంవల్ల – గ్రీష్మపక్షపాతాన్ని వహిస్తూ మిగత చెట్లు తమ నీడలో నిలిచిన వారికిస్తున్న సుఖం కన్న వేయిరెట్లు ఎక్కువగా శోకాన్ని కలిగిస్తోంది.

**వి :** 1. నలుగురిలా పదిమందికీ మేలుచేసే అవకాశమున్నా ఆ బాటను వీడి పదిమందినీ బాధించటం రాక్షసప్రవృత్తి అని కవి భావన. దేవతలను ద్వేషించటమే రాక్షసలక్షణం కాబట్టి ఆ దేవాధిదేవుడు ఎక్కడున్నా తాము ఏదో రూపంలో ఆ లక్షణాన్ని ప్రదర్శిస్తారు రాక్షసులు. వాటిల్లో ఇది ఒకటి. అది కూడా వరబలంతో. వరాలిచ్చేది మళ్ళీ దేవతలే.

2. అన్ని చెట్లుకు మాధవపక్షపాతిత్వం, ఒక్కదానికి మాత్రం గ్రీష్మపక్షపాతిత్వం కవి సంభావనమే. కానీ అది వాచా కనిపించదు. కాబట్టి ఉత్ప్రేక్షాలంకారధ్వని.

ఇక్కడ వక్రోక్త్యలంకారం కూడా వామనుని లక్షణం మేరకు. **సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః** (కావ్యాలంకారసూత్రాణి – 4-3-8). మానవీలయలక్షణమైన పక్షపాతిత్వాన్ని ఆ అవకాశం లేని వృక్షాలలో ఆరోపించి చూపటం వల్ల ఇక్కడ వక్రోక్తి.

| | | | |
|---|---|---|---|
| 3. **వితేనే :** | **వితేనే** | వితేనాతే | వితేనిరే |
| | వితేనిషే | వితేనాథే | వితేనిధ్వే |
| | వితేనే | వితేనివహే | వితేనిమహే. |

*

**శ్లో॥ తరుత్వమప్యాప్య వనం మురారే-రదూషయద్ధన్త! విషైః సమన్తాత్ ।**
**స్వనాసికాచ్ఛేదమపీహ సోఢ్వా - ఖలో నిరున్ధే ఖలు సత్ప్రయాణమ్ ॥ 5-8**

**అ :** గ్రీష్మర్తువర్ణన - వృక్షరూపరాక్షసస్వభావవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** తరుత్వమ్ ఆప్య అపి మురారేః వనం విషైః సమంతాత్ అదూషయత్. హంత. ఇహ ఖలః స్వ-నాసికాచ్ఛేదమ్ అపి సోఢ్వా సత్ప్రయాణం నిరున్ధే ఖలు.

**ప్ర :** తరుత్వమ్ = చెట్టుతనాన్ని, ఆప్య - అపి = పొంది అయినా (ఆ ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ముర+అరేః = కృష్ణునియొక్క, వనమ్ = బృందావనాన్ని, విషైః = విషాలతో (గంధ, ఫల, పుష్ప సమీరాది విషాలు), సమంతాత్ = అన్ని వైపులా, అదూషయత్ = చెడిపెను. (దుష్ వైకృత్యే - ణిచ్ - పరస్మైపది - లఙ్ - ప్ర.ఏ.), హంత = ఎంత కష్టం!, ఇహ = ఈ లోకంలో, ఖలః = చెడ్డవాడు, స్వ-నాసికా-ఛేదమ్-అపి : స్వ=తనయొక్క, నాసికా = ముక్కుయొక్క, ఛేదమ్-అపి = ఖండనను కూడా (స్వస్య నాసికా, తస్యాః ఛేదనమ్), సోఢ్వా = సహించి (సహ ధాతువుపై క్త్వా ప్రత్యయం), సత్-ప్రయాణమ్ = మంచి వారి ప్రయాణాన్ని, నిరున్ధే ఖలు = అడ్డగిస్తాడు గదా! (ని-రుధి - ఆవరణే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ రాక్షసుడు చెట్టుదనాన్ని పొంది అయినా సరే ఆ బృందావనాన్ని అన్ని వైపులా కలుషితం చేయగలిగాడు. ఈ లోకంలో దుర్మార్గుడంతే. తన ముక్కును కోసికొని అయినా ఆ బాధను సహిస్తూ మంచివారి ప్రయాణాన్ని ఆపివేయగలడు.

**వి :** 1. శకునశాస్త్రానికి సంబంధించిన అంశమిది. శకునశాస్త్రానికి మూలం విశ్వాసాలే. ఇటువంటి విశ్వాసాలు విశ్వతో వ్యాప్తాలు. అవిటివారు ఎదురుపడితే ప్రయాణానికి అశుభమని శకునశాస్త్రం. కాబట్టి దుర్మార్గుడు మంచి వారి ప్రయాణానికి అడ్డుదగల దలచి నప్పుడు తన ముక్కును కోసికొని ఆ బాధను భరిస్తూ అయినా ఎదురు వచ్చి ప్రయాణ మాపుతాడు గదా! అటువంటి వాళ్ళు కూడా ఉంటారా అని ఆలోచింప నవసరం లేదు. వెన్నెముకనే దానం చేసే దాతలున్నప్పుడు ముక్కుకోసికొని ఎదురు రాలేని వారుండక పోతారా?

2. శ్లోక పూర్వార్ధం విశేషాంశం. ఉత్తరార్ధం సామాన్యాంశం. రెండింటినీ కలపటం వలన అర్థాంతర-న్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్య విశేషయోః**' (కు. 122). తాను కదలలేని చెట్టు అయినా ఫరవాలేదు కానీ విషాన్ని చిమ్మగలిగితే చాలు అని ఆ రాక్షసభావన.

| | | | |
|---|---|---|---|
| 3. **అదూషయత్:** | **అదూషయత్** | అదూషయతామ్ | అదూషయన్ |
| | అదూషయః | అదూషయతమ్ | అదూషయత |
| | అదూషయమ్ | అదూషయావ | అదూషయామ. |

| | | | |
|---|---|---|---|
| **నిరున్ధే :** | **నిరున్ధే** | నిరున్ధాతే | నిరున్ధతే |
| | నిరున్త్సే | నిరున్ధాథే | నిరున్ధధ్వే |
| | నిరున్ధే | నిరున్ధ్వహే | నిరున్ధ్మహే. |

*

**శ్లో॥ వినాశ్య వృన్దావనవాసిపక్షి-మృగాదినానావిధజీవవర్గమ్ ।**
**వరప్రదాతుస్తరసా విధాతు-రసౌ విశజ్కో విదధే ప్రతీపమ్ ॥ 5-9**

**అ :** గ్రీష్మర్తువర్ణన – తరురూప రాక్షసప్రవృత్తి వర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** అసౌ విశంకః (సన్) వృందా–వన–వాసి–పక్షి మృగ+ఆది–నానావిధ–జీవ–వర్గం తరసా వినాశ్య వర–ప్రదాతుః విధాతుః ప్రతీపం విదధే.

**ప్ర :** అసౌ = ఆ రాక్షసుడు, విశంకః (సన్) = కొంకు లేనివాడై (విగతా శంకా యస్మాత్ సః), వృందా... వర్గమ్ : వృందావన = బృందావనంలో, వాసి = నివసిస్తున్న, పక్షి = పక్షులు, మృగ = జంతువులు, ఆది = మొదలుగాగల, నానా–విధ = అనేక విధాలయిన, జీవ = ప్రాణులయొక్క, వర్గమ్ = సమూహాన్ని (బృందావనే వసన్తి ఇతి వృందావన వాసినః, తే చ పక్షిణః మృగాశ్చ ఆదౌ యేషాం తే బృందావనవాసిమృగాదయః, తే చ తే నానావిధాశ్చ, తేషాం జీవానాం వర్గః, తమ్), తరసా = వేగంగా, వినాశ్య = కనబడకుండా చేసి (వి–నశ్ అదర్శనే ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వర–ప్రదాతుః = వరాలనిచ్చే (వరాణాం ప్రదాతా, తస్య), విధాతుః = బ్రహ్మకు, ప్రతీపమ్ = విరుద్ధంగా, విదధే = ఏర్పరచెను. (వి పూర్వక దా–ధారణ పోషణయోః–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** (ఆ రాక్షసుడు ఆ రీతిగా విషాన్ని వ్యాపింపజేసి) ఏ విధమైన శంకా లేకుండా బృందావనంలో నివసిస్తున్న పక్షులు, జంతువులు మొదలయిన వివిధ జీవజాతులను మట్టుబెట్టి అందరికీ వరాలనిచ్చే విధాతసృష్టికే విరుద్ధంగా ప్రవర్తించాడు.

**వి :** 1. శ్లో॥ తత్రాగ్నిమాధాయ సమిత్సమిద్ధం – స్వమేవ మూర్త్యంతరమష్టమూర్తిః ।
స్వయం విధాతా తపసః ఫలానాం – కేనాపి కామేన తపశ్చచార ॥

అన్నాడు కాళిదాసు **కుమారసంభవం–1/57.** ఈశ్వరుడు తపస్సు ప్రారంభించినప్పుడు తపః ఫలాలనిచ్చే శివుడే ఒకచోట తపస్సు ప్రారంభిస్తే వరాలు పొంది ఆ వరాలనిచ్చేవారికే విరుద్ధంగా మరొకచోట ప్రవృత్తి. అందుకే దేవదానవభేదం స్వభావాలను బట్టి.

| | | | |
|---|---|---|---|
| 2. **విదధే :** | **విదధే** | విదధాతే | విదధిరే |
| | విదధిషే | విదధాథే | విదధిధ్వే |
| | విదధే | విదధివహే | విదధిమహే. |

*

**శ్లో॥ తదీయగన్ధేన ఫలేన పుష్ప–కులేన మూలాశ్రయణేన లోకః ।**
**తదైవ నాశం కిల యాతి కృష్ణ–విపక్షమైత్రీ కిము సౌఖ్యదాత్రీ ॥ 5–10**

**అ :** గ్రీష్మర్తువర్ణన – రాక్షసతరు ప్రభావ వర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** లోకః తదీయ–గంధేన ఫలేన పుష్ప–కులేన మూల+ఆశ్రయణేన తదా+ఏవ నాశం యాతి కిల. (తథాహి) కృష్ణ–విపక్ష–మైత్రీ సౌఖ్య–దాత్రీ కిము?

**ప్ర :** లోకః = జనం (లోకస్తు భువనే జనే – అమరకోశః – నానార్థ – 2), తదీయ–గంధేన : తదీయ = ఆ చెట్టుకు సంబంధించిన, గంధేన = వాసనతో (తదీయశ్చ అసౌ గంధః, తేన), ఫలేన = పండుతో, పుష్ప–కులేన : పుష్ప = పూలయొక్క, కులేన = సమూహంతో (పుష్పాణాం కులం, తేన), మూల+ఆశ్రయణేన: మూల = (ఆ చెట్టు) మొదలును, ఆశ్రయణేన = ఆశ్రయించుటతో (మూలస్య ఆశ్రయణం, తేన), తదా+ఏవ = అప్పటికప్పుడే, నాశం = నాశనాన్ని, యాతి–కిల = పొందుతోంది కదా! (యా ప్రాపణే – పరస్మైపది–లట్–ప్ర.ఏ.) (తథాహి = అది తగినదే గదా!), కృష్ణ–విపక్ష–మైత్రీ : కృష్ణ = కృష్ణునకు, విపక్ష = శత్రువుతో, మైత్రీ = చెలిమి (కృష్ణస్య విపక్షః, తేన మైత్రీ), సౌఖ్య–దాత్రీ కిము : సౌఖ్య = సుఖాన్ని, దాత్రీ కిము = ఇచ్చేదిదా? (సౌఖ్యస్య దాత్రీ)

**తా ॥** ఆ రాక్షసవృక్షానికి సంబంధించిన గాలిపీల్చినా, పండ్లుతిన్నా పూలను ఆఘ్రాణించినా, దానిక్రిందకు వెళ్ళినా జనం నశిస్తున్నారు. నిజమే మరి. కృష్ణుని శత్రువులతో చేసే స్నేహం సౌఖ్యాన్ని ఎలా ఇస్తుంది?

**వి :** 1. ఆ రాక్షసతరువు స్వసంబంధం కలిగిన వారి నందరినీ నశింపజేయటం విశేషవిషయం. కృష్ణ శత్రువులను ఆశ్రయిస్తే సుఖ మెలా కలుగుతుందన్నది సామాన్యాంశం. ఈ రెండింటి కలయిక అర్థాంతరన్యాసాలంకార మవుతుంది. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' (కు.122)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **యాతి :** | **యాతి** | యాతః | యాన్తి | |
| | యాసి | యాథః | యాథ | |
| | యామి | యావః | యామః. | * |

## శ్లో॥ కిం వాచ్యమస్యాతివిషోల్బణత్వం - యస్మాత్ స దర్వీకరవర్గమౌళిః ।
## రామోఽపి తత్సఙ్గతవాయునైవ - గ్లానిం సతాం గ్లానిహరోఽప్యవాప ॥ 5-11

**అ :** రాక్షసతరు విష ప్రభావం - బలరాముడుకూడా విషప్రభావానికి లోనగుట. ఉపేంద్రవజ్ర.

**అ :** అస్య అతివిష+ఉల్బణత్వం కిం వాచ్యమ్. యస్మాత్ దర్వీకర వర్గ మౌళిః సతాం గ్లాని హరః సః రామః అపి తత్సంగత వాయునా+ఏవ గ్లానిమ్ అవాప.

**ప్ర :** అస్య = ఆ రాక్షసవృక్షంయొక్క, అతి-విష+ఉల్బణత్వమ్ = అతిశయించిన విషం యొక్క హెచ్చుదలను గూర్చి (శబ్దార్థకల్పతరుః పుట 209), కిం వాచ్యమ్ = చెప్పవలసిన దేముంది?, యస్మాత్ = దేని వలన, దర్వీకర - వర్గ-మౌళిః : దర్వీకర = పాములయొక్క (దర్వీ కరః యస్య సః), వర్గ = సమూహానికి, మౌళిః = తలవంటి వాడునూ (దర్వీకరాణాం వర్గః, తస్య మౌళిః), సతామ్ = సజ్జనులయొక్క, గ్లాని-హరః = గ్లానిని (శ్రమను) పోగొట్టు వాడునూ అయిన (గ్లానేః హరః), సః రామః+అపి = ఆ బలరాముడు కూడా, తత్-సంగత్-వాయునా-ఏవ:తత్ = ఆ రాక్షస వృక్షంతో, సంగతః= కూడిన, వాయునా+ఏవ = గాలిచేతనే (తేన సంగతః తత్సంగతః, స చ అసౌ వాయుః, తేన), గ్లానిమ్= శ్రమను, అవాప = పొందాడు. (అవ+ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ రాక్షస వృక్షంయొక్క విషతీవ్రత ఎంత ఎక్కువో చెప్పవలసిన దేముంది? ఎందుకంటే సర్పవంశాగ్రణి, సజ్జనుల గ్లానిని అపహరించే వాడు అయిన బలరాముడు కూడా ఆ విష వృక్షపు గాలి కారణంగానే గ్లానికి లోనయ్యాడు.

**వి :** 1. గ్లాని - **దవథుః పరితాపః స్యాత్ గ్లానిః స్త్రీ గ్లవథుః** పుమాన్-(వైజయన్తీ-భూత-122). శ్రమ/పరితాపం గ్లాని పదానికర్థాలు. గ్లై - హర్షక్షయే ధాతువునుండి పుట్టినదీ పదం. హర్షం నశించటం ధాత్వర్థం. ఆలంకారికంగా-

శ్లో॥ రత్యాయాస - మనస్తాప - క్షుత్పిపాసాది సంభవా ।
గ్లాని ర్నిష్ప్రాణతాకంప కార్శ్యానుత్సాహతాదికృత్ ॥ -సాహిత్యదర్పణః -3/70

బలరామునిలో క్షుత్పిపాసలు పెరిగాయని భావించాలి. నిస్సహాయత నుండి మనస్తాపం కూడా కలిగి వుండవచ్చు. భౌతికంగా మానసికంగా కూడా విషం ప్రభావం చూపుతోంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అవాప :** | **అవాప** | అవాపతుః | అవాపుః | |
| | అవాపిథ | అవాపథుః | అవాప | |
| | అవాప | అవాపివ | అవాపిమ | * |

**శ్లో॥ ఫలైః ప్రసూనైర్విలసత్ప్రవాలై-ర్దలైర్విలోలైః స శుభాయితోఽపి ।**
**బిభర్తి హాలాహలమేవ మధ్యే - ఖలః ప్రకృత్యా ఖలు గూఢవృత్తిః ॥ 5-12**

**అ :** రాక్షసతరు వర్ణనమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ఫలైః ప్రసూనైః విలసత్ప్రవాలైః విలోలైః దలైః శుభాయితః అపి మధ్యే హాలాహలమ్ ఏవ బిభర్తి. ఖలః ప్రకృత్యా గూఢ-వృత్తిః ఖలు.

**ప్ర :** సః = ఆ చెట్టు, ఫలైః = పండ్లతో, ప్రసూనైః = పూలతో, విలసత్-ప్రవాలైః : విలసత్ = ప్రకాశిస్తున్న, ప్రవాలైః = చివురులతో (విలసన్తశ్చ తే ప్రవాళాః, తైః), విలోలైః = కదులు తున్న / ఊగుతున్న, దలైః = ఆకులతోనూ (దళం పర్ణం ఛదః పుమాన్-అమరకోశః -వనౌషధి-14), శుభాయితః (సన్) అపి = శుభునివలె ప్రవర్తిస్తున్నా (మంచివానివలె కనిపిస్తున్నా), మధ్యే = లోపల, హాలాహలమ్+ఏవ = కాలకూటవిషాన్నే, బిభర్తి = భరిస్తున్నాడు. (భృ భరణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఖలః = దుర్మార్గుడు, ప్రకృత్యా = స్వాభావికంగానే, గూఢవృత్తిః ఖలు = రహస్యప్రవర్తనగలవాడే గదా! (గూఢా వృత్తిః యస్య సః)

**తా ॥** ఆ రాక్షసవృక్షం పండ్లతో, పూలతో, చివురులతో కదులుతున్న ఆకులతో(సర్వాంగీణంగా) శుభస్వరూపంగా కనిపిస్తోంది. అయినా దాని మధ్యలో మాత్రం హాలాహలముంది. దుర్మార్గుడంతే. స్వాభావికంగానే తాను చేసే చేష్టలు రహస్యంగానే వుంటాయి.

**వి :** 1. పూలు పండ్లు చివురులు ఆకులు ఈనాడు కూడా శుభానికి సంకేతాలే. '**ఆకారసదృశప్రజ్ఞః**' '**నహ్యాకృతిః సుసదృశీం విజహాతి వృత్తిమ్**' అని కాళిదాసు అభిప్రాయ పడినా సర్వత్రా ఆ పరిస్థితి వుండదని. ఇక్కడ కవి భావన. ఆకారం శుభాయితమయినా మధ్యలో విషం. దానికి తగిన చేష్ట ఈ తరువులో కనిపిస్తున్నాయి. దుర్మార్గుడు ఎప్పుడు రహస్యంగానే చెడ్డపనులు చేస్తాడు గదా! అని కవి అభిప్రాయం.

మొదటి మూడు పాదాలలోని విశేషవిషయాన్ని నాలుగవపాదంలోని సామాన్య విషయంతో సమర్థించాడు కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః. |

*

**శ్లో॥ పతత్రిణాం పత్రఫలాశనానాం - వనేఽతిరమ్యే వసతాం సతాం చ ।**
**నిరాగసాం ద్రోహమహో! వ్యధాద్య-స్తముగ్రనామార్హచరిత్రమూహే ॥ 5-13**

**అ :** రాక్షసవృక్షానికి 'ఉగ్ర' నామవ్యవహారం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అతిరమ్యే వనే వసతాం పత్ర-ఫలాశనానాం నిరాగసాం పతత్రిణాం సతాం చ యః ద్రోహం వ్యధాత్ అహో! తమ్ ఉగ్రనామ+అర్హ-చరిత్రమ్ ఊహే.

**ప్ర :** అతిరమ్యే = చాలా అందమయిన, వనే = ఆ బృందావనంలో, వసతామ్ = నివసిస్తున్న, పత్ర-ఫల+అశనానామ్ = ఆకులూ, పండ్లు ఆహారంగా గలవారికి (పత్రాణి ఫలాని చ అశనం యేషాం తేషాం), నిరాగసామ్ = ఏ నేరమూ చేయని (నాస్తి ఆగః యేషు తేషాం), పతత్రిణామ్ = పక్షులకూ, సతాం చ = సజ్జనులకు కూడా, యః = ఎవడయితే, ద్రోహమ్ = అపకారాన్ని, వి+అధాత్ = చేశాడో! (వి+ధా ధారణ పోషణయోః - పరస్మైపది - లుఙ్ - (ప్ర.ఏ.), ఆహో! = ఆశ్చర్యం, తం (దైత్యమ్) = ఆ రాక్షసుణ్ణి, ఉగ్ర-నామ+అర్హ - చరితమ్ : ఉగ్ర =

ఉగ్రుడనే, నామ = పేరుకు, అర్హ = తగిన, చరిత్రమ్ = నడవడి గలవానినిగా (ఉగ్ర ఇతి నామ తస్య అర్హం చరిత్రం యస్య, తమ్), ఊహే = భావిస్తున్నాను. (ఊహ వితర్కే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** అందమైన ఆ బృందావనంలో నివసిస్తూ ఆకులూ, పండ్లు మాత్రమే ఆరగించే సాధువులకూ, ఏ నేరమూ చేయని పక్షులకూ, సజ్జనులకూ కూడా ద్రోహం చేస్తున్నాడు ఆ రాక్షసుడు. ఎంత వింత. అందుకే వాడికి ఉగ్రుడు అని పేరు పెడితే అది వాడి నడవడికి తగినట్లు ఉంటుందని భావిస్తున్నాను.

**వి :** 1. **వ్యధాత్ :**

| | | | |
|---|---|---|---|
| | **వ్యధాత్** | వ్యధాతామ్ | వ్యధుః |
| | వ్యధాః | వ్యధాతమ్ | వ్యధాత |
| | వ్యధామ్ | వ్యధావ | వ్యధామ. |
| **ఊహే :** | ఊహతే | ఊహేతే | ఊహన్తే |
| | ఊహసే | ఊహేథే | ఊహధ్వే |
| | **ఊహే** | ఊహావహే | ఊహామహే. |

*

**శ్లో॥ నగం తముత్పాట్య సమం సమాధికృ-చ్ఛ్రమాఖ్యవృక్షేణ స గోస్వరూపిణః ।**
**ఖలాంశ్చ తేనైవ జఘాన లీలయా - ప్రభోః క్రియైకాఽప్యురుకార్యసాధికా ॥5-14**

**అ :** కృష్ణుడు ఆ వృక్షాన్ని పెకలించి దానినే ఆయుధంగా ఉపయోగించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః తం నగమ్ సమాధికృచ్ఛ్రమా+ఆఖ్య-వృక్షేణ సమమ్ ఉత్పాట్య గో స్వరూపిణః ఖలాన్ చ తేన+ఏవ లీలయా జఘాన. ప్రభోః ఏకా అపి క్రియా ఉరుకార్యసాధికా.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, తమ్ = ఆ, నగమ్ = చెట్టును, సమాధి-కృత్-శ్రమ+ఆఖ్య-వృక్షేణ : సమాధి-కృత్ = ఏకాగ్రచిత్తులయిన మునులయొక్క, శ్రమ+ఆఖ్య = శ్రమ అను పేరుగల, వృక్షేణ = చెట్టుతో, ఉత్పాట్య = పెకలించి (ఉత్-పట-గతౌ - ణిచ్ - ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గో-స్వరూపిణః = గోరూపాన్ని ధరించిన (గవాం స్వరూపిణః), ఖలాన్-చ = దుర్మార్గులను కూడా, తేన+ఏవ = ఆ చెట్టుతోనే, లీలయా = తేలికగా, జఘాన = హింసించాడు. ప్రభోః = సమర్థునియొక్క, ఏకా+అపి-క్రియా = ఒకే ఒక్క పని అయినా, ఉరు-కార్య-సాధికా : ఉరు = ఎక్కువయిన, కార్య = పనులను, సాధికా = సాధించగలది.

**తా ॥** కృష్ణుడు తాపసుల శ్రమ వృక్షంతో పాటు ఆ రాక్షసవృక్షాన్ని పెకలించి దానితోనే గోరూపాన్ని ధరించిన దుర్మార్గులను సంహరించాడు. సమర్థుడు ఒక్క పని పూర్తిచేసినా ఎన్నో పనులు పూర్తవుతాయి.

**వి :** 1. సమాధికృచ్ఛ్రమవృక్షంతోపాటు రాక్షసవృక్షాన్ని కూడా పెకలించాడనటం సహోక్త్యలంకారం. “**సహోక్తిస్సహభావశ్చేద్భాసతే జనరంజనః**’ (కు.58)

2. **జఘాన :**

| | | |
|---|---|---|
| **జఘాన** | జఘ్నతుః | జఘ్నుః |
| జఘన్థ/జఘనిథ | జఘ్నథుః | జఘ్న |
| జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ. |

4. ఈ ‘వృక్షాసుర’ వృత్తాంతం భాగవతంలో కనిపించదు. కానీ మహాభారతతాత్పర్య నిర్ణయంలో కనిపిస్తుంది. శ్రీ వాదిరాజ తీర్థరు మహాభారతతాత్పర్యనిర్ణయానికి ‘**మహాభారతతాత్పర్యనిర్ణయభావప్రకాశిక**’ అనుపేర వ్యాఖ్యానాన్ని వ్రాసినవారు. ఆ మహాభారత తాత్పర్యనిర్ణయాన్ని అనుసరించి ఈ సంఘటనను కల్పించాడు. 13/44-46

శ్లో॥ ఇత్థం సురాసురగణైరవిచింత్య దివ్య - కర్మాణి గోకులగతేఽగణితోరుశక్తేః ।
కుర్వత్యజే వ్రజభువామభవద్వినాశ - ఉగ్రాభిధాసురతస్తరురూపతోఽలమ్ ॥

శ్లో॥ తద్గంధతో నృపశుముఖ్యసమస్తభూతా - న్యాపుర్ధృతిం బహులరోగనిపీడితాని ।
ధాతుర్వరాజ్జగదభావకృతైకబుద్ధి - ర్వధ్యో న కేనచిదసౌ తరురూపదైత్యః ॥
శ్లో॥ సంకర్షణేఽపి తదుదారవిషానువిష్టే - కృష్ణో నిజస్పర్శతస్తమపేతరోగమ్ ।
కృత్వా బభంజ విషవృక్షమముం బలేన - తస్యానుగైస్సహ తదాకృతిభిస్సమస్తైః ॥ *

**శ్లో॥ అహో! నిదాఘోత్థభయాదివేశో - బిభర్తి గఙ్గాం జలధౌ స శేతే ।**
**రమాపతిః పఙ్కజవిష్టరశ్చ - చతుర్ముఖస్తం విషహేత కోఽన్యః ॥ 5-15**

**అ :** మరల గ్రీష్మర్తువర్ణన - తాపం సహించలేని త్రిమూర్తుల పరిస్థితి. -ఉపేంద్రవజ్ర.

**అ :** అహో! ఈశః నిదాఘ+ఉత్థ భయాద్ - ఇవ గంగాం బిభర్తి. సః రమాపతిః జలధౌ శేతే. చతుర్ముఖః పంకజవిష్టరః చ. అన్యః కః తం విషహేత.

**ప్ర :** అహో! = ఆశ్చర్యం, ఈశః = శివుడు, నిదాఘ+ఉత్థ-భయాత్-ఇవ : నిదాఘ = గ్రీష్మం వలన, ఉత్థ = పుట్టిన, భయాద్-ఇవ = భయంవలననో అన్నట్లు, గంగామ్ = గంగను (తలపై), బిభర్తి = భరిస్తున్నాడు. (భృ భరణే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), సః = ఆ, రమాపతిః = విష్ణువు (రమాయాః పతిః), జలధౌ = పాలసముద్రంలో (జలం ధీయతే అస్మిన్ ఇతి జలధిః తస్మిన్), శేతే = పడుకొన్నాడు. (శీ-స్వప్నే-ఆత్మనేపది- లట్-ప్ర.ఏ.), చతుర్ముఖః = బ్రహ్మ (చత్వారి ముఖాని యస్య సః), పంకజ-విష్టరః-చ = పద్మాసనుడు కూడా (పంకజం విష్టరం యస్య సః), అన్యః = ఇతరుడు, కః = మరెవడు, తమ్ = ఆ గ్రీష్మాన్ని, విషహేత = సహింపగలడు? (వి-షహ మర్షణే-ఆత్మనేపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అహో! ఆ గ్రీష్మతాపంవలన కలిగిన భయంతో శివుడు తలపై గంగను మోస్తున్నాడు. లక్ష్మీవల్లభుడు పాలకడలిలోనే పవళించాడు. చతుర్ముఖుడు (బ్రహ్మ) తామరలోనే కూర్చుండి పోయాడు. ఇక ఇతరుడెవ్వడు ఆ తాపాన్ని భరించగలడు.

**వి :** 1. ఇక్కడ 'నిదాఘోత్థభయాదివ' వేసవితాపం వలననో అన్నట్లు అని కవి త్రిమూర్తుల ప్రవృత్తికి వేసవితాపాన్ని భరించలేకపోవటాన్ని - కారణం కానిదాన్ని - కారణంగా ఊహిస్తున్నాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలకారం. 'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా'

నిదాఘ తాపానికి త్రిమూర్తులు ఆయాతావులలో నిలవటానికి వాస్తవానికి ఏవిధమైన సంబంధమూ లేదు. అయినా సంబంధమున్నట్లు చెప్పటం వలన ఇది అతిశయోక్త్యలంకారం కూడా. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' (కు. 39)

| | | | |
|---|---|---|---|
| 2. **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః |
| **శేతే :** | **శేతే** | శయాతే | శేరతే |
| | శేషే | శయాథే | శేధ్వే |
| | శయే | శేవహే | శేమహే |
| **విషహేత:** | **విషహేత** | విషహేయాతామ్ | విషహేరన్ |
| | విషహేథాః | విషహేయాథామ్ | విషహేధ్వమ్ |
| | విషహేయ | విషహేవహి | విషహేమహి. |

తెలుగులో ఇటువంటి భావాలతో ఎన్నో చాటువులున్నాయి. లౌకికంగా ప్రజలు పడుతున్న బాధలను ఆ త్రిమూర్తులకు అన్వయించి అటువంటి బాధలనుండి తప్పించుకొనటానికి దేవతలు వేరు వేరు మార్గాలను ఎన్నుకొన్నారని చమత్కరించటం తెలుగు చాటు కవులకు అలవాటు. రెండు ఉదాహరణలు.

క. శివుడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం
డవిరళముగ శేషునిపైఁ
బవళించుట **నల్లి బాధ పడలేక** సుమీ.

ఆ. **చాఁకివానితోడ జగడాలు పడలేక**
సిరిగలాడు పట్టుచీరగట్టె
శివుడు తోలుగప్పె సీ యని మదిరోసి
భైరవుండు బట్టఁ బారవైచె. *

**శ్లో॥ తదాఽపి సిద్ధాశ్చతురగ్నిమధ్యే - ప్రహృష్టరోమావలయః స్మరన్తి ।**
**నిమీలితాక్షాః పరమం పుమాంసం - ఫలార్థినాం కిం న విషహ్యమస్తి ॥ 5-16**

**అ :** గ్రీష్మర్తువర్ణన - చతురగ్నిమధ్యంలో తపస్సాధన. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదా అపి సిద్ధాః నిమిలీత+అక్షాః ప్రహృష్టరోమ+ఆవలయః (సన్తః) చతుః+అగ్ని-మధ్యే పరమం పుమాంసం స్మరన్తి. ఫలార్థినాం విషహ్యం కిం న అస్తి.

**ప్ర :** తదా+అపి = ఆ గ్రీష్మవేళలో కూడా, సిద్ధాః = సిద్ధులు/తాపసులు, నిమీలిత+అక్షాః = కన్నులు మూసికొని (నిమీలితే అక్షిణీ యైః తే), ప్రహృష్ట-రోమ-ఆవలయః (సన్తః) : ప్రహృష్ట = పరమానందాన్ని పొంది నిక్కబొడుచుకొన్న, రోమ = వెంట్రుకలయొక్క, ఆవలయః (సన్తః) = సమూహం గలవారై (పులకించిన శరీరాలతో), (ప్రహృష్టానాం రోమ్ణామ్ ఆవలిః యేషు తే), చతుః+అగ్ని-మధ్యే = నాలుగు అగ్నుల మధ్యలో (చతుర్ణామ్ అగ్నీనాం మధ్యే), పరమమ్ = శ్రేష్ఠుడైన, పుమాంసమ్ = పురుషుని (పరాత్పరుని), స్మరన్తి = ధ్యానిస్తున్నారు. (స్మృ-ఆధ్యానే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఫల+అర్థినామ్ : ఫల = ఫలితాన్ని, అర్థినామ్ = కోరువారికి (ఫలమ్ అర్థయన్తే ఇతి ఫలార్థినః), విషహ్యమ్ = సహింపవలసినది, కిమ్ = ఏది, న+అస్తి = లేదు? (అస భువి అదాది పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ రీతిగా ఎండలు మండే వేళలో కూడా తాపసులు కళ్ళుమూసికొని శరీరమంతా ఆనందంతో పులకరించగా నాలుగు అగ్నుల మధ్యలో నిలిచి ఆ పురుషోత్తముని ధ్యానిస్తున్నారు. అవును మరి. ఫలితం కావాలంటే దేనినైనా సహించవలసిందే.

**వి :** 1. చతురగ్నులు - దక్షిణాగ్ని, గార్హపత్యం, అహవనీయం ఈ మూడు శ్రౌతాగ్నులు. నాలుగవది గృహ్యాగ్ని. మండిపడుతున్న సూర్యుని కూడా కలిపితే పంచాగ్ని మధ్యంలో నిలిచి ధ్యానిస్తున్నట్లే.

2. తాపసుల ధ్యానస్థితిని వివరించి-విశేషాంశాన్ని-ఫలితం కావాలంటే సహించ వలసినదే - సామాన్యాంశం అని సమర్థించినందువల్ల ఇది అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తి రర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః' (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **స్మరతి :** | **స్మరతి** | స్మరతః | స్మరన్తి |
| | స్మరసి | స్మరథః | స్మరథ |
| | స్మరామి | స్మరావః | స్మరామః |

| | | | |
|---|---|---|---|
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః. * |

**శ్లో॥ సుశీతలః కృష్ణపదాబ్జయుగ్మ-మితః స్పృశత్యుజ్జ్వలకాననాగ్నిమ్ ।**
**తతః సముత్థాపయతి స్మ వాయు-రయం స్వభావః ఖలు చఞ్చలానామ్ ॥ 5-17**

**అ :** గ్రీష్మర్తువర్ణన - వాయుదేవుని చాంచల్యాన్ని నిరూపించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** వాయుః సుశీతలః (సన్) ఇతః కృష్ణపద+అబ్జ-యుగ్మం స్పృశతి తతః ఉజ్జ్వల-కానన+అగ్నిం సముత్థాపయతి స్మ. అయం చంచలానాం స్వభావః ఖలు.

**ప్ర :** వాయుః = గాలి, సుశీతలః (సన్) = బాగా చల్లబడినవాడై, ఇతః = ఇటు, కృష్ణ-పద+అబ్జ-యుగ్మమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, పద+అబ్జ = పాదపద్మాలయొక్క, యుగ్మమ్ = జంటను. (అబ్జే ఇవ పదే తయోః యుగ్మమ్, కృష్ణస్య పదాబ్జయుగ్మమ్), స్పృశతి = తాకుతున్నాడు. (స్పృశ్ - సంస్పర్శనే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), తతః = అటు, ఉజ్జ్వల-కానన+అగ్నిమ్ : ఉజ్జ్వల = పైకి ఎగిసి పడుతున్న, కానన+అగ్నిమ్ = దావాగ్నిని (కాననే అగ్నిః, ఉజ్జ్వలశ్చ అసౌ కాననాగ్నిః, తమ్), సమ్-ఉత్థాపయతి = పైకి లేపుతున్నాడు (సమ్-ఉత్-స్థా - గతి నివృత్తౌ-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), అయమ్ = ఇది, చంచలానామ్= స్థిరత్వంలేని వారియొక్క, స్వభావః ఖలు = స్వభావమే గదా! (పుట్టుకతో వచ్చిన లక్షణమే గదా!)

**తా ॥** వాయువు ఇటు కృష్ణుని పాదాల దగ్గర చల్లగా వుండి తాకుతూ, అటు వనాగ్ని దగ్గర దానిని ఎగిసిపడేట్లు పైకి లేపుతున్నాడు. స్థిరత్వంలేనివాళ్ళ స్వభావమిలాగే వుంటుంది గదా!

**వి :** 1. '**రూపరహితస్పర్శవాన్ వాయుః**' అన్నది తార్కికసమ్మతమైన వాయులక్షణం. వాయువుకు స్పర్శ మాత్రమే వుంటుంది. కృష్ణుడు పరాత్పరుడు కాబట్టి అక్కడ శీతస్పర్శను కొని తెచ్చుకొన్నాడు. '**భీషోస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ. మృత్యుర్ధావతి పంచమః**' (తైత్తిరీయోపనిషత్తు - 2/8) ఆయనంటే భయం కదా! మరొక కారణం విష్ణుపాదాలనుండి గంగ పుట్టింది. ఆ కారణంగా (శీతస్పర్శ జలలక్షణం) ఆ పాదాల దగ్గర చల్లదనం ఎప్పుడూ ఉంటుంది. ఆ పాదాలను తాకినందువల్ల గాలి కూడా చల్లగా వీచింది.

ఇటు అగ్నిని సమీపించినపుడు - అగ్నిగుణం వెచ్చదనం (ఉష్ణస్పర్శ) కాబట్టి గాలికి కూడా ఆ లక్షణమే సంక్రమించింది. అందువలన ఇక్కడ చాంచల్యమంటే సాంక్రామిక లక్షణ ముండటమే కానీ బుద్ధిలోని వైపరీత్యం కాదు.

పై మూడుపాదాలలో వర్ణించిన వాయుస్వభావాన్ని నాలుగవపాదంలోని సామాన్య విషయంతో సమర్థించినందువల్ల ఇది అర్థాంతరన్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **స్పృశతి :** | **స్పృశతి** | స్పృశతః | స్పృశన్తి |
| | స్పృశసి | స్పృశథః | స్పృశథ |
| | స్పృశామి | స్పృశావః | స్పృశామః |

| | | | |
|---|---|---|---|
| **సముత్థాపయతి:** | **సముత్థాపయతి** | సముత్థాపయతః | సముత్థాపయంతి |
| | సముత్థాపయసి | సముత్థాపయథః | సముత్థాపయథ |
| | సముత్థాపయామి | సముత్థాపయావః | సముత్థాపయామః. * |

**శ్లో॥ ప్రియాస్తనాఖ్యాన్ పరిరభ్య కుమ్భాన్ – సుధాం తదీయాధరజాం పిబన్తః ।
విన్దన్త్యహో! నాగరికా న తాపం – న వా పిపాసాం గిరికుఞ్జవాసాః ॥ 5–18**

**అ :** గ్రీష్మర్తువర్ణన. వేసవివిడిదిలో నాగరికప్రవృత్తి. –ఉపేంద్రవజ్ర.

**అ :** గిరి కుంజ వాసాః నాగరికాః ప్రియా స్తన+ఆఖ్యాన్ కుంభాన్ పరిరభ్య తదీయ+ అధర జాం సుధాం పిబన్తః తాపం న విందన్తి పిపాసాం వా న విందన్తి. అహో!

**ప్ర :** గిరి–కుంజ–వాసాః: గిరి = కొండలమీది, కుంజ = పొదరిండ్లలో (నికుంజ కుంజౌ వా క్లీబే లతాదిపిహితోదరే– అమరకోశః–శైల–8), వాసాః = విడిదిగల (గిరేః కుంజేషు వసన్తి ఇతి), నాగరికాః = నగరజనులు (నగరే భవాః), ప్రియా+స్తన+ఆఖ్యాన్ = ప్రియురాండ్ర స్తనాలు అనెడి (ప్రియాయాః స్తనౌ ఏవ ఆఖ్యా యేషాం తాన్), కుంభాన్ = కుండలను, పరిరభ్య = కౌగిలించుకొని (పరి–రభ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తదీయ+ అధర–జామ్ : తదీయ = వారియొక్క, అధర–జామ్ = పెదవులపై పుట్టిన (తదీయే అధరే జాయతే ఇతి, తామ్), సుధామ్ = అమృతాన్ని, పిబన్తః = త్రాగుతూ (పా ధాతువుపై శతృ ప్రత్యయం), తాపమ్ = వేడిని, న విన్దన్తి = పొందుట లేదు. పిపాసాం వా = దప్పికను అయినా న–విందన్తి = పొందుట లేదు. (విద్–ప్రాప్తౌ పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** నాగరికులు వేసవితాపాన్ని భరించలేక కొండల మీదనున్న పొదరిండ్లను ఆశ్ర–యించారు. అక్కడ ప్రియురాళ్ల స్తనాలు అనే కుండలను కౌగిలించుకొని, వారి అధరాలనుండి పుట్టిన సుధను ఆస్వాదించటంవలన వారికి తాపంకానీ, దప్పికకానీ కలగటం లేదు.

**వి :** 1. సుధాపానం ఆకలిదప్పులను లేకుండా చేస్తుంది కాబట్టి వారికి దప్పిక లేదు. కుచకుంభాలను కౌగిలించుకొన్నందువల్ల తాపమూ లేదు.

శ్లో॥ కూపోదకం వటచ్ఛాయా తాంబూలం తరుణీస్తనౌ ।
శీతకాలే భవేదుష్ణముష్ణకాలే తు శీతలమ్ ॥ – చాణక్యనీతిశాస్త్రమ్.

| | | | |
|---|---|---|---|
| 2. **విన్దన్తి :** | విన్దతి | విన్దతః | **విన్దన్తి** |
| | విన్దసి | విన్దథః | విన్దథ |
| | విన్దామి | విన్దావః | విన్దామః |

విద్ ధాతువు 1. దివాది గణంలోనూ, 2. అదాది గణంలోనూ 3. రుధాది గణంలోనూ 4. తుదాది గణంలోనూ (శ్యన్–లుక్–శ్నమ్–శ క్రమంగా వికరణ ప్రత్యయాలు) వుంటుంది. 1. విద్యతే (ఉనికి) 2. వేత్తి (జ్ఞానం) 3. విన్తే (విచారణ), 4. విన్దతే, విన్దతి (ప్రాప్తి).

శ్లో॥ సత్తాయాం విద్యతే జ్ఞానే వేత్తి విన్తే విచారణే ।
విన్దతే విన్దతి (ప్రాప్తౌ) శ్యన్లుక్శ్నమ్ శేష్విదం క్రమాత్ ॥ *

**శ్లో॥ జహార కృష్ణస్తపనోత్థతాపం – ముఖేన్దునా దృష్టిపథంగతేన ।
సుధార్ద్రవీక్షామయవృష్టిభిశ్చ – వ్రజౌకసాం కాననవాసినాం చ ॥ 5–19**

**అ :** కృష్ణ ముఖసందర్శనంతో గోపాలుర తాపోపశమనం. –ఉపేంద్రవజ్ర.

**అ :** కృష్ణః వ్రజ+ఓకసాం కానన–వాసినాం చ తపన+ఉత్థ–తాపం దృష్టిపథంగతేన ముఖేందునా సుధార్ద్ర వీక్షామయ–వృష్టిభిః చ జహార.

ప్ర : కృష్ణః = కృష్ణుడు, వ్రజ+ఓకసామ్ = గోకులవాసులకు (వ్రజం ఓకః యేషాం తేషామ్), కానన–వాసినామ్–చ = బృందావనవాసులకు కూడా (కాననం వాసః యేషాం తేషామ్), తపన+ఉత్థ–తాపమ్ : తపన = సూర్యునివలన (మార్తాండస్తపనో వికర్తన ఇనః–హలాయుధకోశః–35), ఉత్థ = కలిగిన, తాపమ్ = సంతాపాన్ని (తపనేన ఉత్థః చ అసౌ తాపః – తమ్), దృష్టి–పథంగతేన = చూపులకెదురైన, ముఖ+ఇందునా = ముఖచంద్రునిచే (ముఖమ్ ఇన్దురివ తేన), సుధా+ఆర్ద్ర–వీక్షామయ–వృష్టిభిః చ : సుధా = అమృతంతో, ఆర్ద్ర = తడిసిన, వీక్షామయ = చూపులనెడి, వృష్టిభిః చ = కురియుటలచేతను (సుధయా ఆర్ద్రా, సా చ అసౌ వీక్షా చ, వీక్షా ఏవ వీక్షామయా తాశ్చ తా వృష్టయః, తాభిః), జహార = అపహరించాడు.

**తా ॥** కృష్ణుడు సూర్యునివలన గోకులవాసులకూ, బృందావనవాసులకూ కలిగిన తాపాన్ని తన ముఖచంద్రుని దర్శనంచేత, సుధామయాలయిన తన చూపులవానలచేత అంతరింప జేశాడు.

**వి :** 1. ముఖేందునా – అనేచోట ఉపమాలంకారం. ముఖమ్ ఇన్దురివ – చంద్రుని వంటి ముఖం – సుధావృష్టులు సుధలనే వృష్టులన్నచోట రూపకాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. |

*

**శ్లో॥ నీలాం కుమ్భకసమ్భవామలభత స్వీయాం స జిత్వా వృషాన్**
**శౌరిః సప్త స చాపి నీలమణిభిర్నీలాం కరే తత్పురీమ్ ।**
**ధాతూన్ సప్త నిగృహ్య కుమ్భకబలాచ్ఛృంగప్రహారైర్ద్రవ–**
**త్కుమ్భాభాఙ్గయుజోఽపరేఽపి బహవో నీలాం ముఖస్య ప్రభామ్ ॥ 5–20**

**అ :** కృష్ణుడు నీలను పెండ్లియాడుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** సః శౌరిః సప్త వృషాన్ జిత్వా కుంభక–సంభవాం స్వీయాం నీలామ్ అలభత. సః చ సప్త ధాతూన్ కుంబక బలాత్ నిగృహ్య నీల మణిభిః నీలాం తత్ పురీం కరే అలభత. అపరే బహవః శృంగ–ప్రహారైః ద్రవత్ కుంభ+ఆభా+అంగయుజః అపి నీలాం ముఖస్య ప్రభామ్ (అలభన్త).

**ప్ర :** సః శౌరిః = ఆ కృష్ణుడు (శూరస్య అపత్యం పుమాన్), సప్త = ఏడు, వృషాన్ = ఎద్దులను (ఉక్షానడ్వాన్ బలీవర్దః కకుద్మాన్ వృషభో వృషః – హలాయుధకోశః – 263), జిత్వా = బంధించి, కుంభక–సంభవామ్ = కుంభకగోపుని కూతురిని, అలభత = పొందెను (లభ్–ప్రాప్తౌ ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.), సః చ = ఆ కుంభకుడును, సప్త–ధాతూన్ = ఏడు ధాతువులనూ (త్వక్ – చర్మ – మాంస – రుధిర – మేదో (దస్సు) – మజ్జా – అస్థి), కుంభక–బలాత్ = కుంభకమనే యోగబలంవల్ల, నిగృహ్య = బంధించి, నీల–మణిభిః = నీలమణులతో (నీలాశ్చ తే మణయః, తైః) నీలామ్ = నల్లనైన, తత్–పురీమ్ = ఆ కృష్ణుని నగరాన్ని (వైకుంఠాన్ని), కరే = చేతినున్నట్లుగా, అలభత = పొందెను. (తెలుగులో అరచేతిలో వైకుంఠాన్ని చూపటమన్న సామెత ఉంది.) అపరే = ఇతరులయిన, బహవః = చాలామంది (రాజులు), శృంగ–ప్రహారైః = కొమ్ముల యొక్క ప్రహారైః = దెబ్బలతో, ద్రవత్–కుంభ+ఆభా+అంగ–యుజః : ద్రవత్ = కారుతున్న, కుంభ+ఆభా = కుండలవంటి, అంగ = శరీరావయవాలతో, యుజః = కూడినవారై (ద్రవంతశ్చ తే కుంభాః, తేషాం ఆభా ఇవ ఆభా యేషాం, తైః అంగైః యుజః), నీలామ్ = నల్లనైన, ముఖస్య = ముఖంయొక్క, ప్రభామ్ = కాంతిని, (అలభన్త) = పొందారు.

**తా ॥** కృష్ణుడు ఏడు ఎద్దులను బంధించి కుంభకుని కుమార్తె అయిన నీలను పొందాడు. కుంభకుడు కూడా కుంభకయోగబలంతో సప్తధాతువులనూ బంధించి నీలమణులతో, నీలవర్ణంతో భాసించే వైకుంఠాన్ని పొందాడు.

ఇతర రాజులు కూడా చాలామంది ఎద్దుల కొమ్ముల దెబ్బలు తిని కారుతున్న కడవల్లాగా కనిపిస్తూ నల్లని ముఖకాంతిని పొందారు.

**వి :** 1. ప్రాణాయామక్రియలు **రేచకం, పూరకం, కుంభకం** అని మూడుస్థితులు.

సీ. హృదయగత ప్రాణుఁడేతెంచు నాసికా – వివరంబువలనను వెలికి ద్వాద
శాంగుళ పర్యంతమది **రేచ**కంబగు – నరుదెంచునంతలో నర్ధసమయ
మచ్చోటలయమగునది **బహిఃకుంభకం** – బారీతి లోపలి కరుగునదియె
**పూరకం** బనఁనొప్పుఁ బూరించు నంతలో – నర్ధకాలంబు దానడఁగు నచట.

తే. నదియె **యాంతరకుంభకంబన**ఁగఁదనరుఁ–బొసఁగ నిబ్బంగి రేచకపూరకాది
గతులచే విహరించు నీగాలి వానిఁ – గలసి మదితోడ హంసంబు మెలఁగునపుడు.

తే. పూరకమున హకారంబు పొందు పఱచి – కుంభకంబున బిందువు గూర్చి యంత
రేచకంబున స కారంబుఁజూచి వానిఁ – దెలియు తెలివియె నేనని తెలియవలయు.

– సీతారామాంజనేయసంవాదము. 1/176,177

2. ఇక్కడ **తుల్యయోగితాలంకారం** మనోరంజకం. ఏడు ఎద్దులను బంధించి కృష్ణుడు నీలను పొందటం, సప్తధాతువులను నిగ్రహించి కుంభకబలంతో నీలతండ్రి వైకుంఠాన్ని కరతలగతం చేసికోవటం (పొందటం), రాజులు కొమ్ముల దెబ్బలు తిని ముఖప్రభలను నల్లబరచుకోవటం – ఈ మూడూ ప్రకృతాంశాలే. ఈ మూడింటికీ (అలభత) అన్న ఒకే ధర్మం అన్వయిస్తుంది కాబట్టి తుల్యయోగితాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **అలభత :** | **అలభత** | అలభేతామ్ | అలభన్త |
| | అలభథాః | అలభేథామ్ | అలభధ్వమ్ |
| | అలభే | అలభావహి | అలభామహి. |

*

**శ్లో॥ అథాపరో రాసభవేషధారీ – వనం సమాక్రమ్య ముకున్దయోగ్యమ్ ।**
**జఘాన జన్తూన్ బత తాదృశోఽసౌ – ఖరః ప్రకృత్యేతి మమ ప్రతర్కః ॥ 5–21**

**అ :** రాసభవేషధారి అయిన రాక్షసుని సంహరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అథ అపరః రాసభ–వేష–ధారీ (సన్) ముకుంద–యోగ్యం వనం సమాక్రమ్య జంతూన్ జఘాన బత. తాదృశః అసౌ ప్రకృత్యా ఏవ ఖరః ఇతి మమ ప్రతర్కః

**ప్ర :** అథ = ఆ తరువాత, అపరః = మరొక (రాక్షసుడు), రాసభ–వేషధారీ (సన్) : రాసభ = గాడిదయొక్క, వేషధారీ (సన్) = రూపాన్ని ధరించినవాడై (వేషం ధారయత ఇతి), ముకుంద – యోగ్యమ్ : ముకుంద = కృష్ణునకు, యోగ్యమ్ = తగినట్టి (ముకుందాయ యోగ్యమ్), వనమ్ = అడవిని, సమ్–ఆ–క్రమ్య = పూర్తిగా ఆక్రమించి (సమ్+ఆ+క్రము ధాతువుపై ల్యప్ ప్రత్యయం), జంతూన్ = పశువులను, జఘాన = చంపాడు (హన హింసాగత్యోః పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తాదృశః = అటువంటి, అసౌ = ఆ రాక్షసుడు, ప్రకృత్యా = స్వాభావికంగానే, ఖరః = గాడిద, ఇతి = అని, మమ = నా యొక్క, ప్రతర్కః = ఊహ.

**తా ॥** ఆ తరువాత మరొక రాక్షసుడు గాడిదరూపాన్ని ధరించి కృష్ణునకు తగిన ఆ బృందావనాన్ని పూర్తిగా ఆక్రమించుకొని జంతువులను సంహరించాడు. అటువంటి ఆ రాక్షసుడు స్వభావంతోనే గాడిద అయివుంటాడని నా ఊహ.

**వి :** 1. నా ఊహ అని స్పష్టంగానే కవి ప్రతిపాదిస్తున్నందువల్ల ఇది ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **జఘాన : జఘాన** | జఘ్నతుః | జఘ్నుః | |
| జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న | |
| జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ. | * |

**శ్లో॥ క్షుధాఽతిలోలాః కిల గోపబాలాః - సహాచ్యుతేనాభియయుర్వనం తత్ ।**
**తథాహి దుష్టస్య వినాశతోఽన్యత్ - సతాం మనస్తృప్తికరం కిమస్తి ॥ 5-22**

**అ :** క్షుధా+అతిలోలాః గోపబాలాః అచ్యుతేన సహ తత్ వనమ్ అభియయుః తథాహి. దుష్టస్య వినాశతః అన్యత్ సతాం మనస్తృప్తికరం కిమ్ అస్తి. -ఉపేంద్రవజ్ర.

**ప్ర :** క్షుధాఽతిలోలాః : క్షుధా = ఆకలితో, అతిలోలాః = మిక్కిలిగా తినగోరుతున్న వారైనను (క్షుధయా అతిలోలాః), గోపబాలాః = గోపాలబాలురు (గోపాశ్చ తే బాలాః), అచ్యుతేన సహ = కృష్ణునితో కూడి, తత్+వనమ్ = ఆ రాసభమున్న చోటికి, అభియయుః = బయలుదేరిరి (అభి+యా ప్రాపణే పరస్మైపది లిట్ - ప్ర.ఏ.), తథా హి = అది యుక్తమే, దుష్టస్య = చెడ్డవారియొక్క, వినాశతః = వినాశనం కన్న, అన్యత్ = వేరొకటి, సతామ్ = సజ్జనులకు, మనః+తృప్తికరమ్ : మనః = మనస్సునకు, తృప్తికరమ్ = తృప్తిని కలిగించునది, కిమ్ అస్తి = ఏమున్నది? (అస భువి పరస్మైపది లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోపబాలురు ఎంతో ఆకలిమీదున్నా అచ్యుతునితో కలిసి ఆ రాసభమున్న వనానికే బయలుదేరారు. దుర్మార్గుల వినాశనం కన్న సత్పురుషులకు తృప్తికరమైనది ఏమున్నది?

**వి :** 1. గోపబాలురు ఆకలిమీదున్నా కృష్ణునితో బయలుదేరటం విశేషాంశం. దుష్టశిక్షణ కన్న మనస్తృప్తి కరవిషయమేమున్నదనటం సామాన్యాంశం. ఈ రెండింటి కలయిక వల్ల ఇది అర్థాంతరన్యాసాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అభియయుః :** | అభియయౌ | అభియయతుః | **అభియయుః** | |
| | అభియయిథ/అభియయాథ | అభియయథుః | అభియయ | |
| | అభియయౌ | అభియయివ | అభియయిమ. | * |

**శ్లో॥ అథాససాదాసురవర్గవర్యో - బలశ్చ తం ప్రత్యగమద్బలాఢ్యః ।**
**నిజధ్వజక్ష్మాజసమాజరాజ - ద్వనం తదాక్రాన్తమివేర్ష్యమాణః ॥ 5-23**

**అ :** బలరాముడు ఖరరూపంతో వున్న ధేనుకాసురుని ఎదిరించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథ అసుర వర్గ వర్యః ఆససాద. బల+ఆఢ్యః బలశ్చ తం నిజ ధ్వజ క్ష్మాజ సమాజ-రాజద్వనం తదాక్రాంతమ్ ఈర్ష్యమాణః ఇవ తం ప్రత్యగమత్.

**ప్ర :** అథ = ఆ పై, అసుర-వర్గ-వర్యః = రాక్షసగణశ్రేష్ఠుడైన ఆ ధేనుకుడు (అసురాణాం వర్గః, తస్మిన్ వర్యః), ఆససాద = (శ్రీకృష్ణుని) తాకెను. బల+ఆఢ్యః = బలసంపన్నుడైన (బలేన ఆఢ్యః), బలః చ = బలరాముడు కూడా, నిజ... వనమ్ : నిజ = తనయొక్క, ధ్వజ = ధ్వజమయిన, క్ష్మాజ = (తాళ) వృక్షాలయొక్క, సమాజ = సమూహంతో, రాజత్ = శోభిస్తున్న, వనమ్ = (తాళ) వనాన్ని, తద్+ఆక్రాంతమ్ = ఆ రాక్షసునిచేత ఆక్రమింపబడిన దానిని గూర్చి, ఈర్ష్యమాణః+ఇవ = ఈర్ష్యపడుతున్నట్లు, ప్రత్యగమత్ = ఎదురు వెళ్ళాడు. (ప్రతి+గమ్ గతౌ పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఆ వనానికి వెళ్ళగానే ధేనుకాసురుడు ఎదిరించాడు. అయితే బలరాముడు ఆ రాక్షసునిపై దాడిచేశాడు. కారణం? తన ధ్వజమయిన తాళపత్రవనాన్ని ఆ ధేనుకాసురుడు ఆక్రమించాడన్న ఈర్ష్య.

**వి :** 1. శూరులకు తల ఎంత ముఖ్యమో ధ్వజం కూడా అంతే ముఖ్యం. దానిని ధేనుకాసురుడు ఆక్రమించటం బలరామునకు పరాభవం. అందుకే తాను ఎదురునిలవ వలసివచ్చింది. అయితే కవి '**ఈర్ష్యమాణ ఇవ**' అని కారణాన్ని ఉత్ప్రేక్షించాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం. 'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా'. (కు. 32)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆససాద :** | **ఆససాద** | ఆసేదతుః | ఆసేదుః | |
| | ఆసేదిథ/ఆససత్థ | ఆసేదథుః | ఆసేద | |
| | ఆససాద | ఆసేదివ | ఆసేదిమ. | * |

**శ్లో॥ స ధేనుకస్తం నిజపార్ష్ణిపద్భ్యాం - ప్రతాడయన్ గాఢమసహ్యసత్త్వః ।**
**ప్రగృహ్య తావత్క్షిపతో బలస్య - ఖలః సహాయోఽభవదస్తమాయః ॥ 5-24**

**అ :** ధేనుకాసుర బలరాముల పోరాటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అసహ్య-సత్త్వః అస్త-మాయః ఖలః సః ధేనుకః నిజ-పార్ష్ణి-పద్భ్యామ్ తం ప్రతాడయన్ తౌ గాఢం ప్రగృహ్య ఉత్క్షిపతః బలస్య సహాయః అభవత్.

**ప్ర :** అసహ్యసత్త్వః : అసహ్య = భరింపరాని, సత్త్వః = శక్తిగలవాడును (ప్రకృతి గుణే సత్తాయాం స్థామని భూతే చ సత్త్వంస్యాత్ - హలాయుధకోశః - 868) (అసహ్యం సత్త్వం యస్య సః), అస్త-మాయః : అస్త = నశించిన, మాయః = మాయగలవాడును (అస్తా మాయా యస్య సః), ఖలః = దుర్మార్గుడును అయిన, సః - ధేనుకః = ఆ ధేనుకాసురుడు, నిజ-పార్ష్ణి-పద్భ్యామ్ : నిజ = తనయొక్క, పార్ష్ణి = మడమలను కేంద్రీకరించి (పార్ష్ణిరున్మత్తనార్యాం స్త్రీపాదగ్రంథేరధోఽపి చ - వైజయన్తీ - నానాలింగ - 49), పద్భ్యామ్ = కాళ్ళతో (నిజాభ్యాం పార్ష్ణి పద్భ్యామ్), తమ్ = ఆ బలరాముని, ప్రతాడయన్ = కొడుతూ, తౌ (పాదౌ) = ఆ కాళ్ళను, గాఢమ్ = గట్టిగా, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉత్క్షిపతః = పైకి ఎగురవేస్తున్న, బలస్య = బలరామునికి, సహాయః = సహకరించువాడుగా, అభవత్ = అయ్యెను. (భూ సత్తాయామ్ భ్వాది-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ధేనుకుడు ఇతరులు సహింపజాలని వాడు. మారు రూపంతో వచ్చినందువలన మాయలు నశించినవాడు. దుర్మార్గుడు. తన కాలిమడమలతో బలరాముని కొట్టబోయాడు. అయితే ధేనుకుని కాళ్ళు గట్టిగా పట్టుకొని ఎగురవేయదలచుకొన్న బలరాముడికి ఆ ధేనుక చర్య సహాయకారి అయింది.

**వి :** 1. ధేనుకుడి కాళ్ళుపట్టుకొని విసిరివేయదలచుకొన్న బలరామునికి ఆ ధేనుకుడే కాలితో కొట్టబోయి సహకరించట మిక్కడ విశేషం. అదే ప్రహర్షణాలంకారం. '**ఉత్కంఠితార్థసంసిద్ధిః. వినా యత్నం ప్రహర్షణమ్**' (కు. 129) మన ప్రయత్నం లేకుండానే మనం కోరినది జరగటం ప్రహర్షణం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అభవత్ :** | **అభవత్** | అభవతామ్ | అభవన్ | |
| | అభవః | అభవతమ్ | అభవత | |
| | అభవమ్ | అభవావ | అభవామ. | * |

**శ్లో॥ ఉత్క్షిప్య తం తాలమహీరుహాగ్రే - సమ్ప్రేషయామాస సతాం విపక్షమ్ ।**
**విష్వక్ఫలాలమ్బిని పాదపాగ్రే - ధృత్వోపలం బాల ఇవాత్తలీలః ॥ 5-25**

**అ :** బలరాముడు ధేనుకాసురుని తాటిచెట్టుపైకి విసురుట. -ఇంద్రవజ్ర.

**అ :** (బలరామః) సతాం విపక్షం తమ్ ఉత్క్షిప్య తాళ-మహీరుహ+అగ్రే విష్వక్ ఫల+ఆలంబిని (సతి) పాదప+అగ్రే ఉపలం ధృత్వా ఆత్తలీలః బాలః ఇవ సంప్రేషయామాస.

**ప్ర :** (బలరామః) = బలరాముడు, సతామ్ = సజ్జనులకు, విపక్షమ్ = శత్రువయిన, తమ్ = ఆ ధేనుకాసురుని, ఉత్క్షిప్య = పైకెత్తి (ఉత్ - క్షిప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తాళ - మహీరుహ + అగ్రే : తాళ-మహీరుహ = తాటిచెట్టుయొక్క, అగ్రే = పైకి (తాళ ఇతి మహీరుహః, తస్య అగ్రేః, తస్మిన్), విష్వక్ఫల-ఆలంబిని : విష్వక్ = అంతటా (అవ్యయం) (పరితః సర్వతో విష్వక్ - హలాయుధకోశః - 874), ఫల = పండ్లచేత, ఆలంబిని = జారుతున్న (విష్వక్ ఫలైః ఆలంబత ఇతి తస్మిన్), పాదప+అగ్రే = చెట్టుమొదలు దగ్గర (పాదపస్య అగ్రః, తస్మిన్), ఉపలమ్ = ఱాతిని, ధృత్వా = చేతబట్టి, ఆత్త-లీలః = ఆటలాడుకొనే (ఆత్తా లీలా యేన సః), (లీలా క్రియా విలాసశ్చ-వైజయన్తీ-స్త్రీలింగ-33), బాల - ఇవ = బాలుని వలె, సంప్రేషయామాస = విసిరెను. (సమ్-ప్రేష్ గతౌ-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సజ్జన శత్రువయిన ఆ ధేనుకాసురుణ్ణి (అలా కాళ్ళు పట్టుకొని బలరాముడు) తాటిచెట్టు మీదకు విసిరివేశాడు. అది ఎలా వున్నదంటే - ఒక బాలుడు రాయి తీసికొని పండ్లు బాగా క్రిందకు జారుతున్న తాటి చెట్టు మీదకు ఆటగా విసిరినట్టుంది.

**వి :** 1. తాటిచెట్టుకు తలదగ్గర చుట్టూ గెలలు వచ్చి క్రిందకు దిగజారుతుంటాయి. ఱాయి తీసికొడితే రాలేవికావు అవి. ఱాయి మాత్రమే క్రిందపడుతుంది. ఇక్కడ కూడా ధేనుకాసురుణ్ణి పైకి తాటిపండ్లమీదకు విసిరినా పండ్లు రాలవు తానే క్రిందపడతాడు. ఇక్కడ జరగబోయే దదే. పైకి విసరటం ఆట మాత్రమే. అందుకే 'బాల ఇవ' అని పోలిక. ఆ పోలికయే ఉపమాలంకారం.

2. **సంప్రేషయామాస :**

| | | |
|---|---|---|
| సంప్రేషయామాస | సంప్రేషయామాసతుః | సంప్రేషయామాసుః |
| సంప్రేషయామాసిథ | సంప్రేషయామాసథుః | సంప్రేషయామాస |
| సంప్రేషయామాస | సంప్రేషయామాసివ | సంప్రేషయామాసిమ. |

*

**శ్లో॥ వ్యసురథ నిపతన్ స స్వాఙ్ఘ్రిపానేవ కాంశ్చి-**
**ద్గురుతమతనురుచ్చైః పాతయామాస దైత్యః ।**
**హరిపదవిముఖానాం పోషణస్యోచితం తే**
**ఫలమలభిషతాలం తైస్సహేత్యస్మదూహః ॥ 5-26**

**అ :** తాటిచెట్లతో పాటు ధేనుకాసురపతనం. -మాలిని.

**అ :** అథ గురుతమ-తనుః వ్యసుః సః దైత్యం నిపతన్ కాంశ్చిత్ స్వ+అంఘ్రిపాన్ ఏవ ఉచ్చైః పాతయామాస. తే హరి-పద-విముఖానాం పోషణస్య ఉచితం ఫలం తైః సహ అలమ్ అలభిషత ఇతి అస్మత్+ఊహః.

**ప్ర :** అథ = ఆ తరువాత, గురుతమ - తనుః : గురు తమ = మరీ పెద్దదయిన, తనుః = శరీరం గలవాడును (గురుతమశ్చ అసౌ తనుః యస్య సః) (ఉత్తమత్వనిర్ణయంలో తమస్ ప్రత్యయం '**అతిశాయనే తమబిష్ఠనౌ**' (అష్టాధ్యాయి 5-3-55), వి+అసుః = మరణించిన వాడును అయిన (విగతాః అసవః యస్మాత్ సః), సః దైత్యః = ఆ రాక్షసుడు, నిపతన్ = నేలగూలుతూ (ని-పత్ ధాతువుపై శతృ ప్రత్యయం) ఇక్కడ పతనంలో రాక్షసుడికి కర్తృత్వం నైమిత్తికమే. ఱాయి పడినట్లే తానూ పడుతున్నాడు. భూమ్యాకర్షణశక్తిచే లాగబడటం మాత్రమే), కాంశ్చిత్ = కొన్నింటిని, స్వ+అంఘ్రి-పాన్ ఏవ = తన చెట్లనే (అంఘ్రిభిః పిబన్తి ఇతి అంఘ్రిపాః-తాన్-

పాదపం లాగానే), ఉచ్చైః = పెద్దగా, పాతయామాస = పడగొట్టెను. తే = ఆ చెట్లు, హరి – పద – విముఖానామ్ : హరి = విష్ణువుయొక్క, పాద = చరణాలపై, విముఖానామ్ = అనుకూలతలేని వారి యొక్క, (హరిపద – ఆకాశంపై (వియద్విష్ణుపదం వా తు–అమరకోశ – వ్యోమ – 2) లక్షణచే ఆకాశగాములయిన దేవతలతో విముఖానామ్ – ప్రతికూలతగలవారియొక్క), పోషణస్య = పోషణకు, ఉచితమ్ = తగిన, ఫలమ్ = ఫలితం, తైః సహ = వాటితో పాటుగా, అలమ్ = తగినంతగా, అలభిషత = పొందినవి. (లభ్–ప్రాప్తౌ ఆత్మనేపది–లుఙ్–ప్ర.బ.), ఇతి = అని, అస్మత్+ఊహః = మా ఆలోచన.

**తా ॥** (బలరాముడు పైకి విసరగా) ఆ రాక్షసుడు ప్రాణాలు కోల్పోయి ఆ పెద్దశరీరంతో నేల గూలుతూ తనతో పాటు తన చెట్లను (తాటిచెట్లను) కూడా పడగొట్టాడు. హరిచరణాలపై ద్వేషం గలవారిని పోషించినందుకు అవి తగిన ఫలితాన్నే పొందాయని మా తలపు.

**వి :** 1. సత్ఫలాలు సహచరులకు ఒకచో అందకపోవచ్చు గానీ దుష్ఫలితాలు మాత్రం సహచరులనూ బాధిస్తాయి. అందుకే తనతో పాటు తన తాటిచెట్లు కూడా కూలిపోయాయి. ఇది చక్కని సహభావం. అందుకే **సహోక్త్యలంకారం.**

2. పోతన ఈ భావాన్ని విపులీకరించి వర్ణించాడు క్రియాస్వభావోక్తి లాగా.

'బలభద్రుండు రౌద్రాకారంబున గర్దభాసురు పదంబులు నాలుగు నొక్కనేలనంటంబట్టి, బెట్టు దట్టించి, త్రిప్పి, విగతజీవుంజేసి–

మ. ఒక తాళాగ్రముఁదాఁక వైవ నది కంపోద్రిక్తమై త్రుళ్ళి వే
ఱొక తాళాగ్రముపైఁబడ న్నదియు నత్యుగ్రాహతిన్ నిల్వ కొం
డొక తాళాగ్రముపైఁబడన్ విఱిగి యిట్లొండొంటిపైఁ దాళ వృ
క్షముల్ గూలెఁ బ్రచండమారుతముఁ దాఁకం గూలు చందంబునన్.

ఉ. తంతువులందుఁ జేలము విధంబున నే పరమేశుమూర్తియం
దింతయుఁ బుట్టునట్టి జగదీశుఁ డనంతుడు దైత్యమాత్రు ని
ట్లంతము సేయు టెంతపని యద్భుత మే విను మంతలోన వాఁ
డంతము పొందుటెల్లఁ గని యాతనిబంధులు గార్దభంబులై. –పోతనభాగవతం 10/617,619

| | | | |
|---|---|---|---|
| 3. **పాతయామాస :** | పాతయామాస | పాతయామాసతుః | పాతయామాసుః |
| | పాతయామాసిథ | పాతయామాసథుః | పాతయామాస |
| | పాతయామాస | పాతయామాసివ | పాతయామాసిమ |
| **అలభిషత :** | అలభిష్ట | అలభిషాతామ్ | **అలభిషత** |
| | అలభిష్ఠాః | అలభిషాథామ్ | అలభిధ్వమ్ |
| | అలభిషి | అలభిష్వహి | అలభిష్మహి. |

వాస్తవానికి లభ్ ధాతువు **అనిట్.** కానీ కవి **సేట్‌గా** వాడటం జరిగింది. *

**శ్లో॥ మునికృతాగ్రజనామగుణోచితం – విరచయన్నివ సానుగధేనుకమ్ ।**
**హలధరేణ హతం సమకారయత్ – సురనతో రణతోషితనాకినా ॥ 5–27**

**అ :** బలభద్రుడు ధేనుకాసురుని చంపటాన్ని కృష్ణాభీష్టంగా వర్ణించటం. –ద్రుతవిలంబితమ్.

**అ :** సుర–నతః ముని కృత+అగ్రజ–నామ–గుణ+ఉచితం విరచయన్+ఇవ స+అనుగ–ధేనుకం రణ–తోషిత నాకినా హలధరేణ హతం సమకారయత్.

**ప్ర :** సుర-నతః : సుర = దేవతలచే, నతః = నమస్కరింపబడుతున్న కృష్ణుడు (సురైః నతః - ఈ శ్లోకంలో ఈ విశేషణాన్నే విశేష్యంగా తీసికోవాలి. మరొక కర్తృపదం లేదు కాబట్టి), ముని-కృత+అగ్రజ-నామ-గుణ+ఉచితమ్ : ముని = మునిచేత (గర్గుని చేత), కృత = పెట్టబడిన, అగ్రజ = అన్నయొక్క, నామ = పేరునకు, గుణ = లక్షణాలనూ, ఉచితమ్ = తగినట్లుగా (మునినా కృతస్య అగ్రజస్య నామ్నః గుణానాం చ ఉచితం యథా తథా), విరచయన్-ఇవ = చేస్తున్నట్లుగా (వి - రచ్ - ధాతువుపై శతృ ప్రత్యయం), స-అనుగ-ధేనుకమ్ : స+అనుగ = అనుచరులతో పాటుగా, ధేనుకమ్ = ధేనుక రాక్షసుని (అనుగైః సహితః సానుగః స చ అసౌ ధేనుకః - తమ్), రణ-తోషిత-నాకినా : రణ = యుద్ధంచే, తోషిత = ఆనందింపజేయబడిన, నాకినా = దేవతలుగల (రణేన తోషితాః నాకినః యేన తేన), హలధరేణ = బలరామునిచే (రేవతీరమణో రామః కామపాలో హలాయుధః- అమరకోశః-స్వర్గ-23), హతమ్ = చంపబడిన వానినిగా (హన్ - ధాతువుపై క్త ప్రత్యయం), సమ్+అకారయత్ = చేయించెను. (సమ్-కృ కరణే-ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** గర్గుడు బలరామునకు ఆ పేరు పెట్టాడు. పేరుకు తగిన గుణం కూడా గలవాడు బలరాముడు. అందువలన వాటికి తగినట్లుగా కృష్ణుడు ఆ బలరామునిచేత అనుచరులతో సహా ధేనుకాసురుని చంపించాడు. దానితో స్వర్గలోకవాసులు ఆనందింపజేయబడినారు.

**వి :** 1. ధేనుకుని అనుచరులను కూడా కూల్చటం భాగవతంలో - 10/620

క. బలకృష్ణులపైఁ గవిసిన, - బలియుర ఖరదైత్యభటుల ౘబశ్చిమపాదం
బుల వట్టి తాళశిఖరం - బుల నెగురఁగవైఁచి వారుఁబొరిగొని రధిపా!

2. **సమకారయత్ :**

| | | |
|---|---|---|
| **సమకారయత్** | సమకారయాతామ్ | సమకారయన్ |
| సమకారయః | సమకారయతమ్ | సమకారయత |
| సమకారయమ్ | సమకారయావ | సమకారయామ. |

*

**శ్లో॥ గ్రీష్మే భాస్వతి చాపరాధకృతి సంక్రుద్ధః ప్రలంబం హలీ**
**లీలాయాశ్ఛలతో జఘాన మురజిద్వ్యోమంమయస్యాత్మజమ్ ।**
**యుక్తం తద్ధిమనః ప్రియాన్ జనయితా సంతర్జయన్ స్వాన్ శిశూన్**
**తత్ప్రాంతస్థశిలాది హస్తలగుడై స్తప్తోఽపి యత్తాదయేత్ ॥ 5-28**

**అ :** ప్రలంబాసుర హననం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** గ్రీష్మే భాస్వతి చ అపరాధ-కృతి హలీ క్రుద్ధః(సన్) లీలాయాః ఛలతః ప్రలంబం జఘాన. మురజిత్ మయస్య ఆత్మజం వ్యోమం జఘాన తాపం తప్తః అపి జనయితా మనః-ప్రియాన్ స్వాన్ శిశూన్ సంతర్జయన్ హస్త-లగుడైః తత్ప్రాంతస్థ-శిలాది తాడయేత్ ఇతి యత్ తత్ యుక్తం హి.

**ప్ర :** గ్రీష్మే = వేసవి, భాస్వతి చ = సూర్యుడును, అపరాధ-కృతి (సతి) = తప్పుచేయగా (అపరాధం కరోతి ఇతి-తస్మిన్), హలీ = బలరాముడు (నీలాంబరో రౌహిణేయః తాలాంకో ముసలీ హలీ-అమరకోశః-స్వర్గ-24), సంక్రుద్ధః(సన్) = కోపించి, లీలాయాః = ఆటయొక్క (ఆట అనే), ఛలతః = నెపంతో, ప్రలంబం = ప్రలంబాసురుని, జఘాన = చంపాడు (హన హింసాగత్యోః పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), మురజిత్ = కృష్ణుడు (మురం జితవాన్ ఇతి), మయస్య = మయుడనే రాక్షసునియొక్క, ఆత్మజమ్ = కొడుకును, వ్యోమమ్ = వ్యోముడను పేరుగలవాడిని, జఘాన = చంపాడు. జనయితా = తండ్రి (జనీ ధాతువుపై తృచ్ ప్రత్యయం), తప్తః+అపి = కోపించినా, మనః +ప్రియాన్ = మనసుసకు నచ్చిన (మనసః ప్రియాః, తాన్), స్వాన్ = తనయొక్క, శిశూన్ = పిల్లలను, సంతర్జయన్ = బెదిరిస్తూ (సమ్-తర్జ-ధాతువుపై శతృ ప్రత్యయం), హస్త-లగుడైః : హస్త = చేతిలోని, లగుడైః = కర్రలతో

(వైణవో లగుడో రమ్భో దండోయష్టిశ్చ... హలాయుధకోశః-726), తత్-ప్రాంత-స్థ-శిలా+ఆది : తత్ = ఆ, ప్రాంత-స్థ = ప్రాంతమందలి, శిలా+ఆది = రాళ్ళు మొదలగువానిని (తస్మిన్ ప్రాంతే తిష్ఠన్తి ఇతి తత్ ప్రాంతస్థాః, తాశ్చ శిలాః ఆదౌ యస్య తత్.), తాడయేత్-ఇతి = కొడతాడన్నదేదుందో, తత్ = అది/అటువంటిది, యుక్తమ్ హి = తగినదే గదా! (పిల్లలను బెదిరిస్తూ ప్రక్కనున్న రాళ్ళు రప్పలను కొట్టినట్లు గ్రీష్మ సూర్యులను బెదిరిస్తూ ప్రలంబుని, వ్యోమాసురుని చంపారని భావం.)

**తా ॥** వేసవి, ఎండా రెండూ తప్పుచేయగా బలరాముడు ప్రలంబుని ఆట అనే నెపంతో చంపాడు. కృష్ణుడు మయుని కుమారుడైన వ్యోమాసురుణ్ణి చంపాడు. నిజమే. తండ్రి తన పిల్లలమీద కోపంతో వారిని బెదిరిస్తూ ఆ ప్రక్కనున్న రాళ్ళురప్పలను కొడతాడు కానీ పిల్లలను కొట్టడు గదా!

**వి :** 1. ప్రలంబాసురవధ - గోపకులు, బలరామకృష్ణులు ఆడుకొనే సమయంలో ప్రలంబుడు కూడా వారిలో చొరబడి ఆటలో భాగంగా బలరాముని తనపై నెక్కించుకొని పైకివెళ్ళి అక్కడ నరాకృతి వీడి దానవాకృతి దాల్చగా, బలరాముడు అది చూచి ఆ అసురుని సంహరించాడు.

మత్త. మేలుమేలు గదయ్య రాముఁడు మేటిరక్కసు నొక్కనిన్
నేలఁగూలిచె నొక్కపోటున నేఁడు విస్మయమంచు గో
పాలకుల్ కని చచ్చి వచ్చిన భ్రాతఁగన్న విధంబునన్,
జాల దీవెనలిచ్చి రాముని సంస్తుతించిరి వేడుకన్. - పోతనభాగవతం 10/736

2. **వ్యోమాసురవధ :** గోపబాలురు గొఱ్ఱెలు-దొంగలు ఆట ఆడుకొనే సమయంలో వ్యోమాసురుడు మేషరూపంతో 'మేష కల్పనలతో భాసిల్లి క్రీడించు' ఆ బాలకులను ఒక కొండగుహలోనికి తీసికొని వెళ్ళాడు. కృష్ణుడది గ్రహించి గుహలోనికి వెళ్ళి వ్యోమాసురుని చంపి గోపబాలకులను విడిపించాడు.

ఉ. పంకజలోచనుండొడిసిపట్టిన శైలనిభాసురాకృతిన్
బింకముతోడఁబొంగి విడిపించుకొనంగ బలంబులేమి లో
శంకిలి బిట్టు తన్నుకొనఁ జక్కన నారణభీము వ్యోమునిన్
గొంకక కూల్చె నవ్విభుఁడు కోయని మింట సుపర్వులార్వగన్. -పోతనభాగవతం 10/1184

3. శ్లోకంలోని పూర్వార్ధవిషయం విశేషం. ఉత్తరార్ధవిషయం సామాన్యం. ఉత్తరార్ధంతో పూర్వార్ధాన్ని సమర్థించాడు కవి. సమర్థన అవసరం లేకపోయినా సమర్థించినందువలన ఇది అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తి రర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః' - (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 4. **జఘాన : జఘాన** | జఘ్నతుః | జఘ్నుః | |
| జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న | |
| జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ. | * |

**శ్లో॥ పరాభవం వీక్ష్య తతో నిదాఘః - ససర్జ దావానలముజ్జ్వలన్తమ్ ।**
**హరిః పపౌ తం చ జగన్నివాసో - వినాశశూన్యస్య హి కిం న కార్యమ్ ॥ 5-29**

**అ :** గ్రీష్మం దావానలాన్ని వెడలగ్రక్కటం - కృష్ణుడు దానిని మ్రింగివేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః నిదాఘః పరాభవం వీక్ష్య ఉజ్జ్వలంతం దావానలం ససర్జ. జగన్నివాసః హరిః తం చ పపౌ. హి. వినాశ-శూన్యస్య కిం న కార్యమ్?

**ప్ర :** తతః = ఆ తరువాత, నిదాఘః = గ్రీష్మం, పరాభవమ్ = తిరస్కారాన్ని, వీక్ష్య = చూసి, ఉజ్జ్వలన్తమ్ =

మండుతున్న, దావా+అనలమ్ = దావాగ్నిని, ససర్జ = సృష్టించాడు. (సృజ్ – విసర్గే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), జగత్ – నివాసః = విశ్వనివాసస్థానమైన హరి (జగతాం నివాసః), తం చ = దానిని కూడా, పపౌ = త్రాగాడు. (పా పానే భ్వాది పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), వినాశ–శూన్యస్య = మరణమెరుగని వానిని, కిమ్ = ఏది, న కార్యమ్ = చేయదగినది కాదు?

**తా ॥** గ్రీష్మం తనకు జరిగిన పరాభవాన్ని చూసి (ప్రతీకార దృష్టితో) ఎగిసిపడుతున్న దావాగ్నిని సృష్టించింది. కృష్ణుడు దానిని కూడా మ్రింగివేశాడు. మరణ మనేదే లేనివాడు చేయలేని దేముంది? (చేయరాని దేముంది?)

**వి :** 1. దావాగ్ని వెలువడినప్పుడు గోపాలురు భయానికి లోనై కృష్ణుని ప్రార్థించినట్లు పోతన.

శా. నీ చుట్టాలకు నాపదల్ గలుగునే! నే మెల్ల నీవార; మ
న్యాచారంబు లెఱుంగ మీశుఁడవు మా, కాభీలదావాగ్ని నేఁ
డే చందంబున నింక దాఁటుదుము మమ్మీక్షించి రక్షింప వ
న్నా! చంద్రాభ! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్. – పోతనభాగవతం 10/743

2. మొదటి మూడు పాదాలలోని కృష్ణకృత్యాన్ని నాలుగవ పాదంతో సామాన్యాంశంతో బలపరచినందువలన ఇది అర్థాంతరన్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **ససర్జ :** | **ససర్జ** | ససృజతుః | ససృజుః |
| | ససర్జిథ/సస్రష్ఠ | ససృజథుః | ససృజ |
| | ససర్జ | ససృజివ | ససృజిమ |
| **పపౌ :** | **పపౌ** | పపతుః | పపుః |
| | పపిథ/పపాథ | పపథుః | పప |
| | పపౌ | పపివ | పపిమ. |

*

**శ్లో॥ మేఘాః సవర్ణస్య హరేః సహాయం – ప్రాయో విధాతుం పరితః సమేత్య ।**
**భాస్వన్తమఙ్గైః పయసా నిదాఘ–మాచ్ఛాద్య విశ్వం పుపుషస్తదీయమ్ ॥ 5–30**

**అ :** వర్షర్తు ప్రారంభం. –ఇంద్రవజ్ర.

**అ :** మేఘాః సవర్ణస్య హరేః ప్రాయః సహాయం విధాతుమ్ పరితః సమేత్య భాస్వన్తం నిదాఘమ్ అఙ్గైః ఆచ్ఛాద్య పయసా తదీయం విశ్వం పుపుషః.

**ప్ర :** మేఘాః = మేఘాలు, సవర్ణస్య = తమతో సమానమైన రంగు గల (సమానః వర్ణః యస్య తస్య), హరేః = కృష్ణునికి, ప్రాయః = బహుశా, సహాయమ్ = సహకారాన్ని, విధాతుమ్ = కల్గించటానికి (వి – ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), పరితః = చుట్టూ, సమేత్య = కూడి (సమ్–ఆ–ఇ–ధాతువుపై ల్యప్ ప్రత్యయం), భాస్వన్తమ్ = వెలుగుతున్న, నిదాఘమ్ = గ్రీష్మాన్ని, అఙ్గైః = తమ శరీరభాగాలతో, ఆచ్ఛాద్య = కప్పివేసి (ఆ – ఛది ఆచ్ఛాదనే ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పయసా = నీటితో, తదీయమ్ = ఆ కృష్ణునకు చెందిన, విశ్వమ్ = జగత్తును, పుపుషః = పోషించాయి (పుష్ పుష్టౌ క్ర్యాది పరస్మైపది లిట్–ప్ర.బ.)

**తా ॥** కృష్ణుడు నీలమేఘశ్యాముడు. కాబట్టి మేఘాలకు సవర్ణుడు. తమ సవర్ణునికి సహాయం చేయాలన్న ఉద్దేశంతో కాబోలు చుట్టూ మూగి తమ శరీరాలతో వేసవిని ఆచ్ఛాదించి తమ నీటితో ఆ కృష్ణునకు సంబంధించిన జగత్తును పోషించాయి.

**వి :** 1. మేఘాలు తమ కదలికలను బట్టి అక్కడ గగనతలంలో వ్యాపించాయి గానీ కృష్ణునకు – అందునా

సవర్ణనకు సహకరించాలన్న ఆలోచన మేఘాలలో లేదు. ఉన్నట్లు కవి భావించినందువల్ల ఇక్కడ హేతూత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం **ప్రాయో** నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥ ఇక్కడ ప్రాయః ఉత్ప్రేక్షావ్యంజకం.

2. అచేతనాలయిన మేఘాలకు చేతనలక్షణమయిన సహకరణమన్న దానిని కల్పించినందువల్ల ఇది వక్రోక్త్యలంకారం. '**సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః**' (కావ్యాలంకరణ సూత్రాణి - 4-3-8)

| | | | |
|---|---|---|---|
| 3. **పుపోష :** | **పుపోష** | పుపుషతుః | పుపుషుః |
| | పుపోషిథ | పుపుషథుః | పుపుష |
| | పుపోష | పుపుషివ | పుపుషిమ. * |

**శ్లో॥ఆశ్రిత్య విష్ణుపదమర్థిషు యచ్ఛతోఽంబు - మేఘస్య సారథిరభూజ్జలనాయకోఽపి।**
**నిత్యం ముకున్దచరణార్పితవైభవస్య - మర్త్యోపకారనిరతస్య న కస్సహాయః ॥5-31**

**అ :** వర్ష ఋతువర్ణనమే. -వసంతతిలక.

**అ :** విష్ణుపదమ్ ఆశ్రిత్య అర్థిషు అంబు యచ్ఛతః మేఘస్య జల-నాయకః అపి సారథిః అభూత్. నిత్యం ముకుంద చరణ+అర్పిత-వైభవస్య మర్త్య+ఉపకార-నిరతస్య కః సహాయః న (భవతి)

**ప్ర :** విష్ణుపదమ్ = ఆకాశాన్ని (వ్యోమాంబరం విష్ణుపదం-హలాయుధకోశః-137), ఆశ్రిత్య = ఆశ్రయించుకొని ( ఆ-శ్రి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అర్థిషు = నీటిని కోరువారికి (గగనతలాన్ని ఆశ్రయించి వాన చినుకులు కోరేవి చాతక పక్షులు, వాటికి అని అయినా అర్థం సమంజసం), అంబు = నీటిని, యచ్ఛతః = ఇస్తున్న, మేఘస్య = మేఘానికి, జల-నాయకః+అపి = సముద్రుడు కూడా (జలానాం నాయకః) (లడయోరభేదః అని జడ అని పదాన్ని స్వీకరిస్తే జడశ్చ అసౌ నాయకః అని విగ్రహం. జడనాయకుడైన అని అర్థం), సారథిః = సారథిగా, అభూత్ = అయ్యాడు (భూ సత్తాయామ్ భ్వాది పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), నిత్యమ్ = ఎల్లప్పుడూ, ముకుంద-చరణ+అర్పిత - వైభవస్య : ముకుంద = నారాయణుని-యొక్క, చరణ = పాదాలపై, అర్పిత = సమర్పింపబడిన, వైభవస్య = సంపద గలిగి (ముకుందస్య చరణయోః అర్పితం వైభవం యేన తస్య), మర్త్య+ఉపకార-నిరతస్య : మర్త్య = మనుజులకు, ఉపకార = ఉపకారం చేయటంలో, నిరతస్య = ఆసక్తిగల వానికి, కః = ఎవడు, సహాయః = సహకర్తగా, న (భవతి) = కాడు.

**తా ॥** ఆకాశాన్ని ఆశ్రయించి అడిగిన వారికి నీటిని అర్పిస్తున్న మేఘానికి జల(డ) నాయకుడైన (నా) సముద్రుడు సహకరించాడు (మేఘాలకు నీటిని అందించి). నిత్యమూ తన వైభవాన్ని అంతటినీ నారాయణుని పదాలకు అర్పించి మానవులకు మేలుచేసే స్వభావం గలవారికి ఎవరు సహకరించరు?

**విశే :** 1. ముకుంద చరణాలకు తమ వైభవాన్ని అర్పించటమంటే విష్ణుపాదోద్భవ అయిన గంగకు తామే మూలమయినట్లు. అందుకే మేఘంనుండి నేరుగా జలవైభవం కలిగినందువల్ల స్వచ్ఛతకు, విష్ణుపదసంభవంచే పవిత్రతకు గంగ ఆధారమైంది.

2. శ్లోకపూర్వార్ధం విశేషాంశం. ఉత్తరార్ధం సామాన్యాంశం. రెండింటినీ సంయోజించి నందువలన అర్థాంతరన్యాసాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. * |

**శ్లో॥ లోకస్య శోకహరవార్యభివర్షతోఽలం-మేఘస్య యోగకృదభూదమతోఽపి వాతః ।**
**కామం పరోపకృతిలగ్నమనోరథానాం-క్షేమఙ్కరత్వముపయాన్తి హి శత్రవోఽపి॥32అ :**

వర్షఋతువర్ణనం - మేఘప్రవృత్తి. -వసంతతిలక.

**అ :** లోకస్య శోక-హర-వారి అభివర్షతః మేఘస్య అమతః వాతః అపి అలం యోగకృత్ అభూత్. హి. కామం పరోపకృతి-లగ్న-మనోరథానాం శత్రవః అపి క్షేమంకరత్వమ్ ఉపయాంతి.

**ప్ర :** లోకస్య = ప్రజలయొక్క, శోకహరవారి : శోక = శోకాన్ని, హర = పోగొట్టెడి, వారి = నీటిని (శోకస్య హరమ్ చ తత్ వారి), అభివర్షతః = కురుస్తున్న, మేఘస్య = మేఘానికి, అమతః = శత్రువయిన, వాతః+అపి = గాలి కూడా, అలమ్ = చాలినంతగా, యోగ-కృత్ = కలయికను కలిగించునదిగా (యోగం కరోతి ఇతి), అభూత్ = అయింది. (భూ సత్తాయామ్ భ్వాది పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), కామమ్ = స్వేచ్ఛగా, పర+ఉపకృతి-లగ్న-మనోరథానాం : పర = ఇతరులకు, ఉపకృతి = ఉపకారం చేయుట యందే, లగ్న = తగిలిన, మనోరథానామ్ = కోరికలు గలవారికి (పరేషామ్ ఉపకృతిః - తస్యాం లగ్నాః మనోరథాః యేషాం తేషామ్), శత్రవః+అపి = శత్రువులు కూడా, క్షేమం కరత్వమ్ = క్షేమాన్ని కలిగించే లక్షణాన్ని, ఉపయాన్తి = పొందుదురు. (ఉప+యా ప్రాపణే-పరస్మైపది- లట్-(ప్ర.బ.)

**తా ॥** లోకుల శోకాన్ని (శ్రమను) నీటిని కురిపిస్తున్న ఆ మేఘాలకు తాను శత్రువయినా కూడా గాలి సహకరించింది. (వాస్తవానికి గాలి సహకారం లేకపోతే వాన కురవదేమో!) నిజమే. నిరంతరమూ ఇతరులకు మేలు చేయాలనే కోరిక వున్న వారికి శత్రువులు కూడా క్షేమాన్నే కోరుకొంటారు.

**వి :** 1. క్షేమంకరః - క్షేమ+కర 'క్షేమప్రియమద్రేఽణ్చ' (అష్టాధ్యాయి 3-2-44) సూత్రంతో అణ్/ఖచ ప్రత్యయాలు. ఖచ్ ప్రత్యయం+ఆపై '**అరుర్ద్విషదజన్తస్య ముమ్**' (అష్టాధ్యాయి 6/3/67) అని ముమాగమం. **క్షేమంకర** అని రూపం.

2. మేఘం లోకుల శ్రమను పోగొడుతూ కురుస్తుంటే గాలి సహకరించింది. మంచి పనులు చేస్తుంటే శత్రువులయినా సహకరిస్తారు. ఇవి విశేషసామాన్యాలు. కాబట్టి అర్థాంతరన్యాసాలంకారం. **ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః** (కు. 122)

3. **అభూత్ :** 5-31వ శ్లోకవ్యాఖ్య చూదుదు.

| | | | |
|---|---|---|---|
| **ఉపయాన్తి:** | ఉపయాతి | ఉపయాతః | **ఉపయాన్తి** |
| | ఉపయాసి | ఉపయాథః | ఉపయాథ |
| | ఉపయామి | ఉపయావః | ఉపయామః. |

*

**శ్లో॥ ఉద్యద్విద్యుతి వక్రశక్రధనుషి వ్యోమాగ్రసీమాశ్రయే**
**వర్షత్యూర్జితగర్జితేఽతిచకితా మర్త్యాః పయోధారిణి ।**
**నేత్రాన్తభ్రుకుటీబలం కృశలసన్మధ్యోర్ధ్వభాగోదితం**
**నారీపీనపయోధరం భయహరం భేజుః క్వణద్భూషణమ్ ॥ 5-33**

**అ :** వర్షర్తువర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఉద్యద్-విద్యుతి వక్ర-శక్ర-ధనుషి వ్యోమ+అగ్ర సీమా+ఆశ్రయే ఊర్జిత-గర్జితే పయోధారిణి వర్షతి (సతి) మర్త్యాః అతిచకితాః (సన్తః) నేత్రాంత-భ్రుకుటీ-బలం కృశ లసన్మధ్యోర్ధ్వభాగ+ఉదితం క్వణద్-భూషణం భయ-హరం నారీ-పీన-పయోధరం భేజుః.

ప్ర : ఉద్యత్-విద్యుతి : ఉద్యత్ = వెలుగుతున్న, విద్యుతి = మెరుపులు గలదియు (తటిత్సౌ-దామనీ విద్యుత్ చంచలా చపలా-అమరకోశః-దిక్-9) (ఉద్యన్తీ విద్యుత్ యస్య తస్మిన్), వక్ర-శక్ర-ధనుషి : వక్ర = వంకరగా వున్న, శక్ర-ధనుషి = ఇంద్రధనుస్సు గలదియు (వక్రం చ తత్ శక్రస్య ధనుః తస్మిన్), వ్యోమ+అగ్ర-సీమ+ఆశ్రయే: వ్యోమ = ఆకాశంయొక్క, అగ్ర-సీమ = చివరి భాగం, ఆశ్రయే = ఆశ్రయంగా గలదియు (వ్యోమ్నః అగ్రం సీమ ఆశ్రయః యస్య, తస్మిన్), ఊర్జిత-గర్జితే = పెద్ద ఉరుములు గలదియు అయిన (ఊర్జితం చ తత్ గర్జితం, తస్మిన్), పయోధారిణి = మేఘం, వర్షతి (సతి) = కురుస్తుండగా, మర్త్యాః = మనుజులు, అతిచకితాః (సన్తః) = మరీ భయపడినవారై ('దరితశ్చకితో భీతః'-హలాయుధకోశః-354), నేత్ర+అంత-భ్రుకుటీ-బలమ్ : నేత్ర+అంత = కనుకొనల-యొక్కయు, భ్రుకుటీ = కనుబొమలయొక్కయు, బలమ్ = శక్తి గలదియు, కృశ-లసత్-మధ్య-ఊర్ధ్వ-భాగ-ఉదితమ్ : కృశ = సన్నబడి, లసత్ = ప్రకాశిస్తున్న, మధ్య = నడుముయొక్క, ఊర్ధ్వభాగ = పై భాగాన, ఉదితమ్ = పొడమినదియు, క్వణద్-భూషణమ్ = ధ్వనిస్తున్న ఆభరణాలు గలదియు, భయహరమ్ = భయాన్ని తొలగించేదియు - అయిన, నారీ-పీన-పయోధరమ్ : నారీ = కాంతలయొక్క, పీన = బలిసిన, పయోధరమ్ = వక్షోజాన్ని, భేజుః = ఆశ్రయించారు. (భజ సేవాయమ్-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** పయోధరం ప్రకాశిస్తున్న మెరుపులతో, వంకరగా కనిపిస్తున్న ఇంద్రధనుస్సుతో ఆకాశపు అంచును ఆశ్రయించి పెద్దగా ఉరుముతూ వర్షిస్తోంది. దానితో భయపడిన మనుజులు కనుకొనలు, కనుబొమలు వీటి బలంతో, సన్నని నడుమునకు పైభాగాన పొడమిన భూషణధ్వనులతో భయాన్ని పోగొట్టగల కాంతాపీన పయోధరాలను ఆశ్రయించారు.

**వి :** 1. పయోధరాల వలన భయానికి లోనైన వారు మరల పయోధరాలనే ఆశ్రయించి భయాన్ని పోగొట్టుకోవటం విశేషం. ఒక పయోధరం భయపెట్టేదయితే మరో పయోధరం భయాన్ని పోగొట్టేది. ఈ రెండింటికీ పోలిక బింబప్రతిబింబభావంతో వున్నందువలన దృష్టాంతాలంకారం. '**చేద్బింబప్రతిబింబత్వం దృష్టాంతస్తదలంకృతిః**'(కు.52)

పయోధారి - పయోధరాలకు పోలిక ధ్వనిస్తూ దానితోపాటు వ్యతిరేకత (ఒకటి భయకరం - మరొకటి భయహరం) కూడా వున్నందువలన వ్యతిరేకాలంకారం కూడా ధ్వనిస్తుంది. '**వ్యతిరేకో విశేషశ్చేత్ ఉపమానోపమేయయోః**' (కు.57)

| | | | |
|---|---|---|---|
| 2. **భేజుః :** | బభాజ | భేజతుః | **భేజుః** |
| | బేజిథ | భేజథుః | భేజ |
| | బభాజ/బభజ | భేజివ | భేజిమ. |

*

**శ్లో॥ కాదమ్బిన్యై వితరతి పయోబిన్దుమాత్రం పయోధా-**
**వాసీద్వృద్ధిః సకలసరితాం స్వాత్మనశ్చేతి యుక్తమ్ ।**
**నిత్యం విష్ణోః పదమధిగతాయాత్యుదారాయ దానా-**
**దబ్బిన్దూనామపి శతగుణా వృద్ధిరద్ధా స్వవర్గే ॥** **5-34**

**అ :** వసంతఋతువర్ణన - పయోధిదాతృత్వం. -మందాక్రాంత.

**అ :** పయోధౌ కాదంబిన్యై పయో-బిందుమాత్రం వితరతి (సతి) సకల-సరితాం స్వ+ఆత్మనః చ వృద్ధిః ఆసీద్ ఇతి యుక్తమ్. నిత్యం విష్ణోః-పదమ్ అధిగతాయ అత్యుదారాయ అబ్బిందూనామ్ అపి దానాత్ స్వ వర్గే శతగుణా వృద్ధిః అద్ధా.

**ప్ర :** పయోధౌ = సముద్రుడు, కాదంబిన్యై = మేఘాల వరుసకు ('కాదంబినీ మేఘమాలా' – అమరకోశః – దిక్ – 8), పయో–బిందు మాత్రమ్ : పయః = నీటియొక్క, బిందు మాత్రమ్ = ఒక బొట్టునే (పయసః బిందుః పయోబిందుః – కేవలం పయోబిందుః – పయోబిందుమాత్రమ్), వితరతి (సతి) = ఇచ్చినా (వి తృ ధాతువుపై శతృ ప్రత్యయం – సప్తమీ విభక్తి), సకల–సరితామ్ = అన్ని నదులకూ (సకలాః చ తాః సరితః – తాసామ్), స్వ+ఆత్మనః + చ = తనకూ, వృద్ధిః = పెరుగుదల, ఆసీత్ = కలిగింది (అస భువి అదాది పరస్మైపది–లజ్–ప్ర.ఏ.), ఇతి–యుక్తమ్ = అది తగినదే, నిత్యమ్ = ఎప్పుడూ, విష్ణోః – పదమ్ = విష్ణుపాదాన్ని/ ఆకాశాన్ని, అధిగతాయ = ఆశ్రయించిన వాడునూ, అతి+ ఉదారాయ = చాలా త్యాగశీలతగలవాడునూ అయిన మేఘునికి, అప్+బిందూనామ్ = నీటి బొట్లయొక్క (అపాం బిందవః, తేషామ్), దానమ్+అపి = దానం కూడా, స్వ వర్గే = తనవారిలో, శత–గుణా = నూరు రెట్లుగా (శతేన గుణ్యతే ఇతి), వృద్ధిః = ఎదుగుదల, అద్ధా = నిశ్చితం. (అసంశయే భవేదద్ధా – హలాయుధకోశః – 885)

**తా ॥** సముద్రుడు మేఘమాలకు ఒక బొట్టు నీటినే ఇచ్చినా అది సమస్తనదులకూ, తన్మూలకంగా తనకూ (సముద్రునికీ) వృద్ధిని కలిగిస్తోంది. అంతేమరి. మేఘం ఎప్పుడూ విష్ణుపదాన్ని ఆశ్రయించి వుంటుంది. ఎంతో దయాశీలతతో ప్రవర్తిస్తుంది. అటువంటి దానికి నీటిబిందువులను దానం చేసినా అది వందలరెట్లుగా పెరుగుదలకు కారణ మవుతుంది గదా!

**వి :** 1. సత్పాత్రదానం – దాని ఫలితం – మేఘంయొక్క ఔదార్యం ఇక్కడ కనిపిస్తాయి. శతగుణవృద్ధి నిశ్చితమనటం విశ్వాసాన్ని పెంచటానికి దోహదం చేస్తుంది.

శ్లో॥ ప్రథమవయసి పీతం తోయమల్పం స్మరంతః
శిరసి నిహితభారా నారికేళాః నరాణామ్।
దదతి జలమనల్పస్వాదమాజీవితాంతం
న హి కృతముపకారం సాధవో విస్మరన్తి ॥ –సుభాషితరత్నభాండాగారం–పుట 53

కొబ్బరిచెట్టుకు పాదులో కొంచెం నీరు పోసినా దాని చిన్నతనంలో – వాటిని నెత్తిన మోస్తూ జీవితాంతం మనకు మధుర జలాలను అందిస్తూనే వుంటుంది. మేఘత్యాగం కూడా అటువంటిదే.

మహాభారతంలో వ్యాసమహర్షి జలదానాన్ని విశిష్టంగా ప్రతిపాదించాడు.

శ్లో॥ అన్నమేవ మనుష్యాణాం ప్రాణానాహుర్మనీషిణః ।
తచ్చ సర్వం నరవ్యాఘ్ర**పానీయాత్**సంప్రవర్తతే ॥
తస్మాత్**పానీయదానాద్వై న పరం విద్యతే క్వచిత్** ।– మహాభారతం – అనుశాసన పర్వ – 57/15,16

2. **ఆసీత్ :**

| | | |
|---|---|---|
| **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ మేఘగమోఽసహ్యమపి ప్రజహ్రే – గ్రీష్మస్య సత్త్వం సకలం తథా తత్ ।**
**సర్వంసహాజీవనహర్తురస్య – దుర్వారతేజోఽపి కిమేతి వృద్ధిమ్ ॥ 5–35**

**అ :** వర్షఋతువు గ్రీష్మసత్త్వాన్ని కొల్లగొట్టడం. –ఇంద్రవజ్ర.

**అ :** మేఘ+ఆగమః అసహ్యమ్ అపి గ్రీష్మస్య సత్త్వం సకలం ప్రజహ్రే. తత్ తథా. సర్వంసహా– జీవన–హర్తుః అస్య దుర్వార–తేజః అపి వృద్ధిమ్ ఏతి కిమ్?

**ప్ర :** మేఘ+ఆగమః = మేఘాలరాక (మేఘానామ్ ఆగమః), అసహ్యామ్ - అపి = భరింపరానిదైనను, గ్రీష్మస్య = వేసవియొక్క, సకలమ్ = సమస్తమైన, సత్త్వమ్ = శక్తిని, ప్రజహ్రే = కొల్లగొట్టింది. (ప్ర+హృ హరణే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.) తత్ = అది, తథా = అలాగే (వుంటుంది) సర్వంసహా - జీవన - హర్తుః : సర్వంసహా = భూమియొక్క, జీవన = నీటియొక్క, హర్తుః = దొంగగు (సర్వం సహతే ఇతి సర్వంసహా, తస్యాః జీవనమ్, తస్య హర్తా, తస్య), అస్య = ఈ వేసవియొక్క, దుర్వార-తేజః+అపి : దుర్వార = అడ్డగింపరాని, తేజః+అపి = తేజస్సు కూడా, వృద్ధిమ్ = పెరుగుదలను, ఏతి కిమ్? = పొందుతుందా? (ఇ-గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** మేఘాలరాక గ్రీష్మర్తువుయొక్క బలాన్ని మొత్తాన్ని కొల్లగొట్టింది. అదంతే. సర్వంసహ (భూమి)లోని మొత్తం జీవితాన్నీ అపహరించిన వారి తేజస్సు - అది ఎంత తిరుగులేనిదయినా సరే - ఎదుగుతుందా?

**వి :** 1. ఇక్కడ మేఘాగమ, సర్వంసహా, గ్రీష్మజీవన - మొదలగు శబ్దాల ద్వారా స్త్రీ విషయకంగా ఒకరి అసహ్యాపరిస్థితి మరొకరు దానిని పరిహరించటం వ్యక్తమౌతుంది. ప్రస్తుతవర్షర్తువర్ణనతో అప్రస్తుతమైన ఈ స్త్రీ పుంవ్యవహారం స్ఫురిస్తోంది కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్**' (కు.61)

| | | | |
|---|---|---|---|
| 2. ప్రజహ్రే : | **ప్రజహ్రే** | ప్రజహ్రాతే | ప్రజహ్రిరే |
| | ప్రజహృషే | ప్రజహ్రాథే | ప్రజహృధ్వే |
| | ప్రజహ్రే | ప్రజహృవహే | ప్రజహృమహే |
| **ఏతి :** | **ఏతి** | ఇతః | యన్తి |
| | ఏషి | ఇథః | ఇథ |
| | ఏమి | ఇవః | ఇమః. |

*

**శ్లో॥ సాధూనాం వరమానసాకృతి సరః సంశోధయత్ తన్ముఖ-**
**ప్రఖ్యం పద్మచయం ప్రహర్షయదలం పఙ్కం చ సఙ్ఖణ్డయత్ ।**
**హృద్వ్యోమేవ ఘనాపిధానరహితం కుర్వన్నభః సంహరత్**
**తామిస్రం హరివీర్యకీర్తిసదృశౌ సూర్యోడుపౌ స్పష్టయత్ ॥ 5-36**

**అ :** శరత్కాల వర్ణనం - శరద్వైభవ వర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సాధూనాం వర-మానస+ఆకృతి సరః సంశోధయత్ తన్ముఖ-ప్రఖ్యం పద్మ-చయం ప్రహర్షయత్ పంకం చ అలం సంఖండయత్ (సాధూనాం) హృద్+వ్యోమ+ఇవ నభః ఘన+అపిధాన-రహితం కుర్వత్ తామిస్రం సంహరత్ హరి-వీర్య-కీర్తి-సదృశౌ సూర్య+ఉడుపౌ స్పష్టయత్... (తరువాతి శ్లోకంలో కర్తృ-సమాపకక్రియాపదాలు)

**ప్ర :** సాధూనామ్ = సజ్జనులయొక్క, వర-మానస+ఆకృతి : వర = శ్రేష్ఠమైన, మానస = మనస్సుయొక్క, ఆకృతి = ఆకృతివంటి ఆకృతిగల (వరం చ తత్ మానసం, తస్య ఆకృతిరివ ఆకృతిః యస్య తత్), సరః = కొలనును, సంశోధయత్ = నిర్మలం చేస్తూ...., తత్ +ముఖప్రఖ్యమ్ : తత్ = వారియొక్క (ఆ సాధువులయొక్క), ముఖ = ముఖమనెడి, ప్రఖ్యమ్ = పేరుగల (సాధూనాం ముఖాని, తేషాం ప్రఖ్యా ఇవ ప్రఖ్యా యస్య తత్)/ సాధూనామ్ = సజ్జనులయొక్క, ముఖ = వదనాలతో, ప్రఖ్యమ్ = సమానమైన (సాధూనాం ముఖాని తైః ప్రఖ్యః తత్) (ప్రఖ్యః ప్రకాశః ప్రతిమః - హలాయుధకోశః - 694) (ప్రఖ్య పదముత్తరపదమైనపుడు తుల్యార్థకమని హేమనిఘంటువు.), పద్మ-చయమ్ : పద్మ = తామరలయొక్క, చయమ్ = సమూహాన్ని, ప్రహర్షయత్ = వికసింపజేస్తూ, పంకమ్ = బురదను, అలమ్ = తగినంతగా, సంఖణ్డయత్ = విదళిస్తూ, హృద్- వ్యోమ+ఇవ = (సాధువుల) హృదయాకాశాన్నివలె, నభః = ఆకాశాన్ని, ఘన+అపిధాన రహితమ్ : ఘన = మేఘాలనెడి,

అపిధాన = మూత, రహితమ్ = లేనిదిగా చేస్తూ (ఘనాః ఏవ అపిధానం, తేన రహితం), కుర్వత్ = చేస్తూ, తామిస్రం = చీకటిని, సంహరత్ = అపహరిస్తూ, హరి–వీర్య–కీర్తి–సదృశౌ : హరి = విష్ణువుయొక్క, వీర్య = తేజస్సుతో, కీర్తి = కీర్తితో, సదృశౌ = సమాను లయిన (హరేః వీర్యం కీర్తిః చ, తాభ్యాం సదృశౌ), సూర్య+ఉడుపౌ = సూర్యచంద్రులను (సూర్యః చ ఉడూన్ పాతి ఇతి స చ), స్పష్టయన్ = విశదపరుస్తూ...

**తా ॥** (సచ్ఛాస్త్రం వంటి శరత్సామ్రాజ్యం విజృంభించిందని తరువాతి శ్లోకంలో కర్తృపదాన్ని, విజృంభణ రూప క్రియను ప్రయోగించి, రెండు శ్లోకాలకూ ఏకాన్వయాన్ని కల్పించాడు కవి. కాబట్టి ఇక్కడ కూడా సచ్ఛాస్త్రం వంటి శరత్సామ్రాజ్యం కర్త).

సాధువుల మనస్సులతో సమానమైన ఆకారంగల సరస్సులను నిర్మలం చేస్తూ (సాధువుల మనస్సులనే సరోవరాలను వికసింపజేస్తూ (వారి ముఖపద్మాలకు ఆనందాన్ని కలిగిస్తూ) బురదను తగినరీతిగా విదళిస్తూ (బురదవంటి హృదయమాలిన్యాన్ని పోగొడుతూ) వారి హృదయాల వంటి ఆకాశాన్ని మేఘశూన్యంగా చేస్తూ (వారి హృదాయాకాశాలను కప్పిన ఆవరణాన్ని తొలగిస్తూ) చీకటిని పరిహరిస్తూ (తమో రూపమయిన అజ్ఞానాన్ని పోగొడుతూ) నారాయణుని శౌర్యకీర్తులతో సమానులయిన సూర్యచంద్రులను స్పష్టంగా కనిపింపజేస్తూ... (శరత్సామ్రాజ్యం విస్తరించింది. అది సచ్ఛాస్త్రంవలె వుంది).

**వి :** 1. సంశోధయత్, ప్రహర్షయత్, సంఖండయత్, కుర్వత్, సంహరత్, స్పష్టయత్ – ఇవన్నీ శతృ ప్రత్యయాంతరూపాలు. '**లటః శతృశానచావ ప్రథమాసమానాధికరణే**' (అష్టాధ్యాయి – 3–2–124) అనే సూత్రంతో క్రియ అసమాపకమై కొనసాగుతున్నపుడు పరస్మైపదధాతువులపై శతృప్రత్యయం.

2. వరమానసాకృతి – మానసంయొక్క ఆకృతివంటి ఆకృతి అన్నపుడు లుప్తోపమా–లంకారం. మానసాకృతి అనే సరస్సు అన్నపుడు రూపకాలంకారం. తన్ముఖప్రఖ్యమ్ పద్మచయం అన్నచోట కూడా ముఖాలతో సమానమైన పద్మాలు అంటే రూపకాలంకారం. హృద్వ్యోమ – అన్నచోట రూపకాలంకారం. హృద్వ్యోమేవ – అన్నచోట ఉపమాలంకారం. హరివీర్యశక్తిసదృశౌ సూర్యోడుపౌ అన్నచోట ఉపమాలంకారం.

3. భాగవతంలోని భావాల అనుకరణమే ఇక్కడ కనిపిస్తుంది, కానీ స్వతంత్రంగా. శరత్కాలం ప్రధానంగా నైర్మల్యానికి ఉనికి కాబట్టి, తత్త్వజ్ఞానఫలం నైర్మల్యమే కాబట్టి మూలంలోని ఆ భావాలని కూడా అనుసరించాడు కవి.

శ్లో॥ శరదా నీరజోత్పత్త్యా నీరాణి ప్రకృతిం యయుః ।
భ్రష్టానామివ చేతాంసి పునర్యోగనిషేవయా ॥

శ్లో॥ వ్యోమ్నోఽబ్దం భూతశాబల్యం భువః పంకమపాం మలమ్ ।
శరజ్జహారాశ్రమిణాం కృష్ణే భక్తిర్యథాశుభమ్ ॥

శ్లో॥ సర్వస్వం జలదా హిత్వా విరేజుః శుభ్రవర్చసః ।
యథా త్యక్తైషణాః శాంతా మునయో ముక్తకిల్బిషాః ॥ – భాగవతం 10/20/33–35 *

**శ్లో॥ సంసారాఖ్యమభేద్యబన్ధనమివ ప్రావృట్కృతం బన్ధనం**
**భిక్షూణాం వణిజామధఃకృతజలం విచ్ఛేదయన్మోదయత్ ।**
**మోక్షానన్దమహాప్రవాహతులనైర్గోక్షీరపానైర్జనాన్**
**సచ్ఛాస్త్రప్రతికృత్యలక్ష్యత శరత్సామ్రాజ్యముజ్జృమ్భితమ్ ॥ 5–37**

**అ :** శరదృతువర్ణనం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అధఃకృత–జలం సంసార+ఆఖ్యమ్ అభేద్య–బంధనమ్ ఇవ ప్రావృట్–కృతం బంధనం భిక్షూణాం వణిజాం విచ్ఛేదయత్ మోక్షానంద–మహా–ప్రవాహ–తులనైః గో–క్షీర–పానైః జనాన్ మోదయత్ సత్+శాస్త్ర ప్రతికృతి ఉజ్జృంభితం శరత్సామ్రాజ్యమ్ అలక్ష్యత.

**ప్ర :** అధఃకృత–జలమ్ : అధఃకృత = క్రిందు చేయబడిన, జలమ్ = నీరుగల (అధః కృతం జలం యేన తత్ తథా), సంసార+ఆఖ్యమ్ = సంసారమనే, అభేద్య–బంధనమ్–ఇవ : అభేద్య = ఛేదింపరాని, బంధనమ్– ఇవ = బంధాన్నివలె, భిక్షూణామ్ = సంన్యాసులకు, వణిజామ్ = వ్యాపారులకు, ప్రావృట్ – కృతమ్ = వర్షాకాలంచేత ఏర్పడిన (ప్రావృషా కృతమ్), బంధనమ్=ప్రతిబంధకాన్ని, విచ్ఛేదయత్ = తొలగిస్తూ, మోక్ష+ఆనంద–మహా–ప్రవాహ–తులనైః : మోక్ష = ముక్తివలన కలుగు, ఆనంద = ఆనందంయొక్క, మహా = గొప్పదైన, ప్రవాహ = ప్రవాహంతో, తులనైః = సమానమైన (మోక్షాత్ ఆనందః, తస్య మహాన్తః చ తే ప్రవాహాః తైః తులనా యేషాం తైః), గోక్షీర – పానైః : గో = ఆవుల యొక్క, క్షీర = పాలయొక్క, పానైః = త్రాగుటల ద్వారా (గవాం క్షీరం, తస్య పానం, తైః), జనాన్ = ప్రజలను, మోదయత్ = ఆనందింపజేస్తూ, సత్–శాస్త్ర–ప్రతికృతి : సత్ = సత్పదార్థబోధకమైన, శాస్త్ర = శాస్త్రాలకు, ప్రతికృతి = మారురూపంగా (సన్తి చ తాని శాస్త్రాణి, తేషాం ప్రతికృతి), శరత్ – సామ్రాజ్యమ్=శరత్కాలపు ప్రభుత (శరదః సామ్రాజ్యమ్), ఉజ్జృంభితమ్ = విజృంభించింది. అలక్ష్యత = చూడబడెను. (లక్ష దర్శనాంకనయోః కర్మణి–ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** శరత్కాలంలో జలం (వాపీతటాకాదుల్లో) అడుగుకుపోయింది. సంసారబంధంలాగా అభేద్యమయిన ప్రావృట్కాలబంధం తొలగిపోయింది. సంన్యాసులకు, వ్యాపారులకు (వర్షా–కాలంలో సంన్యాసులకు చాతుర్మాస్యవ్రతం పేర ఒక్కచోటనే నిలవ వచ్చున్న వెసులుబాటు నిబంధన, వ్యాపారులకు వాతావరణప్రాతికూల్యంచేత ఒక్కచోటే వుండటం అవసరం.) మోక్షానంద మహాప్రవాహంతో సమానమైన గోక్షీరపానాన్ని చేస్తున్నారు జనులందరు. (శరత్తులో అది ఆరోగ్యకరం). అటువంటి లక్షణాలతో సచ్ఛాస్త్రాలకు మారురూపంవంటి శరత్ప్రభుత ప్రారంభమైంది.

**వి :** 1. విచ్ఛేదయత్, మోదయత్ – ఇవి రెండూ శతృ ప్రత్యయాంతాలు.

2. లడయోః అభేదః అన్న న్యాయం మేరకు జల శబ్దాన్ని జడశబ్దంగా స్వీకరిస్తే అధఃకృతజడమ్ = మూర్ఖుని క్రిందుజేసి అని అర్థం. మోక్షానందం జ్ఞానికే గాని మూర్ఖునకు కాదని శాస్త్రపరిగణన.

శరత్సామ్రాజ్యం సచ్ఛాస్త్రప్రతికృతి అనటంలో తాద్రూప్యరూపకాలంకారం ధ్వనిస్తుంది.

సచ్ఛాస్త్రానికీ, శరత్సామ్రాజ్యానికీ '**అలక్ష్యత**' అని ఒకే ధర్మాన్ని ప్రతిపాదించటంవలన ఇక్కడ తుల్యయోగితాలంకారం కూడా అందగిస్తోంది. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' (కు.44)

| | | | |
|---|---|---|---|
| 3. **అలక్ష్యత :** | **అలక్ష్యత** | అలక్ష్యేతామ్ | అలక్ష్యన్త |
| | అలక్ష్యథాః | అలక్ష్యేథామ్ | అలక్ష్యధ్వమ్ |
| | అలక్ష్యే | అలక్ష్యావహి | అలక్ష్యామహి. |

*

**శ్లో॥ పద్మాసేవ్యగుణౌఘవిస్తృతికరః స్పష్టీభవచ్ఛారదా–**
**నన్దః కమ్పితభోగిరాజశిరసా మాన్యాగమః సన్తతమ్ ।**
**సన్మార్గాశ్రితపఙ్కశోషణకరః సత్పాన్థఘర్మాపహో**
**నిత్యం విష్ణుపదాశ్రయః పరిలసత్పుణ్యామ్బుపూతోఽసకృత్ ॥** **5–38**

**అ :** శరత్కాలవర్ణనం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** పద్మ+ఆసేవ్య-గుణ+ఓఘ-విస్తృతి-కరః స్పష్టీభవత్+శారద(దా)+ఆనందః కంపిత-భోగి-రాజ-శిరసా మాన్య+ఆగమః సంతతం సన్మార్గ+ఆశ్రిత-పంక-శోషణ-కరః సత్పాన్థఘర్మ+ అపహః నిత్యం విష్ణుపద+ఆశ్రయః అసకృత్ పరిలసత్ పుణ్య+అంబుపూతః.

**ప్ర :** పద్మ(ద్మా)+ఆసేవ్య-గుణ+ఓఘ-విస్తృతి-కరః : పద్మ = తామరలచే, లక్ష్మిచే, ఆసేవ్య = సేవింపబడే, గుణ+ఓఘ = గుణసమూహంయొక్క (తామరలపక్షంలో పరిమళాదులు, లక్ష్మిపక్షంలో విష్ణుగుణగణాలు), విస్తృతి = వ్యాప్తిని, కరః = చేయునదియు, స్పష్టీభవత్ - శారద (దా) + ఆనందః : స్పష్టీభవత్ = చక్కగా తెలుస్తున్న, శారద (దా) = శరత్కాల సంబద్ధమైన/ సరస్వతీ సంబద్ధమైన, ఆనందః = ఆనందం గలదియు, కంపిత-భోగి-రాజ-శిరసా : కంపిత = కదల్చబడిన, భోగి = భోగులయిన/పాములయొక్క, రాజ = రాజులయొక్క/ రాజుయొక్క, శిరసా = శిరస్సుచే / పడగచే, మాన్య+ఆగమః : మాన్య = గౌరవింపబడిన, ఆగమః = రాక కలదియు/ శాస్త్రాలు గలదియు, సంతతమ్ = ఎల్లప్పుడు, సత్+మార్గ+ఆశ్రిత-పంక-శోషణ-కరః : సత్+మార్గ = మంచి బాటను, ఆశ్రిత = ఆశ్రయించిన, పంక = బురదయొక్క /మిథ్యాజ్ఞానంయొక్క, శోషణ = ఎండుటను/ పోవుటను, కరః = చేయునదియు, సత్-పాన్థ-ఘర్మ-అపహః : సత్ = సజ్జనులయిన / సత్పదార్థదృష్టిగల, పాన్థ = బాటసారులయొక్క/ సాధకులయొక్క, ఘర్మ = వేడిని/ తాపాన్ని, అపహః = తొలగించునదియు, నిత్యమ్ = నిరంతరమూ, విష్ణు పద - ఆశ్రయః : విష్ణు = విష్ణువుయొక్క, పద = పాదాలను (ఆకాశాన్ని), ఆశ్రయః = ఆశ్రయించినదియు, అసకృత్ = పదే పదే, పరిలసత్-పుణ్య-అంబు-పూతః : పరిలసత్ = ప్రకాశిస్తున్న, పుణ్య = పవిత్రమైన/పుణ్యం అనే, అంబు = నీటిచే, పూతః = పవిత్రమైనదియు... ... (అయిన గాలి పట్టాభిషిక్తమయింది.)

**తా ॥** ఆ శరత్కాలంలోని గాలి పద్మాలచే సేవింపబడే పరిమళ సముదాయాలను వ్యాప్తి చేస్తూ, స్పష్టంగా తెలుస్తున్న శరత్కాలానందం గలదియై, భోగులైన రాజులు శిరః కంపన చేస్తూ తన రాకను శ్లాఘిస్తుండగా, చక్కని బాటలలో పరచుకొన్న (వానల కారణంగా) బురదను ఎండింపజేస్తూ, మంచి బాటసారుల వేడినీ/స్వేదాన్నీ అపహరిస్తూ, నిత్యమూ ఆకాశాన్ని ఆశ్రయించి, స్వచ్ఛమయిన పుణ్యజలాలచే నిరంతరమూ పవిత్రమై... ...

ఆ శరత్కాలంలో ఆనందతీర్థులు లక్ష్మిచేత సేవింపబడుతున్న నారాయణగుణాలను వ్యాపింపజేస్తూ, కదులుతున్న నాగరాజుయొక్క శిరః కంపనలచే గౌరవింపబడిన రాక గలవాడై, సజ్జనుల మార్గంలో అడ్డుపడే మిథ్యాజ్ఞానాన్ని ఎండగడుతూ, సత్పదార్థం వైపు పయనిస్తున్న వారి తాపాన్ని పోగొడుతూ నిత్యమూ విష్ణుచరణాలనే ఆశ్రయించి, వెలుగుతున్న పుణ్యమనే నీటిచే పవిత్రుడై... ... *

**శ్లో॥ రామాయోగిజనస్య భీమచరితః సద్వంశజాతం ముహుః**
**ప్రేమాలమ్బనశబ్దహృద్యవదనం కుర్వన్ స్వకీయాగమైః ।**
**సుక్షేమం సుమనశ్చయస్య విదధత్ సువ్యాప్తమూర్తిః క్షితౌ**
**సచ్ఛాస్త్రే సుఖతీర్థవన్మరుదభూన్మూర్ధాభిషిక్తస్తదా ॥ 5-39**

**అ :** శరత్కాలవర్ణనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** రామా-యోగిజనస్య భీమచరితః స్వకీయ+ఆగమైః సద్వంశజాతం ముహుః ప్రేమ+ఆలంబన-శబ్ద-హృద్య-వదనం కుర్వన్ సుమనశ్చయస్య సుక్షేమం విదధత్ క్షితౌ సువ్యాప్త-మూర్తిః మరుత్ తదా సచ్ఛాస్త్రే సుఖ-తీర్థవత్ మూర్ధాభిషిక్తః అభూత్.

**ప్ర :** రామా+అయోగి జనస్య : రామా (రామ) = స్త్రీలతో / రామునిపై, అయోగి = ఎడబాసిన / భక్తిలేని, జనస్య = జనానికి, భీమ-చరితః : భీమ = భయంకరమైన, చరితః = నడవడి గలదై, ముహుః = మాటిమాటికి, సద్+వంశ-జాతమ్ : సత్ = చక్కని/మంచి, వంశ-జాతమ్ = వెదుళ్ళ పొదలను/ వంశంలో పుట్టినవానిని,

ప్రేమ+ఆలంబన-శబ్ద-హృద్య-వదనమ్ : ప్రేమ = స్నేహానికి, ఆలంబన = ఊతమైన, శబ్ద = ధ్వనితో/మాటలతో, హృద్య = మనోహరమైన, వదనమ్ = ముఖం కలిగిన వానినిగా, కుర్వన్ = చేస్తూ (కృ ధాతువుపై శతృ ప్రత్యయం), స్వకీయ+ఆగమైః : స్వకీయ = తనయొక్క, ఆగమైః = రాకలతో / ఆగమాలతో, సుమనః+చయస్య : సుమనః = మంచిమనస్సుగలవారియొక్క/ దేవతలయొక్క, చయస్య = సమూహానికి, సుక్షేమమ్ = కుశలం/ మోక్షం, విదధత్ = కల్పిస్తూ, క్షితౌ = భూమిపై, సువ్యాప్త - మూర్తిః : సువ్యాప్త = బాగా వ్యాపించిన, మూర్తిః = స్వరూపంగలదైన, మరుత్ = గాలి, తదా = అప్పుడు, సత్+శాస్త్రే = బ్రహ్మను గూర్చిన ఉత్తరమీమాంసలో, సుఖతీర్థవత్ = సుఖతీర్థరు వలె (ఆనందతీర్థరు వలె), మూర్ధా-అభిషిక్తః = పట్టాభిషిక్తుడు, అభూత్ = అయ్యెను.

**తా ॥** మరుత్తు స్త్రీవియోగం గలవారికి భయంకరమైన ప్రవృత్తిగలవాడై, మాటిమాటికి చక్కని వెదుళ్ళనుండి ప్రేమాస్పదమయిన మనోహరశబ్దాలను పుట్టిస్తూ, తనరాకలచే సజ్జన-సమూహానికి కుశలాన్ని కలిగిస్తూ ఉత్తరమీమాంసలో శ్రీమదానందతీర్థరు లాగా పట్టాభిషేకాన్ని పొందింది.

శ్రీమదానందతీర్థరు రామునిపై భక్తిలేని వారికి భీకరమైన నడవడిగలవాడై (భీమ ప్రవృత్తిగలవాడై), మంచివంశంలో పుట్టిన వారి వదనాలను స్నేహాస్పదవచనాలతో వికసింపజేస్తూ, తన ఆగమాలతో దేవతలకు కూడా మోక్షపథాన్ని కలిగిస్తూ, భూమిపై వ్యాప్తి చెందిన స్వరూపంతో శ్రీమదానందతీర్థరు ఉత్తరమీమాంసాశాస్త్రంలో పట్టాభిషిక్తు డయ్యాడు.

**వి :** 1. తన ఆగమాలతో సుమనస్కులకు (దేవతలకు) కూడా సుక్షేమాన్ని (సత్పథాన్ని) కల్పించగలగటం విశేషం. ఆగమాలు ప్రధానంగా శైవ, శాక్తేయ, వైష్ణవ - ఆగమాలుగా మూడు విధాలుగా వుంటాయి. శైవాగమాలు శివసమర్చావిధానాన్ని, శాక్తేయాగమాలు శక్తి పూజావిధానాన్ని తెలుపుతాయి. శాక్తేయులు మరల దక్షిణాచారం వామాచారం అని రెండు తెగలు. వైష్ణవాగమాలు వైఖానసాగమాలు, పాంచరాత్రాగమాలు అని రెండు రకాలు. పాంచరాత్రాగమాలలో ఒక అవాంతరభేదం మాధ్వులు (ద్వైతులు) పాటించే తంత్రసారం సంగ్రహం. *

**శ్లో॥ వియుక్తనారీముఖపద్మపుఞ్జైః - సహామ్బుజాతం శిథిలం వితన్వన్ ।**
**ప్రబోధకల్పం రవిమల్పకాన్తిం - విధాయ హేమన్త ఉపాజగామ ॥ 5-40**

**అ :** హేమంత ఋతువర్ణనం - హేమంతుని రాక. -ఉపేంద్రవజ్ర.

**అ :** అంబు-జాతం వియుక్త-నారీ-ముఖ-పద్మ-పుంజైః సహ శిథిలం వితన్వన్ ప్రబోధకల్పం రవిమ్ అల్ప-కాంతిం విధాయ హేమంతః ఉపాజగామ.

**ప్ర :** అంబు-జాతమ్ = తామరను (అంబతే ఇతి అంబు, తస్మిన్ జాతమ్ తత్), వియుక్త-నారీ-ముఖపద్మ-పుంజైః-సహ : వియుక్త = విరహిణులయిన / భర్తను ఎడబాసిన, నారీ = స్త్రీలయొక్క, ముఖ-పద్మ = మోము తామరలయొక్క, పుంజైః - సహ = సమూహాలతో పాటు (వియుక్తాశ్చ తాః నార్యః, తాసాం ముఖాని ఏవ అబ్జాని, తేషాం పుంజాః, తైః), శిథిలమ్ = నలిగినదిగా, వితన్వన్ = చేస్తూ (వి - తను ధాతువుపై శతృ ప్రత్యయం), ప్రబోధ కల్పమ్ = జ్ఞానంతో సమానుడైన (ఈషదూనః ప్రబోధః ప్రబోధకల్పః, తమ్) **'ఈషదసమాప్తౌ కల్పబ్ దేశ్యదేశీయరః'** (అష్టాధ్యాయి 5-3-67), రవిమ్ = సూర్యుని, అల్పకాంతిమ్ = తక్కువ కాంతిగల వానిగా (అల్పా కాంతిః యస్య తమ్), విధాయ = చేసి (వి పూర్వక ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), హేమంతః = హేమంత ఋతువు, ఉప+ఆజగామ = వచ్చింది. (ఉప-ఆ- గమ్ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** (అప్పుడు) హేమంత ఋతువు వచ్చింది. ఎలా అంటే - విరహిణులయిన నారీమణుల ముఖకమలాలతో పాటు తామరలను శిథిలం చేస్తూ (మంచు కురియటంతో) జ్ఞాన సమానుడైన సూర్యుని కాంతిని క్షీణింపజేస్తూ (హేమంతం వచ్చింది).

**వి :** 1. హేమంత ఋతు లక్షణాలలో ప్రధానమైనది హిమపాతం. అది కమలాలను, కమలాప్తుని కూడా కాంతిహీనులను చేసింది. కమలాలతో పాటు వియుక్తనారీముఖ కమలాలను కూడా శిథిలం చేసింది. ఈ సహభావం కమల, కమలాప్తుల సహభావం ధ్వనిరూపంగా వుంది. కమల, ముఖకమల సహభావం వాచ్యంగా వుంది. కాబట్టి సహోక్త్యలంకారధ్వనీ, వాచ్యరూపమైన సహోక్త్యలంకారం రెండూ ఇక్కడున్నాయి. '**సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః**' (కు. 58)

అలాగే కమలాలకూ, నారీ ముఖకమలాలకూ కూడా శిథిలీక్రియమాణత అనే ఏకధర్మాన్ని చెప్పటం వలన తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' (కు. 44)

| | | | |
|---|---|---|---|
| 2. **ఆజగామ :** | ఆజగామ | ఆజగ్మతుః | ఆజగ్ముః |
| | ఆజగమిథ/ఆజగన్థ | ఆజగ్మథుః | ఆజగ్మ |
| | ఆజగామ/ఆజగమ | ఆజగ్మివ | ఆజగ్మిమ. |

*

## శ్లో॥ హిమార్దితాఙ్గః సకృదుష్ణరశ్మి - రపి స్మ వహ్నిం స్వకరైర్దధానః ।
## విశత్యజస్రం జలధిం తతస్తాం - కథం హిమానీమబలాః సహన్తే ॥ 5-41

**అ :** హేమంత ఋతువర్ణనం - సూర్యచేష్ట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఉష్ణరశ్మిః అపి సకృత్ హిమ+అర్దిత+అంగః స్వకరైః వహ్నిం దధానః అజస్రం జలధిం విశతి. తతః తాం హిమానీమ్ అబలాః కథం సహన్తే.

**ప్ర :** ఉష్ణ - రశ్మిః + అపి = సూర్యుడు కూడా (ఉష్ణాః రశ్మయః యస్య సః), సకృత్ = ఒక్కసారి, హిమ+అర్దిత+అంగః : హిమ = మంచుచేత, అర్దిత = పీడింపబడిన, అంగః = శరీరావయవాలు గలవాడై (హిమేన అర్దితాని అంగాని యస్య సః), స్వ-కరైః = తన కిరణాలతో/ చేతులతో (స్వస్య కరాః, తైః), వహ్నిమ్ = నిప్పును, దధానః = పట్టుకొని (ధా ధాతువుపై శానచ్ ప్రత్యయం), అజస్రమ్ = రోజూ, జలధిమ్ = సముద్రంలోనికి, విశతి = ప్రవేశిస్తున్నాడు. (సాయం సమయంలో అస్తమిస్తున్నాడని భావం) (విశ-ప్రవేశనే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తతః = ఆ కారణంవలన, తామ్ = ఆ, హిమానీమ్ = మంచు మొత్తాలను (హిమానీ హిమసంహతిః-అమరకోశః -దిక్-18), అబలాః = బలహీనలయిన స్త్రీలు, కథమ్ = ఏ రీతిగా, సహన్తే = సహించగలరు? (సహ మర్షణే ఆత్మనేపది-లట్-ప్ర.బ.)

**తా ॥** సూర్యుడు కూడా ఒక్కసారే మంచు తాకిడికి లోనై శరీరమంతా పీడింపబడగా తన కిరణాలతో (చేతితో) నిప్పుపట్టుకొని రోజూ సముద్రంలోనికి చొరబడుతున్నాడు. ఆ కారణం చేత కాంతలు మంచు మొత్తాలను సహింపలేకపోతున్నారు.

**వి :** 1. శ్లో॥ స రాజ్యం గురుణా దత్తం ప్రతిపద్యాధికం బభౌ ।
దినాన్తే నిహితం తేజః సవిత్రేవ హుతాశనః ॥ - రఘువంశం - 4-1

అన్నాడు కాళిదాసు. సాయం వేళలో సూర్యుడు తన తేజస్సును అగ్నిలో నిలిపి అస్తమిస్తాడు. రఘుమహారాజు అలా తన తండ్రి ఇచ్చిన తేజస్సుతో మరీ వెలిగిపోయాడు.

సూర్యుడు అలాచేస్తే లోకానికి ఇబ్బంది లేదు. కానీ ఇక్కడ సూర్యుడు అగ్నినే తన చేతులతో తీసికొని సముద్రంలోనికి వెళ్ళిపోతున్నాడు. కాబట్టి అగ్ని వున్నా తేజోహీనుడే. కాబట్టి మంచును భరించటం మరీ కష్టం.

2. సూర్యుడు వహ్నిని తన చేతులతో పట్టుకొని పోతున్నాడనటం తనకు సంబంధం లేని విషయాన్ని సంబంధమున్నట్లు వర్ణించటం కాబట్టి సంబంధాతిశయోక్త్యలంకారం '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు. 36)

| | | | |
|---|---|---|---|
| 3. **విశతి :** | **విశతి** | విశతః | విశన్తి |
| | విశసి | విశథః | విశథ |
| | విశామి | విశావః | విశామః |
| **సహన్తే :** | సహతే | సహేతే | **సహన్తే** |
| | సహసే | సహేథే | సహధ్వే |
| | సహే | సహావహే | సహామహే. |

4. అగ్ని అందుబాటులో లేకపోవటాన్ని పోతన మరొక రీతిగా సంభావించాడు-

ఆ. శంభు కంట నొకటి జలరాశి నొక్కటి
మఱియు నొకటి మనుజమందిరముల
నొదిఁగెఁగాక మెఱసియున్న మూఁడగ్నులుఁ
జలికి నోఁడి భక్తి సలుపకన్నె. - భాగవతం - 10/802

ఒకటి శివుని కంటిలో, ఒకటి సముద్రంలో, ఒకటి మనుష్యుల ఇళ్ళలో ఒదిగి పోయి అగ్ని తప్పించుకొంది కానీ లేక అదికూడా చలిముందు ఓడిపోయేదట. *

**శ్లో॥ పతిం వశీకర్తుమయం హి కాల - ఇతీవ కృష్ణం పతిమాప్తుకామాః ।**
**వ్రతం వితేనుః కిల గోపకన్యా - వితర్క్య తస్యాసమధామ ధన్యాః ॥ 5-42**

**అ :** గోపికలు **కాత్యాయనీవ్రతాన్ని** చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** కృష్ణం పతిమ్ ఆప్తు-కామాః గోప-కన్యాః పతిం వశీకర్తుం అయం హి కాలః ఇతి ఇవ తస్య అసమ-ధామ వితర్క్య ధన్యాః (సత్యః) వ్రతం వితేనుః కిల.

**ప్ర :** కృష్ణమ్ = శ్రీకృష్ణుని, పతిమ్ = భర్తనుగా, ఆప్తు-కామాః = పొందగోరిన (ఆప్తుం కామాః), గోప-కన్యాః = గోపకన్యలు (గోప్యః చ తాః కన్యాః), పతిమ్ = వల్లభుని, వశీకర్తుమ్ = లోగొనుటకు (వశీ - కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), అయం హి = ఇదియే, కాలః = తగిన సమయం, ఇతి+ఇవ = అనుకొన్నట్లుగా, తస్య = ఆ కృష్ణుని యొక్క, అసమ-ధామ : అసమ = సాటిలేని, ధామ = వెలుగును (ఉస్రధామ వసుకేతు మరీచి... హలాయుధకోశః-39), వితర్క్య = ఆలోచించి, ధన్యాః (సత్యః) = ధన్యురాళ్ళయి, వ్రతమ్ = వ్రతాన్ని (కాత్యాయనీవ్రతాన్ని), వితేనుః కిల = ఆచరించారు గదా! (వి-తనూ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** గోపికలు కృష్ణుడు తమ మగడు కావాలని కోరుకొంటున్నారు. వల్లభుని వశం చేసుకోవటానికి ఆ హేమంతకాలమే తగినదని వారు భావించారు. కృష్ణుని అసమతేజస్సు మనసా ధ్యానించి ధన్యలై వ్రతమాచరించారు.

**వి :** 1. '**నారాయణః పరంజ్యోతిరాత్మా నారాయణః పరః**' అని నారాయణ సూక్తం నారాయణునినే పరమజ్యోతిస్వరూపునిగా వర్ణిస్తుంది. దానిని ఇక్కడ '**అసమధామ**' అని జ్ఞప్తిచేయటం జరిగింది.

2. కాత్యాయనీవ్రతంలో వాళ్ళ మంత్రాన్ని భాగవతమిలా ప్రకటించింది.

శ్లో॥ **కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి ।**
**నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః ॥**

ఇతి మంత్రం జపన్త్యస్తాః **పూజాం చక్రుః కుమారికాః ॥** - భాగవతం 10/22/4

| | | | |
|---|---|---|---|
| 3. **వితేనుః :** వితతాన | వితేనతుః | **వితేనుః** | |
| వితేనిథ | వితేనథుః | వితేన | |
| వితతాన/వితతన | వితేనివ | వితేనిమ. | * |

**శ్లో॥ పుమాంసమభ్యర్చయితుం సలజ్జాః - సమాన్తరఙ్గా వరవర్ణినీశ్చ ।**
**సహోదరీం శ్రీరమణస్య దుర్గా - మపూజయంస్తాః కృతవిశ్వసర్గామ్ ॥5-43**

**అ :** గోపికలు కృష్ణునికి బదులు ఆయన సహోదరిని పూజించుటలోని ఆంతర్యం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తాః పుమాంసం, సమాంతరంగాః వర వర్ణినీః చ అభ్యర్చయితుం సలజ్జాః శ్రీరమణస్య సహోదరీం కృత విశ్వ సర్గాం దుర్గామ్ అపూజయన్.

**ప్ర :** తాః = ఆ గోపికలు, పుమాంసమ్ = పురుషునీ, సమ+అంతరంగాః : సమ = సమానమైన (తమతో), అంతరంగాః = మనస్సులుగల (సమాని అంతరంగాని యాసాః తాః), వరవర్ణినీః చ = ఇతర ఉత్తమస్త్రీలను గానీ (వరారోహామత్తకాశీన్యుత్తమా వరవర్ణినీ - అమరకోశః - మనుష్య - 4), అభ్యర్చయితుమ్ = పూజించటానికి, సలజ్జాః = సిగ్గుతో కూడినవారై (లజ్జయా సహితాః), శ్రీరమణస్య = నారాయణునియొక్క (శ్రియః రమణః తస్య), సహోదరీమ్ = సోదరియు, కృత-విశ్వ-సర్గామ్ : కృత = చేయబడిన, విశ్వ-సర్గామ్ = విశ్వసృష్టి గలదియు అయిన (కృతా విశ్వస్య సృష్టిః యయా తామ్), దుర్గామ్ = దుర్గను, అపూజయన్ = పూజించిరి. (పూజ-పూజాయాం-పరస్మైపది-లఙ్- ప్ర.బ.)

**తా ॥** గోపికలు పురుషులను గానీ, తమ అంతరంగాలవంటి అంతరంగాలే గల ఉత్తమ స్త్రీలనెవ్వరినీ గానీ అర్చించటానికి సిగ్గుపడ్డారు. అందువల్ల లక్ష్మీవల్లభునకు సోదరి, విశ్వసృష్టికర్త్రి అయిన దుర్గను పూజించారు.

**వి :** 1. **కాత్యాయనీ వ్రతాచరణం** - పోతన భాగవతం 10/805-806

"నందుని మందలోఁగల గోపకుమారికలు రేపకడ లేచి చని, కాళిందీజలంబులం దోఁగి, జలతీరంబున నిసుమునం గాత్యాయనీరూపంబు ఁజేసి సురభికుసుమగంధంబు లిడి, ధూపదీపంబు లిచ్చి, బహువిధోపహారంబులు సమర్పించి."

క. ఓ కాత్యాయని! భగవతి నీకుంమ్రొక్కెదము మేము నేఁడనుకంపన్
మా కిందఱకును వైళమ శ్రీకృష్ణుఁడు మగఁడు గాఁగఁ జేయుము తల్లీ!

2. అందఱూ కలసి శ్రీకృష్ణుడే మగడుకావాలని వ్రతమాచరించటం విశేషం.

| | | | |
|---|---|---|---|
| 3. **అపూజయత్ :** | **అపూజయత్** | అపూజయతామ్ | అపూజయన్ |
| | అపూజయః | అపూజయతమ్ | అపూజయత |
| | అపూజయమ్ | అపూజయావ | అపూజయామ. |

*

**శ్లో॥ కృష్ణం పతిం తాః కిల కామయన్త్యో - లక్ష్మీం ప్రసన్నాం విదధుర్వ్రతేన ।**
**స్వప్రేయసీవైరివధూః కథం తా - స్తుష్టాః ప్రభుః సోఽపరథా విదధ్యాత్ ॥5-44**

**అ :** కృష్ణునికోసం లక్ష్మిని ప్రసన్నను చేసికొనే ప్రయత్నం. -ఇంద్రవజ్ర.

**అ :** తాః కృష్ణం పతిం కామయన్త్యః వ్రతేన లక్ష్మీప్రసన్నాం విదధుః కిల. అపరథా సః ప్రభుః స్వప్రేయసీవైరవధూః తాః తుష్టాః కథం విదధ్యాత్.

**ప్ర :** తాః = ఆ గోపికలు, కృష్ణమ్ = కృష్ణుని, పతిమ్ = భర్తనుగా, కామయంత్యః = అభిలషిస్తూ, వ్రతేన = వ్రతంతో, లక్ష్మీమ్ = లక్ష్మిని (దుర్గను), ప్రసన్నామ్ = అనుగ్రహించు దానినిగా, విదధుః = చేశారు. (వి ధా ధారణపోషణయోః-పరస్మైపది-లిట్-ప్ర.బ.), అపరథా = లేకపోతే / అలా కాకపోతే, సః ప్రభుః = ఆ స్వామి, స్వ-ప్రేయసీ-వైరి-వధూః : స్వ = తనయొక్క ప్రేయసీ = భార్యకు, వైరి = శత్రువులయిన, వధూః = కాంతలను

(సవతులను) (స్వస్య ప్రేయసీ, తస్యాః వైరిణ్యః చ తాః వధ్వః, తాః), తుష్టాః = ఆనందింపజేయబడిన వారనుగా, కథమ్ = ఏ రీతిగా, విదధ్యాత్ = చేయగలడు? (వి-ధా ధారణపోషణయోః పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని భర్తనుగా పొందాలని కోరుతున్న ఆ గోపికలు కృష్ణునిపత్ని అయిన దుర్గావ్రతాన్ని ఆచరించారు. అవును మరి. అలా చేయకపోతే తన భార్యకు సపత్నులవుతున్న వారిని కృష్ణుడు ఎలా ఆనందింపజేయగలడు?

**వి :** 1. దక్షిణనాయకుడు కార్య (నాటక) నాయకుడైనప్పుడు సాధారణంగా కనిష్ఠా శృంగారవిషయంలో జ్యేష్ఠపత్ని సహకారం కనిపిస్తుంటుంది మొదట కొంత ఈర్ష్య కనిపించినా. ఈ మానవీయప్రవృత్తి అటు దేవతలకూ తప్పదేమో!

| | | | |
|---|---|---|---|
| 2. **విదధుః :** | విదధౌ | విదధతుః | **విదధుః** |
| | విదధిథ/విదధాథ | విదధథుః | విదధ |
| | విదధౌ | విదధివ | విదధిమ |

| | | | |
|---|---|---|---|
| **విదధ్యాత్:** | **విదధ్యాత్** | విదధ్యాతామ్ | విదధ్యుః |
| | విదధ్యాః | విదధ్యాతమ్ | విదధ్యాత |
| | విదధ్యామ్ | విదధ్యావ | విదధ్యామ. |

*

**శ్లో॥ నేముస్తాం ప్రణయాపరాధశమనే నమ్రోఽస్తు కృష్ణస్త్వితి**
**ప్రేమ్ణా పుష్పమవేదయన్ స్వకబరీం తైః సన్దధాత్విత్యలమ్ ।**
**ధూపం మజ్జనమారచయ్య సహ తద్ధూమేన తాం శోషయ-**
**త్వాలిఙ్గ్యాతనుతాదితీవ తిలకం గన్ధం చ తస్యై దదుః ॥ 5-45**

**అ :** కాత్యాయనీవ్రతసమయంలో గోపికలు చేసిన అర్చన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రణయ+అపరాధ-శమనే కృష్ణః నమ్రః అస్తు ఇతి తాం నేముః. కృష్ణః స్వకబరీం తైః అలం సన్దధాతు ఇతి ప్రేమ్ణా పుష్పమ్ అవేదయన్. కృష్ణః సహ మజ్జనమ్ ఆరచయ్య తాం తద్ధూమేన శోషయతి ఇతి ధూపమ్ అవేదయన్. ఆలిఙ్గ్య తిలకం గన్ధం చ ఆతనుతాత్ ఇతి ఇవ తస్యై తిలకం గన్ధం చ దదుః ।

**ప్ర :** ప్రణయ+అపరాధ-శమనే : ప్రణయ = అనురాగవిషయికంగా జరిగిన, అపరాధ = పొరపాట్లను, శమనే = శమింపజేయటంలో (ప్రణయే అపరాధః, తస్య శమనం, తస్మిన్), కృష్ణః = కృష్ణుడు, నమ్రః = లోబడినవాడుగా, అస్తు = ఉండుగాక (అస భువి పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఇతి = అని, తామ్ = ఆమెను గూర్చి (దుర్గను), నేముః = నమస్కరించిరి. (నమ ప్రహ్వత్వే శబ్దే చ-పరస్మైపది-లిట్-ప్ర.బ.), (కృష్ణః = కృష్ణుడు), స్వ-కబరీమ్ = తమ కొప్పును, తైః = వాటితో, అలమ్ = తగినంతగా, సందధాతు - ఇతి = సమకూర్చగలడు అని (సమ్+ధా ధారణ పోషణయోః లోట్-ప్ర.ఏ.), ప్రేమ్ణా = ప్రేమతో, పుష్పమ్ = పూవును, అవేదయన్ = నివేదించారు. (విద ప్రాప్తౌ ణిచ్ పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.) (కృష్ణః = కృష్ణుడు), సహమజ్జనమ్ = సరిస్నానం, ఆరచయ్య = చేసి, తామ్ = ఆ కబరిని, తద్-ధూమేన = ఆ పొగతో, శోషయతు+ఇతి = ఆరబెడతాడు అని, ధూపమ్ = ధూపాన్ని, అవేదయన్ = నివేదించారు. ఆలింగ్య = కౌగిలించి, తిలకమ్ = బొట్టును, గన్ధం చ = గంధాన్ని, ఆతనుతాత్ = విస్తరింపజేయుగాక, ఇతి+ఇవ = అన్నట్లుగా, తస్యై = ఆ దుర్గకు, తిలకమ్ = బొట్టును, గన్ధం చ = గంధాన్ని, దదుః = సమర్పించారు. (దా దానే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ప్రణయకోపాన్ని శమింపజేయటానికి కృష్ణుడు ఇలాగే నమ్రత వహించాలి అని ఆ గోపికలు దుర్గదగ్గర వినయాన్ని ప్రదర్శించారు. కృష్ణుడు తమ కొప్పులలో చక్కగా పూలను అలంకరించాలని ప్రేమతో ఆ దుర్గకు పువ్వులు అర్పించారు. కృష్ణుడు తమతో సరిస్నానాలు చేసి ధూపంతో వెంట్రుకల నారబెట్టాలి అన్నట్లు దుర్గకు

ధూపాన్ని నివేదించారు. కృష్ణుడు తమను కౌగిలించుకొని తమ గంధాన్ని, తిలకాన్నీ చెదరజేసి విస్తరింపజేయాలని ఆమెకు తిలకగంధాలను అర్పించారు.

**వి :** 1. గోపికలు చేసిన పూజ ఫలితమేనేమో కృష్ణుడు ప్రణయకోపాన్ని శమింప జేయటానికి నమ్రతామార్గాన్నే ఎంచుకొన్నాడు. తిమ్మన మాటల్లో...

ఉ. పాటలగంధిచిత్తమునఁ బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటు గామి మృదుపల్లవకోమలతత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదునందనుఁడర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనం బై తన
ర్చు లతాంతాయుధుకన్న తండ్రిశిర మచ్చో వామపాదంబునం
దోలఁగం ద్రోసె లతాంగి; యట్ల యగు; నాథుల్ నేరముల్ సేయఁ బే
రలుకం జెందిన యట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే?

చం. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్క బూని దాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానముఁ దాకిన నొచ్చు నంచు నే
ననియెద నల్క మానవుగదా! యిఁకనైన నరాళకుంతలా! – పారిజాతాపహరణం 1/120,121,123

ఆ మార్గం సత్ఫలితాలనే ఇచ్చింది కూడా.

2. **అస్తు :**

| | | | |
|---|---|---|---|
| **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |
| **అవేదయన్:** | అవేదయత్ | అవేదయతామ్ | **అవేదయన్** |
| | అవేదయః | అవేదయతమ్ | అవేదయత |
| | అవేదయమ్ | అవేదయావ | అవేదయామ |
| **సన్దధాతు :** | **సన్దధాతు**/సన్ధత్తాత్ | సన్ధత్తామ్ | సన్దధతు |
| | సన్ధేహి/సన్ధత్తాత్ | సన్ధత్తమ్ | సన్ధత్త |
| | సన్దధాని | సన్దధ్వ | సన్దధ్మ |
| **శోషయతు:** | **శోషయతు**/శోషయతాత్ | శోషయతామ్ | శోషయన్తు |
| | శోషయేః | శోషయేతమ్ | శోషయేత |
| | శోషయేయమ్ | శోషయేవ | శోషయేమ. |
| **దదుః :** | దదౌ | దదతుః | **దదుః** |
| | దదిథ/దధాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ. |

*

**శ్లో॥ తామ్బూలఇచ్ఛ ముకున్దచర్వితలసత్తామ్బూలసిద్ధ్యై పయ–**
**స్తద్బిమ్బోష్ఠసుధాప్తయే మృదుతనౌ భూషావలీం సన్దధుః ।**

**రత్యన్తే సమలఙ్కరోతు గలితాకల్పౌఘమస్మత్తను-**
**ష్విత్యాదీప్సితలబ్ధయేఽతికుశలాస్తామర్చయాఞ్చక్రిరే ॥ 5-46**

అ : సదుపచారాలతో కాత్యాయనీ సమర్చన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అతికుశలాః ముకుంద-చర్విత-లసత్తాంబూల-సిద్ధ్యై తాంబూలం చ తద్బింబ+ఓష్ఠ-సుధా+ఆప్తయే పయః, రత్యన్తే గలిత+ఆకల్ప+ఓఘమ్ అస్మత్తనుష సమలంకరోతు ఇతి మృదు-తనౌ భూషా+ఆవలీమ్ సందధుః - ఇత్యాది + ఈప్సితలబ్ధయే తామ్ అర్చయాంచక్రిరే.

**ప్ర :** అతి-కుశలాః = మిక్కిలి నేర్పరులైన గోపికలు, ముకుంద... సిద్ధ్యై : ముకుంద = కృష్ణునిచేత, చర్విత = నమలబడి, లసత్ = ప్రకాశించే, తాంబూల = తాంబూలం యొక్క, సిద్ధ్యై = లబ్ధికై, తాంబూలమ్ = తాంబూలాన్ని, బింబ+ఓష్ఠ-సుధా + ఆప్తయే : బింబ = దొండపండువంటి, ఓష్ఠ = పెదవి యందలి, సుధా = అమృతంయొక్క, ఆప్తయే = పొందుటకై, పయః = పాలను, రతి+అన్తే = రతి తరువాత (రతేః అన్తః తస్మిన్), గలిత+ఆకల్ప+ఓఘమ్ : గలిత = జారిపోయిన, ఆకల్ప = ఆభరణాలయొక్క, ఓఘమ్ = సమూహాన్ని, అస్మత్-తనుష = మా శరీరాలపై, సమలంకరోతు = చక్కగా అలంకరించాలి (అలం - కృ కరణే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), ఇతి = అని, మృదు-తనౌ = సున్నితమైన ఆ దుర్గశరీరంపై, భూషా+ఆవలీమ్ చ = నగల సముదాయాన్ని, సందధుః = అలంక రించారు. (సమ్ ధా ధారణపోషణయోః పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఇతి+ఆది+ఈప్సిత-లబ్ధయే : ఇతి+ఆది = మొదలుగా గల, ఈప్సిత = కోరికలయొక్క, లబ్ధయే = ప్రాప్తికై, తామ్ = ఆ దుర్గను, అర్చయాంచక్రిరే = పూజించారు. (అర్చ పూజాయాం పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** ఆ గోపికలు మిక్కిలి నేర్పరులు. ముకుందచర్వితమైన తాంబూలం తమకు లభించాలన్న కోరికతో ఆ కాత్యాయనికి తాంబూలాన్ని సమర్పించారు. ఆ కృష్ణుని అధర సుధలు లభించాలని దుర్గకు క్షీరాన్ని సమర్పించారు. రతాంతసమయంలో చెదరివున్న ఆభరణాలను కృష్ణుడు సవరించాలని ఆమెకు నగలను అర్పించారు. ఇటువంటి కోరికలతో ఆ కాత్యాయనిని సమర్చించారు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. సందధుః :** | సన్దధౌ | సన్దధతుః | **సన్దధుః** |
| | సన్దధిథ/సన్దధాథ | సన్దధథుః | సన్దధ |
| | సన్దధౌ | సన్దధివ | సన్దధిమ |

**సమ్-అలంకరోతు :**

| | | |
|---|---|---|
| **సమలంకరోతు**/సమలంకురుతాత్ | సమలంకురుతామ్ | సమలంకుర్వన్తు |
| సమలంకురు/సమలంకురుతాత్ | సమలంకురుతమ్ | సమలంకురుత |
| సమలంకరవాణి | సమలంకరవావ | సమలంకరవామ |

| | | | |
|---|---|---|---|
| **అర్చయాంచక్రిరే:** | చక్రే | చక్రాతే | చక్రిరే |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే |
| | చక్రే | చకృవహే | చకృమహే. |

*

**శ్లో॥ తతః సపత్న్యర్చనతత్పరాణాం - వ్రతం విరుద్ధం వ్రజబాలికానామ్ ।**
**స భగ్నమాధాతుమివామ్బరాణి - జహార ధీరోఽమ్బువిహారకాలే ॥ 5-47**

అ : కృష్ణుడు గోపికల వస్త్రాలను అపహరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః సః సపత్నీ+అర్చన తత్పరాణాం వ్రజ బాలికానాం విరుద్ధం వ్రతం భగ్నమ్ ఆధాతుమ్ ఇవ ధీరః (సన్) అంబు విహార కాలే అంబరాణి జహార.

**ప్ర :** తతః = ఆ తరువాత, సః = ఆ కృష్ణుడు, సపత్నీ+అర్చన-తత్పరాణామ్ : సపత్నీ = సవతులయొక్క, అర్చన = పూజయందు, తత్పరాణామ్ = ఆసక్తలయిన (సపత్న్యాః అర్చనం, తస్మిన్ తత్పరాః, తాసామ్), వ్రజ-బాలికానామ్ = గోపబాలికలయొక్క (వ్రజే బాలికాః తాసామ్), విరుద్ధమ్ = (లోకరీతికి) భిన్నమైన, వ్రతమ్ = వ్రతాన్ని, భగ్నమ్ = భంగపడినదిగా (భంజ్ ధాతువుపై క్త ప్రత్యయం), ఆధాతుమ్+ఇవ = చేయదలచినట్లుగా, ధీరః (సన్) = బుద్ధిమంతుడై (ధియం రాతి ఇతి ధీరః) ( ధీరో మనీషీ జ్ఞః ప్రాజ్ఞః-అమరకోశః-బ్రహ్మవర్గ -5), అంబు-విహార-కాలే : అంబు = నీటిలో, విహార = విహరిస్తున్న / స్నానమాడుతున్న, కాలే = సమయంలో (అంబుని విహారః, తస్య కాలః, తస్మిన్), అంబరాణి = బట్టలను, జహార = అపహరించాడు. (హృ-హరణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత (కాత్యాయనీ పూజ) ముగిసిన తర్వాత తమ సపత్నినే అర్చించటంలో ఆసక్తిని కనబరచిన ఆ వ్రజబాలికలవ్రతాన్ని భగ్నం చేయాలని తలపోసినట్లు ధీశాలి అయిన ఆ కృష్ణుడు ఆ బాలికలు జలవిహారం చేస్తున్న సమయంలో వారి వస్త్రాలను అపహరించాడు.

**వి :** 1.పోతన భాగవతంలో-

తరలం. కదలకుం డని తోడివారలఁ గన్నుసన్నుల నిల్పుచున్
బదము లొయ్యన నేలఁ బెట్టుచుఁ బద్మనేత్రుఁడు మౌనియై
పొదల మాటున నల్లనల్లన పొంచి పొంచి నతాంగుఁడై
యదను గోరుచు డాసి వ్రేతల యంబరంబులు దొంగిలెన్. - పోతనభాగవతం-10/814

2. గోపికల వస్త్రాలను కృష్ణుడు అపహరించటానికి ఫలం వారి వ్రతాలను భంగపరచట మని వర్ణించినందువలన ఇది ఫలోత్ప్రేక్షాలంకారం. 'సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా' (కు.32)

| | | | |
|---|---|---|---|
| 3. **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. |

*

**శ్లో॥ దేహీశామ్బరమస్మదీయమబలా దత్తం క్వ తద్వర్తతే**
**మధ్యే వః ప్రతిభాతి తర్హి న కథం సందృశ్యతేఽస్మద్దృశా ।**
**ముగ్ధాస్తార్కికమౌలియుక్త్యకలితం తన్నైవ వః శక్యతే**
**ద్రష్టుం చఞ్చలలోచనైరితి వదన్ కృష్ణః స పుష్ణాతు మామ్ ॥ 5-48**

**అ :** గోపికా కృష్ణుల సంవాదం - ఛలగర్భితం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** గోప్యః - ఈశ అస్మదీయమ్ అంబరం దేహి
కృష్ణ ః - అబలాః దత్తమ్
గోప్యః - తత్ క్వ వర్తతే
కృష్ణః - వః మధ్యే ప్రతిభాతి
గోప్యః - తర్హి అస్మద్దృశా కథం న సందృశ్యతే
కృష్ణః - ముగ్ధాః తార్కికమౌళియుక్తి+అకలితం తత్ వః చంచల-లోచనైః ద్రష్టుం నైవ శక్యతే.

కవిః – ఇతి వదన్ సః కృష్ణః మాం పుష్ణాతు.

**ప్ర : గోపికలు** : ఈశ! = ప్రభూ, అస్మదీయమ్ = మాయొక్క, అంబరమ్ = వస్త్రాన్ని, దేహి = ఇవ్వు; **కృష్ణుడు** : అబలాః = అబలలారా!, దత్తమ్ = ఇవ్వబడింది (అంబర శబ్దానికి ఆకాశమనే అర్థం తీసికొని వారి నడుములు ఆకాశం వంటివనే భావనతో కృష్ణుని సమాధానం), **గోపికలు** : దత్తమ్ = ఇవ్వబడినట్టి, తత్ = ఆ వస్త్రం, క్వ = ఎక్కడ, వర్తతే = ఉన్నది? (వృతు వర్తనే ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), **కృష్ణుడు** : వః = మీ యొక్క, మధ్యే = మధ్యలో, ప్రతిభాతి = ప్రకాశిస్తోంది. (ప్రతి–భా దీప్తౌ పరస్మైపది–లట్–ప్ర.ఏ.), **గోపికలు** : తర్హి = అయితే, అస్మద్ దృశా = మా దృష్టితో, కథమ్ = ఎలా, న సందృశ్యతే = చూడబడుటలేదు. (దృశ్ ప్రేక్షణే–కర్మణి–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), **కృష్ణుడు** : ముగ్ధాః! = అమాయికలారా!, తార్కిక... కలితమ్ : తార్కిక– మౌళి = తార్కికశ్రేష్ఠులయొక్క (తర్కశాస్త్ర–నిష్ణాతులు తార్కికులు) యుక్తి = యుక్తి (అనుమానప్రమాణం)తో, అకలితమ్ = కలుపబడనిదై, వః = మీ యొక్క, చంచల–లోచనైః = కదిలే కళ్ళతో, ద్రష్టుమ్ = చూచుటకు, న+ఏవ శక్యతే = వీలే కాదు, **కవి** : ఇతి = అని, వదన్ = చెపుతూ, సః కృష్ణః = ఆ కృష్ణుడు, మామ్ = నన్ను, పుష్ణాతు = పోషించును గాక.

**తా ॥ 'కృష్ణా మా వస్త్రాలనివ్వు' 'ఎప్పుడో ఇచ్చేశాను' 'ఇస్తే ఎక్కడ వున్నాయి' 'మీ నడుముల మీదే' 'అయితే మాకు కనబడవే' 'తార్కికశ్రేష్ఠుల అనుమానప్రమాణంతో చూడకపోతే మీ చంచలనేత్రాలతో మీరు చూడలేరు'**– అని అంటూవున్న కృష్ణుడు మాకు పుష్టిని కలిగించు గాక.

**విశే :** 1. తార్కికులు దేనినైనా అనుమానప్రమాణంతోనే సాధించాలని భావిస్తారు. వ్యాప్తి సహకారంతో, పంచావయవవాక్యప్రయోగంతో, స్వార్థపరార్థానుమానాలను ఉపయోగించి సాధ్యాన్ని సాధిస్తారు. ఇక్కడ కూడా అంబరాన్ని (ఆకాశాన్ని) గోపికల శరీర మధ్యభాగంలో సాధించాడు కృష్ణుడు. గోపికలకు కనిపించలేదు. ప్రత్యక్షప్రమాణంతో వారు చూస్తున్నారు కాబట్టి. మధ్యలో ఆకాశం లేదా ఆకాశం మధ్యభాగం లేకపోతే శరీరపూర్వాపరభాగాలకు అనుసంధానమేది? ఆ భాగాలు కలిసే వున్నాయి కాబట్టి మధ్య కూడా వున్నట్టే. అదే ఆకాశం.

2. అంబరశబ్దాన్ని గోపికలు వస్త్రార్థంలో ప్రయోగిస్తే దానికి ఆకాశార్థాన్ని తీసికొని కృష్ణుడు సమాధానమివ్వటం వక్రోక్తి. '**వక్రోక్తిః శ్లేష కాకుభ్యామపరార్థ ప్రకల్పనమ్**' (కు.159)

| | | | |
|---|---|---|---|
| 3. **దేహి :** | దధాతు/దత్తాత్ | దత్తామ్ | దదతు |
| | **దేహి**/దత్తాత్ | దత్తమ్ | దత్త |
| | దదాని | దదావ | దదామ |
| **వర్తతే :** | **వర్తతే** | వర్తేతే | వర్తన్తే |
| | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| | వర్తే | వర్తావహే | వర్తామహే |
| **ప్రతిభాతి:** | **ప్రతిభాతి** | ప్రతిభాతః | ప్రతిభాన్తి |
| | ప్రతిభాసి | ప్రతిభాథః | ప్రతిభాథ |
| | ప్రతిభామి | ప్రతిభావః | ప్రతిభామః |
| **సందృశ్యతే:** | **సందృశ్యతే** | సందృశ్యేతే | సందృశ్యన్తే |
| | సందృశ్యసే | సందృశ్యేథే | సందృశ్యధ్వే |
| | సందృశ్యే | సందృశ్యావహే | సందృశ్యామహే |

| | | | |
|---|---|---|---|
| **శక్యతే :** | **శక్యతే** | శక్యేతే | శక్యన్తే |
| | శక్యసే | శక్యేథే | శక్యధ్వే |
| | శక్యే | శక్యావహే | శక్యామహే |
| **పుష్ణాతు :** | **పుష్ణాతు**/పుష్ణీతాత్ | పుష్ణీతామ్ | పుష్ణన్తు |
| | పుష్ణీహి/పుష్ణీతాత్ | పుష్ణీతమ్ | పుష్ణీత |
| | పుష్ణాని | పుష్ణావ | పుష్ణామ. |

*

**శ్లో॥ తతః క్రమేణాఙ్కురితాఙ్గజాతా - నిరీక్ష్య తాశ్చఞ్చలలోచనాన్తాః ।**
**స్వసఙ్గయోగ్యా ఇతి తర్కయన్ స - దదౌ ముదా తద్వసనాని మానీ ॥ 5-49**

**అ :** గోపికలకు వస్త్రాలను తిరిగి ఇవ్వటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః క్రమేణ అంకురిత+అంగజాతాః చంచల లోచనాన్తాః తాః నిరీక్ష్య స్వసంగ యోగ్యాః ఇతి తర్కయన్ మానీ సః ముదా తద్వసనాని దదౌ.

**ప్ర :** తతః = ఆ పై, క్రమేణ = పరిపాటిగా (క్రమః అనుపాత్యయ ఆవృత్ స్త్రీ పరిపాటీ - వైజయన్తీ-బ్రాహ్మణ-113), అంకురిత+అంగజాతాః : అంకురిత = పొడమిన, అంగజాతాః = కోరికలు గలవారును (అంకురితాః అంగజాతాః యాసు తాః), చంచల - లోచన+ అంతాః : చంచల = అటు ఇటు కదలుతున్న, లోచన+అన్తాః = కనుకొనలు గలవారును (చంచలాః లోచనానామ్ అన్తాః యాసాః తాః) అయిన, తాః = ఆ గోపబాలికలను, నిరీక్ష్య = చక్కగా చూచి (నిర్ - ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వ-సంగ-యోగ్యాః : స్వ = తనతో, సంగ = చేరిమికి, యోగ్యాః = తగిన వారుగా (స్వేన సంగః, తస్య యోగ్యాః, తాః), ఇతి = అని, తర్కయన్ = భావిస్తూ, మానీ-సః = అభిమానవంతుడైన ఆ కృష్ణుడు, ముదా = ఆనందంతో, తద్-వసనాని : తద్ = వారియొక్క వసనాని = వస్త్రాలను, దదౌ = ఇచ్చాడు (దా దానే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ గోపకాంతలు కృష్ణుని అభ్యర్థించిన తరువాత మెల్లగా వారిలో కోరికలు కలుగుతున్నాయనీ, అందువలననే కనుకొనలలో చంచాల్యం కనిపిస్తోందని గమనించి వారు తన చెలిమికి తగిన వారని భావించి కృష్ణుడు వారి వస్త్రాలను వారికిచ్చాడు.

**వి :** 1. వారికి కలిగిన కోరిక సత్సాంగత్యాభిలాష... అది ముక్తికి దారి.

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం - నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం - నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥ - భజగోవిందం - 9

ఆ విషయాన్ని పోతన కృష్ణునిచేతనే చెప్పించాడు.

సీ. లక్షణవతులార! లజ్జించి చెప్పరు - గాని మీ మర్మముల్ గానఁబడియె
నను౦ గొల్వఁ జింతంచినారు నాచేతను - సత్యంబు మీ నోము సఫల మగును;
గామితార్థంబుల కలిమి చెప్పఁగ నేల - ననుఁ గొల్వ ముక్తిని నడవవచ్చుఁ;
గడమ గూడఁగ నంబికాదేవి నోమంగ - నట మీఁద రాత్రులయందు మీకు

ఆ. నన్నుఁ బొందఁగల్గు నమ్మి పొందని హరి
పల్కనింతులెల్ల భ్రాంతిఁ జనిరి
తపము పండె ననుచుఁ దత్పదాంభోజముల్,
మానిపించుకొనుచు మందకడకు. - పోతనభాగవతం - 10/846

2. **దదౌ :** 5-45వ శ్లోకవ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ తతో వనే సఞ్చరణాదతిశ్రాన్తాః కదాచన ।**
**అన్నార్థినో యయుర్గోపాః పూర్ణాం యజ్ఞసభాం ద్విజైః ॥ 5-50**

**అ :** గోపకులు ఆకలిగొని అన్నార్థులై యజ్ఞసభకు వెళ్ళుట. -పథ్యావక్త్రమ్.

**అ :** తతః కదాచన వనే సంచరణాత్ అతిశ్రాంతాః అన్న+అర్థినః గోపాః ద్విజైః పూర్ణాం యజ్ఞ-సభాం యయుః ।

**ప్ర :** తతః = అటు తర్వాత, కదాచన = ఒకప్పుడు, వనే = అడవిలో, సంచరణాత్ = తిరిగినందువలన, అతిశ్రాంతాః = బాగా అలసిపోయిన వారును, అన్న+అర్థినః = ఆహారాన్ని కోరుతున్న వారును అయిన (అన్నస్య అర్థినః), గోపాః = గోపకులు, ద్విజైః = బ్రాహ్మణులతో, పూర్ణామ్ = నిండివున్న, యజ్ఞ-సభామ్ = యాగవాటికకు, యయుః = వెళ్ళారు. (యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కాలమలా సాగుతుండగా ఒకసారి గోపాలకులు అడవిలో తిరిగి, బాగా అలసిపోయి, ఆహారాన్ని ఆశిస్తూ, బ్రాహ్మణులతో నిండివున్న యజ్ఞవాటికకు వెళ్ళారు.

**వి :** 1. ద్విజైః : 'ద్వే జన్మనీ యస్య సః – రెండు జన్మలు గలవారు; **'ఉపనయనం బ్రాహ్మణస్యాష్టమే' 'తద్ద్వితీయం జన్మ'** అని ధర్మసూత్రాలు ఉపనయనాన్ని బ్రాహ్మణునికి రెండవ జన్మనుగా చెప్తున్నాయి. అండజాలు (గుడ్లనుండి పుట్టేవి), దంతాలకు కూడా ద్విజన్మ పదం వర్తిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **యయుః :** | యయౌ | యయతుః | **యయుః** |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. * |

**శ్లో॥ క్షుత్పీడితాఽపి పరమానుగమణ్డలీ సా**
**కృష్ణాయ భోజ్యమితి విప్రచయం యయాచే ।**
**యుక్తం హి తన్మురరిపోరనుగా విరాగా**
**యత్నం కదాచిదపి న స్వకృతే ప్రకుర్యుః ॥ 5-51**

**అ :** గోపకులు కృష్ణుని కొఱకుగా అన్నాన్ని అర్థించటం. -వసంతతిలక.

**అ :** సా పరమ+అనుగ మండలీ క్షుత్పీడితా+అపి కృష్ణాయ భోజ్యమ్ – ఇతి విప్రచయం యయాచే । తద్ యుక్తం హి. విరాగాః ముర రిపోః అనుగాః కదాచిత్+అపి స్వకృతే యత్నం న ప్రకుర్యుః

**ప్ర :** సా = ఆ, పరమ+అనుగ-మండలీ : పరమ = పరమాత్మ అయిన శ్రీకృష్ణుని, అనుగ = అనుసరించే వారి యొక్క, మండలీ = సమూహం (పరమమ్ అనుగచ్ఛన్తి ఇతి పరమానుగాః తాసాం మండలీ), క్షుత్-పీడితా+అపి : క్షుత్ = ఆకలిచే (అశనాయా బుభుక్షా ప్సా జిఘత్సా క్షుత్ క్షుదా సమాః-హలాయుధకోశః-361), పీడితా+అపి = బాధింప బడుతున్నా (క్షుదా పీడితా), కృష్ణాయ = కృష్ణుని కోసం, భోజ్యమ్ ఇతి = ఆహారమని, విప్రచయమ్ = బ్రాహ్మణసమూహాన్ని, యయాచే = అభ్యర్థించింది. (యాచ యాచనే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), తత్ = అది, యుక్తం హి = తగినదే కదా!, విరాగాః = రాగమెరగని వారైన, మురరిపోః = కృష్ణునియొక్క, అనుగాః = అనుచరులు, కదాచిత్+అపి = ఎప్పుడు కూడా, స్వకృతే = తమకోసం (స్వేషాం కృతే), యత్నమ్ = పూనికను, న ప్రకుర్యుః = చేయరుగదా! (ప్ర కృ కరణే-పరస్మైపది-ఆశీర్లిఙ్-ప్ర.బ.)

**తా ॥** పరమాత్మ అయిన కృష్ణుని అనుచరుల సమూహం ఆకలితో పీడింపబడుతూ కూడా కృష్ణునికై ఆహారం కావాలని బ్రాహ్మణులను అభ్యర్థించింది. అది తగినపనియే. హరిభక్తులు విరాగులు. వారు ఎప్పుడూ తమకోసం ఏ ప్రయత్నమూ చేయరు.

**విశే :** 1. కృష్ణభక్తులు తమ ప్రయత్నాలనూ, ఫలితాలనూ అన్నింటినీ 'కృష్ణార్పణంగా'నే భావిస్తారు.

| | | | |
|---|---|---|---|
| 2. **యయాచే :** | **యయాచే** | యయాచాతే | యయాచిరే |
| | యయాచిషే | యయాచాథే | యయాచిధ్వే |
| | యయాచే | యయాచివహే | యయాచిమహే |
| **ప్రకుర్యుః :** | ప్రకుర్యాత్ | ప్రకుర్యాతామ్ | **ప్రకుర్యుః** |
| | ప్రకుర్యాః | ప్రకుర్యాతమ్ | ప్రకుర్యాత |
| | ప్రకుర్యామ్ | ప్రకుర్యావ | ప్రకుర్యామ. |

*

**శ్లో॥ స్వీయక్రియాభఙ్గభయేన విప్రాః - శ్రేయస్కృతే తే న దదుః కిలాన్నమ్ ।**
**భృత్యైః సహాశ్నాతి మఖేఽస్మదీయ - ఇత్థం విదిత్వేతి మమ ప్రతర్కః ॥5-52**

**అ :** విప్రులు కృష్ణునకు ఆహారమివ్వకపోవుట. -ఇంద్రవజ్ర.

**అ :** తే విప్రాః స్వీయ-క్రియా-భంగ-భయేన శ్రేయస్కృతే అన్నం న దదుః కిల. అస్మదీయే మఖే భృత్యైః సహ అశ్నాతి ఇత్థం విదిత్వా (న దదుః) ఇతి మమ ప్రతర్కః.

**ప్ర :** తే విప్రాః = ఆ బ్రాహ్మణులు, స్వీయ-క్రియా-భంగ-భయేన : స్వీయ = తమ యొక్క, క్రియా = పనుల (యాగం) యొక్క, భంగ = ఆటంకమను, భయేన = భీతితో (స్వీయాః చ తాః క్రియాః, తాసాం భంగే భయం, తేన), శ్రేయస్కృతే = శ్రేయస్సును కల్గించే కృష్ణునకు, అన్నమ్ = ఆహారాన్ని, న దదుః కిల = ఇవ్వలేదు గదా! (దా దానే-పరస్మైపది-లిట్-ప్ర.బ.), అస్మదీయే = మాయొక్క, మఖే = యాగంలో, భృత్యైః సహ = అనుచరులతో గూడి, అశ్నాతి = ఆరగిస్తాడు. (అశ్ భక్షణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఇత్థమ్ = ఈ రీతిగా, విదిత్వా = గ్రహించి (విద్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), (న దదుః = ఇవ్వలేదని), మమ = నా యొక్క, ప్రతర్కః = వాదన.

**తా ॥** అక్కడ బ్రాహ్మణులు తమ (మఖ) క్రియాభంగం అవుతుందేమో అన్న భయంతో శ్రేయస్కారి అయిన కృష్ణునకు ఆహారాన్ని అందివ్వలేదు. బహుశః యాగభాగంగానే అనుచరులయిన ఇతర దేవతలతో కలిసి ఆరగిస్తాడులే అన్న ఆలోచనతోనే వారు ఆహారాన్ని ఇవ్వలేదని నా అభిప్రాయం.

**వి :** 1. వాదిరాజతీర్థరు ఆ విప్రుల ఆంతర్యాన్ని వెలువరించేందుకూ, వారి చర్యను సమర్థించేందుకు చేస్తున్న ప్రయత్నమిది. కృష్ణుని మాహాత్మ్యాన్ని గుర్తించి (ఊహ) కూడా యాగభాగంగానే ఆరగించవచ్చునన్నది వారి అభిప్రాయమై వుండవచ్చునని కవి భావన.

పోతన భాగవతంలో అది వారి దుర్మతిత్వమని నిందించాడు.

మ. క్రతువున్ మంత్రము తంత్రమున్ ధనములుం గాలంబు దేశంబు దే
వతయున్ ధర్మము నన్యముల్ దలఁప నెవ్వాఁ డట్టి సర్వేశ్వరున్
మతి నూహింపక గోపబాలుఁ డనుచున్ మందస్థితిం జూచి దు
ర్మతులై యన్నము, లేదు లేదనిరి సన్మానక్రియాశూన్యులై. - 10/853

**'న కంచన వసతౌ ప్రత్యాచక్షీత. తద్ వ్రతమ్' తస్మాద్యయా కయాచ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్'** అని

తైత్తిరీయోపనిషత్తు (3/10) చెప్తోంది. ఇంటిలో – అనగా ఇంటికివచ్చిన వారిని ఎవ్వరినీ తిరస్కరించగూడదు, అని ఉపనిషద్వచనం. ఆకలి అంటూ వచ్చి అర్థించిన వారిని తిరస్కరించటం చేయదగదని ఉపనిషత్తులు చెప్తున్నా – మందమతిత్వ మవుతుంది. కానీ కృష్ణమహత్త్వాన్ని గుర్తించలేకపోవటం కాదు. తత్త్వజ్ఞానాన్ని జీవితాలలో సమన్వయించి చూచుకొన గలిగినప్పుడే వాటికి విలువ.

2. **దదుః :** 5–45వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **అశ్నాతి :** | **అశ్నాతి** | అశ్నీతః | అశ్నంతి |
| | అశ్నాసి | అశ్నీథః | అశ్నీథ |
| | అశ్నామి | అశ్నీవ | అశ్నీమ. |

*

**శ్లో॥ విప్రాఙ్గనాః స్వప్రభవే ప్రహృష్టాః – ప్రత్యర్ప్య సర్పిర్దధిపాయసాది ।**
**ముక్తిం కరస్థాం కిల తా వితేనుః – పుంస్త్వేన కిం పూరుషమౌళిభాజామ్ ॥5-53**

**అ :** బ్రాహ్మణస్త్రీలు కృష్ణుని ఆకలిని తీర్చి ముక్తిని పొందుట. –ఇంద్రవజ్ర.

**అ :** తాః విప్ర+అంగనాః ప్రహృష్టాః (సత్యః) స్వప్రభవే సర్పిర్దధిపాయస+ఆది ప్రత్యర్ప్య ముక్తిం కరస్థాం వితేనుః కిల. పూరుషమౌళిభాజాం పుంస్త్వేన కిమ్?

**ప్ర :** తాః = (కృష్ణునిచే ప్రార్థింపబడిన) ఆ, విప్ర+అంగనాః = బ్రాహ్మణస్త్రీలు (విప్రాః చ తాః అంగనాః), ప్రహృష్టాః (సత్యః) = పరమానందపడినవారై, స్వప్రభవే = తమ స్వామికి (కృష్ణునకు), సర్పిః–దధి–పాయస+ఆది : సర్పిః = నేయి, దధి = పెరుగు, పాయస = పరమాన్నం, ఆది = మొదలయినవి, ప్రత్యర్ప్య = సమర్పించి (ప్రతి– ఋ ణిచ్–ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ముక్తిమ్ = మోక్షాన్ని (ముచ్ ధాతువుపై క్తిన్ ప్రత్యయం), కరస్థామ్ = చేతనున్న దానినిగా (కరే తిష్ఠతి ఇతి తామ్), వితేనుః కిల = చేసికొన్నారు గదా! (వి–తనూ విస్తారే లిట్–ప్ర.బ.), పూరుషమౌళి–భాజామ్ = పురుషోత్తముని చేరిన వారికి, పుంస్త్వేన = మగతనంతో, కిమ్? = అవసరమేముంటుంది?

**తా ॥** (విప్రులు ఆహారమివ్వడానికి నిరాకరించిన తరువాత కృష్ణుడు విప్రపత్నుల దగ్గరకు తన సహచరులను పంపాడు.) ఆ విప్రాంగనలు పరమానందపడి నేయి, పెరుగు, పాయసం మొదలయిన పదార్థాలను కృష్ణునకు సమర్పించి ముక్తిని కైవసం చేసికొన్నారు. పురుషోత్తముని సేవించే వారికి పుంస్త్వంతో పని ఏముంది?

**వి :** 1. **జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా...** (వివేకచూడామణి–1)అని శంకరాచార్యవచనం. నరజన్మ – అందునా పురుషజన్మ – అందులో బ్రాహ్మణత్వం దుర్లభాలంటూ చెప్పినమాట విలక్షణంగా కనిపిస్తుంది. అందునా అద్వైతసిద్ధాంతప్రస్థానంలో. దానిని నిరాకరిస్తూ కాబోలు ఇక్కడ ద్వైతసిద్ధాంతవ్యాఖ్యాత '**పురుష–మౌళిభాజామ్ పుంస్త్వేన కిమ్**' అని ప్రశ్నిస్తున్నాడు.

2. భాగవతమూలం కూడా విష్ణుభక్తితప్ప విశేషాధికారాలు అవసరం లేదనే ప్రతి–పాదించింది.

శ్లో॥ అహో పశ్యత నారీణామపి కృష్ణే జగద్గురౌ ।
దురంతభావం యోఽచ్ఛింద్యాన్మృత్యుపాశాన్ గృహాభిధాన్ ॥

శ్లో॥ నాసాం ద్విజాతిసంస్కారో న నివాసో గురావపి ।
న తపో నాత్మమీమాంసా న శౌచం న క్రియాః శుభాః ॥

శ్లో॥ అథాపి హ్యుత్తమశ్లోకే కృష్ణే యోగేశ్వరేశ్వరే ।
భక్తిర్దృఢా న చాస్మాకం సంస్కారాదిమతామపి ॥ – భాగవతం 10/23/41-43

ఇంతకు ముందు అన్నదానాన్ని నిరాకరించిన ఆ విప్రులే ఇప్పుడు ఆక్రోశిస్తూ, కృష్ణుని కృపకై ఆయనకు మ్రొక్కే విధాన్ని గమనించండి–

చ. కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధిలేదు నేఁ
డిట హరిగానఁబోనెఱుఁగ మేము దురాత్ముల మేము కల్మషో
ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞతలేల తపంబులేల ప
ర్యటనము లేల శీలములు యాగములున్ మఱి యేల కాల్పనే.

మ. క్రతువుల్ ధర్మము మంత్రతంత్రధనముల్ గాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వాఁ డట్టి సర్వేశుఁ డీ
క్షితి రక్షింప జనించినాఁ డెఱుఁగ మా శ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథసంహర్తకున్. – పోతనభాగవతం 10/870,873

3. **వితేనుః :** 5–42వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ స విప్రపత్న్యర్పితభక్తభుక్త్యా – విభుః సమాసక్తమనా ఇవైన్ద్రమ్ ।**
**అభుఙ్క్త భోజ్యం గతభీర్గిరీన్ద్ర–వపుః స్వకీయార్పితమప్రతీతః ॥ 5–54**

**అ :** ఇంద్రునకు సమర్పింపవలసిన బలిని కృష్ణుడు తానే స్వీకరించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** విభుః గత భీః గిరీంద్ర వపుః అప్రతీతః సః విప్ర–పత్నీ+అర్పిత–భక్త–భుక్త్యా సమాసక్త–మనాః ఇవ స్వకీయ+అర్పితమ్ ఐంద్రమ్ అభుంక్త.

**ప్ర :** విభుః = ప్రభువును/ సమర్థుడును, గత–భీః = పిరికితనం లేనివాడును (గతా భీః యస్మాత్సః), గిరి+ఇంద్ర–వపుః : గిరి+ఇంద్ర = గొప్ప పర్వతంవంటి, వపుః = శరీరం గలవాడును (గిరీణామ్ ఇంద్రః, తస్య వపుః ఇవ వపుః యస్య సః), అప్రతీతః = అదృశ్యుడును అయిన (న ప్రతీయతే పరైః ఇతి అప్రతీతః), సః = ఆ కృష్ణుడు, విప్ర–పత్నీ+అర్పిత–భక్త–భుక్త్యా : విప్ర = బ్రాహ్మణులయొక్క, పత్నీ = భార్యలచే, అర్పిత = సమర్పింపబడిన, భక్త = వంటకంయొక్క (భజ్యతే ఇతి భక్తమ్), భుక్త్యా = తినుటచేత (విప్రాణాం పత్న్యః, విప్రపత్నీభిః అర్పితస్య భక్తస్య భుక్తిః, తయా), సమాసక్త–మనాః+ఇవ = రుచిగొన్న మనస్సు గలవానివలె, స్వకీయైః = తనవారైన గోపాలురచే, అర్పితమ్ = సమర్పింపబడిన, ఐంద్రమ్ = ఇంద్రదేవతాకమైన/ ఇంద్రుని ఉద్దేశించిన పదార్థాన్ని, అభుంక్త = తిన్నాడు. (భుజ్ – పాలనాభ్యవహారయోః–ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** సమర్థుడు, నిర్భయుడు, గిరీంద్రశరీరుడు, అందరకు తెలియరానివాడు అయిన కృష్ణుడు విప్రభార్యలు సమర్పించిన ఆహారపదార్థాలను తిని, వాటిపై మనస్సుపడి, తన సహచరులు ఇంద్రుని ఉద్దేశించి సమర్పించిన పదార్థాన్ని కూడా తినేశాడు.

**వి :** 1. '**ఇంద్రః సర్వా దేవతాః ఇంద్రశ్రేష్ఠా దేవాః**' (శతపథబ్రాహ్మణం – 3/4/2/2) అని శతపథబ్రాహ్మణ వచనం. ఐంద్రమైన ఆహుతిని భక్షిస్తే సర్వాహుతులను స్వీకరించినట్లే. సర్వాత్మకుడైన కృష్ణుడు సర్వాహుతులను తానే స్వీకరించటంలో దోషం లేదు.

విప్రపత్నులు సమర్పించిన వంటకాన్ని భుజించి, రుచిమరిగి, ఇంద్రుని భాగాన్ని తిన్నట్లు కాని కారణాన్ని కారణంగా చెప్పటం వల్ల **హేతూత్ప్రేక్షాలంకారం.**

| | | | |
|---|---|---|---|
| 2. **అభుంక్త :** | **అభుంక్త** | అభుంజాతామ్ | అభుంజత |
| | అభుంక్థాః | అభుంజాథామ్ | అభుంగ్ధ్వమ్ |
| | అభుంజి | అభుంజవహి | అభుంజమహి. |

*

**శ్లో॥ ప్రదక్షిణీకృత్య గిరిం స్వవర్గైర్ముదాఽర్పితం పర్వతరూపధారీ ।**
**బలిం చ కృష్ణః శతమన్యుమన్యువివర్ధనోఽసావురరీచకార ॥ 5-55**

**అ :** కృష్ణుడు గిరిరూపధారియై అనుచరు లర్పించిన బలుల స్వీకరించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** శతమన్యు-మన్యు-వివర్ధనః అసౌ కృష్ణః గిరిం ప్రదక్షిణీకృత్య పర్వత-రూప-ధారీ (సన్) స్వ-వర్గైః ముదా అర్పితమ్ ఉరరీచకార.

**ప్ర :** శతమన్యుమన్యువివర్ధనః : శతమన్యు = ఇంద్రునియొక్క, మన్యు = కోపాన్ని, వివర్ధనః = పెంపొందించు (శతం మన్యవః యస్య సః, తస్య మన్యుః, తస్య వివర్ధనః), అసౌ = ఆ, కృష్ణః = కృష్ణుడు, గిరిమ్ = పర్వతాన్ని (నికి), ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణం చేసి, పర్వత-రూప-ధారీ (సన్) = పర్వతరూపాన్ని ధరించినవాడై (పర్వతస్య రూపం ధారయతి ఇతి), స్వవర్గైః = తనవారిచే (స్వస్య వర్గాః, తైః), ముదా = సంతోషంగా, అర్పితమ్ = ఇవ్వబడిన, బలిం చ = బలిని కూడా, ఉరరీచకార = అంగీకరించాడు. (ఉరరీ+కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇంద్రునకు కోపాన్ని పెంపొందింపజేస్తున్నట్లుగా కృష్ణుడు పర్వతానికి ప్రదక్షిణం చేసి, పర్వతరూపాన్ని ధరించి, తనవారు సమర్పించిన బలిని అంగీకరించాడు.

**వి :** 1. ఇంద్రునికి కోపం రావటానికి లేదా పెరగటానికి రెండు కారణాలు. ఒకటి కృష్ణుడు పర్వతరూపాన్ని ధరించటం, పర్వతాలు ఇంద్రుని శత్రువులు. రెండు బలిని స్వీకరించటం. బలి శబ్దానికి ఆ పేరనున్న రాక్షసరాజు అని కూడా అర్థం. ఆ బలి రాక్షసుడై, దేవతలకు శత్రువు కాబట్టి, బలిని కృష్ణుడు స్వీకరించటం ఇంద్రునికి కోపకారణ మవుతుంది.

ఇది బహుశః వైదికసంస్కృతి ప్రభావంలోనుండి సమాజం పురాణసంస్కృతివైపు ప్రయాణాన్ని ప్రారంభించిన నాటిది కావచ్చు. వేదాలలో ఇంద్రునికి ఎంతో ప్రాధాన్యముంది. పురాణాల కాలంలో ఇంద్రుని పాత్ర ఒకవైపు విలువైనదిగా కనిపిస్తూ, మరొక వైపు విలువను కోల్పోయింది. ప్రస్తుతసంఘటన ఆ పరిణామక్రమంలో భాగం.

2. కృష్ణుడు ఇంద్రోత్సవాన్ని వ్యతిరేకించటం, భాగవతంలో విపులంగా కనిపిస్తుంది. కృష్ణుడు గిరిరూపాన్ని ధరించటం-

మ. సకలాభీరులు వీఁడె కృష్ణుఁ డన నైజం బైన రూపంబుతో
నకలంకస్థితినుండి శైల మిదె మీరర్చింప రండంచుఁ దా
నొక శైలాకృతిఁ దాల్చి గోపకులతో నొండొండఁ బూజించి గో
పక దత్తాన్నము లాహరించె విభుఁ డా౽ పత్యక్షశైలాకృతిన్. - పోతనభాగవతం 10/889

| | | | |
|---|---|---|---|
| 3. **ఉరరీచకార :** | ఉరరీచకార | ఉరరీచక్రతుః | ఉరరీచక్రుః |
| | ఉరరీచకర్థ | ఉరరీచక్రథుః | ఉరరీచక్ర |
| | ఉరరీచకార/ఉరరీచకర | ఉరరీచక్రివ | ఉరరీచక్రిమ. |

*

**శ్లో॥ సహస్రనేత్రోఽపి స కృష్ణసత్త్వం - మనాగవిజ్ఞాయ దిదేశ మేఘాన్ ।**
**ప్రవర్షణార్థం నిగమైకవేద్యే - కిమక్షిబాహుల్యముపైతి కృత్యమ్ ॥ 5-56**

**అ :** కృష్ణునిపై కోపంతో ఇంద్రుడు ప్రళయవృష్టిని కురిపించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః సహస్ర-నేత్రః అపి కృష్ణ-సత్త్వం మనాగ్ అవిజ్ఞాయ ప్రవర్షణార్థం మేఘాన్ దిదేశ. నిగమైక-వేద్యే అక్షి-బాహుళ్యం కృత్యమ్ ఉపైతి కిమ్?

**ప్ర :** సః = ఆ, సహస్ర – నేత్రః+అపి = ఇంద్రుడుకూడా (సహస్రం నేత్రాణి యస్య సః), కృష్ణ–సత్త్వమ్ = కృష్ణుని శక్తిని (కృష్ణస్య సత్త్వమ్), మనాక్ = కొంచెం కూడా (ఈష త్కించిత్ మనాక్ ప్రోక్తాః కించనస్తోకవాచకాః – హలాయుధకోశః – 882), అవిజ్ఞాయ = తెలిసికొనక, ప్రవర్షణార్థమ్ = బాగా కురియటానికి, మేఘాన్ = మేఘాలను, దిదేశ = ఆజ్ఞాపించాడు. (దిశ అతిసర్జనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), నిగమ+ఏక–వేద్యే : నిగమ+ఏక = వేదాలచే మాత్రమే, వేద్యే = తెలియదగిన కృష్ణుని విషయంలో, అక్షి–బాహుళ్యమ్ = ఎక్కువ కన్నులుండటం (అక్షిణాం బాహుల్యమ్), కృత్యమ్ +ఉపైతి కిమ్? = పని చేస్తుందా? (ఉప+ఆ+ఇ గతౌ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ။** ఇంద్రుడు కూడా కృష్ణుని శక్తిని కొంచెం కూడా గ్రహించలేకపోయాడు. దానితో కుంభవృష్టి కురియ వలసినదిగా మేఘాలను ఆదేశించాడు. నిగమాల ద్వారా తెలియవలసిన కృష్ణుని తెలియటంలో ఎక్కువ కన్నులున్నంత మాత్రాన పని జరగదు.

**వి :** 1. '**సహస్రనేత్రః**' అని ఇంద్రవాచకంగా వాడిన పదం అభిప్రాయగర్భితం. అన్ని కళ్ళున్నా వాస్తవాన్ని చూడలేకపోతున్నాడని ధ్వనింపజేయటం. విశేష్యపదమిలా సాభిప్రాయ మయితే అది **పరికరాంకురాలంకార** మవుతుంది.

2. ఇంద్రుడు మేఘాల నాదేశించుట–

శా. ఉద్యత్సంపద నమ్మి నందతనయోద్యోగమ్మునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁగప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁబొంద ఱాల్గురియుఁడీ! శౌర్యం బవార్యంబుగన్. –పోతనభాగవతం 10/900

ఘర్షణ ఇంద్ర – ఉపేంద్రుల మధ్య, బాధలు గోపకులానివి–

| | | | |
|---|---|---|---|
| 3. **దిదేశ :** | **దిదేశ** | దిదిశతుః | దిదిశుః |
| | దిదిశథ | దిదిశథుః | దిదిశ |
| | దిదేశ/దిదిశ | దిదిశవ | దిదిశిమ. |

*

**శ్లో॥ శతక్రతౌ వర్షతి వాసుదేవో – గిరిం సముద్ధృత్య బభూవ తూష్ణీమ్ ।**
**జిహీర్షుభిః స్వాసమశత్రుశౌర్యం – తదాద్యవైర్యుద్ధరణం హి కార్యమ్ ॥ 5–57**

**అ :** ఇంద్రుని దాడిని కృష్ణుడు నిరోధించటం – గోవర్ధనగిరిని ఉద్ధరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** శత క్రతౌ వర్షతి (సతి) వాసుదేవః గిరిం సముద్ధృత్వ తూష్ణీమ్ బభూవ. స్వ+అసమ శత్రు శౌర్యం జిహీర్షుభిః తద్+ఆద్య–వైరి+ఉద్ధరణం కార్యమ్ హి.

**ప్ర :** శతక్రతౌ = ఇంద్రుడు (శతం క్రతవః యస్య సః), వర్షతి సతి = కురియుచుండగా (వృష్ ధాతువుపై శతృ ప్రత్యయం – సప్తమీ ఏకవచనరూపం – పుంలింగం), వాసుదేవః= కృష్ణుడు (వసుదేవస్య అపత్యం పుమాన్ – '**తస్యాపత్యమ్**' (అష్టాధ్యాయి – 4–1–92 – అణ్ ప్రత్యయం), గిరిమ్ = కొండను, సముద్ధృత్య = పైకి ఎత్తి (సమ్+ఉత్–హృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తూష్ణీం బభూవ = మిన్నకుండెను. (భూ సత్తాయాం భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), స్వ+అసమ–శత్రు– శౌర్యమ్ : స్వ = తనతో, అసమ = సాటికాని, శత్రు = శత్రువులయొక్క, శౌర్యమ్ = పరాక్రమాన్ని, జిహీర్షుభిః = తొలగింప గోరిన వారిచే (హర్తుమ్ ఇచ్ఛవః, జిహీర్షవః , తైః), తద్–ఆద్య–వైరి+ఉద్ధరణమ్:తద్ = అతనియొక్క, ఆద్య = తొల్లింటి, వైరి = శత్రువులయొక్క, ఉద్ధరణమ్ = పెంపుదలయే, కార్యమ్ = కర్తవ్యం గదా!

**తా ॥** ఇంద్రుడు ప్రళయవృష్టి కురిపిస్తుండగా కృష్ణుడు గోవర్ధనగిరి పైకెత్తి మిన్నకుండి పోయాడు. అంతే. మనతో సాటికాని శత్రువు మనలను అణచివేయదలచి నప్పుడు అతని పూర్వ శత్రువులను మనం ఉద్ధరించటమే కర్తవ్యం.

**వి :** 1. రాజనీతిలో శత్రువునకు శత్రువు మిత్రుడవుతాడు. ఆ రీతిగా ఆ మిత్రుని ఉద్ధరించటం ద్వారా శత్రువును అదుపు చేయవచ్చు. కృష్ణుడు ఆ పనే చేశాడు. ఇంద్రునితో ఇంతకుముందే శత్రుత్వమున్న పర్వతాన్ని ఉద్ధరించాడు. ఇప్పుడు ఇంద్రునికీ, కృష్ణునికీ మధ్య ఆ పర్వతమే అడ్డునిలుస్తుంది.

2. కృష్ణుడు గోవర్ధనగిరి నెత్తుట.

శా. బాలం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలం దాల్చిన లీల లేనగవుతోఁ గృష్ణుండు దా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోపంక్తికిన్. – పోతనభాగవతం 10/915

| | | | |
|---|---|---|---|
| 3. **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూమిమ. * |

**శ్లో॥ మయీశ్వరే భూభృతి జాగరూకే – స్వయం చ భూభృత్ కిల బుద్ధిశూన్యః ।**
**స ఇత్యమర్షాదివ భూధరేన్ద్రం – కరేణ భూమేరుదబీభిదత్ తమ్ ॥ 5–58**

**అ :** గోవర్ధనగిరిని ఉద్ధరించుటయే. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః ఈశ్వరే మయి భూభృతి జాగరూకే (సతి) బుద్ధి శూన్యః స్వయం చ భూభృత్ కిల ఇతి అమర్షాదివ భూధరేంద్రం తం కరేణ భూమేః ఉదబీభిదత్.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, ఈశ్వరే = ప్రభువునయిన, మయి = నేను, భూభృతి = భూమిని భరించువాడనుగా (భువం బిభర్తి ఇతి – తస్మిన్), జాగరూకే (సతి) = మేల్కొని యుండగా (జాగృ ధాతువుపై '**జాగరూకః**' (అష్టాధ్యాయి 3–2–165) సూత్రంతో ఊకక్ ప్రత్యయం), బుద్ధి– శూన్యః = బుద్ధిలేని గోవర్ధనగిరి (బుద్ధ్యా శూన్యః), స్వయం చ = తాను కూడా, భూభృత్ కిల = పర్వతమే అట, ఇతి = అని, అమర్షాత్ – ఇవ = కోపంతోనో అన్నట్లు, తమ్ భూధరేంద్రమ్ = ఆ కొండను, కరేణ = చేతితో, భూమేః = భూమినుండి, ఉదబీభిదత్ = పెకలించాడు. (ఉత్–బిద్–విదారణే–యజ్–పరస్మైపది–లజ్–ప్ర.ఏ.)

**తా ॥** (భూభృత్ – అంటే భూభారాన్ని మోసేవాడు. కృష్ణుడు అవతరించింది అందుకే. ఆ పదానికి కొండ అని కూడా అర్థం) – సమర్థుడనైన నేను భూభారాన్ని మోయటానికి జాగరూకతతో వుంటే బుద్ధిహీనుడ వయిన నువ్వుకూడా భూభృత్తువేనా? అనే కోపంతోనో ఏమో కృష్ణుడు తన చేతితో ఆ కొండను భూమినుండి పెకలించాడు.

**వి :** 1. కొండను ఎత్తటం అప్పటి అవసరమే కాని కృష్ణునికి ఆ కొండపై కోపంలేదు. లేని కోపాన్ని కోపంగా, కారణంగా కవి సంభావించినందువలన **హేతూత్ప్రేక్షాలంకారం**.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉదబీభిదత్ :** | **ఉదబీభిదత్** | ఉదబీభిదతామ్ | ఉదబీభిదన్ |
| | ఉదబీభిదః | ఉదబీభిదతమ్ | ఉదబీభిదత |
| | ఉదబీభిదమ్ | ఉదబీభిదావ | ఉదబీభిదామ. * |

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గో ముదాం పఞ్చమః ॥ 5-59**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా॥** ముదాం పంచమః సర్గః అని సంఖ్యావాచకపదం తప్ప మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకమే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో అయిదవసర్గ.

**శ్రీః**





# శ్రీః
# షష్ఠః సర్గః

**శ్లో॥ మహేన్ద్రవిజ్ఞప్తఘనాళిముక్త-పయఃప్రవాహావృతభిన్నభాగమ్ ।**
**ముకున్దహస్తోద్ధృతమద్రిరాజ-మనుద్ధృతం తం మనుజా వ్యజానన్ ॥ 6-1**

**అవతారిక :** గోవర్ధనగిరి సముద్ధరణం – సువృష్టి. –ఉపేంద్రవజ్ర.

**అన్వయక్రమం :** మనుజాః మహేంద్ర... భాగమ్ ముకుంద హస్త+ఉద్ధృతమ్ తమ్ అద్రిరాజమ్ అనుద్ధృతం వ్యజానన్.

**ప్రతిపదార్థం :** మనుజాః = మనుష్యులు (గోపాలురు), మహేంద్ర... భాగమ్ : మహేంద్ర = అమరేంద్రునిచేత, విజ్ఞప్త = విన్నవింపబడిన, ఘన+ఆళి = మేఘసమూహంచేత, ముక్త = కురిపింపబడిన, పయః = నీటియొక్క, ప్రవాహ = ప్రవాహంచేత, ఆవృత = కప్పివేయబడిన, భిన్న = వేరయిన, భాగమ్ = భాగంగలదియు (మహేంద్రేణ విజ్ఞప్తానాం ఘనానామ్ ఆలిభిః ముక్తస్య పయసః ప్రవాహేణ ఆవృతః భిన్నః చ అసౌ భాగః, తమ్), ముకుంద–హస్త–ఉద్ధృతమ్ : ముకుంద = కృష్ణునియొక్క, హస్త = చేతితో, ఉద్ధృతమ్ = పైకెత్తబడిన (ముకుందస్య హస్తేన ఉద్ధృతమ్), తమ్ = ఆ, అద్రిరాజమ్ = పర్వతాన్ని (గోవర్ధనాన్ని), అనుద్ధృతమ్ = ఎత్తబడని దానినిగానే, వి+అజానన్ = తెలిసికొనిరి.(వి జ్ఞా అవబోధనే పరస్మైపది లఙ్–ప్ర.బ.)

**తాత్పర్యం :** మహేంద్రుని ఆదేశంతో మేఘాలు కుంభవృష్టిని కురిపించాయి. ఆ జలప్రవాహం నేలనూ, పర్వతాధోభాగాన్ని కలిపివేసింది. దానితో కృష్ణుడు పర్వతాన్ని పైకి ఎత్తినా ఎత్తనట్లే కనిపిస్తోంది. గోపులకు అలాగే అర్థమైంది.

**విశే :** 1. కురియటాన్ని వివరిస్తున్న భాగం (పూర్వార్ధం) అంతా ఒకే సమాసంగా వుండటం వర్షధారా నిరంతరత్వాన్ని ధ్వనింపజేస్తుంది.

2. గోపుల భ్రాంతి ఈ శ్లోకంలో వర్ణన విషయమైంది. కృష్ణుడు పర్వతాన్ని పైకి ఎత్తినా నిరంతర వారిప్రవాహం ఆ మధ్యభాగాన్ని కలిపివేయటంతో పైకి ఎత్తనట్లే కనిపిస్తోంది. కాబట్టి అది భ్రాంతి. భ్రాంతి ప్రమేయమున్నందువల్ల ఇది **భ్రాంతిమదలంకారం**. 'స్యాత్ స్మృతిభ్రాంతిసందేహైస్తదలంకారకృతిత్రయమ్' (కు.24)

| | | | |
|---|---|---|---|
| 3. **వ్యజానన్ :** | వ్యజానాత్ | వ్యజానీతామ్ | **వ్యజానన్** |
| | వ్యజానాః | వ్యజానీతమ్ | వ్యజానీత |
| | వ్యజానామ్ | వ్యజానీవ | వ్యజానీమ. |

*

**శ్లో॥ వర్షాసు వర్షసహతామధిగమ్య వార్ష్ను - తప్తుం తపః కృతపదస్య పదం ప్రపేదే ।**
**శర్మాన్యజన్మని సిషాధయిషోర్మహీధ్రో-హృన్మధ్యలబ్ధపరమస్య తదోపమాయాః ॥6-2**

**అ :** గోవర్ధనగిరిని మహర్షితో పోల్చటం. -వసంతతిలక.

**అ :** మహీధ్రః తదా వర్షాసు వర్ష-సహతామ్ అధిగమ్య వార్ష్ను తపః తప్తుం కృత-పదస్య అన్య-జన్మని శర్మ సిషాధయిషోః హృన్మధ్య లబ్ధ పరమస్య ఉపమాయాః పదం ప్రపేదే.

**ప్ర :** మహీధ్రః = కొండ (గోవర్ధనగిరి) (మహీం ధరతి ఇతి మహీధ్రః), తదా = ఆ కురిసేటప్పుడు, వర్షాసు = వానాకాలంలో (వర్షాః ప్రావృట్ తపాత్యయః-హలాయుధకోశః -116), వర్ష-సహతామ్ : వర్ష = వృష్టిని, సహతామ్ = సహించటాన్ని, అధిగమ్య = పొంది (అధి-గమ్ గతౌ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వార్ష్ను = నీటియందు, తపః = తపస్సును, తప్తుమ్ = తపించటానికి (తప్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), కృతపదస్య = స్థానాన్ని పొందినవాడును (కృతపదం యేన తస్య), అన్య-జన్మని = మరొక జన్మలో (అన్యం చ తత్ జన్మ, తస్మిన్), శర్మ = సుఖాన్ని ('శర్మ సుఖమ్' సాయణభాష్యమ్-ఋగ్వేద 4/35), సిషాధయిషోః = సాధింపగోరుతున్న వాడును (సాధయితుమ్ ఇచ్ఛుః సిషాధయిషుః తస్య), హృత్ + మధ్య - లబ్ధ-పరమస్య : హృత్+మధ్య = హృదయం మధ్యలో, లబ్ధ = పొందిన, పరమస్య = పరమాత్ముడు గలవాడును అయిన (హృదః మధ్యః, తస్మిన్ లబ్ధః పరమః యేన, తస్య), ఎవరో మహర్షితో, ఉపమాయాః = పోలికకు, పదమ్ = స్థానాన్ని, ప్రపేదే = పొందింది. (ప్ర-పద్ విశరణగత్యవసాదనేషు-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** గోవర్ధనగిరి ఆ రీతిగా వానాకాలంలో వానలను సహించగలిగింది. తపస్సు చేయటానికి స్థానాన్ని సంపాదించుకొని, మరోజన్మలో సుఖాన్ని సాధించుకోవాలని హృదయమధ్యలో పరమాత్మను నింపుకొన్న మహర్షితో పోలికను పొందగలిగింది ఆ గోవర్ధనం తనమధ్యలో కృష్ణుడు నిలిచివుండటంతో.

**వి :** 1. "**పద్మకోశప్రతీకాశగ్ం హృదయం చాప్యధోముఖమ్.... తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః**" అని నారాయణసూక్తం. హృన్మధ్యగతపరమాత్మను వివరిస్తుంది.

2. శ్లోకంలో ఉపమాలంకారముంది. గోవర్ధనపర్వతానికీ, మహర్షికీ పోలికను వర్ణించటం వలన ఉపమాలంకారం. '**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**' (కు.6)

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రపేదే :** | ప్రపేదే | ప్రపేదాతే | ప్రపేదిరే |
| | ప్రపేదిషే | ప్రపేదాథే | ప్రపేదిధ్వే |
| | ప్రపేదే | ప్రపేదివహే | ప్రపేదిమహే. |

*

**శ్లో॥ అన్తః కృపావిపులధారవిలోచనశ్రీ - కాంతాఖ్యమేఘవిభవేక్షణలోలనేత్రైః ।**
**సన్తోషహేతుషు గుహాసు గతైస్స సత్త్వైః-క్రాన్తో బహిశ్చ ఘనదర్శిభిరద్రిరాసీత్ ॥3**

**అ :** గోవర్ధనగిరివర్ణనం - వర్షప్రభావంతో. -వసంతతిలక.

**అ :** సః అద్రిః కృపావిపులధారవిలోచనశ్రీకాంత+ఆఖ్యమేఘవిభవ+ఈక్షణలోలనేత్రైః సత్త్వైః అంతః బహిశ్చ ఘనదర్శిభిః సంతోషహేతుషు గుహాసు గతైః సత్త్వైః క్రాంతః ఆసీత్.

**ప్ర :** సః అద్రిః = ఆ (గోవర్ధన)గిరి, కృపా... నేత్రైఃకృపా = జాలి అనెడి, విపుల = విశాల మైన, ధార = జలధార లనే, విలోచన = కన్నులు గల, శ్రీ-కాంత = లక్ష్మీ వల్లభు డనే, ఆఖ్య = పేరుగల, మేఘ = మొయిలుయొక్క, విభవ = సంపదను, ఈక్షణ = చూచుటతో, లోల = చంచలాలయిన, నేత్రైః = కన్నులు గల, సత్త్వైః = గోపాలురు మొదలగు ప్రాణులచే, అంతః = లోనా, బహిః చ = వెలుపల కూడా, ఘన-దర్శిభిః : ఘన

= మేఘాలను, దర్శిభిః = చూచువారితో, సంతోష–హేతుషు:సంతోష = ఆనందానికి, హేతుషు = కారణా లయిన, గుహాసు = గుహలలోనికి, గతైః = ప్రవేశించిన, సత్త్వైః = జంతువులతో, క్రాంతః =ఆక్రమింపబడినది/నిండినదిగా, ఆసీత్ = అయినది. (అస భువి అదాది పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ။** గోవర్ధనగిరిని కృష్ణుడు పైకెత్తిన తరువాత అది లోపలా బయటా కూడా (రెండు కొండ క్రిందనే) సత్త్వాలతో నిండిపోయింది. లోపల కృపాజలధార లనే కళ్ళుగల శ్రీకృష్ణమేఘ విభవాన్ని చూడటంలో కన్నులు చంచలాలవుతున్న గోపులచే నిండింది. వెలుపల జంతువులు వానవల్ల లోనికి (కొండ క్రిందకు) వచ్చి వానభయం లేదు కాబట్టి సంతోషకారణాలయిన ఆ గుహలలోనికి ప్రవేశించాయి. ప్రవేశించి మేఘాలను చూస్తున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| వి : 1. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ | |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త | |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. | * |

**శ్లో॥ సువర్ణశృఙ్గైః కలశోపమానైః - మృగాదిభిః కృత్రిమసన్నిభైశ్చ ।**
**గుహోల్లసద్ద్వారగణైః సమన్తాద్ - వృతో గిరిర్గోపురతీవ విష్ణోః ॥ 6-4**

**అ :** గోవర్ధనగిరివర్ణనం – గోపురంతో పోలిక. –ఉపేంద్రవజ్ర.

**అ :** కలశోపమానైః సువర్ణ–శృంగైః కృత్రిమ–సన్నిభైః చ మృగ+ఆదిభిః సమన్తాద్ గుహా+ఉల్లసద్–ద్వార–గణైః వృతః గిరిః విష్ణోః గోపురతి+ఇవ.

**ప్ర :** కలశ+ఉపమానైః : కలశ = కలశాలతో, ఉపమానైః = పోలికలు గలవియు (కలశైః ఉపమానం యేషాం తైః), సువర్ణ–శృంగైః : సువర్ణ = బంగారుతో తయారయిన, శృంగైః = శిఖరాలు గలవియు (శృంగం చ శిఖరం కూటం – హలాయుధకోశః – 166) (సువర్ణాని శృంగాని యేషాం తైః), కృత్రిమ సదృశైః : కృత్రిమ = కల్పిత ప్రతిమలతో, సన్నిభైః = సమానమైనవియు (కృత్రిమైః సన్నిభాః, తైః), మృగ+ఆదిభిః : మృగ = జంతువులు, ఆదిభిః = మొదలగువానితో (మృగాః ఆదౌ యేషాం తైః), సమన్తాత్ = అన్నివైపులా, గుహా+ఉల్లసద్–ద్వార–గణైః : గుహా = గుహలతో, ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, ద్వార = ప్రవేశమార్గాల యొక్క, గణైః = సమూహాలతో (గుహాభిః ఉల్లసన్తః ద్వారాణాం గణాః, తైః), వృతః = చుట్టబడిన (వృ ధాతువుపై క్త ప్రత్యయం), గిరిః = కొండ, విష్ణోః = విష్ణుమూర్తి యొక్క, గోపురతి+ఇవ = గోపురంవలె వెలుగొందుతోంది. (గోపురమ్ ఇవ ఆచరతి – క్విప్ ప్రత్యయం (**ఉపమానాదాచారే**–అష్టాధ్యాయి–3–1–10) పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ။** ఆ గోవర్ధనగిరి విష్ణువుయొక్క గోపురంవలె ప్రకాశిస్తోంది. గోపురాలకు కలశాలు ఉంటాయి. కొండకు కలశాలవంటి కొమ్ములున్నాయి. ప్రాసాదాలపై చిత్రలేఖనం (గీచిన బొమ్మలు) వుంటుంది. ఇక్కడ జంతువులు, పక్షులు బొమ్మల్లా నిలిచివున్నాయి. ప్రాసాదాలకు నాలుగువైపులా దారులుంటాయి. ఇక్కడ నాలుగువైపులా గుహలున్నాయి.

**వి॥** 1. గోపురమ్ ఇవ ఆచరతి – అన్నప్పుడు ఆచారార్థంలో క్విప్ ప్రత్యయం వచ్చి గోపురతి అనే రూపం సిద్ధిస్తుంది. ఇక్కడ సమస్తపదంలో ఉపమావాచకం, లోపించటంతో ఇది వాచకలుప్త – పేర లుప్తోపమాలంకారం.

**శ్లో॥ వర్ణ్యోపమానధర్మాణా ముపమావాచకస్య చ ।**
**ఏకద్విత్ర్యనుపాదానైర్భిన్నా లుప్తోపమాష్టధా ॥**– (కు.7)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **గోపురతి :** | **గోపురతి** | గోపురతః | గోపురన్తి | |
| | గోపురసి | గోపురథః | గోపురథ | |
| | గోపురామి | గోపురావః | గోపురామః. | * |

**శ్లో॥ బభౌ సముత్తుఙ్గనగం దధానః - స భావిమల్లేన్ద్రజయోపయోగి ।**
**తదీయవిద్యాభ్యసనం విధాతుం - శిలోచ్చయం బిభ్రదివాభ్రలగ్నమ్ ॥ 6-5**

**అ :** గోవర్ధనగిరి నెత్తిన కృష్ణుని వర్ణన - మల్లవిద్యాభ్యాసంగా సంభావన. -ఉపేంద్రవజ్ర.

**అ :** సముత్తుంగ నగం దధానః సః భావిమల్ల+ఇంద్ర-జయ+ఉపయోగి తదీయ-విద్యాభ్యసనం విధాతుమ్ అభ్ర లగ్నం శిలా+ఉచ్చయం బిభ్రద్ ఇవ బభౌ.

**ప్ర :** సమ్-ఉత్తుంగ-నగమ్ : సముత్తంగ = బాగా ఎత్తైన, నగమ్ = కొండను (న గచ్ఛతి ఇతి నగః), దధానః = భరిస్తూ, సః = ఆ కృష్ణుడు, భావి... యోగి : భావి = భవిష్యత్తులో, మల్ల+ఇంద్ర = శ్రేష్ఠులైన మల్లులను, జయ = గెలుచుటకు, ఉపయోగి = ఉపకరించే, తదీయ-విద్యా-అభ్యసనమ్ : తదీయ = ఆ మల్లయుద్ధానికి సంబంధించిన, విద్యా = విద్యయొక్క, అభ్యసనమ్ = నేర్చుటను, విధాతుమ్ = పాటించటానికి (వి+ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), అభ్ర-లగ్నమ్ : అభ్ర = ఆకాశానికి, లగ్నమ్ = తగులుతున్న, శిలా+ఉచ్చయమ్ : శిలా = ఱాళ్ళయొక్క, ఉచ్చయమ్ = గుంపును, బిభ్రద్+ఇవ = ధరిస్తున్నట్లుగా, బభౌ = ప్రకాశించాడు. (భా దీప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** గోవర్ధనగిరి నెత్తిన కృష్ణుడు మల్లయుద్ధాన్ని అభ్యాసం చేస్తున్న మల్లయోధుడిలాగా కనిపించాడు. మల్లయుద్ధనైపుణ్యం భవిష్యత్తులో మల్లయోధులను గెలవబోతున్న కృష్ణుని కవసరం. మల్లయోధులు బండలనెత్తి అటు ఇటూ విసురుతూ అభ్యాసం చేస్తారు. గోవర్ధనగిరి నెత్తిన కృష్ణుడు ఆ కొండఱాళ్ళు గగనతలానికి తాకుతుండగా ఆ బండ విసురుడును అభ్యసిస్తున్నట్లుంది.

**వి.** 1. 'బిభ్రద్+ఇవ' భరిస్తున్నట్లు - ఇది ఉత్ప్రేక్షాలంకారం. విసరటానికి ఱాళ్ళనెత్తినట్లుగా వుంది. తత్ఫలం మల్లవిద్యాభ్యాసం కాబట్టి ఇక్కడ ఫలాన్ని ఉత్ప్రేక్షించటం జరిగింది. కాబట్టి **ఫలోత్ప్రేక్షాలంకారం.**

| | | | |
|---|---|---|---|
| 2. **బభౌ :** | **బభౌ** | బభతుః | బభుః |
| | బభిథ/బభాథ | బభథుః | బభ |
| | బభౌ | బభివ | బభిమ. |

*

**శ్లో॥ కృష్ణధృతః సురవిస్మయకారీ - విస్తృతపుష్కరమధ్యగతార్ద్రః ।**
**సిన్ధుకబన్ధసముద్ధృతభాస్వ-న్మన్దరకాన్తిమచూచురదద్రిః ॥ 6-6**

**అ :** గోవర్ధనగిరివర్ణం - మందరపర్వతంతో పోలిక. -దోధకం (భభభగగ)

**అ :** కృష్ణ-ధృతః అద్రిః సుర-విస్మయ-కారీ విస్తృతపుష్కరమధ్యగతార్ద్రః సింధు-కబంధ-సముద్ధృత భాస్వత్+ మందర కాంతిమ్ అచూచురత్.

**ప్ర :** కృష్ణధృతః : కృష్ణ = కృష్ణునిచే, ధృతః = ధరింపబడినదియు (కృష్ణేన ధృతః), అద్రిః = కొండ, సుర-విస్మయ-కారీ : సుర = దేవతలకు, విస్మయ = ఆశ్చర్యాన్ని, కారీ = కల్గించేదీ (సురాణాం విస్మయం కరోతి ఇతి), విస్తృత-పుష్కర-మధ్య-గత-ఆర్ద్రః : విస్తృత = పరచుకొనివున్న, పుష్కర = నీటియొక్క (పుష్కరం హస్తి హస్తాగ్రే జలే వాద్యముఖే యుధి-వైజయన్తీ-నపుంసక-24), మధ్య = మధ్యయందు, గత = నిలుచుటచే, ఆర్ద్రః = తడిసినదీ అయి (విస్తృతస్య - పుష్కరస్య మధ్యే గతః చ అసౌ ఆర్ద్రః), సింధు... కాంతిమ్ : సింధు = సముద్రంయొక్క, కబంధ = నీటినుండి (కబన్ధముదకం పాథః ... అమరకోశః-వారి-4), సముద్ధృత = పైకి ఎత్తబడిన, భాస్వత్ = ప్రకాశిస్తున్న, మన్దర = మందరపర్వతం యొక్క, కాంతిమ్ = వెలుగును, అచూచురత్ = దొంగిలించెను. (చుర స్తేయే పరస్మైపది-లుజ్- ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు పైకెత్తిన గోవర్ధనగిరి ప్రళయవృష్టి మధ్య నిలిచి తడిసి వుంది. అది దేవతలకు ఆశ్చర్యాన్ని కలిగించింది. సముద్రం మధ్యనుండి పైకి ఎత్తబడిన మందరపర్వతకాంతిని అది దొంగిలించింది.

**వి :** 1. నీటిలో మునగబోతున్న మందరపర్వతాన్ని కూర్మరూపంలోని విష్ణుమూర్తి ఉద్ధరించాడు. అప్పుడది దేవతా సంరక్షణకోసం. ఇప్పుడు దేవతలకధిపతి అయిన దేవేంద్రుని నుండి మానవులను కాపాడటం కోసం కృష్ణరూపంలో గోవర్ధనగిరిని ఎత్తవలసి వచ్చింది. రెండుచోట్లా ఉద్ధరించినవాడు తానే కాబట్టి ఆ మందరశోభ ఇక్కడ గోవర్ధనగిరికి వచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అచూచురత్ :** | **అచూచురత్** | అచూచురతామ్ | అచూచురన్ |
| | అచూచురః | అచూచురతమ్ | అచూచురత |
| | అచూచరమ్ | అచూచురావ | అచూచురామ. |

*

**శ్లో॥ అనుచక్రేఽమ్భసాంచక్రే లసతా తేన భూభృతా ।**
**తితీర్షోర్వ్రజవర్గస్య శమితోపప్లవః ప్లవః ॥ 6-7**

**అ :** గోవర్ధనగిరి - ఉద్ధరణం. -పథ్యావక్త్రమ్.

**అ :** అంభసాంచక్రే లసతా తేన భూభృతం తితీర్షోః వ్రజవర్గస్య శమిత+ఉపప్లవః ప్లవః అనుచక్రే.

**ప్ర :** అంభసామ్ = నీటియొక్క, చక్రే = సమూహమందు, లసతా = ప్రకాశిస్తున్న, తేన = ఆ, భూభృతా = గోవర్ధనగిరిచేత, తితీర్షోః = దాటగోరుతున్న (తర్తుమ్ ఇచ్ఛుః తితీర్షుః, తస్య), వ్రజ-వర్గస్య : వ్రజ = గోకులమందలి, వర్గస్య = సముదాయానికి (గోకుల జనులకు), శమిత+ఉపప్లవః : శమిత = అణచివేయబడిన, ఉపప్లవః = ప్రమాదం గల, ప్లవః = పడవ, అనుచక్రే = అనుకరింప బడింది. (అను కృ కరణే-కర్మణి-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** జలసమూహంలో ప్రకాశిస్తున్న ఆ గోవర్ధనగిరి ఆ జలరాశిని దాటగోరుతున్న గోకులానికి ఉపద్రవాన్ని దాటించే పడవను అనుకరించింది.

**వి :** 1. ఇక్కడ జలరాశిమధ్యనున్న కొండకు, జలరాశిలో మధ్యలో నుండి అక్కడకు బయటకు (ఒడ్డుకు) చేర్చే పడవకు పోలిక. అయితే ఆ పోలిక వాచ్యంగా (ఇవాది పదాలతో) లేదు. 'అనుకృతః' (అనుకరింపబడెను) అన్న పదంతో ధ్వనిస్తూ ఆ అర్థాన్ని అందిస్తోంది కాబట్టి ఆర్థీ-ఉపమాలంకారం. "**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**' - (కు.5)

| | | | |
|---|---|---|---|
| 2. **అనుచక్రే :** | **అనుచక్రే** | అనుచక్రాతే | అనుచక్రిరే |
| | అనుచకృషే | అనుచక్రాథే | అనుచకృఢ్వే |
| | అనుచక్రే | అనుచకృవహే | అనుచకృమహే. |

*

**శ్లో॥ ఖగాన్ స వృష్టేర్ద్రుమకోటరేషు - మృగాన్ జుగోప స్వగుహాగృహేషు ।**
**మునీన్ ఘనాత్యుచ్ఛ్రితమేఖలాసు - విపత్సు కః స్వీయముపేక్షతేఽగ్ర్యః ॥ 6-8**

**అ :** గోవర్ధనగిరి ఖగ-మృగ-మునిజనులను రక్షించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ఖగాన్ ద్రుమ-కోటరేషు మృగాన్ స్వ-గుహా-గృహేషు మునీన్ ఘన+అత్యుచ్ఛ్రిత-మేఖలాసు వృష్టేః జుగోప. విపత్సు స్వీయం కః అగ్ర్యః ఉపేక్షతే.

**ప్ర :** సః = ఆ గోవర్ధనగిరి, ఖగాన్ = పక్షులను (ఖే గచ్ఛన్తి ఇతి, తాన్), ద్రుమ–కోటరేషు: ద్రుమ = చెట్లయొక్క, కోటరేషు = తొఱ్ఱలలో(నిష్కుటః కోటరః స్మృతః–హలాయుధకోశః–182), మృగాన్ = జంతువులను, స్వ–గుహా–గృహేషు:స్వ = తనయొక్క, గుహా = గుహ లనే, గృహేషు = ఇళ్ళలో (స్వస్య గుహాః, తా ఏవ గృహాణి, తేషు), మునీన్ = ఋషులను, ఘన+అత్యుచ్ఛ్రిత–మేఖలాసు : ఘన = మేఘాలకంటె, అతి+ఉచ్ఛ్రిత = పై నున్న, మేఖలాసు = సానువులపై, వృష్టేః = వాననుండి, జుగోప = రక్షించింది. (గుపూ రక్షణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), విపత్సు = ఇబ్బందులలో, స్వీయమ్ = తన వానిని, కః అగ్ర్యః = ఏ నాయకుడు, ఉప+ఈక్షతే = ఉదాసీనంగా చూస్తాడు. (ఉప –ఈక్ష దర్శనే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** గోవర్ధనగిరి తన మీద నున్న చెట్ల తొఱ్ఱలలో పక్షులను, తనలోని గుహలలో జంతువులను, మేఘగమనానికన్న ఎత్తయిన సానువులలో మునులనూ నిలిపి రక్షించింది. ఆపదలలో ఏ నాయకుడు తన వారిని ఆదుకోడు.

**వి :** 1. విపరీతపరిస్థితులలో విపరీతప్రవృత్తి సత్ఫలాలను ఇస్తుంది కాబోలు చెట్లపైనున్న పక్షులను చెట్లక్రిందకు, గుహలకు వెలుపల ఉన్న జంతువులను గుహల లోపలకు, క్రిందనున్న మునులను పైకి తీసికొని పోయి కొండ కాపాడింది.

శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతిజానీహి **న మే భక్తః ప్రణశ్యతి** ॥ – భగవద్గీత 9/31

అని అగ్రగణ్యులలో అగ్రగణ్యుడయిన కృష్ణుడు అర్జునునికి హామీ ఇచ్చాడు. కృష్ణ భక్తుడు గోవర్ధనగిరి. గోవర్ధనభక్తులు పక్షి, జంతు, మునిగణాలు. వైష్ణవంలో భగవంతుడి కన్న భక్తుడికి బలమెక్కువ.

2. శ్లో॥ ఆమేఖలం సంచరతాం ఘనానాం – ఛాయామధస్సానుగతాం నిషేవ్య ।
ఉద్వేజితా వృష్టిభిరాశ్రయన్తే – శృంగాణి యస్యాతపవన్తి సిద్ధాః ॥
– కుమారసంభవమ్ 1/5

అని కాళిదాసు కూడా వానపడ్డప్పుడు క్రింది నున్న సిద్ధులను మేఘమార్గంకన్న పైనున్న శృంగాల వైపు నడిపించి వానకు తడవకుండా నిలుపుతాడు.

| | | | |
|---|---|---|---|
| 3. **జుగోప :** | **జుగోప** | జుగుపతుః | జుగుపుః |
| | జుగోపిథ/జుగోప్థ | జుగుపథుః | జుగుప |
| | జుగోప | జుగోపివ/జుగుప్వ | జుగోపిమ/జుగుప్మ |
| **ఉపేక్షతే :** | **ఉపేక్షతే** | ఉపేక్షేతే | ఉపేక్షన్తే |
| | ఉపేక్షసే | ఉపేక్షేథే | ఉపేక్షధ్వే |
| | ఉపేక్షే | ఉపేక్షావహే | ఉపేక్షామహే. |

*

**శ్లో॥ ప్రసూనకోశైర్ఘనవర్షపాత–నిపాతితైరఙ్కితసర్వగాత్రః ।**
**ముకున్దహస్తామ్బుజసఙ్గసౌఖ్య–ప్రహృష్టరోమాళిరివాద్రిరాస్తే ॥ 6–9**

**అ :** గోవర్ధనగిరివర్ణన – కృష్ణహస్తస్పర్శవలన పులకించినట్లు కవి సంభావన. –ఉపేంద్రవజ్ర.

**అ :** అద్రిః ఘనవర్షపాతనిపాతితైః ప్రసూనకోశైః అంకితసర్వగాత్రః సన్ ముకుంద–హస్త+ అంబుజసంగ–సౌఖ్యప్రహృష్టరోమ+ఆళిః ఇవ ఆస్తే.

**ప్ర :** అద్రిః = కొండ (గోవర్ధనగిరి), ఘన–వర్ష–పాత–నిపాతితైః : ఘన = గొప్పదైన, వర్ష–పాత = వర్షపాతంచేత, నిపాతితైః = రాల్చబడిన (పడగొట్టబడిన) (ఘనేన వర్షస్య పాతేన నిపాతితాః తైః), ప్రసూన–కోశైః = పూలమొగ్గలతో

(శబ్దార్థకల్పతరుః–పుట–420) (ప్రసూనానాం కోశాః తైః), అంకిత–సర్వగాత్రః : అంకిత = గుర్తించబడిన, సర్వ = సంపూర్ణమైన, గాత్రః = శరీరం గలవాడై (అంకితం సర్వంగాత్రం యస్య సః), ముకుంద... రోమాళిరివ: ముకుంద = కృష్ణునియొక్క, హస్త+అబ్జ = కరకమలాలతో, సంగ = కలయిక–చేత కలిగిన, సౌఖ్య = సుఖంతో, ప్రహృష్ట = పులకరించిన, రోమ+ఆలిః+ఇవ = వెంట్రుకలు గలవాడు అన్నట్లుగా (ముకుందస్య హస్తాబ్జయోః సంగేన (జాతేన) సౌఖ్యేన ప్రహృష్టా రోమాణామ్ అలిః యస్య సః), ఆస్తే = ఉన్నది. (ఆస్ ఉపవేశనే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** సాంద్రంగా వానకురుస్తుండటంతో కొండపై నున్న చెట్ల నుండి పూలమొగ్గలన్నీ రాలి కొండ శరీరమంతా పరచుకున్నాయి. దానితో ఆ కొండ కృష్ణుని కరస్పర్శవలన కలిగిన సౌఖ్యంతో శరీరమంతా పులకించినట్లు ప్రకాశిస్తోంది.

**వి :** 1. గోవర్ధనగిరికి కృష్ణునిపైనున్న భక్తిభావసాంద్రతను రోమాంచమనే సాత్త్వికభావంతో ప్రకటిస్తున్నాడు కవి. '**హర్షాద్భుతభయాదిభ్యో రోమాంచో రోమ విక్రియా**' –సా.ద.–3/137

2. హస్తౌ అమ్బుజే ఇవ – తామరల వంటి చేతులు ఇది ఉపమాలంకారం. ప్రహృష్టరోమాళి రివ – అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం. ఇది వస్తూత్ప్రేక్ష. పూలతో గుర్తింపబడిన శరీరం గలవాడు అని విషయాన్ని కూడా చెప్పినందువలన ఉక్త విషయ వస్తూత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ 'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా ।
ఉక్తానుక్తాస్పదాద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే ॥ – (కు.32)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే. |

*

**శ్లో॥ స భూధరః సాశనివర్షపాత–సమాహతోఽప్యణ్వపి నో చకమ్పే ।**
**తథాహి గోబ్రాహ్మణరక్షకస్య – క్వ కృష్ణదోర్దణ్డధృతస్య కమ్పః ॥ 6–10**

**అ :** కుంభవృష్టిపాతంలో కూడా గోవర్ధనగిరి చలింపకుండుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః భూధరః సాశనివర్షపాతసమాహతః అపి అణు+అపి నో చకంపే. తథాహి. గోబ్రాహ్మణరక్షకస్య కృష్ణదోర్దండధృతస్య కంపః క్వ?

**ప్ర :** సః = ఆ, భూధరః = కొండ, సాశని... హతః+అపి : స+అశని = పిడుగులతో కూడిన (పవిరశనిః శతధారం వజ్రం... హలాయుధకోశః–56), వర్ష–పాత = వర్షపాతంతో, సమ్+ఆహతః+అపి = కొట్టబడినను (అశనినా సహితం సాశని తచ్చ తత్ వర్షం చ తస్య పాతః తేన), అణు+అపి = కొంచెం కూడా, నో చకంపే = బెదరలేదు. (కపి చలనే–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), తథాహి = అది యుక్తమే. గో–బ్రాహ్మణ–రక్షకస్య : గో = ఆవులకు, బ్రాహ్మణ = విప్రులకు, రక్షకస్య = రక్షకుడై (గవాం బ్రాహ్మణానాం చ రక్షకః తస్య), కృష్ణ–దోః–దండ–ధృతస్య : కృష్ణ = కృష్ణునియొక్క, దోః+దండ = భుజదండంతో, ధృతస్య = ధరింపబడిన వానికి (కృష్ణస్య దోః దండేన ధృతః తస్య), కంపః = భయం, క్వ = ఎక్కడిది?

**తా॥** పిడుగులతో పాటు వర్షం పడినా గోవర్ధనగిరి అణువంత కూడా బెదరలేదు. అది తగినదే. గోబ్రాహ్మణరక్షకుడైన వాడు తాను పైగా కృష్ణుడు భుజానికెత్తుకొన్నాడు. అటువంటివాడికి భయమేముంటుంది.

**వి :** 1. గోవర్ధనగిరి నిర్భయత్వానికి రెండు కారణాలున్నాయి ఇక్కడ. ఒకటి తానిస్తున్న అండ. రెండవది తాను పొందుతున్న అండ. పరులకు మేలుచేసేవారికే ఇతరులనుండి మేలు పొందే అధికారం కూడా వుంటుంది. మేలుచేసే శక్తిలేనపుడు ఈ సూత్రానికి మినహాయింపు వుంటుంది.

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది. అయితే విలక్షణంగా పూర్వార్ధంలోని విశేషాంశంలో ఉత్తరార్ధంలో సామాన్యాంశాలుగా చెప్పిన గోబ్రాహ్మణరక్షణ, కృష్ణకరధృతత్వం రెండూ విశేషాలుగా గత శ్లోకాలలో చెప్పబడివుంది. ఆ భావాలను ఇక్కడ అనుసంధిస్తే సామాన్యాంశం విశేషమవుతుంది. ఆ విషయాన్ని పరిగణించకుండా అలంకారప్రాథమిక స్వరూపమే ఉక్తివైచిత్ర్యమాత్రం కాబట్టి ఆ కోణంలోనుండి చూచినప్పుడు తథాహి అని సమర్థకపదప్రయోగంవలన విశేషసామాన్యాంశాలుగా పూర్వోత్తరార్ధాలు నిలిచి దీనిని అర్థాంతరన్యాసం చేస్తున్నాయి. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః'-(కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **చకంపే :** | **చకంపే** | చకంపాతే | చకంపిరే |
| | చకంషిషే | చకంపాథే | చకంపిధ్వే |
| | చకంపే | చకంపివహే | చకంపిమహే. |

*

**శ్లో॥ పయఃశ్రితస్వప్రతిబిమ్బలోలం - పతత్ప్రసూనాఞ్చితశృఙ్గజాలమ్ ।**
**స్వకుక్షిమధ్యార్పితనన్దబాలం - జనోఽద్భుతం సమ్పుటమాశశఙ్కే ॥ 6-11**

**అ :** గోవర్ధనవర్ణనం - సంపుటీకృతిభావన. -ఉపేంద్రవజ్ర.

**అ :** పయః-శ్రితస్వ-ప్రతిబింబ-లోలం, పతత్ప్రసూన+అఞ్చిత-శృంగజాలం స్వకుక్షి-మధ్య+ అర్పిత-నందబాలం జనః అద్భుతం సంపుటమ్ ఆశశంకే.

**ప్ర :** పయఃశ్రితస్వప్రతిబింబలోలమ్ : పయః = నీటి యందు, శ్రిత = ఆశ్రయించిన, స్వ = తనయొక్క, ప్రతిబింబ = నీడచే, లోలమ్ = చంచలమైనదియు (పయసి శ్రితం చ తత్ స్వస్య ప్రతిబింబం, తేన లోలమ్), పతత్... జాలమ్ : పతత్ = రాలి పడుతున్న, ప్రసూన = పూలచే, అఞ్చిత = పూజింపబడిన, శృంగ = కొమ్ములయొక్క, జాలమ్ = సమూహం గలదియు, (పతన్తి చ తాని ప్రసూనాని, తైః అర్చితం శృంగాణాం జాలం యస్య, తమ్), స్వ-కుక్షి-మధ్య+అర్పిత-నంద-బాలమ్ : స్వ = తనయొక్క, కుక్షి = ఉదరం యొక్క, మధ్య = నడుమ, అర్పిత = ఉంచబడిన, నంద-బాలమ్ = కృష్ణుడు గలదియు (స్వస్య కుక్షేః మధ్యే అర్పితః నందస్య బాలః యస్య, తమ్), అయిన ఆ పర్వతాన్ని, జనః = లోకం, అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన, సంపుటమ్ = సంపుటంగా, ఆశశంకే = భావించింది. (ఆ+శక్ శక్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** వర్షపు నీటిలో గోవర్ధనగిరి ప్రతిబింబముంది. నీళ్ళ కదలికలవల్ల అది కదులు తున్నట్లుంది. కొండ కొమ్ములపై పూలు రాలి పడుతున్నాయి. తన ఉదరం మధ్యలో గోపాలకృష్ణుని నిలుపుకొని యున్నాడు. ఇది చూసి జనులంతా అద్భుతమైన సంపుటిగా భావించారు.

**వి :** 1. ఇక్కడ అంచిత సంపుటీకృతి కనిపిస్తోంది. ధ్యానం, ధ్యేయం, ధ్యాత - మూడూ కలిస్తే సంపుటి (త్రిపుటి) కనిపిస్తుంది. కొండనడుమ నున్న కృష్ణుడు ధ్యేయ స్వరూపం. ధ్యాత స్వ ప్రతిబింబం. ధ్యానం అంచితం. ఈ మూడింటికీ అభేదాన్ని గ్రహించగలిగితే అదే అద్వైతంలో మోక్షం. ద్వైతభావనతో ధ్యానం ద్వారా ధ్యేయుని చేరగలిగితే అది ధ్యాతకు సారూప్య సాలోక్య సామీప్య సాయుజ్య మోక్షాలలో ఒకటి.

2. ఇక్కడ జనగతంగా ఉత్ప్రేక్ష కనిపిస్తోంది కవి గతంగా కాదు. తన ఉత్ప్రేక్షను జనకర్తృకంగా ప్రతిపాదించాడు కవి.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **ఆశశంకే :** | **ఆశశంకే** | ఆశశంకాతే | ఆశశంకిరే | |
| | ఆశశంకిషే | ఆశశంకాథే | ఆశశంకిధ్వే | |
| | ఆశశంకే | ఆశశంకివహే | ఆశశంకిమహే. | * |

**శ్లో॥ త్రివిష్టపాభ్రప్రతిరూపధారీ - స పర్వతః స్ఫాటికతుఙ్గశృఙ్గే ।**
**హరేర్నిదేశాదపరాధిశక్ర-ఘనాలయౌ తౌ గ్రసతీవ లోకౌ ॥ 6-12**

**అ :** అంబరచుంబి గోవర్ధనగిరి వర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః పర్వతః స్ఫాటికతుంగశృంగే త్రివిష్టప+అభ్రప్రతిరూపధారీ (సన్) హరేః నిదేశాద్ అపరాధిశక్రఘన+ఆలయౌ తౌ లోకౌ గ్రసతి+ఇవ.

**ప్ర :** సః పర్వతః = ఆ గోవర్ధనగిరి, స్ఫాటిక-తుంగ-శృంగే : స్ఫాటిక = స్ఫటికమయమైన, తుంగ = ఎత్తైన, శృంగే = శిఖరంపై, త్రివిష్ట... ధారీ (సన్) : త్రివిష్టప = స్వర్గంయొక్కయు, అభ్ర = మేఘంయొక్కయు (అభ్రం మేఘో వారివాహః-అమరకోశః-దిక్-6), ప్రతిరూప = ప్రతిబింబాలను, ధారీ (సన్) = ధరిస్తున్నదై (త్రివిష్టపస్య అభ్రస్య చ రూపం ధరతి ఇతి), హరేః = కృష్ణునియొక్క, నిదేశాత్ = ఆజ్ఞతో, అపరాధి-శక్ర-ఘన-ఆలయౌ : అపరాధి = తప్పుచేసిన, శక్ర = ఇంద్రునియొక్కయు, ఘన = మేఘాలయొక్కయు, ఆలయౌ = నివాసాలయిన, తౌ లోకౌ = స్వర్గలోకాన్నీ, అభ్రలోకాన్ని, గ్రసతి+ఇవ = మ్రింగుతున్నట్లుంది. (గ్రస అదనే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఉన్నతమైన గోవర్ధనగిరి శిఖరంపై స్ఫటికాలలో స్వర్గలోక, అభ్రలోకాల ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. కృష్ణుని ఆదేశంతో ఆ గోవర్ధనం తప్పుచేసిన శక్ర, అభ్రలోకాలను మ్రింగి వేస్తున్నట్లుంది.

**వి :** 1. గోవర్ధనపర్వతంయొక్క ఔన్నత్యం అంత ఎక్కువ. స్వర్గాన్ని కూడా మ్రింగుతోంది. ఇంతవరకు **అతిశయోక్త్యలంకారం**. గిరికి స్వర్గాన్ని మ్రింగటమనే పనితో సంబంధం లేకపోయినా సంబంధముందనటం అతిశయోక్తి. అయితే మ్రింగుతున్నట్లు-అని దానిని సంభావనాత్మకంగా చెప్పటం ఉత్ప్రేక్షాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **గ్రసతి :** | **గ్రసతి** | గ్రసతః | గ్రసన్తి | |
| | గ్రససి | గ్రసథః | గ్రసథ | |
| | గ్రసామి | గ్రసావః | గ్రసామః. | * |

**శ్లో॥ స పర్యటత్కుఞ్జరపుఞ్జశోభం - ధరం యదా శ్రీపతిరుద్దధార ।**
**తదా సమస్యాం పరిపూరయన్తి - శిశోః కరే హస్తిసహస్రమస్తి ॥ 6-13**

**అ :** గోవర్ధనగిరి నుద్ధరించిన హరికర మహత్త్వవర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః శ్రీపతిః పర్యటత్కుంజరపుంజశోభం ధరం యదా ఉద్దధార తదా (కవయః) సమస్యాం పరిపూరయన్తి. శిశోః కరే హస్తి-సహస్రమ్ అస్తి.

**ప్ర :** సః = ఆ, శ్రీపతిః = కృష్ణుడు (శ్రియః పతిః), పర్యట... శోభమ్ : పర్యటత్ = సంచరిస్తున్న, కుంజర = ఏనుగులయొక్క, పుంజ = సమూహంచేత, శోభమ్ = ప్రకాశిస్తున్న, ధరమ్ = పర్వతాన్ని (అచలశిలోచ్చయ... నగశిఖర సానుమన్తో ధర... హలాయుధకోశః-165), యదా = ఎప్పుడయితే, ఉద్-దధార = ఉద్ధరించెనో (ఉత్+ధృ ధారణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తదా = అప్పుడు, (కవయః = కవులు), సమస్యామ్ = సమస్యను, పరిపూరయన్తి = పూరిస్తున్నారు. (పరి+పూరీ ఆప్యాయనే-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), శిశోః = శిశువుయొక్క, కరే = చేతియందు, హస్తి-సహస్రమ్ : హస్తి = ఏనుగులయొక్క, సహస్రమ్ = వేయి, అస్తి = ఉన్నది. (అస-భువి-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** పర్యటిస్తున్న ఏనుగులతో అందగిస్తున్న గోవర్ధనగిరిని కృష్ణుడు ఉద్ధరించిన నాటి నుండి కవులకు ఒక సమస్యాపూరణానికి అవకాశం లభించింది. ఆ సమస్య – "**శిశోః కరే హస్తిసహస్రమస్తి**".

**వి :** 1. కుదిరీ కుదరని అర్థంతో ఒక పాదాన్ని ఇచ్చి మిగిలిన పాదాలతో పద్యాన్ని పూర్తిచేసి ఆ కుదరని అర్థాన్ని కూడా కుదిరేటట్లు చేయటం సమస్యాపూరణం. సంస్కృతాంధ్రభాషలలో ఇది ప్రసిద్ధం. ఉదాహరణం–

సమస్య : **నారీ స్తనంధయతి సింహశిశుః విచిత్రమ్.**

కీ॥శే॥ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు. నెల్లూరు.

సమస్యాపూరణం :

**శ్లో॥ పుణ్యాశ్రమేషు యువతీజనపాలితేషు – విశ్వాసయోగమహితేషు మహామృగేషు**
**వాయౌ స్తనాంచల ముదాసయతి ప్రభాతే – నారీస్తనంధయతి సింహశిశుర్విచిత్రమ్.**

– కీ॥శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ,(వేద సంస్కృత కళాశాల, నెల్లూరు – 1970)

నారి సింహపుపిల్లకు చనుబాలనిస్తోందని సమస్య. ఒక ఆశ్రమవాతావరణాన్ని కల్పించి, అందులో గాలి పయ్యెదను తొలగించగా ఆ కాంత సింహశిశువుకు పాలిస్తోందని సమస్యా–పూరణ. భావంలోను, శ్లోకరచనలోనూ చక్కని సౌష్ఠవం కనిపిస్తోంది.

సమస్య : **సంభ్రాన్తా కురునాయకేన హసతా కృష్ణా సమాలింగితా –**

– శ్రీ పమిడిపాటి పట్టాభిరామారావు.

పూరణ : శ్లో॥ భీష్మే యుద్ధపరాఙ్ముఖే శరగురౌ యాతే చ లోకాంతరం
కర్ణే చాపి దివంగతే భారమఖిలం శల్యే సమారోపితమ్
సంభావ్యైవ జయం తథాపి వసతౌ స్వప్నేషు నిద్రాళునా
సంభ్రాన్తా కురునాయకేన హసతా కృష్ణా సమాలింగితా

–సూరం శ్రీనివాసులు

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఉద్దధార :** | **ఉద్దధార** | | ఉద్దధ్రతుః | ఉద్దధ్రుః |
| | ఉద్దధర్థ | | ఉద్దధ్రథుః | ఉద్దధ్ర |
| | ఉద్దధార/ఉద్దధర | | ఉద్దధ్రివ | ఉద్దధ్రిమ |
| **పరిపూరయన్తి :** | పరిపూరయతి | | పరిపూరయతః | **పరిపూరయన్తి** |
| | పరిపూరయసి | | పరిపూరయథః | పరిపూరయథ |
| | పరిపూరయామి | | పరిపూరయావః | పరిపూరయామః |
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి | |
| | అసి | స్థః | స్థ | |
| | అస్మి | స్వః | స్మః. | |

*

**శ్లో॥ స భాసురశ్రీశకపోలలగ్న–నఖోల్లసద్రత్నకరాగ్రసంస్థః ।**
**బిభర్తి కూర్మాశ్రితనాగరాజ–ఫణాస్థపృథ్వీశ్రియమద్రిరాజః ॥ 6–14**

**అ :** కృష్ణుని వ్రేలిపై నున్న గోవర్ధనగిరివర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః అద్రిరాజః భాసురశ్రీ+ఈశకపోలలగ్ననఖ+ఉల్లసద్–రత్నకర+అగ్రసంస్థః కూర్మ+ ఆశ్రితనాగరాజఫణాస్థ పృథ్వీశ్రియమ్ బిభర్తి.

**ప్ర :** సః = ఆ, అద్రిరాజః = పర్వతశ్రేష్ఠమైన గోవర్ధనగిరి, భాసుర... సంస్థః : భాసుర = ప్రకాశిస్తున్న, శ్రీ+ఈశ = లక్ష్మీవల్లభునియొక్క, కపోల = చెక్కిలిపై, లగ్న = తగిలిన, నఖ = గోళ్ళనే, ఉల్లసత్ = వెలుగుతున్న, రత్న = రత్నాలుగల, కర+అగ్ర = వ్రేలిపై, సంస్థః = నిలిచినవాడై (భాసురస్య శ్రీశస్య కపోలే లగ్నాః చ నఖాః ఏవ విలసన్తి రత్నాని యస్య, తస్య కరస్య అగ్రే సంతిష్ఠతి ఇతి), కూర్మ+ఆశ్రిత... శ్రియమ్ : కూర్మ = తాబేటిని, ఆశ్రిత = ఆశ్రయించిన, నాగ-రాజ = ఆదిశేషువుయొక్క, ఫణా-స్థ = పడగలపై నున్న, పృథ్వీ = భూమియొక్క, శ్రియమ్ = కాంతిని/శోభను, బిభర్తి = భరిస్తున్నది. (భృ భరణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోవర్ధనగిరి కృష్ణుని వ్రేలిచివర నిలిచి వుంది. ఆ వ్రేలు గోళ్ళనే రత్నాలతో ప్రకాశిస్తోంది. అది చెక్కిలిగా దగ్గరగా నిలిచి వుండటంతో గోవర్ధనగిరి కూడా ఆ చెక్కిలికి దగ్గరగా కనిపిస్తోంది. ఈ దృశ్యం మేటి తాబేటిపై నున్న నాగరాజుయొక్క పడగలపై నున్న భూమి యొక్క కాంతిని ధరిస్తోంది. (ఆ భూమిలా ప్రకాశిస్తోంది అని భావం).

**వి :** 1. ఇది కృష్ణుని కరాగ్రం పైనున్న గోవర్ధనగిరికి, కూర్మంపై నున్న నాగరాజు పడగలపై నున్న భూమితో పోలిక. మధ్యలోని నాగరాజు పడగలు ప్రకాశించే నఖాలనే రత్నాలు. నాగరాజు పడగలపై రత్నాలస్థితి వుంది కనుక. ఇక్కడ ఉపమావాచకం వాచ్యంగా లేదు కాబట్టి ఆర్థీ+ఉపమ. '**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**'- (కు.6)

| | | | |
|---|---|---|---|
| 2. **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః. |

*

**శ్లో॥ ఉద్గచ్ఛదూష్మావళిధూమలిఙ్గ-మద్రిం ద్రవద్ధాతురసార్ద్రశృఙ్గమ్ ।**
**విష్వక్పతద్రత్నచయస్ఫులిఙ్గ-మగ్న్యస్త్రమీశాచరితం ప్రతర్కే ॥ 6-15**

**అ :** గోవర్ధనగిరివర్ణన - కృష్ణుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రంగా సంభావన. -ఇంద్రవజ్ర.

**అ :** ఉద్గచ్ఛద్+ఊష్మ+ఆవళిధూమలింగమ్ ద్రవద్-ధాతురస+ఆర్ద్రశృంగమ్ విష్వక్ పతద్-రత్నచయ-స్ఫులింగమ్ అద్రిమ్ ఈశాచరితమ్ అగ్ని+అస్త్రం ప్రతర్కే.

**ప్ర :** ఉద్+గచ్ఛత్ = పైకి ఎగయుచున్న, ఊష్మ = ఆవిరులయొక్క (ఊష్మా బాష్పః-హలా-యుధకోశః-67), ఆవళి = పంక్తి (సమూహం) యే, ధూమ = పొగగా, లింగమ్ = గుర్తుగా గలదియు (ఉద్గచ్ఛతామ్ ఊష్మణామ్ ఆవళిః ఏవ ధూమః, స ఏవ లింగం యస్య తత్), ద్రవద్... శృంగమ్ : ద్రవద్ = స్రవిస్తున్న, ధాతు = ధాతువులయొక్క, రస = రసంతో, ఆర్ద్ర = తడిసిన, శృంగమ్ = సానువులు గలదియు (ద్రవతాం ధాతూనాం రసేన ఆర్ద్రాణి శృంగాణి యస్య, తమ్), విష్వక్... స్ఫులింగం : విష్వక్ = అంతటా, పతత్ = పడుతున్న, రత్న = రత్నాలయొక్క, చయ = సమూహ మనే, స్ఫులింగమ్ = అగ్నికణాలు గలదియు అయిన (విష్వక్ పతతాం రత్నానాం చయః ఏవ స్ఫులింగః యస్య, తమ్), అద్రిమ్ = (గోవర్ధన) గిరిని, ఈశ+ఆచరితమ్ = ప్రభువైన కృష్ణునిచే, ఆచరితమ్ = ప్రయోగింపబడిన (ఈశేన ఆచరితమ్), అగ్ని+అస్త్రమ్ = ఆగ్నేయాస్త్రంగా (అగ్ని దేవతగా గల అస్త్రమ్), ప్రతర్కే = భావిస్తున్నాను. (ప్ర+తర్క్ వితర్కే-ఆత్మనేపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** పైకి లేస్తున్న ఆవిరుల సమూహమే పొగగా కనిపిస్తోంది. స్రవిస్తున్న ధాతు (గైరికాది ధాతువులు), రసాలతో సానువులు తడుస్తున్నాయి. అంతటా పడుతున్న రత్నాల సమూహాలు అగ్ని కణాలుగా కనిపిస్తున్నాయి. ఇదంతా చూస్తుంటే కృష్ణుడు ఆగ్నేయాస్త్రాన్ని (వానపై) ప్రయోగిస్తున్నట్లుంది.

**వి :** 1. కొండపై నుండి ఆవిర్లు వెళ్తున్నాయనటంలోనే వాన ఆగిపోవటం ధ్వనిస్తోంది. దానికి కారణం ఆగ్నేయాస్త్రప్రయోగం. కారణమైన ఆగ్నేయాస్త్రానికీ, కార్యమైన ఆవిర్లకూ సామానాధికరణ్యాన్ని కల్పించటం (సహభావం ధ్వనిస్తుంది) వలన ఇక్కడ హేత్వలంకారం కనిపిస్తుంది. '**హేతోః హేతుమతా సార్థవర్ణనం హేతురుచ్యతే**' (కు.167)

2. అస్త్రాలు మంత్రపూరితాలు. వాటికి బాహ్యస్వరూపమేదైనా ఫరవాలేదు. ఇక్కడ అంత పెద్ద కొండను అస్త్రంగా చేసికొనగలగటం విలువిద్యలోని అసాధారణశక్తిని ధ్వనింప జేస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రతర్కే :** ప్రతర్కతే | ప్రతర్కేతే | ప్రతర్కన్తే | |
| ప్రతర్కసే | ప్రతర్కేథే | ప్రతర్కధ్వే | |
| **ప్రతర్కే** | ప్రతర్కావహే | ప్రతర్కామహే. | * |

**శ్లో॥ అద్రిస్తం ఘనమిన్ద్రనీలధరణీకాంత్యా శిఖండశ్రియా**
**తస్యాఖణ్డలచాపమమ్బునిచయం ముక్తాఫలానాం రుచా ।**
**సౌవర్ణస్థలశోభయా చ తటితం పఞ్చాస్యనాదేన త-**
**న్నాదం సాధు జిగాయ కిం న సుకరం నిత్యం క్షమాధారిణః ॥ 6-16**

**అ :** గోవర్ధనగిరి వర్ణనం - ఘనాడంబరాన్ని ఎదిరించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అద్రిః ఇంద్రనీల ధరణీకాంత్యా తం ఘనం, శిఖండశ్రియా తస్య ఆఖండలచాపమ్, ముక్తాఫలానాం రుచా అంబునిచయం, సౌవర్ణస్థలశోభయా తటితం, పంచాస్యనాదేన తత్+ నాదం చ సాధు జిగాయ. నిత్యం క్షమాధారిణః కిం న సుకరమ్?

**ప్ర :** అద్రిః = కొండ (గోవర్ధనగిరి), ఇంద్రనీల-ధరణీ-కాంత్యా : ఇంద్రనీల = ఇంద్ర నీలంవంటి, ధరణీ = నేలయొక్క, కాంత్యా = కాంతితో (ఇంద్రనీలమివ ధరణ్యాః కాంతిః, తయా), తం ఘనమ్ = ఆ మేఘాన్ని, శిఖండ-శ్రియా:శిఖండ = నెమలి పింఛాలయొక్క శ్రియా = శోభతో (శిఖండానాం శ్రీః, తయా), తస్య = ఆ మేఘం యొక్క, అఖండలచాపమ్ = ఇంద్రధనుస్సును (ఆఖండలః సహస్రాక్షః-అమరకోశః-స్వర్గ-44), ముక్తా-ఫలానామ్ = ముత్యాలయొక్క, రుచా = కాంతితో, అంబు-నిచయమ్ = జలసమూహాన్ని (అంబూనాం నిచయః , తమ్), సౌవర్ణ-స్థల-శోభయా : సౌవర్ణ = స్వర్ణమయమైన, స్థల = నేలయొక్క, శోభయా = కాంతితో (సువర్ణస్య వికారః సౌవర్ణం తత్ చ తత్ స్థలం, తస్య శోభా తయా), తటితమ్ = మెరుపును (తటిత్సౌదామనీ విద్యుత్-అమరకోశః-దిక్-9), పంచాస్య-నాదేన : పంచాస్య = సింహంయొక్క (హరిః మృగపతిః పంచాననః కేసరీ-హలాయుధకోశః -214), నాదేన = గర్జనతో (పంచాస్యస్య నాదః, తేన), తత్+నాదమ్ = ఆ మేఘధ్వనిని (ఉరుములను), సాధు = చక్కగా, జిగాయ = గెలిచింది. (జి జియే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), నిత్యమ్ = ఎల్లప్పుడు, క్షమా-ధారిణః = భూమిని మోయువానికి/సహనశీలునకు, కిం-న-సుకరమ్ = ఏది సులువు కాదు?

**తా ॥** గోవర్ధనగిరి ఇంద్రప్రేరితమైన మేఘాడంబరాన్ని జయించింది. ఇంద్రనీలం వంటి దేహ (ధరణీ) కాంతితో మేఘాన్ని గెలిచింది. నెమళ్ళపింఛాల శోభతో ఇంద్రధనుస్సులను ఓడించింది. ముత్యాలవెలుగులతో నీటిసమూహాలను మించింది. బంగారువన్నెగల నేలతో మెరుపులను జయించింది. సింహాల గర్జనలతో ఉరుములను గెలిచింది. అవును మరి. నిత్యమూ క్షమను ధరించే (పర్వతానికీ, ఓర్పుగలవానికీ) వారికి తేలిక గానిది ఏముంటుంది?

**వి :** 1. ఇక్కడ ధరణీకాంతి, శిఖండశోభ, ముక్తాఫలరుచి, స్థలశోభ, పంచాస్యనాదం వీటి కన్నింటికీ **జిగాయ**

అన్న క్రియాపదంతో అన్వయం. ఇవన్నీ ప్రకృతాంశాలే. కేవల ప్రకృతాంశాలకు ఏకధర్మాన్ని అన్వయించటం తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**'–(కు. 12)

క్షమా శబ్దానికి అభంగంగానే భూమి, ఓర్పు అని రెండు అర్థాలు కాబట్టి **శ్లేషాలంకారం** అదీ అభంగశ్లేష. పర్వతవిజయం విశేషం. సహనశీలుడు గెలవటం సామాన్యం. ఈ రెండింటినీ కలిపి చెప్పినందువలన **అర్థాంతరన్యాసాలంకారం**. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**'–(కు. 122). ఈ మూడూ పరస్పరం సంబంధం అవసరం లేనివి. కాబట్టి **అలంకారసంసృష్టి**.

| | | | |
|---|---|---|---|
| 2. **జిగాయ :** | **జిగాయ** | జిగ్యతుః | జిగ్యుః |
| | జిగయిథ/జిగేథ | జిగ్యథుః | జిగ్య |
| | జిగాయ/జిగయ | జిగ్యివ | జిగ్యిమ. |

*

**శ్లో॥ నిర్గత్య పశ్యతాటోపః కిమద్యాప్యస్తి వార్ముచామ్ ।**
**ఇత్యుక్తః కోఽపి గోపస్తద్విదిత్వా వక్తి మాధవమ్ ॥** **6–17**

**అ :** వర్షపాతోపశాంతి. –పథ్యావక్త్రమ్.

**అ :** వాః+ముచామ్ ఆటోపః అద్య+అపి అస్తి కిమ్. పశ్యత నిర్గత్య ఇతి ఉక్తః కః+అపి గోపః తద్ విదిత్వా మాధవం వక్తి.

**ప్ర :** వాః+ముచామ్ = మేఘాలయొక్క (వాః ముంచన్తి ఇతి, తేషామ్), ఆటోపః = ఆడంబరం, అద్య+అపి=ఇంకా, అస్తి కిమ్? = ఉన్నదా? (అస భువి–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), నిర్గత్య = వెలుపలకు వెళ్ళి, పశ్యత = చూడండి (దృశ్ ప్రేక్షణే–పరస్మైపది–లోట్–మ.బ.), ఇతి = అని, ఉక్తః = చెప్పబడినవాడై (కృష్ణునిచేత) (వచ – ధాతువుపై క్త ప్రత్యయం), కః+అపి = ఎవరో ఒక, గోపః = గోపాలుడు, తత్ = దానిని, విదిత్వా = తెలిసికొని (విద్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), మాధవమ్ = కృష్ణునితో, వక్తి = చెప్పాడు. (వచ పరిభాషణే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** 'గోపాలులారా! మేఘాల ఆడంబరం తగ్గిందో లేదో వెళ్ళి చూడండి.' అని కృష్ణుడు ఆదేశించగానే ఒకానొక గోపుడు వెళ్ళి చూచి వచ్చి కృష్ణునితో ఇలా అంటున్నాడు.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **పశ్యత :** | పశ్యతు/పశ్యతాత్ | పశ్యతామ్ | పశ్యన్తు |
| | పశ్య/పశ్యతాత్ | పశ్యతమ్ | **పశ్యత** |
| | పశ్యాని | పశ్యావ | పశ్యామ |

**అస్తి :** 6–13వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **వక్తి :** | **వక్తి** | వక్తః | –– |
| | వక్షి | వక్థః | వక్థ |
| | వచ్మి | వచ్వః | వచ్మః |

వచ ధాతువునకు లట్ ప్ర.బ. అసలుండదు. "అయమంతిపరో న ప్రయుజ్యతే" (వైయాకరణసిద్ధాంతకౌముదీ–బాలమనోరమాసహితా–**తృతీయ భాగః పుట–192**) *

**శ్లో॥ ధారా నైవ పయోముచాం యదుపతే! ప్రేమాశ్రుధారా పరం**
**స్వానాం నాపి చ గర్జితం స్తుతికృతాం సిద్ధేశ్వరాణాం ధ్వనిః ।**

**విద్యున్నామరనర్తకీకరచయాలఙ్కారకాన్తిః ప్రభో!**
**నో వాయుః సురవృష్టపుష్పసహగానల్పాలిపక్షైర్మరుత్ ॥ 6-18**

**అ :** వాన తగ్గిందో లేదో చూడటానికి వెళ్ళినవారు తిరిగి వచ్చి కృష్ణునికి వివరించటం.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** యదుపతే పయోముచాం ధారా న+ఏవ పరం స్వానాం ప్రేమాశ్రుధారా (అస్తి) చ, గర్జితమ్ అపి న. (కింతు) స్తుతికృతాం సిద్ధేశ్వరాణాం ధ్వనిః, విద్యుత్ న (కింతు) అమర/నర్తకీ/కర చయ+అలంకార కాంతిః, ప్రభో! వాయుః నో (కింతు) సురవృష్ట పుష్ప సహగ+ అనల్ప+అలి పక్షైః మరుత్.

**ప్ర :** యదుపతే=యదువంశస్థుల స్వామీ! కృష్ణా! (యదూనాం పతిః, తస్మాత్ సంబుద్ధిః), పయో-ముచామ్ = మేఘాలయొక్క (పయః ముంచన్తి ఇతి - తేషామ్), ధారా = కురియుట, న+ఏవ = లేనే లేదు, పరమ్ = అయితే, స్వానామ్ = మావంటి వారి యొక్క, ప్రేమ+అశ్రు-ధారా : ప్రేమ = స్నేహంతో కూడిన, అశ్రు-ధారా = బాష్పధారమాత్రమే, అస్తి = ఉన్నది, చ = మఱియు, గర్జితమ్ అపి = మేఘధ్వని కూడా, న = లేదు, (కింతు) = అయితే, స్తుతి-కృతామ్ = స్తోత్రం చేస్తున్న (స్తుతిం కుర్వన్తి ఇతి, తేషాం), సిద్ధేశ్వరాణామ్ = సిద్ధ ప్రభువులయొక్క (సిద్ధానామ్ ఈశ్వరాః, తేషాం), ధ్వనిః = చప్పుడు. విద్యుత్ = మెఱుపు, న = లేదు, (కింతు) = అయితే, అమర-నర్తకీ-కర-చయ-అలంకార-కాంతిః : అమరనర్తకీ = దేవతానర్తకీమణులయొక్క, కర = చేతులయొక్క, చయ = సమూహం యొక్క, అలంకార = అలంకారాలయొక్క, కాంతిః = వెలుగు. (అమరాశ్చ తాః నర్తక్యః, తాసాం కరాః, తేషాం చయః, తస్య అలంకారాః, తేషాం కాంతిః), ప్రభో = స్వామీ!, వాయుః = గాలి, నో = లేదు, (కింతు) = కాని, సుర-వృష్ట-పుష్ప-సహగ+అనల్ప+అలి-పక్షైః : సుర = దేవతలచే, వృష్ట = కురియబడిన, పుష్ప = పూలతో, సహ-గ = కలిసివచ్చిన, అనల్ప = ఎక్కువగా వున్న, అలి=తుమ్మెదలయొక్క, పక్షైః=రెక్కలచేత పుట్టిన, మరుత్ = గాలి, (అస్తి) = ఉన్నది.

**తా ॥** యదుపతీ! వానధార లేదు. మావంటి వారి ప్రేమబాష్పధారయే ఉంది. ఉరుములు లేవు. నిన్ను స్తుతిస్తున్న సిద్ధేశ్వరుల స్తోత్రధ్వని మాత్రమే ఉన్నది. మెరుపులు లేవు. ఆనందంతో నాట్యమాడుతున్న దేవతానర్తకీమణుల కరాలంకారకాంతియే ఉంది. గాలి లేదు. దేవతలు కురిపిస్తున్న పూలను అనుసరిస్తున్న తుమ్మెదలపిండుయొక్క రెక్కలసవ్వడి మాత్రమే ఉంది.

**వి :** 1. శ్లో॥ 'ఖం వ్యభ్రముదితాదిత్యం వాతవర్షం చ దారుణమ్ ।
నిశామ్యోపరతం గోపాన్ గోవర్ధనధరోఽబ్రవీత్ ॥ - భాగవతం 10/25/25

అని ఆదేశించాడు కృష్ణుడు. వాన తగ్గటాన్ని గమనించియే చూచి వచ్చిన గోపాలుడు చెప్తున్న మాట పై శ్లోకం. కేవలం వాన, ఉరుములు, మెరుపులు, గాలి లేవు అని చెప్పటమే లక్ష్యమయితే వాన మొ॥ వాటిని కప్పిపుచ్చనవసరం లేదు. అసలది కప్పిపుచ్చటం కాదు. అంత విస్తృతంగా ప్రత్యంశాన్ని అపహ్నవించి అన్యారోపణ చేయనవసరం లేదు. కాబట్టి కొంతకాలవ్యవధానాన్ని రెండింటి మధ్య నిలిపి, అవి తగ్గిపోయిన తరువాత కూడా మనం అలాగే కొంతసేపు భావించాం అని చెప్పటంలో అందముంది. అలా అన్నప్పుడు అది అపహ్నవా-లంకారమవుతుంది. '**శుద్ధాపహ్నుతిరన్యస్యారోపార్థో ధర్మనిహ్నవః**'-(కు. 26)

2. ఇది పరిసంఖ్యాలంకారం కూడా అవుతుంది. ధారను మేఘాలలో నిషేధించి ప్రేమాశ్రువులలో విధించటం, గర్జితాన్ని మేఘాలలో నిషేధించి స్తుతులలో విధించటం, మెరుపును మేఘాలలో నిషేధించి అలంకార సమూహంలో విధించటం, గాలిని మేఘాలలో నిషేధించి తుమ్మెదలలో రెక్కలలో విధించటం ఇది పరిసంఖ్యాలంకారం. '**పరిసంఖ్యా నిషిధ్యైకమన్యస్మిన్ వస్తుయంత్రణమ్**'-(కు. 113).

*

శ్లో॥ నీలం నైవ నభః సులజ్జితశచీభర్తుర్ముఖే నీలిమా
మేఘాః క్వాపి న సన్తి కిన్తు దివిజభ్రాజద్విమానామ్బుదాః ।
తామిస్రం నహి దిశ్యథేదృశమపి త్వాం మానుషం మన్వతాం
చిత్తేష్వస్తి న వేపథుర్నిజజనే భీతేన్ద్రగాత్రే పరమ్ ॥ 6-19

అ : ఓటమి ద్వారా ఇంద్రునిలో కలిగిన ఆత్మన్యూనతా భావాన్ని వర్ణించటం. -శార్దూలవిక్రీడితమ్.

అ : నభః నీలం న ఏవ సులజ్జితశచీభర్తుః ముఖే నీలిమా, క్వ+అపి మేఘాః న సన్తి కిన్తు దివిజభ్రాజద్విమానాంబుదాః దిశి తామిస్రం న హి. అథ ఈదృశమ్ అపి త్వాం మానుషం మన్వతాం చిత్తేషు అస్తి నిజజనే వేపథుః న అస్తి పరం భీతేంద్రగాత్రే అస్తి.

ప్ర : నభః = ఆకాశం, నీలమ్ = నల్లగా, న ఏవ = లేనే లేదు. సులజ్జిత శచీభర్తుః : సులజ్జిత = బాగా సిగ్గుపడిన, శచీ-భర్తుః = ఇంద్రునియొక్క (సులజ్జితశ్చ అసౌ శచ్యాః భర్తా, తస్య), ముఖే = వదనంలో, (అస్తి = ఉన్నది), క్వ-అపి = ఎక్కడా కూడా, మేఘాః = మొయిళ్లు, న సన్తి = లేవు (అస-భువి-పరస్మైపది-లట్-ప్ర.బ.), కింతు = కానీ, దివిజ-భ్రాజద్-విమాన+అంబుదా : దివిజ = దేవతల యొక్క, భ్రాజద్ = ప్రకాశిస్తున్న, విమాన+అంబుదాః = విమానాలనే మేఘాలు (దివిజానాం భ్రాజన్తి విమానాని ఏవ అంబుదాః), సన్తి = ఉన్నాయి. దిశి = దిక్కులో, తామిస్రమ్ = చీకటి, న హి = లేదు. అథ = ఇక, ఈదృశమ్ అపి = ఇటువంటి వాడవైన, త్వామ్ = నిన్ను, మానుషమ్ = మనుజునిగా, మన్వతామ్ = భావిస్తున్న వారి, చిత్తేషు = మనస్సులలో, అస్తి = ఉన్నది. నిజ-జనే = తన వారిలో, వేపథుః = వణుకు, న-అస్తి = లేదు, పరమ్ = అయితే, భీత+ఇంద్ర-గాత్రే : భీత = బెదిరిన, ఇంద్ర = ఇంద్రునియొక్క, గాత్రే = శరీరంలో, అస్తి = ఉన్నది.

తా ॥ నల్లదనం ఆకాశంలో లేదు. సిగ్గుపడుతున్న ఇంద్రుడి ముఖంలోనే వుంది. మేఘాలు ఎక్కడా లేవు. దేవతల విమానాలనే మేఘాల్లా ఉన్నాయి. ఏదిక్కునా చీకటి లేదు. ఇటువంటి నిన్ను ఇంకా మనిషివే అనుకొనే వారి మనస్సులోనే ఉంది. నీ వారెవ్వరూ వణికిపోవటం లేదు. బెదిరిపోయిన ఇంద్రుడి శరీరంలోనే వణుకుంది.

వి : 1. నల్లదనాన్ని ఆకాశంలో నిషేధించి ఇంద్రుని ముఖంలో విధించటం, ఆకాశంలో మేఘాలను నిషేధించి దేవతా విమానాలలోనే మేఘత్వాన్ని ఆరోపించటం, దిక్కులలో చీకటిని నిషేధించి కృష్ణుని మనిషిగా భావించే వారి మనస్సులలోనే చీకటిని విధించటం, వణుకును స్వజనులలో నిషేధించి ఇంద్రశరీరంలో విధించటం-ఇది **పరిసంఖ్యాలంకారం**.

2. బాల్యంలో చూపిన ఎన్నో శక్తులు యాదృచ్ఛికంగా జరిగాయేమో అనే సంభావన కవకాశమున్నవి. కానీ గోవర్ధనపర్వతాన్ని పైకి లేపటమన్నది ఆ రీతిగా భావించే అవకాశం లేనిది. అందుకే కృష్ణుడు మనిషి అని ఇంకా భావించే వారి మనస్సులలోని అజ్ఞానాన్ని చీకటిగా చెప్పటం కంఠోక్తిగా.

అందుకే నందుడు 'గోపజనులు ఈ సంఘటన తర్వాతనే గతంలోని సంఘటనలను కూడా కలబోసి ఆలోచించి' కృష్ణుడు మానవమాత్రుడు కాదని నిర్ణయించుకొన్నారు.

క. ఏడేండ్ల బాలుఁ డెక్కడ? క్రీడం గరి తమ్మియెత్తుక్రియ నిందఱముం
జూడ గిరి యెత్తు టెక్కడ? వేడుక నొక చేత నేఁడు వెఱఁగౌఁ గాదే.

క. ఓ నంద! గోపవల్లభ! నీ నందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె? మానవమాత్రుండె నీ కుమారుఁడు తండ్రీ! -పోతన భాగవతం 10/930,931

3. **సన్తి, అస్తి :** 6-13వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తతః పరీతః స్వైర్గోపైర్గోపీభిర్గోధనైరపి ।**
**ప్రతస్థే ప్రయతం గోష్ఠం స్తూయమానః సురైర్నరైః ॥ 6-20**

**అ :** కృష్ణుడు గోవర్ధనగిరినుండి తిరిగి గోకులానికి బయలుదేరుట. -పథ్యావక్త్రమ్.

**అ :** తతః (కృష్ణః) స్వైః గోపైః గోపీభిః గోధనైః అపి పరీతః సురైః నరైః స్తూయమానః ప్రయతం గోష్ఠం ప్రతస్థే.

**ప్ర :** తతః = ఆ తరువాత – కృష్ణుడు, స్వైః = తనవారైన (లైన), గోపైః = గోపాలురతోనూ, గోపీభిః=గోపికలతోనూ, గో–ధనైః+అపి = గోధనాలతోడనూ (గావః ఏవ ధనాని–తైః), పరీతః (సన్) = చుట్టబడినవాడై, సురైః = దేవతలచేతను, నరైః+అపి = మానవుల చేతను, స్తూయమానః = ప్రశంసింపబడుతూ (స్తు – కర్మణి – ధాతువుపై శానచ్ ప్రత్యయం), ప్రయతమ్ = పవిత్రమైన, గోష్ఠమ్ = గోకులానికి, ప్రతస్థే = బయలుదేరాడు. (ప్ర–స్థా–గతి నివృత్తౌ–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** (ఇంద్రప్రయత్నాన్ని కృష్ణుడు విఫలం చేసిన) తరువాత కృష్ణుడు తనవారైన గోపాలురూ, గోపికలూ, గో ధనాలతో సహా దేవతలు, మానవులు ప్రశంసిస్తూండగా గోకులానికి బయలు దేరాడు.

**వి :** 1. **ప్రతస్థే :**

| | | |
|---|---|---|
| ప్రతస్థే | ప్రతస్థాతే | ప్రతస్థిరే |
| ప్రతస్థిషే | ప్రతస్థాథే | ప్రతస్థిధ్వే |
| ప్రతస్థే | ప్రతస్థివహే | ప్రతస్థిమహే. |

*

**శ్లో॥ నాథాపరాధకృదుపేత్య సులజ్జితోఽథో**
**శక్రోఽచ్యుతం రహసి రమ్యతమం త్రిలోక్యామ్ ।**
**మూర్ధ్నా ప్రణమ్య సదయం సుధయాఽభ్యషిఞ్చ-**
**ద్గోవిన్దనామ చ పఠన్ స్వకృతాఘశాన్త్యై ॥ 6-21**

**అ :** ఇంద్రుడు ఒంటరిగా కృష్ణుని కలిసి పశ్చాతాపాన్ని ప్రకటించటం. -వసంతతిలక.

**అ :** అథో నాథ+అపరాధకృత్ సులజ్జితః శక్రః త్రిలోక్యాం రమ్యతమం సదయమ్ అచ్యుతం రహసి స్వకృత+అఘశాంత్యై మూర్ధ్నా ప్రణమ్య గోవిందనామ పఠన్ చ సుధయా అభ్యషించత్.

**ప్ర :** అథో = ఆ తరువాత (గిరి క్రిందనుండి నిష్క్రమించిన తరువాత), నాథ+అపరాధ+కృత్ : నాథ = ప్రభువయిన కృష్ణుని విషయంలో, అపరాధ–కృత్ = తప్పుచేసిన వాడు (నాథస్య అపరాధం కరోతి ఇతి), సులజ్జితః (సన్) = బాగా సిగ్గుపడినవాడూ అయిన, శక్రః = ఇంద్రుడు, త్రిలోక్యామ్ = మూడు లోకాలనూ (త్రయాణాం లోకానాం సమాహారః – తస్యామ్), రమ్య–తమమ్ = బాగా అందగాడునూ, సదయమ్ = దయామయుడును అయిన, అచ్యుతమ్ = కృష్ణుని, రహసి = ఏకాంతంలో, ఉపేత్య = సమీపించి (ఉప+ఇ – ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వ–కృత+అఘ–శాంత్యై : స్వకృత = తాను చేసిన, అఘ = పాపంయొక్క, శాంత్యై = పరిహారం కోసం (స్వేన కృతస్య అఘస్య శాంతిః, తస్యై), మూర్ధ్నా = తలతో, ప్రణమ్య = నమస్కరించి (ప్ర– నమ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గోవింద–నామ = గోవిందు డనే పేరును, పఠన్ = పలుకుతూ (పఠ ధాతువుపై శతృ ప్రత్యయం), సుధయా = అమృతంతో, అభి+అషించత్ = అభిషేకించాడు. (అభి క్షరణే– పరస్మైపది–లజ్–ప్ర.ఏ.)

**తా ॥** ఇంద్రుడు తాను చేసిన పనికి సిగ్గుపడ్డాడు. కృష్ణుని విషయంలో తాను తప్పుచేసినట్లు గ్రహించి, ఒంటరిగా త్రిలోకసుందరుడైన ఆ కృష్ణుని కలిశాడు. తాను చేసిన పాపానికి పరిహారం కోసం కృష్ణునకు శిరసా నమస్కరించి **గోవింద** నామాన్ని పలుకుతూ అమృతంతో అభిషేకించాడు.

**వి :** 1. మనుష్యుల విషయంలో చేస్తే నేరం. అదే పరమాత్మ విషయికమయితే పాపం. మనుష్యవిషయంలో నేరం/దోషం కూడా మరణానంతరానుభవంలో పాప పుణ్య రూపంగానే గణన చేయబడుతుంది.

శ్లో॥ హరత్యఘం సంప్రతి హేతురేష్యతః – శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః ।
శరీరభాజాం భవదీయదర్శనం – వ్యనక్తి కాలత్రితయేఽపి యోగ్యతామ్ ॥ – శిశుపాలవధమ్ – 1/26

కృష్ణసందర్శనం భూతభవిష్యద్వర్తమానకాలాలలోనూ యోగ్యతను నిరూపించేది. దర్శనం చేత ప్రకృతపాపం నశిస్తుంది. అసలు దర్శనమే పురాకృతపుణ్యఫలం. రాబోయే శుభానికి అది సూచిక.

2. కృష్ణునకు గోవిందపదవి నిచ్చి, అభిషేకించి, గోపగోగణపతిత్వాన్ని ఇచ్చి, ఇంద్రుడు నిష్క్రమించాడు.

మ. సురభిక్షీరములన్ సురద్విపమహా శుండాలతానీత ని
ర్జర గంగాంబువులన్ నిలింపజననీసన్మౌనిసంఘంబుతో
సురనాథుండ భిషిక్తుఁ జేసి పలికెన్ సొంపార గోవిందుఁ డం
చు రణాక్రాంతవిపక్షు ఁదోయజదళాక్షున్ సాధుసంరక్షణున్ –పోతనభాగవతం 10/948

| | | | |
|---|---|---|---|
| 3. **అభ్యషించత్ :** | **అభ్యషించత్** | అభ్యషించతామ్ | అభ్యషించన్ |
| | అభ్యషించః | అభ్యషించతమ్ | అభ్యషించత |
| | అభ్యషించామ్ | అభ్యషించావ | అభ్యషించామ. |

*

**శ్లో॥ బద్ధ్వా నినాయ కిల నన్దమకాలవారి**
**మధ్యప్రవిష్టమనుగః సలిలేశ్వరస్య ।**
**భృత్యచ్ఛలేన స సమన్యురముం బబన్ధ**
**శ్రుత్వా స్వనాథపితరం త్వితి మే ప్రతర్కః॥ 6-22**

**అ :** వరుణుని అనుచరుడు నందుని బంధించుట. –వసంతతిలక.

**అ :** సలిల+ఈశ్వరస్య అనుగః అకాలవారిమధ్యప్రవిష్టం నందం బద్ధ్వా నినాయ కిల. సః స్వనాథపితరం శ్రుత్వా సమన్యుః (సన్) భృత్యచ్ఛలేన అముం బబన్ధ ఇతి మే తు ప్రతర్కః.

**ప్ర :** సలిల+ఈశ్వరస్య = జలాధిపతి(వరుణుని)యొక్క (సలిలస్య ఈశ్వరః తస్య), అనుగః = అనుచరుడు (అను గచ్ఛతి ఇతి), అకాల... ప్రవిష్టమ్ : అకాల = వేళ కాని వేళలో, వారి–మధ్య = నీటిలో, ప్రవిష్టమ్ = ప్రవేశించిన (కాలో న భవతి ఇతి అకాలః తస్మిన్ వారిణః మధ్యే ప్రవిష్టః తమ్), నందమ్ = నందుని, బద్ధ్వా = బంధించి, నినాయ కిల = కొనిపోయాడు గదా! (ప్ర.ఏ.), సః = ఆ వరుణుడు, స్వ–నాథ–పితరమ్ : స్వ = తనయొక్క, నాథ = స్వామియొక్క, పితరమ్ = తండ్రినిగా, శ్రుత్వా = విని (శ్రు ధాతువుపై క్త్వా ప్రత్యయం), సమన్యుః సన్ = కోపించి (మన్యునా సహితః), భృత్య–ఛలేన = సేవకుడనే నెపంతో, అముమ్ = ఆ నందుని, బబన్ధ = బంధించాడు (బన్ధ్ బన్ధనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ఇతి తు = అనియే, మే = నా యొక్క, ప్రతర్కః = భావన.

**తా ॥** నందుడు వేళకానివేళలో జలాశయంలో ప్రవేశించాడని వరుణుని అనుచరుడు ఆయనను బంధించి తీసికొని వెళ్ళాడు. కానీ నందుడు తన ప్రభువుకు తండ్రి అనటం విని, సహించలేక వరుణుడే భృత్యుడన్న నెపంతో నందుని బంధించాడని నా ఊహ. (కవి సంభావన)

**వి :** 1. మనం పురుషోత్తముడుగా భావించే వారిని మరొక సామాన్యుడు శాసిస్తున్నాడంటే మనకు ఆ సామాన్యునిపై కోపం రావటం, లేదా మనలో ఈర్ష్యకలగటం సాధారణ విషయమే. వరుణునిలో ఆ ప్రవృత్తియే పనిచేసిందని కవి ఊహిస్తున్నాడు. అందునా తాను ప్రత్యక్షంగా కార్యాచరణలకు పూనుకొంటే అది మరల తన స్వామికి

కోపకారణం కావచ్చు. అందుకని తన అనుచరుడు ఆపని చేశాడన్న నెపాన్ని కల్పించి, తానే చేసి వుంటాడని కవి సంభావన. హేతుసంభావన కాబట్టి **హేతూత్ప్రేక్షాలంకారం**. **'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా'** (కు.122)

2. నందుని బంధించిన కథాక్రమం పోతన మాటలలో–

సీ. నందుఁ డేకాదశినాఁ డుపవాసంబు – చేసి శ్రీహరిపూజ చేసి దనుజ
వేళ యెఱుఁగక వేగక ముందఱ – ద్వాదశీస్నానంబు దగ నొనర్ప
యమునాజలము సొర నందొక్క దైత్యుండు – నందుని వరుణుని నగరమునకుఁ
గొనిపోవఁ దక్కిన గోపకులందఱు – నందగోపకునిఁ గానక కలంగి

తే. రామకృష్ణులఁ బేర్కొని రవము సేయఁ,
గృష్ణుఁ డీశుండు తమ తండ్రిఁ గికురువెట్టి
వరుణభృత్యుండు గొనిపోయి వరుణుఁ జేర్చు
టెఱిఁగి రయమున నచ్చోటి కేఁగె నధిప! – పోతనభాగవతం 10/951

3. రాక్షసవేళ :

శ్లో॥ సంధ్యాసంరజ్యతే ఘోరా పూర్వరాత్రాగమేషు యా ।
అశీతిభిర్లవైః హీనం తన్ముహూర్తం ప్రచక్షతే ॥

శ్లో॥ విహితం కామచారాణాం యక్షగంధర్వరక్షసామ్ ।
శేషమన్యన్మనుష్యాణాం కర్మచారేషు వై స్మృతమ్ ॥–మహాభారతం ఆదిపర్వం 169/8,9

సంధ్యాకాలంనుండి 80 లవాల కాలాన్ని విడిచి, మిగిలిన రేయి అంతా యక్షరాక్షస గంధర్వుల కాలం. ఆ వేళలో మనుష్యలు జలాశయాలను వాడకూడదు.

| | | | |
|---|---|---|---|
| 4. **నినాయ :** | **నినాయ** | నిన్యతుః | నిన్యుః |
| | నినయిథ/నినేథ | నిన్యథుః | నిన్య |
| | నినాయ/నినయ | నిన్యివ | నిన్యిమ |
| **బబన్ధ :** | **బబన్ధ** | బబన్ధతుః | బబన్ధుః |
| | బబన్ధిథ/బబన్ధ | బబన్ధథుః | బబన్ధ |
| | బబంధ | బబంధివ | బబంధిమ. |

*

**శ్లో॥ కృష్ణోఽపి వీక్ష్య దృఢభక్తిమివ ప్రతుష్టః – కృత్యచ్ఛలేన నిజదర్శనమేవ దిత్సన్ ।**
**గత్వాఽమ్బురాశినిలయం జనకేన సాక–మభ్యర్చితః స్వభవనం పునరాజగామ ॥23**

**అ :** కృష్ణుడు నందుని వరుణలోకంనుండి తిరిగి కొనివచ్చుట. –వసంతతిలక.

**అ :** కృష్ణః అపి దృఢభక్తిం వీక్ష్య సంతుష్ట ఇవ. కృత్యచ్ఛలేన నిజదర్శనమ్ దిత్సన్ ఏవ అంబురాశినిలయం గత్వా అభ్యర్చితః జనకేన సాకం పునః స్వభవనం ఆజగామ.

**ప్ర :** కృష్ణః+అపి = కృష్ణుడుకూడా, దృఢ–భక్తిమ్ = (వరుణుని) గాఢభక్తిని, వీక్ష్య = చూచి (వి+ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సంతుష్టః+ఇవ = ఆనందించినట్లుగా, కృత్య+ఛలేన = నందుని కొనివచ్చే పని అనే నెపంతో (కృత్యమితి ఛలేన), నిజ–దర్శనమ్ = తన దర్శనాన్ని (నిజస్య దర్శనమ్), దిత్సన్–ఏవ = ఇవ్వగోరియే (దాతుమ్ ఇచ్ఛన్), అంబు–రాశి–నిలయమ్ = సముద్రంలోని నిలయానికి (అంబూనాం రాశిః, తస్య నిలయః, తమ్),

గత్వా = వెళ్ళి (గమ్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), అభ్యర్చితః = పూజింపబడి (వరుణునిచే), జనకేన సాకమ్ = తండ్రితో కూడా, పునః = తిరిగి, స్వభవనమ్ = తన ఇంటికి, ఆజగామ = వచ్చెను. (ఆ–గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు కూడా వరుణుని గాఢభక్తిని గుర్తించాడు. ఆనందించాడు. తండ్రితో తీసికొని రావటం అనే నెపంతో వరుణునికి తన దర్శనాన్ని ఇవ్వాలనుకొన్నాడు. వరుణాలయానికి వెళ్ళి, అక్కడ వరుణుని పూజల నందుకొని, నందునితో సహా ఇంటికి తిరిగి వచ్చాడు.

**వి :** 1. తన తండ్రిని బంధించినా వరుణునికి '**దర్శనమివ్వగోరటం**', తానే బయలుదేరటంలో తనపై వరుణుని కున్న భక్తికన్న, వరుణుని కర్తవ్యదీక్ష ప్రధానకారణమై వుండవచ్చు.

శ్లో॥ కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోస్త్వకర్మణి ॥

అని తాను తన సిద్ధాంతాన్ని ప్రకటించబోతున్నాడు గదా! – భగవద్గీత 2/47

2. **వరుణకృతకృష్ణస్తుతి** :

ఉ. ఏ పరమేశ్వరున్ జగము లిన్నిటిఁ గప్పిన మాయ గప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపిత భద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము వాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్. – పోతనభాగవతం 10/955

3. **ఆజగామ :ఆజగామ**

| | | |
|---|---|---|
| ఆజగామ | ఆజగ్మతుః | ఆజగ్ముః |
| ఆజగమిథ/ఆజగన్థ | ఆజగ్మథుః | ఆజగ్మ |
| ఆజగామ/ఆజగమ | ఆజగ్మివ | ఆజగ్మిమ. |

*

**శ్లో॥ తప్తం హేమ కృశానుసంగి గగనే వాతాయనే భాజనే**
**మాహేన్ద్ర్యాః శుభకుణ్డలం రచయితుం దేవైరుపాయాద్దిశః ।**
**సంగృహ్యామ్బుని సన్నివేశితమివోత్తుఙ్గస్ఫులిఙ్గావృతం**
**తేజోరాశిరినో జగామ జలధిం రాగాఙ్కితః పశ్చిమమ్ ॥ 6–24**

**అ :** సూర్యాస్తమయవర్ణన. (ఇక్కడ నుండి 9 శ్లోకాలు) –శార్దూలవిక్రీడితమ్.

**అ :** వాత+అయనే గగనే భాజనే కృశానుసంగి తప్తమ్ ఉత్తుంగస్ఫులింగ+ఆవృతం, మాహేన్ద్ర్యాః దిశః శుభకుండలం రచయితుం దేవైః ఉపాయాత్ సంగృహ్య అంబుని సన్నివేశితమ్ హేమ ఇవ తేజోరాశిః ఇనః రాగ+అంకితః (సన్) పశ్చిమం జలధిం జగామ.

**ప్ర :** వాత+అయనే = కిటికీలో / కొలిమిలో (వాతస్య అయనం తస్మిన్), గగనే–భాజనే = ఆకాశమను పాత్రలో (మూసలో), కృశాను–సంగి = అగ్నితో చేరినదై (పగలు సూర్యుడిలో అగ్ని వుంటాడు. రాత్రి అగ్నిలో సూర్యుడుంటాడు.), తప్తమ్ = కాగిన/కరిగినదియు, ఉత్తుంగ–స్ఫులింగ+ఆవృతమ్ : ఉత్తుంగ = ఉన్నతమైన / పైకెగస్తున్న, స్ఫులింగ = నిప్పురవ్వలతో, ఆవృతమ్ = చుట్టబడినదియు (ఉత్తుంగైః స్ఫులింగైః ఆవృతమ్), మాహేంద్ర్యాః = ఇంద్ర సంబంధమైన, దిశః = దిక్కునకు (తూర్పుదెసకు), శుభ–కుండలమ్ = అందమైన చెవి కమ్మను (శుభం చ తత్ కుండలమ్), రచయితుమ్ = చేయటానికి, దేవైః = దేవతలచే, ఉపాయాత్ = నేర్పుగా, సంగృహ్య = సమీకరించి, అంబుని = నీటిలో, సన్నివేశితమ్ = నిలుపబడిన, హేమ ఇవ = బంగారు అన్నట్లు,

తేజో-రాశిః = తేజః పుంజమైన, ఇనః = సూర్యుడు, రాగ+అంకితః (సన్) = ఎఱ్ఱదనంతో కూడిన వాడై (రాగేణ అంకితః), పశ్చిమమ్ = పడమటనున్న, జలధిమ్ = కడలిని, జగామ = పొందాడు.

**తా ॥** దేవతలు కిటికీ అనే కొలిమిలో ఆకాశమనే మూసలో బంగారాన్ని కరిగించి ఆ రవ్వలు పైకి ఎగిసిపడే ఆ స్వర్ణజలాన్ని ఉపాయంతో సంగ్రహించి నీటిలో నిలిపినట్లు తేజోరాశి అయిన సూర్యుడు ఎఱ్ఱబడి పశ్చిమసంద్రానికి చేరాడు. దేవతల ఆ ప్రయత్నమంతా తూర్పుదిక్కు అనే కాంతకు శుభకుండలాన్ని తయారుచేయటానికి.

**వి :** 1. సూర్యుడికి చిన్నబంగారుముద్దతో పోలిక. వాస్తవానికి ఇది ఉపమాదోషం కావలసి వస్తుంది. **'జాతిప్రమాణధర్మన్యూనతోపమానస్య హీనత్వమ్'** (కావ్యాలంకారసూత్రవృత్తి - 4/9). ఆ ప్రమాదంనుండి తప్పించే ప్రయత్నం ఇక్కడ కనిపిస్తోంది. అది బంగారుముద్దే అయినా దాని వినియోగం తూర్పుదెస అనే అంగనకు కుండలాలు చేయించటం వినియోగదృష్ట్యా దాని ప్రమాణాన్ని పెంచుకొని ఉపమాదోషం కాకుండా చూడవలసి వుంటుంది.

బంగారమో అన్నట్లు సూర్యుడున్నాడనటం సంభావన. అందుకే ఉత్ప్రేక్షాలంకారం. వస్తుమాత్రసంభావన. ఉపమానోపమేయాలు రెండింటినీ చెప్పినందువలన **ఉక్త విషయ-వస్తూత్ప్రేక్ష** ఇది.

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | జగామ | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ కరైర్గిరీన్ద్రాన్ పరితో దధానోऽ-ప్యసౌ వివస్వాన్ పతితః కిలాబ్ధౌ ।**
**మమేత్థమాభాతి సరిచ్ఛరీర-విశోషకం తత్పతిరగ్రసీత్ తమ్ ॥ 6-25**

**అ :** సూర్యాస్తమయవర్ణన. -వసంతతిలక.

**అ :** అసౌ వివస్వాన్ కరైః గిరీంద్రాన్ పరితః దధానః అపి అబ్ధౌ పతితః కిల. సరిత్+శరీర విశోషకం తమ్ తత్పతిః అగ్రసీత్ ఇత్థం మమ ఆభాతి.

**ప్ర :** అసౌ వివస్వాన్ = ఆ సూర్యుడు (వివస్తే ఇతి వివస్వాన్), కరైః = కిరణాలతో, గిరి+ఇంద్రాన్ = శ్రేష్ఠపర్వతాలను, పరితః = అన్ని వైపులా, దధానః+అపి = ధరిస్తున్నా కూడా, అబ్ధౌ=సముద్రంలో, పతితః కిల=పడిపోయాడు గదా (పత్ ధాతువుపై క్త ప్రత్యయం), సరిత్+శరీర-విశోషకమ్ : సరిత్ = నదులయొక్క, శరీర = దేహాలను, విశోషకమ్ = ఎండింపజేసే, తమ్ = ఆ సూర్యుని, తత్పతిః = సరిత్పతి (సముద్రుడు), అగ్రసీత్ = మ్రింగివేశాడు. (గ్రస్ అదనే-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), ఇత్థమ్ = అని, మమ = నాకు, ఆభాతి = స్ఫురిస్తోంది. (ఆ+భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** తన కిరణాలతో పర్వతాలను చుట్టి పట్టుకొని వున్నా కూడా సూర్యుడు సముద్రంలో పడిపోయాడు. నదుల శరీరాలను సూర్యుడు ఎండింప జేశాడన్న కోపంతో నదీవల్లభుడు (సముద్రుడు) సూర్యుని మ్రింగివేశాడని నాకనిపిస్తోంది. (కవి సంభావన)

**వి :** 1. **'మమ ఇత్థమ్ ఆభాతి'** అని కవి వాచా చెప్పి వేయటం వలన ఇది ఉత్ప్రేక్షాలంకారం. తాను నదులను శోషింపజేయటమన్న కారణంగా సముద్రుడు ఆ పని జేశాడని భావించి నందువల్ల ఇది హేతూత్ప్రేక్షాలంకారం.

సూర్యుడు తన చేతులలతో పర్వతాలను పట్టుకొని ఉన్నా సూర్యుడు పడిపోయాడు. కార్యప్రతిబంధకమున్నా కార్యం జరిగిపోవటం విభావనాలంకార భేదాలలో ఒకటి. **'కార్యోత్పత్తిః తృతీయా స్యాత్సత్యపి ప్రతిబంధకే'** (కు.79)

| | | | |
|---|---|---|---|
| 2. **అగ్రసీత్ :** | **అగ్రసీత్** | అగ్రసిష్టామ్ | అగ్రసిషుః |
| | అగ్రసీః | అగ్రసిష్టమ్ | అగ్రసిష్ట |
| | అగ్రసిషమ్ | అగ్రషిష్వ | అగ్రసిష్మ. |

*

**శ్లో॥ త్యక్త్వా క్రమేణ సహజాతమపి స్వరాగం**
**చక్రాబ్జమానితకరః ప్రతతోర్ధ్వపాదః ।**
**ఆశ్రిత్య విష్ణుపదముగ్రతపోఽతపద్య**
**స్తస్యైవ ధామ స జగామ కుతోఽస్య పాతః ॥ 6-26**

**అ :** సూర్యాస్తమయవర్ణన - సూర్యపరంగా తపస్విపరంగా నిరూపణ. -వసంతతిలక.

**అ :** చక్ర+అబ్జమానితకరః ప్రతత+ఊర్ధ్వపాదః యః సహజాతమ్ అపి స్వరాగం క్రమేణ త్యక్త్వా విష్ణుపదమ్ ఆశ్రిత్య ఉగ్రతపః అతపత్, సః తస్య+ఏవ ధామ జగామ. అస్య పాతః కుతః?

**ప్ర : సూర్యపరంగా** : చక్ర+అబ్జమానితకరః : చక్ర = చక్రవాకపక్షులచే, అబ్జ = తామరలచే, మానిత = గౌరవింపబడిన, కరః = కిరణాలు గలవాడును (చక్రైః అబ్జైశ్చ మానితాః కరాః యస్య సః), ప్రతత+ఊర్ధ్వపాదః : ప్రతత = విస్తరించినవియు, ఊర్ధ్వ = పైకి ఎగిసినవియు అయిన, పాదః = కిరణాలు గలవాడును అయిన, **తపస్విపరంగా** : చక్ర+అబ్జమానితకరః : చక్ర+అబ్జ = చక్రశంఖాలచే (అబ్జో ధన్వంతరౌ శంఖే-వైజయన్తీ-ద్వ్యక్షరకాండ-నానాలింగ -3), మానిత = అలంకరింపబడిన, కరః = భుజాలు గలవాడును, ప్రతత+ఊర్ధ్వ - పాదః : ప్రతత = చాపినవియు, ఊర్ధ్వ = పైకి లేచినవియు అయిన, పాదః = పాదాలు గలవాడును (తలక్రిందులుగా నిలిచినవాడు) అయిన, **ఉభయపరంగా :** యః = ఏ సూర్యుడు / ఏ తపస్వి, సహజాతమ్-అపి = సహజమైన / పుట్టుకతో వచ్చిన, రాగమ్ = ఎఱ్ఱదనాన్ని/విషయానురక్తిని, క్రమేణ = క్రమంగా, త్యక్త్వా = విడిచి, విష్ణుపదమ్ = ఆకాశాన్ని (వియద్విష్ణు పదం వా తు పుంస్యాకాశ విహాయసీ-అమరకోశః-దిక్-2)/విష్ణుమూర్తియొక్క పాదాలను, ఆశ్రిత్య = ఆశ్రయించి, ఉగ్ర-తపః = తీవ్రమైన వేడిని/తీవ్రతపస్సును, అతపత్ = కలిగించెనో/చేసెనో, సః = ఆ సూర్యుడు/ ఆ తపస్వి, తస్య = ఆయనయొక్క, ధామ-ఏవ = నివాసానికే (సముద్రంలోనికే), జగామ = వెళ్ళాడు/ విష్ణుసాలోక్యాన్ని పొందాడు. (గమ్ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సూర్యకిరణాలను పద్మాలు, చక్రవాకాలు ఆదరిస్తున్నాయి. ఆ కిరణాలు ఊర్ధ్వముఖంగా ప్రసరిస్తున్నాయి. ఆ సూర్యుడు తనతో పుట్టిన ఎఱ్ఱదనాన్ని వీడి, ఆకాశాన్ని ఆశ్రయించి, తీవ్రతపస్సు చేసి, ఆపై విష్ణువాసమైన జలనిధిలోనికి చేరాడు.

ఒక వైష్ణవతపస్వి భుజాలపై శంఖచక్రాంకితుడై, తలక్రిందులుగా నిలిచి, క్రమంగా సహజాతమైన రాగాన్ని కూడా విడిచిపెట్టి, తీవ్రతపస్సు చేసి, విష్ణునివాసానికి చేరాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో శబ్దశక్తి మూలకమైన ఉపమాలంకారం ధ్వనిస్తుంది. చక్రాబ్జమానితకర, ప్రతతోర్ధ్వపాద, సహజాత, రాగ, విష్ణుపద, ఉగ్రతపః పదాలు ప్రకృతాంశమైన సూర్యపరంగానూ, అప్రకృతమైన తపస్వి పరంగానూ అన్వయిస్తూ పోలికను ధ్వనింపజేస్తాయి.

శ్లో॥ ఆక్షిప్త ఏవాలంకారః శబ్దశక్త్యాప్రకాశతే ।
యస్మిన్ననుక్తః శబ్దేన శబ్దశక్త్యుద్భవో హి సః ॥ - ధ్వన్యాలోక 2/21

2. **జగామ :** 6-24వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తప్తం తపస్వినివహం భువి యస్తతాన - పృథ్వ్యాశ్చ జీవనమహో స్వకరైర్జహార ।**
**లక్ష్మీం తథోడునికరస్య వృథైవ భానో-స్తస్యాస్య పాతమపి యుక్తిసహం వదామః॥27**

**అ :** సూర్యాస్తమయవర్ణన. -వసంతతిలక.

**అ :** యః భువి తపస్వినివహం తప్తం తతాన. పృథ్వ్యాః జీవనం చ స్వకరైః జహార అహో! తథా ఉడునికరస్య లక్ష్మీం వృథా+ఏవ (జహార) తస్య భానోః పాతమ్ అపి యుక్తిసహం వదామః

**ప్ర :** యః = ఎవడయితే, భువి = భూలోకంలో, తపస్వి-నివహమ్ = తాపసుల సమూహాన్ని, తప్తమ్ = తపించిన దానినిగా, తతాన = చేసెనో (తన్ విస్తారే పరస్మైపది - లిట్ - ప్రథమపురుషైకవచనం), పృథ్వ్యాః = భూమియొక్క, జీవనమ్ = ప్రాణమైన నీటిని, స్వకరైః = తన కిరణాలతో, జహార = అపహరించాడో (హృ హరణే పరస్మైపది - లిట్ - (ప్ర.ఏ.), ఉడు-నికరస్య : ఉడు = నక్షత్రాలయొక్క, నికరస్య = సమూహం యొక్క, లక్ష్మీమ్ = కాంతిని, వృథా+ఏవ = వ్యర్థంగా, జహార = అపహరించాడో, తస్య = అటువంటి, భానోః = సూర్యునియొక్క, పాతమ్+అపి = పతనాన్ని కూడా, యుక్తి-సహమ్ = యుక్తియుక్తమే అని, వదామః = చెప్తున్నాము. (వద వ్యక్తాయాం వాచి-పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** ఏ సూర్యుడు ఈ లోకంలోని తాపససమూహాన్ని తపింపజేశాడో, ఏ సూర్యుడయితే తన కిరణాలతో పృథివీజీవనాన్ని అపహరించాడో, ఏ సూర్యుడయితే నక్షత్రసమూహాల కాంతిని అపహరించాడో అటువంటి సూర్యుడి పతనం కూడా యుక్తి సహమే.

**వి :** 1. సూర్యుడి పతనం యుక్తి సహమన్న భావాన్ని సమర్థించవలసి వుంటుంది. అందుకే తపస్యులను తపింపజేయటం, పృథివీజలాన్ని అపహరించటం, నక్షత్రకాంతిని వ్యర్థం చేయటం - ఈ మూడు కారణాలను చూపించి సమర్థించాడు కవి. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' (కు.121)

| | | | |
|---|---|---|---|
| 2. **తతాన :** | **తతాన** | తేనతుః | తేనుః |
| | తేనిథ | తేనథుః | తేన |
| | తతాన/తతన | తేనివ | తేనిమ |
| **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ |
| **వదామః :** | వదతి | వదతః | వదన్తి |
| | వదసి | వదథః | వదథ |
| | వదామి | వదావః | **వదామః.** |

*

**శ్లో॥ స లబ్ధజన్మా దిశి వజ్రపాణేః - ప్రవృద్ధగాత్రో గగనస్య మధ్యే ।**
**అగాద్వినాశం ద్యుమణిః ప్రతీచ్యాం - విధేర్నిదేశో మహతాఽప్యలఙ్ఘ్యః ॥ 6-28**

**అ :** సూర్యాస్తమయవర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ద్యుమణిః వజ్రపాణేః దిశి లబ్ధజన్మా (సన్) గగనస్య మధ్యే ప్రవృద్ధ గాత్రః (సన్) ప్రతీచ్యాం వినాశమ్ అగాత్. విధేః నిదేశః మహతా అపి అలంఘ్యః.

**ప్ర :** సః ద్యుమణిః = ఆ సూర్యుడు (దివః మణిః ద్యుమణిః) (ద్యుమణిః తరణిర్మిత్ర- అమరకోశః-దిక్-30), వజ్ర-పాణేః = ఇంద్రునియొక్క (వజ్రం పాణౌ యస్య, తస్య), దిశి = దిక్కునందు, లబ్ధ-జన్మా(సన్) = పుట్టుక

నంది (లబ్ధం జన్మ యేన సః), గగనస్య = ఆకాశంయొక్క, మధ్యే = నడుమ, ప్రవృద్ధ–గాత్రః (సన్) = శరీరాభివృద్ధిని పొందిన వాడై (ప్రవృద్ధం గాత్రం యస్య సః), ప్రతీచ్యామ్ = పడమటి దిక్కున, వినాశమ్ = నాశనాన్ని, అగాత్ = పొందాడు (ఇ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), విధేః = బ్రహ్మయొక్క, నిదేశః = ఆజ్ఞ/వ్రాత, మహతా+అపి = గొప్పవారిచే కూడా, అలంఘ్యః = దాటరానిది.

**తా ॥** గగనమణి అయిన సూర్యుడు తూర్పుదిక్కున పుట్టి, గగనమధ్యంలో పెరిగి, పడమటి దిక్కున కనిపించకుండా పోయాడు. విధి ఆదేశాన్ని ఎంత మహాత్ముడైనా అతిక్రమింపజాలడు.

**వి :** 1. శ్లో॥హరిణాపి హరేణాపి బ్రహ్మణా త్రిదశైరపి ।
లలాటలిఖితా రేఖా న శక్యా పరిమార్జితుమ్ ॥ –సుభాషితరత్నభాండాగారమ్–దేవ–15

విష్ణువు కానీ, శివుడుకానీ, బ్రహ్మకానీ, దేవతలు కానీ లలాటలిఖితరేఖను తుడిచి వేయలేరు. ఇదొక సుభాషితమే. ఇది మానవులకే కాదు. దేవతలకు కూడా వర్తిస్తుంది. బ్రహ్మదేవుడు కూడా కర్మాధీనుడై సృష్టి చేస్తున్నాడని మన విశ్వాసం.

2. పుట్టినది ఒకచోట. పెరిగినది మరొకచోట. అదృశ్యమైన దింకొకచోట. ఇది విశేష విషయం. మహాత్ములయినా విధిని ఉల్లంఘించలేరన్నది సామాన్యవిషయం. ఈ రెండింటి కలయిక అర్థాంతరన్యాసాలంకారం. **'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః'**–(కు.122)

| | | | |
|---|---|---|---|
| 3. **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ. |

*

**శ్లో॥ రాగం పయోధరతటే హరిదఙ్గనానాం – రాగీ సమర్ప్య సవితా సమగాదగాన్తమ్।
కూజద్విహఙ్గమరవైరివ తా రుదన్త్యో–భేజుస్తమస్తతిమథాన్తరివోరుమూర్ఛామ్॥ 29**

**అ :** సూర్యాస్తమయవర్ణనం. –వసంతతిలక.

**అ :** రాగీ సవితా హరిద్+అంగనానాం పయోధరతటే రాగం సమర్ప్య అగాంతమ్ అగాత్. అథ కూజద్ విహంగమరవైః తాః రుదన్త్యః (సత్యః) ఇవ ఉరుమూర్ఛామ్ ఇవ అంతః తమస్తతిం భేజుః.

**ప్ర :** రాగీ = అనురక్తుడయిన (రాగః అస్య అస్తి ఇతి), సవితా = సూర్యుడు (సువతి ఇతి సవితా), హరిద్+అంగనానామ్ = దిశాంగనల యొక్క, (ఆశాః కకుభః కాష్ఠా హరితశ్చ దిశః–హలాయుధకోశః–100), పయోధర–తటే = మేఘాల ప్రాంతంలో/వక్షోజాల అంచున, రాగమ్ = ఎఱ్ఱదనాన్ని/అనురాగాన్ని, సమర్ప్య = అర్పించి (సమ్ – ఋ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అగ+అంతమ్ = కొండ చివరకు, సమగాత్ = వెళ్ళాడు. (ఇ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), అథ = అటు తరువాత, కూజత్... రవైః : కూజత్ = కూయుచున్న, విహంగమ = పక్షులయొక్క (విహాయసా గచ్ఛతి ఇతి విహంగమః), రవైః = చప్పుళ్ళతో, తాః = ఆ దిగంగనలు, రుదన్త్యః సత్యః = ఏడుస్తూ, ఉరు–మూర్ఛామ్ ఇవ = గాఢమోహ–మన్నట్లు, అంతః = లోన, తమః+తతిమ్ = చీకటి సమూహాన్ని, భేజుః = పొందారు. (భజ సేవాయాం–పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** సూర్యుడు దిక్కులనే స్త్రీలకు పయోధర ప్రాంతంలో రాగాన్ని కలిగించి, తాను పర్వతపు అంచుకు పడిపోయాడు. ఆ దిగంగనలు పక్షుల కూజితాల ద్వారా ఏడుస్తున్నట్లు కనిపిస్తూ తీవ్రమోహంలో పడి, అంతరంగాలలో చీకటిని నింపుకొన్నారు.

**వి :** ఈ శ్లోకంలో పయోధర, రాగశబ్దాలు శ్లిష్టాలు. పదచ్ఛేదం అవసరం లేకుండా రెండు అర్థాలు వస్తాయి. కాబట్టి **అభంగశ్లేషాలంకారం**. రుదన్త్య ఇవ, ఉరుమూర్ఛామివ అన్నచోట్ల **ఉత్ప్రేక్షాలంకారం**. ప్రకృతమైన

సూర్యదిగంగనల విప్రలంభశృంగారం ద్వారా ఒకానొక నాయికా నాయక విప్రలంభం స్ఫురిస్తుంది. అంటే **సమాసోక్త్యలంకారం**. 'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతే అప్రస్తుతస్య చేత్' – (కు.61)

2. **అగాత్ :** 6–28వ శ్లోకవ్యాఖ్య చూడుదు.

| | | | |
|---|---|---|---|
| **భేజుః :** | బభాజ | భేజతుః | **భేజుః** |
| | భేజిథ/బభక్థ | భేజథుః | భేజ |
| | బభాజ/బభజ | భేజివ | భేజిమ. |

*

**శ్లో॥ అమ్భోధిహృత్కృతపదం ప్రతిరూపమర్కః**
**సన్దృశ్య సాధు ధవళీకృతతజ్జలౌఘమ్ ।**
**శాన్తో హి సర్వహృదయఙ్గమతాముపైతీ-**
**త్యన్తే శమం సమధిగమ్య వివేశ సోఽబ్ధిమ్॥ 6–30**

**అ :** సూర్యాస్తమయవర్ణనం. –వసంతతిలక.

**అ :** సః అర్కః అంభోధిహృత్కృతపదం సాధు ధవళీకృతతత్+జల+ఓఘం ప్రతిరూపం సన్దృశ్య శాంతః హి సర్వహృదయంగమతామ్ ఉపైతి ఇతి అన్తే శమం సమధిగమ్య అబ్ధిం వివేశ.

**ప్ర :** సః అర్కః = ఆ సూర్యుడు, అంభోధి... పదమ్ : అంభోధి = సముద్రంయొక్క, హృత్ = మనస్సులో (లోపల), కృత = కల్పింపబడిన, పదమ్ = స్థానం గలదియు (అంభోధేః హృది కృతం పదం యేన తత్), సాధు = చక్కగా, ధవళీ... ఘమ్ : ధవళీకృత = శుభ్రం (తెల్లగా) చేయబడిన (అధవళం ధవళం కరోతి "కృభ్వస్తియోగే సంపద్య కర్తరి చ్విః" (అష్టాధ్యాయి 5–4–50) అనే సూత్రం, '**అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్**' వార్తికం (3340) తో ధవళీకృత రూపసిద్ధి), తత్+జల = ఆ సముద్రజలంయొక్క, ఓఘమ్ = ప్రవాహం గలదియు అయిన (ధవళీకృతః తస్య జలస్య ఓఘః యేన, తత్), ప్రతిరూపమ్ = (తన) ప్రతిబింబాన్ని, సన్దృశ్య = చక్కగా చూసి (సమ్–దృశ్–ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శాంతః హి = శాంతంగా వున్నవాడే, సర్వ–హృదయంగమతామ్ = అందరి మనస్సులలో నిలువ గలగటాన్ని, ఉప+ఏతి = పొందగలడు. (ఉప+ఇణ్ గతౌ–లిట్–ప్ర.ఏ.), ఇతి = అని, అన్తే = తుదకు, శమమ్ = శాంతిని, సమధిగమ్య = పొంది (సమ్+అధి+గమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అబ్ధిమ్ = సముద్రంలోనికి, వివేశ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** సూర్యుడు సముద్రహృదయంలో స్థానం సంపాదించి సముద్రజలప్రవాహాన్ని శుభ్రపరచిన తన ప్రతిరూపాన్ని గమనించాడు. (తన ప్రతిబింబానికి అక్కడ స్థానం దొరకటానికి కారణం దానిలో తాపాన్ని కలిగించే లక్షణం లేకపోవటమే అని గుర్తించాడు.) శాంతస్వరూపుడే అందరి మనస్సులకూ నచ్చుతాడని తుదకు గుర్తించి, శాంతుడై సముద్రంలో ప్రవేశించాడు.

**వి :** 1. అస్తమించే సమయంలో సూర్యతాపం తగ్గటం ఒక సహజపరిణామం. కానీ దానికి "**శాంతో హి సర్వహృదయంగతాముపైతి**" అని జ్ఞానసిద్ధి కారణమని చెప్పటం ద్వారా హేతుసంభావనమై "**హేతూత్ప్రేక్షాలంకార**" మవుతుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయన్తి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః |

| | | | | |
|---|---|---|---|---|
| **వివేశ :** | వివేశ | వివిశతుః | వివిశుః | |
| | వివేశిథ | వివిశథుః | వివిశ | |
| | వివేశ | వివిశివ | వివిశిమ. | * |

**శ్లో॥ మిత్రేఽమ్బుజాతనికరస్య నితాన్తమిత్రే**
**హ్యస్తం సమీయుషి ముఖం ముకులీబభూవ ।**
**పద్మస్య శుద్ధజలగస్య చ ముద్రయన్తి**
**నష్టాః ప్రియాః ఖలు సమృద్ధియుజోఽపి వక్త్రమ్ ॥ 6-31**

**అ :** సూర్యాస్తమయవర్ణనం. -వసంతతిలక.

**అ :** అంబుజాతనికరస్య నితాంతమిత్రే మిత్రే అస్తం సమీయుషి శుద్ధజలగస్య పద్మస్య ముఖం ముకులీబభూవ. నష్టాః ప్రియాః సమృద్ధియుజః అపి వక్త్రం ముద్రయన్తి.

**ప్ర :** అంబు... నికరస్య : అంబు-జాత = పద్మాలయొక్క, నికరస్య = సమూహానికి (అంబుని జాయన్తే ఇతి-తేషాం నికరః తస్య), నితాంత-మిత్రే : నితాంత = ఎక్కువగా, మిత్రే = స్నేహితుడైన (నితాంతం మిత్రం, తస్మిన్), మిత్రే = సూర్యుడు, అస్తమ్ = కనిపించక పోవటాన్ని, సమీయుషి = పొంది వుండగా, శుద్ధ-జల-గస్య : శుద్ధ = నిర్మలమైన, జల-గస్య = నీటనున్న, పద్మస్య చ = తామరయొక్క, ముఖమ్ = వదనం, ముకులీబభూవ = ముడుచుకొన్నది (ముకులీ+భూ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ప్రియాః = నచ్చినవారు, నష్టాః = అదృశ్యమయ్యారు (అప్పుడు), సమృద్ధియుజః+అపి = సంపదతో కూడివున్నా, వక్త్రమ్ = ముఖాన్ని, ముద్రయన్తి ఖలు = ముడుచుకొంటారు గదా! (**ఇది నామధాతువు.**) (ముద్రం కరోతి, ముద్రమాచష్టే వా-ముద్రయతి.)

**తా ॥** తనకు పరమాప్తుడైన సూర్యుడు అస్తమించగా మంచినీటితోవున్న తామర ముఖం ముడుచుకొంది. ప్రియులు కనిపించనప్పుడు (వియోగదశలో) ఎంతసంపన్నులయినా ముఖాన్ని ముడుచుకొంటారు గదా!

**వి :** 1. శ్లోకం లోని నాలుగవ పాదంలో '**నష్టాః ప్రియాః**' అన్నది '**నష్టప్రియాః**' అని సమాస రూపంలో కవి ప్రయోగించి వుండవచ్చు. **నష్టాః ప్రియాః యేషాం తే = నష్టప్రియాః** అని బహువ్రీహి సమాసం. అప్పుడు నష్టమయిన ప్రియులు గలవారు అని అర్థం. సమన్వయం కుదురుతుంది. వ్యస్తంగా వుంటే ప్రియాః అన్నది కర్తృవాచకమై నష్టాః అన్నది విశేషణమవుతుంది. నష్టమైన వారు ఇక ముఖం ముడవటం ఎలా సాధ్యం? 'నష్టాః ప్రియాః' అన్న పాఠంతోనే ప్రతిపదార్థం వ్రాసినా ఆ మొత్తాన్ని రెండు వాక్యాలుగా విడగొట్ట వలసి వచ్చింది. అది **అగతికగతిన్యాయం.**

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ముకులీబభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః | |
| | బభూవిథ | బభూవథుః | బభూవ | |
| | బభూవ | బభూవివ | బభూవిమ | |
| **ముద్రయతి :** | **ముద్రయతి** | ముద్రయతః | ముద్రయన్తి | |
| | ముద్రయసి | ముద్రయాథః | ముద్రయథ | |
| | ముద్రయామి | ముద్రయావః | ముద్రయామః. | * |

**శ్లో॥ ఆకణ్ఠోదకవాసి హృద్గమధుకృజ్ఝఙ్కారరమ్యోంకృతి**
**భ్రాజత్కణ్టకకణ్టకద్యుతి ముహుర్మన్త్రార్థసంచిన్తయా ।**

**ఈషత్కమ్పితమూర్ధశోభి నలినం హంసౌఘసంశిక్షితం**
**స్వాన్తఃస్థాపితధాతృ సాధు తపతీవాకాంక్ష్య మిత్రోదయమ్ ॥ 6-32**

**అ :** సూర్యాస్తమయం వర్ణన – పద్మ తపస్సు. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఆకంఠ+ఉదకవాసి హృద్గమధుకృజ్ఝంకారరమ్య+ఓంకృతి భ్రాజత్కంటకకంటకద్యుతి ఈషత్కంపితమూర్ధశోభి స్వాంతః–స్థాపితధాతృ హంస+ఓఘసంశిక్షితం నలినం ముహుః మంత్రార్థసంచిన్తయా మిత్ర+ఉదయమ్ ఆకాంక్ష్య తపతి+ఇవ.

**ప్ర :** ఆకంఠ+ఉదక–వాసి = గొంతువరకు నీటమునిగినదియు, (ఆకంఠమ్ ఉదకే వసతి ఇతి), హృద్గ... ఓంకృతి : హృద్–గ = మదిలోనున్న, మధుకృత్ = తుమ్మెదలయొక్క, ఝంకార = ఝంకార మనే, రమ్య = మనోహరమైన, ఓంకృతి = ఓంకారం గలదియు (హృది గతః, స చ అసౌ మధుకృత్, తస్య ఝంకారః, స ఏవ రమ్యా ఓంకృతిః యస్య తత్), భ్రాజ... ద్యుతి : భ్రాజత్ = ప్రకాశిస్తున్న, కంటక = ముళ్లు అనెడి, కంటక = రోమాంచం యొక్క, ద్యుతి = కాంతి గలదియు (భ్రాజన్తః కంటకాః ఏవ కంటకాః తేషాం ద్యుతిః యస్య తత్), ముహుః = మాటిమాటికి, మంత్రార్థ–సంచిన్తయా : మంత్ర+అర్థ = మంత్రార్థాన్ని గూర్చి, సంచిన్తయా = మననం చేయుటంవలన, ఈషత్... శోభి : ఈషత్ = కొంచెంగా, కంపిత = వణుకుతున్న, మూర్ధ = తలతో, శోభి = ప్రకాశిస్తున్నదియు (ఈషత్ కంపితేన మూర్ధ్నా శోభత ఇతి), స్వ+అంతః స్థాపిత ధాతృ : స్వ = తనయొక్క, అంతః = లోన, స్థాపిత = నిలుపుకొన్న, ధాతృ = బ్రహ్మదేవుడు కలదియు, (స్వస్య అంతః స్థాపితః ధాతా యేన తత్), హంస+ఓఘ సంశిక్షితమ్ : హంస = హంసలయొక్క, ఓఘ = సమూహం చేత, సంశిక్షితమ్ = శిక్షింపబడినదియు, (హంసానామ్ ఓఘః, తేన సంశిక్షితమ్) అయిన, నలినమ్ = తామర, మిత్ర+ఉదయమ్ = సూర్యుని పుట్టుకను (మిత్రస్య ఉదయః, తమ్), ఆకాంక్ష్య = కోరి (ఆ+కాంక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సాధు = చక్కగా, తపతి+ఇవ = తపిస్తున్నట్లుంది. (తప సంతాపే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** పద్మం గొంతువరకు నీటిలో మునిగి, తనలో బందీ అయిన తుమ్మెదల ఝంకారమనే 'ఓం'కారనాదాన్ని ఉచ్చరిస్తూ, పదే పదే ఆ మంత్రార్థాన్ని బాగామననం చేసిన కారణంగా తన నాళం మీదున్న ముళ్ళే పులకరింతలు కాగా, కొంచెంగా వణుకుతున్న తలతో ప్రకాశిస్తూ తనలో పరమాత్మను నిలుపుకొని, హంసల శిక్షణకు గురి అవుతూ మిత్రుని (సూర్యుని) ఉదయాన్ని ఆకాంక్షిస్తూ చక్కగా తపస్సు చేస్తున్నటుంది.

**వి :** 1. సూర్యాస్తమయానికి ముందు పద్మంలో వున్న తుమ్మెద హఠాత్తుగా పద్మం ముడిచికొని పోవటంతో తెలవారే దాకా లోపలే నిలిచి వుంటుంది. ఆ అంశాన్ని ఒక చక్కని శ్లోకంలో నిబంధించాడు ఒకానొక కవి.

శ్లో॥రాత్రిర్గమిష్యతి భవిష్యతి సుప్రభాతం – భాస్వానుదేష్యతి హసిష్యతి పంకజశ్రీః ।
ఇత్థం విచిన్తయతి కోశగతే ద్విరేఫే – హా! హన్త! హన్త! నళినీం గజ ఉజ్జహార ॥

(కువలయానందం–విషాదనాలంకారోదాహరణం–132). రాత్రి ముగుస్తుంది. సుప్రభాత మవుతుంది. సూర్యుడు ఉదయిస్తాడు. పద్మం వికసిస్తుంది, అని తుమ్మెద అనుకొంటున్న సమయంలోనే ఏనుగు పద్మాన్ని పైకి పీకిందట.)

2. తపతి+ఇవ అన్నచోట **ఉత్ప్రేక్షాలంకారం**. మిత్రోదయకాంక్షతో తపస్సు చేస్తున్నట్లుంది కాబట్టి ఫలోత్ప్రేక్ష.

ఇక్కడ సూర్యాస్తమయవేళలో పద్మం తపస్సుచేయటం ప్రకృతాంశం. విశేషణాల సమానత్వం కారణంగా అప్రకృతమైన తపస్విప్రవృత్తి స్ఫురిస్తుంది. అది ప్రకృతాప్రకృతాలకు ఏక ధర్మాన్వయం కాబట్టి **దీపకాలంకారం**. **'వదన్తి వర్ణ్యావర్ణ్యానాం ధర్మైక్యం దీపకం బుధాః'**–(కు.48), ఏకధర్మతవలన ఉపమాలంకారం ధ్వనిస్తుంది.

సమాసోక్త్యలంకారం కూడా ఇక్కడ భాసిస్తోంది.

శ్లో॥ **"విశేషణానాం సామ్యేన యత్ర ప్రస్తుతవర్తినామ్ ।**
**అప్రస్తుతస్య గమ్యత్వం సా సమాసోక్తిరిష్యతే ॥** – ప్రతాపరుద్రీయమ్.

విశేషణాలసమానత్వంచేత ప్రస్తుతవృత్తాంతవర్ణనతో అప్రస్తుత విషయస్ఫురణ కలగటం సమాసోక్తి. పద్మ, తపస్వి విశేషణాలు ఇక్కడ సమానాలు.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **తపతి :** | **తపతి** | తపతః | తపన్తి | |
| | తపసి | తపథః | తపథ | |
| | తపామి | తపావః | తపామః. | * |

**శ్లో॥ దిగాయతాక్షీమపరాముపేత్య – దిశాపతౌ రాగముపేయుషీన్దుః ।**
**అదృశ్యతైన్ద్ర్యాం దిశి రోషరక్తం – నిబద్ధనీలభ్రుకుటీవ వక్త్రమ్ ॥ 6-33**

**అ :** చంద్రోదయవర్ణనం. (ఇక్కడనుండి 7 శ్లోకాలు.) –ఉపేంద్రవజ్ర.

**అ :** దిశాపతౌ అపరాం దిగ్+ఆయత+అక్షీమ్ ఉపేత్య రాగమ్ ఉపేయుషి ఇందుః ఐన్ద్ర్యాం దిశి రోషరక్తం నిబద్ధనీలభ్రుకుటి వక్త్రమ్ ఇవ అదృశ్యత.

**ప్ర :** దిశాపతౌ = దిక్పతి అయిన సూర్యుడు (దిశాయాః పతిః, తస్మిన్), అపరామ్ = వేరొక, దిగ్+ఆయత+అక్షీమ్ = దిక్కు అనే స్త్రీని (ఆయతే అక్షిణీ యస్యాః సా-దిగ్-ఇతి ఆయతాక్షీ-తామ్), ఉపేత్య = చేరి, రాగమ్ = ఎఱ్ఱదనాన్ని/అనురాగాన్ని, ఉపేయుషి (సతి) = పొంది వుండగా, ఇందుః = చంద్రుడు, ఐన్ద్ర్యామ్ = ఇంద్రసంబంధమైన, దిశి = దిక్కున (తూర్పున), రోష-రక్తమ్:రోష = కోపంతో, రక్తమ్ = ఎఱ్ఱబడిన (రోషేణ రక్తమ్), నిబద్ధ-నీల-భ్రుకుటి : నిబద్ధ = ముడివేయబడిన, నీల = నల్లనైన, భ్రుకుటి = కనుబొమలు గల (నిబద్ధా నీలా భ్రుకుటీ యస్య తత్), వక్త్రమ్+ఇవ = ముఖంవలె (నాయికయొక్క), అదృశ్యత = కనబడెను. (దృశిర్ ప్రేక్షణే కర్మణి-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** సూర్యుడు మరొక దిగంగను చేరి రక్తుడై వుండగా చంద్రుడు తూర్పుదిక్కున కనిపించాడు. రోషంతో ఎఱ్ఱబడి, ముడివేసిన కనుబొమలు గల ముఖంవలె కనిపించాడు చంద్రుడు.

**వి :** 1. వక్త్రమ్ – ఇవ అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం. ప్రకృతవృత్తాంతం వాచ్యమై వుండగా విశేషణసామ్యంవలన అప్రస్తుతవృత్తాంతం నాయికానాయకవ్యవహారం స్ఫురిస్తుంది కాబట్టి సమాసోక్త్యలంకారం. 'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్' (కు.61)

2. ఇక్కడ సూర్యుని దక్షిణనాయకుడుగా వర్ణించాడు కవి. **దక్షిణోఽస్యాం సహృదయః** అని దక్షిణనాయక లక్షణం. ప్రాచ్యదిక్కులో ఖండితా నాయికాత్వాన్ని ప్రదర్శించి చూపాడు.

**శ్లో॥ పార్శ్వమేతి ప్రియో యస్యాః అన్యసంయోగచిహ్నితః ।**
**సా ఖండితేతి కథితా ధీరైరీర్ష్యా కషాయితా ॥** – సాహిత్యదర్పణః – 3/75

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అదృశ్యత :** | **అదృశ్యత** | అదృశ్యేతామ్ | అదృశ్యన్త | |
| | అదృశ్యథాః | అదృశ్యేథామ్ | అదృశ్యధ్వమ్ | |
| | అదృశ్యే | అదృశ్యావహి | అదృశ్యామహి. | * |

**శ్లో॥ నక్షత్రాళిభిరిన్ద్రదిఙ్మృగదృశం సన్ధాయ పూర్వం పున-**
**స్తత్పాదే ప్రణతిం విధాయ నితరామాశాన్తరాసక్తిజమ్ ।**

**తస్యాః కోపసమం తమః పరిహరన్ స్వీయైః కరైస్తాం స్పృశన్**
**వక్త్రామ్భోరుహచుమ్బనాయ శనకైరుద్యాతి నూనం శశీ ॥ 6-34**

**అ :** చంద్రోదయవర్ణన – చంద్రుడిలో దక్షిణనాయకత్వారోపణ. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** శశీ పూర్వమ్ ఇంద్రదిఙ్మృగదృశం నక్షత్రాలిభిః సంధాయ పునః తత్పాదే ప్రణతిం విధాయ, ఆశా+అంతర+ఆసక్తిజం తస్యాః కోపసమం తమః నితరామ్ పరిహరన్ స్వీయైః కరైః తాం స్పృశన్ వక్త్ర+ అంభోరుహ–చుంబనాయ శనకైః ఉద్యాతి నూనమ్.

**ప్ర :** శశీ = చంద్రుడు (శశః అస్మిన్ అస్తి ఇతి), పూర్వమ్ = ముందుగా, ఇంద్రదిక్+ మృగదృశమ్ : ఇంద్ర–దిక్ = తూర్పుదెస అనే, మృగదృశమ్ = స్త్రీని (ఇంద్రస్య దిక్ ఇంద్రదిక్, సా చ మృగస్య దృగివ దృక్ యస్యాః సా, తామ్), నక్షత్ర+ఆలిభిః = నక్షత్రాలనే చెలులతో (నక్షత్రాణి ఏవ ఆలయః, తాభిః), సంధాయ = కూర్చి, పునః = మరల, తత్+పాదే = ఆమెయొక్క పాదానికి, ప్రణతిమ్ = నమస్కారాన్ని, విధాయ = చేసి, ఆశా–అంతర+ ఆసక్తి–జమ్ : ఆశా–అంతర = వేరొక దిక్కుపై నున్న, ఆసక్తి–జమ్ = అనురక్తివలన పుట్టిన, తస్యాః = ఆమెయొక్క, కోప–సమమ్ = కోపంతో సమానమైన, తమః = చీకటిని, నితరామ్ = పూర్తిగా, పరిహరన్ = తొలగిస్తూ (పరి –హృ ధాతువుపై శతృ ప్రత్యయం), స్వీయైః = తనయొక్క, కరైః = కిరణాలతో, తామ్ = ఆమెను, స్పృశన్ = తాకుతూ, శనకైః = మెల్లగా, వక్త్ర+అంభోరుహ–చుంబనాయ = ముఖపద్మాన్ని ముద్దిడటానికి / వక్త్రమ్ అంభోరుహమివ, తస్య చుంబనం, తస్మై), ఉద్–యాతి = పైకి వెళ్తున్నాడు (ఉత్+యా ప్రాపణే పరస్మైపది– లిట్–ప్ర.ఏ.)

**తా ॥** చంద్రుడు ముందుగా తూర్పుదిక్కు అనే స్త్రీని నక్షత్రా లనే సఖులతో కూర్చి ఆపై ఆమె పాదాలపై పడి నమస్కరించి, మరోదిక్కు అనే నాయికపైనున్న ఆసక్తివలన కలిగిన ఆమె కోపంతో సమానమైన చీకటిని పూర్తిగా పోగొట్టి, తన కరాలతో (చేతులు, కిరణాలు) ఆమెను తాకుతూ, ముఖపద్మాన్ని ముద్దాడటానికి మెల్లగా పైకి పోతున్నాడు.

**వి :** 1. నక్షత్రాళి, దిఙ్మృగదృక్ – ఈ రెండు చోట్ల నక్షత్రాలలో ఆలిత్వాన్నీ, దిక్కులో మృగదృక్త్వాన్నీ ఆరోపించినందువలన **రూపకాలంకారం**. ఆశాంతరమన్నచోట శ్లేష. 'కోపసమం తమః'–వక్త్రాంభోరుహమ్–ఈ రెండుచోట్ల **ఉపమాలంకారం**. వీటి సహకారంతో సమాసోక్త్యలంకార మిక్కడ. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్**' (కు.61) ప్రస్తుతమైన దిక్–చంద్ర ప్రవర్తన ద్వారా అప్రస్తుతమైన నాయికా నాయకవ్యవహారం స్ఫురిస్తుంది కాబట్టి సమాసోక్త్యలంకారం.

2. **ఉద్యాతి : ఉద్యాతి** ఉద్యాతః ఉద్యాన్తి
ఉద్యాసి ఉద్యాథః ఉద్యాథ
ఉద్యామి ఉద్యావః ఉద్యామః.

*

**శ్లో॥ చన్ద్రస్య కోమలకరై రచితాఙ్గసఙ్గాః**
**సాన్ద్రాన్ధకారమపి తాః సహసా విహాయ ।**
**ఈశం స్వపత్స్వఖిలజన్తుషు వప్రురేన–**
**మాశా హి నూత్నవిషయా గణయన్తి నైనః ॥ 6-35**

**అ :** చంద్రోదయవర్ణనం. –వసంతతిలక.

**అ :** తాః చంద్రస్య కోమలకరైః రచిత+అంగసంగాః సాంద్ర+అన్ధకారమ్ అపి విహాయ సహసా అఖిలజంతుషు స్వపత్సు ఏనమ్ ఈశం వవ్రుః. హి నూత్నవిషయాః ఆశాః ఏనః న గణయన్తి.

**ప్ర :** తాః = ఆ దిగంగనలు, చంద్రస్య = చంద్రునియొక్క, కోమల+కరైః = మృదు కిరణాలతో/ సున్నితమైన చేతులతో, రచిత+అంగ-సంగాః = శరీరసాంగత్యాన్ని పొంది (రచితః అంగైః సంగః యాసాం తాః), సాంద్ర+అంధకారమ్ అపి = దట్టమైన చీకటిని కూడా, విహాయ = వీడి, సహసా = వెంటనే, అఖిల-జన్తుషు = ప్రాణులన్నీ (అఖిలాః చ తే జంతవః తేషు), స్వపత్సు (సత్సు) = నిదురిస్తుండగా, ఏనమ్ = చంద్రుని, ఈశమ్ = ప్రభువుగా, వవ్రుః = కోరిరి. (వృ వరణే పరస్మైపది-లిట్-ప్ర.బ.), హి = అది తగినదే, నూత్న-విషయాః = క్రొత్త విషయాలకు సంబంధించిన, ఆశాః = కోరికలు, ఏనః = పాపాన్ని(ఏనః కల్మషమశుభం పాపం... హలాయుధకోశః-627), న గణయన్తి= పరిగణింపవు. (గణ పరి సంఖ్యానే-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** చంద్రుడు తనకోమలకిరణాలతో దిగంగనలను తాకగానే వారు గాఢాంధకారమైనా లెక్కచేయక సర్వప్రాణులు నిదురిస్తున్న సమయంలో చంద్రుని తమ ప్రభువుగా భావించి వరించారు. నిజమే క్రొత్త విషయాల మీద కోరికలు కలిగితే పాపాన్ని పరిగణించరు.

**వి :** 1. నిషిద్ధశృంగారవర్ణన మీ శ్లోకంలో కనిపిస్తుంది. దిగంగనలు సూర్యుని విడిచి చంద్రుని ప్రభువునుగా వరించటం, అభిసారికలై అటు వెళ్ళటం నిషిద్ధశృంగారం. ఆలంకారికులు దీనిని రసాభాసంగా చిత్రించారు.

**శ్లో॥ ఏకత్రైవానురాగశ్చేత్ తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపి వా ।**
**యోషితో బహురక్తిశ్చేద్రసాభాసస్త్రిధా మతః ॥**

స్త్రీపురుషులలో ఒకరికే అనురాగమున్నా, శృంగారం పశుమ్లేచ్ఛాదిగతమైనా, స్త్రీకి పలువురు మగవారిపై ఆసక్తిని వర్ణించినా అది రసాభాసం.

| | | | |
|---|---|---|---|
| 2. **వవ్రుః :** | వవార | వవ్రతుః | **వవ్రుః** |
| | వవరిథ | వవ్రథుః | వవ్ర |
| | వవార/వవర | వవృవ | వవృమ |
| **గణయన్తి :** | గణయతి | గణయతః | **గణయన్తి** |
| | గణయసి | గణయథః | గణయథ |
| | గణయామి | గణయావః | గణయామః. |

*

**శ్లో॥ పూర్వాబ్ధావవగాహ్య ఫేననిచయశ్రీఖణ్డలేపద్యుతిః**
**స్వాఙ్కాలఙ్కృతిమూలనీలతిలకస్తారౌఘహారాన్ దిశన్ ।**
**వ్యోమాఖ్యాం కబరీం ప్రగృహ్య సుకరైరాశ్లిష్య దిక్కామినీ-**
**మైన్ద్రీమిన్దురసౌ చుచుమ్బ సరసో రాగేణ తాం రఞ్జయన్ ॥ 6-36**

**అ :** చంద్రోదయం - దిశాచంద్రశృంగారవర్ణనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సరసః అసౌ ఇందుః పూర్వ+అబ్ధౌ అవగాహ్య ఫేననిచయశ్రీఖండలేపద్యుతిః స్వాంకాలంకృతిమూలనీలతిలకః తార+ఓఘహారాన్ దిశన్ వ్యోమ+ఆఖ్యామ్ కబరీం ప్రగృహ్య ఐంద్రీం సుకరైః ఆశ్లిష్య తాం దిక్కామినీం రాగేణ రంజయన్ చుచుంబ.

**ప్ర :** సరసః = సరసుడైన, అసౌ = ఆ, ఇందుః = చంద్రుడు, పూర్వ+అబ్ధౌ = తూర్పు కడలిలో (పూర్వశ్చ అసౌ అబ్ధిః తస్మిన్), అవగాహ్య = స్నానం చేసి/మునిగి (అవ గాహ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఫేన... ద్యుతిః :

ఫేన = నురుగుయొక్క, నిచయ = మొత్తాలు అనే, శ్రీఖండ = శ్రీచందనంయొక్క, లేప = పూతచే, ద్యుతిః = కాంతి గలవాడై (ఫేనస్య నిచయః ఏవ శ్రీఖండస్య లేపః, తస్య ద్యుతిః యస్య సః), స్వాంకా... తిలకః : స్వ+అంక = తన కళంకమే, అలంకృతి = అలంకరణకు, మూల = మొదలయిన, నీల = నల్లని, తిలకః = తిలకం గలవాడును (స్వస్య అంకః, స ఏవ అలంకృతేః మూలం, నీలం చ తత్ తిలకం యస్య సః), తార+ఓఘ–హారాన్ = నక్షత్రసమూహమనే ముత్యాల పేరులను (తారాణామ్ ఓఘః ఏవ హారాః, తాన్), దిశన్ = ఇస్తూ (దిశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), వ్యోమ+ఆఖ్యామ్ = ఆకాశమనే (వ్యోమ ఇతి ఆఖ్యా తామ్), కబరీమ్ = కొప్పును (తద్బంధ విశేషాః స్యుః వేణీధమ్మిల్లకుంతలకబర్యః–హలాయుధకోశః–530), ప్రగృహ్య = పట్టుకొని (ప్ర–గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఐన్ద్రీమ్ = ఇంద్రసంబంధం గల తూర్పుదెసను, సుకరైః = మంచి కిరణాలతో, ఆశ్లిష్య = కౌగిలించి (ఆ–శ్లిష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తామ్ = ఆ, దిక్+కామినీమ్ = దిగంగనను, రాగేణ = ఎఱ్ఱదనంతో, రంజయన్ = ఆనందింపజేస్తూ, చుచుంబ=ముద్దాడెను. (చుంబ్ వక్త్రసంయోగే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** సరసుడైన చంద్రుడు తూర్పుసముద్రంలో స్నానమాడి, నురుగులనే శ్రీచందనాన్ని పూసికొని, కాంతిమంతుడై తన కలంకమే అలంకారాలకు మూలమయిన నల్లతిలకం కాగా, తారల సమూహా లనే హారాలను ఇస్తూ ఆకాశ మనే కొప్పు పట్టుకొని, తన కిరణాలతో ఆ దిగంగనను కౌగిలించుకొని, ఎఱ్ఱదనంతో ఆమెను రంజింపజేస్తూ ఆ తూర్పుదిక్కును ముద్దాడాడు.

**వి :** 1. నురుగు లనే శ్రీచందనం, తార లనే హారాలు, ఆకాశ మనే కొప్పు ఇవన్నీ రూపకాలంకారాలు.

చంద్రుడిలో దక్షిణనాయకలక్షణాలను సమగ్రంగా ఆరోపించాడు కవి. అనుభావాలు పుష్కలంగా వున్న సంయోగశృంగారవర్ణన మిది. అనురక్తులయిన పురుషుల క్రియా–సామాన్యంగా భావిస్తే ఇక్కడ స్వభావోక్తి కూడా అందగించేదే. నాయిక అన్యాభేదాలలో ఒక్కటైన అన్యోఢ. కావ్యనాటక నాయికలు ప్రధానంగా ఆరు రకాలు.




2. ముక్తాపదం లేకపోయినా హారమంటే ముత్యాలతో చేసినది అనియే అర్థం. ఆ హారాన్ని సాధారణీకరించి ఇతరత్ర కూడా వాడుతున్నాం. 'ముక్తాహారపదే ముక్తా శబ్దః శుద్ధః' (కావ్యాలంకారసూత్రాణి–2/2/15)

| | | | |
|---|---|---|---|
| 3. **చుచుంబ :** | **చుచుంబ** | చుచుంబతుః | చుచుంబుః |
| | చుచుంబిథ | చుచుంబథుః | చుచుంబ |
| | చుచుంబ | చుచుంబివ | చుచుంబిమ. |

*

**శ్లో॥ సువర్ణసంవీతవరేన్ద్రనీల–సుమధ్యనిష్కాఞ్చితకృష్ణవక్షః ।**
**సహారమన్వేత్యుదితోర్ధ్వరశ్మి–శశాఙ్కసంగ్యభ్రమముదారతారమ్ ॥ 6–37**

**అ :** చంద్రోదయవర్ణనం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఉదారతారమ్ ఉదిత+ఊర్ధ్వరశ్మిశశాంకసంగి అభ్రం సహారం సువర్ణసంవీతవర+ఇంద్రనీలసుమధ్య–నిష్క+అంచితకృష్ణవక్షః అన్వేతి.

**ప్ర :** ఉదారతారమ్ : ఉదార = శ్రేష్ఠమైన, తారమ్ = నక్షత్రాలు గలదియు (ఉదారాః తారాః యస్య తత్తథా), ఉదిత... సంగి : ఉదిత = పుట్టినట్టి, ఊర్ధ్వ = పైకి ఎగసిన, రశ్మి=కిరణాలు గల, శశాంక=చంద్రునితో, సంగి=సంబంధం గలదియు (ఉదితాః ఊర్ధ్వం రశ్మయః యస్య సః చ అసౌ శశాంకః తస్య సంగః అస్య అస్తీతి తత్ తథా) అయిన, అభ్రమ్ = ఆకాశం, సహారమ్ = ముత్యాలహారంతో కలిసి, సువర్ణసంవీత... వక్షః:సువర్ణ–సంవీత=బంగారంతో చుట్టబడిన, వర=శ్రేష్ఠమైన, ఇంద్రనీల = ఇంద్రనీలరత్నం, సమధ్య = మధ్యగా గల, నిష్క = కంఠాభరణంతో, అంచిత = భాసిస్తున్న, కృష్ణ = కృష్ణుని యొక్క, వక్షః = ఉరఃస్థలాన్ని, అన్వేతి (అను+ఏతి) = అనుకరిస్తోంది. (అను+ఇ గతౌ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆకాశం కృష్ణుని వక్షఃస్థలాన్ని అనుకరిస్తోంది. అనగా కృష్ణుని వక్షఃస్థలంవలె వుంది. ఆకాశంలో మంచినక్షత్రాలున్నాయి. ఊర్ధ్వకిరణాలు గల చంద్రునితో దానికి సంబంధముంది. కృష్ణుని వక్షఃస్థలం ముక్తాహారాలతో శోభిస్తోంది. ఇంద్రనీలం మధ్య మణిగా వున్న బంగారు కంఠాభరణంతో శోభిస్తోంది.

**వి :** 1. ఇక్కడ ఆకాశానికి కృష్ణవక్షఃస్థలంతో పోలిక చెప్పబడింది. ఆకాశం ఉపమేయం. కృష్ణవక్షఃస్థలం ఉపమానం. 'అన్వేతి' ఉపమావాచకం. మిగిలిన శ్లోకభాగమంతా ఉభయత్ర కనిపిస్తున్న (సమాన) ధర్మం. ఉపమాంగాలయిన నాలుగూ ఉన్నాయి కాబట్టి ఇది పూర్ణోపమాలంకారం. "**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః**" – (కు.6)

| | | | |
|---|---|---|---|
| 2. **అన్వేతి :** | **అన్వేతి** | అన్వితః | అనుయంతి |
| | అన్వేషి | అన్విథః | అన్విథ |
| | అన్వేమి | అన్వివః | అన్విమః. |

*

**శ్లో॥ వార్వాహావృతసర్వభాగముదితం బిమ్బం శశాఙ్కం విధో–**
**రీషద్దర్శితకోణమచ్యుతమనస్తోషం నభోఽగ్రస్థితమ్ ।**
**రేజే కుఙ్కుమశోభి రమ్యవసనచ్ఛన్నం మరుద్దర్శిత–**
**ప్రాన్తం శ్రీకుచకోశమీషదుదయన్మధ్యోపరిష్టాదివ ॥ 6–38**

**అ :** చంద్రోదయవర్ణన – లక్ష్మీస్తనముకులంతో చంద్రబింబానికి పోలిక. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** వార్వాహ+ఆవృతసర్వభాగం శశాంకమ్ ఈషద్–దర్శితకోణమ్ నభోఽగ్రస్థితమ్ అచ్యుతమనస్–తోషమ్ ఉదితం విధోః బింబం రమ్యవసన+ఛన్నం కుంకుమశోభి మరుద్–దర్శితప్రాంతం మధ్య+ఉపరిష్టాత్ ఈషద్–ఉదయత్ శ్రీకుచకోశమ్ ఇవ రేజే.

**ప్ర :** వాః+వాహ = మేఘాలచేత, ఆవృత = కప్పబడిన, సర్వ–భాగమ్ = సమస్త ప్రదేశమూ గలదియు (వాః వహన్తి ఇతి వార్వాహాః, తైః ఆవృతః సర్వశ్చ అసౌ భాగః యస్య, తత్), శశ+అంకమ్ = కుందేలు గుర్తుగా గలదియు (శశ ఏవ అంకః యస్య తత్), ఈషద్–దర్శిత–కోణమ్ : ఈషత్ = కొంచెంగా, దర్శిత = చూపబడిన, కోణమ్ = అంచుగలదియు (ఈషద్ దర్శితః కోణః యస్య తత్ తథా), నభః+అగ్ర–స్థితమ్ : నభః = ఆకాశంయొక్క, అగ్ర = ముందుభాగాన, స్థితమ్ = ఉన్నదియు (నభసః అగ్రే స్థితమ్), అచ్యుత–మనః+తోషమ్ : అచ్యుతః = కృష్ణునియొక్క, మనః = మనస్సునకు, తోషమ్ = ఆనందాన్ని కల్గించునదియు (అచ్యుతస్య మనసః తోషః

యస్మాత్ తత్), ఉదితమ్ = ఉదయించినదియు అయిన, విధోః = చంద్రుని యొక్క బింబమ్ = మండలం (గుండ్రంగా కనిపిస్తున్న చంద్రుడు), రమ్య–వసన–ఛన్నమ్ : రమ్య = అందమయిన, వసన = వస్త్రాలతో, ఛన్నమ్ =ఆచ్ఛాదితమై (రమ్యేణ వసనేన ఛన్నమ్), కుంకుమ–శోభి=కుంకుమపువ్వుతో ప్రకాశిస్తున్న దియు, మరుద్–దర్శిత–ప్రాంతమ్ : మరుద్ = గాలిచే, దర్శిత = చూపబడిన, ప్రాంతమ్ = అంచులు గలదియు, మధ్య+ఉపరిష్టాత్ = మధ్యభాగాన మరియు పైభాగాన, ఈషద్–ఉదయత్ = కొంచెంగా పొడము తున్నదియు అయిన, శ్రీకుచకోశమ్–ఇవ : శ్రీ = లక్ష్మియొక్క కుచ = రొమ్ము అనెడి, కోశమ్+ఇవ = మొగ్గవలె (శ్రియః కుచ ఏవ కోశమ్) (కుశతి ఇతి కోశః), రేజే = ప్రకాశించింది. (రాజృ దీప్తౌ ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** (చంద్రబింబానికి శ్రీకుచకోశానికి ఇక్కడ పోలిక శ్రీకుచకోశంవలె చంద్రబింబం శోభిస్తోందని)

చంద్రబింబం మేఘాలచేత ఆవరింపబడింది. కుందేలు గుర్తుగా గలది. ఆకాశంపైన నిలిచి కొంచెంగా కనిపిస్తున్న అంచులు గలది. అచ్యుతుని మనస్సునకు ఆనందాన్ని కలిగించేది. **లక్ష్మీస్తనం** అందమైన వస్త్రాలతో ఆచ్ఛాదింపబడింది. కుంకుమపువ్వుతో (అంగలేపనంతో) ప్రకాశిస్తోంది. గాలికి (పయ్యెద చెదరగా) కొంచెంగా కనిపిస్తున్న అంచులు గలది. మధ్యభాగాన పైభాగాన స్వల్పంగా పొటమరిస్తున్నది.

**వి :** 1. ఈ శ్లోకంలో చంద్రబింబానికీ, లక్ష్మీస్తనానికీ పోలిక. చంద్రబింబం ఉపమేయం. లక్ష్మీస్తనం ఉపమానం. ఇవ ఉపమావాచకం. బింబప్రతిబింబ భావంతో సమానధర్మవర్ణనం. కాబట్టి పూర్ణోపమాలంకారం.

లక్ష్మీసంపద ఎప్పుడు నిరుపమానమే. తాను ఉపమానంగానే వుంటుంది కానీ ఉపమేయం కాలేదు. చంద్రుడయినా ఆమెకు తోబుట్టువు కాబట్టి ఆపాటి పోలికను పొందగలిగాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **రేజే :** | **రేజే** | రేజాతే | రేజిరే |
| | రేజిషే | రేజాథే | రేజిధ్వే |
| | రేజే | రేజివహే | రేజిమహే |

*

**శ్లో॥ గతే దిశాం భర్తరి దేశమన్యం – దివాకరే మన్దముపేత్య చన్ద్రః ।**
**తదమ్బరం యజ్జగృహే కరైః స్వైః–స్తతః కలఙ్కీతి మమ ప్రతర్కః ॥ 6–39**

**అ :** చంద్రోదయవర్ణనం – చంద్రునిలోని కళంకానికి కారణాన్ని ఊహించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** దిశాం భర్తరి దివాకరే అన్యం దేశం గతే (సతి) చంద్రః మందమ్ ఉపేత్య స్వైః కరైః తదంబరం జగృహే (ఇతి) యత్ తతః కలంకీ ఇతి మమ ప్రతర్కః.

**ప్ర :** దిశామ్ = దిక్కులయొక్క, భర్తరి = భర్త అయిన, దివాకరే = సూర్యుడు (దివా కరోతి ఇతి), అన్యమ్ = మరొక, దేశమ్ = ప్రదేశానికి, గతే (సతి) = వెళ్ళి యుండగా, చంద్రః = చంద్రుడు, మందమ్ = మెల్లగా, ఉపేత్య = దగ్గరకు వచ్చి, తద్–అంబరమ్ = ఆ తారల ఆకాశాన్ని/వస్త్రాన్ని, స్వ–కరైః = తన కిరణాలతో (స్వస్య కరాః తైః)/చేతులతో, యత్ = ఎందువలనయితే, జగృహే = పట్టుకొన్నాడో (గ్రహ ఉపాదానే–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), తతః = అందువలన, కలంకీ = కళంకం గలవాడు, ఇతి = అని, మమ = నాయొక్క, ప్రతర్కః = హేతుసంభావనం.

**తా ॥** దిక్కులకు భర్త అయిన సూర్యుడు దేశాంతరానికి వెళ్ళగానే చంద్రుడు మెల్లగా వారిని సమీపించి తన కిరణాలతో వారి ఆకాశప్రదేశాన్ని ఆక్రమించాడు. అందువలన చంద్రుడు కళంకితుడయ్యాడని నా అభిప్రాయం.

**వి :** 1. ఈ శ్లోకంలో దిశాం, భర్తరి, చంద్రశబ్దగతపుంలింగం, అంబర, కర శబ్దాల సాహాయ్యంతో ప్రస్తుతమైన సూర్యచంద్రవ్యవహారమటుండగా అప్రస్తుతమైన పరకీయా శృంగారం (నిషిద్ధశృంగారం) ధ్వనిస్తుంది. ఇది

శబ్దశక్తిమూలధ్వని. అయితే ఆ ధ్వనికన్న వాచ్యంగా చెప్పిన తీరే కవితాసౌందర్యకారణ మవుతుంది కాబట్టి ఇక్కడ సమాసోక్త్యలంకారానికే ప్రాధాన్యం. **'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్'** – (కు. 61)

మమ ప్రతర్కః అని వాచ్యంగానే తాను ఊహిస్తున్నట్లు కవి చెప్పినందువలన ఇది ఉత్ప్రేక్షాలంకారం కూడా. ఇక్కడ హేతువును–కళంకి కావటానికి కారణాన్ని సంభావించి నందు వలన **హేతూత్ప్రేక్షాలంకారం**.

| | | | |
|---|---|---|---|
| 2. **జగృహే :** | **జగృహే** | జగృహాతే | జగృహిరే |
| | జగృహిషే | జగృహాథే | జగృహిధ్వే |
| | జగృహే | జగృహివహే | జగృహిమహే. |

*

**శ్లో॥ యత్పూర్ణం పౌర్ణమస్యాముదయతి నిశి తత్కీర్తినార్యాః కుమార్యా**
**వక్త్రం కస్తూరికాక్తం ప్రవిరలకచవిన్యస్తపుష్పం హి మన్యే ।**
**స్తోత్రవ్యాజేన దేవైర్వదనవినిహితం నన్దసూనోర్న చేత్తత్**
**ప్రీత్యై గోపాఙ్గనానాం కథమహితవధూవర్గతాపాయ చ స్యాత్ ॥ 6–40**

**అ :** రాకాచంద్రవర్ణన – కృష్ణకీర్తికాంతగా చంద్రబింబసంభావన. –స్రగ్ధర.

**అ :** పౌర్ణమస్యాం యత్ పూర్ణం నిశి ఉదయతి తత్ నందసూనోః కుమార్యాః కీర్తినార్యాః కస్తూరికా+అక్తమ్ ప్రవిరళకచవిన్యస్తపుష్పం వక్త్రం హి మన్యే. న చేత్ స్తోత్రవ్యాజేన దేవైః వదనవినిహితం (సత్) గోపాంగనానాం ప్రీత్యై అహితవధూవర్గతాపాయ చ కథం స్యాత్.

**ప్ర :** పౌర్ణమస్యామ్ = పున్నమి నాడు, యత్ = ఏదయితే, పూర్ణమ్ = నిండైనది, నిశి = రాత్రి, ఉదయతి = ఉదయిస్తుందో, తత్ = అది, నంద–సూనోః = నందుని కుమారుని యొక్క, (నందస్య సూనుః, తస్య), కుమార్యాః = బాలిక అయిన, కీర్తి–నార్యాః = కీర్తి కాంతయొక్క (కీర్తిః ఏవ నారీ, తస్యాః), కస్తూరికా–అక్తమ్ = కస్తూరి (పునుగు) చే ఒప్పారుతూ (కస్తూరికయా అక్తమ్), ప్రవిరళ–కచ–విన్యస్త–పుష్పమ్ : ప్రవిరళ = విరబోసుకొన్న, కచ = తలవెంట్రుకలపై, విన్యస్త = వుంచబడిన, పుష్పమ్ = పువ్వు కలదియు అయిన (ప్రవిరళేషు కచేషు విన్యస్తం చ తత్ పుష్పం, తత్), వక్త్రం హి = ముఖమే అని, మన్యే = భావిస్తున్నాను. (మన్ జ్ఞానే ఆత్మనేపది–లట్–ఉ.ఏ.), న చేత్ = కాకపోతే, స్తోత్ర–వ్యాజేన = స్తోత్రమనే నెపంతో (స్తోత్రమితి వ్యాజః తేన), దేవైః = దేవతలచే, వదన–వినిహితమ్ (సత్) : వదన = ముఖంపై, వినిహితమ్ (సత్) = వుంచబడినదై (వదనే వినిహితం), గోప+అంగనానామ్ = గోపకాంతలకు (గోపాశ్చ తాః అంగనాః తాసాం), ప్రీత్యై = ప్రియంగానూ, అహిత–వధూ–వర్గ–తాపాయ చ:అహిత=శత్రువులయొక్క, వధూ = స్త్రీలయొక్క, వర్గ = సమూహానికి, తాపాయ చ = తాపకరంగానూ (అహితానాం వధ్వః, తాసాం వర్గః, తేషాం తాపః, తస్మై), కథమ్ = ఎలా, స్యాత్ = ఉండగలదు. (అస భువి–పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** పున్నమరేయి ఆకాశంలో నిండుగా కనిపించే పదార్థం. అది కృష్ణుని కీర్తికాంతయొక్క ముఖమని నేను భావిస్తున్నా. ఆ ముఖంపై కస్తూరితో చేసిన అలంకరణ వుంది. చెదురు మదురుగా వున్న కేశాలపై పువ్వు అలంకరింపబడి వుంది. అది ఆ కీర్తికాంతవదనమే కాకపోతే దేవతలు స్తోత్రమనే నెపంతో తమ నోటబట్టిన (దేవతలు అమృతాంధసులు. చంద్రకళలను పానం చేసేవారు. అందువలననే చంద్రుడు కృష్ణపక్షంలో తరిగిపోయేది) అది గోపస్త్రీలకు ప్రీతికరంగానూ, శత్రువుల కాంతలకు తాపకరంగానూ ఎలా వుండగలదు?

**వి :** 1. చంద్రబింబాన్ని కీర్తికాంతా వదనంగా సంభావించి నందువలన **ఉత్ప్రేక్షాలంకారం**. ఉపమానోపమేయాలు రెండింటినీ చెప్పినందువల్ల **ఉక్తవిషయవస్తూత్ప్రేక్ష.**

స్తోత్రవ్యాజేన అని వ్యాజశబ్దంతో వాస్తవాన్ని కప్పిపుచ్చే ప్రయత్నం చేయటం వలన ఇది **కైతవాపహ్నుత్యలంకారం.** "కైతవాపహ్నుతిః వ్యక్తౌ వ్యాజాద్యైః నిహ్నుతేః పదైః"-(కు. 31)

| | | | |
|---|---|---|---|
| 2. **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యేధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ దివసకరే హృతతస్కరప్రచారే - నరనయనస్య విదూరవర్త్మ యాతే ।**
**రజనికరోఽయముపేత్య మానవానాం - శ్రమమధరీకురుతే స్మ పూర్ణబిమ్బః ॥41**

**అ :** సూర్యాస్తమయ - చంద్రోదయవర్ణన.

**అ :** హృతతస్కరప్రచారే దివసకరే నరనయనస్య విదూరవర్త్మ యాతే పూర్ణబింబః అయం రజనికరః ఉపేత్య మానవానాం శ్రమమ్ అధరీకురుతే స్మ.

**ప్ర :** హృత... ప్రచారే : హృత = పరిహరింపబడిన (హృ ధాతువుపై క్త ప్రత్యయం), తస్కర = దొంగల యొక్క, ప్రచారే = తిరుగుడుగల (హృతః తస్కరాణాం ప్రచారః యేన తస్మిన్), దివసకరే = సూర్యుడు (దివసస్య కరః తస్మిన్), నర-నయనస్య = మానవనేత్రానికి (నరాణాం నయనం తస్య), విదూర-వర్త్మ = దూరంగావున్న బాటకు (విదూరం చ తత్ వర్త్మ), యాతే = వెళ్ళగా, పూర్ణ-బింబః = నిండైన రూపంగల, అయమ్ = ఈ, రజనికరః = చంద్రుడు (ద్విజరాజో రజనికరః పీయూషరుచిః-హలాయుధకోశః-43), ఉపేత్య = సమీపించి (ఉప+ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మానవానామ్ = మనుష్యులయొక్క, శ్రమమ్ = అలసటను, అధరీకురుతే స్మ = తొలగించాడు. (అధరీ+కృ-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ. **లట్ -స్మే** (అష్టాధ్యాయి - 3-2-118) సూత్రంతో భూతకాలార్థం)

**తా ॥** దొంగల తిరుగుటను పరిహరించి సూర్యుడు మానవనేత్రాలకు దూరంగా వెళ్ళిపోగా చంద్రుడు వచ్చి మానవుల శ్రమను తొలగించాడు.

**వి :** 1. ఏకయోక్త్యా పుష్పవన్తౌ దివాకరనిశాకరౌ - (అమరకోశః-కాల-10) సూర్య-చంద్రుల కిద్దరికీ కలిపి **పుష్పవన్తౌ** - అని పేరు. పుష్పమంటే వికాసం. అది కలిగిన వారు పుష్పవంతులు. స్వప్రకాశాన్ని, లేదా తమ ప్రతిభను సమాజపరం చేసినప్పుడు దాని విలువ పెరుగుతుంది. అందరికీ ఉపయోగపడుతుంది. 39వ శ్లోకంలో సూర్యచంద్రులిద్దరిలోనూ వ్యక్తిగతాంశాలనే స్పృశించినందువలన ఒకడు భర్త, అయితే మరొకడు ఉపపతి అయ్యాడు. ఇక్కడ సమాజపరంగా వినియోగంవలన ఇద్దరూ సమాజానికి హితాన్ని కల్గించగలిగారు.

| | | | |
|---|---|---|---|
| 2. **అధరీకురుతే :** | **అధరీకురుతే** | అధరీకుర్వాతే | అధరీకుర్వతే |
| | అధరీకురుషే | అధరీకుర్వాథే | అధరీకుర్వధ్వే |
| | అధరీకుర్వే | అధరీకుర్వహే | అధరీకుర్మహే |

3. ఛందస్సు - **మృగేంద్రముఖం.**

భవతి మృగేంద్రముఖం నజౌజరౌగః - **ఛందోమంజరి**-2/180

నజజరగ-13వ ఛందంలోనిది. "తురగరయం కథితం నజౌజరౌగః (వృత్తరత్నాకర-3/102)" అని వ్యాఖ్యాతలు. కానీ వృత్తరత్నాకరం అతిజగతీ భేదాలలో తురగరయం కనిపించటంలేదు. వెతకవలసివుంది. *

**శ్లో॥ స మారమౌర్వీస్థితమల్లికేషు-రివ వ్రజస్త్రీహృదయం విజిత్య ।**
**హరేః పదం ప్రాప శనైః స్మరేణ - తమాత్మసాత్కర్తుమివోత్ప్రయుక్తః ॥ 6-42**

**అ :** చంద్రుని ఊర్ధ్వగమనం - స్మరబాణంగా సంభావనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** స్మరేణ తమ్ ఆత్మసాత్కర్తుమ్ ఉత్ప్రయుక్తః మారమౌర్వీస్థితమల్లికా+ఇషుః ఇవ సః వ్రజస్త్రీహృదయం విజిత్య శనైః హరేః పదం ప్రాప.

**ప్ర :** స్మరేణ = మన్మథునిచేత, తమ్ = ఆ కృష్ణుని, ఆత్మసాత్-కర్తుమ్-ఇవ = తనవానిగా చేసికొనటం కోసమో అన్నట్లు, ఉత్+ప్రయుక్తః = పైకి ప్రయోగింపబడిన, మార = మదనుని యొక్క, మౌర్వీ=అల్లెత్రాటిపై, స్థిత = నిలిచిన, మల్లికా+ఇషుః-ఇవ = మల్లిక అనే బాణమో అన్నట్లు (మారస్య మౌర్వీ, తస్యాం స్థితా మల్లికా ఏవ ఇషుః, స ఇవ), సః = ఆ చంద్రుడు, వ్రజ-స్త్రీ-హృదయమ్ = గోపకాంతల మనస్సును (వ్రజే స్త్రియః తాసాం హృదయమ్), విజిత్య = గెలిచి (వి+జి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శనైః = మెల్లగా, హరేః పదమ్ = ఆకాశాన్ని/విష్ణుపాదాన్ని, ప్ర+ఆప = చేరాడు. (ప్ర+ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని లోబరచుకొనడానికి మన్మథుడు తన వింటిపై మల్లికా బాణాన్ని ఎక్కుపెట్టి పైకి ప్రయోగించినట్లు చంద్రుడు గోపకాంతల మనస్సును గెలిచి మెల్లగా హరిపదాన్ని (ఆకాశాన్ని) చేరాడు.

**వి :** 1. **మల్లికా.ఇషురివ**, **ఆత్మసాత్కర్తుమివ** అన్న రెండూ ఉత్ప్రేక్షలు. 'మల్లికేషురివ' అన్నది వస్తూత్ప్రేక్ష. 'ఆత్మసాత్కర్తుమివ' అన్నది ఫలోత్ప్రేక్ష.

2. గోపికల హృదయాన్ని గెలిచిన చంద్రుడు విష్ణువిషయంలో పాదాలను ఆశ్రయించాడు. ఆ బాణం పాదనమస్కారంలాగా వుంది. సమయానికి తగినట్లు తనను తాను మలచుకో గలగటం ఒక కళ. అటువంటి కళలు పదహారూ ఉన్న వాని విషయంలో చెప్పవలసిన దేముంటుంది?

3. మల్లిక మన్మథుని అయిదు బాణాలలో ఒకటి

శ్లో॥ అరవిందమశోకం చ చూతం చ నవమల్లికా ।
నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః ॥ - అమరకోశః

| | | | |
|---|---|---|---|
| 4. **ఆప :** | **ఆప** | ఆపతుః | ఆపుః |
| | ఆపిథ | ఆపథుః | ఆప |
| | ఆప | ఆపివ | ఆపిమ. |

*

**శ్లో॥గన్ధర్వగీతవృతమభ్రమపారతారం - చన్ద్రేణ రఞ్జితముద్వీక్ష్య ముదా ముకున్దః ।**
**బృన్దావనం మధుపమఞ్జురవం - ప్రసూనసన్దోహసాన్ద్రమవిశత్ తరుజాలనీలమ్॥43**

**అ :** కృష్ణుడు బృందావనంలోనికి ప్రవేశించుట. -వసంతతిలక.

**అ :** ముకుందః గంధర్వగీతవృతమ్ అపారతారమ్ చంద్రేణ రంజితమ్ ఉద్వీక్ష్య మధుప-మంజురవం ప్రసూనసందోహసాంద్రం తరుజాలనీలం బృందావనమ్ ముదా అవిశత్.

**ప్ర :** ముకున్దః=కృష్ణుడు (ముకుం దదాతి ఇతి), గంధర్వ-గీత-వృతమ్ : గంధర్వ = గంధర్వుల- యొక్క, గీత

= పాటలచే, వృతమ్ = ఆవరింపబడినదీ (గంధర్వాణాం గీతైః ఆవృతమ్), అపార–తారమ్ : అపార = అంతులేని, తారమ్ = నక్షత్రాలు గలదీ, చంద్రేణ = చంద్రునిచేత, రంజితమ్ = అలంకరింపబడినదీ అయిన, అభ్రమ్ = ఆకాశాన్ని, ఉద్వీక్ష్య = చూసి, మధుప–మంజు–రవమ్ : మధుప = తుమ్మెదలయొక్క, మంజు = మనోహరమైన, రవమ్ = చప్పుడు గలదియు (మధుపానాం మంజుశ్చ అసౌ రవః యస్య, తత్ తథా), ప్రసూన–సందోహ–సాంద్రమ్ : ప్రసూన = పూలయొక్క, సందోహ = గుంపులతో, సాంద్రమ్ = దట్టమైనదియు (ప్రసూనానాం సందోహః, తైః సాంద్రమ్), తరు–జాల–నీలమ్ : తరు = చెట్లయొక్క, జాల = సమూహంచేత, నీలమ్ = నీలవర్ణం గలదియు అయిన (తరూణాం జాలాని, తైః నీలమ్), బృందావనమ్ = బృందావనం లోనికి, ముదా = ఆనందంతో, అవిశత్ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** గంధర్వగీతాలు ఆకాశమంతా ఆవరించి (వినిపిస్తున్నాయి). నక్షత్రాల సమూహం వెలుగులు నింపుతోంది. చంద్రుడు ఆకాశాన్ని అలంకరించాడు. ఆ సమయంలో కృష్ణుడు బృందావనంలోనికి ప్రవేశించాడు.

**వి : 1.** ఇక్కడ ఉపమాలంకారం ధ్వనిస్తుంది బింబప్రతిబింబభావంతో. ఆకాశానికీ, బృందావనానికీ పోలిక. ఆకాశం గంధర్వగీతవృతమూ, అపారహారమూ, చంద్ర రంజిత–మూను. బృందావనం మధుపరవమూ, ప్రసూనసందోహ సాంద్రమూ, తరుజాలనీమూను. ఈ ధర్మాలు దేనికవి వేరే వేరే అయినా మూడు ధర్మాలు కలిగివుండటంలో రెండింటికీ పోలిక వుంది. దీన్నే బింబప్రతిబింబభావమంటారు. అయితే ఆ పోలిక వాచ్యంగా లేదు కాబట్టి ఉపమాలంకారం ధ్వనిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **అవిశత్ :** | **అవిశత్** | అవిశతామ్ | అవిశన్ |
| | అవిశః | అవిశతమ్ | అవిశత |
| | అవిశమ్ | అవిశావ | అవిశామ. |

*

**శ్లో॥ ఇన్దుః స్వరమ్యకిరణైర్విపినం పుపూర - మన్దానిలశ్చ ముదితోత్పలమాన్యగన్ధైః ।**
**సాన్ద్రప్రసూననిచయైస్తరవః సమన్తాత్ - కన్దర్పతాతమవలోక్య పికాశ్చ గీతైః॥6-44**

**అ :** బృందావనప్రవేశసమయంలో ప్రకృతి స్వాగతసన్నాహాలు చేయటం. –వసంతతిలక.

**అ :** కందర్పతాతమ్ అవలోక్య ఇందుః స్వరమ్య–కిరణైః విపినం పుపూర. మందానిలః చ ముదిత+ఉత్పల–మాన్యగంధైః (విపినం పుపూర) తరవః సమంతాత్ సాంద్రప్రసూన–నిచయైః (విపినం పుపూరుః) పికాః చ గీతైః (విపినం పుపూరుః)

**ప్ర :** కందర్ప–తాతమ్ : కందర్ప=మన్మథునియొక్క, తాతమ్ = తండ్రిని (తాతస్తు జనకః పితా–అమరకోశః–మనుష్య–28) (కందర్పస్య తాతః తమ్), అవలోక్య = చూసి (అవ–లోకృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఇందుః = చంద్రుడు, స్వ–రమ్య–కిరణైః : స్వ = తన యొక్క, రమ్య = అందమైన, కిరణైః = కిరణాలతో (స్వస్య రమ్యాశ్చ తే కిరణాః తైః), విపినమ్ = బృందావనాన్ని, పుపూర = నింపాడు. (పూరీ ఆప్యాయనే, పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), మంద+అనిలః చ = మెల్లని గాలికూడా, ముదిత+ఉత్పల–మాన్య–గంధైః : ముదిత = వికసించిన, ఉత్పల = కలువలయొక్క, మాన్య = ఆదరింపదగిన, గంధైః = వాసనలతో (ముదితాని చ తాని ఉత్పలాని, తేషాం మాన్యాః చ తే గంధాః, తైః), (పుపూర = నింపింది), తరవః = చెట్లు, సమంతాత్ = అంతటా, సాంద్ర–ప్రసూన–నిచయైః : సాంద్ర = దట్టంగా వున్న, ప్రసూన = పూలయొక్క, నిచయైః = సమూహాలతో, (పుపూరుః = నింపాయి) (కర్తృపదం బహువచనం కాబట్టి క్రియాపదానికి కూడా వచనవిపర్యాసం), పికాః చ = కోకిలలు కూడా, గీతైః = పాటలతో, (పుపూరుః = నింపాయి.)

**తా ॥** చంద్రుడు తన కిరణాలతో బృందావనాన్ని నింపాడు. చల్లనిగాలి వికసించిన కలువల వాసనలతో నింపింది. చెట్లు పూలసమూహాలను అంతటా విరబూయ జేశాయి. కోయిలలు గీతాలతో బృందావనాన్ని నింపాయి.

**వి :** 1. బృందావనంలోని వాతావరణమంతా అనురాగోద్దీపక మవుతోంది. గోపికలకు ఆలంబనవిభావం కృష్ణుడే. ఉద్దీపనవిభావాలలో తటస్థాలు ప్రకృతి పరిసరాలకు సంబంధించినవి. వాటి వర్ణన చంద్రోదయవర్ణనతో ప్రారంభమైంది. క్రమంగా అతిశయిస్తోంది.

2. ఈ శ్లోకంలో తుల్యయోగితాలంకారముంది. కేవలం ప్రకృతవిషయాలకు కానీ కేవలం అప్రకృత విషయాలకు కానీ ఏకధర్మాన్వయం తుల్యయోగిత. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**'-(కు.44). 'పుపూర' అన్న ఒకే ధర్మం చంద్ర, అనిల, తరు, పికాలలో వర్ణింపబడింది. అన్నీ ప్రకృతవిషయాలే. కాబట్టి తుల్యయోగిత.

| 3. **పుపూర :** | **పుపూర** | పుపూరతుః | పుపూరుః | |
|---|---|---|---|---|
| | పుపూరిథ | పుపూరథుః | పుపూర | |
| | పుపూర | పుపూరివ | పుపూరిమ. | * |

**శ్లో॥ విశ్వస్య మోహన ఇతీశ! యశో మదీయం - విస్తారయేహ లలనాసహితో విహృత్య ।**
**ఇత్యర్థనాకృదివ వృక్షతలప్రవిష్టైః - కృష్ణాఙ్ఘ్రిమాస్పృశతి హృద్యకరైర్హిమాంశుః॥45**

**అ :** వెన్నెలను వర్ణించటం - చంద్రునిలో అభ్యర్థిత్వసంభావనం. -వసంతతిలక.

**అ :** ఈశ! విశ్వస్య మోహనః ఇతి మదీయం యశః ఇహ లలనాసహితః విహృత్య విస్తారయ ఇతి అర్థనాకృద్ ఇవ హిమాంశుః వృక్షతలప్రవిష్టైః హృద్యకరైః కృష్ణ+అంఘ్రిమ్ ఆస్పృశతి.

**ప్ర :** ఈశ = ప్రభూ!, విశ్వస్య = ప్రపంచానికి, మోహనః = మోహింపజేయువాడు అను, మదీయమ్ = నా యొక్క, యశః = కీర్తిని, ఇహ = ఈ బృందావనంలో, లలనాసహితః = కాంతలతో కలిసి (లలనాభిః సహితః), విహృత్య = విహరించి, విస్తారయ = విస్తరింపజేయి (వి+స్తృ ఆచ్ఛాదనే-పరస్మైపది-ణిచ్-లోట్-మ.ఏ.), ఇతి = అని, అర్థనా-కృత్-ఇవ = ప్రార్థిస్తున్నట్లుగా (అభ్యర్థనం కరోతి ఇతి - స ఇవ), హిమాంశుః= చంద్రుడు, వృక్షతల-ప్రవిష్టైః : వృక్షతల = చెట్ల మొదళ్ళలో, ప్రవిష్టైః = ప్రవేశించిన, హృద్య-కరైః : హృద్య = మనోహరమైన, కరైః = కిరణాలతో, కృష్ణ+అంఘ్రిమ్ = కృష్ణుని పాదాన్ని, ఆస్పృశతి = తాకుతున్నాడు.

**తా ॥** ప్రభూ! విశ్వమోహనుడని నాకున్న కీర్తిని ఈ బృందావనంలో నువ్వు లలనలతో కలిసి విహరించి, విస్తరింపజేయాలి - అని చంద్రుడు కృష్ణుని ప్రార్థిస్తున్నట్లుగా చెట్ల మొదళ్ళలో ప్రసరించిన మనోహరకిరణాలతో కృష్ణుని పాదాలను స్పృశించాడు.

**వి :** 1. 'చంద్రుడు కృష్ణుని ప్రార్థించినట్లుంది' అని సంభావించట మిక్కడ ఉత్ప్రేక్షాలంకారం. కీర్తివిస్తరణను చంద్రుడు కోరుతున్నాడు అది కూడా కృష్ణమూలకంగా. అనగా కృష్ణుడు కూడా తనకు లోనయితే తాను మొనగాడనిపించుకోవచ్చని ఆలోచన అట. అంత ఆలోచన చంద్రుడు చేశాడా? చేసినట్లు కవి భావించాడు కాబట్టి ఫలోత్ప్రేక్షాలంకారం.

| 2. **ఆస్పృశతి :** | **ఆస్పృశతి** | ఆస్పృశతః | ఆస్పృశన్తి | |
|---|---|---|---|---|
| | ఆస్పృశసి | ఆస్పృశథః | ఆస్పృశథ | |
| | ఆస్పృశామి | ఆస్పృశావః | ఆస్పృశామః. | * |

**శ్లో॥ వ్యాకీర్ణకామ ఇవ తైర్వివిధైర్విభావై-రాకర్షయన్ వ్రజవధూర్నిజసఙ్గయోగ్యాః ।**
**వేణుం క్రమేణ రణయన్ బహుతానగాన-మానజ్ఞమౌళిరుదగాయదధీశ్వరోఽసౌ ॥46**

**అ :** కృష్ణుని వేణుగానం. –వసంతతిలక.

**అ :** వివిధైః తైః విభావైః వ్యాకీర్ణకామః ఇవ నిజసంగయోగ్యాః వ్రజవధూః ఆకర్షయన్ బహుతానగానమానజ్ఞమౌళిః అధీశ్వరః అసౌ క్రమేణ వేణుం రణయన్ ఉదగాయత్.

**ప్ర :** వివిధైః = అనేకాలైన, తైః=ఆ (గతశ్లోకాలలో వివరించిన), విభావైః=ఉద్దీపన విభావాలచే, వి+ఆకీర్ణ–కామః +ఇవ = ఉద్రిక్తమైన కామం గలవానివలె (వ్యాకీర్ణః కామః యస్య సః), నిజ–సంగ–యోగ్యాః : నిజ = తనతో, సంగ = కలయికకు / చేరిమికి, యోగ్యాః = తగినవారైన (నిజస్య సంగః, తస్య యోగ్యాః), వ్రజ–వధూః = గోపస్త్రీలను, ఆకర్షయన్ = ఆకర్షిస్తూ (ఆ+కృష్ విలేఖనే ధాతువుపై శతృ ప్రత్యయం), బహు–తాన–గాన–మాన–జ్ఞ–మౌళిః : బహు = అనేకమయిన, తాన = స్వరాలను, గాన = గీతాలను, మాన = తాళాలను, జ్ఞ = తెలిసినవారిలో, మౌళిః = శ్రేష్ఠుడునూ, అధి+ఈశ్వరః = జగదీశ్వరుడును అయిన, అసౌ = ఆ కృష్ణుడు, క్రమేణ = అంచెలంచెలుగా, వేణుమ్ = పిల్లనగ్రోవిని, రణయన్ = ధ్వనింపజేస్తూ / ఊదుతూ (రణ (శబ్దే) ధాతువుపై శతృ ప్రత్యయం), ఉద్+అగాయత్ = పాడెను. (ఉద్+గై–శబ్దే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** గతశ్లోకాలలో వర్ణించిన వివిధాలయిన ఉద్దీపనవిభావాలవలన కృష్ణునిలో కామ మతిశయించి నట్లయింది. తనతో చేరిమికి యోగ్యులయిన గోపకాంతలను ఆకర్షిస్తూ, తానగానమానవేత్త అయిన ఆ జగదీశ్వరుడు మెలమెల్లగా వేణువు నూదుతూ గానం చేయసాగాడు. (వేణుగానం చేయసాగాడు.)

**వి :** 1.'వ్యాకీర్ణకామ ఇవ' అన్న ఉత్ప్రేక్ష–సంభావన–ఇక్కడ విలువైనది. కృష్ణునకు వాస్తవంగా కామభావన ముండటం, అది అతిశయించటం సంభవమా? అసంభవమా?

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ – భగవద్గీత – 3/22

అని గీతలో ప్రకటించాడు గదా! పొందవలసినది ఏదీ లేదు? ఆ మేరకు కామం కూడా వుండదు. కానీ 'వర్త ఏవ చ కర్మణి' (కర్మను ఆచరిస్తూనే వుంటాను) అన్న మేరకు లౌకికకృత్యాలలో మామూలుగానే ప్రవర్తిస్తాడు. ఈ రెండింటినీ అనుసంధానం చేసికొనగల మానసికస్థితి కృష్ణున కున్నది.

'**వ్యాకీర్ణ**' పదం కూడా ఆ భావసంయోగంలోని విలక్షణతను సూచించేదే.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉదగాయత్ :** | **ఉదగాయత్** | ఉదగాయతామ్ | ఉదగాయన్ |
| | ఉదగాయః | ఉదగాయతమ్ | ఉదగాయత |
| | ఉదగాయమ్ | ఉదగాయావ | ఉదగాయామ. |

*

**శ్లో॥ హృద్గం హృద్యనురఞ్జయన్ సవయసః సంహర్షయన్ కర్షయన్**
**గోపస్త్రీహృదయం పశూన్ ఋషిగణాన్ నిశ్చేష్టయన్ స్పష్టయన్ ।**
**విశ్వం స్వస్య వశం వియద్గృహవధూః సమ్మూర్ఛయంశ్చారణాన్**
**సిద్ధాన్ సంత్రపయన్ సురాన్ వినమయన్ వేణుం పుపోషాచ్యుతః ॥ 6–47**

**అ :** వేణుగానప్రభావవర్ణనం – వివిధప్రాణులపై. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అచ్యుతః హృద్గం హృది అనురంజయన్ సవయసః సంహర్షయన్ గోపస్త్రీహృదయం కర్షయన్ పశూన్ ఋషిగణాన్ నిశ్చేష్టయన్ వియద్గృహవధూః సమ్మూర్ఛయన్ చారణాన్ సిద్ధాన్ సంత్రపయన్ సురాన్ వినమయన్ విశ్వం స్వస్య వశం స్పష్టయన్ వేణుం పుపోష.

**ప్ర :** అచ్యుతః = కృష్ణుడు, హృద్గమ్ = తనలోనున్న దానిని (హృదం గచ్ఛతి ఇతి), హృది = లోననే, అనురంజయన్ = అనురంజింపజేస్తూ (అనురంజ్ ధాతువుపై శతృ ప్రత్యయం), సవయసః = సమానమైన వయస్సు గలవారిని (తోటి వారిని) (సమానం వయః యేషాం, తాన్), సంహర్షయన్ = ఆనందింపజేస్తూ (సమ్+హృష్+ణిచ్ – ధాతువుపై శతృ ప్రత్యయం), గోప–స్త్రీ–హృదయమ్ = గోపకాంతల మనస్సును (గోపాశ్చ తాః స్త్రియః తాసాం హృదయమ్ తత్), కర్షయన్ = లాగుతూ (కృష్ ధాతువుపై శతృ ప్రత్యయం), పశూన్ = జంతువులను (మానవేతరులను), ఋషి–గణాన్ = ఋషి సమూహాలను (ఋషీణాం గణాః, తాన్), నిశ్చేష్టయన్ = స్తబ్ధులను చేస్తూ (ని+చేష్ట ణిచ్–ధాతువుపై శతృ ప్రత్యయం), వియద్–గృహ–వధూః : వియత్ = ఆకాశమే, గృహ = ఇళ్ళుగా గల, వధూః = స్త్రీలను (వియద్ ఏవ గృహం యేషాం తాః) (దేవతా స్త్రీలను), సంమూర్ఛయన్ = మోహింప జేస్తూ (మూర్ఛా ధాతువుపై శతృ ప్రత్యయం), చారణాన్ = చారణులను, సిద్ధాన్ = సిద్ధులను, సంత్రపయన్ = సిగ్గుపడజేస్తూ (త్రప్ ణిచ్–ధాతువుపై–శతృ ప్రత్యయం), సురాన్ = దేవతలను, వినమయన్ = వినమ్రులను చేస్తూ (వి–నమ్–ణిచ్–ధాతువుపై శతృ ప్రత్యయం), విశ్వమ్ = జగత్తును, స్వస్య = తనకు, వశమ్ = లోనైనదానినిగా, స్పష్టయన్ = వ్యక్తం చేస్తూ (స్పష్ట్ ధాతువుపై శతృ ప్రత్యయం), వేణుమ్ = పిల్లనగ్రోవిని, పుపోష = ఊదెను. (పుష్ పుష్టౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు వేణువు నూదాడు. ఎలా? తనలోనే ఉన్న జగత్తును అక్కడే అనురంజింపజేస్తూ; తన సావాసగాండ్రను ఆనందింపజేస్తూ; గోపకాంతల మనస్సును ఆకర్షిస్తూ; పశువులనూ, ఋషిగణాలనూ నిశ్చేష్టులను చేస్తూ; గానాస్వాదనకై వచ్చిన సురకాంతలను ఆ ఆకాశగృహాల లోనే మూర్ఛిల్ల జేస్తూ; చారణులను, సిద్ధులనూ సిగ్గు పడజేస్తూ; దేవతలను వినమ్రులను చేస్తూ; ప్రపంచమంతా తన అదుపులోనే ఉన్నదని స్పష్టం చేస్తూ...

**వి :** 1. శ్లోకంలో అనురంజయన్, సంహర్షయన్, కర్షయన్, నిశ్చేష్టయన్, స్పష్టయన్, సం–మూర్ఛయన్, సంత్రపయన్, వినమయన్, పుపోష (సమాపక క్రియ) తొమ్మిది క్రియలున్నాయి. తొమ్మిదింటికీ వేరువేరుగా కర్మపదాలున్నాయి. అయితే సముచ్చయార్థకపదం ఒక్కటి కూడా లేకపోవటం విశేషం. ఇది కవి ఐచ్ఛికంగా చేసిన పనే అనుకొంటున్నాను.

ఎందుకంటే 'కర్త ఒక్కడే. కర్తగా తాను చేస్తున్న పని ఒక్కటే. వేణువు నూదటం. దాని ప్రభావం విభిన్నంగా పడుతోంది. వేణువు నూదటానికే తాను కర్తగానీ తత్ప్రభావంతో వివిధ వ్యక్తులలో కలుగుతున్న పరిణామాలకు వారే కర్తలు గానీ తాను కాదు.' అలా ధ్వనింపజేయదలచాడేమో కవి.

2. సిద్ధచారణులు గాంధర్వవిద్యానిపుణులు. వారుకూడా సిగ్గుపడేటట్లుగా వేణుగాన ముండటం దాని స్థాయిని తెలయజేస్తుంది.

3. గోపస్త్రీహృదయం కర్షయన్ – అని హృదయశబ్దం ఏకవచనంలో వుండటం సామూహికమైన ఏకత్వాన్ని సూచిస్తుంది. గోపస్త్రీయొక్క హృదయం అని విడివిడిగా ప్రతి–గోపకాంత కాంత మనస్సునూ అని నానాత్వాన్ని భావించవలసి వస్తుంది. అప్పుడు–

**శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామామ్.**
**పశ్యతి సస్మితచారుతరామపరామనుగచ్ఛతి వామామ్**
**హరిరిహ ముగ్ధవధూనికరే విలాసిని విలసతి కేళిపరే** – గీతగోవిందం–గీతం 4

| | | | |
|---|---|---|---|
| 4. **పుపోష :** | **పుపోష** | పుపుషతుః | పుపుషుః |
| | పుపోషిథ | పుపుషథుః | పుపుష |
| | పుపోష/పుపుష | పుపుషివ | పుపుషిమ. |

*

**శ్లో॥ శుష్కామపి స్మ సరసామధరామృతేన**
**హృద్యస్వనామపి విధాయ మృదూక్తిశూన్యామ్।**
**ఛిద్రం నిగూహ్య మురలీం మురజిచ్చుచుమ్బే**
**సద్వంశజాతలలనాసు న కస్య పక్షః॥ 6-48**

**అ :** కృష్ణునకు వేణువుపైగల పక్షపాతాన్ని సమర్థించుట. -వసంతతిలక.

**అ :** మురజిత్ శుష్కామ్ అపి మురలీమ్ అధర+అమృతేన సరసాం విధాయ, మృదు+ఉక్తి-శూన్యామ్ అపి హృద్యస్వనాం విధాయ ఛిద్రం నిగూహ్య చుచుంబే. సద్వంశజాతలలనాసు కస్య న పక్షః.

**ప్ర :** మురజిత్ = కృష్ణుడు (మురం జయతి ఇతి), శుష్కామ్+అపి = నీరసమైనను, మురలీమ్ = వేణువును, అధర+అమృతేన = పెదవుల ఎంగిలితో (అధరస్య అమృతం తేన), సరసామ్ = సరసంగా, విధాయ = చేసి (వి-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మృదు+ఉక్తి-శూన్యామ్-అపి : మృదు = సున్నితమైన, ఉక్తి = మాటలు, శూన్యామ్ అపి = లేనిదైనను (మృద్వ్యః చ తాః ఉక్తయః, తాభిః శూన్యా, తామ్), హృద్య-స్వనామ్ : హృద్య = మనోహరమైన, స్వనామ్ = ధ్వని గలదానినిగా, విధాయ = చేసి, ఛిద్రమ్ = చిల్లును/ లోపాన్ని, నిగూహ్య = క్రప్పి పుచ్చి (ని-గుహ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), చుచుంబే = ముద్దాడెను. (చుబి వక్త్రసంయోగే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), సద్... లలనాసు : సద్ = మంచిదైన, వంశ = వెదురులో / వంశంలో, జాత = పుట్టిన, లలనాసు = స్త్రీల విషయంలో, కస్య = ఎవనికి, న పక్షః = మొగ్గు ఉండదు?

**తా ॥** కృష్ణుడు నీరసమయిన వేణువును తన అదరామృతంతో సరసంగా చేసి, మృదువయిన మాట లేకపోయినా మనోహరమయిన సవ్వడిని సమకూర్చి, దాని లోపాన్ని కప్పిపుచ్చి, దానిని ముద్దాడాడు. మంచి వంశంలో పుట్టిన స్త్రీలపై పక్షపాతమెవరికుండదు?

**వి :** 1. ఈ శ్లోకంలోని **స్మ** పదం పాదపూరణమాత్ర ప్రయోజకం. '**తుహిచస్మహవై పాద పూరణే**' అని అమరకోశం - (అవ్యయ-5)

2. కృష్ణకృతవేణుగానం ఇక్కడ ప్రస్తుతవిషయం. కానీ లింగసామర్థ్యంచేత విశేషణసామ్యంచేత చేష్టాసామ్యంచేత అప్రస్తుతమయిన నాయికానాయకవ్యవహారం గమ్యమాన మవుతుంది. నీరస అయిన కాంతను కూడా దోషాలను లోపాలను క్షమించి సమాదరించిన సన్నివేశం స్ఫురిస్తుంది. కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. 'సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్'-(కు. 61)

అలాగే 'సద్వంశజాతలలనాసు న కస్య పక్షః' అన్న సామాన్యవాక్యంతో విశేషవిషయాన్ని కృష్ణుడు వేణువును ఆదరించటాన్ని - సమర్థించినందువలన అర్థాంతరన్యాసాలంకారం కూడా. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః'-(కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **చుచుంబే :** | **చుచుంబే** | చుచుంబాతే | చుచుంబిరే |
| | చుచుంబిషే | చుచుంబాథే | చుచుంబిధ్వే |
| | చుచుంబే | చుచుంబివహే | చుచుంబిమహే |

వాస్తవానికి ఈ ధాతువు పరస్మైపది (భ్వాది). చురాది గణంలోని హింసార్థక 'చుబి' ధాతువు ఉభయపది. *

**శ్లో॥ అపరవశమపీశం స్వానురక్తం విధత్తే - సహజమపి విరోధం హన్తి జన్తుష్వభేద్యమ్।**
**వశయతి జగదేతన్మాన్యతామాప వేణు-ర్మధురనినదభాజాం కిం న సాధ్యం హి లోకే॥49**

**అ :** వేణుమాహాత్మ్యవర్ణనం. -మాలిని.

**అ :** వేణుః అపరవశమ్ అపి ఈశం స్వ+అనురక్తం విధత్తే. జంతుషు అభేద్యం సహజం విరోధమ్ అపి హంతి. ఏతత్ జగత్ వశయతి. మాన్యతామ్ ఆప. హి లోకే మధురనినదభాజాం కిం న సాధ్యమ్?

**ప్ర :** వేణుః = పిల్లనగ్రోవి, అపరవశమ్ = అస్వతంత్రుడు కాని (పరవశో న భవతీతి – తమ్), ఈశమ్ = ప్రభువును/ కృష్ణుని, స్వ+అనురక్తమ్ = తనయందు రాగం గల వానిగా (స్వస్మిన్ అనురక్తః, తమ్), విధత్తే = చేస్తుంది. (వి–ధా ధారణపోషణయోః–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), జంతుషు = తిర్యక్కుల యందలి/ ప్రాణుల యందలి, అభేద్యమ్ = తొలగింప లేనిదీ, సహజమ్ = తోడబుట్టినదీ అయిన, విరోధమ్ = శత్రుత్వాన్ని కూడా, హన్తి = అణగారుస్తుంది. (హన్ హింసాగత్యోః–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), ఏతత్ = ఈ, జగత్ = ప్రపంచాన్ని, వశయతి = లోబరుస్తుంది. (వశ కాంతౌ ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), మాన్యతామ్ = గౌరవింపదగుటను, ఆప = పొందింది. (ఆప్ వ్యాప్తౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), హి = అది తగినదే, లోకే = లోకంలో/జనంలో (లోకస్తు భువనే జనే అమరకోశః –నానార్థ–2), మధుర–నినద–భాజామ్ : మధుర = తీయనైన, నినద = మాటలను, భాజామ్ = కలిగివున్న వారికి, కిం–న–సాధ్యమ్ = ఏది వీలు గాదు?

**తా ॥** పిల్లనగ్రోవి (సర్వాత్మనా) స్వతంత్రుడైన కృష్ణుని తనపై అనురక్తుని చేస్తుంది. ప్రాణుల మధ్య సహజమై, భేదింపరాని శత్రుత్వాన్ని కూడా పరిహరిస్తుంది. ప్రపంచాన్నే లోబరచు కొంటుంది. గౌరవాన్ని పొందుతుంది. నిజమే. తీయగా మాటాడగలవారికి లోకంలో అసాధ్య మేముంటుంది?

**వి :** 1. శ్లోకంలోని మొదటి మూడుపాదాలలో విశేషవిషయమైన వేణుమహత్త్వాన్ని వర్ణించి, నాలుగవ పాదంలో సామాన్యవిషయమైన వాఙ్మాధుర్యప్రభావాన్ని వర్ణించినందువల్ల ఇది **అర్థాంతరన్యాసాలంకారం**. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః'–(కు. 122)

2. వేణువునకు ఆ మధురనాదం సిద్ధించటానికి హరికరగ్రహణమే కారణమంటూ చంపూభాగవతం చెప్తోంది చూడండి.

శ్లో॥ ఛిద్రైర్ముహుర్ముఖగతైరపి గాయకానా – మాగంతుకైశ్చ సహజైర్బహుభిర్లఘీయాన్।
**వంశస్తదా హరికరగ్రహణానుభావా** – త్ప్రాప్తశ్రుతిం **జనయతీతి ముదం** న చిత్రమ్॥

–(అభినవకాళిదాస రచిత) చంపూభాగవతం 2/112

| | | | |
|---|---|---|---|
| 3. **విధత్తే :** | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | విధత్సే | విదధాథే | విదధధ్వే |
| | విదధే | విదధ్వహే | విదధ్మహే |
| **హంతి :** | **హంతి** | హతః | ఘ్నంతి |
| | హంసి | హథః | హథ |
| | హన్మి | హన్వః | హన్మః |
| **వశయతి :** | **వశయతి** | వశయతః | వశయన్తి |
| | వశయసి | వశయథః | వశయథ |
| | వశయామి | వశయావః | వశయామః |
| **ఆప :** | 42వ శ్లోకవ్యాఖ్య చూడుడు. | | |

*

**శ్లో॥ స జయతి యదునాథః శ్రావితానేకగీతః – కరధృతవరవేణుః కామినీకామధేనుః ।**
**సులలితవనమాలః సున్దరాపాఙ్గలీలః – సజలజలదమూర్తిః సాధుభిర్గీతకీర్తిః ॥50**

**అ :** వేణుగానం చేస్తున్న కృష్ణస్తుతి. –మాలిని.

**అ :** శ్రావిత+అనేకగీతః కరధృతవరవేణుః కామినీకామధేనుః సులలితవనమాలః సుందర+ అపాంగలీలః సజలజలదమూర్తిః సాధుభిః గీతకీర్తిః సః యదునాథః జయతి.

**ప్ర :** శ్రావిత+అనేక–గీతః : శ్రావిత = వినిపింపజేయబడిన (శ్రు ధాతువుపై ణిచ్ – క్త ప్రత్యయం), అనేక = చాలా, గీతః = పాటలు గలవాడును (శ్రావితాని అనేకాని గీతాని యేన సః), కర–ధృత–వర–వేణుః : కర = చేతియందు, ధృత = ధరింపబడిన (ధృ ధాతువుపై క్త ప్రత్యయం), వర = శ్రేష్ఠమైన, వేణుః = వేణువు గలవాడును (కరే ధృతః వరః చ అసౌ వేణుః యేన సః), కామినీ – కామధేనుః : కామినీ = కోరికలు గల స్త్రీలకు, కామధేనుః = కామధేనువు వంటివాడు (కామినీనాం కామధేనుః), సులలిత–వన–మాలః : సులలిత = బాగా కోమలమైన, వన–మాలః = వనమాల గలవాడును (సులలితా చ సా వనమాలా యస్య సః), సుందర+అపాంగ–లీలః : సుందర = మనోహరమైన, అపాంగ = కడకంటిచూపులయొక్క (నయనోపాంతమపాంగః–హలాయుధకోశః–520), లీలః = విలాసం గలవాడును (సుందరాణామ్ అపాంగానాం లీలా యస్మిన్ సః), సజల–జలద–మూర్తిః : సజల = నీటితో కూడిన, జలద = మేఘంవంటి, మూర్తిః = ఆకృతి గలవాడును (సజలాశ్చ తే జలదాః తేషాం మూర్తిరివ మూర్తిః యస్య సః), సాధుభిః = సజ్జనులచేత, గీత–కీర్తిః: గీత = గానం చేయబడిన, కీర్తిః = పేరు గలవాడును (గీతా కీర్తిః యస్య సః), సః = ఆ, యదునాథః = యాదవపతి, జయతి = వర్ధిల్లుతున్నాడు. (జి జయే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** అనేకగీతాలను వినిపించినవాడు, వేణువును చేతబట్టినవాడు, కామినీ జనులకు కామధేనువు వంటివాడు, కోమలమయిన వనమాల గలవాడు, అందమైన కడగంటి చూపులవాడు, నీలమేఘశ్యాముడు, సజ్జనస్తుత కీర్తి అయిన కృష్ణుడు జయించుగాత.

**వి :** 1. **వనమాల** :

శ్లో॥ ఆజానులంబినీ మాలా సర్వర్తుకుసుమోజ్జ్వలా ।
మధ్యే స్థూలకదంబాఢ్యా వనమాలేతి కీర్తితా ॥ – హలాయుధకోశః.

మోకాళ్ళవరకూ వ్రేలాడేది వనమాల. ఆ మాల మధ్యలో ఒత్తుగా కదంబాలుంటాయి.

2. కావ్యమధ్యంలో మంగళాత్మకంగా చేసిన కృష్ణస్తుతి ఇది.

3. **జయతి :**

| | | |
|---|---|---|
| **జయతి** | జయతః | జయన్తి |
| జయసి | జయథః | జయథ |
| జయామి | జయావః | జయామః. |

*

**శ్లో॥ చన్ద్రే జృమ్భతి తన్ముఖత్విషి ముహుర్మన్దానిలే తద్వపు–**
**ర్గన్ధే వాతి వియోగవహ్నిసచివే తత్కోమలాలాపవత్ ।**
**వేణౌ కూజతి పఞ్చబాణవిశిఖైః శాణాశితైస్తాడితా**
**మానిన్యోఽపి యయుర్మనోభవపితుః శ్రేయోనిధిం సన్నిధిమ్ ॥ 6–51**

**అ :** గోపికలు కృష్ణుని సన్నిధికి వెళ్ళుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** తన్ముఖత్విషి చంద్రే జృంభతి తద్వపుర్గంధే వియోగవహ్నిసచివే మంద+అనిలే ముహుః వాతి తత్–కోమల+ఆలాపవత్ వేణౌ కూజతి శాణాశితైః పంచబాణవిశిఖైః తాడితాః మానిన్యః అపి శ్రేయోనిధిం మనోభవపితుః సన్నిధిం యయుః.

**ప్ర :** తత్+ముఖ–త్విషి : తత్ = ఆ కృష్ణునియొక్క, ముఖ=ముఖంయొక్క, త్విషి = కాంతి గల (రాధా శోభా ఛవీరుక్ త్విట్ సుషమా... వైజయన్తీ–పుర–149) (తస్య ముఖమ్ తన్ముఖమ్, తస్య త్విడివ త్విట్ యస్య, తస్మిన్), చంద్రే = చంద్రుడు, జృంభతి (సతి) = చెలరేగుతుండగా (జృంభ్ గాత్రవినామే–ధాతువుపై శతృ ప్రత్యయం–స.ఏ.), వియోగ–వహ్ని–సచివే : వియోగ = విరహ మనే, వహ్ని = అగ్నికి, సచివే = (మంత్రి) తోడు అయిన (వియోగ ఏవ వహ్నిః, తస్య సచివః, తస్మిన్), తద్–వపుః–గంధే : తత్ = ఆ కృష్ణునియొక్క, వపుః = శరీరంయొక్క, గంధే = వాసన వంటి వాసన గల (తస్య వపుః తద్వపుః, తస్య గంధ ఇవ గంధః యస్య, తస్మిన్), వాతి (సతి) = వీస్తుండగా (వా గతి–గంధనయోః ధాతువుపై శతృ ప్రత్యయం–సప్తమీ విభక్త్యేకవచనం), మంద+అనిలే : మంద = మెల్లనైన, అనిలే = గాలి (మందశ్చ అసౌ అనిలః, తస్మిన్), ముహుః = మాటిమాటికీ, తత్+కోమల+ఆలాపవత్ : తత్ = ఆ కృష్ణునియొక్క, కోమల = మృదువయిన, ఆలాపవత్ = మాటలవలె (తస్య కోమలాశ్చ తే ఆలాపాః, తైః తుల్యమ్), వేణౌ = పిల్లనగ్రోవి, కూజతి (సతి) = మ్రోయుచుండగా (కూజ అవ్యక్తే శబ్దే ధాతువుపై శతృ ప్రత్యయం – సప్తమీ విభక్త్యేకవచనం), శాణా–శితైః : శాణా = సానపై, శితైః = పదును పెట్టబడిన (శాణాయాం శితాః, తైః), పంచబాణ–విశిఖైః : పంచబాణ = మదనుని యొక్క, విశిఖైః = బాణాలచే (పంచబాణస్య విశిఖాః, తైః), తాడితాః = కొట్టబడిన (తడ్ ధాతువుపై క్త ప్రత్యయం), మానిన్యః+అపి = అభిమానవతులు కూడా (మానః చిత్తసమున్నతిః–అమరకోశః–నాట్య–22), శ్రేయః+నిధిమ్ : శ్రేయః = శ్రేయస్సులకు, నిధిమ్ = నిలకడ తావైన (శ్రేయాంసి నిధీయన్తే అస్మిన్ ఇతి, తమ్), మనోభవ–పితుః : మనోభవ = మదనునియొక్క, పితుః = తండ్రి అయిన కృష్ణునియొక్క (మనసి భవతి ఇతి మనోభవః తస్య పితా తస్య), సన్నిధిమ్ = దగ్గరకు, యయుః = వెళ్ళారు. (యా ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని ముఖకాంతివంటి కాంతిగల చంద్రుడు విజృంభిస్తున్నాడు. విరహాగ్నిని పెంపొందింపజేసే చల్లని గాలి వీస్తోంది. అది కృష్ణశరీరగంధంతో కదులుతోంది. కృష్ణుని మృదువచనాలవలె వేణువు పలుకుతోంది. సానపై పదును పెట్టిన బాణాలను మదనుడు ప్రయోగించి మానవతులను దెబ్బ తీస్తున్నాడు. అప్పుడు ఆ బాణాల తాకిడికి లోనైన ఆ మానినులు శ్రేయోనిధి అయిన మదనజనకుని (కృష్ణుని) సన్నిధికి చేరారు.

**వి :** 1. వెన్నెల, చల్లనిగాలి, వేణుగానం – ఇవి శృంగారరసానికి ఉద్దీపనవిభావాలు. ఇవి తటస్థాలు. అనగా ఆలంబనవిభావాన్ని ఆశ్రయించినవి కావు. కానీ ఇక్కడ మూడింటికి కూడా గుణప్రాప్తి కృష్ణసంబంధం వలననే అని వర్ణించటంవల్ల వాటికి కృష్ణాలంబనం శక్తిని పెంచిందని వ్యక్తమవుతుంది.

2. శ్లో॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతః – తౌ సంపరీత్య వివినక్తి ధీరః ।
శ్రేయోఽ హి ధీరోఽ భిప్రేయసో వృణీతే – ప్రేయో మన్దో యోగక్షేమాద్వృణీతే ॥

– కఠోపనిషత్తు – 2/2

ప్రేయోమార్గం, శ్రేయోమార్గం – అని రెండు దారులు. గోపికలలో కనిపించేది ప్రేయోమార్గంలా కనిపిస్తుంది. కానీ వారు చేరింది శ్రేయోనిధిసాన్నిధ్యాన్ని. పరమాత్మాలంబనమైన ప్రేయోమార్గం కూడా శ్రేయోమార్గమే అని ధ్వని.

3. మదనుని పంచబాణాలు :

శ్లో॥ అరవిన్దమశోకం చ చూతం చ నవమల్లికా ।
నీలోత్పలం చ పంచైతే **పంచబాణస్య** సాయకాః ॥ – అమరకోశం.

| | | | |
|---|---|---|---|
| 4. **యయుః :** | యయౌ | యయతుః | **యయుః** |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

**శ్లో॥ దోహం కాపి విహాయ కృష్ణసురభిం దోగ్ధుం సమస్తేప్సితం**
**తద్బింబోష్ఠసుధాతిలుబ్ధహృదయా భుక్తిం విసృజ్యాపరా ।**
**కాన్తం కాచన సద్గుణార్ణవభృతే భర్త్రే స్పృహాం బిభ్రతీ**
**తోకం కృష్ణవిహారయోగ్యవిభవా కన్యేతి కాచిద్గతా ॥ 6-52**

**అ :** గోపికలు కృష్ణసన్నిధికి చేరుటకు పడుతున్న తత్తరపాట్లు. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కాపి దోహం విహాయ కృష్ణసురభిం సమస్తేప్సితం దోగ్ధుం గతా. అపరా తద్బింబ+ఓష్ఠ సుధా+అతిలుబ్ధహృదయా భుక్తిం విసృజ్య గతా. కాచన సద్గుణ+అర్ణవభృతే భర్త్రే స్పృహాం బిభ్రతీ కాంతం విసృజ్య గతా. కాచిత్ కృష్ణవిహారయోగ్యవిభవా కన్యా ఇతి తోకం విసృజ్య గతా.

**ప్ర :** కా+అపి = ఒకానొక గోపిక, దోహమ్ = పాలు పితుకుటను, విహాయ = విడిచి, కృష్ణ-సురభిమ్ = కృష్ణుడనే కామధేనువునుండి (కృష్ణ ఇతి సురభిః తమ్) (సురభిః = స్వర్ధేనుభేదే, కామధేనువు - శబ్దార్థకల్పతరుః - 1539), సమస్త+ఈప్సితమ్ : సమస్త = సంపూర్ణమైన, ఈప్సితమ్ = కోరికను (సమస్తం చ తత్ ఈప్సితం చ), దోగ్ధుమ్ = పితుకుటకు, గతా = వెళ్ళింది. (గమ్ ధాతువుపై క్త ప్రత్యయం), అపరా = మరొక కాంత, తద్... హృదయా (సతీ) : తత్ = ఆ కృష్ణునియొక్క, బింబ = దొండపండు వంటి, ఓష్ఠ = పెదవిమీద, సుధా = అమృతంపై, అతిలుబ్ధ = తీవ్రవ్యామోహం గల, హృదయా (సతీ) = మనస్సుగలదై (తస్య ఓష్ఠః బింబమ్ ఇవ, తస్మిన్ సుధా, తస్యామ్ అతిలుబ్ధం హృదయం యస్యాః సా), భుక్తిమ్ = భోజనాన్ని, విసృజ్య = వదలి (వి+సృజ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గతా = వెళ్ళింది. కాచన = ఒకానొక గోపిక, సద్-గుణ-అర్ణవ-భృతే : సద్ = మంచి వయిన, గుణ = గుణాలయొక్క, అర్ణవ = సముద్రాన్ని, భృతే = భరిస్తున్న (సన్తః చ తే గుణాః, తేషామ్ అర్ణవః, తం బిభర్తి ఇతి - తస్మై), భర్త్రే = భర్త కొరకై (**స్పృహేరీప్సితః** (అష్టాధ్యాయి 1-4-36) సూత్రం ద్వారా భర్తృశబ్దంపై చతుర్థీ విభక్తి), స్పృహామ్ = కోరికను, బిభ్రతీ = భరిస్తున్నదై/ కలిగియున్నదై, కాంతమ్ = (తన) భర్తను, విసృజ్య = వీడి, గతా = వెళ్ళింది. కాచిత్ = ఒకానొక గోపిక, కృష్ణ-విహార-యోగ్య-విభవా : కృష్ణ = కృష్ణుని యొక్క, విహార = విహారానికి/వినోదానికి, యోగ్య = తగిన, విభవా = సంపదగల (కృష్ణస్య విహారః, తస్మై యోగ్యః విభవః యస్యాః సా), కన్యా+ఇతి = కన్యను అనే భావనతో, తోకమ్ = బిడ్డను (తుక్ తోకం తనయశ్చ నందనః, హలాయుధకోశః-497), విసృజ్య = వీడి, గతా = వెళ్ళింది.

**తా ॥** ఒకానొక గోపిక కృష్ణుడనే కామధేనువు దగ్గర తన సమస్తకాంక్షను పిండుకోవాలని ఇంట పాలు పితకటాన్ని మానివేసి వెళ్ళింది. మరొక గోపిక కృష్ణుని అధరబింబామృతం మీది వ్యామోహంతో తిండిమాని బయలుదేరింది. వేరొక గోపిక సద్గుణసాగరుడయిన భర్తను కోరుతూ నిజకాంతుని వీడి బయలుదేరింది. ఇంకొక గోపిక తాను కృష్ణవిహారానికి తగిన సంపదతో కన్యగానే కనిపించాలని కన్నబిడ్డను విడిచి వెళ్ళింది.

**వి :** 1. కృష్ణునిలో సురభిత్వాన్ని ఆరోపించటం వలన ఇది రూపకాలంకారం. సర్వకామనలను తీర్చే సురభి లభించిన తర్వాత ఇతర గోదోహం నిరర్థకమని కావ్యార్థాపత్త్యలంకారధ్వని. అలాగే బింబోష్ఠసుధ లభిస్తుంటే ఇతరభుక్తి నిరర్థకం గదా! అని కావ్యార్థాపత్త్యలంకారధ్వని. మూడవపాదంలో గూడా సద్గుణార్ణవభర్త లభిస్తుంటే నిజకాంతుడు అవసరం లేదు గదా! అన్నది **కావ్యార్థాపత్త్యలంకారధ్వని.**

2. ఇక్కడ రెండవపాదంలోనూ, మూడవపాదంలోనూ వర్ణించిన అంశాలలో నైతికతా ప్రసక్తి చర్చనీయ మవుతుంది. భౌతికభావనలో అది అనుచితమనిపిస్తుంది. ఆ సమన్వయాన్ని శుకమహర్షి మాటలలోనే గ్రహిద్దాం.

మ. తరుణుల్ గొందఱు మూలగేహముల నుద్దండించి రారాక త
ద్విరహాగ్నిం బరితాపమొందుచు మనోవీథిన్ విభున్ మాధవుం
బరిరంభంబులు సేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం
దిరి ముక్తిన్ గుణదేహముల్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై.

ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ,
బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు,
జనులు మోక్షమునకుఁ జనదు రధిప! – పోతనభాగవతం 10/966,971

అనన్యదృష్టి, అనన్యభావన, అనన్యచేష్ట ఎక్కడ కుదిరితే అదే దైవస్వరూపం. అది నిజ వల్లభునిలో కావచ్చు, జగద్వల్లభునిలోనైనా కావచ్చు. కానీ నిజవల్లభుడు, జగద్వల్లభుడు అను భేదబుద్ధి ఉన్నంతకాలం ఆ భేదానికి మూలమైన లోకమర్యాదలను పాటించవలసి వుంటుంది. కృష్ణుని చేతనే ఆ విషయాన్ని ప్రకటింపజేస్తాడు పోతన.

క. నడవడి గొఱ గాకున్నను
బడుగైనఁ గురూపియైనఁ బామరుఁ డైనన్
జడుఁడైన రోగి యైనను
విడుచుట మరియాద కాదు విభు నంగనకున్.

చ. వనితలు నన్నుఁ గోరి యిట వచ్చితి రింత గొఱంత లేదు; మే
లొనరెె; సమస్తజంతువులు నోలిఁ బ్రియంబులు గావె నాకు; నై
నను నిలువంగఁ బోలదు సనాతనధర్మము లాఁడు వారికిం
బెనిమిటులన్ భజించుటలు; పెద్దలు సెప్పుచు నుందు రెల్లెడన్.– భాగవతం 10/978,980 *

**శ్లో॥ గోప్యన్యాఽఞ్జనరూషితం స్వనయనం కుర్వన్త్యగాత్సత్వరా**
**తద్జ్ఞానాఞ్జనతుష్టధీరివ పదోర్భూషాం స్వదోష్ణీతరా ।**
**సన్ధాయాచ్యుతసన్నిధిం సమగమత్ కృష్ణాఙ్ఘ్రిసేవాం సదా**
**తన్వన్త్యాః కరభూషణం మమ భవేత్ తత్పాదయోర్భూషణమ్ ॥ 6-53**

**అ :** గోపికలు కృష్ణసన్నిధిని చేరటానికి పడుతున్న ఆపసోపాలు. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్వనయనమ్ అంజనరూషితం కుర్వన్తీ అన్యా గోపీ తద్జ్ఞాన+అంజనతుష్టధీః+ఇవ సత్వరా అగాత్. ఇతరా కృష్ణ+అంఘ్రిసేవాం సదా తన్వన్త్యాః తత్పాదయోః భూషణం మమ కరభూషణం భవేద్ (ఇతి) పదోః భూషాం స్వదోష్ణి సన్ధాయ అచ్యుతసన్నిధిం సమగమత్.

**ప్ర :** స్వనయనమ్ = తన కంటిని, అంజన–రూషితమ్ : అంజన = కాటుకచే, రూషితమ్ కుర్వన్తీ = మాగురుపడజేస్తూ /మలిన పరుస్తూ (రూషితం గుండితం స్మృతమ్–హలాయుధకోశః–768) కప్పి పుచ్చుతూ (అంజనేన రూషితమ్ – తత్), తద్–జ్ఞాన+అంజన–తుష్ట–ధీః+ఇవ : తద్ = ఆ కృష్ణ సంబంధమైన, జ్ఞాన = జ్ఞానమనే, అంజన = కాటుకచే, తుష్ట = తృప్తిపడిన, ధీః + ఇవ = బుద్ధిగలదానివలె (తస్య జ్ఞానమ్, తదేవ అంజనం, తేన తుష్టా ధీః యస్యాః సా ఇవ), సత్వరా = వేగవతియై (త్వరయా సహితా), అగాత్ = వెళ్ళింది. (ఇణ్ గతౌ–పరస్మైపది–

లుఙ్-(ప్ర.ఏ.), ఇతరా = మరొక గోపిక, కృష్ణ+అంఘ్రి-సేవామ్ : కృష్ణ = కృష్ణునియొక్క, అంఘ్రి = పాదాలయొక్క, సేవామ్ = సేవను (కృష్ణస్య అంఘ్ర్యోః సేవా, తామ్), సదా = ఎల్లప్పుడు, తన్వన్త్యాః = చేస్తున్న, మమ = నాకు, తత్-పాదయోః : తత్ = ఆ కృష్ణునియొక్క, పాదయోః = పాదాలయొక్క (తస్య పాదౌ, తయోః), భూషణమ్ = అలంకారం, కర-భూషణమ్ : కర = చేతికి, భూషణమ్ = అలంకరణం (కరస్య భూషణమ్), భవేత్ = కావాలి (భూ సత్తాయామ్ పరస్మైపది-విధి లిఙ్-(ప్ర.ఏ.), (ఇతీవ = అన్నట్లు), పదోః = పాదాలయొక్క, భూషామ్ = అలంకారాన్ని, స్వ-దోష్ణి = తన భుజంపై (స్వస్య దోః - తస్మిన్), సంధాయ = నిలుపకొని (ని-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అచ్యుత-సన్నిధిమ్ : అచ్యుత = కృష్ణునియొక్క, సన్నిధిమ్ = సమీపానికి (అచ్యుతస్య సన్నిధిః తమ్), సమగమత్ = వెళ్ళింది. (సమ్-గమ్ గతౌ పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** ఒక గోపిక కృష్ణజ్ఞానాంజనంతోనే ఆనందిస్తాను అన్నట్లుగా తన కంటిని కాటుకతో కప్పుకొని వేగంగా బయలుదేరింది. మరొక గోపిక నిరంతరమూ కృష్ణపదసేవ చేస్తున్న తనకు కృష్ణపాదాలంకరణం తన చేతికి ఆభరణమైతే చాలు అనుకొన్నట్లుగా తన పాదాలంకరణాన్ని తన భుజాన పెట్టుకొని కృష్ణసన్నిధికి వెళ్ళింది.

**వి :** 1. గోపికలు కృష్ణసన్నిధికి పయనమయ్యే అంశాన్ని (శ్లో 52,53) భాగవతంలోని దశమస్కంధంలో 27వ అధ్యాయంలో చూడవచ్చు. పోతన వచనరూపంగా దాన్ని వివరించాడు. చూడండి.

"... పుండరీకనయనుండు యమునాతటవనంబున జగన్మోహనంబుగ నొక్క గీతంబుఁ బాడిన, విని, తదాయత్తచిత్తలై, తత్తఱంబున వ్రేత లే పనులకుం జేతు లాడకయు, గోవులకుం గ్రేపుల విడువకయు, విడిచి విడిచి యీడకయు, నీడి యీడికా నీడిన పాలు కాఁపకయుఁ గాఁచి కాఁచియుఁ గాఁగిన పాలు దింపకయు, దించి దించియు, డించినపాలు బాలురకుం బోయకయుఁ, బోసి పోసియుఁ బతుకులకుఁ బరిచర్యలు సేయకయుఁ , జేసి చేసియు నశనంబులు గుడవకయుఁ, గుడిచి కుడిచియుఁ గుసుమంబులు ముదువకయు, ముడిచి ముడిచియుఁ, దొడవులు దొడగకయుఁ, దొడిగి తొడిగియు గోష్ఠంబులపట్టుల నుండక-యుఁ, బాయసంబుల నెఱయ వండకయు, నయ్యయ్యెడల నిలువంబడకయుఁ, గాటుకలు సూటి నిడకయుఁ, గురులు చక్క నొత్తకయుఁ , గుచంబుల గంధంబులు కలయ మెత్తకయుఁ, బయ్యెదల విప్పి కప్పకయు, సఖులకుం జెప్పకయు, సహోదరులు, మగలు, మామలు, మఱఁదులు, బిడ్డలు నడ్డంబు చని, నివారింపఁ దలారింపకయు...

- భాగవతం 10/965

2. తద్జ్ఞానాంజనతుష్టధీరివ - ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారం. 'తత్పాదయోః భూషణం - మమ కరభూషణం భవేత్' - ఇక్కడ కూడా ఉత్ప్రేక్షాలంకారమే కానీ వాచ్యం కాదు.

| | | | |
|---|---|---|---|
| 3. **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ |
| **సమగమత్ :** | **సమగమత్** | సమగమతాన్ | సమగమన్ |
| | సమగమః | సమగమతమ్ | సమగమత |
| | సమగమమ్ | సమగవావ | సమగవామ. |

*

**శ్లో॥ ఆనన్దపూర్ణతాం కృష్ణః స్వానాం సన్దర్శయన్ విభుః ।**
**ఆనతా అపి తాః ప్రీతా మానసీరిత్యచీకథత్ ॥** **6-54**

**అ :** కృష్ణుడు గోపికలతో సంభాషణ కుపక్రమించుట. -పథ్యావక్త్రమ్.

**అ :** విభుః కృష్ణః ఆనందపూర్ణతాం స్వానాం సందర్శయన్ ఆనతాః అపి ప్రీతాః తాః మానినీః ఇతి అచీకథత్.

**ప్ర :** విభుః = ప్రభువయిన, కృష్ణః = కృష్ణుడు, ఆనంద-పూర్ణతామ్ : ఆనంద = (తనయొక్క) ఆనందంతో, పూర్ణతామ్ = నిండియుండుటను (ఆనందేన పూర్ణతా తామ్), స్వానామ్ = తనవారికి, సందర్శయన్ = చూపుతూ (సమ్-దృశ్ - ణిచ్ - ధాతువుపై శతృ ప్రత్యయం), ఆనతాః అపి = వినమ్రులై వున్నను, ప్రీతాః = ఆనందించిన, తాః = ఆ, మానినీః = స్త్రీలతో, ఇతి = ఇలా చెప్పబోవురీతిగా, అచీకథత్ = పలికాడు.. (కథ వాక్యప్రబంధే పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ။** కృష్ణుడు తన ఆనందపరిపూర్ణతను తనవారికి తెలియజేయటానికై వినమ్రలై, ప్రీతిపూర్ణలయిన ఆ మానినులతో ఇలా చెప్పబోతున్నాడు.

**వి :** 1. కృష్ణుని ఆనందపరిపూర్ణత స్వాభావికంగా కాక తమ ఆగమనం వలన అని గోపికలు భావించినా భావించవచ్చు.

క. జారుఁ డని కాని కృష్ణుఁడు, - భూరిపరబ్రహ్మ మనుచు బుద్ధి దలంపన్
నేరరు గుణమయదేహము, - లేరీతిన్ విడిచి రింతు లెఱిగింపు శుకా! -పోతనభాగవతము-10/968

అని పరీక్షిన్మహారాజు శుకమహర్షి నడుగుతాడు. "పరమపురుషుడు నజుండు యోగీశ్వరేశ్వరుండైన హరిని సోఁకిన స్థావరంబైన ముక్తంబగు. వెఱఁగుపడవలదు" అని శుకమహర్షి సమాధానపరుస్తాడు పరీక్షిత్తును.

| | | | |
|---|---|---|---|
| 2. **అచీకథత్ :** | **అచకథత్** | అచకథతామ్ | అచకథన్ |
| **(అచకథత్)** | అచకథః | అచకథతమ్ | అచకథత |
| | అచకథమ్ | అచకథావ | అచకథామ |

**అచీకథత్** - అన్న ప్రయోగాన్ని గురించి ఆలోచించాలి. వాస్తవంగా 'అగ్లోపిత్వాన్న దీర్ఘసన్వద్భావౌ । అచకథత్' అని వైయాకరణసిద్ధాంతకౌముదిలో భట్టోజీదీక్షితుని వివరణ. దీర్ఘసన్వద్భావం లేకపోతే అచీకథత్ రూపం సిద్ధించదు.

*

**శ్లో॥ పితృభర్తృజనన్యాదేః పరిచర్యా యతోఽర్థదా ।**
**వ్రజత వ్రజమేవాతః కురుత స్మరతాం హితమ్ ॥ 6-55**

**అ :** కృష్ణప్రబోధం. -పథ్యావక్త్రమ్.

**అ :** పితృభర్తృజననీ+ఆదేః పరిచర్యా యతః అర్థదా అతః వ్రజమ్ ఏవ వ్రజత. స్మరతాం హితం కురుత.

**ప్ర :** పితృ-భర్తృ-జననీ+ఆదేః = తండ్రి, మగడు, తల్లి మొదలయిన వారియొక్క (పితా భర్తా జననీ చ ఆదిః యస్య తస్య), పరిచర్యా = సేవ, యతః = ఏ కారణంవలన, అర్థ-దా = ప్రయోజనాన్ని ఇస్తుందో, అతః = దానికొఱకు, వ్రజమ్+ఏవ = గోకులానికే, వ్రజత = వెళ్ళండి (వ్రజ గతౌ-పరస్మైపది-లోట్-మ.బ.), స్మరతామ్ = (మిమ్ము) తలచుకొనే వారికి, హితమ్ = మేలును, కురుత = చేయండి (కృ కరణే పరస్మైపది-లోట్-మ.బ.)

**తా ။** తల్లిదండ్రుల పరిచర్య, భర్తృసేవ ఆ వరుసలో అటువంటి బంధుజనుల సేవ ఏది పురుషార్థదాయక మవుతుందో దానికొఱకు గోకులానికే వెళ్ళండి. మిమ్ము తలచుకొనే వారికి మేలు చేయండి.

**వి :** 1. కృష్ణసందర్శనం మోక్షహేతువయితే మోక్షప్రాప్తి అర్థమే గదా! కృష్ణ సందర్శనం అర్థదాయకమే గదా! నిజమే. ధర్మార్థకామాలు సాధనాలుగా మోక్షం సాధ్యం కావాలి కానీ ధర్మార్థనిరపేక్షత కార్యకారి కాదు.

శ్లో॥ న కర్మణా మనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ - భగవద్గీత - 3/3

కర్మలను ఆరంభించనంతమాత్రాన నిష్కర్మత సిద్ధించదు. సంన్యసించినంతమాత్రాన సిద్ధికి అవకాశం లేదు. స్వకృతపుణ్యపాపఫలానుభావం తర్వాతనే మోక్షసిద్ధి.

శ్లో॥ దుస్సహప్రేష్ఠవిరహతీవ్రతాపధుతాశుభాః ।
ధ్యానప్రాప్తాచ్యుతాశ్లేషనిర్వృత్యా క్షీణమంగలాః ॥

శ్లో॥ తమేవ పరమాత్మానం జారబుద్ధ్యాపి సంగతాః ।
జహుర్గుణమయం దేహం సద్యః ప్రక్షీణబన్ధనాః ॥ – భాగవతమ్ 10/29/10,11

2. అందుకే పోతనవారిని వెనుకకు పంపే ప్రయత్నంగా ఎన్నో సుద్దులు చెప్పిస్తాడు కృష్ణునిచేత.

శా. మీ రేతెంచిన జాడఁ గానక వగన్ మీ తల్లులుం దండ్రులున్
మీ రాముల్ మఱఁదుల్ తనూజులు గురుల్ మీ సోదరుల్ బంధువుల్
**మేరల్ మీఱిరి లేరు పోయి** రనుచున్ మీ ఘోషభూభాగమం
దేరీతిం బరికించిరో తగవులే యీ సాహసోద్యోగముల్?

క. నడవడి గొఱ గాకున్నను
బడుగైనఁ గురూపి యైనఁ బామరుఁడైనన్
జడుఁడైన రోగి యైనను
విడుచుట మరియాద కాదు విభు నంగనకున్. – పోతనభాగవతము 10/975,978

| | | | |
|---|---|---|---|
| 3. **వ్రజత :** | వ్రజతు/వ్రజతాత్ | వ్రజతామ్ | వ్రజన్తు |
| | వ్రజ/వ్రజతాత్ | వ్రజతమ్ | **వ్రజత** |
| | వ్రజాని | వ్రజావ | వ్రజామ |
| **కురుత :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| | కురు/కురుతాత్ | కురుతమ్ | **కురుత** |
| | కరవాణి | కరవావ | కరవామ. |

*

**శ్లో॥ యదీశ! తేషాం హితమేవ కార్యం – తదాఽఙ్గ! నాజ్ఞాపయ గన్తుమస్మాన్।**
**వియోగదగ్ధైర్బత! నశ్శరీరై-ర్మహీం న తాం ప్రేతమహీం విధేహి ॥ 6–56**

**అ :** గోపికల వేడికోలు. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశ! అంగ! యది (అస్మాభిః) తేషాం హితమ్ ఏవ కార్యం తదా అస్మాన్ గన్తుమ్ న ఆజ్ఞాపయ. బత! వియోగదగ్ధైః నః శరీరైః తాం మహీం ప్రేతమహీం న విధేహి.

**ప్ర :** అంగ ఈశ = ఓ ప్రభూ! (అంగేత్యామంత్రణే హం హో భోభో... హలాయుధకోశః – 883), యది = ఒకచో, (అస్మాభిః = మాచేత), తేషామ్ = వారికి (తల్లిదండ్రులు మొదలైన వారికి), హితమ్+ఏవ = మంచియే, కార్యమ్ = చేయదగివుంటే, తదా = అప్పుడు, అస్మాన్ = మమ్ము, గన్తుమ్ = మరలిపోవుటకు, న ఆజ్ఞాపయ = ఆదేశించవద్దు. (ఆ+జ్ఞా నియోగే-పరస్మైపది-లోట్-మ.ఏ.), బత = అయ్యో!, వియోగ-దగ్ధైః : వియోగ = విరహంతో, దగ్ధైః = మాడిపోయిన (వియోగేన దగ్ధాః, తైః), నః = మాయొక్క, శరీరైః = శరీరాలతో, తాం – మహీమ్ = ఆ గోకులభూమిని, ప్రేత – మహీమ్ = ప్రేతభూమిగా (ప్రేతానాం మహీ, తాం), న విధేహి = చేయవద్దు (వి-ధా-ధారణ పోషణయోః పరస్మైపది- లోట్-మ.ఏ.)

**తా ॥** ప్రభూ! మావాళ్ళకు హితం చేయటమే మా కర్తవ్యమయితే మమ్ము మరలి పొమ్మని ఆజ్ఞాపించవద్దు. నీ విరహంతో మాడిపోయిన మా శరీరాలతో ఆ గోకులభూమిని శ్మశానంలా చేయవద్దు.

**వి :** 1. భాగవతం దశమస్కంధంలో 11 శ్లోకాలలో గోపికల వేడికోలు కనిపిస్తుంది. పోతన 15 పద్యాలలో వారి వేడికోలును వినిపించాడు. అందులో 3 సీసపద్యాలు కూడా. తమవారిని సేవించటమే కర్తవ్యమన్న కృష్ణవచనాలకు గోపికల పూర్వపక్షమిలా వుంది.

మ. పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం బాటించుటే ధర్మ ప
ద్ధతి యౌ నంటివి; దేహధారిణులకున్ ధర్మజ్ఞ! చింతింపుమా
పతిపుత్త్రాదికనామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందుఁ ద
త్పతిపుత్త్రాదికవాంఛలన్ సలిపి సంభావించు టన్యాయమే. –పోతనభాగవతము 10/986

2. ఇది ఆక్షేపాలంకారం. అందునా దండి చెప్పిన లక్షణం మేరకే. '**ప్రతిషేధోక్తిరాక్షేపః**' (కావ్యాదర్శః – 2/120). నిషేధాన్ని ప్రకటించటం మాత్రమే ఆక్షేపం. 'న ఆజ్ఞాపయ' 'న విధేహి' అని ప్రతిషేధవచనాలు ఉండటంవలన ఇది **ఆక్షేపాలంకారం**.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆజ్ఞాపయ :** | ఆజ్ఞాపయతు/ఆజ్ఞాపయతాత్ | ఆజ్ఞాపయతామ్ | ఆజ్ఞాపయన్తు |
| | **ఆజ్ఞాపయ**/ఆజ్ఞాపయతాత్ | ఆజ్ఞాపయతమ్ | ఆజ్ఞాపయత |
| | ఆజ్ఞాపయాని | ఆజ్ఞాపయావ | ఆజ్ఞాపయామ |
| **విధేహి :** | విదధాతు/విధత్తాత్ | విధత్తామ్ | విదధతు |
| | **విధేహి**/విధత్తాత్ | విధత్తమ్ | విధత్త |
| | విదధాని | విదధావ | విదధామ. |

*

**శ్లో॥ పత్యాదిసేవాఽపి భవత్ప్రసాద–ప్రాప్త్యర్థమేవేతి వదన్తి సన్తః ।**
**త్వత్పాదమూలం విధినోపనీతాః – కస్మాన్ ముధాఽఽజ్ఞాపయసీశ! గన్తుమ్॥ 57**

**అ :** గోపికలు తమ ప్రవృత్తిని సమర్థించుకొనుట. –ఇంద్రవజ్ర.

**అ :** ఈశ! సంతః పతి+ఆదిసేవా+అపి భవత్–ప్రసాద–ప్రాప్తి+అర్థమ్ ఏవ ఇతి వదన్తి. విధినా త్వత్ పాదమూలమ్ ఉపనీతాః కస్మాత్ ముధా గన్తుమ్ ఆజ్ఞాపయసి.

**ప్ర :** ఈశ! = ప్రభూ!, సంతః = సజ్జనులు, పతి+ఆది–సేవా+అపి : పతి+ఆది = భర్త మొదలుగా గలవారి, సేవా+అపి = సేవ కూడా, (పతిః ఆదౌ యేషాం, తేషాం సేవా), భవత్–ప్రసాద–ప్రాప్తి+అర్థమ్+ఏవ:భవత్ = నీయొక్క, ప్రసాద=అనుగ్రహంయొక్క, ప్రాప్తి+ అర్థమ్ ఏవ = పొందుట కొరకే (భవతః ప్రసాదః, తస్య ప్రాప్తిః, తస్మై ఇదమ్ '**అర్థేన నిత్యసమాసో విశేష్యలింగతా చేతి వక్తవ్యమ్**' – (వార్తికం–1273)), ఇతి = అని, వదన్తి = అంటున్నారు. (వద వ్యక్తాయాం వాచి – పరస్మైపది – లట్ – (ప్ర.ఏ.), విధినా = అదృష్టంచేత (దైవం దిష్టం భాగధేయం భాగ్యం స్త్రీ నియతిర్విధిః–అమరకోశః–కాల–29), త్వత్–పాదమూలమ్ = నీ పాదాల దగ్గరకు, ఉపనీతాః = కొనరాబడిన వారిని (మమ్ములను) (ఉప+ణీ–ధాతువుపై క్త ప్రత్యయం), కస్మాత్ = ఎందువలన, గన్తుమ్ = వెళ్ళుటకు (గమ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ముధా = వ్యర్థంగా (మోఘం ముధా–హలాయుధకోశః –760), ఆజ్ఞాపయసి = ఆదేశిస్తున్నావు? (ఆ+జ్ఞా నియోగే పరస్మైపది–లట్–మ.ఏ.)

**తా ॥** భర్త మొదలగువారిని సేవించటం కూడా నీ అనుగ్రహం సిద్ధించటానికే అని సజ్జనుల అంటుంటారు. మా

భాగ్యం మమ్ములను నీ దగ్గరకు నడిపించింది. మమ్ము మరల పొమ్మని నిరర్థకంగా ఎందుకు ఆజ్ఞాపిస్తున్నావు? (నీ ఆదేశాన్ని మేము పాటించమని ధ్వని)

**వి :** 1. ఇక్కడ ఉక్తిచమత్కారం కనిపిస్తోంది. ఒకవైపు ఎందుకు ఆజ్ఞాపిస్తున్నావు? అని ప్రశ్న. ప్రశ్నలో కారణజిజ్ఞాస కనిపిస్తోంది. మరల '**ముధా**' అని క్రియా విశేషణం. తద్ద్వారా కారణమేదైనా మేము మరలము అన్న ప్రతిషేధం ధ్వనిస్తోంది. ప్రతిషేధం వాచ్యంగా కాక వ్యంగ్యంగా వుంది కాబట్టి ఆక్షేపాలంకారధ్వని. (**ప్రతిషేధోక్తిరాక్షేపః-కావ్యాదర్శః-2/120**)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **వదన్తి :** | వదతి | వదతః | **వదన్తి** | |
| | వదసి | వదథః | వదథ | |
| | వదామి | వదావః | వదామః | |
| **ఆజ్ఞాపయసి :** | ఆజ్ఞాపయతి | ఆజ్ఞాపయతః | ఆజ్ఞాపయన్తి | |
| | **ఆజ్ఞాపయసి** | ఆజ్ఞాపయథః | ఆజ్ఞాపయథ | |
| | ఆజ్ఞాపయామి | ఆజ్ఞాపయావః | ఆజ్ఞాపయామః. | * |

**శ్లో॥ నానాయోనిషు సమ్భవే సతి కతి శ్రీనాథ! నో మాతృతాం**
**మాన్యత్వం పితృతాం ప్రియత్వమగమంస్తత్ కుత్ర కుర్మోఽర్చనమ్ ।**
**వైరం వా కతివారమేషు న కృతం విశ్వాన్తరాత్మన్! విభో!**
**తన్నిత్యం పితరం పతిం చ జననీం త్వామేవ సేవామహే ॥ 6-58**

**అ :** గోపికల యుక్తివాదం - ఆత్మ సమర్థన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** శ్రీనాథ నః నానాయోనిషు సంభవే సతి కతి మాతృతాం పితృతాం ప్రియత్వం మాన్యత్వమ్ అగమన్. తత్ కుత్ర అర్చనం కుర్మః. ఏషు వైరం వా కతివారం న కృతం విశ్వ+అంతరాత్మన్ విభో తత్ నిత్యం పితరం పతిం జననీం చ త్వామ్+ఏవ సేవామహే.

**ప్ర :** శ్రీనాథ! = లక్ష్మీవల్లభా (కృష్ణా) ! (శ్రియః నాథః, తస్మాత్ సంబుద్ధిః), నః = మాకు, నానా-యోనిషు = అనేక జాతులలో, సంభవే (సతి) = పుట్టుక ఉండగా, కతి = ఎంతమంది, మాతృతామ్ = మాతృత్వాన్నీ/తల్లిగా, పితృతామ్ = పితృత్వాన్నీ/తండ్రిగా, ప్రియత్వమ్ = భర్తృత్వాన్నీ/భర్తగా, మాన్యత్వమ్ = పూజ్యత్వాన్నీ/ పూజనీయుడుగా, అగమన్ = పొందారో?/ ఉన్నారో?, తత్ = అందువల్ల, కుత్ర = ఎవరికి, అర్చనమ్ = పూజను, కుర్మః = చేయగలం?, ఏషు = వీరియందు, వైరం వా = శత్రుత్వమైనా, కతివారమ్ = ఎన్నిసార్లు, న కృతమ్ = చేయబడలేదు? విశ్వ+అంతః+ఆత్మన్! = జగత్తునకు అంతరాత్మవైన, విభో! = స్వామీ, తత్ = అందువలననే, నిత్యమ్ = ఎప్పుడూ, పితరమ్ = తండ్రి, జననీమ్ = తల్లి, పతిమ్ చ = భర్త (అయిన), త్వామ్+ఏవ = నిన్నే, సేవామహే = సేవిస్తున్నాము. (సేవ్ సేవనే ఆత్మనేపది-లట్-ఉ.బ.)

**తా ॥** కృష్ణా! ఇప్పటికీ మాకు ఎన్నో జన్మలు కలిగాయి. ఎందరో తల్లులు. ఎందరో తండ్రులు. ఎందరో భర్తలు. మరెందరో పూజ్యులు. వీరిలో ఎవరికని అర్చనలు చేయగలం? అంతేగాదు. వీరిలోనే ఎందరితో ఎన్నిసార్లు శత్రుత్వ మేర్పడిందో కూడా! కాబట్టి జగదంతరాత్మవైన స్వామీ! నిత్యమూ తల్లిగా, తండ్రిగా, భర్తగా నిలువగలిగిన నిన్నే సేవిస్తున్నాం.

**వి :** 1. కృష్ణుడు తల్లి, తండ్రి, భర్త అంటూ చెప్పిన మాటల మీదనే దృష్టిపెట్టి మాటాడుతున్నారు గోపికలు. ఇది యుక్తివాదం.

శ్లో॥ బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప! ॥ – భగవద్గీత 4/5

అన్నాడు కృష్ణుడు అర్జునునితో, 'నీ గతమంతా నాకు తెలుసు. నా గతం నీకు తెలియదు! – అదే నరుడికీ, నారాయణుడికీ మధ్య గల భేదం. ఆ స్థితిలో నారాయణ ధర్మాలు నరుల కన్వయించలేము గదా! తమ గత జన్మలను గూర్చి తెలుసుకోవాలని గోపికలు అడగటం లేదు. తెలిసినట్లుగా మాటాడుతున్నారు. అందుకే యుక్తివాదంగానే దానికి పరిగణన.

2. తాము కృష్ణునే సేవించటానికి గల కారణాన్ని చెపుతూ గోపికలు తమ భావాన్ని తాము సమర్థించు కొంటున్నారు కాబట్టి ఇది కావ్యలింగాలంకారం. సమర్థన అవసరమైనపుడు సమర్థించటం కావ్యలింగం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**'–(కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **కుర్మః :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | **కుర్మః** |
| **సేవామహే :** | సేవతే | సేవేతే | సేవన్తే |
| | సేవసే | సేవేథే | సేవధ్వే |
| | సేవే | సేవావహే | **సేవామహే.** |

*

**శ్లో॥ జగత్పితా త్వం న పితా కిమాసాం – జగత్ప్రసూతిర్జననీ న కిం నః ।**
**జగత్పతిః కిం న పతిః సఖే! న–స్తదన్యజుష్ట్యాఽలమరిష్టవృష్ట్యా ॥ 6–59**

**అ :** గోపికలు తమ ప్రవృత్తిని సమర్థించుకొనుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** సఖే త్వం జగత్–పితా ఆసాం నః పితా న కిమ్? జగత్ప్రసూతిః త్వం నః జననీ న కిమ్? జగత్పతిః త్వం నః పతిః న కిమ్? తత్ అరిష్టవృష్ట్యా అన్యజుష్ట్యా అలమ్.

**ప్ర :** సఖే = మిత్రమా! కృష్ణా!, జగత్–పితా = ప్రపంచానికి తండ్రివి అయిన (జగతః పితా), త్వమ్ = నీవు, ఆసామ్=గోపికల మయిన, నః=మాకు, పితా–న–కిమ్? = తండ్రివి కావా?, జగత్ –ప్రసూతిః = జగన్మాత వయిన (జగతః ప్రసూతిః యస్మాత్ సః), త్వమ్ = నీవు, నః = మాకు, జననీ–న–కిమ్? = తల్లివి కావా?, జగత్–పతిః = విశ్వభర్త వయిన (జగతః పతిః), త్వమ్ = నీవు, నః = మాకు, పతిః–న–కిమ్? = భర్తవు కావా?, తత్ = అందువల్ల, అరిష్ట–వృష్ట్యా : అరిష్ట = ఇష్టంలేనివానియొక్క, వృష్ట్యా = వర్షం గల (కురిపించే) (అరిష్టస్య వృష్టిః యస్యాః, తయా), అన్య–జుష్ట్యా=పరసేవచే, అలమ్ = చాలు.

**తా ॥** జగత్పితవయిన నీవు మాకు తండ్రివి కావా? జగన్మాత వయిన నీవు మాకు తల్లివి కాలేవా? జగత్పతివయిన నీవు మాకు భర్తవు కావా? కాబట్టి అరిష్టహేతువయిన త్వదన్య సేవనలు ఇక చాలు.

**వి :** 1. శ్లోకంలో నాలుగవ పాదంలోని తొలి అక్షరం 'త' దొరికిన పాఠాలలో అలాగే వుంది కానీ '**త్వ**' అయితే ఇంకా బావుంటుంది. పొరపాటు కావచ్చు. కాకపోవచ్చు.

2. శ్లో॥ త్వమేవ మాతా చ పితా త్వమేవ – త్వమేవ బంధుశ్చ సఖా త్వమేవ ।
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ – త్వమేవ సర్వం మమ దేవదేవ! ॥

అన్న భావన గోపికలది.

*

**శ్లో॥ కాంతః స ఏవ యః స్థైర్యశౌర్యసౌన్దర్యసాగరః ।**
**సుఖస్యాన్తకరం కాన్తమపరం తర్కయామహే ॥ 6-60**

**అ :** గోపికలు కాంతత్వాన్ని నిర్వచిస్తూ మాటాడటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యః స్థైర్యశౌర్యసౌందర్యసాగరః సః ఏవ కాంతః, అపరం కాంతం సుఖస్య అంతకరం తర్కయామహే.

**ప్ర :** యః = ఎవడయితే, స్థైర్య... సాగరః : స్థైర్య = నిశ్చలత్వం (తొణకకుండా వుండటం), శౌర్య = పరాక్రమం (ఇతరులపై పైచేయిగా వుండగలగటం), సౌందర్య = అందం (వీటికి), సాగరః = నిధియై వుంటాడో (స్థైర్యం చ శౌర్యం చ సౌందర్యం చ, తేషాం సాగర ఇవ), సః ఏవ = తానే (అతడే), కాంతః = ఇష్టుడు (భర్త) కాగలడు, అపరమ్ = ఇతరుడైన/వేరైన, కాంతమ్ = భర్తను, సుఖస్య = సుఖానికి, అంతకరమ్ = నాశకునిగానే, తర్కయామహే = అనుకొంటున్నాము. (తర్క వితర్కే ఆత్మనేపది-లట్-ఉ.బ.)

**తా ॥** స్థైర్యశౌర్యసౌందర్యనిధి అయిన వాడే వల్లభుడు, ఇతరులు కేవలం సుఖాన్ని అంతం చేసే వారే.

**వి :** 1. ఈ భావం గోపికలలోని ఉద్వేగాన్ని తెలియజేసేదే గానీ జీవితంలో పూర్తిగా ఆచరణీయ మనలేము. సంబంధం కలిగించుకొనే ముందు చేయవలసిన ఆలోచన లివి. పైగా శౌర్య-సౌందర్యాదులు నియతనిర్వచనాలు గలవి కావు. అవన్నీ అనియతాలూ, సాపేక్షాలు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **తర్కయామహే :** | తర్కయతే | తర్కయేతే | తర్కయన్తే | |
| | తర్కయసే | తర్కయేథే | తర్కయధ్వే | |
| | తర్కయే | తర్కయావహే | **తర్కయామహే.** | * |

**శ్లో॥ యః సారభాగమనుభూయ శరీరభాజాం**
**శిష్టం ప్రయచ్ఛసి కిలారసమల్పభోగ్యమ్ ।**
**దుఃఖాతిదూరగతపారసుఖైకభోక్తు-**
**స్తస్యేశ! యోగ్యమఖిలం తవ తర్కయామః ॥ 6-61**

**అ :** గోపికల ఆత్మనివేదన భావన. -వసంతతిలక.

**అ :** ఈశ! యః సారభాగమ్ అనుభూయ శిష్టమ్ అరసమ్ అల్పభోగ్యం శరీరభాజాం ప్రయచ్ఛసి కిల. దుఃఖ+అతిదూరగతపారసుఖ+ఏకభోక్తుః తవ అఖిలం యోగ్యం తర్క-యామః.

**ప్ర :** ఈశ! = స్వామీ! యః = ఎవడయితే/ఏ నీవు, సార-భాగమ్ = ప్రధానంగా అనుభవింప దగిన భాగాన్ని/ విషయాలలోని సారాన్ని (సారం చ అసౌ భాగః), అనుభూయ = అనుభవించి (అను+భూ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శిష్టమ్ = మిగిలినదియు (శిష్ ధాతువుపై క్త ప్రత్యయం), అరసమ్ = నీరసమయినదియు, అల్ప-భోగ్యమ్ = కొంచెమే అనుభవింప దగినదియు అయిన దానిని (అల్పం భోగ్యం యస్మిన్ తత్), శరీర-భాజామ్ = దేహధారులకు, ప్రయచ్ఛసి కిల = ఇస్తున్నావు గదా! (దాణ్ దానే పరస్మైపది-లట్-మ.ఏ.), తస్య = అటువంటి నీకు, దుఃఖ+అతిదూర-గత-పార-సుఖ+ఏక-భోక్తుః (సతః) : దుఃఖ = దుఃఖానికి, అతిదూర = ఎంతోదూరమైన వాడవై, గత-పార = అంత మెరుగని వాడవై, సుఖ = సుఖాన్ని, ఏక-భోక్తుః సతః = అద్వితీయుడవై (అద్వితీయంగా) అనుభవించు వానికి, అఖిలమ్ = అంతయు, యోగ్యమ్ = తగినదని, తర్కయామః = భావిస్తున్నాము. (తర్క వితర్కే-పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** నీకు అనుభవింపరానిది ఏదీ లేదని మేము భావిస్తున్నాం. ఎందుకంటే విషయాలలోని సారాన్ని అంతా

నీవు అనుభవించి నీరసమై, అల్పభోగ్యమైన శేషభాగాన్ని దేహధారులకు అందిస్తున్నావు. దుఃఖరహితమై అనంతమైన సుఖాన్ని అద్వితీయుడవై (నీలో నీవే) (ఆత్మారాముడవై) అనుభవించే వాడవు కదా నీవు. (కాబట్టి నీవు మాతో సుఖించటం దోషం కాదు)

**వి :** 1. దేహధారుల అనుభవాలు అన్నీ పరమాత్మచేత అనుభూతపూర్వాలే. ఇదంతా భుక్తశేషమే. మనం భౌతికంగా అనుభవించేవన్నీ కూడా (మనం తయారు చేసిన వయినా) చాలాభాగం భుక్తశేషాలే. ఆహారం పరమాత్మకు నివేదించి స్వీకరిస్తాం. వస్త్రాలలో శేష-వస్త్రాలను గౌరవిస్తాం. పెద్దపెద్ద వస్తువులను కూడా ముందు భగవదర్పణం చేసి ఆపై వినియోగిస్తుంటాం.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రయచ్ఛసి :** | ప్రయచ్ఛతి | ప్రయచ్ఛతః | ప్రయచ్ఛన్తి |
| | **ప్రయచ్ఛసి** | ప్రయచ్ఛథః | ప్రయచ్ఛథ |
| | ప్రయచ్ఛామి | ప్రయచ్ఛావః | ప్రయచ్ఛామః |
| **తర్కయామి :** | తర్కయతి | తర్కయతః | తర్కయన్తి |
| | తర్కయసి | తర్కయథః | తర్కయథ |
| | **తర్కయామి** | తర్కయావః | తర్కయామః. |

*

**శ్లో॥ ధర్మో న వోఽయం శ్రుతిసఙ్గతాక్ష్యో - ధర్మో నవోఽయం శ్రుతిసంగతాక్ష! ।**
**మాఽన్యం భజధ్వం రమణం విహాయ - మాన్యం భజామో రమణం విహాయ ॥62**

**అ :** గోపికా కృష్ణుల సంవాదం. -ఇంద్రవజ్ర.

**అ :** శ్రుతిసంగత+అక్ష్యః అయం వః న ధర్మః - ధర్మః నవః అయమ్ శ్రుతి-సంగత+అక్ష! రమణం విహాయ అన్యం మా భజధ్వమ్ - రమణం విహాయ మాన్యం భజామః

**ప్ర : కృష్ణుడు** : శ్రుతి-సంగత-అక్ష్యః : శ్రుతి = వేదాలలో/చెవులతో, సంగత = సమన్వితమైన / చేరిమి గల, అక్ష్యః = దృష్టిగలవారా! / కన్నులు గలవారా!, (శ్రుతిభిః సంగతాని అక్షీణి యాసాం తాః - తస్మాత్ సంబుద్ధిః), అయమ్ = ఇది, వః = మీకు, న ధర్మః = ధర్మం కాదు. **గోపికలు** : శ్రుతి-సంగత-అక్ష : శ్రుతి = వేదాలతో/ చెవులతో, సంగత = సమన్వితమైన / చేరిమి గల, అక్ష = చూపు/ కన్నులు గలవాడా!, అయమ్ = ఇది, నవః = నూతనమైన, ధర్మః = ధర్మం, **కృష్ణుడు** : రమణమ్ = భర్తను, విహాయ = వీడి, అన్యమ్ = మరొకరిని, మా భజధ్వమ్ = సేవించవద్దు. (భజ సేవాయాం ఆత్మనేపది-లోట్-మ.బ.), **గోపికలు** : రమణమ్ = భర్తను, విహాయ = వీడి, మాన్యమ్ = పూజనీయుని (నిన్ను), **భజామః** = సేవిస్తున్నాము. (భజ సేవాయాం పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** శ్రుతిసంగతాక్షలారా! మీకిది (భర్తను వీడి అన్యుని సేవించటం) ధర్మం కాదు.

శ్రుతిసంగతాక్షా! ఇది నూతనధర్మం.

రమణుని వీడి ఇతరుని సేవించవద్దు.

రమణుని వీడి పూజనీయుని (నిన్ను) సేవిస్తున్నాం.

**వి :** 1. ఈ శ్లోకంలో న-వః - అయమ్; నవః+అయమ్ 'నవోయం' అన్నదానిని రెండు రకాలుగా విడగొట్టడంతో మొదటి వాకో వాక్యం. మా+అన్యం; మాన్యమ్ అని మాన్యపదాన్ని రెండు రకాలుగా విడగొట్టడంద్వారా వాకోవాక్యం. వాకోవాక్యమన్నది ఒక అలంకారం. '**ఉక్తి ప్రత్యుక్తి చాతుర్యం వాకోవాక్యం విదుర్బుధాః**'-(**సరస్వతీకంఠాభరణం - 2/131**) అని వాకోవాక్యలక్షణం.

ఈ చాతుర్యానికి సహకరించేవి ఋజూక్తి, వక్రోక్తి, వైయాత్యోక్తి, గూఢోక్తి, ప్రశ్నోత్తరోక్తి, చిత్రోక్తి అని ఆరు అంశాలు. అందుకే వాకోవాక్య మాఱు రకాలని భోజుని మాట.

ప్రస్తుతశ్లోకంలో మాట రెండు పాయలుగా చీలటానికి సభంగశ్లేష సహకరించింది. శ్లేష సహకారంతో అర్థాంతరాన్ని స్వీకరిస్తే అది అది వక్రోక్త్యలంకారం. '**వక్రోక్తిః శ్లేషకాకుభ్యాం యదర్థాంతరకల్పనమ్**'-(కు. 159) అని వక్రోక్తి లక్షణం. కాబట్టి శ్లేషానుప్రాణితమైన వక్రోక్త్యలంకారమిది. దీనినే భోజుడు సరస్వతీకంఠాభరణంలో వాకోవాక్యాలంకార భేదాలలో ఒకటిగా చూపించాడు.

2. మానసికస్థితి వుండవలసిన తీరును, అటువంటి వారిని తాను అనుగ్రహించే తీరును గీతలో విభూతియోగంలో స్పష్టంగా చెప్పాడు.

శ్లో॥ మచ్చిత్తాః మద్గతప్రాణాః బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

శ్లో॥ తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥ - భగవద్గీత 10/9,10

3. భర్తను సేవించవలసిన తీరును, తనను సేవించవలసిన తీరును భాగవతకృష్ణు డిలా ప్రకటించాడు. - పోతన భాగవతం 10/978,981

క. నడవడి గొఱ గాకున్నను బడుగైనఁ గురూపి యయినఁబామరుఁడైనన్
జడుఁడైన రోగి యైనను విడుచుట మరియాద కాదు విభు నంగనకున్.

క. ధ్యానాకర్ణన దర్శన - గానంబుల నా తలంపు గలిగినఁ జాలున్
బూనెదరు కృతార్థత్వము - మానవతుల్! చనుఁడు మరలి మందిరములకున్.

| | | | |
|---|---|---|---|
| 4. **భజధ్వమ్ :** | భజతామ్ | భజేతామ్ | భజన్తామ్ |
| | భజస్వ | భజేథామ్ | **భజధ్వమ్** |
| | భజై | భజావహై | భజామహై |
| **భజామః :** | భజతి | భజతః | భజన్తి |
| | భజసి | భజథః | భజథ |
| | భజామి | భజావః | **భజామః.** |

*

**శ్లో॥ హితాహితాజ్ఞా బత! యూయమఙ్గనా - యతో హ్యధర్మే మతిరస్తి నిశ్చలా ।**
**హితాహితజ్ఞా వయమచ్యుత! ప్రభో! - యతో హ్యధర్మే మతిరస్తి నిశ్చలా ॥6-63**

**అ :** గోపికా కృష్ణ సంవాదం. -వంశస్థం.

**అ :** అంగనాః యూయం హిత+అహిత-అజ్ఞాః యతః అధర్మే నిశ్చలా మతిః అస్తి హి
ప్రభో! అచ్యుత! వయం హితహితజ్ఞాః యతః అధర్మే నిశ్చలా మతిః అస్తి హి.

**ప్ర : కృష్ణుడు** : అంగనాః = కాంతలారా!, యూయమ్ = మీరు, హిత+అహిత+అజ్ఞాః = మంచీ, చెడూ తెలియని వారు (హితమ్ అహితం చ న జానంతి, ఇతి), యతః = ఎందుకంటే, అధర్మే = తగని (నిషిద్ధమైన పనియందు (నిషిద్ధకర్మ జన్యస్త్వధర్మః-తర్క-సంగ్రహః) (ధర్మః న భవతి ఇతి అధర్మః), నిశ్చలా = చలించని, మతిః = బుద్ధి, అస్తి-హి = ఉన్నదిగదా (అస భువి పరస్మైపది లట్-(ప్ర.ఏ.), **గోపికలు:** ప్రభో! = స్వామీ!,

అచ్యుత! = కృష్ణా!, వయమ్ = మేము, హిత–అహిత–జ్ఞాః : మంచీ, చెడూ తెలిసిన వాళ్ళం (హితం అహితం చ జానన్తి, ఇతి), యతః = ఎందుకంటే, అధర్మే = అధర్మంలో, నిశ్చలా = తొణకని, మతిః = బుద్ధి, అస్తి హి = ఉన్నది గదా!

**తా ॥ కృష్ణుడు** – గోపికలారా! మీకు మంచీ చెడూ తెలియదు. ఎందుకంటే మీకు అధర్మ విషయంలో నిశ్చలమైన బుద్ధి వుంది.

**గోపికలు** – అచ్యుతా! స్వామీ! మేము మంచీ చెడూ తెలిసినవాళ్ళం. ఎందుకంటే అధర్మవిషయంలో నిశ్చలమైన బుద్ధి వుంది.

**వి :** 1. '**అధర్మే నిశ్చలా మతిరస్తి**' అన్నది ఇక్కడ ఇద్దరూ స్వీకరించిన కారణం. నిశ్చలబుద్ధి ప్రవృత్తి ప్రేరకమైనా కావచ్చు. నివృత్తి కారకమైనా కావచ్చు. ఆ విషయాన్ని స్పష్టం చేయకుండా 'ప్రవృత్తి వుంది' అన్నధ్వనితో కృష్ణుడంటే 'ఉన్నది నివృత్తియే' అన్నట్లుగా గోపికల లంటున్నారు. ఇతరులు చెప్పిన కారణంతోనే ఇతరుల సిద్ధాంతాన్ని (ప్రతిపాదనను) కాదనగలగటం వ్యాఘాతాలంకారం. '**సౌకర్యేణ నిబద్ధాపి క్రియా కార్యవిరోధినీ**'–(కు. 103), అని వ్యాఘాతాలంకార భేదాలలో ఒకటి. ఆ వ్యాఘాతంతో కూడిన వాకోవాక్యాలంకార మిక్కడ రంజక మవుతోంది.

2. **అస్తి :** 14వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ వాగ్వైఖరీమివ నిరీక్ష్య స వల్లవీనాం**
**ప్రీతః ప్రియోక్తిపరిరమ్భణచుమ్బనాద్యైః ।**
**సుప్తం ప్రబోధ్య మదనం సమభూదదృశ్యః**
**సత్యాం విధాతుమివ కామివిదూరతాం స్వామ్ ॥ 6–64**

**అ :** కృష్ణుడు గోపికలలో మదనభావాన్ని పెంచి తాను కనిపించకుండా వెళ్ళటం. –వసంతతిలక.

**అ :** సః వల్లవీనాం వాగ్వైఖరీం నిరీక్ష్య ఇవ ప్రీతః ప్రియోక్తిపరిరంభణచుంబన+ఆద్యైః సుప్తం మదనం ప్రబోధ్య స్వాం కామివిదూరతాం సత్యాం విధాతుమ్ ఇవ అదృశ్యః అభూత్.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, వల్లవీనామ్ = గోపికలయొక్క, వాగ్ – వైఖరీమ్ = మాట తీరును (వాచాం వైఖరీ, తామ్), నిరీక్ష్య ఇవ = బాగా గమనించియే (నిర్ – ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ప్రీతః = ఆనందించినవాడై (ప్రీ – ధాతువుపై క్త ప్రత్యయం), ప్రియ+ఉక్తి–పరిరంభణ–చుంబన–ఆద్యైః : ప్రియ+ఉక్తి = ఇష్టమైన మాటలు, పరిరంభణ = కౌగిలింతలు, చుంబన = ముద్దులు, ఆద్యైః = మొదలగు వాటితో (ప్రియా చ సా ఉక్తిః, సా చ పరిరంభణం చ చుంబనం చ ఆదౌ యేషాం, తైః), సుప్తమ్ = నిదురించిన, మదనమ్ = మన్మథుని, ప్రబోధ్య = మేలుకొలిపి (ప్ర – బుధ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వామ్ = తన యొక్క, కామి–విదూరతామ్ : కామి = కామం గలవారికి, విదూరతామ్ = దూరంగా నిలవటాన్ని, సత్యామ్ = సత్యంగా, విధాతుమ్+ఇవ = చేయటానికన్నట్లు, అదృశ్యః = కనిపించని వాడుగా, సమభూత్ = అయ్యాడు. (సమ్ భూ సత్తాయామ్ భ్వాది పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** తన మాటలతోనే తన అభిప్రాయాన్ని ఖండించిన ఆ గోపికల వాగ్వైఖరితో ఆనందించినట్లు కృష్ణుడు వారితో ప్రియంగా మాటాడి, వారిని కౌగిలించి, ముద్దిడుకొని, వారిలో నిదురిస్తున్న మదనభావాన్ని మేల్కొలిపి – కాముకులకు తానెప్పుడూ దూరమే అన్న అంశాన్ని నిరూపించటాని కన్నట్లు కనిపించకుండా పోయాడు.

**వి :** 1. **నిరీక్ష్య ఇవ – విధాతుమ్ ఇవ** రెండూ హేతూత్ప్రేక్షాలంకారాలే.

2. అంతకుముందే 'హితాహితాజ్ఞాః' అంటూ గోపికలను సంబోధించిన కృష్ణుడు వారి మాటలకు పొంగిపోయి ప్రియవచనాలతో, కౌగిలింతలతో, చుంబనాలతో వారిలోని మదనుని మేల్కొల్పటాన్ని ఎలా భావించాలి?

అవి కామప్రవృత్తిలో భాగం కాదనుకోవాలా? వాస్తవానికి ఈ అనుభవాలు కాముకత్వానికే నియతాలు కావు. ఇతరత్రా కూడా అవే అనుభావాలు కనిపిస్తాయి. భావంలోనే - మనస్సులోనే - తేడాలు.

అందుకే **హితాహితాజ్ఞాః** అన్న పదాన్ని నారాయణాచార్యులు ఇలా వ్యాఖ్యానించారు. '**హితేన సర్వభూతానాం హితోపదేష్ట్రా పితామహేన ఆహితా దత్తా ఆజ్ఞా యాసాం తాః**' '**జనిష్యతే తత్ప్రియార్థం సంభవన్తు సురస్త్రియః**' ఇతి భాగవతవచనాత్ - కాబట్టి గోపికలు గతంలో సురస్త్రీలు. పితామహాదేశంతో గోపికలుగా పుట్టారు. అధర్మమంటే (అ అంటే పరమాత్మ) వైష్ణవధర్మం. విష్ణుశరణాగతి గోపికలు పాటించిన ధర్మం. ఆ ధర్మంలో వారి మతి నిశ్చలమే.

3. కృష్ణుడు గోపికలను అలరించటాన్ని అదృశ్యుడై పోవటాన్ని పోతన తనదైన శైలిలో వివరించాడు. -

మ. కరుణాలోకములం బటాంచలకచాకర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్శనంబుల నఖాంకవ్యాప్తులన్, నర్మ వా
క్పరిరంభంబుల మంజులాధర సుధాపానంబులం గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుడు గృపం గందర్పుఁ బాలార్చుచున్.

ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిం
జిక్కి కృతార్థలై మరునిచిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకుం
జక్కన నా విభుండు గుణశాలి దిరోహితుఁ డయ్యె నయ్యెడన్. -పోతనభాగవతం 10/1001-1005

4. శ్రీనారాయణభట్టతిరి నారాయణీయంలో కృష్ణసాన్నిధ్యాన్ని - మార్గమైదైనా - మోక్షమని గోపికలను దృష్టిలో నిలుపుకొని పలికిన శ్లోకాన్ని చూడండి-

శ్లో॥ జారాత్మనా న పరమాత్మతయా స్మరంత్యో
నార్యో గతాః పరమహంసగతిం క్షణేన ।
తం త్వాం ప్రకాశపరమాత్మతమం కథంచిత్
చిత్తే వహన్నమృతమశ్రమమశ్నువీయ ॥ - నారాయణీయమ్ - 65/8

| | | | |
|---|---|---|---|
| 5. **సమభూత్ :** | **సమభూత్** | సమభూతామ్ | సమభూవన్ |
| | సమభూః | సమభూతమ్ | సమభూత |
| | సమభూవమ్ | సమభూవ | సమభూమ. |

*

**శ్లో॥ తాః పత్యపత్యభవనేషు విరక్తచిత్తాః - శ్రీపుణ్డరీకనయనేక్షణకార్యసక్తాః ।**
**ఆరణ్యకేషు మునివర్గ ఇవాతిముగ్ధా-శ్చేరుర్విమృగ్య బహుధా తమరణ్యకేషు ॥65**

అ : గోపికలు కృష్ణునికై వెదకుట. వసంతతిలక.

అ : పతి+అపత్యభవనేషు విరక్తచిత్తాః శ్రీపుండరీకనయన+ఈక్షణకార్యసక్తాః అతిముగ్ధాః తాః ఆరణ్యకేషు మునివర్గః ఇవ అరణ్యకేషు తం బహుధా విమృగ్య చేరుః.

ప్ర : పతి+అపత్య-భవనేషు : పతి = భర్తలమీద, అపత్య = సంతానంమీద, భవనేషు = ఇళ్ళమీద (పతయశ్చ

అపత్యాని చ భవనాని చ, తేషు), విరక్తచిత్తాః : విరక్త = అనురక్తిని కోల్పోయిన, చిత్తాః = మనస్సులు గలవారును (విరక్తాని చిత్తాని యాసాం తాః), శ్రీ పుండరీక-నయన-ఈక్షణ-కార్య-సక్తాః : శ్రీ = ప్రకాశించే, పుండరీక = తెల్ల తామర వంటి (పుండరీకం సితాంబుజమ్-హలాయుధకోశః-680), నయన = కన్నుల గలవానిని (కృష్ణుని), ఈక్షణ = చూచుట అను, కార్య = పనియందు, సక్తాః = తగుల్కొని యున్న వారును (శ్రియా సహితే పుండరీకే ఇవ నయనే తస్య ఈక్షణమ్ ఏవ కార్యం తస్మిన్ సక్తాః), అతిముగ్ధాః = మిక్కిలి అమాయికలును అయిన, తాః = ఆ గోపకాంతలు, ఆరణ్యకేషు = ఆరణ్యక గ్రంథాలలో, ముని-వర్గః ఇవ = ముని సమూహం వలె, అరణ్యకేషు = అరణ్యాలలో/ వనాలలో, తమ్ = ఆ కృష్ణుని, బహుధా = అనేక విధాలుగా, విమృగ్య = అన్వేషించి, చేరుః = తిరిగిరి. (చర గతౌ పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** గోపికలకు భర్త, పిల్లలూ, ఇళ్ళూ వీటి మీద విరక్తి కలిగింది. కమలాక్షుని అన్వేషించుట మొక్కటే పనిగా పెట్టుకొని దానిలో లగ్నమయ్యారు. మునిజనాలు ఆరణ్యక (ఉపనిషత్) గ్రంథాలలో వెదకినట్లు వీరు వనాలలో కృష్ణునికై అనేక విధాలుగా వెదుకనారంభించారు.

**వి :** 1. పత్యపత్యభవనవిరక్తి వైరాగ్యసాధనమయితే పుండరీకనయనదర్శనాసక్తి వైరాగ్య ప్రతిబంధకం కాదా? కాదు. పురుషోత్తమప్రాప్తియే వైరాగ్యఫలమయినప్పుడు పురుషోత్త-మానురక్తి ఆ మోక్షానికి మార్గమే.

2. గోపీజనానికీ, మునిగణానికీ ఇక్కడ పోలిక. శ్రీ పుండరీకనయనేక్షణకార్యాసక్తిని ఇద్దరికీ వర్తింపజేయవచ్చు. ఆరణ్యకసంచారం ఇద్దరికీ సమానం. పతిపదాన్ని తీసివేస్తే మిగిలిన అపత్య భవనాదులపై విరక్తీ ఇద్దరికీ సమానమే. ఇది పూర్ణోపమాలంకారం. 'ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః' - (కువలయానందం - 6)

| | | | |
|---|---|---|---|
| 3. **చేరుః :** చచార | చేరతుః | **చేరుః** | |
| చేరిథ | చేరథుః | చేర | |
| చచార/చచర | చేరివ | చేరిమ. | * |

**శ్లో॥ సమముదితవిమోహావస్థయా క్వాపి ముగ్ధాః**
**సముదితఘనచిన్తావస్థయా క్వాపి శాన్తాః ।**
**వశయితుమివ కాన్తం యోగిపూగైకచిన్త్యం**
**మధురవచనదక్షాస్తం జగుస్తాః పరోక్షమ్ ॥ 6-66**

**అ :** గోపికా గీతాలు. -మాలిని.

**అ :** సమమ్ - ఉదితవిమోహ+అవస్థయా క్వ+అపి ముగ్ధాః సమమ్-ఉదితఘన చింతా+అవస్థయా క్వ+అపి శాంతాః యోగిపూగ+ఏకచిన్త్యం కాన్తం వశయితుమ్ ఇవ మధురవచనదక్షాః తాః తం పరోక్షం జగుః.

**ప్ర :** సమమ్+ఉదిత-విమోహ+అవస్థయా : సమమ్+ఉదిత = పుట్టిన, విమోహ = ఉన్మాదంతోకూడిన, అవస్థయా = అవస్థతో, క్వ+అపి = కొన్ని తావుల, ముగ్ధాః = వివేకశూన్యలూ, సమ్-ఉదితఘనచింతావస్థయా : సముదిత = పుట్టిన, ఘన = గాఢమైన, చింతా+అవస్థయా = తదేకాలోచనతో, క్వ+అపి = కొన్నితావుల, శాంతాః = శాంతంగా వున్న వారును అయిన గోపికలు, యోగి-పూగ+ఏకగమ్యమ్ : యోగి = యోగులయొక్క, పూగ = సమూహాలకు, ఏక-చిన్త్యమ్ = ఒకే చిన్త్యమైన, కాంతమ్ = వల్లభుని, వశయితుమ్- ఇవ = లోబరుచొనుటకో అన్నట్లు, మధుర-వచన-దక్షాః : మధుర = మనోహరమైన, వచన = మాటలలో, దక్షాః = సమర్థత గల, తాః = వారు. పరోక్షమ్ = కనిపించకుండా వున్న, తమ్ = ఆ కృష్ణుని గూర్చి, జగుః = పాడిరి. (గై శబ్దే-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** గోపికలు కొందరు మోహావస్థకు లోనై వివేకహీనలుగా, మరికొందరు గాఢచింతనతో శాంతావస్థలుగా వుండి యోగిబృందాలకు గమ్యస్థానమైన ఆ కృష్ణుని లోబరచుకోవాలనే ఆలోచనతో మధురంగా మాటాడటంలో నేర్పుగల వారై కనిపించని కృష్ణుని గూర్చి ఇలా పాడసాగారు.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. జగుః :** | జగౌ | జగతుః | **జగుః** | |
| | జగిథ/జగాథ | జగథుః | జగ | |
| | జగౌ | జగివ | జగిమ. | * |

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గశ్చ షష్ఠో ముదామ్ ॥ 6-67**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా॥** షష్ఠః సర్గః - ఆరవసర్గ - మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంత శ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో ఆరవ సర్గ.

**శ్రీః**





# శ్రీః
# సప్తమః సర్గః

**శ్లో॥ యదుతిలక! గతో<sub></sub>ఽస్మాన్ ధైర్యమాత్రేణ హిత్వా**
**త్యజసి కథమయాఞ్చా ప్రాప్తసఙ్గం న చేత్త్వమ్ ।**
**తదిదముచితమస్య శ్రీభృతో యత్సమర్థా**
**చరణకమలధూళిస్తన్వి! తన్వీం విధాతుమ్ ॥** **7-1**

**అవతారిక :** గోపికలు కృష్ణుని అన్వేషించుట - ఇరువురు గోపికల మాటలు. -మాలిని.

**అన్వయక్రమం :** యదుతిలక! అస్మాన్ ధైర్యమాత్రేణ హిత్వా గతః. న చేత్. అయాంచా-ప్రాప్తసంగం త్వం కథం త్యజసి. తన్వి! శ్రీభృతః తద్ ఇదమ్ ఉచితమ్ యత్ అస్య చరణ-కమలధూళిః తన్వీం విధాతుం సమర్థా.

**ప్రతిపదార్థం : ఒక గోపిక** - యదుతిలక = యదువంశస్థులలో శ్రేష్ఠుడా! కృష్ణా !, అస్మాన్ = మమ్ము, ధైర్యమాత్రేణ = ధీమాతోనే (ధైర్యం ప్రమాణమ్ అస్య ఇతి ధైర్యమాత్రం తేన ధైర్యమాత్రేణ-**ప్రమాణే ద్వయసజ్దఘ్నచ్ మాత్రచః**-(అష్టాధ్యాయి 5-2-37) సూత్రంతో ధైర్యపదం మీద మాత్రచ్ ప్రత్యయం), హిత్వా = వదలి (హా ధాతువుపై క్త్వా ప్రత్యయం), గతః = వెళ్ళావు. (గమ్ ధాతువుపై క్త ప్రత్యయం), న చేత్ = లేకపోతే, అయాంచా - ప్రాప్త - సంగమ్ : అయాంచా = అడగకుండానే, ప్రాప్త = లభించిన, సంగమ్ = కలయికను (యాంచయా ప్రాప్తః, సః చ అసౌ సంగః యాంచా ప్రాప్తసంగః తత్ న భవతి), త్వమ్ = నీవు, కథమ్ = ఎలా, త్యజసి = విడువగలవు? (త్యజ్ హానౌ పరస్మైపది - లట్ - మ.ఏ.), **మరొక గోపి** - తన్వి = కృశించిన శరీరం గలదానా? శ్రీభృతః = లక్ష్మిని భరించేవానికి, తద్-ఇదమ్ = ఆ ఈ పని (మనలను వీడి వెళ్ళట మనే పని), ఉచితమ్ = తగినదే, యత్ = ఎందుకంటే, అస్య = ఇతనియొక్క, చరణ-కమల-ధూళిః = పాదపద్మాల దుమ్ము (చరణౌ కమలే ఇవ, తయోః ధూళిః), తన్వీమ్ = స్త్రీని, విధాతుమ్ = చేయుటకు, సమర్థా = శక్తి గలది.

**తాత్పర్యం : ఒక గోపిక :** యదువంశశ్రేష్ఠా ! మా ధైర్యాన్ని మాత్రమే లెక్క వేసికొని మమ్ము వదలి వెళ్ళావు. కాకపోతే అడగకుండా లభించిన ఆడవారి కలయికను వదలి పెడతావా?

**మరొక గోపిక :** ఆయన లక్ష్మీపతి. మనలను వీడి వెళ్ళటం ఆయనకు తగినపనే. ఆయన కాలి దుమ్ము కాంతలను తయారుచేసే శక్తి గలది.

**విశేషాలు :** 1. '**చరణకమలధూళిః తన్వీం విధాతుం సమర్థా**' అన్నమాటతో రామావతారాన్ని ధ్వనింపజేస్తున్నాడు రచయిత. రాముడే కృష్ణుడని గోపికభావం.

శ్లో॥ గచ్ఛతస్తస్య రామస్య **పాదస్పర్శాన్మహాశిలా ।**
**కాచిద్యోషాఽభవత్ సోఽపి** విస్మితో మునిరబ్రవీత్ ॥

శ్లో॥ శాపదగ్ధా పురా భర్త్రా రామ శక్రాపరాధతః ।
అహల్యాఖ్యా శిలా జజ్ఞే శతలింగః కృతః స్వరాట్ ॥

శ్లో॥ త్వదంఘ్రిస్పర్శనాత్తస్యై శాపాంతం ప్రాహ గౌతమః ।
తస్మాదియం తే **పాదాబ్జస్పర్శాచ్ఛుద్ధాఽభవత్** ప్రభో ॥ – పద్మపురాణం.

2. అయాంచాప్రాప్తసంగాన్ని కృష్ణుడు పరిత్యజించటానికి తగిన సమాధానాన్నే చెప్పింది మరో గోపిక. అయితే అసలు తనంతతానుగా వస్తే చులకన అని పెద్దల(న) మాట–

చం. అనుటయు మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరుదేఱు తెలిగన్నుల నాతనిc బుల్కుపుల్కనన్
గనుcగొని మాటలంబొదువు గద్గదికందలయూcచి యక్కటా
వనిత దనంతc దా వలచి వచ్చినc జుల్కన గాదె యేరికిన్. – మనుచరిత్ర 2/66

అయితే ఈ భావాలేవీ నియతాలు కావు. వ్యక్తివ్యక్తికీ వున్న సంబంధాన్ని బట్టి ఏర్పడేవి మాత్రమే. కాబట్టి ఎవరేమన్నా అది వారి ధోరణికి సంబంధించింది మాత్రమే.

| | | | |
|---|---|---|---|
| 3. **త్యజసి :** | త్యజతి | త్యజతః | త్యజన్తి |
| | **త్యజసి** | త్యజథః | త్యజథ |
| | త్యజామి | త్యజావః | త్యజామః. |

*

**శ్లో॥ అశ్వత్థద్రుమ! నః ప్రియః కిల భవన్మధ్యే సదా వర్తతే**
**తస్మై జ్ఞాపయ వల్లవీజనదశాం కష్టామదృష్టప్రియామ్ ।**
**నో చేత్ త్వద్ధృతి లగ్నమగ్నిమథవా త్వత్సంస్థితిం తేఽభిధాం**
**నో దేహ్యంగ! వియోగరోగరహితాం త్వం మర్త్యతామాశ్రయ ॥ 7–2**

**అ :** గోపికలు అశ్వత్థవృక్షంతో మాటాడటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అశ్వత్థద్రుమ! నః ప్రియః భవన్మధ్యే సదా వర్తతే కిల. తస్మై అదృష్టప్రియాం కష్టాం వల్లవీజనదశాం జ్ఞాపయ. నో చేత్ అంగ! త్వద్ హృది లగ్నమ్ అగ్నిమ్ అథవా వియోగరోగరహితాం త్వత్సంస్థితిమ్ అథవా తే అభిధాం నః దేహి. త్వం మర్త్యతామ్ ఆశ్రయ.

**ప్ర :** అశ్వత్థ–ద్రుమ! = అశ్వత్థ వృక్షమా! (రావిచెట్టు), (అశ్వత్థ ఇతి ద్రుమః) (శ్వః న తిష్ఠతి ఇతి అశ్వత్థః), నః = మాయొక్క, ప్రియః = ప్రియుడు, భవత్+మధ్యే = మీ మధ్యలో (భవతాం మధ్యే), సదా = ఎప్పుడూ, వర్తతే కిల = ఉంటాడు గదా! (వృతు – వర్తనే ఆత్మనేపది లట్ – ప్ర.ఏ.), తస్మై = ఆయనకు, అదృష్ట–ప్రియామ్ = కనిపించని ప్రియుడుగల (ప్రియుడు కనిపించని – అందువల్ల) (దృష్టః ప్రియా యయా సా, సా న భవతి ఇతి అదృష్టప్రియా, తామ్), కష్టామ్ = సహింపరాని, వల్లవీ–జన–దశామ్ : వల్లవీ–జన = గోపికాజనంయొక్క, దశామ్ = పరిస్థితిని (వల్లవ్యః చ తే జనాః, తేషాం దశా, తామ్), జ్ఞాపయ = గుర్తుచేయి. (జ్ఞా అవబోధనే ణిచ్–

పరస్మైపది–లోట్– మ.ఏ.), నో చేత్ = లేకపోతే, అంగ = ఓ అశ్వత్థమా!, త్వద్ధృది : త్వత్ = నీయొక్క, హృది = హృదయంలో, లగ్నమ్ = నిలిచియున్న, అగ్నిమ్ = నిప్పును, అథవా = లేకపోతే, వియోగరోగరహితామ్ : వియోగ = విరహ మనే, రోగ = వ్యాధిచే, రహితామ్ = శూన్యమైన (వియోగ ఏవ రోగః తేన రహితా తామ్), త్వత్–సంస్థితమ్ = నీ స్థితిని (వృక్షత్వాన్ని), అథవా = కాకపోతే, తే = నీ యొక్క, అభిధామ్ = పేరును (వియోగరోగ రహితమైన పేరును), నః = మాకు, దేహి = ఇవ్వు (దా దానే పరస్మైపది – లోట్ – మధ్యమపురుషైక వచనం), త్వమ్ = నువ్వు, మర్త్యతామ్ = మనుష్యత్వాన్ని, ఆశ్రయ = సేవించు. (ఆ–శ్రి సేవాయాం పరస్మైపది – లోట్ – మ.ఏ.)

**తా ॥** అశ్వత్థవృక్షమా! మా ప్రియుడు ఎప్పుడూ నీలో మధ్యభాగాన వుంటాడు గదా! దుర్భరమయిన ఈ గోపికల దశను మాకు కనిపించని ఆయనకు నువ్వు గుర్తుచేయి. లేదా నీ హృదయంలోని అగ్నిని లేదా వియోగరోగమెరుగని నీ స్థితిని, లేదా నీ పేరును మాకివ్వు. నువ్వు (మాలా) మనుష్యత్వాన్ని స్వీకరించు.

వి : 1. **శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణురూపిణే ।**
**అగ్రతః శివరూపాయ వృక్షరాజాయ తే నమః ॥**

అని అశ్వత్థవృక్షాన్ని స్తుతించటం పురాణప్రసిద్ధం (బ్రహ్మాండపురాణాంతర్గతం). దీనిని బట్టి అశ్వత్థమధ్యంలో విష్ణువుంటాడు.

2. అగ్నిర్దేవేభ్యోఽ నిలాయత. అశ్వో రూపం కృత్వా. సోఽ శ్వత్థే సంవత్సరమతిష్ఠత్. తదశ్వత్థస్య అశ్వత్థత్వమ్. – (వైదికపదకోశం) తైత్తిరీయబ్రాహ్మణం 1–1–3–9

దీనిని బట్టి అశ్వత్థహృదయంలో అగ్ని ఉందన్న అవగాహన.

3. మూలంలో అశ్వత్థాన్ని ప్రశ్నించటం మాత్రమే వుంటుంది కానీ సర్వాంగీణమైన విస్తృతి లేదు.

శ్లో॥ దృష్టో వః కశ్చిదశ్వత్థప్లక్షన్యగ్రోధ నో మనః ।
నందసూనుర్గతో **హృత్వా** ప్రేమహాసావలోకనైః ॥ – భాగవతమ్ 10/30/5

పోతన 'నో మనః హృత్వా గతః' అన్న అంశాన్ని మాత్రం స్వీకరించి అశ్వత్థాన్ని మల్లెపొదలుగా మార్చి ఒక అద్భుతపద్యాన్ని అందించాడు.

**ఉ. నల్లనివాఁడు పద్మనయనమ్ములవాఁడు కృపారసంబు పైఁ**
**జల్లెడువాఁడు మౌళిపరిసర్పితపింఛమువాఁడు నవ్వు రా**
**జిల్లెడు మోమువాఁడొకఁడు చెల్వల మానధనంబుఁదెచ్చె నో**
**మల్లియలార! మీ పొదలమాటున లేఁడు గదమ్మ చెప్పరే! –పోతన భాగవతము 10/1010**

| | | | |
|---|---|---|---|
| 4. **వర్తతే :** | **వర్తతే** | వర్తేతే | వర్తన్తే |
| | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| | వర్తే | వర్తావహే | వర్తామహే |
| **దేహి :** | దదాతు/దత్తాత్ | దత్తామ్ | దదతు |
| | **దేహి**/దత్తాత్ | దత్తామ్ | దత్త |
| | దదాని | దదావ | దదామ |
| **ఆశ్రయ :** | ఆశ్రయతు/ఆశ్రయతాత్ | ఆశ్రయతామ్ | ఆశ్రయన్తు |
| | **ఆశ్రయ**/ఆశ్రయతాత్ | ఆశ్రయతమ్ | ఆశ్రయత |
| | ఆశ్రయాని | ఆశ్రయావ | ఆశ్రయామ. |

*

**శ్లో॥ మూలాసేచనపూర్వకం పరిసరంస్త్వామార్ద్రవస్త్రః పుమాన్**
**స్వాభీష్టం లభతే కిల ప్రతివనం విష్వక్ చరన్తీర్బత! ।**
**కాయక్లేశవశాత్ సముత్థితఘనస్వేదామ్బునాఽఽర్ద్రామ్బరా**
**శ్చాస్రౌఘైః కిముపేక్షసే విదధతీరార్ద్రాం భవద్వేదికామ్ ॥ 7-3**

**అ :** గోపికలు అశ్వత్థవృక్షంతో నిష్ఠూరాలాడుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఆర్ద్రవస్త్రః పుమాన్ మూల+ఆసేచనపూర్వకం త్వాం పరిసరన్ స్వ+అభీష్టం లభతే కిల. బత. ప్రతివనం విష్వక్ చరన్తీః కాయక్లేశవశాత్ సముత్థితఘనస్వేద+అంబునా ఆర్ద్రః +అంబరాః అస్ర+ఓఘైః భవద్+వేదికామ్ ఆర్ద్రాం విదధతీః (నః) కిమ్ ఉపేక్షసే.

**ప్ర :** ఆర్ద్రవస్త్రః = తడిసిన బట్టలు గలవాడై (ఆర్ద్రం వస్త్రం యస్య సః), పుమాన్ = పురుషుడు, మూల+ఆసేచన-పూర్వకమ్ : మూల = పాదులను, ఆసేచన = తడుపుటతో, పూర్వకమ్ = పాటుగా (మూలే ఆసేచనం తత్ పూర్వకం యథా తథా), పరిసరన్ = ప్రదక్షిణ చేస్తూ (పరి+సృ ధాతువుపై శతృ ప్రత్యయం), స్వ+అభీష్టమ్ = తన కోరికను (స్వస్య అభీష్టః, తమ్), లభతే కిల = పొందగలడు గదా! (లభ్ ప్రాప్తౌ ఆత్మనేపది లట్ ప్ర.ఏ.), ప్రతివనమ్ = తోటలన్నీ (వనే వనే) (**లక్షణేన అభిప్రతీ ఆభిముఖ్యే** – అష్టాధ్యాయి 2-1-14), విష్వక్ = అంతటా, చరన్తీః = తిరుగుతున్న వారమై, కాయ-క్లేశ-వశాత్ : కాయ = శరీరంయొక్క, క్లేశ = ఆయాసంయొక్క, వశాత్ = కారణంగా (కాయస్య క్లేశః, తస్య వశం, తస్మాత్), సముత్థిత-ఘన-స్వేద-అంబునా : సముత్థిత = కలిగిన, ఘన = మిక్కిలి అయిన, స్వేద+అంబునా = చెమట నీటిచే, (సముత్థితం చ తత్ ఘనం చ, తత్ చ అసౌ స్వేదః, తస్య అంబు, తేన), ఆర్ద్ర+అంబరాః: ఆర్ద్ర = తడిసిన, అంబరాః = వస్త్రాలు గల వారమై (ఆర్ద్రాణి అంబరాణి యాసాం తాః), అస్ర+ఓఘైః = కన్నీటి ధారలతో (అస్రాణాం ఓఘాః, తైః) (అస్ర ఆస్రశ్చ పుంలింగౌ క్లేశే క్లీ రుధిరేఽశ్రుణి – వైజయన్తీ – నానాలింగ – 13), భవద్+వేదికామ్ = నీ వేదికను (భవతః వేదికా, తామ్), ఆర్ద్రామ్ = తడిసిన దానినిగా, విదధతీః = చేస్తున్నవారమైన, (నః = మమ్ము), కిమ్ = ఎందువలన, ఉప+ఈక్షసే = పట్టించుకోవటం లేదు. (ఉప+ఈక్ష దర్శనే ఆత్మనేపది-లిట్- మ.ఏ.)

**తా ॥** అశ్వత్థవృక్షమా! తడిబట్టలు కట్టుకొని నీ పాదులను తడుపుతూ ప్రదక్షిణం చేస్తే కోరికలు తీరుతాయి గదా! అటువంటప్పుడు ప్రతివనంలోనూ తిరుగుతూ, శరీరశ్రమ వలన కలిగిన చెమటతో తడిసిన బట్టలు కట్టుకొని, కన్నీటిప్రవాహాలతో నీ వేదికను తడుపుతూ, ప్రదక్షిణాలు చేస్తున్న మమ్ములను ఎందుకు పట్టించుకోవటం లేదు.

**వి :** 1. మూలసేచనానికీ, కోరికలు నెరవేరటానికీ కార్యకారణ సంబంధం నియతం కాదు. అసలు ఆ రెండింటికీ సంబంధం లేకపోవచ్చు కూడా. అయినా సంబంధమున్నట్లు చెప్పటం వలన సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' – (కు.36)

| | | | |
|---|---|---|---|
| 2. **లభతే :** | **లభతే** | లభేతే | లభన్తే |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభే | లభావహే | లభామహే |
| **ఉపేక్షసే :** | ఉపేక్షతే | ఉపేక్షేతే | ఉపేక్షన్తే |
| | **ఉపేక్షసే** | ఉపేక్షేథే | ఉపేక్షధ్వే |
| | ఉపేక్షే | ఉపేక్షావహే | ఉపేక్షామహే. |

*

**శ్లో॥ న వదతి బత! సఖ్యో నః ప్రియం విప్రియం వా**
**న దిశతి ఫలమిష్టం స్వైరమారాధితోఽపి ।**

**హరిచరణవిదూరాః కో ను సంభాషయేన్నః**
**సుకృతమపి తదాజ్ఞారూపమాపాదయేత్ కిమ్ ॥ 7-4**

**అ :** గోపికల ఆవేదన - పరస్పరసంభాషణ - అశ్వత్థనింద. -మాలిని.

**అ :** సఖ్యః (అయమ్) నః ప్రియమ్ అప్రియం వా న వదతి. స్వైరమ్ ఆరాధితః అపి ఇష్టం ఫలం న దిశతి. హరిచరణవిదూరాః నః కః ను సంభాషయేత్ తద్ - ఆజ్ఞారూపం సుకృతమ్ అపి కిం న ఆపాదయేత్.

**ప్ర :** సఖ్యః = చెలులారా!, (అయమ్ = ఈ అశ్వత్థం), నః = మనకు (తో), ప్రియమ్ = నచ్చినది కానీ, విప్రియమ్ = నచ్చనిది కాని (ప్రియం న భవతి ఇతి), న వదతి = పలుకదు. (వద-వ్యక్తాయాం వాచి-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), బత = అయ్యో!, స్వైరమ్ = స్వేచ్ఛగా (తనకు నచ్చే రీతిలో) (మందస్వచ్ఛందయోః స్వైరమ్ - హలాయుధకోశః - 833), ఆరాధితః+అపి = పూజింపబడినా, ఇష్టమ్ = నచ్చిన (ఇష ధాతువుపై క్త ప్రత్యయం), ఫలమ్ = ఫలితాన్ని, న దిశతి = ఇవ్వడం లేదు. (దిశ అతిసర్జనే పరస్మైపది-లట్- ప్ర.ఏ.), హరి-చరణ-విదూరాః : హరి = కృష్ణునియొక్క, చరణ = పాదాలకు, విదూరాః = దూరమైన (హరేః చరణౌ, తయోః విదూరాః), నః = మనలను, కః+ను = ఎవరయినా, సంభాషయేత్ = మాటాడుతాడా? (సమ్-భాష్-ణిచ్-పరస్మైపది-విధిలిఙ్- ప్ర.ఏ.), తద్+ఆజ్ఞా-రూపమ్ : తద్ = ఆ కృష్ణునియొక్క, ఆజ్ఞా-రూపమ్ = ఆదేశరూపమైన (తస్య ఆజ్ఞా ఏవ రూపం యస్య తత్), సుకృతమ్+అపి = పుణ్యాన్ని అయినా, ఆపాదయేత్ కిమ్? = కలిగిస్తాడా? (ఆ పద్ విశరణగత్యవసానయోః-పరస్మైపది-విధిలిఙ్- ప్ర.ఏ.)

**తా ॥** "చెలులారా! మనకు నచ్చేదో, నచ్చనిదో కనీసం మాటాడటం లేదు (అశ్వత్థవృక్షం). మనం స్వేచ్ఛగా ఆరాధించినా ఫలితమివ్వటం లేదు." "అయినా హరిచరణాలకు దూరమైన మనతో ఎవరు మాటాడుతారు? కృష్ణుని ఆదేశరూపమైన పుణ్యాన్ని అయినా మనపై కలిగించడా?"

**వి :** 1. '**స్వైరమారాధితోఽపి ఫలం న దిశతి**'-ఆరాధించినా ఫలితం లభించటం లేదు. కారణమున్నా కార్యం జరగటం లేదు. దీన్ని విశేషోక్త్యలంకార మంటారు. '**కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే**'-(కు. 83)

| | | | |
|---|---|---|---|
| 2. **వదతి :** | **వదతి** | వదతః | వదన్తి |
| | వదసి | వదథః | వదథ |
| | వదామి | వదావః | వదామః |
| **దిశతి :** | **దిశతి** | దిశతః | దిశన్తి |
| | దిశసి | దిశథః | దిశథ |
| | దిశామి | దిశావః | దిశామః |
| **సంభాషయేత్ :** | **సంభాషయేత్** | సంభాషయేతామ్ | సంభాషయేయుః |
| | సంభాషయేః | సంభాషయేతమ్ | సంభాషయేత |
| | సంభాషయేయమ్ | సంభాషయేవ | సంభాషయేమ |
| **ఆపాదయేత్ :** | **ఆపాదయేత్** | ఆపాదయేతామ్ | ఆపాదయేయుః |
| | ఆపాదయేః | ఆపాదయేతమ్ | ఆపాదయేత |
| | ఆపాదయేయమ్ | ఆపాదయేవ | ఆపాదయేమ. |

*

**శ్లో॥ ప్రేష్ఠం స్వాన్తరసంస్థితం న దిశతీత్యార్తాః సమస్తా భృశం**
**కోపాచ్చాపమయోజయన్నివ సతాం స్యాత్ త్వత్ఫలం నిష్ఫలమ్ ।**

**విష్ఠాతో జనిరస్తు తే నిశి తవచ్ఛాయా విగేయాస్త్వియం**
**క్రూరస్తే హృది వహ్నిరస్తు న సదా స్పర్శస్య యోగ్యో భవ ॥ 7-5**

**అ :** గోపికలు అశ్వత్థవృక్షాన్ని నిందించటం - శపించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్వాంతరసంస్థితం ప్రేష్ఠం న దిశతి ఇతి భృశమ్ ఆర్తాః సమస్తాః కోపాత్ శాపమ్ అయోజయన్+ఇవ - (అశ్వత్థ) త్వత్ఫలం సతాం. నిష్ఫలం స్యాత్ తే విష్ఠాతః జనిః అస్తు. ఇయం తవ ఛాయా నిశి విగేయా అస్తు. తే హృది క్రూరః వహ్నిః అస్తు సదా స్పర్శస్య యోగ్యః న భవ.

**ప్ర :** స్వ+అంతర-సంస్థితమ్ : స్వ = తనయొక్క, అంతర = మధ్యలో, సంస్థితమ్ = నిలిచియున్న (స్వస్య అంతరం, తస్మిన్ సంస్థితః, తమ్), ప్రేష్ఠమ్ = ప్రియుని (అతిశయేన ప్రియః ప్రేష్ఠః, "**అతిశాయనే తమభిష్ఠనౌ**" (అష్టాధ్యాయి - 5-3-55) సూత్రంతో ఇష్ఠన్ ప్రత్యయం. "**ప్రియస్థిర... వృందాః**" (అష్టాధ్యాయి - 6-4-157) సూత్రంతో 'ప్రియ' కు 'ప్ర' ఆదేశం), న దిశతి = ఇవ్వటం లేదు. (దిశ అతిసర్జనే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఇతి = అని, భృశమ్ = తీవ్రంగా, ఆర్తాః = వెతకు లోనైన, సమస్తాః = అందరూ (గోపికలు), కోపాత్ = కోపంతో, శాపమ్ = శాపాన్ని, అయోజయన్+ఇవ = ఇచ్చినట్లయ్యారు. (యుజ సంయమనే - పరస్మైపది - లజ్ - ప్ర.బ.), త్వత్ - ఫలమ్ = నీ పండు, సతామ్ = సజ్జనులకు, నిష్ఫలమ్ = నిరుపయోగంగా, స్యాత్ = అగుగాక. (అస భువి పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), తే = నీకు, విష్ఠాతః = (కాకుల) పెంటద్వారా, జనిః = పుట్టుక, అస్తు = ఉండుగాక (అస భువి పరస్మైపది - లోట్ - ప్ర.ఏ.), ఇయమ్ = ఈ, తవ = నీ యొక్క, ఛాయా = నీడ, నిశి = రాతిరి, విగేయా = నిందింప దగినదిగా, అస్తు = అగుగాక (అస భువి), తే = నీయొక్క, హృది = హృదయంలో, క్రూరః = దారుణమై, వహ్నిః = అగ్గి, అస్తు = ఉండుగాక (అస భువి), సదా = ఎల్లప్పుడు, స్పర్శస్య = తాకటానికి, యోగ్యః = తగినవాడవు, న భవ = కారాదు. (భూ సత్తాయాం పరస్మైపది-లోట్- మ.ఏ.)

**తా ॥** అశ్వత్థం తనమధ్యలో వున్న తమ ప్రియుని - కృష్ణుని - తమవశం చేయటం లేదని గోపికలంతా తీవ్రవేదనతో, కోపంతో అశ్వత్థాన్ని శపించనట్లయింది. వారి శాపం - నీ ఫలాలు సజ్జనులకు ఉపయోగపడకూడదు. నీకు (కాకి) పెంటద్వారా పుట్టుక వుండాలి. నీ నీడ రాత్రివేళ నిందార్హం గావాలి. నీ గుండెలో ఎప్పుడూ క్రూరమైన నిప్పుండాలి. నీవు స్పర్శ బాహ్యుడివి కావాలి.

**వి :** 1. **శ్లో॥అశ్వత్థం వందయేన్నిత్యం పూర్వాహ్ణే ప్రహరద్వయే ।**
**అత ఊర్ధ్వం న వన్దేత అశ్వత్థం తు కదాచన ॥** అని సంప్రదాయంగా వినిపించే శ్లోకం. అశ్వత్థాన్ని ఉదయం రెండు జాముల లోపు మాత్రమే నమస్కరించాలట. ఆ తరువాత అశ్వత్థాన్ని సేవించకూడదు. అందుకే గోపికలు 'రాత్రే తవ ఛాయా విగేయా' అని అన్నారు. వారి శాపంవలన ఆ లక్షణమేర్పడిందేమో అని సంభావన. అదే ఉత్ప్రేక్షాలంకారం.

2. 'విష్ఠాతో జనిరస్తు' 'తే హృది వహ్నిరస్తు' ఇటువంటివి వాస్తవానికి గుణాలు. కానీ ఆ గుణాలను - సహజసిద్ధాలను - దోషాలుగా, శాపఫలితాలుగా చెప్పే ప్రయత్నం జరిగినందు వలన ఇక్కడ లేశాలంకారం. '**లేశస్స్యాత్ దోషగుణయోః గుణదోషత్వకల్పనమ్**' - (కు.138)

3. శ్లోకంలో అశ్వత్థాన్ని శపించినట్లుగా చెప్పినవన్నీ అశ్వత్థానికి సహజమైన లక్షణాలు. వాటిని శాపరూపంగా కానీ, వరరూపంగా కానీ మరొకరు విధించే అవకాశం కానీ, అవసరం కానీ లేదు. కానీ ఇక్కడ అలా విధించినందువల్ల ఇది విధ్యలంకారం. '**సిద్ధస్యైవ విధానం యత్ తమాహుర్విధ్యలంకృతమ్**' - (కు.166)

4. **'అశ్వత్థసాగరౌ సేవ్యౌ న స్ప్రష్టవ్యౌ కదాచన'** – అని (అశ్వత్థవృక్షాన్నీ, సముద్రాన్నీ ఎప్పుడూ తాకకూడదు) అశ్వత్థాన్ని శనివారం నాడు, సముద్రాన్ని పర్వదినాలలోను తాకవచ్చని ఒక మినహాయింపు. లక్ష్మీదేవి శనివారం అశ్వత్థాన్ని ఆశ్రయించి వుంటుందట. అందువల్ల ఆ రోజు మాత్రం అశ్వత్థవృక్షాన్ని తాకవచ్చని మిగిలిన రోజులలో అశ్వత్థం అస్పృశ్యమనీ పద్మపురాణ వచనం.

**శ్లో॥ మందవారే సదా హ్యేనం లక్ష్మీరత్రాగమిష్యతి ।**
**అస్పృశ్యోఽసౌ భవేత్ తస్మాన్మందవారం వినా కిల ॥**

5. **దిశతి :** 7–4వ శ్లోకవ్యాఖ్య చూదుదు.

| | | | |
|---|---|---|---|
| **అయోజయన్ :** | అయోజయత్ | అయోజయతామ్ | **అయోజయన్** |
| | అయోజయః | అయోజయతమ్ | అయోజయత |
| | అయోజయమ్ | అయోజయావ | అయోజయామ |
| **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |
| **భవ :** | భవతు/భవతాత్ | భవతామ్ | భవన్తు |
| | **భవ**/భవతాత్ | భవతమ్ | భవత |
| | భవాని | భవావ | భవామ. |

*

**శ్లో॥ అస్మాకం న హి యః శృణోతి వచనం ప్రత్యుత్తరం వక్తి నో**
**మూకోఽసౌ బధిరాగ్రణీశ్చ భవతు స్వాన్తస్థితోఽప్యచ్యుతః ।**
**నైతద్దృష్టిపథం ప్రయాతు రమణం యో దర్శయేన్నైవ న-**
**స్తత్పార్శ్వే వసతాదసౌ ద్విజకులే యః ప్రేత్య న స్వర్గతః ॥ 7–6**

**అ :** గోపికలు అశ్వత్థవృక్షంపై ఆరోపణలు చేసి దూరంగా వెళ్ళాలని నిర్ణయించుకొనుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యః (అశ్వత్థః) అస్మాకం వచనం న శృణోతి ప్రత్యుత్తరం (వా) నో వక్తి అసౌ మూకః బధిర+అగ్రణీః స్వ+అంతః స్థితః అపి అచ్యుతః దృష్టిపథం న ప్రయాతు. తత్–పార్శ్వే అసౌ వసతాత్ యః ద్విజకులే ప్రేత్య స్వః న గతః.

**ప్ర :** యః (అశ్వత్థః) = ఏ అశ్వత్థవృక్షం, అస్మాకమ్ = మనయొక్క, వచనమ్ = మాటను, న శృణోతి = వినదో (శ్రు శ్రవణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.), ప్రత్యుత్తరమ్ = సమాధానం, నో వక్తి = చెప్పదో (వచ పరిభాషణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.), అసౌ = ఆ అశ్వత్థవృక్షం, మూకః = మూగ, బధిర+అగ్రణీః చ = చెవిటి వారిలో మేటిగా కూడా, భవతు = అగుగాక (భూ సత్తాయామ్–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.), అచ్యుతః = కృష్ణుడు, స్వ+అంతః +స్థితః+అపి = తనలో నున్ననూ (స్వస్య అంతః, తస్మిన్ స్థితః), యః = ఏదయితే, రమణమ్ = వల్లభుని, న దర్శయేత్ = ప్రదర్శించదో (ప్ర+దృశ్ ప్రేక్షణే–పరస్మైపది–విధిలిఙ్– ప్ర.ఏ.), అచ్యుతః = కృష్ణుడు, ఏతద్–దృష్టిపథమ్ : ఏతత్ = దీనియొక్క, దృష్టి = చూపుయొక్క, పథమ్ = బాటను, న ప్రయాతు = పట్టకూడదు (ప్ర–యా ప్రాపణే–పరస్మైపది–లోట్– ప్ర.ఏ.), యః = ఎవడయితే, ద్విజ–కులే = బ్రాహ్మణకులంలో (ద్వే జన్మనీ యస్యః సః ద్విజః, తస్య కులం, తస్మిన్), ప్రేత్య = మరణించి (ప్ర+ఇ–ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వః = స్వర్గానికి (స్వరవ్యయం స్వర్గ నాకః–అమరకోశః–స్వర్గ–6), న గతః = వెళ్ళలేదో (గమ్ ధాతువుపై క్త ప్రత్యయం),

అసౌ = ఆ వ్యక్తి, తత్–పార్శ్వే = ఆ అశ్వత్థం ప్రక్కన (దగ్గర), వసతాత్ = నివసించుగాక (వస నివాసే–పరస్మైపది–లోట్– ప్ర.ఏ.)

**తా ॥** ఈ అశ్వత్థవృక్షం మన మాటలు వినటం లేదు. సమాధానం చెప్పటం లేదు. దీనిని మూగగా, చెవిటిగా మారిపోనీ, తన మధ్యనున్న కృష్ణుని మనకు చూపటం లేదు కాబట్టి తనలో నున్న వాడైన కృష్ణుడు దీనికి కనిపించగూడదు. బ్రాహ్మణకులంలో పుట్టి మరణించి స్వర్గానికి వెళ్ళనివాడే దీని దగ్గరుండాలి.

**వి :** 1. రావిచెట్టు మూలంలోనూ, మఱ్ఱిచెట్ల మీదను బ్రహ్మరాక్షసులుంటారని లోకంలో ప్రతీతి. ఆముక్తమాల్యదలో కృష్ణదేవరాయలు మేటి మఱ్ఱిచెట్టు మీదనే బ్రహ్మరాక్షసుని చూపించాడు. లోక ప్రసిద్ధమయిన ఆ అంశాన్నే వీళ్ళ శాపనార్థాల రూపంలో వర్ణించినందువల్ల సిద్ధించిన దీనినే విధించటం కాబట్టి ఇది విధ్యలంకారం. '**సిద్ధస్యైవ విధానం యత్తమాహుర్విధ్యలంకృతిమ్**'–(కు. 166)

2. పరదారాపహరణం, బ్రాహ్మణధనాపహరణం చేసినవాడు బ్రహ్మరాక్షసుడవుతాడని యాజ్ఞవల్క్యవచనం–

శ్లో॥ పరస్య యోషితం హృత్వా బ్రహ్మస్వమపహృత్య చ ।
అరణ్యే నిర్జలే దేశే భవతి బ్రహ్మరాక్షసః ॥ (SANSKRIT/ENGLISH DICTIONARY V.S.APTE P 801)

| | | | |
|---|---|---|---|
| 3. **శృణోతి :** | **శృణోతి** | శృణుతః | శృణ్వన్తి |
| | శృణోషి | శృణుథః | శృణుథ |
| | శృణోమి | శృణువః/శృణ్వః | శృణుమః/శృణ్మః |
| **వక్తి :** | **వక్తి** | వక్తః | – |
| | వక్షి | వక్థః | వక్థ |
| | వచ్మి | వచ్వః | వచ్మః |

**దీనికి ప్రథమా బహువచనంలో ప్రయోగం లేదు.** "అయమన్తి పరో న ప్రయుజ్యతే. 'బహువచనపరః' ఇత్యన్యే. 'ఝిపరః' ఇత్యపరే." (వైయాకరణసిద్ధాంతకౌముదీ–ఉత్తరార్ధ – అదాదిప్రకరణమ్)

| | | | |
|---|---|---|---|
| **దర్శయేత్ :** | **దర్శయేత్** | దర్శయేతామ్ | దర్శయేయుః |
| | దర్శయేః | దర్శయేతమ్ | దర్శయేత |
| | దర్శయేయమ్ | దర్శయేవ | దర్శయేమ |
| **ప్రయాతు :** | **ప్రయాతు**/ప్రయాతాత్ | ప్రయాతామ్ | ప్రయాన్తు |
| | ప్రయాహి/ప్రయాతాత్ | ప్రయాతమ్ | ప్రయాత |
| | ప్రయాణి | ప్రయావ | ప్రయామ |
| **వసతాత్ :** | వసతు/**వసతాత్** | వసతామ్ | వసన్తు |
| | వస/వసతాత్ | వసతమ్ | వసత |
| | వసాని | వసావ | వసామ. |

*

**శ్లో॥ హే జాతి! మాలతి! తులస్యయి మల్లికేఽగ్ర్యే**
**యోగం సమాదిశత యోగిజనప్రియస్య ।**
**యద్వైకజన్మని కదాపి తదప్రిసజ్గో**
**యుష్మభ్యమాభిరబలాభిరదాయి సాధ్వ్యః ॥** **7–7**

అ : గోపికలు వివిధలతాపాదపాలతో సంభాషించటం. -వసంతతిలక.

అ : హే జాతి! మాలతి! అయి అగ్ర్యే తులసి! మల్లికే ! యోగిజనప్రియస్య యోగం సమాదిశత. సాధ్వ్యః యర్హి ఏకజన్మని కదా అపి ఆభిః అబలాభిః అంఘ్రిసంగః యుష్మభ్యమ్ అదాయి.

ప్ర : హే జాతి! = ఓ జాజి!, మాలతి! = మాలతీ!, అయి = ఓ, అగ్ర్యే = శ్రేష్ఠమైన, తులసి = తులసీ!, మల్లికే = మల్లికా!, యోగి-జన-ప్రియస్య : యోగి-జన = సాధకులైన వారికి, ప్రియస్య = ఇష్టుడైన కృష్ణునియొక్క (యోగినశ్చ తే జనాః, తేషాం ప్రియః, తస్య), యోగమ్ = సంబంధాన్ని, సమ్+ఆదిశత = కలిగించండి (సమ్-ఆ- దిశ అతిసర్జనే-పరస్మైపది-లోట్-మ.ఏ.), సాధ్వ్యః = ఓ పతివ్రతలారా!, యర్హి = ఒక వేళ, ఏక-జన్మని = ఏదైనా జన్మలో (ఏకం చ తత్ జన్మ తస్మిన్), కదా-అపి = ఎప్పుడయినా, ఆభిః = ఈ, అబలాభిః = స్త్రీలచే (మాచే), తద్-అంఘ్రి-సంగః : తద్ = ఆ కృష్ణునియొక్క, అంఘ్రి = పాదాలతో, సంగః = చేరిమి, యుష్మభ్యమ్ = మీకై, అదాయి = ఇవ్వబడితే (దా-దానే-ఆత్మనేపది-కర్మణి-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** జాతి! మాలతి! తులసి! మల్లికా! యోగిజనాలకు ప్రియుడైన కృష్ణునితో యోగాన్ని మాకు కల్పించండి. (ఈ సంసారచక్రంలో). ఓ పతివ్రతలారా! ఏ జన్మలో అయినా ఆ కృష్ణుని పాదాల సన్నిధిని మేము మీకు కల్పించి వుంటే (ఇప్పుడు మాకు మీరు కల్పించండి.)

వి : 1. శ్లో॥కృతే చ ప్రతికర్తవ్యమేష ధర్మస్సనాతనః ।
సోఽయం త్వత్ప్రతీకారార్థీ త్వత్తస్సమ్మానమర్హతి ॥ -రామాయణం సుందరకాండ-1/114

అని వాల్మీకి వచనం. ఉపకారికి ఉపకారం చేయాలి. అది సనాతనధర్మం. కాబట్టి గతంలో ఎప్పుడైనా మేము మీకు కృష్ణదర్శనానికి సహకరించి వుంటే ఇప్పుడు మాకు సహకరించండి అని అభ్యర్థనం.

ఇక్కడ మరొక అర్థవిశేషముంది. ఎప్పుడైనా కృష్ణ పాదాలతో మీకు సంబంధాన్ని కలిగించి వుంటే అంటూ వాటికి మేలు చేసినట్లు కనిపిస్తున్న అది పూజాస్వరూపం కాబట్టి పూజాఫలం గోపికలకే దక్కుతుంది. కానీ స్వప్రయోజనం కోసమైనా పరప్రయోజనాన్ని సాధించిపెట్టిన ఫలితం గోపికలకు దక్కుతుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **సమాదిశత :** | సమాదిశతు/సమాదిశతాత్ | సమాదిశతామ్ | సమాదిశన్తు |
| | సమాదిశ/సమాదిశతాత్ | సమాదిశతమ్ | **సమాదిశత** |
| | సమాదిశాని | సమాదిశావ | సమాదిశామ |

| | | |
|---|---|---|
| **అదాయి :అదాయి** | అదాయిషాతామ్/అదిషాథామ్ | అదాయిషత/అదిషత |
| అదాయిష్ఠాః/అదిష్ఠాః | అదాయిషాథామ్/అదిషాథామ్ | అదాయిధ్వమ్/అదిధ్వమ్ |
| అదాయిషి/అదిషి | అదాయిష్వహి/అదిష్వహి | అదాయిష్మహి/అదిష్మహి. * |

**శ్లో॥ తులసి! మిలసి కృష్ణాంఘ్ర్యమ్బుజే పుణ్యభూజే!**
**వరయ వరయతీన్ద్రైర్వన్దితేఽస్మాన్ వయస్యాః ।**
**మనసి మనసిజాదేర్నిర్వృతిం నిర్మిమీతే**
**వనజ వనజగంధోఽప్యన్తరేణామ్బ! న త్వామ్ ॥ 7-8**

అ : కృష్ణాన్వేషణలో భాగంగా తులసిని అభ్యర్థించుట - ప్రశంసించుట. -మాలిని.

అ : పుణ్యభూజే వరయతి+ఇంద్రైః వందితే తులసి! కృష్ణ+అంఘ్రి+అంబుజే మిలసి వయస్యాః అస్మాన్ వరయ. అంబ త్వామ్ అంతరేణ వనజ వన-జ గంధః అపి మనసిజ+ఆదేః మనసి నిర్వృతిం న నిర్మిమీతే.

**ప్ర :** తులసి = ఓ తులసి మాతా!, పుణ్యభూజే : పుణ్య = పవిత్రమైన, భూజే = వృక్షమా! (పుణ్యః చ అసౌ భూజః , తస్మాత్ సంబుద్ధిః), వర–యతి+ఇంద్రైః = గొప్ప యతి శ్రేష్ఠులచే (యతీనామ్ ఇంద్రాః, వరాశ్చ తే యతీన్ద్రాః , తైః), వందితే = నమస్కరింపబడినదానా (వది ధాతువుపై క్త ప్రత్యయం), కృష్ణ+అంఘ్రి+అంబుజే : కృష్ణ = కృష్ణునియొక్క, అంఘ్రి+అంబుజే = పాద పద్మాలను (కృష్ణస్య అంఘ్రీ అంబుజే ఇవ, తే), మిలసి = కలుస్తున్నావు (మిల సంగమే పరస్మైపది–లట్–మ.ఏ.), వయస్యాః = చెలులమైన, అస్మాన్ = మమ్ములను, వరయ = వరించు/స్వీకరించు. (వృ వరణే ణిచ్ పరస్మైపది–లోట్–మ.ఏ.), అంబ! = తల్లీ, త్వామ్+అంతరేణ = నీవు తప్ప ('అంతరాం తరేణ యుక్తే' (అష్టాధ్యాయి 2–3–4) సూత్రంతో 'త్వామ్' అని ద్వితీయా విభక్తి), వనజ–వన–జ–గంధః+అపి : వనజ = (నీటబుట్టిన) తామరల యొక్క, వన = సమూహానికి, జ= పుట్టిన, గంధః+అపి = పరిమళం కూడా (వనే జాయన్త ఇతి వనజాని/తేషాం వనం–తస్మాత్ జః చ అసౌ గంధః), మనసిజ+ఆదేః = మదనుని తండ్రి యొక్క (కృష్ణుని యొక్క) (మనసి జాయతే ఇతి మనసిజః తస్య ఆదిః, తస్య), మనసి = మనస్సులో, నిర్వృతిమ్ = సుఖాన్ని/స్వస్థతను (శబ్దార్థ కల్పతరుః పుట – 817), న నిర్మిమీతే = కల్గించలేదు. (నిర్–మా–మానే–ఆత్మనేపది–లట్– ప్ర.ఏ.)

**తా ॥** తులసి! నీవు పవిత్రతరువువు. యతిశ్రేష్ఠులచే నమస్కరింపబడే దానవు. కృష్ణ పాద పద్మాలను చేరగలదానవు. ఆ సమయంలో నీ సఖులమైన మమ్ములను అంగీకరించు. (ఆ పదసన్నిధిని కలిగించు.) తల్లీ! నీవు లేకపోతే తామరల మొత్తాల నుండి పుట్టిన పరిమళ మైనా మదన జనకుడైన కృష్ణుని మనస్సులో సుఖాన్ని/స్థైర్యాన్ని కలిగించలేదు.

**వి :** 1. తులసీదళం లేకుండా మరే పూవైనా, పత్రమయినా అది బంగారుతోనో, వెండితోనో చేసినా, రత్నమయమైనా విష్ణుపూజకు పనికిరాదని స్మృతి వచనం–

శ్లో॥ త్వత్పత్రరహితం యత్తు పత్రం వా పుష్పమేవ వా ।
సువర్ణేన కృతం పుష్పం రజతం రత్నమేవ వా ॥
మమ పాదాబ్జపూజాయామనర్హం భవతి ధ్రువమ్ ॥

2. క.హరిచరణములకుఁ బ్రియమై
హరి నిను మన్నింప భద్ర మందెదు తులసీ!
హరి నీ దెస రాఁడు గదా
హరి చొప్పెఱిఁగించి శుభము లందింపఁగదే. – పోతనభాగవతం 10/1014

3. తులసిలోని విశేషాలు–

1. కటుపత్రము, కుఠేరజము, గంధపత్రము, గంధవహాలము, శ్వేతతులసి, సితార్జకము, తెల్లతొళసి
2. కాండమణి, రామతులసి, రామదూతి, సూక్ష్మపర్ణి
3. కృష్ణతులసి, కరాళకము, కాలతులసి, కృష్ణ, కృష్ణార్జకము, గంధతులసి, బహుమంజరి, సురస, నల్లతొళసి
4. క్షవకము, అడవి తొళసి
5. గంధనామము, గంధఫణిజ్జకము, ఎఱ్ఱతొళసి (ఇదె రక్తతులసి)
6. ఫణిర్జకము, కుక్క తొళసి
7. భూతులసి, నేలతొళసి – ఆంధ్రవాచస్పత్యము – 4/2795,96

| | | | |
|---|---|---|---|
| 4. **మిలసి :** | మిలతి | మిలతః | మిలన్తి |
| | **మిలసి** | మిలథః | మిలథ |
| | మిలామి | మిలావః | మిలామః |
| **వరయ :** | వరయతు/వరయతాత్ | వరయతామ్ | వరయన్తు |
| | **వరయ**/వరయతాత్ | వరయతమ్ | వరయత |
| | వరయాణి | వరయావ | వరయామ |
| **నిర్మిమీతే :** | **నిర్మిమీతే** | నిర్మిమాతే | నిర్మిమతే |
| | నిర్మిమీషే | నిర్మిమాథే | నిర్మిమీధ్వే |
| | నిర్మిమే | నిర్మిమీవహే | నిర్మిమీమహే. |

*

**శ్లో॥ బృన్దావనం కిల వనం భవదీయవాస-**
**శ్చాన్ద్రప్రమోదకరచారుకరాభిరామమ్ ।**
**కన్దర్పబాణదళితం బత! యూయమాసాం**
**వృన్దం వృథా కురుథ హా! వ్రజసున్దరీణామ్ ॥ 7-9**

**అ :** గోపికలు బృందావనంలోని వివిధలతలతో అవి పుట్టిన స్థలవిశేషాన్ని తెలుపుట. -వసంతతిలక.

**అ :** బత! చాంద్ర-ప్రమోద-కర-చారు-కర+అభిరామం బృందావనం వనం భవదీయ-వాసః కిల. యూయమ్ ఆసాం వ్రజసుందరీణాం వృందం వృథా కందర్పబాణదళితం కురుథ? హా.

ప్ర : బత = లతలారా! (భేదానుకంపా సంతోషవిస్మ**యామంత్రణే బత**-అమరకోశః- నానార్థావ్యయ-245), చాంద్ర... రామమ్ : చాంద్ర = చంద్ర సంబంధమైనవై, ప్రమోద-కర = ఆనందాన్ని కల్గించేవి అయి, చారు = అందమయిన, కర = కిరణాలచే, అభిరామమ్ = మనోహరమైన (చంద్రస్య సంబంధినః చాంద్రాః, తే చ (ప్రమోదం కుర్వన్తీతి) ప్రమోదకరాః చ, తైః చారవః చ తే కిరణాః, తైః అభిరామమ్), బృందావనమ్ = బృందావనమనే పేరుగల (బృందాయాః వనం బృందావనం, బృందస్య అవనం యస్మాత్ = బృందావనం - రెండు రకాలుగా విగ్రహవాక్యం - నారాయణాచార్యవ్యాఖ్య), వనమ్ = అడవి (తరులతలచే దట్టమైన అడవి అని కొందరు), భవదీయ-వాసః కిల = మీ నివాసం గదా!, యూయమ్ = మీరు, ఆసామ్ = ఈ, వ్రజ-సుందరీణామ్ = గోపకాంతలకు (వ్రజ సంబంధిన్యః సుందర్యః, తాసామ్), వృందమ్ = సమూహాన్ని, వృథా = నిరర్థకంగా, కందర్ప-బాణ-దళితమ్: కందర్ప = మదనుని యొక్క, బాణ = బాణాలచే, దళితమ్ = బ్రద్దలైన దానినిగా, కురుథ = చేస్తారా? (కృ కరణే పరస్మైపది-లట్-మ.బ.), హా = అయ్యో!

**తా ॥** లతలారా! పొదలారా! ఆహ్లాదకరాలయిన చంద్రకిరణాలచే అందమయిన బృందావనం మీ నివాసస్థానం గదా! ఈ గోపకాంతలలో కామభావనను పెంచి నిరర్థకంగా వీరిని మదనబాణపీడితలను చేస్తారా? అయ్యో! (బృందావనం వాసమయిన మీరు బృంద+అవనం (రక్షణం) చేయరా?)

**వి :** 1. ఇక్కడ విషాదనాలంకారధ్వని. లతల వాసం బృందావనం కాబట్టి - బృంద+ అవనమంటే బృందాన్ని రక్షించటం కాబట్టి ఆ లతలు కాపాడగలవని భావిస్తే అవి కామభావనను పెంచుతున్నాయి కాబట్టి విషాదనాలంకారం ధ్వనిస్తోంది. 'ఇష్యమాణ విరుద్ధార్థసంప్రాప్తిస్తు విషాదనమ్' - (కు.132)

2. ఇక్కడ లతలనన్నింటినీ కలిపి ఒకటిగా నిష్ఠురంగా మాటాడారు గోపికలు. విడివిడిగా వాటిని సంబోధిస్తూ గోపికలు మాటాడటాన్ని పోతన ఇలా విస్తరించాడు.

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ - బాటలీతరులార! పట్టరమ్మ!
హేలావతులఁ గృష్ణ! యేల పాసితి వని - యైలేయలతలార! యడుగరమ్మ!
వనజాక్షుఁ డిచటికి వచ్చి డాఁగఁడు గదా! - చూతమంజరులార! చూడరమ్మ!
మాననీమదనుతో మారాక యెఱిఁగించి - మాధవీలతలార! మనుపరమ్మ!

ఆ. జాతి సతులఁబాయ నీతియే హరి కని
జాతులార! దిశలఁ జాటరమ్మ!
కదళులార! పోయి కదలించి శిఖిపింఛ
జూటుఁ దెచ్చి కరుణఁ జూపరమ్మ! - పోతనభాగవతము - 10/1013

| | | | |
|---|---|---|---|
| 3. **కురుథ :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | **కురుథ** |
| | కరోమి | కుర్వః | కుర్మః. |

*

**శ్లో॥ నః సన్దిశన్తు నయనోత్సవమచ్యుతం తం**
**నక్రాతిభీతగజగీతచరిత్రజాతమ్ ।**
**పశ్చాత్ తదఙ్ఘ్రియుగలే వినివేశ్య కుర్మః**
**పద్మాసనాదిసురసఞ్చయసత్కృతా వః ॥ 7-10**

**అ :** లతలను ఉన్నతస్థితిని కల్పించగలమని గోపికలు ప్రలోభపెట్టి, కృష్ణుని జాడ తెలుసుకొనే ప్రయత్నం చేయటం. -వసంతతిలక.

**అ :** (సాధ్వ్యః) నక్ర+అతిభీతగజగీతచరిత్రజాతమ్ నయన+ఉత్సవం తమ్ అచ్యుతం నః సందిశన్తు. పశ్చాత్ తదంఘ్రియుగలే వినివేశ్య వః పద్మాసన+ఆది-సురసంచయ-సత్కృతాః కుర్మః.

**ప్ర :** (సాధ్వ్యః) = పతివ్రతలారా! (సంబోధనార్థక పదం 7వ శ్లోకం నుండి), నక్ర... జాతమ్ : నక్ర = మొసలినుండి, అతిభీత = చాలా భయపడిన, గజ = ఏనుగుచే, గీత = నుతింపబడ్డ, చరిత్ర-జాతమ్ = నడవడి తీరులుగల వాడును (నక్రాద్ అతిభీతేన గజేన గీతం చరిత్రస్య జాతం యస్య తమ్), నయన+ఉత్సవమ్ : నయన = కళ్ళకు, ఉత్సవమ్ = ఆనందకరుడును (కన్నుల పండుగయు) అయిన (ఉత్సేకామర్షయోః, ఇచ్ఛాప్రభవే ఉత్సవః -అమరకోశః-నానార్థ-210) (నయనయోః ఉత్సవః యస్మాత్, తమ్.), తమ్ అచ్యుతమ్ = ఆ కృష్ణుని, నః = మాకు, సందిశన్తు = చూపండి. (సమ్ దిశ్ అతిసర్జనే-పరస్మైపది-లోట్-ప్ర.బ.), పశ్చాత్ = ఆ తరువాత, తద్-అంఘ్రి-యుగలే:తద్=ఆ కృష్ణునియొక్క, అంఘ్రి = పాదాల యొక్క, యుగలే = జంటపై, వినివేశ్య = ఉంచి (వి-ని-విశ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వః = మిమ్ము, పద్మాసన+ఆది-సుర-సంచయ-సత్కృతాః : పద్మాసన+ఆది = బ్రహ్మ మొదలుగా గల, సుర = దేవతలయొక్క, సంచయ = సమూహంచేత, సత్కృతాః = సత్కరింపబడినవాటినిగా (పద్మాసనః ఆదౌ యేషాం తే, చ తే సురాణాం సంచయాః, తైః సత్కృతాః), కుర్మః = చేస్తాము. (కృ కరణే పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** లతలారా! మొసలికి భయపడిన ఏనుగుచే గానం చేయబడిన నడవడి తీరులు గల వాడునూ, మా కన్నుల పండువయు అయిన కృష్ణుని చూపించండి. ఆ పై ఆ కృష్ణుని పాదాలదగ్గర మిమ్ము నిలిపి బ్రహ్మాదిదేవతాసమూహాలు కూడా మిమ్ము సత్కరించేటట్లు చేయగలం.

**వి :** 1. భాగవతం అష్టమస్కంధంలోని తృతీయాధ్యాయమంతా గజేంద్రకృతమైన పరమాత్మగీతమే. మచ్చుకు-

శ్లో॥ నమో నమస్తేఽఖిలకారణాయ - నిష్కారణాయాద్భుతకారణాయ ।
సర్వాగమామ్నాయ మహార్ణవాయ - నమోఽపవర్గాయ పరాయణాయ ॥ 1511

2. తెలుగులో పోతన భాగవతంలోని గజేంద్రమోక్షం. దానిలోని పద్యాలు చాలా తెలుగువారి నోళ్ళలో నానుతుంటాయి.

**నారాయణస్తుతి**

**ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై**
**యెవ్వని యెందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం**
**బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వముఁ దానయైన వాఁ**
**డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేఁడెదన్.**

**గజేంద్రం తన నిస్సహాయతను వ్యక్తం చేయటం :**

**శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్**
**నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మన్నింపందగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! ॥ -పోతనభాగవతం 8/73,90**

3. ఇది అన్యోన్యాలంకారం. '**అన్యోన్యం నామ యత్ర స్యాదుపకారః పరస్పరమ్**' - (కు. 68), పరస్పరోపకారముంటే అన్యోన్యాలంకారం. ఇక్కడ లతలు గోపికలకు కృష్ణుని చూపించి సహకరించటం, గోపికలు లతాంతాలను కృష్ణపదసన్నిధికి చేర్చి సహకరించటం - అయితే ఇక్కడ రెండూ ఇంకా జరగని పనులే.

| | | | |
|---|---|---|---|
| 4. **సందిశన్తు :** | సందిశతు/సందిశతాత్ | సందిశతామ్ | **సందిశన్తు** |
| | సందిశ/సందిశతాత్ | సందిశతమ్ | సందిశత |
| | సందిశాని | సందిశావ | సందిశామ |
| **కుర్మః :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | **కుర్మః.** |

*

**శ్లో॥ బత! నతజనబన్ధుం సాన్ద్రసౌన్దర్యసిన్ధుం**
**యదునృపకులసారం యచ్చుతోదారహారమ్ ।**
**తదను శిరసి యుష్మాన్ ధారయామః కృతేష్టాః**
**పరమపదయుగాబ్జే పూరయామః ప్రహృష్టాః ॥ 7-11**

**అ :** గోపికలు లతాతరుగుల్మాదులను అభ్యర్థించటమే. -మాలిని.

**అ :** బత! నతజనబన్ధుం సాంద్రసౌందర్యసారమ్ ఉదారహారం యదునృపకులసారం యచ్చుత. తదను కృత+ఇష్టాః (సత్యః) యుష్మాన్ శిరసి ధారయామః ప్రహృష్టాః పరమపదయుగ+అబ్జే పూరయామః.

**ప్ర :** బత = లతలారా! (ఆమంత్రణార్థంలో 'బత' అవ్యయం), నత-జన-బన్ధుమ్ : నత = నమస్కరించిన/లోబడిన, జన = జనులకు, బన్ధుమ్ = బంధువయినవాడును, (నతాశ్చ తే జనాః, నతజనాః తేషాం బన్ధుః, తమ్), సాంద్ర-సౌందర్య-సారమ్ : సాంద్ర = ఒత్తైన, సౌందర్య = అందంయొక్క, సారమ్ = స్థిరాంశస్వరూపుడును

(సాంద్రం చ తత్ సౌందర్యమ్, తస్య సారమ్), ఉదార–హారమ్ : ఉదార = విలువైన, హారమ్ = ముత్యాలపేరులు గల వాడును అయిన (ఉదారాః హారాః యస్య తమ్), యదుకులనృపసారమ్ : యదుకుల = యదువంశానికి చెందిన, నృప = రాజులలో, సారమ్ = అంతశ్శక్తివంతి వాడును అయిన కృష్ణుని, యచ్ఛత = అందజేయండి. (దాణ్ దానే–పరస్మైపది–లోట్–మ.బ.), తదను = ఆ పై, కృత+ఇష్టాః (సత్యః) : కృత = పూర్తిచేయబడిన, ఇష్టాః (సత్యః) = కోరికలు గలవారమై, యుష్మాన్ = మిమ్ము, శిరసి = తలపై, ధారయామః = ధరిస్తాము. (ధృ–ధారణే–ణిచ్–పరస్మైపది–లట్–ఉ.బ.), ప్రహృష్టాః (సత్యః) = ఆనందించినవారమై, పరమ+పద–యుగ+అబ్జే : పరమ = పరమాత్మ యొక్క, పద–యుగ = పాదాల జంట అనే, అబ్జే = పద్మాలపై, పూరయామః = నింపుతాము. (పూర్–ఆప్యాయనే–ణిచ్–పరస్మైపది– లట్–ఉ.బ.)

**తా ॥** లతలారా! వినమ్రులై వచ్చినవారికి బంధువు, సాంద్రసౌందర్యసింధువు, విలువైన ముత్యాలహారాలు ధరించినవాడు, యదుకుల రాజులలో శ్రేష్ఠుడు అయిన కృష్ణుని మాకు చేర్చండి. ఆపై మా కోరికలు తీరినందువల్ల మిమ్ము నెత్తిన పెట్టుకొంటాం. పరమానందంతో పరాత్పరుని పాదాలను మీతో నింపుతాం.

**వి :** 1. శిరసి ధారయామః – నెత్తినపెట్టుకొంటాం. ఇది గొప్ప గౌరవానికి చిహ్నం. తలలో అలంకరించుకొనటాన్నీ ఇది సూచిస్తుంది. విరహకారణంగా వారు పూలను వాడటం లేదు. కృష్ణసాహచర్యం లభిస్తే తలలో పెట్టుకొంటారు.

| | | | |
|---|---|---|---|
| 2. **యచ్ఛత :** | యచ్ఛతు/యచ్ఛతాత్ | యచ్ఛతామ్ | యచ్ఛన్తు |
| | యచ్ఛ/యచ్ఛతాత్ | యచ్ఛతమ్ | **యచ్ఛత** |
| | యచ్ఛాని | యచ్ఛావ | యచ్ఛామ |
| **ధారయామః :** | **ధారయతి** | ధారయతః | ధారయన్తి |
| | ధారయసి | ధారయథః | ధారయథ |
| | ధారయామి | ధారయావః | **ధారయామః** |
| **పూరయామః :** | పూరయతి | పూరయతః | పూరయన్తి |
| | పూరయసి | పూరయథః | పూరయథ |
| | పూరయామి | పూరయావః | **పూరయామః.** |

*

**శ్లో॥ గచ్ఛన్తు పత్యుర్గతిమాసు నైతా – వక్ష్యన్తి గాఢం పరిరమ్భణే నః ।**
**స్వాయాసమాశఙ్క్య తదీయయోగ–మాలాః సమాలమ్బ్య కృతాఙ్గసఙ్గాః ॥7-12**

**అ :** లతలు తమను మోసం చేస్తాయేమో అని గోపికలు శంకించటం.

**అ :** తదీయయోగమాలాః సమాలంబ్య కృతాంగసంగాః ఏతాః నః గాఢం పరిరంభణే స్వ+ఆయాసమ్ ఆశంక్య ఆసు పత్యుః గతిం న వక్ష్యంతి. గచ్ఛన్తు.

**ప్ర :** తదీయ–గేయ–మాలాః : తదీయ = ఆ కృష్ణునియొక్క, గేయ–మాలాః = స్తోత్రమాలలను (తదీయాః గేయాః ఏవ మాలాః, తాః), సమాలంబ్య = ఆశ్రయించుకొని, కృత+అంగ+ సంగాః : కృత = కల్పించుకొన్న, అంగ–సంగాః = శరీరసాహచర్యం గల (కృతః అంగైః సంగః యాభిస్తాః), ఏతాః = ఈ లతలు, గాఢమ్ = గట్టిగా, నః = మమ్ము, పరిరంభణే = కౌగిలిస్తే, స్వ+ఆయాసమ్ = తమకు కలుగబోవు ఒత్తిడిని, ఆశంక్య = శంకించి, ఆసు = ఈ గోపికల యందు/కు, పత్యుః = ప్రభువైన కృష్ణునియొక్క, గతిమ్ = దారిని, న వక్ష్యంతి = చెప్పబోవుట లేదు (వచ పరిభాషణే పరస్మైపది–ల్యట్–ప్ర.బ.), గచ్ఛన్తు = పదండి. (గమ్ గతౌ పరస్మైపది–లోట్–ప్ర.బ.)

**తా ॥** ఈ పూలు స్తుతింపదగిన ఆ కృష్ణుని పూల మాలల ద్వారా కృష్ణుని శరీరసంబంధాన్ని పొంది వున్నాయి. ఒకవేళ కృష్ణుడు మనలను గట్టిగా కౌగిలించుకొంటే మధ్యలో వున్న తమకు శ్రమ కలుగుతుందేమో అని శంకించి, స్వామి వెళ్ళినదారిని గూర్చి మనకు చెప్పటం లేదు. పదండి. (మరోవైపు వెళదాం).

| | | | |
|---|---|---|---|
| వి : 1. **గచ్ఛన్తు :** | గచ్ఛతు/గచ్ఛతాత్ | గచ్ఛతామ్ | **గచ్ఛన్తు** |
| | గచ్ఛ/గచ్ఛతాత్ | గచ్ఛతమ్ | గచ్ఛత |
| | గచ్ఛాని | గచ్ఛావ | గచ్ఛామ |
| **వక్ష్యంతి :** | వక్ష్యతి | వక్ష్యతః | **వక్ష్యంతి** |
| | వక్ష్యసి | వక్ష్యథః | వక్ష్యథ |
| | వక్ష్యామి | వక్ష్యావః | వక్ష్యామః. |

*

**శ్లో॥ అన్యాఞ్చనాన్ముకులితం సరసీరుహాస్య**
**మన్వేతి మన్దమరుతా చలితం ద్విరేఫః ।**
**సన్నాథ! పశ్య సదయాగ్రగ! సాధువశ్య!**
**కిం నః పరిత్యజసి ఖిన్నహృదస్త్వదర్థే ॥ 7-13**

**అ :** ద్విరేఫప్రవృత్తిని వివరిస్తూ అలా తమను ఆదరించమని గోపికలు కృష్ణుని (పరోక్షంగా) కోరటం. -వసంతతిలక.

**అ :** ద్విరేఫః అన్యా+అంచనాత్ ముకుళితం మందమరుతా చలితం సరసీరుహాస్యమ్ అన్వేతి. పశ్య. సన్నాథ! సదయ+అగ్రగ! సాధువశ్య! త్వదర్థే ఖిన్నహృదః నః కిం పరిత్యజసి?

**ప్ర :** ద్విరేఫః = తుమ్మెద (ద్వౌ రేఫౌ యస్మిన్ సః) (ఇందిందిరాళి షట్చరణచంచరీ కాలినో ద్విరేఫాః స్యుః - హలాయుధకోశః - 255), అన్యా+అంచనాత్ : అన్యా = మరొక తీగె వైపు, అంచనాత్ = వెళ్ళుటవలన, ముకుళితమ్ = ముడుచుకొన్నదై, మంద-మరుతా : మంద = మెల్లగా వీస్తున్న, మరుతా = గాలిచేత (మందశ్చాసౌ మరుత్ - తేన), చలితమ్ = కదల్చబడిన (చల్ ధాతువుపై క్త ప్రత్యయం), సరసీరుహ+ఆస్యమ్ = కమలంయొక్క ముఖాన్ని, అను+ఏతి = అనుసరిస్తోంది. (అను+ఇ గతౌ పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), పశ్య = చూడు, సత్+నాథ = సజ్జనస్వామీ (సతాం నాథః, తస్మాత్ సంబుద్ధిః), సదయ+అగ్ర-గ : సదయ = దయగలవారిలో, అగ్ర-గ = ముందు నిలుచువాడా! (దయయా సహితాః సదయాః, తేషు అగ్రే గచ్ఛతి ఇతి-సదయాగ్రగః, తస్మాత్ సంబుద్ధిః), సాధువశ్య! = సాధువులకు వశమైనవాడా!, త్వదర్థే = నీకై, ఖిన్నహృదః = ఖేదపడిన మనస్సులు గల (ఖిన్నాని హృన్ది యాసాం తాః), నః = మమ్ము, కిమ్ = ఎందువలన, పరిత్యజసి = విడుస్తున్నావు. (పరి-త్యజ్ హానౌ- పరస్మైపది-లట్-మ.ఏ.)

**తా ॥** అటు తుమ్మెదను చూడు. మరొక పూవు వైపు వెళ్ళినందుకు ముడుచుకొనిపోయిన సరసీరుహాస్యను అనుసరించి మెల్లగాలికి అది ఎటువైపు వెళ్తే ఇదీ అటే వెళ్తోంది. సజ్జనపతివి. దయామయులలో అగ్రగణ్యుడవు. సాధువులకు వశమైనవాడవు. నీ కోసం కలతపడే మనస్సులు గల మమ్ములను ఎందుకు విడిచిపెడ్తున్నావు.

**వి :** 1. తుమ్మెదను ఒక దక్షిణనాయకుడుగా ప్రదర్శించి, ఉదాహరించి చూపుతూ గోపికలు కృష్ణుని అభ్యర్థిస్తున్నారు. పరిత్యజించవద్దని ప్రార్థిస్తున్నారు.

2. **ద్విరేఫ** శబ్దానికి తుమ్మెద అనే అర్థం లక్షణా భేదాలయిన లక్షితలక్షణద్వారా వస్తుంది. ద్విరేఫ మంటే రెండు రకారాలు కలది అని అర్థం. రెండు రకారాలున్న పదం ఏదయినా కావచ్చు. కానీ 'భ్రమర' పదాన్నే అక్కడ స్వీకరిస్తాం. భ్రమర శబ్దానికి తుమ్మెద అని అర్థం. కాబట్టి ద్విరేఫ శబ్దానికి తుమ్మెద అని అర్థం చెప్పుకొంటాం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అన్వేతి :** | **అన్వేతి** | అన్వితః | అనుయన్తి | |
| | అన్వేషి | అన్విథః | అన్విథ | |
| | అన్వేమి | అన్వివః | అన్విమః | |
| **పరిత్యజసి :** | పరిత్యజతి | పరిత్యజతః | పరిత్యజన్తి | |
| | **పరిత్యజసి** | పరిత్యజథః | పరిత్యజథ | |
| | పరిత్యజామి | పరిత్యజావః | పరిత్యజామః. | * |

**శ్లో॥ హే పద్మిని! ప్రియముదీరయ పీవరాంసం**
**నారాయణః స తు తవాస్త్యుదరే నిగూఢః ।**
**త్వం హి స్వభావమధురేతి బతార్థ్యసేఽమ్బ!**
**నో చేద్దృగమ్బునికరైః కలుషా ఖలు స్యాః ॥ 7-14**

**అ :** గోపికలు కృష్ణుని ఆచూకీకై సరస్సును అభ్యర్థించటం. -వసంతతిలక.

**అ :** హే పద్మిని! పీవర+అంసం ప్రియమ్ ఉదీరయ. సః తు నారాయణః తవ ఉదరే నిగూఢః అస్తి. బత అంబ త్వం స్వభావమధురా ఇతి అర్థ్యసే హి. నో చేత్ దృగ్-అంబు-నికరైః కలుషా స్యాః ఖలు.

**ప్ర :** హే పద్మిని! = ఓ తటాకమా! (పద్మాని అస్మిన్ సంతీతి, తస్మాత్ సంబుద్ధిః), పీవర+ అంసమ్ : పీవర = బలమైన, అంసమ్ = మూపులుగల (స్కన్ధో భుజశిరోఽంసోఽస్త్రీ - అమరకోశః-మనుష్య-78), ప్రియమ్ = ప్రియుడైన కృష్ణుని గూర్చి, ఉద్+ఈరయ = తెలియజేయి (ఉద్+ఈర్ క్షేపే-పరస్మైపది-లోట్-మ.ఏ.), సః తు = ఆ కృష్ణుడయితే, నారాయణః = నారాయణుడు. (నారాః అయనం యస్య సః - నీరు ఆశ్రయంగా కలవాడు), నిగూఢః = చాటుగా (ని-గూహ్ ధాతువుపై క్త ప్రత్యయం), తవ-ఉదరే = నీలోన, అస్తి = ఉన్నాడు. (అస భువి పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), బత అంబ = ఓ తల్లీ!, త్వమ్=నువ్వు, స్వభావ-మధురా:స్వభావ = పుట్టుకవలననే, మధురా = తీయనిదానవని (స్వభావేన మధురా), అర్థ్యసే హి = కోరబడుతున్నావు గదా! (అర్థ ఉపయాంచాయామ్ -కర్మణి-ఆత్మనేపది-లట్-మ.ఏ.), నో చేత్ = కాకపోతే, దృగ్-అంబు-నికరైః : దృగ్-అంబు = కన్నీటియొక్క, నికరైః=సమూహాలతో (దృశామ్ అంబూని, తేషాం నికరాః, తైః), కలుషా = మలినమైనదానివి, స్యాః ఖలు = అయ్యేదానవు గదా! (అస భువి-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** ఓ సరోవరమా! బలిష్ఠమైన మూపురాలుగల మా ప్రియుని గూర్చి తెలియజేయి. ఆయన నారాయణుడు. మీలోపలే దాగివున్నాడు. నీవు పుట్టుకతోనే తీయని దానవు. అందుకే నిన్ను అభ్యర్థిస్తున్నాము. లేకపోతే మా కన్నీటితో నిన్ను మలినం చేయగలం.

**వి :** 1. సరస్సు స్వభావమధుర. దానిలోని నీరు నిర్మలంగా, తీయగా వుంటుంది కాబట్టి. కన్నీరు ఉప్పగా రుచిస్తుంది. నేత్రమాలిన్యాన్ని మోసుకొని వస్తుంది. కాబట్టి కన్నీరు సరస్సులో కలిస్తే సరోవర జలం మలిన మవుతుంది. దీని దోషం దాని కంటుతుంది. అది ఉల్లాసాలంకారం. 'ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌయది' - (కు.133), అయితే కన్నీరు ఎంత కారితే సరోవర జలాన్ని మలినం చేయగలదు? అది సంభవమా? అంటే కాకపోవచ్చు. అందుకే దాన్ని అత్యుక్త్యలంకార మన్నారు. '**అత్యుక్తిరద్భుతా తథ్యశౌర్యౌదార్యాది వర్ణనమ్**' - (కు.163)

| | | | |
|---|---|---|---|
| 2. **ఉదీరయ :** | ఉదీరయతు/ఉదీరయతాత్ | ఉదీరయతామ్ | ఉదీరయన్తు |
| | **ఉదీరయ**/ఉదీరయతాత్ | ఉదీరయతమ్ | ఉదీరయత |
| | ఉదీరయమ్ | ఉదీరయావ | ఉదీరయామ |

| | | | |
|---|---|---|---|
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **అర్థ్యసే :** | అర్థ్యతే | అర్థ్యేతే | అర్థ్యన్తే |
| | **అర్థ్యసే** | అర్థ్యేథే | అర్థ్యధ్వే |
| | అర్థ్యే | అర్థ్యావహే | అర్థ్యామహే |
| **స్యాః :** | స్యాత్ | స్యాతామ్ | స్యుః |
| | **స్యాః** | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ పత్యాసమం తవ జలే విమలే విహృత్య**
**కుర్మః కుచౌఘకృతకుఙ్కుమరఞ్జితాం త్వామ్ ।**
**ముగ్ధప్రసన్నముఖసారసశోభమానాం**
**స్వర్ముక్తపుష్పనికరైః పరితః సుపూర్ణామ్ ॥** **7-15**

**అ :** గోపికలు పద్మినితో మాటాడటం - దానిని ప్రలోభపెట్టే ప్రయత్నం చేయటం. -వసంతతిలక.

**అ :** (పద్మిని!) విమలే తవ జలే పత్యా-సమం విహృత్య త్వామ్ కుచ+ఓఘ కృత కుంకుమ రంజితాం ముగ్ధ ప్రసన్న-ముఖసారస-శోభమానాం స్వః+ముక్త-పుష్పనికరైః పరితః సుపూర్ణాం కుర్మః

**ప్ర :** (పద్మిని!) = సరోవరమా!, విమలే = నిర్మలమైన, తవ = నీ యొక్క, జలే = నీటిలో, పత్యా-సమమ్ = భర్తతో కలిసి ('పతి' శబ్దం-భర్తృర్థ (పుంలింగ) బోధకమైనా-స్త్రీలింగమే), విహృత్య = విహరించి (వి-హృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం-తుగాగమం) (**హ్రస్వ స్యపితి కృతితుక్**-అష్టాధ్యాయి-6-1-71), త్వామ్ = నిన్ను, కుచ+ఓఘ-కృత-కుంకుమ-రంజితామ్ : కుచ = రొమ్ములయొక్క, ఓఘ = సమూహమందు, కృత = అలంకరింపబడిన, కుంకుమ = కుంకుమచేత, రంజితామ్ = ఎఱ్ఱగా చేయబడినదానినిగా, (కుచానామ్ ఓఘః, తస్మిన్ కృతం చ తత్ కుంకుమం, తేన రంజితా, తామ్), ముగ్ధ-ప్రసన్న-ముఖ-సారస-శోభమానామ్ : ముగ్ధ = అమాయకమైన, ప్రసన్న = ప్రశాంతమైన, ముఖ-సారస = ముఖా లనే పద్మాలతో, శోభమానామ్ = ప్రకాశించుదానినిగా (ముగ్ధాని ప్రసన్నాని చ ముఖాని ఏవ సారసాణి, తైః శోభమానా, తామ్), స్వః+ముక్త-పుష్ప-నికరైః : స్వః = స్వర్గనుండి, ముక్త = విడువబడిన, పుష్ప = పూలయొక్క, నికరైః = సమూహాలతో, పరితః = అంతటా, సుపూర్ణామ్ = నింపబడినదానినిగా (స్వః ముక్తానాం పుష్పాణాం నికరైః), కుర్మః = చేస్తాము. (కృ కరణే పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** సరోవరమా! (కృష్ణుని జాడ తెలిపితే) కృష్ణునితో కలిసి నిర్మలమయిన నీ నీటిలో విహరించి మా రొమ్ముల మీద అలంకరించుకొన్న కుంకుమతో నిన్ను ఎఱ్ఱబరుస్తాము. మా ముఖాలు అనే పద్మాలతో ప్రకాశింపజేస్తాం. స్వర్గం నుండి కురిసే పూల సమూహాలతో నిన్ను ముంచెత్తుతాం.

**వి :** 1. కుచకుంకుమల ఎఱ్ఱదనంతో కొలనునీరు ఎఱ్ఱబడటం స్వగుణాన్ని వదలి పరగుణాన్ని స్వీకరించటం, అది తద్గుణాలంకారం. '**తద్గుణః స్వగుణత్యాగాదన్యదీయగుణగ్రహః**'-(కు. 141), 'ముఖ-సారస'-ముఖాలలో సారసత్వాన్ని ఆరోపించటం. అది రూపకాలంకారం.

2. ఈ శ్లోకంలో గోపికల భావప్రకటన ఉత్తరోత్తరం బలహీనమై వారిలోని దీనత్వానికి అద్దం పడుతోంది.

మొదటి తమ గుణాన్ని సరస్సు కందజేస్తామన్నారు. తరువాత తటస్థంగా వుండి శోభింపజేస్తామన్నారు. ఆ తరువాత ఎక్కడనుండో ఊడిపడిన వాటితో పరిపూర్ణం చేస్తామన్నారు. మనస్సులోని సాంద్రత తగ్గింది. అది దీనత్వానికి సంకేతం.

3. **కుర్మః :** 7-10వ శ్లోక వాఖ్య చూడుడు. *

**శ్లో॥ నైషా నవామ్బుదతనుం కథయేన్నిజం నః - స్వీయప్రవాహభరధిక్కృతలోకవార్తా ।**
**సా చుమ్బితాఖిలసరోరుహకోమలాస్యా - భృఙ్గావళీభిరితరార్తిమజానతీ యా ॥16**

**అ :** పద్మిని విషయమై గోపికల నిష్ఠురవచనాలు. -వసంతతిలక.

**అ :** యా భృంగ+ఆవళీభిః చుంబిత+అఖిల-సరోరుహకోమల+ఆస్యా ఇతర+ఆర్తిమ్ అజానతీ సా ఏషా స్వీయప్రవాహభరధిక్కృతలోకవార్తా నిజం నవ+ అంబుదతనుం నః న కథయేత్.

**ప్ర :** యా = ఏదయితే, భృంగ+ఆవళీభిః : భృంగ = తుమ్మెదలయొక్క, ఆవళీభిః = వరుసలచే (భృంగానామ్ ఆవల్యః, తాభిః) (ఆలీ శ్రేణ్యావళీ పంక్తిః-హలాయుధకోశః- 721), చుంబిత+అఖిల-సరోరుహ-కోమల+ఆస్యా : చుంబిత = ముద్దిడబడిన, అఖిల = అన్నీ, సరోరుహ = తామర లనే, కోమల = మనోహరమైన, ఆస్యా = ముఖంగలదై (చుంబితాని అఖిలాని సరోరుహాణి ఏవ కోమలమ్ ఆస్యం యస్యా స్సా), ఇతర+ఆర్తిమ్ : ఇతర = ఇతరులయొక్క, ఆర్తిమ్ = బాధను, అజానతీ = తెలియదో, సా+ఏషా = ఆ ఈ పద్మిని, స్వీయ-ప్రవాహ-భర-ధిక్కృత-లోక-వార్తా : స్వీయ = తనయొక్క, ప్రవాహ = ప్రవాహంయొక్క, భర = భారంచేత, ధిక్కృత = ధిక్కరింపబడిన/పట్టించుకోని, లోక-వార్తా = లౌకిక (జనుల) వార్తలు గలదై (స్వీయస్య ప్రవాహస్య భరేణ ధిక్కృతాః లోకస్య వార్తాః యయా సా), నవ+అంబుద-తనుమ్ : నవ+అంబుద = క్రొత్త మొయిలు వంటి, తనుమ్ = శరీరంగల (నవశ్చ అసౌ అంబుదః స ఇవ తనుః యస్య తమ్), నిజమ్ = మన యొక్క కృష్ణుని గూర్చి, నః = మనకు, న కథయేత్ = చెప్పదు. (కథ వాక్యప్రబంధే పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.)

**తా ॥** తుమ్మెదల వరుసలు ఈ సరోవరంలోని తామర లనే కోమలముఖాన్ని చుంబిస్తున్నాయి. ఇక దీనికి ఇతరుల బాధ తెలియదు. తన ప్రవాహభారంవలన లోకుల విషయాలను పట్టించుకొనే స్థితి లేదు. నవాంబుదశ్యాముడైన కృష్ణుని గూర్చి ఇది మనకు చెప్పలేదు. (మరోచోట వెదుకుదాం)

**వి :** 1. ఇక్కడ ప్రస్తుతాంశం పద్మినీ (సరోవర) విషయప్రస్తావం. అది తమకు తమ ప్రియుని జాడ తెలియజేయటం లేదని. దాని ద్వారా తాను సుఖంగా ఉంటూ ఇతర లోకులను పట్టించుకోని ఒకానొక భోగవతి వృత్తాంతం స్ఫురిస్తుంది కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్**' - (కు.61)

**నవాంబుదతనుమ్** - ఇది లుప్తోపమాలంకారం. నవమేఘంయొక్క శరీరంవంటి శరీరం గలవాడు అన్నచోట ఉపమానం, ఉపమావాచకం, సాధారణధర్మం కూడా లోపించినందువల్ల ఇది ధర్మోపమానవాచకలుప్త.

శ్లో॥ వర్ణ్యోపమానధర్మాణాముపమావాచకస్య చ ।
ఏకద్విత్ర్యనుపాదానైర్భిన్నా లుప్తోపమాష్టధా ॥ - (కు.7)

| | | | |
|---|---|---|---|
| 2. **కథయేత్ :** | **కథయేత్** | కథయేతామ్ | కథయేయుః |
| | కథయేః | కథయేతమ్ | కథయేత |
| | కథయేయమ్ | కథయేవ | కథయేమ. |

*

**శ్లో॥పద్మాని! శంసత పయోఽబ్ధిసుతాకళత్రం - యుష్మద్వనేషు వసతీతి వదన్తి సన్తః ।**
**కుక్షిస్థితాయ విధయేఽపరథా లలాట-లేఖాం స్మ జీవనకృతే రచితాం విమార్ష్టమ్॥17**

**అ :** గోపికలు పద్మాకరాన్ని కాదని పద్మాలను కృష్ణుని జాడ తెలుపుమని కోరటం. –వసంతతిలక.

**అ :** పద్మాని! పయః+అబ్ధిసుతాకళత్రం శంసత. యుష్మద్–వనేషు వసతి+ఇతి సన్తః వదన్తి. అపరథా జీవనకృతే రచితాం లలాటలేఖాం విమార్ష్టుమ్ కుక్షిస్థితాయ విధయే శంసత.

**ప్ర :** పద్మాని! = తామరలారా!, పయః+అబ్ధి సుతా–కళత్రమ్ : పయః+అబ్ధి = పాలకడలి యొక్క, సుతాః =పుత్రిక, కళత్రమ్ = భార్యగా గలవానిని గూర్చి (కృష్ణుని గూర్చి) (పయసామ్ అబ్ధిః తస్య సుతా కళత్రం యస్య, తమ్), శంసత = చెప్పండి (శంస–స్తుతౌ–పరస్మైపది–లోట్–మ.బ.), యుష్మద్–వనేషు = మీ (పద్మ) వనాలలో, వసతి+ఇతి = నివసిస్తాడని, సన్తః = సజ్జనులు, వదన్తి = చెప్తున్నారు. (వద వ్యక్తాయాంవాచి పరస్మైపది–లట్–ప్ర.బ.), అపరథా = అలా కాకపోతే, జీవన–కృతే = జీవించుట కోసం (జీవనస్య కృతే), రచితామ్ = వ్రాయబడిన, లలాట లేఖామ్ = నుదుటి వ్రాతను (లలాటే లేఖా తామ్), విమార్ష్టుమ్ = తుడిచివేయటానికి (విమార్జ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), కుక్షి–స్థితాయ = కడుపులోనున్న (కుక్షే స్థితః, తస్మై), విధయే = బ్రహ్మకు, శంసత = చెప్పండి.

**తా ॥** తామరలారా! శ్రీకృష్ణుని జాడను గూర్చి మాకు చెప్పండి. ఆయన మీ వనాలలోనే నివసిస్తాడని సజ్జనులు చెప్తున్నారు. అలా చేయలేక పోతే మా జీవితం కోసం మా నుదుట వ్రాసిన వ్రాతను చెరపి వేయమని మీలోన నున్న బ్రహ్మకయినా చెప్పండి.

**వి :** 1. ఈ శ్లోకంలో 'స్మ' పదం **వాక్యాలంకారమాత్రం**.

2. ప్రాణి పుట్టినప్పుడే భవిష్యత్తు మొత్తం నిర్ణయింపబడి వుంటుందని అది నుదుటి వ్రాత రూపంలో వుంటుందనీ (మనకు కనిపించదు) మన ప్రగాఢవిశ్వాసం. దానిని ఎవ్వరూ చెరపలేరని కూడా నమ్మకం.

శ్లో॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణా త్రిదశైరపి ।
లలాటలిఖితా రేఖా న శక్యా పరిమార్జితుమ్ ॥

కానీ కవితాలోకంలో ఆ విశ్వాసానికి అటు ఇటుగా వివిధ భావప్రదర్శన జరుగుతుంటుంది. బ్రహ్మ వ్రాసిన వ్రాత కాబట్టి తననే చెరపి వేయమని గోపికల అభ్యర్థన.

3. **శ్లో॥తులసీకాననం యత్ర యత్ర పద్మవనాని చ ।**
**వసన్తి వైష్ణవా యత్ర తత్ర సన్నిహితో హరిః ॥**

అని తులసీమాహాత్మ్యవచనం, పద్మవనాలో కృష్ణుని ఉనికి అని.

| | | | |
|---|---|---|---|
| 4. **శంసత :** | శంసతు/శంసతాత్ | శంసతామ్ | శంసన్తు |
| | శంస/శంసతాత్ | శంసతమ్ | **శంసత** |
| | శంసాని | శంసావ | శంసామ. |

**వదన్తి :** 7–4వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఇమాని లక్ష్మ్యాః కిల నః సపత్న్యాః – సమాననామాని సదా గృహాణి ।**
**అస్త్రాణి చాస్మాన్ ద్విషతస్తదీయ–పుత్త్రస్య తద్గచ్ఛత దేశమన్యమ్ ॥ 7–18**

**అ :** గోపికలు పద్మాలు కూడా తమకు సహకరించేవి కాదనుకొంటూ మరోవైపు వెళ్ళటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఇమాని నః సపత్న్యాః సమాననామాని సదా గృహాణి కిల. అస్మాన్ ద్విషతః తదీయ పుత్త్రస్య అస్త్రాణి చ. తద్ అన్యం దేశం గచ్ఛత.

ప్ర : ఇమాని = ఈ తామరలు, నః = మన యొక్క, సపత్న్యాః = సవతి అయిన (సమానః పతిః యస్యాః తస్యాః), లక్ష్మ్యాః = లక్ష్మికి, సమాన-నామాని = సమానమైన పేరు గలవి. సదా = ఎల్లప్పుడు, గృహాణి = నివాస స్థానాలు కూడా, అస్మాన్ = మనలను, ద్విషతః= ద్వేషిస్తున్న, తదీయ-పుత్రస్య = ఆ లక్ష్మి కొడుకుకు (మన్మథునికి), అస్త్రాణి చ = ఆయుధాలు కూడా (అరవిందం మన్మథుని బాణాలలో ఒకటి), తద్ = కాబట్టి, అన్యమ్ = మరొక, దేశమ్ = ప్రదేశానికి, గచ్ఛత = వెళ్ళండి. (గమ్ గతౌ పరస్మైపది-లోట్-మ.బ.)

**తా ॥** ఈ తామరలు మన సవతి అయిన లక్ష్మి పేరుతో సమానమైన పేరు గలవి. ఆమెకు నిత్యనివాసాలు. ఆమె కొడుకూ, మనకు శత్రువూ అయిన మదనునికి బాణాలు. కాబట్టి మరొక తావుకు వెళ్దాం.

**వి :** 1. '**లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీర్హరిప్రియా**'-అమరకోశం-అని లక్ష్మికి పద్మ అనీ, పద్మాలయ అని కూడా వ్యవహారం.

2. శ్లో॥ అరవిన్దమశోకం చ చూతం చ నవమల్లికా ।
నీలోత్పలం చ పంచైతే పంచబాణస్య సాయకాః ॥ అరవిందం (తామర) మదనుని అయిదు బాణాలలో ఒకటి.

3. **అన్యమ్ దేశమ్ గచ్ఛత** - మరో ప్రాంతానికి వెళ్ళండి అని ఆదేశం. దానికి కారణం ఆ తామరలు లక్ష్మిపేరిటవి కావటం, ఆమె నివాసం కావటం, ఆమెకొడుకుకు బాణాలు కావటం. అన్యప్రాంతగమనం అనివార్యమని ఇప్పుడు స్పష్టపడుతోంది గదా! అది కావ్యలింగాలంకారం. సమర్థింపవలసిన విషయాన్ని సమర్థించటం. ఇది వాక్యగతం కాబట్టి వాక్యార్థహేతుకం కావ్యలింగం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - (కు. 121) 'అనువుగానిచోట నధికుల మనరాదు' అని వేమన ప్రబోధించింది ఈ నీతినే.

4. **గచ్ఛత :**

| | | |
|---|---|---|
| గచ్ఛతు/గచ్ఛతాత్ | గచ్ఛతామ్ | గచ్ఛన్తు |
| గచ్ఛ/గచ్ఛతాత్ | గచ్ఛతమ్ | **గచ్ఛత** |
| గచ్ఛాని | గచ్ఛావ | గచ్ఛామ. |

*

**శ్లో॥ హే చూత! కృష్ణపదవీం వద నః కృశానాం**
**హే నారికేల! పనసామ్ల! పరాన్ హి యూయమ్ ।**
**పుష్ణీథ పుష్పఫలవల్కలమూలపత్ర-**
**చ్ఛాయాసముల్లసితపల్లవకోటరాద్యైః ॥ 7-19**

**అ :** గోపికలు చూతనారికేళాది తరువులను కృష్ణుని ఆచూకీ కోసం అభ్యర్థించటం. -వసంతతిలక.

**అ :** హే చూత! కృశానాం నః కృష్ణపదవీం వద. హే నారికేళ! పనస! ఆమ్ల ! యూయం పుష్పఫలవల్కలమూలపత్రచ్ఛాయాసముల్లసితపల్లవకోటర+ఆద్యైః పరాన్ పుష్ణీథ.

ప్ర : హే చూత! = ఓ మామిడీ! (ఆమ్రశ్చూతో రసాలో஽సౌ-అమరకోశః-వనౌషధి-32), కృశానామ్ = చిక్కిపోయిన, నః = మాకు, కృష్ణ-పదవీమ్ = కృష్ణమార్గాన్ని (కృష్ణస్య పదవీ తామ్), వద = చెప్పు (వద వ్యక్తాయాంవాచి పరస్మైపది-లోట్- మ.ఏ.), హే నారికేళ! = ఓ కొబ్బరీ!, పనస = పనసా!, ఆమ్ల = చింతా!, (తింత్రిణీ చించామ్లికా-అమరకోశః-వనౌషధి-43), (కృష్ణపదవీం వద = కృష్ణమార్గాన్ని చెప్పు), హి = ఎందుకంటే, యూయమ్ = మీరు, పుష్ప... రాద్యైః : పుష్ప = పూలు, ఫల = పండ్లు, వల్కల = బెరళ్ళు (త్వగ్వల్కం వల్కలం ప్రోక్త-హలాయుధకోశం-183), మూల = వేళ్ళు, పత్ర = ఆకులు, ఛాయా = నీడ, సముల్లసిత = ప్రకాశించే,

పల్లవ = చిగుళ్ళు, కోటర = తొఱ్ఱలు, ఆద్యైః = మొదలయిన వాటితో, పరాన్ = ఇతరులను, పుష్ణీథ = పోషిస్తున్నారు. (పుష్ పుష్టౌ–లట్–మ.బ.) )

**తా ॥** మామిడీ! నారికేళమా! పనసా! ఆమ్లికా ! మేము కృశిస్తున్నాం. కృష్ణమార్గాన్ని గూర్చి చెప్పండి. ఎందుకంటే మీరు మీపూలతో, పండ్లతో, బెరళ్ళతో, వేళ్ళతో, ఆకులతో, నీడతో, చివుళ్ళు మొదలయిన వాటితో ఇతరులను పోషిస్తుంటారు గదా! (కాబట్టి మాకు కూడా ఉపకారం చేయండి)

**వి : 1. శ్లో॥ ప్రథమవయసి పీతం తోయమల్పం స్మరన్తః**
**శిరసి నిహితభారా నారికేళా నరాణామ్ ।**
**సలిలమమృతకల్పం దద్యురాజీవితాంతం**
**నహి కృతముపకారం సాధవో విస్మరన్తి ॥**

అది నారికేళ ప్రశంస. చిన్నప్పుడు ఎప్పుడో త్రాగిన నీటి బరువును తలపై మోస్తూ మనుషులకు జీవితాంతమూ అమృతప్రాయమైన నీటిని ఇస్తున్నాయి కొబ్బరి చెట్లు. చెట్లన్నీ అంతే. చివరకు తనుత్యాగం చేసి అయినా మనుషులకు సహకరిస్తుంటాయి. అటువంటివి తమకు మాటసాయమైనా చేయకూడదా అన్నది గోపికల మాట.

| | | | |
|---|---|---|---|
| 2. **వదతు :** | **వదతు**/వదతాత్ | వదతామ్ | వదన్తు |
| | వద/వదతాత్ | వదతమ్ | వదత |
| | వదాని | వదావ | వదామ |
| **పుష్ణీథ :** | పుష్ణాతి | పుష్ణీతః | పుష్ణన్తి |
| | పుష్ణాసి | పుష్ణీథః | **పుష్ణీథ** |
| | పుష్ణామి | పుష్ణీవః | పుష్ణీమః. |

*

**శ్లో॥ తిన్త్రిణ్యాస్స్వ యతః ఫలాన్యపి సదా వక్రాణి తే ప్రాణినాం**
**సా త్వం తాడనకర్మసూపకురుషే కిం నారికేలేన నః ।**
**మస్తే యః ఫలమభ్రచుమ్బిని నరాలభ్యే త్వచా పక్షిణాఽ–**
**ప్యగ్రాహ్యం దధదధ్వనీనమృతిదం శస్త్రేణ సాధ్యం బలాత్ ॥ 7–20**

**అ :** చింతచెట్టు – కొబ్బరిచెట్లను గోపికలు అధిక్షేపించుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** తింత్రిణి త్వమ్ ఆస్స్వ యతః తే ఫలాని అపి సదా వక్రాణి సా త్వం ప్రాణినాం తాడనకర్మసు ఉపకురుషే. నారికేలేన నః కిమ్? యః అభ్రచుంబిని నర+అలభ్యే మస్తే త్వచా పక్షిణామపి అగ్రాహ్యం అధ్వనీన మృతిదమ్ బలాత్ శస్త్రేణ సాధ్యమ్.

**ప్ర :** తింత్రిణి = చింతచెట్టూ!, త్వమ్ = నువ్వు, ఆస్స్వ = ఉండు. (ఆస ఉపవేశనే ఆత్మనేపది–లోట్–మ.ఏ.), యతః = ఎందుకంటే, తే = నీ యొక్క, ఫలాని+అపి = పండ్లుకూడా, సదా = ఎప్పుడూ, వక్రాణి = వంకర తిరిగినవి, సా త్వమ్ = అటువంటి నీవు, ప్రాణినామ్ = ప్రాణులయొక్క, తాడన–కర్మసు = కొట్టే పనులలో (తాడనమేవ కర్మ తేషు), ఉపకురుషే = సహాయం చేస్తావు. (ఉప–కృ కరణే ఆత్మనేపది–లట్–మ.ఏ.), నారికేలేన = కొబ్బరిచెట్టుతో, నః = మాకు, కిమ్ = ఏం లాభం?, యః = ఏదైతే, అభ్ర–చుంబిని = ఆకాశాన్ని అంటే (అభ్రం చుమ్బతే ఇతి అభ్రచుంబి తస్మిన్), నర+అలభ్యే:నర = మానవులకు, అలభ్యే = అందని (నరాణాం అలభ్యం, తస్మిన్), మస్తే = తలపై (మస్తం మస్తకే – శబ్దార్థం– కల్పతరుః–1153), త్వబం = (కొబ్బరి) పీచు, పక్షిణామ్+అపి = పక్షులకు కూడా, అగ్రాహ్యమ్ = గ్రహింపరానిదై, అధ్వనీన–మృతి–దమ్ : అధ్వనీన =

బాటసారులకు, మృతి-దమ్ = మరణాన్నిచ్చేదీ, శస్త్రేణ = ఆయుధంతో, బలాత్ = శక్తితో, సాధ్యమ్ = సాధింపదగిన, ఫలమ్ = పండును, దధత్ = ధరిస్తూ... (ఆస్వ = ఉండు)

**తా ။** చింతచెట్టూ! నువ్వు అటుండు. నీ పండ్లు కూడా ఎప్పుడూ వంకరే. ప్రాణులను కొట్టడానికే నువ్వు ఉపయోగపడతావు. నారికేళమా! నీవల్ల మాకు ఉపయోగం లేదు. నీ ఫలాలు నరులకు అందుబాటులో లేకుండా ఆకాశాన్ని చుంబిస్తూ ఉంటాయి. ఆ పండ్లతోలు పక్షులకు కూడా కొరకరానిది. బాటసారుల మరణానికి నువ్వు కారణమవుతావు. ఆయుధంతో బలప్రయోగం చేస్తేకాని నువ్వు పనికిరావు.

**వి :** 1. చింతకాయలు వంకరగానే ఉంటాయి. వాటి కొమ్మలను (చింతబరికెలు) అల్లరిపనులు చేస్తున్న పిల్లలను దండించటానికి వాడేవారు. (తాడనకర్మసు ఉపకురుషే) కొబ్బరికాయలు చెట్టుపై భాగాన ఉండటం, వాటితోలు మందంగా వుండటం, వాటిని ఉపయోగించుకోటానికి కత్తులు వాడటం అంతా స్వాభావికమే. కానీ కొబ్బరికాయలు మీదపడి మరణించిన సంఘటనలు చాలా అరుదుగానే ఉంటాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆస్వ :** | ఆస్తామ్ | ఆసాతామ్ | ఆసతామ్ |
| | **ఆస్వ** | ఆసాథామ్ | ఆధ్వమ్ |
| | ఆసై | ఆసావహై | ఆసామహై |
| **ఉపకురుషే :** | ఉపకురుతే | ఉపకుర్వాతే | ఉపకుర్వతే |
| | **ఉపకురుషే** | ఉపకుర్వాథే | ఉపకుర్వధ్వే |
| | ఉపకుర్వే | ఉపకుర్వహే | ఉపకుర్మహే. |

*

**శ్లో॥ యః పక్వం ఫలసమ్మితం భువి గతైరజ్ఞేయమావేష్టితం**
**ధత్తే దుర్జనకణ్టకైః స పనసః ప్రాక్ కాకభోగ్యో ధ్రువమ్ ।**
**చూతోఽయం ఫలపుష్పతోషితఖగః స్వోపాన్తగానాం నృణాం**
**పక్వాని ప్రదిశన్ స చాపిన మనసస్తోషాయ నః స్యాత్సఖి ॥ 7-21**

**అ :** పనస, మామిడిచెట్ల గొప్పతనాన్ని, తమ పట్ల వీటి ఉదాసీనతను చూచి గోపికలు దుఃఖపడుట.

-శార్దూలవిక్రీడితమ్.

**అ :** యః (పనసః) పక్వం ఫలసమ్మితం భువి-గతైః అజ్ఞేయం దుర్జనకంటకైః ఆవేష్టితం ఫలం ధత్తే, సః పనసః ప్రాక్ కాకభోగ్యః ధ్రువమ్. సఖి ఫలపుష్ప-తోషిత-ఖగః స్వ+ఉపాంతగానాం నృణాం పక్వాని ప్రదిశన్ యః అయం చూతః సః చ అపి నః మనస్తోషాయ న స్యాత్.

**ప్ర :** యః (పనసః) = ఏదయితే, పక్వమ్ = పండిన, ఫల-సమ్మితమ్ = పండుతో సమానమైనదై (ఫలేన సమ్మితః - తమ్), భువి గతైః = భూమిపై నున్నవారిచే(లోకులచే), అజ్ఞేయమ్ = తెలియరానిదై, దుర్జన-కంటకైః = దుర్జనులవంటి ముళ్ళచే (దుర్జనా ఇవ కంటకాః, తైః), ఆవేష్టితమ్ = చుట్టబడినదై, (ఫలమ్ = పండును), ధత్తే = ధరిస్తుందో (ధా ధారణపోషణయోః ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), సః పనసః = ఆ పనస, ప్రాక్ = తొలుత, కాక-భోగ్యః : కాక = కాకులచే, భోగ్యః = అనుభవింపదగినది (కాకైః భోగ్యః), ధ్రువమ్ = నిశ్చితమే. సఖి = చెలీ!, ఫల-పుష్ప-తోషిత-ఖగః : ఫల = పండ్లచే, పుష్ప = పూలచే, తోషిత = ఆనందింపజేయబడిన, ఖగః = పక్షులు గలదై (ఫలైః పుష్పైశ్చ తోషితాః ఖగాః యేన సః), స్వ+ఉపాంత-గానామ్=తన దగ్గరకు వచ్చిన, నృణామ్ = మనుష్యులకు, పక్వాని = పక్వమైన పండ్లను, ప్రదిశన్ = ఇస్తూ (ప్ర దిశ ధాతువుపై శతృ ప్రత్యయం), యః -అయమ్ = ఏది కలదో, సః చూత+అపి = ఆ మామిడి కూడా, మనసః = మనస్సుయొక్క, తోషామ్ = ఆనందానికి (కారణం), న స్యాత్ = కాలేదు (అస భువి-భ్వాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** పనస పండినా కూడా పచ్చిదానిలాగే లోకులకు కనిపిస్తుంది. పండినట్లు తెలియనీదు. దుర్జనులవంటి ముళ్ళు దాని చుట్టూ ఉంటాయి. అందుకే అది ముందుగా కాకులు తినదగినదవుతోంది. ఇకపోతే మామిడి. పండ్లతో, పూలతో పక్షులను పోషిస్తుంది. తన దగ్గర చేరిన మనుష్యులకే మంచి పండ్లను ఇస్తుంది. అందుకని అది మన మనస్సులకు ఆనందాన్ని కల్గించలేదు.

**వి :** 1. పనసపండ్లను ముందు కాకులే తింటాయని కొన్ని ప్రాంతాలలో ప్రసిద్ధి. అవి పండినా పైకి కనిపించకుండా కుహనాత్మకంగా, చుట్టూ దుర్జనుల వంటి ముళ్ళను పెట్టుకొని వుంటాయి కాబట్టి అవి ఆశ్రయింపరానివని గోపికల భావం. మామిడిని ఆశ్రయింపరాని దనటానికి తీవ్రమైన కారణం శ్లోకంలో కనిపించటం లేదు.

ఈ రెండూ కూడా అర్థశక్తిచేత అటువంటి స్వభావం గల వ్యక్తుల ప్రవర్తనను ధ్వనింప జేస్తాయి. ఇది కవిప్రౌఢోక్తి కృత వస్తుకృతవస్తు ధ్వని. ఆయా తరుజాతుల సహజలక్షణాలను గుణదోషాలుగా ఆరోపించటం కవి ప్రౌఢోక్తి.

| | | | |
|---|---|---|---|
| 2. **ధత్తే :** | **ధత్తే** | దధాతే | దధతే |
| | ధత్సే | దధాథే | దధ్వే |
| | దధే | దధ్వహే | దధ్మహే |

**స్యాత్ :** 7-14వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ కన్దర్పమన్త్రిణి సమీయుషి యః సరాగ-స్తత్పక్షపాతిపికగాయకహర్షహేతుః ।**
**తద్వన్దినః శుకచయస్య సఖా తదీయ-బాణౌఘజన్మధరణీ స హి చూత ఏషః ॥22**

**అ :** మామిడిని కాదనటానికి గోపికలు మరల కారణాలను ప్రతిపాదించటం. -వసంతతిలక.

**అ :** హి ఏషః చూతః కందర్పమంత్రిణి సమీయుషి సరాగః తత్పక్షపాతిపికగాయకహర్ష-హేతుః, తద్-వందినః శుకచయస్య సఖా తదీయబాణ+ఓఘజన్మధరణీ.

**ప్ర :** హి = ఏ కారణంవల్ల, ఏషః చూతః = ఈ మామిడి, కందర్ప-మంత్రిణి = మదనుని మంత్రి అయిన వసంతుడు (కందర్పస్య మంత్రీ, తస్మిన్), సమీయుషి (సతి) = రాగా (సమ్-ఇ ధాతువుపై-లిట్-క్వసు ప్రత్యయం), సరాగః (సన్) = రక్తిమతో కూడినవాడై, యః = ఎవడు, తత్-పక్షపాతి-పిక-గాయక-హర్ష-హేతుః:తత్=ఆ మదనునికి, పక్షపాతి = మద్దతు దారులయిన, పిక = కోకిలలనెడి, గాయక = పాటగాళ్ళయొక్క, హర్ష = ఆనందానికి, హేతుః = కారణభూతుడూ, తద్-వందినః = ఆ మదనుని వైతాళికులైన (ప్రబోధకా మాగధవందిసూతా వైతాళికా మంగళపాఠకాశ్చ-హలాయుధకోశః-435), శుక-చయస్య = చిలుకల సమూహానికి, సఖా = చెలికాడును, తదీయ-బాణ-ఓఘ-జన్మధరణీ : తదీయ = ఆ మదనునియొక్క, బాణ = బాణాల యొక్క, ఓఘ = సమూహంయొక్క, జన్మధరణీ = పుట్టుకతావూ గదా! (తదీయాశ్చ తే బాణాః, తేషామ్ ఓఘః, తస్య జన్మనః ధరణీ)

**తా ॥** మదనునికి మంత్రి అయిన వసంతుడు రాగానే మామిడి రాగసహితమై (చివుళ్ళ ఎఱ్ఱదనం) ఆ మదనునికి సహకరించే కోయిలలనే గాయకుల ఆనందానికి కారణమై, ఆ మదనుని స్తుతించే చిలుకలకు చెలికాడై, ఆ మదనుని బాణాలకు జన్మభూమి అవుతాడు గదా! అందుకే ఈ తృణీకారం.

**వి :** 1. వసంతశక్తి అపారం. వసంతుని అనుచరగణమంతా మదనునికి సహకరించేదే. మదనుడు ఇంద్రునితో అంటాడు ఇలా-

శ్లో॥ తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి - సహాయమేకం మధుమేవ లబ్ధ్వా ।
కుర్యాం హరస్యాపి పినాకపాణేః - ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే ॥ -కు.సం-3/10

2. ఈ శ్లోకంలో చూతం (మామిడి) యొక్క సంపన్నత చక్కగా వర్ణింపబడింది. కాబట్టి ఇది ఉదాత్తాలంకారం. తనకు సంపన్నత ఉండటమే కాకుండా అది అన్యోపయోగి కావటం పరిపూర్ణమైన ఉదాత్తత. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' - (కు. 162). *

**శ్లో॥ హే మాధవి! ప్రాన్తనిగూఢవల్లి! - శ్రీమానినీమానదమాదిశేహ ।**
**దేహి త్వదీయాం స్థితిమేవ నో చే-న్నామ్నాపి యత్రాస్తి హి మాధవీత్వమ్ ॥7-23**

**అ :** మాధవీలతతో గోపికల వచనం. -ఇంద్రవజ్ర.

**అ :** ప్రాంతనిగూఢవల్లి హే మాధవి! శ్రీమాననీ-మాననదమ్ ఇహ ఆదిశ. నోచేత్ త్వదీయాం స్థితిమ్ ఏవ దేహి హి యత్ర నామ్నా అపి మాధవీత్వమ్ అస్తి.

**ప్ర :** ప్రాంత-నిగూఢ-వల్లి! : ప్రాంత = దగ్గరగా, నిగూఢ = కౌగిలించుకొన్న (శబ్దార్థకల్ప-తరుః-పుట 808), వల్లి! = లతలు గలదానా (నిగూఢాః వల్ల్యః యయా సా), హే మాధవి! = ఓ మాధవీ (వాసంతీ) లతా! (వాసంతీ మాధవీ లతా-హలాయుధకోశః-208), శ్రీ-మానినీ-మానదమ్ : శ్రీ-మానినీ = లక్ష్మికి, మాన-దమ్ = గౌరవాన్ని ఇచ్చే కృష్ణుని (శ్రీః ఇతి మాననీ, తస్యాః మానం దదాతి ఇతి శ్రీమాననీ మానదః, తమ్), ఇహ = ఇక్కడ, ఆదిశ = చూపించు (ఆ+దిశ అతిసర్జనే పరస్మైపది-లోట్-మ.ఏ.), నో చేత్ = లేకపోతే, త్వదీయామ్ = నీకు చెందిన, స్థితిమ్ = అవస్థనయినా, దేహి = ఇవ్వు (దా దానే పరస్మైపది-లోట్-మ.ఏ.), హి = ఎందుకంటే, యత్ర = ఏ స్థితిలో, నామ్నా+అపి = నామమాత్రంగా అయినా, మాధవీత్వమ్ = మాధవసంబంధిత్వం, అస్తి = కలదో (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** మాధవీలతా! నీకు దగ్గరగా ఎన్నో లతలు నిన్ను చుట్టి వున్నాయి. మాకిప్పుడు కృష్ణుని చూపించు. లేదా నీ స్థితివంటి స్థితిని మాకివ్వు. కనీసం పేరులో నయినా మాధవీత్వాన్ని (మాధవసంబంధాన్ని) పొందవచ్చు.

**వి :** 1. ప్రేమలో సహచరులకు సంబంధించిన వన్నీ తనవే అనుకోవడం, వాళ్ళకు సంబంధించిన సమస్తవిశ్వాన్ని తన విశ్వంగా భావించడం చాలా సహజమైన పరిణామం. ఆ భావన యూరోపియనులలో అయితే వ్యక్తి వృద్ధికి దారితీస్తుందని, భారతీయులలో వ్యక్తి పతనానికి దారితీస్తోందని కవిత్వతత్త్వవిచారంలో కట్టమంచి వారి ప్రతిపాదన.

"కామమనునది పురోభివృద్ధిహేతు"వని యూరోపియనుల భావన. ఎట్లన వరించు స్వాతంత్ర్య ముండబట్టియే నొక హృదయాకర్షకమగు విశేషము గలిగియో నేర్చియో యున్నగాని యేకాకులుగా జీవనము గడుపవలసినదే. కాబట్టి స్త్రీల మెప్పు కొఱకై యెల్లరు శ్రమకోర్చి శక్త్యనుసారము గొప్పతనము నందఁజూతురు. మఱియు స్త్రీలును దెలివితేటలఁదేఱిన వారుగాన నట్టివారి సావాసము శ్రేయోహేతువు. ఒకానొక కవి యాచించిన రీతి శూరుని లక్షణమేమనగా

తే॥ ఒక్కకాంతను గోరిఁ మహోద్యమములఁ
బూని సాధించుటలచేతఁ బూజసేసి
రాజ్యమును దైవమును భార్యరాగమదరఁ
బ్రీతులం జేయుటయ గాని వేఱగాదు" (టేనిసన్)

అట్లగుట స్త్రీల మీది వ్యామోహము వీరకృత్యములకుఁ బ్రేరేపకము. హిందూదేశములో స్త్రీలు అధఃపతితలై యున్నందున వారి వెంటం బోవుట పాతాళయాత్ర." - కవిత్వతత్త్వవిచారము పుట - 86

వాస్తవానికి భారతీయత కూడా పై పరిస్థితికి తీసిపోయినది కాదు. కానీ మధ్యకాలం లోనూ, కొంత ఆధునికకాలంలోనూ దుస్థితి ఏర్పడింది. వర్తమానంలో ఆ దుస్సితి తగ్గుతున్నట్లు అనిపిస్తోంది. కానీ సనాతన వాదులుగా కనిపించేవాళ్ళు అడ్డుగోడలుగా నిలవటానికి అన్ని ప్రయత్నాలూ చేస్తున్నారు.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆదిశ :** | ఆదిశతు/ఆదిశతాత్ | ఆదిశతామ్ | ఆదిశన్తు |
| | **ఆదిశ**/ఆదిశతాత్ | ఆదిశతమ్ | ఆదిశత |
| | ఆదిశాని | ఆదిశావ | ఆదిశామ |
| **దేహి :** | దదాతు/దత్తాత్ | దత్తామ్ | దదతు |
| | **దేహి**/దత్తాత్ | దత్తమ్ | దత్త |
| | దదాని | దదావ | దదామ. |

*

**శ్లో॥ అశోక ఏషోఽపరవేదనాజ్ఞః - పదాహతేరేవ పరోపకర్తా ।**
**న కార్యకారీ శిథిలాత్మనాం న-స్తతోఽపరత్ర ప్రతియాత సఖ్యః! ॥ 7-24**

**అ :** గోపికలు అశోకాన్ని వీడి దూరం వెళ్ళటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఏషః అశోకః అపరవేదనాజ్ఞః పద+ఆ-హతేః ఏవ పర+ఉపకర్తా. శిథిల+ఆత్మనాం నః న కార్యకారీ తతః సఖ్యః! అపరత్ర ప్రతియాత.

**ప్ర :** ఏషః=ఈ, అశోకః = అశోక వృక్షం, అపరవేదనాజ్ఞః = ఇతరుల బాధలు తెలియనిది - (పరేషాం వేదనాః న జానాతి ఇతి), పద+ఆహతేః+ఏవ : పద = కాలి యొక్క ఆహతేః +ఏవ = దెబ్బవలన మాత్రమే, పర+ఉపకర్తా : పర = ఇతరులకు, ఉపకర్తా = ఉపకరించేవాడు (ఉప కరోతి ఇతి, పరేషామ్ ఉపకర్తా), శిథిల+ఆత్మానామ్ = బడలిన శరీరాలు గల, నః = మనకు, కార్యకారీ : కార్య = ప్రయోజనాన్ని, కారీ = చేయువాడు (కార్యస్య కారీ), న = కాదు, తతః = కాబట్టి, సఖ్యః = చెలులారా!, అపరత్ర = మరొక వైపునకు, ప్రతియాత = వెళ్ళండి. (ప్రతి-యా-ప్రాపణే-పరస్మైపది-లోట్-మ.బ.)

**తా ॥** ఇది అశోకవృక్షం. కాబట్టి ఇతరుల బాధలు తెలియవు. కాలితో కొట్టితే కాని పరులకు మేలు చేయదు. మన శరీరాలు బడలి వున్నాయి. కాలితో కొట్టగల శక్తి లేదు కాబట్టి ఇది మనకు ఉపయోగపడదు. కాబట్టి మరోవైపుకు పదండి.

**వి :** 1. అశోకాన్ని కాలితో కొడితేనే అది పూత కొస్తుందని వృక్షదోహదప్రక్రియ చెప్తుంది. విభిన్నతరువులకు విభిన్నదోహదప్రక్రియ లున్నాయి.

శ్లో॥ **అశోక**శ్చరాణాహత్యా **వకులో** ముఖసీధునా ।
ఆలింగనాత్కురవకః తిలకో వీక్షణేన చ ॥
కరస్పర్శేన **మాకందో** ముఖరాగేణ **చంపకః** ।
సల్లాపతః **కర్ణికారః** సిన్ధువారో ముఖావిలాత్ ॥
గీత్యా **ప్రియాళు**ర్నితరాం **నమేరు**ర్హసితేన చ । - వసుచరిత్రవ్యాఖ్య - పుట 142

అశోకం-కాలిదెబ్బ; పొగడ-ఉమియుట; గోరింట-ఆలింగనం; తిలకం-చూడటం; మామిడి-కరస్పర్శ; సంపెంగ - ముఖరాగం; కొండగోగు-సల్లాపం; వావిలి-మోముగాలి; ప్రేంకణం - గానం; సురపొన్న-నవ్వు...

దానిమ్మచెట్టుకు విశేషమైన **ధూపనప్రక్రియ** దోహదంగా కనిపిస్తుంది.

శ్లో॥ మేషామిషాంబుసంసేకస్తత్కేశామిషధూపనమ్ ।
శ్రేయానయం ప్రయోగః స్యాద్దాడిమీ ఫలవృద్ధయే ॥

మత్స్యాజ్య త్రిఫలా లేపైర్మాంసైరాజీవికోద్భవైః ।
లేపితా ధూపితా సూతే ఫలం తాళీవ దాడిమీ ॥

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రతియాత :** | ప్రతియాతు/ప్రతియాతాత్ | ప్రతియాతామ్ | ప్రతియాన్తు |
| | ప్రతియాహి/ప్రతియాతాత్ | ప్రతియాతమ్ | **ప్రతియాత** |
| | ప్రతియాని | ప్రతియావ | ప్రతియామ. |

*

**శ్లో॥ హే పారిజాత! సురసంసది గీత! దాతః! – శ్రీనన్దనన్దనముదీరయ సిద్ధగమ్యమ్ ।**
**రత్నాని రాస్యురువిధాని కిలాశ్రితానా-మస్మభ్యమచ్యుతహరిన్మణిమేవ దేహి॥ 25**

**అ :** పారిజాత తరువుతో గోపికల వేడికోలు. –వసంతతిలక.

**అ :** సురసంసది గీత! దాతః ! హే పారిజాత! సిద్ధగమ్యమ్ శ్రీనందనందనమ్ ఉదీరయ. ఆశ్రితానామ్ ఉరువిధాని రత్నాని రాసి కిల అస్మభ్యమ్ అచ్యుతహరిన్మణిమ్ ఏవ దేహి.

**ప్ర :** సుర–సంసది = దేవసభలో (సురాణాం సంసద్ – తస్యామ్), గీత! = స్తుతింపబడిన దానా! (గై ధాతువుపై క్త ప్రత్యయం), దాతః = దానశీలా!, హే పారిజాత = పారిజాతమా!, సిద్ధ–గమ్యమ్ : సిద్ధ = సిద్ధులచే, గమ్యమ్ = పొందదగిన (సిద్ధైః గమ్యః, తమ్), శ్రీ–నందనందనమ్ = శ్రీకృష్ణుని గూర్చి, ఉదీరయ = చెప్పు. (ఉద్–ఈర్ క్షేపే పరస్మైపది–లోట్–మ.ఏ.), ఆశ్రితానామ్ = చెంతచేరిన వారికి, ఉరువిధాని = గొప్ప రకాలకు చెందిన, రత్నాని = రత్నాలను, రాసి కిల = ఇస్తున్నావు కదా! (రా దానే పరస్మైపది–లట్–మ.బ.), అస్మభ్యమ్ = మా కొఱకు, అచ్యుత–హరిన్మణిమ్–ఏవ = కృష్ణు డనే మరకతమణినే, దేహి = ఇవ్వు (దా దానే పరస్మైపది–లోట్–మ.ఏ.)

**తా ॥** పారిజాతమా! దేవసభలో నువ్వు మన్ననలు పొందుతావు. దానశీలత గలదానవు. కృష్ణుని గురించి చెప్పు. సిద్ధులకు గమ్యం తానే. ఆశ్రితులకు విలువైన రత్నాలను ఇస్తావు గదా! మాకు కృష్ణుడనే మరకతమణిని ఇవ్వు.

**వి :** 1. కృష్ణునిలో మరకతమణిత్వాన్ని ఆరోపించి నందువల్ల 'అచ్యుతహరిన్మణి' అన్నచోట రూపకాలంకారం.

2. పారిజాతం దేవతావృక్షాలలో ఒకటి.

శ్లో॥ పంచైతే దేవతరవో మందారః పారిజాతకః ।
సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్ ॥ –అమరకోశః–స్వర్గ–53

3. పారిజాత లక్షణాలనూ, ఫలితాలను కూడా తిమ్మన ఇలా వర్ణించాడు.

క. పరిమళము సెడదు వాడదు – పరువము దప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేకమనో – హరమగు నీ కుసుమరాజమంబుజవదనా!

చం. అడిగినయంతలోన సరసాన్నములన్నమకూర్చు నాఁకట
న్నడలకఁ జెందనీక యశుభంబు లడంచు జగత్త్రయంబునం
బడయఁగ రాని సర్వగుణభవ్యము సుమ్మిది దీనిఁ దాల్చి యి
ప్పడతులలోఁ గనుంగొను మపారమహామహిమానుభావముల్. –పారిజాతాపహరణము–1/59,61

4. **ఉదీరయ :** 7–14వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **రాసి :** | రాతి | రాతః | రాన్తి |
| | **రాసి** | రాథః | రాథ |
| | రామి | రావః | రామః |

**దేహి :** 7-23వ శ్లోక వ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ తదఙ్ఘ్రిలాభేన నిజావమాన-విశఙ్కిచేతా న దిశేన్నిజం నః ।**
**సహోదరోఽయం నను సిన్ధుపుత్ర్యాః - సహస్రనేత్రార్హణదృప్తవృత్తిః ॥ 7-26**

**అ :** పారిజాతాన్ని అధిక్షేపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదంఘ్రిలాభేన నిజ+అవమానవిశంకిచేతాః అయం నిజం నః న దిశేత్. నను అయం సింధుపుత్ర్యాః సహోదరః సహస్రనేత్ర+అర్హణదృప్తవృత్తిః.

**ప్ర :** తద్-అంఘ్రి-లాభేన : తద్ = ఆ కృష్ణునియొక్క, అంఘ్రి = పాదాలయొక్క, లాభేన = లబ్ధిచే (తస్య అంఘ్రీ తదంఘ్రీ, తయోః లాభః, తేన), నిజ-అవమాన-విశంకి-చేతాః : నిజ = తనయొక్క, అవమాన = పరాభవాన్ని, విశంకి = అనుమానిస్తున్న, చేతాః = మనస్సు గలదై (నిజస్య అవమానం శంకత ఇతి, తత్ చ తత్ చిత్తం యస్య సః), అయమ్ = ఈ పారిజాతం, నిజమ్ = మన వానిని (కృష్ణుని) గూర్చి, న దిశేత్ = చెప్పకపోవచ్చు (దిశ అతిసర్జనే-పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.), నను = అసలు, అయమ్ = ఈ పారిజాతం, సింధు-పుత్ర్యా = కడలి కూతురికి (లక్ష్మికి) (సింధోః పుత్రీ-తస్యాః), సహోదరః = తోడబుట్టినది, సహస్రనేత్ర-అర్హణ-దృప్త-వృత్తిః : సహస్రనేత్ర = ఇంద్రునియొక్క, అర్హణ = మన్ననచే, దృప్త = గర్వించిన, వృత్తిః = నడవడి గలది. (సహస్రాణి నేత్రాణి యస్య సః, తస్య అర్హణం, తేన దృప్తా వృత్తిః యస్య సః)

**తా ॥** మాకు ఆ కృష్ణుని పదసన్నిధి లభిస్తే అది తనకు అవమానమని భావించి ఈ పారిజాతం కృష్ణుని గురించి చెప్పదు. అసలిది మనకు సవతి అయిన లక్ష్మికి తోబుట్టువు. ఇంద్రుని మన్ననలు పొంది పొగరెక్కి వుంది.

**వి :** 1. ఇంద్రుడు తలపూ వాడని భోగి. పారిజాతాన్ని సొంతం చేసికొన్నాడు. కృష్ణుడికి పారిజాతానుభవం లేదు. అందుకే నారదుడు పనిగట్టుకొని కృష్ణునికి పారిజాతాన్ని కానుక చేశాడు. ఇంద్రుడు తనను నెత్తిన పెట్టుకొన్నందున కృష్ణుడన్నా పారిజాతానికి చిన్న చూపుండవచ్చు. లక్ష్మి తనకు తోబుట్టువు కాబట్టి కృష్ణుని కట్టడి చేయటం తన కర్తవ్యమని అది భావించవచ్చు కూడా. అందుకే కృష్ణుని ఆచూకీ ఇవ్వదు.

| | | | |
|---|---|---|---|
| 2. **దిశేత్ :** | **దిశేత్** | దిశేతామ్ | దిశేయుః |
| | దిశేః | దిశేతమ్ | దిశేత |
| | దిశేయమ్ | దిశేవ | దిశేమ. * |

**శ్లో॥ గీతేన తే గీష్పతిశర్వపూర్వ-గీర్వాణవర్యాః కిల నమ్రభావమ్ ।**
**నీతాస్తదస్మాన్ స్వవశే విధాతు-మేతావతా కిం కమనీయమూర్తే! ॥ 7-27**

**అ :** కృష్ణుని గానంలోని మాహాత్మ్యాన్ని నివేదించి ప్రార్థించటం. -ఇంద్రవజ్ర.

**అ :** కమనీయమూర్తే! తే గీతేన గీష్పతిశర్వపూర్వగీర్వాణవర్యాః నమ్రభావం నీతాః కిల. తత్ అస్మాన్ స్వవశే విధాతుమ్ ఏతావతా కిమ్?

**ప్ర :** కమనీయమూర్తే! : కమనీయ = కోరదగిన (కమ్ ధాతువుపై అనీయర్ ప్రత్యయం), మూర్తే! = ఆకృతి గలవాడా! (కమనీయా మూర్తిః యస్య సః - తస్మాత్ సంబుద్ధిః), తే = నీ యొక్క, గీతేన = పాటతో/గానంతో, గీష్పతి-శర్వ-పూర్వ-గీర్వాణ-వర్యాః : గీష్పతి = బ్రహ్మ (గిరః పతిః), శర్వ = శివుడు (శృణాతి ఇతి), పూర్వ = మొదలుగాగల, గీర్వాణ-వర్యాః = దేవతాశ్రేష్ఠులు (గీర్వాణా దానవారయః అమరకోశః - స్వర్గ-9) (గీష్పతిశ్చ శర్వశ్చ గీష్పతిశర్వౌ తౌ పూర్వౌ యేషాం తే చ తే గీర్వాణవర్యాః చ), నమ్రభావమ్ = నమ్రత్వం వైపు/లొంగిపోవటం వైపు, నీతాః కిల = నడిపింపబడ్డారు గదా! (నీ ప్రాపణే ధాతువుపై క్త ప్రత్యయం), తత్ = అందువల్ల, అస్మాన్

= మమ్ము, స్వవశే = నీ అదుపులో, విధాతుమ్ = ఉంచుకొనుటకై (వి ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఏతావతా = ఇంతటి పనిద్వారా, కిమ్? = ఏం లాభం (ఇంత అవసరమా?)

**తా ॥** అందగాడా! నీ పాటను విని బ్రహ్మ, శివుడు మొదలయిన దేవతాశ్రేష్ఠులు కూడా లోబడి నిలుస్తున్నారు గదా! అటువంటప్పుడు మమ్ము లొంగదీయటం కోసం ఇంతపని అవసరమా?

**వి :** 1. బ్రహ్మాది దేవతలు కూడా వినమ్రులయినప్పుడు గోపికలు లొంగిపోవటమన్నది అర్థాపత్తి ద్వారానే సిద్ధిస్తుంది. దానికోసం ఇంతశ్రమ అవసరం లేదు. బ్రహ్మయే లోబడితే ఇతరుల మాట చెప్పవలసినది ఏముంది? ఇది కావ్యార్థాపత్త్యలంకారం. "**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**" – (కు.57) *

**శ్లో॥ మురళి! మురరిపుం తం మోహనం శంస హంసా-**
**భ్యుదయముదయదిన్దుశ్రీముఖం వీతశోకమ్ ।**
**విరహదహనభాసా నిర్దహామోఽత్ర నో చేత్**
**తరుణి! కులమిదం తే హన్త వృన్దావనాన్తే ॥ 7-28**

**అ :** పిల్లనగ్రోవిని గోపికలు హెచ్చరించుట. –మాలిని.

**అ :** మురళి! మోహనం హంస+అభ్యుదయమ్ ఉదయద్+ఇందుశ్రీముఖం వీతశోకం తం మురరిపుం శంస. నో చేత్ తరుణి! అత్ర బృందావన+అన్తే ఇదం తే కులం విరహ- దహనభాసా నిర్దహామః హంత.

**ప్ర :** మురళి = పిల్లనగ్రోవి!, మోహనమ్ = అందగాడును, హంస+అభ్యుదయమ్ : హంస = యతులకు, అభ్యుదయమ్ = అభివృద్ధి స్వరూపుడును (హంసానామ్ అభ్యుదయః, తమ్), ఉదయద్ – ఇందు–శ్రీ–ముఖమ్ : ఉదయద్ = ఉదయిస్తున్న, ఇందు = చంద్రునివలె, శ్రీ = శోభిస్తున్న, ముఖమ్ = మోముగలవాడును (ఉదయన్ చ అసౌ ఇందుః, స ఇవ శ్రీముఖం యస్య, తమ్), వీత–శోకమ్ : వీత = వీడిపోయిన, శోకమ్ = దుఃఖం గలవాడును (వీతః శోకః యస్మాత్ సః) అయిన, తమ్ = ఆ, మురిరిపుమ్ = కృష్ణుని గూర్చి (మురః రిపుః యస్య, తమ్), శంస = చెప్పు. (శంస స్తుతౌ పరస్మైపది–లోట్–మ.ఏ.), నో చేత్ = లేకపోతే, తరుణి! = యువతి!, అత్ర = ఇక్కడ, బృందావన+అన్తే = బృందావనంలో (బృందావనస్య అంతః తస్మిన్), ఇదమ్ = ఈ (ఎదురుగా నున్న), తే = నీ యొక్క, కులమ్ = వంశాన్ని (వెదురును), విరహ–దహన–భాసా:విరహ = విరహ మనే, దహన = అగ్నియొక్క, భాసా = తేజస్సుతో, నిర్దహామః = తగుల బెడతాము. (నిర్–దహ దహనే పరస్మైపది–లట్–ఉ.బ.)

**తా ॥** పిల్లనగ్రోవీ! కృష్ణుడు పరమహంసలకు అభ్యుదయం, మోహనరూపం గలవాడు. ఉదయించే చంద్రుని వంటి అందమైన మోము గలవాడు. శోకమెరుగని వాడు. ఆయనను గురించి మాకు చెప్పు. లేకపోతే ఇక్కడ బృందావనంలో నున్న నీ వంశాన్ని మా విరహాగ్ని జ్వాలతో తగులబెట్టేస్తాము.

**వి :** 1. **ఉదయత్** – ఉత్ పూర్వకమైన అయ ధాతువుపై శతృ ప్రత్యయాన్తరూపం. వాస్తవానికి అయధాతువు ఆత్మనేపది – కాబట్టి '**లటః శతృశానచావప్రథమా సమానాధికరణే**' (అష్టాధ్యాయి 3-2-124) సూత్రం మేరకు శానచ్ ప్రత్యయం రావాలి. 'ఉదయమాన' అని రూపమేర్పడాలి. మరి ఉదయత్ నిర్దుష్టమేనా? '**అనుదాత్తేత్త్వ నిమిత్తమాత్రనేపదమనిత్యం భవతి**' అన్న న్యాయం మేరకు అయ ధాతువు అనుదాత్తనిమిత్తంగా ఆత్మనేపదమయి నందువల్ల, అది అనిత్యమయినందువల్ల పరస్మైపదంగా స్వీకరింపబడి దానిపై శతృ ప్రత్యయ ప్రయోగం కాబట్టి దోషం లేదు.

2. వీతశోకః – కర్తవ్యమూ, కాంక్షా రెండూ లేకపోతే శోకానికి అవకాశమే లేదు. కృష్ణుని స్థితి అది.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
**నానవాప్తమవాప్త**వ్యం వర్త ఏవ చ కర్మణి ॥ – భగవద్గీత 3-22

3. మురళితో మాటాడుతూ కృష్ణుని గూర్చి చెప్పకపోతే బృందావనంలోని దాని వంశాన్ని దహించి వేస్తామనటం ఉక్తివైచిత్ర్యం. అది ప్రత్యనీకాలంకారం. బలవంతుడైన శత్రువును ఎదిరించలేక వాడికి సంబంధించిన వారిపై బలప్రదర్శనం. '**ప్రత్యనీకం బలవతః శత్రోః పక్షే పరాక్రమః**' – (కు. 116)

| | | | |
|---|---|---|---|
| 4. **శంస :** | శంసతు/శంసతాత్ | శంసతామ్ | శంసన్తు |
| | **శంస**/శంసతాత్ | శంసతామ్ | శంసత |
| | శంసాని | శంసావ | శంసామ |
| **నిర్దహామః :** | నిర్దహతి | నిర్దహతః | నిర్దహన్తి |
| | నిర్దహసి | నిర్దహథః | నిర్దహథ |
| | నిర్దహామి | నిర్దహావః | **నిర్దహామః.** |

*

**శ్లో॥ హే వృందావన! కృష్ణవర్త్మ వద నో నోచేత్ పుమాంసం హి తం**
**దాస్యామః ప్రియవిప్రయోగజనితం తేన త్వదీయోదయైః ।**
**సాకం ప్రజ్వలితేఽఙ్గ! గోపలలనాభాస్వచ్చకోరీచయే**
**లోకే నామ నిరర్థకం తవ పునః కో వా కవిః కీర్తయేత్ ॥ 7-29**

**అ :** బృందావనాన్ని మొత్తంగా గోపికలు హెచ్చరించుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** హే బృందావన! నః కృష్ణవర్త్మ వద నో చేత్ ప్రియవిప్రయోగజనితం తం పుమాంసం దాస్యామః. తేన త్వదీయ+ఉదయైః సాకం గోపలలనాభాస్వత్+చకోరీచయే ప్రజ్వలితే అంగ! లోకే నిరర్థకం తవ నామ పునః కః వా కవిః కీర్తయేత్.

**ప్ర :** హే బృందావన! = ఓ బృందావనమా! (బృందానాం వనమ్, తస్మాత్ సంబుద్ధిః), నః = మాకు, కృష్ణ-వర్త్మ = కృష్ణుని బాటను (కృష్ణస్య వర్త్మ-తత్), వద = చెప్పు (వద వ్యక్తాయాం వాచి పరస్మైపది-లోట్-మ.ఏ.), నో చేత్ = లేకపోతే, ప్రియ-విప్రయోగ-జనితమ్ : ప్రియ = ప్రియునితో, విప్రయోగ = విరహం చేత, జనితమ్ = పుట్టిన, తం పుమాంసం హి = ఆ మగవానినే (అగ్నిని), దాస్యామః = ఇవ్వగలం. (దా దానే పరస్మైపది -లృట్- ఉ.బ.), తేన = దానితో, త్వదీయ+ఉదయైః సాకమ్ : త్వదీయ = నీకు సంబంధించిన, ఉదయైః సాకమ్ = అభ్యుదయాలతో పాటు, గోప-లలనా-భాస్వత్-చకోరీ-చయే : గోప-లలనా = గోపస్త్రీలు అనే, భాస్వత్ = ప్రకాశించే, చకోరీ-చయే = చకోరపక్షుల సమూహం, ప్రజ్వలితే-సతి = మండిపోగా, అంగ = అయ్యో!, లోకే = లోకంలో, నిరర్థకమ్ = పనికిరాని, తవ = నీయొక్క, నామ = పేరు, పునః = మరల, కః వా = ఎవరైనా? కవిః = కవి, కీర్తయేత్ = చెపుతాడు. (కౄత్ సంశబ్దనే-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఓ బృందావనమా? కృష్ణుని జాడను చెప్పు. లేకపోతే ప్రియవియోగంచేత పుట్టిన అగ్నిని నీకిస్తాం. దానితో నీ అభ్యుదయంతో పాటు గోపవనిత లనే ఆడచకోరాల గుంపు కూడా తగలబడిపోతుంది. దానితో లోకంలో నీకున్న కీర్తి పోతుంది. నిరుపయోగమైన నీపేరును ఇక లోకంలో ఏ కవీ కీర్తించదు.

**వి : 1. తం పుమాంసం** – ఇది శాబ్దికమైన చమత్కృతి. కృష్ణవర్త్మ (కృష్ణుని బాట) చెప్పమని అడిగారు. చెప్పకపోతే దానినే పుంరూపంగా ఇస్తామన్నారు. వర్త్మ శబ్దం నపుంసకలింగం. కృష్ణవర్త్మ తత్పురుషసమాసం కాబట్టి వర్త్మపదం అదే లింగంలో వుంటుంది. కానీ అది బహువ్రీహిగా మారితే కృష్ణం వర్త్మ యస్య సః =

కృష్ణవర్త్మా అని పుంలింగరూప మవుతుంది. దానికి అర్థం అగ్ని. నిప్పు పెడతామన్న మాటను అంత చమత్కారంగా చెప్పారు.

2. గోపికలను ఆడ వెన్నెల పులుగులతో (చకోరాలు) పోల్చటం ద్వారా కృష్ణుడు చంద్రుడని ధ్వనిస్తుంది. ఇది అలంకారకృతమైన అలంకార ధ్వని. భాస్వత్ (ప్రకాశిస్తున్న) అన్నది వారికి విశేషణం. కృష్ణవియోగంలో కూడా వారు వెలిగిపోతుంటే కృష్ణునితో కలిస్తే ఇక చెప్పవలసినదేముంది?

| | | | |
|---|---|---|---|
| 3. **వద :** | వదతు/వదతాత్ | వదతామ్ | వదన్తు |
| | **వద**/వదతాత్ | వదతమ్ | వదత |
| | వదాని | వదావ | వదామ |
| **దాస్యామః :** | దాస్యతి | దాస్యతః | దాస్యన్తి |
| | దాస్యసి | దాస్యథః | దాస్యథ |
| | దాస్యామి | దాస్యావః | **దాస్యామః** |
| **కీర్తయేత్ :** | **కీర్తయేత్** | కీర్తయేతామ్ | కీర్తయేయుః |
| | కీర్తయేః | కీర్తయేతమ్ | కీర్తయేత |
| | కీర్తయేయమ్ | కీర్తయేవ | కీర్తయేమ. |

*

**శ్లో॥ సఖి! తరురయమజ్ఞో నైవ జానాతి కృష్ణం**
**కిమితి విధినిదేశాద్ జ్ఞానశూన్యో హి వృక్షః ।**
**యదుతిలకవియోగాదస్తు మే జ్ఞానహాని-**
**ర్గతవిరహభయస్య జ్ఞానహానిః కుతోఽస్య॥ 7-30**

**అ :** ఇద్దరు గోపికల సంభాషణం - ప్రకరణం గోపీవిరహవర్ణనమే. -మాలిని.

**అ :** సఖి! అయం తరుః అజ్ఞః, కృష్ణం న జానాతి ఏవ. కిమ్ ఇతి హి విధినిదేశాత్ వృక్షః జ్ఞానశూన్యః - యదుతిలకవియోగాద్ మే జ్ఞానహానిః అస్తు. గతవిరహభయస్య అస్య కుతః జ్ఞానహానిః.

**ప్ర :** సఖి! = చెలి, అయమ్ = ఈ, తరుః = చెట్టు, అజ్ఞః = తెలివిలేనిది (న జానాతి ఇతి అజ్ఞః), కృష్ణమ్ = కృష్ణుని, న జానాతి ఏవ = తెలియలేదు. (జ్ఞా అవబోధనే పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), కిమ్-ఇతి = ఎందుకు?, హి = ఎందుకంటే, విధి-నిదేశాద్ : విధి = బ్రహ్మయొక్క, నిదేశాత్ = ఆజ్ఞమేరకు, వృక్షః = చెట్టు, జ్ఞానశూన్యః = తెలివిలేనిది (జ్ఞానేన శూన్యః), యదుతిలక వియోగాత్ : యదుతిలక = యదువంశశ్రేష్ఠుడైన కృష్ణుని-యొక్క, వియోగాత్ = విరహంవలన (యదూనాం కులం, తస్మిన్ తిలకః, తేన వియోగః తస్మాత్), మే = నాకు, జ్ఞాన-హానిః = బుద్ధినాశం (జ్ఞానస్య హానిః), అస్తు = కలుగుగాక (అస భువి పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.), గత-విరహ-భయస్య:గత = తొలగిపోయిన, విరహ-భయస్య = విరహభయంగల (గతం విరహాత్ భయం యస్య తస్య), అస్య = ఈ చెట్టుకు, జ్ఞాన-హానిః = తెలివిలేకపోవటం, కుతః? = ఎలా జరుగుతుంది.

**తా ॥** గోపి - చెలి! ఈ చెట్టు తెలివితక్కువది. కృష్ణుని తెలియదు.

గోపిక - ఎందుకని?

గోపి - బ్రహ్మ ఆజ్ఞమేరకు చెట్టు తెలివిలేనిదే.

గోపిక - కృష్ణునితో విరహంవలన నేను తెలివితక్కువ దాననయితే కావచ్చు. కానీ విరహభయమే లేని ఈ చెట్టు జ్ఞానహీనమెలా అవుతుంది?

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. జానాతి :** | **జానాతి** | జానీతః | జానన్తి | |
| | జానాసి | జానీథః | జానీథ | |
| | జానామి | జానీవః | జానీమః | |
| **అస్తు :** | **అస్తు/స్తాత్** | స్తామ్ | సన్తు | |
| | ఏధి/స్తాత్ | స్తామ్ | స్త | |
| | అసాని | అసావ | అసామ. | * |

**శ్లో॥ సఖి! కథయ స కోఽయం తన్వి! పీయూషరశ్మి-**
**ర్దిశతి కథముదగ్రం తర్హి మే కాలకూటమ్ ।**
**హరిరివ పదమాత్రశ్లాఘ్యధర్మః స నూనం**
**వహతి గరమగౌరం హ్రాసభాగేష చన్ద్రః ॥** **7-31**

**అ :** చంద్రోపాలంభన చేస్తూ గోపికల సంభాషణ. -మాలిని.

**అ :** గోపిక - సఖి అయం సః కః కథయ.

గోపి - తన్వి! పీయూషరశ్మిః.

గోపిక - తర్హి మే ఉదగ్రం కాలకూటం కథం దిశతి.

గోపి - సః హరిః+ఇవ పదమాత్రశ్లాఘ్యధర్మః హ్రాసభాక్ అగౌరం గరం వహతి నూనమ్.

**ప్ర :** సఖి! = చెలి!, అయమ్ సః = కనిపిస్తున్న ఆయన, కః = ఎవడు?, తన్వి! = తన్వీ! (సన్ననిదానా?), పీయూష-రశ్మిః = అమృతకిరణుడు (పీయూషమమృతం సుధా - అమరకోశః - స్వర్గ - 48) (పీయూషం రశ్మిషు యస్య సః), తర్హి = అయితే, మే = నాకు, ఉదగ్రమ్ = దారుణమైన, కాలకూటమ్ = కాలకూటవిషాన్ని, కథమ్ = ఎలా, దిశతి = ఇస్తున్నాడు? (దిశ అతిసర్జనే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), స ఏషః = ఆ ఈ, చన్ద్రః = చంద్రుడు, హరిః+ఇవ = కృష్ణునివలె (హరిః+ఇవ = హరిరివ, '**ఇవేన సమాసో విభక్త్యలోపశ్చ**' (వార్తికం), పదమాత్ర-శ్లాఘ్య-ధర్మః : పదమాత్ర = పేరుకు మాత్రమే, శ్లాఘ్య = ప్రశంసింప దగిన, ధర్మః = ధర్మం గలవాడు (పదమాత్రేణ శ్లాఘ్యః ధర్మః యస్య సః), హ్రాస-భాక్ = క్షీణతను పొందేవాడు (హ్రాస-అపచయే- శబ్దార్థకల్పతరుః-పుట 1616) (హ్రాసం భజతీతి), అగౌరమ్ = నల్లని, గరమ్ = విషాన్ని, వహతి = భరిస్తున్నాడు (వహ ప్రాపణే పరస్మైపది -లట్-ప్ర.ఏ.), నూనమ్ = నిశ్చితం.

**తా ॥** గోపిక - ఆ కనిపించేది ఎవరు చెలీ!

గోపి - అమృతకిరణుడు

గోపిక - మరి దారుణమైన కాలకూటాన్ని ఎందుకు అందిస్తున్నాడు.

గోపి - హరిలాగా ఆయనకూడా నామమాత్రంగానే లక్షణాలు గలవాడు. హృదయంలో నల్లని విషాన్ని నింపుకొన్నాడు. అందువల్లనే చిక్కిపోతున్నాడు.

**వి : 1.** విప్రలంభశృంగారరసపోషణలో శృంగారానికి ఉద్దీపన విభావాలయిన చంద్రుడు, వెన్నెల, వసంతం మొదలగు వాటిని వర్ణించటం లేదా అధిక్షేపించటం చంద్రోపాలంభన, మన్మథోపాలంభన పేరుతో సంస్కృతాంధ్రకావ్యాలలో అలవాటు. ఆ మేరకు ఇక్కడ చంద్రోపాలంభన జరుగుతోంది.

2. **పీయూషరశ్మి** (అమృతకిరణుడు) నుండి కాలకూటం వెలువడటం విభావనాలంకారం. విరుద్ధకారణం ద్వారా కార్యనిష్పత్తి (అనగా కార్యకారణాలు పరస్పరం వ్యతిరేకాలయితే) విభావనాలంకార భేదాలలో ఒకటి. '**విరుద్ధాత్ కార్యసంపత్తిర్దృష్టా కాచిద్విభావనా**'- (కు. 81)

చంద్రుని మచ్చలో గరళత్వాన్ని ఆరోపించటం ద్వారా కళంకత్వాన్ని కప్పిపుచ్చటం ధ్వనిస్తుంది కాబట్టి ఇక్కడ అపహ్నుత్యలంకారధ్వని. చిక్కిపోవటానికి తనలోని కళంకానికి సంబంధం లేకపోయినా కార్యకారణభావాన్ని కల్పించినందువలన అది అతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**'-(కు.39)

| | | | |
|---|---|---|---|
| 3. **కథయ :** | కథయతు/కథయతాత్ | కథయతామ్ | కథయన్తు |
| | **కథయ**/కథయతాత్ కథయతమ్ | | కథయత |
| | కథయాని | కథయావ | కథయామ |
| **దిశతి :** | **దిశతి** | దిశతః | దిశన్తి |
| | దిశసి | దిశథః | దిశథ |
| | దిశామి | దిశావః | దిశామః |
| **వహతి :** | **వహతి** | వహతః | వహన్తి |
| | వహసి | వహథః | వహథ |
| | వహామి | వహావః | వహామః. |

*

**శ్లో॥ ధన్యే! యామిని! కామినీవ శశినం సానన్దమాచుమ్బ్య యా**
**మాన్యైస్తస్య కరైః సుధారసధరైరాలిఙ్గితాఙ్గీ సదా ।**
**విశ్లేషాచ్చకితానుయాసి బత! తం దేశాన్తరే ప్రస్థితం**
**కృష్ణాయాధ్వని శంస కఞ్జనయనాయాస్మన్మనోవేదనామ్ ॥ 7-32**

**అ :** గోపికలు యామినిని అభ్యర్థించుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ధన్యే! యామిని! యా కామినీ+ఇవ సానందమ్ మాన్యైః సుధారసధరైః తస్య కరైః సదా ఆలింగిత+అంగీ శశినమ్ ఆచుంబ్య దేశాంతరే ప్రస్థితం తం విశ్లేషాత్ చకితా (సతీ) అనుయాసి బత అధ్వని కంజనయనాయ కృష్ణాయ అస్మన్మనోవేదనాం శంస.

**ప్ర :** ధన్యే = ధన్యురాలా!, యామిని = రాతిరీ!, యా = ఏ నీవు, కామినీ+ఇవ = కామంగల దానివలె (కామినీ+ఇవ-'**ఇవేన సమాసో విభక్త్య లోపశ్చ**') (వార్తికమ్), స+ఆనందమ్ = ఆనందంతో (ఆనందేన సహితం యథా తథా), మాన్యైః = గౌరవింప దగినవియు, సుధా-రస-ధరైః : సుధా-రస = అమృతరసాన్ని, ధరైః = ధరించినవియు అయిన (సుధా రసం ధారయంతి ఇతి, తైః), తస్య = ఆ చంద్రునియొక్క, కరైః = కిరణాలచే (అంశుభానుకరపాదవిరోకా... హలాయుధకోశః-39), సదా = ఎప్పుడూ, శశినమ్ = చంద్రుని, ఆలింగిత+అంగీ = కౌగిలించిన శరీరం గలదానవై (ఆలింగితం అంగం యస్యాః సా), దేశ+అంతరే = మరొక తావుకు, ప్రస్థితమ్ = బయలు దేరగా, విశ్లేషాత్ = వియోగం చేత, చకితా సతీ = బెదరినదానవై (చరితశ్చకితో భీతః-హలాయుధకోశః -354), అనుయాసి = వెంటబడుతున్నావు (అను+యా ప్రాపణే-పరస్మైపది-లట్-మ.ఏ.), బత = అయ్యో!, అధ్వని = దారిలో, కంజనయనాయ = కమలాక్షుడైన (కంజే ఇవ నయనే యస్య తస్మై), కృష్ణాయ = కృష్ణునకు, అస్మత్+మనో-వేదనామ్ = మా మనోవ్యథను, శంస = చెప్పు.

**తా ॥** యామినీ! నీవు కాముకివలె ఆ చంద్రుని సుధారసమయాలయిన కిరణాలచే నిరంతరం కౌగిలింపబడి ఆనందంగా గడుపుతున్నావు. ఇప్పుడు ఆ చంద్రుడు మరోచోటికి బయలుదేరగానే ఆ వియోగాన్ని భరించటానికి భయపడి వెంటబడిపోతున్నావు. సరే. దారిలో ఆ కమలాక్షుడు – కృష్ణుడు కనబడితే మా మనోవేదనను తెలియజేయి.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **అనుయాసి :** | అనుయాతి | అనుయాతః | అనుయాన్తి |
| | **అనుయాసి** | అనుయాథః | అనుయాథ |
| | అనుయామి | అనుయావః | అనుయామః |

**శంస :** 7-17వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ నిశాచరాః ప్రాణహరాశ్చ చోరా-శ్చరన్తి యస్యాం న బుధాః సుబోధాః ।**
**స్వయం చ కృష్ణాప్రియసౌభగా యా - కిమస్మదానన్దకరీయమార్యాః ॥ 7-33**

**అ :** గోపికలు రాత్రిని నిందించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ప్రాణహరాః నిశాచరాః ప్రాణహరాః చోరాః చ యస్యాం చరన్తి, సుబోధాః బుధాః (న చరన్తి) యా స్వయం కృష్ణ+అప్రియసౌభగా చ ఆర్యాః ఇయమ్ అస్మదానందకరీ కిమ్?

**ప్ర :** ప్రాణ-హరాః = ప్రాణాలు తీసే (ప్రాణాన్ హరన్తి ఇతి), నిశా-చరాః = రాక్షసులూ (నిశాయాం చరన్తి ఇతి), (ప్రాణహరాః = ప్రాణాలు తీసే), చోరాః చ = దొంగలును, యస్యామ్ = దేనియందు, చరన్తి = తిరుగుతున్నారో (చర-గతి భక్షణయోః -పరస్మైపది - లట్ - ప్రథమపురుషబహువచనం), సుబోధాః = సద్బుద్ధిగల, బుధాః = పండితులు, న చరన్తి = తిరగరో, యా = ఏ రాతిరి, స్వయమ్ = తనంతగా, కృష్ణ+అప్రియ-సౌభగా : కృష్ణ = కృష్ణ పక్షంలో/కృష్ణవిషయంలో, అప్రియ = నచ్చని, సౌభగా = సౌభాగ్యం గలదో (కృష్ణే అప్రియం సౌభగం యస్యాః సా), ఇయమ్ = (ఆ) ఈమె, ఆర్యాః = పెద్దలారా!, అస్మద్+ఆనంద-కరీ-కిమ్ = మనకు ఆనందాన్ని కల్గించేదా?

**తా ॥** రాత్రివేళ రాక్షసులు, దొంగలు మాత్రమే తిరుగుతుంటారు. వారు ప్రాణాలు తీసేవారు. సద్‌బుద్ధిగల విద్వాంసులు రాత్రి దరికి చేరరు. తానసలు కృష్ణపక్షంగా ఆలోచిస్తే లోకులకు నచ్చనిది - సౌభాగ్యాన్ని కోల్పోయేది. కృష్ణపక్షీయుల మయిన మాకు ఆనందాన్ని ఎందుకు కలిగిస్తుంది?

**వి :** 1.ప్రాణహరాః అన్నది నిశాచరులకు, చోరులకు ఇద్దరికీ అన్వయించే ధర్మం. నిశా-చరులు, చోరులు ఇద్దరూ ప్రకృత విషయాలే. రెండు ప్రకృతాంశాలకు ఏకధర్మాన్ని అన్వయించటం వలన ఇది తుల్యయోగితాలంకారం. **'వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా'**-(కు. 44), దేహళీదీపన్యాయంతో ఆ ధర్మం ఇద్దరికీ వరిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **చరన్తి :** | చరతి | చరతః | **చరన్తి** |
| | చరసి | చరథః | చరథ |
| | చరామి | చరావః | చరామః. |

*

**శ్లో॥ కాళింది! తం కథయ కఞ్జదళాయతాక్షం**
**నామ్నా గుణేన సదృశీ నను నన్దసూనోః ।**
**బ్రహ్మణ్యదేవమృషయః సఖి! శాన్తగమ్యం**
**బ్రహ్మహ్రదే కృతగృహం బ్రువతే భవత్యాః ॥ 7-34**

**అ :** గోపికలు కృష్ణుని జాడకై కాళిందిని (యమునని) అభ్యర్థించటం.

**అ :** కాళింది! కంజదళ+ఆయత+అక్షం తం కథయ. నామ్నా గుణేన (త్వం) నందసూనోః సదృశీ నను. సఖి! ఋషయః శాంతగమ్యం బ్రహ్మణ్యదేవం భవత్యాః బ్రహ్మహ్రదే కృతగృహం బ్రువతే.

**ప్ర :** కాళింది = యమునా!, కంజ-దళ+ఆయత+అక్షమ్: కంజ = తామరపూవు యొక్క (కే జాయతే ఇతి

కంజమ్), దళ = రేకులవలె, ఆయత = విశాలమైన, అక్షమ్ = కన్నులు గల (కంజస్య దళే ఇవ ఆయతే అక్షిణీ యస్య తమ్), తమ్ = ఆ కృష్ణుని గూర్చి, కథయ = చెప్పు. (కథ వాక్యప్రబంధే పరస్మైపది-లోట్-మ.ఏ.), నామ్నా = పేరుచేతనూ, గుణేన = గుణం (నల్లదనం) చేతనూ, త్వమ్ = నీవు, నంద-సూనోః = నందకుమారునకు/ కృష్ణునకు (నందస్య సూనుః, తస్య), సదృశీ నను = సమానమైన దానవు గదా!, సఖి = చెలి!, ఋషయః = మునులు, శాంత-గమ్యమ్ : శాంత = శాంతిగలవారిచే/ జ్ఞానులచే, గమ్యమ్ = పొందదగినవానిని గాను (గమ్ ధాతువుపై యత్ ప్రత్యయం) (గంతుం యోగ్యం), బ్రహ్మణ్య-దేవమ్ : బ్రహ్మణ్య = బ్రాహ్మణులకు ఇష్టమైన (బ్రహ్మణి సాధుః), దేవమ్ = దేవుడైన కృష్ణుని (బ్రహ్మణ్యశ్చ అసౌ దేవశ్చ, తమ్), భవత్యాః = నీయొక్క, బ్రహ్మ-హ్రదే = బ్రహ్మ హ్రదమందు (యమునలోని ఒక తీర్థం), కృత-గృహమ్ : కృత = కల్పించుకొన్న, గృహమ్ = నివాసం గలవానిగా, బ్రువతే = చెప్తున్నారు. (బ్రూ-వ్యక్తాయాం-వాచి-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** కాళిందీ! తామరరేకులవంటి విశాలమైన కన్నులుగల ఆ కృష్ణుని గూర్చి మాకు చెప్పు. నీకూ ఆయనకూ పేరులోనూ, గుణాలలోనూ పోలిక ఉంది కదా! అంతేకాదు. జ్ఞానులు పొందదగిన ఆ కృష్ణుడు బ్రాహ్మణప్రియుడైన దేవుడనీ, నీలోని బ్రహ్మహ్రదంలోనే నివాసమేర్పరచుకొన్నాడని ఋషులు చెప్తున్నారు.

**వి :** 1. “అక్రూరాయ శ్రీకృష్ణః స్వాత్మానం యత్రాదర్శయత్ తస్య నామ బ్రహ్మహ్రద ఇతి” (రుక్మిణీశవిజయ వ్యాఖ్య - శ్రీనారాయణాచార్య) - అక్రూరుడికి శ్రీకృష్ణుడు ఆత్మస్వరూపాన్ని ప్రదర్శించిన తావు.

| | | | |
|---|---|---|---|
| 2. **కథయ :** | కథయతు/కథయతాత్ | కథయతామ్ | కథయన్తు |
| | **కథయ**/కథయతాత్ | కథయతమ్ | కథయత |
| | కథయాని | కథయావ | కథయామ |
| **బ్రువతే :** | బ్రూతే | బ్రువాతే | **బ్రువతే** |
| | బ్రూషే | బ్రువాథే | బ్రూధ్వే |
| | బ్రువే | బ్రూవహే | బ్రూమహే. |

*

**శ్లో॥ కాళింది! త్వమఘాన్వితానపి సతః కృత్వా పవిత్రాత్మనో**
**గన్తుం నైవ కదాపి ముంచసి తవ భ్రాతుర్నికేతం ప్రతి ।**
**కిన్తు క్షీరపయోఽబ్ధివాసనిరతాన్ ప్రీతా కరోష్యాశ్రితాన్**
**స్నిగ్ధే భర్తరి కామినీజనరుచిస్తత్పక్ష ఏవ హ్యలమ్ ॥ 7-35**

**అ :** కాళిందీ మాహాత్మ్యవర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కాళింది! త్వమ్ అఘ+అన్వితాన్ అపి సతః పవిత్ర+ఆత్మనః కృత్వా తవ భ్రాతుః నికేతం ప్రతి గన్తుం కదా అపి న ముంచసి. కిన్తు ప్రీతా (సతీ) ఆశ్రితాన్ క్షీరపయః+అబ్ధి-వాసనిరతాన్ కరోషి హి. భర్తరి స్నిగ్ధే (సతి) కామినీజనరుచిః అలం తత్పక్షే+ఏవ.

**ప్ర :** కాళింది = కాళిందీ!, త్వమ్ = నువ్వు, అఘ+అన్వితాన్-అపి : అఘ = పాపంతో, అన్వితాన్ అపి = కూడిన వారినైనను (అఘేన అన్వితాః, తాన్), సతః = సజ్జనులనుగా, పవిత్ర+ఆత్మనః = పవిత్రస్వరూపులనుగా, కృత్వా = చేసి (కృ ధాతువుపై క్త్వా ప్రత్యయం), తవ = నీయొక్క, భ్రాతుః = సోదరునియొక్క, నికేతం ప్రతి = ఇంటివైపు (శబ్దార్థకల్పతరుః పుట 815) (నికేతతి అస్మిన్ ఇతి నికేతః), కదా-అపి = ఎప్పుడూ కూడా, న-ముంచసి = వదలుట లేదు. (ముచ్ మోక్షణే పరస్మైపది-లట్-మ.ఏ.), కిన్తు = పైపెచ్చు/ కాని, ప్రీతా (సతీ) = ఆనందించిన దానవై, ఆశ్రితాన్ = (నిన్ను) ఆశ్రయించిన వారిని, క్షీర-పయః+అబ్ధి-వాస-నిరతాన్ : క్షీర-పయః+అబ్ధి =

పాలసముద్రంలో, వాస = నివసించుట యందు, నిరతాన్ = ఆసక్తిగలవారినిగా (క్షీరమ్ ఏవ పయః తస్య అబ్ధిః తస్మిన్ వాసః తస్మిన్ నిరతాః తాన్), కరోషి = చేస్తున్నావు. (కృ కరణే పరస్మైపది-లట్-మ.ఏ.), హి = యుక్తమే. భర్తరి = భర్త, స్నిగ్ధే = స్నేహశీలుడై వుంటే, కామినీ-జన-రుచిః : కామినీ-జన = కామినుల (స్త్రీల) యొక్క, రుచిః = ఆసక్తి, అలమ్ = తగినంతగా, తత్పక్షే+ఏవ = వాళ్ళవైపే వుంటుంది.

**తా ॥** కాళిందీ! నీవు పాపాత్ములను కూడా సజ్జనులనుగా పవిత్రస్వరూపులనుగా చేసి నీ సోదరుడైన యముని ఇంటికి ఎప్పుడూ వెళ్లనవసరం లేకుండా చేస్తావు. నిన్ను ఆశ్రయించిన ఆ ప్రజలలో పాలకడలిలో నివసించాలన్న కోరికను కలిగిస్తావు.

**వి :** 1. యముని ఇంటికి వెళ్ళనీయవు అనటం ద్వారా సకల పాపావినాశకరణశక్తి వ్యక్తమవుతోంది. పాపాత్ములను కూడా మంచివారిని చేస్తావు అనటంలో భవిష్యత్తులో పాపాలు చేయకుండా ఆపగలగటం తెలుస్తుంది. కానీ యమనికేతం వైపు వెళ్ళనివ్వవనటం పూర్వపాపప్రక్షాళనశక్తిని వ్యక్తం చేస్తుంది.

కాళింది తనను ఆశ్రయించిన వారిని పాలకడలివైపు – అంటే మెట్టినింటివైపే నడిపిస్తోంది. కానీ పుట్టినింటి వైపునకు – యమనికేతనం – నడపటం లేదు. మెట్టినింటిపై స్త్రీ పక్షపాతం సాధ్యమే ననీ అది భర్తలోని స్నేహశీలతను బట్టి వుంటుందనీ కవి అభిప్రాయం.

2. కాళిందికి సంబంధించిన విశేషవిషయాన్ని తొలిమూడు పాదాలలో చెప్పి, నాలుగవ పాదంలో స్త్రీ పక్షపాతప్రసక్తిని – సామాన్యవిషయాన్ని – చెప్పినందువల్ల ఇది అర్థాంతర-న్యాసాలంకారం. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్ సామాన్యవిశేషయోః' – (కు.122)

| | | | |
|---|---|---|---|
| 3. **ముంచసి :** | ముంచతి | ముంచతః | ముంచన్తి |
| | **ముంచసి** | ముంచథః | ముంచథ |
| | ముంచామి | ముంచావః | ముంచామః |
| **కరోషి :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | **కరోషి** | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః. |

*

**శ్లో॥ రఙ్గత్తరఙ్గచయసఙ్గతవాయునా త్వం – మాఙ్గల్యదా కిల సమీపకృతాలయానామ్।**
**భృఙ్గీరివాన్తికవనే తవ సఞ్చరన్తీః – సఙ్గీతకృష్ణచరితాః కిముపేక్షసే నః ॥ 7-36**

**అ :** కాళిందిని గోపికలు ప్రస్తుతించటం. –వసంతతిలక.

**అ :** (కాళిందీ!) రంగత్-తరంగ-చయ-సంగత-వాయునా త్వం సమీపకృత+ ఆలయానాం మాంగల్యదా కిల. భృంగీః+ఇవ తవ అంతికవనే సంచరన్తీః సంగీతకృష్ణచరితాః నః కిమ్ ఉపేక్షసే.

**ప్ర :** కాళిందీ! = యమునా!, రంగత్... వాయునా: రంగత్ = కదులుతున్న (రగి ధాతువుపై శతృ ప్రత్యయం), తరంగ = అలలయొక్క, చయ = సమూహంతో, సంగత = కూడిన, వాయునా = గాలిచేత, త్వమ్ = నీవు, సమీప-కృత-ఆలయానామ్ : సమీప = దగ్గరగా, కృత = కల్పించుకొన్న, ఆలయానామ్ = ఇళ్ళుగలవారికి (దగ్గరగా నివసిస్తున్న వారికి) (శరణమగారం నివసనమాలయ... –హలాయుధకోశః 292), మాంగల్యదా కిల = శుభాన్నిచ్చే దానవు కదా!, భృంగీః-ఇవ = ఆడుతుమ్మెతలవలె, తవ = నీయొక్క, అన్తిక-వనే : అన్తిక = సమీపమందున్న, వనే = అడవిలో (అంతికే వనం, తస్మిన్), సంచరన్తీః = తిరుగుతున్నవారమై, సంగీత-కృష్ణ-చరితాః : సంగీత = చక్కగా పాడిన, కృష్ణ-చరితాః = కృష్ణుని చరితగల (సమ్యక్ గీతం కృష్ణస్య చరితం

యాభిస్తాః), నః = మమ్ము, కిమ్–ఉపేక్షసే = ఎందుకు పట్టించుకోవు? (ఉప–ఈక్ష దర్శనే–ఆత్మనేపది–లట్–మ.ఏ.)

**తా ॥** యమునా! నీకు దగ్గరగా నివాస మేర్పరచుకొన్న వారికి కదులుతున్న, పైగా వస్తున్న గాలులతో నీవు శుభాలను కలుగజేస్తున్నావు గదా! నీకు దగ్గరలో వున్న అడవిలో కృష్ణ చరితలు పాడుకొంటూ తుమ్మెదలవలె తిరుగుతున్న మమ్ములను ఎందుకు పట్టించుకోవు (ఉదాసీనంగా చూస్తున్నావు?)

**వి : 1. ఉపేక్షసే :**

| | | |
|---|---|---|
| ఉపేక్షతే | ఉపేక్షేతే | ఉపేక్షన్తే |
| **ఉపేక్షసే** | ఉపేక్షేథే | ఉపేక్షధ్వే |
| ఉపేక్షే | ఉపేక్షావహే | ఉపేక్షామహే. |

*

**శ్లో॥ హే మన్దమారుత! ముకున్దపదాబ్జగన్ధ–శ్రీమాననీయ! తమిహానయ మాన్యగమ్యమ్।**
**నో చేద్బహిర్నయ తవాఙ్గ! సమానజాతిం – ప్రాణం హృది స్థితమథార్పయ కృష్ణపాదే॥ 37**

**అ :** గోపికలు మందమారుతాన్ని అభ్యర్థించటం. –వసంతతిలక.

**అ :** ముకుందపద+అబ్జ–గంధశ్రీ–మాననీయ! హే మందమారుత! మాన్యగమ్యం తమ్ ఇహ ఆనయ. నో చేద్ తవ అంగ! సమానజాతిం హృది స్థితం ప్రాణం బహిః నయ అథ కృష్ణపాదే అర్పయ.

**ప్ర :** ముకుంద–పద+అబ్జగంధ–శ్రీ–మాననీయ! : ముకుంద = కృష్ణునియొక్క (ముకుం దదాతీతి ముకుందః), పద+అబ్జ = చరణకమలాలయొక్క, గంధ = పరిమళంయొక్క, శ్రీ = వైభవంచేత, మాననీయ = గౌరవింప దగినవాడా! (ముకుందస్య పదాబ్జయోః గంధస్య శ్రియా మాననీయః, తస్మాత్ సంబుద్ధిః), మాని+ఆగమ్యమ్ : మాని = అభిమానవంతులచే, అగమ్యమ్ = చేరరాని (లేదా మాన్య – గమ్యమ్ మాన్యులచే చేరదగిన వాడు), తమ్ = ఆ కృష్ణుని, ఇహ = ఇక్కడకు, ఆనయ = తీసికొనిరా (ఆ+నీ ప్రాపణే పరస్మైపది లోట్–మ.ఏ.), నో చేద్ = లేకపోతే, అంగ = ఓ వాయూ!, తవ = నీకు, సమాన–జాతిమ్ = సమానమైనవాడై, హృది = మనస్సులో, స్థితమ్ = ఉన్నట్టి, ప్రాణమ్ = ప్రాణాన్ని, బహిః = వెలుపలకు, నయ = తీసికొనిరా (నీ ప్రాపణే పరస్మైపది–లోట్–మ.ఏ.), అథ = ఆపై, కృష్ణ–పాదే = కృష్ణుని పాదంపై (కృష్ణస్య పాదః, తస్మిన్), అర్పయ = అర్పించు. (ఋ గతౌ ణిచ్ పరస్మైపది–లోట్–మ.ఏ.)

**తా ॥** మందమారుతమా! నీవు ముకుందుని పాదపద్మాల పరిమళశోభ గలదానవు. ఆ కారణంగా గౌరవింపదగిన దానవు. అహంకారులకు అందరాని ఆ కృష్ణుని ఇక్కడకు తీసికొనిరా! లేదా మా హృదయంలో వున్న నీ జాతికి చెందిన ప్రాణాన్ని వెలుపలకు తీసికొని పోయి, కృష్ణ పాదాల దగ్గర అర్పించు.

**వి :** 1. హృదయమందలి ప్రాణం–

శ్లో॥ హృది ప్రాణః గుదేఽపానః సమానో నాభిసంస్థితః ।
ఉదానః కంఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః ॥ –అమరకోశం–స్వర్గ

హృదయంలో ప్రాణం, మలద్వారంలో అపానం, నాభిలో సమానం, కంఠంలో ఉదానం, శరీరమంతా వ్యానం – ఇవి పంచప్రాణాలు.

2. కృష్ణుని కొనిరాలేకపోతే మా ప్రాణాలు తీసికొనిపోయి కృష్ణపాదార్పణం చేయమని వాయుదేవుని కోరుతున్నారు. ప్రాణం తీసికొనిపొమ్మనటమంటే మరణాన్ని ఆహ్వానించటమే. అయితే బ్రతికి వున్నప్పుడు లేని కృష్ణతనుస్పర్శ ప్రాణాలను కృష్ణుని పాదాలకర్పిస్తే (మరణం జరిగిన తర్వాత) లభిస్తుంది కాబట్టి ఆ గుణం కోసం

మరణరూపదోషాన్ని గోపికలు కోరుకోవటం అనుజ్ఞాలంకారం. '**దోషస్యాభ్యర్థనాఽనుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్**'– (కు. 137)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆనయ :** | ఆనయతు/ఆనయతాత్ | ఆనయతామ్ | ఆనయన్తు |
| | **ఆనయ**/ఆనయతాత్ | ఆనయతమ్ | ఆనయత |
| | ఆనయాని | ఆనయావ | ఆనయామ |
| **నయ :** | నయతు/నయతాత్ | నయతామ్ | నయన్తు |
| | **నయ**/నయతాత్ | నయతమ్ | నయత |
| | నయాని | నయావ | నయామ |
| **అర్పయ :** | అర్పయతు/అర్పయతాత్ | అర్పయతామ్ | అర్పయన్తు |
| | **అర్పయ**/అర్పయతాత్ | అర్పయతమ్ | అర్పయత |
| | అర్పయాణి | అర్పయావ | అర్పయామ. |

*

**శ్లో॥ అతీన్ద్రియస్యామితవిక్రమస్య – ప్రదర్శయస్యఙ్గ పదాబ్జగన్ధమ్ ।**
**అపేక్షసే కిం పరమస్య సామ్య–మదృశ్య! దృశ్యాత్మవిశేషధర్మన్! ॥ 7–38**

**అ :** వాయువును గోపికలు అధిక్షేపించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అతీంద్రియస్య అమితవిక్రమస్య (కృష్ణస్య) పద+అబ్జగంధం ప్రదర్శయసి. అంగ! అదృశ్య! దృశ్య+ ఆత్మవిశేషధర్మన్! పరమస్య సామ్యమ్ అపేక్షసే కిమ్?

**ప్ర :** అతీంద్రియస్య = ఇంద్రియాలకు విషయం కాని వాడును (అతిక్రాంతః ఇంద్రియాణి తస్య), అమిత–విక్రమస్య : అమిత = మితిలేని, విక్రమస్య = పరాక్రమం గలవాడును (అయిన) కృష్ణునియొక్క (న భవతి మితమ్ అస్య ఇతి అమితః, అమితః విక్రమః యస్య తస్య), పద+అబ్జ–గంధమ్ = పాదపద్మపరిమళాన్ని, ప్రదర్శయసి = చూపుతున్నావు. (ప్ర – దృశ్ ప్రేక్షణే ణిచ్–లట్–మ.ఏ.), అంగ! = ఓ వాయూ!, అదృశ్య = కనింపిచని వాడా! (రూపరహితస్పర్శవాన్ వాయుః–అని వాయులక్షణం. వాయువుకు రూప ముండదు.), దృశ్య+ఆత్మ–విశేష–ధర్మన్ :దృశ్య=కనిపించే, ఆత్మ = తనయొక్క, విశేష–ధర్మన్ = ప్రత్యేకధర్మం గలవాడా! (దృశ్యం ఆత్మనః విశేషం ధర్మం యస్య సః – తస్మాత్ సంబుద్ధిః), పరమస్య = పరాత్పరునియొక్క, సామ్యమ్ = పోలికను, అపేక్షసే కిమ్ ? = కోరుతున్నావా?

**తా ॥** వాయుదేవా! కృష్ణుడు అతీంద్రియుడు. అమితపరాక్రమశాలి. ఆయన పాదపద్మాల పరిమళాన్ని నీవు ప్రదర్శిస్తున్నావు. (ఆయనలాగా) నీవు కూడా అతీంద్రియుడివే (కనిపించని వాడివే). మరల ఇంద్రియాలకు తెలిసే విశేషధర్మం (స్పర్శ కలిగి వుండటం) వున్నవాడవు. అంతమాత్రాన ఆయనతో పోలికను కోరుకొంటున్నావా?

**వి :** 1. ఒక విశిష్టవ్యక్తిత్వంలోని లక్షణైకదేశం మరొక వ్యక్తిత్వంలో కనిపించవచ్చు. అంత మాత్రాన ఆ ఇద్దరూ ఒకటి కాలేరు. ఆ పోలిక నైసర్గికలక్షణాలవల్ల సంక్రమించినది కావచ్చు. అంతమాత్రమే. దాన్ని చమత్కారంగా చెప్పిన శ్లోకాన్ని చూడండి.

శ్లో॥ కవయః కాళిదాసాద్యాః కవయో వయమప్యమీ ।
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం ప్రతిష్ఠితమ్ ॥

కాళిదాసాదులూ కవులే. మేమూ కవులమే. పర్వతమూ పరమాణువూ రెండూ పదార్థాలే గదా! (పదార్థత్వధర్మం రెండింటిలో సమానం కాబట్టి రెండూ సమానమే అనటం).

2. **ఆత్మవిశేషధర్మన్** – ధర్మశబ్దం లౌకికంగా పుంలింగం. కానీ ఇక్కడ నపుంసకలింగంగా ప్రయోగింపబడింది. "**అయం వేదే క్లీబః లోకే పుంసి. తాని ధర్మాణి ప్రథమాన్యాసన్–**' ఇతి వేదే. '**ఏష ధర్మస్సనాతనః**' ఇతి లోకే. 'ఈ ధర్మశబ్దం వేదమందు నపుంసకలింగము. లోకమందు పుంలింగము. (**అమరకోశః–గురుబాలప్రబోధిక–కాల–25**)

కానీ ఇక్కడ లౌకికంగా కూడా నపుంసకలింగంలో ధర్మశబ్దప్రయోగం. కృష్ణునితో పోలికను నువ్వు తెచ్చిపెట్టుకొన్నా నీలోని ధర్మం నపుంసకమే అన్న దెప్పిపొడుపు కావచ్చు. లేదా అది వైదికంగా సంక్రమించిన ధర్మమే కానీ నీ లౌకిక ప్రజ్ఞ కాదు అన్న అధిక్షేపణ అయినా కావచ్చు.

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రదర్శయసి :** | ప్రదర్శయతి | ప్రదర్శయతః | ప్రదర్శయన్తి |
| | **ప్రదర్శయసి** | ప్రదర్శయథః | ప్రదర్శయత |
| | ప్రదర్శయామి | ప్రదర్శయావః | ప్రదర్శయామః |
| **అపేక్షసే :** | అపేక్షతే | అపేక్షేతే | అపేక్షన్తే |
| | **అపేక్షసే** | అపేక్షేథే | అపేక్షధ్వే |
| | అపేక్షే | అపేక్షావహే | అపేక్షామహే. |

*

**శ్లో॥ హే పక్షిణః! కృష్ణముదీరయధ్వం – పాపాపహం పావనపావనం తమ్ ।**
**నో చేద్భవత్కణ్ఠవిశోషణైర్నః – శ్రోత్రస్య శల్యోపమితైః కిమేతైః ॥ 7–39**

**అ :** చేరువలో పక్షుల కూతలు విని కృష్ణుని జాడకై గోపికలు పక్షుల నడగటం – వాటిపై విసుగుదల ప్రదర్శించటం.
– ఇంద్రవజ్ర.

**అ :** హే పక్షిణః పాప+అపహం పావనపావనం తం కృష్ణమ్ ఉదీరయధ్వమ్. నో చేద్ భవత్–కంఠవిశోషణైః నః శ్రోత్రస్య శల్య+ఉపమితైః ఏతైః (కూజనైః) కిమ్?

**ప్ర :** హే పక్షిణః = ఓ పక్షులారా!, పాప+అపహమ్ : పాప = పాపాలను (చెడ్డ పనుల ఫలితాలను), అప–హమ్ = తొలగించువాడును (పాపాని అపహన్తి ఇతి పాపహః, తమ్), పావన–పావనమ్ : పావన = పవిత్రులకే, పావనమ్ = పవిత్రుడును అయిన (పావనానాం పావనః, తమ్), తమ్ = ఆ, కృష్ణమ్ = కృష్ణుని గూర్చి, ఉదీరయధ్వమ్ = చెప్పండి. (ఉద్ –ఈర గతౌ కంపనే చ–ఆత్మనేపది–లోట్–మ.బ.), నో చేత్ = లేకపోతే, నః = మాయొక్క, శ్రోత్రస్య = చెవికి, శల్య+ఉపమితైః : శల్య = బాణంతో (శలాకాయుధయోః శల్యమ్–హలాయుధకోశః –834), ఉపమితైః = పోల్చబడిన (శల్యైః ఉపమితాని, తైః), భవత్–కంఠ–విశోషణైః : భవత్ = మీయొక్క, కంఠ = గొంతులను, విశోషణైః = ఎండింపజేసెడి (భవతాం కంఠానాం విశోషణాని తైః), ఏతైః = ఈ అరుపులతో, కిమ్ = లాభమేమిటి?

**తా ॥** పక్షులారా! కృష్ణుడు పవిత్రులలో పవిత్రుడు. పాపాలనన్నింటినీ పోగొట్టేవాడు. ఆయన జాడ మాకు చెప్పండి. చెప్పలేకపోతే ఈ కూతలెందుకు. మీకు కంఠశోష. మా చెవులకు బాణాలు తగిలినట్లు బాధ.

**వి :** 1. పక్షులు తమ ప్రవృత్తిని బట్టి కూస్తున్నాయి కానీ గోపికల కోసం కాదు. గోపికలకు కృష్ణుని జాడ చెప్పకుండా వారిని బాధించటానికీ కాదు. అయినా ఆ సంబంధాన్ని గోపికలు కల్పించుకొని తమ చెవులకు శల్యాలవంటివి అనటం లేని సంబంధాన్ని ఉటంకించటం ఆ పరంగా అది అతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**'–(కు. 39)

2. **శ్లో॥ పవిత్రాణాం పవిత్రం యో** మంగళానాం చ మంగళమ్ ।
దైవతం దేవతానాం చ భూతానాం యోఽవ్యయః పితా ॥ –విష్ణుసహస్రనామస్తోత్రం–పూర్వపీఠిక–16

| | | | |
|---|---|---|---|
| 3. **ఉదీరయధ్వమ్ :** | ఉదీరయతామ్ | ఉదీరయేతామ్ | ఉదీరయన్తామ్ |
| | ఉదీరయస్వ | ఉదీరయేథామ్ | **ఉదీరయధ్వమ్** |
| | ఉదీరయై | ఉదీరయావహై | ఉదీరయామహై. * |

**శ్లో॥ స్వరేణ స్మారయన్ శౌరిం ప్రయచ్ఛతి న నః సఖి! ।**
**పరపుష్టః స విస్పష్టం పోష్టుర్వై విప్రలమ్భకః ॥ 7-40**

అ : గోపికలు కోకిలల నిందించుట. -పథ్యావక్త్రమ్.

అ : సఖి! స్వరేణ శౌరిం స్మారయన్ నః న ప్రయచ్ఛతి. సః పరపుష్టః విస్పష్టం ప్రోష్టుః విప్రలంభకః వై.

ప్ర : సఖి = చెలీ!, స్వరేణ = గొంతుతో (స్వరంతో), శౌరిమ్ = కృష్ణుని, స్మారయన్ = తలపిస్తూ (స్మృ ధాతువుపై ణిచ్ - శతృ ప్రత్యయం), పరపుష్టః = కోకిల (పరేణ పుష్టః), నః = మనకు, న ప్రయచ్ఛతి = ఇవ్వదు. (దాణ్ దానే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), పరపుష్టః = కాకిచేత పెంచబడినది/ పరాన్నజీవి, విస్పష్టమ్ = తప్పనిసరిగా, పోష్టుః = పోషించువానికి, విప్రలంభకః వై = మోసగాడే కదా!

**తా ॥** చెలీ! తన గొంతుతో కృష్ణుని తలపిస్తున్న ఈ కోకిల పరపుష్టం. ఇతరుల పెంపకంలో పెరిగినది. పెంచినవానిని వంచిస్తూనే వుంటుంది.

**వి :** 1. కోకిల తన పిల్లలను రెక్కలు వచ్చేవరకు కాకి గూటిలోనే వంచనతో పెరగనిస్తుందని ప్రసిద్ధి. కాళిదాసు అభిజ్ఞానశాకున్తలంలో శకున్తలను హేళనచేస్తూ అంటున్నమాట-

శ్లో॥ స్త్రీణామశిక్షితపటుత్వమమానుషీషు - సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః ।
**ప్రాగన్తరిక్షగమనాత్స్వమపత్యజాత - మన్యై ర్ద్విజైః పరభృతః ఖలు పోషయన్తి ॥** - 5-22

మానవేతర ప్రాణులలో కూడా నేర్వని నేర్పు కనిపిస్తూంటుంది. ఇక జ్ఞానులమయిన మనుషుల విషయంలో చెప్పేదేముంది. మింటికెగరకముందువరకు ఆడకోయిలలు తమ పిల్లలను ఇతర పక్షుల (కాకుల) చేతనే పెంపొందింప జేస్తున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రయచ్ఛతి :** | **ప్రయచ్ఛతి** | ప్రయచ్ఛతః | ప్రయచ్ఛన్తి |
| | ప్రయచ్ఛసి | ప్రయచ్ఛథః | ప్రయచ్ఛథ |
| | ప్రయచ్ఛామి | ప్రయచ్ఛావః | ప్రయచ్ఛామః. * |

**శ్లో॥ హే కృష్ణసార! కృతకౌతుకమాత్మదృష్టేః - శ్రీకృష్ణవర్ష్మ కిమలక్షి భరం బిభర్షి ।**
**నేత్రోదయస్య మురలీవరరఞ్జితస్య - శ్రోత్రస్య చోన్నతిరియం భవతశ్చకాస్తి ॥41**

అ : జింకను గోపికలు ప్రశ్నించటం. -వసంతతిలక.

అ : హే కృష్ణసార! ఆత్మదృష్టేః కృతకౌతుకం శ్రీకృష్ణవర్ష్మ అలక్షి కిమ్? నేత్ర+ఉదయస్య భరం బిభర్షి. మురలీరవరంజితస్య భవతః ఇయం శ్రోత్రస్య ఉన్నతిః చ చకాస్తి.

ప్ర : హే కృష్ణసార! = ఓ జింకా! (కృష్ణేన సారః, తస్మాత్ సంబుద్ధిః), ఆత్మ-దృష్టేః = నీ చూపునకు (ఆత్మనః దృష్టిః, తస్యాః), కృత-కౌతుకమ్ : కృత = కల్పింపబడిన, కౌతుకమ్ = కుతూహలంగల (కృతం కౌతుకం యేన తత్) (కౌతూహలం కౌతుకం చ కుతుకం చ కుతూహలం-అమరకోశః-నాట్య-31), శ్రీకృష్ణ- వర్ష్మ : శ్రీకృష్ణ = శ్రీకృష్ణునియొక్క, వర్ష్మ = శరీరం (అంగం వపుర్వర్ష్మ పురం చ పిండమ్-హలాయుధకోశః-510), అలక్షి కిమ్ = గమనింపబడిందా? (లక్ష-దర్శనాంకనయోః-కర్మణి-ఆత్మనేపది-లుఙ్-ప్ర.ఏ.), నేత్ర+ఉదయస్య : నేత్ర

= కన్నులయొక్క, ఉదయస్య = ఫలసిద్ధియొక్క (ఆంధ్రశబ్దరత్నాకరము -ప్రథమసంపుటి-పుట 373) (నేత్రయోః ఉదయః తస్య), భరమ్ = బరువును/ఉప్పొంగు టను, బిభర్షి = భరిస్తున్నావు. (భృ భరణే పరస్మైపది-లట్-మ.ఏ.), మురలీ-రవ-రంజితస్య : మురలీ-రవ = వేణుధ్వనితో, రంజితస్య = ఆనందింపజేయబడిన (మురళ్యాః రవః, తేన రంజితః, తస్య), భవతః = నీయొక్క, శ్రోత్రస్య = చెవియొక్క, ఇయమ్ ఉన్నతిః = ఈ ఔన్నత్యం / నిక్కపొడుచుకొనుట, చకాస్తి = ప్రకాశిస్తోంది. (చకాస్-దీప్తౌ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఓ కృష్ణసార! నీ చూపులకు ఉత్సుకతను కల్గించే కృష్ణ శరీరాన్ని నీవు గమనించావా? నీ కన్నులు కృతార్థమైనట్లు కనిపిస్తున్నాయి. నిక్కబొడుచుకొన్న మీ చెవులు ప్రకాశిస్తూ వేణుగానంతో కలిగిన ఆనందాన్ని వ్యక్తం చేస్తున్నాయి.

**వి :** 1. జింక కన్నులకు కుతూహలం గలగటం ద్వారా అవి తమ చంచలత్వాన్ని కూడా విడిచి కృష్ణుని రూపాన్ని చూస్తూ ఉంటాయని ధ్వని. మురళీరవాన్ని విని ఆనందించాయి కాబట్టి కన్నులను నిలకడగా నిలిపాయని, చెవులు నిక్కబొడుచుకున్నాయని భావం. అది జింకల స్వాభావికమైన చేష్ట. జాతిస్వభావవర్ణన కాబట్టి ఇది స్వభావోక్త్యలంకారం. '**స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్**' - (కు.160)

| | | | |
|---|---|---|---|
| 2. **అలక్షి :** | **అలక్షి** | అలక్షిషాతామ్ | అలక్షిషత |
| | అలక్షిష్ఠాః | అలక్షిషాథామ్ | అలక్షిధ్వమ్ |
| | అలక్షిషి | అలక్షిష్వ | అలక్షిష్మ |
| **బిభర్షి :** | బిభర్తి | బిభృతః | బిభ్రతి |
| | **బిభర్షి** | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః |
| **చకాస్తి :** | **చకాస్తి** | చకాసతః | చకాసతి |
| | చకాస్సి | చకాస్థః | చకాస్థ |
| | చకాస్మి | చకాస్వః | చకాస్మః. |

*

**శ్లో॥ యది నిగమవిదూరస్త్వం నృణాం దూరదూరో**
**హృదయకమలతః కిం నాథ! నాపైషి తర్హి ।**
**తరుణి! తనువియోగః కిం మతస్తే మనోజ్ఞే!**
**ప్రియపురుషవియోగాద్దుస్సహం తం న మన్యే ॥ 7-42**

**అ :** ప్రాణత్యాగమా? ప్రణయత్యాగమా? అన్న మీమాంసతో గోపికల సంవాదం. -మాలిని.

**అ :** నాథ! నిగమవిదూరః త్వం నృణాం దూరదూరః యది తర్హి హృదయకమలతః కిమ్ న అపైషి. తరుణి! తను-వియోగః తే మతః కిమ్? మనోజ్ఞే ! తం ప్రియపురుషవియోగాత్ దుస్సహం న మన్యే.

**ప్ర :** నాథ! = స్వామీ, నిగమ-విదూరః : నిగమ = వేదాలకు (నియతం గమ్యతే ఇతి), విదూరః = అందనివాడవు, త్వమ్ = నీవు, నృణామ్ = మనుషులకు, దూర-దూరః = మరీ దూరమైనవాడవు, యది = అయితే, తర్హి = ఆ మేరకు, హృదయ-కమలతః = హృదయపద్మంనుండి (హృదయమేవ కమలం-తస్మాత్), కిమ్ = ఎందువల్ల, న-అపైషి = తొలగిపోవటంలేదు? (అప-ఇ-గతౌ పరస్మైపది-లట్-మ.ఏ.) తరుణి! = యువతీ!, తను-వియోగః = శరీరపరిత్యాగం (తనోః వియోగః), తే = నీకు, మతః కిమ్ = ఇష్టమా? మనోజ్ఞే = మనసెరిగినదానా! (మనః జానాతి ఇతి - తస్మాత్ సంబుద్ధిః), తమ్ = దానిని (శరీరత్యాగాన్ని), ప్రియ-పురుష-వియోగాత్ : ప్రియ =

ఇష్టుడైన, పురుష = మగవానితో, వియోగాత్ = విరహం కన్న (ప్రియశ్చాసౌ పురుషః, తేన వియోగః, తస్మాత్), దుస్సహమ్ = భరింపరానిదని, న మన్యే = అనుకోవటం లేదు. (మన్ జ్ఞానే–ఆత్మనేపది–లట్–ఉ.ఏ.)

**తా ॥** స్వామీ! శ్రుతి కందని వాడవు. నీవు మనుషులకు మరీ అందనంతవాడవు. అది నిజమే అయితే హృదయకమలంనుండి ఎందుకు తొలగిపోవు? తరుణీ! శరీరపరిత్యాగం నీకిష్టమా? మనోజ్ఞా! ప్రియపురుష–విరహంకన్న శరీరపరిత్యాగం సహించలేనిది కాదులే!

**వి :** 1. కృష్ణుడు (పరమాత్మ) మాటల కందని వాడు. మనుష్యులకూ అందనివాడు.

శ్లో॥ **నైవ వాచా** న **మనసా** ప్రాప్తుం శక్యో న **చక్షుషా** ।
అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥ – కఠోపనిషత్తు 2-3-12

2. హృదయంనుండి తొలగిపోకపోవటమంటే తమకు కృష్ణుడు దగ్గరగా వున్నట్టే. వియోగభావన మాత్రమే వారి మధ్య వుంది. ఆ భావన తొలగితే చాలు. భావాభావాలకు తేడా వుండదు. దశరథుడు రామవియోగంలో అంటున్న మాటలు గమనించండి.

శ్లో॥ హృదయాన్నాపయాతోఽసి దిక్షు సర్వాసు దృశ్యసే ।
వత్స! రామ! గతోఽసీతి సంతాపేనానుమీయతే ॥

"హృదయంనుండి తొలగిపోలేదు. అన్ని దిక్కులలో కనిపిస్తూనే వున్నావు. సంతాపం వల్ల మాత్రమే నువ్వు వెళ్ళావని అనుమానించవలసి వస్తోంది."

| | | | |
|---|---|---|---|
| 3. **అపైషి :** | అపైతి | అపేతః | అపయన్తి |
| | **అపైషి** | అపేథః | అపేథ |
| | అపైమి | అపేవః | అపేమః |
| **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే. |

*

**శ్లో॥ త్వయి న వహతి మానం న ప్రగల్భేతి కృష్ణో**
**యదజని తనుకార్శ్యం దైన్యమన్తః క్షణేన ।**
**న హి సఖి మమ దైన్యం దీననాథప్రయుక్తం**
**కృశతరనిఖిలాఙ్గ్యాః కిన్తు విశ్లేషవహ్నేః ॥ 7-43**

**అ :** గోపికల సంవాదం. –మాలిని.

**అ :** ప్రగల్భా న ఇతి కృష్ణః త్వయి మానం న వహతి యత్ క్షణేన తనుకార్శ్యమ్ అజని, అంతః దైన్యమ్ అజని. హి. సఖి! కృశతరనిఖిల+అంగ్యాః మమ దైన్యం దీననాథప్రయుక్తం న. కింతు విశ్లేషవహ్నేః (విశ్లేషవహ్నినా ప్రయుక్తమ్)

**ప్ర :** ప్రగల్భా = ప్రౌఢవు, న ఇతి = కాదని, కృష్ణః = కృష్ణుడు, త్వయి = నీ యందు, మానమ్ = గౌరవాన్ని/ ఆదరణను, న వహతి = వహించటం లేదు. (వహ ప్రాపణే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), యత్ = ఎందుకంటే, క్షణేన = (విరహవేళలో) క్షణమాత్రంలో, తను–కార్శ్యమ్ : తను = శరీరమందు, కార్శ్యమ్ = చిక్కిపోవుట (తనోః తనౌ వా కార్శ్యమ్), అజని = కలిగింది. (జనీ ప్రాదుర్భావే పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), అంతః = లోన (మనస్సులో), దైన్యమ్ = దీనత్వం (బేలతనం) (దీనస్య భావః), (అజని = కలిగింది), సఖి = చెలి, కృశతర–నిఖిలాంగ్యాః :

కృశతర = బాగా చిక్కిపోయిన ('**ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ**' (అష్టాధ్యాయి -5-3-57) సూత్రంతో రెండింటిని పోల్చి చూపితే తరప్ ప్రత్యయం. ఇక్కడ రెండు పదార్థాలకు పోలిక కాదు. రెండు అవస్థలకు పోలిక. ఇంతకుముందు స్థితితో, ఇప్పటి స్థితికి పోలిక), నిఖిల+అంగ్యాః = సర్వాంగాలూ గల (కృశతరాణి సర్వాణి అంగాని యస్యాః తస్యాః), మమ = నా యొక్క, దైన్యమ్ = బేలతనం, దీన-నాథ-ప్రయుక్తమ్ : దీన = దీనులకు, నాథ = స్వామి అయిన కృష్ణునిచే, ప్రయుక్తమ్ = కల్పింపబడినది (దీనానాం నాథః, తేన ప్రయుక్తం), న = కాదు, కింతు = అయితే, విశ్లేష-వహ్నేః : విశ్లేష = విరహమనే (విశ్లేషో విధురేఽ యోగే - మేదినీకోశః - షాన్త -45), వహ్నేః = అగ్నియొక్క, ప్రయుక్తమ్ = ప్రయోగం (ప్ర యుజ్ ధాతువుపై క్త ప్రత్యయం భావార్థంలో).

**తా ॥ గోపి** - నువ్వు ప్రగల్భవు కావని నిన్ను కృష్ణుడు ఆదరించటం లేదు. ఎందుకంటే కృష్ణవియోగం ఏర్పడిన క్షణంలోనే నువ్వు శారీరకంగా చిక్కిపోయావు. మానసికంగా బేలవయ్యావు. **గోపిక** - చెలీ! ఇది కృష్ణవియోగం వలన ఏర్పడిన కృశత్వం కాదు. సర్వాంగాలు అంతకుముందుకన్న చిక్కిపోయాయి. దానికి కారణం వియోగాగ్ని మాత్రమే.

**వి :** 1. **ప్రగల్భ** అన్నది కావ్యనాయికలలోని భేదాలలో ఒకటి. ఆలంకారికులు చెప్పిన ఆ నాయికా భేదాలు ప్రధానంగా ఇవి-(చూడుడు శ్లో6-36)

లౌకికంగా ఆలోచిస్తే గోపికలు అన్యలు. (అనగా ఇతరుని వివాహమాడినవారు లేదా కన్యలు). కానీ వారిని కూడా స్వీయలుగానే భావిస్తూ **ప్రగల్భ** అని వ్యవహరించటం. అందుకే ఈ గోపికాకృష్ణసంబంధాన్ని పూర్తిగా ఆధ్యాత్మికంగానే గౌరవిస్తోంది భారతీయ సంప్రదాయం. అక్కడ శారీరకప్రవృత్తికి స్థానమూ లేదు, విలువా లేదు. కానీ కొన్ని భాషలలో కవుల తమ భావుకత్వపరిధుల మేరకు ఆ సంబంధాన్ని శారీరకమన్నట్లు కూడా వర్ణించి తృప్తి చెందారు.

2. ఈ చిక్కిపోవటం కృష్ణుడు కల్గించింది కాదు. వియోగాగ్ని వల్ల ఏర్పడిందని గోపిక చెప్పటం నిజంగా ఆమె బేలతనమైనా కావాలి. లేదా నెరజాణతనమైనా కావాలి. కృష్ణుని ఒక్కమాటన్నా సహించలేని ప్రేమ అయినా కావచ్చు. అందుకే దేన్ని కాదంటోందో దాన్నే మరొకవిధంగా కారణంగా చెప్తోంది. ఒకదాన్ని కప్పిపుచ్చి మరొక దాన్ని ఆరోపిస్తే దానిని అపహ్నుత్యలంకారమంటారు. '**శుద్ధాపహ్నుతిరన్యస్యారోపార్థో ధర్మనిహ్నవః**'-(కు. 26), ఇక్కడ దాదాపు రెండూ ఒకటే కావట మొక చమత్కారం.

3. **వహతి :** 7-31వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **అజని :** | **అజని**/అజనిష్ఠ | అజనిషాతామ్ | అజనిషత |
| | అజనిష్ఠాః | అజనిషాథామ్ | అజనిధ్వమ్ |
| | అజనిషి | అజనిష్వహి | అజనిష్మహి. |

*

**శ్లో॥ అనృతలపితమేనం నార్థయధ్వం తథా త**
**ద్విదధతి బత! చేతః ప్రార్థనాశీలమేతే ।**
**పరభృతశుకభృఙ్గా గీతవాక్యాలకాభాః**
**పథి పథి పరమస్య శ్రీముఖశ్రీశ్చ చన్ద్రః ॥** **7-44**

**అ :** గోపికా సంవాదం - కృష్ణుని మరువలేకపోవటానికి కారణాన్ని ప్రకటించటం. -మాలిని.

**అ : గోపిక**-అనృతలపితమ్ ఏనం న అర్థయధ్వమ్. **గోపికలు**-తత్ తదా గీత వాక్య+ అలక+ఆభాః ఏతే పరభృత-శుక-భృంగాః పరమస్య శ్రీముఖశ్రీః చంద్రః చ పథి పథి చేతః ప్రార్థనాశీలం విదధతి.

**ప్ర : గోపిక :** అనృత–లపితమ్ : అనృత = అసత్యమైన, లపితమ్ = మాటగల (అనృతం లపితం యస్య తమ్), (వ్యాహార ఉక్తిర్లపితం – అమరకోశః – వాక్ –1), ఏనమ్ = ఈ కృష్ణుని, న అర్థయధ్వమ్ = ప్రార్థించకండి. (అర్థ్ ఉపయాంచాయామ్–ఆత్మనేపది–లోట్– మ.బ.), **గోపికలు :** తత్ = అది, తథా = అలాగే..., గీత–వాక్య+అలక+ఆభాః : గీత = పాటలయొక్క, వాక్య = మాటలయొక్క, అలక = ముంగురుల యొక్క, ఆభాః = శోభవంటి శోభగల (గీతానాం వాక్యానామ్ అలకానామ్ ఆభా ఇవ ఆభా యేషాం తే), ఏతే = ఈ, పరభృత–శుక–భృంగాః = కోకిలలు, చిలుకలు, తుమ్మెదలు (పరభృతాః శుకాః భృంగాశ్చ), పరమస్య = ఆ పరాత్పరునియొక్క, శ్రీముఖశ్రీః = శ్రీముఖం వంటి శోభగల (శ్రీముఖస్య శ్రీరివ శ్రీః యస్య), చంద్రః చ = చంద్రుడూ, పథి పథి = అన్ని దారులలో, చేతః = మనస్సును, ప్రార్థనా–శీలమ్ = అభ్యర్థించుట అను స్వభావంగల దానినిగా (ప్రార్థనా శీలం యస్య తత్), విదధతి = చేస్తున్నాయి. (వి ధా ధారణపోషణయోః లట్ ప్ర.బ.)

**తా ॥** 'చెలులారా! అబద్ధాలు చెప్పే కృష్ణుని ప్రార్థించకండి'. 'నువ్వు చెప్పింది నిజమే. కానీ కృష్ణుని పాటల వంటి పాటలు, మాటలవంటి మాటలు, ముంగురుల వంటి శోభ, ముఖకాంతివంటి కాంతి గల ఈ కోకిలలు, ఈ చిలుకలు, ఈ తుమ్మెదలు, ఈ చంద్రుడు మేము ఎటువెళ్ళినా అక్కడ తటస్థపడుతూ మమ్ము ప్రార్థించకుండా వుండనివ్వటం లేదు.

**వి :** 1. కోకిలలు, చిలుకలు, తుమ్మెదలు, చంద్రుడు – ఇవన్నీ శృంగారానికి ఉద్దీపన విభావాలు. వాటి పోరు ఎక్కువై గోపికలను నిలువనీయటం లేదు. కృష్ణుడు అసత్యవాది అని భావించినా అది ఉక్రోషంనుండి పుట్టిన ఆలోచనయే కానీ ప్రణయప్రతిబంధకమయ్యే స్థాయి దానికి లేదు. అవన్నీ భావశబలతలోని విన్యాసాలు. అందుకే పికశుకాదుల ప్రవృత్తితో వారు మరల కృష్ణునివైపే మొగ్గుచూపుతారు.

| | | | |
|---|---|---|---|
| 2. **అర్థయధ్వమ్ :** | అర్థయతామ్ | అర్థయేతామ్ | అర్థయన్తామ్ |
| | అర్థయస్వ | అర్థయేథామ్ | **అర్థయధ్వమ్** |
| | అర్థయై | అర్థయావహై | అర్థయామహై |
| **విదధతి :** | విదధాతి | విధత్తః | **విదధతి** |
| | విదధాసి | విదత్థః | విధత్థ |
| | విదధామి | విదధ్వః | విదధ్మః. |

*

**శ్లో॥ రమణి! రుచిరరూపః కిం ను దూరే తవాసీ–**
**న్నహి నహి మమ పుణ్యం తన్వి! దూరే ప్రయాతమ్ ।**
**బత! యదుకులనాథః స త్వయా మృగ్యతే కిం**
**నహి సఖి! సహనీతం చిత్తమన్వేషయామి ॥ 7–45**

అ : గోపికా సంవాదం. –మాలిని.

అ : గోపి – రమణి! రుచిరరూపః తవ దూరే ఆసీత్ కిం ను?
గోపిక – నహి నహి తన్వి! మమ పుణ్యం దూరే ప్రయాతమ్.
గోపి – బత! యదుకులనాథః సః త్వయా మృగ్యతే కిమ్?
గోపిక – నహి సఖి! సహనీతం చిత్తమ్ అన్వేషయామి.

ప్ర : రమణి! = కాంతా!, రుచిర–రూపః = అందమైన రూపంగల (రుచిరం రూపం యస్య సః), తవ = నీకు, దూరే = దూరంగానే, ఆసీత్ కిం ను? = ఉన్నాడా? (అస భువి –పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.), నహి నహి = లేదు లేదు, తన్వి! = సన్నని దానా!, మమ = నాయొక్క, పుణ్యమ్ = సత్కర్మఫలం, దూరే = దూరంగా, ప్ర–యాతమ్

= వెళ్ళింది. (ప్ర-యా ధాతువుపై క్త ప్రత్యయం), బత = అయ్యో!, యదు-కుల-నాథః = యదువంశస్వామి అయిన (యదుః ఇతి కులమ్ తస్య నాథః), సః = ఆ కృష్ణుడు, త్వయా = నీ చేత, మృగ్యతే కిమ్? = వెదుకబడుతున్నాడా! (మృగ అన్వేషణే-కర్మణి-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), - నహి = లేదు, సఖి = చెలి!, సహనీతమ్ = తోడుకొనిపోబడిన, చిత్తమ్ = మనస్సును, అన్వేషయామి = వెదుకుతున్నాను. (అను-ఇష్ గతౌ/ఇచ్ఛాయామ్-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోపి - చెలి! అందగాడు ఆ కృష్ణుడు నీకు దూరంగానే ఉన్నాడా?

గోపిక - లేదు లేదు. నా పుణ్యం నాకు దూరమైంది.

గోపి - యదుకులతిలకుని నీవు వెదుకుతున్నావా?

గోపిక - లేదు. తాను తనతో కొనిపోయిన నా మనస్సును వెదుకుతున్నాను.

**వి :** 1. 'కృష్ణుని కాదు నా పుణ్యాన్ని వెదుకుతున్నాను' అనటంలో కృష్ణునిలోని కృష్ణత్వాన్ని కాదని, తన పుణ్యత్వాన్ని ఆరోపించటం ధ్వనిస్తోంది. అది అపహ్నుత్యలంకారధ్వని. రెండవ భాగంలో కృష్ణుని కాదు నామనస్సును వెదుకుతున్నాను అనటం ద్వారా మనసంతా కృష్ణుడే అని మనస్సులో కృష్ణత్వాన్ని ఆరోపించటం ధ్వనిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ |
| **మృగ్యతే :** | **మృగ్యతే** | మృగ్యేతే | మృగ్యన్తే |
| | మృగ్యసే | మృగ్యేథే | మృగ్యధ్వే |
| | మృగ్యే | మృగ్యావహే | మృగ్యామహే |
| **అన్వేషయామి:** | అన్వేషయతి | అన్వేషయతః | అన్వేషయన్తి |
| | అన్వేషయసి | అన్వేషయథః | అన్వేషయథ |
| | **అన్వేషయామి** | అన్వేషయావః | అన్వేషయామః. |

*

**శ్లో॥ వితనుత బత! సఖ్యః! సుస్థిరం చిత్తమస్మ-**
**న్మృదులహృదవలోక్య స్థైర్యమాలమ్బయేత్సః ।**
**అనువనమయి! కాన్తం సఞ్చరన్తం సమన్తా-**
**దనుసరదనురక్తం కారయేత్ కః స్థిరం తత్ ॥ 7-46**

**అ :** గోపికల సంవాదం. -మాలిని.

**అ :** బత! సఖ్యః! చిత్తం సుస్థిరం వితనుత. అస్మత్+మృదులహృద్ అవలోక్య సః స్థైర్యమ్ ఆలంబయేత్. అయి అనువనం సమన్తాత్ సంచరన్తం కాన్తమ్ అనుసరత్ అనురక్తం తత్ కః స్థిరం కారయేత్.

**ప్ర :** బత! = అయ్యో! సఖ్యః = సఖులారా!, చిత్తమ్ = మనస్సును, సుస్థిరమ్ = స్థిరంగా/గట్టిగా, వితనుత = చేసికొనండి. (వి+తనూ విస్తారే పరస్మైపది-లోట్-మ.బ.), అస్మన్మృదులహృద్ : అస్మద్ = మనయొక్క, మృదుల = మృదువైన, హృద్ = మనస్సును (జాతి గతంగా ఏకవచనం), అవలోక్య = చూచి (అవ-లోకృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సః = ఆ కృష్ణుడు, స్థైర్యమ్ = స్థిరత్వాన్ని/కఠినత్వాన్ని, ఆలంబయేత్ = ఆసరా చేసికోవచ్చు. (ఆ-లవి అవస్రంసనే-ణిచ్-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), అయి = ఓ చెలి!, అనువనమ్ = ప్రతివనంలోనూ, సమన్తాత్= పూర్తిగా, సంచరన్తమ్ = తిరుగుతున్న, కాన్తమ్ = వల్లభుని, అనుసరత్ = అనుసరిస్తూ, అనురక్తమ్

= అనురాగాన్ని పొందిన, తత్ = ఆ మనస్సును, కః = ఎవడు, స్థిరమ్ = నిలకడగలదానినిగా, కారయేత్ = చేయగలడు. (కృ కరణే ణిచ్ -పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** చెలులారా! మనస్సును స్థిరంగా నిలుపుకోండి. మన మనస్సులలోని బేలతనాన్ని గమనిస్తే కృష్ణుడు కఠినంగా వ్యవహరించవచ్చు. (మనదగ్గరికి రాక పోవచ్చు.) ప్రతి వనంలో తిరుగుతున్న కృష్ణుని అనుసరిస్తూ అనురాగరంజితమైన మనస్సును ఎవడు స్థిరంగా నిలుపుకొనగలుగుతాడు?

**వి :** 1. మనస్సును అదుపు చేయటాన్ని గురించి ఆధ్యాత్మికవాదులు, కవులు కూడా ఎంతగానో చెప్తుంటారు. దానిని అదుపుచేయటమంత తేలిక కాదని దాదాపు అందరూ అంగీకరిస్తారు. ఒక్క ఆత్మజ్ఞానమే (తనను తాను సరిగా అంచనా వేసికొనగలశక్తి) మాత్రమే మనిషిని మనః ప్రభావం నుండి బయటపడవేయగలుగుతుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆలంబయేత్ :** | **ఆలంబయేత్** | ఆలంబయేతామ్ | ఆలంబయేయుః |
| | ఆలంబయేః | ఆలంబయేతమ్ | ఆలంబయేత |
| | ఆలంబయేయమ్ | ఆలంబయేవ | ఆలంబయేమ |
| **కారయేత్ :** | **కారయేత్** | కారయేతామ్ | కారయేయుః |
| | కారయేః | కారయేతమ్ | కారయేత |
| | కారయేయమ్ | కారయేవ | కారయేమ. |

*

**శ్లో॥ స విధిరపి నిదేశం తస్య నూనం విధత్తే**
**విరహదహనశాన్తిం యన్న మూర్ఛాం దదాతి ।**
**అపి నిశి హృదయాంతః కృష్ణసంశ్లేషశఙ్కీ**
**న దిశతి చ సుషుప్తిం హా! హతాః కిం విధేయమ్ ॥ 7-47**

**అ :** సః విధిః అపి నూనం తస్య నిదేశం విధత్తే యత్ విరహదహనశాంతిం మూర్ఛాం న దదాతి. అపి నిశి హృదయ+అంతః కృష్ణ సంశ్లేష శంకీ (సన్) సుషుప్తిం చ న దిశతి. హా! హతాః కిం విధేయమ్? -మాలిని.

**ప్ర :** సః విధిః అపి = ఆ బ్రహ్మకూడా (విధాతా విశసృడ్ విధిః-అమరకోశః-స్వర్గ-17) (విదధాతి సర్వమ్ - ఇతి విధిః), నూనమ్ = నిశ్చితంగా, తస్య = ఆ కృష్ణునియొక్క, నిదేశమ్ = ఆదేశాన్నే, విధత్తే = పాటిస్తాడు. (వి-ధా ధారణపోషణయోః-ఆత్మనేపది-లట్ -ప్ర.ఏ.), యత్ = ఎందుకంటే, విరహ-దహన-శాంతిమ్ : విరహ-దహన = విరహమనే అగ్నికి, శాంతిమ్ = నివారకమైన (విరహ ఏవ దహనః, తస్య శాంతిః, తామ్), మూర్ఛామ్ = ఒళ్ళు మరచుటను, న దదాతి = ఇచ్చుట లేదు. అపి = అంతేకాక, నిశి = రాత్రియందు, హృదయ+అంతః కృష్ణసంశ్లేషశంకీ : హృదయ+అంతః = మనస్సులో నున్న, కృష్ణ = కృష్ణునియొక్క, సంశ్లేష = కౌగిలిని, శంకీ (సన్) = అనుమానిస్తున్నవాడై (హృదయస్య అంతః తస్మిన్ కృష్ణస్య సంశ్లేషం శంకతే ఇతి), సుషుప్తిం చ = నిద్రను కూడా, న దిశతి = కల్గించటం లేదు (దిశ అతిసర్జనే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), హా! = అయ్యో, హతాః = దెబ్బతిన్నాం. కిం విధేయమ్ = చేయదగినదేముంది? (వి-ధా ధాతువుపై యత్ ప్రత్యయం)

**తా ॥** ఆ బ్రహ్మదేవుడు కూడా తప్పని సరిగా ఆ కృష్ణుని ఆదేశాలనే మన్నిస్తాడు. అందుకే విరహాగ్నికి ఉపశమనాన్ని కల్గించే మూర్ఛనయినా కలిగించటం లేదు. అంతేకాదు. రాత్రిపూట నిద్రలో మనస్సులోనున్న కృష్ణుని కౌగిలించుకుంటామేమో అని సందేహిస్తూ నిదురను కూడా కలిగించటం లేదు. అయ్యో! దెబ్బతిన్నాం. ఇప్పుడేమి చేయగలం?

**వి :** 1. శ్లో॥ గోప్యో గావ ఋచస్తస్య యష్టికా కమలాసనః ।
వంశస్తు భగవాన్ రుద్రః శృంగమింద్రః సగోసురః ॥ – కృష్ణోపనిషత్ 1/8

ఆ మేరకు కృష్ణుని వేణువు కమలాసునుడే. కాబట్టి కృష్ణుడు ఊదినట్టే పలుకుతాడు. ఆయన కూడా. అందుకే తమకు సహకరించటం లేదేమో అని గోపికల భావన.

2. కృష్ణుడితో పాటు బ్రహ్మకూడా తమ విరహశాంతికి సహకరించటం లేదన్న సహభావం వ్యంగ్యమై సహోక్త్యలంకార మిక్కడ ధ్వనిస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **విధత్తే :** | **విధత్తే** | | విదధాతే | విదధతే |
| | విధత్సే | | విదధాథే | విదధ్వే |
| | విధధే | | విదధ్వహే | విదధ్మహే |
| **దదాతి :** | **దదాతి** | దత్తః | | దదతి |
| | దదాసి | దత్థః | | దత్థ |
| | దదామి | దద్వః | | దద్మః |
| **దిశతి :** | **దిశతి** | దిశతః | | దిశన్తి |
| | దిశసి | దిశథః | | దిశథ |
| | దిశామి | దిశావః | | దిశామః. |

*

**శ్లో॥ యది మధురమపాయి స్వీయగాథామృతం ప్రాక్**
**స్ఫురదధరసుధాం స్వాం తర్హి యచ్ఛేన్ముకున్దః ।**
**క్వచిదపి నిజధామ స్థావరం జఙ్గమం వా**
**యది విమలమదర్శి స్వం తదా దర్శయేన్నః ॥ 7-48**

**అ :** గోపికలు కృష్ణుని నిందించుట. –మాలిని.

**అ :** యది ప్రాక్ మధురం స్వీయగాథామృతమ్ అపాయి తర్హి ముకుందః స్వాం స్ఫురదధర– సుధాం యచ్ఛేత్. క్వచిద్ అపి విమలం స్థావరం జంగమం వా నిజధామ యది అదర్శి తదా నః స్వం దర్శయేత్.

**ప్ర :** యది = ఒకవేళ, ప్రాక్ = ఇంతకు ముందు, మధురమ్ = తీయనైన, స్వీయ–గాథా–అమృతమ్ : స్వీయ = తన(కృష్ణుని)యొక్క, గాథా = కథ అనెడి, అమృతమ్ = అమృతాన్ని (స్వీయా చ సా గాథా, సా ఏవ అమృతమ్), అపాయి = త్రాగబడి వుంటే. (పా పానే కర్మణి –ఆత్మనేపది–లుఙ్–ప్ర.ఏ.), తర్హి = అప్పుడు, ముకుందః = కృష్ణుడు (ముకుం దదాతి ఇతి), స్వామ్ = తనయొక్క, స్ఫురద్–అధర–సుధామ్ : స్ఫురత్ = ప్రకాశించే, అధర = పెదవుల మీది, సుధామ్ = అమృతాన్ని (స్ఫురన్ చ సః అధరః, తస్మిన్ సుధా, తామ్), యచ్ఛేత్ = ఇచ్చి వుండేవాడు. (దాణ్ దానే పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.), క్వచిద్–అపి = ఎక్కడయినా, విమలమ్ = నిర్మలమైన, స్థావరమ్ = అచరమైనా (కదలనిది) (స్థా ధాతువుపై వరచ్ ప్రత్యయం), జంగమం వా = చరమైనా (కదిలెడిది) (భృశం గచ్ఛతీతి జంగమం), నిజ–ధామ : నిజ = తనయొక్క, ధామ = ఉనికిపట్టు, యది–అదర్శి = చూడబడి వుంటే (దృశ్ ప్రేక్షణే–కర్మణి–ఆత్మనేపది–లుఙ్–ప్ర.ఏ.), తదా = అప్పుడు, నః = మనకు, స్వమ్ = తనను, దర్శయేత్ = చూపి వుండేవాడు (దర్శనమిచ్చేవాడు) (దృశ్ ప్రేక్షణే పరస్మైపది – విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** మనం ఎప్పుడైనా మధురమైన ఆ కృష్ణుని గాథామృతాన్ని ఇంతకుముందు వినివుంటే ఇప్పుడు ముకుందుడు

మనకు అధరసుధను అందజేసివుండేవాడు. మనం ఎప్పుడైనా పవిత్రమైన ఆ కృష్ణుని నివాసాన్ని – స్థావరమైనా జంగమమైనా చూసి వుంటే ఇప్పుడు మనకు దర్శనాన్ని ఇచ్చి వుండేవాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో ముకుందపదం సాభిప్రాయం. ముకుంద పదానికి మోక్షమిచ్చేవాడని అర్థం. ఒకవైపు శృంగారరసానుభావం (శృంగారరసాంగమైన) అధరసుధాదానవర్ణనం మరొక వైపు మోక్షప్రదానం – ఈ రెండూ పరస్పరం భిన్నవిషయాలుగా కనిపించవచ్చు. కానీ ఈ వ్యతిరిక్తత అంతా మానవజాతి ప్రాదేశికంగా కల్పించుకున్న కొన్ని విలువలకు సంబంధించిన వ్యతిరేకతయే కానీ ఆ విలువలు సార్వదేశికాలు కానీ, సార్వకాలికాలు కానీ నియతాలు కానీ కావు. ప్రాకృతికజీవనానికి భిన్నమైనవీ కావు. ప్రాకృతికమైన భావనను, కాల్పనికాలైన అనుభావాలను కలిపి ఆలోచించినా, ప్రదర్శించినా ఇటువంటి అనుమానాలకు అవకాశం. అవన్నీ వదలిపెట్టి ఆలోచిస్తే కృష్ణ తనుస్పర్శ ఏ రీతిగా అయినా మోక్షప్రదమని భావన. అందుకే ముకుందపద ప్రయోగం సాభిప్రాయం – '**సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః**'–(కు.63), లక్షణం మేరకు ఇది పరికరాంకురాలంకారం.

2. ఇక్కడ కవిలోని భక్త్యతిశయం వ్యక్తమవుతుంది. అది ప్రధానరసం. అయితే ఆ భక్తిభావనలో కొంత కవి సమకాలీనత కనిపిస్తుంది. ఆ కృష్ణుని గాథామృతం విని వుంటే, ఆయననివాసాన్ని (మందిరాన్ని) దర్శించివుంటే – ఈ భావనకు కృష్ణకథా సమకాలికత కంటే కవి జీవనసమకాలికత్వం కనిపిస్తోంది. కృష్ణుని కాలానికి అదీ శైశవం కూడా ఇంకా దాటనప్పుడు కృష్ణకథామృతశ్రవణం, కృష్ణమందిరదర్శనం సమకూరేవి కావు. అవి కావ్యరచనాకాలానికి సంబంధించినవి. లేదా కృష్ణుని పరాత్పరునిగా/స్వీకరించి తత్సంబంధంగా గోపికలు మాటాడుతున్నారని భావించవలసివస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **అపాయి :** | **అపాయి** | అపాయిషాతామ్ | అపాయిషత |
| | అపాయిష్ఠాః | అపాయిషాథామ్ | అపాయిధ్వమ్ |
| | అపాయిషి | అపాయిష్వహి | అపాయిష్మహి |
| **యచ్ఛేత్ :** | **యచ్ఛేత్** | యచ్ఛేతామ్ | యచ్ఛేయుః |
| | యచ్ఛేః | యచ్ఛేతమ్ | యచ్ఛేత |
| | యచ్ఛేయమ్ | యచ్ఛేవ | యచ్ఛేమ |
| **అదర్శి :** | **అదర్శి** | అదర్శిషాతామ్ | అదర్శిషత |
| | అదర్శిష్ఠాః | అదర్శిషాథమ్ | అదర్శిధ్వమ్ |
| | అదర్శిషి | అదర్శిష్వహి | అదర్శిష్మహి |
| **దర్శయేత్ :** | **దర్శయేత్** | దర్శయేతామ్ | దర్శయేయుః |
| | దర్శయేః | దర్శయేతమ్ | దర్శయేత |
| | దర్శయేయమ్ | దర్శయేవ | దర్శయేమ. |

*

**శ్లో॥ కరరుహపదభాస్వద్గాత్రవిశ్లేషభీత్యా**
**న మృతిరనుమతా నః కృష్ణ! తేఽదర్శనాచ్చ ।**
**అసుభృతిరపి తస్మాత్ సౌమ్య! సౌందర్యధామ**
**న్నధిగహనముభాభ్యాం బద్ధకణ్ఠా ఇవ స్మః ॥** **7–49**

**అ :** గోపికలు జీవనమరణాల మధ్యనున్న తమనిస్సహాయతను వ్యక్తం చేయటం. –మాలిని.

**అ :** సౌమ్య! సౌందర్యధామన్! కృష్ణ! కరరుహపదభాస్వద్–గాత్రవిశ్లేషభీత్యా నః మృతిః న అనుమతా. తే అదర్శనాత్ అసుభృతిః అపి న అనుమతా. తస్మాత్ అధిగహనమ్ ఉభాభ్యాం బద్ధకంఠాః ఇవ స్మః.

ప్ర : సౌమ్య! = శుభప్రదమైనవాడా! (సౌమ్యం సాధు చ వల్గు చారు సుషమా వామం శుభం పేశలమ్-హలాయుధకోశః -689), సౌందర్యధామన్ = అందానికి మందిరమైన వాడా! (సౌందర్యస్య ధామ యస్మిన్ సః-తస్మాత్ సంబుద్ధిః), కృష్ణ = కృష్ణా!, కరరుహ... భీత్యా : కర-రుహ = గోళ్ళయొక్క, పద = స్థానమైన / గుర్తులు గలిగి, భాస్వత్ = ప్రకాశిస్తున్న, గాత్ర = శరీరంతో, విశ్లేష = విరహంవలన, భీత్యా = భయంతో, నః = మాకు, మృతిః = మరణం, న-అనుమతా = ఇష్టం లేదు, తే = నీయొక్క, అదర్శనాత్-చ = కనిపించనందువల్ల, అసు-భృతిః అపి : అసు = ప్రాణాలయొక్క, భృతిః+అపి = ధారణ కూడా (బ్రతకటం కూడా), న-అనుమతా = ఇష్టం లేదు. తస్మాత్ = కాబట్టి, ఉభాభ్యామ్ = ఇద్దరిచేత/రెండుభావాలచేత, అధిగహనమ్ = అరణ్య మధ్యలో (గహనస్య మధ్యే), బద్ధ-కంఠాః ఇవ = గొంతును బంధించినట్లుగా, స్మః = వున్నాము. (అస భువి పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ။** నఖక్షతాలతో ప్రకాశిస్తున్న కృష్ణ శరీరంతో వియోగం కలుగుతుందని మాకు మరణమిష్టం లేదు. కృష్ణుడు కనిపించటం లేదు కాబట్టి బ్రతకటమూ ఇష్టం లేదు. నట్టడవిలో ఇద్దరు గొంతు బిగించినట్లుగా వుంది మా పరిస్థితి. రెండు భావాలూ మమ్ము కదలనీయ కుండా చేస్తున్నాయి.

**వి :** 1. ఈ శ్లోకంలో గోపికలలోని భావసంధి కనిపిస్తోంది. సమానమైన బలంగల రెండు భావాలు సంఘర్షించటం **భావసంధి**. మరణేచ్ఛా కలగటం లేదు. జీవనేచ్ఛా కలగటం లేదు. కలుగక పోగా రెండు భావాలూ పరస్పరం కలహిస్తున్నాయి. వాళ్ళ అభిప్రాయమేమిటో (బ్రతకాలని భావిస్తున్నారా? చావాలని భావిస్తున్నారా?) స్పష్టపడటం లేదు. ఇటువంటి స్థితిగల కావ్యాన్ని అస్ఫుటవ్యంగ్యమని గుణీభూతవ్యంగ్యభేదంగా ఆలంకారికలు వ్యవహరిస్తారు. ఇటువంటిదే అందమైన శ్లోకం కావ్యప్రకాశంలో అస్ఫుటవ్యంగ్యాని-కుదాహరణం-

**శ్లో॥ అదృష్టే దర్శనోత్కంఠా - దృష్టే విచ్ఛేదభీరుతా ।**
**నాదృష్టేన న దృష్టేన - భవతా లభ్యతే సుఖమ్ ॥**

నీవు కనిపించనప్పుడు చూడాలని తపన. కనిపిస్తే మళ్ళీ వెళ్ళిపోతావని తపన. కాబట్టి కనిపించినా మానినా నీవల్ల సుఖం లేదు.

2. ఇది **ఉత్ప్రేక్షాలంకారం**. 'ఇవ' పదం వల్ల ఉపమాలంకార మనిపిస్తున్నా ఉపమానాంతర ప్రసక్తి లేదు కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షావ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥

| | | | |
|---|---|---|---|
| 3. **స్మః :** | అస్తి | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | **స్మః.** |

*

**శ్లో॥ నయనగనలినేషుం కాన్తవక్త్రేన్దుకాన్త్యా**
**నవపదరవిభాసా నః కుచస్థోత్పలేషుమ్ ।**
**శమయ సదయ! గాఢాలిఙ్గనేనార్ధగాత్రీ-**
**ర్విరచయ తవ దాసీస్తేన కన్దర్పదర్పమ్ ॥** **7-50**

**అ :** కందర్పదర్పాన్ని శమింపజేయుమని గోపికలు కృష్ణుని ప్రార్థించుటం. -మాలిని.

**అ :** నయనగనలిన+ఇషుం కాంతవక్త్ర+ఇందుకాంత్యా శమయ నః కుచస్థ+ఉత్పల+ఇషుం నవపదరవిభాసా శమయ. సదయ! గాఢ+ఆలింగనేన తవ దాసీః అర్ధగాత్రీః విరచయ. తేన కందర్పదర్పం శమయ.

**ప్ర :** నయనగ నలిన+ఇషుమ్ : నయన-గ = కంటిని చేరిన, నలిన+ఇషుమ్ = అరవింద బాణాన్ని (నయనం గతః, స చ అసౌ నలినేషుః, తమ్), కాంత-వక్త్ర+ఇందు-కాంత్యా : కాంత = అందమైన, వక్త్ర+ఇందు = ముఖచంద్రునియొక్క, కాంత్యా = వెలుగుతో (వక్త్రమ్ ఇందురివ వక్త్రేందుః, కాంతశ్చ అసౌ వక్త్రేందుః, తస్య కాంతిః, తయా), శమయ = అణచివేయి (శమ ఉపశమే-ణిచ్-పరస్మైపది-లోట్-మ.ఏ.), నః = మాయొక్క, కుచ-స్థ-ఉత్పల-ఇషుమ్ : కుచ-స్థ = స్తనాలను చేరిన, ఉత్పల+ఇషుమ్ = కలువబాణాన్ని (కుచే తిష్ఠతి ఇతి కుచస్థః, స చాసౌ ఉత్పలేషుః - తమ్), నవ-పద-రవి-భాసా : నవ = నూతనమైన, పద = కాలు అనెడి, రవి = సూర్యునియొక్క భాసా = కాంతితో (శమయ = అణచివేయి), సదయ = దయతో కూడినవాడా!, గాఢ+ఆలింగనేన : గాఢ = గట్టి, ఆలింగనేన = కౌగిలింతతో (గాఢం చ తత్ ఆలింగనం, తేన), తవ = నీ యొక్క, దాసీః = దాసులను (మమ్ము), అర్ధ-గాత్రీః = సగం శరీరం గలవారినిగా (అర్ధం గాత్రం యాసాం తాః అర్ధగాత్ర్యః, తాః), విరచయ = చేయి (వి-రచ ప్రతియత్నే-పరస్మైపది-లోట్-మ.ఏ.), తేన = దానితో, కందర్ప-దర్పమ్: కందర్ప = మదనుని యొక్క, దర్పమ్ = పొగరును (కందర్పస్య దర్పః తమ్), శమయ = అణచివేయి.

**తా ॥** కృష్ణా! అందమైన నీ ముఖచంద్రుని వెలుగుతో మా కన్నులలో చేరిన అరవింద బాణాన్ని నాశనం చేయి. మా స్తనాల నాశ్రయించిన నీలోత్పలశరాన్ని నీ పాదమనే సూర్యకాంతితో నాశనం చేయి. దయతో కూడిన నీ గట్టి కౌగిలింతతో మమ్ము అర్ధశరీరంతో మిగిల్చి మదనుని పొగరును అణచివేయి.

**వి :** 1. తామరలకు చంద్రుడితో వైరుధ్యం కాబట్టి చంద్రకాంతి ప్రసరించేంతవరకే కన్నులను చేరిన కమలాల వెలుగు. ఉత్పలాలకు సూర్యుడితో శత్రుత్వం కాబట్టి రవికిరణాలు ప్రసరించేంతవరకే స్తనాల నాశ్రయించిన ఉత్పలాల ఎగిసిపాటు. గోపికలందరూ కృష్ణుని కౌగిలితో అర్ధనారీగోపాలురయితే మదనుని పొగరు అణగినట్లే. ఎందుకంటే ఒక అర్ధనారీశ్వరుడే మదనుని దహింపజేయగలిగాడు. అటువంటి వారిసంఖ్య ఎక్కువయితే ఇక చెప్పవలసినదేముంటుంది?

| | | | |
|---|---|---|---|
| 2. **శమయ :** | శమయతు/శమయతాత్ | శమయతామ్ | శమయన్తు |
| | **శమయ**/శమయతాత్ | శమయతమ్ | శమయత |
| | శమయాని | శమయావ | శమయామ |
| **విరచయ:** | విరచయతు/విరచయతాత్ | విరచయతామ్ | విరచన్తు |
| | **విరచయ**/విరచయతాత్ | విరచయతమ్ | విరచయత |
| | విరచయాని | విరచయావ | విరచయామ. |

*

**శ్లో॥ అయి! రమణ! మురారే! సున్దరీకాన్త! శౌరే!**
**నరకమథన కృష్ణ! ప్రౌఢ! వారాశిధిష్ణ్య! ।**
**కరజితసురవృక్షాహంకృతాత్మీయశిక్ష!**
**స్వకవిజయసహాయ! ధ్వస్తధర్మాన్తరాయ! ॥** **7-51**

**అ :** కృష్ణస్తుతి - కావ్యమధ్యంలో మంగళస్తుతి. -మాలిని.

**అ :** అయి! రమణ! ముర+అరే! సుందరీకాంత! శౌరే! నరకమథన! కృష్ణ! ప్రౌఢవారాశిధిష్ణ్య! కరజితసురవృక్ష! అహంకృత+ఆత్మీయశిక్ష! స్వకవిజయసహాయ! ధ్వస్తధర్మ+అంతరాయ!

**ప్ర :** అయి! = ఓ, రమణ! = వల్లభా! (రమయతి ఇతి రమణః, తస్మాత్ సంబుద్ధిః), ముర+అరే! = మురునకు శత్రువా! (మురస్య అరిః, తస్మాత్ సంబుద్ధిః), సుందరీ-కాంత! : సుందరీ = అందగత్తెలకు, కాంత = ఇష్టమైనవాడా!

(సుందరీణాం కాంతః, తస్మాత్ సంబుద్ధిః), శౌరే = శూరుని పుత్రుడా!, నరక-మథన = నరకుని సంహరించినవాడా!, కృష్ణ = కృష్ణా, ప్రౌఢ = నేర్పరీ!, వారాశి-దిష్ణ్య : వారాశి = సముద్రం, దిష్ణ్య = నివాసంగా కలవాడా! (దిష్ణ్యం ధామ నికేతనం-హలాయుధకోశః-291), కర-జిత-సుర-వృక్ష : కర = చేతితో, జిత = గెలువబడిన, సుర-వృక్ష! = కల్పతరువు గలవాడా! (కరేణ జితః సురాణాం వృక్షః యేన సః), అహంకృత+ఆత్మీయ-శిక్ష : అహంకృత = అహంకరించిన, ఆత్మీయ = తనవారిని, శిక్ష = దండించేవాడా! (అహంకృతానామ్ ఆత్మీయానాం శిక్షా యస్మాత్ సః, తస్మాత్ సంబుద్ధిః), స్వక-విజయ-సహాయ:స్వక=తనవారికి, విజయ= గెలుపు నందు/వృద్ధియందు, సహాయ = తోడైనవాడా (స్వకానాం విజయం, తస్మిన్ సహాయః తస్మాత్ సంబుద్ధిః), ధ్వస్త-ధర్మ-అంతరాయ:ధ్వస్త=నశింపజేయబడిన, ధర్మ+అంతరాయ! = ధర్మ ప్రతిబంధకాలు గలవాడా! (ధ్వస్తాః ధర్మస్య అంతరాయాః యేన సః, తస్మాత్ సంబుద్ధిః)

**తా ॥** వల్లభా! మురరిపూ! సుందరీమణులకు ఇష్టమైనవాడవు నీవు. శూరుని (వసుదేవుని) కుమారుడవు. నరకుని సంహరించినవాడవు. నేర్పరివి. సముద్రం నీ నివాసం. కల్పవృక్షాన్ని సైతం గెలిచిన చెయ్యి నీది. అహంకరిస్తే ఆత్మీయులనైనా శిక్షించేవాడవు నువ్వు. నీ వారి విజయంలో సహాయపడేవాడవు. ధర్మప్రతిబంధకాలను ధ్వంసం చేసేవాడవు నీవు.

**వి :** 1. ముర+అరే = మురుడనే రాక్షసునకు శత్రువా? నరకమథన = నరకాసురుని సంహరించినవాడా? ఇవి వాస్తవానికి ప్రస్తుతకథాంశంలోని కాలానికి జరిగిన విషయాలు కావు. ఆ తర్వాత కృష్ణుని జీవితంలో జరిగిన సంఘటనలు. మరి గోపికలు అలా ఎలా అనగలిగారు? అన్నది ప్రశ్న తార్కికదృష్టికి.

ప్రశ్న సమంజసమే. పౌరాణికగాథలను కావ్యాలుగా మలచేటప్పుడు ఇటువంటివి జరుగుతుంటాయి. ఆ జీవితమంతా జరిగిపోయిన తరువాత ఎప్పటికో ఆ కథను వ్రాస్తుంటాం. అప్పటికే ఆ పాత్రలకు ఆ కథలోని సంఘటనల ద్వారా కొన్ని పేర్లు లేక కొన్ని లక్షణాలు రూఢమై పోతాయి. యౌగికార్థంతో నిమిత్తం లేకుండా వాటిని రూఢిమాత్రంగా అలా వాడటం జరుగుతుంది.

రాబోయే సంఘటనలకు సంబంధించిన జ్ఞానం అప్రయత్నంగా ఆయా వక్తలలో కనిపిస్తోందనో మరొకరీతిగానో సమర్థించటం ఆ రచయితపై మనకున్న గౌరవాన్ని వ్యక్తం చేస్తుంది. అంతవరకే. నాటకీయంగా భవిష్యత్తును సూచించే ఏర్పాటు అని అనాలంటే అది ప్రకృతం మరొకరీతిగా వుండి రెండవరకంగా అన్వయించే వీలు కలిగి వుంటుందే కానీ అదొక్కటిగా వుండే పరిస్థితి లేదు.

ధ్వస్తధర్మాంతరాయ - అన్న పదబంధంలో మాత్రం ధర్మరాజునకు అడ్డంగా నిలిచిన దుర్యోధనాది ధ్వంసం ధర్మపదంచేత నాటకీయంగా స్ఫురించవచ్చు. అది గోపికలకు తెలియనిది. మనకు కథ మొత్తం తెలుసు కాబట్టి స్ఫురణకు వచ్చేది. ప్రకరణానుసారంగా ధర్మపదం వేరే అర్థాన్నిస్తోంది కాబట్టి ఇబ్బందిలేనిది.

2. శ్లోకంలో పదాలు/పదబంధాలు అన్నీ సంబోధనాంతాలే. కృష్ణుని ఉద్దేశించిన సంబోధనలే. కావ్యమధ్యంలోని మంగళస్తుతి ఇతి. ఈ సంబోధనాంతాలనన్నింటినీ ముందు శ్లోకంతోనే అన్వయించి అక్కడున్న విధేయవాక్యాన్నే ఇక్కడ కూడా ప్రధానవాక్యంగా తీసికోవచ్చు. అప్పుడు '**గాఢాలింగనేన అర్ధగాత్రీః విరచయ**' అన్న వాక్యంతో ఈ సంబోధనలు సమసిస్తాయి.

*

**శ్లో॥ వృక్షేషు పక్షిషు మృగేషు విచారయన్తీః**
**ప్రేక్ష్య ప్రముగ్ధహృదయాః శ్రుతతత్త్వకాన్తీః ।**
**ఆవిర్బభూషురపి రమ్యతదీయవాక్య**
**భావం పునర్వివిదిషుః స తదా తిరోఽభూత్॥ 7-52**

**అ :** గోపికల మనోహరవచనాలను మరీ వినగోరి కృష్ణుడు కనిపించకుండా పోవటం. -వసంతతిలక.

**అ :** వృక్షేషు పక్షిషు మృగేషు విచారయన్తీః ప్రముగ్ధహృదయాః శ్రుతతత్త్వకాన్తీః, ప్రేక్ష్య ఆవిర్బుభూషురపి రమ్యతదీయవాక్యభావం పునర్వివిదిషుః సః తదా తిరోఽభూత్ ।

**ప్ర :** వృక్షేషు = చెట్ల (గుంపుల) యందు, పక్షిషు = పక్షులలో, మృగేషు = జంతువులలో, విచారయన్తీః = (కృష్ణుని గూర్చి) అడుగుతున్న, ప్రముగ్ధ-హృదయాః : ప్రముగ్ధ = మోహానికి లోనైన, హృదయాః = మనస్సులు గల (ప్రముగ్ధాని హృదయాని యాసాం తాః), శ్రుత-తత్త్వ-కాన్తీః:శ్రుత-తత్త్వ = తత్త్వమెరిగిన వారి, కాన్తీః = వెలుగువంటి వెలుగు గల గోపికలను (శ్రుతం తత్త్వం యైస్తే శ్రుతతత్త్వాః, తేషాం కాన్తిరివ కాన్తిః యాసాం తాః), ప్రేక్ష్య = చూచి (ప్ర-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఆవిర్బుభూషుః+అపి = కనిపించదలచుకొని కూడా (ఆవిర్భవితుమ్ ఇచ్ఛుః ఆవిర్బుభూషుః), రమ్య-తదీయ-వాక్య-భావమ్ : రమ్య = మనోజ్ఞమైన, తదీయ = ఆ గోపికలయొక్క, వాక్య = మాటలయొక్క, భావమ్ = ఆంతర్యాన్ని (రమ్యాణి చ తదీయాని వాక్యాని, తేషాం భావః, తమ్), పునః = మరల, వివిదిషుః = తెలిసికొనగోరి (వేత్తుమ్ ఇచ్ఛుః), సః = ఆ కృష్ణుడు, తదా = అప్పుడు, తిరః+అభూత్ = అదృశ్యుడయ్యాడు. (తిరః + భూ సత్తాయామ్-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** చెట్లలో పక్షుల గుంపుల్లో జంతుసమూహాల్లో వెదుకుతూ మోహానికి లోనైన మనస్సులు, తత్త్వవేత్తలలోని కాంతివంటి కాంతి గల ఆ గోపికలను చూచి వారి ఎదుటపడాలని అనుకొని కూడా వాళ్ళ మనోహరవచనాలలోని భావాన్ని తెలిసికోవాలనుకొని మరల కనిపించకుండా పోయాడు.

**వి :** 1. **ప్రముగ్ధహృదయాః - శ్రుతతత్త్వకాన్తీః** - ఈ రెండు పరస్పరం విరుద్ధమైన విశేషణాలుగా కనిపిస్తాయి. కృష్ణునికై పరితపిస్తూ చెట్లు, పుట్టలూ అంతా వెదకటం వాళ్ళ మోహాన్నే కాక 'కృష్ణుడు సర్వాంతర్యామి' అని వాళ్ళకున్న జ్ఞానాన్ని కూడా సూచిస్తుంది. మొదటిది ప్రముగ్ధహృదయత్వ మయితే, రెండవది శ్రుతతత్త్వకాంతిమత్త్వం. రెండూ సమంజసాలే.

కృష్ణునిలోని భావాలు కూడా విలాసమాత్రాలే. కనిపించాలనుకొని కూడా ఇంకా వారి ఆంతర్యాన్ని తెలిసికోవాలని అంతర్ధానం కావటం లీలా మాత్రమే. గోపికల భావాన్ని సాంద్రతమం చేయాలన్న దృష్టి అక్కడ కనిపిస్తుంది.

2. గోపికలు తరులతాదులను కృష్ణుని గూర్చి అడగటాన్ని పోతన విస్తరించి వ్రాశాడు. మచ్చుకు...

సీ. మానినీమన్మథు మాధవుఁ గానరే - సలలితోదారవత్సకములార !
సలలితోదారవత్సకవైరిఁ గానరే - సుందరోన్నతలతార్జునములార!
సుందరోన్నతలతార్జునభంజుఁ గానరే - ఘనతరలసదశోకంబులార!
ఘనతరలసదశోకస్ఫూర్తిఁ గానరే - నవ్యరుచిరకాంచనంబులార!

ఆ. నవ్యరుచిరకాంచనకిరీటుఁ గానరే - గహనపదవికురువకంబులార!
గహనపదవికురువకనివాసిఁ గానరే - గణికలార! చారుగణికలార! - పోతనభాగవతము 10/1012

**కృష్ణుని అంతర్ధానం** :

ఉ. చిక్కక యీశుఁడై యెదిరిఁ జిక్కులఁ బెట్టెడి మాయలానికిన్
జిక్కి కృతార్థలై మరునిచిక్కులఁ జొక్కి లతాంగు లుండఁగా
మక్కువ శాంతి సేయుటకు మన్నన సేసి ప్రసన్నుఁ డౌటకున్
జక్కన నా విభుండు గుణశాలి ఁదిరోహితుఁ డయ్యె నయ్యెడన్ - 10/1005

| | | | | |
|---|---|---|---|---|
| 3. **తిరోఽభూత్ :** | **తిరోఽభూత్** | తిరోఽభూతామ్ | తిరోఽభూవన్ | |
| | తిరోఽభూః | తిరోఽభూతమ్ | తిరోఽభూత | |
| | తిరోఽభూవమ్ | తిరోఽభూవ | తిరోఽభూమ. | * |

**శ్లో॥ కామినీతి జితాపద్యాం నినాయ సుఖయన్ సుఖీ ।**
**కామినీతిజితా పద్యాం కాఞ్చిదాసాద్య సోజ్ఝితా ॥ 7-53**

**అ :** శబ్దాలంకార ప్రధానమైన రచన - కృష్ణప్రవృత్తి వివరణ. -పథ్యావక్త్రమ్.

**అ :** జితాపద్ సుఖీ కామినీ ఇతి యామ్ సుఖయన్ నినాయ. సా కామి-నీతి-జితా కాంచిత్ పద్యామ్ ఆసాద్య ఉజ్ఝితా

**ప్ర :** జిత+ఆపద్ = కష్టాలు గడచినవాడై (జితాః ఆపదః యేన సః), సుఖీ = సుఖంగా వున్న కృష్ణుడు, కామినీ+ఇతి = అనురాగవతి అని, యామ్ = ఏ గోపికను, సుఖయన్ = సుఖింపజేస్తూ/ఆనందింపజేస్తూ, నినాయ = కొనిపోయెనో (నీ-ప్రాపణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), సా = ఆ గోపిక, కామి-నీతి-జితా : కామి = కాముకుల యొక్క, నీతి = పద్ధతిని, జితా = గెలిచిన కృష్ణునిచే (కామినాం నీతిం జయతీతి కామినీతి జిత్-తేన), కాంచిత్ = ఒకానొక, పద్యామ్ = బాటను (అయనం పదవీమార్గః పద్యా - హలాయుధకోశః - 260), ఆసాద్య = పొంది (ఆ-సద్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉజ్ఝితా = విడువ బడింది. (ఉజ్ఝ్ ధాతువుపై కర్మార్థంలో క్త ప్రత్యయం)

**తా ॥** (పసితనంలో) కష్టాలు గడచి సుఖంగా వున్న కృష్ణుడు అనురాగవతి అన్న భావనతో ఏ గోపికను సుఖింపజేస్తూ కొనిపోయాడో ఆ గోపికను కామినీతిని జయించినవాడు కాబట్టి ఒకానొక బాటలో వదలివేశాడు.

**వి :** 1. కామినీతిని జయించినవాడు కాబట్టి కృష్ణుడు ఆమెను వదలివేశాడని ప్రతిపాదన. వదలిపెట్టడం కామినీతి అవుతుందా? కామినీతిని గెలవట మవుతుందా? ఆలోచించాలి.

2. తాను సుఖి కాబట్టి కృష్ణునకు ఇతరులను సుఖపెట్టడం కూడా తెలుస్తుంది. '**స్వయం తీర్ణః పరాంస్తారయేత్**' అన్నది గదా జీవనరీతి.

3. శ్లోకంలో గోపికను కొనిపోతున్నప్పుడు కానీ, విడిచిపెట్టిన సందర్భంలో కానీ కృష్ణవాచకమైన విశేష్యపదం లేదు. పేరుకన్న ప్రవృత్తికి ప్రాధాన్యాన్ని కవి భావించి-నట్లనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 4. **నినాయ :** | **నినాయ** | నిన్యతుః | నిన్యుః |
| | నినయిథ/నినేథ | నిన్యథుః | నిన్య |
| | నినాయ/నినయ | నిన్యివ | నిన్యిమ. |

6. ఈ శ్లోకంతో ప్రారంభించి 63వ శ్లోకం వరకు వివిధ యమకభేదాలకు రచనలో ప్రాధాన్యం కనిపిస్తోంది. యమక మొక శబ్దాలంకారం.

**'పదమనేకార్థమక్షరం చావృత్తం స్థాననియమే యమకమ్'**

**'పాదాః పాదస్యైకస్య అనేకస్య చాదిమధ్యాంతభాగాః స్థానాని'** - కావ్యాలంకారసూత్రాణి 4/1/1,2

ఒక పాదం పూర్తిగా ఆవృత్తం కావటం, లేదా ఒకే పదం లేదా పదబంధం పాదాలలో ఆది-మధ్య-అంతభాగాలలో ఎక్కడైనా ప్రతిపాదంలోనూ ఆవృత్తం కావటం యమకం. పద్యంలోని నాలుగుపాదాలలోనూ అంత్యపదాలు సమానంగా వుండటం, లేదా రెండు నాలుగు పాదాల చివరిభాగాలు సమానంగా వుండటం ఇవన్నీ యమకభేదాలే. పదయమకంతోపాటు అక్షర యమకాన్ని కూడా ఆదరించవచ్చు.

ప్రకృతశ్లోకంలో కామినీతి జితాపద్యామ్ అన్నదే ప్రథమతృతీయ పాదాల స్వరూపం. కాబట్టి ఇది పాదయమకం.

7. శ్లో॥ ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనమ్ ।
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః ॥ - ధ్వన్యాలోకం - 2/15

అని ఆనందవర్ధనుడు శృంగారరసవిషయంలో, అందునా విప్రలంభశృంగారవిషయంలో యమకం మొదలయిన శబ్దాలంకారాలను వాడే ప్రయత్నం చేయటం ప్రమాదకరమని సూచించాడు. అయినా కవులు అటు సంస్కృతకవులు ఇటు తెలుగు కవులు కూడా చాలామంది దానిని గమనించినట్లు లేదు. వారి కవితా పాండిత్యాలమీద నమ్మకమున్న కారణంగా కవులు మృదుతమాలైన విప్రలంభశృంగారంలోనూ కరుణంలోనూ కూడా ఆ పోకడలు పోయారు.

ప్రకృతం గోపికాగతంగా విప్రలంభశృంగారరసావిష్కారం జరుగుతోంది. ఈ పరిస్థితిలో యమకానికి ఉపక్రమించటం కవిగతమైన ప్రౌఢిమకు సంకేతం. *

**శ్లో॥ సాఽరసాఽసారసంసారే ససార సురసూరసమ్ ।**
**సుసారసరసారోరఃసరసీసరసారసీ ॥ 7-54**

**అ :** యమకాన్నే ద్వ్యక్షరం (రెండే అక్షరాలు) గా ప్రయోగిస్తూ గోపీస్థితి వర్ణన. -పథ్యావక్త్రమ్.

**అ :** అసారసంసారే అరసా సా సురసూ+ఉరసమ్ సుసార-సర-సార-ఉరః-సరసీ-సర-సారసీ (సతీ) ససార.

**ప్ర :** అసార-సంసారే = సారంలేని ప్రపంచంపై (నాస్తి సారః యస్మిన్ సః అసారః స చాసౌ సంసారః, తస్మిన్), అరసా = ఆసక్తిలేని, సా = ఆ గోపిక, సరసూ-ఉరసమ్ : సుర-సూ = లక్ష్మి (సురాన్ సూతే ఇతి సురసూః), ఉరసమ్ = వక్షస్థలంలో గలవానిని/ (సురసూః ఉరసి యస్య తమ్) కృష్ణుని, సుసార... సారసీ : సు-సార = మిక్కిలి శ్రేష్ఠములైన, సర = ముత్యాలహారాలయొక్క, సార = శ్రేష్ఠమైన, ఉరః-సరసీ = వక్షస్థలమనే సరస్సువైపు, సర = వెళ్తున్న, సారసీ (సతీ) = సారసపక్షిణియై (సుసారాశ్చ తే సరాః తైః సారమ్ చ త ఉరః చ తదేవ సరసీ తాం సరన్తీ చ సా సారసీ), ససార = అనుసరించింది. (సృ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** నిస్సారమైన ఈ సంసారంమీద ఆసక్తిని కోలుపోయిన ఒక గోపిక లక్ష్మిని గుండెల్లో నిలుపుకొన్న కృష్ణుని వెంట వెళ్ళింది. అది... మంచి ముత్యాల హారాలు ధరించిన కృష్ణుని వక్షస్థలమనే సరస్సు వైపు ఆడ బెగ్గురు పక్షి వెళ్ళినట్లుంది.

**వి :** 1.సురసూరసమ్ - సురసువః (లక్ష్మికి) రసః (శృంగారం) యస్మాత్ సః సురసూరసః తమ్ - సురసూరసమ్ అని అయినా చెప్పవచ్చు. 'శృంగారో విష్ణుదైవత్యః' (నాట్యశాస్త్రం - 6/44) అని నిర్వచించినందువలన శృంగారానికి అధిదేవత విష్ణువు - తద్వారా లక్ష్మికి సింగారం అని అర్థం.

2. ఈ శ్లోకంలో **ద్వ్యక్షరయమకం**. శ్లోకమంతా రెండక్షరాలతోనే సాగుతుంది. ఇటువంటివి చిత్ర కవితా భేదాలు.

| | | | |
|---|---|---|---|
| 3. **ససార :** | **ససార** | సస్రతుః | సస్రుః |
| | ససర్థ | సస్రథుః | సస్ర |
| | ససార/ససర | సస్నవ | సస్నమ. |

*

**శ్లో॥ అలక్షయంతీ స్మరతాతమేనం - హృదాత్తఖేదా స్మరతా తమేనమ్ ।**
**జగాద సౌమ్యం నయ నాతిదూరం - విధే! న కుర్యా నయనాతిదూరమ్ ॥7-55**

**అ :** కృష్ణుని దూరంగా కొనిపోవద్దని గోపిక బ్రహ్మను ప్రార్థించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** స్మరతాతమ్ ఏనమ్ అలక్షయన్తీ తమ్ ఏనమ్ స్మరతా హృదా ఆత్తఖేదా (గోపికా) జగాద. విధే! సౌమ్యం అతిదూరం న నయ. నయన+అతిదూరం న కుర్యాః.

**ప్ర :** స్మర–తాతమ్ : స్మర = మదనునియొక్క, తాతమ్ = తండ్రిఅయిన (తాతస్తు జనకః పితా–అమరకోశః–మనుష్య–28) (స్మరస్య తాతః తమ్), అలక్షయన్తీ సతీ =గుర్తించనిదై, తమ్ ఏనమ్ = ఆ ఈ కృష్ణుని, స్మరతా = తలచుకొంటున్న, హృదా = మనస్సుద్వారా, ఆత్త–ఖేదా : ఆత్త = పొందబడిన, ఖేదా = దుఃఖం గల (ఆత్తః ఖేదః యయా సా), గోపిక, జగాద = పలికింది (బ్రహ్మతో) (గద వ్యక్తాయాం వాచి పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), విధే = బ్రహ్మదేవుడా!, సౌమ్యమ్ = మృదుత్వం గల కృష్ణుని, అతిదూరమ్ = మరీ దూరంగా, న నయ = కొనిపోవద్దు (నీ–ప్రాపణే–పరస్మైపది–లోట్–మ.ఏ.), నయన+అతిదూరమ్ : నయన = కన్నులకు, అతిదూరమ్ = చాలా దూరమైన వానినిగా (నయనయోః అతిదూరః తమ్), న కుర్యాః = చేయవద్దు. (కృ–కరణే–పరస్మైపది–విధిలిఙ్–మ.ఏ.)

**తా ॥** ఆ గోపిక మదనుని తండ్రిని గుర్తించక మనస్సు ఆ కృష్ణుని మాత్రమే స్మరిస్తుంటే ఖేదపడి బ్రహ్మతో ఇలా అంది – 'విధీ! మృదుస్వభావుడైన ఆ కృష్ణుని దూరం కొనిపోవద్దు. మా కంటికి దూరం చేయవద్దు.'

**వి :** 1. ఇది పాదాంతయమకం. ప్రథమ ద్వితీయ పాదాలలో తృతీయ చతుర్థ పాదాలలో సమానపదబంధ సన్నివేశం.

| | | | |
|---|---|---|---|
| 2. **జగాద :** | **జగాద** | జగదతుః | జగదుః |
| | జగదిథ | జగదథుః | జగద |
| | జగాద/జగద | జగదివ | జగదిమ |
| **నయ :** | నయతు/నయతాత్ | నయతామ్ | నయన్తు |
| | **నయ**/నయతాత్ | నయతమ్ | నయత |
| | నయాని | నయావ | నయామ |
| **కుర్యాః :** | కుర్యాత్ | కుర్యాతామ్ | కుర్యుః |
| | **కుర్యాః** | కుర్యాతమ్ | కుర్యాత |
| | కుర్యామ్ | కుర్యావ | కుర్యామ. |

*

**శ్లో॥ కాన్తోపమానేన దివాఽపి కుట్యా–మన్తర్హితం కాలభతేజసా యమ్ ।**
**స్వాన్తే బిభర్మీశ! వినేహ తం త్వా–మన్తర్హితం కా లభతేఽజ! సాయమ్ ॥ 7–56**

**అ :** గోపికలు కృష్ణుని అనుగ్రహప్రాప్తికై అభ్యర్థించుట. –ఇంద్రవజ్ర.

**అ :** ఈశ! దివా అపి కుట్యామ్ అపి అన్తర్హితమ్ యమ్ త్వాం కాలభతేజసా ఉపమానేన స్వాన్తే బిభర్మి ఇహ సాయం తం త్వాం వినా అజ! కా అన్తర్హితం లభతే.

**ప్ర :** ఈశ = స్వామీ, కాంత = వల్లభా, దివా+అపి = పగలు కూడా, కుట్యామ్–అపి = ఇంటిలో కూడా (కుటీరస్తు కుటీపల్లీ – వైజయన్తీ – పురా – 28), అన్తర్హితమ్ = మాటుగా నిలిచిన, యం త్వామ్ = ఏ నిన్ను, కాలభ–తేజసా = గున్నఏనుగు తేజస్సుతో (కలభ సంబంధి ఇదం కాలభం, తచ్చ తత్ తేజశ్చ కాలభతేజః తేన), ఉపమానేన = పోలికతో, స్వాన్తే = మనస్సులో, బిభర్మి = భరిస్తున్నాను. (భృ భరణే పరస్మైపది–లట్–ఉ.ఏ.), ఇహ = ఇక్కడ (వనంలో), సాయమ్ = సంజెవేళలో, తం త్వాం వినా = ఆ నీవు లేక, అజ! = పుట్టుకలేనివాడా!,

కృష్ణా! (న జాయతే ఇతి), కా = ఏ కాంత, అంతర్హితమ్ = మనస్సుకు హితాన్ని (సుఖాన్ని) (అంతః హితమ్), లభతే = పొందుతుంది. (లభ్-ప్రాప్తౌ-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఓ స్వామీ! పగటిపూట ఇంటిలో కూడా కనిపించవు. వనంలో సంచరిస్తూ వుంటావు. గున్న ఏనుగుతేజస్సు వంటి నీ తేజస్సును మనస్సులో పెట్టుకొని తలచుకొంటున్నాను. ఇక ఇప్పుడు ఈ వనంలో సంజెవేళలో కూడా నువ్వు కనిపించకపోతే ఏ లలన సుఖాన్ని పొందగలదు?

**వి :** 1. ఈ శ్లోకంలో ద్వితీయ చతుర్థ పాదాలు సమానంగా కనిపిస్తున్నాయి. కాబట్టి ఇది మధ్యాంతపాదయమకం. ఇక్కడ కూడా గోపికలలోని కృష్ణదర్శనాసక్తి వాచ్యంగానే వుంది. పూర్వరాగవిప్రలంభంలోని దశావస్థలలో ఇది ఒకటి. సాంకేతికంగా చక్షుః ప్రీతి అని వ్యవహారం-

క. చక్షుః ప్రీతియనం జను
నక్షీణగుణవిలాసగుణసమగ్రునిఁ బ్రీతిన్
వీక్షించు కుతుక మది మరు
నిక్షుధనుర్దండమునకు నెక్కెక్కించున్ - కావ్యాలంకారచూడామణి - 2/62

| | | | |
|---|---|---|---|
| 2. **బిభర్మి :** | బిభర్తి | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | **బిభర్మి** | బిభృవః | బిభృమః |
| **లభతే :** | **లభతే** | లభేతే | లభన్తే |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభే | లభావహే | లభామహే. |

*

**శ్లో॥ రాసి సారోఽసి సురసమేహి హే మహి! మామిహ ।**
**దాసీం ససాదాం సదసి వేదవాదవిదో వద ॥ 7-57**

**అ :** గోపికలు కృష్ణుని ప్రార్థించటమే. -పథ్యావక్త్రమ్.

**అ :** (ఈశ!) సారః అసి. సురసం రాసి. ఏహి. హే మహి! ఇహ సాదాం దాసీం మాం వేదవాదవిదః సదసి వద.

**ప్ర :** ఈశ ! = స్వామీ (పూర్వశ్లోకంలోనిపదం), సారః = శ్రేష్ఠుడవుగా (సారంబలేస్థిరాంశే చ న్యాయ్యే క్లీబం వరే త్రిషు అమరకోశః - నానార్థ - 182), అసి = ఉన్నావు (అస భువి పరస్మైపది-లట్ -మ.ఏ.), సురసమ్ = మంచి రసాన్ని/శృంగారాన్ని (శోభనః చ అసౌ రసః, తమ్), రాసి = ఇస్తున్నావు. (రా దానే పరస్మైపది-లట్-మ.ఏ.), హే మహి = ఓ భూమీ, ఇహ = ఇక్కడ, స సాదామ్ = బాధతో కూడిన (Sanskrit - English Dictionary - P-1114) , దాసీమ్ = దాసి అయిన, మామ్ = నన్ను (నా గురించి), వేద-వాద-విదః = వేదవాదమెరిగిన కృష్ణునకు (వేదస్య వాదాన్ వేత్తి ఇతి తస్య), సదసి = కొలువులో, వద = చెప్పు. (వద వ్యక్తాయాం వాచి పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! నువ్వు శ్రేష్ఠుడవు. ఉత్తమరసాన్ని అందించే వాడవు. కాబట్టి దరిచేరు. ఓ భూమి! నేను కృష్ణ దాసిని. బాధతో కృశిస్తున్నాను. నా గురించి కృష్ణుని కొలువులో చెప్పు.

**వి :** 1. సురసమంటే రసాలలో మంచిది శ్రేష్ఠమైనది. శృంగారరసాన్ని రసరాజమని ఆలంకారికులు కొందరు వ్యవహరిస్తారు, ముఖ్యంగా భోజుడు తదనుయాయులు. కంఠోక్తిగా చెప్పకున్నా దాదాపు కవులందరూ, లాక్షణికులు అందరూ శృంగారరసాన్నే నెత్తికెత్తుకొన్న వారు. భోజుడు కంఠోక్తిగా చెప్పినమాట-

**శ్లో॥ శృంగారహాస్యకరుణాద్భుతవీరరౌద్ర - బీభత్సవత్సలభయానకశాంతనామ్నః ।**
**ఆమ్నాసిషుర్దశరసానపరే వయన్తు - శృంగారమేవ రసనాద్రసమామనామః ॥** - శృంగారప్రకాశః

అయితే భోజుడు చాలా విస్తృతపరిధిలో శృంగారాన్ని వివరిస్తాడు.

శ్లో॥ రసోఽభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే । - సరస్వతీకంఠాభరణం - 5/1

అంటూ అభిమానం, అహంకారం, శృంగారం - ఈ మూడు పర్యాయపదాలంటాడు. ఆ కోణంలో చూస్తే ప్రాణులందరినీ ప్రధానంగా నడిపించేది శృంగారమే అనటం తత్త్వశాస్త్రానికి కూడా సమ్మతమైన విషయమే.

| | | | |
|---|---|---|---|
| 2. **అసి :** | అస్తి | స్తః | సన్తి |
| | **అసి** | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **రాసి :** | 7-25వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |
| **ఏహి (అ+ఇహి) :** | ఏతు/ఇతాత్ | ఇతామ్ | యన్తు |
| | **ఏహి**/ఇతాత్ | ఇతమ్ | ఇత |
| | అయాని | అయావ | అయామ |
| **వద :** | 7-30వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |

ఇక్కడ ద్వ్యక్షరయమకం. కానీ ప్రతిపాదంలోనూ వేరు వేరు అక్షరాలు. *

**శ్లో॥ మధుపాలిరీశ! సరసా సరసా-ముపకణ్ఠమేత్య ముదితా ముదితా ।**
**అనుయాతి పశ్య సభయా సభయా-మనునీయ చాలిమధునా మధునా ॥ 7-58**

**అ :** గోపికలు కృష్ణుని ప్రార్థించుట - తుమ్మెదల అనురాగాన్ని వర్ణించటం. -ప్రమితాక్షర.

**అ :** ఈశ! సరసా మధుప+ఆలిః సరసామ్ ఉపకంఠమ్ ఏత్య మధునా ముదితామ్ సభయామ్ ఆలిమ్ సభయా (సతీ) అనునీయ ఉదితా అధునా అనుయాతి పశ్య.

**ప్ర :** ఈశ! = స్వామీ!, సరసా = అనురాగంతో కూడిన (రసేన సహ వర్తతే ఇతి), మధుప+ఆలిః = తుమ్మెదల వరుస, సరసామ్ = సరస్సులయొక్క, ఉపకంఠమ్ = దగ్గరకు (ఉపగతః కంఠమ్ '**అవ్యయం విభక్తిసమీప...**' (2-1-5) సూత్రంతో సమాసం), ఏత్య = వచ్చి (ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మధునా = మకరందంతో, ముదితామ్ = ఆనందింప జేయబడి, సభయామ్ = బెదరిపోతున్న, ఆలిమ్ = నెచ్చెలిని, సభయా (సతీ) = బెదరిపోతూనే, అనునీయ = ఒప్పించి (అనునయించి) (అను-నీ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉదితా = ఎగిరిపోయింది. (ఉద్-ఇ ధాతువుపై క్త ప్రత్యయం-టాప్), అధునా = ఇప్పుడు, అనుయాతి = అనుసరిస్తోంది. (అను+యా ప్రాపణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), పశ్య = చూడు. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! తుమ్మెదల గుంపు సరస్సుల దగ్గరకు వచ్చి మకరందంతో ఆనందించి కూడా భయంభయంగానే తిరుగుతున్న చెలిని తానూ బెదురుతూనే అనునయించి, పైకి ఎగిరింది. ఆడుతుమ్మెద దానిని అనుసరిస్తోంది. చూడు.

**వి :** 1. ఈ శ్లోకంలో **మధుపాలిః** (తుమ్మెదల వరుస) కర్తృపదం కాగా కర్మపదం 'ఆలిమ్' రెండూ వ్యాకరణ మర్యాద రీత్యా ఏకవచనరూపాలే అయినా అర్థగతంగా కర్తృపదం బహుబోధకం, కర్మపదం ఏకవ్యక్తిబోధక మవుతోంది. చాలా పోతు తుమ్మెదలు ఒక పెంటితుమ్మెదను అనునయించాయని అర్థం చెప్పవలసి వస్తోంది.

మధుపాలి పదాన్ని పురుషబోధకంగా ఏకవచనంగా మరోరీతిగా చెప్పవచ్చు కానీ సరసా అన్న విశేషణం అడ్డుతగులుతోంది. అసలే తిర్యక్ శృంగారం. అందునా బహునాయకత్వమని చెప్పక తప్పని స్థితి.

2. పశుపక్ష్యాదులకు చెందిన శృంగారాన్ని రసాభాసమన్నారు సంస్కృతాలంకారికులు. దానిపై విద్యాధరుని (ఏకావళి) వంటివారు తిర్యగ్గత శృంగారం రసమెందుకు కాదని పూర్వపక్షం చేసి తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. సర్వజ్ఞ సింగభూపాలుడు (రసార్ణవసుధాకరం) విద్యాధరుని అభిప్రాయాన్ని ఖండిస్తూ, రసవంతమైన చర్చ చేశాడు రసార్ణవసుధాకరంలో. దానిని రసమనవచ్చా? రసాభాసమే అనాలా? అన్నది మాత్రమే ప్రధానచర్చ కానీ దాని ఆస్వాదనీయతను కానీ, దానిని కావ్యాలలో ఆదరించటాన్ని కానీ ఎవ్వరూ కాదనలేరు. కుమారసంభవంలో కాళిదాసు మదనునికి సహాయకుడైన వసంతుని విజృంభణాన్నీ వర్ణిస్తూ-

శ్లో॥ మధు ద్విరేఫః కుసుమైకపాత్రే - పపౌ ప్రియాం స్వామనువర్తమానః
శృంగేణ చ స్పర్శ నిమీలితాక్షీం - మృగీ మకండూయత కృష్ణసారః ॥ 3-36

అంతేకాదు. అభిజ్ఞానశాకుంతలంలో భ్రమరస్వభావాన్ని నాయకచేష్టగా సంభావిస్తూ దుష్యంతుడు చేసిన ఆలోచనను ఎలా వర్ణించాడో గమనించండి.

శ్లో॥ చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదుకర్ణాంతికచరః ।
కరౌ వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాస్త్వం ఖలు కృతీ ॥ - 1/19

| | | | |
|---|---|---|---|
| 3. **అనుయాతి :** | **అనుయాతి** | అనుయాతః | అనుయాన్తి |
| | అనుయాసి | అనుయాథః | అనుయాథ |
| | అనుయామి | అనుయావః | అనుయామః |
| **పశ్య :** | పశ్యతు/పశ్యతాత్ | పశ్యతామ్ | పశ్యన్తు |
| | **పశ్య**/పశ్యతాత్ | పశ్యతమ్ | పశ్యత |
| | పశ్యాని | పశ్యావ | పశ్యామ. |

4. ఇక్కడ యమకాలంకారం - నాలుగు పాదాలలోనూ చివరలలో పదయమకం. *

**శ్లో॥ నగాయతాకాశమితాగసాను - సమేత్య పుంస్కోకిలసుస్వనేన ।**
**న గాయతా కా శమితాగసా ను - త్వయా మృగాక్షీ విమదీకృతాఙ్గ! ॥ 7-59**

**అ :** కృష్ణగానమాహాత్మ్యాన్ని గోపికలు ప్రశంసించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అంగ! నగ+ఆయత+ఆకాశ-మిత+అగ-సాను సమేత్య గాయతా పుంస్కోకిలసుస్వనేన శమిత+ఆగసా త్వయా కా ను మృగాక్షీ న విమదీకృతా.

**ప్ర :** అంగ = కృష్ణా! (సుప్యాట్పాడంగ హేహైభోః-అమరకోశః-అవ్యయ-7), నగ+ఆయత +ఆకాశ-మిత+అగ-సాను:నగ = చెట్లతో (శబ్దాః ద్రువిష్టరనగద్రుమ పాదపాశ్చ-హలాయుధ కోశః - 177), ఆయత = విశాలమైన, ఆకాశ = నింగియే, మిత = హద్దుగాగల, అగ = కొండయొక్క, సాను = చరియలను (నగైః ఆయతమ్, తచ్చ తత్ ఆకాశం చ, తేన మితః అగః, తస్య సాను, తత్), సమేత్య = చేరి (సమ్+ఆ-ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గాయతా = పాడుతున్న, పుంస్కోకిల-సుస్వనేన : పుంస్కోకిల = మగకోయిలవలె, సుస్వనేన = మంచిస్వరంతో (ప్రాణినాం చ స్వనే స్వరః హలాయుధకోశః-863) (పుంస్కోకిల వత్ సుస్వనః తేన), శమిత+ఆగసా : శమిత

= తొలగించబడిన, ఆగసా = అపరాధం గల (శమితః ఆగః యేన తేన) (ఆగోఽపరాధో మన్తుశ్చ-అమరకోశః -క్షత్ర-26), త్వయా = నీచేత, కా ను మృగ+అక్షీ = ఏ స్త్రీ (ఏ మృగనయన), న విమదీకృతా = పొగరణచబడలేదు.

**తా ॥** గోవర్ధనగిరిమీది చెట్లు పెద్దవై ఆ కొండను విశాలంగా చేస్తున్నాయి. వాటితో ఆకాశమే హద్దుగా ఎదిగిన ఆ కొండ చరియలపై చేరి మగకోయిలవలె మంచిస్వరంతో కృష్ణుడు గానం చేస్తుంటే గోపికల మనస్సులో నున్న ఆ కృష్ణుని అపరాధాలన్నీ తొలగిపోయాయి. కృష్ణా! ఆ రీతిగా నువ్వు ఏ గోపికల పొగరణచలేదు?

**వి :** 1. మానవుడు సౌందర్యవిషయాలుగా భావించేవన్నీ జంతుజాతిలో మగవాటిలోనే వుండటం కాకతీళీయమేమో! మగకోకిల పాడుతుంది. మగనెమలి ఆడుతుంది. కోడిపుంజుకు తలపై కిరీటముంటుంది. ఎద్దుకు మూపురముంటుంది. దీనిని బట్టి మగవాడు (వ్యక్తిగా) స్త్రీని ఆకర్షించగలగాలంటే ఎంత వున్నతంగా వుండగలగాలో నేర్పుతుంది ప్రకృతి. కానీ మానవులు మాత్రమే తిరగబడి ఆలోచించటం వింత విషయం.

2. ఇది ప్రథమతృతీయపాదద్వయయమకం. *

**శ్లో॥ కందర్ప! సర్పతల్పస్య నందనానందకారణ! ।**
**తం దేశం నయ మాం యత్ర బన్ధురాస్తే సతాం హరిః ॥ 7-60**

**అ :** గోపిక మదనుని ప్రార్థించుట. -పథ్యావక్త్రమ్.

**అ :** సర్పతల్పస్య నందన! ఆనందకారణ! కందర్ప! యత్ర హరిః సతాం బంధుః ఆస్తే తం దేశం మాం నయ.

**ప్ర :** సర్ప-తల్పస్య = విష్ణుమూర్తి (భుజగశయనుని) యొక్క (సర్పః తల్పం యస్య తస్య), నందన! = పుత్త్రా!, ఆనంద-కారణ! ఆనందానికి హేతువయిన వాడా? (ఆనందస్య కారణమ్ - తస్మాత్ సంబుద్ధిః), కందర్ప = మన్మథ (కందర్పోదర్పకోనంగః అమరకోశః-స్వర్గ-25), యత్ర = ఎక్కడయితే, హరిః = కృష్ణుడు, సతామ్ = సజ్జనులకు, బంధుః = బంధువుగా, ఆస్తే = వున్నాడో (ఆస్-ఉపవేశనే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), తం దేశమ్ = ఆ చోటికి, మామ్ = నన్ను, నయ = కొనిపొమ్ము (నీ-ప్రాపణే-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** మదనా! ఆనందకారణా! సర్పశయనుని కుమారా! సజ్జనబంధువుగా కృష్ణుడున్న చోటికి నన్ను నడిపించు.

**వి :** 1.

| | | | | |
|---|---|---|---|---|
| **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే | |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే | |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే | |
| **నయ :** | నయతు/నయతాత్ | నయతామ్ | నయన్తు | |
| | **నయ**/నయతాత్ | నయతమ్ | నయత | |
| | నయాని | నయావ | నయామ. | * |

**శ్లో॥ ర మా నయాహంకృతిదూరవృత్తి-రమానయాఽహంకృతిదూరవృత్తిః ।**
**రమా న యాఽహం కృతిదూరవృత్తి-రమానయాహంకృతిదూరవృత్తిః ॥ 7-61**

**అ :** గోపిక కృష్ణునికై మదనుని ప్రార్థించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ర! యా అహం కృతిదూరవృత్తిః, అమానయా అహంకృతిదూరవృత్తిః మా నయ (మానయ). యా కృతిదూర వృత్తిః అమా+అనయ+అహంకృతిదూరవృత్తిః (సా) రమా అహం న. (లేదా)

(కృష్ణ) అహం కృతిదూరవృత్తిః (అతః) అమానయా అనయా అహంకృతిదూరవృత్తిః (త్వం) రమ. యా కృతిదూరవృత్తిః అమా+అనయ+అహంకృతిదూరవృత్తిః (సా) రమా అహం న.

**ప్ర :** ర = మదనా! (రః పుమాన్ పావకే కామే–నానార్థమంజరీ–1370), యా అహమ్ = ఏ నేను, కృతి–దూర–వృత్తిః : కృతి = (చేయవలసిన) కర్మలకు, దూర–వృత్తిః = దూరమైన నడవడిగల దాననై (కృతేః దూరా వృత్తిః యస్యాః సా), (అస్మి = ఉన్నానో) (అందువలన), అమానయా = అహంకారమెరుగని నాచే, అహంకృతి–దూర–వృత్తిః : అహంకృతి = అహంకారానికి, దూర = దూరంగా, వృత్తిః = ప్రవర్తించే నీవు, మా = నన్ను, నయ = (కృష్ణసన్నిధికి) కొనిపో! (నీ ప్రాపణే–పరస్మైపది–లోట్–మ.ఏ.), మానయ = సమాదరించు (మాన పూజాయామ్ పరస్మైపది–లోట్–మ.ఏ.), యా = ఎవరయితే, కృతి–దూర–వృత్తిః : కృతి = పునరుత్పత్తికి, దూర = దూరమైన, వృత్తిః = జీవనంగలదై (స్యాద్వృత్తిః – స్నేహే/వర్తన జీవనే–నానార్థమంజరీ–643,44) (కృతేః దూరా వృత్తిః యస్యాః సా), అమా+అనయ+అహంకృతి–దూర–వృత్తిః : అమా = అజ్ఞానానికీ (మా అస్యాః నాస్తి ఇతి అమా) (మాస్త్రీ మానే మృతౌ వేలా మేధా పద్మాసు చ స్త్రి యామ్–నానార్థమంజరీ–1171) అనయ = అవనీతికీ, అహంకృతి = అహంకారానికి, దూర = దగ్గరగాని, వృత్తిః = ప్రవృత్తి గలదో, (సా = ఆ), రమా = లక్ష్మి, అహం న = నేను కాదు.

**మరొక విధంగా** : కృష్ణ = కృష్ణా! (అధ్యాహార్యం), అహమ్ = నేను (గోపికను), కృతి–దూర–వృత్తిః : కృతి = కర్తవ్యాలకు, దూర–వృత్తిః = దూరమైన దానను, అమానయా = అభిమానమెరుగని దానను కాబట్టి, అనయా = నాతో, అహంకృతి–దూర–వృత్తిః = అహంకారమెరుగని నీవు, రమ = క్రీడించు. (రము క్రీడాయాం పరస్మైపది–లోట్–మ.ఏ.) మిగిలిన భాగమంతా ముందు వ్రాసినట్లే...

**తా ॥** మదనా! నన్ను కృష్ణుని దగ్గరకు చేర్చు. నేను చేయవలసిన పనులు కూడా చేయలేక పోతున్నాను. నిరహంకారుడవయిన నీవు నన్ను (కృష్ణుని దగ్గరకు చేర్చు). / కృష్ణా! నేను కర్తవ్య నిర్వహణకు కూడా దూరమవుతున్నాను. అభిమానమెరుగని నాతో అహంకార రహితుడవైన నీవు క్రీడించు.

నేను సాధారణమైన స్త్రీవలె శారీర ధర్మాలకు; అజ్ఞానానికీ, అనీతికి, అహంకారానికి దూరంగా వుండగల లక్ష్మిని కాను. (కాబట్టి నాకు శారీరధర్మప్రవృత్తిని కలిగించు)

**వి :** 1. నాలుగుపాదాలు ఒకేరీతిగా వున్న శ్లోకమిది. కాబట్టి చతుష్పాదయమక మిక్కడ అలంకారం.

2. **నయ :** 7–60వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **మానయ:** | మానయతు/మానయతాత్ | మానయతామ్ | మానయన్తు |
| | **మానయ**/మానయతాత్ | మానయతమ్ | మానయత |
| | మానయాని | మానయావ | మానయామ |
| **రమ :** | రమతు/రమతాత్ | రమతామ్ | రమన్తు |
| | **రమ**/రమతాత్ | రమతమ్ | రమత |
| | రమాణి | రమావ | రమామ |

వస్తుతః ఇది ఆత్మనేపదధాతువు. ఇక్కడ పరస్మైపదంగా ప్రయోగం. ఆత్మనేపదంగా అయితే...

| | | |
|---|---|---|
| రమతామ్ | రమేతామ్ | రమన్తామ్ |
| రమస్వ | రమేథామ్ | రమేధ్వమ్ |
| రమై | రమావహై | రమామహై. |

*

**శ్లో॥ తతాతతాతీతతత్త్వతతితాతోఽతతే తు తత్ ।**
**తత్తాతౌతాతితేతీ తేఽతాతాఽతీతే తతోఽత్తి తామ్ ॥ 7–62**

**అ :** ఏకాక్షరయమకంతో కృష్ణస్తుతి. -పథ్యావక్త్రమ్.

**పదచ్ఛేదం :** తతాతతాతీతతత్త్వతతితాతః – అతతే–తు–తత్–తత్తా తేతాతితేతీ – తే – అతాత–అతీతే – తతః అత్తి – తామ్.

**అ :** అతాత –తత+అతత+అతీత–తత్త్వ–తతి–తాతః (సన్) అతతే. తతః తామ్ అత్తి. తత్ తత్తా తేతా తిత+ఈతీ తే అతీతే.

**ప్ర :** అతాత = తండ్రి (పుట్టుక) లేనివాడా! (నాస్తి తాతః యస్య సః), తతా... తాతః : తత = వ్యాపించినవీ (తనూ విస్తారే ధాతువుపై క్త ప్రత్యయం), అతత = వ్యాపించనివీ (స్థిరంగా వుండేవి) అయిన వాటికి, అతీత = దూరమైన, తత్త్వ = తత్త్వాలయొక్క, తతి = సమూహానికి, తాతః సన్ = జనకుడవై (తతానామ్ అతతానాం చ అతీతానాం తత్త్వానాం తతేః తాతః), అతతే = వ్యాపిస్తున్నావు. (అత సాతత్యగమనే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), తతః = ఆతరువాత, తామ్ = ఆసృష్టిని, అత్తి = తింటున్నావు/ఉపసంహరిస్తున్నావు. (అద భక్షణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తత్ = కాబట్టి, తత్తా–తేతాతీత+ఈతే : తత్+తా = జగత్స్వరూపత్వం (తస్య భావః తత్తా) / మాయావాదం, తేతాతీత = మీమాంసకులయొక్క, ఈతీ = బాధ (నిరీశ్వరవాదం) కూడా (తస్య భావః తత్తా తచ్చ తేతాతీతానామ్ ఈతిశ్చ తత్తాతేతాతీతేతీ), తే = నీకు, అతీతే = తొలగింపబడ్డాయి. (అతి–ఇ ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** కృష్ణా! నీకు తండ్రి లేదు. నీవు వ్యాపనశీలం గల ఆకాశాదితత్త్వాలకన్నా, వ్యాపించక స్థిరంగానే వుండే భూమి మొదలయిన తత్త్వాలకన్నా అతీతమైన తత్త్వాలకు జనకుడవు. కాబట్టి ఆ తత్త్వాలలో వ్యాపించి వుంటావు. మరల దానిని నీవే కబళించివేస్తావు. అందువలననే నీవు జగత్తుయొక్క ఉనికికి యోగం చెప్పే మాయావాదానికి, మీమాంసకులు చెప్పే నిరీశ్వరవాదానికీ కూడా అతీతుడవు.

**వి :** 1. తత–అతత–అతీతమైన తత్త్వానికి జనకుడు కృష్ణుడు–

శ్లో॥ భూమిరాపోఽనలో వాయుః ఖం మనోబుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥

శ్లో॥ **అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్ ।**
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్ ॥

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా ॥ – భగవద్గీత – 7/4–7

2. ఇంతటి వ్యక్తికి ఈ గోపికల భావబంధాన్ని పట్టించుకొనే అవసరంగానీ అవకాశం గానీ వుందా? తప్పక. ఎందుకంటే తన భక్తులూ, తనను ఆరాధించేవాళ్ళూ అందరికన్న, అన్నింటికన్న ఎక్కువే శ్రీకృష్ణునకు. ఆ అంశాన్ని మాఘకవి శిశుపాలవధలో ఎలా ప్రదర్శించాడో చూడండి.

శ్లో॥ యుగాంతకాలప్రతిసంహృతాత్మనో – జగన్తి యస్యాం సవికాస మాసత ।
తనే మముస్తత్ర న కైటభద్విష – స్తపోధనాభ్యాగమసంభవా ముదః ॥ –1/23

'ప్రళయకాలంలో తనను తాను ఉపసంహరించుకొన్నప్పుడు సమస్తవిశ్వాలు ఏ కృష్ణునిలో ఏ అసౌకర్యము లేకుండా వుండ గలిగాయో, ఆయనలో నారదుని రాకతో కలిగిన ఆనందం ఇమడలేక పోయింది.'

| | | | |
|---|---|---|---|
| 3. **అతతే :** | **అతతే** | అతేతే | అతాన్తే |
| | అతసే | అతేథే | అతధ్వే |
| | అతే | అతావహే | అతామహే |

| | | | |
|---|---|---|---|
| **అత్తి :** | **అత్తి** | అత్తః | అదన్తి |
| | అత్సి | అత్థః | అత్థ |
| | అద్మి | అద్వః | అద్మః. |

*

**శ్లో॥ అధరామృతం ప్రదిశ తే దిశతే - తనుమర్పయే విహరతేహ రతే ।**
**విహితేహతిం విరచయేఽరచయే - స్ఫుటమిత్యదాయి భవతాఽభవతా ॥ 63**

**అ :** కృష్ణప్రణయంలోనే గోపిక ముక్తిని దర్శింపగోరుట. -ప్రమితాక్షర.

**అ :** (కృష్ణ!) తే అధరామృతం ప్రదిశ. దిశతే తనుమ్ అర్పయే. విహరతా ఇహ రతే విహితే అరచయే హతిం విరచయే. ఇతి భవతా అభవతా స్ఫుటమ్ అదాయి.

**ప్ర :** (కృష్ణ! = కృష్ణా!), తే = నీ యొక్క, అధర+అమృతమ్ : అధర = పెదవులమీది, అమృతమ్ = అమృతాన్ని (అధరే అమృతమ్), ప్రదిశ = ఇవ్వు (దిశ-అతిసర్జనే లోట్-మ.ఏ.), దిశతే = ఇస్తున్న (నీకు), తనుమ్ = శరీరాన్ని, అర్పయే = అర్పిస్తాను. (ఋ గతి ప్రాపణయోః ణిచ్-పరస్మైపది-లోట్-మ.ఏ.), విహరతా = విహరిస్తూ, ఇహ = ఈ శరీరంలో, రతే = సురతం, విహితే = చేయబడగా, అర-చయే : అర = శత్రువులయొక్క (శబ్దార్థకల్పతరుః-పుట 72), చయే = సమూహంపై (అరాణాం చయః, తస్మిన్), హతిమ్ = దెబ్బ, విరచయే = కొడతాను (వి-రచ ప్రతియత్నే ఆత్మనేపది-లిట్-ఉ.ఏ.), ఇతి = ఆ రీతిగా, భవతా = నీ చే, అభవతా = ముక్తి (నాస్తి భవః యస్య సః, తస్యః భావః అభవతా), అదాయి = ఇవ్వబడినట్లే (దా దానే కర్మణి-ఆత్మనేపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** నీ అధరామృతాన్ని నా కివ్వు. ఇస్తే నా శరీరాన్ని నీకు అర్పిస్తాను. ఈ శరీరంతో నీవు విహరించి, నీ సంయోగాన్ని కలిగిస్తే నా శత్రువులను (వియోగకారణమైన వారిని) దెబ్బతీస్తాను. నీ ద్వారా ముక్తిని పొందినట్లే భావిస్తాను.

**వి :** 1. ఇది సర్వపాదాంతయమకశ్లోకం.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రదిశ :** | ప్రదిశతు/ప్రదిశతాత్ | ప్రదిశతామ్ | ప్రదిశన్తు |
| | **ప్రదిశ**/ప్రదిశతాత్ | ప్రదిశతమ్ | ప్రదిశత |
| | ప్రదిశాని | ప్రదిశావ | ప్రదిశామ |
| **అర్పయే :** | అర్పయతే | అర్పయేతే | అర్పయన్తే |
| | అర్పయసే | అర్పయేథే | అర్పయధ్వే |
| | **అర్పయే** | అర్పయావహే | అర్పయామహే |
| **విరచయే :** | విరచయతే | విరచయేతే | విరచయన్తే |
| | విరచయసే | విరచయేథే | విరచయధ్వే |
| | **విరచయే** | విరచయావహే | విరచయామహే |
| **అదాయి :** | **అదాయి** | అదాయిషాతామ్ | అదాయిషత |
| | అదాయిష్ఠాః | అదాయిషాథామ్ | అదాయిధ్వమ్ |
| | అదాయిషి | అదాయిష్వహి | అదాయిష్మహి. |

*

**శ్లో॥ ఇత్థం గిరా కాపి తమర్చయంతీ - యం తీవ్రయోగైర్మునయోఽగురన్తే ।**
**రన్తేతి మత్వా గలితాత్మహారా - హా రామ కృష్ణేత్యపతచ్ఛుచార్తా ॥ 7-64**

**అ :** విరహదశలలో చివరిదైన మూర్ఛావస్థావర్ణనం – గోపిక స్పృహతప్పుట. –ఇంద్రవజ్ర.

**అ :** మునయః యం తీవ్రయోగైః అన్తే అగుః తం రన్తా ఇతి మత్వా గిరా ఇత్థమ్ అర్చయన్తీ గలిత–ఆత్మహారా హా రామ హా కృష్ణ ఇతి శుచార్తా కా అపి అపతత్.

**ప్ర :** మునయః = మహర్షులు, యమ్ = ఎవనినయితే, తీవ్ర–యోగైః : తీవ్ర = తీక్ష్ణమైన (తిగ్మం తీక్ష్ణం ఖరం తీవ్రం... హలాయుధకోశః – 40), యోగైః = ధ్యానాలచే (తీవ్రాశ్చ తే యోగాః తైః), అన్తే = చివరగా, అగుః = చేరిరో (ఇ–గతౌ–పరస్మైపది–లుఙ్–ప్ర.బ.), తమ్ = ఆ కృష్ణుని, రన్తా ఇతి = క్రీడించే వాడని (రమ్–ధాతువుపై తృచ్ ప్రత్యయం), మత్వా = భావించి (మను జ్ఞానే ధాతువుపై క్త్వా ప్రత్యయం), గిరా = వాక్కుతో, ఇత్థమ్ = ఈ (చెప్పబడిన) రీతిగా, అర్చయన్తీ = పూజిస్తున్నదై (అర్చ్ ధాతువుపై శతృ ప్రత్యయం), గలిత+ఆత్మ+హారా : గళిత = జారిన, ఆత్మ = తనయొక్క, హారా = ముత్యాలపేరులు గలదై (గళితాః చ ఆత్మనః హారాః యస్యాః సా), హారామ – హా కృష్ణ : అయ్యో రామా! కృష్ణా! ఇతి = అని అంటూ, శుచ+ఆర్తా = దుఃఖంతో దీనురాలై, కా+అపి = ఒకానొక గోపి, అపతత్ = పడిపోయింది. (పత్ పతనే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** తీవ్రమైన ధ్యానాదులను చేసిన మునులు కూడా చివరిదశలో మాత్రమే ఆ కృష్ణుని చేరగలిగారని భావించిన ఒక గోపిక ఇంతవరకు సాగిన రీతిగా మాటలతో ఆ కృష్ణుని అర్చించి హా రామా! హా కృష్ణా! అనుకొంటూ మూర్ఛపోయింది. ఆమె మెడలోని ముత్యాలహారాలు జారాయి.

**వి :** 1. శ్లోకంలోని అన్తపదం అనేకజన్మల చివర అనే అర్థాన్ని అయినా ఇవ్వవచ్చు–

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ – భగవద్గీత 7/19

చాలా జన్మల తరువాత జ్ఞాని నన్ను చేరుతాడు. వాసుదేవుడే సమస్తమూ అని గ్రహిస్తాడు. అటువంటి మహానుభావులు అరుదుగా వుంటారు.

2. ఈ శ్లోకంలో ముక్తపదగ్రస్తమనే శాబ్దికమైన అలంకారం కనిపిస్తుంది. పాదాంతంలో విడిచిన పదాన్ని తరువాతి పాదం మొదటలో స్వీకరించటం ముక్తపదగ్రసం – యంతీ యంతీ; రన్తే రన్తే, హారా – హారా ఇవి ముక్తపదగ్రస్త స్వరూపాలు.

3. కామదశలలో చివరిది మూర్ఛావస్థ. కొందరు మృతి చివరిదశ అంటూ కూడా (సాహిత్యదర్పణం) ఆలంబన వినాశం కాబట్టి మరణాన్ని వర్ణించకూడదని నిషేధించారు. (సాహిత్యదర్పణం –3/190,193). మూర్ఛలక్షణం కావ్యాలంకారచూడామణిలో–

క. అనయము నెమ్మనమునఁ బా
యని సొమ్మలపేరు మూర్ఛయనఁగాఁ బరగున్
దనరెడు నింద్రియగుణవ
ర్తనవైకల్యము నెఱుంగఁ దగుఁ దద్జ్ఞులకున్ – 2/82

4. **అగుః :**

| | | | |
|---|---|---|---|
| | అగాత్ | అగాతామ్ | **అగుః** |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ |

**అపతత్ :**

| | | |
|---|---|---|
| **అపతత్** | అపతతామ్ | అపతన్ |
| అపతః | అపతతమ్ | అపతత |
| అపతమ్ | అపతావ | అపతామ. |

*

శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని
ప్రేమ్ణా చింతయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసందాయిని ।
సంజాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే
సంజాతః సురమండలీషు మహితః సర్గో ముదామ్ సప్తమః ॥ 7-65

అ : సర్గాంతశ్లోకం.

తా॥ ముదాం సప్తమః సర్గః - ఆనందాల ఏడవసర్గ - మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో ఏడవ సర్గ.

**శ్రీః**





# శ్రీః
# అష్టమః సర్గః

శ్లో॥ విరహవహ్నిబలా మలయానిలా - జగదివాఖిలధామ లయానిలాః ।
చలతి వీక్ష్య భియాఽమల! యానిలా - బత తుదన్తితరామలయానిలాః ॥ 8-1

**అవతారిక :** గోపికలు కృష్ణునికై విలపించుట. -ప్రియంవాదిని.

**పదవిభాగం :** విరవహ్నిబలాః మలయ+అనిలాః జగద్ ఇవ అఖిలధామ లయ+అనిలాః చలతి వీక్ష్య భియా అమల యాన్ ఇలా బత తుదంతితరామ్ అలయ+అనిలాః

**అన్వయక్రమం :** బత అమల యాన్ వీక్ష్య ఇలా అపి భియా చలతి (తే) విరహవహ్నిబలాః అలయ+అనిలాః మలయ+అనిలాః అఖిలధామ జగద్ లయ+అనిలా ఇవ తుదంతితరామ్.

**ప్రతిపదార్థం :** బత = ఓయీ! (బతామంత్రణసంతోషఖేదానుక్రోశవిస్మయే - నానార్థమంజరీ - పంక్తి 661), అమల = పాప మెరుగని వాడా! (మలోఽస్త్రీ పాపవిట్ కిట్టకృపణేషు... నానార్థమంజరీ - పంక్తి 1662), (నాస్తి మలః యస్మిన్ సః - తస్మాత్ సంబుద్ధిః), యాన్ = వేటిని, వీక్ష్య = చూచి (వి+ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఇలా-అపి = భూమి కూడా (గౌరిలా కుంభినీ క్షమా - అమరకోశః - భూమి-3), భియా = భయంతో, చలతి = కదులుతుందో (చల కంపనే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), తే = ఆ, విరహ-వహ్ని-బలాః : విరహ-వహ్ని = వియోగమనే నిప్పే, బలాః = బలంగా గలవారమూ (విరహః ఏవ వహ్నిః తస్య బలం యేషాం తే), అలయ+అనిలాః : అలయ = నశించని, అనిలాః = ఊపిరి గలవారము అయిన మమ్ము (అలయః అనిలః యాసాం తాః), మలయ+అనిలాః = మలయపర్వతం వైపునుండి వీస్తున్న గాలులు (మలయాత్ ఆగతాః అనిలాః), (లేదా విరహవహ్నిబలాః = విరహాగ్నియే బలంగా గలవియై, అలయా+అనిలాః = నశింపజేయని ప్రచండ వాయువులు గల, మలయ+అనిలాః = మలయమారుతాలు), అఖిల-ధామ : అఖిల = అన్నింటికీ, ధామ = ఆశ్రయమైన (అఖిలానాం ధామ), జగత్ = ప్రపంచాన్ని, లయ+అనిలాః ఇవ = ప్రళయకాలమందలి గాలులవలె (లయే అనిలాః, త ఇవ), తుదంతితరామ్ = బాధిస్తున్నాయి. (తుద వ్యథనే పరస్మైపది - లట్ - ప్ర.బ. దానిపై తరప్, ఆమ్ ప్రత్యయాలు)

**తాత్పర్యం :** అమలా! కృష్ణా! తమ దర్శనంతో భూమిని కూడా భయంతో చలింపజేయగల మలయమారుతాలు మా విరహాగ్నినే తమ బలంగా చేసికొని, తమను నశింపజేయగల ప్రచండగాలులు లేనివై (విరహాగ్నియే బలంగా కలిగి కొన ఊపిరులతో మిగిలివున్న) మమ్ము అన్నింటికీ ఆశ్రయమయిన ఆ ప్రపంచాన్ని ప్రళయకాలమరుత్తులవలె బాధిస్తున్నాయి.

**విశేషాలు :** 1. మలయానిలాలు లయానిలాలవలె పీడిస్తున్నాయి అన్నప్పుడు మలయానిలాలు ఉపమేయాలు. లయానిలాలు ఉపమానాలు. రెండింటికీ పోలిక. కాబట్టి ఉపమాలంకారం. (**ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీరుల్లసతి ద్వయోః** – కు.6) అయితే ఇక్కడ గాలుల్లో స్థాయీ భేదమే కానీ రెండూ గాలులే. రెండూ బాధను కలిగిస్తున్నవే. కాబట్టి వాటి స్థితి భేదాన్ని బట్టి ఫలభేదం కూడా కనిపిస్తుంది. అందుకే 'తుదంతితరామ్' అని ప్రయోగం. తుదంతి వరకు సాధారణధాతురూపం, వ్యధను కలిగిస్తున్నాయనే అర్థంలో. ఆపై రెండిటి మధ్య ఒకదాని అతిశయాన్ని చెప్పవలసి వచ్చింది కాబట్టి '**ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ**' (అష్టాధ్యాయి – 5-3-57) సూత్రంతో తరప్ ప్రత్యయం. ఆ పై '**కిమేత్తిఙవ్యయఘాదామ్వ-ద్రవ్యప్రకర్షే**' (అష్టాధ్యాయి – 5-4-11) సూత్రంతో ఆమ్ ప్రత్యయం = **తుదంతితరామ్**.

2. విరహవర్ణనంలో మదనునకు తోడైన మందమారుతాలను నిందించటం కూడా కవి సమయసిద్ధమైన ఒక అంశం. చల్లనిగాలులు కూడా ప్రచండవాయువులుగా అనిపిస్తున్నా యని భావం.

3. 1,3 పాదాల చివర మలయానిలా అనీ, 2,4 పాదాల చివర మలయానిలాః యమక పోషణం.

| | | | |
|---|---|---|---|
| 4. **చలతి :** | **చలతి** | చలతః | చలన్తి |
| | చలసి | చలథః | చలథ |
| | చలామి | చలావః | చలామః |
| **తుదంతి :** | తుదతి | తుదతః | **తుదన్తి** |
| | తుదసి | తుదథః | తుదథ |
| | తుదామి | తుదావః | తుదామః. |

*

**శ్లో॥ దేవేశ! దేవేఽశనివర్షహేతౌ – పాతాఽసిపాతాసితఘాతకల్పే ।**
**దావేఽష్టదావేష్టయతీహ యోఽభూ-ర్మా నః సమానః స నిజే త్యజాద్య ॥ 8-2**

**అ :** ఇంద్రుని నుండి ఇప్పుడు కూడా తమను కాపాడాలని గోపికలు కృష్ణుని ప్రార్థించటం. –ఇంద్రవజ్ర.

**ప :** దేవేశ! దేవే అశనివర్షహేతౌ, పాతా, అసిపాత+అసితఘాతకల్పే దావే అష్టద! ఆవేష్టయతి ఇహ యః అభూః మా నః సమానః సః నిజే త్యజ అద్య.

**అ :** అష్టద! దేవేశ దేవే అశనివర్షహేతౌ (సతి) అసిపాత+అసితఘాతకల్పే దావే ఆవేష్టయతి (సతి) యః పాతా అభూః సః త్వమ్ ఇహ అద్య నిజే సమానః (సన్) నః మా త్యజ.

**ప్ర :** అష్ట-ద! = ఎనిమిది సిద్ధుల నిచ్చువాడా!, దేవ+ఈశ! = దేవతలలో మేటి అయినవాడా! (దేవానామ్ ఈశః) కృష్ణా!, దేవే = ఇంద్రుడు, అశని-వర్ష-హేతౌ (సతి) : అశని = పిడుగుపాటుతో కూడిన, వర్ష = వానకు, హేతౌ = కారణం కాగా, (అశని సహితః వర్షః, తస్య హేతుః, తస్మిన్), అసి-పాత-అసిత-ఘాత-కల్పే : అసి = కత్తియొక్క, పాత = పడుటవలన పుట్టిన, అసిత = కట్టులేని/ నల్లని, ఘాత = దెబ్బతో, కల్పే = సమానమైన (అసేః పాతః, అసిపాతాత్ జాతః చ అసౌ ఘాతః – ఈషదూనః అసి పాతాసితఘాతః అసిపాతాసితఘాతకల్పః – '**ఈషదసమాప్తౌ కల్పబ్ దేశీయరః**' (అష్టాధ్యాయి – 5-3-67)), దావే = దావాగ్ని (దావదవౌ వనవనానలౌ – నానార్థమంజరీ – పంక్తి – 1763), ఆవేష్టయతి సతి = చుట్టుముట్టుచుండగా, యః త్వమ్ = ఏ నీవు, పాతా = రక్షకుడవుగా (పా ధాతువుపై తృచ్ ప్రత్యయం), అభూః = అయితివో (భూ సత్తాయామ్ పరస్మైపది – లుఙ్ – మ.ఏ.), సః త్వమ్ = ఆ నీవు, ఇహ = ఇక్కడ, అద్య = ఇప్పుడు, నిజే = నీ వారి యందు (మాయందు), సమానః సన్ = అభిమానం గలవాడవై, నః = మమ్ము, మా త్యజ = వీడవద్దు. (త్యజ హానౌ పరస్మైపది – లోట్ – మ.ఏ.)

**తా ॥** కృష్ణా! నీవు దేవతాశ్రేష్ఠుడవు. అష్టసిద్ధులనిచ్చే వాడవు. గతంలో పిడుగులతో కూడిన వానను దేవేంద్రుడు కురిపించినప్పుడూ, కత్తిపోటుల గాయాలవంటి గాయాలను చేస్తూ దావాగ్ని చెలరేగినప్పుడు నువ్వే మమ్ము కాపాడావు. ఇప్పుడు కూడా నావారు అన్న అభిమానముంచి మమ్ము వీడకుండా కాపాడాలి.

**వి :** 1. కృష్ణుడు గోపకులాన్ని దావాగ్నినుండి కాపాడటం (పంచమసర్గ - 29 శ్లో), ఇంద్రుడు తీవ్రవృష్టి కురిపించినప్పుడు గోవర్ధనగిరిని ఎత్తి దానిక్రింద గోపకులాన్ని కాపాడటం (ఆరవ సర్గ) గతంలో జరిగాయి. ఇప్పుడు కాపాడకపోతే అప్పటి శ్రమ నిరర్థక మవుతుందని గోపికల అభ్యర్థనం.

2. నాల్గుపాదాలలోనూ పాదాదిలో విడివిడిగా యమకనిర్మాణ మిక్కడ కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **అభూః :** | అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| | **అభూః** | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **త్యజ :** | త్యజతు/త్యజతాత్ | త్యజతామ్ | త్యజన్తు |
| | **త్యజ**/త్యజతాత్ | త్యజతమ్ | త్యజత |
| | త్యజాని | త్యజావ | త్యజామ. |

*

**శ్లో॥ నానాననానను న్నూనం నైనో౽నన్నే౽న్నినాం నునౌః ।**
**నానాన్ననున్నేనానేన నోనో నేన న నో నను ॥** **8-3**

**అ :** గోపీ విలాపం. తమతోనే మోహం ప్రారంభం కాలేదంటూ ఆత్మసమర్థనం. -పథ్యావక్త్రమ్.

**ప :** నానా+ఆనన+అన-నుత్ నూనమ్ న ఏనః అనన్నే, అన్నినాం ను నౌః నానా+అన్న-నున్నేన అనేన న ఊనః నా ఇన న నః నను.

**అ :** నానా+ఆనన+అన నుత్ ఇన ఏనః నూనమ్ అనన్నే న. అన్నినాం నౌః ను. నానా+అన్న-నున్నేన అనేన నా ఊనః న. నః న నను.

**ప్ర :** నానా+ఆనన+అన-నుత్ : నానా = చాలా, ఆనన = ముఖాలుగలవానిని (చతుర్ముఖుడైన బ్రహ్మ లేదా పంచముఖుడైన శివుడు), అన = ముఖ్య ప్రాణుని, నుత్ = ప్రేరేపించువాడా! (నానా ఆననాని యస్య సః, సః చ అనః చ నానాననానౌ, తౌ నుదతి ఇతి నానాననానుత్ - తస్మాత్ సంబుద్ధిః), ఇన = స్వామీ కృష్ణా!, ఏనః = పాపం (ఏనః కల్మషమశుభం పాపం - హలాయుధకోశః - 627), నూనమ్ = నిక్కచ్చిగా, అనన్నే = అన్నమెరుగని వానియందు (నాస్తి అన్నం యస్య సః, తస్మిన్), న = ఉండదు. అన్నినామ్ = అన్నంతినే వాళ్ళకు (అన్నమ్ ఏషామ్ అస్తీతి అన్నినః, తేషామ్), నౌః = నౌకవు (నుద్యతే అనయా ఇతి), ను = కదా (నీవు/కృష్ణుడవు), నానా+అన్న-నున్నే న : నానా = అనేకాలయిన, అన్న = ఆహారాలతో, నున్నేన = ప్రేరేపింపబడిన, అనేన = ఈ పాపంతో, నా = పురుషుడు, ఊనః = తక్కువ వాడు, న = కాదు, నః = మాకే, న నను = (తక్కువ దనం) కలుగదు గదా!

**తా ॥** కృష్ణా! బ్రహ్మను/ రుద్రునీ ముఖ్యప్రాణదేవరను కూడా నడిపించే వాడవు నీవు. అన్నం తినని వారిలో పాపముండదు. అన్నం తినే వారి విషయంలో ఆ అన్న వికారాలు తప్పవు. వారిని తరింపజేసే నావవు నీవే. ఆరు రుచుల ఆహారపదార్థాలు తినే పురుషులు తక్కువ వారు కారా? మాకు మాత్రమే ఆ పాపం తగులుతుందా?

**వి :** 1. "**అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే. అన్నేన జాతాని జీవన్తి. అన్నం ప్రయన్త్యభిసంవిశన్తి**" - (తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి - 2) - 'ప్రాణులు అన్నం నుండి పుడుతున్నాయి. అన్నంతో బ్రతుకుతున్నాయి.

అన్నంలోనే లీనమవుతున్నాయి." కాబట్టి అన్నస్పర్శ ఉన్నంతకాలం దాని వికారాలూ ఉంటాయి. ఆ అన్నం పరిపాకం చెందాలన్నా తానే కావాలని శ్రీకృష్ణుడు చెప్పాడు.

**శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాస్థితః ।**
**ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్ ॥** **– భగవద్గీత 15/14**

2. ఇది ఏకాక్షరశ్లోకం.

3. ఈ మోహం తమకు మాత్రమేనా అని ప్రశ్నిస్తున్నారు గోపికలు.

శా. మగువల్ సిక్కరె తొల్లివల్లభులకున్? మన్నించి తద్వల్లభుల్
మగపంతంబు దలంపరే? తగులముల్ మాపాలనే పుట్టెనే?
మగవా రాడెడి మాటలే తగవు నీ మాటల్ మనోజాగ్నిచేఁ
బొగులం జాలము, కౌఁగిలింపుము మమున్ బుణ్యంబు పుణ్యాత్మకా!– పోతనభాగవతము 10/992

రుక్మిణి కూడా ఇలాగే అడిగింది కృష్ణుని–

శా. ధన్యున్ లోకమనోఽభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీబలదానశౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్? – పోతన భాగవతము 10/1702*

**శ్లో॥ మనసామహిత! స్వరమిత్రహృదా–మనసామహితస్వరమిత్ర! హృదా ।**
**మనసా మహిత! స్వరమిత్రహృదా–మనసాఽమహితస్వర! మిత్ర! హృదా ॥ 8-4**

**అ :** గోపికలు కృష్ణుని దర్శనానికై తపించుట. –తోటకం.

**ప :** మనసామ్ అహిత స్వః+అమిత్రహృదామ్ అనసామహితస్వరమిత్ర! హృదా మనసా మహిత–స్వరమిత్రహృదామ్ అనసా అమహితస్వర! మిత్ర! హృదా.

**అ :** స్వః+అమిత్రహృదామ్ మనసామ్ అహిత! హృదా అనసామహితస్వరమిత్ర; స్వరమిత్రహృదామ్ మనసా మహిత! అనసా అహితస్వర! హృదా మిత్ర!

**ప్ర :** స్వః+అమిత్ర–హృదామ్ : స్వః = స్వర్గానికి (స్వరవ్యయం స్వర్గనాకః – అమరకోశః – స్వర్గ – 6), అమిత్ర = శత్రువయిన, హృదామ్ = మనస్సుగలవారియొక్క (స్వః అమిత్రం హృత్ యేషాం తేషామ్), మనసామ్ = మనస్సులకు, అహిత! = దుఃఖాన్ని కల్గించే వాడా!, హృదా = మనసారా, అన... మిత్ర : అన = ముఖ్య ప్రాణదేవరయొక్క, సామ = సామములకు (బృహద్రథంతరం మొదలయిన వాటియొక్క), హిత = అనుకూలమైన, స్వర = స్వరాలకు, మిత్ర! = ఆత్మీయమైనవాడా! (అనస్య సామాని తేషాం హితశ్చ అసౌ స్వరః తస్య మిత్రమ్ తస్మాత్ సంబుద్ధిః), స్వర–మిత్ర–హృదామ్ : స్వర = ఓంకారంతో, మిత్ర = మైత్రితో కూడిన, హృదామ్ = మనస్సుగలవారియొక్క (ఓంకారోపాసకుల యొక్క) (స్వరే మిత్రాణి తేషాం హృదః తేషాం), మనసా = మనస్సుతో (జాతిగతంగా ఏకవచనం), మహిత = పూజింపబడినవాడా!, అనసా = శకటాసురునిచే (అనః శతాంగః శకటం – హలాయుధకోశః – 444), అమహిత–స్వర! : అమహిత = మన్నింపబడని, స్వర = గొంతుక గలవాఁడా! (అమహితః స్వరః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), హృదా = హృదయంతో /వక్షస్థలంతో, మిత్ర! = సూర్యునివంటి వాడా!

**తా ॥** కృష్ణా! స్వర్గంపై శత్రుత్వాన్ని వహించిన రాక్షసుల మనస్సులకు నీవు దుఃఖాన్ని కలిగించే వాడవు. పవమాన దేవతా సంబంధమైన సామ స్వరాలకు ఆత్మీయమైన వాడవు. ఓంకారాలతో మైత్రిగల పరమహంసల మనస్సులలో పూజింపబడే వాడవు. శకటాసురుడు నీ స్వరాన్ని మన్నించలేదు. నీ వక్షస్థలం సూర్యదీప్తితో ప్రకాశిస్తుంది.

**వి :** 1. ఇది ఏకపాదయమకాలంకారం. *

**శ్లో॥ వరయాసురమోదారే! తరసా కింకరీరిమాః ।**
**వర! యాసు రమోదారే త్వయి నేదం గుణోచితమ్ ॥ 8-5**

**అ :** గోపికలు కృష్ణుని నిందించుట. -పథ్యావక్త్రమ్.

**ప :** వరయ అసురమోద+అరే తరసా కింకరీః ఇమాః వర యాసు రమా ఉదారే త్వయి న ఇదం గుణ+ఉచితమ్.

**అ :** అసురమోద+అరే వర యాసు రమా (వర్తతే) (తా) ఇమాః కింకరీః తరసా వరయ. ఉదారే త్వయి ఇదం గుణ+ఉచితం న (భవతి)

**ప్ర :** అసుర-మోద+అరే : అసుర = రాక్షసులయొక్క, మోద = ఆనందానికి, అరే = శత్రువా!, వర = శ్రేష్ఠుడా! కృష్ణా!, యాసు = ఏ స్త్రీలయందు, రమా = లక్ష్మి, వర్తతే = ఉంటుందో (అటువంటి) ఇమాః = ఈ, కింకరీః = నీ దాసులను, తరసా = త్వరగా (తరశ్చ బలరంహసోః - నానార్థమంజరీ - పంక్తి 1895), వరయ = వరించు (వృఞ్ వరణే స్వాది - ణిచ్ - పరస్మైపది - లోట్ - మ.ఏ.), ఉదారే = దయాగుణం గల, త్వయి = నీయందు, ఇదమ్ = ఇది (ఈ నిరాదరణ), గుణ+ఉచితమ్ = నీ గుణాలకు తగినది, న (భవతి) = కాదు.

**తా ॥** రాక్షసుల ఆనందానికి శత్రువయిన వాడా! కృష్ణా! మాయందు లక్ష్మి ఉంది. కాబట్టి (తప్పనిసరిగా) నువ్వు మమ్ము నీ దాసులను - వరించాలి. నీవు ఉదారుడవు. నీకు మాపై నిరాదరణ చూపటం తగదు.

**వి :** 1. కృష్ణునిపై ప్రేమభక్తిని పొంది ఆరాధించే వారికి తమలో లక్ష్మి అంశ కలదన్న భావం సహజం. రుక్మిణి కూడా అటువంటి అభిప్రాయాన్నే ప్రకటిస్తుంది. చూడండి.

సీ. ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక-దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల-కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవలే ప్రొద్దుఁజేసిన-భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ-దడవిన బంధసంతతులు వాయు

తే. నట్టి నీ యందు నా చిత్తమనవరతము-నచ్చి యున్నది నీ యాన నాన లేదు,
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!-శ్రీయుతాకార! మానినీచిత్తచోర!-పోతన భాగవతము-10/1701

రుక్మిణి తనలో శ్రీయుత+ఆకార మానినీత్వాన్ని - లక్ష్మితో కూడిన ఆకృతికల స్త్రీత్వాన్ని - ఆరోపించుకొన్నది.

2. ఈ శ్లోకంలో అయుగ్మపాదాదియమకమ్.

3. **వరయ :**

| | | |
|---|---|---|
| వరయతు/వరయతాత్ | వరయతామ్ | వరయన్తు |
| **వరయ**/వరయతాత్ | వరయతమ్ | వరయత |
| వరయాణి | వరయావ | వరయామ. |

*

**శ్లో॥ వృణీత దాసీర్యది నో వనే నః - కవీశ గౌరీశ హృతాఽఽత్మవృత్తా ।**
**కవీశగౌరీశహృతాత్మవృత్తా-వృణీ తదాసీర్యదినో ఽవనే నః ॥ 8-6**

**అ :** నీవు మాకు ఋణపడుతావని గోపికలు కృష్ణునిపై ఆరోపణ చేయటం. -ఉపేంద్రవజ్ర.

**ప :** వృణీత దాసీః యది నో వనే నః కవీశ! గౌః ఈశ! హృతా ఆత్మవృత్తా కవీశ గౌరీశ హృత ఆత్మవృత్తౌ ఋణీ తత్ ఆసీః యత్ ఇనః అవనే నః.

**అ :** కవీశ! యది వనే దాసీః నః న వృణీత (తర్హి) ఈశ ఆత్మవృత్తా గౌః అపహృతా (భవేత్). ఆత్మ వృత్తౌ క-వి+ఈశ-గౌరీ+ఈశ-హృత యత్ (త్వం) నః అవనే ఇనః తత్ ఋణీ ఆసీః.

**ప్ర :** కవి+ఈశ : కవి = అన్ని చూడగలవారికి (కవిః క్రాంతదర్శీ సర్వదృక్ – ఈశావాస్యోపనిషత్ – శాంకరభాష్యం), ఈశ! = ప్రభువా!, యది = ఒకవేళ, వనే = బృందావనంలో, దాసీః = దాసులమైన, నః = మమ్ము, న వృణీత = వరించకపోతే (వృ వరణే – ఆత్మనేపది – విధిలిఙ్ – ప్ర.ఏ.), (తర్హి = అప్పుడు), ఈశ = స్వామీ, ఆత్మ-వృత్తా : ఆత్మ = నీనుండి, వృత్తా = వెలువడిన (నీవిచ్చిన) (ఆత్మనః వృత్తా), గౌః = మాట (దిగ్దృష్టిదీధితి-స్వర్గవజ్రవాగ్బాణవారిషు – హలాయుధకోశః – 854), హృతా = అపహరింపబడినట్లే / తప్పి పోయినట్లే. (హృ ధాతువుపై క్త ప్రత్యయం – టాప్), ఆత్మ-వృత్తౌ = అంతఃకరణప్రవృత్తిలో (ఆత్మనః వృత్తిః తస్యామ్), క-వి+ఈశ; గౌరీ+ఈశ-హృత : క = బ్రహ్మచేతను, వి = పక్షులకు (శకునః ఖగో నగౌకాః పక్షీవిః – హలాయుధకోశః – 238), ఈశ = రాజయిన గరుడుని చేతను, గౌరీ+ఈశ = గౌరీవల్లభుని (శివుని) చేతను, హృత = అపహరింపబడినవాడా! (కశ్చ వీనామ్ ఈశశ్చ గౌర్యాః ఈశశ్చ తైః హృతః తస్మాత్ సంబుద్ధిః), యత్ = ఎందువలన, నః = మమ్ము, అవనే = రక్షించుటలో, ఇనః = సమర్థుడవో, తత్ = అందువలన (సమర్థత ఉన్నా చేయనందువల్ల), ఋణీ = ఋణపడినవాడవుగా, అసీః = అయ్యావు. (అస భువి పరస్మైపది లఙ్ – మ.ఏ.)

**తా ॥** కవీశా! ఈ బృందావనంలో నీ దాసులమైన మమ్ము నీవు వరించనిచో నీవే మాట ఇచ్చి తప్పిన వాడవవుతావు. బ్రహ్మ, గరుత్మంతుడు, శివుడు నిన్ను తమ అంతఃకరణలో నిలుపు కొంటారు. అంతటి వాడవు కాబట్టి మమ్ము కాపాడగలవాడవు. అయినా కాపాడకపోతే నీవు మాకు ఋణపడినట్లే.

**వి :** 1. కృష్ణుడు అంతకుముందు గోపికలకు మాట ఎప్పుడిచ్చాడు?

తన భారాన్ని తగ్గించమని భూమి గోరూపంతో బ్రహ్మను ప్రార్థించినప్పుడు ఆ బ్రహ్మ విష్ణుసన్నిధిలో సమాధినిష్ఠుడై పౌరుషవాణిని విని దాని నిలా ప్రకటించాడు. "**గాం పౌరుషీం మే శృణుతామరాః**" (భాగవతం దశమస్కంధం 1/21)

శ్లో॥ వసుదేవగృహే సాక్షాద్ భగవాన్ పురుషః పరః ।
జనిష్యతే తత్ప్రియార్థం సంభవన్తు సురస్త్రియః ॥ – భాగవతం 10/1/23

పోతన మాట మరీ స్పష్టంగా–

తే. పురుషసూక్తంబుఁ జదివి యద్భుత సమాధి
నుండి యొకమాట విని వారిజోద్భవుండు
వినుఁడు వేల్పులు ధరయు నే విన్నియట్టి
పలుకు వివరింతు నని ప్రీతిఁ బలికెఁ దెలియ. ....

క. హరిపూజార్థము పుట్టుఁడు, – సురకన్యలు భూమియందు సుందరతనులై
హరి కగ్రజుఁడై శేషుఁడు – హరికళతోఁ బుట్టుఁదత్ప్రియారంభుండై. – పోతనభాగవతం 10/14,16

గోపికలు కృష్ణునకై తహతహలాడుటను పోతన హరిపూజగానే భావించాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **వృణీత :** | **వృణీత** | వృణీయాతామ్ | వృణీరన్ |
| | వృణీథాః | వృణీయాథామ్ | వృణీధ్వమ్ |
| | వృణీయ | వృణీవహి | వృణీమహి |

| | | | | |
|---|---|---|---|---|
| **ఆసీః :** | ఆసీత్ | ఆస్తామ్ | ఆసన్ | |
| | **ఆసీః** | ఆస్తమ్ | ఆస్త | |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. | * |

**శ్లో॥ జానతీర్నస్తవామానవేషు స్థితిం**
**న త్యజేమాః ప్రభో! మా నవేషు స్థితిమ్ ।**
**కుర్వసౌ కిం ప్రియా మా నవేషః స్థితిం**
**నేహ కిన్తు ప్రియేమా నవేషు స్థితిమ్ ॥ 8-7**

**అ :** కృష్ణుడు అనుగ్రహించకపోతే మరణమే శరణమను గోపికావచనం. –స్రగ్విణి.

**ప :** జానతీః నః తవ అమానవేషు స్థితిమ్
న త్యజ ఇమాః ప్రభో మా నవేషు స్థితిమ్ ।
కురు అసౌ కిం ప్రియా మా నవా ఈషుః స్థితిమ్
న ఇహ కిన్తు ప్రియ ఇమాః నవేషు స్థితిమ్ ॥

**అ :** ప్రభో! అమానవేషు తవ స్థితిం జానతీః ఇమాః నః న త్యజ. నవేషు స్థితిం మా కురు. ప్రియ అసౌ ప్రియా మా నవా కిమ్? ఇమాః ఇహ స్థితిం న ఈషుః కిన్తు నవేషు స్థితిమ్ ఈషుః

**ప్ర :** ప్రభో! = స్వామీ! కృష్ణా!, అమానవేషు = దేవతలలో (మానవాః న భవన్తి ఇతి అమానవాః తేషు), స్థితిమ్ = ఉనికిని (ష్ఠా ధాతువుపై క్తిన్ ప్రత్యయం), జానతీః = ఎరిగిన, ఇమాః = ఈ, నః = మమ్ము, న త్యజ = వదలవద్దు (త్యజ హానౌ – పరస్మైపది – లోట్ – మ.ఏ.), నవేషు = క్రొత్తవారియందు, స్థితిమ్ = నిలకడను, మా కురు = చేయవద్దు (కృ కరణే – పరస్మైపది – లోట్ – మ.ఏ.), ప్రియ = వల్లభా!, అసౌ = ఆ, ప్రియా = నీ నెచ్చెలియైన, మా = లక్ష్మి, నవా కిమ్? = క్రొత్తదియా ఏమి?, ఇమాః = ఈ గోపికలు, ఇహ = ఈ లోకంలో, స్థితిమ్ = మనుగడను, న ఈషుః = కోరలేదు. (ఇష ఇచ్ఛాయాం పరస్మైపది – లిట్ – ప్ర.బ.), కిన్తు = కానీ, నవ+ఇషు–స్థితిమ్ : నవ = క్రొత్తదైన, ఇషు = బాణానికి లక్ష్యంగా, స్థితిమ్ = ఉనికిని, ఈషుః = కోరిరి.

**తా ॥** కృష్ణా! నిన్ను దేవతాశ్రేష్ఠునిగా గుర్తించి ఆరాధిస్తున్న మమ్ము వీడవద్దు. క్రొత్తవారిమధ్య మనుగడ సాగించాలనుకోకు. (అన్ని అవతారాలలోనూ అన్ని యుగాలలోనూ నిన్ను అనుసరిస్తున్న) లక్ష్మి నీకు క్రొత్త కాదు గదా! (అలాగే మమ్ము కూడా భావించాలి). మేమీ లోకంలో బ్రతకాలని కోరుకోవటం లేదు. నీ అనుగ్రహం లేకపోతే క్రొత్తబాణాలకు ఎరగా నిలవాలని కోరుతున్నాం.

**వి :** 1. ఇది చతుఃపాదాంతయమకం.

2. శ్లో॥ ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ॥ – భగవద్గీత 6/5

అని గీతాబోధ. 'తనను తానే ఉద్ధరించుకోవాలి. తనను తాను పతనం చేసి కొనగూడదని' – కానీ పరాకాష్ఠకు చెందిన నైరాశ్యం అప్పుడప్పుడు మనిషిని ఆత్మహననానికి ప్రేరేపిస్తుంది. గమనించవలసిన దేమిటంటే అది శారీరకమైన ఒత్తిడి ప్రభావమే కానీ మానసికమైన కామన కాదు.

| | | | |
|---|---|---|---|
| 3. **త్యజ :** | త్యజతు/త్యజతాత్ | త్యజతామ్ | త్యజన్తు |
| | **త్యజ**/త్యజతాత్ | త్యజతమ్ | త్యజత |
| | త్యజాని | త్యజావ | త్యజామ |

| | | | |
|---|---|---|---|
| **కురు :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| | **కురు**/కురుతాత్ | కురుతమ్ | కురుత |
| | కరవాణి | కరవామ | కరవామ |
| **ఈషుః:** | ఇయేష | ఈషతుః | **ఈషుః** |
| | ఇయేషిథ | ఈషథుః | ఈష |
| | ఇయేష | ఈషివ | ఈషిమ. |

*

**శ్లో॥ వ్రజే మహం తోషసితం వికుణ్ఠం - భజేమ చక్షుర్విషయే త్వయీశ ! ।**
**వ్రజేమ హన్తోషసి తం వికుణ్ఠం - న చేత్ త్వదీక్షోత్సవభఙ్గహీనమ్ ॥ 8-8**

**అ :** 'నీ దర్శనం లేకుంటే వైకుంఠప్రాప్తియే గతి' అని గోపికలు ప్రకటించటం. -ఉపేంద్రవజ్ర.

**ప :** వ్రజే మహం తోషసితం వికుంఠం - భజేమ చక్షుర్విషయే త్వయి ఈశ ! ।
వ్రజేమ హంత ఉషసి తం వికుంఠం - న చేత్ త్వదీక్షా+ఉత్సవభంగహీనమ్ ॥

**అ :** ఈశ ! త్వయి చక్షుర్విషయే (సతి) వ్రజే తోష సితం వికుంఠం మహం భజేమ. న చేత్ ఉషసి త్వద్ - ఈక్షా+ఉత్సవ-భంగ-హీనం తం వికుంఠం వ్రజేమ. హంత.

**ప్ర :** ఈశ! = ప్రభూ!, త్వయి = నీవు, చక్షుః+విషయే (సతి) = కంటికి కనిపిస్తుంటే, వ్రజే = గోకులంలో, తోష-సితమ్ : తోష = ఆనందంచే, సితమ్ = బంధింపబడినదై (సి బంధనే ధాతువుపై క్త ప్రత్యయం), వికుంఠమ్ = నశింపని/భంగపడని, మహమ్ = పండుగను, భజేమ = సేవిస్తాము. (భజ సేవాయామ్ - పరస్మైపది - విధిలిజ్ - ఉ.బ.), న చేత్ = లేకపోతే (నీవు కంటికి విషయం కాకపోతే), ఉషసి = ప్రాతః కాలంలో, త్వత్-ఈక్షా+ఉత్సవ-భంగ-హీనమ్ : త్వత్ = నీయొక్క, ఈక్షా = దర్శనమనే, ఉత్సవ = పండువుయొక్క, భంగ-హీనమ్ = నాశం లేని, వికుంఠమ్ = వైకుంఠలోకానికే (ఆత్మహననం ద్వారా అని భావం), వ్రజేమ = వెళ్ళగలం (వ్రజ గతౌ - పరస్మైపది - విధిలిజ్ - ఉ.బ.)

**తా ॥** కృష్ణా! నీవు మా కళ్ళకు కనిపిస్తుంటే గోకులంలోనే ఆనందబద్ధమై భంగపాటు నెరుగని ఉత్సవాన్ని సేవిస్తాము. నీవు కనిపించకుంటే ప్రాతఃకాలంలోనే (మరణించి) నీ దర్శనమనే ఉత్సవంలో ఏలాటి భంగపాటుకూ అవకాశం లేని వైకుంఠాన్ని చేరుకొంటాం.

**వి :** 1. అయుగ్మపాదయమకమీ శ్లోకంలో.

2. మరణించి వైకుంఠానికి వెళ్తామంటున్నారు గోపికలు. మరణం ఆత్మహత్య ద్వారా అయితే అది పాపకృత్యం కాబట్టి వైకుంఠప్రాప్తి ఎలా అనే శంకకు అవకాశముంది. కాబట్టి ఇక్కడ బలవన్మరణ మనటం కన్న 'ఆపై మేము బ్రతక జాల'మన్న భావననే స్వీకరించాలి. అప్పుడు దోషముండదు. భగవచ్ఛిన్ననతో కలిగిన మరణం కాబట్టి పరమపదప్రాప్తికి భంగ ముండదు.

| | | | |
|---|---|---|---|
| 3. **భజేమ :** | భజేత్ | భజేతామ్ | భజేయుః |
| | భజేః | భజేతమ్ | భజేత |
| | భజేయమ్ | భజేవ | **భజేమ** |
| **వ్రజేమ :** | వ్రజేత్ | వ్రజేతామ్ | వ్రజేయుః |
| | వ్రజేః | వ్రజేతమ్ | వ్రజేత |
| | వ్రజేయమ్ | వ్రజేవ | **వ్రజేమ.** |

*

**శ్లో॥ వియోగే తవ గోవింద! దివసోఽపి భయఙ్కరః ।**
**ఇయం నిశా దిశావ్యాప్తతమిస్రా కాన్త! కిం పునః ॥ 8-9**

**అ :** విరహవేళలో కాలక్షేపం కూడా దుర్భరమని గోపికలు ఖేదపడుట. -పథ్యావక్త్రమ్.

**అ :** గోవింద! తవ వియోగే దివసః అపి భయంకరః. కాంత! దిశావ్యాప్తతమిస్రా ఇయం నిశా కిం పునః.

**ప్ర :** గోవింద! = కృష్ణా! (గాః విన్దతీతి గోవిందః, తస్మాత్ సంబుద్ధిః), తవ=నీయొక్క, వియోగే = విరహంలో, దివసః+ అపి = పగలు కూడా, భయంకరః = భయాన్ని కల్గించేదే. (భయం కరోతి ఇతి భయంకరః), **మేఘర్తిభయేషు కృఞః** (అష్టాధ్యాయి 3-2-43), సూత్రంతో భయపదముపపదమైనపుడు కృ ధాతువుపై ఖచ్ ప్రత్యయం, **'ఖిత్యనవ్యయస్య'** (అష్టాధ్యాయి 6-3-66) సూత్రంతో ముమాగమం = భయంకరః), కాంత! = ప్రియా! గోవిందా!, దిశా-వ్యాప్త-తమిస్రా: దిశా = దిక్కులయందు, వ్యాప్త = అలముకొన్న, తమిస్రా = చీకటిగల (దిశాసు వ్యాప్తం తమిస్రం యస్యాం సా), (ఇక్కడ చీకటిని తెలిపే తమిస్ర పదాన్నే స్వీకరించాలి కానీ చీకటి రేయి అని చెప్పే 'తమిస్రా' పదాన్ని కాదు. అర్థబోధలో రెండూ సరిపోయినా ప్రక్కన నిశా పదమున్నందువల్ల తమిస్రా పదాన్ని స్వీకరిస్తే పునరుక్తి దోష మేర్పడుతుంది), ఇయమ్ = ఈ, నిశా = రేయి (భయంకరమైనదని), కిం పునః (వ్యక్తవ్యమ్) = మరల చెప్పవలెనా?

**తా ॥** కృష్ణా! నీ వియోగంలో పగలు కూడా భయంకరంగా వుంటుంది. ఇక దిక్కులన్నీ చీకటిని వ్యాపింపజేసిన ఈ రాత్రిని గురించి చెప్పవలెనా?

*

**శ్లో॥ సమాయతేయం న శరైః సమాఽయతే - సమాయతే స్వేషు కిలాసమాయతే! ।**
**సమాయ తేనాంగ! నమః సమాయ! తే - స మా యతేర్వర్త్మ భజాసమాయ! తే ॥10**

**అ :** తమను పరిత్యజించటం తగదని గోపికలు కృష్ణుని అభ్యర్థించటం. -వంశస్థం.

**ప :** సమాయతా ఇయం న శరైః సమా అయతే - సమాయతే స్వేషు కిల అసమాయతే।
సమాయ తేన అంగ నమః సమాయ తే - సః మా యతేః వర్త్మ భజ అసమాయ తే ॥

**అ :** శరైః సమా సమాయతా ఇయం న అయతే. అసమాయతే స్వేషు సమాయతే కిల. తేన సమాయ! అంగ! సమాయ! తే నమః. అసమాయ! సః (త్వం) తే యతేః వర్త్మ మా భజ.

**ప్ర :** శరైః = బాణాలతో, సమా = సమానమైనదియు, సమ్-ఆయతా = చాలా పొడవైనదియు అయిన, ఇయమ్ = ఈ రాత్రి (పూర్వశ్లోకంనుండి నిశా పదం అన్వయిస్తుంది.) న అయతే = ముగిసిపోవటం లేదు. (శరత్కాలం కావటంతో రాత్రి కాలం ఎక్కువ) (అయ గతౌ ఆత్మనేపది - లట్ ప్ర.ఏ.), అసమ+ఆయతే = సాటిలేని వ్యాప్తి గలవాడా! కృష్ణా! (అసమా ఆయతిః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), స్వేషు = నీ వారి విషయంలో, సమాయతే కిల = సమానంగా ప్రవర్తిస్తావు గదా! (సమవత్ ఆచరతి ఇతి సమాయతే - నామధాతువు - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), స-మాయ! = మాయతో నిండినవాడా! (మాయయా సహ వర్తతే ఇతి - తస్మాత్ సంబుద్ధిః), అంగ! = కృష్ణ!, స-మాయ! = లక్ష్మితో కూడిన (మాయా సహితః సమః, తస్మై), తే = నీకు, నమః = నమస్కారం, అసమ+అయ! : అసమ = సాటిలేని, ఆయ! = లాభం గలవాడా! (అసమః ఆయః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), సః (త్వమ్) = అటువంటి నీవు, తే = నీదయిన, యతేః = యతి సంబద్ధమైన, వర్త్మ = బాటను, మా భజ = ఆశ్రయించవద్దు. (భజ సేవాయాం పరస్మైపది - లోట్ - మ.ఏ.)

**తా ॥** కృష్ణా! ఈ రేయి బాణాలవలె ఎంతో నిడివి గలదై ఎంతకూ వెళ్ళిపోవటం లేదు. నీవు అసమానమైన వ్యాపనశీలత గలవాడవు. కానీ నీ వారిని (భక్తులను) సమభావనతో చూసేవాడవు. నీవు మాయావివి. లక్ష్మితో

కూడిన వాడివి. నీకు నమస్సు. నీ లాభం కూడా అసమానం. కానీ మా విషయంలో నీ దయిన యతిమార్గాన్ని ఆశ్రయించ వద్దు.

**వి :** 1. కృష్ణుడు అసమానమయిన ఆయతి గలవాడని వేదవచనం.

శ్లో॥ యచ్చ కించిద్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥– తైత్తిరీయారణ్యకమ్ – నారాయణసూక్తమ్ 5

'దృష్టికి, వినికిడికి తోస్తున్న ఈ జగత్తుయొక్క లోనా బయటా మొత్తం వ్యాపించి వుంటాడు **నారాయణుడు**.'

2. నీదయిన యతి మార్గాన్ని ఆశ్రయించవద్దని అనటం ద్వారా గీతలో తాను చెప్పబోతున్న స్వీయతత్త్వాన్ని, పరమాత్మపరంగా తనకున్న భావనను గుర్తు చేస్తున్నాడు.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ – భగవద్గీతా – 3/22

3. నాల్గుపాదాలలోనూ ఆద్యంతాలలో '**సమాయతే**' కనిపిస్తోంది కాబట్టి ఇది సర్వపాద+ ఆద్యంతయమకం.

| | | | |
|---|---|---|---|
| 4. **ఆయతే :** | **ఆయతే** | ఆయేతే | ఆయన్తే |
| | ఆయసే | ఆయేథే | ఆయధ్వే |
| | ఆయే | ఆయావహే | ఆయామహే |
| **సమాయతే :** | **సమాయతే** | సమాయేతే | సమాయన్తే |
| | సమాయసే | సమాయేథే | సమాయధ్వే |
| | సమాయే | సమాయావహే | సమాయామహే |
| **భజ :** | భజతు/భజతాత్ | భజతామ్ | భజన్తు |
| | **భజ**/భజతాత్ | భజతమ్ | భజత |
| | భజాని | భజావ | భజామ. |

*

**శ్లో॥ కరోఽతికార్యో దధిమన్థసంగ-మపి స్మ కర్తుం యతతే న తేన ।**
**త్వదఙ్ఘ్రిజుష్టేరపరం మురారే! – కరోతి కాఽఽర్యోదధిమన్థసఙ్గ ॥ 8-11**

**అ :** కర్తవ్యనిర్వహణలోని తమ అనాసక్తిని గోపికలు కృష్ణునకు విన్నవించుట. –ఉపేంద్రవజ్ర.

**ప :** కరః అతికార్యః దధిమన్థసంగమ్–అపి స్మ కర్తుం యతతే న తేన ।
త్వదంఘ్రిజుష్టేః అపరం మురారే! – కరోతి కా ఆర్యా ఉదధిమన్థసంగ! ॥

**అ :** ఉదధిమన్థసంగ! మురారే! అతికార్యః కరః దధిమన్థసంగమ్ అపి కర్తుం న యతతేస్మ. తేన త్వదంఘ్రి జుష్టేః అపరం కా ఆర్యా కరోతి?

**ప్ర :** ఉదధిమన్థసంగ! : ఉద–ధి = సముద్రంయొక్క (ఉదకం ధీయతే అస్మిన్ ఉదధిః తస్మాత్ సంబుద్ధిః), మన్థ = కవ్వమైన మందరపర్వతంతో (మన్థా మన్థశ్చ మన్థానః – హలాయుధకోశః – 276), సంగ! = చేరిమి కలవాడా! (కూర్మరూపంతో) (ఉదధేః మన్థేన సంగః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), ముర+అరే! = (మురాసురునకు శత్రువైన) కృష్ణా! అతికార్యః = పని ముగిసిన తరువాత (అతిక్రాంతం కార్యం యేన సః), కరః = (మా) చేయి (జాత్యేకవచనం) దధి–మన్థ–సంగమ్–అపి : దధి = పెరుగును (చిలికే), మన్థ = కవ్వంతో, సంగమ్–అపి =

కలయికను కూడా, కర్తుమ్ = చేయటానికి (కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), న యతతే స్మ = ప్రయత్నించటం లేదు. (యతీ ప్రయత్నే ఆత్మనేపది - **లట్ స్మే**' (అష్టాధ్యాయి 3/2/118) సూత్రం ద్వారా భూతార్థం కోసం స్మ అనుబంధం), తేన = అందువల్ల, త్వద్-అంఘ్రి-జుష్టేః : త్వద్ = నీయొక్క, అంఘ్రి = పాదాలయొక్క, జుష్టేః = సేవకన్న (తవ అంఘ్రీ త్వదంఘ్రీ, తయోః జుష్టిః తస్యాః), అపరమ్ = మరియొక పని, కా ఆర్యా = ఏ మర్యాదస్తురాలు, కరోతి = చేస్తుంది? (కృ-కరణే-పరస్మైపది-లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! సముద్రాన్ని చిలికినప్పుడు కవ్వంగా ఉపయోగపడిన మందరపర్వతాన్ని కూర్మరూపంతో నిలిపి దానితో చేరిమి గలవాడవు నీవు. మా పనులు ముగిసిన తరువాత మా చేయి పెరుగును చిలికే కవ్వాన్ని తాకటానికి కూడా ప్రయత్నం చేసేది కాదు. అంటే నీ పాదసేవను తప్ప మరిదేనినీ ఏ ఉత్తమస్త్రీ కూడా కోరు కోరు.

**వి :**1. "**యౌవనే సత్వజాః స్త్రీణామలంకారాస్తు వింశతిః**" అని దశరూపకం 20 లక్షణాలను ప్రస్తావిస్తుంది. వాటిలో ఒకటి లీల. - "**ప్రియానుకరణం లీలా మధురాంగవిచేష్టితైః**" - మధురమైన ఆంగిక చేష్టలతో ప్రియుని అనుకరించటం లీల. ప్రియునకిష్టమైన వానిని తానూ ఇష్టపడుటలో ఒక భాగమిది. కానీ ఇక్కడ దానికన్న కూడా కృష్ణపదసేవనే ఇష్టతరంగా భావిస్తున్నారు.

| | | | |
|---|---|---|---|
| 2. **యతతే :** | **యతతే** | యతేతే | యతన్తే |
| | యతసే | యతేథే | యతధ్వే |
| | యతే | యతావహే | యతామహే |
| **కరోతి :** | **కరోతి** | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః. |

*

**శ్లో॥ దయాఽఙ్గ! యద్యాసు న దీనబంధో! - ప్రియేయమాప్యా హి నదీనబన్ధో।**
**హృతోఽరిరస్యా యదసౌ భగస్య - తవౌజసా తోయదసౌభగస్య ॥ 8-12**

**అ :** తమను కాకున్నా యమునను ఆదరించటానికైనా రావాలి కదా అని గోపికలు కృష్ణుని హెచ్చరించటం.
-ఉపేంద్రవజ్ర.

**ప :** దయా అంగ! యది ఆసు న దీనబంధో - ప్రియా ఇయమ్ ఆప్యా హి నదీ ఇనబంధో।
హృతః అరిః అస్యాః యత్ అసౌ భగస్య - తవ ఓజసా తోయదసౌభగస్య ॥

**అ :** దీనబంధో! అంగ! యది ఆసు దయా న (తథాపి) ఇనబంధో! ప్రియా ఇయం నదీ ఆప్యా హి. యత్ అస్యాః భగస్య అరిః తోయదసౌభగస్య తవ ఓజసా హృతః.

**ప్ర :** దీనబంధో! = దీనులకు బంధువా! (దీనానాం బంధుః - తస్మాత్ సంబుద్ధిః), అంగ = కృష్ణా!, యది = ఒకవేళ, ఆసు = ఈ మా యందు, దయా = జాలి, న = లేకపోయినా, ఇన-బంధో! = సూర్యునకు బంధువా! ప్రియా = (నీకు) ఇష్టమైన, నదీ = ఈ యమున (సూర్యపుత్రి కాబట్టి), ఆప్యా హి = చేరదగినది గదా!, యత్ = ఎందుకంటే, అస్యాః = ఈమె యొక్క, భగస్య = భాగ్యానికి (భగో భాగ్యమ్-భాగవత టీక - హలాయుధకోశః), అరిః = శత్రువయిన, అసౌ = ఈ కాలియుడు, తోయద- సౌభగస్య = మేఘాల సొబగు వంటి సొబగు గల (తోయదస్య సౌభగమివ సౌభగం యస్య తస్య), తవ = నీయొక్క, ఓజసా = తేజస్సుచే, హృతః = అపహరింపబడెను/ వెళ్ళగొట్టబడెను. (హృ హరణే ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** దీనబంధూ! కృష్ణా! నీకు మామీద దయలేకపోయినా నీ కిష్టమయిన యమునపై ఆప్యాయతను చూపు. ఎందుకంటే ఆమె సూర్యుని కూతురు. నీవు సూర్యునకు బంధువువు. నీలమేఘశ్యామా! నీవు ఆ యమున భాగ్యానికి శత్రువు అయిన కాళియుని ఆ యమునలో నుండి వెళ్ళగొట్టావు గదా!

**వి :** 1. కృష్ణుడు ఇన(సూర్య)బంధువు-

శ్లో॥ ధ్యేయస్సదా సవితృమండలమధ్యవర్తీ - నారాయణస్సరిసిజాసనసన్నివిష్టః ।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ - హారీ హిరణ్మయవపుర్ధృతశంఖచక్రః॥

నిత్యానుష్ఠానంలో అర్చాక్రమంలో వాడే ప్రసిద్ధశ్లోకమిది.

2. ప్రథమద్వితీయపాదాలకూ, తృతీయచతుర్థపాదాలకూ యమకం. *

**శ్లో॥ ఇహాగతా హన్త సురానుదారా-నముం చ రామావర సిద్ధభద్రాః ।**
**విహాయ లోకం తవ సఙ్గసిద్ధ్యై - న ముఞ్చ రామా వరసిద్ధభద్రాః ॥ 8-13**

**అ :** గోపికలు కృష్ణునికై తాము స్వర్గాన్ని కూడా వీడి రావటాన్ని గుర్తుచేస్తున్నారు. -ఉపేంద్రవజ్ర.

**ప :** ఇహ+ఆగతాః హన్త సురాన్ ఉదారాన్ - అముమ్ చ రామ+అవర! సిద్ధభద్రాః ।
విహాయ లోకం తవ సంగసిద్ధ్యై - న ముంచ రామా వరసిద్ధభద్రాః ॥

**అ :** రామ+అవర! హన్త ఉదారాన్ సురాన్ అముం లోకం చ విహాయ తవ సంగసిద్ధ్యై ఇహ ఆగతాః వరసిద్ధభద్రాః సిద్ధభద్రాః రామాః న ముంచ.

**ప్ర :** రామ+అవర!=బలరాముని తమ్ముడా! కృష్ణా! (రామాత్ అవరః తస్మాత్ సంబుద్ధిః), హన్త = చూడు (ఇది తెలుగులో వాక్యారంభసూచకం. 'హన్త హర్షే౽ నుకంపాయాం వాక్యారంభవిషాదయోః'-అమరకోశః-నానార్థవ్యయ-246), ఉదారాన్ = గొప్పవారయిన, సురాన్ = దేవతలనూ, అముమ్ = ఈ (దేవతాసంబద్ధమైన), లోకమ్ = లోకాన్ని, చ = కూడా, విహాయ = విడిచి, తవ = నీయొక్క, సంగ-సిద్ధ్యై : సంగ = చేరిమియొక్క, సిద్ధ్యై = ప్రాప్తికై (సంగస్య సిద్ధిః, తస్యై), ఇహ = ఈ (భూ లోకానికి), ఆగతాః = వచ్చినట్టివారమూ, వర-సిద్ధ-భద్రాః : వర = వరంవలన, సిద్ధ = లభించిన, భద్రాః = శుభాలుగలవారమూ (వరేణ సిద్ధం భద్రం యాసాం తాః), సిద్ధభద్రాః : సిద్ధ = సిద్ధులకు కూడా, భద్రాః = మంగళస్వరూపలమూ అయిన (సిద్ధానాం భద్రాః), ఇమాః = ఈ, రామాః = అందగత్తెలను, న ముంచ = వీడవద్దు.

**తా ॥** కృష్ణా! మేటి వేలుపులనూ దేవలోకాన్నీ వీడి నీ సమాగమసిద్ధిని కోరి ఈ లోకానికి వచ్చాం. మేము కృష్ణ సమాగమాన్ని వరంగా సిద్ధింపజేసికొన్న శుభస్వరూపాలం. సిద్ధులకు కూడా శుభాలను చేకూర్చగలవారం. అటువంటి మమ్మ విడువవద్దు.

**వి :** 1. ఈ శ్లోకంలో పదవినియోగం అర్థవంతంగా విశిష్టంగా కనిపిస్తుంది.

మన కామనలలో భద్ర మొకటి.

ఋ. **భద్రం** కర్ణేభిః శృణుయామ దేవాః - **భద్రం** పశ్యేమాక్షిభిర్యజత్రాః ।
స్థిరైరంగైస్తుష్టువాగ్ంసస్తనూభిః - వ్యశేమ దేవహితం యదాయుః ॥

- ఋగ్వేదం 1-89-8

ఇది శాంతిమంత్రాలలో ఒకటి. అటువంటి భద్రత సిద్ధించినవారు గోపికలు. మరి వీరి కామన. "**తత్ప్రియార్థం సంభవన్తు సురస్త్రియః**' - అన్న బ్రహ్మ ఆదేశాన్ని మనమిక్కడ స్మరించాలి.

2. 'రామా' శబ్దం స్త్రీ పర్యాయంగా శక్తిమంతమైనది. పుంలింగంలో రామశబ్దానికున్న శక్తి స్త్రీలింగంలో **రామా** శబ్దానిది. అందుకే కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతస్సును ప్రలోభపెట్టే సన్నివేశంలో రామా పదమే కనిపిస్తుంది.

ఇమా రామాః సరథా సతూర్యా –న హీదృశా లంభనీయా మనుష్యైః ।
అభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ – నచికేతో మరణం మానుప్రాక్షీః ॥ – కఠోపనిషత్తు 1/25

3. శ్లోకంలో ద్వితీయచతుర్థపాద యమకం.

| | | | |
|---|---|---|---|
| 4. **ముంచ :** | ముంచతు/ముంచతాత్ | ముంచతామ్ | ముంచన్తు |
| | **ముంచ**/ముంచతాత్ | ముంచతమ్ | ముంచత |
| | ముంచాని | ముంచావ | ముంచామ. |

*

**శ్లో॥ ఉచితైవ నాథ! సుదయాసు దయా – చకితాసు దుష్టభయదాభ! యదా ।**
**న భవాంస్తదా గృహమదోహమదో – భయదం కిముత్స్వనవనం న వనమ్ ॥8-14**

**అ :** కృష్ణుడు లేకుంటే ఇల్లయినా అడవయినా భయంకరమే అని గోపికల ప్రకటన.

**ప :** ఉచితా ఏవ నాథ సుదయ ఆసు దయా – చకితాసు దుష్టభయ–ద+ఆభ యదా ।
న భవాన్ తదా గృహమ్ అదోహమ్ అదః–భయదం కిమ్ ఉత్స్వనవనం న వనమ్ ॥

**ప్ర :** సుదయ! = మంచి జాలి గలవాడా! (శోభనా దయా యస్మిన్ సః – తస్మాత్ సంబుద్ధిః), దుష్ట–భయ–ద–ఆభ : దుష్ట = దుర్మార్గులకు, భయ–ద = భయాన్ని కలిగించే, ఆభ = శోభ గలవాడా! (దుష్టానాం భయదా ఆభా యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), నాథ = వల్లభా! కృష్ణా!, చకితాసు = బెదిరినట్టి, ఆసు = ఈ మా యందు, దయా = జాలి, ఉచితా+ఏవ = తగినదే!, యదా = ఎప్పుడు, భవాన్ = నీవు, న = లేవో, తదా = అప్పుడు, అదోహమ్ = నిర్వహణలేని (న విద్యతే దోహః యస్మిన్ తత్), అదః = ఈ, గృహమ్ = ఇల్లు కూడా, భయదమ్ = భయాన్ని కలిగించేదే (భయం దదాతి ఇతి), ఉత్–స్వనవనమ్ : ఉత్స్వన = పెద్ద చప్పుళ్ళు గల, వనమ్ = నీరు కలిగిన (వనే సలిల కాననే – అమరకోశః – నానార్థ – 128), వనమ్ = అడవి (బృందావనం), భయదం న కిమ్? = భయంకరం కాదా?

**తా ॥** కృష్ణా! నీవు దయామయుడవు. చెడ్డ వారికి భయాన్ని కలిగించే తేజస్సు గలవాడవు. కాబట్టి బెదిరిన మాపై జాలిచూపుట నీకు తగిన పనియే. నీవు లేకుంటే నిర్వహణ/లోపించిన మా ఇల్లు కూడా భయావహంగానే వుంటుంది. ఇక జలపాతాల ధ్వనులతో కూడిన ఈ వనం భయంకరం కావటం ఆశ్చర్యమా?

**వి :** 1. ఈ శ్లోకంలో సర్వపాదాంతయమకం రమణీయంగా వుంది.

2. ఏ దోహదమూ లేని ఇల్లే భయంకరమైనప్పుడు జలపాతాల రొదలతో కూడిన అరణ్యాన్ని గూర్చి చెప్పాలా? అనటంలో కావ్యార్థాపత్త్యలంకారం కనిపిస్తుంది. '**కైముత్యేనార్థ సంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**' – (కు – 120)

3. ఛందస్సు – వంశస్థం. *

**శ్లో॥ భ్రమరఞ్జితస్తవ పదాబ్జయుగే – భ్రమరం జితారికుల! నః సదయ! ।**
**హృదయం వియుక్తతరుణీస్థిరతా–హృదయం విభోఽర్దయతి భృఙ్గచయః ॥ 8-15**

**అ :** జాతిభ్రమరాలు కర్మభ్రమరాలయిన తమ హృదయాలను పీడిస్తున్నాయని గోపికల ఆవేదన.–ప్రమితాక్షర.

**ప :** భ్రమరంజితః తవ పద+అబ్జయుగే – భ్రమరం జిత+అరికుల! నః సదయ! ।
హృదయం వియుక్తతరుణీస్థిరతా–హృద్ అయం విభో+అర్దయతి భృంగచయః ॥

**అ :** జిత+అరికుల! సదయ! భ్రమరంజితః వియుక్త-తరుణీ-స్థిరతా-హృద్ అయం భృంగ- చయః తవ పద+అబ్జయుగే భ్రమరం నః హృదయమ్ అర్దయతి.

**ప్ర :** జిత+అరి-కుల : జిత = గెలువబడిన, అరి = శత్రువులయొక్క, కుల = సమూహం గలవాడా! (జితమ్ అరీణాం కులం యేన సః, తస్మాత్ సంబుద్ధిః) (ప్రకరఘనౌఘ సంఘ సంఘాతవ్రాతకులోత్కరా - హలాయుధకోశః - 686), సదయ = దయతో కూడినవాడా!, (దయయా సహితః, తస్మాత్ సంబుద్ధిః), విభో! = స్వామీ! కృష్ణా!, భ్రమ-రంజితః : భ్రమ = గిరికీలు కొట్టడంతో, రంజితః = అందగిస్తున్నదియు (భ్రమేణ రంజితః), వియుక్త-తరుణీ-స్థిరతా-హృద్ : వియుక్త = ఎడబాసిన, తరుణీ = యువతులయొక్క, స్థిరతా = నిలకడను, హృద్ = అపహరించేదీ అయిన (వియుక్తానాం తరుణీనాం స్థిరతాం హరతి ఇతి), అయమ్ = ఈ, భృంగ-చయః : భృంగ = తుమ్మెదలయొక్క, చయః = గుంపు (భృంగాణాం చయః), తవ=నీ యొక్క, పద+అబ్జ-యుగే : పద+అబ్జ = పాదపద్మాల యొక్క, యుగే = జంటపై, భ్రమరమ్ = తుమ్మెదవలె నున్న, నః = మాయొక్క, హృదయమ్ = మనస్సును (జాత్యేక వచనం), అర్దయతి = పీడిస్తోంది. (అర్ద హింసాయామ్ పరస్మైపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** దయామయా! స్వామీ! కృష్ణా! నీవు శత్రుసమూహాలను గెలిచినవాడవు. (పసితనం నుండీ కృష్ణుడు సాధించిన విజయాలను చూసివున్నారు గదా!), ఈ తుమ్మెదల గుంపు అందంగా గిరికీలు కొడుతూ నీ వియోగంతో నలుగుతున్న మా నిలకడను కొల్లగొడుతూ నీ చరణారవిందాలపై తుమ్మెదలవలె తిరుగుతున్న మా మనస్సును పీడిస్తోంది.

**వి :** 1. ఈ శ్లోకంలోని '**భ్రమ**' పదం విశిష్టం. తుమ్మెదల గుంపు భ్రమ(ణం)తో అందగిస్తోంది. గోపికల హృదయాలు కూడా భ్రమరంజితాలు. కృష్ణుని పరాత్పరునిగా గుర్తిస్తూ కూడా ఆయన ఉనికిని తమ దగ్గరలో సంశయిస్తున్న వారి అనురాగం భ్రమ రూపమే.

శ్లో॥ ఆసీనో దూరం వ్రజతి - శయానో యాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం - మదన్యో జ్ఞాతుమర్హతి ॥ - కఠోపనిషత్తు 2/21

అటువంటి పరాత్పరుని సాన్నిధ్యాన్ని భావింపలేకపోవటం, అభావాన్ని మాత్రమే భావించటం వారి భ్రమయే.

ఇక తుమ్మెదల గుంపు వీరి మనస్సును పీడించటానికి కారణం జ్ఞాతి వైరం. అవి కృష్ణ పదారవిందాలపై తుమ్మెదలవలె ప్రవర్తిస్తున్న గోపికల మనస్సును చూచి సహింపలేక పోతున్నాయి. అవి నిజంగా అలా భావిస్తున్నాయా? లేదు. అది వీరి భ్రమ మాత్రమే. వాటికి సంబంధం లేకపోయినా ఆ సంబంధాన్ని కల్పించటం సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు.39), భ్రమణరంజనం భ్రమరస్వభావం మాత్రమే. అదే భ్రమణాన్ని మగవాడైన దుష్యంతుడెలా భావించాడో గమనించండి.

శ్లో॥ చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదుకర్ణాంతికచరః ।
కరే వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వమధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర హతాస్త్వం ఖలు కృతీ ॥ - అభిజ్ఞానశాకున్తలం - 1/19

| | | | |
|---|---|---|---|
| 2. **అర్దయతి :** | **అర్దయతి** | అర్దయతః | అర్దయన్తి |
| | అర్దయసి | అర్దయథః | అర్దయథ |
| | అర్దయామి | అర్దయావః | అర్దయామః. |

*

**శ్లో॥ చరణామ్బుజం కరసరోజరుచం - కవివర్ణనాకరసరోఽజరుచమ్ ।**
**తవ నాభిమచ్యుత! దిదృక్ క్షతి దృ-గ్విషయేచ్ఛయా సపది దృక్క్షతిదృక్ ॥16**

**అ :** కృష్ణనాభిసందర్శనాన్ని గోపికలు అభిలషించుట. -ప్రమితాక్షర.

**ప :** చరణ+అంబుజం కరసరోజరుచం - కవివర్ణన+ఆకరసరః+అజరుచమ్ ।
తవ నాభిమ్ అచ్యుత దిదృక్క్షతి దృక్ - విషయ+ఇచ్ఛయా సపది దృక్క్షతిదృక్ ॥

**ప్ర :** అచ్యుత = కృష్ణా! (నాస్తి చ్యుతం యస్య సః - తస్మాత్ సంబుద్ధిః), విషయ+ఇచ్ఛయా : విషయ = విషయాలపై (ఇంద్రియార్థాలపై), ఇచ్ఛయా = కోరికచేత (విషయేషు ఇచ్ఛా, తయా), సపది = వెంటనే, ది దృక్-క్షతి-దృక్ : ది దృక్ = జ్ఞానంయొక్క (దర్శన జ్ఞాననేత్రేషు దృక్ - నానార్థరత్నమాలా - పంక్తి - 104), క్షతి = వినాశాన్ని, దృక్ = చూడగలదైన (దృశః క్షతిం పశ్యతి ఇతి), దృక్ = చూపు, తవ = నీయొక్క, చరణ+అంబుజమ్ = పాదపద్మాన్నీ, (చరణః అంబుజమ్ ఇవ), కర-సరోజ-రుచమ్ = కరారవిందకాంతినీ, (కరః సరోజమివ - తస్య రుక్ తామ్), కవి-వర్ణన+ఆకర-సరః - అజ-రుచిమ్ : కవి = కవులయొక్క, వర్ణన = వర్ణనలకు, ఆకర = ఆశ్రయమైన, సరః = సరస్సువంటి, అజ = బ్రహ్మయొక్క, రుచమ్ = కాంతిగల (కవీనాం వర్ణనస్య ఆకరః చ తత్ సరః, తద్రూపకం అజస్య రుక్ యస్మాత్ తమ్), నాభిమ్ = బొడ్డును, దిదృక్క్షతి = చూడగోరుతోంది (ద్రష్టుమ్ ఇచ్ఛతి ఇతి దిదృక్క్షతి - దృశ్ ధాతువుపై **సన్నంత ప్రయోగం** లట్ - ప్ర.ఏ.)

**తా ॥** అచ్యుతా! కృష్ణా! మాకున్న విషయేచ్ఛవలన మా జ్ఞానదృష్టి వెంటనే నశిస్తోంది. ఆ సంగతి గ్రహించిన మా చూపు నీ పాదారవిందాలనూ, నీ కరారవిందాలనూ, కవి వర్ణనలకు ఆశ్రయమైన సరోజరుచిగల నాభినీ చూడగోరుతోంది.

**వి :** 1. విషయాసక్తి జ్ఞానాన్ని నశింపజేయగలుగుతుంది. ఎందుకంటే విషయప్రవృత్తి ఇంద్రియసంబంధి, మనస్సుతో సహా. జ్ఞానం బుద్ధిసంబంధి.

శ్లో॥ విషయైరింద్రయగ్రామో న తృప్తిమధిగచ్ఛతి ।
అజస్రం పూర్యమాణోఽపి సముద్రస్సలిలైరివ ॥ - సౌందర నందనం - 13/40

అంటాడు అశ్వఘోషుడు. సముద్రాన్ని నదులు నిరంతరంగా నింపుతున్నా అది నిండదు. ఇంద్రియాలకు విషయాలను ఎంత అందించినా అవి తృప్తి చెందవు.

2. నాభి సందర్శనాభిలాషలో జ్ఞానతృష్ణ కనిపిస్తుంది. బ్రహ్మ పుట్టుక నాభికమలం నుండి. కాబట్టి నాభిసందర్శన బ్రహ్మసందర్శనమై బ్రహ్మజ్ఞానహేతువవుతుంది.

లేదా ఆనాడు పురుషోత్తమ వచనంగా కృష్ణప్రీతికై అప్సరసలను గోపికలుగా జన్మించమని ఆదేశించింది బ్రహ్మ. ఇప్పుడు ఆయననే నిలదీసి అడగాలన్న కోరిక అయినా కావచ్చు.

3. ప్రథమద్వితీయపాదాంతంలోనూ, తృతీయచతుర్థపాదాంతంలోనూ యమకం.

| | | | |
|---|---|---|---|
| 4. **దిదృక్షతి :** | **దిదృక్షతి** | దిదృక్షతః | దిదృక్షంతి |
| | దిదృక్షసి | దిదృక్షథః | దిదృక్షథ |
| | దిదృక్షామి | దిదృక్షావః | దిదృక్షామః. |

*

**శ్లో॥ పదారవిన్దం హృది దేహి నః ప్రియం - సదా స్మరన్నిర్మలదేహినః ప్రియమ్ ।**
**తదేహి శాన్తస్తవ నన్దనోఽజ! య-న్నిహన్తి శాన్తస్తవ నన్దనో జయన్ ॥ 8-17**

**అ :** మదనుడు తమను పీడించటాన్ని గోపికలు మదనజనకుడైన కృష్ణునితో నివేదించుట. -వంశస్థం.

**ప :** పదారవిందం హృది దేహి నః ప్రియమ్ – సదా స్మరన్నిర్మలదేహినః ప్రియమ్ ।
తద్ ఏహి శాంతః తవ నందనః అజ! యత్ – నిహన్తి శాంత–స్తవ–నందనః జయన్॥

**అ :** సదా స్మరన్నిర్మలదేహినః ప్రియం నః ప్రియం పద+అరవిందం హృది దేహి. అజ! యత్ శాంత–స్తవ–నందనః తద్ ఏహి. శాంతః తవ నందనః జయన్ నిహన్తి.

**ప్ర :** సదా = ఎల్లప్పుడు, స్మరత్+నిర్మల–దేహినః : స్మరత్ = స్మరిస్తూ/ తలపోస్తూ (స్మృధాతువుపై శతృ ప్రత్యయం), నిర్మల = ఏ దోషమూ లేని, దేహినః = శరీరంగలవానికి (స్మరన్ చ నిర్మలశ్చ దేహః అస్య అస్తీతి తస్య), ప్రియమ్ = ఇష్టమైనదీ, నః = మాకు, ప్రియమ్ = ఇష్టమైనదీ అయిన, పద+అరవిందమ్ = పాదపద్మాన్ని, హృది = గుండెలపై, దేహి = ఉంచు. (దా దానే – పరస్మైపది – లోట్ – మ.ఏ.), అజ = పుట్టువు లేనివాడా! కృష్ణా! యత్ = ఎందువల్ల నయితే, శాంత–స్తవ–నందనః : శాంత = గర్వం నశించిన వారియొక్క, స్తవ = స్తుతులచే, నందనః = ఆనందించే వాడవో (శాంతానాం స్తవైః నందతి ఇతి), తత్ = అందువల్ల, ఏహి = రా! (ఆ+ఇణ్ గతౌ పరస్మైపది – లోట్ – మ.ఏ.), శాంతః = నెమ్మదించిన, తవ = నీ యొక్క, నందనః = కుమారుడు (మదనుడు), జయన్ = అందరికన్న మిన్నగా, నిహన్తి = (మమ్ము) పీడిస్తున్నాడు. (ని+హన హింసాగత్యోః పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నిరంతరమూ నిన్ను తలచుకొంటూ పవిత్రులయిన వారికీ, మాకూ కూడా ఇష్టమైనది నీ పాదారవిందం. దాన్ని మా హృదయాలపై పెట్టు. నిగర్వులై నిన్ను స్తోత్రం చేస్తే నీవు ఆనందిస్తావు. కాబట్టి నిన్ను స్తుతిస్తున్న మా దగ్గరకు రా! ఇంతకు ముందు కొంత నిదానించిన నీ కుమారుడు మరల మాపై గెలుపొందుతున్నాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో కూడా ప్రథమద్వితీయపాదాలకూ, తృతీయచతుర్థపాదాలకూ పాదాన్త యమకాలంకారం.

2. '**హృది దేహి పదారవింద**' మనటంలోని ఆంతర్యం – కృష్ణుడు అడుగిడితే ఆర్తి అంతరించి ఆనందం వెల్లివిరుస్తుందన్న విశ్వాసం. భాగవతంలో ఇది వాచ్యంగానే కనిపిస్తుంది.

ఫణిఫణార్పితం తే పదాంబుజం – కృణు కుచేషు నః కృన్ధి హృచ్ఛయమ్. – భాగవతం 10/31/7

| | | | |
|---|---|---|---|
| 3. **దేహి :** | దదాతు/దత్తాత్ | దత్తామ్ | దదతు |
| | **దేహి**/దత్తాత్ | దత్తమ్ | దత్త |
| | దదాని | దదావ | దదామ |
| **ఏహి :** | ఏతు | ఇతామ్ | యన్తు |
| | **ఆ+ఇహి** | ఇతమ్ | ఇత |
| | అయాని | అయావ | అయామ |
| **నిహన్తి :** | **నిహన్తి** | నిహతః | నిఘ్నన్తి |
| | నిహన్సి | నిహథః | నిహథ |
| | నిహన్మి | నిహన్వః | నిహన్మః. |

*

**శ్లో॥ నను చమ్పకాచ్యుతపదామ్బు జయో–దయమస్తి తేఽచ్యుతపదామ్బుజయోః।**
**ఉచితం చ పుష్పమలినాకలితం – తమిహేక్షయాశు మలినాకలితమ్ ॥ 8–18**

**అ :** గోపికలు చంపకవృక్షాన్ని కృష్ణుని రప్పింపుమని ప్రార్థించటం. –ప్రమితాక్షర.

**ప :** నను చంపక అచ్యుతపద+అంబు జయో–దయమ్ అస్తి తే అచ్యుతపదాంబుజయోః ।
ఉచితం చ పుష్పమ్ అలినా అకలితం–తమ్ ఇహ+ఈక్షయ+ఆశు మలిన+అకలితమ్॥

**అ :** చంపక! జయ+ఉదయమ్ అచ్యుతపద+అంబు తే అస్తి నను. అచ్యుతపదాంబుజయోః ఉచితమ్ అలినా అకలితం పుష్పమ్ అస్తి నను. మలిన+అకలితం తమ్ ఆశు ఇహ ఈక్షయ.

**ప్ర :** చంపక! = సంపెంగ చెట్టూ! జయ+ఉదయమ్ : జయ = అభివృద్ధికి, ఉదయమ్ = పుట్టువు అయిన (జయస్య ఉదయః యస్మాత్, తత్), అచ్యుతపద+అంబు : అచ్యుత పద = విష్ణుపదం/ఆకాశం నుండి కురిసిన (వ్యోమాంబరం విష్ణుపదం చ ఖం... హలాయుధకోశః 137), అంబు = నీరు (అచ్యుతపదాత్ వృష్టం అంబు), తే = నీకు, అస్తి నను = ఉన్నది కదా! (అస భువి అదాది పరస్మైపది - లట్ - ప్ర.ఏ), అచ్యుత-పద-అంబుజయోః:అచ్యుత = కృష్ణునియొక్క, పద-అంబుజయోః= పాదపద్మాలకు (పదే అంబుజే ఇవ, పదాంబుజే. అచ్యుతస్య పదాంబుజే, తయోః), ఉచితమ్ = తగినదై, అలినా = తుమ్మెదచే, అకలితమ్ = ఆస్వాదింపబడని/పొందబడని, పుష్పమ్ = పువ్వు, (అస్తి నను = ఉన్నది కదా!), మలిన+అకలితమ్ : మలిన = అపవిత్రులచే, అకలితమ్ = పొందబడని (మలినైః అకలితమ్), తమ్ = ఆ కృష్ణుని, ఆశు = వెంటనే (అవిలంబితమాశు చ - అమరకోశః - స్వర్గ-65), ఇహ = ఇక్కడ, దర్శయ = చూపించు. (దృశ్ ప్రేక్షణే ణిచ్ - పరస్మైపది - లోట్ - మ.ఏ.)

**తా ॥** ఓ చంపకమా! అభివృద్ధికే ఆకరమై ఆకాశంనుండి కురిసిన జలం నీ దగ్గరుంది. కృష్ణుని పాదపద్మాలకు యోగ్యమై, తుమ్మెదలు కూడా ఆస్వాదించని పూలు నీ దగ్గరున్నాయి. వాటితో నీవు కృష్ణుని సేవింపగలుగుతున్నాయి. అపవిత్రులకు పొందరాని ఆ కృష్ణుని ఇక్కడ మాకు త్వరగా పంపించు.

**వి :** 1. ప్రథమద్వితీయపాదాలకూ, తృతీయచతుర్థపాదాలకూ చెందిన పాదాంత యమక మీ శ్లోకంలో.

2. సంపెంగ పువ్వును తుమ్మెదలు అంటవన్నది కవి సమయసిద్ధం. కాబట్టి సంపెంగపువ్వు స్థిత్యపేక్షచే కాక వస్తుస్థిత్యపేక్షచేత కూడా తుమ్మెదలచే అనాఘ్రాతమే. అది పవిత్రతకు సంకేతం. చంపకంయొక్క నైసర్గికస్థితిని రామరాజభూషణుడు ఇలా చమత్కరిస్తాడు. గిరిక ముక్కును వర్ణిస్తూ.

శా. నానాసూనవితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్యసంవాస మై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు నిర్వంకలన్. -వసుచరిత్రము -2/47

3. మలిన+అకలితమ్ - కృష్ణుడు అపవిత్రులు పొందరాని వాడంటూ తమకు వెంటనే ఆయనను చూపించమనటం తమ పవిత్రత మీద తమకున్న విశ్వాసం. అంతేకాదు. ప్రస్తుతం కృష్ణస్మరణ చేస్తున్నారు కాబట్టి దానివలన కూడా పవిత్రత సమకూరినట్లే.

**శ్లో॥ అపవిత్రః పవిత్రో వా సర్వావస్థాం గతోఽపి వా ।**
**యః స్మరేత్పుండరీకాక్షం స బాహ్యాభ్యంతరశ్శుచిః ॥**

4. **అస్తి :**

| | | |
|---|---|---|
| **అస్తి** | స్తః | సన్తి |
| అసి | స్థః | స్థ |
| అస్మి | స్వః | స్మః |

**ఈక్షయ :**

| | | |
|---|---|---|
| ఈక్షయతు/ఈక్షయతాత్ | ఈక్షయతామ్ | ఈక్షయన్తు |
| **ఈక్షయ**/ఈక్షయతాత్ | ఈక్షయతమ్ | ఈక్షయత |
| ఈక్షయాణి | ఈక్షయావ | ఈక్షయామ. |

*

**శ్లో॥ అలిరయం నహి వేత్తి మధుద్విషం - తదపి నాత్ర శివేఽత్తి మధు ద్విషన్ ।**
**బహుపదే ప్రకృతిర్విషమస్థితిః - పరమిహాతనుతే విషమస్థితిః ॥ 8-19**

**అ :** తుమ్మెదతో/కృష్ణుణి పోల్చి చూపుతూ గోపికల నిష్ఠూరాలు. -ద్రుతవిలంబితమ్.

**ప :** అలిః అయం న హి వేత్తి మధుద్విషం-తద్ అపి న+అత్ర శివే అత్తి మధు ద్విషన్ ।
బహుపదే ప్రకృతిః విషమస్థితిః - పరమ్ ఇహ+ఆతనుతే విషమ్ అస్థితిః ॥

**అ :** అయమ్ అలిః మధుద్విషం న వేత్తి హి. తద్ శివే అత్ర అపి ద్విషన్ మధు న అత్తి. బహుపదే విషమస్థితిః ప్రకృతిః. ఇహ అస్థితిః పరం విషమ్ ఆతనుతే.

**ప్ర :** అయమ్ = ఈ, అలిః = తుమ్మెద, మధు-ద్విషమ్ = కృష్ణుని (మధుం ద్వేష్టి ఇతి - మధుద్విట్ - తమ్), న వేత్తి హి = ఎరుగదు కదా! (విద(2) జ్ఞానే - పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), తద్ = అందువలననే, శివే = శుభకరమైన, అత్ర అపి = ఈ సంపెంగను కూడా, ద్విషన్ = ద్వేషిస్తూ, మధు = మకరందాన్ని, న అత్తి = ఆస్వాదించటం లేదు (అద భక్షణే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), బహు-పదే = షట్పద (తుమ్మెద) విషయంలో (బహూని పదాని యస్య, తస్మిన్), విషమ-స్థితిః : విషమ = తులన లేని (అన్నిటా సమంగా ప్రవర్తించని), స్థితిః = ప్రవృత్తి (విషమా చ సా స్థితిః), ప్రకృతిః = స్వాభావికమే. ఇహ = ఇక్కడ, అస్థితిః = లేకపోవటం, పరమ్ = మాత్రం, విషమ్ = గరళాన్నే, ఆతనుతే = విస్తరింపజేస్తోంది. (ఆ+తనూ విస్తారే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ తుమ్మెద కృష్ణుని ఎరుగదు. అందువల్లనే శివాస్పదమైన ఈ సంపెంగను కూడా ద్వేషిస్తూ మకరందాన్ని ఆస్వాదించటం లేదు. నిజమే. ఆ తుమ్మెద బహుపదం (షట్పదం). అందుకే ఒక్కచోట అనురాగాన్ని నిలపలేదు. కానీ మా విషయంలో అది (అసమస్థితి) విషప్రాయమవుతోంది.

**వి :** 1. ఈ శ్లోకంలో ప్రథమద్వితీయపాదాలలో, తృతీయచతుర్థపాదాలలో అంతయమకం.

2. తుమ్మెదకు మధుద్విట్టును గురించి తెలియకపోయినా మధుద్వేషాన్ని ప్రదర్శించ గలిగినట్లు వర్ణించటం విభావనాలంకారం. '**విభావనా వినాపి స్యాత్ కారణం కార్యజన్మ చేత్**' - (కు.77)

తుమ్మెదను తెలుపుతూ బహుపదపదాన్ని ప్రయోగించటం సాభిప్రాయవిశేష్యప్రయోగం. అది పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయే విశేష్యే తు భవేత్పరికరాంకురః**' - (కు.63)

3. ఈ శ్లోకంలో దక్షిణనాయకుని ప్రవృత్తి వర్ణింపబడింది. కృష్ణుడు దక్షిణనాయకుడు. షట్పదప్రవృత్తి కూడా అటువంటిదే. అయితే దక్షిణనాయకుని ప్రవర్తన నాయికలకు మాత్రం భిన్నానుభవాలను కలిగిస్తుంది. తన ఉనికి ఉన్నచోట అమృతాయమానమయితే తన లేమి విషప్రాయమవుతుంది. ఆ విషయమే ప్రకృతశ్లోకంలో గోపికలు ప్రకటించింది.

| | | | |
|---|---|---|---|
| 4. **వేత్తి :** | **వేత్తి** | విత్తః | విదన్తి |
| | వేత్సి | విత్థః | విత్థ |
| | వేద్మి | విద్వః | విద్మః |
| **అత్తి :** | **అత్తి** | అత్తః | అదన్తి |
| | అత్సి | అత్థః | అత్థ |
| | అద్మి | అద్వః | అద్మః |
| **ఆతనుతే :** | **ఆతనుతే** | ఆతన్వాతే | ఆతన్వతే |
| | ఆతనుషే | ఆతన్వాథే | ఆతన్వధ్వే |
| | ఆతన్వే | ఆతన్వహే/ఆతనువహే | ఆతన్మహే/ఆతనుమహే. * |

**శ్లో॥ మురళీ మనో విజయతేఽజ! యతే-రపి మోహదా(గ్ర్యవలయేవ లయే ।**
**కమలా తవాధర సుధారసుధాః - పిబతి త్వదుద్యమహితా మహితా ॥ 8-20**

**అ :** పిల్లన(గోవిని తమకన్న భాగ్యవతిగా గోపికలు భావించుట. -(ప్రమితాక్షర.

**ప :** మురళీ మనః విజయతే అజ! యతేః - అపి మోహదా+ అ(గ్ర్యవలయా+ఇవ లయే।
కమలా తవ+అధరసుధారసుధాః - పిబతి త్వద్-ఉద్యమహితా మహితా ॥

**అ :** అజ! యతేరపి మోహదా త్వదుద్యమస్య హితా మహితా తవ మురళీ మనః విజయతే లయే అ(గ్ర్యవలయా కమలా ఇవ తవ అధరసుధారసుధాః పిబతి.

**(ప్ర :** అజ! = పుట్టుక లేనివాడా! కృష్ణా! (న జాయతే ఇతి), యతేః అపి = సన్న్యాసికి కూడా, మోహ-దా = మోహాన్ని కల్గించగలదియు, త్వద్-ఉద్యమ-హితా : త్వద్ = నీ యొక్క, ఉద్యమ = పూనికకు, హితా = అనుకూలమైనదియు, మహితా = గొప్పదియు అయిన, తవ = నీయొక్క, మురళీ = పిల్లన(గోవి, మనః = (మా)మనస్సును, విజయతే = గెలుచుకొంటోంది. (వి+జి జయే ఆత్మనేపది - లట్ - (ప్ర.ఏ.), లయే = (ప్రళయవేళలో, అ(గ్ర్య-వలయా : అ(గ్ర్య = (శ్రేష్ఠమైన, వలయా = గాజులు గల, కమలా+ఇవ = లక్ష్మివలె, అధర-సుధార-సుధాః : అధర = పెదవిమీద గల, సుధార = అందమైన ధారగల, సుధాః = అమృతాలను (అధరస్య శోభనా ధారా యాసాః తాః అధరసుధారాః, తాశ్చ సుధాః), పిబతి = (తాగుతోంది. (పా పానే భ్వాది పరస్మైపది - లట్ - (ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నీ పిల్లన(గోవి సన్న్యాసులకు కూడా మోహాన్ని కలిగించగలది. మమ్ములను ఆకర్షించటమనే నీ (ప్రయత్నానికి అనుకూలమయినది, మన్ననల నందింది కూడా. అది మా మనస్సును గెలుచు కొంటోంది. (ప్రళయకాలంలో కూడా (శ్రేష్ఠమైన హస్తాభరణాలు గల లక్ష్మివలె నీ అధరసుధా ధారలను ఆస్వాదింప గలుగుతోంది.

**వి :** 1. ఈ శ్లోకంలో పాదాంతయమకం కనిపిస్తుంది. నాలుగుపాదాలలోనూ భిన్నంగా-

2. వేణువు నీ అధర సుధాధారలను ఆస్వాదిస్తోందనటంలో గోపికలలోని తత్పానాభిలాష వ్యక్తమవుతోంది. నారాయణభట్టతిరి దానిని అందంగా తీర్చిన తీరు - గోపికల మాటలలోనే-

శ్లో॥ ఆపిబేయమధరామృతం కదా - వేణుభుక్తరసశేషమే కదా!
దూరతో బత కృతం దురాశయే - త్యాకులా ముహురిమాః సమాముహన్ ॥-నారాయణీయమ్ 59/8

3. విజయతే - జి ధాతువు నైసర్గికంగా పరస్మైపదం కానీ వి,పరా అన్న ఉపసర్గలు చేరినపుడు "**విపరాభ్యాం జేః**" (అష్టాధ్యాయి 1-3-19) సూత్రం మేరకు ఆత్మనేపద మవుతుంది.

| | | | |
|---|---|---|---|
| 4. **విజయతే :** | **విజయతే** | విజయేతే | విజయన్తే |
| | విజయసే | విజయేథే | విజయధ్వే |
| | విజయే | విజయావహే | విజయామహే |
| **పిబతి :** | **పిబతి** | పిబతః | పిబన్తి |
| | పిబసి | పిబథః | పిబథ |
| | పిబామి | పిబావః | పిబామః. |

*

**శ్లో॥ తవ వేణునా సురనతా రణతా - వినతా వధూతతిజితాతిజితా ।**
**యమునా గతాన్తికమలం కమలం - దదతీవ తే కరముదార! ముదా ॥ 8-21**

**అ :** వేణుగానపరవశయై యమున కృష్ణునకు కమలాన్ని కానుక చేస్తున్నదని గోపికల నివేదన. –ప్రమితాక్షర.

**ప :** తవ వేణునా సురనతా రణతా – వినతా వధూతతిజితా అతిజితా ।
యమునా గతా అంతికమ్ అలం కమలం – దదతి+ఇవ తే కరమ్ ఉదార ముదా॥

**అ :** ఉదార! రణతా వధూతతిజితా తవ వేణునా సురనతా వినతా అతిజితా యమునా ముదా కమలం కరం దదతీవ అలమ్ అంతికం ప్రాప్తా.

**ప్ర :** ఉదార = వదాన్యుడా! కృష్ణా!, రణతా = పలుకుతున్నదియు, వధూ–తతి–జితా : వధూ = కన్నియలయొక్క, తతి = సమూహాన్ని, జితా = గెలిచినదియు అయిన (వధూనాం తతిః, తాం జయతి ఇతి, తయా), తవ = నీయొక్క, వేణునా = పిల్లనగ్రోవిచే, సురనతా : సుర = దేవతలచే, నతా = నమస్కరింపబడినదియు (సురైః నతా), వినతా = వినయవతియు, అతిజితా = మిక్కిలిగా గెలువబడినదియు అయిన, యమునా = యమునానది, ముదా = ఆనందంతో, తే = నీకు, కమలమ్ = పద్మాన్ని, కరమ్ = కానుకగా (నభాంశుహస్త–కరణోపథా... నానార్థమంజరి పంక్తి 1436), దదతి+ఇవ = ఇస్తున్నట్లుగా, అలమ్ = తగినంతగా (అలం భూషణపర్యాప్తి శక్తివారణవాచకమ్ – అమరకోశః – నానార్థావ్యయ – 253), అంతికమ్ = దగ్గరకు, ప్రాప్తా = వచ్చింది.

**తా ॥** ఉదారా! కృష్ణా! నీ వేణునాదం కన్నియల సమూహాలను గెలిచింది. అందుకే దేవతలు కూడా నమస్కరిస్తున్నా వినయశీలగా నిలిచే యమున ఆనందంతో నీకు కానుక చేయాలని తామరను తీసికొని బాగా దగ్గరకు వచ్చింది.

**వి :** 1. ఈ శ్లోకంలో పాదాంతయమకం నాల్గు పాదాలలోనూ విడివిడిగా.

| | | | |
|---|---|---|---|
| 2. **దదతి :** | దదాతి | దత్తః | **దదతి** |
| | దదాసి | దత్థః | దత్థ |
| | దదామి | దద్వః | దద్మః. |

*

**శ్లో॥ కరజప్రసక్త్యురురుచా రురుచా–ర్వవలోకనాకలితయాలి! తయా ।**
**కమలాఽన్వకారి రుచిరా రుచిరా–శ్యపహప్రియోష్ఠరసతీరసతీ ॥ 8–22**

**అ :** మురళీ ప్రస్తుతి. –ప్రమితాక్షర.

**ప :** కరజ ప్రసక్త్యురురుచా రురు–చారు+ – అవలోకన+ఆకలితయా ఆలి! తయా ।
కమలా అన్వకారి రుచిరా అరుచి–రాశి+ – అపహప్రియోష్ఠ–రస–తీర–సతీ ॥

**అ :** ఆలి! కరజ–ప్రసక్తి–ఉరు–రుచా రురు–చారు+అవలోకన+ఆకలితయా తయా రుచిరా అరుచి–రాశి–అపహ–ప్రియ+ఓష్ఠ–రస–తీర–సతీ కమలా అను+అకారి.

**ప్ర :** ఆలి = చెలీ!, కరజ–ప్రసక్తి–ఉరు–రుచా : కరజ = గోళ్ళతో (కరజస్తు కరం జాఖ్యద్రుమే వ్యాఘ్రనఖే నఖే – నానార్థరత్నమాలా – పంక్తి – 1351), ప్రసక్తి = ప్రసక్తిచేత (తగులం చేత), ఉరు = ఎక్కువైన, రుచా = కాంతి గలదియు (కరజానాం ప్రసక్త్యా ఉర్వీ రుక్ యస్యాః, తయా), రురు–చారు+అవలోకన+ఆకలితయా : రురు = జింకవలె, చారు = అందమైన, అవలోకన = చూపుతో, ఆకలితయా = కూడినదియు అయిన, తయా = ఆ వేణువుచే, రుచిరా = అందగిస్తూ, అరుచి... సతీ : అరుచి = చవిలేని వానియొక్క, రాశి = సమూహాన్ని, అపహ = అపహరించు, ప్రియ = ప్రియునియొక్క, ఓష్ఠ = అధరంపై, రస = ప్రవహించేదానియొక్క, తీర = ఒడ్డున, సతీ = నిలచినదైన, కమలా = లక్ష్మి, అను+అకారి = అనుకరింపబడెను. (అను కృ కరణే – కర్మణి–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** సఖీ! కృష్ణుని గోళ్ళు తగలటం వలన మరింతగా శోభిస్తూ, జింకలా అందమైన చూపులతో వెలుగుతున్న

వేణువు కమలను అన్ని అరుచులను పోగొట్టగల ప్రియాధర రస ప్రవాహతీరంలో నిలిచిన కమలను – అనుకరిస్తోంది.

వి : 1. ఈ శ్లోకంలోనూ పాదాంత యమకం నాలుగు పాదాలలోనూ విడివిడిగా పాటింపబడింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అన్వకారి :** | **అన్వకారి** | అన్వకారిషాతామ్ | అన్వకారిషత |
| | అన్వకారిష్ఠాః | అన్వకారిషాథామ్ | అన్వకారిధ్వమ్ |
| | అన్వకారిషి | అన్వకారిష్వహి | అన్వకారిష్మహి. |

*

**శ్లో॥ మురళీమమానయ తవాయతవా-గ్జితచేతసాన్తికమితాః కమితా ।**
**విసృజేఽన్నిజేఽభినవధూర్నవధూ-ర్న చకాస్తి సాధ్వి! వినతావినతా ॥ 8-23**

అ : కృష్ణుని కొనిరమ్మని గోపికలు వేణువును ప్రార్థించటం. –ప్రమితాక్షర.

ప : మురళి! – ఇమమ్ – ఆనయ తవ–ఆయతవా
గ్జితచేతసా–అంతికమ్–ఇతాః–కమితా ।
విసృజేత్ – నిజే అభినవధూః – న – వధూః
న – చకాస్తి – సాధ్వి – వినతౌ – ఇనతా ॥

అ : మురళి! ఇమమ్ ఆనయ. తవ ఆయతవాగ్జితచేతసా అంతికమ్ ఇతాః వధూః నిజే అభినవధూః కమితా (సః ) న విసృజేత్. సాధ్వి! వినతౌ ఇనతా న చ కాస్తి.

ప్ర : మురళి = పిల్లనగ్రోవీ! ఇమమ్ = ఈ కృష్ణుని, ఆనయ = తీసికొనిరా (ఆ+నీ ప్రాపణే పరస్మైపది – లోట్ – మ.ఏ.), తవ = నీయొక్క, ఆయత–వాగ్–జిత–చేతసా : ఆయత = విశాలమైన/ప్రస్తరించిన, వాక్ = పలుకుచే, జిత = గెలువబడిన, చేతసా = మనస్సుతో (ఆయతా చ సా వాక్, తయా జితం చ తత్ చేతః చ, తేన), అన్తికమ్ = దగ్గరకు, ఇతాః = చేరిన (ఇ–గతౌ ధాతువుపై క్త ప్రత్యయం), వధూః = కన్యలను (మమ్ము), నిజే = తన వారియందు, అభినవ–ధూః : అభినవ = క్రొత్తదైన, ధూః = భారము గల (అభినవా ధూః యస్య సః), కమితా = ఇష్టుడైన కృష్ణుడైన (ఇచ్ఛార్థకమయిన కమ్ ధాతువుపై తృచ్ ప్రత్యయం), న విసృజేత్ = విడువరాదు. (వి+సృజ్ విసర్గే – పరస్మైపది – విధిలిఙ్ – ప్ర.ఏ.), సాధ్వి! = ఏకాంతశీలా!, వినతౌ = లొంగినవారిపై, ఇనతా = దార్ఢ్యకం, న చకాస్తి = శోభించదు/బాగుండదు. (చకాస్ దీప్తౌ – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** మురళీ! కృష్ణుని తీసికొనిరా! విస్తృతమైన నీ రవళితో మా మనస్సును గెలుచుకొన్నావు. అందుకే నీ దగ్గరకు చేరాము. నీ స్వామి చెంతకు వచ్చాము. తన వారిపై నూతన భారాన్నుంచిన ఆ వల్లభుడు కృష్ణుడు తనవారిని (మమ్ము) వీడరాదు గదా! ఏకాంతశీలా! లోబడిన వారిపై అధికారాన్ని చెలాయించరాదు గదా!

వి : 1. ఈ శ్లోకంలోనూ పాదాంతయమకం నాలుగు పాదాలలోనూ విడివిడిగా.

2. కృష్ణుడు తమను వీడరాదన్న ప్రతిపాదనకు సమర్థకంగా '**వినతౌ ఇనతా న చకాస్తి**' అని ఒక సాధారణార్థాన్ని ప్రతిపాదించారు. సమర్థన అవసరమైనచోట సమర్థించటం కాబట్టి ఇది కావ్యలింగాలంకారం. 'సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్'–(కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆనయ :** | ఆనయతు/ఆనయతాత్ | ఆనయతామ్ | ఆనయన్తు |
| | **ఆనయ**/ఆనయతాత్ | ఆనయతమ్ | ఆనయత |
| | ఆనయాని | ఆనయావ | ఆనయామ |

| | | | |
|---|---|---|---|
| **విసృజేత్ :విసృజేత్** | | విసృజేతామ్ | విసృజేయుః |
| | విసృజేః | విసృజేతమ్ | విసృజేత |
| | విసృజేయమ్ | విసృజేవ | విసృజేమ. |
| **చకాస్తి :** | **చకాస్తి** | చకాస్తః | చకాసతి |
| | చకాస్సి | చకాస్థః | చకాస్థ |
| | చకాస్మి | చకాస్వః | చకాస్మః. |

*

**శ్లో॥ వ్రజభూరియం భువి *తతావితతా౽* -పృదభూత్ తవేశ్వర! *జనేరజనే!* ।**
**కమలా౽పి తత్ర *లసతే౽లసతే౽* -తృధునోత్సృజేత్ సురమణే! *రమణే* ॥ 8-24**

**అ :** కృష్ణునివలన గోకులం పొందిన దానిని, కృష్ణుడు లేకపోతే కోల్పోయే దానిని గోపికలు వినిపించటం.
-ప్రమితాక్షర.

**ప :** వ్రజభూః ఇయం భువి తతా అవి-తతా+అపి-ఉదభూత్ తవ ఈశ్వర జనేః అజనే! ।
కమలా+అపి తత్ర లసతే అలసతా+ఇతి-అధునా ఉత్సృజేత్ సురమణే రమణే ॥

**అ :** అజనే! ఈశ్వర! తవ జనేః అవి - తతా అపి ఇయం వ్రజభూః భువి తతా ఉదభూత్ - కమలా అపి తత్ర లసతే. సురమణే! అధునా రమణీ అలసతా ఇతి (సా) ఉత్సృజేత్.

**ప్ర :** అజనే = పుట్టువు లేనివాడా! (నాస్తి జనిః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), తవ = నీ యొక్క, జనేః = పుట్టుక వలన (జనుర్జనన జన్మాని జనిరుత్పత్తి రుద్భవః - అమరకోశః - కాల - 31), అవి-తతా-అపి : అవి = గొర్రెలచే, తతా-అపి = వ్యాపించినదైనను(అవిభిః తతా), ఇయమ్ = ఈ, వ్రజ-భూః = గొల్లపల్లె (వ్రజశ్చ అసౌ భూః), భువి = జగత్తులో, తతా = ప్రసిద్ధమైనదిగా, ఉద్+అభూత్ = ఉద్భవించింది (ఉద్-భూ సత్తాయామ్ - పరస్మైపది - లుఙ్ - (ప్ర.ఏ.), కమలా - అపి = లక్ష్మి కూడా, తత్ర = ఆ గోకులంలో, లసతే = ప్రకాశిస్తోంది. (లస్ - శ్లేషణక్రీడనయోః - ఆత్మనేపది - లట్ - (ప్ర.ఏ.) లస్ ధాతువు పైఅర్థాలలో వస్తుతః పరస్మైపదం. ఇక్కడ ఆత్మనేపద ప్రయోగానిన "చాంద్రా- దయస్తు మన్యన్తే సర్వస్మాదుభయం పదమ్" అన్న వెసులుబాటును బట్టి లేదా '**అకర్మకాచ్చ**' అని పాణిని కొన్ని ధాతువులకిచ్చిన అవకాశాన్ని ఔపచారికంగా భావించి, అన్ని ధాతువులకూ వర్తింపజేయటంవలన గానీ సాధించాలి.), సురమణే = దేవతాశ్రేష్ఠా!, అధునా = ఇప్పుడు, రమణే = వల్లభుడవైన నీయందు, అలసతా ఇతి = ఆలస్యమని/ ఉదాసీనత అని, ఉత్సృజేత్ = (గోకులాన్ని) వీడవచ్చు. (ఉత్ - సృజ విసర్గే - పరస్మైపది - విధిలిఙ్ - (ప్ర.ఏ.)

**తా ॥** జననరహితా! ఈశ్వరా! నీ పుట్టుకవలననే గొర్రెలమందలతో వ్యాపించిన ఈ గోకులం లోకంలో ప్రసిద్ధిని పొందింది. అక్కడ లక్ష్మి ప్రకాశిస్తోంది కూడా. ఇప్పుడు నీవే ఉదాసీనత వహిస్తే నీ అలసతను బట్టి ఆ లక్ష్మికూడ గోకులాన్ని వీడి వెళ్ళవచ్చు.

**వి :** 1. శ్లోకమంతా ప్రతిపాదమూ పాదాంతయమకంతో కూడివుంది.

2. ఎవరి పుట్టుక ఆ వంశానికి విలువ తెస్తుందో ఆ పుట్టుకయే పుట్టుక అని భర్తృహరి వచనం-

శ్లో॥ పరివర్తిని సంసారే మృతః కోవా న జాయతే ।
స జాతో యేన జాతేన యాతి వంశస్సమున్నతిమ్ ॥- సుభాషిత త్రిశతి-నీతి-32

ఇక్కడ కృష్ణజననం వంశోద్ధారకమే కాక వ్రజోద్ధారకం, జగదుద్ధారకం కూడా. ఆ విషయాన్ని గుర్తింపగలిగిన గోపికలను అభినందించవలసిందే.

ఇక్కడ మరొక విషయాన్ని కూడా గుర్తించాలి. పుట్టుకవలననే గోకులం ప్రసిద్ధమన్న దాంట్లో, అది కేవలం మానసికమో విశ్వాసాత్మకమో కాదనీ, గోకులాభివృద్ధికోసం కృష్ణుడు చేసిన కృషి కూడా అనితరసాధ్యమనీ గుర్తించాలి.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉదభూత్ :** | **ఉదభూత్** | ఉదభూతామ్ | ఉదభూవన్ |
| | ఉదభూః | ఉదభూతమ్ | ఉదభూత |
| | ఉదభూవమ్ | ఉదభూవ | ఉదభూమ |
| **లసతే :** | **లసతే** | లసేతే | లసన్తే |
| | లససే | లసేథే | లసధ్వే |
| | లసే | లసావహే | లసామహే |
| **ఉత్సృజేత్ :** | **ఉత్సృజేత్** | ఉత్సృజేతామ్ | ఉత్సృజేయుః |
| | ఉత్సృజేః | ఉత్సృజేతమ్ | ఉత్సృజేత |
| | ఉత్సృజేయమ్ | ఉత్సృజేవ | ఉత్సృజేమ. |

*

**శ్లో॥ విజనే వనే స్వజనముత్సృజత-స్తవ నాగమం యది మనో మనుతే ।**
**వినిహంసి హంసనుతపుణ్యయశ-స్తవనాగమం పరమ! తర్హి తవ ॥ 8-25**

**అ :** నీవు రాకపోతే మాట ఇచ్చి తప్పిన వాడవు కాగలవని గోపికలు కృష్ణుని హెచ్చరించటం. -ప్రమితాక్షర.

**అ :** పరమ! విజనే వనే స్వజనమ్ ఉత్సృజతః తవ మనః ఆగమం యది న మనుతే తర్హి తవ హంస-నుత-పుణ్య-యశః-స్తవన+ఆగమం విని హంసి.

**ప్ర :** పరమ = పరాత్పరా! కృష్ణా!, విజనే = ఎవ్వరూ లేని, వనే = అడవిలో, స్వజనమ్ = నీ వారిని (భక్తులను) (స్వస్య జనమ్), ఉత్సృజతః = వీడుతున్న, తవ = నీయొక్క, మనః = హృదయం, ఆగమమ్ = రాకను, యది న మనుతే = అంగీకరించక పోతే (రావటానికి మనసొప్పక పోతే) – (మను అవబోధనే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), తర్హి = అప్పుడు/ఆ స్థితిలో, తవ = నీయొక్క, హంస... ఆగమమ్ : హంస = పరివ్రాజకులచే, నుత = ప్రశంసింపబడిన, పుణ్య = పవిత్రమైన, యశః = కీర్తిని, స్తవన = స్తుతించే, ఆగమమ్ = శాస్త్రాన్ని (గీతాశాస్త్రాన్ని) (హంసైః నుతం పుణ్యం యశః స్తౌతి ఇతి హంసనుత పుణ్యయశ- స్తవనః స చ అసౌ ఆగమః), వినిహంసి = నశింపజేస్తావు. (వి-ని+హన హింసాగత్యోః - పరస్మైపది-లట్-మ.ఏ.)

**తా ॥** పరమపురుషా! కృష్ణా! ఎవరూ లేని ఈ అడవిలో నీవారిని వదలి పెడుతున్న (సహకరింప రాకుండా) నీ మనస్సునకు రాకపోవటమే ఇష్టమైతే అలాగే కానీ. కానీ పరమహంసలు ప్రశంసిస్తూ నీ పుణ్యకీర్తిని గానం చేస్తున్న ఆగమాన్ని నీవు నాశనం చేసిన వాడవవుతావు. (ఆ శాస్త్రవచనాన్ని తప్పిన వాడవవుతావు.)

**వి :** 1. యుగ్మ పాదాదియమకం ఈ శ్లోకంలో పాటింప బడింది.

2. కృష్ణుని ఆగమం గీతయే. అది గీతాశాస్త్రంగా భావింప బడుతోంది. మరి గోపికలు ఇలా మాటాడుతున్న సమయానికి గీతాశాస్త్రం ఆవిర్భవించలేదు గదా! నిజమే. కథా కాలానికీ, రచనాకాలానికీ మధ్య నున్న కాలగతవ్యవధి ఇటువంటి సందేహాలకు అవకాశమిస్తుంది. పాత్రకు తెలియని కథ కవికి తెలిసి వుండటం దానికి కారణం. సాధారణంగా దానిని లోపంగా అంగీకరించవలసినదే. కానీ పురాణకథలలో ఇది ఎక్కువగా కనిపిస్తుంది. భక్తి భావం దానిని కప్పిపుచ్చుతుంది.

భవిష్యత్కథ కూడా భగవదనుగ్రహం కారణంగా వారి నోటివెంట వస్తున్నదని అనుకోవాలి. లేదా అర్జునునకు

యుద్ధసమయంలో కృష్ణుడు చెప్పిన గీత తన భావజాల సమీకరణకు సంబంధించినది. అటువంటి మాటలు అనటం, ఆ భావాలు ప్రకటించటం గ్రంథస్థం కాకపోయినా కృష్ణుని బాల్యంనుండీ జరిగి వుండవచ్చు. ఆ మాటలను పట్టుకొనే, తలచుకొంటూ గోపికలు ఈ ఆరోపణ చేస్తూ వుండవచ్చు. కృష్ణుడు బాల్యంనుండీ అలా ప్రకటిస్తున్న భావాలను పెద్దలెందరో ఆయా సందర్భాలలో ప్రశంసించి, అభినందించి వుండవచ్చు కూడా.

ఇంతకూ ఆ గీతాశాస్త్రంలో కృష్ణుడు చెప్పిందేమిటి?

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ – భగవద్గీత 9/22

'అన్యభావన లేకుండా నిత్యమూ నన్నే తలచుకొంటూ నాతో అనుబంధం కలిగియున్న వారి యోగక్షేమాలను నేనే వహిస్తాను.'

| | | | |
|---|---|---|---|
| 3. **మనుతే :** | **మనుతే** | మన్వాతే | మన్వతే |
| | మనుషే | మన్వాథే | మన్వధ్వే |
| | మన్వే | మన్వహే | మన్మహే |
| **వినిహంసి :** | వినిహన్తి | వినిహతః | వినిఘ్నన్తి |
| | **వినిహంసి** | వినిహథః | వినిహథ |
| | వినిహన్మి | వినిహన్వః | వినిహన్మః. |

*

**శ్లో॥ అయోగభిన్నా నయతీశమానీ – తవాఙ్ఘ్రిదాసీర్బత దణ్డపాణిః ।**
**అయోగభిన్నా న యతీశమానీ – హ్రియేత కస్తేన భవద్వియోగే ॥ 8–26**

**అ :** కృష్ణుడు రాకపోతే యముని బారినుండి తప్పించుకొనలేమని గోపికల ఆందోళన. –ఉపేంద్రవజ్ర.

**ప :** అయోగభిన్నాః నయతి ఈశమానీ – తవ అంఘ్రిదాసీః బత దండపాణిః ।
అయః+అగ+భిత్ నాః న యతి+ఈశమానీ – హ్రియేత కః తేన భవద్వియోగే ॥

**అ :** ఈశమానీ దండపాణిః అయోగభిన్నాః తవ అంఘ్రిదాసీః నయతి బత. భవద్+వియోగే తేన అయః+అగ–భిత్ నాః యతి+ఈశమానీ కః న హ్రియేత.

**ప్ర :** ఈశ–మానీ = ఈశ్వరుడుగా తనను తాను భావించుకొనే (ఈశమ్ ఆత్మానం మనుతే ఇతి), దండపాణిః = యముడు (దండః పాణౌ యస్య సః), (కాలో దండధరః – అమరకోశః – స్వర్గ – 59), అయోగ–భిన్నాః : అయోగ = విరహంచే, భిన్నాః = చెదరియున్న (అయోగేన భిన్నాః, తాః), తవ = నీయొక్క, అంఘ్రి–దాసీః = పాదదాసులమైన మమ్ము (అంఘ్రేః దాస్యః, తాః), నయతి = కొనిపోతున్నాడు. (నీ ప్రాపణే – పరస్మైపది – లట్ – ప్ర.ఏ.), బత = అయ్యో!, భవద్–వియోగే : భవద్ = నీతో, వియోగే = వియోగమందు (భవతా వియోగః, తస్మిన్), అయః–అగ–భిత్ : అయః = ఇనుమును/లోహాన్ని, అగ = కొండను, భిత్ = బ్రద్దలు చేయగల (అయః అగం చ భినత్తి ఇతి), నాః = మనిషి అయినా, యతి–ఈశ–మానీ = యతిశ్రేష్ఠుడుగా భావించుకొనే వాడైనా (యతీనాం ఈశ్వరః, తమ్ ఆత్మానాం మనుతే ఇతి), కః = ఎవడు, న హ్రియేత = కొనిపోబడడు? (హృ హరణే ఆత్మనేపది – విధిలిఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! తనను తాను ఈశ్వరుడుగా భావించుకొంటూ యముడు నీ వియోగంతో చెదరి వున్న మమ్ము – నీ దాసులను – కొనిపోతున్నాడు. నీ వియోగ మేర్పడినపుడు లోహాన్నీ, కొండనూ కూడా బ్రద్దలు చేయగల మనిషి అయినా యమునిచేత అపహరింప బడకుండా నిలువగలడు?

**వి :** 1. అయుగ్మపాదయమక మీ శ్లోకంలో కనిపిస్తుంది.

2. కృష్ణవియోగం స్థిరమైతే మరణం తప్ప మరో మార్గం లేదని గోపికల విలాపం. రాగభావాలు కలిగించే మన్మథుడే ప్రాణాంతకస్థితిని కల్పిస్తే ఇక యముడు ఊరుకుంటాడా? 'సా విరహే తవ దీనా' అంటూ జయదేవుడు రాధావిరహాన్ని ఇలాగే వర్ణిస్తాడు చూడండి–

శ్లో॥ ఆవాసో విపినాయతే ప్రియసఖీమాలాపి జాలాయతే
తాపోఽపి శ్వసితేన దావదహనజ్వాలా కలాపాయతే ।
సాఽపి త్వద్విరహేణ హన్త హరిణీరూపాయతే హా కథం
కందర్పోఽపి యమాయతే విరచయన్ శార్దూలవిక్రీడితమ్ ॥ –గీతగోవిందం 4/28

| | | | |
|---|---|---|---|
| 3. **నయతి :** | **నయతి** | నయతః | నయన్తి |
| | నయసి | నయథః | నయథ |
| | నయామి | నయావః | నయామః |
| **హ్రియేత :** | **హ్రియేత** | హ్రియేయాతామ్ | హ్రియేరన్ |
| | హ్రియేథాః | హ్రియేయాథామ్ | హ్రియేధ్వమ్ |
| | హ్రియేయ | హ్రియేవహి | హ్రియేమహి. |

*

**శ్లో॥ వినాశనానామయదేహపుష్టీ-రనాదితస్త్వం పరముజ్ఝసీశ! ।**
**వినాశనానామయదేహపుష్టీ-ర్లభేమహి త్వత్తులనాం వయం చ ॥ 8-27**

**అ :** గోపికలు కృష్ణునితో పోలికను సాధించటం ఏదో ఒకరీతిగా. –ఉపేంద్రవజ్ర.

**ప :** వినాశ–నానా–ఆమయ–దేహ–పుష్టీః – అనాదితః త్వం పరమ్ ఉజ్ఝసి ఈశ! ।
వినా అశన+అనామయ+దేహపుష్టీః – లభేమహి త్వత్–తులనాం వయం చ ॥

**అ :** ఈశ! అనాదితః త్వం వినాశనానామయదేహపుష్టీః (నః) పరమ్ ఉజ్ఝసి. వయం చ అశన–అనామయదేహపుష్టీః వినా త్వత్తులనాం లభేమహి.

**ప్ర :** ఈశ! = ప్రభూ!, అనాదితః = తొలినాటినుండి, త్వమ్ = నీవు, వినాశ–నానా+ఆమయ–దేహ–పుష్టీః : వినాశ = మరణం, నానా+ఆమయ = వివిధ వ్యాధులు, దేహ–పుష్టీః = శరీరపుష్టి గల (వినాశః చ నానా ఆమయాః చ దేహపుష్టిః చ యాసాం తాః), (నః = మమ్ము), పరమ్ = కేవలమూ, ఉజ్ఝసి = విడిచిపెడుతున్నావు. (ఉజ్ఝ ఉత్సర్గే – పరస్మైపది – లట్ – మ.ఏ.), వయం చ = మేము కూడా, అశన–అనామయ–దేహపుష్టీః : అశన = ఆహారాన్ని, అనామయ = స్వస్థతను, దేహపుష్టీః = శరీరపుష్టిని, వినా = లేక/వీడి, త్వత్–తులనామ్ = నీతో పోలికను, లభేమహి = పొందగలము (లభ్ – ప్రాప్తౌ ఆత్మనేపది – విధిలిఙ్ – ఉ.బ.)

**తా ॥** కృష్ణా! అనాదిగా నీవు మరణమూ, వివిధ వ్యాధులూ, శరీరపోషణం వీటి మీదనే దృష్టిగల మమ్ము పూర్తిగా వదలివేస్తున్నావు. ఇప్పుడు మేము కూడా ఆహారం, స్వస్థత, శరీరపుష్టి – వీటిని విడిచిపెట్టి నీతో సమానత్వాన్ని పొందగలుగుతున్నాము.

**వి :** 1. అయుగ్మపాదయమకమీ శ్లోకంలో.

2. కృష్ణునికై నిరాహారంగా గోపికలుండటం కృష్ణునకే హితకరం గాదు. నచికేతస్సు తనకై నిరీక్షిస్తూ మూడు రాత్రులు నిరాహారంగా ఉన్నందుకు యముడు ప్రాయశ్చిత్తంగా నచికేతస్సుకు మూడు వరాల నిస్తాడు కఠోపనిషత్కథలో.

శ్లో॥ తి(స్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మేఽ - నశ్నన్ బ్రహ్మన్నతిథిర్నమస్య ః ।
నమస్తేఽస్తు బ్రహ్మన్ స్వస్తి మేఽస్తు - తస్మాత్ ప్రతిత్రీన్ వరాన్వృణీష్వ ॥ - కఠోపనిషత్తు 1/9

3. అనపేక్షతో వస్తువిషయపరిత్యాగమూ, అపేక్షాభంగంవలన వస్తువిషయ పరిత్యాగమూ ఒకటి కావు. కృష్ణునిది మొదటి రకం. గోపికలది రెండవ రకం. అంటే గోపికలలో రావలసినంత మనఃపరిణతి ఇంకా రాలేదు. అందుకే ఈ విలాపాలూ, ఈ పరిత్యాగాలూ.

| | | | | |
|---|---|---|---|---|
| 4. **ఉజ్ఝసి :** | ఉజ్ఝతి | ఉజ్ఝతః | ఉజ్ఝన్తి | |
| | **ఉజ్ఝసి** | ఉజ్ఝథః | ఉజ్ఝథ | |
| | ఉజ్ఝామి | ఉజ్ఝావః | ఉజ్ఝామః | |
| **లభేమహి :** | లభేత | లభేయాతామ్ | లభేరన్ | |
| | లభేథాః | లభేయాథామ్ | లభేధ్వమ్ | |
| | లభేయ | లభేవహి | **లభేమహి.** | * |

**శ్లో॥ విధిశర్వపూర్వసుమనస్సుమనః-సరసీనివాస *జగతాజ! గతా* ।**
**త్వదభిన్నతా తుహినతోఽహి నతో - దహనోఽపరోఽసదృశ తాదృశతా ॥ 8-28**

**అ :** కృష్ణపరంగా గోపికలచేత మాటాడిస్తూ కవి **అద్వైతవాదాన్ని నిరసించటం.** -ప్రమితాక్షర.

**ప :** విధి-శర్వ-పూర్వ-సుమనస్సుమన-స్సరసీనివాస! జగతా అజ గతా ।
త్వద్+అభిన్నతా- తుహినతః హి నతః - దహనః అపరః అసదృశ! తాదృశతా ॥

**అ :** విధిశర్వపూర్వసుమనస్సుమస్సరసీనివాస! అజ! జగతా త్వద్+అభిన్నతా గతా. తుహినతః నతః దహనః అపరః హి. అసదృశ! తాదృశతా.

**ప్ర :** విధి... నివాస : విధి = బ్రహ్మ, శర్వ = శివుడు, పూర్వ = మొదలుగాగల, సుమనః = దేవతలయొక్క (సుపర్వాణః సుమనసః త్రిదివేశా దివౌకసః - అమరకోశః - స్వర్గ - 8), సుమనః = మంచిమనస్సుఅనే, సరసీ = సరోవరంలో, నివాస! = నివసించే వాడా! (విధిశ్చ శర్వశ్చ తౌ పూర్వౌ యేషాం తే విధిశర్వపూర్వాః, తే చ తే సుమనసశ్చ, తేషాం శోభనం మనః ఏవ సరసీ తత్ర నివసతి ఇతి - తస్మాత్ సంబుద్ధిః), అజ! = పుట్టుక లేనివాడా! కృష్ణా!, జగతా = ప్రపంచంచేత, త్వద్-అభిన్నతా : త్వద్ = నీనుండి, అభిన్నతా = వేరుకాకపోవటం, గతా = తొలగిపోయింది. తుహినతః = మంచునుండి, నతః = నమస్కరింపబడే, దహనః = అగ్ని, అపరః హి = వేరే కదా!, అసదృశ = సాటిలేని వాడా!, తాదృశతా = (మీకు కూడా) అలాగే భిన్నత్వమే.

**తా ॥** కృష్ణా! నీవు పుట్టుకలేని వాడవు - బ్రహ్మ, శివుడు మొదలుగా గల దేవతల మనస్సు లనే సరస్సులో నివసించే వాడవు. జగత్తుకన్న నీవు వేరు కాదన్న భావం తొలగిపోయింది. మంచుకన్న నిప్పు వేరే. నిప్పు నమస్కరింపబడేది. (మంచు నమస్కరింప బడదు) అసమానా! హిమాగ్నులకువలె నీకూ, జగత్తుకూ అభిన్నతయే. (ఇక్కడ జగత్తు జీవునకు ప్రతినిధి)

**వి : 1. శ్లో॥ బ్రహ్మ సత్యం జగన్మిథ్యా - జీవో బ్రహ్మైవ నాపరః ।**
**అనేన వేద్యం సచ్ఛాస్త్ర-మితి వేదాంతడిండిమః ॥ - (శంకరాచార్య) బ్రహ్మజ్ఞానావలీమాల-20**

"బ్రహ్మసత్యం జగన్మిథ్యేత్యపరోక్షజ్ఞానాగ్నినా బ్రహ్మాద్యైశ్వర్యాశాసిద్ధసంకల్పబీజసంతాపం తపః"
- నిరాలంబోపనిషత్తు

జీవబ్రహ్మలకు అభేదాన్ని సిద్ధాంతీకరించిన అద్వైతమత ప్రతిపాదనమిది. శంకరా-చార్యులు

సాంఖ్యమతానుయాయి. యోగంలో జీవాత్మ, పరమాత్మలను విడిగా లెక్కించి 26 తత్త్వాలను అంగీకరిస్తారు. సాంఖ్యంలో జీవాత్మ, పరమాత్మ వేరు వేరు కాదు. అందువల్ల 25 తత్త్వాలే సృష్టికి సంబంధించి.

జగత్తు మిథ్య అన్నది అద్వైతంలో ప్రధానాంశం. స్వాప్నికసాక్షాత్కారంలో అవాస్తవమైనది జగత్తు. అంటే కలలో కనిపించే దృశ్యం అసలు లేదు. అయినా ఉన్నట్టనిపిస్తుంది. దానికన్న మేల్కొన్నప్పుడు కనిపించే దృశ్యం వాస్తవం. ఇది వుంది. అయితే పారమార్థికసత్యదృష్టిలో ఈ దృశ్యవస్తువుకూడా లేనిదే. కాబట్టి ఈ స్థితిగల జగత్తు మిథ్య అని అద్వైతం. ఈ శ్లోకం దాన్ని నిరసిస్తూ హేతుబద్ధంగా జగత్తుకూ జీవునకూ భిన్నత్వాన్ని సాధిస్తోంది.

బ్రహ్మాది దేవతల మనస్సరసీనివాసి అయిన పరముడూ, బ్రహ్మాదులూ వేరు వేరే కదా! మనస్సరస్సు ఆధారం. పరమాత్మ ఆధేయం. ఒకే వస్తువు తనకు తానే ఆధారం, ఆధేయం కాలేదు గదా! కాబట్టి అవి రెండూ విభిన్నాలే. (**'యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా. అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః'** అన్న నారాయణసూక్తంలో కూడా జగుత్తు వ్యాప్యమానము. నారాయణుడు వ్యాపకుడు. రెండిటి లక్షణాలు వేరు వేరు. (ఘటంలో ఆకాశముంది అంటే ఘటం వేరు ఆకాశం వేరు అనే అర్థం) రెండు విరుద్ధధర్మాలు ఒకే దానికి వర్తించవు.

దృష్టాంతంగా తుహినదహనులను చూపించాడు కవి. అందునా దహనుడు నమ్య-మానుడు. (నమస్కరించబడే వాడు.) తుహినం నమస్కరింప బడేది కాదు. నమ్యత్వం, అనమ్యత్వం రెండు ధర్మాలు వేరై రెండు పదార్థాలనూ వేరు చేసినట్లు భిన్నధర్మాలు గల జీవాత్మ పరమాత్మలు ఒకటి కాదు. అవి వేరు వేరు. కాబట్టి అద్వైతవాదం కుదరదు.

2. పాదాంతమయకమీ శ్లోకంలో నాల్గుపాదాలలో భిన్నంగా. *

**శ్లో॥ కమలాసనాచ్చ భవతోఽభవతో - మహతీన్దిరా కిల తయా లతయా ।**
**తరువద్భవాన్ పరివృతోఽరివృతో-దయదావ! సేదమను తే మనుతే ॥ 8-29**

**అ :** లక్ష్మికి సర్వోత్తమత్వాన్ని వర్ణించటం. -ప్రమితాక్షర.

**ప :** కమలాసనాత్ చ భవతః అభవతః - మహతీ ఇందిరా కిల తయా లతయా ।
తరువద్ భవాన్ పరివృతః (కిల) అరివృత+-ఉదయదావ సా ఇదమ్ అను తే మనుతే॥

**అ :** ఇందిరా కమలాసనాత్, భవతః అభవతః మహతీ కిల. అరివృత+ఉదయ దవదావ! తయా లతయా తరువద్ భవాన్ పరివృతః. తే సా ఇదమ్ అను మనుతే.

**ప్ర :** ఇందిరా = లక్ష్మి (ఇందతి ఇతి ఇందిరా), కమల+ఆసనాత్ = పద్మాసనుడైన బ్రహ్మ కన్న (కమలమ్ ఆసనం యస్య తస్మాత్), భవతః = శివుని కన్న, అభవతః చ = ముక్తుల కన్న (నాస్తి భవః యస్య, తస్మాత్), మహతీ కిల = గొప్పది గదా!, అరి-వృత+ఉదయ-దావ : అరి = శత్రువులచే, వృత = పొందబడిన/వరింపబడిన, ఉదయ = అభ్యుదయానికి, దావ = దావాగ్ని వంటివాడా! (అరిభిః వృతః ఉదయః, తస్య దావః, తస్మాత్ సంబుద్ధిః), తయా = ఆ లక్ష్మిచే, లతయా = తీవెచే, తరువద్ = చెట్టువలె, పరివృతః = చుట్టబడితివి/ వరింపబడితివి. సా = ఆ లక్ష్మి, ఇదమ్ = ఈ జగత్తును, అను = తన కన్న తక్కువగా, మనుతే = భావిస్తుంది. (మను అవబోధనే ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.)

**తా ॥** ఇందిర బ్రహ్మకన్న, శివునికన్న, సర్వస్వాన్నీ త్యజించిన ముక్తునికన్న కూడా గొప్పది. శత్రూదయానికి దావాగ్ని వంటివాడా! అటువంటి లక్ష్మి తీవె చెట్టును చుట్టుకొన్నట్టు నిన్ను వరించింది. ఈ సమస్తజగత్తునూ తనకన్న తక్కువగా ఆ ఇందిర భావిస్తుంది.

**వి :** 1. శ్లోకంలో 'ఇందిరా' పదం (విశేష్యం) సాభిప్రాయం. ఇందిరా పదం 'ఇది ఐశ్వర్యే' ధాతువు నుండి పుట్టింది. పరమైశ్వర్యం గలది అని ఇందిరా పదానికి అర్థం. అటువంటి స్త్రీ అందరికన్న గొప్పది కావటం సర్వజగత్తునూ తనకన్న తక్కువని భావించటం సహజం. అందుకే అది సాభిప్రాయవిశేష్యం. సాభిప్రాయ-విశేష్యప్రయోగం పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయవిశేష్యే తు భవేత్పరికరాంకురః**' - (కు. 63)

2. లక్ష్మి నారాయణుని లతలా చుట్టుకొన్నట్లు ఈ భావం. శ్రీగుణరత్నకోశంలో పరాశరభట్టరుచే ప్రతిపాదింపబడింది-

శ్లో॥ అనుకల **తను కాండాలింగనా**రంభశుంభత్
ప్రతిదిశభుజశాఖశ్రీసఖానోకహర్ధిః ।
స్తననయనగుళుచ్ఛ స్ఫారపుష్పద్విరేఫా
రచయతు మమ **లక్ష్మీః కల్పవల్లీ కటాక్షాన్** ॥ - శ్రీ గుణరత్నకోశం - శ్లో 3

ఇక్కడ లక్ష్మికి, కల్పలతకూ సావయవరూపకాలంకారంతో పోలిక వర్ణింపబడింది.

3. లక్ష్మికి సర్వోత్తమత్వాన్ని ప్రతిపాదించే అంభృణీ సూక్తం ఈ శ్లోకంలోని ప్రతిపాదనకు మూలం. ఋగ్వేదం (10/125) లోని ఆ సూక్తం జిజ్ఞాసువులకై ఇక్కడ పొందుపరచబడుతోంది-

**అహం రుద్రేభిర్వసుభిశ్చరామ్యహమాదిత్యైరుత విశ్వదేవ్యైః ।**
**అహం మిత్రావరణోభా బిభర్మ్యహమింద్రాగ్నీ అహమశ్వినోభా ॥**

**అహం సోమమాహనసం బిభర్మ్యహం త్వష్టారముత పూషణం భగమ్ ।**
**అహం దధామి ద్రవిణం హవిష్మతే సుప్రావ్యే యజమానాయ సున్వతే ॥**

**అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్ ।**
**తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరిస్థాత్రాం భూర్యావేశయన్తీమ్ ॥**

**మయా సో అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈ శృణోత్యుక్తమ్ ।**
**అమన్తవో మాం త ఉప క్షియన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి ॥**

**అహమేవ స్వయమిదం వదామి జుష్టం దేవేభిరుత మానుషేభిః ।**
**యం కామయే తంతముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధామ్ ॥**

**అహం రుద్రాయ ధనురా తనోమి బ్రహ్మద్విషే శరవే హన్తవా ఉ ।**
**అహం జనాయ సమదం కృణోమ్యహం ద్యావాపృథివీ ఆ వివేశ ॥**

**అహం సువే పితరమస్య మూర్ధన్మమ యోని రప్స్వ (అ)3న్తః సముద్రే ।**
**తతో వి తిష్ఠే భువనాను విశ్వోతామూం ద్యాం వర్ష్మణోప స్పృశామి ॥**

**అహమేవ వాతఇవ ప్ర వాభ్యారభమాణా భువనాని విశ్వా ।**
**పరో దివా పర ఏనా పృథివ్యైతావతీ మహినా సం బభూవ ॥**

**ఓం శాన్తిః శాన్తిః శాన్తిః - ఇతి అంభృణీ సూక్తమ్.**

| | | | |
|---|---|---|---|
| 4. **మనుతే :** | **మనుతే** | మన్వాతే | మన్వతే |
| | మనుషే | మన్వాథే | మనుధ్వే |
| | మన్వే | మనువహే | మనుమహే. |

*

**శ్లో॥ నిగమోఽస్తి తే మతిమతోఽతిమతో - నిఖిలేశ్వరత్వసమయేఽసమయే ।**
**తమపి త్యజన్త్యసుభృతః సుభృతః - స్వనయః కుతోఽక్షరహితైరహితైః ॥ 8-30**

**అ :** ద్వైతానికైనా అద్వైతానికైనా వేదమే ప్రమాణమనీ, ద్వైతాన్ని నిరాకరిస్తే అద్వైతమూ అప్రమాణమనీ ప్రతిపాదన.
-ప్రమితాక్షర.

**ప :** నిగమః అస్తి తే మతిమతః అతిమతః - నిఖిల+ఈశ్వరత్వసమయే అసమ! యే ।
తమ్ అపి త్యజన్తి అసుభృతః సుభృతః - స్వనయః కుతః అక్షరహితైః అహితైః ॥

**అ :** అసమ! తే నిఖిల+ఈశ్వరత్వసమయే మతిమతః అతిమతః నిగమః అస్తి. యే అసుభృతః తమ్ అపి త్యజన్తి అక్షరహితైః (తైః) అహితైః సుభృతః స్వనయః కుతః?

**ప్ర :** అసమ = సాటిలేని వాడా!, తే = నీయొక్క, నిఖిల+ఈశ్వరత్వ-సమయే : నిఖిల = సమస్తానికీ, ఈశ్వరత్వ = ప్రభుత్వం యొక్క, సమయే = జ్ఞానమందు (నిఖిలస్య ఈశ్వరత్వం, తస్మిన్ సమయః, తస్మిన్), మతిమతః = బుద్ధిమంతునకు, అతిమతః = బాగా సమ్మతమైన, నిగమః = వేదం (ప్రమాణంగా), అస్తి = ఉంది, యే అసుభృతః = ఏమనుషులయితే (అసూన్ బిభ్రతి ఇతి), తమ్ అపి = ఆ వేదాన్ని కూడా, త్యజన్తి = విడిచి వేస్తారో, అక్ష-రహితైః = కళ్ళులేని (అక్షిభిః రహితాః), అహితైః = విరోధులైన, (తైః = వారిచే), స్వనయః = తమ సిద్ధాంతం, కుతః = ఏ ప్రమాణంద్వారా, సుభృతః = గట్టిగా ధరింపబడుతోంది?

**తా ॥** అసమానా! కృష్ణా! నీవు నిఖిలేశ్వరుడవు అనేందుకు వేద ప్రమాణముంది. వేద ప్రామాణ్యాన్ని బుద్ధిమంతులందరు పూర్తిగా విశ్వసిస్తారు. అయినా ప్రమాణాన్ని కూడా కాదంటున్న పురుషులు అంధులు. అస్మద్విరోధులు. వేద ప్రమాణాలతోనే తమ సిద్ధాంతాన్ని స్థాపించేవారు వేదాలను కాదని మరే ఇతర ప్రమాణం ద్వారా దానిని సాధిస్తారు? (వేదం ప్రమాణమో అప్రమాణమో ఇద్దరికీ సమానమే అని భావం)

**వి :** 1. కృష్ణుడు సర్వేశ్వరుడు అనేందుకు వేద ప్రమాణముంది-

ఋ. న తే విష్ణో జాయమానో న జాతో - దేవ మహిమ్నః పరమన్తరూప ।
ఉదస్తభ్నా నాకమృష్వం బృహన్తం - దాదర్థం ప్రాచీం కకుభం పృథివ్యాః ॥ - ఋగ్వేదం 7/99/2

తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః - విష్ణుసూక్తమ్.

పంచమవేదంగా పరిగణింపబడే భగవద్గీతలో కూడా కృష్ణుడే సర్వేశ్వరుడని అర్జునుని ద్వారా ప్రతిపాదన-

శ్లో॥ తత్రైకస్థం జగత్ కృత్స్నం ప్రవిభక్తమనేకధా ।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా ॥

శ్లో॥ త్వమక్షరం పరమం వేదితవ్యం - త్వమస్య విశ్వస్య పరం నిధానమ్ ।
త్వమవ్యయః శాశ్వతధర్మగోప్తా - సనాతనస్త్వం పురుషో మతో మే ॥ - భగవద్గీత 11/11,18

ఒకవేళ ఇటువంటి శ్రుతి ప్రమాణాలను ప్రమాణాలు కాదంటే శ్రుతుల ఆధారంగానే అద్వైతాన్ని ప్రతిపాదించే వారికి కూడా శ్రుతి అప్రమాణమే అవుతుంది. అప్పుడు ఏ ప్రమాణంద్వారా అద్వైతాన్ని ప్రతిపాదిస్తారో చెప్పండని నిలదీస్తున్నారు వాదిరాజతీర్థరు.

2. ప్రతిపాదంలోనూ విడివిడిగా పాదాంతయమకం.

3. **అస్తి :** 18వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **త్యజన్తి :** | త్యజతి | త్యజతః | త్యజన్తి |
| | **త్యజసి** | త్యజథః | త్యజథ |
| | త్యజామి | త్యజావః | త్యజామః. |

*

**శ్లో॥ అనృతం జగత్కలయతేఽలయ! తే - యది కోఽపి మానసహితం స హితమ్ ।**
**రుచిరం కథం నిజనయే జనయే - న్న హి రజ్జ్వహేః క్షతిరభూతిరభూత్ ॥ 8-31**

**అ :** జగత్తు మిథ్య అన్న దానిని నిరసించటం. -ప్రమితాక్షర.

**ప :** అనృతం జగత్ కలయతే అలయ! తే - యది కః అపి మానసహితం సః హితమ్ ।
రుచిరం కథం నిజనయే జనయేత్ - న హి రజ్జ్వహేః క్షతిః అభూతిః అభూత్ ॥

**అ :** అలయ! కోఽపి మానసహితం తే జగత్ అనృతం కలయతే సః నిజనయే హితం రుచిరం కథం జనయేత్. రజ్జు+అహేః అభూతిః క్షతిః న అభూత్ హి.

**ప్ర :** అలయ! = నాశనం లేనివాడా! (నాస్తి లయః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), కోఽపి = ఎవరైనా, మాన-సహితమ్ : మాన = ప్రమాణంతో, సహితమ్ = కూడియున్న (మానేన సహితమ్), జగత్ = విశ్వాన్ని, అనృతమ్ = మిథ్యగా, కలయతే = భావిస్తాడో (కల-గతౌ సంఖ్యానే చ - ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), సః = ఆ వ్యక్తి, నిజ-నయే : నిజ = తనయొక్క, నయే = సిద్ధాంతంలో (నిజస్య నయః తస్మిన్), హితమ్= తమ కిష్టమైన దానిని, రుచిరమ్ = మనోహరంగా, కథమ్ = ఏ రీతిగా, జనయేత్ = కల్పింప గలడు? (ఆవిర్భవింప జేయగలడు?) (జనీ ప్రాదుర్భావే - పరస్మైపది - విధిలిఙ్ - ప్ర.ఏ.), రజ్జు+అహేః = త్రాటి పాము వలన (త్రాటిలో ఆరోపింపబడిన పామువలన), (రజ్జుః ఏవ అహిః, తస్మాత్), అభూతిః = ఐశ్వర్యప్రదం కాని/ అమంగళ కరమైన, క్షతిః = మృతి, న అభూత్ హి = కలుగలేదు గదా!

**తా ॥** నాశరహితా! కృష్ణా! ఎవరయినా వాదిస్తూ వాస్తవికమై నీ అధీనంలో నున్న ఈ జగత్తును అనృతంగా (అవాస్తవికంగా - మిథ్యగా) భావించి మాటాడవచ్చు. ఆ వాది తన సిద్ధాంతంలోని జీవబ్రహ్మైక్యాన్ని అందరూ అంగీకరించేటట్లు ఎలా నిరూపించగలడు? ఎందుకంటే త్రాటిలో పామును ఆరోపిస్తే అది భ్రాంతి కావచ్చు కానీ కాటువేయలేదు గదా!

**వి :** 1. పాదాంతయమకం నాలుగు పాదాలలోనూ విడివిడిగా ఈ శ్లోకంలో.

2. చాలా సందర్భాలలో, శ్లోకాలలో అజ అని కృష్ణుని సంబోధించిన కవి (గోపికల ద్వారా) ఈ శ్లోకంలో 'అలయ' అని సంబోధింపజేశాడు. క్షరమైన జగత్తుతో తాను సర్వాత్మనా భిన్నుడే అక్షరుడు కాబట్టి - అన్న భావాన్ని సూచించటానికే కాబోలు.

**శ్లో॥ ద్వావిమౌ పురుషౌ లోకే - క్షరశ్చాక్షర ఏవ చ ।**
**క్షరస్సర్వాణి భూతాని - కూటస్థోఽక్షర ఉచ్యతే ॥ ...**

**శ్లో॥ యస్మాక్షరమతీతోఽహమక్షరాదపి చోత్తమః ।**
**అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః ॥** **- భగవద్గీత 15/16,18**

3. జగన్మిథ్యాత్వవాదాన్ని నిరసించే శ్లోకమిది. జగత్తును సత్యంగా భావించటం రజ్జుసర్ప- భ్రాంతి వంటిదని అద్వైతభావం. నిజమే. త్రాటిని చూసి పాము అనుకోవటం ఎటువంటిదో జగత్తులోని దృశ్యమానవస్తుసముదాయాన్ని చూసి వాస్తవమనుకోవట మటువంటిదే. ఇది అద్వైతుల వాదం. నిజమే. అంగీకరిద్దాం. కానీ మిథ్యాజ్ఞానమెప్పుడూ అర్థసాధకం కాదు. అర్థసాధకమయితే అది మిథ్య కాదు.

అన్నం, అన్నచిత్రం రెండూ ప్రక్క ప్రక్కనే ఉన్నాయి. పారమార్థికంగా అద్వైతం ప్రకారం రెండూ భ్రాంతులే. కానీ అన్నచిత్రంవలన తీరని ఆకలి అన్నంవల్ల తీరుతోంది. అలా కార్యసాధకమైనప్పుడు అది మిథ్య ఎలా అవుతుంది.

భ్రాంతి కూడా రెండు రకాలుగా వుంటుంది. సంవాదిభ్రాంతి, విసంవాదిభ్రాంతి అని. విసంవాదిభ్రాంతి అర్థకారి కాలేదు. సంవాదిభ్రాంతి అర్థకారి అవుతుంది.

శ్లో॥ మణిప్రదీపప్రభయోః మణిబుద్ధ్యాభిధావతోః ।
మిథ్యాజ్ఞానావిశేషేఽపి విశేషోఽర్థక్రియాం ప్రతి ॥

మణికాంతిని, ప్రదీపకాంతిని చూసి మణి అనుకొంటే రెండూ భ్రాంతులే. అది కేవలం కాంతి కాబట్టి. కానీ ఆ కాంతిని బట్టి దగ్గరకు వెళ్తే ఒకరికి **మణిప్రాప్తి**, మరొకరికి **దీపప్రాప్తి**. అర్థవిషయంలో తేడా.

అలాగే మిథ్యాజ్ఞానం అసలు కార్యకారి కాదు. కానీ జగత్తు దృశ్యమానమై, కార్యకారి కూడా అవుతుంది. కాబట్టి జగత్తు మిథ్య అనటం కుదరదు. కాబట్టి జగత్తూ వాస్తవం. పరమపురుషుడూ (నారాయణుడు) వాస్తవం. ఇద్దరికీ భిన్నత్వం.

| | | | |
|---|---|---|---|
| 4. **కలయతే :** | **కలయతే** | కలయేతే | కలయన్తే |
| | కలయసే | కలయేథే | కలయధ్వే |
| | కలయే | కలయావహే | కలయామహే |
| **జనయేత్ :** | **జనయేత్** | జనయేతామ్ | జనయేయుః |
| | జనయేః | జనయేతమ్ | జనయేత |
| | జనయేయమ్ | జనయేవ | జనయేమ |
| **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

**శ్లో॥ భయహేతుతాऽస్య న చ కంపకతో - భయహేతుతాऽస్యచిత ఏవ పరమ్ ।**
**న హి చిద్గతేऽర్థమహిమా నిశి తా-నహిచిద్గతేऽర్థ ఇహ రాతి హి తాన్ ॥ 8-32**

**అ :** వస్తుసంభవమా? వస్తుజ్ఞానమా? - ఏది కార్యకారి అని తర్కించటం. -ప్రమితాక్షర.

**ప :** భయహేతుతా అస్య న చ కంపకతా - ఉభయహేతుతా అస్య చితః ఏవ పరమ్ ।
న హి చిద్గతే అర్థమహిమా నిశి తాన్ - అహి చిద్ గతే అర్థే ఇహ రాతి హి తాన్॥

**అ :** అస్య భయహేతుతా కంపకతా చ న. అస్య చితః ఏవ పరమ్ ఉభయహేతుతా. నిశి చిద్గతే (పురుషే) అర్థమహిమా తాన్ న రాతి. ఇహ అర్థే గతే అపి అహిచిత్ తాన్ రాతి హి.

**ప్ర :** అస్య = ఈ రజ్జుసర్పానికి (పాముగా కనిపిస్తున్న త్రాటికి), భయహేతుతా = భయ కారణత్వం (భయస్య హేతుః, తస్య భావః), కంపకతా చ = వణికించటం కూడా (కంపకస్య భావః), న = లేదు, పరమ్ = అయితే/కాని, అస్య = ఈ రజ్జుసర్పంయొక్క, చితః ఏవ = జ్ఞానానికే (త్రాటిని చూసి పామని భావించటం), ఉభయహేతుతా = ఈ రెండింటికినీ కారణత్వ (ముంది) (ఉభయోః హేతుతా), నిశి = రాత్రి, చిద్-గతే = జ్ఞానంలేని, (పురుషే = మనిషి యందు) (నిదురిస్తున్న వాని యందు), అర్థ-మహిమా = వస్తు ప్రభావం (సర్పరూపవస్తుప్రభావం), తాన్ = ఆ రెండింటినీ, న రాతి = ఇవ్వదు. (రా ఆదానే పరస్మైపది - లట్ - ప్ర.ఏ.), ఇహ = ఇక్కడ, అర్థే గతే

అపి = పాము లేకపోయినా, అహి-చిత్ = పాము అన్న జ్ఞానం (అహిః ఇతి చిత్), తాన్ = వాటిని, రాతి = ఇస్తుంది.

**తా ॥** రజ్జుసర్పానికి భయపెట్టడం కానీ వణకు పుట్టించటం కానీ కుదరదు. ఆ రెండు కార్యాలలో దానికి కారణత్వం లేదు. రజ్జువును చూచినప్పుడు పాము అని అనుకోవటమే (రజ్జుసర్పజ్ఞానం) అక్కడ ఆ రెండు కార్యాలకూ కారణమవుతుంది. ఎందుకంటే మనిషి నిద్రిస్తున్నప్పుడు పైన పామును వేసినా భయమూ, వణకూ కలుగవు. కారణం. అక్కడ పాము వున్నా పాము అన్న జ్ఞానం లేకపోవటం. రజ్జుసర్పభ్రాంతి దగ్గర వాస్తవంగా పాము లేకపోయినా భయమూ, వణకూ పుడుతున్నాయి. కాబట్టి రజ్జుసర్పస్థితి కార్యకారి కాదు. రజ్జుసర్పజ్ఞానమే కార్యకారి.

**వి :** 1. ఈ శ్లోకంలో తార్కికంగా ముందు శ్లోకంలో చెప్పిన రజ్జుసర్పభ్రాంతి విషయాన్నే కొనసాగిస్తున్నాడు కవి.

మిథ్యాజ్ఞానం కూడా అర్థం సాధకం కాగలిగితే రజ్జుసర్పం కూడా కాటువేయాలని పూర్వశ్లోకంలో దానికి దంశకత్వాన్ని నిరసించిన కవి ఈ శ్లోకంలో ఆ రజ్జుసర్పానికి భయకారణత్వం కంపనకారణత్వం కూడా లేదని నిరూపిస్తున్నాడు.

ఎక్కడ సర్పముంటే అక్కడ భయకంపనలుంటాయి అని వ్యాప్తిని (సాహచర్య నియమాన్ని) స్వీకరిస్తే ప్రస్తుతాంశంలో అన్వయవ్యాప్తిలో వ్యతిరేకవ్యాప్తిలో కూడా దోషం కనిపిస్తుంది. (ఇది వుంటే అది వుంటుంది అన్నది అన్వయవ్యాప్తి. ఇది లేకపోతే అది వుండదు అన్నది వ్యతిరేకవ్యాప్తి) ఇక్కడ రాత్రి నిద్రిస్తున్నప్పుడు పామువున్నా భయకంపనలు కలుగక పోవటం అన్వయవ్యాప్తిలోని దోషం. భ్రాంతి దగ్గర పాము లేకున్నా భయకంపనలు కలుగటం వ్యతిరేకవ్యాప్తిలోని దోషం. కాబట్టి రజ్జుసర్పానికి భయకంపనకారణత్వం లేదు.

ఇది శక్తిమంతమయిన వాదన. **రసార్ణవసుధాకరంలో** సర్వజ్ఞ సింగభూపాలుడు కూడా ఏకావళీ గ్రంథకర్త అయిన విద్యాధరుని అభిప్రాయాలను రసాభాస సందర్భంలో ఖండిస్తూ

రసానుభూతిలో విభావాది సంభవం కారణమా? విభావాది జ్ఞానం కారణమా? అని వితర్కించి అందమైన చర్చ చేసి సిద్ధాంతస్థాపన చేస్తాడు. (రసార్ణవసుధాకరం - ద్వితీయ విలాసం చివరలో - రసాభాసప్రసంగంలో)

2. ఈ శ్లోకంలో ప్రథమద్వితీయపాదాలలోనూ, తృతీయచతుర్థపాదాలలోనూ పాదాది యమకం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **రాతి :** | **రాతి** | రాతః | రాన్తి | |
| | రాసి | రాథః | రాథ | |
| | రామి | రావః | రామః. | * |

**శ్లో॥ యది భేదశూన్యమఖిలం మఖిలంఘ్యసురార్దితా సురసభాఽఽర సభా ।**
**తవ ధామ కిం మురరిపో! ఽరరిపో! - స్తుతిరప్యుదారచరితాచరితా ॥ 8-33**

**అ :** అద్వైతం ప్రతిపాదించే జీవబ్రహ్మైక్యాన్ని (జీవ-పరమపురుషులకు అభేదాన్ని) మరో రీతిగా ఖండించటం-
-ప్రమితాక్షర.

**ప :** యది భేదశూన్యమ్ అఖిలం మఖిలం - ఘి+అసుర+అర్దితా సురసభా ఆర సభా ।
తవ ధామ కిం మురరిపో! అరరిపో! - స్తుతిః అపి ఉదారచరిత! ఆచరితా ॥

**అ :** అరరిపో! ఉదారచరిత! మురరిపో! యది అఖిలం భేదశూన్యం (తర్హి) మఖి-లంఘి-అసుర-అర్దితా సభా సురసభా తవ ధామ కిమ్ ఆర స్తుతిః అపి కిమ్ ఆచరితా.

**ప్ర :** అర-రిపో : అర = (కామక్రోధాది) శత్రువులకు, రిపో! = శత్రువా! (అరాణాః రిపుః తస్మాత్ సంబుద్ధిః), ఉదార-చరిత! = మేటి నడవడి గలవాడా! (ఉదారం చరితం యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), ముర-రిపో = మురాసురుడు శత్రువుగా గలవాడా! (మురః రిపుః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), యది = ఒకచో, అఖిలమ్ =

సమస్తమైన, జగత్ = విశ్వం, భేద-శూన్యమ్ = భేదం లేనిదయితే (అద్వైత మయితే) (భేదేన శూన్యమ్), (తర్హి = అప్పుడు), మఖి-లంఘి-అసుర-అర్దితా : మఖి = యజమానులను, లంఘి = అతిక్రమించు/కాదను, అసుర = రాక్షసులచే, అర్దితా (సతీ) = పీడింపబడినదియు, (మఖినః లంఘయన్తీతి, తే చ తే అసురాః, తైః అర్దితా), సభా = కాంతితో కూడినదియు అయిన (భాసా సహితా సభా), సుర-సభా : సుర (బ్రహ్మశివాదికమైన) దేవతలయొక్క, సభా = సమాజమంతా (సురాణాం సభా) (సమాజః సంసదాస్థానీ సభా స్యాత్ – హలాయుధ కోశః – 745), తవ = నీ, ధామ = మందిరానికి, కిమ్ = ఎందుకోసం, ఆర = వచ్చింది? (ఋ గతౌ పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), స్తుతిః +అపి = స్తోత్రం కూడా, కిమ్ = ఎందుకోసం, ఆచరితా = పాటింపబడింది. (ఆఙ్+చర ధాతువుపై క్త ప్రత్యయం – టాప్)

**తా ॥** కామక్రోధాది దోషాలకు శత్రువైన వాడా! ఉదారచరిత్ర గలవాడా? మురారీ! ఈ సమస్తజగత్తూ భేదరహితమైతే యాగాలనూ – యజమానులనూ వ్యతిరేకిస్తూ రాక్షసులు పీడిస్తుంటే బ్రహ్మాది దేవసభ అంతా పాలకడలిని – నీ నివాసాన్ని – చేరవలసిన అవసర మేమంటుంది? అక్కడ పురుషసూక్తంతో నిన్ను స్తుతించవలసిన అవసర మేముంటుంది? (స్వ పర భేద మున్నప్పుడే గదా ఒకరు స్తుతించటం, మరొకరు స్తుతింపబడటం కుదిరేది.)

**వి :** 1. బ్రహ్మాదులు పాలకడలిని చేరి పురుషసూక్తంతో నారాయణుని స్తుతించటం భాగవతంలోని భాగమే–

శ్లో॥ బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవైస్తయా సహ ।
జగామ సత్రిణయనస్తీరం క్షీరం పయోనిధేః ॥

శ్లో॥ తత్ర గత్వా జగన్నాథం దేవదేవం వృషాకపిమ్ ।
పురుషం పురుషసూక్తేన ఉపతస్థే సమాహితః ॥ – భాగవతం 10/1/19,20

జగత్తునకూ నారాయణునకూ భేదం లేకపోతే దేవతలు నారాయణుని దగ్గరకు వెళ్ళటం, అక్కడ ఆయనను స్తుతించటం, ఆయనయే గతి అని తమ అసమర్థతను అంగీకరించటం ఇవేవీ కుదరవు గదా!

2. అద్వైతసిద్ధాంతాన్ని ప్రతిపాదించి ప్రస్థానత్రయవ్యాఖ్య వ్రాసిన శంకరాచార్యులు కూడా స్తోత్రసాహిత్యాన్నే ఎక్కువగా సృష్టించటం మనం గమనించాలి. అంతేగాదు

'జంతూనాం నరజన్మ దుర్లభమతః పుంస్త్వం తతో విప్రతా' (**వివేకచూడామణి**) అంటూ భేదభావాన్ని సూక్ష్మసూక్ష్మతరసూక్ష్మతమరూపంగా ప్రకటించటాన్ని కూడా గమనించాలి.

3. ఈ శ్లోకంలో ప్రతిపాదం చివరలోనూ (పాదాంత యమకం) నాలుగు పాదాలలోనూ విడివిడిగా పాటింప బడింది.

| | | | |
|---|---|---|---|
| 4. **ఆర :** | **ఆర** | ఆరతుః | ఆరుః |
| | ఆరిథ | ఆరథుః | ఆర |
| | ఆర | ఆరివ | ఆరిమ. |

*

**శ్లో॥ అమితోరువిక్రమ! తవామతవా–గభిదాం వదన్ ఖరమతే రమతే ।**
**క్వ విరుద్ధధర్మజలధీ జడధీ – కలితాభిదా క్వ నిజయోనిజయోః ॥ 8–34**

**అ :** అభేదత్వాన్ని నిరసించటాన్ని ముగిస్తున్నాడు కవి. –ప్రమితాక్షర.

**ప :** అమిత+ఉరువిక్రమ! తవ అమతవాక్ – అభిదాం వదన్ ఖరమతే రమతే ।
క్వ విరుద్ధధర్మజలధీ జడధీ–కలిత+అభిదా క్వ నిజయోనిజయోః ॥

**అ :** అమిత+ఉరువిక్రమ! తవ అభిదాం వదన్ అమతవాక్ ఖరమతే రమతే. విరుద్ధధర్మ జలధీ క్వ? నిజయోనిజయోః జడ-ధీ-కలిత-అభిదా క్వ?

**ప్ర :** అమిత+ఉరు-విక్రమ! : అమిత = హద్దు లేని, ఉరు = గొప్పదైన, విక్రమ! = పరాక్రమం గలవాడా? (అమితాః ఉరవః విక్రమాః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), తవ = నీకు, అభిదామ్ = (జగత్తుతో) అభేదత్వాన్ని, వదన్ = పలుకుతూ (వద ధాతువుపై శతృ ప్రత్యయం), అమత-వాక్ = అంగీకరింపలేని మాటలు గలవాడు (అమతాః వాచః యస్య సః), ఖర-మతే = గర్దభాభిప్రాయంలో (ఖరస్య మతే), రమతే = ఆనందిస్తున్నాడు. (రము క్రీడాయామ్ ఆత్మనేపది - లట్ - ప్ర.ఏ.), విరుద్ధ-ధర్మ-జలధీ : విరుద్ధ = పరస్పరం విరుద్ధమైన, ధర్మ = లక్షణాలకు, జలధీ = కడలివంటి వారు (జీవాత్మ పరమాత్మలు), క్వ = ఎక్కడ?, నిజ-యోనిజయోః = తనకూ (అజునకూ), జన్మకలవారలకూ, జడధీ-కలిత-అభిదా : జడ-ధీ = మందబుద్ధితో, కలిత = కూడినవానియొక్క, అభిదా = అభేదత్వకథనం, క్వ = ఎక్కడ?

**తా ॥** అపరిమితపరాక్రమం గలవాడా! కృష్ణా! నీకూ ఈ జగత్తునకూ భేదం లేదంటూ అప్రమాణమైన మాటలు మాటాడుతారు కానీ, విరుద్ధధర్మాలకు నిలయాలైన నీవూ, జగత్తూ ఎక్కడ? అజుడవయిన నీకూ, మందమతిత్వంతో జననమరణాలకు ఆకరమైన ఈ జగత్తునకూ అభేదమనటం ఎక్కడ?

**వి :** 1. నారాయణుని అమితవిక్రమత్వాన్ని పురుషసూక్తం చక్కగా వినిపిస్తుంది.

ఋ. పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి
త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోఽస్యేహాభవాత్పునః ॥
తతో విష్వఙ్ వ్యక్రామత్ - సాశనానశనే అభి । తస్మాద్విరాడజాయత
- ఋగ్వేదసంహితా 10/90

2. **ఖరమతే :**

అద్వైతవాదిమతాన్ని ఖరమతంగా (గాడిద ఆలోచనగా) వర్ణిస్తున్నాడు కవి. జీవపరములకు అభిన్నత ఏరీతిగానూ కుదరదన్నది ఆయన అభిప్రాయం. ప్రాచీనప్రమాణసిద్ధం కూడా.

శ్లో॥ యదా స్వరూపతశ్చాన్యో జాతితః శ్రుతితోఽర్థతః ।
కథమస్మి స ఇత్యేవం సంబోధః స్యాదసంహితః ॥- మహాభారతం - శాంతిపర్వం - 220/36

స్వరూపాన్ని బట్టి, జాతిని బట్టి, శ్రుతిని బట్టి, అర్థాన్ని బట్టి తన కన్న భిన్నమైన పరమునితో 'అహం సః అస్మి' అన్న భావన ఎలా కుదురుతుంది?

అసలు పంచభూతాల సమ్మేళనంతోనే ప్రాణి పుట్టుక అంటూ పంచభూతాలకూ అభేదత్వాన్ని అంగీకరిస్తే ఇక ప్రాణి పుట్టుకకు అవకాశ మెక్కడ?

3. పాదాంతయమక మీ శ్లోకంలో. నాలుగు పాదాలకూ విడివిడిగా.

| | | | |
|---|---|---|---|
| 4. **రమతే :** | **రమతే** | రమేతే | రమన్తే |
| | రమసే | రమేథే | రమధ్వే |
| | రమే | రమావహే | రమామహే.. |

*

**శ్లో॥ స్మృతిభారతాశ్రవణపురాణపురా-తనవేదశాస్త్రవిభవం విభవమ్ ।**
**పరమం చ మానసమయైః సమయై-రనృతం వదన్న సుసభాసు సభాః ॥ 8-35**

**అ :** స్మృతిభారతపురాణాదులకు కూడా వేదానికివలె ప్రామాణికత్వాన్ని సమర్థించటం. -ప్రమితాక్షర.

**ప :** స్మృతిభారత+అవ్రణపురాణపురా-తనవేదశాస్త్రవిభవం విభవమ్।
పరమం చ మానసమయైః సమయైః - అనృతం వదన్ న సుసభాసు సభాః ॥

**అ :** స్మృతి... విభవం విభవం పరమం చ మానసమయైః సమయైః అనృతం వదన్ సుసభాసు సభాః న.

**ప్ర :** స్మృతి=స్మృతిగ్రంథాలూ, భారత = మహాభారతం, అవ్రణ = నిర్దుష్టాలయిన, పురాణ = పురాణాలు, పురాతన = ప్రాచీనమైన, వేద = నాలుగు వేదాలూ, శాస్త్ర = శిక్ష మొదలైన శాస్త్రాలు - వీటి యొక్క, విభవమ్ = సంపదను, వి-భవమ్ = బంధరహితుడైన (విగతః భవః యస్మాత్, తమ్), పరమమ్ = పరమాత్మనూ, మానసమయైః - మనోవికారరూపాలైన, సమయైః = ప్రమాణాలతో/సిద్ధాంతాలతో, అనృతమ్ = అసత్యంగా/ మిథ్యగా, వదన్ = చెపుతూ, సు సభాసు = సత్సభలలో (శోభనాశ్చ తాః సభాః, తాసు), సభాః = కాంతి-మంతుడవు, న = కాలేదు.

**తా ॥** స్మృతులనూ, భారతాన్నీ, దోషంలేని పురాణాలనూ, పురాతనాలూ, అపౌరుషేయాలూ అయిన వేదాలనూ, శాస్త్రాలనూ - ఈ సంపదనూ, సంసారాతీతుడైన పరమాత్మనూ కూడా తనవైన మనోవికారరూపాలైన సిద్ధాంతాలతో అసత్యమని/మిథ్య అని చెప్తున్న వాడు సత్సభలలో వెలుగొందలేడు.

**వి :** 1. వేదాలు అపౌరుషేయాలుగా పరిగణింపబడ్డాయి. అవి స్వతః ప్రమాణాలని సిద్ధాంతం. అందువల్ల వేదాలను పరమప్రమాణాలుగా అందరూ గుర్తిస్తారు. కొందరు వేదాలను మాత్రమే ఈ జాతి జీవనశైలికి ప్రమాణంగా భావిస్తారు. ఆర్యసమాజం, తత్ స్థాపకుడైన దయానందసరస్వతి ఆ సిద్ధాంతం వైపే మొగ్గుతారు. సంహితా, బ్రాహ్మణం, ఆరణ్యక, ఉపనిషత్తులు వేద భాగాలుగానే గుర్తింపబడ్డాయి. కాబట్టి అవికూడా ప్రమాణాలని మరికొందరు. 'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్' అన్న మాటలను ఆధారంగా చూపుతూ ఇతిహాస (రామాయణ, మహాభారతాలు) పురాణాలను కూడా చాలామంది వేదాలవలె ప్రమాణాలని భావిస్తారు.

ఇదంతా ఈ జాతిసంపద. ఈ సంపదను వినియోగించటంలో జగత్తునకూ, జగన్నాథు నకూ సంబంధాన్ని కల్పించటంలో అభిప్రాయాలు - తీవ్రమైనవే - ఏర్పడ్డాయి. అద్వైత సిద్ధాంతం చాలా మందికి అద్భుతంగా కనిపించింది. అయితే ఆ అద్వైతసిద్ధాంత ప్రవక్త కూడా ఆచరణలో ద్వైతిగానే కనిపిస్తాడు. ఆ మిథ్యాజ్ఞానం బుద్ధుని శూన్యవాదానికి దగ్గరగా వుండటంతో అద్వైతాన్ని ప్రచ్ఛన్నబౌద్ధం అని కూడా అన్నారు. ఏతావతా ఇప్పటికీ భారతీయులలో ద్వైతం భావనాత్మకంగా ఆచరణాత్మకంగా కనిపిస్తుంది. ఎక్కువ మందిలో ఆలోచనలో అద్వైతం ఆచరణలో/అనుష్ఠానంలో ద్వైతం కనిపిస్తుంది. భావనాత్మకమైతే అద్వైతమైనా ఇబ్బంది లేదు కానీ క్రియారూపానికి వచ్చేసరికి ద్వైతం వైపే మరలక తప్పదు.

2. ఈ శ్లోకంలో కూడా పాదాంతయమకం. నాల్గు పాదాలలో విడివిడిగా. *

**శ్లో॥ ఫణిరాజగర్వశమనః శమనః-క్షయకారకః స కురుతాత్ కురుతాత్।**
**చకితాత్మనామిహ వనే హవనే - వినుతః కృపావసుహృదాం సుహృదామ్ ॥8-36**

**అ :** గోపికా విలాపం - సుఖప్రార్థన. -ప్రమితాక్షర.

**ప :** ఫణిరాజగర్వశమనః శమ్ అనః-క్షయకారకః సః కురుతాత్ కు-రుతాత్।
చకితాత్మనామ్ ఇహ వనే హవనే - వినుతః కృపావసు-హృదాం సుహృదామ్ ॥

**అ :** ఫణి-రాజ-గర్వశమనః అనఃక్షయకారకః హవనే వినుతః సః ఇహ వనే కురుతాత్ చకిత+ఆత్మనాం కృపావసుహృదాం సుహృదాం శం కురుతాత్.

ప్ర : ఫణి... శమనః : ఫణిరాజ = సర్పరాజు (కాళియుని) యొక్క, గర్వ = అహంకారాన్ని, శమనః = అణచివేసిన వాడును (ఫణీనాం రాజా ఫణిరాజః, తస్య గర్వం శమయతి ఇతి), అనః క్షయ కారకః : అనః = శకటాసురుని యొక్క (క్లీబేఽనః శకటోఽస్త్రీస్యాత్ – అమరకోశః – క్షత్ర – 52), క్షయ = వినాశనానికి, కారకః = కర్తయును (అనసః క్షయం కరోతి ఇతి), హవనే = యజ్ఞములందు, వినుతః = స్తుతింపబడినవాడును అగు, సః = ఆ కృష్ణుడు, ఇహ వనే = ఈ అడవిలో (బృందావనంలో), **కు–రుతాత్** = చెడ్డ (భీకరమైన) అరుపుల వలన (తిరశ్చాం వాసితం రుతమ్ – అమరకోశః – నాట్య –4), చకిత+ఆత్మనామ్ = బెదిరిన మనస్సులు గల వారము (చకితః ఆత్మా యాసాం తాసామ్), కృపా–వసు–హృదామ్ : కృపా = కరుణనే, వసు = ధనంగా భావించే, హృదామ్ = మనస్సు గలవారము అయిన మాకు (కృపా ఏవ వసు, తస్మిన్ హృత్ యాసాం తాసామ్), శమ్ = సుఖాన్ని, కురుతాత్ = చేయునుగాత (కృ కరణే – పరస్మైపది – లోట్ – ప్ర.ఏ.)

**తా ॥** కాళియుని అహంకారాన్ని అణచిన వాడును, శకటాసురుని సంహరించిన వాడును, యజ్ఞాలలో స్తుతింపబడే వాడును అయిన కృష్ణుడు ఈ వనంలో జంతువుల పెను అరుపుల వలన బెదరిపోతున్న మాకు సుఖాన్ని కలిగించు గాత. ఆయన కృపనే సొమ్ముగా భావించే వాళ్ళము మేము.

**వి :** 1. "అథైనం విష్ణవే చరుం నిర్వపతి. యజ్ఞో వై విష్ణుః యజ్ఞ ఏవాంతతః ప్రతితిష్ఠతి. సోఽత్ర జుహోతి. విష్ణవే స్వాహా యజ్ఞాయ స్వాహా. ప్రతిష్ఠాయై స్వాహేతి"

అని విష్ణువునే యజ్ఞస్వరూపనిగా స్తుతిస్తారు.

2. పాదాంతయమక మీ శ్లోకంలో కూడా నాలుగు పాదాలలోనూ విడివిడిగా.

| | | | |
|---|---|---|---|
| 3. **కురుతాత్ :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| | కురు/**కురుతాత్** | కురుతమ్ | కురుత |
| | కరవాణి | కరవావ | కరవామ. |

*

**శ్లో॥ ముఖసారసం చ సురసం సురసం–స్తుతచారుభావయుగలం యుగలమ్ ।**
**నయనాబ్జయోరజ! మనోజమనో–జయి సుస్మితం హృదయతేఽదయ తే ॥ 8–37**

**ప :** ముఖసారసం చ సురసం సురసం–స్తుతచారుభావయుక్+అలం యుగలమ్ ।
నయన+అబ్జయోః అజ మనోజమనో–జయి సుస్మితం హృత్ అయతే అదయ తే ॥

**అ :** అజ! అదయ! హృత్ సురసం తే ముఖ సారసం అలం సురసంస్తుత చారు భావయుక్ నయన+అబ్జయోః యుగలం మనోజ మనోజయి సుస్మితమ్ అయతే.

ప్ర : అజ! = పుట్టుక లేని వాడా! (న జాయతే ఇతి అజః), అదయ! = దయలేని వాడా! (న భవతి దయా యస్మిన్ సః – తస్మాత్ సంబుద్ధిః), హృత్ = (మా) మనస్సు, సురసమ్ = మంచివాసనగల (రసో వీర్యే గుణే రాగే... జలేంగధాతౌ గంధే – నానార్థమంజరీ – పంక్తి – 1885), తే = నీయొక్క, ముఖ–సారసమ్ = ముఖపద్మాన్నీ (ముఖమేవ సారసం తత్), అలమ్ = ఎక్కువగా, సుర... యుక్ : సుర = దేవతలచేత, సంస్తుత = సన్నుతింప బడిన, చారు = అందమైన, భావ = ఆలోచనలతో, యుక్ = కూడినట్టి (సురైః సంస్తుతః చ అసౌ చారుభావః తేన యుజ్యతే ఇతి), నయన+అబ్జయోః = నేత్రపద్మాలయొక్క (నయనే ఏవ అబ్జే తయోః), యుగలమ్ = జంటనూ, మనోజ–మనో–జయి : మనోజ = మదనుని–యొక్క, మనః=మనస్సును, జయి= గెలుచునట్టి (మనోజస్య మనః జయతి ఇతి), సుస్మితమ్ = మంచి చిఱునవ్వును, అయతే = చేరుతున్నది/ తలచుకొంటున్నది. (అయ గతౌ ఆత్మనేపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥** అజ! దయారహితా! కృష్ణా! మా మనస్సు సురసమైన నీ ముఖపద్మాన్నీ, దేవతలచేత స్తుతింపబడే అందమైన ఆలోచనలతో కూడిన నీ నేత్రపద్మాలనూ, మన్మథుని గూడ జయింపగల నీ దరహాసాన్నీ తలచుకొంటూనే వుంది.

**వి :** 1. పోతన ఈ అంశాన్నే ఒక తేటగీతిలో వక్షస్థలాన్ని కూడా కలుపుతూ, దేవతా ప్రస్తావనను పరిహరిస్తూ వివరించాడు.

తే. మదనుఁ డార్వంగ నీవాడు మంతనములు
నవరసాలోకనం బగు నగుమొగంబు
కమల కిరవైన మహితవక్షఃస్థలంబు
మా మనంబుల లోఁగొని మరపెఁగృష్ణ. – పోతన భాగవతము 10/1057

2. ఈ శ్లోకంలో పాదాంతయమకం నాల్గుపాదాలలో విడివిడిగా నిర్వచించబడింది.

ఈ శ్లోకంలో గోపికల విలాపం విప్రలంభం – ముగుస్తోంది. విప్రలంభశృంగార వర్ణనలో దాదాపు పూర్తిగా యమకాలంకారాన్ని నిర్వహించటం ఒక విలక్షణమైన ప్రయత్నం. ఆలంకారికుల అభిప్రాయాలకు విరుద్ధం కూడా. కానీ 'నిరంకుశాః కవయః' అన్న వాక్యం ప్రసిద్ధం.

| | | | |
|---|---|---|---|
| 3. **అయతే :** | **అయతే** | అయేతే | అయన్తే |
| | అయసే | అయేథే | అయధ్వే |
| | అయే | అయావహే | అయామహే |

4. ఛందస్సు – ప్రమితాక్షర. *

**శ్లో॥ గోపీనాం పరితాపమిత్యుడుపతిః కృష్ణాయ శంసన్నివ**
**ప్రాపాబ్ధ్యంతికమచ్యుతేన్దురుదితస్తత్పుణ్యపుఞ్జాచలాత్ ।**
**వక్షోజాఖ్యగిరిం కరైః పరిమృజన్ నేత్రోత్పలం హర్షయన్**
**హృద్వ్యోమాప్యనురఞ్జయన్ విరచయన్ వృద్ధిం ప్రమోదాంబుధేః ॥ 8–38**

**అ :** చంద్రవర్ణనం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఉడుపతిః ఇతి గోపీనాం పరితాపం కృష్ణాయ శంసన్+ఇవ అబ్ధి+అంతికం ప్రాప. వక్షోజ+ఆఖ్య–గిరిం కరైః పరిమృజన్ నేత్ర+ఉత్పలం హర్షయన్, హృద్–వ్యోమ+అపి అనురంజయన్ ప్రమోద+అంబుధేః వృద్ధిం విరచయన్ తత్–పుణ్య–పుంజ+అచలాత్ అచ్యుత +ఇన్దుః ఉదితః.

**ప్ర :** ఉడుపతిః : ఉడు=నక్షత్రాలకు, పతిః=ప్రభువయిన చంద్రుడు (ఉడూనాం పతిః), ఇతి = ఈ రీతిగా సాగిన, గోపీనామ్ = గోపికలయొక్క, పరితాపమ్ = వియోగదుఃఖాన్ని, కృష్ణాయ = కృష్ణునకు, శంసన్ ఇవ = చెప్తున్నట్లుగా, అబ్ధి+అంతికమ్ = కడలి దగ్గరకు, ప్ర+ఆప = వెళ్ళాడు. (ప్ర+ఆప్ వ్యాప్తౌ – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.), వక్షోజ + ఆఖ్య–గిరిమ్ : వక్షోజ+ఆఖ్య = రొమ్ము అను పేరుగల, గిరిమ్ = కొండను (వక్షోజః ఇతి ఆఖ్యా యస్య సః, చ అసౌ గిరిః, తమ్), కరైః = చేతులతో/కిరణాలతో (నభాంశుహస్తకరణోపధాన– శిలాసు చ – నానార్థమంజరీ – పంక్తి – 1436), పరిమృజన్ = తాకుతూ (పరి–మృజ్ ధాతువుపై శతృ ప్రత్యయం), నేత్ర+ఉత్పలమ్ : నేత్ర = (గోపికల) కన్ను అనెడి, ఉత్పలమ్ = కలువను, హర్షయన్ = ఆనందింపజేస్తూ/ వికసింపజేస్తూ (హృష్ – ధాతువుపై – ణిచ్ – శతృ ప్రత్యయం), హృద్–వ్యోమ–అపి = హృదయమనే ఆకాశాన్ని (హృద్ ఏవ వ్యోమ – తత్),

అనురంజయన్ = ఎఱ్ఱబరుస్తూ (అను రంజ్ – ణిచ్ – శతృ ప్రత్యయం), ప్రమోద+అంబుధేః : ప్రమోద = ఆనంద మను, అంబుధేః = కడలికి, వృద్ధిమ్ = పొంగు దలను, విరచయన్ = కలిగిస్తూ (వి–రచ ధాతువుపై శతృ ప్రత్యయం), తత్–పుణ్య–పుంజ+అచలాత్ : తత్ = ఆ గోపికలయొక్క, పుణ్య = పున్నెముల, పుంజ = ప్రోవు అను, అచలాత్ = కొండనుండి (తాసాం పుణ్యానాం పుంజః ఏవ అచలః, తస్మాత్), అచ్యుత+ఇన్దుః = కృష్ణు డనే చంద్రుడు, ఉదితః = పుట్టాడు. (ఉత్ – ఇ ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** గోపికల పరితాపాన్ని గురించి కృష్ణునకు చెప్తున్నట్లుగా చంద్రుడు కృష్ణుని నివాసమైన కడలివైపు వెళ్ళిపోయాడు. అప్పుడు ఆ గోపికల పుణ్యాలప్రోవు అనే కొండనుండి కృష్ణుడు అనే చంద్రుడు ఉదయించాడు. ఉదయిస్తూనే గోపికల రొమ్ము లనే కొండలను చేతితో/ కిరణాలతో తాకుతూ, వారి కన్ను లనే కలువలను వికసించి ఆనందింపజేస్తూ వారి హృదయాకాశాలను ఎఱ్ఱ బరుస్తూ, వారి ఆనందసాగరాలను ఉప్పొంగింపజేస్తూ కనిపించాడు.

**వి :** 1. ఇది ప్రకరణానుగుణమయిన ప్రకృతివర్ణన. చంద్రోదయపరిణామాలను రూపకం ద్వారా గోపికలలో కనిపింపజేస్తూ చేసిన మనోరంజకమైన వర్ణన మిది. కిరణప్రసారం, గిరిస్పర్శ, ఉత్పలవికాసం, గగనసీమ అనురంజనం, కడలిని ఉప్పొంగించటం ఇవి చంద్రోదయ వేళలో కలిగే సన్నివేశాలు. వీటి నన్నింటినీ గోపికలతో అనుసంధానం చేయటం ద్వారా ప్రకరణంతో దానికి బంధమేర్పడి మరింత అందంగా కనిపిస్తోంది.

2. శంసన్–ఇవ అన్నచోట్ల ఉత్ప్రేక్షాలంకారం. చంద్రుడు కదలిపోవటానికి ఫలం కృష్ణునితో మాటాడటం. కాబట్టి ఫలోత్ప్రేక్ష. '**సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' – (కు. 32).

అచ్యుత+ఇన్దువు, వక్షోజగిరి, నేత్ర+ఉత్పలం, హృదయాకాశం, ప్రమోదాంబుధి, పుణ్య+అచలం – ఇవన్నీ రూపకాలు. ఉపమానంతో ఉపమేయానికి అభేదాన్ని చెప్పటం. '**విషయ్యభేదతాద్రూప్యరంజనస్య విషయస్య యత్ తత్ రూపకమ్**' – (కు. 17)

చంద్రుని వీడి, అచ్యుత చంద్రుని స్వీకరించి వర్ణించటం పరివృత్త్యలంకారం. '**పరివృత్తిర్వినిమయో న్యూనాభ్యధికయోర్మిథః**" – (కు. 112)

కారణమైన చంద్రోదయాన్నీ, కార్యాలైన ఉత్పలవికాసాదులనూ సమానాంతరంగానే వర్ణించాడు కాబట్టి – కార్యకారణాలకు ఐక్యం – ఇది హేత్వలంకారం '**హేతోర్హేతుమతా సార్థం వర్ణనం హేతురుచ్యతే**' – (కు. 167)

ఈ అలంకారాలు అన్నీ దేనికవే స్వతంత్రప్రతిపత్తి గలవి. కాబట్టి ఇది అలంకార సంసృష్టి.

| | | | |
|---|---|---|---|
| 3. ప్రాప : | ప్రాప | ప్రాపతుః | ప్రాపుః |
| | ప్రాపిథ | ప్రాపథుః | ప్రాప |
| | ప్రాప | ప్రాపివ | ప్రాపిమ. |

*

**శ్లో॥ కాచిన్ముకున్దముఖసారససౌరభాఢ్యం**
**తామ్బూలచర్విత మభక్షయదమ్బుజాక్షీ ।**
**అన్తర్నిలీనమదనాయుధజాతఘాత**
**శాన్తిం విధాతుమివ సఞ్చితపుణ్యశేషా ॥ 8–39**

**అ :** ఒకానొక గోపిక కృష్ణుని ఉచ్ఛిష్టతాంబూలాన్ని సేవించటం. –వసంతతిలక.

**అ :** సంచితపుణ్యశేషా కాచిత్ అంబుజ+అక్షీ అంతః+నిలీనమదన+ఆయుధజాతఘాత– శాంతిం విధాతుమ్ ఇవ ముకుందముఖసారస–సౌరభ+ఆఢ్యం తాంబూలచర్వితమ్ అభక్షయత్.

ప్ర : సంచిత-పుణ్య-శేషా : సంచిత = సంపాదింపబడిన, పుణ్య = పున్నెంయొక్క, శేషా = మిగులు గల (సంచితస్య పుణ్యస్య శేషః యస్యాః సా), కాచిత్ = ఒకానొక, అంబుజ+అక్షీ = పద్మాక్షి / గోపిక (అంబుజే ఇవ అక్షిణీ యస్యాః సా), అంతః ... శాంతిమ్ : అంతః = మనస్సులో, నిలీన = కనిపించకుండా వున్న, మదన = మన్మథునియొక్క, ఆయుధ = ఆయుధాలచేత, జాత = ఏర్పడిన, ఘాత = గాయానికి, శాంతిమ్ = ఉపశమనాన్ని, విధాతుమ్-ఇవ = కల్పించడాని కన్నట్లు (అంతః నిలీనస్య మదనస్య ఆయుధైః జాతస్య ఘాతస్య శాంతిః, తామ్), ముకుంద... సౌరభ+ఆఢ్యమ్ : ముకుంద = కృష్ణునియొక్క, ముఖ+సారస = వదనారవిందంయొక్క, సౌరభ = పరిమళంతో, ఆఢ్యమ్ = సమృద్ధమైన (ముకుందస్య ముఖమ్ ఏవ సారసం తస్య సౌరభేణ ఆఢ్యమ్, తత్), తాంబూల-చర్వితమ్ : తాంబూల = తాంబూలంయొక్క, చర్వితమ్ = నములబడిన దానిని (కృష్ణుడు నమిలిన ఎంగిలి తాంబూలాన్ని), అభక్షయత్=తిన్నది. (భక్ష అదనే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అచ్యుత చంద్రుడు ఉదయించిన తరువాత తన పుణ్యశేషం ఫలంగా ఒకానొక గోపిక తన మనస్సులో దాగియున్న మదనుని ఆయుధాలవలన ఏర్పడిన గాయాల ఉపశాంతి కోసం కృష్ణుని ముఖసౌరభంతో కూడిన ఎంగిలి తాంబూలాన్ని తిన్నది.

**వి :** 1. కృష్ణుని ఉచ్ఛిష్టాన్ని (ఎంగిలిని) తినటం, అనుభవించటం మాయపై గెలుపొందటానికి కారణమవుతుందని ఉద్ధవుడు కృష్ణునితో అంటాడు భాగవతంలోనే.

శ్లో॥ త్వయోపభుక్తస్రగ్గంధవాసోఽలంకారచర్చితాః ।
ఉచ్ఛిష్టభోజినో దాసాస్తవ మాయాం జయేమహి ॥ - భాగవతం 11/6/46

2. తాంబూలసేవనం కొందరికి తగదని బ్రహ్మవైవర్తపురాణం నిషేధించింది-

శ్లో॥ తాంబూలం విధవాస్త్రీణాం యతీనాం బ్రహ్మచారిణామ్ ।
తపస్వినాం చ విప్రేంద్రగోమాంససదృశం ధ్రువమ్ ॥ - బ్రహ్మవైవర్తపురాణం/బ్రహ్మఖండం.

ఈ విధినిషేధాలు దేశకాలాలను బట్టి కూడా మారుతుంటాయి. ప్రజల అలవాట్లను బట్టి కూడా.

3. తాంబూలంలో తమలపాకులు, వక్కలు (పోకచెక్కలు) సున్నం లేదా సోడావుప్పు ప్రధానాంశాలు. ఇక దాని సౌరభం కోసం వివిధ సుగంధద్రవ్యాలు చేరుతాయి. దానికి సంబంధించి కొన్ని విశేషాలు మనుచరిత్ర నుండి-

ప్రవరుడు కాలిపసరు కరిగిపోగా హిమగిరిపై సంచరిస్తున్నపుడు తాంబూల వాసన వచ్చింది. అది-

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణిత ఘనసారసాంద్రవీటీ గంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్. - మనుచరిత్ర 2/24

దీని వ్యాఖ్యానంలో వెంపరాల సూర్యనారాయణశాస్త్రి (వ్యాఖ్యాత) మాటలు-

"మృగమదద్విగుణిత ఘనసార మగు తాంబూలము మగువ పొలుపు తెలుపుచుండె" ననుటచే స్త్రీలు తాంబూలమున నొకపాలు కస్తూరియు, రెండుపాళ్ళు పచ్చకప్పురమును జేర్చియు - పురుషులు రెండుపాళ్ళు కస్తూరియు, నొకపాలు కప్పురమును జేర్చియు సేవించుటాచారమని కొందఱును, అట్లు సేవింపవలెనని శాస్త్రము గలదని కొందఱును జెప్పుదురు"

| | | | |
|---|---|---|---|
| 4. **అభక్షయత్ :** | **అభక్షయత్** | అభక్షయతామ్ | అభక్షయన్ |
| | అభక్షయః | అభక్షయతమ్ | అభక్షయత |
| | అభక్షయమ్ | అభక్షయావ | అభక్షయామ. * |

**శ్లో॥ అన్యా తదంసపరిలమ్బితపాణిపద్మా - ధన్యా స్ఫురన్మకరకుణ్డలశోభిగణ్డమ్ ।**
**ప్రేష్ఠాన్తరాఙ్కురితరాసవిలాసతృష్ణా - పుష్టిప్రదేవ మృదు హృష్టముఖీ చుచుమ్బే ॥40**

**అ :** మరొక గోపిక కృష్ణుని ముద్దిడుకొనుట. -వసంతతిలక.

**అ :** తదంసపరిలంబితపాణిపద్మా ధన్యా హృష్టముఖీ అన్యా ప్రేష్ఠాంతరాంకురితరాసవిలాస- తృష్ణా పుష్టిప్రదా+ఇవ స్ఫురత్+మకరకుండలశోభిగండమ్ మృదు చుచుంబే.

**ప్ర :** తత్+అంస పరిలంబిత పాణి పద్మా : తద్ = ఆ కృష్ణునియొక్క, అంస = భుజంపై నుండి, పరిలంబిత = వ్రేలాడుతున్న, పాణి-పద్మా = కరారవిందం గలదై (తస్య అంసే పరిలంబితః పాణిః ఏవ పద్మం యస్యాః సా), ధన్యా = ధన్యురాలై, హృష్ట-ముఖీ = వికసించిన ముఖం గలదై (హృష్టం ముఖం యస్యాః సా), ప్రేష్ఠా... ప్రదేవ : ప్రేష్ఠ = ప్రియుడైన కృష్ణునియొక్క, అంతర = హృదయంలో (అంతరః పరిధానీయే బాహ్యే స్వీయేఽ౽ంతరాత్మని - వైజయన్తీ - నానాలింగ - 2), అంకురిత = మొలిచిన, రాస-విలాస = రాస క్రీడయొక్క, తృష్ణా = కోరికకు, పుష్టి = పెంపుదలను, ప్రదా+ఇవ = ఇచ్చుదానిలాగా (ప్రేష్ఠస్య అంతరే అంకురితా రాసవిలాసస్య తృష్ణా తస్యాః పుష్టేః ప్రదా ఇవ), స్ఫురత్... గండమ్ : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, మకరకుండల = మకరకుండలాలు / చెవి కమ్మలచేత, శోభి = శోభిస్తున్న, గండమ్ = చెక్కిలిని (స్ఫురతీ చ తే మకరకుండలే తాభ్యాం శోభతే ఇతి స చ అసౌ గండః తమ్), మృదు = సున్నితంగా, చుచుంబే = ముద్దిడికొన్నది. (చుబి వక్త్రసంయోగే - ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** మరొక గోపిక కృష్ణుని భుజాలపై పాణిపద్మాలను వ్రేలాడదీస్తూ, వికసించిన ముఖం కలిగి (ఆ కృష్ణసాన్నిధ్యంవలన) ధన్యురాలై కృష్ణుని మనసులో (భుజాలపై వ్రాలుట వలన) పుట్టిన రాసవిలాసాకాంక్షకు వృద్ధిని కలిగిస్తున్నట్లుగా మకరకుండలాలతో శోభిస్తున్న కృష్ణుని ముఖాన్ని మృదువుగా ముద్దుపెట్టుకొన్నది.

**వి :** 1. వస్తుసౌందర్యం చలనంలో కనిపిస్తుంది. కానీ స్తబ్ధతలో కాదు. ఆ భావాన్ని సాహిత్యంలో వస్తు/పాత్రగతమైన చైతన్యంలో ప్రదర్శింప జేయగలిగితే సాహిత్యం సౌందర్య సంపన్న మవుతుంది. దానికి మూలం అనుభావాలను నిశితంగా ఆవిష్కరింపజేయగలగటం. ఈ శ్లోకంలో ఆ ప్రతిభ కనపడుతోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **చుచుంబే :** | **చుచుంబే** | చుచుంబాతే | చుచుంబిరే |
| | చుచుంబిషే | చుచుంబాథే | చుచుంబిధ్వే |
| | చుచుంబే | చుచుంబివహే | చుచుంబిమహే |

వస్తుతః 'చుబి వక్త్రసంయోగే' ధాతువు (భ్వాదిగణం) పరస్మైపది ధాతువు. 'చుబి హింసాయామ్' అని హింసార్థకమైన ధాతువు ఉభయపది. ప్రకృతం 'చుచుంబే' అని ఆత్మనేపదప్రయోగం అర్థభేదంతో చురాదిగణధాతువు అయినా కావాలి. లేదా పదభేదంతో భ్వాది గణధాతువైనా కావాలి. ఒకచోట కవి స్వాతంత్ర్యాన్ని అంగీకరించాలి. *

**శ్లో॥ కాచిచ్చ దష్టమృదులోష్ఠపుటీ ముకున్దం**
**తన్వీ తతాన తరలాత్మకటాక్షలక్ష్యమ్ ।**
**భ్రూసంజ్ఞయైవ రమణం ప్రతి దర్శయన్తీ**
**బిమ్బోష్ఠచుమ్బనరుచిం రుచిరాలకాస్యమ్॥ 8-41**

**అ :** మరొక గోపిక చేష్ట. –వసంతతిలక.

**అ :** కాచిత్ తన్వీ చ రుచిర+అలక+ఆస్యం రమణం ప్రతి బింబోష్ఠచుంబనరుచిం భ్రూసంజ్ఞయా దర్శయన్తీ+ఇవ దష్టమృదుల+ఓష్ఠపుటీ ముకుందం తరల+ఆత్మకటాక్షలక్ష్యం తతాన.

**ప్ర :** కాచిత్ తన్వీ చ = మరొక్క గోపిక కూడా, రుచిర+అలక+ఆస్యమ్ : రుచిర = అందమైన, అలక=ముంగురులు గల, ఆస్యమ్ = ముఖం గల (రుచిరాః అలకాః యస్య తత్ రుచి–రాలకమ్, ఆస్యం యస్య తమ్), తమ్ = ఆ, రమణం ప్రతి = ప్రియుడైన కృష్ణునికి, బింబ+ఓష్ఠ–చుంబన రుచిమ్ : బింబ = దొండపండు వంటి, ఓష్ఠ = పెదవిని, చుంబన = ముద్దుపెట్టుకోవటం లోని, రుచిమ్ = ఆసక్తిని (బింబమ్ ఇవ ఓష్ఠః బింబోష్ఠః, తస్య చుంబనే రుచిః, తామ్) (బింబ+ఓష్ఠః – 'ఓత్వోష్ఠయోస్సమాసే వా" అను వార్తికంతో – 3634 – పరరూపం వైకల్పికంగా – బింబోష్ఠ), భ్రూ–సంజ్ఞయా = కనుబొమల సన్నలచే, దర్శయన్తీ+ఇవ = చూపుతున్నట్లుగా, దష్ట–మృదుల–ఓష్ఠ–పుటీ : దష్ట = కొరకబడిన, మృదుల = సున్నితమైన, ఓష్ఠ–పుటీ (సతీ) = పెదవి భరణి కలదియై (స్యూతః ప్రసేవ–కోఽథ స్యాత్ సముద్గస్సంపుటః పుటః – వైజయన్తీ – పాతాల – పురా – 64) (దష్టం మృదులమ్ ఓష్ఠస్య పుటం యస్యాః సా), ముకుందమ్ = కృష్ణుని, తరల+ఆత్మ–కటాక్ష–లక్ష్యమ్ : తరల = చంచలమైన, ఆత్మ = తనయొక్క, కటాక్ష = కడకంటిచూపునకు, లక్ష్యమ్ = ఎరగా (తరలః చ అసౌ ఆత్మనః కటాక్షః, తస్య లక్ష్యమ్), తతాన = చేసింది. (తనూ విస్తారే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక అందమైన ముంగురులు గల ఆ కృష్ణునకు దొండపండు వంటి పెదవిని ముద్దిడుకొనటానికి ఆసక్తిని కనుసన్నలతోనే ప్రదర్శిస్తూ సున్నితమైన తన ఓష్ఠపుటాన్ని ఎరచేసింది.

**వి :** 1. శ్లో॥దర్శనే స్పర్శనే వాపి శ్రవణే భూషణేఽపి చ ।
యత్రాంతరంగం ద్రవతి సస్నేహ ఇతి కథ్యతే ॥ అని ఆర్య వచనం.

దర్శనంతోనే అంతరంగం ద్రవించటం స్నేహకార్యాలలో ఒకటి. ప్రస్తుతం గోపికలోని ఆంతర్యం ఆ స్నేహానుభవమే.

| | | | |
|---|---|---|---|
| 2. **తతాన :** | **తతాన** | తేనతుః | తేనుః |
| | తేనిథ | తేనథుః | తేన |
| | తతాన/తతన | తేనివ | తేనిమ. |

*

## శ్లో॥ న స్వైరిణీతి నయకోవిద! మయ్యుపేక్షా – యుక్తా తవేతి తమివ ప్రతిబోధయన్తీ ।
## పస్పర్శ పాణికమలం సుఖజాశ్రుధారా – హస్తేన హర్షకరకఙ్కణసుస్వనేన ॥8–42

**అ :** ఒకానొక గోపిక కృష్ణుని స్పృశించి ఆనందబాష్పాలు రాల్చటం. –వసంతతిలక.

**అ :** నయకోవిద! స్వైరిణీ ఇతి మయి తవ ఉపేక్షా న యుక్తా ఇతి తం ప్రతిబోధయన్తీ ఇవ సుఖ–జ+అశ్రుధారా (సతీ) హర్షకరకంకణసుస్వనేన హస్తేన పాణికమలం పస్పర్శ.

**ప్ర :** నయ–కోవిద! : నయ = నీతియందు, కోవిద = అంతయు తెలిసిన వాడా! (కిం న వేత్తి ఇతి కోవిదః) (నయే కోవిదః, తస్మాత్ సంబుద్ధిః), స్వైరిణీ ఇతి = స్వేచ్ఛగా సంచరించునది అని (స్వైరగమనమస్యాః అస్తీతి), మయి = నాపై, తవ = నీకు, ఉపేక్షా = తిరస్కృతి, న యుక్తా=తగదు, ఇతి=అని, తమ్ = ఆ కృష్ణునకు, ప్రతిబోధయన్తీ–ఇవ = తెలుపు తున్నట్లుగా, (కాచిత్ = ఒకానొక గోపిక), సుఖ–జ–అశ్రు–ధారా (సతీ) : సుఖ = (హస్త గ్రహణ) సుఖంవలన, జ=పుట్టిన, అశ్రు = కన్నీటియొక్క, ధారా (సతీ) = ధార గలదై, హర్ష–కర–కంకణ–సుస్వనేన : హర్ష=ఆనందాన్ని, కర=కలిగిస్తున్న, కంకణ = గాజుల యొక్క, సుస్వనేన = మంచిసవ్వడి

గల (హర్షం కుర్వన్తి ఇతి హర్షకరాః, తే చ కంకణానాం సుస్వనాః యస్య, తేన), హస్తేన = చేతితో, పాణికమలమ్ = (కృష్ణునియొక్క) కరారవిందాన్ని (చేయితామరను) పస్పర్శ = తాకింది. (స్పృశ సంస్పర్శనే పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** మరొక గోపిక 'నీతివిశారదా! నేను స్వైరిణిని అనే భావంతో నన్ను తృణీకరించటం నీకు తగదు' అని కృష్ణునకు చెప్తున్నట్లుగా కృష్ణుని చేతిని పట్టుకొంది. ఆమె కన్నులలో ఆనందబాష్పాలు ధారలు కట్టాయి. ఆమె చేతిగాజుల సవ్వడి ఆనందాన్ని కలిగిస్తోంది.

**వి :** 1. ఎవరికోసం స్వేచ్ఛాగమనాన్ని ఎన్నుకొన్నదో ఆ వ్యక్తి, ఆ కారణంగా, ఆ స్త్రీని నిందించ కూడదన్న భావన గోపికలోని ఆంతర్యం. అది స్వైరిణీత్వం కావచ్చునేమో కానీ ఉద్దిష్టవ్యక్తి మాత్రం ఆ ఆరోపణ చేయటం తగదు.

2. స్వైరిణీ స్వ+ఈర సంధిలో స్వాభావికంగా గుణం వచ్చి స్వేరిణీ కావాలి కానీ '**స్వాదీ రేరిణోః**' (వార్తికం 3606) వార్తికంతో వృద్ధి వస్తుంది. స్వైరిణీ అని రూపం.

3. ఇది విలోమ పాణిగ్రహణం. పురుషుడు స్త్రీ పాణిని పట్టుకొంటే అది పాణిగ్రహణం.

శ్లో॥ ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ ।
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా ॥– రామాయణం బాలకాండం –73/27

| | | | |
|---|---|---|---|
| 4. **పస్పర్శ :** | **పస్పర్శ** | పస్పృశతుః | పస్పృశుః |
| | పస్పర్శిథ | పస్పృశథుః | పస్పృశ |
| | పస్పర్శ | పస్పృశివ | పస్పృశిమ. |

*

**శ్లో॥ రత్యుత్సవార్హతనుమన్దిరసఙ్గితుఙ్గ–**
**వక్షోజసత్కలశమణ్డనధీరివాన్యా ।**
**సంయోజ్య తచ్చరణపల్లవమాశు మార–**
**ధిక్కారచిహ్నమఖనద్ధ్వజముత్పతాకమ్॥ 8–43**

**అ :** ఒకానొక గోపిక తన స్తనాలపై కృష్ణ పదపల్లవాన్ని నిలుపుకొనుట. –వసంతతిలక.

**అ :** అన్యా రతి+ఉత్సవ+అర్హతనుమందిరసంగితుంగవక్షోజసత్కలశమండనధీః ఇవ తత్+చరణ పల్లవమ్ ఆశు సంయోజ్య మారధిక్కారచిహ్నమ్ ఉత్పతాకమ్ ధ్వజమ్ అఖనత్.

**ప్ర :** అన్యా = మరొక గోపిక, రతి... ధీః ఇవ : రతి+ఉత్సవ–అర్హ = కలయిక పండువుకు తగిన, తను–మందిర = శరీర మనే ఇంటితో, సంగి = బంధం గల, తుంగ = ఉన్నతాలైన, వక్షోజ = రొమ్ము లనెడి, సత్–కలశ = మంచి కుంభాలను, మండన = అలంకరించాలనే, ధీః+ఇవ = బుద్ధిగలదాని వలె, తత్–చరణ–పల్లవమ్ : తత్ = ఆ కృష్ణునియొక్క, చరణ = పాదమనే, పల్లవమ్ = చివురుటాకును, ఆశు = వెంటనే, సంయోజ్య = (స్తనంపై) కూర్చి, మార–ధిక్కార–చిహ్నమ్ : మార = మదనుని, ధిక్–కార = ధిక్కరించే, చిహ్నమ్ = గుర్తు అయినదీ (మారస్య ధిక్కారః, తస్య చిహ్నమ్), ఉత్పతాకమ్ = ఎగిరే పతాకం కలిగినదీ అయిన (ఉచ్ఛ్రితః పతాకః యస్య తమ్), ధ్వజమ్ = ధ్వజాన్నీ, అఖనత్ = నిలబెట్టింది. (ఖన–అవదారణే పరస్మైపది – లఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక సురతోత్సవానికి తగిన తన శరీరమందిరానికి పూర్ణకలశాలుగా కనిపిస్తున్న రొమ్ములను అలంకరించాలన్న తలపుతో, కృష్ణుని పదపల్లవాన్ని తన స్తనంపై నిలుపుకొని, మదనుని ధిక్కరించామనటానికి గుర్తుగా ఎగిరే పతాకం కల ధ్వజస్తంభాన్ని చిత్రించింది.

**వి :** 1. కృష్ణుని పాదాలపై విజయసూచకమైన పతాకధ్వజరేఖను ఆ గోపిక వ్రాయటం మదనుని తాను జయించగలిగానని సూచించటమే. కృష్ణ పదస్పర్శమాత్రంచేత తాప శాంతిని అంగీకరించటమే. ఇక్కడ స్పర్శ కారణంగా మనస్సులో ఏర్పడే ఆర్ద్రత విస్తరంగా ప్రతిపాదింపబడింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అఖనత్ :** | **అఖనత్** | అఖనతామ్ | అఖనన్ |
| | అఖనః | అఖనతమ్ | అఖనత |
| | అఖనమ్ | అఖనావ | అఖనామ. |

*

**శ్లో॥ అన్యా చ తం హృది నిధాయ నిమీలితాక్షీ**
**ధన్యా ప్రియం పులకశోభితసర్వగాత్రీ ।**
**సర్వాభిరాభిరనుభూతమభుఙ్క్త భోగం**
**కిం నామ నాస్తి మునిమార్గజుషాం హి లోకే॥** **8-44**

**అ :** కృష్ణస్మరణంతో ఆనందిస్తున్న మరొక గోపకాంతను వర్ణించటం. –వసంతతిలక.

**అ :** పులకశోభితసర్వగాత్రీ ధన్యా చ అన్యా తం ప్రియం హృది నిధాయ నిమీలిత+అక్షీ ఆభిః సర్వాభిః అనుభూతం భోగమ్ అభుంక్త. హి లోకే మునిమార్గజుషాం కిం నామ నాస్తి.

**ప్ర :** పులక–శోభిత–సర్వ–గాత్రీ : పులక = పొటమరింతలచే (రోమాంచః పులకః స్యాత్ – హలాయుధకోశః – 651), శోభిత = వెలుగొందుతున్న, సర్వ = సమస్తమైన, గాత్రీ = శరీరం గలదియై (పులకైః శోభితం సర్వం గాత్రం యస్యాః సా), ధన్యా చ = ధన్యురాలును అయిన, అన్యా = మరొక గోపిక, తమ్ = ఆ, ప్రియమ్ = ప్రియుడైన కృష్ణుని, హృది = మనస్సులో (స్వాన్తం హృత్ మానసం మనః – అమరకోశః – ధీ – 33), నిధాయ = నిలుపుకొని (ని+ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నిమీలిత+అక్షీ : నిమీలిత = మూయబడిన, అక్షీ = కనులుగలదియై (నిమీలితే అక్షిణీ యయా సా), ఆభిః = ఆ (ముందు వర్ణించిన), సర్వాభిః = అందరిచే, అనుభూతమ్ = అనుభవింపబడిన, భోగమ్ = సుఖాన్ని, అభుంక్త = అనుభవించింది. (భుజ పాలనాభ్యవహారయోః – ఆత్మనేపది – లఙ్ – ప్ర.ఏ.), హి = అది తగినదే, లోకే=లోకంలో, ముని–మార్గ–జుషామ్ = మునుల బాటను పట్టిన వారికి, కిం నామ=ఏ పేరు గలది (ఏది), న+అస్తి = లేదు? (అస భువి పరస్మైపది–లట్ – ప్ర.ఏ.)

**తా ॥** మరొక గోపకాంతకు కృష్ణుని రాకవలననే శరీరమంతా పులకరించింది. తాను తన ధన్యతను భావించింది. ప్రియుడైన కృష్ణుని మనస్సులో నిలుపుకొని కనులు మూసి అంతకుముందు గోపకాంతలు అందరూ అనుభవించిన సుఖాలనన్నింటినీ తాను అనుభవించింది. మునుల బాట పట్టిన వారు పొందలేనిది లేదు గదా!

**వి :** 1. స్మరణం (మనసులో నిలుపుకొని భావించటం) నవవిధభక్తి మార్గాలలో ఒకటి.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥

శ్లో॥ ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా ।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్ ॥ – భాగవతం 7/5/23,24

అని ప్రహ్లాదుడు హిరణ్యకశిపునకు వివరిస్తాడు.

శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం – ఈ తొమ్మిదీ భక్తి మార్గాలు.

మ. తనుహృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్, చింతనం
బనునీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!– పోతన భాగవతం – 7/167

స్మరణలోని సౌకర్యం కవిచే చక్కగా భావింపబడి, ప్రకటింపబడింది. అంతకు ముందు గోపిక లందరూ ఆయా చేష్టల ద్వారా అనుభవించిన సుఖాన్ని తాను అనుభవించింది. అంటే సర్వచేష్టలనూ భావింపగలిగింది. స్మరణ భావనాత్మకం కావటంతో దానికి అవధులుండవు. 'మనోరథానామతటాః ప్రవాహాః' – అని కాళిదాసు కథనం. అంతకు ముందు గోపికలు దర్శన, స్పర్శన సుఖాల ననుభవించారు. ఈ గోపిక అదంతా భావించ గలిగింది.

భవభూతి ఉత్తరరామచరితనాటకంలో ప్రథమాంకంలో చిత్రదర్శనసన్నివేశం ద్వారా స్మరణ ప్రభావాన్ని అద్భుతంగా చిత్రించి చూపాడు.

2. గోపిక ధ్యానంతో సర్వసుఖాలనూ తాను అనుభవించగలిగింది అను విశేషాంశాన్ని మునుల బాట పట్టిన వారికి లేదనేది లేదు అని సామాన్యవిషయంతో సమర్థించటం అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః" – (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **అభుంక్త :** | **అభుంక్త** | అభుంజాతామ్ | అభుంజత |
| | అభుంక్థాః | అభుంజాథామ్ | అభుంగ్ధ్వమ్ |
| | అభుంజి | అభుంజ్వహి | అభుంజ్మహి |

**అస్తి :** 18వ శ్లోకం వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ నయనైర్దధుర్ముఖవిధుం ఖవిధుం – విహసన్తమస్య చరణే చ రణే।**
**జయదాయినీ స్తనయుగేన యుగే – క్షణతాం శమావధిగతేఽధిగతే ॥ 8–45**

**అ :** కృష్ణసాన్నిధ్యంలో గోపికలకు యుగం క్షణమైనట్లు వర్ణించటం.

**ప :** నయనైః దధుః ముఖవిధుం ఖవిధుం – విహసన్తమ్ అస్య చరణే చ రణే।
జయదాయినీ స్తనయుగేన యుగే – క్షణతాం శమ+అవధిగతే అధిగతే ॥

**అ :** ఖవిధుం విహసంతమ్ అస్య ముఖవిధుం నయనైః దధుః రణే జయదాయినీ చరణే స్తనయుగేన దధుః. శమ+అవధిగతే అధిగతే యుగే క్షణతాం దధుః.

**ప్ర :** (గోపికాః = గోపికలు), ఖ–విధుమ్ : ఖే = ఆకాశమండలి (నభోన్తరిక్షం గగన మనన్తం సురవర్త్మ ఖమ్ – అమరకోశః – వ్యోమ – 1), విధుమ్ = చంద్రుని (ఖే విధుః తమ్), విహసన్తమ్ = హేళన చేస్తున్నట్టి, అస్య = ఈ కృష్ణునియొక్క, ముఖ–విధుమ్ = ముఖచంద్రుని, నయనైః = కళ్ళతో, దధుః = ధరించారు (ధా ధారణపోషణయోః పరస్మైపది – లిట్ – ప్ర.బ.), రణే = యుద్ధంలో, జయ–దాయినీ = గెలుపు నిచ్చునట్టి (జయం దదాతి ఇతి జయదాయి – తస్మాత్ ద్వివచనే), చరణే = పాదాలను (పదంఘ్రిశ్చరణోఽస్త్రియామ్ –అమరకోశః–మనుష్య–81), స్తన–యుగేన = రొమ్ముల జంటతో, (దధుః = ధరించారు), శమ+అవధి–గతే : శమ = అడకువ యొక్క, అవధి = హద్దులకు, గతే = చేరినట్టి (శమస్య అవధిం గతః, తస్మిన్), అధిగతే = కృష్ణుడు చూడబడగా/ పొందబడగా (అధి–గమ్ ధాతువుపై క్త ప్రత్యయం), యుగే = యుగకాలంలో, క్షణతామ్ = క్షణత్వాన్ని (నిమేషమాత్రతను), దధుః = ధరించారు.

**తా ॥** గోపికలు గగనసీమలోని చంద్రుణ్ణి హేళన చేస్తున్న కృష్ణ ముఖచంద్రుణ్ణి కళ్ళలో నిలుపు కొన్నారు. యుద్ధంలో గెలుపు నందివ్వగల ఆయన పాదాలను రొమ్ములపై నిలుపుకొన్నారు. అణకువ యొక్క హద్దులకు చేరిన ఆ కృష్ణుడు తమ కంటబడగానే యుగకాలాన్ని క్షణకాలంగా భావించారు.

**వి :** 1. విషాదంలో బరువుగా, నెమ్మదిగా గడిచే కాలం ఆనందంలో తేలికగా, త్వరగా గడుస్తుంది.

2. ఈ శ్లోకంలో పాదాంతయమకం నాల్గు పాదాలలో విడివిడిగా.

| 3. **దధుః :** | దధౌ | దధతుః | **దధుః** |
|---|---|---|---|
| | దధిథ/దధాథ | దధథుః | దధ |
| | దధౌ | దధివ | దధిమ. |

*

**శ్లో॥ స్వానన్దం ప్రకటీచకార సుఖదం సాయుజ్యమాలిఙ్గ్య తాః**
**సాధర్మ్యం స్వకృతానులేపతిలకైర్మోక్షం హృదిస్థావృతేః ।**
**తాభిః సస్మితమీక్షితో యదుపతిః సారూప్యసార్ష్టీ దిశన్**
**రాసాఖ్యం చ తథోత్సవం న హి కథా వ్యర్థా పరబ్రహ్మణః ॥ 8-46**

**అ :** కృష్ణుడు రాసోత్సవం ద్వారా గోపికలకు భౌతికానందాన్నీ, మోక్షాన్నీ అందివ్వటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** తాభిః సస్మితమ్ ఈక్షితః యదుపతిః హృదిస్థ+ఆవృతేః మోక్షం ప్రకటీచకార. స్వానందం (ప్రకటీచకార). తాః ఆలింగ్య సుఖదం సాయుజ్యం (ప్రకటీచకార). స్వకృత+అనులేప–తిలకైః సాధర్మ్యం (ప్రకటీచకార). సారూప్యసార్ష్టీ దిశన్ తథా రాసాఖ్యమ్ ఉత్సవం (ప్రకటీచకార). పరబ్రహ్మణః కథా వ్యర్థా న హి.

**ప్ర :** తాభిః = ఆ గోపికలచే, సస్మితమ్ = చిరునవ్వుతో (స్మితేన సహితం యథా తథా), ఈక్షితః = చూడబడిన, యదు–పతిః = కృష్ణుడు (యదూనాం పతిః), హృది–స్థ–ఆవృతేః : హృది–స్థ = గుండెలపై నున్న, ఆవృతేః =ఆచ్ఛాదనకు (హృది తిష్ఠతి ఇతి హృదిస్థా, తస్యాః ఆవృతిః, తస్యాః), మోక్షమ్ = తొలగించుటను, ప్రకటీచకార = ప్రకటించాడు. (ప్రకటీ+కృ కరణే – లిట్ – ప్ర.ఏ.), స్వ+ఆనందమ్ = తన చేష్టల వలన కలిగిన ఆనందాన్ని (స్వ స్య ఆనందః, తమ్), ప్రకటీచకార – , తాః = వారిని, ఆలింగ్య = కౌగిలించి (ఆ+లిగి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుఖ–దమ్ = సుఖాన్నిచ్చే (సుఖం దదాతి ఇతి, తమ్), సాయుజ్యమ్ = మిక్కిలిగా చేరిమిని, ప్రకటీచకార, స్వ–కృత–అనులేప–తిలకైః : స్వ = తనచే, కృత = కల్పింపబడిన, అనులేప = చందనాదులు పులుముటలచే, తిలకైః = తిలకాలచే (బొట్లచే) (స్వేన కృతాః అనులేపాః తిలకా చ, తైః), సాధర్మ్యమ్ = తనతో సమానత్వాన్ని, ప్రకటీచకార, సారూప్య–సార్ష్టీ = సరూపతనూ, సార్ష్టిని (ఒకరి మెడపై మరొకరు చేతులు వేసి ఆడే ఆట), దిశన్ = చూపుతూ (దిశ ధాతువుపై శతృ ప్రత్యయం), తథా = ఆ రీతిగా, రాస+ఆఖ్యమ్ = రాస మను పేరుగల (రాసః ఇతి ఆఖ్యా యస్య తమ్), ఉత్సవమ్ = పండువును, (ప్రకటీచకార)

**తా ॥** గోపికలు చిఱునవ్వుతో కృష్ణునివైపు చూశాడు. కృష్ణుడు గోపికల గుండెలపై నున్న ఆచ్ఛాదనకు మోక్షాన్ని కలిపించాడు. (హృదయానికున్న ఆవరణను తొలగించాడు. ఆవరణ భంగమైతేనే ఆత్మానందానికి అవకాశం. మూకుడును తొలగిస్తేనే దీపం తాను వెలుగుతూ అన్నింటినీ వెలిగింపజేయ గలిగినట్లు.) స్వాత్మానందాన్ని ప్రకటించాడు. గోపికలను కౌగిలించుకొని వారికి చేరువ అయ్యాడు (సాయుజ్యమోక్షాన్ని కలిగించాడు). తన గట్టి కౌగిలింతతో తన మేని చందన తిలకాలు వారికంటగా వారిని తనతో సమానం చేశాడు. (ఇది తన సధర్మతను వారికి కల్గించటం). వారికి తన సారూప్యాన్నీ, తనతో సార్ష్టిని (ఒకానొక ఆట) కలిగించి రాసక్రీడను నడిపించాడు. కృష్ణ కథాజ్ఞానం నిరర్థకం కాదు గదా!

వి : 1. 'ముక్తి నాలుగువిధాలు వైష్ణవ సంప్రదాయంలో, సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్య రూపాలలో.

సారూప్యం – ఉపాస్యదేవతయొక్క రూపాన్ని ఉపాసకుడు పొందటం.

సామీప్యం – ఉపాస్యదేవతకు సమీపంలో నిలువ గలగటం.

సాలోక్యం – ఉపాస్యదేవత లోకంలో ఉండగలగటం.

సాయుజ్యం – ఉపాస్యదేవతలో ఉపాసకుడు కలిసి పోవటం.

సాధర్మ్య కల్పనం, సార్ష్టి ప్రధానం ఇటువంటివాటిని కూడా కొందరు మోక్ష పదాలతోనే వ్యవహరిస్తారు. ఉపాస్యదేవత మహిమలు ఉపాసకునకు లభించటం సార్ష్టి.

2. **న హి కథా వ్యర్థా పరబ్రహ్మణః** – అని సామాన్యాంశంతో గోపికలు కృష్ణసేవ ద్వారా పొందిన ఫలాలను సమర్థించినందువలన ఇది అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తి– రర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః" – (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రకటీచకార :** | **ప్రకటీచకార** | ప్రకటీచక్రతుః | ప్రకటీచక్రుః |
| | ప్రకటీచకర్థ | ప్రకటీచక్రథుః | ప్రకటీచక్ర |
| | ప్రకటీచకార/ప్రకటీచకం | ప్రకటీచకృవ | ప్రకటీచకృమ. |

*

**శ్లో॥ రమ్యస్థలీం రాసమహాయ శౌరి–రాగాదసౌ సారజనీహితాయ ।**
**ఆసామభూదీప్సితదాతరీశే – రాగాదసౌ సా రజనీ హితాయ ॥ 8–47**

అ : కృష్ణుని రాకతో గోపికలు కుదుట పడటాన్ని వర్ణించటం. –ఇంద్రవజ్ర.

ప : రమ్యస్థలీమ్ రాసమహాయ శౌరిః – ఆగాత్ అసౌ సార–జనీ–ఈహితాయ ।
ఆసామ్ అభూత్ ఈప్సితదాతరి ఈశే – రాగాత్ అసౌ సారజనీ హితాయ ॥

అ : అసౌ శౌరిః సారజనీ+ఈహితాయ రాసమహాయ రమ్యస్థలీమ్ ఆగాత్. ఆసామ్ ఈప్సితదాతరి ఈశే రాగాత్ సారజనీ అసౌ హితాయ అభూత్.

ప్ర : అసౌ=ఈ, శౌరిః = కృష్ణుడు, సార–జనీ–ఈహితాయ : సార = శ్రేష్ఠమైన (సారో బలే స్థిరాంశేఒర్థే పుమాన్ న్యాయ్యే వరే త్రిషు – నానార్థరత్నమాలా – పంక్తి – 938), జనీ = పుట్టుక గల గోపికలయొక్క, ఈహితాయ = కోరిక అయిన (సారా జనిః యాసాం తాసామ్ ఈహితాయ), రాస–మహాయ : రాస = రాస మనే, మహాయ = ఉత్సవం కోసం (మహ్యతే ఇతి తస్మై) (ఉత్సవః స్యాన్మహః క్షణః – హలాయుధకోశః–76) (రాస ఇతి మహః, తస్మై), రమ్య–స్థలీమ్ : రమ్య = అందమైన, స్థలీమ్ = ప్రదేశానికి, ఆగాత్ = వచ్చాడు. (ఆ– ఇ గతౌ లుజ్ – ప్ర.ఏ.), ఆసామ్ = ఈ గోపికలకు, ఈప్సిత–దాతరి : ఈప్సిత = ఇష్టమైనదానిని (ఆప్తుమ్ ఇష్టః ఈప్సితః), దాతరి = ఇచ్చే, ఈశే = కృష్ణునియందు, రాగాత్ = ప్రీతివలన, సా రజనీ = ఆ రేయి, అసౌ = ప్రాణమందు, హితాయ = మేలుకోసం, అభూత్ = అయినది (భూ సత్తాయాం భ్వాది పరస్మైపది – లుజ్ – ప్ర.ఏ.)

తా ॥ కృష్ణుడు మంచిపుట్టుకగల ఆ గోపికల కోరిక అయిన రాసక్రీడకై అందమైన స్థలానికి వచ్చాడు. ఆ గోపికల కోరిక నెరవేరుస్తున్న కృష్ణుని మీది ప్రీతితో ఆ రేయి గోపికల ప్రాణధారణలో హితకరమైంది.

వి : 1. కృష్ణుడు, ఆ రాతిరి ఇద్దరూ కూడా గోపికల హితం కోసమే ప్రవర్తించారు. రెండూ ప్రాకరణికాంశాలే. కాబట్టి ఆర్థికంగా ఈహిత – హితాలు వేరయినా యమక నిర్వహణం ద్వారా రెండూ 'హితాయ' కాబట్టి తుల్యయోగితాలంకారం. 'వర్ణ్యానా మితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా' – (కు. 44)

2. యుగ్మపాదాంతయమక మీ శ్లోకంలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆగాత్ :** | | **ఆగాత్** | ఆగాతామ్ఆగుః |
| | ఆగాః | ఆగాతమ్ | ఆగాత |
| | ఆగామ్ | ఆగావ | ఆగామ |

**అభూత్ : 8-31**వ శ్లోక వ్యాఖ్యానం చూడుడు. *

**శ్లో॥ కణ్ఠాశ్లేషకరాగ్రపాతమధురవ్యాహారమన్దస్మితై-**
**ర్లోలాపాఙ్గనిరీక్షణేన మరుతా గీతేన శీతాంశునా ।**
**శృఙ్గారం రసముచ్చకైః కుసుమితే వృన్దావనే పోషయన్**
**గోపీమణ్డలమణ్డితం మధుపతీ రాసోత్సవం నిర్మమే ॥ 8-48**

**అ :** రాసోత్సవ వర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** మధుపతిః కంఠ+ఆశ్లేష-కర+అగ్ర-పాత-మధుర-వ్యాహార-మంద-స్మితైః లోల+అపాంగ-నిరీక్షణేన మరుతా గీతేన శీత+అంశునా శృంగారం రసం పోషయన్ ఉచ్చకైః కుసుమితే వృందావనే గోపీమండలమండితం మధుపతిః రాస+ఉత్సవం నిర్మమే.

**ప్ర :** మధుపతిః = కృష్ణుడు (మధోః పతిః), కంఠ... స్మితైః : కంఠ = మెడను, ఆశ్లేష = కౌగిలించుట, కర+అగ్ర=గోళ్ళయొక్క, పాత = గ్రుచ్చడాలు, మధుర = తీయనైన, వ్యాహార = పలుకులు, మంద-స్మితైః = మందస్మితాలతోనూ, లోల... నిరీక్షణేన : లోల = చంచలా-లయిన, అపాంగ = కడకంటి చూపులతో, నిరీక్షణేన = చూచుటతోడనూ (లోలాః చ తే అపాంగాః, తైః నిరీక్షణం తేన), మరుతా = చల్లగాలితోనూ, గీతేన = పాటతోనూ, శీత+అంశునా = చంద్రునితోనూ (శీతాః అంశః యస్య తేన), శృంగారం రసమ్ = శృంగారరసాన్ని, పోషయన్ = పరిపుష్టం చేస్తూ, ఉచ్చకైః = బాగా, కుసుమితే = పూచిన, వృందా-వనే = వృందావనంలో, గోపీ... మండితమ్ : గోపీ = గోపికలయొక్క, మండల = సమూహంచే, మండితమ్ = అలంకరింపబడిన, రాస+ఉత్సవమ్ = రాసక్రీడను (రసస్య అయం రాసః, స చ అసౌ ఉత్సవః, తమ్), నిర్మమే = నిర్మించాడు. (చేశాడు.) (నిర్ - మా మానే ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు కౌగిలింతలతో, గోళ్ళ గ్రుచ్చుటలతో, తీయని మాటలతో, మందహాసాలతో, కడకంటి చూపులతో, చల్లని గాలులతో, పాటలతో, చంద్రునితో శృంగారరసాన్ని పోషిస్తూ బాగా పూచిన ఆ బృందావనంలో గోపికల మండలాల మధ్యలో నిలిచి రాసక్రీడను నిర్వహించాడు.

**వి :** 1. కౌగిలింతలు, నఖపాతాలు, తీయని పలుకులు, మందహాసాలు, కడకంటి చూపులు కృష్ణగతంగా అనుభావాలు. కానీ గోపికలకు అవి ఆలంబనవిభావాలై తదాశ్రితంగా శృంగారాన్ని పరిపుష్టం చేస్తాయి. చల్లగాలులు, గీతమాధురులు, చంద్రుడు ఇది ఉద్దీపన విభావాలు. కలిగిన రతిని పెంపొందింప జేస్తాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **నిర్మమే :** | **నిర్మమే** | నిర్మమాతే | నిర్మమిరే |
| | నిర్మమిషే | నిర్మమాథే | నిర్మమిధ్వే |
| | నిర్మమే | నిర్మమివహే | నిర్మమిమహే. |

*

**శ్లో॥ ప్రేష్ఠస్యాంసయుగం కరైరుభయతః ప్రేమోత్థరోమోద్గమైః**
**సుష్ఠ్వాలింగ్య పునః పలాయనభియేవౌత్సుక్యతో వీక్షతామ్ ।**

**సిద్ధానాం నయనైః సమం సముదితం శృఙ్గారసంజ్ఞం రసం**
**మధ్యస్థం ముముచుర్మిథో ధృతకరా గన్తుం బహిర్న క్వచిత్ ॥ 8-49**

**అ :** రాసోత్సవ వర్ణన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రేమ+ఉత్థరోమ+ఉద్గమైః కరైః ప్రేష్ఠస్య అంసయుగం పునః పలాయనభియా ఇవ ఉభయతః సుష్ఠు ఆలింగ్య ఔత్సుక్యతః వీక్షతాం సిద్ధానాం నయనైః సమం సముదితం మధ్యస్థం శృంగారసంజ్ఞం రసం మిథః ధృతకరా బహిః క్వచిత్ అపి గన్తుం న ముముచుః.

**ప్ర :** ప్రేమ+ఉత్థ–రోమ+ఉద్గమైః : ప్రేమ = ప్రీతివలన, ఉత్థ = కలిగిన, రోమ+ఉద్గమైః = పులకింతలు గల (ప్రేమ్ణా ఉత్థాః రోమ్ణామ్ ఉద్గమాః యేషాం తైః), కరైః = చేతులతో, ప్రేష్ఠస్య = ప్రియుడైన కృష్ణునియొక్క, అంస–యుగమ్ = మూపుల జంటను (అంసయోః యుగమ్), పునః = మరల, పలాయన–భియా+ఇవ : పలాయన = పారిపోతాడేమో అను, భియా+ఇవ = భయంతోనో అన్నట్లు (పలాయనే భీః, తయా ఇవ), ఉభయతః = రెండు వైపులా, సుష్ఠు = గట్టిగా, ఆలింగ్య = కౌగిలించుకొని, ఔత్సుక్యతః = ఉత్కంఠతో, వీక్షతామ్ = చూస్తున్న, సిద్ధానామ్ = సిద్ధులయొక్క, నయనైః సమమ్ = కళ్ళతో పాటు, సముదితమ్ = పుట్టినదై, మధ్యస్థమ్ = మధ్యలోనున్న, శృంగార–సంజ్ఞమ్ = శృంగారమనుపేరుగల, రసమ్ = రసాన్ని, మిథః = పరస్పరం, ధృతకరాః : ధృత = పట్టుకొనబడిన, కరాః = చేతులు గలవారై, బహిః = వెలుపలకు, క్వచిద్+అపి = ఎక్కడకూ కూడా, గన్తుమ్ = వెళ్లటానికి, న ముముచుః = వీడక పోయిరి.

**తా ॥** గోపికలు కృష్ణప్రేమవలన చేతులు పులకిస్తుండగా, కృష్ణుడు మరల కనిపించకుండా పోతాడేమో అనే భయంతోనో అన్నట్లు ఆయన భుజాలపై చేతులు వేసి, గట్టిగా కౌగిలించుకొని, ఉత్కంఠతో చూస్తున్న సిద్ధుల కళ్ళతో పాటు మండల మధ్యస్థమై శృంగార సంజ్ఞితమైన ఆ కృష్ణుని, ఒకరి చేతులొకరు పట్టుకొని చుట్టుముట్టి కదలకుండా చేశారు.

**వి :** 1. కృష్ణునిలో శృంగారరసత్వాన్ని ఆరోపణ చేయటంతో పాటు ఉపమేయమయిన కృష్ణుని ప్రస్తావించ నందువలన ఇది అధ్యవసాయమై రూపకాతిశయోక్త్యలంకార మవుతుంది. '**రూపకాతిశయోక్తిః స్యాన్నిగీర్యాధ్య–వసానతః**' – (కు.36), అది రసరూపం కాబట్టి ప్రవహించి బయటకు వెళ్ళకుండా వారంతా చేతులు అడ్డం పెట్టడం అందమైన ఉత్ప్రేక్ష. ఎందుకంటే వారి నృత్యక్రీడావిశేషాలలో భాగమే ఒకరి చేతులొకరు పట్టుకోవటం. కాని దానిని శృంగారరసం వెలుపలికి పోకుండా ఆపేందుకు అని ఫలాన్ని ఉత్ప్రేక్షించి నందువలన ఇది ఫలోత్ప్రేక్షాలంకారం. ఈ ఉత్ప్రేక్షకు మూలం ఆ రూపకాలంకారం.

ఆ గోపికా కృష్ణుల అన్యోన్య ప్రేమ వలన పుట్టిన శృంగారరసాన్ని మధ్యలోనే నిలపాలనీ, వెళ్ళనీయ గూడదనీ గోపికల అభిలాష కావచ్చు. ఒక భావానికి అదృశ్యమూర్తిమత్వ కల్పన.

2. ఈ మండల–మధ్యస్థ–శృంగారరస–స్వరూపాన్నీ, ఇంతకు ముందు శ్లోకాలలో వర్ణించిన గోపికల వివిధచేష్టలనూ **అష్టపది** రూపంలో జయదేవుడు చిత్రీకరించాడు–

**చందనచర్చితనీలకళేబరపీతవసనవనమాలీ**
**కేళిచలన్మణికుండలమండితగండయుగస్మితశాలీ**
**హరిరిహ ముగ్ధవధూనికరే – విలాసిని విలసతి కేళిపరే ॥ 1 ॥**

**పీనపయోధరభారభరేణ హరిం పరిరభ్య సరాగమ్**
**గోపవధూరనుగాయతి కాచిదుదంచితపంచమరాగమ్ హరిరిహ ॥**

**కాఽపివిలాసవిలోలవిలోచనఖేలనజనితమనోజమ్ ।**
**ధ్యాయతి ముగ్ధవధూరధికం మధుసూదనవదనసరోజమ్ ॥ హరిరిహ ॥**

**కాఽపి కపోలతలే మిళితా లపితుం కమపి శ్రుతిమూలే ।**
**కాఽపి చుచుంబ నితంబవతీ దయితం పులకైరనుకూలే ॥ హరిరిహ ॥**

**కేళికళాకుతుకేన చ కాచిదముం యమునాజలకూలే ।**
**మంజులవంజులకుంజగతం విచకర్ష కరేణ దుకూలే ॥ హరిరిహ ॥**

**కరతలతాళతరలవలయావలికలితకలస్వనవంశే ।**
**రాసరసే సహ నృత్యపరా హరిణా యువతిః ప్రశశంసే ॥ హరిరిహ ॥**

**శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామామ్ ।**
**పశ్యతి సస్మితచారుతరామపరామనుగచ్ఛతి వామామ్ ॥ హరిరిహ ॥**

**శ్రీ జయదేవభణితమిదమద్భుతకేశవకేళిరహస్యమ్ ।**
**వృందావనవిపినే లలితం వితనోతు శుభాని యశస్యమ్ ॥ హరిరిహ ॥**

| | | | |
|---|---|---|---|
| 3. **ముముచుః :** | ముమోచ | ముముచతుః | **ముముచుః** |
| | ముమోచిథ | ముముచథుః | ముముచ |
| | ముమోచ | ముముచివ | ముముచిమ. |

*

**శ్లో॥ స నేష్యతి ప్రాగివ కాఞ్చిదాసాం - మనోరమాం శౌరిరితీవ భీత్యా ।**
**పరస్పరాబద్ధమనోజ్ఞహస్తా - విరేజురిన్దీవరలోచనాస్తాః ॥ 8-50**

**అ :** ఒకరి చేతులొక్కరు పట్టుకొని ఒక్కటిగా నిలిచి గోపికలు నిలుచుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః శౌరిః ప్రాక్+ఇవ ఆసాం కాంచిత్ మనోరమాం నేష్యతి ఇతి భీత్యా ఇవ ఇందీవరలోచనాః తాః పరస్పరాబద్ధమనోజ్ఞహస్తాః (సత్యః) విరేజుః.

**ప్ర :** సః శౌరిః = ఆ కృష్ణుడు, ప్రాక్+ఇవ = ఇంతకు ముందువలె, ఆసామ్ = వారిలో, కాంచిత్ = ఒకానొక (ఎవరైనా), మనోరమామ్ = మనస్సుకు నచ్చిన దానిని/ అందగత్తెను (మనః రమతే అస్యామితి, తామ్), నేష్యతి = తీసికొని పోగలడు (నీ - ప్రాపణే - పరస్మైపది -ల్రుట్-(ప్ర.ఏ.), ఇతి = అని, భీత్యా+ఇవ = భయంచేతనో అన్నట్టు, ఇందీవరలోచనాః : ఇందీవర = కలువలవంటి, లోచనాః = కన్నులు గల (ఇందీవరే ఇవ లోచనే యాసాం తాః), తాః = ఆ గోపికలు, పరస్పర+ఆబద్ధ-హస్తాః (సత్యః) : పరస్పర = అన్యోన్యంగా, ఆబద్ధ = గట్టిగా పట్టుకొన్న, హస్తాః సత్యః = చేతులు గలవారై (పరస్పరమ్ ఆబద్ధాః హస్తాః యాసాం తాః), విరేజుః = వెలుగొందారు. (వి+రాజ్ దీప్తౌ - పరస్మైపది - లిట్ - (ప్ర.బ.)

**తా ॥** అంతకు ముందులాగా (రకరకాల పదార్థాలను దొంగిలించినట్లు) తమలో ఎవర్తైనా ఒకానొక అందగత్తెను కృష్ణుడు తీసికొని పోతాడేమో అనే భయంతోనో అన్నట్లు ఆ గోపికలు ఆ కలువకన్నుల అందగత్తెలు - ఒకరి చేతులొకరు గట్టిగా పట్టుకొని వెలుగొందారు.

**వి :** 1. కృష్ణుడు బాల్యంనుండీ నవనీతచోరుడుగా ప్రసిద్ధి అయినా ప్రకృతగ్రంథంలోనే (7/53) కృష్ణుడు ఒక గోపికను తీసికొని వెళ్ళినట్లు కనిపిస్తుంది. ఆ విషయాన్ని ఇక్కడ స్మరింప జేయటం కావచ్చు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **నేష్యతి :** | **నేష్యతి** | నేష్యతః | నేష్యన్తి | |
| | నేష్యసి | నేష్యథః | నేష్యథ | |
| | నేష్యామి | నేష్యావః | నేష్యామః | |
| **విరేజుః :** | విరరాజ | విరేజతుః/విరరాజతుః | **విరేజుః/విరరాజుః** | |
| | విరేజిథ/విరరాజిథ | విరేజథుః/విరరాజథుః | విరేజ | |
| | విరరాజ | విరేజివ/విరరాజివ | విరేజిమ/విరరాజిమ. | * |

**శ్లో॥ విష్వగ్విసర్పినయనాః పరిముచ్యమాన-వక్షోజవస్త్రకబరీభరభవ్యనీవ్యః ।**
**సిఞ్జద్విభూషణగణా మిషతామలౌల్యం - నాట్యచ్ఛలేన చరణైః కణశో వితేనుః ॥51**

**అ :** గోపికానృత్యవర్ణన. -వసంతతిలక.

**అ :** విష్వక్+విసర్పినయనాః పరిముచ్యమానవక్షోజవస్త్రకబరీభరభవ్యనీవ్యః సింజద్ విభూషణగణాః నాట్యచ్ఛలేన మిషతామ్ అలౌల్యమ్ చరణైః కణశః వితేనుః.

**ప్ర :** విష్వక్-విసర్పి నయనాః : విష్వక్ = అంతట (పరితః సర్వతో విష్వక్ - హలాయుధకోశః - 874), విసర్పి = ప్రసరిస్తున్న, నయనాః = కన్నులు గలవారు (విష్వక్ విసర్పీణి నయనాని యాసాం తాః), పరిముచ్య... నీవ్యః : పరిముచ్యమాన = విడువబడుతున్న/ ముడివీడుతున్న (పరి+ముచ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), వక్షోజ-వస్త్ర = స్తనపట్టికయు, కబరీ భర = నిండైన కొప్పు, భవ్య = శోభిస్తున్న, నీవ్యః = కోకముడి గలవారునూ, పరిముచ్యమానం వక్షోజయోః వస్త్రం, కబర్యాః భారః భవ్యా చ నీవీ యాసాం తాః), సింజద్-విభూషణ - గణాః : సింజద్=శబ్దిస్తున్న, విభూషణ=ఆభరణాలయొక్క, గణాః= సమూహం గలవారును (సింజన్ విభూషణానాం గణః యాసాం తాః) అయిన గోపికలు, నాట్య-ఛలేన = నర్తనమనే సాకుతో, మిషతామ్ = చూచువారియొక్క, అలౌల్యమ్ = ధైర్యాన్ని, చరణైః = కాళ్ళతో, కణశః = పొడిపొడిగా, వితేనుః = చేశారు. (వి-తనూ విస్తారే పరస్మైపది - లిట్ - ప్ర.బ.)

**తా ॥** గోపికలు అంతటా - అన్నివైపులా - చూస్తున్నారు. వాళ్ళ స్తనపట్టికలూ, కేశపాశాలూ, కోకముళ్ళు జారుతున్నాయి. వారి ఆభరణాలు గలగలా చప్పుడు చేస్తున్నాయి. ఆ రీతిగా వాళ్ళు నాట్యం చేస్తూ తమనే చూస్తున్న సిద్ధుల ధైర్యాన్ని కొల్లగొట్టారు.

**వి :** 1. పరిముచ్యమాన - శిథిలమవుతున్న, ఈ లక్షణాన్ని వక్షోజవస్త్రాలకూ, కబరీ భారాలకూ, నీవీబంధాలకూ కూడా అన్వయింపజేశాడు కవి. మూడూ ప్రకృతాంశాలే. కాబట్టి ఇది తుల్యయోగితాలంకారం. "**వర్ణ్యానామితరేషాం ధర్మైక్యం తుల్యయోగితా**"-కు. 44)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **తేనుః :** | వితతాన | వితేనతుః | **వితేనుః** | |
| | వితేనిథ | వితేనథుః | వితేన | |
| | వితతాన/వితతన | వితేనివ | వితేనిమ. | * |

**శ్లో॥ కృష్ణాంసవిన్యస్తకరాబ్జమాలా - హృష్టా స్త్రియస్తా ననృతుః సలీలాః ।**
**ఆనన్దమూర్తిం పరిరభ్య మర్త్యః - కో నామ నో నృత్యతి సిద్ధకృత్యః ॥ 8-52**

**అ :** గోపికలు నృత్యమాడి ఆనందించుట. -ఇంద్రవజ్ర.

**అ :** కృష్ణ+అంసవిన్యస్తకర+అబ్జమాలా హృష్టాః సలీలాః తాః స్త్రియః ననృతుః. ఆనందమూర్తిం పరిరభ్య సిద్ధకృత్యః కో నామ మర్త్యః నో నృత్యతి.

ప్ర : కృష్ణాంస... హృష్టాః : కృష్ణ=కృష్ణునియొక్క, అంస=మూపుపై, విన్యస్త = నిలిపిన, కర+అబ్జ = చేయి తామరల, మాలాః = మాలలతో, హృష్టాః = ఆనందించినవారును, స-లీలాః = విలాసవతులును అయిన, తాః స్త్రియః = ఆ గోపకాంతలు, ననృతుః = నాట్యమాడిరి. ఆనందమూర్తిమ్ = ఆనందమే స్వరూపమైన కృష్ణుని (ఆనందః మూర్తిః యస్య, తమ్), పరిరభ్య = కౌగిలించుకొని (పరి-రభి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సిద్ధ-కృత్యః = పని ఫలించిన (సిద్ధం కృత్యం యస్య సః), కో నామ మర్త్యః = ఏ మనిషి, నో నృత్యతి? = నాట్యమాడదు? (నృతీ గాత్రవిక్షేపే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని భుజస్కంధాలపై తమ కరారవిందమాలలను నిలిపి ఆనందించిన ఆ గోపవనితలు విలాసంగా నాట్యం చేశారు. అవును మరి. ఆనందమూర్తిని కౌగిలించుకొని ధన్యుడయిన ఏ మనిషి నాట్యం చేయడు?

**వి :** 1. కృష్ణుడు పరమాత్మ. పరమాత్మ ఆనందమూర్తి

"**ఆనందో బ్రహ్మేతి వ్యజనాత్**. ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే. ఆనందేన జాతాని జీవన్తి. ఆనందం ప్రయన్త్యభిసంవిశన్తి " - తైత్తిరీయోపనిషత్తు - భృగువల్లి - 6

| | | | |
|---|---|---|---|
| 2. **ననృతుః :** | ననర్త | ననృతతుః | **ననృతుః** |
| | ననర్తిథ | ననృతథుః | ననృత |
| | ననర్త | ననృతివ | ననృతిమ |
| **నృత్యతి :** | **నృత్యతి** | నృత్యతః | నృత్యన్తి |
| | నృత్యసి | నృత్యథః | నృత్యథ |
| | నృత్యామి | నృత్యావః | నృత్యామః. |

*

**శ్లో॥ ఆబధ్య ముక్తగణవల్లభకణ్ఠమేకా - బాలా విముక్తకబరీభరబన్ధనాయ ।**
**చక్రే న యత్నమలసా గురుకార్యలాభే - లఘ్వర్థసాధనకృతిర్నహి దృష్టపూర్వా ॥53**

**అ :** ఒక గోపిక గురుకార్యసిద్ధితో లఘుకార్యాన్ని లెక్కింపక పోవటం. -వసంతతిలక.

**అ :** ఏకా బాలా ముక్తగణవల్లభకంఠమ్ ఆబధ్య విముక్తకబరీబంధనాయ అలసా (సతీ) యత్నం న చక్రే. గురుకార్యలాభే (సతి) లఘు+అర్థసాధనకృతిః దృష్టపూర్వా నహి.

ప్ర : ఏకా బాలా = ఒకానొక పడుచు, ముక్త-గణ-వల్లభ-కంఠమ్ : ముక్త = బంధం నుండి విడివడిన వారియొక్క, గణ = సమూహానికి, వల్లభ = ప్రియుడైన కృష్ణునియొక్క, కంఠమ్ = మెడను (ముక్తానాం గణః, తస్య వల్లభః, తస్య కంఠః, తమ్ లేదా - ముక్తానాం గణః వల్లభః యస్య సః, తస్య కంఠః, తమ్), ఆబధ్య = (చేతితో) బిగించి, విముక్త-కబరీ-భర-బంధనాయ : విముక్త = విడివడిన, కబరీభర = కొప్పును, బంధనాయ = బిగించుటకు (విముక్తస్య కబర్యాః భరస్య బంధనం, తస్మై), అలసా (సతీ) = ఓపిక లేనిదై, యత్నమ్ = ప్రయత్నాన్ని, న చక్రే = చేయలేదు (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), గురు-కార్య-లాభే : గురు = గొప్పదైన, కార్య=పనియొక్క, లాభే సతి = లాభముండగా (గురు చ తత్ కార్యం, తస్య లాభః తస్మిన్), లఘు+అర్థ-సాధన- కృతిః : లఘు =తేలికైన (చిన్నదైన), అర్థ = ప్రయోజనాన్ని, సాధన = సాధించుటకు, కృతిః = ప్రయత్నం (లఘుశ్చ అసౌ అర్థః, తస్య సాధనం, తస్మిన్ కృతిః), దృష్ట-పూర్వా = గతంలో చూచినది (పూర్వం దృష్టా దృష్టపూర్వా), న- హి = లేదు గదా!

**తా ॥** ఒకానొక గోపకాంత ముక్తులకు ఇష్టుడైన కృష్ణునియొక్క మెడను చేతులతో బిగించి జారిపోతున్న కొప్పును సవరించుకొనే ప్రయత్నం చేయలేదు. నిజమే మరి. పెద్దపని సిద్ధించే సమయంలో చిన్న పనికోసం ప్రయత్నం చేయటం ఇంతకు ముందెప్పుడూ చూడలేదు.

**వి :** 1. కృష్ణుడు ముక్తజనవల్లభుడు, ముక్తజనులకు వల్లభుడని **తత్పురుషసమాసం** కన్న, ముక్తజనులు వల్లభుడైన వాడు అని **బహుబ్రీహిసమాసం** అందంగా వుంటుంది. తత్పురుషం చెపితే ముక్తుల మనస్సు తెలుస్తోంది కానీ కృష్ణుని మనస్సు తెలియదు. బహుబ్రీహి అయితే కృష్ణుని మనస్సు తెలుస్తుంది ముక్తజనులను తానిష్టపడతాడని.

శ్లో॥ తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।
ప్రియో హి జ్ఞానినోఽ త్యర్థమహం స చ మమ ప్రియః ॥

శ్లో॥ బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే ।
వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః ॥ – భగవద్గీత 7/17,19

అటువంటి ముక్తజనవల్లభుని కంఠాన్ని బంధించి ఆ గోపకాంత కొప్పు బిగించటం లెక్క చేయలేదు. ఆమె ఆ కంఠాన్ని బిగించింది కానీ అందులో ఆయన చిక్కువడ్డాడా? అన్నది ఆలోచింపవలసిన విషయం. ఇదంతా బహుబ్రీహి సమాసంతోనే సాధ్యం.

2. ఈ శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది. కృష్ణ కంఠలాభంతో గోపిక కబరీభారాన్ని తృణీకరించటం విశేషం. గురుకార్యలబ్ధివున్నప్పుడు అల్పకార్యప్రయత్న ముండదన్నది సామాన్యం. రెండింటినీ సమాంతరంగా వాడటం అర్థాంతరన్యాసం. '**ఉక్తి రర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**' – (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే |
| | చక్రే | చకృవహే | చకృమహే. |

*

**శ్లో॥ కృష్ణాలిఙ్గన భఙ్గశఙ్కిహృదయాః స్రస్తం కచం ప్రచ్యుతం**
**వక్షోజామ్బరముద్గతామపి న తా నీవీం బబన్ధుః కిల ।**
**తద్భర్త్రా రతిసూచకం మృగదృశో దృష్ట్వా ప్రహృష్టాననా-**
**రత్యంతోచితకర్మ చక్రురమతం నైవేతి చేతో మమ ॥ 8-54**

**అ :** కవి గోపికల ఆంతర్యాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేయటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణ+ఆలింగనభంగశంకిహృదయాః తాః స్రస్తం కచం ప్రచ్యుతం వక్షోజ+అంబరమ్ ఉద్గతాం నీవీమ్ అపి న బబన్ధుః కిల. భర్త్రా రతిసూచకం తత్ దృష్ట్వా ప్రహృష్ట+ఆననాః మృగదృశః అమతం రతి+అంత+ఉచితకర్మ న ఏవ చక్రుః ఇతి మమ చేతః

**ప్ర :** కృష్ణ+... హృదయాః : కృష్ణ = కృష్ణునియొక్క, ఆలింగనమ్ = కౌగిలింతయొక్క, భంగ=భంగపాటును, శంకి=సంశయిస్తున్న, హృదయాః = మనస్సుగల (కృష్ణస్య ఆలింగనం, తస్య భంగః, తం శంకతే ఇతి తత్ హృదయం యాసాం తాః), తాః = ఆ గోపకాంతలు, స్రస్తమ్ = జారినట్టి, కచమ్ = జుట్టును, ప్రచ్యుతమ్ = తొలగినట్టి, వక్షోజ+ అంబరమ్ = పయ్యెదను, ఉద్గతామ్ = సడలుతున్న, నీవీం చ = కోకముడినీ, న బబన్ధుః కిల = బిగించలేదు కదా! (బధి సంయమనే పరస్మైపది–లిట్–ప్ర.బ.), భర్త్రా = భర్తతో/ ప్రభువుతో, రతిసూచకమ్ = కలయికను సూచించే (రతేః సూచకం తత్), తత్ = ఆ అనుభావ–జాతమంతా, దృష్ట్వా = గమనించి (దృశ్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), ప్రహృష్ట+ఆననాః : ప్రహృష్ట=వికసించిన, ఆననాః=ముఖాలు గల ఆ (ప్రహృష్టాని ఆననాని యాసాం తాః), మృగదృశః = మృగాక్షులు (మృగస్య దృగివ దృక్ యాసాం తాః), అమతమ్ = నచ్చని, రతి+అంత+ఉచిత–కర్మ : రతి = కలయికయొక్క, అంత = చివరలో, ఉచిత = తగినట్టి, కర్మ = పనిని, న చక్రుః ఏవ = చేయనే లేదని (కృ కరణే – పరస్మైపది – లిట్ – (ప్ర.బ.), ఇతి = అని, మమ = నాయొక్క (కవి ప్రతిపాదన), చేతః = ఆలోచన /అభిప్రాయం.

**తా ॥** కృష్ణుని కౌగిలింతలో ఎడబాటు కలుగుతుందేమో అన్న శంకతో ఆ మృగాక్షులు జారిన కొప్పును గానీ, తొలగిన పయ్యెదను కానీ, సడలుతున్న నీవీబంధాన్ని కానీ, సవరించుకోలేదు. కృష్ణునితో రతిని సూచించే ఆ అనుభావాలను గమనించి ఆనందించిన ఆ గోపికలు కలయికకు తరువాత చేయవలసిన పనులను కలయికకు ముందు చేయ దలచలేదని నా అభిప్రాయం.

**వి :** 1. ఈ జారుబాటులనూ, వాటిని సవరించటానికి బుద్ధిపుట్టకపోవటమటుంచి అది వీలు కానిదేమో అన్న భావాన్ని కలిగిస్తూ చేమకూర వేంకటకవి ఒక అందమైన పద్యాన్ని అందించారు.

ఉ. శయ్యకుఁ దార్పఁగాఁ దుఱుము జాఱెనదంతటఁ జక్కదిద్దఁ బోఁ
బయ్యెద జాఱె నయ్యదిరిపాటునఁ గ్రక్కున నీవిజాఱె రా
జయ్యెడ నవ్విలాసిని యొయారముఁ జూచి కవుంగిలించె నౌ
నె య్యెడ మేలె చూతురు గ్రహింపరు జాణలు జాఱుపాటులన్. – విజయవిలాసము 1/107

2. క. హరితనుసంగసుఖంబునఁ
బరవశలై వ్రేత లెల్ల బయ్యెదలు నిజాం
బరములు నెఱుఁగమి చోద్యమె?
సురసతు లీక్షించి కరఁగి చొక్కిరి మింటన్. – పోతన భాగవతము 10/1095

3. **బబన్ధ :**

| | | | |
|---|---|---|---|
| | **బబన్ధ** | బబన్ధతుః | బబన్ధుః |
| | బబన్ధిథ/బబన్ధ | బబన్ధథుః | బబన్ధ |
| | బబన్ధ | బబన్ధివ | బబన్ధిమ |
| **చక్రుః :** | చకార | చక్రతుః | **చక్రుః** |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |

*

**శ్లో॥ కాచిచ్చుచుమ్బే కమలేక్షణస్య – కారుణ్యసిన్ధోః కరమబ్జనేత్రా ।**
**ఆశ్లిష్య కణ్ఠం బత! పూర్వవన్మాం – స్వీయాం న ముఞ్చేతి తమఞ్చయన్తీ ॥8-55**

**అ :** మరొక గోపవనిత కృష్ణుని చేతిని ముద్దాడుట. –ఇంద్రవజ్ర.

**అ :** అబ్జనేత్రా కాచిత్ కారుణ్యసింధోః కమలేక్షణస్య కరమ్ కంఠమ్ ఆశ్లిష్య పూర్వవత్ బత స్వీయాం న ముంచ ఇతి తమ్ అంచయన్తీ ఇవ చుచుంబే.

**ప్ర :** అబ్జ–నేత్రా = తామరవంటి కన్నులు గల (అబ్జే ఇవ నేత్రే యస్యాః సా), కాచిత్ = ఒకానొక గోపిక, కారుణ్య–సింధోః = దయాసముద్రుడైన (కారుణ్యే సింధుః ఇవ, తస్య), కమల+ఈక్షణస్య = కమలాక్షునియొక్క (కృష్ణునియొక్క) (కమలే ఇవ ఈక్షణే యస్య తస్య), కరమ్ = చేతిని, కంఠమ్ = (నా) మెడను, ఆశ్లిష్య = కౌగిలించి, పూర్వవత్ = అంతకు ముందువలె, బత = ఓయీ కృష్ణా!, స్వీయామ్ = నీ దాననైన, మామ్ = నన్ను, న ముంచ = విడువ వద్దు, ఇతి = అని, అంచయన్తీ ఇవ = అభ్యర్థిస్తున్నట్లుగా, చుచుంబే = ముద్దాడింది. (చుంబ వక్త్రసంయోగే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక పద్మాక్షి దయాసాగరుడైన కమలాక్షుని చేతిని పట్టుకొని 'నా మెడ కౌగిలించుకొని ఇంతకుముందులాగా నీ దాననైన నన్ను వదలకూడదోయ్' అని బ్రతిమిలాడు తున్నట్లు దానిని ముద్దాడింది.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **చుచుంబే : చుచుంబే** చుచుంబాతే | చుచుంబిరే | | |
| చుచుంబిషే | చుచుంబాథే | చుచుంబిధ్వే | |
| చుచుంబే | చుచుంబివహే | చుచుంబిమహే | |
| **ముంచ :** ముంచతు/ముంచతాత్ | ముంచతామ్ | ముంచన్తు | |
| **ముంచ**/ముంచతాత్ | ముంచతమ్ | ముంచత | |
| ముంచాని | ముంచావ | ముంచామ. | * |

**శ్లో॥ శ్రీలోలకోమలకపోలవిలగ్న గణ్డ**
**లోలం కయాऽప్యబలయాऽऽననమన్యవధ్వాః ।**
**జఘ్నే స్వవక్త్రగతవీటికయా తదేవ**
**కృష్ణస్య సూచకమభూదివ దిత్సతస్తామ్ ॥ 8-56**

**అ :** తన నోటి తమ్మలంతో ఒక గోపిక మరొక గోపికను కొట్టడం. -వసంతతిలక.

**అ :** శ్రీలోలకోమలకపోలవిలగ్నగండలోలమ్ అన్యవధ్వాః ఆననం కయా అపి అబలయా స్వవక్త్ర గత వీటికయా జఘ్నే. తదేవ తాం దిత్సతః కృష్ణస్య సూచకమ్ అభూద్ ఇవ.

**ప్ర :** శ్రీ... లోలమ్ : శ్రీ = లక్ష్మియందు, లోల = ఆసక్తిగల కృష్ణునియొక్క, కోమల = మృదువైన, కపోల = చెక్కిలిపై, విలగ్న = ఆనిన, గండ = చెక్కిలితో, లోలమ్ = లాలసతతో కూడి (లోలుభం లోలుపం లోలం లాలసం లంపటం విదుః - హలాయుధకోశః - 353), అన్యవధ్వాః : అన్య = మరొక, వధ్వాః = పడతియొక్క (అన్యా చ సా వధూః తస్యాః), ఆననమ్ = ముఖం, కయా+అపి = ఒకానొక, అబలయా = అబలచే, స్వ-వక్త్ర-గత-వీటికయా : స్వ = తనయొక్క, వక్త్రగత=నోటి యందలి, వీటికయా = తమ్మలంతో (స్వస్య వక్త్రం, తస్మిన్ గతా చ సా వీటికా, తయా), జఘ్నే = కొట్టబడింది. (హన హింసాగత్యోః - కర్మణి - ఆత్మనేపది - లిట్ - ప్ర.ఏ.), తద్+ఏవ = అదియే, తామ్ = నోటిలోని తాంబూలాన్ని, తస్యాః = ఆమెకు, దిత్సతః = ఇవ్వగోరుతున్న (దాతుమ్ ఇచ్ఛతః) కృష్ణునకు, సూచకమ్ = దారిచూపునదిగా, అభూద్-ఇవ = అయినట్లుంది (భూ సత్తాయామ్ - భ్వాది - పరస్మైపది - లుజ్ - ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక లక్ష్మిపైని అనురాగంతో కోమలమైన కృష్ణుని చెక్కిలిపై చెక్కిలి చేర్చి మరొక గోపికను తన నోటి వీటికతో కొట్టింది. అది తన నోటి తాంబూలాన్ని ఆ గోపికకు ఇవ్వగోరుతున్న కృష్ణునకు మార్గదర్శకమైంది.

**వి :** 1. గోపికా కృష్ణుల అనుభావాలుగా వివిధ శ్లోకాలలో భాగవతంలో వర్ణించిన వాటిని పోతన ఒక సీసపద్యంలో అమర్చాడు - పోతన భాగవతము 10/1092

సీ. చెలువ యొక్కతె చెక్కుఁ జెక్కుతో మోపిన - విభుఁడు దాంబూలచర్వితము వెట్టె
నాడుచు నొకలేమ యలసినఁ బ్రాణేశుఁ-డున్నతదోస్తంభ మూఁత సేసెఁ
జెమరించి యొకభామ సేరినఁ గొనగోరఁ - జతురుఁడు కుచఘర్మజలము వాపె
నలకంబు లొక యింతి కలికచిత్రకరేఖ - నంటినఁ బ్రియుఁడు వాయంగ దువ్వెఁ

ఆ. బడఁతి యొకతె పాటపాడి డస్సిన యధ-రామృతమున నాథుఁ డాదరించె
హార మొక్క సతికి నంసావృతం బైనఁ - గాంతుఁ దురముఁ జేర్చి కౌఁగిలించె.

| | | | |
|---|---|---|---|
| 2. **జఘ్నే :** | **జఘ్నే** | జఘ్నాతే | జఘ్నిరే |
| | జఘ్నిషే | జఘ్నాథే | జఘ్నిధ్వే |
| | జఘ్నే | జఘ్నివహే | జఘ్నిమహే |

**అభూత్ :** 8-47వశ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ విలాసమస్యాం వరసిద్ధసత్కృతా-విలాఽసమస్యామ్బరసిద్ధసత్కృతా ।**
**తతాన వీణాధ్వనిగానవిద్యయాఽఽ-తతా నవీనాధ్వని గానవిద్యయా ॥ 8-57**

**అ :** ఒకానొక గోపిక కృష్ణునితో కలిసి పాడుట. -వంశస్థం.

**ప :** విలాసమ్, అస్యాం, వరసిద్ధసత్కృత+ఆవిలా,అసమస్య, అంబరసిద్ధసత్కృతా ।
తతాన, వీణాధ్వని, గానవిద్యయా,ఆతతా (సతీ), నవీన+అధ్వని, గానవిత్, యయా॥

**ప్ర :** అస్యామ్ = ఈ రాసక్రీడలో, వరసిద్ధ... విలా : వర = వరంచేత, సిద్ధ = దొరికిన, సత్కృత = పుణ్యంచేత, ఆవిలా = కలిసినదియు (వరేణ సిద్ధేన సత్కృతేన ఆవిలా), అంబరసిద్ధసత్కృతా : అంబర=ఆకాశమందలి, సిద్ధ=సిద్ధులచే, సత్కృతా = సత్కరింప-బడినదియు (అంబరే సిద్ధైః సత్కృతా), (కాచిత్ = ఒకానొక గోపిక), వీణా-ధ్వని-గాన-విద్యయా : వీణాధ్వని = వీణాధ్వని వంటిదైన, గానవిద్యయా = గానవిద్యచే (పాడుటచే), ఆతతా (సతీ) = అంతటా నిండినదై, అసమస్య = సాటిలేని కృష్ణునియొక్క, విలాసమ్ = (రాస) గానక్రీడను, తతాన = విస్తరిల్లజేసింది. (తనూ విస్తారే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.), యయా = ఎవర్తెచే, నవీన+అధ్వని = (లోకం) క్రొత్త బాటలో, గానవిత్ = గానమెరిగినదిగా, (అభూత్ = అయ్యిందో!)

**తా ॥** ఒకానొక గోపిక ఆ రాసక్రీడలో ఏదో వరంచేత సిద్ధించిన పుణ్యఫలంతో కూడినదై గగనసీమయందున్న సిద్ధులచే సత్కరింపబడిన గానవిద్యతో అంతటా నిండి కృష్ణగానంతో సమానంగా నిలిచింది. ఆమె కంఠం వీణాధ్వనివలె మనోహరంగా వుంది. ఆమె ద్వారా లోకం క్రొత్తబాటలో పాట పాడటం నేర్చుకొన్నది.

**వి :** 1. ఈ శ్లోకంలో గోపిక ప్రదర్శించిన శృంగారచేష్ట లీల. "**ప్రియానుకరణం లీలా మధురాంగవిచేష్టితైః**" - ఆంగికచేష్టలతో ప్రియుని అనుకరించటం లీల. ఇక్కడ గోపిక గానంతో కృష్ణుని అనుకరించింది.

2. **తతాన :** 8-41వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ భర్తుర్మృదుస్వరకృతానుకృతిః స్వగీతం**
**విస్తార్య హృద్యకలకణ్ఠవధూరివాద్ధా ।**
**ముగ్ధీభవత్సు సకలేషు ముకున్దవక్త్రం**
**స్నిగ్ధా చుచుమ్బ రహసీవ విశఙ్కమేకా ॥ 8-58**

**అ :** ఒకానొక గోపిక తన గానంతో అందరినీ పరవశింపజేసి కృష్ణుని ముద్దాడుట.

**అ :** భర్తుః మృదుస్వరకృత+అనుకృతిః ఏకా హృద్యకలకంఠవధూః+ఇవ స్వగీతం విస్తార్య సకలేషు ముగ్ధీభవత్సు అద్ధా రహసి+ఇవ విశంకం స్నిగ్ధా (సతీ) ముకుందవక్త్రం చుచుంబ.

**ప్ర :** భర్తుః=ప్రభువైన కృష్ణునియొక్క, మృదుస్వరకృత+అనుకృతిః : మృదు = కోమలమైన, స్వర=కంఠంతో, కృత=చేయబడిన, అనుకృతిః = అనుకరణగలదై (మృదునాం స్వరేణ కృతా అనుకృతిః యయా సా), హృద్య-కలకంఠ-వధూః+ఇవ : హృద్య = మనోహరమైన, కలకంఠ-వధూః ఇవ = ఆడుకోయిలవలె, స్వగీతమ్ = తన పాటను (స్వస్య గీతమ్), విస్తార్య = వ్యాపింపజేసి, సకలేషు = అందరూ, ముగ్ధీభవత్సు = పరవశులు కాగా, అద్ధా = వెంటనే (అద్ధా యథార్థం తత్త్వమ్ అంజసా - హలాయుధకోశః - పుట 114), రహసి+ఇవ = ఏకాంతంలో వలె, విశంకమ్ = కొంకు లేకుండా (విగతా శంకా యథా తథా), స్నిగ్ధా (సతీ) = స్నేహశీలయై, ముకుందవక్త్రమ్ = కృష్ణుని ముఖాన్ని, చుచుంబ = ముద్దాడింది. (చుంబ వక్త్రసంయోగే - పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక కృష్ణుని మృదుస్వరాన్ని అనుకరిస్తూ మనోరంజకంగా ఆడుకోయిల వలె తన గీతాన్ని విస్తరింపజేసి మిగిలిన వారినందరినీ మైమరచిపోయేటట్లు చేసింది. ఆ వెంటనే ఏకాంతమన్నట్లుగా ఏ కొంకూ లేకుండా స్నేహపూర్వకంగా కృష్ణుని ముఖాన్ని ముద్దాడింది.

**వి :** 1. **కలకంఠవధూరివ – 'పికః కూజతి పంచమమ్'**

శ్లో॥ వాయుస్సముత్థితో నాభేరురోహృత్కంఠమూర్ధసు ।
సంచరన్ పంచమస్థానప్రాప్త్యా పంచమ ఉచ్యతే ॥ – అమరకోశః –నాట్యవర్గం

"నాభి, ఉరము, హృదయము, కంఠము, శిరస్సు అను అయిదు స్థానములందును బుట్టినది. కోయిలలచే విస్తరింపఁబడునది. సప్తస్వరములలో నొకటి" – (ఆంధ్రవాచస్పత్యము పుట – 1646)

2. పారిజాతాపహరణంలో సత్యభామ ఏడుపును వర్ణించటానికి తిమ్మన కూడా **కలకంఠ వధువు**నే ఎన్నుకొన్నాడు.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాస కషాయకంఠ **కలకంఠవధూ** కలకాకలీధ్వనిన్.– పారిజాతాపహరణం – 1/133

మనోహరంగా పాడబడగలిగింది మగకోయిలే కానీ ఆడకోయిల కాదన్నది శాస్త్రీయ నిర్ణయం – ఆడుకోయిల అందంగా పాడిందని వర్ణించటం కవిసమయం.

3. ఈ సన్నివేశాన్ని నారాయణభట్టతిరి ఇలా వర్ణించాడు.

శ్లో॥ కాచిత్ కుచే పునరసజ్జితకంచులీకా – వ్యామోహతః పరవధూభిరలక్ష్యమాణా ।
త్వామాయయౌ నిరుపమప్రణయాతిభార – రాజ్యాభిషేకవిధయే కలశీధరేవ ॥

– నారాయణీయమ్ 65/6

| | | | |
|---|---|---|---|
| 4. **చుచుంబ :** | **చుచుంబ** | చుచుంబతుః | చుచుంబుః |
| | చుచుంబిథ | చుచుంబథుః | చుచుంబ |
| | చుచుంబ | చుచుంబివ | చుచుంబిమ. |

*

**శ్లో॥ కిమాప్తకామస్య తవాభిరీశ! – తథాపి నస్తోషయసే విలాసైః ।**
**ఇతీరయంతీవ కరం మురారేః – స్తనే న్యధాత్ కాపి బలేన బాలా ॥ 8–59**

**అ :** ఒకానొక గోపిక కృష్ణుని చేతిని తన రొమ్ముపై నుంచుకొనుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశ! ఆప్తకామస్య తవ ఆభిః కిమ్? తథాపి విలాసైః నః తోషయసే. ఇతి ఈరయన్తీ కాపి బాలా మురారేః కరం స్తనే బలేన న్యధాత్.

**ప్ర :** ఈశ! = ప్రభూ! కృష్ణా!, ఆప్తకామస్య : ఆప్త = పొందబడిన, కామస్య = కోరికలు గల నీకు (ఆప్తాః కామాః యేన సః, తస్య), తవ = నీకు, ఆభిః = వీరితో, కిమ్? = పనేమిటి?, తథాపి = అయినా కూడా, విలాసైః = నీ విలాసాలతో, నః = మమ్ము, తోషయసే = ఆనందింప జేస్తున్నావు. (తుష్ ప్రీతౌ–ణిచ్–ఆత్మనేపది–లిట్–మ.ఏ.), (ఇతి = అని), ఈరయన్తీ ఇవ = చెప్తున్నట్లుగా, కా+అపి = ఒకానొక, బాలా = పడతి, ముర+అరేః = కృష్ణునియొక్క, కరమ్ = చేతిని, స్తనే = (తన) రొమ్ముపై, బలేన = గట్టిగా/విసురుతో, ని+అధాత్ = ఉంచింది. (ని–ధా ధారణ పోషణయోః పరస్మైపది – లుఙ్ – ప్ర.ఏ.)

**తా ॥** 'కృష్ణా! నీవు సకల కామనలూ సిద్ధించిన వాడవు. వారితో నీ కెందుకు? అయినా నీవు నీ విలాసాలతో మమ్ము ఆనందింపజేస్తున్నావు", అని చెప్తున్నట్లుగా కృష్ణుని చేతిని బలంగా తన రొమ్ముపై నిలుపుకొన్నది.

**వి :** 1. ఈ శ్లోకానికి మూలం–

శ్లో॥ నృత్యన్తీ గాయతీ కాచిత్ – కూజన్నూపురమేఖలా ।
పార్శ్వస్థాచ్యుతహస్తాబ్జం – శ్రాంతాధాత్ స్తనయోః శివమ్ ॥ – భాగవతం 10/33/14

ఈ శ్లోకంలోని ద్వితీయార్థం ప్రస్తుతశ్లోకానికి మూలం.

కృష్ణుని చేతిని తన రొమ్ముపై నుంచుకోవటమంటే శృంగారచేష్టామాత్రమేనా? కాదంటారు కొందరు. అది తన గుండెలలోని భక్తిలోని గాఢతను పరీక్షించమనటం కావచ్చునేమో?

"కవిభూషణుడు" భక్తిని స్తనములను పోల్చి స్తనములు అనగా భక్తి అని అర్థము చెప్పవలెనని సూచించినాడు.

శ్లో॥ "ప్రథమముదితా కించిత్పశ్చాద్వివృద్ధిముపేయుషీ
హరతి హృదయం పుంసః కాఠిన్యభాగపి భోగదా ।
యదియమనఘా భక్తిః కాలేన యాత్యపి మార్దవం
తదగణిబుధైః గౌణ్యా వృత్త్యా కుచాదిపదైః ధ్రువమ్ ॥

(ముందు కొద్దిగా పుడుతుంది. తరువాత పెరుగుతుంది. పురుషుని మనస్సు లాగుతుంది. కఠినమయినా మంచిభోగం కలిగిస్తుంది. కొంతకాలానికి మృదువుగా మారుతుంది. ఇదంతా భక్తి లక్షణం. ఇదే స్తన లక్షణము కూడా. అందువలన పండితులు పరోక్షపద్ధతిలో దీనిని 'స్తనం' మొదలయిన పదాలతో సూచించుతారు.)

ఈ విషయము వాసుదాసు గారు ఉదాహరించినట్లు గుర్తు–

(శ్రీ కృష్ణరాసలీల – యోగత్రయీహేల పుట – 180) – మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

| | | | |
|---|---|---|---|
| 2. **తోషయసే :** | తోషయతే | తోషయేతే | తోషయన్తే |
| | **తోషయసే** | తోషయేథే | తోషయధ్వే |
| | తోషయే | తోషయావహే | తోషయామహే |
| **న్యధాత్ :** | **న్యధాత్** | న్యధాతామ్ | న్యధుః |
| | న్యధాః | న్యధాతమ్ | న్యధాత |
| | న్యధామ్ | న్యధావ | న్యధామ. |

*

**శ్లో॥ ఉరోజయుగ్మాఙ్కితకుఙ్కుమాఙ్క–మసావసాధారణమాత్మభర్తుః ।**
**కరే స్థిరీకృత్య చకార చారుం – తమన్యమానిన్యభిరుచ్యయోగ్యమ్ ॥ 8–60**

**అ :** గోపిక తన చేష్టతో కృష్ణుని ఇతరులకు దగ్గర కానీకుండా చేయటం.

**అ :** అసౌ అసాధారణమ్ ఉరోజయుగ్మ+అంకితకుంకుమ+అంకమ్ ఆత్మభర్తుః కరే స్థిరీకృత్య చారుం తమ్ అన్యమానినీ+అభిరుచి+అయోగ్యం చకార.

**ప్ర :** అసౌ = ఆ గోపిక, అసాధారణమ్ = మామూలుగా లేని (సాధారణః న భవతీతి, తమ్), తమ్ = ఆ కృష్ణుని, ఉరః+జ–యుగ్మ+అంకిత+కుంకుమ+అంకమ్ : ఉరోజ = స్తనాలయొక్క, యుగ్మ=జంటపై, అంకిత=అలదిన, కుంకుమ=కుంకుమచే, అంకమ్= గుర్తుగలవానిని, ఆత్మ–భర్తుః = తన వల్లభునియొక్క (ఆత్మన భర్తా తస్య), కరే = చేతియందు, స్థిరీకృత్య = నిలిపి, చారుమ్ = అందమైన (సౌమ్యం సాధు చ వల్గు చారు సుషమం –

హలాయుధకోశః -689), తమ్ = ఆ చేతిని, అన్య-మానినీ+అభిరుచి+ అయోగ్యమ్ : అన్య-మానినీ = ఇతర స్త్రీలయొక్క, అభిరుచి = ఆసక్తిని, అయోగ్యమ్ = తగని దానినిగా, చకార = చేసింది. (కృ కరణే పరస్మైపది - లిట్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని చేతిని తన స్తనంపై బలంగా నిలుపు కొన్న ఆ గోపిక తన వక్షోజాల మీదనున్న కుంకుమ గుర్తులు గల ఆ అసాధారణమైన వానిని తన వల్లభుడైన కృష్ణుని చేతిలో స్థిరంగా నిలిపి ఇతరస్త్రీల అభిరుచులకు ఆయనను అనర్హుని చేసింది.

**వి :** 1. ఈ శ్లోకంలో కొంత అస్పష్టత వుంది. కృష్ణుని చేతిలో స్థిరీకరింపబడినది ఏమిటి? స్పష్టంగా తెలియటం లేదు. తన రొమ్మునే అలా నిలపిందందామంటే 'ఉరోజయుగ్మాంకిత' పదం అడ్డు తగులుతోంది. పోనీ కృష్ణునే అందామంటే కృష్ణుని కృష్ణుని చేతిలో స్థిరీకరించట మెలా అన్న సంశయానికి అవకాశమిస్తోంది. శ్లోకానికి పాఠాంతరాలు కూడా లేవు.

2. కృష్ణుని కుంకుమ చిహ్నం గల వానిని చేయటంలో తన సొంతమన్న అభిప్రాయం ప్రకటించటమొకటి - తానే బొట్టు పెట్టింది కాబట్టి. అందువల్ల ఇతర మానినులకు ఆసక్తి కలగదని.

రెండవ అంశం - కుంకుమాంకితుడైన భర్తను (దక్షిణనాయకుని) చూస్తే నాయికలు - ఖండితలు (జ్ఞాతేఽన్యాసంగవికృతే ఖండితా ఈర్ష్యా కషాయితా - అన్యకాంతతో కలిసిన గుర్తులు కనిపిస్తే ఈర్ష్యతో ఆక్రోశించే స్త్రీ ఖండిత) ఆ నాయకునిపై అభిరుచిని పెంచుకోరని.

3. **చకార :** 8-54వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ముదావహో భాసురగీతశోభా - విభాతి వృందావనరాసలీలా ।**
**హరేశ్చ మూర్తిః శతశోఽఙగనాల్యా-ముదావహాభాసురగీతశోభా ॥ 8-61**

**అ :** బృందావన రాసలీలా ప్రశంస. -ఉపేంద్రవజ్ర.

**ప :** ముదావహో భాసుర-గీత-శోభా విభాతి వృందావనరాసలీలా ।
హరేః చ మూర్తిః శతశః అంగనా+ఆల్యామ్-ఉద్+ఆవహ+ఆభా సుర-గీత-శోభా॥

**అ :** ముద్+ఆవహో = ఆనందాన్ని కలిగించేదీ (ముదమ్ ఆవహతి ఇతి), భాసుర-గీత-శోభా : భాసుర = ప్రకాశించే, గీత = గానంయొక్క, శోభా = శోభగలదీ (భాసురం చ తద్ గీతం, తస్య శోభా యస్యాః సా) అయిన, బృందావన-రాసలీలా : బృందావన = బృందావనమందలి, రాసలీలా = రాసక్రీడ (బృందావనే రాసలీలా), విభాతి = ప్రకాశిస్తోంది. (వి-భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), అంగనా+ఆల్యామ్ = స్త్రీ సమూహ మందు (అంగనానాః ఆలిః తస్యామ్), ఉదావహ+ఆభా-సుర-గీతశోభా : ఉద్-ఆవహ = నీటినిచ్చే మేఘంయొక్క, ఆభా = కాంతివంటి కాంతి గలదియు, (ఉదమ్ ఆవహతీతి ఉదావహః తస్య ఆభా ఇవ ఆభా యస్యాః సా), సుర-గీత-శోభా : సుర = దేవతలచే, గీత = నుతింపబడిన, శోభా = వెలుగు గలదియు అయిన, హరేః = కృష్ణుని యొక్క, మూర్తిః = స్వరూపం, ఏకా+ఏవ = ఒక్కటియే, శతశః = వందలుగా, విభాతి = ప్రకాశిస్తోంది.

**తా ॥** భాసురమైన గీతశోభ గలదై, ముదావహమై బృందావనరాసలీల శోభిస్తోంది. అంగనా సమూహంలో మేఘచ్ఛాయతో దేవతలు నుతించే తేజస్సుతో **కృష్ణస్వరూపం** వాస్తవానికి ఒకటే అయినా వందలుగా ప్రకాశిస్తోంది.

**వి :** 1. మండలాకృతిలో జరిగే రాసక్రీడలో మధ్యనున్న కృష్ణుడు తానొకడయినా తలకొకడుగా కనిపించి మురిపించటం ప్రధానాంశం. '**హరిరిహ ముగ్ధవధూనికరే** ' - గీతంలో జయదేవుడు ఈ అంశాన్నే ప్రస్తావించాడు '**శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామామ్**' - అంటూ. అయితే అక్కడ అదంతా ఒకే

సమయంలో చేసినట్లు సూచన లేదు. నారాయణీయంలో నారాయణభట్టతిరి జయదేవునిశైలీ విన్యాసంతో పోటీపడుతూ రాసక్రీడను వర్ణించాడు. - నారాయణీయమ్ 69.

శ్లో. వాసుదేవ తవ భాసమానమిహ రాసకేళిరససౌరభం
దూరతోఽపి ఖలు నారదాగదితమాకలయ్య కుతుకాకులా ।
వేషభూషణవిలాసపేశలవిలాసినీశతసమావృతా
నాకతో యుగపదాగతా వియతి వేగతోఽథ సురమండలీ ॥

శ్లో. కామినీరితి హి యామినీషు ఖలు కామనీయకవిధే భవాన్ 3
పూర్ణసమ్మదరసార్ణవం కమపి యోగిగమ్యమనుభావయన్ ।
బ్రహ్మశంకరముఖానపీహ పశుపాంగనాసు బహుమానయన్
భక్తలోకగమనీయరూప! కమనీయ! కృష్ణ! పరిపాహి మామ్ ॥ 11

2. బృందావనరాసలీలకూ, హరిమూర్తికీ 'విభాతి' అని ఏకధర్మాన్ని వర్తింపజేశాడు కాబట్టి అవి రెండూ ప్రకృతాంశాలే కాబట్టి ఇది తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' - (కు. 44)

| | | | |
|---|---|---|---|
| 3. **విభాతి :** | **విభాతి** | విభాతః | విభాన్తి |
| | విభాసి | విభాథః | విభాథ |
| | విభామి | విభావః | విభామః. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గోఽష్టమోఽయం ముదామ్॥ 8-62**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా॥** అష్టమః సర్గః - మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో అష్టమసర్గ.

**శ్రీః**





# శ్రీః
# నవమః సర్గః

శ్లో॥ మణ్డలీకృతమనోరమరామా-కుణ్డలద్యుతిసుదీపితసీమా ।
గణ్డచుమ్బనకుతూహలకామా-ఖణ్డితాననసరోరుహధామా ॥ 9-1

**అవతారిక :** రాసవిలాసవర్ణన. -స్వాగతం.

**అన్వయక్రమం :** మండలీకృత-మనోరమ-రామా-కుండలద్యుతి-సుదీపిత-సీమా. గండ-చుంబన-కుతూహల-కామ+అఖండిత+ఆనన-సరోరుహ-ధామా.

**ప్రతిపదార్థం :** మండలీకృత... సీమా : మండలీకృత = గుండ్రంగా చేయబడిన (అమండలం మండలం సంపద్యతే తత్ కృతం-మండలీకృతమ్-'**కృభ్వస్తియోగే సంపద్య కర్తరి చ్విః**' (అష్టాధ్యాయి - 5-4-50) '**అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్**' (వార్తికం 3340), మనోరమ = మనస్సుకు ఆనందకరమైన/ అందమైన (మనః రమతే ఆసు ఇతి మనోరమాః), రామా = స్త్రీలయొక్క, కుండల = చెవికమ్మలయొక్క, ద్యుతి = కాంతిచే, సుదీపిత = బాగా వెలుగ జేయబడిన, సీమా = హద్దులు గలదియు (మండలీకృతాః మనోరమాశ్చ తాః రామాః, తాసాం కుండలాని, తేషాం ద్యుతిః, తయా సుదీపితా సీమా యస్మిన్ సః), గండ... ధామా : గండ = చెక్కిలిని, చుంబన = ముద్దాడాలనే, కుతూహల = వినోదంతో (కౌతూహలం వినోదః స్యాత్కౌతుకం చ కుతూహలమ్ - హలాయుధకోశః - 720), కామ = కోరికతో, అఖండిత = విడదీయని, ఆనన-సరోరుహ =మోము తామరలయొక్క, ధామా = కాంతి గలదియు (అయిన) (గండస్య చుంబనే కుతూహలేన కామేన చ అఖండితాని ఆననాని ఏవ సరోరుహాణి, తేషాం ధామ యస్మిన్ సః), (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.)

**తాత్పర్యం :** బృందావనంలో రాసవిలాసం వర్ధిల్లుతోంది. అక్కడ గోపికలు మండలాకారంలో అలరారుతున్నారు. వారి చెవికమ్మల కాంతితో హద్దులన్నీ వెలుగొందుతున్నాయి. కృష్ణుడు ముద్దాడాలన్న కుతూహలంతో, కృష్ణుని ముద్దాడాలన్న కోపంతో చెక్కిలినుండి వెనుదీయ కుండా నిలిపిన ఆ ముఖపద్మాల కాంతి రాసక్రీడను వెలిగింపజేస్తోంది.

**విశేషాలు :** 1. ఈ శ్లోకంలోని రెండు సమాసపదాలూ విశేషణాలే. కర్తృపదమైన రాస-విలాసః, క్రియాపదమైన జయతి 11వ శ్లోకంలో వున్నాయి. అంతవరకు ఉన్న పదిశ్లోకాలూ కూడా ఆ కర్తృక్రియాపదాలతో అన్వయిస్తాయి. దీనిని **కులకం** అంటారు. ముందున్న పదం తరువాతి శ్లోకాలతో అన్వయిస్తే **పూర్వకులకం**, తరువాతి పదం ముందున్న శ్లోకాలతో అన్వయిస్తే **ఉత్తరకులకం**. వృత్తం **స్వాగతం.** *

**శ్లో॥ ముచ్యమానకబరీభరబన్ధః - ప్రోచ్యమానరసదాతృముకున్దః ।**
**ప్రథ్యమాననఖలాఞ్ఛనచన్ద్రః - కథ్యమానహరివిక్రమవృన్దః ॥ 9-2**

**అ :** రాసవిలాసవర్ణన.

**అ :** ముచ్యమాన-కబరీభర-బంధః - ప్రోచ్యమాన-రసదాతృ-ముకున్దః ।
ప్రథ్యమాన-నఖలాంఛన-చన్ద్రః - కథ్యమాన-హరివిక్రమ-బృందః (రాసవిలాసః జయతి)

**ప్ర :** ముచ్యమాన... బంధః : ముచ్యమాన = విడువబడుతున్న/ విరగబడుతున్న (ముచ్ మోక్షణే ధాతువుపై కర్మణి - శానచ్ ప్రత్యయం), కబరీ భర = కేశభారంయొక్క / ఒత్తైన వెంట్రుకలయొక్క, బంధః = కొప్పు గలదియు, (ముచ్యమానః కబర్యాః భరస్య బంధః యస్మిన్ సః), ప్రోచ్యమాన... ముకున్దః : ప్ర+ఉచ్యమాన = వినిపింపజేయబడుతున్న (ప్ర పూర్వక వచ ధాతువుపై కర్మణి శానచ్ ప్రత్యయం), రస-దాతృ = ఆనందాన్ని అందించే, ముకున్దః = కృష్ణుడు గలదియు (ప్రోచ్యమానః రసస్య దాతా చ అసౌ ముకున్దః యస్మిన్ సః), ప్రథ్యమాన... చన్ద్రః : ప్రథ్యమాన = విస్తరింపజేయబడుతున్న, (ప్రథ ధాతువుపై కర్మణి శానచ్ ప్రత్యయం), నఖ-లాంఛన = గోటి గుర్తు లనే, చంద్రః = చంద్రుడు గలదియు, (ప్రథ్యమానాని నఖస్య లాంఛనాని ఏవ చంద్రః యస్మిన్ సః), కథ్యమాన... వృందః : కథ్యమాన = శ్లాఘించబడుతున్న (కథ వాక్యప్రబంధే ధాతువుపై కర్మణి శానచ్ ప్రత్యయం), హరి = కృష్ణునియొక్క, విక్రమ = పరాక్రమంయొక్క, వృందః = సమూహం గలదియు (కథ్యమానః హరేః విక్రమాణాం వృందః యస్మిన్ సః), రాసవిలాసః = రాస క్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.

**తా ॥** రాసక్రీడలేని నాట్యసందర్భంలో ఆ గోపికల కొప్పులు జారిపోతున్నాయి. గోపికలు కృష్ణునితో ఏవేవో ఊసులు చెప్తున్నారు. గోపికల శరీరాలపై నఖలాంఛనాలనే నెలవంకలు విస్తరిస్తున్నాయి. వారు కృష్ణుని పరాక్రమవృత్తాంతాలను ప్రశంసిస్తూ మాటాడుకుంటున్నారు.

**వి :** 1. కృష్ణుని సంబంధించిన అనేక వృత్తాంతాలు బలపరాక్రమ ప్రదర్శన రూపాలు - అప్పటికే వారి అనుభవంలో ఉన్నాయి. వాటినన్నింటినీ కథలు కథలుగా చెప్పుకొంటున్నారు. అవన్నీ వింటూ అందరితో అందరుగా ఉంటూ రసదానం చేస్తున్న వాడు కృష్ణుడు. పరమాత్మ రసస్వరూపుడు కాబట్టి రసదాయిత్వం తనకే తగినది. '**రసో వై సః**' - రసగ్గ్ హ్యేవాయం **లబ్ధ్వాఽఽ ఽనందీ భవతి**' - తైత్తిరీయోపనిషత్తు - ఆనందవల్లి. *

**శ్లో॥ హృష్టరోమనికరైర్వనసత్త్వైః - దృష్టరమ్యవిభవో హృతచిత్తైః ।**
**తుష్టనిర్జరగణైర్గగనస్థై-ర్వేష్టితః స్తుతముకున్దచరిత్రైః ॥ 9-3**

**అ :** రాసవిలాసవర్ణన.

**అ :** హృష్ట-రోమ-నికరైః హృత-చిత్తైః వన-సత్త్వైః, గగనస్థైః, స్తుత-ముకుంద-చరిత్రైః తుష్ట-నిర్జర-గణైః, దృష్ట-రమ్య-విభవః, వేష్టితః (రాసవిలాసః జయతి)

**ప్ర :** హృష్ట... నికరైః:హృష్ట=పులకించిన, రోమ = వెంట్రుకల యొక్క, నికరైః = సమూహాలు గలవియు (హృష్టాః రోమ్ణాం నికరాః యేషాం తైః), హృత -చిత్తైః : హృత = అపహరింపబడిన, చిత్తైః = మనస్సుగలవియు అయిన (హృతాని చిత్తాని యేషాం తైః), వన-సత్త్వైః : వన = అడవియందలి, సత్త్వైః = జంతువులచే, గగన-స్థైః = ఆకాశమందున్న వారును (గగనే తిష్ఠన్తీతి, తైః), స్తుత... చరిత్రైః: స్తుత = పొగడబడిన, ముకుంద = కృష్ణునియొక్క, చరిత్రైః = నడవడిగలవారును అయిన, తుష్ట... గణైః : తుష్ట = ఆనందించిన, నిర్జర = దేవతలయొక్క, గణైః = సమూహాలచే (తుష్టాః నిర్జరాణాం గణాః తైః), దృష్ట... విభవః : దృష్ట = చూడబడిన, రమ్య = అందమైన, విభవః = సంపన్నత గలదియు, వేష్టితః = చుట్టుముట్టబడినదియు అయిన, రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.

**తా ॥** రాసక్రీడ జరుగుతున్నపుడు వన్యజంతువులు అన్నీ పులకించి రోమాలు నిక్కపొడుచు కున్న పరిస్థితిలో వివశత్వంతో ఆ రసనీయసంపదను చూస్తున్నాయి. దేవగణాలన్నీ ఆకాశంలో నిలిచి ముకుందుని చరిత్రను నుతిస్తూ ఆనందిస్తున్నాయి.

**వి :** 1. దేవతల ఆనందానికి కారణం రాసవిలాసదర్శనంతో పాటు ఇక అక్కడ బృందా-వనంలో, గోకులంలో కృష్ణుని కర్తవ్యం ముగింపుకు వస్తోంది అన్నది కూడా. బాలకృష్ణుడుగా తానంత వరకు చేసిన మహాకార్యాలను ప్రస్తుతించటం ఉత్తర క్రియాకలాపాలకు పునరంకితం చేయించే ప్రయత్నమే.

**శ్లో॥ స్తవ్యః స్తవప్రియః స్తుతిః స్తోతా రణప్రియః ।** - విష్ణు సహస్ర నామం -73

2. వనజంతువులు పాటలు విని స్పందించటాన్ని కవులెందరో మనోహరంగా చిత్రీకరించారు. **నాగానంద** నాటకంలో **శ్రీహర్షుడు-**

శ్లో॥ స్థానప్రాప్త్యా దధానం ప్రకటితగమకం మంద్రతారవ్యవస్థాం
నిర్హ్రాదిన్యా విపంచ్యా మిళితమళిరుతేనేవ తంత్రీస్వనేన ।
ఏతా దంతాంతరాలస్థితతృణకబలచ్ఛేదశబ్దం నిశమ్య
వ్యాజిహ్మాంగాః కురంగాః స్ఫుటలలితపదం గీతమాకర్ణయన్తి ॥ - నాగానందం 1/13*

**శ్లో॥ చారుపాదతలసన్నఖకాన్త్యా-ధీరనూపురరుచా విచరన్త్యా ।**
**సారరత్నమయమణ్డపపఙ్క్త్యా-హారిభూమివిభవో విలసన్త్యా ॥ 9-4**

**అ :** రాసవిలాసవర్ణన.

**అ :** విలసన్త్యా చారు-పాదతల-సత్+నఖ-కాన్త్యా విచరన్త్యా అధీర-నూపుర-రుచా సార-రత్న-మయ-మండప-పంక్తి+ఆహారి-భూమి-విభవః (రాసవిలాసః జయతి)

**ప్ర :** విలసన్త్యా = ప్రకాశిస్తున్న, చారు... కాన్త్యా:చారు=అందమయిన, పాదతల = అరకాలి పైకి, సత్ = ప్రసరిస్తున్న, నఖ = గోళ్ళయొక్క, కాన్త్యా = వెలుగుతోనూ, (**చారుణి పాదతలే సీదతాం నఖానాం కాంతిః, తయా**), విచరన్త్యా = కదులుతున్న , అధీర-నూపుర-రుచా : అధీర = చంచలమైన, నూపుర=గజ్జెలయొక్క, రుచా=కాంతితో (అధీరాశ్చ తే నూపురాః, తేషాం రుక్, తయా), సార... విభవః : సార = శ్రేష్ఠమైన (సారో బలే స్థిరాంశేర్థే పుమాన్ న్యాయ్యే వరే త్రిషు-నానార్థరత్నమాలా-పంక్తి-938), రత్న-మయ = రత్నాలతో వ్యాపించిన, మండప = మంటపాలయొక్క, పంక్తి = వరుసలను, ఆహారి = ప్రోది చేసికొన్న, భూమి = రాసక్రీడాప్రదేశంయొక్క, విభవః = సంపద గలదియు అగు, (రాస విలాసః = రాసక్రీడ), జయతి = వర్ధిల్లుతోంది.)

**తా ॥** గోపికా కృష్ణుల పాద నఖకాంతి పాదతలంపై ప్రసరించి ఎఱ్ఱటి కాంతిని కలిగిస్తోంది. పద్మరాగభ్రాంతిని కలిగిస్తోంది. కదులుతున్న కాలిగజ్జెల రత్నకాంతులు రత్నమయాలైన మంటపాల కాంతిని మించిపోయే రాసక్రీడాప్రాంగణంలో రాసవిలాసం వర్ధిల్లుతోంది. *

**శ్లో॥ వేణువాద్యపటునా వ్రజనారీ - మానదేన హరిణాన్తరహారీ ।**
**ఆనతాబ్జజనిమారుతగౌరీ-ప్రాణనాథనయనోత్సవకారీ ॥ 9-5**

**అ :** రాసవిలాసవర్ణన.

**అ :** వేణువాద్యపటునా వ్రజనారీ, మానదేన హరిణా+అన్తరహారీ, ఆనత+అబ్జజనిమారుత-గౌరీప్రాణనాథ-నయన+ఉత్సవకారీ (రాసవిలాసః జయతి)

**ప్ర :** వేణువాద్యపటునా: వేణు = పిల్లనగ్రోవిని, వాద్య = ఊదుటలో, పటునా = సమర్థుడును (వేణోః వాద్యం, తస్మిన్ పటుః, తేన), హరిణా=కృష్ణునిచే, అంతరహారీ:అంతర = అంతరాత్మను, హారీ = అపహరించెడిదియు (అన్తరః పరిధానీయ స్వీయ బాహ్యేషు వాచ్యవత్ - అంతరాత్మని పుంస్యేవ - నానార్థరత్నమాలా - 1941) (అంతరస్య హరణం శీలమస్యేతి), ఆనత... కారీ : ఆనత = వినయాన్ని ప్రదర్శిస్తూ వంగిన, అబ్జ-జని = బ్రహ్మ, మారుత = ముఖ్యప్రాణదేవర, గౌరీ-ప్రాణనాథ = శివుడు - వీరి యొక్క, నయన+ఉత్సవ-కారీ = కన్నుల పండువు చేయునదియు అయిన (నయనానామ్ ఉత్సవం కర్తుం శీలమ్ అస్య ఇతి) (ఆనతాశ్చ తే అబ్జజనిః మారుతః గౌర్యాః ప్రాణనాథః చ, తేషాం నయనానామ్ ఉత్సవకారీ), (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.)

**తా ॥** వేణువును ఊదుటలో నిపుణుడై వ్రజసుందరులకు ఆత్మీయతను పంచుతున్న కృష్ణునిచే రాసక్రీడ కొనసాగింపబడుతోంది. అది అంతరాత్మలను తాకుతూ అపహరిస్తోంది. వినయశీలురైన బ్రహ్మ, ముఖ్యప్రాణుడు (వాయువు), శివుడు - వీరికి కన్నుల పండువు చేస్తోంది.

**వి :** 1. అంతరహారిత్వలక్షణం పరిచితులకూ, అపరిచితులకూ కూడా ఉత్సుకతను కలిగిస్తోంది. హృదయాంతరాళాలలో ఎక్కడో తాకుతూ, తగులుతూ భావాలనూ, భావబంధాలనూ తట్టి లేపుతుంది. వేణువాదనలో నైపుణ్యప్రదర్శన మాత్రమయితే అందుకు కృష్ణుడే అవసరం లేదు. ఆ గానం ఎక్కడ ఏది అవసరమో, అక్కడ దానిని జాగృతం చేయగలగాలి. సాధారణజనులలో కూడా అటువంటిది ఎంత ప్రభావాన్ని చూపుతుందో కాళిదాసు మాటలలో చూద్దాం-

శ్లో॥ రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః ।
తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం
భావస్థిరాణి జననాంతరసౌహృదాని ॥ - అభిజ్ఞానశాకున్తలమ్ 5/2*

**శ్లో॥ పాదసఞ్చరణదర్శితతాళః - స్వాదుగీతవరవిభ్రమజాలః ।**
**మోదితద్విజమృగాఙ్ఘ్రిపశైలః - శ్రీధరేక్షణరసాయనలోలః ॥ 9-6**

**అ :** రాసవిలాసవర్ణనం.

**అ :** పాద-సంచరణ-దర్శిత-తాళః స్వాదు-గీత-వర-విభ్రమ-జాలః మోదిత-ద్విజ-మృగ-అంఘ్రిప-శైలః శ్రీధర+ఈక్షణ-రసాయన-లోలః (రాసవిలాసః జయతి)

**ప్ర :** పాద... తాళః : పాద = కాళ్ళయొక్క, సంచరణ = కదలికలచే, దర్శిత = చూపబడిన, తాళః = తాలంగలదియు (కాలవిరామాన్ని నియతితో పాటిస్తూ పాటను పాడటం తాళం) (పాదానం సంచరణేన దర్శితః తాళః యస్మిన్ సః), స్వాదు... జాలః : స్వాదు = రసనీయమైన, గీత = పాటలయొక్కయు, వర = శ్రేష్ఠమైన, విభ్రమ = విలాసాలయొక్కయు, జాలః = సమూహం గలదియు, (స్వాదూని వరాణాం విభ్రమాణాం జాలాని యస్మిన్ సః), మోదిత... శైలః: మోదిత = ఆనందింప జేయబడిన, ద్విజ = పక్షులు, మృగ = జంతువులు, అంఘ్రి-ప = చెట్లు (అంఘ్రిభిః పిబన్తి ఇతి అంఘ్రిపాః), శైలః = కొండలు గలదియు (మోదితాః ద్విజాః మృగాః అంఘ్రిపాః శైలాః చ యేన సః), శ్రీధ... లోలః : శ్రీధర = కృష్ణునియొక్క, ఈక్షణ = చూపు అనే, రసాయన = అమృతమందు (స్యాద్రసజశేషాంబు నభో రసాయన-క్షీరాజ్యమోక్షాన్నసుధాసు చామృతమ్ - నానారత్నమాల - 573), లోలః = కోరిక గలదియు అయిన, (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది)

**తా ॥** ఆ రాసవిలాసంలో గానంచేస్తున్న వారూ, వింటున్నవారూ కూడా పాదాలతో తాళం వేసి చూపుతున్నారు.

రసనీయగీతాలూ, విలాసవిన్యాసాలూ కుప్పలుగా కనిపిస్తున్నాయి. పక్షులు, జంతువులు, చెట్లు, కొండలు కూడా ఆ గానంతో ఆనందిస్తున్నాయి. కృష్ణుని కడకంటిచూపు అనే అమృతంమీది తృష్ణతో ఆ రాసవిలాసం కొనసాగుతోంది.

**వి :** 1. పాటకు తాళం వేయటం గాయకుడికి అవసరం. కానీ శ్రోతకూడా తాళం వేయ-సాగాడంటే అది గానంలో ప్రతిభాప్రదర్శనం. గీతం రసవంతంగా సాగితే అప్రయత్నంగానే కాళ్ళు కదులుతాయి (శ్రోతలవి). అది గాయకప్రతిభకు నికషం. జయదేవుడు ఏమన్నాడో గమనించండి. - గీతగోవిందం 1/2

శ్లో॥ వాగ్దేవతాచరితచిత్రితచిత్తసద్మా - పద్మావతీచరణచారణచక్రవర్తీ ।
శ్రీవాసుదేవరతికేళికథాసమేత-మేతం కరోతి జయదేవకవిః ప్రబంధమ్ ॥

అందుకే జయదేవుడు '**పద్మావతీచరణచారణచక్రవర్తి**'గానే ప్రసిద్ధిని పొందాడు.

2. చైతన్యప్రకృతినీ, జడప్రకృతినీ కూడా కదిలించగల శక్తి సంగీతాని కున్నదని సహృదయుల నమ్మకం. అచేతనాలకు అలా మూర్తిమత్త్వాన్నీ, మూర్తిమల్లక్షణాలనూ కల్పించి వర్ణించటం **కవిలోకసంప్రదాయం**. అభిజ్ఞానశాకున్తలంలో చెట్లు శకుంతల అత్తవారింటికి వెళ్ళే సమయంలో చీరె సారెను అందిస్తాయి.

శ్లో॥ క్షౌమం కేనచిదిందుపాండుతరుణా మాంగల్యమావిష్కృతం
నిష్ఠ్యూతశ్చరణోపరాగసుభగో లాక్షారసః కేనచిత్ ।
అన్యేభ్యో వనదేవతాకరతలైరాపర్వభాగోత్థితైః
దత్తాన్యాభరణాని నః కిసలయచ్ఛాయా పరిస్పర్ధిభిః ॥ - అభిజ్ఞానశాకున్తలమ్ 4/7 *

**శ్లో॥ కృష్ణమూర్తిశతవాసవనీలః - పుష్టగోపతరుణీమణిమాలః ।**
**ఘృష్టపాణివరదామవిలోల-శ్చిత్రహారసరహారణశీలః ॥ 9-7**

**అ :** కృష్ణ-మూర్తి-శత-వాసవ-నీలః పుష్ట-గోప-తరుణీ-మణి-మాలః ఘృష్ట-పాణి-వర-దామ-విలోలః చిత్ర-హార-సర-హారణ-శీలః. (రాసవిలాసః జయతి)

**ప్ర :** కృష్ణ... నీలః : కృష్ణ = కృష్ణునియొక్క, మూర్తి = శరీరమే, శత = వందల కొలదిగ, వాసవ-నీలః = ఇంద్రనీలమణులుగా గలదియు (కృష్ణస్య మూర్తిః ఏవ శతమ్ వాసవనీలాని యస్మిన్ సః), పుష్ట... మాలః : పుష్ట = బలిసిన/వన్నెదేరియున్న, గోప-తరుణీ = గోప యువతులే, మణి = మణులయొక్క, మాలః = వరుసగా గలదియు (పుష్టాః గోపతరుణ్యః ఏవ మణీనాం మాలాః యస్మిన్ సః), ఘృష్ట... విలోలః : ఘృష్ట = కలిపి బిగించిన, పాణి = చేతులే, వర = శ్రేష్ఠమైన, దామ = సూత్రమై, విలోలః = కదులుతున్నదియు (ఘృష్టాశ్చ తే పాణయః ఏవ వరం దామ, తేన విలోలః) (ఆధునికకాలంలో ఇలా చేతులు కలిపి నిలవడాన్ని మానవహారమంటున్నాం). చిత్ర... శీలః :చిత్ర=వివిధవర్ణాల కలయికతో కూడిన (తచ్చ శుక్ల నీల పీత రక్త హరిత కపిశ చిత్ర భేదాత్ సప్తవిధమ్ - తర్కసంగ్రహః), హార = హారాలయొక్క, సర = పేటలను/ వరుసలను, హారణ = కాలదన్నే, శీలః = స్వభావం గలదియు అగు (చిత్రహారసరాణాం హారణం శీలం యస్య సః), (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.)

**తా ॥** ఆ రాసక్రీడలో కృష్ణుని శరీరమే వందల ఇంద్రనీలమణులుగా వెలుగొందుతోంది. బాగా బలిసిన గోపయువతులు మణిమాలలవలె ఉన్నారు. అందరూ చేతులు కలిపి గట్టిగా బిగించి పట్టుకోవటంతో అదే సూత్రమైంది. ఈ మొత్తం కలిసి చిత్రవర్ణహారశోభను తిరస్కరిస్తూ రాసలీలకు అందాన్ని తెస్తోంది.

**వి :** 1. అవతారాలలో జగద్విఖ్యాతి పొంది, పరమాత్మస్వరూపంగా స్వీకరింపబడిన రాముడు కానీ, కృష్ణుడు కానీ నల్లని వారే. తెలుపు, నలుపు అను వర్ణవివక్ష, తెలుపు గొప్పదిగా భావింపబడటం మధ్యకాలంలో వచ్చిన అభిరుచి భేదం. ఆర్థికసాంస్కృతికనైపథ్యాలు కూడా దీనికి కారణమై వుండవచ్చు. *

**శ్లో॥ హారభాస్వదురసా సకలాశా-పూరితస్మరశతాధికభాసా ।**
**శారదామ్బుజదృశా వరభూషా-ధారిణాతిరుచిరః కమలేశా ॥ 9-8**

**అ :** రాసవిలాసవర్ణనలో భాగమైన కృష్ణవర్ణన.

**అ :** హార-భాస్వద్-ఉరసా సకల+ఆశా-పూరిత-స్మర-శత+అధిక-భాసా శారద+ అంబుజ-దృశా వర-భూషా-ధారిణా కమలా+ఈశా అతిరుచిరః. (రాసవిలాసః జయతి)

**ప్ర :** హార-భాస్వద్-ఉరసా:హార = ముత్యాలగొలుసుతో, భాస్వద్ = ప్రకాశిస్తున్న, ఉరసా = వక్షస్థలం గలవాడును (హారేణ భాస్వద్ ఉరః యస్య తేన), సకల... భాసా : సకల = అన్ని, ఆశా = దిక్కులయందు, పూరిత = నింపబడిన, స్మర-శత = వందల మదనులకన్న, అధిక=ఎక్కువయిన, భాసా = కాంతిగలవాడును (సకలాసు ఆశాసు పూరితాః స్మరాణాం శతకాదధికాః భాసః యస్య, తేన), శారద+అంబుజ-దృశా:శారద = శరత్కాలమందలి, అంబుజ = తామరవంటి, దృశా = కన్నులు గలవాడును (శరత్ సంబంధి శారదం, శారదే చ తే అంబుజే, త ఇవ దృశౌ యస్య, తేన), వర-భూషా-ధారిణా:వర = శ్రేష్ఠమైన, భూషా = నగలను, ధారిణా = ధరించిన వాడును అగు (వరాణాం భూషాణాం ధారణం శీలమ్ అస్య ఇతి తేన), కమల+ఈశా = లక్ష్మీవల్లభునిచే (కమలాయాః ఈట్ - తేన), అతిరుచిరః = మిక్కిలి అందమైనదియు అగు (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది)

**తా ॥** (బృందావనంలో కొనసాగుతున్న) ఆ రాసక్రీడ కృష్ణుని కారణంగా ఎంతో సొగసుగా వుంది. ఆ కృష్ణుడు తన వక్షస్థలంపై ముత్యాలహారాన్ని ధరించాడు. దాని మిక్కటమైన వెలుగు అన్ని దిక్కులనూ నిండుగా నింపుతోంది. శతాధికమన్మథులవంటి కాంతి ఆ కృష్ణునిది. శరత్కాలమందలి తామరలవంటి కన్నులు, మేటి ఆభరణాలు కలిగి శోభిస్తున్నాడు ఆ కమలావల్లభుడు.

**వి :** 1. **అంబుజే ఇవ దృశౌ** - ఇది ఉపమాలంకారం. అందునా లుప్తోపమా, ఉపమావాచకం లోపించింది కాబట్టి. ఉపమావయవాలయిన ఉపమాన- ఉపమేయ-ఉపమావాచక - ధర్మాలలో ఏది లోపించినా, ఎన్ని లోపించినా అది లుప్తోపమాలంకారం.

**శ్లో॥ వర్ణ్యోపమానధర్మాణాముపమావాచకస్య చ ।**
ఏకద్విత్ర్యనుపాదానైర్భిన్నా లుప్తోపమాష్టధా ॥ - (కువలయానందం - 7)

2. శృంగారః, శుచిః, ఉజ్జ్వలః ఇవన్నీ పర్యాయపదాలు. కాబట్టి శృంగారమంటేనే శుచిత్వం, ఉజ్జ్వలత్వం కూడా స్ఫురించాలి. లౌకికమూ, భౌతికమూ అయిన శారీరకసంబంధ మాత్రం కన్న అలౌకికమూ, మానసికమూ అయిన శృంగారం విలక్షణమైనది. అది కావ్యగతమై శారీరకసంబంధం అప్రధానం, ఆత్మీయతాభావం ప్రధానమై రాణిస్తుంది. ఆ అంశాన్ని మరచి కావ్యాలలో కూడా దానిని శరీరానికి పరిమితం చేసి స్థాయి తగ్గించిన కవులున్నారు.

ప్రకృతం **రాసక్రీడావర్ణన**లో కాంతిమత్త్వానికీ, కళాతత్త్వానికీ, ఔజ్జ్వల్యానికీ, శుచిత్వానికీ ప్రాధాన్యమిస్తూ సాగుతున్న ఈ రాసవిలాసవర్ణన నిజమైన అలౌకికశృంగారానికి ప్రతినిధిగా నిలుస్తోంది.

3. ప్రస్తుతాంశం రాసవిలాసం. దాన్ని వర్ణిస్తున్న కావ్యనిర్మాణం. ఈ రెండూ కూడా అంత మెరుగనివే. '**న కావ్యార్థవిరామోఽస్తి యది స్యాత్ప్రతిభాగుణః**' - అన్న ఆనందవర్ధనుడు (ధ్వన్యాలోకం) విలాసాలకు కూడా అంతం కానీ, పునరుక్తి కానీ లేదన్నాడు తన విషమబాణ లీలలో-

శ్లో॥ న చ తేషాం ఘటతేఽవధి - ర్న చ తే దృశ్యన్తే కథమపి పునరుక్తాః ।
యే విభ్రమాః ప్రియాణా-మర్థా వా సుకవి వాణీనామ్ ॥ -ధ్వన్యాలోకం-చతుర్థోద్ద్యోతం.

కవి క్రియమాణమయిన రాసవిలాసవర్ణన కాబట్టి ప్రతిశ్లోకం నూతనంగా, ఉజ్జ్వలంగా సాగుతోంది. *

**శ్లో॥ సప్రియామరవిమానవితాన-స్తృప్తవన్దిచయమానవితానః ।**
**స్వల్పమేఘరవమర్దలసాన్ద్రః - స్వః ప్రసూనరుచిమద్దలసాన్ద్రః ॥ 9-9**

**అ :** రాసవిలాసవర్ణనం.

**ప :** సప్రియ+అమర-విమాన-వితానః తృప్త-వంది-చయ-మాన-వి-తానః ।
స్వల్ప-మేఘ-రవ-మర్దల-సాంద్రః స్వః-ప్రసూన-రుచిమత్-దళ-సాంద్రః ॥

**అ :** సప్రియ = ప్రియలతో కూడిన, అమర = దేవతలయొక్క, విమాన = విమానాలు అనే, వితానః= మేలుకట్లు గలదియు (వితానముల్లోచవిస్తారమఖసద్మసు - నానార్థ-రత్నమాలా - పంక్తి - 1726) (ప్రియాభిః సహితాః సప్రియాః, తే చ తే అమరాః, తేషాం విమానాని, తాన్యేవ వితానాని యస్మిన్ సః), తృప్త... తానః : తృప్త = సంతసించిన, వంది = స్తోత్ర పాఠకుల యొక్క, చయ = సమూహానికి, మాన = ఉపమానమైన/ ప్రమాణమైన, వి = పక్షులయొక్క, (విశ్చక్షుషి వ్యోమ్ని వాతే పరమాత్మని పక్షిణి - నానార్థరత్నమాలా - పంక్తి 149), తానః = విస్తృతి గలదియు (తృప్తానాం వందినాం చయస్య మానం యస్య సః, వీనాం తానః యస్మిన్ సః), స్వల్ప-మేఘ-రవ-మర్దల-సాంద్రః : సు+అల్ప = చాలా తక్కువయిన, మేఘ-రవ = ఉరుములనే, మర్దల = మృదంగధ్వనిచేత, సాంద్రః = నిబిడమైనదియు (స్వల్పశ్చ అసౌ మేఘరవః, స ఏవ మర్దలః, తేన సాంద్రః), స్వః-ప్రసూన-రుచిమత్-దళ-సాంద్రః : స్వః = స్వర్గంనుండి తెచ్చిన (స్వరవ్యయం స్వర్గనాకః అమరకోశః - స్వర్గవర్గం-1), ప్రసూన = పూలయొక్క (పారిజాతపుష్పాలయొక్క), రుచిమత్ = కాంతి-మంతమైన, దళ = రేకులచే, సాంద్రః = దట్టమైనదియు అయిన (స్వః ప్రసూనాని తేషాం రుచిమన్తి చ తాని దళాని తైః సాంద్రః), (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.)

**తా ॥** రాసక్రీడ జరుగుతున్నప్పుడు అమరులు భార్యలతో సహా వచ్చి గగనసీమలో నిలిచారు. వారి విమానాలే మేలికట్లు (చాందినీలు/చలువ పందిళ్ళు) గా శోభిస్తున్నాయి. ఆనందించిన వందిమాగధులతో పోలికగల పక్షుల సమూహాలు వీనులవిందుగా ఆనందంగా కూస్తున్నాయి. కొద్ది చప్పుడుతో ఉరుములు మద్దెల సవ్వడిలాగా రాసక్రీడకు సహవాద్యంగా వినిపిస్తోంది. దేవతలు ఆకాశంనుండి కురిపించిన పారిజాతకుసుమాల రేకులు నేలపై విస్తారంగా పడి వున్నాయి.

**వి :** 1. ఒక అందమైన వేదికపై నాట్యకార్యక్రమం జరుగుతున్నట్లుందీ వర్ణన. పారిజాత కుసుమాల రేకులు పడివుండట మంటే నాట్యంచేసే వారి కాలిక్రింద పూలు నలిగి రేకులు విడివడటం. ఆ నాట్యానికి గానం పక్షుల అరుపులు, సహ వాద్యం మృదంగం - అది ఉరుముల చప్పుడు. దేవతల విమానాలే మేలుకట్లు అయిన సభావేదిక.

2. నలుగుతున్న పారిజాతసుమదళాల బదులు జారిపడుతున్న నగలను గూర్చి ముచ్చటిస్తూ ఇటువంటి వర్ణనమే **నారాయణీయం**లో కనిపిస్తుంది. (69-5)

శ్లో॥ శ్రద్ధయా విరచితానుగానకృతతారతారమధురస్వరే
నర్తనేఽథ లలితాంగహారలులితాంగహారమణిభూషణే ।
సమ్మదేన కృతపుష్పవర్షమలమున్మిషద్దివిషదాం కులం
చిన్మయే త్వయి నిలీయమానమివ సమ్ముమోహ సవధూకులమ్ ॥

*

**శ్లో॥ జృమ్భమాణనవపల్లవశోభే - శమ్బరారిపితృపల్లవశోభే ।**
**అమ్బుజేఽర్పితహృదా హిమదాత్రా - జృమ్భితశ్చ మరుతాఽహిమదాత్రా ॥ 9-10**

**అ :** రాసవిలాసవర్ణన – మందమారుతగతి.

**అ :** జృంభమాణ–నవ–పల్లవ–శోభే శంబరారి–పితృ–పత్–లవ–శోభే అంబుజే+అర్పిత–హృదా హిమ–దాత్రా అహి–మద–అత్రా మరుతా జృంభితః చ (రాసవిలాసః జయతి)

**ప్ర :** జృంభ... శోభే : జృంభమాణ = పొడముతున్న (జృంభ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), నవ = క్రొత్తవైన, పల్లవ = చివురులయొక్క, శోభే = కాంతి గల (జృంభమాణానాం నవానాం పల్లవనాం శోభా యస్మిన్ తస్మిన్), శంబర... శోభే : శంబరారి = మన్మథునియొక్క, పితృ = తండ్రి (కృష్ణుని) యొక్క, పత్ = పాదాలతో, లవ = కొద్ది, శోభే = శోభ గలదియు (శంబరారేః పితా తస్య పత్ తేన లవా శోభా యస్మిన్ తస్మిన్), అంబుజే = తామరయందు, అర్పిత–హృదా : అర్పిత = నిలుపబడిన, హృదా = మనస్సు గలదీ, హిమ–దాత్రా : హిమ = చల్లదనాన్ని, దాత్రా = ఇచ్చేదీ, అహి–మద–అత్రా : అహి = పాము, మద = ఆనందం కొరకు, అత్రా = తినేదీ అయిన (అహిః మదాయ అత్రా యస్య తేన), మరుతా = గాలిచే, జృంభితః = విజృంభింప బడినదీ/రెచ్చగొట్టబడినదీ అయిన (రాసవిలాసః = రాసక్రీడ, జయతి = వర్ధిల్లుతోంది.)

**తా ॥** క్రొత్త చివురులతో ప్రగల్భిస్తూ కృష్ణుని పాదాల కాంతిని స్వల్పంగా పొందిన తామరపూలపై మనస్సు నుంచి గాలి మెల్లగా వీస్తోంది. అది చల్లదనాన్ని అందిస్తోంది. పాములకు ఆహారంగా తగిన దది.

**వి :** 1. శృంగారగతమైన శుచిత్వానికీ, ఉజ్జ్వలత్వానికీ ప్రధానంగా అవసరమయినవి చల్లదనం, చల్లగాలి. అవి తటస్థాలైన ఉద్దీపన విభావాలు. అందుకే '**ధీరసమీరే యమునాతీరే వసతి వనే వనమాలీ**' – అని గీతగోవిందం (గీతం – 11), విరహదశలో అవే ప్రతికూలాలై ఇబ్బంది పెడతాయి. '**వ్యాళనిలయమిలనేన గరళమివ కలయతి మలయసమీరమ్**' – సా విరహే తవ దీనా' – గీతగోవిందం – గీతం 8) *

**శ్లో॥ మఞ్జుశిఞ్జదతిభాసురభూషః – కఞ్జనాభబహుసున్దరవేషః ।**
**అంసలగ్నకరసారసపాశః – సంశ్రుతో జయతి రాసవిలాసః ॥ 9–11**

**అ :** రాసవిలాసవర్ణన – విశేషణ పరిసమాప్తి.

**అ :** మంజు–శింజద్–అతిభాసుర–భూషః కంజ–నాభ–బహు–సుందరవేషః అంస–లగ్న–కర–సారస–పాశః సంశ్రుతః రాసవిలాసః జయతి.

**ప్ర :** మంజు... భూషః : మంజు = మనోహరంగా, శింజత్ = శబ్దిస్తున్నవీ, అతి–భాసురః = బాగా ప్రకాశిస్తున్నవీ అయిన, భూషః = నగలు గలదియు, (మంజు శింజన్త్యః అతి భాసురాః చ తాః భూషాః యస్మిన్ సః), కంజ... వేషః : కంజ = తామర, నాభ = బొడ్డుతో గల కృష్ణునియొక్క, బహుసుందర = పరమరమణీయమైన, వేషః = రూపం గలదియు (కంజం నాభౌ యస్య తస్య బహుశ్చ సుందరశ్చ అసౌ వేషః యస్మిన్ సః), అంస... పాశః : అంస = మూపుపై, లగ్న = తగుల్కొనిన, కర = చేతు లనే, సారస = తామరల, పాశః = బంధంగలదియు (అంసే లగ్నాః కరాః ఏవ సారసాణి, తాని ఏవ పాశః యస్మిన్ సః), సంశ్రుతః = ప్రసిద్ధి కెక్కిన (సమ్యక్ శ్రుతః), **రాసవిలాసః = గోపక్రీడ** (రాస ఇతి విలాసః) ('గోపక్రీడా రవేరాసౌ' నానార్థరత్నమాలా – పంక్తి – 1124), **జయతి = వర్ధిల్లుతోంది.** (జి జయే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** విశ్వవిఖ్యాతమైన **రాసవిలాసం** (గోపక్రీడ) జరుగుతోంది. ఆ క్రీడలో ఆభరణాలు అన్నీ మనోహరంగా ధ్వనిస్తున్నాయి. కృష్ణుడు వివిధ సుందరరూపాలతో కనిపిస్తున్నాడు. గోపికలు కృష్ణుని మూపుపై కరకమలాలను వేసి బంధిస్తున్నారు.

**వి : 1.రాసక్రీడ–**

రాసక్రీడను ఒక గోపక్రీడగా నిఘంటువులు నిర్వచించాయి. గ్రామీణప్రాంతాలలో, అటవీప్రాంతాలలో వారి జీవనశైలికి అనుగుణంగా, వారి జీవిస్తున్న వాతావరణానికి తగినట్లుగా, నిత్యజీవితంలో వారు పడే శ్రమకు తగిన విశ్రాంతిస్థానంగా ప్రాంతభేదాన్ని బట్టీ, భాషాభేదాన్ని బట్టి ఎన్నో రకాల ఆటవిడుపులు (కళారూపాలు) ఏర్పడ్డాయి. కాలగర్భంలో కొన్ని కలిసిపోయినా ఇప్పటికీ ఎక్కడికక్కడ ఎన్నో మిగిలివున్నాయి.

నాగరికులు తమ జీవనశైలినే గొప్పగా భావించి, తమకున్న కళారూపాలనే ఉన్నత మైనవని గుర్తించి, జానపదకళలను చిన్నచూపు చూసిన తరువాత జానపదకళలూ, ఆ కళాకారులూ చిన్నబోవలసి వచ్చింది. కొన్ని సాధారణస్థితినుండి పైపైకి పోతే కొన్ని నిలద్రొక్కుకోలేనంతగా క్రిందికి జారిపోయాయి.

అలా పైపైకి వెళ్ళి అవధిలేని ప్రశంసలకూ, అంతులేని వ్యతిరేకవిమర్శలకూ కూడా ఆలవాలమైనది **రాసక్రీడ**. అది పచ్చిశృంగారంగా కొందరికి అనిపిస్తే, పరమాధ్యాత్మిక రహస్యంగా మరికొందరికి కనిపించింది. అసలే కళ. అందునా క్రీడ. అది స్త్రీ పురుషులు కలిసి. ప్రదేశమేమో బృందావనం. ఇక కవులూరుకుంటారా? ఒకరినిమించి మరొకరు విజృంభించారు. అయోగవిప్రలంభాన్నీ, అస్ఖలితబ్రహ్మచర్యాన్నీ జోడించారు. కావ్యశోభకోస మనీ కొందరూ, మధురభక్తి అని కొందరూ, 'కామిగాక మోక్షగామి కాదు' అంటూ మరికొందరూ ఆ రాసక్రీడకు వైవిధ్యాన్నీ, విస్తృతినీ, వివాదాన్నీ కూడా కల్గించారు. ప్రజల మధ్య నిలిచి వుండవలసిన క్రీడ కవి పండితుల పంచన చేరి తనను తాను కోల్పోయిందేమో!

ఇప్పుడూ రాసక్రీడ ఆడుకోవచ్చు. తప్పుకాదు. జానపదకళారూపాలలోనుండీ దానిని అన్వేషించి పట్టుకోవచ్చు. జానపదకళలలో చాలా మండలాకారంలోనే సాగుతాయని మనం మరచిపోకూడదు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జయతి :** | **జయతి** | జయతః | జయన్తి | |
| | జయసి | జయథః | జయథ | |
| | జయామి | జయావః | జయామః | * |

**శ్లో॥ పుణ్డరీకముఖముఖ్యవికాసః – ఖణ్డితారితిమిరోరుతరాశః ।**
**శౌణ్డమధ్వకవివర్ణ్యవిలాసః – పాండురంగరవిరత్ర లలాస ॥ 9–12**

**అ :** రాసవిలాసంతో భాసించిన పాండురంగని స్తుతి. –స్వాగతం.

**అ :** పుండరీక–ముఖ–ముఖ్య–వికాసః ఖండిత+అరి–తిమిర+ఉరుతర+ఆశః శౌండ–మధ్వ–కవి–వర్ణ్య–విలాసః పాండురంగ–రవిః అత్ర లలాస.

**ప్ర :** పుండరీక = పుండరీకునియొక్క / తామరయొక్క, ముఖ = మోముకు, ముఖ్య = అద్వితీయమైన (ఏకే ముఖ్యాన్యకేవలాః–నానార్థరత్నమాలా – పంక్తి – 216), వికాసః = వెలుగు కలిగించెడి వాడునూ (పుండరీకస్య ముఖం, తస్య ముఖ్యః వికాసః యస్మాత్ సః), ఖండి... రాశః : ఖండిత = నశింపజేయబడిన, అరి = శత్రువులనెడి / శత్రువులైన, తిమిర=చీకట్ల యొక్క, ఉరు–తర = గొప్పదైన, ఆశః = కోరికలు గలవాడునూ/ దిక్కులు గలదియు, (ఖండితాః అరయ ఏవ తిమిరాణి, తేషామ్ ఉరుతరాః ఆశాః యేన సః/ ఖండితాని అరయశ్చ తాని తిమిరాణి యాసాః తాశ్చ ఉరుతరాః ఆశాః యస్య సః), శౌండ... విలాసః : శౌండ = ప్రసిద్ధుడైన (మంత్రవిఖ్యాతయోః శౌండః – నానార్థరత్నమాలా – పంక్తి – 394), మధ్వకవి = మధ్వకవిచేత, వర్ణ్య = వర్ణింపబడిన, విలాసః = విలాసం గల వాడును అగు (శౌండశ్చ అసౌ మధ్వకవిః తేన వర్ణ్యః విలాసః యస్య సః), పాండురంగ–రవిః = పాండురంగ డనే సూర్యుడు, అత్ర = ఈ రాసవిలాసంలో, లలాస = ప్రకాశించాడు. (లస్ శ్లేషణక్రీడనయోః పరస్మైపది–లిట్–ప్ర.ఏ.) లలాస – లేసతుః–లేసుః

**తా ॥** ఆ రాసవిలాసంలో వెలుగొందినవాడు పాండురంగ విఠలుడు అనే సూర్యుడు. ఆయన పుండరీకముఖవికాసం కలిగించేవాడు. పుండరీకుడనే భక్తుని ముఖానికి అద్వితీయమైన వెలుగు. పద్మాలకు శత్రువులయిన చీకట్ల దిక్కులనన్నింటినీ నశింపజేసిన వాడు. పుండరీకాదుల శత్రువులనే చీకట్ల ఆశలను అంతరింపజేసినవాడు. సమర్థుడైన మధ్వకవి కావ్యంలో వర్ణింపబడిన విలాసం గలవాడు.

**వి :** 1. పాండురంగవిఠలునిలో రవిత్వాన్ని ఆరోపించినందువలన ఇది రూపకాలంకారం. '**విషయ్యభేదతాద్రూప్య-రంజనం విషయస్య యత్ తత్‌రూపకం**' - (కు-17)

2. మధ్వకవి పాండురంగవిఠలుని విలాసాన్ని వర్ణించిన వాడు. (పాండురంగ)రవి వర్ణన అనేక కావ్యాలలో కనిపించేదే.

3. **రాసగోష్ఠి** : రాసగోష్ఠి(క్రీడను)ని **హరివంశవ్యాఖ్యలో నీలకంఠుడు** ఇలా నిర్వచించాడు-

శ్లో॥ పృథుం సువృత్తం మసృణం వితస్తి - మాత్రోన్నతం కౌ వినిఖన్య శంకుమ్ ।
ఆక్రమ్య పద్భ్యామితరేతరం తు - హస్తైర్భ్రమోఽయం ఖలు **రాసగోష్ఠీ** ॥

నేలపై ఉన్నతంగా, గుండ్రంగా, నున్నగా, దాదాపు తొమ్మిది అంగుళాలు (వితస్తి) ఎత్తుగా ఒక శంకువును పాతి దానిని పాదాలతో ఆక్రమించి చేతులు కలిపి పట్టుకొని గుండ్రంగా తిరగటం **రాసగోష్ఠి** - లేదా - **రాసక్రీడ**.

ఇది నిన్న మొన్నటిదాకా పిల్లలు ఆడుకొంటున్న ఆటయే. ఇప్పటికీ నాగరకత ముదరని చోట ఆడుకొంటూనే వుంటారు. గుండ్రంగా తిరుగుతూ ఆడే ఆటలన్నీ దీని అవశేషాలే కావచ్చు.

గట్టిగా పట్టుకొన్న ఆ చేతులలో ఎప్పుడో సడలింపు రావటం అందరూ వెల్లకిలా పడటం దీనిలోని కొసమెరుపు.*

**శ్లో॥ గాతృకోకిలరవశ్రుతిపూర్త్యా - స్ఫీతభృఙ్గనినదైః శ్రుతిపూర్త్యా ।**
**జాతు యత్పదమసిద్ధమృగాద్యైర్ధ్యాతమేతదిహ సిద్ధమృగాద్యైః ॥ 9-13**

**అ :** రాసక్రీడావర్ణనమే - కృష్ణుడు అందరికీ కనిపించటం. -స్వాగతం.

**అ :** యత్పదమ్ జాతు ఋక్+ఆద్యైః అసిద్ధం ఏతత్ గాతృ-కోకిల-రవ-శ్రుతి-పూర్త్యా స్ఫీత-భృంగ-నినదైః శ్రుతిపూర్త్యా సిద్ధ-మృగ+ఆద్యైః ఇహ ధ్యాతమ్.

**ప్ర :** యత్ = ఏ కృష్ణునియొక్క, పదమ్ = పాదం, జాతు = ఎప్పుడునూ/ ఒక్కసారి కూడా, ఋగ్+ఆద్యైః = ఋక్కు మొదలయిన వేదాలచే, అసిద్ధమ్ = సిద్ధించదో, ఏతత్ = ఈ ఆ కృష్ణపదం, గాతృ... పూర్త్యా : గాతృ = పాడుతున్న, కోకిల = కోయిలలయొక్క, రవ = చప్పుడుయొక్క, శ్రుతేః = వినుటయొక్క, పూర్త్యా = ముగింపు గలదియు, స్ఫీత-భృంగ-నినదైః : స్ఫీత = అంతటా క్రమ్మిన/ నిరంతరమైన, భృంగ = తుమ్మెదలయొక్క, నినదైః = ధ్వనులతో (నదః సముద్రే నినదే సరిద్భేదే - నానార్థరత్నమాలా - పంక్తి - 612), శ్రుతి-పూర్త్యా : శ్రుతేః = జ్ఞానంయొక్క, పూర్త్యా = పరిపూర్తి గలదియు అయిన, ఇహ = ఈ రాసక్రీడలో, సిద్ధ-మృగ-ఆద్యైః = ప్రసిద్ధిచెందిన జంతువులు మొదలగు వాటిచే, ధ్యాతమ్ = చింతింపబడినది. (ధ్యై చింతాయాం ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** కృష్ణుని పాదం ఋగ్వేదాది వేదాల ద్వారా గానీ, ఉపనిషదాదుల ద్వారా గాని దర్శించటానికి వీలు కానిది. అయితే అటువంటి ఆ పాదాన్ని ఆ రాసక్రీడలో జంతువులు మొదలయిన తిర్యగ్జాతులు కూడా చూడగలుగుతున్నాయి. అవి కోకిల గానాల ద్వారా వేదశ్రవణాన్ని ముగించుకొని, నిరంతరంగా సాగుతున్న తుమ్మెదల గానాల ద్వారా జ్ఞానాన్ని పొంది, ఆపై ధ్యానం ద్వారా ఆ పాదాన్ని దర్శించ గలుగుతున్నాయి.

**వి :** 1. '**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ**' అని తైత్తిరీయోపనిషత్తు. మాటలకు గానీ మనస్సుకు (ఆలోచనకు)గానీ అందనిది ఆ పరతత్త్వ స్వరూపం. '**మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ**' – అని గీతలో భగవద్వచనం. ఆ పదప్రాప్తి భక్తి ద్వారా సులభతమమని విద్వన్నిర్ణయం. అందుకే '**భక్త్యా భాగవతం జ్ఞేయం**' – అని కృష్ణతత్త్వాన్ని, జీవితాన్ని చెప్పే భాగవతాన్ని భక్తితోనే గ్రహించాలనటం.

2. సిద్ధమృగాదులకు అక్కడ శ్రవణ, మనన, నిదిధ్యాసలు మూడూ కుదిరాయి. కోకిల గానంద్వారా శ్రవణం, నిరంతరంగా తుమ్మెదల చప్పుళ్ళద్వారా మననం. కృష్ణ ధ్యానం. ఈ మూడింటి కారణంగా ఋగాదుల కందని పదం వారికి కనిపించింది. *

**శ్లో॥ హస్తినీశతరమాకృతిపూరః – కృష్ణమూర్తిసురపాదపసారః ।**
**ధిక్చకార స పయోఽబ్ధిముదారః – సుద్యుతిస్మితపయోఽమృతధారః ॥9–14**

**అ :** రాసవిలాసవర్ణనలో – గోపికలను హస్తినీజాతిస్త్రీలనుగా వర్ణించటం. –స్వాగతం.

**అ :** హస్తినీ–శత–రమా+ఆకృతి–పూరః కృష్ణ–మూర్తి–సుర–పాదప–సారః ఉదారః సుద్యుతి–స్మిత–పయః+అమృత–ధారః సః పయః+అబ్ధిమ్ ధిక్చకార.

**ప్ర :** హస్తినీ... పూరః : హస్తినీ = హస్తినీజాతికి చెందిన గోపికలయొక్క, శత = వందకు లోబడిన, రమా = లక్ష్మియొక్క, ఆకృతి = రూపాలు అనే, పూరః = పొంగుదల గలదియు, (హస్తినీనాం శతమేవ రమాయాః ఆకృతయః, తాసాం పూరః యస్మిన్ సః) ('పూరః స్యాదంభసో వృద్ధిః' – హలాయుధకోశః – 668), కృష్ణ... సః ఆరః : కృష్ణ = కృష్ణునియొక్క, మూర్తి = స్వరూపా లనే, సుర–పాదప–సారః = శ్రేష్ఠమైన కల్పవృక్షాలు గలదియు (కృష్ణస్య మూర్తయః ఏవ సురపాదపసారాః యస్మిన్ సః) (సారస్తు వరే త్రిషు – నానార్థమంజరీ – పంక్తి – 1490), ఉదారః = గొప్పదియు, సుద్యుతి...స్మిత...ధారః : సుద్యుతి = మంచి కాంతి గల, స్మిత=చిఱునవ్వులు అనే, పయః = పాలును, అమృత–ధారః = సుధాధారలు గలదియు అయిన (సుద్యుతి సహితాని స్మితాని ఏవ పయాంసి, అమృతస్య ధారాశ్చ యస్మిన్ సః), సః = ఆ రాసవిలాసం, పయః+అబ్ధిమ్ = పాలకడలిని, ధిక్చకార = తిరస్కరించింది. (ధిక్+కృ కరణే – పరస్మైపది – లిట్ – ప్ర.ఏ.)

**తా ॥** హస్తినీజాతికి చెందిన గోపవనితలు వందల కొలదిగ లక్ష్మీస్వరూపలై ఉండటంతో వారివలన రాసవిలాసం ఉప్పొంగుతోంది. కృష్ణస్వరూప మనే కల్పవృక్షసార మా రాసవిలాసంలో వుంది. కాంతిమంతమైన చిఱునవ్వు లనే పాలధారలు, అమృతధారలు ఆ రాసవిలాసంలో ఉన్నాయి. ఆ శ్రేష్ఠ రాసవిలాసం పాలకడలిని ధిక్కరించింది. (పాలకడలి సంపద లక్ష్మి, కల్పతరువు, పాలు, అమృతం. అవి శతాధికంగా రాసక్రీడలో ఉన్నాయి కాబట్టి పాలకడలిని తిరస్కరించటం)

**వి :** 1. పాలకడలిని ధిక్కరించటానికీ, రాసవిలాసానికీ ఏ విధమైన సంబంధమూ లేకపోయినా సంబంధమున్నట్లు వర్ణించటం వలన సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' – (కు.36)

2. **హస్తినీజాతిస్త్రీ** :

పద్మినీ చిత్రిణీ చైవ శంఖినీ **హస్తినీ** తథా । ...

శ్లో॥ స్థూలాధరా స్థూలనితంబభాగా – స్థూలాంగులీ స్థూలకుచా సుశీలా ।
కామోత్సుకా గాఢరతిప్రియా యా – నితాంతభోక్త్రీ **కరిణీ** మతా సా ॥ –రతిమంజరి 3–7

3. **సురపాదపం** :

శ్లో॥ పంచైతే దేవతరవో మందారః పారిజాతకః
సంతానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచందనమ్ ॥ – అమరకోశః

| | | | |
|---|---|---|---|
| 4. **ధిక్చకార :** | ధిక్చకార | ధిక్చక్రతుః | ధిక్చక్రుః |
| | ధిక్చకర్థ | ధిక్చక్రథుః | ధిక్చక్ర |
| | ధిక్చకార/ధిక్చకర | ధిక్చకృవ | ధిక్చకృమ. * |

**శ్లో॥ రాసోత్సవస్య హి రసం భువి వర్ణయేత్కః**
**శ్రీశోడురాజనిజసౌభగరఞ్జితస్య ।**
**యద్భృఙ్గహంసశుకకోకిలకేకిముఖ్యా**
**ద్రష్టుం ప్రహృష్టమనసః పరితః సమీయుః॥** **9-15**

**అ :** రాసక్రీడా వైభవాన్ని ప్రస్తుతించటం. -వసంతతిలక.

**అ :** శ్రీ+ఈశ+ఉడురాజ-నిజ-సౌభగ-రంజితస్య రాస+ఉత్సవస్య రసం భువి కః వర్ణయేత్ హి. యద్ భృంగ-హంస-శుక-కోకిల-కేకి-ముఖ్యాః ప్రహృష్ట-మనసః (సన్తః) ద్రష్టుం పరితః సమీయుః ।

**ప్ర :** శ్రీ... రంజితస్య : శ్రీ+ఈశ = కృష్ణ డనే, ఉడు-రాజ = చంద్రునియొక్క, నిజ = నైసర్గికమైన, సౌభగ = విభూతిచేత/ సౌభాగ్యంచేత, రంజితస్య = అలంకరింపబడిన (శ్రీశ ఏవ ఉడురాజః, తస్య నిజేన సౌభగేన రంజితస్య), రాస+ఉత్సవస్య = రాసక్రీడయొక్క (రాస ఇతి ఉత్సవః, తస్య), రసమ్ = రుచిని, (ఆస్వాదనధ్వనిసుధాంబురసాఖ్యధాతుష్విష్టో రసః - నానార్థరత్నమాలా - పంక్తి -1136), భువి = లోకంలో, కః = ఎవడు, వర్ణయేత్ హి = వర్ణింపగలడో! (వర్ణ క్రియావిస్తారగుణవచనేషు-పరస్మైపది-విధిలిజ్- ప్ర.ఏ.), యత్ = ఎందుకంటే, భృంగ... ముఖ్యాః : భృంగ = తుమ్మెదలు, హంస = హంసలు, శుక = చిలుకలు, కోకిల = కోయిలలు, కేకి = నెమళ్ళు, ముఖ్యాః = ప్రధానంగా గల పక్షులూ, ప్రహృష్ట-మనసః (సన్తః) : ప్రహృష్ట = ఆనందించిన, మనసః(సన్తః)= మనస్సుగలవై, ద్రష్టుమ్ = (రాసవిలాసాన్ని) చూడాలని (దృశ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), పరితః = చుట్టూ, సమీయుః = చేరినవి. (సమ్-ఇ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణుడు అనే చంద్రుని నైసర్గికసౌభాగ్యంచేత అలంకరింపబడిన ఆ రాసవిలాస రుచిని లోకంలో ఎవ్వడూ వర్ణించలేడు. ఎందుకంటే ఆ రాసక్రీడను చూడాలని తుమ్మెదలు, హంసలు, చిలుకలు, కోయిలలు, నెమళ్ళు మొదలయిన పక్షులు పరమానందపడిన మనస్సులతో ఆ రాసక్రీడ చుట్టూ మూగాయి.

**వి :** 1. శ్లో॥ సంగీతసాహిత్యరసానభిజ్ఞః - సాక్షాత్పశుః పుచ్ఛవిషాణహీనః ।
తృణం న ఖాదన్నపి జీవమానః-తద్భాగధేయం పరమం పశునామ్ ॥ అని సూక్తి.

సంగీతసాహిత్యరసం తెలియని వాడు తోక, కొమ్ములు లేని పశువే. గడ్డి తినకుండా కూడా! బ్రతకగలడు తాను. అదే ఆ పశువుల అదృష్టం - రాసక్రీడలో సంగీతసాహిత్యాలతో పాటు నృత్యం లేదా నృత్తం కూడా కలిసి వుంటాయి. ఆనాటి కది నృత్తరూపంలోనే వుండి వుండవచ్చు. కాబట్టి **రాసక్రీడ** తప్పక రుచించే విషయమే అందరికీ. తిర్యక్కులు కూడా దానికై తపించటాన్ని శ్లోకం ప్రతిపాదిస్తోంది.

2. శ్లోకపూర్వార్ధంలో చెప్పిన అంశాన్ని ఉత్తరార్ధంలో కవి సమర్థిస్తున్నందువలన ఇది కావ్యలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - (కు.121)

| | | | |
|---|---|---|---|
| 3. **వర్ణయేత్ :** | **వర్ణయేత్** | వర్ణయేతామ్ | వర్ణయేయుః |
| | వర్ణయేః | వర్ణయేతమ్ | వర్ణయేత |
| | వర్ణయేయమ్ | వర్ణయేవ | వర్ణయేమ |

| | | | |
|---|---|---|---|
| **సమీయుః :** | సమియాయ | సమీయతుః | **సమీయుః** |
| | సమియయిథ/సమియేథ | సమీయథుః | సమీయ |
| | సమియాయ / సమియయ | సమీయివ | సమీయిమ. |

*

**శ్లో॥ యత్తాణ్డవం పక్షిమృగాఙ్ఘ్రిపాద్రీ-నుద్భూతహర్షామ్బుదృశో హ్యకార్షీత్ ।**
**ఉన్నిద్రరోమ్ణః స మదన్తరఙ్గే - నన్నర్తు మామీదృశమేవ కుర్వన్ ॥ 9-16**

**అ :** కవి కృష్ణప్రేమతో తన కోరికను వెల్లడిస్తూ ప్రార్థించటం. -ఇంద్రవజ్ర.

**అ :** యత్-తాండవం పక్షి-మృగ-అంఘ్రిప-అద్రీన్ ఉద్భూత-హర్ష-అంబుదృశః ఉన్నిద్ర-రోమ్ణః అకార్షీత్ హి. సః మామ్ ఈదృశమ్ ఏవ కుర్వన్ మద్-అంతరంగే నన్నర్తు.

**ప్ర :** యత్ = ఏ కృష్ణునియొక్క, తాండవమ్ = తాండవనృత్యం, పక్షి... అద్రీన్ : పక్షి = పక్షులను, మృగ = జంతువులను, అంఘ్రిప = చెట్లను, అద్రీన్ = కొండలను (పక్షిణః చ మృగాః చ అంఘ్రిపాః చ అద్రయః చ, తాన్), ఉద్భూత... దృశః : ఉద్భూత = పొడమిన, హర్ష+అంబు = ఆనందాశ్రువులుగల, దృశః = కన్నులు గల వానినిగా, ఉన్నిద్ర-రోమ్ణః : ఉన్నిద్ర = నిక్కబొడుచుకొన్న, రోమ్ణః = వెంట్రుకలు గల వానినిగా, అకార్షీత్ హి = చేసిందో (కృ - కరణే పరస్మైపది - లుజ్ - ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, మామ్ = నన్ను, ఈదృశమ్+ఏవ = ఇటువంటి వానినిగనే (ఆనందాశ్రు పులకరింతలు గల వానిగనే), కుర్వన్ = చేస్తూ (కృ ధాతువుపై శతృ ప్రత్యయం), మద్-అన్తరంగే = నా హృదయంలో, నన్నర్తు = నృత్యమాడునుగాక. (నృతీ గాత్ర విక్షేపే-యజ్‌లుక్-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** రాసవిలాస వేళలో కృష్ణుని తాండవం పక్షులలో, జంతువులలో, చెట్లలో, కొండలలో కూడా కదలికను చూపి ఆనందంతో అవి కంటతడిపెట్టి పులకించేటట్లు చేసింది. ఆ కృష్ణుడు నాకు కూడా ఆనందబాష్పాలనూ, పులకరింతలనూ కలిగించి నా హృదయంలో నృత్యమాడు గాక! (అని కవి చేసిన ఆశంస)

**వి :** 1. ఈ శ్లోకంలో జడ(కొండలు)అజడ ప్రకృతులు రెండూ చోటు చేసికొన్నాయి. అజడ ప్రకృతిలో కూడా స్థావర, జంగమాలు రెండూ విషయమయ్యాయి. కాబట్టి జడ, అజడ ప్రకృతులు రెండింటిలోనూ మానవీయ ప్రవృత్తులయిన ఆనందబాష్పాలనూ, కన్నీటినీ వర్ణించటం **వక్రోక్తి** అలంకారం. '**సాదృశ్యాత్ లక్షణా వక్రోక్తిః**'-(కావ్యాలంకారసూత్రాణి-8)

2. తారంగం తారంగం - **తాండవ** కృష్ణా తారంగం
వేణునాదతారంగం - వేంకటరమణా తారంగం.

అని తెలుగు పిల్లలు ఎప్పటినుండో పాడుకొంటున్నా తాండవమనగానే శివతాండవాన్ని గుర్తు చేసికోవటం తెలుగు వారికి అలవాటయింది. కానీ కృష్ణుడు కూడా తాండవకృష్ణుడే.

నృత్యం రెండు రకాలు. లాస్యం, తాండవం. మధురమైనది లాస్యం. ఉద్ధత మైనది తాండవం. రెండూ పదార్థాభినయస్వరూపాలే. లాస్యమంటే ముఖంలో భావాలను ప్రదర్శించటమనీ (సాత్త్వికాభినయం). తాండవమంటే శరీరంలో కదలికలనీ (ఆంగికాభి-నయం) అనీ కొందరు చెప్తుంటారు. అది అప్రమాణం. అవగాహనారాహిత్యం. స్త్రీ నృత్యం లాస్యమనీ, పురుషనృత్యం తాండవమనీ భావించటం సంప్రదాయం. అందుకే లాస్యాన్ని పార్వతి అందిస్తే తాండవాన్ని శివుడు అందించాడు నాట్యశాస్త్రానికి.

| | | | |
|---|---|---|---|
| 3. **అకార్షీత్ :** | **అకార్షీత్** | అకార్ష్టామ్ | అకార్షుః |
| | అకార్షీః | అకార్ష్టమ్ | అకార్ష్ట |
| | అకార్షమ్ | అకార్ష్వ | అకార్ష్మ |

| | | | |
|---|---|---|---|
| **నర్నర్తు :** | **నర్నర్తు**/నర్నృత్తాత్/నర్నృతీతు | నర్నృత్తామ్ | నర్నృతతు |
| | నర్నృద్ధి / నర్నృత్తాత్ | నర్నృత్తమ్ | నర్నృత |
| | నర్నృతాని | నర్నృతావ | నర్నృతామ. * |

**శ్లో॥ బర్హీ తర్హి ననర్త యం ప్రతి నగాః పుష్పం సమర్ప్యార్చయన్**
**స్వైరం మఞ్జురవా జగుర్మధుకరాః ప్రైక్షన్త సాక్షాన్మృగాః ।**
**ఉత్క్షిప్తోచ్చఫణాః ఫణీశ్వరగణాః కమ్పేన యం పర్యగుః**
**సోఽయం శ్రీరమణో మయా రచితయా ప్రీణాతు దేవోఽర్చయా ॥ 9-17**

**అ :** తాను చేసిన రాసవిలాసవర్ణన కృష్ణుని సంప్రీతుని చేయాలని కవి ఆకాంక్షించటం.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** యం ప్రతి తర్హి బర్హీ ననర్త, నగాః పుష్పం సమర్ప్య ఆర్చయన్, మంజురవాః మధుకరాః స్వైరం జగుః, మృగాః సాక్షాత్ ప్రైక్షంత. ఉత్క్షిప్త+ఉచ్చ-ఫణాః ఫణి+ఈశ్వర-గణాః కంపేన యం పర్యగుః సః అయం శ్రీరమణః దేవః మయా రచితయా అర్చయా ప్రీణాతు.

**ప్ర :** యం ప్రతి = ఏ కృష్ణుని ఉద్దేశించి, తర్హి = ఆ రాసక్రీడా సమయంలో, బర్హీ = నెమలి (బర్హః అస్య అస్తీతి), ననర్త = నృత్యం చేసిందో (నృతీ గాత్రవిక్షేపే - పరస్మైపది - లిట్ - (ప్ర.ఏ.), నగాః = చెట్లు (న గచ్ఛన్తి ఇతి), పుష్పమ్ = పూవును (జాత్యేకవచనం), సమర్ప్య = సమర్పించి (సమ్-ఋ ధాతువుపై-ణిచ్-ల్యప్-ప్రత్యయం), ఆర్చయన్ = పూజించాయో (అర్చ్ పూజాయాం పరస్మైపది - లఙ్ - (ప్ర.బ.), మంజు-రవాః= మధురధ్వనులు గల, మధుకరాః = తుమ్మెదలు, స్వైరమ్ = స్వేచ్ఛగా, జగుః = పాడాయో (గై శబ్దే పరస్మైపది -లిట్-(ప్ర.బ.), మృగాః = జింకలు, సాక్షాత్ = ప్రత్యక్షంగా, ప్ర+ఐక్షన్త = చూశాయో ((ప్ర+ఈక్ష-దర్శనే-ఆత్మనేపది-లఙ్-(ప్ర.బ.), ఉత్+క్షిప్త+ఉచ్చ - ఫణాః : ఉత్క్షిప్త = పైకి విసరిన, ఉచ్చ = ఎత్తైన, ఫణాః = పడగలుగల (ఉత్క్షిప్తాః ఫణాః యేషాం తే), ఫణి+ఈశ్వర = గొప్ప పాములయొక్క, గణాః = సమూహాలు (ఫణీనామ్ ఈశ్వరాః, తేషాం గణాః), కంపేన = తలనూపుతూ, యమ్ = ఎవనికి, పర్యగుః = ప్రదక్షిణం చేశాయో (పరి+ఇ గతౌ-లుఙ్-(ప్ర.బ.), సః + అయమ్ = ఆ ఈ, దేవః = దేవుడైన, శ్రీరమణః = లక్ష్మీవల్లభుడు / కృష్ణుడు, మయా = నాచే, రచితయా = చేయబడిన, అర్చయా = పూజతో, ప్రీణాతు = ఆనందించును గాక. (ప్రీ తర్పణే-పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు రాసవిలాసం జరుపుతున్న వేళలో నెమలి నృత్యం చేసింది. చెట్లు పూలు కురిపించి అర్చించాయి. తుమ్మెదలు స్వేచ్ఛగా మధురరవాలతో పాడాయి. జింకలు ప్రత్యక్షంగా చూశాయి. పాములు పడగవిప్పి తలలనూపుతూ కృష్ణుని చుట్టూ తిరిగాయి. వాటి సేవలనందిన ఆ శ్రీవల్లభుడైన కృష్ణదేవుడు నేను చేసిన అర్చనతో తృప్తిపడి ప్రసన్నుడగు గాక!

**వి :** 1. పూర్వశ్లోకంనుండి ప్రారంభించిన మంగళస్తుతిని కొనసాగిస్తున్నాడు కవి. '**మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథన్తే**' - అని ప్రాచీన భారతీయ కవి విశ్వాసం. ఆ విశ్వాసంతోనే అవకాశమున్న మేరకు కావ్యమధ్యంలో కూడా మంగళస్తుతిని కొనసాగిస్తారు కవులు.

| | | | |
|---|---|---|---|
| 2. **ననర్త :** | **ననర్త** | ననృతతుః | ననృతుః |
| | ననర్తిథ | ననృతథుః | ననృత |
| | ననర్త | ననృతివ | ననృతిమ |
| **ఆర్చయన్ :** | ఆర్చయత్ | ఆర్చయతామ్ | **ఆర్చయన్** |
| | ఆర్చయః | ఆర్చయతమ్ | ఆర్చయత |
| | ఆర్చయమ్ | ఆర్చయావ | ఆర్చయామ |

| | | | |
|---|---|---|---|
| **జగుః :** | జగౌ | జగుతుః | **జగుః** |
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ |
| **ప్రైక్షన్త :** | ప్రైక్షత | ప్రైక్షేతామ్ | **ప్రైక్షన్త** |
| | ప్రైక్షథాః | ప్రైక్షేథామ్ | ప్రైక్షధ్వమ్ |
| | ప్రైక్షే | ప్రైక్షావహి | ప్రైక్షామహి |
| **పర్యగుః :** | పర్యగాత్ | పర్యగాతామ్ | **పర్యగుః** |
| | పర్యగాః | పర్యగాతమ్ | పర్యగాత |
| | పర్యగామ్ | పర్యగావ | పర్యగామ |
| **ప్రీణాతు :** | **ప్రీణాతు** | ప్రీణీతామ్ | ప్రీణన్తు |
| | ప్రీణీహి | ప్రీణీతమ్ | ప్రీణీత |
| | ప్రీణాని | ప్రీణీవ | ప్రీణీమ. * |

**శ్లో॥ రాసోత్సవస్మరణలాలసమానసానాం - నాసహ్యబన్ధమిహ మోచయతీత్యపూర్వమ్ ।**
**యత్కేశపక్షకుచకఞ్చుకరమ్యనీవీ-బన్ధం స విశ్లథయతే వ్రజవల్లవీనామ్ ॥ 18**

**అ : రాసోత్సవస్మరణ ఫలశ్రుతి.** -వసంతతిలక.

**అ :** రాస+ఉత్సవ-స్మరణ-లాలస-మానసానామ్ అసహ్యబంధం మోచయతి+ఇతి న అపూర్వమ్. యత్ సః వ్రజ-వల్లవీనామ్ కేశపక్ష-కుచకంచుక-రమ్యనీవీబంధం విశ్లథయతే.

**ప్ర :** రాస... మానసానామ్ : రాస+ఉత్సవ = రాసవిలాసాన్ని, స్మరణ = తలచుకొనుట యందు, లాలస = ఆసక్తిగల, మానసానామ్ = మనస్సుగల వారియొక్క, అసహ్య-బంధమ్ : అసహ్య = భరింపరాని, బంధమ్ = భవబంధాన్ని (అసహ్యః చ అసౌ బంధః తమ్), మోచయతి+ఇతి = విడిపిస్తుందనటం, న+అపూర్వమ్ = క్రొత్త ఏమీ కాదు / ఆశ్చర్యకరమేమీ కాదు. యత్ = ఎందుకంటే, సః = ఆ రాసవిలాసం, వ్రజ-వల్లవీనామ్ = గోపవనితలయొక్క, కేశ... బంధమ్ : కేశ-పక్ష = కేశపాశాన్ని, కుచ-కంచుక = రవికను, రమ్య-నీవీబంధమ్ = అందమైన కోకముడిని, విశ్లథయతే = వదులు చేస్తోంది. (వి+శ్లథ్ హింసాయాం ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** రాసోత్సవాన్ని తలచుకోవాలన్న ఉత్సుకత గలవారికి భవబంధవిముక్తిని ఆ రాసక్రీడ కలిగించటం ఆశ్చర్యకరమేమీ కాదు. ఎందుకంటే ఆ రాసవిలాసం గోపకాంతల యొక్క కేశపాశ-కుచకంచుక-నీవీబంధరూపమయిన బంధత్రయాన్ని విడిపించ గల్గింది.

**వి :** 1. ఈ శ్లోకంలో కావ్యార్థాపత్త్యలంకారముంది. గోపకాంతల బంధత్రయాన్ని విడిపించ గలిగిన రాసవిలాసం తత్స్మరణలాలసులయొక్క ఒక్క బంధాన్ని విడిపించలేదా? ఈ అంశం అర్థాపత్తి ప్రమాణం ద్వారా సిద్ధిస్తుంది. ఆలంకారికంగా దాన్నే కావ్యార్థాపత్తి అంటారు. '**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**' - (కు.120)

| | | | |
|---|---|---|---|
| 2. **మోచయతి :** | **మోచయతి** | మోచయతః | మోచయన్తి |
| | మోచయసి | మోచయథః | మోచయథ |
| | మోచయామి | మోచయావః | మోచయామః |
| **విశ్లథయతే :** | **విశ్లథయతే** | విశ్లథయేతే | విశ్లథయన్తే |
| | విశ్లథయసే | విశ్లథయేథే | విశ్లథయధ్వే |
| | విశ్లథయే | విశ్లథయావహే | విశ్లథయామహే. * |

**శ్లో॥ యస్మిన్నుద్యతి నాగకేకినకులాః ఫేరుణ్డసింహద్విపా**
**గోశార్దూలమృగాః కిరాతవిహగా వైరం విసృజ్య స్ఫుటమ్ ।**
**మిత్రామిత్రకళత్రపుత్త్రవిరసాస్తస్థుః సమం షడ్రిపూం**
**స్తద్వృన్దావనరాసమణ్డలమహః స్వాన్తఃస్థితాన్ కృన్తతు ॥ 9–19**

**అ :** రాసవిలాసం అరిషడ్వర్గవినాశకం కావాలని ప్రార్థించటం. –శార్దూలవిక్రీడితమ్.(19–28వరకు)

**అ :** యస్మిన్ ఉద్యతి నాగ–కేకి–నకులాః ఫేరుండ–సింహ–ద్విపాః గో–శార్దూల–మృగాః కిరాత–విహగాః స్ఫుటం వైరం విసృజ్య మిత్ర+అమిత్ర–కళత్ర–పుత్త్ర–విరసాః సమం తస్థుః తద్ వృందావన–రాస–మణ్డల–మహః స్వ+అంతః–స్థితాన్ షడ్+రిపూన్ కృన్తతు.

**ప్ర :** యస్మిన్ = ఏ రాసవిలాసం, ఉద్యతి = మొదలవగా, నాగ–కేకి–నకులాః = పాములూ, నెమళ్ళూ, ముంగిసలూ, ఫేరుండ–సింహ–ద్విపాః=భేరుండపక్షులూ, సింహాలూ, ఏనుగులూ, గో–శార్దూల–మృగాః = గోవులూ, పులులూ, జింకలూ, కిరాత–విహగాః = బోయవారూ, పక్షులూ, స్ఫుటమ్ = స్పష్టంగావున్న, వైరమ్ = పగను, విసృజ్య = వీడి (వి+సృజ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మిత్ర+అమిత్ర–కళత్ర–పుత్ర–విరసాః : మిత్ర = స్నేహితులయందు, అమిత్ర = శత్రువులయందు, కళత్ర = భార్యలయందు, పుత్త్ర = సంతతియందు, విరసాః = అనాసక్తులై, సమమ్ = సమభావంతో, తస్థుః = నిలిచాయో, (స్థా–గతినివృత్తౌ–పరస్మైపది–లిట్–ప్ర.బ.), తత్ = ఆ, వృందావన–రాసమండల–మహః : బృందావన = బృందావన మందలి, రాస–మండల–మహః = రాసమండలశోభ, స్వ+అంతః స్థితాన్ = నాలోనున్న, షడ్రిపూన్ = ఆరుగురు శత్రువులనూ, కృతన్త = ఖండించును గాత, (కృతీ ఛేదనే–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**తా ॥** రాసవిలాసం ప్రారంభం కాగానే పాములూ, నెమళ్ళు, ముంగిసలూ; భేరుండ పక్షులూ, సింహాలూ, ఏనుగులూ; గోవులూ, పులులూ, జింకలూ; బోయవారూ, పక్షులూ స్పష్టంగా వున్న పరస్పర శత్రుత్వాన్ని వీడి, మిత్రులూ, శత్రువులూ, భార్యలూ, పిల్లలూ – వీటిపట్ల విరక్తితో సమభావంతో నిలిచాయో ఆ **రాసమండలశోభ** నాలోవున్న అంత–శ్శత్రువులను ఆరుగురినీ ఖండించునుగాక!

**వి :** 1. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలను అంతశ్శత్రువు లంటారు–కామ క్రోధాలు రజోగుణంనుండీ పుట్టేవి. వాటి పర్యవసానరూపాలు మిగిలిన నాలుగూ. బాహ్యశత్రువులను గెలిచినంత తేలికగా అంతశ్శత్రువులను గెలువలేము. దానికి కారణం అవి ధర్మబద్ధంగా అవసరాలూ, అధర్మంగా అయితే ప్రమాదకారణాలు కాబట్టి. రాసకేళి నైసర్గికశత్రుత్వాలను పోగొట్టి సమదృష్టిని కల్పించగలిగింది కాబట్టి తనలోని శత్రువులను అది అంతరింపజేయగలదని కవి ఆంతర్యం, ఆకాంక్ష.

2. **కృంతతు : కృంతతు**/కృంతతాత్ కృంతతామ్ కృన్తన్తు
కృంత/కృంతతాత్ కృంతతమ్ కృంతత
కృంతాని కృంతావ కృంతామ

**తస్థుః :** తస్థౌ తస్థతుః **తస్థుః**
తస్థిథ/తస్థాథ తస్థథుః తస్థ
తస్థౌ తస్థివ తస్థిమ.

*

**శ్లో॥ అంసాలమ్బితపాదపద్మలలనాసంసక్తపోలస్థలీ–**
**సంసక్తోజ్జ్వలగణ్డమణ్డలరుచం హంసాసనాద్యైః స్తుతమ్ ।**

**వంశస్థాపితమఙ్గలాఙ్గులిదలం స్రంసద్విభూషావలిం**
**తం సేవే హరినీలనీలమమలం సంసారసారం హరిమ్ ॥ 9-20**

**అ :** రాసకేళిలో నృత్యభంగిమలోనున్న కృష్ణుని స్తుతించటం.

**అ :** అంస+ఆలంబిత-పాద-పద్మ-లలనా-సంసత్-కపోల-స్థలీ-సంసక్త-ఉజ్జ్వల-గండ-మండల-రుచం హంస+ఆసన+ఆద్యైః స్తుతం వంశ-స్థాపిత-మంగల+అంగుళిదలం స్రంసద్-విభూషా+ఆవలిం హరినీల-నీలమ్ అమలం సంసార-సారం తం హరిం సేవే.

**ప్ర :** అంస = (కృష్ణుని) మూపుపై, ఆలంబిత = వ్రేలాడుతున్న, పాణిపద్మ = కరకమలాలుగల, లలనా = స్త్రీలయొక్క, సంసత్ = సమూహంయొక్క, కపోల-స్థలీ = చెక్కిళ్ళపై, సంసక్త = బాగా ఆనిన, ఉజ్జ్వల = వెల్లివిరిసిన, గణ్డ = చెక్కిలియొక్క, మండల-రుచిమ్ = కాంతి-మండలంగల వాడునూ, హంస+ఆసన+ఆద్యైః : హంస+ఆసన = బ్రహ్మ, ఆద్యైః = మొదలుగా గల వారిచే (బ్రహ్మ మొదలగు దేవతలచే) (హంసః ఆసనం యస్యః సః ఆదౌ యేషాం తైః), స్తుతమ్ = స్తోత్రం చేయబడినవాడునూ, వంశ... దలమ్ : వంశ = వెదురు (ముక్క)పై, స్థాపిత = నిలుపబడిన, మంగల = శుభకరమైన, అంగుళి = వ్రేళ్ళు అనే, దళమ్ = ఆకులు గలవాడునూ (వంశే స్థాపితాని మంగళాని చ తాని అంగులీనాం దళాని యేన తమ్), స్రంసద్-విభూషా+ఆవలిమ్ : స్రంసద్ = జారుతున్న, విభూషా = నగలయొక్క, ఆవలిమ్ = సమూహం గలవాడునూ (స్రంసతాం విభూషాణామ్ ఆవళిః యస్య తమ్), హరినీల-నీలమ్ : హరినీల = ఇంద్రనీలమణివలె, నీలమ్ = నల్లనివాడునూ, అమలమ్ = నిర్మలుడునూ, సంసార-సారమ్:సంసార=జీవితంలో/విశ్వంలో, సారమ్ = సార-స్వరూపుడునూ అయిన, తమ్ = ఆ, హరిమ్ = కృష్ణుని, సేవే = సేవిస్తున్నాను. (సేవ్ సేవనే ఆత్మనేపది - లట్ - ఉ.ఏ.)

**తా ॥** గోపకాంతలు కృష్ణుని మూపుపై చేతులు వేసి నిలిచివున్నారు. వారి చెక్కిళ్ళపై కృష్ణుడు తన చెక్కిలిని ఆన్చి ఉన్నాడు. బ్రహ్మాది దేవతలు ఆ కృష్ణుని స్తుతిస్తున్నారు. అంగుళి దళాలను వేణువుపై నిలిపి వున్నాడు కృష్ణుడు. జారుతున్న నగలూ, ఇంద్రనీల-నీలవర్ణం గలవాడూ, సంసారసారస్వరూపుడూ అయిన ఆ హరిని సేవిస్తున్నాను.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. సేవే :** | సేవతే | సేవేతే | సేవన్తే |
| | సేవసే | సేవేథే | సేవధ్వే |
| | సేవే | సేవావహే | సేవామహే |

*

**శ్లో॥ హారాధారమనోహరోరసి లసన్నారీకరాంభోరుహం**
**తారాధీశముఖం విహారసరసోదారస్ఫురద్వీక్షణమ్ ।**
**స్మేరం చారుపరార్ధ్యభూషణధరం కారుణ్యవారాంనిధిం**
**కారాగారమిదం విహాయ భజ తం ధారాధరశ్యామలమ్ ॥ 9-21**

**అ :** నీలమేఘశ్యామలుని భజింపుడని ఉద్బోధ.

**అ :** హార+ఆధార-మనోహర+ఉరసి లసత్+నారీ-కర+అమ్భోరుహం తారా+అధీశ-ముఖం విహార-సరస+ఉదార-స్ఫురద్-వీక్షణం స్మేరం చారు-పరార్ధ్య-భూషణ-ధరం కారుణ్య-వారాంనిధిం ధారాధరశ్యామలం తమ్ ఇదం కారా+అగారం విహాయ భజ.

**ప్ర :** హారా... రోరసి: హార = హారాలకు, ఆధార = ఆశ్రయమైన, మనోహర = అందమైన, ఉరసి = వక్షస్థలంపై (హారాణామ్ ఆధారం మనోహరం చ తత్ ఉరః, తస్మిన్), లసత్+నారీ-కర-అమ్భోరుహమ్ : లసత్ = ప్రకాశిస్తున్న, నారీ = కాంతలయొక్క, కర+అమ్భోరుహమ్ = కరకమలాలు గలవాడును (లసన్తి చ తాని నారీణాం కరాః ఏవ

అమ్భోరుహాణి యస్య, తమ్), తారా+అధీశ-ముఖమ్ : తారాధీశ = చంద్రుని వంటి, ముఖమ్ = మోముగలవాడును (తారాణామ్ అధీశ ఇవ ముఖం యస్య, తమ్), విహార... క్షణమ్ : విహార = విహారంచేత, స-రస = రస సహితమై, ఉదార = గొప్పదైన, స్ఫురత్ = ప్రకాశించే, వీక్షణమ్ = చూపు గలవాడును (విహారేణ సరసమ్ ఉదారం స్ఫురత్ చ వీక్షణం యస్య, తమ్), స్మేరమ్ = చిఱునవ్వు గలవాడును, చారు... ధరమ్ : చారు = అందమైన, పరార్ధ్య = విలువైన/ శ్రేష్ఠమైన (ముఖ్యం పరార్ధ్యం ప్రవరం ప్రవర్హమ్ - హలాయుధకోశః - 690), భూషణ = నగలను, ధరమ్ = ధరించినవాడును, కారుణ్య-వారాంనిధిమ్ = దయాసముద్రుడును (కారుణ్యస్య వారాంనిధిః, తమ్), ధారాధర-శ్యామలమ్ = మేఘశ్యాముని (ధారాధర ఇవ శ్యామలః, తమ్), తమ్ = ఆ కృష్ణుని, ఇదమ్ = ఈ, కారా+అగారమ్ = (శరీర మనే) చెరసాలను, విహాయ = విడిచి, భజ = సేవించు. (భజ సేవాయాం పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** ముత్యాలహారాలకు ఆధారమైన ఆ అందమైన వక్షస్థలంపై గోపవనితా కరకమలం గలవాడూ, చంద్రముఖుడు, రాసవిహారంవలన రసవంతమై ప్రకాశించే చూపు గలవాడూ, చిఱునవ్వుల వాడూ, విలువయిన మనోహరమైన ఆభరణాలు ధరించినవాడూ, దయా-సాగరుడు, నీలమేఘశ్యామలుడు అయిన కృష్ణుని, కారాగారం వంటి ఈ శరీరాన్ని విడిచి సేవించాలి.

**వి :** 1. '**దేహో దేవాలయః ప్రోక్తః జీవో దేవస్సనాతనః**' - అని కొందరి దృష్టిలో దేహం దేవాలయం. జీవుడు దైవం. కొందరి దృష్టిలో శరీరం కారాగారం. దానిని వీడి కృష్ణుని సేవించాలి. సంసారాన్ని బంధనమనీ, శరీరాన్ని తుచ్ఛం, నశ్వరం అంటూనే మోక్షప్రాప్తి కావాలంటే మరల ఈ శరీరం ద్వారానే - ఈ భూలోకంలో జన్మించటం ద్వారానే - సాధ్యమనీ, మరే లోకంలోని వారికీ ఆ అవకాశం లేదనీ ప్రవచిస్తుంటాం. కాబట్టి దేహం బంధం కాదు. కానీ దేహభ్రాంతి బంధనం. వదలవలసింది దానినే.

| | | | |
|---|---|---|---|
| 2. **భజ :** | భజతు/భజతాత్ | భజతామ్ | భజన్తు |
| | **భజ**/భజతాత్ | భజతమ్ | భజత |
| | భజాని | భజావ | భజామ |

*

**శ్లో॥ విస్తీర్ణామరశాఖిరత్నభవనే ఛత్రాయితాహీశ్వరే**
**సత్సింహాసనశోభిమూలవిభవే విభ్రాజమానం విభుమ్ ।**
**భృత్యైర్బ్రహ్మభవాదిభిః పరివృతం సద్వన్దిభిః సంస్తుతం**
**చిత్తోపాస్స్వ విలోలగోపలలనానేత్రాన్తసచ్చామరమ్ ॥ 9-22**

**అ :** '**మనసా కృష్ణుని భజించు**' - అని మనస్సుకు హెచ్చరిక.

**అ :** చిత్త! విస్తీర్ణ+అమర-శాఖి-రత్న-భవనే ఛత్రాయిత+అహి+ఈశ్వరే సత్-సింహాసన-శోభి-మూల విభవే విభ్రాజమానం బ్రహ్మభవాదిభిః భృత్యైః పరివృతం సద్-వందిభిః సంస్తుతం విలోల-గోప-లలనా-నేత్ర-అంత-సత్-చామరం విభుమ్ ఉపాస్స్వ.

**ప్ర :** చిత్త! = హృదయమా!, విస్తీ... భవనే : విస్తీర్ణ = విస్తరించిన, అమర-శాఖి = కల్పవృక్షమనే, రత్న-భవనే = రత్నాలు పొదిగిన భవనంలో (విస్తీర్ణశ్చ అసౌ అమరశాఖీ, స ఏవ రత్నభవనం, తస్మిన్), ఛత్రాయిత+అహీశ్వరే : ఛత్రాయిత = గొడుగుగా నున్న, అహీశ్వరే = ఆదిశేషునిపై, సత్... విభవే : సత్ = మంచి, సింహాసన = సింహాసనంవలె, శోభి = ప్రకాశిస్తున్న, మూల = కుదుటియొక్క, విభవే = సంపదయందు (సత్ చ తత్ సింహాసనం, తద్వత్ శోభీ మూలస్య విభవః యస్య, తస్మిన్), విభ్రాజమానమ్ = వెలు గొందుతున్నవాడును,

బ్రహ్మ-భవ+ఆదిభిః : బ్రహ్మ = బ్రహ్మ, భవ = శివుడు, ఆదిభిః = మొదలుగా గల, భృత్యైః = సేవకులచే, పరివృతమ్ = చుట్టబడినవాడునూ, సద్-వందిభిః = మంచి స్తోత్రపాఠకులచే (సన్తః చ తే వందినః, తైః), సంస్తుతమ్ = ప్రస్తుతింపబడినవాడును, విలోల... సచ్చామరమ్ : విలోల = చంచలాలైన, గోపలలనా = గోపవనితలయొక్క, నేత్ర = కన్నులయొక్క, అంత = కొసలే, సత్-చామరమ్ = మంచి వింజామరలుగా గలవాడును అయిన, విభుమ్ = స్వామిని (కృష్ణుని), ఉపాస్స్వ = ఆరాధించు. (ఆస్ ఉపవేశనే ఆత్మనేపది - లోట్ - మ.ఏ.)

**తా ॥** ఓ మనసా! కృష్ణుని ఉపాసించు. ఆయన పాలకడలిలో బాగా విస్తరించిన కల్పవృక్ష మనే రత్నభవనంలో, ఆదిశేషుడు గొడుగు లాగా పడగపట్టగా, కల్పవృక్షం కుదురు దగ్గరనున్న సంపన్నమైన వితర్ది సింహాసనం కాగా, అక్కడ శయనించి విరాజిల్లుతుంటాడు. బ్రహ్మ, శివుడు మొదలయిన దేవతలు భృత్యులై చుట్టూ నిలిచివుంటారు. నారదాది మునులు స్తోత్రపాఠకులై పొగడుతుంటారు. గోపకాంతల కనుకొనలు అటు ఇటూ కదులుతూ వింజామరలై వీస్తుంటాయి.

**వి :** 1. మనస్సులో ఒకరూపాన్ని నిలుపుకొని దానినే ధ్యానిస్తూ భక్తి తన్మయతను పొందటం, ఆత్మబోధ-కుపక్రమించటం ఆర్తుల లక్షణం. ఆ ఆర్తియే భగవత్తత్త్వసాక్షాత్కారానికి మూలమై వైరాగ్యంగా ప్రవృద్ధమై ముముక్షుతకు మార్గదర్శక మవుతుంది. సదాశివబ్రహ్మేంద్రుల కీర్తనను గమనించండి. మనస్సుతోనే మాటాడుతున్నాడు.

**మానససంచర రే - బ్రహ్మణి - మానససంచర రే**
**మదశిఖిపింఛాలంకృతచికురే - మహనీయకపోలవిజితముకురే** ॥మానస॥
**శ్రీరమణీకుచదుర్గవిహారే - సేవకజనమందిరమందారే** ॥మానస॥
**పరమహంసముఖచంద్రచకోరే - పరిపూరితమురళీరవధారే** ॥మానస॥

2. అమరశాఖిలో రత్నభవనత్వాన్నీ, గోపలలనా నేత్రాంతాలలో చామరత్వాన్నీ ఆరోపించినందువల్ల రూపకాలంకారం. సింహాసనంవలె శోభించే కల్పతరుమూల విభవమన్నచోట లుప్తోపమాలంకారం. ఈ మొత్తం కలిసి క్షీరసాగర సంపన్నతను వర్ణించటం, అది పరమేశ్వరునికి ఆశ్రయమై ప్రకాశించటం కాబట్టి ఉదాత్తాలంకారం. '**ఉదాత్త-మృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్** ' - (కు. 162)

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపాస్స్వ :** | ఉపాస్తామ్ | ఉపాసాతామ్ | ఉపాసతామ్ |
| | ఉపాస్స్వ | ఉపాసాథామ్ | ఉపాధ్వమ్ |
| | ఉపాసై | ఉపాసావహై | ఉపాసామహై |

*

**శ్లో॥ హే చేతఃక్షితిపాల! భక్తిరమణీయుక్తోఽక్షిమీనాశ్రయే**
**నాభ్యావర్తవతి శ్రుతిహ్రదయుతే కేశౌఘశైవాలిని ।**
**సుభ్రూసద్వలిపఙ్క్తిమన్దహసితోత్తుఙ్గోర్మిఫేనావిలే**
**హస్తాఙ్ఘ్ర్యబ్జిని విట్ఠలాఙ్గసరసీతోయే రమస్వానిశమ్ ॥ 9-23**

**అ :** ఆత్మబోధ - పాండురంగడనే సరోవరజలంలో నిత్యమూ క్రీడించమని సూచన.

**అ :** హే చేతఃక్షితిపాల! భక్తి-రమణీ-యుక్తః (సన్) అక్షి-మీన+ఆశ్రయే నాభి+ఆవర్తవతి శ్రుతి-హ్రద-యుతే కేశ+ఓఘ-శైవాలిని సుభ్రూ-సద్-వలి-పంక్తి-మంద-హసిత+ఉత్తుంగ +ఊర్మి-ఫేన-ఆవిలే హస్త+అంఘ్రి-అబ్జిని విట్ఠల+అంగ-సరసీ-తోయే అనిశం రమస్వ.

**ప్ర :** హే చేతః-క్షితిపాల = ఓ హృదయభూపాలా! (మనస్సనే రాజా!) (చేతః ఇతి క్షితిపాలః తస్మాత్

సంబుద్ధిః), భక్తి-రమణీ-యుక్తః సన్ : భక్తి = భక్తి అనే, రమణీ = స్త్రీతో, యుక్తః(సన్) = కూడిన వాడవై, అక్షి-మీన+ఆశ్రయే : అక్షి = కన్ను లనే, మీన = చేపలకు, ఆశ్రయే = ఆధారమైనదియు (అక్షిణి ఏవ మీనాః తేషామ్ ఆశ్రయః, తస్మిన్), నాభి+ఆవర్తవతి : నాభి = బొడ్డు అనే, ఆవర్తవతి = సుడులు గలదియు (నాభిః ఏవ ఆవర్తః తద్వాన్ తస్మిన్), శ్రుతి-హ్రద-యుతే : శ్రుతి = చెవులు అనే, హ్రద = మడుగులతో (జలాశయా జలాధారా స్తత్రాగాధజలో హ్రదః - అమరకోశః - వారి - 25), యుతే = కూడుకొన్నదియు (శ్రుతిః ఏవ హ్రదః, తేన యుక్తం, తస్మిన్), కేశ+ఓఘ-శైవాలిని : కేశ+ఓఘ = కేశ-సమూహ మనే, శైవాలిని = నాచు (పాచి) గలదియు (ఆంధ్రవాచస్పత్యము - 4 పుట 2500) (కేశానామ్ ఓఘః ఏవ శైవాలం తదస్య అస్తీతి, తస్మిన్), సుభ్రూ... ఆవిలే : సుభ్రూ = అందమైన కనుబొమలు, సద్-వలి-పంక్తి =చక్కని మూడు ముడతలు, మందహసిత = చిఱునవ్వు అనే, ఉత్తుంగ = ఉన్నతమైన, ఊర్మి = అలలచేతనూ (కను-బొమలు, ముడతలు అలలు), ఫేన = నురుగుచేతనూ (నవ్వు నురుగు), ఆవిలే = మలినమైనదియు (కలుషం క్లీబేఽ హస్యావిలే త్రిషు - నానార్థరత్నమాలా - పంక్తి - 2092), హస్త+అంఘ్రి+అబ్జిని : హస్త = చేతులు, అంఘ్రి = కాళ్ళు అనే, అబ్జిని = తామరలు గలదియు (హస్తాః అంఘ్రయశ్చ ఏవ అబ్జాని అస్య సన్తి ఇతి, తస్మిన్), విట్ఠల+అంగ-సరసీ-తోయే : విట్ఠల = పాండురంగనియొక్క, అంగ = శరీరమనే, సరసీ = సరస్సు యొక్క, తోయే = నీటిలో (విట్ఠలస్య అంగమేవ సరస్యాః తోయం, తస్మిన్), అనిశమ్ = ఎల్లప్పుడూ, రమస్వ = క్రీడించు. (రమ్ క్రీడాయాం - ఆత్మనేపది - లోట్ - మ.ఏ.)

**తా ॥** ఓ మనోభూపాలా! పాండురంగవిట్ఠలుడనే సరోవరజలంలో నిరంతరంగా భక్తికాంతతో కూడి క్రీడించు. అక్కడ కన్నులనే చేపలు తిరుగుతుంటాయి. నాభి అనే సుడి, చెవులనే మడుగులు, కేశపాశమనే నాచు వుంటాయి. కనుబొమలు, త్రివళులు అనే అలలు, మందహాసమనే నురుగుతో అది కలతపడి వుంటుంది. చేతులు, కాళ్ళు అనే తామరలు అక్కడ కనిపిస్తాయి.

**వి :** 1. ఇది సావయవరూపకాలంకారం. పాండురంగవిట్ఠలునిలో సరోవరజలత్వాన్ని ఆరోపించటం అవయవి. సరోవరానికి అవసరమైన అవయవాలను పాండురంగని శరీరావయవాలలో (భక్తి రమణితో పాటు) ఆరోపించటం అవయవారోపణం. కాబట్టి ఇది సావయవరూపకం.

2. భక్తిలో రమణీత్వాన్ని ఆరోపించటం కూడా మరో రూపకం. భక్తిలో, ముక్తిలో కూడా - పదాలు స్త్రీలింగాలు అయితే కావచ్చు కూడా కాంతాత్వాన్ని ఆరోపించటం కవులకు అలవాటు. ఒకవైపు ముక్తి అంటూ మరొక కాంతాత్వాన్ని ఆరోపించి, అభిలాషను ప్రకటించటం కవి సమయంగా మారిపోయింది.

| | | | |
|---|---|---|---|
| 3. **రమస్వ :** | రమతామ్ | రమేతామ్ | రమన్తామ్ |
| | **రమస్వ** | రమేథామ్ | రమధ్వమ్ |
| | రమై | రమావహై | రమామహై |

*

**శ్లో॥ హే హస్తామ్బుజ! విట్ఠలాఙ్ఘ్రితరణిం మా ముఞ్చ దృక్కైరవ!**
**శ్రీమన్తం ముఖచన్ద్రమస్థిరమనశ్చోరాలకాఖ్యం తమః ।**
**జిహ్వేదర్దుర! తత్కథాసుజలధిం వక్షః కవాటం సదా**
**హృద్గేహ! శ్రుతిపఞ్జర! ప్రతిదినం హృద్యం శుకస్యోదితమ్ ॥ 9-24**

**అ :** శరీరావయవాలను సంబోధిస్తూ విట్ఠలుని విడువరాదని ఉద్బోధించటం.

**అ :** హే హస్త+అంబుజ! విట్ఠల+అంఘ్రి-తరణిం మా ముంచ. దృక్-కైరవ! శ్రీమంతం ముఖచంద్రం (మా

ముంచ). అస్థిరమనః+చోర! అలక+ఆఖ్యం తమః (మా ముంచ). జిహ్వాదర్దుర! తత్కథా-సుజలధిం (మా ముంచ). హృద్+గేహ! వక్షః-కవాటం (మా ముంచ). శ్రుతిపంజర! ప్రతిదినం హృద్యం శుకస్య ఉదితం మా ముంచ.

ప్ర : హే హస్త+అంబుజ = ఓ కరకమలమా! (హస్త ఏవ అంబుజం, తస్మాత్ సంబుద్ధిః), విట్ఠల+అంఘ్రి-తరణిమ్: విట్ఠల = కృష్ణుని యొక్క, అంఘ్రి-తరణిమ్ = పాదమనే సూర్యుని (తిగ్మాంశుస్తరణిస్తథా దినమణిః-హలాయుధకోశః-35) (అంఘ్రిః ఏవ తరణిః తమ్), మా ముంచ = వీడవద్దు. (ముచ్ మోక్షణే-పరస్మైపది-లోట్-మ.ఏ.), దృక్+కైరవ = నయనోత్పలా! (దృక్ ఏవ కైరవం తస్మాత్ సంబుద్ధిః), శ్రీమంతమ్ = కాంతిగల, ముఖచంద్రమ్ = ముఖచంద్రుని (ముఖమ్ ఏవ చంద్రః, తమ్), మా ముంచ = వీడవద్దు. అస్థిర-మనశ్చోర = నిలకడలేని మనస్సు అనే చోరుడా! (అస్థిరం చ తత్ మనః తదేవ చోరః, తస్మాత్ సంబుద్ధిః), అలక+ఆఖ్యమ్ = వెంట్రుకలనబడే, తమః = చీకటిని, మా ముంచ = వీడవద్దు. జిహ్వా-దర్దుర! = నాలుక అనే కప్పా! (జిహ్వా ఏవ దర్దురః, తస్మాత్ సంబుద్ధిః) (మండూకః ప్లవకో భేకః శాలూరో దర్దురో హరిః - హలాయుధకోశః - 662), తత్-కథా-సుజలధిమ్ : తత్-కథా = కృష్ణ కథలనెడి, సుజలధిమ్ = సముద్రాన్ని (తస్య కథాః త ఏవ సుజలధిః, తమ్), మా ముంచ = వీడవద్దు. హృద్-గేహ! = హృదయ గృహమా! (హృద్ ఏవ గేహం, తస్మాత్ సంబుద్ధిః), వక్షః-కవాటమ్ = వక్షస్థలమనే ద్వారాన్ని (వక్షః ఏవ కవాటమ్), మా ముంచ = వీడవద్దు, శ్రుతి-పంజర! = చెవి అనే పంజరమా! (శ్రుతిః ఏవ పంజరః, తస్మాత్ సంబుద్ధిః), ప్రతిదినమ్ = ప్రతిరోజూ (దినే దినే), హృద్యమ్ = మనోహరమైన, శుకస్య = శుకునియొక్క ఉదితమ్ = మాటను (భాగవతాన్ని), మా ముంచ = వీడవద్దు.

**తా ॥** ఓ కరకమలమా! కృష్ణుని పాదసూర్యుని వీడవద్దు. నయనోత్పలమా! కృష్ణుని ముఖచంద్రుని వీడవద్దు. చంచలమైన మనశ్చోరుడా! కృష్ణుని అలక లనే చీకటిని వీడవద్దు. జిహ్వా భేకమా! కృష్ణ కథాసముద్రాన్ని వీడవద్దు. హృదయగృహమా! వక్షఃకవాటాన్ని వీడవద్దు. శ్రుతిపంజరమా! హృద్యమైన శుకవచనాలను ఏనాడూ వదలవద్దు.

వి : 1. శరీరావయవాలను ఉద్దేశించి ప్రసంగిస్తూ కులశేఖరాళ్వార్ రచించిన శ్లోకం ముకుంద మాలలో కనిపిస్తుంది.

**శ్లో॥ జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరమ్**
**పాణిద్వంద్వః సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు**
**కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం**
**జిఘ్ర ఘ్రాణ ముకుందపాదతులసీం మూర్ధన్ నమాధోక్షజమ్ - ముకుందమాల 16**

2. హస్తాంబుజ, అంఘ్రితరణి, దృక్కైరవ, ముఖచంద్ర, అలకాఖ్యం తమః, జిహ్వా దర్దుర, కథాసుజలధి, వక్షఃకవాట, హృద్గేహ, శ్రుతిపంజర - ఇవన్నీ రూపకాలంకారాలే.

| | | | |
|---|---|---|---|
| 3. **ముంచ :** | ముంచతు/ముంచతాత్ | ముంచతామ్ | ముంచన్తు |
| | **ముంచ**/ముంచతాత్ | ముంచతమ్ | ముంచత |
| | ముంచాని | ముంచావ | ముంచామ |

*

**శ్లో॥ భ్రాన్త! స్వాన్త! వినిన్దితైః క్రిమిశతైర్విష్టాతిపుష్టైర్వృతం**
**మూత్రామత్రమమేయపూయమబలాకాయం విగేయం త్యజ ।**
**నిత్యం నిర్మలవిగ్రహం నిజవశం నీలోత్పలశ్యామలం**
**ప్రేష్ఠం సంస్మర విట్ఠలం వ్రజవధూతృష్ణాసముజ్జృమ్భకమ్ ॥ 9-25**

అ : విట్ఠల సంస్మరణమే శ్రేష్ఠ తరమని మనస్సున కుద్బోధ చేయుట-

**అ :** భ్రాంత! స్వాంత! వినిందితైః విష్ట+అతిపుష్టైః క్రిమిశతైః వృతం మూత్ర+అమత్రమ్ అమేయపూయమ్ అబలాకాయం విగేయం త్యజ. నిత్యం నిర్మల విగ్రహం నిజవశం నీల+ఉత్పల శ్యామలం ప్రేష్ఠం వ్రజ-వధూ-తృష్ణా-సముజ్జృంభకం విట్ఠలం సంస్మర.

**ప్ర :** భ్రాంత! = భ్రాంతికి లోనైన, స్వాంత! = హృదయమా!, వినిందితైః = జుగుప్సావహమై, విష్టా+అతిపుష్టైః = మలంతో బాగా పెరిగిన, క్రిమిశతైః = వందల క్రిములతో, వృతమ్ = చుట్టబడినదియు, మూత్ర+అమత్రమ్ = మూత్రానికి పాత్ర అయినదియు, అమేయ-పూయమ్ = అంతులేని చీము కలదియు, విగేయమ్ = నిందింపదగినదియు అయిన, అబలా-కాయమ్ = స్త్రీ శరీరాన్ని (అబలాయాః కాయః, తమ్), త్యజ = విడిచిపెట్టు (త్యజ హానౌ పరస్మైపది-లోట్-మ.ఏ.), నిత్యమ్ = నశించని వాడును, నిర్మల-విగ్రహమ్: నిర్మల = దోషంలేని, విగ్రహమ్ = ఆకృతిగలవాడును, నిజవశమ్ : నిజ = తనయొక్క, వశమ్ = అదుపులో నున్నవాడును, నీల+ఉత్పల-శ్యామలమ్:నీల+ఉత్పల=నల్లకలువవలె, శ్యామలమ్ = శ్యామలవర్ణం గలవాడును, ప్రేష్ఠమ్ = ఇష్టమైన వాడును, వ్రజ-వధూ-తృష్ణా-సముజ్జృంభకమ్ : వ్రజ-వధూ = గోపవనితల యొక్క, తృష్ణా = కోరికను, సముజ్జృంభకమ్ = పెంపొందింప జేయువాడును అయిన, విట్ఠలమ్ = కృష్ణుని, సంస్మర = బాగా తలచుకో. (సమ్-స్మృ ఆధ్యానే - పరస్మైపది - లోట్ - మ.ఏ.)

**తా ॥** మనసా! భ్రాంతికి లోనవుతున్నావు. కాంతా శరీరం తనలోనున్న అమేధ్యంలో పెరిగిన వందల క్రిములతో కూడిన మూత్రపాత్రయై, ఎడతెగని చీముకు ఆశ్రయమై, నిందింప దగినది. దానిని గురించిన ఆలోచన వదలిపెట్టు. నిత్యమై, నిర్మలస్వరూపమై, భక్తవశమై, నీలోత్పలశ్యామలమై, ప్రియమై, గోపకాంతలలో కోరికలను విజృంభింపజేసే విట్ఠలుని తలచుకో.

**వి :** 1. ఈ శ్లోకంలో పరస్పరమూ పోల్చదగని రెండు అంశాలను వర్ణించినందువలన ఇది విషమాలంకారం. హేయమైన కాంతాశరీరానికీ, ప్రేయమైన కృష్ణస్వరూపానికీ సరూపతలేదు. ఆ రెండింటినీ వర్ణించటం విషమం. **'విషమం వర్ణ్యతే యత్ర ద్వయోరననురూపయోః'** - (కు.88)

2. కాంతాశరీరాన్ని పూర్వార్ధంలో పరమహేయంగా వర్ణించి శ్లోకాంతంలో 'వ్రజ వధూతృష్ణాసముజ్జృంభకమ్' అంటూ విట్ఠలునికి విశేషణాన్ని వేయటాన్ని గమనించాలి. హేయమైన ఆ కాంతల శరీరంలో తృష్ణను కలిగించట మెందుకు? ఆ తృష్ణ పురుషుని మీదనే గదా! మరి ఆ పురుషులకు ఆ శరీరంమీద అంత అధమభావాన్ని కల్గించటమెందుకు? దాని అపరిహార్యతను బోధించటానికా? మన నిమిత్తమాత్రతను నిరూపించటానికా? మరి తాను అవన్నీ కల్పిస్తూ వాటిని తుచ్ఛాలని అసహ్యించుకోవట మెందుకు? ఆలోచించవలసి వుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **త్యజ :** | త్యజతు/త్యజతాత్ | త్యజతామ్ | త్యజన్తు |
| | **త్యజ**/త్యజతాత్ | త్యజతమ్ | త్యజత |
| | త్యజాని | త్యజావ | త్యజామ |
| **సంస్మర :** | సంస్మరతు/సంస్మరతాత్ | సంస్మరతామ్ | సంస్మరన్తు |
| | **సంస్మర**/సంస్మరతాత్ | సంస్మరతమ్ | సంస్మరత |
| | సంస్మరాణి | సంస్మరావ | సంస్మరామ |

*

**శ్లో॥ హృద్యేతః క్వ గతోఽసి నాథ! మృగయాం కర్తుం కథం సా ప్రభో-**
**రద్యైవాఙ్కురితాన్తరే పరిలసత్కుమ్భీన్ద్ర కుమ్భత్విషి ।**
**లుబ్ధాన్ కేసరిణస్తవ స్తనతటే స్పర్ధాయుతాంశ్చ ద్విపాన్**
**ముగ్ధే! వేద్ధుమితీరయన్ మురరిపుర్బుద్ధిం స దద్యాన్మమ ॥ 9-26**

**అ :** గోపీ కృష్ణ సంవాదాత్మకమైన **కృష్ణ ప్రార్థన.**

**అ :** గోపి : హృద్య నాథ ఇతః క్వ గతః అసి

కృష్ణుడు : మృగయాం కర్తుమ్

గోపి : సా ప్రభోః అంతరే అద్య ఏవ కథమ్ అంకురితా

కృష్ణుడు : ముగ్ధే! పరిలసత్-కుంభి+ఇంద్ర-కుంభ-త్విషి తవ స్తనతటే లుబ్ధాన్ కేసరిణః స్పర్ధా-యుతాన్ ద్విపాన్ చ వేద్ధుమ్.

కవి : ఇతి ఈరయన్ సః మురరిపుః మమ బుద్ధిం దద్యాత్.

**ప్ర : గోపి** : హృద్య! = మనోహరా! నాథ! = స్వామీ, ఇతః = ఇక్కడనుండి, క్వ = ఎక్కడకు, గతః+అసి = వెళ్ళావు. (అస భువి పరస్మైపది-లట్-మ.ఏ.), **కృష్ణుడు :** మృగయాం కర్తుమ్ = వేటాడటానికి, **గోపి :** సా = ఆ మృగయ (వేట), ప్రభోః = స్వామియొక్క, అంతరే = మనస్సులో, అద్య-ఏవ = ఇప్పుడు, కథమ్ = ఏ రీతిగా, అంకురితా = పుట్టింది?, **కృష్ణుడు :** ముగ్ధే! = ముద్దరాలా!, పరిలసత్-కుంభి+ఇంద్ర-కుంభ-త్విషి : పరిలసత్ = ప్రకాశిస్తున్న, కుంభీంద్ర = గజరాజుయొక్క, కుంభ = కుంభస్థలంయొక్క, త్విషి = కాంతివంటి కాంతిగల, తవ = నీయొక్క, స్తన-తటే = రొమ్ముల అంచుపై, లుబ్ధాన్ = లోభం గల, కేసరిణః = సింహాలను, స్పర్ధా-యుతాన్ = (రొమ్ములతో) పోటీ గల (స్పర్ధయా యుతాః, తాన్), ద్విపాన్-చ = ఏనుగులను కూడా, వేద్ధుమ్ = (బాణాలతో) చంపటానికి, ఇతి = అని, ఈరయన్ = పలుకుతూ, సః మురరిపుః = ఆ కృష్ణుడు, మమ = నాకు, బుద్ధిమ్ = మతిని, దద్యాత్ = ఇచ్చుగాక.

**తా ॥** గోపి - మనోహరా! ప్రభూ! ఎక్కడకు వెళ్ళావు.

కృష్ణుడు - వేటాడటానికి

గోపి - ఆ ఆలోచన ఇప్పుడెలా పుట్టింది?

కృష్ణుడు - ప్రకాశించే ఏనుగు కుంభస్థలంవంటి కాంతిగల నీ రొమ్ములపై లోభపడిన సింహాలనూ, రొమ్ములతో స్పర్ధిస్తున్న కుంభస్థలాలు గల ఏనుగులను బాణాలతో చంపటానికి వేటాడుతున్నాను-

అంటూ గోపికలతో పలుకుతున్న ఆ **కృష్ణుడు నాకు బుద్ధిని ఇచ్చుగాక!**

**వి :** 1. స్త్రీల స్తనాలను ఏనుగు కుంభస్థలంతో పోల్చటం సంస్కృతకవులకూ, తెలుగు కవులకూ - అదీ ప్రబంధ, తత్సన్నిహిత కాల కవులకు బాగా అలవాటు. **రుక్మిణీశవిజయ** కావ్యకర్త ప్రబంధకాలానికి దగ్గరవాడే కొంచెం ముందు. శ్రీనాథుడికి కొంచెం తర్వాత వాడు. శ్రీనాథుడి పోకడను కూడా గమనించండి అటువంటి పోలికల విషయంలో.

శ్లో॥ అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా
భిక్షా దానము సేయరా! సుకవిరాడ్బృందారకశ్రేణికిన్
దక్షారామ చళుక్యభీమవరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయకుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

2. ఇలా సంవాదాత్మకంగా శ్లోకరచన చేయటాన్ని **వాకోవాక్య** మంటారు. ఇది సాధారణమైన వాకోవాక్యం. వాకోవాక్యాలలో వక్రోక్తి, గూఢోక్తుల కలయిక కూడా కొన్ని చోట్ల కనిపించి మరీ అందగిస్తుంది. శ్రీవాదిరాజ తీర్థరచితమైన అటువంటి సంవాదాన్ని కూడా గమనించండి.

శ్లో॥ అంగుళ్యా కః కవాటం ప్రహరతి? కుటిలే మాధవః, కిం వసన్తో?
నో చక్రీ, కిం కులాలో? న హి ధరణిధరః, కిం ద్విజిహ్వః ఫణీంద్రః? ।
నాహం ఘోరాహిమర్దీ, ఖగపతిరసి కిం? నో హరిః, కిం కపీంద్ర-
స్త్విత్యేవం గోపకన్యా ప్రతివచనజడః పాతు మాం పద్మనాభః ॥

| | | | |
|---|---|---|---|
| 3. **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ దద్యాత | |
| దద్యామ్ | దద్యావ | దద్యామ | * |

**శ్లో॥ సాజాత్యేన వరాహసింహనివహం సామ్యేన తే చక్షుషోః**
**సారఙ్గాన్ విధుగర్వశఙ్క్యపి శశాన్ నామ్నా శిఖణ్డివ్రజమ్ ।**
**త్వత్పుష్పాఞ్చితకేశహస్తతులయా సన్త్యజ్య సఖ్యాగమం**
**కృత్వా త్వద్దురితే మృగాక్షి! మృగయామిత్యాలపన్ పాత్వసౌ ॥ 9-27**

**అ :** కృష్ణుడు గోపికతో మాటాడిన దానిని అనువదిస్తూ కవికృత **కృష్ణప్రార్థన.**

**అ :** సఖి! సాజాత్యేన వరాహ-సింహ-నివహం; తే చక్షుషోః సామ్యేన సారంగాన్ నామ్నా విధు-గర్వశంకీ+అపి శశాన్, త్వత్-పుష్ప+అంచిత-కేశ-హస్త-తులయా శిఖండివ్రజం సంత్యజ్య. మృగ+అక్షి! త్వద్-దురితే మృగయాం కృత్వా ఆగమమ్ ఇతి ఆలపన్ అసౌ పాతు.

**ప్ర :** సఖి! = చెలీ!, సాజాత్యేన = సమానజాతి అయినందువల్ల (సమానా చ సా జాతిః సజాతిః, తస్యాః భావః, తేన), వరాహ-సింహ-నివహమ్ : వరాహ = పందులయొక్క, సింహ = సింహాలయొక్క, నివహమ్ = సమూహాన్నీ, (వరాహాశ్చ సింహాశ్చ వరాహసింహాః తేషాం నివహః, తమ్), తే = నీయొక్క, చక్షుషోః = కళ్ళయొక్క, సామ్యేన = పోలికవల్ల, సారంగాన్ = జింకలనూ (సారాణి అంగాని యస్య సః, తాన్), విధు-గర్వ-శంకీ+అపి : విధు = చంద్రునియొక్క, గర్వ = అహంకారాన్ని, శంకీ+అపి = అనుమానిస్తూ కూడా (విధోః గర్వం శంకతే ఇతి), నామ్నా = పేరువల్ల, శశాన్ = కుందేళ్ళనూ, త్వత్-పుష్ప+అంచిత-కేశ-హస్త-తులయా : త్వత్ = నీయొక్క, పుష్ప = పూలతో, అంచిత = అలంకరింపబడిన, కేశహస్త = తలవెంట్రుకలతో (హస్తః పక్షః పాశః కేశేషు బహుత్వ వాచకాః శబ్దాః - హలాయుధకోశః - 531), తులయా = పోలిక చేత, శిఖండి-వ్రజమ్ : శిఖండి = నెమళ్ళయొక్క (కేకః శిఖీ శిఖండీ- హలాయుధకోశః - 241) (శిఖండః అస్య అస్తి ఇతి), వ్రజమ్ = గుంపునూ (శిఖండినాం వ్రజమ్), సంత్యజ్య = విడిచి (సమ్-త్యజ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మృగ+అక్షి! = మృగనయనా!, త్వద్-దురితే : త్వద్ = నీ పట్ల, దురితే = పాపంచేసిన దానిపై, మృగయాం కృత్వా = వేటాడి, ఆగమమ్ = వచ్చాను. (ఆ+గమ్ గతౌ పరస్మైపది-లుఙ్-ఉ.ఏ.), ఇతి=అని, ఆలపన్ = పలుకుతూ, అసౌ = ఆ కృష్ణుడు, పాతు = రక్షించును గాక! (పా రక్షణే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** 'చెలీ! నాకు సజాతీయమైనవి కాబట్టి వరాహాలనూ, సింహాలను వదలిపెట్టాను. నీ కళ్ళతో పోలిక వుంది కాబట్టి జింకలను వదలిపెట్టాను. చంద్రుడు అహంకరిస్తాడని అనుమానించి కూడా పేరును బట్టి కుందేళ్ళను వదలిపెట్టాను. నీ కేశపాశాలతో పోలిక వల్ల నెమళ్ళను వదలిపెట్టాను. మిగిలిన వాటిని - నీకు ఇబ్బందిని కలిగిస్తూ నీ పట్ల పాపం చేసిన వాటిని - వేటాడి నీ దగ్గరకు వచ్చాను మృగనయనా!' - అని చెప్తున్న కృష్ణుడు కాపాడు గాక!

**వి :** 1. శ్లోకంలో నాలుగు కారణాలతో (సాజాత్యేన, సామ్యేన, నామ్నా, తులయా) నాలుగింటిని (వరాహసింహనివహ,

సారంగ, శశ, శిఖండివ్రజ) విడిచి నట్టుంది. అది శ్లోకరచనలో **చతురస్రత**. అయితే మూడు (శశ) కారణాలలో స్పష్టత వుంచి, వాచ ప్రకటన వుంది. నాలుగవది ఊహించవలసి వస్తోంది. వ్యాఖ్యాతలు 'నామ్నా, తులయా' అన్న రెండింటినీ **శిఖండివ్రజానికే** అన్వయించి చూపారు. శశ విషయం సంభావించారు. ఊహలో అనౌచిత్యం లేదుకానీ అన్వయించటంలో చతురస్రత లోపిస్తోంది. కాబట్టి నామ్నా అన్న దానిని శశపరంగానే అన్వయించాలి. ఎలా? శశపదానికి శశతి ఇతి శశః అని వ్యుత్పత్తి. తీవ్రవేగగమనం గలది లేదా ఎగురుతూ, ఎగురుతూ వెళ్ళేది అని అర్థం. ఆ పేరును బట్టి దానిని అభిమానిస్తూ, లేదా గౌరవిస్తూ విడిచిపెట్టాడని భావం. అది చంద్రునికి అహంకారాన్ని కల్గించేదే. ఆ శంక చేసి కూడా విడిచిపెట్టానని అందుకే అన్నాడు కృష్ణుడు. మరేదైనా సంభావన కూడా చేయవచ్చునేమో! కానీ శ్లోకంలోని చతురస్రత నష్టపడకుండా.

కృష్ణునికి కూడా స్వపరపక్షపాత మున్నట్లు శ్లోకం ప్రకటిస్తోంది. ఇది ఆంతరమైన వాస్తవం కావచ్చు లేదా గోపికను విశ్వసింపజేసే ప్రయత్నం కావచ్చు. అందుకే తన్నిరపేక్షంగా 'పాతు' అని రక్షణను కోరటం.

| | | | |
|---|---|---|---|
| 2. **పాతు :** | **పాతు**/పాతాత్ | పాతామ్ | పాన్తు |
| | పాహి/పాతాత్ | పాతమ్ | పాత |
| | పాని | పావ | పామ |
| **ఆగమమ్ :** | ఆగమత్ | ఆగమతామ్ | ఆగమన్ |
| | ఆగమః | ఆగమతమ్ | ఆగమత |
| | **ఆగమమ్** | ఆగమావ | ఆగమామ |

*

**శ్లో॥ కస్మాన్నాథ! విహాయ నస్త్వమగమః కర్తుం భవన్మార్గణం**
**వృక్షాభ్యన్తరవర్తిచన్ద్రమహసో యుష్మాన్ శుకౌఘాక్షరాత్ ।**
**యుష్మన్మఞ్జుగిరః పికౌఘనినదాన్ముగ్ధా భవత్సుస్వరా-**
**నజ్ఞాత్వా పృథగిత్యుదీర్య శమయన్ సౌఖ్యం స దద్యాన్మమ ॥ 9-28**

**అ :** ప్రశ్నోత్తరశ్లోకం - గోపికాకృష్ణసంవాదం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** నాథ! నః విహాయ కస్మాత్ త్వమ్ అగమః ముగ్ధాః! వృక్ష+అభ్యంతర-వర్తి-చంద్ర-మహసః యుష్మాన్ శుక+ఓఘ-అక్షరాత్ యుష్మత్+మంజు-గిరః పిక+ఓఘ-నినదాత్ భవత్-సుస్వరాన్ పృథక్ అజ్ఞాత్వా భవత్+మార్గణం కర్తుమ్ ఇతి ఉదీర్య శమయన్ సః మమ సౌఖ్యం దద్యాత్.

**ప్ర :** నాథ! = స్వామీ!, నః = మమ్ములను, విహాయ = విడిచి, కస్మాత్ = ఎందువలన, త్వమ్ = నీవు, అగమః = వెళ్ళావు? (గమ్ గతౌ పరస్మైపది-లజ్-మ.ఏ.), ముగ్ధాః = ముగ్ధలారా!, వృక్ష+అభ్యంతర-వర్తి-చంద్ర-మహసః : వృక్ష = చెట్లయొక్క, అభ్యంతర = చాటుగా, వర్తి = ఉన్నట్టి, చంద్ర = చంద్రునియొక్క, మహసః = కాంతికన్న (వృక్షాణామ్ అభ్యంతరే వర్తతే ఇతి, సః చ అసౌ చంద్రః, తస్య మహః, తస్మాత్), యుష్మాన్ = మిమ్ము, శుక+ఓఘ-అక్షరాత్ : శుక = చిలుకలయొక్క, ఓఘ = సమూహంయొక్క, అక్షరాత్ = పలుకునుండి (శుకానామ్ ఓఘః, తస్య అక్షరం, తస్మాత్), యుష్మత్+మంజు-గిరః : యుష్మత్ = మీయొక్క మంజు=మనోహరమైన, గిరః=మాటలనూ (యుష్మత్ మంజవశ్చ తాః గిరః తాః), పిక+ఓఘ-నినదాత్ : పిక = కోయిలల యొక్క, ఓఘ = సమూహంయొక్క, నినదాత్ = కూతలవలన, భవత్-సుస్వరాన్ = మీయొక్క సుస్వరాన్ = మంచి గొంతుకలను (భవతాం శోభనాశ్చ తే స్వరాః, తాన్), పృథక్ = వేరుగా, అజ్ఞాత్వా = తెలియలేక (న-జ్ఞా ధాతువుపై క్త్వా ప్రత్యయం), భవత్ + మార్గణమ్ : భవత్ = మీ యొక్క, మార్గణమ్ = వెదుకులాటను (భవతీనాం మార్గణం),

కర్తుమ్ = చేయటానికి, ఇతి = అని, ఉదీర్య = పలికి (ఉత్-ఈర ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శమయన్ = ఓదార్చుతూ (శమ్ ణిచ్ ధాతువుపై శతృ ప్రత్యయం), సః = కృష్ణుడు, మమ = నాకు, సౌఖ్యమ్ = సుఖాన్ని, దద్యాత్ = ఇచ్చుగాక! (దా దానే పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** 'స్వామీ! మమ్ములను వదలి ఎలా వెళ్ళావు?' గోపికల ప్రశ్న. 'చెట్ల మాటుగా వున్న చంద్రకాంతిని, మిమ్ము వేరు చేసి గ్రహించలేక, చిలుకల పలుకుల మధ్య మీ తీయని మాటలను విడిగా గుర్తించలేక, కోయిలల స్వరాల మధ్య మీ గొంతులను గుర్తుపట్టలేక మిమ్ములను వెదుకుతూ వెళ్ళాను' - కృష్ణుని సమాధానం. ఆ రీతిగా గోపికలతో మాటాడుతూ వారిని ఓదార్చుతున్న కృష్ణుడు నాకు సుఖాన్ని ఇచ్చుగాక- అని కవి ఆశంస.

**వి :** 1. గోపికల సౌందర్యాన్నీ, వారి చిలుక పలుకులను, వారి గొంతుకలలోని తీయదనాన్ని ధ్వనింపజేస్తుంది ఈ శ్లోకం. చెట్ల మాటున చంద్రకాంతిని చూసి ముఖాలుగా భావించటం, ముఖాలకూ చంద్రకాంతిని తేడాను గుర్తించలేకపోవటం భ్రాంతి ఫలం. చిలుక పలుకులకూ గోపికల పలుకులకూ, కోయిలల గొంతులకు గోపికల కంఠమాధుర్యానికీ భేదాన్ని గుర్తించలేక పోవటం భ్రాంతి ఫలితమే. అందుకే ఈ భ్రాంతిమదలంకారం. '**స్యాత్ స్మృతిభ్రాంతి సందేహైస్తదలంకారం-కృతిత్రయమ్**' - (కు.24). దానిద్వారా ఉపమాలంకారం ధ్వనిస్తుంది. **గోపికాకృష్ణులప్రణయభావం కవిగతమైన కృష్ణభక్తికి అంగమవుతుంది**. ఇది **రసవదాద్య-లంకారం.**

| | | | |
|---|---|---|---|
| 2. **అగమః :** | 9-26వ శ్లోకవ్యాఖ్య చూడుడు. | | |
| **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ. |

*

**శ్లో॥ దన్తక్షతస్ఫురితగణ్డరుచః కరాబ్జ-సమ్బద్ధమధ్యమధురాః కుచకుమ్భపార్శ్వే ।**
**సఞ్జాతమఞ్జులనఖవ్రణరఞ్జితాస్తాః - సాన్ద్రాపరాధఫలమాపురివేన్దుముఖ్యః ॥ 29**

**అ :** శృంగారసంబంధమైన బాహ్యచిహ్నాలను గోపికల శరీరంపై చూసిన కవి సంభావన. -వసంతతిలక.

**అ :** దంత-క్షత-స్ఫురిత-గండ-రుచః కర+అబ్జ-సంబద్ధ-మధ్య-మధురాః కుచ-కుంభ-పార్శ్వే సంజాత-మంజు-నఖ-వ్రణ-రంజితాః తాః ఇందుముఖ్యః సాంద్ర+అపరాధ-ఫలమ్ ఆపుః+ఇవ.

**ప్ర :** దంత... రుచః : దంత=దంతాలయొక్క, క్షత = గాయాలచే, స్ఫురిత=వెలుగ జేయబడిన, గండ = చెక్కిళ్ళయొక్క, రుచః = కాంతిగలవారును (దంతానాం క్షతైః స్ఫురితాః గండానాం రుచః), కర+అబ్జ... మధురాః : కర+అబ్జ = కరకమలాలచే, సంబద్ధ = బంధింపబడిన, మధ్య = నడుములచే, మధురాః = అందమైన వారును (కరౌ ఏవ అబ్జే, తయోః సంబద్ధైః మధ్యైః మధురాః), కుచ-కుంభ-పార్శ్వే : కుచ = స్తనా లనే, కుంభ = ఏనుగు కుంభస్థలాల-యొక్క, పార్శ్వే = ప్రక్కన (అంచులపై), సంజాత... రంజితాః : సంజాత = ఏర్పడిన, మంజుల = మనోహరమైన, నఖ-వ్రణ = గోటి గాట్లచే, రంజితాః = రంజింపజేయబడిన వారును అయిన (సంజాతాః చ తే నఖానాం వ్రణానాం, తైః రంజితాః), తాః ఇందు-ముఖ్యః = ఆ చంద్రముఖులు, సాంద్ర-అపరాధ-ఫలమ్ : సాంద్ర+అపరాధ = (చేసిన) పెద్దతప్పుయొక్క, ఫలమ్=ఫలితాన్ని, ఆపుః+ఇవ = పొందినట్లుంది. (ఆప్ వ్యాప్తౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రాసక్రీడ తరువాత గోపికల చెక్కిళ్ళపై దంతక్షతాల కాంతులు కనిపిస్తున్నాయి. వాళ్ళ నడుములు కరకమలాల మధ్య చిక్కినట్లున్నాయి. స్తనాల అంచున గోటిగుర్తులు అందగిస్తున్నాయి. వారు చేసిన తప్పునకు తగిన ఫలితాన్ని వారు పొందినట్లుంది.

**వి :** 1. గోపికలు తాము చేసిన అపరాధానికి శిక్షను అనుభవించినట్లుంది అని ఉత్ప్రేక్ష. అయితే వారు చేసిన తప్పు? కృష్ణుని కేవలం తమ వాడుగా భావించటమేనా? తమకు దూరమయ్యాడని నిందించటమేనా? నిలదీయటమేనా? కావచ్చు. 'మమ' అన్న భావన ఉన్నచోట 'అహం' (నేను) అన్న భావన కూడా తప్పని సరి. అహంకారం తలెత్తితే దానికి శిక్షను మానవమాత్రుడు వేయలేకపోయినా దైవం నిష్క్రియగా నిలవదు. అయితే ఆ దైవం మానవరూపంలోనే తానా పనిని నిర్వహిస్తుంది. అదే కృష్ణకృతం. అందుకే దానిని కవి దండనగానే భావించటం. ఇటువంటి వర్ణనలను కావ్యశోభాహేతువులుగా భావిస్తారు కవులూ, పండితులు.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆపుః :** ఆప | ఆప్నతుః | **ఆపుః** | |
| ఆపిథ | ఆపథుః | ఆప | |
| ఆప | ఆపివ | ఆపిమ. | * |

**శ్లో॥ పరభృతమధుపాద్యైః సేవితో గన్ధలుబ్ధైః**
**కరపదధరహాసాపాఙ్గతుఙ్గేషుసఙ్గః।**
**సులలితవనమాలాకార్ముకాంసో విరేజే**
**స్మర ఇవ వరరూపీ దృప్తయోషిత్సహాయః॥ 9-30**

**అ :** వరుడైన స్మరునిగా కృష్ణుని భావించటం. -మాలిని.

**అ :** గంధ-లుబ్ధైః పరభృత-మధుప-ఆద్యైః సేవితః కర-పత్-అధర-హాస-అపాంగ-తుంగ-ఇషు-సంగః సులలిత-వనమాలా-కార్ముక-అంసః దృప్త-యోషిత్-సహాయః వర- రూపీ స్మర ఇవ విరేజే.

**ప్ర :** గంధ-లుబ్ధైః : గంధ = సౌరభమందు, లుబ్ధైః = ఆశగల, పరభృత-మధుప+ఆద్యైః = కోకిల, తుమ్మెద మొదలగు వాటిచేత (పరభృతః చ మధుపశ్చ ఆదౌ యేషాం, తైః), సేవితః = సేవింపబడిన వాడును (సేవ్ - ధాతువుపై క్త ప్రత్యయం), కర... సంగః : కర = చేయి, పద్ = కాలు, అధర = పెదవి, హాస = చిఱునవ్వు, అపాంగ = కడకంటి చూపు అనే, తుంగ = ఉన్నతమైన, ఇషు = బాణాలతో, సంగః = కలయిక గలవాడును, సుల... కాంసః : సులలిత = బాగా సున్నితమైన, వనమాలా = వనమాలయే, కార్ముక = విల్లు అయిన, అంసః = మూపు గలవాడును (సులలితా చ సా వనమాలా, సైవ కార్ముకమ్ అంసే యస్య సః), దృప్త-యోషిత్-సహాయః : దృప్త = గర్వించిన, యోషిత్ = స్త్రీలు, సహాయః = సహాయంగా గలవాడును అయిన కృష్ణుడు (దృప్తాః యోషితః ఏవ సహాయః యస్య సః), వర-రూపీ = వరరూపం ధరించిన, స్మర ఇవ = మదనునివలె, విరేజే = ప్రకాశించాడు. (వి రాజృ దీప్తౌ ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు వరరూపాన్ని ధరించిన మన్మథునివలె ప్రకాశిస్తున్నాడు. మెడలోని వనమాలయే విల్లుగా వుంది. ఆ పూల తావుల మీది మక్కువతో కోకిలలు, తుమ్మెదలు కృష్ణుని చెంత చేరాయి. చేయి, కాలు, పెదవి, నవ్వు, కడకంటిచూపు అనే అయిదు బాణాలతో కూడియున్నాడు ఆ కృష్ణుడు.

**వి :** 1. అశోకం, అరవిందం, మామిడి, మల్లిక, నల్లకలువ ఇవి అయిదు బాణాలు మదనునికి. ఇక్కడ వరుసగా చేయి, పాదం, పెదవి, నవ్వు, కడకంటిచూపు ఆయా పూలుగా ప్రకాశిస్తున్నాయి. కాబట్టి వరరూపి అయిన మదనునిలా కనిపిస్తున్నాడు కృష్ణుడు.

2. **వనమాల :**

**శ్లో॥** ఆజానులంబినీ మాలా సర్వర్తు కుసుమోజ్జ్వలా
మధ్యే స్థూలకదంబాఢ్యా **వనమాలేతి** కీర్తితా ॥ - హలాయుధకోశః

వనమాలకు మూడు లక్షణాలు 1. మోకాళ్ళవరకు వ్రేళాడటం. 2. అన్ని ఋతువుల పూలతో కట్టడం. 3. మధ్యలో పెద్ద కదంబకుసుమాలుండటం.

3. ఇది ఉపమాలంకారం అయితే సంభావితోపమాలంకారం.

వరరూపి అయిన మదనునితో పోలిక. అనంగుడైన మదనునికి వరరూపం సంభావితం నైసర్గికం కాదు. దానితో కృష్ణునికి పోలిక. కాబట్టి ఇది సంభావితోపమ. కల్పితోపమ అని కూడా కొందరు ఆలంకారికులు వ్యవహరిస్తారు.

శ్లో॥ ఉభౌ యది వ్యోమ్ని పృథక్ప్రకాశా-వాకాశగంగా పయసః పతేతామ్ ।
తేనోపమీయేత తమాలనీల-మాముక్తముక్తాఫలమస్య వక్షః ॥

ఆకాశగంగ చీలి రెండు పాయలై ప్రవహిస్తే అప్పుడు తమాలతరువులాగా నీలమై, ముత్యాలహారాలతో కూడివున్న ఆయన వక్షస్థలంతో పోల్చవచ్చు-

| | | | |
|---|---|---|---|
| 4. **విరేజే :** | **విరేజే** | విరేజాతే | విరేజిరే |
| | విరేజిషే | విరేజాథే | విరేజిధ్వే |
| | విరేజే | విరేజివహే | విరేజిమహే. |

*

**శ్లో॥ నాలీకాగారమారత్రిపురహరముఖైర్గీయమానామ్బరస్థై-**
**ర్మాలాలఙ్కారకాన్త్యా విఘటితహృదయగ్రన్థిరిన్దీవరాభా ।**
**కాళిన్దీతీరసంస్థా కరధృతమురళీ కామినీకేలిలోలా**
**లీలాపాఙ్గావలోకా లసతు మమ హృది ప్రేయసీ దేవతా సా ॥ 9-31**

**అ :** కృష్ణుని దేవతాస్వరూపునిగా (స్త్రీ రూపంలోని) కవి భావించటం. -స్రగ్ధర.

**అ :** అంబరస్థైః నాలీక+అగార-మార-త్రిపురహర-ముఖైః గీయమానా మాలా+అలంకార-కాంత్యా విఘటిత-హృదయ-గ్రంథిః ఇందీవర+ఆభా కాళిందీ-తీర-సంస్థా కర-ధృత-మురళీ కామినీ-కేలి-లోలా లీలా+ఆపాంగ+అవలోకా ప్రేయసీ సా దేవతా మమ హృది లసతు.

**ప్ర :** అంబర-స్థైః = ఆకాశమందున్న (అంబరే తిష్ఠన్తి ఇతి అంబరస్థాః, తైః), నాలీకా... ముఖైః : నాలీక+అగార=పద్మం నివాసమైన బ్రహ్మ (నాలీకమ్ అగారం యస్య సః), మార = మదనుడు, త్రిపుర-హర = శివుడు (త్రిపురాణాం హరః), ముఖైః = మొదలగు వారిచే (నాలీకాగారశ్చ మారశ్చ త్రిపురహరశ్చ ముఖం యేషాం తైః), గీయమానా= స్తుతింపబడు చున్నదియు (గై ధాతువుపై కర్మణి-శానచ్-ప్రత్యయం), మాలా+అలంకార-కాంత్యా : మాలా = వనమాలయొక్కయు, అలంకార = నగలయొక్కయు, కాంత్యా = వెలుగుతో, విఘటిత-హృదయ-గ్రంథిః : విగళిత = వదిలింపబడిన, హృదయ-గ్రంథిః = హృదయగ్రంథి గలదియు (విమోచితః హృదయస్య గ్రంథిః యయా సా), ఇందీవర+అభా = కలువవంటి కాంతిగలదియు (ఇందీవరస్య ఆభా ఇవ ఆభా యస్యాః సా), కాళిందీ-తీర=ఒడ్డున, సంస్థా = నిలిచినదియు (కాళింద్యాః తీరే సమ్యక్ తిష్ఠతీతి), కర-ధృత-మురళీ : కర = చేతి-యందు, ధృత=ధరింపబడిన, మురళీ = వేణువు గలదియు (కరే ధృతా మురళీ యయా సా), కామినీ-కేలి-లోలా : కామినీ = స్త్రీలతో, కేలి = ఆడుటయందు, లోలా = ఆసక్తి గలదియు (కామినీనా కేలిః, తస్యాం లోలా), లీలా+అపాంగ+అవలోకా:లీలా= విలాసాత్మక-మైన, అపాంగ = కడకంటి చూపులు గల, అవలోకా = కనులు గలదియు, ప్రేయసీ = ఇష్టమైనదియు అయిన, సా = ఆ కృష్ణ స్వరూపమైన, దేవతా = దేవత, మమ = నా యొక్క, హృది = హృదయంలో, లసతు = నిలుచును గాక. (లస-శ్లేషణక్రీడనయోః- పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** నా కిష్టమైన దేవత కృష్ణుడని పిలవబడే స్వరూపం. ఆ దేవతను బ్రహ్మ, మదనుడు, శివుడు గగనసీమలో నిలిచి ప్రస్తుతిస్తున్నారు. మెడలోని వనమాల, ఒంటిమీది నగల కాంతులతో హృదయగ్రంథి విడిపోతోంది. ఆ దేవత కాళిందీ తీరంలో వుంది. పిల్లనగ్రోవిని చేత బట్టి వుంది. కామినీకేలిలో ఆసక్తి గలది. విలాసవంతమైన కడగంటి చూపులు గలది. ఆ దేవత నా హృదయంలో నిలుచు గాత!

**వి :** 1. ఆ కృష్ణ స్వరూపమైన దేవత నా హృదయంలో నిలుచును గాత – హృదయంలో కృష్ణపరమాత్మ స్థితి హృదయగ్రంథిని భేదిస్తుంది.

శ్లో॥ భిద్యతే హృదయగ్రన్థిః – ఛిద్యన్తే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్య కర్మాణి – దృష్ట ఏవాత్మనీశ్వరే ॥ – భాగవతం 1/2/21

ఆత్మలో ఈశ్వరుని దర్శించగలిగితే హృదయగ్రంథి విడిపోతుంది. అన్ని అనుమానాలూ తొలగిపోతాయి. కర్మలు కూడా నశిస్తాయి.

కర్మలను అనుభవించకుండానే నశిస్తాయా? అని సంశయించవచ్చు. కానీ సర్వం వాసుదేవాధీనమైనపుడు, ఆ పరమాత్మ ఆత్మలో నిలిచినపుడు ఏదైనా సాధ్యమే.

శ్లో॥ వాసుదేవపరా వేదా వాసుదేవపరా సుఖాః ।
వాసుదేవపరా యోగా వాసుదేవపరాః క్రియాః ॥
వాసుదేవపరం జ్ఞానం వాసుదేవపరం తపః ।
వాసుదేవపరో ధర్మో వాసుదేవపరం గతిః ॥ – భాగవతం 1/2/28,29

'**మమ హృదయే సా ప్రేయసీ లసతు**' అని కవి కృష్ణునిలో ప్రేయసీత్వాన్ని సంభావించాడు. మధురభక్తి సంప్రదాయంలో ఇది లక్షణం. వాసుదేవుని మాత్రమే పురుషరూపంగా మిగిలిన సమస్తసృష్టినీ స్త్రీ రూపంగా భావించటం మధురభక్తిలో ఒక విధానం.

శ్లో॥ స ఏవ వాసుదేవోఽసౌ సాక్షాత్పురుష ఉచ్యతే ।
స్త్రీప్రాయమితరత్సర్వం జగత్ బ్రహ్మ పురస్సరమ్ ॥

'వాసుదేవు డొక్కడే సాక్షాత్తూ పురుషుడు. బ్రహ్మ మొదలుగా మిగిలిన దంతా కూడా స్త్రీ ప్రాయమే'
కానీ ప్రకృతశ్లోకంలో కృష్ణుని స్త్రీ రూపంగా భావించటం కనిపిస్తోంది. అది విలక్షణం.

| | | | |
|---|---|---|---|
| 3. **లసతు :** | **లసతు**/లసతాత్ | లసతామ్ | లసన్తు |
| | లస/లసతాత్ | లసతమ్ | లసత |
| | లసాని | లసావ | లసామ. |

*

**శ్లో॥ లీలాసఙ్గీతమఞ్జుస్తనితకృతరుచిః పుష్టిహేతుః స్రవన్త్యాః**
**సాలోక్యాద్యమ్బువర్షీ నిజతనుమహసాఽఽచ్ఛాదితార్కోడురాజః ।**
**బాలానేత్రోత్సవశ్రీర్జయతి సురవరస్తోమహృద్వ్యోమధామా**
**నీలామ్భోదోపమోఽసౌ వరవసనతటిత్సాన్ద్రమాల్యేన్ద్రచాపః ॥ 9–32**

**అ : కృష్ణస్తుతి.** –స్రగ్ధర.

**అ :** లీలా–సంగీత–మంజు–స్తనిత–కృత–రుచిః స్రవన్త్యాః పుష్టి–హేతుః సాలోక్య+ఆది+ అంబువర్షీ నిజ–తను–మహసా ఆచ్ఛాదిత+అర్క+ఉడురాజః బాలా–నేత్ర+ఉత్సవ–శ్రీః సుర–వర–స్తోమ–హృద్–వ్యోమ–ధామా వర–వసన–తటిత్–సాంద్ర–మాల్య+ఇంద్ర–చాపః నీల+అంభోద+ఉపమః అసౌ జయతి.

**ప్ర :** లీలా... రుచిః : లీలా = లీలాసంబంధమైన/విలాసవంతమైన, సంగీత = సంగీతమనే, మంజు=మనోహరమైన, స్తనిత=ఉరుముచేత (స్తనితం మేఘనిర్ఘోషః – అమరకోశః), కృత= కల్పింపబడిన, రుచిః = కాంతిగలవాడును (లీలయా కృతం సంగీతమ్, తద్ ఏవ మంజు చ తత్ స్తనితం, తేన కృతా రుచిః యస్య సః), స్రవన్త్యాః = కాళిందీనదికి, పుష్టి–హేతుః : పుష్టి = పొంగుదలకు, హేతుః = కారణమైన వాడును (పుష్టేః హేతుః), సాలోక్య+ఆది+ అంబు–వర్షీ : సాలోక్య+ఆది = సాలోక్యం మొదలుగా గల మోక్షాలు అనే, అంబు = నీటిని, వర్షీ = కురిసే వాడును (సాలోక్యమాదౌ యేషాం, తాని ఏవ అంబు, తత్ వర్షణం శీలమస్య ఇతి), నిజ–తను–మహసా: నిజ = తనయొక్క, తను = శరీరం యొక్క, మహసా = కాంతితో (నిజా చ సా తనుః తస్యాః మహః తేన), ఆచ్ఛాదిత+ అర్క+ఉడురాజః : ఆచ్ఛాదిత = మూయబడిన, అర్క = సూర్యుడును, ఉడురాజః = చంద్రుడు గలవాడును (ఆచ్ఛాదితౌ అర్కః ఉడురాజశ్చ యేన సః), బాలా–నేత్ర+ఉత్సవ–శ్రీః : బాలా = బాలలయిన గోపికల యొక్క, నేత్ర = కన్నులకు, ఉత్సవ–శ్రీః = పండుగ కళవంటి వాడును, సుర... ధామా : సురవర = దేవతాశ్రేష్ఠులయొక్క, స్తోమ = సమూహంయొక్క, హృద్ = మనస్సు అనే, వ్యోమ–ధామా = ఆకాశ భవనం గలవాడును, (సురాణాం వరాః, తేషాం స్తోమః, తస్య హృత్, తదేవ వ్యోమ్ని ధామ యస్య సః), వర... చాపః : వర = మేలిమి అయిన, వసన = వస్త్రాలు అనే, తటిత్ = మెరుపునూ, సాంద్ర = ఒత్తుగా వున్న, మాల్య = మాలలనే, ఇంద్ర–చాపః = ఇంద్రధనుస్సు గలవాడును (వరాణి చ తాని వసనాని, తాన్యేవ తటిత్, సా చ సాంద్రాణి మాల్యాని, తాని ఏవ ఇంద్రచాపః యస్య సః), నీల+అంభోద+ ఉపమః : నీల = నల్లని, అంభోద = మేఘంతో, ఉపమః = పోలిక గలవాడును అయిన (నీలేన అంభోదేన ఉపమా యస్య సః), అసౌ = కృష్ణుడు, జయతి = వర్ధిల్లుతున్నాడు. (జి జయే పరస్మైపది లట్ – ప్ర.ఏ.)

**తా ॥** నీలమేఘంతో పోలికగల కృష్ణుడు వర్ధిల్లుతున్నాడు. విలాసార్థం పాడుకొంటున్న పాటలే మేఘగర్జనలు. కాళిందీనదికి కలిగిన పుష్టియే వరద. సాలోక్యం మొదలయిన మోక్షాలను ఆ మేఘం కురిపిస్తుంది. తన శరీరకాంతితో ఆ మేఘం సూర్యచంద్రులను కప్పివేస్తోంది. దేవతాశ్రేష్ఠుల హృదయమే దానికి ఆకాశభవనం. శ్రేష్ఠమైన వస్త్రాలు మెరుపులు. చిక్కటి మాలలు ఇంద్రచాపం.

**వి :** 1. సాలోక్యం, సామీప్యం, సారూప్యం, సాయుజ్యం, సార్ష్టి ఇవి మోక్షవిశేషాలు. వాటినన్నింటినీ కృష్ణమేఘం కురుస్తుంది.

2. ఈ శ్లోకంలో కృష్ణునికీ, నీలమేఘానికీ పోలిక. నీలాంభోదః ఉపమా యస్య సః – అని సామాసికంగా ఉపమాలంకారం. సంగీతంలో స్తనితత్వం, సాలోక్యాదుల్లో అంబుత్వం, హృదయంలో వ్యోమధామత్వం, వస్త్రాలలో తటిత్త్వం, మాల్యంలో ఇంద్రచాపత్వం ఆరోపింప బడింది. ఇవన్నీ రూపకాలు.

3. ఇక్కడ ప్రత్యక్షంగా భక్తివర్ణన కనిపిస్తుంది. భగవద్భక్తిని కొందరు రసమన్నారు. కొందరు భావమన్నారు.

రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాంచితః । భావః ప్రోక్తః – కావ్యప్రకాశః – 4/35

ప్రాచీనాలంకారికులు భక్తిని భావమనే అన్నారు. శృంగారాది నవరసాలనే కొందరయితే శాంతాన్ని కూడా కాదని ఎనిమిది రసాలనే అంగీకరించారు. మధుసూదనసరస్వతి (భక్తి రసాయనం), రూపగోస్వామి (భక్తిరసామృతసింధువు) వంటివారు భక్తియే ప్రధాన రసమన్నారు. మరికొందరు భరతుని మాటను మన్నించుదాం. ఆ లెక్కన కాంతావిషయక రతియే రసం, భగవద్విషయకరతి భావమన్నారు.

4. **రసగంగాధరంలో జగన్నాథుడు** ఇలాగే కృష్ణుని మేఘమాలతో పోల్చి మంగళశ్లోకాన్ని రచించారు.

శ్లో॥ స్మృతాపి తరుణాతాపం కరుణయా హరన్తీ నృణా
మభంగురతనుత్విషాం వలయితా శతైర్విద్యుతామ్ ।

కళిందగిరినందినీ తటసురద్రుమాలంబినీ
మదీయమతిచుంబినీ భవతు కాపి కాదంబినీ ॥

5. **జయతి :** 9-11వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యమునాజఘననివాసం కమనీయం బ్రహ్మ కామినీకలితమ్ ।**
**శమయత్వఘం మదీయం విమృశద్యోగీశ చేతసో దూరమ్ ॥ 9-33**

**అ :** కృష్ణుని పరబ్రహ్మగా కీర్తించటం. -ఆర్యాగీతి.

**అ :** యమునా-జఘన-నివాసం కమనీయం కామినీ-కలితం విమృశద్-యోగీశ-చేతసః దూరం బ్రహ్మ మదీయమ్ అఘం శమయతు.

**ప్ర :** యమునా-జఘన-నివాసమ్ : యమునా = యమునానదియొక్క, జఘన = (వెనుక) ఒడ్డున, నివాసమ్ = నివసించేదీ (యమునాయాః జఘనే నివాసః యస్య తత్), కమనీయమ్ = కోరదగినదీ ( కమ్ ధాతువుపై అనీయర్ ప్రత్యయం), కామినీ-కలితమ్ : కామినీ = స్త్రీలతో, కలితమ్ = కూడినదీ (కామినీభిః కలితమ్), విమృశద్-యోగీశ-చేతసః : విమృశద్ = పరిశీలిస్తున్న, యోగీశ = శ్రేష్ఠులైన యోగుల యొక్క, చేతసః = మనస్సుకు (విమృశతాం యోగీనాం చేతః, తస్య), దూరమ్ = అందనిదీ అయిన, బ్రహ్మ = కృష్ణుడనే పరబ్రహ్మ, మదీయమ్ = నాయొక్క, అఘమ్ = పాపాన్ని, శమయతు = అణచివేయుగాత (శమ్ ఉపశమనే-ణిచ్-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** యమునా తీరంలో నివసిస్తూ, కామినులతో కూడి కమనీయమై, పరామర్శలు చేసే యోగివరుల హృదయాలకు దూరంగా వుండే కృష్ణస్వరూపమైన పరబ్రహ్మ నా పాపాన్ని శమింప జేయుగాత.

**వి :** 1. కృష్ణ పరబ్రహ్మ పాపవినాశకమని నారదాది దేవర్షులు కూడా విశ్వసిస్తారు. నారదుడు చేసిన కృష్ణస్తుతి-

శ్లో॥ **హరత్యఘం సంప్రతి** హేతురేష్యతః - శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః ।
శరీరభాజాం భవదీయదర్శనం - **వ్యనక్తి కాలత్రితయేఽ** పి యోగ్యతామ్ ॥ - శిశుపాలవధమ్ 1/26

యోగుల కయినా పరామర్శలు చేస్తున్నంత కాలం పరబ్రహ్మాన్వేషణమే గానీ జ్ఞానానికి అవకాశం లేదు. అందుకే కాళిదాసు కూడా

'యోగినో యం విచిన్వన్తి క్షేత్రాభ్యంతరవర్తినమ్' - (కుమారసంభవం - 6/77) అని ప్రతిపాదించాడు. ఉపనిషత్తులు కూడా **పరబ్రహ్మ** తర్కానికి అందదని ఘోషించాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **శమయతు :** | **శమయతు**/శమయతాత్ | శమయతామ్ | శమయన్తు |
| | శమయ/శమయతాత్ | శమయతమ్ | శమయత |
| | శమయాని | శమయావ | శమయామ. * |

**శ్లో॥ శ్రాన్తాలిభిః పరివృతోఽమ్భసి గాహమానః - కాన్తాకరేణుసహితః కనకోజ్జ్వలాఙ్గః ।**
**ప్రాన్తస్థితాబ్జచయచుమ్బికరో ముకున్ద-దన్తీ నికృన్తతు మమాన్తరమోహమోచాః॥ 34**

**అ :** కృష్ణునిలో దంతిత్వాన్ని ఆరోపించి ఆ ఏనుగు తన మోహాన్ని తొలగించాలని కోరటం. -వసంతతిలక.

**అ :** శ్రాంత+అలిభిః పరివృతః అంభసి గాహమానః కాంతా-కరేణు-సహితః కనక+ఉజ్జ్వల+ అంగః ప్రాంత-స్థిత+అబ్జ-చయ-చుంబి-కరః ముకుంద-దన్తీ మమ అంతర-మోహ-మోచాః నికృంతతు.

**ప్ర :** శ్రాంత+అలిభిః:శ్రాంత = అలసిన, అలిభిః=తుమ్మెదలచేత, పరివృతః= చుట్టబడినదియు (శ్రాంతైః అలిభిః

పరివృతః), అంభసి = నీటిలో, గాహమానః = మునుగుతున్నదియు (గాహ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), కాంతా-కరేణు-సహితః:కాంతా = గోపికలు, కరేణు = ఆడ ఏనుగులతో (కరేణుర్గజహస్తిన్యోః-హలాయుధకోశః-833), సహితః = కూడినదియు (కాంతాః ఏవ కరేణవః, తాభిః సహితః), కనక+ఉజ్జ్వల+అంగః : కనక = బంగారు నగలచే, ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న, అంగః = శరీరం గలదియు (కనకేన ఉజ్జ్వలాని అంగాని యస్య సః), ప్రాంత... కరః:ప్రాంత = దగ్గరగా, స్థిత = ఉన్నట్టి, అబ్జ = తామరలయొక్క, చయ = సమూహాన్ని, చుంబి = తాకుతున్న, కరః = తొండం గలదియు (ప్రాంతే స్థితానా- మబ్జానాం చయం చుంబతీతి, సః కరః యస్య సః) అయిన, ముకుంద-దన్తీ = కృష్ణుడను ఏనుగు (ముకున్ద ఇతి దన్తీ), మమ = నాయొక్క, అంతర-మోహ-మోచాః : అంతర = మనస్సులోని, మోహ = మోహమనే, మోచాః = అరటులను (రంభా కదళీ మోచా-హలాయుధకోశః-192), నికృంతతు = ఛేదించుగాక! (ని+కృతీ ఛేదనే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥ కృష్ణుడనే ఏనుగు నా హృదయంలోని మోహమనే అరటిని పీకివేయుగాక**. ఆ ఏనుగు అలసిన తుమ్మెదలచేత చుట్టబడివుంది. నీటిలో మునుగుతోంది. అందమైన ఆడేనుగులతో కలిసి వుంది. బంగారు నగలతో ప్రకాశిస్తోంది. తనకు దగ్గరలో వున్న పద్మాలను తొండంతో చుంబిస్తోంది. (అటువంటి ఏనుగు తన మోహకదళిని నరికివేయాలని కవి ప్రార్థన)

**వి :** 1. కృష్ణుడనే ఏనుగు, మోహమనే అరటులు ఇవి రూపకాలంకారాలు. కృష్ణుడనే ఉపమేయానికి, ఏనుగు అనే ఉపమానానికీ, మోహమనే ఉపమేయానికి, అరటి అనే ఉపమానానికీ, అభేదాన్ని చెప్పినందువల్ల అభేదరూపకాలివి. **'విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్ తత్ రూపకమ్'**-(కు.17)

2. కరేణు పదం పుంలింగంగా, స్త్రీలింగంగా కూడా వుంటుంది. మగ ఏనుగు, ఆడ ఏనుగు - సందర్భాన్ని బట్టి అర్థం చెప్పుకోవచ్చు.

3. **నికృంతతు :**

| | | |
|---|---|---|
| **నికృంతతు**/నికృంతతాత్ | నికృంతతామ్ | నికృంతంతు |
| నికృంత/నికృంతతాత్ | నికృంతతమ్ | నికృంతత |
| నికృంతాని | నికృంతావ | నికృంతామ. |

*

**శ్లో॥ అభిగతిజలదానప్రేమసంశ్లేషవేగా-త్ప్రకటితకుచభాగా దృశ్యమానోరుదేశాః ।**
**కచవిగలితమాల్యాః సఙ్గతైరఙ్గరాగైః - సరితమపి సరాగాం చక్రురాసాం కిమన్యే ॥35**

**అ :** గోపికలు కృష్ణునికి ఆతిథ్యమివ్వటంలోని తొందరపాటు, జలక్రీడ. -మాలిని.

**అ :** అభిగతి-జలదాన-ప్రేమ-సంశ్లేష-వేగాత్ ప్రకటిత-కుచ-భాగాః దృశ్యమాన-ఊరు- దేశాః కచ-విగళిత-మాల్యాః (గోప్యః) సంగతైః అంగరాగైః సరితమ్ అపి సరాగాం చక్రుః ఆసామ్ అన్యే కిమ్?

**ప్ర :** అభిగతి... వేగాత్ : అభిగతి = ఎదురు వెళ్ళటం, జల-దాన = (అర్ఘ్యపాద్యాదులకు) నీళ్ళ నివ్వటం, ప్రేమ-సంశ్లేష = ప్రేమగా కౌగిలించుకోవటం - వీటిలోని, వేగాత్ = త్వర వలన (అభిగతిశ్చ జలస్య దానం చ ప్రేమ్ణా సంశ్లేషః చ, తేషాం వేగాత్), ప్రకటిత-కుచ-భాగాః : ప్రకటిత = కనిపింపజేయబడిన, కుచ-భాగాః = స్తనప్రదేశం గలవారును (ప్రకటితాః కుచయోః భాగాః యాసాం తాః), దృశ్యమాన-ఊరు-దేశాః : దృశ్యమాన = కనిపిస్తున్న, ఊరు-దేశాః = తొడలు గలవారును (దృశ్యమానః ఊర్వోః దేశః యాసాం తాః), కచ-విగళిత-మాల్యాః : కచ = వెంట్రుకలనుండి (కచతే ఇతి), విగళిత = (త్వర వలన) జారిన, మాల్యాః=పూలమాలలు గలవారును అగు, (గోప్యః =గోపికలు), సంగతైః = (నీట) కలిసిన, అంగరాగైః = మైపూతలతో, సరితమ్ అపి = కాళిందీనదిని కూడా, సరాగామ్ = రాగవతినిగా, చక్రుః = చేశారు. (కృ కరణే పరస్మైపది-లిట్-ప్ర.బ.), ఆసామ్ = వీరికి, అన్యే = ఇతర పురుషులు, కిమ్ = లెక్క ఏముంది?

**తా ॥** కృష్ణుని రాకను గమనించిన గోపికలు ఆయనకు ఎదురేగటం, నీటిని అందించటం, ప్రేమగా కౌగిలించుకోవటం ఈ చర్యలలోని వేగంవలన వారికి కుచభాగాలు కనిపిస్తున్నాయి. తొడలు కనిపిస్తున్నాయి. కేశపాశాలనుండి పూలు జారుతున్నాయి. అటువంటి వారు జలక్రీడలకై నీటదిగి, తమ మైపూతలతో ఆ యమునానదిని కూడా రాగవతిని (ఎర్రబడిన దానిని, అనురాగం గలదానిని) చేశారు. ఇక మగవారి విషయం చెప్పేదేముంది?

**వి :** 1. శ్లో॥ వేదవేదాంతవేద్యాయ – మేఘశ్యామలమూర్తయే ।
పుంసాం మోహనరూపాయ – పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥

**వరవరమునికృతరామమంగళాశాసనమ్** అని పురుషులకే మోహాన్ని కల్గించే రూపమున్నట్లు రామవర్ణన. ఇక్కడ గోపికలు యమునకే (అది జలం/జడం పైగా స్త్రీ మూర్తి) రాగాన్ని కల్గిస్తున్నారు. వాస్తవానికి సౌందర్యం స్త్రీలకో పురుషులకో ఏ ఒక్కరికో సొంతం కాదు. సౌందర్యారాధన కూడా కామమాత్రమో, మోహమాత్రమో కూడా కాదు. అది ఎక్కడైనా వుండవచ్చు. ఎవరినైనా మెప్పించవచ్చు. అది మనదై పోవాలనుకొన్నప్పుడు మాత్రమే యోగ్యతాయోగ్యతల పరామర్శ.

2. '**సరితమపి సరాగం చక్రుః అన్యే కిమ్**' అనటంలో కావ్యార్థాపత్త్యలంకారముంది. యముననే రాగవతిని చేసిన గోపికలకు ఇతర పురుషుల విషయం చెప్పేదేముంది? అని. '**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**' – (కు. 120)

| | | | | |
|---|---|---|---|---|
| 3. **చక్రుః :** | చకార | చక్రతుః | **చక్రుః** | |
| | చకర్థ | చక్రథుః | చక్ర | |
| | చకార/చకర | చకృవ | చకృమ. | * |

**శ్లో॥ సత్కైరవాస్యవిభవోత్పలలోలనేత్రా – వ్యక్తస్తనాభమధుపాఙ్కితపద్మకోశా ।**
**ఆవర్తనాభిరుచిరా యమునోర్మిహస్తా – గోపీవ లక్ష్యజఘనాఽస్తి సుఫేనహాసా ॥36**

**అ :** యమునను గోపకాంతతో పోల్చటం. –వసంతతిలక.

**అ :** సత్–కైరవ+ఆస్య–విభవా ఉత్పల–లోల–నేత్రా వ్యక్త–స్తన+ఆభ–మధుప+అంకిత–పద్మ–కోశా ఆవర్త–నాభి–రుచిరా ఊర్మి–హస్తా లక్ష్య–జఘనా సుఫేన–హాసా యమునా గోపీ+ఇవ అస్తి.

**ప్ర :** సత్... విభవా : సత్ = మంచి, కైరవ = తెల్లకలువ అనే (ఇందీవరం చ నీలేఽస్మిన్ సితే కుముదకైరవే, అమరకోశః – వారి – 37) (కేరవస్య ఇదం ప్రియం కైరవం), ఆస్య = ముఖంయొక్క, విభవా = సంపన్నత గలదియు (సత్ కైరవ మేవ ఆస్యం, తస్య విభవః యస్యాం సా), ఉత్పల–లోల–నేత్రా : ఉత్పల = నల్లకలువ అనే, లోల = చంచలమైన, నేత్రా = కన్నులు గలదియు (ఉత్పలమేవ లోలం నేత్రం యస్యాః సా), వ్యక్త... కోశా : వ్యక్తః = పైకి కనిపిస్తున్న / పొటమరించిన, స్తన = రొమ్ములయొక్క, ఆభ = కాంతివంటి కాంతి గల, మధుప=తుమ్మెదలచే, అంకిత=గుర్తింపబడిన, పద్మ–కోశా = తామరమొగ్గ గలదియు (వ్యక్తశ్చాసౌ స్తనః, తస్య ఆభా ఇవ ఆభా యస్య సః చ మధుపేన అంకితః పద్మస్య కోశః చ యస్యాః సా), ఆవర్త–నాభి–రుచిరా : ఆవర్త = సుడి అనెడి, నాభి = బొడ్డుతో, రుచిరా = అందమైనదియు (ఆవర్త ఏవ నాభిః, తేన రుచిరా), ఊర్మి–హస్తా : ఊర్మి = అలయే, హస్తా = చేయిగా గలదియు (ఊర్మిః ఏవ హస్తః యస్యాః సా), లక్ష్య–జఘనా : లక్ష్య=కనిపిస్తున్న, జఘనా=తీరం (నితంబం) గలదియు (లక్ష్యం జఘనం యస్యాః సా), సుఫేన–హాసా : సుఫేన = మంచి నురుగు అనే, హాసా = చిఱునవ్వు గలదియు అయిన, యమునా = యమునా నది, గోపీ+ఇవ = గోపవనితలా, అస్తి = ఉంది. (అస భువి పరస్మైపది – లట్ – ప్ర.ఏ.)

**తా ॥ యమునానది గోపవనితలా వుంది.** ఆ యమునకు తెల్లకలువలే ముఖం. నల్లకలువలు కళ్ళు. తుమ్మెదలచే గుర్తింపబడిన తామరమొగ్గలే రొమ్ములు. సుడియే బొడ్డు. అలలే చేతులు. కనిపించే జఘనం (తీరం). నురగలే నవ్వులు.

**వి :** 1. విశేషణాలను గోపికల పరంగా అన్వయించేటప్పుడు ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసాలుగా అన్వయించాలి. కైరవం వంటి ఆస్యం, ఉత్పలాల వంటి నేత్రాలు, ఆవర్తం వంటి నాభి, అలల వంటి చేతులు, నురుగు వంటి నవ్వు - ఇలా, ద్వితీయపాదంలోని విశేషణం, లక్ష్యజఘనా అన్న విశేషణం ఈ రెండింటిదగ్గర ఉపమాన పూర్వపద కర్మధారయం కుదరదు. అంటే గోపికా పరంగా. ఉపమానపూర్వపదకర్మధారయం చేసినా అది యమున పరంగానే అన్వయిస్తుంది. 'యమునా గోపీ ఇవ అస్తి' స్పష్టమైన ఉపమాలంకారం. ఇక్కడ ఉపమాలంకారం వాచ్యంగానే వుంది. పైన చెప్పిన రూపకాలంకారాలు దీనికి కారకాలు కాబట్టి రూపకానుప్రాణితమైన ఉపమాలంకారమిది.

2. వాస్తవానికి ప్రకృతాంశం గోపికా కృష్ణ రాసక్రీడకు సంబంధించినది. మధ్యలో మంగళమధ్యంగా కృష్ణస్తుతికి ఉపక్రమించాడు కవి. ఆ ప్రకరణం కొనసాగుతుంది. ఆ మధ్యలో యమునా వర్ణన. ఇది కృష్ణుడికీ, గోపికలకూ యమునకు ఉన్న అవినాభావ సంబంధాన్ని తెలియజేస్తోంది. గోపికా కృష్ణుల ప్రణయానికి కానీ, రాధాకృష్ణుల ప్రణయానికి కానీ, యమునయే ప్రధానసాక్షి. జయదేవుని శ్లోకాన్ని చూడండి.

శ్లో॥ మేఘైర్మేదురమంబరం వనభువశ్శ్యామాస్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే గృహం ప్రాపయ ।
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి యమునాకూలే రహః కేలయః ॥ **-గీతగోవిందం 1/1**

| | | | |
|---|---|---|---|
| 3. **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః. |

*

**శ్లో॥ గాఢాలిఙ్గితవల్లభామధిజలం నిశ్శబ్దభూషావలీ-**
**మబ్జాస్యామవిమృశ్య కాఽప్యుపగతా సీత్కారనాదశ్రుతేః ।**
**క్రుద్ధా భ్రూదృఢచాపలగ్ననయనప్రాంతేషుపాతాత్ పురా**
**కృష్ణేనాపరరూపిణా శశిముఖీ సామ్నా సమాలిఙ్గితా ॥ 9-37**

**అ :** గోపికాకృష్ణుల ప్రణయమే. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అధిజలమ్-గాఢ+ఆలింగిత-వల్లభామ్ నిశ్శబ్ద-భూష+ఆవలీమ్ అబ్జ+అస్యామ్ అవిమృశ్య కా అపి ఉపగతా (సతీ) సీత్కార-నాద- శ్రుతేః క్రుద్ధా (సతీ) శశిముఖీ భ్రూ-దృఢ-చాప-లగ్న-నయన-ప్రాంత+ఇషు-పాతాత్ పురా అపర-రూపిణా కృష్ణేన సామ్నా సమాలింగితా.

**ప్ర :** అధిజలమ్ = నీటిమధ్యలో, గాఢ+ఆలింగిత-వల్లభామ్ : గాఢ = గట్టిగా, ఆలింగిత = కౌగిలించు కొనబడిన, వల్లభామ్ = ప్రియుడు గలదియు (గాఢమ్ ఆలింగితః వల్లభః యయా, తామ్), నిశ్శబ్ద-భూషా-ఆవలీమ్ : నిశ్శబ్ద = చప్పుడు చేయని, భూషా = నగల యొక్క, ఆవలీమ్ = సమూహం గలదియు, అబ్జ+ఆస్యామ్ = పద్మముఖిని (అబ్జమ్ ఇవ ముఖం యస్యాః, తామ్), అవిమృశ్య = గమనించక, ఉపగతా = దగ్గరకు వచ్చిన, కా-అపి = ఒకానొక గోపిక, సీత్కార-నాద-శ్రుతేః : సీత్కార-నాద = సీత్కారధ్వనిని, శ్రుతేః = వినుటవలన,

క్రుద్ధా (సతీ) = కోపించిన, శశిముఖీ = చంద్రవదన (శశీ ఇవ ముఖం యస్యాః సా), భ్రూ... పాతాత్ : భ్రూ = కనుబొమ అనే, దృఢ-చాప = గట్టి వింటిపై, లగ్న = సంధింపబడిన, నయన-ప్రాంత = కన్నుల అంచు లనే, ఇషు = బాణాల యొక్క, పాతాత్ = పడుటవలన (భ్రూః ఏవ దృఢః చాపః, తస్మిన్ లగ్నః, తస్య పాతః, తస్మాత్), పురా = అంతకు ముందు, అపర-రూపిణా = మరొక రూపం గల (అపరం రూపం యస్య తేన), కృష్ణేన = కృష్ణుని చేత, సామ్నా = అనునయపూర్వకంగా, సమ్+ఆలింగితా = కౌగిలింపబడింది.

**తా ॥** ఒకానొక గోపిక మెడబంటి నీటిలో నిలిచి కృష్ణుని గట్టిగా కౌగిలించుకొంది. నీటిలో వుంది కాబట్టి ఆభరణాల చప్పుడేదీ వినిపించ లేదు. ఆమెను గమనించకుండా మరొక గోపిక కృష్ణుని సమీపించింది. అయితే అక్కడ శృంగారచేష్టా ఫలితమైన సీత్కారాన్ని విన్నది. దానితో కోపించింది. కృష్ణుడు తన కనుబొమలనే చాపంనుండి కడగంటిచూపులనే బాణాలను ప్రయోగించటంతో ఆమె కోపం తగ్గింది. అంతకు ముందు మరోలా కనిపించిన కృష్ణుడు ఇప్పుడు మామూలుగా కనిపించాడు. ఆ కృష్ణునిచేత ఆ గోపిక అనునయ పూర్వకంగా దగ్గరకు తీసికొనబడింది.

**వి :** 1. కావ్యశాస్త్రప్రమాణాల మేరకు ఇక్కడ కృష్ణుని దక్షిణనాయకత్వం గొప్పగా వర్ణింప బడింది. '**అనేకాసు నాయికాసు అవైషమ్యేణ స్నేహానువర్తీ**' – అని దక్షిణనాయకనిర్వచనం. దక్షిణనాయకత్వాన్ని కొనసాగించటం ఎంత కష్టమో, అలరింప జేయటానికి ఎంత శ్రమ పడాలో కాళిదాసు మాళవికాగ్నిమిత్రం చదివితే అర్థమవుతుంది. దక్షిణనాయకచాతుర్యానికి నిరూపకమైన ఒక **అమరుక** శ్లోకాన్ని పరిశీలించండి.

**శ్లో॥ దృష్ట్వైకాసనసంస్థితే ప్రియతమే పశ్చాదుపేత్యాదరా-**
**దేకస్యా నయనే నిమీల్య విహితక్రీడానుబంధచ్ఛలః ।**
**ఈషద్వక్రితకంధరః పరిలసత్ప్రేమోల్లసన్మానసా-**
**మంతర్హాసలసత్కపోలఫలకాం ధూర్తోఽపరాం చుంబతి ॥**

ఒక నాయకుడు ఒకే ఆసనంపై కూర్చొని వున్న ఇద్దరు ప్రియురాళ్ళనూ చూశాడు. వెనుక నుండి ప్రేమతో ఒకరి కన్నులు మూశాడు చేతులతో. అప్పుడే మెడను కొంచెం వంచి మరొక కాంతను ముద్దాడాడు. ఆమె లోలోన నవ్వుకొంటూ ఆ వెలుగును చెక్కిళ్ళపై ప్రసరింప జేసింది. *

**శ్లో॥ కరధృతదృతితోయైః స్నాపయిత్వా ముకున్దం**
**కుచతటగతగన్ధాలిప్తమాలిఙ్గ్య కృత్వా ।**
**శిరసినిహితమాల్యైరర్చ్యమానర్చురేనం**
**గతిమివ యతియోగ్యాం సాధయన్త్యోఽబలాస్తాః ॥** **9-38**

**అ :** గోపీకృత కృష్ణ సమర్చన. –మాలిని.

**అ :** కర-ధృత-దృతి-తోయైః ముకుందం స్నాపయిత్వా ఆలింగ్య కుచ-తట-గంధ-ఆలిప్తం కృత్వా యతి-యోగ్యాం గతిం సాధయంత్య ఇవ తాః అబలాః శిరసి నిహిత-మాల్యైః అర్చ్యమ్ ఏనమ్ ఆనర్చుః

**ప్ర :** కర... తోయైః : కర = చేతియందు, ధృత = ధరింపబడిన, దృతి = తోలుతిత్తిలోని (దృతిశ్చర్మప్రసేవకః – హలాయుధకోశః – 764), తోయైః = నీటితో (కరేణ ధృతా చ సా దృతిః, తస్యాః తోయాని, తైః), ముకుందమ్ = కృష్ణుని (ముకుం దదాతి ఇతి. తమ్), స్నాపయిత్వా = స్నానం చేయించి, ఆలింగ్య = కౌగిలించుకొని, కుచ... లిప్తమ్ : కుచ తట = రొమ్ములఅంచున, గత = అలదిన, గంధ = గంధం చే, ఆలిప్తమ్ = బాగా పూయబడిన వానినిగా (కుచయోః తటే తయోః గతేన గంధేన ఆలిప్తమ్), కృత్వా = చేసి, యతి-యోగ్యామ్ = యతులకు

తగిన (యతీనాం యోగ్యా, తామ్), గతిమ్ = స్థితిని, సాధయంత్యః ఇవ = సాధిస్తున్నవారివలె, తాః = ఆ, అబలాః = గోపికలు, శిరసి-నిహిత-మాల్యైః : శిరసి = తలపై, నిహిత = ఉంచబడిన, మాల్యైః = మాలలతో (శిరసి నిహితాని చ తాని మాల్యాని, తైః), అర్చ్యమ్ = పూజింపదగిన, ఏనమ్ = ఈ కృష్ణుని, ఆనర్చుః = పూజించారు. (అర్చ్ పూజాయాం-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** గోపికలు తమ చేతనున్న తోలు సంచులలోని నీటితో ముకుందునకు స్నానం చేయించి, కౌగిలించుకొని తమ ఎదల అంచులనున్న గంధాన్ని ఆ కృష్ణునకు పూసి, యతులకు తగిన స్థానాన్ని తాము పొందగోరినట్లు కృష్ణుని శిరస్సుపై మాలలనుంచి పూజ్యుడైన ఆయనను పూజించారు.

**వి :** 1. యతియోగ్యమైన గతిని సాధిస్తున్నవారన్నట్లు - ఇది ఉత్ప్రేక్షాలంకారం. అందునా ఫలోత్ప్రేక్ష. వారు తమ ధోరణిలో తమ భక్తిభావంతో తమకు చేతనయినట్లు కృష్ణుని అర్చిస్తున్నారే కానీ యతి యోగ్యస్థానాన్ని పొందటం వారి అభిమతం కాదు. అందుకోసం ప్రయత్నించటమూ లేదు. అయినా ఆ రీతిగా కవి సంభావించి నందువలన అది ఉత్ప్రేక్షాలంకారం. -**'సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా'**.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆనర్చుః :** | ఆనర్చ | ఆనర్చతుః | **ఆనర్చుః** |
| | ఆనర్చిథ | ఆనర్చథుః | ఆనర్చ |
| | ఆనర్చ | ఆనర్చివ | ఆనర్చిమ. |

*

**శ్లో॥ సిక్తోఽపి రమ్యలలనా కరపద్మపత్రై-ర్భృత్యామరావలిసమర్పితపుష్పపుఞ్జే ।**
**విస్తీర్ణరేణునికరం దధదాత్మనోఽఙ్గే - హస్తీశ్వరప్రకృతిమార్జయదేష దేవః ॥ 9-39**

**అ :** కృష్ణుని గజరాజుతో పోల్చి స్తుతించుట. -వసంతతిలక.

**అ :** రమ్య-లలనా-కర-పద్మ-పత్రైః సిక్తః అపి భృత్య+అమర+ఆవలి-సమర్పిత-పుష్ప-పుంజే విస్తీర్ణ-రేణు-నికరమ్ ఆత్మనః అంగే దధత్ ఏషః దేవః హస్తి+ఈశ్వర-ప్రకృతిమ్ ఆర్జయత్.

**ప్ర :** రమ్య... పత్రైః:రమ్య=అందమైన, లలనా = స్త్రీల (గోపికల) యొక్క, కర = చేతియందలి/ చేతులనే, పద్మ-పత్రైః = తామరాకులతో(రమ్యాశ్చ తాః లలనాః, తాసాం కరాః ఏవ పద్మానాం పత్రాణి తైః), సిక్తః+అపి = తడిసిననూ , భృత్య... పుంజే : భృత్య = సేవకులైన, అమర = దేవతలయొక్క, ఆవలి = సమూహంచేత, సమర్పిత = అర్పింపబడిన, పుష్ప = పూలయొక్క, పుంజే = సమూహమందు (భృత్యాశ్చ తాః అమరాణామ్ ఆవలయః, తాభిః సమర్పితానాం పుష్పాణాం పుంజం, తైః), విస్తీర్ణ-రేణు-నికరమ్ : విస్తీర్ణ = వ్యాపించిన, రేణు = రేణువుల-యొక్క, నికరమ్ = సమూహాన్ని (నికర నికాయ నివహ విసర... హలాయుధకోశః-686) (విస్తీర్ణశ్చ అసౌ రేణూనాం నికరః, తమ్), ఆత్మనః = తనయొక్క, అంగే = శరీరంపై, దధత్ = ధరిస్తూ, ఏషః = ఈ, దేవః = దేవుడైన కృష్ణుడు, హస్తి+ఈశ్వర-ప్రకృతిమ్ : హస్తి+ఈశ్వర = గజరాజుయొక్క, ప్రకృతిమ్ = స్వభావాన్ని (హస్తీనా-మీశ్వరః, తస్య ప్రకృతిః తామ్), ఆర్జయత్ = పొందాడు. (ఆర్జ-సముపార్జనే-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** గోపికల చేతులు అనే తామరాకులు చిందించిన నీళ్ళతో తడిశాడు కృష్ణుడు. అయితే తన సేవకులయిన దేవతలు సమర్పించిన పూలలోని పుప్పొడి రేణువులు శరీరమంతా పడ్డాయి. అవన్నీ ధరించిన కృష్ణుడు గజరాజస్వభావాన్ని సంపాదించుకొన్నాడు.

**వి :** 1. ఏనుగు స్నానం చేయటం వ్యర్థం. ఎందుకంటే సరస్సులో దిగి స్నానం చేసినా బయటకు వస్తూ వెంటనే మరల బురదనీళ్ళు తీసి మీద పోసుకొంటుంది.

**సరో విశతి న స్నాతుం గజస్నానం హి నిష్ఫలమ్ ।** అని ఆర్యోక్తి. కాబట్టి ఏనుగు స్నానం చేసినా, మానినా

ఒకటే. ఇక్కడ కృష్ణుడు అటువంటి గజరాజ స్వభావాన్ని పాటించాడట. గోపికల కరకమల పత్రాల నీటితో స్నానమాడాడు. దేవతలు సమర్పించిన పూలపుప్పొడిని మరల మీద పోసుకొన్నాడు. ఏదీ అంటని వానికి ఏదైనా లాభనష్టాలు రెండూ లేవు. గజరాజ ప్రకృతి ప్రాప్తి కవి సంభావన మాత్రమే.

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి - నైనం దహతి పావకః ।
న చైవం భేదయన్త్యాపో - న శోషయతి మారుతః ॥ - భగవద్గీత 2/23

2. కృష్ణుడు స్నానమాడి, పూలపుప్పొడిని ధరించటానికీ గజరాజ ప్రకృతికీ ఎటువంటి సంబంధమూ లేదు. అయినా గజరాజ ప్రకృతిని సంపాదించుకొన్నట్లు వర్ణించినందువలన ఇది సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు. 36)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆర్జయత్ : ఆర్జయత్**/ఆర్జయతాత్ | ఆర్జయతామ్ | ఆర్జయన్తు | |
| ఆర్జయ/ఆర్జయతాత్ | ఆర్జయతమ్ | ఆర్జయత | |
| ఆర్జయాని | ఆర్జయావ | ఆర్జయామ. | * |

**శ్లో॥ ద్విరేఫశావాఙ్కితశోభివక్త్రం - కృతక్షతం సుస్వరరాజహంసైః ।**
**మనోరమం సారసకోశమేకా - ఘనస్తనస్పర్ధి చకర్త బాలా ॥ 9-40**

**అ :** ఒకానొక గోపిక తామరమొగ్గను త్రుంచటాన్ని వర్ణిస్తూ కారణాన్ని ప్రతిపాదించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఏకా బాలా ద్విరేఫ-శావ+అంకిత-శోభి-వక్త్రం మనోరమం సుస్వర-రాజ-హంసైః కృత-క్షతమ్ ఘన-స్తన-స్పర్ధి సారసం చకర్త.

**ప్ర :** ఏకా బాలా = ఒక గోపకాంత, ద్విరేఫ... వక్త్రమ్ : ద్విరేఫ = తుమ్మెదయొక్క, శావ = పిల్లచే, అంకిత = గుర్తింపబడి, శోభి = ప్రకాశిస్తున్న, వక్త్రమ్ = ముఖం గలదియు (ద్విరేఫస్య శావేన అంకితం శోభి చ వక్త్రమ్), మనో-రమమ్ = అందమైనదియు (మనాంసి రమన్తే అస్మిన్ ఇతి), సుస్వర-రాజ-హంసైః: సుస్వర = మంచి గొంతుగల, రాజ హంసైః = రాయంచలచే (సుస్వరాః చ తే రాజహంసాః, తైః), కృత-క్షతమ్ = కొరక బడినదియు (కృతం క్షతం యస్మిన్ తమ్), ఘన-స్తన-స్పర్ధి : ఘన = గట్టివయిన, స్తన = రొమ్ములతో, స్పర్ధి = పోటీపడుతున్నదీ, అయిన (ఘనాభ్యాం స్తనాభ్యాం స్పర్ధత ఇతి తత్), సారస- కోశమ్ : సారస = తామరలయొక్క, కోశమ్ = మొగ్గను, చకర్త = త్రుంచింది. (కృతీ ఛేదనే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒక గోపిక పిల్లతుమ్మెద వాలి ప్రకాశిస్తున్న తామరమొగ్గను త్రుంచింది. ఆ తామర మొగ్గ చాలా అందంగా వుంది. రాజహంసలు దానిని పొడిచి గాయం చేశాయి. ఆ తామరమొగ్గ ఆ గోపిక రొమ్ముతో పోటీ పడుతోంది. కాబట్టి ఆమె దానిని త్రుంచి వేసింది.

**వి :** 1. ఇక్కడ **ఘనస్తనస్పర్ధి** అన్న విశేషణం వాస్తవానికి పద్మకోశానికి సంబంధంలేని విషయం. సహజస్వరూపంతో అది అందంగా వున్నది. అంతేకానీ స్తనంతో పోటీ పడటం లేదు. అయినా పోటీ పడుతున్నట్లు కవి లేని సంబంధాన్ని కల్పించినందువల్ల ఇది సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు. 36)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చకర్త :** | చకర్త | చకృతతుః | చకృతుః | |
| | చకర్తిథ | చకృతథుః | చకర్త | |
| | చకర్త | చకృతివ | చకృతిమ. | * |

**శ్లో॥ మాద్యద్ద్విరేఫైః కృతగీతజాతం - పద్మాసనేష్టం పవనేన జుష్టమ్ ।**
**పద్మం సుగన్ధి న్యలునాత్ సపత్నీ-సద్మాభిశఙ్క్యేవ ముకున్దయోగ్యమ్ ॥9-41**

**అ :** ఒక గోపిక పద్మాన్ని కోయటం. -ఇంద్రవజ్ర.

**అ :** మాద్యద్-ద్విరేఫైః కృత-గీత-జాతం పద్మ+ఆసన+ఇష్టం పవనేన జుష్టం సుగంధి ముకుంద-యోగ్యం పద్మం సపత్నీ-సద్మ అభిశంక్య+ఇవ పద్మం న్యలునాత్.

**ప్ర :** మాద్యద్+ద్విరేఫైః : మాద్యద్ = మత్తెక్కివున్న, ద్విరేఫైః = తుమ్మెదలచే (మాద్యన్తః చ అమీ ద్విరేఫాః, తైః), కృత-గీత-జాతమ్ : కృత = చేయబడిన (పాడబడిన), గీత-జాతమ్ = పాటల సమూహం గలదియు (కృతాని గీతానాం జాతాని యస్మిన్ - తత్), పద్మ+ఆసన+ ఇష్టమ్ : పద్మ+ఆసన=బ్రహ్మకు, ఇష్టమ్ = నచ్చినదియు, పవనేన = వాయువుచే, జుష్టమ్ = సేవింపబడినదియు, సుగంధి = మంచివాసన గలదియు (శోభనః గంధః యస్య తత్), ముకుంద-యోగ్యమ్ = కృష్ణునకు తగినదియు (ముకుందాయ యోగ్యం), సపత్నీ-సద్మ : సపత్నీ = సవతియొక్క, సద్మ = ఇంటినిగా, అభిశంక్య+ఇవ = సంశయించి కాబోలు, పద్మమ్ = పద్మాన్ని, న్యలునాత్ = త్రుంచి వేసింది. (లూఞ్-ఛేదనే-పరస్మైపది-(ఉభయ)లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** మరొక గోపిక పద్మాన్ని త్రుంచి వేసింది. ఆ పద్మం చుట్టూ తుమ్మెదలు మూగి పాటలు పాడుతున్నాయి. బ్రహ్మ, ముఖ్యప్రాణదేవర ఆ పద్మాన్ని సేవిస్తున్నారు. పరిమళ-భరితమైన అది కృష్ణుని ఆరాధించటానికి తగినది. దానిని తన సపత్ని (లక్ష్మి) యొక్క ఇల్లుగా భావించి కాబోలు ఆ గోపిక ఆ పద్మాన్ని త్రుంచి వేసింది.

**వి :** 1. ప్రస్తుతశ్లోకంలోని ప్రధానాంశం పూలుకోయటం. మహాకావ్యాలలోని అష్టాదశ వర్ణనలలో ఉద్యానవిహారం కూడా ఒకటి. దానిలోని అంతర్భాగం పూలుకోయటం. పూలు కోయటం, పూలు కట్టడం రెండూ కూడా కళాత్మకమైన వ్యవహారాలే. సంస్కృతాంధ్ర కావ్యాలలో చాలా వాటిల్లో ఈ పూలు కోయటాన్ని (పుష్పాపచయం) వర్ణించారు. వసుచరిత్ర లోని పుష్పాపచయాన్ని మచ్చుకు గమనించండి.

ఇది దేశీయమైన ఛందస్సులో (వృషభగతిరగడ) వుంది.

బాల బాలరసాల మిది పికపాలిపాలిటియమరసాలము
గేలిఁ గేలిడి గ్రుచ్చఁ గడు రాగిల్లు గిల్లుము తత్ప్రవాళము
కొమ్మ కొమ్మఁ గదల్చి ననగైకొనక కొన కదియేల నిక్కెదు
రమ్మురమ్మన మోపఁ గురవకరాజి రాజిలు నెంత పొక్కెదు. ... ...

గోర గోరఁట నించితివొ కలిగొట్టు గొట్టుగఁ గోయఁ బొసఁగవు
నారి నారికదంపుబాలెలు నాకు నాకులవృత్తి నొసఁగవు
కలయ కలయకలంకకేతకి కళిక కళికచ పఱచెఁ బిల్తమె
యళిక యళికి వడంకె నీ యిభయాన యా ననవిల్తుఁ గొల్తమె.- వసుచరిత్రము 3/149

2. పద్మాసనుడు (బ్రహ్మ) లక్ష్మి కుమారుడు. వాయువు పురుషోత్తముని ప్రాణం నుండి పుట్టిన వాడు.

ఋ॥ చంద్రమా మనసో జాతః చక్షోస్సూర్యోఽజాయత ।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥ - పురుషసూక్తమ్.

అందుకే లక్ష్మి కుమారుడు. ఆ ఇద్దరూ లక్ష్మిని సేవిస్తున్నారు; తదాసనమైన పద్మాన్ని సేవిస్తూ. లక్ష్మి పద్మాలయ గదా!

శ్లో॥ సరసిజనిలయే సరోజహస్తే – ధవళతమాంశుకగంధమాల్యశోభే।
భగవతి హరివల్లభే మనోఽజ్ఞే – త్రిభువనభూతికరి ప్రసీద మహ్యమ్ ॥

– కనకధారాస్తోత్రమ్ – 18

| | | | |
|---|---|---|---|
| 3. ని+అలునాత్ : | **న్యలునాత్** | న్యలునీతామ్ | న్యలునన్ |
| | న్యలునాః | న్యలునీతమ్ | న్యలునీత |
| | న్యలునామ్ | న్యలునీవ | న్యలునీమ. |

*

**శ్లో॥ శ్రీపతేరధరసీత్కృతికాలే – గోపికేక్షయతి మామితరేతి ।**
**కోపతప్తహృదయేవ సరాగం – కాపి కోకనదమేత్య జహార ॥ 9–42**

**అ :** ఒక గోపిక మరొక గోపికను ఎఱ్ఱకలువతో కొట్టడం. –స్వాగతం.

**అ :** శ్రీపతేః అధర–సీత్కృతి–కాలే ఇతరా గోపికా మామ్ ఈక్షయతి ఇతి కోప–తప్త హృదయా+ఇవ కా+ అపి కోకనదమ్ ఏత్య సరాగం జహార.

**ప్ర :** శ్రీపతేః : కృష్ణునియొక్క (శ్రియః పతిః, తస్య), అధర–సీత్కృతి–కాలే : అధర = పెదవిని, సీత్కృతి = ముద్దిడుకొనే, కాలే = సమయంలో (అధరస్య సీత్కృతిః, తస్యాః కాలః, తస్మిన్), ఇతరా = మరొక, గోపికా = గోపిక, మామ్ = నన్ను, ఈక్షయతి–ఇతి = చూస్తోందని (ఈక్ష దర్శనే పరస్మైపది–లట్–ప్ర.ఏ.), కోప–తప్త–హృదయా+ఇవ : కోప = కోపంతో, తప్త = మండింప జేయబడిన, హృదయా+ఇవ = మనస్సుగల దానివలె, కా+అపి = ఒకర్తుక, కోకనదమ్=ఎఱ్ఱకలువను, ఏత్య = పొంది/ తీసికొని, సరాగమ్ = ప్రేమతో, జహార = కొట్టింది. (హృ–హరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥ ఒక గోపిక కృష్ణుని ముద్దాడుతోంది**. మరొక గోపిక అది చూస్తోందని ఈమె మనస్సు మండిపోయిందన్నట్లు ఒక ఎఱ్ఱ కలువను తీసికొని ప్రేమ పూర్వకంగానే ఆమెను కొట్టింది.

**వి :** 1. కోకనద శబ్దానికి ఎఱ్ఱ తామర అని కూడా అర్థం చెప్పవచ్చు. 'రక్తం కోకనదం ప్రోక్తం పుండరీకం సితాంబుజమ్'–హలాయుధకోశః–681)

నీలనలినాభమపి తన్వి తవ లోచనం – ధారయతి **కోకనదరూపమ్**
కుసుమశర బాణభావేన యది రంజయసి – కృష్ణమిదమేతదనురూపమ్ ॥
ప్రియే చారుశీలే ముంచ మయి మానమనుదినమ్ – **గీతగోవిందం 10 సర్గ**

| | | | |
|---|---|---|---|
| 2. **ఈక్షయతి :** | **ఈక్షయతి** | ఈక్షయతః | ఈక్షయన్తి |
| | ఈక్షయసి | ఈక్షయథః | ఈక్షయథ |
| | ఈక్షయామి | ఈక్షయావః | ఈక్షయామః |
| **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. |

*

**శ్లో॥ దృప్తభృఙ్గసదపాఙ్గవిలోలం – సత్సరోజమలునాత్ కిల కాచిత్ ।**
**సీత్కరిష్యతి హరిః స మదీయం – వక్త్రమేతదితి భీతియుతేవ ॥ 9–43**

**అ :** ఒకానొక గోపిక కృష్ణభ్రాంతినివారణకై పద్మాన్ని త్రుంచటం.

**అ :** దృప్త–భృంగ–సద్–అపాంగ–విలోలం సత్–సరోజం సః హరిః ఏతత్ మదీయం వక్త్రమ్ ఇతి సీత్కరిష్యతి ఇతి భీతి–యుతా+ఇవ కాచిత్ అలునాత్.

**ప్ర :** దృప్త... విలోలమ్: దృప్త–భృంగ = పొగరెక్కిన తుమ్మెదలే, సద్+అపాంగ = అందమైన కడగంటి చూపులతో, విలోలమ్ = చంచలమైన (దృప్తశ్చ అసౌ భృంగః, స ఏవ అపాంగః, తేన విలోలం), సత్–సరోజమ్ = మంచి తామరను (సచ్చ తత్ సరోజం చ), సః హరిః = ఆ కృష్ణుడు, ఏతత్ = దీనిని, మదీయమ్ = నాయొక్క, వక్త్రమ్ = ముఖ మనుకొని, సీత్కరిష్యతి = ముద్దాడుతాడు, ఇతి = అని, భీతి–యుతా+ఇవ = భయంతో కూడిన దానివలె (భీత్యా యుతా సా ఇవ), కాచిత్ = ఒకానొక గోపిక, అలునాత్ = త్రుంచింది. (లూ–ఛేదనే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** ఒక గోపిక తామరను చూసింది. దానిపై మదించిన తుమ్మెదలు వ్రాలి వున్నాయి. అవే కడకంటి చూపులుగా కదులుతున్న ఆ తామరను చూచి ఆ గోపికకు ఒక అనుమానం కలిగింది. కృష్ణుడు దానిని చూసి తన ముఖమే అనుకొని దానిని ముద్దాడుతాడేమో అని భయమేసింది – వెంటనే దానిని త్రుంచివేసింది.

**వి :** 1. ఇక్కడ గోపిక భయం దానిని ముద్దాడుతాడనా? తనను ముద్దాడడనా? సందిగ్ధంగా కనిపిస్తోంది. అందువల్ల దీనిని గుణీభూతవ్యంగ్యభేదాలలో ఒకటిగా పరిగణించాలి. గుణీభూతవ్యంగ్యమంటే వ్యంగ్యార్థం అప్రధానమై వాచ్యార్థం అంతకన్న అందంగా భాసించటం. ఇది ఎనిమిది రకాలు. 1. అగూఢం 2. అపరాంగం 3. వాచ్యసిద్ధ్యంగం, 4. అస్ఫుటం 5. సందిగ్ధం 6. తుల్యప్రాధాన్యం 7. కాక్వాక్షిప్తం 8. అసుందరం.

శ్లో॥ అగూఢమపరస్యాంగం వాచ్యసిద్ధ్యంగమస్ఫుటమ్ ।
సందిగ్ధతుల్యప్రాధాన్యే కాక్వాక్షిప్తమసుందరమ్ ॥
వ్యంగ్యమేవం గుణీభూతవ్యంగ్యస్యాష్టౌ భిదః స్మృతాః ॥ – కావ్యప్రకాశః – 5/1,2

2. **భీతియుతా+ఇవ** అన్నది ఉత్ప్రేక్ష. ఆమె తామరను త్రుంచటానికి కారణం ఆమె భయం. కాబట్టి భయాన్ని కారణంగా సంభావించినందువల్ల ఇది హేతూత్ప్రేక్ష. '**సంభావనాస్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా**' – (కు.32)

| | | | |
|---|---|---|---|
| 3. **సీత్కరిష్యతి :** | **సీత్కరిష్యతి** | సీత్కరిష్యతః | సీత్కరిష్యన్తి |
| | సీత్కరిష్యసి | సీత్కరిష్యథః | సీత్కరిష్యథ |
| | సీత్కరిష్యామి | సీత్కరిష్యావః | సీత్కరిష్యామః |

**అలునాత్ :** 9–41వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఆకణ్ఠమమ్భసి గతస్య హరేర్మనోజ్ఞ–మాస్యం సమీపగసఖీజనజాతలజ్జా ।**
**నీలోత్పలం విలసదేతదధీరభృఙ్గ–మాతామ్రకేసరమితి ప్రవదన్త్యజిఘ్రత్ ॥ 9–44**

**అ :** ఒకానొక గోపిక నీలోత్పల మంటూ కృష్ణుని ముఖాన్ని ముద్దాడటం. –వసంతతిలకమ్.

**అ :** ఆ కంఠమ్ అంభసి గతస్య హరేః మనోజ్ఞమ్ ఆస్యం సమీపగ–సఖీ–జన–జాత–లజ్జా (సతీ) అధీర–భృంగమ్ ఆతామ్ర– కేసరం విలసత్ ఏతత్ నీల+ఉత్పలమ్ ఇతి ప్రవదన్తీ (సతీ) అజిఘ్రత్.

**ప్ర :** ఆకంఠమ్ = గొంతువరకు (ఆ కంఠాత్ అని పంచమీ విభక్త్యంతం '**ఆఙ్ మర్యాదాభి–విధ్యోః**' – (అష్టాధ్యాయి 2–1–13) సూత్రంతో సమాసం, అవ్యయీభావం), అంభసి = నీటిలోనికి, గతస్య = వెళ్ళినట్టి, హరేః= కృష్ణునియొక్క, మనో–జ్ఞమ్ = అందమైన (మనసా జ్ఞాయతే ఇతి తత్), ఆస్యమ్ = ముఖాన్ని, సమీప–గ–సఖీ–జన–జాత–లజ్జా (సతీ) : సమీప–గ = దగ్గరగా వున్న (సమీపే గచ్ఛంతి ఇతి సమీపగాః), సఖీ–జన = నెచ్చెలులవలన, జాత = పుట్టిన (జనీ ధాతువుపై క్త ప్రత్యయం), లజ్జా = సిగ్గు కలదై (సమీపగేభ్యః సఖీజనేభ్యః

జాతా లజ్జా యస్యాః సా), కాచిత్ = ఒకానొక గోపిక (కాచిత్ పదం గతశ్లోకం- నుండి), అధీర-భృంగమ్ : అధీర=చంచలమైన, భృంగమ్ = తుమ్మెదలు గలదియు (అధీరౌ భృంగౌ యస్మిన్ తత్), ఆతామ్ర-కేసరమ్: ఆతామ్ర = కొంచెంగా ఎఱ్ఱబడిన (ఆఙీషదర్థేఽభివ్యాప్తౌ-అమరకోశః-నానార్థ-240), కేసరమ్ = ఆకరువుగలదియు, విలసత్ = ప్రకాశిస్తున్నదియు (వి+లస ధాతువుపై శతృప్రత్యయం) అయిన, ఏతద్ = ఇది, నీల+ఉత్పలమ్ = నల్ల కలువ, ఇతి = అని, ప్రవదన్తీ (సతీ) = పలుకుతున్నదై, అజిఘ్రత్ = వాసన చూసింది. (ఘ్రా గంధోపాదానే పరస్మైపది లఙ్ ప్ర.ఏ.)

**తా ॥** గొంతువరకు నీటిలో మునిగివున్న కృష్ణుని అందమైన ముఖాన్ని గమనించింది ఒక గోపిక. (ముద్దాడాలి అనుకొంది). అయితే ప్రక్కనే వున్న నెచ్చెలులను చూసి సిగ్గు పడింది. దానితో ఈ నల్లకలువ కదులుతున్న తుమ్మెదలతో, ఎఱ్ఱని కింజల్కంతో వెలుగొందుతోంది అంటూ దానిని వాసన చూసింది (ముద్దాడింది).

**వి :** 1. ఈ శ్లోకంలో గోపికా వచనం తన చేష్టను (చేష్టతో కూడిన తన ఆకృతిని) కప్పిపుచ్చుకోవటానికి చేస్తున్న ప్రయత్నం. దీనిని **వ్యాజోక్తి** అంటారు. '**వ్యాజోక్తిరన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్**'- (కు.153). ఇతర గోపికలు ఆ కృష్ణుని ముఖాన్ని గుర్తించలేదంటే అప్పుడది మీలితాలంకారమవుతుంది. **మీలితం యది సాదృశ్యాద్ భేద ఏవ న లక్ష్యతే** - (కు.146). కానీ వారికి తెలియదా? తెలియదని ఈమె భావిస్తోందా? లేదు. వారికి తెలుసని తనకూ తెలుసు. అయినా అది ఒక దాచిపుచ్చటం.

మనసుకున్న కోరికలకూ, మనిషికున్న పరిమితులకూ మధ్య సమన్వయం కుదరకపోతే ఇటువంటి వ్యాజోక్తులు అవసరమవుతాయి. దీనితోబాటు ఇక్కడ కవిప్రమేయంతో చూస్తే రూపకాతిశయోక్త్యలంకారం. కదులుతున్న చూపులలో, ఎఱ్ఱని పెదవిలో తుమ్మెదలనూ, ఆతామ్రకేసరత్వాన్ని ఆరోపించటం. అయితే ఉపమేయాలను దాచిపుచ్చి ఉపమానాలను మాత్రమే చెప్పటం నిగీర్య అధ్యవసానం. ఆ లక్షణముంటే అది రూపకాతిశయోక్త్యలంకారం. '**రూపకాతిశయోక్తిః స్యాన్నిగీర్యాధ్యవసానతః**' - (కు.36)

2. **అజిఘ్రత్ :**

| | | | |
|---|---|---|---|
| **అజిఘ్రత్** | అజిఘ్రతామ్ | అజిఘ్రన్ | |
| అజిఘ్రః | అజిఘ్రతమ్ | అజిఘ్రత | |
| అజిఘ్రమ్ | అజిఘ్రావ | అజిఘ్రామ. | * |

**శ్లో॥ ఆర్యాయాహి గృహం త్వయా విరహితం సంత్యజ్య సా సత్వరా**
**ద్వార్యాస్తే న పునర్వివిక్షతి తనుం త్వద్యోగహీనామివ ।**
**చిత్తం త్వచ్చరణే నిధాయ వివశా చిత్రార్పితేవ ప్రభో!**
**నో చేత్ తత్తనుశాఖినేశ! భవనం స్యాదేవ తత్ కాననమ్ ॥ 9-45**

**అ :** ఒక దూతిక ఒకానొక నాయిక దీనస్థితిని కృష్ణునకు వివరించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఆర్య! ఆయాహి. త్వయా విరహితం గృహం సంత్యజ్య సత్వరా సా చిత్తం త్వత్+చరణే నిధాయ వివశా చిత్ర+అర్పితా+ఇవ ద్వారి ఆస్తే త్వద్-యోగ-హీనాం తనుమ్ ఇవ పునః న వివిక్షతి ప్రభో! ఈశ! నోచేత్ తత్-తను-శాఖినా తత్ భవనం కాననం ఏవ స్యాత్.

**ప్ర :** ఆర్య! = చేరదగినవాడా!, ఆయాహి = రా! (ఆ-యా ప్రాపణే-పరస్మైపది-లోట్- మ.ఏ.), త్వయా-విరహితమ్ = నీవు లేని, గృహమ్ = ఇంటిని, సంత్యజ్య = బొత్తిగా వదిలి (సమ్-త్యజ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సత్వరా = వేగవతియై, సా = ఆ గోపిక (మె), చిత్తమ్ = మనస్సును, త్వత్-చరణే = నీ కాలిపై (దగ్గర), నిధాయ = ఉంచి/నిలిపి (ని-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వివశా=వశం తప్పి, చిత్ర+అర్పితా+ఇవ

= బొమ్మ గీచినట్లుగా (చిత్రే అర్పితా, సా ఇవ), ద్వారి = గుమ్మంలోనే, ఆస్తే = ఉంది (ఆస్ ఉపవేశనే ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.), త్వద్-యోగ-హీనామ్:త్వద్=నీయొక్క, యోగ=కలయిక, హీనామ్ = లేని (త్వయా యోగః, తేన హీనా, తామ్), తనుమ్-ఇవ = శరీరాన్ని వలె, (గృహమ్ = ఇంటిని), పునః = మరల, న వివిక్షతి = ప్రవేశింపగోరుట లేదు (వేష్టుమ్ ఇచ్ఛతి వివిక్షతి) (విశ-ప్రవేశనే-సన్నంతం-పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), ప్రభో! = స్వామీ!, ఈశ! = రక్షకా!, నో చేత్ = లేకపోతే, తత్-తను-శాఖినా:తత్ = ఆమెయొక్క, తను=శరీర మనే, శాఖినా = కొమ్మచేత (తస్యాః తనుః, సైవ శాఖీ, తేన), తత్ భవనమ్ = ఆ ఇల్లు, కాననమ్-ఏవ = అడవియే, స్యాత్ = కాగలదు. (అస భువి పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.)

**తా ॥** ఆర్యా! రండి. నువ్వు లేని ఆ ఇంటిని వీడి, ఆ గోపిక వేగంగా వచ్చి, ద్వారంలో నిలిచి, నీ పాదాలపై మనస్సునుంచి, వివశయై బొమ్మలాగా నిలిచింది. లోనికి ప్రవేశించ టానికి కూడా ఇష్టపడటం లేదు. నీ కలయికలేని శరీరంలాగా నీవులేని ఇల్లు కూడా ఆమెకు నచ్చటం లేదు. నువ్వు లేకపోతే/ రాకపోతే ఆమె శరీరమే చెట్టై ఆ ఇల్లే అడవి అవుతుంది.

**వి :** 1. ఆప్తుల కోసం ఎదురు చూసేటప్పుడు ద్వారంలో నిలిచి క్షణక్షణానికీ వేరువేరుగా స్పందించ గలగటం ఒక మధురానుభూతి. నిరీక్షణ కూడా అక్కడ ఆనందహేతువే. ఆ అంశాన్ని అమరుకుడు కూడా మనస్సు నాకట్టుకొనేటట్టు వర్ణించాడు. చూడండి.

**శ్లో॥ ఆదృష్టిప్రసరాత్ప్రియస్య పదవీముద్వీక్ష్య నిర్విణ్ణయా**
**విచ్ఛిన్నేషు పథిష్వహః పరిణతౌ ధ్వాన్తే సముత్సర్పతి ।**
**దత్త్వైకం సశుచా గృహం ప్రతిపదం పాన్థస్త్రియాస్మిన్ క్షణే**
**మా భూదాగత ఇత్యమందవలితగ్రీవం పునర్వీక్షితమ్ ॥** **- అమరుశతకమ్ -** 76

నిర్వేదంతో కనుచూపు సాగినంత మేర భర్త వెళ్ళిన దారిని చూస్తూ, దారి కనుమరుగు కాగా, పగలు గడచిపోయి, చీకట్లు క్రమ్ముతుండగా బాధతో ఇంటివైపు ఒక అడుగు వేసి, ఇప్పుడు వచ్చివుంటాడేమో అని వెంటనే మెడ వెనక్కు త్రిప్పి చూసింది.

విప్రలంభశృంగారంలో అది పూర్వరాగవిప్రలంభమయినా సంయోగానంతరవిప్రలంభమయినా ఎదురుచూపులు రసదీప్తికి ఉపకరిస్తాయి. స్థాయీభావాన్ని రసీకరించటంలో ప్రముఖపాత్రను పోషిస్తాయి. **నిరీక్షణ-అన్వేషణలతో విప్రలంభశృంగారాన్ని అద్భుతంగా ఒక ప్రయోగంగా కాళిదాసు విక్రమోర్వశీయం చతుర్థాంకంలో విస్తృతంగా ప్రదర్శించాడు. ఊర్వశిని అన్వేషిస్తూ, ఆమెకై నిరీక్షిస్తూ పురూరవుడు దాదాపు అంకమంతా ఒక్కడే రంగస్థలంపై వుంటాడు. ఒక పాత్రతో అంకాన్ని అంతసేపు నడిపించటం విక్రమోర్వశీయంలో తప్ప మరెక్కడా - నాటకాల్లో కనిపించదు.**

| | | | |
|---|---|---|---|
| 2. **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే |
| **వివిక్షతి :** | **వివిక్షతి** | వివిక్షతః | వివక్షంతి |
| | వివిక్షసి | వివిక్షథః | వివిక్షథ |
| | వివిక్షామి | వివిక్షావః | వివిక్షామః |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

శ్లో॥ నిర్యాన్తీ ప్రవిశన్త్యదో గృహమసౌ ప్రత్యాక్షిపన్తీ మమ
ప్రేమాలాపమపి శ్వసన్త్యురుశుచా హస్తే నివేశ్యాననమ్ ।
పశ్యన్తీ తవ వర్త్మ సాశ్రునయనా మాం యాచమానా ముహు-
ర్మోహం క్వాపి వహన్త్యసౌ న సదయం కస్యేశ! కుర్యాన్మనః ॥ **9-46**

**అ :** మరొక దూతి మరొక గోపిక విరహదశను వర్ణించటం. -శార్దూలవిక్రీడితమ్.

**ప్ర :** ఈశ! = రక్షకా! కృష్ణా!, గృహమ్ = ఇంటిలోనికి, ప్రవిశన్తీ (సతీ) = ప్రవేశిస్తున్నదై, అదః=అప్పుడే (Sanskrit - English Dictionary v s Apte p 94) నిర్యాన్తీ (సతీ) = వెలుపలకు వస్తున్నదై, మమ = నాయొక్క, ప్రేమ+ఆలాపమ్-అపి = ప్రియవచనాన్ని కూడా (ప్రేమ్ణా ఆలాపః, తమ్), ప్రతి+ఆక్షిపన్తీ (సతీ) = తిరస్కరిస్తున్నదై, క్వ+అపి = ఎక్కడో ఒకచోట, ఆననమ్ = ముఖాన్ని, హస్తే = చేతిలో, నివేశ్య = నిలిపి (ని-విశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉరు-శుచా = ఎంతో శోకంతో (మన్యు శోకౌ చ శుక్స్త్రియామ్ - అమరకోశః - నాట్య -25), శ్వసన్తీ (సతీ) = నిట్టూరుస్తూ, తవ = నీయొక్క, వర్త్మ = బాటను, పశ్యన్తీ (సతీ) = చూస్తున్నదై, స+అశ్రు-నయనా (సతీ) = కంటనీరు పెట్టుకొంటూ, ముహుః = మాటిమాటికి, మామ్ = నన్ను, యాచమానా (సతీ) = అడుగుతూ, క్వాపి = ఒక్కొక్కప్పుడు (Sanskrit - English Dictionary v s Apte p 620), మోహమ్ = భ్రాంతిని, వహన్తీ (సతీ) = పొందుతున్నదై, అసౌ = ఆ గోపిక, కస్య = ఎవనియొక్క, మనః = మనస్సును, సదయమ్ = జాలితో కూడినదిగా (దయయా సహితమ్), న కుర్యాత్ = చేయలేదు? (కృ-కరణే పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! ఆ గోపిక ఇంటినుండి వెలుపలకు వస్తుంది. వెంటనే లోనికి వెళ్తుంది. నేను ప్రీతిగా మాటాడినా తిరస్కరిస్తోంది. ఎక్కడో చేతిలో తలపెట్టుకొని కూర్చొని తీవ్రమైన ఆవేదనతో నీ దారివైపే చూస్తోంది. కన్నీటితో నన్ను పదేపదే యాచిస్తోంది. మోహానికి లోనవుతోంది. ఆ స్థితిలో నున్న ఆమె ఎవరి మనస్సులో జాలిని కలిగించదు?

**వి :** 1. విభిన్నభావాలు **ఖలేకపోతన్యాయంగా** మనస్సును చుట్టబెడితే దాన్ని **భావశబలత** అంటారు. ఈ శ్లోకంలో చేష్టా శబలత కనిపిస్తోంది. విభిన్నచేష్టలు పరంపరంగా ఒకే వ్యక్తిలో కనిపిస్తే దానిని చేష్టాశబలతగా భావించవచ్చు. మానసికమయిన ఆందోళన వున్నపుడు మనస్సు పరిపరిరీతుల పరిభ్రమిస్తుంది. ఆ అనిశ్చితికి, ఆలోచనలకూ చేష్టారూపం చేష్టాశబలత. విరహదశలో ఈ ఆందోళన ఎక్కువగా వుంటుంది. జయదేవుని మాటల్లో చూడండి-

శ్లో॥ సా రోమాంచతి సీత్కరోతి విలపత్యుత్కంపతే తామ్యతి
ధ్యాయత్యుద్భ్రమతి ప్రమీలతి పతత్యుద్యాతి మూర్ఛత్యపి ।
ఏతావత్యతనుజ్వరే వరతనుర్జీవేన్న కిం తే రసాత్
స్వర్వైద్య ప్రతిమ ప్రసీదసి యది త్యక్తోఽ న్యథా నాంతకః ॥-గీతగోవిందం-శ్లో 29

... ... ...  ... ... ... ... ... ...

త్యజతి న పాణితలేన కపోలమ్ - బాలశశినమివ సాయమలోలమ్
రాధికా విరహే తవ కేశవ... -గీతగోవిందం - గీతం 9

2. ఈ శ్లోకంలో నిర్యాన్తీ, ప్రవిశన్తీ, ప్రత్యాక్షిపన్తీ, శ్వసన్తీ, పశ్యన్తీ, వహన్తీ, యాచమానా- ఇవన్నీ ఆయా ధాతువులపై '**లటః శతృశానచావప్రథమా సమానాధికరణే**' అన్న సూత్రంద్వారా శతృ, శానచ్ ప్రత్యయాలతో సిద్ధించే రూపాలు. పరస్మైపద ధాతువులపై శతృ ప్రత్యయం, ఆత్మనేపద ధాతువులపై శానచ్ ప్రత్యయం వస్తాయి.

పై ధాతువులలో నిర్-యా; ప్ర-విశ; ప్రతి+ఆ-క్షిప్; శ్వస్; దృశిర్ (పశ్యన్తీ) ఇవి పరస్మైపద ధాతువులు. వహ్, యాచ్ ఈ రెండూ ఆత్మనేపద ధాతువులు. వీటిలో కూడా యాచ్ ధాతువు స్వరితేత్తు. అంటే క్రియాఫలాన్ని కర్తయే పొందేటప్పుడు అది ఆత్మనేపద మవుతుంది.

పై ధాతువులలో యాచ్ ధాతువు యొక్క అర్థం ప్రార్థించటం. ఆ ప్రార్థన గోపిక తన కొరకు చేస్తోంది. మిగిలిన పనులన్నీ తనకు తెలిసో, తెలియకో జరుగుతున్న పనులు, సఖిని యాచించటం తెలిసి చేస్తున్న పదం. యాచన ఫలితాన్ని తానే అనుభవిస్తుంది. అందుకే ఆ ధాతువును ఆత్మనేపదిగా వాడటంలో ఎంతో ఔచిత్యముందిక్కడ.

| | | | |
|---|---|---|---|
| 3. **కుర్యాత్ :** | **కుర్యాత్** | కుర్యాతామ్ | కుర్యుః |
| | కుర్యాః | కుర్యాతమ్ | కుర్యాత |
| | కుర్యామ్ | కుర్యావ | కుర్యామ. |

*

**శ్లో॥ సాయం హీన న హీయం సా - మారతాత! తతా రమా ।**
**క్షీణాఽదేవవదేణాక్షీ - చారురాజ! జరారుచా ॥ 9-47**

**అ :** దూతి గోపికావిరహాన్ని వర్ణించి చెప్పటం. -పథ్యావక్త్రమ్.

**ప :** సాయం హి ఇన! న హి ఇయం సా - మారతాత! తతా రమా ।
క్షీణా అదేవవద్ ఏణాక్షీ - చారు రాజ! జరా+అరుచా ॥

**అ :** మార-తాత! చారు-రాజ! ఇన! సాయం హి. ఇయం తతా సా రమా న. ఏణ+అక్షీ జరా+అరుచా అదేవవత్ క్షీణా।

**ప్ర :** మార-తాత! = మదన జనకా! (తాతస్తు జనకః పితా - అమరకోశః - మనుష్య - 28) (మారస్య తాతః , తస్మాత్ సంబుద్ధిః), చారు-రాజ! = సుందరశ్రేష్ఠా !, ఇన = ప్రభూ!, సాయం హి = సాయంకాలం (అయింది), ఇయమ్ = ఈ గోపిక, తతా = ప్రసిద్ధమైన, సా రమా = ఆ లక్ష్మి, న హి = కాదు గదా!, ఏణ+అక్షీ = మృగనేత్ర అయిన ఈ గోపిక (ఏణస్య అక్షిణీ ఇవ అక్షిణీ యస్యాః సా), జరా-అరుచా : జరా = ముసలితనంవల్ల కలిగిన, అరుచా = కాంతిహీనతచే, అదేవవత్ = మనుష్యునివలె, క్షీణా = కృశించింది. (క్షి ధాతువుపై **నిష్ఠ** (అష్టాధ్యాయి - 3-2-103) సూత్రంతో ధాతువుకు దీర్ఘం. '**క్షియో దీర్ఘాత్**' (8-2-46) సూత్రంతో నకారానికి ణకారం. '**అజాద్యతష్టాప్**' (4-1-4) సూత్రంతో టాప్ ప్రత్యయం)

**తా ॥** మదనజనకా! సుందరశ్రేష్ఠా ! స్వామీ! సాయం సమయమైంది గదా! ఈ గోపిక ఆ లక్ష్మి కాదు గదా! ఈ హరిణలోచన వార్ధక్యంవలన ఏర్పడిన శిథిలతతో మానవులవలె క్షీణించింది. (ఈ శైథిల్యం విరహంవలన ఏర్పడిందే కానీ నైసర్గికమైన బక్కచిక్కిన తనం కాదని ప్రతిపాదన)

**వి :** 1. ఈ శ్లోకంలోని ప్రతిపాదమూ ముందునుంచి వెనక్కు చదివినా, వెనుక నుండి ముందుకు చదివినా సమానంగానే వుంటుంది. దీనిని **గతాగత యమక** మంటారు. విప్రలంభ శృంగారవర్ణనలో ఇటువంటి ప్రయోగాలు చేయటం సాహసగుణమే. *

**శ్లో॥ ఇత్థం నిగద్య నిగమాకలితం నయన్తి - దూత్యో వితానమణిశోభి గృహం నిశాసు ।**
**నృత్తన్మయూరశుకకోకిలమత్తభృఙ్గ-తత్యాదృతోపవనవాసితమఙ్గనాయాః ॥ 48**

**అ :** దూతికలు కృష్ణుని గోపికల దగ్గరకు కొనిపోవటం. -వసంతతిలక.

**అ :** దూత్యః ఇత్థం నిగద్య నృత్తత్-మయూర-శుక-కోకిల-మత్త-భృంగ-తతి+ఆదృత+ ఉపవన-వాసితమ్ అంగనాయాః వితాన-మణి-శోభి-గృహం నిగమ+అకలితం నిశాసు నయన్తి.

ప్ర : దూత్యః=దూతికలు (రాయబారం నడిపే నాయికచెలికత్తెలు), ఇత్థమ్ = ఈ రీతిగా, నిగద్య = చెప్పి (ని–గద ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నృత్త... వాసితమ్ : నృత్తత్ = నృత్తం చేస్తున్న, మయూర = నెమళ్ళు, శుక = చిలుకలు, కోకిల = కోయిలలు, మత్త = మదించిన, భృంగ = తుమ్మెదలయొక్క, తతి = సమూహంచేత, ఆదృత = ఆదరింప బడిన, ఉపవన = తోటలతో, వాసితమ్ = పరిమళింప జేయబడిన (భావితే స్తంభితేఽపి స్యాచ్ఛాదితే చ త్రిషూచ్యతే–నానార్థమంజరీ–పంక్తి 776) (నృత్తన్తః చ తే మయురాః చ శుకాశ్చ కోకిలాశ్చ మత్తాశ్చ తే భృంగాశ్చ తేషాం తతిః, తయా ఆదృతం చ తత్ ఉపవనం తేన వాసితమ్), అంగనాయాః = స్త్రీ (గోపిక) యొక్క, వితాన–మణి–శోభి : వితాన= మేలికట్లతో, మణి = మణులతో, శోభి = ప్రకాశిస్తున్న (వితానైః మణిభిశ్చ శోభత ఇతి తత్), గృహమ్ = ఇంటికి, నిగమ+అకలితమ్ : నిగమ = వేదాలచే, అకలితమ్ = తెలియబడని కృష్ణుని (నిగమైః అకలితః, తమ్), నిశాసు = రాత్రులలో, నయన్తి = కొనిపోతున్నారు. (నీ ప్రాపణే–పరస్మైపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ఈ రీతిగా (వెనుకటి శ్లోకాలలో చెప్పినట్లుగా) చెప్పి దూతికలు వేదాలకు కూడా అందని ఆ కృష్ణుని రాత్రి వేళలలో గోపికల ఇంటికి తీసికొని పోతున్నారు.ఆ ఇళ్ళు మేలి–కట్లతో మణులతో శోభిస్తున్నాయి. నృత్తం చేసే నెమళ్ళు, చిలుకలు, కోయిలలు, మదపు తుమ్మెదల సమూహంతో ఆదరింపబడిన ఆ గృహోపవనాలు ఆ ఇళ్ళను పరిమళభరితాలుగా చేస్తున్నాయి.

**వి :** 1. నాయికలకు ప్రియసమాగమవిషయంలో సహాయం చేసేవారు ఎనిమిది రకాలకు చెందిన వారు ఉంటారని అలంకారశాస్త్రవచనం.

శ్లో॥ దూత్యో దాసీ సఖీ కారూః ధాత్రేయీ ప్రతివేశికా ।
లింగినీ శిల్పినీ స్వం చ నేతృమిత్రగుణాన్వితాః ॥ – దశరూపకమ్ – 2/27

దాసి, సఖి, కారువు (చాకెత మొ॥వారు) దాది కూతురు, పొరుగింటి గృహిణి, లింగిని (భిక్షుకి మొదలగు వారు), శిల్పిని (కళాకారిణులు), తాను (నాయికయే స్వయంగా ఉపక్రమించటం) ఈమెనే శృంగారనాయికాభేదాలలో అభిసారికగా పరిగణిస్తారు.)

2. నృత్తమ్ : '**నృత్తం తాళలయాశ్రయమ్**' – దశరూపకమ్ 1/9

నృత్తమంటే తాళానికీ, లయకూ అనుగుణంగా శరీరంతో చూపే కదలిక. దీనినే దేశీ పరిభాషలో '**చిందు**' అంటారు. ఈ మధ్యకాలంలో ఇదే నృత్యంగా చెలామణి అవుతోంది. వాస్తవానికి నృత్యం భావాన్ని ఆశ్రయించిన కదలిక.

| | | | |
|---|---|---|---|
| 3. **నయన్తి :** | నయతి | నయతః | **నయన్తి** |
| | నయసి | నయథః | నయథ |
| | నయామి | నయావః | నయామః. |

*

**శ్లో॥ నేత్రానన్దజలేన మఞ్జుకలశప్రఖ్యస్తనస్థాయినా**
**పాద్యార్ఘ్యే హిమవారిణేవ మధుభిః స్నానం ప్రసూనసృతైః ।**
**ఆశ్లిష్యాఙ్గకలాపరమ్యతిలకశ్రీఖణ్డలేపాంశ్చ సా**
**లోలేక్షోత్పలమాల్యమోష్ఠజసుధాం ప్రాదాత్ ప్రియేఽభ్యాగతే ॥ 9-49**

అ : ప్రియుడైన కృష్ణుడు ఇంటికి రాగా గోపిక ఆయనను స్వాగతిస్తూ అర్చించిన తీరు. –శార్దూలవిక్రీడితమ్.

అ : సా ప్రియే అభ్యాగతే మంజు–కలశ–ప్రఖ్య–స్తన–స్థాయినా నేత్ర+ఆనంద–జలేన హిమ–వారిణా+ఇవ

పాద్య+అర్ఘ్యే, ప్రసూన-సృతైః మధుభిః స్నానమ్ ఆశ్లిష్య అంగ-కలాప-రమ్య-తిలక-శ్రీ-ఖండ-లేపాన్ లోల+ఈక్ష+ఉత్పల-మాల్యమ్ ఓష్ఠ-జ-సుధాం చ ప్రాదాత్.

**ప్ర :** సా = ఆ గోపిక, ప్రియే = ప్రియుడైన కృష్ణుడు, అభి+ఆగతే = సమ్ముఖానికి రాగా, మంజు... స్థాయినా : మంజు = అందమైన, కలశ = కలశాలతో, ప్రఖ్య = సమానమైన (ప్రఖ్యః ప్రకాశః ప్రతిమః ప్రకారః – హలాయుధకోశః – 694), స్తన = రొమ్ములపై, స్థాయినా = నిలిచి యున్న (మంజ్వోః కలశాభ్యాం ప్రఖ్యయోః స్తనయోః తిష్ఠతి ఇతి, తేన), నేత్ర+ఆనంద-జలేన : నేత్ర = కన్నులు కార్చిన, ఆనంద-జలేన = ఆనందబాష్పాలతో (నేత్రయోః ఆనందేన స్రుతం జలం, తేన), హిమ-వారిణా+ఇవ = మంచునీటితోవలె, పాద్య+అర్ఘ్యే = పాద్యాన్నీ, అర్ఘ్యాన్నీ (పాదప్రక్షాళనకై అర్పించే జలం **పాద్యం**, హస్త ప్రక్షాళనకై అర్పించే జలం **అర్ఘ్యం**) (పాద్యం చ అర్ఘ్యం చ పాద్యార్ఘ్యే), ప్రసూన-స్రుతైః : ప్రసూన = పూలనుండీ, స్రుతైః = జారిన (ప్రసూనేభ్యః స్రుతాః, తైః), మధుభిః = మకరందాలతో, స్నానమ్ = స్నానాన్నీ, ఆశ్లిష్య = కౌగిలించుకొని (ఆ-శ్లిష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అంగ... లేపాన్ : అంగ = తన శరీరంపై నున్న, కలాప = నగలను (కలాపో భూషణే బర్హే – నానార్థమంజరీ – పంక్తి – 1102), (అంగ = శరీరమే, కలాప = నగలుగా), రమ్య=అందమైన, తిలక = (కస్తూరీ) తిలకాన్ని, శ్రీఖండ-లేపాన్ = చందన విలేపాలను (చందనం స్యాన్మలయజం శ్రీఖండం... హలాయుధకోశః – 544), లోలే... మాల్యమ్:లోల=చంచలమైన, ఈక్షా = చూపు లనే, ఉత్పల = నల్లకలువల యొక్క, మాల్యమ్ = మాలను (లోలాని చ తాని ఈక్షణాని ఏవ మాల్యమ్, తత్), ఓష్ఠ – జ – సుధామ్ : ఓష్ఠ-జ = పెదవులనుండి పుట్టిన, సుధామ్ చ = అమృతాన్నీ కూడా (ఓష్ఠయోః జాతా చ సుధా, తామ్), ప్ర+అదాత్ = ఇచ్చింది. (ప్ర-దా దానే పరస్మైపది-లుఙ్- ప్ర.ఏ.)

**తా ॥** దూతి సూచనమేరకు కృష్ణుడు గోపిక ఇంటికి వెళ్ళాడు. కృష్ణుడు తన ఇంటికి రాగానే ఆ గోపిక తన స్తనా లనే కలశాలపై పడిన ఆనందబాష్పాలనే అర్ఘ్య పాద్య జలంగా అర్పించింది. పూలనుండి కారిన మకరందంతో స్నానాన్ని సమర్పించింది. కృష్ణుని కౌగిలించుకొని తన శరీరంపై వున్న నగలనూ, తిలకాన్నీ, చందనలేపనాన్ని (ఆయన-కర్పించింది). తన చూపు లనే నల్లకలువలతో మాలలను అలంకరించింది. తన అధరామృతాన్ని నివేదించింది.

**వి :** 1. శ్లోకంలో అర్చనావయవాల వర్ణన ప్రధానాంశం. షోడశోపచారపూజ మనకలవాటు. ఇక్కడ అవన్నీ లేకపోయినా వాటిలో కొన్నింటితో గోపిక అర్చించటాన్ని శ్లోకం వివరిస్తోంది. అర్ఘ్య పాద్యాలతో ప్రారంభించి అధరామృతనివేదన దాకా అర్ఘ్య, పాద్య, స్నాన, భూషణ, తిలక, గంధ, మాల్య, నివేదనలను (8 ఉపచారాలు) గోపిక కృష్ణునకు చేయగలిగింది.

2. తిలక ప్రస్తావన వచ్చింది కాబట్టి **కస్తూరీతిలకధారిని** స్తుతించిన ఈ ప్రసిద్ధ శ్లోకాన్ని మనం స్మరించుకోవాలి.

**శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షఃస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।**
**సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళిం**
**గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥** **– శ్రీకృష్ణకర్ణామృతం-2/108**

2. స్తనకలశాలతో ఆనందబాష్పాలను అర్ఘ్యపాద్యాలుగా అందించింది. ఆనందబాష్పాలు కాకపోయినా తొలకరి చినుకులు పయోధరాలపై పడటాన్ని కాళిదాసు – కుమారసంభవం 5/24 లో మనోహరంగా వర్ణిస్తాడు పార్వతి తపస్సు చేసే సందర్భంలో-

శ్లో॥ స్థితాః క్షణం పక్ష్మసు తాడితధరాః – **పయోధరోత్సేధనిపాతచూర్ణితాః ।**
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే – చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః ॥

తపస్సు చేస్తున్న పార్వతి కనురెప్పలపై తొలకరి చినుకులు పడ్డాయి. అవి అక్కడ క్షణకాలముండి అక్కడనుండి పెదవులపై బడి, ఆపై రొమ్ములపై పడి బ్రద్దలై, ఆమె త్రివళిలోనికి జారి, మెల్లగా నాభిలో ప్రవేశించాయి.

| | | | |
|---|---|---|---|
| 3. ప్ర+**అదాత్ :** | **ప్రాదాత్** | ప్రాదాతామ్ | ప్రాదుః |
| | ప్రాదాః | ప్రాదాతమ్ | ప్రాదాత |
| | ప్రాదామ్ | ప్రాదావ | ప్రాదామ. |

*

**శ్లో॥ కాన్తాననద్యుతినివృత్తకటాక్షగణ్డ–**
**బిమ్బోష్ఠరమ్యరుచిభిర్మిలితా స్మితశ్రీః ।**
**ఇన్దీవరామ్బురుహకోకనదైః సుగన్ధి**
**సాన్ద్రం తయాఽనుకురుతే మధు పీయమానమ్॥ 9–50**

**అ :** కృష్ణుని దరహాసాన్ని వర్ణించటం. –వసంతతిలక.

**అ :** కాంత+ఆనన–ద్యుతి–నివృత్త–కటాక్ష–గండ–బింబ+ఓష్ఠ–రమ్య–రుచిభిః మిలితా స్మితశ్రీః ఇందీవర+అంబురుహ–కోకనదైః సుగంధి తయా పీయమానం సాంద్రం మధు అనుకురుతే.

**ప్ర :** కాంత... రుచిభిః:కాంత = కాంతుని (కృష్ణుని) యొక్క, ఆనన=ముఖంయొక్క, ద్యుతి = కాంతుల చేత, నివృత్త = మరల్ప జేయబడిన, కటాక్ష = చూపులయొక్క, గండ = చెక్కిలియొక్క, బింబ+ఓష్ఠ = దొండపండువంటి పెదవియొక్క, రమ్య = అందమైన, రుచిభిః = కాంతులచేత, మిళితా = కూడుకొన్న, స్మితశ్రీః = చిఱునవ్వు వెలుగు, ఇందీ... నదైః : ఇందీవర = నల్లకలువచేత, అంబురుహ = పద్మంచేత, కోకనదైః = ఎఱ్ఱకలువ చేత (ఇందీవరం చ అంబురుహం చ కోకనదం చ, తైః), సుగంధి = సువాసితమై, తయా = ఆ గోపిక చేత, పీయమానమ్ = త్రాగబడుతున్న, సాంద్రమ్ = చిక్కనైన, మధు = మధువును, అనుకురుతే = అనుకరిస్తోంది. (అను–కృ–కరణే–ఆత్మనేపది–లట్– ప్ర.ఏ.)

**తా ॥** గోపీ ముఖంమీద చిఱునవ్వు వెలుగు, కృష్ణుని ముఖకాంతులచేత (ముద్దాడేటప్పుడు) వెనుకకు నెట్టబడింది. చూపులు (నల్లకలువలు) చెక్కిలి (తామర) పెదవి (ఎఱ్ఱకలువ)ల కాంతులతో కలిసి ఇందీవర–అంబురుహ–రక్తోత్పలాల పరిమళంతో కూడి ఆ గోపిక త్రాగుతున్న చిక్కని మధువును అనుకరిస్తోంది.

**వి :** 1. **దరహాసకాంతి చిక్కనైన మధువును అనుకరిస్తోందనటం అసాధారణమైన ఊహ**. ఆ మధువు బహుశః కల్లు అయి వుండాలి. తాటిచెట్టు మొదలుగా గల కొన్ని రకాల చెట్ల నుండి తీసిన పాలవంటి చిక్కని పదార్థం కల్లు. అది ఒక విధమైన మద్యమే అయినా ఈ నాటికీ స్త్రీపురుషభేదం లేకుండా అనునిత్యమూ ఆ కల్లును ఆరోగ్యకరమని భావిస్తూ సేవించేవారున్నారు. ఆ గోపిక కూడా అటువంటి వాతావరణానికి సంబంధించినదై వుండాలి.

2. కటాక్ష–గండ–బింబోష్ఠాలకు క్రమంగా ఇందీవర–అంబురుహ–కోకనదాలతో పోలిక ధ్వనిస్తుంది. కాబట్టి ఉపమాలంకారధ్వని. అదీ క్రమంగా కాబట్టి యథాసంఖ్యాలంకారం కూడా ఇక్కడుంది. "**యథాసంఖ్యం క్రమేణైవ క్రమికానాం సమన్వయః**" – (కు. 106)

'స్మితశ్రీః మధు అనుకరోతి' అన్న చోట కూడా ఉపమాలంకారం. స్మితశ్రీ ఉపమేయం మధు ఉపమానం. అనుకురుతే అన్నది ఆర్థియయిన ఉపమావాచకం.

| | | | |
|---|---|---|---|
| 3. **అనుకురుతే :** | **అనుకురుతే** | అనుకుర్వాతే | అనుకుర్వతే |
| | అనుకురుషే | అనుకుర్వాథే | అనుకుర్వధ్వే |
| | అనుకుర్వే | అనుకుర్వహే | అనుకుర్మహే. |

*

**శ్లో॥ విష్వగ్వ్యాపిమణిప్రభాభిధపయస్సిన్ధౌ స్ఫురన్మణ్టప-**
**ప్రఖ్యే వేశ్మని భోగికల్పకశిపౌ సాకం వ్రజస్త్రీజనైః ।**
**భిత్తిశ్రీపతిమౌళిరత్నమహసోత్సర్పిస్వరత్నశ్రియా**
**పుష్టోన్నమ్రఫణత్విషాం ముషి లసంస్తుష్టోఽస్త్వసౌ విట్ఠలః ॥ 9-51**

**అ :** శేషశయ్యపై గోపికలతో కలిసి ప్రకాశిస్తున్న విట్ఠలుని నుతి. -శార్దూలవిక్రీడితమ్. 59వ శ్లోకం వరకు.

**అ :** విష్వగ్-వ్యాపి-మణి-ప్రభా+అభిద-పయః+సిన్ధౌ స్ఫురత్+మంటప-ప్రఖ్యే వేశ్మని భిత్తి-శ్రీపతి-మౌళి-రత్న-మహసా ఉత్సర్పి-స్వ-రత్న-శ్రియా పుష్ట+ఉత్-నమ్ర-ఫణ-త్విషాం ముషి భోగికల్ప-కశిపౌ వ్రజ-స్త్రీ-జనైః సాకం లసన్ అసౌ విట్ఠలః తుష్టః అస్తు.

**ప్ర :** విష్వగ్... సిన్ధౌ : విష్వగ్ = అంతటా, వ్యాపి = వ్యాపిస్తున్న, మణి = మణులయొక్క, ప్రభా = కాంతులనే, అభిధ = పేరుగల, పయస్సిన్ధౌ = పాలకడలిలో (విష్వగ్ వ్యాపినీ మణీనాం ప్రభా, సైవ అభిధా యస్య, స చాసౌ పయసాం సిన్ధుః, తస్మిన్), స్ఫురన్మంటప-ప్రఖ్యే : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, మంటప = మంటపంతో, ప్రఖ్యే = సమానమైన (ప్రఖ్యః ప్రకాశః ప్రతిమః - హలాయుధకోశః - 694) (స్ఫురతః మంటపస్య ప్రఖ్యే), వేశ్మని = ఇంటిలో (శాలా వేశ్మ... హలాయుధకోశః-291), భిత్తి... మహసా : భిత్తి = గోడల మీదనూ, శ్రీపతి-మౌళి = కృష్ణుని కిరీటం మీదనూ ఉన్న, రత్న = రత్నాలయొక్క, మహసా = కాంతితో (భిత్తేః శ్రీపతేః మౌళేః చ రత్నానాం మహః, తేన), ఉత్సర్పి-స్వ-రత్న-శ్రియా : ఉత్సర్పి = పైకి వ్యాపిస్తున్న, స్వ = తనయొక్క, రత్న = రత్నాలయొక్క, శ్రియా = కాంతితో (ఉత్సర్పిణీ స్వస్య రత్నానాం శ్రీః, తయా), పుష్ట+ఉత్+నమ్ర-ఫణ-త్విషామ్ : పుష్ట = బలిసిన, ఉన్నమ్ర = పైకెగసిన, ఫణ = పడగలయొక్క, త్విషామ్ = కాంతులను (పుష్టాః ఉన్నమ్రాశ్చ తే ఫణాః, తేషాం త్విషః, తాసామ్), ముషి = దొంగిలించెడి, భోగి కల్ప-కశిపౌ = ఆదిశేషునితో సమానమైన పడకపై (అస్త్రీ కశిపు శయ్యాయాం - నానార్థ రత్నమాలా - పంక్తి - 1767) (ఈషదూనః భోగీ భోగికల్పః స చ అసౌ కశిపుః తస్మిన్ - '**ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః**-అష్టాధ్యాయి-5-3-67), వ్రజ-స్త్రీ-జనైః సాకమ్ = గోపవనితలతో కూడి (వ్రజే విద్యమానాః స్త్రీజనాః తాభిః సాకమ్), లసన్ = వెలుగొందుతూ (లస ధాతువుపై శతృ ప్రత్యయం), అసౌ విట్ఠలః = ఆ పాండురంగ విట్ఠలుడు, తుష్టః = ఆనందించినవాడుగా, అస్తు = ఉండుగాక. (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** అంతటా వ్యాపిస్తున్న మణికాంతు లనే పేరుగల పాలకడలిలో ప్రకాశిస్తున్న రత్నమంటపంతో సమానమైన ఇంటిలో, గోడల కాంతీ, మరియు శ్రీపతి కిరీట రత్న కాంతులచే నిరోధింపబడి, ప్రక్కలకు ప్రసరించే అవకాశంలేక, పైకి ప్రసరిస్తున్న రత్న కాంతులచే విప్పిన పడగలపైనున్న రత్నకాంతిని దొంగిలిస్తున్న ఆదిశేషునివంటి శయ్యపై, గోపకాంతలతో కలిసి వెలుగొందుతున్న పాండురంగవిట్ఠలుడు ఆనందించు గాక.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ. |

*

**శ్లో॥ గోపీ కాచన ధీరతాం హృది బలాదాలమ్బ్య రత్యుత్సుకే**
**కోపేనేవ నిమీల్య నేత్రయుగలం తల్పే శయానా సకృత్ ।**

**కాన్తం నిద్రితమాకలయ్య శనకైరాలిఙ్గ్య బిమ్బాధరం**
**సీత్కుర్వన్త్యథ వీక్షితాపి వివశా మానం న సస్మార సా ॥ 9-52**

**అ :** ఒకానొక గోపిక కృష్ణుడు నిద్రించిన తరువాత కౌగిలించి, ముద్దాడుట.

**అ :** కాచన గోపీ రతి+ఉత్సుకే హృది బలాత్ ధీరతామ్ ఆలంబ్య కోపేన+ఇవ నేత్ర-యుగలం నిమీల్య తల్పే శయానా సకృత్ కాన్తం నిద్రితమ్ ఆకలయ్య శనకైః ఆలింగ్య బింబ+అధరం సీత్కుర్వన్తీ అథ వీక్షితా అపి వివశా సా మానం న సస్మార.

**ప్ర :** కాచన = ఒకానొక, గోపీ = గోపిక, రతి+ఉత్సుకే = రతికై ఉద్యమించిన (ప్రతూర్ణ స్త్వరితస్తూర్ణ ఉత్సుకః ప్రసృతః... హలాయుధకోశః - 353) (రత్యై ఉత్సుకం, తస్మిన్), హృది = హృదయంలో, బలాత్ = బలంగా, ధీరతామ్ = ధైర్యాన్ని (ధీరస్య భావః, తామ్), ఆలంబ్య = పొంది (ఆ-లమ్బ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కోపేన+ఇవ = కోపంతోనో అన్నట్లు (ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ - వార్తికం - 1236), నేత్ర-యుగలమ్ = కనుదోయిని (నేత్రయోః యుగలం తత్), నిమీల్య = మూసి (ని-మీల్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తల్పే = పడకపై, శయానా (సతీ) = పడుకొన్నదై, సకృత్ = ఒకసారి (చూసి), నిద్రితమ్ = కునుకుదీస్తున్నట్లుగా, కాంతమ్ = ప్రియుడైన కృష్ణుని, ఆకలయ్య = అనుకొని, శనకైః = మెల్లగా, ఆలింగ్య = కౌగిలించి, బింబ+అధరమ్ = దొండపండువంటి పెదవిని, సీత్కుర్వన్తీ = ముద్దాడుతూ, అథ=ఆ పై, వీక్షితా+అపి = చూడబడినా (కృష్ణునిచే), వివశా = పరవశయై (అదుపు లేనిదై), సా = ఆ గోపిక, మానమ్ = కోపాన్ని, న సస్మార = తలచుకోలేదు. (స్మృ చింతాయాం-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపికకు రతిపై ఆసక్తి కలిగి, దానికై ఉద్యమించాలనిపించినా కష్టం మీద మదిలో ధైర్యాన్ని నిలుపుకొని, కోపం చేతనో అన్నట్లు కనుదోయిని మూసి, పడకపై పడుకొని ఒక్క క్షణం ఆగింది. ఆపై కృష్ణుడు నిద్రించాడని భావించి, మెల్లగా కౌగిలించుకొని దొండపండు వంటి పెదవిని ముద్దాడుతూ కృష్ణుని కంట పడింది. అయినా ఆ పారవశ్యంలో ఆమె తనకు అంతకు ముందు కలిగిన కోపాన్ని కూడా మరచి పోయింది.

**వి :** 1. ఈ సన్నివేశాన్ని చదువుతుంటే అమరుకుని శ్లోకం గుర్తుకు వస్తోంది.

**శ్లో॥ శూన్యం వాసగృహం విలోక్య శయనాదుత్థాయ కించిచ్ఛనైః**
**నిద్రావ్యాజముపాగతస్య సుచిరం నిర్వర్ణ్య పత్యుర్ముఖమ్ ।**
**విస్రబ్ధం పరిచుంబ్య జాతపులకామాలోక్య గండస్థలీం**
**లజ్జా నమ్రముఖీ ప్రియేణ హసతా బాలా చిరం చుంబితా ॥ -అమరుశతకమ్ 82**

అమరుకుడు నాయకుని కూడా చుంబనోద్యుక్తుని చేశాడు. కానీ వాదిరాజశ్లోకంలో కృష్ణుడు చుంబనోద్యుక్తుడు కాలేదు. నాయికయే తన కోపాన్ని మరచిపోయింది.

2. ఇటువంటి శ్లోకాలు భావచిత్రాల వంటివి. చలచ్ఛాయాచిత్రాల వంటివి. పాత్రలలోని ప్రతికదలికనూ కాలంతోపాటు కదిలిస్తూ చేస్తున్న వర్ణనలలో అనుభావాలు ఎక్కువగా, స్ఫుటంగా వుంటాయి. అవి కవిభావాన్ని బొమ్మ కట్టిస్తాయి. ఇటువంటి భావచిత్రరచనలో తిక్కనకు పెట్టింది పేరు.

| | | | |
|---|---|---|---|
| 3. **సస్మార :** | **సస్మార** | సస్మరతుః | సస్మరుః |
| | సస్మర్థ | సస్మరథుః | సస్మర |
| | సస్మార/సస్మర | సస్మరివ | సస్మరిమ |

*

**శ్లో॥ గన్తుం కుత్ర సముద్యతోఽసి తరుణి! త్వద్ధామ తత్పద్ధతిః**
**కిం తత్రాస్తి ముకున్ద! మానిని! తవ స్వచ్ఛోర్జితాభీశునా ।**
**క్రాన్తం ద్వారమలక్షయన్ కృశమిదం గాత్రం చ తస్యాన్తరే**
**గన్తాస్మీత్యభిధాయ తన్మృదుకరం గృహ్ణన్ స గృహ్ణాతు మామ్ ॥ 9-53**

**అ :** గోపికా కృష్ణ సంవాదం - శృంగారానికి భక్తిలో అంగభావం.

**అ : గోపి** : ముకుంద! కుత్ర గన్తుం సముద్యతః అసి?

**కృష్ణుడు** : తరుణి! త్వద్-ధామ.

**గోపి** : తత్ పద్ధతిః తత్ర అస్తి కిమ్?

**కృష్ణుడు** : మానిని! తవ స్వచ్ఛ+ఊర్జిత+అభీశునా క్రాంతం ద్వారమ్ అలక్షయన్, కృశమ్ ఇదం గాత్రం చ అలక్షయన్ తస్య అన్తరే గన్తా అస్మి.

**కవి** : ఇతి-అభిధాయ తత్+మృదుకరం గృహ్ణన్ సః మాం గృహ్ణాతు.

**ప్ర :** ముకుంద! = కృష్ణా! (ముకుం దదాతి ఇతి, తస్మాత్ సంబుద్ధిః), కుత్ర = ఎక్కడకు, గన్తుమ్ = వెళ్ళుటకు (గమ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), సముద్యతః+అసి = సిద్ధమయ్యావు?, తరుణి = యువతీ!, త్వద్+ధామ = నీ ఇంటికే, తత్-పద్ధతిః : తత్ = దాని (మా ఇంటి) యొక్క, పద్ధతిః = దారి (పద్ధతీ పంక్తి వర్త్మనీ-నానార్థరత్నమాల-పంక్తి -1522), తత్ర = అటు/అక్కడ, అస్తి కిమ్? = ఉన్నదా? (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.), మానిని! = అభిమానవతీ!, తవ = నీయొక్క, స్వచ్ఛ+ఊర్జిత+అభీశునా : స్వచ్ఛ = నిర్మలమైన, ఊర్జిత = గొప్పదైన, అభీశునా = కాంతితో (రోచిశ్శోచిరభీశుః-హలాయుధ-కోశః-38), క్రాంతమ్ = ఆక్రమింపబడిన, ద్వారమ్ = గుమ్మాన్ని, తస్య = ఆ కిరణ-సముదాయంయొక్క, అంతరే = మధ్యలో, కృశమ్ = చిక్కిపోయిన, ఇదమ్-చ = ఈ నీ, గాత్రమ్ = శరీరాన్నీ, అలక్షయన్ = గుర్తించలేక, గన్తా+అస్మి = వెళ్తున్నాను/లేదా, గన్తాస్మి = వెళ్ళబోతున్నాను. (గమ్ గతౌ పరస్మైపది-లుట్-ఉ.ఏ.), ఇతి = అని, అభిధాయ = చెప్పి (అభి ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తత్-మృదు-కరమ్ : తత్ = ఆమెయొక్క, మృదు = సున్నితమైన, కరమ్ = చేతిని (తస్యాః మృదుశ్చ అసౌ కరః, తమ్), గృహ్ణన్ = పట్టుకొంటూ, సః = ఆ కృష్ణుడు, మామ్ = నన్ను, గృహ్ణాతు = స్వీకరించును-గాక! (గ్రహ ఉపాదానే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** - కృష్ణా! ఎక్కడకు బయలు దేరావు?

- మీ ఇంటికే, తరుణీ!

- మా ఇంటికి అదేనా దారి?

- మానినీ! నిర్మలమయిన నీ శరీరకాంతితో మీ గుమ్మాన్ని, చిక్కిపోయిన నీ శరీరాన్ని గుర్తించలేక అటు వెళ్తున్నాను.

- అని చెప్తూ ఆ గోపిక చేతిని పట్టుకొన్న కృష్ణుడు నన్ను కూడా పరిగ్రహించు గాక!

**వి :** 1. శ్రీవాదిరాజతీర్థరు ఈ శ్లోకంవంటి ఎత్తుగడతో **ఉక్తి ప్రత్యుక్తి స్తోత్రంలో** ఒక శ్లోకాన్ని రచించారు.

**శ్లో॥ కృష్ణ త్వం క్వ గతోఽసి చాఽద్య మృగయాసక్తో వనాంతం గతో**
**గంధోఽసౌ వనపుష్పజః శ్రమజం ధర్మక్షతం కంటకైః ।**
**అస్త్వేవం మృగయా తు కేనచిదహో దష్టోఽధరో దృశ్యతే**
**శంఖాపూరణమత్ర కారణమిదం కుర్యాం ప్రమాణాని తే ॥**

2. శ్లోకంలో వ్యాజోక్త్యలంకార ముంది. '**వ్యాజోక్తిరన్య హేతూక్త్యా యదాకారస్య గోపనమ్**' – (కు.153), వాస్తవానికి భిన్నమైన కారణాన్ని పలుకుతూ అసలు వాస్తవాన్ని కప్పి పుచ్చటం. ఇక్కడ కృష్ణుడు మరోవైపు వెళ్తూ తన చేష్టను కప్పి పుచ్చుకొనేందుకు మరో కారణం చెప్పాడు. అందువల్ల వ్యాజోక్తి. అది కృష్ణపరంగా ఆలోచిస్తే – కవి పరంగా ఆలోచిస్తే కృష్ణుడు ముందుకు వెళ్ళటానికి ఆమె శరీరకాంతితో ఎటువంటి సంబంధమూ లేదు. అయినా సంబంధమున్నట్లు వర్ణించినందువల్ల సంబంధాతిశయోక్త్యలంకారం. 'సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్' – (కు.36)

3. **అస్తి :** 9–36వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **గృహ్ణాతు :** | **గృహ్ణాతు**/గృహ్ణీతాత్ | గృహ్ణీతామ్ | గృహ్ణన్తు |
| | గృహాణ/గృహ్ణీతాత్ | గృహ్ణీతమ్ | గృహ్ణీత |
| | గృహ్ణాని | గృహ్ణావ | గృహ్ణామ |

*

**శ్లో॥ యద్యాయాసి రిరంసయేశ! మహితం మద్ధామ తర్హ్యధ్వని**
**స్నిగ్ధాం మామవలోక్య భీతపదవీం సద్యోఽలభిష్టాః కుతః ।**
**ఉద్వీక్ష్య స్తనజృమ్భికుమ్భయుగలం కుమ్భీశ్వరాశఙ్కయా**
**పద్మాక్షీతి నిగద్య సుస్మితముఖీం చుమ్బన్ స తాం జృమ్భతే ॥ 9–54**

**అ :** గతశ్లోకంలోని సంవాదానికే కొనసాగింపు– జిజ్ఞాసతో గోపి తిరిగి అడిగిన దానికి కృష్ణుని సమాధానం.

**అ : గోపి** : ఈశ! యది రిరంసయా మహితం మద్–ధామ ఆయాసి తర్హి అధ్వని స్నిగ్ధాం మామ్ అవలోక్య సద్యః భీత–పదవీం కుతః అలభిష్టాః.

**కృష్ణుడు** : పద్మాక్షి! స్తన–జృంభి–కుంభ–యుగలమ్ ఉద్వీక్ష్య కుంభీశ్వర+ఆశంకయా.

**కవి** : ఇతి నిగద్య సుస్మితముఖీం తాం చుంబన్ సః జృంభతే.

**ప్ర :** ఈశ! = స్వామీ! (కృష్ణా!), యది = ఒకచో, రిరంసయా = రతికాంక్షతో (రంతుమ్ ఇచ్ఛా, తయా), మహితమ్=పూజింపబడిన/ కాంతిమంతమైన, మద్–ధామ = నా ఇంటికి, ఆయాసి = వస్తుంటే (ఆ యా ప్రాపణే పరస్మైపది–లట్–మ.ఏ.), తర్హి = అలాంటప్పుడు, అధ్వని = దారిలో, స్నిగ్ధామ్ = స్నేహంతో కూడిన, మామ్ = నన్ను, అవలోక్య = చూసి (అవ+లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సద్యః = వెంటనే, భీత–పదవీమ్ = పిరికివాని బాటను, కుతః = ఎందుకు, అలభిష్టాః = పట్టావు? (లభ్–ప్రాప్తౌ–ఆత్మనేపది–లుఙ్–మ.ఏ.), పద్మ+అక్షి = తామరకనుల దానా! (పద్మే ఇవ అక్షిణీ యస్యాః సాః, తస్మాత్ సంబుద్ధిః), స్తన... యుగలమ్:స్తన = రొమ్ము లనే, జృంభి = పైకుబికిన, కుంభ = మూపుల యొక్క, యుగలమ్ = జంటను, ఉద్వీక్ష్య = చూసి (ఉద్+వి+ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కుంభి+ఈశ్వర+ఆశంకయా = గజరాజనే శంకతో, ఇతి = అని, నిగద్య = చెప్పి (ని+గద ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుస్మిత–ముఖీమ్ = దరహాసంతో కూడిన ముఖం గల (సుస్మితం ముఖే యస్యాః, తామ్), తామ్ = ఆ గోపికను, చుంబన్ = ముద్దాడుతూ, సః = ఆ కృష్ణుడు, జృంభతే = పొంగిపోతున్నాడు. (జృభి గాత్రవినామే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! రత్యాసక్తితో నీవు గొప్పదైన నా భవనానికే వస్తున్నట్లయితే దారిలో నన్ను చూసిన వెంటనే ఎందుకు భయపడ్డావు?

– కమలనయనా! ఏనుగు కుంభస్థలాలవలె విజృంభించియున్న నీ స్తనాలను చూసి గజరాజేమో అన్న సంశయంతో భయపడ్డాను.

– అని చెప్పి దరహాసవదన అయిన ఆ గోపికను ముద్దాడుతూ కృష్ణుడు పొంగి పోతున్నాడు.

**వి :** 1. స్తనాలను కుంభస్థలాలుగా భావించి గజరాజు అని సంశయించటం సందేహా-లంకారం. కృష్ణుడు సంశయించాడో సంశయించినట్లు నటించాడో అనే సంశయానికి అవకాశమేర్పడింది. ఆడ ఏనుగేమో అనకుండా గజరాజు అనటంలో కూడా కొంత చాతుర్యం కనిపిస్తుంది. అందుకే ఆ గోపిక చిఱునవ్వు చిందించింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అలభిష్టాః :** | అలభిష్ట | అలభిషాతామ్ | అలభిషత |
| | **అలభిష్టాః** | అలభిషాథామ్ | అలభిఢ్వమ్ |
| | అలభిషి | అలభిష్వహి | అలభిష్మహి |
| **జృంభతే :** | **జృంభతే** | జృంభేతే | జృంభన్తే |
| | జృంభసే | జృంభేథే | జృంభధ్వే |
| | జృంభే | జృంభావహే | జృంభామహే |

*

**శ్లో॥ అన్యాచుమ్బనజాతచిహ్నమధునా బిమ్బాధరే దృశ్యతే**
**తన్మాం రఞ్జయసీశ! కిం ప్రియగిరా ధన్యాఽబలా సైవ హి ।**
**మన్యూద్రిక్తహృదా ముహుః సఖి! భవచ్ఛూన్యాం సభాం పశ్యత-**
**స్తన్మేఽభూద్వరవర్ణినీతి శమయన్ మన్మానసే స్యాదసౌ ॥ 9-55**

**అ :** మరొక గోపిక ఖండితయై కృష్ణుని నిందించుట – కృష్ణ సమాధానం.

**అ : గోపి** – ఈశ! అన్యా-చుంబన-జాత-చిహ్నమ్ అధునా బింబ+అధరే దృశ్యతే తత్ ప్రియ-గిరా మాం రంజయసి కిమ్. సా ఏవ అబలా ధన్యా హి.

**కృష్ణుడు** – సఖి! వరవర్ణిని! మన్యు+ఉద్రిక్త-హృదా ముహుః భవత్+శూన్యాం సభాం పశ్యతః మే తద్ అభూత్ ఇతి శమయన్ అసౌ మత్+మానసే స్యాత్

**ప్ర :** ఈశ! = ప్రభూ!, అన్యా... చిహ్నమ్ : అన్యా = మరొక స్త్రీయొక్క, చుంబన = ముద్దు చేత, జాత=ఏర్పడిన, చిహ్నమ్=గుర్తు (అన్యాయాః చుంబనం, తేన జాతం చ తత్ చిహ్నమ్) అధునా = ఇప్పుడు, బింబ+అధరే = దొండపండువంటి పెదవిపై, దృశ్యతే = కనిపిస్తోంది. (దృశ్ ప్రేక్షణే కర్మణి-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), తత్ = అందువలననే, ప్రియ-గిరా = ఇష్టమైన పలుకుతో (ప్రియా చ సా గీః, తయా), మామ్ = నన్ను, రంజయసి కిమ్? = ఆనందింపజేస్తున్నావా? (రంజ్ రాగే ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సా = ఆ, అబలా ఏవ = పడతియే, ధన్యా హి = కృతార్థురాలు గదా!, సఖి = చెలి!, వరవర్ణిని! = వరవర్ణినీ! (ఉష్ణకాలమున సుఖ శీతలమును శీతాకాలమున సుఖోష్ణమునైన యంగములు గలిగి భర్తయందనురాగము గల ఉత్తమస్త్రీ – శబ్దరత్నాకరము – పుట 694), మన్యు+ఉద్రిక్త-హృదా : మన్యు = కోపంచే, ఉద్రిక్త = ఉద్రిక్తమైన, హృదా = మనస్సుతో (మన్యునా ఉద్రిక్తం చ తత్ హృద్, తేన), ముహుః = మాటిమాటికి, భవత్+శూన్యామ్ = నీవు లేని (భవత్యా శూన్యా, తామ్), సభామ్ = సభను, పశ్యతః = చూస్తున్న, మే = నాకు, తత్ = అది (ఆ అధరవ్రణం), అభూత్ = అయింది, ఇతి = అని, శమయన్ = ఉపశమింపజేస్తూ, అసౌ = ఆ కృష్ణుడు, మత్+మానసే = నా మనస్సులో, స్యాత్ = ఉండును గాత! (అస భువి-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥ గోపిక** – నీ పెదవిపై మరెవరినో ముద్దుపెట్టుకొన్న గుర్తు కనిపిస్తోంది. అందుకే ప్రియవచనాలతో నన్ను రంజింపజేస్తున్నావు. ఏమైనా ఆ స్త్రీయే ధన్యురాలు గదా!

**కృష్ణుడు** – సఖి! వరవర్ణిని ! నువ్వు కనిపించలేదన్న కోపంతో ఉద్రిక్తమైన మనస్సుతో నీవులేని సభను మాటిమాటికీ చూస్తున్నందువలన (పెదవి కొరకటంవలన) ఆ గాయమైంది.

కవి : అని ఆమెను ఉపశమింపజేస్తున్న కృష్ణుడు నా మనస్సులో నిలుచు గాక.

**వి :** 1. 'వరవర్ణిని' అని సంబోధించటం సాభిప్రాయమైన పదం. అది గోపికకు విశేషణం. సాభిప్రాయవిశేషణాన్ని ప్రయోగిస్తే అది పరికరాలంకారం. '**అలంకారః పరికరః సాభిప్రాయ విశేషణే**'-(కు. 62). ఆ విశేషణంతో సంబోధించటంతో ఆమె కోపం త్వరగా తగ్గిపోయే అవకాశముంటుంది.

2. ఉక్తి ప్రత్యుక్తి శ్లోకాలు సంస్కృతభాషలో అనంతం. ఒక ప్రశ్న, ఒక సమాధానంతో పాటు ఆరుప్రశ్నలూ, ఆరు సమాధానాలు ఒకే శ్లోకంలో ఇమిడ్చినవి కూడా ఉన్నాయి.

శ్లో॥ బాలే![1] నాథ![2] విముంచ మానిని![3] రుషం రోషాన్మయా[4] కిం కృతమ్
క్రోధో౽స్మాసు[5] న మే౽పరాధ్యతి[6] భవాన్ సర్వే౽పరాధా మయి ।
తత్కిం రోదిషి గద్గదేన-వచసా[7] కాస్యాగ్రతో రుద్యతే[8]
నన్వేతన్మమ[9] కా తవాస్మి[10] దయితా[11] నాస్మీత్యతో రుద్యతే[12] ॥ -అమరుశతకమ్-57

3. ఈ శ్లోకంలో వర్ణింపబడిన శృంగారనాయిక **ఖండిత**. '**జ్ఞాతే౽న్యాసంగవికృతే ఖండితేర్ష్యాకషాయితా**' అని ఖండితా లక్షణం. అన్యకాంతాసమాగమ సంకేతాలు కనిపించి నపుడు ఈర్ష్యా కషాయిత అయిన కాంత ఖండిత.

4. **అన్యాచుంబనజాతచిహ్నం** - ఇక్కడ అన్యా అంటే సాధారణంగా 'ఇతర' అని అర్థం. ఆలంకారికంగా అయితే 'అన్యా' అన్నది నాయికా భేదాలలో ఒకటి. అన్య కూడా కన్య - అన్యోఢ అని రెండు విధాలు. ఇక్కడ చుంబనమాత్రపరామర్శవలన ఆ నాయిక ఈ ఇద్దరిలో ఎవరయినా కావచ్చు. అన్యోఢా చుంబనమయితే అది ధర్మబద్ధమా? కాదా? అనే సంశయానికి తరువాత శ్లోకాల దగ్గర సమాధాన ముంటుంది. ఆ అనుమానం మనదే కాదు పరీక్షిన్మహారాజుది కూడా.

| | | | |
|---|---|---|---|
| 5. **దృశ్యతే :** | **దృశ్యతే** | దృశ్యేతే | దృశ్యన్తే |
| | దృశ్యసే | దృశ్యేథే | దృశ్యధ్వే |
| | దృశ్యే | దృశ్యావహే | దృశ్యామహే |
| **రంజయసి :** | రంజయతి | రంజయతః | రంజయన్తి |
| | **రంజయసి** | రంజయథః | రంజయథ |
| | రంజయామి | రంజయావః | రంజయామః |
| **స్యాత్ :** | 9-46వ శ్లోకవ్యాఖ్య చూడుడు. | | |

*

**శ్లో॥ వృన్దారణ్యనికుఞ్జమన్దిరగతం మన్దానిలైర్వీజితం**
**చన్ద్రామన్దకరేణ సేవితపదం కన్దర్పతాతం నిశి ।**
**మన్దారాదిలసత్ప్రసూననిచయైర్వృన్దారకప్రేషితైః**
**సన్దృశ్య ప్రియవర్త్మ గోపలలనావృందం శనైః పద్యతే ॥ 9-56**

**అ :** శారదరాత్రి గోపికలు కృష్ణుని సన్నిధిని చేరుట.

**అ :** గోప-లలనా-వృందం బృందారక-ప్రేషితైః మందార+ఆది-లసత్-ప్రసూననిచయైః ప్రియవర్త్మ సంధృశ్య వృంద+అరణ్య-నికుంజ-మందిర-గతం మంద+అనిలైః వీజితం చంద్ర+అమంద-కరేణ సేవితపదం కందర్ప-తాతం నిశి శనైః పద్యతే.

**ప్ర :** గోప-లలనా-వృందమ్ = గోపకాంతల సమూహం (గోపాశ్చ తాః లలనాః, తాసాం వృందమ్), వృందారక-ప్రేషితైః:వృందారక = దేవతలచే (బృందారకా దైవతాని-అమరకోశః -స్వర్గ-9), ప్రేషితైః = పంపబడిన (బృందారకైః ప్రేషితాని, తైః), మందార+ఆది-లసత్-ప్రసూన-నిచయైః : మందార+ఆది = మందారం మొదలుగా గల, లసత్ = ప్రకాశిస్తున్న, ప్రసూన = పూలయొక్క, నిచయైః = సమూహాలతో (మందారః ఆదౌ యేషాం తాని మందారాదీని తాని చ లసన్తి చ తాని ప్రసూనాని, తేషాం నిచయాః, తైః) నిండిన, ప్రియ-వర్త్మ = ప్రియుని (కృష్ణుని) బాటను (ప్రియస్య వర్త్మ తత్), సందృశ్య = చూసి (సమ్-దృశ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వృంద... గతమ్ : వృంద+అరణ్య = బృందావనంలోని, నికుంజ = పొదరిళ్ళు అనే, మందిర = భవనాన్ని, గతమ్ = పొందినట్టి వాడును (వృందా-ఇతి అరణ్యం, తస్మిన్ నికుంజమ్ ఏవ మందిరం, తస్మిన్ గతః తమ్), మంద+అనిలైః = మెల్లగాలులచే (మందాశ్చ తే అనిలాః, తైః), వీజితమ్ = వీయcబడిన వాడును, చంద్ర... కరేణ : చంద్ర = చంద్రునియొక్క , అమంద = దట్టమైన, కరేణ = కిరణంతో (చంద్రస్య అమందశ్చ అసౌ కరః, తేన), సేవిత-పదమ్ : సేవిత = సేవింపబడిన, పదమ్ = పాదం గలవాడును అయిన, (సేవితం పదం యస్య సః, తమ్), కందర్ప-తాతమ్ = మదన జనకుని (కందర్పస్య తాతః, తమ్), శనైః = మెల్లగా, నిశి = రేయి, పద్యతే = చేరుతోంది. (పద్ గతౌ-దివాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోపికాగణాన్ని ఆదరిస్తున్న కృష్ణునిబాటపై దేవతాబృందం మందారాది కుసుమాలను చల్లి స్వాగతం పలికింది. గోపకాంతలు ఆ కృష్ణుని మార్గాన్ని గమనించి తానున్న నికుంజమందిరం దగ్గరకు చేరుతున్నారు. అక్కడ కృష్ణుడు మెల్లని గాలులచే వీయబడుతూ చంద్రకిరణాలతో సేవింపబడుతున్నాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. పద్యతే :** | **పద్యతే** | పద్యేతే | పద్యన్తే |
| | పద్యసే | పద్యేథే | పద్యధ్వే |
| | పద్యే | పద్యావహే | పద్యామహే * |

**శ్లో॥ నృత్యత్కేకిని చిత్రపుష్పతిలకారత్నస్ఫురత్తోరణైః**
**విష్వక్శోభిని పల్లవాఖ్యవిలసత్తల్పే ప్రదీపత్విషి ।**
**విస్తీర్ణౌషధిభిః ప్రసూనవిలసత్పత్రైర్వితానప్రభే**
**మత్తాలివ్రజగాయకే హరిరభాత్ కుఞ్జే నిజాం రఞ్జయన్ ॥ 9-57**

**అ :** పొదరింట నున్న కృష్ణుని రాజవైభవాన్ని వర్ణించటం. యోగేశ్వరుడు ఎక్కడైనా యోగేశ్వరుడే.

**అ :** నృత్యత్-కేకిని చిత్ర-పుష్ప-తిలకా-రత్న-స్ఫురత్-తోరణైః విష్వక్-శోభిని పల్లవ+ఆఖ్య-విలసత్-తల్పే ప్రదీప-త్విషి విస్తీర్ణ+ఓషధిభిః ప్రసూన-విలసత్-పత్రైః వితాన-ప్రభే మత్త+అలి-వ్రజ-గాయకే కుంజే నిజాం రంజయన్ హరిః అభాత్.

**ప్ర :** నృత్యత్-కేకిని : నృత్యత్ = నాట్యమాడుతున్న, కేకిని = నెమళ్ళు గలదియు (నృత్యన్తః మయూరాః యస్మిన్ తస్మిన్), చిత్ర... తోరణైః : చిత్ర = వివిధ వర్ణాలు గల (తచ్చ శుక్ల, నీల, పీత, రక్త, హరిత, కపిశ, చిత్ర భేదాత్ సప్తవిధమ్ - తర్కసంగ్రహః), పుష్ప = పూలు గల, తిలకా = తిలకపుచెట్టుయొక్క (తిలాభాని పుష్పాణి యస్య సః తిలకః-నువ్వుపువ్వుల వంటి పూలు గలది - అమరకోశః - వనౌషధి - 40), రత్న = రత్నాలతో, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, తోరణైః = తోరణాలతో (చిత్రాణి పుష్పాణి యాసాం తాః తిలకాః ఏవ రత్నాని, తైః స్ఫురన్తః చ తే తోరణాః, తైః), విష్వక్ = అంతటా, ప్రకాశిస్తున్నదియు, పల్ల... తల్పే : పల్లవ+ఆఖ్య = చివురు లనే పేరుగల, విలసత్ = ప్రకాశిస్తున్న, తల్పే = పడక గలదియు (పల్లవాని ఇతి ఆఖ్యా, తయా విలసత్ చ తత్ తల్పం, తస్మిన్),

విస్తీర్ణ+ఓషధిభిః : విస్తీర్ణ = వ్యాపించిన, ఓషధిభిః = వెలిగే తీగలతో (విస్తీర్ణాః చ తాః ఓషధయః, తాభిః), ప్రదీప-త్విషి = దీపకాంతులు గలదియు (ప్రదీపానాం త్విట్ - యస్మిన్ తస్మిన్), ప్రసూన-విలసత్-పత్రైః:ప్రసూన = పూలచేతనూ, విలసత్ = ప్రకాశిస్తున్న, పత్రైః = ఆకుల తోడనూ (ప్రసూనాని చ తాని విలసన్తి చ పత్రాణి, తైః), వితాన-ప్రభే = మేలికట్టుల శోభ గలదియు (వితానానాం ప్రభా యస్మిన్ తస్మిన్), మత్త-అలి-వ్రజ-గాయకే : మత్త = మదించిన, అలి = తుమ్మెదలయొక్క, వ్రజ = సమూహ మనే, గాయకే = పాటగాళ్ళు గలదియు (మత్తాః చ తే అలయః, తేషాం వ్రజః ఏవః గాయకాః యస్మిన్ తస్మిన్) అయిన, కుంజే = పొదరింట, నిజామ్ = తనదైన గోపిని, రంజయన్ = ఆనందింపజేస్తూ, హరిః = కృష్ణుడు, అభాత్ = ప్రకాశించాడు. (భా దీప్తౌ పరస్మైపది - లజ్ - ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు పొదరింటిలో తన గోపికతో కలిసి వెలుగొందుతున్నాడు మహారాజులా. ఆ రాజవైభవమంతా అక్కడ కుదిరింది. నెమళ్ళు నర్తకులవలె నాట్యమాడుతున్నాయి. రకరకాల రంగులతో కూడిన తిలకవృక్షాలే రత్నతోరణాలుగా అంతగా శోభిస్తున్నాయి. చివురుటాకులే అక్కడ పడక. బాగా వ్యాప్తి చెందిన జ్యోతిర్లతల కాంతులే అక్కడ దీపశోభ. పూలు, ఆకులు మేలికట్ల వైభవాన్ని అందిస్తున్నాయి. మదించిన తుమ్మెదల సమూహమే గాయకబృందం లాగా అనిపిస్తోంది.

**వి :** 1. ఈ శ్లోకంలో తిలకాలలో రత్నత్వాన్నీ; పల్లవాలపై తల్పత్వాన్నీ, ఓషధులలో ప్రదీపత్వాన్నీ, పూలూ-ఆకులలో వితానత్వాన్నీ, మదించిన తుమ్మెదలలో గాయకత్వాన్నీ, ఆరోపించినందువలన ఇది రూపకాలంకారం.

2. ఈ విశేషాన్నే పోతన వర్ణించిన తీరు-

మ. సతులుం దానును నీటిలో వెడలి భూషాగంధచేలాద్యలం
కృతుఁడై కుంభి కరేణుయూథములతోఁ గ్రీడించుచందంబునన్
లతలందుం దరులందుఁ బుష్పమయ లీలాశయ్యలందున్ సుఖో
న్నతుఁడై కృష్ణుఁడు క్రీడలం దనిపె నా నారీలలామంబులన్. - పోతనభాగవతం 10/1099

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అభాత్ :** | **అభాత్** | అభాతామ్ | అభుః | |
| | అభాః | అభాతమ్ | అభాత | |
| | అభామ్ | అభావ | అభామ | * |

**శ్లో॥ స్నాతస్సౌన్దర్యనద్యాం పరిహృతవసనో గోపికాలేపనశ్రీ-**
**ర్వక్షోజాబ్జాసనస్థః కృతవనవసతిర్హారమాలాకరాగ్రః ।**
**బిభ్రత్ కేశౌఘకాశానధరజనిపయోమాత్రవృత్తిర్వినిద్రః**
**ప్రేష్ఠః శ్రీవిట్ఠలోఽసౌ జయతి మునిగణం జారవార్తా కుతోఽస్య ॥ 9-58**

**అ :** కృష్ణునిలో మునిత్వాన్ని ప్రదర్శించి జారప్రసక్తిని నిరాకరించటం.

**అ :** సౌందర్య-నద్యాం స్నాతః పరిహృత-వసనః గోపికా-ఆలేపన-శ్రీః వక్షోజ-అబ్జ+ఆసన-స్థః కృత-వన-వసతిః హార-మాలా-కర+అగ్రః కేశ+ఓఘ-కాశాన్ బిభ్రత్ అధర-జని-పయః-మాత్ర-వృత్తిః వినిద్రః ప్రేష్ఠః అసౌ శ్రీ విట్ఠలః ముని-గణం జయతి. అస్య జార-వార్తా కుతః?

**ప్ర :** సౌందర్య-నద్యామ్ : సౌందర్య = అందమనే, నద్యామ్ = నదిలో (సౌందర్యమ్ ఏవ నదీ తస్యామ్), స్నాతః = స్నానం చేసిన వాడును (స్నా ధాతువుపై క్త ప్రత్యయం), పరిహృత-వసనః : పరిహృత = విడువబడిన, వసనః = బట్టలు గలవాడును (పరిహృతాని వస్త్రాణి యేన సః), గోపికా-ఆలేపన-శ్రీః : గోపికా = గోపికలయొక్క, ఆలేపన = అంగరాగాదుల యొక్క, శ్రీః = (కౌగిలించుటతో అంటిన) శోభ గలవాడును (గోపికానామ్ ఆలేపనస్య

శ్రీః యస్య సః), వక్షోజ+అబ్జ+ఆసన–స్థః : వక్షోజ = (గోపికలయొక్క) రొమ్ము అనే, అబ్జ+ఆసన–స్థః : పద్మాసనంలో నున్న వాడును (వక్షోజ ఏవ అబ్జాసనం, తస్మిన్ తిష్ఠతి ఇతి), కృత–వన–వసతిః : కృత = కల్పించుకొనబడిన, వన = బృందావనంలో, వసతిః = నివాసం గలవాడును (కృతా వనే వసతిః యేన సః), హార... అగ్రః : హార–మాలా = ముత్యాల హారమనే అక్షమాలతో కూడిన, కర+అగ్రః = చేతి చివరలు గలవాడును (హార ఏవ మాలా కరస్య అగ్రే యస్య సః), కేశ+ఓఘ–కాశాన్ : కేశ+ఓఘ = వెంట్రుకల సమూహ మనే, కాశాన్ = దర్భలను (కేశానామ్ ఓఘ ఏవ కాశాః, తాన్), బిభ్రత్ = ధరించిన వాడును, అధర... వృత్తిః : అధర–జని = పెదవులపై పుట్టిన, పయో మాత్ర = అమృతమాత్రమే, వృత్తిః = జీవనంగా గలవాడును (అధరే జనిః చ తత్ పయః, తన్మాత్రేణైవ వృత్తిః యస్య సః), వినిద్రః = నిద్ర లేనివాడును (విగతా నిద్రా యస్మాత్ సః), ప్రేష్ఠః = ఇష్టమైన వాడును అయిన, అసౌ = ఆ, శ్రీ విట్ఠలః = పాండురంగవిఠలుడు, ముని–గణమ్ = మునుల సమూహాన్ని (మునీనాం గణః, తమ్), జయతి = జయిస్తున్నాడు. (జి జయే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు (తాను మునివృత్తిని పాటిస్తూ) మునిగణాన్ని జయిస్తున్నాడు. సౌందర్య నదిలో స్నానం చేశాడు కృష్ణుడు. (నదీస్నానం). బట్ట విడిచాడు (దిగంబరత్వం). గోపికల మేనిమీదనున్న చందనాదులను అంటించుకొన్నాడు. (చందనధారిత్వం). గోపీ వక్షోజమనే పద్మాసనంపై నున్నాడు (పద్మాసనస్థితి). బృందావనంలో నివసిస్తున్నాడు. (వనవాసం). చేత ముత్యాలహారాన్ని పట్టాడు. (అక్షమాలా ధారణం). కేశ సమూహమనే దర్భలు ధరించాడు (వైదిక క్రియాకలాపానికై దర్భలను వినియోగించటం). అధరామృతాన్ని మాత్రమే త్రాగుతున్నాడు. (పాలు మాత్రమే త్రాగటం). నిద్రను విడిచాడు (పర్వదినాలలో జాగరణ).

ఈ రీతిగా కృష్ణుడు మహర్షి గణాలను జయిస్తుంటే ఇక ఆయన జారుడన్న ప్రసక్తికి అవకాశమేముంది?

**వి :** 1. జారుడన్న సంశయం పరీక్షిత్తుకు కూడా కలిగింది. శుకుని అడిగాడు కూడా. ఆ పరీక్షిత్ – శుకుల ప్రశ్నోత్తరాలను గమనించండి–

మ. ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁ డధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁ బుట్టి పరాంగనాజనసంగ మే
ధర్మ మంచుఁ దలంచి చేసె? నుదాత్తమానస! చెప్పుమా!

అనిన శుకుండిట్లనియె.

ఆ. సర్వభక్షుఁ డగ్ని సర్వంబు భక్షించి–దోషిగాని పగిది దోష మైనఁ
జేసి దోషపదముఁ జెందరు తేజస్వు–లగుటఁ జంద్రవాసవాదు లధిప !

క. ఈశ్వరుఁడు కానివాఁడు న, రేశ్వర! పరకాంతఁ దలచి యెట్లు బ్రతుకు గౌ
రీశ్వరుఁడు దక్క నన్యుఁడు, విశ్వభయదవిషము మ్రింగి వెలయం గలడే!

క. సత్యము ప్రభువుల వచనము
నిత్యముఁ **దద్వచనవీథి నిలుతురు పెద్దల్**
**సత్యాసత్యము గావున**
**సత్య మనుచుఁ జనరు వారి చరితమున నృపా!**

మ. ఘనులై యెవ్వని పాదపంకజపరాగధ్యానసంప్రాప్త యో
గ నిరూఢత్వముచే మునీంద్రులు మహాకర్మంబులన్ బాసి బం

ధ నిరోధంబులు లేక విచ్చలవిడిం దర్పింతు, రా నిత్య శో
భనుఁ డెట్లుండిన నుండెఁ గాక కలవే బంధంబు లుర్వీశ్వరా!

ఆ. గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకుఁ బరాంగన లెవ్వరు?
సర్వమయుఁడు లీల సలిపెఁ గాక. – పోతనభాగవతము 10/1101-1107

2. పెద్దల మాటలను పాటించటం వారి నడవడిన అనుసరించటం కన్న సముచిత తరమని ధర్మసూత్ర గ్రంథాలు కూడా నిర్దేశిస్తాయి. **గౌతమధర్మసూత్రగ్రంథ** ప్రారంభంలోనే గమనించండి–

– వేదోఽఖిలో ధర్మమూలమ్

– తద్విదాం చ స్మృతిశీలే

– దృష్టో ధర్మవ్యతికరో సాహసం చ మహతామ్

– అవరదౌర్బల్యాత్. – గౌతమధర్మసూత్రాలు 1-4

మహాత్ములు అనగా పర్యవసానాలను భరించగలవారు, ధర్మం తప్పారు గదా అని మనం ఆ ప్రయత్నం చేయగూడదు. ఎందుకంటే పర్యవసానాలు వారు భరింపగలరు. అది మనవల్ల కాదు. 'దారుకావని స్త్రీలఁ దగిలెఁ గాని యదేమొ నీవలె ముక్కంటి నేరఁడయ్యె' – అని ఉలూచి అర్జునుని ఎత్తిపొడిచింది కానీ–

క. మ్రింగెడు వాడు విభుండని
మ్రింగెడిదియు గరళమనియు మిగుల నెఱిఁగియున్
మ్రింగుమనె సర్వమంగళ
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో.

ఆ పార్వతిలాగా అవసరమయితే అర్జునుని ముందు కురికించ గలదా!

3. **జయతి :** 9-11వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ చుమ్బన్త్యః సరసాధరం పులకితైరఙ్గైర్గలద్భూషణై-**
**స్తం గాఢం పరిరభ్య సుస్మితముఖం సౌన్దర్యసిన్ధుం ముదా ।**
**తుఙ్గాత్మీయమనోరమస్తనతటే సన్దర్శితాఙ్కం నఖై-**
**ర్వృన్దారణ్యమదో ననన్దురబలా మన్దానిలైర్మఞ్జులమ్ ॥ 9-59**

**అ :** గోపికలు కృష్ణుని సన్నిధిలో ఆనందించుట.

**అ :** సౌందర్య-సింధుం సుస్మిత-ముఖం తుంగ+ఆత్మీయ+మనో-రమ-స్తన-తటే నఖైః సందర్శితాంకం తం పులకితైః గళద్-భూషణైః అంగైః ముదా గాఢం పరిరభ్య సరస+అధరం చుంబన్త్యః అబలాః మంద+అనిలైః మంజులమ్ అదః బృన్దారణ్యం (విలోక్య) ననన్దుః

**ప్ర :** సౌందర్య-సింధుమ్ = సౌందర్యసాగరుడును (సౌందర్యస్య సింధుః, తమ్), సుస్మిత-ముఖమ్=నగుమోము గలవాడును (సుస్మితేన సహితం ముఖం యస్య, తమ్), తుంగ+ ఆత్మీయ-మనోరమ-స్తన-తటే:తుంగ=ఎత్తైన, ఆత్మీయ=తమయొక్క, మనోరమ=అందమైన, స్తన-తటే = రొమ్ముల పై భాగాన, (తుంగౌ ఆత్మీయౌ మనోరమౌ చ స్తనౌ, తయోః తటే), నఖైః = గోళ్ళతో, సందర్శిత+అంకమ్ = ప్రకటించిన గుర్తులు గలవాడును అయిన, తమ్

= ఆ కృష్ణుని, పులకితైః=పులకించినవీ, గళద్-భూషణైః = గళత్ = జారుతున్న, భూషణైః = నగలు గలవీ అయిన (గళన్తి భూషణాని యేషాం తైః), అంగైః = శరీరావయవాలతో, ముదా = ఆనందంతో, గాఢమ్ = గట్టిగా, పరిరభ్య = కౌగిలించుకొని (పరి-రభ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సరస+అధరమ్ = సరసమైన పెదవిని (సరసః చ అసౌ అధరః, తమ్), చుంబన్త్యః = ముద్దిడుతున్న వారై, అబలాః = (గోప) స్త్రీలు, మంద+అనిలైః = పిల్లగాలులతో, మంజులమ్ = అందమైన, అదః = ప్రసిద్ధమైన ఆ, వృందా+అరణ్యమ్ = బృందావనాన్ని (చూచి), ననన్దుః = ఆనందించారు. (నంద్ సమృద్ధౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సొగసుకాడు, నగుమోమువాడు, తమ అందమైన రొమ్ములపై గోటిగుర్తులు పెట్టినవాడు కృష్ణుడు. వాటికి పులకించి, పెట్టుకొన్న నగలు కూడా జారిపోతుండగా, గోపవనితలు కృష్ణుని గట్టిగా కౌగిలించుకొని, పెదవిని ముద్దాడుతూ పిల్లగాలులతో సొబగులీనుతున్న ఆ బృందావనాన్ని చూసి మురిసిపోయారు.

**వి :** 1. ఇష్టమైన పనులలో పురోభాగిత-ముందు చొరవ చూపటం-దోషమూ కాదు, నేరమూ కాదు. అందువలననే ఒక వైపు ఇష్టమూ, మరో వైపు స్తనస్పర్శ కారణంగా ఏర్పడిన పారవశ్యమూ కలిసి వారిని చొరవ చూపేందుకు ముందుకు త్రోశాయి. తత్ఫలితమే వారే కృష్ణుని ముద్దాడటం. 'స్త్రీ సిగ్గుపడాలి గదా' అని ప్రశ్నించవచ్చు. కానీ చేమకూర వేంకటకవి ఏమన్నాడు 'ఆ సిగ్గుకు సిగ్గులేదటులు చేసిన పిమ్మట నుండవచ్చునే' అని గదా! (విజయవిలాసం) కాబట్టి దేశకాలాదులను బట్టి చొరవగా ప్రవర్తించటం సొగసైన పనియే.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ననన్దుః :** | ననన్ద | ననన్దతుః | **ననన్దుః** | |
| | ననన్దిథ | ననన్దథుః | ననన్ద | |
| | ననన్ద | ననన్దివ | ననన్దిమ | * |

**శ్లో॥ కాన్తాకదమ్బకుచకుఞ్జరకుమ్భసంగి-**
**సన్తాపహారినఖమణ్డలమణ్డితోఽలమ్ ।**
**గణ్డానుషక్తవిలసన్ముఖచన్ద్రచుమ్బీ**
**కుఞ్జేషు సఞ్చరతి కృష్ణవిచిత్రసింహః ॥ 9-60**

**అ :** కృష్ణునిలో సింహత్వాన్ని ఆరోపించి సింహప్రవృత్తిని కృష్ణునిలో ప్రదర్శించటం. -వసంతతిలక.

**అ :** కాంతా-కదంబ-కుచ-కుంజర-కుంభ-సంగి-సంతాప-హారి-నఖ-మండల-మండితః గండ+అనుషక్త-విలసత్-ముఖ-చంద్ర-చుంబీ కృష్ణ-విచిత్ర-సింహః అలం కుంజేషు సంచరతి.

**ప్ర :** కాంతా... మండితః:కాంతా=(గోప) వనితలయొక్క, కదంబ = సమూహం యొక్క, కుచ = రొమ్ములనెడి, కుంజర-కుంభ = ఏనుగు కుంభస్థలాలతో, సంగి = కూడి, సంతాప-హారి = తాపాన్నిపోగొట్టే, నఖ=గోళ్ళయొక్క, మండల=మండలంచే, మండితః = అలంకరింప బడినదీ, గండ... చుంబీ : గండ = చెక్కిలికి, అనుషక్త = చేరువ అయిన, విలసత్ = ప్రకాశిస్తున్న, ముఖ-చంద్ర = (గోపిక యొక్క) ముఖ మనే చంద్రుని, చుంబీ = ముద్దిడుతున్నదీ అయిన, కృష్ణ-విచిత్ర-సింహః = కృష్ణుడనే వింత సింగం (కృష్ణ ఇతి విచిత్రశ్చ అసౌ సింహః), అలమ్ = తగినట్లుగా, కుంజేషు = పొదలలో, సంచరతి = తిరుగాడుతోంది. (సమ్-చర గతిభక్షణయోః పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణు డనే వింత సింగం పొదరిండ్లలో సంచరిస్తోంది. అది తన గండస్థలానికి / చెక్కిలికి ఆనిన ముఖచంద్రుని ముద్దాడుతోంది. కాంతా సమూహాల స్తనా లనే ఏనుగు కుంభస్థలాలకు తగిన సంతాపాన్ని అపహరించే నఖమండలాలతో అలంకరింపబడింది.

**వి :** 1. శ్లోకంలో కృష్ణునిలో సింహత్వం ఆరోపింపబడింది. ఆ విచిత్రసింహం ముఖచంద్రుని ముద్దాడుతోంది. సింహం చంద్రుని ముద్దాడటమా? ఎలా? పోనీ ముఖచంద్రుని ముద్దా డటమా? అదీ కుదరదు. చుంబన కర్మ సర్వప్రాణులకూ ఒక సహజచర్య అయినా మానవ-జాతిలో నున్నట్టిది విస్పష్టంగా జంతు జాతిలో కనిపించదు. కాబట్టి సింహమన్న ఉపమానం ఉపమేయంగా కృష్ణరూపంగా పరిణమించి చుంబనరూపక్రియతో అన్వయిస్తుంది. ఉపమానం ఉపమేయంగా పరిణమించింది కాబట్టి ఇది పరిణామాలంకారం. '**పరిణామః క్రియార్థశ్చేద్విషయీవిషయాత్మనా**' - (కు.21)

| | | | |
|---|---|---|---|
| 2. **సంచరతి :** | **సంచరతి** | సంచరతః | సంచరన్తి |
| | సంచరసి | సంచరథః | సంచరథ |
| | సంచరామి | సంచరావః | సంచరామః. |

*

**శ్లో॥ కృష్ణాఙ్ఘ్ర్యమ్బుజలక్ష్మలక్ష్యమఖిలం యత్ర స్థలం సాచలం**
**సస్త్రీకా మునయశ్చ పక్షిహరిణీహర్యక్షవృక్షాదయః ।**
**యత్పాథః సురసిన్ధుసిన్ధుమహితం యస్మిన్ వ్రజస్త్రీవశం**
**శ్రుత్యన్తాన్తరితం మహః పరమదో వృన్దావనం స్యాన్ముదే ॥ 9-61**

**అ :** కవి బృందావన మహత్త్వాన్ని వర్ణించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యత్ర సాచలమ్ అఖిలం స్థలం కృష్ణ+అంఘ్రి+అంబుజ-లక్ష్మ-లక్ష్యమ్, యత్ర సస్త్రీకాః పక్షి-హరిణీ-హర్యక్ష-వృక్ష+ఆదయః చ మునయః యత్-పాథః సురసింధుసింధు-మహితం యస్మిన్ శ్రుతి+అన్త+అన్తరితం మహః వ్రజ-స్త్రీ-వశమ్ అదః (తత్) పరం బృందావనం ముదే స్యాత్.

**ప్ర :** యత్ర = ఏ చోట, స+అచలమ్ = కొండ (గోవర్ధనం) తో సహా (అచలేన సహ వర్తతే ఇతి), అఖిలమ్ = సమస్తమైన, స్థలమ్ = తావు, కృష్ణ... లక్ష్యమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, అంఘ్రి=పాదా లనే, అంబుజ= తామరలయొక్క, లక్ష్మ = గుర్తులచే, లక్ష్యమ్ = గుర్తింపబడుతుందో, యత్ర = ఎక్కడయితే, సస్త్రీకాః = స్త్రీలతో కూడి, పక్షి... ఆదయః : పక్షి = పక్షులు, హరిణీ = జింకలు, హర్యక్ష = సింహాలు, వృక్ష = చెట్లు, ఆదయః చ = మొదలగునవి కూడా, మునయః = మహర్షులో, యత్-పాథః = ఎక్కడి నీరు (అర్ణః పాథః కుశజలవనం - హలాయుధకోశః-648), సుర... మహితమ్ : సుర-సింధు = ఆకాశగంగ, సింధు = సముద్రం- వీటిచే, మహితమ్ = సత్కరింపబడినదో, యస్మిన్ = ఏ చోట, శ్రుతి+అంత+ అంతరితమ్ : శ్రుతి+అంత = వేదాంతమందు/ ఉపనిషత్తులయందు, అంతరితమ్ = లీనమై యున్న, మహః =తేజస్సు (కృష్ణ రూపం), వ్రజ-స్త్రీ-వశమ్ : వ్రజ-స్త్రీ = గోపకాంతలకు, వశమ్ = అధీనమైనదో, అదః = ప్రసిద్ధమైన, (తత్ = ఆ), పరమ్ = గొప్పదైన, బృందా-వనమ్ = బృందావనం, ముదే = ఆనందకరంగా, స్యాత్ = ఉండుగాత! (అస భువి పరస్మైపది- విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** బృందావనంలోని భూమి గోవర్ధనగిరితో సహా కృష్ణుని పాదా లనే పద్మాల గుర్తులు కలిగి వుంటుంది. అక్కడి పక్షులు, జింకలు, సింహాలు, చెట్లు మొదలయినవన్నీ ఆడవారితో సహా మహర్షులే. అక్కడి నీరు ఆకాశగంగ చేతా, సముద్రం చేతా కూడా మన్నింపబడేది. వేదాంతనిరూపితమైన పరబ్రహ్మతేజస్సు కృష్ణరూపంలో అక్కడి గోపవనితలకు అధీనమై వుంటుంది. అటువంటి బృందావనం ఆనందకరమగుగాక.

**వి:** 1. **సస్త్రీకాః** అని విశేషిస్తూ **హరిణీ** అని మరల స్త్రీలింగ పదాన్ని ప్రయోగించటం ఆలోచింప దగినది.

2. ఇక్కడ **బృందావనమహత్త్వం** చాలా గొప్పగా వర్ణింపబడింది. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' – (కు. 162) అని ఉదాత్తలక్షణం. కృష్ణమహత్త్వవర్ణనం ద్వారా బృందావనమహత్త్వ మిక్కడ సుస్పష్టం. కృష్ణమహత్త్వం – వేదాంతనిగూఢమైన ఆ మహస్సు – గోపికలకధీనమై వుందనటం ద్వారా ఆ మహస్సు అన్యోపలక్షణమై బృందావనాన్ని మహత్తరం చేస్తోంది.

3. వేదాంతనిగూఢమైన ఆ మహస్సు **కృష్ణస్వరూపమని** కవి ప్రతిపాదన. వేదాంత ప్రతిపాదితతత్త్వం నిర్గుణం నీరూపం కావటంతో ఆయా సంప్రదాయవేత్తలు వాటి వాటి కనుగుణంగా దానిని వర్ణిస్తారు. శైవుడైన కాళిదాసు–

శ్లో॥ వేదాంతేషు యమాహురేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయః శబ్దో యథార్థాక్షరః ।
అంతర్యశ్చ ముముక్షుభిర్నియమితప్రాణాదిభిర్మృగ్యతే
సః స్థాణుః స్థిరభక్తియోగసులభో నిశ్శ్రేయసాయాஉస్తు వః ॥**–విక్రమోర్వశీయం1/1**

వేదాంతనిగూఢమైనది శివతత్త్వమే అంటాడు.

4. **స్యాత్ :** 9–55వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యత్కుఞ్జా మురవైరిసఙ్గతవధూవిక్రీడనైర్వాసితా**
**యత్సఞ్జాతసురద్రుమౌఘమహసా విద్యోతితాశాముఖమ్ ।**
**యచ్చేన్ద్రేశసురేశముఖ్యవిబుధైః సంసేవ్యమానం సదా**
**తద్బృన్దావనమావిరస్తు సతతం చిత్తే ప్రమత్తే మమ ॥ 9–62**

**అ :** ఈ శ్లోకం కూడా బృందావనమహత్త్వాన్నే ప్రతిపాదిస్తోంది . శార్దూలవిక్రీడితమ్.

**అ :** యత్–కుంజాః ముర–వైరి–సంగత–వధూ–విక్రీడనైః వాసితాః, యత్–సంజాత–సుర–ద్రుమ–ఓఘ–మహసా విద్యోతిత+ఆశా–ముఖం యత్ చంద్ర+ఈశ–సురేశ–ముఖ్య–విబుధైః సదా సంసేవ్యమానం తద్ బృందావనం ప్రమత్తే మమ చిత్తే సతతమ్ ఆవిరస్తు.

**ప్ర :** యత్ = ఏ బృందావనంయొక్క, కుంజాః = పొదరిళ్ళు, ముర... విక్రీడనైః : ముర–వైరి = కృష్ణునితో, సంగత=కూడిన, వధూ=కాంతల యొక్క, విక్రీడనైః = విలాస చేష్టలచే (మురవైరిణా సంగతానాం వధూనాం విక్రీడనాని, తైః), వాసితాః = పరిమళింప జేయబడినవో, యత్ = ఏ తోట, సంజాత = ఏర్పడిన, సుర–ద్రుమ = దేవతా (పారిజాత) వృక్షాలయొక్క, ఓఘ = సమూహంయొక్క, మహసా = కాంతిచే (సంజాతానాం సురద్రమాణామ్ ఓఘస్య మహసా), విద్యోతిత+ఆశా–ముఖమ్ : విద్యోతిత = వెలుగొంద జేయబడిన, ఆశా = దిక్కులయొక్క, ముఖమ్ = ముఖాలు గలదో (విద్యోతితాని ఆశానాం ముఖాని యస్య, తత్), యత్ = ఏదయితే, చంద్ర = చంద్రుడు, ఈశ = శివుడు, సుర+ఈశ = దేవేంద్రుడు, ముఖ్య = మొదలుగాగల, విబుధైః=దేవతలచే (చంద్రశ్చ ఈశశ్చ సురేశశ్చ, త ఏవ ముఖ్యాః యేషాం తే చ విబుధాః చ, తైః), సదా = ఎల్లప్పుడూ, సంసేవ్యమానమ్ = చక్కగా సేవింప బడుతున్నదో, తత్ = ఆ, బృందావనమ్ = బృందావనం, ప్రమత్తే = మత్తెక్కిన (భక్తిచే), మమ=నాయొక్క, చిత్తే=మనస్సులో, సతతమ్ = నిరంతరమూ, ఆవిః+అస్తు = ఆవిర్భవించుగాక! (ఆవిః+అస భువి పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**తా ॥** బృందావనంలోని పొదరిళ్ళు కృష్ణునితో కలిసి గోపకాంతలు కొనసాగించిన విలాస క్రీడలతో పరిమళ భరితమై వుంటాయి. అక్కడ పుట్టిన దేవతరుసముదాయ కాంతులతో దిక్కులన్నీ వెలుగొందుతుంటాయి. శివుడు, చంద్రుడు, ఇంద్రుడు మొదలుగా గల దేవతలు అక్కడ దానిని స్తుతిస్తుంటారు, సేవిస్తుంటారు. అటువంటి బృందావనం నిరంతరమూ మత్తెక్కిన నా చిత్తంలో ఆవిర్భవించి యుండుగాక!

**వి :** 1. ఆనందతీర్థవిరచితమైన **తీర్థప్రబంధం**లోని బృందావనవర్ణనకు కొంచెం మార్పులతో రచించిన శ్లోకమిది. తీర్థప్రబంధంలోని శ్లోకమిది–

శ్లో॥ యత్కుంజా మురవైరిసంగతవధూవిక్రీడనైర్వాసితా
యత్సంజాతసురద్రుమౌఘమహసా విద్యోతితాశాముఖమ్ ।
యత్పాథః సురసింధుసింధుమహితం యత్రాఖిలైర్లక్షితం
శ్రుత్యంతాన్తరితం మహః పరమహో బృందావనం పావనమ్ ॥ –తీర్థప్రబంధం2/34

తీర్థప్రబంధంలోని ఈ శ్లోకంలోని మొదటి రెండు పాదాలనూ ప్రస్తుతశ్లోకంలోని మొదటి రెండు పాదాలుగా స్వీకరించి మిగిలిన శ్లోకాన్ని తానుగా కవి రచించాడు. తీర్థ ప్రబంధశ్లోకంలోని చివరి రెండు పాదాలనూ పూర్వశ్లోకంలోనికి తృతీయ చతుర్థ పాదాలుగా స్వీకరించాడు చిన్న మార్పులతో–

2. **ఆవిరస్తు (ఆవిః+అస్తు) : అస్తు/స్తాత్** స్తామ్ సన్తు
ఏధి/స్తాత్ స్తమ్ స్త
అసాని అసావ అసామ.

*

**శ్లో॥ కస్త్వం కశ్చన నిర్జరోఽహమిహ తే స్వర్గః క్వ తత్ త్వద్గృహం**
**పీయూషం క్వ తవాధరేఽస్తి సుభగే! క్వాస్తే తవానిద్రతా ।**
**త్వత్ప్రేమ్ణాం సఖి! చిన్తయాఽనిమిషవతా కుత్ర ప్రియే! పశ్యత–**
**స్త్వద్రూపం త్వితి వల్లవీం ప్రియగిరా చక్రీ స చక్రే నిజామ్ ॥ 9–63**

**అ :** గోపీ కృష్ణ సంవాద శ్లోకం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** గోపి : త్వమ్ కః ?
కృష్ణ : అహం కశ్చన నిర్జరః
గోపి : ఇహ తే స్వర్గః క్వ?
కృష్ణ : త్వద్గృహమ్.
గోపి : పీయూషం క్వ?
కృష్ణ : సుభగే! తవ అధరే అస్తి
గోపి : తవ అనిద్రతా క్వ ఆస్తే?
కృష్ణ : సఖి! త్వత్ప్రేమ్ణాం చింతయా
గోపి : అనిమిషతా కుత్ర?
కృష్ణ : ప్రియే! త్వద్రూపం పశ్యతః తు
కవి : ఇతి ప్రియగిరా సః చక్రీ పల్లవీం నిజాం చక్రే.

**ప్ర :** త్వమ్ = నీవు, కః? = ఎవడవు?, అహమ్ = నేను, కశ్చన = ఒకానొక, నిర్జరః = దేవతను, ఇహ = ఇక్కడ, తే = నీ యొక్క, స్వర్గః = స్వర్గం, క్వ = ఎక్కడ?, త్వద్–గృహమ్ = నీ ఇల్లు, పీయూషమ్ = అమృతం, క్వ = ఎక్కడ?, సుభగే = సత్సంపద గలదానా!, తవ=నీయొక్క, అధరే=పెదవిపై, అస్తి = ఉంది (అస భువి–పరస్మైపది–లట్–(ప్ర.ఏ.), తవ = నీయొక్క, అనిద్రతా = నిదురలేనితనం, క్వ–ఆస్తే = ఎక్కడుంది? (ఆస్ ఉపవేశనే ఆత్మనేపది–లట్–(ప్ర.ఏ.), సఖి! = చెలి!, త్వత్–ప్రేమ్ణామ్ = నీ వలపులయొక్క, చింతయా = ఆలోచనలచేత. అనిమిషతా = రెప్పపాటులేనితనం, క్వ = ఎక్కడ?, ప్రియే = ప్రియా!, త్వద్–రూపమ్ = నీ రూపాన్ని, పశ్యతః = చూస్తున్న

(నాకు) రెప్పపాటులేనితనం, ఇతి = అని, ప్రియ-గిరా=ఇష్టమైన మాటలతో, సః = ఆ, చక్రీ = కృష్ణుడు, వల్లవీమ్ = గోపకాంతను, నిజామ్ = తన దానినిగా, చక్రే = చేసికొన్నాడు (కృ కరణే ఆత్మనేపది-లిట్- ప్ర.ఏ.)

**తా ॥** నీ వెవడవు? నేనొక దేవతను. మరి నీ స్వర్గ మిక్కడెక్కడ? మీ ఇల్లే. అమృత మెక్కడ? నీ అదరామృతం. మరి నిద్రలేక పోవటం? నీ వలపుల గురించి ఆలోచిస్తూ. నీ అనిమిషత్వం? నిన్ను చూస్తుంటే (రెప్పవాలదు) అని ప్రియవచనాలు పలుకుతూ ఆ కృష్ణుడు గోపకాంతను తన దానిని చేసికొన్నాడు.

**వి :** 1. ప్రియవచనాలకు కార్యసాధనలో ఎంతో ప్రాధాన్యముంది.

శ్లో॥ ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యన్తి జన్తవః ।
తస్మాత్తదేవ వక్తవ్యం వచనే కా దరిద్రతా ॥

అన్నాడొక ప్రాచీన కవి. ప్రియవచనాలతో అందరూ ఆనందిస్తారు కాబట్టి అవే పలుకుదాం. మాటలకు లోటేమిటి? అయితే ప్రియవచనమైన సరే అది అసత్యం కాకూడదని.

శ్లో॥ సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ - న బ్రూయాత్సత్యమప్రియమ్ ।
ప్రియం చ నానృతం బ్రూయా - దేష ధర్మస్సనాతనః ॥

'సత్యం చెప్పాలి. ప్రియంగా చెప్పాలి. అప్రియమైన సత్యం చెప్పకూడదు. ప్రియమైన అసత్యమూ చెప్పకూడదు'-

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి | |
| | అసి | స్థః | స్థ | |
| | అస్మి | స్వః | స్మః | |
| **ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే | |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే | |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే | |
| **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే | |
| | చకృషే | చక్రాథే | చకృధ్వే | |
| | చక్రే | చకృవహే | చకృమహే. | * |

**శ్లో॥ ప్రీతేర్లాభమవేక్ష్య చిత్తమపి యా తస్మై దదావఙ్కగాం**
**తాం కృత్వా రతిసఙ్గరస్థహృదయామాలిఙ్గ్య రమ్యైర్భుజైః ।**
**తస్యా దృష్టిపథం గతం ముఖమలం చిత్తాయ సంరోచయన్**
**కస్తూరీతిలకేన భూషయతి యః స స్యాన్ముదే విట్ఠలః ॥ 6-64**

**అ :** మరొక గోపికతో కృష్ణుని క్రీడావిశేషం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యా ప్రీతేః లాభమ్ అవేక్ష్య చిత్తమ్ అపి తస్మై దదౌ, తామ్ అంకగాం కృత్వా రతి-సంగర-స్థ-హృదయాం రమ్యైః భుజైః ఆలమ్ ఆలింగ్య దృష్టిపథం గతం తస్యాః ముఖం చిత్తాయ సంరోచయన్ యః కస్తూరీతిలకేన భూషయతి సః విట్ఠలః ముదే స్యాత్.

**ప్ర :** యా = ఎవర్తె అయితే, ప్రీతేః = సుఖంయొక్క, లాభమ్ = లబ్ధిని, అవేక్ష్య = చూసి, చిత్తమ్-అపి = మనస్సును కూడా, తస్మై = ఆ కృష్ణునకు, దదౌ = ఇచ్చిందో (దా దానే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తామ్ = ఆమెను, కృష్ణః = కృష్ణుడు, అంక-గామ్ = తన ఒడిలోనికి చేర్చుకొని, రతి-సంగర-స్థ-హృదయామ్ : రతి-

సంగర = సురతయుద్ధమందు, స్థ = నిలిచిన, హృదయామ్ = మనస్సుగలదానిని (రతిః ఏవ సంగరః తస్మిన్ తిష్ఠతి ఇతి, తచ్చ తత్ హృదయం యస్యాః, తామ్), రమ్యైః = అందమైన, భుజైః = బాహువులతో, అలమ్ = తగినంతగా, ఆలింగ్య = కౌగిలించి, దృష్టి–పథమ్ = చూపునకు ఎదురుగానున్న, తస్యాః = ఆమెయొక్క, ముఖమ్ = మోమును, చిత్తాయ = మనస్సునకు, సంరోచయన్ = ఇష్టం కలుగునట్లు చేస్తూ, కస్తూరీ–తిలకేన = కస్తూరి బొట్టుతో, యః = ఎవడు, భూషయతి = అలంకరిస్తాడో (భూష్ అలంకారే ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), సః = ఆ, విట్ఠలః = కృష్ణుడు, ముదే = ఆనందకారిగా, స్యాత్ = అగుగాక! (అస భువి పరస్మైపది–విధిలిఙ్– ప్ర.ఏ.)

**తా ॥** సుఖలాభదృష్టితో తన మనస్సును కృష్ణున కర్పించిన గోపికను ఒడిలోనికి చేర్చుకొని, రతిసంగరం మీద నిలిచిన మనస్సుగల ఆమెను అందమైన బాహువులతో కౌగిలించి, కంటికి కనిపించిన ఆమె ముఖాన్ని మనస్సునకు నచ్చేటట్లు కస్తూరీతిలకంతో అలంకరించే ఆ విట్ఠలుడు ఆనందాన్ని కల్గించు గాక.

**వి :** 1. శ్లోకంలో కవి చమత్కారశీలత కనిపిస్తుంది. ఆమె లాభదృష్టితో మనస్సు నర్పించింది కాబట్టి ఒడిలోనికి చేర్చుకొన్నాడు. అంటే ఆమెలో వైశ్యదృష్టి వుంది కాబట్టి 'ఊరూ తదస్య యద్వైశ్యః' అన్న పురుషసూక్త వాక్యాన్ని బట్టి ఆమెను తొడల మీదికి చేర్చటం. అదే సూక్తంలోని 'బాహూ రాజన్యః కృతః' – అన్న వాక్యాన్ని బట్టి రతిసంగరేచ్ఛగల ఆమెను బాహువులతో కౌగిలించటం. "**యాదృశీ భావనా తత్ర సిద్ధిర్భవతి తాదృశీ**" – అన్న నానుడిని స్ఫురింపజేశాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః |
| | దదిథ/దదాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ |
| **భూషయతి :** | **భూషయతి** | భూషయతః | భూషయన్తి |
| | భూషయతి | భూషయథః | భూషయథ |
| | భూషయామి | భూషయావః | భూషయామః |
| **స్యాత్ :** | 9–54వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు నవమః సర్గో ముదాం సత్కృతః॥ 9–65**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా॥** సురమండలీషు సత్కృతః ముదాం నవమః సర్గః – దేవతలచే సత్కరింపబడిన తొమ్మిదవ ఆనందసృష్టి – మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో నవమ సర్గ.

**శ్రీః**



# శ్రీః
# దశమః సర్గః

**శ్లో॥ ఇత్థం స రాత్రౌ వివిధాన్ విలాసాన్ - కృత్వా నిశాన్తే విససర్జ గోపీః ।**
**ప్రీత్యై విధోరన్వయజః స్వలీలాం - మిత్రం న సన్దర్శయతి స్మ నూనమ్ ॥10-1**

**అవతారిక :** శారదరాత్రుల రాసవిలాసాల ముగింపు - సూర్యోదయం. -ఇంద్రవజ్ర.

**అన్వయక్రమం :** సః ఇత్థమ్ రాత్రౌ వివిధాన్ విలాసాన్ కృత్వా నిశాంతే గోపీః విససర్జ. ప్రీత్యై విధోః అన్వయ జః (సః) స్వ-లీలాం మిత్రం న సందర్శయతి స్మ. నూనమ్.

**ప్రతిపదార్థం :** సః = ఆ కృష్ణుడు, ఇత్థమ్ = ఈ రీతిగా, రాత్రౌ = రేయి, వివిధాన్ = ఎన్ని రకాలుగానో, విలాసాన్ = క్రీడావిలాసాలను, కృత్వా = చేసి, నిశా+అంతే = రేయి చివరన, గోపీః = గోపికలను, విససర్జ = వదిలాడు (వి-సృజ విసర్గే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ప్రీత్యై = సంతోషం కోసం, విధోః = చంద్రునియొక్క, అన్వయ-జః = వంశంలో (చంద్రవంశంలో) పుట్టిన కృష్ణుడు, స్వ-లీలామ్ = తన విలాసాన్ని, మిత్రమ్ = సూర్యుడికి, న **సందర్శయతి** స్మ = చూపలేదు. ('**లట్ స్మే**' (అష్టాధ్యాయి - 3-2-118) సూత్రంతో 'స్మ'తో కలిసిన వర్తమానప్రయోగం భూతార్థాన్నిస్తుంది.) (సమ్-దృశ్ ప్రేక్షణే ణిచ్-లట్-ప్ర.ఏ.), నూనమ్ = నిశ్చితం.

**తాత్పర్యం :** ఆ రీతిగా (తొమ్మిదవ సర్గలో వర్ణించినట్లు) కృష్ణుడు ఆ రాత్రి వివిధ విలాసాలను ప్రదర్శించి తెల్లవారే వేళలో గోపికలను విడిచాడు. తాను చంద్రప్రీతికై ఆ వంశంలో జన్మించిన వాడు కాబట్టి మిత్రునికి (సూర్యునికి) తన విలాసాలను చూపలేదు. (చంద్ర ప్రీతికై చేసే పనులు సూర్యుడికి నచ్చవని కాబోలు). ఇది నిశ్చయం.

**విశేషాలు :** 1. చంద్రప్రీతికై చంద్రవంశంలో పుట్టిన వారు సూర్యుడికి తన విలాసాలను ప్రదర్శించలేదని కవి సంభావన చేసినందువలన ఇది **ఉత్ప్రేక్ష.** 'నూనమ్' పద ప్రయోగంతో అది సుస్పష్టం.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయో నూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥

2. మిత్రపదం సూర్యార్థంలో పుంలింగం. సుహృదర్థంలో నపుంసకలింగం. ద్వితీయా-విభక్త్యేకవచనంలో రెండింటికీ 'మిత్రమ్' అని రూపం. శ్లిష్టమైన మిత్రపదం ద్వారా అన్యప్రీతి కోసం చేస్తున్న పనులకు మిత్రుల దగ్గరైనా దాపరికం అవసరమే అని శబ్ద శక్తిద్వారా ధ్వనిస్తుంది. ఇది **శబ్దశక్తిమూలధ్వని.**

| | | | |
|---|---|---|---|
| 3. **విససర్జ :** | **విససర్జ** | విససృజతుః | విససృజుః |
| | విససర్జిథ/విసస్రష్ట | విససృజథుః | విససర్జ |
| | విససర్జ | విససృజివ | విససృజిమ |
| **సందర్శయతి :** | **సందర్శయతి** | సందర్శయతః | సందర్శయన్తి |
| | సందర్శయసి | సందర్శయథః | సందర్శయథ |
| | సందర్శయామి | సందర్శయావః | సందర్శయామః. * |

**శ్లో॥ దుర్గావనే వ్రతధరం నిశి నన్దగోపం - సర్పోఽగ్రసీత్ కిల బుభుక్షితచిత్తవృత్తిః ।**
**కృష్ణం విసృజ్య సకలేశ్వరమన్యదైవ-ప్రత్యర్హణాభిరతమిత్యహమూహయామి ॥10-2**

**అ :** నందగోపుని పాము కబళించటం. -వసంతతిలక.

**అ :** దుర్గా-వనే వ్రత-ధరం నంద-గోపం నిశి బుభుక్షిత-చిత్త-వృత్తిః సర్పః అగ్రసీత్ కిల. సకల+ఈశ్వరం కృష్ణం విసృజ్య అన్య-దైవ-ప్రత్యర్హణా+అభిరతమ్ ఇతి అహమ్ ఊహయామి.

**ప్ర :** దుర్గా-వనే = అంబికావనంలో, వ్రత-ధరమ్ = ఉపవాసవ్రతధారియైన, నంద-గోపమ్ = నందగోపుని, నిశి = రేయి, బుభుక్షిత-చిత్త-వృత్తిః : బుభుక్షిత = తినాలనే కోరికతో కూడిన, చిత్త = మనస్సుయొక్క, వృత్తిః = ప్రవృత్తి (నడవడి) గలదై (బుభుక్షితా చ సా చిత్తస్య వృత్తిః యస్మిన్ సః), సర్పః = పాము, అగ్రసీత్-కిల = మ్రింగింది కదా! (గ్రస అదనే-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), సకల+ఈశ్వరమ్ = అందరికీ పాలకుడైన (సకలస్య ఈశ్వరః, తమ్), కృష్ణమ్ = కృష్ణుని, విసృజ్య = వీడి, అన్య... రతమ్ : అన్య-దైవ = మరొక దేవుని యొక్క, ప్రత్యర్హణ =ఆరాధనయందు, అభిరతమ్ = ఆసక్తి గల నందుని (పాము మ్రింగింది), ఇతి = అని, అహమ్ = నేను, ఊహయామి = భావిస్తున్నాను. (ఊహ వితర్కే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** నందగోపుడు అంబికావనంలో వ్రతధారియై (ఉమామహేశ్వరులను) సేవించుచుండగా ఆకలిగొన్న మనస్సుతో పాము ఆయనను మ్రింగింది. సర్వేశ్వరుడైన కృష్ణుని కాదని అన్యదైవాన్ని ఆరాధించినందువలననే అలా జరిగిందని నేను (కవి) ఊహిస్తున్నాను.

**వి :** 1. అన్యదైవమని మాత్రమే కవి వచనం. **దుర్గావన** పదం ద్వారా అది శైవారాధన అని భావించవలసివుంటుంది.

పోతన "అంత నొక్కనాఁడు నందాదులైన గోపకు లంబికావనంబునకు శకటంబులెక్కి జాతరకుంజని, సరస్వతీనదీజలంబుల స్నానంబులు సేసి, యుమామహేశ్వరుల నర్చించి..." (పోతన భాగవతము - 10/1110) అని శివారాధనను స్పష్టం చేశాడు. అంతేకాదు ఆ పాము తనను చుట్టిముట్టినప్పుడు "...నిదురవోయిన నందునింగఱచి, మ్రింగ నగ్గలింప, నతండు 'కృష్ణ, కృష్ణే'తి వచనంబుల' అని కృష్ణునే శరణు కోరాడు. కృష్ణ తిరస్కారం కానీ, అనాదరణం కానీ కన్పించదు.

భాగవతం మూలంలో కూడా పశుపతి సమారాధనమనే కనిపిస్తుంది.

శ్లో॥ తత్ర స్నాత్వా సరస్వత్యాం దేవం పశుపతిం విభుమ్ ।
ఆనర్చురర్హణైర్భక్త్యా దేవీం చ నృపతేఽంబికామ్ ॥ - భాగవతం 10/34/2

2. ఈ శ్లోకంలో సాక్షాత్తూ 'అహ మూహయామి' అని కవి చెప్పినందువలన ఇది ఉత్ప్రేక్షయే.

| | | | |
|---|---|---|---|
| 3. **అగ్రసీత్ :** | **అగ్రసీత్** | అగ్రసిష్టామ్ | అగ్రసిషుః |
| | అగ్రసీః | అగ్రసిష్టమ్ | అగ్రసిష్ట |
| | అగ్రసిషమ్ | అగ్రసిష్వ | అగ్రసిష్మ |

| | | | |
|---|---|---|---|
| **ఊహయామి :** | ఊహయతి | ఊహయతః | ఊహయన్తి |
| | ఊహయసి | ఊహయథః | ఊహయథ |
| | **ఊహయామి** | ఊహయావః | ఊహయామః. |

*

**శ్లో॥కృష్ణః స్వదర్శనసుదర్శనమేనమాత్మ-విద్యాధరాన్వయమమూముచదబ్జనేత్రః।**
**తత్పాదపూతతనురుత్తమపూరుషాఙ్ఘ్రి-ప్రీత్యైవ తస్య పదమేవ జగామ సోఽపి॥ 3**

**అ :** నందగోపవిముక్తి – సుదర్శనమోక్షప్రాప్తి. –వసంతతిలక.

**అ :** అబ్జనేత్రః కృష్ణః స్వ–దర్శన–సుదర్శనమ్ ఆత్మ–విద్యా–ధర+అన్వయమ్ ఏనమ్ అమూముచత్. సః అపి తత్–పాద–పూత–తనుః (సన్) ఉత్తమపూరుష+అంఘ్రి–ప్రీత్యా+ఏవ తస్య పదమ్ ఏవ జగామ.

**ప్ర :** అబ్జనేత్రః = కమలాక్షుడు అయిన (అబ్జే ఇవ నేత్రే యస్య సః), కృష్ణః = కృష్ణుడు, స్వ–దర్శన–సుదర్శనమ్: స్వ = తనయొక్క, దర్శన = దర్శనంచేత, సుదర్శనమ్ = మంచిని చూసినవాడై, ఏనమ్ = ఆ సుదర్శనుని, ఆత్మ–విద్యా–ధర+అన్వయమ్ : ఆత్మ = తనయొక్క, విద్యా = విద్యను, ధర = ధరించే వారి, అన్వయమ్ = వంశం గల వానిని, అమూముచత్= విడిపించాడు/ ముక్తుని చేశాడు (ముచ్ మోక్షణే పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.) సః +అపి = ఆ సుదర్శనుడు కూడా, తత్... తనుః సన్ : తత్ = ఆ కృష్ణునియొక్క, పాద = కాలిచే, పూత = పవిత్రమైన, తనుః (సన్) = శరీరం గలవాడై, ఉత్తమ... ప్రీత్యా+ఏవ : ఉత్తమ–పూరుష = మహాత్మునియొక్క, అంఘ్రి = పాదాలపై గల, ప్రీత్యా+ఏవ = భక్తితోడనే, తస్య = ఆ విష్ణువుయొక్క, పదమ్–ఏవ = స్థానాన్నే (విష్ణుపదం – ఆకాశం), జగామ = పొందాడు. (గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ సర్పం సుదర్శనుడనే విద్యాధరుడు. కృష్ణదర్శనంచేత ఆ సుదర్శనుడు నిజంగా సుదర్శనుడు అయ్యాడు. కృష్ణవిద్యను ధారణం చేయటం ద్వారా ఆత్మవిద్యాధరుడయ్యాడు. ఆ సుదర్శనుని కృష్ణుడు విముక్తుని చేశాడు. ఆ విద్యాధరుడు కూడా కృష్ణపాదస్పర్శచే శరీరం పవిత్రం కాగా ఉత్తమపురుషుని పాదాలపై ప్రీతితో ఆ విష్ణుపదానికే (ఆకాశానికి, విష్ణుసన్నిధికి) చేరాడు.

**వి :** 1. ఆ పాము సుదర్శనుడనే విద్యాధరుడు. ఒకనాడు ఆంగిరస ఋషులను – కురూపులను – చూసి నవ్వినందువల్ల వారు మహాసర్పరూపాన్ని పొందుమని శపించారు. కృష్ణ పాదస్పర్శతో మరల స్వరూపసిద్ధి కలుగుతుందని అనుగ్రహించారు. ఇప్పుడు ఆ శాపవిముక్తి కలిగింది. ఆ విద్యాధరుడు కృష్ణుని స్తుతించి నిష్క్రమించాడు ఇలా–

మ. నినుఁ జింతించిన విన్నుఁ బేరుకొనినన్ నిర్మూలమై క్రుస్సి పా
పనికాయంబు వినష్టమౌ నఁట భవత్పాదంబు నామీఁదఁ బె
ట్టినఁ దద్బ్రాహ్మణశాపసంజనితకౌటిల్యంబు దా నిల్చునే?
వనజాతేక్షణ! నేఁడు వాసె నురగత్వం బెల్ల నేఁ బోయెదన్.– పోతనభాగవతం 10/1116

2. సుదర్శనుడు అన్నది పేరు. అయినా కృష్ణ సందర్శనం చేత సుదర్శను డయ్యాడని వర్ణించటం, స్వతహాగా విద్యాధరుడైనా ఆత్మవిద్య కారణంగా విద్యాధరుడయ్యాడనటం – ఈ రెండూ సిద్ధించిన అర్థాలే మరలా సాధించేందుకు, లేదా విధించేందుకు సిద్ధపడటం విధ్యలంకార మవుతుంది. '**సిద్ధస్యైవ విధానం యత్ తమాహుః విధ్యలంకృతిమ్**' – (కు.166)

| | | | |
|---|---|---|---|
| 3. **అమూముచత్ :** | **అమూముచత్** | అమూముచతామ్ | అమూముచన్ |
| | అమూముచః | అమూముచతమ్ | అమూముచత |
| | అమూముచమ్ | అమూముచావ | అమూముచామ |

| | | | | |
|---|---|---|---|---|
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః | |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ | |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. | * |

**శ్లో॥ అసహ్యనక్తఞ్చరనాశకత్వం - ప్రకాశయన్ స్వాత్మని విద్యమానమ్ ।**
**స శఙ్ఖచూడం దితిజం నిగూఢం - మమర్ద శార్దూలమివ క్షపాయామ్॥ 10-4**

**అ :** శంఖచూడసంహారం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః స్వ+ఆత్మని విద్యమానమ్ అసహ్య-నక్తంచర-నాశకత్వం ప్రకాశయన్ నిగూఢం శంఖచూడం దితిజం శార్దూలమ్+ఇవ క్షపాయాం మమర్ద.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, స్వ+ఆత్మని = తనలో, విద్యమానమ్ = ఉన్నట్టి (విద్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), అసహ్య-నక్తంచర-నాశకత్వమ్ : అసహ్య = సహింపరాని, నక్తంచర = రాక్షసులయొక్క (నక్తం చరన్తి ఇతి నక్తంచరాః), నాశకత్వమ్ = నాశనం చేసే స్వభావాన్ని (అసహ్యానాం నక్తం చరాణాం నాశకః, తస్య భావః), ప్రకాశయన్ = వెలిపరుస్తూ, నిగూఢమ్ = మాటున వచ్చిన, శంఖచూడమ్ = శంఖచూడు డనే, దితిజమ్ = రాక్షసుని (దితేః జాతః దితిజః తమ్), శార్దూలమ్+ఇవ = పులినివలె, క్షపాయామ్ = రాత్రిపూట, మమర్ద = చంపాడు. (మృద్ క్షోదే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు హద్దుమీరి సహింపరాని రాక్షసులను సంహరించే స్వభావం కలవాడు. దానిని ప్రకటింపజేస్తూ చాటుమాటుగా వచ్చిన శంఖచూడుడనే రాక్షసుని, పులిని రాత్రిపూట చంపినట్టు చంపివేశాడు.

**వి :** 1. శంఖచూడుడు తన యోగబలంబున గోపికలను ఉత్తరదిక్కునకు తీసికొని పోయాడు. వారు ఆక్రోశించారు. అంతవరకు రామకృష్ణులతో కలిసి ఆడుతున్నవారే. దానితో కృష్ణుడు వెంటబడి వాడిని చంపాడు.

శా. ఓరీ! గుహ్యక! పోకు పోకు మని రోషోక్తిం బకారాతి వాఁ
**డే రూపంబున నెందుఁ జొచ్చె నెటఁ బోయెం దోడఁ దా నేగి దు**
ర్వారోదంచితముష్టి వానితలఁ ద్రెవ్వం బట్టి తద్వీరు కో
టీరభ్రాజితరత్నమున్ గొనియె దండిన్ గోపిక ల్సూడగన్. -పోతనభాగవతము 10/1123

అతని మాయచేష్టలు కృష్ణుని దగ్గర ఫలించలేదు.

2. శార్దూలమివ - ఉపమాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **మమర్ద :** | **మమర్ద** | మమృదతుః | మమృదుః | |
| | మమర్దిథ | మమృదథుః | మమృద | |
| | మమర్ద | మమృదివ | మమృదిమ. | * |

**శ్లో॥ శిరోమణిం తస్య వధాదవాప్తం - బలాయ దత్త్వా బుభుజే స్వయం సః ।**
**యశోమణిం చన్ద్రచయాతిచారుం - మనోజ్ఞకాన్తామణిభిస్సమేతమ్ ॥ 10-5**

**అ :** కృష్ణుడు శంఖచూడుని శిరోరత్నాన్ని బలరామున కిచ్చి, యశోమణిని తాను పొందటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తస్య వధాత్ అవాప్తం శిరోమణిం బలాయ దత్త్వా సః మనోజ్ఞ-కాంతా-మణిభిః సమేతం చంద్ర-చయ-అతిచారుం యశో-మణిం స్వయం బుభుజే.

**ప్ర :** తస్య = ఆ శంఖచూడునియొక్క, వధాత్ = వధించుట ద్వారా, అవాప్తమ్ = పొందబడిన, శిరోమణిమ్ =

తలమానికాన్ని, బలాయ = బలరామునికి, దత్వా = ఇచ్చి (దా ధాతువుపై క్త్వా ప్రత్యయం), సః = ఆ కృష్ణుడు, మనోజ్ఞ-కాంతా-మణిభిః : మనోజ్ఞ = అందమైన, కాంతామణిభిః = కాంతామణులతో (మనోజ్ఞాః చ తాః కాంతామణయః, తాభిః), సమేతమ్ = కూడినదీ, చంద్ర-చయ-అతిచారుమ్ : చంద్ర = చంద్రుల యొక్క, చయ = సమూహం కంటే/చంద్రసమూహంచేత (అది రాత్రి కాబట్టి చంద్రబింబం దానిలో ప్రతిబింబించి అనేక చంద్రులుగా కనిపించిందని), అతిచారుమ్ = చాలా అందమైనదీ, (చంద్రస్య చయేన అతిచారుః, తమ్), యశోమణిమ్=కీర్తిమణిని, స్వయమ్ = తాను, బుభుజే = అనుభవించాడు. (భుజ్ పాలనాభ్యవహారయోః – ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** శంఖచూడుని చంపటం ద్వారా అతని శిరోమణి కృష్ణునికి దొరికింది. దానిని బలరామునికిచ్చాడు. తాను మాత్రం అందమైన కాంతామణులతో కూడి చంద్రసమూహం కంటే మనోజ్ఞమైన యశోమణిని తాను అనుభవించాడు. (మహనీయులకు వస్తుస్థితి కన్న వచ్చిన మంచిపేరే విలువైనది గదా!)

**వి :** 1. శ్లోకంలో **పరివృత్త్యలంకారం** కనిపిస్తుంది. తనదైన శిరోమణిని బలరామునకిచ్చి తాను కాంతాసహితంగా యశోమణిని స్వీకరించటం (అంతవరకు ఆ గోపకాంతలు బలరాముని రక్షణలో వున్నారు మరి కృష్ణుడు శంఖచూడునితో తలపడుతున్నందువల్ల) ఇక్కడ వినిమయం. '**పరివృత్తిర్వినిమయో న్యూనాభ్యధికయోర్మిథః**' – (కు. 112)

| | | | |
|---|---|---|---|
| 2. **బుభుజే :** | **బుభుజే** | బుభుజాతే | బభుజిరే |
| | బుభుజిషే | బుభుజాథే | బుభుజిధ్వే |
| | బుభుజే | బుభుజివహే | బుభుజిమహే. |

*

**శ్లో॥ ధూళీపాలిభిరమ్బరం మలినయన్ విష్ణోః పదం తోయదాన్**
**లాఙ్గూలేన విదారయన్ సమరుచస్తజ్జన్మమూలం త్వితి ।**
**దేవేన్ద్రం కకుదద్రిణా ఖురపుటైః పృథ్వీం చ స క్లేశయ-**
**న్నభ్యాయాత్ స్వవిషాణలక్ష్యమజితం కుర్వన్నరిష్టాసురః ॥ 10-6**

**అ :** అరిష్టాసుర ప్రవేశం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ధూళీ-పాలిభిః విష్ణోః పదమ్ అంబరం మలినయన్, సమరుచః తోయదాన్ లాంగూలేన విదారయన్, తత్+జన్మ-మూలం తు ఇతి కకుద్-అద్రిణా దేవేంద్రం ఖురపుటైః పృథ్వీం చ క్లేశయన్, అజితం స్వ-విషాణ-లక్ష్యం కుర్వన్ సః అరిష్టాసురః అభ్యాయాత్.

**ప్ర :** ధూళీ-పాలిభిః : ధూళీ = దుమ్ముయొక్క (పాంశుః క్షోదో రేణుశ్చూర్ణం ధూళీ రజశ్చ – హలాయుధకోశః – 443), పాలిభిః = సమూహాలచేత (ధూళీనాం పాలిః, తాభిః), విష్ణోః = విష్ణువుయొక్క, పదమ్ = పదమగు, అంబరమ్ = ఆకాశాన్ని (వియద్విష్ణుపదం వాపి – అమరకోశః – దిక్ – 2), మలినయన్ = మలినం చేస్తూ (మలినమివ కరోతి – మలినయతి– దానిపై శతృ ప్రత్యయం), సమ-రుచః : సమ = (కృష్ణునితో) సమానమైన, రుచః = కాంతులుగల (సమానా రుక్ యేషాం తాన్), తోయదాన్ = మేఘాలను, లాంగూలేన = తోకతో, విదారయన్ = బ్రద్దలు చేస్తూ (వి-దృ ధాతువుపై శతృ ప్రత్యయం), తత్-జన్మ-మూలం తు : తత్ = ఆ కృష్ణునియొక్క, జన్మ = పుట్టుకకు, మూలం-తు = కారణం కదా, ఇతి = అని, కకుద్-అద్రిణా = కకుత్తు అనే పర్వతంతో, దేవేంద్రమ్ = దేవేంద్రుని, ఖుర-పుటైః = గిట్టల దొప్పలతో (పుటపదం విడిగా గుళ్లపు గిట్టలకు వాచకం), పృథ్వీం చ = భూమిని, క్లేశయన్ = కలత బెడుతూ (క్లిశ్ – ధాతువుపై – ణిచ్ – శతృ ప్రత్యయం),

అజితమ్ = ఓటమి నెరుగని కృష్ణుని, స్వ-విషాణ-లక్ష్యమ్ : స్వ = తనయొక్క, విషాణ = కొమ్ములకు, లక్ష్యమ్ = గురిగా, కుర్వన్ = చేస్తూ (కృ ధాతువుపై శతృ ప్రత్యయం), సః అరిష్టాసురః = ఆ అరిష్టాసురుడు, అభి+ఆయాత్ = ఎదురు వచ్చాడు. (అభి+ఆ-యా ప్రాపణే-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అరిష్టాసురుడు విష్ణుపదం (ఆకాశం) అన్న కోపంతో ఆకాశాన్ని మలినం చేస్తూ, కృష్ణునితో సమానమైన కాంతి గలవి కాబట్టి మేఘాలను తన తోకతో చెదరగొడుతూ, ఆ కృష్ణుని జన్మకు మూలం కాబట్టి దేవేంద్రుని కకుప్ పర్వతంతోనూ, భూమిని ఖురపుటాలతోనూ ఇబ్బంది పెడుతూ కృష్ణుని తన కొమ్ములకు లక్ష్యంగా చేసికొని ఎత్తి వచ్చాడు.

**వి :** 1. అరిష్టాసురుడు వృషభ (ఎద్దు) రూపుడు. వృషభుని ఆగడాన్ని పోతన వివరంగా వర్ణించాడు.

సీ. ఎవ్వని మూఁపుర మీక్షించి మేఘంబు - లద్రిశృంగం బని యాశ్రయించు
నెవ్వని అంకె కర్ణేంద్రియంబులు సోఁక - గర్భపాతం బగు గర్భిణులకు
నెవ్వని పదహతి నెగయుపరాగంబు - లంధకారారాతి నావరించు
నెవ్వఁడు గొమ్ముల నెదిరించి చిమ్మినఁ - బృథ్వీధరంబులు పెల్లగిల్లు

తే. నట్టి వృషభాసురేంద్రుఁ డహంకరించి - వాలలత యెత్తి పెనుఅంకె వైచి నేలఁ
గాలు ద్రవ్వుచు నిశితశృంగములు సాఁచి - మంద బెగడంగ గవిసె నమందుఁడగుచు.

– పోతనభాగవతము 10/1134

2. అరిష్టాసురుడు విష్ణువును ద్వేషిస్తున్నాడు. విష్ణుసంబంధముందన్న కారణంగా ఇతరాలనూ ద్వేషిస్తున్నాడు. శత్రువుతో పాటు శత్రుపక్షంపై కూడా లేదా శత్రువుతో పోరాడలేక తత్పక్షంపై దాడిచేయటం **ప్రత్యనీకాలంకారం**. 'ప్రత్యనీకం బలవతః శత్రోః పక్షే పరాక్రమః' – (కు.119)

3. **అభ్యాయాత్ :**

| | | | |
|---|---|---|---|
| | **అభ్యాయాత్** | అభ్యాయాతామ్ | అభ్యాయయుః |
| | అభ్యాయాః | అభ్యాయాతమ్ | అభ్యాయాత |
| | అభ్యాయామ్ | అభ్యాయావ | అభ్యాయామ. |

*

**శ్లో॥ అగ్రే నిధాయ స్వవిషాణయుగ్మ-ముగ్రోఽచ్యుతం ప్రత్యగమత్ సహాయమ్ ।**
**దోష్ణా తదుత్పాటయతో మురారేః - కుర్వన్ శిరోభారజిహీర్షయేవ ॥ 10-7**

**అ :** వృషభా(అరిష్టా)సురుడు కృష్ణునిపై దాడిచేయటం. –ఇంద్రవజ్ర.

**అ :** ఉగ్రః స్వ-విషాణ-యుగ్మమ్ అగ్రే నిధాయ దోష్ణా తద్ ఉత్పాటయతః మురారేః శిరః+భార-జిహీర్షయా సహాయం కుర్వన్+ఇవ అచ్యుతం ప్రత్యగమత్.

**ప్ర :** ఉగ్రః = క్రూరుడైన అరిష్టాసురుడు, స్వ-విషాణ-యుగ్మమ్ : స్వ = తనయొక్క, విషాణ = కొమ్ములయొక్క, యుగ్మమ్ = జంటను (స్వస్య విషాణే, తయోః యుగ్మమ్, తత్), అగ్రే = ముందుకు, నిధాయ = నిలిపి/చాచి, దోష్ణా = చేతితో, తద్ = దానిని, ఉత్పాటయతః = పెకలిస్తున్న, మురారేః = కృష్ణునకు, శిరో... జిహీర్షయా : శిరోభార = తలబరువును, జిహీర్షయా = పోగొట్టాలనే కోరికతో (హర్తుమ్ ఇచ్ఛా, తయా), సహాయమ్ = తోడ్పాటును, కుర్వన్+ఇవ = చేస్తున్నట్లుగా, అచ్యుతమ్ = కృష్ణుని, ప్రతి+అగమత్ = ఎదిరించాడు. (ప్రతి-గమ్-గతౌ - పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అరిష్టాసురుడు కొమ్ములు ముందుకు చాచి కృష్ణుని మీదికి ఉరికాడు. ఆ కొమ్ములు ముందుకు చాపటం ఎలా వుందంటే – ఎటూ తన కొమ్ములు పట్టుకొనే కృష్ణుడు వాటిని పెరికి వేస్తాడు కాబట్టి ఆ కొమ్ములకు

ఆధారమైన శిరస్సు యొక్క భారం (వంచటంలో) కృష్ణునకు లేకుండా చేద్దామని అరిష్టాసురుడు కోరుకొన్నాడు కాబట్టి అలా చాపాడు.

**వి :** 1. శ్లోకం లోని పూర్వార్ధంలో మూలం భాగవత శ్లోకం. ఉత్తరార్ధం కవి సంభావన. మూలంలో ఉత్తరార్ధంలో వున్న ఉపమను తొలగించి ప్రకృతశ్లోకంలోని ఉత్తరార్ధంలో ఉత్ప్రేక్షను జోడించాడు.

శ్లో॥ అగ్రన్యస్తవిషాణాగ్రః స్తబ్ధాసృగ్లోచనోఽచ్యుతమ్ ।
కట్యాక్షిప్యాద్రవత్తూర్ణమింద్రముక్తోఽశనిర్యథా ॥ – భాగవతం 10/36/10

మూలంలోని ఉత్తరార్ధంలోని ఉపమ అరిష్టాసురుని లోని శక్తిని సూచిస్తుండగా ప్రకృత శ్లోకంలో కవి చేసిన ఉత్ప్రేక్ష అంత క్రూరుడిలో కూడా కనిపిస్తున్న కృష్ణభక్తిని ప్రకటిస్తోంది. చెడ్డవాళ్ళ చెడునడవడి కూడా మంచివాళ్ళకు ఒక్కొక్కసారి సహాయకారిగా వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రత్యగమత్ :** | **ప్రత్యగమత్** | ప్రత్యగమతామ్ | ప్రత్యగమన్ |
| | ప్రత్యగమః | ప్రత్యగమతమ్ | ప్రత్యగమత |
| | ప్రత్యగమమ్ | ప్రత్యగమావ | ప్రత్యగమామ. |

*

**శ్లో॥ యదుపతిమృదుహస్తేనోద్ధృతం శృఙ్గయుగ్మం**
**వ్యసుమసురమకార్షీత్తత్క్షణేనేతి యుక్తమ్ ।**
**అపి శిరసి ధృతో యత్స్వీయ ఏవాన్తకాలే**
**కరవశముపయాతః శత్రుతామేతి శత్రోః ॥ 10-8**

**అ :** అరిష్టాసుర సంహారం – నెత్తికెక్కించుకొన్నదే మిత్తికి కారణం కావటం. –మాలిని.

**అ :** యదుపతి–మృదు–హస్తేన ఉద్ధృతం శృంగ–యుగ్మం తత్క్షణేన అసురం వ్యసుమ్ అకార్షీత్ । ఇతి యుక్తమ్. యత్ శిరసి ధృతః స్వీయః అపి అంతకాలే శత్రోః కరవశమ్ ఉపయాతః శత్రుతామ్ ఏవ ఏతి.

**ప్ర :** యదుపతి... హస్తేన : యదుపతి = కృష్ణునియొక్క (యదూనాం పతిః), మృదు = కోమలమైన, హస్తేన = చేతితో (యదుపతేః మృదుః చ అసౌ కరః, తేన), ఉద్ధృతమ్ = పెరకబడిన, శృంగ–యుగ్మమ్ = కొమ్ములజతగల (శృంగయోః యుగ్మం), అసురమ్ = రాక్షసుని, తత్–క్షణేన = ఆ క్షణంలోనే, వి+అసుమ్ = విగత ప్రాణునిగా/ ప్రాణాలు పోయిన వానినిగా (విగతాః అసవః యస్మాత్, తమ్), అకార్షీత్ = చేసింది. (కృ కరణే – పరస్మైపది– లుఙ్–(ప్ర.ఏ.), ఇతి = అనునది, యుక్తమ్ = తగినదే, యత్ = ఎందువల్లనంటే, శిరసి = తలపై, ధృతః = ధరింపబడినది, స్వీయః+అపి = తనదయినను, అంత–కాలే = నశించే వేళలో (అంతస్య కాలః, తస్మిన్), శత్రోః = పగతునియొక్క, కరవశమ్ = చేతి అదుపులోనికి (కరస్య వశమ్), ఉపయాతః = చేరినదై, శత్రుతామ్ ఏవ = శత్రుత్వానే, ఏతి = పొందుతుంది. (ఇ–గతౌ–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన కోమలమయిన చేతితో ఆ వృషభాసురుని కొమ్ములను పెరకివేయగానే ఆ రాక్షసుడు చనిపోయాడు. తగినదే గదా! మన తలపై మనం మోస్తున్నదయినా వినాశకాలం వస్తే శత్రువు చేతికి చిక్కితే అది కూడా మనకు శత్రువే అవుతుంది.

**వి :** 1. మనం ప్రేమతో నెత్తికెక్కించుకొన్నవే కాలం కలిసి రానపుడు మనకే ఎదురు తిరిగి కడగండ్లు కలిగిస్తాయి. వృషభాసురుడివి పుట్టుకతో వచ్చిన కొమ్ములు. తాను తెచ్చిపెట్టుకొన్న కొమ్ములు విష్ణుద్వేషం. ఆ ద్వేషంవలన పరవశమై శరీరం (ఆ కొమ్ములు) ఆ విష్ణువు చేతికి చిక్కినప్పుడు తనంతట తాను పెంచుకొన్న కొమ్ములు (అహంకారం) కూడా విరిగి పోతాయి. అహంకారం పెట్రేగితే నెత్తికి కొమ్ములు వచ్చాయనే మనం వ్యవహరిస్తుంటాం.

2. శ్లోకంలోని మొదటి రెండు పాదాలు విశేషవిషయం. తరువాతి రెండు పాదాలూ సామాన్యవిషయం. సామాన్యవిషయంతో విశేషవిషయాన్ని సమర్థించటంవలన - అవసరం లేక పోయినా - ఇది అర్థాంతరన్యాసాలంకారం. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః' - (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **అకార్షీత్ :** | **అకార్షీత్** | అకార్ష్టామ్ | అకార్షుః |
| | అకార్షీః | అకార్ష్టమ్ | అకార్ష |
| | అకార్షమ్ | అకార్ష్వ | అకార్ష్మ. |

*

**శ్లో॥ యదీయనామ స్మరతాం మునీనా-మరిష్టమాత్యన్తికనాశమేతి ।**
**తదేకనాథం వ్రజమేత్య జైత్ర-మరిష్టపుష్టిర్నహి దృష్టపూర్వా ॥ 10-9**

**అ :** కృష్ణ మాహాత్మ్యవర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** యదీయనామ స్మరతాం మునీనాం అరిష్టమ్ ఆత్యంతికనాశమ్ ఏతి తత్+ఏకనాథం జైత్రం వ్రజమ్ ఏత్య అరిష్ట-పుష్టిః దృష్ట-పూర్వా నహి.

**ప్ర :** యదీయ = ఎవనియొక్క (ఏ కృష్ణునియొక్క), నామ = పేరును (యస్య సంబంధి యదీయం, తచ్చ నామ చ), స్మరతామ్ = తలచుకొనే, మునీనామ్ = ఋషులకు, అరిష్టమ్ = అశుభం (అరిష్టం సూతికాగృహే అశుభే నిమ్బవృక్షే చ - నానార్థరత్నమంజరి - పంక్తి-476-477), ఆత్యంతికనాశమ్ : ఆత్యంతిక = పూర్తిగా, నాశమ్ = నాశనాన్ని, ఏతి = పొందుతుందో (ఇ-గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ), తద్-ఏకనాథమ్ : తద్ = ఆ కృష్ణుడే, ఏక-నాథమ్ = ఒక్కడే పాలకుడుగా నున్నది (స ఏవ ఏకః నాథః యస్య తమ్), జైత్రమ్ = జయశీలమూ అయిన, వ్రజమ్ = గొల్లపల్లెను, ఏత్య = చేరి (ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అరిష్ట = అశుభానికీ/ అరిష్టాసురునికీ, పుష్టిః = వృద్ధి, దృష్టపూర్వా న హి = అంతకుముందు చూడనిది గదా! (పూర్వం దృష్టా)

**తా ॥** కృష్ణ నామస్మరణంచేత మునుల అరిష్టాలు సంపూర్ణంగా నశిస్తాయి. అటువంటి కృష్ణుడు మాత్రమే రక్షకుడుగా వున్న గొల్లపల్లెను చేరి అరిష్టం వృద్ధి చెందటం అంతకు ముందెప్పుడూ కనిపించలేదు. (అశుభానికి కానీ అరిష్టాసురుడికి కానీ అక్కడ వర్ధిల్లే అవకాశం లేదు. అందుకే కూలిపోయాడు.

**వి :** 1. శ్లో॥యస్య స్మరణమాత్రేణ జన్మ సంసారబంధనాత్ ।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥ - అని విష్ణుసహస్రనామస్తుతిలో వింటాం. స్మరణమాత్రంతో జన్మ సంసారబంధాలనుండి విముక్తి లభిస్తుంటే లౌకికాలైన అశుభాలు తొలగిపోవట మెంత పని?

నామస్మరణం భక్తిమార్గాలలో ఒకటి సులభతమమైనది కూడా.

**శ్లో॥హరేకృష్ణ హరేకృష్ణ - కృష్ణకృష్ణ హరేహరే ।**
**హరేరామ హరేరామ - రామరామ హరేహరే ॥**

శ్లో॥ ఇతి షోడశకం నామ్నాం - కలికల్మషనాశనమ్ ।
నాతః పరతరోపాయః - సర్వవేదేషు దృశ్యతే ॥ - కలిసంతరణోపనిషత్తు-2

| | | | |
|---|---|---|---|
| 2. **ఏతి :** | **ఏతి** | ఇతః | యన్తి |
| | ఏషి | ఇథః | ఇథ |
| | ఏమి | ఇవః | ఇమః. |

*

**శ్లో॥ కృష్ణస్య ప్రథమానవీర్యతరణిం దృష్ట్వా సపత్నాఙ్గనాః**
**చిన్తాక్రాన్తమనోరథాః స్వనయనద్వారాఽశ్రుధారా దధుః ।**

**భావిస్వీయపయోధరద్వయమహాశుష్కత్వసమ్ప్రాప్తయే**
**హృద్గోదగ్రపయోవియోగకరణోద్యుక్తా ఇవార్తా భృశమ్ ॥ 10-10**

**అ :** కృష్ణుని ప్రభ వెలిగిపోవటాన్ని గమనించి శత్రుకాంతలు ఆవేదనకు లోనగుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణస్య ప్రథమాన-వీర్య-తరణిం దృష్ట్వా భృశమ్ ఆర్తాః సపత్న+అంగనాః చింతా+ ఆక్రాంత-మనోరథాః భావి-స్వీయ-పయోధర-ద్వయ-మహా-శుష్కత్వ-సంప్రాప్తయే హృద్-గ-ఉదగ్ర-పయః+వియోగ-కరణ-ఉద్యుక్తా ఇవ స్వ-నయన-ద్వారా అశ్రు-ధారాః దధుః.

**ప్ర :** కృష్ణస్య = కృష్ణునియొక్క, ప్రథమాన...తరణిమ్ : ప్రథమాన = వర్ధిల్లుతున్న, వీర్య = ప్రతాపమనే, తరణిమ్ = సూర్యుని (ప్రథమానం వీర్యమేవ తరణిః, తమ్), దృష్ట్వా = చూచి (దృశ్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), భృశమ్ = మిక్కిలిగా, ఆర్తాః సన్తః = కలతబడిన, సపత్న+అంగనాః = శత్రువుల భార్యలు, చింతా+ఆక్రాంత-మనోరథాః : చింతా = ఆవేదనతో, ఆక్రాంత = ఆక్రమింపబడిన, మనోరథాః సత్యః = కోరికలు గలవారై, భావి... సంప్రాప్తయే : భావి = జరుగబోయే, స్వీయ = తమయొక్క, పయోధర = రొమ్ములయొక్క, ద్వయ = జంటకు కలుగబోయే, మహా-శుష్కత్వ = బొత్తిగా ఎండిపోవటాన్ని, సంప్రాప్తయే = పొందటానికై, హృద్గ... ద్యుక్తా : హృద్-గ = హృదయంలోనున్న, ఉదగ్ర = భయంకరమైన, పయో-వియోగ = నీటితో ఎడబాటును, కరణ = కల్పించటానికి, ఉద్యుక్తా ఇవ = ఉద్యమించినవారి వలె, స్వ-నయన-ద్వారా:స్వ= తమయొక్క, నయన-ద్వారా = కళ్ళనుండి, అశ్రధారాః = కన్నీటిని, దధుః = ధరించారు/విడిచారు. (ధా ధారణ పోషణయోః-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని పరాక్రమసూర్యుడు విస్తరించటాన్ని గమనించిన శత్రుకాంతలు బాగా కలతకు లోనయ్యారు. వారి మనోరథాలన్నీ చింతకు లోనయ్యాయి. భవిష్యత్తులో వారి రొమ్ముల జంట బాగా ఎండిపోబోతుందని భావించి దానికి అలవాటు పడటానికి తమ గుండెలలోనున్న భీకరమైన (ఆ సమయంలోని వారి మానసికస్థితిని బట్టి) నీటిని వదిలించుకోవటానికి సిద్ధపడుతున్నట్లుగా కన్నీటిధారలు విడువసాగారు.

**వి :** 1. వీర్యతరణి - రూపకాలంకారం. పరాక్రమంలో తరణిత్వారోపణం. పరాక్రమం ఉపమేయం. తరణి ఉపమానం.

2. శుష్కత్వసంప్రాప్తయే ఉద్యుక్తా ఇవ - శుష్కత్వప్రాప్తికి అలవాటు పడటానికి ఉద్యమించిన వారిలాగా అనటం ఫలోత్ప్రేక్ష. వారి ప్రయత్నానికి ఫలితం అలవాటు పడటం కాబట్టి.

ఇక్కడ ఈ ఉత్ప్రేక్షద్వారా కవి భవిష్యత్కథను సూచిస్తున్నాడు. ఆ భవిష్యత్సూచన ద్వారా కృష్ణుడు శత్రుసంహారం చేస్తే తత్పత్నుల పయోధరాలు శుష్కత్వాన్ని పొందటం అనివార్య విషయం. అది వస్తుధ్వని రూపంగా స్ఫురిస్తుంది. అయితే కవి దానిని మరోరీతిగా '**భావిస్వీయపయోధరమహాశుష్కత్వసంప్రాప్తయే**' అంటూ వాచ్యంగానే చెప్పినందువలన దీనిని పర్యాయోక్తాలంకారమంటారు. '**పర్యాయోక్తం తు గమ్యస్య వచోభంగ్యంతరాశ్రయమ్**' - (కు. 68)

| | | | |
|---|---|---|---|
| 3. **దధుః :** | దదౌ | దధతుః | **దధుః** |
| | దధిథ/దదాథ | దధథుః | దధ |
| | దధౌ | దధివ | దధిమ. |

*

**శ్లో॥ ముకున్దమాజౌ ప్రతి యాస్యతో మే - న జీవితాశా నను విద్యతే శ్వః ।**
**ఇతీవ నిశ్చిత్య జగామ కేశీ - జవేన నన్దవ్రజమశ్వరూపీ ॥ 10-11**

**అ :** కేశి అశ్వరూపంతో గోపకులంలోనికి ప్రవేశించుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఆజౌ ముకుందం ప్రతి యాస్యతః మే శ్వః జీవితాశా న విద్యతే నను ఇతి నిశ్చిత్య ఇవ కేశీ అశ్వరూపీ (సన్) జవేన నందవ్రజం జగామ.

**ప్ర :** ఆజౌ = యుద్ధంలో, ముకుందం ప్రతి = కృష్ణునికి ఎదురుగా, యాస్యతః = పోబోతున్న, మే = నాకు, శ్వః = రేపు, జీవిత+ఆశా = బ్రతుకుమీది ఆశ (జీవితే ఆశా), న విద్యతే = ఉండదు (విద్-సత్తాయాం పరస్మైపది-లట్-ప్ర.ఏ.), నను = నిశ్చితం. ఇతి = అని, నిశ్చిత్య+ఇవ = నిశ్చయించుకొని అన్నట్లు, కేశీ = కేశి అనే రాక్షసుడు, అశ్వ-రూపీ (సన్) = గుఱ్ఱం రూపం దాల్చి (శ్వః న విద్యతే ఇతి అశ్వః - రేపుండనిది - అందుకే జీవితాశ లేకపోవటం, భావానికి తగిన రూపం), జవేన = వేగంగా, నంద-వ్రజమ్ = గోపకులానికి, జగామ = వెళ్ళాడు (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని యుద్ధంలో ఎదిరింపబోతున్న తనకు ఇక రేపు అనేది ఉండదని భావించి కేశి అనే రాక్షసుడు గుఱ్ఱం రూపాన్ని ధరించి గోపకులానికి వెళ్ళాడు.

**వి :** 1.కేశి కంసుని తమ్ముడు. గతజన్మలో హయగ్రీవాసురుడు. నరమాంసభక్షకుడై బృందావనంలో సంచరించేవాడు.

శ్లో॥ యోఽ ప్యసౌ హయవిక్రాంతో హయగ్రీవ ఇతి స్మృతః ।
కేశీ నామ హయోజాతః స తస్యైవ జఘన్యజః ॥

శ్లో॥ స దుష్టో ప్రేషితపుటః కేసరీ నిరవగ్రహః ।
బృందావనే వసత్యేకో నృణాం మాంసాని భక్షయన్ ॥ - హరివంశం 55/70,71

| | | | |
|---|---|---|---|
| 2. **విద్యతే :** | **విద్యతే** | విద్యేతే | విద్యన్తే |
| | విద్యసే | విద్యేథే | విద్యధ్వే |
| | విద్యే | విద్యావహే | విద్యామహే |
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ స విస్తృతాస్యః కిల విశ్వమూర్తిం - గ్రసిష్ణురభ్యాగమదగ్ర్యకీర్తిమ్ ।**
**అదో యదోర్వంశమణిః స్వపాణిం - నివేశయన్నీప్సితమేవ మేనే ॥ 10-12**

**అ :** కేశి కృష్ణుల పోరు. -ఉపేంద్రవజ్ర.

**అ :** అగ్ర్య-కీర్తిం విశ్వ-మూర్తిం గ్రసిష్ణుః సః విస్తృత-ఆస్యః(సన్) అభ్యాగమత్. యదోఃవంశ-మణిః స్వ-పాణిం నివేశయన్ అదః ఈప్సితమ్ ఏవ మేనే.

**ప్ర :** అగ్ర్య-కీర్తిమ్ = మేటి పేరు గల (అగ్ర్యా కీర్తిః యస్య, తమ్), విశ్వ-మూర్తిమ్ = జగత్స్వరూపుడైన కృష్ణుని (విశ్వం మూర్తిః యస్య, తమ్), గ్రసిష్ణుః = మ్రింగ గోరిన వాడై (గ్రసితమ్ ఇచ్ఛుః), సః = ఆ కేశి, విస్తృత+ఆస్యః (సన్) : విస్తృత = తెరచిన, ఆస్యః (సన్) = నోరు గలవాడై (విస్తృతమ్ ఆస్యం యస్య సః), అభి+ఆగమత్ = ఎదురువచ్చాడు (అభి+ఆ+గమ్ గతౌ-లజ్-ప్ర.ఏ.), యదోః-వంశ-మణిః = యదువంశశ్రేష్ఠుడైన కృష్ణుడు, స్వ-పాణిమ్ = తన చేతిని (స్వ స్య పాణిం తమ్), నివేశయన్ = (నోటిలో) దూరుస్తూ (ని-విశ్-ణిచ్-ధాతువుపై శతృ ప్రత్యయం), అదః = ఆ కేశిరాకడను, ఈప్సితమ్-ఏవ = ఇష్టంగానే, మేనే = భావించాడు. (మను-అవబోధనే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు యదుకులశ్రేష్ఠుడు. విశ్వమూర్తి. అది గ్రహించక కేశి కృష్ణుని మ్రింగాలని నోరు తెరిచి మందుకురికాడు. అది తనకు అనుకూలంగానే భావించి కృష్ణుడు ఆ కేశి నోటిలో తన చేయిపెట్టాడు.

**వి :** 1. సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువమ్ ।
విశ్వం నారాయణం దేవమక్షరం పరమం పదమ్ ॥
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిమ్ ।
విశ్వమేవేదం పురుషస్తద్విశ్వముపజీవతి ॥ – నారాయణసూక్తమ్.

అలా విశ్వమూర్తి కృష్ణుడు. అంతటి వాడిని తన నోట పట్టాలనుకోవటం కేశి అజ్ఞానం. దాని ఫలితం వెంటనే అనుభవిస్తాడు.

2. కృష్ణుని విశ్వమూర్తి అనటం ద్వారా ఆయన స్వరూపం కొలతల కందనంతటిది అని స్పష్టం. కేశి నోరు ఎంత తెరచినా చిన్నదే. ఆ నోరు ఆధారం. ఆ నోటిలో కృష్ణుడు పట్టాలి. కృష్ణుడు ఆధేయం. ఆధారం కన్న ఆధేయం పెద్దదయినట్లు వర్ణిస్తే అది **అధికాలంకారం**. '**అధికం పృథులాధారాద్యదాధేయాధిక్యవర్ణనమ్**' – (కు. 95)

| | | | |
|---|---|---|---|
| 3. **అభ్యాగమత్ :** | **అభ్యాగమత్** | అభ్యాగమతామ్ | అభ్యాగమన్ |
| | అభ్యాగమః | అభ్యాగమతమ్ | అభ్యాగమత |
| | అభ్యాగమమ్ | అభ్యాగమావ | అభ్యాగమామ |
| **మేనే :** | **మేనే** | మేనాతే | మేనిరే |
| | మేనిషే | మేనాథే | మేనిధ్వే |
| | మేనే | మేనివహే | మేనిమహే. * |

## శ్లో॥ స కేశిదైత్యస్య ముఖే మురారి-ర్నివేశయామాస కరం స్వకీయమ్ ।
## తదీయహార్దామ్బరమధ్యసంస్థ-మసుం బహిష్కర్తుమివేహమానః ॥ 10-13

**అ :** కేశినోట కృష్ణుడు చేయి జొనుపుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః మురారిః తదీయ-హార్ద+అంబర-మధ్య-సంస్థమ్ అసుం బహిష్కర్తుమ్ ఈహమానః ఇవ కేశిదైత్యస్య ముఖే స్వకీయం కరం నివేశయామాస.

**ప్ర :** సః = ఆ, మురారిః = కృష్ణుడు (మురః అరిః యస్య సః/మురస్య అరిః), తదీయ... సంస్థమ్ : తదీయ = ఆ కేశియొక్క, హార్ద+అంబర = హృదయాకాశంయొక్క, మధ్య = మధ్యలో, సంస్థమ్ = నిలిచియున్న (తదీయే హృది స్థితస్య అంబరస్య మధ్యే సంస్థః తమ్), అసుమ్ = ప్రాణాన్ని, బహిః+కర్తుమ్ = వెలిపరచటానికి (బహిః +కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఈహమానః+ఇవ = కోరుతున్న వానిలాగా (ఈహ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), కేశి-దైత్యస్య = కేశి రాక్షసునియొక్క (కేశి ఇతి దైత్యః, తస్య), ముఖే = నోటిలో, స్వకీయమ్ = తనయొక్క, కరమ్ = చేతిని, నివేశయామాస = చొనిపాడు. (ని-విశ్-ప్రవేశనే-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ కృష్ణుడు కేశి రాక్షసుని నోటిలో తన చేతిని ప్రవేశపెట్టాడు. అది అతని హృదయాకాశ మధ్యంలోనున్న ప్రాణాన్ని వెలువరించాలన్న కోరికతో చేసిన పనిలా వుంది.

**వి :** 1. ప్రాణాలు పోవాలన్నా, ప్రాణాలు పోయాలన్నా కృష్ణకరస్పర్శ చాలు.

| | | | |
|---|---|---|---|
| 2. **నివేశయామాస :** | **నివేశయామాస** | నివేశయామాసతుః | నివేశయామాసుః |
| | నివేశయామాసిథ | నివేశయామాసథుః | నివేశయామాస |
| | నివేశయామాస | నివేశయామాసివ | నివేశయామాసిమ. * |

**శ్లో॥ తద్ధైర్యం జరయన్ బలం చ శమయన్నఙ్గం ముహుః కమ్పయ-**
**న్నక్షేభ్యోఽపటుతాం దిశన్ దృఢతరాన్ దన్తాన్ బలాత్పాటయన్ ।**
**తచ్ఛ్వాసం స్థలయన్ జరేవ బహుశస్తద్యౌవనం దూరయన్**
**హస్తోఽసౌ వవృధేఽన్తరన్తకపురాతిథ్యం ద్విషః సూచయన్ ॥ 10-14**

**అ :** కేశిరాక్షసునికుక్షిలో కృష్ణునిచేయి వృద్ధిపొందుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అసౌ హస్తః జరా+ఇవ తద్-ధైర్యం జరయన్ బలం చ శమయన్ అంగం ముహుః కంపయన్ అక్షేభ్యః అపటుతాం దిశన్ దృఢతరాన్ దంతాన్ బలాత్ పాటయన్ తత్+శ్వాసం స్థలయన్ బహుశః తద్+యౌవనం దూరయన్ ద్విషః అన్తక-పుర+ఆతిథ్యం సూచయన్ అంతః వవృధే.

**ప్ర :** అసౌ = ఆ, హస్తః=(కృష్ణుని) చేయి, జరా+ఇవ = ముసలితనంవలె (ఇవేన సమాసో విభక్త్యలోపశ్చ- వార్తికం 1236), తద్-ధైర్యమ్ = ఆ రాక్షసుని ధైర్యాన్ని, జరయన్ = నశింపజేస్తూ, బలమ్ = శక్తిని, శమయన్ = అణచివేస్తూ, అంగమ్ = శరీరాన్ని, ముహుః = మాటిమాటికి, కంపయన్ = వణికిస్తూ, అక్షేభ్యః = ఇంద్రియాలకు (ఇంద్రియం త్వక్షిరేతసోః -నానార్థరత్నమాలా-పంక్తి-1844), అపటుతామ్ = అసమర్థతను (పటుః న భవతీతి అపటుః తస్య భావః తామ్), దిశన్ = చూపుతూ, దృఢతరాన్ = మరీ గట్టివైన, దంతాన్ = పళ్ళను, బలాత్ = ఒత్తిడితో, పాటయన్ = రాలుస్తూ, తత్+శ్వాసమ్ = అతని ఊర్పును, స్థలయన్ = తడబడజేస్తూ, బహుశః = అనేకరీతులుగా, తద్+యౌవనమ్ = అతని పడుచుదనాన్ని, దూరయన్ = దూరంచేస్తూ, ద్విషః = శత్రువగు కేశికి, అంతక-పుర-ఆతిథ్యమ్ : అంతక = యముని యొక్క, పుర = నగరానికి, ఆతిథ్యమ్ = అతిథిగా వెళ్ళటాన్ని (అంతకస్య పురం తస్య ఆతిథ్యం తత్), సూచయన్ = సూచిస్తూ, అంతః = (కడుపు) లోపల, వవృధే = వృద్ధి పొందింది. (వృధ్ వృద్ధౌ ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కేశిదైత్యుని నోటిలోనికి ప్రవేశించిన ఆ చేయి ఆ రాక్షసుని ధైర్యాన్ని సడలిస్తూ, శక్తిని అణచివేస్తూ, శరీరాన్ని వణికిస్తూ, ఇంద్రియ పటుత్వాన్ని తొలగిస్తూ, గట్టి పళ్ళను బలా-త్కారంగా రాలగొడుతూ, ఊర్పును తడబడజేస్తూ, యౌవనాన్ని దూరం చేస్తూ, యమపురికి అతిథిగా వెళ్ళబోవటాన్ని సూచిస్తూ ముసలితనంలా ప్రవర్తించి లోన వృద్ధిపొందసాగింది.

**వి :** 1. కేశిదైత్యుని కుక్షిలో కృష్ణుని చేయి వృద్ధి పొందటాన్ని పోతన మాటల్లో చూద్దాం-

శ్లో॥ దంభోళిప్రతిమానకర్కశమహోద్యద్వామదోఃస్తంభమున్
శుంభల్లీల నఘారి వానిరదముల్ చూర్ణంబులై రాలఁగా
గంభీరంబుగఁ గుక్షిలోఁ జొనిపి వీఁకన్ వృద్ధి ఁబొందింపుచున్
గుంభించెన్ బవనంబు పిక్కటిలఁ దత్కుక్షిన్ నరేంద్రోత్తమా! - పోతనభాగవతము 10/1171

2. శ్లోకంలో జరేవ - అని ముసలితనంతో చేతిని పోల్చటం ఉపమాలంకారం. వార్ధక్య లక్షణాలన్నీ ముసలితనం లేకపోయినా ఆ కేశిలో కనిపింపజేశాడు కృష్ణుడు.

| 3. **వవృధే :** | **వవృధే** | వవృధాతే | వవృధిరే |
|---|---|---|---|
| | వవృధిషే | వవృధాథే | వవృధిధ్వే |
| | వవృధే | వవృధివహే | వవృధిమహే. |

*

**శ్లో॥ స కృష్ణదోర్దణ్డవరాభివృద్ధ్యా - ఖలాగ్రగణ్యో విససర్జ కాయమ్ ।**
**కరోదయాన్ వీక్ష్య పరస్య జాతా-నసూనసూయాభిరతాస్త్యజన్తి ॥ 10-15**

అ : కేశి మరణం. –ఉపేంద్రవజ్ర.

అ : ఖల+అగ్ర–గణ్యః సః కృష్ణ–దోః+దండ–వర+అభివృద్ధ్యా కాయం విససర్జ. పరస్య జాతాన్ కర+ఉదయాన్ వీక్ష్య అసూయా+అభిరతాః అసూన్ త్యజన్తి.

ప్ర : ఖల+అగ్ర–గణ్యః : ఖల = చెడ్డవారిలో, అగ్ర–గణ్యః = మొదట లెక్కింపదగిన (ఖలేషు అగ్రే గణ్యః), సః = ఆ కేశి, కృష్ణ... వృద్ధ్యా: కృష్ణ = కృష్ణునియొక్క, దోః+దండ–వర = దండంవంటి మేటిబాహువుయొక్క, అభివృద్ధ్యా = ఎదుగుదలచేత, కాయమ్ = శరీరాన్ని, విససర్జ = విడిచాడు. (వి–సృజ్ విసర్గే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), పరస్య = ఇతరునికి, జాతాన్ = కలిగిన, కర+ఉదయాన్ = ఆయ ప్రాప్తిని (చేతి ఎదుగుదలను), వీక్ష్య = చూసి, అసూయా+అభిరతాః : అసూయా = తప్పుపట్టడంలో, అభిరతాః = ఆసక్తులైనవారు (అసూయాయామ్ అభిరతాః), అసూన్ = ప్రాణాలను, త్యజన్తి = విడుస్తారు. (త్యజ హానౌ పరస్మైపది–లట్–ప్ర.బ.)

తా ॥ కృష్ణునియొక్క ఆ దోర్దండాభివృద్ధితో చెడ్డవారిలో ప్రథమగణ్యుడయిన కేశి శరీరాన్ని విడిచాడు (మరణించాడు). అవును మరి. ఇతరుల కరాభివృద్ధిని (కరం = ఆదాయం, చేయి) చూసి అసూయపడేవాళ్ళు ప్రాణాలు విడుస్తారు.

వి : 1. కేశి మరణం పోతన పదాలలో –

ఆ. ఘోటకాసురేంద్రుకుక్షిలోఁ గృష్ణుని – బాహు వధికమయినఁబట్టలేమిఁ
బగిలి దోసపండు పగిదిఁ దద్దేహంబు – వసుమతీశ ! రెండు వ్రక్క లయ్యె.

– పోతనభాగవతము 10/1173

2. కృష్ణుని కరాభివృద్ధిని చూసి కేశి అసూయాగ్రస్తుడయ్యాడు. అందుకే ప్రాణాలు విడిచాడు. ఇతరుల అభివృద్ధిని చూసి సహింపలేనివారు ప్రాణాలయినా పోగొట్టుకుంటారు గదా! శ్లోకంలో పూర్వార్ధం విశేషం. ఉత్తరార్ధం సామాన్యం. రెండింటి కలయిక అర్థాంతరన్యాసాలంకారం. **ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః** – (కు.122)

3. **విససర్జ** : 10–1వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **త్యజన్తి :** | త్యజతి | త్యజతః | **త్యజన్తి** |
| | త్యజసి | త్యజథః | త్యజథ |
| | త్యజామి | త్యజావః | త్యజామః. |

*

**శ్లో॥ అథో విపక్షం కుశలేన నిన్దన్ – సురర్షిరభ్యేత్య శశంస కంసమ్ ।**
**పితా న సోఽయం తవ భోజరాజ–స్త్వమఙ్గ! మాయామయజారజాతః ॥ 16**

అ : నారదుడు కంసుని కలిసి ఆయన జన్మకు సంబంధించిన రహస్యాన్ని తెలియజేయటం. –ఉపేంద్రవజ్ర.

అ : అథో సుర+ఋషిః కుశలేన విపక్షం నిందన్ కంసమ్ అభ్యేత్య శశంస. అంగ! సః అయం భోజరాజః తవ పితా న. త్వం మాయామయ–జార–జాతః (అసి).

ప్ర : అథో = అటు తర్వాత, సుర+ఋషిః = దేవర్షి అయిన నారదుడు (సురశ్చ అసౌ ఋషిః), కుశలేన = సమర్థతతో (పర్యాప్తిక్షేమపుణ్యేషు కుశలం – నానార్థమంజరి–పంక్తి–1709,10), విపక్షమ్ = శత్రువర్గాన్ని, నిందన్ = తిడుతూ, కంసమ్ = కంసుని కడకు, అభ్యేత్య = వచ్చి (అభి–ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శశంస = చెప్పాడు. (శంస స్తుతౌ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), అంగ = కంసా!, సోఽయమ్ = ఆ ఈ, భోజరాజః = ఉగ్రసేనుడు, తవ = నీ యొక్క, పితా = తండ్రి, న = కాదు. త్వమ్ = నీవు, మాయామయ–జార–జాతః : మాయామయ = మాయావి అయిన, జార = జారునకు (ఉపపతికి) జాతః (అసి) = పుట్టినవాడవు.

**తా ॥** ఆ తరువాత ఒకానొకప్పుడు దేవర్షి అయిన నారదుడు శత్రుపక్షాన్ని నేర్పుగా నిందిస్తూ "కంసా! ఈ భోజరాజు ఉగ్రసేనుడు నీ తండ్రి కాదు. మాయావి అయిన ఉపపతికి (ద్రుమిళునికి) పుట్టినవాడవు నీవు." అని కంసునికి చెప్పాడు.

**వి :** 1. ద్రుమిళుడనే గంధర్వజాతికి చెందిన అందగాడికి పుట్టినవాడు కంసుడు. ఆ ద్రుమిళుడు మాయావి కావటంతో ఉగ్రసేనుని రూపంలో వచ్చి ఆ రాణితో కలిసినందువల్ల పుట్టినవాడు కంసుడు–

శ్లో॥ స ఔగ్రసేనే జనితోఽసురేణ – క్షేత్రే హి తద్రూపధరేణ మాయయా ।
గంధర్వజేన ద్రుమిళేన నామ్నా – కంసో జితో యేన వరాచ్ఛచీపతిః ॥

– మహాభారతతాత్పర్యనిర్ణయః – 11/199

ఈ ద్రుమిళ సమాగమానికి సంబంధించిన కథా సంవిధానాన్ని 'పర్వ'లో చూడవచ్చు. (పర్వ (నవల) పుటలు 290–296) ఈ నవలలో రచయిత (భైరప్ప) ఆమె ఇష్టపూర్వకంగా ద్రుమిళునితో సంగమించినట్లు వ్రాశారు. కానీ హరివంశంలో అలా లేదు. తన భర్త అనియే ఆమె భావించినట్లూ, ద్రుమిళుడు వాస్తవ మెరిగించిన తరువాత అతనిని నిందించినట్లూ కనిపిస్తుంది. ఆమె ద్రుమిళుని నిందించిన మాటలు–

శ్లో॥ ధిక్ తే వృత్తం సుదుర్వృత్త యః సర్వా నిందసి స్త్రియః ।
సన్తి స్త్రియో నీచవృత్తాః సన్తి చైవ పతివ్రతాః ॥

శ్లో॥ యాస్త్వేకపత్న్యః శ్రూయన్తేఽరున్ధతీప్రముఖాః స్త్రియః ।
ధృతా యాభిః ప్రజాస్సర్వా లోకాశ్చైవ కులాధమ ॥

శ్లో॥ యస్త్వయా మమ పుత్రో వై దత్తో వృత్తవినాశనః ।
న మే బహుమతస్త్వేషః శృణు చాపి యదుచ్యతే ॥

శ్లో॥ ఉత్పత్స్యతి పుమాన్ నీచ పతివంశే మమాద్యయః ।
భవిష్యతి స తే మృత్యుర్యశ్చ దత్తస్త్వయా సుతః ॥ – హరివంశం –విష్ణుఖండం–28/105–108

| | | | |
|---|---|---|---|
| 2. **శశంస :** | **శశంస** | శశంసతుః | శశంసుః |
| | శశంసిథ | శశంసథుః | శశంస |
| | శశంస | శశంసివ | శశంసిమ. |

*

**శ్లో॥ తవానుగా యే భువి దానవాస్తే – త్వమగ్రగణ్యోఽసురసఞ్చయేషు ।**
**సురేశ్వరోఽసౌ వసుదేవసూనుః – సురాశ్చ తత్పక్షగతాః సమస్తాః ॥ 10–17**

**అ :** నారదమహర్షి కంసునికి తనస్థితిని వివరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** భువి యే తవ అనుగాః తే దానవాః త్వమ్ అసుర–సంచయేషు అగ్రగణ్యః అసౌ వసుదేవసూనుః సుర+ఈశ్వరః సమస్తాః సురాః చ తత్–పక్ష–గతాః.

**ప్ర :** భువి = లోకంలో, యే = ఎవరయితే, తవ = నీయొక్క, అనుగాః = అనుచరులో, తే = ఆ, దానవాః = రాక్షసులు, త్వమ్ = నీవు, అసుర–సంచయేషు = రాక్షససమూహాలలో (అసురాణాం సంచయాః, తేషు), అగ్ర–గణ్యః = మొదట లెక్కింపదగిన వాడవు (అగ్రే గణ్యః), అసౌ వసుదేవ–సూనుః = ఆ వసుదేవసుతుడు (కృష్ణుడు), సుర+ఈశ్వరః : సుర = దేవతలలో, ఈశ్వరః = శ్రేష్ఠుడు (సురాణామ్ ఈశ్వరః), సమస్తాః = మొత్తం, సురాః చ = దేవతలునూ, తత్–పక్ష–గతాః : తత్ = ఆ కృష్ణునియొక్క, పక్ష = ఆత్మీయులలో, గతాః = చేరిన వారే (తస్య పక్షః, తస్మిన్ గతాః), (ఇతి శశంస = అని చెప్పాడు)

**తా ॥** లోకంలో నిన్ను అనుసరించే వారందరూ దానవులే. అసురసమూహాలలో నువ్వు అగ్రగణ్యుడవు. ఆ వసుదేవకుమారుడు దేవతా శ్రేష్ఠుడు. దేవతలందరూ ఆ పక్షానికి చెందిన వారే.

**వి : 1.** శ్లో॥ నందాద్యా యే వ్రజే గోపా యాశ్చామీషాం చ యోషితః ।
వృష్ణయో వసుదేవాద్యా దేవక్యాద్యా యదుస్త్రియః ॥

శ్లో॥ సర్వే వై దేవతాప్రాయా ఉభయోరపి భారత ।
జ్ఞాతయో బంధుసుహృదో యే చ కంసమనువ్రతాః ॥

**శ్లో॥ అసురా సర్వ ఏవైతే లోకోపద్రవకారిణః ।** – భాగవతం 10/1/62-64

(ఈ పంక్తి చాలా ప్రతులలో కనిపించటం లేదు. కానీ అది ఉండటమే ఉచితం.) *

**శ్లో॥ ధృతః స గర్భే వసుదేవపత్న్యా – తతః ప్రసూతస్తవ మన్దిరేఽస్మిన్ ।**
**త్వదీయభీత్యాఽఽనకదున్దుభిస్తం – నినాయ మిత్రాలయమాలయాత్ తే ॥10-18**

**అ :** కృష్ణుని పుట్టుకను, గోపకులం చేరుటను వివరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః వసుదేవపత్న్యా గర్భే ధృతః. తతః అస్మిన్ తవ మందిరే ప్రసూతః ఆనకదుందుభిః త్వదీయ భీత్యా తం తే ఆలయాత్ మిత్ర+ఆలయం నినాయ.

**ప్ర :** సః = ఆ నారాయణుడు, వసుదేవ–పత్న్యా = వసుదేవుని భార్య (దేవకి) చేత (వసుదేవస్య పత్నీ, తయా), గర్భే = గర్భమందు, ధృతః = ధరింపబడ్డాడు. తతః = ఆపై, అస్మిన్ = ఈ, తవ = నీయొక్క, మందిరే = ఇంటిలో, ప్రసూతః = పుట్టాడు. ఆనకదుందుభిః = వసుదేవుడు (వసుదేవోఽస్య జనకః స ఏవానకదుందుభిః, అమరకోశః – స్వర్గ–22), త్వదీయ–భీత్యా : త్వదీయ= నీకు సంబంధించిన, భీత్యా = భయంతో (త్వదీయా చ సా భీతిః, తయా), తమ్ = అతనిని, తే = నీ యొక్క, ఆలయాత్ = ఇంటినుండి, మిత్ర+ఆలయమ్ = మిత్రుని ఇంటికి, నినాయ = కొనిపోయాడు. (నీ ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), (ఇతి శశంస = అని చెప్పాడు.)

**తా ॥** ఆ నారాయణుని దేవకీదేవి గర్భాన ధరియించింది. ఆపై నీ ఇంటిలో పుట్టాడు. నీ భయం కారణంగా వసుదేవుడు ఆ శిశువును నీ ఇంటినుండి మిత్రుని ఇంటికి కొనిపోయాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. నినాయ :** | **నినాయ** | నిన్యతుః | నిన్యుః |
| | నినయిథ/నినేథ | నిన్యథుః | నిన్య |
| | నినాయ/నినయ | నిన్యివ | నిన్యిమ. |

*

**శ్లో॥ ఇతీరితే శౌరివధోద్యతం తం – నిషిధ్య బుద్ధ్యా స తు దేవయోగీ ।**
**న వారయామాస తదీయబన్ధం – మతం ముకున్దస్య తదా విజానన్ ॥ 19**

**అ :** కంసుని ప్రతిక్రియను నారదుడు గమనించి యథోచితంగా ప్రవర్తించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఇతి ఈరితే (సతి) శౌరి–వధ+ఉద్యతం తం సః తు దేవ–యోగీ బుద్ధ్యా నిషిధ్య తదా తదీయ–బంధం ముకుందస్య మతం విజానన్ న వారయామాస.

**ప్ర :** ఇతి = ఈ విధంగా, ఈరితే (సతి) = (నారదునిచే) చెప్పబడగా, శౌరి–వధ+ఉద్యతమ్ : శౌరి = వసుదేవుని, వధ = చంపుటకై, ఉద్యతమ్ = సిద్ధపడిన, తమ్ = ఆ కంసుని, సః తు = ఆ, దేవ–యోగీ = నారదుడు, బుద్ధ్యా = తెలివితో, నిషిధ్య = ఆపి (ని–సిధ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తదీయ–బంధమ్ : తదీయ = వసుదేవునియొక్క, బంధమ్ = బంధించటాన్ని, తదా = ఆ సమయంలోని, ముకుందస్య= కృష్ణునియొక్క,

మతమ్ = అభిప్రాయాన్ని, విజానన్ = తెలిసి (వి-జ్ఞా ధాతువుపై శతృ ప్రత్యయం), న వారయామాస = నివారించలేదు. (వృ-ఆవరణే-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** నారదుని మాటలు విని కంసుడు వసుదేవుని చంపడానికి సిద్ధపడ్డాడు. నారదుడు తెలివిగా ఆ పూనికను ఆపాడు. అయితే వసుదేవుని బంధించే విషయంలో మాత్రం నారదుడు అడ్డుపడలేదు. ఎందుకంటే కృష్ణుని అభిప్రాయం అప్పుడలా వుండదని నారదుడు భావించాడు.

**వి :** 1. కృష్ణుడు కంసుని - తన మేనమామను - చంపాలి. చంపటానికి తగిన కారణం కావాలి. వసుదేవుని బంధిస్తే ఆ కారణం సరిపోవచ్చు. నారదుడు దానిని కూడా ఆపితే అప్పుడు కృష్ణుడికి చంపదగిన కారణ ముండదు. అందుకే నారదుడు వసుదేవుని బంధిస్తున్న కంసుని ఆపలేదు. చంపే ప్రయత్నాన్ని మాత్రమే వ్యతిరేకించాడు.

శ్లో॥ వినాఽ పరాధాద్ధి న తతో గరీయసో - న మాతులో వధ్యతామేతి విష్ణోః ।
లోకస్య ధర్మాననువర్తతోఽతః - పిత్రోర్వ్విరోధార్థమువాచ వాయుః ॥

- మహాభారతతాత్పర్యనిర్ణయః - 12/4

| | | | |
|---|---|---|---|
| 2. **వారయామాస :** | **వారయామాస** | వారయామాసతుః | వారయామాసుః |
| | వారయామాసిథ | వారయామాసథుః | వారయామాస |
| | వారయామాస | వారయామాసివ | వారయామాసిమ. |

*

**శ్లో॥ ఋషిస్తమేవం రచితాపరాధం - విధాయ కృష్ణాన్తికమాజగామ ।**
**యథాపరాధం ఖలదణ్డకర్తుః - పురః పురారిప్రతిమస్తమూచే ॥ 10-20**

**అ :** నారదుడు కంసుని దగ్గరునుండి కృష్ణుని కడకేగుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఋషిః తమ్ ఏవం రచిత+అపరాధం విధాయ కృష్ణ+అన్తికమ్ ఆజగామ. పుర+అరి-ప్రతిమః సః యథా+అపరాధం ఖల-దండ-కర్తుః పురః తమ్ ఊచే.

**ప్ర :** ఋషిః = నారదుడు, తమ్ = ఆ కంసుని, ఏవమ్ = ఈ రీతిగా, రచిత+అపరాధమ్ = తప్పు చేసిన వానినిగా (కృతః అపరాధః యేన సః), విధాయ = చేసి, కృష్ణ+అన్తికమ్ = కృష్ణుని దగ్గరకు, ఆజగామ = వచ్చాడు. (ఆ-గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), పుర+అరి-ప్రతిమః : పుర+అరి = శివునితో, ప్రతిమః = పోలిక గల (పురారిః ప్రతిమా యస్య సః), సః = ఆ నారదుడు, యథా+అపరాధమ్ = తప్పునకు మించకుండా (తప్పును బట్టి), ఖల-దండ-కర్తుః : ఖల = చెడ్డవారిని, దండకర్తుః = శిక్షించే కృష్ణునియొక్క, పురః = ఎదురుగా, తమ్ = ఆ కంసుని గూర్చి, ఊచే = చెప్పాడు. (వచ పరిభాషణే ఆత్మనేపది -లిట్-ప్ర.ఏ.)

**తా ॥** నారదుడు ఆ రీతిగా కంసుని చేత తప్పు చేయించి (వసుదేవుని బంధించటం) ఆ తరువాత కృష్ణుని దగ్గరకు వెళ్ళాడు. శివస్వరూపుడైన నారదుడు తప్పును బట్టి శిక్షించే కృష్ణునితో కంసుని గురించి చెప్పాడు.

**వి :** యథాపరాధదండన - తప్పును బట్టి శిక్షించటం మన్నది చాలా క్లిష్టమైన పని. రఘువంశపు రాజుల ఘనతకు అది కూడా ఒక కారణమని కాళిదాసు భావించాడు.

శ్లో॥ యథావిధిహుతాగ్నీనాం యథాకామార్చితార్థినామ్ ।
**యథాపరాధదండానాం** యథాకాలప్రబోధినామ్ ॥ - రఘువంశం-1/6

| | | | |
|---|---|---|---|
| 2. **ఆజగామ :** | **ఆజగామ** | ఆజగ్మతుః | ఆజగ్ముః |
| | ఆజగమిథ/అజగన్థ | ఆజగ్మథుః | ఆజగ్మ |
| | ఆజగామ/అజగమ | ఆజగ్మివ | ఆజగ్మిమ |

| | | | |
|---|---|---|---|
| **ఊచే :** | **ఊచే** | ఊచాతే | ఊచిరే |
| | ఊచిషే | ఊచాథే | ఊచిధ్వే |
| | ఊచే | ఊచివహే | ఊచిమహే. |

*

**శ్లో॥ తథాఽపి పూర్ణస్య న కృత్యమస్తీ-త్యసౌ భవిష్యత్ సకలం బభాషే ।**
**ఋతం విధాతుం వచనం మదీయ-మపీహ కార్యాణి కరిష్యతీతి ॥ 10-21**

**అ :** పూర్ణకాముడైన కృష్ణునితో నారదుడు భవిష్యత్కథను చెప్పటంలోని ఔచిత్యం.

**అ :** తథా+అపి పూర్ణస్య కృత్యం న అస్తి ఇతి అసౌ మదీయం వచనం ఋతం విధాతుమ్ అపి ఇహ కార్యాణి కరిష్యతి ఇతి భవిష్యత్ సకలం బభాషే.

**ప్ర :** తథా+అపి = కంసుడు తప్పు చేసినా, పూర్ణస్య = అన్నీ పొందిన కృష్ణునకు, కృత్యమ్ = కర్తవ్యం, న+అస్తి = లేదు (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఇతి = అని, అసౌ = ఆ నారదుడు, మదీయమ్ = నా యొక్క, వచనమ్ = మాటను, ఋతం విధాతుం-అపి = నిజం చేయటానికి అయినా, ఇహ = లోకంలో, కరిష్యతి = చేయగలడు, ఇతి = అని, భవిష్యత్ = జరుగబోయే, సకలమ్ = మొత్తాన్నీ, బభాషే = చెప్పాడు. (భాష్ వ్యక్తాయాం వాచి-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా॥** కృష్ణుడు పూర్ణకాముడు. అనగా అన్ని కోరికలు తీరిపోయినవాడు కాబట్టి ఇప్పుడు కోరికలు లేవు. లేదా అసలు కోరవలసిన దేమీ లేనివాడు. కాబట్టి కంసాదులు తప్పు చేసినా కృష్ణుడు ప్రతిక్రియ చేయటానికి సిద్ధపడడేమో అని నారదుడు జరగబోయేదంతా చెప్పాడు. (దానిలో కృష్ణుని కర్తృత్వాన్ని కూడా కలిపి). అప్పుడయినా తన మాటను నిజం చేయాలన్న తలంపుతో కృష్ణుడు దుష్టశిక్షణకు పూనుకొంటాడని నారదుని భావం.

**వి :** 1. రాబోయే రోజుల్లో కృష్ణుడు అర్జునునికి హితాన్ని ఉపదేశిస్తూ స్వకర్తవ్యతను గూర్చి ఇలా అంటాడు.

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ - భగవద్గీత 3/22

తనకు పొందవలసినది ఏమీ లేకపోయినా తాను ఇతరులకు మార్గదర్శకంగా నిలవటానికి కర్మను ఆచరిస్తూనే వుంటానని కృష్ణవచనం. అయితే అది భవిష్యత్తులో చెప్పబోతున్న మాట. కాబట్టి ఇప్పుడు నారదుడు సంశయించటంలో ఔచిత్యం లేకపోలేదు.

| | | | |
|---|---|---|---|
| 2. **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **బభాషే:** | **బభాషే** | బభాషాతే | బభాషిరే |
| | బభాషిషే | బభాషాథే | బభాషిధ్వే |
| | బభాషే | బభాషివహే | బభాషిమహే. |

*

**శ్లో॥ ఇతీరయిత్వాఽబ్జజనేః సుతే గతే - వ్యదృశ్యతారిప్రహితః శ్వఫల్కజః ।**
**మృగాధిపగ్రస్తవిముక్తవీక్షిత-స్వవర్గహృష్యన్మృగశావవిభ్రమః ॥ 10-22**

**అ :** నారదనిర్గమనం - అక్రూరప్రవేశం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇతి ఈరయిత్వా అబ్జజనేః సుతే గతే (సతి) అరిప్రహితః మృగ+అధిప-గ్రస్త-విముక్త-వీక్షిత-స్వ-వర్గ-హృష్యత్-మృగ-శావ-విభ్రమః శ్వఫల్క-జః వ్యదృశ్యత.

**ప్ర :** ఇతి = అలా, ఈరయిత్వా = పలికి (ఈర్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), అబ్జ–జనేః = బ్రహ్మయొక్క (అప్సు జాయాత ఇతి అబ్జం, తస్మాత్ జనిః యస్య, తస్య), సుతే = కుమారుడు, గతే (సతి) = వెళ్ళగా, అరి–ప్రహితః : అరి = శత్రువుచేత, ప్రహితః = పంపబడిన (అరిణా ప్రహితః), మృగాధిప... విభ్రమః : మృగ+అధిప = సింహంచేత, గ్రస్త = మ్రింగబడి, విముక్త = విడువబడిన, వీక్షిత = చూడబడిన, స్వ వర్గ = తనవారు కలిగి, హృష్యత్ = ఆనందిస్తున్న, మృగ–శావ = సింహపుపిల్లయొక్క, విభ్రమః = మురిపెం వంటి మురిపెం గల (మృగాణామ్ అధిపః, తేన గ్రస్తశ్చ అసౌ విముక్తశ్చ అసౌ వీక్షితశ్చ స్వవర్గః యేన, స చ హృష్యన్ చ అసౌ మృగశావః, తస్య విభ్రమ ఇవ విభ్రమః యస్య సః), శ్వఫల్కజః = శ్వఫల్కుని కుమారుడైన అక్రూరుడు, వి+అదృశ్యత = చూడబడెను. (వి–దృశ్ ప్రేక్షణే –కర్మణి–ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** (కంసాది సంహరణానికి సంబంధించిన భవిష్యత్కథను కృష్ణునకు చెప్పి) బ్రహ్మ మానసపుత్రుడైన నారదుడు నిష్క్రమించగా అప్పుడే అక్రూరుడు కనిపించాడు కృష్ణునకు. సింహం నోట చిక్కి కూడా మరల విడిపింపబడి తనవారిని చూసి ఆనందిస్తున్న సింహపు పిల్లలా కనిపించాడు అక్రూరుడు.

**వి :** 1. అక్రూరుని తండ్రి శ్వఫల్కుడు.

శ్లో॥ శ్వఫల్కః చిత్రరథశ్చ గాందిన్యాం చ శ్వఫల్కతః ।
అక్రూరప్రముఖా ఆసన్ పుత్రా ద్వాదశవిశ్రుతాః ॥ – భాగవతమ్ 9/24/15

శ్వఫల్కు డంటే అక్రూరుడు. శ్వఫలమంటే మాదీఫలం. శునః ప్రియాణి ఫలాని యస్య తత్ శ్వఫలం. (కుక్కకు ఇష్టమైన పండ్లు గలది) దానిపై స్వార్థంలో కప్ ప్రత్యయం చేరి శ్వఫలక అయి అదే వ్యవహారంలో శ్వఫల్క అయివుండవచ్చు. ఆ శ్వఫల్కుని కొడుకు శ్వఫల్కజుడు – అక్రూరుడు.

2. శ్లోకంలో ఉపమాలంకార ముంది. కృష్ణుని చూస్తున్న అక్రూరుని మానసికస్థితినీ, శారీరకచేష్టను ప్రకటించే పోలిక అది. ఉపమాలంకారాన్ని వాడటంలో కవి ఉద్దేశం ఉపమేయాన్ని స్పష్టపరచటం, లేదా సంపన్నం చేయటం. ఇక్కడ సింహం నోటబడి, బయటపడి తనవారిని ఆనందంతో చూస్తున్న సింహపుపిల్లలా అక్రూరుడు కనిపించాడనటం (పోలిక) ద్వారా కృష్ణదర్శనానికి అక్రూరుడు పడుతున్న ఆర్తి కనిపిస్తుంది. ఉపమాలంకారం నామమాత్రంగా కాక తన లక్ష్యాన్ని నెరవేర్చుకొంది.

| | | | |
|---|---|---|---|
| 3. **వ్యదృశ్యత :** | **వ్యదృశ్యత** | వ్యదృశ్యేతామ్ | వ్యదృశ్యన్త |
| | వ్యదృశ్యథాః | వ్యదృశ్యేథామ్ | వ్యదృశ్యధ్వమ్ |
| | వ్యదృశ్యే | వ్యదృశ్యావహి | వ్యదృశ్యామహి. |

*

**శ్లో॥ వ్రజే స గోదోహనకర్మణి స్థితం – నిజం ప్రభుం నీరదనీలవిగ్రహమ్ ।**
**దదర్శ సన్దర్శయితుం సముద్యతం – స్వభక్తసర్వేప్సితదోహదక్షతామ్ ॥ 10–23**

**అ :** అక్రూరుడు కృష్ణుని చూడటం. –వంశస్థం.

**అ :** సః వ్రజే గో–దోహన–కర్మణి స్థితం నీరద–నీల–విగ్రహం స్వ–భక్త–సర్వ+ఈప్సిత–దోహ–దక్షతాం సందర్శయితుం సముద్యతం నిజం ప్రభుం దదర్శ.

**ప్ర :** సః = ఆ అక్రూరుడు, వ్రజే = గోకులంలో (వ్రజన్తి అత్ర ఇతి తస్మిన్) (వ్రజః స్యాద్ గోకులం గోష్ఠం – హలాయుధకోశః – 262), గో–దోహన–కర్మణి : గో = ఆవులను, దోహన = పితికే, కర్మణి = పనిలో, స్థితమ్ = ఉన్నవాడూ (గవాం దోహనం, తదేవ కర్మ, తస్మిన్ స్థితః, తమ్), నీరద–నీల–విగ్రహమ్ = మేఘమువలె నల్లని మేనివాడూ (నీలః విగ్రహః యస్య, తమ్), స్వ–భక్త... దక్షతామ్ : స్వ–భక్త = తన భక్తులయొక్క,

సర్వ+ఈప్సిత = అన్ని కోరికలనూ, దోహ = పిండటంలోని, దక్షతామ్ = సమర్థతను (స్వస్య భక్తాః, తేషాం సర్వాణి చ తాని ఈప్సితాని, తేషాం దోహనం, తస్మిన్ దక్షః, తస్య భావః, తామ్), సందర్శయితుమ్ = చూపటానికి, సముద్యతమ్ = ఉద్యమించినవాడూ అయిన, నిజమ్ = తనయొక్క, ప్రభుమ్ = స్వామిని (కృష్ణుని), దదర్శ = చూశాడు. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అక్రూరుడు కృష్ణుని సమీపించి ఆయనను చూశాడు. ఆ సమయంలో కృష్ణుడు ఆవుల పాలు పితుకుతున్నాడు. తన భక్తుల కోరికల నన్నింటినీ తీర్చగల తన సామర్థ్యాన్ని ప్రదర్శించటానికి తాను ఉద్యమించినట్లుంది. అటువంటి తన ప్రభువును చూశాడు కృష్ణుడు.

**వి :** 1. భక్తుల కోరికల నన్నింటినీ తీర్చగల శక్తి సంపన్నత నారాయణునిది. విష్ణుసహస్రనామ ఫలశ్రుతి ఆ విషయాన్ని స్పష్టపరుస్తుంది. వాటిలో ముఖ్యమైన శ్లోకం.

శ్లో॥ ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవ్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ ప్రజాః ॥

ప్రవృత్తి నివృత్తి రూపమయిన మన నడవడి అంతా అర్థకామాలకు సంబంధించినదే కదా!

2. శ్రీదేవి, భూదేవి సతీమణులుగా వున్నవాడు నారాయణుడు. ఒకరు చలస్వభావ. మరొకరు స్థిరస్వభావ. ఆస్తులు చరాచరరూపాలు. రెండింటికీ ఆశ్రయమైన ఇద్దరూ తనకు ఆశ్రయంగా, ఇద్దరికీ తాను ఆశ్రయంగా వున్నప్పుడు ఇక నారాయణుడివ్వ లేని-దేముంటుంది?

శ్లో॥ స్వతశ్శ్రీస్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వేఽ ప్యభవదపరాధీనవిభవః ।
స్వయా దీప్త్యారత్నం భవదపి మహార్ఘం న విగుణం
న కుంఠస్వాతంత్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్ ॥ - శ్రీగుణరత్నకోశః శ్లో. 31

| | | | |
|---|---|---|---|
| 3. **దదర్శ :** | **దదర్శ** | దదృశతుః | దదృశుః |
| | దదర్శిథ | దదృశథుః | దదృశ |
| | దదర్శ | దదృశివ | దదృశిమ. |

*

**శ్లో॥ ననామ నారాయణమాదిపూరుషం - ననర్త నవ్యోత్సవజాతసమ్భ్రమః ।**
**ననాద నానాదురితౌఘమర్దయ-న్ననన్ద నన్దస్య తపఃఫలోదయమ్ ॥** **24**

**అ :** కృష్ణసందర్శన కాగానే నందునిలో కలిగిన ప్రతిక్రియ. -వంశస్థం.

**అ :** (సః) ఆదిపూరుషం నారాయణం ననామ । నవ్య+ఉత్సవ-జాత-సంభ్రమః (సన్) ననర్త। నానాదురిత+ఓఘమ్ అర్దయన్ ననాద. నందస్య తపః-ఫల+ఉదయం ననంద.

**ప్ర :** (సః = ఆ అక్రూరుడు), ఆది-పూరుషమ్ = పురాణపురుషుడైన, నారాయణమ్ = కృష్ణుని, ననామ = నమస్కరించాడు. (నమ-ప్రహ్వీభావే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), నవ్య... సంభ్రమః : నవ్య = క్రొత్తదైన, ఉత్సవ = (కృష్ణసందర్శన రూపమైన) పండుగవలన, జాత = కలిగిన, సంభ్రమః (సన్) = తడబాటు గలవాడై (నవ్యశ్చ అసౌ ఉత్సవః, తేన జాతః సంభ్రమః యస్య సః), ననర్త = నాట్యమాడాడు. (నృతీ గాత్ర విక్షేపే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), నానా-దురిత+ఓఘమ్ : నానా = వివిధాలయిన, దురిత = పాపాలయొక్క, ఓఘమ్ = సమూహాన్ని, అర్దయన్ = నశింపజేస్తూ, ననాద = అరిచాడు. (నద అవ్యక్తే శబ్దే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), నందస్య = నందునియొక్క, తపః+ఫల+ఉదయమ్ : తపః = తపస్సుయొక్క, ఫల = ఫలితంయొక్క, ఉదయమ్ = పుట్టుక, ననంద = ఆనందించింది. (నంద్ సమృద్ధౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** నందుడు కృష్ణుని చూడగానే పురాణపురుషుడైన ఆయనకు నమస్కరించాడు. తనకు క్రొత్తగా ఏర్పడిన కన్నులపండువును అనుభవిస్తూ నాట్యమాడాడు. తన పాపాలు అన్ని నశించి పోయాయంటూ అరిచాడు. నందుని తపఃఫలం అప్పుడే ఉదయించి ఆనందించింది.

**వి :** 1. అక్రూరుని భక్తిభావం విశిష్టం. మహాభారతంలో భీష్ముడు శత్రుపక్షంలో నిలిచి పోరాడినా కృష్ణభక్తిని మాత్రం మరువక సహస్రనామస్తోత్రం చేసి లోకానికి అందించినట్లు అక్రూరుడు కంసుని ఏలుబడిలో బ్రతుకుతున్నా కృష్ణభక్తిని విడవని వాడు. అసాధారణ భజనశీలుడు. పరాశరభట్టరు అక్రూరభక్తిని ఎలా వర్ణించాడో చూడండి.

శ్లో॥ పశ్యన్ననందత భవద్విహృతిస్థలాని – పాంసుస్వవేష్టత భవచ్చరణాంకితేషు ।
కిం బ్రూమహే బహుజనా హి తదాపి జాతాః – ఏవం తు భక్తితరలా విరలాః పరాత్మన్॥

– నారాయణీయమ్ – 72/6

నీవు (కృష్ణుడు) విహరించిన తావులను చూసి ఆనందించాడు. నీ కాలి గుర్తులు గల నేలలోని ధూళిపై పొర్లాడాడు. ఏమనగలం. ఆరోజుల్లో కూడా చాలామంది భక్తులున్నారు. కానీ ఇటువంటి (అక్రూరుని వంటి) భక్తులు మాత్రం అరుదుగానే వుంటారు–

2. శ్లోకంలోని మొదటి మూడు పాదాలలోని మూడు వాక్యాలలో కర్త అక్రూరుడు. నాలుగవ వాక్యంలో మాత్రం నందుని తపఃఫలం కర్తృపదం. ఇంతింతని చెప్పటానికి వీలుకాని ఆ ఫలాన్ని (స్వతః అమూర్తం) కర్తను చేయటం చమత్కారం. అచేతనాలకు వాక్యార్థీభావాన్ని కల్పించటం ఇక్కడ భక్తిరసపోషణవైవిధ్యం.

| | | | |
|---|---|---|---|
| 3. **ననామ :** | **ననామ** | నేమతుః | నేముః |
| | నేనిథ/ననన్థ | నేమథుః | నేమ |
| | ననామ/ననమ | నేమివ | నేమిమ. |
| **ననర్త :** | **ననర్త** | ననృతతుః | ననృతుః |
| | ననర్తిథ | ననృతథుః | ననృత |
| | ననర్త | ననృతివ | ననృతిమ |
| **ననాద :** | **ననాద** | నేదతుః | నేదుః |
| | నేదిథ | నేదథుః | నేద |
| | ననాద/ననద | నేదివ | నేదిమ |
| **ననంద :** | **ననంద** | ననందతుః | ననందుః |
| | ననందిథ | ననందథుః | ననంద |
| | ననంద | ననందివ | ననందిమ. * |

**శ్లో॥ తమాలిలిఙ్గే దృఢమచ్యుతః ప్రియం – సశఙ్కమేణాఙ్కశుచిస్మితాననః ।**
**అనాదిసిద్ధం భవరూపబన్ధనం – తదాశ్రితం విశ్లథయన్నివాఞ్జసా ॥ 10–25**

**అ :** కృష్ణుడు అక్రూరుని కౌగిలించుకొనుట ద్వారా స్వాగతించుట. –వంశస్థం.

**అ :** ఏణాంక–శుచి–స్మిత+ఆననః అచ్యుతః సశంకం తం ప్రియం తద్–ఆశ్రితమ్ అనాది–సిద్ధం భవ–రూప–బంధనమ్ అంజసా విశ్లథయన్+ఇవ దృఢమ్ ఆలిలింగే.

**ప్ర :** ఏణాంక... ననః : ఏణ+అంక = (జింకమచ్చగా గల) చంద్రునివలె (ఏణః అంకః యస్మిన్ తద్వత్), (ఏణః కురంగో హరిణః – హలాయుధకోశః – 230), శుచి = నిర్మలమైన, స్మిత = చిఱునవ్వుగల, ఆననః = ముఖం

గల (ఏణాంకవత్ శుచిస్మితమ్ ఆననే యస్య సః), అచ్యుతః = కృష్ణుడు, సశంకమ్ = సంశయిస్తున్న (శంకయా సహితం), తమ్ = ఆ, ప్రియమ్ = ఇష్టుని (అక్రూరుని), తద్+ఆశ్రితమ్ = ఆయనాశ్రయించి వున్నదీ, (తమ్ ఆశ్రితః తమ్), అనాది-సిద్ధమ్ = ఎప్పటినుండియో కలిసివున్నదీ (అనాదేః సిద్ధమ్) అయిన, భవ-రూప-బన్ధనమ్ : భవ-రూప = సంసారరూపమైన, బన్ధనమ్ = కట్టుదలను (భవ రూపంచ తత్ బంధనమ్), అంజసా = వేగంగా (క్షిప్రం ద్రుతమంజసా ఝటితి - హలాయుధకోశః - 697), వి-శ్లథయన్+ఇవ = జీర్ణింపజేస్తున్నట్లుగా, దృఢమ్ = గట్టిగా, ఆలిలింగే = కౌగిలించుకొన్నాడు. (ఆ లిగి -ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ)

**తా ॥** చంద్రుని (వెన్నెల) వంటి నిర్మలమైన నగవు విలసిల్లే మోముతో కృష్ణుడు అక్రూరుని కౌగిలించుకొన్నాడు. అక్రూరుడు దగ్గరకు చేరటానికి సంశయించటాన్ని గమనించి, తన కిష్టుడైన ఆ అక్రూరుని కౌగిలించుకోవటం అనాదిగా ఆ అక్రూరుని ఆశ్రయించుకొని వున్న భవబంధనాన్ని వేగంగా శిథిలం చేస్తున్నట్లుంది.

**వి :** 1. ఏణాంకుడు - చంద్రునిలోని మచ్చను రకరకాలుగా సంభావిస్తారు. కొందరు జింక అంటారు. కొందరు కుందేలంటారు. దానిని చమత్కరిస్తూ వ్రాసిన శ్లోకం-

శ్లో॥ అంకం కేఽపి శశంకిరే జలనిధేః పంకం పరే మేనిరే
సారంగం కతిచిచ్చ సంజగదిరే భూచ్ఛాయమైచ్ఛన్ పరే ।
ఇందౌ యద్దళితేంద్రనీలశకలశ్యామం దరీదృశ్యతే
తత్సాంద్రం నిశి పీతమన్ధతమసం కుక్షిస్థమాచక్ష్మహే ॥

2. కౌగిలి మాత్రం చేత అనాదియైన భవబంధం తొలిగి పోతుందా? కౌగిలి కూడా బంధమే గదా! నిజం. అయితే భవబంధం కన్న బలవత్తరం భగవంతుని కౌగిలి. అందువల్ల బలహీనమైనది శిథిలమవుతుంది. ఇక భగవంతుడు తాను కౌగిలించుకొన్నాడు. భగవంతునికి బంధాలు లేవు. భక్తుడు లీనమవుతాడు. నమస్కారమాత్రంచేత కూడా మోక్షాన్ని పొందే అవకాశం లేకపోలేదు. అది బాహిరమైన చేష్టకన్న సాంద్రమైన భావానికి సంబంధించిన అంశం. **శివస్తుతి...**

**శ్లో॥ వపుః ప్రాదుర్భావాదనుమితమిదం జన్మని పురా**
**పురారే న క్వాపి క్వచిదపి భవన్తం ప్రణతవాన్ ।**
**నమన్ముక్తః సంప్రత్యహమతనురగ్రేఽప్యనతిమా**
**నితీశ క్షంతవ్యం తదిదమపరాధద్వయమపి ॥**

'గత జన్మలో నీకు నమస్కరించ లేదు. అదొక తప్పు. అందువల్ల ఈ జన్మ. ఇప్పుడు నమస్కరిస్తున్నాను. ఇక జన్మ వుండదు. భవిష్యత్తులో ఇక నీకు నమస్కరింపను. అది రెండవ తప్పు. ఈ రెండు తప్పులూ క్షమించాలి.' - ఎంతనమ్మకమో! నమస్కారమాత్రం చేత ముక్తి.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆలిలింగే :** | **ఆలిలింగే** | ఆలిలింగాతే | ఆలిలింగిరే |
| | ఆలిలింగిషే | ఆలిలింగాథే | ఆలిలింగిధ్వే |
| | ఆలిలింగే | ఆలిలింగివహే | ఆలిలింగిమహే. |

*

**శ్లో॥ హీనం మహీనం మథితుం నినీషు-మక్రూరమక్రూరజనప్రియః స్వమ్ ।**
**గీర్వాణగీర్బాణగణాతిదూరో - రక్షోభరక్షోభకృదిత్యవోచత్ ॥ 10-26**

**అ :** కృష్ణుడు అక్రూరునితో సంభాషణకు ఉపక్రమించటం. -ఇంద్రవజ్ర.

**ప :** హీనం మహీ+ఇనం మథితుం నినీషుమ్-అక్రూరమ్ అక్రూర-జన-ప్రియః స్వమ్।
గీర్వాణ-గీః-బాణ-గణ+అతిదూరః రక్షః+భర-క్షోభ-కృద్ ఇతి+అవోచత్ ॥

**అ :** అక్రూర-జన-ప్రియః గీర్వాణ-గీః-బాణ-గణ-అతిదూరః రక్షః+భరక్షోభకృత్ (కృష్ణః) హీనం మహీ+ఇనం మథితుం స్వం నినీషుమ్ అక్రూరమ్ ఇతి అవోచత్.

**ప్ర :** అక్రూర-జన-ప్రియః : అక్రూర = దయగల, జన = జనులకు, ప్రియః = ఇష్టుడును (అక్రూరాశ్చ తే జనాః , తేషాం ప్రియః), గీర్వాణ... దూరః : గీర్వాణ = దేవతలయొక్క, గీః = మాట లనే, బాణ = అమ్ములకు, అతిదూరః = చాలా దూరంగా వుండేవాడూ (గీర్వాణానాం గిరః ఏవ బాణాః, తేషాం గణః, తస్య అతిదూరః), రక్షః... కృత్ : రక్షో-భర = రాక్షసులు అనే భారానికి, క్షోభ-కృత్ = నాశం కల్పించేవాడూ అయిన కృష్ణుడు (రక్షాంసి ఏవ భరః, తస్య క్షోభం కరోతి, ఇతి), హీనమ్ = నీచుడైన, మహీ+ఇనమ్ = భూభర్తను (మహ్యాః ఇనః తమ్) కంసుని, మథితుమ్ = చంపటానికి, స్వమ్ = తనను, నినీషుమ్ = కొనిపోదలచిన (నేతుమ్ ఇచ్ఛుః తమ్), అక్రూరమ్ = అక్రూరునితో, అవోచత్ = చెప్పాడు. (చెప్పబోవు రీతిగా) వచ పరిభాషణే పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు దయగలవారికి ప్రియుడు. దేవతల వాగ్బాణాలకు అందనంత దూరంలోని వాడు. రాక్షసులవలన ఏర్పడిన భూభారాన్ని తొలగించేవాడు. తనను హీనుడైన రాజును -కంసుని-సంహరించడానికి తీసికొని పోదలచిన అక్రూరునితో ఆ కృష్ణుడిలా అంటున్నాడు.

**వి :** 1.**శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

అన్నది కృష్ణుడు చేయబోయే ప్రతిజ్ఞ. ముందు పనిచేసి చూపి తర్వాత మాట చెప్పబోతున్నాడు కృష్ణుడు. అక్రూర జనప్రియత్వమూ, రక్షోభరక్షోభకరణం పైన చెప్పిన రెండు లక్షణాలే.

| | | | |
|---|---|---|---|
| 2. **అవోచత్ :** | **అవోచత్** | అవోచతామ్ | అవోచన్ |
| | అవోచః | అవోచతమ్ | అవోచత |
| | అవోచమ్ | అవోచావ | అవోచామ. |

*

**శ్లో॥ క్షేమః కిం తవ నః పితా చ కుశలీ స్వాధ్యాయతీర్థాప్లుతి-**
**స్వర్గ్యారాధనముఖ్యశోభనకృతిర్విఘ్నోజ్ఝితా వర్తతే ।**
**కిం సంసారవిముక్తయే ప్రయతసే కంసస్య కా వా స్పృహా**
**స త్వం వేత్స్యఖిలం యదద్య హి మయా కార్యం చ తద్ జ్ఞాపయ ॥10-27**

**అ :** కృష్ణుని కుశలప్రశ్నలు - కర్తవ్యజ్ఞాపనప్రార్థన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** తవ క్షేమః కిం? నః పితా కుశలీ కిమ్? స్వ+అధ్యాయ-తీర్థ-అప్లుతి-స్వర్గి-ఆరాధన-ముఖ్య-శోభన-కృతిః విఘ్న+ఉజ్ఝితా వర్తతే కిమ్? సంసార-విముక్తయే ప్రయతసే కిమ్? కంసస్య స్పృహా కా వా? స త్వమ్ అఖిలం వేత్సి హి అద్య మయా యత్ కార్యం తత్ చ జ్ఞాపయ.

**ప్ర :** తవ క్షేమః కిమ్? = నీకు కుశలమేనా?, నః పితా = మా తండ్రి, కుశలీ కిమ్? = క్షేమంగా వున్నాడా?, స్వాధ్యాయ... కృతిః : స్వ+అధ్యాయ = వేదాధ్యయనం, తీర్థ+అప్లుతి = పుణ్యతీర్థాలలో స్నానం, స్వర్గి = దేవతల యొక్క, ఆరాధన = పూజ, ముఖ్య = మొదలుగా గల, శోభన-కృతిః = పుణ్యకర్మ, విఘ్న-ఉజ్ఝితా = విఘ్నాలు తొలగినదై, వర్తతే కిమ్? = ఉన్నదా? (వృతు వర్తనే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), సంసార-విముక్తయే : సంసార = సంసారంనుండి, విముక్తయే=మోక్షం కోసం, ప్రయతసే కిమ్?=ప్రయత్నిస్తున్నావా? (ప్ర+ యతీ ప్రయత్నే ఆత్మనేపది-లట్-మ.ఏ.), కంసస్య = కంసునియొక్క, స్పృహా = కోరిక (ఇచ్ఛా వాంఛా స్పృహా కాంక్షా,

హలాయుధకోశః - 710), కా వా? = ఏమిటి?, స త్వమ్ = ఆ నీవు, అఖిలమ్ = పూర్తిగా, వేత్సి = ఎరుగుదువు, హి = అందువలన, అద్య = ఇప్పుడు, మయా = నా చేత, యత్ = ఏది, కార్యమ్ = చేయదగినదో, తత్ చ = అది కూడా, జ్ఞాపయ=గుర్తు చేయి. (జ్ఞా అవబోధనే ప్రేరణార్థం-ణిచ్-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణుని మాటలు-

నీకు క్షేమమేనా? నా తండ్రి క్షేమంగా వున్నాడా? వేదాధ్యయనం కొనసాగుతోందా? పుణ్యతీర్థస్నానం, దేవతారాధనలు మొదలయిన పుణ్యకర్మలు కొనసాగుతున్నాయా? ఆటంకాలేవీ లేవు కదా! సంసారవిముక్తికోసం ప్రయత్నం చేస్తున్నావా? కంసుడు ఏం కావాలనుకొంటున్నాడు? నీ కంతా తెలుసు. ఇప్పుడు నేనేం చేయాలో గుర్తు చేయి.

**వి :** 1. కర్తవ్యాలలో ప్రధానమైనవి స్వాధ్యాయప్రవచనాలూ, దేవపితృకార్యాలూ.

"**స్వాధ్యాయ ప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్. దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్**" - తైత్తిరీయోపనిషత్తు 1/11

స్వాధ్యాయప్రవచనాలు వ్యక్తివికాసం కోసమైతే, దేవపితృకార్యాలు సమాజవికాసం కోసం.

శ్లో॥ దేవాన్ భావయతానేన తే దేవాః భావయన్తు వః ।
పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ ॥ - భగవద్గీత 3/11

అందుకని కృష్ణుడు ఆ రెండు విషయాలనే ప్రస్తావిస్తున్నాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **వర్తతే :** | **వర్తతే** | వర్తేతే | వర్తన్తే |
| | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| | వర్తే | వర్తావహే | వర్తామహే |
| **ప్రయతసే :** | ప్రయతతే | ప్రయతేతే | ప్రయతన్తే |
| | **ప్రయతసే** | ప్రయతేథే | ప్రయతధ్వే |
| | ప్రయతే | ప్రయతావహే | ప్రయతామహే |
| **వేత్సి :** | వేత్తి | విత్తః | విదన్తి |
| | **వేత్సి** | విత్థః | విత్థ |
| | వేద్మి | విద్వః | విద్మః |
| **జ్ఞాపయ :** | జ్ఞాపయతు/జ్ఞాపయతాత్ | జ్ఞాపయతామ్ | జ్ఞాపయన్తు |
| | **జ్ఞాపయ**/జ్ఞాపయతాత్ | జ్ఞాపయతమ్ | జ్ఞాపయత |
| | జ్ఞాపయాని | జ్ఞాపయావ | జ్ఞాపయామ. |

*

**శ్లో॥ క్షేమస్తావదనన్త! హృత్సరసిజే యావద్భవాన్ వర్తతే**
**స్వీయక్లేశవనానలే త్వయి సతి క్లేశః క్వ పిత్రోస్తవ ।**
**కిన్తు త్వత్పితృతాఽపవాదజనితం తచ్ఛృఙ్ఖలాబన్ధనం**
**చిన్తాసన్తతిహేతురేవ న తయోః సన్తాపకారి ప్రభో! ॥ 10-28**

**అ :** కృష్ణుని కుశలప్రశ్నలకు అక్రూరుని ప్రతివచనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అనన్త! భవాన్ హృత్-సరసిజే యావత్ వర్తతే తావత్ క్షేమః స్వీయ-క్లేశ-వన+అనలే త్వయి సతి। తవ పిత్రోః క్లేశః క్వ? కిం తు త్వత్-పితృతా+అపవాద-జనితం తత్+శృంఖలా-బన్ధనం చింతా-సంతతి-హేతుః ఏవ ప్రభో! తయోః సంతాప-కారి న నతయోః (తయోః) సంతాపకారి.

ప్ర : అనన్త! = హద్దులెరుగని వాడా! (నాస్తి అన్తః యస్య సః) (అనన్తహుతభుక్‌భోక్తా – విష్ణుసహస్రనామస్తోత్రం), భవాన్ = నీవు, యావత్ = ఎంతవరకు, హృత్+సరసిజే = హృదయపద్మంలో, వర్తతే = వుంటావో, తావత్ = అంతవరకు, క్షేమః = కుశలమే!, స్వీయ–క్లేశ–వన+అనలే : స్వీయ = తనవారియొక్క, క్లేశ = బాధలనే, వన = అరణ్యానికి, అనలే = అగ్ని వంటి (స్వీయానాం క్లేశాః ఏవ వనం, తస్యః అనలః, తస్మిన్), త్వయి సతి = నీవుండగా, తవ = నీయొక్క, పిత్రోః = తల్లిదండ్రులకు, క్లేశః = బాధ, క్వ = ఎక్కడిది? కింతు = కానీ, త్వత్–పితృతా–అపవాద–జనితమ్ : త్వత్ = నీయొక్క, పితృతా = తండ్రిగా వుండటమనే, అపవాద = అవపవాదంచేత, జనితమ్ = కలిగినట్టి (తవ పితృతా త్వత్పితృతా, సైవ అపవాదః, తేన జనితం), తత్+శృంఖలా–బంధనమ్ = వారి సంకెళ్ళ కట్టుబాటు (తయోః శృంఖలాభిః బంధనమ్), చింతా–సంతతి–హేతుః+ఏవ = ఎడతెగని వేదనకు కారణమే (చింతానాం సంతతిః, తస్యాః హేతుః) అయినా, ప్రభో! = స్వామీ, తయోః = ఆ ఇద్దరికీ, సంతాప–కారి = దుఃఖాన్ని కలిగించేది, న = కాదు, నతయోః = వినయశీలురైన వారికి, సంతాపకారి = దుఃఖాన్ని కల్గించేదే!

**తా ॥** అనన్తా! హృదయకమలంలో నీవున్నంతవరకు నాకు కుశలమే. తనవారి కష్టాలు అనే అరణ్యానికి దావాగ్నివంటి నీవుండగా నీ తల్లిదండ్రులకు కలత ఏముంటుంది? కానీ నీ తండ్రి అయిన కారణంగా ఆయన చెఱసాల పాలు కావటం నిరంతరమూ బాధకు కారణమే. కానీ వారు బాధపడటం లేదు. (కానీ వినయశీలురయి వారు బాధపడుతున్నారు.)

**వి :** 1. కృష్ణునిలో వనానలత్వాన్ని ఆరోపించటం వలన అది రూపకాలంకారం. అయితే ఆ రూపకమిక్కడ స్పర్శ మాత్రమే. సావయవత్వప్రయత్నం కవి చేయలేదు. అక్రూరునిలోని కృష్ణభక్తిని ప్రకటించటం ప్రకరణంలో ముఖ్యాంశం. అందుకే అలంకారాన్ని నామమాత్రంగా రసపరంగా నిలపటం జరిగింది. ఇది ఆనందవర్ధనుడు ప్రతిపాదించిన అలంకారనివేశన సమీక్షకు అనుగుణంగా వుంది.

శ్లో॥ వివక్షా తత్పరత్వేన నాంగిత్వేన కదాచన ।
కాలే చ గ్రహణత్యాగౌ నాతినిర్వహణైషితా ॥

శ్లో॥ నిర్వ్యూఢావపి చాంగత్వే యత్నేన ప్రత్యవేక్షణమ్ ।
రూపకాదేరలంకారవర్గస్యాంగత్వసాధనమ్ ॥ – ధ్వన్యాలోకనం 2/18,19

2. శ్లో॥ లాభస్తేషాం యశస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥ – మహాభారతమ్.

శ్లో॥ న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।
జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే ॥ – విష్ణుసహస్రనామస్తోత్రమ్.

ఇక అక్రూరుడు, క్షేమంగా వుండటానికి అభ్యంతరమేముంది? ఆయన వాసుదేవుని పరమభక్తుడు.

| | | | |
|---|---|---|---|
| 3. **వర్తతే :** | **వర్తతే** | వర్తేతే | వర్తన్తే |
| | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| | వర్తే | వర్తావహే | వర్తామహే. |

*

**శ్లో॥ తీర్థం సేవితమేవ యత్పదరజో జుష్టం సురాః సత్కృతా**
**యేనాలిఙ్గితవానహం తవ వపుశ్చీర్ణా చ పుణ్యక్రియా ।**
**యల్లబ్ధం తవ దర్శనం పరిచితో వేదశ్చ యత్ తే శ్రుతం**
**కళ్యాణం వచనం భవోఽపి న భవత్సామీప్యభాజో మమ ॥ 10–29**

**అ :** అక్రూరుని వినయపూర్వకప్రతివచనం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యత్(తే) పద–రజః జుష్టం తత్ తీర్థం సేవితమ్ ఏవ. అహం యేన తవ వపుః ఆలింగితవాన్ (తేన) సురాః సత్కృతాః యత్ తవ దర్శనం లబ్ధం తత్ పుణ్యక్రియా చీర్ణా యత్ తే కళ్యాణం వచనం శ్రుతం (తత్) వేదః చ పరిచితః భవత్–సామీప్య–భాజః మమ భవః అపి న.

**ప్ర :** యత్ = ఎందువలనయితే, (తే = నీయొక్క), పద–రజః=పాదధూళి (పదస్య రజః), జుష్టమ్ = సేవింపబడిందో, తత్ = దానివల్ల, తీర్థమ్ = పుణ్యనదీస్నానం, సేవితమ్ ఏవ = సేవింపబడినదియే. అహమ్ = నేను, యేన = ఏ కారణంచేత, తవ = నీయొక్క, వపుః = శరీరాన్ని, ఆలింగితవాన్= కౌగిలించుకొన్నానో, (తేన= ఆ కారణంచేత), సురాః = దేవతలు, సత్కృతాః = సేవింపబడినట్లే, యత్ = ఏదయితే, తవ = నీయొక్క, దర్శనమ్ = కనుకలి, లబ్ధమ్ = దొరికిందో, తత్ = అది (ఆ రీతిగా), పుణ్య–క్రియా = పుణ్యకర్మ, చీర్ణా = చేయబడింది. యత్ = ఏదయితే, తే = నీ యొక్క, కళ్యాణమ్ = శుభకరమైన, వచనమ్ = మాట, శ్రుతమ్ = వినబడిందో, (తత్ = ఆ రీతిగా), వేదః చ = వేదం కూడా, పరిచితః = తెలియబడింది, భవత్–సామీప్య–భాజః = నీ సన్నిధిని పొందినట్టి, మమ = నాకు, భవః = సంసారంకూడా, న = లేదు (ముక్తి దొరికినట్లే)

**తా ॥** కృష్ణా! నీ పాదధూళిని సేవించటం ద్వారా పుణ్యతీర్థాలు సేవించినట్లే. నీ కౌగిలిని పొందటం ద్వారా దేవతల నందరినీ సత్కరించినట్లే. నీ దర్శనాన్ని పొందటం ద్వారా పుణ్యక్రియలన్నీ చేసినట్లే. నీ శుభవచనాన్ని వినటం ద్వారా వేదాన్ని కూడా విన్నట్లే. నీ సన్నిధిని చేరిన నాకు ఇక సంసారం బంధం వీడి ముక్తి లభించినట్లే.

**వి :** 1. అక్రూరుడు ఇక్కడ పలుకుతున్న మాటలు మూలంలో కృష్ణుని దగ్గరకు వస్తున్న సమయంలో అక్రూరుడు చేసిన ఆలోచనలుగా కనిపిస్తాయి.

శ్లో॥ సుహృత్తమం జ్ఞాతిమనన్యదైవతం – దోర్భ్యాం బృహద్భ్యాం పరిరప్స్యతేఽథ మామ్ ।
ఆత్మా హి తీర్థీక్రియతే తదైవ మే – బంధశ్చ కర్మాత్మక ఉచ్ఛ్వసిత్యతః ॥

శ్లో॥ లబ్ధ్వాంగసంగం ప్రణతం కృతాంజలిం – మాం వక్ష్యతేఽక్రూర తతేత్యురుశ్రవాః ।
తదా వయం జన్మభృతో మహీయసా – నైవాదృతో యో ధిగముష్య జన్మ తత్ ॥

– భాగవతం 10/38/20,21

2. కృష్ణుని సామీప్యానికి చేరితే ముక్తినందినట్లే. సారూప్య, సాలోక్య, సాయుజ్యాలతో పాటు సామీప్యం కూడా మోక్షమే. *

**శ్లో॥ కిం విష్ణో! బహునోదితేన విదితం విశ్వం భవద్దర్శనా–**
**చ్ఛత్రుర్మిత్రమభూద్భవోఽపి యదహం కంసేన సమ్ప్రేషితః ।**
**అద్రాక్షం తవ సున్దరం వపురయం సర్వజ్ఞచూడామణే!**
**ప్రశ్నస్తే నృవిడమ్బనాయ మమ చ ప్రత్యుక్తిరీశేదృశీ ॥ 10–30**

**అ :** అక్రూరుడు కృష్ణుని స్తుతిస్తూ ప్రతివచన మివ్వటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** విష్ణో! బహునా ఉదితేన కిమ్? భవద్–దర్శనాత్ విశ్వం విదితమ్. శత్రుః అపి భవః మిత్రమ్ అభూత్ యత్ కంసేన సంప్రేషితః అహం తవ సుందరం వపుః అద్రాక్షమ్. సర్వజ్ఞ–చూడామణే! తే అయం ప్రశ్నః నృ–విడంబనాయ ఈశ! మమ ప్రత్యుక్తిః చ ఈదృశీ.

**ప్ర :** విష్ణో! = నారాయణా, బహునా = ఎక్కువగా, ఉదితేన = చెప్పినదానితో, కిమ్? = లాభమేమి? భవత్+దర్శనాత్ = నీ దర్శనంతో, విశ్వమ్ = ప్రపంచం, విదితమ్ = తెలిసింది (ఆయన విశ్వస్వరూపుడు కాబట్టి), శత్రుః =

శత్రువువంటి, భవః+అపి = సంసారం కూడా, మిత్రమ్ = చెలికానివలె, అభూత్ = అయ్యింది. (భూ సత్తాయామ్ పరస్మైపది-లుఙ్- ప్ర.ఏ.), యత్ = ఎందువలన, అహమ్ = నేను, కంసేన = కంసునిచే, సంప్రేషితః = పంపబడితినో, (తేన = అందువలన), తవ = నీయొక్క, సుందరమ్ = అందమైన, వపుః = శరీరాన్ని, అద్రాక్షమ్ = చూశాను. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లుఙ్-ఉ.ఏ.), సర్వజ్ఞ-చూడామణే! = సర్వమెరిగినవారిలో మేటి అయినవాడా!, ఈశ! = స్వామీ, అయమ్ = ఈ, తే ప్రశ్నః = నీ ప్రశ్న, నృ-విడంబనాయ= మనిషిని అనుకరించటం కోసమే, మమ = నాయొక్క, ప్రత్యుక్తిః చ = సమాధానమూ కూడా, ఈదృశీ = ఇటువంటిదే (నిన్ను మనిషిగా భావించి చెప్పటమే)

**తా ॥** కృష్ణా! ఎక్కువ మాట లెందుకు? నీ దర్శనంవల్లనే విశ్వమంతా తెలిసినట్లయింది. నాకు శత్రువయిన ఈ సంసారం కూడా మిత్రమయింది. ఎందుకంటే ఈ సంసారంలో వున్నాను కాబట్టి కంసుడు నన్ను పంపాడు. కాబట్టి నేను నీ సుందరరూపాన్ని చూడగలిగాను. నీవు సర్వజ్ఞులలో మేటివి. నీవు నన్ను అడగటం మనిషిగా వున్నందువల్ల మనిషిగా నటించటమే. నేను నీకు సమాధానం చెప్పటం నీవు మనిషిగా వున్నందువల్ల మాత్రమే. (లేకపోతే చెప్పగలిగే పరిస్థితి రాదని భావం)

**వి :** 1. పరమాత్మ అయినా మానవశరీరంలో వున్నప్పుడు మానవుడిలాగానే ప్రవర్తించాలి. కాకపోతే నరులకు ఆదర్శంగా నిలుస్తూ నారాయణుడు అవుతాడు. మానవులలో మేలుబంతిగా నిలిచి మాధవుడవుతాడు. పురుషులకు జీవనవిధానం నేర్పి పురుషోత్తము డవుతాడు. ఇక్కడ కృష్ణుడు అంతా తెలిసే మానవుడిలా మాట్లాడాడు. అక్రూరుడు సమాధానం చెప్పటం కూడా అటువంటిదే. కృష్ణుడికి తెలియవనా?

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **అద్రాక్షమ్ :** | అద్రాక్షీత్ | అద్రాష్టామ్ | అద్రాక్షుః |
| | అద్రాక్షీః | అద్రాష్టమ్ | అద్రాష్ట |
| | **అద్రాక్షమ్** | అద్రాక్ష్వ | అద్రాక్ష్మ. |

*

**శ్లో॥ కంసః సమ్ప్రతి కార్ముకోత్సవకథావ్యాజేన తే విప్రియం**
**కర్తుం వాఞ్ఛతి తేన మాతులమహం సార్ధం విధాతుం భవాన్ ।**
**గత్వా తత్ర విభుర్ధునోతు సబలం శత్రుం పునః ప్రస్ఫుర-**
**ద్భ్రూచాపోత్సవమారచయ్య భజతామాధిం సమాధిప్రియః ॥ 10-31**

**అ :** అక్రూరుడు కంసుని దురాలోచనను కృష్ణునకు తెలిపి కర్తవ్యాన్ని సూచించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సంప్రతి కంసః కార్ముక+ఉత్సవ-కథా-వ్యాజేన తే విప్రియం కర్తుం వాంఛతి. తేన మాతుల-మహం సార్ధం విధాతుం తత్ర గత్వా విభుః సబలం శత్రుం ధునోతు. పునః సమాధిప్రియః భవాన్ ప్రస్ఫురత్-భ్రూ-చాప+ఉత్సవమ్ ఆరచయ్య భజతామ్ ఆధిం ధునోతు.

**ప్ర :** సంప్రతి = ఇప్పుడు, కంసః = కంసుడు, కార్ముక... వ్యాజేన : కార్ముక+ఉత్సవ = ఆయుధపూజయొక్క, కథా = ప్రకటనఅనే, వ్యాజేన = సాకుతో, తే = నీకు, విప్రియమ్ = అనిష్టాన్ని, కర్తుమ్ = చేయాలని, వాంఛతి = కోరుతున్నాడు. (వాంఛ్ ఇచ్ఛాయామ్ - పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తేన = అందుచేత, మాతుల-మహమ్ : మాతుల = మేనమామ యొక్క, మహమ్ = ఉత్సవాన్ని (మహస్తూత్సవతేజసోః-అమరకోశః-నానార్థ-232), సార్ధమ్

= ప్రయోజనవంతంగా, విధాతుమ్ = చేయటానికి (వి–ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), తత్ర = అక్కడకు (మథురానగరికి), గత్వా = వెళ్ళి, విభుః = సమర్థుడవైన నీవు, సబలమ్ = బలవంతుడైన, శత్రుమ్ = శత్రువును, ధునోతు = కంపింపజేయి (తనస్థానం నుండి) ధూ కంపనే పరస్మైపది–లోట్–(ప్ర.ఏ.), సమాధి–ప్రియః : సమాధి = ఏకాగ్రతను, ప్రియః = ఇష్టంగా గల (సమాధిః ప్రియః యస్య సః), భవాన్ = నీవు, పునః = మరల, ప్రస్ఫురత్ = మిక్కిలి ప్రకాశిస్తున్న, భ్రూ–చాప+ఉత్సవమ్ : భ్రూ = కనుబొమలనే, చాప = ధనుస్సుయొక్క, ఉత్సవమ్ = పండుగను, ఆరచయ్య = జరిపి, భజతామ్ = సేవిస్తున్న భక్తులయొక్క, ఆధిమ్ = మనోవ్యథను, (ధునోతు = తొలగించు).

**తా ॥** కంసుడిప్పుడు కార్ముకోత్సవం అనే సాకుతో నీకు కీడు చేయాలని భావిస్తున్నాడు. కాబట్టి మేనమామ తలపెట్టిన పండుగను సార్థకం చేయటానికి సమర్థుడవైన నీవు అక్కడకు వెళ్ళాలి. శత్రువును సంహరించాలి. ఆపై కనుబొమలనే వింటి పండుగను జరిపి నీ భక్తుల బాధలను తొలగించాలి.

**వి :** 1. 'కర్తవ్యాన్ని గుర్తుచేయ'మన్న కృష్ణుని మాటకిది ప్రతివచనం. నిర్దేశించటం కాదు గుర్తు చేయటమే.

పరమాత్మ అవతారాలలో ఉత్తరోత్తరమూ విశిష్టత, విలక్షణత, బహుళ ప్రయోజన సాధన కనిపిస్తాయి. మత్స్యకూర్మాదులలో ప్రయోజనం స్వల్పం. స్వల్పవ్యవధిలో ఆయా అవతారాల లక్ష్యం ముగిసి అవతారం కూడా ముగుస్తుంది. మానవీయావతారాలలో ఆ పరిస్థితిలో మార్పు కనిపిస్తుంది. కొంత విస్తృతి చోటు చేసుకొంటుంది. రామావతారం లక్ష్యం తాత్కాలికం కాదు. ఒక జీవితానికి సంబంధించింది. కృష్ణావతారం మరీ విలక్షణం. పుట్టిన నాటినుండీ ఏదో ఒక మహత్కార్యాన్ని సాధిస్తూనే కనిపిస్తుంది. కంసహననం వాటిల్లో ఒకటి. దానినే గుర్తు చేస్తున్నాడు అక్రూరుడు.

2. ఇక్కడ సమాధ్యలంకార ముంది. భ్రూచాపోత్సవం ద్వారా కంసుని సంహరించటం కృష్ణుని కర్తవ్యాలలో ఒకటి. దానిని సాధించటానికి తనంత తానుగా వచ్చిన అవకాశం కంసుడు తలపెట్టిన కార్ముకోత్సవం. చేయదలచిన/ చేయవలసిన పని మరొకరీతిగా పూర్తయ్యే అవకాశ మేర్పడటం సమాధ్యలంకారం. '**సమాధిః కార్యసౌకర్యం కారణాంతరసన్నిధేః**' – (కు.118)

| | | | |
|---|---|---|---|
| 3. **వాంఛతి :** | **వాంఛతి** | వాంఛతః | వాంఛన్తి |
| | వాంఛసి | వాంఛథః | వాంఛథ |
| | వాంఛామి | వాంఛావః వాంఛామః | |
| **ధునోతు : ధునోతు**/ధునుతాత్ | | ధునుతామ్ | ధున్వన్తు |
| | ధును/ధునుతాత్ | ధునుతమ్ | ధునుత |
| | ధునవాని | ధునవావ | ధునవామ. |

*

**శ్లో॥ మథురా మథురాకేశమహసా మహసాధికా ।**
**సహసా సహ సాఽఽప్యా స్వైర్భవతా భవతారక! ॥ 10–32**

**అ :** కృష్ణుని మథురానగరికి రమ్మని అక్రూరుడు అభ్యర్థించటం. –పథ్యావక్త్రమ్.

**ప :** మథురా మధు–రాకేశ–మహసా మహ–సాధికా ।
సహసా సహ సా ఆప్యా స్వైః భవతా భవ–తారక! ॥

**అ :** భవతారక! భవతా మధు–రాకా+ఈశ–మహసా మహ–సాధికా సా మథురా స్వైః సహ సహసా ఆప్యా.

**ప్ర :** భవ–తారక! = సంసారంనుండి ఉద్ధరించే వాడా! కృష్ణా! (భవస్య తారకః, తస్మాత్ సంబుద్ధిః), భవతా = నీచే,

మధు–రాకా+ఈశ–మహసా : మధు = మకరందం యొక్కయు, రాకా+ఈశ = పున్నమిచంద్రునియొక్కయు, మహసా = కాంతితో (మధునః రాకేశస్య చ మహసా), మహ–సాధికా : మహ = ఉత్సవాన్ని, సాధికా = సాధిస్తున్న (మహస్య సాధికా), సా = ఆ, మథురా = మథురానగరి (మధు అస్యాః అస్తీతి మధురా) (**ఊషసుషిముష్కమధో రః** – అష్టాధ్యాయి 5–2–107 సూత్రంతో మధు శబ్దం మీద 'ర' ప్రత్యయం), స్వైః సహ = నీ వారితో కలిసి, సహసా = త్వరగా, ఆప్యా = చేరదగినది.

**తా ॥** సంసారం నుండి ఉద్ధరించే వాడా! కృష్ణా! నువ్వు మకరందం, పున్నమిచంద్రుడు – ఈ ఇద్దరి కాంతితో మనస్సునకు ఉల్లాసాన్ని కలిగించే మధురానగరానికి నీ వారితో కలిసి చేరాలి.

**వి :** 1. సర్వపాదాది యమక మీ శ్లోకంలో కనిపిస్తుంది. మధురా మధురా: మహసా మహసా; సహసా సహ సా; భవతా భవ–తా.

*

**శ్లో॥ స తతః సతతధ్యానశుద్ధవృద్ధజనాశ్రితామ్ ।**
**మథురాం మధురాం కర్తుం గమనాయోపచక్రమే ॥ 10–33**

**అ :** కృష్ణుడు మధురానగరికి వెళ్ళటానికి సిద్ధపడటం. –పథ్యావక్త్రమ్.

**అ :** తతః సః సతత–ధ్యాన–శుద్ధ–వృద్ధ–జన+ఆశ్రితామ్ మథురాం మధురాం కర్తుం గమనాయ ఉపచక్రమే.

**ప్ర :** తతః = ఆ (అక్రూరుని మాటలు విన్న) తర్వాత, సః = ఆ కృష్ణుడు, సతత..తామ్ : సతత = ఎల్లప్పుడు, ధ్యాన = ధ్యానించటం ద్వారా, శుద్ధ = పవిత్రులైన, వృద్ధ–జన = పెద్దవారిచే, ఆశ్రితామ్ = ఆశ్రయింపబడిన (సతతం ధ్యానేన శుద్ధాః వృద్ధాః చ తే జనాః, తైః ఆశ్రితా, తామ్), మధురామ్ = మాధుర్యం గలదానినిగా, కర్తుమ్ = చేయటానికి (కృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), గమనాయ = వెళ్ళటానికి, ఉపచక్రమే = సిద్ధపడ్డాడు. (ఉప–క్రము పాదవిక్షేపే –ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.) (క్రము ధాతువు వస్తుతః పరస్మైపది అయినా ఉపపూర్వకమైనపుడు '**ఉపపరాభ్యామ్**' (అష్టాధ్యాయి – 1–3–39), సూత్రంతో ఆత్మనేపది అవుతుంది).

**తా ॥** అక్రూరుని మాటలు వినిన తరువాత కృష్ణుడు మధురానగరానికి వెళ్ళి దానిని నిజంగా మధురను చేయదలచుకొన్నాడు. నిరంతరమూ కృష్ణధ్యానంచేత పవిత్రులయిన పెద్దలు గల నగరి ఆ మథుర.

**వి :** 1. నిరంతరమూ కృష్ణధ్యానం పరమాత్మ స్వరూపంగా కావచ్చు, నారాయణ స్వరూపంగా కావచ్చు. అప్పటికే కృష్ణుని బాల్యలీలలను విని వున్నారు కాబట్టి కృష్ణస్వరూపంగా అయినా కావచ్చు.

2. మథురను మధురను చేయాలని కృష్ణుడు వెళ్ళటం సముచితం. ఎందుకంటే కృష్ణునకు సంబంధించిన దేదైనా మధురమే. తానక్కడ వుంటే నగరం మధురమవుతుంది.

**శ్లో॥ అధరం మధురం వదనం మధురం – నయనం మధురం గమనం మధురం ।**
**హృదయం మధురం గమనం మధురం – మధురాధిపతేరఖిలం మధురమ్ ॥**

**శ్లో॥ వచనం మధురం చరితం మధురం – వసనం మధురం వలితం మధురమ్ ।**
**చలితం మధురం భ్రమితం మధురం – మధురాధిపతే రఖిలం మధురమ్ ॥**

**శ్లో॥ వేణుర్మధురో రేణుర్మధురః – పాణిర్మధురః పాణౌ మధురౌ ।**
**నృత్యం మధురం సఖ్యం మధురం – మధురాధిపతేరఖిలం మధురమ్ ॥**

**శ్లో॥ గీతం మధురం పీతం మధురం – భుక్తం మధురం సుప్తం మధురమ్ ।**
**రూపం మధురం తిలకం మధురం – మధురాధిపతే రఖిలం మధురమ్ ॥**

శ్లో॥ కరణం మధురం తరణం మధురం - హరణం మధురం స్మరణం మధురమ్ ।
వమితం మధురం శమితం మధురం - మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

శ్లో॥ గుంజా మధురా మాలా మధురా - యమునా మధురా వీచీ మధురా ।
సలిలం మధురం కమలం మధురం - మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

శ్లో॥ గోపీ మధురా లీలా మధురా - యుక్తం మధురం భుక్తం మధురమ్ ।
దృష్టం మధురం శిష్టం మధురం - మధురాధిపతేరఖిలం మధురమ్ ॥
గోపా మధురా గావో మధురా - యష్టిర్మధురా సృష్టిర్మధురా ।
దలితం మధురం ఫలితం మధురం - మధురాధిపతేరఖిలం మధురమ్ ॥

3. అయుగ్మ పాదాది యమకమీశ్లోకంలో.

| | | | |
|---|---|---|---|
| 4. **ఉపచక్రమే :** | **ఉపచక్రమే** | ఉపచక్రమాతే | ఉపచక్రమిరే |
| | ఉపచక్రమిషే | ఉపచక్రమాథే | ఉపచక్రమిధ్వే |
| | ఉపచక్రమే | ఉపచక్రమివహే | ఉపచక్రమిమహే. |

*

**శ్లో॥ హరిం మధుపురీం యాన్తం విలోక్య వ్రజయోషితః ।**
**విలేపుర్వివిధాలాపైర్వినివర్తయితుం ధియా ॥ 10-34**

అ : కృష్ణుడు మధురకు వెళ్ళటాన్ని గోపికలు నిలువరింప దలచుట. -పథ్యావక్త్రమ్.

అ : మధుపురీం యాన్తం హరిం విలోక్య వ్రజ-యోషితః వినివర్తయితుం ధియా వివిధాలాపైః విలేపుః

ప్ర : మధుపురీమ్ = మధురానగరికి, యాన్తమ్ = బయలుదేరిన, హరిమ్ = కృష్ణుని, విలోక్య = చూసి (వి-లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వ్రజ-యోషితః=గోపస్త్రీలు, వినివర్తయితుం ధియా = మరలించే బుద్ధితో, వివిధ+ఆలాపైః = రకరకాల మాటలతో, విలేపుః = విలపించారు. (వి లప్ వ్యక్తాయాం వాచి-లిట్-ప్ర.బ.)

తా ॥ శ్రీకృష్ణుడు మధురానగరానికి వెళ్ళబోతున్నాడని విని గోపకాంతలు ఆయనను ఆ ప్రయత్నంనుండి మరలించాలని రకరకాలుగా విలపించారు. (మాటాడారు.)

| | | | |
|---|---|---|---|
| వి : 1. **విలేపుః :** | విలలాప | విలేపతుః | **విలేపుః** |
| | విలేపిథ | విలేపథుః | విలేప |
| | విలేప | విలేపివ | విలేపిమ. |

*

**శ్లో॥ రమ్యాధరోష్ఠసుధయా రచితాత్మవృత్తీ-ర్న త్యక్తుమర్హసి నవామ్బుదనీలమూర్తే! ।**
**త్వత్సఙ్గభఙ్గకరణోద్యతపాపమంగ! - శక్నోతి హి క్షపయితుం తవ లోచనాన్తః ॥35**

అ : గోపికల విలాపం. -వసంతతిలక.

అ : నవ+అంబుద-నీల-మూర్తే! రమ్య+అధర+ఓష్ఠ-సుధయా రచిత+ఆత్మ-వృత్తీః(నః) త్యక్తుం న అర్హసి. అంగ! త్వత్-సంగ-భంగ-కరణ+ఉద్యత-పాపం క్షమయితుం తవ లోచన+అన్తః న శక్నోతి.

ప్ర : నవ+అంబుద-నీల-మూర్తే! : నవ = క్రొత్తదైన, అంబుద = మేఘం వంటి, నీల = నల్లని, మూర్తే = రూపం గలవాడా! కృష్ణా! (నవః చ అసౌ అంబుదః, స ఇవ నీలా మూర్తిః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), రమ్యా... వృత్తీః : రమ్య = అందమైన, అధర+ఓష్ఠ = క్రిందిపెదవియొక్క, సుధయా = అమృతంతో (రమ్యః అధరశ్చ అసౌ

ఓష్ఠః తస్య సుధా, తయా), రచిత+ఆత్మ–వృత్తీః : రచిత = కల్పింపబడిన, ఆత్మ = తమయొక్క, వృత్తీః = జీవిక గల, (నః = మమ్ము), త్యక్తుమ్ = వీడుటకు, న అర్హసి = తగవు (అర్హ పూజాయామ్ – పరస్మైపది–లట్–మ.ఏ.), అంగ! = ప్రభూ, త్వత్... పాపమ్ : త్వత్ = నీయొక్క, సంగ = కలయిక యొక్క, భంగ = ఎడబాటును, కరణ = చేయుటచేత, ఉద్యత = పుట్టిన, పాపమ్ = పాపాన్ని, క్షపయితుమ్ = తొలగించటానికి, తవ = నీ యొక్క, లోచన+అంతః = కడగంటిచూపు, శక్నోతి హి = సమర్థమే గదా! (శక్ –శక్తౌ–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నవాంబుదశ్యామా! అందమైన నీ పెదవిమీది అమృతంతో మా జీవికను కల్పించుకున్నాం. అటువంటి మమ్ము వీడిపోవటం తగదు. నీ సమాగమాన్ని భంగపరచటం ద్వారా చేసిన పాపాన్ని అణచివేయటానికి నీ కడకంటి చూపు చాలు గదా! (గోపికా కృష్ణ సమాగమానికి భంగం కలిగిస్తున్న కంసుని చంపటానికి కడగంటిచూపు చాలదా? నువ్వే వెళ్ళాలా? అని కూడా గోపికల ఆలోచన)

**వి :** 1. అధరామృతానికి ఆత్మవృత్తిని కలిగించగల శక్తి వున్నప్పుడు కంటిచూపులకు శత్రుసంహారం చేసే శక్తిలేదా? అని గోపికల భావన. దానికోసమైనా కృష్ణుడు వెళ్ళవలసినదే గదా! ఆ ఆవేదనలో అంత ఆలోచన రాలేదు వాళ్ళకు. లేదా భావనామాత్రంతోనే దృష్టి ప్రసారం జరుగుతుందని భావించారేమో.

| | | | |
|---|---|---|---|
| 2. **అర్హతి :** | **అర్హతి** | అర్హతః | అర్హన్తి |
| | అర్హసి | అర్హథః | అర్హథ |
| | అర్హామి | అర్హావః | అర్హామః |
| **శక్నోతి :** | **శక్నోతి** | శక్నుతః | శక్నువన్తి |
| | శక్నోషి | శక్నుథః | శక్నుథ |
| | శక్నోమి | శక్నువః | శక్నుమః. |

*

**శ్లో॥ యియాసుం త్వాం సమాలోక్య – నః ప్రాణోఽపి యియాసతి ।**
**యువయోరవినాభావ–మక్షైరీక్షామహేఽధునా ॥ 10–36**

**అ :** గోపికా విలాపం. –పథ్యావక్త్రమ్.

**అ :** యియాసుం త్వాం సమాలోక్య నః ప్రాణః అపి యియాసతి. యువయోః అవినాభావమ్ అధునా అక్షైః ఈక్షామహే.

**ప్ర :** యియాసుమ్ = వెళ్ళదలచిన (యాతుమ్ ఇచ్ఛుః, తమ్), త్వామ్ = నిన్ను, సమ్–ఆ–లోక్య = చూసి (సమ్–ఆ–లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నః = మాయొక్క, ప్రాణః+అపి = ప్రాణం కూడా, యియాసతి = వెళ్ళగోరుతోంది. (యాతుమ్ ఇచ్ఛతి) (యా ప్రాపణే–సన్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), యువయోః = మీ ఇద్దరియొక్క, అవినాభావమ్ = అవినాభావాన్ని (ఒకరు లేకపోతే మరొకరు లేకపోవటం అవినాభావం), అధునా = ఇప్పుడు, అక్షైః = ఇంద్రియాలతో (ఖమక్షమింద్రియం స్రోతః – హలాయుధకోశః – 535), ఈక్షామహే = చూస్తున్నాము. (ఈక్ష దర్శనే–ఆత్మనేపది–లట్–ఉ.బ.)

**తా ॥** కృష్ణా! నీవు మథురకు వెళ్ళదలచుకోగానే మా ప్రాణం కూడా వెళ్ళాలనుకొంటోంది. మీ ఇద్దరియొక్క అవినాభావసంబంధాన్ని నేడు చూస్తున్నాం.

**వి :** 1. శరీరంలోని హృదయస్థానంలోని ధాతువుకు ప్రాణమని పేరు. దానికే ఆయా స్థానభేదాలను బట్టి వేరు వేరు పేర్లు.

శ్లో॥ హృది ప్రాణో గుదేఽపానస్సమానో నాభిసంస్థితః ।
ఉదానః కణ్ఠదేశస్థో వ్యానస్సర్వశరీరగః ॥ – అమరకోశః

కాబట్టి హృదయంలో ప్రాణముంటుంది. ఆ హృదయంలోనే పరమాత్మయొక్క ఉనికి.

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని భారత! ॥ – భగవద్గీత – 18/61

కాబట్టి ప్రాణానికీ, కృష్ణునికీ అవినాభావసంబంధం. దాన్ని ప్రస్తుతం గోపికలు ప్రత్యక్షంగా చూస్తున్నారు.

| | | | |
|---|---|---|---|
| 2. **యియాసతి :** | **యియాసతి** | యియాసతః | యియాసన్తి |
| | యియాససి | యియాసథః | యియాసథ |
| | యియాసామి | యియాసావః | యియాసామః |
| **ఈక్షామహే :** | ఈక్షతే | ఈక్షేతే | ఈక్షన్తే |
| | ఈక్షసే | ఈక్షేథే | ఈక్షధ్వే |
| | ఈక్షే | ఈక్షావహే | **ఈక్షామహే.** |

*

## శ్లో॥ కిము దురితమకారి యేన కంస–ప్రకటితకార్ముకసంభ్రమే శరాణామ్ ।
## విధిరకృత పదం వివేకహీనో – మృదులకలేవరమస్మదీయమాదౌ ॥ 10–37

**అ :** గోపికా విలాపం. –పుష్పితాగ్ర.

**అ :** కిము దురితమ్ అకారి యేన వివేకహీనః విధిః కంస–ప్రకటిత–కార్ముక–సంభ్రమే అస్మదీయం మృదులం కలేవరమ్ ఆదౌ శరాణాం పదమ్ అకృత.

**ప్ర :** కిము = ఎటువంటి, దురితమ్ = పాపం, అకారి = చేయబడినదో (కృ కరణే–కర్మణి–ఆత్మనేపది–లుఙ్–ప్ర.ఏ.), యేన = ఏ పాపంచేత, వివేక–హీనః = బుద్ధిలేని (వివేకేన హీనః), విధిః = దేవుడు, కంస... సంభ్రమే : కంస = కంసునిచేత, ప్రకటిత = ఘోషింపబడిన, కార్ముక = ఆయుధసంబంధమైన, సంభ్రమే = తిరుణాళ్ళలో (కంసేన ప్రకటితశ్చ అసౌ కార్ముకాణాం సంభ్రమః, తస్మిన్), అస్మదీయమ్ = మాయొక్క, మృదుల–కళేవరమ్ : మృదుల = కోమలమైన, కళేవరమ్ = శరీరం, ఆదౌ = ముందుగా, శరాణాం పదమ్ = బాణాలకు ఎరగా, అకృత = చేశాడు. (కృ కరణే–ఆత్మనేపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** మేము ఏ పాపం చేశామో! లేకపోతే కంసుడు ఎక్కడో మథురానగరిలో కార్ముకోత్సవాన్ని ప్రకటించి ఆ బాణాలకు తొలి ఎరగా మమ్మల్నే చేశాడు. ఈ కోమల శరీరాలను బాణాలకు లక్ష్యంగా కల్పించిన విధికి వివేకం లేదు.

**వి :** 1. 'వివేకహీనః విధిః' అని విధిని నిందించటం ద్వారా ఇక్కడ వాస్తవంగా నిందిస్తున్నది విధిని కాదు. ఇటువంటి పరిస్థితికి కారణమైన కంసుని కార్ముకోత్సవ ప్రయత్నాన్ని. అయితే కంసుడు కూడా దానికి ప్రత్యక్షంగా కారణం కాలేదు. కృష్ణునిపై అంత ప్రేమను అంకురింప జేసిన మదనుని పూనికను. పోనీ కంసుడు కబురు చెప్పమన్నంత మాత్రాన వెంటనే వచ్చిన అక్రూరుడూ, అక్రూరుడు చెప్పినంత మాత్రాన హఠాత్తుగా బయలుదేరిన కృష్ణుడు అందరూ బాధ్యులే. కానీ వారిలో ఏ ఒక్కరినీ దూషించే వీలులేక తమలో తామే ఎంత పాపం చేశామో అని అనుకోవటం కనిపిస్తుంది. కాబట్టి విధి నింద ద్వారా స్వీయనిందయే వ్యక్తమవుతుంది. నిందతో నింద వ్యక్తమయితే అది వ్యాజనిందాలంకారం. '**నిందాయా–నిందయా వ్యక్తిః వ్యాజనిందేతి గీయతే**' – (కు.72)

| | | | |
|---|---|---|---|
| 2. **అకారి :** | **అకారి** | అకారిషాతామ్ | అకారిషత |
| | అకారిష్ఠాః | అకారిషాథామ్ | అకారిఢ్వమ్ |
| | అకారిషి | అకారిష్వహి | అకారిష్మహి |
| **అకృత :** | **అకృత** | అకృషాతామ్ | అకృషత |
| | అకృథాః | అకృషాథామ్ | అకృఢ్వమ్ |
| | అకృషి | అకృష్వహి | అకృష్మహి. |

*

**శ్లో॥ అహో విధే! త్వద్వచసాఽతితృప్తా - యదూద్వహాలిఙ్గనలుబ్ధచిత్తాః ।**
**తదీక్షణేనాపి కథం విహీనా - దయాతిదూరాద్య కరోషి దీనాః ॥ 10-38**

**అ :** గోపికా విలాపం. -ఉపేంద్రవజ్ర.

**అ :** దయా+అతిదూర! విధే! త్వద్ వచసా అతితృప్తాః యదు+ఉద్వహ+ఆలింగన-లుబ్ధ-చిత్తాః దీనాః అద్య తద్-ఈక్షణేన అపి విహీనాః కథం కరోషి. అహో!

**ప్ర :** దయా+అతిదూర! : దయ = జాలికి, అతిదూర = చాలా దూరమైన వాడా !, విధే! = విధిరూపా (అక్రూరా!), త్వద్-వచసా = నీ మాటచే, అతితృప్తాః = బాగా ఆనందించిన వారమూ, యదు... చిత్తాః : యదు ఉద్వహ = యదువంశశ్రేష్ఠుడైన కృష్ణుని, ఆలింగన = కౌగి-లించుటయందు, లుబ్ధ = ఆశగల, చిత్తాః = మనస్సుగల వారమూ (యదునామ్ ఉద్వహః, తస్య ఆలింగనం, తస్మిన్ లుబ్ధాని చిత్తాని యాసాం తాః), దీనాః = దీనులమూ అయిన మమ్ము, అద్య = ఇప్పుడు, తద్-ఈక్షణేన+అపి = ఆయన చూపునకు కూడా, విహీనాః = లేని వారినిగా, కథమ్ = ఏ రీతిగా, కరోషి = చేస్తున్నావు? (కృ కరణే పరస్మైపది-లట్-మ.ఏ.)

**తా ॥** దయావిహీనా! విధీ! పరమానందంగా కృష్ణుని కౌగిలించుకొనే ఆశతో నిండినవి మా మనస్సులు. అటువంటి మనస్సులుగల మమ్ము నీ మాటతో కృష్ణుని మా చూపులకు కూడా అవకాశమివ్వని వానినిగా చేస్తున్నావు. మాదైన్యానికి కారణమైన ఇంతపని ఎలా చేస్తున్నావు.

**వి :** 1. ఈ శ్లోకంలో విషాదనాలంకారం కనిపిస్తుంది. కోరుకున్న దానికి విరుద్ధమైన ఫలితం లభించటం విషాదనాలంకారం. '**ఇష్యమాణవిరుద్ధార్థసంప్రాప్తిస్తు విషాదనమ్**' - (కు. 132). కృష్ణుని కౌగిలించుకోవాలని ఆశపడుతున్న వారికి కంటికి కూడా కనిపించకుండా పోయే పరిస్థితి రావటం విషాదనం.

2. అక్రూరునిలో విధ్యంశ కలదని మహాభారతతాత్పర్యనిర్ణయం చెపుతోంది.

శ్లో॥ సంసేవనాయ స హరేరభవత్ పురైవ
నామ్నా కిశోర ఇతి యః సురమాయకోఽభూత్ ।
స్వాయంభువస్య చ మనోః పరమాంశయుక్త
**ఆవేశయుక్ కమలజస్య** బభూవ విద్వాన్ ॥ - మహాభారతతాత్పర్యనిర్ణయః -13/85

| | | | |
|---|---|---|---|
| 3. **కరోషి :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | **కరోషి** | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః. |

*

**శ్లో॥ అయమపి చ విరుద్ధనామధేయో - నయతి విలాపముపేక్ష్య కామినీనామ్ ।**
**ప్రియసరసవిలాసమగ్ర్యవేషం - కమలదృశం కమనీయచారుహాసమ్ ॥ 10-39**

**అ :** గోపికలు అక్రూరుని తప్పుపట్టడం. -పుష్పితాగ్ర.

**అ :** విరుద్ధ-నామధేయః అయమ్ అపి చ కామినీనాం విలాపమ్ ఉపేక్ష్య ప్రియ-సరస విలాసమ్ అగ్ర్యవేషం కమనీయ-చారు-హాసం కమలదృశం నయతి.

**ప్ర :** విరుద్ధ-నామధేయః : విరుద్ధ = స్వభావానికి/ అర్థానికి భిన్నమైన, నామధేయః = పేరుగల (విరుద్ధం నామధేయం యస్య సః), అయమ్-అపి-చ = ఈ అక్రూరుడు కూడా, కామినీనామ్ = కాంతలయొక్క, విలాపమ్ = ఆవేదనను, ఉపేక్ష్య = తృణీకరించి (ఉప-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ప్రియ-సరస-విలాసమ్ : ప్రియ = ఇష్టమైన, సరస = సరస (ఆసక్తికర)మైన, విలాసమ్ = విలాసాలు గలవాడూ (ప్రియాః సరసాశ్చ విలాసాః యస్య తమ్), అగ్ర్య-వేషమ్ : అగ్ర్య = గొప్పదైన, వేషమ్ = ఆహార్యం గలవాడూ (అగ్ర్యః వేషః యస్య తమ్), కమనీయ-చారు-హాసమ్ : కమనీయ = కోరదగిన, చారు = అందమైన, హాసమ్ = నవ్వు గలవాడూ అయిన (కమనీయః చారుశ్చ హాసః యస్య, తమ్), కమల-దృశమ్ = కమలాక్షుని (కృష్ణుని), నయతి = కొనిపోతున్నాడు. (నీ ప్రాపణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ అక్రూరుడు విరుద్ధనామధేయుడు (మనిషికి తగిన పేరు కాదు). కామినులమైన మేమంతా విలపిస్తున్నా సరే కృష్ణుని (మధురానగరానికి) తీసికొని పోతున్నాడు. కృష్ణుడు ప్రియసరసవిలాసాల వాడు. గొప్ప ఆహార్యం గలవాడు. అందమైన దరహాసంతో కమనీయుడు. (అటువంటి వాడిని అక్రూరుడు దూరం చేస్తున్నాడు.)

**వి :** 1. పురాణ పాత్రలలో లేదా పౌరాణిక వ్యక్తులలో పేర్లు దేశానికో, జాతికో, వంశానికో, లక్షణాలకో లేదా ఎప్పుడైనా జరిగిన ప్రసిద్ధ సంఘటనలకో సంబంధించి వుండటం పరిపాటి. కాబట్టి అక్రూర పదాన్ని విని గోపికలు దానిని ఆయన లక్షణంగా భావించారు. కానీ చేసిన పని కృష్ణుని తీసికొనిపోవటం- వారికి క్రూరమైన పనిగా కనిపించింది. అందువల్ల విరుద్ధనామధేయుడని వారు వ్యవహరిస్తున్నారు.

బృహత్ప్రయోజనాన్ని ఆశించేవారు స్వల్పప్రయోజనాన్ని ఆశించేవారి దృష్టిలో ఒక్కొక్కప్పుడు క్రూరులుగా కనిపిస్తారు. అది తెలిసికూడా మౌనంగా తాము తలపెట్టిన జగద్ధితాన్ని సాధించే ప్రయత్నం చేయటమే వారి అక్రూరత్వం.

2. పోతన మాటలలో గోపికల నిష్ఠురోక్తులను గమనించండి.

శా. అక్రూరుం డని పేరువెట్టుకొని నేఁ డస్మన్మనోవల్లభుం-
జక్రిన్ మాకడఁ బాపికొంచు నరుగన్ జర్చించి యేతెంచి నాఁ
డక్రూరుం డఁట క్రూరుఁ డీతఁడు నిజం బక్రూరుఁడౌనేని ని
ర్వక్రత్వంబునఁ గృష్ణుఁ బెట్టి తన త్రోవం బో విచారింపఁడే?-పోతనభాగవతము 10/1214

| | | |
|---|---|---|
| 3. **నయతి :** | **నయతి** | నయతః నయన్తి |
| | నయసి | నయథః నయథ |
| | నయామి | నయావః నయామః. |

*

**శ్లో॥ భృత్యోఽయం కిము సన్తనోతు స పరం ప్రత్యర్థిభూతః సతాం**
**కంసస్తద్ధనురుత్సవోఽస్తు నిహతో భగ్నం చ భూయాద్ధనుః ।**
**యోఽస్మత్ప్రాణసమం వియోజయతి హా స్మేరాననం శ్రీపతిం**
**తం ప్రాణేన వియోజయత్వతిమదం దేవోఽస్మదీయో విభుః ॥ 10-40**

**అ :** అక్రూరుని పోకడను అనిష్టంగానే అంగీకరిస్తూ దానికి కారణమైన కంసుని నిందించటం. -శార్దూలం.

**అ :** భృత్యః అయం కిము సంతనోతు పరం సః కంసః సతాం ప్రత్యర్థి-భూతః తద్ధనురుత్సవః నిహతః అస్తు.

ధనుః చ భగ్నం భూయాత్. యః అస్మత్ప్రాణ-సమం స్మేర+ఆననం శ్రీపతిం వియోజయతి హా అతిమదం తం విభుః అస్మదీయః దేవః ప్రాణేన వియోజయతు.

**ప్ర :** భృత్యః = సేవకుడైన, అయమ్ = ఈ అక్రూరుడు, కిము సంతనోతు = ఏం చేయగలడు? (సమ్+తనూ విస్తారే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), పరమ్ = కానీ, సః కంసః = ఆ కంసుడు, సతామ్ = మంచివారికి, ప్రత్యర్థి-భూతః = శత్రువైనవాడు, తత్+ధనుః+ఉత్సవః = ఆ వింటి పండుగ, నిహతః-అస్తు = పాడయి పోను. (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), ధనుః+చ = విల్లు కూడా, భగ్నం భూయాత్ = విరిగిపోవాలి (భూ సత్తాయామ్ -పరస్మైపది-ఆశీర్లిఙ్-ప్ర.ఏ.), యః = ఎవడయితే, అస్మత్-ప్రాణ-సమమ్ = మన ప్రాణసమానుడూ (అస్మాకం ప్రాణైః సమః తమ్), స్మేర+ఆననమ్ = నగుమోము వాడునూ (స్మేరమ్ ఆననం యస్య తత్) అయిన, శ్రీ-పతిమ్ = లక్ష్మీకాంతుని (శ్రియః పతిః, తమ్), వియోజయతి = విడదీస్తున్నాడో (వి+యుజ్ యోజనే-లట్-ప్ర.ఏ.), హా = అయ్యో!, అతిమదమ్ = బాగా పొగరుబోతు అయిన, తమ్ = ఆ కంసుని, విభుః = సమర్థుడూ, అస్మదీయః = మనవాడూ అయిన, దేవః = ప్రభువు (కృష్ణుడు), ప్రాణేన = ప్రాణంతో, వియోజయతు = విడదీయుగాత!

**తా ॥** ఈ అక్రూరుడు కేవలం సేవకుడు. స్వతంత్రంగా తానేం చేయగలడు. కానీ ఆ కంసుడు సజ్జనశత్రువు. ఆయన వింటిపండుగ పాడయిపోవాలి. ఆ విల్లు విరిగిపోవాలి. నగుమోము వాడూ, మనకు ప్రాణసమానుడూ అయిన కృష్ణుని మననుండి విడదీస్తున్నాడు గదా! ఆయన ప్రాణాన్ని ఆయన నుండి వేరు చేయాలి సమర్థుడైన మనదేవుడు ఈ కృష్ణుడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **సంతనోతు :** | **సంతనోతు**/సంతనుతాత్ | సంతనుతామ్ | సంతన్వన్తు |
| | సంతను/సంతనుతాత్ | సంతనుతమ్ | సంతనుత |
| | సంతనవాని | సంతనవావ | సంతనవామ |
| **అస్తు :** | **అస్తు**/స్యాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |
| **భూయాత్ :** | **భూయాత్** | భూయాస్తామ్ | భూయాసుః |
| | భూయాః | భూయాస్తామ్ | భూయాస్త |
| | భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |
| **వియోజయతు:** | **వియోజయతు**/వియోజయతాత్ | వియోజయతామ్ | వియోజయన్తు |
| | వియోజయ/వియోజయతాత్ | వియోజయతమ్ | వియోజయత |
| | వియోజయాని | వియోజయావ | వియోజయామ. |

*

**శ్లో॥ జిగమిషసి మురారే! రాజధానీం యదీతః**
**శ్రుతితతిజిత! యాహి శ్రీః శుభా తత్ర తేఽస్తు ।**
**సుఖద! తదుపసర్గం సౌమ్య! సన్ధేహి శీఘ్రం**
**ఘటయ ఘటక! నో చేన్నస్తవైవోపసర్గమ్ ॥ 10-41**

అ : గోపికలు కృష్ణుని వెళ్ళి త్వరగా రమ్మని ప్రార్థించటం. -మాలిని.

**అ :** మురారే ఇతః యది రాజధానీం జిగమిషసి (తర్హి) యాహి. తత్ర తే శుభా శ్రీః అస్తు. శ్రుతి-తతి-జిత! సుఖద! సౌమ్య! తద్-ఉపసర్గం శ్రీఘ్రం సంధేహి. నో చేత్ ఘటక నః తవ ఏవ ఉపసర్గం ఘటయ.

**ప్ర :** మురారే = కృష్ణా, ఇతః = ఇక్కడ నుండి, యది = ఒకవేళ, రాజధానీమ్ = రాజధాని (మథురా) నగరానికి, జిగమిషసి = వెళ్ళదలచుకుంటే (గన్తుమ్ ఇచ్ఛసి) (జగమ్-గతౌ-సన్-పరస్మైపది-లట్-మ.ఏ.), తర్హి = అప్పుడు, యాహి = వెళ్ళు. (యా ప్రాపణే పరస్మైపది-లోట్-మ.ఏ.), తత్ర = అక్కడ, తే = నీకు, శుభా = శోభనకరమైన, శ్రీః = సంపద, అస్తు = ఉండుగాక (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), శ్రుతి-తతి-జిత! : శ్రుతి-తతి = వేదసమూహంచే, జిత = సాధింపబడినవాడా! (శ్రుతీనాం తతిః తయా జితః తస్మాత్ సంబుద్ధిః), సుఖ-ద = సుఖాన్ని ఇచ్చేవాడా! (సుఖం దదాతి ఇతి, తస్మాత్ సంబుద్ధిః), సౌమ్య! = సౌమ్యుడా!, తద్-ఉపసర్గమ్ : తత్ = దాని ('యాహి' పదం) యొక్క, ఉపసర్గమ్ = ఉపసర్గను (ఆఙ్ అనేదానిని), శీఘ్రమ్ = త్వరగా, సంధేహి = కలుపు ('యాహి'కి 'ఆ'ను కలిపితే ఆయాహి అవుతుంది. 'రా' అనే అర్థం వస్తుంది) (సమ్+ధా ధారణ పోషణయోః పరస్మైపది-లోట్-మ.ఏ.), నోచేత్ = లేకపోతే, ఘటక = కూర్పరీ! నః = మాకు, తవ ఏవ = నీ యొక్కయే, ఉప = సమీపంలో, సర్గమ్ = పుట్టుకను, ఘటయ = కల్పించు (ఘట చేష్టాయామ్ ణిచ్-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! ఈ ప్రదేశం నుండి రాజధాని అయిన మథురకు వెళ్ళదలిచావు. అయితే వెళ్ళు. అక్కడ నీకు శుభసంపదలు కలుగుతాయి. వేదజితా! సుఖద! సౌమ్య! అయితే వెంటనే తిరిగిరా. లేకపోతే మమ్ములను కూడా అక్కడే పుట్టించు.

**వి :** 1. 'వెళ్ళదలచుకుంటే వెళ్ళు. కానీ మమ్ములను అక్కడే పుట్టించు' అనటం ద్వారా 'నీవు వెళితే మేము బ్రతకలేము. నీవున్నచోటే పుట్టించవలసివస్తుంది నీకు. కాబట్టి వెళ్ళవద్దు' అన్న నిషేధవచనం అక్కడ గమ్యమాన మవుతుంది. కాబట్టి విధివాచ్యంగానూ నిషేధం వ్యంగ్యంగాను వుంటే అది ఆక్షేపాలంకారం. '**ఆక్షేపాఽన్యో విధౌ వ్యక్తే నిషేధే చ తిరోహితే**' - (కు.75)

| | | | |
|---|---|---|---|
| 2. **జిగమిషసి :** | జిగమిషతి | జిగమిషతః | జిగమిషన్తి |
| | **జిగమిషసి** | జిగమిషథః | జిగమిషథ |
| | జిగమిషామి | జిగమిషావః | జిగమిషామః |
| **యాహి :** | యాతు/యాతాత్ | యాతామ్ | యాన్తు |
| | **యాహి**/యాతాత్ | యాతమ్ | యాత |
| | యాని | యావ | యామ |
| **అస్తు :** | 10-40వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |
| **సన్ధేహి :** | సన్దధాతు/సన్ధత్తాత్ | సన్ధత్తామ్ | సన్దధతు |
| | **సన్ధేహి**/సన్ధత్తాత్ | సన్ధత్తమ్ | సన్ధత్త |
| | సన్దధాని | సన్దధావ | సన్దధామ. |

*

**శ్లో॥ ప్రియం నినీషోర్నను యస్య ధాతా - పిపర్తి కాంక్షాం నిజసౌఖ్యదాతా ।**
**స ఏష గర్భీకృతపద్మజన్మా - జిఘృక్షతి శ్రీశపదామ్బుజన్మ ॥ 10-42**

**అ :** గోపికా విలాపమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** ప్రియం నినిషోః యస్య కాంక్షాం నిజసౌఖ్య-దాతా ధాతా పిపర్తి గర్భీకృత-పద్మ-జన్మా సః ఏషః శ్రీ+ఈశ-పద+అంబుజన్మ జిఘృక్షతి.

**ప్ర :** ప్రియమ్ = ప్రియుడైన కృష్ణుని, నినీషోః = కొనిపోగోరుతున్న (నేతుమ్ ఇచ్ఛుః తస్య), యస్య = ఏ అక్రూరునియొక్క, కాంక్షామ్ = కోరికను, నిజ-సౌఖ్య-దాతా : నిజ = తమకు చెందిన, సౌఖ్య = సుఖానుభవాన్ని,

దాతా = అందించే వాడైన, ధాతా = బ్రహ్మ, పిపర్తి = పెంచుతున్నాడో (పౄ పాలనపూరణయోః పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), గర్భీకృత–పద్మ–జన్మా : గర్భీకృత = లోన ప్రవేశించిన, పద్మ–జన్మా = బ్రహ్మదేవుడు గల (గర్భీకృతః పద్మే జన్మా యస్య సః), సః + ఏషః = ఆ ఈ అక్రూరుడు, శ్రీ+ఈశ–పదాంబుజన్మ : శ్రీశ = కృష్ణునియొక్క, పద+అంబుజన్మ = పాదపద్మాలను, జిఘృక్షతి = గ్రహింపగోరుతున్నాడు. (గ్రహీతుమ్ ఇచ్ఛతి) గ్రహ ఉపాదానే–సన్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని మధురా నగరికి తీసికొని పోవాలన్న అక్రూరుని కోరికను తనకు సౌఖ్యాన్ని కలిగించే బ్రహ్మదేవుడు వృద్ధిపొందిస్తున్నాడు. అక్రూరునిలో పద్మజన్ముడు (బ్రహ్మ) ఆవేశించాడు. ఆ అక్రూరుడు కృష్ణుని పాదపద్మాలను గ్రహింప గోరుతున్నాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. పిపర్తి :** | **పిపర్తి** | పిపూర్తః | పిపూరతి |
| | పిపర్షి | పిపూర్థః | పిపూర్థ |
| | పిపర్మి | పిపూర్వః | పిపూర్మః |
| **జిఘృక్షతి :** | **జిఘృక్షతి** | జిఘృక్షతః | జిఘృక్షన్తి |
| | జిఘృక్షసి | జిఘృక్షథః | జిఘృక్షథ |
| | జిఘృక్షామి | జిఘృక్షావః | జిఘృక్షామః. |

*

**శ్లో॥ ఇతి విరహజభీత్యా వేపమానాః కృశాఙ్గీ–**
**ర్గలితవలయహారాశ్చిత్రలేఖ్యానుసారాః ।**
**మురభిదమృతకల్పైః ప్రీణయన్ ప్రేమవాక్యైః**
**సకరుణమసకృత్ తా వీక్షమాణః ప్రతస్థే॥ 10–43**

**అ :** కృష్ణుడు గోపికలను వీడ్కొనుట. –మాలిని.

**అ :** ఇతి విరహ–జ–భీత్యా వేపమానాః కృశ+అంగీః గలిత–వలయ–హారాః చిత్ర–లేఖ్య+అనుసారాః తాః అమృతకల్పైః ప్రేమవాక్యైః ప్రీణయన్ స కరుణమ్ అసకృత్ వీక్షమాణః మురభిత్ ప్రతస్థే.

**ప్ర :** ఇతి = అని, విరహజ–భీత్యా : విరహ = వియోగంవలన, జ = పుట్టిన, భీత్యా = భయంతో (విరహేణ జాయత ఇతి సా చ సా భీతిః విరహజభీతిః, తయా), వేపమానాః = వణికిపోతున్నవారును, కృశ+అంగీః : కృశ = చిక్కిపోయిన, అంగీః = శరీరం గలవారును (కృశాని అంగాని యాసాం తాః, తాః), గలిత–వలయ–హారాః : గలిత = జారిన, వలయ = గాజులు, హారాః = ముత్యాలపేరులుగల వారును (గళితాః వలయాః హారాశ్చ యాసాం తాః తాః), చిత్ర–లేఖ్య–అనుసారాః : చిత్రలేఖ్య = చిత్తరువులను, అనుసారాః = అనుసరించువారును/ స్తబ్ధంగా నిలిచిన వారు (చిత్రలేఖ్యామ్ అనుసరన్తి ఇతి), తాః = ఆ గోపికలను, అమృతకల్పైః = అమృతం వంటి (ఈషదూనమ్ అమృతమ్ అమృతకల్పమ్), ప్రేమ–వాక్యైః = ప్రీతివచనాలతో, ప్రీణయన్ = తృప్తిని కలిగిస్తూ, సకరుణమ్ = జాలిగా, అసకృత్ = మాటిమాటికీ, వీక్షమాణః = చూస్తూ (వి+ఈక్ష ధాతువుపై శానచ్ ప్రత్యయం), మురభిత్ = కృష్ణుడు, ప్రతస్థే = బయలుదేరాడు (ప్ర+స్థా ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ రీతిగా విలపిస్తున్నారు గోపికలు. వారు విరహంవలన ఏర్పడిన భయంతో వణికి పోతున్నారు. బక్కచిక్కివున్నారు. వారి గాజులు, హారాలు సడలి పోతున్నాయి. బొమ్మల్లాగా నిశ్చేష్టులయ్యారు వారు. అటువంటి ఆ గోపికలను అమృతాయమానమైన ప్రణయవచనాలతో ఆనందింపజేస్తూ జాలిగా వారివైపు పదే పదే చూస్తూ కృష్ణుడు బయలు దేరాడు.

**వి :** నారాయణీయంలో పరాశరభట్టరు గోపికాకృష్ణుల పరస్పరవీక్షణాన్ని వర్ణించాడు.

శ్లో॥ సవిషాదభరం సయాచ్ఞముచ్చై – రతిదూరం వనితాభిరీక్ష్యమాణః ।
మృదు తద్దిశి పాతయన్నపాంగాన్–సబలోఽ క్రూరరథేన నిర్గతోఽ భూః ॥ – 73/5

2. శ్లోకంలో గోపికలలో రెండు సాత్త్వికభావాలు కనిపిస్తాయి. 1. వేపథువు 2. స్తంభం రాగరోషభయాది భావాలతో శరీరంలో వణుకు పుట్టడం **వేపథువు (రాగరోషభయాదిభ్యో వేపథుర్గాత్రకంపనమ్)**, నిశ్చేష్టంగా నిలిచిపోవటం స్తంభం (స్తంభః స్యాన్నిష్క్రియాంగతా).

| | | | |
|---|---|---|---|
| 3. ప్రతస్థే : | **తస్థే** | తస్థాతే | తస్థిరే |
| | తస్థిషే | తస్థాథే | తస్థిధ్వే |
| | తస్థే | తస్థివహే | తస్థిమహే. |

*

**శ్లో॥ పాదస్పర్శకరగ్రహప్రియతమాఙ్గాశ్లేషకేశగ్రహ–
ప్రేక్షాధఃకరణోపరిస్థితిమిథోముష్ట్యాదిజుష్టే రతే ।
గోపీనాం కుచకుమ్భమర్దనకృతా మల్లేన్ద్రవిద్యాఽర్జితా
యేనేభార్దనవైఖరీ చ స కథం తాస్త్యక్తుమీష్టే ప్రభుః ॥ 10–44**

**అ :** కవి గోపికల ఆవేదనను సమర్థిస్తూ, కృష్ణునకు వారి గురుత్వాన్ని స్మరించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యేన–పాద–స్పర్శ–కర–గ్రహ–ప్రియతమా+అంగ+ఆశ్లేష–కేశ–గ్రహ+ప్రేక్షా–అధఃకరణ+ఉపరిస్థితి–మిథః +ముష్టి+ఆది–జుష్టే రతే గోపీనాం కుచ–కుంభ–మర్దన–కృతా మల్ల+ఇంద్ర–విద్యా ఆర్జితా ఇభ+అర్దన–వైఖరీ చ ఆర్జితా సః ప్రభుః తాః త్యక్తుం కథమ్ ఈష్టే.

**ప్ర :** యేన = ఎవనిచే, పాద–స్పర్శ = కాలు తాకుట, కర–గ్రహ = చేయి పట్టుకొనుట, ప్రియతమా = నెచ్చెలులయొక్క, అంగ = శరీరంయొక్క, ఆశ్లేష = కౌగిలించుట, కేశ–గ్రహ = జుట్టుపట్టుకొనుట, ప్రేక్షా = చూచుట, అధఃకరణ = క్రిందు చేయుట, ఉపరిస్థితి = మీద నిలుచుట, మిథః+ముష్టి = ముష్టాముష్టి, ఆది = మొదలగు వానిచే, జుష్టే = సేవింపబడిన, రతే = సురతంలో, గోపీనామ్ = గోపికలయొక్క, కుచ–కుంభ–మర్దన–కృతా : కుచ = రొమ్ము లనబడే, కుంభ = ఏనుగు కుంభస్థలాలను, మర్దన = గ్రుద్దుట చేత, కృతా = అలవడిన, మల్ల+ఇంద్ర–విద్యా = మేటి మల్లయుద్ధవిద్య, ఆర్జితా = సంపాదించబడిందో, ఇభ–అర్దన–వైఖరీ–చ = ఇభ = ఏనుగులను, అర్దన = పీడించే, వైఖరీ చ = పద్ధతి కూడా, ఆర్జితా = సంపాదింపబడిందో, సః = ఆ, ప్రభుః = స్వామి అయిన కృష్ణుడు, తాః = వారిని (ఆ గోపికలను), త్యక్తుమ్ = విడుచుటకు, కథమ్ = ఎట్లు, ఈష్టే = సమర్థుడు కాగలడు? (ఈశ ఐశ్వర్యే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు గోపికలనుండి మల్లవిద్యనూ, ఏనుగులను అదుపు చేయటాన్ని నేర్చుకొన్నాడు. ఈ రెండు విద్యలనూ వారినుండి నేర్చుకోవటానికి వారితో జరిపిన సురతక్రీడయే ఆధారం. ఆ క్రీడలోని అంశాలయిన పాదస్పర్శ, కరగ్రహణం, కౌగిలింత, జుట్టుపట్టుకోవటం, చూడటం, క్రిందు చేయటం, మీదు కావటం, ముష్టాముష్టి – ఇవన్నీ కృష్ణునకు మల్లయుద్ధాన్నీ, గజగ్రహణాన్ని నేర్పాయి. కానీ కృష్ణుడు తనకవి నేర్పిన ఆ గోపికలనే ఎలా వీడి వెళ్ళగలుగుతున్నాడు?

**వి :** 1. ఇక్కడ గోపికలతోడి క్రీడలకూ, కృష్ణుని మల్లవిద్యా, గజగ్రహణవిద్యాభ్యాసానికి సంబంధం లేదు. లేని సంబంధాన్ని కల్పించాడు కాబట్టి ఇది సంబంధాతిశయోక్తి. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' – (కు.39)

| | | | |
|---|---|---|---|
| 2. **ఈష్టే :** | **ఈష్టే** | ఈశాతే | ఈశతే |
| | ఈశిషే | ఈశాథే | ఈశిధ్వే |
| | ఈశే | ఈశ్వహే | ఈశ్మహే. |

*

**శ్లో॥ స వల్లవీనాం ప్రణయాఖ్యదామ్నా - నిబధ్యమానోఽపి రిపూన్ జిఘాంసుః ।**
**జగామ శౌరిర్న విజేతుకామో - నివార్యమాణోఽపి నివర్తతే స్మ ॥ 10-45**

**అ :** కృష్ణుడు ప్రణయబద్ధుడైనా శత్రుహననేచ్ఛతో వెళ్ళాడని కవి కృష్ణుని సమర్థించటం.

**అ :** సః శౌరిః వల్లవీనాం ప్రణయ+ఆఖ్య-దామ్నా నిబధ్యమానః అపి రిపూన్ జిఘాంసుః జగామ. విజేతుకామః నివార్యమాణః అపి న నివర్తతే స్మ.

**ప్ర :** సః శౌరిః = ఆ కృష్ణుడు, వల్లవీనామ్ = గోపికలయొక్క, ప్రణయ+ఆఖ్య-దామ్నా : ప్రణయ+ఆఖ్య = ప్రేమ అనే పేరుగల, దామ్నా = త్రాటితో (ప్రణయ ఇతి ఆఖ్యా యస్య తత్, చ దామ చ ప్రణయాఖ్యదామ, తేన), నిబధ్యమానః అపి = బంధింపబడుతున్నా, రిపూన్ = శత్రువులను, జిఘాంసుః (సన్) = చంపగోరినవాడై (హన్తుమ్ ఇచ్ఛుః), జగామ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), విజేతు-కామః = గెలుపుకోరుతున్నవాడు (విజేతుం కామః), నివార్యమాణః అపి = ఆపబడుతున్నా, న నివర్తతే = మరలడు. (ని వృతు వర్తనే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోపికలు తమ ప్రణయమనే త్రాటితో కృష్ణుని బంధించినా కృష్ణుడు శత్రువులను చంపాలన్న కోరికతో (మధురకు) వెళ్ళనే వెళ్ళాడు. అవును మరి. గెలవాలి అనే కోరికతో వెళ్ళేవాడు ఆపినా ఆగడు.

**వి :** 1. గోపికలు బంధించినా కృష్ణుడు ఆగలేదు. బంధనమనే కారణమున్నా ఆగడమనే పని జరుగలేదు. దీన్ని విశేషోక్త్యలంకారమంటారు. '**కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే**' - (కు. 83)

2. గోపికలు ఆపుతున్నా ఆగకుండా కృష్ణుడు వెళ్ళటం విశేషం. విజేత ఆపినా ఆగడన్నది సామాన్యవిషయం. విశేషాన్ని సామాన్యంతో సమర్థించినందువల్ల ఇది అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**'- (కు. 122)

3. **జగామ :** 10-3వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **నివర్తతే :** | **నివర్తతే** | నివర్తేతే | నివర్తన్తే |
| | నివర్తసే | నివర్తేథే | నివర్తధ్వే |
| | నివర్తే | నివర్తావహే | నివర్తామహే |

4. ఛందస్సు - ఉపేంద్రవజ్ర. *

**శ్లో॥ రథేన దూరే రమణం వ్రజన్తం - వ్రజస్త్రియస్తం పరితోఽనుజగ్ముః ।**
**దృగశ్వభాజా దృఢభక్తిదామ్నా - మనోరథేనామలబుద్ధియన్త్రా ॥ 10-46**

**అ :** గోపికలు తమ చూపులతో కృష్ణుని అనుసరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** రథేన దూరే వ్రజన్తం రమణం పరితః వ్రజ-స్త్రియః దృగ్-అశ్వ-భాజా అమల-బుద్ధి-యన్త్రా దృఢ-భక్తి-దామ్నా మనోరథేన అనుజగ్ముః.

**ప్ర :** రథేన = రథంలో, దూరే = దూరంగా, వ్రజన్తమ్ = వెళ్తున్న, రమణమ్ = వల్లభుడైన కృష్ణుని, పరితః = అంతటా (నాల్గుదిక్కులలో) ('పర్యభిభ్యాం చ' (అష్టాధ్యాయి-5-3-9) సూత్రంతో 'పరి' ఉపసర్గమీద తసిల్

ప్రత్యయం), దృగ్-అశ్వ-భాజా : దృగ్ = చూపు లనే, అశ్వ-భాజా = గుఱ్ఱాలు గలదీ (దృశః ఏవ అశ్వాః తాన్ భజతీతి, తేన), అమల-బుద్ధి-యన్త్రా : అమల = నిర్మలమైన, బుద్ధి = బుద్ధి అనే, యన్త్రా = సారథి గలదియు (అమలా చ సా బుద్ధిః, సైవ యన్త్రా యస్య సః, తేన), దృఢ-భక్తి-దామ్నా : దృఢ = గాఢమైన, భక్తి = భక్తి అనే, దామ్నా = త్రాడు గలదీ అయిన (దృఢా చ సా భక్తిః, సైవ దామ, తేన), మనోరథేన = మనస్సనే రథంతో (మనః ఏవ రథః, తేన), అనుజగ్ముః = అనుసరించారు. (అను గమ్ గతౌ -పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** శ్రీకృష్ణుడు గోపికలను వీడి రథంపై దూరంగా వెళుతుంటే (మధురానగరానికి) - గోపికలు మనోరథంతో ఆయనను అనుసరించారు. వారి మనోరథానికి వారి చూపులే గుఱ్ఱాలు. వారి గాఢభక్తి జీను. వారి నిర్మలబుద్ధి సారథి.

**వి :** 1. కృష్ణుని రథాన్ని పరితః (నాలుగు దిక్కులా) అనుసరించటం - అంటే ముందు వైపు కూడా వారే నిలువ గలిగారు. ఎలా సాధ్యమంటే కృష్ణుడు రథంపై వెళ్తుంటే వారు మనోరథంపై వెళ్తున్నారు. మనోరథాలకు హద్దులు, నియంత్రణలూ లేవు మరి.

2. బుద్ధిని సారథిగా కఠోపనిషత్తు చెప్తుంది.

శ్లో॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।
**బుద్ధిం తు సారథిం** విద్ధి మనఃప్రగ్రహ ఏవ చ ॥ - కఠోపనిషత్తు 3/3

3. కృష్ణుని రథమార్గంలో ధూళీ, దుమ్ము కనిపించినంత మేర గోపికలు చూస్తూనే వున్నారు-

చ. అదె చనుచున్నవాఁడు ప్రియుఁ డల్లదె తే రదె వైజయంతి య
ల్లదె రథఘోటకాంఘ్రిరజ మాదెసె మార్గము చూడుఁ డంచు లో
నొదవెడి మక్కువన్ హరిరథోన్ముఖలై గములై వ్రజాంగనల్
కదలక నిల్చిచూచి రటు గన్నుల కబ్బిన యంత దూరమున్. -పోతనభాగవతము-10/1221

| | | | |
|---|---|---|---|
| 4. **అనుజగ్ముః :** | అనుజగామ | అనుజగ్మతుః | **అనుజగ్ముః** |
| | అనుజగమిథ/అనుజగన్థ | అనుజగ్మథుః | అనుజగ్మిథ |
| | అనుజగామ/అనుజగమ | అనుజగ్మివ | అనుజగ్మిమ. |

*

**శ్లో॥ నయన్నసౌ నన్దకిశోరమీశం - శ్వఫల్కసూనుర్యమునామ్బుమధ్యే ।**
**దదర్శ సేవాఫలరూపమన్యై-రదృశ్యమస్యైవ విచిత్రరూపమ్ ॥ 10-47**

**అ :** అక్రూరుడు యమున నీటిలో కృష్ణుని విచిత్రరూపాన్ని చూడగలగటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశం నందకిశోరం నయన్ అసౌ శ్వఫల్కసూనుః యమునా+అంబు-మధ్యే సేవా-ఫల-రూపమ్ అన్యైః అదృశ్యమ్ అస్య ఏవ విచిత్ర-రూపం దదర్శ.

**ప్ర :** ఈశమ్ = ప్రభువైన, నంద-కిశోరమ్ = గోపనందబాలకుని (నందస్య కిశోరః, తమ్), నయన్ = కొనిపోతూ (నీ-ధాతువుపై శతృ ప్రత్యయం), అసౌ = ఆ, శ్వఫల్క-సూనుః = అక్రూరుడు (శ్వ-ఫల్కస్య సూనుః), యమునా+అంబు-మధ్యే : యమునా = యమునానదియొక్క, అంబు = నీటియొక్క, మధ్యే = మధ్యభాగంలో (యమునాయాః అంబు, తస్య మధ్యే), సేవా-ఫల-రూపమ్ : సేవా = సారథ్యమనే సేవయొక్క, ఫలరూపమ్= ఫలిత స్వరూపమూ (సేవాయాః ఫలస్య రూపం), అన్యైః = ఇతరులచే, అదృశ్యమ్ = చూడబడనిదీ అయిన, అస్యైవ = ఆ కృష్ణునియొక్క, విచిత్ర-రూపమ్ = విలక్షణ రూపాన్ని, దదర్శ = చూశాడు. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** తన ప్రభువయిన నందగోపబాలుని (రథంపై) కొనిపోతూ అక్రూరుడు యమునలో స్నానమాడబోయి ఆ జలమధ్యంలో కృష్ణసేవా (రథసారథ్యం) ఫలరూపంగా విచిత్రమైన కృష్ణరూపాన్ని దర్శించాడు.

**వి :** 1. వ్యాసభాగవతంలో రామకృష్ణులను ఇద్దరినీ చూసినట్లుంది అక్రూరుడు.

శ్లో॥ నిమజ్జ్య తస్మిన్ సలిలే జపన్ బ్రహ్మ సనాతనమ్ ।
తావేవ దదృశేఽక్రూరో రామకృష్ణౌ సమన్వితౌ ॥ – భాగవతమ్.

2. రామకృష్ణులను ఇద్దరినీ అటు యమునలో, ఇటు రథంపై మార్చి మార్చి చూసి గమనించి ఆశ్చర్యపోయిన అక్రూరుని వెఱఁగుపాటునూ, తాను చూసిన దివ్యస్వరూపాలనూ పోతన వర్ణించిన తీరు–

శా. కంటిన్ మున్ను రథంబుపై; జలములోఁ గంటిన్ దుదిన్ గ్రమ్మఱన్
గంటిన్ దొంటి రథంబుమీఁద; నిదె యీ కళ్యాణచారిత్రులే
వెంటన్ దోఁచిరి రెండు దిక్కుల; మనోవిభ్రాంతియో? నీటిలో
నుం టాశ్చర్యము చూతు నంచు మఱియు న్నూహించి మగ్నాంగుఁడై.

ఉ. పోషితబాంధవుండు యదుపుంగవుఁ డా జలమందుఁ గాంచె స
ద్భాషు సహస్రమస్తకవిభాషితభూషు నహీశు భూమిభృ
ద్వేషుఁ గృపాభిలాషుఁ బ్రతివీరచమూవిజిగీషు నిత్య సం
తోషు నరోషు నిర్దళితదోషు **ననేకవిశేష శేషునిన్.**

సీ. ఆ భోగి భోగపర్యంకమధ్యంబున – వలనొప్పు పచ్చనివలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగుచందంబున – నురమున శ్రీదేవి యొప్పువాని
ముసరుతేఁటుల విప్ప ముఖచతుష్కముగల – తనయుఁ డాడెడి బొడ్డుఁ దమ్మివానిఁ
గదలని బహుపదక్రమవిశేషంబుల – రవము సూపెడి నూపురములవాని.

ఆ. జలజగర్భ రుద్ర సనక సనందన – సద్ద్విజామర ప్రశస్యమాన
చరితుఁడైన వాని సౌందర్యఖనియైన – వాని నొక్క పురుషవర్యుఁ గాంచి.

– పోతనభాగవతము 10/1227,28,30

| | | | |
|---|---|---|---|
| 3. **దదర్శ :** | **దదర్శ** | దదృశతుః | దదృశుః |
| | దదర్శిథ/దద్రష్ఠ | దదృశథుః | దదృశ |
| | దదర్శ | దదృశివ | దదృశిమ. * |

**శ్లో॥ పుణ్యక్షేత్రనివాసినాం సువిమలజ్ఞానానురక్తాత్మనాం**
**పారమ్పర్యసమాగతం ప్రభుమపి శ్రీకృష్ణపక్షాప్రియమ్ ।**
**దూరేణోత్సృజతాం సుశాన్తమనసాం తీర్థాటనం కుర్వతాం**
**వేద్యం హృద్యమపశ్యదమ్బుని హరే రూపం శ్వఫల్కాత్మజః ॥ 10-48**

**అ :** కృష్ణ స్వరూపాన్ని అక్రూరుడు యమునలో చూడగలగటానికున్న అర్హతను నిరూపించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** పుణ్య–క్షేత్ర–నివాసినాం సువిమల–జ్ఞాన+అనురక్త+ఆత్మనాం పారంపర్య+సమాగతమ్ అపి శ్రీకృష్ణపక్ష+అప్రియం ప్రభుం దూరేణ ఉత్సృజతాం సుశాంత–మనసాం తీర్థ+అటనం కుర్వతాం వేద్యం హృద్యం హరేః రూపం శ్వఫల్క+ఆత్మజః అంబుని అపశ్యత్.

ప్ర : పుణ్య–క్షేత్ర–నివాసినామ్ = పవిత్రప్రదేశాలలో నివసించేవారికి (పుణ్యాని చ తాని క్షేత్రాణి, తేషు నివసన్తీతి, తేషామ్) (పుణ్యక్షేత్రము... వింధ్యహిమవత్పర్వతముల నడిమిదేశము. 2. పవిత్ర స్థలము – తిరుపతి, కాశి మొదలైనవి – ఆంధ్ర శబ్దరత్నాకరము 2/1018), సువిమల... త్మనామ్ : సు విమల = బాగా నిర్మలమయిన, జ్ఞాన = జ్ఞానమందు (ఎరుక యందు), అనురక్త = ప్రీతిగల, ఆత్మనామ్ = మనస్సుగలవారికీ (సువిమలం చ తత్ జ్ఞానం, తస్మిన్ అనురక్తః ఆత్మా యేషాం తే), పారంపర్య–సమాగతమ్ : పారంపర్య = పరంపరగా (పెద్దవాళ్ల దగ్గర నుండి) (పరంపరాయాః భావః పారంపర్యమ్), సమాగతమ్– అపి = వచ్చినవాడైనా, శ్రీకృష్ణ–పక్ష–అప్రియమ్ : శ్రీకృష్ణ–పక్ష = శ్రీకృష్ణుని వైపున్న వారిపై, అప్రియమ్ = ప్రేమలేని వాడైన (శ్రీకృష్ణస్య పక్షః, తస్మిన్ అప్రియః, తమ్), ప్రభుమ్ = రాజును, దూరేణ = దూరంగా, ఉత్–సృజతామ్ = విడిచిపెట్టే వారికి, సుశాంత–మనసామ్ = సుశాంత = మిక్కిలిగా శమం కలిగిన, మనసామ్ = మనస్సు గల వారికి (సుశాంతం మనః యేషాం తేషామ్), తీర్థ+అటనమ్ : తీర్థ = పుణ్యనదీప్రదేశాలలో, అటతామ్ = తిరిగే వారికి (తీర్థేషు అటనమ్), కుర్వతామ్ = చేసే వారికి, వేద్యమ్ = తెలియదగిందీ (వేత్తుం యోగ్యం వేద్యమ్), హృద్యమ్ = మనోహరమైందీ అయిన, హరేః = కృష్ణునియొక్క, రూపమ్ = రూపాన్ని, శ్వఫల్క+ఆత్మజః = అక్రూరుడు (శ్వఫల్కస్య ఆత్మజః), అంబుని = నీటిలో, అపశ్యత్ = చూశాడు. (దృశిర్ ప్రేక్షణే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణరూపం మనోహరం, అది పుణ్యక్షేత్రాలలో నివసించేవారూ, నిర్మలజ్ఞానంపై ప్రీతి గలవారూ, సుశాంతమనస్కులూ, తీర్థాటనం చేసే వారూ, వంశపరంపరగా వచ్చినా రాజునైనా కృష్ణ పక్షవ్యతిరేకి అయితే దూరంగా నెట్టివేయగలవారు మాత్రమే తెలియదగింది. అటువంటి ఆ రూపాన్ని అక్రూరుడు చూడగలిగాడు.

**వి :** 1. కృష్ణస్వరూపదర్శనానికి అవసరమైన పై లక్షణాలన్నీ అక్రూరునిలో వున్నాయి. తాను మధురాక్షేత్రనివాసి. కృష్ణతత్త్వవివేకి. కంసుని కాదనగలవాడు. యమునా తీర్థానికి వచ్చినవాడు. శాంతమనస్కుడు. అందువలన కృష్ణస్వరూపదర్శనం లభించింది. లేదా కృష్ణుని అనుగ్రహమే వుంటే ఇవేవీ లేకపోయినా ఉన్నట్లే. అది కూడా అక్రూరునికి పుష్కలంగా వుంది. ఇక లోటేముంది.

| | | | |
|---|---|---|---|
| 2. **అపశ్యత్ :** | **అపశ్యత్** | అపశ్యతామ్ | అపశ్యన్ |
| | అపశ్యః | అపశ్యతమ్ | అపశ్యత |
| | అపశ్యమ్ | అపశ్యావ | అపశ్యామ. |

*

**శ్లో॥ భక్తో నామ స ఏవ యః కరగతే కృష్ణేఽపి వేదోదితం**
**తత్కర్మాచరదేతదేవ దురితప్రధ్వంసి కర్మ క్షితౌ ।**
**తీర్థం చాపి తదేవ జాత్వపి తయోః సంసేవయా శ్రావ్యయాఽ**
**దృశ్యం రూపమదర్శయన్మురరిపుర్దాస్యైకవశ్యః ప్రభుః ॥ 10–49**

**అ :** భక్తస్వరూపనిరూపణం – కృష్ణుని భక్తపరాధీనతను ప్రదర్శించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** భక్తః నామ సః ఏవ యః కృష్ణే కరగతే అపి వేద+ఉదితం తత్ కర్మ ఆచరత్ ఏతద్ ఏవ క్షితౌ దురిత–ప్రధ్వంసి కర్మ, తీర్థం చ అపి తద్ ఏవ. జాతు అపి శ్రావ్యయా తయోః సంసేవయా దాస్య+ఏక–వశ్యః ప్రభుః మురరిపుః అదృశ్యం రూపమ్ అదర్శయత్.

ప్ర : భక్తః నామ = భక్తుడంటే, సః ఏవ = ఆ అక్రూరుడే, యః = ఎవడయితే, కృష్ణే = కృష్ణుడు, కర–గతే (సతి) అపి = చేత చిక్కి వున్నా, వేద+ఉదితమ్ = వేదోక్తమైన, తత్–కర్మ = కృష్ణసేవారూపమైన కర్మ, ఆచరత్ = పాటించాడో. (ఆ చర గతిభక్షణయోః పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.), ఏతద్–ఏవ = ఇదియే, క్షితౌ = లోకంలో, దురిత–ప్రధ్వంసి = పాపాలు పోగొట్టే (దురితానాం ప్రధ్వంసి), కర్మ = కర్మ (విధి), తీర్థం చ–అపి = తీర్థం

కూడా, తదేవ = అదియే. జాతు+అపి = ఎప్పుడైనా/ఒక్కసారైనా, శ్రావ్యయోః = వినదగినట్టి, తయోః = ఆ కర్మ తీర్థాలయొక్క, సంసేవయా = ఉపాసనచేత, దాస్య+ఏక-వశ్యః = దాస్యానికి మాత్రమే లోబడే (దాస్యేన ఏకేన వశ్యః), ప్రభుః = స్వామి అయిన, మురరిపుః = కృష్ణుడు, అదృశ్యమ్= (ఇతరులకు) కనరాని, రూపమ్ = రూపాన్ని, అదర్శయత్ = చూపించాడు. (దృశ్ ప్రేక్షణే ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** భక్తుడంటే అక్రూరుడే. ఎందుకంటే సాక్షాత్తూ పరమాత్మ స్వరూపుడైన కృష్ణుడే చేత చిక్కివున్నా వేదోచితమైన సంధ్యావందనాది కర్మను పాటిస్తున్నాడు. లోకంలో పాపవినాశక మైన కర్మ అదియే. అదియే తీర్థం కూడా. శ్రవణయోగ్యాలయిన ఆ కర్మతీర్థసేవనలచేత దాస్యానికి మాత్రమే లోబడే కృష్ణుడే వశమయ్యాడు. స్వరూపదర్శనానికి అవకాశమిచ్చాడు.

**వి :** 1. '**అహరహస్సంధ్యాముపాసీత।**' అని విధి వాక్యం. త్రికాలలలోనూ సంధ్యోపాసన చేయాలి అని భావం. సంధ్యావందనంలో '**యదహ్నా కురుతే పాపం తదహ్నాత్ ప్రతిముచ్యతే యద్రాత్ర్యా కురుతే పాపం తద్రాత్ర్యా ప్రతిముచ్యతే**' అని సంధ్యావందన ఫలితం కనిపిస్తుంది. ఇది నిత్యకర్మ. కర్మలు నిత్యకర్మలతోపాటు నైమిత్తికకర్మలు, కామ్యకర్మలు కూడా ఉంటాయి. ఆయా విధులవలన సంస్కారవిశేషాలలో జరిగే కర్మలు నైమిత్తికాలు. ఇక కామ్యకర్మలు అనంతాలు. '**యజేత స్వర్గ కామః**' వంటి వాక్యాలు విధివాక్యాలైనా **స్వర్గకామః** అని ఉటంకించటం ద్వారా అది కామ్యకర్మయే అవుతుంది. ఇలా కోరికలుండి అవి తీరడానికి చేసే కర్మలన్నీ కామ్యకర్మలే.

2. కర్మాచరణ కర్మపరిత్యాగాల విషయంలో చాలా చర్చలు జరిగాయి. కర్మ పరిత్యాగ మాత్రం చేత నిష్కర్మత్వం కానీ మోక్షం కానీ సిద్ధించదని కృష్ణ నిర్ణయం.

శ్లో॥ న కర్మణామనారంభాత్ నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ - భగవద్గీత 3/4

ఎంతటి జ్ఞాని అయినా వేదశాస్త్రవిహితకర్మలపట్ల శ్రద్ధాసక్తులు కలిగి ఆచరింపవలసిందే అని **కృష్ణామృతమహార్ణవం** (ఆనందతీర్థవిరచితం) చెప్తోంది.

శ్లో॥ అతీతానాగతజ్ఞానీ త్రైలోక్యోద్ధరణక్షమః ।
ఏతాదృశోఽపి నాచారం శ్రౌతం స్మార్తం పరిత్యజేత్ ॥ - శ్లో 231.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆచరత్ :** | **ఆచరత్** | ఆచరతామ్ | ఆచరన్ |
| | ఆచరః | ఆచరతమ్ | ఆచరత |
| | ఆచరమ్ | ఆచరావ | ఆచరామ |
| **అదర్శయత్ :** | **అదర్శయత్** | అదర్శయతామ్ | అదర్శయన్ |
| | అదర్శయః | అదర్శయతమ్ | అదర్శయత |
| | అదర్శయమ్ | అదర్శయావ | అదర్శయామ. |

*

**శ్లో॥ స సహస్రసహస్రాంశుమరీచివ్యాప్తదిక్తటమ్ ।**
**కమలాకరపద్మార్ఘ్యచరణారుణభాస్కరమ్ ॥ 10-50**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణునివర్ణన. -పథ్యావక్త్రమ్- 70 వఅకు.

**అ :** సః సహస్ర-సహస్ర+అంశు-మరీచి-వ్యాప్త-దిక్-తటం కమల+ఆకర-పద్మ+అర్ఘ్య-చరణ+అరుణ-భాస్కరమ్.

**ప్ర :** సః = ఆ అక్రూరుడు, సహస్ర... దిక్తటమ్ : సహస్ర = వేలకొలది, సహస్ర+అంశు = సూర్యులయొక్క (భానుర్హంసస్సహస్రాంశుః - అమరకోశః - దిక్-31), మరీచి = కిరణాలవంటి దేహకాంతులతో, వ్యాప్త =

వ్యాపించిన, దిక్-తటమ్= దిగంతాలు గల వాడును (సహస్రం సహస్రాంశూనాం మరీచయ ఇవ మరీచయః, తాభిః వ్యాప్తం దిశాం తటం యేన, తమ్), కమలా... భాస్కరమ్ : కమలా = లక్ష్మియొక్క, కర = చేయి అనే, పద్మ = తామరచే, అర్ఘ్య = కోరదగిన, చరణ = పాదమనే, అరుణ-భాస్కరమ్ = ఎఱ్ఱని సూర్యుడు గలవాడును (కమలాయాః కరః ఏవ పద్మం, తేన అర్ఘ్యః చరణ ఏవ అరుణశ్చ అసౌ భాస్కరః యస్య, తమ్), (కృష్ణమ్ = కృష్ణుని, ఐక్షత = చూశాడు) (**ఐక్షత అన్న క్రియాపదం 69వ శ్లోకంలో వుంటుంది. అక్కడివరకు అన్ని శ్లోకాలకూ అదే క్రియాపదం**)

**తా ॥** కృష్ణుని శరీరంనుండి కాంతులు వ్యాపించి దిగంతాలవరకూ ప్రసరిస్తున్నాయి. అవి వేల సూర్యుల కాంతిలా ప్రకాశిస్తున్నాయి. ఆయన పాదం ఎఱ్ఱని సూర్యునివలె వెలుగొందుతోంది. అది లక్ష్మియొక్క కరకమలంచే ప్రార్థింపదగింది.

**వి :** 1. కృష్ణుని దేహకాంతులకు సూర్యకాంతితో పోలిక. ఉపమాలంకారం. లక్ష్మికరంలో పద్మత్వారోపణం. కృష్ణచరణంలో భాస్కరత్వారోపణం. రూపకాలంకారం. *

**శ్లో॥ వజ్రాఙ్కుశపతాకాబ్జలక్ష్యపాదతలోజ్జ్వలమ్ ।**
**భిన్నప్రవాళవిలసదఙ్గుళీదళమణ్డితమ్ ॥ 10-51**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణవర్ణన.

**అ :** వజ్ర+అంకుశ-పతాకా+అబ్జ-లక్ష్య-పాదతల+ఉజ్జ్వలం భిన్న-ప్రవాళ-విలసత్-అంగుళీ-దళ-మండితమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** వజ్ర...జ్జ్వలమ్ : వజ్ర = వజ్రం (వజ్రాయుధం లేదా వజ్రం), అంకుశ = అంకుశ (ఏనుగును అదుపు చేసే ఆయుధం), పతాకా = జెండా, అబ్జ = పద్మం - ఈ రేఖలచే, లక్ష్య = గుర్తింపదగిన/చూడదగిన, పాదతల = అరికాలిచే, ఉజ్జ్వలమ్ = ప్రకాశించేవాడూ (వజ్రం చ అంకుశం చ పతాకా చ అబ్జం చ తైః లక్ష్యేణ పాదస్య తలేన ఉజ్జ్వలః, తమ్), భిన్న... మండితమ్ : భిన్న = చీలిన, ప్రవాళ = పగడాలవలె, విలసత్ = ప్రకాశిస్తున్న, అంగుళీ = వేళ్ళు అనే, దళ = దళాలతో, మండితమ్ = అలంకరింపబడిన వాడునూ - అయిన (భిన్నం చ తత్ ప్రవాళం తదివ విలసన్త్యః అంగుళ్యః దళాని ఇవ తైః మండితః, తామ్), **కృష్ణమైక్షత.**

**తా ॥** కృష్ణుని పాదతలంలో వజ్రరేఖ, అంకుశరేఖ, పతాకా రేఖ, అబ్జరేఖ కనిపిస్తున్నాయి. వాటితో అది ప్రకాశిస్తోంది. కాళివేళ్ళు బ్రద్దలయిన పగడాల దళాలలాగా వెలుగొందు తున్నాయి.

**వి :** 1. వజ్రరేఖ, అంకుశరేఖ, పతాకరేఖ, అబ్జరేఖ - ఇవన్నీ సాముద్రిక శాస్త్రానికి సంబంధించిన అంశాలు. ఐశ్వర్యసూచక రేఖలివి. *

**శ్లో॥ పుష్కలేన్దుసమశ్రీమన్నిష్కలఙ్కనఖావలిమ్ ।**
**ఉత్తుఙ్గరత్నఖచితనూత్ననూపురశోభితమ్ ॥ 10-52**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణవర్ణనం.

**అ :** పుష్కల+ఇందు-సమ-శ్రీమత్-నిష్కలంక-నఖ+ఆవలిమ్ ఉత్తుంగ-రత్న-ఖచిత-నూత్న-నూపుర-శోభితమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** పుష్కల = నిండైన (పుష్యతి ఇతి పుష్కలం '**కలంశ్చ**' (ఉణాది సూత్రం 445) అని కలన్ ప్రత్యయం), ఇందు = చంద్రునితో, సమ = సమానమైన, శ్రీమత్ = శోభగల, నిష్కలంక = కళంకం లేని, నఖ = గోళ్ళయొక్క,

ఆవళిమ్ = సముదాయం గల వానిని (పుష్కలం చ అసౌ ఇందుః, తేన సమాః శ్రీమంతః నిష్కలంకాశ్చ నఖాః, తేషామ్ ఆవళిః యస్య, తమ్), ఉత్తుంగ... మండితమ్ : ఉత్తుంగ = ఉన్నతమైన, రత్న = రత్నాలచే, ఖచిత = పొదగబడిన, నూత్న=క్రొత్తవైన, నూపుర = అందెలచే, శోభితమ్ = ప్రకాశిస్తున్న వాడునూ అయిన (ఉత్తుంగైః రత్నైః ఖచితైః నూత్నైః నూపురైః శోభితః, తమ్), **(కృష్ణమ్ ఐక్షత)**

**తా ॥** కృష్ణుని గోళ్ళు పూర్ణచంద్రుని శోభవంటి శోభతో ప్రకాశిస్తున్నాయి. అదీ కళంక రహితంగా. అది విశేషం. ఎత్తుగా రత్నాలు పొదిగిన క్రొత్త గజ్జెలతో శోభిస్తున్నాడు కృష్ణుడు.

**వి :** 1. నఖాలను చంద్రునితో పోల్చుతూ ఆ నఖాలు నిష్కలంకాలు అనటం విశేషం. చంద్రుడు పరిపూర్ణుడైనా కళంకం తప్పదు కాబట్టి. ఉపమానోపమేయాలకు పోలికతోపాటు విశేషం కూడా కనిపిస్తే అది వ్యతిరేకాలంకారం. **'వ్యతిరేకో విశేషశ్చేదుపమానోపమేయయోః'** – (కు. 57) *

### శ్లో॥ లక్ష్మీకరాబ్జసంసక్తవృత్తజఙ్ఘం వృషాకపిమ్ ।
### రత్నదర్పణసఙ్కాశశస్తజానుద్వయం విభుమ్ ॥ 10–53

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** లక్ష్మీ–కర+అబ్జ–సంసక్త–వృత్త–జంఘం వృషా–కపిం రత్న–దర్పణ–సంకాశ–శస్త–జాను–ద్వయం విభుమ్ (కృష్ణమ్ ఐక్షత).

**ప్ర :** లక్ష్మీ... జంఘమ్ : లక్ష్మీ = లక్ష్మియొక్క, కర+అబ్జ = చే తామరతో, సంసక్త = కలిసివున్న, వృత్త = గుండ్రని, జంఘమ్ = పిక్కలు గలవాడూ (లక్ష్మ్యాః కరః ఏవ అబ్జం, తేన సంసక్తే వృత్తే జంఘే యస్య తమ్), వృషా–కపిమ్ = ధర్మస్వరూపుడు, రత్న... ద్వయమ్: రత్న–దర్పణ = రత్న దర్పణంతో, సంకాశ = సమానమైన, శస్త = ప్రశస్తమైన, జాను–ద్వయమ్ = రెండు మోకాళ్ళూ గలవాడూ (రత్నదర్పణస్య సంకాశం శస్తం చ జాన్వోః ద్వయం యస్య, తమ్), విభుమ్ = ప్రభువు అయిన, **(కృష్ణమ్ ఐక్షత)**.

**తా ॥** లక్ష్మి చేయి తగిలిన గుండ్రని పిక్కలు గలవాడూ, రత్నదర్పణాలవంటి గొప్ప మోకాళ్ళు గలవాడూ, ధర్మస్వరూపుడూ, ప్రభువు అయినవాడు కృష్ణుడు.

**వి :** 1. **వృషాకపి** శబ్దాన్ని అమరకోశమిలా నిర్వచించింది.

వృషేణ (ధర్మేణ)అకంతి (యాంతి) ఇతి వృషాకాః, వృషాకాన్ పాతి ఇతి వృషాకపిః.పు. అక కుటిలాయాం గతౌ పా రక్షణే. ధర్మముచేత చరించువారు వృషాకులు. వారిని రక్షించువాడు వృషాకపి – అమరకోశం – నానార్థవర్గ – 131)

2. **వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః ।** అని విష్ణుసహస్రనామస్తోత్రం విష్ణువును వృషాకపిగా స్తుతించింది.

3. మహాభారతం వృషాకపిపదాన్ని ధర్మవరాహార్థాలలో నిర్దేశించింది.

శ్లో॥ కపిర్వరాహః శ్రేష్ఠశ్చ ధర్మశ్చ వృష ఉచ్యతే ।
తస్మాత్ **వృషాకపిం** ప్రాహ కశ్యపో మాం ప్రజాపతిః ॥ –శాంతిపర్వం 342/89 *

### శ్లో॥ మృదువర్తులసమ్భాస్వద్రమ్భాస్తమ్భోరుమవ్యయమ్ ।
### కరిపోతలసత్కుమ్భసమరమ్యకటిద్వయమ్ ॥ 10–54

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనం.

**అ :** మృదు–వర్తుల–సంభాస్వద్–రంభా–స్తంభ+ఊరుమ్ అవ్యయమ్ కరి–పోత–లసత్–కుంభ–సమ–రమ్య–కటి–ద్వయమ్ (కృష్ణమ్ ఐక్షత).

**ప్ర :** మృదు... భోరుమ్: మృదు = కోమలములూ, వర్తుల = గుండ్రాలూ అయి, సంభాస్వద్ = చక్కగా ప్రకాశించే, రంభా–స్తంభ = అరటిబోదెలవంటి, ఊరుమ్ = తొడలు గలవాడూ, అవ్యయమ్ = నాశంలేని వాడూ, కరి... ద్వయమ్ : కరి–పోత = గున్నయేనుగుయొక్క (పోతో పాకోఽర్భకో డిమ్భః – అమరకోశః – సింహాది – 349), లసత్ = ప్రకాశించే, కుంభ = కుంభస్థలంతో, సమ = సమానమైన, కటి–ద్వయమ్ = రెండు మొలలు గలవాడూ అయిన (కరిణః పోతః, తస్య లసన్ చ అసౌ కుంభః, తేన సమం రమ్యం కటిద్వయం యస్య, తమ్), (**కృష్ణమ్ ఐక్షత**).

**తా ॥** కోమలంగా, గుండ్రంగా భాసించే అరటిబోదె సమానమైన తొడలు గలవాడూ, గున్నయేనుగు కుంభస్థలంవంటి కటిద్వయం గలవాడూ కృష్ణుడు.

**వి :** 1. సాహిత్యంలో సహజంగా స్త్రీల తొడలను అరటిబోదెలతో పోలుస్తుంటారు. కాని వ్యాసుడు మహాభారతంలో సుయోధనుని తొడలను అరటిబోదెలతో పోల్చి చూపాడు.

శ్లో॥ ఏవముక్త్వా తు కౌంతేయమపోహ్య వసనం స్వకమ్ ।
స్మయన్నవేక్ష్య పాంచాలీమైశ్వర్యమదమోహితః ॥

శ్లో॥ **కదలీస్తంభసదృశం** సర్వలక్షణసంయుతమ్ ।
గజహస్తప్రతీకాశం వజ్రప్రతిమగౌరవమ్ ॥

శ్లో॥ అభ్యుత్స్మయిత్వా రాధేయం భీమమాధర్షయన్నివ ।
ద్రౌపద్యాః ప్రేక్షమాణాయాః **సవ్యమూరుమదర్శయత్** ॥ – మహాభారతమ్–సభాపర్వణి–71/10–12*

**శ్లో॥ ఉద్యదర్కశతోద్రిక్తహృద్యకౌశేయవాససమ్ ।**
**విచిత్రరత్నసంశోభిహైమకాఞ్చీగుణద్యుతిమ్ ॥** **10–55**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** ఉద్యద్–అర్క–శత+ఉద్రిక్త–హృద్య–కౌశేయ–వాససం విచిత్ర–రత్న–సంశోభి–హైమ–కాంచీ–గుణ–ద్యుతిమ్ (**కృష్ణమ్ ఐక్షత**).

**ప్ర :** ఉద్య... వాససమ్ : ఉద్యత్ = ఉదయిస్తున్న, అర్క–శత = వందల కొలది సూర్యులకన్న ఉద్రిక్త = ఎక్కువై, హృద్య = మనోహరమైన, కౌశేయ–వాససమ్ = పట్టుబట్ట గలవాడూ (ఉద్యతామర్కాణాం శతాత్ ఉద్రిక్తం హృద్యం చ కౌశేయనిర్మితం వాసః యస్య, తమ్), విచిత్ర... ద్యుతిమ్ : విచిత్ర = వివిధావర్ణాలు గల, రత్న = రత్నాలతో, సంశోభి = చక్కగా అందగిస్తున్న, హైమ–కాంచీ–గుణ = బంగారు మొలనూలుయొక్క, ద్యుతిమ్ = కాంతి గలవాడూ అయిన (విచిత్రైః రత్నైః సంశోభీ హైమస్య కాంచ్యాః గుణస్య ద్యుతిః యస్య, తమ్), **కృష్ణమ్ ఐక్షత**.

**తా ॥** కృష్ణుడు పట్టుబట్టలు కట్టి వున్నాడు. అవి వందలకొలది బాలభానుల కాంతిని మించి కాంతిమంతంగా కనిపిస్తున్నాయి. ఆయన బంగారు మొలనూలు దానికున్న విచిత్ర రత్నకాంతులతో విరాజిల్లుతోంది. *

**శ్లో॥ అనేకభువనాధారతనూదరవలిత్రయమ్ ।**
**విరిఞ్చిభృఙ్గశోభాబ్జస్ఫురన్నాభిసరోవరమ్ ॥** **10–56**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** అనేక-భువన+ఆధార-తను+ఉదర-వలి-త్రయం విరించి-భృంగ-శోభా+అబ్జ-స్ఫురత్-నాభి-సరోవరమ్.

**ప్ర :** అనేక... త్రయమ్ : అనేక = ఎన్నో, భువన = లోకాలకు, ఆధార = ఆశ్రయమైన, తను+ఉదర = సన్నని పొట్టపై, వలి-త్రయమ్ = మూడు ముడుతలు గలవాడూ (అనేకేషాం భువనానామ్ ఆధారం తను ఉదరం యస్య, తమ్), విరించి... సరోవరమ్ : విరించి = బ్రహ్మ అనే, భృంగ = తుమ్మెదచే, శోభా = అందగించిన, అబ్జ = తామరచే, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, నాభి = బొడ్డు అనే, సరోవరమ్ = కొలను గలవాడూ అయిన, (విరించిః ఏవ భృంగః, తేన శోభా యస్య తచ్చ తత్ అబ్జం, తేన స్ఫురత్ నాభిః ఏవ సరోవరం యస్య, తమ్) (**కృష్ణం ఐక్షత**.)

**తా ॥** కృష్ణుని సన్నని పొట్ట అనేక భువనాలకు ఆధారం. దానిపైని మూడు మడలతలతో తాను భాసిస్తున్నాడు. కృష్ణుని నాభి సరోవరంలా వుంది. అక్కడ మొలిచిన పద్మంలో నున్న బ్రహ్మ తుమ్మెదలా వెలుగొందుతున్నాడు.

**వి :** 1. కృష్ణుడు శైశవంలోనే తనలోని చతుర్దశభువనాలనూ యశోదకు కనిపింపజేసి ఆమెను ఆశ్చర్యానికి గురిచేసినవాడు.

**క. చూపితివట నీ నోటను**
**బాపురే పదునాల్గు భువన భాండంబుల నా**
**రూపము గనిన యశోదకుఁ**
**దాపము నశియించి జన్మ ధన్యత గాంచెన్** **- సముద్రాల.**

క. ఆ లలితాంగి కనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాదికరండమైన బ్రహ్మాండంబున్ -పోతనభాగవతము - 10/339

2. విరించిలో భృంగత్వాన్నీ, నాభిలో సరోవరత్వాన్నీ ఆరోపించి రూపకాలంకారంతో సహజమైన నాభి కమలానికి పూర్వాపరశోభను కల్గించాడు కవి. ఈ రూపకాలంకారం అక్రూరునిలోని భక్తి భావాన్ని ఉద్దీపింప జేస్తుంది.

*

**శ్లో॥ వలిపల్లవసత్కాన్త్యా జ్వలితోదరబన్ధనమ్ ।**
**కృశమధ్యవిశాలోరఃస్థలచర్చితచన్దనమ్ ॥** **10-57**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** వలి-పల్లవ-సత్-కాంత్యా జ్వలిత-ఉదర-బంధనం కృశ-మధ్య-విశాల-ఉరః-స్థల-చర్చిత-చందనమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** వలి... కాంత్యా : వలి = (పొట్టమీది) ముడుతలనే, పల్లవ = చివురులయొక్క, సత్-కాంత్యా = మంచిశోభతో (వలయః ఏవ పల్లవాః, తేషాం కాంతిః, తయా), జ్వలిత... బంధనమ్ : జ్వలిత = వెలుగొందజేయబడిన, ఉదర-బంధనమ్ = ఉదరబంధమనే ఆభరణం గలవాడూ (జ్వలితమ్ ఉదరస్య బంధనం యస్య, తమ్), కృశ... చందనమ్ : కృశ = సన్నని, మధ్య = నడుముగల, విశాల = విశాలమైన, ఉరఃస్థల = ఛాతిపై, చర్చిత = పూయబడిన, చందనమ్ = శ్రీగంధం గలవాడూ అయిన (కృశశ్చ అసౌ మధ్యః యస్య సః, విశాలే ఉరఃస్థలే చర్చితం చందనం యస్య సః, కృశమధ్యః చ అసౌ విశాలోరఃస్థలచర్చిత చందనః, తమ్), (**కృష్ణమ్ ఐక్షత**)

**తా ॥** కృష్ణుని త్రివళుల కాంతితో ఉదరబంధనమైన ఆభరణమే ప్రకాశిస్తోంది. సన్నని నడుముగల ఆ కృష్ణుడు తన విశాలమైన వక్షస్థలంపై చందనాన్ని అలదుకొని వున్నాడు.

**వి :** 1. '**చందన చర్చిత నీల కళేబర పీతవసన వనమాలీ**' – అంటూ జయదేవుడు గీతగోవిందంలో వర్ణించింది ఈ చందన చర్చనే. *

**శ్లో॥ లక్ష్మీధరాశ్లిష్టపుష్టపార్శ్వయుగ్మం పరాత్పరమ్ ।**
**అఙ్కస్థితరమావక్షఃకుఙ్కుమాఙ్కోపలక్షితమ్ ॥ 10-58**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** లక్ష్మీ-ధరా+ఆశ్లిష్ట-పుష్ట-పార్శ్వ-యుగ్మమ్ పరాత్-పరమ్ అంక-స్థిత-రమా-వక్షః-కుంకుమ+అంక+ఉపలక్షితమ్. **కృష్ణమ్ ఐక్షత**.

**ప్ర :** లక్ష్మీ... యుగ్మమ్ : లక్ష్మీ = ఇందిర, ధరా = భూదేవి-వీరిచే, ఆశ్లిష్ట = కూడి, పుష్ట = నిండుగావున్న, పార్శ్వ-యుగ్మమ్ = రెండుప్రక్కలూ గలవాడూ (లక్ష్మ్యా ధరయా చ ఆశ్లిష్టమ్, అత ఏవ పుష్టం, పార్శ్వయోః యుగ్మం యస్య, తమ్), పరాత్-పరమ్ = పరాత్పరుడూ, అంక... లక్షితమ్ : అంక = ఒడియందు, స్థిత = ఉన్నట్టి, రమా = లక్ష్మియొక్క, వక్షః = గుండెపై నున్న, కుంకుమ = కుంకుమయొక్క, అంక = గుర్తుతో, ఉపలక్షితమ్ = గుర్తింపబడిన వాడునూ అయిన (అంకే స్థితాయాః రమాయాః వక్షసి కుంకుమస్య అంకేన ఉపలక్షితః, తమ్), **కృష్ణమ్ ఐక్షత**.

**తా ॥** శ్రీదేవి, భూదేవి కౌగిలించిన ఉభయ పార్శ్వాలు గలవాడు, పరాత్పరుడూ అయిన కృష్ణుడు తన ఒడిలో నున్న లక్ష్మి వక్షఃస్థలం మీది కుంకుమవల్ల ఏర్పడిన గుర్తుతో గుర్తింపబడినవాడు. *

**శ్లో॥ శ్రీవత్సవక్షసం శ్రీమద్వనమాలావిభూషితమ్ ।**
**స్ఫురదిన్దుసమామన్దవరకౌస్తుభమణ్డనమ్ ॥ 10-59**

**అ :** అక్రూరుడు చూసిన కృష్ణవర్ణన.

**అ :** శ్రీవత్స-వక్షసం శ్రీమత్-వన-మాలా-విభూషితం స్ఫురద్-ఇందు-సమ+అమంద-వర-కౌస్తుభ-మండనమ్.

**ప్ర :** శ్రీవత్స-వక్షసమ్ : శ్రీవత్స = శ్రీవత్సమనే గుర్తు, వక్షసమ్ = రొమ్ముపై గలవాడు, (శ్రీః వసతి అస్మిన్ ఇతి శ్రీవత్సం, తత్ వక్షసి యస్య, తమ్), శ్రీ... భూషితమ్ : శ్రీమద్ = సంపన్నమైన, వన-మాలా = వనమాలతో, విభూషితమ్ = అలంకరింపబడినవాడూ, స్ఫుర... మండనమ్ : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, ఇందు = చంద్రునితో, సమ = సమానమైన, అమంద = తక్కువ కాని, వర = శ్రేష్ఠమైన, కౌస్తుభ = కౌస్తుభమణిచే, మండితమ్ = అలంకరింపబడిన వాడూ అయిన (స్ఫురన్ చ అసౌ ఇందుః, తేన సమః అమందశ్చ అసౌ వరకౌస్తుభః మండనం యస్య, తమ్), **కృష్ణమ్ ఐక్షత**.

**తా ॥** శ్రీవత్సం గుండెలపై గలవాడు. వనమాలాలంకృతుడు. వెలిగే చంద్రునివంటి కౌస్తుభమణితో ప్రకాశించేవాడు అయిన కృష్ణుని చూశాడు అక్రూరుడు.

**వి :** 1. **శ్రీవత్సమన్నది భృగుమహర్షి విష్ణువు గుండెపై తన్నినపుడు ఏర్పడిన కాలిగుర్తు.** త్రిమూర్తుల తారతమ్యాన్ని పరీక్షించటానికి బయలుదేరిన భృగుమహర్షికి వైకుంఠంలో జరిగిన సంఘటనకు గుర్తు అది. వివరంగా-

సీ. పొలుపొందు వైకుంఠపురమునకర్థితోఁ – జని యందు సమధికైశ్వర్యమొప్పఁ
గమలాంకపర్యంకగతుఁడై సుఖించు న – క్కౌస్తుభభూషు వక్షస్స్థలంబుఁ

దనపాదమునఁ బిట్టుదన్నెఁ దన్నినఁ బాన్పు – డిగివచ్చి మునిఁజూచి నగధరుండు
పదములకెఱఁగి యో పరమతపోధన – యీగతి నీవచ్చు టెఱుఁగలేక.

తే. యున్న నా తప్పుమన్నించి నన్నుఁగరుణఁజూచి యీ ద్వివమణిమయస్ఫూర్తిఁదనరు
రుచిరసింహాసనమునఁగూర్చుండు దివ్యతాపసోత్తమ! యభయప్రదాననిపుణ!

– పోతన భాగవతము 10/1271

ఆ విధంగా భృగువు కాలిగుర్తు ఒక ఆభరణంగా నారాయణుని ఛాతిపై నిలిచి పోయింది. మహర్షిపట్ల జరిగిన అపచారానికి గుర్తుగ అది అలా వుండిపోతుందనీ అది ఇతరులకు ఒక గుణపాఠంగా వుండాలనీ దానినలాగే నిలుపుకొన్నాడేమో నారాయణుడు. 'శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీనిధిః శ్రీవిభావనః' – అని విష్ణుసహస్రనామం విష్ణువును ప్రస్తుతిస్తుంది. *

**శ్లో॥ విలసద్రత్నకటకకఙ్కణైరఙ్గులీయకైః ।**
**శఙ్ఖచక్రగదాపద్మైశ్చాఙ్కితశ్రీకరామ్బుజమ్ ॥ 10–60**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనం.

**అ :** విలసద్–రత్న–కటక–కంకణైః అంగులీయకైః శంఖ–చక్ర–గదా–పద్మైః చ అంకిత–శ్రీ–కర+అంబుజమ్ **(కృష్ణమ్ ఐక్షత)**.

**ప్ర :** విలసద్ = ప్రకాశిస్తున్న, రత్న = రత్నాలతో కూడిన, కటక = కడియాలూ, కంకణైః = గాజులతోనూ (విలసన్తి చ తాని రత్నాని కటకాని కంకణాని చ తైః), అంగులీయకైః = ఉంగరాలతోనూ, శంఖ... పద్మైః : శంఖ = పాంచజన్యశంఖం, చక్ర = సుదర్శనచక్రం, గదా = కౌమోదకీగద, పద్మైః చ = పద్మం – వీటితో కూడా (శంఖశ్చ చక్రం చ గదా చ పద్మం చ తైః), అంకిత–శ్రీ–కర+అంబుజమ్ : అంకిత = అలంకరింపబడిన, శ్రీ = శోభగల, కర+అంబుజమ్ = కరకమలాలు గలవాడూ అయిన (శ్రీమన్తః కరాః ఏవ అంబుజాని యస్య తమ్), (కృష్ణమ్ ఐక్షత)

**తా ॥** కృష్ణుని కరకమలాలు, రత్నకటకాలూ, రత్నకంకణాలూ, రత్నాంగులీయకాలతో, శంఖచక్రగదాపద్మాలతో ప్రకాశిస్తున్నాయి. *

**శ్లో॥ త్రిరేఖకమ్బుసఙ్కాశస్ఫురన్నిష్కశిరోధరమ్ ।**
**అగణ్యలావణ్యపూర్ణప్రసన్నముఖసారసమ్ ॥ 10–61**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** త్రి–రేఖ–కంబు–సంకాశ–స్ఫురత్–నిష్క–శిరోధరమ్ అగణ్య–లావణ్య–పూర్ణ–ప్రసన్న–ముఖ–సారసమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** త్రి... ధరమ్ : త్రిరేఖ = మూడుగీతలుగల, కంబు = శంఖంతో, సంకాశ = సమానమైన, స్ఫురత్= ప్రకాశిస్తున్న, నిష్క = కంఠాభరణం గల, శిరోధరమ్ = మెడగలవాడూ, అగణ్య = లెక్కింపరాని, లావణ్య = సౌందర్యంతో, పూర్ణ = నిండిన, ప్రసన్న = అనుగ్రహదృష్టి గల, ముఖ–సారసమ్ = ముఖపద్మం గలవాడునూ అయిన (అగణ్యేన లావణ్యేన పూర్ణం ప్రసన్నం చ ముఖమేవ సారసం యస్య తమ్), (కృష్ణమ్ ఐక్షత)

**తా ॥** కృష్ణుని కంఠం శంఖంలా వుంది. దానిచుట్టూ కంఠాభరణాన్ని ధరించి వున్నాడు. అంతులేని సౌందర్యంతో నిండిన ఆ ముఖపద్మం ప్రసన్నంగా కనబడుతోంది.

వి : 1. **లావణ్య** మంటే వ్యుత్పత్త్యర్థం ఉప్పదనం. అయితే లావణ్యపదం సౌందర్యం అనే అర్థంలో రూఢం. అది తన ఆశ్రయంలో అవాంతరవిభాగాల కన్న భిన్నమై ప్రస్ఫుటంగా భాసించే సౌందర్యవిశేషం, కావ్యధ్వనిలాగా. అందుకే **ఆనందవర్ధనుడు**

శ్లో॥ ప్రతీయమానం పునరన్యదేవ - వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్ ।
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం - విభాతి **లావణ్య**మివాంగనాసు ॥ -ధ్వన్యాలోకం 1/4 *

**శ్లో॥ అతిరక్తమృదుస్నిగ్ధపక్వబిమ్బనిభాధరమ్ ।**
**కున్దకుట్మలసంశోభిదన్తపఙ్క్తిం దయానిధిమ్ ॥ 10-62**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనం.

**అ :** అతిరక్త-మృదు-స్నిగ్ధ-పక్వ-బింబ-నిభ-అధరమ్ కుంద-కుట్మల-సంశోభి-దంత-పంక్తిం దయా-నిధిమ్ ॥ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** అతిరక్త... ధరమ్ : అతిరక్త = బాగా ఎఱ్ఱనై, మృదు = కోమలలై, స్నిగ్ధ = మనోజ్ఞమై, పక్వ = పండిన, బింబ = దొండ (పండు) తో, నిభ = సమానమైన, అధరమ్ = పెదవి గలవాడూ (అతిరక్తం చ తత్ మృదు చ తత్స్నిగ్ధం చ తత్ పక్వబింబం యస్య, తమ్), కుంద... పంక్తిమ్ : కుంద = మల్లెయొక్క, కుట్మల = మొగ్గలా, సంశోభి = ప్రకాశిస్తున్న, దంత-పంక్తిమ్ = పలువరుస గలవాడూ అయిన (కుందస్య కుట్మలవత్ సంశోభినః చ తే దంతాః తేషాం పంక్తిః యస్య, తమ్), దయా-నిధిమ్ : దయా = దయకు, నిధిమ్ = నెలవయిన వాడూ అయిన (దయాయాః నిధిః తమ్), **కృష్ణమ్ ఐక్షత**.

**తా ॥** కృష్ణుని పెదవి మరీ ఎఱ్ఱగా పండి మృదువుగా వున్న దొండపండులా వుంది. పలువరుస మల్లెమొగ్గల వలె ప్రకాశిస్తోంది. ఆయన దయానిధి. *

**శ్లో॥ చన్ద్రికాసౌభగస్పర్ధిమన్దహాసం మనోహరమ్ ।**
**హరినీలజ్వలద్వప్రవిలసద్గణ్డమణ్డలమ్ ॥ 10-63**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** చంద్రికా-సౌభగ-స్పర్ధి-మంద-హాసం మనో-హరం హరి-నీల-జ్వలద్-వప్ర-విలసద్-గండ-మండలమ్. (కృష్ణం ఐక్షత)

**ప్ర :** చంద్రికా = వెన్నెలయొక్క (చంద్రికా కౌముదీ జ్యోత్స్నా - అమరకోశః - దిక్-16), సౌభగ = సంపదతో, స్పర్ధి = పోటీపడుతున్న, మందహాసమ్ = చిఱునవ్వు గలవాడూ, మనః+హరమ్ = మనస్సును దోచేవాడూ, హరి... మండలమ్ : హరి-నీల = ఇంద్రనీల మణులతో గూడి, జ్వలత్ = ప్రకాశిస్తున్న, వప్ర = మట్టిదిన్నెవలెనున్న (స్యాచ్ఛయో వప్ర మస్త్రియామ్ - అమరకోశః - పుర-3), విలసత్ = ప్రకాశిస్తున్న, గండ-మండలమ్ = గుండ్రని చెక్కిలి గలవాడూ అయిన (హరినీలమయః జ్వలన్ చ వప్రః, తద్వత్ విలసత్ గండస్య మండలం యస్య, తమ్)- కృష్ణమ్ ఐక్షత.

**తా ॥** కృష్ణుడు వెన్నెల సంపదతో పోటీపడుతున్న చిఱునవ్వుల వాడు. మనోహరుడు. ఇంద్రనీలమణిమయమైన వప్రం వంటి గుండ్రని చెక్కిలి గలవాడు.

**వి :** 1. హరిశబ్దం అనేకార్థాలలో వుంటుంది.

శ్లో॥ యమానిలేంద్రచంద్రార్కవిష్ణుసింహాంశువాజిషు ।
శుకాహిపికభేకేషు హరిర్నా కపిలే త్రిషు ॥

యముడు, వాయువు, ఇంద్రుడు, చంద్రుడు, సూర్యుడు, విష్ణువు, సింహం, కిరణం, గుఱ్ఱం, చిలుక, పాము, కోయిల, కప్ప ఈ అర్థాలలో హరిశబ్దం పుంలింగం. కపిలవర్ణమనే అర్థంలో మూడు లింగాలలోనూ (విశేష్యాన్నిబట్టి) వాడవచ్చు. *

**శ్లో॥ తరుణాదిత్యసఙ్కాశవరకుణ్డలమణ్డితమ్ ।**
**లసన్నాసాప్రభాముష్టనవచమ్పకసమ్పదమ్ ॥ 10-64**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** తరుణ+ఆదిత్య-సంకాశ-వర-కుండల-మండితం లసత్+నాసా-ప్రభా-ముష్ట-నవ-చంపక-సంపదమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** తరుణా... మండితమ్ : తరుణ+ఆదిత్య = బాల సూర్యునితో, సంకాశ = సమానమైన, వర = శ్రేష్ఠమైన, కుండల = చెవి నగల (కుండలాలు) చే, మండితమ్ = అలంకరింపబడిన వాడూ, లసత్... సంపదమ్ : లసత్ = వెలుగొందుతున్న, నాసా = ముక్కుయొక్క, ప్రభా = కాంతిచే, ముష్ట = దొంగిలింపబడిన, నవ = క్రొత్తదైన, చంపక = సంపెంగయొక్క, సంపదమ్ = సంపద గలవాడూ అయిన (లసన్తీ చ సా నాసా, తస్యాః ప్రభా, తయా ముష్టం నవం చ తత్ చంపకం, తస్య సంపత్ యస్య, తమ్)

**తా ॥** కృష్ణుడు ధరించిన కుండలాలు బాలభానుని కాంతితో సమానమైన కాంతితో ప్రకాశిస్తున్నాయి. నాసిక వెలుగు సంపెంగపూల సంపదను దోచుకొంటున్నట్లుంది. (అటువంటి కృష్ణుని చూశాడు అక్రూరుడు.) *

**శ్లో॥ చలన్మధుకరాసక్తజలజోపమలోచనమ్ ।**
**ఇన్ద్రనీలోత్పలమయశార్ఙ్గసౌన్దర్యజిద్భ్రువమ్ ॥ 10-65**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణించటం.

**అ :** చలత్+మధుకర+ఆసక్త-జలజ+ఉపమ-లోచనమ్ ఇంద్ర-నీల+ఉత్పల-మయ-శార్ఙ్గ-సౌందర్య-జిత్-భ్రువమ్ (కృష్ణమ్ ఐక్షత).

**ప్ర :** చలత్... లోచనమ్ : చలత్ = కదులుతున్న, మధుకర = తుమ్మెదలతో, ఆసక్త = కూడిన, జలజ+ఉపమ = కమలంతో పోలికగల, లోచనమ్ = కన్నులు గలవాడూ (చలద్భ్యాం మధుకరాభ్యామ్ ఆసక్తే జలజే ఉపమా యయోః, తే లోచనే యస్య, తమ్), ఇంద్ర... భుజమ్ : ఇంద్రనీల = ఇంద్రనీలమణులు, ఉత్పల-మయ = నల్లకలువలు - వీటితో కూడిన, శార్ఙ్గ = (తన) ధనుస్సుయొక్క, సౌందర్య = సౌందర్యాన్ని, జిత్ = జయించే, భ్రువమ్ = కనుబొమ గలవాడూ అయిన (ఇంద్రనీలానాముత్పలానాం చ స్వరూపమ్ ఇంద్రనీలోత్పలమయం, తచ్చ తత్ శార్ఙ్గం చ తస్య సౌందర్యం జయతీతి, సా భ్రూః యస్య తమ్), **కృష్ణమ్ ఐక్షత.**

**తా ॥** కదిలే తుమ్మెదలతో కూడిన తామరలవంటి కళ్ళు కృష్ణుడివి. ఇంద్రనీలమణులూ, నల్లకలువలతో కూడిన శార్ఙ్గధనుస్సుయొక్క సొగసును గెలుస్తున్నాయి ఆ కృష్ణుని కనుబొమలు. (అటువంటి కృష్ణుని చూశాడు అక్రూరుడు)

**వి :** 1. **చాపః శార్ఙ్గం మురారేస్తు శ్రీవత్సో లాంఛనం మతమ్** - అని అమరకోశం. *

**శ్లో॥ శ్రీభూముఖామ్బుజాసక్తలోలాపాఙ్గమధువ్రతమ్ ।**
**హృద్యోర్ధ్వపుణ్డ్రమధ్యస్థసద్రత్నతిలకోజ్జ్వలమ్ ॥ 10-66**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనమే.

**అ :** శ్రీ–భూ–ముఖ+అంబుజ+ఆసక్త–లోల+అపాంగ–మధువ్రతం హృద్య+ఊర్ధ్వపుండ్ర–మధ్యస్థ–సద్–రత్న–తిలక+ఉజ్జ్వలమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** శ్రీ... మధువ్రతమ్ : శ్రీ = లక్ష్మి, భూ = భూమి – వీరియొక్క ముఖ+అంబుజ = ముఖపద్మాలపై, ఆసక్త=తగుల్కొన్న, లోల=చంచలమైన, అపాంగ = చూపు లనే, మధువ్రతమ్ = తుమ్మెదలు గలవాడు (శ్రీశ్చ భూశ్చ శ్రీభువౌ, తయోః ముఖే ఏవ అంబుజే, తయోః ఆసక్తౌ లోలే చ తౌ అపాంగౌ ఏవ మధువ్రతౌ యస్య, తమ్), హృద్య... ఉజ్జ్వలమ్ : హృద్య = మనోహరమైన, ఊర్ధ్వ–పుండ్ర = ఎగునామాల యొక్క, మధ్యస్థ = మధ్యనున్న, సద్–రత్న = మేలిమిరత్నాలతో చేసిన, తిలక = తిలకం (బొట్టు)తో, ఉజ్జ్వలమ్ = ప్రకాశించే వాడు అయిన (హృద్యస్య ఊర్ధ్వపుండ్రస్య మద్యే తిష్ఠతీతి, తత్ చ తత్ సద్రత్నవికారం తిలకం, తేన ఉజ్జ్వలః, తమ్) **(కృష్ణమ్ ఐక్షత)**

**తా ॥** కృష్ణుని చూపులు శ్రీభూదేవుల ముఖపద్మాలపై తగిలి వున్నాయి. ఆ చూపులు (కమలాలపై వ్రాలిన) తుమ్మెదల వలె కనిపిస్తున్నాయి. మోముపై ఊర్ధ్వపుండ్రాల మధ్యనున్న రత్నతిలకంతో ఉజ్జ్వలంగా కనిపిస్తున్నాడు కృష్ణుడు.

**వి :** 1. కృష్ణతిలకమంటే తెలుగువారి మనస్సుల్లో వెంటనే మెదిలే శ్లోకం కృష్ణకర్ణామృతం లోనిది–

**శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కంకణమ్ ।**
**సర్వాంగే హరిచందనం చ కలయన్ కంఠే చ ముక్తావళిం**
**గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః ॥** **– కృష్ణకర్ణామృతం – 2/108**

2. శ్రీభూదేవుల ముఖాలలో అంబుజత్వాన్నీ, కృష్ణుని అపాంగంలో మధువ్రతత్వాన్నీ ఆరోపించి నందువల్ల ఇది రూపకాలంకారం. *

**శ్లో॥ అలకాసక్తవిలసన్ముకుటాద్భుతభాస్కరమ్ ।**
**అనర్ఘ్యహారకేయూరనూపురాద్యైర్విరాజితమ్ ॥** **10–67**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనం.

**అ :** అలక+ఆసక్త–విలసత్–ముకుట+అద్భుత–భాస్కరమ్ అనర్ఘ్య–హార–కేయూర–నూపుర+ఆద్యైః విరాజితమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** అలక... భాస్కరమ్ : అలక = ముంగురులపై, ఆసక్త = తగిలివున్న, విలసత్ = ప్రకాశిస్తున్న, ముకుట = కిరీటం అనే, అద్భుత = ఆశ్చర్యకరమైన, భాస్కరమ్ = సూర్యుడు గలవాడూ, అనర్ఘ్య... రాద్యైః : అనర్ఘ్య = వెలలేని, హార = ముత్యాలపేరులు, కేయూర = అంగదాలు, నూపుర = కడియాలు, ఆద్యైః = మొదలగు వానిచేత (అనర్ఘ్యాః హారాః కేయూరాః నూపురాః చ ఆదౌ యేషాం, తైః), విరాజితమ్ = ప్రకాశింపజేయబడినవాడూ అయిన, **కృష్ణమ్ ఐక్షత.**

**తా ॥** కృష్ణుని ముంగురులను తాకుతూ అందమైన కిరీటముంది. అది సూర్యసమానంగా కనిపిస్తోంది. ఆ కృష్ణుడు వెలలేని హారాలూ, అంగదాలు, కడియాలు మొదలయిన నగలను ధరించి విరాజిల్లుతున్నాడు. అటువంటి కృష్ణుని చూశాడు అక్రూరుడు. *

**శ్లో॥ కన్దర్పకోటిలావణ్యమన్దిరాకారమచ్యుతమ్ ।**
**సువర్ణమణ్టపాన్తస్థం కమలామలవిష్టరమ్ ॥** **10–68**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** కందర్ప–కోటి–లావణ్య–మందిర+అకారమ్ అచ్యుతం–సువర్ణ–మంటప–అంతః– స్థం కమల+అమల–విష్టరమ్ (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** కందర్ప... కారమ్ : కందర్ప–కోటి = కోట్ల మన్మథులయొక్క, లావణ్య = అందానికి, మందిర = నివాసస్థానమైన, ఆకారమ్ = రూపంగలవాడూ (కందర్పాణాం కోటీనాం లావణ్యస్య మందిరమ్ ఇవ ఆకారః యస్య తమ్), అచ్యుతమ్ = చ్యుతి (జారుపాటు) లేని వాడూ, సువర్ణ...తఃస్థమ్ : సువర్ణ = బంగారుతో చేసిన, మంటప = మండపంయొక్క, అంతఃస్థమ్ = లోనున్నవాడూ, కమలా... విష్టరమ్: కమల = పద్మమే, అమల = నిర్మలమైన, విష్టరమ్ = ఆసనంగా గలవాడూ అయిన (కమలమ్ ఏవ అమలః విష్టరః యస్య తమ్), (**కృష్ణమ్ ఐక్షత**)–

**తా ॥** కృష్ణుడు అచ్యుతుడు. కోటి మన్మథుల లావణ్యంవంటి అందానికి ఆశ్రయమైన ఆకృతి గలవాడు. బంగారు మంటపం మధ్యలో నిర్మలమైన తామరపై కూర్చొని వున్నాడు.

**వి :** 1. కృష్ణ పర్యాయంగా అచ్యుత పదం ప్రసిద్ధం. బాగా వాడుకలో గలది. '**అజస్సర్వేశ్వరస్సిద్ధః సిద్ధిస్సర్వాదిరచ్యుతః** " (శ్లో. 35) అని విష్ణు సహస్రనామం నుతిస్తుంది. అందుకే అచ్యుతాష్టకంలో అది విష్ణుస్తుతిపరమైనా ప్రాథమికంగా విష్ణ్వవతారరూపమైనా రామస్తుతి పరంగా ఒకశ్లోకం, కృష్ణస్తుతిపరంగా ఏడు శ్లోకాలు దానిలో కనిపిస్తాయి. విష్ణుపర్యాయ పదాలలో కోశగ్రంథాలలో కృష్ణపదముంటుందిగానీ రామపదముండదు. '**యస్మాన్నచ్యుత–పూర్వోహమచ్యుతస్తేన కర్మణా**' (మహాభారతం శాంతి–342/71) అన్న నిర్వచనాన్ని బట్టి అచ్యుతత్వం రామునిలో కూడా కనిపిస్తున్నా కృష్ణపరంగా, విష్ణుపర్యాయంగా మాత్రమే అచ్యుతపదం వాడుకలో కనిపిస్తుంది. *

**శ్లో॥ విశ్వస్థేమలయోత్పత్తిముక్త్యాదేర్ముఖ్యకారణమ్ ।**
**అచ్ఛశేషఫణారత్నచ్ఛత్రశోభితమైక్షత ॥ 10–69**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణన.

**అ :** విశ్వ–స్థేమ–లయ+ఉత్పత్తి–ముక్తి+ఆదేః ముఖ్య–కారణమ్ అచ్ఛ–శేష–ఫణా–రత్న–ఛత్ర–శోభితమ్ (కృష్ణమ్) ఐక్షత.

**ప్ర :** విశ్వ... ఆదేః: విశ్వ = ప్రపంచంయొక్క, స్థేమ = నిలకడ, లయ = నాశనం, ఉత్పత్తి = పుట్టుక, ముక్తి = విమోచనం, ఆదేః = మొదలగువాటికి (విశ్వస్య స్థేమా చ లయశ్చ ఉత్పత్తిశ్చ ముక్తిశ్చ ఆదౌ యస్య, తస్య), ముఖ్య–కారణమ్ = ప్రధానకారణమైన వాడూ (ముఖ్యం చ తత్ కారణమ్), అచ్ఛ... శోభితమ్ : అచ్ఛ = నిర్మలమైన, శేష = ఆదిశేషువు– యొక్క, ఫణా = పడగలే, రత్న–ఛత్ర = రత్నాల గొడుగుగా, శోభితమ్ = వెలుగొందుతున్న వాడూ అయిన (అచ్ఛాః శేషస్య ఫణా ఏవ రత్నమయాని ఛత్రాణి యస్య, తమ్), (కృష్ణమ్ = కృష్ణుని), ఐక్షత = చూశాడు. (ఈక్ష దర్శనే ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** విశ్వం యొక్క స్థితికి, వినాశానికీ, ఉత్పత్తికీ, విముక్తికీ కూడా ప్రధానకారణం కృష్ణుడే. ఆదిశేషుని యొక్క నిర్మలమయిన పడగలే రత్నపుగొడుగులుగా శయనించి వున్నాడు. అటువంటి కృష్ణుని చూశాడు అక్రూరుడు.

**వి :** 1. బ్రహ్మ సృష్టికీ, విష్ణువు స్థితికీ, ఈశ్వరుడు విలయానికీ కారకులని సాధారణమైన ఒప్పుదల. కానీ ఆయా తాత్త్విక విశేషాలను బట్టి ఈ భావనలో విలక్షణత కనిపిస్తుంది. నన్నయ "**శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతో వక్షోముఖాంగేషు యే లోకానాం స్థితిమావహన్తి**" అంటూ స్థితిని మాత్రమే ప్రస్తావించాడు. ప్రకృతశ్లోకంలో సృష్టిస్థిత్యాదులకన్నింటికీ తానే ముఖ్యకారణమని ప్రస్తుతింపబడింది. అంటే కృష్ణుని పరాత్పరస్వరూపంగా భావించి ప్రకటించటమిది.

శ్లో॥ యతత్సర్వాణి భూతాని భవన్త్యాదియుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ జగత్క్షయే ॥

శ్లో॥ తస్య లోకప్రధానస్య జగన్నాథస్య భూపతే ।
విష్ణోర్నామ సహస్రం మే శృణు పాపభయావహమ్ ॥ – విష్ణుసహస్రనామం – పూర్వపీఠిక.

ఈ శ్లోకసారాంశం మేరకు ఉత్పత్తివినాశాదులకు అన్నింటికీ కారణం విష్ణువు (కృష్ణుడే). '**జగత్ప్రభుం దేవదేవ**' మన్నది అందుకే. "**తస్యాశ్శిఖాయ మధ్యే పరమాత్మా వ్యవస్థితః స బ్రహ్మా సశివస్సహరిస్సేంద్రస్సోఽక్షరః పరమః స్వరాట్**" అని నారాయణసూక్తంలో నుతింప బడిన ఆ పరాత్పరుని శ్రీకృష్ణుడుగా స్వీకరించి ముఖ్యకారణమనటాన్ని ఇక్కడ గమనించాలి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఐక్షత :** | **ఐక్షత** | ఐక్షేతామ్ | ఐక్షన్త | |
| | ఐక్షథాః | ఐక్షేథామ్ | ఐక్షధ్వమ్ | |
| | ఐక్షే | ఐక్షావహి | ఐక్షామహి | * |

**శ్లో॥ విధిముఖ్యైః సురగణైర్ముదితైర్మునిపుఙ్గవైః ।**
**గీయమానం దయాదృష్టిక్షాళితాశ్రితకల్మషమ్ ॥ 10–70**

**అ :** అక్రూరునకు కనిపించిన కృష్ణుని వర్ణనం.

**అ :** విధి–ముఖ్యైః సుర–గణైః ముదితైః ముని–పుంగవైః గీయమానం దయా–దృష్టి–క్షాళిత+ఆశ్రిత–కల్మషం (కృష్ణమ్ ఐక్షత)

**ప్ర :** విధి–ముఖ్యైః = బ్రహ్మ మొదలుగా గల (విధిః ముఖ్యః యేషాం తైః), సుర–గణైః = దేవతా సమూహాల చేతనూ (సురాణాం గణాః తైః), ముదితైః = ఆనందించిన (ముద ధాతువుపై క్త ప్రత్యయం), ముని–పుంగవైః = ఋషిశ్రేష్ఠులచేతనూ, గీయమానమ్ = నుతింపబడువాడూ (గై శబ్దే ధాతువుపై శానచ్ ప్రత్యయం), దయా... కల్మషమ్ : దయా = కరుణతో కూడిన, దృష్టి = చూపులచే, క్షాళిత = కడగబడిన, ఆశ్రిత = భక్తులయొక్క, కల్మషమ్ = పాపాలు గలవాడూ అయిన (దయా యుక్తా దృష్టిః, తయా క్షాళితాని ఆశ్రితానాం కల్మషాణి యేన, తమ్), కృష్ణమ్ = అచ్యుతుని, ఐక్షత = చూశాడు.

**తా ॥** బ్రహ్మాదిదేవతాగణాలు, ఆనందించిన మహర్షిబృందాలూ ఆయనను ప్రస్తుతిస్తున్నాయి. తన కరుణాదృష్టితో తనను ఆశ్రయించిన భక్తుల పాపాలను ఆయన ప్రక్షాళన చేసేవాడు. అటువంటి కృష్ణుని చూశాడు అక్రూరుడు. *

**శ్లో॥ దృష్ట్వాతమమ్భోరుహపత్రనేత్రం – తుష్టావ తుష్టాఖిలచిత్తవృత్తిః ।**
**పశ్చాత్ సిషేవే రథసంస్థితం తం – ముక్తోఽపి నైవోజ్ఝతి కృష్ణసేవామ్ ॥ 10–71**

**అ :** జలమధ్యంలో కృష్ణుని చూసి ఆనందించి, అక్రూరుడు మరల రథం దగ్గరకు రావటం. –ఇంద్రవజ్ర.

**అ :** అంభోరుహ–పత్ర–నేత్రం తం దృష్ట్వా తుష్ట+అఖిల–చిత్త–వృత్తిః (సః) తుష్టావ. పశ్చాత్ రథ–సంస్థితం తం సిషేవే. ముక్తః అపి కృష్ణ–సేవాం న ఏవ ఉజ్ఝతి.

**ప్ర :** అంభో... నేత్రమ్ : అంభో–రుహ = తామరపూవుయొక్క, పత్ర = రేకుల వంటి, నేత్రమ్ = కన్నులు గల (అంభోరుహస్య పత్రే ఇవ నేత్రే యస్య, తమ్), తమ్ = ఆ కృష్ణుని, దృష్ట్వా = చూసి (నీటిలో), తుష్టా... వృత్తిః : తుష్ట = ఆనందించిన, అఖిల = సంపూర్ణమైన, చిత్త = మనస్సుయొక్క, వృత్తిః = నడవడిగల (తుష్టాః అఖిలాశ్చ తాః చిత్తస్య వృత్తయః యస్య సః), (సః = ఆ అక్రూరుడు), తుష్టావ = స్తోత్రం చేశాడు. (ష్టు స్తుతౌ పరస్మైపది–లిట్–

ప్ర.ఏ.), పశ్చాత్ = ఆ తరువాత, రథ–సంస్థితమ్ : రథ = రథంపై, సంస్థితమ్ = నిశ్చలంగా వున్న (రథే సమ్యక్ స్థితః తమ్), సిషేవే = సేవించాడు. (సేవ్ సేవనే ఆత్మనేపది –లిట్–ప్ర.ఏ.), ముక్తః+అపి= ముక్తిని పొంది కూడా, కృష్ణ–సేవామ్ = కృష్ణుని భజించటాన్ని, న ఏవ ఉజ్ఝతి = విడువడే. (ఉజ్ఝ ఉత్సర్గే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** యమునానదీ మధ్య జలంలో కృష్ణుని స్వరూపాన్ని చూసిన అక్రూరుడు ఆ కమలదళనేత్రుని స్తుతించాడు. అక్రూరుని మనోవృత్తి పూర్తిగా తృప్తి పడింది. ఆపై మరలా రథం దగ్గరకు వచ్చి రథంపై నున్న కృష్ణుని సేవించాడు. తాను కృష్ణదర్శనంతో జీవన్ముక్తిని పొందినా కృష్ణసేవను మాత్రం విడువలేదు.

**వి :** 1. పోతన తన భాగవతంలో అక్రూరుడు కృష్ణుని స్తుతించటాన్ని దండకంగా మలిచాడు. తెలుగు వారికి దండకం అభిమానవిషయం స్తోత్రాలలో. తన జీవితంలో భోగినీ దండకాన్ని కూడా వ్రాసిన పోతన అక్రూరుడు చేసిన స్తుతిని దండకం చేశాడు. (పోతన భాగవతము 10/1234). "**శ్రీ మానినిమానచోరా! శుభాకార! వీరా!... నమః**"

అక్రూరుడు మరలివచ్చి రథాన్ని యథావిధిగా నడపటానికి సిద్ధపడుతున్న సందర్భంలో కృష్ణ – అక్రూరుల చమత్కారసంభాషణను ఒకదాన్ని నిర్మించాడు పోతన.

హరి : క. జలములు చేరువనున్నవి
తలపోయఁగ నీవు పోయి తడ వయ్యె నదీ
జలమున నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకుఁ గానం బడెనే?

అక్రూరుడు :క. నీలోన లేని చోద్యము
లేలోకములందుఁ జెప్ప రీశ్వర! నీట
న్నేలం నింగిని నున్నవె?
నీలోఁ జోద్యంబు లెల్ల నెగడు మహాత్మా!

2. జలమధ్యంలోని కృష్ణదర్శనంతోనే చిత్తవృత్తి తృప్తిచెందినా మరల రథస్థుడైన కృష్ణుని సేవించటాన్ని 'ముక్తోఽపి కృష్ణసేవాం న ఉజ్ఝతి' అని సమర్థించటంవలన ఇక్కడ కావ్య–లింగాలంకారం. కృష్ణ సందర్శనం ముక్తి దాయకమే అని నిశ్చయించి చెప్పటం కూడా. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' – (కు.121)

| | | | |
|---|---|---|---|
| 3. **తుష్టావ :** | **తుష్టావ** | తుష్టువతుః | తుష్టువుః |
| | తుష్టోథ | తుష్టువథుః | తుష్టువ |
| | తుష్టావ/తుష్టవ | తుష్టువ | తుష్టుమ |
| **సిషేవే :** | **సిషేవే** | సిషేవాతే | సిషేవిరే |
| | సిషేవిషే | సిషేవాథే | సిషేవిధ్వే |
| | సిషేవే | సిషేవివహే | సిషేవిమహే |
| **ఉజ్ఝతి :** | **ఉజ్ఝతి** | ఉజ్ఝతః | ఉజ్ఝన్తి |
| | ఉజ్ఝసి | ఉజ్ఝథః | ఉజ్ఝథ |
| | ఉజ్ఝామి | ఉజ్ఝావః | ఉజ్ఝామః. |

*

**శ్లో॥ యమునా సా విజయతే యమినాం పరమప్రియా ।
ప్రదర్శయతి యా కృష్ణం సుధియః స్నానమాత్రతః ॥ 10–72**

**అ :** కవి యమునను తన్మాహాత్మ్యాన్ని స్తుతించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యమినాం పరమ-ప్రియా సా యమునా విజయతే. యా స్నానమాత్రతః సుధియః కృష్ణం ప్రదర్శయతి.

**ప్ర :** యమినామ్ = సంన్యాసులకు, పరమ-ప్రియా = ఎంతో ఇష్టమయిన, సా = ఆ, యమునా = యమునానది, విజయతే = వర్ధిల్లుతోంది. (వి+జి జయే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.) (జి ధాతువు వస్తుతః పరస్మైపది. కాని 'వి'పూర్వకమైనపుడు '**విపరాభ్యాం జేః**' (అష్టాధ్యాయి-1-3-19) సూత్రంతో ఆత్మనేపది అవుతుంది.), యా = ఏదయితే, స్నాన-మాత్రతః = (తనలో) స్నానం చేసినంతమాత్రాన, సుధియః = బుద్ధిమంతునకు, కృష్ణమ్ = కృష్ణుని, ప్రదర్శయతి=చూపిస్తోందో! (ప్ర-దృశ్ ప్రేక్షణే-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** తనలో స్నానం చేసినంత మాత్రాన ధీమంతులకు కృష్ణుని ప్రదర్శింపజేయగలది యమున. అందుకే యోగులకు చాలా ఇష్టమైనది యమున. ఆ యమున విరాజిల్లుతోంది.

**వి :** 1. యమునాతీరంలో కృష్ణుడు తిరిగిన కారణంగా యమున అటు ఆధ్యాత్మికతకూ, ఇటు శృంగార విలాసాలకూ కూడా అది ఆశ్రయమయింది-

శ్లో॥ మేఘైర్మేదురమంబరం వనభువశ్యామాస్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ తదిమం రాధే గృహం ప్రాపయ ।
ఇత్థం నందనిదేశతశ్చలితయోః ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయోర్జయంతి **యమునాకూలే** రహః కేలయః ॥ - గీతగోవిందం.1

అంటూ జయదేవుడు తన గీతగోవిందానికి యముననే నేపథ్యంగా స్వీకరించాడు. అదే యమునలో అక్రూరుడికి కృష్ణపరాత్పరదర్శనం లభించింది. వాస్తవానికి కృష్ణతత్త్వం ఆధ్యాత్మిక-ఆధిభౌతిక తత్త్వాలకు ఒక వంతెన వంటిది. ఒక సమన్వయం. రెండూ అన్యోన్యాశ్రితాలు అని నిరూపించే ఒక సజీవశాస్త్రం.

| | | | |
|---|---|---|---|
| 2. **విజయతే :** | **విజయతే** | విజయేతే | విజయన్తే |
| | విజయసే | విజయేథే | విజయధ్వే |
| | విజయే | విజయావహే | విజయామహే |
| **ప్రదర్శయతి :** | **ప్రదర్శయతి** | ప్రదర్శయతః | ప్రదర్శయన్తి |
| | ప్రదర్శయసి | ప్రదర్శయథః | ప్రదర్శయథ |
| | ప్రదర్శయామి | ప్రదర్శయావః | ప్రదర్శయామః. |

*

**శ్లో॥ మథురాముపగమ్యాథ కృతస్నానః పురాద్బహిః ।**
**పురతస్త్వం పురం యాహీత్యవదద్గాన్దినీసుతమ్ ॥ 10-73**

**అ :** కృష్ణుడు మథురను చేరుట - అక్రూరుని ముందుగా పంపుట. -పథ్యావక్త్రమ్.

**అ :** అథ మథురాం (పురీమ్) ఉపగమ్య నగరాద్ బహిః కృత-స్నానః పురతః త్వం పురం యాహి ఇతి గాందినీసుతమ్ అవదత్.

**ప్ర :** అథ = అటుతర్వాత, మథురాం (పురీమ్) = మథురా నగరిని, ఉపగమ్య = సమీపించి (ఉప-గమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పురాద్-బహిః = నగరానికి బయట, కృత-స్నానః = స్నానంచేసి (కృతం స్నానం యేన సః), (కృష్ణః = కృష్ణుడు), పురతః = ముందుగా, త్వమ్ = నీవు, పురమ్ = నగరికి, యాహి = వెళ్ళు (యా ప్రాపణే పరస్మైపది-లోట్-మ.ఏ.), ఇతి = అని, గాందినీ-సుతమ్ = గాందిని కొడుకుతో (అక్రూరునితో) (గాందిన్యాః సుతః తమ్), అవదత్ = చెప్పాడు. (వద వ్యక్తాయాం వాచి-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అక్రూరుడు మరలా రథాన్ని నడిపించటం ప్రారంభించిన తరువాత మథురానగరికి చేరారు. నగరానికి వెలుపలనే కృష్ణుడు స్నానాన్ని ముగించాడు. 'నువ్వు ముందు వెళ్ళు' అని గాందినీ కుమారుని (అక్రూరుని) నగరిలోనికి పంపించాడు.

**వి :** 1. అక్రూరుని తల్లి గాందిని అని హరివంశవచనం. ఆమె నిత్యమూ గోదానం చేసేది బ్రాహ్మణులకు.

ఆ మేరకు ఆమె తన తండ్రినుండి మాట తీసుకొన్న తరువాతనే లోకం లోనికి వచ్చింది.

శ్లో॥ శ్వఫల్కః కాశిరాజస్య సుతాం భార్యామవిందత ।
గాందినీం నామ సా గాం తు దదౌ విప్రేషు నిత్యశః ॥

శ్లో॥ సా మాతురుదరస్థా తు బహూన్ వర్షగణాన్ కిల ।
నివసంతీ న వై జజ్ఞే గర్భస్థాం తాం పితాబ్రవీత్ ॥

శ్లో॥ జాయస్వ శీఘ్రం భద్రం తే కిమర్థమిహ తిష్ఠసి ।
ప్రోవాచ చైనం గర్భస్థా కన్యా గాం చ దినే దినే ॥

శ్లో॥ యది దద్యాం తతోఽద్యాహం జాయయిష్యామి తాం పితా ।
తథేత్యువాచ తం చాస్యాః పితా కామమపూరయత్ ॥ -హరివంశం 1/34/7-10

| | | | |
|---|---|---|---|
| 2. **యాహి :** | యాతు/యాతాత్ | యాతామ్ | యాన్తు |
| | **యాహి**/యాతాత్ | యాతమ్ | యాత |
| | యాని | యావ | యామ |

| | | | |
|---|---|---|---|
| **అవదత్ :** | **అవదత్** | అవదతామ్ | అవదన్ |
| | అవదః | అవదతమ్ | అవదత |
| | అవదమ్ | అవదావ | అవదామ. |

*

**శ్లో॥ ప్రియసఙ్గమవిచ్ఛేదభయనిర్విణ్ణధీరసౌ ।
గృహపుత్త్రకళత్రేచ్ఛారహితో వక్తి మాధవమ్ ॥ 10-74**

**అ :** సాంసారికబంధవిషయమై ఆసక్తిని కోల్పోయిన అక్రూరుడు దానిని ప్రతిపాదించే ప్రయత్నం చేయటం.

**అ :** ప్రియ-సంగమ-విచ్ఛేద-భయ-నిర్విణ్ణ-ధీః అసౌ గృహ-పుత్త్ర-కళత్ర+ఇచ్ఛా-రహితః మాధవం వక్తి.

**ప్ర :** ప్రియ... ధీః : ప్రియ = ఇష్టుడైన కృష్ణునియొక్క, సంగమ = చేరిమినుండి, విచ్ఛేద = ఎడబాటు వలని, భయ = భయంచేత, నిర్విణ్ణ = విరక్తిగొన్న, ధీః = బుద్ధిగల (ప్రియస్య సంగమే విచ్ఛేదాత్ భయేన నిర్విణ్ణా ధీః యస్య సః), అసౌ = ఆ అక్రూరుడు, గృహ... రహితః : గృహ = ఇల్లు, పుత్త్ర = పిల్లలు, కళత్ర = ఆలు- వీటిపై, ఇచ్ఛా-రహితః (సన్) = కోరిక లేనివాడై (గృహం చ పుత్త్రాః చ కళత్రం చ, తేషు ఇచ్ఛయా రహితః), మాధవమ్ = కృష్ణునితో, వక్తి = చెప్తున్నాడు. (వచ పరిభాషణే పరస్మైపది - లట్-ప్ర.ఏ.)

**తా ॥** తనకు ఇష్టుడైన కృష్ణునితో వియోగ మేర్పడబోతోందన్న ఆలోచనతో అక్రూరుడు నిర్విణ్ణుడయ్యాడు. ఇంటిపై ఆలుబిడ్డలపై ఏపాటి కోరికా లేని అక్రూరుడు కృష్ణునితో ఇలా అంటున్నాడు-

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **వక్తి :** | **వక్తి** | వక్తః | -- |
| | వక్షి | వక్థః | వక్థ |
| | వచ్మి | వచ్వః | వచ్మః |

వచ ధాతువుకు ప్ర.బ.లో ప్రయోగం లేదు. 'అయమన్తిపరో న ప్రయుజ్యతే' 'బహువచన పరః' ఇత్యన్యే! 'ఝిపరః' ఇత్యపరే. అని సిద్ధాంతకౌముదీవచనం. (వచధాతువు 1063). *

**శ్లో॥ సంసారాసారసిన్ధోర్జనిమరణజరాద్యూర్మిభిర్బాధితానాం**
**దారాగారాదిభారాః కిమిహ సుఖకరాః ప్రేమపాశైర్నిబద్ధాః ।**
**కృష్ణ త్వత్పాదపోతం ప్రదిశ తదనిశం సత్పతాకం సకేతుం**
**రమ్యం కర్మన్దిగమ్యం భవజలధిభవత్స్వేదవిచ్ఛేదహేతుమ్ ॥ 10-75**

**అ :** సంసారసాగరతరణానికి కృష్ణుని పాదమనే చిన్నపడవ కావాలని అక్రూరుడు కృష్ణుని ప్రార్థించటం. -స్రగ్ధర.

**అ :** సంసార+అసార-సింధోః జని-మరణ-జరా+ఆది+ఊర్మిభిః బాధితానాం ప్రేమ-పాశైః నిబద్ధాః దారా+అగార+ఆది-భారాః ఇహ సుఖకరాః కిమ్? తత్ కృష్ణ! సత్-పతాకం స-కేతుం రమ్యం కర్మంది-గమ్యం భవ-జలధి-భవత్-స్వేద-విచ్ఛేద-హేతుం త్వత్-పాద-పోతమ్ అనిశం ప్రదిశ.

**ప్ర :** సంసార = సంసారమనే, అసార = చేవలేని, సింధోః = సముద్రంయొక్క (సంసార ఇతి అసారః చ అసౌ సింధుః, తస్య), జని-మరణ-జరా+ఆది+ఊర్మిభిః : జని = పుట్టుక, మరణ = చావు, జరా = ముసలితనం, ఆది = మొదలుగాగల, ఊర్మిభిః = అలలచే (జనిః మరణం జరా చ ఆదౌ యేషాం తే, తే ఏవ ఊర్మయః తైః), బాధితానామ్ = పీడింపబడినవారికి, ప్రేమ-పాశైః : ప్రేమ = ఇష్టమనే, పాశైః = కట్టుత్రాళ్ళచే (ప్రేమ ఇతి పాశాః, తైః), నిబద్ధాః = కట్టివేయబడిన, దారా+అగార+ఆది-భారాః : దారా = భార్య (దారా శబ్దం పుంలింగం నిత్యబహువచనాంతం), అగార = ఇల్లు (శరణమగారం నివసనమాలయ - హలాయుధకోశః - 291), ఆది = మొదలుగాగల, భారాః = బరువులు, ఇహ = ఈ లోకంలో, సుఖ-కరాః కిమ్? = సుఖాన్ని కల్గిస్తాయా? తత్ = అందువల్ల, కృష్ణ = కృష్ణా! సత్పతాకమ్ = మంచి పతాకమూ, సకేతుమ్ = మంచి ధ్వజమూ కలిగి, రమ్యమ్ = అందమైనదై, కర్మంది-గమ్యమ్ = సన్న్యాసులచే తెలియదగిన (కర్మందేన ప్రోక్తమ్ అధీతే ఇతి కర్మందీ, తైః గమ్యమ్), భవ... హేతుమ్: భవ = సంసారమనే (భవో దేవః సంసారశ్చ), జలధి=సముద్రమందు (జలం ధీయతే అత్ర), భవత్=పుడుతున్న, స్వేద = చెమటయొక్క, విచ్ఛేద = వినాశనానికి, హేతుమ్ = కారణమైనదీ అయిన, త్వత్-పాద-పోతమ్ = నీ కాలు అనే నావను, అనిశమ్ = ఎల్లప్పుడూ, ప్రదిశ = ఇవ్వు (ప్ర-దిశ అతిసర్జనే పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! లోకంలో సంసారమనే ఈ చేవలేని సముద్రంలో పుట్టుక, చావు, ముసలితనం లాంటి అలలు పీడిస్తుంటే ప్రేమపాశానికి బద్ధులైన వారికి ఆలు, పిల్లలు, ఇల్లు వగైరా పాశాలిక ఏం సుఖం కలిగిస్తాయి? కాబట్టి మంచిపతాకతో, మంచిధ్వజంతో కూడి అందమైన నీ పాదమనే నావను నాకు ప్రసాదించు. అది సంసారసాగరంలో పుడుతున్న (శ్రమవలన కలిగిన) స్వేదాన్ని నశింపజేయగలదు.

**వి :** 1. సంసార-సింధువు, భవ-జలధి, పాద-పోతం ప్రేమ-పాశాలు ఇవన్నీ రూపకా-లంకారానికి ఉదాహరణలు. సంసారంలో సింధుత్వాన్నీ, భవ(సంసారం)ంలో జలధిత్వాన్నీ, పాదంలో పోతత్వాన్నీ (నావ), ప్రేమలో పాశత్వాన్నీ ఆరోపిస్తున్నాడు కవి.

సంసారాన్ని సముద్రంతో పోల్చటం చాల సాధారణమైన విషయం. ఇట రామదాసు కీర్తనను గమనించండి.

**కీ. ఏ తీరుగ నను దయచూచెదవో - ఇనవంశోత్తమ రామా!**
**నా తరమా భవసాగరమీదగ - నలినదళేక్షణ రామా!**

**శ్రీరఘునందన సీతారమణ - శ్రితజనపోషక రామా!**
**కారుణ్యాలయ భక్తవరద నిను - కన్నది కానుపు రామా!**

**క్రూరకర్మములు నేరక చేసితి - నేరము లెంచకు రామా!**
**దారిద్ర్యము పరిహారము చేయవె - నలినదళేక్షణ రామా!**
**వాసవనుత రామదాస పోషక - వందనమయోధ్య రామా!**
**భాసురవరసద్గుణములు కలిగిన - భద్రాద్రీశ్వర రామా!**

తత్త్వగీతాలు వ్రాసిన రచయితలు దాదాపు ఎవ్వరూ ఈ పోలిక చెప్పకుండా వుండలేరు.

మ. కలలం బోలెడి పుత్త్రమిత్రవనితారాగాదిసంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునన్
దలఁతున్ రుచ్యములంచు; మూఢుఁడ వృథాతత్త్వజ్ఞుఁడన్ నాకు నీ
విలసత్పాదయుగంబుఁ జూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ! – పోతనభాగవతము 10/1233

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రదిశ :** | ప్రదిశతు/ప్రదిశతాత్ | ప్రదిశతామ్ | ప్రదిశన్తు |
| | **ప్రదిశ**/ప్రదిశతాత్ | ప్రదిశతమ్ | ప్రదిశత |
| | ప్రదిశాని | ప్రదిశావ | ప్రదిశామ. |

*

**శ్లో॥ ప్రాయో వ్రజస్త్రీజనదత్తశాపో - మామస్పృశద్యేన భవాన్ వియుంక్తే ।**
**లావణ్యవారాంనిధిపూర్ణమూర్తిః - శ్రేయో వినా పుణ్యముపార్జయేత్ కః ॥ 10-76**

**అ :** తన తప్పే తనకు కృష్ణవియోగాన్ని కలిగిస్తోందని అక్రూరుని పశ్చాత్తాపం. -ఇంద్రవజ్ర.

**అ :** ప్రాయః వ్రజ-స్త్రీ-జన-దత్త-శాపః మామ్ అస్పృశత్ యేన లావణ్య-వారాంనిధి-పూర్ణ-మూర్తిః భవాన్ వియుంక్తే. పుణ్యం వినా కః శ్రేయః ఉప+అర్జయేత్.

**ప్ర :** ప్రాయః = బహుశః, వ్రజ... శాపః : వ్రజ-స్త్రీ = గోపకాంతలచే, దత్త = ఇవ్వబడిన, శాపః = శాపం, మామ్ = నన్ను, అస్పృశత్ = తాకింది. (స్పృశ్ స్పర్శనే పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.), యేన = దేని చేనయితే, లావణ్య... మూర్తిః : లావణ్య-వారాంనిధి = సౌందర్య సముద్రంవలె, పూర్ణ = నిండైన, మూర్తిః = రూపం గల, భవాన్ = నీవు, వియుంక్తే = దూరమవుతున్నావు. (వి యుజిర్ యోగే రుధాది ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.), పుణ్యం వినా = పున్నెం లేకుండా, కః = ఎవడు, శ్రేయః = శ్రేయస్సును, ఉప+అర్జయేత్ = సంపాదింపగలడు? (ఋజ్ గతిస్థానార్జనోపార్జనేషు ణిచ్-పరస్మైపది-విధిలిఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** బహుశః కృష్ణుని తమనుండి విడదీస్తున్నానన్న బాధతో గోపకాంతలు నన్ను శపించి వుండవచ్చు. దాని ఫలితంగానే సౌందర్యసాగరుడైన కృష్ణుని రూపం నాకు దూరమవుతోంది. అవును మరి. పుణ్యం చేయకుండా శ్రేయస్సు కావాలంటే ఎలా వస్తుంది?

**వి :** 1. ఇక్కడ అక్రూరుడు పుణ్యం చేయకపోతే శ్రేయస్సు ఎలా అంటున్నాడు. కానీ అక్కడ వాస్తవం పుణ్యం చేయకపోవటం కాదు. పాపం చేయటం, గోపికలను కృష్ణునినుండి దూరం చేసే రూపంలో, అది బంధవిముక్తి గదా! బంధవిముక్తి మహాఫలమని అందరి ఆలోచన గదా! మహాఫలహేతువైన వాడు దోషి అవుతాడా? కాకపోవచ్చు. కానీ అక్రూరుడు తాను చేసిన పనికి గోపికలు శపించారేమో అనుకొంటున్నాడంటే పాపభావన ఆయనలో కలిగింది. కాబట్టి పాపం చేయట మక్కడ జరిగింది. దాన్ని పుణ్యం చేయకపోవటంగా అక్రూరుడు భావించాడు.

2. మొదటి మూడు పాదాలలోని విశేషవిషయాన్ని నాలుగవ పాదంలోని సామాన్య విషయంతో సమర్థించాడు కాబట్టి ఇది అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**' - (కు.122). ప్రాయః - శబ్ద ప్రయోగం వలన ఉత్ప్రేక్షాలంకారం కూడా.

3. **వియుంక్తే : వియుంక్తే** వియుంజాతే వియుంజతే
వియుఙ్క్షే వియుంజాథే వియుఙ్ధ్వే
వియుంజే వియుంజ్వహే వియుంజ్మహే

**ఉపార్జయేత్ :** **ఉపార్జయేత్** ఉపార్జయేతామ్ ఉపార్జయేయుః
ఉపార్జయేః ఉపార్జయేతమ్ ఉపార్జయేత
ఉపార్జయేయమ్ ఉపార్జయేవ ఉపార్జయేమ. *

**శ్లో॥ పుణ్యశ్రేణ్యతిదూరమప్యనుదినం మూకం సతాం దూషణే-**
**ష్వన్ధం మీనదృగీక్షణేషు బధిరం త్వద్భిన్నగోష్ఠీషు మామ్ ।**
**పఙ్గుం పాపకరప్రయాణకరణేऽపాణిం చ తత్కర్మసు**
**క్లీబం గ్రామ్యరతౌ ముకున్ద! కురు మాం మూఢం తదీయస్మృతౌ ॥ 10-77**

**అ :** అక్రూరుడు తనను సల్లక్షణసంపన్నుని చేయుమని కృష్ణుని ప్రార్థించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ముకుంద! పుణ్య-శ్రేణి+అతిదూరమ్ అపి మామ్ అనుదినం సతాం దూషణేషు మూకం కురు. మీన-దృగ్-ఈక్షణేషు అంధం కురు. త్వద్-భిన్న-గోష్ఠీషు బధిరం కురు. పాప-కర-ప్రయాణ-కరణే పంగుం కురు. తత్-కర్మసు చ అపాణిం కురు. గ్రామ్య-రతౌ క్లీబం కురు. తదీయ-స్మృతౌ మూఢం కురు.

**ప్ర :** ముకుంద! = కృష్ణా! (ముకుం దదాతీతి ముకుందః, తస్మాత్ సంబుద్ధిః), పుణ్య-శ్రేణి+అతిదూరమ్-అపి = పుణ్యసమూహానికి ఎంతో దూరంగా వున్నా, మామ్ = నన్ను, అనుదినమ్ = ఎల్లప్పుడూ, సతామ్ = సజ్జనులయొక్క, దూషణేషు = నిందించే విషయాల్లో, మూకమ్ = మూగవానినిగా, కురు = చేయి. మీన-దృగ్-ఈక్షణేషు = అతివలను చూచుట యందు (మీనౌ ఇవ దృశౌ యాసాం తాః మీనదృశః, తాసామ్ ఈక్షణాని, తేషు), అంధమ్ = గ్రుడ్డివానిని, కురు = చేయి. త్వద్-భిన్న-గోష్ఠీషు : త్వద్భిన్న = నీకన్న వేరైన, గోష్ఠీసు = కథా ప్రసంగాలలో (త్వత్ భిన్నాః తాశ్చ తాః గోష్ఠ్యః, తాసు), బధిరమ్= చెవిటివానిని, కురు = చేయి, పాప...-కరణే : పాపకర = పాపంవైపు, ప్రయాణ-కరణే = పయనించే కార్యంలో (పాపకరే ప్రయాణం, తస్య కరణం, తస్మిన్), పంగుమ్ = కుంటివానిని, కురు = చేయి. తత్+కర్మసు = ఆ పాపపు పనులలో (తేషు కర్మసు), అపాణిమ్ = చేయి లేనివానినిగా, కురు = చేయి. గ్రామ్యరతౌ = నిసిద్ధ శృంగారవిషయంలో, క్లీబమ్ = నపుంసకునిగా, కురు = చేయి. మామ్ = నన్ను, తదీయ-స్మృతౌ = ఆయా (ముందు చెప్పిన) విషయాల తలపులలో, మూఢమ్ = బుద్ధిహీనునిగా, కురు = చేయి.

**తా ॥** ముకుందా! నేను పుణ్యపరంపరకు దూరమైన వాడను. అయినా నన్ను అనుదినమూ సజ్జనులను నిందించే విషయంలో మూగవానినిగా చేయి. మీననేత్రల విషయంలో గ్రుడ్డివానిని చేయి. నీకన్న వేరైన కథాప్రసంగాల దగ్గర నన్ను చెవిటి వానిని చేయి. పాపపుపనులవైపు పయనించే విషయంలో నన్ను కుంటివానిని చేయి. ఆ పనులు చేయటంలో నన్ను చేయి లేని వానిని చేయి. నిషిద్ధశృంగారవిషయంలో నన్ను నపుంసకుని చేయి. ఆయా పనులను గూర్చిన ఆలోచనలు కూడా కలుగకుండా నన్ను బుద్ధిహీనుని చేయి.

**వి :** 1. ప్రాణి ఎప్పుడూ అంగవైకల్యాన్ని కోరుకోదు. ప్రాణులలో మనిషిని గురించి చెప్పవలసిన అవసరమే లేదు. అన్ని అవయవాలు సరిగా వుండటమే సంపన్నత. అటువంటి స్థితిలో కోరి మూగతనాన్నీ, గ్రుడ్డితనాన్నీ, చెవిటితనాన్నీ, కుంటితనాన్నీ, చేతులు లేకపోవటాన్నీ, నపుంసకత్వాన్నీ, బుద్ధిహీనతనూ కోరుకోవటమంటే అక్కడ ఏదో గుణముండి తీరాలి. అదే అసత్కార్యాలవైపు పయనించకుండా వుండటం. ఆ గుణాన్ని చూసి దోషాన్ని కోరుకోవటం అనుజ్ఞాలంకారం. '**దోషస్యాభ్యర్థనానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్**' - (కు. 137)

ముకుంద పదం కృష్ణపరం. అది ఇక్కడ సాభిప్రాయం. మోక్షదృష్టితో అక్రూరుడు పైన ఉదాహరించిన కోరికలనన్నింటినీ కోరుకొన్నాడు. ముకుందుడంటే మోక్షమిచ్చేవాడు. (ముకుం దదాతి ఇతి ముకుందః). అందువలన కృష్ణవాచకమైన ముకుంద పదం సాభి-ప్రాయవిశేష్య మయింది. అది పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయవిశేష్యే తు భవేత్పరి-కరాంకురః**' - (కు. 63)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **కురు :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు | |
| | **కురు**/కురుతాత్ | కురుతమ్ | కురుత | |
| | కరవాణి | కరవావ | కరవామ. | * |

**శ్లో॥ కామస్తేఙ్ఘ్రియుగార్చనేఽ మలధియాం లోభః సుపుణ్యార్జనే**
**మాత్సర్యం చరితానుకీర్తనసుధాపానాన్మదః శత్రుషు ।**
**క్రోధో భక్తజనేషు రాగ ఉదయాచ్ఛ్రీవిట్ఠలాన్యత్ర నో**
**యచ్ఛత్రుర్నహి శత్రురుచ్చనిలయస్యాన్యస్య శత్రుర్భవేత్ ॥ 10-78**

**అ :** అక్రూరకృత కృష్ణప్రార్థన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** శ్రీవిట్ఠల! తే అంఘ్రి-యుగ-అర్చనే కామః ఉదయాత్. అమలధియాం లోభః ఉదయాత్. సుపుణ్య+ ఆర్జనే మాత్సర్యమ్ ఉదయాత్. చరిత+అనుకీర్తన-సుధా-పానాత్ మదః ఉదయాత్. శత్రుషు క్రోధః ఉదయాత్. భక్తజనేషు రాగః ఉదయాత్. అన్యత్ర నో ఉదయాత్. యత్ ఉచ్చ-నిలయస్య శత్రుః శత్రుః న హి. అన్యస్య శత్రుః భవేత్.

**ప్ర :** శ్రీ విట్ఠల! = పాండురంగవిఠలా!, తే = నీయొక్క, అంఘ్రి-యుగ-అర్చనే : అంఘ్రి = పాదాలయొక్క, యుగ = జంటయొక్క, అర్చనే = పూజించుటయందు (అంఘ్ర్యో యుగం, తస్య అర్చనం, తస్మిన్), కామః = కోరిక, ఉదయాత్ = పుట్టింది. (ఉద్-యా ప్రాపణే-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), అమల-ధియామ్ = నిర్మల బుద్ధి విషయంలో (అమలాశ్చ తాః ధియః, తాసామ్), లోభః = అత్యాశ, ఉదయాత్, సు-పుణ్య+ఆర్జనే = మంచి పుణ్యాన్ని సంపాదించటంలో (శోభనం చ తత్ పుణ్యం తస్య ఆర్జనం తస్మిన్), మాత్సర్యమ్ = ఇతరులను మించి పోవాలన్న తపన, ఉదయాత్. చరితా... పానాత్ : చరిత = చరిత్రయొక్క, అనుకీర్తన = నిరంతరంగా పాడటమనే, సుధా = అమృతంయొక్క, పానాత్ = త్రాగుటవలన, మదః = పొగరు (ఇంకేవీ సరియైనవి కావన్న భావం), ఉదయాత్, శత్రుషు = శత్రువులయందు, క్రోధః = తీవ్ర కోపం (చంపి వేయ్యాలన్నంత కోపం), ఉదయాత్. భక్త-జనేషు = భక్తులైన వారి యందు, రాగః = ప్రీతి (మోహం), ఉదయాత్. అన్యత్ర = వేరో చోట్ల, నో = అవేవీ కలుగరాదు. యత్ = ఎందుకంటే, ఉచ్చ-నిలయస్య : ఉచ్చ = గొప్ప వారు, నిలయస్య = ఆధారమైన వానికి, శత్రుః = విరోధి కూడా, శత్రుః న హి = విరోధి కాలేడు. (విరోధి కావలసినంత కారణమున్నా శత్రుత్వం వహించలేడు), అన్యస్య = ఇతరుడికి (అటువంటిదన్ను లేని వాడికి), శత్రుః = విరోధి, భవేత్ = అవుతాడు. (భూ సత్తాయాం పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.)

**తా ॥** విట్ఠలా! నీ పాదాలను అర్చించటంలో కోరిక (కామం), నిర్మలబుద్ధిని పొందటంలో లోభం, పుణ్యసంపాదనంలో మాత్సర్యం, నీ చరితను పాడుట అనే అమృతాస్వాదనతో మదం, నీ శత్రువులపై క్రోధం, నీ భక్తులపై మోహం కలగాలి. ఇతర విషయాలలో అవి కలుగ కూడదు. ఎందుకంటే గొప్పవారిని ఆశ్రయించిన వారికి శత్రువు శత్రువు కాలేడు. ఇతరులకయితే శత్రువు కాగలడు.

**వి :** 1. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు అంతఃశత్రువులు. విజ్ఞులు ఆ శత్రువులకు తాము బలికారాదని కోరుతుంటారు. కానీ ఇక్కడ ఆ అంతశ్శత్రువులు తనకు కావాలని - ఆయా నిర్దిష్టవిషయాలలో - అక్రూరుడు కోరుతున్నాడు. అంటే అవి వుండటం కూడా గుణం గానే భావిస్తున్నాడు. అవి ఎలా గుణాలవుతాయో తానే వివరించాడు

కూడా. కాబట్టి ఇది అనుజ్ఞాలంకారం. '**దోషస్యాభ్యర్థనానుజ్ఞా తత్రైవ గుణదర్శనాత్**' – (కు. 137)

కామక్రోధలోభమాత్సర్యమదరాగాలకు 'ఉదయాత్' అని ఒకే ధర్మాన్ని అన్వయించటం వల్ల ఇది తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' – (కు. 44)

**2. శ్లో॥ అత్యంతబలవంతోఽపి పౌరజనపదా జనాః ।**
**దుర్బలైరపి బాధ్యన్తే పురుషైః పార్థివాశ్రితైః ॥**

అని మీమాంసాన్యాయం, లౌకికన్యాయం కూడా! పౌరులు, జానపదులు ఎంత బల–వంతులయినా రాజాశ్రయం పొందిన బలహీనుల చేత బాధింపబడతారు.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉదయాత్ :** | **ఉదయాత్** | ఉదయాతామ్ | ఉదయుః |
| | ఉదయాః | ఉదయాతమ్ | ఉదయాత |
| | ఉదయామ్ | ఉదయావ | ఉదయామ |
| **భవేత్ :** | **భవేత్** | భవేతామ్ | భవేయుః |
| | భవేః | భవేతమ్ | భవేత |
| | భవేయమ్ | భవేవ | భవేమ. |

*

**శ్లో॥ రుద్ర! త్వం హి మనోభిమాన్యసి తతస్త్వచ్ఛత్రుమిత్రం మనో**
**మా కుర్వచ్యుతచిన్తనార్చనరతం కుర్వీశ! హే భాస్కర! ।**
**చక్షుర్మాన్యసి తచ్చ విట్ఠలవపుః సన్దర్శనైకాధ్వరం**
**కృత్వా మా కురు కైరవాక్ష్యనుచరం యత్ తాః సపత్న్యాశ్రయాః ॥ 10–79**

**అ :** అక్రూరకృత రుద్రభాస్కరప్రార్థన – తద్రూపంగా కృష్ణ సంభావన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** రుద్ర! త్వం మనః+అభిమానీ అసి హి. తతః మనః త్వత్+శత్రు–మిత్రం మా కురు. ఈశ! అచ్యుత–చింతన+అర్చన–రతం కురు. హే భాస్కర! చక్షుః+మానీ అసి తత్ చ విట్ఠల–వపుః–సందర్శన+ఏక+అధ్వరం కృత్వా కైరవ+అక్షి+అనుచరం మా కురు యత్ తాః సపత్న+ఆశ్రయాః

**ప్ర :** రుద్ర!=రుద్రా!, త్వమ్=నీవు, మనః+అభిమానీ = మనస్సుకు నచ్చినవాడవు (మనసః అభిమానీ), అసి–హి = వున్నావు గదా!, తతః = అందువలన, మనః = మనస్సును, త్వత్+శత్రు–మిత్రమ్ = నీ శత్రువుకు మిత్రునిగా, మా కురు = చేయవద్దు. (కృ కరణే పరస్మైపది–లోట్–మ.ఏ.) (తవ శత్రుః, తస్య మిత్రమ్), ఈశ! = ప్రభూ!, అచ్యు... రతమ్ : అచ్యుత = కృష్ణునియొక్క, చింతన = తలపులందు, అర్చన = పూజయందు, రతమ్ = ప్రీతిగలదానినిగా (అచ్యుతస్య చింతనే అర్చనే చ రతమ్), కురు = చేయి, హే భాస్కర! = ఓ సూర్యా!, చక్షుః +మానీ = కంటి కభిమానివిగా, అసి = ఉన్నావు. తత్ చ = ఆ కన్ను కూడా, విట్ఠల... ధ్వరమ్ : విట్ఠల = పాండురంగనియొక్క, వపుః = శరీరంయొక్క, సందర్శన = దర్శనమనే, ఏక+అధ్వరమ్ = ఒకే సావధానం గలదానిని, కృత్వా = చేసి, కైరవ+అక్షి+అనుచరమ్ : కైరవ+అక్షి = ఉత్పలాక్షులయొక్క, (స్త్రీల యొక్క), అనుచరమ్ = అనుచరునిగా, మా కురు = చేయవద్దు. యత్ = ఎందుకంటే, తాః = ఆ స్త్రీలు, సపత్నానామ్ = నీ శత్రువులయిన కలువలకు, ఆశ్రయాః = నిలకడ తావులు.

**తా ॥** రుద్రా! నీవు మనోభిమానివి. కాబట్టి నా మనస్సును నీ శత్రువయిన కామునికి మిత్రునిగా నన్ను చేయవద్దు. నిరంతరము అచ్యుతచింతనా, అచ్యుతసమర్చనలపై మనస్సు నిలిచేటట్లు చేయి. ఓ భాస్కరా! నీవు చక్షురభిమానివి. విఠలుని శరీర సౌందర్య దర్శనాన్ని మాత్రమే నాకు కలిగించు. కమలాక్షులవైపు నాదృష్టిని పోనీకు. ఎందుకంటే ఆ

కలువకన్నులకాంతలు నీ శత్రువును ఆశ్రయించేవారు.

**వి :** 1. **'చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యోఽజాయత'** – అని పురుషసూక్తమ్. పరాత్పరుని కంటినుండి పుట్టిన వాడు సూర్యుడు. కాబట్టి చక్షురభిమాని.

| | | | |
|---|---|---|---|
| 2. **అసి :** | అస్తి | స్తః | సన్తి |
| | **అసి** | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **కురు :** | 10–77వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |

*

**శ్లో॥ స్వామిన్! విట్ఠల! సజ్జనశ్వశురతః ప్రాప్తాం దిగన్తామ్బరా-**
**ముత్క్రాన్తావపి యోగినీం మననసద్జ్ఞానాదిభిర్భూషితామ్ ।**
**మోక్షాపత్యవతీం విరక్తిరమణీం సంశ్లిష్యతోఽహర్నిశం**
**కాలో గచ్ఛతు నాన్యథా కురు తదా కామో యదాలమ్బతే ॥ 10–80**

**అ :** విరక్తితో కాలం గడవాలని అక్రూరుడు కృష్ణుని ప్రార్థించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్వామిన్! విట్ఠల! సజ్జన–శ్వశురతః ప్రాప్తాం దిక్+అంత+అంబరామ్ ఉత్క్రాంతౌ అపి యోగినీం మనన–సద్జ్ఞాన+ఆదిభిః భూషితాం మోక్ష+అపత్యవతీం విరక్తి–రమణీం సంశ్లిష్యతః అహః+నిశం కాలః గచ్ఛతు అన్యథా న కురు యత్ తదా కామః ఆలంబతే.

**ప్ర :** స్వామిన్! = ప్రభూ!, విట్ఠల! = పాండురంగా! కృష్ణా!, సజ్జన–శ్వశురతః : సజ్జన = మంచివారు అనే, శ్వశురతః = అత్తమామల నుండి, ప్రాప్తామ్ = లభించిందీ, దిగ్+అంత–అంబరామ్ = దిగంతాలే బట్టలుగా గలదీ, ఉత్క్రాంతౌ అపి= మరణంలో కూడా, యోగినీమ్ = కలిసివుండేదీ, మనన–సద్జ్ఞాన+ఆదిభిః : మనన = అదేపనిగా ఆలోచించటం, సద్+జ్ఞాన = మంచి బోధ, ఆదిభిః = మొదలగువాటిచే (మననం చ సద్ జ్ఞానం చ ఆదీ యేషా తైః), భూషితామ్ = అలంకరింపబడిందీ, మోక్ష–అపత్యవతీమ్ = మోక్షమనే సంతానం గలదీ అయిన (మోక్ష ఇతి అపత్యం, తద్వతీ, తామ్), విరక్తి–రమణీమ్ = విరక్తి అనే స్త్రీని (విరక్తిరితి రమణీ తామ్), సంశ్లిష్యతః = కౌగిలించుకొనుటద్వారా, అహర్నిశమ్ = రేబవళ్ళు, కాలః = కాలం, గచ్ఛతు = గడవనీ (గమ్ గతౌ పరస్మైపది–లోట్–ప్ర.ఏ.), అన్యథా = మరొక రీతిగా, న కురు = చేయవద్దు. (కృ కరణే పరస్మైపది–లోట్–మ.ఏ.), యత్ = ఎందుకంటే, తదా = అప్పుడు, కామః = మదనుడు, ఆలంబతే = లోగొంటాడు. (ఆ లమ్బ్ ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** స్వామీ! పాండురంగవిఠలా! సజ్జను లనే అత్తమామలనుండి వచ్చి, దిక్కులు వస్త్రాలుగా వుండి, ప్రాణప్రయాణసమయంలో కూడా కలిసివచ్చే లక్షణం గలిగి, మననం, సద్జ్ఞానం మొదలయిన నగలు ధరించి, మోక్షసంతానాన్ని పొందిన, విరక్తిరమణిని రేబవళ్ళూ కౌగిలించుకొనుటద్వారా నేను కాలాన్ని గడపగలగాలి. మరో రీతిగా జరిపించవద్దు. అలా జరిగితే కాముడు నన్ను లోగొంటాడు.

**వి :** 1. విరక్తిలో రమణీత్వాన్నీ ఆరోపిస్తున్నాడు కవి. అవయవి అయిన విరక్తితో పాటు అవయవాలైన, సజ్జన, మోక్షాలలో శ్వశురత్వ, అపత్యత్వాల నారోపించటంతో ఇది సావయవ రూపకాలంకారం.

2. ముక్తి, విరక్తి పదాలు స్త్రీలింగాలు కావటం సంస్కృతకవులకు ప్రస్తుతాప్రస్తుతాలను సమన్వయం చేస్తూ (సమాసోక్త్యలంకారం) కానీ, కాంతాత్వాన్ని ఆరోపించటం ద్వారా కానీ స్త్రీతో పోల్చటం బాగా అలవాటు. సర్వబంధాలను వదిలించుకోవటాన్నే విరక్తి, ముక్తి అంటూ కూడా వాటిలో మరలా కాంతాత్వాన్ని ఆరోపించటం, ఆ

కౌగిలిలో అహర్నిశలు నిలిచి పోవాలనటం కొంత విలక్షణంగా కనిపిస్తుంది కానీ ఆధ్యాత్మికతత్త్వవేత్తలకు అలా మాటాడటం అదొక అలవాటు, అలవోకగా పైకి వచ్చే పదబంధం.

| | | | |
|---|---|---|---|
| 3. **గచ్ఛతు :** | **గచ్ఛతు**/గచ్ఛతాత్ | గచ్ఛతామ్ | గచ్ఛన్తు |
| | గచ్ఛ/గచ్ఛతాత్ | గచ్ఛతమ్ | గచ్ఛత |
| | గచ్ఛాని | గచ్ఛావ | గచ్ఛామ |
| **కురు :** | 10-77వ శ్లోక వ్యాఖ్య చూడుడు. | | |
| **ఆలంబతే :** | **ఆలంబతే** | ఆలంబేతే | ఆలంబన్తే |
| | ఆలంబసే | ఆలంబేథే | ఆలంబధ్వే |
| | ఆలంబే | ఆలంబావహే | ఆలంబామహే. |

*

**శ్లో॥ యస్మిన్ విట్ఠలనామవర్ణయుగలం సత్పర్ణచూర్ణే పరో**
**వర్ణః పూగఫలం గుణౌఘగణనా కర్పూరఖణ్డం మహత్ ।**
**భిక్షుశ్లాఘ్యమనఙ్గవైరి తదిదం సంసర్పిరాగాపహం**
**జక్షత్సంసృతిరోగమేష్యతి కథం తామ్బూలమాకస్మికమ్ ॥ 10-81**

**అ :** విట్ఠలుని తాంబూలంతో పోల్చి ప్రస్తుతించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యస్మిన్ విట్ఠల-నామ-వర్ణ-యుగలం సత్-పర్ణ-చూర్ణే పరః వర్ణః పూగ-ఫలం గుణ+ఓఘ-గణనా మహత్ కర్పూర-ఖండం భిక్షు-శ్లాఘ్యమ్ అనంగ-వైరి సంసర్పి-రాగ-అపహమ్ ఆకస్మికం తాంబూలం జక్షత్ సంసృతి-రోగం కథమ్ ఏష్యతి?

**ప్ర :** యస్మిన్ = ఏ తాంబూలమందు, విట్ఠల-నామ-వర్ణ-యుగలమ్ : విట్ఠల-నామ = 'విట్ఠల' అనే పేరులోని, వర్ణ-యుగలమ్ = మొదటి రెండు అక్షరాలు (విట్ఠ), సత్పర్ణ-చూర్ణే = మంచి ఆకులూ, సున్నమూ (వి=తమలపాకు, ట్ఠ= అంటే సున్నం), పరః-వర్ణః = తరువాతి అక్షరం (ల), పూగ-ఫలమ్ = వక్క, గుణ... గణనా : గుణ = (విట్ఠలుని) గుణాలయొక్క, ఓఘ = సమూహంయొక్క, గణనా = లెక్కింపు (గుణానామ్ ఓఘః, తస్య గణనా), మహత్ = మేటి అయిన, కర్పూర-ఖండమ్ = కర్పూరపు పలుకు (కర్పూరస్య ఖండమ్), భిక్షు-శ్లాఘ్యమ్ : భిక్షు = భిక్షుకుల (సన్న్యాసుల)చే, శ్లాఘ్యమ్ = పొగడదగినది (భిక్షుభిః శ్లాఘ్యమ్), అనంగ-వైరి : అనంగ = మదనునికి, వైరి = శత్రువైనదీ (అనంగస్య వైరి), సంసర్పి-రాగ+అపహమ్ : సంసర్పి = వ్యాపించే, రాగ = కోరికలను, అపహమ్ = పోగొట్టేదీ, ఆకస్మికమ్ = హఠాత్తుగా వచ్చేదీ అయిన, తద్-ఇదమ్ = ఆ ఈ (విట్ఠలుడనే), తాంబూలమ్ = తాంబూలం (వక్కాకు), జక్షత్ = నములుతూ (జక్ష ధాతువుపై శతృ ప్రత్యయం), సంసృతి-రోగమ్ = సంసారమనే రోగాన్ని (సంసృతిః ఇతి రోగః తమ్), కథమ్ ఏష్యతి? = ఎలా పొందగలడు? (ఇ గతౌ పరస్మైపది-ల్రుట్-ప్ర.ఏ.)

**తా ॥** 'విట్ఠల' అనే తాంబూలంలో వి అక్షరం తమలపాకు. ట్ఠ అనే అక్షరం సున్నం. ల అనే అక్షరం వక్క. విట్ఠలుని గుణగణనమే కర్పూరపు పలుకు. ఆ తాంబూలం సన్న్యాసులు కూడా అభినందించేది. మదనునికి శత్రువు. వ్యాపనశీలమయిన రాగాన్ని పోగొట్టేది. అటువంటి ఆ విట్ఠలాఖ్యతాంబూలాన్ని నములుతూ ఉండేవాడికి సంసారమనే రోగం ఎలా వుంటుంది?

**వి :** 1. విట్ఠలుని తాంబూలంతో పోల్చుతూనే సాధారణ తాంబూల లక్షణాల కన్న విలక్షణత విట్ఠల తాంబూలంలో ప్రదర్శించటం వలన ఇక్కడ వ్యతిరేకాలంకారం కనిపిస్తుంది. సాధారణ తాంబూలానికి భిక్షువులు శ్లాఘించట ముండదు.

వారికది నిషిద్ధం. అలాగే అనంగ శత్రుత్వ-ముండదు. అది కామ ప్రవర్ధకం. అది రాగపరివర్ధకమే కానీ రాగాన్ని పోగొట్టేది కాదు. కానీ విట్ఠల తాంబూలంలో ఆ లక్షణాలున్నాయి. కాబట్టి ఉపమేయం కన్న విశేషం ఉపమానంలో వుంది. అందుకే వ్యతిరేకం. '**వ్యతిరేకో విశేషశ్చేదుపమానోపమేయయోః**' – (కు.57)

2. తాంబూలచర్వణ కొందరికి నిషిద్ధం. వారిలో భిక్షుకులు (యతులు) కూడా వున్నారు.

శ్లో॥ తాంబూలం విధవాస్త్రీణాం యతీనాం బ్రహ్మచారిణామ్ ।
తపస్వినాం చ విప్రేంద్రగోమాంససదృశం ధ్రువమ్ ॥ – బ్రహ్మవైవర్త – బ్రహ్మఖండం

3. భిక్షుకులకు చాలా నిషిద్ధం. వాటిలో తాంబూలం కూడా ఒకటి.

శ్లో॥ గంధమాల్యాద్యలంకారం **తాంబూలం** శుక్లవాససీ ।
దివాస్వాపం చ యానం చ నిశ్యన్నం వర్జయేద్యతిః ॥ – పైఠీనసీశ్రుతిః – (రుక్మిణీశ-విజయ గ్రంథ సూచికల నుండి స్వీకరింపబడింది.)

4. తాంబూలం వల్ల సత్ఫలితాలను – నిషిద్ధం కాని వారి విషయంలో – ఆయుర్వేద గ్రంథాలు వివరించాయి.

శ్లో॥ కర్పూరజాతీకక్కోలలవంగకటుకాహ్వయైః ।
సచూర్ణపూగైః సహితం పత్రం తాంబూలజం శుభమ్ ॥

శ్లో॥ ముఖవైశద్యసౌగంధ్యకాంతిసౌష్టవకారకమ్ ।
హనుదంతస్వరమలజిహ్వేంద్రియ విశోధనమ్ ॥ – సుశ్రుతసంహిత-24/21,22

| | | | |
|---|---|---|---|
| 5. **ఏష్యతి :** | **ఏష్యతి** | ఏష్యతః | ఏష్యన్తి |
| | ఏష్యసి | ఏష్యథః | ఏష్యథ |
| | ఏష్యామి | ఏష్యావః | ఏష్యామః. |

*

**శ్లో॥ స్వాన్తం తదేవ యత్తేఽఙ్ఘ్రికమలే చఞ్చరీకతి ।**
**స్వాన్తకారీతరన్మన్యే భ్రమద్భుజగసన్నిభమ్ ॥ 10-82**

**అ :** కృష్ణపదపద్మసేవనఫలాన్ని వర్ణించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** (కృష్ణ!) యత్ తే అంఘ్రి-కమలే చంచరీకతి తద్ ఏవ స్వాంతమ్. ఇతరత్ భ్రమద్-భుజగ-సన్నిభం (సత్) స్వ+అంత-కారి (ఇతి) మన్యే.

**ప్ర :** కృష్ణ = కృష్ణా!, యత్ = ఏదైతే, తే = నీయొక్క, అంఘ్రి-కమలే = పాదపద్మంపై (అంఘ్రిం: ఏవ కమలం, తస్మిన్), చంచరీకతి = తుమ్మెదలా ప్రవర్తిస్తుందో (చంచరీకవత్ ఆచరతి), తద్+ఏవ = అదియే, స్వాంతమ్ = హృదయం. ఇతరత్ = వేరైనది (నీ పదపద్మభృంగం కానిది), భ్రమద్-భుజగ-సన్నిభమ్-సత్ : భ్రమద్ = కదులుతున్న, భుజగ = పాముతో, సన్నిభం సత్ = సమానమైనది (భ్రమతా భుజగేన సన్నిభమ్), స్వ+అంత-కారి = తననే అంతం చేసేది (స్వస్య అంతం కరోతీతి), (ఇతి = అని), మన్యే = అనుకొంటున్నాను. (మన్ జ్ఞానే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నీ పాదపద్మాలపై తుమ్మెదలా తిరిగే మనస్సే మనస్సు. అలా నీ పదపద్మాలపై తిరుగాడని మనస్సు కదిలే పాముతో సమానమై ఆ మనస్సు గలవానినే నాశనం చేస్తుంది.

**వి :** 1. **చంచరీకతి :** చంచరీకవత్ ఆచరతి – ఆచారార్థంలో క్విప్ ప్రత్యయం. **నామధాతువు**గా రూపొందుతుంది. చంచరీక ధాతువు – పరస్మైపది.

| | | |
|---|---|---|
| **చంచరీకతి** | చంచరీకతః | చంచరీకన్తి |
| చంచరీకసి | చంచరీకథః | చంచరీకథ |
| చంచరీకామి | చంచరీకావః | చంచరీకామః |

| | | | |
|---|---|---|---|
| 2. **మన్యే :** | **మన్యే** | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | మన్యే | మన్యావహే | మన్యామహే. |

*

**శ్లో॥ ఇతి బ్రువన్తమక్రూరమాశ్వాస్య మధురోక్తిభిః ।**
**విససర్జ ప్రభోరాజ్ఞాం విధిత్సుః సోఽప్యగాద్గృహాన్ ॥ 10-83**

**అ :** కృష్ణుడు అక్రూరుని అనునయించి వీడ్కొనుట. -పథ్యావక్త్రమ్.

**అ :** ఇతి బ్రువంతం మధుర+ఉక్తిభిః ఆశ్వాస్య (కృష్ణః) విససర్జ. సః అపి ప్రభోః ఆజ్ఞాం విధిత్సుః గృహాన్ అగాత్.

**ప్ర :** ఇతి=ఈ విధంగా, బ్రువంతమ్=పలుకుతున్న, అక్రూరమ్ = అక్రూరుని, మధుర+ఉక్తిభిః = తీయని మాటలతో (మధురాః చ తాః ఉక్తయః, తాభిః), ఆశ్వాస్య = ఊరడించి, (కృష్ణః = ముకుందుడు), విససర్జ = విడిచిపెట్టాడు. (వి సృజ-సర్గే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), సః+అపి = ఆ అక్రూరుడు కూడా, ప్రభోః = స్వామి అయిన కృష్ణుని యొక్క, ఆజ్ఞామ్ = ఆదేశాన్ని, విధిత్సుః సన్ = పాటింపగోరినవాడై (విధాతుమ్ ఇచ్ఛుః), గృహాన్ = ఇంటికి (గృహ్ణంతి ప్రవిష్టాన్ ఇతి గృహాః తాన్ - 'గృహాః పుంసి చ భూమ్న్యేవ' - అమరకోశః - పుర-5) (గృహశబ్దాన్ని పుంలింగమయితే బహువచనంలోనే వాడాలి), అగాత్ = వెళ్ళాడు. (ఇ-గతౌ పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అక్రూరుడు తననుద్దేశించి ప్రస్తుతించటాన్ని విని కృష్ణుడు మంచిమాటలతో అక్రూరుని అనునయించి వీడ్కొలిపాడు. అక్రూరుడు కూడా కృష్ణుని మాటను పాటించాలని తన ఇంటికి వెళ్ళిపోయాడు.

**వి : 1.** ఈ సందర్భంలో అక్రూర-కృష్ణ సంభాషణ సమయోచితంగా వుంటుంది భాగవతం లో కూడా.

అక్రూరుడు :క. నా యింటికి విచ్చేయుము
నీ యంఘ్రి సరోజరేణునికరము సోఁకన్
నాయిల్లు పవిత్రంబగు
శ్రీయుత! నీ భటునిఁ బెద్ద సేయం దగదే?

కృష్ణుడు : క. యదుకుల విద్వేషణుఁడై
మదమున వర్తించు కంసు మర్దించి భవత్
సదనంబు సూడ వచ్చెదఁ
బొద యీ స్యందనముఁ గొనుచుఁ బురమున కనఘా! -పోతనభాగవతము 10/1239,1241

ఆతిథేయుడు, అతిథి సాధారణంగా మాటాడుకున్న రీతిలోనే ఆ సంభాషణ సాగింది. సహజంగా తెలుగు పలుకుబడిలో ఆత్మార్థకంగా బహువచనం వాడటం కద్దు. 'మా ఇంటికి' అంటూ, ఇక్కడ పోతన 'నా ఇంటికి' అనటం ఆపాటి బహువచన ప్రయోగాన్ని కూడా సహించలేని అక్రూరుని వినయప్రపత్తి కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **విససర్జ :** | **విససర్జ** | విసస్పృజతుః | విసస్పృజుః |
| | విససర్జిథ/విసస్రష్ఠ | విసస్పృజథుః | విసస్పృజ |
| | విససర్జ | విసస్పృజివ | విసస్పృజిమ |

| | | | |
|---|---|---|---|
| **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు దశమః సర్గో ముదాం సత్కృతః॥ 10-84**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా॥** సురమండలీషు సత్కృతః ముదాం దశమః సర్గః - దేవతలచే సత్కరింపబడిన పదవ ఆనందసృష్టి - మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలకశ్రీమద్వాజిరాజతీర్థశ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో దశమః సర్గః.

**శ్రీః**





# శ్రీః
# ఏకాదశః సర్గః

**శ్లో॥ ప్రవిశ్య వ్రజతస్తస్య హృదయాఖ్యపురీం హరిః ।
ఇనోదయే నిర్వివిశే మధురాం మథురాపురీమ్ ॥** **11-1**

**అవతారిక :** కృష్ణుని మథురాపురప్రవేశం. -పథ్యావక్త్రమ్.

**అన్వయక్రమం :** వ్రజతః తస్య హృదయ+ఆఖ్య-పురీం ప్రవిశ్య హరిః ఇన+ఉదయే మధురాం మథురాపురీం నిర్వివిశే.

**ప్రతిపదార్థం :** వ్రజతః = (ఇంటికి) వెళ్తున్న, తస్య = ఆ అక్రూరునియొక్క, హృదయ+ఆఖ్య-పురీమ్ : హృదయ+ఆఖ్య = హృదయమనే పేరుగల, పురీమ్ = నగరిలోనికి (హృదయమ్ ఇతి ఆఖ్యా యస్యాః సా, సా చ అసౌ పురీ, తామ్), ప్రవిశ్య = ప్రవేశించి (ప్ర-విశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), హరిః = కృష్ణుడు (హరతి మనాంసి ఇతి హరిః), ఇన+ఇదయే = సూర్యోదయవేళలో (ఇనస్య ఉదయః, తస్మిన్) (ఇనః సూర్యే ప్రభౌ పుంసి – నానార్థమంజరీ-పంక్తి-964), మధురామ్ = అందమైన, మథురా-పురీమ్ = మథురానగరిని (మథురా ఇతి పురీ తామ్), నిర్వివిశే = ప్రవేశించాడు. (ని-విశ ప్రవేశనే ఆత్మనేపది-లిట్-(ప్ర.ఏ.) (విశ ధాతువు వస్తుతః పరస్మైపది. అయితే **నేర్విశః** (అష్టాధ్యాయి-1-3-17) సూత్రం మేర నిపూర్వకమయితే విశ ధాతువు ఆత్మనేపది అవుతుంది. ని, నిర్-ఈ రెండింటినీ సమానంగా భావించి చేసిన ప్రయోగమిది.)

**తాత్పర్యం :** తన మాటమేరకు ఇంటికి బయలుదేరిన అక్రూరుని హృదయనగరిలో (ముందు) ప్రవేశించి కృష్ణుడు ఆ తరువాత సూర్యోదయకాలంలో మధురమయిన మథురానగరిలో ప్రవేశించాడు.

**విశేషాలు :** 1. కృష్ణుడు ప్రవేశించిన మథురను పోతన వర్ణించిన తీరు-

మ. పరిఖల్ గోటలు ఁగొమ్మలుం బడగలుం బ్రాసాదముల్ వీథులున్
హరులుం దేరులు వీరులున్ గజములున్ హర్మ్యంబులున్ వాద్యముల్
తరుణుల్ ధాన్యములున్ ధనంబులు మహోద్యానంబులున్ దీర్ఘికల్
గరమాశ్చర్యరుచిం దనర్చు మథురన్ గాంచెన్ విభుండంతటన్. -పోతనభాగవతము 10/1243

| | | | |
|---|---|---|---|
| 2. **నిర్వివిశే :** | **నిర్వివిశే** | నిర్వివిశాతే | నిర్వివిశిరే |
| | నిర్వివిశిషే | నిర్వివిశాథే | నిర్వివిశిధ్వే |
| | నిర్వివిశే | నిర్వివిశివహే | నిర్వివిశిమహే. |

*

శ్లో॥ ద్వారి ద్వారి స్వభక్తాహృతవివిధబలిర్వాయునోద్యానవాపీ-
ప్రోత్ఫుల్లామ్భోజకున్దప్రకరసురభిణా సేవ్యమానోఽధివర్త్మ ।
సిక్తాం సన్మార్గనాడీమవిశదురుగుణః పుష్పపీయూషవృష్ట్యా
పాపవ్రాతం దిధక్షుః ప్రథితనిజపురో బ్రహ్మనాడీమివేశః ॥ 11-2

అ : కృష్ణుని మథురాపురప్రవేశం. -శార్దూలవిక్రీడితమ్.

అ : ద్వారి ద్వారి స్వ-భక్త-ఆహృత-వివిధ-బలిః ఉద్యాన-వాపీ-ప్రోత్ఫుల్ల+అమ్భోజ-కుంద-ప్రకర-సురభిణా వాయునా అధివర్త్మ సేవ్యమానః ఉరుగుణః ఈశః పుష్ప-పీయూష-వృష్ట్యా సిక్తాం సత్+మార్గ-నాడీమ్ ప్రథిత-నిజ-పురః బ్రహ్మ-నాడీమ్ ఇవ పాప-వ్రాతం దిధక్షుః అవిశత్.

ప్ర : ద్వారి ద్వారి = ప్రతి ద్వారం, స్వభక్తా... బలిః : స్వ = తనయొక్క, భక్త = సేవకులచే, ఆహృత = కొనిరాబడిన, వివిధ = అనేక విధాలయిన, బలిః = సమర్పణలు (పూజాదికాలు) గలవాడై (స్వస్య భక్తైః ఆహృతాః వివిధాః బలయః యస్య సః), ఉద్యాన... సురభిణా : ఉద్యాన = తోటలోని, వాపీ = దిగుడుబావిలోని, ప్రోత్ఫుల్ల = బాగా వికసించిన, అంభోజ = తామరలయొక్క, కుంద = మొల్లలయొక్క, ప్రకర = సమూహంయొక్క, సురభిణా = సువాసనగల (ఉద్యానే వాప్యః, తాసు ప్రోత్ఫుల్లాని అంభోజాని, కుందాని చ, తేషాం ప్రకరః తేన సురభిః, తేన), వాయునా = గాలిచేత, అధివర్త్మ = అన్ని బాటలలో, సేవ్యమానః = సేవింపబడుతున్న, ఉరు-గుణ = మేటి గుణాలు గల, ఈశః = కృష్ణుడు, పుష్ప-పీయూష-వృష్ట్యా : పుష్ప = పూలయొక్క, పీయూష = మకరందమనే అమృతంయొక్క (మకరందంలో మకరందత్వాన్ని అధ్యవసానం చేసి పీయూషత్వాన్ని ఆరోపించటం-ఇది రూపకాతిశయోక్తి), వృష్ట్యా = వానతో (పుష్పాణం పీయూషం, తస్య వృష్టిః, తయా), సిక్తామ్ = తడుపబడినదైన, సత్+మార్గ-నాడీమ్ : సత్ = సజ్జనులయొక్క/చక్కని, మార్గ = బాట అనే, నాడీమ్ = నాడిలోనికి (సన్ చ అసౌ మార్గః, స ఏవ నాడీ, తామ్), ప్రథిత-నిజ-పురః : ప్రథిత = ప్రసిద్ధమైన, నిజ = తనవారి యొక్క, పురః = హృదయమనే పురంయొక్క (ప్రథితా నిజస్య పూః యస్యాః తస్యాః), బ్రహ్మనాడీమ్-ఇవ = సుషుమ్నానాడిలోనికి వలె, పాప-వ్రాతమ్ = పాప సమూహాన్ని (పాపానాం వ్రాతః, తమ్), దిధక్షుః (సన్) = దహింపజేయ గోరినవాడై (దగ్ధుమ్ ఇచ్ఛుః), అవిశత్ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

తా ॥ కృష్ణుడు ప్రతి ఇంటి ముంగిట తన భక్తులు సమర్పించిన బలులను స్వీకరించాడు. తోటలలోని దిగుడుబావులలోని తామరలు, మొల్ల పూలయొక్క వాసనలు గాలితో కలిసి ప్రసరిస్తున్నాయి. ఆ గాలి దారిపొడుగునా కృష్ణుని సేవిస్తోంది. కృష్ణుడు నడుస్తున్న దారిలోని ఇళ్ళముందు పూలమకరందంతో/పన్నీటితో కల్లాపి చల్లి వున్నారు. మేటిగుణాలు గల కృష్ణుడు ఆ బాటవెంట మథురాపురిలో ప్రవేశించాడు. అది శరీరమనే నగరిలోని బ్రహ్మనాడిలోనికి ఈశ్వరుడు ప్రవేశించినట్లుంది. ఫలితం పాపదహనం.

వి : 1. కృష్ణునికి పరమేశ్వరునితో (పరాత్పరునితో) పోలిక. మథురానగరి బాటలకు సుషుమ్నానాడితో పోలిక. ఇది ఉపమాలంకారం.

2. కృష్ణుడు మథురలో ప్రవేశిస్తున్న సమయంలో పౌరులలోని స్పందనను, దిదృక్షను భాగవతం వర్ణించింది. ముందుగా మథురానగరవర్ణన (10/41/20-23) చేసి ఆపై పౌరులలోని దిదృక్షను (10/41/24-30) విపులంగా నిరూపించింది. పోతన తనదైన శైలిలో దానిని ఆంధ్రీకరించాడు-

ఉ. నందతపఃఫలంబు, సుగుణంబులపుంజము, గోపకామినీ
బృందమునోముపంట, సిరివిందు; దయాంబుధి; యోగిబృందముల్

దెందములందుఁ గోరెదు కడింది నిధానము సేరవచ్చె నో
సుందరులార! రండు చని చూతము కన్నుల కోర్కి దీఱఁగన్.

అని మఱియు, గోవిందసందర్శనకుతూహలంబులఁ బౌరసుందరులు పరస్పరాహూయ మానలై, భుంజానలై భోజనభాజనంబులు దలంగఁ ద్రోచియు, శయానలై లేచియు, నభ్యజ్యమానలై జలంబులాడకయు, గురుజనశిక్ష్యమాణలై యోడకయు, గృహకార్య–ప్రవర్తమానలై పరిభ్రమింపకయు, రమణరమమాణలై రమింపకయు. శిశుజనభిభ్రాణలై డించియు, నలంకుర్వాణలై యన్యోన్య వస్త్రాభరణ మాల్యానులేపనంబులు వీడ్వడ ధరించియు"

– పోతనభాగవతము 10/1245,1246

| | | | |
|---|---|---|---|
| 3. **అవిశత్ :** | **అవిశత్** | అవిశతామ్ | అవిశన్ |
| | అవిశః | అవిశతమ్ | అవిశత |
| | అవిశమ్ | అవిశావ | అవిశామ. |

*

**శ్లో॥ రజకం రజసా గ్రస్తం దర్శయన్నివ సోఽధ్వని ।**
**వసనం పీతవసనః సమయాచత సర్వవిత్ ॥ 11-3**

**అ :** మథురానగరిలో పురవీథిలో కృష్ణుడు రజకుని బట్టలివ్వమని అడగటం. –పథ్యావక్త్రమ్.

**అ :** రజకం రజసా గ్రస్తం దర్శయన్+ఇవ సర్వవిత్ సః పీతవసనః అధ్వని వసనం సమయాచత.

**ప్ర :** రజకమ్ = చాకలిని, రజసా = రజోగుణంచే, గ్రస్తమ్ = మ్రింగబడినవానినిగా (గ్రస్ ధాతువుపై క్త ప్రత్యయం), దర్శయన్+ఇవ = చూపింపదలచినట్లుగా, సర్వ–విత్ = సర్వజ్ఞుడైన (సర్వం వేత్తి, ఇతి), సః–పీతవసనః = ఆ పీతాంబరుడు (కృష్ణుడు) (పీతం వసనం యస్య సః) (పీతాంబరోఽచ్యుతః శార్ఙ్గీ... అమరకోశః –స్వర్గ–16), అధ్వని = దారిలో, వసనమ్ = వస్త్రాన్ని, సమ్–అయాచత = అడిగాడు. (సమ్–యాచ్–యాంచాయామ్–ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** (పురప్రవేశం చేయగానే దారిలో నడుస్తూ) కృష్ణుడు అక్కడ కనిపించిన రజకుని తనకు బట్టలిమ్మని అడిగాడు. అది రజకునిలో రజోగుణాన్ని ప్రదర్శింపజేయటం కోసమో అన్నట్లుంది.

**వి :** 1. ఈ శ్లోకంలో **పీతవసనః** అన్నది సాభిప్రాయ విశేష్యం. సాభిప్రాయవిశేష్యప్రయోగం పరికరాంకురాలంకారం. అది **దర్శయన్నివ** అన్న ఉత్ప్రేక్షాలంకారానికి పరిపోషకం. కృష్ణుడు పీతాంబరుడు. కాబట్టి రజకుని బట్టలు అడగటంలో తనకు అవి లేక కాదు. ఆ రజకుని లోని రాజసగుణాన్ని చూపించటం కోసమే అన్నభావం బలపడుతుంది. '**సాభిప్రాయవిశేష్యేతు భవేత్పరికరాంకురః**' – (కు.63)

2. కృష్ణుడు రజకుని బట్టలడిగిన తీరు–

ఉ. విందలమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము; మాకు మా
మందలలోనఁ గట్టికొన మంచిపటంబులు లేవు నీ ముడిన్
సుందరధౌతచేలములు శోభిలు చున్నవి; తెమ్ము; నిన్ను మే
లందెదు; నిమ్ము; రాజుదెస నల్లుర;మో రజకాన్వయాగ్రణీ. –పోతనభాగవతము–10/1254

3. కృష్ణుడు తనకు వస్త్రాల నిమ్మని అడగటంతో పాటు వస్త్రదానఫలాన్ని కూడా రజకునకు తెలిపినట్లు భాగవతమూలంలో కనిపిస్తుంది.

శ్లో॥ దేహ్యావయోః సముచితాన్యంగ వాసాంసి చార్హతోః ।
భవిష్యతి పరం శ్రేయః దాతుస్తే నాత్ర సంశయః ॥ – భాగవతమ్ 10/41/33

| | | | |
|---|---|---|---|
| 4. **సమయాచత :** | **సమయాచత** | సమయాచేతామ్ | సమయాచన్త |
| | సమయాచథాః | సమయాచేథామ్ | సమయాచధ్వమ్ |
| | సమయాచే | సమయాచిచావహి | సమయాచిచామహి. |

*

**శ్లో॥ తతస్తస్య దురాలాపం నిశమ్య సుదురాత్మనః ।**
**శిరో జహార కిం కాయం కరోత్వకృతకిల్బిషమ్ ॥ 11-4**

**అ :** కృష్ణుడు రజకుని సంహరించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** తతః సుదురాత్మనః తస్య దురాలాపం నిశమ్య శిరః జహార. అకృత-కిల్బిషం కాయం కిం కరోతు?

**ప్ర :** తతః = ఆ తరువాత, సు-దురాత్మనః = బాగా చెడ్డవాడయిన, తస్య = ఆ రజకునియొక్క, దురాలాపమ్ = చెడ్డమాటలను, నిశమ్య = విని, శిరః = తలను, జహార = అపహరించాడు. (హృ హరణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), అకృత-కిల్బిషమ్ : అకృత = చేయబడని, కిల్బిషమ్ = పాపం గల, కాయమ్ = శరీరాన్ని, కిం కరోతు = ఏం చేయగలదు? (కృ కరణే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ (రజకుని బట్టలిమ్మని అడిగిన) తరువాత కృష్ణుడు దుర్మార్గుడైన ఆ రజకుని దురాలాపాలను విని అతని తలనరికాడు. ఏ పాపమూ చేయని శరీరాన్ని ఏమీ చేయలేదు గదా! (చెడు మాటలు మాటాడిన నోరు శిరోభాగాలలో ఒకటి కాబట్టి శిరస్సును ఖండించాడు. మిగిలిన శరీరంతో తల వేరయింది. శరీరం తప్పుచేయలేదు కాబట్టి దాన్నేమీ చేయలేదు. ఇది మాటలోని చమత్కారమే. గుంపులో నుండి సగభాగాన్ని అటుతీసినా, ఇటుతీసినా ఫలితమొక్కటే గదా!)

**వి :** 1. రజకుడు బలరామకృష్ణులను నిందించినందువల్ల కృష్ణుడు అతనిని సంహరించాడు. ఏమని తిట్టాడు?

శ్లో॥ ఈదృశాన్యేవ వాసాంసి నిత్యం గిరివనేచరాః ।
పరిధత్త కిముద్వృత్తా రాజద్రవ్యాణ్యభీప్సథ ॥

శ్లో॥ యాతాశు బాలిశామైవం ప్రార్థ్యం యది జిజీవిషా ।
బధ్నంతి ఘ్నంతి లుంపంతి దృప్తం రాజకులాని వై ॥ -భాగవతమ్ 10/41/35,36

కొండ జాతులవారు, ఆటవికులు నిత్యం ఇటువంటి బట్టలే కడ్తున్నారా? రాజుల సొమ్ము కోరుతున్నారా? మూర్ఖులారా! వెళ్ళండి. బ్రతుకుమీద ఆశవుంటే ఇటువంటివి కోరకండి. రాజులు పొగరుబోతులను బంధిస్తారు. చంపుతారు. కనిపించకుండా చేస్తారు. ఇవీ రజకుని మాటలు. గిరిచరులు, వనచరులు అంటూ వారిని తక్కువ చేయటం. ఇది వ్యాసభాగవతరచనా కాలం నాటిమాట.

పోతనకాలానికి వచ్చేసరికి అది తెలుగు సంస్కృతికి దగ్గరగా వచ్చి కులనిందగా మారింది-

శా॥ ఎట్టెట్టా మనుజేంద్రుచేలములు మీ కీc బాడియే? మీరలుం
గట్టం బోలుదురే పయోఘృతదధిగ్రాసంబులన్ మత్తులై
యిట్టాడం జనెcగాక గొల్లలకు మీ కెబ్బంగి నోరాడెడిన్?
గట్టా! ప్రాణముc గోలుపోయెదు సుమీ కంసోద్ధతిం బాలకా! -పోతనభాగవతము-10/1256,1257

వనచర గిరిచరులనూ, గొల్లలను (కులదృష్టితో) రజకుడు నిందించటం అప్పుడైనా, ఇప్పుడైనా తగని విషయమే. నేరమే. అయితే చంపివేయవలసినంత నేరం ఆ రజకుడు చేశాడా? అలా అని అంగీకరిస్తే ఈనాటికీ అవే మాటలు బహిరంగంగా మాటాడుతున్న వారిని ఏమీ చేయలేక పోతున్నాం గదా! గతంలో తనను నిందించిన శిశుపాలుని కూడా సంహరించాడు కృష్ణుడు. అయితే అక్కడ దానికి తగిన నేపథ్యముంది. ఇక్కడ అటువంటిదేదీ

ఉన్నట్లు చెప్పలేదు. కానీ ఈ చర్య జరిగింది. ఒక్కసారి తమరాకతో పురజనులను భయభ్రాంతులకు గురిచేయటం వ్యూహమా? రాజకీయవ్యూహాలకు నిస్సహాయులు బలి–కావలసినదేనా?

ఆయనలోని రజోగుణాన్ని ప్రదర్శించటం కోసం అడగటం కాదంటే చంపటం సాధారణ దృష్టికి సబబు అనిపించదు. రజోగుణవంతుల నందరినీ చంపివేస్తున్నామా? ఆలోచించ వలసివుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః | |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర | |
| | జహార/జహర | జహ్రివ | జహ్రిమ. | * |

**శ్లో॥ పథి పథి నవసౌధాన్తస్థముగ్ధాఙ్గనాభిః**
**కుసుమనికరలాజైః కీర్యమాణోఽపి కృష్ణః ।**
**అవిదితగుణకర్మోపేత్య వవ్రే త్రివక్రాం**
**చతురపురుషకాంక్షా వక్రయోషిత్సు నూనమ్ ॥** **11-5**

**అ :** కృష్ణుడు ముగ్ధస్త్రీల స్వాగతాన్ని స్వీకరిస్తూ త్రివక్ర–కుబ్జ–ను చేరుట. –మాలిని.

**అ :** పథి పథి నవ–సౌధ–అంత–స్థ–ముగ్ధ+అంగనాభిః కుసుమ–నికర–లాజైః కీర్యమాణః అవిదితగుణ–కర్మా కృష్ణః త్రి–వక్రామ్ ఉపేత్య వవ్రే. చతుర–పురుష–కాంక్షా వక్ర–యోషిత్సు నూనమ్.

**ప్ర :** పథి పథి = ప్రతిబాటలోనూ, నవ–సౌధ+అంత–స్థ–ముగ్ధ+అంగనాభిః : నవ = నూతనమైన, సౌధ = మేడలయొక్క, అంత–స్థ = లోనున్న, ముగ్ధ = అమాయికలయిన, అంగనాభిః = అతివలచే (నవాని చ తాని సౌధాని తేషామ్ అంతః తిష్ఠంతీతి తాశ్చ తాః ముగ్ధాశ్చ తాః అంగనాః తాభిః), కుసుమ–నికర–లాజైః : కుసుమ = పూలయొక్క, నికర = సమూహాలచే, లాజైః = పేలాలచే (కుసుమానాం నికరైః లాజైః చ), కీర్యమాణః+అపి = చల్లబడుతున్నా, అవిదిత–గుణ–కర్మా : అవిదిత = తెలియని, గుణ = గుణాలూ, కర్మా = కర్మలూ గల (అవిదితాః గుణాః కర్మాణి చ యస్య సః), కృష్ణః = కృష్ణుడు, త్రివక్రామ్ = మూడు వంకరలు గల దానిని (త్రిషు వక్రా, తామ్), ఉపేత్య = సమీపించి, వవ్రే = కోరాడు. (వరించాడు) (వృ వరణే ఆత్మనేపది లిట్–(ప్ర.ఏ.), చతుర...కాంక్షా : చతుర = తెలివిగల, పురుష = మగవారియొక్క, కాంక్షా = కోరిక (చతురాణాం పురుషాణాం కాంక్షా), వక్ర–యోషిత్సు = కుటిలస్త్రీల మీదనే. (వక్రాశ్చ తాః యోషితః, తాసు), నూనమ్ = నిశ్చితం.

**తా ॥** కృష్ణుడు నడుస్తున్న దారి పొడువునా మేడల పైనున్న ముద్దరాళ్ళు పూలనూ, పేలాలనూ ఆయనపై చల్లుతూనే వున్నారు. అయితే గుణాలనూ, కర్మలనూ గుర్తించలేని కృష్ణుడు (తన గుణకర్మల ఆంతర్యంకూడా తెలియనీయని కృష్ణుడు) త్రివక్రను (త్రికాలాలలోనూ, శరీరం లోని మూడు భాగాల – నడుము, కటి, మోకాళ్ళు – లోనూ) సమీపించి ఆమెను వరించాడు. తెలివిగల మగవారు వక్రతగల స్త్రీలనే కోరుతుంటారనేది నిశ్చయం.

**వి :** 1. కృష్ణుడు అవిదితగుణకర్ముడు. గుణకర్మలు తెలియనివాడు. ఇది నిందలా కనిపిస్తుంది. కానీ ఆయన చేస్తున్న పనుల గుణకర్మలు తెలియనీయని వాడు అన్నది అక్కడ ఆంతర్యం. అది స్తుతి. గుణకర్మలు తెలియనివాడు కాబట్టే అందమైన ఆడవారు స్వాగతిస్తున్నా త్రివక్ర దగ్గర చేరాడు. నిందలా కనిపిస్తున్నా స్తుతి కాబట్టి ఇది వ్యాజస్తుతి అలంకారం. '**ఉక్తిర్వ్యాజస్తుతిర్నిందాస్తుతిభ్యాం స్తుతినిందయోః**' – (కు.70)

శ్లోకంలో తొలిమూడు పాదాలలోని విశేషవిషయాన్ని త్రివక్రావరణరూపాన్ని, నాలుగవ పాదంతో సమర్థించినందువలన (సమర్థన అవసరం లేకపోయినా) ఇది అర్థాంతర–న్యాసాలంకారం. మరి ముగ్ధాంగనలు స్వాగతిస్తున్నా త్రివక్ర (కుబ్జ) ను వరించటమేమిటన్న దానికి సమర్థన అవసరం గదా అంటే 'అవిదితగుణకర్మా' అన్న కృష్ణవిశేషణం ఆ పనిని పూర్తిచేస్తుంది. అక్కడ కావ్యలింగాలంకారం.

**– ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః ॥**

**– సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్** ॥ (కు. 122-121)

2. పేలాలు చల్లుతూ స్వాగతించటం ప్రాచీనసంప్రదాయాలలో ఒకటి. కాళిదాసు **రఘువంశం**లో కూడా దీనిని ప్రస్తావించాడు-

శ్లో॥ **అవాకిరన్ వయోవృద్ధాస్తం లాజైః** పౌరయోషితః ।
పృషతైర్మందరోద్ధూతైః క్షీరోర్మయ ఇవా చ్యుతమ్ ॥ – చతుర్థసర్గ-27

| | | | |
|---|---|---|---|
| 3. **వవ్రే :** | **వవ్రే** | వవ్రాతే | వవ్రిరే |
| | వవృషే | వవ్రాథే | వవృఢ్వే |
| | వవ్రే | వవృవహే | వవృమహే. * |

**శ్లో॥ముష్టిప్రమాణతనుమధ్యవతీం స్వకర్ణ-విశ్రాన్తనిర్మలగుణాం రుచిరాం త్రివక్రామ్ ।**
**విష్వక్ప్రయుక్తనయనాన్తశరాం నిరీక్ష్య - కోదణ్డముద్ధవకథావిషయం స మేనే ॥6**

**అ :** త్రివక్రను ఉద్ధరించాలని కృష్ణుడు భావించటం. -వసంతతిలక.

**అ :** సః ముష్టి-ప్రమాణ-తను-మధ్యవతీం స్వ-కర్ణ-విశ్రాంత-నిర్మల-గుణాం రుచిరాం త్రివక్రామ్ విష్వక్-ప్రయుక్త-నయన+అంత-శరాం నిరీక్ష్య ఉద్ధవ-కథావిషయం కోదండం మేనే.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, ముష్టి... మధ్యవతీమ్ : ముష్టి = పిడికిలి, ప్రమాణ = కొలతగల, తను = సూక్ష్మమైన, మధ్యవతీమ్ = నడుముగలదీ (ముష్టిః ప్రమాణం యస్య సః, తనుశ్చ అసౌ మధ్యః ముష్టి-ప్రమాణశ్చ అసౌ తనుమధ్యః, తద్వతీమ్), స్వ... గుణామ్ : స్వ = తనయొక్క, కర్ణ = చెవులలో, విశ్రాంత = విశ్రమించిన/నిలిచియున్న, నిర్మల-గుణామ్ = మంచి గుణాలు గలదీ (స్వస్య కర్ణయోః విశ్రాంతాః నిర్మలాశ్చ తే గుణాః యస్యాః, తామ్), రుచిరామ్ = అందమైనదీ, విష్వక్... శరామ్ : విష్వక్ = అంతటా, ప్రయుక్త = ప్రయోగింపబడిన, నయన+అంత = కడగంటి చూపు లనే, శరామ్ = బాణాలు గలదీ అయిన (విష్వక్ ప్రయుక్తాః నయనయోః అంతాః ఏవ శరాః యస్యాస్తామ్), త్రివక్రామ్ = త్రివక్రను (కుబ్జను), నిరీక్ష్య = చూసి (నిర్-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉద్ధవ-కథా-విషయమ్ : ఉద్ధవ = పండుగలో (ఉద్ధవస్తు స్యాన్మహే కృష్ణమంత్రిణి - నానార్థరత్నమాలా-పంక్తి-2049), కథా = చెప్పుకొనదగిన, విషయమ్ = విషయం గల, కోదండమ్ = వింటినిగా, మేనే = అనుకొన్నాడు.

త్రివక్రకు వేసిన విశేషణాలు కోదండానికి కూడా అన్వయిస్తాయి. ముష్టిప్రమాణ తనుమధ్య అంటే వింటి నడుమభాగం. పిడికిలితో పట్టుకొనే భాగం. స్వకర్ణవిశ్రాంత నిర్మలగుణ – తన చెవిదాకాలాగబడిన అల్లెత్రాడు గలదని అర్థం. ఉద్ధవ కథావిషయమంటే ఉద్ధవుని ప్రస్తావనగల దని అర్థం. త్రివక్ర అంటే మూడు వంకరలు గల విల్లు.

**తా ॥** కృష్ణుడు త్రివక్ర అయిన కుబ్జను చూసి కోదండంగా (విల్లుగా) భావించాడు. ఆమె వింటిలాగా పిడికిలితో పట్టుకొనగల సన్నని నడుము గలది. తన (కృష్ణుని) చెవులవరకు వ్యాపించిన నిర్మల గుణాలు గలది. విల్లయితే గట్టి గుణం (అల్లెత్రాడు) గలది. అందమైనది. అంతటా ప్రయోగించిన కనుచూపులు అనే బాణాలు గలది. పండువులో ప్రస్తావింపదగిన విషయం గలది విల్లు. ఉద్ధవుని కథా ప్రసక్తిలో వినిపించిన దామె.

**వి :** 1. ఇక్కడ త్రివక్రకూ, వింటికీ పోలిక ధ్వనిస్తుంది. కాబట్టి ఇది ఉపమాలంకారధ్వని, మధ్య-గుణ-ఉద్ధవపదాలు యథాతథంగానే రెండర్థాలను ఇస్తున్నాయి కాబట్టి అభంగశ్లేషాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **మేనే :** | **మేనే** | మేనాతే | మేనిరే |
| | మేనిషే | మేనాథే | మేనిధ్వే |
| | మేనే | మేనివహే | మేనిమహే. |

*

**శ్లో॥మధురవచనమాత్రేణాఙ్గరాగం దదౌ యా - పులకితరుచిరాఙ్గీ చఞ్చలాపాఙ్గ భృఙ్గీ।**
**అనుచితమభిధానం త్యాజయన్ వాసుదేవః - ఖలకులవనదావస్తాం తతానర్జుగాత్రీమ్॥7**

**అ :** కృష్ణుడు కుబ్జను (త్రివక్రను) ఋజుగాత్రిని చేయటం. -మాలిని.

**అ :** మధుర-వచన-మాత్రేణ పులకిత-రుచిర-అంగీ చంచల+అపాంగ-భృంగీ యా అంగరాగం దదౌ ఖల-కుల-వన-దావః వాసుదేవః అనుచితమ్ అభిధానం త్యాజయన్ తామ్ ఋజు-గాత్రీం తతాన.

**ప్ర :** మధుర... మాత్రేణ: మధుర = తీయనైన, వచనమాత్రేణ = మాటమాత్రంతో (వచనం ప్రమాణమస్య వచనమాత్రమ్, తేన), ('ప్రమాణే ద్వయసజ్ దఘ్నఞ్ మాత్రచః' - అష్టాధ్యాయి 5-2-37 సూత్రంతో మాత్రచ్ ప్రత్యయం), పులకిత-రుచిర-అంగీ : పులకిత = పులకించిన, రుచిర = అందమైన, అంగీ = అవయవాలు గలదీ (పులకితాని రుచిరాణి చ తాని అంగాని యస్యాః సా), చంచల... భృంగీ : చంచల = కదులుతున్న, అపాంగ = కడకంటి చూపు లనే, భృంగీ = తుమ్మెదలు గలదీ (చంచలాశ్చ తే అపాంగాః త ఏవ భృంగాః యస్యాః సా), యా = ఎవర్తె అయితే, అంగరాగమ్ = (శరీరానికి అలదుకొనే) లేపనాన్ని, దదౌ = ఎవరికి ఇచ్చిందో (దా దానే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఖల-కుల-వన-దహనః : ఖల = దుర్మార్గులయొక్క, కుల = సమూహమనే/ వంశమనే, వన = అడవికి, దావః = అగ్నివంటివాడైన, వాసుదేవః = కృష్ణుడు, అనుచితమ్ = తగని, అభిధానమ్ = పేరును (త్రివక్ర అన్న పేరును), త్యాజయన్ = విడిపింపజేస్తూ (త్యజ హానౌ ధాతువు - ణిచ్-శతృ ప్రత్యయం), తామ్ = ఆ త్రివక్రను, ఋజు-గాత్రీమ్ = నిటారైన శరీరంగల దానినిగా (ఋజు గాత్రం యస్యాః తామ్), తతాన = చేశాడు. (తన్ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు త్రివక్రతో తీయగా మాటాడగానే ఆమె పులకించి పోయింది. అందమైన ఆమె శరీరావయవాలు స్పందించాయి. తనకడకంటి చూపులే తుమ్మెదలుగా విహరించాయి. ఆ పాటి పలకరింపుకే కృష్ణుడడిగిన అంగరాగాన్ని ఇచ్చింది. అప్పుడు చెడ్డవారనే వనానికి దావాగ్నివంటి కృష్ణుడు ఆమెకు తగని ఆ పేరును వదిలింపజేయాలనుకొని ఆమెను ఋజుగాత్రిని చేశాడు.

**వి :** 1. కృష్ణ కుబ్జల సంవాదాన్ని, కృష్ణుడు మధురంగా అంతే మధురంగా ఆమె సమాధానమివ్వటాన్ని పోతన ముచ్చటగా చిత్రించాడు.

కృ. **ఎవ్వరిదానవు లేపము లెవ్వరికిం గోరికొనుచు నేగెదు? నీ పే**
**రెవ్వతె** మాకిమ్మిన్నియు నివ్వటిలెదు చక్కనగుచు నీరజనేత్రీ!

కు. చక్కనివాఁడ వౌదు; సరసంబుల నొల్లకు; మెల్లవారికిన్
జక్కఁ దనంబు లెక్కడివి? చారుశరీర! త్రివక్ర యంద్రు; నే
నిక్కము కంసుదాసిని; వినిర్మలలేపనవిద్యదాన నన్
మిక్కిలి రాజుమెచ్చుఁ దగ మీరు విలేపనముల్ ధరింపరే? -పోతనభాగవతము-10/1272,1274

2. శ్లో॥పత్రం పుష్పం ఫలం తోయం - యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృత-మశ్నామి ప్రయతాత్మనః ॥ - భగవద్గీత - 9/26

అని కృష్ణవచనం గీతలో. తాను పాటించినవే చెప్పటం కృష్ణజీవితంలోని విశేషం. అంగరాగదానంతోనే అంగరాగాన్ని ఇవ్వదలచుకొన్నాడు త్రివక్రకు.

| | | | |
|---|---|---|---|
| 3. **తతాన :** | **తతాన** | తేనతుః | తేనుః |
| | తేనిథ | తేనథుః | తేన |
| | తతాన/తతన | తేనివ | తేనిమ. |

4. తతాన+ఋజుగాత్రీమ్ = తతానర్జుగాత్రీమ్, గుణసంధి. *

**శ్లో॥ ప్రపదనిహితపాదామ్భోజఫుల్లప్రసూనో**
**వదనముపగతేన ద్వ్యఙ్గులోత్తానదోష్ణా ।**
**ఋజుతనుమతనోత్ తామున్నమయ్య త్రివక్రాం**
**చుబుకగతకరాణామఞ్చతాం క్వాస్తి వక్రా ॥ 11-8**

**అ :** కృష్ణుడు కుబ్జలోని వక్రతను తొలగించి ఋజుగాత్రిని చేయటం. -మాలిని.

**అ :** ప్రపద-నిహిత-పాద+అమ్భోజ-ఫుల్ల-ప్రసూనః వదనమ్ ఉపగతేన ద్వి+అంగుళ+ ఉత్తాన-దోష్ణా తాం త్రివిక్రామ్ ఉన్నమయ్య ఋజ-తనుమ్ అతనోత్. చుబుక-గత-కరాణామ్ అంచతాం వక్రా క్వ అస్తి.

**ప్ర :** ప్రపద... ప్రసూనః : ప్రపద = పాదంచివర (కాలిబొటనవ్రేలిపై) (పాదాగ్రం ప్రపదం-అమరకోశః-మనుష్య-81), నిహిత = ఉంచబడిన/నిలిపిన, పాద+అమ్భోజ = పాదపద్మ మనే, ఫుల్ల = వికసించిన, ప్రసూనః (సన్) = పూవు గలవాడైన (ప్రపదే నిహితం పాదాంభోజమ్ ఏవ ఫుల్లం ప్రసూనం యేన సః) కృష్ణుడు, వదనమ్ = త్రివక్ర ముఖం దగ్గరకు, ఉపగతేన = వచ్చినట్టి, ద్వి+అంగుళ...దోష్ణా : ద్వ్యంగుళి = రెండు వ్రేళ్ళు, ఉత్తాన = పైకి లేచిన, దోష్ణా = చేతితో (ద్వే అంగులీ సమాహృతే ఇతి ద్వ్యంగులం, తదేవ ఉత్తానం యస్య సః చ అసౌ దోశ్చ, తేన), తామ్ = ఆ, ఉన్నమయ్య = పైకి లేపి, ఋజ-తనుమ్ = నిటారైన శరీరంగలదానినిగా (ఋజుః తనుః యస్యాః తామ్), అతనోత్ = చేశాడు. (తనూ విస్తారే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), చుబుక...కరాణామ్ : చుబుక = గడ్డంపై, గత = చేరిన, కరాణామ్ = చేయిగలిగి (చుబుకేషు గతాః కరాః యేషాం తేషామ్), అంచతామ్ = గౌరవిస్తున్న/అనునయిస్తున్న వారికి, వక్రా = విముఖ అయిన స్త్రీ, క్వ+అస్తి = ఎక్కడుంది? (అస భువి అదాది పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు ఆమె పాదం చివర తన పదపద్మమనే వికసించిన పూవునుంచి తన చేతిని ఆమె ముఖం దగ్గరకు తీసికొనిపోయి, తన చేతి రెండు వ్రేళ్ళను దగ్గరకు చేర్చి ఆ రెండు వ్రేళ్ళను ఆమె చుబుకం పైనుంచి ఆమెను పైకి ఎత్తాడు. ఆమె శరీరం నిటారుగా అయ్యింది. అవును మరి. గడ్డాన్ని చేతితో పట్టుకొని అనునయింపగలవారికి ఇక వక్రతగల స్త్రీ (విముఖంగా నిలిచే స్త్రీ) ఎక్కడుంటుంది?

**వి :** 1. మొదటిపాదంలో **పాదాంభోజఫుల్లప్రసూన** మంటూ పాదపద్మంలో మళ్ళీ ఫుల్ల ప్రసూనత్వాన్ని ఆరోపించటం విలక్షణం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అతనోత్ :** | **అతనోత్** | అతనుతామ్ | అతన్వన్ | |
| | అతనోః | అతనుతమ్ | అతనుత | |
| | అతనవమ్ | అతన్వ/అతనువ | అతన్మ/అతనుమ. | * |

**శ్లో॥ వక్రామపి చ తాం తన్వీమృజ్వీం కృష్ణకరోఽకరోత్ ।**
**అనుకూలయితుం బాలాం కర ఏవ హి కారణమ్ ॥ 11-9**

**అ :** త్రివక్రను ఋజుగాత్రిని చేసిన కృష్ణుని ప్రస్తావించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** కృష్ణ–కరః వక్రామ్ అపి తామ్ తన్వీమ్ ఋజ్వీమ్ అకరోత్. బాలామ్ అనుకూలయితుం కర ఏవ హి కారణమ్.

**ప్ర :** కృష్ణ–కరః : కృష్ణ = కృష్ణునియొక్క, కరః = చేయి/బలి (అనునయపూర్వకంగా ఇచ్చే కానుక) (కృష్ణస్య కరః) (బలి హస్తాంశవః కరాః–అమరకోశః–నానార్థ–165), వక్రామ్–అపి = వంకరగలదానినైనా/ ప్రతికూలంగా వున్నదానినైనా, తామ్ = ఆ, తన్వీమ్ = కాంతను, ఋజ్వీమ్ = నిటారైన దానినిగా/అనుకూలనుగా, అకరోత్ = చేసింది. (కృ కరణే పరస్మైపది–లఙ్–(ప్ర.ఏ.), హి = అది యుక్తమే, బాలామ్ = బాలను (కోపన అయిన కాంతను), అనుకూలయితుమ్ = సుముఖను చేసికొనటానికి, కర ఏవ = బలియే/కానుకయే, కారణమ్ = కారణ మవుతుంది.

**తా ॥** కృష్ణుని కరం (చేయి) త్రివక్ర అయినా కూడా ఆమెను నిటారుగా చేయగలిగింది. అవునుమరి. ప్రతికూలంగా వున్న కాంతను అనుకూలను చేసికోవాలంటే కరమే (కానుక/సొమ్ము) కారణమవుతుంది గదా!

**వి :** 1. శ్లోకంలోని పూర్వార్ధం. విశేషం. ఉత్తరార్ధం సామాన్యం. సామాన్యవిశేషాల కలయిక వల్ల ఇది అర్థాంతరన్యాసాం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' – (కు.122). అయితే ఆ అర్థాంతరన్యాసం కరశబ్దానికున్న రెండు అర్థాల వల్ల ఏర్పడింది. పదం రెండర్థాల నివ్వటం శ్లేషాలంకారం. కాబట్టి శ్లేషమూలకమయిన అర్థాంతరన్యాసాలంకారం మిది.

2. ఆ త్రివక్రను ఋజుగతిగా చేయటం ప్రతికృతిగా నారాయణభట్టతిరి వర్ణించాడు–

శ్లో॥ కుబ్జామబ్జవిలోచనాం పథి పునర్దృష్ట్వాంగరాగే తయా
దత్తే సాధు కిలాంగరాగమదదాస్తస్యా మహాంతం హృది ।
చిత్తస్థామృజుతామథ ప్రథయితుం గాత్రేఽపి తస్యాః స్ఫుటం
గృహ్ణన్ మంజు కరేణ తాముదనయస్తావజ్జగత్సుందరీమ్ ॥ – నారాయణీయమ్–74/5

| | | | |
|---|---|---|---|
| 3. **అకరోత్ :** | **అకరోత్** | అకురుతామ్ | అకుర్వన్ |
| | అకరోః | అకురుతమ్ | అకురుత |
| | అకరవమ్ | అకుర్వ | అకుర్మ. |

*

**శ్లో॥ గన్ధార్పణాద్రుచిరవేషకృతేర్మనోజ్ఞ–కున్దప్రసూనరచితామలమాల్యదానాత్ ।
కుబ్జాదయస్తమలభన్త మహాప్రసాదం – కిం నామ సర్వవిధిభిర్విభుమర్చయన్తః॥10**

**అ :** ఏ రీతిగా అయినా కృష్ణసేవ మహాఫలదాయకమని కవి ప్రతిపాదించటం. –వసంతతిలక.

**అ :** గంధ+అర్పణాత్ రుచిర–వేష–కృతేః మనోజ్ఞ–కుంద–ప్రసూన–రచిత+అమల–మాల్య–దానాత్ కుబ్జ+ఆదయః తం మహా–ప్రసాదమ్ అలభన్త. సర్వ–విధిభిః విభుమ్ అర్చయంతః మహా–ప్రసాదమ్ అలభన్త ఇతి కిం నామ?

**ప్ర :** గంధ+అర్పణాత్ = గంధాన్ని ఇవ్వటం ద్వారా (త్రివక్ర) (గంధస్య అర్పణం, తస్మాత్), రుచిర–వేష–కృతేః : రుచిర = అందమైన, వేష = వేషాన్ని (ఆహార్యాన్ని), కృతేః = అందజేయుటద్వారా (వాయకుడు) (రుచిరశ్చ అసౌ వేషః తస్య కృతిః తస్యాః), మనోజ్ఞ... దానాత్ : మనోజ్ఞ = అందమైన, కుంద–ప్రసూనః = మొల్లపూలతో, రచిత = కూర్పబడిన, అమల = నిర్మలమైన, మాల్య = పూమాలలను, దానాత్ = ఇవ్వటం వలన (సుదాముడు) (మనోజ్ఞాని చ తాని కుందస్య ప్రసూనాని, తైః రచితాని అమలాని చ తాని మాల్యాని, తేషాం దానం, తస్మాత్), కుబ్జ+ఆదయః = కుబ్జ మొదలగు వారు, మహా–ప్రసాదమ్ = గొప్ప అనుగ్రహాన్ని, అలభన్త = పొందారు. (లభ్ ప్రాప్తౌ ఆత్మనేపది–లఙ్–(ప్ర.బ.), సర్వ–విధిభిః = అన్ని విధులతో/ ఉపచారాలతో, విభుమ్ = ప్రభువును,

అర్చయన్తః = పూజిస్తున్నవారు, మహా-ప్రసాదమ్ = మహానుగ్రహాన్ని, అలభన్త ఇతి = పొందారు అంటే, కిం నామ? = ఏ పాటి?

**తా ॥** కృష్ణునకు గంధాన్ని ఇవ్వటం ద్వారా, అందమైన బట్టలను ఇవ్వటం ద్వారా, అందమైన మొల్లపూలతో కట్టిన మాలలను ఇవ్వటం ద్వారా కుబ్జ (త్రివక్ర), వాయకుడు, సుదాముడు మహాప్రసాదాన్ని పొందగలిగారు. ఇక సర్వవిధులతోనూ ఆ ప్రభువును అర్చించేవారు మహాప్రసాదాన్ని పొందారంటే చెప్పవలసినదేముంది?

**వి :** 1. గంధాన్ని అందించింది **త్రివక్ర**. బట్టలు అందించింది **వాయకుడు**. పూలమాలలను అందించింది **సుదాముడు** – గంధాన్ని అందించింది కుబ్జ.

శ్లో॥ తతస్తు వాయకః ప్రీతస్తయోర్వేషమకల్పయత్ ।
విచిత్రవర్ణైశ్చైలేయైరాకల్పైరనురూపతః ॥

శ్లో॥ నానాలక్షణవేషాభ్యాం కృష్ణరామౌ విరేజతుః ।
స్వలంకృతౌ బాలగజౌ పర్వణీవ సితేతరౌ ॥

శ్లో॥ తస్య ప్రసన్నో భగవాన్ ప్రాదాత్ సారూప్యమాత్మనః ।
శ్రియం చ పరమాం లోకే బలైశ్వర్యస్మృతీంద్రియమ్ ॥

శ్లో॥ తతస్సుదామ్నో భవనం మాలాకారస్య జగ్మతుః ।
తౌ దృష్ట్వా స సముత్థాయ ననామ శిరసా భువి ॥

శ్లో॥ తయోరాసనమానీయ పాద్యం చార్ఘ్యర్హణాదిభిః । ... ... ...

శ్లో॥ పుంసోఽ త్యనుగ్రహో హ్యేష భవద్భిర్యన్నియుజ్యతే ।
ఇత్యభిప్రేత్య రాజేంద్ర సుదామా ప్రీతమానసః ॥

శ్లో॥ శస్తైః సుగంధైః కుసుమైర్మాలా విరచితా దదౌ ।
తాభిః స్వలంకృతౌ ప్రీతౌ కృష్ణరామౌ సహానుగౌ ।
ప్రణతాయ ప్రసన్నాయ దదతుర్వరదౌ వరాన్ ॥ – భాగవతమ్ 10/41/40-50

సుదామునికి వరాలనిచ్చాడు కృష్ణుడు. ఆ వరంగా సుదాముడు కోరినదిది–

శ్లో॥ సోఽ పి వవ్రేఽ చలాం భక్తిం తస్మిన్నేవాఖిలాత్మని ।
తద్భక్తేషు చ సౌహార్దం భూతేషు చ దయాం పరామ్ ॥ – భాగవతమ్ 10/41/51

తెలుగులో ఈ సుదాముడు కోరిన కోరికను తెలిపే కందపద్యం చాలా ప్రసిద్ధిని పొందింది. భక్తులు కోరవలసిన వరాలకు ఆదర్శంగా నిలిచింది–

**క. నీ పాదకమలసేవయు**
**నీ పాదార్చకులతోడినెయ్యము ను నితాం**
**తాపారభూతదయయును**
**తాపసమందార! మాకు దయసేయగదే!** – పోతనభాగవతము 10/1268

| | | | |
|---|---|---|---|
| 2. **అలభన్త :** | అలభత | అలభేతామ్ | **అలభన్త** |
| | అలభథాః | అలభేథామ్ | అలభధ్వమ్ |
| | అలభే | అలభావహి | అలభామహి. |

*

**శ్లో॥ రాజాధ్వనా సమధిగమ్య ధనుర్నివాసం - కోదణ్డఖణ్డనమథో చకమే రమేశః ।**
**యుక్తం హి తత్సకలదైవతముఖ్యదేవః - కృష్ణః కథం జడతమస్య బలిం సహేత ॥11**

**అ :** కృష్ణుడు వింటినుంచి పూజిస్తున్న ఇంటిదగ్గరకు పోయి దానిని భంగం చేయటం. -వసంతతిలక.

**అ :** అథో రమేశః రాజ+అధ్వనా ధనుః+నివాసం సమధిగమ్య కోదండ-ఖండనం చకమే. తత్ యుక్తం హి. సకల-దైవత-ముఖ్య-దేవః కృష్ణః జడతమస్య బలిం కథం సహేత.

**ప్ర :** అథో = ఆ తరువాత (అథో అథేత్యుభే ప్రశ్న వికల్పారంభమంగలే, ఆనంతర్యే చ-నానార్థరత్నమాలా-పంక్తి-2584), రమా+ఈశః = కృష్ణుడు (రమాయాః ఈశః), రాజ+అధ్వనా = రాజమార్గంలో (రాజ్ఞః అధ్వా, తేన), ధనుః+నివాసమ్ = వింటి ఇంటిని (ధనుషాం నివాసః, తమ్), సమ్-అధి-గమ్య = పొంది, కోదండ-ఖండనమ్ = విల్లు విరుచుటను (కోదండస్య ఖండనమ్), చకమే = కోరాడు. (కము కాన్తౌ, కోరుట, ఆత్మనేపది-లిట్-(ప్ర.ఏ.), తత్ యుక్తం హి = అది తగినదే గదా!, సకల... దేవః : సకల = సమస్తమైన, దైవత = దేవతలలో, ముఖ్య = ప్రధానుడైన, దేవః = దేవుడైన (సకలేషు దైవతేషు ముఖ్యశ్చాసౌ దేవః), కృష్ణః = కృష్ణుడు, జడతమస్య = పరమ మూర్ఖుని యొక్క, బలిమ్ = పూజాంగమైన బలిదానాన్ని, కథమ్ = ఎట్లు, సహేత? = సహింపగలడు? (సహ మర్షణే ఆత్మనేపది-విధిలిఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత కృష్ణుడు రాజమార్గంలో ధనుశ్శాలకు వెళ్ళి అక్కడున్న కోదండాన్ని విరువ దలచుకొన్నాడు. అవును మరి. సకలదేవతలలోనూ ప్రధానుడైన కృష్ణుడు పరమ మూర్ఖుని పూజను ఎలా సహించగలడు?

**వి :** 1. ధనుస్సు కదలకుండా పడివుండటం వల్ల దానిని జడతమంగా భావించటం జరిగింది. కంసుడు శివభక్తుడు. శివసంబంధంగానే ఆ వింటికి పూజలు జరుపుతున్నాడు. అందుకే కృష్ణుడు దానిని వ్యతిరేకించవలసివచ్చింది.

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ॥

అని దాదాపు అందరూ - వీరశైవులు తప్ప - అంగీకరిస్తారు. అయినా కేశవుని వ్యతిరేకిస్తూ శివుని మాత్రమే అర్చించటం వలన కృష్ణుడు వ్యతిరేకించి వుండవచ్చు. తన నిర్భయత్వాన్ని కంసునికి ప్రత్యక్షంగా తెలియజేయటానికి దానిని సాధనంగా ఎన్నుకొని వుండవచ్చు కృష్ణుడు.

| | | | |
|---|---|---|---|
| 2. **చకమే :** | **చకమే** | చకమాతే | చకమిరే |
| | చకమిషే | చకమాథే | చకమిధ్వే |
| | చకమే | చకమివహే | చకమిమహే |
| **సహేత :** | **సహేత** | సహేయాతామ్ | సహేరన్ |
| | సహేథాః | సహేయాథామ్ | సహేధ్వమ్ |
| | సహేయ | సహేవహి | సహేమహి. |

*

**శ్లో॥ సద్వంశజాతోఽపి గుణాన్వితోఽపి - శిక్షానురూపోఽపి స తేన చాపః ।**
**భగ్నః శనైర్వక్రహృదో హి పుంసః - కో వా గుణః కోవిదమానయోగ్యః ॥11-12**

**అ :** కృష్ణుడు వింటిని విరుచుట. -ఇంద్రవజ్ర.

**అ :** సద్-వంశ-జాతః అపి గుణ+అన్వితః అపి శిక్షా+అనురూపః అపి స చాపః తేన శనైః భగ్నః హి. వక్రహృదః పుంసః కోవిద-మాన-యోగ్యః గుణః కః వా (భవతి)?

ప్ర : సద్-వంశ-జాతః అపి : సద్-వంశ = మంచి కులంలో/వెదురులో, జాతః అపి = పుట్టినవాడైనను (సతి వంశే జాతః), గుణ+అన్వితః అపి : గుణ = మంచి గుణాలతో/అల్లెత్రాటితో, అన్వితః అపి = కూడివున్ననూ (గుణైః అన్వితః), శిక్షా+అనురూపః అపి = అభ్యాసానికి తగినదైననూ (శిక్షాయాః అనురూపః), సః చాపః ఆ విల్లు, తేన = ఆ కృష్ణునిచే, శనైః = మెల్లగా, భగ్నః = విరువబడింది. హి = అది యుక్తమే. వక్ర-హృదః = వంకర మనస్సు గల (వక్రం హృద్ యస్య తస్య), పుంసః = పురుషునకు, కోవిద-మాన-యోగ్యః : కోవిద = పండితులయొక్క, మాన = గౌరవానికి, యోగ్యః = తగిన (కోవిదానాం మానస్య యోగ్యః), గుణః = గుణం/లక్షణం, కో వా (భవతి) = ఏదుంటుంది?

**తా ॥** విల్లు వెదురుతో తయారయింది. అల్లెత్రాడు కలది. అభ్యాసానికి తగినది. అయినా కృష్ణునిచే మెల్లగా విరువబడింది. (మంచి వంశంలో పుట్టినా, గుణవంతులయినా, అభ్యసింప దగినవారైనా భంగపడే పరిస్థితి వుంటుంది). వంకర మనస్సు గలవానికి పండితులు మెచ్చదగిన గుణమేదుంటుంది?

**వి :** 1. వింటిలో వక్రత సహజం. కానీ కోవిదులకు నచ్చని లక్షణం వక్రతయే. అందుకే సద్వంశంలో పుట్టినా, గుణాలున్నా, అభ్యాసయోగ్యమయినా కృష్ణుడు ఆ వింటిని భంగపరచ వలసి వచ్చింది. కోవిదమానయోగ్యత తనకు లేదనవలసి వచ్చింది. అంతేకాదు. ఆ వింటికున్న అల్లెత్రాడు కూడా తనకు నచ్చదగ్గ స్థాయిది కాదు. అందుకే సద్గుణహీనం. శ్లేషమూలకమైన అర్థాంతరన్యాసాలంకారమిక్కడ. *

**శ్లో॥ కరేణోద్ధృత్య ప్రాగ్వ్యతనుత గుణావేదనమసౌ**
**ప్రభుః పాదాఘాతం తదను విరచయ్యాశ్వనమయత్ ।**
**అథో లీలాబాలః ఖలమివ ధనుర్భగ్నమకరో-**
**ద్బలాన్నమ్రీభూతే కిమిహ కరుణా శుష్కహృదయే ॥ 11-13**

**అ :** కృష్ణుడు వింటిని విరవటాన్ని వివరించటం. -శిఖరిణి.

**అ :** అసౌ లీలా-బాలః ప్రాక్ ఖలమ్+ఇవ కరేణ ఉద్ధృత్య గుణ+ఆవేదనం వ్యతనుత. తదను ప్రభుః పాద+ఆఘాతం విరచయ్య ఆశు అనమయత్. అథో ధనుః భగ్నమ్ అకరోత్. ఇహ బలాత్ నమ్రీభూతే శుష్క-హృదయే కరుణా కిమ్?

ప్ర : అసౌ = ఆ, లీలా-బాలః = లీలలు ప్రదర్శించే బాలుడైన కృష్ణుడు (లీలా సహితః బాలః), ప్రాక్ = ముందుగా, ఖలమ్ ఇవ = దుర్మార్గుని వలె, కరేణ = చేతితో/కానుకలనివ్వటంతో, ఉద్ధృత్య = పైకి ఎత్తి/ఉద్ధరించి, గుణ+ఆవేదనమ్ : గుణ = అల్లెత్రాటితో/సద్గుణాలతో, ఆవేదనమ్ = సంబంధాన్ని, వి+అతనుత = కల్గించాడు. (వి తనూ విస్తారే ఆత్మనేపది-లఙ్-(ప్ర.ఏ.), తద్+అను = ఆ తరువాత, ప్రభుః = సమర్థుడైన కృష్ణుడు, పాద+ఆఘాతమ్ : పాద = కాలితో, ఆఘాతమ్ = దెబ్బను, విరచయ్య = కల్పించి, ఆశు = వెంటనే, అనమయత్ = వంచాడు. (నమ్ ప్రహ్వత్వే శబ్దే చ ణిచ్-పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.), అథో = ఆ తరువాత (అథో అథేత్యుభే ప్రశ్నవికల్పారంభమంగళే ఆనంతర్యేచ - నానార్థరత్నమాలా-పంక్తి-2584), ధను = వింటిని, భగ్నమ్ = విరిగినదిగా, అకరోత్ = చేశాడు. (కృ కరణే పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.), ఇహ = ఈ లోకంలో, బలాత్ = బలవంతంగా, నమ్రీభూతే = లొంగినట్టి, శుష్క-హృదయే = స్నిగ్ధతలేని మనస్సుగల వానిపై (శుష్కం హృదయం యస్య, తస్మిన్), కరుణా కిమ్? = దయ ఎందుకు?

**తా ॥** లీలాబాలుడైన కృష్ణుడు దుర్మార్గుని లొంగదీసిన విధంగా ధనుస్సును కూడా వంచి భగ్నం చేశాడు. ముందుగా దానిని చేతితో పైకి ఎత్తాడు. అది దుర్మార్గునికి ఏవో కానుకలు ఇచ్చి లొంగదీసిన పద్ధతి. ఆపై ఆ

ధనుస్సుని అల్లెత్రాటితో కూర్చాడు. దుర్మార్గుడికి వినయాది గుణాలను కలిగించినట్లు. ఆపై పదవిన్యాసంతో దానిని వంచాడు. అది దుర్మార్గుని పాదాఘాతంతో లొంగదీసినట్లు. ఆపై ఆ వింటిని విరిచాడు. దుర్మార్గుని భంగపరచినట్లు. అయితే లొంగిన వాడిని భంగపరచవచ్చా అంటే అవునుమరి లొంగినవాడైనా వాడిలో స్నేహశీలత లోపిస్తే జాలి అవసరం లేదు గదా!

**వి :** 1. ఒక దుర్మార్గుణ్ణి లొంగదీసి భంగపరచటానికి వింటిని ఎక్కుపెట్టి విరవటానికి ఈ శ్లోకంలో పోలిక. అది ఉపమాలంకారం. ఆ ఉపమాలంకారానికి శ్లేషాలంకారం తోడ్పాటు నిస్తుంది. కర-గుణ-నమనం (లొంగదీయటం) పదాలు రెండు అర్థాలనిస్తాయి. పదభంగం లేకుండానే. కాబట్టి అక్కడ అర్థశ్లేష. అర్థశ్లేష సహకారంతో ఉపమాలంకారం.

లొంగినవాణ్ణి భంగపరచటం తగినదేనా అని ప్రశ్న. ఆ ప్రవృత్తిని సమర్థించవలసి వచ్చింది. సమర్థన అవసరమైన చోట సమర్థించటం కాబట్టి ఇది కావ్యలింగాలంకారం. '**సమర్థనాయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' – (కు. 121)

2. ఖలుని లొంగదీసినట్లు అన్న పోలికగానీ, కావ్యలింగాలంకారప్రసక్తి కానీ మూలభాగవతంలో లేవు.

శ్లో॥ కరేణ వామేన సలీలముద్ధృతం - సజ్యం చ కృత్వా నిమిషేణ పశ్యతామ్ ।
నృణాం వికృష్య ప్రబభంజ మధ్యతో- యథేక్షుదణ్డం మదకర్యురు క్రమః ॥ -భాగవతం 10/42/17

పోతనకూడా మూలంలోని మదకరితో పోలికనే నిక్షేపించాడు.

శా॥ బంధుల్ మేలన వామహస్తమునఁ జాపం బెత్తి మౌర్వీలతా
సంధానం బొనరించి కొంచెపుఁ దెగన్ శబ్దించుచున్ ధీరతా
సింధుం డా హరి దాని ఖండితముగాఁ జేసెన్ జనుల్ చూడఁగా
గంధేభంబు రసాలదండము నొగిన్ ఖండించుచందంబునన్. -పోతనభాగవతము 10/1282

| | | | |
|---|---|---|---|
| 3. **వ్యతనుత :** | **వ్యతనుత** | వ్యతన్వాతామ్ | వ్యతన్వతామ్ |
| | వ్యతనుథాః | వ్యతన్వాథామ్ | వ్యతనుధ్వమ్ |
| | వ్యతన్వి | వ్యతనువహి/వ్యతన్వహి | వ్యతనుమహి/వ్యతన్మహి |
| **అనమయత్ :** | **అనమయత్** | అనమయతామ్ | అనమయన్ |
| | అనమయః | అనమయతమ్ | అనమయత |
| | అనమయమ్ | అనమయావ | అనమయామ |
| **అకరోత్ :** | **అకరోత్** | అకురుతామ్ | అకుర్వన్ |
| | అకరోః | అకురుతమ్ | అకురుత |
| | అకరవమ్ | అకుర్వ | అకుర్మ. |

*

**శ్లో॥ భగ్నశ్చాపః స్వభర్తుః ప్రతిభయనినదైర్ధైర్యచౌర్యం తతాన**
**వ్యగ్రస్వాన్తాన్ స్వపాలాన్ దృఢతరశకలధ్వస్తఘాతైర్జఘాన ।**
**భజ్ఞేనైవోగ్రమల్లప్రకరహృది భయం భల్లకల్పం చఖాన**
**ద్వైధీభావం విపక్షే విరచయతి బత! స్వీయ ఏవ స్వశత్రుః ॥ 11-14**

**అ :** విరిగిన విల్లు తన భంగపాటుతో ఇతరులను ప్రభావితం చేసిన వైనాన్ని వర్ణించటం.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** భగ్నః చాపః ప్రతిభయ-నినదైః స్వ-భర్తుః ధైర్య-చౌర్యం తతాన. వ్యగ్ర-స్వాంతాన్ స్వపాలాన్ దృఢతర-శకల-ద్వంద్వ-ఘాతైః జఘాన. భంగేన+ఏవ ఉగ్ర-మల్ల-ప్రకర-హృది భల్ల-కల్పం భయం చఖాన. విపక్షే ద్వైధీభావం విరచయతి (సతి) స్వీయః ఏవ స్వ-శత్రుః (భవతి) బత.

**ప్ర :** భగ్నః = విరిగిన, చాపః = విల్లు, ప్రతిభయ-నినదైః : ప్రతిభయ = శ్రవణభీకరమైన, నినదైః = ధ్వనులతో (ప్రతిభయాః చ తే నినదాః, తైః), స్వ-భర్తుః = తన ప్రభువుయొక్క (స్వస్య భర్తా, తస్య), ధైర్య-చౌర్యమ్ = ధైర్యంయొక్క దోపిడిని, తతాన = కల్గించింది. (తనూ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), వ్యగ్ర-స్వాంతాన్ : వ్యగ్ర = కలతపడిన, స్వాంతాన్ = మనస్సుగలవారిని (వ్యగ్రాణి స్వాంతాని యేషాం తాన్), స్వ-పాలాన్ = తన కాపలావారిని, దృఢ.. ఘాతైః = దృఢతర = మరీ గట్టివైన, శకల = ముక్కలయొక్క, ద్వంద్వ = జంటయొక్క, ఘాతైః = దెబ్బలతో (దృఢతరయోః శకలయోః ద్వంద్వః తస్య ఘాతాః తైః), జఘాన = హింసించింది. (హన హింసా గత్యోః-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), భంగేన+ఏవ = విరుగుటతోనే, ఉగ్ర...హృది : ఉగ్ర = క్రూరులైన, మల్ల = మల్లయోధులయొక్క (కుస్తీలు పట్టేవారు), ప్రకర = సమూహం యొక్క, హృది = మనస్సులో (జాత్యేకవచనం), భల్లకల్పమ్ = బల్లెంతో సమానమైన, భయమ్ = పిరికితనాన్ని, చఖాన = లోతుగా నిలిపింది. (ఖన్ అవదారణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), విపక్షే = శత్రుపక్షం, ద్వైధీభావమ్ = విడగొట్టటాన్ని (మిత్రభేదాన్ని), విరచయతి సతి = కల్పిస్తుంటే, స్వీయః ఏవ = తనవాడే, స్వ-శత్రుః = తన శత్రువుగా, (భవతి) = కాగలడు, బత = అయ్యో!

**తా ॥** కృష్ణుని చేతిలో విరిగిన విల్లు తన భీకరధ్వనులతో కంసుని ధైర్యాన్ని కొల్లగొట్టింది. రెండు ముక్కలైన తాను ఆ రెండు ముక్కలతోనే తన రక్షకులను హింసించింది. తాను భంగపడుతూనే క్రూరులయిన మల్లయోధుల సమూహంయొక్క మనస్సులో బల్లెంతో సమానంగా భయాన్ని కల్గించింది. అవును మరి. శత్రువు మిత్రభేదాన్ని (అంతః కలహాన్ని) కల్పించినపుడు తనవారే తనకు శత్రువులవుతారు. ఎంత విషాదం.

**వి :** 1. కృష్ణుని చేతిలో విరిగిన చాపం కూడా ఎన్నో భీకరకార్యాలు చేయగలిగింది. అదే చక్కగా పనిచేస్తున్న చాపమయితే?... చాపభంజనం దేనికి ప్రతీక? కృష్ణుడు అస్త్రవిద్యను అంతం చేయటం తన అవతారప్రయోజనాలలో ఒకటిగా నిర్ణయించుకొని చేసినట్లు కొందరు పండితుల అభిప్రాయం. దానికి ఇది సంకేతమా? కృష్ణుని లక్ష్యం అస్త్రవిద్యను అంతం చేయటమే కాని శస్త్రవిద్యను కాదు. ఆ పండితుల అభిప్రాయం మేరకు కూడా!

పౌరాణికంగా చూసినా, చారిత్రకంగా చూసినా మహాభారతం తర్వాత అస్త్రాలను (మంత్రకృతమైన బాణాలు) ప్రయోగించి చేసిన యుద్ధాలు కనిపించవు. అందుకే కృష్ణనిర్యాణం తర్వాత అర్జునుడు కూడా యాదవస్త్రీలను రక్షించటంలో విఫలం కావటం.

శ్లో॥ ప్రేక్షతస్త్వేవ పార్థస్య వృష్ణ్యంధకవరస్త్రియః ।
జగ్మురాదాయ తే మ్లేచ్ఛాః సమంతాజ్జనమేజయ ॥

శ్లో॥ ధనంజయస్తు దైవం తత్ మనసాఽచింతయత్ప్రభుః ।
దుఃఖశోకసమావిష్టో నిఃశ్వాసపరమోఽభవత్ ॥

శ్లో॥ అస్త్రాణాం చ ప్రణాశేన బాహువీర్యస్య సంశయాత్ ।
ధనుషశ్చావిధేయత్వాచ్ఛరాణాం సంక్షయేణ చ ॥

శ్లో॥ బభూవ విమనాః పార్థో దైవమిత్యనుచింతయన్ ।
న్యవర్తత తతో రాజన్నేదమస్తీతి చాబ్రవీత్ ॥ - మహాభారతమ్-మౌసలపర్వం-7/63-66

2. మొదటి మూడుపాదాలలోని విశేషవిషయం, నాలుగవపాదంలోని సామాన్యవిషయం పరస్పరంపోషకాలు కాబట్టి ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' - (కు.122)

3. **తతాన : 11**–7వ శ్లోక వ్యాఖ్య చూడుదు.

| | | | |
|---|---|---|---|
| **జఘాన :** | జఘాన | జఘ్నతుః | జఘ్నుః |
| | జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న |
| | జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ |
| **చఖాన :** | చఖాన | చఖ్నతుః | చఖ్నుః |
| | చఖనిథ | చఖ్నథుః | చఖ్న |
| | చఖాన/చఖన | చఖ్నివ | చఖ్నిమ. |

*

**శ్లో॥ ఇతి వివిధచరిత్రం శ్రీపతేస్తద్విచిత్రం**
**కథయితుమివ భానుః సిద్ధవిద్యాధరాణామ్ ।**
**అగమదమలమేరోర్భాగమన్యం ముకున్దోఽ–**
**ప్యగణితవిభవః స్వం జ్ఞాతిజుష్టం నివాసమ్ ॥** **11–15**

**అ :** సూర్యాస్తమయవర్ణనం–కృష్ణుడు విడిదికి చేరటం. –మాలిని.

**అ :** ఇతి శ్రీపతేః విచిత్రం వివిధ–చరిత్రం సిద్ధ–విద్యాధరాణాం కథయితుమ్+ఇవ భానుః అమల–మేరోః అన్యం భాగమ్ అగమత్. అగణిత–విభవః ముకుందః అపి జ్ఞాతి–జుష్టం స్వం నివాసమ్ అగమత్.

**ప్ర :** ఇతి = ఈ ప్రకారంగా, శ్రీపతేః = కృష్ణునియొక్క, విచిత్రమ్ = అద్భుతమైన, వివిధ–చరిత్రమ్ = అనేక ఘటనలను (వివిధం చ తత్ చరిత్రమ్), సిద్ధ–విద్యాధరాణామ్ : సిద్ధ = సిద్ధులకూ, విద్యాధరాణామ్ = విద్యాధరులకూ, కథయితుమ్+ఇవ = చెప్పడానికో అన్నట్లు, భానుః = సూర్యుడు, అమల–మేరోః : అమల = నిర్మలమైన, మేరోః = మేరుపర్వతానికి (అమలశ్చ అసౌ మేరుః, తస్య), అన్యం భాగమ్ = మరొక వైపునకు, అగమత్ = వెళ్ళారు. (గమ్ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), అగణిత = లెక్కకందని, విభవః = సంపదగల (అగణితః విభవః యస్య సః), ముకుందః+అపి = కృష్ణుడు కూడా, జ్ఞాతి–జుష్టమ్ : జ్ఞాతి = దాయాదులచే, జుష్టమ్ = కూడివున్న (జ్ఞాతిభిః జుష్టమ్), స్వమ్ = తనయొక్క, నివాసమ్ = వసతికి, (అగమత్ = వెళ్ళాడు).

**తా ॥** ఇంతవరకు జరిగిన కృష్ణుని సంబంధించిన వివిదాద్భుతసంఘటనలను సిద్ధులకూ, విద్యాధరులకూ తెలియజేయాలనుకొన్నాడేమో సూర్యుడు మేరుపర్వతంయొక్క ఆవలివైపుకు చేరాడు. అగణితవిభవం గల కృష్ణుడు కూడా తన జ్ఞాతులయిన నందాదులున్న తన నివాసానికి వెళ్ళాడు.

**వి :** 1. సూర్యుడు సిద్ధవిద్యాధరులకు చెప్పడానికో అన్నట్లు – అని సూర్యాస్తమయానికి కారణాన్ని ఊహించినందువలన ఇది హేతూత్ప్రేక్షాలంకారం.

సూర్యుడికి కృష్ణుడికీ గమనరూపమైన ఒకే క్రియను అన్వయించినందువల్ల, అవి రెండు ప్రకృతాంశాలే కావటంవల్లా ఇది తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' – (కు.44)

| | | | |
|---|---|---|---|
| 2. **అగమత్ :** | అగమత్ | అగమతామ్ | అగమన్ |
| | అగమః | అగమతమ్ | అగమత |
| | అగమమ్ | అగమావ | అగమామ. |

*

**శ్లో॥ తమః సమన్తాత్ కాష్ఠాసు పుపూర స గతో రవిః ।**
**బహిర్గతో ముకున్దోఽపి భయాఖ్యం తత్ స్వశత్రుషు ॥** **11–16**

**అ :** చీకటి వ్యాపించటం – శత్రువులలో కృష్ణభయం వ్యాపించటం. –పథ్యావక్త్రమ్.

**అ :** గతః సః రవిః కాష్ఠాసు సమన్తాత్ తమః పుపూర. బహిః గతః ముకుందః అపి భయ+ఆఖ్యం తత్ స్వశత్రుషు పుపూర.

**ప్ర :** గతః = అస్తమించిన, సః రవిః = ఆ సూర్యుడు, కాష్ఠాసు = దిక్కులలో (దిశస్తు కకుభః కాష్ఠాః–అమరకోశః –దిక్–1), సమన్తాత్ = అంతటా, తమః = చీకటిని, పుపూర = నింపాడు. (పూర్ ఆప్యాయనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), బహిః = నగరం వెలుపలకు, గతః = వెళ్ళిన, ముకుందః అపి = కృష్ణుడు కూడా, భయ+ఆఖ్యమ్ = భయ మనే (భయమ్ ఇతి ఆఖ్యా యస్య తత్), తత్ = దానిని (చీకటిని), స్వ–శత్రుషు = తన శత్రువులయందు, (పుపూర = నింపాడు).

**తా ॥** అస్తమించిన సూర్యుడు అన్ని దిక్కులలో పూర్తిగా చీకటిని నింపివేశాడు. నగరం వెలుపల (తనవారిదగ్గర)కు వెళ్ళిన కృష్ణుడు తన శత్రువులలో భయమనే చీకటిని నింపివేశాడు.

**వి :** 1. సూర్యుడికి, కృష్ణుడికి భయాన్ని నింపటమనే ఒకే ధర్మాన్ని అన్వయించటం వలనా, రెండూ ప్రకృతాంశాలే అయినందువలన ఇది తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' – (కు.44)

2. '**స్వశత్రుషు**' అని బహువచనాన్ని ప్రయోగించినా అప్పటి ప్రధానశత్రువు కంసుడే. అందుకే మూలంలో కంసప్రస్తావన కనిపిస్తుంది.

శ్లో॥ ధనుషో భజ్యమానస్య శబ్దః ఖం రోదసీ దిశః ।
పూరయామాస యం శ్రుత్వా కంసస్త్రాసముపాగమత్ ॥ – భాగవతం 10/42/18

| | | | |
|---|---|---|---|
| 3. **పుపూర :** | **పుపూర** | పుపూరతుః | పుపూరుః |
| | పుపూరిథ | పుపూరథుః | పుపూర |
| | పుపూర | పుపూరివ | పుపూరిమ. |

*

**శ్లో॥ ఔదార్యధైర్యశౌర్యాణి గర్హయన్ స భయోచ్చయః ।**
**మనో మమర్ద కంసస్య మధుసూదనదూతవత్ ॥ 11–17**

**అ :** ధనుర్భంగం ద్వారా కలిగిన భయం కంసుని మనస్సును కలతపెట్టడం. –పథ్యావక్త్రమ్.

**అ :** ఔదార్య–ధైర్య–శౌర్యాణి గర్హయన్ సః భయ+ఉచ్చయః మధుసూదన–దూతవత్ కంసస్య మనః మమర్ద.

**ప్ర :** ఔదార్య...శౌర్యాణి : ఔదార్య = ఉదారత్వమూ, ధైర్య = గుండెదిటవు, శౌర్యాణి = శూరత్వమూ – వీటిని (ఔదార్యం చ ధైర్యం చ శౌర్యం చ, తాని), గర్హయన్ = నిందిస్తూ, సః = ఆ ధనుర్భంగంవలన పుట్టిన, భయ+ఉచ్చయః = భయసమూహం (భయానామ్ ఉచ్చయః), మధుసూదన–దూతవత్ = కృష్ణుని దూతలాగా (మధుసూదనస్య దూతేన తుల్యమ్) (**తేన తుల్యం క్రియాచేద్వతిః** – అష్టాధ్యాయి – 5–1–115), కంసస్య = కంసుని యొక్క, మనః = మనస్సును, మమర్ద = నూర్చి వేసింది. (మృద్ క్షోదే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా॥** ధనుర్భంగం ద్వారా పుట్టిన భయసముదాయం కంసునిలోని ఔదార్యాన్నీ, ధైర్యాన్నీ, శౌర్యాన్నీ నిందిస్తూ మధుసూదనుడి దూతలాగా కంసుని నూరేసింది.

**వి :** 1. మధుసూదనదూతవత్ – అన్నప్పుడు ఉపమాలంకారం. ఉపమావాచకమైన ఇవ పదం లేకుండా ఆ భావాన్ని తెలియజేసే 'వతి' ప్రత్యయాన్ని ప్రయోగించటం దీనిని అర్థి+ఉపమాలంకారమంటారు.

| | | | |
|---|---|---|---|
| 2. **మమర్ద :** | మమర్ద | మమృదతుః | మమృదుః |
| | మమర్దిథ | మమృదథుః | మమృద |
| | మమర్ద | మమృదివ | మమృదిమ. |

*

**శ్లో॥ కస్త్వం సోఽహమరే! త్వదన్తకతటాదభ్యాగతో వై భటః**
**పృథ్వ్యాం క్వాస్తి మమాన్తకః స భువనేష్వన్తర్బహిర్వర్తతే ।**
**నామాప్యస్య న దేవకీసుత ఇతి ఖ్యాతః స తన్నన్దనో**
**ధ్వస్తో హ్యజ్ఞ! మృతిర్న తస్య నిహతాస్తేన త్వదీయాః పరమ్ ॥ 11-18**

**అ :** కంసుడు తనలో తాను మాటాడుకోవటం – మధుసూదనుని దూతతో మాటాడుతున్నట్టు. సంవాద శ్లోకమిది.

**అ :** త్వమ్ కః? అరే సః అహమ్. త్వద్–అంతక–తటాద్ అభ్యాగతః భటః వై. పృథ్వ్యామ్ మమ అన్తకః క్వ అసి? సః భువనేషు అంతః బహిః చ వర్తతే. అస్య నామ అపి? సః దేవకీ–సుతః ఇతి ఖ్యాతః తత్+నందనః ధ్వస్తః హి? అజ్ఞ! తస్య మృతిః న. పరం త్వదీయాః తేన నిహతాః ॥

**ప్ర :** త్వమ్ = నువ్వు, కః = ఎవడవు? అరే = శత్రువా!, సః = వాడినే, అహమ్ = నేను, త్వద్–అంతక–తటాద్ = నిన్ను చంపే వాడి దగ్గరనుండి (తవ అంతకః, తస్య తటం, తస్మాద్), అభ్యాగతః = వచ్చిన, భటః వై = సేవకుడను (దూతను) గదా! పృథ్వ్యామ్ = భూమిపై, మమ = నాకు, అంతకః = అంతకుడు, క్వ+అస్తి? = ఎక్కడున్నాడు. (అస భువి పరస్మైపది–లట్–(ప్ర.ఏ.), సః = వాడు (నిన్ను చంపేవాడు), భువనేషు = లోకాలలో, అంతః = లోనా, బహిః = వెలుపలా, వర్తతే = ఉంటాడు. (వృతు వర్తనే ఆత్మనేపది–లట్–(ప్ర.ఏ.), అస్య = ఆ హంతకునియొక్క, నామ+అపి = పేరుకూడా..., న = లేదే. సః = ఆ హంతకుడు, దేవకీ–సుతః ఇతి = దేవకి కొడుకని (దేవక్యాః సుతః), ఖ్యాతః = పేరు పొందినవాడు. తత్–నందనః = ఆ (దేవకి) కొడుకు (జాత్యేకవచనం), ధ్వస్తః హి = చంపబడ్డాడు గదా!

అజ్ఞ! = తెలివిలేనివాడా! (న జానాతి ఇతి అజ్ఞః, తస్మాత్ సంబుద్ధిః), తస్య = ఆ దేవకీ సుతుడికి, మృతిః = చావు, న = లేదు, పరమ్ = పై పెచ్చు, త్వదీయాః = నీ వారు, తేన = ఆయనచే, నిహతాః = చంపబడ్డారు. (ని హన్ ధాతువుపై క్త ప్రత్యయం)

**తా ॥** నువ్వెవడివి? శత్రువా! నేను వాడినే, నిన్ను చంపబోయే వాడిదగ్గర నుండి దూతగా వచ్చాను. భూమిపై నన్ను చంపేవాడు ఎక్కడున్నాడు? లోకాల వెలుపలా, లోపలా కూడా తానుంటాడు. వాడి పేరుకూడా వినబడదే! దేవకి కొడుకని ఆయన ప్రసిద్ధుడే. ఆ దేవకి కొడుకును చంపించాను గదా! ఆయనకు మరణం లేదు. పైపెచ్చు నీవారే ఆయన చేతిలో చనిపోయారు.

**వి :** 1.

| | | | |
|---|---|---|---|
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **వర్తతే :** | **వర్తతే** | వర్తేతే | వర్తన్తే |
| | వర్తసే | వర్తేథే | వర్తధ్వే |
| | వర్తే | వర్తావహే | వర్తామహే |

2. ఛందస్సు – శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ మల్లాః శైలసమాః బలం చ జగతి ప్రఖ్యాతమస్త్యేవ మే**
**హస్తీ హస్తిసహస్రసమ్మితబలస్తత్ క్వాస్తి మృత్యుర్మమ ।**
**రాజన్ మృత్యురివాహమేవ భవతాం చిత్తే సముజ్జృమ్భితో**
**దృష్టం వస్తు భయఙ్కరం విరచయే శఙ్కాసహస్రార్పకః ॥ 11-19**

**అ :** కంసుడు భయంతో తనలో తానే మాటాడుకోవటం, కృష్ణుని దూతతో మాటాడుతున్నట్లు–

**అ :** – శైల–సమాః మల్లాః(సన్తి) జగతి ప్రఖ్యాతం బలం చ అస్తి ఏవ. హస్తి–సహస్ర–సమ్మిత–బలః హస్తీ(అస్తి). తత్ మమ మృత్యుః క్వ అస్తి.

– రాజన్! భవతాం చిత్తే సముజ్జృంభితః అహమ్ ఏవ శంకా–సహస్ర–అర్పకః (సన్) మృత్యుః+ఇవ దృష్టం వస్తు భయంకరం విరచయే.

**ప్ర :** శైల–సమాః = కొండలవంటి (శైలైః సమాః), మల్లాః= మల్లయోధులు, (సన్తి) = ఉన్నారు. జగతి = లోకంలో, ప్రఖ్యాతమ్ = ప్రసిద్ధికెక్కిన, బలం చ = శక్తి/ సేన కూడా, అస్తి+ఏవ = ఉండనే ఉంది. (అస భువి పరస్మైపది–లట్–ప్ర.ఏ.), హస్తి...బలః : హస్తి–సహస్ర = వేయి ఏనుగులతో, సమ్మిత = సమానమైన, బలః = శక్తి గల, హస్తీ = ఏనుగు కూడా, (అస్తి = వుంది), తత్ = కాబట్టి, మమ = నాకు, మృత్యుః = చావు, క్వ+అస్తి? = ఎక్కడుంది?

రాజన్ = రాజా!, భవతాం చిత్తే = నీ మనస్సులో, సముజ్జృంభితః = ఎగబడినవాడనై, అహమ్–ఏవ = నేనే, శంకా–సహస్ర–అర్పకః (సన్) : శంకా = అనుమానాలను, సహస్ర = వేలకొలదిగా, సమర్పకః (సన్) = కలిగిస్తూ (సహస్రాణాం శంకానాం సమర్పకః), మృత్యుః + ఇవ = మృత్యువు వలె, దృష్టమ్ = (నీచే) చూడబడిన, వస్తు = పదార్థాన్ని, భయంకరమ్ = పిరికితనాన్ని కలిగించేదానినిగా, విరచయే = చేస్తాను.(వి–రచ్ ప్రతియత్నే ఆత్మనేపది–లట్–ఉ.ఏ.)

**తా ॥** నాకు కొండలవంటి మల్లయోధులున్నారు. నా శక్తి, నా సేన లోకంలో ప్రసిద్ధి చెందింది. వేయి ఏనుగుల బలంగల ఏనుగు నాకుంది. ఇక నాకు మృత్యువెక్కడ? రాజా! నేనే నీ మనస్సులో విజృంభించి వేలకొలదిగ అనుమానాలను అంకురింపజేస్తూ మృత్యువులా నువ్వు చేసిన ప్రతివస్తువునూ భయంకరంగా కనిపింపజేస్తాను.

**వి :** 1. '**పులిగాడికంటే గిలిగాడు బలవంతు**'డని తెలుగు సామెత. పులిని చూస్తే కలిగే భయం కన్న పులి ఎక్కడుందో, అసలు వుందో లేదో తెలియనప్పుడు వుందనుకొంటూ పొందే భయం తీవ్రమైనదట. అది నిత్యజీవితంలో కనిపిస్తుంది కూడా. అటువంటి భయాన్ని కలిగిస్తానంటున్నాడు కంసునితో మాటాడుతున్న పిరికి కంసుడు. కంసుని ఆంతర్యంలోనే సాగుతున్న ఘర్షణాత్మకస్థితి ఇది.

**భీషాస్మాద్వాతః పవతే. భీషోదేతి సూర్యః భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః** – (తైత్తిరీయోపనిషత్తు– 2/8) లో వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, మృత్యువు కూడా భయపడుతున్నట్లే వుంది. కానీ ఆ భయం కర్తవ్యనిర్వహణలో తొట్రుపాటు ఏర్పడుతుందేమో అన్న ఆలోచనకు సంబంధించినది. కంసునిలోని భయం అది కాదు. ప్రాణభయం, అధర్మఫలితాలను అనుభవింపవలసివస్తుందేమో అన్న భయం. అశరీరవాణి పలుకులు నిజమవుతాయన్న భయం. యోగమాయ చేసిన సూచన క్రియకట్టబోతోందేమో అన్న భయం. అందుకే

శ్లో॥ అజరామరవత్ప్రాజ్ఞో విద్యామర్థం చ సాధయేత్ ।
గృహీత ఇవ కేశేషు మృత్యునా ధర్మమాచరేత్ ॥ – హితోపదేశః – 3

అని ధర్మాచరణ ప్రాధాన్యాన్ని ప్రకటించింది. మృత్యువు జుట్టుపట్టుకొని వుంది అన్నంత భయంగా ధర్మాన్ని పాటించాలి. దాన్ని తప్పితే ఇప్పుడు కంసుడున్న స్థితికి లోనవుతారు జనులు.

| | | | |
|---|---|---|---|
| 2. **విరచయే :** | విరచయతే | విరచయేతే | విరచయన్తే |
| | విరచయసే | విరచయేథే | విరచయధ్వే |
| | **విరచయే** | విరచయావహే | విరచయామహే |

3. ఛందస్సు - శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ యస్మిన్నుత్సృజతి స్వభక్తనికరైః సాకం హృదోకో నృణాం**
**ప్రాగన్ధా బధిరా వివేకరహితా మూకాయితాశ్చ క్షణాత్ ।**
**అన్తే ప్రేతపురీం ప్రయాన్తి జగతామీశస్య తస్యాగ్రతః**
**కిం మల్లైః కిము హస్తినాఽతిబలినా కిం వా త్వయా కిం భటైః ॥ 11-20**

**అ :** హృదయ మందిరంలో నుండి పరమాత్మ నిర్గమిస్తే మనబలం ఏదైనా నిరర్థకమే అని ప్రతిపాదించటం.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్వ-భక్త-నికరైః సాకం నృణాం హృద్+ఓకః యస్మిన్ ఉత్సృజతి (సతి) ప్రాక్ క్షణాత్ అంధాః బధిరాః వివేక-రహితాః మూకాయితాః చ సన్తః అన్తే ప్రేత-పురీం ప్రయాన్తి తస్య జగతామ్ ఈశస్య అగ్రతః మల్లైః కిం? అతిబలినా హస్తినా కిము? భటైః కిం? త్వయా వా కిమ్?

**ప్ర :** స్వ-భక్త-నికరైః సాకమ్ : స్వ = తనయొక్క, భక్త = భక్తులయొక్క, నికరైః సాకమ్ = సమూహాలతో పాటు (స్వస్య భక్తాః, తేషాం నికరాః, తైః సాకమ్), నృణామ్ = మనుష్యుల యొక్క హృద్-ఓకః = హృదయమందిరాన్ని (హృద్ ఏవ ఓకః తత్) (ఓకస్త్వాశ్రయే గృహే - నానార్థమంజరీ-పంక్తి-1908), ఉత్సృజతి సతి = విడిచిపెడితే, ప్రాక్ = ముందుగా, క్షణాత్ = క్షణకాలంలోనే, అంధాః = గ్రుడ్డివారుగా, బధిరాః = చెవిటివారుగా, వివేక-రహితాః = జ్ఞానహీనులుగా, మూకాయితాః చ సన్తః = మూగవారుగా కూడా అయి, అన్తే = తుదకు, ప్రేత-పురీమ్ = యమనగరానికి, ప్రయాన్తి = వెళ్తారో (ప్ర-యా ప్రాపణే-పరస్మైపది-లట్-ప్ర.బ.), తస్య = అటువంటి, జగతామ్ = లోకాలకు, ఈశస్య = ప్రభువైన కృష్ణునియొక్క, అగ్రతః = ఎదుట, మల్లైః = మల్లయోధులచే, కిమ్? = లాభమేమిటి?, అతిబలినా = చాలా శక్తిగల, హస్తినా = ఏనుగుచే, కిము? = ఉపయోగమేమిటి?, భటైః = భటులచే, కిమ్? = మేలేమిటి?, త్వయా వా = నీ చేతనయినా, కిమ్? = ప్రయోజన మేమిటి?

**తా ॥** తన భక్తులతో పాటు (పరాత్పరుడైన) కృష్ణుడు మనుష్యుల హృదయమందిరాలలో నుండి బయటకు వెళితే వెంటనే ముందుగా గుడ్డివారుగా, చెవిటివారుగా, మూగవారుగా, వివేకహీనులుగా మారి ఆపై యమనగరానికి వెళ్తారు మనుష్యులు. అటువంటి జగదీశ్వరుని ముందు ఈ మల్లయోధులు, ఈ బలసంపన్నమైన ఏనుగు, ఈ సేనలు, కడకు నువ్వు (కంసుడు)కూడా ఎందుకూ పనికిమాలినట్లే.

**వి :** 1. శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా ॥ -భగవద్గీత 18/61

అని గీతావచనం. సర్వప్రాణులయొక్క హృదయంలో ఈశ్వరుడున్నాడు. ఆయన నడిపించినట్లు మొత్తం నడుస్తుంటుంది. ఆయన హృదయంలో నుండి వెళ్ళిపోతే, క్షణాలలో మృత్యుప్రాప్తి.

కంసుని హృదయంలో గూడా కృష్ణుడున్నాడు భయరూపంతో. ఆ భయమే కంసునికి కృష్ణసందర్శనప్రాప్తిని కల్పించింది.

శా. కామోత్కంఠత గోపికల్ **భయమునం గంసుండు** వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
బ్రేమన్ మీరలు భక్తినేము **నిదె చక్రిం గంటి** మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందవచ్చు ధాత్రీశ్వరా. -పోతనభాగవతము 7/18

అంతేకాదు. భక్తిలోకన్న వైరం (దానితో పుట్టిన భయం)లోనే తన్మయత్వమెక్కువని వ్యాసవచనం.

శ్లో॥ యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్ ।
న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః ॥ – భాగవతమ్ 7/1/26

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రయాన్తి :** | ప్రయాతి | ప్రయాతః | **ప్రయాన్తి** |
| | ప్రయాసి | ప్రయాథః | ప్రయాథ |
| | ప్రయామి | ప్రయావః | ప్రయామః. |

*

**శ్లో॥ కిం భ్రాన్తోఽసి విరుద్ధభాషణమిదం మా బ్రూహి భో! దుర్మతే!**
**భ్రాన్తిస్తే విపరీతవాగపి మనో యత్తే మయా నిర్జితమ్ ।**
**మత్ఖడ్గాభిహతిం కిమిచ్ఛసి శనైర్హస్తాద్గలంశ్చఞ్చలాత్**
**స త్వామేవ హనిష్యతీశ్వరభటం మాం హన్తుమీశోఽస్తి కః ॥ 11-21**

**అ :** కంసుడు తనలో తాము మాటాడుకోవటం – భీతధీరస్వభావాలతో. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** భో! దుర్మతే! భ్రాంతః అసి కిమ్? ఇదం విరుద్ధభాషణం మా బ్రూహి. యత్ తే మనః మయా నిర్జితం (తత్) తే భ్రాన్తిః, విపరీత–వాక్ అపి.

– మత్–ఖడ్గ–అభిహతిమ్ ఇచ్ఛసి కిమ్?

– చంచలాత్ హస్తాత్ శనైః గళన్ సః త్వామ్ ఏవ హనిష్యతి. ఈశ్వర–భటం మాం హన్తుం కః ఈశః అస్తి?

**ప్ర :** భో! దుర్మతే! = ఓరీ దుర్బుద్ధీ (దుష్టా మతిః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), భ్రాంతః = (మతి) చెదిరిన వాడివిగా, అసి కిమ్? = ఉన్నావా? (అస భువి పరస్మైపది–లట్–మ.ఏ.), ఇదమ్ = ఈ, విరుద్ధ–భాషణమ్ = పొసగని మాటను, మా బ్రూహి = చెప్పవద్దు (బ్రూ వ్యక్తాయాం వాచి–పరస్మైపది–లోట్–మ.ఏ.), యత్ = ఎందుకంటే, తే = నీయొక్క, మనః = హృదయం, మయా = నాచేత, నిర్జితమ్ = ఓడింపబడింది. (నిర్–జి ధాతువుపై క్త ప్రత్యయం), తత్ = అందువల్ల, తే = నీకు, భ్రాంతిః = భ్రమ, విపరీత–వాగ్–అపి = విపరీతమైన మాట కూడా (విపరీతా చ సా వాక్),

–మత్–ఖడ్గ–అభిహతిమ్ : మత్ = నాయొక్క, ఖడ్గ = కత్తియొక్క, అభిహతిమ్ = దెబ్బను (మమ ఖడ్గః తస్య అభిహతిః తామ్), ఇచ్ఛసి కిమ్? = కోరుతున్నావా? (ఇష ఇచ్ఛాయాం–పరస్మైపది–లట్–మ.ఏ.),

–చంచలాత్ = వణుకుతున్న, హస్తాత్ = చేతినుండి, శనైః = మెల్లగా, గలన్ = జారుతూ (గళ ధాతువుపై శతృ ప్రత్యయం), సః = ఆ కత్తి, త్వామ్–ఏవ = నిన్నే, హనిష్యతి = చంపగలదు. (హన హింసాగత్యోః పరస్మైపది–లృట్–ప్ర.ఏ.) ఈశ్వర–భటమ్ = కృష్ణభక్తుడనైన (ఈశ్వరస్య భటః, తమ్), మామ్ = నన్ను, హన్తుమ్ = చంపుటకు (హన్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), కః = ఎవడు? ఈశః అస్తి = సమర్థుడు కాగలడు?

**తా ॥** ఓయీ దుర్బుద్ధీ! తల తిరుగుతోందా? ఏమిటీ విపరీత వచనాలు. నీ మనస్సును నేను గెలుచుకొన్నాను. అందుకే నీకు మతి భ్రమణం విరుద్ధభాషణం.

నా కత్తి దెబ్బ తినాలను కొంటున్నావా?

వణుకుతున్న నీ చేతినుండి మెల్లగా జారిన ఆ కత్తి నిన్నే చంపుతుంది. కృష్ణ సేవ చేస్తున్న నన్ను చంపగల వాడెవడున్నాడు?

**వి :** 1. కంసుని లోని ధీరుడిని మెల్లమెల్లగా పిరికితనం అణిచేస్తోంది. ఇతరులెవరివల్లనైనా ప్రాణభయం కలిగితే కృష్ణుని ఆశ్రయించవచ్చు. కృష్ణునివలననే భయమేర్పడితే ఇక ఆశ్రయించటానికి ఎవ్వరూ వుండరు. ఇతర దేవతలు పొందే బాధలనుండి ఉపసంహారానికి కృష్ణుని ఆశ్రయించవచ్చు. ఆయన ఏదో ఒక రూపంలో తొలగిస్తాడు.

ఇప్పుడు కృష్ణుడు అలా ప్రజల బాధలు తీర్చటానికే అవతరించాడు గదా. మరింకెవరి దగ్గరకు వెళ్ళటం కుదురుతుంది?

2. **అసి/అస్తి :** 11-18వ శ్లోక భాగము చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **బ్రూహి :** | బ్రవీతు/బ్రూతాత్ | బ్రూతామ్ | బ్రువంతు |
| | **బ్రూహి**/బ్రూతాత్ | బ్రూతమ్ | బ్రూత |
| | బ్రవాణి | బ్రవావ | బ్రవామ |

| | | | |
|---|---|---|---|
| **ఇచ్ఛసి :** | ఇచ్ఛతి | ఇచ్ఛతః | ఇచ్ఛన్తి |
| | **ఇచ్ఛసి** | ఇచ్ఛథః | ఇచ్ఛథ |
| | ఇచ్ఛామి | ఇచ్ఛావః | ఇచ్ఛామః |

| | | | |
|---|---|---|---|
| **హనిష్యతి :** | **హనిష్యతి** | హనిష్యతః | హనిష్యన్తి |
| | హనిష్యసి | హనిష్యథః | హనిష్యథ |
| | హనిష్యామి | హనిష్యావః | హనిష్యామః. |

*

**శ్లో॥ క్లీబః కిం కురుషే త్వమజ్ఞ! భవతః క్లీబోపమాం దిత్సయా**
**తద్భావం శిరసా దధామి బహునా కిం జల్పితేనాధునా ।**
**నిత్యం మన్నియతః స వాతి పవనః పాకం విధత్తేఽనలః**
**సూర్యోఽసౌ సముదేతి తం హరిమృతే సర్వం జగన్మద్వశమ్ ॥ 11-22**

**అ :** భయానికీ, కంసుడికీ మధ్య సంవాదం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అజ్ఞ! క్లీబః త్వం కిం కురుషే? భవతః క్లీబ+ఉపమాం దిత్సయా తద్-భావం శిరసా దధామి. అధునా బహునా జల్పితేన కిమ్? మత్+నియతః సః పవనః నిత్యం వాతి అనలః పాకం విధత్తే. అసౌ సూర్యః సముదేతి. తమ్ హరిమ్ ఋతే సర్వం జగత్ మద్-వశమ్.

**ప్ర :** అజ్ఞ = తెలివి తక్కువ వాడా!, క్లీబః = నపుంసకుడవైన (భయ శబ్దం నపుంసకలింగం కాబట్టి ఈ ఆరోపణ), త్వమ్ = నీవు, కిం కురుషే? = ఏం చేయగలవు? భవతః = నీకు, క్లీబ+ఉపమామ్ = నపుంసకునితో పోలికను (క్లీబేన ఉపమా, తామ్), దిత్సయా = ఇవ్వదలచి (దాతుమ్ ఇచ్ఛా దిత్సా, తయా), తద్-భావమ్ = నపుంసకభావాన్ని, శిరసా = తలతో, దధామి = వహిస్తున్నాను. (ధా ధారణపోషణయోః-పరస్మైపది-లట్-ఉ.ఏ.), అధునా = ఇప్పుడు, బహునా = ఎక్కువగా/అనేకరీతులుగా, జల్పితేన = మాటాడటం వలన, కిమ్? = ఏం లాభం?, మత్-నియతః (సన్) = నాచే నియమింపబడి, సః పవనః = ఆ వాయువు, వాతి = వీస్తోంది (వా గతిగంధనయోః పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), అనలః = అగ్ని, పాకం విధత్తే = వండుతాడు (వి+ధా ధారణపోషణయోః-ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ), అసౌ = ఆ, సూర్యః = సూర్యుడు, సమ్-ఉద్-ఏతి = ఉదయిస్తాడు. (ఇ-గతౌ పరస్మైపది-లట్-(ప్ర.ఏ), తం హరిమ్ ఋతే = ఆ కృష్ణుడుతప్ప మిగిలిన, సర్వం జగత్ = లోకమంతా, మద్-వశమ్ = నాకు లొంగినదే.

**తా ॥** నువ్వు నపుంసకుడివి. నన్నేం చేయగలవు? నీకు నపుంసకుడితో సమానత్వాన్ని కలిగించాలని నేను నపుంసకత్వాన్ని శిరసా వహిస్తున్నాను. ఇప్పుడిన్ని మాటలెందుకు? నాకు భయపడే నిరంతరంగా గాలి వీస్తోంది. అగ్నిపక్వం చేస్తున్నాడు. సూర్యుడు ఉదయిస్తున్నాడు. కృష్ణుడు తప్ప మిగిలిన ప్రపంచమంతా నాకు లొంగి నడచుకొనేదే.

**వి :** 1. 19వ శ్లోక వ్యాఖ్యలో ఉదాహరించిన తైత్తిరీయోపనిషద్వచనాన్ని (2/8) ఇక్కడ వాచా వినిపిస్తున్నాడు కవి.

2. జ్ఞానం యొక్క ఫలం నిర్భయత్వం. బ్రతకడాన్ని అయినా చనిపోవటాన్ని అయినా ఏ తేడా లేకుండా అనుభవించటానికి సిద్ధపడగలగటం జ్ఞానఫలం కావాలి. మనమేదో ఒకదాన్ని అనుకూలంగా భావించి అది అందుబాటులో లేదని విలపించటం, ఆక్రోశించటం పిరికితనమే. అందుకే ఇవేవీపట్టని పరాత్పరుడు మిగిలినవారంతా భయానికి లోనయ్యేవారే దాదాపుగా. ఆధునికతత్త్వవేత్తలు చాలామంది ఈ అభిప్రాయం మీదనే దృష్టిని కేంద్రీక రించారు. ప్రాచీనతత్త్వశాస్త్రమీ విషయాన్ని చెప్పలేదని కాదు. ఆ ప్రాచీనతత్త్వశాస్త్రాన్ని పదిమందికీ అందించే క్రమంలో ఈ ఆధునికతత్త్వవేత్తలు ఆ అంశంపై ప్రత్యేకదృష్టి పెట్టారు.

| | | | |
|---|---|---|---|
| 3. **దధామి :** | దధాతి | ధత్తః | దధతి |
| | దధాసి | ధత్థః | దత్థ |
| | **దధామి** | దధ్వః | దధ్మః |
| **వాతి :** | **వాతి** | వాతః | వాన్తి |
| | వాసి | వాథః | వాథ |
| | వామి | వావః | వామః |
| **విధత్తే :** | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | విధత్సే | విదధాథే | విదధధ్వే |
| | విదధే | విదధ్వహే | విదధ్మహే |
| **సముదేతి :** | **సముదేతి** | సముదితః | సముద్యన్తి |
| | సముదేషి | సముదిథఃసముదిత | |
| | సముదేమి | సముదివఃసముదిమః. | * |

**శ్లో॥ సత్త్వం నిష్ఫలమాతనోమి మలినం భిన్నం ముఖం వేపథు-**
**గ్రస్తం గాత్రమధీరమక్షియుగలం చిత్తం చ చిన్తాకులమ్ ।**
**దైన్యం వాచి విరక్తతాం చ విభవే త్యాగం చ భోగావలే-**
**ర్లజ్జామానయశశ్చ్యుతిం విరచయే చిత్తేఽహముజ్జృమ్భితః ॥** **11-23**

**అ :** మధుసూదనుని దూతవంటి భయం కంసుని బెదిరించటం/హెచ్చరించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అహం చిత్తే ఉజ్జృంభితః (సన్) సత్త్వం నిష్ఫలమ్ ఆతనోమి ముఖం మలినం భిన్నమ్ (ఆతనోమి) గాత్రం వేపథు-గ్రస్తమ్ (ఆతనోమి) అక్షి-యుగలమ్ అధీరమ్ (ఆతనోమి) చిత్తం చ చిన్తా+ఆకులమ్ (ఆతనోమి). వాచి దైన్యమ్ (ఆతనోమి) విభవే విరక్తతామ్ (ఆతనోమి) భోగ+ఆవలేః చ త్యాగమ్ (ఆతనోమి) లజ్జా-మాన-యశః-చ్యుతిం విరచయే

**ప్ర :** అహం = నేను, చిత్తే = మనస్సులో, ఉత్-జృంభితః సన్ = బాగా చెలరేగిన వాడనై, సత్త్వమ్ = బలాన్ని (సత్త్వం గుణే పిశాచాదౌ బలే ద్రవ్యస్వభావయోః - విశ్వకోశః-వాన్త-16), నిష్ఫలమ్ = నిరుపయోగంగా, ఆతనోమి = చేస్తాను (ఆ తనూ విస్తారే లట్-ఉ.ఏ.), ముఖమ్ = మొగాన్ని, మలినమ్ = మలినంగా, భిన్నమ్ = కలత పడినట్లుగా (చేస్తాను), (ఇక్కడ **స్విన్నమ్** అని పాఠాంతరం. ఆ పక్షంలో చెమటపట్టేటట్లు చేస్తానని అర్థం), గాత్రమ్ = శరీరాన్ని (గాతే ఇతి గాత్రమ్), వేపథు-గ్రస్తమ్ : వేపథు = వణకుతో (రాగరోషభయాదిభ్యో వేపథుర్గాత్రకంపనమ్), గ్రస్తమ్ = కూడినదిగా (చేస్తాను) (వేపథునా గ్రస్తమ్), అక్షి-యుగలమ్ = కనుదోయిని

(అక్ష్ణః యుగలమ్), అధీరమ్ = బెదరినట్లుగా (చేస్తాను), చిత్తం చ = మనస్సును కూడా, చిన్తా+ఆకులమ్ = చింతతో కలత చెందునట్లు (చేస్తాను). (చింతయా ఆకులం తత్), వాచి = మాటలో, దైన్యమ్ = దీనత్వాన్ని (కలిగిస్తాను), విభవే = సంపదలపై, విరక్తతామ్ = ప్రేమ లేకపోవటాన్ని (చేస్తాను), భోగ+ఆవలేః = భోగాల వరుసనుండి, త్యాగమ్ = త్యాగాన్ని (కలిగిస్తాను), లజ్జా... చ్యుతిమ్ : లజ్జా = సిగ్గు/బిడియం, మాన = గౌరవం/కోపం, యశః = కీర్తి–వీటినుండి, చ్యుతిమ్ = జారుబాటును, విరచయే = కల్పిస్తాను. (వి–రచ ప్రతియత్నే–ఆత్మనేపది–లట్–ఉ.ఏ.)

**తా ॥** కంసా! నేను నీ మనస్సులో చెలరేగితే నీ బలం నిరుపయోగమవుతుంది. నీ ముఖం మలినమవుతుంది. చెమటతో/కలతతో నిండుతుంది. నీ శరీరంలో వణుకు పుడుతుంది. నీ కళ్ళలో పిరికితనం కనిపిస్తుంది. నీ మనస్సు చింతాకులమవుతుంది. మాటలో దీనత్వం, సంపదలపై విరక్తి, భోగాలపై అనాసక్తి కలుగుతాయి. నీ లజ్జ, మానం, కీర్తి అన్నీ జారిపోతాయి.

**వి :** 1. ధనుశ్శాలలో కృష్ణుడు చేసిన ఒక్కపని – వింటిని విరవటం – కంసుని అతలాకుతలం చేస్తోంది. కృష్ణుడు చేసినదొక మానసికమైన ప్రయోగం. అది గొప్పగా విజయవంతమయింది. కంసునితో పోరాడకుండానే దాదాపు కంసుని అధ్యాయాన్ని ముగించినట్లవుతోంది.

శ్లో॥ తావద్భయస్య భేతవ్యం యావద్భయమనాగతమ్ ।
ఆగతం చ భయం వీక్ష్య నరః కుర్యాద్ యథోచితమ్ ॥ – హితోపదేశః – 1/67

భయం కలుగక ముందు ఏమవుతుందో అని జంకవచ్చు. కాని భయం దగ్గరైనప్పుడు ప్రతీకారాన్ని గురించి ఆలోచించాలి. ఇక అప్పుడు భయముండకూడదు. కాని కంసుడు భయపడుతున్నాడు.

2. '**అతనోమి**' అన్న ఒకే క్రియాపదం విభిన్న కర్తృవాచకపదాలతో, ప్రకృతాలతో– అన్వయిస్తోంది. కాబట్టి తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' – (కు. 44)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆతనోమి :** | ఆతనోతి | ఆతనుతః | ఆతన్వన్తి |
| | ఆతనోషి | ఆతనుథః | ఆతనుథ |
| | **ఆతనోమి** | ఆతనువః/అతన్వః | ఆతనుమః/అతన్మః |

**విరచయే :** 11–19వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ రే రే! మంద! బహిః ప్రయాహి యది భో! భోజేశ! కృష్ణాశ్రితో**
**భూయాస్తర్హి తథా కరోమ్యపరథా త్వాం నోభయత్రోత్సృజే ।**
**ధైర్యస్థైర్యయుతాచ్యుతప్రియమనో మహ్యం న వై రోచతే**
**క్షేమాయాభ్యుదయాయ చ ప్రతిదినం తద్వైరిచేతో మమ ॥ 11–24**

**అ :** కంస–భయ సంవాదం. కంసుడు భయం నుండి బయట పడటానికి ప్రయత్నించటం.–శార్దూలవిక్రీడితం.

**అ :** రే రే! మంద! బహిః ప్రయాహి. భో భోజేశ ! యది కృష్ణం శ్రితః భూయాః తర్హి తథా కరోమి అపరథా త్వామ్ ఉభయత్ర న ఉత్సృజే. ధైర్య–స్థైర్య–యుత–అచ్యుత–ప్రియ–మనః మహ్యం న రోచతే వై. తద్ వైరి–చేతః ప్రతిదినం మమ క్షేమాయ అభ్యుదయాయ చ (భవతి)

**ప్ర :** – రే రే! మంద! = ఓరీ బుద్ధిహీనుడా! బహిః = వెలుపలకు, ప్రయాహి = వెళ్ళు. భో! భోజ+ఈశ! = ఓ భోజరాజా! యది = ఒకచో, కృష్ణాశ్రితః (కృష్ణం శ్రితః) = కృష్ణుని ఆశ్రయించిన వాడవు, భూయాః = కాగలిగితే (భూ సత్తాయామ్ – పరస్మైపది–ఆశీర్లిఙ్–మ.ఏ.), తర్హి = అప్పుడు (ఆ నిబంధనమేరకు), తథా = ఆ రీతిగా,

కరోమి = చేస్తాను. (కృ కరణే–పరస్మైపది–లట్–ఉ.ఏ.), అపరథా = వేరొకరీతిగా అయితే (కృష్ణుని ఆశ్రయించక పోతే), త్వామ్ = నిన్ను, ఉభయత్ర = రెండుతావులా (ఇలలోనూ కలలోనూ), న ఉత్సృజే = విడువను (ఉత్–సృజ విసర్గే–ఆత్మనేపది–లట్–ఉ.ఏ.), ధైర్య... మనః : ధైర్య = ధీరత్వంతో, స్థైర్య = నిలకడతో, యుత = కూడిన, అచ్యుత–ప్రియ = కృష్ణ–భక్తులయొక్క, మనః = మనస్సు (జాత్యేకవచనం) (ధైర్యేణ స్థైర్యేణ చ యుతమ్ అచ్యుతస్య ప్రియాణాం మనః), మహ్యమ్ = నాకు ('రుచ్యర్థానాం ప్రీయమాణః'–అష్టాధ్యాయి (1–4–33)–చ.వి., న రోచతే = ఇష్టం లేదు. (రుచ్ దీప్తావభీప్రీతౌ చ–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), తద్–వైరి–చేతః : తద్ = ఆ కృష్ణునియొక్క, వైరి = శత్రువులయొక్క, చేతః = మనస్సు (తస్య వైరీ తస్య చేతః), ప్రతిదినమ్ = ప్రతిరోజూ (దినే దినే), మమ = నాకు, క్షేమాయ = క్షేమం కొరకు (ఉన్నది ఇబ్బంది లేకుండా ఉండటం క్షేమం), అభి+ఉదయాయ చ = అభ్యుదయం కొరకూ (లేనిది సమకూరటం అభ్యుదయం), (భవతి = కాగలదు).

**తా ॥ కంసుడు:** ఓరీ మూఢుఢా! నా మనస్సులో నుండి బయటకు పో! **భయం:** పోతాను. భోజరాజా! నువ్వు కృష్ణుని ఆశ్రయాన్ని పొందితే నేనలాగే చేస్తాను. లేకపోతే నిన్ను రెండుచోట్లా కూడా వదలను. **కంసుడు:** ధైర్యస్థైర్యాలతోకూడిన కృష్ణభక్తుల మనస్సంటే నా కిష్టం. కృష్ణుని శత్రువుల మనస్సుమాత్రం నిరంతరంగా నాకు క్షేమాన్నీ, అభ్యుదయాన్నీ కలిగిస్తుంది.

వి : 1. శ్లో॥ '**న భయం క్వచిదాప్నోతి** వీర్యం తేజశ్చ విందతి'

'**భయాన్ముచ్యేత భీతస్తు** ముచ్యేతాపన్న ఆపదః'

శ్లో॥ 'న వాసుదేవభక్తా నా మశుభం విద్యతే క్వచిత్।
జన్మ మృత్యుజరావ్యాధి భయం నైవోపజాయతే ॥' – విష్ణుసహస్రనామ ఫలశ్రుతి.

కాబట్టి విష్ణుభక్తులకు భయమంటూ ఉండదు. అందువల్ల భయానికి వారు నచ్చరు. కృష్ణద్వేషులు నిరంతరమూ బెదరుతుంటారు. కాబట్టి భయం వారిని నిరంతరమూ లొంగదీసుకొని స్థిరంగా కాలం గడుపుతుంది.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥ – భగవద్గీత 18/66

అని భగవద్గీత పరమశరణాగతిని బోధించింది ఈ భయం నుండి బయటపడటానికే.

2. **ప్రయాహి :** ప్రయాతు/ప్రయాతాత్ ప్రయాతామ్ ప్రయాన్తు

| | | | |
|---|---|---|---|
| **ప్రయాహి :** | ప్రయాతు/ప్రయాతాత్ | ప్రయాతామ్ | ప్రయాన్తు |
| | **ప్రయాహి**/ప్రయాతాత్ | ప్రయాతమ్ | ప్రయాత |
| | ప్రయాణి | ప్రయావ | ప్రయామ |
| **భూయాః :** | భూయాత్ | భూయాస్తామ్ | భూయాసుః |
| | **భూయాః** | భూయాస్తమ్ | భూయాస్త |
| | భూయాసమ్ | భూయాస్వ | భూయాస్మ |
| **కరోమి :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | **కరోమి** | కుర్వః | కుర్మః |
| **ఉత్సృజే :** | ఉత్సృజతే | ఉత్సృజేతే | ఉత్సృజన్తే |
| | ఉత్సృజసే | ఉత్సృజేథే | ఉత్సృజధ్వే |
| | **ఉత్సృజే** | ఉత్సృజావహే | ఉత్సృజామహే |

| | | | |
|---|---|---|---|
| **రోచతే :** | **రోచతే** | రోచేతే | రోచన్తే |
| | రోచసే | రోచేథే | రోచధ్వే |
| | రోచే | రోచావహే | రోచామహే. |

*

**శ్లో॥ శమ్భుం సమ్భజ పద్మయోనిమథవా చంద్రేంద్రవీంద్రాదికాన్**
**స్వర్గం గచ్ఛ తమో వ్రజ ప్రవిశ వా పాతాళమత్రైవ వా ।**
**రక్షాం భిత్తిసహస్రవారిధిమహాశైలజ్వలత్పావకైః**
**కృత్వా తిష్ఠ తథాపి కృష్ణవిమతం త్యక్ష్యామి న త్వామహమ్ ॥ 11-25**

**అ :** కృష్ణ విరోధిని ఎవ్వరూ కాపాడలేరని కవి భయం ద్వారా చెప్పించి ప్రతిపాదించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** శంభుం సంభజ త్వామ్ అహం న త్యక్ష్యామి అథవా పద్మయోనిం (సంభజ). చంద్ర+ఇంద్ర–వి+ఇంద్ర+ఆదికాన్ (సంభజ). స్వర్గం గచ్ఛ. తమః వ్రజ. వా పాతాళం ప్రవిశ వా. అత్ర+ఏవ (తిష్ఠ). భిత్తి–సహస్ర–వారిధి–మహా–శైల–జ్వలత్–పావకైః రక్షాం కృత్వా తిష్ఠ. తథా+అపి కృష్ణ–విమతం త్వామ్ అహం న త్యక్ష్యామి.

**ప్ర :** శంభుమ్ = శివుని, సంభజ = సేవించు(కో). (సమ్ భజ సేవాయాం–పరస్మైపది–లోట్–మ.ఏ.), అథవా = లేకుంటే, పద్మయోనిమ్ = బ్రహ్మను (పద్మం యోనిః యస్య తమ్), చంద్ర–ఇంద్ర–వి+ఇంద్ర+ఆదికాన్ : చంద్ర = చంద్రుడు, ఇంద్ర = ఇంద్రుడు, వి+ఇంద్ర = పక్షిరాజైన గరుడుడు, ఆదికాన్ = మొదలగువారినైనా, సంభజ = సేవించు/ఆశ్రయించు, త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, న త్యక్ష్యామి = విడువబోను (త్యజ హానౌ పరస్మైపది–ల్యట్–ఉ.ఏ.), స్వర్గమ్ = స్వర్గలోకానికి, గచ్ఛ = వెళ్ళు (గమ్ గతౌ పరస్మైపది–లోట్–మ.ఏ.)(అయినా నిన్ను నేను వదలను), తమః = చీకటిలోకానికి, వ్రజ = వెళ్ళు (వ్రజ గతౌ పరస్మైపది లోట్–మ.ఏ.) (అయినా నిన్ను వదలను), వా = లేక, పాతాళమ్ = పాతాళం లోనికి, ప్రవిశ = ప్రవేశించు (ప్ర విశ ప్రవేశనే–పరస్మైపది–లోట్–మ.ఏ.), వా = లేక, అత్ర+ఏవ = ఇక్కడే, (తిష్ఠ = ఉండు) (అయినా నేను నిన్ను వదలను), భిత్తి... పావకైః : భిత్తి–సహస్ర = వేలకొలది గోడలతో, వారిధి = అగడ్తలతో (కందకాలతో) మహాశైల = పెద్ద కొండలతో, జ్వలత్ = మండుతున్న, పావకైః = అగ్నితో (భిత్తీనాం సహస్రం తాని చ, వారిధయశ్చ, మహాన్తః చ తే శైలాశ్చ, జ్వలన్తః చ తే పావకాశ్చ, తైః ), రక్షామ్ = కాపుదలను, కృత్వా = ఏర్పరచుకొని (కృ ధాతువుపై క్త ప్రత్యయం), తిష్ఠ = నిలు (స్థా–గతినివృత్తౌ పరస్మైపది–లోట్–మ.ఏ.), తథాపి = అయినా కూడా, కృష్ణ–విమతమ్ = కృష్ణునకు శత్రువైన (కృష్ణస్య విమతః తమ్), త్వామ్ = నిన్ను, అహమ్ = నేను, న త్యక్ష్యామి = విడువబోను.

**తా ॥** కంసా! నువ్వు శివుణ్ణి ఆశ్రయించు. లేదా బ్రహ్మను ఆశ్రయించు. లేదా చంద్రుణ్ణో, ఇంద్రుణ్ణో, గరుత్మంతుణ్ణో మరెవరినైనా సరే శరణు కోరుకో. కృష్ణుని వ్యతిరేకించే నిన్ను మాత్రం నేను వదలను.

స్వర్గానికి పో! పాతాళానికి పో! చీకటిలోకాలకు పో! లేదా ఇక్కడే నిలు. ఎక్కడున్నా నిన్ను నేను వదలను. గోడలూ, కందకాలు, పర్వతాలు, అగ్నులు– వేటితో అయినా రక్షణ కల్పించుకొని నిలు. కృష్ణ శత్రువయిన నిన్ను మాత్రం నేను వదలను.

**వి :** 1. రాక్షసులకూ, విష్ణువుకూ మాత్రమే శత్రుత్వాన్ని వర్ణిస్తాయి పురాణాదులు. మిగిలిన వారితో వారికి శత్రుత్వం తక్కువ. శివుడు, బ్రహ్మ వారికిష్టమైన వరాలనిచ్చినవారే. హిరణ్యకశిపుడు బ్రహ్మ అనుగ్రహాన్ని పొందినవాడు. రావణుడు బ్రహ్మ ద్వారా వరాలనూ, శివుని అనుగ్రహాన్ని కూడా పొందినవాడు. బాణాసురుడు శివుని ఆశ్రయించినవాడే. పాతాళాన్ని ఆశ్రయించివున్నవాడు నరకాసురుడు. అయినా విష్ణుశత్రువులూ విష్ణువుకు భయపడినవారే. భంగపడినవారే.

బ్రహ్మరుద్రులు రాక్షసులకు కూడా వరాలివ్వటం వారిని అహంకారప్రవృత్తిని అంత మొందించటానికి విష్ణువు మాత్రమే వివిధ అవతారాలను ధరింపవలసిరావటం భారతీయ విశ్వాసాలకు సంబంధించిన పురాణగాథలలోని ఒక విలక్షణత. ఆ విలక్షణతయే కంసుడు భయపడటానికి కానీ, కంసునిలోని భయం తొలగిపోవటానికి భయమే దారిచూపటానికి కానీ కారణం.

2. ధనుర్భంగధ్వని కంససంహారమహోత్సవానికి ఆరంభమంగళవాద్యధ్వని అయిందని నారాయణీయ వర్ణన.

శా॥ ఆ కంస క్షపణోత్సవమ్మునకు మున్నారంభతూర్యస్వన
మ్మై కోదండరవమ్ము వేల్పులకు రోమాంచమ్ము గల్పించెఁ జీ
కాకున్ గూర్చెను గంసుచిత్తమునకున్ ఖండాల్పఖండస్ఫుట
వ్యాకృత్త్యోద్భట చాపరక్షకభటవ్యాలోల హాహా ధ్వనుల్.

– నారాయణీయమ్–74/9 – అనువక్త–విద్వాన్ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులు.

3. **సంభజ :** సంభజతు/సంభజతాత్ సంభజతామ్ సంభజన్తు
**సంభజ**/సంభజతాత్ సంభజతమ్ సంభజత
సంభజాని సంభజావ సంభజామ

**గచ్ఛ :** గచ్ఛతు గచ్ఛతామ్ గచ్ఛన్తు
**గచ్ఛ**/గచ్ఛతాత్ గచ్ఛతమ్ గచ్ఛత
గచ్ఛాని గచ్ఛావ గచ్ఛామ

**వ్రజ :** వ్రజతు/వ్రజతాత్ వ్రజతామ్ వ్రజన్తు
**వ్రజ**/వ్రజతాత్ వ్రజతమ్ వ్రజత
వ్రజాని వ్రజావ వ్రజామ

**ప్రవిశ :** ప్రవిశతు/ప్రవిశతాత్ ప్రవిశతామ్ ప్రవిశన్తు
**ప్రవిశ**/ప్రవిశతాత్ ప్రవిశతమ్ ప్రవిశత
ప్రవిశాని ప్రవిశావ ప్రవిశామ

**తిష్ఠ :** తిష్ఠతు/తిష్ఠతాత్ తిష్ఠతామ్ తిష్ఠన్తు
**తిష్ఠ**/తిష్ఠతాత్ తిష్ఠతమ్ తిష్ఠత
తిష్ఠాని తిష్ఠావ తిష్ఠామ

**త్యక్ష్యామి :** త్యక్ష్యతి త్యక్ష్యతః త్యక్ష్యన్తి
త్యక్ష్యసి త్యక్ష్యథః త్యక్ష్యథ
**త్యక్ష్యామి** త్యక్ష్యావః త్యక్ష్యామః.

*

**శ్లో॥ యుద్ధార్థం న కదాపి గచ్ఛతి గతోఽప్యోజస్వినాం పృష్ఠత–**
**స్తిష్ఠత్యన్యమవేక్ష్య శస్త్రనికరం పృథ్వ్యాం క్షణేనోజ్ఝతి ।**
**శత్రుం స్తౌతి తృణాఙ్గులీదలమదన్ కమ్పీ పతన్ ధావతి**
**స్తబ్ధేత్థం బహులోకనిన్దితదశాం సమ్ప్రాపయిష్యామ్యహమ్ ॥ 11–26**

**అ :** లోకనిందితమైన పిరికితనాన్ని నీలో వర్ధిల్లజేస్తానని భయం కంసుని బెదిరించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్తబ్ధ! యుద్ధార్థం న కదా అపి గచ్ఛతి గతః అపి ఓజస్వినాం పృష్ఠతః తిష్ఠతి అన్యమ్ అవేక్ష్య శస్త్ర–నికరం

క్షణేన పృథ్వ్యామ్ ఉజ్ఝతి. తృణ+అంగులీ-దలమ్ అదన్ శత్రుం స్తౌతి కంపీ పతన్ ధావతి ఇతి బహు-లోక-నిందిత-దశామ్ అహం సంప్రాపయిష్యామి.

**ప్ర :** స్తబ్ధ! = చలనం లేనివాడా! (నేను మనస్సులో చేరితే), యుద్ధార్థమ్ = పోరికి, కదా+అపి = ఎప్పుడూ, న గచ్ఛతి = వెళ్ళడు. (గమ్ గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), గతః+అపి = ఒకవేళ వెళ్ళినా, ఓజస్వినామ్ = శూరులయొక్క, పృష్ఠతః = వెనుకనే, తిష్ఠతి = నిలుస్తాడు. (స్థా గతినివృత్తౌ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), అన్యమ్ = శత్రువును, అవేక్ష్య = చూసి (అవ-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), క్షణేన = క్షణకాలంలోనే, శస్త్ర-నికరమ్ : శస్త్ర = ఆయుధాలయొక్క, నికరమ్ = సమూహాన్ని, పృథ్వ్యామ్ = నేలపై, ఉజ్ఝతి = విడుస్తాడు. తృణ+అంగులీ-దళమ్ : తృణ = గడ్డి, అంగులీ-దళమ్ = గజకర్ణికా (ఒక ఓషధి) దళాలను (ఆంధ్రశబ్దరత్నాకరము ప్రథమసంపుటి-పు.11), అదన్ = తింటూ (అద ధాతువుపై శతృ ప్రత్యయం), శత్రుమ్ = పగవానిని, స్తౌతి = స్తోత్రం చేస్తాడు. (స్తు స్తుతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), కమ్పీ = వణుకుగలవాడై, పతన్ = పడుతూ (లేస్తూ), ధావతి = పరుగెడతాడు. (ధావ్ గతిశుద్ధయోః-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఇత్థమ్ = ఈ రీతిగా, బహు...దశామ్: బహు = అనేకవిధాలుగా, లోక = జనులచే, నిందిత = నిందింప బడిన, దశామ్ = స్థితికి (బహ్వీ చ సా లోకైః నిందితా దశా తామ్), అహమ్ = నేను, సంప్రాపయిష్యామి = చేర్చగలను. (సమ్-ప్ర+ఆప్ వ్యాప్తౌ-ణిచ్-పరస్మైపది-ల్యట్-ఉ.ఏ.)

**తా ॥** నేను (భయం) మనస్సులో ప్రవేశించి చెలరేగితే ఆ మనిషి యుద్ధానికి కూడా ఎప్పుడూ వెళ్ళడు (పిరికితనంతో). ఒకవేళ వెళ్ళినా శూరుల వెనుకనే తిరుగుతుంటాడు. (ఆత్మరక్షణ కోసం). శత్రువు కనిపించిన క్షణంలోనే బాణాలను నేలపై విడుస్తాడు. (అప్పుడు శత్రువు చంపడన్న నమ్మకంతో). గడ్డి, గాదం తింటూ శత్రువును పొగుడుతుంటాడు. (జాలి చూపకపోతాడా అని). వణకుతూ పడుతూ పరువెత్తి పారిపోతాడు రణభూమినుండి. (పారిపోతున్న వాడిని చంపకూడదన్న రణనీతి శత్రువుకు తెలుసన్న ధీమాతో). ఈ రీతిగా లోకులు నిందించే దశకు ఆ మనిషిని నడిపిస్తాను.

**వి :** 1. యుద్ధమంటే భయపడే స్థితి వస్తే ఆ వ్యక్తి ప్రవర్తన ఎలావుంటుందో మహాభారతంలోని ఉత్తరునిలో మనం గమనించవచ్చు. 'ఎత్తునఁ గొందుఁగౌరవుల'ను అని అంతఃపురంలో మాటాడిన ఉత్తరుడు కౌరవసేనను చూడగానే భయం ముదిరి ఎలా మాట్లాడుతున్నాడో చూడండి.

శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వల బలాత్యుగ్రంబుదగ్రధ్వజా
ర్చిష్మత్వాకలితంబు సైన్యమిది యేఁ జేరంగ శక్తుండనే.....

ఉ. కౌరవసేనఁజూచి వడఁకందొడఁగెన్ మదితోన మేను నీ
వూరక పోవుచున్కి యిది యొప్పునె యిప్పటి భంగిఁజూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునన్
దేరు మరల్పు ప్రాణములు దీపనమున్ వినవే బృహన్నలా. -విరాటపర్వము 4/52,55

| | | | |
|---|---|---|---|
| 2. **గచ్ఛతి :** | **గచ్ఛతి** | గచ్ఛతః | గచ్ఛన్తి |
| | గచ్ఛసి | గచ్ఛథః | గచ్ఛథ |
| | గచ్ఛామి | గచ్ఛావః | గచ్ఛామః |
| **తిష్ఠతి :** | **తిష్ఠతి** | తిష్ఠతః | తిష్ఠన్తి |
| | తిష్ఠసి | తిష్ఠథః | తిష్ఠథ |
| | తిష్ఠామి | తిష్ఠావః | తిష్ఠామః |

| | | | |
|---|---|---|---|
| **ఉజ్ఝతి :** | **ఉజ్ఝతి** | ఉజ్ఝతః | ఉజ్ఝన్తి |
| | ఉజ్ఝసి | ఉజ్ఝథః | ఉజ్ఝథ |
| | ఉజ్ఝామి | ఉజ్ఝావః | ఉజ్ఝామః |
| **స్తౌతి :** | **స్తౌతి**/స్తవీతి | స్తుతః/స్తువీతః | స్తువన్తి |
| | స్తౌషి/స్తవీషి | స్తుథః/స్తువీథః | స్తుథ/స్తవీథ |
| | స్తౌమి/స్తవీమి | స్తువః/స్తువీవః | స్తుమః/స్తువీమః |
| **ధావతి :** | **ధావతి** | ధావతః | ధావన్తి |
| | ధావసి | ధావథః | ధావథ |
| | ధావామి | ధావావః | ధావామః |

| | | | |
|---|---|---|---|
| **సంప్రాపయిష్యామి:** | సంప్రాపయిష్యతి | సంప్రాపయిష్యతః | సంప్రాపయిష్యన్తి |
| | సంప్రాపయిష్యసి | సంప్రాపయిష్యథః | సంప్రాపయిష్యథ |
| | **సంప్రాపయిష్యామి** | సంప్రాపయిష్యావః | సంప్రాపయిష్యామః. |

*

**శ్లో॥ గాథా తిష్ఠతు భూప! సమ్ప్రతి భవాన్ నిద్రాతి కిం నిద్రితః**
**స్వప్నం శోభనమేవ పశ్యతి రిపుం కిం నానిశం శఙ్కతే ।**
**ధైర్యం కిం హృది సన్దధాత్యనుచరాన్ ధీరాన్ కిముద్వీక్ష్యతే**
**స్వైరం మద్వశమానసస్య భవతః సౌఖ్యం క్వ సౌఖ్యార్థినః ॥ 11-27**

**అ :** కంసునితో భయవచనం - తన ప్రశ్నలతో ఆందోళనకు గురిచేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** భూప! గాథా తిష్ఠతు. భవాన్ సంప్రతి నిద్రాతి కిమ్? నిద్రితః శోభనమ్ ఏవ స్వప్నం పశ్యతి కిమ్? రిపుమ్ అనిశం న శంకతే కిమ్? ధైర్యం హృది సందధాతి కిమ్? ధీరాన్ అనుచరాన్ ఉద్వీక్షతే (ఉద్వీక్ష్యతే అని పాఠం. ఉద్వీక్ష్యతే అన్నది కర్మణి ప్రయోగం. కర్తృపదం భవచ్ఛబ్దం. 'ఉద్వీక్ష్యతే' పాఠమయితే కర్తృపదం తృతీయా విభక్తిలో వుండాలి. ఇది లేఖక దోషం వలన జరిగిన పొరపాటుకావచ్చు. నారాయణాచార్య వ్యాఖ్యానంలో కూడా ఉద్వీక్ష్యతే అన్న పాఠమే కనిపిస్తుంది కానీ వ్యాఖ్యానంలో ఆ పదానికర్థాన్ని వ్రాయలేదు వ్యాఖ్యాత), స్వైరం మద్+వశ-మానసస్య సౌఖ్య+అర్థినః భవతః సౌఖ్యం క్వ?

**ప్ర :** భూప! = రాజా!(భువం పాతీతి, తస్మాత్ సంబుద్ధిః), గాథా = లోకులందరూ చెప్పుకొనే కథ. ('గాథా వాగ్భేదవృత్తయోః' అని విశ్వకోశంలోనూ, 'గం గమనగీతయోః గా చ గాథాయాం (253) అని నానార్థమంజరి గీతార్థంలోనూ గాథాపదాన్ని నిర్దేశించాయి. 'గాథాసప్తశతి' వంటి గ్రంథాలలో కూడా గాథా పదం ఆ అర్థంలోనే కనిపిస్తుంది. కానీ అది అర్థ-విపరిణామంతో 'జనవ్యవహారంలోని కథ'గా పరిణమించింది.) తిష్ఠతు = అటుండుగాక! (స్థా గతినివృత్తౌ పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), భవాన్ = నువ్వు, సంప్రతి = ఇప్పుడు (నేను మదిలో వున్నప్పుడు), నిద్రాతి కిమ్ = కునుకు తీస్తున్నావా? (ని+ద్రా కుత్సాయాం గతౌ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), నిద్రితః = (ఏదోరీతిగా) నిద్రించినా, శోభనమ్ ఏవ = శుభ సూచకమైన, స్వప్నమ్ = కలను (**'స్వపో నన్'-అష్టాధ్యాయి (3-3-91)** సూత్రంతో స్వప్ ధాతువుపై నన్ ప్రత్యయం), పశ్యతి కిమ్ = చూస్తున్నావా? (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), అనిశమ్ = ఎల్లప్పుడూ, రిపుమ్ = శత్రువును, న శంకతే కిమ్? = అనుమానించటం లేదా? (శంక్ శంకాయామ్-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), హృది = మనస్సులో, ధైర్యమ్ = ధీరత్వాన్ని, సమ్-దధాతి కిమ్ = ధరిస్తున్నావా? (సమ్-ధా ధారణపోషణయోః-లట్-ప్ర.ఏ.), అనుచరాన్ = (నీ) సేవకులను (అనుచరన్తీతి

తాన్), ధీరాన్ = ధైర్యవంతులనుగా, ఉద్వీక్ష్యతే కిమ్? = చూస్తున్నావా? (ఉద్–వి–ఈక్ష దర్శనే –ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), స్వైరమ్ = స్వేచ్ఛగా, మద్వశ = నా అదుపులోనున్న, మానసస్య = మనస్సుగల వాడవైన (మమ వశే మానసం యస్య తస్య), సౌఖ్యార్థినః = సుఖాన్ని కోరుకున్నాడవగు, భవతః = నీకు, సౌఖ్యమ్ = సుఖం (సుఖినః భావః), క్వ = ఎక్కడిది?

**తా ॥** రాజా! (నీ గొప్పతనాన్ని గురించి) లోకం చెప్పుకొనే మాట అటుండనీ! నేను నీ మనస్సులో ప్రవేశించిన ఈ సమయంలో నువ్వు నిద్రపోతున్నావా? నిద్రించినా కమ్మని కలలు కంటున్నావా? శత్రువును గురించియే నిరంతరంగా శంకించకుండా వుంటున్నావా? గుండెలో ధైర్యం నిలకడగా వుందా? నీ అనుచరులు ధీరులుగా కనిపిస్తున్నారా? నీ అంతట నీవు నాకు లోబడ్డావు. ఇక సుఖంగా వుండాలని కోరుకున్నా నీకు సుఖం ఎక్కడినుండి వస్తుంది?

**వి :** 1. **తిష్ఠతు :** 11–25వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **నిద్రాతి :** | **నిద్రాతి** | నిద్రాతః | నిద్రాన్తి |
| | నిద్రాసి | నిద్రాథః | నిద్రాథ |
| | నిద్రామి | నిద్రావః | నిద్రామః |
| **పశ్యతి :** | **పశ్యతి** | పశ్యతః | పశ్యన్తి |
| | పశ్యసి | పశ్యథః | పశ్యథ |
| | పశ్యామి | పశ్యావః | పశ్యామః |
| **శంకతే :** | **శంకతే** | శంకేతే | శంకన్తే |
| | శంకసే | శంకేథే | శంకధ్వే |
| | శంకే | శంకావహే | శంకామహే |
| **సన్దధాతి :** | **సన్దధాతి** | సన్ధత్తః | సన్దధతి |
| | సన్దధాసి | సన్ధత్థః | సన్ధత్థ |
| | సన్దధామి | సన్దధ్వః | సన్దధ్మః |
| **ఉద్వీక్షతే :** | **ఉద్వీక్షతే** | ఉద్వీక్షేతే | ఉద్వీక్షన్తే |
| | ఉద్వీక్షసే | ఉద్వీక్షేథే | ఉద్వీక్షధ్వే |
| | ఉద్వీక్షే | ఉద్వీక్షావహే | ఉద్వీక్షామహే. |

*

**శ్లో॥ ఇత్థం సాధ్వససందిగ్ధబుద్ధిర్నిద్రాం న సోఽధ్యగాత్ ।**
**లబ్ధనిద్రోఽపి దుస్స్వప్నైః స్వర్ధోన్నద్ధో వ్యబోధ్యత ॥ 11–28**

**అ :** కంసుడు చెడుకలలతో కలతపడి మేలుకొనటం. –పథ్యావక్త్రమ్.

**అ :** ఇత్థం సాధ్వస–సందిగ్ధ–బుద్ధిః సః నిద్రాం న అధ్యగాత్. లబ్ధ–నిద్రః అపి దుస్స్వప్నైః స్పర్ధా+ఉన్నద్ధః వ్యబోధ్యత.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, సాధ్వస... బుద్ధిః :సాధ్వస = భయంతో (సాధూనామ్ అసమ్), (అతంకో భయమాశంకా దరస్త్రాసశ్చ సాధ్వసమ్– హలాయుధకోశః–725), సందిగ్ధ = ఊగిసలాడుతున్న, బుద్ధిః = మతిగల (సాధ్వసేన సందిగ్ధా మతిః యస్య సః), సః = ఆ కంసుడు, నిద్రామ్ = నిద్రను, న అధ్యగాత్ = పొందలేదు. (అధి–ఇ గతౌ–పరస్మైపది–లుజ్–ప్ర.ఏ.), లబ్ధ–నిద్రః అపి = నిదురించినా (లబ్ధా నిద్రా యేన సః), దుస్స్వప్నైః = పీడకలలతో,

స్పర్ధా+ఉన్నద్ధః : స్పర్ధా = స్పర్ధతో (జయేచ్ఛతో), ఉన్నద్ధః = ఉద్రిక్తుడై (ఉలికిపడి) (స్పర్ధయా ఉన్నద్ధః), వి+అబోధ్యత = మేల్కొన్నాడు. (వి-బుధ అవగమనే-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ రీతిగా భయానికి లోనైన కంసుడు ఊగిసలాడుతూ కర్తవ్యమూఢుడై నిద్రించలేక పోయాడు. (కొంతసేపటికి) కునుకు పట్టినా పీడకలలు కని ఎవరిమీదనో స్పర్ధతో ఉలికి పడిలేస్తున్నాడు.

**వి :** 1. శుభసూచనలు కలలో కనిపించక పోవటమే గాక, అశుభసూచనలు కలలో, ఇలలో కూడా కనిపించినట్లు వర్ణించటం ఏ సాహిత్యంలోనైనా కనిపిస్తుంది. ఈ విశ్వాసాలు, ఈ లక్షణాలు దేశకాలభేదం లేకుండా సర్వజాతులలో కనిపిస్తాయి. కంసునకు కలిగిన అశుభసూచనలను భాగవతమిలా వర్ణించింది.

శ్లో॥ అదర్శనం స్వశిరసః ప్రతిరూపే చ సత్యపి ।
అసత్యపి ద్వితీయే చ ద్వైరూప్యం జ్యోతిషాం తథా ॥

శ్లో॥ ఛిద్ర ప్రతీతిశ్ఛాయాయాం ప్రాణఘోషానుపశ్రుతిః ।
స్వర్ణప్రతీతిర్వృక్షేషు స్వపదానామదర్శనమ్ ॥

శ్లో॥ స్వప్నే ప్రేతపరిష్వంగః ఖరయానం విషాదనమ్ ।
యాయాన్నలదమాల్యేకస్తైలాభ్యక్తో దిగంబరః ॥ – భాగవతమ్ 10/42/28-30

సీ. కర్ణరంధ్రములు చేఁ గప్పిన లోపలి – ప్రాణఘోషము వినఁబడక డిందెఁ
దోయాదికములందుఁ దొంగిచూచుచునుండఁ-దల గానరా దయ్యెఁ దనువుమీఁదఁ
గరశాఖ నాసికాగ్రంబుపై నిడి చూడ – గ్రహతారకలు రెండుగా నగపడె
వెలుఁగున నిలుచుండి వీక్షింపఁగా మేని – నీడ సరంధ్రమై నేలఁ దోఁచె

ఆ. నడుగుజాడ దృష్టమగుట లే దయ్యెను – దరువులెల్ల హేమతరువు లగుచు
మెఱయుచుండెఁ గాలమృత్యువు డగ్గఱ – బుద్ధియెల్లఁ గలఁగె భోజపతికి.

కం. గరళముఁ దినుటయుఁబ్రేతముఁ – బరిరంభించుటయు నగ్నభావుఁ డగుటయున్
శిరమునఁ దైలము వడుటయు – ఖరపతి నెక్కుటయు నతఁడు గలలోఁ గనియెన్.

– పోతనభాగవతము 10/1299-1300

| | | | |
|---|---|---|---|
| 2. **అధ్యగాత్ :** | **అధ్యగాత్** | అధ్యగాతామ్ | అధ్యగుః |
| | అధ్యగాః | అధ్యగాతమ్ | అధ్యగాత |
| | అధ్యగామ్ | అధ్యగావ అధ్యగామ | |
| **వ్యబోధ్యత :** | **వ్యబోధ్యత** | వ్యబోధ్యేతామ్ | వ్యబోధ్యన్త |
| | వ్యబోధ్యథాః | వ్యబోధ్యేథామ్ | వ్యబోధ్యధ్వమ్ |
| | వ్యబోధ్యే | వ్యబోధ్యావహి | వ్యబోధ్యామహి. |

*

**శ్లో॥ తతస్తమిస్రం పరిహర్తుమర్కః – సమాససాదాభ్రగరాజమార్గమ్ ।**
**అసత్తమిస్రం స్వకరైర్జిహీర్షు-ర్హరిశ్చ గోపైస్సహ రాజమార్గమ్ ॥ 11-29**

**అ :** సూర్యోదయం – సూర్యునితోపాటు కృష్ణుడు కూడా పురప్రవేశం చేయటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** తతః అర్కః తమిస్రం పరిహర్తుమ్ అభ్ర-గ-రాజ-మార్గం సమాససాద. హరిశ్చ స్వ-కరైః అసత్-తమిస్రం జిహీర్షుః గోపైః సహ రాజ-మార్గం సమాససాద.

**ప్ర :** తతః = అటు తర్వాత, అర్కః = సూర్యుడు, తమిస్రమ్ = చీకటిని (తమిస్రం/తిమిరం తమః – అమరకోశః – భోగా–3), పరిహర్తుమ్ = తొలగించటానికి (పరి–హృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), అభ్ర–గ–రాజ–మార్గమ్ : అభ్ర–గ = ఆకాశంలోని (అభ్రే గచ్ఛతీతి అభ్రగః), రాజ = చంద్రునియొక్క మార్గమ్ = బాటను, సమ్–ఆ–ససాద = పట్టాడు (చేరాడు) (సమ్ ఆ–సద్ విశరణగత్యవసాదనేషు పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), హరిః చ = కృష్ణుడు కూడా, స్వ–కరైః = తన చేతులతో, అసత్–తమిస్రమ్ = చెడు అనే చీకటిని, జిహీర్షుః సన్ = తొలగింప గోరినవాడై (హర్తుమ్ ఇచ్ఛుః), గోపైః సహ = గోపకులతో పాటు, రాజ–మార్గమ్ = (మధురలోని) రాచబాటను, సమాససాద = చేరాడు.

**ప్ర :** కంసుడు పీడకలలు కని ఉలిక్కిపడి లేచిన తరువాత – చీకటిని తొలగించటానికి సూర్యుడు చంద్రుని బాట పట్టాడు. కృష్ణుడు కూడా తన చేతులతో చెడు అనే చీకటిని తొలగించాలని గోపకులతో కలిసి రాజమార్గంలో ప్రవేశించాడు.

**వి :** 1. సూర్యుడూ, కృష్ణుడూ ఇద్దరూ కూడా రాచబాటన పట్టారు. చీకటిని తొలగించటానికి సూర్యుడు, అసత్తు అనే చీకటిని తొలగించటానికి కృష్ణుడు. కాబట్టి సూర్యుడితో పోలిక, సూర్యుడికన్న విశేషం కృష్ణునిలో కనిపిస్తోంది కాబట్టి ఇక్కడ వ్యతిరేకాలంకారం ధ్వనిస్తుంది. '**వ్యతిరేకో విశేషశ్చదుపమానోపమేయయోః**' – (కు.57)

| | | | |
|---|---|---|---|
| 2. **సమాససాద :** | సమాససాద | సమాసేదతుః | సమాసేదుః |
| | సమాసేదిథ/సమాససత్థ | సమాసేదథుః | సమాసేద |
| | సమాససాద | సమాసేదివ | సమాసేదిమ. |

*

**శ్లో॥ గచ్ఛన్ విలోక్య గజరమ్యగతిః స రఙ్గ–**
**ద్వారి స్థితేభమథ హస్తిపమిత్యవోచత్ ।**
**మార్గం ప్రదేహి కరిణా సహ దూరమేహి**
**నో చేత్ ప్రయాస్యసి విదూరకృతాన్తలోకమ్॥ 11–30**

**అ :** కృష్ణుడు ఏనుగును చూసి తప్పించమని మావటీనితో చెప్పుట. –వసంతతిలక.

**అ :** గజ–రమ్య–గతిః సః గచ్ఛన్ రంగ–ద్వారి స్థిత–ఇభమ్–విలోక్య అథ హస్తిపమ్ ఇతి అవోచత్. మార్గం ప్రదేహి. కరిణా సహ దూరమ్ ఏహి నో చేత్ విదూర–కృతాంత–లోకం ప్రయాస్యసి.

**ప్ర :** గజ–రమ్య–గతిః : గజ = ఏనుగులా, రమ్య = అందమైన, గతిః = నడకగల (గజవత్ రమ్యా గతిః యస్య సః), సః = కృష్ణుడు, గచ్ఛన్ = వెళుతూ (గమ్ ధాతువుపై శతృ ప్రత్యయం), రంగ–ద్వారి = తాలింఖానా తలుపుదగ్గర (రంగస్య ద్వాః, తస్మిన్), స్థిత+ఇభమ్ = ఉన్న ఏనుగును (స్థితశ్చ అసౌ ఇభః, తమ్), విలోక్య – చూసి (వి–లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అథ = ఆపై, హస్తి–పమ్ = మావటీనితో (హస్తినం పాతి ఇతి హస్తిపః, తమ్), ఇతి = చెప్పబోవురీతిగా, అవోచత్ = పలికాడు. (వచ పరిభాషణే పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), మార్గం = దారిని, ప్రదేహి = ఇవ్వు (ప్ర–దా దానే పరస్మైపది–లోట్–మ.ఏ.), కరిణా సహ = ఏనుగుతో పాటు, దూరమ్ = దూరంగా, ఏహి = వెళ్ళు (ఆ+ఇ గతౌ పరస్మైపది–లోట్–మ.ఏ.), నోచేత్ = లేకపోతే, విదూర–కృతాంత–లోకమ్ : విదూర = ఎక్కడో దూరంగా వున్న, కృతాంత = యముని యొక్క, లోకమ్ = లోకానికి, ప్రయాస్యసి = వెళ్ళ గలవు. (ప్ర యా ప్రాపణే–ల్యట్–మ.ఏ.)

**తా ॥** కృష్ణుడు రాచబాటలో గజగమనుడై వెళుతూ మల్లయుద్ధరంగద్వారం దగ్గర వున్న ఏనుగును చూసి దాని మావటీనితో ఇలా అన్నాడు. 'దారి ఇవ్వు. ఏనుగుతో పాటు దూరంగా వెళ్ళు. లేకుంటే మరీ దూరంగా వున్న యమలోకానికి వెళ్ళవలసి వస్తుంది.'

**వి :** 1. ఆ ఏనుగు పేరు కువలయాపీడం. మూలంలో అది కనిపిస్తుంది.

శ్లో॥ రంగద్వారం సమాసాద్య తస్మిన్నాగమవస్థితమ్ ।
అపశ్యత్కువలయాపీడం కృష్ణోఽ౽౦బష్ఠప్రచోదితమ్ ॥ – భాగవతమ్ 10/43/2

2. కువలయాపీడం రుద్రప్రసాదరక్షితమని మహాభారతతాత్పర్య నిర్ణయం. కంసుడు శివభక్తుడు కాబట్టి ఆయనకు సంబంధించిన ఏనుగు కూడా రుద్రప్రసాదరక్షితమే–

శ్లో॥ ఆయన్ జగద్గురుతమో బలినం గజేంద్రం – రుద్రప్రసాదపరిరక్షితమాశ్వపశ్యత్ ।
దుష్టోరురంగముఖసంస్థితమీక్ష్య చైబ్యం – పాపాపయాహి న చిరాదితి వాచమూచే ॥
– మహాభారతతాత్పర్యనిర్ణయః : 13/112

| | | | |
|---|---|---|---|
| 3. **అవోచత్ :** | **అవోచత్** | అవోచతామ్ | అవోచన్ |
| | అవోచః | అవోచతమ్ | అవోచత |
| | అవోచమ్ | అవోచావ | అవోచామ |
| **ప్రదేహి :** | ప్రదదాతు/ప్రదత్తాత్ | ప్రదత్తామ్ | ప్రదదతు |
| | **ప్రదేహి**/ప్రదత్తాత్ | ప్రదత్తమ్ | ప్రదత్త |
| | ప్రదదాని | ప్రదదావ | ప్రదదామ |
| **ఏహి :** | ఏతు | ఇతామ్ | యన్తు |
| | **ఇహి** | ఇతమ్ | ఇత |
| | అయాని | అయావ | అయామ |
| **ప్రయాస్యసి :** | ప్రయాస్యతి | ప్రయాస్యతః | ప్రయాస్యన్తి |
| | **ప్రయాస్యసి** | ప్రయాస్యథః | ప్రయాస్యథ |
| | ప్రయాస్యామి | ప్రయాస్యావః | ప్రయాస్యామః. |

*

**శ్లో॥ భో! తిష్ఠ తిష్ఠ వనవాసిజనైకమాన్య! – ప్రౌఢిర్బలం కుశలమస్తి న తాదృశం తే ।**
**యాదృగ్విదగ్ధపురవాసిజనేషు శత్రు–సందర్భకేసరిసమేషు జితశ్రమేషు ॥ 11–31**

**అ :** కువలయాపీడానికి మావటీడు (అంబష్ఠుడు) కృష్ణుని హేళన చేయటం. –వసంతతిలక.

**అ :** భో! వన–వాసి–జన+ఏక–మాన్య! తిష్ఠ తిష్ఠ తే తాదృశం ప్రౌఢిః బలం కుశలం న అస్తి. శత్రు–సందర్భ–కేసరి–సమేషు జిత–శ్రమేషు విదగ్ధ–పుర–వాసి–జనేషు యాదృక్...

**ప్ర :** భో! = ఓరీ, వన–వాసి–జన+ఏక–మాన్య! : వన–వాసి = ఆటవికులైన, జన+ఏక = జనులచే మాత్రమే, మాన్య! = గౌరవింపదగినవాడా! (వనేషు వసన్తీతి తే చ జనాః తైః ఏకైః మాన్యః తస్మాత్ సంబుద్ధిః), తిష్ఠ తిష్ఠ = నిలు, నిలు (స్థా గతి నివృత్తౌ–పరస్మైపది–లోట్–మ.ఏ.), తే = నీకు, తాదృశమ్ (శీ) = అటువంటి, ప్రౌఢిః = దిట్టతనం, బలమ్ = శక్తి, కుశలమ్ = నేర్పు, న అస్తి = లేదు. యాదృక్ = ఎటువంటి దిట్టతనమూ, శక్తీ, నేర్పు, శత్రు... సమేషు :శత్రు = శత్రువులయొక్క, సందర్భ = కూర్పునకు, కేసరి సమేషు = సింహాలతో సమానమైన వారూ (శత్రూనాం సందర్భః తస్య కేసరిభిః సమాః, తేషు), జిత–శ్రమేషు : జిత = గెలువబడిన, శ్రమేషు = అలసట గలవారూ అయిన (జితః శ్రమః యైః, తేషు), విదగ్ధ... జనేషు : విదగ్ధ = పండితులు/నేర్పరులు అయిన, పుర–వాసి = నగరంలోనివసించే, జనేషు = జనులయందు (ఉంటాయో అటువంటివి) (విదగ్ధాః చ పురవాసినః చ తే జనాః, తేషు)

**తా ॥** ఓయ్! నిలు నిలు. నువ్వు ఆటవికులచే మాత్రమే గౌరవింపబడేవాడివి. నగరవాసులలో కనిపించే ప్రౌఢి, బలం, నేర్పూ నీకు లేవు. నాగరికులలో అవి వుంటాయి. నాగరికులు అలసట లేనివారు. శత్రుసముదాయానికి సింహాలవంటివాళ్ళు. నువ్వు ఆపాటి కాదు.

**వి :** 1. ఆటవికులు అంటే చులకన భావన ఆనాడు ఈనాడూ కూడా చాలామందిలో కనిపిస్తుంది. ఆటవికులతో పాటు పల్లెటూరివాళ్ళను కూడా అలాగే భావిస్తుంటారు నాగరికులు. వాస్తవానికి ఆటవికుడైన ఏకలవ్యుని ప్రతిభముందు అర్జునుడే తలవంచవలసి వచ్చింది. అటవాట్లలోనూ, కలుపుగోలుతనంలోనూ తేడా వుండచ్చు. అది సహజం కూడా. అది నాగరికుల మధ్య కూడా కనిపిస్తుంది, తాము పెరిగిన ప్రదేశాలను బట్టి. అంతేకానీ ప్రతిభావిషయంలో ఆ తేడాలు ఏమీ లేవు. కృష్ణునితో మాటాడింది కూడా సాధారణస్థాయికి చెందిన వాడే కాబట్టి అలా మాటాడాడు.

2. **తిష్ఠ :** 11-27వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ప్రౌఢిం విచారయత మందమతేః స్వహస్తి**
**విధ్వంసనోద్యతకరస్య వనే నివాసః ।**
**కిం దూషణం విమతకేసరిసమ్మితానాం**
**కిం భూషణం ప్రతిదినం నగరే నివాసః॥ 11-32**

**అ :** ఆ అంబష్ఠుని మాటలలోని అనౌచిత్యాన్ని కృష్ణుడు బహిరంగంగా ప్రకటించటం.

**అ :** మందమతేః (అస్య) ప్రౌఢిం విచారయత. స్వ-హస్తి-విధ్వంసన-ఉద్యత-కరస్య వనే నివాసః దూషణం కిమ్? విమత-కేసరి-సమ్మితానాం ప్రతిదినం నగరే నివాసః భూషణం కిమ్?

**ప్ర :** మంద-మతేః = బుద్ధిమాంద్యం గల (అస్య = ఈ అంబష్ఠుని యొక్క), ప్రౌఢిమ్ = దిట్టతనాన్ని, విచారయత = గమనించండి. (వి చర గతిభక్షణయోః-ణిచ్-పరస్మైపది-లోట్-మ.బ.), స్వ... కరస్య : స్వ = తనయొక్క, హస్తి = ఏనుగుయొక్క, విధ్వంసన = చంప టానికి, ఉద్యత = ఎత్తిన, కరస్య = చేయి గలిగిన (స్వస్య హస్తినః విధ్వంసనే ఉద్యతః కరః యస్య, తస్య), (మమ = నాకు), వనే = అడవిలో, నివాసః = ఉనికి/నివసించటం, దూషణం కిమ్? = దోషమా?, విమత-కేసరి-సమ్మితానామ్ : విమత = శత్రువులపాటికి, కేసరి = సింహంతో, సమ్మితానామ్ = సమానమైన వారికి, నగరే = నగరంలో, నివాసః = ఉండటం, భూషణం కిమ్? = అలంకరణమా?

**తా ॥** వీడి తెలివితేటలు చూడండి. మందబుద్ధి. వాడి ఏనుగును చంపటానికి చెయ్యెత్తిన నేను అడవిలో వుండటం దోషమా? శత్రువుల విషయంలో సింహంలా ప్రవర్తించగలవారు అడవిలో కాక నగరంలో వుండటం అది భూషణమా?

**వి :** 1. సింహం అడవిలోనే వుండాలి. అది అడవిదాటి ఊరిలో ఉండటానికి అలవాటు పడితే గ్రామసింహమై పోతుంది. అడవికి సింహం రక్ష. సింహానికి అడవి రక్ష. సంజయుడు ధృతరాష్ట్రుని ప్రతినిధిగా ధర్మరాజు దగ్గరకు వచ్చినపుడు కృష్ణుడు సంజయునకు చెప్పిన మాటను గమనించండి-

మ. ధృతరాష్ట్రుండును బుత్రులున్ వనము గుంతీనందనుల్ సింహముల్
మతినూహింప నసింహమైన వనమున్ మర్దింతురెందున్ వనా
వృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁ గా
న తగంబొందుట కార్యమీయుభయమున్ సంతుష్టియై నున్కికిన్.

- శ్రీమదాంధ్రమహాభారతము-ఉద్యోగ-1/358

కాబట్టి సింహం అడవిలో వుంటే సింహానికీ రక్షణ, అడవికీ రక్షణ.

| | | | |
|---|---|---|---|
| 2. **విచారయత :** | విచారయతు/విచారయతాత్ | విచారయతామ్ | విచారయన్తు |
| | విచారయ/విచారయతాత్ | విచారయతమ్ | **విచారయత** |
| | విచారయాణి | విచారయావ | విచారయామ. |

*

**శ్లో॥ ప్రౌఢిస్తథాఽస్తు బలకౌశలమస్మదీయం**
**పశ్యేత్యుదీర్య తరసా కరిణం నిహత్య ।**
**తస్యాఙ్ఘ్రి మధ్యమధిగమ్య విభుర్విలిల్యే**
**హస్తీ వ్యకమ్పత తదా జగృహే న శౌరిమ్॥ 11-33**

**అ :** కృష్ణుడు కువలయాపీడాన్ని కరాఘాతాలతో పీడించటం. -వసంతతిలక.

**అ :** ప్రౌఢిః తథా అస్తు. అస్మదీయం బలకౌశలం పశ్య. ఇతి ఉదీర్య తరసా కరిణం నిహత్య తస్య అంఘ్రి-మధ్యమ్ అధిగమ్య విభుః విలిల్యే. తదా హస్తీ వ్యకంపత. శౌరిం న జగృహే.

**ప్ర :** ప్రౌఢిః = దిట్టతనం, తథా-అస్తు = అలా ఉండనీ. (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), అస్మదీయమ్ = మాయొక్క, బల-కౌశలమ్ = శక్తినీ, నేర్పునూ (బలం చ కౌశలం చ), పశ్య = చూడు (దృశ్-ప్రేక్షణే-పరస్మైపది-లోట్-మ.ఏ.), ఇతి = అని, ఉదీర్య = పలికి (ఉత్-ఈర్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తరసా = బలంగా/వేగంగా (తరశ్చ బలరంహసోః - నానార్థమంజరీ-పంక్తి-1895), కరిణమ్ = ఏనుగును, నిహత్య = కొట్టి/హింసించి (ని హన్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తస్య = దానియొక్క, అంఘ్రి-మధ్యమ్ = కాళ్ళమధ్యకు (అంఘ్రిణాం మధ్యమ్) అధిగమ్య = చేరి (అధి గమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విభుః = స్వామి అయిన కృష్ణుడు, విలిల్యే = దాగాడు. (వి+లీ శ్లేషణే దివాది ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), తదా = అప్పుడు, హస్తీ = ఏనుగు, వి+అకంపత = వణికి పోయింది. (వి-కంప్ చలనే-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.), శౌరిమ్ = కృష్ణుని, న జగృహే = పట్టుకొనలేదు. (గ్రహ ఉపాదానే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** 'నా ప్రౌఢిని అటుండనీ. నా బలాన్నీ, నా నేర్పును చూడు' అని అంటూ కృష్ణుడు ఆ ఏనుగును బలంగా కొట్టి దాని పాదాల మధ్యలో లీనమై నిలిచాడు. అప్పుడు ఏనుగు వణికిపోయింది కానీ కృష్ణుని పట్టుకొనలేదు.

**వి :** 1. మూలంలో కువలయాపీడం తొండంతో కృష్ణుని పట్టుకొన్నట్లుంది. కానీ కృష్ణుడు తప్పించుకొని పాదాల మధ్యకు చేరుతాడు. ఇక్కడ కృష్ణుడు ఆ అవకాశం కూడా ఇవ్వలేదు కువలయాపీడానికి.

శ్లో॥ కరీంద్రస్తమభిద్రుత్య కరేణ తరసాగ్రహీత్ ।
కరాద్విగలితః సోఽముం నిహత్యాంఘ్రిష్వలీయత ॥ - భాగవతమ్ -10/43/6

| | | | |
|---|---|---|---|
| 2. **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |
| **పశ్య :** | పశ్యతు/పశ్యతాత్ | పశ్యతామ్ | పశ్యన్తు |
| | **పశ్య**/పశ్యతాత్ | పశ్యతమ్ | పశ్యత |
| | పశ్యాని | పశ్యావ | పశ్యామ |
| **విలిల్యే :** | **విలిల్యే** | విలిల్యాతే | విలిల్యిరే |
| | విలిల్యిషే | విలిల్యాథే | విలిల్యిధ్వే |
| | విలల్యే | విలల్యివహే | విలిల్యిమహే |

| | | | |
|---|---|---|---|
| **అకంపత :** | **అకంపత** | అకంపేతామ్ | అకంపన్త |
| | అకంపథాః | అకంపేథామ్ | అకంపధ్వమ్ |
| | అకంపే | అకంపావహి | అకంపామహి |
| **జగృహే :** | **జగృహే** | జగృహాతే | జగృహిరే |
| | జగృహిషే | జగృహాథే | జగృహిధ్వే |
| | జగృహే | జగృహివహే | జగృహిమహే. |

*

**శ్లో॥పుచ్ఛే ప్రగృహ్యా పురుసత్త్వమముం పునశ్చ - కృష్ణశ్చకర్ష బహుదూరమపారశక్తిః ।**
**ధావన్ విభుర్నిజవిపాతవిశంకినోఽస్య - భూలగ్నదన్తయుగలం శిథిలీచకార ॥34**

**అ :** కృష్ణుడు కువలయాపీడాన్ని హింసించటం. –వసంతతిలక.

**అ :** అపార–శక్తిః కృష్ణః పునః పురు–సత్త్వమ్ అముం పుచ్ఛే ప్రగృహ్యా బహుదూరం చకర్ష. ధావన్ విభుః నిజ–విపాత–విశంకినః అస్య భూ–లగ్న–దంత–యుగలం శిథిలీచకార.

**ప్ర :** అపార–శక్తిః = అపరిమితమైన శక్తిగల (అపారా శక్తిః యస్య సః), కృష్ణః = కృష్ణుడు, పునః = మరల, పురు–సత్త్వమ్ : పురు = ఎక్కువైన (పురుభూః పురు భూయిష్ఠమ్–అమరకోశః – విశేష్య 64), సత్త్వమ్ = శక్తిగల, అముమ్ = ఆ కువలయాపీడాన్ని, పుచ్ఛే = తోక(పై), ప్రగృహ్యా = పట్టుకొని (ప్ర గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), బహు–దూరమ్ = చాలా దూరం, చకర్ష చ = లాగాడు కూడా (కృష విలేఖనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ధావన్ = పరుగెత్తుతూ (ధావ్ ధాతువుపై శతృ ప్రత్యయం), విభుః = కృష్ణుడు, నిజ–విపాత–శంకినః : నిజ = తనయొక్క, విపాత = పతనాన్ని, శంకినః = అనుమానిస్తున్న (నిజస్య విపాతం శంకతే ఇతి, తస్య), అస్య = ఆ ఏనుగుయొక్క, భూ–లగ్న–దంత–యుగలమ్ : భూ = భూమిపై, లగ్న = తగుల్కొన్న, దంత = దంతాలయొక్క, యుగలమ్ = జంటను (భువి లగ్నం దంతయోః యుగలం తత్), శిథిలీచకార = శిథిలం చేశాడు. (అశిథిలం శిథిలరూపేణ సంపద్యమానం కరోతి – శిథిలీకృ–శిథిలీకరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** అపారశక్తి సంపన్నుడైన కృష్ణుడు మహాబలంగల ఆ ఏనుగును తోకపట్టుకొని చాలా దూరం లాగాడు. తాను పరుగెత్తుతూ క్రిందపడినట్లు నటించి అది మోసపోయి తనను దంతాలతో గాయపరచాలని దంతాలను నేలకేసి కొట్టగానే నేలకు తగిలిన దాని దంతాలను శిథిలం చేశాడు.

**వి :** 1. గరుడుడు ఏనుగును/పామును లాగినట్లు అనాయాసంగా కృష్ణుడు కువలయాపీడాన్ని లాగాడని మూలకథనం.

శ్లో॥ **పుచ్ఛే** ప్రగృహ్యాతిబలం ధనుషః పంచవింశతిమ్ ।
విచకర్ష యథానాగం సుపర్ణ ఇవ లీలయా ॥ – భాగవతం 10/43/8

గరుత్మంతుడు ఏనుగును కాలిగోటితో లాక్కొని పోయిన సన్నివేశం మహాభారతంలోని ఆదిపర్వంలో కనిపిస్తుంది. గరుడుడు అమృతాన్ని తెచ్చేందుకు వెళుతూ తనకు ఆహారంగా ఏనుగును, తాబేలును పట్టుకొంటాడు కశ్యపుని సూచనమేరకు–

శ్లో॥ నఖేన గజమేకేన కూర్మమేకేన చాక్షిపత్ ।
సముత్పపాత చాకాశం తత ఉచ్చైర్విహంగమః ॥ –మహాభారతం–ఆదిపర్వ–29/38

2. కువలయాపీడానికి తాను పడిపోయినట్లు భ్రాంతిని కలిగించటాన్ని కూడా మూలంలో క్రీడామాత్రమని స్పష్టం చేశాడు వ్యాసమహర్షి.

శ్లో॥ స ధావన్ క్రీడయా భూమౌ పతిత్వా సహసోత్థితః ।
తం మత్వా పతితం క్రుద్ధో దంతాభ్యాం సోఽహనత్ క్షితిమ్ ॥ -భాగవతమ్ 10/43/11

| | | | |
|---|---|---|---|
| 3. **చకర్ష :** | చకర్ష | చకృషతుః | చకృషుః |
| | చకర్షిథ | చకృషథుః | చకృష |
| | చకర్ష | చకృషివ | చకృషిమ |
| **శిథిలీచకార :** | శిథిలీచకార | శిథిలీచక్రతుః | శిథిలీచక్రుః |
| | శిథిలీచకర్థ | శిథిలీచక్రథుః | శిథిలీచక్ర |
| | శిథిలీచకార/శిథిలీచకర | శిథిలీచకృవ | శిథిలీచకృమ. |

*

**శ్లో॥ కృష్ణం విశఙ్క్య పతితం భువి సంహతాత్మ-దంతానుషక్తబహుధూలిరిభో విరేజే ।**
**సిద్ధాత్మబుద్ధ్యుచితసిద్ధిరివామ్బరస్థ-సిద్ధేశ్వరస్తుతిగిరా పథి వర్ణ్యమానః ॥ 11-35**

**అ :** కృష్ణుడు నేలపై పడిపోయాడని భావించి తలవాల్చి దుమ్మకొట్టుకొన్న కువలయాపీడుని వర్ణన. -వసంతతిలక.

**అ :** కృష్ణం భువి పతితం విశంక్య సంహత+ఆత్మ-దంత+అనుషక్త-బహు-ధూళిః సిద్ధ+ఆత్మ-బుద్ధి+ఉచిత-సిద్ధిః ఇవ అంబర-స్థ-సిద్ధ+ఈశ్వర-స్తుతి-గిరా పథి వర్ణ్యమానః ఇభః విరేజే.

**ప్ర :** కృష్ణమ్ = కృష్ణుని (కర్షతి ఇతి), పతితమ్ = పడినవానినిగా (పత్ ధాతువుపై క్త ప్రత్యయం), విశంక్య = భావించి/అనుమానించి, భువి = నేలపై, సంహత... ధూళిః : సంహత = (అటువైపు) కొట్టబడిన, ఆత్మ-దంత = తన దంతాలపై, అనుషక్త = అంటుకొన్న, బహు = ఎక్కువయిన, ధూళిః = దుమ్ముగల, (సంహతే ఆత్మనః దంతే అనుషక్తా ధూళిః యస్య సః), ఇభః = ఏనుగు (కుంభీ కుంజర వారణేభరదినః - హలాయుధకోశః-214), సిద్ధ...సిద్ధిః +ఇవ : సిద్ధ = సిద్ధించిన/ఫలించిన, ఆత్మ = తన (ఏనుగు) యొక్క, బుద్ధి = బుద్ధికి, ఉచిత = తగిన/యోగ్యమైన, సిద్ధిః+ఇవ = ఫలితం గల వానివలె (సిద్ధా ఆత్మనః బుద్ధేః ఉచితా సిద్ధిః యస్య సః - ఇవ), అంబర... గిరా : అంబర-స్థ = ఆకాశంలో వున్న, సిద్ధ+ఈశ్వర = సిద్ధేశ్వరులయొక్క, స్తుతి-గిరా = స్తోత్రవచనంతో (అంబరస్థానాం సిద్ధేశ్వరాణాం స్తుతిః చ సా గీః తయా), పథి = దారిలో, వర్ణ్యమానః (సన్) = వర్ణింపబడుతున్నదై, విరేజే = ప్రకాశించింది. (వి+రాజృ దీప్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు నేలపై బడినట్లు భావించిన ఆ కువలయాపీడం తన దంతంతో నేలపై పొడిచింది కృష్ణుని కొడుతున్నానన్న భావంతో. అయితే కృష్ణుడు క్రీడగా నేలబడినవాడేగానీ వాస్తవంగా కాదు. అందుకని ఆ ఏనుగుదంతానికే దుమ్ము అంటింది. అప్పుడు అది తన బుద్ధికి (కృష్ణుని కొట్టాలని భావించిన దానికి) తగిన ఫలితాన్ని అనుభవించినట్లు గగనతలంపైనున్న సిద్ధేశ్వరులు 'ఏనుగుకు తగిన ఫలితాన్నే కలిగించాడ'ని కృష్ణుని స్తుతిస్తూ దానిని వర్ణింపసాగారు. అలా ప్రకాశించింది ఆ కువలయాపీడం.

**వి :** 1. తన బుద్ధికి తగిన ఫలితాన్ని పొందినదన్నట్లు కవి భావించటమిక్కడ ఉత్ప్రేక్ష.

శ్లో॥ సత్యానుసారిణీ లక్ష్మీః కీర్తిస్త్యాగానుసారిణీ ।
అభ్యాససారిణీ విద్యా బుద్ధిః కర్మానుసారిణీ ॥ అని నానుడి. కువలయాపీడం బుద్ధికూడా తన కర్మననుసరించి ప్రవర్తించి దానికి తగిన ఫలితాన్ని పొందింది.

| | | | |
|---|---|---|---|
| 2. **విరేజే :** | **విరేజే** | విరేజాతే | విరేజిరే |
| | విరేజిషే | విరేజాథే | విరేజిధ్వే |
| | విరేజే | విరేజివహే | విరేజిమహే. |

*

**శ్లో॥ ఇత్థం ప్రదర్శ్య బలకౌశలమమ్బుజాక్షః**
**పద్భ్యాం ప్రపీడ్య తరసా కరిణం మమర్ద ।**
**ఉత్ఖాతతద్ధవళదన్తకరః క్షణేన**
**తత్స్వామినం తదనుగాంశ్చ స లీలయేవ ॥ 11-36**

**అ :** కృష్ణుడు కువలయాపీడాన్ని, మావటీని, అతని అనుచరులను సంహరించటం. -వసంతతిలక.

**అ :** ఇత్థమ్ అంబుజ+అక్షః బలకౌశలం ప్రదర్శ్య కరిణం పద్భ్యాం తరసా ప్రపీడ్య మమర్ద. ఉత్ఖాత-తద్-ధవళ-దన్త-కరః క్షణేన సః లీలయా ఇవ క్షణేన తత్-స్వామినం తద్-అనుగాన్ చ మమర్ద.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, అంబుజ+అక్షః = కమలాక్షుడు (అంబుజే ఇవ అక్షిణీ యస్య సః), బల-కౌశలమ్ = శక్తినీ, నేర్పునూ (బలం చ కౌశలం చ - ఏకవద్భావః), ప్రదర్శ్య = చూపి (దృశ్ - ధాతువుపై ణిచ్ - ల్యప్ ప్రత్యయం), కరిణమ్ = ఏనుగును (కరః అస్య అస్తీతి తమ్), పద్భ్యామ్ = కాళ్ళతో, తరసా = బలంగా (తరశ్చ బలరంహసోః - నానార్థమంజరీ-పంక్తి-1895), ప్రపీడ్య = పీడించి/కొట్టి, మమర్ద = మర్దించాడు/చితక కొట్టాడు (మృద్-క్షోదే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఉత్ఖాత... కరః : ఉత్ఖాత = పెకలింపబడిన, తత్ = ఆ కువలయాపీడం యొక్క, ధవళ = తెల్లని, దంత = దంతాన్ని, కరః = చేతబట్టిన (ఉత్ఖాతః తస్య ధవళశ్చ అసౌ దంతః కరే యస్య సః ), సః = ఆ కృష్ణుడు, లీలయా ఇవ = విలాసంగా, క్షణేన = క్షణకాలంలో, తత్-స్వామినమ్ = దాని ఏలికను (మావటీని), తద్ -అనుగాన్ చ = ఆయన అనుచరులను కూడా, మమర్ద = చితకకొట్టాడు.

**తా ॥** ముందు చెప్పిన రీతిగా కృష్ణుడు తన బలాన్నీ, తన కౌశలాన్నీ ప్రదర్శించి ఆ ఏనుగును కాళ్ళతో బలంగా తొక్కాడు. దాని తెల్లని దంతాన్ని పీకి దానిని చేతబట్టుకొని క్షణంలో మావటీన్ని, అతని అనుచరులను లీలామాత్రంగా చితకకొట్టాడు.

**వి :** 1. కృష్ణుడు కువలయాపీడాన్ని కాలితో/కొట్టడానికి ముందు మరికొంత ఘర్షణ జరిగింది. దానిని భాగవతమిలా వర్ణించింది.

శ్లో॥ స్వవిక్రమే ప్రతిహతే కుంజరేంద్రోఽత్యమర్షితః ।
చోద్యమానో మహామాత్రైః **కృష్ణమభ్యద్రవద్రుషా** ॥

శ్లో॥ తమాపతంతమాసాద్య భగవాన్ మధుసూదనః ।
నిగృహ్య పాణినా హస్తం పాతయామాస భూతలే ॥

శ్లో॥ పతితస్య పదాక్రమ్య మృగేంద్ర ఇవ లీలయా ।
దంతముత్పాట్య తేనేభం హస్తిపాంశ్చాహనద్ధరిః ॥ -భాగవతమ్ 10/43/12-14

| | | | |
|---|---|---|---|
| 2. **మమర్ద :** | **మమర్ద** | మమృదతుః | మమృదుః |
| | మమర్దిథ | మమృదథుః | మమృద |
| | మమర్ద | మమృదివ | మమృదిమ. |

*

**శ్లో॥ పాదప్రహారవివశః కిల వారణోఽసౌ**
**కుర్వన్ పపాత భువి నామ గుణానుకూలమ్ ।**
**తస్యాఙ్ఘ్రిసఙ్గిసహజాఙ్కుశరమ్యరేఖా-**
**శఙ్కీవ కమ్పితమహీధరభూప్రదేశః ॥ 11-37**

**అ :** కువలయాపీడం (ఏనుగు) నేలకూలటం. -వసంతతిలక.

**అ :** తస్య అంఘ్రి-సంగి-సహజ+అంకుశ-రమ్య-రేఖా-శంకీ+ఇవ పాద-ప్రహార-వివశః అసౌ వారణః కంపిత-మహీధర-భూ-ప్రదేశః (సన్) నామ గుణ+అనుకూలం కుర్వన్ భువి పపాత.

**ప్ర :** తస్య = ఆ కృష్ణునియొక్క, అంఘ్రి... శంకీ ఇవ : అంఘ్రి = పాదంపై, సంగి = తగిలివున్న, సహజ = తోడబుట్టిన, అంకుశ = అంకుశరూపమైన, రమ్య = అందమైన, రేఖా = గీతలను, శంకీ ఇవ = అనుమానిస్తున్నట్లుగా (పాదౌ సంగినాం సహజానాం అంకుశానాం రమ్యాః రేఖాః శంకతే ఇవ), పాద-ప్రహార-వివశః : పాద-ప్రహార = కాలితాకిడి/దెబ్బతో, వివశః = అదుపుతప్పిన (పాదస్య ప్రహారః తేన వివశః), అసౌ = ఆ, వారణః = ఏనుగు, కంపిత... ప్రదేశః సన్ : కంపిత = వణికింపజేయబడిన, మహీధర = కొండలు, భూ-ప్రదేశః (సన్) = నేలగలదై, నామ = (తన) పేరును, గుణ+అనుకూలమ్ = గుణానికి తగినట్లుగా, కుర్వన్ = చేస్తూ, భువి = నేలపై, పపాత = పడింది. (పత్ పతనే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** శ్రీకృష్ణుడు కాళ్ళతో కొట్టినపుడు ఆ అరకాలిపై వున్న అంకుశరేఖలను చూసి కువలయాపీడం వాటిని నిజమైన అంకుశాలుగానే అనుమానించింది. ఆ కాలిదెబ్బతో తనపై తాను అదుపు కోలుపోయింది. కువలయాపీడమన్న పేరు తన గుణానికి తగినదే అన్నట్లు కొండలను, భూమిని కంపింపజేస్తూ నేలపై పడిపోయింది.

**వి :** 1. తనపేరును గుణానుకూలంగా చేస్తూ అని ప్రస్తావించటం తప్ప కువలయాపీడ సంఘటన పూర్తి అవుతున్నా కవి ఎక్కడా దానిపేరు చెప్పలేదు. ఏనుగని మాత్రమే ప్రస్తావించాడు. '**అనుక్తమన్యతో గ్రాహ్యమ్**' అన్న న్యాయాన్నిబట్టి మనం దాన్ని భాగవతం నుండి గ్రహించాం. దానిపేరు ప్రసిద్ధచ్ఛందస్సులో ఇమడలేకపోవటమొక కారణం కావచ్చునేమో అని ఊహ. మూలంలో కూడా అనుష్టుప్ శ్లోకంలో దాని పేరు చెప్పబడింది ఛందోభంగంతో-

**అపశ్యత్ కువలయాపీడం** కృష్ణోఽంబష్ఠ ప్రచోదితమ్ ॥ - భాగవతమ్ 10/43/2

ఎనిమిది అక్షరాలే వుండవలసిన పాదంలో తొమ్మిది అక్షరాలున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **పపాత :** | **పపాత** | పేతతుః | పేతుః |
| | పేతిథ | పేతథుః | పేత |
| | పపాత/పపత | పేతివ | పేతిమ. |

*

**శ్లో॥ అంసస్థదన్తపరిశోభితరక్తబిన్దు-సంసక్తనిర్మలతనుర్ద్విపారిరాబభాసే ।**
**రక్షోవిదారణవిలాసధృతాంత్రమాలా-వక్షఃస్థలాద్భుతనృసింహ ఇవ ద్విపారిః ॥ 38**

**అ :** దంతాన్ని ధరించిన కృష్ణుని నృసింహమూర్తితో పోల్చి వర్ణించటం. -వసంతతిలక.

**అ :** అంస-స్థ-దంత-పరిశోభిత-రక్త-బిందు-సంసక్త-నిర్మల-తనుః ద్విప+అరిః హరిః రక్షః-విదారణ-విలాస-ధృత+ఆంత్ర-మాలా-వక్షః-స్థల+అద్భుత-నృసింహః ఇవ ఆబభాసే.

**ప్ర :** అంస... తనుః : అంస = చేంకలో, స్థ = ఉన్న, దంత = దంతంపై, పరి = అంతటా, శోభిత = ప్రకాశిస్తున్న, రక్త = నెత్తుటియొక్క, బింద = బిందువులచే, సంసక్త = కూడివున్న, నిర్మల = నిర్మలమైన, తనుః = శరీరంగలవాడూ (అంసే తిష్ఠతీతి అంసస్థః, స చ అసౌ దన్తః, తస్య పరితః శోభితస్య రక్తస్య బిందుభిః సంసక్తా నిర్మలా తనుః యస్య సః), ద్విప+అరిః = ఏనుగుకు (కువలయాపీడానికి) శత్రువూ అయిన (ద్విపస్య అరిః), హరిః = కృష్ణుడు, రక్షో... నృసింహ ఇవ : రక్షః = రాక్షసునియొక్క, విదారణ = చీల్చుట అనే, విలాస = విలాసంతో, ధృత = ధరింపబడిన, ఆంత్ర = ప్రేవులయొక్క (అస్త్రీ పరీతదాంత్రం స్యాత్ - వైజయన్తీ-పాతాళ-113), మాలా = మాలలుగల, వక్షఃస్థల = రొమ్ము ప్రదేశంతో, అద్భుత = ఆశ్చర్యకరుడైన, నృసింహః ఇవ = నృసింహునిలాగా, ఆబభాసే = ప్రకాశించాడు. (ఆ-భాస్ దీప్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు (కువలయాపీడం శరీరంనుండి పెకలించిన) దంతాన్ని చేంకలో పెట్టుకొని, దానిచుట్టూ శోభిస్తున్న నెత్తుటి బిందువులతో కూడిన నిర్మలదేహం గలవాడై, రాక్షసుని సంహరించటమనే విలాసచేష్టను ముగించి, దాని ప్రేవుల మాలలను ధరించి, అద్భుతమైన వక్షఃస్థలంతో వెలుగొందుతున్న నరసింహునిలాగా ప్రకాశించాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో కృష్ణావతారంలోని విష్ణువుకు, నృసింహావతారంలోని విష్ణువుతో పోలిక. దంతానికీ, ప్రేవులమాలకూ పోలిక. ఏనుగు శరీరంనుండి పెరికినందువలన అది రక్తదిగ్ధం. ప్రేవులమాలలు శరీరంలోపలిభాగాలే. నృసింహునితో పోల్చటం ద్వారా ప్రధానశత్రువినాశనం కూడా సూచింపబడింది. ఈ ఉపమాలంకారం ప్రకృతబీభత్సరసానికి పరిపోషక మవుతుంది.

2. మెప్పథూర్ నారాయణ భట్టతిరి ఈ సన్నివేశంలో మరో అంశాన్ని కూడా జోడించాడు. ఏనుగుల దంతమూలాలలో ముత్యాలుంటాయన్నది కవి సమయం. దాన్నిబట్టి కువలయాపీడం దంతాన్ని పెరికి తన్మూలంలోని ముత్యాలను 'రాధకిమ్మ'ని తన స్నేహితునకు కృష్ణుడిచ్చినట్లు వర్ణించాడు.

శ్లో॥ హస్తప్రాప్యోఽ ప్యగమ్యో ఝటితి మునిజనస్యేవ ధావన్ గజేంద్రం
క్రీడన్నాపత్య భూమౌ పునరభిపతతస్తస్య దంతం సజీవమ్ ।
మూలాదున్మూల్య తన్మూలగమహితమహామౌక్తికాన్యాత్మమిత్రే
ప్రాదాస్త్వం హారమేభిర్లలితవిరచితం రాధికాయై దిశేతి ॥ -నారాయణీయమ్ 75/3

3. ఇక్కడ శత్రుపక్షం - అసత్పక్షం - లోని ఏనుగును సంహరించాడు. భవిష్యత్తులో 'నీవే తప్ప నితః పరంబెరుగ'నన్న ఏనుగును కాపాడబోతున్నాడు. మన సదసద్వ్యవహారాలే మనకు శిక్షకులైనా, రక్షకులైనా!

| | | | |
|---|---|---|---|
| 4. **ఆబభాసే :** | **ఆబభాసే** | ఆబభాసాతే | ఆబభాసిరే |
| | ఆబభాసిషే | ఆబభాసాథే | ఆబభాసిధ్వే |
| | ఆబభాసే | ఆబభాసివహే | ఆబభాసిమహే. |

*

**శ్లో॥ లోకద్వయసుఖవ్యూహప్రత్యూహౌ ద్విషతామివ ।**
**ఏకైకదన్తావశ్రాన్తౌ రఙ్గం వివిశతుర్విభూ ॥ 11-39**

**అ :** రామకృష్ణులు మల్లయుద్ధప్రదేశానికి చేరటం. -పథ్యావక్త్రమ్.

**అ :** ద్విషతాం లోక-ద్వయ-సుఖ-వ్యూహ-ప్రత్యూహౌ ఇవ ఏక+ఏక-దంతౌ అశ్రాంతౌ విభూ రంగం వివిశతుః.

**ప్ర :** ద్విషతామ్ = శత్రువులకు (ద్విష్ ధాతువుపై శతృ ప్రత్యయం), లోక... ప్రత్యూహౌ = లోక-ద్వయ = ఇహపర (రెండు)లోకాలలోని, సుఖ = సుఖాలయొక్క, వ్యూహ = సమూహానికి (సందోహ నివహ వ్యూహ సమూహ నికరా కరాః - వైజయన్తీ - గణ-2), ప్రత్యూహౌ = ఆటంకం వంటివారూ, (విఘ్నోంతరాయః ప్రత్యూహః - వైజయన్తీ-ధర్మ-4) (లోకయోః ద్వయే సుఖానాం సమూహస్య ప్రత్యూహౌ), ఏక+ఏక దంతౌ = ఒక్కొక్క దంతం కలవారూ (ఏకైకః దంతః యయోః తౌ) అశ్రాంతౌ = అలసట లేనివారు అయిన, విభూ = ప్రభువులైన రామకృష్ణులు, రంగమ్ = మల్లయుద్ధ ప్రదేశాన్ని, వివిశతుః = ప్రవేశించారు. (విశ ప్రవేశనే పరస్మైపది-లిట్-ప్ర.ద్వి.)

**తా ॥** తమ శత్రువులకు ఇహపరలోకాలలో అనుభవించదలచుకొన్న సుఖసమూహానికి ఆటంకం వంటివారూ, అలసటలేని వారూ అయిన ఆ బలరామకృష్ణులు చెరి ఒక చేతిలో చెరొక దంతాన్ని పట్టుకొని రంగస్థలం లోనికి ప్రవేశించారు.

**వి :** 1. రామకృష్ణులు రంగస్థలంలోనికి ప్రవేశించే సందర్భంలో భాగవతం కృష్ణుని అనేక విధాలుగా ఉల్లేఖిస్తూ చక్కని శ్లోకాన్ని అందించింది–

శ్లో॥ మల్లానామశనిర్నృణాం నరవరః స్త్రీణాం స్మరో మూర్తిమాన్
గోపానాం స్వజనోఽసతాం క్షితిభుజాం శాస్తా స్వపిత్రోః శిశుః ।
మృత్యుర్భోజపతేర్విరాడవిదుషాం తత్త్వం పరం యోగినం
వృష్ణీనాం పరదేవతేతి విదితో రంగం గతః సాగ్రజః ॥ – భాగవతం 10/43/17

పోతన ఈ శ్లోకాన్ని చక్కని సీసంలోనికి అనువదించాడు–

సీ. మహితరౌద్రంబున మల్లురకశనియై – నరుల కద్భుతముగ నాథుఁ డగుచు
శృంగారముగఁ బురస్త్రీలకుఁ గాముఁడై – నిజమృత్యువై కంసునికి భయముగ
మూఢులు బీభత్సమును బొంద వికటుఁడై – తండ్రికి దయరాఁగఁ దనయుఁ డగుచు
ఖలులకు విరసంబుగా దండియై గోప – కులకు హాస్యంబుగఁ గులజుఁ డగుచు

ఆ. బాంధవులకుఁ బ్రేమ భాసిల్ల వేలుపై – శాంతమొనర యోగిజనుల కెల్లఁ
బరమతత్త్వ మగుచు భాసిల్లె బలునితో – మాధవుండు రంగమధ్యమందు.

– పోతనభాగవతము 10/1322

| | | | |
|---|---|---|---|
| 2. **వివిశతుః :** | వివేశ | **వివిశతుః** | వివిశుః |
| | వివేశిథ | వివిశథుః | వివిశ |
| | వివేశ | వివిశివ | వివిశిమ. |

*

**శ్లో॥ తతః ప్రవవృతే యుద్ధం మల్లాభ్యాం రామకృష్ణయోః ।**
**గజాభ్యామివ మత్తాభ్యాం ఖ్యాతయోః సింహయోస్తయోః ॥ 11–40**

**అ :** బలరామకృష్ణులకు మల్లయోధులతో పోరు. –పథ్యావక్త్రమ్.

**అ :** తతః తయోః రామకృష్ణయోః మల్లాభ్యాం (సహ) ఖ్యాతయోః సింహయోః మత్తాభ్యాం గజాభ్యామ్ ఇవ యుద్ధం ప్రవవృతే.

**ప్ర :** తతః = అటుతరువాత, తయోః = ఆ, రామకృష్ణయోః = బలరామకృష్ణులకు (రామశ్చ కృష్ణశ్చ, తయోః), మల్లాభ్యాం (సహ) = మల్లురతో, ఖ్యాతయోః = ప్రసిద్ధికెక్కిన, మత్తాభ్యామ్ = మదించిన, గజాభ్యామ్ ఇవ = ఏనుగులతో వలె, యుద్ధమ్ = పోరు, ప్రవవృతే = జరిగింది. (ప్ర వృతు వర్తనే – ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** బలరామకృష్ణులు రంగప్రవేశం చేసిన తరువాత వారిద్దరికీ మల్లురతో పోరు జరిగింది. అది మదించిన ఏనుగులతో ప్రసిద్ధమైన సింహాలు పోరాడినట్లుంది.

**వి :** 1. రామకృష్ణులకు సింహాలతోనూ, మల్లురకు మదపుటేనుగులతోనూ పోలిక. (ఉపమాలంకారం). అంతకుముందే కువలయాపీడాన్ని వారు వధించివున్నారు కాబట్టి ఇక్కడ మల్లుర మరణం కూడా తప్పదని సూచన. ఏనుగుకు సింహస్వప్నమే భీకరమైనదైనప్పుడు సాక్షాత్తూ సింహం ప్రమాదకారియే గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రవవృతే :** | **ప్రవవృతే** | ప్రవవృతాతే | ప్రవవృతిరే |
| | ప్రవవృతిషే | ప్రవవృతాథే | ప్రవవృతిధ్వే |
| | ప్రవవృతే | ప్రవవృతివహే | ప్రవవృతిమహే. |

*

**శ్లో॥ స్వభక్తిరివ సంసారం కృష్ణశ్చాణూరమభ్యగాత్ ।**
**తద్జ్ఞానమివ పాపౌఘం ముష్టికం రోహిణీసుతః ॥ 11-41**

**అ :** కృష్ణుడు చాణూరునిపై, బలరాముడు ముష్టికునిపై దూకుట. -పథ్యావక్త్రమ్.

**అ :** కృష్ణః స్వ-భక్తిః సంసారమ్ ఇవ చాణూరమ్ అభ్యగాత్. రోహిణీసుతః తద్-జ్ఞానం పాప+ఓఘమ్ ఇవ ముష్టికమ్ అభ్యగాత్.

**ప్ర :** కృష్ణః = శ్రీకృష్ణుడు, స్వ-భక్తిః = తన (కృష్ణ) భక్తి (స్వస్య భక్తిః), సంసారమ్ ఇవ = సంసారాన్ని లాగా, చాణూరమ్ = చాణూరుని, అభి+అగాత్ = ఎదిరించాడు. (అభి-ఇ గతౌ-పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), రోహిణీసుతః = బలరాముడు (రోహిణ్యాః సుతః), తద్-జ్ఞానమ్ = ఆ కృష్ణ జ్ఞానం (తస్య జ్ఞానమ్), పాప+ఓఘమ్-ఇవ = పాప సమూహాన్ని లాగా (పాపానామ్ ఓఘః, తమ్ ఇవ), ముష్టికమ్ = ముష్టికుని, అభ్యగాత్ = ఎదిరించాడు.

**తా ॥** కృష్ణుడు, తనభక్తి సంసారాన్ని ఎదిరించినట్లు, చాణూరుని ఎదిరించాడు. బలరాముడు, కృష్ణజ్ఞానం పాపసమూహాన్ని ఎదిరించినట్లు, ముష్టికుని ఎదిరించాడు.

**వి :** 1. కృష్ణభక్తి లోపిస్తే సంసారాన్ని ఎదిరించటం కష్టం. వ్యాసుడంతటివాడు చింతకు లోనయి దానికి కారణం తెలియక మథనపడుతుంటే విష్ణుకథలు చెప్పక పోవటం దానికి కారణమన్న నారదవచనాన్ని చూడండి-

ఉ. అంచితమైన ధర్మచయమంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథలేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే హరి గుణవిశేషములెన్నినగాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! -పోతనభాగవతము 1/93

2. శ్లో॥సర్వోపనిషదో గావః దోగ్ధా గోపాలనందనః ।
పార్థో వత్సస్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ - అని గీతాస్తుతి.

ఉపనిషత్తులను గోవులను చేసి కృష్ణుడు పిండిన పాలు జ్ఞానం. ఉపనిషత్సారం గీత. ఆ గీతా (కృష్ణ) తత్త్వం తెలిస్తే పిడికిలి విడిపోయినట్లే. పాపాలు పారిపోయినట్లే.

| | | | |
|---|---|---|---|
| 3. **అభ్యగాత్ :** | **అభ్యగాత్** | అభ్యగాతామ్ | అభ్యగుః |
| | అభ్యగాః | అభ్యగాతమ్ | అభ్యగాత |
| | అభ్యగామ్ | అభ్యగావ | అభ్యగామ. |

*

**శ్లో॥ అపి వివిధతదీయాభ్యాసకౌశల్యమాసీత్**
**ఫణిపతియదుపత్యోరగ్రతోఽవ్యగ్రమత్యోః ।**
**గతఫలమతియత్నాభ్యస్తవిద్యాఽనవస్థా**
**ఫలతి సహజతేజోబుద్ధిభాజాం కిమగ్రే ॥ 11-42**

**అ :** చాణూరముష్టికుల మల్లయుద్ధనైపుణ్యం కృష్ణుని ముందు నిరర్థకమే అని ప్రతిపాదించుట. -మాలిని.

**అ :** వివిధ-తదీయ+అభ్యాస-కౌశల్యమ్ అపి అవ్యగ్రమత్యోః ఫణిపతి-యదుపత్యోః అగ్రతః గతఫలమ్ ఆసీత్. అనవస్థా అతియత్న+అభ్యస్త-విద్యా సహజ-తేజో-బుద్ధి-భాజామ్ అగ్రే ఫలతి కిమ్?

**ప్ర :** వివిధ = పలుతీరులైన, తదీయ = ఆ చాణూరముష్టికులయొక్క, అభ్యాస = నిరంతరమూ పునశ్చరణ చేయుట ద్వారా కలిగిన, కౌశల్యమ్ = నేర్పరితనం (వివిధం చ తదీయస్య అభ్యాసస్య కౌశల్యమ్), అవ్యగ్రమత్యోః : అవ్యగ్ర

= ఏమరని, మత్యోః = బుద్ధిగల (అవ్యగ్రే మతీ యయోః, తయోః), ఫణిపతి–యదుపత్యోః = బలరామకృష్ణుల యొక్క, అగ్రతః = ముందు, గత–ఫలమ్ = నిష్ఫలంగా (గతం ఫలం యస్య తత్), ఆసీత్ = అయ్యింది. (అస భువి పరస్మైపది లజ్ ప్ర.ఏ.), అనవస్థా = అంతులేనంతయై, అతి...విద్యా : అతిప్రయత్న = తీవ్ర ప్రయత్నంతో, అభ్యస్త = నేర్వబడిన, విద్యా = చదువు అయినా, సహజ... భాజామ్ : సహజ = పుట్టుకతో వచ్చిన, తేజః = తేజస్సు, బుద్ధి = తెలివీ, భాజామ్ = కలవారి యొక్క (సహజే చ తేజః బుద్ధిః చ యేషాం తేషామ్), అగ్రే = ఎదుట, ఫలతి కిమ్? = ఫలిస్తుందా? (ఫల నిష్పత్తౌ–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ మల్లుడు చాణూరముష్టికులు మల్లయుద్ధాన్ని వివిధరీతులలో అభ్యసించి, నిరంతరంగా అభ్యాసం చేస్తూ నేర్పు సంపాదించినవాళ్ళు. అయితే అసలే ఏమరుపాటే లేకుండా వారిముందు నిలిచిన రామకృష్ణుల ముందు ఆనేర్పు నిరర్థకమయింది. అవును సహజమైన ప్రతిభావ్యుత్పత్తులముందు అభ్యాసంవలన కలిగిన నేర్పు ఫలించదు గదా!

**వి :** 1. శ్లో॥ అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః।
యస్త్వశక్తికృతస్తస్య ఝటిత్యేవావ భాసతే ॥ – ధ్వన్యాలోకం.

ఇది ఆనందవర్ధనుడు కావ్యంలోని దోషాలను గురించి ప్రస్తావిస్తూ చెప్పినమాట. పాండిత్యం లేనందువల్ల తప్పు జరిగితే శక్తి (ప్రతిభ) దానిని కప్పివేస్తుంది. ప్రతిభలేనందువల్ల తప్పుజరిగితే పాండిత్యం దాన్ని కప్పి పుచ్చలేదు. పైగా అది వెంటనే బయటపడుతుంది.

ఏ విద్య అయినా, ఏ కళ అయినా అంతే. సహజంగా వచ్చిన నేర్పు ముందు కృత్రిమంగా అలవడిన నేర్పు తక్కువగానే కనిపిస్తుంది.

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది. చాణూరముష్టికుల నేర్పు విఫలమైంది అన్నది విశేషవిషయం. సహజమైన నేర్పు ముందు అభ్యస్తవిద్యవలన వచ్చిన నేర్పు దిగదుడుపే అన్నది సామాన్యాంశం. రెండింటినీ గుదిగ్రుచ్చినందువల్ల ఇది అర్థాంతర–న్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' – (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 3. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ |
| **ఫలతి :** | **ఫలతి** | ఫలతః | ఫలన్తి |
| | ఫలసి | ఫలథః | ఫలథ |
| | ఫలామి | ఫలావః | ఫలామః. |

*

**శ్లో॥ అఙ్గాలిఙ్గనతత్పరస్య చరణస్పర్శోద్యతస్యాప్యలం**
**నమ్రస్య స్వముపేయుషోఽపి పరితశ్చాణూరనామ్నో వశే ।**
**కృష్ణోఽభూన్న చ ముష్టికస్య సమరే సఙ్కర్షణస్తత్కృతిం**
**దుష్టైరాచరితాం కిమత్ర మతిమాన్ మృత్యుప్రదాం విశ్వసేత్ ॥ 11–43**

**అ :** చాణూరముష్టికులు రామకృష్ణులను ఏ రీతిగానూ లొంగదీయలేకపోవటాన్ని వివరించటం అర్థాంతరన్యాసంతో.
–శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణః సమరే అంగ+ఆలింగన–తత్పరస్య చరణ–స్పర్శ+ఉద్యతస్య అలం నమ్రస్య స్వం పరితః ఉపేయుషః

అపి చాణూర–నామ్నః వశే న అభూత్ సంకర్షణః చ ముష్టికస్య వశే న అభూత్ దుష్టైః ఆచరితాం మృత్యు–ప్రదాం సత్కృతిమ్ అత్ర మతిమాన్ కిమ్ విశ్వసేత్.

**ప్ర :** కృష్ణః = కృష్ణుడు (కర్షతి ఇతి), సమరే = యుద్ధంలో, అంగ... తత్పరస్య : అంగ = శరీరాన్ని, ఆలింగన = కౌగిలించుకొనటంలో, తత్పరస్య = ఆసక్తిగలవాడూ (అంగస్య ఆలింగనే తత్పరః తస్య), చరణ... తస్య : చరణ = పాదాలను, స్పర్శ = తాకుటకై, ఉద్యతస్య = ఉద్యమించినవాడూ (చరణయోః స్పర్శే ఉద్యతః తస్య), అలమ్ = పూర్తిగా, నమ్రస్య = ఒంగినవాడూ, స్వమ్ = తనను, పరితః = చుట్టి, ఉపేయుషః+అపి = తిరుగుతున్నవాడూ అయిన, చాణూర–నామ్నః = చాణూరుడనేపేరు గలవాడియొక్క (చాణూర ఇతి నామ యస్య తస్య), వశే = లొంగుబాటులో, న–అభూత్ = ఉండలేదు (భూ సత్తాయామ్ – భ్వాది – పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), సంకర్షణః చ = బలరాముడు కూడా (సంకర్షణశ్శీరపాణిః కాళిన్దీభేదనో బలః – అమరకోశః–స్వర్గ–24), ముష్టికస్య = ముష్టికుని యొక్క, వశే = అదుపులో, న అభూత్ = ఉండలేదు (హి = అది యుక్తమే), దుష్టైః = దుర్మార్గుల చేత, ఆచరితామ్ = పాటింపబడి, మృత్యు–ప్రదామ్ = మరణాన్ని కల్పించే, సత్కృతిమ్ = సత్కారాన్ని, అత్ర = ఈ లోకంలో, మతిమాన్ = బుద్ధిమంతుడు (మతిః అస్య అస్తి ఇతి) (**తదస్యాస్త్యస్మిన్నితి మతుప్**' – అష్టాధ్యాయి (5–2–94) సూత్రంతో మతుప్), కిమ్ విశ్వసేత్ = నమ్ముతాడా? (వి–శ్వస్ ప్రాణనే పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ။** చాణూరుడు మల్లయుద్ధం చేస్తూ కృష్ణుని శరీరాన్ని ఆలింగనం చేసికోవాలనుకొన్నాడు. పూర్తిగా నమ్రతను ప్రదర్శించాడు. చుట్టూ తిరిగాడు. (ఇవన్నీ మల్లయుద్ధవిన్యాసాలూ, భక్తి భావానికి అనుభావాలూ కూడా). అయినా కృష్ణుడు ఆ చాణూరుడికి లోబడలేదు. అలాగే ముష్టికుడికి బలరాముడు కూడా లోబడలేదు. నిజమే. దుర్మార్గులు ప్రాణాలమీదకు తెచ్చే సత్కారాలు చేసినంతమాత్రాన లోకంలో బుద్ధిమంతుడెవ్వడూ వారిని నమ్మడు.

**వి :** 1. చాణూరముష్టికులు కృష్ణునీ, బలరామునీ లొంగదీయాలని ఎన్నో రకాలుగా మల్లయుద్ధవిన్యాసాలను ప్రదర్శించటం కుస్తీలో ఒక భాగం. అవే చేష్టలు భక్తుల చేష్టలకు కూడా సరిపోతున్నాయి. భక్తులు అలా ప్రవర్తిస్తే కృష్ణుడు లొంగిపోయేవాడే. కానీ ఇక్కడ చాణూరిడికి లొంగలేదు. అలాగే బలరాముడు ముష్టికుడికీ. ఇది విశేషవిషయం. దుర్మార్గుడు సత్కారాలు చేసినా బుద్ధిమంతుడు వాడిని నమ్మడన్నది సామాన్యం. ఈ రెండింటి కలయికతో ఇక్కడ అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**' – (కు.122)

2. చాణూరుని దృష్టిలో తన చేష్టలు మల్లయుద్ధపు పట్లు. కవి దృష్టిలో భక్తి భావ ప్రదర్శనలు. కృష్ణుని దృష్టిలో స్వాభావిక క్రియామాత్రం. ఏ పనీలేక ఎప్పుడూ నిలవలేము కాబట్టి ఆ క్షణానికి ఆ పని రూపొందింది. అంతమాత్రమే. అందుకే దాన్ని మృత్యుప్రదంగానూ నమ్మలేదు. భక్తి భావంగానూ నమ్మలేదు. భక్తిభావంగా నమ్మితే చాణూరుని ఆదరించాలి. మృత్యుప్రదంగా నమ్మితే తానే చాణూరునికి భయంతో లొంగిపోవాలి.

| | | | |
|---|---|---|---|
| 3. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **విశ్వసేత్ :** | **విశ్వసేత్** | విశ్వసేతామ్ | విశ్వసేయుః |
| | విశ్వసేః | విశ్వసేతమ్ | విశ్వసేత |
| | విశ్వసేయమ్ | విశ్వసేవ | విశ్వసేమ. |

*

**శ్లో॥ అశనిసమకఠోరమల్లఘాతో – మృదునిహరేరఫలః కలేవరేఽభూత్ ।**
**మృదుసరసకవేః పురః కిమీడ్యా – కఠినపదప్రియకావ్యకారశీలా ॥ 11–44**

**అ :** చాణూరుని దెబ్బలు కృష్ణుని బాధించలేదనుట. -పుష్పితాగ్ర.

**అ :** అశని-సమ-కఠోర-మల్ల-ఘాతః మృదుని హరేః కలేవరే అఫలః అభూత్. మృదు-సరస-కవేః పురః కఠిన-పద-ప్రియ-కావ్య-కార-శీలా ఈడ్యా కిమ్?

**ప్ర :** అశని... ఘాతః : అశని = వజ్రాయుధంతో (అశ్నాతి ఇతి), (పవిరశనిః శతధారం వజ్రం - హలాయుధకోశః - 56), సమ = సమానంగా, కఠోర = కఠినమైన, మల్ల = మల్లునియొక్క, ఘాతః = దెబ్బ (అశనినా సమః కఠోరశ్చ అసౌ మల్లః తస్య ఘాతః), మృదుని = సున్నితమైన, హరేః = కృష్ణునియొక్క, కలేవరే = శరీరంపై, అఫలః = ఫలితం లేనిదిగా, అభూత్ = అయింది. (భూ సత్తాయామ్ పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), మృదు-సరస-కవేః : మృదు = సున్నితమూ, సరస = రసవంతమూ అయిన, కవేః = కవితలల్లేవాని యొక్క, పురః = ఎదుట, కఠిన.. శీలా : కఠిన = వినసొంపు కాని, పద = పదాల (యొక్క), ప్రియ = ఇష్టదైన, కావ్యకార = కవియొక్క, శీలా = ప్రవృత్తి, ఈడ్యా కిమ్? = స్తుతింపదగినదా?

**తా ॥** వజ్రంలాగా కఠినమైనవాడు చాణూరుడు. అతను కొట్టే దెబ్బ కూడా వజ్రపాతం వంటిదే. కృష్ణుని శరీరం మృదువు. అయినా చాణూరుని దెబ్బ కృష్ణుని పట్ల నిరర్థకమైంది. సరసమై మృదువైన కవిత్వం చెప్పేవానిముందు కఠినపదప్రయోగశీలుని స్తుతింపలేము గదా!

**వి :** 1. చాణూరుడికీ, కృష్ణుడికీ అసలు పోలికే లేదు. పరమభయంకరుడు చాణూరుడు. ఎలా వున్నాడో చూద్దాం-

సీ. రోషాగ్నిధూమప్రరోహంబు కైవడి - శిరమున సన్నపుసిగ వెలుంగ
నాశామదేభేంద్రహస్తసన్నిభములై - బాహుదండంబులు భయదములుగ
లయసమయాంతకోల్లసితదంష్ట్రలభంగిఁ-జాఁగిన కోఱమీసములు మెఱయ
నల్లని తెగ గల నడగొండ చాడ్పున - నాభీలనీలదేహంబు మెఱయఁ

ఆ. జరణహతుల ధరణి సంచలింపఁగ నభో - మండలంబు నిండ మల్లసఱచి
శౌరిదెసకు నడచెఁ జాణూరమల్లుండు - పౌరలోకహృదయభల్లుఁ డగుచు. -పోతనభాగవతము 10/1344

నడగొండలా కనిపించే చాణూరుడే వజ్రంతో సమానమైన దెబ్బ కొడుతున్నాడు. ఇద్దరు శత్రువులు మిత్రులై బాధిస్తున్నారు. అయినా కృష్ణుడికి లెక్కలేదు. చూపరులకు మాత్రం జాలి కలుగుతోంది.

ఉ. మంచి కొమారులం గుసుమమంజుశరీరులఁ దెచ్చి చెల్లరే !
యంచితవజ్రసారులు మహాద్రికఠోరులు నైన మల్లురం
గ్రించులఁ బెట్టి రాజు పెనఁగించుచుఁ జూచుచు నున్నవాఁడు; మే
లించుక లేదు; మానుమనఁ డిట్టి దురాత్ముని మున్ను వింటిమే? - పోతనభాగవతము 10/1350

2. ఇది నిదర్శనాలంకారం. సమానమైన తూకం గల రెండు వాక్యాలను ఒకే భావాన్ని తెలియజేయటానికి ఒకదానికి మరొకదానిని పరిపూరకంగా ప్రయోగిస్తే అది నిదర్శనాలంకారం. రెండు వాక్యాలలోనూ ఒకటి ప్రకృతాంశం, మరొకటి అప్రకృతాంశం. '**వాక్యార్థయోః సదృశయోః ఐక్యారోపో నిదర్శనా**' - (కు.53), ఉపమాలంకారమిక్కడ ధ్వనిస్తుంది.

వాస్తవానికి ఈ పోలికను అన్వయించటం కొంత క్లిష్టంగా వుంది. సరసకవి ముందు కఠోరకవి నిలువలేకపోవటం ఒక వాస్తవం. అంత మాత్రాన సున్నితంగా వుండే వాడి ముందు గట్టిగా దెబ్బతీయగలవాడు నిలవలేకపోవడమేమిటి? అక్కడ ఇంకేదో కారణ ముండాలి? సహజనైపుణ్యమా? ఆ ప్రస్తావన మింతకుముందే వచ్చింది? శరీర తత్త్వమా? అప్పుడు 'మృదు' కళేవర మన్న విశేషణానికి విలువ లేదు. వైతసీవృత్తిని ఆశ్రయించటమా? ఇక్కడ కృష్ణుడు లొంగిపోవటం లేదు. మరికొంత స్పష్టత అవసరం సమన్వయానికి...

3. **అభూత్ :** 11-43వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ తల్లభ్యాం జయకామినీమివ లషన్ పాదౌ గృహీత్వా రిపో-**
**స్తత్కాలార్హమివ భ్రమం ప్రతిదిశన్ తం భ్రామయిత్వా ముహుః ।**
**తన్మూర్ధానమతాడయత్ క్షితితలే దుష్టేభపంచానన-**
**స్తస్యాభ్యాససమేధితాం కఠినతాం పశ్యన్నివాఙ్గే ద్విషః ॥ 11-45**

**అ :** కృష్ణుడు చాణూరునిలోని చేవ చూడటానికై అతడిని నేలపై పడవేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** దుష్ట+ఇభ-పంచాననః (కృష్ణః) తత్+లభ్యామ్ జయ-కామినీం లషన్-ఇవ రిపోః పాదౌ గృహీత్వా తత్-కాల-అర్హం భ్రమం ప్రతిదిశన్ ఇవ తం ముహుః భ్రామయిత్వా అభ్యాస-సమేధితాం ద్విషః అంగే కఠినతాం పశ్యన్ ఇవ తస్య మూర్ధానం క్షితితలే అతాడయత్.

**ప్ర :** దుష్ట+ఇభ-పంచాననః : దుష్ట = చెడ్డవా రనే, ఇభ = ఏనుగులకు, పంచాననః = సింహం వంటివాడైన (దుష్ట ఏవ ఇభః, తస్య పంచాననః), (కృష్ణః = కృష్ణుడు), తత్+ లభ్యామ్ = ఆ చాణూరుని ద్వారా లభించబోయే, జయ-కామినీమ్ = గెలుపుపడతిని (జయ ఏవ కామినీ, తామ్), లషన్+ఇవ = కోరుతున్నట్లుగా, రిపోః = శత్రువైన చాణూరునియొక్క, పాదౌ = కాళ్ళను, గృహీత్వా = పట్టుకొని (గ్రహ ధాతువుపై క్త్వా ప్రత్యయం), తత్-కాల+అర్హమ్ = ఆ సమయానికి తగినట్లుగా (సః చ అసౌ కాలః తత్కాలః, తస్య అర్హః, తమ్), భ్రమమ్ = భ్రాంతిని/ప్రదక్షిణాన్ని, ప్రతిదిశన్-ఇవ = కల్పిస్తున్నట్లుగా (ప్రతిదిశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), తమ్ = ఆ శత్రువును, ముహుః = మాటిమాటికీ, భ్రామయిత్వా = త్రిప్పి, అభ్యాస-సమేధితామ్ : అభ్యాస = నిరంతరం కొనసాగించటం వలన, సమేధితామ్ = వర్ధిల్లిన (అభ్యాసేన సమేధితా, తామ్), ద్విషః = శత్రువుయొక్క, అంగే = శరీరంలోని, కఠినతామ్ = దృఢత్వాన్ని, పశ్యన్-ఇవ = చూస్తున్నట్లుగా, క్షితి-తలే = భూతలంపై,తత్+ మూర్ధానమ్ : తత్ = ఆ చాణూరునియొక్క, మూర్ధానమ్ = తలను, అతాడయత్ = కొట్టాడు. (తడ ఆఘాతే ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా॥** చెడ్డవారనే ఏనుగుల పాలిటి సింహంవంటి కృష్ణుడు చాణూరుని సంహరించటం ద్వారా లభించబోయే జయకాంతను అభిలషిస్తూ ఆ శత్రువుయొక్క కాళ్ళు పట్టుకొని, ఆ కాలానికి తగినట్లుగా భ్రాంతిని కల్పించి పదే పదే (గిర గిర) త్రిప్పుతూ, నిరంతరాభ్యాసం వలన ఆ చాణూరుని శరీరంలో ఏర్పడిన కాఠిన్య మేపాటిదో చూడాలని భావిస్తున్నట్లు అతని శరీరాన్ని నేలకేసి కొట్టాడు.

**వి :** 1. '**కఠినతాం పశ్యన్నివ**' (కాఠిన్యాన్ని చూస్తున్నట్లు) అన్న ఫలోత్ప్రేక్షలో కొంత వక్రోక్తి కూడా కలిసి వుంది. కాఠిన్యాన్ని చూడాలని కృష్ణుడు భావించాడనటంలో కవిలోని పరిహాస శీలత కనిపిస్తోంది. నేలకేసి కొట్టడమే కృష్ణుని ఆంతర్యం - ఉత్ప్రేక్ష కవి ఆంతర్యం కాబట్టి.

**జయకామిని, దుష్టేభం** అన్నవి రూపకాలంకారాలు. **దుష్టేభపంచానన** అనటం ఉపమేయాన్ని చెప్పనందువల్ల రూపకాతిశయోక్త్యలంకారం.

2. చాణూరుడికీ, ముష్టికుడికీ మరణానికి ముందే కృష్ణుడు బంధమోక్షాలను కల్పించాడని నారాయణీయంలో కనిపిస్తుంది.

శ్లో॥ చాణూరో మల్లవీరస్తదను నృపగిరా ముష్టికో ముష్టిశాలీ
త్వాం రామం చాభిపేదే ఝుటఝుటితి మిథో ముష్టిపాతాతిరూక్షమ్ ।
ఉత్పాతాపాతనాకర్షణవివిధరణాన్యాసతాం తత్ర చిత్రం
మృత్యోః ప్రాగేవ మల్లప్రభురగమదయం భూరిశో బంధమోక్షాన్ ॥ -నారాయణీయమ్ 75/6

| | | | |
|---|---|---|---|
| 3. **అతాడయత్ :** | **అతాడయత్** | అతాడయతామ్ | అతాడయన్ |
| | అతాడయః | అతాడయతమ్ | అతాడయత |
| | అతాడయమ్ | అతాడయావ | అతాడయామ. |

*

**శ్లో॥ బాలమల్లకరచూర్ణితభాస్వ-న్నారికేళతులనాం స జగామ ।**
**అన్యలోకగమనోద్యతభీతో-త్తంసకంసపరిపన్థిసుశాన్త్యై ॥ 11-46**

**అ :** చాణూరుని తలను నారికేళంతో పోల్చటం. -స్వాగతమ్.

**అ :** సః అన్య-లోక-గమన-ఉద్యత-భీత-ఉత్తంస-కంస-పరిపన్థి-సుశాన్త్యై బాల-మల్ల-కర-చూర్ణిత-భాస్వత్+నారికేళ-తులనాం జగామ.

**ప్ర :** సః = ఆ చాణూరుని తల, అన్య... సుశాన్త్యై : అన్య = మరొక, లోక = లోకానికి, గమన = వెళ్ళటానికి, ఉద్యత = సిద్ధమయిన, భీత+ఉత్తంస = పిరికివారిలో మేటి అయిన, కంస = కంసుని యొక్క, పరిపంథి = శత్రువులయొక్క (ఇది వైదికరూపమేయయినను లోకమునను దీనికి వాడుక గలదు. ఆంధ్రశబ్దరత్నాకరము - ద్వితీయ-870), ఇక్కడ లాక్షణికంగా విఘ్నాలని అర్థం. సుశాన్త్యై = ఉపశాంతి కొరకు, బాల... తులనామ్ : బాల = బాలుడైన, మల్ల = మల్లుని యొక్క, కర = చేతితో, చూర్ణిత = బ్రద్దలు చేయబడి, భాస్వత్ = ప్రకాశిస్తున్న, నారికేళ = కొబ్బరికాయతో, తులనామ్ = పోలికను, జగామ = పొందాడు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** నేలబడ్డ చాణూరుని తల పగిలిన కొబ్బరి కాయలా వుంది. మరోలోకానికి వెళ్ళటానికి సిద్ధమైన కంసుడనే మేటి పిరికివాని విఘ్నశాంతికోసం బాలుడైన మల్లుడు తన చేతితో కొట్టిన కొబ్బరికాయను అది తలపిస్తోంది.

**వి :** 1. దోష శాంతికోసం కొబ్బరికాయను కొట్టడం ఎప్పటినుండియో అలవాటులోవున్న ఆచారం.

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | జగామ | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ పదోః ప్రగృహ్య ప్రసభం నిపాత్య - సంచూర్ణయన్ మల్లవరం ధరణ్యామ్ ।**
**సహోదరోన్మూలనకర్మయోగ్య-ప్రతిక్రియాం ప్రౌఢపతిః ప్రచక్రే ॥ 11-47**

**అ :** కృష్ణుడు మల్లుని నేలపై గూల్చి చూర్ణం చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** మల్లవరం పదోః ప్రగృహ్య ధరణ్యాం ప్రసభం నిపాత్య సంచూర్ణయన్ ప్రౌఢపతిః సహోదర-ఉన్మూలన-కర్మ-యోగ్య-ప్రతిక్రియాం ప్రచక్రే.

**ప్ర :** మల్ల-వరమ్ = మల్లులలో మేటి అయిన చాణూరుని (మల్లేషు వరః, తమ్), పదోః = పాదాలపై, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ధరణ్యామ్ = నేలపై, ప్రసభమ్ = వేగంగా (ప్రసభో - జవో వేగః స్యదోరయః - వైజయన్తీ-లోకపాల - 55), నిపాత్య = పడవేసి, సంచూర్ణయన్ = పొడిచేస్తూ, ప్రౌఢపతిః = పెద్దలకే ప్రభువైన కృష్ణుడు, సహోదర... క్రియామ్ : సహోదర = తోడబుట్టినవారిని, ఉన్మూలన = చంపుట అను, కర్మ = పనికి, యోగ్య = తగిన, ప్రతిక్రియామ్ = ప్రతీకారచేష్టను, ప్రచక్రే = చేశాడు. (ప్ర-కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** మేటి రేడయిన కృష్ణుడు మల్లయోధులలో మేటి అయిన చాణూరుని కాళ్ళు పట్టుకొని నేలపై వేగంగా/బలంగా పడవేసి పొడిచేస్తూ తన సోదరులను (కంసుడు) చంపిన దానికి తగిన ప్రతిక్రియను చేశాడు.

**వి :** 1. చాణూరుడు కృష్ణునికి లోబడటాన్ని పోతన ఎంత సుందరంగా వర్ణించాడో చూడండి.

కం. ధృతి సెడి లోఁబడె మల్లుం
దతులితభవజలధితరికి హతరిపుపురికిన్
జితకరికిన్ ధృతగిరికిం
దతహరిరవభరితశిఖరిదరికిన్ హరికిన్. – పోతనభాగవతము 10/1358

పోతన సహజశైలి ఇక్కడ మల్లయుద్ధవర్ణన సందర్భంలో పొందికగా కుదిరింది. మల్లుని గిరగిర త్రిప్పుతున్నట్లనిపిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రచక్రే :** | ప్రచక్రే | ప్రచక్రాతే | ప్రచక్రిరే |
| | ప్రచకృషే | ప్రచక్రాథే | ప్రచకృఢ్వే |
| | ప్రచక్రే | ప్రచకృవహే | ప్రచకృమహే. |

*

**శ్లో॥ బలస్య తలఘాతేన నష్టం ముష్టికమీక్షితుమ్ ।**
**హ్రియేవ చూర్ణితం రేజే చాణూరస్య శిరః పురా ॥ 11-48**

**అ :** ముష్టికుని మరణానికి ముందే చాణూరుడు మరణించటానికి కారణాన్ని కవి సంభావించటం.–పథ్యావక్త్రమ్.

**అ :** బలస్య తల–ఘాతేన నష్టం ముష్టికమ్ ఈక్షితుమ్ హ్రియా+ఇవ పురా చూర్ణితం చాణూరస్య శిరః రేజే.

**ప్ర :** బలస్య = బలరాముని యొక్క, తల–ఘాతేన = చేతి చరుపుతో, నష్టమ్ = మరణించిన, ముష్టికమ్ = ముష్టికుని, ఈక్షితుమ్ = చూడటానికి (ఈక్ష ధాతువుపై తుమున్ ప్రత్యయం), హ్రియా+ఇవ = సిగ్గుచేతనో అన్నట్లు, పురా = ముందుగా, చూర్ణితమ్ = మర్దింపబడిన, చాణూరస్య = చాణూరునియొక్క, శిరః = తల,రేజే = వెలుగొందింది.(రాజృ దీప్తౌ–ఆత్మనే–పది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** బలరాముని చేతి చరుపుతో చనిపోయిన ముష్టికుని చూడటానికి సిగ్గుపడుతున్నట్లుగా అతనికన్న ముందుగా మర్దింపబడిన చాణూరుని శిరస్సు వెలుగొందింది.

**వి :** 1. మల్లయుద్ధప్రవీణులయిన చాణూరముష్టికులతో లౌకికదృష్టిలో పసివారైన బలరామ–కృష్ణులు పోరాడటం, అదీ మల్లయుద్ధం కావటం చాలా అసమంజసం, అధర్మం కూడా. ఈ సన్నివేశాన్నే ఆధారం చేసికొని వ్యాసమహర్షి చేస్తున్న హితోక్తులను స్వీకరిద్దాం–

శ్లో॥ క్వ వజ్రసారసర్వాంగౌ మల్లౌ శైలేంద్రసన్నిభౌ ।
క్వ చాతిసుకుమారాంగౌ కిశోరౌ నాప్తయౌవనౌ ॥

శ్లో॥ ధర్మవ్యతిక్రమోహ్యస్య సమాజస్య ధ్రువం భవేత్ ।
యత్రాధర్మః సముత్తిష్ఠేన్న స్థేయం తత్ర కర్హిచిత్ ॥

శ్లో॥ న సభాం ప్రవిశేత్ ప్రాజ్ఞః సభ్యదోషాననుస్మరన్ ।
అబ్రువన్ విబ్రువన్నజ్ఞో నరః కిల్బిమశ్నుతే ॥ – భాగవతమ్ 10/44/8-10

మల్లుల సర్వావయవాలూ వజ్రసారాలు. వారు కొండలవంటివారు. వీరు సుకుమార శరీరులు. ఇంకా యౌవనంలోనికి అడుగిడనివారు. ఇది సామాజికమైన అధర్మం. అధర్మమున్నచోట మనం వుండకూడదు. ప్రాజ్ఞ సభలలోనికి వెళ్ళకూడదు. వెళితే సభ్యుల దోషాలను గురించి చెప్పినా తప్పే, మానినా తప్పే. అది పాపానికే దారి తీస్తుంది. ప్రభుత్వాల ఆశ్రయం కోసం ప్రాకులాడే పండితులూ, పామరులూ కూడా గమనించవలసిన విషయం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **రేజే :** | **రేజే** | రేజాతే | రేజిరే | |
| | రేజిషే | రేజాథే | రేజిధ్వే | |
| | రేజే | రేజివహే | రేజిమహే. | * |

**శ్లో॥ న మన్ముష్టిప్రహారస్య లక్ష్యోఽయమితి లక్షయన్ ।**
**రామస్తం తలఘాతేన జఘానాపార్థనామకమ్ ॥ 11-49**

**అ :** బలరాముడు ముష్టికుని సార్థకనామధేయుని చేయగూడదని అరచేతితో చరచుట. -పథ్యావక్త్రమ్.

**అ :** రామః మత్+ముష్టి-ప్రహారస్య అయమ్ లక్ష్యః న ఇతి లక్షయన్ అపార్థ-నామకం తం తల-ఘాతేన జఘాన.

**ప్ర :** రామః = బలరాముడు, మత్+ముష్టి-ప్రహారస్య : మత్ = నాయొక్క, ముష్టి = పిడికిలియొక్క, ప్రహారస్య = దెబ్బకు, అయమ్ = ఈ ముష్టికుడు, లక్ష్యః = గురిగా, న (భవతి) = కాదు, ఇతి = అని, లక్షయన్ = గుర్తింపజేస్తూ, అపార్థ-నామకమ్ = నిరర్థకమైన పేరుగల (అపార్థం నామ యస్య సః అపార్థనామా, స ఏవ అపార్థనామకః తమ్), తమ్ = ఆ ముష్టికుని, తల-ఘాతేన = అరచేతి చరుపుతో, జఘాన = చంపాడు. (హన హింసాగత్యోః పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** తన పిడికిలి దెబ్బకు గురిగా ముష్టికుడు తగడని భావించిన బలరాముడు ఆ ముష్టికుని పేరును నిరర్థకం చేస్తూ అరచేతి చరుపుతో అతడిని చంపాడు.

**వి :** 1. **ముష్టిః కే యస్య సః ముష్టికః** అని విగ్రహవాక్యం. అంటే తల మీద పిడికిలి గలవాడు అని అర్థం. బలరాముడు తలమీద పిడికిలి దెబ్బ కొడితే ముష్టికుడు సార్థకనామధేయు డవుతాడు. పేరు నిలుపుకోవటం మంచి లక్షణాలలో ఒకటి. కానీ ముష్టికుడికి ఆపాటి విలువ కూడా దక్కకూడదని బలరాముడు అరచేతితో చరిచి చంపాడు ముష్టికుని.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జఘాన :** | **జఘాన** | జఘ్నతుః | జఘ్నుః | |
| | జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న | |
| | జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ. | * |

**శ్లో॥ కృష్ణం మన్నగరాద్బహిష్కురుత తత్పక్షైః సమం మద్భటా**
**నన్దం మారయతాశు మర్దయత తం హీనోగ్రసేనం భువి ।**
**కంసేనేత్థముదీరితేఽఖిలఖలశ్రేణీవనోగ్రానల**
**స్తస్యాజ్ఞాధరవజ్జగామ సుజనస్తోమాంతకస్యాన్తికమ్ ॥ 11-50**

**అ :** చాణూరముష్టికులను కృష్ణబలరాములు సంహరించిన తర్వాత అక్కడి పరిస్థితి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** మద్-భటాః కృష్ణం మత్+నగరాద్ తత్+పక్షైః సమం బహిః+కురుత. ఆశు నందం మారయత తం హీన+ఉగ్రసేనం భువి మర్దయత కంసేన ఇత్థమ్ ఉదీరితే అఖిల-ఖల-శ్రేణీ-వన-ఉగ్ర+అనలః (కృష్ణః) తస్య ఆజ్ఞా-ధరవత్ సుజన-స్తోమ+అంతకస్య అంతికం జగామ.

**ప్ర :** మద్-భటాః = నా సైనికులారా! కృష్ణమ్ = కృష్ణుని, మత్+నగరాత్ = నా నగరం నుండి, తత్-పక్షైః సమమ్ = అతని అనుచరులతో పాటు, బహిః+కురుత = బయటకు పంపండి (బహిః - కృ కరణే పరస్మైపది-లోట్-మ.బ.), ఆశు = వెంటనే, నందమ్ = నందుని, మారయత = చంపండి (మృ ప్రాణత్యాగే ణిచ్-పరస్మైపది-లోట్-మ.బ.), తమ్ = ఆ, హీన+ఉగ్రసేనమ్ = హీనుడైన ఉగ్రసేనుని (హీనశ్చ అసౌ ఉగ్రసేనః, తమ్), భువి = నేలపై,

మర్దయత = త్రొక్కండి. (మృద్ క్షోదే ణిచ్-పరస్మైపది-లోట్-మ.బ.), కంసేన = కంసునిచేత, ఇత్థమ్ = ఈ రీతిగా, ఉదీరితే (సతి) = చెప్పబడగా, అఖిల... నలః : అఖిల = సమస్తమైన, ఖల= దుష్టుల యొక్క శ్రేణీ = వరుస అనే, వన = అడవికి, ఉగ్ర = తీవ్రమైన, అనలః = అగ్గివంటి వాడైన (అఖిలానాం ఖలానాం శ్రేణీ ఏవ వనం తస్య, ఉగ్రశ్చ అసౌ అనలః), (కృష్ణః = కృష్ణుడు), ఆజ్ఞా-ధరవత్ = ఆదేశాన్ని పాటించేవాడిలాగా (ఆజ్ఞాం ధరతీతి ఆజ్ఞాధరః – తద్వత్), సుజన... కస్య : సుజన = సజ్జనులయొక్క, స్తోమ = సమూహానికి, అంతకస్య = నాశకుడైన, తస్య = ఆ కంసుని యొక్క, అంతికమ్=సమీపానికి, జగామ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** 'సైనికులారా! కృష్ణుని నా నగరంనుండి అనుచరులతో పాటు పంపండి. వెంటనే నందుని చంపండి. హీనుడైన ఉగ్రసేనుని నేలకేసి త్రొక్కండి.' కంసుడలా అనగానే దుర్మార్గుల వరుస అనే అడవికి దావాగ్నివంటి కృష్ణుడు సజ్జనసమూహానికి వినాశకుడైన ఆ కంసుని దగ్గరకు వెళ్ళాడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **బహిష్కురుత :** | బహిష్కరోతు/బహిష్కురుతాత్ | బహిష్కురుతామ్ | బహిష్కుర్వన్తు |
| | బహిష్కురు/బహిష్కురుతాత్ | బహిష్కురుతమ్ | **బహిష్కురుత** |
| | బహిష్కరవాణి | బహిష్కరవావ | బహిష్కరవామ |
| **మారయత :** | మారయతు/మారయతాత్ | మారయతామ్ | మారయన్తు |
| | మారయ/మారయతాత్ | మారయతమ్ | **మారయత** |
| | మారయాణి | మారయావ | మారయామ |
| **మర్దయత :** | మర్దయతు/మర్దయతాత్ | మర్దయతామ్ | మర్దయన్తు |
| | మర్దయ/మర్దయతాత్ | మర్దయతమ్ | **మర్దయత** |
| | మర్దయాని | మర్దయావ | మర్దయామ |

**జగామ** : 11-46వ శ్లోకం చూడుదు. *

**శ్లో॥ తదా మదాన్ధాః పరివవ్రురేనం - చమూభిరన్యే చతురఙ్గిణీభిః ।**
**యథా పతఙ్గా జ్వలనం జ్వలన్తం - తమస్సమూహస్తరణిం తథా వా ॥ 11-51**

**అ :** కంసుని ఆజ్ఞమేరకు సేనలు కృష్ణునిపైకి ఉరుకుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** తదా మద+అన్ధాః అన్యే చతుః+అంగిణీభిః చమూభిః సహ యథా పతంగాః జ్వలన్తం జ్వలనం వా యథా తమః+సమూహః తరణిం తథా ఏనం పరివవ్రుః

**ప్ర :** తదా = అప్పుడు, మద+అన్ధాః : మద = పొగరుచే, అన్ధాః = గ్రుడ్డివారైన, అన్యే = మరికొందరు (సైనికులు), చతుః+అంగిణీభిః = నాలుగు అంగాలుగల (సేనలోని నాలుగు అంగాలు. ఏనుగులు, గుఱ్ఱాలు, రథాలు, పదాతులు), చమూభిః+సహ = సేనలతో కూడి, యథా = ఏ రీతిగా, పతంగాః = మిడతలు (పతన్తః గచ్ఛన్తి ఇతి పతంగాః) (పతంగః శలభః ప్రోక్తః – హలాయుధకోశః-257), జ్వలన్తమ్ = మండుతున్న, జ్వలనమ్ = అగ్నిని (చుట్టుముట్టుతాయో), వా = లేక, యథా = ఏ రీతిగా, తమః సమూహః = చీకటి గుంపు, తరణిమ్ = సూర్యుని (చుట్టు ముదుతుందో), తథా = ఆ రీతిగా, ఏనమ్ = కృష్ణుని, పరివవ్రుః = చుట్టుముట్టారు. (పరి వృ ఆవరణే-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** అలా కృష్ణుడు వెళ్తున్న సమయంలో మదాంధులైన కొందరు కంససైనికులు చతురంగ-బలాలతో కూడిన సేనలతో కృష్ణుని చుట్టుముట్టారు. అది మిడతలు మండే అగ్నిని చుట్టుముట్టినట్టూ, చీకటిగుంపు సూర్యుని చుట్టుముట్టినట్టూ వుంది.

**వి :** 1. దీపాన్ని చుట్టుముట్టిన మిడతలు, సూర్యుని చుట్టుముట్టిన చీకట్లు నశించటం నిశ్చయం. ఆ పోలికను (ఉపమాలంకారం) చూపటం ద్వారా ఆ సేనల వినాశనం సూచింపబడింది. ఇక్కడ ఉపమాలంకారం బింబప్రతిబింబభావంతో కనిపిస్తుంది. సేనలు కృష్ణుని చుట్టుముట్టడం ఉపమేయకోటిలోని బింబం. మిడతలు దీపాన్ని చుట్టుముట్టడం, చీకట్లు సూర్యుని చుట్టుముట్టడం ఉపమానకోటిలోని ప్రతిబింబాలు. ఈ రెండింటికీ పోలిక కాబట్టి ఇది బింబప్రతిబింబభావంతో ఉపమాలంకారం. ఉపమానకోటిలో రెండు వాక్యాలున్నాయి కాబట్టి ఇది **మాలోపమ** కూడా అవుతుంది.

2. **పరివవ్రుః :** పరివవార — పరివవ్రతుః — **పరివవ్రుః**
పరివవరిథ — పరివవ్రథుః — పరివవ్ర
పరివవార/పరివవర — పరివవృవ — పరివవృమ. *

**శ్లో॥ రణే పదాభ్యాం చరతో మురారే - రథం ససూతం స సహస్రనేత్రః ।**
**సమాదిశత్ స్వాభ్యుదయప్రదస్య - పరస్య సేవాం భువి కర్తుకామః ॥ 11-52**

**అ :** పాదచారియై యుద్ధం చేస్తున్న కృష్ణునకు ఇంద్రుడు రథాన్ని ఏర్పాటు చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సహస్ర-నేత్రః రణే పదాభ్యాం చరతః స్వ+అభ్యుదయ-ప్రదస్య పరస్య మురారేః భువి సేవాం కర్తు-కామః స-సూతం రథం సమాదిశత్.

**ప్ర :** సహస్ర-నేత్రః = ఇంద్రుడు (సహస్రాణి నేత్రాణి యస్య సః), రణే = యుద్ధంలో, పదాభ్యామ్ = కాళ్ళతో, చరతః = సంచరిస్తున్న/నడుస్తున్నవాడూ, స్వ+అభ్యుదయ-ప్రదస్య : స్వ = తనయొక్క, అభ్యుదయ = అభివృద్ధికి, ప్రదస్య = దాతయూ, పరస్య = పరాత్పరుడూ అయిన, మురారేః = కృష్ణునికి, భువి = భూలోకంలో, సేవామ్ = సేవను, కర్తు-కామః (సన్) = చేయగోరినవాడై (కర్తుం కామః), స-సూతమ్ = సారథితో పాటు, రథమ్ = రథాన్ని, సమాదిశత్ = కల్పించాడు. (సమ్+ఆ+దిశ అతిసర్జనే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తన అభ్యుదయానికి కారకుడు, పరాత్పరుడు కాబట్టి భూలోకంలో ఆయనకు సేవ చేయాలనుకొన్నాడు ఇంద్రుడు. అందువల్ల యుద్ధంలో పాదచారియై కదులుతున్న కృష్ణుడికి సూతునితో సహా రథాన్ని సమకూర్చి పంపించాడు.

**వి :** 1. భాగవతంలో ఇంద్రుడు రథాన్ని పంపే సన్నివేశం లేదు. అసలు అంతవ్యవధి వున్నట్లు కూడా కనిపించదు. అంతా క్షణాల్లో జరిగిపోతుంది. మహాభారతతాత్పర్యనిర్ణయంలో మాత్రం ఇంద్రుడు రథాన్ని సమకూర్చినట్లుంది-

శ్లో॥ జానన్నపీశ్వరమనన్తబలం మహేంద్రః
కృష్ణం **రథం నిజమయాపయదాయుధాఢ్యమ్** ।
శుశ్రూషణాయ పరమస్య యథా సముద్ర-
మర్ఘ్యేణ పూరయతి పూర్ణజలం జనోఽయమ్ ॥ - మహాభారతతాత్పర్ణనిర్ణయః-13/125

పోతన కూడా అటువంటి ప్రస్తావన చేయలేదు. రామాయణంలో ఇంద్రుడు రామునికోసం రథాన్ని మాతలితో పాటు పంపటం (రామాయణం-యుద్ధ-102 సర్గ), ఆ రథంపైననే నిలిచి రాముడు యుద్ధం చేయటం కనిపిస్తుంది. ఆ కోవలోనే మహాభారతనిర్ణయకర్త లోకకంటకసంహారంలో ఇంద్రుని ప్రమేయం కూడా సముచితమని భావించి కృష్ణునికోసం ఇంద్రుడు రథాన్ని పంపటాన్ని ప్రస్తావించాడు.

పోతన మూలభాగవతాన్ని అనుసరించాడు కాబట్టి రథ ప్రసక్తి లేదు. కంసుని మృతిని ఎంత దయనీయంగా చిత్రించాడో పోతన! గమనించండి.

శా. పక్షీంద్రు డురగంబుఁ బట్టు విధ మొప్పన్ గేశబంధంబు లో
కక్షోభంబుగఁ గట్టి మౌళిమణులాకల్పాంతవేళాపత
న్నక్షత్రంబుల భంగి రాల రణసన్నాహంబు డిందించి రం
గ క్షోణింబడఁ ద్రోచెఁ గృష్ణుఁడు వెసన్ గంసున్ నృపోత్తంసునిన్.

శా. మంచాగ్రంబుననుండి రంగధరణీమధ్యంబునం గూలి యే
సంచారంబును లేక చిక్కి జనులాశ్చర్యముం బొందఁగా
బంచత్వంబును బొంది యున్న విమతున్ బద్మాక్షుఁ డీడ్చెన్ వడిన్
పంచాస్యంబు గజంబు నీడ్చు పగిదిన్ బాహాబలోల్లాసియై. - పోతనభాగవతము-10/1373,1374

| | | | |
|---|---|---|---|
| 2. **సమాదిశత్ :** | **సమాదిశత్** | సమాదిశతామ్ | సమాదిశన్ |
| | సమాదిశః | సమాదిశతమ్ | సమాదిశత |
| | సమాదిశమ్ | సమాదిశావ | సమాదిశామ. |

*

**శ్లో॥ అథో రథాగ్ర్యోఽవతతార తారా-వృతః శశీవాతివిచిత్రరత్నః ।**
**ముకున్దసన్దర్శన ధూతపాపం - మునిం ఖలాన్నేతుమివోర్ధ్వలోకమ్ ॥ 11-53**

**అ :** కంసునిలో నున్న భృగుమహర్షిని కొనిపోవటానికి గగనతలంనుండి రథం అవతరించటం.-ఉపేంద్రవజ్ర.

**అ :** అథో అతి-విచిత్ర-రత్నః తారా+ఆవృతః శశీ ఇవ రథ+అగ్ర్యః ముకుంద-సందర్శన-ధూత-పాపమ్ మునిం ఖలాత్ ఊర్ధ్వలోకం నేతుమ్-ఇవ అవతతార.

**ప్ర :** అథో = అటుతర్వాత, అతి-విచిత్ర-రత్నః = బాగా విచిత్రాలయిన రత్నాలుగల (అతివిచిత్రాణి రత్నాని యస్య సః), తారా+ఆవృతః : తారా = నక్షత్రాలతో, ఆవృతః = చుట్టబడిన, శశీ+ఇవ = చంద్రునిలా వున్న, రథ+అగ్ర్యః = శ్రేష్ఠమైన రథం (రథేషు అగ్ర్యః), ముకుంద... పాపమ్ : ముకుంద = కృష్ణునియొక్క, సందర్శన = చూచుట చేత, ధూత = తొలగింపబడిన, పాపమ్ = పాపాలు గల, మునిమ్ = (భృగు) మహర్షిని, ఖలాత్ = దుష్టుడైన కంసునినుండి, ఊర్ధ్వ-లోకమ్ = పై లోకానికి (ఊర్ధ్వశ్చ అసౌ లోకః, తమ్), నేతుమ్-ఇవ = కొనిపోవటానికన్నట్లు, అవతతార = దిగింది. (అవ-తౄ ప్లవన తరణయోః-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అప్పుడు ఇంకో గొప్ప రథం కూడా గగనతలం నుండి దిగింది. అది విచిత్ర రత్నాలతో అలంకరింపబడింది. చుట్టూ నక్షత్రాలు ఉన్న చంద్రుడిలా అది వెలుగొందుతోంది. ఆ రథం కృష్ణ సందర్శనంచేత పాపాలు తొలగిపోయిన భృగుమహర్షిని దుష్టుడైన కంసుని నుండి ఊర్ధ్వలోకాలకు తీసికొనిపోవటానికి వచ్చింది.

**వి :** భృగుమహర్షి వరుణకుమారుడు. ఆత్మజ్ఞానం కోసం తండ్రి ఆదేశం మేరకు తపస్సు చేసి సాధించుకొన్నవాడు. ఆ మహర్షి తన తపోబలం కారణంగా త్రిమూర్తులలో 'ఎవరు గొప్ప' అని నిర్ణయించటానికి నియమింపబడి విష్ణుమూర్తిపై దౌర్జన్యం కూడా చేసి, అయినా చలించని విష్ణుసహనాన్ని గుర్తించి, విష్ణువునే మహనీయుడుగా ప్రకటించినవాడు.

ఆయన కంసునిలో ప్రవేశించినట్టు భాగవతం చెప్పలేదు కానీ భాగవత తాత్పర్యంలో కనిపిస్తుంది. 'కంసావిష్టో భృగుః స్వయమ్'

కంసుడు పూర్వజన్మలో కాలనేమి అనే రాక్షసుడని, హిరణ్యకశిపుని శాపం వల్ల ఆ కాలనేమి కంసుడుగా పుట్టాడని దేవీభాగవతం (చతుర్థస్కంధం) చెప్తోంది. తదాధారంగానే నారాయణభట్టతిరి కంసహననం తర్వాత కృష్ణుని ఇలా స్తుతించాడు.

శ్లో॥సద్యో నిష్పిష్టసంధిం భువి నరపతిమాపాత్య తస్యోపరిష్టాత్
త్వయ్యాపాత్యే తదైవ త్వదుపరి పతితా నాకినాం పుష్పవృష్టిః।
కిం కిం బ్రూమస్తదానీం సతతమపి భియా త్వద్గతాత్మా స భేజే
సాయుజ్యం త్వద్వధోత్థా! పరమ! పరమియం వాసనా కాలనేమేః॥

| | | | |
|---|---|---|---|
| 2. **అవతతార :** | అవతతార | అవతేరతుః | అవతేరుః |
| | అవతేరిథ | అవతేరథుః | అవతేర |
| | అవతతార/అవతతరఅవతేరివ అవతేరిమ. | | * |

**శ్లో॥ సహస్రనేత్రోఽనిమిషప్రభుః సః – శతక్రతుర్వజ్రధరో హి లోకే ।**
**సుపావనీం యః శతధారధుర్యాం – హరేః సపర్యాం క్షణశః కరోతి ॥ 11-54**

**అ :** ఇంద్రుడు అప్రమత్తుడై ఉపేంద్రుని సపర్యకొనసాగిస్తూనే వుంటాడని ఇంద్రుని కీర్తించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః సహస్ర–నేత్రః అనిమిష–ప్రభుః శతక్రతుః వజ్ర–ధరః (చ) లోకే (భవతి) హి. యః సు–పావనీం శతధార–ధుర్యాం హరేః సపర్యాం క్షణశః కరోతి.

**ప్ర :** సః = ఆ ఇంద్రుడు, సహస్ర–నేత్రః = వేయి కళ్ళు గలవాడు (సహస్రాణి నేత్రాణి యస్య సః), అనిమిష–ప్రభుః = వేలుపు రేడు (అనిమిషాణాం ప్రభుః), శత–క్రతుః = నూరు యాగాలు చేసినవాడు (శతం క్రతవః యస్య సః), వజ్ర–ధరః (చ) = వజ్రాయుధం ధరించినవాడు (వజ్రం ధరతి ఇతి) కూడా, లోకే = లోకంలో, భవతి హి = ఉన్నాడు గదా! (భూ సత్తాయామ్ పరస్మైపది–లట్– ప్ర.ఏ.), యః = ఎవడయితే, సుపావనీమ్ = పరమపవిత్రమై, శతధార–ధుర్యామ్ = వజ్రపు భారాన్ని మోసేదీ (శతధారస్య ధురం వహతీతి తామ్) అయిన, హరేః = కృష్ణునియొక్క, సపర్యామ్ = సేవను, క్షణశః = క్షణాలలో, కరోతి = చేస్తాడో (కృ కరణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** (స్వర్గ) లోకంలో నూరు యాగాలు చేసి వేలుపురేడై వజ్రధారియైన వేయికన్నుల వేలుపు ఉన్నాడు. ఆయన వజ్రపుభారాన్ని మోస్తూ పరమ పవిత్రమైన హరిసేవ చేయటానికి ప్రతిక్షణమూ సిద్ధమై వుంటాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో ఉదాత్తాలంకారముంది. ఇంద్రుని గొప్పతనం ప్రతివిశేషణంలోనూ కనిపిస్తుంది. అటువంటి ఇంద్రుడు ప్రతిక్షణమూ కృష్ణ సపర్యకు సిద్ధమయి వుండటం కృష్ణుని మహత్త్వాన్ని సూచిస్తుంది. వజ్రపు భారాన్ని మొత్తాన్నీ మోయగలవాడు కృష్ణుడు. అటువంటి వాడు ఉపేంద్రుడుగా వుండటం – తనకు అండగా వుండటం – ఇంద్రుని గొప్పతనాన్ని సూచిస్తుంది. ఒకదాని మహత్త్వవర్ణనద్వారా మరొకటి మహత్తరం కావటం ఉదాత్తా–లంకారం. **'ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్'** – (కు.162). మరి కృష్ణుడు ఇంద్రోత్సవాన్ని వ్యతిరేకించటం, ఇంద్రుడు కుంభవృష్టి కురిపించటం ఇటువంటి వన్నీ ఇద్దరి స్థాయీ మనకు తెలియటానికే.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **కరోతి :** | **కరోతి** | కురుతః | కుర్వన్తి | |
| | కరోషి | కురుథః | కురుథ | |
| | కరోమి | కుర్వః | కుర్మః. | * |

**శ్లో॥ రథం సమారుహ్య సపత్నసేనాం – జఘాన హస్త్యశ్వపదాతిపీనామ్ ।**
**పరిస్థితాత్మీయమనోరథస్థో – దురిష్టసేనామపి దేవదేవః ॥ 11-55**

**అ :** కృష్ణుడు ఇంద్రుడు సమర్పించిన రథాన్ని ఎక్కి శత్రు (కంస) సేనను సంహరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** దేవదేవః రథం సమారుహ్య హస్తి+అశ్వ–రథ–పదాతి–పీనాం సపత్న–సేనాం జఘాన. పరి–స్థిత+ఆత్మీయ–మనోరథ–స్థః దురిష్ట–సేనామ్ అపి (జఘాన).

**ప్ర :** దేవదేవః = దేవులకు దేవుడైన కృష్ణుడు (దేవానాం దేవః), రథమ్ = (మాతలి తెచ్చిన) రథాన్ని, సమ్+ఆ–రుహ్య = ఎక్కి (సమ్–ఆ–రుహ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), హస్తి... పీనామ్ : హస్తి = ఏనుగులతో, అశ్వ = గుఱ్ఱాలతో, రథ = రథాలతో, పదాతి = కాల్బలంతో, పీనామ్ = బలిష్ఠమైన (హస్తిభిః అశ్వైః రథైః పదాతిభిశ్చ పీనా, తామ్), సపత్న–సేనామ్ = శత్రుసేనను (సపత్నస్య సేనా, తామ్), జఘాన = చంపాడు. (హన హింసాగత్యోః పరస్మైపది–లిట్–(ప్ర.ఏ.), పరి... రథః సన్ : పరి = చుట్టూ, స్థిత = నిలిచిన, ఆత్మీయ = తనవారి (భక్తుల) యొక్క మనోరథ–స్థః (సన్) = మనస్సులలోని కోరికలలో నిలిచినవాడై (పరితః స్థితానామ్ ఆత్మీయానాం మనోరథేషు తిష్ఠతీతి), దురిష్ట–సేనామ్ అపి = (వారి) పాపసేనను కూడా, జఘాన = చంపాడు.

**తా ॥** దేవదేవుడైన కృష్ణుడు ఇంద్రుడు పంపిన రథాన్ని ఎక్కి చతురంగబలాలతో (ఏనుగులు, గుర్రాలు, రథాలు, పదాతులు) బలిష్ఠమైన శత్రుసేనను సంహరించాడు. అక్కడ తనచుట్టూ వున్న తనవారి మనస్సులలోని కోరికలలో నిలిచి వారి పాపసేనను కూడా సంహరించాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో శత్రుసేనతో పాటు తన ఆత్మీయుల దురిష్టసేనను కూడా సంహరించటం వలన రెండింటికీ సహభావముంది. అయితే ఆ సహభావాన్ని వాచా చెప్పలేదు కవి. కాబట్టి ఇక్కడ సహభావం ధ్వనిస్తుంది. కాగా సహోక్త్యలంకారధ్వని ఇక్కడుంది.

'జఘాన' అన్న ఒకే క్రియాపదం శత్రుసేనతో, భక్తుల దురిష్టసేనతో కూడా అన్వయించటం వలన తుల్యయోగితాలంకారం కూడా ఇక్కడుంది. రెండు ప్రకృత విషయాలతో ఒకే ధర్మం అన్వయించటం కాబట్టి **'వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా'** – (కు.44), అన్న లక్షణాన్ని బట్టి తుల్యయోగితాలంకారం.

2. **జఘాన :** 11–49వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ శరైః కరోర్వఙ్ఘ్రిశిరోధరాదీం–శ్చకర్త శస్త్రాస్త్రవిదాం రిపూణామ్ ।**
**స్వయం ముదోన్మీలితలోచనాన్త–శరైస్తదాఽతాడ్యత కామినీనామ్ ॥ 11–56**

**అ :** కృష్ణుడు శత్రుసేనల సంహరించుట – సన్నిహితకాంతల లోచనాంత బాణాలతో తాను దెబ్బతినుట.
–ఉపేంద్రవజ్ర.

**అ :** (కృష్ణః) శస్త్ర+అస్త్ర–విదాం రిపూణాం కర+ఊరు+అంఘ్రి–శిరోధర+ఆదీన్ శరైః చకర్త. తదా స్వయం కామినీనాం ముదా ఉన్మీలిత–లోచన+అంత–శరైః అతాడ్యత.

**ప్ర :** (కృష్ణః = కృష్ణుడు), శస్త్ర–అస్త్ర–విదామ్ = శస్త్రాలూ, అస్త్రాలూ తెలిసిన (శస్త్రాణి అస్త్రాణి చ విదన్తీతి తేషామ్), రిపూణామ్ = శత్రువులయొక్క, కరో...రాదీన్ : కర = చేతులు, ఊరు = తొడలు, అంఘ్రి = పాదాలు, శిరోధర = మెడలు, ఆదీన్ = మొదలగువాటిని (కరాశ్చ ఊరవశ్చ అంఘ్రయశ్చ శిరోధరాశ్చ ఆదౌ యేషాం తాన్), శరైః = బాణాలతో, చకర్త = ఖండించాడు. (కృత్ ఛేదనే పరస్మైపది–లిట్–(ప్ర.ఏ.), తదా = అప్పుడు, స్వయమ్ = తాను, కామినీనామ్ = కాంతలయొక్క, ముదా = ఆనందం చేత, ఉన్మీలిత... శరైః : ఉన్మీలిత = వికసించిన, లోచన+అంత = కనుకొన లనే, శరైః = బాణాలతో (ఉన్మీలితాః చ తే లోచనాన్తాః త ఏవ శరాః తైః), అతాడ్యత = కొట్టబడెను. (తడ్ ఆఘాతే కర్మణి – ఆత్మనేపది–లఙ్–(ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు శస్త్రాస్త్రవేత్తలయిన శత్రువులయొక్క చేతులనూ, తొడలనూ, కాళ్ళనూ, మెడలనూ ఇంకా

ఇతరావయవాలనూ బాణాలతో ఖండించాడు. తాను కూడా ఆనందంతో వికసించిన కామినుల కనుకొనల బాణాలతో కొట్టబడ్డాడు.

**వి :** 1. శస్త్రాస్త్రవేత్తల శరీరావయవాలనే నరికివేయ గలిగిన వాడు కామినుల కనుకొనల బాణాలచే కొట్టబడటం విచిత్రం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చకర్త :** | **చకర్త** | | చకృతతుః | చకృతుః |
| | చకర్తిథ | | చకృతథుః | చకృత |
| | చకర్త | | చకృతివ | చకృతిమ |
| **అతాద్యత :** | **అతాద్యత** | అతాద్యేతామ్ | | అతాద్యన్త |
| | అతాద్యథాః | అతాద్యేథామ్ | | అతాద్యధ్వమ్ |
| | అతాద్యే | అతాద్యావహి | | అతాద్యామహి. |

*

**శ్లో॥ చిరం పురా వైష్ణవసేవనేన - ముకున్దసామీప్యఫలం ప్రపన్నః ।**
**స మాతలిస్తస్య విచిత్రవీర్య-మభూన్నిరీక్ష్యోభయథాఽపి సూతః ॥ 11-57**

**అ :** కృష్ణసేవ ద్వారా మాతలి పొందిన ఫలితాన్ని వివరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పురా చిరం వైష్ణవ-సేవనేన ముకుంద-సామీప్య-ఫలం ప్రపన్నః సః మాతలిః తస్య విచిత్రవీర్యం నిరీక్ష్య ఉభయథా అపి సూతః అభూత్ ।

**ప్ర :** పురా = పూర్వం, చిరమ్ = చాలాకాలం నుండి, వైష్ణవ-సేవనేన : వైష్ణవ = విష్ణు-భక్తుడైన ఇంద్రునియొక్క, సేవనేన = సేవతో, ముకుంద... ప్రపన్నః : ముకుంద = కృష్ణునియొక్క, సామీప్య = సన్నిధి అనే, ఫలమ్ = ఫలితాన్ని (ముకుందస్య సామీప్యమేవ ఫలమ్), ప్రపన్నః = పొందినట్టి, సః మాతలిః = ఆ మాతలి, తస్య = ఆ కృష్ణునియొక్క, విచిత్ర-వీర్యమ్ = ఆశ్చర్యకరమైన పరాక్రమాన్ని (విచిత్రం చ తత్ వీర్యం చ తత్), నిరీక్ష్య = చక్కగా చూసి (నిర్-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉభయథా అపి = రెండురకాలుగా కూడా, సూతః = రథసారథి/ స్తుతించువాడూ (సూతః స్యాత్ప్రష్టృసారథ్యోః వందిసుష్యూతయో-రపి - నానార్థమంజరి-683), అభూత్ = అయ్యాడు. (భూ సత్తాయామ్ పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఇంతకుముందు చాలాకాలంనుండి వైష్ణవ (విష్ణుభక్త) సేవ చేయటం ద్వారా ముకుందుని సామీప్యాన్ని ఫలంగా పొందిన మాతలి ఇప్పుడు ఆ కృష్ణుని అద్భుత పరాక్రమాన్ని ప్రత్యక్షంగా చూసి రెండు రకాలుగానూ సూతుడయ్యాడు. ఒకరకంగా రథసారథి. మరొకరకంగా కృష్ణుని స్తుతించేవాడు.

**వి :** 1. వైష్ణవసేవ విష్ణుసేవకన్న బలవత్తరమైనది మాతలి వైష్ణవసేవ చేసినవాడు. కాబట్టి కృష్ణసామీప్యం దక్కింది. వైష్ణవసేవ దక్కితే చాలు అని కులశేఖరాళ్వార్ ముకుందుని స్తుతించిన తీరు చూడండి-

**శ్లో॥ మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే - మత్ప్రార్థనీయమదనుగ్రహ ఏష ఏవ ।**
**త్వద్భృత్యభృత్యపరిచారకభృత్యభృత్య-భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోకనాథ॥**

- ముకుందమాలాస్తోత్రమ్-28

2. **అభూత్ :** 11-43వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ధాత్రీం ప్రాక్ పరిపోషణాయ పతగం వాతం విలాసాయ తాన్**
**వత్సానోవృషధేనుకాదిదితిజాంస్తద్భారవోఢానివ ।**

**అశ్వేభౌ రజకం చ మాతులకృతే సమ్ప్రేష్య మల్లాంశ్చ త-**
**త్సేనాం ప్రేషయతి స్మ గాఢతమసే సమ్ప్రేషయిష్యన్ క్రమాత్ ॥ 11-58**

**అ :** కృష్ణుడు కంససంహారానికి ముందే చీకటిలోకాలలో ఆయనకు సౌకర్యాలు సమకూర్చిన తీరు.-శా.వి.

**అ :** గాఢ-తమసే (కంసం) క్రమాత్ సంప్రేషయిష్యన్ (కృష్ణః) ప్రాక్ పరిపోషణాయ ధాత్రీం, విలాసాయ పతగం వాతం తద్-భార-వోఢాన్+ఇవ తాన్ వత్స+అనః-వృష-ధేనుక+ఆది-దితిజాన్ మాతుల-కృతే అశ్వ+ఇభౌ రజకం మల్లాన్ చ సంప్రేష్య తత్-సేనాం ప్రేషయతి స్మ.

**ప్ర :** గాఢ-తమసే = కారుచీకట్లలోనికి (గాఢం చ తత్ తమః, తస్మై), (కంసమ్ = కంసుని), సంప్రేషయిష్యన్ = పంపగోరుతూ, ప్రాక్ = ముందుగా, పరిపోషణాయ = పెంపుదలకై, ధాత్రీమ్ = దాదిని (పూతనను), విలాసాయ = సరదాకోసం, పతగమ్ = పక్షిని (బకాసురుని), వాతం చ = గాలిని (తృణావర్తుని), తద్-భార-వోఢాన్ ఇవ : తత్ = ఆ కంసునియొక్క, భార = భారాన్ని, వోఢాన్ ఇవ = మోసేవారినో అన్నట్లు, తాన్ = ఆ, వత్సా... దితిజాన్ : వత్స = వత్సాసురుడు, అనః = శకటాసురుడు, వృష = వృషభాసురుడు, ధేనుక = ధేనుకాసురుడు, ఆది = మొదలయిన, దితిజాన్ = రాక్షసులను (వత్సః చ అనః చ వృషః చ ధేనుకః చ ఆదౌ యేషాం తే చ తే దితిజాః, తాన్), మాతుల-కృతే = మేనమామ కోసం, అశ్వ+ఇభౌ = గుర్రాన్నీ (కేశి) ఏనుగును (కువలయాపీడం) (అశ్వశ్చ ఇభశ్చ తౌ), రజకమ్ = చాకలిని, మల్లాన్ చ = మల్లురను (చాణూర-ముష్టికులు), సంప్రేష్య = పంపి, తత్-సేనామ్ = ఆ కంసుని సేనను (తస్య సేనా తామ్), ప్రేషయతి స్మ = పంపాడు. (ప్ర-ఇష్ ఇచ్ఛాయాం-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ. -'**లట్ స్మే**' (అష్టాధ్యాయి 3-1-118) సూత్రంతో 'స్మ' చేరి భూతార్థాన్నిస్తుంది.)

**తా ॥** కృష్ణుడు తన మేనమామ అయిన కంసుని చీకటిలోకాలకు పంపదలచుకొన్నాడు. అక్కడ ఆయనకవసరమైన సౌకర్యాలను ముందుగానే కల్పించాలనుకొన్నాడు. అందుకని ఆయన సేనను ముందుగా పంపాడు క్రమంగా, అందరికన్న ముందు పెంచిపోషించేందుకు దాదిగా పూతనను పంపాడు. ఆపై విలాసజీవితానికి అవసరమయిన బకాసురుని, తృణావర్తుని పంపిచాడు. తరువాత ఆయన భారాన్ని మోయడానికన్నట్లు వత్సాసురునీ, శకటాసురునీ, వృషాభాసురునీ, ధేనుకాసురునీ ఇంకా ఇటువంటి రాక్షసులనూ పంపించాడు. ఆపై రజకుని, మల్లులను పంపించాడు. (అన్నీ సమకూరాయి కాబట్టి ఇక కంసుని పంపబోతున్నాడు.)

**వి :** 1. శ్లోకంలో చెప్పినట్లు పూతనాదుల మరణానికీ, కంసుని తమోలోకాలలో కల్పిస్తున్న సౌకర్యాలకీ సంబంధమే లేదు. ఎవరి చావు వారిది. అయినా వారి చావు చావబోయే కంసుని కోసమే అన్నట్లు వర్ణించినందువల్ల ఇది సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు.39)

వత్సాసురాదులను పంపటంలోని - '**తద్భారవోఢాన్-ఇవ**' అంటూ - ఫలితాన్ని ఊహించినందువల్ల ఇది ఫలోత్ప్రేక్షాలంకారం.

2. కవి ఇంతకు ముందు చెప్పినట్లు పూతనాదులలోని అసత్ప్రవృత్తికి సంబంధించిన జీవుల పరిస్థితి ఇది. వారంతా గాఢతమోలోకాలకు చేరినవారే. సత్ప్రవృత్తికి - కృష్ణుని చేతిలో మరణించి ముక్తి పొందటానికి అనువైన ప్రవృత్తికి - కారణమైన జీవులు అప్పుడే పుణ్యలోకాలకు వెళ్ళారు. జీవద్వయస్థితిని కవి వాచా ప్రకటించాడు గదా!

3. మేనమామగా కంసుడు కృష్ణుని బాగోగులు చూడకున్నా మేనల్లుడుగా కృష్ణుడు మేనమామ కోసం అన్ని ఏర్పాట్లు చేసినట్లు వర్ణించటం కృష్ణునిలోని కర్మయోగిని స్ఫుటీకరించటమే. కావలసినది ఏదీ లేకపోయినా కర్తవ్యాన్ని మాత్రం చేస్తూనే వుంటానన్నది కృష్ణజీవనసిద్ధాంతంలో ఒక భాగం గదా!

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ - భగవద్గీత 3/22

4. హరిభక్తి లోపిస్తే ఇటువంటి పాట్లే వుంటాయని మహాభారతతాత్పర్యనిర్ణయం కూడా ప్రకటించింది-

శ్లో. ద్వేషాత్ స సర్వజగదేకగురోః స్వకీయైః పూర్వం ప్రమాపితజనైః సహితః సమస్తైః ।
**ధాత్ర్యాదిభిః** ప్రతియయౌ కుమతిస్తమోఽన్ధమన్యేఽపి చైవముపయాన్తి హరావభక్తాః ॥ -11/132

| | | | |
|---|---|---|---|
| 5. **ప్రేషయతి :** | **ప్రేషయతి** | ప్రేషయతః | ప్రేషయన్తి |
| | ప్రేషయసి | ప్రేషయథః | ప్రేషయథ |
| | ప్రేషయామి | ప్రేషయావః | ప్రేషయామః. |

*

**శ్లో॥ విస్తీర్ణైర్వరహారచామరసితచ్ఛత్రాదివిత్తైః సితా**
**నీలా స్రస్తకచాసినీలమణిభిః సా రంగభూమిర్మృధే ।**
**రక్తా రక్తచయేన హైమకవచాకల్పైశ్చ పీతాఽఽత్మనో**
**నామాసృక్ సరిదోఘమగ్నకుణపా చక్రేఽనుకూలం తదా ॥ 11-59**

**అ :** కృష్ణుడు కంససేనను సంహరించిన తరువాత కనిపిస్తున్న రంగభూమి వర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సా రంగ-భూమిః మృధే విస్తీర్ణైః వర-హార-చామర-సిత-ఛత్ర+ఆది-విత్తైః సితా స్రస్త-కచ-అసి-నీల-మణిభిః నీలా రక్త-చయేన రక్తా హైమ-కవచ-ఆకల్పైః పీతా అస్రుక్-సరిద్-ఓఘ-మగ్న-కుణపా చ ఆత్మనః నామ తదా అనుకూలం చక్రే.

**ప్ర :** సా = ఆ, రంగ-భూమిః = మల్లయుద్ధరంగప్రదేశం, మృధే = యుద్ధంలో (మర్ధతే ఇతి), (యుద్ధం యుత్ప్రధనం మృధం-హలాయుధకోశః-453), విస్తీర్ణైః=వెదజల్లబడిన, వర... విత్తైః = వర = గొప్పవయిన, హార = ముత్యాలపేరులు, చామర = వీవనలు, సిత = తెల్లని, ఛత్ర = గొడుగులు, ఆది = మొదలయిన, విత్తైః = సొమ్ములతో (వరాః హారాః చ చామరాణి చ సితాని ఛత్రాణి చ ఆదౌ యేషాం తాని చ తాని విత్తాని తైః), సితా = తెల్లనిదీ, స్రస్త... మణిభిః : స్రస్త = జారిన, కచ = జుట్టు, అసి = కత్తులు, నీల-మణిభిః = ఇంద్ర నీలమణులచే (స్రస్తైః కచైః అసిభిః నీలమణిభిః చ), నీలా = నల్లనిదీ, రక్త-చయేన = రక్త ప్రవాహంతో, రక్తా = ఎఱ్ఱనిదీ, హైమ-కవచ+ఆకల్పైః:హైమ= బంగారుతో చేసిన, కవచ = కవచాలు, ఆకల్పైః = నగలతో (హైమాని కవచాని ఆకల్పాః చ తైః), (ఆకల్పోమండనం వేషః - హలాయుధకోశః -539), పీతా = పసుపువన్నెగలదీ, అస్రుక్... కుణపా : అస్రుక్-సరిత్ = నెత్తుటేరుయొక్క, ఓఘ = ప్రవాహమందు, మగ్న = మునిగిన (పైకి కనిపించని), కుణపా = శవాలు గలదీ అయి (కుణపః శవ ముచ్యతే-హలాయుధకోశః-629), ఆత్మనః = తనయొక్క, నామ = పేరును, తదా = అప్పుడు, అనుకూలమ్ = అనుకూలంగా/ ఒడ్డున ఉన్నట్లుగా, చక్రే = చేసికొన్నది. (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అది మల్లయుద్ధరంగ భూమి. (రంజింప జేయబడినది రంగం. అనగా రకరకాల రంగులు గల వస్తువులతో అందగింప బడింది.) అది రంగభూమి అన్న తన పేరును అనుకూలం (సార్థకం) చేసికొంది. ఎలా? అక్కడ చెల్లాచెదరుగా పడివున్న ముత్యాలపేరులు, చామరాలు, తెల్ల గొడుగులు మొదలయిన సొమ్ములతో తెల్లగా వుంది. జారిపోయిన వెంట్రుకలు, కత్తులు, ఇంద్రనీలమణులతో నల్లగా వుంది. బంగారు కవచాలు, నగలతో పచ్చగా వుంది. అయితే అమంగళమనిపించే శవాలు మాత్రం పైకి కనిపించకుండా నెత్తుటి ప్రవాహంలో మునిగివున్నాయి.

**వి :** 1. ప్రవాహంలో శవాలు తేలకుండా మునిగి వుంటాయా? ప్రాణం పోయిన తరువాత పైకి తేలవలసిందే గదా!

నిజమే. కేవలం నీళ్ళే ప్రవహిస్తుంటే శవాలు తప్పక తేలుతాయి. కానీ బురద లేదా మరేదైనా చెత్తాచెదారం ఆ నీటి అడుగున వున్నప్పుడు శవాలు పైకి తేలలేవు. అందుకే గజ ఈతగాళ్ళు లోపల గాలించి వాటిని పైకి తెస్తుంటారు. ఇక్కడ కూడా రక్తప్రవాహంలో అడుగున శ్లోకంలోనే వర్ణించిన అనేకవస్తుసముదాయముంది. అదికొంత బయటకు కనిపిస్తున్నా చాలా లోపలా వుండవచ్చు. అది శవాలను పైకితేలకుండా ఆపవచ్చు. పైగా అది నెత్తుటి ప్రవాహం. జలసాంద్రతకూ, రక్తసాంద్రతకూ సమానస్థితి వుండదు గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే |
| | చక్రే | చకృవహే | చకృమహే. |

*

**శ్లో॥ కోపాటోపవశేన రక్తనయనం తం ఖడ్గచర్మోల్లస-**
**త్పాణిం పాపమివోత్పతన్తమమతం మూర్ధ్ని ప్రగృహ్య ప్రభుః ।**
**పృథ్వీమేత్య నిపాత్య విస్తృతకచం త్రస్తం చకర్షాచ్యుతః**
**ప్రేమప్రావిలసాధుసఙ్ఘనయనైః సానన్దమాలోకితః ॥ 11-60**

**అ :** కంసుడు కృష్ణుని మీదకు లంఘించబోగా కృష్ణుడు జుట్టుపట్టుకొని ఈడ్చుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రభుః అచ్యుతః కోప+ఆటోప-వశేన రక్త-నయనం ఖడ్గ-చర్మ+ఉల్లసత్-పాణిం పాపమ్+ఇవ ఉత్పతన్తమ్ అమతం మూర్ధ్ని ప్రగృహ్య పృథ్వీమ్ ఏత్య నిపాత్య విస్తృత-కచం త్రస్తం తం ప్రేమ-ప్రావిల-సాధు-సంగ-నయనైః సానందమ్ ఆలోకితః సన్ చకర్ష.

**ప్ర :** ప్రభుః = సమర్థుడైన, అచ్యుతః = కృష్ణుడు (న భవతి చ్యుతం యస్య సః), కోప+ఆటోప-వశేన : కోప = కోపమూ, ఆటోప = తొందర-వీటికి, వశేన = లోనయినందువల్ల (కోపస్య ఆటోపస్య చ వశేన), రక్త-నయనమ్ = ఎఱ్ఱబడిన కన్నులుగలవాడు (రక్తే నయనే యస్య తమ్), ఖడ్గ-చర్మ+ఉల్లసత్-పాణిమ్ : ఖడ్గ = కత్తితోనూ, చర్మ = డోలుతోను, ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, పాణిమ్ = చేయిగలవాడూ (ఖడ్గశ్చ చర్మ చ ఖడ్గచర్మే, తాభ్యాం ఉల్లసన్తౌ పాణీ యస్య తమ్), పాపమ్-ఇవ = పాపంవలె, ఉత్పతన్తమ్ = ఎగిసిపడుతున్న వాడు అయిన, అమతమ్ = శత్రువును (కంసుని), మూర్ధ్ని = తలపై, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పృథ్వీమ్ = నేలకు, ఏత్య = లాగి, నిపాత్య = పడవేసి (నిపత్-ణిచ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విస్తృత-కచమ్ = విరబడ్డ జుట్టుగలిగి (విస్తృతః కచః యస్య తమ్), త్రస్తమ్ = భయబడుతున్న, తమ్ = ఆ కంసుని, ప్రేమ... నయనైః :ప్రేమ = స్నేహంచేత, ప్రావిల = కలగబారిన, సాధు = సజ్జనులయొక్క, సంఘ = సమూహంయొక్క, నయనైః = కళ్ళతో (ప్రేమ్ణా ప్రావలాని చ తాని సాధూనాం సంఘస్య నయనాని తైః), స+ఆనందమ్ = సంతోషంతో, ఆలోకితః-సన్ = చూడబడినవాడై (ఆ-లోక్ ధాతువుపై క్త ప్రత్యయం), చకర్ష = ఈడ్చాడు. (కృష్ విలేఖనే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కంసునిలో కోపం, కృష్ణుని ఏదో చేయాలన్న తొందరా చెలరేగి కళ్ళు ఎఱ్ఱబడ్డాయి. చేతిలో కత్తి, డాలు పట్టుకొని ఎగిసిపడే పాపంలా కృష్ణుని మీది కురకబోయాడు. అంతలో కృష్ణుడు కంసుని జుట్టుపట్టుకొని నేలమీదికి లాగి పడద్రోశాడు. కంసుడి జుట్టుముడి వీడింది. బెదిరిపోతున్నాడు. ఆ కంసుని నేలమీద అటు ఇటు లాగాడు కృష్ణుడు. అక్కడున్న కన్నులన్నీ ప్రేమతో తడిశాయి. ఆ చూపులు కృష్ణుని మీద పడ్డాయి.

**వి :** 1. కంసుడు పడిపోయిన తరువాత కంసుడికి కలిగిన కృష్ణసందర్శనాన్ని అందంగా వివరించాడు వ్యాసమహర్షి - భాగవతమ్ 10/44/39

శ్లో॥ స నిత్యదోద్విగ్నధియా తమీశ్వరం – పిబన్వదన్ వా విచరన్ స్వపన్ శ్వసన్ ।
దదర్శ చక్రాయుధమగ్రతో యః – తదేవ రూపం దురవాపమాప ॥

కంసుడు సర్వావస్థలలోనూ త్రాగుతూ, మాటాడుతూ, తిరుగుతూ, నిద్రిస్తూ, ఊపిరి పీలుస్తూ ఎవరిరూపాన్ని భావించేవాడో అదే రూపమిప్పుడు కళ్ళముందుకనిపించింది. కానీ చూడటం కష్టమైంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చకర్ష :** | **చకర్ష** | చకృషతుః | చకృషుః | |
| | చకర్షిథ | చకృషథుః | చకృష | |
| | చకర్ష | చకృషివ | చకృషిమ. | * |

**శ్లో॥ కృష్ణోఽథో బహిరాజగామ నగరాత్ కంసస్య దేహాభిదా–**
**చ్చక్షుఃశ్రోత్రముఖాక్షిపాలనపరైః స్వీయైః సమేతః సురైః ।**
**నష్టానిష్టజనాన్ నిరీక్ష్య విమతం దృష్ట్వాఽతిపుష్టం భటా–**
**నన్దోఽపి క్షయమేయివాన్ స చ ఖలో హీనోగ్రసేనో హతః ॥ 11-61**

**అ :** కృష్ణుడు కంసుని శరీరమనే నగరం నుండి బయట పడగానే కంసుడు మరణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అథో చక్షుః–శ్రోత్ర–ముఖ+అక్షి–పాలన–పరైః స్వీయైః సురైః సమేతః కృష్ణః కంసస్య దేహ+అభిధాత్ నగరాత్ బహిః ఆజగామ. ఇష్ట–జనాన్ నష్టాన్ నిరీక్ష్య అతిపుష్టం విమతం దృష్ట్వా భట+ఆనందః+అపి క్షయమ్ ఏయివాన్ హీన+ఉగ్ర–సేనః సః ఖలః అపి హతః ।

**ప్ర :** అథో = అటు తర్వాత, చక్షు... పరైః : చక్షుః = కళ్ళు (వస్తు స్వరూపాన్ని వివరించేది), శ్రోత్ర = చెవులు, ముఖ = ముఖం, అక్షి = కన్ను (దూరంగా వ్యాపించేది) వీటిని, పాలన = రక్షించుటయందు, పరైః = ఆసక్తిగల (చక్షూంషి చ శ్రోత్రాణి చ ముఖాని చ అక్షీణి చ, తేషాం పాలనే పరాః తైః), స్వీయైః = తనవారైన, సురైః = దేవతలతో, సమేతః (సన్) = కూడినవాడై, కృష్ణః = కృష్ణుడు, కంసస్య = కంసునియొక్క, దేహ+అభిధాత్ = దేహమను పేరుగల, నగరాత్ = నగరంనుండి, బహిః = వెలుపలకు, ఆజగామ = వచ్చాడు. (ఆ+గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ఇష్ట–జనాన్ = నచ్చినవారిని, నష్టాన్ = నశించిన వారినిగా, నిరీక్ష్య = గమనించి, అతిపుష్టమ్ = బాగా బలిసిన, విమతమ్ = శత్రువును, దృష్ట్వా = చూసి, భట+ఆనందః+అపి = భటుల ఆనందంకూడా, క్షయమ్ = వినాశాన్ని, ఏయివాన్ = పొందింది. హీన+ఉగ్ర–సేనః : హీన = లోపించిన, ఉగ్ర–సేనః =తీవ్రసైన్యంగల, సః ఖలః అపి = ఆ నీచుడు కూడా, హతః = చనిపోయాడు.

**తా ॥** కంసుని శరీరమనే నగరం నుండి కృష్ణుడు కళ్ళు, చెవులు, ముఖం – వంటి అవయవాలను రక్షించే తనవారైన దేవతలతో కూడి నిష్క్రమించాడు. ఇష్టజనులంతా నశించిపోవటాన్నీ, శత్రువు బలిష్ఠుడై పోవటాన్నీ గమనించి భటుల ఆనందం కూడా నశించిపోయింది. హీనమూ, భీకరమూ అయిన సేనగల ఆ దుర్మార్గుడు, కంసుడు కూడా మరణించాడు.

**వి :** 1. శరీరంలో నుండి ప్రాణం (దైవం) నిష్క్రమిస్తే ఇక మిగిలేది జీవచ్ఛవమే. క్షణాలలో అది శవమై పోతుంది. కంసుడు విధించిన దేశ బహిష్కరణ శిక్ష దేహ బహిష్కరణ శిక్షగా పరమాత్ముని చేత స్వీకరింపబడింది. పర్యవసానం కంస మరణం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆజగామ :** | **ఆజగామ** | ఆజగ్మతుః | ఆజగ్ముః | |
| | ఆజగమిథ/ఆజగన్థ | ఆజగ్మథుః | ఆజగ్మ | |
| | ఆజగామ/అజగమ | ఆజగ్మివ | ఆజగ్మిమ. | * |

**శ్లో॥ కంసోఽన్తర్వృతగర్వపర్వతవరః పోతస్య ఘాతాహతో
వక్త్రం దర్శయితుం సులజ్జిత ఇవ ప్రాపోగ్రమన్ధన్తమః ।
అన్యః శ్రీరమణస్య ధామ సుమహఃస్తోమం జగామ ద్విషా
యుక్తం మాం హరిరగ్రహీత్ కరుణయేత్యాశ్రావ్యభవ్యోత్సవః ॥ 11-62**

**అ :** కంసుడు బాలకృష్ణునిచేత దెబ్బతిని శ్రీరమణుని పరంధామానికి చేరటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అంతర్వృత-గర్వ-పర్వత-వరః కంసః పోతస్య ఘాత+ఆహతః వక్త్రం దర్శయితుం సులజ్జితః+ఇవ ఉగ్రమ్ అన్ధం-తమః ప్రాప. ద్విషా యుక్తం మాం హరిః కరుణయా అగ్రహీత్ ఇతి ఆశ్రావ్య-భవ్య-ఉత్సవః అన్యః సుమహః-స్తోమం శ్రీరమణస్య ధామ జగామ.

**ప్ర :** అంత... వరః :అంతః =లోన, వృత=కప్పిన/క్రమ్ముకొన్న, గర్వ = గర్వ మనే, పర్వత-వరః = గొప్ప పర్వతం గల (అంతః వృతః గర్వ ఇతి పర్వతవరః యేన సః), కంసః = కంసుడు, పోతస్య = అర్భకునియొక్క, (బాలః పాకోఽర్భకో గర్భః పోతశ్చ పృథుకః శిశుః హలాయుధకోశః-503), ఘాత+ఆహతః (సన్) : ఘాత = చేతిదెబ్బతో, ఆహతస్సన్ = కొట్టబడినవాడై (ఘాతేన ఆహతః), వక్త్రమ్ = ముఖాన్ని, దర్శయితుమ్ = చూపేందుకు, సులజ్జితః ఇవ = సిగ్గుపడుతున్నట్లుగా, ఉగ్రమ్ = క్రూరమైన, అన్ధం-తమః = గ్రుడ్డిచీకటిని, ప్రాప = పొందాడు. (ప్ర+ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ద్విషా = శత్రువుతో, యుక్తమ్ = కూడివున్న, మామ్ = నన్ను, హరిః = కృష్ణుడు, కరుణయా = దయతో, అగ్రహీత్ ఇతి = స్వీకరించాడని (గ్రహ ఉపాదానే-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), ఆశ్రావ్య-భవ్య+ఉత్సవః : ఆశ్రావ్య = అందరికీ వినిపింపదగిన, భవ్య = శుభకరమైన, ఉత్సవః = పండువుగల (ఆశ్రావ్యః భవ్యశ్చ అసౌ ఉత్సవః యస్య సః), అన్యః = మరొకడు (అదే శరీరంలో వున్నవాడు - భృగువు), సుమహః స్తోమమ్ : సుమహః = గొప్ప కాంతుల యొక్క, స్తోమమ్ = సమూహం గల (సుమహసాం స్తోమః యస్మిన్, తమ్), శ్రీ-రమణస్య = లక్ష్మీవల్లభునియొక్క, ధామ = నివాసానికి, జగామ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కంసునిలోన పర్వతమంత గర్వముంది. కానీ ఒక బాలుని చేత దెబ్బతిన్నాడు. ముఖం చూపించటానికి సిగ్గుపడి, ఎవరికీ ఎవరూ కనిపించని చీకటిలోకానికి వెళ్ళిపోయాడు. ఆ కంసుని శరీరంలోనే మరొక జీవుడు భృగువు. శత్రువు శరీరంలో వున్నా దయతో తనను అనుగ్రహించాడని నలుగురికీ చెప్పుకొనేంత సంబరం చేసికొని ఆ భృగువు కాంతుల కావాసమైన శ్రీరమణుని పరంధామానికి చేరాడు.

**వి :** 1. ఒకే శరీరంలో విరుద్ధ ప్రవృత్తిగల ఇద్దరు జీవులను ప్రవేశపెట్టి పరమాత్మ చేతిలో మరణించినా - ఆ శరీరం నశించినా - అందులోని జీవులను రెండు విభిన్న లోకాలకు పంపి పరమాత్మచేత మరణంకూడా మోక్షప్రదమే అన్న సిద్ధాంతాన్ని ఇక్కడ కూడా - కంస విషయంలో కూడా - సమన్వయిస్తున్నాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రాప :** | **ప్రాప** | ప్రాపతుః | ప్రాపుః |
| | ప్రాపిథ | ప్రాపథుః | ప్రాప |
| | ప్రాప | ప్రాపివ | ప్రాపిమ |
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ |

| | | | |
|---|---|---|---|
| **అగ్రహీత్ :** | **అగ్రహీత్** | అగ్రహీష్టామ్ | అగ్రహీషుః |
| | అగ్రహీః | అగ్రహీష్టమ్ | అగ్రహీష్ట |
| | అగ్రహీషమ్ | అగ్రహీష్వ | అగ్రహీష్మ. |

*

**శ్లో॥ సంచూర్ణితాఙ్గాన్ కతిచిత్ స హత్వా - ఛిన్నాఙ్గసంధీంశ్చ తథా న కంసమ్ ।**
**జఘాన కాయం పరిరభ్య దోర్భ్యాం - పత్న్యా రుదన్త్యా ఇవ దర్శయిష్యన్ ॥11-63**

**అ :** కృష్ణుడు కంసుని చంపిన తీరూ, దానిలోని ఔచిత్యాన్నీ వర్ణించటం. -ఉపజాతి.

**అ :** సః కతిచిత్ సంచూర్ణిత+అంగాన్ (కతిచిత్) విచ్ఛిన్న-సంధీన్ చ హత్వా దోర్భ్యాం పరిరభ్య రుదన్త్యాః (కంస) పత్న్యాః కాయం దర్శయిష్యన్+ఇవ కంసం తథా నః జఘాన.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, కతిచిత్ = కొందరిని, సంచూర్ణిత+అంగాన్ : సంచూర్ణిత = నలిపివేయబడిన, అంగాన్ = అవయవాలు గలవారినిగా (సంచూర్ణితాని అంగాని యేషాం తాన్), (కతిచిత్ = కొందరిని), ఛిన్న+అంగ-సంధీన్ : ఛిన్న = ఖండింపబడిన, అంగ = అవయవాలూ, సంధీన్ = కీళ్ళు గలవారినిగా (ఛిన్నాని అంగాని సంధయశ్చ యేషాం తాన్), చ = కూడా, హత్వా = చంపి (హన్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), దోర్భ్యామ్ = బాహువులతో, పరిరభ్య = కౌగిలించుకొని (పరి-రభ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), రుదన్త్యాః = ఏడుస్తున్న, పత్న్యాః = (కంసుని) భార్యకు, కాయమ్ = (కంసుని) శరీరాన్ని, దర్శయిష్యన్ ఇవ = చూపింపబోతున్నట్లుగా, కంసమ్ = కంసుని, తథా = ఆ రీతిగా (చాణూరాదులను చంపిన రీతిగా), న జఘాన = చంపలేదు. (హన హింసాగత్యోః పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు కంసుని సేనలోని కొందరిని ముక్కలు ముక్కలు చేసి చంపాడు. కొందరిని శరీరావయవాలు కీళ్ళు విరిచి చంపాడు. కాని కంసుని అలా చంపలేదు. బాహువులతో కంసుని పట్టుకొని ఏడ్వబోయే కంసుని భార్యలకు ఆయన శరీరాన్ని చూపించదలచాడు. (అందుకే శరీరంగాయపడకుండా చంపాడు.)

**వి :** 1. కంసుని భార్యలు ఇద్దరు. అస్తి, ప్రాప్తి. వారు జరాసంధుని కుమార్తెలు.

2. యావత్పవనో నివసతి దేహే - తావత్ పృచ్ఛతి కుశలం గేహే ।
గతవతి వాయౌ దేహాపాయే - భార్యా బిభ్యతి తస్మిన్ కాయే ॥ -భజగోవిందం-6

అని ప్రాణం పోయిన తరువాత ఆ శరీరం భయపెడుతుందని ఆదిశంకరులు చెప్పినా ప్రాణాలు పోయి అంత్యక్రియలు అయ్యేలోగా ఆ కాస్తసేపు ఏ చుమ్మర్లు లేకుండా శరీరముండాలని కోరుకోవటం, అలా వుంచగలగటాన్ని మహావిజయంలాగానో, గొప్పనివాళి గానో భావించటం మనుషుల కలవాటు. ఆ మనస్తత్త్వానికి అనుగుణంగా కృష్ణుడు కంసుని దేహాన్ని ఉంచాడు. కేవలం తాను కూర్చున్న ఆసనంనుండీ రంగమధ్యానికి లాగాడు. పడద్రోశాడు. దాంతోనే ప్రాణం పోయింది.

3. **జఘాన :** 11-49వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యమివృన్దమనశ్చన్ద్రః శ్రమం పరిహరన్నివ ।**
**యమునాకూలమగమద్విమలీకర్తుమఞ్జసా ॥ 11-64**

**అ :** కృష్ణుడు అలసట తీర్చుకొనుటకై యమునా తీరానికి చేరుట. -పథ్యావక్త్రమ్.

**అ :** యమి-వృంద-మనః-చంద్రః శ్రమం పరిహరన్+ఇవ అంజసా విమలీకర్తుం యమునా-కూలమ్ అగమత్.

**ప్ర :** యమి-వృంద-మనః-చంద్రః : యమి = మునులయొక్క, వృంద = సమూహం యొక్క, మనః = మనస్సునకు (జాత్యేక వచనం), చంద్రః = చంద్రుని వంటి (కృష్ణుడు), శ్రమమ్ = అలసటను, పరిహరన్+ఇవ = తొలగించుకోవటానికి అన్నట్లు, అంజసా = వెంటనే, విమలీకర్తుమ్ = శుద్ధి చేయుటకై, యమునా-కూలమ్ = యమునా తీరానికి, అగమత్ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** మునిసమూహమానసచంద్రుడయిన కృష్ణుడు కంససంహారంచేత కలిగిన శ్రమను తొలగించుకోవటానికన్నట్లు, వెంటనే నిర్మలీకరణం కోసం యమునా తీరానికి వెళ్ళాడు. (తన శరీరాన్ని నిర్మలం చేసికోవటం లోకదృష్టిలో. తన స్పర్శతో యముననే పవిత్రం చేయగలగటం అలౌకికదృష్టిలో.)

**వి :** 1. శ్రమం పరిహరన్ ఇవ – అంటే మనదృష్టిలో తనకు కలిగిన శ్రమను పరిహరించటం. ఆయన దృష్టిలో అంతవరకు కంసాదుల స్పర్శ వలన కలిగిన శ్రమను తన శరీరస్పర్శతో లేకుండా చేయటం. యమునను పవిత్రీకరించటంతోపాటు ప్రశాంతపరచటం కూడా.

2. **అగమత్ :** 11-15వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గోఽయమేకాదశః॥ 11-65**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** అయమ్ = ఇది, మహితః = గొప్పదైన, ఏకాదశః = పదకొండవ, సర్గః = సర్గ- మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పదకొండవ సర్గ.

**శ్రీః**





# శ్రీః
# ద్వాదశః సర్గః

శ్లో॥ తతస్సదస్యుగ్రసేనమాహూయ మధురాపతిః ।
యదూనామధిపం చక్రే ముదా ప్రణతవత్సలః ॥ 12-1

**అవతారిక :** కృష్ణుడు ఉగ్రసేనుని యాదవులకు రాజును చేయటం. -పథ్యావక్త్రమ్.

**అన్వయక్రమం :** తతః ప్రణత-వత్సలః మధురా-పతిః ముదా సదసి ఉగ్రసేనమ్ ఆహూయ యదూనామ్ అధిపం చక్రే.

**ప్రతిపదార్థం :** తతః = అటుతర్వాత (కంసుని సంహరించిన తరువాత), ప్రణత-వత్సలః : ప్రణత = లోబడిన వారియందు, వత్సలః = వాత్సల్యంగల (ప్రణతేషు వత్సలః), మధురా-పతిః = మధురాధిపతి అయిన కృష్ణుడు (మధురాయాః అధిపతిః), ముదా = ఆనందంతో, సదసి = కొలువులోనికి, ఉగ్రసేనమ్ = ఉగ్రసేనుని, ఆహూయ = పిలిపించి, యదూనామ్ = యదువంశస్థులకు, అధిపమ్ = రాజును, చక్రే = చేశాడు. (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.),

**తాత్పర్యం ॥** కంసమరణం తర్వాత ప్రణతవత్సలుడైన కృష్ణుడు ఆనందంతో ఉగ్రసేనుని కొలువు లోనికి పిలిపించి యదుపతిని చేశాడు.

**విశేషాలు :** 1. ఉగ్రసేనుడు కంసుని తండ్రి. ఆహుకుని కొడుకు. ఉగ్రసేనుని చెరసాలలో బంధించి కంసుడు రాజయ్యాడు. అసలు కంసుని తండ్రి ఉగ్రసేనుడు కాదని ద్రమిళుడనే గంధర్వుడనీ భాగవతం దశమస్కంధం చెపుతోంది. ఆ ఉగ్రసేనుని భార్య శాపం వలననే ఆమెకు పుట్టిన ఆ కంసుడు ఆమె పుట్టింటివాడైన కృష్ణుని చేతిలో మరణించవలసి వచ్చింది.

2. ఉగ్రసేనుని రాజును చేసేముందు కృష్ణుడు పలికిన అనునయవచనాల ద్వారా కృష్ణుని ఉదాత్తతతో పాటు యాదవులకు రాజ్యాధికారం లేకపోవటానికి కారణం కూడా కనిపిస్తుంది.

చ. అనఘ! యయాతి శాపమున యాదవవీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు నృపసత్తమ! రాజవు గమ్ము భూమికిన్;
నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరివెట్టుదు రన్యరాజులం
బనిగొను టెంత రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్. -పోతనభాగవతము-10/1394

| | | | | |
|---|---|---|---|---|
| 3. చక్రే : | **చక్రే** | చక్రాతే | చక్రిరే | |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే | |
| | చక్రే | చకృవహే | చకృమహే. | * |

**శ్లో॥ రాజ్యం మే తవ శాస్త్రమేవ నియమాః సేనా తితిక్షాఽంగనా**
**నిత్యం భక్తివిరక్తిదైన్యశమనజ్ఞానాదిలాభో ధనమ్ ।**
**మచ్ఛ్రోత్రాన్తికసఙ్గతే తవ యశోధారే స్ఫురచ్చామరే**
**ఛత్రం మూర్ధ్ని కృతం భవాతపహరం హస్తారవిన్దం తవ ॥ 12-2**

**అ :** ఉగ్రసేనుడు కృష్ణునితో తనకు రాజ్యాధికారం అవసరం లేదని చెప్పటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** (కృష్ణ!) మే రాజ్యం తవ శాస్త్రమ్-ఏవ, సేనా నియమాః అంగనా తితిక్షా ధనం నిత్యం భక్తి-విరక్తి-దైన్య-శమన-జ్ఞాన+ఆది-లాభః ధనమ్ స్ఫురత్+చామరే మత్-శ్రోత్ర+అంతిక-సంగతే తవ యశః-ధారే ఛత్రం మూర్ధ్ని కృతం భవ-ఆతప-హరం తవ హస్త+అరవిందమ్-ఏవ.

**ప్ర :** (కృష్ణ! = ముకుందా!), మే = నాయొక్క, రాజ్యమ్ = ప్రభుత, తవ = నీయొక్క, శాస్త్రమ్ ఏవ = శాస్త్రమే. (కృష్ణ తత్త్వశాస్త్రమే) సేనా = సైన్యం, నియమాః = నియమాలు (శాస్త్రవిహితవ్రతాదికర్మలు) (నియమో వ్రతమస్త్రీ- అమరకోశః-బ్రహ్మ-38), అంగనా = కాంత, తితిక్షా = ఓర్పు (సుఖదుఃఖాది ద్వంద్వాలను సహించగలగటం - తేజితుమ్ ఇచ్ఛా తితిక్షా-తిజ క్షమాయాం ధాతువు, క్షమార్థంలో నిత్యసన్నంతమీ ధాతువు), ధనమ్ = సొమ్ము, నిత్యమ్ = ఎల్లప్పుడూ, భక్తి... లాభః : భక్తి = భక్తిని (భగవత్సేవయందు ఆసక్తి), విరక్తి = (ఇతర విషయాలపై) అనాసక్తిని, దైన్య-శమన = దీనత్వాన్ని పోగొట్టేది అయిన, జ్ఞాన = జ్ఞానం, ఆది = మొదలగు వాటియొక్క, లాభః = లబ్ధి (భక్తిశ్చ విరక్తిశ్చ దైన్యస్య శమనం చ యత్ జ్ఞానమ్ తత్ ఆదౌ యేషాం తేషాం లాభః), ధనమ్ = ధనం, స్ఫురత్+చామరే = ప్రకాశించే వీవెనలు (స్ఫురతీ చ తే చామరే), మత్-శ్రోత్ర+అంతిక-సంగతే : మత్ = నాయొక్క, శ్రోత్ర = చెవులయొక్క, అంతిక = దగ్గరకు, సంగతే = చేరినట్టి (మమ శ్రోత్రయోః అంతికం సంగతే), తవ = నీ, యశః+ధారే :యశః = కీర్తియొక్క, ధారే = ధారలు (యశసాం ధారే), ఛత్రమ్ = గొడుగు, మూర్ధ్ని = తలపై, కృతమ్ = ఉంచబడినదీ, భవ-ఆతప-హరమ్ : భవ = సంసారమనే, ఆతప = తాపాన్ని (ఎండను), హరమ్ = హరించేదీ అయిన, తవ = నీయొక్క, హస్త+అరవిందమ్ ఏవ = కరకమలమే.

**తా ॥** కృష్ణా! నా రాజ్యం నీగురించి చెప్పే శాస్త్రమే. (తత్త్వశాస్త్రమే). నా సేన నీకు సంబంధించిన వ్రతాలే. నా ధర్మపత్ని తితిక్షయే. నా ధనం భక్తి విరక్తులను కలిగిస్తూ దైన్యాన్ని పోగొట్టే జ్ఞానలబ్ధియే. నా వింజామరలు నా చెవులకు సోకే నీ కీర్తిధారలే. నా గొడుగు నా తలపై నీవుంచిన భవతాప పరిహారకమైన నీ కరకమలమే.

**వి :** 1. ఈ శ్లోకంలో కృష్ణతత్త్వంలో రాజ్యత్వాన్ని, వ్రతోపవాసాదులలో చమూత్వాన్ని, తితిక్షలో అంగనాత్వాన్ని, జ్ఞానంలో ధనత్వాన్ని, యశోధారలలో శాస్త్రత్వాన్ని, హస్తారవిందంలో ఛత్రత్వాన్ని ఆరోపించటం జరిగింది. అందువల్ల ఇది రూపకాలంకారం. తద్రూపంగానే ఆరోపించినందువల్ల తాద్రూప్యరూపకం. '**విషయ్యభేదతాద్రూప్యరంజనం విషయస్య యత్ తద్రూపకమ్**' - (కు.17)

2. కంసుడు కృష్ణద్వేషి అయినా ఉగ్రసేనుడు కృష్ణద్వేషి కాదు. కృష్ణుడికి కూడా కంసుని మీదనే కోపం ఉగ్రసేనుని మీద కాదు. కంసుడు వాస్తవికంగా ద్రమిళుని కుమారుడై ఉగ్రసేనుని కొడుకుగా వ్యవహరింపబడటం దీనికి కారణం కావచ్చు. కంసుడు ఉగ్రసేనుని కూడా ద్వేషించాడు. అదే పరిస్థితి ఉగ్రసేనునిలోనూ వుండవచ్చు. *

శ్లో॥ త్వత్క్షేత్రం మమ దుర్గమార్యకరుణా వర్మ త్వదఙ్ఘ్రిధ్వజా-
సక్తః సౌమ్య! మనోరథో మమ రథశ్ఛన్దాంస్యమన్దా హయాః ।
ప్రాణస్సారథిరాయుధం త్వదభిధా జేయః కలిస్తద్భటాః
షట్ తేషాం నగరీ చ సంసృతిరథో లభ్యా విముక్తిః పురీ ॥ 12-3

అ : కృష్ణుని ఉగ్రసేనుడు స్తుతించటం. -శార్దూలవిక్రీడితమ్.

అ : మమ దుర్గం త్వత్-క్షేత్రమ్ ఏవ. వర్మ ఆర్య-కరుణా. సౌమ్య! మమ రథః త్వద్-అంఘ్రి-ధ్వజ+ఆసక్తః మనోరథః అమన్దాః హయాః ఛందాంసి. సారథిః ప్రాణః ఆయుధం త్వద్+అభిధా జేయః కలిః తద్-భటాః షట్. తేషాం నగరీ చ సంసృతిః అథో విముక్తిః పురీ లభ్యా.

ప్ర : మమ = నాయొక్క, దుర్గమ్ = కోట (రాజ్యాంగాలైన ఏడింటిలో కోట ఒకటి. 'స్వామ్యమాత్యసుహృత్కోశ-రాష్ట్రదుర్గబలాని చ '- వైజయన్తి-క్షత్ర-5, రాజు, మంత్రి, మిత్రులు, ఖజానా, రాజ్యం, కోట, సేన- ఈ ఏడు రాజ్యాంగాలు), త్వత్-క్షేత్రమ్ = కృష్ణ (విష్ణు) క్షేత్రమే. (తవ క్షేత్రమ్), వర్మ = కవచం, ఆర్య-కరుణా : ఆర్య = పెద్దలయొక్క, కరుణా = అనుగ్రహమే. (ఆర్యాణాం కరుణా), సౌమ్య = సౌమ్యుడా!, మమ = నాయొక్క, రథః = రథం (వాహనం), త్వద్-అంఘ్రి-ధ్వజ+ఆసక్తః : త్వద్ = నీయొక్క, అంఘ్రి = పాదాల యందలి, ధ్వజ = ధ్వజాకృతిగల రేఖలపై, ఆసక్తః = లగ్నమైన (తవ అంఘ్ర్యోః ధ్వజేషు ఆసక్తః), మనో-రథః = కోరికయే, అమందాః = వడిగల, హయాః = గుఱ్ఱాలు, ఛందాంసి+ఏవ = వేదాలే, సారథిః = రథాన్ని నడిపేవాడు, ప్రాణః = వాయువే, ఆయుధమ్ = ఆయధం ఉపకరణం, త్వత్+అభిధా = నీ నామమే (తవ అభిధా), జేయః = గెలువ వలసినది/శత్రువు (జేతుం యోగ్యః '**అచో యత్**' (అష్టాధ్యాయి 3-1-97) సూత్రంతో యత్ ప్రత్యయం), కలిః = కలియే, తద్-భటాః = ఆయన సైనికులు, షట్ = ఆరుగురు (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు), తేషామ్ = వారియొక్క, నగరీ = నగరం, సంసృతిః = సంసారం (సమ్-సృ ధాతువుపై క్తిన్ ప్రత్యయం), అథో = ఆ తరువాత, విముక్తిః = మోక్షమనే (వి ముచ్ ధాతువుపై క్తిన్ ప్రత్యయం), పురీ = నగరం, లభ్యా = పొందదగినది.

**తా ॥** కృష్ణా! నీ నివాసక్షేత్రమే నాకు కోట. పెద్దల కరుణయే కవచం. నీ పాదాలయందలి ధ్వజరేఖలపై తగుల్కొన్న నా మనోరథమే నా రథం. వేదాలు గుఱ్ఱాలు. ప్రాణం సారథి. నీ నామమే ఆయుధం. నా శత్రువు కలియే, కామక్రోదలోభమోహమదమాత్సర్యాలు ఆ కలి భటులు. సంసారం తన (కలి) నగరం. కడగా నేను చేరవలసిన నగరి విముక్తి.

**వి :** 1. పరమాత్మ అయిన నారాయణుని నామకీర్తనమే కలి కల్మషహారి అని **కలిసంతరణోపనిషత్తు** చెపుతోంది.

"భగవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చారణమాత్రేణ నిర్ధూతకలిర్భవతీతి. నారదః పునః పప్రచ్ఛ తన్నామ కిమితి. సహోవాచ హిరణ్యగర్భః-

**శ్లో॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే ।**
**హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ॥**

శ్లో॥ ఇతి షోడశకం నామ్నాం కలికల్మషనాశనమ్ ।
నాతః పరతరోపాయః సర్వవేదేషు దృశ్యతే ॥

2. కృష్ణక్షేత్రంలో దుర్గత్వాన్ని, ఆర్యకరుణలో వర్మత్వాన్ని, మనోరథంలో రథత్వాన్ని, వేదాలలో హయత్వాన్ని, ప్రాణంలో సారథిత్వాన్ని, కృష్ణనామంలో ఆయుధత్వాన్ని, కలిలో శత్రుత్వాన్ని, కామక్రోధాదుల్లో కలిభటత్వాన్ని సంసారంలో, విముక్తిలో కూడా తత్తద్విశిష్ట నగరత్వాన్ని ఆరోపించినందువల్ల ఈ శ్లోకంలో **రూపకాలంకారం.** *

**శ్లో॥ యథా త్వం సతతం పూర్ణః సామ్రాజ్యం నేచ్ఛసి ప్రభో! ।**
**తథా త్వత్సేవయా పూర్ణా వయమప్యబ్జలోచన ॥ 12-4**

**అ :** ఉగ్రసేనుడు కృష్ణుని స్తుతించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** అబ్జలోచన! ప్రభో! యథా త్వం సతతం పూర్ణః సన్ సామ్రాజ్యం న ఇచ్ఛసి తథా త్వత్‌సేవయా పూర్ణాః వయమ్ అపి (న ఇచ్ఛామః).

**ప్ర :** అబ్జ-లోచన = కమలనయన! (అబ్జే ఇవ లోచనే యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), ప్రభో! = స్వామీ!, యథా = ఏ ప్రకారంగా, త్వమ్ = నీవు, సతతమ్ = ఎల్లప్పుడూ, పూర్ణస్సన్ = పరిపూర్ణుడవై, సామ్రాజ్యమ్ = ప్రభుత్వాన్ని, న-ఇచ్ఛసి = కోరటం లేదో (ఇష ఇచ్ఛాయాం-పరస్మైపది-లట్-మ.ఏ.), తథా = ఆ ప్రకారంగా, త్వత్-సేవయా = నీపై భక్తితో, పూర్ణాః = పరిపూర్ణులమైన, వయమ్ అపి = మేము కూడా, (సామ్రాజ్యమ్ = ప్రభుతను, న ఇచ్ఛామః = కోరుటలేదు.)

**తా ॥** కమలనయనా! ప్రభూ! నీవు సతతమూ పూర్ణకాముడవు. కాబట్టి నీకు ప్రభుత అవసరం లేదు. నీ సేవచేత మేముకూడా పూర్ణకాములమయ్యాం. కాబట్టి మాకు కూడా ప్రభుత అవసరం లేదు.

**వి :** 1. శ్లో॥యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా ।
తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోఽంశసంభవమ్ ॥

శ్లో॥ అథవా బహూనైతేన కిం జ్ఞాతేన తవార్జున ।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥ - భగవద్గీత 10/41-42

సృష్టిలోని అసాధారణమైన తేజస్సు గానీ, శక్తిగానీ, ఐశ్వర్యం గానీ అవన్నీ తన అంశలే అని భవిష్యత్తులో ప్రకటింపబోతున్నాడు. అన్నీ తానే అయినప్పుడు తనకంటూ లేనిది ఏముంటుంది?

| 2. **ఇచ్ఛసి :** | ఇచ్ఛతి | ఇచ్ఛతః | ఇచ్ఛన్తి | |
|---|---|---|---|---|
| | **ఇచ్ఛసి** | ఇచ్ఛథః | ఇచ్ఛథ | |
| | ఇచ్ఛామి | ఇచ్ఛావః | ఇచ్ఛామః. | * |

**శ్లో॥ యే త్వాం శాస్త్రవిచారవిస్తృతధియః శ్రేయస్కరం శ్రీకరం**
**సేవన్తే పులకాఙ్కితాఙ్గముదితప్రేమాశ్రుధారాధరాః ।**
**తేషాం నైహికసమ్పదస్తి విదుషామిత్యజ్ఞగీతాం కథాం**
**నాథోన్మూలయితుం కరోమి గదితం న స్యాన్మదో మే యది ॥ 12-5**

**అ :** ఉగ్రసేనుని వచనం - కృష్ణప్రశంస. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** నాథ! శాస్త్ర-విచార-విస్తృత-ధియః ఉదిత-ప్రేమ+అశ్రు-ధారాధరాః యే శ్రేయస్కరం శ్రీకరం త్వాం పులక+అంకిత+అంగం సేవన్తే తేషాం విదుషామ్ ఐహికసంపత్ న అస్తి ఇతి అజ్ఞ-గీతాం కథామ్ ఉన్మూలయితుం గదితం కరోమి మే మదః యది న స్యాత్.

**ప్ర :** నాథ! = ప్రభూ!, శాస్త్ర,,, ధియః : శాస్త్ర = శాస్త్రాలయొక్క విచార = ఆలోచనలచేత, విస్తృత = విస్తరిల్లిన, ధియః = బుద్ధిగలవారూ (శాస్త్రాణాం విచారః తేన విస్తృతా ధీః యేషాం తే), ఉదిత... ధరాః : ఉదిత = పుట్టిన, ప్రేమ+అశ్రు = ప్రేమబాష్పాలయొక్క, ధారాః = ప్రవాహాలను, ధరాః = ధరించేవారూ అయిన (ప్రేమ్ణా జాతా అశ్రూణాం ధారాః తాసాం ధరాః), యే = ఎవరు, శ్రేయస్కరమ్ = శ్రేయోదాయకమై, శ్రీకరమ్ = సంపత్కరమైన, త్వామ్ = నిన్ను, పులక... అంగమ్ : పులక = పులకరింతలచే, అంకిత = గుర్తింపబడిన, అంగమ్ =

శరీరంగలుగునట్లు (పులకైః అంకితమ్ అంగం యథా తథా), సేవన్తే = సేవిస్తారో (సేవ్ సేవనే ఆత్మనేపది-లట్-ప్ర.బ.), తేషామ్ = ఆ, విదుషామ్ = పండితులకు, ఐహిక-సంపత్ = ఇహలోకసంపద (ఐహికీ చ సా సంపత్), న+అస్తి ఉండదు, ఇతి = అనే, అజ్ఞ-గీతామ్ : అజ్ఞ = తెలియనివారిచే, గీతామ్ = చెప్పబడిన (అజ్ఞైః గీతా-తామ్), కథామ్ = కథను, ఉన్మూలయితుమ్=పెకలించటానికి/తొలగించటానికి, గదితమ్ = (నీ) మాటను (గద ధాతువుపై క్త ప్రత్యయం), కరోమి = పాటిస్తున్నాను. (కృ కరణే పరస్మైపది-లట్-ఉ.ఏ.), మే = నాకు, మదః = పొగరు, యది న స్యాత్ = లేకపోతే... (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! శాస్త్రాలను పరిశీలించటం ద్వారా విస్తరిల్లిన బుద్ధి గలిగి ప్రేమబాష్పాలను ప్రవహింపజేస్తూ శరీరమంతా పులకరించగా శ్రేయస్కరుడవు, శ్రీ కరుడవు అయిన నిన్ను సేవించే పండితులకే (పరలోక వైభవమే కానీ) ఐహికసంపద ఉండదనే అజ్ఞానుల కథనాన్ని తొలగింపజేయటానికి నీ మాటను బట్టి శాసనాధికారాన్ని స్వీకరిస్తున్నాను, అది కూడా నాకు పొగరు పట్టకపోతేనే.

**వి :** 1. దైవానుగ్రహం ఇహపరహితకారకం. మేధావులుగా భావించుకొనే అందరు భగవత్సేవ పరలోకానికి అనుకొంటుంటారు. కానీ అది వాస్తవం కాదు, అని ఉగ్రసేనవచనం ద్వారా కవి ప్రతిపాదిస్తున్నాడు. భాగవతగాథలెన్నో ఈ అంశాన్ని నిరూపిస్తాయి. అయితే-

**శ్లో॥ అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।**
**తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన ॥**

అని అనగలగాలి. గజేంద్రుడు ఆ మాట అన్న తరువాతనే కృష్ణుడు వైకుంఠంనుండి పరుగులమీద రావటాన్ని చూచాం గదా!

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్
తావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
**నీవే తప్ప నితఃపరంబెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్**
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా! - పోతనభాగవతము 8/90

అని కదా గజేంద్రుని మొర.

2. **సేవన్తే :**

| | | | |
|---|---|---|---|
| | సేవతే | సేవేతే | **సేవన్తే** |
| | సేవసే | సేవేథే | సేవధ్వే |
| | సేవే | సేవావహే | సేవామహే |
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **కరోమి :** | కరోతి | కురుతః | కుర్వన్తి |
| | కరోషి | కురుథః | కురుథ |
| | **కరోమి** | కుర్వః | కుర్మః |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ ఉగ్రసేనం యదుపతిం చక్రే చక్రధరః కిల ।**
**యదుమాత్రాధిపత్యేన తస్య విశ్వేశ్వరస్య కిమ్ ॥ 12-6**

**అ :** కృష్ణుడు ఉగ్రసేనుని యదుపతిని చేయటంలోని మరొక ఔచిత్యాన్ని ప్రకటించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** చక్రధరః ఉగ్రసేనం యదుపతిం చక్రే కిల! విశ్వ+ఈశ్వరస్య తస్య యదుమాత్ర+ అధిపత్యేన కిమ్?

**ప్ర :** చక్రధరః = సుదర్శనధారి అయిన కృష్ణుడు (చక్రస్య ధరః-ఇక్కడ కర్మకు శేషత్వ (షష్ఠి) వివక్ష), ఉగ్రసేనమ్ = ఉగ్రసేనుని, యదుపతిమ్ = యదువులకు రాజుగా (యదూనాం పతిః తమ్), చక్రే కిల = చేశాడు గదా! (కృ కరణే-ఆత్మనేపది-లిట్-(ప్ర.ఏ.), విశ్వ+ఈశ్వరస్య = ప్రపంచానికే ప్రభువైన, తస్య = ఆ కృష్ణునకు, యదుమాత్ర+ఆధిపత్యేన = యాదవులకు మాత్రం రాజైనంత మాత్రాన, కిమ్? = ఏం ప్రయోజనం? (అదనంగా)

**తా ॥** కృష్ణుడు ఉగ్రసేనుని యదువులకు రాజును చేశాడు గదా! తాను విశ్వేశ్వరుడు. విశ్వేశ్వరుడికి యాదవాధిపత్యం లేకపోయినా వున్నట్లే గదా!

**వి :** 1. **శతే పంచాశత్-** అని ఒక సంస్కృత న్యాయం. వందలో ఏభై ఇమిడి వుండటం. దీనిలో అసంభవమేమీ లేదు గదా! వాచస్పత్యం దీన్నిలా నిర్వచించింది-'**వ్యాపకశతసంఖ్యాయాం యథా వ్యాప్య పంచాశత్సంఖ్యా నివిష్టా ఏవం యత్ర వ్యాపకే వ్యాప్యస్య నివేశస్తత్రాస్య ప్రవృత్తిః**" - మామూలుగా చెప్పాలంటే ఆధేయం ఆధారాన్ని మించక పోవటం సంస్కృతంలోని ఎనిమిది ప్రమాణాలలో ఇది ఒకటి. సంభవం. విశ్వానికే అధిపతి అయినవాడు విశ్వంలో ఒక చిన్న భాగమయిన యదువుల రాజ్యానికి కూడా అధిపతియే గదా! అది చెప్పనవసరం లేదు గదా! ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, శబ్దం ఈ నాలుగు ప్రమాణాలను అందరూ అంగీకరిస్తారు. అర్థాపత్తి, అనుపలబ్ధి ప్రమాణాలు వేదాంతులు అంగీకరిస్తారు. సంభవం, ఐతిహ్యమనే ప్రమాణాలను పౌరాణికులు అంగీకరిస్తారు.

2. **చక్రే :** 12-1వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ సః కృష్ణః కంసవిధ్వంసీ తత్పిత్రే తన్మహీం దదౌ ।**
**పరార్థైకఫలః సాక్షాత్పురాణపురుషో హ్యసౌ ॥ 12-7**

**అ :** ఉగ్రసేనునకు రాజ్యమివ్వటంలోని కృష్ణప్రవృత్తిని మరొక కోణంలో విశ్లేషించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** కంస-విధ్వంసీ సః కృష్ణః తత్ పిత్రే తత్-మహీం దదౌ. హి. అసౌ పర+అర్థ+ఏక-ఫలః సాక్షాత్ పురాణ-పురుషః.

**ప్ర :** కంస-విధ్వంసీ:కంస = కంసుని యొక్క, విధ్వంసీ = వినాశకుడైన (కంసస్య విధ్వంసీ), సః = ఆ, కృష్ణః = కృష్ణుడు, తత్-పిత్రే = ఆ కంసుని తండ్రికి (తస్య పితా, తస్మై), తత్-మహీమ్ = ఆ కంసుని భూమిని (రాజ్యాన్ని) (తస్య మహీ తామ్), దదౌ = ఇచ్చాడు. (దా దానే పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), హి = యుక్తమే, అసౌ = ఆ కృష్ణుడు, పర+అర్థ+ఏక-ఫలః : పర = ఇతరుల యొక్క, అర్థ = ప్రయోజనమే, ఏక = కేవలం, ఫలః = ఫలంగా గలవాడు. (పరేషామ్ అర్థః ఏక ఏవ ఫలం యస్య సః), సాక్షాత్ = సాక్షాత్తుగా (కళ్ళకు కడుతున్న), పురాణ-పురుషః = పురాణపురుషుడు.

**తా ॥** కంసుని సంహరించిన కృష్ణుడు ఆ కంసుని రాజ్యాన్ని ఆ కంసుని తండ్రికే ఇచ్చాడు. అవును అది యుక్తమే. కృష్ణుడు పురాణపురుషుడు. తాను చేసే పనులన్నీ ఇతరులకు ప్రయోజనాన్ని కల్పించటానికే.

**వి :** 1. అవతారాల ప్రయోజనం ఉత్తరోత్తరా విస్తృతంగా కనిపించింది. మత్స్యాద్యవతారాలు ఒకే ఒక లక్ష్యంతో

జరిగాయి. రామావతారం కొంచెం విస్తరించింది. అయినా లక్ష్యం ఒకటే అయింది. అదే కృష్ణావతారం విషయంలో శిశుపాల, దంతవక్త్రసంహార రూపమైన లక్ష్యం మరుగున పడిపోయింది. లక్ష్యం బాగా విస్తృతమైంది. అయితే వాటిలో స్వప్రయోజనపరత వున్నదా? లోకకళ్యాణదృష్టి వున్నదా? అన్నది గ్రహించగలగాలి. అవతార ప్రవృత్తి స్వతః పరప్రయోజనపరాయణమే.

| 2. **దదౌ :** | దదౌ | దదతుః | దదుః | |
|---|---|---|---|---|
| | దదిథ/దదాథ | దదథుః | దద | |
| | దదౌ | దదివ | దదిమ. | * |

**శ్లో॥ త్వదుక్తికారిణస్సర్వే వయమిత్యబ్రవీద్ధరిః ।**
**భక్తమాత్రోక్తకర్తుస్తత్ కిమపూర్వం కృపామ్బుధేః ॥ 12-8**

**అ :** కృష్ణుడు ఉగ్రసేనునకు తాను వాచోవిధేయుడనని ప్రకటించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** హరిః వయం సర్వే త్వద్-ఉక్తి-కారిణః ఇతి అబ్రవీత్. తత్ భక్త-మాత్ర-ఉక్త-కర్తుః కృపా+అంబుధేః అపూర్వం కిమ్?

**ప్ర :** హరిః = కృష్ణుడు, వయం సర్వే = మేమందరం, త్వద్-ఉక్తి-కారిణః = నీ మాటను పాటించేవాళ్ళం (తవ ఉక్తిః, తస్యాః కారిణః), ఇతి = అని, అబ్రవీత్ = చెప్పాడు. (బ్రూ వ్యక్తాయాం వాచి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), తత్ = అది, భక్త... కర్తుః : భక్తమాత్ర = భక్తులచే మాత్రమే, ఉక్త = చెప్పబడినదానిని, కర్తుః = చేసేవాడైన (ప్రమాణార్థంలో మాత్రచ్ ప్రత్యయం - భక్తః ప్రమాణమస్య భక్తమాత్రమ్, తేన ఉక్తస్య కర్తా తస్య), కృపా+అంబుధేః = దయాసాగరునకు (కృష్ణునకు) (కృపాయాః అంబుధిః, తస్య), అపూర్వమ్ కిమ్? = కొత్త విషయమా?

**తా ॥** కృష్ణుడు ఉగ్రసేనునితో 'మేమంతా నువు చెప్పినట్లు చేసేవారమే' అన్నాడు. భక్తులు చెప్పినట్లే చేసే ఆ దయాసాగరునికి అది క్రొత్త విషయమా ఏమి?

**వి :** 1. ఉగ్రసేనునిలోని జంకును పోగొట్టటానికి కృష్ణుడు పలికిన మాట ఇది. అయితే అది అయథార్థం కాదు. కృష్ణుడప్పటికింకా బాల్యంలోనే వున్నాడు. అయినా వాక్ప్రౌఢిమకు లోటు లేదు. జ్ఞానవృద్ధుల విషయంలో, ధర్మవృద్ధుల విషయంలో వయః ప్రసక్తి అనవసరం గదా!

| 2. **అబ్రవీత్ :** | **అబ్రవీత్** | అబ్రూతామ్ | అబ్రువన్ | |
|---|---|---|---|---|
| | అబ్రవీః | అబ్రూతమ్ | అబ్రూత | |
| | అబ్రవమ్ | అబ్రూవ | అబ్రూమ. | * |

**శ్లో॥ సేనామధ్యగతా రాజన్! వయమిత్యాహ మాధవః ।**
**విశ్వమధ్యగతస్యాస్య సేనాన్తః కిం ను దూషణమ్ ॥ 12-9**

**అ :** నీ సేనలోని వారం మేమని కృష్ణుడు ఉగ్రసేనునకు చెప్పటం. -పథ్యావక్త్రమ్.

**అ :** మాధవః 'రాజన్ వయం (తవ) సేనా-మధ్య-గతాః' ఇతి ఆహ. విశ్వ-మధ్య-గతస్య అస్య సేనా+అంతః దూషణం కిం ను?

**ప్ర :** మాధవః = కృష్ణుడు (మాయాః ధవః), రాజన్! = రాజా!, వయమ్ = మేము, (తవ = నీయొక్క), సేనా-మధ్య-గతాః = సేనలోని వారము (సేనాయాః మధ్యే గతాః), ఇతి = అని, ఆహ = చెప్తున్నాడు. (బ్రూ వ్యక్తాయాం వాచి-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), విశ్వ-మధ్య-గతస్య = ప్రపంచంలోని అన్నింటిలో నున్న, అస్య = ఆ కృష్ణునకు, సేనా+అన్తః = సేనమధ్య వుండుట, దూషణం కిం ను? = లోపమా?

**తా ॥** కృష్ణుడు ఉగ్రసేనునితో 'మేము నీ సేనలోని వారం' అన్నాడు. విశ్వంలోని సర్వవస్తువుల మధ్యనున్న కృష్ణుడు సేనామధ్యలో వుండటం దోషమా?

**వి :** 1. **శ్లో॥అణోరణీయాన్ మహతో మహీయా-నాత్మాఽస్య జన్తోర్నిహితో గుహాయామ్ ।**

**తమక్రతుః పశ్యతి వీతశోకో - ధాతుః ప్రసాదదాన్మహిమానమాత్మనః ॥** - కఠోపనిషత్తు - 2/20

అని అణువులలో అణువైన పరమాత్మ సేనా మధ్యలో వుండటం లోపం కాదు. సర్వ పదార్థాలలోనూ తానే గదా!

2. **ఆహ** (బ్రూఞ్ వ్యక్తాయాం వాచి ధాతువునకు లట్‌లో ప్ర.పు.ఏక-ద్వి-బహువచనాలకు మధ్యమపురుష ఏక-ద్వి వచనాలకు వైకల్పికంగా 'ఆహ' ఆదేశమవుతుంది. (**బ్రువః పంచనామాదిత ఆహో బ్రువః**' - అష్టాధ్యాయి 3-4-84) :

| | | |
|---|---|---|
| **ఆహ** | ఆహతుః | ఆహుః |
| ఆత్థ | ఆహథుః | బ్రూత |
| బ్రవీమి | బ్రూవః | బ్రూమః. |

*

**శ్లో॥ వక్రం సర్వమవక్రయత్వనుదినం కుబ్జాతనూజ్జృమ్భకో**
**మల్లానాం లయకృద్ధునోతు స రిపూన్ కంసస్య హింసాకరః ।**
**బన్ధూన్ బన్ధకరాన్ వియోజయతు మే రమ్యాం ధురం మాధురః**
**సన్దద్యాద్ధరిరన్తరఙ్గవిభవం రఙ్గస్థలీరఞ్జకః ॥** **12-10**

**అ :** కవి గడచిపోయిన కథాంశాలను సమీకరిస్తూ కావ్యమధ్యంలో మంగళాచరణం చేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కుబ్జా-తను+ఉజ్జృంభకః అనుదినం వక్రం సర్వమ్ అవక్రయతు. మల్లానాం లయ-కృత్ సః రిపూన్ ధునోతు. కంసస్య హింసాకరః బంధకరాన్ బంధూన్ వియోజయతు. మాధురః మే రమ్యాం పురం సందద్యాత్. రంగ-స్థలీ-రంజకః హరిః అన్తరంగ-విభవం సందద్యాత్.

**ప్ర :** కుబ్జా-తను+ఉజ్జృంభకః : కుబ్జా = త్రివక్రయొక్క, తను = శరీరంయొక్క, ఉజ్జృంభకః = పైకి ఎత్తిన (లేపిన) వాడు (కుబ్జాయాః తనుః, తస్యాః ఉజ్జృంభకః), అనుదినమ్ = ప్రతిరోజు, వక్రమ్ = వంకర అయిన, సర్వమ్ = అంతటినీ (ఇంద్రియాదులను), అవక్రయతు = ఋజువుగా చేయును గాక. (అవక్ర-ణిచ్ నామధాతువు-పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.), మల్లానామ్ = చాణూరముష్టికాది మల్లయోధులయొక్క, లయ-కృత్ = వినాశకుడైన (లయం కరోతి ఇతి), సః = ఆ కృష్ణుడు, రిపూన్ = శత్రువులను, ధునోతు = కంపింపజేయుగాక (ధూ కంపనే-పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.), కంసస్య = కంసుని, హింసా-కరః = హింసించిన వాడు, బంధ-కరాన్ = బంధాన్ని కల్పించే, బంధూన్ = బంధువులను, వియోజయతు = విడదీయును గాత, మాధురః = మథురా రక్షకుడు, మే = నాకు, రమ్యామ్ = మధుర మైన, ధురమ్ = బరువును, సన్దద్యాత్ = ఇచ్చుగాక. (సమ్-దా దానే విధిలిఙ్-పరస్మైపది-(ప్ర.ఏ.), రంగ-స్థలీ-రంజకః : రంగ-స్థలీ = మల్లయుద్ధరంగాన్ని, రంజకః = రంజింపజేయు వాడు అయిన, హరిః = కృష్ణుడు, అంతరంగ-విభవమ్ : అంతరంగ = అంతఃకరణానికి సంబంధించిన, విభవమ్ = సంపదను, సన్దద్యాత్ = ఇచ్చుగాక.

**తా ॥** త్రివక్ర (కుబ్జ) శరీరాన్ని చక్కజేసిన కృష్ణుడు వంకరగా వున్న అన్నింటినీ సరిజేయుగాక. మల్లురను సంహరించిన కృష్ణుడు శత్రువులను సంహరించుగాత. కంసుని హింసించిన తాను బంధాలను కల్గించే బంధువులనుండి విముక్తిని కలిగించుగాక. మథురాపురాధిపతి రమ్యమైన భారాన్ని నాకు కల్పించు గాక. మల్లయుద్ధరంగభూమిని రంజింపజేసిన కృష్ణుడు నాకు అంతరంగవిభవాన్ని కల్గించుగాక.

**వి :** 1. కుబ్జాతనూజ్జృంభకః, మల్లానాం లయకృత్, కంసస్య హింసాకరః, రంగస్థలీరంజకః ఈ విశేషణాలన్నీ అభిప్రాయగర్భితాలు. తాను ఆ కృష్ణునినుండి ఆశిస్తున్న వాటిని ఆశించటానికి గల కారణాలను ప్రస్ఫుటం చేసేవి. సాభిప్రాయవిశేషణాలు కాబట్టి ఇక్కడ పరికరాలంకారముంది. '**అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణే**' – (కు. 62)

| | | | |
|---|---|---|---|
| 2. **అవక్రయతు :** | **అవక్రయతు**/అవక్రయతాత్ | అవక్రయతామ్ | అవక్రయన్తు |
| | అవక్రయ/అవక్రయతాత్ | అవక్రయతమ్ | అవక్రయత |
| | అవక్రయాణి | అవక్రయావ | అవక్రయామ |
| **ధునోతు :** | **ధునోతు**/ధునుతాత్ | ధునుతామ్ | ధున్వన్తు |
| | ధును/ధునుతాత్ | ధునుతమ్ | ధునుత |
| | ధునవాని | ధునవావ | ధునువామ |
| **వియోజయతు:** | **వియోజయతు**/వియోజయతాత్ | వియోజయతామ్ | వియోజయన్తు |
| | వియోజయ/వియోజయతాత్ | వియోజయతమ్ | వియోజయత |
| | వియోజయాని | వియోజయావ | వియోజయామ |
| **సన్దద్యాత్ :** | **సన్దద్యాత్** | సన్దద్యాతామ్ | సన్దద్యుః |
| | సన్దద్యాః | సన్దద్యాతమ్ | సన్దద్యాత |
| | సన్దద్యామ్ | సన్దద్యావ | సన్దద్యామ. |

*

**శ్లో॥ మథురా మధురా యేన సమభూత్ సమభూజ్ఝితా ।**
**స్మరత స్మరతాతం తం మహతామహతార్థదమ్ ॥ 12-11**

**అ :** మథురా ప్రసక్తి – కృష్ణ ప్రశస్తి. –పథ్యావక్త్రమ్.

**ప :** మథురా మధురా యేన సమబూత్ సమ–భూ+ఉజ్ఝితా స్మరత స్మర–తాతం తం మహతామ్ అహత+అర్థ–దమ్.

**అ :** యేన మథురా మధురా సమ–భూ+ఉజ్ఝితా సమభూత్ మహతామ్ అహత+అర్థదమ్ స్మర–తాతం తం స్మరత.

**ప్ర :** యేన = ఏ కృష్ణుని కారణంగా, మథురా = మథురా నగరి, మధురా = మనోహరమైనది. (మధురాతి ఇతి మధురా), సమ = సమానమైన, భూ = భూమిచేత, ఉజ్ఝితా = విడువ బడినదో (అసమానమో) (సమయా భువా ఉజ్ఝితా), సమభూత్ = అయిందో (సమ్–భూ సత్తాయాం–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), మహతామ్ = మహాత్ములకు, అహత+అర్థ–దమ్ : అహత = నశింపని, అర్థ = పురుషార్థాన్ని, దమ్ = ఇచ్చే (అహతః చ అసౌ అర్థః తం దదాతీతి తమ్), తమ్ = ఆ, స్మర–తాతమ్ = మదనుని తండ్రిని (కృష్ణుని)(స్మరస్య తాతః తమ్), స్మరత = తలచుకోండి (స్మృ చింతాయాం పరస్మైపది–లోట్–మ.బ.)

**తా ॥** మధురమైన మథురానగరికి లోకంలో సమానమైన తావు లేదు. దానికి కారణం కృష్ణుడే. తాను జ్ఞానులకు మోక్షరూపమైన పురుషార్థాన్ని ఇచ్చేవాడు. అటువంటి కృష్ణుని స్మరించండి.

**వి :** 1. **మథురానగరి : శ్లో॥అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవన్తికా ।**
**పురీ ద్వార(రా)వతీ చైవ సప్తైతా మోక్షదాయికాః ॥**

అయోధ్య, మథుర, మాయ (హరిద్వార్–అక్కడ మాయాదేవీ ఆలయం వుంటుంది), కాశి, కాంచి, అవన్తిక

– ఈ ఏడు నగరాలు మోక్షప్రదాలుగా ప్రసిద్ధాలు. రామ జననం కారణంగా అయోధ్య, కృష్ణజననం కారణంగా మథుర మోక్షాన్నిచ్చేవిగా కీర్తి నందాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **సమభూత్ :** | **సమభూత్** | సమభూతామ్ | సమభూవన్ |
| | సమభూః | సమభూతమ్ | సమభూత |
| | సమభూవమ్ | సమభూవసమభూమ | |
| **స్మరత :** | స్మరతు/స్మరతాత్ | స్మరతామ్ | స్మరన్తు |
| | స్మర/స్మరతాత్ | స్మరతమ్ | **స్మరత** |
| | స్మరాణి | స్మరావ | స్మరామ. |

*

**శ్లో॥ కృష్ణోదారవిహారఖణ్డితమలం యస్యాం జలం మఙ్గళం**
**తత్పాదామ్బుజలక్ష్మలక్ష్యవిభవా ధన్యస్థలీ యత్స్థలీ ।**
**యద్గేహాని కృతస్పృహాణి రమయా నిత్యం స్వభర్తుః స్థితేః**
**దద్యాత్ సా మథురా పురీ శుభకరీ శ్రేయాంసి భూయాంసి నః ॥ 12-12**

**అ :** మథురాపురిని పవిత్రతకు నిలయంగా శుభకరంగా కవి వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యస్యాం కృష్ణ+ఉదార–విహార–ఖండిత–మలం (సత్) జలం మంగళం, యత్స్థలీ తత్–పాద+అంబుజ–లక్ష్మ–లక్ష్య–విభవా (సతీ) ధన్యస్థలీ యద్–గేహాని నిత్యం స్వ–భర్తుః స్థితేః రమయా కృత–స్పృహాణి సా శుభకరీ మథురా పురీ నః భూయాంసి శ్రేయాంసి దద్యాత్.

**ప్ర :** యస్యామ్ = ఏ నగరిలో, కృష్ణ... మలమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, ఉదార = ఔదార్యంతో కూడిన, విహార = తిరుగాడుటచే, ఖండిత = తొలగింపబడిన, మలమ్ (సత్) = కాలుష్యం గల (కృష్ణస్య ఉదారేణ విహారేణ ఖండితం మలం యస్య తత్), జలమ్ = నీరు, మంగళమ్ = శుభకరమో (పవిత్రమో), యత్ స్థలీ = ఏ నగరంయొక్క, స్థలీ = ప్రదేశం, తత్... విభవా : తత్ = ఏ కృష్ణుని యొక్క, పాద+అంబుజ = కరకమలముల యొక్క, లక్ష్మ = గుర్తులచే (అంకశ్చిహ్నమభిజ్ఞానం లాంఛనం లక్ష్మ లక్షణమ్ –హలాయుధకోశః–45), లక్ష్య = గుర్తింపబడిన, విభవా (సతీ) = సంపదగలదై (తస్య పాదౌ ఏవ అంబుజే, తయోః లక్ష్మాణి, తైః లక్ష్యః విభవః యస్యాః సా), ధన్య–స్థలీ = ధన్యమైన ప్రదేశమో, యద్–గేహాని = దేనియందలి ఇళ్ళు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, స్వ–భర్తుః = తన భర్తయొక్క, స్థితేః = ఉనికి వల్ల, రమయా = లక్ష్మిచేత, కృత–స్పృహాణి = కోరబడినవో (కృతా స్పృహా యేషు తాని), సా = అటువంటి, శుభ–కరీ = శుభాలను కలిగించే, మథురా–పురీ = మథురా నగరం, నః = మాకు (మనకు), భూయాంసి = చాలా, శ్రేయాంసి = శుభా/సుఖాలను, దద్యాత్ = ఇచ్చు గాక! (దా దానే పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని ఉదారవిహారాలవలన మథురా నగరిలోని జలం మంగళప్రదమైంది. ఆ కృష్ణునియొక్క పాదచిహ్నాలచేత దాని వైభవం స్పష్టపడి అక్కడ ప్రదేశం ధన్యమైంది. కృష్ణుడు అక్కడే నిత్యమూ వుండటం వలన లక్ష్మికి కూడా అక్కడి ఇళ్ళంటే ఇష్టం. అటువంటి మథురాపురి మనకు ఎన్నో శ్రేయస్సులను కల్గించునుగాక!

**వి : 1.** పవిత్రతకు కారణమయ్యేవి రెండే జలం, స్థలం. జలపవిత్రతవలన పుణ్యతీర్థాలు, స్థలపవిత్రతవలన పుణ్యక్షేత్రాలు గణన కెక్కుతాయి. మథురానగరి పుణ్యతీర్థం, పుణ్యక్షేత్రం కూడా. కృష్ణునకు నిత్య నివాసం. అందుకే లక్ష్మికి అక్కడ వుండటం ఇష్టం. తీర్థప్రబంధం లోని మథురాపురీ వర్ణనలో ఈ శ్లోకంలోని నాలుగవ పాదం అలాగే కనిపిస్తుంది.

శ్లో॥ సేనా యత్ర విరక్తవైష్ణవజనా నామాయుధం శ్రీపతేః
కామాద్యైః సహితః కలిః కిల రిపుర్యత్రాన్వహం హన్యతే ।
ప్రాకారాది చ యత్ర తీర్థనిచయః కర్మాపి వర్మామలం
దద్యాత్సా మథురా పురీ శుభకరీ శ్రేయాంసి భూయాంసి నః ॥ -తీర్థప్రబంధం-2/31

2. కృష్ణ స్పర్శ కారణంగా జలస్థలాలు పవిత్రం కావటం. ఆ జలస్థలాల ఉనికి కారణంగా మథుర పవిత్రం కారణం శ్లోకంలోని విధేయాంశం. ఇది ఉదాత్తాలంకారం. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' - (కు. 162)

| | | | |
|---|---|---|---|
| 3. **దద్యాత్ :** | **దద్యాత్** | దద్యాతామ్ | దద్యుః |
| | దద్యాః | దద్యాతమ్ | దద్యాత |
| | దద్యామ్ | దద్యావ | దద్యామ. |

*

**శ్లో॥ జగత్పిత్రాఽథ పితరౌ మృదుభాషణపూర్వకమ్ ।**
**నతౌ న తౌ పుత్త్రబుద్ధిం చక్రతుశ్చక్రిణీశ్వరే ॥ 12-13**

**అ :** కృష్ణుడు తల్లిదండ్రులను కలిసి మాటాడటం. -పథ్యావక్త్రమ్.

**అ :** అథ జగత్-పిత్రా మృదు-భాషణ-పూర్వకం నతౌ తౌ పితరౌ ఈశ్వరే చక్రిణి పుత్త్ర-బుద్ధిం న చక్రతుః

**ప్ర :** అథ = అటు తర్వాత (కంససంహారం తర్వాత), జగత్-పిత్రా = లోకపిత అయిన కృష్ణునిచే (జగతః పితా తేన), మృదు-భాషణ-పూర్వకమ్ = సున్నితంగా ముందు మాటాడుతూ (మృదు చ తత్ భాషణం పూర్వకే భవతి యథా తథా), నతౌ = నమస్కరింప బడిన, తౌ పితరౌ = ఆ తల్లిదండ్రులు (మాతా చ పితా), ఈశ్వరే = జగత్ప్రభువైన, చక్రిణి = కృష్ణునియందు, పుత్త్ర-బుద్ధిమ్ = (తమ) కుమారు డనే ఆలోచనను (పుత్త్ర ఇతి బుద్ధిః తామ్), న చక్రతుః = చేయలేకపోయిరి. (కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర. ద్వి.)

**తా ॥** కృష్ణుడు తన తల్లిదండ్రులను కలిసికొని మృదువైన మాటలతో పలుకరించి నమస్కరించాడు. అయితే ఆ తల్లిదండ్రులు జగదీశ్వరుడైన అతని విషయంలో పుత్త్రభావాన్ని చూపలేకపోయారు. (పుత్త్రుని దగ్గరకు తీసికొన్నట్లుగా ప్రవర్తించలేక పోయారు.)

**వి :** 1. కృష్ణుడు హృషీకేశుడు. అనగా ఇంద్రియాలను అదుపులో నుంచుకొన్నవాడు. ఆ లెక్కన మనస్సు, మాటకూడా అదుపులో వుంటాయి. అందుకే మృదువుగా మాటాడగలడు. నవ్వుతూ మాటాడటం, మృదువుగా మాటాడటం సుహృద్భావాన్ని పెంపొందింపజేస్తాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **చక్రతుః :** | చకార | **చక్రతుః** | చక్రుః |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |

*

**శ్లో॥ విముచ్య నిగడాదీశః స్మితవక్త్రః ప్రియం వదన్ ।**
**కృతస్నేహోఽథ నిగడం మాయామయమయోజయత్ ॥ 12-14**

**అ :** కృష్ణుడు తల్లిదండ్రులను గొలుసులనుండి విడిపించి మోహనిగళాలతో బంధించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** ఈశః (పితరౌ) నిగడాత్ విముచ్య స్మితవక్త్రః (సన్) ప్రియం వదన్ కృత-స్నేహః (సన్) అథ మాయామయం నిగడమ్ అయోజయత్.

**ప్ర :** ఈశః = కృష్ణుడు (ఈష్టే ఇతి), (పితరౌ = తల్లిదండ్రులను), నిగడాత్ = గొలుసునుండి (నిగడః పాదబంధశ్చ-

హలాయుధకోశః–223), విముచ్య = విడిపించి, స్మిత–వక్త్రః సన్ = నగుమోముగలవాడై (స్మితం వక్త్రే యస్య సః ), ప్రియమ్ = ప్రీతిపూర్వకంగా, వదన్ = మాటాడుతూ (వద్ ధాతువుపై శతృ ప్రత్యయం), కృత–స్నేహః సన్ = స్నిగ్ధతను కల్గిస్తూ (కృతః స్నేహః యేన సః), మాయామయమ్ = మాయతో నిండిన (పుత్రమాయ), నిగడమ్ = గొలుసును, అయోజయత్ = కూర్చాడు. (యుజ సంయమనే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ။** కృష్ణుడు తల్లిదండ్రులను శృంఖలాల నుండి విడిపించి, నవ్వుతూ, ప్రీతిభావాన్ని ప్రదర్శిస్తూ, ముచ్చటగా మాటాడుతూ మళ్ళీ (పుత్రుడనే బంధాన్ని కల్గించి) మాయ అనే గొలుసులతో కట్టేశాడు.

**వి :** 1. కృష్ణుని ప్రియవచనాలే దేవకీవసుదేవులకు మోహాన్ని కల్గించాయి.

శ్లో॥ ఇతి **మాయామనుష్యస్య** హరేర్విశ్వాత్మనో గిరా ।
**మోహితా**వంకమారోప్య పరిష్వజ్యాపతుర్ముదమ్ ॥ – భాగవతమ్ 10/45/10

| | | | |
|---|---|---|---|
| 2. **అయోజయత్ :** | **అయోజయత్** | అయోజయతామ్ | అయోజయన్ |
| | అయోజయః | అయోజయతమ్ | అయోజయత |
| | అయోజయమ్ | అయోజయావ | అయోజయామ. * |

**శ్లో॥ అథ ధర్మపథాధ్యక్షో జగదే జగదేకరాట్ ।**
**వార్తయాఽహం భవత్పుత్రో యశ్చకార న వాం హితమ్ ॥ 12–15**

**అ :** తల్లిదండ్రులతో కృష్ణుని మాటలు. –పథ్యావక్త్రమ్.

**అ :** అథ ధర్మ–పథ+అధ్యక్షః జగద్–ఏక–రాట్ (కృష్ణః) జగదే యః వాం హితం న చకార (సః) అహం వార్తయా భవత్–పుత్రః.

**ప్ర :** అథ = అటు తర్వాత, ధర్మ–పథ–అధ్యక్షః : ధర్మ–పథ = ధర్మమార్గానికి, అధ్యక్షః = రక్షకుడు, జగద్–ఏక–రాట్ : జగద్ = ప్రపంచానికి, ఏకరాట్ = ఒకే ఒక ప్రభువు అయిన కృష్ణుడు, **జగదే** = అన్నాడు. (గదీ దేవశబ్దే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), యః = ఏ నేను, వామ్ = మీ ఇద్దరకూ, హితమ్ = (పుత్రుడుగా చేయవలసిన) హితాన్ని, న చకార = చేయలేదో (కృ కరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), (సః) అహమ్ = ఆ నేను, వార్తయా = మాటమాత్రంగా, భవత్–పుత్రః = మీ కొడుకును.

**తా ။** ఆపై ధర్మమార్గసంరక్షకుడూ, జగదేకపాలకుడు అయిన కృష్ణుడు 'నేను మీ కుమారుడుగా చేయవలసిన హితాన్ని (కర్తవ్యాన్ని) చేయలేదు కాబట్టి మాటమాత్రంగానే మీ కొడుకును' అన్నాడు.

**వి :** 1. తల్లిదండ్రులను అనునయిస్తూ అన్నమాటలు–

శా. కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపఁగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపఁగా రాక ని
ష్కారుణ్యాత్ములమైన క్రూరుల మహాకౌటిల్య సంచారులన్
సారాతిక్షములార! మమ్ముఁ గొఱఁతల్ సైరించి రక్షింపరే! – పోతనభాగవతము 10/1392

2. మనుష్యఋణాన్ని గురించీ, సమాజహితాన్ని గురించి విస్తృతంగా ఆలోచించే వ్యాసమహర్షి ఈ సందర్భంలో కృష్ణుని ద్వారా రెండు మాటలు సమాజం కోసం చెప్పించాడు.

శ్లో॥ సర్వార్థసంభవో దేహో జనితః పోషితో యతః ।
న తయోర్యాతి నిర్వేశం పిత్రోర్మర్త్యః శతాయుషా ॥

శ్లో॥ యస్తయోరాత్మజః కల్ప ఆత్మనా చ ధనేన చ ।
వృత్తిం న దద్యాత్తం ప్రేత్య స్వమాంసం ఖాదయంతి హి ॥

శ్లో॥ మాతరం పితరం వృద్ధం భార్యాం సాధ్వీం సుతం శిశుమ్ ।
గురుం విప్రం ప్రపన్నం చ కల్పోఽబిభ్రచ్ఛ్వసన్ మృతః ॥ –భాగవతమ్ 10/43/5-7

దీని అనువాదం : ... ...

తే. నిఖిలపురుషార్థహేతువై నెగడుచున్న – మేని కెవ్వార లాఢ్యులు మీరకారె
యా ఋణముఁదీర్ప నూఱేండ్ల కైనఁ జనదు.

క. చెల్లుబడి గలిగి యెవ్వఁడు – తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్
సెల్లింపఁ డట్టి కష్టుఁడు – ప్రల్లదుఁడా మీఁద నాత్మపలలాశి యగున్.

క. జననీజనకుల వృద్ధులఁ – దనయుల గురువిప్రసాధుదారాదుల నే
జనుఁడు ఘనుఁ డయ్యుఁ బ్రోవక – వనరును జీవన్మృతుండు వాఁడు ధరిత్రిన్.

–పోతనభాగవతము 10/1388-1389

| | | | |
|---|---|---|---|
| 2. **జగదే :** | **జగదే** | జగదాతే | జగదిరే |
| | జగదిషే | జగదాథే | జగదిధ్వే |
| | జగదే | జగదివహే | జగదిమహే |

గద-వ్యక్తాయాం వాచి ధాతువు పరస్మైపదం. గదీ దేవశబ్దే చురాది ధాతువు ఉభయపదం. కాబట్టి కొంత అర్థవిపరిణామంతో 'గదీ' ధాతువే ఇక్కడ ప్రయోగింపబడినట్లు భావించాలి. లేదా అన్ని ధాతువులు ఉభయ పదాలలోనూ వుంటాయని నిర్దేశిస్తున్న చాంద్రాది వ్యాకరణాలను బట్టి వీటిని సాధు రూపాలుగా భావించాలి.

**చకార :** 12-13వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సర్వం తాత! కృతం త్వయా యదుదితం ప్రీత్యాఽస్మదీయాన్వయే**
**తేనేదం తిలకీబభూవ హి కులం కీర్తిశ్చ మే విస్తృతా ।**
**యేనానేకఖలాన్ నిహత్య బలినం కంసం చ వంశద్రుహం**
**బన్ధగ్రన్థిరయం వ్యయోజి దయయా కిం కిం కృతం న త్వయా ॥ 12-16**

**అ :** వసుదేవుడు కృష్ణుని సమాధానపరచటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** తాత! త్వయా సర్వం కృతమ్. యద్ ప్రీత్యా అస్మదీయ+అన్వయే ఉదితం తేన ఇదం కులం తిలకీబభూవ హి. మే కీర్తిః చ విస్తృతా. యేన అనేక-ఖలాన్ నిహత్య వంశ-ద్రుహం బలినం కంసం చ నిహత్య దయయా అయం బంధ-గ్రన్థిః వ్యయోజి తేన త్వయా కిం కిం న కృతమ్.

**ప్ర :** తాత = నాయనా! (తాత శబ్దం పితృర్థకం. అయితే వాత్సల్యంలో తాత అని పిల్లలకు కూడా సంబోధన), త్వయా = నీచే, సర్వమ్ = అంతా, కృతమ్ = చేయబడింది (కృ ధాతువుపై క్త ప్రత్యయం), యత్ = ఎందువల్ల, ప్రీత్యా = ప్రేమతో, అస్మదీయ+అన్వయే = మా వంశంలో, ఉదితమ్ = జన్మించావో, తేన = దానితో, ఇదం కులమ్ = ఈ మా వంశం, తిలకీబభూవ = శ్రేష్ఠమైంది. (తిలక – భూ సత్తాయామ్-తిలక శబ్దంమీద '**కృభ్వస్తి యోగే సంపద్య కర్తరి చ్విః**' అని (అష్టాధ్యాయి-5-4-50 చ్వి ప్రత్యయం తిలకీభూ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.),

మే = నాయొక్క, కీర్తిః చ = యశస్సు కూడా, విస్తృతా (బభూవ) = విస్తరించింది. యేన త్వయా = ఏ నీ చేత, అనేక-ఖలాన్ = చాలా మంది దుర్మార్గులను (అనేకే చ తే ఖలాః తాన్), నిహత్య = చంపి, (ని-హన్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వంశ-ద్రుహమ్ = వంశానికి ద్రోహం చేసిన (వంశం ద్రుహ్యతీతి తమ్), బలినమ్ కంసం చ = బలవంతుడగు కంసుని కూడా, దయయా = దయతో, నిహత్య = చంపి, అయమ్ = ఈ, బన్ధ-గ్రన్థిః = ఈ గొలుసుల ముడి, వి+అయోజి = విడదీయబడింది. (అటువంటి), త్వయా = నీచేత, కిం కిం న కృతమ్ = ఏమేమి చేయబడలేదు?

**తా ॥** నాయనా! నువ్వు చేయవలసిన దంతా చేశావు. ప్రేమతో మా వంశంలో పుట్టటమే గొప్ప కార్యం. దానితో మావంశం (సాటివారిలో) శ్రేష్ఠమైంది. నా కీర్తి కూడా విస్తరించింది. దుర్మార్గులను ఎందరినో చంపటంతో పాటు వంశద్రోహి అయిన కంసుని కూడా చంపి మా బంధాల ముడిని విడగొట్టావు. నువ్వు చేయనిది ఏముంది?

**వి :** 1. కృష్ణుడు పుట్టిందే దుష్టశిక్షణకు, తద్వారా ధర్మరక్షణకు. శిశుపాల-దంతవక్త్ర సంహరణం అవతారపరమప్రయోజనం. దానికి ఇప్పుడు ప్రదర్శించిన దుష్టసంహరణం పూర్వరంగం మాత్రమే. అయినా వసుదేవుడు తమ కోసమే అదంతా చేశాడని భావించటం ఆయన మంచితనం.

2. **శ్లో॥ జీవతోర్వాక్యకరణాత్ ప్రత్యబ్దం భూరి భోజనాత్ ।**
**గయాయాం పిండదానాచ్చ త్రిభిః పుత్రస్య పుత్రతా ॥** అని స్మృతి వచనం.

తల్లిదండ్రులు జీవించి వున్నపుడు వారి మాట వినటం, ప్రతి సంవత్సరం శ్రాద్ధవిధి నిర్వహణ, గయలో పిండప్రదానం - ఇవి పుత్రుని విధులు. ఇది కలియుగానికి సంబంధించిన విధి. కృష్ణకథ ద్వాపరయుగంలోనిది.

| | | | |
|---|---|---|---|
| 3. **తిలకీ-బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ |
| **వ్యయోజి :** | **వ్యయోజి** | వ్యయోజిషాతామ్ | వ్యయోజిషత |
| | వ్యయోజిష్ఠాః | వ్యయోజిషాథామ్ | వ్యయోజిధ్వమ్ |
| | వ్యయోజి | వ్యయోజిష్వహి | వ్యయోజిష్మహి. |

*

**శ్లో॥ అమ్బా తం పరిరభ్య ఫుల్లకరసన్మాల్యేన తస్యార్చనం**
**నేత్రానన్దజలేన సిఞ్చనమురోజోద్యత్పయోధారయా ।**
**నైవేద్యం చ నివేద్య వీక్షణలసన్నీరాజనం శోభనం**
**భావిస్వీయవిముక్తికల్పలతికాబీజం నిజం నిర్మమే ॥ 12-17**

**అ :** దేవకి కృష్ణుని దగ్గరకు తీసికొని మాతృత్వాన్ని అనుభవిస్తూ సమర్చన చేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అంబా తం పరిరభ్య ఫుల్ల-కర-సత్+మాల్యేన తస్య అర్చనం, నేత్ర+ఆనంద-జలేన సించనమ్ ఉరః +జ+ఉద్యత్-పయః+ధారయా నైవేద్యం శోభనం వీక్షణ-లసత్-నీరాజనం చ నివేద్య భావి-స్వీయ-విముక్తి-కల్ప-లతికా-బీజం నిజం నిర్మమే.

**ప్ర :** అంబా = (కృష్ణుని) తల్లి అయిన దేవకి, తమ్ = ఆ కృష్ణుని, పరిరభ్య = కౌగిలించి, ఫుల్ల... మాల్యేన : ఫుల్ల = పులకించిన (లాక్షణికమైన అర్థం. అభిధేయార్థం 'వికసించిన') కర = చేతు లనే, సత్+మాల్యేన = మంచి మాలలతో (ఫుల్లౌ కరౌ ఏవ సచ్చ తత్ మాల్యం తేన), తస్య = ఆ కృష్ణునకు, అర్చనమ్ = పూజను (అర్చ పూజాయామ్ ధాతువుపై ల్యుట్ ప్రత్యయం), నేత్ర+ఆనంద-జలేన : నేత్ర = కళ్ళలోని, ఆనంద-జలేన =

ఆనందబాష్పాలతో (నేత్రయోః ఆనందేన జాతం జలం, తేన), సించనమ్ = అభిషేకాన్ని (సిచ్–క్షరణే ధాతువుపై ల్యుట్ ప్రత్యయం), ఉరః+జ+ఉద్యత్–పయః–ధారయా : ఉరోజ = రొమ్ముల నుండి, ఉద్యత్ = ఉబుకుతున్న, పయః–ధారయా = పాలధారతో (ఉరసి జాతౌ, తాభ్యాం ఉద్యతః పయసః ధారా, తయా), నైవేద్యమ్ = నైవేద్యాన్ని (పూజావసానంలో పరమాత్మకు సమర్పించే పక్వ+అపక్వ+ఆహార విశేషాలు), శోభనమ్ = అందమైన, వీక్షణ–లసత్–నీరాజనమ్ : వీక్షణ = చూపు లనే, లసత్ = ప్రకాశిస్తున్న, నీరాజనమ్ = హారతిని (వీక్షణమేవ లసత్ చ తత్ నీరాజనం, తత్), నివేద్య = నివేదించి (సమర్పించి), భావి... బీజమ్ : భావి = కలుగ బోయే, స్వీయ = తనదైన, విముక్తి = మోక్షమనే, కల్పలతికా = చిన్నకల్పలతయొక్క, బీజమ్ = గింజను, నిజమ్ = తనకు సంబంధించిన దానినిగా, నిర్మమే = చేసికొనెను. (నిర్ మా మానే–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** దేవకి (కృష్ణుని తల్లి) కృష్ణుని కౌగిలించుకొని పులకించిన తన చేతు లనే వికసించిన పూల మాలలతో అర్చనను, ఆనందబాష్పాలతో అభిషేకాన్ని, రొమ్ములనుండి ఉప్పొంగిన పాలతో నైవేద్యాన్ని, చూపులతో అందమైన నీరాజనాన్ని నివేదించి, భవిష్యత్తులో తనకు లభించబోయే మోక్షరూపమైన కల్పలతకు అవసరమైన గింజను అప్పుడే నాటుకొంది.

**వి :** 1. దేవకి శైశవంలో కృష్ణుని లాలించలేక పోయింది. ఇప్పుడు ఆ లాలనను, ఆత్మోద్ధారకుడు కాబట్టి అర్చననూ ఒకే పనిద్వారా సమర్పిస్తోంది. మాతృమూర్తి తన కర్తవ్యాన్ని తాను నిర్వహించటమే విముక్తికి సోపానం. అందుకే ఆమె విముక్తికి గింజను నాటుకొన్నదని కవి సంభావన. పూవు మరో పండును అందిస్తూ తాను రాలిపోవటమే మోక్షం, కర్తవ్యం ముగిసింది కాబట్టి. ప్రస్తుతం దేవకి కూడా అంతే. జగన్మోహనుడు, జగద్రక్షకుడు అయిన కృష్ణుని కన్న తోడనే ఆ తల్లికి మోక్షార్హత లభించినట్లే. తన ధర్మాన్ని తాను సరిగా నిర్వహించే ఏ తల్లికయినా అది మోక్షమార్గమే. దానికి తొలిమెట్టు జోలపాడి నిదురబుచ్చటం. చిన్నప్పుడు దేవకి పాడలేకపోయిన ఆ పాటను అన్నమయ్య ఎంత అందంగా పాడి కృష్ణుని నిదురబుచ్చాడో చూడండి–

**జో అచ్యుతానంద జోజో ముకుంద – లాలి పరమానంద రామగోవింద**

**నందు నింటను జేరి నయము మీఱంగ – చంద్రవదనలు నీకు సేవ చేయంగ**
**నందముగ వారిండ్ల నాడుచుండంగ – మందలకు దొంగ మా ముద్దురంగ జో॥...**
**అంగజుని గన్న మా యన్న ఇటు రారా – బంగారు గిన్నెలో పాలు పోసేరా**
**దొంగనీవని సతులు పొంగుచున్నారా – ముంగిట నాడరా మోహనాకార జో॥**

**హంగుగా తాళ్ళపాకన్నయ్య చాల – శృంగార రచనగా చెప్ప నీజోల**
**సంగతిగ సకల సంపదల నీవేళ – మంగళము తిరుపట్ల మదనగోపాల జో॥**

–తాళ్ళపాక అన్నమాచార్యుల కీర్తన.

ఇలా పాటలు పాడి పసివారిని నిదురబుచ్చుతూనే, తాను కూడా బడలికతో నిదురించే తల్లికి ముక్తి లేదనగలమా?

| | | | |
|---|---|---|---|
| 2. **నిర్మమే :** | **నిర్మమే** | నిర్మమాతే | నిర్మమిరే |
| | నిర్మమిషే | నిర్మమాథే | నిర్మమిధ్వే |
| | నిర్మమే | నిర్మమివహే | నిర్మమిమహే. |

*

**శ్లో॥ వ్రజే గృహస్థోచితరమ్యలీలాః – ప్రచక్రతుర్యౌ సమమజ్ఞనాభిః ।**
**అథోపనీతౌ విధినోపనీతౌ – సుతౌ వితేనే కిల శూరసూనుః ॥ 12–18**

**అ :** బలరామకృష్ణులను ఉపనీతులను చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అథ వ్రజే అంగనాభిః సమం యౌ గృహ-స్థ+ఉచిత-రమ్య-లీలాః ప్రచక్రతుః విధినా ఉపనీతౌ (తౌ) సుతౌ శూరసేనః విధినా ఉపనీతౌ వితేనే కిల.

**ప్ర :** అథ = ఆ తరువాత, వ్రజే = గోకులంలో, అంగనాభిః సమమ్ = గోపికలతో కూడి, యౌ = ఏ (బలరామ కృష్ణులు), గృహ-స్థ = గృహస్థాశ్రమంలోని వారికి, ఉచిత = తగినట్టి, రమ్య = మనోహరమైన, లీలాః = లీలలను (విలాసాలను), ప్రచక్రతుః = చేశారో (ప్ర+కృ కరణే పరస్మైపది-లిట్-ప్ర.ద్వి.), విధినా = దైవికంగా (అదృష్టం కొద్దీ), ఉపనీతౌ = దగ్గరకు చేర్చబడిన, తౌ సుతౌ = ఆ కొడుకులకు, శూరసూనుః = వసుదేవుడు (విధినా = యథా-శాస్త్రంగా), ఉపనీతౌ = ఉపనయనం చేయబడినవారినిగా, వితేనే కిల = చేశాడు గదా! (వి+తనూ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** బలరామకృష్ణులు గోకులంలో గృహస్థులకు తగిన విలాసాల నెన్నింటినో గోపికలతో కూడి ప్రదర్శించారు. వసుదేవుని అదృష్టం కొద్దీ ఆయన దగ్గరకు వచ్చారు. అప్పుడు వసుదేవుడు యథావిధిగా వారికి ఉపనయనవిధిని పూర్తిచేశాడు.

**వి :** 1. గోకులంలో గృహస్థోచితకృత్యాలు నిర్వహించిన వారిని మరల బ్రహ్మచర్యాశ్రమం లోనికి నడిపించటం విచిత్రం. ఇదంతా లోకం కోసం

శ్లో॥ ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్ ।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః ॥ - భగవద్గీత 3/24

తాను కర్తవ్యనిర్వహణ చేయకపోతే లోకానికే నష్టమని భగవత్ప్రతిపాదన. కాబట్టి లోకవినాశకమయిన భావనను కానీ, చేష్టను కానీ అవతారపురుషులనుండి ఆశించలేము గదా! ఉపనయనం విద్యాధ్యయనానికి పూర్వరంగం.

| | | | |
|---|---|---|---|
| 2. **వితేనే :** | **వితేనే** | వితానాతే | వితేనిరే |
| | వితేనిషే | వితేనాథే | వితేనిధ్వే |
| | వితేనే | వితేనివహే | వితేనిమహే. |

*

**శ్లో॥ మునయ ఉపయయుర్మహేక్షణోత్సుకాః(త్కాః)-ధృతనియమాః కిల సర్వతః సమేతాః ।**
**జనిమివ పరిహర్తుముత్తరత్ర - హ్యుపనయనాదినిదానమాప్తకామాః ॥ 12-19**

**అ :** కృష్ణుని ఉపనయనమహోత్సవానికి వచ్చిన మునిజనప్రస్తావన. -పుష్పితాగ్ర.

**అ :** ధృతనియమాః మహ+ఈక్షణ+ఉత్సుకాః(త్కాః), ఆప్త-కామాః మునయః ఉత్తరత్ర ఉపనయన+ఆది-నిదానం జనిం పరిహర్తుమ్+ఇవ సమేతాః సర్వతః హి ఉపయయుః కిల.

**ప్ర :** మహే... త్సుకాః (త్కాః) : మహ = ఉత్సవంయొక్క (మహ ఉద్ధవ ఉత్సవః - అమరకోశః - నాట్య - 38), ఈక్షణే = చూచుటయందు, ఉత్సుకాః (త్కాః) = ఉత్కంఠ గలవారూ (మహస్య దర్శనే ఉత్సుకాః), ధృత-నియమాః : ధృత = ధరింపబడిన, నియమాః = వ్రతాలు గలవారూ (నియమో వ్రతమస్త్రీ-- అమరకోశః-బ్రహ్మ-38) (ధృతాః నియమాః యైస్తే), ఆప్త-కామాః = తీరిన కోరికలు గలవారు అయిన (ఆప్తాః కామాః యేషాం తే), మునయః = ఋషులు, ఉత్తరత్ర = రాబోయే రోజులలో, ఉపనయన+ఆది-నిదానమ్ : ఉపనయన = ఒడుగు, ఆది = మొదలయిన కర్మలకు, నిదానమ్ = మూలకారణమైన (నిదానమపదానే స్యాత్థండనే మూలకారణే-వైజయన్తీ-నపుంసక-20), జనిమ్ = పుట్టుకను, పరిహర్తుమ్-ఇవ = తొలగించుకోడానికన్నట్లు,

సమేతాః సన్తః = కూడినవారై (గుంపులు గుంపులుగా), సర్వతః = అన్ని వైపులనుండి, ఉపయయుర్హి కిల = వచ్చిచేరారు గదా! (ఉప+యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని ఉపనయనమహోత్సవదర్శనాభిలాషులై వ్రతధారులూ, పూర్ణకాములూ అయిన మునులు భవిష్యత్తులో ఉపనయనాది కర్మకాండకు మూలకారణమైన పుట్టుక లేకుండా చేసికోవాలని గుంపులు గుంపులుగా అన్నివైపులనుండి వచ్చారు.

**వి :** 1. ప్రథమపాదం చివరలో '**ణోత్సుకాః**' అని ముద్రితపాఠం. అప్పుడు ఛందోభంగం (ఒక అక్షరం ఎక్కువ అవుతుంది. '**ఉత్కాః**' అన్నది పాఠాంతరం (అంతర్జాలంనుండి). ఛందస్సు కుదురుతుంది. కాబట్టి '**మహేక్షణోత్కాః**' అన్నదే సరి అయిన పాఠం.

2. కర్మభూమి భూలోకం మాత్రమే. మిగిలినవి సుఖదుఃఖాల భోగభూములు. ఇక్కడ చేసిన కర్మల ఫలితాలనే ఇక్కడే అనుభవించినవి పోగా మిగిలిన ఫలితాన్ని అనుభవించ వలసిన ప్రదేశాలు. కాబట్టి కర్మాసక్తుడు తిరిగి భూలోకంలో పుట్టుకనే కోరుకొంటాడు. మోక్షేచ్ఛ గలవాడు తదనుగుణమైన వాతావరణాన్ని ఇక్కడే కల్పించుకోవాలి కాబట్టి ఇక్కడనే పుట్టాలనుకొంటాడు. ముక్తి కావాలని కోరుకొన్న మునులంతా కర్మ లేక మోక్షం లేదన్న కృష్ణుని చూడటానికి రావటం విశేషం.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపయయుః :** | ఉపయయౌ | ఉపయయతుః | **ఉపయయుః** |
| | ఉపయయిథ/ఉపయయాథ | ఉపయయథుః | ఉపయయ |
| | ఉపయయౌ | ఉపయయివ | ఉపయయిమ. |

*

**శ్లో॥ వాద్యాని నేదుర్మునయశ్చ మన్త్రా-నుచ్చారయన్తః సహ వన్దివృన్దైః ।**
**బృన్దారకాణాం స్తుతయశ్చ రమ్య-గన్ధర్వగీతైః సహ నాకిలోకే ॥ 12-20**

**అ :** కృష్ణుని ఉపనయనోత్సవవైభవాన్ని వర్ణించటం. -ఇంద్రవజ్ర.

**అ :** వాద్యాని మంత్రాన్ ఉచ్చారయన్తః మునయః చ వంది-బృందైః సహ నేదుః నాకి-లోకే బృందారకాణాం స్తుతయః చ రమ్య-గంధర్వ-గీతైః సహ నేదుః.

**ప్ర :** వాద్యాని = మృదంగం మొదలయిన మ్రోయింపబడు సంగీత పరికరాలు, మంత్రాన్ = మంత్రాలను, ఉచ్చారయన్తః = పలుకుతున్న, మునయః+చ =మునులూ కూడా, వంది-బృందైః సహ = వైతాళికుల సమూహాలతో పాటు (వందినాం బృందాని, తైః), నేదుః = ధ్వనించాయి (నద అవ్యక్తే శబ్దే-పరస్మైపది-లిట్-ప్ర.బ.), నాకి-లోకే = దేవలోకంలో (నాకినాం లోకః, తస్మిన్), బృందారకాణామ్ = దేవతలయొక్క (బృందారకా దైవతాని - అమరకోశః-స్వర్గ-9), స్తుతయః చ = స్తోత్రాలు కూడా, రమ్య-గంధర్వ-గీతైః : రమ్య = మనోజ్ఞమైన, గంధర్వ-గీతైః = గంధర్వుల పాటలతో (రమ్యాణి చ తాని గంధర్వాణాం గీతాని, తైః), నేదుః = ధ్వనించాయి.

**తా ॥** అప్పుడు మంగళవాద్యాలు మ్రోగాయి. మంత్రోచ్చారణ చేస్తున్న మునుల ధ్వనులు వైతాళికుల గీతాలతో కలిసి శబ్దించాయి. దేవలోకంలో కూడా దేవతల స్తోత్రాలు గంధర్వ గీతాలతో కలిసి రమణీయంగా ధ్వనించాయి.

**వి :** 1. శ్లో॥ అథ శూరసుతో రాజన్ పుత్త్రయోః సమకారయత్ ।
పురోధసా బ్రాహ్మణైశ్చ యథావద్ద్విజసంస్కృతిమ్ ॥ - భాగవతమ్ 10/45/26

వసుదేవుడు బలరామకృష్ణులకు ద్విజసంస్కృతిని (ఉపనయనాన్ని) జరిపించాడు. ఉపనయనార్హత కలవారి కందరికీ అది ద్వితీయ జన్మ. యదువంశం క్షత్రియవంశం కాబట్టి '**ఏకాదశ ద్వాదశయోః క్షత్రియవైశ్యయోః**' - (గౌతమధర్మసూత్రాణి-1/12) అన్న సూత్రాన్నిబట్టి క్షత్రియులకు పదకొండవ సంవత్సరం ముగిసే లోపు ఉపనయనం

జరిపించాలి. అలా వీలుకాకపోతే చివరి హద్దు ఇరవైరెండవ సంవత్సరం. '**ద్వావింశతే రాజన్యస్య ద్వ్యధికాయా వైశ్యస్య**' (గౌతమధర్మసూత్రాణి - 1/14). అయితే ఈ వయోనియమాదులు ఈనాడు మనం చెప్పుకొంటున్నవి. అప్పటి వాటిలో కొన్ని తేడాలు వుండవచ్చు. స్వధర్మ మేదైనా యుగధర్మాన్ని అనుసరించి పోవలసినదే గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **నేదుః :** | ననాద | నేదతుః | **నేదుః** |
| | నేదిథ | నేదథుః | నేద |
| | ననాద/ననద | నేదివ | నేదిమ. |

*

**శ్లో॥ నార్యః సమస్తా నయనోత్సవం తం - రక్తాక్షతై రాగయుతా ముకున్దమ్ ।**
**అవాకిరంస్తత్పరిరమ్భణోత్కా - కుబ్జా దురన్తాం ధ్రువమాప చిన్తామ్ ॥ 21**

**అ :** ఉపనయనమహోత్సవ వర్ణనం, కుబ్జామనోవేదన.

**అ :** రాగ-యుతాః సమస్తాః నార్యః నయన+ఉత్సవం తం ముకున్దం రక్త+అక్షతైః అవాకిరన్. తత్-పరిరంభణ-ఉత్కా కుబ్జా ధ్రువం దురన్తాం చిన్తామ్ ఆప.

**ప్ర :** రాగ-యుతాః : రాగ = ప్రేమతో, యుతాః = కూడినవారైన (రాగేణ యుతాః), సమస్తాః నార్యః = స్త్రీలందరూ, నయన+ఉత్సవమ్ = కన్నులపండువైన, తమ్ = ఆ, ముకున్దమ్ = కృష్ణుని, రక్త+అక్షతైః = కుంకుమాక్షతలను, అవాకిరన్ = చల్లారు. తత్...త్కా : తత్ = ఆ కృష్ణునియొక్క, పరిరంభ = కౌగిలింతపై, ఉత్కా = ఆసక్తిగల (తస్య పరిరంభే ఉత్కా), కుబ్జా = త్రివక్ర, ధ్రువమ్ = నిశ్చితంగా, దురన్తామ్ = అంతులేని, చిన్తామ్ = చింతను, అవాప = పొందింది. (అవ+ఆప్ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అనురాగవతులయిన సమస్తకాంతలూ కన్నుల పండువుగా కనిపిస్తున్న కృష్ణునిపై రక్తాక్షతలు చల్లారు. కృష్ణుని కౌగిలించుకోవాలని ఉత్కంఠతో వున్న కుబ్జ మాత్రం అంతులేని ఆవేదనకు లోనైంది.

**వి :** 1. కుబ్జ తన త్రివక్రత్వాన్ని కృష్ణుడు పోగొట్టినప్పుడే కృష్ణుని తన నివాసానికి ఆహ్వానించింది.

పల్లవి : మాధవ మే రతిం దేహి -నాథ! నాథ!

అను పల్లవి : మధురాధరకన్యేయం మాననీయా త్వయా నూనమ్ ॥

చరణం : దీనజనదయాఘన దేవకీవరనందన మానినీమానభంజన మదన మదన।
మునిమనోనికేతన మోహతిమిరనిధన కనకమయపరిధానకలితాఖిలభువన॥

చరణం :న త్యజామి చేలాంచలం నాథ తవ సురతి మూలం అతినీలఘనసుందరం ఆనందలీలమ్।
సత్యమాశాసే గోపాలం సర్వకామాదిగుణజాలం భృత్యవర్గపరిపాలంబలభద్రానుజమపి బాలమ్ ॥

చరణం : తరణికోటికిరణతామసగుణనిర్హరణ తారకముక్తాభరణదాసపోషణ ।
దురితదుర్జనగణదోషరహితచరణ వరనారాయణతీర్థసన్తరణ నామరూపనిర్వహణ ॥

అంతగా ప్రార్థించినా కృష్ణుడు తరువాత వస్తానని చెప్పి ముందుకు పోయాడు. ఇక రాగలడో లేదో అని కుబ్జ ఆందోళన.

| | | | |
|---|---|---|---|
| 2. **అవాకిరన్ :** | అవాకిరత్ | అవాకిరతామ్ | **అవాకిరన్** |
| | అవాకిరః | అవాకిరతమ్ | అవాకిరత |
| | అవాకిరమ్ | అవాకిరవావ | అవాకిరమామ |

| | | | |
|---|---|---|---|
| **అవాప :** | **అవాప** | అవాపతుః | అవాపుః |
| | అవాపిథ | అవాపథుః | అవాప |
| | అవాప | అవాపివ | అవాపిమ |

3. ఛందస్సు – ఉపజాతి (1,2,4 పాదాలు ఇంద్రవజ్ర 3వ పాదం ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ అమ్బాయాః పితురఞ్చతామపి సతాం సత్ప్రేమదామోపమం**
**సమ్బద్ధం విశదం గలే త్రిగుణితం యజ్ఞోపవీతం తయోః ।**
**రేజే తద్విలసద్గుణైర్బహుగుణైరన్తర్గరిష్ఠం త్రయం**
**స్తోతృస్తవ్యతయా తదాశ్రయయుతం స్వచ్ఛం శ్రుతీనామివ ॥ 12–22**

**అ :** యజ్ఞోపవీతధారణతో బలరామకృష్ణులు విరాజిల్లిన తీరును వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అంబాయాః పితుః అంచతాం సతామ్ అపి సత్–ప్రేమ–దామ+ఉపమం తయోః గలే సంబద్ధం విశదం త్రిగుణితం యజ్ఞోపవీతం తద్–విలసద్–గుణైః బహుగుణైః అంతః+గరిష్టం స్తోతృస్తవ్యతయా తద్–ఆశ్రయ–యుతం స్వచ్ఛం శ్రుతీనాం త్రయమ్–ఇవ రేజే.

**ప్ర :** అంబాయాః= తల్లి యొక్కయు, పితుః = తండ్రి యొక్కయు, అంచతామ్ = పూజిస్తున్న (అంచ్ గతి పూజనయోః ధాతువుపై శతృప్రత్యయం), సతామ్–అపి = సజ్జనులయొక్కయు, సత్–ప్రేమ–దామ+ఉపమమ్ : సత్ = నిర్మలమైన, ప్రేమ–దామ = ప్రేమపాశాలతో, (దామ రజ్జౌ రాక్షసే చ –నానార్థమంజరీ–పంక్తి–975), ఉపమమ్ = పోలికగలదై, తయోః = ఆ బలరామకృష్ణులయొక్క, గళే = మెడలో, సమ్బద్ధమ్ = తగిలించబడినదీ, విశదమ్ = స్వచ్ఛమైనదీ, త్రి–గుణితమ్ = మూడు పోగులు గలదీ అయిన (త్రిభిః గుణితమ్), యజ్ఞోపవీతమ్ = జందెం, బహు–గుణైః : బహు = మూడు విధాలయిన (సత్త్వ రజస్తమో రూపంగా), గుణైః = గుణాలుగల (బహవశ్చ తే గుణాః, తైః), తద్–విలసద్–గుణైః : తద్ = ఆ కృష్ణునియొక్క, విలసద్ = ప్రకాశించే, గుణైః = గుణాలతో (సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ – తైత్తిరీయోపనిషత్తు ప్రతిపాదన) (తస్య విలసన్తః చ తే గుణాః, తైః), అంతర్గరిష్ఠమ్ = లోన దృఢంగా వున్నదీ, స్తోతృ–స్తవ్య తయా = స్తుతించేవారూ, స్తుతింపబడేవారు – ఈ లక్షణాలు గలిగి వుండటంతో స్తోత ఆదిశేష స్వరూపుడు కాబట్టి బలరాముడు – స్తుతింప బడేవాడు పరమాత్మ స్వరూపుడు కాబట్టి కృష్ణుడు) (స్తోతా చ స్తవ్యశ్చ స్తోతృస్తవ్యౌ తయో భావః స్తోతృస్తవ్యతా, తయా), తద్–ఆశ్రయ–యుతమ్ : తద్ = వారితో (బలరామకృష్ణులతో), ఆశ్రయ = ఆధారంగా, యుతమ్ = కూడినదీ (తౌ ఏవ ఆశ్రయౌ తాభ్యాం యుతమ్), స్వచ్ఛమ్ = నిర్మలమైనదీ అయిన, శ్రుతీనామ్ = వేదాలయొక్క, త్రయమ్ ఇవ = త్రయం లాగా (మూడింటి సమూహం లాగా–), రేజే = ప్రకాశించింది.

**తా ॥** ఆ బలరామకృష్ణుల మెడలలో వున్న యజ్ఞోపవీతం తల్లిదండ్రులయొక్క, తమను పూజిస్తున్న సజ్జనుల యొక్క, ప్రేమపాశంతో పోలికను పొంది నిర్మలంగా త్రిగుణాత్మకంగా (మూడుపోగులుగా) ప్రకాశిస్తోంది. అంతేగాదు సత్త్వరజస్తమోరూపంగా బహుగుణితమైన ఆ కృష్ణుని ఆశ్రయించిన గుణాలతో (పోవులతో) దృఢమై, స్తుతించేవాడైన బలరాముడు, స్తుతింపబడే తాను (కృష్ణుడు) ఆశ్రయమైన నిర్మలమైన వేదాల త్రయంలాగా ప్రకాశించింది.

**వి :** 1. ప్రాచీనుల దృష్టిలో ఋక్–యజుస్–సామవేదాలే వేదాలు. అథర్వవేదం వేదం కాదు. అందుకే వేదవిద్యను త్రయీ విద్య అనే వారు. తరువాత్తరువాత అథర్వవేదం కూడా వేదంగా పరిగణనను పొంది వ్యవహారంలోనికి వచ్చింది నాలుగవ వేదంగా.

2. యజ్ఞోపవీతంలో (బ్రహ్మచారికి) మూడు పోగులుంటాయి. అవి సత్త్వరజస్తమో గుణాలకు ప్రతీకలు. ఈ

మూడు పోగులను ఒకటిచేస్తూ ఒకముడి వుంటుంది. అది బ్రహ్మ (పరబ్రహ్మ) గ్రంథి. పరమాత్మయొక్క ఏకత్వాన్ని తెలియజేస్తుంది.

ఉపనయనం జరిగినప్పటినుండి మాత్రమే విహితకర్మలకు అధికారం లభిస్తుంది. శుభకర్మలైనా, అశుభకర్మలయినా యజ్ఞోపవీతాన్ని వేసుకొన్న తరువాత. విహితకర్మలు ఋణవిముక్తి కోసమే.

**'జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిః ఋణా వా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్య ఏష వా అనృణో యః॥'** – అని తైత్తిరీయ సంహిత చెప్తోంది. ఆ ఋణవిముక్తికి మొదటి అడుగు ఉపనయనం.

3. శ్లోకంలో యజ్ఞోపవీతానికి వేదత్రయంతో పోలిక. దానికి గుణశబ్దం (దారాలు–గుణాలు) అభంగంగానే రెండర్థాలనిస్తూ శ్లేషాలంకారానికి అవకాశమిచ్చింది. కాబట్టి శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకార మీ శ్లోకంలో కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 4. **రేజే :** | **రేజే** | రేజాతే | రేజిరే |
| | రేజిషే | రేజాథే | రేజిధ్వే |
| | రేజే | రేజివహే | రేజిమహే. |

*

**శ్లో॥లోకం విడమ్బయితుమేవ మిహోపనీతః – సత్యాం కరిష్యతి హరిర్మదపత్యవాఞ్ఛామ్।**
**ఇత్థం ప్రవిష్టహృదివాగ్నిరసౌ విశఙ్కో – జజ్వాల యజ్వవరమన్త్రహుతైర్హవిర్భిః ॥ 23**

**అ :** ఉపనయన సమయంలోని హోమాగ్నిజ్వాలను కవి అగ్నిహృదయంలోని ఆనందంగా సంభావించుట.
–వసంతతిలక.

**అ :** ఇహ లోకం విడంబయితుమ్ ఏవమ్ ఉపనీతః హరిః మద్–అపత్య–వాంఛాం సత్యాం కరిష్యతి ఇత్థం ప్రహృష్ట–హృద్ ఇవ విశంకః అసౌ అగ్నిః యజ్వ–వర–మంత్ర–హుతైః హవిర్భిః జజ్వాల.

**ప్ర :** ఇహ = ఈ భూలోకంలో, లోకమ్ = జనాన్ని (లోకస్తు భువనే జనే – అమరకోశః–నానార్థ–2), విడంబయితుమ్ ఏవమ్ = అనుకరించటానికై, ఉపనీతః = ఉపనయనం చేయించు కొన్న, హరిః = కృష్ణుడు, మద్–అపత్య–వాంఛామ్: మత్ = నాయొక్క, అపత్య = సంతానం–యొక్క, వాంఛామ్ = కోరికను (మమ అపత్యాని, తేషాం వాంఛా, తామ్), సత్యామ్ = వాస్తవంగా, కరిష్యతి = చేయగలడు. (కృ కరణే పరస్మైపది–ల్రుట్–ప్ర.ఏ.), ఇత్థమ్ = ఈ రీతిగా, ప్రహృష్ట–హృద్–ఇవ = ఆనందించిన మనస్సు గలవానివలె (ప్రహృష్టం హృత్ యస్య సః ఇవ), విశంకః సన్ = సందేహం లేనివాడై (విగతా శంకా యస్మిన్ సః), అసౌ = ఆ హోమాగ్ని, యజ్వ... హుతైః : యజ్వ–వర = పురోహితశ్రేష్ఠులయొక్క, మన్త్ర = మంత్రాలతో, హుతైః = హోమం జేయబడిన (యజ్వనాం వరాః, తేషాం మన్త్రైః హుతాః, తైః), హవిర్భిః = హవిస్సులతో, జజ్వాల = ఎగిశాడు. (జ్వల దీప్తౌ–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు భూలోకంలో అవతరించాడు కాబట్టి లోకమర్యాద ననుసరించి ఉపనయనం చేసికొంటున్నాడు. ఇక నా కుమారుల కోరికను వాస్తవం చేస్తాడని ఆనందించినట్లుగ అగ్ని ఏ కొంకూలేక పురోహితులు మంత్రపురస్సరంగా సమర్పించిన హవిస్సులతో వెలు గొందాడు.

**వి :** 1. అగ్ని కుమారులు 16000లు. వీళ్ళు కృష్ణుని భర్తగా పొందాలని తపస్సు చేసి స్త్రీ రూపాన్ని పొందారు. కృష్ణుడు నరకాసురుని సంహరించి అతని చెరలో వున్న పదహారువేలమంది కన్యలను పెండ్లాడటం భవిష్యత్తులో జరుగుతుంది కృష్ణుని జీవితంలో. అలా జరగబోతున్నందుకు అగ్ని ఆనందించి బాగా మండాడని కవి సంభావన.

శ్లో. కాశ్చిత్ తత్రాసన్ దేవగంధర్వకన్యా - స్తాసాం ప్రధానా త్వష్టుపుత్రీ కశేరుః ।
పుత్రా అగ్నేః పూర్వమాసంశ్చ తేऽథ - స్త్రీత్వప్రాప్త్యై చక్రురుగ్రం తపశ్చ ॥

శ్లో. భార్యాత్వార్థే వాసుదేవస్య యోషి-త్తనుం తాసామిచ్ఛతీనాం సమీరః ।
అదాద్ వరం తపసాऽऽరాధితః స - స్త్రీభూతాస్తే బదరీం సమ్ప్రజగ్ముః ॥

శ్లో. నారాయణం తత్ర శుశ్రూషమాణాః - ప్రాప్యాసరస్త్వం రాజకులేషు జాతాః ।
కాశ్చిత్ స్వర్గే తా నిశామ్యైవ కృష్ణం - వవ్రుః పతిం సర్వగుణాభిరామమ్ ॥

- మహాభారతతాత్పర్యనిర్ణయః 20/111-113

2. ప్రస్తుతం హోమాగ్ని జ్వలించటానికీ జరుగబోయే నరకాసురవధాసందర్భానికీ సంబంధం లేదు. అసలు ఆ కథ మనకు తెలుసు కానీ అగ్నికి అది అప్పటికి అవిదితమే. (విదితమే అయితే ప్రత్యేకించి ఆనందించవలసిన అవసరం లేదు. ఎటూ జరిగేదే కాబట్టి) కాబట్టి లేని సంబంధాన్ని వున్నట్లు కవి ఊహించి చెప్పినందువల్ల ఇది సంబంధాతిశయోక్త్య-లంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' - (కు. 36)

| | | | |
|---|---|---|---|
| 3. **కరిష్యతి :** | **కరిష్యతి** | కరిష్యతః | కరిష్యన్తి |
| | కరిష్యసి | కరిష్యథః | కరిష్యథ |
| | కరిష్యామి | కరిష్యావః | కరిష్యామః |
| **జజ్వాల :** | **జజ్వాల** | జజ్వలతుః | జజ్వలుః |
| | జజ్వలిథ | జజ్వలథుః | జజ్వల |
| | జజ్వాల/జజ్వల | జజ్వలివ | జజ్వలిమ. |

*

**శ్లో॥ఆచార్యః సకలవిదే పురాణపుంసే - గాయత్రీమనుమదిశన్మమేత్థమూహః ।**
**తద్వ్యాజాత్తవ గుణచిన్తకాయ మహ్యం - సద్బుద్ధిం దిశ దయయేత్యసౌ యయాచే ॥24**

**అ :** గురువు గర్గుడు కృష్ణునికి గాయత్రీమంత్రాన్ని ఉపదేశించటం. -ప్రహర్షిణి.

**అ :** ఆచార్యః సకల-విదే పురాణ-పుంసే గాయత్రీ-మనుమ్ అదిశత్. మమ ఇత్థమ్ ఊహః తద్-వ్యాజాత్ గుణ-చిన్తకాయ మహ్యం దయయా సద్-బుద్ధిం దిశ ఇతి అసౌ యయాచే.

**ప్ర :** ఆచార్యః = గురువైన గర్గుడు (ఆచినోతి శాస్త్రాణి ఇతి), సకల-విదే = అన్నీ తెలిసిన (సకలాన్ వేత్తి ఇతి - తస్మై), పురాణ-పుంసే = పురాణపురుషుడికి (పురాణశ్చ అసౌ పుమాన్, తస్మై), గాయత్రీ-మనుమ్ = గాయత్రీ మన్త్రాన్ని (గాయత్రీ ఇతి మనుః తమ్) (మనుః మన్త్రే-శబ్దార్థకల్పతరుః-పుట-1166), అదిశత్ = ఉపదేశించాడు. (దిశ అతిసర్జనే పరస్మైపది-లజ్-(ప్ర.ఏ.), మమ = నాకు, ఇత్థమ్ = ఈ రీతిగా, ఊహః = ఆలోచన, తద్-వ్యాజాత్ = ఉపదేశమనే నెపంతో (స చాసౌ వ్యాజః, తస్మాత్), అసౌ = ఆ గర్గుడు, తవ = నీయొక్క, గుణ-చిన్తకాయ = గుణాలను ధ్యానించే వానికి (గుణానాం చిన్తకః, తస్మై), మహ్యమ్ = నాకై, దయయా = కరుణతో, సద్బుద్ధిమ్ = మంచి బుద్ధిని, దిశ = ఇవ్వు (దిశ అతిసర్జనే పరస్మైపది-లోట్-మ.ఏ.), ఇతి = అని, యయాచే = అడిగాడు. (యాచ్ యాంచాయాం పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కులగురువయిన గర్గుడు సకలవిషయవేత్త పురాణపురుషుడూ అయిన కృష్ణునికి గాయత్రీమన్త్రాన్ని ఉపదేశించాడు. నాకిలా అనిపిస్తోంది. గాయత్రీమన్త్రోపదేశమనే సాకుతో నీ గుణాలను గురించి ధ్యానించే నాకు మంచిబుద్ధి నిమ్మని కృష్ణుని యాచించాడు గర్గుడు.

**వి :** 1. గాయత్రీ మంత్రం –

**ఓం భూర్భువ స్వః – తత్సవితుర్వరేణ్యం**
**భర్గో దేవస్య ధీ మహి – ధియో యో నః ప్రచోదయాత్**

మంత్రార్థప్రతిపాదకమైన శ్లోకం–

యో దేవస్సవితాస్మాకం – ధియో ధర్మాదిగోచరాః
ప్రేరయేత్తస్య యద్భర్గః – తద్వరేణ్యముపాస్మహే ॥

**భూః భువః** స్వః (సువః) అనే మూడింటికి వ్యాహృతులని పేరు. నాల్గవది మహః. మాహాచమస్యుడు దానిని ప్రతిపాదించి అదే బ్రహ్మమన్నాడు. "భూర్భువఃసువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః । తాసాముహస్మైతాం చతుర్థీమ్ । మాహాచమన్యః ప్రవేదయతే। మహ ఇతి । తద్బ్రహ్మ । స ఆత్మా । అంగాన్యన్యా దేవతాః" – (తైత్తిరీయోపనిషత్తు–1/5)

ఆ తరువాత 'యః నః ధియః ప్రచోదయాత్ సవితుః దేవస్య తత్ వరేణ్యం భర్గః ధీమహి' అని అర్థం. "ఏదయితే మా బుద్ధిని ప్రేరేపిస్తుందో ఆ సూర్యదేవుని శ్రేష్ఠమైన ఆ జ్యోతిని ధ్యానిస్తున్నాము"–

ఈ మంత్రాన్ని కృష్ణుని చెవిలో ఉపదేశించటం ద్వారా గర్గుడు కృష్ణుని ఉద్దేశించి ఈ ప్రార్థన చేసినట్లయింది గదా! కవి చేసినది ఆ ఊహనే. కవి దీనిని తన ఊహగా వాచా చెప్తున్నాడు కాబట్టి ఇది ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **అదిశత్ :** | **అదిశత్** | అదిశతామ్ | అదిశన్ |
| | అదిశః | అదిశతమ్ | అదిశత |
| | అదిశమ్ | అదిశావ | అదిశామ |
| **దిశ :** | దిశతు/దిశతాత్ | దిశతామ్ | దిశన్తు |
| | **దిశ**/దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ. |

*

**శ్లో॥ ఇతః పరం శ్రౌతపథస్థితోఽయం – న యాతి గోపాలకబాలలీలామ్ ।**
**ఇతీవ శౌరిః సహ దక్షిణాభి–ర్దదౌ ముదా గాః సుభగా మునిభ్యః ॥ 12–25**

**అ :** ఉపనయనోత్సవంలో మునులకు గోదానం. –ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రౌత–పథ–స్థితః (సన్) అయమ్ ఇతః పరం గో–పాలక–బాల–లీలాం న యాతి ఇతి+ఇవ శౌరిః దక్షిణాభిః సహ సుభగాః గాః ముదా మునిభ్యః దదౌ.

**ప్ర :** శ్రౌత–పథ–స్థితః : శ్రౌత = వేదవిహితమైన (శ్రుతౌ విహితం శ్రౌతమ్), పథ = మార్గమందు, స్థితః (సన్) = నిలిచినవాడై (శ్రౌతే పథే స్థితః), అయమ్ = ఈ కృష్ణుడు, ఇతః పరమ్ = ఇకపై, గో–పాలక–బాల–లీలామ్ : గోపాలక = గోవులను కాపాడే, బాల = బాలునియొక్క, లీలామ్ = లీలను (పద్ధతిని) (గోపాలకశ్చ అసౌ బాలః , తస్య లీలామ్), న యాతి = పాటించడు (యా ప్రాపణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.), ఇతి+ఇవ = అన్నట్లుగా, శౌరిః = వసుదేవుడు, దక్షిణాభిః సహ = దక్షిణలతో పాటు, సుభగాః = అందమైన/సొబగైన, గాః = ఆవులను, ముదా = ఆనందంతో, మునిభ్యః = మునులకు, దదౌ = ఇచ్చాడు. (దా దానే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఉపనీతుడైన కృష్ణుడు ఇక వేదం విధించిన బాటలో నడువబోతున్నాడని, గోపాల బాలుడుగా ఇక వుండడనీ భావించిన వసుదేవుడు అందమైన ఆవులను దక్షిణలతో పాటు మునులకు దానంగా ఇచ్చాడు.

**వి :** 1. త్రేతాగ్నులకు (గార్హపత్యం, ఆహవనీయం, దక్షిణాగ్ని) కూడా శ్రౌతమని పేరు. ఆ అగ్నులను రక్షించటాన్ని కూడా శ్రౌతమంటారు. (ఆంధ్రశబ్దరత్నాకరము-3/1956) ఉపనీతునకు వేదం విధించిన వాటిలో అగ్నికార్యం కూడా ఒకటి. నిప్పును వినియోగించటం వలన వచ్చే లాభాన్ని, నిప్పును తయారుచేసికోవటంలో వున్న కష్టాన్ని గ్రహించిన నాటినుండి మానవులు నిప్పును కాపాడుకోవటాన్ని ఒక బాధ్యతగా స్వీకరించి వుంటారు. అదే నిత్యాగ్నిహోతృత్వాన్ని విశిష్టధర్మంగా భావించటానికి కారణమై వుండవచ్చు.

ఉపనయనమంటేనే గురువు సమీపానికి కొనిపోవటం. గురుసన్నిధిలో విద్యాధ్యయనం చేసే వారు ఇక ఇక్కడున్న గోవులను మేపటం వంటివి అసాధ్యాలు. అందుకని ఆ సంభావన.

అది కవి సంభావన. గోదాన మన్నది ఇతర కార్యక్రమాలలోనూ వుంటుంది. ఇక్కడా వుంది. కానీ దానికి కారణంకాని దాన్ని కారణంగా కవి భావించినందువలన ఇది హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **యాతి :** | **యాతి** | యాతః | యాన్తి |
| | యాసి | యాథః | యాథ |
| | యామి | యావః | యామః |

**దదౌ :** 12-7వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యజ్ఞోపవీతోజ్జ్వలకణ్ఠదేశః - కృష్ణాజినశ్రీర్మునిసఙ్ఘమాన్యః ।**
**ప్రాణప్రణేతా ధృతతర్కముద్రో - ధ్యాయన్ మనుం వ్యాస ఇవాన్వశిక్షత్ ॥26**

**అ :** కృష్ణుడు ఉపనయనానంతరం గాయత్రిని జపించటం. -ఇంద్రవజ్ర.

**అ :** యజ్ఞ+ఉపవీత-ఉజ్జ్వల-కంఠ-దేశః కృష్ణ+అజిన-శ్రీః ముని-సంఘ-మాన్యః ప్రాణ-ప్రణేతా ధృత-తర్క-ముద్రః (కృష్ణః) ధ్యాయన్ వ్యాసః+ఇవ మనుమ్ అన్వశిక్షత్.

**ప్ర :** యజ్ఞో... దేశః : యజ్ఞ+ఉపవీత = జందెంతో, ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న, కంఠ-దేశః = మెడగలవాడూ (యజ్ఞోపవీతేన ఉజ్జ్వలః కంఠస్య దేశః యస్య సః), కృష్ణ+అజిన-శ్రీః = కృష్ణాజిన (జింకతోలు) శోభగలవాడూ (కృష్ణాజినేన శ్రీః యస్య సః), ముని-సంఘ-మాన్యః : ముని = మునులయొక్క, సంఘ = సముదాయంచేత, మాన్యః = గౌరవింపదగిన వాడూ (మునీనాం సంఘః, తేన మాన్యః), ప్రాణ-ప్రణేతా : ప్రాణ = గాలిని (ఉచ్ఛ్వాస నిఃశ్వాసాలను), ప్రణేతా = నడిపించువాడూ, ధృత-తర్క-ముద్రః : ధృత = ధరింపబడిన, తర్క = జ్ఞానంయొక్క, ('**తర్క చక్షుషా**' అన్న మహాభారత ప్రయోగాన్ని బట్టి (1-168-18) హలాయుధకోశం తర్కశబ్దానికి జ్ఞానార్థాన్ని సూచించింది-హలాయుధకోశః-327), ముద్రః = ముద్ర గలవాడూ అయిన కృష్ణుడు, ధ్యాయన్ = ధ్యానం చేస్తూ, వ్యాసః ఇవ = వ్యాసునివలె, మనుమ్ = మంత్రాన్ని, అను+అశిక్షత్ = అభ్యసించాడు. (జపించాడు) (అను+శిక్ష్ విద్యోపాదానే-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని మెడలో జందెముంది. అది ఉజ్జ్వలంగా ప్రకాశిస్తోంది. కృష్ణాజినాన్ని కట్టాడు కృష్ణుడు. ఆ శోభ కృష్ణునికి శోభ నిచ్చింది. ముని సమూహం కృష్ణుని గౌరవిస్తోంది. ప్రాణాయామాన్ని చేస్తూ కృష్ణుడు తర్క (జ్ఞాన)ముద్రను పట్టి కూర్చుంటున్నాడు. గాయత్రీ మంత్రాన్ని జపిస్తూ వ్యాసమహర్షిలా కనిపిస్తున్నాడు.

**వి :** 1. కృష్ణాజినాన్ని బ్రహ్మచారులకు విధించారు. కుమారసంభవంలో కాళిదాసు బ్రహ్మచారిగా వచ్చిన మహేశ్వరునిచేత కూడా జింక చర్మాన్నే ధరింపజేశాడు వస్తుతః మహేశ్వరుడు పులితోలు కట్టుకొనేవాడైనా-

శ్లో॥ అథా**జినాషాఢధరః** ప్రగల్భవా-గ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా ।
వివేశ కశ్చిజ్జటిలస్తపోవనం - శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా ॥

ఆధునికంగా అవి అలభ్యాలు, నిషిద్ధాలూ కూడా. అయితే పురాతనమైన వెక్కడైనా అందుబాటులో వుంటే ఒక్క చిన్న ముక్కను యజ్ఞోపవీతానికి ముడివేసి కట్టి కృష్ణాజినధారణను పూర్తి చేస్తున్నారు.

2. **తర్కముద్ర** – తర్క పదాన్ని జ్ఞానార్థంలో హలాయుధకోశం అందించింది. భారత ప్రయోగం ఆధారంగా – తర్కం జ్ఞానరూపమే అయి వుండాలని మనువు ధ్వనింపజేస్తాడీ క్రింది విధిలో–

శ్లో॥ అర్షం ధర్మోపదేశం చ వేదశాస్త్రావిరోధితామ్ ।
యస్తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః ॥ – మనుస్మృతి – 12/106

తర్కంతో ఋషులు చేసిన ధర్మోపదేశాన్ని వేదశాస్త్రాలకు విరోధం లేకుండా అనుసంధానం చేయగలవాడే ధర్మవేత్త. ఇక్కడ కూడా తర్కశబ్దం జ్ఞానార్థకమే.

తార్కికులు '**వ్యాప్యారోపేణ వ్యాపకారోపః తర్కః**' –అని తర్కశబ్దాన్ని నిర్వచిస్తారు. ఇది అయథార్థానుభవాల్లో ఒకటి.

3. ప్రాణప్రణయనం అంటే ప్రాణాయామం. ఉచ్ఛ్వాసనిఃశ్వాసాలను క్రమబద్ధం చేయటం. ఈ ప్రక్రియలో పూరకం, రేచకం, కుంభకం అని మూడు అవస్థలు. నిండుగా గాలి పీల్చటం పూరకం. పీల్చిన గాలిని కొంతసేపు అలాగే విడువకుండా నిలుపగలగటం కుంభకం. పూర్తిగా గాలిని వదలి వుండటం రేచకం.

| | | | |
|---|---|---|---|
| 4. **అశిక్షత్ :** | **అశిక్షత్** | అశిక్షతామ్ | అశిక్షన్ |
| | అశిక్షః | అశిక్షతమ్ | అశిక్షత |
| | అశిక్షమ్ | అశిక్షావ | అశిక్షామ |

**శిక్ష ధాతువు వస్తుతః అత్మనేపదం**. దానికి పరస్మైపదిత్వాన్ని విధించే సూత్రాలు కూడా లేవు. అన్ని ధాతువులూ ఉభయపదులే అన్న చాంద్రాదుల మతంమేర ఇక్కడ పరస్మైపదంగా దానిని ప్రయోగించినట్లు భావించాలి.*

**శ్లో॥ దినే దినేఽగ్నౌ సమిధో జుహావ – తథా శ్రుతీనాం జననీం జజాప ।**
**స్వకుక్షిపూర్తౌ న రతిర్హి కస్య – నిజానుభావస్మరణోత్సవే చ ॥ 12–27**

**అ :** కృష్ణుడు అగ్నికార్యాన్ని చేయటం, గాయత్రీ మంత్రాన్ని జపించటంలోని ఔచిత్యనిరూపణ.–ఉపేంద్రవజ్ర.

**అ :** (కృష్ణః) దినే దినే అగ్నౌ సమిధః జుహావ. తథా (దినే దినే) శ్రుతీనాం జననీం జజాప. హి స్వ–కుక్షి–పూర్తౌ కస్య న రతిః, నిజ+అనుభావ+స్మరణ+ఉత్సవే చ (కస్య న రతిః)

**ప్ర :** (కృష్ణః = కృష్ణుడు), దినే దినే = ప్రతిదినమూ, అగ్నౌ = అగ్నిహోత్రంలో, సమిధః = సమిధలను, జుహావ = హోమం చేశాడు. (హు దానాదనయోః (ప్రీణనే2పి) –పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తథా = అదే రీతిగా, శ్రుతీనామ్ = వేదాలయొక్క, జననీమ్ = తల్లిని (గాయత్రిని), జజాప = జపించాడు. (జప వ్యక్తాయాం వాచి–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), హి = యుక్తమే. స్వ–కుక్షి–పూర్తౌ:స్వ = తనయొక్క, కుక్షి = పొట్టయొక్క, పూర్తౌ = నింపు కొనుటయందు (స్వస్య కుక్షిః, తస్య పూర్తిః, తస్యామ్), కస్య = ఎవనికి, రతిః = కోరిక (రతిః, స్మరప్రియాయామిచ్ఛాయాం సురతే క్రీడరాగయోః – నానార్థమంజరీ–పుట–634), న = కలుగదు. నిజాను...వే : నిజ = తనయొక్క, అనుభావ = ప్రభావాన్ని (అనుభావః ప్రభావే చ సతాం చ మతినిశ్చయే–నానార్థమంజరీ పుట–1785), స్మరణ = తలచుకొనుట అను, ఉత్సవే = పండుగ మీద, చ = కూడా (కస్య రతిః న = ఎవరికి కోరిక ఉండదు)

**తా ॥** కృష్ణుడు ప్రతిదినమూ అగ్నికార్యాన్ని నిర్వహించాడు. వేదమాత అయిన గాయత్రిని జపించాడు. అది తగినదే. తన పొట్ట నింపుకోవాలని ఎవరికుండదు? తన గొప్పతనాన్ని స్మరించుకోవాలని, (తన మాహాత్మ్యాన్ని పొగిడించుకోవాలని) ఎవరికి కోరిక ఉండదు?

**వి :** 1. అథైనం విష్ణవే చరుం నిర్వపతి. **యజ్ఞో వై విష్ణుః** యజ్ఞ ఏవాన్తతః ప్రతితిష్ఠతి. సోఽత్ర జుహోతి. విష్ణవే స్వాహా, యజ్ఞాయ స్వాహా, ప్రతిష్ఠాయై స్వాహేతి–

అంటూ విష్ణువును యజ్ఞస్వరూపునిగా చెప్తుంది శ్రుతివచనం. కాబట్టి అగ్నికార్య నిర్వహణమంటే కుక్షిని నింపుకోవటమే.

ఇక్కడ మరొక అంశాన్ని కూడా గమనించాలి. వేదవిహితకర్మలనే ధర్మంగా భావిస్తాయి తర్కమీమాంసాశాస్త్రాలు. ఆ క్రమంలో ఆహారస్వీకారం కూడా అధర్మ మవుతుంది దానికి వేదవిధిలేదు కాబట్టి. మరి కుక్షిని నింపుకోవటమెలా? లౌకికంగా. అది అధర్మమే కదా ఎవరు చేసినా? అందువల్ల యజ్ఞశేషంగా స్వీకరిస్తే అప్పుడు ఆహారస్వీకారం అధర్మం కాదు. కాబట్టి లౌకికంగా పొట్టనిండాలన్నా (ఆకలి తీరాలన్నా) అగ్నికార్యం చేయనివాళ్ళూ, చేయటానికి విధిననుసరించి అర్హత లేనివాళ్ళూ అన్నం తింటే అధర్మమవుతుందా? కాదు. యజ్ఞస్వరూపం చాలా విస్తృతం. విధ్యుక్తధర్మాన్ని (కర్తవ్యాన్ని) సరిగా నిర్వహించే వారందరూ యజ్ఞం చేస్తున్నట్లే. ఆ పని చేయనివాళ్ళకు అన్నంతినే హక్కు అసలు వుందో లేదో వారైనా నిర్ణయించుకోగలగాలి. సామాజికశాస్త్రమైనా నిర్దేశించగలగాలి. హక్కులేని పనిచేస్తే అధర్మమే మరి.

2. శ్లో॥ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసంమితమ్ ।
**గాయత్రీ ఛందసాం మాతేదం** బ్రహ్మ జుషస్వ నః ॥ –మహానారాయణోపనిషత్తు–34/1

అని గాయత్రిని వేదమాతగా భావిస్తుంది ఆర్షసంస్కృతి. విశ్వస్వరూపుడు కృష్ణుడే అయినప్పుడు గాయత్రీజపం కూడా ఆత్మసంస్మరణోత్సవమే అవుతుంది. నిత్యచలనశీలతకు అది దోహదకారి అవుతుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **జుహావ :** | **జుహావ** | జుహువతుః | జుహువుః |
| | జుహువిథ/జుహోథ | జుహువథుః | జుహువ |
| | జుహావ/జుహవ | జుహువివ | జుహువిమ |
| **జజాప :** | **జజాప** | జేపతుః | జేపుః |
| | జజపిథ | జేపథుః | జేప |
| | జజాప/జజప | జేపివ | జేపిమ. |

*

**శ్లో॥ తం బ్రహ్మచర్యవ్రతధుర్యమార్యాః – సందృశ్య హృష్టాః పరమబ్ధిపుత్రీ ।**
**వక్షఃస్థలస్థా త్రపయాఽఽకులాఽఽసీ–దభ్యర్థ్యమానౌ చ దినేశవహ్నీ ॥ 12–28**

**అ :** కృష్ణ బ్రహ్మచర్యవ్రతపరిణామాలను కవి విశదీకరించటం. –ఇంద్రవజ్ర.

**అ :** ఆర్యాః బ్రహ్మచర్య–వ్రత–ధుర్యం తం సందృశ్య హృష్టాః. పరమ్ వక్షః–స్థల–స్థా అబ్ధి–పుత్రీ త్రపయా ఆకులా ఆసీత్. అభ్యర్థ్య–మానౌ దిన+ఈశ–వహ్నీ చ (ఆకులౌ ఆస్తామ్)

**ప్ర :** ఆర్యాః = పెద్దలు, బ్రహ్మ... ధుర్యమ్ : బ్రహ్మచర్య = బ్రహ్మచర్యమనే, వ్రత = వ్రతం యొక్క, ధుర్యమ్ = భారాన్ని మోస్తున్న (బ్రహ్మచర్యమితి వ్రతం, తస్య ధుర్యమ్), తమ్ = ఆ కృష్ణుని, సన్దృశ్య = చక్కగా చూసి (సమ్ దృశ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), హృష్టాః = ఆనందించారు. (హృష్ ధాతువుపై క్త ప్రత్యయం), పరమ్ = అయితే, వక్షః–స్థల–స్థా = గుండె పైనున్న (వక్షఃస్థలే తిష్ఠతి ఇతి), అబ్ధి–పుత్రీ = కడలి కూతురు (అబ్ధేః పుత్రీ) లక్ష్మి, త్రపయా = సిగ్గుతో, ఆకులా = కలవరపడినదిగా, ఆసీత్ = అయ్యింది. (అస భువి పరస్మైపది–లజ్–ప్ర.ఏ.), అభ్యర్థ్యమానౌ = అడుగబడుతున్న, దిన+ఈశ–వహ్నీ చ = సూర్యాగ్నులు కూడా (దినస్య ఈశః, స చ వహ్నిశ్చ), (ఆకులౌ ఆస్తామ్ = కలవరపడిరి)

**తా ॥** బ్రహ్మచర్యవ్రతభారాన్ని మోస్తున్న (ఆచరిస్తున్న) కృష్ణుని చూసి పెద్దలందరూ సంతోషించారు. కానీ కృష్ణుని వక్షఃస్థలంపైనున్న లక్ష్మి మాత్రం సిగ్గుపడింది. తమనే అభ్యర్థిస్తున్న కృష్ణుని చూసి సూర్యుడూ, అగ్నీ కూడా కలవరపడ్డారు.

**వి :** 1. బ్రహ్మచర్యవ్రతభారాన్ని అథర్వవేదసంహిత, సామవేదాంగమైన ఛాందోగ్యోపనిషత్తూ విరివిగా ప్రతిపాదించాయి. **అథర్వవేదసంహితలో** 11వ కాండంలోని 7వ సూక్తం (**బ్రహ్మచర్య సూక్తం**) బ్రహ్మచర్యాన్ని 27 మంత్రాలలో వర్ణించింది– మచ్చుకు...

శ్లో. బ్రహ్మచారీష్ణంశ్చరతి రోదసీ ఉభే – తస్మిన్ దేవాః సంమనస్యో భవన్తి ।
సదాధార పృథివీం దివం చ – స ఆచార్యం తపసా పిపర్తి ॥ 1 ... ...

శ్లో. పూర్వో జాతో బ్రహ్మణో బ్రహ్మచారీ – ధర్మం వసానస్తపసోదతిష్ఠత్ ।
తస్మాజ్జాతం బ్రాహ్మణం బ్రహ్మ జ్యేష్ఠం – దేవాశ్చ సర్వే అమృతేన సాకమ్ ॥ 5

1. బ్రహ్మచారి భూలోకాన్నీ, రోదసిని తనకు అనుకూలం చేసికొంటాడు. దేవగణాలు బ్రహ్మచారిలో సౌమనస్యంతో కూడి వసిస్తారు. ఇలా బ్రహ్మచారి భూలోక–ద్యులోకాలను తన తపస్సుతో ధరిస్తూ గురువును తృప్తి పరుస్తాడు.

5. బ్రాహ్మణుడయ్యే ముందు బ్రహ్మచారి అవుతాడు. ఊర్జస్వియై తపస్సుతో ఉన్నతిని పొందుతాడు. అప్పుడు బ్రాహ్మణుడవుతాడు. పరబ్రహ్మ సాన్నిధ్యాన్ని, దేవగణసాన్నిధ్యాన్ని పొందుతాడు.

2. **ఛాందోగ్యోపనిషత్తు** అష్టమాధ్యాయంలోని 5వ ఖండం బ్రహ్మచర్యవిశిష్టతను వినిపిస్తుంది.

అథ యద్యజ్ఞ ఇత్యాక్షతే బ్రహ్మచర్యమేవ...
యదిష్టమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ.... 1

అథ యత్సత్త్రాయణమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ...

యన్మౌనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ... 2

అథ యదనాశకాయనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ...
యదరణ్యాయనమిత్యాచక్షతే బ్రహ్మచర్యమేవ....

యజ్ఞం, ఇష్టం, సత్రాయణం, మౌనం, అనాశకాయనం, అరణ్యాయనం – ఈ పేర్లతో పిలుచుకొనే వన్నీ బ్రహ్మచర్యాలే. ఎందుకంటే బ్రహ్మచర్యం ద్వారా మాత్రమే వాటిని పొందటం కుదురుతుంది కాబట్టి.

3. బ్రహ్మచారి గుండెపై నిత్యనివాసముంటున్నందుకు లక్ష్మి సిగ్గుపడింది.

4. ఇక సూర్యుడు, అగ్ని ప్రతిపూట వాళ్లను అభ్యర్థిస్తూ సంధ్యోపాసన చేస్తుంటే మరి వాళ్ళు సిగ్గుపడాలి. 'చక్షోస్సూర్యోఽజాయత. ముఖాదింద్రశ్చాగ్నిశ్చ' –(పురుషసూక్తం) – అలా ఆయన కంటినుండి, ముఖంనుండి పుట్టిన తాము ఆయనచే ఉపాసింపబడటం సిగ్గుపడటానికి కారణం–

ప్రాతస్సంధ్యావందనంలో సూర్యోపస్థానం

ఓం మిత్రస్య చర్షణీధృతః శ్రవో దేవస్య సానసిం సత్యం చిత్ర శ్రవస్తమం మిత్రో జనాన్ యాతయతి ప్రజానన్ మిత్రో దాధార పృథివీముత ద్యాం మిత్రః కృష్టీరనిమిషాభిః చష్టే సత్యాయ హవ్యం ఘృతవద్విధేమ. ప్ర స మిత్ర మర్తో అస్తు ప్రయస్వాన్ యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన న హన్యతే న జీయతే త్వోతో నైనమగ్ంహో అశ్నోత్యంతితో న దూరాత్

అలాగే మాధ్యాహ్నికసంధ్యావందనంలో సూర్యోపస్థాపన చేస్తారు.

ఓం ఆ సత్యేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ ।
హిరణ్యయేన సవితా రథేనాదేవో యాతి భువనా విపశ్యన్ ॥

ఉద్వయం తమసస్పరి పశ్యంతో జ్యోతిరుత్తరమ్ ।
దేవం దేవత్రా సూర్యమగన్మ జ్యోతి రుత్తమమ్ ॥

ఉదుత్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః । దృశే విశ్వాయ సూర్యమ్ । చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్ మిత్రస్య వరుణస్యాగ్నేః । ఆప్రాద్యావా పృథివీ అంతరిక్షగ్‌మ్ సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్ । పశ్యేమ శరదశ్శతం జీవేమ శరదశ్శతం నందామ శరదశ్శతం మోదామ శరదశ్శతం భవామ శరదశ్శతగ్ం శృణవామ శరదశ్శతం ప్రబ్రవామ శరదశ్శతమజీవాస్యామ శరదశ్శతం జ్యోక్చ సూర్యం దృశే య ఉదగాన్మహతోఽ ర్ణవాద్విభ్రాజమానస్సరిదస్య మధ్యాత్సమావృషభో లోహితాక్ష–స్సూర్యో విపశ్చిన్మనసా పునాతు.

అగ్నికార్యంలో అగ్నిని ప్రార్థిస్తారు.

అగ్నయే సమిధమాహార్షం బృహతే జాతవేదసే । యథా త్వమగ్నే సమిధా సమిధ్యసే ఏవం మామాయుషా వర్చసా సన్యా మేధయా ప్రజయా పశుభిః బ్రహ్మవర్చసేన ధనేనాన్నాద్యేన సమేధిషీయ స్వాహా–

శ్లో॥ శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం బుద్ధిం శ్రియం బలమ్ ।
ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహి మే హవ్యవాహన ॥

**శ్రియం దేహి మే హవ్యవాహన ఓం నమ ఇతి.**

ఆ రీతిగా తమను కృష్ణుడు ప్రార్థిస్తుంటే సూర్యుడూ, అగ్నీ సిగ్గుపడవలసి వచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 5. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ గురోర్గృహం సర్వవిదగ్రగణ్యా – వుపేయతుస్తౌ సమిధః సమర్ప్య ।**
**భవాన్ భవారణ్యమిదం చిదగ్నా–వతః పరం నిర్దహతాదితీవ ॥ 12–29**

**అ :** బలరామకృష్ణులు గురుసన్నిధికి చేరుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** సర్వ–విద్–అగ్ర–గణ్యౌ తౌ ఈశ! భవాన్ ఇదం భవ+అరణ్యం అతః పరం చిద్+అగ్నౌ నిర్దహతాత్ ఇతి+ఇవ సమిధః సమర్ప్య గురోః గృహమ్ ఉపేయతుః

**ప్ర :** సర్వ...ణ్యౌ : సర్వ–విత్ = అన్నీ తెలిసినవారిలో, అగ్ర–గణ్యౌ = ముందుగా లెక్కింపబడగిన (సర్వం వేత్తి ఇతి సర్వవిత్ తేషామ్ అగ్రే గణ్యౌ), తౌ = ఆ ఇద్దరూ (బలరామ, కృష్ణులు), ఈశ = స్వామీ, భవాన్ = నీవు (గౌరవార్థంలో భవచ్ఛబ్ద ప్రయోగం), ఇదమ్ = ఈ, భవ+అరణ్యమ్ = సంసారమనే అడవిని (భవ ఇతి అరణ్యం తత్), అతః పరమ్ = మేము వచ్చిన తరువాత, చిద్+అగ్నౌ = జ్ఞానాగ్నిలో, నిర్దహతాత్ = బూడిద చేయుదువు గాక (నిర్–దహ భస్మీకరణే–పరస్మైపది–లోట్–ప్ర.ఏ. 'తు' ప్రత్యయానికి '**తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్**' (అష్టాధ్యాయి 7–1–35) సూత్రంతో తాతఙ్ ఆదేశం), ఇతి+ఇవ = అన్నట్లుగా, సమిధః = సమిధలు, సమర్ప్య = అర్పించి, గురోః = గురువు (సాందీపని) యొక్క, గృహమ్ = ఇంటికి, ఉపేయతుః = వెళ్ళారు. (ఉప–ఇ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ద్వి.)

**తా ॥** అన్నీ తెలిసిన వారిలో అగ్రగణ్యులయిన బలరామకృష్ణులు గురువు దగ్గరకు పోయి సమిధలను సమర్పించారు.

"తమరు జ్ఞానాగ్నితో సంసారారణ్యాన్ని భస్మీకరించాల"ని గురువు గారిని ప్రార్థిస్తున్నట్లుగా వుంది సమిధలను సమర్పించటం.

**వి :** 1. యజన, యాజన; అధ్యయన, అధ్యాపన; దాన, ప్రతిగ్రహాలు శ్రోత్రియులకు విధించిన ధర్మాలు. యజనం మొదటిది. యజనానికి అత్యావశ్యకమైనవి సమిధలు. గురువుల చెంత చేరి అధ్యయనం చేస్తున్నపుడు సమిధలు తెచ్చి ఇవ్వటం వంటి పనులు కూడా గురుసేవలో భాగాలే. బలరామకృష్ణులు ముందే వాటిని సమర్పించారు.

ఇక్కడ కవి గురువుకు సంబంధించిన సమాచారమేదీ ఇవ్వలేదు. మూలంలో ఆ వివరణ దొరుకుతుంది. గురువుపేరు సాందీపని. అవంతీపురం ఆయన నివాసం.

శ్లో. అథ గురుకులే వాసమిచ్ఛన్తావుపజగ్మతుః ।
కాశ్యం సాందీపనిం నామ హ్యవంతీపురవాసినమ్ ॥ – భాగవతమ్ 10/45/31

2. గురువుగారికి సమిధలను సమర్పించటానికి ఫలితం భవారణ్యదహనమని కవి ఉత్ప్రేక్షించినందువల్ల ఇది ఫలోత్ప్రేక్షాలంకారం.

సర్వవిదగ్రగణ్యే అన్న విశేషణం సాభిప్రాయం. సర్వవేత్తలలో అగ్రగణ్యులయిన వారు మరల గురుకులానికి చేరటమెందుకు? అంటే లోకమర్యాదను పాటించటానికన్న వస్తువు ధ్వనిస్తుంది. సాభిప్రాయవిశేషణప్రయోగం వలన ఇక్కడ పరికరాలంకారం. '**అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణే**' – (కు–62)

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపేయతుః :** | ఉపేయాయ | **ఉపేయతుః** | ఉపేయుః |
| | ఉపేయయిథ/ఉపేయిథ | ఉపేయథుః | ఉపేయ |
| | ఉపేయాయ/ఉపేయయ | ఉపేయివ | ఉపేయిమ. |
| **నిర్దహతాత్ :** | నిర్దహతు/నిర్దహతాత్ | నిర్దహతామ్ | నిర్దహన్తు |
| | నిర్దహ/నిర్దహతాత్ | నిర్దహతమ్ | నిర్దహత |
| | నిర్దహాని | నిర్దహావ | నిర్దహామ. |

*

**శ్లో॥ అథో చతుష్షష్టిదినైః స తావత్ – కలాః ప్రజగ్రాహ బలశ్చ ధీమాన్ ।**
**గురోస్తతోఽప్యల్పదినైర్యదాసాం – సకృత్ సముచ్చారణమప్యశక్యమ్ ॥12-30**

**అ :** బలరామకృష్ణుల కళాపరిగ్రహం అరవైనాలుగురోజుల్లోనే. అన్ని రోజులు పట్టడానికి కారణం.–ఉపేంద్రవజ్ర.

**అ :** యత్ తతః అపి అల్ప–దినైః ఆసాం సకృత్ సముచ్చారణమ్ అపి గురోః అశక్యమ్ అథో సః చతుః+షష్టి–దినైః తావత్ కలాః ప్రజగ్రాహ. ధీమాన్ బలః చ ప్రజగ్రాహ.

**ప్ర :** యత్ = ఏ కారణం చేత, తతః అపి = అంతకన్న, అల్ప–దినైః = తక్కువ రోజులలో (అల్పాని చ తాని దినాని, తైః), ఆసామ్ = ఆ కళలయొక్క, సకృత్ = ఒక్కమారు, సముచ్చారణమ్ అపి = పలుకుట కూడా, గురోః = గురువునకు, అశక్యమ్ = వీలుకాదో, అథో = అందువలన, సః = ఆ కృష్ణుడు, చతుః+షష్టి–దినైః = అరవైనాలుగు రోజులలో (చతుః షష్టిః చ తాని దినాని, తైః), తావత్ = అంతే సంఖ్యగల, కళాః = కళలను, ప్రజగ్రాహ = గ్రహించాడు. (ప్ర గ్రహ ఉపాదానే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ధీమాన్ = బుద్ధిమంతుడైన (ధీః అస్య అస్తీతి ధీమాన్ "**తదస్యాస్త్యస్మిన్నితి మతుప్**" (అష్టాధ్యాయి 5–2–94) సూత్రంతో మతుప్ ప్రత్యయం), బలః చ = బలరాముడు కూడా, ప్రజగ్రాహ = నేర్చుకొన్నాడు.

**తా ॥** కృష్ణుడు అరవైనాలుగు రోజులలో అరవైనాలుగు కళలను నేర్చుకొన్నాడు. అన్ని రోజులు అవసరమా కృష్ణునకు కూడా అంటే అంతకన్న తక్కువ రోజులలో ఆ కళలను ఒకసారైనా ఉచ్చరించటానికయినా గురువుగారికయినా వీలుకాదు కాబట్టి.

**వి :** 1. వారి అధ్యయన విశేషాలను వ్యాసమహర్షి వివరించిన తీరు–

శ్లో॥ ప్రోవాచ వేదానఖిలాన్ సాంగోపనిషదో గురుః ॥

శ్లో॥ సరహస్యం ధనుర్వేదం ధర్మాన్ న్యాయపథాంస్తథా ।
తథా చాన్వీక్షకీం విద్యాం రాజనీతిం చ షడ్విధామ్ ॥

శ్లో॥ సర్వం నరవరశ్రేష్ఠౌ సర్వవిద్యాప్రవర్తకౌ ।
సకృన్నిగదమాత్రేణ తౌ సంజగృహతుర్నృప ॥

శ్లో॥ అహోరాత్రైశ్చతుష్షష్ట్యా సంయత్తౌ తావతీః కలాః । – భాగవతమ్ 10/45/33-36

2. అరవైనాలుగు కళలూ అరవైనాలుగు రోజులూ ఇదంతా మనకు వింతగా కనిపించవచ్చు. కృష్ణపరమాత్మకు అది కరతలామలకం. అయితే సాధారణదృష్టితో చూసినా చదవటమంటే ఆయా విషయాల సారాంశాన్ని గ్రహించగలగటం. విష్ణుశర్మ రాజ–కుమారులను ఆరునెలలలో పండితులను చేస్తానని ప్రతిజ్ఞచేసి సాధించాడు. ప్రహ్లాదుడు హిరణ్యకశిపునితో కూడా ఇటువంటి అభిప్రాయాన్నే చెప్పాడు.

క. చదివించిరి నను గురువులు
చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రంబులు నేఁ
జదివినవి గలవు పెక్కులు
చదువులలో సారమెల్లఁ జదివితిఁ దండ్రీ. – పోతనభాగవతము – 7/166

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రజగ్రాహ :** | **ప్రజగ్రాహ** | ప్రజగృహతుః | ప్రజగృహుః |
| | ప్రజగ్రహిథ | ప్రజగృహథుః | ప్రజగృహ |
| | ప్రజగ్రాహ/ప్రజగ్రహ | ప్రజగృహివ | ప్రజగృహిమ. |

*

## శ్లో॥ గురుం తతోఽపృచ్ఛదుపాయనం దిశన్ – సుతం యయాచే విమలీకృతాన్వయః । ముహుర్మురారేః సదయావలోకనై – స్తమప్యవద్యాత్ పరిపాలయన్నివ ॥ 12-31

**అ :** కృష్ణుని అభ్యర్థన మేరకు సాందీపని తన మృతపుత్రుని గురుదక్షిణగా కోరుట. –వంశస్థం.

**అ :** తతః ఉపాయనం దిశన్ (కృష్ణః) గురుమ్ అపృచ్ఛత్. మురారేః ముహుః దయా+ అవలోకనైః విమలీకృత+అన్వయః తమ్ అపి అవద్యాత్ పరిపాలయన్ ఇవ సుతం యయాచే.

**ప్ర :** తతః = ఆ తరువాత, ఉపాయనమ్ = కానుకను (గురుదక్షిణను), దిశన్ = ఇవ్వబోతూ (దిశ ధాతువుపై శతృ ప్రత్యయం), గురుమ్ = గురువును (సాందీపనిని), అపృచ్ఛత్ = అడిగాడు. (ప్రచ్ఛ జ్ఞీప్సాయామ్ పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.), మురారేః = కృష్ణునియొక్క (మురస్య అరిః, తస్య), ముహుః = మాటిమాటికి, దయా+అవలోకనైః = జాలి (ని కురిపించే) చూపులతో, విమలీకృత+అన్వయః = పవిత్రమైన వంశం గలవాడై (విమలీకృతః అన్వయః యస్య సః), తమ్ అపి = మరణించిన కుమారుని కూడా, అవద్యాత్ = దోషంనుండి (అర్వాణ మణక మపసదమవమమవద్యం – హలాయుధకోశః–337), పరిపాలయన్+ఇవ = కాపాడుతున్నట్లుగా, సుతమ్ = కుమారుని, యయాచే = కోరాడు. (యాచ్ యాంచా–యామ్–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత కృష్ణుడు గురుదక్షిణను ఇవ్వజూపుతూ ఏం కావాలో అడిగాడు గురువును. కృష్ణుని కరుణాదృక్కులతో తనవంశాన్ని పవిత్రం చేసికొన్న గురువు (సాందీపని) ఆ చూపులతో; మరణించిన తన కొడుకును కూడా కాపాడుకుందామని తన కుమారుని గురుదక్షిణగా కోరాడు.

**వి :** 1. చనిపోయిన కొడుకు తిరిగి కావాలని కోరటం మరీ విలక్షణం. గురుదక్షిణ విషయంలో పూర్వగాథలు ఎన్నో విచిత్రంగా కనిపిస్తాయి. కౌత్సుడు తన గురువును ఒత్తిడి చేయగా ఆయన 14 విద్యలు చదివావు కాబట్టి 14 కోట్ల నాణేలు అడుగుతాడు. ఉత్తంకుడు (ఉదంకుడు) గురువు భార్య ఆదేశం మేరకు గురుదక్షిణగా పౌషుడనే రాజు భార్య కుండలాలను తెచ్చిస్తాడు తంటాలు పడి. గాలవుడు తన తండ్రి, గురువూ అయిన విశ్వామిత్రుని ఆదేశం మేరకు 800 గుఱ్ఱాలను – అన్నింటినీ ఒక చెవి నల్లగా వుండాలి– తెచ్చి గురుదక్షిణగా ఇవ్వటానికి చాలా శ్రమ పడవలసి వచ్చింది చాలా సంవత్సరాలపాటు. కౌరవ పాండవులు కూడా విద్యాభ్యాసం ముగిసిన తర్వాత ద్రుపదునిపై దాడిచేసి ద్రుపదుని బంధించి తీసుకొని వచ్చారు గురుదక్షిణగా, ద్రోణుని కోరిక మేరకు. అయితే వీటికన్నింటికన్న క్లిష్టతమమయినది మరణించిన వారిని తిరిగి తేగలగటం. కృష్ణుని వంటి శిష్యుడు కాబట్టి సాందీపని వంటి గురువు అడగ గలిగాడు. 'పరిపాలయన్నివ' అన్న ఉత్ప్రేక్ష సాందీపనికి కృష్ణునిపై కలిగిన నమ్మకాన్ని ధ్వనింపజేస్తుంది.

2. ఇంతగా గురుదక్షిణావ్యవహారం బలపడటానికి కారణం అది వేద (ఉపనిషద్) విధి కావటమే.

వేదమనూచ్యాచార్యోఽన్తేవాసినమనుశాస్తి. సత్యం వద ధర్మం చర స్వాధ్యాయాన్మా ప్రమదః ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః– తైత్తిరీయో–పనిషత్తు 1/11. అయితే ఈ వాక్యం కూడా గురువు చెప్పినదే కావటం విశేషం.

| | | | |
|---|---|---|---|
| 3. **యయాచే :** | యయాచే | యయాచాతే | యయాచిరే |
| | యయాచిషే | యయాచాథే | యయాచిధ్వే |
| | యయాచే | యయాచివహే | యయాచిమహే. |

*

**శ్లో॥ సుతం విజానన్నపి మృత్యునీతం – స శఙ్ఖదైత్యం వినిహన్తుకామః ।**
**సముద్రమాసాద్య నిహత్య రక్షో – లసద్యశఃసమ్మితమాప శఙ్ఖమ్ ॥ 12–32**

**అ :** కృష్ణుడు శంఖుని చంపి, శంఖునినుండి పాంచజన్యశంఖాన్ని పొందటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః సుతం మృత్యు–నీతం విజానన్ అపి శంఖ–దైత్యం వినిహన్తు–కామః (సన్) సముద్రమ్ ఆసాద్య రక్షః నిహత్య లసద్–యశః–సమ్మితం శంఖమ్ ఆప.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, సుతమ్ = (గురువుగారి) కొడుకును, మృత్యు–నీతమ్ = మృత్యు = మృత్యువుచేత, నీతమ్ = కొనిపోబడినవానినిగా (మృత్యునా నీతః, తమ్), విజానన్–అపి = తెలిసి కూడా (వి–జ్ఞా ధాతువుపై శతృ ప్రత్యయం), శంఖ–దైత్యమ్ = శంఖుడనబడు ఆ రాక్షసుని (శంఖ ఇతి దైత్యః తమ్), వినిహన్తు–కామః (సన్) = చంపగోరినవాడై (వినిహన్తుం కామః), సముద్రమ్ = కడలిని, ఆసాద్య = చేరి (పొంది), (ఆ–సద్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), రక్షః = రాక్షసుని (నిరృతో యాతు రక్షసీ – అమరకోశః–స్వర్గ–60), నిహత్య = చంపి (ని–హన్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), లసద్–యశః–సమ్మితమ్ : లసద్ = ప్రకాశిస్తున్న, యశః = కీర్తితో, సమ్మితమ్ = సమానమైన (లసతా యశసా సమ్మితః, తమ్) (సమ్మితమ్ తుల్యపరిమాణే–శబ్దార్థకల్పతరుః –1498), శంఖమ్ = శంఖాన్ని (శమయతి దుఃఖమితి), ఆప = పొందాడు. (ఆప్ వ్యాప్తౌ స్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** గురుకుమారుడు మరణించాడని తెలిసికూడా కృష్ణుడు శంఖుడనే ఆ రాక్షసుని చంపగోరి, సముద్రం దగ్గరకు చేరి, ఆ రాక్షసుని చంపి, ప్రకాశవంతమైన కీర్తితో సమానమైన శంఖాన్ని (పాంచజన్యాన్ని) పొందాడు.

**వి :** 1. శంఖరూపంలో వుండే ఆ రాక్షసుడి పేరు పంచజనుడు. అతని కారణంగానే గురుసుతుడు మరణించాడు ప్రభాసతీర్థంలో. పంచజనుడికి సంబంధించింది కాబట్టి అది పాంచజన్యమైంది.

2. 'యశస్సమ్మితమ్' అన్నచోట ఉపమాలంకారం. ఉపమావాచకంగా సమ్మితపదముంది కాబట్టి ఆర్థీ-ఉపమ.

3. **ఆప :** 12-21వ శ్లోక వ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ స పఞ్చజనదేహస్థాన్ ప్రాణాన్ నిష్కాస్య పఞ్చ చ ।**
**అపఞ్చజనమాతేనే సాకం తేన పయోనిధిమ్ ॥ 12-33**

**అ :** పంచజనునీ, సముద్రాన్నీ కూడా అపంచజనునిగా చేయటం. -పథ్యావక్త్రమ్.

**అ :** సః పంచజన-దేహ-స్థాన్ పంచ చ ప్రాణాన్ నిష్కాస్య తేన సాకం పయో-నిధిమ్ అపంచ-జనమ్ ఆతేనే.

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, పంచజన-దేహ-స్థాన్ : పంచజన = పంచజనుని యొక్క, దేహ-స్థాన్ = శరీరమందున్న (పంచజనస్య దేహే తిష్ఠంతీతి, తాన్), పంచ చ = అయిదింటినీ, ప్రాణాన్ = ప్రాణాలను, నిష్కాస్య = వెలుపలికి నెట్టి (నిస్-కాస్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తేన సాకమ్ = అతనితో పాటు, పయః+నిధిమ్ = సముద్రుని (పయసాం నిధిః తమ్), అపంచజనమ్ = పంచ జనరహితంగా (నాస్తి పంచజనః యస్మిన్ సః = సముద్రుడు; న సన్తి పంచజనాః (ప్రాణాః) యస్మిన్ సః = పంచజనుడు-రాక్షసుడు; తమ్), ఆతేనే = చేశాడు. (ఆ-తనూ విస్తారే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ కృష్ణుడు పంచజనుని శరీరంలోని పంచప్రాణాలనూ బయటకు నెట్టి ఆ దైత్యుని అపంచజనుణ్ణి (ప్రాణరహితుని) చేశాడు. అలాగే సముద్రంలో పంచజనుడు లేకుండా చేసి సముద్రుని కూడా అపంచజనుణ్ణి చేశాడు.

**వి :** 1. పంచజనులంటే పంచప్రాణాలు.

శ్లో॥హృది **ప్రాణః** గుదే౽**పానః సమానో** నాభి సంస్థితః ।
**ఉదానః** కంఠదేశస్థో **వ్యానస్సర్వశరీరగః** ॥ - ఇవి శరీరంలోని అయిదు ప్రాణాలూ, వాటి ఉనికి గల ప్రదేశాలూ.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆతేనే :** | **ఆతేనే** | ఆతేనాతే | ఆతేనిరే |
| | ఆతేనిషే | ఆతేనాథే | ఆతేనిధ్వే |
| | ఆతేనే | ఆతేనివహే | ఆతేనిమహే. |

*

**శ్లో॥యమాలయం ప్రాప్య స కమ్బుముద్ధృతం - విభుః ప్రదధ్మౌ రిపుదర్పహారిణమ్ ।**
**గురోః సుతం దేహి న చేదియం దశా - భవేత్ తవాపీతి నిదర్శయన్నివ ॥12-34**

**అ :** కృష్ణుని యముని నివాసానికి వెళ్ళి శంఖనాదం చేయటం. -వంశస్థమ్.

**అ :** విభుః సః యమ+ఆలయం ప్రాప్య 'గురోః సుతం దేహి. న చేద్ తవ అపి ఇయం దశా భవేత్' ఇతి నిదర్శయన్+ఇవ ఉద్ధృతం రిపు-దర్ప-హారిణం కంబుం ప్రదధ్మౌ.

**ప్ర :** విభుః = అంతటా వున్న (పత్యౌ సర్వగతే విభుః' నానార్థరత్నమాలా-పంక్తి-718) విష్వక్ భవతీతి విభుః), సః = ఆ కృష్ణుడు, యమ+ఆలయమ్ = యముని నివాసానికి (యమస్య ఆలయః, తమ్), ప్రాప్య = పొంది (ప్ర ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గురోః = (నా) గురువుయొక్క, సుతమ్ = కుమారుని, దేహి = ఇవ్వు. (దా దానే-పరస్మైపది-లోట్-మ.ఏ.), న చేద్ = లేకపోతే, తవ అపి = నీకు కూడా, ఇయమ్ = ఈ (ఇటువంటి), దశా = స్థితి, భవేత్ = కలుగుతుంది. (భూ సత్తాయాం పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), ఇతి = అని, నిదర్శయన్-ఇవ

= సూచిస్తున్నట్లుగా, ఉద్ధృతమ్ = ఎత్తిన, రిపు-దర్ప-హారిణమ్ : రిపు = శత్రువుయొక్క, దర్ప = గర్వాన్ని, అపహారిణమ్ = దొంగిలించే (రిపోః దర్పస్య అపహరణం శీలమ్ అస్య ఇతి, తమ్), కంబుమ్ = శంఖాన్ని (కామ్యతే ఇతి), ప్రదధ్మౌ = ఊదాడు. (ప్ర-ధ్మా శబ్దాగ్నిసంయోగయోః-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సర్వవ్యాపకుడైన కృష్ణుడు యమనిలయానికి వెళ్ళాడు. అక్కడ శత్రువుల పొగరణచే తన పాంచజన్యాన్ని ఎత్తి గట్టిగా ఊదాడు. అది 'నా గురువు కొడుకును ఇవ్వు. లేకపోతే నీకు కూడా ఇదే గతి పడుతుంద'ని యమునికి సూచన చేస్తున్నట్లుగా వుంది.

**వి :** 1. సముద్రంలో పడిపోయి గురుసుతుడు తిరిగి కనిపించలేదు కాబట్టి కృష్ణుడు ముందుగా సముద్రతీరానికి పోయి వరుణుని అడిగాడు. వరుణుడు 'శంఖరూపంలోనున్న పంచజనుడు చేసిన పని అది' అని చెప్పగానే కృష్ణుడు పంచజనుణ్ణి చంపాడు. అక్కడ ఆ శంఖంలో గురుకుమారుడు కనిపించకపోయే సరికి అందరికీ అంతకుడు యముడే కాబట్టి యమనిలయానికి వెళ్ళి యుద్ధసూచనగా శంఖ మూదాడు. అయితే శంఖధ్వని విని యముడు అనుకూలంగానే స్పందించాడు. ముందు కోపాన్ని వహించినా రామకృష్ణులను చూసి, భక్తి భావాన్నే ప్రదర్శించాడు-

శా. అస్మద్బాహుబలంబుఁగైకొనక శంఖారావమున్ మానసా
పస్మారంబుగ నెవ్వఁ డొక్కొ నగరప్రాంతంబునం జేసె? మ
ద్విస్మేరావహరోషపావకునిచే విధ్వస్తుఁడై వాఁడు దా
భస్మంబై చెడు నంచు నంతకుఁడు కోపప్రజ్వలన్మూర్తియై. -పోతనభాగవతము-10/1422

వచ్చి రామకృష్ణులను చూసి వాస్తవం గ్రహించి భక్తితో శుశ్రూష చేశాడు. (వాళ్ళ ఆదేశాలను వినగోరాడు.)

2. 'నిదర్శయన్నివ'- ఇది ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రదధ్మౌ :** | ప్రదధ్మౌ | పదధ్మతుః | ప్రదధ్ముః |
| | ప్రదధ్మిథ/ప్రదధ్మాథ | ప్రదధ్మథుః | ప్రదధ్మ |
| | ప్రదధ్మౌ | ప్రదధ్మివ | ప్రదధ్మిమ. |

*

**శ్లో॥ అముష్య లక్ష్మీశగురోః సుతస్య - ధ్రువం విముక్తిః కరసఙ్గతాఽభూత్ ।**
**త్వదాగమాత్ ప్రాగపి తం జిహాసుం - విభుస్త్వమాజ్ఞాపయసీశ! కిం మామ్ ॥35**

**అ :** కృష్ణునితో యముని విన్నపం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశ ! లక్ష్మీ+ఈశ-గురోః సుతస్య అముష్య విముక్తిః ధ్రువం కర-సంగతా అభూత్ త్వద్ ఆగమాత్ ప్రాక్ అపి తం జిహాసుం మాం విభుః త్వం కిమ్ ఆజ్ఞాపయసి?

**ప్ర :** ఈశ! = కృష్ణా! (ఈష్టే ఇతి ఈశః), లక్ష్మీ+ఈశ-గురోః : లక్ష్మీ+ఈశ = లక్ష్మీ వల్లభునియొక్క, గురోః = గురువుయొక్క (లక్ష్మ్యాః ఈశః తస్య గురుః తస్య), సుతస్య = కుమారుడైన, అముష్య = ఈ బాలునియొక్క, విముక్తిః = విమోచనం (వి ముచ్ ధాతువుపై క్తిన్ ప్రత్యయం), ధ్రువమ్ = నిశ్చితంగా, కర-సంగతా = చేత చిక్కినదిగా, అభూత్ = అయింది (అని) (భూ సత్తాయాం పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), త్వద్ = నీయొక్క, ఆగమాత్ = రాకకు, ప్రాక్ అపి = ముందుగానే, తమ్ = ఆ బాలుని, జిహాసుమ్ = విడుదల చేయగోరిన (హాతుమ్ ఇచ్ఛుః తమ్), మామ్ = నన్ను, విభుః = సర్వతోగతుడవైన, త్వమ్ = నీవు, కిమ్ ఆజ్ఞాపయసి? = ఆదేశించే అవసరమేముంది? (ఆ-జ్ఞప్ జ్ఞానజ్ఞాపన మరణతోషణనిశాననిశామనేషు-పరస్మైపది-లట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! నీవు లక్ష్మీవల్లభుడవు. నీ గురువుయొక్క కుమారుడైన ఈ బాలుడి విముక్తి తథ్యమని ముందే భావించి

ఈ బాలునికి విముక్తి కల్పించాలని నేను సిద్ధపడివున్నాను. విభుడవైన నీవు నన్ను ఆజ్ఞాపించే అవసరమేముంది?

వి : 1. **అభూత్ :** 12-11వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఆజ్ఞాపయసి :** | ఆజ్ఞాపయతి | ఆజ్ఞాపయతః | ఆజ్ఞాపయన్తి |
| | **ఆజ్ఞాపయసి** | ఆజ్ఞాపయథః | ఆజ్ఞాపయథ |
| | ఆజ్ఞాపయామి | ఆజ్ఞాపయావః | ఆజ్ఞాపయామః. |

*

**శ్లో॥ఇతీవ తత్త్యాగవిశఙ్కమానసో - యమః సమభ్యర్చ్య సుతం సమాఽదిశత్ ।**
**అలభ్యతద్దర్శనజాతసమ్భ్రమః - ప్రహృష్టరోమా ప్రణమన్ ముహుర్ముహుః ॥12-36**

అ : యముడు సాందీపని కుమారుని కృష్ణున కప్పగించుట. -వంశస్థమ్.

అ : ఇతి+ఇవ తత్-త్యాగ-విశంక-మానసః అలభ్య-తద్దర్శన-జాత-సంభ్రమః ప్రహృష్ట-రోమా ముహుః ముహుః ప్రణమన్ యమః సమభ్యర్చ్య సుతం సమాదిశత్.

ప్ర : ఇతి+ఇవ = అనే అభిప్రాయంతోనో అన్నట్లు, తత్-త్యాగ... మానసః : తత్ = ఆ సాందీపని కొడుకు యొక్క, త్యాగ = విముక్తియందు, విశంక = సందేహంలేని, మానసః = మనస్సుగలవాడూ (తస్య త్యాగః, తస్మిన్ విశంకం మానసం యస్య సః), అలభ్య... సంభ్రమః : అలభ్య = మామూలుగా దొరకని, తద్ = ఆ కృష్ణునియొక్క, దర్శన = దర్శనంచేత, జాత = కలిగిన, సంభ్రమః = తడబాటు గలవాడూ (అలభ్యం చ తస్య దర్శనం, తేన జాతః సంభ్రమః యస్మిన్ సః), ప్రహృష్ట-రోమా = నిక్కబొడుచుకొన్న వెంట్రుకలు గలవాడూ (ప్రహృష్టాని రోమాణి యస్య సః), ముహుర్ముహుః = మాటిమాటికీ, ప్రణమన్ = నమస్కరిస్తూ (ప్ర-నమ్ ధాతువుపై శతృ ప్రత్యయం), యమః = యముడు, సమ్-అభి-అర్చ్య = చక్కగా పూజించి, సుతమ్ = గురుపుత్రుని, సమ్-ఆ-అదిశత్ = ఇచ్చాడు (సమ్ ఆ+దిశ అతిసర్జనే పరస్మైపది లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** 'తానే మోక్షాన్ని కల్పించాలని సిద్ధమై వున్నప్పుడు ఇక కృష్ణుడు ఆజ్ఞాపించవలసిన అవసరమేముంది' అన్నట్లుగా ఆ గురుకుమారునికి విముక్తి కలిగించటంలో ఏవిధమైన అనుమానమూ లేని మనస్సుతో, సాధారణంగా దుర్లభమైన ఆ కృష్ణదర్శనంతో తడబడుతూ, రోమాంచంతో పదేపదే కృష్ణునకు నమస్కరిస్తూ, ఆ కృష్ణుని అర్చించి సాందీపని కొడుకును అందించాడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **సమాదిశత్ :** | **సమాదిశత్** | సమాదిశతామ్ | సమాదిశన్ |
| | సమాదిశః | సమాదిశతమ్ | సమాదిశత |
| | సమాదిశమ్ | సమాదిశావ | సమాదిశామ. |

*

**శ్లో॥సుతం సమానీయ తతోఽన్తకాన్తికాత్ - ప్రదాయ శౌరిర్గురవే స్వకాం పురీమ్ ।**
**ఉపేత్య పిత్రోరపి దక్షిణామివ - ప్రదర్శయామాస నిజం స్వవిగ్రహమ్ ॥ 12-37**

అ : గురుపుత్రుని తీసికొనివచ్చి కృష్ణుడు గురువు కప్పగించుట, తల్లిదండ్రులను సందర్శించుట. -వంశస్థమ్.

అ : శౌరిః తతః అన్తక+అన్తికాత్ సుతం సమానీయ గురవే ప్రదాయ స్వకాం పురీమ్ ఉపేత్య పిత్రోః అపి దక్షిణామ్+ఇవ నిజం స్వవిగ్రహం ప్రదర్శయామాస.

ప్ర : శౌరిః = కృష్ణుడు, తతః = ఆ తరువాత, అన్తక+అన్తికాత్ = యముని దగ్గరనుండి (అన్తకస్య అన్తికాత్), సుతమ్ = (గురు)పుత్రుని, సమానీయ = తీసికొని వచ్చి (సమ్+ఆ-నీ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గురవే = గురువునకు, ప్రదాయ = ఇచ్చి (ప్ర-దా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వకామ్ = తనయొక్క, పురీమ్ = నగరికి (మధురకు) ఉపేత్య = వచ్చి (ఉప+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పిత్రోః అపి = తల్లిదండ్రులకు కూడా (మాతా

చ పితా చ, తయోః), దక్షిణామ్ ఇవ = దక్షిణను అన్నట్లుగా, నిజమ్ = స్వాభావికమైన, స్వ-విగ్రహమ్ = తన రూపాన్ని, ప్రదర్శయామాస = చూపించాడు. (ప్ర-దృశ్-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆపై కృష్ణుడు యముని దగ్గరనుండి తన గురుపుత్రుని తీసికొనివచ్చి గురువుగారికిచ్చి తన మథురానగరానికి చేరి తల్లిదండ్రులకు కూడా పితృదక్షిణ నిస్తున్నట్లు స్వాభావికమయిన తన స్వరూపాన్ని ప్రదర్శించాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో కథాగమనం వేగంగా సాగింది. ఇది ఓజస్సు అనే అర్థగుణం. '**అర్థస్య ప్రౌఢిరోజః**' (కావ్యాలంకారసూత్రవృత్తి 3/2/2). ఈ ప్రౌఢి అయిదు రకాలు.

శ్లో॥ పదార్థే వాక్యరచనా వాక్యార్థే చ పదాభిధా ।
ప్రౌఢిర్వ్యాససమాసౌ చ సాభిప్రాయత్వమస్య చ ॥

1. పదార్థంలో వాక్యరచన 2. వాక్యార్థంలో పదరచన 3. విస్తరించటం 4. కుదించటం 5. సాభిప్రాయంగా చెప్పటం.

ప్రకృతశ్లోకంలో కుదింపు కనిపిస్తుంది.

2. బలరామకృష్ణుల విద్యాభ్యాసవిషయాన్ని అంతటిని ఒకే శ్లోకంలో వివరించి తానుకూడా ప్రౌఢిమను ప్రదర్శించాడు నారాయణభట్టతిరి.

శ్లో॥ గత్వా సాందీపనిమథ చతుష్షష్టిమాత్రైరహోభిః
సర్వజ్ఞస్త్వం సహ ముసలినా సర్వవిద్యాం గృహీత్వా ।
పుత్రం నష్టం యమనిలయనాదాహృతం దక్షిణార్థం
దత్వా తస్మై నిజపురమగా నాదయన్ పాంచజన్యమ్ ॥ - నారాయణీయమ్ 76/1

3. **ప్రదర్శయామాస :**

| | | |
|---|---|---|
| ప్రదర్శయామాస | ప్రదర్శయామాసతుః | ప్రదర్శయామాసుః |
| ప్రదర్శయామాసిథ | ప్రదర్శయామాసథుః | ప్రదర్శయామాస |
| ప్రదర్శయామాస | ప్రదర్శయామాసివ | ప్రదర్శయామాసిమ. |

*

**శ్లో॥ రాజధానీ జయతి సా భోజవృష్ణ్యన్ధకాశ్రితా ।**
**రాజరాజపదత్రాతా రాజా యత్ర రమాపతిః ॥ 12-38**

**అ :** మథురానగరవైభవ కీర్తనం. -పథ్యావక్త్రమ్.

**అ :** రాజరాజ-పద-త్రాతా రమాపతిః యత్ర రాజా భోజ-వృష్ణి-అంధక+ఆశ్రితా సా రాజధానీ జయతి.

**ప్ర :** రాజ... త్రాతా : రాజరాజ = కుబేరునియొక్క (రాజరాజో ధనాధిపః-అమరకోశః-స్వర్గ-68) (రాజ్ఞాం రాజా రాజరాజః), పద = స్థానంయొక్క, త్రాతా = రక్షకుడైన (రాజరాజస్య పదస్య త్రాతా), రమా-పతిః = కృష్ణుడు (రమాయాః పతిః), యత్ర = ఏ నగరిలో, రాజా = పాలకుడో, భోజ... శ్రితా : భోజ = భోజులు, వృష్ణి = వృష్ణులు, అంధక = అంధకులు - వీరిచే, ఆశ్రితా = ఆశ్రయింపబడిన (భోజైః వృష్ణిభిః అంధకైః చ ఆశ్రితా), సా = ఆ, రాజధానీ = రాజధాని (రాజ్యంలో పరిపాలనావ్యవస్థ కేంద్రీకృతమైన ప్రధాననగరం) (రాజానః ధీయన్తే అస్యామ్ ఇతి), జయతి = వర్ధిల్లుతోంది. (జి జయే పరస్మైపది-లట్- ప్ర.ఏ.)

**తా ॥** భోజులు, వృష్ణులు, అంధకులు యాదవులలోని అవాంతర భేదాలు. వారిచే ఆశ్రయింప బడిన ఆ రాజధాని-మథురానగరి - వర్ధిల్లుతోంది. ఎందుకంటే రాజరాజస్థానానికి కూడా రక్షకుడైన కృష్ణుడు (రమాపతి) అక్కడున్నాడు కాబట్టి.

**వి :** 1. కృష్ణుని మహత్త్వం రాజరాజపదత్రాత అంటూ వర్ణింపబడింది. అయితే అది మధురా వైభవానికి కారణమై మథురను ఉన్నతంగా చూపుతుంది. కాబట్టి ఇది ఉదాత్తాలంకారం. '**ఉదాత్తమృద్ధేశ్చరితం శ్లాఘ్యం చాన్యోపలక్షణమ్**' – (కు.162)

| | | | |
|---|---|---|---|
| 2. **జయతి :** | **జయతి** | జయతః | జయన్తి |
| | జయసి | జయథః | జయథ |
| | జయామి | జయావః | జయామః. |

*

**శ్లో॥ ఉగ్రసేనో విజయతే స్వర్గిభిర్గీతవైభవః ।**
**అగ్రేసరా యద్ధ్వజిన్యాముగ్రా రామాదయో ద్విషామ్ ॥ 12–39**

**అ :** ఉగ్రసేనుని సేనావైభవవర్ణనం – బలరామకృష్ణుల ఉనికి కారణం కావటం. –పథ్యావక్త్రమ్.

**అ :** యద్ధ్వజిన్యాం ద్విషామ్ ఉగ్రాః రామ+ఆదయః అగ్రేసరాః స్వర్గిభిః గీత–వైభవః (సః) ఉగ్రసేనః విజయతే.

**ప్ర :** యద్–ధ్వజిన్యామ్ : యద్ = ఎవనియొక్క, ధ్వజిన్యామ్ = సేనలో (ధ్వజినీ వాహినీ సేనా–అమరకోశః–క్షత్ర–78), (ధ్వజాః అస్యాం సన్తి ఇతి, తస్యామ్), ద్విషామ్ = శత్రువులకు, ఉగ్రాః = భీకరులైన, రామ+ఆదయః = బలరాముడు మొదలగు వారు (రామః ఆదౌ యేషాం తే), అగ్రే–సరాః = ముందు నడుస్తారో (అగ్రే సరన్తి ఇతి), స్వర్గిభిః = దేవతలచే, గీత–వైభవః = స్తుతింపబడిన వైభవం గల (గీతం వైభవం యస్య సః), ఉగ్రసేనః = ఉగ్రసేనుడు, విజయతే = వర్ధిల్లుతున్నాడు. (వి+జి జయే ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** ఉగ్రసేనుని సేనలో శత్రుభీకరులైన బలరామాదులు ముందు నడుస్తుంటారు. ఆయన వైభవాన్ని దేవతలు కూడా కీర్తిస్తుంటారు. అటువంటి ఉగ్రసేనుడు వర్ధిల్లుతున్నాడు.

**వి :** 1. అగ్రేసరః : అగ్రేసరతి – అగ్ర శబ్దమీద సప్తమీవిభక్తి లోపించదు. '**పురోఽగ్రతోఽగ్రేషు సర్తేః**' (అష్టాధ్యాయి 3–1–18) అనే సూత్రంతో సృధాతువుపై ట ప్రత్యయ విధితో పాటు అగ్ర శబ్దానికి ఏదంతత్వనిపాతనం కూడా వుంది. కాబట్టి **అగ్రేసరః** అని **రూపసిద్ధి**.

**జి ధాతువు వస్తుతః పరస్మైపది**. కానీ వి పూర్వకమైనప్పుడు '**వి పరాభ్యాం జేః**' (అష్టాధ్యాయి 1–3–19) అన్న సూత్రంతో ఆత్మనేపదిత్వం విధింపబడుతుంది.

2. ఇక్కడ కూడా బలరామాదుల వైభవం ఉగ్రసేనుని వైభవానికి ఉపలక్షకమవుతోంది కాబట్టి ముందటి శ్లోకంలో లాగా ఉదాత్తాలంకారమే.

| | | | |
|---|---|---|---|
| 3. **విజయతే :** | **విజయతే** | విజయేతే | విజయన్తే |
| | విజయసే | విజయేథే | విజయధ్వే |
| | విజయే | విజయావహే | విజయామహే. |

*

**శ్లో॥ హృదయజ్ఞా రాజనీతేః సభాయాం శార్ఙ్గధన్వనః ।**
**మన్త్రిణో మన్త్రతన్త్రజ్ఞా మన్త్రయన్తీత్థమన్వహమ్ ॥ 12–40**

**అ :** కవి ఉగ్రసేనుని దగ్గరున్న మంత్రులనూ, వారి మంత్రాంగాన్ని గూర్చి వివరించటం. –పథ్యావక్త్రమ్.

**అ :** రాజ–నీతేః హృదయ–జ్ఞాః మంత్ర–తంత్ర–జ్ఞాః మంత్రిణః శార్ఙ్గధన్వనః సభాయామ్ ఇత్థమ్ అన్వహం మన్త్రయన్తి.

**ప్ర :** రాజ–నీతేః = రాజనీతియొక్క (రాజ్ఞాం నీతిః, తస్యాః), హృదయ+జ్ఞాః = రహస్యమెరిగిన వారూ (హృదయం జానన్తి ఇతి), మంత్ర–తంత్ర–జ్ఞాః : మంత్ర = మంత్రాంగమూ, తంత్ర = ఉపాయాలూ, జ్ఞాః = తెలిసినవారూ (మంత్రాన్ తంత్రాణి చ జానన్తి ఇతి) అయిన, మన్త్రిణః = మంత్రులు, శార్ఙ్గధన్వనః = కృష్ణునియొక్క, సభాయామ్

= కొలువులో, ఇత్థమ్ = ఈ (చెప్పబోవు) రీతిగా, అన్వహమ్ = ప్రతిరోజూ, మన్త్రయన్తి = ఆలోచిస్తుంటారు. (మన్త్ర గుప్తపరిభాషణే-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని కొలువులోని మంత్రులు రాజనీతి మర్మాలు తెలిసినవారు. మంత్రతంత్రాలలో నిష్ణాతులు. ప్రతిదినమూ ఇలా (చెప్పబోయేరీతిగా) ఆలోచనలు చేస్తూనే వుంటారు.

**వి :** 1. **మంత్రణ** మంటే షడ్గుణ విచారం - సంధి, విగ్రహం, యానం, ఆసనం, ద్వైధం, ఆశ్రయం - ఈ ఆరు మంత్రాంగంలోని అంశాలు.

సామం, దానం, భేదం, దండం ఈ నాలుగు ఉపాయాలు తంత్రాలు.

మిత్రలాభం, మిత్రభేదం, సంధివిగ్రహం, లబ్ధనాశం, సంప్రేక్ష్యకారిత్వం - ఈ అయిదింటినీ పంచతంత్రాలుగా **పంచతంత్రగ్రంథం** (విష్ణుశర్మ) ప్రతిపాదించింది.

ఈ మంత్రతంత్రాలు రాజనీతికి సంబంధించినవి మాత్రమే. ఉపాసనలకు సంబంధించిన తంత్రాలు వేరే వుంటాయి.

2. రాజనీతిని నీతిశాస్త్రమని కూడా వ్యవహరిస్తారు. నీతి, రాజనీతి రెండూ సత్ప్రయోజనాన్ని ఆకాంక్షించి నడుచుకొనే రీతులే. కాకపోతే రాజనీతి ఒక్కొక్కసారి సాధారణ నీతికన్న భిన్నంగా వుంటుంది. స్వరాజ్య, స్వప్రజాక్షేమం దృష్ట్యా రాజులు ఎన్నుకొనే మార్గమది.

| | | | |
|---|---|---|---|
| 3. **మంత్రయన్తి :** | మంత్రయతి | మంత్రయతః | **మంత్రయన్తి** |
| | మంత్రయసి | మంత్రయథః | మంత్రయథ |
| | మంత్రయామి | మంత్రయావః | మంత్రయామః. |

*

**శ్లో॥ రణే యదాజ్ఞాశరశఙ్కిచిత్తా - భటాః పరావృత్య న లక్షయన్తి ।**
**జయాఙ్గనాం వా దివిజాఙ్గనాం వా - స్పృశన్తి రాజా విజయీ స ఏవ ॥12-41**

**అ :** మథురానగర రక్షకులయిన రాజు, ఆయన సేనల నిబద్ధతను వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** యద్-ఆజ్ఞా-శర-శంకి-చిత్తాః భటాః రణే పరావృత్య న లక్షయన్తి, జయ+అంగనాం వా దివిజ+అంగనాం వా స్పృశన్తి సః రాజా ఏవ విజయీ (భవతి)

**ప్ర :** యదా... చిత్తాః : యద్ = ఏ రాజుయొక్క, ఆజ్ఞా-శర = ఆదేశమనే బాణాన్ని, శంకి = సంశయించే, చిత్తాః = మనస్సు గలవారై (యస్య ఆజ్ఞా ఏవ శరః, తం శంకత ఇతి, తచ్చ తత్ చిత్తం యేషాం తే), భటాః = సైనికులు, రణే = యుద్ధమందు, పరావృత్య = వెనుదిరిగి (పర+ఆ-వృత్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), న లక్షయన్తి = చూడరో (లక్ష్ దర్శనాంకనయోః-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.బ.), జయ+అంగనాం వా = జయకాంతనో, దివిజ+అంగనాం వా = దేవతా కాంతనో, స్పృశన్తి = తాకుతారో (స్పశ్ బాధన స్పర్శనయోః-భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.బ.), సః =ఆ (అటువంటి), రాజా ఏవ = రాజే, విజయీ = గెలువగలవాడు (భవతి = అవుతాడు.)

**తా ॥** అక్కడి రాజభటులకు రాజుగారి ఆదేశమే శరాఘాతం లాంటిది. యుద్ధంలో వెనుదిరిగి చూస్తే ఆజ్ఞామాత్రంతో తలను తెగనరుకుతారేమో అని వెనుదిరిగి చూడరు. జయకాంతనో, (గెలిచి) దేవతాకాంతనో (మరణించి) తాకే దాకా ఆగరు. అటువంటి భటులున్న రాజే జయశీలుడు కాగలడు.

**వి :** 1. భవిష్యత్తులో కృష్ణుడు అర్జునుడికి ఈ సిద్ధాంతాన్నే చెప్పబోతున్నాడు. అర్జునుడు యుద్ధభూమిలో కలవరపాటుకు గురి అయినప్పుడు-

శ్లో. హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః ॥ – భగవద్గీత 2/37

2. '**ఉత్సాహప్రభుమంత్రశక్తియుతమై**' – అంటూ హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని ప్రశ్నిస్తాడు. (పోతన భాగవతము 7/139) ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి – ఈ మూడింటిని ప్రస్తావించాడిక్కడ కవి. ప్రకృతశ్లోకంలో ప్రభుశక్తి కనిపిస్తుంది. రాజంటే సైనికులకు అంత భయముండాలి. రాజశాసనాన్ని వేదశాసనంలాగా సైనికులు భావించగలగాలి.

| | | | |
|---|---|---|---|
| 3. **లక్షయన్తి :** | లక్షయతి | లక్షయతః | **లక్షయన్తి** |
| | లక్షయసి | లక్షయథః | లక్షయథ |
| | లక్షయామి | లక్షయావః | లక్షయామః |
| **స్పృశన్తి :** | స్పృశతి | స్పృశతః | **స్పృశన్తి** |
| | స్పృశసి | స్పృశథః | స్పృశథ |
| | స్పృశామి | స్పృశావః | స్పృశామః. |

*

**శ్లో॥చారేణ యో వేత్తి రిపోర్విచారం – సదా రణోపస్కరణం యునక్తి ।**
**అగమ్య భూమిః పరిఖాదినాఽన్యైః – స ఏవ రాజా విజయీ న చాన్యః ॥ 12–42**

**అ :** విజయశీలుడైన రాజున కవసరమైన ఉపకరణ ప్రస్తావన. –ఇంద్రవజ్ర.

**అ :** యః చారేణ రిపోః విచారం వేత్తి; యః సదా రణ+ఉపస్కరణమ్ యునక్తి యః పరిఖా+ఆదినా అన్యైః అగమ్య–భూమిః సః ఏవ రాజా విజయీ అన్యః (విజయీ) న చ.

**ప్ర :** యః = ఏ రాజు, చారేణ = గూఢచారుల ద్వారా, రిపోః = శత్రువుయొక్క, విచారమ్ = ఆలోచనను (మంత్రాంగాన్ని), వేత్తి = తెలిసికొంటాడో (విద జ్ఞానే అదాది–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), (యః = ఏ రాజు), సదా = ఎల్లప్పుడు, రణ+ఉపస్కరణమ్ : రణ = యుద్ధసంబంధం గల, ఉపస్కరణమ్ = సామగ్రిని (వేషవార ఉపస్కరః – హలాయుధకోశః–321) ("**సమవాయే చ**" (అష్టాధ్యాయి 6–1–138) సూత్రంతో ఉప–కరణమ్ అన్నచోట కృ ధాతువుకు సుడాగమం–ఉపస్కరణమ్") (రణస్య ఉపస్కరణమ్), యునక్తి = కూర్చు కొంటాడో (యుజ్ యోగే రుధాది–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), పరిఖా+ఆదినా : పరిఖా = కందకం (పరితః ఖాతా), ఆదినా = మొదలగువానిచే (పరిఖా ఆదౌ యస్య తేన), అన్యైః = ఇతరులచే, అగమ్య–భూమిః (సన్) = చొరరాని తావుగలవాడో (అగమ్యా భూమిః యస్య సః), సః = ఆ, రాజా ఏవ = రాజే, విజయీ = జయశీలుడు, అన్యః = ఇతరుడు, న = (జయశీలుడు) కాదు.

**తా ॥** ఏ రాజు గూఢచారుల ద్వారా శత్రువుల ఆలోచనలను తెలిసికొంటుంటాడో, ఏ రాజు యుద్ధానికి అవసరమైన ఉపకరణాలను సమకూర్చుకుంటూ వుంటాడో, ఏ రాజు కందకాలు త్రవ్వటం వంటి చర్యల ద్వారా తన కోటను శత్రువులు చొరరానిదిగా చేసుకొంటాడో ఆ రాజే విజయశీలుడు కాగలడు.

**వి :** 1. రాజులకు వార్తాసేకరణం అత్యంతం అవసరం.

ఆ. వార్తయందు జగము వర్తిల్లుచున్నది
యదియ లేనినాఁడు నఖిల జనులు
అంధకార మగ్నులగుదురు గావున
వార్త నిర్వహింపవలయుఁ బతికి.

ఈ వార్తా సేకరణలో గూఢచారుల పాత్ర చాలా ఎక్కువ. రాజులకు కళ్ళు గూఢచారులే కాబట్టి.

శ్లో. గంధేన గావః పశ్యన్తి వేదైః పశ్యన్తి పండితాః ।
**చారైః పశ్యన్తి రాజానః** చక్షుర్భ్యామితరే జనాః ॥ – మహాభారతమ్-ఉద్యోగ-34/32

సీతారాములు వియోగానికి కూడా ఈ గూఢచారులు సేకరించిన వార్తలే కారణం. (రామాయణమ్), అర్జునుడు పాశుపతానికై ప్రయత్నించటం కూడా గూఢచారి దుర్యోధన పాలనను గురించి సేకరించిన విషయాలే ప్రేరణ (కిరాతార్జునీయమ్- భారవి)

గూఢచర్యాన్ని నిర్వహించటంలోని మెళుకువలను (చాణక్యనీతిని) ముద్రారాక్షసం నాటకంలో (విశాఖదత్తుడు) సమగ్రంగా గమనించవచ్చు.

గూఢచారుల విషయంలో రాజు ఎలా వుండాలో, రాజుల విషయంలో గూఢచారులు ఎలా వుండాలో భారవి చక్కగా విశ్లేషించాడు.

శ్లో. క్రియాసు యుక్తైర్నృప చారచక్షుషో – న వంచనీయాః ప్రభవోఽనుజీవిభిః ।
అతోఽర్హసి క్షంతుమసాధు సాధు వా – హితం మనోహారి చ దుర్లభం వచః ॥–కిరాతార్జునీయమ్ 1/4

చారచక్షువులయిన రాజులను కార్యనియుక్తులైన అనుచరులు వంచింపగూడదు. అలాగే గూఢచారులు చెప్పిన విషయాలు నచ్చినా నచ్చకపోయినా రాజు కోపించగూడదు. మాట మనకు నచ్చాలి, హితమూ కల్గించాలీ అంటే అటువంటి మాట దుర్లభం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **వేత్తి :** | **వేత్తి** | విత్తః | విదన్తి | |
| | వేత్సి | విత్థః | విత్థ | |
| | వేద్మి | విద్వః | విద్మః | |
| **యునక్తి :** | **యునక్తి** | యుంక్తః | యుంజన్తి | |
| | యునక్షి | యుంక్థః | యుంక్థ | |
| | యునజ్మి | యుంజ్వః | యుంజ్మః | * |

**శ్లో॥ స్వసంసది ప్రౌఢజనేషు మన్త్రి-వరేషు నీత్యాగమతత్త్వవిత్సు ।**
**విచార్య కుర్యాద్ద్విషతాముపాయై-ర్మిథో విభేదం సుఖభాక్ స భూపః ॥ 12-43**

**అ :** రాజు మిత్రభేదతంత్రాన్ని ఎలా పాటించాలో వివరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ-సంసది ప్రౌఢ-జనేషు మంత్రి-వరేషు నీతి+ఆగమ-తత్త్వ-విత్సు విచార్య ఉపాయైః ద్విషతాం మిథః విభేదం (యః) కుర్యాద్ సః భూపః సుఖ-భాక్ (భవతి).

**ప్ర :** స్వ-సంసది: స్వ=తనయొక్క, సంసది = కొలువులో (సభా సమితి సంసదః-అమరకోశః-బ్రహ్మ-15) (సీదన్తి అస్యాం ఇతి, తస్యామ్), ప్రౌఢ-జనేషు = పెద్దలలో (ప్రౌఢాశ్చ తే జనాః తేషు), మంత్రి-వరేషు = శ్రేష్ఠమంత్రులలో (వరాశ్చ తే మంత్రిణః – తేషు), నీతి+ఆగమ-తత్త్వ-విత్సు : నీతి+ఆగమ = నీతి శాస్త్రంయొక్క (ఆగమః శాస్త్రమాత్రం-హలాయుధకోశః-పుట-147), తత్త్వ-విత్సు = తత్త్వమెరిగిన వారిలో (నీతేః ఆగమః తస్య తత్త్వం తత్ విదన్తీతి, తేషు), విచార్య = ఆలోచించి, ఉపాయైః = ఆశపెట్టడం వంటి ఉపాయాలతో, ద్విషతామ్ = శత్రువులకు, మిథః = పరస్పరం, విభేదమ్ = ఎడబాటును (యః = ఏ రాజు), కుర్యాత్ = చేయగలడో, సః భూపః = ఆ రాజు, సుఖ-భాక్ = సుఖాన్ని పొందుతాడు. (సుఖం భజతి ఇతి)

**తా ॥** ఏ రాజు తన కొలువులో నున్న పెద్దలతో మేటిమంత్రులతో, రాజనీతిరహస్యవేత్తలతో చక్కగా సంప్రదించి తన శత్రువులకు పరస్పరం ఎడబాటును కల్పించగలుగుతాడో ఆ రాజే సుఖంగా వుండగలడు.

**వి :** 1. రాజనీతిలో మిత్రభేదం చాలా శక్తిమంతమైన తంత్రం. కృష్ణుడు భవిష్యత్తులో రాయబారిగా వెళ్ళి కౌరవసభలో ఈ మిత్రభేదవ్యూహంతోనే అందరినీ మానసికంగా విడదీయగలుగుతాడు.

అయితే మిత్రభేదమన్నది రాజనీతిలో విలువయిన అంశమే కానీ సాధారణనీతిలో అది తుచ్ఛమయినదే. ఎందుకంటే రాజనీతిలో రాజువేసే ఎత్తుగడల కన్నింటికీ స్వప్రజా హితమే లక్ష్యం. సాధారణజీవితాల్లో స్వప్రయోజనమే లక్ష్యమవుతుంది ఆ ఎత్తుగడలలో.

| | | | |
|---|---|---|---|
| 2. **కుర్యాత్ :** | **కుర్యాత్** | కుర్యాతామ్ | కుర్యుః |
| | కుర్యాః | కుర్యాతమ్ కుర్యాత | |
| కుర్యామ్ | కుర్యావ | కుర్యామ. | * |

**శ్లో॥ ఉత్సాహసఙ్గతా నీతిః సూతే నరవరోచితౌ ।**
**కీర్తిప్రతాపౌ రాజేన్ద్ర! తత్రాలస్యం ప్రతీపకృత్ ॥** **12-44**

**అ :** రాజ ప్రయత్నాలలో ఉత్సాహ ప్రాధాన్యాన్ని నిరూపించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** రాజేంద్ర! ఉత్సాహ-సంగతా నీతిః నరవర+ఉచితౌ కీర్తి-ప్రతాపౌ సూతే. తత్ర ఆలస్యం ప్రతీప-కృత్.

**ప్ర :** రాజేంద్ర = మేటిరేడా! ఉగ్రసేనా! ఉత్సాహ-సంగతా : ఉత్సాహ = ఉత్సాహం (ఉద్యోగం)తో, సంగతా = కూడిన(ఉత్సాహేన సంగతా), నీతిః = రాజనీతి, నర-వర+ఉచితౌ : నర-వర = రాజశ్రేష్ఠులకు, ఉచితౌ = తగినట్టి (నరాణాం వరః, తస్య ఉచితౌ), కీర్తి-ప్రతాపౌ = కీర్తినీ, ప్రతాపాన్నీ (కీర్తిశ్చ ప్రతాపశ్చ తౌ), సూతే = కలిగిస్తుంది. (సూ ప్రాణిగర్భవిమోచనే-అదాది-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), తత్ర = ఆ విషయంలో, ఆలస్యమ్ = సోమరితనం (అలసస్య భావః), ప్రతీప-కృత్ = విపరీత ఫలితాన్ని కల్గిస్తుంది. (ప్రతీపం కరోతి ఇతి)

**తా ॥** ఉత్సాహం (ప్రయత్నం, ఉద్యోగం) తో కూడిన రాజనీతి రాజుల అనుభవానికి యోగ్యమయిన కీర్తి ప్రతాపాలను కలిగిస్తుంది.

**వి :** 1. నాయకున కుండవలసిన లక్షణాలలో కీర్తి ప్రతాపాలపై ఉత్సాహం ప్రధానాంశం.

శ్లో. **యశః ప్రతాపసుభగో** ధర్మకామార్థతత్పరః ।
ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః ॥ - **ప్రతాపరుద్రీయమ్**-1/22

ఆ కీర్తి ప్రతాపాలకు మూలం ఉత్సాహం. దాని విషయంలో సోమరితన ముండకూడదు.

2. **ఆలస్యం** - ఆలసస్య భావః అలసుడంటే సోమరి. కానీ తెలుగులో అది అర్థ-విపరిణామంతో కనిపిస్తుంది. విలంబం-జాగు-అనే అర్థాలలో తెలుగులో ఆలస్య పదాన్ని వాడుతున్నాం.

3. అలసత-సోమరితనం మనకు పెద్ద శత్రువు. దానికి విరుగుడు ప్రయత్నశీలతయే.

**శ్లో. ఆలస్యం హి మనుష్యాణాం శరీరస్థో మహాన్ రిపుః ।**
**నాస్త్యుద్యమసమో బంధుః కృత్వా యం నావసీదతి ॥ -సుభాషితరత్నభాండాగారం-పు.86/15**

| | | | |
|---|---|---|---|
| 4. **సూతే :** | **సూతే** | సువాతే | సువతే |
| | సూషే | సువాథే | సూధ్వే |
| | సూవే | సూవహే | సూమహే. * |

**శ్లో॥ సామాద్యుపాయావసరజ్ఞానశూన్యస్య శూరతా ।**
**ఆమ్నాయార్థాపరిస్ఫూర్తేః సామర్థ్యమివ వాదినః ॥ 12-45**

**అ :** ఉపాయప్రయోగానికి వేళ తెలియకపోతే ఆ శౌర్యం నిరర్థక మనటం. -పథ్యావక్త్రమ్.

**అ :** సామ+ఆది+ఉపాయ+అవసర-జ్ఞాన-శూన్యస్య శూరతా ఆమ్నాయ+అర్థ+ అపరిస్ఫూర్తేః వాదినః సామర్థ్యమ్+ఇవ (భవతి).

**ప్ర :** సామా... శూన్యస్య : సామ+ఆది = సామం మొదలుగా గల, ఉపాయ = ఉపాయాల యొక్క, అవసర = ప్రయోగకాలంయొక్క జ్ఞాన = జ్ఞానంచే, శూన్యస్య = శూన్యుడైన వానియొక్క (సామ ఆదౌ యేషాం తే సామాదయః , తే చ తే ఉపాయాః, తేషామ్ అవసరస్య జ్ఞానేన శూన్యః, తస్య), శూరతా = శౌర్యం (శూరస్య భావః), ఆమ్నాయ+అర్థ+అపరి-స్ఫూర్తేః : ఆమ్నాయ = వేదంయొక్క, అర్థ = అర్థంయొక్క, అపరిస్ఫూర్తేః = స్ఫురణలేని వానియొక్క (ఆమ్నాయానామ్ అర్థస్య అపరిస్ఫూర్తిః యస్య తస్య), వాదినః = వాదియొక్క, సామర్థ్యమ్+ఇవ = సమర్థతలా (భవతి = వుంటుంది.)

**తా ॥** సామ దాన భేద దండోపాయాలు తెలిసినా తగిన సమయంలో ప్రయోగించలేకపోతే ఆ శౌర్యం వేదార్థం స్ఫురించని వాది సమర్థతలాగా నిరర్థకమవుతుంది.

**వి :** 1. **అధ్యయనంలో నాలుగు అంశాలు ప్రధానం. అధ్యయనం, అవగాహనం, ఆచరణం, ప్రచారం.** ఈ నాలుగు అవస్థలు సరిగా సాగినపుడే విద్య సరిగా వచ్చినట్టు. సరిగా రావటమంటే దాన్ని వినియోగించ వలసివచ్చినప్పుడు అది గుర్తుకు రావటం. గుర్వధ్యయన పూర్వకమైన వేదవిద్యకు అది మరీ అవసరం. అలా స్మరణ కుదరకపోతే అది నిరర్థకం. రాజుకున్న సేన విషయం కూడా అంతే. ఎప్పుడు ప్రయోగించాలో తెలీకపోతే దండగే. '**కాలే ఖలు సమారబ్ధాః ఫలం బధ్నన్తి నీతయః**'.

*

**శ్లో॥యః సన్ధిముఖ్యామలనీతికాల-మజ్ఞాన్యవిజ్ఞాయ రణం విధత్తే ।**
**షణ్నిగ్రహాణాం సమయానభిజ్ఞ-వాదీవ సంసత్సు స యాత్యకీర్తిమ్ ॥ 12-46**

**అ :** కాలవివేకం లేకపోతే రాజనీతిప్రయోగం అపకీర్తి హేతువని ప్రకటించటం. -ఇంద్రవజ్ర.

**అ :** అజ్ఞానీ యః సంధి-ముఖ్య-అమల-నీతి-కాలమ్ అవిజ్ఞాయ రణం విధత్తే సః సంసత్సు షట్+నిగ్రహాణాం సమయ+అనభిజ్ఞవాదీ+ఇవ అకీర్తిం యాతి.

**ప్ర :** అజ్ఞానీ = జ్ఞానశూన్యుడైన (జ్ఞానీ న భవతి ఇతి), యః = ఏ రాజు, సంధి... కాలమ్ : సంధి-ముఖ్య = సంధిప్రధానమైన, అమల = దోషరహితమైన, నీతి = నీతి ప్రయోగం యొక్క, కాలమ్ = సమయాన్ని (సంధిః ముఖ్యః యస్యాః సా చ అమలా చ నీతిః, తస్యాః కాలః, తమ్), అవిజ్ఞాయ = తెలియక (నఞ్-వి-జ్ఞా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), రణమ్ = యుద్ధాన్ని, విధత్తే = ఆదేశిస్తాడో, సః= ఆ రాజు, సంసత్సు = సభలలో, షట్-నిగ్రహాణామ్ = ఆరు నిగ్రహాలయొక్క, సమయ+అనభిజ్ఞవాదీ+ఇవ : సమయ = యోగ్యమైన కాలం యొక్క, అనభిజ్ఞ = ఎరుకలేని, వాదీ+ఇవ = వాదం చేసే వానివలె, అకీర్తిమ్ = అపకీర్తిని (చెడ్డపేరును), యాతి = పొందుతాడు. (యా ప్రాపణే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఏ రాజు అజ్ఞానియై సంధి మొదలుగా గల షడ్గుణాల ప్రయోగకాలమెరగక యుద్ధాన్ని ప్రకటిస్తాడో ఆ రాజు పండితసభలలో నిగ్రహస్థానాలు తెలియక వాదన చేసే వానిలాగా అపకీర్తిని తెచ్చుకొంటాడు.

**వి :** 1. షడ్గుణాల వివరణ 40వ శ్లోక వ్యాఖ్యానంలో వుంది.

నిగ్రహస్థానాలు 1. విరోధం, 2. అసంగతి, 3. న్యూనమ్ 4. ఆధిక్యమ్ 5. సంవాదం 6. అనుక్తి.

1. యోగ్యత లేకపోతే విరోధం. అంటే అర్థం కుదరకపోవటం. 2. ఆకాంక్ష లోపిస్తే అది అసంగతి. (ఈ రెండూ వాక్యార్థ జ్ఞాన హేతువులయిన మూడింటిలో రెండు.) 3. చెప్పవలసినదానిని పూర్తిగా, స్పష్టంగా చెప్పలేక పోవటం న్యూనం. 4. ఆకాంక్ష కుదిరిన తరువాత అది మరొకదానితో కూడా అన్వయించటం ఆధిక్యం 5. ఎదిరి అభిప్రాయాన్నే మన మాటలలో దొర్లించటం సంవాదం. 6. పరార్థజ్ఞానానికి తప్పనిసరి అయిన వాటిని చెప్పకపోవటం అనుక్తి.

నిగ్రహస్థానాలు (ఓడిపోవుటకు తావైనది) ఇరవై రెండు అని మరొక అభిప్రాయం. 1. ప్రతిజ్ఞాహాని 2. ప్రతిజ్ఞాంతం 3. ప్రతిజ్ఞా విరోధం 4. ప్రతిజ్ఞా సన్న్యాసం 5. హేత్వంతరం 6. అర్థాంతరం 7. నిరర్థకం 8. అవిజ్ఞాతార్థం 9. అపార్థకం 10. అప్రాప్తకాలం 11. న్యూనం 12. ఆధిక్యం 13. పునరుక్తం 14. అననుభాషణం 15. అజ్ఞానం 16. అప్రతిభ 17. విక్షేపం 18. మతానుజ్ఞ 19. పర్యనుయోజ్యోపేక్షణం 20. నిరనుయోజ్యానుయోగం 21. అపసిద్ధాంతం 22. హేత్వాభాసం - ఆంధ్రశబ్దరత్నాకరము - 2/599

2. శ్లోకంలో ఉపమాలంకారం-శాస్త్రప్రయోగకాలమెరుగని రాజుకు నిగ్రహస్థానాలు తెలీని వాదితో పోలిక. ప్రతిపాద్యవిషయస్పష్టతకు సహకరిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **విధత్తే :** | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | విధత్సే | విదధాథే | విదధధ్వే |
| | విదధే | విదధ్వహే | విదధ్మహే. |

*

**శ్లో॥ నానాప్రకారైర్దశదిక్షు శత్రూన్ - యో నైవ జేతుం యతతే క్షితీశః ।**
**బతావశీభూతదశేంద్రియౌఘో - వ్రతీవ నాసౌ సుఖభాక్కదాపి ॥ 12-47**

**అ :** దశ దిక్కులలోనూ విజయానికై రాజు ప్రయత్నం చేయకపోతే సుఖం దక్కదని వివరణ.

**అ :** యః క్షితి+ఈశః నానా-ప్రకారైః దశ దిక్షు శత్రూన్ జేతుం న-ఏవ యతతే అసౌ అవశీభూత-దశ-ఇంద్రియ+ఓఘః వ్రతీ+ఇవ కదా అపి సుఖభాక్ న బత.

**ప్ర :** యః = ఏ, క్షితి+ఈశః = భూపతి (క్షితేః ఈశః), నానా ప్రకారైః = అనేక రీతులతో / సర్వోపాయాలతో), దశ-దిక్షు = పది దిక్కులలోని (దశసు చ తాసు దిక్షు), శత్రూన్ = శత్రువులను, జేతుమ్ = గెలవటానికి (జి ధాతువుపై తుమున్ ప్రత్యయం), న+ఏవ యతతే = ప్రయత్నమే చేయడో(యతీ ప్రయత్నే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), అసౌ = ఆ రాజు,అవశీ- భూత-దశ+ఇంద్రియ+ఓఘః:అవశీభూత = లోబడిన, దశ+ఇంద్రియ = పది ఇంద్రియాల-యొక్క, ఓఘః = సమూహం గలవాడైన(అవశీభూతాని దశ చ తాని ఇంద్రియాణి తేషామ్ ఓఘః), వ్రతీ+ఇవ = సంన్యాసిలాగా, కదా+అపి = ఎప్పుడూ, సుఖ-భాక్ = సుఖాన్ని అనుభవించేవాడు, న (భవతి) = కాలేదు, బత = అయ్యో!

**తా ॥** రాజు సర్వోపాయాలతోనూ దశదిక్కులలోనూ శత్రువులను జయించే ప్రయత్నం చేయాలి. లేకపోతే దశేంద్రియాలనూ గెలువలేక వాటికి లోబడిన సంన్యాసిలాగా ఎప్పుడూ సుఖంగా వుండలేడు.

**వి :** 1. ఇంద్రియాలు పది. అయిదు కర్మేంద్రియాలు (వాక్-పాణి-పాద-పాయు-ఉపస్థలు) అయిదు జ్ఞానేంద్రియాలు (కన్ను, నాలుక, ముక్కు, చర్మం, చెవి). ఇవి విషయాలపై ఆసక్తిని పెంచుతాయి. వాటికి తృప్తి కలిగించే ప్రయత్నం చేసే కొద్దీ ఆసక్తి పెరుగుతూనే వుంటుంది.

శ్లో. విషయైరింద్రియగ్రామః న తృప్తిమధిగచ్ఛతి ।
అజస్రం పూర్యమాణోఽపి సముద్రస్సలిలైరివ ॥ **– సౌందరనందమ్-13/40**

సముద్రాన్ని ఎంత నింపినా అది నిండనట్టు విషయాలను ఎంతగా అందించినా ఇంద్రియాలకు తృప్తి కలుగదు.

భగవద్గీతలో కూడా కృష్ణుడు అర్జునుడికి ఈ అశక్తసంన్యాసం నిష్ప్రయోజనకరమని వివరిస్తాడు.

శ్లో. న కర్మణామనారంభాన్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే ।
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి ॥ ... ... ...

శ్లో. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే ॥ – భగవద్గీత 3/4,6

ఇటువంటి సంన్యాసి దుఃఖభాజనుడైనట్లు శత్రువుల మధ్యనున్న రాజుకూడా నిరంతరం ఆందోళనకు గురి అవుతాడు. కడగా సర్వస్వాన్నీ కోల్పోతాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **యతతే :** | **యతతే** | యతేతే | యతన్తే |
| | యతసే | యతేథే | యతధ్వే |
| | యతే | యతావహే | యతామహే |

3. ఛందస్సు – ఉపజాతి (పూర్వార్ధం ఇంద్రవజ్ర, ఉత్తరార్ధం ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ యత్సైన్యకున్తాః స్వసపత్నచిన్తాం – శార్దూలదన్తా ఇవ సాధయన్తి ।**
**స్వరాష్ట్రసన్తోషమపి స్వతన్తౌ – తదీయదంష్ట్రా ఇవ సోఽవనీశః ॥ 12-48**

**అ :** శత్రువులకు చింతనూ, తన రాజ్యంలో నిశ్చింతనూ కలిగించగలవాడే రాజని ప్రతిపాదించటం.

**అ :** యత్–సైన్య–కుంతాః శార్దూల–దన్తాః ఇవ స్వ–సపత్న–చిన్తాం సాధయన్తి స్వ–తంతౌ తదీయ–దంష్ట్రాః ఇవ స్వ–రాష్ట్ర–సంతోషమ్ అపి సాధయన్తి సః అవనీ+ఈశః (భవతి)

**ప్ర :** యత్–సైన్య–కుంతాః: యత్ = ఏ రాజుయొక్క, సైన్య = సైన్యంయొక్క, కుంతాః = కుంతాలు అనే ఆయుధాలు, శార్దూల–దన్తాః+ఇవ = పులిదంతాలవలె, స్వ–సపత్న–చిన్తామ్ : స్వ = తనయొక్క, సపత్న = శత్రువులకు, చిన్తామ్ = వ్యథను, సాధయన్తి = సాధిస్తాయో, స్వ–తన్తౌ = తన సంతతియందు (తన్తుః సంతానే–శబ్దార్థకల్పతరుః–పు–638), తదీయ–దంష్ట్రాః+ఇవ = దాని కోరలవలె, స్వ–రాష్ట్ర–సంతోషమ్–అపి : స్వ = తనయొక్క, రాష్ట్ర = రాజ్యంయొక్క, సంతోషమ్ అపి = ఆనందాన్ని కూడా (స్వస్య రాష్ట్రం, తస్య సంతోషః, తమ్ అపి), సాధయన్తి = సాధిస్తాయో, సః = ఆయన, అవనీ+ఈశః = భూపతి (అవన్యాః ఈశః)

**తా ॥** రాజసైనికుల చేతులలోని కుంతాయుధాలు పులిదంతాలలాగా శత్రువులకు మనోవ్యథను కల్గించగలగాలి. అంతేకాదు ఆ పులికోరలు తన సంతానాన్ని గాయపడకుండా పట్టుకోగలిగినట్లు ఆ కుంతాలు తన రాజ్యంలోని ప్రజలకు సంతోషాన్ని కలిగించగలగాలి. అటువంటి రాజే రాజు. ఇతరులు రాజులుగా వున్నా రంజింపజేయలేరు.

**వి :** 1. పులి తన పిల్లలను పట్టుకోవటం విలక్షణం–

శ్లో. వ్యాఘ్రీ యథా హరేత్పుత్రాన్ – దంష్ట్రాభ్యాం న చ పీడయేత్ ।
భీతా పతనభేదాభ్యాం – తద్వద్వర్ణాన్ ప్రయోజయేత్ ॥ – పాణినీయశిక్ష–25

వర్ణ ప్రయోగవిషయంలో పులి తన పిల్లలను నోటబట్టుకొన్నంత జాగరూకతతో వుండాలి.

2. రాజు కర్తవ్యాలలో ప్రధానమైనది ప్రజారంజనం. రఘుమహారాజును వర్ణిస్తూ కాళిదాసు చేసిన వ్యాఖ్య–

శ్లో. యథా ప్రహ్లాదనాచ్చంద్రః ప్రతాపాత్తపనో యథా।
తథైవ సోఽభూదన్వర్థో **రాజా ప్రకృతిరంజనాత్**॥ – రఘువంశమ్ – 4/12

సైన్యాన్ని అయినా, సేనల ఆయుధాల నైనా రాజు ప్రకృతి(ప్రజా)రంజన కోసమే వినియోగించాలి

3. ఇక్కడ సేనల కుంతాలకు శత్రువిషయకంగా శార్దూలదంతాలతోనూ, స్వప్రజా విషయకంగా శార్దూలదంష్ట్రలతోనూ పోలిక. ఇది ఉపమాలంకారం. ఇది వాచ్యం. అయితే దీనితో పాటు ఉల్లేఖాలంకారం కూడా శ్లోకంలో కనిపిస్తుంది. '**ఏకేన బహుధోల్లేఖోఽప్యసౌ విషయభేదతః**' – (కు. 23)

| 4. **సాధయన్తి :** | సాధయతి | సాధయతః | **సాధయన్తి** |
|---|---|---|---|
| | సాధయసి | సాధయథః | సాధయథ |
| | సాధయామి | సాధయావః | సాధయామః |

5. ఛందస్సు – ఉపజాతి (పూర్వార్ధం ఇంద్రవజ్ర. ఉత్తరార్ధం ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ రాజన్! ముక్తోఽపి తే బాణో – నిహన్తి దిశి దిశ్యరీన్।**
**గుణసఙ్గస్యార్జవస్య – వంశస్య హి ఫలం చ తత్॥ 12-49**

**అ :** ఉగ్రసేనుని బాణం సత్ఫలితాన్ని సాధించటం. –పథ్యావక్త్రమ్.

**అ :** రాజన్! తే బాణః ముక్తః+అపి దిశి దిశి అరీన్ నిహన్తి. హి గుణసంగస్య ఆర్జవస్య చ వంశస్య తత్ ఫలమ్.

**ప్ర :** రాజన్ = రాజా!, తే = నీయొక్క, బాణః = బాణం, ముక్తః+అపి = విడువబడిననూ (ముచ్ ధాతువుపై క్త ప్రత్యయం), దిశి దిశి = అన్ని దిక్కులలో, అరీన్ = శత్రువులను, నిహన్తి = సంహరిస్తోంది. (ని హన్ హింసాగత్యోః –పరస్మైపది–లట్–ప్ర.ఏ.), హి = అది యుక్తమే, గుణ–సంగస్య : గుణ = అల్లెత్రాటితో / సద్గుణాలతో, సంగస్య = చేరిమి గలదీ, ఆర్జవస్య = నిటారుగావున్నదీ/నిజాయితీ గలదీ అయిన, వంశస్య = వెదురుకు/వంశానికి, తత్ = అది, ఫలమ్ = ఫలితం.

**తా ॥** రాజా! ఉగ్రసేనా! నీ బాణం విముక్తమయినా సర్వదిక్కులలోనూ శత్రుసంహారం చేస్తోంది. (తాను వదలిన తర్వాత కూడా తన పని చేయటమేమిటన్నది సందేహం. దానికి సమాధానం ఉత్తరార్ధం.) గుణంతో చేరిమిని పొంది, ఋజుత్వం గల వంశం (వెదురు, కులం) యొక్క ఫలితమటువంటిదే గదా!

**వి :** 1. శ్లోకంలో ముక్త, గుణ, ఆర్జవ, వంశపదాలు శ్లిష్టాలు. విరుపుడు అవసరం లేకుండానే రెండు అర్థాలను ఇస్తాయి. కాబట్టి ఆయా పదాల విషయంలో అభంగశ్లేష కనిపిస్తుంది. ఒక అర్థం బాణ పక్షంగా, అది ప్రకృతాంశం. మరొక అర్థం సజ్జన పక్షంగా. అది ప్రకృత శ్లేష. రెండింటి కలయిక వల్ల అది **ప్రకృతాప్రకృతశ్లేష.**

పూర్వార్ధంలోని విషయానికి ఉత్తరార్ధం సమర్థన. ఆ భావం సమర్థనను కోరుతోంది. కాబట్టి సమర్థన అవసరమైనపుడు సమర్థించటం కాబట్టి కావ్యలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' (కు. 121)

| 2. **నిహన్తి :** | **నిహన్తి** | నిహతః | నిఘ్నన్తి |
|---|---|---|---|
| | నిహంసి | నిహథః | నిహథ |
| | నిహన్మి | నిహన్వః | నిహన్మః. |

*

**శ్లో॥ పాన్థాన్ సమన్తాద్దివసే దినేశ–ప్రఖ్యో రజన్యాం రజనీశకల్పః।**
**యస్తస్కరేభ్యోఽవతి దుష్కరాజ్ఞః – స ఏవ కీర్త్యైతి దిశాముపాన్తమ్॥ 12-50**

**అ :** పగలురేయీా చోరులనుండి కాపాడిన రాజే కీర్తిమంతుడని కీర్తించటం.

**అ :** దుష్కర+ఆజ్ఞః యః దివసే దిన+ఈశ-ప్రఖ్యః (సన్) రజన్యాం రజనీ+ఈశ-కల్పః (సన్) సమంతాత్ పాన్థాన్ తస్కరేభ్యః అవతి సః ఏవ కీర్త్యా దిశామ్ ఉపాంతమ్ ఏతి.

**ప్ర :** దుష్కర+ఆజ్ఞః : దుష్కర = కష్టసాధ్యమైన, ఆజ్ఞః = ఆదేశాలుగల (దుష్కరా ఆజ్ఞా యస్య సః), యః = ఏ రాజు, దివసే = పగటిపూట, దిన+ఈశ-ప్రఖ్యః-సన్ = సూర్యుడను పేర, రజన్యామ్ = రాత్రిపూట, రజనీ+ఈశ-కల్పః (సన్) = చంద్రసమానుడై (రజన్యాః ఈశః ఈషదూనః రజనీశః రజనీశకల్పః) "**ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్య దేశీయరః**" (అష్టాధ్యాయి 5-3-67) సూత్రంతో కల్పప్ ప్రత్యయం), సమంతాత్ = అంతటా, పాన్థాన్ = బాటసారు లను, తస్కరేభ్యః = దొంగలనుండి, అవతి = రక్షిస్తాడో (అవ రక్షణ గత్యాదిషు-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సః+ఏవ=ఆ రాజే,కీర్త్యా= కీర్తితో, దిశామ్= దిక్కులయొక్క ఉపాంతమ్ = దగ్గరకు, ఏతి = చేరుతాడు. (ఇ-గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఏ రాజు పగటిపూట సూర్యుడుగా, రాత్రిపూట చంద్రుడుగా నిలిచి అంతటా బాటసారులను దొంగలబారినుండి కాపాడుతాడో ఆ రాజుయొక్క కీర్తి దిగంతాల దగ్గర వరకు వ్యాపిస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| **వి :** | 1. **అవతి :** | **అవతి** | అవతః | అవన్తి |
| | | అవసి | అవథః | అవథ |
| | | అవామి | అవావః | అవామః |
| | **ఏతి :** | **ఏతి** | ఇతః | యన్తి |
| | | ఏషి | ఇథః | ఇథ |
| | | ఏమి | ఇవః | ఇమః |

2. ఛందస్సు - ఉపజాతి (1,2,3 పాదాలు ఇంద్రవజ్ర 4వ పాదం ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ న్యాయం సజ్గృహ్య నృపతి-రన్యాయం యస్తు సన్త్యజేత్ ।**
**పదే పదే తమన్యాయః - సన్నమ్యాభ్యర్థయిష్యతే ॥** **12-51**

**అ :** రాజు న్యాయసంగ్రహణంపై దృష్టి పెట్టాలని సూచన. -పథ్యావక్త్రమ్.

**అ :** యః నృపతిః న్యాయం సంగృహ్య అన్యాయం తు సన్త్యజేత్, తమ్ (నృపతిం) పదే పదే అన్యాయః సన్నమ్య అభ్యర్థయిష్యతే.

**ప్ర :** యః నృపతిః = ఏ రాజు, న్యాయమ్ = న్యాయం, సంగృహ్య = స్వీకరించి, అన్యాయమ్ = అన్యాయాన్ని, సంత్యజేత్ = విడిచిపెడతాడో (సమ్-త్యజ హానౌ-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), తమ్ = ఆ రాజును, పదే పదే = ప్రతిపదంలోనూ, అన్యాయః = అన్యాయం, సన్నమ్య = బాగా లోబడి (సమ్-నమ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అభ్యర్థయిష్యతే = అభ్యర్థించగలదు (అభి+అర్థ ఉపాయాంచాయామ్ ణిచ్-ఆత్మనేపది-ప్ర.ఏ.)

**తా ॥** రాజు వ్యవహారాలలో న్యాయాన్ని ఆశ్రయించి అన్యాయాన్ని విడిచిపెడితే అన్యాయం గతిలేనిదై పదే పదే ఆరాజుకు లోబడి ఆయనను ప్రార్థిస్తూనే వుంటుంది.

**వి :** రాచరికపువ్యవస్థలో రాజు దగ్గరున్న మూడు అధికారాలూ (శాసనం చేయటం, శాసనాన్ని అమలు చేయటం, శాసనంలో కానీ అమలులోకానీ న్యాయం లోపిస్తే సరి చేయటం) రాజు చేతిలోనే వుండేవి. సాధారణంగా ప్రజలలో పరస్పరం ఏర్పడిన న్యాయవివాదాలను రాజే తీర్చేవాడు.

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఈ మూడు అధికారాలు ముగ్గురి చేతిలోనికి వచ్చాయి. ప్రజా ప్రతినిధులు శాసనం చేస్తే, ప్రభుత్వాలు అమలు చేస్తాయి. న్యాయ వివాదాలను న్యాయవ్యవస్థ పరిష్కరిస్తుంది. విచిత్రవిషయమేమిటంటే రాచరికపువ్యవస్థలో ప్రజలమధ్య ఏర్పడే న్యాయ–వివాదాలను రాజు తీరుస్తుంటే ప్రస్తుతన్యాయవ్యవస్థ ప్రభుత్వానికీ, ప్రజలకూ మధ్య ఏర్పడుతున్న న్యాయవివాదాలను కూడా పరిష్కరించవలసి వస్తోంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **సన్త్యజేత్ :** | **సన్త్యజేత్** | సన్త్యజేతామ్ | సన్త్యజేయుః | |
| | సన్త్యజేః | సన్త్యజేతమ్ | సన్త్యజేత | |
| | సన్త్యజేయమ్ | సన్త్యజేవ | సన్త్యజేమ. | * |

**శ్లో॥ దినే దినేశప్రఖ్యో రాత్రౌ రాత్రీశసన్నిభః ।**
**కాపథేభ్యః ప్రజా రున్ధే స రాజా స విశామినః ॥** **12–52**

**అ :** ప్రజలను అపమార్గంనుండి మరలింప వలసిన బాధ్యత రాజుదే. –పథ్యావక్త్రమ్.

**అ :** దినే దిన+ఈశ–ప్రఖ్యః రాత్రౌ రాత్రి+ఈశ–సన్నిభః (యః) రాజా ప్రజాః కాపథేభ్యః రున్ధే సః రాజా సః విశామ్ ఇనః చ.

**ప్ర :** దినే = పగలు, దిన+ఈశ–ప్రఖ్యః = సూర్యసమానుడై (దినస్య ఈశః ఇతి ప్రఖ్యా యస్య సః), రాత్రౌ = రాత్రియందు, రాత్రి+ఈశ–సన్నిభః = చంద్రసమానుడై (రాత్ర్యాః ఈశః, తేన సన్నిభః), (యః) రాజా = ఏ రాజు, ప్రజాః = ప్రజలను, కాపథేభ్యః = చెడ్డదారులనుండి (కుత్సితాశ్చ తే పన్థానః, తేభ్యః) (వ్యధ్వో దురధ్వో విపథః కదధ్వా కాపథస్సమాః – అమరకోశః–భూమి–16), రున్ధే = అడ్డగిస్తాడో (రుధ్ – ఆవరణే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), సః రాజా = ఆ రాజే, విశామ్ = ప్రజలకు (పురుషః పూరుషశ్చ విట్–హలాయుధకోశః–331), ఇనః = ప్రభువు.

**తా ॥** పగటిపూట సూర్యసమానుడై, రాత్రి చంద్ర సమానుడై తన ప్రజలు చెడుదారుల పట్టకుండా కాపాడే రాజే రాజు. అతడే జన(నర)పాలుడు.

వి : 1. **శా. రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు నం**
**భోజాక్షీచతురంతయానతురగీభూషాదులాత్మవ్యథా**
**బీజంబుల్ తదపేక్షచాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల**
**క్ష్మీజాగ్రత్పరిణామమిమ్ము దయతో శ్రీకాళహస్తీస్వరా!**

అంటూ ధూర్జటి రాజులను తీవ్రంగా నిందించాడు. కానీ ఆనిందలో ఆత్మాశ్రయత ఎక్కువగా కనిపిస్తోంది. నిజమైన రాజు సూర్యచంద్రసదృశుడు. ఆయన కర్తవ్యం కూడా ఎక్కువే. కవి తన భోగలాలసత కోసం రాజును ఆశ్రయించి అవసరం తీరిన తరువాత నిందించటం సమాజాన్ని తప్పుదారి పట్టించటమే. 'వారిచ్చు నంభోజాక్షీ' అన్న మాటలోనే రాజు చెడ్డతనంకన్న తన చెడ్డతనం ఎక్కువగా కనిపించటం లేదూ!

ప్రజలను కూడా అపమార్గంనుండి తప్పించ గలవాడే రాజు. అందుకే రాజుకు చంద్ర–వాచకమైన రాజపదం, సూర్యవాచకరమైన ఇనపదం రెండూ నప్పుతాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **రున్ధే :** | **రున్ధే** | రున్ధాతే | రున్ధతే | |
| | రున్త్సే | రున్ధాథే | రున్ద్ధ్వే | |
| | రున్ధే | రున్ధ్వహే | రున్ధ్మహే. | * |

**శ్లో॥ ప్రాయేణ ధనవానేవ జాయతే క్లేశవానపి ।**
**ఫలవానేవ హి తరుః కణ్టకైరుపరుద్ధ్యతే ॥** **12–53**

అ : పండిన చెట్టుకే రాళ్ళ దెబ్బలన్న సామెతతో రాజుల క్లేశాలను వివరించే ప్రయత్నం. -పథ్యావక్త్రమ్.

అ : ప్రాయేణ ధనవాన్ ఏవ క్లేశవాన్ అపి జాయతే. హి. తరుః ఫలవాన్ ఏవ కంటకైః ఉపరుద్ధ్యతే.

ప్ర : ప్రాయేణ = సాధారణంగా, ధనవాన్ ఏవ = ధనవంతుడే, క్లేశవాన్ అపి = కష్టాలు గలవాడు కూడా, జాయతే = అవుతాడు. (జనీ ప్రాదుర్భావే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), హి = అది యుక్తమే. ఫలవాన్ ఏవ = కాచి పండిన, తరుః = చెట్టు, కంటకైః = ముళ్ళచేత, ఉపరుద్ధ్యతే = అడ్డగించబడుతుంది. (ఉప-రుధ్ ఆవరణే-కర్మణి-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

తా ॥ సాధారణంగా డబ్బున్నచోటే కష్టాలుంటాయి. పండిన చెట్టుకే చుట్టూ ముళ్ళకంపలు కట్టి అడ్డగిస్తారు.

వి : 1. శ్లో॥ అర్థానామర్జనే దుఃఖ-మార్జితానాం చ రక్షణే ।
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం - ధిగర్థం దుఃఖభాజనమ్ ॥

అని అర్థనింద చేస్తుంది మహాభారతం. డబ్బుకావాలని మక్కువే కానీ దానిని సంపాదించటం కష్టం, కాపాడుకోవటం కష్టం, ఖర్చుపెడుతుంటే ఏదో బాధ- ఇవన్నీ కలిసి అర్థానికి కష్టాలు సహచరులవుతాయి. పండిన చెట్టుకే రాళ్ళదెబ్బలు గదా!

అలాగే ముద్దుగా పలికే చిలుకను పంజరంలో బంధించినట్టు చెట్టు బాగా కాస్తే దాని చుట్టూ ముళ్ళకంపలు కడతారు, ఎవరూ చెట్టెక్కి కాపును కోసుకొనిపోకుండా. ఏ పండూ లేని చెట్టు దగ్గరకు హాయిగా మనుషులు వస్తారు, సేదతీరుతారు ఆనందిస్తారు. పండిన చెట్టుకు ఆ అవకాశం లేదు.

అలాగే రాజు, రాజ్యం సంపన్నమయ్యే కొద్దీ కష్టాలు చుట్టుముడుతుంటాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **జాయతే :** | **జాయతే** | జాయేతే | జాయన్తే |
| | జాయసే | జాయేథే | జాయధ్వే |
| | జాయే | జాయావహే | జాయామహే. |
| **ఉపరుద్ధ్యతే :** | **ఉపరుద్ధ్యతే** | ఉపరుద్ధ్యేతే | ఉపరుద్ధ్యన్తే |
| | ఉపరుద్ధ్యసే | ఉపరుద్ధ్యేథే | ఉపరుద్ధ్యధ్వే |
| | ఉపరుద్ధ్యే | ఉపరుద్ధ్యావహే | ఉపరుద్ధ్యామహే. |

*

**శ్లో॥ కాలే కాలే ధనం నూనమర్థిభ్యో వితరేద్ధి యః ।**
**ముచ్యతే సర్వదుఃఖేభ్యః కణ్టకేభ్య ఇవ ద్రుమః ॥ 12-54**

అ : యాచకులకు దానంచేయవలసిన అవసరాన్ని వివరించటం. -పథ్యావక్త్రమ్.

అ : యః కాలే కాలే అర్థిభ్యః ధనం వితరేత్ హి సః కంటకేభ్యః ద్రుమః ఇవ సర్వదుఃఖేభ్యః నూనం ముచ్యతే.

ప్ర : యః = ఏ రాజయితే, కాలే కాలే = ఆయా సముచితవేళలలో, అర్థిభ్యః = యాచకులకు, ధనమ్ = సొమ్మును, వితరేత్+హి = దానం చేస్తాడో (వి తౄ ప్లవనతరణయోః-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), (సః = ఆ రాజు), కంటకేభ్యః = ముళ్ళనుండి, ద్రుమః ఇవ = చెట్టువలె, సర్వ-దుఃఖేభ్యః = అని దుఃఖాలనుండీ (సర్వాణి చ తాని దుఃఖాని తేభ్యః ), నూనమ్ = నిశ్చితంగా, ముచ్యతే = విడవబడతాడు. (ముచ్ మోక్షణే-తుదాతి-కర్మణి-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

తా ॥ రాజు ఆయా వేళలలో (కాలాలలో) యాచకులకు ధనాది దానం చేస్తుంటే ముళ్ళనుండి చెట్టుకు విడుదల లభించినట్లు ఆ రాజుకు కూడా అన్ని దుఃఖాలనుండి విముక్తి దొరుకుతుంది.

ప్ర : 1. రఘుమహారాజు విశ్వజిద్యాగం చేసి సమస్తమూ దానం చేసి తన అవసరానికి కుండలు పెట్టుకొన్నాడు.

అందుకే కౌత్సుడు గురుదక్షిణ కోసం వచ్చినా '**శరద్ఘనం నార్దతి చాతకోఽపి**' (చాతకపక్షి అయినా శరత్కాలమేఘాన్ని యాచింపదు) అని వెళ్ళిపోబోయాడు. భోగంమీదకన్న త్యాగంమీద రాజు దృష్టిపెట్టినప్పుడు తానూ, తన ప్రజలు కూడా సుఖంగా వుండే అవకాశముంటుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **వితరేత్ :** | **వితరేత్** | వితరేతామ్ | వితరేయుః |
| | వితరేః | వితరేతమ్ వితరేత | |
| | వితరేయమ్ | వితరేవ | వితరేమ |
| **ముచ్యతే :** | **ముచ్యతే** | ముచ్యేతే | ముచ్యన్తే |
| | ముచ్యసే | ముచ్యేథే | ముచ్యధ్వే |
| | ముచ్యే | ముచ్యావహే | ముచ్యామహే. |

*

**శ్లో॥ విత్తైః కీర్తిం శరైః శౌర్యం ప్రత్యహం యః సమార్జయేత్ ।**
**స ఏవ ధనవాన్ సమ్రాడన్యం మన్యే హ్యకిఞ్చనమ్ ॥ 12-55**

**అ :** కీర్తిశౌర్యాలే రాజుకు ధనమని నిర్దేశించుట. -పథ్యావక్త్రమ్.

**అ :** యః విత్తైః కీర్తిం శరైః శౌర్యం ప్రత్యహం సమార్జయేత్ సః సమ్రాట్ ఏవ ధనవాన్. అన్యమ్ అకించనం మన్యే.

**ప్ర :** యః = ఏ రాజయితే, విత్తైః = ధనాలతో, కీర్తిమ్ = యశస్సునూ, శరైః = బాణాలతో, శౌర్యమ్ = ప్రతాపాన్నీ, ప్రత్యహమ్ = ప్రతిదినమూ, సమార్జయేత్ = సంపాదిస్తాడో (సమ్-ఋుజ్-గతిస్థానార్జనోపార్జనేషు-ణిచ్-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), సః సమ్రాట్ ఏవ = ఆ సార్వభౌముడే, ధనవాన్ = ధనవంతుడు (ధనమస్య అస్తీతి ధనవాన్. '**తదస్యాస్త్యస్మిన్నితి మతుప్**' (అష్టాధ్యాయి 5-2-94) సూత్రంతో మతుప్ ప్రత్యయం), అన్యమ్ = ఇతరుని, అకించనమ్ = ఏమీ లేని వానినిగా (నాస్తి కించన యస్య తమ్), మన్యే = భావిస్తున్నాను. (మన్-జ్ఞానే-దివాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** దానాలతో కీర్తిని, బాణాలతో ప్రతాపాన్నీ ప్రతిదినమూ సంపాదించుకొన్న సమ్రాట్టే ధనవంతుడు. ఇతరుడు దరిద్రుడే అని నాభావన.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **సమార్జయేత్ :** | **సమార్జయేత్** | సమార్జయేతామ్ | సమార్జయేయుః |
| | సమార్జయేః | సమార్జయేతమ్ | సమార్జయేత |
| | సమార్జయేయమ్ | సమార్జయేవ | సమార్జయేమ |
| **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే. |

*

**శ్లో॥ అర్థిభ్యోఽర్థమనాదిశ్య యస్తన్నిక్షిపతి క్షితౌ ।**
**మృత్స్నాం స్వయోగ్యామాదాయ విత్తం భూమ్యై ప్రదత్తవాన్ ॥ 12-56**

**అ :** భూమిలో ధనాన్ని దాచటంలోని హేయతను ప్రకటించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యః అర్థిభ్యః అర్థమ్ అనాదిశ్య తత్ క్షితౌ నిక్షిపతి (సః) స్వ-యోగ్యామ్ మృత్స్నామ్ ఆదాయ విత్తం భూమ్యై ప్రదత్తవాన్.

**ప్ర :** యః = ఏ రాజు, అర్థిభ్యః = యాచకులకు, అర్థమ్ = డబ్బును, అనాదిశ్య = ఇవ్వక, తత్ = దానిని, క్షితౌ = భూమిలో, నిక్షిపతి = పూడ్చిపెడతాడో (ని క్షిప ప్రేరణే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), (సః = ఆ రాజు), స్వ-యోగ్యామ్ = తనకు తగిన, మృత్స్నామ్ = మట్టిని, ఆదాయ = తీసికొని, విత్తమ్ = ధనాన్ని, భూమ్యై = భూమికి, ప్రదత్తవాన్ = ఇచ్చినవాడు (ప్ర దా ధాతువుపై క్తవత్ ప్రత్యయం)

**తా ॥** ఏ రాజు యాచకులకు అర్థాన్ని ఇవ్వకుండా ఆ ధనాన్ని భూమిలో దాచిపెడతాడో ఆ రాజు నేలనుండి తనకు దగిన మట్టిని తీసికొని (త్రవ్వి) ధనాన్ని నేలకు సమర్పించినట్లే.

**వి :** 1. శ్లో॥ దానం భోగోనాశస్తిస్రో గతయో భవన్తి విత్తస్య ।
యో న దదాతి న భుంక్తే తస్య తృతీయా గతిర్భవతి ॥ –భర్తృహరిసుభాషితం – నీతిశతకమ్–43.

క. దానము భోగము నాశము
పూనికతో మూడుగతులు భువి ధనమునకున్
దానము భోగము నెఱుఁగని
దీనుని ధనమునకుఁ గతి తృతీయమె పొసగున్. –ఏనుగు లక్ష్మణకవి అనువాదం.

భూమిలో ఎంత ధనం ఘనస్థితిలో మనం దాస్తామో అంత ఘనస్థితి మట్టిని పైకి తీస్తాము. అంటే డబ్బు ఇచ్చి మట్టిని కొనుక్కొంటున్నాం. ఎంత దయనీయస్థితి అంటున్నాడు కవి.

2. శ్లోకంలో నిదర్శనాలంకార ముంది. '**వాక్యార్థయోః సదృశయోః ఐక్యారోపో నిదర్శనా**' – (కు.53)

| | | | |
|---|---|---|---|
| 3. **నిక్షిపతి :** | **నిక్షిపతి** | నిక్షిపతః | నిక్షిపన్తి |
| | నిక్షిపసి | నిక్షిపథః | నిక్షిపథ |
| | నిక్షిపామి | నిక్షిపావః | నిక్షిపామః. |

*

**శ్లో॥ సర్వేశే భువి యస్య భక్తిరమలా నైవైతదాజ్ఞాత్మకే**
**ధర్మే వా న రతిస్తదాశ్రితజనే సన్మానలేశోఽపి వా ।**
**దుష్టప్రీతిరతస్య నిష్ఠురగిరో దుర్మన్త్రదత్తశ్రుతేః**
**సామ్రాజ్యం నిజవంశపాంసనకృతేః కంసస్య సంసారవత్ ॥ 12–57**

**అ :** కృష్ణభక్తి ధర్మరతిలేని రాజుపాలన కంసుని సంసారం వంటిదని ప్రతిపాదన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యస్య (రాజ్ఞః) భువి సర్వ+ఈశే అమలా భక్తిః న ఏవ ఏతద్–ఆజ్ఞా+ఆత్మకే ధర్మే వా న రతిః తద్–ఆశ్రిత–జనే సత్–మాన–లేశః అపి వా న దుష్ట–ప్రీతి–రతస్య నిష్ఠుర–గిరః దుర్మంత్ర–దత్త–శ్రుతేః (రాజ్ఞః) సామ్రాజ్యం నిజ–వంశ–పాంసన–కృతేః కంసస్య సంసారవత్.

**ప్ర :** యస్య (రాజ్ఞః) = ఏ రాజుకు, భువి = లోకంలో, సర్వ+ఈశే = అంతటికీ ప్రభువైన కృష్ణునిపై, అమలా=నిర్మలమైన, భక్తిః= సేవాభావం, న ఏవ= లేనే లేదో, ఏతద్–ఆజ్ఞా+ ఆత్మకే : ఏతద్ = ఆ కృష్ణునియొక్క, ఆజ్ఞా+ఆత్మకే = ఆజ్ఞారూపమైన (ఏతస్య ఆజ్ఞా ఏవ ఆత్మా యస్య, తస్మిన్), ధర్మే = ధర్మమందు, రతిః న = ఆసక్తి లేదో, తద్–ఆశ్రిత–జనే : తద్ = ఆ కృష్ణుని, ఆశ్రిత = ఆశ్రయించిన, జనే = జనమందు (తస్య ఆశ్రితశ్చ అసౌ జనః, తస్మిన్), సన్మాన–లేశః అపి వా = కొంచెం అభిమానం అయినా (సన్మానస్య లేశః), న = లేదో, దుష్ట–ప్రీతి–రతస్య : దుష్ట = దుర్మార్గుల మీది, ప్రీతి = ప్రేమపై, రతస్య = ఆసక్తి గలవాడూ (దుష్టే ప్రీతిః తస్యాం రతః తస్య), నిష్ఠుర–గిరః = కఠినవాక్కుగలవాడూ, దుర్మంత్ర–దత్త–శ్రుతేః : దుర్మంత్ర =

చెడుతలపులకై, దత్త = ఇవ్వబడిన, శ్రుతేః = చెవి గలవాడూ అయిన రాజుయొక్క (దుర్మంత్రే దత్తా శ్రుతిః యేన తస్య), సామ్రాజ్యమ్ = సామ్రాజ్యము, నిజ...కృతేః : నిజ = తనయొక్క, వంశ = వంశాన్ని, పాంసన = మలినపరిచే, కృతేః = పనిచేసే, కంసస్య = కంసునియొక్క, సంసారవత్ = సంసారం వంటిది–

**తా ॥** సర్వేశ్వరుడైన కృష్ణునిపై భక్తిగానీ, కృష్ణుని ఆజ్ఞ అయిన ధర్మంపై ఆసక్తికానీ, ఆ కృష్ణుని ఆశ్రయించిన జనం (భక్తులు)పై ఆదరభావం కానీ లేక చెడ్డవారి చెలిమిపై ఆసక్తి చూపుతూ, నిష్ఠురంగా మాటాడుతూ, చెడు ఆలోచనలు వినే రాజుయొక్క రాజ్యం తన వంశానికే చేటుతెచ్చే చేష్టలు చేసిన కంసుని సంసారంవంటిది.

**వి :** 1. చెడ్డవారితో చెలిమి, కరకు పలుకుల బలిమి, చెడుతలపుల కలిమి రాజుకుంటే ఆ సామ్రాజ్యం విచ్ఛిన్నమవుతుంది. *

**శ్లో॥ విష్ణుభక్తిరతం భూపం – నైవ త్యక్ష్యతి తత్ప్రియా ।**
**తద్ద్వేషిణి న సా స్థాతు–ముత్సహేత పతివ్రతా ॥ 12–58**

**అ :** విష్ణుభక్తి ప్రాధాన్యం. –పథ్యావక్త్రమ్.

**అ :** విష్ణు–భక్తి–రతం భూపం తత్–ప్రియా న త్యక్ష్యతి ఏవ. పతివ్రతా సా తద్ ద్వేషిణి స్థాతుం న ఉత్సహేత.

**ప్ర :** విష్ణు–భక్తి–రతమ్ :విష్ణు = నారాయణునిపై, భక్తి = భక్తియందు, రతమ్ = ఆసక్తిగల (విష్ణౌ భక్తిః, తస్యాం రతః, తమ్), భూపమ్ = రాజును (భువం పాతీతి భూపః, తమ్), తత్–ప్రియా : తత్ = ఆ నారాయణునియొక్క, ప్రియా = భార్య (లక్ష్మి), న త్యక్ష్యతి ఏవ = ఎన్నడూ వదలబోదు (త్యజ హానౌ–పరస్మైపది–లృట్–ప్ర.ఏ.), పతి–వ్రతా = పతియందే వ్రతం గల (పతౌ వ్రతం యస్యాః సా), సా = ఆ లక్ష్మి, తద్–ద్వేషిణి = ఆ నారాయణుని ద్వేషించేవారి దగ్గర, స్థాతుమ్ = నిలవటానికి, న ఉత్సహేత = ఉత్సాహపడదు. (ఉత్–సహ మర్షణే – భ్వాది–ఆత్మనేపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** విష్ణుభక్తి గల రాజును ఆ విష్ణుప్రియ (లక్ష్మి) ఎన్నడూ విడువబోదు. పతివ్రత అయిన ఆ లక్ష్మి నారాయణుని ద్వేషించే వారిదగ్గర నిలవటానికి ఉత్సాహపడదు.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **త్యక్ష్యతి :** | **త్యక్ష్యతి** | త్యక్ష్యతః | త్యక్ష్యన్తి |
| | త్యక్ష్యసి | త్యక్ష్యథః | త్యక్ష్యథ |
| | త్యక్ష్యామి | త్యక్ష్యావః | త్యక్ష్యామః |
| **ఉత్సహేత :** | **ఉత్సహేత** | ఉత్సహేయాతామ్ | ఉత్సహేరన్ |
| | ఉత్సహేథాః | ఉత్సహేయాథామ్ | ఉత్సహేధ్వమ్ |
| | ఉత్సహేయ | ఉత్సహేవహి | ఉత్సహేమహి. |

*

**శ్లో॥ ధర్మద్వితీయం నృపతిం ధర్మోఽన్యో నైవ పీడయేత్ ।**
**అన్యథాఽప్రతిమల్లోఽసౌ సాన్వయం సంహరిష్యతి ॥ 12–59**

**అ :** నృపతికి ధర్మాచరణయొక్క ఆవశ్యకాన్ని తెలియజేయటం. –పథ్యావక్త్రమ్.

**అ :** ధర్మ–ద్వితీయం నృపతిమ్ అన్యః ధర్మః న పీడయేత్ ఏవ. అన్యథా అప్రతిమల్లః అసౌ స+అన్వయం సంహరిష్యతి.

**ప్ర :** ధర్మ–ద్వితీయమ్ = ధర్మం తోడుగావున్న, (ధర్మః ద్వితీయః యస్య, తమ్), నృ–పతిమ్ = రాజును (నృణాం పతిః, తమ్), అన్యః = మరొక, ధర్మః = ధర్ముడు (యమ–ధర్మరాజు) (ధర్మాః పుణ్యమన్యాయస్వభావాచారసోమపాః–అమరకోశః–నానార్థ–140), న పీడయేత్–ఏవ = బాధించనే బాధించడు. (పీడ అవగాహనే–పరస్మైపది–విధిలిఙ్–

ప్ర.ఏ.), అన్యథా = అలాకాకపోతే, అప్రతిమల్లః = ఎదురులేని (నాస్తి ప్రతిమల్లః యస్య సః), అసౌ = ఆ యముడు, స+అన్వయమ్ = వంశంతోపాటు ఆ రాజును, సంహరిష్యతి = చంపివేయ గలడు. (సమ్-హృ హరణే-భ్వాది-పరస్మైపది-ల్యట్-ప్ర.ఏ.)

**తా ॥** ధర్మాన్ని తోడుగా నిలుపుకొన్న రాజును యముడు ఏమీ చేయలేడు. ఆలాకాక రాజు అధర్మంగా నడిస్తే ఎదురులేని ఆ యమధర్మరాజు ఆ రాజునూ, ఆయన వంశాన్నీ కూడా నాశనం చేస్తాడు.

**వి :** 1. మహాభారతం వనపర్వంలో ధర్మరాజు యక్షుడితో ధర్మాన్ని గురించి ఇలాగే వివరిస్తాడు.

శ్లో. ధర్మ ఏవ హతో హన్తి ధర్మో రక్షతి రక్షితః।
తస్మాద్ధర్మం న త్యజామి మా నో ధర్మో హతోఽవధీత్॥ – వనపర్వం 313/128

యక్షుడు తన సోదరులలో ఒకరిని బ్రతికిస్తానన్నప్పుడు ధర్మరాజు నకులుని కోరుకొంటూ చెప్పిన మాటలివి. ధర్మజుడు చెప్పిన మాటలే యక్షుడికి కూడా సబబనిపించాయి కాబట్టి నలుగురు తమ్ముళ్ళనూ బ్రతికిస్తాడు. ధర్మాన్ని రక్షించినవాణ్ణి ధర్మం రక్షించడమంటే ఇదే.

రాజుకే కాదు. సాధారణంగా అందరికీ ధర్మద్వితీయత్వం అవసరమే. కాకపోతే రాజు అందరికీ ప్రతినిధి కాబట్టి, అందరి బాగోగులూ తనవే కాబట్టి ఆ తీవ్రత అవసరం.

| | | | |
|---|---|---|---|
| 2. **పీడయేత్ :** | **పీడయేత్** | పీడయేతామ్ | పీడయేయుః |
| | పీడయేః | పీడయేతమ్ | పీడయేత |
| | పీడయేయమ్ | పీడయేవ | పీడయేమ |
| **సంహరిష్యతి :** | **సంహరిష్యతి** | సంహరిష్యతః | సంహరిష్యన్తి |
| | సంహరిష్యసి | సంహరిష్యథః | సంహరిష్యథ |
| | సంహరిష్యామి | సంహరిష్యావః | సంహరిష్యామః. |

*

**శ్లో॥ విష్ణోరర్భకసఙ్కాశాన్ వైష్ణవాన్ యస్తు నిన్దతి ।**
**తత్రాపి న స్థిరా శ్రీః స్యాత్ పుత్రద్వేషిణి మాతృవత్ ॥12-60**

**అ :** వైష్ణవద్వేషం లక్ష్మికి కోపహేతువనటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యః తు (నృపతిః) విష్ణోః అర్భకసంకాశాన్ వైష్ణవాన్ నిందతి తత్ర అపి శ్రీః పుత్ర-ద్వేషిణి మాతృవత్ స్థిరా న స్యాత్.

**ప్ర :** యస్తు (నృపతిః) = ఏ రాజయితే, విష్ణోః = విష్ణువుయొక్క, అర్భక-సంకాశాన్ : అర్భక = శిశువులతో, సంకాశాన్ = సమానమైన (అర్భకైః సంకాశాః, తాన్), వైష్ణవాన్ = విష్ణుభక్తులను, నిన్దతి = దూషిస్తాడో (నిన్ద్ కుత్సాయామ్ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తత్ర+అపి = ఆ రాజుదగ్గర కూడా, శ్రీః = లక్ష్మి, పుత్ర-ద్వేషిణి:పుత్ర = (తన) కుమారులను, ద్వేషిణి = ద్వేషించేవానియందు, మాతృవత్ = తల్లివలె, స్థిరా న స్యాత్ = స్థిరంగా నిలువజాలదు.

**తా ॥** విష్ణువుయొక్క సంతతివంటి వైష్ణవులను నిందించే రాజుదగ్గర కూడా లక్ష్మి స్థిరంగా వుండదు. తన కుమారులనే ద్వేషించే వారిదగ్గర తల్లి నిలువలేదు గదా!

**వి :** 1. విష్ణుభక్తులను నిందించకపోవటమే గాక ప్రేమతో ఆదరింపగలవానినే ఉన్నతస్థితికి తీసికొనిపోతుంది లక్ష్మి. **విష్ణుచిత్తుని కథ దీనికి చక్కని ఉదాహరణం** (ఆముక్తమాల్యద). విష్ణుచిత్తుడు వైష్ణవులను ఆదరించిన తీరు ఎంత హృద్యమో!

శా. ఆ నిష్ఠానిధిగేహసీమ నడిరేయాలించిన న్నోయి నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధాను సం
ధానధ్యానము 'నాస్తి శాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదనసౌష్ఠవం చ కృపయా భోక్తవ్యమన్మా'టలున్. -ఆముక్తమాల్యద-1/84

| | | | |
|---|---|---|---|
| 2. **నిందతి :** | **నిందతి** | నిందతః | నిందన్తి |
| | నిందసి | నిందథః | నిందథ |
| | నిందామి | నిందావః | నిందామః |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ దుష్టప్రీతిరతం భూపం దోషోఽపి స్పృశతి క్రమాత్ ।**
**దోషిణం గుణలుబ్ధా శ్రీర్నాశ్రయేదితి మే మతిః ॥ 12-61**

**అ :** దుష్టస్నేహాలు గల వారిదగ్గరకు లక్ష్మి రాదనుట. -పథ్యావక్త్రమ్.

**అ :** దుష్ట-ప్రీతి-రతం భూపం క్రమాత్ దోషః అపి స్పృశతి. గుణ-లుబ్ధా శ్రీః దోషిణం న ఆశ్రయేద్ ఇతి మే మతిః
.

**ప్ర :** దుష్ట-ప్రీతి-రతమ్ : దుష్ట = దుష్టులపై, ప్రీతి = ప్రీతిపై, రతమ్ = ఆసక్తిగల (దుష్టేషు ప్రీతిః, తస్యాం రతః, తమ్), భూపమ్ = రాజును, క్రమాత్ = క్రమంగా, దోషః+అపి = దోషం కూడా, స్పృశతి = తాకుతుంది (స్పృశ్ సంస్పర్శనే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), గుణ-లుబ్ధా : గుణ = గుణాలపై, లుబ్ధా = లోభంగల (గుణేషు లుబ్ధా), శ్రీః = లక్ష్మి, దోషిణమ్ = దోషిని, న ఆశ్రయేత్ = ఆశ్రయింపబోదు. (ఆః శ్రి సేవాయామ్ పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), ఇతి = అని, మే = నాయొక్క, మతిః = ఆలోచన.

**తా ॥** చెడ్డవారితో చెలిమిగల నరపాలుని క్రమంగా దోషం తాకుతుంది. గుణాలమీదనే ఆసక్తిగల లక్ష్మి ఆ దోషి చెంతకు చేరదు.

**వి :** 1. లక్ష్మి నారాయణుని వరించేటప్పుడు కూడా ఈ నిర్దోషిత్వాన్ని గమనించియే ముందడుగు వేసింది. పాలకడలిని చిలికినపుడు పుట్టిన లక్ష్మి ముకుందుని వరించిన సన్నివేశాన్ని చూద్దాం-

శ్లో॥ స్తనద్వయం చాతికృశోదరీ సమం - నిరంతరం చందనకుంకుమోక్షితమ్ ।
తతస్తతో నూపురవల్గుశింజితైః - విసర్పతీ హేమలతేవ సా బభౌ ॥

శ్లో॥ విలోకయంతీ నిరవద్యమాత్మనః - పదం ధ్రువం చావ్యభిచారిసద్గుణమ్ ।
గంధర్వయక్షాసురసిద్ధచారణ-త్రైవిష్టపేయాదిషు నాన్వవిందత ॥

శ్లో॥ నూనం తపో యస్య న మన్యునిర్జయో - జ్ఞానం క్వచిత్ తస్య న సంగవర్జితమ్ ।
కశ్చిన్మహాంస్తస్య న కామనిర్జయః - స ఈశ్వరః కిం పరతో వ్యపాశ్రయః ॥

శ్లో॥ ధర్మః క్వచిత్తత్ర న భూతసౌహృదం - త్యాగః క్వచిత్తత్ర న ముక్తికారణమ్ ।
వీర్యం న పుంసోఽస్త్యజవేగనిష్కృతం - న హి ద్వితీయో గుణసంగవర్జితః ॥

శ్లో॥ క్వచిచ్చిరాయుర్న హి శీలమంగళం - క్వచిత్తదప్యస్తి న వేద్యమాయుషః ।
యత్రోభయం కుత్ర చ సోఽ ప్యమంగళః - సుమంగళః కశ్చ న కాంక్షతే హి మామ్॥

శ్లో॥ ఏవం విమృశ్యావ్యభిచారిసద్గుణైః - పరం నిజైకాశ్రయతాఽ గుణాశ్రయమ్ ।
వవ్రే వవం సర్వగుణైరపేక్షితం - రమా ముకుందం నిరపేక్ష మీప్సితమ్ ॥

- భాగవతమ్ 8/8/18-23

2. సీ. అమర ముత్తైదువ నై యుండవచ్చును - వరుసకు సవతులెవ్వరును లేరు
వెలయంగ నశ్రాంత విభవమీతని యిల్లు - శృంగారచందన శీతలుండు
గలఁగఁ డెన్నఁడు శుద్ధకారుణ్యమయమూర్తి - విమలుండు గదసి సేవించవచ్చు
నెఱి నాడి తిరుగఁడు నిలుకడ గలవాఁడు - సకల కార్యములందు జడత లేదు

ఆ. సాధురక్షకుండు షడ్వర్గరహితుండు - నాథుఁ డయ్యెనేని నడప నోపు
నితఁడె భర్త యనుచు నింతి సరోజాక్షుఁ - బుష్పదామకమునఁ బూజసేసె.

- పోతనభాగవతము 8/282

| | | | |
|---|---|---|---|
| 3. **స్పృశతి :** | **స్పృశతి** | స్పృశతః | స్పృశన్తి |
| | స్పృశసి | స్పృశథః | స్పృశథ |
| | స్పృశామి | స్పృశావః | స్పృశామః |
| **ఆశ్రయేత్ :** | **ఆశ్రయేత్** | ఆశ్రయేతామ్ | ఆశ్రయేయుః |
| | ఆశ్రయేః | ఆశ్రయేతమ్ | ఆశ్రయేత |
| | ఆశ్రయేయమ్ | ఆశ్రయేవ | ఆశ్రయేమ. |

*

**శ్లో॥ కఠోరగిరముత్సృజ్య - వృణోత్యపరమిన్దిరా ।**
**ఘనం పురోగ్రస్తనితా-ద్విహాయేవ తటిద్దిశః ॥** **12-62**

**అ :** మాట కటువయితే లక్ష్మికి నచ్చరనుట. -పథ్యావక్త్రమ్.

**అ :** ఇందిరా కఠోర-గిరమ్ ఉత్సృజ్య అపరం వృణోతి. తటిత్ ఉగ్ర-స్తనితాత్ పురా ఘనం విహాయ దిశః ఇవ.

**ప్ర :** ఇందిరా = లక్ష్మి, కఠోర-గిరమ్ = కటువుగా మాటాడేవాడిని (కఠోరా గీః యస్య, తమ్), ఉత్సృజ్య = వీడి, అపరమ్ = ఇతరుని, వృణోతి = వరిస్తుంది. (వృ వరణే స్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తటిత్ = మెరుపు (తటిత్సౌదామనీవిద్యుత్ - అమరకోశః-దిక్-9), ఉగ్ర-స్తనితాత్ = భీకరమైన ఉఱుముకన్న, పురా = ముందుగా, ఘనమ్ = మేఘాన్ని, విహాయ = విడిచి, దిశః ఇవ = దిక్కులనువలె (అపరం వృణోతి)

**తా ॥** మెఱుపుతీగ మేఘం ఉఱమటానికన్న ముందుగానే దానిని విడిచి దిక్కులను ఆశ్రయించినట్లు లక్ష్మి కఠోరవాక్కులు గలవాడిని విడిచి ఇతరులను ఆశ్రయిస్తుంది.

**వి :** 1. '**నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుందని**' తెలుగు సామెత.

శ్లో. ఈదృశీం రాక్షసీమాహుః వాచమున్మత్తదృప్తయోః ।
సా యోనిస్సర్వవైరాణాం సా హి లోకస్య నిరృతిః ॥ అని భవభూతి. ఉన్మత్త, దృప్తులమాటను రాక్షసవాక్కు అన్నాడు.

2. "సమేంద్రో మేధయా స్పృణోతు. అమృతస్య దేవ ధారణో భూయాసమ్. శరీరం మే విచర్షణమ్. **జిహ్వా మే మధుమత్తమా**" - తైత్తిరీయోపనిషత్తు - 1/4

అంటూ నాలుక మరీ తీయగా వుండాలని కోరుకొన్నది కటువయిన మాటలు రాకుండా వుండటం కోసమే.

| | | | |
|---|---|---|---|
| 3. **వృణోతి :** | **వృణోతి** | వృణుతః | వృణ్వన్తి |
| | వృణోసి | వృణుథః | వృణుథ |
| | వృణోమి | వృణువః | వృణుమః. |

*

**శ్లో॥ సన్మన్త్రశీర్ణో దుర్మన్త్రః ప్రయోక్తారం క్షిణోతి హి ।**
**యథా నృసింహసూర్యాగ్రే భైరవః కైరవద్యుతిః ॥ 12-63**

**అ :** దురాలోచన సదాలోచనతో నశించి ఆలోచించిన వానినే నశింపజేస్తుందనుట (దుర్మంత్రం ఎదురు తిరగటం) -పథ్యావక్త్రమ్.

**అ :** సత్+మంత్ర-శీర్ణః దుర్మంత్రః ప్రయోక్తారం క్షిణోతి హి. నృసింహ-సూర్య-అగ్రే కైరవ-ద్యుతిః భైరవః యథా ।

**ప్ర :** సత్-మన్త్ర-శీర్ణః:సత్ = సరియైన, మన్త్ర = ఆలోచనే (మంత్రంచే), శీర్ణః = శిథిలమైన (సత్ చ అసౌ మంత్రః తేన శీర్ణః), దుర్-మన్త్రః = దురాలోచన (అభిచార మంత్రం), ప్రయోక్తారమ్ = ప్రయోగించినవానినే, క్షిణోతి హి = నశింపజేస్తుంది గదా (క్షి క్షయే-స్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), నృసింహ-సూర్య-అగ్రే : నృసింహ = నృసింహమంత్రమనే సూర్యుడి ముందు (నృసింహ ఇతి సూర్యః తస్య అగ్రే), కైరవ-ద్యుతిః = కలువ వంటి కాంతిగల (కైరవస్య ద్యుతిరివ ద్యుతిః యస్య సః), భైరవః = భైరవ మంత్రం, యథా = ఏ రీతిగా (ప్రయోక్తారం క్షిణోతి = ప్రయోగించిన వాడినే నశింపజేస్తుందో) ఆరీతిగా-

**తా ॥** సదాలోచన చేత శిథిలమైన దురాలోచన దురాలోచన చేసినవాడినే నశింపజేస్తుంది. నృసింహమంత్రమనే సూర్యుడి ముందు కలువపువ్వువంటి కాలభైరవమంత్రం నశించిపోయి, దాన్ని ప్రయోగించిన మంత్రవేత్తనే నశింపజేస్తుంది గదా!

**వి :** 1. ఇక్కడ నృసింహమంత్రాన్ని సదాలోచనగానూ, కాలభైరవమంత్రాన్ని దురాలోచన తోనూ పోల్చి చూపిస్తున్నాడు కవి. నృసింహోపాసనవంటి వాటిని ఉపాసనాంగాలయిన మహామంత్రాలుగాను, కాలభైరవమంత్రం వంటివి అన్యవినాశానానికి ఉద్దేశించిన క్షుద్ర మంత్రాలు అని కవి భావన కావచ్చు.

క్షుద్రమంత్రాలు కృత్యాస్వరూపాలు. ఈ కృత్యలను ప్రయోగించేముందు ఎదుటి (శత్రువు) వారి శక్తియుక్తులను కూడా తెలిసికొని ప్రయోగించాలి. లేకపోతే అవి ప్రయోక్తకే ప్రాణాల మీదికి తెస్తాయి.

2. దుర్వాసుడు అంబరీషుడిమీద ఇటువంటి కృత్యనే ప్రయోగించి ప్రాణాపాయాన్ని కొని తెచ్చుకొని కడకు అంబరీషునే శరణుకోరి ఆయన అనుగ్రహంతో సుదర్శన చక్రం నుండి తప్పించుకొన్నాడు.

పౌండ్రకవాసుదేవుని కుమారుడు సుదక్షిణుడు వాసుదేవుడు తనతండ్రిని చంపాడని కోపంతో తపస్సుచేసి శివుని ఆదేశంమేర అభిచారహోమం చేసి కృత్యను సృష్టించి వాసుదేవునిపై ప్రయోగించాడు. దానితో కృష్ణుడు సుదర్శనచక్రాన్ని ప్రయోగించగా సుదక్షిణుడితో పాటు కాశీనగరం కూడా సమూలంగా దగ్ధమైంది. కృత్యపైకి పంపిన చక్రస్వరూపాన్ని గమనించండి-

సీ. భీమమై బహుతీవ్రధామమై హతరిపు - స్తోమమై సుమహితోద్దామమగుచుఁ
జండమై విజితమార్తాండమై పాలితా - ఖండమై విజయప్రకాండమగుచు
దివ్యమై నిఖిలగంతవ్యమై సుజనసం - భావ్యమై సద్భక్తసేవ్యమగుచు
నిత్యమై నిగమసంస్తుత్యమై వినమితా -దిత్యమై నిర్జితదైత్యమగుచు.

విలయసమయసముద్ధూతవిపులభాస్వ – దళికలోచన లోచనానల సహస్ర
ఘటిత పటుసటాజ్వాలికా చటుల సత్వ – భయద చక్రంబు కృత్యపైఁ బంపె శౌరి.

– దశమస్కంధము – ఉత్తర–530

| | | | |
|---|---|---|---|
| 3. **క్షిణోతి :** | క్షిణోతి | క్షిణుతః | క్షిణ్వన్తి |
| | క్షిణోషి | క్షిణుథః | క్షిణుథ |
| | క్షిణోమి | క్షిణువః/క్షిణ్వః | క్షిణుమః/క్షిణ్మః. |

*

**శ్లో॥ ప్రజా యం న ప్రశంసన్తి – న స్తుతశ్చార్థిభిశ్చ యః ।**
**విషయాసక్తకుమతే–ర్న సుఖం తస్య భూపతేః ॥ 12–64**

**అ :** ప్రజలు, యాచకులు ప్రశంసించినప్పుడే రాజు పరిపాలన సుఖకరమగుననుట. –పథ్యావక్త్రమ్.

**అ :** యం ప్రజాః న ప్రశంసన్తి, యః అర్థిభిః చ న స్తుతః విషయ+ఆసక్త–కుమతేః తస్య భూపతేః సుఖం న.

**ప్ర :** యమ్ = ఏ రాజును, ప్రజాః = ప్రజలు, న ప్రశంసన్తి = పొగడరో (ప్ర–శంస్ స్తుతౌ (దుర్గతావపి)–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), యః = ఏ రాజు, అర్థిభిః చ = యాచకులచేత కూడా, న స్తుతః = పొగడబడడో (స్తు ధాతువుపై క్త ప్రత్యయం), విషయ+ఆసక్త–కుమతేః : విషయ = ఇంద్రియార్థాలపై, ఆసక్త = ఆసక్తిగల, కుమతేః = చెడుబుద్ధిగల (విషయేషు ఆసక్తా కుత్సితా చ మతిః యస్య తస్య), తస్య భూపతేః = ఆ రాజునకు, సుఖం న (భవతి) = సుఖముండదు.

**తా ॥** ప్రజల ప్రశంసలను కానీ, యాచకుల పొగడ్తలను కానీ పొందని రాజు విషయాసక్తుడై, దుర్మతియై వుంటాడు. అటువంటి రాజుకు సుఖంలేదు.

**వి :** 1. రఘుమహారాజు, ఆయనను యాచించటానికి వచ్చిన కౌత్సుడు కూడా ప్రజల అభినందనలను అందుకొన్న ముచ్చట రఘువంశంలో కనిపిస్తుంది. 'నీ కోసం కురిసిన బంగారువాన మొత్తం నీదే' అనే రాజు, 'నేను అడిగినంత మేరే నాది. మిగిలింది నాది కాదు' అన్న కౌత్సుడు – అది రాజుకూ ప్రజలకూ మధ్య వుండవలసిన బంధం–

శ్లో॥ జనస్య సాకేతనివాసిన స్తౌ – ద్వావప్యభూతామభినంద్యసత్త్వౌ ।
గురుప్రదేయాధికనిస్పృహోఽర్థీ – నృపోఽర్థికామాదధికప్రదశ్చ ॥ –రఘువంశం 5/31

| | | |
|---|---|---|
| 2. **ప్రశంసన్తి :** ప్రశంసతి | ప్రశంసతః | **ప్రశంసన్తి** |
| ప్రశంససి | ప్రశంసథః | ప్రశంసథ |
| ప్రశంసామి | ప్రశంసావః | ప్రశంసామః. |

*

**శ్లో॥ ప్రజానాం పీడనం కృత్వా యో లుబ్ధో ధనమార్జయేత్ ।**
**విక్రీయ స్వసుతానేవ స వై సఞ్చినుతే వసు ॥ 12–65**

**అ :** ప్రజలను పీడించి డబ్బు సంపాదించే రాజు తన పిల్లలనే అమ్ముకొన్నట్టు అనటం. –పథ్యావక్త్రమ్.

**అ :** లుబ్ధః యః (భూపతిః) ప్రజానాం పీడనం కృత్వా ధనమ్ ఆర్జయేత్ సః స్వ–సుతాన్ ఏవ విక్రీయ వసు సంచినుతే వై.

**ప్ర :** లుబ్ధః = లోభి అయిన, యః(భూపతిః) = ఏ రాజు, ప్రజానామ్ = ప్రజలను, పీడనం కృత్వా = పీడించి (కృ ధాతువుపై క్త ప్రత్యయం), ధనమ్ = డబ్బును, ఆర్జయేత్ = సంపాదిస్తాడో (ఋజ్ గతిస్థానార్జనోపార్జనేషు –

పరస్మైపది-విధిలిఙ్-(ప్ర.ఏ.), సః = ఆ రాజు, స్వ-సుతాన్-ఏవ = తన కొడుకులనే, విక్రీయ = అమ్మి, వసు = ధనాన్ని, సంచినుతే వై = కూడబెడతాడు గదా! (సమ్-చి చయనే -స్వాది ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ప్రజలను పీడించి డబ్బు సంపాదించే రాజు తన సంతానాన్నే అమ్మి ధనం కూడబెట్టుకొనే వాడితో సమానం.

**వి :** 1. ప్రజలనుండి రాజు ధనాన్ని సంగ్రహించటం రాజ్యరక్షణకై అవసరం. కానీ దానికి కొన్ని సులువులున్నాయి-

శ్లో. మధుదోహం ధుహేద్రాష్ట్రం భ్రమరా ఇవ పాదపమ్ ।
వత్సాపేక్షీ దుహేచ్చైవ స్తనాంశ్చ న వికుట్టయేత్ ॥

శ్లో. జలాకావత్పిబేద్రాష్ట్రం మృదునైవ నరాధిపః ।
వ్యాఘ్రీవ చ హరేత్పుత్రాన్ సందశేన్న చ పీడయేత్ ॥

శ్లో. యథా శల్యకవానాఖుః పదం ధూనయతే సదా ।
అతీక్ష్ణేనాభ్యుపాయేన తథా రాష్ట్రం సమాపిబేత్ ॥ - మహాభారతమ్-శాంతిపర్వమ్-88/4-6

"తేనెటీగలు చెట్టునుండి తేనెను గ్రహించినట్లు రాజు ప్రజలనుండి ధనం గ్రహించాలి. దూడ చక్కగా పెరగటానికి తగినన్ని పాలు విడిచి, మిగిలినవి పిండుకోవాలి. అంతేగాని పొదుగు కోయరాదు. రాజు జలగలాగా మృదువుగా రాష్ట్రం నుండి ధనం పీల్చాలి. ఆడుపులి తన పిల్లలను నోటకరచుకొన్నట్లు ప్రజలతో రాజు వ్యవహరించాలి కానీ పీడించరాదు. సూదిపళ్ళతో చుంచు పాదం కొరికినట్లు మృదువైన ఉపాయంతో రాజు రాష్ట్రంనుండి ధనం పీల్చాలి."
- వ్యాసమహాభారతం - శాంతిపర్వము-ప్రథమసంపుటి-పు-214

| | | | |
|---|---|---|---|
| 2. **ఆర్జయేత్ :** | **ఆర్జయేత్** | ఆర్జయేతామ్ | ఆర్జయేయుః |
| | ఆర్జయేః | ఆర్జయేతమ్ | ఆర్జయేత |
| | ఆర్జయేయమ్ | ఆర్జయేవ | ఆర్జయేమ |
| **సంచినుతే :** | **సంచినుతే** | సంచిన్వాతే | సంచిన్వతే |
| | సంచినుషే | సంచిన్వాథే | సంచినుధ్వే |
| | సంచిన్వే | సంచినువహే/సంచిన్వహే | సంచినుమహే/సంచిన్మహే. * |

**శ్లో॥ ప్రజాపరంపరామేతి ప్రజారఞ్జనకృన్నృపః ।**
**పీడితా సా సనామ్నీం తాం నోత్పాదయతి తత్కులే ॥ 12-66**

**అ :** ప్రజాపీడకుడైన రాజుకు ప్రజ (సంతతి) కలుగదని ప్రకటనం. -పథ్యావక్త్రమ్.

**అ :** ప్రజా-రంజన-కృత్ నృపః ప్రజాపరంపరామ్ ఏతి. సా పీడితా (సతీ) తత్-కులే సనామ్నీం తాం న ఉత్పాదయతి.

**ప్ర :** ప్రజా-రంజన-కృత్ : ప్రజా = ప్రజలకు, రంజన = సంతోషాన్ని, కృత్ = కలిగించే (ప్రజానాం రంజనం కరోతి ఇతి), నృపః = రాజు (నౄన్ పాతి ఇతి), ప్రజా-పరంపరామ్ = సంతాన సంవృద్ధిని, ఏతి = పొందుతాడు. (ఇ గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సా = ఆ ప్రజ, పీడితా (సతీ) = పీడింపబడినదై, తత్-కులే = ఆ వంశమందు, సనామ్నీమ్ = తనతో సమానమైన పేరుగల (సమానం నామ యస్యాః సా, తామ్), తామ్ = ఆ సంతతిని, న-ఉత్పాదయతి = కలిగించదు. (ఉత్ పద్-గతే ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ప్రజలను ఆనందింపజేస్తూ పరిపాలించిన రాజు ప్రజ(సంతతి)ను పొంది వంశ పరంపరను కొనసాగింప గలుగుతాడు. ప్రజలను రాజు పీడిస్తే తమతో సమానమైన పేరుగల ఆ ప్రజను రాజుకు దక్కకుండా చేస్తుంది ప్రజ.

**వి :** 1. రాజునకు సంతతి లేకపోవటానికి కారణం ప్రజాపీడనమే అనలేము. మంచి రాజులుగా పేరున్నవారికి కూడా సంతానం లేకపోవచ్చు. దశరథమహారాజుకు కూడా సంతానం లేదు. కానీ అక్కడ ప్రజాపీడన వుందనలేము. కాబట్టి ఆ కారణం అనైకాంతికం. ప్రజాపీడనవల్ల సంతతి లేకపోవచ్చు. కానీ సంతతి లేకపోవటానికి ప్రజాపీడనమే కారణం కాదు.

ఒక్కొక్కసారి పూర్వీకుల చేసిన పాపకృత్యం కారణం కావచ్చు. అది ఐచ్ఛికంగా చేసింది కాకపోవచ్చు. దండనిర్ణయంలో జరిగిన పొరపాటైనా కావచ్చు.

శ్లో. యాని మిథ్యాభిశప్తానాం పతంత్యశ్రూణి రోదతామ్ ।
తాని పుత్రాన్ పశూన్ ఘ్నంతి తేషాం మిథ్యాభిశంసనాత్ ॥

శ్లో. యది నాత్మని పుత్రేషు న చేత్ పౌత్రేషు నప్తృషు ।
న హి పాపం కృతం కర్మ సద్యః ఫలతి గౌరివ ॥ – మహాభారతమ్–శాంతి–91/20,21

"తప్పుడు శిక్షను పొంది ఏడ్చేవారి కన్నీరు ఏడిపించినవారి పుత్రులను, పశువులను చంపుతుంది. కారణం తప్పుడు శిక్ష కనుక. తాను చేసిన పాపం తనపట్ల ఫలించకపోతే పుత్రుల మీదనో, మనుమల మీదనో, మునుమనుమల మీదనో ఫలిస్తుంది. మెల్లగా ఆవులా ఫలిస్తుంది." – వ్యాసమహాభారతం–శాంతి–ప్రథమసంపుటం–పుట.221

2. **ఏతి :** 12–50వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఉత్పాదయతి :** | **ఉత్పాదయతి** | ఉత్పాదయతః | ఉత్పాదయన్తి |
| | ఉత్పాదయసి | ఉత్పాదయథః | ఉత్పాదయథ |
| | ఉత్పాదయామి | ఉత్పాదయావః | ఉత్పాదయామః. * |

**శ్లో॥ అపూజితోఽతిథిః స్వీయమతిథిత్వమపార్థకమ్ ।**
**సమర్పయతి తత్తిథ్యామపూజ్యత్వమివార్పయన్ ॥ 12–67**

**అ :** అతిథిత్వానికి రాజుయొక్క అసత్ప్రవర్తనచే అతిథిత్వసాధన. –పథ్యావక్త్రమ్.

**అ :** అపూజితః అతిథిః అపార్థకం స్వీయమ్ అతిథిత్వం తత్–తిథ్యామ్ అపూజ్యత్వమ్ అర్పయన్ ఇవ సమర్పయతి.

**ప్ర :** అపూజితః = పూజింపబడని (రాజుచేత), అతిథిః = అతిథి, అపార్థకమ్ = అపార్థకమైన (తన అర్థాన్ని కోల్పోయిన), స్వీయమ్ = తనయొక్క, అతిథిత్వమ్ = తిథిలేని తనాన్ని, తత్–తిథ్యామ్ = ఆ తిథిలో, అపూజ్యత్వమ్ = పూజింపబడకపోవటాన్ని (పూజకు అర్హత లేకపోవటాన్ని) అర్పయన్–ఇవ = కల్పిస్తున్నట్లుగా, సమర్పయతి = కలిగిస్తాడు.

**తా ॥** రాజు తన ఇంటి అతిథిని పూజింపకపోతే ఆ అతిథి తన అతిథిత్వం అపార్థకమైనది కాబట్టి – అదీ అపూజ్యత్వంచేత – ఆ తిథులను పూజ్యార్హతలేని తిథులుగా చేస్తాడు. అవి వ్యర్థతిథులుగా మిగిలిపోయి ఎందుకూ పనికిరానివయిపోతాయి.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **సమర్పయతి :** | **సమర్పయతి** | సమర్పయతః | సమర్పయన్తి |
| | సమర్పయసి | సమర్పయథః | సమర్పయథ |
| | సమర్పయామి | సమర్పయావః | సమర్పయామః. * |

**శ్లో॥ విషయేషూపభుక్తేషు తృతీయోఽంశోఽస్య జీర్యతి ।**
**శిష్టస్తు విషసారూప్యాత్ కష్టాయ పరికల్పతే ॥ 12-68**

**అ :** 'విషయ' పదాన్ని మూడు ముక్కలు చేసి చమత్కరిస్తూ విషయాసక్తిని నిరసించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** ఉపభుక్తేషు విషయేషు తృతీయః అంశః అస్య జీర్యతి. శిష్టం తు విష-సారూప్యాత్ కష్టాయ పరికల్పతే.

**ప్ర :** ఉపభుక్తేషు = అనుభవింపబడిన, విషయేషు = విషయాలలో (ఇంద్రియార్థాలలో), తృతీయః అంశః = మూడవ భాగం, అస్య = ఆ రాజుకు, జీర్యతి = జీర్ణమవుతుంది. (జ్యా వయోహానౌ -దివాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), శిష్టం తు = మిగిలినది ('విషయ'ంలో మూడవభాగం 'య' జీర్ణం కాగా మిగిలిన భాగం 'విషం'), విష-సారూప్యాత్ = విషంతో సమానం కాబట్టి (విషేణ సారూప్యం తస్మాత్), కష్టాయ = కష్టాలకే, పరికల్పతే = కారణమవుతుంది. (పరి-కప్ సామర్థ్యే - ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇంద్రియార్థాలు - రూప రస గంధాలు - విషయాలు. వాటిని అనుభవించినప్పుడు మూడవ భాగం మాత్రమే జీర్ణం కాగా ('విషయం'లో 'య' నశించి 'విష' మిగులుతుంది) మిగిలింది విషంతో సమానం కాబట్టి కష్టాలకే కారణమవుతుంది.

**వి :** 1. విషయానుభవం పర్యంతక్లేశకారి అని తాత్త్వికభావన. అయితే విషయానుభవం అపరిహార్యం కాబట్టి అనాసక్తంగానైనా దానిని కొనసాగించవలసినదే అన్నది ఒకమౌలిక భావన. కర్మఫలనిరపేక్షంగా విషయానుభవం కావలసినదే అని కృష్ణతత్త్వం.

శ్లో. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మా కర్మఫలహేతుర్భూః మా తే సంగోస్త్వకర్మణి ॥ - భగవద్గీత 2/47

విషయంలో తృతీయాంశమే జీర్ణమవుతుంది మిగిలినది మాత్రమే కష్టాన్ని కలిగి-స్తుందనటం పదచమత్కారమే కానీ ప్రమాణసిద్ధంకాదు. కవి వివక్షకూడా చమత్కార పర్యవసాయియే.

| | | | |
|---|---|---|---|
| 2. **జీర్యతి :** | **జీర్యతి** | జీర్యతః | జీర్యన్తి |
| | జీర్యసి | జీర్యథః | జీర్యథ |
| | జీర్యామి | జీర్యావః | జీర్యామః |
| **పరికల్పతే :** | **పరికల్పతే** | పరికల్పేతే | పరికల్పన్తే |
| | పరికల్పసే | పరికల్పేథే | పరికల్పధ్వే |
| | పరికల్పే | పరికల్పావహే | పరికల్పామహే. |

*

**శ్లో॥ ఇత్యాద్యమాత్యవర్గోక్త - నీత్యా పృథ్వీం స పాలయన్ ।**
**భక్తిం ముకున్దే బిభ్రాణ-స్తత్యాజ విషయస్పృహామ్ ॥ 12-69**

**అ :** అమాత్యవర్గనీతి ప్రబోధోపసంహారం. -పథ్యావక్త్రమ్.

**అ :** ఇతి+ఆది+అమాత్య-వర్గ+ఉక్త-నీత్యా పృథ్వీంపాలయన్ ముకుందే భక్తిం బిభ్రాణః సః విషయస్పృహాం తత్యాజ.

**ప్ర :** ఇత్యా... నీత్యా : ఇతి = ఇంతవరకు చెప్పినవి, ఆది = మొదలుగా గల, అమాత్య = మంత్రులయొక్క, వర్గ = సమూహం చే, ఉక్త = చెప్పబడిన, నీత్యా = రాజనీతితో, పృథ్వీమ్ = రాజ్యాన్ని (నేలను), పాలయన్ = పాలిస్తూ

(పాల్ ధాతువుపై శతృ ప్రత్యయం), ముకుందే = కృష్ణునిపై, భక్తిమ్ = సేవాభావాన్ని, బిభ్రాణః = ధరిస్తూ(భృ ధాతువుపై శానచ్ ప్రత్యయం), సః = ఉగ్రసేనుడు, విషయ–స్పృహామ్ : విషయ = ఇంద్రియార్థాలపై, స్పృహామ్ = కోరికను(ఇచ్ఛా వాంఛా స్పృహా కాంక్షా–హలాయుధకోశః–710) (విషయేషు స్పృహా తామ్), తత్యాజ = వదలిపెట్టాడు.

**తా ॥** ఈ ప్రకారంగా, ఇంకా ఇటువంటి రీతిలోమంత్రివర్గం చెప్తున్న నీతిని అనుసరిస్తూ, కృష్ణునిపై భక్తిని ప్రదర్శిస్తూ ఉగ్రసేనుడు విషయాసక్తి విడిచిపెట్టాడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **తత్యాజ :** | **తత్యాజ** | తత్యజతుః | తత్యజుః |
| | తత్యజిథ | తత్యజథుః | తత్యజ |
| | తత్యాజ/తత్యజ | తత్యజివ | తత్యజిమ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గో ముదాం ద్వాదశః ॥ 12–70**

**అ :** సర్గాంత శ్లోకం.

**తా ॥** ముదామ్ = ఆనందాలయొక్క, ద్వాదశః సర్గః = పన్నెండవ సర్గ– మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో ద్వాదశః సర్గః.

**శ్రీః**





# శ్రీః
# త్రయోదశః సర్గః

**శ్లో॥నిజాగమాశాధృతజీవనానాం వ్రజాఙ్గనానాం హృది ఖేదశఙ్కీ ।**
**ఇమాం స్థితిం స్వస్య నిశమ్య రమ్యాం - స్వసూనుతాశాపగమాచ్చ పిత్రోః ॥ 13-1**

**శ్లో॥వ్రజం వ్రజేత్యాదిశదుద్ధవం స్వం - వ్రజేశ్వరోఽథాత్మవియోగవహ్నేః ।**
**ప్రతప్తముజ్జీవయితుం స్వవర్గం - సుఖార్థసన్దేశసుధాప్రవాహైః ॥ 13-2**

**అవతారిక :** కృష్ణుడు గోపికల దగ్గరకు ఉద్ధవుని ఆదేశించటం. -ఉపేంద్రవజ్ర.

**అన్వయం :** అథ వజ్ర+ఈశ్వరః రమ్యామ్ ఇమాం స్వస్య స్థితిం నిశమ్య నిజ+ఆగమ+ఆశా-ధృత-జీవనానాం వ్రజ+అంగనానాం పిత్రోః స్వ-సూనుతా+ఆశా+అపగమాత్ చ హృది ఖేద-శంకీ(సన్) ఆత్మవియోగవహ్నేః ప్రతప్తం స్వ-వర్గం. సుఖ+అర్థసందేశ-సుధా-ప్రవాహైః ఉజ్జీవయితుం వ్రజం వ్రజ ఇతి స్వమ్ ఉద్ధవమ్ ఆదిశత్.

**ప్రతిపదార్థం :** అథ = ఆ తరువాత, వ్రజ+ఈశ్వరః = కృష్ణుడు (వ్రజస్య ఈశ్వరః), రమ్యామ్ = మనోజ్ఞమైన, ఇమామ్ = ఈ, స్వస్య = తనయొక్క, స్థితిమ్ = పరిస్థితిని/నిలకడను, నిశమ్య = విని (ని-శమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నిజా... నానామ్ : నిజ = తనయొక్క, ఆగమ = రాకయందలి, ఆశా = ఆశచేత, ధృత = ధరింపబడిన, జీవనానామ్ = ప్రాణాలుగల (నిజస్య ఆగమే ఆశయా ధృతాని జీవనాని యాభిః, తాసామ్), వ్రజ+అంగనానామ్ = గోపకాంతలకు (వ్రజే అంగనాః తాసామ్), పిత్రోః = తల్లిదండ్రులకూ (యశోదా నందులకు), స్వ... గమాత్ చ : స్వ-సూనుతా = తమ కుమారుడనే, ఆశా = ఆశయొక్క, అపగమాత్ చ = తొలగిపోవుట వలన, (స్వస్య సూనుః తస్య భావః తస్యామ్ ఆశా తస్యాః అపగమః తస్మాత్), హృది = మనస్సులో, ఖేద-శంకీ (సన్) = దుఃఖాన్ని శంకించిన వాడై, ఆత్మ-వియోగ-వహ్నేః : ఆత్మ = తనయొక్క, వియోగ+వహ్నేః = విరహాగ్నివలన (ఆత్మనః వియోగః ఏవ వహ్నిః తస్మాత్), ప్రతప్తమ్ = తపించివున్న, స్వ-వర్గమ్ = తనవారిని, సుఖా... ప్రవాహైః : సుఖ+అర్థ = (వారి) సుఖమే ప్రయోజనమైన, సందేశ = సందేశాలనే, సుధా-ప్రవాహైః = అమృతప్రవాహాలతో (సుఖమ్ ఏవ అర్థః తే చ తే సందేశాః త ఏవ సుధాప్రవాహాః, తైః), ఉత్-జీవయితుమ్ = బాగా బ్రతుకజేయాలని, వ్రజమ్ = గోకులానికి, వ్రజ = వెళ్ళు, (వ్రజ గతౌ పరస్మైపది-లోట్-మ.ఏ.), ఇతి = అని, స్వమ్ = తనవాడైన, ఉద్ధవమ్ = ఉద్ధవుని, ఆదిశత్ = ఆజ్ఞాపించాడు. (ఆ-దిశ అతిసర్జనే-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తాత్పర్యం ॥** కృష్ణుడు (మథురలో తన కర్తవ్యం ముగియగానే) తాను వస్తానని ఆశతో ప్రాణాలు నిలుపుకొని

వున్న గోపకాంతల హృదయావేదననూ, కృష్ణుడు తమకుమారుడు అన్న భావనతో అప్పటిదాకా ఆనందంగా వున్న యశోదానందులలో ఆ ఆశ తొలగిపోయినందువలన కలుగుతున్న మనఃఖేదాన్ని తలచుకొన్నాడు. పైపెచ్చు ప్రస్తుతం తాను ప్రశాంతంగా వున్న విషయం వారు వినే వుంటారు. అటువంటి తన వారికి తన విరహాగ్నివలన కలుగుతున్న తాపాన్ని శుభసందేశమనే సుధాప్రవాహాలతో ఉపశమింపజేసి వారిని ఉజ్జీవింపజేయాలన్న తలంపుతో 'గోకులానికి వెళ్ళ'మని తనవాడైన ఉద్ధవుని ఆదేశించాడు.

**విశేషాలు :** 1. కృష్ణుడు ఉద్ధవుని గోపకులానికి పంపటంలోని ఆంతర్యాన్ని నారాయణభట్టతిరి ఇలా సంభావించాడు.

శ్లో. స్మృత్వా స్మృత్వా పశుపసుదృశః ప్రేమభారప్రణున్నాః
కారుణ్యేన త్వమపి వివశః ప్రాహిణోరుద్ధవం తమ్ ।
కిం చాముష్మై పరమసుహృదే భక్తవర్యాయ **తాసాం**
**భక్త్యుద్రేకం సకలభువనే దుర్లభం దర్శయిష్యన్** ॥ – నారాయణీయమ్ 76/2

తన భక్తుడైన ఉద్ధవునికి సకలలోకాలలోనూ దుర్లభమైన గోపికల భక్తిని చూపాలని కృష్ణుడు ఉద్ధవుని పంపాడట.

2. కృష్ణుడు పంపిన సందేశ సుధాప్రవాహమిది పోతన మాటల్లో–

క. లౌకికమొల్లక న న్నా – లోకించు ప్రపన్నులకు లోఁబడి కరుణా
లోకములఁబోషింతును – నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్.

క. సందేహము మానుం డర – విందాననలార! మిమ్ము విడువను వత్తున్
బృందావనమున కని హరి – సందేశము పంపె నను ము సంకేతమునన్.

– పోతనభాగవతము 10/1434,1435

| | | | |
|---|---|---|---|
| 3. **వ్రజ :** | వ్రజతు/వ్రజతాత్ | వ్రజతామ్ | వ్రజన్తు |
| | **వ్రజ**/వ్రజతాత్ | వ్రజతమ్ | వ్రజత |
| | వ్రజాని | వ్రజావ | వ్రజామ |
| **ఆదిశత్:** | **ఆదిశత్** | ఆదిశతామ్ | ఆదిశన్ |
| | ఆదిశః | ఆదిశతమ్ | ఆదిశత |
| | ఆదిశమ్ | ఆదిశావ | ఆదిశామ. |

*

**శ్లో॥స చ ప్రియాయోగసముత్థసాధ్వసం – తదీయసన్దేశవరైర్విదూరయన్ ।**
**ప్రపన్నవాత్సల్యమదో మధుద్విషః – స్మరన్ శ్రమం వర్త్మని విస్మరన్ యయౌ ॥ 3**

**అ :** గోకులానికి ఉద్ధవుని ప్రయాణం. –వంశస్థమ్.

**అ :** ప్రియ–అయోగ–సముత్థ–సాధ్వసం తదీయ–సందేశ–వరైః విదూరయన్ మధు–ద్విషః అదః ప్రపన్న–వాత్సల్యం స్మరన్ వర్త్మని శ్రమం విస్మరన్ సః యయౌ.

**ప్ర :** ప్రియా... సాధ్వసమ్ : ప్రియ = ఇష్టుడైన కృష్ణునియొక్క, అయోగ = విరహంచేత, సముత్థ = కలిగిన, సాధ్వసమ్ = బిడియాన్ని (ప్రియస్య అయోగేన సముత్థం సాధ్వసం), తదీయ–సందేశ–వరైః : తదీయ = ఆ కృష్ణునియొక్క, సందేశ–వరైః = శ్రేష్ఠసందేశాలచేత (తదీయాః సందేశేషు వరాః తైః) (తదీయాః వరాశ్చ తే సందేశాః తైః), విదూరయన్ = దూరం చేస్తూ (వి దూర్ ధాతువుపై శతృప్రత్యయం), మధు–ద్విషః = కృష్ణునియొక్క (మధుం ద్వేష్టి ఇతి, తస్య), అదః = ఆ, ప్రపన్న–వాత్సల్యమ్ : ప్రపన్న = ఆశ్రయించినవారిపై నున్న, వాత్సల్యమ్

= వత్సలత్వాన్ని (ప్రపన్నేషు వాత్సల్యమ్, తత్), స్మరన్ = తలచుకొంటూ (స్మృ చింతాయాం–భ్వాది–పరస్మైపది–శతృప్రత్యయాంతం), వర్త్మని = బాటలో, శ్రమమ్ = అలసటను, విస్మరన్ = మరచిపోతూ, సః = ఆ ఉద్ధవుడు, యయౌ = వెళ్ళాడు. (యా ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఉద్ధవుడు గోకులానికి ప్రయాణమయ్యాడు. తనకిష్టుడైన కృష్ణుని వియోగం తనను బాధిస్తున్నా కృష్ణుడు గోపికలకు పంపిన సందేశవచనాలలోని సారంతో దానిని దూరం చేసుకొంటూ, మధుసూదనుని ఆశ్రితవత్సలత్వాన్ని తలచుకొంటూ, ఆ తలపులతో మార్గాయాసాన్ని మరచిపోతూ ప్రయాణం చేశాడు.

**వి :** 1. శ్లో॥ మామేవ దయితం ప్రేష్ఠమాత్మానం మనసా గతాః ।
యే త్యక్తలోకధర్మాశ్చ మదర్థే తాన్ బిభర్మ్యహమ్ ॥ – భాగవతమ్ 10/46/4

అది కృష్ణుడు ఉద్ధవుని ద్వారా గోపికలకు పంపిన సందేశం. నా కోసం లోకధర్మాలను సైతం త్యజించి నన్నే మనసా చేరిన వారిని నేను భరిస్తానని భావం. ఆ సందేశసారమే ఉద్ధవునికి కలిగిన వియోగభారాన్ని దూరం చేస్తోంది. ఆ సందేశంలోనే కృష్ణుని ప్రపన్న–వత్సలత్వం కూడా కనిపిస్తుంది.

శ్లో॥ అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ – భగవద్గీత–9/22

అని భవిష్యత్తులో కూడా కృష్ణుడు ఆ భరోసానే ఇవ్వబోతున్నాడు, అర్జునుడి పేర అనన్యభావన గల భక్తులందరికీ.

| | | | |
|---|---|---|---|
| 2. **యయౌ:** | యయౌ | యయతుః | యయుః |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

## శ్లో॥ నిశాముఖే గోనికురమ్బమీశితు–ర్వ్రజం విశన్ సోఽథ దదర్శ మణ్డితమ్ ।
## పరిస్ఫురద్వేణువినోదవేదిత–స్వభర్తృలీలారసగోపబాలకైః ॥ 13–4

**అ :** ఉద్ధవుడు ప్రదోషసమయంలో గోకులంలో ప్రవేశించటం. –వంశస్థమ్.

**అ :** అథ సః నిశా–ముఖే ఈశితుః వ్రజం విశన్ పరిస్ఫురత్–వేణు–వినోద–వేదిత–స్వ–భర్తృ–లీలా–రస–గోప–బాలకైః మండితం గో–నికురంబం దదర్శ.

**ప్ర :** అథ = అటు తరువాత, సః = ఆ ఉద్ధవుడు, నిశా–ముఖే = ప్రదోష (సంజె) వేళలో (ప్రదోషో రజనీముఖమ్–అమరకోశః–కాల–6), ఈశితుః = ప్రభువైన కృష్ణునియొక్క, వ్రజమ్ = గోకులాన్ని, విశన్ = ప్రవేశిస్తూ (విశ ధాతువుపై శతృ ప్రత్యయం), పరిస్ఫురత్... బాలకైః : పరిస్ఫురత్ = ప్రకాశిస్తున్న, వేణు = పిల్లనగ్రోవిని, వినోద = ఊదుట అను వినోదంచేత, వేదిత = తెలుపబడిన, స్వ = తనయొక్క, భర్తృ = స్వామియొక్క, లీలా = విలాసాలమీద, రస = ఆసక్తిగల, గోప–బాలకైః = గోపబాలకులచే, మండితమ్ = అలంకరింపబడిన, గో–నికురంబమ్ = గోవుల సమూహాన్ని (సముదయ సార్థయూథ నికురంబ–హలాయుధకోశః–686), దదర్శ = చూశాడు. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఉద్ధవుడు సంధ్యాసమయానికి గోకులాన్ని చేరాడు. వెళుతూ గోపబాలకులనూ, గోవుల సమూహాన్ని కూడా చూశాడు. ఆ గోపబాలకులందరూ వేణువునూదుతూ తమ స్వామి అయిన కృష్ణుని లీలారసాన్ని తెలియబరుస్తున్నారు.

**వి :** 1. లీలలకు – అద్భుతచేష్టలకు – రసత్వాన్ని కల్పించటం కృష్ణావతారంలోనే కనిపిస్తుంది. శృంగారాది నవరసాలనూ, తాను ఆస్వాదిస్తూ, ఆస్వాదింపజేస్తూ జీవితాన్నే ఒక లీలగా తన అవతారాన్నే లీలావతారంగా ప్రదర్శించటం కృష్ణుని విషయంలోనే కనిపిస్తుంది. అందుకే రామాయణం ధర్మనిరూపకమూ, మహాభారతం

అధర్మప్రదర్శకమూ, కాగా భాగవతం ధర్మాధర్మవిచికిత్సారూపమైంది. చైతన్యానికి నియతస్వరూపముండదని ప్రజలు గ్రహించ గలగటం, తద్వారా జీవితాలను దిద్దుకొనగలగటం అక్కడ లక్ష్యం. అందుకే నారాయణతీర్థులు కృష్ణ జీవితాన్ని గానంచేస్తూ కృష్ణలీలా తరంగిణి అన్నాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **దదర్శ :** | **దదర్శ** | దదృశతుః | దదృశుః |
| | దదర్శిథ | దదృశథుః | దదృశ |
| | దదర్శ | దదృశివ | దదృశిమ. * |

**శ్లో॥ ఉత్క్షిప్తపుచ్ఛముదితాల్పరవాభిరామం**
**వత్సం స్మ ధావనవిలాసవికమ్పితాఙ్గమ్ ।**
**వీక్ష్యానుధావనపరాఽధ్వని గౌః స్వవర్గ-**
**మన్వేతు కృష్ణ ఇతి వక్తి తదోద్ధవాయ ॥** **13-5**

**అ :** ఆవుకు దూడపై గల వత్సలతను తద్వారా కృష్ణతత్త్వనిరూపణ. -వసంతతిలక.

**అ :** అధ్వని ఉత్క్షిప్త-పుచ్ఛమ్ ఉదిత-అల్ప-రవ+అభిరామం ధావన-విలాస-వికంపిత+అంగం వత్సం వీక్ష్య అనుధావన-పరా గౌః తదా కృష్ణః స్వ-వర్గమ్ అన్వేతు ఇతి ఉద్ధవాయ వక్తి.

**ప్ర :** అధ్వని = బాటలో, ఉత్క్షిప్తపుచ్ఛమ్ : ఉత్క్షిప్త = పైకెత్తిన, పుచ్ఛమ్ = తోకగలదీ (ఉత్క్షిప్తః పుచ్ఛః యేన తమ్), ఉదిత... రామమ్ : ఉదిత = పుట్టిన, అల్ప-రవ = చిన్న అరుపులతో, అభిరామమ్ = అందమైనదీ (ఉదితః అల్పశ్చ అసౌ రవః, తేన అభిరామః, తమ్), ధావన... తాంగమ్ : ధావన = పరుగుయొక్క, విలాస = విలాసంచేత, వికంపిత = వణుకుతున్న (అటు ఇటూ కదులుతున్న), అంగమ్ = శరీరావయవాలు గలదీ అయిన (ధావనే విలాసః, తేన వికంపితాని అంగాని యస్య, తమ్), వత్సమ్ = (ఆవు) దూడను (తర్ణకః స్మర్యతే వత్సః-హలాయుధకోశః -264), వదతి ఇతి వత్సః, (వృతౄవదిహ-నికమికషిభ్యః సః' (**ఉణాది-342**) సూత్రంతో వద్ ధాతువుపై స ప్రత్యయం), వీక్ష్య = చూసి (వి+ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అనుధావన-పరా = వెంటపరుగెత్తుటలో ఆసక్తయైన, గౌః = ఆవు, తదా = అప్పుడు, కృష్ణః = కృష్ణుడు, స్వ-వర్గమ్ = తనవారి సమూహాన్ని, అను+ఏతు = అనుసరించునుగాక, ఇతి = అని, ఉద్ధవాయ = ఉద్ధవుడికి, వక్తి = చెప్తోంది. (వచ పరిభాషణే అదాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోకులంలోనికి ఉద్ధవుడు ప్రవేశించేవేళలో గోవులు కూడా ఇళ్ళకు చేరుకొంటున్నాయి. తల్లి వస్తున్నదన్న సంబరంతో ఇంటనున్న దూడ తోకను పైకెత్తి, 'అంబా' అని మెల్లగా అరుస్తూ పరుగు సొగసుతో శరీరమంతా కదలుతుండగా ఎదురు వెళ్ళి అమ్మను చూసి మళ్ళీ ఇంటివైపు పరుగెత్తుతుంటే ఆ తల్లికూడా వెంటబడి పరుగుపెడుతోంది. పరుగిడుతున్న ఆ ఆవు 'కృష్ణుడు కూడా ఇలాగే తనవారి వెంటబడి రావాలి' అని ఉద్ధవుడికి చెప్తున్నట్లుందట.

**వి :** 1. **గో గోవత్స స్వభావవర్ణన మీ శ్లోకంలో రమణీయంగా వుంది. 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్'** - (కు.160). జాతి గుణక్రియా స్వభావాల వర్ణన స్వభావోక్త్య-లంకారం. ఇక్కడ గోజాతి స్వభావం వర్ణింపబడింది.

'ఉద్ధవాయ వక్తి' అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది. వాచ్యంగా ఉత్ప్రేక్షాబోధక పదాలు లేవు కాబట్టి. ఎందుకంటే ఆవు అక్కడ ఏమీ చెప్పటం లేదు. కానీ 'చెపుతున్నట్లుంది' అని కవికి అనిపించింది. అది సంభావన. **'సంభావనా స్యాదుత్ప్రేక్షా'** (కు.32)

| | | | | |
|---|---|---|---|---|
| 2. వక్తి : | **వక్తి** | వక్తః | – | |
| | వక్షి | వక్థః | వక్థ | |
| | వచ్మి | వచ్వః | వచ్మః. | * |

**శ్లో॥గోధూళిధూసరమనోజ్ఞశరీరకాన్తీన్ – గోపాన్ నిరీక్ష్య కరసఙ్గతవేణుశృఙ్గాన్ ।**
**కృష్ణస్య శైశవవిలాసమనుస్మరన్ స – మోదామ్బుపూర్ణనయనః పులకాఙ్కితోఽభూత్॥6**

**అ :** బాలకృష్ణునివలె కనిపిస్తున్న గోపబాలురను చూసి ఉద్ధవుడు కృష్ణుని బాల్యస్వరూపాన్ని భావించి ఆనందించటం.
–వసంతతిలక.

**అ :** గో–ధూళి–ధూసర–మనోజ్ఞ–శరీర–కాంతీన్ కర–సంగత–వేణు–శృంగాన్ గోపాన్ నిరీక్ష్య కృష్ణస్య శైశవ–విలాసమ్ అనుస్మరన్ సః మోద+అంబు–పూర్ణ–నయనః పులక+ అంకితః అభూత్.

**ప్ర :** గో... కాంతీన్ : గోధూళి =ఆల దుమ్ముయొక్క, ధూసర = బూడిదరంగుతో, మనోజ్ఞ = అందమైన, శరీర–కాంతీన్ = దేహకాంతిగలవారూ, (గవాం ధూల్యా ధూసరాణి మనోజ్ఞాని చ తాని శరీరాణి, తేషాం కాంతిః, తయా), కర... శృంగాన్ : కర = చేతులలో, సంగత = చేరివున్న, వేణు–శృంగాన్ = వేణుశృంగమనే వాద్యం గలవారూ అయిన (కరేషు సంగతాని వేణుశృంగాణి యేషాం తాన్), గోపాన్ = గోపులను, నిరీక్ష్య = చూసి, కృష్ణస్య = కృష్ణుని యొక్క, శైశవ–విలాసమ్ = పసితనపు చేష్టలను (శైశవస్య విలాసమ్), అనుస్మరన్ =తలచుకొంటూ, సః = ఆ ఉద్ధవుడు, మోద... నయనః : మోద+అంబు = ఆనందాశ్రువులతో, పూర్ణ = నిండిన, నయనః = కన్నులుగలవాడూ, పులక+అంకితః = పులకలచే గుర్తింపబడిన వాడూ, అభూత్ = అయ్యాడు (భూ సత్తాయామ్–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** గోధూళి వేళలో గోవులను మరలించుకొని వస్తున్న గోపబాలుర శరీరాలు దుమ్ముతో బూడిదరంగులో అందంగా వున్నాయి. వారి చేతుల్లో వేణుశృంగవాద్యాలున్నాయి. అవి చూసి ఉద్ధవుడు పసితనంలోని కృష్ణుని తలచుకొని కన్నులలో ఆనందాశ్రువులు నింపుకొని పులకించి పోయాడు.

**వి :** 1. ఇక్కడ స్మృత్యలంకారం (స్మరణం కాబట్టి), పసితనంలోని కృష్ణునిరూపాన్ని భావించటం కాబట్టి భావికాలంకారం కనిపిస్తాయి. '**భావికం భూతభావ్యర్థసాక్షాత్కారస్య వర్ణనమ్**' – (కు.161)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ | |
| | అభూః | అభూతమ్ | అభూత | |
| | అభూవమ్ | అభూవ | అభూమ. | * |

**శ్లో॥తాః కృష్ణభుక్తవరభూషణవస్త్రమాల్యం – భృత్యం నిరీక్ష్య నిజనాథధియేవ గావః ।**
**ఉన్నమ్రకన్ధరముదీరితకర్ణయుగ్మం – పశ్యన్త్య ఉద్ధవమనోఽభ్యుదయం వితేనుః॥7**

**అ :** గోవులు ఉద్ధవుని తమ స్వామిగా భావించి వినమ్రతను ప్రదర్శించటం. –వసంతతిలక.

**అ :** కృష్ణ–భుక్త–వర–భూషణ–వస్త్ర–మాల్యం భృత్యం నిరీక్ష్య నిజ–నాథ–ధియా+ఇవ ఉన్నమ్రకంధరమ్ ఉదీరిత–కర్ణ–యుగ్మం పశ్యన్త్య తాః గావః ఉద్ధవ–మనః+అభ్యుదయం వితేనుః.

**ప్ర :** కృష్ణ... మాల్యమ్ : కృష్ణ = కృష్ణునిచే, భుక్త = అనుభవింపబడ్డ, వర = శ్రేష్ఠమైన, భూషణ = నగలు, వస్త్ర = ఉడుపులు, మాల్యమ్ = మాలలు గల (కృష్ణేన భుక్తాని వరాని చ తాని భూషణాని వస్త్రాణి మాల్యాని చ యస్య తమ్), భృత్యమ్ = కృష్ణసేవకుని, నిరీక్ష్య = చూసి, నిజ–నాథ–ధియా ఇవ : నిజ = తమయొక్క, నాథ = ప్రభువు

అను, ధియా+ఇవ = బుద్ధిచేతనో అన్నట్లు (నిజానాం నాథః ఇతి ధీః తయా ఇవ), ఉత్-నమ్ర-కంధరమ్ : ఉత్-నమ్ర = మోరసాచిన, కంధరమ్ = మెడలతో (ఉన్నమ్రః కంధరః యథా తథా), ఉదీరిత-కర్ణ-యుగ్మమ్ : ఉదీరిత = నిక్కబొడిచిన, కర్ణ = చెవులయొక్క, యుగ్మమ్ = జంటతో (ఉదీరితయోః కర్ణయోః యుగ్మం యథా తథా), పశ్యన్త్యః = చూస్తూ, తాః = ఆ, గావః = ఆవులు, ఉద్ధవ-మనః+అభ్యుదయమ్ : ఉద్ధవ = ఉద్ధవునియొక్క, మనః =మనస్సు నకు, అభ్యుదయమ్ = పొంగును, వితేనుః = కలిగించాయి. (వి-తనూ విస్తారే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ఇంటికి మరలివస్తున్న ఆవులు ఉద్ధవుని చూశాయి. ఉద్ధవుడు ధరించిన మాలలు, వస్త్రాలు, నగలు కృష్ణభుక్తశేషాలని గ్రహించాయి. అందుకే ఉద్ధవుని తమ స్వామిగా భావించాయి. మోరసాచి, చెవులు నిక్కబొడుచుకొనేటట్లు ఉద్ధవుని చూశాయి. దానితో ఉద్ధవుని మనస్సు పొంగిపోయింది.

**వి :** 1. ఉచ్ఛిష్టా (ఎంగిలి)న్ని స్వీకరించటం భక్తిభావానికి ఆత్మీయతావ్యక్తీకృతికి ప్రముఖమైన అనుభావంగా అనాదిగా భావింపబడుతోంది. శబరి రుచిచూసిన ఫలాలను రాముడు తిన్నట్లు రామాయణగాథ. గోకులంలోని దాదాపు ప్రతిఇంటా కృష్ణభుక్తశేషాన్ని ఏదో ఒకరోజు తినే వుంటారు. ఆహారపదార్థాలే కాక వాడి వీడిన వస్తువులు ఏవైన భుక్తశేషాలే. కృష్ణుడు ధరించిన వస్త్రమాల్యాదులు ఆ ఆవుల కిప్పటికీ గుర్తే. ఈరోజుకు కూడా దేవాలయాలే శేషవస్త్రప్రదానం/ స్వీకరణం గొప్ప గౌరవం క్రింద లెక్క. దేవునకలంకరించిన పూలమాలలను స్వీకరించటం గొప్ప అదృష్టంగానే భావిస్తారు ముత్తైదువలు. గోదా భుక్తశేషాన్ని కూడా విష్ణువు పరమానందకారణంగా భావించాడు గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **వితేనుః :** | వితతాన | వితేనతుః | **వితేనుః** |
| | వితేనిథ | వితేనథుః | వితేన |
| | వితతాన/వితతన | వితేనివ | వితేనిమ. |

*

**శ్లో॥ దిదేశ యం ప్రీతమనాః స్వవర్గే - నిజం వ్రజం ప్రత్యరవిన్దనేత్రః ।**
**వివేశ సోఽప్యుద్ధవమేవ దూరా-న్నివేశయన్ ద్రష్టృవిలోచనేషు ॥ 13-8**

**అ :** ఉద్ధవుని చూసిన గోపాలకులకు నేత్రోత్సవం కలిగినదనుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ-వర్గే ప్రీత-మనాః అరవింద-నేత్రః యమ్ (ఉద్ధవం) నిజం వ్రజం దిదేశ సః అపి దూరాత్ ఏవ ద్రష్టృ-విలోచనేషు ఉద్ధవమ్ ఏవ నివేశయన్ వ్రజం వివేశ.

**ప్ర :** స్వ-వర్గే = తనవారి (భక్తుల) సమూహంపై (స్వస్య వర్గః తస్మిన్), ప్రీత-మనాః = ఇష్టమున్న మనస్సుగలవాడై (ప్రీతం మనః యస్య సః), అరవింద-నేత్రః = కమలాక్షుడు (అరవిందే ఇవ నేత్రే యస్య సః), నిజమ్ = తనదైన (నిజం నిత్యే స్వకే ధర్మే-నానార్థమంజరి-పంక్తి-397), వ్రజం ప్రతి = గోకులానికి, యమ్ = ఎవనిని, దిదేశ = ఆదేశించాడో (దిశ అతిసర్జనే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), సః+అపి = ఆ ఉద్ధవుడున్నూ, దూరాత్-ఏవ = దూరంనుండియే, ద్రష్టృ-విలోచనేషు = చూపరుల కన్నులలో (ద్రష్టౄణాం విలోచనాని, తేషు), ఉద్ధవమ్-ఏవ = ఉత్సవాన్నే/ఆనందాన్నే (ఉద్ధునోతి దుఃఖమ్ ఇతి ఉద్ధవః) (ఉద్ధవః ఉత్సవః-హలాయుధకోశః-పు-172), నివేశయన్ = ప్రవేశింపజేస్తూ, వివేశ = ప్రవేశించాడు.

**తా ॥** అరవిందనేత్రుడయిన కృష్ణుడు తనవారిపై ప్రేమతో ఏ ఉద్ధవుని గోకులానికి పంపాడో ఆ ఉద్ధవుడు దూరంనుండియే చూపురుల కళ్ళలో ఉత్సవాన్ని నింపాడు (చూపరులకు కన్నులపండువయ్యాడు)

**వి :** 1. కృష్ణుడు ఉద్ధవుని గోకులానికి పంపటంలోని విశేషాన్ని భాగవతమిలా వర్ణించింది.

శ్లో॥ వృష్ణీనాం ప్రవరో మంత్రీ – కృష్ణస్య దయితః సఖా ।
శిష్యో బృహస్పతేః సాక్షా–దుద్ధవో బుద్ధిసత్తమః ॥ – భాగవతమ్ 10/46/1

వృష్ణివంశానికి మేటిమంత్రి, కృష్ణుని ప్రియసఖుడు, బృహస్పతి శిష్యుడు సాక్షాత్తూ పండుగవంటివాడు ఉద్ధవుడు.

| | | | |
|---|---|---|---|
| 2. **దిదేశ :** | **దిదేశ** | దిదిశతుః | దిదిశుః |
| | దిదేశిథ | దిదిశథుః | దిదిశ |
| | దిదేశ | దిదిశవ | దిదిశిమ |
| **వివేశ :** | **వివేశ** | వివిశతుః | వివిశుః |
| | వివేశిథ | వివిశథుః | వివిశ |
| | వివేశ | వివిశివ | వివిశిమ. |

*

**శ్లో॥గృహే గృహే కృష్ణకథామృతాతతం – తదర్చనాయాహృతధూపవాసితమ్ ।**
**స్రగమ్బరాలఙ్కృతిచన్దనాదిభి–ర్విభూషితస్త్రీపురుషం తదర్పితైః ॥ 13–9**

**అ :** గోకులంలో ప్రతిఇంటా కృష్ణ సమర్చనాభావం వెల్లివిరిసివుండుట.

**అ :** గృహే గృహే కృష్ణ–కథా+అమృత+ఆతతం తద్–అర్చనాయ ఆహృత–ధూప–వాసితం తద్–అర్పితైః స్రగ్–అంబర+అలంకృతి–చందన+ఆదిభిః విభూషిత–స్త్రీ–పురుషమ్ (**గోకులమ్ ఆప**) (9–10–11–12 శ్లోకాలు నాలుగూ కలిపి **కులకం**–12వ శ్లోకంలోని గోకులమ్ ఆప అన్న క్రియాపదం (కర్మపదంతో సహా) నాలుగు శ్లోకాలకూ వర్తిస్తుంది – **వంశస్థమ్**.

**ప్ర :** గృహే గృహే = ప్రతి ఇంటియందు, కృష్ణ... ఆతతమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, కథా+అమృత = కథ అనే అమృతంతో, ఆతతమ్ = వ్యాపించినదీ (కృష్ణస్య కథా ఏవ అమృతం, తేన ఆతతమ్), తద్–అర్చనాయ = కృష్ణుని అర్చించటానికి (తస్య అర్చనం తస్మై), ఆహృత–ధూప–వాసితమ్ : ఆహృత = కొనిరాబడిన, ధూప = ధూపంచేత, వాసితమ్ = పరిమళింపజేయబడినదీ (ఆహృతేన ధూపేన వాసితమ్), తద్–అర్పితైః = ఆ కృష్ణునకు సమర్పించిన (తస్మై సమర్పితాః, తైః), స్రగ... నాదిభిః : స్రక్ = మాలలు, అంబర = వస్త్రాలు, అలంకృతి = నగలు, చందన = గంధం, ఆదిభిః = మొదలగువానిచే, విభూషిత–స్త్రీ–పురుషమ్ : విభూషిత = అలంకరింపబడిన, స్త్రీ పురుషమ్ = స్త్రీలూ, పురుషులూ గలది అయిన (విభూషితాః స్త్రియః పురుషాశ్చ యస్మిన్ తత్), గోకులమ్ = గోకులానికి, ఆప = చేరాడు. (ఆప్ వ్యాప్తౌ–స్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** గోకులంలోని ప్రతిగృహంలోనూ స్త్రీ పురుష సమవాయం కనిపిస్తోంది. ఆ స్త్రీ పురుషులు కృష్ణకథామృతాస్వాదనలో వున్నారు. ఆ ఇళ్ళు కృష్ణసమర్చనకై తెచ్చిన ధూపంతో పరిమళిస్తున్నాయి. స్త్రీ పురుషులు కృష్ణునకు సమర్పించిన మాలలు, వస్త్రాలు, నగలు చందనాదులను అలంకరించుకొని వున్నారు.

**వి :** 1.కృష్ణమాయను జయించటానికి ఉపాయంగా ఉద్ధవుడు ఉచ్ఛిష్టస్వీకారాన్నే మార్గంగా ప్రబోధిస్తాడు.

శ్లో. త్వయోపభుక్తస్రగ్గంధవాసోఽలంకారచర్చితాః ।
ఉచ్ఛిష్టభోజినో దాసాస్తవ మాయాం జయేమహి ॥ – భాగవతమ్ 1/6/46

నీవు అనుభవించగా మిగిలిన మాలలు, గంధాలు, వస్త్రాలు అలంకారాలు స్వీకరించి, తినగా మిగిలిన దానిని భుజించి నీ దాసులమై నీ మాయను జయించగలం–

అందుకే గోకులమంతా ఆ బాటనే అనుసరించి కృష్ణునకై ఎదురు చూస్తోంది.

ఈ నిర్మాల్యధారణమన్నది భక్తికున్న 64 అంగాలలో ఒకటి. (ఈ 64 అంగాలకై చూడుడు-భక్తిరసామృతసింధుబిందు-విశ్వనాథచక్రవర్తిఠాకూర్-పు. 33,34) *

**శ్లో॥ శుకైర్హరేర్నామ గృణద్భిరావృతం - పికైశ్చ తద్వేణురవానువాదిభిః ।**
**ముకున్దపాదామ్బుజశోభినీరజ-స్థిరద్విరేఫైర్హరికిఙ్కరప్రభైః ॥ 13-10**

**అ :** గోకులంలోని శుకపిక ద్విరేఫాల సందడి.

**అ :** హరేః నామ గృణద్భిః శుకైః తద్-వేణు-రవ-అనువాదిభిః పికైః చ ముకుంద-పాద-అంబుజ-శోభి-నీరజ-స్థిర-ద్విరేఫైః హరి-కింకర-ప్రభైః ఆవృతమ్ (గోకులమ్ ఆప)

**ప్ర :** హరేః = కృష్ణునియొక్క, నామ = పేరును, గృణద్భిః = పలుకుతున్న, శుకైః = చిలుకలచే, తత్... వాదిభిః : తత్ = ఆ కృష్ణునియొక్క, వేణు = పిల్లనగ్రోవియొక్క, రవ = ధ్వనిని, అనువాదిభిః = అనుసరిస్తున్న, పికైః = కోయిలలచేతనూ, ముకుంద... ద్విరేఫైః : ముకుంద = కృష్ణునియొక్క, పాద = కాలియందలి, అంబుజ = పద్మరేఖలవలె, శోభి = ప్రకాశిస్తున్న, నీరజ = పద్మమందు, స్థిర = నిలకడగావున్న, ద్విరేఫైః = తుమ్మెదలచేతను, హరి-కింకర-ప్రభైః = విష్ణుకింకరులుగానున్న, (ఏతైః = వీటిచే), ఆవృతమ్ = ఆవరింపబడి యున్న, (గోకులమ్ ఆప = గోకులానికి చేరాడు.)

**తా ॥** ఆ గోకులంలోని చిలుకలు హరినామాన్ని పలుకుతున్నాయి. కోయిలలు ఆయన వేణురవాన్ని అనుసరిస్తున్నాయి. హరిపాదాలలోగల పద్మరేఖలవంటి కమలాలపై తుమ్మెదలు స్థిరంగా నిలిచివున్నాయి. ఇవన్నీ కృష్ణుని అనుచరులవలె కనిపిస్తున్నాయి. అటువంటి గోకులాన్ని చేరాడు ఉద్ధవుడు. *

**శ్లో॥ సదా ముకున్దాగమనాభిశఙ్కయా - సుపూర్ణకుమ్భైః శుభతోరణధ్వజైః ।**
**అలఙ్కృతద్వారచయం ఫలోచ్చయై-ర్విచిత్రరఙ్గావలిభిశ్చ రఞ్జితమ్ ॥ 13-11**

**అ :** కృష్ణుని రాకకై గోకులం సదా సన్నద్ధమై అలంకరించుకొని వుండుట.

**అ :** సదా ముకుంద+ఆగమన+అభిశంకయా సుపూర్ణ-కుంభైః శుభ-తోరణ-ధ్వజైః ఫల+ఉచ్చయైః అలంకృత-ద్వార-చయం విచిత్ర-రంగ+ఆవలిభిః రంజితం చ గోకులమ్ ఆప.

**ప్ర :** సదా = ఎల్లప్పుడు, ముకుంద... శంకయా : ముకుంద = కృష్ణునియొక్క, ఆగమన = రాకయొక్క, అభిశంకయా = అనుమానంచేత (నిజానికి ఏ క్షణాన అయినా వస్తాడేమో అన్న ఆశ) (ముకుందస్య ఆగమనస్య, అభిశంకా, తయా), సుపూర్ణ-కుంభైః = పూర్ణకుంభములతో, శుభ-తోరణ-ధ్వజైః : శుభ = శుభాన్ని సూచించే, తోరణ = తోరణాలతో, ధ్వజైః = పతాకలతో (శుభాః చ తే తోరణాః ధ్వజాశ్చ - తైః), ఫల+ఉచ్చయైః = పండ్ల సముదాయాలతో (ఫలానామ్ ఉచ్చయాః, తైః), అలంకృత ద్వార చయమ్ = అలంకరింపబడిన వాకిళ్ల సమూహము, విచిత్ర-రంగ-ఆవలిభిః చ : విచిత్ర = వివిధవిన్యాసాలు గల, రంగ-ఆవలిభిః చ = రంగవల్లులతో /ముగ్గులతో కూడా, రంజితమ్ =అలంకరింపబడిన, (గోకులమ్ ఆప = గోకులానికి చేరాడు.)

**తా ॥** ఉద్ధవుడు గోకులానికి చేరాడు. ఏ వేళనయినా కృష్ణుడు రావచ్చునన్న ఆశతో అక్కడ పూర్ణకుంభాలను సిద్ధంగా వుంచారు. వెలుపలి ద్వారాలకు మంగళతోరణాలు కట్టారు. రకరకాల పండ్లను అలంకారంగా వుంచారు. విచిత్ర రంగవల్లులతో ముంగిళ్ళ నలంకరించారు.

**వి :** 1. తోరణ శబ్దానికి వెలుపలి ద్వారమని అర్థం (శబ్దార్థకల్పద్రుమః-పుట-627), కానీ, అది వెలుపలి ద్వారానికి కట్టే పూలమాలలు, లేదా ఆకులతో కట్టిన మాలల వరుసలు (తోరణాలు) అనే అర్థంగా పరిణమించింది. తోరణాని కట్టే మాలాదులు తోరణాలు అయ్యాయి.

పెద్దలు, మాననీయులు వచ్చినపుడు పూర్ణకుంభాలతో స్వాగతం చెప్పటం ఇప్పటికీ సంప్రదాయంగా కొనసాగుతోంది. పదిమంది గుమిగూడే అవకాశమున్నచోట మామిడాకుల వంటి వాటితో తోరణాలు కట్టడం ఇప్పటికీ కనిపిస్తుంది. కాకపోతే వాటిని శుభకార్యాలకు పరిమితం చేశాం. శుభమైనా అశుభమైనా వాటి అవసరం మాత్రముంది. వెలుపలి ద్వారాల దగ్గర పండ్లు మాత్రం ప్రస్తుతం అలవాటులో లేదు. కాకపోతే అరటిగెలతో పాటు (కాయలు) అరటిబోదెలను తెచ్చి కడుతున్నారు. అదిశుభం కావచ్చునేమో కానీ సముచితం మాత్రం కాదు. పచ్చికాయలతో పాటు చెట్టును నరికివేయటం శుభమెలా అవుతుంది? రంగవల్లులు ముగ్గులు దేశంలోని కొన్ని ప్రాంతాలకు ముఖ్యంగా తెలుగు, కన్నడ ప్రాంతాలకు పరిమితమైన సౌందర్యమిది. *

**శ్లో॥ ముకున్దవీక్షాఫలకామ్యయాఽన్వహం - త్రికాలచీర్ణద్విజదేవతార్చనైః ।**
**తదీయలీలామృతపూర్ణసత్కథా-ధృతాసుభిః సఙ్కులమాప గోకులమ్ ॥ 13-12**

**అ :** గోకులం సదా ముకుందుని రాకకై ద్విజదేవతార్చనలు చేస్తున్నదని వర్ణించటం.

**అ :** (సః) అన్వహం ముకుంద-వీక్షా-ఫల-కామ్యయా త్రికాల-చీర్ణ-ద్విజ-దేవతా+అర్చనైః తదీయ-లీలా+అమృత-పూర్ణ-సత్-కథా-ధృత+అసుభిః సంకులం గోకులమ్ ఆప.

**ప్ర :** (సః = ఆ ఉద్ధవుడు), అన్వహమ్ = ప్రతిదినమూ, ముకుంద... కామ్యయా : ముకుంద = కృష్ణునియొక్క, వీక్షా = దర్శనమనే, ఫల = ఫలితంయొక్క, కామ్యయా = కోరికతో (ముకుందస్య వీక్షా ఏవ ఫలం, తస్య కామ్యా, తయా), త్రికాల... తార్చనైః : త్రికాల = మూడు కాలాలలోనూ (ఉదయం మధ్యాహ్నం, సాయం), చీర్ణ = చేయబడిన (చర ధాతువుపై నక్ ప్రత్యయం, "**పృషోదరాదీని యథోపదిష్టమ్**" (అష్టాధ్యాయి-6-3-109) సూత్రంతో అకారానికి ఈకారం.), ద్విజ = బ్రాహ్మణులయొక్క (ద్వే జన్మనీ యస్య సః ద్విజః), దేవతా = దేవతలయొక్క, అర్చనైః = పూజలతో (త్రయశ్చ తే కాలాః తేషు చీర్ణాని ద్విజానాం దేవతానాం చ అర్చనాని యైః తైః), తదీయ... సుభిః : తదీయ = ఆ కృష్ణునియొక్క, లీలా = లీల లనే, అమృత = అమృతంతో, పూర్ణ = నిండిన, సత్-కథా = సత్కథలచే, ధృత = ధరింపబడిన, అసుభిః = ప్రాణాలుగలవారితో (తదీయాః చ తాః లీలాః ఏవ అమృతం తేన పూర్ణాభిః చ తాభిః కథాభిః ధృతాః అసవ యైః తైః), సంకులమ్ = క్రిక్కిరిసినదీ అయిన (సంకీర్ణే సంకులాకీర్ణే-అమరకోశః-విశేష్య-86), గోకులమ్ = గోకులానికి, ఆప = చేరాడు. (ఆప్ వ్యాప్తౌ-స్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తమదగ్గరకు వచ్చి దర్శనమివ్వాలన్న కోరికతో త్రికాలాలలోనూ ద్విజదేవతార్చనలు కొనసాగుతున్నాయి. కృష్ణవియోగం దుస్సహమైనా వారు కృష్ణలీలామృతంతో నిండిన సత్కథలు చెప్పుకొంటూ ప్రాణాలు నిలుపుకొంటున్నారు. అటువంటి గోపకులతో క్రిక్కిరిసి వున్న గోకులానికి చేరాడు ఉద్ధవుడు.

**వి :** 1. లీలా-అమృతమని లీలలో అమృతత్వాన్ని ఆరోపించటం రూపకాలంకారం. ఇక్కడ ఈ రూపకం అలంకారమాత్రంగా కాక అలంకారత్వాన్ని సార్థకం చేసికొంటోంది. కథలతో వారు ప్రాణాలు నిలుపుకొంటున్నారని ప్రతిపాదన. ప్రాణాలు నిలవటానికి అత్యంతమూ ఉపయోగపడేది అమృతం. కాబట్టి లీలామృతమన్నది సార్థకమైన రూపకం.

2. ఉద్ధవుడు ప్రవేశించిన వేళలో గోకుల మిలా వున్నట్లు భాగవతం-

శ్లో. ప్రాప్తో నందవ్రజం శ్రీమాన్ నిమ్లోచతి విభావసౌ ।
ఛన్నయానః ప్రవిశతాం పశూనాం ఖురరేణుభిః ॥

శ్లో. వాసితార్థేఽభియధ్యద్భిర్నాదితం శుష్మిభిర్వృషైః ।
ధావంతీభిశ్చ వాస్రాభిరూధోభారైః స్వవత్సకాన్ ॥

శ్లో. ఇతస్తతో విలంఘద్భిర్గోవత్సైర్మండితం సితైః ।
గోదోహ శబ్దాదిరవం వేణూనాం నిస్స్వనేన చ ॥

శ్లో. గాయంతీభిశ్చ కర్మాణి శుభాని బలకృష్ణయోః ।
స్వలంకృతాభిర్గోపీభిర్గోపైశ్చ సువిరాజితమ్ ॥

శ్లో. అగ్న్యర్కాతిథిగోవిప్రపితృదేవతార్చనాన్వితైః ।
ధూపదీపైశ్చ మాల్యైశ్చ గోపావాసైర్మనోరమమ్ ॥

శ్లో. సర్వతః పుష్పితవనం ద్విజాళికులనాదితమ్ ।
హంసకారండవాకీర్ణైః పద్మషండైశ్చ మండితమ్ ॥ – భాగవతమ్ 10/46/8-13

| | | | |
|---|---|---|---|
| 3. **ఆప :** | **ఆప** | ఆపతుః | ఆపుః |
| | ఆపిథ | ఆపథుః | ఆప |
| | ఆప | ఆపివ | ఆపిమ |

*

**శ్లో॥ తతో వివేశ నన్దస్య సదనం సహసోద్ధవః ।**
**అన్యేషామపి చేతస్సు న్యయుఙ్క్త పరముద్ధవమ్ ॥ 13-13**

**అ :** ఉద్ధవుడు నందుని ఇంటికి చేరుట. –పథ్యావక్త్రమ్.

**అ :** తతః ఉద్ధవః సహసా నందస్య సదనం వివేశ అన్యేషాం చేతస్సు అపి పరమ్ ఉద్ధవం న్యయుంక్త.

**ప్ర :** తతః = ఆ తరువాత, ఉద్ధవః = ఉద్ధవుడు, సహసా = వెంటనే, నందస్య = నందుని యొక్క, సదనం = ఇంటిలోనికి, వివేశ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), అన్యేషామ్ = ఇతరులయొక్క, చేతస్సు అపి = మనస్సులలో కూడా, పరమ్ = అతిశయించిన (మిక్కిలిగా), ఉద్ధవమ్ = ఆనందాన్ని (ప్రీతిరుత్కర్ష ఉద్ధవః-హలాయుధకోశః-123), న్యయుంక్త = కలిగించాడు. (ని యుజ్ యోగే-రుధాది-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత ఉద్ధవుడు నందుని ఇంటికి చేరాడు. ఇతరుల మనస్సులలో కూడా పరమానందాన్ని కల్గించాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. వివేశ :** | **వివేశ** | వివిశతుః | వివిశుః |
| | వివేశిథ | వివిశథుః | వివిశ |
| | వివేశ | వివిశివ | వివిశిమ |
| **న్యయుంక్త :** | **న్యయుంక్త** | న్యయుంజాతామ్ | న్యయుంజత |
| | న్యయుంక్థాః | న్యయుంజాథామ్ | న్యయుఙ్గ్ధ్వమ్ |
| | న్యయుంజి | న్యయుంజ్వహి | న్యయుంజ్మహి. |

*

**శ్లో॥ తమర్చయామాస స నందగోపః - స్వనందనాంఘ్ర్యమ్బుజలుబ్ధభృఙ్గమ్ ।**
**తథాహి లక్ష్మీశపదైకభక్తా-స్తదన్యదర్చన్తి తదీయబుద్ధ్యా ॥ 13-14**

**అ :** నందుడు ఉద్ధవుని స్వాగతించి సత్కరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః నంద-గోపః స్వ-నందన+అంఘ్రి+అంబుజ-లుబ్ధ-భృంగం తమ్ అర్చయామాస. తథాహి లక్ష్మీ+ఈశ-పద+ఏక-భక్తాః తద్-అన్యత్ తదీయ-బుద్ధ్యా అర్చన్తి.

**ప్ర :** సః = ఆ, నంద-గోపః = నందుడు అనే గోపాలుడు, స్వ... భృంగమ్ : స్వ = తనయొక్క, నందన =

కుమారునియొక్క (నందయతి ఇతి నందనః), అంఘ్రి+అంబుజ = పాదపద్మాలపై, లుబ్ధ = ఆశగల, భృంగమ్ = తుమ్మెద అయిన (స్వస్య నందనః, తస్య అంఘ్రీ ఏవ అంబుజే, తయోః లుబ్ధశ్చ అసౌ భృంగః తమ్), తమ్ = ఆ ఉద్ధవుని, అర్చయామాస = పూజించాడు. (అర్చ పూజాయామ్ చురాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తథాహి = అది యుక్తమే, లక్ష్మీ... భక్తాః : లక్ష్మీ+ఈశ = కృష్ణునియొక్క, పద+ఏక = పాదాలమీదనే, భక్తాః = భక్తిగలవారు (లక్ష్మ్యాః ఈశః, తస్య పదయోః ఏకయోః ఏవ భక్తాః), తద్-అన్యత్ = కృష్ణభిన్నమైనదానిని కూడా (తస్మాత్ అన్యత్), తదీయ-బుద్ధ్యా : తదీయ = కృష్ణ సంబద్ధమే అను, బుద్ధ్యా = జ్ఞానంతో, అర్చన్తి = పూజిస్తాడు. (అర్చ పూజాయామ్ భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** తన కుమారుని పాదపద్మాలపై లోభం గల తుమ్మెదవంటి ఆ ఉద్ధవుని నందగోపుడు సమర్చించాడు. నిజమే. కృష్ణుని చరణాల మీదనే భక్తి గలవారు కృష్ణునికి భిన్నమైన దంతా తత్స్వరూపమే అన్న భావనతో దానిని పూజిస్తారు.

**వి :** 1. మనకు దూరమైన వారు మనలను గూర్చి ఆలోచిస్తున్నారా? లేదా? అన్న విచికిత్స మనషులకు అత్యంతమూ సన్నిహితమయిన భావన. దానినే మనతో వారికిగల ఆత్మీయతకూ, అనురాగానికీ ప్రమాణంగా భావిస్తాం. గోకులంతో కృష్ణునకున్న బంధం చాలా గట్టిది. ఆ దశలో కృష్ణుడు తమను స్మరిస్తున్నాడా? లేదా? అన్నది వారి మనస్సులలోని ప్రగాఢమైన ఆందోళన. దానిని వ్యక్తం చేస్తూ నందుడు అడుగుతున్నాడు ఇలా ఉద్ధవుని.

శా. అన్నా! భద్రమె? తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే?
తన్నుం బాసిన గోపగోపికల మిత్రవ్రాతముం గోగణం
బు న్నిత్యంబుఁ దలంచునే వననదీభూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నఁడు వచ్చునయ్య! యిట మాఱ్ఱేపల్లెకున్ నుద్ధవా! -పోతనభాగవతము-10/1439

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది. పూర్వార్ధంలో చెప్పిన - నందుడు ఉద్ధవుని సమర్చించటం- విశేషవిషయానికి ఉత్తరార్ధంలో దానిని కృష్ణభక్తలక్షణమైన సామాన్యవిషయంగా చెప్పినందువల్ల అది అర్థాంతరన్యాసం. **'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః'** - (కు.122)

3. విష్ణుసహస్రనామం 'విశ్వం విష్ణుః' అంటూ ప్రారంభమవుతుంది. ఆ మేరకు విశ్వాన్నే విష్ణుస్వరూపంగా స్వీకరింపగలిగితే కృష్ణభక్తసమర్చన మన్నది మామూలు విషయంగా కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 4. **అర్చయామాస :** | **అర్చయామాస** | అర్చయామాసతుః | అర్చయామాసుః |
| | అర్చయామాసిథ | అర్చయామాసథుః | అర్చయామాస |
| | అర్చయామాస | అర్చయామాసివ | అర్చయామాసిమ |

| | | | |
|---|---|---|---|
| **అర్చన్తి :** | అర్చతి | అర్చతః | **అర్చన్తి** |
| | అర్చసి | అర్చథః | అర్చథ |
| | అర్చామి | అర్చావః | అర్చామః. |

*

**శ్లో॥కృపాం హరేరాత్మని వర్ణ్యమానాం - నిశమ్య నన్దః సహ జాయయాఽభూత్ ।**
**ప్రహృష్టరోమా ప్రతిరుద్ధకణ్ఠః - ప్రహర్షవార్యఙ్కితలోలనేత్రః ॥ 13-15**

**అ :** నందుడు ఉద్ధవుడు కృష్ణ ప్రస్తావన చేయగా విని ఆనందభరితుడు కావటం.

**అ :** నందః హరేః ఆత్మని వర్ణ్యమానాం కృపాం జాయయా సహ నిశమ్య ప్రహృష్ట-రోమా ప్రతిరుద్ధ-కంఠః ప్రహర్ష-వారి+అంకిత-లోల-నేత్రః అభూత్.

**ప్ర :** నందః = నందుడు, హరేః = కృష్ణునకు, ఆత్మని = తనయందు (ఉన్నట్లుగా), వర్ణ్య-మానామ్ = వర్ణింపబడుతున్న (వర్ణ్ ధాతువుపై కర్మణి-శానచ్ ప్రత్యయం), కృపామ్ = దయను, జాయయా సహ = భార్యతో సహా, నిశమ్య = విని (ని-శమ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ప్రహృష్ట-రోమా : ప్రహృష్ట = నిక్కబొడుచుకున్న, రోమా = వెంట్రుకలు గలవాడూ (ప్రహృష్టాని రోమాణి యస్య సః), ప్రతిరుద్ధ-కంఠః : ప్రతిరుద్ధ = అడ్డగింపబడిన, కంఠః = గొంతు గలవాడు (ప్రతిరుద్ధః కంఠః యస్య సః), ప్రహర్ష... నేత్రః : ప్రహర్ష-వారి = ఆనందబాష్పాలతో, అంకిత = నిండిన, లోల = చంచలమైన, నేత్రః = కన్నులు గలవాడు (గా) (ప్రహర్షేణ జాతం వారి, తేన అంకితే లోలే చ తే నేత్రే యస్య సః), అభూత్ = అయ్యాడు. (భూ సత్తాయామ్ పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.)

**తా ॥** ఉద్ధవుడు శ్రీకృష్ణునకు నందునిపై గల దయావిశేషాన్ని వర్ణించి చెపుతుంటే యశోదతో కలిసి విన్నాడు నందుడు. ఆనందం పొంగిపోయి వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి. కంఠం గద్గదమైంది. కన్నులు ఆనందబాష్పాలతో నిండిపోయాయి, చూపు కళవళ పడింది.

**వి :** 1. నందునిలో వర్ణింపబడిన ఈ సాత్త్వికభావాలు భక్తిభావానికి (రసానికి) వ్యంజకాలు. ప్రహ్లాదుని భక్తిపారవశ్యాన్ని వర్ణిస్తూ అనుభావబాహుళ్యాన్ని భాగవతం వివరిస్తుంది.

సీ. వైకుంఠచింతా వివర్జిత చేష్టుఁడై - యొక్కఁడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరి భావనా రూఢచిత్తుఁడై - యుద్ధతుఁడై పాడు నొక్కకచోట
విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని - యొత్తిలి నగుచుండు నొక్కచోట
నళినాక్షుఁడను నిధానముఁ గంటినేఁడని - యుబ్బి గంతులువైచు నొక్కచోటఁ

తే. బలుకునొక్కచోటఁ బరమేశుఁ గేశవు - బ్రణయహర్షజనిత బాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై - యొక్కచోట నిలిచి యూరకుండు. -పోతనభాగవతము 7/124

2. ఉద్ధవుడు చేసిన ప్రసంగంవలన కృష్ణుని మాహాత్మ్యం అంతటివానికి తనపైగల దయాళుత్వం తెలిసివచ్చాయి నందునికి. అందుకే సత్సాంగత్యం అవసరమని కపిలుడు దేవహూతికి నివేదించినభక్తి నిరూపణ ప్రస్తావనలో ప్రకటిస్తాడు.

శ్లో. సతాం ప్రసంగాన్మమ వీర్యసంవిదో - భవంతి హృత్కర్ణరసాయనాః కథాః ।
తజ్జోషణాదాశ్వపవర్గ వర్త్మని - శ్రద్ధారతిర్భక్తిరనుక్రమిష్యతి ॥ - భాగవతమ్ 3/25/25

3. **అభూత్ :** 13-6వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ విజృమ్భితే యస్య ముఖే సతీయ-మపశ్యదాత్మానమిదం జగచ్చ ।**
**వియోగవార్తామమునోత్సృజధ్వం - పరం పరంబ్రహ్మధియా భజధ్వమ్ ॥ 13-16**

**అ :** కృష్ణుని పరబ్రహ్మ భావనతో చూడాలని యశోదా నందులకు బోధ. -ఉపేంద్రవజ్ర.

**అ :** విజృంభితే యస్య ముఖే ఇయం సతీ ఆత్మానమ్ ఇదం జగత్ చ అపశ్యత్ అమునా వియోగ-వార్తామ్ ఉత్సృజధ్వం పరం పరంబ్రహ్మ-ధియా భజధ్వమ్.

**ప్ర :** విజృంభితే = తెరువబడిన, యస్య = ఏ కృష్ణునియొక్క, ముఖే = నోటిలో, ఇయమ్ = ఈ, సతీ = యశోద, ఆత్మానమ్ = తననూ, ఇదమ్ = ఈ, జగత్-చ = విశ్వాన్నీ, అపశ్యత్ = చూసిందో (దృశ్ ప్రేక్షణే పరస్మైపది-లజ్-ప్ర.ఏ.), అమునా = ఆ కృష్ణునితో, వియోగ-వార్తామ్ : వియోగ = విరహమనే, వార్తామ్ = విషయాన్ని (వియోగ ఇతి వార్తా తామ్), ఉత్సృజధ్వమ్ = విడవండి (ఉత్-సృజ్ విసర్గే-దివాది-ఆత్మనేపది-లోట్-మ.బ.), పరమ్ = కేవలం (పరః స్యాదుత్తమానాప్తవైరిదూరేషు కేవలం - నానార్థమంజరీ-పంక్తి-1411), పరంబ్రహ్మ-ధియా = పరబ్రహ్మభావనతో, భజధ్వమ్ = సేవించండి (భజ సేవాయాం-భ్వాది-ఆత్మనేపది-లోట్-మ.బ.)

**తా ॥** ఏ కృష్ణుడు నోరు తెరిస్తే ఈ నీ సతి యశోద ఆ నోటిలో తననూ, ఈ ప్రపంచాన్నీ కూడా చూడగలిగిందో అటువంటి కృష్ణునితో వియోగమన్న మాటను కూడా విడిచిపెట్టండి. కేవలమూ పరమాత్మభావనతో సేవించండి.

**వి :** 1. కృష్ణుని నోట విశ్వాన్ని చూసిన యశోద–

శ్లో. సా తత్ర దదృశే విశ్వం జగత్ స్థాస్ను చ ఖం దిశః ।
సాద్రిద్వీపాబ్ధి భూగోళం స వాయ్వగ్నీందుతారకమ్ ॥

శ్లో. జ్యోతిశ్చక్రం జ్వలం తేజో నభస్వాన్ వియదేవ చ ।
వైకారికాణీంద్రియాణి మనో మాత్రా గుణాస్త్రయః ॥ – భాగవతమ్ 10/8/37,38

ఆ భావాన్నే వెంటనే ఉపశమింపజేశాడు ఆ రోజు కృష్ణుడు. ఇప్పుడు ఉద్ధవుడు దానిని మరల గుర్తు చేస్తూ కృష్ణుని పరబ్రహ్మనుగా భావిస్తే ఇక వియోగమన్న మాటకే అవకాశం లేదుగదా అని వ్యాఖ్యానిస్తున్నాడు. అప్పుడు ఆ భావాన్ని కృష్ణుడు మరపించటం సహేతుకమే, ఇప్పుడు ఉద్ధవుడు గుర్తుచేయటమూ సహేతుకమే. జ్ఞాపనం, విస్మారణం రెండు పరమాత్మ విభూతులే.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉత్సృజధ్వమ్ :** | ఉత్సృజతామ్ | ఉత్సృజేతామ్ | ఉత్సృజన్తామ్ |
| | ఉత్సృజస్వ | ఉత్సృజేథామ్ | **ఉత్సృజధ్వమ్** |
| | ఉత్సృజై | ఉత్సృజావహై | ఉత్సృజామహై |
| **భజధ్వమ్ :** | భజతామ్ | భజేతామ్ | భజన్తామ్ |
| | భజస్వ | భజేథామ్ | **భజధ్వమ్** |
| | భజై | భజావహై | భజామహై. |

*

**శ్లో॥ స నన్దమానన్దనిధిం విధాయ – జగామ గోపీజనమన్దిరాణి ।**
**సుదుష్కరోగ్రవ్రతకర్శితాఙ్గ–మునీన్ద్రవృన్దాశ్రమసమ్మితాని ॥ 13–17**

**అ :** ఉద్ధవుడు నందుని వీడి గోపికల మందిరాలకు వెళ్ళటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సః నందమ్ ఆనంద–నిధిం విధాయ సుదుష్కర+ఉగ్ర–వ్రత–కర్శిత+అంగ–ముని+ఇంద్ర–వృంద+ఆశ్రమ–సమ్మితాని గోపీ–జన–మందిరాణి జగామ.

**ప్ర :** సః=ఆ ఉద్ధవుడు, నందమ్ = నందగోపుని, ఆనంద–నిధిమ్ = ఆనందానికి ఆశ్రయంగా (ఆనందస్య నిధిమ్– నితరాం ధీయతే అస్మిన్ ఇతి నిధిః), విధాయ = చేసి (వి–ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుదుష్కర... సమ్మితాని : సుదుష్కర = బాగా కష్టసాధ్యమైన, ఉగ్ర = తీవ్రమైన, వ్రత = దీక్షలతో, కర్శిత = కృశింపజేయబడిన, అంగ = అవయవాలు గల, ముని+ఇంద్ర = ఋషిశ్రేష్ఠులయొక్క, వృంద = సమూహంయొక్క, ఆశ్రమ = ఆశ్రమాలతో, సమ్మితాని = సమానమైన వైన (సుదుష్కరైః ఉగ్రైః చ వ్రతైః కర్శితాని అంగాని యేషాం, తే చ తే మునీంద్రాః, చ తేషాం వృందస్య ఆశ్రమైః సమ్మితాని), గోపీ–జన–మందిరాణి = గోపికాగృహాలకు (గోప్యః చ తే జనాః, తేషాం మందిరాణి), జగామ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఉద్ధవుడు నందునికి కృష్ణునకు ఆయనపై వున్న దయను తెలియజేసి, ఆయన పరంబ్రహ్మ అని గ్రహింపజేసి ఆనందాన్ని కలిగించి ఆపై గోపికల మందిరాలకు వెళ్ళాడు. ఆ మందిరాలు తీవ్రమైన, కష్టసాధ్యమైన వ్రతాల ద్వారా శరీరాలను కృశింపజేసిన మహర్షి శ్రేష్ఠుల ఆశ్రమాలవలె వున్నాయి.

**వి :** 1. గోపికలు స్వీకరించిన వ్రతదీక్షాదులు ముని శ్రేష్ఠుల వ్రతదీక్షాదుల కన్న తక్కువేమీ కాదని కవి వివక్ష. నారాయణమాత్ర మననం చేస్తున్న వారు మునులు కాకపోరు గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ, జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ కాచిన్ముకున్దేన సహైవ శయ్యాం - ప్రాప్తుం బతాధఃశయనవ్రతస్థా ।**
**తజ్జుష్టతామ్బూలఫలాయ ధన్యా - తత్యాజ తామ్బూలరుచిం కిలాన్యా ॥ 13-18**

**అ :** గోపికల విరహదశావర్ణన - విరుద్ధకార్యకరణాభిలాష. -ఇంద్రవజ్ర.

**అ :** కాచిత్ ముకుందేన సహ+ఏవ శయ్యాం ప్రాప్తుం అధః+శయన-వ్రత-స్థా బత. అన్యా ధన్యా (సతీ) తత్+జుష్ట-తాంబూల-ఫలాయ తాంబూల-రుచిం తత్యాజ కిల.

**ప్ర :** కాచిత్ = ఒకానొక గోపి, ముకుందేన సహ+ఏవ = కృష్ణునితో పాటే, శయ్యామ్ = పడకను, ప్రాప్తుమ్ = పొందాలని, అధః శయన-వ్రత-స్థా = అధశ్శయనం (క్రింద పడుకోవటం) అనే వ్రతాన్ని పూనింది. బత = అయ్యో!, ధన్యా = ధన్యురాలైన, అన్యా = మరొకర్తుక, తత్... ఫలాయ : తత్ = ఆ కృష్ణునిచే, జుష్ట = చర్వితమైన / ఆస్వాదింపబడిన, తాంబూల = తాంబూల మనే, ఫలాయ = ఫలితం కొరకు, తాంబూల-రుచిమ్ = తాంబూలాసక్తిని, తత్యాజ కిల = విడిచింది గదా! (త్యజ హానౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక కృష్ణునితో కలిసి పడకనెక్కాలని తాను అధశ్శయనవ్రతాన్ని స్వీకరించింది. మరొక గోపిక కృష్ణచర్వితమైన తాంబూలాన్ని ఫలంగా కోరి తాంబూలం మీద ఆసక్తిని విడిచిపెట్టింది.

**వి :** 1. శ్లోకంలో విచిత్రాలంకారముంది. కావలసిన దానిని పొందటానికి విపరీతమైన (భిన్నమైన) ప్రయత్నం చేస్తే అది విచిత్రాలంకారం. '**విచిత్రం తత్ప్రయత్నశ్చేద్ విపరీతః ఫలేచ్ఛయా**' - (కు.94) ఇక్కడ కృష్ణునితో శయ్యను కోరుకొంటూ శయ్యను విడిచిపెట్టడం, కృష్ణచర్వితతాంబూలాసక్తితో తాంబూలాన్ని విడిచి పెట్టడం విచిత్రప్రయత్నాలు.

| | | | |
|---|---|---|---|
| 2. **తత్యాజ :** | **తత్యాజ** | తత్యజతుః | తత్యజుః |
| | తత్యజిథ | తత్యజథుః | తత్యజ |
| | తత్యాజ/తత్యజ | తత్యజివ | తత్యజిమ. |

*

**శ్లో॥ తద్భుక్తశేషోదనలుబ్ధచిత్తా - నిత్యం కిలైకాఽనశనవ్రతస్థా ।**
**స్వప్నేఽపి తత్సఙ్గమివాప్తుకామా - స్వస్థాఽపి శేతే కిల కాఽపి దీనా ॥ 13-19**

**అ :** గోపికల విరహదశావర్ణన - నిరాహారనిద్రావ్రతధారణ. -ఇంద్రవజ్ర.

**అ :** తద్-భుక్త-శేష+ఓదన-లుబ్ధ-చిత్తా ఏకా నిత్యం అనశన-వ్రత-స్థా కిల. దీనా కా అపి స్వప్నే అపి తత్-సంగమ్ ఆప్తు-కామా ఇవ స్వస్థా అపి శేతే.

**ప్ర :** తద్... చిత్తా : తద్ = ఆ కృష్ణునిచేత, భుక్త = భుజింపబడి, శేష = మిగిలిన, ఓదన = ఆహారంపై, లుబ్ధ = లోభంగల, చిత్తా = మనస్సు గలదై (తేన భుక్తాత్ శేషః ఓదనః, తస్మిన్ లుబ్ధం చిత్తం యస్యాః సా), ఏకా = ఒకానొక గోపిక, నిత్యమ్ = నిరంతరంగా, అనశన-వ్రత-స్థా కిల = ఉపవాసవ్రతంలో నిలిచింది గదా!, దీనా = దీనురాలైన, కా+అపి = ఒకానొక గోపిక, స్వప్నే అపి = కలలో నయినా (స్వప్ ధాతువుపై '**స్వపోనన్**' (అష్టాధ్యాయి 3-3-91) సూత్రంతో 'నన్' ప్రత్యయం), తత్-సంగమ్ = ఆ కృష్ణునితో చేరిమిని, అవాప్తు-కామా = పొందగోరినదై (అవాప్తుం కామా), స్వస్థా+అపి = బాగున్నా కూడా, శేతే కిల = పడుకొంటోంది. (శీ స్వప్నే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక కృష్ణభుక్తశేషమైన ఆహారాన్నే తినాలన్న కోరికతో నిత్యమూ అనశనవ్రతాన్ని (ఉపవాసాన్ని) పాటిస్తోంది. దీనురాలయిన మరొక గోపిక కలలోనైనా ఆ కృష్ణుని చూడాలన్న తలంపుతో అనారోగ్యమేమీ లేకపోయినా (పనులన్నీ వదలి) పడుకొంటోంది.

**వి :** 1. ఇక్కడ కూడా విచిత్రాలంకారమే. ఫలప్రాప్తికి విపరీతమైన పనిచేయటం.

| | | | |
|---|---|---|---|
| 2. **శేతే :** | **శేతే** | శయాతే | శేరతే |
| | శేషే | శయాథే | శేధ్వే |
| | శయే | శేవహే | శేమహే. * |

**శ్లో॥ కాన్తం హరిం తత్ప్రభవం కుమారం – తజ్జుష్టగేహం గృహమూహమానా ।**
**పత్యుర్న పూజాం న చ పుత్త్రరక్షాం – కృత్యం న గృహ్యం వితనోతి తన్వీ ॥13-20**

**అ :** గోపీవిరహదశావర్ణన – కర్మపరిత్యాగ భావన. –ఇంద్రవజ్ర.

**అ :** కాంతం హరిం కుమారం తత్–ప్రభవం గృహం తత్+జుష్ట–గేహమ్ ఊహమానా తన్వీ పత్యుః పూజాం న వితనోతి, పుత్ర–రక్షాం చ న వితనోతి గృహ్యం కృత్యం చ న వితనోతి.

**ప్ర :** కాంతమ్ = భర్తనుగా (కామ్యతే ఇతి తమ్), హరిమ్ = కృష్ణుని, కుమారమ్ = పుత్త్రునిగా, తత్–ప్రభావమ్ = ఆ కృష్ణునివలన పుట్టిన వానిని (తస్మాత్ ప్రభవః యస్య సః), గృహమ్ = ఇంటినిగా, తత్–జుష్ట–గేహమ్ : తత్ = ఆయనచే, జుష్ట = అనుభవింపబడిన, గేహమ్ = ఇంటిని (తేన జుష్టం చ తత్ గేహమ్), ఊహమానా = ఊహించుచున్నదై, తన్వీ = కాంత (కృశించిన శరీరంగలది), పత్యుః = భర్తకు, పూజామ్ = పూజను, న వితనోతి = చేయటం లేదు (వి తనూ విస్తారే పరస్మైపది–లట్–ప్ర.ఏ.), పుత్త్ర–రక్షామ్ : పుత్ర = కొడుకుయొక్క, రక్షామ్ = పాలనను, న వితనోతి = చేయటం లేదు, గృహ్యమ్ = ఇంటికి సంబంధించిన, కృత్యమ్ = పనిని, న వితనోతి = చేయటం లేదు.

**తా ॥** మరొక గోపిక హరినే తన భర్తగా, ఆయన ద్వారా కలిగిన సంతానాన్నే తన సంతానంగానూ, ఆయన అనుభవించిన ఇంటినే తన ఇల్లుగానూ, ఊహించుకొంటూ పతిపరిచర్యలు మానింది. కొడుకు ఆలనాపాలనా చూడటం మానింది. ఇంటిపనులు చేయటం కూడా మానింది.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **వితనోతి :** | **వితనోతి** | వితనుతః | వితన్వన్తి |
| | వితనోషి | వితనుథః | వితనుథ |
| | వితనోమి | వితనువః/వితన్వః | వితనుమః/వితన్మః. * |

**శ్లో॥ రతావసానే మురజిత్కరేణ – నిబద్ధుమేకోజ్ఝితకేశబన్ధా ।**
**తదైవ తత్సంహితభూషణేచ్ఛా – న భూషణం కాఽపి బిభర్తి బాలా ॥13-21**

**అ :** గోపీ విరహదశావర్ణన – కేశసంస్కారం, భూషణాభిలాషలేని స్థితి. –ఉపేంద్రవజ్ర.

**అ :** ఏకా రత+అవసానే ముర–జిత్–కరేణ నిబద్ధుమ్ ఉజ్ఝిత–కేశ–బన్ధా తదా ఏవ కా అపి బాలా తత్–సంమిత–భూషణ+ఇచ్ఛా (సతీ) భూషణం న బిభర్తి.

**ప్ర :** ఏకా = ఒక గోపిక, రత+అవసానే = రతి ముగిసిన పిదప (రతస్య అవసానం, తస్మిన్), మురజిత్–కరేణ = కృష్ణుని చేతితో (మురజితః కరః తేన), నిబద్ధుమ్ = ముడివేయబడటానికి (ని బధ్ ధాతువుపై తుమున్ ప్రత్యయం), ఉజ్ఝిత–కేశ–బన్ధా : ఉజ్ఝిత = విడదీయబడిన, కేశ–బన్ధా = కొప్పుగలదై (ఉజ్ఝితః కేశానాం బన్ధః యయా సా), (అస్తి = వుంది), కా+అపి = మరొక, బాలా = గోపబాలిక, తదా+ఏవ = అప్పుడే (రతాంతమందే),

తత్-సంహిత-భూషణ+ఇచ్ఛా : తత్ = ఆ కృష్ణునిచేత, సంహిత = కూర్చబడిన (గ్రథితం గుంఫి తాక్రాంత సంహితేషు-నానార్థమంజరీ-723), భూషణ = అలంకరణలపై, ఇచ్ఛా = కోర్కి గలదై (తేన సంహితాని తాని చ తాని భూషణాని, తేషు ఇచ్ఛా యస్యాః సా), భూషణమ్ = నగ(ల)ను, న బిభర్తి = ధరించటం లేదు. (భృ ధారణ పోషణయోః-జుహోత్యాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒకానొక గోపిక రతాంతసమయంలో కృష్ణుడే ఈ వెంట్రుకలను ముడివేయాలని వీడిన కొప్పును అలాగే వుంచింది. మరొక గోపిక ఆ రతాంతవేళలోనే నగలను ఆ కృష్ణుడు అలంకరించాలని నగలను అసలు ధరించటంలేదు.

**వి :** 1. ప్రణయంలో అదీ కృష్ణప్రేమలో కోరికలు అలాగే వుంటాయి. జీవితంలోని ప్రత్యణువూ కృష్ణ స్పృష్టమో, కృష్ణజుష్టమో కావాలన్న తపన ఆ గోపికలకు. భవిష్యత్తులో గీతలో కృష్ణుడు చెప్పబోతున్న అంశమిలా వుంది-

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ ।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ ॥ - భగవద్గీత 9/27

తనకోసం ప్రత్యేకించి ఏమీ అవసరం లేదనీ చేసే పనులను తనకర్పించమనీ కృష్ణుడు చెప్పబోతుంటే అన్ని పనులలో కృష్ణుని చూడటం మాని, కృష్ణునిలో అన్ని పనులనూ చూడాలనుకొంటున్నారు గోపికలు. అది తన సిద్ధాంతానికి భిన్నమైనా వారిలోని అకల్మషమూ, అచంచలమూ అయిన ఆ భావన కృష్ణుని ఆకర్షించింది.

| | | | |
|---|---|---|---|
| 2. **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః. |

*

**శ్లో॥ ప్రదక్షిణీకృత్య దినే దినేఽన్యాః - స్వధామవృన్దావనమర్థయన్తే ।**
**వికస్వరక్ష్మారుహపుఞ్జమఞ్జు-ముకున్దవృన్దావనరాసలీలామ్ ॥ 13-22**

**అ :** కొందఱు గోపికలు బృందావన సమర్చన చేసి వృందావనరాసలీలను కోరుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** అన్యాః దినే దినే స్వ-ధామ-వృందా-వనం ప్రదక్షిణీ కృత్య వికస్వర+క్ష్మా-రుహ-పుంజ-మంజు-ముకుంద-వృందా-వన-రాస-లీలామ్ అర్థయన్తే.

**ప్ర :** అన్యాః = మరికొందరు గోపికలు, దినే దినే = ప్రతిదినమూ, స్వ... వనమ్ : స్వ = తమ యొక్క, ధామ = ఇంటిలోని, వృందా-వనమ్ = తులసి తోటను, ప్రదక్షిణీకృత్య = చుట్టుతిరిగి, వికస్వర... లీలామ్ : వికస్వర = వికసించిన, క్ష్మా-రుహ = చెట్లయొక్క, పుంజ = సమూహంచేత, మంజు = మనోహరమైన, ముకుంద = కృష్ణునియొక్క, బృందా-వన = బృందావనంలోని, రాస-లీలామ్ = రాసక్రీడావిలాసాన్ని, అర్థయన్తే = కోరు కొంటున్నారు. (అర్థ ఉపయాంచాయామ్-ఆత్మనేపది-ప్ర.బ.)

**తా ॥** మరికొందరు గోపికలు తమ ఇంటిలోని తులసివనానికి ప్రతిదినమూ ప్రదక్షిణలు చేస్తూ, బాగా వికసించిన చెట్లతో మనోహరమయిన బృందావనంలో ముకుందునితో రాసలీలను కోరుకొంటున్నారు.

**వి :** 1. రాసలీల సామూహిక కార్యక్రమం. అందుకే కొందరు గోపికల కోరిక అది. పదిమందితో ఆనందాన్ని పంచుకోవటం అందరికీ కుదిరే పనికాదు. కనీసం ఆపాటి మానసికస్థాయికి వచ్చిన గోపికలు రాసలీలను ఆశిస్తున్నారు. ఇంకా వ్యక్తిగతంగా తమవాడుగానే భావిస్తున్న గోపికలు వ్యక్తిగతంగానే కృష్ణసాన్నిధ్యాన్ని కోరుకొంటున్నారు.

2. **అర్థయన్తే :** అర్థయతే అర్థయేతే **అర్థయన్తే**
అర్థయసే అర్థయేథే అర్థయధ్వే
అర్థయే అర్థయావహే అర్థయామహే. *

**శ్లో॥ నిజైర్జనన్యా జనకేన సాకం - న భాషతే కిఞ్చన కాఽపి గోపీ ।**
**ప్రియేణ సార్ధం బత! రమ్యగోష్ఠీ-మకుర్వతా కిం వచసేతి దీనా ॥ 13-23**

**అ :** ఒకానొక గోపి ముకుందగోష్ఠి లేని మాట ఎందుకని ఇంటివారితో పలుకకుండటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** కా అపి గోపీ ప్రియేణ సార్ధం రమ్య-గోష్ఠీమ్ అకుర్వతా వచసా కిమ్ ఇతి దీనా నిజైః జనన్యా జనకేన సాకం కించన న భాషతే.

**ప్ర :** కా+అపి = ఒకానొక, గోపీ = గోపిక, ప్రియేణ-సార్ధమ్ = ప్రియుడైన కృష్ణునితో, రమ్య-గోష్ఠీమ్ : రమ్య = రమణీయమైన, గోష్ఠీమ్ = గోష్ఠిని/సంభాషణను, అకుర్వతా = చేయని, వచసా = మాటతో, కిమ్? = ఏమి (ప్రయోజనం)? ఇతి = అని, దీనా = దయనీయస్థితికి లోనైనదై, నిజైః = తనవారైన, జనన్యా సాకమ్ = తల్లితోనూ, జనకేన సాకమ్ = తండ్రితోనూ, కించన = కొంచెమైనా (ఏదీ), న భాషతే = మాటాడదు. (భాష్ వ్యక్తాయాం వాచి-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** మరొక గోపిక కృష్ణునితో అందమైన ఇష్టాగోష్ఠికి కొరగాని ఈ మాట ఎందుకని తన వారైన తల్లిదండ్రులతో కూడా ఏమీ మాటాడటం లేదు.

**వి :** 1. నైసర్గికంగా సంక్రమించిన శరీరం కానీ, మనస్సు కానీ, ఇంద్రియప్రవృత్తికానీ, విశిష్టప్రతిభాపాటవాలు కానీ ఉండటం వేరు, వినియోగించటం వేరు. ఆ వినియోగం కూడా పాత్రత, అపాత్రతను బట్టి వేరు వేరు. పాత్రత కూడా నచ్చినచోటు, నచ్చని చోటు అని వేరు వేరు. కృష్ణునితో మాటాడటానికి పనికిరాని మాట ఎందుకని గోపిక మాటనే విడిచిపెట్టింది-రుక్మిణి ఏమంటుందో చూడండి - -పోతనభాగవతము 10/1708

సీ. ప్రాణేశ ! నీ మంజు భాషలు విన లేని - కర్ణరంధ్రంబుల కలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని - తనులత వలని సౌందర్య మేల?
భువనమోహన! నిన్నుఁ బొడగానఁగా లేని - చక్షురింద్రియముల సత్త్వ మేల?
దయిత! నీ యధరామృతంబానగాలేని - జిహ్వకు ఫలరససిద్ధి యేల?

ఆ. నీరజాతనయన! నీవనమాలికా - గంధమబ్బలేని ఘ్రాణమేల?
ధన్యచరిత! నీకు దాస్యంబుసేయని - జన్మమేల యెన్ని జన్మములకు.

2. శ్లోకంలో పూర్వార్ధం తల్లిదండ్రులతో మాటాడని గోపిక స్థితి. ఉత్తరార్ధంలో దానికి కారణమైన ఆమె ఆలోచన. పూర్వార్ధానికి ఉత్తరార్ధం సమర్థన. సాధారణదృష్టికి అది సమర్థన కాకపోవచ్చు. కానీ గోపికదృష్టిలో అది సమర్థన. కాబట్టి సమర్థనీయార్థసమర్థన కారణంగా ఇది కావ్యలంగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - (కు.121)

3. **భాషతే : భాషతే** భాషేతే భాషన్తే
భాషసే భాషేథే భాషధ్వే
భాషే భాషావహే భాషామహే. *

**శ్లో॥ మన్దానిలం చన్దనరమ్యగన్ధి-మిన్దీవరాక్షీ సహతే న కాచిత్ ।**
**విశ్లేషవహ్నేర్దహతో నిజాఙ్గం - వృద్ధిం విదధ్యాదితి చిన్తయేవ ॥ 13-24**

**అ :** మరొక గోపిక మందమారుతాన్ని సహింపలేని విరహాగ్నిలో క్రాగుట. -ఇంద్రవజ్ర.

**అ :** కాచిత్ ఇందీవర+అక్షీ నిజ+అంగం దహతః విశ్లేష-వహ్నేః వృద్ధిం విదధ్యాత్ ఇతి చింతయా+ఇవ చందన-రమ్య-గంధిం మంద+అనిలం న సహతే.

**ప్ర :** కాచిత్ = ఒకానొక, ఇందీవర+అక్షీ = కలువలవంటి కన్నులు గల కాంత (ఇంద్రియాణి వృణోతి ఇతి ఇందీవరమ్, తే ఇవ అక్షిణీ యస్యాః సా), నిజ+అంగమ్ = తన శరీరాన్ని (నిజస్య అంగమ్), దహతః = దహిస్తున్న, విశ్లేష-వహ్నేః = వియోగాగ్నికి (విశ్లేష ఇతి వహ్నిః, తస్య), వృద్ధిమ్ = పెరుగుదలను, విదధ్యాత్-ఇతి = కల్గించగలదని (వి-ధా ధారణపోషణయోః-పరస్మైపది-ఆశీర్లిఙ్-ప్ర.ఏ.), చింతయా+ఇవ = ఆలోచనతోనో అన్నట్లు, చందన-రమ్య-గంధిమ్ : చందన = మంచిగంధంచేత, రమ్య = మనోజ్ఞమైన, గంధిమ్ = పరిమళంగల (చందనేన రమ్యః గంధః అస్య అస్తీతి, తమ్), మంద+అనిలమ్ = మెల్లనిగాలిని (మందశ్చ అసౌ అనిలశ్చ తమ్), న సహతే = సహించటం లేదు. (సహ మర్షణే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** అప్పటికే తన శరీరాన్ని దహిస్తున్న వియోగవహ్నిని అది ఇంకా పెంచుతుందేమో అన్న చింతతో ఒకానొక గోపిక చందనసౌరభాలతో మనోజ్ఞంగా వున్న మందమారుతాన్ని కూడా సహించటంలేదు. (అంగీకరించటం లేదు)

**వి :** 1. చల్లనిగాలి విరహాన్ని పెంచుతుదని కవి సమయం. సంస్కృతాంధ్రకవులు అందరూ ఈ కవిసమయాన్ని తమ ప్రతిభాపాటవాలకు అనుగుణంగా వినియోగించుకొన్నవారే. ఇదే ఇతివృత్తం గల **జయదేవుని వర్ణన** ఎంత సొగసుగా సాగిందో...

నిందతి చందనమిందుకిరణమనువిందతి ఖేదమధీరమ్
వ్యాలనిలయమిలనేన గరళమివ కలయతి మలయసమీరమ్
మాధవమనసిజవిశిఖభయాదివ భావనయా త్వయి లీనా
సా విరహే తవ దీనా... - గీతగోవిందం - గీతం.8

2. **సహతే :**

| | | |
|---|---|---|
| **సహతే** | సహేతే | సహన్తే |
| సహసే | సహేథే | సహధ్వే |
| సహే | సహావహే | సహామహే. |

*

## శ్లో॥ ఆలాపమాల్యాః ప్రియమప్యపార్థ-మాలోచ్య బాలా నహి శుశ్రువేఽన్యా ।
## సేయం ముకున్దాగమనం వదన్తీ - జాతేదృశీత్యుత్థితతీవ్రతాపా ॥ 13-25

**అ :** మరొక గోపిక ముకుందుని రాకపై ఆశను రేకెత్తిస్తూ అబద్ధమాడుతోందని అలుక బూనుట.-ఇంద్రవజ్ర.

**అ :** అన్యా బాలా ముకుంద+ఆగమనం (ప్రతి) వదన్తీ సా ఇయమ్ ఈదృశీ జాతా ఇతి ఉత్థితతీవ్రతాపా ఆల్యాః ప్రియం అపి ఆలాపమ్ ప్రియమ్ అపి న హి శుశ్రువే.

**ప్ర :** అన్యా బాలా = మరొక బాలిక, ముకుంద+ఆగమనమ్ (ప్రతి) = కృష్ణుని రాకను గూర్చి (ముకుందస్య ఆగమనం), వదన్తీ = చెపుతూ, సా ఇయమ్ = ఆ ఈ నెచ్చెలి, ఈదృశీ జాతా = ఇలా తయారైంది, ఇతి = అని, ఉత్థిత-తీవ్ర-తాపా : ఉత్థిత = చెలరేగిన, తీవ్ర-తాపా = తీవ్రమైన తాపం గలదై (ఉత్థితః తీవ్రః చ అసౌ తాపః యస్యాం సా), ప్రియం-అపి = ఇష్టమైనా, ఆల్యాః ఆలాపమ్ = చెలి మాటను, అపార్థమ్ = అపార్థాన్ని, ఆలోచ్య = ఊహించి, న శుశ్రువే హి = వినలేదు కదా! (శ్రు శ్రవణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒక గోపికకు ఆమె చెలి కృష్ణుడు వచ్చేస్తున్నాడంటూ పదే పదే చెప్పింది. చివరకు నిలదీస్తే ఏవేవో కబుర్లు

చెప్తోంది అని చాలా తాపం కలిగింది. దానితో ఆ గోపిక ఆ సఖిమాటలు ఇష్టమే అయినా ఇంకా ఏ అపార్థాలు వస్తాయో అని ఆమె మాటలు వినటం లేదు.

**వి :** 1. ఓదార్పు సమయంలో ఆపద్ధర్మంగా ఎన్నోమాటలు చెప్పటం కద్దు. ఆ మాటలు చాలా భాగం ఆ సమయంలో అవసరమైన కార్యసాధన కోసం. అయితే వాటిని మొత్తం యథాతథంగా స్వీకరిస్తే అంత ఉపయోగముండకపోగా అనవసరమైన అసంతృప్తి కూడా కలుగుతుంది. ప్రస్తుతం గోపిక పరిస్థితి ఇదే.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **శుశ్రువే :** | **శుశ్రువే** | శుశ్రువాతే | శుశ్రువిరే | |
| | శుశ్రువిషే | శుశ్రువాథే | శుశ్రువిధ్వే | |
| | శుశ్రువే | శుశ్రువివహే | శుశ్రువిమహే. | * |

**శ్లో॥కర్పూరకుఙ్కుమలసన్మృగనాభిశోభి - నేచ్ఛత్యహో మలయజామలచూర్ణమన్యా ।**
**కృష్ణాంగసఙ్గి తదలం పరిరభ్య దోర్భ్యాం - ధర్తుం ధియేవ వరవైష్ణవవర్గయోగ్యమ్॥26**

**అ :** మరొక గోపిక శ్రీగంధాన్ని నిరాకరించటం. -వసంతతిలక.

**అ :** అన్యా కృష్ణ+అంగ-సంగి వర-వైష్ణవ-వర్గ-యోగ్యమ్ (తత్) అలం దోర్భ్యాం పరిరభ్య ధర్తుం ధియా+ఇవ కర్పూర-కుంకుమ-లసత్-మృగనాభి-శోభి మలయ-జ+అమల-చూర్ణం న ఇచ్ఛతి ఆహో!

**ప్ర :** అన్యా = మరొక గోపిక, కృష్ణ... సంగి : కృష్ణ = కృష్ణునియొక్క, అంగ = శరీరంతో, సంగి = చేరిమిగలదై (కృష్ణస్య అంగేన సంగః యస్య తత్), వర... యోగ్యమ్ : వర = శ్రేష్ఠులైన, వైష్ణవ = విష్ణుభక్తులయొక్క, వర్గ = బృందానికి, యోగ్యమ్ = తగినదైన (వరాశ్చ తే వైష్ణవాః, తేషాం వర్గః, తస్య యోగ్యమ్), తత్ = దానిని, అలమ్ = బాగా, దోర్భ్యామ్ = భుజాలతో, పరిరభ్య = (కృష్ణుని) కౌగిలించుకొని, ధర్తుమ్ = ధరించటానికి, ధియా ఇవ = మనస్సు పడినట్లు, కర్పూర... శోభిః : కర్పూర = కర్పూరంతో, కుంకుమ = కుంకుమతో, లసత్ = ప్రకాశించే, మృగనాభిః = కస్తూరితో, శోభి = అలంకరింపబడిన, మలయ-జ = (మలయపర్వతంపై పుట్టిన) శ్రీగంధంయొక్క, (మలయే జాతమ్ ఇతి) (చందనం స్యాన్మలయజం శ్రీఖండం రోహణద్రుమః - హలాయుధ కోశః -544), అమల = నిర్మలమైన, చూర్ణమ్ = పొడిని, న ఇచ్ఛతి = ఇష్టపడటం లేదు. (ఇష ఇచ్ఛాయాం-తుదాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కర్పూరం, కుంకుమం, కస్తూరి-వీటితో శోభిస్తున్న శ్రీఖండ చూర్ణాన్ని (గంధపుపొడిని) ఒక గోపిక ఇష్టపడటం లేదట. ఎందుకంటే కృష్ణుడు తన శరీరానికి అలదుకొని విడిచినదీ, శ్రేష్ఠవైష్ణవులకు ధారణయోగ్యమైనదీ అయిన ఆ చందనచూర్ణాన్ని ఆమె కోరుతోంది. అది కూడా కృష్ణుని శరీరాన్ని బాహువులతో కౌగిలించుకోగా తన శరీరానికి అంటినది.

**వి :** 1. శ్రీగంధచూర్ణాన్ని తిరస్కరించటంలో ఆమెకు అప్పటికి వాటిపై అలకవల్ల ఏర్పడిన విరక్తి కారణం. అంతే కృష్ణుని శరీరాన్ని కౌగిలించుకొని ఆ చూర్ణాన్ని తగిలించుకోవటం కాదు. అయినా ఆ రీతిగా భావించి చెప్పినందువల్ల ఇది ఉత్ప్రేక్షాలంకారం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఇచ్ఛతి :** | **ఇచ్ఛతి** | ఇచ్ఛతః | ఇచ్ఛన్తి | |
| | ఇచ్ఛసి | ఇచ్ఛథః | ఇచ్ఛథ | |
| | ఇచ్ఛామి | ఇచ్ఛావః | ఇచ్ఛామః. | * |

**శ్లో॥కీరేన్దుకోకిలమధువ్రతమాన్యగన్ధ-పుష్పాణి కాఽపి న హృదో విషయీకరోతి ।**
**కృష్ణోక్తిసన్ముఖమృదుస్వరకున్తలాఙ్గ-సౌరభ్యసఙ్గతతదీయసమస్తవృత్తిః ॥ 13-27**

అ : మరొక గోపిక వర్ణన – పూలను కూడా తాను ఇష్టపడటం లేదని. –వసంతతిలక.

అ : కృష్ణ+ఉక్తి–సన్–ముఖ–మృదు–స్వర–కుంతల+అంగ–సౌరభ్య–సంగత–తదీయ–సమస్త–వృత్తిః కా అపి కీర+ఇందు–కోకిల–మధువ్రత–మాన్య–గంధ–పుష్పాణి హృదః న విషయీకరోతి.

ప్ర : కృష్ణోక్తి... వృత్తిః : కృష్ణ = కృష్ణునియొక్క, ఉక్తి = మాటలు, సత్+ముఖ = మంచి మోము, మృదు–స్వర = సున్నితమైన గొంతు, కుంతల = వెంట్రుకలు, అంగ–సౌరభ్య = శరీరపరిమళం – వీటితో, సంగత = కూడినదై, తదీయ = ఆ కృష్ణ సంబంధమైన, సమస్త–వృత్తిః = సమస్త ప్రవర్తన కలదై, (కృష్ణస్య ఉక్తిః చ సన్ముఖం చ, మృదుశ్చ అసౌ స్వరశ్చ కుంతలాశ్చ అంగసౌరభ్యం చ తేషు సంగతా తదీయా సమస్తా వృత్తిః యస్యాః సా), కీరేన్దు... పుష్పాణి : కీర = చిలుక, ఇన్దు = చంద్రుడు, కోకిల = కోయిల, మధువ్రత = తుమ్మెద–వీటిచే, మాన్య=ఆదరింపబడిన, గంధ = పరిమళం గల, పుష్పాణి = పూలను, హృదః = మనస్సునకు, న విషయీకరోతి = ఇష్టపడుటలేదు.

**తా ॥** ఒకానొక గోపిక కృష్ణుని మాటలు, మంచి మోము, మృదుస్వరం, ముంగురులు, శరీరసౌరభం – అలా సమస్తమైన ప్రవృత్తిని కృష్ణసంబంధంగానే భావిస్తూ చిలుకలను, కోకిలలను, తుమ్మెదలను – అవి గౌరవించే మంచి పరిమళం గల పూలనూ ఇష్టపడటం లేదు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. విషయీ–కరోతి :** | **–కరోతి** | –కురుతః | –కుర్వన్తి |
| | –కరోషి | –కురుథః | –కురుథ |
| | –కరోమి | –కుర్వః | –కుర్మః. |

*

**శ్లో॥ కృష్ణాఙ్ఘ్రిభృఙ్గం తం వీక్ష్య లజ్జాక్లేశవశఙ్గతాః ।**
**శ్లిష్టోక్త్యోచుస్తథా భృఙ్గం లక్షీకృత్యాన్యమగ్రతః ॥ 13–28**

అ : గోపికలు పలికిన భ్రమరాన్యోక్తులకు నాందీ వచనం. –పథ్యావక్త్రమ్.

అ : కృష్ణ+అంఘ్రి–భృంగం తం వీక్ష్య లజ్జా–క్లేశ–వశంగతాః (గోప్యః) తథా అగ్రతః అన్యం తం భృంగం లక్షీకృత్య శ్లిష్ట+ఉక్త్యా ఊచుః.

ప్ర : కృష్ణ+అంఘ్రి–భృంగమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, అంఘ్రి = పాదాలపై, భృంగమ్ = తుమ్మెద అయిన (కృష్ణస్య అంఘ్ర్యోః భృంగః, తమ్), తమ్ = ఆ ఉద్ధవుని, వీక్ష్య = చూసి, లజ్జా–క్లేశ–వశంగతాః : లజ్జా = బిడియంవలన ఏర్పడిన, క్లేశ = ఇబ్బందికి, వశంగతాః = లోనైనవారై (లజ్జయా క్లేశః, తస్య వశంగతాః), (గోప్యః = గోపికలు), తథా = ఆ రీతిగా, అగ్రతః = ఎదురుగా, అన్యమ్ = మరొక, భృంగమ్ = తుమ్మెదను, లక్షీకృత్య = ఉద్దేశించి, శ్లిష్ట+ఉక్త్యా = శ్లేష వచనంతో, ఊచుః = పలికారు. (వచ పరిభాషణే పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని పాదాలపై (పాదపద్మాలపై) తుమ్మెదవంటి ఉద్ధవుని చూసి బిడియపడి,ఆ ఇబ్బందికి లోనైన గోపికలు ఎదురుగా కనిపిస్తున్న తుమ్మెదనూ చూసి శ్లిష్టవచనాలతో ఇలా అన్నారు.

వి : 1. ఈ ప్రకరణంలోని గోపికల మాటలు భ్రమరగీతాలుగా ప్రసిద్ధాలు. **భాగవతంలోని దశమస్కంధంలో 47వ అధ్యాయంలో (12–21) పది శ్లోకాలు ఈ భ్రమరగీతాలు**. భ్రమరాన్యోక్తులు అనికూడా వీటిని వ్యవహరించవచ్చు. ఇటువంటి అన్యోక్తి వచనాలు సంస్కృతసాహిత్యంలో లెక్కకు మిక్కిలిగా వున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **ఊచుః :** | ఉవాచ | ఊచతుః | **ఊచుః** |
| | ఉవచిథ/ఉవక్థ | ఊచథుః | ఊచ |
| | ఉవాచ/ఉవచ | ఊచివ | ఊచిమ. |

*

**శ్లో॥ మధుప! చరసి కస్మాదస్మదగ్రే త్వమగ్ర్య-**
**ద్విరదవరదమూర్ధారోహయోగ్యోఽసి నూనమ్।**
**విషమవిరహవహ్నౌ నిర్దహత్యస్మదఙ్గం**
**కిమిహ పతితుమిచ్ఛస్యజ్ఞ! దూరే ప్రయాహి॥ 13-29**

**అ : భ్రమరగీతం.** (29-36వ వఱకు - మాలినీ వృత్తం.) -మాలిని.

**అ :** మధుప అస్మద్ అగ్రే కస్మాత్ చరసి? త్వమ్ అగ్ర్య-ద్విరద-వరద-మూర్ధా+ఆరోహ-యోగ్యః అసి నూనమ్. ఇహ అస్మద్-అంగం నిర్దహతి విషమ-విరహ-వహ్నౌ పతితుమ్ ఇచ్ఛసి కిమ్? అజ్ఞ! దూరే ప్రయాహి.

**ప్ర :** మధుప! = తుమ్మెదా! (మధు పిబతి ఇతి మధుపః, తస్మాత్ సంబుద్ధిః), అస్మద్-అగ్రే = మా ఎదుట, కస్మాద్ = ఎందుకు, చరసి = తిరుగుతున్నావు? (చర గతిభక్షణయోః-పరస్మైపది-లట్-మ.ఏ.), త్వమ్ = నీవు, అగ్ర్య... యోగ్యః : త్వమ్ = నీవు, అగ్ర్య = మేటి అయిన, ద్విరద = ఏనుగుయొక్క (ద్వౌ రదౌ అస్య ఇతి ద్విరదః), వర-ద = కోరినదిచ్చే, మూర్ధా = తలపై, ఆరోహ = ఎక్కుటకు, యోగ్యః+అసి = తగినవాడవు, నూనమ్ = నిశ్చితం. అస్మద్ = మాయొక్క, అంగమ్ = శరీరాన్ని, నిర్దహతి = తగుల బెడుతున్న, విషమ-విరహ-వహ్నౌ : విషమ = భరింపరాని, విరహ-వహ్నౌ = వియోగాగ్నిలో, పతితుమ్ = పడటానికి, ఇచ్ఛసి కిమ్? = కోరుతున్నావా? (ఇష్ట ఇచ్ఛాయాం-తుదాది-పరస్మైపది-లట్-మ.ఏ.), అజ్ఞ! = తెలివిలేనిదానా! (న జానాతి ఇతి అజ్ఞః తస్మాత్ సంబుద్ధిః ), దూరే = దూరంగా, ప్రయాహి = వెళ్ళు. (ప్ర-యా ప్రాపణే పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** తుమ్మెదా! మా ముందు ఎందుకు తిరుగుతావు? నీవు మేటి ఏనుగు యొక్క శ్రేష్ఠ కుంభస్థలంమీద ఎక్కదగిన దానవు. నిజం. మా శరీరాన్ని దుర్భరరమైన వియోగాగ్ని దహిస్తోంది. దానిలో నువ్వు కూడా పడాలనుకొంటున్నావా? తెలివితక్కువదానా! పో ఎటైనా దూరంగా.

**వి :** 1. 'కొడితే ఏనుగు కుంభస్థలాన్ని కొట్టాలి' అన్నది తెలుగు నానుడి. ఏనుగు కుంభస్థలంపై ముత్యాలుంటాయన్నది ఒక విశ్వాసం. నాగుపాము పడగపై మణిలాగా! వాటిని నమ్మిన ప్రజలకు అవి దక్కాయో లేదో కాని దాన్ని నమ్మిన కవులు మధురకవితలను కల్పన చేయగలిగారు. తద్ద్వారా సుభాషితాలు చెప్పగలిగారు.

2. తుమ్మెదతో మాటాడుతూ 'అజ్ఞానంతో నిప్పులో పడకు, పో దూరంగా' అని హెచ్చరించటం వారిలోని ప్రేమతత్త్వాన్ని ప్రకటిస్తోంది. కృష్ణప్రణయం ద్వారా వారు పొందిన మానసికోన్నతి అది.

| | | | |
|---|---|---|---|
| 3. **చరసి :** | చరతి | చరతః | చరన్తి |
| | **చరసి** | చరథః | చరథ |
| | చరామి | చరావః | చరామః |

**ఇచ్ఛసి :** 13-26వ శ్లోక వ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ప్రయాహి :** | ప్రయాతు/ప్రయాతాత్ | ప్రయాతామ్ | ప్రయాన్తు |
| | **ప్రయాహి**/ప్రయాతాత్ | ప్రయాతమ్ | ప్రయాత |
| | ప్రయాణి | ప్రయావ | ప్రయామ. |

*

**శ్లో॥ సదసి సుమనసాం త్వం ప్రౌఢిమాదర్శయాలం**
**విధు-రవి-విధ! యోషిత్తాపమాపాదయేః కిమ్ ?**
**గ్రహగతిరియమార్యా యత్పురస్తాదయం నో**
**వసతి వసతిపుత్త్రామిత్రవార్త్తోజ్ఝితానామ్ ॥ 13-30**

**అ :** విధు-రవి-విధ! త్వం సుమనసాం సదసి ప్రౌఢిమ్ అలం ఆదర్శయ. యోషిత్-తాపమ్-ఆసాదయేః కిమ్? ఆర్యాః వసతి-పుత్ర+అమిత్ర-వార్తా+ఉజ్ఝితానాం నః పురస్తాద్ అయం వసతి. గ్రహ-గతిః ఇయమ్.

**ప్ర :** విధు-రవి-విధ! : విధు = చంద్రుడు, రవి = సూర్యుడు-వీరియొక్క, విధ = పద్ధతి గలవాడా! ఉద్ధవా! (విధుశ్చ రవిశ్చ తయోః విధా యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), త్వమ్ = నీవు, సుమనసామ్ = దేవతలయొక్క, సదసి = కొలువులో, ప్రౌఢిమ్ = పెద్దరికాన్ని, అలమ్ = తగినంతగా, ఆదర్శయ = ప్రదర్శించు (ఆ దృశ్ ప్రేక్షణే-ప్రేరణార్థే-పరస్మైపది-లోట్-మ.ఏ.), యోషిత్-తాపమ్ = స్త్రీలకు తాపాన్ని (యోషితాం తాపః తమ్), కిమ్ ఆపాదయేః = ఎందుకు కలిగిస్తావు? (ఆ పద్-విశరణగత్యవసాదనేషు-ప్రేరణార్థే-పరస్మైపది-విధిలిఙ్-మ.ఏ.), అయమ్ = ఈ ఉద్ధవుడు, వసతి... తానామ్ : వసతి = ఇల్లు (వసన్తి అస్మిన్ ఇతి వసతిః), పుత్త్ర = పిల్లలు, అమిత్ర = శత్రువులు – ఇటువంటి, వార్తా = వార్తను కూడా, ఉజ్ఝితానామ్ = విడిచిన (వసతిశ్చ పుత్త్రాశ్చ అమిత్రాశ్చ తేషాం వార్తయా ఉజ్ఝితాః, తాసామ్), నః = మనయొక్క, పురస్తాద్ = ఎదురుగా (నిలవటం), యత్ = ఏది గలదో, ఇయమ్ = ఇది, గ్రహ-గతిః=గ్రహచార (ఫల)ం,(గ్రహాణాం గతిః), భ్రమరపక్షంలో : విధుర-వివిధ = విరహిణులమై (నందువల్ల) వివిధరీతులనున్న, యోషిత్ = స్త్రీలకు, తాపమ్ = తాపాన్ని, సుమనసామ్ = దేవతలయొక్క (మిగిలినదంతా సమానమే)

**తా ॥** (విధు-రవి-విధా!) ఉద్ధవా! దేవతలలో కొలువులో నీ పెద్దరికాన్ని చూపు. ఆడవాళ్ళకు తాపం కల్పించటమెందుకు? (విరహిణులై వివిధరీతుల ప్రవర్తిస్తున్న కాంతలకు తాపం కల్గించటమెందుకు?) ఇంటినీ, పిల్లలను, శత్రువులను గురించి పట్టించుకోవటం కూడా మానిన మన ఎదురుగానే ఈయన వున్నాడంటే అది మన గ్రహచార(ఫల)ం.

**వి :** 1. ఇక్కడ రవి, చంద్ర, గురు గ్రహాలకు సంబంధించిన జ్యోతిషశాస్త్ర ప్రస్తావన కనిపిస్తుంది. ఉద్ధవుడు బృహస్పత్యవతారంగా (గురు) ప్రసిద్ధి. గోపికలు విధు-రవి-విధలు. గురువు గోచారం రీత్యా సంవత్సరకాలంపాటు ఒకే రాశిలో వుంటాడు. చంద్రుడు 2 1/2 రోజులపాటే ఒక రాశిలో వున్నా సూర్యుడు నెలరోజుల పాటు వుంటాడు ఒక్కొక్క రాశిలో. గ్రహాలు గోచారంలో కొన్ని కొన్ని నిర్దిష్ట స్థానాలలోనే అనుకూలఫలితాల నిస్తాయి. అనుకూలఫలితాలనిచ్చే స్థానాలలో సంచరిస్తున్నప్పుడు కూడా వాటిని ఎదురుగా (నిర్దిష్ట స్థానాలలో), ఏ గ్రహాలు లేనప్పుడు మాత్రమే అనుకూలత. ఆయా స్థానాలను వేధ స్థానాలు అంటారు. క్రింది పట్టికలో ఆయా గ్రహాలకు ఆయా అనుకూలస్థానాలను వేధస్థానాలనూ కూడా గమనించవచ్చు.

| | అనుకూలస్థానాలు | వేధస్థానాలు (క్రమంగా) |
|---|---|---|
| రవి | 3,6,10,11 | 9,12,4,5 |
| చంద్రుడు | 1,3,6,7,10,11 | 5,9,12,2,4,8 |
| కుజుడు | 3,6,11 | 12,9,5 |
| బుధుడు | 2,4,6,8,10,11 | 5,3,9,1,8,12 |
| గురువు | 2,5,7,9,11 | 12,4,3,10,8 |
| శుక్రుడు | 1,2,3,4,5,8,9,11,12 | 8,7,1,10,9,5,11,6,3 |
| శని | 3,6,11 | 12,9,5 |

రవికి, శనికీ పరస్పరం వేధ లేదు. చంద్రుడికీ, బుధుడికీ కూడా పరస్పరం వేధ లేదు.

ప్రస్తుతం ఉద్ధవుడు వారిముందు వేధ స్థానంలోని గ్రహంలాగా నిలిచి పీడిస్తున్నాడని గోపికల భావం. అదీ సంవత్సరంపాటు కదలని గురుగ్రహం.

2. శ్లోకంలో గూఢోక్త్యలంకారం. భ్రమరగీతలన్ని గూఢోక్తులే. '**గూఢోక్తిరన్యోద్దేశ్యం చేద్యదన్యం ప్రతి కథ్యతే**' (కు. 154) ఎవరినో ఉద్దేశించి ఎవరితోనో మాటాడటం గూఢోక్తి. భ్రమరగీతల్లో మాటాడేది తుమ్మెదలతో, ఉద్దేశించేదీ ఉద్ధవుని. ప్రకృతశ్లోకంలో అభంగ (సుమనసాం), సభంగ (విధు-ర-వి-విధ) శ్లేషల సహకారం కూడా వుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆదర్శయ :** | ఆదర్శయతు/ఆదర్శయతాత్ | ఆదర్శయతామ్ | ఆదర్శయన్తు |
| | **ఆదర్శయ**/ఆదర్శయతాత్ | ఆదర్శయతమ్ | ఆదరర్శయత |
| | ఆదర్శయాని | ఆదర్శయావ | ఆదర్శయామ |
| **ఆపాదయేః :** | ఆపాదయేత్ | ఆపాదయేతామ్ | ఆపాదయేయుః |
| | **ఆపాదయేః** | ఆపాదయేతమ్ | ఆపాదయేత |
| | ఆపాదయేయమ్ | ఆపాదయేవ | ఆపాదయేమ |
| **వసతి :** | **వసతి** | వసతః | వసన్తి |
| | వససి | వసథః | వసథ |
| | వసామి | వసావః | వసామః |

*

**శ్లో॥ వరుణదిశి గతోఽపి స్వైరముద్యాతి సోఽయం**
**బత! దిశి బలభేత్తుః కామదః కామినీనామ్ ।**
**గురురివ సఖి! కర్ణోపాన్తమభ్యేత్య గీతం**
**హరిపదకృతవృత్తిః శ్రావయత్యేష ధీరః ॥** **13-31**

**అ :** సఖి! కామినీనాం కామదః సః అయమ్ వరుణ-దిశి గతః అపి బల-భేత్తుః దిశి స్వైరమ్ ఉద్యాతి బత! గురుః ఇవ హరి పద-కృత-వృత్తిః ధీరః ఏషః కర్ణ+ఉపాన్తమ్ అభ్యేత్య గీతం శ్రావయతి.

**ప్ర :** సఖి! = చెలి!, కామినీనామ్ = కామినులమైన మనకు, కామదః = కోరికలను రెచ్చగొట్టే (కృష్ణ విషయాలను చెప్పటం ద్వారా), సః+అయమ్ = ఆ ఈ ఉద్ధవుడు/ తుమ్మెద, వరుణ-దిశి = పశ్చిమదిక్కుకు (వరణస్య దిక్-తస్యామ్), గతః+అపి = చేరినా (అస్తమించినా), బల-భేత్తుః = ఇంద్రునియొక్క (బలస్య భేత్తా, తస్య), దిశి = దిక్కున (తూర్పున), స్వైరమ్ = స్వేచ్ఛగా, ఉద్-యాతి = ఉదయిస్తాడు (ఉద్-యా-ప్రాపణే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), బత! = అయ్యో!, గురుః+ఇవ = బృహస్పతిలా/ గురువులా, హరి... వృత్తిః : హరి-పద = కృష్ణుని పాదాలపై (ఆకాశంపై), కృత = కల్పించుకొన్న, వృత్తిః = నడవడి గలవాడై(ది) (హరేః పదయోః (హరిపదే) కృతా వృత్తిః యేన సః), ధీరః = ధీరుడైన (నిర్భయంగా), ఏషః = ఈ ఉద్ధవుడు (ఈ తుమ్మెద), కర్ణ+ఉపాన్తమ్ = చెవి దగ్గరకు, అభ్యేత్య = వచ్చి (అభి+ఆ+ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గీతమ్ = పాటను /మంత్రాన్ని, శ్రావయతి = వినిపిస్తున్నాడు/స్తోంది. (శ్రు శ్రవణే ప్రేరణార్థే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** సఖి! ఈ ఉద్ధవుడు కృష్ణ ప్రసంగం చేయటం ద్వారా కామినులమైన మనకు కామాన్ని వర్ధిల్లజేస్తూ వరుణిని దిక్కుకు పయనించినా మరల ఇంద్రుని దిక్కులో కనిపిస్తున్నాడు. హరిపదవృత్తి అయిన (హరిపదమంటే విష్ణుపాదమని ఒక అర్థం. ఆకాశమని మరొక అర్థం.) ఈ ధీరుడు చెవిదగ్గరకు వచ్చి గీతాలు వినిపిస్తున్నాడు. అది గురువు మంత్రోపదేశం చేస్తున్నట్టుంది.

**వి :** 1. అటుపోయి ఇటురావటం భ్రమరస్వభావం. కాబట్టి "**వరుణదిశి గతోఽపి బలభేత్తుః దిశి ఉద్యాతి**" అన్నమాట అందంగా కుదురింది. పోలిక (తుమ్మెదకు) సూర్యునితో అయితే అస్తమయం, పునరుదయం అతికినట్టుండేవి. కానీ ఉద్ధవునితో పోలిక. ఉద్ధవుడు పశ్చిమ దిక్కుకు వెళ్ళి, మరల తూర్పుకు రావటమన్నది సంభవం కావచ్చు కానీ...

భ్రమరస్వభావాన్ని కాళిదాసు చాలా అందంగా చిత్రించాడు అభిజ్ఞానశాకున్తలంలో-

శ్లో. చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదుకర్ణాంతికచరః ।
కరే వ్యాధున్వత్యాః పిబసి రతి సర్వస్వమధరం
వయం తత్త్వాన్వేషాన్మధుకర! హతాస్త్వం ఖలు! కృతీ ॥ -ప్రథమాంకం-19

2. శ్లోకంలో '**హరిపద**' మన్న పదబంధం/పదం మాత్రమే రెండర్థాల నిచ్చేది హరియొక్క పాదం, ఆకాశం అని. ఆ శ్లేషసహకారంతో **గూఢోక్తి**.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉద్యాతి :** | **ఉద్యాతి** | ఉద్యాతః | ఉద్యాన్తి |
| | ఉద్యాసి | ఉద్యాథః | ఉద్యాథ |
| | ఉద్యామి | ఉద్యావః | ఉద్యామః |
| 4. **శ్రావయతి :** | **శ్రావయతి** | శ్రావయతః | శ్రావయన్తి |
| | శ్రావయసి | శ్రావయథః | శ్రావయథ |
| | శ్రావయామి | శ్రావయావః | శ్రావయామః |

*

**శ్లో॥ గగనచర! కిమస్మత్సన్నిధౌ తేఽస్తి కృత్యం**
**హరిపదముపయాయా దూరమస్మద్వ్రజస్య ।**
**సమరుచిమలకాల్యా వక్రయా నన్దసూనోః**
**కథయ కథమిహ త్వాం సమ్భజామస్త్యజామః ॥ 13-32**

**అ :** గగన-చర! అస్మత్-సన్నిధౌ తే కృత్యం కిమ్ అస్తి? అస్మద్-వ్రజస్య దూరం హరిపదమ్ ఉపయాయాః. వక్రయా అలక+ఆల్యా నంద-సూనోః సమ-రుచిం త్వాం కథం సంభజామః ఇహ కథం త్యజామః కథయ ।

**ప్ర :** గగన-చర = ఆకాశంలో చరించేవాడా! తిరిగే దానా! (గగనే చరతి ఇతి) (ఉద్ధవుడు బృహస్పత్యవతారం కాబట్టి గగనచరత్వం) - (తుమ్మెద కూడా ఆకాశంలో ఎగిరేదే), అస్మత్-సన్నిధౌ = మాదగ్గర (అస్మాకం సన్నిధిః తస్మిన్), తే = నీకు, కృత్యమ్ = పని, కిమ్-అస్తి = ఏమున్నది? (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.), అస్మద్-వ్రజస్య = మా గోకులానికి, దూరమ్ = దూరంగా వున్న, హరి-పదమ్ = కృష్ణుని పాదాన్ని, ఉపయాయాః = సమీపించు. (ఉప-యా-ప్రాపణే-పరస్మైపది-ఆశీర్లిఙ్-మ.ఏ.), నంద-సూనోః = కృష్ణునియొక్క (నందస్య సూనుః తస్య), వక్రయా = వంకర్లు తిరిగిన, అలక+ఆల్యా = ముంగురుల సమూహంతో (అలకానామ్ ఆలిః, తయా), సమ-రుచిమ్ = సమానమైన కాంతిగల (సమా రుచిః యస్య తమ్), త్వామ్ = నిన్ను, ఇహ = ఈ తావున/ఈ స్థితిలో, కథమ్ = ఎట్లు, సంభజామః = సేవించగలం? (సమ్-భజ పరస్మైపది-లట్-ఉ.బ.), కథమ్ = ఎట్లు, త్యజామః = విడవగలమ? (త్యజ హానౌ పరస్మైపది-లట్-ఉ.బ.), కథయ = చెప్పు. (కథ వాక్యప్రబంధే పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** గగనవిహారి! మాదగ్గర నీకేం పని? మా గోకులంనుండి దూరంగా విష్ణుపాదాల దగ్గరకు/ ఆకాశానికి వెళ్ళు. కృష్ణునియొక్క ముంగురులతో సమానమైన కాంతిగల నిన్ను చూస్తూ సేవించనూ లేము? విడువనూ లేము? ఈ స్థితిలో అది ఎలా సాధ్యమో చెప్పు.

**వి :** 1. ఈ శ్లోకంలో హరిపదమన్న పదమొక్కటే శ్లిష్టం (రెండర్థాలనిచ్చేది). మిగిలినదంతా ఉద్ధవపక్షంగానూ, తుమ్మెదల పక్షంగానూ యథాతథంగా ఒకే అర్థంతోనే అన్వయిస్తుంది. వక్తృవైశిష్ట్యకారణంగానే అర్థద్వయమూ స్ఫురిస్తుంది.

2. శ్లోకంలో ప్రతీపాలంకారం కనిపిస్తుంది. '**ప్రతీపముపమానస్యోపమేయత్వకల్పనమ్**' – (కు. 123) ప్రసిద్ధమైన ఉపమానానికి (కవులకు సాధారణంగా ఆయాభావాలకు విశిష్టోపమానంగా వాడే దానికి) ఉపమేయత్వాన్ని కల్పించటం ప్రతీపాలంకారం. ఇక్కడ ముంగురులకు ప్రసిద్ధమైన ఉపమానం తుమ్మెదల రెక్కలు. నందసూనునితో వక్రాలకాలవంటి అంటూ ఆ తుమ్మెదలను ఉపమేయంగా వర్ణించటంతో ఇది ప్రతీపాలంకారమైంది.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపయాయాః :** | ఉపయాయాత్ | ఉపయాయాస్తామ్ | ఉపయాయుః |
| | **ఉపయాయాః** | ఉపయాయాస్తమ్ | ఉపయాయాస్త |
| | ఉపయాయాసమ్ | ఉపయాయాస్వ | ఉపయాయాస్మ |

| | | | |
|---|---|---|---|
| **కథయ :** | కథయతు/కథయతాత్ | కథయతామ్ | కథయన్తు |
| | **కథయ**/కథయతాత్ | కథయతమ్ | కథయత |
| | కథయాని | కథయావ | కథయామ |

| | | | |
|---|---|---|---|
| **సంభజామః :** | సంభజతి | సంభజతః | సంభజన్తి |
| | సంభజసి | సంభజథః | సంభజథ |
| | సంభజామి | సంభజావః | **సంభజామః** |

| | | | |
|---|---|---|---|
| **త్యజామః :** | త్యజతి | త్యజతః | త్యజన్తి |
| | త్యజసి | త్యజథః | త్యజథ |
| | త్యజామి | త్యజావః | **త్యజామః** |

*

**శ్లో॥ వనభవనగతానాం దర్శయిత్వా స్వరూపం**
**కతిపయదినమధ్యే మాధవోఽసౌ త్వదీయః ।**
**న దిశతి పునరీక్షాం హన్త! తస్యానువర్తీ**
**త్వమపి చపల! తాదృక్ కిం తదస్మాసు మైత్ర్యా ॥** **13–33**

**అ :** అసౌ త్వదీయః మాధవః వన–భవన–గతానామ్ కతిపయ–దిన–మధ్యే స్వరూపం దర్శయిత్వా పునః ఈక్షాం న దిశతి. హంత చపల! తస్య అనువర్తీ త్వమ్ అపి తాదృక్ కిమ్? తద్ అస్మాసు మైత్ర్యా కిమ్?

**ప్ర :** అసౌ= ఆ, త్వదీయః = నీ వాడైన, మాధవః = కృష్ణుడు (మాయాః ధవః)/ వసంతుడు (మాధవస్తు వసన్తే స్యాద్వైశాఖే గరుడధ్వజే–నానార్థరత్నమాలా–1779), వన–భవన–గతానామ్ : వన = బృందావనమందలి, భవన = ఇళ్ళలోనికి, గతానామ్ = చేరివున్న మాకు (వనే భవనాని తేషు గతానామ్), కతిపయ–దిన–మధ్యే = కొద్దిరోజుల వ్యవధిలో (కతిపయాని చ తాని దినాని, తేషాం మధ్యే), స్వరూపమ్ = తనరూపాన్ని (స్వస్య రూపమ్), దర్శయిత్వా = చూపి (దృశ్–ప్రేరణ–ధాతువుపై క్త్వా ప్రత్యయం), పునః = మరల (ఇప్పుడు), ఈక్షామ్ = దర్శనాన్ని, న దిశతి = ఇవ్వటం లేదు. (దిశ అతిసర్జనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), హన్త=అయ్యో!, చపల! = చంచలుడా!, తస్య = ఆ కృష్ణునకు, అనువర్తీ = అను చరుడవైన (అనువర్తనం శీలమ్ అస్య ఇతి), త్వమ్–అపి = నీవూ, తాదృక్ = అటువంటి వాడవే, తత్ = కాబట్టి, అస్మాసు = మాపై, మైత్ర్యా = స్నేహంతో, కిమ్? = ఏం ప్రయోజనం?

**తా ॥** ఉద్ధవ! నీ వాడైన కృష్ణుడు ఈ బృందావనంలో వుంటున్న మాకు కొద్దిరోజుల క్రితం కనిపించి మరల ఇప్పటివరకు దర్శనమివ్వటం లేదు. అయ్యో! చపలుడా! ఆయనకు అనుచరుడవైన నువ్వు కూడా అటువంటి వాడవే. ఇక మాతో స్నేహమెందుకు?

భ్రమరపరంగా – ఎప్పుడో చైత్రవైశాఖమాసాలలో కనిపించిన వసంతుడు – మీవాడు – మళ్ళీ కనిపించటమే లేదు. ఆయన అనుచరుడవు నువ్వు. నువ్వూ అంతటి చపలుడవే. ఇక మాతో స్నేహమెందుకు?

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. దిశతి :** | **దిశతి** | దిశతః | దిశన్తి | |
| | దిశసి | దిశథః | దిశథ | |
| | దిశామి | దిశావః | దిశామః | * |

**శ్లో॥ అయి సఖి! చరతోఽస్య స్వైరమస్మత్పురస్తా-**
**న్మరుదపి సహకారీ సాధయత్యగ్ర్యశక్తిమ్।**
**అభిముఖమనుపార్శ్వం విష్వగూర్ధ్వం తథాధ-**
**శ్చరణచతురశీలః శిక్షయేదేష వీరాన్॥ 13-34**

**అ :** అయి సఖి! అస్మత్ పురస్తాత్ స్వైరం చరతః అస్య మరుద్ అపి సహకారీ అగ్ర్య–శక్తిం సాధయతి. ఏషః అభిముఖమ్ అనుపార్శ్వం విష్వగ్ ఊర్ధ్వం తథా అధః చరణ–చతుర–శీలః వీరాన్ శిక్షయేత్.

**ప్ర :** అయి సఖి! = ఓ చెలి!, అస్మత్–పురస్తాత్ = మనముందు (ప్రాచ్యాం పురస్తాత్ప్రథమే పురార్థేఽగ్రత ఇత్యపి –అమరకోశః–నానార్థావ్యయ–247), స్వైరమ్ = స్వేచ్ఛగా, చరతః = తిరుగతున్న, అస్య = ఈ ఉద్ధవునికి/తుమ్మెదకు, మరుత్–అపి = ముఖ్యప్రాణదేవర/గాలికూడా, సహకారీ సన్ = సహకరించువాడై (ఉద్ధవుని ద్వారా కృష్ణసేవ చేస్తూ), అగ్ర్య–శక్తిమ్ : అగ్ర్య = హెచ్చైన, శక్తిమ్ = శక్తిని (అగ్ర్యా చ సా శక్తిః, తామ్), సాధయతి = ప్రోది చేస్తున్నాడు/ చేస్తోంది (సధ్ హింసాయామ్–ప్రేరణ–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), ఏషః =ఈ ఉద్ధవుడు/తుమ్మెద, అభిముఖమ్ = ఎదురుగా మీదమీదకు, అనుపార్శ్వమ్ = రెండుప్రక్కలా (పార్శ్వయోః అను), విష్వక్ = గుండ్రంగా అంతటా (పరితః సర్వతో విష్వక్ సమన్తాచ్చ సమన్తతః – హలాయుధకోశః–874) (విషు సామ్యేన అంచతీతి), ఊర్ధ్వమ్ = పైకి, తథా = అదేవిధంగా, అధః = క్రిందకూ, చరణ–చతుర–శీలః : చరణ = (ఎగురుతూ) తిరగటంలో, చతుర = నేర్పుగల, శీలః = స్వభావంగల, ఏషః = ఈ ఉద్ధవుడు/తుమ్మెద, వీరాన్ = వీరులకు, శిక్షయేత్ = నేర్పించగలడు. (శిక్ష్ విద్యోపాదానే–ప్రేరణే–పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** చెలీ! స్వేచ్ఛగా మన ఎదుట తిరుగుతున్న ఈ ఉద్ధవుడికి (తుమ్మెదకు) మరుత్తు (ముఖ్యప్రాణదేవుడు–వాయుదేవుడు)(గాలి) కూడా సహకరిస్తూ శక్తినింకా పెంచుతోంది. ఇతడు (ఇది) ఎదురుగా, ప్రక్కలా, చుట్టూ, పైకి, క్రిందకూ సంచరిస్తూ ఆ సంచరణంలోని నైపుణ్యంతో వీరులకు శిక్షణనిస్తున్నట్లుంది.

**వి :** 1. ఇక్కడ భ్రమరభ్రమణస్వభావాన్ని కవి వీరశిక్షణగా భావించటం వలన ఇక్కడ ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది, ఉత్ప్రేక్షావాచకపదాలు లేవు కాబట్టి. భ్రమరస్వభావవర్ణన కాబట్టి స్వభావోక్త్యలంకారం కూడా. '**స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనమ్**' – (కు.160)

| | | | | |
|---|---|---|---|---|
| **2. సాధయతి :** | **సాధయతి** | సాధయతః | సాధయన్తి | |
| | సాధయసి | సాధయథః | సాధయథ | |
| | సాధయామి | సాధయావః | సాధయామః | |
| **శిక్షయేత్ :** | **శిక్షయేత్** | శిక్షయేతామ్ | శిక్షయేయుః | |
| | శిక్షయేః | శిక్షయేతమ్ | శిక్షయేత | |
| | శిక్షయేయమ్ | శిక్షయేవ | శిక్షయేమ | * |

**శ్లో॥ సురపతిరపి నూనం గానమేతన్నిశమ్య**
**ప్రియనినద మహిష్యా మానయిష్యత్యవశ్యమ్।**

**సమమమల! విలోక్య త్వద్వశః శిష్యవత్ స్యాత్**
**కిమిహఫలమిదానీం గాయతోఽప్యస్మదగ్రే ॥ 13-35**

**అ :** ప్రియ-నినద! అమల! సుర-పతిః అపి ఏతత్ గానం నిశమ్య మహిష్యాః సమం విలోక్య అవశ్యం మానయిష్యతి శిష్యవత్ త్వద్-వశః స్యాత్. ఇదానీమ్ అస్మద్ అగ్రే గాయతః అపి ఇహ కిం ఫలమ్?

**ప్ర :** ప్రియ-నినద = ప్రియంగా మాటాడేవాడా! ప్రియంగా మ్రోసేదానా? (ప్రియః నినదః యస్య సః తస్మాత్ సంబుద్ధిః), అమల! = నిర్మలా! ఉద్ధవా! భ్రమరా! సురపతిః అపి = దేవేంద్రుడు కూడా (సురాణాం పతిః), ఏతత్ = ఈ, గానమ్ = మాటను/పాటను, నిశమ్య = విని, మహిష్యాః = శచితో, సమమ్ = సమానంగా, విలోక్య = చూసి, అవశ్యమ్ = తప్పక, మానయిష్యతి = గౌరవింపగలడు. (మాన పూజాయామ్-చురాది-పరస్మైపది-ల్సృట్-(ప్ర.ఏ.), శిష్యవత్ = శిష్యునివలె (శిష్యేణ తుల్యం శిష్యవత్- **'తేన తుల్యం క్రియా చేద్వతిః'** (అష్టాధ్యాయి 5-1-115) సూత్రంతో వతి ప్రత్యయం), త్వద్-వశః = నీకు లోబడినవాడు, స్యాత్ = కాగలడు. (అస భువి పరస్మైపది-విధిలిజ్-(ప్ర.ఏ.), ఇదానీమ్ = ఇప్పుడు, అస్మద్+అగ్రే = మాముందు, గాయతః+అపి = పాడుతూవున్నా, ఇహ = ఈ దశలో, కిం ఫలమ్? = ప్రయోజనమేముంది?

**తా ॥** మంచి మాటకారీ! నిర్మలా! దేవేంద్రుడు కూడా నీ మాటలు విని శచీదేవితో సమానంగా నిన్ను తప్పక గౌరవింపగలడు. శిష్యుడిలా నీకు లోబడగలడు. (బృహస్పతి దేవగురువు. ఉద్ధవుడు బృహస్పతి రూపుడు కాబట్టి శిష్యుడిలా వ్యవహరిస్తాడు) కానీ ఇప్పుడు ఈ స్థితిలో మాముందు నువ్వు మాటాడి ప్రయోజనమేముంది? - ఇది ఉద్ధవుని ఉద్దేశించి-

భ్రమరపక్షంలో.... నీ ఝుంకారం శచితోపాటు విని, దేవేంద్రుడైనా నిన్ను గౌరవిస్తాడు. శిష్యరికం చేస్తాడు. కానీ ఇప్పుడు మాముందు ఇలా పాడినందువల్ల లాభమేముంది?

| | | | | |
|---|---|---|---|---|
| వి : 1. **మానయిష్యతి :** | **మానయిష్యతి** | మానయిష్యతః | మానయిష్యన్తి | |
| | మానయిష్యసి | మానయిష్యథః | మానయిష్యథ | |
| | మానయిస్యామి | మానయిష్యావః | మానయిష్యామః | |
| **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః | |
| | స్యాః | స్యాతమ్ | స్యాత | |
| | స్యామ్ | స్యావ | స్యామ | * |

**శ్లో॥ అసి మధుకర! విద్మో మాధవే పక్షపాతీ**
**కుజరవిజయచాపేతస్య జీవాయితోఽసి ।**
**విరచయ వివశం తం నః సమీపే వసన్తం**
**వివిధరసవిలాసశ్రేణివిశ్రాణనజ్ఞమ్॥ 13-36**

**అ :** మధుకర! (త్వం) మాధవే పక్ష-పాతీ అసి (ఇతి) విద్మః. కుజ-రవి-జయి-చాప+ఇతస్య జీవాయితః అసి. వివిధ-రస-విలాస-శ్రేణి-విశ్రాణన-జ్ఞం తం నః సమీపే వివశం వసంతం విరచయ.

**ప్ర :** మధు-కర! = సుఖాన్ని కల్గించేవాడా! (మధు కరోతీతి మధుకరః) ఉద్ధవా! / తుమ్మెద), (త్వమ్ = నీవు), మాధవే = కృష్ణునియందు/ వసంతర్తువునందు, పక్షపాతీ (ఇతి) = అభిమానవంతుడవని, విద్మః = ఎరుగుదుము (విద జ్ఞానే అదాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.), కుజ... ఇతస్య : కుజ = భూమియందుపుట్టిన, రవి = సూర్యుని, జయి = గెలిచే, చాప = ధనుస్సు (గాండీవం)తో, ఇతస్య = నడుస్తున్న అర్జునునకు, జీవాయితః+అసి = జీవం (ప్రాణం)వంటివాడవుగా వున్నావు. (అస భువి పరస్మైపది-లట్-మ.ఏ.), వి-వశమ్ = పక్షికి (గరుడునకు)

లోబడిన, వివిధ... జ్ఞమ్ : వివిధ = అనేక ప్రకారాలయిన, రస = రసాలయందలి, విలాస-శ్రేణి = విలాసపు వరుసల యొక్క, విశ్రాణన-జ్ఞమ్ = ఈవి (వితరణను)ని తెలిసిన (శబ్దార్థకల్పతరుః - 1336) (వివిధేషు రసేషు విలాసానాం శ్రేణేః విశ్రాణనం జానాతీతి, తమ్), తమ్ = ఆ కృష్ణుని, నః = మాయొక్క, సమీపే = దగ్గరగా, వసన్తమ్ = నివసిస్తున్న వానినిగా, విరచయ = చేయి (వి-రచ ప్రతియత్నే పరస్మైపది-లోట్-మ.ఏ.).

**భ్రమరపక్షంగా** రెండవపాదానికి మాత్రం ఇలా వేరుగా అర్థం చెప్పుకోవాలి: కు-జర = చెడ్డదయిన ముసలితనాన్ని, విజయి = గెలిచే, చాపే = విల్లు అయిన పుష్పమందు, తస్య = దానికి, జీవాయితః = వింటినారిగా (మౌర్వీ జ్యా సింజినీ గుణోజీవా - హలాయుధకోశః - 464), అసి = వున్నావు.

**తా ॥** మధుకరా! ఉద్ధవా! నువ్వు మాధవునియందు (కృష్ణునియందు) పక్షపాతం గల వాడవు. కర్ణుని గెలిచే అర్జునుని వింటికి అల్లెత్రాడుగా వున్నవాడవు. మాకు తెలుసు. వివశుడైవున్న ఆ కృష్ణుని మా దగ్గర నివసించేటట్లు చేయి. కృష్ణుడు వివిధరసవిలాస శ్రేణులను కల్పించటమెలాగో తెలిసినవాడు. (భ్రమరా! నీవు వసంతునిపై పక్షపాతం గలదానవు. మాకు తెలుసు. చెడ్డదయిన ముసలితనాన్ని జయించే పుష్పధనుస్సునకు నీవు జీవం (అల్లెత్రాడు) వంటిదానవు. వివశుడై వున్న ఆ కృష్ణుని మా దగ్గరకు చేర్చు. తాను వివిధరసవిలాసాలను అందజేయటం తెలిసిన వాడు.)

**వి : 1. మధు** శబ్దానికి సుఖమనే అర్థాన్ని భాగవతతాత్పర్యనిర్ణయం నిర్దేశిస్తోంది. శబ్దనిర్ణయ గ్రంథాన్ని ఉదాహరిస్తూ-

శ్లో. మధు నామ సుఖం విన్ద్యాత్ - మాధుర్యం సుఖహేతుతా ।
సుఖే రతిర్వా సంప్రోక్తా - శబ్దతత్త్వవిచక్షణైః ॥ - ఇతి శబ్దనిర్ణయే.

- భాగవతతాత్పర్యనిర్ణయః 11/7/44

2. ఈ శ్లోకంలో గూఢోక్తికి శ్లేష సహకారముంది. కుజ-రవి-జయి-చాప-ఇతస్య/కుజర-విజయి-చాపే-తస్య అని సభంగంగా, మదు, జీ పదాలతో అభంగంగా రెండర్థాలనిస్తూ శ్లేష గూఢోక్తికి సహకరిస్తుంది.

3. జర కుత్సితమన్న భావం సహజంగా ప్రాణికోటి కుంటుంది. మానసికంగా ఎదుగుదల శారీరకంగా తగ్గుదల వుండే స్థితి. భౌతికమయిన విషయాలపై దృష్టి కొనసాగుతున్న వారికీ, భౌతికంగా ఏర్పడిన శైథిల్యకారణంగా ఇతరులపై ఆధారపడవలసి వచ్చినవారికీ అది ఇహలోక నరకం వంటిది. అందుకే '**అనాయాసేన మరణమ్**' అని శ్రమలేని చావును ఆశిస్తారు. అయితే శారీరక సుఖాపేక్ష నశించనివారు జరను అసహ్యించుకొంటారు. యయాతి లాగా మరల యౌవనాన్ని పొందాలని తాపత్రయపడతారు.

శుక్రాచార్యుడు తన కుమార్తెకు యయాతి ద్రోహం చేశాడని కోపించి "ముదిమిని పొందెదవు" అని యయాతిని శపిస్తాడు. యయాతి తన వార్ధక్యాన్ని కుమారుల యౌవనంతో మార్చుకోవాలని వారిని అభ్యర్థిస్తాడు. పైవాళ్ళందరూ తిరస్కరిస్తారు. కనిష్ఠపుత్రుడు పూరువు మాత్రం అంగీకరిస్తాడు. ఆ తండ్రీ కొడుకుల సంభాషణ చూడండి.

ఉ. పిన్నవుగాని నీవు కడు బెద్దవు బుద్ధులయందు రమ్ము నా
యన్న! మదాజ్ఞదాఁటవు గదన్న! వినీతుఁడవన్న! నీవు నా
యన్నలు సెప్పినట్లు పరిహారము సెప్పకుమన్న! నాజరన్
మన్ననఁ దాల్చి నీ తరుణిమంబొనఁ గూర్పుము నాకుఁ బుత్త్రకా!
అనిన విని గురుభక్తి గుణాధారుండైన పూరుండిట్లనియె.

శా. అయ్యా! నన్నిటు వేఁడనేల భవదీయాజ్ఞా సముల్లంఘనం
బయ్యుండన్ బరిహారమున్ వొడువనే నన్యాయినే నీ జర

న్నెయ్యంబొప్పఁగ దాల్చి నా తరుణిమన్నీకిచ్చెదన్ బంపినన్
గయ్యంబాడెడి పుత్రకుండు గ్రిమిసంకాశుండుఁ గాకుండునే. -పోతనభాగవతము 9/553-555

ఈ పూరువే చంద్రవంశ కర్తలలో ఒకడుగా పరిగణింపబడ్డది.

| | | | |
|---|---|---|---|
| 4. **విద్మః :** | వేత్తి | విత్తః | విదన్తి |
| | వేత్సి | విత్థః | విత్థ |
| | వేద్మి | విద్వః | **విద్మః** |
| **అసి :** | అస్తి | స్తః | సన్తి |
| | **అసి** | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **విరచయ :** | విరచయతు/విరచయతాత్ | విరచయతామ్ | విరచయన్తు |
| | **విరచయ**/విరచయతాత్ | విరచయతమ్ | విరచయత |
| | విరచయాని | విరచయావ | విరచయామ. * |

**శ్లో॥ వితన్యమానస్వప్రేష్ఠవియోగార్తీరథోద్ధవః ।**
**ప్రియోక్తిభిః ప్రీణయిత్వా ప్రయయౌ కృష్ణసన్నిధిమ్ ॥ 13-37**

**అ :** ఉద్ధవుడు తిరిగి కృష్ణుని సన్నిధికి చేరుట. -పథ్యావక్త్రమ్.

**అ :** అథ వితన్య-మాన-స్వ-ప్రేష్ఠ-వియోగ-ఆర్తీః ప్రియ+ఉక్తిభిః ప్రీణయిత్వా ఉద్ధవః కృష్ణ-సన్నిధిం ప్రయయౌ.

**ప్ర :** అథ=ఆ తరువాత, వితన్య... గార్తీః : వితన్యమాన = పెరుగుతున్న, స్వ = తమయొక్క, ప్రేష్ఠ = ప్రియునియొక్క, వియోగ = విరహం వలన, ఆర్తీః = బాధ గల ఆ గోపికలను (వితన్యమానా స్వస్య ప్రేష్ఠస్య వియోగేన ఆర్తిః యాసాం, తాః), ప్రియ+ఉక్తిభిః = నచ్చే మాటలతో (ప్రియాశ్చ తాః ఉక్తయః, తాభిః), ప్రీణయిత్వా = ఆనందింపజేసి (ప్రీ ధాతువు-ప్రేరణ-పై క్త్వా ప్రత్యయం), ఉద్ధవః = ఉద్ధవుడు, కృష్ణ-సన్నిధిమ్ = కృష్ణుని దగ్గరకు (కృష్ణస్య సన్నిధిః, తమ్), ప్రయయౌ = వెళ్ళాడు. (ప్ర యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.),

**తా ॥** ఆ పై ఉద్ధవుడు పెరుగుతున్న ప్రియావియోగబాధతో కునారిల్లుతున్న ఆ గోపికలను ప్రియవచనాలతో ఆనందింపజేసి కృష్ణుని దగ్గరకు బయలుదేరాడు.

**వి :** 1. ఉద్ధవుని ప్రియవచనాలు, ఆ మాటలను విని గోపికలు కృష్ణతత్త్వాన్ని గ్రహించి తృప్తి పడి మరల ఉద్ధవునితో కృష్ణునకు తమ సందేశాన్ని పంపటం. విస్తృతంగా భాగవతంలో (దశమస్కంధం 47వ అధ్యాయం) వుంది. మచ్చుకు పోతన ఉద్ధవుని అనునయవచనాలు-

మ. జపదానవ్రతహోమసంయమతపస్స్వాధ్యాయముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నే విభున్ మనముల న్నిల్పంగలే రట్టి స
ద్విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీ కజ
స్ర పటుధ్యానము లిట్లు నిల్చునె? భవచ్చారిత్రముల్ చిత్రముల్. - 10/1465

కృష్ణసందేశంగా ఉద్ధవుని మాట-

మ. చెలువల్ దవ్వన నున్న వల్లభులపైఁ జిత్తంబులం గూర్తు రు
త్కలికన్ జేరువవారికంటె నదియుం గాకెప్పుడున్ నన్ను మీ
రలు చింతింపుచు నుండఁ గోరి యిటు దూరస్థత్వముం బొందితిన్
దలఁకం బోలదు నన్నుఁ గూడెదరు నిత్యధ్యానపారీణలై. -10/1471

గోపికల ప్రతిసందేశం–

సీ. తనుఁబాసి యొక్కింత తడవైన – నిటమీఁద నేలపై మేనులు నిలువ మనుము
నేలపై మేనులు నిలువక యట మున్న – ధైర్యంబులొక్కటఁ దలఁగు ననుము
ధైర్యంబు లొక్కటఁ దలఁగిన పిమ్మటఁ – జిత్తంబు లిక్కడఁ జిక్క వనుము
చిత్తంబు లిక్కడఁ జిక్కక వచ్చినఁ – బ్రాణంబు లుండక పాయు ననుము

తే. ప్రాణములు పోవ మఱి వచ్చి ప్రాణవిభుఁడు
ప్రాణిరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్లఁ
జేరి దూఱంగ మఱి యేమి సేయువాఁడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ! – 10/1478

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రయయౌ :** | **ప్రయయౌ** | ప్రయయతుః | ప్రయయుః |
| | ప్రయయిథ/ప్రయయిథ | ప్రయయథుః | ప్రయయ |
| | ప్రయయౌ | ప్రయయివ | ప్రయయిమ. * |

**శ్లో॥కంసే బలైస్సహ మృతే సతి యాఽవశిష్టా – వంశం స్వమాతురపి తాదృశమస్తినామ్నీ।**
**కృత్వోచితం విదధతీవ నిజాభిధానం – పిత్రే న్యవేదయదథాచ్యుతకృత్యమార్తా ॥38**

**అ :** అస్తి తన తండ్రి అయిన జరాసంధునికి కంసమృతిని తెలియజేయటం. –వసంతతిలక.

**అ :** అథ కంసే బలైః సహ మృతే (సతి) అవశిష్టా అస్తినామ్నీ యా ఆర్తా స్వ–మాతుః అపి వంశం తాదృశం కృత్వా నిజ+అభిధానమ్ ఉచితం కృత్వా విదధతి+ఇవ అచ్యుత–కృత్యం పిత్రే న్యవేదయత్.

**ప్ర :** అథ = ఆ పై, కంసే = కంసుడు, బలైః సహ = సేనలతో పాటు, మృతే (సతి) = మరణించగా, అవశిష్టా = మిగిలినదై, అస్తి–నామ్నీ = అస్తి అనుపేరుగల, యా = ఏ కాంత, ఆర్తా (సతీ) = దీనురాలై, స్వ–మాతుః = తన తల్లియొక్క, వంశమ్–అపి = ఇంటిని కూడా (పుట్టింటిని కూడా), తాదృశమ్ = అటువంటిదానినిగా, కృత్వా = చేసి (కృ ధాతువుపై క్త్వా ప్రత్యయం), నిజ+అభిధానమ్ = తన పేరును (అస్తి అన్న పేరును) (నిజస్య అభిధానమ్), ఉచితమ్ = తగినదిగా, విదధతీ ఇవ = చేస్తున్నదో అన్నట్లు, అచ్యుత–కృత్యమ్ = కృష్ణుని పనిని (అచ్యుతస్య కృత్యమ్), పిత్రే = తండ్రికి (జరాసంధునికి), ని+అవేదయత్ = తెలియజేసింది. (ని+విద్–జ్ఞానే అదాది–ప్రేరణార్థే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు కంసుని సేనలతో పాటు సంహరించిన తరువాత కంసుని భార్య అస్తి మిగిలింది. ఆమె జరాసంధుని కూతురు. ఆమె కలతపడి కృష్ణుడు చేసిన పనిని తన తండ్రికి తెలియజేసింది. బహుశః ఆమె తన పుట్టింటికి కూడా మెట్టినింటికి పట్టిన గతినే పట్టించి '**అస్తి**' (వున్నది) అన్న తన పేరును సార్థకం చేయదలచిందేమో!

**వి :** 1. '**విదధతీ.ఇవ**' అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం. మెట్టినింటిపరిస్థితికి పుట్టినింటిని కూడా తీసుకురావాలన్న భావన 'అస్తి' కి వున్నదనటం, తన పేరు సార్థకం చేసుకోదలచిన దనటం అందమైన ఉత్ప్రేక్ష. కానీ స్త్రీ స్వభావమందుకు అంగీకరిస్తుందా? అన్నది సంశయం. తన పేరు 'అస్తి' కాబట్టి ఆ పేరులోని శక్తి అలా పనిచేసి ఆమెను అలా ప్రేరేపించిందని కవిభావన కావచ్చు. లేదా ఆమెకు తన పుట్టినిల్లూ, మెట్టినిల్లూ కూడా నచ్చి వుండక పోవచ్చు. కృష్ణచర్యతో తన అభిప్రాయం మీద విశ్వాసం కలిగివుండవచ్చు.

| | | | |
|---|---|---|---|
| 2. **న్యవేదయత్ :** | **న్యవేదయత్** | న్యవేదయతామ్ | న్యవేదయన్ |
| | న్యవేదయః | న్యవేదయతమ్ | న్యవేదయత |
| | న్యవేదయమ్ | న్యవేదయావ | న్యవేదయామ. * |

**శ్లో॥ స మాగధః సాధితసైన్యసింధు-ర్మదాన్ధబుద్ధిర్మథురాం జగామ ।**
**అనేకదేశాశ్రితభూమిభార-హరస్య సారథ్యకృదచ్యుతస్య ॥ 13-39**

**అ :** జరాసంధుడు మథురకు వచ్చుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సాధిత-సైన్య-సిన్ధుః మద+అంధ-బుద్ధిః సః మాగధః అనేక-దేశ-ఆశ్రిత-భూమి-భార-హరస్య అచ్యుతస్య సారథ్యకృద్ మథురాం జగామ.

**ప్ర :** సాధిత-సైన్య-సిన్ధుః : సాధిత=సమకూర్చుకొన్న, సైన్య=సేన అనే, సిన్ధుః = సముద్రంగల వాడూ (సాధితం సైన్యమ్ ఏవ సిన్ధుః యస్య సః), మద+అన్ధ-బుద్ధిః : మద = గర్వంచేత, అన్ధ = గ్రుడ్డిదయిన, బుద్ధిః = బుద్ధిగలవాడూ (మదేన అన్ధా బుద్ధిః యస్య సః), సః = ఆ, మాగధః = మగధాధిపతి - జరాసంధుడు, అనేక... హరస్య : అనేక = చాలా, దేశ = దేశాలను, ఆశ్రితః = ఆశ్రయించి వున్న, భూమి = భూమియొక్క, భార = బరువును, హరస్య = హరించునట్టి, (అనేకేషు దేశేషు ఆశ్రితస్య భూమేః భారస్య హరః, తమ్), అచ్యుతస్య = కృష్ణునకు, సారథ్య-కృత్ = సారథ్యం చేసేవాడై (సహాయం కరోతీతి), మథురామ్ = మథురకు, జగామ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కంసుని వినాశనాన్ని తెలిసికొన్న జరాసంధుడు మదాంధబుద్ధియై తాను సాధించిపెట్టు కొన్న సేనాసముద్రాన్ని తరలించుకొని భూభారాన్ని హరించటానికి సిద్ధపడిన కృష్ణుడికి తానే సారథియై నడిపిస్తున్నట్లు (సహాయం చేస్తున్నట్లు) మథురకు వెళ్ళాడు.

**వి :** 1. కృష్ణావతరణమే భూభారహరణమే లక్ష్యంగా జరిగింది. కృష్ణావతారోపక్రమణికలోనే ఆ విషయం సుస్పష్టం-

శ్లో. భూమిర్దృప్తనృపవ్యాజదైత్యానీకశతాయుతైః ।
ఆక్రాంతా భూమిభారేణ బ్రహ్మాణం శరణం యయౌ ॥
శ్లో. గౌర్భూత్వాఽ శ్రుముఖీ ఖిన్నా క్రందంతీ కరుణం విభోః ।
ఉపస్థితాన్తికే తస్మై వ్యసనం స్వమవోచత ॥ - భాగవతమ్ 10/1/17,18

భూమి బ్రహ్మదగ్గర మొరపెట్టుకొంటే, బ్రహ్మ ఆమెతో సహా వెళ్ళి విష్ణువుకు విన్నవించుకొన్నాడు. అందువల్ల అవతారలక్ష్యమే భూభారాన్ని తగ్గించటం.

**కంసవధతోనే భూభారహరణం ప్రారంభమైంది.** అందుకు ముందు గోకులంలో జరిగిన సంహారమంతా నామమాత్రం. ఎందుకంటే వారంతా దుర్మార్గులు కావచ్చు కానీ అస్వతంత్రులు. తాము చెడటమే కానీ ఇతరులను చెరపలేని వారు. వారు పాలితులు మాత్రమే. కంసుడు పాలకుడు. తాను చెడి, నలుగురినీ చెడపగలవాడు. పాలితుల తప్పులు పాలకుల లెక్కలోనికే వస్తాయి. తాను చేసిన తప్పులతో పాటు. కాబట్టి కంసహననమే భూభారహరణానికి ప్రారంభం.

2. '**అచ్యుతస్య సారథ్యకృత్**' అన్నచోట ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది.

3. **జగామ :** 13-17వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ గజై రథౌఘైర్గగనం స్పృశద్భి-ర్భటైర్హయైర్భాసురభూషణౌఘైః ।**
**జగామ జామాతృపథేన తస్మై - చమూమమూం ప్రేషయితుం ధియేవ ॥ 40**

**అ :** జరాసంధుడు సేనతో కదిలిరావటాన్ని కవి మరొక రీతిగా సంభావించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అముం చమూం జామాతృ-పథేన తస్మై ప్రేషయితుం ధియా ఇవ గగనం స్పృశద్భిః గజైః రథ+ఓఘైః భటైః హయైః భాసుర-భూషణ-ఓఘైః (మథురాం) జగామ.

ప్ర : అముమ్ = ఈ, చమూమ్ = సేనను, జామాతృ-పథేన = అల్లుని (కంసుని) బాటలో (జామాతుః పథః, తేన), తస్మై = ఆ అల్లుని కొరకు, ప్రేషయితుమ్ = పంపాలనే, ధియా ఇవ = బుద్ధితోనో అన్నట్లు, (సః = ఆ జరాసంధుడు), గగనమ్ = ఆకాశాన్ని, స్పృశద్భిః = తాకుతున్న, గజైః = ఏనుగులతోనూ, రథ+ఓఘైః = రథ సమూహాలతోనూ (రథానామ్ ఓఘాః తైః), భాసుర = ప్రకాశించే, భూషణ = నగలయొక్క, ఓఘైః = సమూహాలు గల (భాసురాణి చ తాని భూషణాని, తేషామ్ ఓఘాః యేషాం తైః), భటైః = భటులతోనూ, హయైః = చ (సహ) = గుఱ్ఱాలతో కూడా, జగామ = (మధురకు) వెళ్ళాడు. (గమ్ గతౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ జరాసంధుడు ఆకాశాన్ని అంటే ఏనుగులతో, రథసమూహాలతో, వెలుగులు చిమ్మే ఆభరణాలు ధరించిన సైనికులతో, గుఱ్ఱాలతో సహా మధురకు బయలుదేరాడు. ఆ పయనం తన అల్లుడు వెళ్ళిన దారిలో ఆయనకు తోడుగా సేనను పంపటానికి బయలు దేరినట్టుంది.

**వి :** 1. సేనలను తీసికొని జరాసంధుడు పయనించటం అల్లునికి సేనను పంపుతున్నట్లు ఉందనటం కవి సంభావన. కాబట్టి ఉత్ప్రేక్ష. (సంభావనా స్యాదుత్ప్రేక్షా- కు.32)

2. **జగామ :** 13-39వ శ్లోకవ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ కున్తైః కుఠారైః కుద్దాలైర్బభఞ్జుర్భగవత్పురీమ్ ।**
**ఆద్యాముపనిషద్విద్యాం కుతర్కైరివ వాదినః ॥** **13-41**

**అ :** జరాసంధునిసేన మధురపై దండెత్తటం. -పథ్యావక్త్రమ్.

**అ :** వాదినః కుతర్కైః ఆద్యామ్ ఉపనిషద్విద్యామ్+ఇవ (తే) కుంతైః కుఠారైః కుద్దాలైః భగవత్ పురీం బభంజుః

ప్ర : వాదినః = వాదులు, కుతర్కైః = విపరీతతర్కాలతో (హేత్వాభాసాలతో), ఆద్యామ్ = అనాది అయిన, ఉపనిషద్-విద్యామ్-ఇవ = ఉపనిషద్విద్యనువలె, (జరాసంధుని సేనలు), కుంతైః = ఈటెలతోనూ, కుఠారైః = గొడ్డళ్ళతోనూ, కుద్దాలైః = గునపాలతోనూ, భగవత్-పురీమ్ = కృష్ణనగరిని (మధురను), బభంజుః = భంగపరిచారు (భంజ్ ఆమర్దనే-రుధాది-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** జరాసంధుని సేనలు ఈటెలతో, గొడ్డళ్ళతో, గునపాలతో కృష్ణనగరి అయిన మధురను భంగపరచారు. అది (యుక్తి) వాదులు కుతర్కాలతో అనాది అయిన ఉపనిషద్విద్యను భంగపరచే ప్రయత్నం చేసినట్టుంది.

**వి :** 1. ఉపనిషత్తులకన్న ఉపనిషద్ జ్ఞానం పురాతనం. ఆలోచనలకు రూపం ఉపనిషత్తులలో కనిపించినా అటువంటి ఆలోచనలు అంతకన్న ప్రాచీనతరాలే. మనిషి తన పరిసరాలలో కారణం తెలియని నియతిని గమనించటం ప్రారంభించిన రోజే ఉపనిషద్విద్య ప్రారంభ మైంది. దానికి మూలమే తర్కం. అందువల్ల కుతర్కాలు దానినేమీ చేయలేవు. అయితే ఏదోచెయ్యాలన్న ప్రయత్నాలు మాత్రం జరుగుతుంటాయి. జరాసంధుడు మధురపై దండెత్తటమిటువంటిదే.

| | | | |
|---|---|---|---|
| 2. **బభంజుః :** | బభంజ | బభంజతుః | **బభంజుః** |
| | బభంజిథ/బభంక్థ | బభంజథుః | బభంజ |
| | బభంజ | బభంజివ | బభంజిమ. * |

**శ్లో॥ ఉపవనముపవేదప్రాయమున్మూలయన్తః**
**సుకృతసమముదారం ద్వారమారాద్బభంజుః ।**
**ప్రతిభయవరశక్త్యాద్యూర్జితాధారయుక్తాః**
**ఖలమతహృతచిత్తా దూష్యదుర్మంత్రదృప్తాః ॥** **13-42**

అ : జరాసంధసేన మధురను పాడుచేయుట. -మాలిని.

అ : ప్రతిభయ-వర-శక్తి+ఆది+ఊర్జిత+ఆధార-యుక్తాః ఖల-మత-హృత-చిత్తాః దూష్య-దుర్మంత్ర-దృప్తాః ఉపవేద-ప్రాయమ్ ఉపవనమ్ ఉన్మూలయన్తః సుకృత-సమమ్ ఉదారమ్ ద్వారమ్ ఆరాత్ బభంజుః.

ప్ర : ప్రతి... యుక్తాః : ప్రతిభయ = భీకరమైన, వర = శ్రేష్ఠమైన, శక్తి+ఆది = శక్తి మొదలుగాగల, ఊర్జిత=బలిష్ఠమైన, ఆధార=ఆధారంతో, యుక్తాః=కూడినవారూ (ప్రతి-భయాని వరాణిచ తాని శక్త్యాదీని (ఆయుధాని) ఏవ ఊర్జితశ్చ అసౌ ఆధారః, తేన యుక్తాః), ఖల... చిత్తాః : ఖల = దుర్మార్గుడైన జరాసంధునియొక్క, మత = అభిమతంచే, హృత = అపహరింపబడిన, చిత్తాః = మనస్సుగలవారూ (ఖలస్య మతేన హృతాని చిత్తాని యేషాం తే), దూష్య... దృప్తాః : దూష్య = నిందింపదగిన, దుర్మంత్ర = దురాలోచనలతో, దృప్తాః = పొగరెక్కిన వారూ (దూష్యాశ్చ తే దుర్మంత్రాః తై దృప్తాః) అయిన జరాసంధసేనలు, ఉపవేద-ప్రాయమ్ = ఉపవేదం వంటి, ఉపవనమ్ = తోటను, ఉన్మూలయన్తః = పెకలిస్తూ, సుకృత-సమమ్ = పుణ్యంతో సమానమై, ఉదారమ్ = ఉదారమైన, ద్వారమ్ = ద్వారాన్ని, ఆరాత్ = దగ్గరగా (ఆరాద్దూరసమీపయోః-నానార్థమంజరి-714), బభంజుః = బ్రద్దలు చేశారు.

**తా ॥** (జరాసంధుని సేనలు కృష్ణసేనతో పోరాడటాన్ని వర్ణిస్తున్నాడు కవి) జరాసంధుని సేనలు భీకరమైన శక్త్యాద్యాయుధాల బలిష్ఠమైన ఆధారంతో కూడి జరాసంధుని దురభిప్రాయాలచే అపహరింపబడిన మనస్సులు గలవారై, నిందింపదగిన దురాలోచనలతో పొగరెక్కి ఉపవేదప్రాయమైన ఉపవనాన్ని నిర్మూలిస్తూ సుకృతసమమై, ఉదారమైన గోపురాన్ని దగ్గరగా బ్రద్దలుచేశారు.

**వి :** 1. శ్లోకంలో జరాసంధసేనను మాయావాదులతోనూ కృష్ణసేనను తత్త్వవాదులతోనూ పోలుస్తున్నాడు కవి. జరాసంధసేనలు శక్త్యాద్యాయుధబలం గలవారు. మాయావాదులు శక్తి మొదలయిన క్షుద్రదేవతాపూజ ద్వారా బలిష్ఠులయినవారు. క్షుద్రదేవతాపూజలతో పాటు భిన్న సిద్ధాంతాల సాంకర్యంతో మతిభ్రమించిన వారు. నిందింపదగిన మంత్రోపాసనల ద్వారా పొగరెక్కినవారు. వారు సుకృతసమమై ఉదారమైన ద్వారాన్ని (గోపురాన్ని) బ్రద్దలు చేశారు. మధురానగరి ఉపనిషత్తుల వంటిది. తత్త్వజ్ఞానరూపం. దానికి దగ్గరగా వున్న తోట ఉపవేదప్రాయం.

2. ఉపవేదాలు నాలుగు. 1. ధనుర్వేదం 2. ఆయుర్వేదం 3. గాంధర్వం 4. స్థాపత్యం.

3. **బభంజుః** :13-41వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ బాధ్యాం తాం సహ నిశ్చలార్థనికరైః క్రుద్ధాః ఖలా నిర్గుణా-**
**గారామంతరహో విధాతుమమతా యత్నం వితేనుః కిల ।**
**కృష్ణేనాపి సముజ్ఝితాం సమయినో యుక్త్యాఽఽత్మపక్షేఽఞ్జసా**
**కృత్వైక్యం సమయోజయన్ గతభయా దుర్భాష్యపుఞ్జైరపి ॥ 13-43**

అ : కృష్ణ శత్రువులు మధురానగరిని భంగపరచటం. -శార్దూలవిక్రీడితమ్.

అ : సమయినః గతభయాః క్రుద్ధాః ఖలాః అమతాః యుక్త్యా ఆత్మపక్షే అంజసా ఐక్యం కృత్వా తాం నిశ్చలఃఅర్థ-నికరైః సహ బాధ్యాం విధాతుం, (యత్నం వితేనుః కిల) నిర్గుణ+అగారామ్+అంతః విధాతుం, కృష్ణేన సముజ్ఝితామ్ అపి విధాతుం, యత్నం వితేనుః కిల. దుర్భాష్య-పుంజైః అపి సమయోజయన్.

ప్ర : సమయినః = సంకేతసూచనలు గలవారూ (సంకేతే సమయః ప్రోక్తః నియమేఽవసరేఽపి చ - త్రికాండశేషః), గత-భయాః = భయంలేనివారూ (గతం భయం యేభ్యః తే), క్రుద్ధా = కోపిష్ఠులూ, ఖలాః = చెడ్డవారూ అయిన, అమతాః = శత్రువులు, యుక్త్యా = ఉపాయంతో, ఆత్మ-పక్షే = తమవైపు (తమసేనలో) (ఆత్మనాం పక్షే), అంజసా = వేగంగా, ఐక్యమ్ = ఏకత్వాన్ని, కృత్వా = సాధించి, తామ్ = ఆ మధురానగరిని,

నిశ్చల+అర్థ–నికరైః : నిశ్చల = స్థిరంగా వున్న, అర్థ = వివిధవస్తువులయొక్క, నికరైః సహ = సమూహాలతో కూడా, బాధ్యామ్ = బాధింపదగినదిగా, వితేనుః కిల = చేశారు గదా! (వి–తనూ విస్తారే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), అంతః = లోన, నిర్గుణ+అగారామ్ : నిర్గుణ = గుణహీనమైన, అగారామ్ = ఇళ్ళు గలదిగా (భవనాగారమందిరమ్–అమరకోశః–పుర–5), విధాతుమ్ = చేయటానికి, యత్నమ్ = ప్రయత్నాన్ని, వితేనుః కిల = చేశారు గదా!, కృష్ణేన = కృష్ణునిచే, సముజ్ఝితామ్ = విడువబడినదానినిగా, విధాతుమ్ = చేయటానికి, (యత్నం వితేనుః కిల = ప్రయత్నించారు గదా!), దుర్భాష్య–పుంజైః+అపి : దుర్భాష్య = చెడుమాటలయొక్క, పుంజైః అపి = సమూహాలతో కూడా, సమయోజయన్ = కూర్చారు. (యుజ్ యోగే పరస్మైపది–రుధాది–లఙ్–ప్ర.బ.)

**తా ॥** కోపిష్ఠులు, చెడ్డవారు, భయరహితులు అయిన శత్రువులు పనిచేయటానికి సంకేతాలను ఏర్పరచుకొని యుక్తితో తమ పక్షంలోని సేనలో సమైక్యాన్ని సాధించి ఆ నగరాన్ని నిశ్చలంగా వున్న కలశాదివస్తువులతోపాటు నశింపజేశారు. లోపలి భాగాలను గుణహీనాలుగా చేసే ప్రయత్నం చేశారు. కృష్ణరహితం చేయాలనీ ప్రయత్నించారు. దుర్భాషల సముదాయాలతో నింపి వేశారు.

**అద్వైతుల పక్షంగా** : అపసిద్ధాంతాలుగలవారు (సమయినః) నిశ్చలప్రమాణాలతో సహా ఆ ఉపనిషద్విద్యను బాధించాలని ప్రయత్నించారు. ఆత్మపక్షంలో (ఆత్మ విషయంలో సమైక్యాన్ని (అద్వైతాన్ని) కల్పించారు. కృష్ణపరత్వాన్ని కూడా తొలగించాలని ప్రయత్నం చేశారు. ఆ ఉపనిషద్విద్యకు దుర్భాష్యాలను కూడా నిర్మించారు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **వితేనుః :** | వితతాన | వితేనతుః | **వితేనుః** |
| | వితేనిథ | వితేనథుః | వితేన |
| | వితతాన/వితతన | వితేనివ | వితేనిమ |
| **సమయోజయన్ :** | సమయోజయత్ | సమయోజయతామ్ | **సమయోజయన్** |
| | సమయోజయః | సమయోజయతమ్ | సమయోజయత |
| | సమయోజయమ్ | సమయోజయావ | సమయోజయామ. |

*

**శ్లో॥ కృష్ణోఽపి స్వచమూం సువర్ణఖచితాం కృత్వా చతుర్ధా ప్రభు–**
**స్తత్రాగ్ర్యాంశ్చతురో విధాయ నగరీరక్షార్థమీశోఽదిశత్ ।**
**భాస్వత్సూత్రచమూమివోపనిషదాం రక్షార్థమత్యూర్జితా–**
**మధ్యాయైః సహితాం చతుర్భిరమలైస్తన్మానపాదోజ్జ్వలైః ॥ 13–44**

**అ :** కృష్ణుడు జరాసంధునిసేనతో పోరాడటానికి వ్యూహాన్ని నిర్మించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రభుః ఈశః కృష్ణః అపి సువర్ణ–ఖచితాం స్వ–చమూం చతుర్ధా కృత్వా తత్ర అగ్ర్యాన్ చతురః విధాయ నగరీ–రక్షార్థమ్ అదిశత్. తత్–మాన–పాద+ఉజ్జ్వలైః అమలైః చతుర్భిః సహితామ్ అత్యూర్జితాం భాస్వత్–సూత్ర–చమూమ్ ఉపనిషదాం రక్షార్థమ్ అదిశత్.

**ప్ర :** ప్రభుః=సమర్థుడు, ఈశః = స్వామి అయిన, కృష్ణః+అపి = కృష్ణుడు కూడా, సువర్ణ–ఖచితామ్ = బంగారు పొదిగిన (సువర్ణైః ఖచితా, తామ్), స్వ–చమూమ్ = తనసేనను, చతుర్ధా కృత్వా = నాలుగుగా విభజించి, తత్ర = అక్కడ, అగ్ర్యాన్ = నాయకులనుగా (అగ్రే గచ్ఛన్తి ఇతి అగ్ర్యాః, తాన్), చతురః = నలుగురిని, విధాయ = సమకూర్చి (వి ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నగరీ–రక్షార్థమ్ = పురరక్షణకై, తత్… ఉజ్జ్వలైః : తత్–మాన = ఆ అధ్యాయాల లెక్కగల, పాద = పాదాలచే (గ్రంథావాంతర భాగాలు), ఉజ్జ్వలైః = ప్రకాశిస్తున్న, అమలైః =

నిర్మలమైన, చతుర్భిః అధ్యాయైః = నాలుగు అధ్యాయాలతో, సహితామ్ = కూడిన, అత్యూర్జితామ్ = మిక్కిలి ఉత్కృష్టమైన, భాస్వత్–సూత్ర–చమూమ్ : భాస్వత్ = ప్రకాశిస్తున్న, సూత్ర = బ్రహ్మసూత్రాలు అనే, చమూమ్ = సేనను, ఉపనిషదామ్ = ఉపనిషత్తులయొక్క, రక్షార్థమ్ = రక్షణకై, అదిశత్ = ఆదేశించాడు.

**తా ॥** కృష్ణుడు సువర్ణఖచితమైన తన సేనను నాలుగుగా విభజించి నాలుగింటికి నాయకులను ఏర్పరచి నగరరక్షణకై వారిని పురమాయించాడు. అది వ్యాసుడు నిర్మలమైన నాలుగు అధ్యాయాలతో కూడిన బ్రహ్మసూత్రాలను సువర్ణఖచితాలను చేసి ఉపనిషద్రక్షణకై ఆదేశించి నట్లుంది.

**వి :** 1. బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులు, భగవద్గీత – ఈ మూడింటికి ప్రస్థానత్రయమని వ్యవహారం. విశేషమేమిటంటే ఈ మూడింటికీ ఆయా సిద్ధాంతప్రతిష్ఠాపకులు వ్యాఖ్యానాలు వ్రాశారు. అందలి విషయాలకు శంకరాచార్యులు అద్వైతపరంగా, రామానుజాచార్యులు విశిష్టాద్వైతపరంగా, మధ్వాచార్యులు ద్వైతపరంగా ఆ వ్యాఖ్యలను ప్రోదిచేశారు. ఎత్తువారి చేతిబిడ్డలాగా ఆ వాఙ్మయం వారి వారి చేతుల్లో ఒదిగిపోయింది.

బ్రహ్మసూత్రాలకే **వేదాంతసూత్రాలు, శారీరకసూత్రాలు, భిక్షుసూత్రాలు** అని కూడా పేర్లు.

2. చతుర్వ్యూహపురరక్షణను భాగవతం వివరంగా చెప్పింది.

శ్లో. నిర్గత్యసదనాత్ కృష్ణో వృష్ణీనాహూయ సర్వశః ।
ఆజ్ఞాపయామాస తూర్ణం చతుర్ద్వారస్య పాలనే ॥

శ్లో. **వసుదేవం చ నిశఠం కృతవర్మాణముద్ధవమ్ ।**
కృష్ణో నిర్యాతయామాస పూర్వద్వారేణ భారత ॥

శ్లో. ఉగ్రసేనం సుదామానం పృథం విపృథుమేవ చ ।
హరర్నిర్యాతయామాస ద్వారేణానుత్తరేణ వై ॥

శ్లో. సాత్యకిం చ గదం చైవ ప్రసేనం గాందినీసుతమ్ ।
హరిః ప్రతీచీ ద్వారేణ ప్రేషయామాస దుర్మదాన్ ॥

శ్లో. గోవిందస్తు మహాతేజాః స్వయం దారుకసారథిః ।
ఆత్తాభీష్టప్రహరణః సంకర్షణసహాయవాన్ ॥

శ్లో. ఉత్తరేణ వినిర్గమ్య ద్వారేణ జగదీశ్వరః । – భాగవతమ్ 10/49/32–37

(ఈ శ్లోకాలు కొన్ని ప్రతులలో లేవు. 31వ శ్లోకంతోనే అధ్యాయం ముగిసిపోయింది. ఇవి అధికపాఠశ్లోకాలు.)

3. శ్లోకంలో శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారముంది.

| | | | |
|---|---|---|---|
| 4. **అదిశత్ :** | **అదిశత్** | అదిశతామ్ | అదిశన్ |
| | అదిశః | అదిశతమ్ | అదిశత |
| | అదిశమ్ | అదిశావ | అదిశామ. |

*

**శ్లో॥ పక్షీన్ద్రాయతనః పరస్య వసతిర్వృష్ణిప్రమోదోఽభ్యగా–**
**ద్విఖ్యాతాశ్వచతుష్టయః కిల రథో విభ్రాజమానధ్వజః ।**
**మధ్వస్యేవ మనోరథో నిగమసమ్బుద్ధః ఖగేన్ద్రావృతో**
**విష్ణోర్ధామ తదంఘ్రికేతునిలయః సూత్రౌఘపుష్టిప్రదః ॥ 13–45**

**అ :** కృష్ణుని యుద్ధసన్నద్ధత – రథం వచ్చి చేరుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** పక్షి+ఇంద్ర+ఆయతనః పరస్య వసతిః వృష్ణి-ప్రమోదః విఖ్యాత+అశ్వ-చతుష్టయః విభ్రాజమాన-ధ్వజః వృష్ణి-ప్రమోదః రథః విష్ణోః ధామ నిగమ-సంబద్ధః ఖగ+ఇంద్ర+ఆవృతః తద్-అంఘ్రి-కేతు-నిలయః సూత్ర+ఓఘ-పుష్టి-ప్రదః మధ్వస్య మనోరథః+ఇవ అభ్యగాత్ కిల.

**ప్ర :** పక్షి... తనః : పక్షి+ఇంద్ర = గరుత్మంతునకు, ఆయతనః = (ధ్వజాగ్ర) స్థానమైనదీ (పక్షీణామ్ ఇంద్రః, తస్య ఆయతనం యస్మిన్ సః), పరస్య = పరాత్పరుడైన కృష్ణునకు, వసతిః = నివాసమైనదీ, విఖ్యాత+అశ్వ-చతుష్టయః : విఖ్యాత = పేరుగల, అశ్వ-చతుష్టయః = నాలుగు గుఱ్ఱాలు గలదీ (విఖ్యాతం చ తత్ అశ్వానాం చతుష్టయం యస్య సః), విభ్రాజమాన-ధ్వజః = ప్రకాశించే ధ్వజం గలదీ, (విభ్రాజమానః ధ్వజః యస్య సః), వృష్ణి-ప్రమోదః : వృష్ణి = యాదవులకు, ప్రమోదః = ఆనందకారణమైనదీ అయిన (వృష్ణీనాం ప్రమోదః యస్మాత్ సః), రథః = రథం, నిగమ-సంబద్ధః : నిగమ = వేదాలతో, సంబద్ధః = సంబంధం గలదీ (నిగమైః సంబద్ధః), ఖగ... ఆవృతః : ఖగ+ఇంద్ర = గరుడునిచే, ఆవృతః = ఆవరింపబడినదీ (ఖగానామ్ ఇంద్రః, తేన ఆవృతః), విష్ణోః = విష్ణువునకు, ధామ = నివాసస్థానమైనదీ, తద్... నిలయః : తద్-అంఘ్రి = ఆయన పాదాలపైనున్న, కేతు = ధ్వజరేఖలకు, నిలయః = నివాసమైనదీ (తస్య అంఘ్ర్యోః కేతోః నిలయః), సూత్ర... ప్రదః : సూత్ర+ఓఘ = (బ్రహ్మ) సూత్రసమూహానికి, పుష్టి-ప్రదః = పుష్టిని ఇచ్చేదీ అయిన (సూత్రాణామ్ ఓఘః, తస్య పుష్టిం ప్రదదాతి ఇతి), మధ్వస్య = మధ్వాచార్యునియొక్క, మనోరథః ఇవ = కోరికవలె, అభ్యగాత్ = వచ్చి చేరింది. (అభి-ఇ గతౌ పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ సమయంలో కృష్ణుని రథం కూడా వచ్చి చేరింది. ఆ రథం గరుడధ్వజం. కృష్ణ నివాసం. ప్రసిద్ధమైన నాలుగు గుఱ్ఱాలు గలది. ప్రకాశిస్తున్న ధ్వజపతాక గలది. యాదవులకు ఆనందాన్ని కల్గించేది. ఆ రథం మధ్వాచార్యుని మనోరథం వంటిది. మధ్వాచార్య మనోరథం కూడా వేదసంబద్ధమైనది. గరుడధ్యానాసక్తమైనది. విష్ణునివాసం. ఆయన పాదధ్వజరేఖయే ధ్వజంగా గలది. బ్రహ్మసూత్రాలకు పుష్టిని ప్రసాదించేది.

**వి :** 1. **నారాయణుని రథాశ్వాలు నాలుగు.** 1. శైబ్యం 2. సుగ్రీవం 3. మేఘపుష్పం 4. వలాహకం.

2. మనస్సు శాస్త్రవిచారం చేసే సమయంలో గరుడుడు మనోభిమానిగా వుంటాడని నానుడి.

3. కృష్ణుడు తలచుకొన్నప్పుడు రెండు రథాలూ (తనకొకటీ, బలరామున కొకటీ) వచ్చాయని మూలం.

శ్లో. ఏవం ధ్యాయతి గోవిన్దే ఆకాశాత్ సూర్యవర్చసౌ ।
రథావుపస్థితౌ సద్యః ససూతౌ సపరిచ్ఛదౌ ॥ - భాగవతం 10/50/11

4. రథాలు వచ్చిన తరువాత కృష్ణుడే బలరామునకు కర్తవ్యాన్ని గుర్తుచేసినట్లు భాగవత వచనం-

దృష్ట్వా తాని హృషీకేశః సంకర్షణమథాబ్రవీత్ ॥ 12

శ్లో. పశ్యార్య వ్యసనం ప్రాప్తం యదూనాం త్వవతాం ప్రభో ।
ఏష తే రథ ఆయాతో దయితాన్యాయుధాని చ ॥ 13

శ్లో. యానమాస్థాయ జహ్యేతద్వ్యసనాత్స్వాన్ సముద్ధర ।
ఏతదర్థం హి నౌ జన్మ సాధూనీమీశ శర్మకృత్ ॥ 14

శ్లో. త్రయోవింశత్యనీకాఖ్యం భూమేర్భారమపాకురు ॥ - భాగవతం 10/50/12-15

5. శ్లోకంలో కృష్ణరథానికీ, మధ్వమనోరథానికీ పోలిక అదీ బింబప్రతిబింబభావంతో. కాబట్టి ఉపమాలంకారం. బింబప్రతిబింబభావం మాత్రముంటే అది దృష్టాంతాలంకార మవుతుంది. బింబప్రతిబింబభావంతో పోలిక వాచ్యమైతే ఉపమాలంకారం.

6. **అభ్యగాత్ : అభ్యగాత్** అభ్యగాతామ్ అభ్యగుః
అభ్యగాః అభ్యగాతమ్ అభ్యగాత
అభ్యగామ్ అభ్యగావ అభ్యగామ. *

**శ్లో॥ కౌమోదకీ వాదనివిష్టమధ్వ-వాచస్సమా ప్రాదురభూద్ధరణ్యామ్ ।**
**కమ్బుర్గురోర్మఞ్జునినాదకణ్ఠ-కాన్తిః సమస్తాగమగానకర్తుః ॥ 13-46**

**అ :** కౌమోదకీ పాంచజన్యాలు భూమికి అవతరించటం. -ఇంద్రవజ్ర.

**అ :** వాద-నివిష్ట-మధ్వ-వాచః-సమా కౌమోదకీ ధరణ్యాం ప్రాదురభూత్. సమస్త+ఆగమ-గాన-కర్తుః గురోః మంజు-నినాద-కంఠ-కాన్తిః కంబుః (ధరణ్యాం ప్రాదురభూత్).

**ప్ర :** వాద... సమా:వాద=వాదం కోసం, నివిష్ట = (సిద్ధమై) కూర్చున్న, మధ్వ = మధ్వాచార్యుని యొక్క, వాచః = మాటతో, సమా = సమానమైన (వాదే నివిష్టస్య మధ్వస్య వాచా సమా), కౌమోదకీ = కౌమోదకి (కృష్ణుని గద), ధరణ్యామ్ = భూమిపై, ప్రాదుః+అభూత్ = ప్రాదుర్భవించింది. (నేలకు దిగింది.) (భూసత్తాయామ్ పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), సమస్తా... కర్తుః : సమస్త = సకలమైన, ఆగమ = వేదాలయొక్క, గాన-కర్తుః = గానాన్ని చేసే (సమస్తానామ్ ఆగమానాం గానస్య కర్తా తస్య), గురోః= గురువు (మధ్వాచార్యుని) యొక్క, మంజు... కాంతిః : మంజు = మనోహరమైన, నినాద = ధ్వనిగల, కంఠ = స్వరంయొక్క, కాంతిః = కాంతిగల (మంజుః నినాదః యస్య సః, మంజునినాదః స చ అసౌ కంఠః తస్య కాంతిః యస్య సః), కంబుః = శంఖం (శంఖః స్యాత్ కంబురస్త్రియౌ - అమరకోశః-వారి-23), (ధరణ్యాం ప్రాదురభూత్ = నేలకు దిగింది.)

**తా ॥** ఆ యుద్ధసమయంలో వాదానికి సిద్ధపడి కూర్చున్న మధ్వాచార్యవచనంతో సమానమైన కౌమోదకి (కృష్ణుని గద) నేలకు దిగింది. సమస్తాగమాలనూ గానం చేసే ఆ గురువుయొక్క కంఠంవంటి కాంతిగల పాంచజన్యశంఖం కూడా నేలకు అవతరించింది.

**వి :** 1. కృష్ణుడు యుద్ధసన్నద్ధుడు కాబట్టి ఆయన ఆయుధాలు నేలకు అవతరించాయి.
2. **ప్రాదుః+అభూత్ :** 13-6వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ వ్యక్తాభేద్యసహస్రవక్త్రరుచిరం నిత్యం మురారేః ప్రియం**
**ముక్తిద్వారమహీశముఖ్యవిబుధైర్గీతం తమిస్రాపహమ్ ।**
**దైత్యధ్వంసి సుదర్శనం దినకరోద్రిక్తం దిగన్తాతతం**
**పృథ్వ్యాం మధ్వసుదర్శనప్రతికృతి ప్రాదృశ్యత ప్రోజ్జ్వలమ్ ॥ 13-47**

**అ :** సుదర్శనచక్రం భూమిపైకి వచ్చుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** వ్యక్త+అభేద్య-సహస్ర-వక్త్ర-రుచిరం నిత్యం మురారేః ప్రియం ముక్తి-ద్వారమ్ అహి+ఈశ ముఖ్య-విబుధైః గీతం తమిస్రా+అపహం దైత్య-ధ్వంసి దినకర+ఉద్రిక్తం దిక్+అంత+ఆతతం మధ్వ-సుదర్శన-ప్రతికృతి ప్ర+ఉజ్జ్వలం సుదర్శనం పృథ్వ్యాం ప్ర+అదృశ్యత.

**ప్ర :** వ్యక్తా... రుచిరమ్ : వ్యక్త = స్పష్టంగా కనిపిస్తున్న, అభేద్య = భేదింపరాని, సహస్ర = వేయి, వక్త్ర = ముఖాలతో, రుచిరమ్ = అందమైనదీ (వ్యక్తాని అభేద్యాని చ సహస్రాణి వక్త్రాణి, తైః రుచిరమ్), నిత్యమ్ = ఎల్లప్పుడూ, మురారేః = కృష్ణునకు, ప్రియమ్ = ఇష్టమైనదీ, ముక్తి-ద్వారమ్ : ముక్తి = మోక్షానికి, ద్వారమ్ = ప్రవేశమార్గం వంటిదీ (ముక్తేః ద్వారమ్), అహి+ఈశ... విబుధైః : అహి+ఈశ = నాగరాజు, ముఖ్య = ప్రధానంగా

గల / మొదలుగా గల, విబుధైః = దేవతలచే (అహీనామ్ ఈశః అహీశః, ముఖ్యః యేషాం తే, తే చ తే విబుధాః , తైః), గీతమ్ = గానం చేయబడినదీ/స్తుతింపబడినదీ, తమిస్రా+ అపహమ్ : తమిస్రా = చీకటిని, అపహమ్ = అపహరించేదీ (తమిస్రామ్ అపహన్తి ఇతి తమిస్రాపహః, తమ్), దైత్య-ధ్వంసి : దైత్య = దితి సుతులైన రాక్షసులను, ధ్వంసి = నశింపజేసేదీ (దైత్యానాం ధ్వంసి), దినకర+ఉద్రిక్తమ్ : దినకర = సూర్యుని కంటె, ఉద్రిక్తమ్ = శ్రేష్ఠమైనదీ (దినకరాత్ ఉద్రిక్తమ్), దిక్+అంత+ఆతతమ్ : దిగంత = కడలికొనలవరకు, ఆతతమ్ = వ్యాపించిందీ (దిగంతేషు ఆతతమ్), మధ్వ-సుదర్శన-ప్రతికృతి : మధ్వ = మధ్వాచార్యునియొక్క, సుదర్శన = మంచిదర్శనమే (సిద్ధాంతమే) ప్రతికృతి = పోలికగా గలది (మధ్వస్య సుదర్శనమేవ ప్రతికృతి యస్య తత్), ప్ర+ఉజ్వలమ్ = బాగా ప్రకాశించేదీ అయిన, సుదర్శనమ్ = సుదర్శనచక్రం, పృథ్వ్యామ్ = భూమిపై, ప్ర+అదృశ్యత = చక్కగా కనబడింది. (ప్ర+దృశ్ ప్రేక్షణే-కర్మణి-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ యుద్ధసమయంలో సుదర్శనచక్రం కూడా నేలకు దిగి కనిపించింది. ఆ సుదర్శన చక్రం పైకి స్పష్టంగా కనిపిస్తూ భేదింపశక్యం కాని వేయి ముఖాలు గలది. నిత్యమూ కృష్ణునకు ప్రియమైనది. ముక్తికి ద్వారం వంటిది. ఆదిశేషునిచే స్తుతింపబడేది. చీకట్లను తొలగించేది. దైత్యులను ధ్వంసం చేసేది. సూర్యునికన్న మేలైనది. దిగంతాల వరకూ వ్యాపించింది. మధ్వాచార్యునియొక్క సమ్యగ్దర్శనంతో పోలినది. ప్రకాశవంతమైనది.

**వి :** 1. మధ్వ-సుదర్శన-ప్రతికృతి-మధ్వాచార్యుని సుదర్శనంతో పోలిక గలది. ఆ ఉపమేయం సుదర్శన చక్రం. ఉపమానం మధ్వాచార్యదర్శనం. ప్రతికృతి ఉపమావాచకం. అయితే అది (పోలికను చెప్పే పదం) శ్రుతం కాదు కాబట్టి ఆర్థీ+ఉపమా, దానికి. సహకరించేది శ్లేషాలంకారం. సుదర్శనానికి ఉపయోగించిన విశేషణాలన్నీ అభంగశ్లేషకు ఆలవాలమయిన పదాలు. ప్రకారాంతరంగా మధ్వాచార్యసుదర్శనానికి కూడా వర్తించేవి. కొన్ని పదాలు లాక్షణికంగా (ద్వైతధ్వంసి వంటివి) కూడా వర్తిస్తాయి. కాబట్టి శ్లోకంలో శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారముంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రాదృశ్యత :** | **ప్రాదృశ్యత** | ప్రాదృశ్యేతామ్ | ప్రాదృశ్యన్త |
| | ప్రాదృశ్యథాః | ప్రాదృశ్యేథామ్ | ప్రాదృశ్యధ్వమ్ |
| | ప్రాదృశ్యే | ప్రాదృశ్యావహి | ప్రాదృశ్యామహి. |

*

**శ్లో॥ కృష్ణశ్రైష్ఠ్యసమర్థనేఽతిచతురైస్తద్భిన్నలోకే భిదాం**
**నిత్యం సాధయితుం క్షమైర్మతిమతాఽప్యచ్ఛేద్యహృద్యాత్మభిః ।**
**విఖ్యాతైః శరసఞ్చయైః సురుచిరం ప్రాప్తం నిషఙ్గద్వయం**
**భాస్వన్మానసహస్రభాష్యసదనువ్యాఖ్యానకల్పం తదా ॥ 13-48**

**అ :** అమ్ములపొదులు - రెండు - కృష్ణుని చేరుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణ-శ్రైష్ఠ్య-సమర్థనే అతిచతురైః తద్-భిన్న-లోకే భిదాం నిత్యం సాధయితుం క్షమైః మతిమతా అపి అచ్ఛేద్య-హృద్య+ఆత్మభిః విఖ్యాతైః శర-సంచయైః సురుచిరం భాస్వత్-మాన-సహస్ర-భాష్య-సత్+అనువ్యాఖ్యాన-కల్పం నిషంగ-ద్వయం తదా ప్రాప్తమ్.

**ప్ర :** కృష్ణ-శ్రైష్ఠ్య-సమర్థనే : కృష్ణ = కృష్ణునియొక్క, శ్రైష్ఠ్య = శ్రేష్ఠతను, సమర్థనే = సమర్థించుటలో (కృష్ణస్య శ్రైష్ఠ్యం, తస్య సమర్థనమ్, తస్మిన్) (శ్రేష్ఠస్య భావః శ్రైష్ఠ్యమ్), అతి చతురైః = మిక్కిలి నేర్పుగలవీ, తద్-భిన్న-లోకే : తద్ = కృష్ణునకు, భిన్న = శత్రువులయిన, లోకే = జనులలో (తస్మాత్ భిన్నః, స చ అసౌ లోకః, తస్మిన్), భిదామ్ = భేదభావాన్ని (ఎడబాటును), సాధయితుమ్ = సంపాదించటానికి, నిత్యమ్ = ఎప్పుడూ, క్షమైః =

సమర్థతగలవీ, మతిమతా-అపి = బుద్ధిమంతులకు కూడా, అచ్ఛేద్య... ఆత్మభిః : అచ్ఛేద్య = ఖండింపరాని, హృద్య = మనోహరమైన, ఆత్మభిః = స్వరూపం గలవీ (అచ్ఛేద్యాః హృద్యశ్చ ఆత్మా యేషాం తైః), శర-సంచయైః = బాణ సమూహాలతో (శరాణాం సంచయాః, తైః), సురుచిరమ్ = అందమైనదీ అయిన, భాస్వత్... కల్పమ్ : భాస్వత్ = విరాజిల్లుతున్న, మాన = ప్రమాణాలయొక్క, సహస్ర = వేలుగల, భాష్య = భాష్యంతో, సద్ = మంచి, అనువ్యాఖ్యాన-కల్పమ్ = అనువ్యాఖ్యానంతో సమానమైన, నిషంగ-ద్వయమ్ = అమ్ముల పొదుల జంట (నిషంగయోః ద్వయమ్), తదా = అప్పుడు, ప్రాప్తమ్ = వచ్చి చేరింది.

**తా ॥** ఆ సమయంలోనే రెండు అమ్ముల పొదులు కృష్ణుని చేరాయి. అవి బాణాలతో నిండి వున్నాయి. ఆ బాణాలు కృష్ణుని సర్వాతిశాయిత్వాన్ని సమర్థించటంలో నేర్పుగలవి. కృష్ణ శత్రువులను నిరంతరమూ సాధించటానికి (ఓడించటానికి) తగిన శక్తి గలవి. బుద్ధిమంతులకు కూడా ఛేదించటానికి వీలుకానివి. అటువంటి బాణాలతో నిండిన అమ్ములపొదులజంట వేలప్రమాణాలతో ప్రకాశించే భాష్య-అనుభాష్యాల (జంట)తో సమానంగా కనిపిస్తోంది.

**వి :** 1. విష్ణువైరిజనంలో భేదసాధనమంటే చీల్చివేయటమైనా కావచ్చు. అంతర్గతకలహాలను సృష్టించి వారిని విడదీయటమైనా కావచ్చు. మొదటిది శారీరకశక్తి. రెండవది రాజనీతి యుక్తి. *

**శ్లో॥ సద్వంశజాతం సుగుణం ముకున్ద-హస్తామ్బుజాధారమభేద్యమన్యైః ।**
**శార్ఙ్గం సతాం వృన్దమివావిరాసీ-న్మానోపమానేషుభిరన్యజిష్ణు ॥ 13-49**

**అ :** శార్ఙ్గధనుస్సు కృష్ణునికి సంక్రమించటం. -ఇంద్రవజ్ర.

**అ :** సద్-వంశ-జాతం సుగుణం ముకుంద-హస్త+అంబుజ+ఆధారమ్ అన్యైః అభేద్యం మాన+ఉపమాన+ఇషుభిః అన్య-జిష్ణు శార్ఙ్గం సతాం వృందమ్+ఇవ ఆవిః+ఆసీత్.

**ప్ర :** సద్-వంశ-జాతమ్ : సత్ = మంచి, వంశ = వెదురునుండి/వంశంలో, జాతమ్ = పుట్టినదీ (సతి వంశే జాతమ్), సుగుణమ్ = మంచి అల్లెత్రాడు గలదీ/మంచి లక్షణాలు గలదీ, ముకుంద-హస్త+అంబుజ+ఆధారమ్ : ముకుంద = కృష్ణునియొక్క, హస్త+అంబుజ = కరకమలం, ఆధారమ్ = ఆధారంగా గలదీ (ముకుందస్య కర ఏవ కమలం, తదేవ ఆధారః యస్య తత్), అన్యైః=ఇతరులచే, అభేద్యమ్=భంగపరచరానిదీ, మాన+ఉపమాన+ఇషుభిః : మాన = ప్రమాణాలే, ఉపమాన = పోలికగా గల, ఇషుభిః = బాణాలతో (మానమ్ ఏవ ఉపమానం యేషాం తే మానోపమానాః, తే చ తే శరాః, తైః), అన్య-జిష్ణు = శత్రువులను జయించే స్వభావం గలది (అన్యేషాం జిష్ణు) అయిన, శార్ఙ్గమ్ = శార్ఙ్గమనే విష్ణుధనుస్సు (శృంగస్య వికారః శార్ఙ్గం), సతామ్ = సత్పురుషులయొక్క, వృందమ్-ఇవ = సమూహంవలె, ఆవిరాసీత్ = ఆవిర్భవించింది. (ఆవిః+అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ యుద్ధసన్నద్ధవేళలో కృష్ణునియొక్క ధనుస్సు - శార్ఙ్గం కూడా వచ్చి సజ్జనవృందం లాగా కృష్ణుని చేరింది. ఆ చాపం సద్వంశ(వెదురు)ంలో పుట్టింది. గుణం (అల్లెత్రాడు) గలది. కృష్ణుని కరకమలాలే ఆశ్రయమైనది. ఇతరులు భంగపరచలేనిది. ప్రమాణాలే పోలికగా గల బాణాలతో ఇతరులను జయింపగలది.

**వి :** 1. శార్ఙ్గమంటే శృంగం నుండి పుట్టినదని వ్యుత్పత్తి. అయినా ధనుస్సును సహజంగా వెదురుతో తయారు చేస్తారు. కాబట్టి సద్వంశజాతమని అభిప్రాయపడటం.

2. శార్ఙ్గధనుస్సుకు వాడిన విశేషణాలు సజ్జనబృందానికి కూడా వర్తిస్తాయి. వంశ శబ్దం, గుణశబ్దం మాత్రం శ్లిష్టాలు. శార్ఙ్గధనుస్సు పక్షంగా, సజ్జనవృంద పక్షంగా అభంగంగానే వేరువేరు అర్థాల నిస్తాయి. మిగిలిన విశేషణాలు భావమాత్రంచేతనే ఉభయత్ర అన్వయిస్తాయి. శార్ఙ్గధనుస్సుకు సజ్జనబృందంతో పోలిక కాబట్టి ఇది ఉపమాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆవిః+ఆసీత్ :** | **–ఆసీత్** | –ఆస్తామ్ | –ఆసన్ |
| | –ఆసీః | –ఆస్తమ్ | –ఆస్త |
| | –ఆసమ్ | –ఆస్వ | –ఆస్మ. |

*

**శ్లో॥ ద్విడ్వర్గదైన్యకరనన్దకసజ్ఞితాసిం – భక్తౌఘనన్దకమసావురరీచకార ।**
**సద్వాదినాం సమయముద్ధతశత్రువర్గ–విధ్వంసనం స్వజనహర్షకరం యుధీవ॥50**

**అ :** నందకఖడ్గం కృష్ణుని చేరటం. –ఇంద్రవజ్ర.

**అ :** భక్త+ఓఘ–నందకం ద్విట్+వర్గ–దైన్య–కర–నందక–సంజ్ఞిత+అసిం యుధి ఉద్ధత–శత్రు–వర్గ–విధ్వంసనం స్వజన–హర్ష–కరం సద్–వాదినాం సమయమ్+ఇవ అసౌ ఉరరీచకార.

**ప్ర :** భక్త+ఓఘ–నందకమ్ : భక్త = భక్తులయొక్క, ఓఘ = సమూహానికి, నందకమ్ =ఆనందాన్ని కల్గించేదీ (భక్తానామ్ ఓఘః, తస్య నందకః, తమ్), ద్విట్... అసిమ్ : ద్విట్ = శత్రువులయొక్క (ద్వేష్టి ఇతి ద్విట్), వర్గ = సమూహానికి, దైన్య = దీనత్వాన్ని, కర = కల్గించే, నందక–సంజ్ఞిత = నందకమనే పేరుగల (నందక ఇతి సంజ్ఞితః), అసిమ్ = కత్తిని (ద్విషాం వర్గస్య దైన్యస్య కరశ్చ అసౌ నందకః ఇతి సంజ్ఞితః అసిః తమ్), యుధి = యుద్ధమందు, ఉద్ధత... విధ్వంసనమ్ : ఉద్ధత = గర్వించిన, శత్రు = శత్రువులయొక్క, వర్గ = సమూహానికి, విధ్వంసనమ్ = వినాశకమూ (ఉద్ధతానాం శత్రూణాం వర్గస్య విధ్వంసనమ్), స్వజన–హర్ష–కరమ్ : స్వజన = తనవారికి, హర్ష = ఆనందాన్ని, కరమ్ = కలిగించేదీ (స్వస్య జనాః, తేషాం హర్షస్య కరః, తమ్), సద్+వాదినామ్ = మంచివాదుల యొక్క, సమయమ్–ఇవ = ప్రతిజ్ఞలా, అసౌ = ఆ కృష్ణుడు, ఉరరీచకార = అంగీకరించాడు / తీసికొన్నాడు. (ఉరరీ+కృ కరణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ యుద్ధసమయంలో నందక మనే ఖడ్గం కూడా కృష్ణుని దగ్గరకు చేరింది. ఆయన దానిని స్వీకరించాడు. ఆ నందకం శత్రుసమూహాలకు దీనత్వాన్నీ, భక్తవర్గానికి ఆనందాన్నీ కల్గించేది. ఆ నందకం కృష్ణుని చేతికి చేరటం గర్వించిన ప్రతివాదులకు విధ్వంసకమూ, స్వజనులకు ఆనందకరమూ అయిన సద్వాదుల ప్రతిజ్ఞలాగా వుంది.

**వి :** 1. శ్లోకంలో కత్తికి సద్వాదులు సమయంతో(ప్రతిజ్ఞతో) పోలిక. రెండూ శత్రు విధ్వంసకాలూ, స్వజన సంతోషకాలూ. అయినా విశేషణాలు ఉపమానోపమేయాలకు విడివిడిగానే వాడబడినందువల్ల అది బింబ ప్రతిబింబభావం ద్వారా ఉపమాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉరరీ–చకార :** | **–చకార** | చక్రతుః | చక్రుః |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |

*

**శ్లో॥ శ్రుత్యన్తవిశ్రాన్తశరౌఘయుక్తి–శూరా హరేః పక్షధరా విధాయ ।**
**సిద్ధాన్తమత్యూర్జితపూర్వపక్షం – జఘ్నుః క్రమేణోత్తరపక్షమన్తే ॥ 13–51**

**అ :** శ్రుతి+అంత–విశ్రాంత–శర+ఓఘ–యుక్తి–శూరాః హరేః పక్షధరాః అతి+ఊర్జిత–పూర్వ–పక్షం సిద్ధాంతం తం విధాయ అంతే క్రమేణ ఉత్తరపక్షం జఘ్నుః.

**ప్ర :** శ్రుత్యంత... శూరాః : శ్రుతి+అంత = చెవిదగ్గర (చెవిదాకా), విశ్రాంత = నిలిచిన, శర+ఓఘ = బాణసమూహాలయొక్క, యుక్తి = యోజనచే, శూరాః = శూరులైన (శ్రుతేః అన్తే విశ్రాంతానాం శరాణామ్ ఓఘాః, తేషాం యుక్త్యా శూరాః), హరేః = కృష్ణునియొక్క, పక్ష–ధరాః = సహాయకులయిన సేనలు, అతి+ఊర్జిత–

పూర్వపక్షమ్ : అతి+ఊర్జిత = మిక్కిలి బలిష్ఠమైన, పూర్వపక్షమ్ = తూర్పునందున్న శత్రువిభాగాన్ని, (అతి+ఊర్జితశ్చ అసౌ పూర్వపక్షః), సిద్ధ+అంతమ్ : సిద్ధ = సిద్ధించిన, అంతమ్ = ముగింపు గలదానినిగా, విధాయ = చేసి (వి- ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), క్రమేణ = వరుసలో, అన్తే = ముగింపులో, ఉత్తర-పక్షమ్ = ఉత్తరదిక్కున వున్న సేనా విభాగాన్ని, జఘ్నుః = చంపారు. (హన హింసాగత్యోః- పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని సేనలు ఆకర్ణాంతం లాగి విడిచిన బాణసమూహాలతో తూర్పుద్వారం దగ్గరున్న బలిష్ఠమైన సేనను సిద్ధాంతం (అంతం సిద్ధించింది)గా చేసి ఆ తరువాత క్రమంగా ఉత్తర-ద్వారం దగ్గరున్న శత్రుపక్షాన్ని సంహరించారు.

మరొక అర్థం : శ్రుతి అంటే వేదం. శ్రుత్యంతమంటే వేదాంతం. విష్ణుభక్తులయిన వైష్ణవులు వేదాంతవచనాలనే బాణాలవంటి సాధనాలుగా చేసికొని వైష్ణవేతరులు (అద్వైతులు-మాయావాదులు) తమ గ్రంథాలలో ప్రబల పూర్వపక్షంగా చూపిన దానినే తమ సిద్ధాంతంగా చూపి వారిమాటలతోనే వారిని ఖండిస్తూ క్రమంగా అద్వైతసిద్ధాంతాన్ని ఖండించారు.

**వి :** 1. ముండకోపనిషద్వచనాలు-

ద్వా సుపర్ణా సయుజా సఖాయా - సమానం వృక్షం పరిషస్వజాతే ।
తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్య - నశ్నన్నన్యోఽభిచాకశీతి ॥ 3/1/1

సమానే వృక్షే పురుషో నిమగ్నోఽ -నీశయా శోచతి ముహ్యమానః ।
జుష్టం యదా పశ్యత్యన్యమీశ - మస్య మహిమానమితి వీతశోకః ॥ 3/1/2

యదా పశ్యః పశ్యతేరుక్మవర్ణం - కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిమ్ ।
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ - నిరంజనః పరమం సామ్యముపైతి ॥3/1/3

ఈ వాక్యాలన్నీ ద్వైతవాదానికి ఉపబలకంగా నిలిచే వాక్యాలు.

ఉపనిషత్తులలోనే అద్వైతవాదప్రతిపాదకశ్లోకాలు కనిపిస్తాయి.

కఠోపనిషత్తు ద్వితీయవల్లి పూర్తిగా పరమాత్మయొక్క అద్వితీయత్వాన్ని ప్రతిపాదించేదే. మచ్చుకు-

ఏకో వశీ సర్వభూతాంతరాత్మా - ఏకం రూపం బహుధా యః కరోతి ।
తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః - తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥

- కఠోపనిషత్తు-ద్వితీయ-12

కానీ బృహదారణ్యకోపనిషత్తు దీనికి భిన్నంగా ద్వైతాన్ని సూచిస్తోంది.

స వై నైవ రేమే । తస్మాదేకాకీ న రమతే । స ద్వితీయ మైచ్ఛత్ । స హై తావానాస యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ. స ఇమమేవాత్మానం ద్వేధాఽపాతయత్. - 1/4/3

మనసైవానుద్రష్టవ్యం **నేహ నానాఽస్తి కిం చన** ।
మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి ॥ - 4/4/19

ఈ ఉపనిషద్వచనాలు పరస్పరవిరుద్ధాలుగా కనిపిస్తున్నాయి. ముండకోపనిషత్తు జీవ, పరములను భిన్నంగా వాచా ప్రతిపాదిస్తోంది. కఠోపనిషత్తు అద్వితీయత్వాన్ని, బృహదారణ్య-కోపనిషత్తు అద్వితీయత్వాన్ని చెపుతూనే తానే ద్వితీయాన్ని కోరినట్లు వివరిస్తోంది.

ఈ వైరుధ్యాలు ప్రత్యేకించి అద్వైతాన్ని ప్రతిపాదిస్తూ, ద్వైతతత్త్వాన్ని ప్రకటించే ప్రతిపాదనలు తమ పూర్వపక్షాలతోనే తమ సిద్ధాంతాన్ని ఖండించి ద్వైత సిద్ధాంతాన్ని స్థాపించే అవకాశమిస్తున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **జఘ్నుః :** | జఘాన | జఘ్నతుః | **జఘ్నుః** |
| | జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న |
| | జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ |

3. ఛందస్సు - ఇంద్రవజ్ర. *

**శ్లో॥ ఆప్యాయితాః కిల మురాన్తకముఖ్యవాత-**
**సఞ్జాతశఙ్ఖమధురశ్రుతిరమ్యశబ్దైః ।**
**శత్రూన్ నిహత్య సమరే పరితః పురీం తాం**
**చక్రుర్ముకున్దగుణవర్ణనశోభమానమ్॥ 13-52**

**అ :** జరాసంధుని ఓటమి - కృష్ణునికి ప్రశంసలు.

**అ :** ముర+అంతక-ముఖ్య-వాత-సంజాత-శంఖ-మధుర-శ్రుతి-రమ్య-శబ్దైః ఆప్యాయితాః (సైనికాః) శత్రూన్ సమరే నిహత్య తాం పురీం పరితః ముకుంద-గుణ-వర్ణన-శోభమానాం చక్రుః కిల.

**ప్ర :** మురాం... శబ్దైః : ముర+అంతక = కృష్ణునియొక్క, ముఖ్య = ముఖంనుండి పుట్టిన (ముఖాత్ భవః), వాత = గాలిచేత, సంజాత = పుట్టిన,శంఖ = శంఖంయొక్క, మధుర = మనోహరమూ, శ్రుతి-రమ్య = చెవికింపూ అయిన, శబ్దైః = ధ్వనులతో (మురాంతకస్య ముఖ్యస్య వాయోః సంజాతాః, శంఖస్య మధురాశ్చ తే శ్రుతేః రమ్యాశ్చ తే శబ్దాః తైః), ఆప్యాయితాః = ఆనందింపజేయబడిన, (సైనికాః = భటులు), శత్రూన్ = పగవారిని, సమరే = యుద్ధంలో, నిహత్య = చంపి (ని-హన్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తాం పురీమ్ = ఆ నగరిని, పరితః = అంతటా, ముకుంద... శోభమానామ్ : ముకున్ద = కృష్ణునియొక్క, గుణ = గుణాలయొక్క, వర్ణన = వర్ణనచే (శ్లాఘించుటచే), శోభమానామ్ = ప్రకాశిస్తున్న దానినిగా, చక్రుః కిల = చేశారు గదా! (కృ కరణే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ။** కృష్ణ నోటినుండి ఊదిన గాలి శంఖంలో పూరింపబడి చెవికింపైన మధుర శబ్దాలు పుట్టించింది. దానితో ఆనందించిన భటులు శత్రుసేనలను చంపి కృష్ణుని గుణగానంతో ఆ నగరమంతటినీ నింపివేశారు.

**అర్థాంతరం**: ముఖ్యవాత మంటే ముఖ్యప్రాణుడైన వాయుదేవుడు. ఆయననుండి అవతారస్వరూపుడై పుట్టినవాడు మధ్వాచార్యుడు. శంఖధ్వని మధురవేద ధ్వనులద్వారా మధ్వాచార్యులు శిష్యులను, జిజ్ఞాసువులను ఆనందింపజేస్తాడు. దానితో శిష్యులు వాదాలలో (సమరం) ప్రతిపక్షులను జయించి (వారి సిద్ధాంతాలను ఖండించి), ఉపనిషద్వచనాల నన్నింటినీ కృష్ణపరంగా వ్యాఖ్యానించి, శోభను కల్పించారు.

**వి :** 1. యుద్ధరూప ప్రస్తుతవృత్తాంతం వర్ణింపబడుతుంటే అప్రస్తుతమైన మధ్వశిష్యవాద విజయిత్వం స్ఫురిస్తోంది కాబట్టి ఇది సమాసోక్త్యలంకారం. విశేషణసామ్యంవలన రెండవ అర్థం స్ఫురిస్తున్న సర్వత్ర సమాసోక్త్యలంకార మున్నట్టే. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్**' - (కు.61)

| | | | |
|---|---|---|---|
| 2. **చక్రుః :** | చకార | చక్రతుః | **చక్రుః** |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |

*

**శ్లో॥ కృష్ణాఙ్గసఙ్ఘ్యుజ్జ్వలశార్ఙ్గజన్మా - సత్పక్షపాతేన గృహీతవేగః ।**
**ఏకోఽపి నానావదనైః సమన్తా-ద్ధ్యన్నసౌ మధ్వ ఇవాస్తి బాణః ॥ 13-53**

**అ :** కృష్ణ బాణాన్ని మధ్వాచార్యునితో పోల్చుతూ వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** కృష్ణ+అంగ-సంగి+ఉజ్జ్వల-శార్ఙ్గ-జన్మా సత్-పక్షపాతేన గృహీత-వేగః ఏకః అపి నానా-వదనైః సమన్తాత్ యుధ్యన్ అసౌ బాణః మధ్వః ఇవ అస్తి.

**ప్ర :** కృష్ణాంగ... జన్మా : కృష్ణ = కృష్ణునియొక్క, అంగ = శరీరంతో, సంగి = చేరిమిగల, ఉజ్జ్వల = ప్రకాశవంతమైన, శార్ఙ్గ = శార్ఙ్గ ధనుస్సునుండి, జన్మా = వెలువడినదై (కృష్ణస్య అంగేన సంగినః ఉజ్జ్వలాత్ శార్ఙ్గాత్ జన్మ యస్య సః), సత్-పక్ష-పాతేన : సత్ = మంచి, పక్ష = రెక్కలయొక్క, పాతేన = నడతచే (సతోః పక్షయోః పాతః , తేన), గృహీత-వేగః : గృహీత = స్వీకరింపబడిన, వేగః = వేగం గలదీ (గృహీతః వేగః యేన సః), ఏకః+అపి = ఒక్కటైననూ, నానా-వదనైః = అనేక ముఖాలతో, సమన్తాత్ = అన్నివైపులా, యుధ్యన్ = యుద్ధం చేస్తూ, అసౌ బాణః = ఈ బాణం, మధ్వః+ఇవ = మధ్వాచార్యునివలె, అస్తి = ఉంది. (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని శరీరస్పర్శతో ప్రకాశిస్తున్న ఆ శార్ఙ్గ ధనుస్సునుండి వెలువడిన బాణం రెక్కలు తగినట్లుగా కదులుతున్నందువల్ల వేగాన్ని పుంజుకొని అది ఒకటే అయినా బహుముఖీనంగా అన్నివైపులా శత్రుసంహారం చేస్తూ మధ్వాచార్యునివలె కనిపించింది.

**మధ్వాచార్యపక్షంగా**: తానొక్కడే అయినా పూర్ణప్రజ్ఞుడు కాబట్టి వివిధవాదాలను ఖండిస్తూ సర్వదిక్కులా సంచరించాడని భావం.

శ్లో. గదా తు వాయుర్బలసంవిదాత్మా - శార్ఙ్గశ్చ విద్యేతి రమైవ ఖడ్గః ।
దుర్గాత్మికా సైవ చ చర్మనామ్నీ - పంచాత్మకో మారుత ఏవ బాణః ॥

-మహాభారతతాత్పర్యనిర్ణయః 3/74

కాబట్టి మధ్వాచార్యునకు బాణంతో పోలిక. మధ్వుడు కూడా ముఖ్యప్రాణస్వరూపుడే గదా! (21)వళిత్థా సూక్తంలోని రెండవ ఋక్కును వ్యాఖ్యానిస్తూ-

శ్లో. పృక్షోః వపుః పితుమాన్ నిత్య ఆశయే - ద్వితీయమా సప్త శివాసు మాతృషు ।
తృతీయమస్యవృషభస్య దోహసే - **దశప్రమతిం జనయన్త యోషణః** ॥

ముఖ్యప్రాణుని తృతీయావతారం పూర్ణప్రజ్ఞస్వరూపమే అను వాదిరాజు నిర్ణయం మహాభారతతాత్పర్యభావ-ప్రకాశికలో కనిపిస్తుంది. వేదాభిమానినులయిన శ్రీభూదుర్గలు తామభిమానించే వేదాలకు ఇతరులు అపవ్యాఖ్యలు చేస్తున్నారని భావించి, సద్వ్యాఖ్యానంకోసం పూర్ణప్రజ్ఞుని పుట్టించారు. ఆయన సర్వదిక్కులా సంచరించి ప్రకృతబాణంలా సంచరించి ద్వైతాన్ని ప్రతిష్ఠించటం వల్ల అది విశ్వతోముఖమైంది.

2. ఇక్కడ కూడా శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారం. బాణానికి మధ్వాచార్యునితో పోలిక. *

**శ్లో॥ అయఃస్థిరాప్త్యాఽరిభటైరసహ్యః - సువర్ణశోభీ శుభవంశజన్మా ।**
**దిగష్టకవ్యాప్తతనుః సమన్తా-జ్జిగాయ మాయావినికాయమాజౌ ॥ 13-54**

**అ :** కృష్ణుని బాణాన్ని వర్ణించటమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** అయః-స్థిర+ఆప్త్యా అరి-భటైః అసహ్యః సువర్ణ-శోభీ శుభ-వంశ-జన్మా దిక్+అష్టక-వ్యాప్త-తనుః (బాణః) సమన్తాత్ ఆజౌ మాయావి-నికాయం జిగాయ.

**ప్ర :** అయః+స్థిర+ఆప్త్యా : అయః=ఇనుముయొక్క, స్థిర=నిశ్చలమైన (లోహోఽస్త్రీ శస్త్రకం తీక్ష్ణం పిణ్డం కాలాయసాయసీ-అమరకోశః-వైశ్య-98), ఆప్త్యా = పొందికచేత (అయసః స్థిరా చ సా ఆప్తిః, తయా), అరి-

భటైః = శత్రుసేనలచే (అరీణాం భటాః తైః), అసహ్యః = భరింపరానిదీ (సోఢుమ్ అశక్యః), సువర్ణ–శోభీ = బంగారు మొనతో ప్రకాశించేదీ (సువర్ణేన శోభతే ఇతి), శుభ–వంశ–జన్మా : శుభ = ఏ దోషంలేని, వంశ = వెదురు నుండి, జన్మా = తయారయినదీ (శుభాత్ వంశాత్ జన్మ యస్య సః), దిక్... తనుః : దిక్+అష్టక = ఎనిమిది దిక్కులలోనూ, వ్యాప్త = వ్యాపించిన, తనుః = శరీరం గలదీ (దిశామ్ అష్టకం, తస్మిన్ వ్యాప్తా తనుః యస్య సః), (బాణః = బాణం), సమన్తాత్ = అంతటా, ఆజౌ = యుద్ధంలో, మాయావి–నికాయమ్ : మాయావి = మాయావులయిన జరాసంధాది రాక్షసులయొక్క, నికాయమ్ = సమూహాన్ని (మాయావినాం నికాయః తమ్), జిగాయ = గెలిచాడు. (జి జయే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**మధ్వాచార్య పక్షంగా** – అయః స్థిరాప్త్యా : అయః = శుభావహుడైన విష్ణువుపై, స్థిర+ఆప్త్యా = నిశ్చలభక్తిచేత, అరిభటైః = ప్రతివాదుల అనుచరులచే, సువర్ణశోభీ = పవిత్రాక్షరాలు గలవాడు, శుభవంశజన్మా = సద్వంశసంజాతుడు, దిగష్టకవ్యాప్తతనుః = ఎనిమిది దిక్కులలోనూ సంచరించినవాడూ, ఆజౌ = వాదనలో, మాయావి–నికాయమ్ = మాయావాదుల సమూహాన్ని, జిగాయ = గెలిచాడు.

**తా ॥** ఇనుప ములికి వుండటంచేత (విష్ణువుపై స్థిరభక్తి వుండటం చేత) శత్రువులకు సహింపరానిదై (సహింపరానివాడై) బంగారుతో తయారయినదై (పవిత్రాక్షరాలు గలవాడై) మంచి వెదురునుండి పుట్టినదై (మంచివంశంలో పుట్టినవాడై) అన్ని దిక్కుల వ్యాపిస్తున్నదై రణ–రంగంలో (వాదనలో) మాయావుల (మాయావాదుల) సమూహాన్ని గెలిచింది. (గెలిచాడు.) ఆ బాణం (ఆ మధ్వాచార్యుడు).

**వి :** 1. ఇక్కడ ఉపమాలంకారం ధ్వనిస్తుంది. పూర్వశ్లోకంనుండి బాణః మాత్రం స్వీకరిస్తే ఉపమాలంకారధ్వని. బాణః మధ్వ ఇవ అని ఉపమానాంశాన్ని కూడా స్వీకరిస్తే ఉపమాలంకారం వాచ్యమే అవుతుంది. శ్లేష ఉపమకు సహకరిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **జిగాయ :** | **జిగాయ** | జిగ్యతుః | జిగ్యుః |
| | జిగయిథ/జిగేథ | జిగ్యథుః | జిగ్య |
| | జిగాయ/జిగయ | జిగ్యివ | జిగ్యిమ. |

*

**శ్లో॥ నత్యుద్యతానాం నయవాక్యభాజాం – న్యస్తాయుధానాం నికురమ్బమాజౌ ।**
**హిత్వోద్ధతానేవ జయన్ స పూర్ణ–మత్యాహ్వయార్హాచరణం బిభర్తి ॥ 13–55**

**అ :** బాణానికి పూర్ణప్రజ్ఞాచార్యునితో పోలిక. –ఇంద్రవజ్ర.

**అ :** సః ఆజౌ నతి+ఉద్యతానాం నయ–వాక్య–భాజాం న్యస్త+ఆయుధానాం నికురంబం హిత్వా ఉద్ధతాన్ ఏవ జయన్ పూర్ణమతి+ఆహ్వయ+అర్హ+ఆచరణం బిభర్తి.

**ప్ర :** సః = ఆ బాణం, ఆజౌ = యుద్ధంలో, నతి+ఉద్యతానామ్ : నతి = నమస్కరించటానికి, ఉద్యతానామ్ = ప్రయత్నిస్తున్నవారియొక్క (నత్యామ్ ఉద్యతాః తేషామ్), నయ–వాక్య–భాజామ్ : నయ = బ్రతిమిలాడుతున్న (పొందించే), వాక్య = మాటలను, భాజామ్ = ఆశ్రయిస్తున్న వారియొక్క (నయాని వాక్యాని భజన్త ఇతి తేషామ్), న్యస్త+ఆయుధానామ్ : న్యస్త = విడిచిన, ఆయుధానామ్ = ఆయుధాలు గలవారియొక్క (న్యస్తాని ఆయుధాని యైః తేషామ్), నికురంబమ్ = సమూహాన్ని, హిత్వా = విడిచి (హా ధాతువుపై క్త్వా ప్రత్యయం), ఉద్ధతాన్–ఏవ = గర్వించిన వారినే, జయన్ = గెలుస్తూ (జి ధాతువుపై శతృ ప్రత్యయం), పూర్ణ... ఆచరణమ్ : పూర్ణ–మతి = నిండైన బుద్ధి (పూర్ణప్రజ్ఞ)అనే, ఆహ్వయ = పేరునకు, అర్హ = తగినట్టి, ఆచరణమ్ = ప్రవర్తనను, బిభర్తి = కలిగివుంది. (భృ భరణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** శార్ఙ్గవిముక్తమైన ఆ బాణం నమస్కరించటానికి(లొంగిపోవటానికి) ప్రయత్నిస్తున్న వారు, బ్రతిమిలాడే

మాటలను ఆశ్రయించినవారు, ఆయుధాలను విడిచిపెట్టినవారు– వీరందరి సమూహాలను వీడి యుద్ధంలో గర్వంతో ఎదిరిస్తున్న వారిని మాత్రమే ఓడిస్తూ పూర్ణప్రజ్ఞపదానికి తగిన రీతిగానే ఆచరిస్తోంది

**మధ్వాచార్యపరంగా–** పూర్ణ ప్రజ్ఞాచార్య విధానం కూడా ఇదే. వినమ్రులనూ, ఆశ్రితులనూ, వాదాన్ని వదలిపెట్టిన వాళ్ళనూ వదలిపెట్టి ఔద్ధత్యంతో వాదించటానికి ముందుకువచ్చిన వారితో మాత్రమే వాదించి, ఓడించి తన పూర్ణ ప్రజ్ఞ పదానికి గల తన అర్హతను నిరూపించటం జరిగింది.

వి : 1. **బిభర్తి :** 13–21వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ హృన్మధ్యాలయతః స నిర్గతతనుః పృథ్వీభుజామచ్యుత–**
**ప్రేక్షావాప్తమహోదయః పవనవద్విఖ్యాతవేగః క్షితౌ ।**
**సచ్ఛాస్త్రోదితకృష్ణవిక్రమచయం విఖ్యాపయన్ స్వర్గిణాం**
**సుప్రీతిం జనయన్ మురాన్తకచమూం పుష్ణన్నజైషీద్ద్విషః ॥ 13–56**

**అ :** బాణం శత్రువులను జయించటం – ఆచార్యునితో సమానత్వాన్ని వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** పృథ్వీ–భుజాం హృత్+మధ్య–ఆలయతః నిర్గత–తనుః సః(బాణః) అచ్యుత–ప్రేక్షా+ అవాప్త–మహా+ఉదయః పవనవత్ విఖ్యాత–వేగః క్షితౌ సత్+శాస్త్ర+ఉదిత–కృష్ణ–విక్రమ–చయం విఖ్యాపయన్ స్వర్గిణాం సుప్రీతిం జనయన్ ముర+అంతక–చమూం పుష్ణన్ ద్విషః అజైషీత్.

**ప్ర :** పృథ్వీ–భుజామ్ = భూపాలురయొక్క (పృథ్వీం భుంజతే ఇతి పృథ్వీభుజః, తేషామ్), హృత్–మధ్య+ఆలయతః : హృత్ = హృదయాలయొక్క, మధ్య = నడుమనున్న, ఆలయతః = గుడినుండి, నిర్గత–తనుః = వెలువడిన శరీరంగల (నిర్గతా తనుః యస్య సః), సః = ఆ బాణం, అచ్యుత... ఉదయః : అచ్యుత = జారుపాటులేని, ప్రేక్షా = గురిచూచుట చేత, అవాప్త = పొందిన, మహా+ఉదయః = గొప్ప అభ్యుదయంగలదీ, పవనవత్... వేగః : పవనవత్ = గాలివలె, విఖ్యాత = ప్రసిద్ధికెక్కిన, వేగః = వేగం గలది (పవన ఇవ విఖ్యాతః వేగః యస్య సః), క్షితౌ = లోకంలో, సచ్ఛా... చయమ్ : సత్ = మంచి, శాస్త్ర = శాస్త్రాలయందు, ఉదిత = చెప్పబడిన, కృష్ణ = ముకుందునియొక్క, విక్రమ–చయమ్ = పరాక్రమ సముదాయాన్ని (సత్సు శాస్త్రేషు ఉదితాః కృష్ణస్య పరాక్రమాః , తేషాం చయః, తమ్), విఖ్యాపయన్ = ప్రసిద్ధికెక్కిస్తూ (వి–ఖ్యా ధాతువుపై శతృ ప్రత్యయం), స్వర్గిణామ్ = దేవతలకు, సుప్రీతిమ్ = ఆనందాన్ని, జనయన్ = కలిగిస్తూ (జన్ ధాతువుపై ప్రేరణ–శతృ ప్రత్యయం), ముర... చమూమ్ = కృష్ణసేనను (మురస్య అంతకః, తస్య చమూః, తామ్), పుష్ణన్ = వర్ధిల్లజేస్తూ, ద్విషః = శత్రువులను, అజైషీత్ = గెలిచింది. (జి జయే పరస్మైపది–లుజ్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ బాణం శత్రువుల హృదయమధ్యమందలి ఆలయంనుండి వెలువడి నిశ్చలమైన ఏకాగ్రతతో గురి చూడటం వల్ల అభ్యుదయాన్ని పొంది, వాయువేగంతో లోకంలో చక్కని శాస్త్రాలలో చెప్పిన కృష్ణ పరాక్రమగాథలను ప్రసిద్ధికెక్క జేస్తూ, దేవతలకు ఆనందాన్ని కలిగిస్తూ కృష్ణసేనను వర్ధిల్లజేస్తూ శత్రువులను గెలిచింది.

**మధ్వాచార్యపరంగా:** (మధ్వాచార్యుల తండ్రి మధ్యగేహభట్టు. గురువు అచ్యుత ప్రేక్షుడు.) మధ్వాచార్యుడు మధ్యగేహ విప్రుని ఇంట బుట్టి, అచ్యుతప్రేక్షుని చేరిమివలన అభ్యుదయాన్ని పొంది, తాను ముఖ్యప్రాణస్వరూపుడు కాబట్టి వాయువేగియై సచ్ఛాస్త్రప్రతిపాదితమైన కృష్ణ పరాక్రమాన్ని ప్రచారంచేస్తూ, దేవతలకు ఆనందాన్ని కలిగిస్తూ, విష్ణుభక్తులను పోషిస్తూ, ప్రతిపక్షులను (మాయావాదులను) గెలిచాడు.

**వి :** 1. శాస్త్రపదానికి అర్థం శాసించేది అని. శబ్దప్రమాణం ప్రధానమైన వేదాదులు శాస్త్రపరిధిలోనికి వస్తాయి. అవి దాదాపు శ్రుతి స్మృతి గ్రంథాలు. సదాచారాన్ని కూడా ఒక ప్రముఖప్రమాణంగా స్వీకరించమన్నందువల్ల

కాలగతిలో శ్రుతిస్మృతులను తప్పించి సదాచారానికి శాస్త్రత్వాన్ని కల్పించాం. రాను రాను సత్తును కూడా వీడి ఆచారమే ప్రమాణమైంది. దానితో వైవిధ్యం, నిత్యసంశయస్థితి సమాజంలో వేళ్లూనుకొన్నాయి.

మధ్యకాలంలో శ్రుతిస్మృతుల తర్వాత '**వేదః ప్రాచేతసాదాసీత్సాక్షాద్రామాయణాత్మనా**' – (రామాయణం) అన్నందువల్ల, '**భారతం పంచమో వేదః**' – అన్నందువల్ల భాగవతం సాక్షాత్తూ వేదవేద్యుని కథ కావటం వలన వాటిని కూడా శాస్త్రాలు గానే స్వీకరించటం ప్రారంభమైంది. (దానిలో అనౌచిత్యమేమీ లేదు. కానీ 'నానాటికి తీసికట్టు' అన్నట్టు ప్రస్తుతం ఏది శాస్త్రమో, ఎలా శాస్త్రమో, ఎంతమేర శాస్త్రమో తెలియని పరిస్థితి ఏర్పడింది సమాజంలో) అందుకే సచ్ఛాస్త్రోదితకృష్ణవిక్రమమని కవి ప్రయోగం.

| | | | |
|---|---|---|---|
| 2. **అజైషీత్ :** | **అజైషీత్** | అజైష్టామ్ | అజైషుః |
| | అజైషీః | అజైష్టమ్ | అజైష్ట |
| | అజైషమ్ | అజైష్వ | అజైష్మ. |

*

**శ్లో॥ శస్త్రైరస్త్రగణైః శరైరరిధృతైర్వేధం విభేదం ఛిదాం**
**కృష్ణే స్వాగమకౌశలైః పరిహరన్ స్వానన్దమాత్రాకృతిమ్ ।**
**నిర్బాధాం ప్రతిపాదయన్నవయవాన్ నిత్యాంశ్చ విజ్ఞాపయన్**
**యుధ్యగ్రాహ్యమతీన్ద్రియం వ్యతనుతాగణ్యప్రతాపం ప్రభుమ్ ॥ 13–57**

**అ :** బాణవర్ణనం – ఆచారసామ్యం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** (సః) అరి–ధృతైః శస్త్రైః అస్త్ర–గణైః శరైః కృష్ణే వేధం విభేదం ఛిదాం స్వ+ఆగమ–కౌశలైః పరిహరన్ స్వ+ఆనంద–మాత్ర+ఆకృతిం నిర్బాధాం ప్రతిపాదయన్ అవయవాన్ నిత్యాన్ విజ్ఞాపయన్ అగణ్య–ప్రతాపం ప్రభుం యుధి అగ్రాహ్యమ్ అతీంద్రియం వ్యతనుత.

**ప్ర :** (సః = ఆ బాణం), అరి–ధృతైః = శత్రువులచే ధరింపబడిన (అరిభిః ధృతాః, తైః), శస్త్రైః = ఆయుధాలతో, అస్త్ర–గణైః=మంత్రిత బాణసమూహాలతో (అస్త్రాణాం గణాః, తైః), శరైః = బాణాలతో, కృష్ణే = కృష్ణుని శరీరంపై, వేధమ్ = గాయాన్ని, విభేదమ్ = చీల్చటాన్ని, ఛిదామ్ = రెండుగా చేయటాన్ని, స్వ+ఆగమ–కౌశలైః = తన సంచరణంలోని చమక్కులతో (స్వస్య ఆగమః, తస్మిన్ కౌశలాని, తైః), పరిహరన్ = తొలగిస్తూ/ అడ్డగిస్తూ (పరి హృ ధాతువుపై శతృ ప్రత్యయం), స్వ... ఆకృతిమ్ : స్వ–ఆనంద–మాత్ర = ఆత్మానందరూపమైన, ఆకృతిమ్ = మూర్తిని (కృష్ణుని తనువును), నిర్బాధామ్ = బాధలేని దానినిగా, ప్రతిపాదయన్= ప్రతిపాదిస్తూ, అవయవాన్ = శరీరావయవాలను, నిత్యాన్ = నశింపనివానినిగా, విజ్ఞాపయన్ = గట్టిగా తెలుపుతూ, ప్రభుమ్ = స్వామి అయిన కృష్ణుని, యుధి = యుద్ధంలో, అగ్రాహ్యమ్ = పట్టరాని వానినిగా, అతీంద్రియమ్ = ఇంద్రియాల కందని వానినిగా, అగణ్య–ప్రతాపమ్ = లెక్కింపరాన్ని ప్రతాపం గల వానినిగా, వి+అతనుత = చేశాడు. (వి+తనూ విస్తారే ఆత్మనేపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని శార్ఙ్గంనుండి వెలువడిన బాణం శత్రువులు ప్రయోగించిన ఆయుధాల (కత్తి మొ॥) చేత గాయపడకుండా, అస్త్రసముదాయంచే చీలిపోకుండా, బాణాలతో శిథిలం కాకుండా తన ఆగమాదులనేర్పుతో అడ్డుపడుతూ (తొలగిస్తూ) ఆనందమాత్ర స్వరూపమైన ఆ కృష్ణ శరీరాన్ని బాధారహితమనీ, శరీరావయవాలు నిత్యాలనీ తెలుపుతూ, ఆ కృష్ణస్వామిని రణభూమిలో అగ్రాహ్యునీ అతీంద్రియునీ, అగణ్యప్రతాపునీ చేసింది.

**మధ్వాచార్యపరంగా** : మధ్వాచార్యులు తన నేర్పుతో ఉదాహరిస్తున్న ఆగమాల (శాస్త్రవచనాల) బలంతో కృష్ణుని వేధించుట, భేదించుట, ఛేదించుట కుదరదని వాటిని పరిహరిస్తూ ఆయన ఆనందమాత్రాకృతి అని దానిని

బాధించుట కుదరదనీ, ఆ శరీరావయవాలు నిత్యాలనీ ఆ కృష్ణుడు యుద్ధంలో అగ్రాహ్యుడు, అతీంద్రియుడు, అగణ్యప్రతాపుడూ అని నిరూపించారు.

వి : 1. గీతావచనం :

శ్లో. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః ।
న చైనం క్లేదయంత్యాపో న శోషయతి మారుతః ॥

శ్లో. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ ।
నిత్యస్సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః ॥

శ్లో. అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే ।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి ॥ - భగవద్గీత 2/23-25

ఈ గీతాశాస్త్రం కృష్ణునియొక్క విశిష్టలక్షణాలను నిరూపిస్తోంది. మహాభారతతాత్పర్య నిర్ణయం కూడా కృష్ణుని విలాసవ్యవహారాన్నీ, విష్ణుని నిశ్చలత్వాన్ని నిరూపిస్తుంది.

శ్లో. విద్ధవన్ముగ్ధవచ్చైవ కేశవో వేదనార్తవత్।
ప్రదర్శయతి మోహాయ నైవ విష్ణుస్తథా భవేత్ ॥ - 11/96

2. **వ్యతనుత :**

| | | |
|---|---|---|
| **వ్యతనుత** | వ్యతన్వాతామ్ | వ్యతన్వత |
| వ్యతనుథాః | వ్యతన్వాథామ్ | వ్యతనుధ్వమ్ |
| వ్యతన్వి | వ్యతన్వహి | వ్యతన్మహి. |

*

**శ్లో॥ హృష్టాం స కృష్ణస్య చమూం వితన్వన్ - దుష్టాన్ వినష్టాన్ విశిఖో విధాయ ।**
**తుష్టః సురైర్వ్యోమచరైర్మురారేః - స్పష్టీచకారోత్తమతాం జితారేః ॥ 13-58**

అ : బాణ వర్ణనం - కృష్ణుని ఉత్తమత్వాన్ని స్ఫుటీకరించటం. -ఇంద్రవజ్ర.

అ : సః విశిఖః కృష్ణస్య చమూం హృష్టాం వితన్వన్ దుష్టాన్ వినష్టాన్ విధాయ వ్యోమ-చరైః సురైః తుష్టః (సన్) జిత+అరేః మురారేః ఉత్తమతాం స్పష్టీచకార.

ప్ర : సః=అ, విశిఖః = బాణం (పత్రీ తు విశిఖః ఖగః పృషత్కో రోపణో బాణః - వైజయన్తీ - క్షత్రియ - 189), కృష్ణస్య = కృష్ణునియొక్క, చమూమ్ = సేనను, హృష్టామ్ = ఆనందింప జేయబడినదిగా, వితన్వన్ = చేస్తూ (వి-తనూ ధాతువుపై శతృ ప్రత్యయం), దుష్టాన్ = చెడ్డవారిని, వినష్టాన్ = నశింపజేయబడినవారిగా, విధాయ=చేసి (వి-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), వ్యోమ-చరైః = గగనంలో తిరుగాడే, సురైః = దేవతలచే, తుష్టః (సన్) = ఆనందింప జేయబడినదియై (అంతర్భావితణ్యర్థమైన ప్రయోగం), జిత+అరేః = జయింపబడిన శత్రువులుగల (జితాః అరయః యేన తస్య), ముర+అరేః = కృష్ణునియొక్క (మురః అరిః యస్య తస్య), ఉత్తమతామ్ = ఉత్తమత్వాన్ని (అందరినీ మించిన లక్షణాన్ని), స్పష్టీచకార = స్పష్టం చేశాడు. (స్పష్టీ కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.) (అస్పష్టం స్పష్టం సంపద్యమానం కరోతి ఇతి స్పష్టీకరోతి)

**తా ॥** శార్ఙ్గధనువునుండి వెలువడిన ఆ బాణం కృష్ణుని సేనను గగనచరులయిన దేవతలచే ఆనందింపజేయబడి కృష్ణుని సర్వోత్తమత్వాన్ని తెలియజేసింది.

వి : 1. **స్పష్టీ-చకార :** 13-50వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ పౌరాణికం వాక్యమివోగ్రసేన-మగ్రే జరాసూనురసౌ జహాస ।**
**జీవేశయోర్భేదమివాత్మయుక్త్యా - భేదం స చాసాధయదస్య చాపే ॥ 13-59**

**అ :** జరాసంధుడు ఉగ్రసేనుని పరిహసించుట – అద్వైతభావ ఖండనం. –ఇంద్రవజ్ర.

**అ :** అసౌ జరాసూనుః అగ్రే ఉగ్రసేనం పౌరాణికం వాక్యమ్ ఇవ జహాస. సః ఆత్మ–యుక్త్యా జీవ+ఈశయోః భేదమ్+ఇవ అస్య చాపే భేదం చ అసాధయత్.

**ప్ర :** అసౌ = ఆ, జరాసూనుః = జరాసంధుడు (జరాయాః సూనుః), అగ్రే = ముందుగా, ఉగ్రసేనమ్ = ఉగ్రసేనుని, పౌరాణికమ్ = పురాణాలలోని, వాక్యమ్–ఇవ = వచనం వలె, జహాస = నవ్వాడు/హేళన చేశాడు. (హస్–హసనే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), సః చ = ఆ ఉగ్రసేనుడు కూడా, ఆత్మ–యుక్త్యా = తన యుక్తిచేత, జీవ+ఈశయోః = జీవాత్మ, పరమాత్మలకు, భేదమ్–ఇవ = వేరుదనాన్నివలె, అస్య = ఆ, జరాసంధస్య = జరాసంధునియొక్క, చాపే = వింటిలో, భేదమ్ = భిన్నమగుటను (విరుగటను) అసాధయత్ = సాధించాడు. (సాధ–సంసిద్ధౌ ప్రేరణార్థే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥**ఆ జరాసంధుడు తన ఎదుటనున్న ఉగ్రసేనుని పౌరాణికవాక్యంలాగా పరిహసించాడు. తన యుక్తులతో జీవేశ్వరులకు భేదాన్ని సాధించినట్లు జరాసంధుని వింటి విషయంలో కూడా భేదాన్ని (విరిగిపోవటాన్ని) సాధించాడు.

**వి :** 1. పౌరాణిక వచనాలు తాము ప్రతిపాదింపదలచిన సిద్ధాంతానికి భిన్నంగా వుండే పాత్రల ఆలోచనలను, వాక్యాలను హర్షించవు. పాత్రను అధిక్షేపిస్తూ ఆ విషయాన్ని తెలుపుతాయి.

కాలయవనుడు ముచుకుందుని చూచి కృష్ణుడుగా భావించి కాలితో కొడతాడు.

శ్లో. ఏవం క్షిప్తోఽపి భగవాన్ ప్రావిశద్గిరికందరమ్ ।
సోఽపి ప్రవిష్టస్తత్రాన్యం శయానం దదృశే నరమ్ ॥

శ్లో. నన్వసౌ దూరమానీయ శేతే మామిహ సాధువత్ ।
ఇతి మత్వాఽచ్యుతం మూఢస్తం పదా సమతాడయత్ ॥ –భాగవతం 10–51/9–10

ఇక్కడ మూఢపదంతో కాలయవనుని నిందించటం జరిగింది. దానికి కారణం జీవుడైన ముచుకుందునిలో పరమాత్మ భావన చేయటం.

ఉగ్రసేనుని కాలయవనుడు అధిక్షేపించటాన్ని మహాభారతతాత్పర్యనిర్ణయం వాచా ప్రకటించింది–

శ్లో. **పాపాప యాహి** పురతో మమ రాజ్యకామ–నిర్లజ్జపుత్రవధకారణశత్రుపక్ష! ।
**త్వం జీర్ణవస్త్రసదృశో** న మయేహ వధ్యః – సింహోను సింహమభియాతి న వై సృగాలమ్॥ – 14/26

ఇటువంటి అధిక్షేపవచనాల ఫలితం తీవ్రంగానే వుంటుంది.

జీవునిలో పరమభావన దోషమైనట్లు పరమునిలో జీవభావన కూడా దోషమే అవుతుంది. శిశుపాలుడు కృష్ణుని సాధారణమానవునిగా భావించి నిందించిన తీరు గమనించండి.

సీ. గురుదేవ శూన్యుండు కులగోత్ర రహితుండు – దలిదండ్రు లెవ్వరో తడవఁ గాన
మప్పులఁ బొరలెడు నాదిమధ్యావసా – నంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కుభంగుల వర్తించు – వావివర్తనములు వరుసలేవు
పరికింప విగతసంబంధుండు దలపోయ – మా నిమిత్తంబున మానిసయ్యెఁ

తే. బరఁగ మున్ను యయాతి శాపమునఁ జేసి – వాసికెక్కదు యాదవవంశమెల్ల
బ్రహ్మతేజంబు నెల్లఁ గోల్పడిన యితఁడు – బ్రహ్మఋషిసేవ్యుఁ డగునె గోపాలకుండు.

–పోతనభాగవతము 10/2/786

2. జీవేశ్వరభేదం భేదపంచకంలో ఒకటి. భాగవత మీ జీవేశ్వరభేదాన్ని ప్రతిపాదిస్తుంది.

శ్లో. సువర్ణావేతౌ సదృశౌ సఖాయౌ – యదృచ్ఛయైతౌ కృతనీడౌ చ వృక్షే।
ఏకస్తయోః ఖాదతి పిప్పలాన్నం – అన్యో నిరన్నోఽపి బలేన భూయాన్ ॥

శ్లో. ఆత్మానమన్యం చ స వేద విద్వాన్– అపిప్పలాదో న తు పిప్పలాదః।
యోఽవిద్యయా యుక్ స తు నిత్యబద్ధో – విద్యామయో యః స తు నిత్యముక్తః ॥

– భాగవతమ్ 11/11/6,7

ముండకోపనిషత్తులోని 'ద్వా సుపర్ణా సయుజా... మొదలుగాగల పిప్పలాదవచనానికి పై శ్లోకాలు వివరణ రూపాలు. ఉపనిషద్వచనాలను త్రిమతాలు తమకు అనుగుణంగా వ్యాఖ్యానించాయి. కానీ మధ్వాచార్యులు ఆ వచనాలను ఆత్మయుక్తితో ద్వైతపరంగా నిరూపించటం జరిగింది. '**నిరవకాశాః విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే**' అన్నది ఒక వ్యాకరణపరిభాష. రెండువిధులమధ్య ప్రవృత్తివిషయంలో ఘర్షణ ఏర్పడితే అన్యత్ర నిరవకాశం బలవత్తరమవుతుంది. 'ద్వా సుపర్ణా' ఇత్యాది వచనాలు అన్యత్ర నిరవకాశాలు కాబట్టి ఆ మేరకు వాటి ప్రాధాన్యాన్ని అంగీకరించాలి. అవి ద్వైతబోధకాలు.

| | | | |
|---|---|---|---|
| 3. **జహాస :** | **జహాస** | జహసతుః | జహసుః |
| | జహసిథ | జహసథుః | జహస |
| | జహాస/జహస | జహసివ | జహసిమ |
| **అసాధయత్ :** | **అసాధయత్** | అసాధయతామ్ | అసాధయన్ |
| | అసాధయః | అసాధయతమ్ | అసాధయత |
| | అసాధయమ్ | అసాధయావ | అసాధయామ. |

*

**శ్లో॥ గుణోజ్ఝితం శ్రీరమణం విధాతుం – శరోఽరివర్గం యతమానమాశు ।**
**గుణైర్విహీనం విరచయ్య కృష్ణ–మనన్తసచ్చిన్త్యగుణం వితేనే ॥ 13–60**

**అ :** బాణ వర్ణనం – ఈశ్వర సగుణత్వ సమర్థనం. –ఉపేంద్రవజ్ర.

**అ :** శరః శ్రీరమణం గుణ+ఉజ్ఝితం విధాతుం యతమానమ్ అరి–వర్గమ్ ఆశు గుణైః విహీనం విరచయ్య కృష్ణమ్ అనన్త–సత్–చిన్త్య–గుణం వితేనే.

**ప్ర :** శరః = బాణం, శ్రీ–రమణమ్ = లక్ష్మీవల్లభుని, గుణ+ఉజ్ఝితమ్ = గుణవిముక్తునిగా / అల్లెత్రాడు లేని వానినిగా (గుణేన ఉజ్ఝితః తమ్) (మౌర్వీ జ్యా శింజినీ గుణః – అమరకోశః–క్షత్ర–85), విధాతుమ్ = చేయాలని (వి–ధా ధాతువుపై తుమున్ ప్రత్యయం), యతమానమ్ = ప్రయత్నిస్తున్న (యత్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), అరి–వర్గమ్ = శత్రు సమూహాన్ని (అరేః వర్గః, తమ్), ఆశు = వేగంగా, గుణైః = అల్లె త్రాళ్ళతో, విహీనమ్ = లేని దానినిగా, విరచయ్య = చేసి, కృష్ణమ్ = కృష్ణుని, అనంత... గుణమ్: అనంత = అంతులేని, సత్ = సజ్జనులచే, చిన్త్య=ఆలోచింపదగిన, గుణమ్ = గుణం గలవానినిగా (అనన్తశ్చ అసౌ సజ్జనైః చిన్త్యః గుణః యస్య, తమ్), వితేనే= చేశాడు. (వి–తనూ విస్తారే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** శార్ఙ్గ ధనుస్సునుండి వెలువడిన ఆ బాణం కృష్ణుని గుణహీనుని చేయాలని ప్రయత్నం చేస్తున్న ఆ శత్రుసమూహాన్నే గుణహీనం చేసి కృష్ణుని అనంతునీ, సజ్జనులు స్మరింపదగిన గుణాలు గలవానినీ చేసింది.

మధ్వాచార్యుల పరంగా : మధ్వాచార్యులు కృష్ణుని నిర్గుణునిగా నిరూపించాలని ప్రయత్నంచేసే అద్వైతవాదులనే గుణహీనులనుగా చేసి కృష్ణుని సజ్జనులు సేవింపదగిన అనన్తకల్యాణగుణవంతునిగా నిరూపించాడు.

**వి :** 1. పరమాత్మ నిర్గుణ, నిష్క్రియానన్వరూపుడని అద్వైతభావన. గుణ, కర్మలుంటేనే పదార్థత్వ సిద్ధి. కానీ ద్వైతం పరమాత్మను (కృష్ణుని) కళ్యాణగుణస్వరూపునిగా అనన్తసచ్చేష్టా స్వరూపునిగా స్వీకరిస్తుంది. అందుకే శత్రువర్గాన్ని గుణహీనమనీ, కృష్ణుని సచ్చిన్యగుణుడనీ వర్ణించటం.

**శ్లో. జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం చేతో భజ శ్రీధరం**
**పాణిద్వంద్వ సమర్చయాచ్యుతకథాః శ్రోత్రద్వయ త్వం శృణు ।**
**కృష్ణం లోకయ లోచనద్వయ హరేర్గచ్ఛాంఘ్రియుగ్మాలయం**
**జిఘ్ర ఘ్రాణ ముకున్దపాదతులసీం మూర్ధన్ నమాధోక్షజమ్ ॥** **-ముకున్దమాలా-16**

వంటి శ్లోకాలు కుదరాలంటే పరమాత్మ సగుణుడు కావలసిందే.

2. శ్లోకంలో గుణశబ్దం రెండర్థాల నిస్తుంది. శ్లేషసహకారంతో.

| | | | |
|---|---|---|---|
| 3. **వితేనే :** | వితేనే | వితేనాతే | వితేనిరే |
| | వితేనిషే | వితేనాథే | వితేనిధ్వే |
| | వితేనే | వితేనివహే | వితేనిమహే. |

*

**శ్లో॥ అన్ధానామపి కృష్ణసద్గుణమణిం సన్దర్శయిత్వా జగ-**
**ద్వంద్యాం కీర్తివధూం పరానలసమాం సన్ధాయ లోకత్రయే ।**
**సాన్ద్రే రక్తజలే చ రత్నదృషదాం వృన్దం స సంప్లావయన్**
**ఛన్దోఽన్వర్థమలం సమర్థ్య సుధియాం సన్దేహమాశ్వచ్ఛినత్ ॥** **13-61**

**అ :** బాణవర్ణనం - వేదప్రామాణ్య ప్రతిపాదనం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సః అన్ధానామ్ అపి కృష్ణ-సద్గుణ-మణిం సందర్శయిత్వా జగద్-వంద్యాం కీర్తి-వధూం లోక-త్రయే పర+అనల-సమాం సన్ధాయ, సాంద్రే రక్త-జలే చ రత్న-దృషదాం వృందం సంప్లావయన్ ఛందః అలమ్ అన్వర్థమ్ సమర్థ్య సుధియాం సందేహమ్ ఆశు అచ్ఛినత్.

**ప్ర :** సః=శార్ఙ్గం నుండి వెలువడిన ఆ బాణం, అన్ధానామ్+అపి = గ్రుడ్డివారికి కూడా, కృష్ణ-సద్-గుణ-మణిమ్ : కృష్ణ = కృష్ణునియొక్క, సద్-గుణ = మంచి గుణా లనే, మణిమ్ = మణిని (కృష్ణస్య సన్తః చ తే గుణాః ఏవ మణిః, తమ్), సందర్శయిత్వా = చక్కగా చూపించి (సమ్-దృశ్ ధాతువుపై ప్రేరణార్థకం పై క్త్వా ప్రత్యయం. సమ్ ఉపసర్గ వున్నపుడు క్త్వా స్థానంలో ల్యప్ రావాలి నిరంకుశాః కవయః), జగద్-వంద్యామ్ = జగత్తుచే నమస్కరింపదగిన/స్తుతింపదగిన (జగతా వంద్యా, తామ్), కీర్తి-వధూమ్ = కీర్తి కాంతను (కీర్తిః ఏవ వధూః, తామ్), లోక-త్రయే = ముల్లోకాలలో (లోకానాం త్రయం, తస్మిన్), పర+అనల-సమామ్ : పర = శత్రువులకు, అనల-సమామ్ = నిప్పువంటిదానినిగా (పరేషామ్ అనలేన సమా తామ్), విధాయ = చేసి, సాంద్రే = దట్టమైన, రక్త-జలే = నెత్తుటి నీటిలో, రత్న-దృషదామ్ = రత్నా లనే రాళ్ళయొక్క, వృందమ్ = సమూహాన్ని, సంప్లావయన్ చ = దొరలిస్తూ, ఛందః = వేదాన్ని, అలమ్ = తగినట్లుగా, అన్వర్థమ్ = సార్థకంగా, సమర్థ్య = సమర్థించి, సుధియామ్ = బుద్ధిమంతుల యొక్క, సందేహమ్ = సంశయాన్ని, ఆశు = వేగంగా, అచ్ఛినత్ = ఛేదించాడు. (ఛిద్-ద్వైధీకరణే-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణశార్ఙ్గంనుండి వెలువడిన ఆ బాణం (మధ్వాచార్యరూపం) గ్రుడ్డివాళ్ళకు కూడా కృష్ణసద్గుణమణిని చూపిస్తూ, లోకులు కీర్తింపదగిన కీర్తికాంతను శత్రువులకు అగ్నిసమానంగా కల్పిస్తూ, సాంద్రమైన నెత్తుటినీటిలో రత్నాలనే రాళ్ళసమూహాన్ని ప్రవహింపజేస్తూ, (యుద్ధభూమి కాబట్టి నెత్తుటి ప్రవాహం) వేదవాక్యాన్ని తగినరీతిగా అన్వర్థం చేస్తూ, ధీమంతుల సందేహాలను తొలగించింది.

**వి :** 1.శ్లో. మూకం కరోతి వాచాలం - పంగుం లంఘయతే గిరిమ్ ।
యత్కృపా తమహం వన్దే - పరమానందమాధవమ్ ॥ -చైతన్యచరితామృతమ్ 17/80

పరమానందస్వరూపుడైన ఏ మాధవుని కృప మూగవానిని వాచాలుని చేస్తుందో, కుంటివాడు కూడా కొండలను దాటేటట్లు చేస్తుందో ఆ మాధవునికి నమస్కారం.

కాబట్టి గ్రుడ్డివానికి దర్శనభాగ్యాన్ని కలిగించగలగటం వింత ఏమీ కాదు.

| | | | |
|---|---|---|---|
| 2. **అచ్ఛినత్ :** | **అచ్ఛినత్(ద్)** | అచ్ఛిన్తామ్ | అచ్ఛిన్దన్ |
| | అచ్ఛినః | అచ్ఛిన్తమ్ | అచ్ఛిన్త |
| | అచ్ఛినదమ్ | అచ్ఛిన్ద్వ | అచ్ఛిన్ద్మ. |

*

**శ్లో॥ శస్త్రాస్త్రప్రకరేషు శార్ఙ్గధరతో భేదం ద్విపాశ్వద్విప**
**ద్వర్గేష్వాత్తశరాసనాన్మురభిదో నిర్భిన్నగాత్రేషు చ ।**
**మృత్యోర్లోకమితేషు తం స్వజనతః కాయాన్మిథః ఖణ్డితే**
**హస్తాదౌ యుధి సాధయన్ స విదధే వ్యక్తం భిదాం పఞ్చకమ్ ॥ 13-62**

**అ :** బాణవర్ణనమే - భేదపంచక సమర్థన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** శస్త్ర+అస్త్ర-ప్రకరేషు శార్ఙ్గధరతః భేదం ద్విప+అశ్వ-ద్విపద్-వర్గేషు ఆత్త-శర+ఆసనాత్ మురభిదః **భేదం** నిర్భిన్న-గాత్రేషు చ (**భేదం**) మృత్యోః లోకమ్ ఇతేషు స్వజనతః **భేదం** కాయాత్ మిథః ఖండితే హస్త+ఆదౌ (**భేదం**) యుధి సాధయన్ భిదాం పంచకం వ్యక్తం విధత్తే.

**ప్ర :** శస్త్ర+అస్త్ర-ప్రకరేషు :శస్త్ర = ఆయుధాలయొక్క, అస్త్ర = (మంత్రపూరిత) బాణాలయొక్క, ప్రకరేషు = సమూహాల విషయంలో (విషయ సప్తమి) (శస్త్రాణామ్ అస్త్రాణాం చ ప్రకరాః, తేషు), శార్ఙ్గధరతః = శార్ఙ్గధనుస్సు కన్న, భేదమ్ = భేదాన్ని; ద్విప... వర్గేషు : ద్విప = ఏనుగుల యొక్క (ద్వాభ్యాం పిబతీతి ద్విపః), అశ్వ = గుఱ్ఱాలయొక్క, ద్విపద్ = పదాతులయొక్క, వర్గేషు = సమూహాల విషయంలో (ద్విపాః అశ్వాః ద్విపదః చ, తేషాం వర్గేషు), ఆత్త-శర+ఆసనాత్ : ఆత్త = చేపట్టిన, శర+ఆసనాత్ = విల్లుగల (ఆత్తం శరస్య ఆసనం, యేన తస్మాత్), ముర-భిదః = కృష్ణుని కన్న, భేదమ్ = భేదాన్ని, నిర్భిన్న-గాత్రేషు : నిర్భిన్న = బ్రద్దలయిన, గాత్రేషు = శరీరావయవాలుగల వారి(టి) విషయంలో, భేదమ్ = భేదాన్ని, మృత్యోః = మృత్యువుయొక్క, లోకమ్ = లోకాన్ని, ఇతేషు = వెళ్ళిన వారి విషయంలో, స్వ-జనతః=తమవారినుండి, తమ్=ఆ భేదాన్ని, కాయాత్ = శరీరం నుండి, ఖండితే = విరువబడిన, హస్త+ఆదౌ = చేతులు మొదలగు వాటిలో, మిథః = పరస్పరం, భేదఞ్చ = భేదాన్ని కూడా, యుధి = యుద్ధంలో, సాధయన్ = సాధిస్తూ, సః = ఆ బాణం, భిదామ్ = భేదాలయొక్క, పంచకమ్ = పంచకాన్ని (అయిదు రకాలైన భేదాలను), వ్యక్తమ్ = స్పష్టం, విదధే = చేసింది. (వి-ధా ధారణపోషణయోః ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ యుద్ధంలో కృష్ణుని బాణం అయిదురకాలైన భేదాలను స్పష్టం చేసింది. ఆ అయిదు భేదాలు ఇవి 1. శస్త్రాస్త్రాలు కృష్ణుని శార్ఙ్గంకన్న భిన్నాలు. 2. యుద్ధంలో పాల్గొన్న ఏనుగులు, గుఱ్ఱాలు, పదాతులు కృష్ణుని కన్న భిన్నాలు. 3. బ్రద్దలయిన శరీరధారులలో పరస్పరభేదం. 4. మరణించిన వారికి తమవారికన్న భేదం. 5. ఖండింపబడిన హస్తపాదులలో పరస్పరభేదం.

**వి :** 1. ద్వైతం లేదన్నది అజ్ఞాని పక్షమే అంటూ విష్ణుతత్త్వనిర్ణయం భేదపంచకాన్ని వివరించింది-

"ఉపదేశాదయం వాదోఽజ్ఞాతే ద్వైతం న విద్యతే" - ఇత్యాహ. అజ్ఞాత ఏవ ద్వైతం న విద్యతే. అజ్ఞానినాం పక్ష ఏవ ద్వైతం న విద్యత ఇత్యర్థః.

శ్లో॥ **జీవేశ్వరభిదా** చైవ **జడేశ్వరభిదా** తథా ।
**జీవభేదో** మిథశ్చైవ **జడజీవభిదా** తథా ॥
**మిథశ్చ జడభేదో**ఽయం ప్రపంచో భేదపంచకః ॥

1. జీవ+ఈశ్వర భేదం 2. జడ+ఈశ్వర భేదం 3. జీవ-జీవ భేదం 4. జడ-జీవ భేదం, 5. జడ-జడ భేదం - ఈ రీతిగా ఈశ్వర-జీవ-జడ పదార్థాల మధ్య అయిదు రకాలయిన భేదం కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **విదధే :** | విదధే | విదధాతే | విదధిరే |
| | విదధిషే | విదధాథే | విదధిధ్వే |
| | విదదే | విదధివహే | విదధిమహే. * |

**శ్లో॥ అరిప్రయుక్తైర్యుధి తైః శరౌఘై-ర్హరిప్రియాస్తద్ధ్వజినీం నిజఘ్నుః ।**
**స్వపక్షమాస్థాప్య పరోక్తవాక్యై-ర్విపక్షపక్షానివ మధ్వశిష్యాః ॥ 13-63**

**అ :** కృష్ణసేన శత్రువులు ప్రయోగించిన ఆయుధాలతోనే శత్రువులను ఓడించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** మధ్వ-శిష్యాః పర+ఉక్త-వాక్యైః స్వపక్షమ్ ఆస్థాప్య విపక్షపక్షాన్ ఇవ హరి-ప్రియాః యుధి అరి-ప్రయుక్తైః తైః శర+ఓఘైః తద్-ధ్వజినీం నిజఘ్నుః.

**ప్ర :** మధ్వ-శిష్యాః = మధ్వాచార్యుని శిష్యులు (మధ్వస్య శిష్యాః), పర+ఉక్త-వాక్యైః : పర = ఇతరులచే, ఉక్త = చెప్పబడిన (వచ ధాతువుపై క్త ప్రత్యయం), వాక్యైః = వచనాలతో, స్వ-పక్షమ్ = తమ సిద్ధాంతాన్ని (తమ వాదనను), ఆస్థాప్య = స్థిరపరచి (ఆ స్థా ధాతువుపై ప్రేరణార్థంలో ల్యప్ ప్రత్యయం), విపక్షపక్షాన్-ఇవ = ప్రతివాదులను వలె, హరి-ప్రియాః = కృష్ణభక్తులు, యుధి = యుద్ధంలో, అరి-ప్రయుక్తైః : అరి = శత్రువులచే, ప్రయుక్తైః = ప్రయోగింపబడిన, తైః = ఆ, శర+ఓఘైః = బాణసమూహాలతో, తద్-ధ్వజినీమ్ = వారి సేనను, నిజఘ్నుః = సంహరించారు. (ని-హన హింసాగత్యోః పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ యుద్ధంలో కృష్ణభక్తులు శత్రువులు ప్రయోగించిన బాణాలతోనే వారి సేనను ధ్వంసం చేశారు. అది మధ్వాచార్యశిష్యులు ప్రతివాదులు ప్రయోగించిన వాక్యాలతో వారి వాదాన్నే ఖండించినట్లుంది.

**వి :** 1. శ్లోకంలో బింబప్రతిబింబభావంతో ఉపమాలంకారముంది. కృష్ణసేనకు మధ్వశిష్యులకూ పోలిక.

2. మధ్వశిష్యులు ద్వైతవాదులు. జగత్సత్యత్వాన్ని వీరు ప్రతిపాదిస్తారు. ప్రతివాదులు అద్వైతులు. జగత్తు మిథ్య అని సిద్ధాంతీకరించటం వీరి లక్ష్యం.

| | | | |
|---|---|---|---|
| 3. **నిజఘ్నుః :** | నిజఘాన | నిజఘ్నతుః | **నిజఘ్నుః** |
| | నిజఘనిథ/నిజఘన్థ | నిజఘ్నథుః | నిజఘ్న |
| | నిజఘాన/నిజఘన | నిజఘ్నివ | నిజఘ్నిమ. * |

**శ్లో॥ ప్రాణాయోగపలాయనప్రపతనాఘాతార్తివిత్తవ్యయ-**
**స్వేదాస్రోదయవక్త్రనైల్యభయదుష్కీర్త్యాదివిశ్వం యుధి ।**
**సత్యం శత్రుచయేషు చక్రురఖిలం యద్బ్రహ్మసాక్షాత్కృతే-**
**ర్లబ్ధం తద్విపరీతమాత్మసు తతః సిద్ధం మురారేర్భటాః ॥ 13-64**

**అ :** రణవిషయంలో శత్రువుల దురవస్థ- జ్ఞానులైన కృష్ణ సేనలకు తద్విపరీతస్థితి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** మురారేః భటాః యుధి ప్రాణ+అయోగ-పలాయన-ప్రపతన-ఆఘాత+ఆర్తి-విత్త-వ్యయ-స్వేద-అస్ర-

ఉదయ–వక్త్ర–నైల్య–భయ–దుష్కీర్తి+ఆది–విశ్వం శత్రు–చయేషు సత్యం చక్రుః ఆత్మసు తతః బ్రహ్మ–సాక్షాత్కృతేః యత్ లబ్ధం తద్ విపరీతం సిద్ధం చక్రుః.

**ప్ర :** మురారేః = కృష్ణుని యొక్క, భటాః = సైనికులు, యుధి = యుద్ధంలో, ప్రాణా... విశ్వమ్ : ప్రాణ+అయోగ = ప్రాణాలతో వియోగం, పలాయన = పారిపోవటం, ప్రపతన = నేలకూలటం, ఆఘాత = దెబ్బతినటం, ఆర్తి = దుఃఖించటం, విత్త–వ్యయ = ధనం ఖర్చుకావటం, స్వేద = చెమట పట్టడం, అస్ర+ఉదయ = కంటనీరు రావటం, వక్త్ర–నైల్య = ముఖం నల్లబడటం, భయ = భయపడటం, దుష్కీర్తి = అపకీర్తి పొందటం, ఆది = మొదలగు, విశ్వమ్ = ప్రపంచం, అఖిలమ్ = మొత్తం, శత్రు–చయేషు = శత్రు సమూహాలలో (శత్రూణాం చయాః, తేషు), సత్యమ్ = యథార్థమైనదిగా, చక్రుః = చేశారు (కృ కరణే పరస్మైపది–లిట్–ప్ర.బ.), బ్రహ్మ–సాక్షాత్కృతేః : బ్రహ్మ = కృష్ణపరమాత్మయొక్క, సాక్షాత్కృతేః = సాక్షాత్కారంవలన (బ్రహ్మణః సాక్షాత్కృతిః, తస్యాః), యత్ = ఏది, లబ్ధమ్ = ప్రయోజనమో (అది), తద్–విపరీతమ్ = ప్రాణాయోగాదులకు వ్యతిరేకమైనది, తతః = ఆ సాక్షాత్కారం వలన, ఆత్మసు = తమయందు, సిద్ధమ్ = సిద్ధించినదిగా, చక్రుః = చేశారు.

**తా ॥** కృష్ణుని సైనికులు ఆ యుద్ధంలో శత్రు సేనలలో ప్రాణవియోగం, పలాయనం, నేలగూలటం, దెబ్బతినటం, దుఃఖపడటం, ధనవ్యయం, చెమటపట్టడం, కంటనీరు రావటం, ముఖం నల్లబడటం, భయం, అపకీర్తి మొదలగు సమస్త ప్రపంచాన్నీ (యుద్ధ సంబంధంగా) సత్యం చేశారు. తమకు మాత్రం దానికి పూర్తిగా వ్యతిరేకమైన పరిస్థితి. దానికి కారణం కృష్ణ పరమాత్మ సాక్షాత్కార లబ్ధి.

**వి :** 1. **చక్రుః :** 13–50వ శ్లోక వ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చింతయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతోఽయమభూత్ త్రయోదశమితః సర్గో ముదాం స్వర్గిషు ॥ 13–65**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** స్వర్గిషు = దేవతలలో, త్రయోదశ–మితః = పదమూడవదైన, ముదాం సర్గః ఆనందసృష్టి – మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో త్రయోదశసర్గ.

**శ్రీః**



# శ్రీః
# చతుర్దశః సర్గః

**శ్లో॥ ఛత్రం ధ్వజం చామరచర్మవర్మ-హస్త్యశ్వపత్త్యాదిసమస్తవిత్తమ్ ।
కృత్వా సఖణ్డం యుధి కృష్ణభృత్యా-శ్చక్రుర్హ్యఖణ్డార్థమవిద్యమానమ్ ॥ 14-1**

**అవతారిక :** కృష్ణసేన శత్రుసేనను ఛిన్నాభిన్నం చేయటం. -ఇంద్రవజ్ర.

**అన్వయక్రమం :** కృష్ణభృత్యాః యుధి ఛత్రం ధ్వజం చామరచర్మ-వర్మ-హస్తీ-అశ్వ-పత్తి+ఆది-సమస్త-విత్తం సఖండం కృత్వా అఖండార్థమ్ అవిద్యమానం చక్రుః హి.

**ప్రతిపదార్థం :** కృష్ణ-భృత్యాః : కృష్ణ = కృష్ణునియొక్క, భృత్యాః = సేవకులు (కృష్ణస్య భృత్యాః), యుధి = యుద్ధంలో, ఛత్రమ్ = గొడుగును, ధ్వజమ్ = పతాకను (ధ్వజశ్చిహ్నే పతాకయోః-నానార్థమంజరీ-404), చామర... విత్తమ్ : చామర = వీవెనలు, చర్మ = డాళ్ళు (చర్మమయం చర్మ ఫలకం ఖేటకం సమమ్ - వైజయన్తీ-క్షత్రియ-198) చర్మపదం చర్మ నిర్మితమైన దానికి ఉపలక్షణం), వర్మ = కవచాలు, హస్తీ = ఏనుగులు, అశ్వ = గుఱ్ఱాలు, పత్తి = పదాతులు (పాదచారులయిన సైనికులు), ఆది = మొదలుగా గల, సమస్త-విత్తమ్ = వస్తువుల నన్నింటినీ, (చామరాణి చర్మాణి వర్మాణి హస్తినః అశ్వాః పత్తయః చ ఆదౌ యస్య తత్, తచ్చ సమస్తం చ తత్ విత్తమ్, తత్), సఖండమ్ = ముక్కలుగా (ఖండైః సహితమ్), కృత్వా = చేసి (కృ ధాతువుపై క్త్వా ప్రత్యయం), అఖండార్థమ్ = అఖండపదార్థత్వాన్ని (ముక్కలు కాకుండటాన్ని), అవిద్యమానమ్ = లేనిదానినిగా, చక్రుః = చేశారు. (కృ-కరణే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తాత్పర్యం ॥** కృష్ణ సైనికులు ఆ యుద్ధంలో శత్రువులకు సంబంధించిన గొడుగులను, పతాకలను, వీవెనలను, డాళ్ళనూ, కవచాలనూ, ఏనుగులనూ, గుఱ్ఱాలనూ పదాతులను ఇంకా ఇతర వస్తుసముదాయాన్ని అంతటినీ ఖండించి (ముక్కలుగా చేసి) అఖండపదార్థత్వాన్ని లేకుండా చేశారు.

**విశేషాలు :** 1. అద్వైతం '**బ్రహ్మ సత్యం జగన్మిథ్య**' అంటుంది. అక్కడ బ్రహ్మ అఖండానంద సత్స్వరూపం. "**సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ**" అన్న మాటలలోనే బ్రహ్మకు సత్యత్వ జ్ఞానత్వ-అనన్తత్వాది విశేషగుణ కల్పనద్వారా తదితరం నుండి దానిని వేరు చేయటం జరిగింది. కాబట్టి అది సఖండమే అవుతుంది కానీ అఖండం కాదు. ఇక్కడ సమస్తవస్తుజాతాన్ని ఖండించటం ద్వారా అఖండత్వసిద్ధాంతాన్ని కనుమరుగు చేశారు కృష్ణభక్తులు. ద్వైత-సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు.

| | | | |
|---|---|---|---|
| 2. చక్రుః : | చకార | చక్రతుః | **చక్రుః** |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. * |

**శ్లో॥ సఙ్గ్రామకౌశల్యచిదుజ్ఝితానాం - భఙ్గం సమాలిఙ్గ్య సుమూర్ఛితానామ్ ।**
**సిద్ధామవిద్యాం విదధుర్విపక్షే - విజ్ఞప్త్య(జ్ఞాప్య)భావాకృతిమేవ యుద్ధే ॥ 14-2**

**అ :** కృష్ణసేన జరాసంధసేనను భంగపరచటం. -ఇంద్రవజ్ర.

**అ :** (కృష్ణభృత్యాః) యుద్ధే విపక్షే సంగ్రామకౌశల్య-చిద్-ఉజ్ఝితానాం భంగం సమాలింగ్య సుమూర్ఛితానాం (శత్రూణాం) సిద్ధామ్ అవిద్యాం విజ్ఞప్తి+అభావ+ఆకృతిమ్ ఏవ విదధుః.

**ప్ర :** (కృష్ణ-భృత్యాః = కృష్ణుని సేవకులు), యుద్ధే = యుద్ధమందు, విపక్షే = శత్రుపక్షమందు, సంగ్రామ... తానామ్:సంగ్రామ = యుద్ధమండలి, కౌశల్య = నేర్పుయొక్క, చిత్ = జ్ఞానంచేత, ఉజ్ఝితానామ్ = విడువబడినవారూ, భంగమ్ = భంగపాటును, సమ్-ఆలింగ్య = పొంది (సమ్-ఆ-లిగ్-భ్వాది ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సుమూర్ఛితానామ్ = పూర్తిగా మూర్ఛపోయిన వారూ అయిన శత్రువులకు, సిద్ధామ్ = లభించిన, అవిద్యామ్ = అజ్ఞానాన్ని, విజ్ఞ... కృతిమ్-ఏవ : విజ్ఞప్త్యభావ = జ్ఞానాభావంయొక్క ఆకృతిమ్-ఏవ = స్వరూపంగానే, విదధుః = చేశారు. (వి ధా ధారణ పోషణయోః పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** జరాసంధునితో జరుగుతున్న ఆ యుద్ధంలో కృష్ణసైనికులు యుద్ధనైపుణ్యం లేని ఆ జరాసంధసైనికులు భంగపడి, మూర్ఛపోయి ఆ రీతిగా వారికి కలిగిన అజ్ఞానాన్ని (చైతన్యరాహిత్యాన్ని) జ్ఞానాభావరూపంగా చేశారు.

**వి :** జరాసంధసైనికులు యుద్ధరంగంలో మూర్ఛిల్లి, చైతన్యాన్ని కోల్పోయి, అజ్ఞానులయ్యారు. స్వతహాగా అజ్ఞానులయిన వారు (యుద్ధనైపుణ్యజ్ఞానం లేనందువలన) స్పృహలోనికి వచ్చినా అజ్ఞానులే అవుతారు.

అద్వైతవేదాంతం జీవునికీ, పరబ్రహ్మకు భావగతమైన భేదాన్ని అంగీకరించదు. అది భావకృతమయిన అజ్ఞానమని అద్వైతభావన.

**శ్లో॥ న జీవబ్రహ్మణోర్భేదస్సత్తారూపేణ విద్యతే ।**
**సత్తాభేదే న మానం స్యాదితి వేదాంతడిండిమః ॥** - వేదాంతడిండిమః-62

ఈ అద్వైతసిద్ధాంతాన్ని ప్రకృతశ్లోకంలో నిరసించటం కనిపిస్తోంది. ద్వైతగతంగా పరముడు కృష్ణుడు, జీవులు జరాసంధ సైనికులు. కృష్ణునిలో అజ్ఞానం (యుద్ధసంబంధమైనది) అసలు లేదు కాబట్టి భావరూపమైన అజ్ఞానాన్ని అంగీకరింపనవసరం లేదు. జరాసంధ సైనికులలో అసలు జ్ఞానమేలేదు కాబట్టి భావరూపమైన అజ్ఞానమున్నట్లు అంగీకరింప నవసరం లేదు. కాబట్టి పరబ్రహ్మదృష్ట్యాకానీ, జీవపక్షంగా కానీ భావకృతమైన అజ్ఞానానికి స్థితియే లేదు కాబట్టి నామరూపకృతమైన జ్ఞానాన్ని మిథ్యాజ్ఞానంగా (భావకల్పితమైన అజ్ఞానంగా) అంగీకరించవలసిన అవసరమే లేదు.

| | | | |
|---|---|---|---|
| 2. **విదధుః :** | విదధౌ | విదధతుః | **విదధుః** |
| | విదధిథ/విదధాథ | విదధథుః | విదధ |
| | విదధౌ | విదధివ | విదధిమ. * |

**శ్లో॥ పలాయనం యే విదధుర్నృపాంస్తాన్ - వి(ని)ధాయ సత్కోటిషు కృష్ణభృత్యాః ।**
**అన్యానసత్కోటిషు సన్నివేశ్య - శూన్యం ప్రచక్రుః సదసద్విభిన్నమ్ ॥ 14-3**

**అ :** కృష్ణభృత్యులు శత్రుసేనలో పారిపోయిన వారిని విడిచిపుచ్చి, ఎదిరించిన వారిని సంహరించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** కృష్ణ–భృత్యాః యే పలాయనం విదధుః తాన్ నృపాన్ సత్–కోటిషు విధాయ అన్యాన్ అసత్–కోటిషు సన్నివేశ్య సదసద్విభిన్నం శూన్యం ప్రచక్రుః.

**ప్ర :** కృష్ణ–భృత్యాః = కృష్ణ సైనికులు, యే = ఏ రాజులయితే (జరాసంధ సైనికులు), పలాయనమ్ = (యుద్ధంలో) పారిపోవటం, విదధుః = చేశారో (వి–దా ధారణ పోషణయోః–పరస్మైపది–లిట్–(ప్ర.బ.), తాన్ నృపాన్ = ఆ రాజులను, సత్–కోటిషు : సత్ = (జీవించి) ఉన్నవారియొక్క, కోటిషు=పక్షంలో (సమూహంలో), నిధాయ = నిలిపి, అన్యాన్ = ఇతరులను (ఎదిరించినవారిని), అసత్–కోటిషు : అసత్ = లేనివారియొక్క, కోటిషు = పక్షంలో (సమూహంలో), సన్నివేశ్య = నిలిపి (సమ్–ని–విశ–ధాతువు–(ప్రేరణార్థకం–పై ల్యప్ ప్రత్యయం), సద్–అసద్–విభిన్నమ్ = సత్తుకూ, అసత్తుకూ భిన్నమన్న (వా)దాన్ని (సచ్చ అసచ్చ సదసతీ, తాభ్యాం విభిన్నమ్), శూన్యమ్ = లేని దానినిగా, చక్రుః = చేశారు. (కృ కరణే పరస్మైపది–లిట్–(ప్ర.బ.)

**తా ॥** కృష్ణసైనికులు జరాసంధుని పక్షాన నిలిచి పోరాడుతున్న వారిలో పారిపోతున్న రాజులను ప్రాణాలతో విడిచిపెట్టి (సత్పదార్థాలు), ఎదిరించినవారిని సంహరించి (అసత్పదార్థాలు) సదసద్విభిన్నమనే దాన్ని లేకుండా చేశారు.

**వి :** 1. అద్వైతవేదాంతం నామరూపాలనూ, జగత్తునూ మిథ్య అంటుంది.

శ్లో॥ బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః ।
జీవన్ముక్తస్తు తద్విద్వానితి వేదాంతడిండిమః ॥ – వేదాంతడిండిమః–67

మిథ్యాపదం గౌడపాదకారికలలో కనిపిస్తుంది.

శ్లో॥ **సప్రయోజనతా** తేషాం స్వప్నే విప్రతిపద్యతే ।
తస్మాదాద్యన్తవత్త్వేన **మిథ్యైవ** ఖలు తే స్మృతాః ॥ – గౌడపాదకారిక – 2/7

వస్తుగతమైన ప్రయోజనం కలలో కనిపించిన అదే వస్తువునుండి కలగదు కాబట్టి లౌకికప్రత్యక్షం కన్న స్వాప్నికప్రత్యక్షం భిన్నమవుతోంది. అయితే కలలోని అవసరానికి కలలో కనిపించిన వస్తువు ఉపయోగపడుతుంది. ఇలలోని అవసరానికి ఇలలో కనిపించిన వస్తువు కావలసివస్తుంది. కాబట్టి వస్తుస్థితి సాపేక్షమవుతోంది. దానిని నిర్వచించటానికే **మిథ్యాపదం**.

అద్వైతసిద్ధి (మధుసూదనసరస్వతి) మిథ్యాపదాన్ని అయిదు రకాలుగా నిర్వచిస్తుంది. వాటిలో మొదటిది – సదసద్విలక్షణత్వం. అంటే సత్పదార్థమూ, అసత్పదార్థమూ కూడా కానిదని అర్థం. అందువలననే అది అనిర్వచనీయమని వివక్ష. సదసద్విలక్షణంగా ఎలా వుంటుందంటే అది ఇలలో కనిపించేవస్తువు కలలో కనిపించే వస్తువు కన్న వాస్తవం. అంటే స్వాప్నికప్రత్యక్షం అసత్తు అయితే లౌకికప్రత్యక్షం సత్తు అయింది. అంటే లౌకిక వస్తువు సత్తు అయింది. అయితే అదే లౌకిక వస్తువు పారమార్థికమైన బ్రహ్మతో పోలిస్తే అసత్తు (లేనిది) అవుతుంది. కనిపించేది ఎప్పుడైనా నశించేదే కాబట్టి. నామరూపాలు కల్పితాలు మాత్రమే కాబట్టి. అందువల్ల సదసద్విలక్షణం మిథ్యాపదార్థమని నిర్వచనం. ఈ సిద్ధాంతం మేరకే జగత్తు మిథ్య అన్న శంకరాచార్య (అద్వైత) ప్రతిపాదన.

అద్వైతం సిద్ధించాలంటే ద్వైతమిథ్యాత్వాన్ని ఖండించాలంటూ మధుసూదనసరస్వతి అద్వైతసిద్ధి గ్రంథాన్ని ప్రారంభిస్తాడు.

అయితే ప్రకృతశ్లోకంలో వాదిరాజు సదసద్విలక్షణరూపమిథ్యానిర్వచనాన్ని, తద్వారా అనిర్వచనీయత్వాన్నీ ఖండిస్తున్నాడు. జరాసంధసైనికులనే జగత్తులో సత్పదార్థాన్నీ, అసత్పదార్థాన్నీ విడివిడిగా చూపించి కృష్ణసైనికులు సదసద్విభిన్నలక్షణాన్ని శూన్యం చేశారని. రెండూ కూడా లౌకికప్రత్యక్షాలూ, పారమార్థికప్రత్యక్షాలు కూడా అని వాదిరాజ సిద్ధాంతీ–కరణం. అందుకే ద్వైతం. శ్రీమదానందతీర్థరచితమైన తత్త్వోద్యోతంలో మిథ్యాత్వాన్నీ ఖండంచటం

చూడవచ్చు. వారి దృష్టిలో జగత్తు సత్యం.

2. ప్ర-చక్రుః : 14-1వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥తే బ్రహ్మణః శార్ఙ్గధరాద్విభిన్నా-నాహూయ హేయానపి గర్విణస్తాన్ ।**
**స్వేభ్యోఽపి భిన్నాన్ విరచయ్య యుద్ధే - ధానుష్కచూడామణయో నిజఘ్నుః ॥ 4**

**అ :** కృష్ణసేనలు జరాసంధసేనను సంహరించటం.

**అ :** ధానుష్క-చూడామణయః తే (కృష్ణ-భటాః) బ్రహ్మణః శార్ఙ్గధరాత్ విభిన్నాన్ హేయాన్ గర్విణః అపి తాన్ యుద్ధే ఆహూయ స్వేభ్యః అపి భిన్నాన్ విరచయ్య నిజఘ్నుః.

**ప్ర :** ధానుష్క-చూడామణయః = విలుకాండ్లలో శ్రేష్ఠులైన (ధానుష్కేషు చూడామణయః), తే = ఆ, (కృష్ణ-భటాః = కృష్ణసేనలు), బ్రహ్మణః= బ్రహ్మ (పరమాత్మ) అయిన, శార్ఙ్గధరాత్ = కృష్ణునికన్న, విభిన్నాన్ = వేరై (కృష్ణుని వీడి వేరుగా వున్న) (ఆ కారణంగానే), హేయాన్ = విడువవలసినవారై, గర్విణః అపి = అహంకరిస్తున్న వారైనా, తాన్ = ఆ శత్రువులను, యుద్ధే = రణరంగంలో, ఆహూయ = పిలిచి (ఆ-హ్వే ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వేభ్యః-అపి = తమనుండి వెలువడిన ఆయుధాలతో (తమకన్న కూడా), భిన్నాన్ = ఖండింపబడినవారినిగా (వేరైన వారినిగా), విరచయ్య = చేసి (వి-రచ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నిజఘ్నుః=సంహరించారు. (ని హన్ హింసాగత్యోః-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణసైనికులు మేటి విలుకాండ్రు. జరాసంధసైనికులు పరమాత్మ అయిన కృష్ణునితో విభేదిస్తున్నవారు. అందువలననే పరిత్యజింపదగినవారు. గర్విష్ఠులయిన ఆ జరాసంధ సైనికులను రణభూమిలోనికి ఆహ్వానించి వారిని తమ ఆయుధాలతో ఖండించి చంపివేశారు.

**వి : 1. శ్లో॥ న జీవబ్రహ్మణోర్భేదః సత్తారూపేణ విద్యతే ।**
**సత్తాభేదే న మానం స్యాదితి వేదాన్తడిండిమః ॥**

అంటూ ప్రారంభించి, అయిదు శ్లోకాలతో జీవబ్రహ్మభేదాన్ని నిరాకరించి, జీవుడు పిండమనీ, పరముడు బ్రహ్మాండమనీ రెండింటికీ భేదంలేదనీ సిద్ధాంతీకరింపబడింది వేదాంత డిండిమంలో శంకరాచార్యులచే. జీవబ్రహ్మాలలో సత్తారూపంగా కానీ, స్ఫూర్తిరూపంగా కానీ, ప్రియరూపంగా కానీ, నామరూపంగా కానీ రూపరూపంగా కానీ తేడాలేదని విభిన్నరూపాలతోనూ పరిశీలించి అద్వైతతత్త్వాన్ని ప్రతిపాదించారు శంకరాచార్యులు.

జీవబ్రహ్మలలోనే భేదం లేనపుడు జీవుల మధ్య అవాంతరంగా ఇక భేదప్రసక్తియే లేదు. నామరూపభేదం జీవబ్రహ్మల మధ్య లేదనటం ద్వారా నామరూపకృతమైన జీవ జీవభేదం కూడా లేదన్నట్లే.

ద్వైతమతంతో మధ్వాచార్యులు పంచభేదాలనూ అంగీకరించారు. వారి సిద్ధాంతంలో జీవేశ్వరభేదమూ వుంది. జీవులలో అవాంతరభేదమూ (జీవజీవభేదం) వుంది. భేద పంచక ప్రపంచంలోనూ, నవప్రమేయాలలోనూ దీన్ని స్పష్టం చేశారు మధ్వాచార్యులు.

శ్లో॥ **జీవేశ్వరభిదా చైవ** జడేశ్వరభిదా తథా ।
జీవభేదో మిథశ్చైవ జడజీవభిదా తథా ॥

శ్లో॥ మిథశ్చ జడభేదోఽయం ప్రపంచో భేదపంచకమ్ । - విష్ణుతత్త్వనిర్ణయః.

ఆ జీవేశ్వర భేదాన్ని, జీవజీవభేదాన్నీ ప్రకృతశ్లోకంలో నిరూపిస్తున్నాడు కవి. కృష్ణుని కన్న విభిన్నులు అయిన ఆ జరాసంధసైనికులను (జీవేశ్వరభేదం), తమకన్న కూడా వేరుచేసి (జీవజీవభేదం) చూపారు కృష్ణసైనికులు.

| | | | |
|---|---|---|---|
| 2. **నిజఘ్నుః :** | నిజఘాన | నిజఘ్నతుః | **నిజఘ్నుః** |
| | నిజఘనిథ/ నిజఘన్థ | నిజఘ్నథుః | నిజఘ్న |
| | నిజఘాన/నిజఘన | నిజఘ్నివ | నిజఘ్నిమ. |

*

**శ్లో॥ సురర్షిసిద్ధస్తుతిభిః సమన్తాత్ - సముత్థితాభిః సమదూషయంస్తే ।**
**అనన్యయోగ్యాభిరవాచ్యభావం - ముకున్దముఖ్యార్థపరాభిరస్య ॥ 14-5**

**అ :** కృష్ణసైనికులు ముకుందుని అవాచ్యత్వభావాన్ని నిరాకరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తే అనన్య-యోగ్యాభిః ముకున్ద-ముఖ్య+అర్థ-పరాభిః సమన్తాత్ ఉత్థితాభిః సుర+ఋషి-సిద్ధ-స్తుతిభిః అస్య అవాచ్యభావం సమదూషయన్.

**ప్ర :** తే = ఆ కృష్ణసైనికులు, అనన్య-యోగ్యాభిః = ఇతరులకు తగనివీ (సరిపడని) (అన్యేషు యోగ్యాః న భవన్తి ఇతి), ముకున్ద... పరాభిః : ముకున్ద = కృష్ణుడే, ముఖ్యార్థ = వాచ్యార్థంగా, పరాభిః = తత్పరాలయినవీ అయి (ముకున్దః ఏవ ముఖ్యార్థః, తస్మిన్ పరాః, తాభిః), సమన్తాత్ = అన్నివైపులనుండీ, ఉత్థితాభిః = పైకెగసినట్టి, సుర... స్తుతిభిః : సుర+ఋషి = దేవమునులయొక్క, సిద్ధ = సిద్ధులయొక్క, స్తుతిభిః = స్తుతులచేత (సురాశ్చ తే ఋషయః, తే తే చ సిద్ధాశ్చ, తేషాం స్తుతయః, తాభిః), అస్య = కృష్ణునియొక్క, అవాచ్య-భావమ్ = అవాచ్యత్వాన్ని (లక్ష్యార్థత్వాన్ని) (అవాచ్యః ఇతి భావః, తమ్), సమదూషయన్ = నిందించారు (తిరస్కరించారు) (సమ్-దూష్ వైక్లవ్యే-దివాది-ప్రేరణ-పరస్మైపది-లఙ్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణసేనలు జరాసంధసైనికులను సంహరించటంతో దేవర్షులు, సిద్ధులు ముకుందుని స్తుతించారు. ఆ స్తోత్రాలు (కృష్ణ పరాక్రమప్రశంసకాలు కాబట్టి) ఇతరులకు కుదరవు. కృష్ణుని మాత్రమే ముఖ్యార్థంగా భావిస్తూ పలికినవి. కాబట్టి అటువంటి స్తుతులతో కృష్ణునియొక్క అవాచ్యత్వాన్ని కృష్ణసైనికులు తిరస్కరించారు.

**వి :** 1. శబ్దానికి **అభిధ, లక్షణ, వ్యంజన** అని మూడు శక్తులుంటాయి. సంకేతితమైన అర్థాన్ని ఇచ్చే శక్తి అభిధ. ఆ అర్థం వాచ్యం. ఆ వాచ్యం కుదరనప్పుడు లక్షణ పని చేసి ఆ వాచ్యార్థానికి సన్నిహితమైన (అభేధేయేన సామీప్యాత్ సాదృశ్యాత్ సమవాయతః । వైపరీత్యాత్ క్రియాయోగాల్లక్షణా పంచధా మతా॥) అర్థాన్ని ఇస్తుంది. అది లక్ష్యార్థం. వాచ్యార్థం కుదిరిన తర్వాత కానీ, లక్ష్యార్థాన్ని స్వీకరించిన తరువాత కానీ స్ఫురించే అర్థాంతరం వ్యంగ్యార్థం - దాన్ని ఇచ్చే శబ్దశక్తి వ్యంజన.

పరమాత్మకు అవాచ్యత్వాన్ని అంగీకరిస్తుంది అద్వైతం. '**యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ**' అన్న ఉపనిషద్వచనాలను విశ్లేషించి ఆత్మస్వరూపం అవాచ్యమని అద్వైతం భావిస్తుంది. ద్వైతమతంలో పరమపురుషునకు అవాచ్యత్వం లేదు. అది ప్రత్యక్ష -అనుమాన-శబ్ద ప్రమాణాలతో సాధించటానికి వీలయినది. నవ ప్రమేయాలను వివరించే శ్లోకాన్ని చూద్దాం-

శ్లో॥ శ్రీమన్మధ్వమతే హరిః[1] పరతరస్సత్యం[2] జగత్తత్త్వ[3]తో
భేదో జీవగణా హరేరనుచరాః[4] నీచోచ్చభావం గతాః[5] ।
ముక్తిర్నైజసుఖానుభూతి[6]రమలా భక్తిర్హి తత్సాధనం[7]
హ్యక్షాదిత్రితయం ప్రమాణ8మఖిలామ్నాయైకవేద్యో హరిః[9] ॥

ప్రత్యక్షానుమానశబ్దప్రమాణాలచేత స్వీకరింపబడినదిక అవాచ్యమయ్యే అవకాశమే లేదు.

ప్రకృతశ్లోకంలో స్తుతులు కృష్ణపరమైనవి కాబట్టి ఇతరుల విషయంలో కుదరనివి. కృష్ణుడే వాచ్యార్థంగా గలవి. అవి కృష్ణ విషయంలో కుదురుతున్నాయి కాబట్టి లక్షణకు అవకాశం లేదు. ఇతరులకు కుదరవు కాబట్టి

కృష్ణపరంగా వాచ్యార్థాలు అనకపోతే శబ్దప్రయోగం నిరర్థక మవుతుంది. కాబట్టి కృష్ణపరంగానే వాచ్యార్థం. అందువల్ల కృష్ణునకు అవాచ్యత్వం (అవచనీయత్వం) అన్న అద్వైతం కుదరదు.

| | | | |
|---|---|---|---|
| 2. **సమదూషయన్ :** | సమదూషయత్ | సమదూషయతామ్ | **సమదూషయన్** |
| | సమదూషయః | సమదూషయతమ్ | సమదూషయత |
| | సమదూషయమ్ | సమదూషయావ | సమదూషయామ. |

*

**శ్లో॥ భస్మీభూతమివారచయ్య గిరిశో యం బాహ్యదృష్ట్యా పున-**
**శ్చిత్తాన్తఃస్థితమార్పయద్గిరిసుతాగర్భే హ్యనేకాననమ్ ।**
**తం పఞ్చావయవేషుమఙ్గరుచిరం సృష్ట్వాఽగ్ర్యతర్కోపమం**
**ఛన్దోబాహ్యకుతర్కకల్పమజయత్ తేనైకలవ్యం విభుః ॥ 14-6**

అ : కృష్ణుడు యుద్ధంలో మనసా ప్రద్యుమ్నుని సృష్టించి ఏకలవ్యుని చంపించుట. -శార్దూలవిక్రీడితమ్.

అ : గిరిశః యం బాహ్య-దృష్ట్యా భస్మీభూతమ్+ఇవ ఆరచయ్య పునః చిత్త+అంతఃస్థితమ్ అనేక+ఆననం గిరి-సుతా-గర్భే ఆర్పయత్ హి తమ్ అగ్ర్య-తర్క+ఉపమం పంచ+అవయవ +ఇషుమ్ అంగ-రుచిరం సృష్ట్వా తేన విభుః ఛందః+బాహ్య-కుతర్క-కల్పమ్ ఏకలవ్యమ్ అజయత్.

ప్ర : గిరిశః = శివుడు (గిరౌ శేతే ఇతి గిరిశః "గిరౌ డశ్ఛందసి" వార్తికం (2929 తో గిరి-శీ ధాతువుపై 'డ' ప్రత్యయం), యమ్ = ఎవనిని (మదనుని), బాహ్య-దృష్ట్యా = పై పై చూపునకు, భస్మీభూతమ్+ఇవ = బూడిదయినట్లుగా, ఆరచయ్య = చేసి (ఆ-రచ ధాతువుపై ణిచ్-ల్యప్ ప్రత్యయం), చిత్త+అంతః+స్థితమ్ = మనస్సులోనున్న అతనిని (చిత్తస్య అంతః స్థితమ్), అనేక+ఆననమ్ = షణ్ముఖునిగా (అనేకాని ఆననాని యస్య తమ్), గిరి-సుతా-గర్భే=పార్వతిగర్భంలో (గిరేః సుతా, తస్యాః గర్భః, తస్మిన్), పునః = మరల, ఆర్పయత్ హి = నిక్షేపించాడో (అ-ఋ గతౌ ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), తమ్ = అతనిని, అగ్ర్య-తర్క-ఉపమమ్ : అగ్ర్య = శ్రేష్ఠమైన, తర్క = తర్కంతో, ఉపమమ్ = సమానుడైన (అగ్ర్యశ్చ అసౌ తర్కః, తేన ఉపమా యస్య, తమ్), పంచ+అవయవ+ఇషుమ్ = అయిదుపూలు బాణాలుగా గల మదనుని (అవయవ శబ్దానికిక్కడ తీగల అవయవాలు అని అర్థం ఉపమానాన్ని బట్టి చెప్పుకోవలసి వస్తోంది) (పంచ అవయవాః ఇషవః యస్య, తమ్) అంగ-రుచిరమ్ = అందమైన శరీరావయవాలు గలవానినిగా (అంగైః రుచిరః, తమ్), సృష్ట్వా = సృష్టించి, తేన = అతనిద్వారా, విభుః = కృష్ణుడు, ఛందః... కల్పమ్ : ఛందోబాహ్య = వేదబాహ్యమైన, కుతర్కకల్పమ్ = కుతర్కం వంటి, ఏకలవ్యమ్ = ఏకలవ్యు డనే అసురుని, అజయత్ = జయించాడు. (జి జయే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

తా ॥ శివుడు మదనుని (లలాటాగ్నితో) భస్మం చేశాడు. అయితే అది బాహ్యదృష్టికి మాత్రమే. మరల మనోభవునిగా చేసి షణ్ముఖరూపంలో పార్వతిగర్భంలో ప్రవేశపెట్టాడో ఆ మదనుని కృష్ణుడు ఆ రణభూమిలో మనసా ప్రద్యుమ్నరూపంగా సృష్టించాడు. శ్రేష్ఠతర్కంతో సమానంగా పంచావయవబాణుడైన ఆ ప్రద్యుమ్నుని ద్వారా వేదబాహ్యుడై కుతర్కంతో సమానుడైన ఏకలవ్యుని కృష్ణుడు జయించాడు.

వి : 1. తర్కశాస్త్రంలో అనుమాన ప్రమాణాన్ని స్వార్థానుమానం, పరార్థానుమానం అని రెండుగా విభజిస్తారు.

**పరార్థానుమానం** - తానుగ్రహించిన దానిని ఇతరులకు గ్రహింపజేయటం, పంచావయవవాక్యం మీద ఆధారపడుతుంది. ప్రతిజ్ఞ, హేతు, ఉదాహరణ, ఉపనయ, నిగమాలు ఆ అయిదు అవయవాలు. తర్కసంగ్రహం వీటిని సోదాహరణంగా నిర్వచిస్తుంది. 1. 'పర్వతో వహ్నిమాన్ ఇతి **ప్రతిజ్ఞా** 2. ధూమవత్త్వాదితి **హేతుః** 3. యో యో ధూమవాన్ స స వహ్నిమాన్ యథా మహానసః **ఇత్యుదాహరణమ్.** 4. తథా చాయ మిత్యు**పనయః**

3. తస్మాత్తథా ఇతి **నిగమనమ్** (1. పర్వతంలో నిప్పు వుంది – ఇది ప్రతిజ్ఞ. 2. పొగ వుంది కాబట్టి – ఇది హేతువు. 3. ఎక్కడక్కడ పొగవుంటే అక్కడక్కడ నిప్పుంటుంది వంట ఇంటిలో లాగా – ఇది ఉదాహరణం 4. ఈ కొండ కూడా అలాగే వుంది – ఇది ఉపనయం 5. కాబట్టి నిప్పున్నట్లే – ఇది నిగమనం)

ఈ రీతిగా సాధ్యాన్ని హేతుబద్ధంగా సాధించటం తర్కం. కొన్ని హేతువువలె కనిపిస్తుంటాయి కానీ అవి హేతువులు కాలేవు. వాటిని హేత్వాభాసాలంటారు. ఇవి కూడా అయిదు. 1.**సవ్యభిచారం** 2. **విరుద్ధం** 3. **సత్ప్రతిపక్షం** 4.**అసిద్ధం** 5. **బాధితం** ఈ లక్షణాలతో కూడిన హేతువులు హేత్వాభాసాలు. వీటితో సాధ్యాన్ని సాధించాలనుకోవటం కుతర్కం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆర్పయత్ :** | **ఆర్పయత్** | ఆర్పయతామ్ | ఆర్పయన్ |
| | ఆర్పయః | ఆర్పయతమ్ | ఆర్పయత |
| | ఆర్పయమ్ | ఆర్పయావ | ఆర్పయామ |
| **అజయత్ :** | **అజయత్** | అజయతామ్ | అజయన్ |
| | అజయః | అజయతమ్ | అజయత |
| | అజయమ్ | అజయావ | అజయామ. |

*

**శ్లో॥ రణే క్షణేనాఙ్గజముజ్జ్వలాఙ్గైః – సమం సముత్పాద్య స సర్వశక్తిః ।**
**భవానుభావాగతతత్పితృత్వ–ప్రథాం శ్రితాత్మీయగతిర్ద్యతి స్మ ॥ 14–7**

**అ :** కృష్ణుడు క్షణకాలంలో ప్రద్యుమ్నుని సృష్టించుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రిత+ఆత్మీయ–గతిః సర్వ–శక్తిః సః రణే క్షణేన ఉజ్జ్వల+అంగైః సమమ్ అంగజం సముత్పాద్య భవ+అనుభావ+ఆగత–తత్–పితృత్వ–ప్రథాం ద్యతి స్మ.

**ప్ర :** శ్రిత+ఆత్మీయ–గతిః : శ్రిత = (తనను) ఆశ్రయించిన, ఆత్మీయ = తనవారికి (భక్తులకు), గతిః = ఆశ్రయమైన వాడూ (శ్రితానామ్ ఆత్మీయానాం గతిః), సర్వ–శక్తిః = అన్ని శక్తులు గలవాడూ అయిన (సర్వాః శక్తయః యస్మిన్ సః), సః = ఆ కృష్ణుడు, రణే = యుద్ధభూమిలో, క్షణేన = క్షణకాలంలో, ఉజ్జ్వల+అంగైః–సమమ్ : ఉజ్జ్వల = ప్రకాశించే, అంగైః–సమమ్ = అవయవాలతో పాటు (ఉజ్జ్వలాని చ తాని అంగాని, తైః), అంగజమ్ = మన్మథుని (ప్రద్యుమ్నుని), సముత్పాద్య = సృష్టించి (సమ్–ఉత్ పద్ ధాతువు–ప్రేరణ–పై ల్యప్ ప్రత్యయం), భవ... ప్రథామ్ : భవ = శివునియొక్క, అనుభావ = ప్రభావంచేత, ఆగత = సిద్ధించిన, తత్ = ఆ ప్రద్యుమ్నునియొక్క, పితృత్వ = తండ్రితనమనే, ప్రథామ్ = ప్రసిద్ధిని, ద్యతి స్మ = ఖండించాడు. (దో అవఖండనే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ రణరంగంలో కృష్ణుడు క్షణకాలంలోనే ఉజ్జ్వలమైన శరీరావయవాలతో వున్న ప్రద్యుమ్నరూపుడైన మన్మథుని సృష్టించి, శంకరుని ప్రభావం వలననే తనకు ప్రద్యుమ్న పితృత్వం సిద్ధించిందన్న ప్రథను పోగొట్టుకొన్నాడు.

**వి :** 1. కృష్ణుడు 'నీ దగ్గరనుండి వరాన్ని భవిష్యత్తులో గ్రహింపగలను' అని శివునికి వరమిచ్చాడట. ఆ వరం మేరకు శివుని దగ్గరకు వెళ్ళి – బదరికాశ్రమానికి – శివునితో మాటాడాడు.

శ్లో॥ "మాయా వరో హి శంభవే ప్రదత్త ఆస పూర్వతః ।
వరం గ్రహీష్య ఏవ తే సకాశతో వియోహయన్ ॥

శ్లో॥ త్వామారాధ్య తతశ్శంభో గ్రహీష్యామి వరం సదా ।
ద్వాపరాదౌ యుగే భూత్వా కలయా మానుషాదిషు ॥"

శ్లో॥ ఇతి వాక్యమృతం కర్తుమభి(పాయం విజజ్ఞుషీ ।
(ప్రీత్యర్థం వాసుదేవస్య రుగ్మిణీ వాక్యమ(బవీత్ ॥

శ్లో॥ జాతేఽపి పు(త్రే పు(త్రార్థం స్త్రాహి వేద మనోగతమ్ ।
పు(త్రో మే బలవాన్ దేవస్యాత్సర్వాస్త్రవిదుత్తమః ॥

శ్లో॥ ఇత్యుక్తో భగవాన్ దేవ్యా సమ్మోహాయ సురద్విషామ్ ।
యయౌ సుపర్ణమారుహ్య స్వీయం బదరికా(శయమ్ ॥ -మహాభారతతాత్పర్యనిర్ణయః-22/148-152

ఆ రీతిగా తనకున్న (ప్రథను పోగొట్టుకొనటానికి కృష్ణుడు క్షణంలో (ప్రద్యుమ్నుని సృష్టించాడట. మదనుడే (ప్రద్యుమ్నుడు రూపాంతరంగా.

| | | | |
|---|---|---|---|
| 2. **దృతి :** | **దృతి** | దృతః | దృన్తి |
| | దృసి | దృథః | దృథ |
| | ద్యామి | ద్యావః | ద్యామః. * |

**శ్లో॥ ఈశాపరోక్షసమకాలమశేషవిద్యా-బాధ్యం (ప్రసాధ్య సకలం తదిదం ద్విషత్సు ।**
**శ్రీశార్ఙ్గపాణిచరణే నిఖిలం సమర్ప్య - స్వోపార్జితం సమలభన్త మహా(ప్రసాదమ్॥8**

**అ :** కృష్ణసైనికులు యుద్ధంలో గెలిచి తాము సంపాదించిన దానిని కృష్ణున కర్పించి ముక్తినందుట. -వసంతతిలక.

**అ :** ఈశ+అపరోక్ష-సమ-కాలం సకలం తద్ ఇదం ద్విషత్సు అశేష-విద్యా-అబాధ్యం (ప్రసాధ్య స్వ+ఉపార్జితం నిఖిలం శ్రీశార్ఙ్గపాణి-చరణే సమర్ప్య మహా-(ప్రసాదం సమలభన్త.

**(ప్ర :** ఈశ... కాలమ్ : ఈశ = పరముడైన కృష్ణునియొక్క, అపరోక్ష = (ప్రత్యక్షదర్శనంయొక్క, సమకాలమ్ = సమకాలంలో (కృష్ణదర్శన వేళలోనే) (కృష్ణస్య అపరోక్షస్య సమః కాలః యస్మిన్ తత్), సకలమ్ = సంపూర్ణమైన, తద్-ఇదమ్ = ఆ ఇది (యుద్ధంలో గాయపడటం, పారిపోవటం మొదలయినది), ద్విషత్సు = శ(త్రువులయందు, అశేష-విద్యా-అబాధ్యమ్ : అశేష-విద్యా = సర్వవిద్యలచేతనూ, అబాధ్యమ్ = బాధింపబడని దానినిగా, (ప్రసాధ్య = సాధించి, స్వ+ఉపార్జితమ్ = (యుద్ధంలో) తాము సంపాదించిన దానిని, నిఖిలమ్ = మొత్తాన్ని, శ్రీ శార్ఙ్గపాణి-చరణే = శ్రీకృష్ణుని పాదంపై, సమర్ప్య = అర్పించి (సమ్-ఋ ధాతువుపై-(ప్రేరణ-ల్యప్ (ప్రత్యయం), మహా-(ప్రసాదమ్ = గొప్ప అను(గహాన్ని (పరమ-పురుషార్థం కాబట్టి మోక్షాన్ని), సమ్-అలభన్త = పొందారు. (సమ్-లభ్ (ప్రాప్తౌ-ఆత్మనేపది-లఙ్-(ప్ర.బ.)

**తా ॥** కృష్ణుడు తమతో (ప్రత్యక్షంగా వున్నాడు కాబట్టి ఆ (ప్రభావంచేత ఆ సమయంలో, ఆ రణరంగంలో తాము శ(త్రుపక్షంపై వారి ఏ విద్యలూ తమను ఇబ్బందిపెట్టలేని రీతిలో పరా(క్రమాన్ని (ప్రదర్శించి, సాధించిన సమస్తాన్నీ శ్రీకృష్ణపదార్పణంచేసి కృష్ణసైనికులు తాము కృష్ణుని మహా(ప్రసాదాన్ని పొందారు. (ఆ మహా(ప్రసాదం మోక్షరూపం)

| | | | |
|---|---|---|---|
| వి : 1. **సమలభన్త :** | సమలభత | సమలభేతామ్ | **సమలభన్త** |
| | సమలభథాః | సమలభేథామ్ | సమలభధ్వమ్ |
| | సమలభే | సమలభావహి | సమలభామహి. * |

**శ్లో॥ సం(ప్రేష్య శైవీం (ప్రథమం గదాం యో - జరాభిధానాం జననీం జఘాన ।**
**జాత్యుత్తరేణైవ పరాజితోఽభూ-దాత్మోదితవ్యాహతిహేతునాఽసౌ ॥ 14-9**

**అ :** జరాసంధ పరాజయం. -ఇం(ద్రవ(జ.

**అ :** యః ప్రథమం శైవీం గదాం సంప్రేష్య జరా+అభిధానాం జననీం జఘాన అసౌ ఆత్మ+ఉదిత–వ్యాహతి–హేతునా జాతి+ఉత్తరేణ ఏవ పరాజితః అభూత్.

**ప్ర :** యః = ఏ జరాసంధుడు, ప్రథమమ్ = ముందుగా, శైవీమ్ = శివుడిచ్చిన, గదామ్ = గదను, సంప్రేష్య = ప్రయోగించి (పంపి), జరా+అభిధానామ్ = జర అను పేరుగల (జరా ఇతి అభిధానం యస్యాః, తామ్), జననీమ్ = తల్లిని (తల్లివంటిదానిని), జఘాన = చంపాడో, అసౌ = ఆ జరాసంధుడు, ఆత్మ... హేతునా : ఆత్మ = తనయొక్క, ఉదిత = పుట్టుకకు కారణమైన దానియొక్క (మాట యొక్క), వ్యాహతి = వ్యాఘాతమే (నాశనమే), హేతునా = కారణంగా గల (ఆత్మనః ఉదితస్య వ్యాహతిః ఏవ హేతుః యస్య, తేన), జాతి+ఉత్తరేణ–ఏవ = జాతి (లక్షణం గల) సమాధానం చేతనే, పరాజితః = ఓడింపబడిన వాడుగా, అభూత్ = అయ్యాడు. (భూ సత్తాయాం పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** జరాసంధుడు ముందుగా శివుడు తనకిచ్చిన గదను కృష్ణునిపైకి ప్రయోగించాడు. ఆ గదతోనే జరాసంధుని ఉనికికి కారణమైన జర మరణించింది. కాబట్టి తన పుట్టుకకు హేతువైన తల్లిని సంహరించిన జరాసంధుడు జాత్యుత్తరం (స్వోదితవిరోధిత్వం) చేతనే ఓడిపోయాడు.

**వి :** 1. జాత్యుత్తరమంటే స్వవచోవ్యాఘాతం. '**స్వవ్యాహతిర్జాతిః**' (ప్రమాణపద్ధతి), **స్వవాక్యవిరోధః అపసిద్ధాంత–జాతిరూపేణ**" ప్రమాణ లక్షణం

స్వవాక్యవిరోధం అపసిద్ధాంతోత్పత్తిరూపంగా పరిణమిస్తుంది. తన వ్రేలితోనే తనకంటిని పొడుచుకొన్నట్లు.

ఇక్కడ జరాసంధుని పరిస్థితి కూడా అలాగే అయింది. తన గదతో తన తల్లినే చంపుకొన్నాడు కాబట్టి స్వోదితవిరోధం కలిగింది. ఓటమి సంభవించింది.

2. **జర** ఒక రక్షసి. కానీ మనుషులంటే ఇష్టం. తనను తలచుకొన్నా, చేరదీసినా వారికోసం ఏమైనా చేసే స్వభావం గలది. జరాసంధుని తండ్రి బృహద్రథుడు జరను అర్చించేవాడు. అందువల్ల ఆమె ఆయనకు ఉపకారం చేయటానికై ఎదురుచూస్తుండేది. బృహద్రథుని భార్యలిద్దరికీ జరాసంధుడు పుట్టాడు. అయితే రెండుముక్కలుగా, చెరొక ముక్కగా, ఆ రెండింటినీ కలిపింది జర. ఆ బాలుడే జరాసంధుడు. (జర సంధానం చేసింది కాబట్టి). అందువల్ల జరను తల్లిగా భావించటం.

3. జరాసంధుని చేతినుండి జారిపడిన గదవల్ల, బలరాముడు ప్రయోగించిన స్థూణాకర్ణమనే ఆయుధం వల్ల జర మరణించినట్లు మహాభారతంలో కృష్ణుడే వివరిస్తాడు అర్జునునికి–

శ్లో॥ తామాపతన్తీం దృష్ట్వైవ గదాం రోహిణినందనః ।
ప్రతిఘాతార్థమస్త్రం వై స్థూణాకర్ణమవాసృజత్ ॥

శ్లో॥ అస్త్రవేగప్రతిహతా సా గదా ప్రాపతద్ భువి ।
ధారయంతీ ధరాం దేవీం కంపయన్తీవ పర్వతాన్ ॥

శ్లో॥ తత్ర సా రాక్షసీ ఘోరా జరానామ్నీ సువిక్రమా ।
సందధే సా హి సంజాతం జరాసంధమరింధమమ్ ॥ ... ...

శ్లో॥ సా తు భూమిం గతా పార్థ హతా ససుతబాంధవా ।
గదయా తేన చాస్త్రేణ స్థూణాకర్ణేన రాక్షసీ ॥ –ద్రోణపర్వం–122/10–12,14

**మహాభారతతాత్పర్యనిర్ణయం** కూడా జరాసంధుడు ప్రయోగించిన గదయే జరను సంహరించినట్లు చెప్తోంది.

శ్లో॥ క్షిప్తా తు తా భగవతోஉథ గదా జరాభ్యాం – తత్సన్ధినీమసుభిరాశు వియోజ్య పాపామ్ ।
మర్త్యాశినీం భగవతః పునరాజ్ఞయైవ – యాతా గిరీశసదనం మగధం విసృజ్య ॥ –14/14

| | | | |
|---|---|---|---|
| 4. **జఘాన : జఘాన** | జఘ్నతుః | జఘ్నుః | |
| జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న | |
| జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ | |
| **అభూత్ : అభూత్** | అభూతామ్ | అభూవన్ | |
| అభూః | అభూతమ్ | అభూత | |
| అభూవమ్ | అభూవ | అభూమ. | * |

**శ్లో॥ సంవాదం కిల కేఽపి బభ్రురపరేఽనుక్తిం శరైస్తాడితా**
**నిర్యాన్తః కటకాన్నిరున్ధతి నిజే క్రుద్ధా విరోధం పరే ।**
**ధ్వస్తాః కేచిదసఙ్గతిం నిజజనైః సర్వే జయైర్న్యూనతా-**
**మాధిక్యం హతిభిః పరాజితమభూదిత్థం తదద్వైతివత్ ॥ 14-10**

**అ :** పరాజయాన్ని పొందిన జరాసంధసైనికుల విభిన్నచేష్టలు. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కే అపి సంవాదం బభ్రుః కిల. అపరే శరైః తాడితాః (సన్తః) అనుక్తిం బభ్రుః. పరే కటకాత్ నిర్యాంతః నిరున్ధతి (సతి) నిజే క్రుద్ధాః విరోధం బభ్రుః. కేచిత్ ధ్వస్తాః (సన్తః) నిజజనైః అసంగతిం బభ్రుః. సర్వే జయైః న్యూనతాం హతిభిః ఆధిక్యం బభ్రుః. ఇత్థం తత్ అద్వైతివత్ పరాజితమ్ అభూత్.

**ప్ర :** కే-అపి = కొంతమంది (సైనికులు), సంవాదమ్ = మంచిమాటను (పరాజయ వచనాన్ని), బభ్రుః కిల = ధరించారు (స్వీకరించారు) (భృ-భరణే-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.బ.), అపరే = మరికొందరు, శరైః = బాణాలచే, తాడితాః (సన్తః) = కొట్టబడినవారై, అనుక్తిమ్ = మౌనాన్ని, బభ్రుః = ధరించారు. పరే = కొందరు, కటకాత్ = సేననుండి (సైన్యేఽపి కటకోఽస్త్రియామ్ వైజయన్తీ-నానాలింగ-31), నిర్యాన్తః = పారిపోతూ, నిరున్ధతి = అడ్డగిస్తున్న, నిజే = తనవారి (సేన) మీదనే, క్రుద్ధాః = కోపగించినవారై, విరోధమ్ = విరోధాన్ని, బభ్రుః = ధరించారు. కేచిత్ = కొందరు, ధ్వస్తాః (సన్తః) = ధ్వంసంచేయ బడినవారై, నిజజనైః = తనవారితోనే, అసంగతిమ్ = కూడమిని (వేరగుటను), బభ్రుః = ధరించారు, సర్వే = అందరూ, జయైః = గెలుపులతో, న్యూనతామ్ = లేమిని, హతిభిః = దెబ్బలతో, ఆధిక్యమ్ = అధికత్వాన్ని, బభ్రుః = ధరించారు. తత్ = ఆ జరాసంధసేన, ఇత్థమ్ = ఈ ప్రకారంగా, అద్వైతివత్ = అద్వైతవాదిలాగా, పరాజితమ్ = ఓడింపబడినదిగా, అభూత్ = అయింది. (భూ సత్తాయాం పరస్మైపది లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** జరాసంధసైనికులలో కొందరు **సంవాదాన్ని** స్వీకరించారు. కొందరు బాణాల దెబ్బలు తిని **అనుక్తిని** ధరించారు. కొందరు సేనలో నుండి పారిపోతూ తనవారే అడ్డుపడగా వారిమీదనే కోపగించి **విరోధాన్ని** భరించారు. కొందరు శిథిలమవుతూ తమవారితోనే **అసంగతిని** చేపట్టారు. అందరూ కూడా గెలుపు విషయంలో **న్యూనత్వాన్నీ**, దెబ్బలు తినటంలో **ఆధిక్యాన్ని** స్వీకరించారు. ఇలా ఆ జరాసంధసేన అద్వైతవాదిలాగా పరాజిత మైంది.

**వి :** 1. శ్లోకంలోని సంవాదాది పదాలు పారిభాషికాలు. వాదప్రతివాదాలలో ప్రతిపక్షిని కట్టివేయటం - వాదన కొనసాగించే అవకాశం లేకుండా చేసి - తమవాదాన్ని అంగీకరింప జేయటం వాదంలో గెలుపు. ఇలా ఆటకట్టించడాన్ని నిగ్రహస్థానమంటారు. అవి ఆరు అని మధ్వాచార్యమతం. '**విరోధాసంగతీ న్యూనాధికే సంవాదానుక్తీ ఇతి షడేవ నిగ్రహస్థానాని**" (ప్రమాణ పద్ధతి).

1. విప్రతిపన్న ప్రమేయాంగీకారః **సంవాదః** (ప్రతిపక్షి ప్రతిపాదించిన ప్రమేయాన్ని ఒప్పుకోవటం)

2. పరబోధనార్థస్య అవశ్యం వక్తవ్యస్య అవచనమ్ **అనుక్తిః** (ఇతరులకు అవగాహన కల్గించటానికై తప్పనిసరిగా చెప్పవలసినదానిని చెప్పకపోవటం)

3. యోగ్యతాభావః **విరోధః** (యోగ్యతలేకపోవటం (యోగ్యత అంటే ప్రతిపాదిత విషయానికి బాధ లేకపోవటం. 'నిప్పుతో తడుపుతున్నాడు' అంటే యోగ్యత లేనట్టు, నిప్పు తడపలేదు కాబట్టి.)

4. ఆకాంక్షా విరహః **అసంగతిః** (ఆకాంక్ష లేకపోవటం అసంగతి. వాక్యంలోని పదాలకు పరస్పరం అన్వయం కుదరటం ఆకాంక్ష. అప్పుడే వాక్యార్థ జ్ఞానం కలుగుతుంది.)

5. అవశ్యవక్తవ్యస్య ఏకదేశమాత్రవచనమ్ **న్యూనమ్**. (చెప్పవలసినదానిలో కొంతభాగాన్ని మాత్రమే చెప్పటం–మిగిలినది వదలివేయటం–న్యూనం)

6. ఆకాంక్షితస్యైవ అన్యేన కృతకార్యస్య వచనమ్ **ఆధిక్యమ్** (మరోపదంతో పని జరిగిపోతున్నా అనవసరంగా పదాన్ని ప్రయోగించటం)

ఈ ఆరు నిగ్రహస్థానాలతో అద్వైతి పరాజయానికి లోనైనట్లు, జరాసంధసేనల చేష్టలలోనూ ఈ నిగ్రహస్థానాలను ప్రదర్శించి, పరాజయాన్ని కల్గించాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **బభ్రుః :** | బభార | బభ్రతుః | **బభ్రుః** |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ |

**అభూత్ :** 14–9వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సఞ్చూర్ణితాఙ్గాః సమరే శరౌఘైః – సఞ్ఛిన్నపాదోదరకణ్ఠహస్తాః ।**
**విరేజురశ్నన్త ఇవాసృగబ్ధౌ – ఫలం నిరాకారమతస్య తావత్ ॥ 14–11**

**అ :** జరాసంధసేనలో శరీరావయవాలు తెగిపడిన వారి స్థితిని వర్ణించటం.

**అ :** సమరే శర+ఓఘైః సంచూర్ణిత+అంగాః సంఛిన్న–పాద+ఉదర–కంఠ–హస్తాః అసృక్+అబ్ధౌ నిరాకార–మతస్య ఫలమ్ అశ్నన్తః+ఇవ విరేజుః తావత్.

**ప్ర :** సమరే = యుద్ధంలో, శర+ఓఘైః = బాణసమూహాలతో (శరాణామ్ ఓఘాః, తైః), సంచూర్ణిత+అంగాః : సంచూర్ణిత = శిథిలం చేయబడిన, అంగాః = అవయవాలు గలవారూ (సంచూర్ణితాని అంగాని యేషాం తే), సంఛిన్న... హస్తాః : సంఛిన్న = నరుకబడిన, పాద = కాళ్ళు, ఉదర = పొట్టలు, కంఠ = మెడలు, హస్తాః = చేతులు–గలవారైన (సైనికులు) (సంఛిన్నాః పాదాః ఉదరాణి కంఠాః హస్తాశ్చ యేషాం తే), అసృక్+అబ్ధౌ = నెత్తుటేటిలో, నిరాకార–మతస్య = పరమేశ్వరునకు ఆకారం లేదను అభిప్రాయంయొక్క, ఫలమ్ = ఫలితాన్ని, అశ్నన్తః–ఇవ = అనుభవిస్తున్నట్లుగా, విరేజుః = ప్రకాశించారు. (వి–రాజ్ దీప్తౌ–పరస్మైపది–లిట్–ప్ర.బ.), తావత్ = అంతే మరి.

**తా ॥** రణరంగంలో బాణసమూహాలచే శరీరాలు శిథిలాలు కాగా కాళ్ళు, చేతులూ, మెడలూ, పొట్టలు తెగిపడిన సైనికులు రక్తపుటేటిలో పరమేశ్వరునికి నిరాకారుడన్నందుకు తగిన ఫలాన్ని అనుభవిస్తున్నట్లు ప్రకాశించారు. అంతే మరి (పరమేశ్వరుడు నిరాకారుడంటూ సేవించారు కాబట్టి వారు కూడా ఆకారాలు కోల్పోయారు.)

**వి :** 1. పరమాత్మకు పదార్థత్వమున్నా అది అమూర్తపదార్థం. ఆ నిరాకారత్వాన్ని కూడా పరమాత్మ లక్షణంగా అద్వైతం ప్రతిపాదిస్తుంది. దాన్ని నిరాకరిస్తున్నాడు కవి ఈ శ్లోకంలో. అంతేగాక 'చేసుకున్న వారికి చేసుకున్నంత' అని ఎత్తిపొడుస్తున్నాడు కూడా.

2. అశ్నన్తః ఇవ – అనుభవిస్తున్నట్లుగా అనటంలో ఉత్ప్రేక్షాలంకారం. నెత్తుటేటిలో శరీరాలు తెగిన సైనికులు

పడివుండటాన్ని వారు పరమేశ్వరుడు నిరాకారుడన్నందుకు తాము నిరాకారులై దాని ఫలితాన్ని అనుభవిస్తు-న్నట్లున్నదని కవి సంభావించటం వల్ల ఇది వస్తూత్ప్రేక్ష.

3. **విరేజుః :**

| | | |
|---|---|---|
| విరరాజ | విరేజతుః | **విరేజుః** |
| విరేజిథ | విరేజథుః | విరేజ |
| విరరాజ/విరరజ | విరేజివ | విరేజిమ. |

4. ఛందస్సు – ఉపజాతి (పూర్వార్ధం ఇంద్రవజ్ర ఉత్తరార్ధం ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ స్వాఙ్గాచ్ఛాదితశత్రుశౌర్యతరణిః శార్ఙ్గేన్ద్రచాపోజ్జ్వలః**
**శ్రీదేవీస్థిరవిద్యుదద్భుతరథశ్రీమత్సమీరేరితః ।**
**కావ్యోద్గీతకథః శరౌఘకరకావర్షైః స కృష్ణామ్బుదో**
**రాజన్యాననపాణిపాదకమలవ్రాతానలావీత్ క్షణే ॥ 14-12**

**అ :** కృష్ణ పరాక్రమవర్ణన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** స్వ+అంగ+ఆచ్ఛాదిత–శత్రు–శౌర్య–తరణిః శార్ఙ్గ+ఇంద్రచాప+ఉజ్జ్వలః శ్రీ–దేవీ–స్థిర–విద్యుద్ అద్భుత–రథ–శ్రీమత్–సమీర+ఈరితః కావ్య+ఉద్గీత–కథః సః కృష్ణ+అంబుదః శర+ఓఘ–కరకా–వర్షైః రాజన్య+ఆనన–పాణి–పాద–కమల–వ్రాతాన్ క్షణే అలావీత్.

**ప్ర :** స్వాంగా... తరణిః : స్వ = తనయొక్క, అంగ = చతురంగబలాలచే/శరీరంచే, ఆచ్ఛాదిత=కప్పబడిన, శత్రు=శత్రువులయొక్క, శౌర్య = పరాక్రమమనే, తరణిః = సూర్యుడు గలదీ (స్వ స్య అంగాని తైః ఆచ్ఛాదితం శత్రూణాం శౌర్యమ్ ఏవ తరణిః యేన సః), శార్ఙ్గే... జ్జ్వలః : శార్ఙ్గ = శార్ఙ్గమనే (ఆ పేరుగల ధనుస్సు అనే), ఇంద్ర–చాప = ఇంద్ర ధనుస్సుతో, ఉజ్జ్వలః = ప్రకాశిస్తున్నదీ (శార్ఙ్గమ్ ఏవ ఇంద్రస్య చాపః యస్య సః), శ్రీదేవీ–స్థిర–విద్యుత్ : శ్రీదేవీ = శ్రీలక్ష్మి అనే, స్థిర = నిశ్చలమైన, విద్యుత్ = మెరుపుగలదీ (శ్రీదేవీ ఏవ స్థిరా విద్యుత్ యస్య సః), అద్భుత... రేరితః : అద్భుత = ఆశ్చర్యకరమైన, రథ = రథమనే, శ్రీమత్–సమీర = శ్రీమన్ముఖ్యప్రాణునిచే (గాలిచే), ఈరితః = నడిపింప బడినదీ (అద్భుతః చ అసౌ రథః, స ఏవ సమీరః, తేన ఈరితః), కావ్య–ఉద్గీత–కథః : కావ్య = (ప్రకృత) కావ్యమందు, ఉద్గీత = ఎలుగెత్తి గానం చేయబడిన, కథః = కథ గలదీ అయిన (కావ్యే ఉద్గీతా కథా యస్య సః), సః = ఆ, కృష్ణ+అంబుదః = కృష్ణుడనే మేఘం (నీలమేఘం), శరౌ... వర్షైః : శర = బాణాలయొక్క, ఓఘ = సమూహ మనే, కరకా = వడగళ్ళయొక్క, వర్షైః = వానలతో (శరాణామ్ ఓఘాః ఏవ కరకాః, తాసాం వర్షైః) (వర్షోపలస్తు కరకా–అమరకోశః–దిక్–12), రాజన్యా... వ్రాతాన్ : రాజన్య = రాజులయొక్క, ఆనన = ముఖాలు, పాణి = చేతులు, పాద = కాళ్ళు అనే, కమల = తామరలయొక్క, వ్రాతాన్ = సమూహాలను (రాజన్యానామ్ ఆననాని పాణయః పాదాశ్చ ఏవ కమలాని, తేషాం వ్రాతాః, తాన్), క్షణే = క్షణంలో, అలావీత్ = ఖండించింది. (లూ ఛేదనే పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** రణరంగంలో కృష్ణమేఘం క్షణంలో రాజుల ముఖకమలాలు, కరకమలాలు, చరణ కమలాలయొక్క సమూహాలను ఖండించింది. తన శరీరంచేత ఆచ్ఛాదింపబడిన శత్రు శౌర్యమనే సూర్యుడు గలదది. (కృష్ణుడు తన చతురంగబలాలతో శత్రుశౌర్యాన్ని అడ్డగించాడు. మేఘం తన ఆకృతితో సూర్యుని కప్పివేసింది.) శార్ఙ్గమనే ఇంద్రధనుస్సుతో ప్రకాశిస్తోంది అది. (కృష్ణుడు శార్ఙ్గధనుస్సుతో ప్రకాశిస్తున్నాడు. మేఘం ఇంద్రచాపంతో ప్రకాశిస్తోంది.) శ్రీదేవి అనే స్థిరమైన మెఱుపుగలదది. (శ్రీదేవితో స్థిరంగా మెఱుస్తున్నవాడు కృష్ణుడు. నిలకడగల మెఱుపులతో మెరుస్తోంది మేఘం) అద్భుతరథమనే గాలిచే నడపబడినదది. (కృష్ణుడు తన అద్భుతరథవేగం వలన పుట్టిన గాలితో ప్రేరణ పొందినవాడు. మేఘం గాలిప్రేరణచే కురుస్తున్నది) కావ్యమందు గానం చేయబడినదది.

(కృష్ణుడు ప్రకృత కావ్య-నాయకుడై కీర్తింపబడుతున్నవాడు. మేఘం కావ్యాలలో ఋతువర్ణన సందర్భంలో కీర్తింపబడుతుంది). బాణా లనే వడగండ్లు కురుస్తున్నదది. (కృష్ణుడు బాణవృష్టిని కురిపిస్తున్నాడు. మేఘం వడగండ్లను రాల్చుతోంది.)

**వి :** 1. కృష్ణాంబుదః అన్నది రూపకం. కృష్ణునితో అంబుదత్వాన్ని ఆరోపించటం. అందువల్ల అది రూపకాలంకారం అవుతుంది. కానీ అంబుదానికి (మేఘానికి) అలావీత్ (ఖండించింది) అనే క్రియతో అన్వయం కుదరదు. మేఘానికి ఖండించే శక్తి లేదు కాబట్టి. అది చేతన కర్తృకం కాబట్టి అచేతనమైన మేఘానికి కుదరదు. అందువల్ల ఆ ఉపమానం ఉపమేయంగా పరిణమించి క్రియతో అన్వయిస్తుంది. ఇలా పరిణమించటాన్ని పరిణమాలంకార-మంటారు. '**పరిణామః క్రియార్థశ్చేద్విషయీ విషయాత్మనా**' - (కు.21) ఈ శ్లోకంలో వ్యతిరేకాలంకారం కూడా వుంది. 'శ్రీదేవీ స్థిరవిద్యుత్' అన్నచోట శ్రీదేవి ఉపమేయం. విద్యుత్తు (మెఱుపు) ఉపమానం. మెఱుపునకు మరోపేరు చంచల/చపల అని. కానీ ఇక్కడ 'స్థిర' విశేషణ ముంది కాబట్టి ఉపమానం కన్న ఉపమేయం విశిష్టం. అందువల్ల వ్యతిరేకాలంకారం. '**వ్యతిరేకో విశేషశ్చేదుపమానోపమేయయోః**' - (కు.57)

| | | | |
|---|---|---|---|
| 2. **అలావీత్ :** | **అలావీత్** | అలావిష్టామ్ | అలవిషుః |
| | అలావీః | అలావిష్టమ్ | అలావిష్ట |
| | అలావిషమ్ | అలావిష్వ | అలావిష్మ. |

*

**శ్లో॥ ముహుః సమాకృష్య రణావనౌ రిపూన్ - కఠోరమృత్పిణ్డసమాన్ ప్రచూర్ణయన్ ।**
**హలాయుధః సన్ముసలో హ్యసాధయ-ద్యశోఙ్కురాన్ శౌర్యమనోజ్ఞబీజజాన్ ॥ 13**

**అ :** బలరాముని యుద్ధాన్ని కృషీవలుని వ్యవసాయంతో పోల్చుతూ వర్ణించటం. -వంశస్థం.

**అ :** సత్+ముసలః హల+ఆయుధః రణ+అవనౌ రిపూన్ ముహుః సమాకృష్య కఠోర-మృత్-పిండ-సమాన్ ప్రచూర్ణయన్ శౌర్య-మనోజ్ఞ-బీజ-జాన్ యశః+అంకురాన్ అసాధయత్ హి.

**ప్ర :** సత్+ముసలః : సత్ = మంచిదైన, ముసలః = రోకలి ఆయుధంగా గల (సత్ ముసలం యస్య సః), హల+ఆయుధః = హలాయుధుడు (బలరాముడు) (హలమ్ ఆయుధం యస్య సః), రణ+అవనౌ = యుద్ధభూమియందు (రణస్య అవనిః తస్యామ్), రిపూన్ = శత్రువులను, సమాకృష్య = చక్కగా లాగి, కఠోర... సమాన్ : కఠోర = కఠినమైన, మృత్-పిండ = మట్టి ముద్దలతో, సమాన్ = సమానులయిన (వారిని) (కఠోరైః మృత్పిండైః సమాః, తాన్), శౌర్య... జాన్ : శౌర్య = పరాక్రమమనే, మనోజ్ఞ = మంచి (అందమైన), బీజ = గింజలనుండి, జాన్ = పుట్టినట్టి, యశః+అంకురాన్ = కీరితి మొలకలను, అసాధయత్ హి = సాధించాడు గదా! (సాధ్ సంసిద్ధౌ ప్రేరణ ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** బలరాముడు హలాయుధుడు, ముసలాయుధుడు కూడా (హలమంటే నాగలి. ముసలమంటే రోకలి. నాగలి పొలంలో దున్నటానికి రణరంగంలో లాగటానికి ఉపయోగ పడుతుంది. రోకలి మామూలుగా దంచటానికి అవసరమైతే రణభూమిలో మోదటానికి ఉపయోగపడుతుంది.) ఆ బలరాముడు రణభూమిలో శత్రువులను (నాగలితో) లాగి, గట్టి మట్టి ముద్దల వంటివారిని చూర్ణంచేసి, శౌర్యమనే మంచిగింజలనుండి మొలిచిన కీర్తి మొలకలను సాధించాడు.

**వి :** 1. శ్లోకంలో బలరామునికీ, వ్యవసాయదారునికీ పోలిక. వ్యవసాయదారుడు నాగలితో భూమిని దున్ని, నేలను చదునుచేసి, అదునులో గింజలను నాటి మొలకలను మొలిపిస్తాడు. బలరాముడు రణభూమిలో శత్రువులను లాగి, మట్టిబెడ్డలవంటివారిని పిండిపిండిచేసి, పరాక్రమంతో కీర్తిని సాధించాడు.

| వ్యవసాయదారుడు | బలరాముడు |
|---|---|
| – నాగలితో దున్నటం | నాగలితో లాగటం |
| – మట్టిబెడ్డలను పిండిచేయటం | శత్రువులను శిథిలం చేయటం |
| – గింజలను విత్తటం | పరాక్రమాన్ని ప్రదర్శించటం |
| – మొలకలెత్తించటం | కీర్తిని పొందటం |

యశోంకుర, శౌర్యబీజ – ఈ రెండుచోట్ల రూపకాలంకారం. ఉపమానకోటిలో అవయవాలను రూపకం ద్వారా చెప్పటం జరిగింది. కానీ అవయవి అయిన కృషీవలుని చెప్పలేదు. ఈ రెండు రూపకాలద్వారా హలాయుధ, సన్ముసల శబ్దాలు బలరామునితో పాటు కృషీవలుని కూడా స్ఫురింపజేసి ఉపమాలంకారాన్ని ధ్వనింపజేస్తాయి.

| 2. **అసాధయత్ :** | **అసాధయత్** | అసాధయతామ్ | అసాధయన్ |
|---|---|---|---|
| | అసాధయః | అసాధయతమ్ | అసాధయత |
| | అసాధయమ్ | అసాధయావ | అసాధయామ. |

*

**శ్లో॥ తతశ్చైద్యః క్రుద్ధః కరధృతధనుర్మార్గణగణాన్**
**విభౌ వర్షన్ విష్ణోః ప్రశిఖవిశిఖైర్గ్లానిమగమత్ ।**
**తదా భూపాః కోపోజ్జ్వలితవదనాః కార్ముకకరాః**
**పరీయుః పాపాన్ధాః పరమపురుషం పావకమివ ॥ 14-14**

**అ :** శిశుపాలుడూ, ఇతర నరపతులూ కృష్ణుని చుట్టుముట్టడం. –శిఖరిణి.

**అ :** తతః క్రుద్ధః కర–ధృత–ధనుః చైద్యః మార్గణగణాన్ విభౌ వర్షన్ విష్ణోః ప్రశిఖవిశిఖైః గ్లానిమ్ అగమత్. తదా కోప+ఉజ్జ్వలిత–వదనాః పాప+అన్ధాః భూపాః కార్ముక–కరాః (సన్తః) పరమ–పురుషం పావకమ్ ఇవ పరీయుః

**ప్ర :** తతః = అటుతర్వాత, క్రుద్ధః = కోపించినవాడూ, కర–ధృత–ధనుః:కర = చేతియందు, ధృత = ధరింపబడిన, ధనుః = విల్లుగలవాడై (కరేణ ధృతం ధనుః యేన సః), చైద్యః = శిశుపాలుడు, మార్గణ–గణాన్ : మార్గణ = బాణాలయొక్క (కలంబ మార్గణశరాః – అమరకోశః–క్షత్ర–76), గణాన్ = సమూహాలను (మార్గణానాం గణాః తాన్), విభౌ = కృష్ణునిపై, వర్షన్ = కురుస్తూ (కురిపిస్తూ), విష్ణోః = కృష్ణునియొక్క, ప్రశిఖ–విశిఖైః : ప్రశిఖ = మంచి మొనలుగల, విశిఖైః = బాణాలచే (ప్రశిఖాశ్చ తే విశిఖాః తైః) (పృషత్క బాణవిశిఖాః–అమరకోశః–క్షత్ర–76), గ్లానిమ్ = ఖేదాన్ని (గ్లై ధాతువుకు హర్ష క్షయమని అర్థం), అగమత్ = పొందాడు. (గమ్ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), తదా = అప్పుడు, కోప... వదనాః : కోప = కోపంచేత, ఉజ్జ్వలిత = మండింపజేయబడిన, వదనాః = ముఖాలు గలవారై (కోపేన ఉజ్జ్వలితాని వదనాని యేషాం తే), పాప+అన్ధాః = పాపంచేత గ్రుడ్డివారై (పాపేన అన్ధాః), భూపాః = రాజులు (భువం పాతి ఇతి), కార్ముక–కరాః (సంతః) = విండ్లు చేతబట్టిన వారై (కార్ముకాణి కరేషు యేషాం తే), పరమ–పురుషమ్ = పరమేశ్వరుని, పావకమ్–ఇవ = అగ్నినివలె, పరీయుః = చుట్టుముట్టారు. (పరి+ఇ గతౌ–పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** బలరాముడు అలా చెలరేగుతున్నప్పుడే శిశుపాలుడు కోపంతో విల్లు చేతబట్టి కృష్ణునిపై బాణసమూహాన్ని కురిపించాడు. ప్రతిగా కృష్ణుని బాణాలతో ఖేదానికి గురయ్యాడు. అప్పుడు ఇతర రాజులు కోపంతో ముఖాలను మండింపజేస్తూ పాపంతో గ్రుడ్డివారై విండ్లు చేతబట్టి ఆ పరమపురుషుని అగ్నినివలె చుట్టుముట్టారు.

**వి :** 1. అగ్నిని చుట్టుముట్టారనటం వారి వినాశనాన్ని సూచిస్తుంది అగ్నిని చుట్టుముట్టే మిడతలను గుర్తుచేస్తూ.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **పరీయుః :** | పరీయాయ | పరీయతుః | **పరీయుః** | |
| | పరీయియథ/పరీయేథ | పరీయథుః | పరీయ | |
| | పరీయాయ/పరీయయ | పరీయివ | పరీయిమ. | * |

**శ్లో॥కృష్ణోఽపి వక్షసి ముఖే ద్విషతాం లలాటే - లగ్నైః శరైర్లసితలాఞ్ఛనచిత్రపత్రైః ।**
**స్వధ్యానకీర్తనసదూర్ధ్వలలామశూన్యాన్ - సార్థాభిధానకృత శోణితశోణగాత్రాన్ ॥15**

**అ :** కృష్ణపరాక్రమవర్ణన.

**అ :** ద్విషతాం వక్షసి ముఖే లలాటే లగ్నైః లసితలాంఛన-చిత్ర-పత్రైః శరైః కృష్ణః అపి స్వ-ధ్యాన-కీర్తన-సద్-ఊర్ధ్వ-లలామ-శూన్యాన్ శోణిత-శోణ-గాత్రాన్ సార్థ+అభిధాన్ అకృత.

**ప్ర :** ద్విషతామ్ = శత్రువులయొక్క, వక్షసి = గుండెపై, ముఖే = వదనంపై, లలాటే = నుదిటిపై, లగ్నైః = గ్రుచ్చుకొన్న, లసిత... పత్రైః : లసిత = ప్రకాశిస్తున్నవీ, లాంఛన = గుర్తుగలవీ, చిత్ర = రంగు రంగుల, పత్రైః = ఈకలు గల (లసితం లాంఛితం చిత్రం చ పత్రం ఏషాం తైః), శరైః = బాణాలతో, కృష్ణః+అపి = కృష్ణుడు కూడా, స్వ... శూన్యాన్ : స్వ = తనయొక్క, ధ్యాన = ధ్యానమూ, కీర్తన = సంకీర్తనమూ, సత్ = తగినరీతిగా, ఊర్ధ్వ-లలామ = ఊర్ధ్వపుండ్రాలు-వీటితో, శూన్యాన్ = శూన్యులైన వారిని (స్వస్య ధ్యానం కీర్తనం ఊర్ధ్వలలామ చ, తైః శూన్యాన్), శోణిత-శోణ-గాత్రాన్ : శోణిత = నెత్తుటిచే, శోణ = ఎఱ్ఱనైన, గాత్రాన్ = శరీరాలు గలవారినిగా (శోణితేన శోణాని గాత్రాణి యేషాం తాన్), సార్థ+అభిధాన్ : సార్థ = సార్థకమైన, అభిధాన్ = పేరుగలవారినిగా (సార్థాని అభిధానాని యేషాం తాన్), అకృత = చేశాడు (కృ కరణే ఆత్మనేపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు కూడా తన శత్రువుల నుదుట, గుండెలపై, ముఖంపై బాణాలు వేశాడు. అవి కృష్ణనామాంకితమైనవి. రంగురంగుల ఈకలు గలవి. ఆ బాణాలతో కృష్ణుడు తన ధ్యానం, కీర్తనం, ఊర్ధ్వపుండ్రం - వీటికి దూరమైన రాజుల శరీరాలను నెత్తుటితో ఎఱ్ఱబడచేసి వారిని సార్థకనామధేయులను చేశాడు. (రంజన గలవాడు రాజు. ఇప్పుడు రక్తరంజితుడు కాబట్టి సార్థకనామధేయత్వం)

**వి :** 1. వారి శరీరాలపై వైష్ణవచిహ్నాలు లేవు కాబట్టి స్వనామాంకిత శరాలతో గ్రుచ్చి, వారిని వైష్ణవులుగానే పరలోకానికి పంపాడు కృష్ణుడు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అకృత :** | **అకృత** | అకృషాతామ్ | అకృషత | |
| | అకృథాః | అకృషాథామ్ | అకృఢ్వమ్ | |
| | అకృషి | అకృష్వహి | అకృష్మహి | * |

**శ్లో॥ మాద్యన్తం శిశుపాలమేత్య మధుజిచ్ఛార్ఙ్గచ్యుతైః సాయకై-**
**శ్చాపచ్ఛత్రకిరీటకేతురహితం చక్రే శిశూనాం ప్రభుమ్ ।**
**రామశ్చూర్ణితవాజిసారథిరథం కృత్వా జరాసంహిత-**
**ప్రాయం మాగధమాగృహీతమపి తం వాచా ముమోచ ప్రభోః ॥ 14-16**

**అ :** కృష్ణుడు శిశుపాలుని ఓడించటం. బలరాముడు జరాసంధుని బంధించి కృష్ణాదేశం మేరకు విడిచిపెట్టడం.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** మధు-జిత్ మాద్యన్తం శిశుపాలమ్ ఏత్య శార్ఙ్గ-చ్యుతైః సాయకైః చాప-ఛత్ర-కిరీట-కేతు-రహితం శిశూనాం ప్రభుం చక్రే. రామః చూర్ణిత-వాజి-సారథి-రథం మాగధం జరా-సంహిత-ప్రాయం కృత్వా ఆగృహీతమ్ అపి తం ప్రభోః వాచా ముమోచ.

ప్ర : మధు–జిత్ = కృష్ణుడు (మధుం జితవాన్ ఇతి), మాద్యన్తమ్ = మదించివున్న, శిశుపాలమ్ = శిశుపాలుని (చైద్యుని), ఏత్య = సమీపించి (ఆ–ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శార్‌ఙ్గ–చ్యుతైః : శార్‌ఙ్గ = శార్‌ఙ్గధనుస్సునుండి, చ్యుతైః=వెలువడిన (శార్‌ఙ్గాత్ చ్యుతాః, తైః), సాయకైః = బాణాలతో, చాప...రహితమ్ : చాప = ధనుస్సు, ఛత్ర = గొడుగు, కిరీట = కిరీటం, కేతు = పతాక–ఇవి, రహితమ్ = లేనివానినిగా (చేసి) (చాపేన ఛత్రేణ కిరీటేన కేతునా చ రహితమ్), శిశూనామ్ = చిన్నపిల్లలకు, ప్రభుమ్ = అధిపతిగా, చక్రే = చేశాడు. (శిశుపాలుని శిశువుల్లో మేటిని చేశాడు) (కృ కరణే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), రామః = బలరాముడు, చూర్ణిత... రథమ్ : చూర్ణిత = పిండిచేయబడిన, వాజి = గుర్రాలు, సారథి = సారథి, రథమ్ = రథం గల (చూర్ణితాః వాజినః సారథిః రథః చ యస్య, తమ్), మాగధమ్ = మగధేశ్వరుని (జరాసంధుని) జరా–సంహిత–ప్రాయమ్ : జరా = జరచేత/ముసలితనంచే, సంహిత–ప్రాయమ్ = కలుపబడినవానినిగా/ కూడుకొన్న వానినిగా (జరయా సంహితప్రాయః, తమ్), కృత్వా = చేసి, ఆగృహీతమ్–అపి = చక్కగా పట్టుబడినా, తమ్ = ఆ జరాసంధుని, ప్రభోః = కృష్ణునియొక్క, వాచా = మాటతో, ముమోచ = విడిచిపెట్టాడు. (ముచ్ మోక్షణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు మదించివున్న శిశుపాలుని సమీపించి తన శార్‌ఙ్గ ధనుస్సునుండి వెలువడిన బాణాలతో శిశుపాలుని ధనుస్సును, గొడుగును, కిరీటాన్ని పతాకను విరిచి శిశుపాలుని కేవలం శిశువులకు ప్రభువును చేశాడు. (ఇంతలో) బలరాముడు జరాసంధుని గుఱ్ఱాలను, సారథిని, రథాన్ని చూర్ణంచేసి కేవలం జరాసంహితుడు అయిన ఆ మాగధుని పట్టుకొని కూడా కృష్ణుని ఆదేశం మేరకు వదలిపెట్టాడు.

**వి :** 1. జరాసంధుని వదలివేయటంలో ఒక ప్రయోజనాన్ని మనస్సులో పెట్టుకొన్నట్టు చెప్పి భాగవతం ఆ పనిని సహేతుకం చేసింది.

శ్లో॥ జగ్రాహ విరథం రామో జరాసంధం మహాబలమ్ ।
హతానీకావశిష్టాసుం సింహః సింహమివౌజసా ॥

శ్లో॥ బధ్యమానం హతారాతిం పాశైర్వారుణమానుషైః ।
వారయామాస గోవిందస్తేన **కార్యచికీర్షయా** ॥ – భాగవతమ్ 10/50/31–32

2. **ముమోచ : ముమోచ** ముముచతుః ముముచుః
ముముచిథ ముముచథుః ముముచ
ముమోచ/ముముచ ముముచివ ముముచిమ. *

**శ్లో॥ పునశ్చ తావతీం సేనాం సమ్పాద్య స తు దుర్మతిః ।**
**మథురాం విధురీకర్తుం పరం పారముపాగమత్ ॥ 14–17**

**అ :** జరాసంధుడు మథురపై మరల దండెత్తటం. –పథ్యావక్త్రమ్.

**అ :** దుర్మతిః సః తు పునశ్చ తావతీం సేనాం సంపాద్య మథురాం విధురీకర్తుం పరం పారమ్ ఉపాగమత్.

**ప్ర :** దుర్మతిః = దుష్టబుద్ధిగల (దుష్టా మతిః యస్య సః), సః తు = ఆ జరాసంధుడయితే (తు పదం కేవలం వాక్యాలంకారమైనా కావచ్చు నిరర్థకంగా), పునశ్చ = మరల, తావతీమ్ = అంతటి, సేనామ్ = సేనను, సంపాద్య = కూడగట్టి, మథురామ్ = మథురానగరిని, విధురీకర్తుమ్ = అనాథను చేయగోరి, పరమ్ = మరొక, పారమ్ = ఒడ్డును, ఉప+అగమత్ = సమీపించాడు. (ఉప గమ్ గతౌ పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** జరాసంధుడు దుష్టబుద్ధి. కృష్ణుడు విడిపించిన తరువాత మరలిపోయి అంతే సేనను మరలా కూడగట్టుకొని మథురను విధవలా చేయాలన్న ఆలోచనతో యమున యొక్క మరొక తీరాన్ని సమీపించాడు.

**వి :** 1. జరాసంధుడు మొదటిసారి తెచ్చిన సేన అంతసేనతోనే రెండవసారి కూడా వచ్చాడు. మొదటిసారి తెచ్చిన సేన ఇరవైమూడు అక్షౌహిణులు.

**శ్లో॥ అక్షౌహిణీభిర్వింశత్యా తిసృభిశ్చాపి సంవృతః ।**
**యదురాజధానీం మథురాం న్యరుణత్సర్వతో దిశమ్ ॥** **– భాగవతమ్ 10/50/4**

ఒక అక్షౌహిణీ పరిగణన :

| | |
|---|---|
| రథాలు : 21870 | ఏనుగులు : 21870 |
| గుఱ్ఱాలు : 65160 | పదాతులు :109350 (సైనికులు) |

ఈ జరాసంధుని సేన కౌరవపాండవులిద్దరి సేనకన్న పెద్దది. (కౌరవసేన పదకొండు అక్షహిణులు. పాండవసేన ఏడు అక్షౌహిణులు) అది 18 అక్షౌహిణులు మాత్రమే.

| 2. **ఉపాగమత్ :** | **ఉపాగమత్** | ఉపాగమతామ్ | ఉపాగమన్ |
|---|---|---|---|
| | ఉపాగమః | ఉపాగమతమ్ | ఉపాగమత |
| | ఉపాగమమ్ | ఉపాగమావ | ఉపాగమామ. |

*

**శ్లో॥ అపి పుణ్యనదీతీరముపవ్రజ్య స మాగధః ।**
**అమూముదద్గీయమానో విముగ్ధప్రకృతిర్హి సా ॥** **14-18**

**అ :** జరాసంధుడు యమునాతీరానికి చేరుట. –పథ్యావక్త్రమ్.

**అ :** సః మాగధః పుణ్య–నదీ–తీరమ్ ఉపవ్రజ్య అపి గీయమానః అమూముదత్. సా విముగ్ధ–ప్రకృతిః హి.

**ప్ర :** సః = ఆ, మాగధః = జరాసంధుడు, నదీ–తీరమ్ = (యమునా) నదీతీరానికి (నద్యాః తీరమ్), ఉపవ్రజ్య అపి = చేరికూడా (ఉపవ్రజ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), గీయమానః (సన్) = స్తుతింపబడుతూ (గై (శబ్దే) ధాతువుపై–కర్మణి–శానచ్ ప్రత్యయం), అమూముదత్ = ఆనందించారు. (ముద్ హర్షే భ్వాది–ణిచ్ పరస్మైపది–లుఙ్–(ప్ర.ఏ.), సా = అది (స్తుతులతో పొంగి పోవటం), విముగ్ధ–ప్రకృతిః హి = మూఢుల స్వభావమే గదా! (విముగ్ధానాం ప్రకృతిః)

**తా ॥** జరాసంధుడు యమునాతీరానికి సమీపించి అక్కడకూడా వందిమాగధుల పొగడ్తలతో ఆనందింపసాగాడు. అవును అజ్ఞానుల స్వభావమలాగే వుంటుంది.

**వి :** 1. సహజంగా పుణ్యక్షేత్రాలలో, పుణ్యతీర్థాలలో భక్తి తాత్త్వికచర్చలతో కాలాన్ని గడపాలని ఆశిస్తారు. ఆశిస్తే బావుంటుందని కూడా అనుకొంటారు. కానీ జరాసంధుడు యమునా–తీరంలో కూడా తనను పొగిడించుకొని ఆనందించాడు. అది అజ్ఞానప్రకృతి అని కవి అధిక్షేపణ.

| 2. **అమూముదత్ :** | **అమూముదత్** | అమూముదతామ్ | అమూముదన్ |
|---|---|---|---|
| | అమూముదః | అమూముదతమ్ | అమూముదత |
| | అమూముదమ్ | అమూముదావ | అమూముదామ. |

*

**శ్లో॥ కుహకస్య కుబుద్ధిం తామభివీక్ష్యేవ భాస్కరః ।**
**కుపితస్తద్విఘాతార్థం పరదేశమపీపదత్ ॥** **14-19**

**అ :** కథానుసంధానంతో సూర్యాస్తమయవర్ణన. –పథ్యావక్త్రమ్.

**అ :** భాస్కరః కుహకస్య (తస్య) తాం కుబుద్ధిమ్ అభివీక్ష్య కుపితః ఇవ తద్–విఘాత+అర్థం పరదేశమ్ అపీపదత్.

**ప్ర :** భాస్కరః=సూర్యుడు, కుహకస్య=వంచకుడైన జరాసంధునియొక్క (కుహకః స్యాత్కాపటికః వైజయన్తీ–నానాలింగ–23), తామ్ = ఆ, కుబుద్ధిమ్ = దుష్టబుద్ధిని (కుత్సితా చ సా బుద్ధిః, తామ్), అభివీక్ష్య = చూసి (అభి–వి+ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కుపితః ఇవ = కోపపడినట్లుగా, తద్–విఘాతార్థమ్ : తద్ = ఆ జరాసంధుని పనికి, విఘాతార్థమ్ = ఆపుదలకై (విఘ్నాన్ని కలిగించటానికి), పరదేశమ్ = మరొక ప్రాంతానికి, అపీపదత్ = వెళ్ళాడు. (పద్ విశరణగత్యవసాదనేషు–దివాది–ణిచి–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** వంచకుడైన ఆ జరాసంధుని కుబుద్ధిని గమనించి కోపంతో ఆ జరాసంధుని కృత్యాలకు విఘాతం కల్గించటానికన్నట్లుగా సూర్యుడు మేరువున కటువైపు వెళ్ళాడు.

**వి :** 1. శ్లోకంలో ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది. సూర్యుడు కోపించాడో లేదో తెలియదు. కానీ కోపించినట్లు కవి సంభావించటంవలన ఉత్ప్రేక్షాలంకారం. అయితే అది వాచ్యంగా లేదు కాబట్టి ఉత్ప్రేక్షాలంకారధ్వని.

కథాంశంతో అన్వయిస్తూ వర్ణనలు చేయటంలో కావ్యకర్తలలో బాణభట్టు మొనగాడు. అర్వాచీనకవులు ఎందరో ఆ మార్గాన్ని అనుసరిస్తూ బాణుని గౌరవించటం కావ్యాలలో కనిపిస్తుంది. ప్రకృతసూర్యాస్తమయవర్ణన కథాంశంతో ముడి పడివుంది. జరాసంధుని కుబుద్ధిని చూసి భాస్కరుడు కోపించాడనటం ద్వారా.

| | | | |
|---|---|---|---|
| 2. **అపీపదత్ :** | **అపీపదత్** | అపీపదతామ్ | అపీపదన్ |
| | అపీపదః | అపీపదతమ్ | అపీపదత |
| | అపీపదమ్ | అపీపదావ | అపీపదామ. |

*

**శ్లో॥ అథోషఃసమయే శౌరీ రథమారుహ్య నిర్యయౌ ।**
**సవితేవ సహ స్వీయైర్నిశాచరబలాన్తకః ॥ 14–20**

**అ :** తెలవారగానే కృష్ణుడు తనసేనలతో బయలుదేరటం. –పథ్యావక్త్రమ్.

**అ :** అథ నిశాచర–బల–అంతకః శౌరిః ఉషఃసమయే రథమ్ ఆరుహ్య స్వీయైః (సహ) నిశాచర–బల+అంతకః సవితా+ఇవ నిర్యయౌ.

**ప్ర :** అథ = ఆ తరువాత, నిశాచర–బల+అంతకః = రాక్షసబల నాశకుడైన (నిశాచరణాం బలం, తస్య అంతకః ), శౌరిః = కృష్ణుడు, ఉషఃసమయే = ఉషఃకాలంలోనే, రథమ్ = రథాన్ని, ఆరుహ్య = ఎక్కి (ఆ–రుహ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్వీయైః (సహ) = తనవారితో పాటు, నిశాచర–బల–అంతకః = రాత్రులలో తిరిగే వారి బలాన్ని నశింపజేసే, సవితా+ఇవ = సూర్యునివలె, నిర్యయౌ = బయలుదేరాడు. (నిర్–యా ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ తరువాత రాక్షసబలవినాశకుడైన కృష్ణుడు ఉషఃకాలంలోనే తన సేనతో పాటు నిశాచరబలాన్ని నశింపజేసే సూర్యుడిలాగా (యుద్ధానికి) బయలుదేరాడు.

**వి :** 1. '**సవితా ఇవ**' (సూర్యునివలె) – ఇది ఉపమాలంకారం. కృష్ణునికి సూర్యునితో పోలిక. పరమాత్మకు మరొకరితో పోలిక చెప్పటం అంత తేలిక కాదు. న్యూనత్వం, అధికత్వం వంటి ఉపమాదోషాలకు అవకాశముంటుంది. అందుకే సమానధర్మంగా 'నిశాచర బలాంతకత్వాన్ని' ప్రయోగించి సర్వాత్మనా ఇద్దరినీ (ఉపమానోపమేయాలను) సమానం చేశాడు కవి. ఆ సమస్తపదం అభంగశ్లేషసహకారంతో రెండర్థాలనిస్తూ ఇద్దరికీ అన్వయిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. నిర్యయౌ : | **నిర్యయౌ** | నిర్యయతుః | నిర్యయుః |
| | నిర్యయిథ/నిర్యయాథ | నిర్యయథుః | నిర్యయ |
| | నిర్యయౌ | నిర్యయివ | నిర్యయిమ. |

*

**శ్లో॥ రాజనీతిం ప్రకటయన్ రాజీవనయనస్త్రిధా ।**
**అమేయవిభవః స్వీయామయూయుజదనీకినీమ్ ॥ 14-21**

అ : కృష్ణుడు తన సేనను మూడుగా విభజించటం. -పథ్యావక్త్రమ్.

అ : అమేయ-విభవః రాజీవ-నయనః రాజనీతిం ప్రకటయన్ స్వీయామ్ అనీకినీం త్రిధా అయూయుజత్.

ప్ర : అమేయ-విభవః : అమేయ = లెక్కకందని, విభవః = సంపదగల (అమేయః విభవః యస్య సః), రాజీవ-నయనః = కమలాక్షుడు (రాజీవే ఇవ నయనే యస్య సః), రాజ-నీతిమ్ = రాజనీతిని, ప్రకటయన్ = ప్రదర్శిస్తూ (ప్ర-కట్ ధాతువుపై శతృ ప్రత్యయం), స్వీయామ్ = తనయొక్క, అనీకినీమ్ = సేనను (సేనాపృతనానీకినీ చమూః - అమర-క్షత్ర-78), త్రిధా = మూడు భాగాలుగా, అయూయుజత్ = ప్రయోగించాడు. (యుజ్ యోగే-రుధాది-ణిచి-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** అమేయసంపదగల ఆ కమలాక్షుడు (కృష్ణుడు) తన రాజనీతిజ్ఞతను ప్రకటిస్తూ తన సేనను మూడుభాగాలు చేసి ప్రయోగించాడు.

**వి :** 1. జరాసంధుని సేన ఇరవైమూడు అక్షౌహిణులు. కృష్ణుని సేన చాలా తక్కువ. కాబట్టి వ్యూహాత్మకంగా పోరాడితేనే గెలుపు సులువవుతుంది. అందుకని సేనను మూడు భాగాలుగా విభజించాడు. ఇది తొలిచర్య.

2. ఇక్కడ రాజీవనయనః అన్నది సాభిప్రాయ విశేష్యం. సూర్యుడు ఉదయిస్తున్న వేళ కాబట్టి రాజీవాలు కూడా విచ్చుకొనేవేళ. ఆ ఉదయ శోభ కృష్ణుని కళ్ళలో కనిపింపజేయటం కవి సంకల్పం. అందుకే సాభిప్రాయవిశేష్యం. ఇది పరికరాంకురాలంకారం. 'సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాంకురః' - (కు.63)

| | | | |
|---|---|---|---|
| 3. **అయూయుజత్ :** | **అయూయుజత్** | అయూయుజతామ్ | అయూయుజన్ |
| | అయూయుజః | అయూయుజతమ్ | అయూయుజత |
| | అయూయుజమ్ | అయూయుజావ | అయూయుజామ. |

*

**శ్లో॥ సూర్యేణోదయశైలమూర్ధ్ని లసతా శౌర్యోన్నతిం శ్రీపతే-**
**స్తత్పోష్యోదయమమ్బుజైర్మధుకరైస్తద్వందినాం సమ్పదమ్ ।**
**ధ్వస్తైః సన్తమసైశ్చ తామసదశాం నీడే క్వణద్భిః ఖగై -**
**ర్వేశ్మాన్తః పరవైభవం ప్రకటయన్ స స్యాన్ముహూర్తో ముదే ॥ 14-22**

అ : సూర్యోదయవర్ణనం. -శార్దూలవిక్రీడితమ్.

అ : ఉదయ-శైల-మూర్ధ్ని లసతా సూర్యేణ శ్రీపతేః శౌర్య+ఉన్నతిమ్ అంబుజైః తత్-పోష్య+ఉదయం మధుకరైః తద్-వందినాం సంపదం ధ్వస్తైః సంతమసైః తామస-దశాం నీడే క్వణద్భిః ఖగైః వేశ్మ+అంతః పర-వైభవం చ ప్రకటయన్ సః ముహూర్తః ముదే స్యాత్.

ప్ర : ఉదయ-శైల-మూర్ధ్ని : ఉదయ-శైల = ఉదయపర్వతంయొక్క, మూర్ధ్ని = తలపై (శిఖరభాగాన) (ఉదయాఖ్యః శైలః, తస్య మూర్ధా, తస్మిన్), లసతా = ప్రకాశిస్తున్న, సూర్యేణ = సూర్యుని ద్వారా, శ్రీ-పతేః = లక్ష్మీకాంతునియొక్క (శ్రియః పతిః తస్య), శౌర్య+ఉన్నతిమ్ : శౌర్య=పరాక్రమంయొక్క, ఉన్నతిమ్ = అభ్యుదయాన్ని (శౌర్యస్య ఉన్నతిః

తామ్), అంబుజైః = తామరల ద్వారా, తత్–పోష్య+ఉదయమ్ : తత్ = ఆ కృష్ణుని యొక్క, పోష్య = పోష్యులయొక్క (పోషింపదగిన వారు పోష్యులు–బంధుమిత్రసేవకాదులు), ఉదయమ్ = అభివృద్ధినీ (తేన పోష్యాః, తేషామ్ ఉదయః , తమ్), మధు–కరైః = తుమ్మెదలచే, తద్–వందినామ్ : తత్ = ఆ కృష్ణునియొక్క, వందినామ్ = స్తోత్రపాఠకులయొక్క (తస్య వందినః, తేషామ్), సంపదమ్ = సంపదను, ధ్వస్తైః = నశింపజేయబడిన, సంతమసైః = చీకట్లచే, తామస–దశామ్ : తామస = తమోగుణంగల వారియొక్క, దశామ్ = స్థితిని (తామసానాం దశా, తామ్) (చీకట్లు తాము నశిస్తూ, నశింపబోయే జరాసంధసేనను సూచిస్తున్నాయి), నీడే = గూటిలో, క్వణద్భిః = కూస్తున్న, ఖగైః = పక్షులచే, వేశ్మ+అంతః = గుడారంలోని, పర–వైభవమ్ చ = శత్రుసంపత్తిని కూడా (వేశ్మనః అంతః, తత్ర పరేషాం వైభవమ్), ప్రకటయన్ = ప్రకటిస్తూ, సః = ఆ, ముహూర్తః = (సూర్యోదయ) ముహూర్తం, ముదే = ఆనందంకోసం, స్యాత్ = నిలుచుగాత (అస భువి పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ సూర్యోదయముహూర్తం ఉదయాద్రిశిఖరంపై నున్న సూర్యుని ద్వారా లక్ష్మీకాంతుని శౌర్యోన్నతినీ, తామరల ద్వారా ఆయనచే పోషింపబడేవారి అభ్యుదయాన్నీ, తుమ్మెదల ద్వారా ఆయనను పొగిడేవారి (వాక్) సంపత్తినీ, నశిస్తున్న చీకట్లద్వారా తామసులు పొందబోయే పరిస్థితినీ, గూళ్ళలో కూస్తున్న పక్షులద్వారా శత్రువుల గుడారంలో నున్న వారి సేనావైభవాన్ని ప్రకటిస్తూ ఆనందహేతువగు గాక!

**వి :** 1. **స్యాత్ :**

| | | |
|---|---|---|
| **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| స్యాః | స్యాతమ్ | స్యాత |
| స్యామ్ | స్యావ | స్యామ. |

*

**శ్లో॥ త్రిషు స్థానేషు విస్తీర్ణా మధుసూదనవాహినీ ।**
**త్రిపదీ వేదమాతేవ రిపుసేనామహన్ క్షణాత్ ॥ 14–23**

**అ :** కృష్ణసేన జరాసంధసేనను సంహరించటం –పథ్యావక్త్రమ్.

**అ :** త్రిషు స్థానేషు విస్తీర్ణా మధుసూదన–వాహినీ త్రిపదీ వేదమాతా+ఇవ రిపు–సేనాం క్షణాత్ అహన్.

**ప్ర :** త్రిషు–స్థానేషు = మూడు తావులలో, విస్తీర్ణా = వ్యాపించిన, మధుసూదన–వాహినీ = కృష్ణసేన (మధుసూదనస్య వాహినీ), త్రిపదీ (దా) = మూడు పాదాలుగల (త్రయః పాదాః యస్యాం సా), వేదమాతా+ఇవ=గాయత్రివలె, రిపు–సేనామ్ = శత్రుసేనను (రిపోః సేనా, తామ్), అహన్ = సంహరించింది. (హన్ హింసాగత్యోః–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** మూడుగా విభజింపబడి మూడువైపుల వ్యాపించిన కృష్ణసేన త్రిపద అయిన గాయత్రిలాగా శత్రుసేనను క్షణంలో సంహరించింది.

**వి :** 1. గాయత్రి ఆవాహనం–

శ్లో॥ ఆయాతు వరదా దేవ్యక్షరం బ్రహ్మసమ్మితమ్ ।
గాయత్రీం **ఛందసాం మాతేదం** బ్రహ్మజుషస్వ నః ॥

అంటూ వేదమాతగానే గాయత్రి ఆవాహన చేస్తాం.

20వ శ్లోకంలో కృష్ణునికీ, సూర్యునికీ పోలిక. ఇక్కడ కృష్ణసేనకూ, సూర్యసేన అయిన గాయత్రికీ పోలిక. ఉపమాలంకారం.

2. **అహన్ :**

| | | |
|---|---|---|
| **అహన్** | అహతామ్ | అఘ్నన్ |
| అహన్ | అహతమ్ | అహత |
| అహనమ్ | అహన్వ | అహన్మ. |

*

**శ్లో॥ అమూముచన్ శరవ్రాతమమతేషు హరేర్భటాః ।**
**ఖలేషు త్రిదశాధీశా జ్వలత్తాపత్రయం యథా ॥ 14-24**

**అ :** కృష్ణసేన జరాసంధసేనపై బాణాలు వేయటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యథా త్రిదశ+అధీశాః ఖలేషు జ్వలత్-తాప-త్రయం (తథా) హరేః భటాః అమతేషు శర-వ్రాతమ్ అమూముచన్.

**ప్ర :** యథా = ఏ రీతిగా, త్రిదశ+అధీశాః = దేవాధినాథులు (త్రిదశానామ్ అధీశాః), ఖలేషు = చెడ్డవారిపై, జ్వలత్-తాప-త్రయమ్ : జ్వలత్ = మండుతున్న, తాప-త్రయమ్ = త్రివిధ తాపాలను (ఆధిభౌతిక-ఆధిదైవిక-ఆధ్యాత్మిక తాపాలు) (ప్రసరింపజేస్తారో), (తథా = ఆ రీతిగా), హరేః = కృష్ణునియొక్క, భటాః = సైనికులు, అమతేషు = శత్రువులపై, శర-వ్రాతమ్ = బాణసమూహాన్ని (శరాణాం వ్రాతః, తమ్), అమూముచన్ = విడిచారు. (ప్రయోగించారు) (ముచ్ మోక్షణే-ణిచి-పరస్మైపది-లుఙ్-ప్ర.బ.)

**తా ॥** దేవతలు చెడ్డవారిపై తాపత్రయాన్ని ప్రయోగించినట్లు (తాపత్రయానికి వారిని గురిచేసినట్లు) కృష్ణభటులు తమ శత్రువులపై బాణసమూహాన్ని ప్రయోగించారు.

**వి :** 1. దేవతలు ఆగ్రహమైనా, అనుగ్రహమైనా మన ఆలోచనలను మాధ్యమంగా చేసికొని ప్రదర్శిస్తారు.

| | | | |
|---|---|---|---|
| 2. **అమూముచన్ :** | అమూముచత్ | అమూముచతామ్ | **అమూముచన్** |
| | అమూముచః | అమూముచతమ్ | అమూముచత |
| | అమూముచమ్ | అమూముచావ | అమూముచామ. |

*

**శ్లో॥ ప్రమత్తా ధ్వజినీ శత్రోర్యమునాతీరగాఽప్యభూత్ ।**
**అసతాం పుణ్యసరిదప్యనిష్టస్య హి కారణమ్ ॥ 14-25**

**అ :** కృష్ణశత్రుసేనయొక్క ప్రమత్తతావర్ణన. -పథ్యావక్త్రమ్.

**అ :** శత్రోః ధ్వజినీ యమునా-తీర-గా అపి ప్రమత్తా అభూత్. హి. పుణ్య-సరిత్+అపి అసతామ్ అనిష్టస్య కారణమ్.

**ప్ర :** శత్రోః = కృష్ణుని శత్రువైన జరాసంధునియొక్క, ధ్వజినీ = సేన (ధ్వజినీ చ వరూథినీ -అమరకోశః-క్షత్రియ-55), యమునా-తీర-గా అపి = యమునాతీరంచేరిన దయినా, ప్రమత్తా = మత్తెక్కినదిగానే, అభూత్ = ఉంది. (భూ సత్తాయామ్ లుఙ్-(ప్ర.ఏ.), హి = అంతేగదా!, పుణ్య-సరిత్-అపి = పుణ్యనదికూడా, అసతామ్ = చెడ్డవారికి, అనిష్టస్య = అనిష్టానికే (ఇష్టం లేని వానిని పొందటానికే), కారణమ్ = హేతువు (అవుతుంది).

**తా ॥** జరాసంధసేన యమునాతీరం చేరినా ఇంకా మత్తులోనే వుంది. అంతేమరి. పుణ్యనది అయినా చెడ్డవారికి అనిష్టహేతువే అవుతుంది.

**వి :** 1. **శ్లో॥ అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి ।**
**పుణ్యక్షేత్రే కృతం పాపం వజ్రలేపో భవిష్యతి ॥**

ఇతర ప్రదేశాలలో పాపం చేస్తే పుణ్యక్షేత్రంలో (నివసన దర్శనాదుల ద్వారా) నశిస్తుంది. పుణ్యక్షేత్రంలోనే పాపంచేస్తే అది వజ్రపుపూతగా ఎప్పటికీ పోదు.

2. శ్లోకంలోని పూర్వార్ధంలోని విశేషాంశాన్ని, ఉత్తరార్ధంలోని సామాన్యాంశం సమర్థిస్తోంది కాబట్టి అర్థాంతర న్యాసాలంకారం. 'ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః' - (కు.122)

3. **అభూత్ :** 14-9వ శ్లోక వ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ శరైరపారైస్తత్సైన్యం చతురఙ్గం స పూరయన్ ।**
**మమేషువారిధేర్నాలం తవ సేనేతి శంసతి ॥ 14-26**

**అ :** కృష్ణుడు జరాసంధసేనలను బాణాలలో ముంచివేయటం. -పథ్యావక్త్రమ్.

**అ :** అపారైః శరైః చతుః+అంగం తత్-సైన్యం పూరయన్ సః మమ ఇషు-వారిధేః తవ సేనా న అలమ్ ఇతి శంసతి.

**ప్ర :** అపారైః = అంతులేని, శరైః = బాణాలతో, చతుః+అంగమ్ = నాలుగు అంగాలుగల (రథాలు, ఏనుగులు, గుర్రాలు, కాల్బలం), తత్-సైన్యమ్ = ఆ జరాసంధసైన్యాన్ని, పూరయన్ = నింపుతూ, సః = ఆ కృష్ణుడు, మమ = నా యొక్క, ఇషు-వారిధేః = బాణసముద్రానికి (ఇషవః ఏవ వారిధిః తస్య), తవ = నీయొక్క, సేనా = సైన్యం, న అలమ్ = చాలదు, ఇతి = అని, శంసతి = చెప్తోంది. (శంస్ స్తుతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు అంతులేని తన బాణాలను ప్రయోగించి జరాసంధుని చతురంగసేననూ నింపి, నా బాణసముద్రాన్ని తరించటానికి నీ సేనకు శక్తిలేదు అని ప్రకటించాడు.

**వి :** 1. వామనావతారంలో రెండడుగులతోనే భూమ్యాకాశాలను ఆక్రమించిన నారాయణు-నకు కృష్ణావతారంలో జరాసంధుని ఇరవైమూడు అక్షౌహిణుల సేనను తన బాణాలతో ముంచెత్తటం అసాధ్యమేమీ కాదు గదా! అలా సంకల్పిస్తే

'**సహస్రశీర్షా పురుషః । సహస్రాక్షః సహస్రపాత్**' అని పురుషసూక్తం, ఆ భావాన్నే అనువదిస్తూ గీతకూడా ఇలా వర్ణించింది.

శ్లో॥ సర్వతః పాణిపాదం తత్ సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వత్ర శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి ॥ - భగవద్గీత - 13/14

| | | | |
|---|---|---|---|
| 2. **శంసతి :** | **శంసతి** | శంసతః | శంసన్తి |
| | శంససి | శంసథః | శంసథ |
| | శంసామి | శంసావః | శంసామః. * |

**శ్లో॥ శార్ఙ్గం బిభ్రన్నిషఙ్గాన్నిశితశరచయానాదదానో ముహుర్జ్యా-**
**మాకర్ణాన్తం వికర్షన్ ప్రబలరిపువపుః పూరయన్ మార్గణౌఘైః ।**
**అన్యాతఙ్కం స్వశఙ్ఖం రణధురి రణయన్నఙ్ఘ్రిమూలే నతానాం**
**తన్వన్ దోష్ణాఽభయం చ ప్రథయతి మురజిద్విశ్వతః పాణితాం స్వామ్ ॥14-27**

**అ :** కృష్ణుడు తన విశ్వతః పాణిత్వాన్ని ప్రదర్శిస్తూ పోరాడుట. -స్రగ్ధర.

**అ :** రణ-ధురి దోష్ణా శార్ఙ్గం బిభ్రన్ నిషంగాద్ నిశిత-శర-చయాన్ ఆదదానః ముహుః జ్యామ్ ఆకర్ణాంతం వికర్షన్ మార్గణ+ఓఘైః ప్రబల-రిపు-వపుః పూరయన్ అన్య+ఆతంకం స్వ-శంఖం రణయన్ అంఘ్రి-మూలే నతానామ్ అభయం తన్వన్ చ ముర-జిత్ స్వాం విశ్వతః-పాణితాం ప్రథయతి.

**ప్ర :** రణ-ధురి = రణభూమిలో (రణస్య ధూః తస్యామ్), దోష్ణా = చేతితో, శార్ఙ్గమ్ = శార్ఙ్గధనుస్సును, బిభ్రన్ = ధరిస్తూ, నిషంగాత్ = అమ్ములపొదినుండి, నిశిత-శర-చయాన్ : నిశిత=వాడి అయిన, శర =

బాణాలయొక్క, చయాన్ = సమూహాలను (నిశితాశ్చ తే శరాః, తేషాం చయాః, తాన్), ఆదదానః = తీసికొంటూ, ముహుః = మాటిమాటికీ, జ్యామ్ = అల్లెత్రాటిని, ఆకర్ణ+అంతమ్ = చెవి చివరివరకు, వికర్షన్ = లాగుతూ, మార్గణ+ఓఘైః : మార్గణః = బాణాలయొక్క, ఓఘైః = సమూహాలతో, ప్రబల-రిపు-వపుః : ప్రబల = సత్తువగల, రిపు = శత్రువుయొక్క, వపుః = శరీరాన్ని (ప్రబలశ్చ అసౌ రిపుః, తస్య వపుః), పూరయన్ = నింపుతూ, అన్య+ఆతంకమ్ : అన్య = ఇతరులకు, ఆతంకమ్ = భయాన్ని కలిగించే (అన్యేషామ్ ఆతంకః యస్మాత్, తమ్) (ఆతంకం సంజ్వరే రోగే సాధ్వసే మురజధ్వనౌ-నానార్థరత్నమాలా-1210), స్వ-శంఖమ్ = తన శంఖాన్ని (పాంచజన్యాన్ని), రణయన్ = ఊదుతూ, అంఘ్రి-మూలే = పాదాల చెంత (అంఘ్ర్యోః మూలే), నతానామ్ = వంగిన (లొంగిన) వారికి, అభయమ్ = అభయాన్ని, తన్వన్ = కల్గిస్తూ, ముర-జిత్ = కృష్ణుడు (మురం జితవాన్ ఇతి), స్వామ్ = తనయొక్క, విశ్వతః-పాణితామ్ = అంతటా చేతులు కలిగి వుండటాన్ని (విశ్వతః పాణయః యస్య, తస్య భావః, తామ్), ప్రథయతి = ప్రకటిస్తున్నాడు. (ప్రథ ప్రఖ్యానే-చురాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు రణభూమిలో తన విశ్వతః పాణిత్వాన్ని ప్రకటిస్తున్నాడు. ఎలా అంటే చేతితో చాపాన్ని పట్టి వున్నాడు. చేతితో అమ్ములపొది నుండి బాణసమూహాలను తీస్తున్నాడు. మాటిమాటికీ వింటి అల్లెత్రాటిని చెవిదాకా లాగుతున్నాడు. శత్రువు శరీరాన్ని బాణసమూహాలతో ముంచెత్తుతున్నాడు. శత్రువులకు భయాన్ని కల్గించే తన శంఖాన్ని ఊదుతున్నాడు. పాదాలచెంత చేరిన వారికి చేతితో అభయమిస్తున్నాడు.

**వి :** 1. శ్లో॥ విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖో - **విశ్వతోబాహురుత** విశ్వతస్పాత్।
సంబాహుభ్యాం ధమతి సంపతత్రై - ర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః ॥

- ఋగ్వేదసంహితా 10/81/3

ఈ శ్రుతివచనం పరమపురుషుని విశ్వతోబాహుత్వాన్ని వర్ణిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రథయతి :** | **ప్రథయతి** | ప్రథయతః | ప్రథయన్తి |
| | ప్రథయసి | ప్రథయథః | ప్రథయథ |
| | ప్రథయామి | ప్రథయావః | ప్రథయామః. |

*

**శ్లో॥ యే సన్ధ్యాసమయేఽపి భాస్వదుదయే నిద్రాం ద్విషోఽచీకరం**
**స్తేభ్యోఽదీదిశదచ్యుతః శుభకృతేః సాక్షీ సుదీర్ఘాం హి తామ్ ।**
**యైరీక్షా న కృతా రవేః కుమతిభిస్తేషాం దృశోఽమీలయత్**
**యే శుద్ధామ్బుని నో మమజ్జురహితాంస్తాంశ్శోణితేఽమజ్జయత్ ॥ 14-28**

అ : కృష్ణుడు సూర్యోదయాన్ని మన్నించని శత్రువులను శిక్షించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యే ద్విషః భాస్వద్-ఉదయే సంధ్యా-సమయే అపి నిద్రామ్ అచీకరన్ తేభ్యః శుభ-కృతేః సాక్షీ అచ్యుతః సుదీర్ఘాం తామ్ అదీదిశత్ హి. యైః కుమతిభిః రవేః ఈక్షా న కృతా తేషాం దృశః అమీలయత్. యే శుద్ధ+అంబుని న మమజ్జుః తాన్ అహితాన్ శోణితే అమజ్జయత్.

**ప్ర :** యే ద్విషః = ఏ శత్రువులు, భాస్వద్-ఉదయే = సూర్యుడుదయించిన (భాస్వతః ఉదయః యస్మిన్ తస్మిన్), సంధ్యా-సమయే+అపి = ప్రాతస్సంధ్యవేళ కూడా, నిద్రామ్ = నిదురనే, అచీకరన్ = పొందారో (కృ కరణే ణిచ్-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), తేభ్యః = వారికి, శుభ-కృతేః = శుభకర్మకు (శుభా చ సా కృతిః, తస్యాః), సాక్షీ = సాక్షి అయిన, అచ్యుతః = కృష్ణుడు, సుదీర్ఘామ్ = బాగా పొడవైన (సుదీర్ఘమైన), తామ్ = ఆ నిద్రనే (సుదీర్ఘనిద్ర

అంటే మరణం), అదీదిశత్ హి = ఇచ్చాడు గదా! (దిశ అతిసర్జనే-ణిచ్-పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), కుమతిభిః = దుర్బుద్ధులైన (కుత్సితాః మతయః యేషాం తైః), యైః = ఎవరిచే, రవేః = సూర్యునియొక్క ఈక్షా = దర్శనం, న కృతా = చేయబడలేదో, తేషామ్ = వారియొక్క దృశః = కన్నులను, అమీలయత్ = మూసివేయించాడు. (మీల్ నిమేషణే-ణిచ్-పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), యే = ఎవరయితే, శుద్ధ+అంబుని = నిర్మలమైన నీటిలో (శుద్ధం చ తత్ అంబు, తస్మిన్), నో మమజ్జుః= మునగలేదో (మజ్జ్ శుద్ధౌ-పరస్మైపది-లిట్-(ప్ర.బ.), తాన్ = ఆ, అహితాన్ = శత్రువులను, శోణితే = నెత్తుటిలో, అమజ్జయత్ = ముంచెను. (మజ్జ్-శుద్ధౌ-ణిచ్-పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** సూర్యుడు ఉదయించిన తరువాత ఆ ప్రాతస్సంధ్యాకాలంలో నిద్రనే ఆశ్రయించివున్న శత్రువులకు, శుభకర్మసాక్షి అయిన కృష్ణుడు దీర్ఘనిద్రనే అందించాడు. సూర్యుని చూడని దుష్టబుద్ధుల కళ్ళు మూయించాడు. శుద్ధజలంలో మునగని (తలారా స్నానంచేయని) శత్రువులను నెత్తుటిలో ముంచివేశాడు.

**వి :** 1. శత్రుసంహారానికి తనమీద వారు దండెత్తటం కారణం. అయినా అప్పటికప్పుడు ఏర్పడిన మరొక కారణాన్ని కూడా సూచిస్తున్నాడు కవి. తాను చేస్తున్న దాడికన్న విహితకర్మలను పాటించకపోవటాన్ని శిక్షార్హమైన పనిగా కృష్ణుడు భావించినట్లు కవి భావన.

2. నిదురలోనే వున్న వారికి దీర్ఘనిద్రాసిద్ధికి, సూర్యుని చూడని వారి కళ్ళకు ఏదీ కనిపించకుండా చేయటం, నీటిలో మునగటానికి ఇష్టంలేని వారికి నెత్తుటిలో మునిగే అవకాశ మివ్వటం సమాలంకారం. కారణానికి తగిన కార్యం సిద్ధించటం. '**సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః**' (కు.92)

3. **అచీకరన్ :** అచీకరత్ అచీకరతామ్ **అచీకరన్**

| | | | |
|---|---|---|---|
| | అచీకరః | అచీకరతమ్ | అచీకరత |
| | అచీకరవమ్ | అచీకుర్వ | అచీకుర్మ |
| **అదీదిశత్ :** | **అదీదిశత్** | అదీదిశతామ్ | అదీదిశన్ |
| | అదీదిశః | అదీదిశతమ్ | అదీదిశత |
| | అదీదిశమ్ | అదీదిశావ | అదీదిశామ |
| **అమీలయత్ :** | **అమీలయత్** | అమీలయతామ్ | అమీలయన్ |
| | అమీలయః | అమీలయతమ్ | అమీలయత |
| | అమీలయమ్ | అమీలయావ | అమీలయామ |
| **మమజ్జుః :** | మమజ్జ | మమజ్జతుః | **మమజ్జుః** |
| | మమజ్జిథ/మమంక్థ | మమజథుః | మమజ్జ |
| | మమజ్జ | మమజ్జివ | మమజ్జిమ |
| **అమజ్జయత్:** | **అమజ్జయత్** | అమజ్జయతామ్ | అమజ్జయన్ |
| | అమజ్జయః | అమజ్జయతమ్ | అమజ్జయత |
| | అమజ్జయమ్ | అమజ్జయావ | అమజ్జయామ. |

*

**శ్లో॥ పాదాబ్జే స్వమనీనమన్ కతిపయే మూర్ధానమాత్మేశితుః**
**శార్ఙ్గాన్ముక్తశరైర్విశీర్ణతనవః కేఽప్యాత్మనోఽమీమరన్ ।**
**అన్యే కేఽపి హరిం జరాసుతమపి త్యక్త్వా తతో దుద్రువు-**
**ర్జీవానాం త్రితయేన సఞ్చితదశాం సన్దర్శయన్తో యుధి ॥ 14-29**

**అ :** జరాసంధసైనికులు జీవుల త్రివిధదశలనూ సూచిస్తూ ప్రవర్తించటం కృష్ణుని విషయంలో. -శార్దూలం.

**అ :** యుధి జీవానాం త్రితయేన సంచితదశాం సందర్శయన్తః కతిపయే ఆత్మ+ఈశితుః పాద+అబ్జే స్వం మూర్ధానమ్ అనీనమన్. కే. అపి శార్ఙ్గాత్ ముక్త-శరైః విశీర్ణ-తనవః ఆత్మనః అమీమరన్. అన్యే కే అపి హరిం జరాసుతమ్ అపి త్యక్త్వా తతః దుద్రువుః.

**ప్ర :** యుధి=రణరంగంలో, జీవానామ్ = జీవులయొక్క, త్రితయేన = ముప్పేటతో (ఉత్తములు - మధ్యములు - అధములు అనే త్రయంచేత), సంచిత-దశామ్ = ప్రోదిచేసికొన్న స్థితిని (సంచితా చ సా దశా, తామ్), సందర్శయన్తః = చూపుతూ; 1. కతిపయే = కొందరు ఆత్మ+ఈశితుః = తమ ప్రభువయిన కృష్ణునియొక్క (ఆత్మనామ్ ఈశితా, తస్య), పాద+అబ్జే = చరణకమలంపై, స్వమ్ = తమయొక్క, మూర్ధానమ్ = తలను, అనీనమన్ = వంచారు. (నమ్ ప్రహ్వీభావే శబ్దే చ - ణిచ్-పరస్మైపది-లుఙ్-ప్ర.బ.), 2. కే+అపి = కొందరు, శార్ఙ్గాత్ = శార్ఙ్గధనుస్సునుండి, ముక్త-శరైః = విడువబడిన బాణాలచే (ముక్తాశ్చ తే శరాః తైః), విశీర్ణ-తనవః (సంతః) : విశీర్ణ = శిథిలమైన, తనవః (సంతః) = శరీరాలుగలవారై (విశీర్ణాః తనవః యేషాం తే), ఆత్మనః = తమంతగా, స్వాన్ = తమను, అమీమరన్ = చంపుకొనిరి. (మృఙ్-ప్రాణత్యాగే-ణిచ్-పరస్మైపది-లుఙ్-ప్ర.బ.), 3. అన్యే-కే+అపి = మరికొందరు, హరిమ్ = కృష్ణునీ, జరాసుతమ్ అపి = జరాసంధునీ కూడా, త్యక్త్వా = విడిచి, తతః = అక్కడ (రణభూమి) నుండి, దుద్రువుః = పారిపొయ్యారు. (ద్రు గతౌ పరస్మైపది-లిట్-ప్ర.బ.),

**తా ॥** రణరంగంలో జరాసంధుని సైనికులు జీవులు ఉత్తమ-మధ్యమ-అధమ రూపంగా తాము సంపాదించుకొన్న దశలను సూచిస్తూ 1. కొందరు జీవులు తమ ప్రభువయిన కృష్ణుని చరణకమలాలపై తలవంచారు. 2. కొందరు శార్ఙ్గం నుండి వెలువడిన బాణాలతో శరీరాలు శిథిలం కాగా తమను తామే చంపుకొన్నారు. 3. మరికొందరు కృష్ణునీ, జరాసంధునీ కూడా విడిచి రణరంగంనుండి పారిపొయ్యారు.

**వి :** 1. భగవద్గీతలోని గుణత్రయవిభాగయోగం (14వ అధ్యాయం), శ్రద్ధాత్రయవిభాగ-యోగం (17వ అధ్యాయం) జీవులలోని ఈ భేదాలను త్రివిధంగానే ప్రకటిస్తాయి. దాదాపుగా నిత్యజీవితాలలోని ఏ విభాగాలనయినా ప్రధానంగా మూడురకాలుగానే చూపించే ప్రయత్నం చేస్తాం. తరతమభేదాలు చూపవలసినప్పుడు. వ్యాకరణంలో కూడా తరప్, తమప్ ప్రత్యయాలు మాత్రమే కనిపిస్తాయి స్థాయీ భేదాన్ని చూపవలసివస్తే.

శ్రద్ధ-శ్లో॥ త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా ।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు ॥ - భగవద్గీత - 17/2

ఆయా శ్రద్ధలను బట్టి లభించే స్థానాలు-

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా - మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా - అధో గచ్ఛన్తి తామసాః ॥ - భగవద్గీత - 14/18

సాత్త్వికులకు ఊర్ధ్వగతి. రాజసులకు మధ్యస్థితి. తామసులకు అధోగతి.

| | | | |
|---|---|---|---|
| 2. **అనీనమన్ :** | అనీనమత్ | అనీనమతామ్ | **అనీనమన్** |
| | అనీనమః | అనీనమతమ్ | అనీనమత |
| | అనీనమమ్ | అనీనమావ | అనీనమామ |
| **అమీమరన్ :** | అమీమరత్ | అమీమరతామ్ | **అమీమరన్** |
| | అమీమరః | అమీమరతమ్ | అమీమరత |
| | అమీమరమ్ | అమీమరావ | అమీమరామ |

| | | | | |
|---|---|---|---|---|
| **దుద్రువుః :** | దుద్రావ | దుద్రువతుః | **దుద్రువుః** | |
| | దుద్రోథ | దుద్రువథుః | దుద్ర | |
| | దుద్రావ/దుద్రవ | దుద్రువ | దుద్రుమ. | * |

**శ్లో॥ యో మాగధస్య సాధర్మ్య - మాపన్నానపి నావధీత్ ।**
**స మాగధవధం హీనం - మేనే వీరశిరోమణిః ॥ 14-30**

**అ :** కృష్ణుడు మాగధవధను హీనంగా భావించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** యః వీర-శిరోమణి మాగధస్య సాధర్మ్యమ్ ఆపన్నాన్ అపి న అవధీత్ సః మాగధ-వధం హీనం మేనే.

**ప్ర :** యః = ఏ, వీర-శిరోమణిః = వీరశ్రేష్ఠుడైన కృష్ణుడు, మాగధస్య = జరాసంధుని/స్తుతిపాఠకునియొక్క (వందీ తు స్తుతిపాఠకః మాగధో మధుకః - వైజయన్తీ-భూమి-59,60), సాధర్మ్యమ్ = పోలికను, సమానత్వాన్ని, ఆపన్నాన్ = పొందినవారిని కూడా, న అవధీత్ = చంపలేదో (హన హింసాగత్యోః-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, మాగధ-వధమ్ = జరాసంధవధను, హీనమ్ = చిన్నతనంగా (అగౌరవంగా), మేనే = భావించాడు. (మన్ జ్ఞానే దివాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** మాగధుడంటే జరాసంధుడు. స్తోత్రాలు చేసే (వంది)మాగధుడు కూడా. స్తుతిపాఠకులలాగా (మాగధులలాగా) స్తోత్రం చేసే వాళ్ళనే కృష్ణుడు చంపలేదు. స్తుతిస్తున్నారు కాబట్టి. ఆ స్థితిలో సాక్షాత్తూ మాగధుని (జరాసంధుని) చంపటం అపకీర్తికరమని భావించాడు కృష్ణుడు, తాను వీరశిరోమణి కదా!

**వి :** 1. మాగధులతో సాధర్మ్యమున్న వాళ్ళనే చంపనివాడు మాగధుని ఎలా చంపుతాడు? అని చెప్పటంలో ఇక్కడ కావ్యార్థాపత్త్యాలంకారం. '**కైముత్యేనార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తిరిష్యతే**' - (కు.120). ఆ అర్థాపత్తిసిద్ధికి మాగధపదంపై శ్లేషాలంకారం సహకరిస్తుంది. మాగధపదానికి అభంగంగానే రెండర్థాల నివ్వటం ద్వారా.

2. శ్లో॥న శక్యోఽసౌ రణే జేతుం సర్వైరపి సురాసురైః ।
బాహుయుద్ధేన జేతవ్యః స ఇత్యుపలభామహే ॥

శ్లో॥మయి **నీతిర్బలం** భీమే **రక్షితా** చావయోర్జయః ।
మాగధం సాధయిష్యామ ఇష్టిం త్రయ ఇవాగ్నయః ॥ -మహాభారతమ్-సభా.20/2,3

జరాసంధుని చంపాలంటే బాహుయుద్ధమే అవసరం. అందుకే కృష్ణుడు రాజనీతిపరంగా ఆలోచించి అప్పటికి జరాసందుని విడిచిపెట్టాడు. ధర్మజుని రాజసూయానికి ముందు భీమునిచేత ఆ జరాసంధుని చంపించటానికి సన్నాహాలు చేస్తూ ధర్మరాజుతో పలికిన మాటలు సభాపర్వంలోని శ్లోకాలు.

ఎప్పుడు ఎలా ఎదుర్కొనాలో నిర్ణయించటానికి రాజనీతి. ప్రత్యక్షంగా పోరాడటానికి బాహుబలం. ఒకవేళ సేనలు ఎదిరిస్తే వారినుండి కాపాడటానికి రక్షణం. ఈ మూడింటి రూపాలు కృష్ణ-భీమ-అర్జునులు.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అవధీత్ :** | **అవధీత్** | అవధిష్టామ్ | అవధిషుః | |
| | అవధీః | అవధిష్టమ్ | అవధిష్ట | |
| | అవధిషమ్ | అవధిష్వ | అవధిష్మ. | |
| **మేనే :** | **మేనే** | మేనాతే | మేనిరే | |
| | మేనిషే | మేనాథే | మేనిధ్వే | |
| | మేనే | మేనివహే | మేనిమహే. | * |

**శ్లో॥ స ఇత్థమాజౌ బహువారమేనం - విజిత్య బార్హద్రథముగ్రసేనమ్ ।**
**పురం హిరణ్యామలరత్నచిత్ర-మరిన్దమోఽచీకరదబ్ధిమధ్యే ॥ 14-31**

**అ :** జరాసంధుని ఓడించి కూడా కృష్ణుడు సముద్రమధ్యంలో నగరాన్ని నిర్మించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇత్థమ్ అరిందమః సః ఆజౌ ఉగ్రసేనం బార్హద్రథం బహువారం విజిత్య అబ్ధి-మధ్యే హిరణ్య+అమల-రత్న-చిత్రం పురమ్ అచీకరత్.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, అరిందమః సః = శత్రువుల నణచగల ఆ కృష్ణుడు, ఆజౌ = యుద్ధంలో, ఉగ్ర-సేనమ్ = భీకరమైన సేనగల (ఉగ్రా సేనా యస్య, తమ్), బార్హద్రథమ్ = జరాసంధుని, బహువారమ్ = చాలాసార్లు, విజిత్య = ఓడించి, అబ్ధి-మధ్యే = సముద్రమధ్యంలో (అబ్ధేః మధ్యః, తస్మిన్), హిరణ్య... చిత్రమ్ : హిరణ్య = బంగారుతో, అమల = నిర్మలమైన, రత్న = రత్నాలతో, చిత్రమ్ = ఆశ్చర్యకరమైన (హిరణ్యైః అమలైః రత్నైశ్చ చిత్రమ్), పురమ్ = నగరాన్ని, అచీకరత్ = కట్టించాడు. (కృ కరణే-ణిచ్-పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ విధంగా కృష్ణుడు భీకరసేనగల జరాసంధుని చాలా సార్లు యుద్ధంలో ఓడించి, ఆపై బంగారుతో, నిర్మలరత్నాలతో అద్భుతమైన నగరాన్ని సముద్రమధ్యంలో నిర్మింపజేశాడు.

**వి :** 1. **బహువారం** అంటే 18 సార్లు.

శ్లో॥ ఏవం **సప్తదశ**కృత్వస్తావదక్షౌహిణీబలః ।
యుయుధే మాగధో రాజా యదుభిః కృష్ణపాలితైః ॥

శ్లో॥ అక్షిణ్వ స్తద్బలం సర్వం వృష్ణయః కృష్ణతేజసా ।
హతేషు స్వేష్వనీకేషు త్యక్తోఽయాదరిభిః నృపః ॥

శ్లో॥ అష్టాదశమసంగ్రామే ఆగామిని తదంతరా । - భాగవతమ్ 10/50/42-44

శ్లో॥ తైః ప్రేరితా నృపతయః పితరశ్చ తేషాం
సాకం బృహద్రథసుతేన హరేః సకాశమ్ ।
యుద్ధాయ జగ్మురమునాఽష్టదశేషు యుద్ధే-
ష్వత్యంతభగ్నబలదర్పమదా నివృత్తాః ॥ - మహాభారతతాత్పర్యనిర్ణయః-14/83

2. **అచీకరత్ :** 14-28వ శ్లోక వ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ నిధాయ తస్యాం మథురాపురస్థాన్ - నిజాన్ క్షణేనాపరిమేయశక్తిః ।**
**విదుద్రువేఽథో యవనం దిధక్షుః - స్వభక్తహర్యక్షదరీమరిఘ్నః ॥ 14-32**

**అ :** కృష్ణుడు యవనుని దగ్ధం చేయాలని ముచుకుందునిగుహదగ్గరకు వెళ్ళటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అపరిమేయ-శక్తిః (అరిఘ్నః) కృష్ణః తస్యాం క్షణేన మథురా-పుర-స్థాన్ నిజాన్ నిధాయ అథో యవనం దిధక్షుః స్వ-భక్త-హర్యక్ష-దరీం విదుద్రువే.

**ప్ర :** అపరిమేయ-శక్తిః : అపరిమేయ = కొలతకందని, శక్తిః = శక్తిగలవాడు (అపరిమేయా శక్తిః యస్య సః), అరి-ఘ్నః = శత్రుసంహారకుడు అయిన కృష్ణుడు (అరీన్ హన్తి ఇతి), తస్యామ్ = ఆ ద్వారకానగరంలో, మథురా-పుర-స్థాన్ = మథురా నగరమందున్న (మథురాఖ్యం పురం, తస్మిన్ తిష్ఠంతీతి, తాన్), నిజాన్ = తనవారిని, నిధాయ = నిలిపి (ని ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అథో = ఆ తరువాత, యవనమ్ = కాలయవనుని, దిధక్షుః = దహింపగోరి (దగ్ధుమ్ ఇచ్ఛుః), స్వ... దరీమ్ : స్వ=తనయొక్క, భక్త = భక్తుడైన ముచుకుందు డనే, హర్యక్ష =

సింహం యొక్క, దరీమ్=గుహవైపుగా, విదుద్రువే = పరుగెత్తాడు. (వి-ద్రు గతౌ ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అగణ్యశక్తిమంతుడు, శత్రుసంహారకుడు అయిన కృష్ణుడు మధురానగరిలో నున్న తన వారినందరినీ క్షణంలో ద్వారకకు చేర్చి ఆపై కాలయవనుని దగ్ధం చేయాలని తన భక్తసింహమయిన ముచుకుందునిగుహదగ్గరకు పరుగెత్తాడు.

**వి :** 1. అపరిమేయశక్తి అన్నదానికి సాక్ష్యం క్షణంలో మథురావాసులను ద్వారకకు చేర్చటం. అరిఘ్నుడు అన్నదానికి ముచుకుందసంహారానికై వెంటనే పరువులు పెట్టడం సాక్ష్యం.

2. "**సింహశార్దూలనాగాద్యాః పరే శ్రేష్ఠత్వగోచరాః**" - అన్న నియమాన్ని బట్టి భక్త హర్యక్ష పదానికి భక్తశ్రేష్ఠుడు అని కూడా అర్థం సమంజసమే. కానీ దరీపదం హర్యక్షపదానికున్న సింహార్థాన్ని ఆక్షేపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **విదుద్రువే :** | **విదుద్రువే** | విదుద్రువాతే | విదుద్రువిరే |
| | విదుద్రువిషే | విదుద్రువాథే | విదుద్రువిధ్వే |
| | విదుద్రువే | విదుద్రువివహే | విదుద్రువిమహే |

ద్రు ధాతువు స్వాభావికంగా పరస్మైపదం. కానీ అన్ని ధాతువులూ ఉభయపదాలే అన్న కొందరి అభిప్రాయం మేరకు ఇక్కడ ఆత్మనేపదంలో ప్రయోగం. *

**శ్లో॥ పరాఙ్ముఖోఽసౌ పరమః పలాయన్ - ఖలాగ్రతః కఞ్జదలాయతాక్షః ।**
**దురాత్మనాం వక్త్రనిరీక్షణం స్వై-ర్జనైర్న కార్యం త్వితి శంసతి స్మ ॥ 14-33**

**అ :** కృష్ణుడు పరాఙ్ముఖుడై యవనుని వైపు వెళుతూ తన భక్తుల కొక సందేశమివ్వటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** కంజ-దళ-ఆయత+అక్షః పరాఙ్ముఖః (సన్) ఖల+అగ్రతః పలాయన్ అసౌ పరమః దురాత్మనాం వక్త్ర-నిరీక్షణం స్వైః జనైః న కార్యం తు ఇతి శంసతి స్మ.

**ప్ర :** కంజ... అక్షః : కంజ = తామరయొక్క, దళ = రేకులవంటి, ఆయత = విశాలమైన, అక్షః = కన్నులు గల కృష్ణుడు (కంజస్య దళే ఇవ ఆయతే అక్షిణీ యస్య సః), పరాఙ్ముఖః (సన్) = వెనుదిరిగినవాడై, ఖల+అగ్రతః : ఖల = మోసగాడైన యవనుని యొక్క (మాయావీ ప్రాతిహారికః నాదుర్జనః ఖలః - వైజయన్తీ-అర్థవత్-24,25), అగ్రతః = ఎదురుగా, పలాయన్ = పరుగెత్తుతూ (పల(ర)+అయ్ ధాతువుపై శతృ ప్రత్యయం), అసౌ = ఆ, పరమః = పరమపురుషుడైన కృష్ణుడు, స్వైః-జనైః = తనవారితో, దురాత్మనామ్ = చెడ్డవారియొక్క (దుష్టః ఆత్మా యేషాం తేషాం), వక్త్ర-నిరీక్షణమ్ = ముఖదర్శనం (వక్త్రస్య నిరీక్షణమ్), న కార్యమ్ = చేయరాదు. ఇతి = అని, శంసతి స్మ = చెప్పాడు. (శంస - స్తుతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.). 'స్మ' కలయికతో భూతకాలార్థం '**లట్ స్మే**' సూత్రంతో (అష్టాధ్యాయి 3-2-118)

**తా ॥** తామరరేకులవంటి కన్నులు గల కృష్ణుడు కాలయవనుని వైపు వెనుదిరిగి పరుగెత్తాడు. దానిద్వారా చెడ్డవారి ముఖం కూడా చూడకూడదని తన భక్తులకు చెప్పాడు.

**వి :** 1. విష్ణుభక్తుడై ఊర్ధ్వపుండ్రం ధరించినవాడు చండాలుడైనా పరిశుద్ధుడూ, పూజనీయుడూ అనీ, ఊర్ధ్వపుండ్రం లేకపోతే ఆముఖం శ్మశానసమానమనీ దానిని చూస్తే తిరిగి సూర్యదర్శనం చేయాలనీ కృష్ణామృతమహార్ణవం చెప్తోంది.

శ్లో॥ఊర్ధ్వపుండ్రం మృజుం సౌమ్యం లలాటే యస్య దృశ్యతే ।
స చండాలోఽపి శుద్ధాత్మా పూజ్య ఏవ న సంశయః ॥

శ్లో॥ఊర్ధ్వపుండ్రవిహీనస్య శ్మశానసదృశం ముఖమ్ ।
అవలోక్య ముఖం తేషామాదిత్యమవలోకయేత్ ॥ - కృష్ణామృతమహార్ణవం-221-223

| | | | | |
|---|---|---|---|---|
| 2. **శంసతి(స్మ) :** | **శంసతి** | శంసతః | శంసన్తి | |
| | శంససి | శంసథః | శంసథ | |
| | శంసామి | శంసావః | శంసామః. | * |

**శ్లో॥ అధిక్షిప్తోఽపి తేనాధ్వన్యదత్తోత్తర ఈశ్వరః ।**
**అసల్లాపమసద్వర్గైః సతాం సంశిక్షయన్నివ ॥ 14-34**

**అ :** పలాయనవేళలోని మౌనం ద్వారా కృష్ణసందేశం. -పథ్యావక్త్రమ్.

**అ :** తేన అధ్వని అధిక్షిప్తః అపి ఈశ్వరః అసద్-వర్గైః సతామ్ అసల్లాపం సంశిక్షయన్+ఇవ అదత్త+ఉత్తరః.

**ప్ర :** తేన = ఆ కాలయవనునిచే, అధ్వని = దారిలో, అధిక్షిప్తః+అపి = ఎత్తిపొడవబడినా, ఈశ్వరః = కృష్ణుడు, అసద్-వర్గైః = చెడ్డవారితో, సతామ్ = మంచివారికి, అసల్లాపమ్ = మాటాడకపోవటాన్ని, సంశిక్షయన్-ఇవ = నేర్పుతున్నట్లుగా, అదత్త+ఉత్తరః = సమాధాన మివ్వనివాడుగా, (అస్తి = ఉన్నాడు.)

**తా ॥** కృష్ణుడు వెనుదిరిగి పరుగెత్తుతూ కాలయవనుని వైపు వెళ్తున్నప్పుడు కాలయవనుడు రెచ్చగొట్టే మాటలు మాటాడాడు. అయినా కృష్ణుడు సమాధానమివ్వలేదు. చెడ్డవారితో సంవాదనం మంచివారికి తగదని చెప్తున్నట్లుగా అది కనిపిస్తోంది.

**వి :** 1. కాలయవనుడు కృష్ణుని రెచ్చగొట్టిన రీతి పోతన మాటలలో-

మ. యదువంశోత్తమ! పోకు పోకు రణ మీ నర్హంబు; గంసాదులన్
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్;
విదితఖ్యాతులు వీటిఁ బోవ నరికిన్ వెన్నిచ్చి యిబ్భంగి నే
గుదురే రాజులు? రాజమాత్రుఁడవె? వైగుణ్యంబు వచ్చెన్ జుమీ! ...

మ. శరముల్ దూఅవు; మధ్ధనుర్గుణలతాశబ్దంబు లేతేర వా
హరిరింఖోద్ధతి ధూళి గప్ప; దకటా! హాస్యుండవై పాఱె; దు
ర్వరపై నే క్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీనాథుతోన్॥ - పోతనభాగవతము 10/1621,1624*

**శ్లో॥ నిద్రాలోర్ముచుకున్దభూవరమణేర్విద్యోతమానాం గుహా-**
**మధ్యాసీనమగమ్యమల్పమతిభిః శుద్ధం ప్రబుద్ధం స్వతః ।**
**హృద్వ్యోమస్థితముగ్ధజీవనికరాద్దుర్ధీరభిన్నం వద-**
**న్నద్వైతీవ నృపాత్ స భేదరహితం బుద్ధ్వాఽన్వమంస్తాసురః ॥ 14-35**

**అ :** కాలయవనుడు ముచుకుందుని కృష్ణునిగా భావించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సః అసురః నిద్రాలోః ముచుకుంద-భూవర-మణేః విద్యోతమానాం గుహామ్ అధ్యాసీనమ్ అల్పమతిభిః అగమ్యం స్వతః ప్రబుద్ధం శుద్ధం హృద్-వ్యోమ-స్థిత-ముగ్ధ-జీవ-నికరాత్ అభిన్నం వదన్ దుర్ధీః అద్వైతీ+ఇవ నృపాత్ భేదరహితం బుద్ధ్వా అన్వమంస్త.

**ప్ర :** సః అసురః = ఆ రాక్షసుడు (కాలయవనుడు), నిద్రాలోః = నిదురిస్తున్న ("**స్పృహి గృహి పతి-దయినిద్రాతంద్రాశ్రద్ధాభ్య ఆలుచ్**' - (అష్టాధ్యాయి-3-2-158) సూత్రంతో నిద్రా+ఆలుచ్); ముచుకుంద-భూవర-మణేః : ముచుకుంద = ముచుకుందు డనే, భూవర-మణేః = రాజశ్రేష్ఠునియొక్క (ముచుకుంద ఇతి భూవరమణిః

, తస్య), విద్యోతమానామ్ = వెలుగొందుతున్న, గుహామ్ = గుహలో, అధ్యాసీనమ్ = ఉన్నవాడూ (ఇక్కడ 'ఉండటానికి' ఆధారం గుహ. కాబట్టి ఆధారార్థంలో సప్తమీ విభక్తి రావాలి. కానీ '**అధిశాఙ్స్థానాం కర్మ**' (అష్టాధ్యాయి 1-4-46) సూత్రాన్ని బట్టి గుహకర్మయై '**కర్మణి ద్వితీయా**' (అష్టాధ్యాయి 2-3-2) అని ద్వితీయావిభక్తి వస్తుంది.), అల్ప-మతిభిః = స్వల్పబుద్ధులచే (అల్పాః మతయః యేషాం తైః), అగమ్యమ్ = చేరలేని వాడూ, స్వతః = తనంతగా, ప్రబుద్ధమ్ = జాగరూకుడూ, శుద్ధమ్ = పరమాత్మ అయిన కృష్ణుని, హృద్... నికరాత్ : హృద్-వ్యోమ =హృదయాకాశమందు, స్థిత = ఉన్నట్టి, ముగ్ధ = అమాయకులైన, జీవ-నికరాత్ = జీవకోటినుండి, (హృత్ ఏవ వ్యోమ తస్మిన్ స్థితః ముగ్ధశ్చ అసౌ జీవానాం నికరః తస్మాత్), అభిన్నమ్ = వేరుకాని వానినిగా, వదన్ = పలుకుతున్న (వద ధాతువుపై శతృ ప్రత్యయం), దుర్ధీః = దుష్టబుద్ధి అయిన (దుష్టా ధీః యస్య సః), అద్వైతీ+ఇవ = అద్వైతిలాగా, నృపాత్ = ముచుకుందరాజుకన్న, భేద-రహితమ్ = అభిన్నునిగా, అన్వమంస్త = ఆలోచించాడు. (అను+మన్ జ్ఞానే-దివాది-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ముచుకుందమహారాజు రాజశ్రేష్ఠుడు. గుహలో నిద్రలో వున్నాడు. కాలయవనుడు ఆ గుహలోనికి ప్రవేశించి ఆ ముచుకుందుని చూసి కృష్ణుడుగా భావించాడు. కృష్ణునకు ఆ ముచుకుందునకు భేదం లేదనుకొన్నాడు. అది నిత్యజాగరూకుడై, శుద్ధుడైన ఆ పరబ్రహ్మను హృదయాకాశమందున్న ముగ్ధజీవకోటితో అభిన్నునిగా చెప్పే దుర్బుద్ధి అయిన అద్వైతి భావనలా వుంది.

**వి :** 1. తనముందే కృష్ణుడు గుహలోనికి ప్రవేశించాడు. కాబట్టి అక్కడ ముచుకుందుని కన్న మరొకడు కనిపించటం లేదు కాబట్టి కాలయవనుడు ముచుకుందుని కృష్ణుని కన్న వేరుకాదని భావించాడు. అది అద్వైతి భావనలా వుందట. అద్వైతి జీవునీ, బ్రహ్మనూ, అభిన్నంగా భావిస్తాడు. ఏ ప్రమాణంచేతనూ జీవబ్రహ్మలకు భేదం లేదంటాడు. దానిని ద్వైత మంగీకరించదు. ద్వైతగతంగా జీవుడు నిద్రాళువు. బ్రహ్మ నిత్య జాగరీకుడు. కాబట్టి ఈ ఇద్దరినీ ఒకటనరాదు.

| | | | |
|---|---|---|---|
| 2. **అన్వమంస్త :** | **అన్వమంస్త** | అన్వమంసాతామ్ | అన్వమంసత |
| | అన్వమంస్థాః | అన్వమంసాథామ్ | అన్వమంధ్వమ్ |
| | అన్వమంసి | అన్వమంస్వహి | అన్వమంస్మహి. |

*

**శ్లో॥ ఐక్యం సిషాధయిషితం యది తత్కిమర్థం**
**రక్షోఽచ్యుతత్వమతి రాజ్ఞి శుకో న సేహే।**
**అస్మ్యచ్యుతోఽహమితి దిక్షు విఘోషయన్తం**
**కస్మాత్ స పౌన్డ్రకమగర్హయదర్హణీయః ॥ 14-36**

**అ :** అద్వైతభావాన్నే ప్రకారాంతరంగా ఖండించటం. -వసంతతిలక.

**అ :** యది ఐక్యం సిషాధయిషితం తత్ రాజ్ఞి అచ్యుతత్వమతి రక్షః శుకః కిమర్థం న సేహే. అర్హణీయః సః అహమ్ అచ్యుతః అస్మి ఇతి దిక్షు విఘోషయన్తం పౌండ్రకం కస్మాత్ అగర్హయత్.

**ప్ర :** యది=ఒకవేళ, ఐక్యమ్=జీవపరములు అభిన్నులని, సిషాధయిషితమ్ = సాధింపదలచు కొంటే (సాధయితుమ్ ఇష్టమ్), తత్ = ఆ కారణంగా, రాజ్ఞి = రాజులోని, అచ్యుతత్వ-మతి = అచ్యుతత్వబుద్ధిగల (అచ్యుతత్వం మతౌ యస్య తత్), రక్షః = రాక్షసుని, శుకః = శుకుడు, కిమర్థమ్ = ఎందువలన, న సేహే = సహించలేదు. (సహ మర్షణే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), అర్హణీయః = పూజ్యుడైన (అర్హ్ ధాతువుపై అనీయర్ ప్రత్యయం, "**తవ్య- త్తవ్యానీయరః** " (అష్టాధ్యాయి 3-1-96) సూత్రంతో, సః = ఆ శుకుడు, అహమ్-అచ్యుతః-అస్మి = "నేను కృష్ణుడను", ఇతి = అని, దిక్షు = దిక్కులలో, విఘోషయన్తమ్ = ఘోష-పెడుతున్న, పౌండ్రకమ్ = పౌండ్రకవాసుదేవుని, కస్మాత్ = ఎందువలన, అగర్హయత్ = నిందించాడు? (గర్హ కుత్సాయాం-చురాది-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** జీవపరములకు అభిన్నత్వాన్ని సాధించటమే శుకుని లక్ష్యమయితే ముచుకుందుని కృష్ణుడుగా భావించిన (జీవబ్రహ్మైక్యమే గదా!) కాలయవనుని ప్రవర్తనను శుకమహర్షి ఎందుకు సహించలేకపోయాడు? అలాగే ఆ పూజ్యుడు – శుకుడు – తానే వాసుదేవుడనని చెప్పుకొనే పౌండ్రకవాసుదేవుని (జీవబ్రహ్మైక్యమే గదా!) ఎందుకు నిందించాడు?

**వి :** 1. శ్లో॥ నన్వసౌ దూరమానీయ శేతే మామిహ సాధువత్ ।
ఇతి మత్వాఽచ్యుతం **మూఢ**స్తం పదా సమతాడయత్ ॥ – భాగవతమ్ 10/51/10

ఈ శ్లోకంలో కథాంశాన్ని చెప్తున్న శుకమహర్షి మూఢః అని కాలయవనుని నిర్దేశించాడు. "నన్ను చాలా దూరం తెచ్చి (కృష్ణుడు) సత్పురుషుడిలా ఇక్కడ పడుకొన్నాడు" – అని ముచుకుందుని కృష్ణునిగా భావించటం మూఢు డనటానికి కారణం. అది అద్వైతభావన. అద్వైతమే శుకమహర్షి వివక్ష అయితే 'మూఢః' అని అనకూడదు గదా!

శ్లో॥ ఇతి ప్రస్తోభితో బాలైర్మేనే ఆత్మానమచ్యుతమ్ ॥... ...

శ్లో॥ యాని త్వమస్మచ్చిహ్నాని మౌఢ్యాద్బిభర్షి సాత్వత ।
త్యక్త్వైహి మాం త్వం శరణం నో చేద్దేహి మమాహవమ్ ॥

శ్రీ శుక ఉవాచ :

శ్లో॥ కత్థనం తదుపాకర్ణ్య పౌండ్రకస్యాల్పమేధసః
ఉగ్రసేనాదయః సభ్యా ఉచ్చకైర్జహసుస్తదా ॥ – భాగవతమ్ 10/66/2,6,7

పై శ్లోకాలలో మొదటిది పౌండ్రకుడు కృష్ణునకు పంపిన సందేశం. రెండవది శుకవచనం. తనకూ వాసుదేవునితో అభిన్నత్వాన్ని భావించిన పౌండ్రకుని శుకమహర్షి అల్పబుద్ధి అని గర్హించాడు. అభేదభావన అల్పబుద్ధి అయితే ద్వైతభావన సమంజసమని కదా శుకమహర్షి అభిప్రాయం అని కవి ప్రతిపాదన.

| | | | |
|---|---|---|---|
| 2. **సేహే :** | **సేహే** | సేహాతే | సేహిరే |
| | సేహిషే | సేహాథే | సేహిధ్వే |
| | సేహే | సేహివహే సేహిమహే | |
| **అగర్హయత్ :** | **అగర్హయత్** | అగర్హయతామ్ | అగర్హయన్ |
| | అగర్హయః | అగర్హయతమ్ | అగర్హయత |
| | అగర్హయమ్ | అగర్హయావ | అగర్హయామ. |

*

**శ్లో॥ ప్రదాహ్య నయనాగ్నినా యవనకాననం భూపతే–**
**ర్భవాఖ్యగహనం పునః స్వపదపద్మవీక్షాగ్నినా ।**
**వినాశ్య ముచుకున్దహృత్సరసిజాతభానుః శనై–**
**రియాయ పురమాత్మనో జలధిమధ్యరత్నాయితామ్ ॥ 14-37**

**అ :** కృష్ణుడు యవనుని దగ్ధంచేసి తాను ద్వారకకరుగుట. –పృథ్వీ (జసజసయలగ)

**అ :** ముచుకుంద–హృత్–సరసిజాత–భానుః భూపతేః నయన+అగ్నినా యవన–కాననం ప్రదాహ్య పునః భూపతేః భవ+ఆఖ్య–గహనం స్వ–పద–పద్మ–వీక్షా–అగ్నినా వినాశ్య శనైఃజలధి–మధ్య–రత్నాయితామ్ ఆత్మనః పురమ్ ఇయాయ.

**ప్ర :** ముచుకుంద... భానుః : ముచుకుంద = ముచుకుందునియొక్క, హృత్ = హృదయమనే, సరసి–జాత=పద్మానికి, భానుః = సూర్యుడైన కృష్ణుడు (ముచుకుందస్య హృత్ ఏవ సరసిజాతం, తస్య భానుః), భూపతేః = ముచుకుందునియొక్క నయన+అగ్నినా = కళ్ళనుండి పుట్టిన నిప్పుతో (నయనాత్ జాతః అగ్నిః, తేన), యవన–కాననమ్ = కాలయవనుడనే అడవిని (యవన ఇతి కాననం, తత్), ప్రదాహ్య = తగులబెట్టి (ప్ర దహ ధాతువుపై–ణిచ్–ల్యప్ ప్రత్యయం), పునః = తిరిగి, భవ+ఆఖ్య–గహనం = (ముచుకుందుని) సంసారమనే అగ్నిని (గహనం కాననం వనమ్–అమరకోశః–వనౌషధి–1) (భవ ఇతి ఆఖ్యా యస్య తచ్చ తత్ గహనం చ), స్వ... గ్నినా : స్వ = తనయొక్క, పద–పద్మ = చరణకమలాలయొక్క, వీక్షా = దర్శనమనే, అగ్నినా = నిప్పుతో (స్వస్య పదే ఏవ పద్మే, తయోః వీక్షా ఏవ అగ్నిః, తేన), వినాశ్య = నశింపజేసి (వి–నశ ధాతువుపై ణిచ్–ల్యప్ ప్రత్యయం), శనైః = మెల్లగా, జలధి మధ్య రత్నాయితమ్ = సముద్రమధ్యంలో రత్నంగా వున్న, ఆత్మనః = తనయొక్క, పురీమ్=నగరానికి (ద్వారకకు), ఇయాయ = వెళ్ళాడు. (ఇ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ముచుకుందుని హృదయపద్మానికి సూర్యుడైన కృష్ణుడు ముచుకుందుని నేత్రాగ్నితో కాలయవనుడనే కాననాన్ని దహించి, తన పాదపద్మాలను దర్శించటమనే (జ్ఞాన) అగ్నితో ముచుకుందుని సంసారకాననాన్ని కూడా నశింపజేసి, మెల్లగా సముద్రజలమధ్యంలో రత్నంగా వున్న ద్వారకకు వెళ్ళాడు.

**వి :** 1. నయన+అగ్ని, యవన–కాననం, పద–పద్మం, వీక్షా+అగ్ని, హృత్–సరసిజాత; భవాఖ్యగహనం ఇవన్నీ రూపకాలంకారాలే, ఉపమేయంలో ఉపానత్వాన్ని ఆరోపించి నందువల్ల. కాకపోతే పదపద్మ, హృత్సరసిజాత (హృదయపద్మం) భవగహనం; నయనాగ్ని, వీక్షా–అగ్ని ఇవి పాఠకులకు దాదాపు పరిచయం లోనివే. యవనునిలో కాననత్వాన్ని ఆరోపించటం మాత్రం నూతనం.

అలాగే '**జలధిమధ్యరత్నాయితమ్**' అన్న పోలిక (ద్వారకకు) కూడా నూతనంగా కనిపించేదే.

| | | | |
|---|---|---|---|
| 2. **ఇయాయ :** | **ఇయాయ** | ఈయతుః | ఈయుః |
| | ఇయేథ/ఇయియిథ | ఈయథుః | ఈయ |
| | ఇయాయ/ఇయయ | ఈయివ | ఈయిమ. |

*

**శ్లో॥ నిజైః సహ ద్వారవత్యాం నివసత్యమ్బుజేక్షణే ।**
**అజయా ప్రేషితం పత్రం ద్విజః కశ్చిదుపాహరత్ ॥ 14–38**

**అ :** రుక్మిణి నుండి కృష్ణునకు లేఖ రావటం. –పథ్యావక్త్రమ్.

**అ :** అంబుజ+ఈక్షణే నిజైః సహ ద్వారవత్యాం నివసతి (సతి) కశ్చిత్ ద్విజః అజయా ప్రేషితం పత్రమ్ ఉపాహరత్.

**ప్ర :** అంబుజ+ఈక్షణే = కమలాక్షుడు (అంబుజే ఇవ ఈక్షణే యస్య, తస్మిన్), నిజైః సహ = తనవారితోపాటు, ద్వారవత్యామ్ = ద్వారకలో, నివసతి = నివసిస్తుండగా, కశ్చిత్ = ఒకానొక, ద్విజః = బ్రాహ్మణుడు, అజయా = పుట్టుకలేనిదానిచే (రుక్మిణిచే) (న జాయతే ఇతి అజా, తయా), ప్రేషితమ్ = పంపబడిన, పత్రమ్ = లేఖను, ఉప+అహరత్ = తెచ్చియిచ్చాడు (ఉప–హృ హరణే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు తనవారితో కలిసి ద్వారకలో నివసిస్తున్నాడు. ఆ సమయంలో ఒకానొక బ్రాహ్మణుడు రుక్మిణి వ్రాసిన లేఖను తెచ్చి ఇచ్చాడు.

**వి :** 1. భాగవతంలోని **రుక్మిణీకళ్యాణకథ** లోకంలో బాగా ప్రసిద్ధం. పోతన తన శైలిలో దాన్ని తెలుగులో ఇంకా బాగా రక్తి కట్టించాడు. తెలుగువారు రుక్మిణీకళ్యాణభాగాన్ని పారాయణగ్రంథంగా భావిస్తారు. పారాయణం చేస్తుంటారు. కన్యలచే చేయిస్తుంటారు.

ఆ కథాభాగానికి ఉపక్రమణికలాగా పరీక్షిన్మహారాజు శుకమహర్షిని అడిగిన తీరు ఇది– పోతన బాగవతము – 10/1681,1682

శా. కళ్యాణాత్మకమైన విష్ణుకథ లాకర్ణింపుచున్ ముక్త వై
కల్యుం డెవ్వఁడు తృప్తుఁ డౌ; నవి వినంగాఁ గ్రొత్త లేచుండు సా
కల్యం బేర్పడ భూసురోత్తమ! యెఱుంగం బల్కవే? రుక్మిణీ
కళ్యాణంబు వినంగ నాకు మదిలోఁ గౌతూహలంబయ్యెడిన్.

క. భూషణములు సెవులకు బుధ – తోషణములనేక జన్మదురితౌఘ విని
శ్శోషణములు మంగళతర – ఘోషణములు గరుడగమనగుణభాషణముల్.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపాహరత్ :** | **ఉపాహరత్** | ఉపాహరతామ్ | ఉపాహరన్ |
| | ఉపాహరః | ఉపాహరతమ్ | ఉపాహరత |
| | ఉపాహరమ్ | ఉపాహరావ | ఉపాహరామ. * |

**శ్లో॥ ధన్యాఽబలా సా విభవే భవేద్యా – వేద్యాయ భూమ్నే పురుషాయ సామ్నా ।**
**సామ్నాయశాస్త్రోదితధర్మపాత్రే – పాత్రేషు దత్తాత్మపదాయ దత్తా ॥ 14–39**

**అ :** శ్రీకృష్ణుని భర్తగా పొందటాన్ని ధన్యతగా ప్రతిపాదించటం. –ఇంద్రవజ్ర.

**అ :** యా అబలా విభవే భూమ్నే సామ్నా వేద్యాయ స+ఆమ్నాయ–శాస్త్ర+ఉదిత–ధర్మ–పాత్రే పాత్రేషు దత్త+ఆత్మ–పదాయ పురుషాయ దత్తా సా ధన్యా భవేత్.

**ప్ర :** యా = ఏ, అబలా = స్త్రీ, విభవే = సమర్థుడు (విశేషేణ భవతి ఇతి విభుః), భూమ్నే = సంపూర్ణుడు, సామ్నా = సామదృష్టితో (సామవేదం ద్వారా), వేద్యాయ = తెలియ దగినవాడు, సామ్నాయ... పాత్రే : స+ఆమ్నాయ = వేదంతో కూడిన, శాస్త్ర = బ్రహ్మశాస్త్రం చేత, ఉదిత = చెప్పబడిన, ధర్మ = ధర్మానికి, పాత్రే = రక్షకుడు (ఆమ్నాయేన సహితం చ తత్ శాస్త్రం, తేన ఉదితస్య ధర్మస్య పాతా, తస్మై), పాత్రేషు = యోగ్యులయిన జీవులకు, దత్త+ఆత్మ–పదాయ = తనయొక్క స్థానమిచ్చినవాడు అయిన (సాలోక్య మోక్షం), పురుషాయ = మగవానికి (కృష్ణునికి), దత్తా = ఇవ్వబడునో, సా = ఆమె, ధన్యా = ధన్యురాలు, భవేత్ = అగును.

**తా ॥** సమర్థుడు, పరిపూర్ణుడు, సామవేదం ద్వారా (సంగీత ప్రధానం) తెలియదగినవాడు, వేదసహితమైన బ్రహ్మ మీమాంసా (ఉత్తర మీమాంస) శాస్త్రంలో చెప్పిన ధర్మాన్ని కాపాడేవాడు. యోగ్యులయిన జీవులకు తనదైన వైకుంఠంలో స్థానమిచ్చేవాడు అయిన మగవాని (కృష్ణుని) కొరకు ఇవ్వబడిన స్త్రీ ధన్యురాలు అగును.

**వి :** 1. భాగవతంలో బ్రాహ్మణుడి ద్వారా రుక్మిణి పంపిన సందేశంలో రెండవ శ్లోకం–

శ్లో॥ కా త్వా ముకుంద మహతీ కులశీలరూప – విద్యావయోద్రవిణధామభిరాత్మతుల్యమ్।
ధీరా పతిం కులవతీ న వృణీత కన్యా – కాలే నృసింహ నరలోకమనోభిరామమ్ ॥ – 10/52/38

ఈ శ్లోకభావాన్ని విస్తరిస్తూ పోతన చేసిన అనువాదం తెలుగులోగిలిలో అజరామరం–

శా. ధన్యున్ లోకమనోఽభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ
జన్యశ్రీ బలదాన శౌర్యకరుణాసంశోభితున్ నిన్ను నే
కన్యల్ గోరరు? కోరదే మును రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నా వలననే జన్మించెనే మోహముల్. –పోతనభాగవతము 10/1702

2. శ్లోకంలో ముక్తపదగ్రస్తం కనిపిస్తుంది. పాదాంతపదంతో తరువాతి పాదం ప్రారంభం కావటం. *

శ్లో॥ కుర్వన్తి కామవశగా మయి చిత్తమన్యే
కుర్వన్తికాగతయమానుచరాన్ రణే తాన్ ।
దేహ్యఙ్గజాకృతిశతోర్జితరమ్యరూప!
దేహ్యఙ్గజాతనిలయాఙ్ఘ్రి సరోజసేవామ్ ॥ **14-40**

**అ : 'నన్ను కోరుతున్న ఇతరులకు నన్ను దక్కనీయవద్ద'ని** రుక్మిణి సందేశం. -వసంతతిలక.

**అ :** అంగజ+ఆకృతి-శత+ఊర్జిత-రమ్య-రూప! దేహి+అంగజాత-నిలయ! అంఘ్రి-సరోజ-సేవాం దేహి. కామ-వశ-గాః అన్యే మయి చిత్తం కుర్వన్తి తాన్ రణే అంతిక+ఆగత-యమ+అనుచరాన్ కురు.

**ప్ర :** అంగజా... రూప! : అంగ-జ = మదనునియొక్క, ఆకృతి-శత = వందరూపాలకన్న, ఊర్జిత=మేటిఅయిన, రమ్య = అందమైన, రూప = రూపంగలవాడా! (అంగజస్య ఆకృతీనాం శతాత్ ఊర్జితం రమ్యం చ తద్ రూపం యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), దేహ్యా.... నిలయ! : దేహి = ప్రాణులయొక్క, అంగ-జాత = శరీర సమూహమే, నిలయ! = నివాసస్థానంగా కలవాడా! (దేహినామంగానాం జాతమ్ ఏవ నిలయః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), అంఘ్రి-సరః+జ-సేవామ్ : అంఘ్రి-సరః+జ = పాదపద్మాలయొక్క, సేవామ్ = సేవను (అంఘ్రీ ఏవ సరోజే, తయోః సేవా, తామ్), దేహి = ఇవ్వు (దా దానే పరస్మైపది-లోట్-మ.ఏ.), కామ-వశ-గాః = మదనునికి లోబడి నడిచే వాళ్లు (కామస్య వశే గచ్ఛన్తీతి), అన్యే = ఇతరులు, మయి = నాపై, చిత్తం కుర్వన్తి = మనస్సు పడుతున్నారు. (కృ కరణే పరస్మైపది-లట్-ప్ర.బ.), తాన్ = వారిని, రణే = యుద్ధంలో, అంతికా... చరాన్ : అంతిక = దగ్గరకు, ఆగత = వచ్చిన, యమ = యమునియొక్క, అనుచరాన్ = భటులు గలవారినిగా (అంతికమ్ ఆగతాః యమస్య అనుచరాః యేషాం తాన్), కురు = చేయి (కృ కరణే పరస్మైపది-లోట్-మ.ఏ.).

**తా ॥** శతమదనులవంటి అందమైన రూపంగలవాడా! ప్రాణి సమూహానికి నివాసమైన వాడా! కృష్ణా! నీ పాదసరోజసేవను నాకందించు. కామునికి లోబడి నడుస్తున్న చాలామంది నాపై మనస్సు పడుతున్నారు. యుద్ధంలో వారిని యమభటులు సమీపించిన వారినిగా చేయి (చంపు)

**వి :** 1. శ్లో॥ **కన్యా వరయతే రూపం** మాతా విత్తం పితా శ్రుతమ్ ।
బాంధవాః కులమిచ్ఛన్తి మృష్టాన్నమితరే జనాః ॥ అని సూక్తి.

కన్య వరుని రూపాన్ని నచ్చుతుంది. అందుకే రుక్మిణి 'అంగజాకృతిశతోర్జితరమ్యరూప' అని సంబోధించింది కృష్ణుని. రుక్మిణి అంతవరకు కృష్ణుని చూడలేదు. అయినా **వినుకలివల్ల** కృష్ణుని సౌందర్య మామెకు తెలుసు.

శ్లో॥ సోపశ్రుత్య ముకుందస్య **రూప**వీర్యగుణశ్రియః ।
గృహాగతైర్గీయమానాస్తం మేనే సదృశం పతిమ్ ॥ - భాగవతం 10/52/23

2. కామవశగాః అన్యే-

ఇక్కడ శిశుపాలుని వాచా ప్రకటించింది రుక్మిణి-

ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్న వాఁ
డా యధమాధముం డెఱుఁగఁడద్భుతమైన భవత్ప్రతాపమున్. -పోతనభాగవతము 10/1703

| | | | |
|---|---|---|---|
| 3. **కుర్వన్తి :** | కరోతి | కురుతః | **కుర్వన్తి** |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః |
| **కురు :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| | **కురు**/కురుతాత్ | కురుతమ్ | కురుత |
| | కరవాణి | కరవావ | కరవామ |

4. యమకం ప్రథమద్వితీయపాదాలలోనూ (కుర్వన్తికా–కుర్వన్తికా) ద్వితీయ చతుర్థపాదాలలోనూ (దేహ్యంగజా దేహ్యంగజా) పాదాది యమకం. *

**శ్లో॥ భవతాపహరాపాఙ్గ! భవతాఽపహృతైవ ధీః ।**
**చరణాఙ్కకృతాఙ్కాం మాఞ్చరణాఙ్గణతో నయ ॥** **14-41**

**అ :** రుక్మిణీ సందేశం. –పథ్యావక్త్రమ్.

**అ :** భవ–తాప–హర+అపాంగ! భవతా ధీః అపహృతా ఏవ. చరణ+అంక–కృత+అంకాం మాం చ రణ+అంగణతః నయ.

**ప్ర :** భవ... పాంగ! : భవ = సంసారసంబంధమైన, తాప = తాపాన్ని (ఆధిభౌతికతాపం, ఆధిదైవికతాపం, ఆధ్యాత్మికతాపం), హర = పోగొట్టే, అపాంగ! = కడగంటిచూపు గలవాడా! (భవస్య తాపః, తస్య హరః అపాంగః యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), భవతా = నీ చే, ధీః= బుద్ధి, అపహృతా+ఏవ=దొంగిలింపబడినదే!, చరణ...కృతామ్:చరణ = పాదాలయందలి, అంక = గుర్తులచే (రేఖలచే ఏర్పడిన ఆకృతులు), కృత = కల్పింపబడిన, అంకామ్ = గుర్తులుగల (చరణస్య అంకైః కృతాః అంకాః యస్యాః, తామ్), మామ్–చ = నన్ను కూడా, రణ+అంగణతః = రణభూమినుండీ (రణస్య అంగణం, తస్మాత్), నయ = కొనిపొమ్ము (నీ–ప్రాపణే పరస్మైపది–లోట్–మ.ఏ.)

**తా ॥** కృష్ణ! భవతాపాన్ని అపహరించే కడగంటిచూపు గలవాడవు, నా మనస్సు నెప్పుడో దొంగిలించావు. నీ పాదాలలోని గుర్తులను ముద్రించుకొన్న నన్ను యుద్ధభూమినుండి తీసికొనిపో!

**వి :** 1. '**రణాంగణతో నయ**' – అనటం ద్వారా రుక్మిణి భావిచిత్రాన్ని ఊహిస్తోంది. తమ వివాహం జరగాలంటే పూర్వరంగమెంత సాగవలసివుందో ఆమెకు తెలుసు. అందుకే యుద్ధరంగంనుండి తీసికొని పొమ్మంటోంది. అది రాక్షసవివాహపద్ధతి. ఎనిమిది రకాల వివాహాలలో అది యొకటి. రుక్మిణి సాక్షాత్తూ ఆ పదాన్నే వాడి బ్రాహ్మణుని ద్వారా సందేశం పంపించింది చూడండి–

ఉ. అంకిలి సెప్పలేదు; చతురంగబలంబులదోడ నెల్లి యో
పంకజనాభ! నీవు శిశుపాలజరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే
యుంకువ సేసి కృష్ణ! పురుషోత్తమ! చేకొని పొమ్ము వచ్చెదన్. –పోతనభాగవతమ్ 10/1705

2. ప్రథమద్వితీయపాదాలలోనూ (భవతాప – భవతాప), తృతీయచతుర్థపాదాలలోనూ (చరణా–చరణా) పాదాది యమకం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **నయ :** | నయతు/నయతాత్ | నయతామ్ | నయన్తు | |
| | **నయ**/నయతాత్ | నయతమ్ | నయత | |
| | నయాని | నయావ | నయామ. | * |

**శ్లో॥ ధిక్కృత్యాహముమేశహంసగమనౌ స్వర్గేశ్వరాగ్నీ భవ-**
**త్సూక్తాసక్తహృదఙ్గ లోకమఖిలం దేవౌఘమాన్యాన్ మునీన్ ।**
**సచ్ఛాస్త్రాధ్వని కోవిదానపి బుధాంస్త్వయ్యేవ యత్సస్పృహా**
**విశ్వాధీశ్వరతాం భవఘ్న! భవతస్తన్నిశ్చినోమి ప్రభో! ॥ 14-42**

**అ :** రుక్మిణి కృష్ణుడే సర్వాధికుడన్న తన నిశ్చితభావాన్ని ప్రకటించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** భవ-ఘ్న! ప్రభో! అంగ! భవత్-సూక్త+ఆసక్త-హృత్ అహం ఉమా+ఈశ-హంస-గమనౌ స్వర్గ+ఈశ్వర+అగ్నీ దేవ+ఓఘ-మాన్యాన్ మునీన్ సత్+శాస్త్ర+అధ్వని కోవిదాన్ బుధాన్ అఖిలం లోకం చ ధిక్కృత్య యత్ త్వయి+ఏవ సస్పృహా (ఇతి) తత్ భవతః విశ్వ+అధి+ ఈశ్వరతాం నిశ్చినోమి.

**ప్ర :** భవ-ఘ్న!=సంసార (తాప) వినాశకా! (భవం హన్తీతి భవఘ్నః, తస్మాత్ సంబుద్ధిః), ప్రభో! = స్వామీ, అంగ! = అందగాడా! (అంగో దేశేఽంగశాలిని-వైజయన్తీ-నానా-3), భవత్... హృత్ : భవత్ = నీయొక్క, సూక్త = మంచి మాటయందు, ఆసక్త = లగ్నమైన, హృత్ = మనస్సుగలదాననై (భవతః సూక్తం, తస్మిన్ ఆసక్తం హృత్ యస్యాః సా), అహమ్ = నేను (రుక్మిణి) ఉమా+ఈశ-హంస-గమనౌ = శివునీ, బ్రహ్మనూ (ఉమేశశ్చ హంస గమనశ్చ), స్వర్గ+ఈశ్వర-అగ్నీ = దేవేంద్రునీ, అగ్నినీ (స్వర్గస్య ఈశ్వరః స చ అగ్నిశ్చ), దేవ+ఓఘ-మాన్యాన్ : దేవ+ఓఘ = దేవతాసమూహంచే, మాన్యాన్ = గౌరవింపదగిన (దేవానామ్ ఓఘః, తేన మాన్యాః, తాన్), మునీన్ = మునులనూ, సత్-శాస్త్ర+అధ్వని : సత్+శాస్త్ర = మంచి శాస్త్రాలయొక్క, అధ్వని = మార్గంలో, కోవిదాన్ = అంతయు తెలిసిన (కిం నామ న వేత్తి ఇతి కోవిదః), బుధాన్-అపి = పండితులను కూడా, ధిక్ కృత్య = ధిక్కరించి, యత్ = ఎందువలన, త్వయి+ఏవ = నీయందే, స స్పృహా = కోరికతోవున్నానే (స్పృహయా సహితా), తత్ = దానివలన, భవతః = నీయొక్క, విశ్వ+అధీశ్వరతామ్ = సర్వాధిపత్యాన్ని (సర్వోన్నతత్వాన్ని) (విశ్వస్య అధీశ్వరతా తామ్), నిశ్చినోమి = నిర్ణయిస్తున్నాను. (నిస్-చి చయనే పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** ప్రభూ! భవఘ్నా! కృష్ణా! సుందరా! నీ సముచితవచనాలు విని వాటిమీదనే మనస్సును నిలుపుకొని శివునీ, బ్రహ్మనూ, ఇంద్రునీ, అగ్నినీ దేవతలు కూడా మన్నించే మునులను సచ్ఛాస్త్రమార్గవిశేషాలు తెలిసిన పండితులనూ, లోకాన్ని అంతటినీ కూడా కాదని నీమీదనే నాకు కోరిక కలుగుతున్నదంటే - ఆ కారణంగానే నీయొక్క విశ్వాధీశ్వరత్వాన్ని నేను నిర్ణయిస్తున్నాను.

**వి :** 1. అంభృణీసూక్తంలో వర్ణించిన లక్ష్మీవైభవాన్ని ఈ శ్లోకంలో ప్రస్తుతించాడు కవి. అటువంటి లక్ష్మీస్వరూప కాబట్టి రుక్మిణికి అన్య స్పృహ లేదు. (అంభృణీసూక్తం ఇంతకుముందే ఉదాహరింపబడింది.)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **నిశ్చినోమి :** | నిశ్చినోతి | నిశ్చినుతః | నిశ్చిన్వన్తి | |
| | నిశ్చినోషి | నిశ్చినుథః | నిశ్చినుథ | |
| | **నిశ్చినోమి** | నిశ్చినువః | నిశ్చినుమః. | * |

**శ్లో॥ శమ్భుః పుత్రసమః స మే పురరిపుః పౌత్రః శశీ సోదరః**
**సిన్ధుర్మే జనకాయితో మధుసఖో మత్సూనుకల్పః ప్రభో! ।**

**అమ్బాఽహం సకలస్య చేతి కమలా కృష్ణైకలగ్నం మనో-**
**భృఙ్గం దర్శయితుం కృతోగ్రశపథా స్వం రూపమస్పష్టయత్ ॥ 14-43**

**అ :** రుక్మిణి తన మనస్సు కృష్ణునిమీదనే లగ్నం కావటాన్ని సమర్థించుకొనటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కమలా మనః+భృంగం కృష్ణ+ఏక-లగ్నం దర్శయితుం '**ప్రభో! శంభుః మే పుత్ర-సమః సః పుర-రిపుః పౌత్రః శశీ సోదరః సింధుః మే జనకాయితః మధు-సఖః మత్-సూను-కల్పః అహం సకలస్య అంబా చ**' ఇతి కృత+ఉగ్ర-శపథా స్వం రూపమ్ అస్పష్టయత్.

**ప్ర :** కమలా = రుక్మిణి, మనః+భృంగమ్ = (తన) మనస్సనే తుమ్మెద (మనః ఏవ భృంగః, తమ్), కృష్ణ+ఏక-లగ్నమ్ = కృష్ణుని యందే లగ్నమై వుండటాన్ని (కృష్ణే ఏకస్మిన్ ఏవ లగ్నః, తమ్), దర్శయితుమ్ = చూపటానికి (దృశ్ ధాతువుపై ణిచ్-తుమున్ ప్రత్యయం), ప్రభో! = స్వామీ!, శంభుః = బ్రహ్మ (శంభుర్ధాతు హరార్హత్సు - వైజయన్తీ-ద్వ్యక్షర-57), మే = నాకు, పుత్ర-సమః = కొడుకుతో సమానుడు (పుత్రేణ సమః) (విష్ణు నాభికమలం నుండి పుట్టినవాడు), పుర-రిపుః = పురారి (శివుడు), పౌత్రః = మనవడు (రుద్రుడు బ్రహ్మకుమారుడు కాబట్టి లక్ష్మికి మనవడు.), శశీ = చంద్రుడు, సోదరః = తోడబుట్టినవాడు (చంద్రుడు సముద్రంలో పుట్టాడు కాబట్టి), సింధుః = సముద్రుడు, మే = నాకు, జనకాయితః = తండ్రివంటి వాడు, మధు-సఖః = మన్మథుడు (మధుః సఖా యస్య సః), మత్-సూను-కల్పః = నా కొడుకులాంటివాడు (మమ ఈషద్ దూనః సూనుః మత్సూనుకల్పః - "**ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్య దేశీయరః**" (5-3-67 అష్టాధ్యాయి), అహమ్ = నేను, సకలస్య = అంతటికీ (అన్నిటికీ), అంబా చ = తల్లిని కూడా, ఇతి = అని, కృత+ఉగ్ర-శపథా : కృత = చేయబడిన, ఉగ్ర = తీవ్రమైన, శపథా = ప్రతిజ్ఞగలదై (కృతః ఉగ్రశ్చాసౌ శపథః యయా సా), స్వం రూపమ్ = తన రూపాన్ని (లక్ష్మీత్వాన్ని), అస్పష్టయత్ = స్పష్టం చేసింది. (స్పశ బాధనస్పర్శనయోః-భ్వాది-పరస్మైపది-ణిచి-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥ 'బ్రహ్మ నా కుమారునితో సమానం. శివుడు నా మనవడు. చంద్రుడు నా తోబుట్టువు. సముద్రుడు నా తండ్రివంటివాడు. మదనుడు నా కొడుకులాంటివాడు. ప్రభూ! నేను సమస్తలోకాలకు తల్లిని**' అని పలుకుతూ రుక్మిణి తన మనస్సనే తుమ్మెద కృష్ణుని మీదనే లగ్నమై వున్నదన్న విషయాన్ని ప్రదర్శిస్తూ ఒట్టుపెట్టుకొన్నట్టుగా స్పష్టం చేసింది.

**వి :** 1. శతపథబ్రాహ్మణం మేరకు రుద్రుడు (శివుడు) బ్రహ్మకు, ఉషస్సుకు పుట్టినవాడు. పేరు లేదని ఏడుస్తున్న కారణంగా రోదనకారణంగా రుద్రుడని పేరు పెట్టాడు బ్రహ్మ. సోఽరోదీద్యదరోదీత్తస్మాద్రుద్రః (శతపథబ్రాహ్మణం 6-1-3-10) అలా వరుసగా పేర్లు పెట్టుకొంటూ పోగా రుద్ర, శర్వ, పశుపతి, ఉగ్ర, అశని, భవ, మహాదేవ, ఈశాన నామాలు ఏర్పడ్డాయి.

విష్ణుపురాణం, దేవీభాగవతం, మార్కండేయపురాణాల్లో కూడా కొంత విభిన్నంగా కథలున్నాయి కానీ అన్నీ రుద్రుడు బ్రహ్మ కుమారుడని ప్రతిపాదించేవే.

| | | | |
|---|---|---|---|
| 2. **అస్పష్టయత్ :** | **అస్పష్టయత్** | అస్పష్టయతామ్ | అస్పష్టయన్ |
| | అస్పష్టయః | అస్పష్టయతమ్ | అస్పష్టయత |
| | అస్పష్టయమ్ | అస్పష్టయావ | అస్పష్టయామ. |

*

**శ్లో॥ నిత్యానన్దచిదాకృతిం యదుపతే! త్వామేవ మన్యే పతిం**
**యత్తేఽస్త్యచ్యుతనామ విశ్వవిదితం వీరాగ్ర్యగానన్యగమ్ ।**
**తచ్చిన్మాత్రసమీక్షయా యది తదా సర్వేఽపి కిం నాచ్యుతా**
**యద్యేతచ్చిరకాలసంస్థితికృతం పుత్రే తవ స్యాత్తదా ॥14-44**

**అ :** కృష్ణగతమైన అచ్యుతత్వాన్ని అచ్యుతమాత్రపర్యవసాయిగ ప్రతిష్ఠించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** వీర+అగ్ర్య-గ! యదు-పతే! నిత్య+ఆనంద+చిద్-ఆకృతిం త్వామ్ ఏవ పతిం మన్యే. యత్ తే విశ్వ-విదితమ్ అనన్యగమ్ అచ్యుత-నామ అస్తి యది తత్ చిత్+మాత్ర-సమీక్షయా తదా సర్వే అపి అచ్యుతాః కిం న (భవన్తి)? యది ఏతత్ చిర-కాల-సంస్థితి-కృతం తదా తవ పుత్రే స్యాత్.

**ప్ర :** వీర+అగ్ర్య-గ!: = వీరులకు ముందునిలిచి నడచువాడా! (వీరాణామ్ అగ్రే భవస్సన్ గచ్ఛతీతి, తస్మాత్ సంబుద్ధిః), యదు-పతే! = యదువంశరాజా! కృష్ణా! నిత్య+ ఆనంద-చిద్-ఆకృతిమ్ = నిత్యానందజ్ఞాన స్వరూపుడవైన (నిత్యాయామ్ ఆనందచితౌ ఏవ ఆకృతిః యస్య తమ్), త్వామ్-ఏవ = నిన్నే, పతిమ్ = భర్తగా, మన్యే = భావిస్తున్నాను. (మను జ్ఞానే-దివాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.), యత్ = ఎందుకంటే, తే = నీకు, విశ్వ-విదితమ్ = లోకమెరిగినదీ (విశ్వే న విదితమ్), అనన్య-గమ్ = ఇతరులకు కుదరనిదీ అయిన (అన్యం న గచ్ఛతీతి, తమ్), అచ్యుత-నామ = అచ్యుతుడన్నపేరు, అస్తి = వుంది (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యది = ఒకవేళ, తత్ = అది (అచ్యుతత్వం), చిత్-మాత్ర-సమీక్షయా = జ్ఞానమాత్రదృష్టితో అయితే (కేవలా చిత్ చిన్మాత్రం, తస్య సమీక్షా, తయా), తదా = అప్పుడు, సర్వే+అపి = అందరూ (జీవులు), అచ్యుతాః = అచ్యుతులు, కిం న (భవేయుః)? = ఎందుకు కారు? (జీవులలోని జ్ఞానం నిత్యమే కదా!), యది = ఒకవేళ, ఏతత్ = ఇది, చిర...కృతమ్: చిర-కాల = చాలాకాలం, సంస్థితి = ఉండుట చేత, కృతమ్ = ఏర్పడినది అయితే (చిరాయ కాలః, తస్మిన్ సంస్థితిః, తయా కృతమ్), తదా = అప్పుడు, తవ = నీయొక్క, పుత్రే = కుమారుడైన బ్రహ్మయందు (దీర్ఘకాలముండటం వలన), స్యాత్ = ఉండుగాక (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** వీరాగ్రేసరా! యదుపతీ! నీవు నిత్యానందజ్ఞానస్వరూపుడవు. లోకప్రసిద్ధమైన ఇతరులకు ఎవ్వరికీ కుదరని అచ్యుతపదం నీకున్నది. ఆ అచ్యుతత్వం నిత్యానందజ్ఞానస్వరూపత్వం వలన ఏర్పడింది. జ్ఞానమాత్రం చేతనే అచ్యుతత్వమంటే జీవులందరిలోని జ్ఞానం నిత్యం కాబట్టి జీవులందరూ అచ్యుతులు కావాలి. కానీ అలా జరగటం లేదు. చిరకాలసంస్థితియే అచ్యుతత్వానికి కారణమైతే చిరకాలం నిలిచి యుండే బ్రహ్మకూడా అచ్యుతుడు కావాలి. కానీ అలా అనటం లేదు. అందువలన నీ నిత్యానందజ్ఞానస్వరూపత్వమే అచ్యుతత్వం. అది నీకే సొంతం.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే. |
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **స్యాత్ :** | 14-22వ శ్లోక వ్యాఖ్య చూడుదు. | | * |

**శ్లో॥ శేషేఽఙ్గ! శేషే యదశేషమన్తే - బిభ్రత్త్వమభ్రద్యుతిరాత్మగర్భే ।**
**ఆనన్దసాన్ద్రాకృతిమచ్యుతం త్వాం - శ్రీశం తదీశం వరయామి నాన్యమ్ ॥ 45**

**అ :** కృష్ణుని తాను వరించుటలోని ఆంతర్యాన్ని రుక్మిణి నివేదించటం. -ఇంద్రవజ్ర.

**అ :** అంగ! యత్ అన్తే అశేషమ్ ఆత్మగర్భే బిభ్రత్ త్వమ్ అభ్ర-ద్యుతిః శేషే శేషే. తత్ ఆనంద-సాంద్ర-ఆకృతిమ్ అచ్యుతం శ్రీ+ఈశం త్వామ్ ఈశం వరయామి అన్యం న.

**ప్ర :** అంగ! = అందగాడా!, యత్ = ఏ కారణంవలన, అన్తే = ప్రళయవేళలో, అశేషమ్ = సమస్తమైన జగత్తును,

ఆత్మ-గర్భే = నీ కుక్షిలో (ఆత్మనః గర్భః, తస్మిన్), బిభ్రత్ = భరిస్తూ (భృ ధాతువుపై శతృ ప్రత్యయం), త్వమ్ = నీవు, అభ్ర-ద్యుతిః = మేఘకాంతితో (అభ్రస్య ద్యుతిరివ ద్యుతిః యస్య సః), శేషే = ఆదిశేషునిపై, శేషే = శయనిస్తావు. (శీ-స్వప్నే ఆత్మనేపది-లట్-మ.ఏ.), తత్ = ఆ కారణంవలన, ఆనంద... ఆకృతిమ్ = ఆనందఘన రూపుడవై (ఆనంద ఏవ సాంద్రా ఆకృతిః యస్య తమ్), అచ్యుతమ్ = అచ్యుతడవై (నాస్తి చ్యుతం యస్య, తమ్), శ్రీ+ఈశమ్ = లక్ష్మీపతిని (శ్రియః ఈశః, తమ్), ఈశమ్ = భర్తగా, వరయామి = వరిస్తున్నాను. (వృ వరణే చురాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.), అన్యమ్ = ఇతరుని, న (వరయామి) = వరించను.

**తా ॥** సుందరా! ప్రళయకాలంలో అశేషవిశ్వాన్నీ నీ కుక్షిలో ధరించి మేఘకాంతితో ఆదిశేషునిపై శయనిస్తావు. అందుకే ఆనందఘనస్వరూపుడవై అచ్యుతుడవై లక్ష్మీవల్లభుడవైన నిన్ను నేను వరిస్తాను. ఇతరుని వరించను.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. శేషే :** | శేతే | శయాతే | శేరతే | |
| | **శేషే** | శయాథే | శేధ్వే | |
| | శయే | శేవహే | శేమహే. | |
| **వరయామి :** | వరయతి | వరయతః | వరయన్తి | |
| | వరయసి | వరయథః | వరయథ | |
| | **వరయామి** | వరయావః | వరయామః. | * |

**శ్లో॥ దశావృతీదం కిల పద్మజాణ్డ-మనేకధా యస్య హి రోమకూపే ।**
**పరాణువత్తిష్ఠతి పఞ్చభూత-భవః కథం తస్య తవాఙ్గ! దేహః ॥ 14-46**

**అ :** కృష్ణ శరీరానికి పాంచభౌతికత్వాన్ని నిరాకరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అంగ! హి దశ+అవృతి ఇదం పద్మ-జ-అండమ్ అనేక-ధా యస్య రోమ-కూపే పర+అణువత్ తిష్ఠతి తస్య తవ దేహః పంచ-భూత-భవః కథం (భవేత్)?

**ప్ర :** అంగ! = సుందరా! (అంగో దేశేంగశాలిని-వైజయన్తీ-నానా-3), హి = ఏ కారణం వలన, దశ+ఆవృతి = పది ఆవరణలు గల (దశ ఆవృతయః యస్య తత్), ఇదమ్ = ఈ, పద్మ-జ+అండమ్=బ్రహ్మాండం (పద్మే జాయతే ఇతి, తస్య అండమ్), అనేకధా = బహు విధాలుగా, యస్య = ఎవనియొక్క, రోమ-కూపే = రోమరంధ్రంలో (రోమాణాం కూపః, తస్మిన్), పర+అణువత్ = పరమాణువ వలె, తిష్ఠతి = ఉంటుందో (స్థా గతినివృత్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తస్య = అటువంటి, తవ = నీ యొక్క, దేహః = శరీరం, పంచ-భూత-భవః = పంచభూతాలనుండి పుట్టినది (పంచ చ తాని భూతాని తేభ్యః భవః యస్య సః), కథమ్ = ఎట్లు, (భవేత్ = కాగలదు)?

**తా ॥** కృష్ణా! ఈ బ్రహ్మాండం పాంచభౌతికం, దశావృతం. అది అనేక విధాలుగా నీ రోమకూపంలో వుంటుంది. అటువంటి నీ శరీరం ఆ పంచభూతాలనుండి ఎలా పుడుతుంది?

**వి : 1. దశావృతం** : పంచభూతాలు (నేల,నీరు,నింగి,గాలి,ఆకాశం) అహంకారం, మహత్తు, సత్త్వం, రజస్సు, తమస్సు - ఇవి పది ఆవరణలు. వీటితో కూడిన బ్రహ్మాండం కృష్ణునియొక్క ఒక్క రోమకూపంలోనే అనేకవిధాలుగా వుంటుంది. అటువంటి ఆ పంచభూతాలనుండి కృష్ణుడెలా పుడతాడు? ఆధారాధేయభావం విపరీతమై పోతుందని భావం.

| | | | | |
|---|---|---|---|---|
| **2. తిష్ఠతి :** | **తిష్ఠతి** | తిష్ఠతః | తిష్ఠన్తి | |
| | తిష్ఠసి | తిష్ఠథః | తిష్ఠథ | |
| | తిష్ఠామి | తిష్ఠావః | తిష్ఠామః. | * |

**శ్లో॥గోపీరగోపీః కిల లోకనాథ! - స్వాపచ్ఛిదాపాదన! విక్రమౌఘ! ।**
**ఏవం విభో! వఞ్చితదుర్దశాం మాం - స్వీయాం దయావారినిధే! విధేహి ॥ 14-47**

**అ :** గోపికలనువలె తనను కూడా సొంతం చేసికొమ్మని రుక్మిణి కృష్ణుని ప్రార్థించటం. -ఇంద్రవజ్ర.

**అ :** లోక-నాథ! స్వ+ఆపత్+ఛిత్+ఆపాదన! విక్రమ+ఓఘ! విభో! (త్వం)గోపీః అగోపీః కిల. ఏవం దయా-వారి-నిధే! వంచిత-దుర్దశాం మాం స్వీయాం విధేహి.

**ప్ర :** లోక-నాథ = జగత్పతీ!, స్వ+ఆపత్+ఛిత్+ఆపాదన! : స్వ = తనవారియొక్క, ఆపత్ = ఆపదలను, ఛిత్ = ఛేదనాన్ని, ఆపాదన! = కల్పించగల వాడా!, (స్వానామ్ ఆపత్, తస్యాః ఛిత్, తస్యాః ఆపాదనం యేన, తస్మాత్ సంబుద్ధిః), విక్రమ+ఓఘ = పరాక్రమసమూహం గలవాడా! (విక్రమాణామ్ ఓఘః యస్య, తస్మాత్ సంబుద్ధిః), విభో! = ప్రభూ!, (త్వమ్ = నీవు), గోపీః = గోపికలను, అగోపీః కిల=రక్షించావు గదా! (గుపూ రక్షణే పరస్మైపది-లుఙ్-మ.ఏ.), ఏవమ్ = అలాగే, దయా-వారి-నిధే! = దయాసముద్రా! (దయాయాః వారిణః నిధిః, తస్మాత్ సంబుద్ధిః), వంచిత-దుర్దశామ్ : వంచిత = వంచింపబడిన, దుః-దశామ్ = దుష్టులస్థితిగల దానినిగా (వంచితా దుష్టానాం దశా యయా తామ్), మామ్=నన్ను, స్వీయామ్=నీ దానినిగా, విధేహి = చేయి. (వి-ధా ధారణపోషణయోః -పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** లోకనాథా! నీవారికి గలిగే ఆపదలను భేదించేవాడవు నీవు. పరాక్రమనిధివి. గోపికలను నువ్వు కాపాడావు గదా! దయానిధీ! అలాగే నన్ను కూడా నీ దానిని చేసికో! దుష్టులైన శిశుపాలాదులకు నాచే వంచింపబడే స్థితిని కల్గించు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. అగోపీః :** | అగోపీత్ | అగోపిష్టామ్ | అగోపిషుః |
| | **అగోపీః** | అగోపిష్టమ్ | అగోపిష్ఠ |
| | అగోపిషమ్ | అగోపిష్వ | అగోపిష్మ |
| **విధేహి :** | విదధాతు/విధత్తాత్ | విధత్తామ్ | విదధతు |
| | **విధేహి**/విధత్తాత్ | విధత్తమ్ | విధత్త |
| | విధధాని | విదధావ | విదధామ. |

*

**శ్లో॥ కిం రుగ్మిణా భీష్మకేణ కిమన్యైర్నృపసంజ్ఞితైః ।**
**అనాదిసిద్ధాం మాం జాయాం నయతస్తే ప్రయోజనమ్ ॥ 14-48**

**అ :** రుగ్మి, భీష్మకాదుల అనర్హతను రుక్మిణి ప్రతిపాదించటం. -పథ్యావక్త్రమ్.

**అ :** అనాది-సిద్ధాం మాం జాయాం నయతః తే రుగ్మిణా కిం? భీష్మకేణ కిమ్? నృప-సంజ్ఞితైః అన్యైః కిమ్?

**ప్ర :** అనాది-సిద్ధామ్ = ఎప్పటినుండియో లభించిన, జాయామ్ = భార్యను, మామ్ = లక్ష్మిని/నన్ను, నయతః = కొనిపోతున్న, తే = నీకు, రుగ్మిణా = రుక్మితో (రుక్మిణి సోదరుడు), భీష్మకేణ = భీష్మకునితో, నృప-సంజ్ఞితైః = రాజను పేరుగల (నృప ఇతి సంజ్ఞితాః, తైః), అన్యైః = ఇతరులతో, కిమ్? ప్రయోజనమ్ = ఏం పని?

**తా ॥** నేను లక్ష్మిని. నీకు అనాదిగా లభించిన భార్యను. అటువంటి నన్ను తీసికొని పోయేటప్పుడు నీకు రుక్మితో కానీ, భీష్మకునితో కానీ, రాజు లనబడే ఇతరులతో కాని ఏం పని?

**వి :** 1. రుగ్మి గతజన్మలో నరహైల్వలుడనే రాక్షసుడు.

శ్లో॥ జిత్వైవ తావపి జిగాయ చ పౌండ్రకాఖ్యం - శౌరేః సుతం సుతమజైదథ భీష్మకస్య ।
**యః పూర్వమాస** దితిజో నరహైల్వలాఖ్యో - **రుగ్మీతి నామ** చ **బభూవ స కుండినేశః**॥

- మహాభారతతాత్పర్యనిర్ణయః 14/90 *

**శ్లో॥ నయేశ! మామన్యజనైరభోగ్యాం - త్వదఙ్ఘ్రియుగ్మార్చనకర్మయోగ్యామ్ ।**
**ఇమామవస్థామవధూయ నో చే-ద్భవామి భూమ్నో హృదయస్య యోగ్యా ॥ 49**

**అ :** నీవు లేకపోతే నేనూ ఉండనని రుక్మిణి విన్నపం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఈశ! త్వద్-అంఘ్రి-యుగ్మ-అర్చన-కర్మ-యోగ్యామ్ అన్య-జనైః అభోగ్యాం మాం నయ. నో చేత్ ఇమామ్ అవస్థామ్ అవధూయ భూమ్నః హృదయస్య యోగ్యా భవామి.

**ప్ర :** ఈశ!=స్వామీ! కృష్ణ! త్వద్... యోగ్యామ్ : త్వత్ = నీయొక్క, అంఘ్రి = పాదాలయొక్క, యుగ్మ = జంటయొక్క, అర్చన = పూజ అనే, కర్మ = పనికి, యోగ్యామ్ = తగినదానవై (తవ అంఘ్ర్యోః యుగ్మస్య అర్చనమ్ ఏవ కర్మ, తస్య యోగ్యా, తామ్), అన్య-జనైః = ఇతర జనులచే (అన్యే చ తే జనాః, తైః), అభోగ్యామ్ = అనుభవింప దగనిదాననైన (భోక్తుం యోగ్యా భోగ్యా, సా న భవతీతి, తామ్), మామ్ = నన్ను, నయ = తీసికొనిపో! (నీ ప్రాపణే పరస్మైపది-లోట్-మ.ఏ.), నో చేత్ = లేకపోతే, ఇమామ్ = ఈ, అవస్థామ్ = స్థితిని (రుక్మిణీ స్థితిని), అవధూయ = తిరస్కరించి/కప్పిపుచ్చి, భూమ్నః = నిండైన, హృదయస్య = హృదయానికి, యోగ్యా = తగినదాననుగా (లక్ష్మిగా), భవామి = కాగలను. (భూ సత్తాయామ్-పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** స్వామీ! నీ పదయుగసమర్చనమనే పనికి తగినదానను నేను. ఇతరులు అనుభవింప దగని దానను. నన్ను తీసికొనిపో. లేకపోతే ఈ (ఇప్పటి) స్థితిని విడిచి నీ నిండుమనస్సుకు తగిన దాననవుతాను. (నన్ను కొనిపోకపోతే దేహాంతరంలో నీ దాననవుతాను. లేదా రూపాంతరంలో నీ హృదయంలో నిలుస్తాను.)

| | | | |
|---|---|---|---|
| **వి : 1. నయ :** | నయతు/నయతాత్ | నయతామ్ | నయన్తు |
| | **నయ**/నయతాత్ | నయతమ్ | నయత |
| | నయాని | నయావ | నయామ |
| **భవామి :** | భవతి | భవతః | భవన్తి |
| | భవసి | భవథః | భవథ |
| | **భవామి** | భవావః | భవామః. |

*

**శ్లో॥ *దిశాసునాథేక్షణమాశ్రితాయా - ముకున్ద! సౌందర్యసముద్రసాంద్ర! ।***
***దిశాసునాథే క్షణమాశ్రితా! యా-స్తదీయభాగ్యస్య న చేచ్చరన్తీ ॥* 14-50**

**అ :** రుక్మిణి విన్నపాలు. -ఉపేంద్రవజ్ర.

**అ :** సౌందర్య-సముద్ర-సాంద్ర! అసు-నాథ! ముకుంద! ఆశ్రితాయాః (మమ) ఈక్షణం దిశ. న చేత్ దిశాసు చరన్తీ (త్వాం) యాః క్షణమ్ ఆశ్రితాః తదీయ-భాగ్యస్య నాథే.

**ప్ర :** సౌందర్య-సముద్ర-సాంద్ర: సౌందర్య = అందంయొక్క, సముద్ర = కడలిచే, సాంద్ర = దట్టమైన వాడా! (సౌందర్యమితి సముద్రః, తేన సాంద్రః, తస్మాత్ సంబుద్ధిః), అసు-నాథ! = ప్రాణనాథా! (అసూనాం నాథః, తస్మాత్ సంబుద్ధిః), ఆశ్రితాయాః = (నిన్ను) ఆశ్రయించిన, (మమ = నాకు), ఈక్షణమ్ = దర్శనం, దిశ = ఇవ్వు (దిశ = అతిసర్జనే పరస్మైపది-లోట్-మ.ఏ.), న చేత్ = లేకపోతే, దిశాసు = దిక్కులలో, చరన్తీ = తిరుగుతున్నదాననై,

(త్వామ్ = నిన్ను), యాః = ఎవరు, క్షణమ్ = క్షణకాలమైనా, ఆశ్రితాః = చేరగలిగిరో, తదీయ-భాగ్యమ్ = వారి అదృష్టాన్ని, నాథే = అభ్యర్థిస్తాను. (నాథ్-యాంచోపతాపైశ్వర్యాదిషు-ఆత్మనేపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** సౌందర్యసముద్రసాంద్ర! ముకుందా! ప్రాణనాథా! నిన్నే ఆశ్రయించిన నాకు దర్శనమివ్వు. లేకపోతే అన్ని దిక్కులలో నీకై తిరుగుతూ నిన్ను క్షణమైనా చేరగలిగిన కాంతల సౌభాగ్యాన్ని నేను అర్థిస్తాను.

**వి :** 1. ప్రథమ, తృతీయపాదాలకు పాదయమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **దిశ :** | దిశతు/దిశతాత్ | దిశతామ్ | దిశన్తు |
| | **దిశ**/దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ |
| **నాథే :** | నాథతే | నాథేతే | నాథన్తే |
| | నాథసే | నాథేథే | నాథధ్వే |
| | **నాథే** | నాథావహే | నాథామహే. |

*

**శ్లో॥ త్వదైక్యమన్తః స్మరతాం జనానాం - భవత్యనిష్టం కిల దైత్యజుష్టమ్ ।**
**త్వదేకపత్నీమభికాంక్షతస్త-దుపేక్షితుం నార్హసి తానిమాంస్త్వమ్ ॥ 14-51**

**అ :** అద్వైతభావంకన్న భార్యాపహరణం పెద్దతప్పు అని రుక్మిణి ప్రతిపాదించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అంతః త్వద్+ఐక్యం స్మరతాం జనానాం దైత్య-జుష్టమ్ అనిష్టం భవతి కిల. తత్ త్వద్+ఏకపత్నీమ్ అభికాంక్షతః తాన్ ఇమాన్ త్వమ్ ఉపేక్షితుం న అర్హసి.

**ప్ర :** అంతః=లోన (మనస్సులో), త్వద్-ఐక్యమ్ = నీతో అద్వైతాన్ని, స్మరతామ్ = భావించే, జనానామ్ = జనులకు, దైత్య-జుష్టమ్ = దేవతలచే అనుభవింపబడే (దైత్యైః జుష్టమ్), అనిష్టమ్ = కోరనిది (జరుగరానిది), భవతి కిల = జరుగుతుంది గదా!, తత్ = అందువలన, త్వద్-ఏకపత్నీమ్ = నిన్నే భర్తగా భావిస్తున్న (ఏకః పతిః యస్యాః సా ఏకపత్నీ, తామ్), అభికాంక్షతః = కోరుతున్న, తాన్ ఇమాన్ = ఆ వీరిని (శిశుపాలాదులను), త్వమ్ = నువ్వు, ఉప+ఈక్షితుమ్ = పట్టించుకోకపోవటానికి, న అర్హసి = తగవు. (అర్హ్ పూజాయామ్ భ్వాది-పరస్మైపది-లట్-మ.ఏ.)

**తా ॥** నీతో ఐక్యాన్ని (అద్వైతాన్ని) భావించే వారికి రాక్షసులు అనుభవించే అనిష్టం జరుగుతుంది. ఇక నిన్నే భర్తనుగా భావించే వారి విషయంలో నీవు ఉపేక్ష వహించగూడదు. (అద్వైతభావం రాక్షసభావమని కవి ప్రతిపాదన.)

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **భవతి :** | **భవతి** | భవతః | భవన్తి |
| | భవసి | భవథః | భవథ |
| | భవామి | భవావః | భవామః |
| **అర్హసి :** | అర్హతి | అర్హతః | అర్హన్తి |
| | **అర్హసి** | అర్హథః | అర్హథ |
| | అర్హామి | అర్హావః | అర్హామః. |

*

**శ్లో॥ త్వమఙ్గ లక్ష్మీరమణః స్వతంత్ర-స్త్వదీయజాయా కమలా஽హమస్మి ।**
**అసజ్జనానామభిమానహానిం - మదర్థితాయాశ్ఛలతో విధత్స్వ ॥ 14-52**

**అ :** రుక్మిణి తనకోరిక అనే నెపంతో దుర్మార్గుల ఆట కట్టించమని సందేశించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అంగ! త్వం స్వతంత్రః లక్ష్మీ-రమణః అహం త్వదీయ-జాయా కమలా అస్మి. మద్-అర్థితాయాః ఛలతః అసజ్జనానామ్ అభిమాన-హానిం విధత్స్వ.

ప్ర : అంగ = సుందరా! కృష్ణా! త్వమ్ = నువ్వు, స్వతంత్రః = అపరతంత్రుడవు, లక్ష్మీ-రమణః=లక్ష్మీరమణుడవు (లక్ష్మ్యాః రమణః, తస్మాత్ సంబుద్ధిః), అహమ్ = నేను, త్వదీయా = నీయొక్క, జాయా = భార్యనుగా, అస్మి = ఉన్నాను. మద్-అర్థితాయాః = నా కోరికయొక్క (మమ అర్థితా, తస్యాః), ఛలతః = నెపంతో, అసత్+జనానామ్ = చెడ్డవారైన శిశుపాలాదుల యొక్క, అభిమాన-హానిమ్ = అహంకారనాశనాన్ని (అహంకారస్య హానిః, తామ్), విధత్స్వ = కలిగించు. (వి-ధా ధారణపోషణయోః - ఆత్మనేపది-లోట్-మ.ఏ.)

**తా ॥** కృష్ణా! నీవు లక్ష్మీరమణుడవు. స్వతంత్రుడవు. నేను నీ భార్యను. నా కోరిక అనే నెపంతో నీవు దుర్మార్గుల అభిమానాన్ని కనిపించకుండా చేయి.

**వి :** 1. రుక్మిణి పంపిన సందేశంలో ఇది చివరి శ్లోకం. మొత్తం పదునాలుగు శ్లోకాలలో రుక్మిణీ సందేశం విస్తరించింది విభిన్నఛందస్సులలో. భాగవతంలో ఏడు శ్లోకాలు మాత్రమే కనిపిస్తాయి. అన్నీ వసంతతిలక వృత్తాలే. తెలుగులో పోతన దీనిని బాగా విస్తరించాడు, ఎనిమిది పద్యాలలో పోతన మూలాన్ని అనుసరిస్తూనే మూలాన్ని విస్తరిస్తున్నట్లుగా అనువాదాన్ని తీర్చిదిద్దాడు. ఎనిమిది పద్యాలలోనూ మూడు సీసపద్యాలుండటం విస్తృతికి అవకాశమిచ్చింది. మూలంలో అభిలాషకు (పూర్వరాగానికి) ప్రాధాన్యముండగా పోతన దానిని కొంత పూర్వరాగవిప్రలంభంగా కూడా తీర్చిదిద్దాడు. శిశుపాలుని అనర్హతను, కృష్ణుని అర్హతను తెలియజేసే రెండు పద్యాలను ఆస్వాదిద్దాం-

ఉ. శ్రీయుతమూర్తి! యో పురుషసింహమ! సింహముపాలి సొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీ పదాంబుజ
ధ్యాయిని యైన నన్నువడిఁ దాఁ గొని పోయెద నంచు నున్న వాఁ
డా యధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్.

సీ. ప్రాణేశ ! నీ మంజుభాషలు వినలేని - కర్ణరంధ్రంబుల కలిమి యేల?
పురుషరత్నమ! నీవు భోగింపఁగా లేని - తనులతవలని సౌందర్యమేల ?
భువనమోహన! నినుఁ బొడగానఁగాలేని - చక్షురింద్రియముల సత్త్వమేల ?
దయిత! నీయధరామృతం బానఁగా లేని - జిహ్వకు ఫలరససిద్ధియేల ?.

ఆ. నీరజాతనయన! నీ వనమాలికా - గంధ మబ్బలేని ఘ్రాణమేల ?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని - జన్మమేల? యెన్ని జన్మములకు?

- పోతన భాగవతము 10/1703,1708

పోతనరచనలో **శృంగారభావన** ప్రధానంగా కనిపిస్తుండగా వాదిరాజరుక్మిణిలో **తాత్త్వికత** ప్రధానంగా కనిపిస్తుంది. కవిలోని ద్వైతసిద్ధాంతప్రతిష్ఠాపనాభిలాష దానికి ఎక్కువ అవకాశ మిచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 2. **అస్మి :** | అస్తి | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | **అస్మి** | స్వః | స్మః |
| **విధత్స్వ :** | విధత్తామ్ | విదధాతామ్ | విదధతామ్ |
| | **విధత్స్వ** | విధాథామ్ | విదధ్వమ్ |
| | విదధై | విదధావహై | విదధామహై. |

*

**శ్లో॥ ఇతి పత్రగతాలాపం సమాలోక్య స మాధవః ।**
**రథమారుహ్య తరసా ప్రతస్థే యత్ర సా ప్రియా ॥ 14-53**

**అ :** రుక్మిణికై కృష్ణప్రయాణం. -పథ్యావక్త్రమ్.

**అ :** ఇతి పత్ర-గత+ఆలాపం సమాలోక్య సః మాధవః తరసా రథమ్ ఆరుహ్య యత్ర సా ప్రియా (తత్ర) ప్రతస్థే.

**ప్ర :** ఇతి=ఈరీతిగా నున్న, పత్ర-గత+ఆలాపమ్ : పత్ర-గత=లేఖలో నున్న, ఆలాపమ్ = సందేశాన్ని, సమ్+ఆ-లోక్య=బాగా పరికించి (సమ్ ఆ-లోకృధాతువుపై ల్యప్ ప్రత్యయం), సః = ఆ, మాధవః = కృష్ణుడు, తరసా = వేగంగా (రంహస్తరః క్లీ ప్రసభో జవో వేగః - వైజయన్తీ-స్వర్గ-55), రథమ్ = రథాన్ని, ఆరుహ్య = ఎక్కి (ఆ రుహ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), యత్ర = ఎక్కడ, సా = ఆ, ప్రియా = ప్రియురాలైన రుక్మిణి కలదో, (తత్ర = అక్కడకు), ప్రతస్థే = బయలుదేరాడు (స్థా గతినివృత్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి వ్రాసి పంపిన ఆ లేఖలోని సారాంశాన్ని బాగా గమనించి కృష్ణుడు వెంటనే రథమెక్కి రుక్మిణివున్న తావుకు (కుండిన నగరానికి) బయలుదేరాడు.

**వి :** 1. పోతన భాగవతంలో అగ్నిద్యోతనబ్రాహ్మణుడు చెప్పిన రుక్మిణీ సందేశం విని వెంటనే తన నిర్ణయాన్ని తెలియజేస్తాడు బ్రాహ్మణునికి-

ఉ. కన్నియమీఁద నా తలఁపు గాఢము; కూరుకురాదు రేయి నా
కెన్నడు; నా వివాహము సహింపక రుక్మి తలంచు కీఁడు నే
మున్నె యెఱుఁగుదున్; బరుల మూఁక లడంచి కుమారిఁ దెత్తు వి
ద్వన్నుత! మాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడిఁ దెచ్చు కైవడిన్. -పోతనభాగవతము 10/1713

2. **ప్రతస్థే :**

| | | |
|---|---|---|
| **ప్రతస్థే** | ప్రతస్థాథే | ప్రతస్థిరే |
| ప్రతస్థిషే | ప్రతస్థాథే | ప్రతస్థిధ్వే |
| ప్రతస్థే | ప్రతస్థివహే | ప్రతస్థిమహే |

స్థా ధాతువు నైసర్గికంగా పరస్మైపదం. కానీ 'ప్ర' పూర్వకమైనందువల్ల 'సమవప్రవిభ్యః స్థః' (అష్టాధ్యాయి 1-3-22) సూత్రంతో ఆత్మనేపదం అవుతుంది. *

**శ్లో॥ సన్దేశం భీష్మకన్యాయాః సన్దృశ్య కమలేక్షణః ।**
**తం దేశం దయయాఽగచ్ఛన్మన్దస్మితముఖోఽచ్యుతః ॥ 14-54**

**అ :** కృష్ణుడు విదర్భదేశానికి వెళ్ళటం. -పథ్యావక్త్రమ్.

**అ :** కమల+ఈక్షణః అచ్యుతః భీష్మ-కన్యాయాః సందేశం సందృశ్య మంద-స్మిత-ముఖః సన్ దయయా తం దేశమ్ అగచ్ఛత్.

**ప్ర :** కమల+ఈక్షణః=కమలాక్షుడైన (కమలే ఇవ ఈక్షణే యస్య సః), అచ్యుతః=కృష్ణుడు, భీష్మ-కన్యాయాః = భీష్మని పుత్రి అయిన రుక్మిణియొక్క, సందేశమ్ =సందేశాన్ని, సందృశ్య = చక్కగా చూచి, మంద-స్మిత-ముఖః (సన్) = చిఱునవ్వుమోమువాడై, దయయా = కృపతో, తం-దేశమ్ = ఆ విదర్భదేశానికి, అగచ్ఛత్ = వెళ్ళాడు. (గమ్ గతౌ పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కమలేక్షణుడైన కృష్ణుడు రుక్మిణి సందేశాన్ని విని దయతో చిఱునవ్వులు మోమున నిలుపుకొని విదర్భదేశానికి బయలుదేరాడు.

**వి :** 1. **అగచ్ఛత్ :**

| | | |
|---|---|---|
| **అగచ్ఛత్** | అగచ్ఛతామ్ | అగచ్ఛన్ |
| అగచ్ఛః | అగచ్ఛతమ్ | అగచ్ఛత |
| అగచ్ఛమ్ | అగచ్ఛావ | అగచ్ఛామ. |

*

**శ్లో॥భైష్మీకరగ్రహణమేష కరిష్యతీతి – వక్తవ్యమస్తి కిమిహాశ్రితపక్షపాతీ ।**
**యద్బ్రాహ్మణస్య సదయః కరపల్లవేన – ప్రత్యగ్రహీద్వచనమాత్రహృతోఽపి హస్తమ్॥55**

**అ :** కృష్ణుని దయాళుత్వాన్ని కవి ప్రస్తావించటం. –వసంతతిలక.

**అ :** ఆశ్రిత–పక్ష–పాతీ ఏషః భైష్మీ–కర–గ్రహణం కరిష్యతి ఇతి వక్తవ్యమ్ అస్తి కిమ్? యద్ వచన–మాత్ర–హృతః అపి సదయః (సన్) కర–పల్లవేన బ్రాహ్మణస్య హస్తం ప్రత్యగ్రహీత్.

**ప్ర :** ఆశ్రిత–పక్ష–పాతీ=ఆశ్రయించినవారివైపు నిలిచే (ఆశ్రితానాం పక్షే పతనం శీలమస్య ఇతి), ఏషః = ఈ కృష్ణుడు, భైష్మీ–కర–గ్రహణమ్ : భైష్మీ = భీష్మపుత్రి (రుక్మిణి)యొక్క, కర–గ్రహణమ్ = పాణిగ్రహణాన్ని (కరస్య గ్రహణమ్), కరిష్యతి+ఇతి = చేయగలడు అని (కృ–కరణే పరస్మైపది–ల్యట్–ప్ర.ఏ.), వక్తవ్యమ్ = చెప్పవలసింది. అస్తి కిమ్ = ఉన్నదా? (అస్ భువి–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), యత్ = ఎందువల్లనంటే, వచన–మాత్ర–హృతః –అపి=మాట మాత్రంచేత లోబడినా, సదయః (సన్) = కృపాళువై, కర–పల్లవేన = చివురుటాకు వంటి తన చేతితో, బ్రాహ్మణస్య = (సందేశం తెచ్చిన) విప్రునియొక్క, హస్తమ్ = చేతిని, అగ్రహీత్ = పట్టుకొన్నాడు.

**తా ॥** ఆశ్రితపక్షపాతి అయిన కృష్ణుడు రుక్మిణీ పాణిగ్రహణం చేస్తాడని మరలా చెప్పవలసిన అవసరం లేదు. ఎందుకంటే రుక్మిణి సందేశం విని, ఆ సందేశం తెచ్చినంతమాత్రంచేతనే దయాశాలియై ఆ బ్రాహ్మణుని చేతిని పట్టుకొన్నాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. అగ్రహీత్ :** | **అగ్రహీత్** | అగ్రహీష్టామ్ | అగ్రహీషుః |
| | అగ్రహీః | అగ్రహీష్టమ్ | అగ్రహీష్ట |
| | అగ్రహీషమ్ | అగ్రహీష్వ | అగ్రహీష్మ. |

*

**శ్లో॥ ఉద్యన్మరీచిశతభాసితసర్వదేశః – పద్మోదయాయ స నిశాచరఘూకశోకమ్ ।**
**పుష్ణన్ లలాస దినరాడివ పూర్వసిన్ధోః – సచ్చక్రమానితగతిర్హి తదోపకణ్ఠే ॥ 56**

**అ :** తూర్పుసముద్రం దగ్గర కృష్ణుడు సూర్యునిలా ప్రకాశించటం. –వసంతతిలక.

**అ :** తదా పద్మ(ద్మా)+ఉదయాయ ఉద్యత్+మరీచి– శత–భాసిత–సర్వ–దేశః నిశాచర–ఘూక–శోకం పుష్ణన్ సత్–చక్ర–మానిత–గతిః సః పూర్వ–సిన్ధోః ఉపకంఠే దినరాట్+ఇవ లలాస.

**ప్ర :** తదా = అప్పుడు, పద్మ(ద్మా)+ఉదయాయ : పద్మ (ద్మా) = తామరయొక్క/లక్ష్మియొక్క ఉదయాయ = అభ్యుదయానికై (పద్మస్య/పద్మాయాః ఉదయః, తస్మై), ఉద్యత్... దేశః : ఉద్యత్=పైకి ఎగస్తున్న, మరీచి=కిరణాలయొక్క, శత = వందలచే, భాసిత = అలంకరింప బడిన, సర్వ = సమస్తమైన, దేశః = ప్రదేశాలుగలవాడై (ఉద్యతాం మరీచీనాం శతైః భాసితాః సర్వే చ తే దేశాః యేన సః), నిశాచర... శోకమ్ : నిశాచర = రాక్షసు లనే, ఘూక = గుడ్లగూబలయొక్క, శోకమ్ = దుఃఖాన్ని (నిశాచరాః ఏవ ఘూకాః, తేషాం శోకః, తమ్), పుష్ణన్ = పెంచుతూ (పుష్ (క్ర్యాది) ధాతువుపై శతృ ప్రత్యయం), సత్... గతిః : సత్+చక్ర = మంచివారియొక్క సమూహంచే / తగిన చక్రం వలన, మానిత = గౌరవింపబడిన, గతిః = నడవడిగలవాడై (సతా చక్రేణ మానితా గతిః యస్య సః), సః = ఆ కృష్ణుడు, దినరాట్–ఇవ = సూర్యునిలా (దినస్య రాట్ దినరాట్, స ఇవ), పూర్వ–సిన్ధోః = తూర్పుకడలియొక్క (పూర్వశ్చ అసౌ సిన్ధుః, తస్య), ఉపకంఠే = దగ్గర, లలాస హి = ప్రకాశించాడు. (లస శ్లేషణక్రీడనయోః ప్రకాశే చ–భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** అప్పుడు పద్మాభ్యుదయానికై కృష్ణుడు సూర్యుడిలా పూర్వసముద్రం దగ్గర ప్రకాశించాడు. ఆయన ఎగిసిపడుతున్న కిరణశతాలతో సమస్తప్రదేశాలను ప్రకాశింపజేస్తున్నాడు. రాక్షసు లనే గుడ్లగూబలశోకాన్ని పెంపొందింపజేస్తున్నాడు. ఆయన గమనాన్ని సజ్జనులందరూ మన్నిస్తున్నారు.

**వి :** 1. శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారం. కృష్ణునకు సూర్యునితో పోలిక. ఆ పోలికకు సహకరించేది పద్మ+ఉదయ, పద్మా+ఉదయ పద్మపదం మీది శ్లేష. నిశాచర-ఘూక (నిశాచరులనే ఘూకాలు)-అన్నచోట రూపకం. 'చక్రపదం (సమూహం, సుదర్శనచక్రం) మీది శ్లేష.

| | | | |
|---|---|---|---|
| 2. **లలాస :** | **లలాస** | లలసతుః | లలుసుః |
| | లలసిథ | లలసథుః | లలస |
| | లలాస/లలస | లలసివ | లలసిమ. |

*

**శ్లో॥ దుష్టౌఘపూర్ణాం నగరీం ప్రవేష్టుం - కృష్ణో హ్యనిచ్ఛన్ బహిరేవ వాసమ్ ।**
**చక్రే స్థలీ నాగరికైర్వృతా సా - తదీక్షణోత్కైరజయత్పురీం తామ్ ॥ 14-57**

**అ :** కృష్ణుడు నగరం వెలుపలనే విడిది చేయటం. -ఇంద్రవజ్ర.

**అ :** కృష్ణః దుష్ట+ఓఘ-పూర్ణాం నగరీం ప్రవేష్టుమ్ అనిచ్ఛన్ బహిః ఏవ వాసం చక్రే. తద్-ఈక్షణ+ఉత్కైః నాగరికైః వృతా సా స్థలీ తాం పురీమ్ అజయత్.

**ప్ర :** కృష్ణః = కృష్ణుడు, దుష్ట = దుర్మార్గులయొక్క, ఓఘ = సమూహంతో, పూర్ణామ్ = నిండినట్టి (దుష్టానామ్ ఓఘః, తేన పూర్ణా, తామ్) (ఓఘః ప్రవాహో నివహః - నానార్థరత్నమాలా - పంక్తి-276), నగరీమ్ = నగరాన్ని, ప్రవేష్టుమ్ = ప్రవేశించటానికి (ప్ర-విశ ధాతువుపై తుమున్ ప్రత్యయం), అనిచ్ఛన్ = ఇష్టపడక, బహిః+ఏవ = వెలుపలనే, వాసం చక్రే = విడిది చేశాడు. (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), తద్... ఉత్కైః : తద్ = ఆ కృష్ణునియొక్క, ఈక్షణ = దర్శనమందు, ఉత్కైః = ఉబలాటం గల (ఉత్క ఉన్మనాః-అమరకోశః-విశేష్య-8), నాగరికైః = నగరజనులచేత, వృతా=చుట్టబడిన, సా స్థలీ = ఆ తావు, తామ్ = ఆ, పురీమ్=నగరిని, అజయత్ = గెలిచింది. (జి జయే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** దుర్మార్గుల సమూహంతో నిండిన ఆ నగరంలోనికి ప్రవేశించటం కృష్ణునకిష్టం లేదు. అందుకని నగరం వెలుపలే విడిది చేశాడు. అయితే నాగరికులైన జనులు కృష్ణుని చూడాలన్న ఉబలాటంతో ఆయన చుట్టూ మూగారు. అప్పు డాతావు నగరాన్నే జయించింది.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **అజయత్ :** | **అజయత్** | అజయతామ్ | అజయన్ |
| | అజయః | అజయతమ్ | అజయత |
| | అజయమ్ | అజయావ | అజయామ. |

*

**శ్లో॥ శౌరిం తదోపాయనపాణయస్త-మాలోక్య సౌన్దర్యసముద్రసాన్ద్రమ్ ।**
**వీరానపార్థానపరానుపేక్ష్య - పౌరాః సదారాః కిల తే ప్రచక్రుః ॥ 14-58**

**అ :** పురజనులందరూ శిశుపాలాదులను ఉపేక్షించి కృష్ణుని సేవించుట. -ఇంద్రవజ్ర.

**అ :** తదా సదారాః తే పౌరాః సౌందర్య-సముద్ర-సాంద్రం శౌరిమ్ ఉపాయన-పాణయః (సన్తః) ఆలోక్య అపరాన్ వీరాన్ ఉపేక్ష్య అపార్థాన్ ప్రచక్రుః కిల.

**ప్ర :** తదా = ఆ సమయంలో, సదారాః = భార్యలతో కూడినవారై, తే = ఆ, పౌరాః = పురజనులు, సౌందర్య-సముద్ర-సాంద్రమ్ : సౌందర్య = అందమనే, సముద్ర = కడలిచే, సాంద్రమ్ = చిక్కనైన (సౌందర్యమేవ సముద్రః , తేన సాంద్రః, తమ్), శౌరిమ్ = కృష్ణుని, ఉపాయన-పాణయః (సన్తః) = కానుకలను చేతబట్టినవారై (ఉపాయనాని పాణిషు యేషాం తే), ఆలోక్య = చూసి, అపరాన్ = ఇతరులైన, వీరాన్ = వీరులను, ఉపేక్ష్య = చిన్న చూపు చూసి,

అపార్థాన్=నిష్ప్రయోజకులనుగా (అపనీతః అర్థః యేభ్యః తాన్), ప్రచక్రుః = చేశారు.

**తా ॥** ఆ సమయంలో పౌరులు కానుకలు చేతబట్టి భార్యలతో కలిసి కృష్ణునిదగ్గరకు వచ్చి, దర్శించి, ఇతర రాజులనందరినీ ప్రయోజనశూన్యులను చేశారు.

**వి :** 1. భాగవతంలో రామకృష్ణులరాకను విని భీష్మకుడు వారిని స్వాగతించి, ఆతిథ్య మిచ్చినట్లు కనిపిస్తుంది. (భాగవతం 10/53/32-34) కవి ప్రకృతకావ్యంలో కృష్ణుడు నగరిలోనికి అడుగుపెట్టడానికి కూడా ఇష్టపడనట్లు చెప్పటం జరిగింది. దానికి కారణాన్ని కూడా 57వ శ్లోకంలో కవి వివరించాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రచక్రుః :** | ప్రచకార | ప్రచక్రతుః | **ప్రచక్రుః** |
| | ప్రచకర్థ | ప్రచక్రథుః | ప్రచక్ర |
| | ప్రచకార/ప్రచకర | ప్రచకృవ | ప్రచకృమ. |

*

**శ్లో॥ నాయం స్మరః శ్యామలకోమలాఙ్గః - నాయం శశీ వీతకలఙ్కశఙ్కః ।**
**నాయం రవిర్లోకదృగార్తిహారీ - సోఽయం పురాణః పురుషోఽద్వితీయః ॥14-59**

**అ :** పౌరులు కృష్ణుని పురాణపురుషునిగా భావించుట. -ఇంద్రవజ్ర.

**అ :** శ్యామల-కోమల-అంగః అయం స్మరః న. వీత-కలంక-శంకః అయం శశీ న. లోక-దృగ్-ఆర్తి-హారీ అయం రవిః న. సః అయమ్ అద్వితీయః పురాణః పురుషః.

**ప్ర :** శ్యామ-కోమల+అంగః : శ్యామల=చామనచాయతో, కోమల = మృదువైన, అంగః = శరీరంగల (శ్యామలం కోమలం చ అంగం యస్య సః), అయమ్ = ఈ వ్యక్తి, స్మరః = మదనుడు, న=కాదు. వీత-కలంక-శంకః =మచ్చ గురించిన సందేహం తొలగినందు వలన (వీతా కలంకస్య శంకా యస్మిన్ సః), అయమ్ = ఇతడు, శశీ = చంద్రుడు, న = కాదు, లోక... హారీ : లోక = జనులయొక్క, దృక్ = చూపులలోని, ఆర్తి = దుఃఖాన్ని, హారీ = అపహరించేవాడైనందువల్ల (లోకానాం దృశామ్ ఆర్తేః హరణం శీలమ్ అస్య ఇతి), రవిః = సూర్యుడు, న = కాదు, సః+అయమ్ = ఆ ఈ వ్యక్తి, అద్వితీయః = సాటిలేని (నాస్తి ద్వితీయః యస్య సః), పురాణః పురుషః = ప్రాచీనపురుషుడు.

**తా ॥** ఈయన మదనుడు కాదు. ఎందుకంటే చేమనచాయ గల శరీరమితనికుంది. ఈయన చంద్రుడు కాదు. ఎందుకంటే ఇతనిలో కళంకశంకకు అవకాశం లేదు. ఈయన సూర్యుడు కాదు. ఎందుకంటే ఈయన లోకుల కళ్ళలోని ఆర్తిని పోగొట్టగలుగుతున్నాడు. ఈయన అసమానుడైన **పురాణపురుషుడు**.

**వి :** 1. శ్లోకంలో వ్యతిరేకం వాచ్యంగాను, పోలిక వ్యంగ్యంగానూ వుంది. కానీ వ్యతిరేకాలంకారానికి కూడా మూలం ఉపమయే కాబట్టి ఇక్కడ వ్యతిరేకాలంకారధ్వని వుంది. కృష్ణునికీ మదనునితోనూ, చంద్రునితోనూ, సూర్యునితోనూ పోలికను కాదనటానికి కారణం చెప్పబడింది. కాబట్టి పోలిక వ్యంగ్యంగా వుంటుంది. *

**శ్లో॥ శ్రీరేవ సా భీష్మసుతా మనోజ్ఞా - శ్రీవల్లభోఽయం సుభగాగ్రగణ్యః ।**
**ఏతౌ సమేతౌ భవతామితీమే - ధాతారమాత్మేష్టదమర్థయన్తే ॥ 14-60**

**అ :** రుక్మిణీ కృష్ణులు దంపతులు కావాలని ప్రజలు బ్రహ్మను ప్రార్థించటం. -ఇంద్రవజ్ర.

**అ :** మనోజ్ఞా సా భీష్మ-సుతా శ్రీః ఏవ. సుభగ+అగ్ర-గణ్యః అయం శ్రీ-వల్లభః. ఏతౌ సమేతౌ భవతామ్ ఇతి ఇమే ఆత్మ+ఇష్ట-దం ధాతారమ్ అర్థయన్తే.

**ప్ర :** మనోజ్ఞా = అందమైన, సా = ఆ, భీష్మ-సుతా = భీష్ముని కూతురు రుక్మిణి (భీష్మస్య సుతా), శ్రీః-ఏవ=లక్ష్మియే,

సుభగ... గణ్యః : సుభగ=అందగాళ్ళలో, అగ్ర-గణ్యః = ముందు లెక్కింపదగిన (శ్రేష్ఠుడైన) (సుభగేషు అగ్రే గణయితుం యోగ్యః), అయమ్ = ఈయన (కృష్ణుడు), శ్రీ-వల్లభః = లక్ష్మీపతి, ఏతౌ = ఈ ఇద్దరూ, సమేతౌ = కూడినవారుగా, భవతామ్ = అగుదురు గాక (భూ సత్తాయామ్-పరస్మైపది-లోట్-ప్ర.ద్వి), ఇతి = అని, ఇమే = ఈ ప్రజలు, ఆత్మ+ఇష్ట-దమ్ = తాముకోరినదిచ్చే (ఆత్మనః ఇష్టం దదాతీతి, తమ్), ధాతారమ్ = బ్రహ్మను, అర్థయన్తే = అడుగుతున్నారు. (అర్థ ఉపయాంచాయామ్-ఆత్మనేపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ఈ భీష్మపుత్రి అందగత్తె. సాక్షాత్తూ లక్ష్మి. సుందరులలో శ్రేష్ఠుడైన ఈయన లక్ష్మీవల్లభుడు. వీరిద్దరి కూడిక జరిగితే బావుంటుంది అని కృష్ణుని చూడవచ్చిన ప్రజలు ఆ ఇద్దరినీ కలపాలని బ్రహ్మను యాచిస్తున్నారు.

**వి :** 1. ప్రజల ఈ కోరిక మూలభాగవతంలోనిదే.

శ్లో॥ అస్యైవ భార్యా భవితుం రుక్మిణ్యర్హతి నాపరా ।
అసావప్యనవద్యాత్మా భైష్మ్యాః సముచితః పతిః ॥

శ్లో॥ కించిత్సుచరితం యన్నస్తేన తుష్టస్త్రిలోకకృత్ ।
అనుగృహ్ణాతు గృహ్ణాతు వైదర్భ్యాః పాణిమచ్యుతః ॥ - భాగవతమ్ 10/53/37,38

పోతన ఈ శ్లోకాలకు అందమైన అనువాదాన్ని అందించారు.

మ. తగు నీచక్రి విదర్భరాజసుతకున్; దథ్యంబు వైదర్భియుం
దగు నీచక్రికి; నింతమంచి దగునే? దాంపత్య మీ యిద్దఱిం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరి గదా! దర్పాహతారాతియై
మగఁడౌ ఁగావుతఁ జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్. -పోతనభాగవతము-10/1737

కారణజన్ములకళ్యాణం జగత్కల్యాణకారకమవుతుంది కాబట్టి అది ప్రజల పుణ్యఫలమే.

| | | | |
|---|---|---|---|
| 2. **భవతామ్ :** | భవతు/భవతాత్ | **భవతామ్** | భవన్తు |
| | భవ/భవతాత్ | భవతమ్ | భవత |
| | భవాని | భవావ | భవామ. |

*

**శ్లో॥ గృహ్ణాతి యద్యేణదృశీకరం నః - పుణ్యేన సోఽయం పురుషాగ్రగణ్యః ।**
**స్వర్ణే తదా నీలమణిం సమేతం - మన్యామహే లోహమతోఽన్యథా చేత్ ॥14-61**

**అ :** రుక్మిణిని స్వర్ణంగా కృష్ణుని నీలమణిగా పోల్చి ప్రజలు ఆలోచించటం. -ఇంద్రవజ్ర.

**అ :** పురుష+అగ్ర-గణ్యః సః అయం నః పుణ్యేన యది ఏణదృశీ-కరం గృహ్ణాతి తదా నీలమణి స్వర్ణే సమేతం మన్యామహే. అతః అన్యథా చేత్ లోహం మన్యామహే.

**ప్ర :** పురుష+అగ్ర-గణ్యః = పురుషోత్తముడైన (పురుషేషు అగ్రే గణయితుం యోగ్యః), సః+అయమ్ = ఆ ఈ కృష్ణుడు, నః = మనయొక్క, పుణ్యేన = పుణ్యంతో, ఏణదృశీ = మృగాక్షి అయిన రుక్మిణియొక్క, కరమ్ = చేతిని, యర్హి = ఎప్పుడు (యదా యర్హి తదా తర్హి - వైజయన్తీ-అవ్యయ-5), గృహ్ణాతి = స్వీకరిస్తాడో (గ్రహ ఉపాదానే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తదా = అప్పుడు, నీలమణిమ్ = నీలమణిని, స్వర్ణే = బంగారులో, సమ+ఇతమ్=కూర్చబడినది (పొదగబడినది)గా, మన్యామహే=భావిస్తాము (మన్ జ్ఞానే-దివాది-ఆత్మనేపది-లట్-ఉ.బ.), అతః=దానికన్న, అన్యథా చేత్ = మరొకరీతిగా అయిన (కృష్ణుడు గాక ఇతరులు రుక్మిణిని చేపడితే), స్వర్ణే-సమేతమ్ = బంగారులో కూర్చిన, లోహమ్ = ఇనుపముక్కగా, (మన్యామహే = భావిస్తాం)

**తా ॥** పురుషాగ్రగణ్యుడైన కృష్ణుడు మన పుణ్యంవలన రుక్మిణిని చేపడితే అప్పుడు ఇంద్ర-నీలమణిని బంగారులో పొదిగినట్లే. అలాకాక మరెవరైనా ఆమెను చేపడితే బంగారులో ఇనుపముక్కను కూర్చినట్లే.

**వి :** 1. బంగారానికి రత్నాన్ని కూర్చటమే యోగ్యం - తిక్కన తన భారతకృతిని దేవదేవునకు అంకితమిస్తూ ఇదే భావాన్ని ప్రకటిస్తాడు-

కూర్చుట నూత్నరత్నమునకుం గనకంబునకుం దగున్ జనా
ళ్యర్చితమైన భారతమపారకృపాపరతంత్రవృత్తిమైఁ
బేర్చిన దేవదేవునకుఁ బ్రీతిగనిచ్చుట సర్వసిద్ధి నా
నేర్చిన భంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. - మహాభారతము-విరాటపర్వం-1/29

2. ఇది సమాలంకారం. బంగారానికి, ఇంద్రనీలమణికి అనురూపమైన కూర్పు కావాలని జనాకాంక్ష. '**సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయోరప్యనురూపయోః**' (కు. 61)

| | | | |
|---|---|---|---|
| 3. **గృహ్ణాతి :** | **గృహ్ణాతి** | గృహ్ణీతః | గృహ్ణన్తి |
| | గృహ్ణాసి | గృహ్ణీథ | గృహ్ణీథ |
| | గృహ్ణామి | గృహ్ణీవః | గృహ్ణీమః |
| **మన్యామహే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | మన్యే | మన్యావహే | **మన్యామహే.** |

*

**శ్లో॥ ఇత్థం గృణన్తః కిల వృన్దశస్తం - నత్వా ముకున్దం నయనైః పపుస్తే ।**
**కృష్ణోఽపి సర్వాన్ సదయావలోకై-ర్ముగ్ధస్మితోఽరఞ్జయదఞ్జసా తాన్ ॥ 14-62**

**అ :** ప్రజ కృష్ణసందర్శనంతో తృప్తిపడటం. -ఇంద్రవజ్ర.

**అ :** ఇత్థం వృందశః గృణన్తః తే తం ముకున్దం నత్వా నయనైః పపుః కృష్ణః అపి ముగ్ధ-స్మితః (సన్) తాన్ సర్వాన్ సదయ+అవలోకైః అంజసా అరంజయత్.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, వృందశః = గుంపులుగా, గృణన్తః = మాటాడుకొంటూ (గౄ ధాతువుపై శతృ ప్రత్యయం), తే = ఆ జనులు, తం ముకున్దమ్ = ఆ కృష్ణునికి, నత్వా = నమస్కరించి (నమ్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), నయనైః = కళ్ళతో, పపుః = త్రాగారు. (పా పానే భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.బ.), కృష్ణః+అపి = కృష్ణుడు కూడా, ముగ్ధ-స్మితః (సన్) = అందమైన చిఱునవ్వుతో, తాన్ సర్వాన్ = వారినందరినీ, సదయ+అవలోకైః : సదయ = దయతో కూడిన, అవలోకైః = చూపులతో, అంజసా = చక్కగా, అరంజయత్ = రంజింపజేశాడు. (రంజ్ రాగే-భ్వాది-ణిచ్-పరస్మైపది-లజ్-ప్ర.ఏ.)

**తా ॥** గతశ్లోకంలో వర్ణించినరీతిగా ప్రజలు గుంపులుగా మాటాడుకొంటూ కృష్ణునకు నమస్కరించి కళ్ళతో ఆయనను త్రాగారు. కృష్ణుడు కూడా అందమైన చిఱునవ్వులు చిందిస్తూ కరుణాదృక్కులతో వారిని రంజింపజేశాడు.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **పపుః :** | పపౌ | పపతుః | **పపుః** |
| | పపిథ/పపాథ | పపథుః | పప |
| | పపౌ | పపివ | పపిమ |
| **అరంజయత్ :** | **అరంజయత్** | అరంజయతామ్ | అరంజయన్ |
| | అరంజయః | అరంజయతమ్ | అరంజయత |
| | అరంజయమ్ | అరంజయావ | అరంజయామ. |

*

**శ్లో॥ చలత్పతాకోజ్జ్వలచామరౌఘాం - పరిస్ఫురచ్ఛత్రసహస్రశోభామ్ ।**
**విచిత్రతూర్యధ్వనిపూరితాశా-మథో వితేనుః కులదేవయాత్రామ్ ॥ 14-63**

**అ :** కులదేవ యాత్రారంభం -ఉపేంద్రవజ్ర.

**అ :** అథో చలత్-పతాకా+ఉజ్జ్వల-చామర+ఓఘాం పరిస్ఫురత్-ఛత్ర-సహస్ర-శోభాం విచిత్ర-తూర్య-ధ్వని-పూరిత+ఆశాం కుల-దేవ-యాత్రాం వితేనుః.

**ప్ర :** అథో = అటుతర్వాత (అథో అథార్థేషు - శబ్దార్థకల్పతరుః-పుట 50), చలత్... రౌఘామ్ : చలత్ = కదులుతున్న (రెపరెపలాడుతున్న), పతాకా = పతాకలు, ఉజ్జ్వల = ప్రకాశించే, చామర = వీవెనలయొక్క, ఓఘామ్ = సమూహం గలదీ (చలన్తః పతాకాభిః ఉజ్జ్వలానాం చామరాణామ్ ఓఘాః యస్యాం తామ్), పరి... శోభాత్ : పరిస్ఫురత్ = అంతటా ప్రకాశించే, ఛత్ర-సహస్ర=వేల గొడుగులయొక్క, శోభామ్ = శోభగలదీ (పరిస్ఫురన్తీ ఛత్రాణాం సహస్రస్య శోభా యస్యాం తామ్), విచిత్ర... తాశామ్ : విచిత్ర = విచిత్రమైన, తూర్య-ధ్వని = తూర్యనాదాలచే, పూరిత = నింపబడిన, ఆశామ్ = దిక్కులుగలదీ అయిన (విచిత్రాణాం తూర్యాణాం ధ్వనిభిః పూరితాః ఆశాః యస్యాం తామ్), కుల-దేవ-యాత్రామ్ = ఇంటిదేవతల జాతరను, వితేనుః = విస్తరింపజేశారు. (వి-తనూ విస్తారే-పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ఆపై (భీష్మకుని ఇంటినుండి) కులదేవత యాత్ర ప్రారంభమైంది. పతాకలతో కూడిన వీవెనలు వేలకొలదిగ గొడుగులు, విచిత్రతూర్యనాదాలు ఆ జాతరలో శోభిస్తున్నాయి.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. వితేనుః :** | వితతాన | వితేనతుః | **వితేనుః** |
| | వితేనిథ | వితేనథుః | వితేన |
| | వితతాన/వితతన | వితేనివ | వితేనిమ. |

*

**శ్లో॥ స్వజనకగృహదేవం పౌత్రమారాధ్య భైష్మీ**
**నిజమథ గృహదేవం మాధవం ద్రష్టుకామా ।**
**అపి పురమభియాన్తీ సా రథం నారురోహ**
**ప్రియచరణసకాశం తేవనేన వ్రజన్తీ ॥ 14-64**

**అ :** రుక్మిణి కులదైవాన్ని అర్చించి నిజదైవసమర్చనకై బయలుదేరటం. -మాలిని.

**అ :** భైష్మీ స్వ-జనక-గృహ-దేవం పౌత్రమ్ ఆరాధ్య అథ నిజం గృహ-దేవం మాధవం ద్రష్టు-కామా సా పురమ్ అభియాన్తీ అపి ప్రియ-చరణ-సకాశం తేవనేన వ్రజన్తీ రథం న ఆరురోహ.

**ప్ర :** భైష్మీ = భీష్మపుత్రి (రుక్మిణి) (భీష్మస్య అపత్యం స్త్రీ), స్వ... దేవమ్ : స్వ = తనయొక్క, జనక-గృహ = పుట్టినింటియొక్క, దేవమ్=దేవుడైన (స్వస్య జనకస్య గృహస్య దేవః, తమ్), పౌత్రమ్ = తన మనుమని (శివుని), ఆరాధ్య = ఆరాధించి, అథ = ఆ తరువాత, నిజమ్ = తనకు సంబంధించిన, గృహదేవమ్ = ఇంటిదైవమైన, మాధవమ్ = కృష్ణుని, ద్రష్టు-కామా = చూడగోరినదై (ద్రష్టుం కామా), సా = ఆ రుక్మిణి, పురమ్ = నగరానికి, అభియాన్తీ-అపి = వెళ్తున్నా కూడా, ప్రియ-చరణ-సకాశమ్ : ప్రియ = వల్లభునియొక్క, చరణ-సకాశమ్ = పాదాల చెంతకు (ప్రియస్య చరణయోః సకాశమ్), తేవనేన = పాదచారిణిగా (తేవనం పాదచారణమ్ ఇతి హలః), వ్రజన్తీ = వెళ్తూ, రథమ్ = రథాన్ని, న ఆరురోహ = ఎక్కలేదు. (ఆ రుహ బీజజన్మనిప్రాదుర్భావే చ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి తన పుట్టినింటి కులదైవం, తన మనుమడు అయిన శివుని ఆరాధించి, ఆపై తన ఇంటి దైవమయిన

మాధవుని చూడగోరి నగరాభిముఖంగా వెళ్తూ కూడా ప్రియచరణాల దగ్గరకు క్రీడామాత్రంగా నడక ప్రారంభించిందే కానీ రథమెక్కలేదు.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. ఆరురోహ :** | **ఆరురోహ** | ఆరురుహతుః | ఆరురుహుః | |
| | ఆరురోహిథ | ఆరురుహథుః | ఆరురుహ | |
| | ఆరురోహ | ఆరురుహివ | ఆరురుహిమ. | * |

**శ్లో॥ అలసవిలసదక్షిస్తమ్భితాన్యాక్షవృత్తి-**
**ర్జలజకులజగన్ధస్పర్ధిసౌరభ్యసాన్ద్రా ।**
**వదనమదనశస్త్రాగణ్యలావణ్యచిత్రా**
**గజగతిరజతాతం భీష్మపుత్ర్యైక్షతైనమ్ ॥ 14-65**

**అ :** రుక్మిణి కృష్ణుని సందర్శించటం. -మాలిని.

**అ :** అలస-విలసత్-అక్షి-స్తంభిత+అన్య+అక్ష-వృత్తిః జల-జ-కుల-జ-గంధ-స్పర్ధి-సౌరభ్య-సాంద్రా వదన-మదన-శస్త్రా అగణ్య-లావణ్య-చిత్రా గజ-గతిః భీష్మ-పుత్రీ ఏనమ్ అజ-తాతమ్ ఐక్షత.

**ప్ర :** అలస... వృత్తిః : అలస = నెమ్మదితో, విలసత్ = ప్రకాశిస్తున్న, అక్షి = కన్నులతో, స్తంభిత = నిలువరింపబడిన, అన్య = ఇతరులయొక్క, అక్ష = ఇంద్రియాలయొక్క (అక్ష మింద్రియం - నానార్థరత్నమాలా - 1163), వృత్తిః = ప్రవృత్తిగలదీ (అలసం విలసత్ చ అక్షి, తేన స్తంభితా అన్యేషామ్ అక్షాణాం వృత్తిః యయా సా), జలజ... సాంద్రా : జలజ = తామరలయొక్క, కుల = సమూహం నుండి, జ = పుట్టినట్టి, గంధ = పరిమళంతో, స్పర్ధి = పోటీపడుతున్న, సౌరభ్య = పరిమళంతో, సాంద్రా = చిక్కనైనదీ (జలజానాం కులే జాతేన గంధేన స్పర్ధినా సౌరభ్యేణ సాంద్రా), వదన... శస్త్రా : వదన = ముఖమనే, మదన-శస్త్రా = మదనబాణం గలదీ (వదనమేవ మదనస్య అస్త్రం యస్యాః సా), అగణ్య-లావణ్య-చిత్రా : అగణ్య = లెక్కింపరాని, లావణ్య = చక్కదనం చేత, చిత్రా = విచిత్రమైనదీ (అగణ్యేన లావణ్యేన చిత్రా), గజ-గతిః = గజగమనం గలదీ అయిన (గజస్య గతిరివ గతిః యస్యాః సా), భీష్మ-పుత్రీ = రుక్మిణి (భీష్మస్య పుత్రీ), ఏనమ్ =ఈ, అజ-తాతమ్ = కృష్ణుని (అజస్య తాతః తమ్), ఐక్షత = చూచింది. (ఈక్ష్ దర్శనే ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి మెల్లమెల్లగా (గజగమనంతో) నడుస్తోంది. ఆ సమయంలో రుక్మిణి మందంగా, విలాసంగా చూస్తూ తనను చూస్తున్న వారి ఇంద్రియప్రవృత్తిని స్తంభింపజేస్తోంది. తామరల సమూహంనుండి పుట్టిన పరిమళంతో పోటీపడుతూ పరిమళాలు వెదజల్లుతోంది. ఆమె మొగమే మన్మథబాణంలా వుంది. అంతులేని లావణ్యంతో ఆమె చిక్కుగా వుంది. అటువంటి రుక్మిణి కృష్ణుని చూసింది.

**వి : 1.** పోతన తన కృతిలో ఈ రుక్మిణివిలాసచేష్టలను చూసిన రాజులలోని ఇంద్రియ ప్రవృత్తుల స్తంభనను గద్యంలో వర్ణించి, రుక్మిణి చూసిన కృష్ణుని కూడా మత్తేభవృత్తంలో వర్ణించాడు. ఆ పద్యం చాలా ప్రసిద్ధం.

"అయ్యింతి లజ్జావలోకనంబులఁ జిత్తంబు లేమఱి, ధైర్యంబులు దిగనాడి, గాంభీ-ర్యంబులు విడిచి, గౌరవంబులు మఱచి, చేష్టలు మాని, యెఱుకలుడిగి యాయుధంబులు దిగవైచి, రథతురగగజారోహణంబులు సేయనేరక రాజులెల్ల నేలకు వ్రాలిరి....

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖుం గంఠీరవేంద్రావ ల
గ్ను నవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశ దే
హు నగారాతి గజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్. -పోతనభాగవతము 10/1746,1747

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఐక్షత :** | **ఐక్షత** | ఐక్షేతామ్ | ఐక్షన్త | |
| | ఐక్షథాః | ఐక్షేథామ్ | ఐక్షధ్వమ్ | |
| | ఐక్షే | ఐక్షావహి | ఐక్షామహి. | * |

**శ్లో॥ కృష్ణేన నేయా జననీ మమేయ-మిత్యుత్సుకోఽసౌ స్మర ఏవ నూనమ్ ।**
**మూర్ఛావశానాత్మశరైరకార్షీత్ - తద్దృష్టిజన్మా సకలాన్ నృపాలాన్ ॥ 14-66**

**అ :** ఆ సమయంలో మన్మథుడు తన బాణాలతో రాజులనందరినీ మూర్ఛిల్లజేయటం. -ఇంద్రవజ్ర.

**అ :** ఇయం మమ జననీ కృష్ణేన నేయా ఇతి ఉత్సుకః అసౌ స్మరః, తద్-దృష్టి-జన్మా (సన్) ఆత్మశరైః నృపాలాన్ సకలాన్ మూర్ఛా-వశాన్ అకార్షీత్ నూనమ్.

**ప్ర :** ఇయమ్ = ఈ, మమ జననీ = నా తల్లి, కృష్ణేన = కృష్ణునిచే, నేయా = కొనిపోదగినది, ఇతి = అని, ఉత్సుకః = ముచ్చటబడినవాడై, అసౌ = ఆ, స్మరః = మదనుడు, తద్-దృష్టి-జన్మా (సన్) = ఆమెచూపులనుండి పుట్టినవాడై, ఆత్మ-శరైః = తన బాణాలతో, నృపాలాన్ = రాజులను, సకలాన్ = అందరినీ, మూర్ఛా-వశాన్ = మూర్ఛకు లోనైన వారినిగా, అకార్షీత్ = చేశాడు. (కృ కరణే పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.), నూనమ్ = నిశ్చితం.

**తా ॥** 'ఈ నా తల్లిని కృష్ణుడే కొనిపోవాలి' అనే ఉత్సుకతతో మదనుడు ఆమె కన్నులలో నుండి పుట్టి, అక్కడున్న రాజులనందరినీ మూర్ఛిల్లజేశాడు.

| | | | | |
|---|---|---|---|---|
| **వి :** 1. **అకార్షీత్ :** | **అకార్షీత్** | అకార్ష్టామ్ | అకార్షుః | |
| | అకార్షీః | అకార్ష్టమ్ | అకార్ష్ట | |
| | అకార్షమ్ | అకార్ష్వ | అకార్ష్మ. | * |

**శ్లో॥ తదను మదనమన్దీభూతచిత్తేషు భూపే-**
**ష్వవిదితగతిరుద్యద్రోమరాజిం ప్రహర్షాత్।**
**వికసితనయనాబ్జోద్భూతహర్షామ్బుధారాం**
**నిజరథమధిరోప్య స్వాం ప్రపేదే స్వతన్త్రః॥ 14-67**

**అ :** కృష్ణుడు రుక్మిణిని కొనిపోవటం. -మాలిని.

**అ :** తదను భూపేషు మదన-మన్దీభూత-చిత్తేషు (సత్సు) అవిదిత-గతిః స్వతంత్రః ప్రహర్షాత్ ఉద్యద్-రోమ-రాజిం వికసిత-నయన+అబ్జ+ఉద్భూత-హర్ష+అంబు-ధారాం స్వాం నిజ-రథమ్ అధిరోప్య ప్రపేదే.

**ప్ర :** తదను = ఆపై, భూపేషు = రాజులు, మదన... చిత్తేషు (సత్సు) = మన్మథమూర్ఛను పొందివుండగా (మదనేన మన్దీభూత చిత్తాః, తేషు), అవిదిత-గతిః = (తన) గతి (ఇతరులకు) తెలియని (అవిదితా గతిః యస్య సః), స్వతంత్రః = అపరతంత్రుడైన కృష్ణుడు, ప్రహర్షాత్ = ఆనందంవలన (ఇష్టప్రాప్తివల్ల కలిగిన ఆనందం), ఉద్యత్-రోమ-రాజిమ్ : ఉద్యత్ = నిక్కబొడుచుకున్న, రోమ = వెంట్రుకలయొక్క, రాజిమ్ = సమూహం గలదీ (పులకరించి పోతున్నదని భావం) (ఉద్యమన్తీ రోమ్ణాం రాజిః యస్యాః సా), వికసిత... ధారామ్ : వికసిత=విచ్చుకున్న, నయన = కన్నులనే, అబ్జ = తామరల నుండి, ఉద్భూత = ఉబికిన, హర్ష-అంబు = ఆనందాశ్రువుల, ధారామ్ = ధారలు గలదీ (వికసితే నయనే ఏవ అబ్జే, తయోః ఉద్భూతాః హర్షేణ జాతా అంబునః ధారా యస్యాః తామ్), స్వామ్=తనదీ అయిన రుక్మిణిని, నిజ-రథమ్ = తన రథంపైకి (నిజస్య రథః, తమ్), అధిరోప్య = ఎక్కించి, ప్రపేదే = బయలుదేరాడు. (ప్ర పద్ విశరణగత్యవసాదనేషు-ఆత్మనేపది-లిట్-(ప్ర.ఏ.)

**తా ॥** రాజులంతా మదనభావంతో మూర్ఛకు లోను కాగా రుక్మిణికి ఆనందంతో (ఒడలు పులకరించగా) వెంట్రుకలను నిక్కపొడుచుకోగా వికసించిన నయనపద్మాలనుండి ఆనంద బాష్పధారలు కురియుచుండగా ఎవ్వరికీ ఎరుగరాని నడతగల కృష్ణుడు తనదైన ఆ రుక్మిణిని తన రథంపైకి ఎక్కించుకొని బయలుదేరాడు.

**వి :** 1. కృష్ణుడు రుక్మిణిని రథం పైకి ఎక్కించుకొనుట– మూలభాగవతంలో మరొక విశేషం కనిపిస్తుంది. రుక్మిణి తానుగా రథమెక్కాలనుకొన్నప్పుడు కృష్ణుడు ఆమెను రథమెక్కించాడు.

శ్లో॥ తాం రాజకన్యాం రథమారురుక్షతీం – జహార కృష్ణో ద్విషతాం సమీక్షతామ్ ।
రథం సమారోప్య సుపర్ణలక్షణం – రాజన్య చక్రం పరిభూయ మాధవః ॥ –భాగవతమ్–10/53/55

కృష్ణునికి సందేశం పంపటంలోనూ రుక్మిణిదే చొరవ. రథమెక్కి వెళ్ళటంలోనూ రుక్మిణిదే చొరవ.

| | | | |
|---|---|---|---|
| 2. ప్రపేదే : | **ప్రపేదే** | ప్రపేదాతే | ప్రపేదిరే |
| | ప్రపేదిషే | ప్రపేదాథే | ప్రపేదిధ్వే |
| | ప్రపేదే | ప్రపేదివహే | ప్రపేదిమహే. |

*

**శ్లో॥ పునర్వివాహేన కిమిన్దిరాయా – ఇతీవ లక్ష్మీరమణః స కృష్ణః ।**
**అపాఙ్గదూతీవినివేదితాత్మ–మనోఽనురాగామతనోత్సుయోగామ్ ॥ 14–68**

**అ :** రుక్మిణి కడకంటిచూపులోని ఆంతర్యాన్ని గ్రహించి కృష్ణుడు ఆమెను దగ్గరకు తీసికొనటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** లక్ష్మీ–రమణః స కృష్ణః పునః ఇందిరాయాః వివాహేన కిమ్ ఇతి+ఇవ అపాంగ–దూతీ–వినివేదిత+ఆత్మ–మనః+అనురాగాం సుయోగామ్ అతనోత్.

**ప్ర :** లక్ష్మీ–రమణః = లక్ష్మీవల్లభుడైన (లక్ష్మ్యాః వల్లభః), సః = ఆ, కృష్ణః = కృష్ణుడు, ఇందిరాయాః=లక్ష్మికి, పునః =మరల (ఇంకా), వివాహేన=పెండ్లితో, కిమ్?= అవసర మేమిటి?, ఇతి+ఇవ = అన్నట్లుగా, అపాంగ... రాగామ్ : అపాంగ = కనుకొనచూపు అనే, దూతీ = దూతిక ద్వారా, వినివేదిత = చక్కగా తెలుపబడిన, ఆత్మ = తనయొక్క, మనః = మనస్సులోని, అనురాగామ్ = అనురాగం గల రుక్మిణిని (అపాంగః ఏవ దూతీ, తయా నివేదితః ఆత్మనః మనసః అనురాగః యయా, తామ్), సుయోగామ్ = సన్నిహితనుగా, అతనోత్ = చేశాడు. (తనూ విస్తారే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** (రాక్షసవివాహమునం గొనిపొమ్ము వచ్చెదన్– అని రుక్మిణి పంపిన సందేశం. దానిని పాటించాడు కృష్ణుడు) ఇక మరల రుక్మిణి వివాహమెందుకని భావించిన కృష్ణుడు ఆమె కడకంటిచూపు అనే దూతికద్వారా ఆమె మనస్సులోని అనురాగాన్ని గ్రహించి, ఆమెను దగ్గరకు చేర్చుకొన్నాడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. **అతనోత్ :** | **అతనోత్** | అతనుతామ్ | అతన్వన్ |
| | అతనోః | అతనుతమ్ | అతనుత |
| | అతనవమ్ | అతన్వ/అతనువ | అతన్మ/అతనుమ. |

*

**శ్లో॥ కృష్ణాస్యేన్దుసమీపలగ్నముదితభ్రాజత్కపోలా ప్రభో–**
**ర్హస్తామ్భోజయుగేన వేష్టితలసన్మధ్యా భియేవాంజసా ।**
**భర్త్రంసద్వయసంహితాయతభుజా మోదామ్బుధౌ మగ్నధీః**
**సా పాణిగ్రహణాదపీమమధికం మేనే వివాహోత్సవమ్ ॥ 14–69**

**అ :** కృష్ణుని ఆదరణతో శరీరాశ్లేషంతో రుక్మిణి పాణిగ్రహణం కన్న శరీరగ్రహణమే మిన్న అని ఆనందించటం.

**అ :** కృష్ణ+ఆస్య+ఇన్దు–సమీప–లగ్న–ముదిత–భ్రాజత్–కపోలా ప్రభోః హస్త+అంభోజ–యుగేన వేష్టిత–లసత్+మధ్యా భియా+ఇవ అంజసా భర్తృ+అంస–ద్వయ–సంహిత+ఆయత–భుజా మోద+అంబుధౌ మగ్న–ధీః సా పాణి–గ్రహణాద్ అపి ఇమం వివాహ+ఉత్సవమ్ అధికం మేనే.

**ప్ర :** కృష్ణ = కృష్ణునియొక్క, ఆస్య+ఇందు = ముఖచంద్రుని, సమీప = దగ్గరగా, లగ్న = నిలచివుండటంతో, ముదిత = ఆనందించినదై, భ్రాజత్ = వెలుగుతున్న, కపోలా = చెక్కిళ్ళుగలదీ (కృష్ణస్య ఆస్యమేవ ఇందుః తస్య సమీపే లగ్నః (అత ఏవ) ముదితః భ్రాజన్ చ కపోలః యస్యాః సా), ప్రభోః=స్వామి అయిన కృష్ణునియొక్క, హస్త... యుగేన : హస్త+అంభోజ = కరకమలాలయొక్క, యుగేన = జంటచే (హస్తౌ ఏవ అంభోజే, తయోః యుగం, తేన), వేష్టిత–లసత్–మధ్యా : వేష్టిత = చుట్టబడి, లసత్ = ప్రకాశిస్తున్న, మధ్యా = నడుముగలదీ (వేష్టితః లసన్ చ మధ్యః యస్యాస్సా), భియా+ఇవ = భయంతోనో అన్నట్లు, అంజసా = చక్కగా, భర్తృ... ద్వయా:భర్తృ=పతియొక్క, అంస–ద్వయ = భుజాల జంటతో, సంహిత = కూడిన, ఆయత = విశాలమైన, భుజా = భుజాలు గలదీ (భర్తుః అంసద్వయేన సంహితౌ ఆయతౌ భుజౌ యస్యాస్సా), మోద+అంబుధౌ = ఆనంద సాగరమందు (మోద ఏవ అంబుధిః, తస్మిన్), మగ్న–ధీః = మునిగిన బుద్ధి గలదీ అయిన (మగ్నా ధీః యస్యాస్సా), సా = ఆ రుక్మిణి, పాణి–గ్రహణాద్–అపి = పెండ్లి (యథావిధిగా పెద్దలు నిర్ణయించినది) కన్న, ఇమమ్ = ఈ, వివాహ+ఉత్సవమ్ = పెండ్లివేడుకను, అధికమ్=మిన్నగా, మేనే=భావించింది. (మను జ్ఞానే దివాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** (కృష్ణుని రథంపైకెక్కించిన రుక్మిణిని కృష్ణుడు దగ్గరకు తీసికొన్నాడు. రథవేగానికి పడే అవకాశమివ్వకుండా దానితో) కృష్ణుని ముఖచంద్రునికి దగ్గరగా నిలవటంచేత కలిగిన ఆనందం ఆమె చెక్కిళ్ళపై వెలుగొందుతోంది. కృష్ణుని కరకమలాల జంట ఆమె నడుమును చుట్టి వుంది. నడుము విలసిల్లుతోంది. భయంతోనో అన్నట్లు తన భుజాలను భర్త భుజాల దగ్గరకు చేర్చింది. ఆనందాంబుధిలో మునుగుతున్న ఆమె మామూలుగా జరిగే పాణిగ్రహణం కన్న ఈ పెండ్లివేడుకను మిన్నగా భావించింది. (పాణిగ్రహణంలో తత్కాలీన పాణిస్పర్శానందం మాత్రమే. **ఇప్పుడు పాణి, భుజ, మధ్య, కపోల సాన్నిధ్య (స్పర్శ) సుఖం లభించింది.**

**వి :** 1. **మేనే :** 14–30వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

2. ఛందస్సు – శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతోఽయమభూచ్చతుర్దశమితః సర్గో ముదాం స్వర్గిషు ॥ 14–70**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** చతుర్దశ–మితః = పదునాలుగవ, ముదామ్ = ఆనందాలయొక్క, సర్గః =సృష్టి – మిగిలినదంతా ప్రథమసర్గలోని సర్గాంతశ్లోకం వలెనే.

ఇది శ్రీమత్కవికులతిలకశ్రీమద్వాదిరాజతీర్థశ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో చతుర్దశః సర్గః. *

**శ్రీః**



# శ్రీః

# పఞ్చదశః సర్గః

**శ్లో॥ తరణిమివ తమస్తమన్వధావన్ - మదనవశాః కిల మానినో మహీశాః ।**
**విషమమృగదృశీవియోగరోగాత్ - స్వతనుమివోజ్ఝితుముద్యతాః పురస్తాత్॥15-1**

**అవతారిక :** జరసంధాదిరాజులు రుక్మిణిని కొనిపోతున్న కృష్ణుని వెంటబడుట.

**అన్వయక్రమం :** మదన-వశాః మానినః మహీ+ఈశాః విషమ-మృగ-దృశీ-వియోగ-రోగాత్ పురస్తాత్ స్వ-తనుమ్ ఉజ్ఝితుమ్ ఉద్యతాః ఇవ తమః తరణిమ్ ఇవ తమ్ అను+అధావన్.

**ప్రతిపదార్థం :** మదన-వశాః : మదన = మన్మథునికి, వశాః = లోబడినవారు (మదనస్య వశాః), మానినః = అహంకారులూ అయిన, మహీ+ఈశాః = రాజులు, విషమ... రోగాత్ : విషమ = సహింపరాని, మృగదృశీ = రుక్మిణియొక్క, వియోగ = విరహమనే, రోగాత్ = జబ్బువలన (విషమః చాసౌ మృగీదృశ్యా వియోగః స ఏవ రోగః, తస్మాత్), పురస్తాత్ = ఎదురుగా (**పూర్వస్మిన్ కాలే**-'పూర్వ' శబ్దంపై '**దిక్ శబ్దేభ్యః సప్తమీ పంచమీ ప్రథమాభ్యః దిగ్దేశకాలేష్వతాతిః**) (అష్టాధ్యాయి 5-3-27) సూత్రంతో **అతాతి** (తాత్) ప్రత్యయం. పూర్వశబ్దానికి '**అస్తాతి చ**' (అష్టాధ్యాయి 5-3-80) సూత్రంతో పురాదేశం), స్వ-తనుమ్ = తమ శరీరాన్ని (స్వస్య తనుః తామ్) (జాత్యేకవచనం), ఉజ్ఝితుమ్ = విడుచుటకు, ఉద్యతాః ఇవ = సిద్ధపడినట్లుగా, తమః = చీకటి, తరణిమ్-ఇవ = సూర్యునివలె, తమ్ = ఆ కృష్ణుని, అను+అధావన్ = అనుసరించారు. (అను+ధావ్ గతి శుద్ధ్యోః-పరస్మైపది-లఙ్-ప్ర.బ.),

**తాత్పర్యం ॥** అభిమానధనులై, మదనపరవశులయిన ఆ రాజులు రుక్మిణీ వియోగరోగంతో తమ శరీరాలనే విడువదలచినట్లుగా, చీకటి తానే సూర్యుని వెంటబడినట్లు కృష్ణుని వెన్నంటి పరుగెత్తారు.

**విశేషాలు :** 1. శ్లోకంలో ఉపమాలంకారం, ఉత్ప్రేక్షాలంకారం రెండూ కనిపిస్తాయి. ఇవ శబ్దాన్ని తత్తదలంకారవాచకంగా వినియోగిస్తూ.

**తరణిం తమః** - ఇది ఉపమానకక్ష్య. **తం మానినః** - ఇది ఉపమేయకక్ష్య. **ఇవ** ఉపమావాచకం. ఉపమానోపమేయాలకు బింబప్రతిబింబభావం. ఇక్కడ ఉపమావాచకమైన ఇవ పదం - స్వతనుమ్ ఉజ్ఝితుమ్ ఉద్యతా ఇవ' అన్నచోట ఉత్ప్రేక్షావాచకమైంది.

శ్లో॥ మన్యే శంకే ధ్రువం ప్రాయోఽనూనమిత్యేవమాదిభిః ।
ఉత్ప్రేక్షా వ్యజ్యతే శబ్దైరివ శబ్దోఽపి తాదృశః ॥

అని అలంకారికులు **ఇవ** శబ్దాన్ని ఉత్ప్రేక్షావ్యంజక శబ్దాలలో ప్రత్యేకంగా పరిగణించారు.

2. చీకటి సూర్యుని అనుసరించినట్లు – అన్న ఉపమ ఆ రాజుల నిరర్థక ప్రయత్నాన్ని, తమ వినాశనాన్ని తాము కోరి తెచ్చుకోవటాన్ని సూచిస్తుంది. ఈ పోలిక కవి ప్రతిభాకల్పన. మూలం–

శ్లో॥ ఇతి సర్వే సుసంరబ్ధా వాహానారుహ్య దంశితాః ।
స్వైః స్వైర్బలైః పరిక్రాంతా చాన్వీయుర్ధృతకార్ముకాః ॥ – భాగవతమ్ 10/54/1

| | | | |
|---|---|---|---|
| 3. **అన్వధావన్ :** | అన్వధావత్ | అన్వధావతామ్ | **అన్వధావన్** |
| | అన్వధావః | అన్వధావతమ్ | అన్వధావత |
| | అన్వధావమ్ | అన్వధావ అన్వధామ | |

4. ఛందస్సు – పుష్పితాగ్ర. (విషమపాదాలు – ననరయ;సమపాదాలు–నజజరగ) *

**శ్లో॥ యే భైష్మ్యాః పరిరమ్భణం చకమిరే తేషాం భుజాంశ్చిచ్ఛిదు–**
**ర్యే వా తన్ముఖచన్ద్రచుమ్బనరుచిం తేషాం శిరాంసి ద్విషామ్ ।**
**యే తల్పే శయనం తయా సహ ఖలా లోకామ్బయా సజ్గరే**
**ప్రేతైః సార్ధమశీశయన్ హరిభటాస్తాన్ దుర్మదాన్ సాయకైః ॥ 15–2**

**అ :** కృష్ణభటులు యుద్ధంలో పరాక్రమాన్ని ప్రదర్శించి ఆ యా రాజుల అపరాధాలకు తగిన రీతిగా వారిని శిక్షించుట. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** సంగరే హరి–భటాః యే భైష్మ్యాః పరిరంభణం చకమిరే తేషాం ద్విషాం భుజాన్ చిచ్ఛిదుః, యే వా తత్+ముఖ–చంద్ర–చుంబన–రుచిం చకమిరే తేషాం శిరాంసి చిచ్ఛిదుః. యే ఖలాః లోక+అంబయా తయా సహ తల్పే శయనం చకమిరే తాన్ దుర్మదాన్ సాయకైః ప్రేతైః సార్ధమ్ అశీశయన్.

**ప్ర :** సంగరే = యుద్ధంలో, హరి–భటాః = కృష్ణుని సైనికులు (హరేః భటాః), యే = ఎవరయితే, భైష్మ్యాః = రుక్మిణియొక్క (భీష్మస్య అపత్యం స్త్రీ), పరిరంభణమ్ = కౌగిలింతను, చకమిరే = కోరారో (కము కాంతౌ ఆత్మనేపది–లిట్–ప్ర.బ.), ద్విషామ్ = శత్రువులైన, తేషామ్ = వారియొక్క, భుజాన్ = భుజాలను, చిచ్ఛిదుః = నరికారు. (ఛిద్ ద్వైధీకరణే–పరస్మైపది–లిట్–ప్ర.బ.), యే వా = మరెవరయితే, తత్... రుచిమ్ : తత్ = ఆ రుక్మిణియొక్క, ముఖ–చంద్ర = ముఖమనే చంద్రుని, చుంబన = ముద్దిడుటలోని, రుచిమ్ = చవిని (శబ్దార్థకల్పతరుః –పు–1232), (చకమీరే = కోరారో), (తస్యాః ముఖమ్ ఏవ చంద్రః తస్య చుంబనే రుచిః, తామ్), తేషామ్ = వారియొక్క, శిరాంసి = తలలను, (చిచ్ఛిదుః = నరికారు) (ముఖం తలను ఆశ్రయించుకొని వుంటుంది కాబట్టి), యే ఖలాః = ఏ దుర్మార్గులు, లోక+అంబయా = జగన్మాత అయిన (లోకానామ్ అంబా, తయా), తయా సహ = ఆ రుక్మిణితో పాటు, తల్పే = పక్కపై, శయనమ్ = పడకను, చకమిరే = కోరారో, దుర్మదాన్ = చెడ్డపొగరెక్కిన, (దుష్టః మదః యేషు, తాన్), తాన్ = వారిని, సాయకైః = బాణాలతో, ప్రేతైః సార్ధమ్ = శవాలతోపాటు, అశీశయన్ = పండబెట్టారు. (శీ స్వప్నే ణిచి–పరస్మైపది–లుఙ్–ప్ర.బ.),

**తా ॥** రణరంగంలో హరిభటులు శత్రుసైనికులను వివిధరీతులలో శిక్షించారు. రుక్మిణి కౌగిలింతను కోరిన వారి భుజాలను ఖండించారు. ఆమె ముఖచంద్రుని ముద్దాడి చవిగొనగోరిన వారి తలలను నరికారు. రుక్మిణితోపాటు పక్కపై పరుండాలని కోరిన దుర్మార్గులను శవాలతో పాటు పండబెట్టారు.

**వి :** 1. హరిభటులు భుజాలు ఖండించినవారు వాస్తవంగా రుక్మిణికౌగిలింతను కోరారో లేదో తెలియదు. అది కవి కల్పించిన కారణం, సంబంధం. అలాగే ఇతర ఫలితాలు కూడా. రుక్మిణిని పెండ్లాడాలని కూడా వారందరూ

కోరి వుండరు. శిశుపాలుడికి రుక్మిణిని ఇవ్వాలన్న నిర్ణయం గతంలోనే జరిగింది. ఆ మేరకే పెళ్ళి ఏర్పాట్లు. కాబట్టి ఈ రాజుల లోని భావాలకూ, కృష్ణసేనల చేష్టలకూ సంబంధం కవి కల్పన మాత్రమే. కాబట్టి లేని సంబంధాన్ని కల్పించినందువల్ల ఇది సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**'-(కు. 39)

అలాగే కృష్ణసేనలు చేసిన మొదటి రెండుపనులలో (భుజాలను నరకటం, తలలను నరకటం) విషాదనాలంకారం కనిపిస్తుంది ఆ రాజుల పరంగా. కోరిన దానికి విరుద్ధమైన ఫలితం లభించటం విషాదనాలంకారం. '**ఇష్యమాణవిరుద్ధార్థసంప్రాప్తిస్తు విషాదనమ్**' - (కు. 132). మూడవ చేష్టలో వారు కోరిన శయనం మరోరీతిగా సంక్రమించింది కాబట్టి శయనమాత్రం చేత ప్రహర్షణం (**ఉత్కంఠితార్థసంసిద్ధిః వినా యత్నం ప్రహర్షణమ్** - కు. 129), రుక్మిణితో శయనానికి బదులు శవాలతో శయనం కాబట్టి విషాదనం.

| | | | |
|---|---|---|---|
| 2. **చకమిరే :** | చకమే | చకమాతే | **చకమిరే** |
| | చకమిషే | చకమాథే | చకమిధ్వే |
| | చకమే | చకమివహే | చకమిమహే |
| **చిచ్ఛిదుః :** | చిచ్ఛేద | చిచ్ఛిదతుః | **చిచ్ఛిదుః** |
| | చిచ్ఛేదిథ | చిచ్ఛిదథుః | చిచ్ఛిద |
| | చిచ్ఛేద | చిచ్ఛిదివ | చిచ్ఛిదిమ |
| **అశీశయన్ :** | అశీశయత్ | అశీశయతామ్ | **అశీశయన్** |
| | అశీశయః | అశీశయతమ్ | అశీశయత |
| | అశీశయమ్ | అశీశయావ | అశీశయామ. |

*

**శ్లో॥ సాహాయ్యం క్వ చకార శమ్భుదయితా తద్వైరిమాతుః కథం**
**దేవ్యాః శ్రీపతివిప్రయోగమహరత్ తద్విప్రయోగోఽపి వా ।**
**కిన్తు శ్రీపతిరేవ తాం స్వవిరహాయోగ్యాం సమవ్యాపినీం**
**నిన్యేఽశ్లేషకథాం ఖలైః సహ ముహుః శిక్షన్ స రక్షన్ శ్రుతిమ్ ॥ 15-3**

**అ :** కృష్ణుడు రుక్మిణిని కొనిపోవటం ఒక శ్రౌతవిధియేగానీ దానిలో అన్యసాహాయ్యం లేదనుట.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** శంభు-దయితా తద్-వైరి-మాతుః సాహాయ్యం క్వ చకార. దేవ్యాః శ్రీ-పతి-విప్ర-యోగం తద్-విప్ర-యోగం వా కథమ్ అహరత్. కిన్తు అశ్లేష-కథాం ఖలైః సహ ముహుః శిక్షన్ శ్రుతిం రక్షన్ సః శ్రీపతిః ఏవ స్వ-విరహ+అయోగ్యాం సమ-వ్యాపినీం తాం నిన్యే.

**ప్ర :** శంభు-దయితా : శంభు = శివునియొక్క దయితా = ఇల్లాలు (శంభోః దయితా) పార్వతి, తద్-వైరి-మాతుః : తద్ = ఆ శివునియొక్క వైరి = పగవాని(మదనుని)యొక్క, మాతుః = తల్లికి (లక్ష్మి-రుక్మిణికి) (తస్య వైరీ తస్య మాతా తస్యాః), సాహాయ్యమ్ = తోడు నిలవటాన్ని (సహాయస్య భావః, తమ్) ('సహాయ' పదం మీద "**గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణి చ**" (అష్టాధ్యాయి-5-1-124) సూత్రంతో ష్యఞ్ ప్రత్యయం), క్వ = ఎక్కడ (ఏ రీతిగా), చకార = చేసింది? (కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), దేవ్యాః = రుక్మిణికి, శ్రీపతి-వి-ప్ర (విప్ర)-యోగమ్ : శ్రీపతి = కృష్ణునితో (శ్రియః పతిః), వి-ప్ర (విప్ర)యోగమ్ = విరహాన్ని/బ్రాహ్మణునితో కలయికను (విప్రేణయోగః తమ్) శ్రీపతేః విప్రస్య చ విప్రేణ వా యోగః తమ్), తద్-వి-ప్ర (విప్ర) యోగః : తద్ = ఆ కృష్ణునితో, విప్ర-యోగః = బ్రాహ్మణుని కలయిక (తస్య విప్రేణ యోగః), కథమ్ = ఏ రీతిగా, అహరత్ = హరింప గలిగింది? (హృ

హరణే-పరస్మైపది-లజ్-(ప్ర.ఏ.), కిన్తు = అయితే, అశ్లేష-కథామ్ : అశ్లేష = ఎడబాటుయొక్క, కథామ్ = కథను (ఘటనను) (అశ్లేషస్య కథా తామ్), ఖలైః సహ = చెడ్డవారితో పాటు, శిక్షన్ = శిక్షిస్తూ (శిక్ష్ ధాతువుపై శతృ ప్రత్యయం-శిక్ష ధాతువు నైసర్గికంగా ఆత్మనేపది-ఆత్మనేపద ధాతువులపై శానచ్ (శిక్షమాణ) ప్రత్యయాన్నే వాడాలి. శతృ ప్రయోగం ఆర్షం.), ముహుః = మాటిమాటికీ, శ్రుతిమ్ = (వేద) వచనాన్ని, రక్షన్ = కాపాడుతూ, సః = ఆ, శ్రీపతిః+ఏవ = లక్ష్మీవల్లభుడే, సమ+వ్యాపినీమ్ : సమ = సమానంగా, వ్యాపినీమ్ = వ్యాపకత్వం గలదీ (సమం వ్యాపనం శీలమస్యా ఇతి తామ్), స్వ-విరహ-అయోగ్యామ్ : స్వ = తనయొక్క, విరహ = వియోగానికి, అయోగ్యామ్ = తగనిదీ అయిన (స్వేన విరహః, తస్య అయోగ్యా, తామ్), తామ్ = ఆ రుక్మిణిని, నిన్యే = తీసికొనిపోయాడు. (నీ ప్రాపణే-ఆత్మనేపది-లిట్-(ప్ర.ఏ.).

**తా ॥** పార్వతి శివుని అర్ధాంగి. శివునికి శత్రువు మన్మథుడు. మన్మథుని తల్లి రుక్మిణి. ఆ స్థితిలో పార్వతి రుక్మిణికి సహాయమేం చేయగలదు? (భర్తృశత్రువులకు భార్య సహకరించ లేకపోవటం సహజమే గదా!) బ్రాహ్మణునితో కలయిక ద్వారా కృష్ణునితో వియోగాన్ని రుక్మిణి తొలగించుకొనటం అన్నది కూడా సముచితమేం గాదు. అసలు విషయమేమిటంటే శ్రీపతియే రుక్మిణికి కృష్ణునితో వియోగమన్న మాటను దుర్మార్గులతోపాటు ఖండిస్తూ, శ్రుతివచనాన్ని రక్షిస్తూ, తనతో నిత్యమూ కలిసి వుంటూ, తనతో వియోగమన్న పదానికి కూడా తగని రుక్మిణిని తీసికొని పోయాడు.

**వి : 1. సమవ్యాపిని :** అంటే సమానమైన వ్యాపకత్వం గలది. అంటే కృష్ణుడెక్కడుంటే తానక్కడుండటం, తానెక్కడుంటే కృష్ణుడక్కడుండటం. **బ్రహ్మసూత్రభాష్యం**లో మధ్వాచార్య వచనం-

సమనా **చాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య** (బ్రహ్మసూత్రం 4-2-7) దీన్ని వ్యాఖ్యానిస్తూ - **దేశతః కాలతశ్చ వ్యాప్త్యా సమో నా పరమపురుషో యస్యాః సా సమనా. సంసారానుపక్రమాత్ స్వత ఏవామృతత్వం తస్యాః. బృహచ్ఛ్రుతిశ్చ - ద్వౌ వా వ సృత్యనుపక్రమౌ ప్రకృతిశ్చ పరమశ్చ ద్వావేతౌ నిత్యముక్తౌ నిత్యౌ చ.....**

శ్లో॥ దేశతః కాలతశ్చైవ సమాప్రకృతిరీశ్వరే ।
ఉభయోరప్యబద్ధత్వం తదబంధః పరాత్మనః ॥ -బ్రహ్మసూత్రభాష్యం (4-2-10)

2. దుర్మార్గులతోపాటు (ఖలైస్సహ) రుక్మిణి విశ్లేషకథను ఖండించాడనటంలో సహోక్త్యలంకారముంది. అశ్లేషకథకూ, ఖలులకూ సహభావవర్ణనం. '**సహోక్తిస్సహభావశ్చేద్భాసతే జనరంజనః**' - (కు.58) విప్ర-యోగ, వి-ప్ర-యోగ అని విరవటం ద్వారా విప్రయోగ పదం కూడా రెండర్థాల నిస్తుంది శ్లేషాలంకార సహకారంతో.

| | | | |
|---|---|---|---|
| 2. **చకార :** | **చకార** | చక్రతుః | చక్రుః |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |
| **నిన్యే :** | **నిన్యే** | నిన్యాతే | నిన్యిరే |
| | నిన్యిషే | నిన్యాథే | నిన్యిధ్వే |
| | నిన్యే | నిన్యివహే | నిన్యిమహే. |

*

**శ్లో॥ రక్తామ్భోనిచయే గజాద్రినికరైరాబధ్య సేతుం హతైః**
**సుగ్రీవోద్ధతసైన్యమాత్రబలవాన్ శ్రీపూర్వరామో యుధి ।**
**ప్రాచీనావనిజాం నినాయ స నిజామవ్యగ్రవక్త్రామ్బుజాం**
**జిత్వా ప్రాక్తనరావణం హతబలం తల్లగ్నచిత్తం ఖలమ్ ॥ 15-4**

**అ :** కృష్ణుడు పూర్వరాముడై పూర్వరావణుడైన శిశుపాలుని నిర్జించి రుక్మిణిని కొనిపోవుటను వర్ణించటం.

**అ :** సుగ్రీవ+ఉద్ధత-సైన్యమాత్ర-బలవాన్ సః శ్రీ-పూర్వ-రామః యుధి రక్త+అంభః+నిచయే గజ+అద్రి-నికరైః సేతుమ్ ఆబధ్య తత్+లగ్న-చిత్తం హత+బలం ఖలం ప్రాక్తన-రావణం జిత్వా అవ్యగ్ర-వక్త్ర+అంబుజాం నిజాం ప్రాచీన+అవనిజాం నినాయ.

**ప్ర :** సుగ్రీవో... బలవాన్ : సుగ్రీవ = సుగ్రీవమనే పేరుగల గుఱ్ఱమూ/సుగ్రీవునియొక్క, ఉద్ధత-సైన్య మాత్ర = గర్వించిన సైన్యమూ మాత్రమే / గర్వించిన సైన్యమే, బలవాన్ = బలంగా గల (సుగ్రీవశ్చ ఉద్ధతసైన్యశ్చ తౌ కేవలం బలమ్ అస్త అస్తీతి సః), సః = ఆ, శ్రీ-పూర్వ-రామః : శ్రీ = లక్ష్మితో గూడిన, పూర్వరామః = (గతంలో రాముడు) కృష్ణుడు, శ్రీపూర్వ = లక్ష్మితో కూడిన, రామః = రాముడు, యుధి = యుద్ధంలో, రక్త+అంభః-నిచయే = నెత్తుటి కడలిలో (రక్తమ్ ఏవ అంభసాం నిచయః, తస్మిన్), హతైః = మరణించిన, గజ+అద్రి-నికరైః : గజ+అద్రి = ఏనుగు లనే కొండలయొక్క, నికరైః = సమూహాలతో (గజాః ఏవ అద్రయః, తేషాం నికరాః, తైః ), సేతుమ్ = వంతెనను, ఆబధ్య = కట్టి (ఆ-బధ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఖలమ్ = దుర్మార్గుడు, తత్+లగ్న-చిత్తమ్ : తత్ = ఆ రుక్మిణియందు, లగ్న = లగ్నమైన, చిత్తమ్ = మనస్సు గలవాడు (తస్యాం లగ్నం చిత్తం యస్య, తమ్), హత-బలమ్ : హత = నశించిన, బలమ్ = సైన్యం గలవాడు అయిన (హతం బలం యస్య, తమ్), ప్రాక్ తన-రావణమ్ = పూర్వరావణుని (శిశుపాలుని), జిత్వా = గెలిచి (జి ధాతువుపై క్త్వా ప్రత్యయం), అవ్యగ్ర-వక్త్ర+అంబుజామ్ : అవ్యగ్ర = ప్రసన్నమైన, వక్త్ర+అంబుజామ్ = ముఖపద్మం గలదీ (అవ్యగ్రం వక్త్రమ్ ఏవ అంబుజమ్ యస్యాః, తామ్), నిజామ్ = తనదీ అయిన, ప్రాచీన+అవనిజామ్ = నాటి సీతను (నేటి రుక్మిణిని) ప్రాచీనా చ సా అవనిజా తామ్), నినాయ = కొనిపోయాడు. (నీ ప్రాపణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సుగ్రీవమనే గుఱ్ఱం, ఉద్ధతసైన్యం మాత్రమే బలంగా గలవాడు కృష్ణుడు. (సుగ్రీవుని యొక్క ఉద్ధతసైన్యం గలవాడు రాముడు) ఆ శ్రీ పూర్వరాముడు రణభూమిలో చనిపోయిన ఏనుగుల శరీరాలనే కొండలతో నెత్తుటేటికి వంతెనను కట్టి ఆమెయందే లగ్నమైన మనస్సుగల ప్రాచీనరావణునియొక్క సేనను అణచి, గెలిచి ప్రసన్నమైన ముఖపద్మం గల ప్రాచీన భూజాతను కొనిపోయాడు.

**వి :** 1. లౌకికంగా ఆలోచించినా నాటి సీత నేటి రుక్మిణిగా అవతరించింది గదా!

శ్లో॥ పతిం యా నాభిచరతి మనోవాక్కాయ సంయతా ।
సా భర్తుర్లోకమాప్నోతి సద్భిః సాధ్వీతి చోచ్యతే ॥ - మనుస్మృతి - 9/29

అని మనుస్మృతి వచనం. సీత సతీత్వాన్ని గురించిన శంక ఆనాటి ప్రజలవిషయ మెట్లున్నా ఈనాటి ప్రజలలో లేదు. లోకపాలకులకూ లేదు.

శ్లో॥ యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః ॥

యది వా త్వేకపత్నీత్వం శీతో భవ హనూమతః ।
తతస్తీక్ష్ణార్చిరవ్యగ్రః ప్రదక్షిణశిఖోఽనలః ॥ - సుందరకాండ 53/26,27

సీత తన సతీత్వం మీద ఒట్టుపెట్టగానే హనుమంతుని శరీరం మీదున్న అగ్ని చల్లబడ్డాడు గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **నినాయ :** | **నినాయ** | నిన్యతుః | నిన్యుః |
| | నినయిథ/నినేథ | నిన్యథుః | నిన్య |
| | నినాయ/నినయ | నిన్యివ | నిన్యిమ. |

3. ఛందస్సు – శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ అహాయిదహాయి కశ్చిదనంసీదపరోఽచ్యుతమ్ ।**
**నాక్రమీదపరో విద్ధో విక్రమార్కోదయే హరేః ॥ 15-5**

**అ :** కృష్ణ పరాక్రమవర్ణన. –పథ్యావక్త్రమ్.

**అ :** హరేః విక్రమ+అర్క+ఉదయే కశ్చిత్ అహాయి (సన్) అహాయిత్. అపరః అచ్యుతమ్ అనంసీత్. అపరః విద్ధః (సన్) న అక్రమీత్.

**ప్ర :** హరేః = కృష్ణునియొక్క, విక్ర... దయే : విక్రమ = పరాక్రమమనే, అర్క = సూర్యుని–యొక్క, ఉదయే = ఉదయం (పొడముట) జరుగగా (విక్రమః ఏవ అర్కః తస్య ఉదయః, తస్మిన్), కశ్చిత్ = ఒకానొకడు, అహాయి (సన్) = గుఱ్ఱం లేనివాడై (హయః అస్య అస్తీతి హయీ, స న భవతి ఇతి), అహాయిత్ = వెళ్ళాడు. (హయ గతౌ పరస్మైపది–లుఙ్–(ప్ర.ఏ.), అపరః = మరొకడు, అచ్యుతమ్ = కృష్ణునికి, అనంసీత్ = నమస్కరించాడు (నమ్ ప్రహ్వత్వే శబ్దే చ–భ్వాది–పరస్మైపది–లుఙ్–(ప్ర.ఏ.), అపరః = వేరొకడు, విద్ధః (సన్) = గాయపడినవాడై, న అక్రమీత్ = కదలలేకపోయాడు (క్రమ్ పాదవిక్షేపే–పరస్మైపది–లుఙ్–(ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని పరాక్రమసూర్యుడు ఉదయించగా సైనికులలో ఒకడు గుఱ్ఱం దిగి పారిపోయాడు. మరొకడు నమస్కరించి తప్పుకున్నాడు. వేరొకడు కదలలేక పోయాడు.

| | | | | |
|---|---|---|---|---|
| వి : | 1. **అహాయిత్ :** | **అహాయిత్** | అహాయిష్టామ్ | అహాయిషుః |
| | | అహాయీః | అహాయిష్టమ్ | అహాయిష్ట |
| | | అహాయిషమ్ | అహాయిష్వ | అహాయిష్మ |
| | **అనంసీత్ :** | **అనంసీత్** | అనంసిష్టామ్ | అనంసిషుః |
| | | అనంసీః | అనంసిష్టమ్ | అనంసిష్ట |
| | | అనంసిషమ్ | అనంసిష్వఅనంసిష్మ | |
| | **అక్రమీత్ :** | **అక్రమీత్** | అక్రమిష్టామ్ | అక్రమిషుః |
| | | అక్రమీః | అక్రమిష్టమ్ | అక్రమిష్ట |
| | | అక్రమిషమ్ | అక్రమిష్వ | అక్రమిష్మ. * |

**శ్లో॥ హుత్వా శత్రుసమూహమున్ముఖశిఖస్వీయప్రతాపానలే**
**కృత్వా రక్తరసార్ద్రతామపి శరభ్రాజద్ధృతిశ్రేణిభిః ।**
**స్వస్థప్రేషితపుష్పలాజనికరాకీర్ణః క్షితీశార్పితై–**
**ర్విత్తైస్తత్సమయోచితైః సహ నిజాం నిన్యే నిసర్గప్రియామ్ ॥ 15-6**

**అ :** శత్రుసంహారంచేసి కృష్ణుడు రుక్మిణిని కొనిపోయిన తీరును వర్ణించటమే. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఉత్+ముఖ–శిఖ–స్వీయ–ప్రతాప+అనలే శత్రు–సమూహం హుత్వా శర–భ్రాజత్–ధృతి–శ్రేణిభిః రక్త–రస+ఆర్ద్రతామ్ అపి కృత్వా స్వస్థ–ప్రేషిత–పుష్ప–లాజ–నికర+ఆకీర్ణః (సన్) క్షితి+ఈశ+అర్పితైః తత్–సమయ+ఉచితైః విత్తైః సహ నిసర్గ–ప్రియాం నిజాం నిన్యే.

**ప్ర :** ఉన్ముఖ... నలే : ఉత్+ముఖ = పైకి ఎగుస్తున్న, శిఖ = జ్వాలలుగల, స్వీయ = తనయొక్క, ప్రతాప+అనలే = ప్రతాపం (వాడిమి) అనే అగ్నిలో (ఉన్ముఖ్యః శిఖాః యస్య సః, స చ అసౌ స్వీయశ్చ అసౌ ప్రతాపః ఏవ

అనలః, తస్మిన్), శత్రు-సమూహమ్ : శత్రు = పగవారియొక్క, సమూహమ్ = గుంపును, హుత్వా = హోమం చేసి (హు ధాతువుపై క్త్వా ప్రత్యయం), శర... శ్రేణిభిః : శర = బాణాలు అనే, భ్రాజత్ = ప్రకాశిస్తున్న, దృతి = తిత్తుల (సంచుల)యొక్క, శ్రేణిభిః = వరుసలతో, రక్త-రస+ఆర్ద్రతామ్ : రక్త = నెత్తు రనే, రస = రసంతో, ఆర్ద్రతామ్ అపి = తడిసినతనాన్ని (తేమను) కూడా (రక్తః ఏవ రసః, తేన ఆర్ద్రాః, తేషాం భావః, తామ్), కృత్వా = కలిగించి, స్వస్థ... కీర్ణః : స్వస్థ = స్వర్గమందున్న దేవతలచే, ప్రేషిత = పంప (కురిపింప)బడిన, పుష్ప = పూవు లనే, లాజ = పేలాలయొక్క, నికర = మొత్తాలచే, ఆకీర్ణః (సన్) = నింపబడినవాడై (స్వః తిష్ఠన్తి ఇతి స్వస్థాః, తైః ప్రేషితాని పుష్పాణి ఏవ లాజాః, తేషాం నికరైః ఆకీర్ణః), క్షితి+ఈశ+అర్పితైః : క్షితి+ఈశ = రాజులచే, అర్పితైః = ఇవ్వబడినవీ (క్షితేః ఈశాః, తైః అర్పితాః, తైః), తత్... ఉచితైః = ఆ వేళకు తగినవీ అయిన (స చ అసౌ సమయః తస్య ఉచితాని తైః), విత్తైః సహ = సొమ్ములతో పాటు, నిసర్గ-ప్రియామ్ : నిసర్గ = స్వాభావికంగానే, ప్రియామ్ = ఇష్టురాలైన (నిసర్గేణ ప్రియా, తామ్), నిజామ్ = తన దానిని (భార్యను), నిన్యే = కొనిపోయాడు. (నీ ప్రాపణే-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు పైకి ఎగిసిపడుతున్న జ్వాలలు గల తన ప్రతాపాగ్నిలో శత్రుసమూహాలను హోమం చేసి బాణా లనే తిత్తుల వరుసలతో వారిని నెత్తుటితో తడిపి, దేవతలు కురిపించిన పూల పేలాలు తన శరీరాన్ని నింపగా, యుద్ధంలో ఓటమి పొందిన రాజులు ఆ (యుద్ధ)వేళకు తగిన రీతిగా సమర్పించిన విత్తాలతో పాటు తన స్వాభావికప్రియ అయిన రుక్మిణిని తీసికొని పోయాడు.

**వి :** 1. నిసర్గప్రియా - ప్రకృతి పురుషుల అన్యోన్యప్రేమ స్వాభావికం, అపరిహరణీయం. భౌతికంగా వియోగమున్నా ఆంతరంగా వారు అవిభాజ్యులు. ఆ ప్రేమకు కారణాలుండవు. అది అవ్యాజప్రేమ.

2. లాజ: పేలాలు చల్లటమన్నది ఒక మంగళకృత్యం. '**అవాకిరన్ వయోవృద్ధాః తం లాజైః పౌరయోషితః**' - (రఘువంశం-4-27) అని కాళిదాసు కూడా రఘుమహారాజుపై వృద్ధులయిన పురకాంతలచేత పేలాలు చల్లించాడు. వివాహసమయంలో '**లాజహోమం**' జరిపించటం ఈనాటికీ వివాహవిధిలో ఒక భాగం.

3. నిన్యే : 15-3వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ కృష్ణే స్వాం దయితాం నయత్యురుబలే తద్బన్ధుయోగ్యాం దశా-**
**మాపన్నా ఇవ భూభుజోఽన్తకపురీమన్వాగతా వై గతాః ।**
**అన్యే ఖిన్నముఖా దృగమ్బు ససృజుః కేచిచ్చ మూర్ఛాం శ్రితా-**
**శ్చైద్యాద్యా మలినాననా గతగిరశ్చిన్తాం దురన్తాం యయుః ॥ 15-7**

**అ :** కృష్ణుడు రుక్మిణిని కొనిపోవటం వలన శిశుపాలాదులలోని ప్రతిక్రియను వర్ణించటం.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఉరు-బలే కృష్ణే స్వాం దయితాం నయతి (సతి) భూ-భుజః తద్-బన్ధు-యోగ్యాం దశామ్ ఆపన్నాః ఇవ అను+ఆగతాః (సన్తః) దృగ్+అంబు ససృజుః. కేచిత్ చ మూర్ఛాం శ్రితాః । మలిన+ఆననాః గత-గిరః చైద్య+ఆద్యాః దురన్తాం చిన్తాం యయుః.

**ప్ర :** ఉరు-బలే = మేటి బలంగల (ఉరు బలం యస్య తస్మిన్), కృష్ణే = కృష్ణుడు, స్వామ్ = తనయొక్క, దయితామ్ = వల్లభ అయిన రుక్మిణిని, నయతి (సతి) = కొనిపోతుండగా, భూ-భుజః = రాజులు (భువం భుంజతే ఇతి), తద్-బన్ధూనామ్ = ఆ రుక్మిణి బంధువులకు, యోగ్యామ్ = తగిన, దశామ్ = స్థితిని, ఆపన్నాః+ఇవ = పొందిన వారిలాగా, అను+ఆగతాః సన్తః = అనుసరించి వచ్చినవారై, అన్తక-పురీమ్ = యమనగరికి (అన్తకస్య పురీ, తామ్), గతాః వై = వెళ్ళారు గదా! (వియోగబాధతో మరణించారు), అన్యే = మరికొందరు, ఖిన్న-ముఖాః (సన్తః)

= వాడిన మొగాలు గలవారై (ఖిన్నాని ముఖాని యేషాం తే), దృగ్+అంబు = కన్నీటిని (దృశోః అంబు, తత్), ససృజుః = విడిచారు. (సృజ్ విసర్గే–తుదాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), కేచిత్–చ = ఇంకా కొందరు, మూర్ఛామ్ = ఒళ్ళు–తెలియమిని, ఆశ్రితాః = ఆశ్రయించారు. మలిన+ఆననాః : మలిన = పాలిపోయిన, ఆననాః = ముఖాలు గలవారూ (మలినాని ఆననాని యేషాం తే), గత–గిరః = మాటరాని వారూ అయిన (గతా గీః యేషాం తే), చైద్య+ఆద్యాః = శిశుపాలుడు మొదలగువారు (చైద్యః ఆద్యః యేషాం తే), దురంతామ్ = ముగింపులేని, చిన్తామ్ = దుఃఖాన్ని, యయుః = పొందారు. (యా ప్రాపణే పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** మేటి సత్తువతో కృష్ణుడు రుక్మిణిని కొనిపోగా రాజులు ఆమె బంధువులకు తగిన దశను పొందినట్లుగా కొందరు మరణించారు. కొందరు ముఖాలు పాలిపోగా కన్నీరు కార్చారు. మరికొందరు మూర్ఛపోయారు. శిశుపాలాదులకు నోట మాట రాలేదు. ముఖాలు మలినమై పోయాయి. వారు అంతులేని ఆవేదనకు లోనయ్యారు.

**వి :** 1. రుక్మిణీవియోగంతో కొందరు రాజులు ఆమెను అనుసరించి వెళ్ళి యమపురికి చేరారు. ఆ వియోగాన్ని భరించలేక అన్నది అత్యుక్తి. దాన్ని అలంకారికులు ఒక అలంకారంగా పరిగణించారు. 'అత్యుక్తిరద్భుతాతథ్యమైన**శౌర్యౌదార్యాదివర్ణనమ్**' (కు. 163), అతథ్యమైన శౌర్యాన్నో, ధైర్యాన్నో, మరేదైనా ప్రవృత్తినో వర్ణించటం అత్యుక్తి. అది కొంత ఎబ్బెట్టుగా కూడా కనిపిస్తుంది. కానీ అలా చెప్పటమే కవి లక్ష్యం కావచ్చు. ఆ తీవ్రత తెలియజేయటానికి అదే తగినమార్గంగా కవి భావించవచ్చు.

అయితే ప్రకృతంలో విశేషమేమిటంటే రుక్మిణి కృష్ణుని వెంట వెళ్ళిందే కానీ వారు వెళ్ళిన చోటికి ఆమె వెళ్ళలేదు. అదీ విషయం. మరికొందరిలో వర్ణించిన కంటతడిపెట్టడం, ముఖాలు పాలిపోవటం లాంటివి సంభవాలే.

| | | | |
|---|---|---|---|
| 2. **ససృజుః :** | ససర్జ | ససృజతుః | **ససృజుః** |
| | ససర్జిథ/సస్రష్ట | ససృజథుః | సస్రజ |
| | ససర్జ | ససృజివ | ససృజిమ |
| **యయుః :** | యయౌ | యయతుః | **యయుః** |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

**శ్లో॥ న కృష్ణో నాపి తత్సేనా జఘాన రిపువాహినీమ్ ।**
**జననీద్రోహకృచ్చైద్యపక్షపాతేన సా హతా ॥** **15–8**

**అ :** కృష్ణరిపు వినాశకారణం తాము జగన్మాతకు ద్రోహం చేయాలనుకోవటమే అని ప్రతిపాదన.–పథ్యావక్త్రమ్.

**అ :** కృష్ణః రిపు–వాహినీం న జఘాన. తత్–సేనా అపి న. (కిన్తు) జననీ–ద్రోహ–కృత్–చైద్య–పక్షపాతేన సా హతా.

**ప్ర :** కృష్ణః = కృష్ణుడు, రిపు–వాహినీ = శత్రుసేనను (రిపోః వాహినీ, తామ్) (వాహినీ బలం సైన్యం –హలాయుధకోశః – 457), న జఘాన = చంపలేదు (హన్ హింసాగత్యోః –పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), తత్–సేనా అపి = కృష్ణునిసేనకూడా (తస్య–సేనా), న (జఘాన) = చంపలేదు (కిన్తు = అయితే), జననీ... పాతేన : జననీ = తల్లికి, ద్రోహ–కృత్ = ద్రోహం చేసిన, చైద్య = శిశుపాలుని, పక్ష =వైపు, పాతేన = నిలుచుట ద్వారా (జనన్యాః ద్రోహం కరోతి ఇతి స చ అసౌ చైద్యః తస్య పక్షః తస్మిన్ పాతః తేన), సా = ఆ శత్రుసేన, హతా = చంపబడింది. (హన్ ధాతువుపై కర్మణి–క్త–ప్రత్యయం)

**తా ॥** కృష్ణుడు కానీ కృష్ణసేన కానీ శత్రుసేనను చంపలేదు. తల్లికి ద్రోహం చేసిన శిశుపాలుని వైపు నిలవటం వల్లనే శత్రుసేన నశించింది.

**వి :** 1. శత్రుసేనావినాశకారణత్వాన్ని కృష్ణునిలోనూ, కృష్ణసేనలోనూ నిషేధించి శిశుపాల పక్షపాతంలో నియంత్రించినందువల్ల ఇక్కడ పరిసంఖ్యాలంకారం. '**పరిసంఖ్యా నిషిద్ధ్యైకమేకస్మిన్ వస్తుయంత్రణమ్**' – (కు. 113)

2. శత్రుసేన రుక్మిణికి ప్రత్యక్షంగా ఏ ద్రోహమూ చేయలేదు. కానీ ద్రోహం చేసిన శిశుపాలుని వైపు నిలిచింది. కర్తతో పాటు కారయితకు, ప్రేరకునికీ, అనుమోదకునికీ సమానమైన ఫలముంటుందని గీతావచనం కదా–

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః ।
సుకృతే దుష్కృతే చైవ చత్వారస్సమభాగినః ॥

| | | | |
|---|---|---|---|
| 3. **జఘాన :** జఘాన | జఘ్నతుః | జఘ్నుః | |
| జఘనిథ/జఘన్థ | జఘ్నథుః | జఘ్న | |
| జఘాన/జఘన | జఘ్నివ | జఘ్నిమ. | * |

**శ్లో॥ రుగ్మీ స రుగ్మీవ యదా విరోధం – చక్రే తదా చక్రధరశ్చ రౌగ్మమ్ ।**
**ఛిత్త్వా ధనుస్తస్య ముహుర్భవిష్య–దుద్యోగముత్థాపయతి స్మ దేవః ॥ 15-9**

**అ :** రుగ్మి అక్షయ్యధనుస్సును సాధించుకొనటానికి (భవిష్యత్తులో) కృష్ణుడే ప్రేరణ కల్పించినట్లు సంభావిస్తూ కృష్ణపరాక్రమాన్ని వర్ణించటం. –ఇంద్రవజ్ర.

**అ :** సః రుగ్మీ యదా రుగ్మీ+ఇవ విరోధం చక్రే తదా చక్ర–ధరః దేవః చ రౌగ్మం తస్య ధనుః ముహుః ఛిత్త్వా భవిష్యద్–ఉద్యోగమ్ ఉత్థాపయతి స్మ.

**ప్ర :** సః రుగ్మీ = ఆ రుక్మి (రుక్మిణీ సోదరుడు), యదా = ఎప్పుడు, రుగ్మీ ఇవ = ధనవంతుడిలాగా (రుక్మమ్ అస్య అస్తీతి రుక్మీ (రుగ్మీ) (రుక్మం తు కాంచనే లోహే – నానార్థరత్నమాల–పంక్తి–737) (రుక్మమంటే బంగారమే. అయితే బంగారముండటం సంపన్నతను సూచిస్తుంది కాబట్టి పరంపరయా ధనార్థం బంగారమున్నవానివలె అంటే వాచ్యార్థంగా వుంటుంది.), విరోధమ్ = శత్రుత్వాన్ని, చక్రే = (కనిపింప) జేశాడో (కృ కరణే ఆత్మనేపది లిట్–ప్ర.ఏ.), తదా = అప్పుడు, చక్ర–ధరః = (సుదర్శన) చక్రాన్ని ధరించిన, దేవః = దేవుడు (కృష్ణుడు), రౌగ్మమ్ = బంగారుతో చేసిన (రుక్మస్య వికారమ్. '**తస్య వికారః**' (అష్టాధ్యాయి 4–3–134) సూత్రంతో అణ్ ప్రత్యయం), తస్య = ఆ రుక్మియొక్క, ధనుః = వింటిని, ముహుః = పదేపదే, ఛిత్త్వా = ముక్కలు చేసి (ఛిద్ ధాతువుపై క్త్వా ప్రత్యయం), భవిష్యద్–ఉద్యోగమ్ : భవిష్యద్ = జరుగబోయే, ఉద్యోగమ్ = పూనికను (భవిష్యన్ చ అసౌ ఉద్యోగః తమ్), ఉత్థాపయతిస్మ = పైకి తీశాడు (ఉద్–స్థా–గతినివృత్తౌ–ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.) ('**లట్ స్మే**' (అష్టాధ్యాయి 3–1–118) సూత్రంతో భూతకాలార్థం)

**తా ॥** రుక్మి రుక్మిలాగా (సంపన్నుడిలాగా) కృష్ణుడితో విరోధాన్ని పెట్టుకొన్నాడు. కృష్ణుడు చక్రధారియై ఆ రుక్మియొక్క బంగారు వింటిని ముక్కలు చేశాడు. ఆ రుక్మిలో కలుగబోయే పూనికను పైకి లేపాడు.

**వి :** 1. రుక్మి కృష్ణుడు తన వింటిని విరిచిన తర్వాత తిరుగులేని వింటిని పొందాలని పరమేశ్వరుని గూర్చి తపస్సు చేశాడు. ఆయన అనుగ్రహంతో వింటిని పొందాడు కానీ మహావిష్ణువిరోధమేర్పడితే ఆ విల్లు తిరిగి తననే చేరుతుందని శివుని నిబంధన.

**జితః కృష్ణేన పూర్వం యః శర్వాదా పధనుర్వరమ్ ॥**
**శ్లో॥ తపసా తోషితాత్ కృష్ణాదన్యానేవామునాऽఖిలాన్ ।**
**విజేష్యసి యదా కృష్ణవిరోధస్తే తదా ధనుః ।**
**మామేష్యతీతి తేనోక్తో న వ్యరుధ్యత కేశవే ॥ – మహాభారతతాత్పర్యనిర్ణయః21/203,204**

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చక్రే :** | చక్రే | చక్రాతే | చక్రిరే | |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే | |
| | చక్రే | చకృవహే | చకృమహే | |
| **ఉత్థాపయతి :** | **ఉత్థాపయతి** | ఉత్థాపయతః | ఉత్థాపయన్తి | |
| | ఉత్థాపయసి | ఉత్థాపయథః | ఉత్థాపయథ | |
| | ఉత్థాపయామి | ఉత్థాపయావః | ఉత్థాపయామః. | * |

**శ్లో॥ అచీకపన్ముణ్డితమూర్ధజం తం - శచీపతిస్తుత్యకృతిర్మురారిః ।**
**ఉపేక్ష్య యద్గేహమగాద్ధి లక్ష్మీ-స్తదేతదస్యానుగుణం ఖలస్య ॥ 15-10**

**అ :** కృష్ణుడు రుక్మికి శిరోముండనం చేయటాన్ని కవి సమర్థించటం.

**అ :** శచీ-పతి-స్తుత్య-కృతిః ముర+అరిః తం ముండిత-మూర్ధజమ్ అచీకపత్. యద్-గేహమ్ ఉపేక్ష్య లక్ష్మీః అగాత్ తస్య ఖలస్య తత్ ఏతత్ అనుగుణం హి.

**ప్ర :** శచీ... కృతిః : శచీ-పతి = ఇంద్రుని చేత, స్తుత్య = ప్రశంసింపదగిన, కృతిః = పనిగల (శచ్యాః పతిః, తేన స్తుత్యా కృతిః యస్య సః), ముర+అరిః = మురుని శత్రువు (కృష్ణుడు), తమ్ = ఆ రుక్మిని, ముండిత-మూర్ధజమ్ : ముండిత = పూర్తిగా గొరగబడిన, మూర్ధజమ్ = వెంట్రుకలు గలవానినిగా (ముండితాః మూర్ధజాః యస్య తమ్), అచీకపత్ = చేశాడు. (కృపూ సామర్థ్యే-ణిచి-పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.), యత్ = ఎవనియొక్క గేహమ్ = ఇంటిని, ఉపేక్ష్య = కాదని (ఉప-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), లక్ష్మీః = లక్ష్మి (రుక్మిణి), అగాత్ = వెళ్ళిందో (ఇ-గతౌ పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.), అస్య ఖలస్య = ఆ దుర్మార్గునికి (రుక్మికి), తద్-ఏతత్ = ఆ ఈ పని (తలగొరుగుట), అనుగుణం హి = తగినదే గదా!

**తా ॥** ఇంద్రునిచేత స్తుతింపబడే కార్యక్రమాలు గల కృష్ణుడు రుక్మి తలవెంట్రుకలను పూర్తిగా గొరిగాడు (గుండు చేశాడు). నిజమే! ఎవని ఇంటినుండి లక్ష్మి (రుక్మిణి) వెళ్ళిపోయిందో అతనికి (రుక్మి) ఆ పని తగినదే.

**వి :** 1. శ్లోకంలో 'మురారి' విశేష్యపదం సాభిప్రాయం. మురుని చంపినవాడు అందుకే ఇంద్రునిచేత ప్రశంసింపబడినవాడు కృష్ణుడు.

మురుడు పంచముఖుడు. కృష్ణుడు ఆ మురుని ఐదు తలలనూ సుదర్శన చక్రంతో ఖండించాడు.

శ్లో॥ పాంచజన్యధ్వనిం శ్రుత్వా యుగాంతాశనిభీషణమ్ ।
మురః శయాన ఉత్తస్థౌ దైత్యః పంచశిరా జలాత్ ॥ ... ...

శ్లో॥ తామాపతన్తీం గదయా గదాం మృధే - గదాగ్రజో నిర్బిభిదే సహస్రధా ।
ఉద్యమ్య బాహూనభిధావతోఽజితః - శిరాంసి చక్రేణ జహార లీలయా ॥ -భాగవతమ్10/59/6,10

అయిదు తలలున్న మురాసురుని అయిదు తలలనూ ఖండించిన వానికి ఒకతల వున్న రుక్మి తలను కాక తలమీదున్న వెంట్రుకలను ఖండించటం అసలు లెక్కేముంది. సాభిప్రాయవిశేష్యప్రయోగం కాబట్టి ఇది పరికరాంకురాలంకారం. '**సాభిప్రాయవిశేష్యే తు భవేత్ పరికరాంకురః**' - (కు. 63)

మురారి రుక్మి తలవెంట్రుకలను ఖండించటాన్ని శ్లోకద్వితీయార్థంలోని భావంతో సమర్థిస్తు న్నందువల్ల ఇది వాక్యార్థహేతుకకావ్యలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - (కు. 121)

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అచీకపత్ :** | **అచీకపత్** | అచీకపతామ్ | అచీకపన్ | |
| | అచీకపః | అచీకపతమ్ | అచీకపత | |
| | అచీకపమ్ | అచీకపావ | అచీకపామ | * |

**శ్లో॥ సహస్రసఙ్ఖ్యావనిపాలభఙ్గ-సముత్థభాస్వజ్జయకామినీభిః ।**
**సహాత్మదాసీభిరనన్యకాన్తా - జగామ సా చఞ్చలలోచనాన్తా ॥ 15-11**

**అ :** రుక్మిణి ప్రయాణవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** చంచల-లోచన-అన్తా అనన్య-కాంతా సా ఆత్మ-దాసీభిః సహ సహస్ర-సంఖ్యా+ అవని-పాల-భంగ-సముత్థ-భాస్వత్+జయ-కామినీభిః జగామ.

**ప్ర :** చంచల... న్తా : చంచల = నిలకడలేని, లోచన+అన్తా = కనుకొనలు గలదీ (చంచలౌ లోచనయోః అన్తౌ యస్యాః సా), అనన్య-కాన్తా = (కృష్ణ) ఏకపత్నీ అయిన (న అన్యః కాన్తః యస్యాస్సా), సా = ఆ రుక్మిణి, ఆత్మ-దాసీభిః సహ = తన దాసులతో పాటు (ఆత్మనః దాస్యః, తాభిః), సహస్ర... కామినీభిః : సహస్ర-సంఖ్యా = వేలకొలదిగా గల, అవని-పాల = రాజులయొక్క, భంగ = భంగపాటు (ఓటమి)చేత, సముత్థ = కలిగిన (ఏర్పడిన), జయ-కామినీభిః = గెలుపు మగువలతో, జగామ = వెళ్ళింది. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** అనన్యకాంతా, చంచలలోచనాన్తా అయిన ఆ రుక్మిణి తన దాసీజనంతోపాటు వేలకొలదిగ రాజులు (కృష్ణునితో పోరాడి) ఓడినందువల్ల లభించిన జయకాంతలతో కూడి వెళ్ళింది.

**వి :** 1. శ్లోకంలో చక్కని సహభావానికి చోటు దక్కింది. అందమైన సహభావాన్ని వర్ణిస్తే అది సహోక్త్యలంకారం. రుక్మిణి తన దాసులతో పాటు వేలకొలదిగనున్న విజయకాంతలతో కలిసి వెళ్ళినదని భౌతికంగా వున్న తన దాసులకు, కేవలం మానసికమైన (భావనాత్మకమైన) విజయకాంతలకూ సహభావాన్ని వర్ణించి మనోబలానికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి చేసిన వర్ణన (సహభావం) మనోరంజకం. '**సహోక్తిః సహభావశ్చేద్భాసతే జనరంజనః**' - (కు.58)

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ తద్యోధా జయకామినీజనయుతా గర్జన్తి ధైర్యోర్జితా**
**యుద్ధాప్తా బడవా నిరీక్ష్య తురగా హ్రేషాం ముహుస్తన్వతే ।**
**హస్తీన్ద్రాః కరిణీః సమేత్య పరితః కుర్వన్త్యహో! బృంహితం**
**భక్తాభీష్టకరో హరిర్నను పురా స్వీయాన్ సజాయాన్ వ్యధాత్ ॥ 15-12**

**అ :** రుక్మిణికి తోడుగా వస్తున్న సేన కోలాహలం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ధైర్య+ఊర్జితాః తద్-యోధాః జయ-కామినీ-జన-యుతాః (సన్తః) గర్జన్తి. తురగాః యుద్ధ+ఆప్తాః బడవాః నిరీక్ష్య ముహుః హ్రేషాం తన్వతే. హస్తి+ఇంద్రాః కరిణీః సమేత్య పరితః బృంహితం కుర్వన్తి. భక్త+అభీష్ట-కరః హరిః పురా స్వీయాన్ సజాయాన్ వ్యధాత్ నను. అహో.

**ప్ర :** ధైర్య+ఊర్జితాః : ధైర్య = ధీరత్వంతో, ఊర్జితాః = బలిష్ఠులైన (ధైర్యేణ ఊర్జితాః), తద్-యోధాః : తద్ = కృష్ణునియొక్క, యోధాః = సైనికులు (తస్య యోధాః), జయ... యుతాః (సన్తః):జయ = గెలుపు అనే, కామినీ-జన = కాంతాజనంతో, యుతాః (సన్తః) = కూడినవారై, గర్జన్తి = అరుస్తున్నారు. (గర్జ శబ్దే పరస్మైపది-లట్-ప్ర.బ.), తురగాః = గుఱ్ఱాలు (తురం గచ్ఛన్తి ఇతి), యుద్ధ+ఆప్తాః = యుద్ధంలో తటస్థపడిన, బడవాః = ఆడ గుఱ్ఱాలను, నిరీక్ష్య = చూసి (నిర్-ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ముహుః = మాటిమాటికి, హ్రేషామ్ = సకిలింతను, తన్వతే = చేస్తున్నాయి. (తన్ విస్తారే ఆత్మనేపది-లట్-ప్ర.బ.), హస్తి+ఇంద్రాః = గజరాజులు, కరిణీః = ఆడయేనుగుల,

పరితః = చుట్టూ, బృంహితమ్ = ఘీంకారాన్ని, కుర్వన్తి = చేస్తున్నాయి. (కృ కరణే పరస్మైపది–లట్–ప్ర.బ.), భక్త+అభీష్ట–కరః : భక్త = సేవించేవారి యొక్క, అభీష్ట = కోరికను, కరః = తీర్చే (భక్తానామ్ అభీష్టస్య కరః), హరిః = కృష్ణుడు, పురా = ఇంతకు మునుపే, స్వీయాన్ = తనవారిని, సజాయాన్ = భార్యాసమేతంగా, వ్యధాత్ నను = పోషించాడు గదా! (వి–ధా ధారణపోషణయోః–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), అహో! = ఆశ్చర్యం!

**తా ॥** ధైర్యసంపన్నులయిన కృష్ణుని భటులు జయకామినులతో కూడి బొబ్బలు పెడుతున్నారు. గుఱ్ఱాలు యుద్ధంలో లభించిన ఆడగుఱ్ఱాలను చూసి సకిలిస్తున్నాయి. ఏనుగులు ఆడయేనుగులను చూసి ఘీంకరిస్తున్నాయి. భక్తుల అభీష్టాలను తీర్చే కృష్ణుడు తన వివాహానికి ముందు తన భటులను సతీసమేతంగానే పోషించాడు గదా!

| | | | | |
|---|---|---|---|---|
| వి : 1. | **గర్జంతి :** | గర్జతి | గర్జతః | **గర్జన్తి** |
| | | గర్జసి | గర్జథః | గర్జథ |
| | | గర్జామి | గర్జావః | గర్జామః |
| | **తన్వతే :** | తనుతే | తన్వాతే | **తన్వతే** |
| | | తనుషే | తన్వాథే | తనుధ్వే |
| | | తన్వే | తనువహే/తన్వహే | తనుమహే/తన్మహే |
| | **కుర్వన్తి :** | కరోతి | కురుతః | **కుర్వన్తి** |
| | | కరోషి | కురుథః | కురుథ |
| | | కరోమి | కుర్వః | కుర్మః |
| | **వి+అధాత్ :** | **వ్యధాత్** | వ్యధాతామ్ | వ్యధుః |
| | | వ్యధాః | వ్యధాతమ్ వ్యధాత | |
| | వ్యధామ్ | వ్యధావ | వ్యధామ. | * |

**శ్లో॥ అలఙ్కృతాం నిజపురీం జలజాయతలోచనః ।**
**హయహస్తిరథోపేతః ప్రియయా సహితోఽవిశత్ ॥ 15–13**

**అ :** కృష్ణుడు రుక్మిణితో గూడి ద్వారకానగరంలోనికి ప్రవేశించటం. –పథ్యావక్త్రమ్.

**అ :** హయ–హస్తి–రథ+ఉపేతః జలజ+ఆయత–లోచనః ప్రియయా సహితః (సన్) అలంకృతాం నిజ–పురీమ్ అవిశత్.

**ప్ర :** హయ... పేతః : హయ = గుఱ్ఱాలతో, హస్తి = ఏనుగులతో, రథ = రథాలతో, ఉపేతః = కూడినవాడూ (హయైః హస్తిభిః రథైశ్చ ఉపేతః), జలజ+ఆయత–లోచనః : జలజ = తామరలవలె, ఆయత = విశాలమైన, లోచనః = కన్నులుగల వాడు (కృష్ణుడు) (జలజే ఇవ ఆయతే లోచనే యస్య సః), ప్రియయా = ఇష్టురాలైన రుక్మిణితో, సహితః (సన్) = కూడినవాడై, అలంకృతామ్ = అలంకరింపబడిన, పురీమ్ = నగరిలో, అవిశత్ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కమలాయతలోచనుడైన కృష్ణుడు గుఱ్ఱాలు ఏనుగులు రథాలతో తన వల్లభ అయిన రుక్మిణితో కూడి అలంకరింపబడిన తన నగరంలోనికి ప్రవేశించాడు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| వి : 1. | **అవిశత్ :** | **అవిశత్** | అవిశతామ్ | అవిశన్ | |
| | | అవిశః | అవిశతమ్ | అవిశత | |
| | | అవిశమ్ | అవిశావ | అవిశామ. | * |

**శ్లో॥ కరం జిఘృక్షుర్వైదర్భ్యాః శరణ్యోఽథ యథావిధి ।**
**ప్రియయా బన్ధుభిః సార్ధం ప్రయయౌ మూలమాధవమ్ ॥ 15-14**

**అ :** కృష్ణుడు రుక్మిణితో సహ మూలమాధవక్షేత్రానికి వెళ్ళటం. -పథ్యావక్త్రమ్.

**అ :** అథ యథా-విధి వైదర్భ్యాః కరం జిఘృక్షుః శరణ్యః (కృష్ణః) ప్రియయా బన్ధుభిః సార్ధం మూల-మాధవ ప్రయయౌ.

**ప్ర :** అథ = అటు తరువాత, యథా-విధి = శాస్త్రోక్తంగా (విధిమ్ అనతిక్రమ్య), వైదర్భ్యాః = రుక్మిణియొక్క, కరమ్ = చేతిని, జిఘృక్షుః = పట్టుకొనగోరి (గ్రహీతుమ్ ఇచ్ఛుః), శరణ్యః = శరణుగోరదగిన కృష్ణుడు (శరణే సాధుః- 'తత్ర సాధుః' (అష్టాధ్యాయి 4-4-98) సూత్రంతో యత్ ప్రత్యయం), ప్రియయా = ఇష్టురాలైన రుక్మిణితో, బన్ధుభిః చ సార్ధమ్ = బంధువులతో కూడా, మూల-మాధవ+ఆఖ్యామ్ = మూలమాధవ మనే పేరుగల తోటకు, ప్రయయౌ = వెళ్ళాడు. (ప్ర-యా ప్రాపణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆపై యథావిధిగా రుక్మిణి పాణిగ్రహణం చేయాలని శరణ్యుడైన కృష్ణుడు తనకిష్టమైన రుక్మిణితో, బంధువులతో కూడి మూలమాధవానికి బయలుదేరాడు.

**వి :** 1. వివాహంలో విధివిధానాలకు ఎంత ప్రాధాన్యముందో విందువిలాసాలకూ, వేడుకలకూ కూడా అంతే ప్రాధాన్యం లేదా దానికన్న కొంచెం ఎక్కువే అని కూడా చెప్పవచ్చు. బంధుమిత్రుల కలయిక, విభిన్నస్థాయిలలో విభిన్నవ్యక్తులమధ్య డబ్బు చేతులు మారటం ద్వారా, తద్ద్వారా నిలువలో వున్న డబ్బు చెలామణిలోకి రావటం, తద్ద్వారా ఆర్థికవ్యవస్థలో కదలిక. పదిమంది తృప్తిగా జీవించగలగటం ఇవన్నీ కలిసి పెండ్లివేడుక. కాబట్టి ఈనాడు కూడా పెండ్లితంతు విభిన్నకారణాలవల్ల ఏ కొద్దిమందితోనో జరిపించినా 'రిసెప్షన్' పేరుతో విందు వేడుక పెద్దఎత్తున జరుపుతున్నారు. ద్రవ్యవినియోగానికి ఇది మంచిదే. కానీ అవకాశం లేని వారు కూడా ఆడంబరాలకు పోతే వ్యక్తిగతంగా అనర్థకరం.

కృష్ణుడు మూలమాధవానికి బయలుదేరటంలో కూడా ఆంతర్యం ద్రవ్యవినియోగం, ఊరెరిగింపు (ఊరేగింపు)

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రయయౌ :** | **ప్రయయౌ** | ప్రయయతుః | ప్రయయుః |
| | ప్రయయిథ/ప్రయయాథ | ప్రయయథుః | ప్రయయ |
| | ప్రయయౌ | ప్రయయివ | ప్రయయిమ. |

*

**శ్లో॥ గచ్ఛన్తమాస్థాపయతీవ కృష్ణం - ద్వారావతీ తత్కృతరమ్యశోభా ।**
**కాన్త్యోల్లసన్త్యోభయభాగహేమ్నాం - ద్వార్యఞ్చలేనాభిముఖే మురారేః ॥ 15**

**అ :** కృష్ణగమనవర్ణన - ద్వారశోభ. -ఇంద్రవజ్ర.

**అ :** తత్-కృత-రమ్య-శోభా ద్వారవతీ ముర+అరేః అభిముఖే ఉల్లసన్త్యా ద్వారి ఉభయ-భాగ-హేమ్నాం కాన్త్యా అంచలేన గచ్ఛన్తం కృష్ణమ్ ఆస్థాపయతి+ఇవ (అస్తి).

**ప్ర :** తత్... శోభా : తత్ = ఆ కృష్ణునిచేత, కృత = కల్పింపబడిన, రమ్య = మనోహరమైన, శోభా = కాంతిగల (తేన కృతా రమ్యా శోభా యస్యా స్సా), ద్వారావతీ = ద్వారక, ముర+అరేః = కృష్ణునియొక్క, అభిముఖే = ఎదురుగా, ఉత్+లసన్త్యా = ప్రకాశిస్తున్న, ద్వారి = ద్వారమందలి, ఉభయ-భాగ-హేమ్నామ్ : ఉభయ-భాగ = రెండువైపులనున్న, హేమ్నామ్ = బంగారులయొక్క (ఉభయయోః భాగయోః హేమాని, తేషామ్), కాన్త్యా = వెలుగుయొక్క, అంచలేన = అంచుతో, గచ్ఛన్తమ్ = వెళ్తున్న, కృష్ణమ్ = కృష్ణుని, ఆస్థాపయతి+ ఇవ = ఆపుతున్నట్లుగా వుంది. (ఆ-స్థా గతినివృత్తౌ-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని ఉనికితో ద్వారకకు వింత కాంతి ఏర్పడింది. మురారి ఎదురుగా ఆ ద్వారవతి తన ద్వారాల రెండువైపులా

ప్రకాశిస్తున్న బంగారు వెలుగు యొక్క అంచుతో కృష్ణుని ఆపుతున్నట్లుంది.

**వి :** 1. ఆస్థాపయతీవ – ఉత్ప్రేక్షాలంకారం. ద్వారవతీవర్ణన – ద్వారవతిచేసిన కృష్ణసంస్థాపన వర్ణన ప్రస్తుతాంశం. దానితో ఒక నాయికప్రవృత్తి అప్రస్తుతాంశం స్ఫురిస్తుంది. అలా స్ఫురించటం సమాసోక్త్యలంకారం. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్**'–(కు.61)

2. ద్వారవతి కృష్ణవియోగాన్ని అంగీకరించలేకపోతోందని ఉత్ప్రేక్షించటం ద్వారా అమూర్త–అచేతన పదార్థాలు కూడా కృష్ణ నిరంతరసాహచర్యాన్నే అభిలషిస్తాయని ధ్వని.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆస్థాపయతి :** | **ఆస్థాపయతి** | ఆస్థాపయతః | ఆస్థాపయన్తి |
| | ఆస్థాపయసి | ఆస్థాపయథః | ఆస్థాపయథ |
| | ఆస్థాపయామి | ఆస్థాపయావః | ఆస్థాపయామః. |

*

**శ్లో॥కృష్ణే బలాద్వ్రజతి సా ద్రవదిన్దుకాన్తై-స్తన్మన్దహాసనవచన్ద్రికయాఽశ్రుధారామ్ ।**
**తత్సైన్యసమ్భ్రమసముత్థరజోభిరాస్య-మాలిన్యముద్గతవచా రభసా బభార ॥ 16**

**అ :** కృష్ణవియోగంతో ద్వారావతి కలత చెందినట్లు సంభావన. –వసంతతిలక.

**అ :** కృష్ణే బలాత్ వ్రజతి (సతి) సా తత్+మంద–హాస–నవ–చంద్రికయా ద్రవద్–ఇందు–కాంతైః అశ్రు–ధారాం బభార. ఉద్గత–వచా రభసా తత్–సైన్య–సంభ్రమ–సముత్థ–రజోభిః ఆస్య–మాలిన్యం బభార.

**ప్ర :** కృష్ణే = కృష్ణుడు (కర్షతి ఇతి, తస్మిన్), బలాత్ = తప్పనిసరిగా, వ్రజతి (సతి) = వెళ్తుండగా, సా = ఆ ద్వారవతి, తన్మ... చంద్రికయా : తత్ = ఆ కృష్ణునియొక్క, మంద–హాస = చిఱునవ్వు అనే, నవ = క్రొత్తదైన, చంద్రికయా = వెన్నెలతో (తస్య మందశ్చ అసౌ హాసః ఏవ నవా చంద్రికా, తయా), ద్రవత్–ఇందు–కాంతైః : ద్రవత్ = కరుగుతున్న, ఇందు–కాంతైః = చంద్రకాంతమణులతో (ద్రవంతశ్చ తే ఇందుకాంతాః, తైః), అశ్రు–ధారామ్ = కన్నీటి ధారను, బభార = భరియించింది. (భృ భరణే–భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ఉద్గత–వచా : ఉద్గత = పొడమిన, వచా = వస(మాట) గలదై (వచోగ్రగ్రన్థా షడ్గంథా–అమరకోశః–వన–102) (ఉద్గతా వచా యస్యాస్సా) (స్త్రీపరంగా చెప్పాలంటే వెక్కి వెక్కి మాటాడుతూ అని అర్థం. అయితే అప్పుడు వచస్ శబ్దం స కారాంత నపుంసకలింగమై ఉద్గతవచస్కా అని ప్రయోగించవలసి వస్తుంది.), రభసా = శక్తిమంతంగా, తత్... రజోభిః : ఆ = కృష్ణునియొక్క, సైన్య = సేనా సమూహంయొక్క, సంభ్రమ = అటుఇటుతిరుగుట వలన, సముత్థ = పైకి ఎగసిన, రజోభిః = దుమ్ముకణాలచే, ఆస్య–మాలిన్యమ్ : ఆస్య = ముఖప్రాంతంలో, మాలిన్యమ్ = మలినతను, బభార = భరించింది.

**తా ॥** కృష్ణుని ఉనికిచేత అందగించిన ఆ ద్వారక కృష్ణుడు తప్పనిపనితో తననుండి బయలుదేరగానే ఆ కృష్ణుని చిఱునవ్వు వెన్నెలవలన స్రవించే చంద్రకాంతజలాన్ని కన్నీటిధారగా భరించింది. వేగంగా వెళ్తున్న ఆ సేనలవలన పైకెగసిన ధూళితో ముఖ మాలిన్యాన్ని భరించింది. (ముఖప్రాకారప్రదేశమంతా దుమ్ము కప్పిందని భావం.)

**వి :** 1. ఈ శ్లోకంలో కూడా సమాసోక్త్యలంకారముంది. ప్రస్తుత ద్వారకానగర వృత్తాంతం ద్వారా అప్రస్తుతమైన మగడెడబాసిన నాయికావృత్తాంతం గమ్యమానమవుతున్నందువల్ల సమాసోక్తి. '**సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్**' – (కు.61)

| | | | |
|---|---|---|---|
| 2. **బభార :** | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ. |

*

**శ్లో॥ భర్తుస్తతః ప్రతికృతిం స్ఫురదాత్మవప్ర-లగ్నోచ్చరత్ననికరేషు నిధాయ దీనా ।**
**తస్థావివాథ ఫలితాఽచ్యుతభూషణేషు - విశ్లేషశఙ్కిహృదయాఽనుయయావివేశమ్ ॥17**

**అ :** ద్వారవతిలో కృష్ణవియోగబాధను కవి ఊహించటం. -వసంతతిలక.

**అ :** తతః దీనా స్ఫురద్-ఆత్మ-వప్ర-లగ్న-ఉచ్చ-రత్న-నికరేషు భర్తుః ప్రతికృతిం నిధాయ తస్థౌ-ఇవ అథ అచ్యుత-భూషణేషు ఫలితా విశ్లేష-శంకి-హృదయా ఈశమ్ అనుయయౌ ఇవ.

**ప్ర :** తతః = అటు తర్వాత, దీనా = దీనురాలైన ఆ ద్వారక, స్ఫురత్... నికరేషు : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, ఆత్మ = తనయొక్క, వప్ర = కోటకొరడునందు, లగ్న = అతికివున్న, ఉచ్చ = ఉన్నతమైన, రత్న = రత్నాలయొక్క, నికరేషు = సమూహాలయందు, భర్తుః = స్వామియొక్క, ప్రతికృతిమ్ = ప్రతిరూపాన్ని, నిధాయ = నిలుపుకొని, తస్థౌ+ఇవ = నిలిచినట్లుంది (స్థా గతి-నివృత్తౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), అథ = ఆ పై, అచ్యుత-భూషణేషు = కృష్ణుని నగలపై (అచ్యుతస్య భూషణాని, తేషు), ఫలితా = ప్రతిబింబించిన, విశ్లేష-శంకి-హృదయా : విశ్లేష = వియోగాన్ని, శంకి = సంశయించే, హృదయా = మనస్సుగలదై (విశ్లేషం శంకత ఇతి విశ్లేషశంకి, తచ్చ తత్ హృదయం యస్యాస్సా), ఈశమ్ = ప్రభువును, అనుయయౌ+ఇవ = అనుసరించినట్లుంది. (అను యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ ద్వారకయొక్క కోటకొరళ్ళపై అద్దిన రత్నసమూహాలపై కృష్ణుని ప్రతిబింబం పడుతోంది. అది ఆ ద్వారక భర్తృరూపాన్ని తనలో దాచుకొని నిలిచినట్లుంది. అలాగే కృష్ణుని నగలపై ద్వారక ప్రతిబింబం పడింది. అది ద్వారక తన ప్రభువుతో వియోగాన్ని శంకించి ఆయన్ను అనుసరించినట్లుంది.

**వి :** 1. ద్వారక అవస్థానాన్నీ (నిలకడనూ) అనుగమనాన్నీ (వెళ్ళుటనూ) ఉత్ప్రేక్షిస్తున్న శ్లోకమిది. కృష్ణుడు కదులుతున్నాడు కాబట్టి ద్వారకలో కూడా కదలికనూ, నిలకడనూ రెండింటిని సంభావించవలసి వచ్చింది. ఆ సంభావన క్రియకు సంబంధించింది. (కాబట్టి ఉత్ప్రేక్షాలంకారం). కాళిదాసు ఇటువంటి పరిస్థితినే పార్వతికి కల్పించి ఆమె '**న యయౌ న తస్థౌ**' అని అనుగమన, అవస్థానాలను నిషేధించాడు. అక్కడ శివుడు నిలకడగా వున్నాడు కాబట్టి-

**శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీ సరసాంగయష్టిః - నిక్షేపణాయ పదముద్ధృతముద్వహన్తీ ।**
**మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః - శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ ॥**

- కుమారసంభవమ్ 5/85

| | | | |
|---|---|---|---|
| 2. **తస్థౌ :** | **తస్థౌ** | తస్థతుః | తస్థుః |
| | తస్థిథ/తస్థాథ | తస్థథుః | తస్థ |
| | తస్థౌ | తస్థివ | తస్థిమ |
| **అను-యయౌ :** | **యయౌ** | యయతుః | యయుః |
| | యయిథ/యయాథ | యయథుః | యయ |
| | యయౌ | యయివ | యయిమ. |

*

**శ్లో॥ చలత్పతాకానిలనిర్మలీకృతే - రథౌఘచక్రావలిభిః సమీకృతే ।**
**సురాలిముక్తామలపుష్పలాఞ్ఛితే - గజేన్ద్రదానామ్బుకదమ్బసిఞ్చితే ॥ 15-18**

**అ :** ప్రయాణవేళలోని రాజమార్గవర్ణనం. -వంశస్థం.

**అ :** చలత్–పతాకా+అనిల–నిర్మలీకృతే రథ+ఓఘ–చక్ర–ఆవలిభిః సమీకృతే సుర+ఆలి–ముక్త+అమల–పుష్ప–లాంఛితే గజ+ఇంద్ర–దాన+అంబు–కదంబ–సించితే (రాజమార్గే – యయౌ – 21వ శ్లోకంతో అన్వయం)

**ప్ర :** చలత్... కృతే : చలత్ = కదులుతున్న, పతాకా = పతాకలనుండి వెలువడిన, అనిల = గాలిచేత, నిర్మలీకృతే = శుభ్రం చేయబడినదీ (చలన్తీనాం పతాకానామ్ అనిలేన నిర్మలీకృతః తస్మిన్), రథౌ... వలిభిః : రథ=రథాలయొక్క, ఓఘ=సమూహంయొక్క, చక్ర = చక్రాలయొక్క, ఆవలిభిః = వరుసల చేత (రథానామ్ ఓఘాః, తేషామ్ ఆవలయః , తాభిః), సమీకృతే = సమీకరింపబడిందీ, సురా... లాంఛితే : సుర+ఆలి = దేవతా సమూహంచేత, ముక్త = విడువ(చల్ల)బడిన, అమల = నిర్మలమైన, పుష్ప = పూలచేత, లాంఛితే = గుర్తింపబడినదీ (సురాణామ్ ఆలిః, తయా ముక్తైః అమలైః పుష్పైః లాంఛితః, తస్మిన్), గజేంద్ర... సించితే : గజ+ఇంద్ర = శ్రేష్ఠగజాలయొక్క (సింహశార్దూలనాగాద్యాః పరే శ్రేష్ఠత్వబోధకాః), దాన+అంబు = మదజలంయొక్క, కదంబ = సమూహంచేత, సించితే = తడుపబడినదీ (గజానామ్ ఇంద్రాః, తేషాం దానేన జాతాని అంబూని, తేషాం కదంబః, తేన సించితః, తస్మిన్), (రాజమార్గే = రాచబాటలో, యయౌ = వెళ్ళాడు.)

**తా ॥** కృష్ణుడు రాచబాటలో ప్రయాణమయ్యాడు. ఆ బాట కదులుతున్న పతాకాలనుండి వెలువడుతున్న గాలులతో శుభ్రం చేయబడింది. రథచక్రసమూహంచేత సమీకృతమై దట్టంగా, ఏకమొత్తంగా కనిపిస్తోంది. దేవతలు కురిపిస్తున్న నిర్మలపుష్పాలు లాంఛనంగా ఆ బాటలో కనిపిస్తున్నాయి. మదపుటేనుగుల మదజలంచేత ఆ బాట తడుపబడింది.

**వి :** 1. ఇంటి ముంగిళ్ళను శుభ్రపరిచినట్లే రాచబాటలను కూడా శుభ్రపరచటమిక్కడ కనిపిస్తోంది. చీపురుతో ఊడ్వటం, కల్లాపి చల్లటం, రేఖామాత్రంగా ముగ్గులు వేయటం, అందులో పూలు చల్లటం (వుంచటం) ఇక్కడ విషయం. పండుగ నెలలో (ధనుర్మాసంలో) తెలుగునాట ప్రతిముంగిట కనిపించే సన్నివేశమిది. **ముగ్గుల మధ్య నిలపటానికి మంచి గుమ్మడిపూలను, చుట్టూ చల్లటానికి తంగేడిపూలను వాడుతారు.**

2. శ్లోకంలో ఈ అలంకరణకు సంబంధించిన క్రమం తారుమారుగా కనిపిస్తుంది. కానీ “**అర్థక్రమ పాఠక్రమయోః అర్థక్రమః బలీయాన్**’ అని మీమాంసా సూత్రం. పాఠక్రమం కన్న అర్థక్రమానికే ప్రాధాన్యం. కాబట్టి ప్రక్రియకు అనుగుణంగా అర్థాన్ని బట్టి అన్వయించుకోవలసి వస్తుంది. *

**శ్లో॥ వరాశ్వవారోచ్చయసూచితైర్హయై–రితస్తతో మణ్డలధావనోద్యతైః ।**
**పరిస్ఫురద్భూషణచామరోజ్జ్వలై–ర్విరాజితే హ్రేషితభూషితాననైః ॥ 15–19**

**అ :** రాజమార్గవర్ణనమే. –వంశస్థమ్.

**అ :** వర+అశ్వ–వార+ఉచ్ఛయ–సూచితైః ఇతః+తత మండల–ధావన+ఉద్యతైః పరిస్ఫురత్+ భూషణ–చామర+ఉజ్జ్వలైః హ్రేషిత–భూషిత+ఆననైః హయైః విరాజితే (రాజమార్గే... యయౌ– 21వ శ్లోకంతో అన్వయం)

**ప్ర :** వరా... సూచితైః : వర = శ్రేష్ఠులైన, అశ్వవార = (గుఱ్ఱపు) రౌతులయొక్క, (Sanskrit-English Dictionary-Apte P-204), ఉచ్ఛయ = సమూహంచేత, సూచితైః = సూచింపబడినవీ, (వరాశ్చ తే అశ్వవారాః, తేషామ్ ఉచ్ఛయః, తైః సూచితాః, తైః), ఇతః+తతః = ఇటు అటు, మండల–ధావన+ఉద్యతైః : మండల = గుండ్రంగా, ధావన = పరుగెత్తటానికి, ఉద్యతైః = సిద్ధమైనవీ (మండలాకారేణ ధావనే ఉద్యుక్తాః, తైః), పరి... జ్జ్వలైః : పరిస్ఫురత్ = ప్రకాశిస్తున్న, భూషణ = అలంకరణలచే, చామర = మెడపైనున్న, వింజామర వంటి వెంట్రుకలచే, ఉజ్జ్వలైః = కాంతిమంతములయినవీ (పరిస్ఫురద్భిః భూషణైః చామరైశ్చ ఉజ్జ్వలాః, తైః), హ్రేషిత+భూషిత+ఆననైః : హ్రేషిత = సకిలింతలచే, భూషిత = అలంకరింపబడిన, ఆననైః = ముఖాలుగలవీ అయిన (హ్రేషితైః భూషితాని ఆననాని యేషాం, తైః), హయైః = గుఱ్ఱాలతో, విరాజితే = వెలుగొందుతున్న, (రాజమార్గే = రాచబాటలో, యయౌ = వెళ్ళాడు.)

**తా ॥** కృష్ణుడు ప్రయాణిస్తున్న రాచబాటలో గుఱ్ఱాలు ఆ బాటకు అందాన్ని తెస్తున్నాయి. మంచి రౌతులు ఆ గుఱ్ఱాలకు సూచనలనిచ్చి నడిపిస్తున్నారు. అవి మండలాకృతిలో అటు ఇటు పరుగెత్తుతున్నాయి. వాటి మెడలపై వింజామరం వంటి వెంట్రుకలు, వివిధ భూషణాలు ప్రకాశిస్తున్నాయి. వాటి ముఖాలు సకిలింతలతో సొగసుగా వున్నాయి.

*

**శ్లో॥ పార్శ్వద్వయస్థేభకదమ్బరఙ్గి-కుమ్భైస్సమేతే కలశోపమానైః ।**
**అన్యోన్యసక్తోన్ముఖకుఞ్చితాగ్ర-హస్తైశ్చ నీలోత్పలతోరణాభైః ॥ 15-20**

**అ :** రాజమార్గవర్ణనమే. -ఇంద్రవజ్ర.

**అ :** కలశ+ఉపమానైః పార్శ్వ-ద్వయ-స్థ+ఇభ-కదంబ-రంగి-కుమ్భైః నీల+ఉత్పల-తోరణ+ఆభైః అన్యోన్య-సక్త+ఉన్ముఖ-కుంచిత+అగ్ర-హస్తైః చ సమేతే (రాజమార్గే... యయౌ - 21వ శ్లోకంతో అన్వయం)

**ప్ర :** కలశ+ఉపమానైః : కలశ = కలశాలతో (కుండలతో), ఉపమానైః = పోలికగల (కలశైః ఉపమానం యేషాం, తైః), పార్శ్వ... కుంభైః : పార్శ్వ-ద్వయ = ఇరుప్రక్కలా, స్థ = ఉన్న, ఇభ = ఏనుగులయొక్క (ఇభః స్తమ్బేరమః పద్మీ - అమరకోశః-క్షత్ర-35), కదంబ = సమూహంయొక్క, రంగి = రంజనగల, కుమ్భైః = కుంభస్థలాలచే (పార్శ్వయోః ద్వయే తిష్ఠన్తీతి పార్శ్వద్వయస్థాః, తే చ తే ఇభాః, తేషాం కదంబానాం రంగినశ్చ తే కుమ్భాః తైః), సమేతే = కూడినదీ, నీలో... ణాభైః : నీల+ఉత్పల = నల్లకలువలయొక్క, తోరణ = తోరణాలయొక్క, ఆభైః = శోభగలవీ (నీలాని చ తాని ఉత్పలాని, తేషాం తోరణాని, తేషామ్ ఆభా ఇవ ఆభా యేషాం తైః), అన్యోన్య... హస్తైః : అన్యోన్య = ఒకదానితో ఒకటి, సక్త = తగుల్కొని, ఉత్+ముఖ = మొగాలు పైకెత్తి, కుంచిత = కొంచెం వంగిన, అగ్ర-హస్తైః = తొండాల చివరలతో (అన్యోన్యం సక్తాః ఉన్ముఖాః కుంచితాః చ తే అగ్రే హస్తాః యైః తైః), చ=కూడా, సమేతే = కూడినదీ అయిన, (రాజమార్గే = రాచబాటలో, యయౌ = వెళ్ళాడు.)

**తా ॥** ఆ రాచబాటకు రెండువైపులా కలశాలవంటి ఏనుగు కుంభస్థలాలు పలు వన్నెలతో కనిపిస్తున్నాయి. ఏనుగుల తొండాల చివరలు ఒకదానికొకటి తగుల్కొని నల్లకలువల తోరణాలాగా ప్రకాశిస్తున్నాయి. *

**శ్లో॥ విచిత్రరత్నోజ్జ్వలభూషణౌఘైః - పదామ్బుజైః ప్రాహుణికాఙ్గనానామ్ ।**
**రఙ్గప్రభాం ముష్ణతి రాజమార్గే - మన్దం యయౌ మన్మథకోటిరూపః ॥ 15-21**

**అ :** రాజమార్గవర్ణనమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** విచిత్ర-రత్న+ఉజ్జ్వల-భూషణ+ఓఘైః ప్రాహుణిక+అంగనానాం పద+అంబుజైః రాజ-మార్గే రంగ-ప్రభాం ముష్ణతి మన్మథ-కోటి-రూపః (కృష్ణః) మందం యయౌ.

**ప్ర :** విచిత్ర... ఘైః : విచిత్ర = రంగురంగుల, రత్న = రత్నాలతో కూడి, ఉజ్జ్వల = వెలుగొందుతున్న, భూషణ = నగలయొక్క, ఓఘైః = సమూహాలుగల (విచిత్రైః రత్నైః ఉజ్జ్వలానాం భూషణానామ్ ఓఘాః యేషాం, తైః), ప్రాహుణిక+అంగనానామ్ = అతిథులైన స్త్రీలయొక్క (ఆతిథ్యః ప్రాహుణోఽతిథిః-వైజయన్తీ-బ్రాహ్మణ-68), (ప్రాహుణికాశ్చ తాః అంగనాః, తాసామ్), పద+అంబుజైః = పాదపద్మాలచేత (పదాని ఏవ పద్మాని, తైః), రాజ-మార్గే = రాచబాట, రంగ-ప్రభామ్ = ముగ్గుల కాంతిని (రంగాణాం ప్రభా, తామ్), ముష్ణతి (సతి) = అపహరిస్తుండగా, మన్మథ-కోటి-రూపః = మదనకోటివంటి రూపంగల (మన్మథానాం కోటిః, స ఇవ రూపం యస్య సః) (కృష్ణః = కృష్ణుడు), మన్దమ్ = మెల్లగా, యయౌ = వెళ్ళాడు (యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణీకృష్ణుల పెళ్ళివేడుకకు అతిథులుగా వచ్చిన అతివల పాదపద్మాలు వివిధ రత్నాభరణాల సమూహాలతో ప్రకాశిస్తూ ఆ ముంగిళ్ళలోని రంగవల్లుల కాంతిని అపహరిస్తున్నాయి. అటువంటి అతివలతో కూడిన ఆ రాజమార్గంలో కోటి మన్మథుల వంటి రూపంగల కృష్ణుడు మెల్లగా ముందుకు సాగాడు.

**వి :** 1. ముంగిళ్ళలోని రంగవల్లులు రత్నకాంతులను మించిపోవటం ఆశ్చర్యకరమేమీ కాదు.

ఈ రంగవల్లికలేమి తెల్పెదునయా – తెలుగునారీ **కళాధీన**బుద్ధి –అంటూ తన సంక్రాంతి పద్యాలలో రంగవల్లులోని కళాతత్త్వాన్ని ప్రకటించారు. ఆ రోజుల్లో ఎర్రమట్టినీ, చెక్కపొడినీ (ఆకుపచ్చరంగు – తలంటుస్నానానికి ప్రధానంగా పిల్లలకు వాడే ఆకుపొడి) వాడి రంగులను ప్రదర్శించేవారు. ఈనాడు వివిధవర్ణాలతో రంగవల్లులను తీర్చిదిద్దుతున్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **యయౌ :** | **యయౌ** | యయతుః | యయుః | |
| | యయిథ/యయాథ | యయథుః | యయ | |
| | యయౌ | యయివ | యయిమ. | * |

**శ్లో॥ మధ్యస్థాపితమాధవా స్మితలసత్ఫేనా చలచ్చామర–**
**వ్రాతోర్మిర్వితతాతపత్రకమఠా హస్త్యశ్వపత్త్యావృతా ।**
**వీణావేణునినాదగర్జితయుతా వార్ధేస్సమా సా చమూ–**
**రాచ్ఛన్నానిమిషాఽన్తరాగతమహీపాలౌఘసేనాసరిత్ ॥ 15–22**

**అ :** కృష్ణునితోపాటు వెళ్తున్న కృష్ణసేనను వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** మధ్య–స్థాపిత–మాధవా స్మిత–లసత్–ఫేనా చలత్–చామర–వ్రాత+ఊర్మిః వితత+ ఆతపత్ర–కమఠా హస్తి+అశ్వ–పత్తి+ఆవృతా వీణా–వేణు–నినాద–గర్జిత–యుతా ఆచ్ఛన్న+ అనిమిషా అన్తః+ఆగత–మహీ–పాల+ఓఘ–సేనా–సరిత్ సా వార్ధేః సమా చమూః (మందం యయౌ–వెనుక శ్లోకంతో అన్వయం)

**ప్ర :** మధ్య–స్థాపిత–మాధవా : మధ్య = నడిమి ప్రదేశంలో, స్థాపిత = నిలుపబడిన, మాధవా = కృష్ణుడు గలదీ (మధ్యే స్థాపితః మాధవః యయా సా), స్మిత–లసత్–ఫేనా : స్మిత = చిఱునవ్వు అనే, లసత్–ఫేనా = ప్రకాశించే నురుగు గలదీ (స్మితమ్ ఏవ లసత్ ఫేనః యస్యాః సా), చలత్–చామర–వ్రాత+ఊర్మిః : చలత్ = కదులుతున్న, చామర = వింజామరల యొక్క, వ్రాత = సమూహాలే, ఊర్మిః = అలలుగా గలదీ (చలన్తి చ తాని చామరాణాం వ్రాతాని ఏవ ఊర్మయః యస్యాః సా), వితత+ఆతపత్ర–కమఠా : వితత = విశాలమైన (విప్పబడిన), ఆతపత్ర = గొడుగు లనే, కమఠా = తాబేళ్ళు గలది (వితతాని ఆతపత్రాణి ఏవ కమఠాః యస్యా స్సా), హస్తి+అశ్వ–పత్తి+ఆవృతా : హస్తి = ఏనుగులచే, అశ్వ = గుఱ్ఱాలచే, పత్తి = పాదచారులైన సైనికులచే, ఆవృతా = ఆవరింపబడిందీ, (హస్తినః చ అశ్వాః చ పత్తయః, చ హస్త్యశ్వపత్తయః తాభిః ఆవృతా), వీణా... యుతా : వీణా = వీణియలయొక్క, వేణు = పిల్లనగ్రోవుల యొక్క, నినాద = సవ్వడు లనే, గర్జిత = ఘోషతో, యుతా = కూడినదీ, (వీణానాం వేణూనాం చ నినాదా ఏవ గర్జితాని, తైః యుతా), ఆచ్ఛన్న+అనిమిషా : ఆచ్ఛన్న = మరుగువడిన, అనిమిషా = దేవతలు/చూపలు గలదీ (ఆచ్ఛన్నాః అనిమిషాః యస్యాం సా), అంత... సరిత్ : అంతః = మధ్యలో, ఆగత = వచ్చిచేరిన, మహీ–పాల = రాజులయొక్క, ఓఘ = సమూహంయొక్క, సేనా = సైన్యమనే, సరిత్ = నదులుగలదీ అయిన (అంతః ఆగతానాం మహీపాలానామ్ ఓఘస్య సేనా ఏవ సరిత్ యస్యాః సా), సా = ఆ, చమూః = కృష్ణసేన, వార్ధేః = సముద్రానికి, సమా = సమానతగలదై (మన్దమ్ = మెల్లగా, యయౌ = వెళ్ళింది.)

**తా ॥** కృష్ణునిసేన సముద్రసమానమై (కృష్ణుని వెంట) మెల్లగా నడిచింది. సముద్ర మధ్యంలో నారాయణుడు ఉన్నట్లే సేనమధ్యలో కృష్ణుడున్నాడు. ఆ మాధవుని చిఱునవ్వులే అక్కడ నురుగులు. కదులుతున్న వింజామరలే అలలు. గొడుగులే తాబేళ్ళు. ఏనుగులు, గుఱ్ఱాలు, పదాతులే ఆవరణలు. వీణావేణునినాదాలే (సాగర)ఘోషలు. మనుష్యరూపంలోనున్న దేవతలు (అనిమిష) గలది కృష్ణసేన అయితే, చేపలు (అనిమిష) గలది సాగరం. ఆ రీతిగా సాగరంతో సమానమైన కృష్ణసేన మెల్లగా కదిలింది.

**వి :** 1. శ్లోకంలోని సావయవరూపకాలంకారంతో కూడిన ఉపమ మనోహరంగా వుంది. కృష్ణసేనకు సముద్రంతో పోలిక. ఇది అవయవి. ఇక్కడ ఉపమాలంకారం. అవయవాల పోలిక రూపకరూపంలో, అభంగశ్లేషసహకారంతోనూ జరిగింది. మధ్యస్థాపితమాధవా; పత్త్యావృతా, ఆచ్ఛన్నానిమిష - ఇక్కడ అభంగశ్లేషసహకారం, ఆయా పదాలకు యథాతథంగా రెండు అర్థాలను స్వీకరిస్తున్నందువల్ల. స్మిత... ఫేనా... చామరవ్రాతోర్మి, ... వేణునినాదగర్జిత, సేనాసరిత్- ఇక్కడ రూపకాలంకారం. శ్లేష రూపకానుప్రాణితమైన ఉపమాలంకారం శ్లోకం మొత్తం మీద. *

**శ్లో॥లక్ష్మీశవాహరథహస్తిభటౌఘవేగా-జ్జాతం వ్రజత్ త్రిదివమాత్తరయం రజస్తత్ ।**
**కృష్ణానుషఙ్గిచిదచేతనసఙ్గభాజో - వక్తి త్రివిష్టపగతిం గతమేధసోఽపి ॥ 15-23**

**అ :** ప్రయాణంలో ఆకాశమంటుతున్న దుమ్ము - స్వర్గతిగా కవి సంభావన. -వసంతతిలక.

**అ :** లక్ష్మీ+ఈశ-వాహ-రథ-హస్తి-భట+ఓఘ-వేగాత్ జాతం (సత్) త్రిదివం వ్రజత్ ఆత్త-రయం తద్ రజః కృష్ణ+అనుషంగి-చిద్-అచేతన-సంగ-భాజః గత-మేధసః అపి త్రివిష్టప-గతిం వక్తి.

**ప్ర :** లక్ష్మీ... వేగాత్ : లక్ష్మీ+ఈశ = కృష్ణునియొక్క, వాహ = గుఱ్ఱాలు (ఘోటకో హయో వాహః - హలాయుధకోశః -436), రథ = రథాలు, హస్తి = ఏనుగులు, భట = సైన్యం - వీటియొక్క, ఓఘ = సమూహంయొక్క, వేగాత్ = త్వర వలన (లక్ష్మ్యాః ఈశః, తస్య వాహాః రథాః హస్తినః భటాః, చ తేషామ్ ఓఘః, తస్య వేగః, తస్మాత్), జాతం (సత్) = పుట్టినదై (జనీ ధాతువుపై క్త ప్రత్యయం), త్రిదివమ్ = స్వర్గంవైపు, వ్రజత్ = వెళ్తూ (వ్రజ ధాతువుపై శతృ ప్రత్యయం), ఆత్త-రయమ్ : ఆత్త = పొందిన, రయమ్ = వేగం గల (ఆత్తః రయః యేన తత్), తత్ రజః = ఆ ధూళి, కృష్ణా... భాజః : కృష్ణ = కృష్ణునితో, అనుషంగి = చేరిమి గల, చిద్-అచేతన = చేతనాచేతనాలతో, సంగ = కలయికను, భాజః = పొందినట్టి (కృష్ణేన అనుషంగిణోః, చిచ్చ అచేతనశ్చ, తయోః సంగం భజతి ఇతి తస్య), గత-మేధసః+అపి = జ్ఞానహీనునికి కూడా (గతా మేధా యస్మాత్తస్య), త్రివిష్టప-గతిమ్ : త్రివిష్టప = స్వర్గంవైపునకు, గతిమ్ = గమనాన్ని, వక్తి = చెప్తోంది (తెలుపుతోంది), (వచ పరిభాషణే పరస్మైపది అదాది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని గుఱ్ఱాలు, రథాలు, ఏనుగులు, సైనికులు కదులుతున్న వేగంవల్ల పుట్టిన ధూళి పైకి ఎగసి స్వర్గంవైపు వేగంగా వెళ్తూ కృష్ణునితో చేరిమిగల చేతనాలతోగానీ, అచేతనాలతోగానీ (గుఱ్ఱాలు, ఏనుగులు, సైనికులు చేతనాలు, రథాలు అచేతనాలు) కలయిక వుంటే బుద్ధిహీనునికి కూడా స్వర్గప్రాప్తి కలుగుతుందని చెప్తోంది.

**వి :** 1. గతమేధసః - మేధా శబ్దం ఆకారాన్తం స్త్రీలింగం. గతా మేధా యస్మాత్ సః - అన్న బహువ్రీహిలో **'గోస్త్రియోరుపసర్జనస్య'** (అష్టాధ్యాయి 1-2-48) సూత్రం మేరకు మేధా శబ్దం హ్రస్వాన్తమై గతమేధః-(గతమేధస్య-షష్ఠీ) అని రూపం కావలసి వుంది.

అయితే **'నిత్యమసిచ్ ప్రజామేధయోః'** (అష్టాధ్యాయి 5-4-122) సూత్రంతో ప్రజా మేధా శబ్దాలకు 'అసిచ్' ప్రత్యయం చివర వస్తుంది. అమేధాః, దుర్మేధాః, సుమేధాః అని మేధస్ శబ్దం సిద్ధిస్తుంది. కానీ ఈ అసిచ్ ప్రత్యయం నఙ్, దుస్, సు పూర్వపదాలుగా వున్నప్పుడు మాత్రమే అని నియతి. మరి 'గత'-పూర్వపదమైనప్పుడు అసిచ్ ప్రత్యయమెలా? 'సూత్రంలోని నిత్యపదప్రయోగంవలన అసిచ్ ప్రత్యయాన్ని సర్వత్ర అన్వయింపజేస్తున్నారు కొందరు' అని బాలమనోరమావ్యాఖ్యాకర్త -

**"కేచిత్తు నిత్యగ్రహణమన్యతో విధానార్థమ్. తేనాల్పమేధసః ఇత్యాది సిద్ధ్యతీత్యప్యాహుః"** (5-4-122 సూత్రవ్యాఖ్య.)

2.**రజః త్రివిష్టపగతిం వక్తి** - అనటంలో కర్తృపదం ధూళి అయింది. పరిభాషణార్థకమైన వచనంలో (చెప్పటంలో)

ధూళికి శక్తిలేదు. కాబట్టి ఇటువంటి ప్రయోగాలు లాక్షణికాలు. దీన్ని వక్రోక్త్యలంకారమని వామనుని పరిగణన. **'సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః'** (కావ్యాలంకారసూత్రవృత్తి – 418) తెలియజేస్తోంది లేదా తెలిసేటట్లు చరిస్తోంది అని భావం.

3. ధూళికి స్వర్గతిని లభింపజేయటం తీర్థమహిమ. చక్రతీర్థమహిమను వర్ణిస్తూ తీర్థప్రబంధ శ్లోకం–

**శ్లో॥ చక్రతీర్థస్య మహిమా వర్ణితుం కేన శక్యతే ।**
**యచ్ఛిలామపి సంగేన విధత్తే విశ్వవందితామ్ ॥** – తీర్థప్రబంధ – 1/95

| | | | |
|---|---|---|---|
| 4. **వక్తి :** | **వక్తి** | వక్తః | – (ప్రయోగం లేదు) |
| | వక్షి | వక్థః | వక్థ |
| | వచ్మి | వచ్వః | వచ్మః. * |

**శ్లో॥ విచిత్రరత్నద్యుతిరఙ్గకాన్త్యా – సుమౌక్తికౌఘాక్షతలాజరాజ్యా ।**
**మన్దానిలాఖ్యవ్యజనైః స్వతీరే – సిన్ధుః స్వజామాతరమర్చతీవ ॥ 15–24**

**అ :** సముద్రుడు కృష్ణుని సమర్చించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సిన్ధుః స్వ–తీరే విచిత్ర–రత్న–ద్యుతి–రంగ–కాన్త్యా సుమౌక్తిక+ఓఘ+అక్షత–లాజ–రాజ్యా మంద+అనిల+ఆఖ్య–వ్యజనైః స్వ–జామాతరమ్ అర్చతి+ఇవ.

**ప్ర :** సిన్ధుః = సముద్రుడు, స్వ–తీరే = తన ఒడ్డున (స్వస్య తీరం, తస్మిన్), విచిత్ర... కాన్త్యా : విచిత్ర = రకరకాల రంగులుగల, రత్న = రత్నాలయొక్క, ద్యుతి = కాంతులు అనే, రంగ = ముగ్గులయొక్క (పీఠంయొక్క), కాన్త్యా = వెలుగుతో (పూజా సమయంలో ఆవాహనకు ముందే ఆసనాన్ని రేఖామాత్రంగా అయినా ముగ్గులతో అలంకరించటం ఈనాడూ చూస్తున్నాం. యాంత్రిక, తాంత్రిక పూజలలో ఇవి మరీ ఎక్కువ) (విచిత్రాణాం రత్నాణాం ద్యుతిః ఏవ రంగమ్, తస్య కాంతిః, తయా), సుమౌ... రాజ్యా : సుమౌక్తిక = మంచి ముత్యాలయొక్క, ఓఘ = సమూహ మనే, అక్షత = అక్షతలయొక్క, లాజ = పేలాలయొక్క, రాజ్యా = వరుసతో (సుమౌక్తికానామ్ ఓఘః ఏవ అక్షతాశ్చ లాజాశ్చ, తేషాం రాజిః, తయా), మన్దా... వ్యజనైః : మన్ద+అనిల = చల్లని గాలి, ఆఖ్య = అనుపేరుగల, వ్యజనైః = వీవెనలతో (మన్దశ్చాసౌ అనిలః, స ఇతి ఆఖ్యా యేషాం తాని చ తాని వ్యజనాని చ, తైః ), స్వ–జామాతారమ్ = తన అల్లుని, అర్చతి+ఇవ = పూజిస్తున్నట్లుంది. (అర్చ పూజాయాం–భ్వాది–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు మూలమాధవం వైపు వెళ్తూ సముద్రతీరాన్ని తాకినప్పుడు సముద్రుడు తన అల్లుని అర్చిస్తున్నట్టు వివిధరత్నకాంతులనే రంగపీఠంగా తీర్చి ముత్యాల అక్షతలను పేలాలను పంక్తులుగా కూర్చి చల్లని గాలు లనే వీవెనలతో వీచసాగాడు.

**వి :** 1. వరుని లక్ష్మీనారాయణ స్వరూపునిగా భావించి తానెంతవాడైనా (కాబోయే) అల్లుని కాళ్ళుకడిగి కన్యాదానం చేస్తాడు మామ. అటువంటప్పుడు ఆ లక్ష్మీనారాయణుడే అల్లు–డయితే ఆ మర్యాదలను, అర్చనలను గురించి చెప్పవలసిన దేముంటుంది?

| | | | |
|---|---|---|---|
| 2. **అర్చతి :** | **అర్చతి** | అర్చతః | అర్చన్తి |
| | అర్చసి | అర్చథః | అర్చథ |
| | అర్చామి | అర్చావః | అర్చామః. * |

**శ్లో॥ తుఙ్గైస్తరఙ్గైర్ధృతశఙ్ఖచక్రైః - కీర్ణం పయః ఫేనసితం వితన్వన్ ।**
**హస్తైర్మురారేర్వ్రజతోఽధిమార్గం - వస్త్రాణి విస్తారయతీవ వార్ధిః ॥ 15-25**

**అ :** సముద్రుడు కృష్ణునికి వస్త్రాలను సమర్పించటం. -ఇంద్రవజ్ర.

**అ :** తుంగైః ధృత-శంఖ-చక్రైః తరంగైః ఫేన-సితం పయః కీర్ణం వితన్వన్ వార్ధిః వ్రజతః మురారేః అధిమార్గం వస్త్రాణి హస్తైః విస్తారయతీవ.

**ప్ర :** తుంగైః = ఎత్తైనవీ, శంఖ-చక్ర-ధరైః = శంఖ, చక్రాలను ధరించినవీ అయిన, తరంగైః = అలలచే, ఫేన-సితమ్ = నురుగుతో శుభ్రమైన (ఫేనేన సితమ్), పయః = నీటిని, కీర్ణమ్ = వ్యాపించేటట్లు (అలల ద్వారా), వితన్వన్ = చేస్తూ, వార్ధిః = సముద్రుడు, వ్రజతః = వెళ్తున్న, ముర+అరేః = కృష్ణునకు, అధిమార్గమ్ = దారిలో, వస్త్రాణి = బట్టలను (గుడ్డలను), హస్తైః = చేతులతో, విస్తారయతి+ఇవ = పరుస్తున్నట్లుంది. (వి స్తృ ఆచ్ఛాదనే-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు సముద్రతీరంలో వెళ్తుంటే ఎత్తైన అలలు శంఖచక్రాలను తమలో నింపుకొని నురుగుతో శుభ్రమైన నీటిని తీరంపై పరుస్తున్నాయి. (వ్యాపింపజేస్తున్నాయి). అది సముద్రుడు తన చేతులతో కృష్ణుడు వెళ్తున్న దారిలో వస్త్రాలను పరుస్తున్నట్లుంది.

**వి :** 1. నడిచే బాటలో పైన చలువ పందిళ్ళు, క్రింద పరచిన పరుపులు లేదా వస్త్రాలు మహనీయులపై చూపించే ఆదరణకు గొప్ప సంకేతం. ఉత్సవవిగ్రహాలను ఊరేగించే సమయంలో విడిదిచేసే ప్రదేశాల దగ్గర చలువ పందిళ్ళు వేయటం గమనించవచ్చు. (ఇప్పుడు షామియానాలు ఆ స్థానాన్ని ఆక్రమించాయి. శుభాశుభభేదం లేకుండా) క్రింద వస్త్రాలు పరచటం ఈనాడు 'రెడ్ కార్పెట్' స్వాగతరూపంలో కనిపిస్తుంది.

2. అలలు శంఖచక్రాలతో కూడి వుండటం వైష్ణవధర్మాన్ని ధ్వనింపజేయటం. వైష్ణవులు శంఖచక్రాల ముద్రలను ధరించటం పవిత్రకార్యాలకు అర్హతనిస్తుంది. చక్రాంకితులు చక్రాంకితులు కాని వారిచేతి వంటను తినకపోవటం కూడా గమనించవచ్చు. కాబట్టి కృష్ణపదార్చనకు శంఖచక్రాంకితాలై అలలు అర్హతను పొందుతున్నాయి. అద్వైతంలో కూడా రుద్రాభిషేకం చేసేటప్పుడు '**నారుద్రో రుద్రమర్చయేత్**' అన్న నియమం మేరకు ముందుగా సర్వాంగరౌద్రీకరణాన్ని ఆచరిస్తారు మహాన్యాసరూపంలో.

3. **విస్తారయతీవ** - అనటం సంభావన, కవి ఊహ. కాబట్టి అది ఉత్ప్రేక్షాలంకారం. సిద్ధవిషయ వస్తూత్ప్రేక్షాలంకారం. శ్లోకంలో పూర్వార్ధం ఉపమేయభాగం. ఉత్తరార్ధం ఉపమాన భాగం. అయితే కవి వాటిని ఉపమానోపమేయాలుగా కాక విశేషణవిశేష్యాలుగా (వితన్వన్) వర్ణించి ఉత్ప్రేక్షకు అందం తెచ్చాడు.

| | | | |
|---|---|---|---|
| 4. **విస్తారయతి :** | **విస్తారయతి** | విస్తారయతః | విస్తారయన్తి |
| | విస్తారయసి | విస్తారయథః | విస్తారయథ |
| | విస్తారయామి | విస్తారయావః | విస్తారయామః. |

*

**శ్లో॥ నీలాశ్మద్యుతిపత్రశోభిభిరధోవ్యాలమ్బిపుష్పస్ఫుర-**
**న్ముక్తాదామభిరుల్లసత్కిసలయశ్రేణీవితానోజ్జ్వలైః ।**
**సిన్ధుప్రేషితరత్నసంహితతలైర్వృక్షైః సువర్ణోన్నత-**
**స్తమ్భాఙ్గైర్మణిమణ్డపానుకృతిభిర్యుక్తం సమానాయతైః ॥ 15-26**

అ : మూలమాధవక్షేత్రంలోని వనవర్ణన. –శార్దూలవిక్రీడితమ్.

అ : నీల+అశ్మ–ద్యుతి–పత్ర–శోభిభిః అధః–వ్యాలమ్బి–పుష్ప–స్ఫురత్–ముక్తా–దామభిః ఉల్లసత్–కిసలయ–శ్రేణీ–వితాన–ఉజ్జ్వలైః సింధు–ప్రేషిత–రత్న–సంహిత–తలైః సువర్ణ+ ఉన్నత–స్తంభ+అంగైః మణి–మండప+అనుకృతిభిః సమాన+ఆయతైః వృక్షైః యుక్తమ్ (వనమ్ అవిశత్–తర్వాతి శ్లోకంతో అన్వయం)

ప్ర : నీలా... శోభిభిః : నీల+అశ్మ = ఇంద్రనీలమణులయొక్క, ద్యుతి = కాంతివంటి కాంతిగల, పత్ర = ఆకులతో, శోభిభిః = ప్రకాశిస్తున్నవీ, (నీలాని చ తాని అశ్మాని, తేషాం ద్యుతిరివ ద్యుతిః యేషాం తాని చ తాని పత్రాణి తైః శోభన్తే ఇతి తైః), అధో... దామభిః : అధః = క్రిందుగా, వ్యాలంబి = వ్రేలాడుతున్న, పుష్ప = పూవులనే, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, ముక్తా = ముత్యాల, దామభిః = హారాలు గలవీ (అధః వ్యాలంబీని పుష్పాణి ఏవ స్ఫురన్తి చ తాని ముక్తానాం దామాని, తైః), ఉల్లసత్... నోజ్జ్వలైః : ఉల్లసత్ = వెలుగొందుతున్న, కిసలయ = చివురులయొక్క, శ్రేణీ = పంక్తి అనే, వితాన = సమూహంచేత, ఉజ్జ్వలైః = ప్రకాశిస్తున్నవీ (ఉల్లసతాం కిసలయానాం శ్రేణీ ఏవ వితానం, తేన ఉజ్జ్వలాః, తైః), సింధు... తలైః : సింధు = సముద్రంచే, ప్రేషిత = పంపబడిన, రత్న = రత్నాలతో, సంహిత = పొదగబడిన, తలైః = ఉపరిభాగం గలవీ (సింధునా ప్రేషితైః రత్నైః సంహితాని తలాని యేషాం తైః), సువర్ణ... భాంగైః : సువర్ణ = బంగారుతో చేసిన, ఉన్నత = ఎత్తైన, స్తంభ = స్తంభాలవంటి, అంగైః = అవయవాలు (కాండలు) గలవీ, (సువర్ణైః నిర్మితాః స్తంభాః, తద్వత్ అంగాని యేషాం తైః), సమాన+ఆయతైః : సమాన = సమానమైన, ఆయతైః = పొడవు గలవీ (సమానమ్ ఆయతం యేషాం తైః), మండప+అనుకృతిభిః : మండప = మంటపాలను, అనుకృతిభిః = అనుకరించేవీ అయిన (మండపానామ్ అనుకృతయః, తాభిః), వృక్షైః = చెట్లతో, యుక్తమ్ = కూడివున్న, (వనమ్ = తోటలో, అవిశత్ = ప్రవేశించాడు.)

తా ॥ మూలమాధవవనంలోని చెట్లు రత్నమండపాలను అనుకరిస్తున్నాయి. ఆ చెట్ల ఆకులు ఇంద్రనీలమణుల కాంతివంటి కాంతి గలవి. క్రిందకు వ్రేలాడుతున్న ఆ చెట్ల పూలు ముత్యాల సరాల్లాగా వున్నాయి. కిసలయశ్రేణి వితానం వలె వుంది. ఆ చెట్ల ఉపరితలాలు సముద్రుడు పంపిన రత్నాలతో పొదగబడి వున్నాయి. ఆ చెట్ల మ్రానులు బంగారు స్తంభాలలాగా కనిపిస్తున్నాయి. అవన్నీ ఒకే ఎత్తులో వున్నాయి. అందుకే రత్నమండపాలను అనుకరిస్తున్నాయి.

వి : 1. '**నీలాశ్మద్యుతిపత్ర**', '**సువర్ణోన్నతస్తంభాంగ**' – రెండూ లుప్తోపమాలంకారాలు. '**పుష్పస్ఫురన్ముక్తాదామ**' '**శ్రేణీవితాన**' – ఈ రెండూ రూపకాలంకారాలు.

*

**శ్లో॥ విష్వగ్లమ్బిఫలోచ్చయం కలపికైరారబ్ధగీతం వనం**
**గర్జద్వారిధిమర్దలం శుకవచస్తోత్రం స్వతన్వీక్షయా ।**
**నృత్యత్కేకినటీమనోజ్ఞమలిగీర్వీణానినాదం పత-**
**త్పుష్పౌఘాక్షతలాజవృన్దమవిశన్మాఙ్గల్యవేశ్మోపమమ్ ॥15-27**

అ : కృష్ణుడు ప్రవేశించిన వనాన్ని వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

అ : విష్వగ్–లంబి–ఫల+ఉచ్చయం కల–పికైః ఆరబ్ధ–గీతం గర్జద్–వారిధి–మర్దలం శుక–వచ–స్తోత్రం స్వ–తను+ఈక్షయా నృత్యత్–కేకి–నటీ–మనోజ్ఞమ్ అలి–గీః–వీణా–నినాదం పతత్–పుష్ప+ఓఘ+అక్షత–లాజ–వృందం మాంగల్య–వేశ్మ+ఉపమం వనమ్ అవిశత్.

ప్ర : విష్వగ్... యమ్ : విష్వగ్ = అన్నివైపులా, లంబి = వ్రేలాడుతున్న, ఫల = పండ్లయొక్క, ఉచ్చయమ్ = సమూహం గలదీ (విష్వక్ లంబినః–ఫలానామ్ ఉచ్చయాః యస్మిన్ తత్), కల–పికైః = కలం గల కోకిలలచే (కలేన

యుతాః పికాః) (ధ్వనౌ తు మధురా–స్ఫుటే కలః (అమర–నాట్య–2) అని కలపదం ధ్వనివిశేషం కాబట్టి మధ్యమపదలోపిగానే సమాసాన్ని చెప్పుకోవాలి), ఆరబ్ధ–గీతమ్ = ప్రారంభింపబడిన పాటగలదీ (ఆరబ్ధం గీతం యస్మిన్ తత్), గర్జద్–వారిధి–మర్దలమ్ : గర్జత్ = ఘోషిస్తున్న, వారిధి = సముద్రమనే, మర్దలమ్ = మద్దెలగలదీ (గర్జత్ వారిధిః ఏవ మర్దలం యస్మిన్ తత్), శుక–వచః–స్తోత్రమ్ : శుక = చిలుకల యొక్క, వచః = మాట లనే, స్తోత్రమ్ = స్తుతులుగలదీ (శుకానాం వచాంసి ఏవ స్తోత్రాణి యస్మిన్ తత్), స్వ–తను+ఈక్షయా : స్వ = తనయొక్క, తను = శరీరంయొక్క, ఈక్షయా = దర్శనంచేత (స్వస్య తనోః ఈక్షా, తయా), నృత్యత్... మనోజ్ఞమ్ : నృత్యత్ = నృత్యం చేస్తున్న, కేకి = నెమళ్ళు అనే, నటీ = నటిచేత, మనోజ్ఞమ్ = అందమైనదీ (నృత్యన్తః కేకినః ఏవ నట్యః, తాభిః మనోజ్ఞమ్), అలి–గీః–వీణా–నినాదమ్ : అలి = తుమ్మెదలయొక్క, గీః= మాట లనే (ఝుంకారాలనే), వీణా–నినాదమ్ = వీణానాదం గలదీ (అలీనం గిరః ఏవ వీణాయాః నినాదః యస్మిన్ తత్), పతత్... వృందమ్ : పతత్ = రాలుతున్న, పుష్ప = పూలయొక్క, ఓఘ = సమూహమనే, అక్షత = అక్షతలూ, లాజ = పేలాలూ–వీటియొక్క, వృందమ్ = మొత్తాలు గలదీ, (పతతాం పుష్పాణామ్ ఓఘః ఏవ అక్షతానాం లాజానాం వృందం యస్మిన్ తత్), మాంగల్య–వేశ్మ+ ఉపమమ్ : మాంగల్య–వేశ్మ = కళ్యాణమంటపంతో, ఉపమమ్ = పోలిక గలదీ (మాంగల్య వేశ్మ, తేన ఉపమా యస్య, తమ్), వనమ్ = (మూలమాధవ) వవనంలోనికి, అవిశత్ = ప్రవేశించాడు. (విశ ప్రవేశనే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ။** కళ్యాణమంటపంలా వున్న ఆ మూలమాధవవనంలోనికి ప్రవేశించాడు కృష్ణుడు. వనమంతా పళ్ళు వ్రేలాడుతున్నాయి (చెట్లవి). కోకిలల అవ్యక్త మధురధ్వనులు గీతా–లాపనలా వున్నాయి. సాగరఘోష మృదంగ ధ్వనిలా వుంది. చిలుకల పలుకులు స్తుతుల్లా వున్నాయి. కృష్ణుని శరీరాన్ని చూసి నెమళ్ళు అనే నర్తకీమణులు నాట్యమాడుతున్నారు. తుమ్మెదల ఝుంకారాలు వీణనాదంలా వున్నాయి. రాలిపడుతున్న పూలు (అతిథులు) చల్లుతున్న అక్షతల్లాగా, పేలాల్లాగా వున్నాయి.

**వి :** 1. వనానికి కళ్యాణమంటపంతో పోలిక ఈ శ్లోకంలో. కళ్యాణమంటపాలలోని మొగసాల దగ్గర, ఇతరత్ర పండ్లగుత్తులను (ప్రధానంగా అరటి, కొబ్బరి) వ్రేలాడదీయటం మనం నిత్యమూ చూసేది. అలంకరణ కోసం అరటిచెట్లను గెలలతో సహా నరికివేయటం వాస్తవానికి దారుణం. అయినా పండితులూ, పామరులూ ఆ బాటనే అనుసరిస్తున్నారు. అలాగే కోకిలల గీతాలు, అలల మృదంగధ్వని, చిలుకల స్తుతిగీతాలు, నెమళ్ళనే నర్తకుల నాట్యాలు, తుమ్మెదల ఝుంకారాల వీణానాదం, పూల అక్షతలు, పేలాలు ఇవన్నీ మంగళకరవస్తుసముదాయమై ఆ తోటకు కళ్యాణమంటపశోభను తెస్తున్నాయి. విధేయ వాక్యంలో (వేశ్మోపమమ్) ఉపమా–లంకారం. అవయవాలలో రూపకాలంకారం కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **అవిశత్ :** | **అవిశత్** | అవిశతామ్ | అవిశన్ |
| | అవిశః | అవిశతమ్ | అవిశత |
| | అవిశమ్ | అవిశావ | అవిశామ. |

*

**శ్లో॥ యదిన్దిరాయాస్తదభూద్ధి మూలం – ప్రియాఙ్గసంశ్లేషమహోత్సవశ్రియః ।**
**తతస్తదార్యాః ప్రవదన్తి నూనం – స్థలం స్థలజ్ఞా భువి మూలమాధవమ్ ॥ 15–28**

**అ :** మూలమాధవనామౌచిత్యనిరూపణ.

**అ :** యత్ తత్ ఇందిరాయాః ప్రియ+అంగ–సంశ్లేష–మహా+ఉత్సవ–శ్రియః మూలమ్ అభూత్ హి తతః స్థల–జ్ఞాః ఆర్యాః భువి తత్ స్థలం నూనం మూల–మాధవం ప్రవదన్తి.

**ప్ర :** యత్ = ఏ కారణంవలన, తత్ = అది (ఆ మూలమాధవవనం), ఇందిరాయాః = లక్ష్మికి (ఇందిరా లోకమాతా మా రమా మంగళదేవతా-అమరకోశః), ప్రియా... శ్రియః : ప్రియ = వల్లభునియొక్క, అంగ = శరీరంతో, సంశ్లేష = కలయిక అను, మహా+ఉత్సవ = గొప్ప పండుగయొక్క, శ్రియః = సంపదకు, (ప్రియస్య అంగేన సంశ్లేషః ఏవ మహాన్ చ అసౌ ఉత్సవః, తస్య శ్రీః, తస్యాః), మూలమ్ = కారణం, అభూత్ హి = అయినదో (భూ సత్తాయాం పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), తతః = అందువలన, స్థల-జ్ఞాః = స్థలవేత్తలయిన, ఆర్యాః = పెద్దలు, భువి = లోకంలో, తత్-స్థలమ్ = ఆ తావును, మూలమాధవమ్ = మూలమాధవమని (మాయాః ధవస్య మూలమ్), ప్రవదన్తి = అంటున్నారు. (వద వ్యక్తాయాం వాచి పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇందిరకు ప్రియాంగసంశ్లేషమనే మహోత్సవసంపత్తికి ఆ ప్రదేశం మూలమైంది కాబట్టి స్థలతత్త్వవేత్తలయిన పెద్దలు ఆ స్థలాన్ని **మూలమాధవ**మంటున్నారు.

**వి :** 1. మూలమాధవ మన్నపేరు అంతకు ముందు కూడా వున్నదే. ఇప్పుడు కవి ఆ పదానికున్న యోగశక్తిని సమర్థిస్తూ అదే పేరును మరల ప్రతిపాదిస్తున్నందువల్ల ఇది విధ్యలంకారం. '**సిద్ధస్యైవ విధానం యత్తమాహుః విధ్యలంకృతిమ్**' - (కు. 166)

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **ప్ర-వదన్తి :** | వదతి | వదతః | **వదన్తి** |
| | వదసి | వదథః | వదథ |
| | వదామి | వదావః | వదామః |

3. ఛందస్సు - శ్లోకంలోని 1,3 పాదాలు ఉపేంద్రవజ్ర. 2,4 పాదాలు వంశస్థం. త్రిష్టుప్, జగతీచ్ఛందస్సుల కలయిక.

*

**శ్లో॥ ఆసన్ నృపాః కేచన భీష్మపుత్ర్యాః - పక్షే సదారా అపరే మురారేః ।**
**వార్ధిస్తదా గర్జతి వారిజాక్ష్యాః - పక్షేఽహమేవేతి వదన్నివోచ్చైః ॥ 15-29**

**అ :** రుక్మిణీకృష్ణుల పెండ్లివేడుక. -ఇంద్రవజ్ర.

**అ :** కేచన నృపాః సదారాః (సన్తః) భీష్మపుత్ర్యాః పక్షే ఆసన్. అపరే మురారేః (పక్షే ఆసన్) తదా వార్ధిః వారిజ+అక్ష్యాః పక్షే అహమ్ ఏవ ఇతి వదన్+ఇవ ఉచ్చైః గర్జతి.

**ప్ర :** కేచన = కొంతమంది, నృపాః = రాజులు, సదారాః (సన్తః) = భార్యలతో కూడి (దారాభిః సహ వర్తన్తే ఇతి), భీష్మ-పుత్ర్యాః = రుక్మిణియొక్క (భీష్మస్య పుత్రీ, తస్యాః), పక్షే = వైపుగా, ఆసన్ = నిలిచారు. (అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), అపరే = మరికొందరు, మురారేః = కృష్ణునియొక్క, (పక్షే ఆసన్ = వైపు నిలిచారు.), తదా = అప్పుడు, వార్ధిః = సముద్రుడు (వాః ధీయతే అస్మిన్ ఇతి), వారిజ+అక్ష్యాః= కమలనయన అయిన రుక్మిణియొక్క, పక్షే = వైపున, అహమ్-ఏవ = నేనే, ఇతి = అని, వదన్+ఇవ = చెప్తున్నట్లుగా, ఉచ్చైః = పెద్దగా, గర్జతి = ఘోషపెడుతున్నాడు.(గర్జ శబ్దే-భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కొందరు రాజులు భార్యలతో పాటుగా రుక్మిణి పక్షం వహించారు. మరికొందరు రాజులు కృష్ణుని పక్షం వహించారు. నేనే రుక్మిణివైపు అన్నట్టుగా సముద్రుడు ఘోషపెట్టాడు.

**వి :** 1. రుక్మిణి ఇప్పుడు కృష్ణుని వెంట ఒంటరిగా వచ్చింది. కాబట్టి ఆమెకు ఏ లోటూ కనిపించకుండా, మనస్సు కలత పడకుండా చూసుకోవలసిన అవసరం యాదవులకుంది. అందుకే కొందరు రుక్మిణి పక్షం వహించారు. ఎవరున్నా లేకపోయినా (లక్ష్మి కడలికూతురు కాబట్టి) నేనున్నా అన్నట్టుగా సముద్రఘోష.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆసన్ :** | ఆసీత్ | ఆస్తామ్ | **ఆసన్** |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ |
| **గర్జతి :** | **గర్జతి** | గర్జతః | గర్జన్తి |
| | గర్జసి | గర్జథః | గర్జథ |
| | గర్జామి | గర్జావః | గర్జామః. |

*

**శ్లో॥రత్నౌఘపూర్ణరవివర్ణసువర్ణపాత్రే - సత్కర్ణపత్రముఖశోభనవస్తురాశిమ్ ।**
**విస్తీర్య శఙ్ఖపటహధ్వనిపూరితాశా - జగ్ముర్వధూగృహమథోత్సవనిర్ణయాయ ॥ 30**

**అ :** రుక్మిణీకృష్ణుల పెండ్లివేడుక. -వసంతతిలక.

**అ :** అథ రత్న+ఓఘ-పూర్ణ-రవి-వర్ణ-సువర్ణ-పాత్రే సత్-కర్ణ-పత్ర-ముఖ-శోభన-వస్తు-రాశిం విస్తీర్య శంఖ-పటహ-ధ్వని-పూరిత+ఆశాః (సన్తః) ఉత్సవ-నిర్ణయాయ వధూ-గృహం జగ్ముః

**ప్ర :** అథ = అటు తర్వాత, రత్నౌ... పాత్రే : రత్న = రత్నాలయొక్క, ఓఘ = రాశితో, పూర్ణ = నిండి, రవి-వర్ణ = సూర్యుని వన్నెగల, సువర్ణ-పాత్రే = బంగారుగిన్నెలో (రత్నానామ్ ఓఘేన పూర్ణం చ తత్ సువర్ణమయం పాత్రమ్, తస్మిన్), సత్... రాశిమ్ : సత్ = మేలిమి అయిన, కర్ణ-పత్ర = చెవినగలు, ముఖ = మొదలగు, శోభన = మంగళకరాలయిన, వస్తు = వస్తువులయొక్క, రాశిమ్ = రాశిని (సన్తి చ తాని కర్ణపత్రాణి, తాని ముఖే యస్య తత్ చ, సః శోభనవస్తూనాం రాశిః, తమ్), విస్తీర్య = నింపి (వి-స్తృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శంఖ... తాశాః : శంఖ = శంఖాలయొక్క, పటహ = తప్పెట్లయొక్క, ధ్వని = చప్పుడుతో, పూరిత = నింపబడిన, ఆశాః (సన్తః) = దిక్కులుగలవారై (శంఖానాం పటహానాం చ ధ్వనిభిః పూరితాః ఆశాః యాభిస్తాః), ఉత్సవ-నిర్ణయాయ : ఉత్సవ = వివాహోత్సవముహూర్తంయొక్క, నిర్ణయాయ = నిశ్చయం కోసం (ఉత్సవస్య నిర్ణయః, తస్మై), వధూ-గృహమ్ = పెండ్లి కూతురింటికి (వధ్వాః గృహమ్), జగ్ముః = వెళ్ళారు. (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ఆపై వివాహమహోత్సవనిర్ణయం కోసం రత్నాలతో నిండి సూర్యవర్ణంతో శోభిస్తున్న బంగారుగిన్నెలలో కర్ణపత్రం (తాటంకం) మొదలగు మంగళకరవస్తురాశిని నింపుకొని శంఖపటాహధ్వనులతో దిక్కులను నింపుతూ వధువు ఇంటికి బయలుదేరారు. (శ్లోకంలో కర్తృపదం లేదు)

**వి :** 1. **జగ్ముః :** 15-11వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ వివిచ్య సర్వాఙ్గవిచారకాలే - తయోః సమన్తాద్ఘటనా కిలాసీత్ ।**
**సుపీనదేవీస్తనమధ్యదేశే - సుదుర్లభా సా పరమచ్యుతస్య ॥ 15-31**

**అ :** వధూవరులకు పొంతన. -ఉపేంద్రవజ్ర.

**అ :** తయోః వివిచ్య సర్వ+అంగ-విచార-కాలే సమన్తాత్ ఘటనా ఆసీత్ కిల. అచ్యుతస్య పరం సుపీన-దేవీ-స్తన-మధ్య-దేశే సా (ఘటనా) సుదుర్లభా (ఆసీత్).

ప్ర : తయోః = ఆ రుక్మిణీకృష్ణులకు, వివిచ్య = వివరంగా (వి-విచ్ (పృథగ్భావే) ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సర్వ... కాలే : సర్వ = సమస్తమైన, అంగ = విభాగాలను గూర్చి, విచార = ఆలోచించే, కాలే = సమయంలో (సర్వేషామ్ అంగానాం విచారస్య కాలః తస్మిన్) (వయస్సు, సాముద్రికశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రపరంగా రాశికూటాదుల కుదిరిక మొదలయిన అంగాలు), సమన్తాత్ = పూర్తిగా, ఘటనా = పొందిక, ఆసీత్ కిల = ఉంది గదా! (అస భువి పరస్మైపది-లజ్-(ప్ర.ఏ.), అచ్యుతస్య పరమ్ = కృష్ణునకు మాత్రమే, సుపీన... దేశే : సుపీన = బాగా బలిసిన, దేవీ = రుక్మిణియొక్క, స్తన = చనుగవయొక్క, మధ్య-దేశే = నడిమి తావులో (సుపీనయోః దేవ్యాః స్తనయోః మధ్యశ్చ అసౌ దేశః తస్మిన్), సా = ఆ కుదిరిక (పొంతన), సుదుర్లభా = అలభ్యంగా, ఆసీత్ = ఉంది.

**తా ॥** రుక్మిణీకృష్ణుల పొందికకు సంబంధించిన సర్వ విషయాలను వివరంగా పరిశీలిస్తున్నపుడు చక్కగా కుదిరింది. కేవలం కృష్ణుడికి బలిసిన ఆమె చనుగవ మధ్యభాగంలో మాత్రం ఘటన కుదరలేదు.

వి : 1. కాళిదాసు కుమారసంభవంలో పార్వతీ విషయంలో కూడా ఇటువంటి వర్ణనమే చేస్తాడు. (1-40)

**శ్లో॥ అన్యోన్యముత్పీడితముత్పలాక్ష్యాః - స్తనద్వయం పాండు తథా ప్రవృద్ధమ్ ।**
**మధ్యే యథా శ్యామముఖస్య తస్య - మృణాళసూత్రాంతరమప్యలభ్యమ్ ॥**

పరస్పరం ఒరుసుకొంటున్న పార్వతి స్తనములమధ్య తామరతూటికి కూడా చోటు దొరకలేదట.

2. **ఆసీత్ :** 15-29వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥కన్యామిమాం కనకదామకదమ్బగౌరీం - ధన్యాం దిశన్తు హరయే హరినీలభాసే ।**
**యుక్తస్తయాయముదవాహ ఇవాత్తవిద్యు-ద్విష్వక్ కరిష్యతి సమస్తపుమర్థవర్షమ్॥32**

అ : రుక్మిణీ కన్యాదానం సమస్తపురుషార్థఫలప్రదాయకమని ప్రస్తుతి. -వసంతతిలక.

అ : కనక-దామ-కదంబ-గౌరీం ధన్యామ్ ఇమాం కన్యాం హరి-నీల-భాసే హరయే దిశన్తు. తయా యుక్తః అయమ్ ఆత్త-విద్యుత్ ఉదవాహః+ఇవ విష్వక్ సమస్త-పుమ్-అర్థ-వర్షం కరిష్యతి.

ప్ర : కనక... గౌరీమ్ : కనక-దామ = బంగారు గొలుసులా, కదంబ = కడిమి పువ్వులా, గౌరీమ్ = గౌరవర్ణం (పసుపుపచ్చ రంగు అధికముగాఁ గలిగిన యెఱుపు - ఆంధ్రవాచస్పత్యం -ద్వితీయ-పు 1132) గలదీ, (కనకదామవత్ కదంబవత్ గౌరీ, తామ్), ధన్యామ్ = ధన్యురాలైన, ఇమామ్ = ఈ, కన్యామ్ = కన్నియను, హరి-నీల-భాసే : హరి-నీల = ఇంద్రనీలం వంటి, భాసే = కాంతిగల (హరినీలస్య భాః ఇవ భాః యస్య తస్మై), హరయే = కృష్ణునికి, దిశన్తు = ఇవ్వండి (దిశ అతిసర్జనే-పరస్మైపది-లోట్-(ప్ర.బ.), తయా = ఆ రుక్మిణితో, అయమ్ = ఈ కృష్ణుడు, యుక్తస్సన్ = కూడినవాడై, ఆత్త-విద్యుత్ : ఆత్త = పొందిన, విద్యుత్ = మెరుపుగల (ఆత్తా విద్యుత్ యేన సః), ఉదవాహః+ఇవ = మేఘంలా (ఉదకస్య వాహః విగ్రహం-ఉదక శబ్దానికి ఉదాదేశం '**ఉదకస్యోదః సంజ్ఞాయామ్**' (అష్టాధ్యాయి-6-3-27), విష్వక్ = అంతటా, సమస్త-పుమ్-అర్థ-వర్షమ్ : సమస్త = అన్నీ, పుమ్+అర్థ = పురుషార్థాలయొక్క (ధర్మ-అర్థ-కామ-మోక్షాలయొక్క), వర్షమ్ = వానను, కరిష్యతి = కురిపించగలడు (కృ కరణే-పరస్మైపది-లృట్-(ప్ర.ఏ.)

**తా ॥** ఈమె బంగారుగొలుసులా, కడిమిపూవులా గౌరవర్ణంగల కన్య, ధన్య. ఇంద్రనీలమణి వంటి కాంతిగల కృష్ణునికి ఈమె నివ్వండి. ఈమెతో కూడిన కృష్ణుడు మెరుపుతో కూడిన మేఘంలాగా సర్వత్ర పురుషార్థవృష్టిని కురిపింపగలడు.

వి : 1. **శ్లో॥ అయాచితాని దేయాని సర్వద్రవ్యాణి భారత ।**
**అన్నం విద్యా తథా కన్యా చానర్థిభ్యో న దీయతే ॥**

ఆర్షవచనం. 'అడగకపోయినా అన్ని వస్తువులనూ ఇవ్వవచ్చు కానీ అన్నం, విద్య, కన్య – ఈ మూడింటిని మాత్రం అడగని వారి కివ్వగూడదు' – అందుకే రుక్మిణిని ఈ కృష్ణున కివ్వండి అని అడగటం. కాలానుగుణంగా ఈ ఆలోచనలో అప్పుడప్పుడు మార్పు కనిపిస్తుంది కానీ మౌలికంగా మాత్రం ఆ ఆలోచనయే సమంజసం.

2. మేఘంలాగా కృష్ణుడు పురుషార్థవృష్టిని కురిపిస్తాడనటం ఉపమాలంకారం. పురుషార్థవృష్టి అన్నచోట రూపకం. అది ఉపమకు సహకరిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **దిశన్తు :** | దిశతు/దిశతాత్ | దిశతామ్ | **దిశన్తు** |
| | దిశ/దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ |

| | | | |
|---|---|---|---|
| **కరిష్యతి :** | **కరిష్యతి** | కరిష్యతః | కరిష్యన్తి |
| | కరిష్యసి | కరిష్యథః | కరిష్యథ |
| | కరిష్యామి | కరిష్యావః | కరిష్యామః. |

*

**శ్లో॥ వైదర్భవంశోదధిజాతరత్న–మియం సతీ సోఽప్యుడునాయకస్య ।**
**కులోద్భవాలఙ్కృతిరేతయోస్తత్ – పరమ్పరాయోగ్యమవైత యోగమ్ ॥15–33**

**అ :** రుక్మిణీకృష్ణులు ఒకరికొకరు తగినవారని వర్ణించటం (వంశపరంగా)

**అ :** ఇయం సతీ వైదర్భ–వంశ–ఉదధి–జాత–రత్నమ్ సః అపి ఉడు–నాయకస్య కుల+ ఉద్భవ+అలంకృతిః తత్ ఏతయోః యోగం పరంపరా–యోగ్యమ్ అవైత.

**ప్ర :** ఇయం సతీ = ఈ సతి (రుక్మిణి), వైదర్భ... రత్నమ్ : వైదర్భ = విదర్భకు చెందిన (భీష్మకునియొక్క), వంశ = వంశ మనే, ఉదధి = సముద్రమందు, జాత = పుట్టిన, రత్నమ్ = రత్నం (వైదర్భస్య వంశ ఏవ ఉదధిః, తస్మిన్ జాతం రత్నమ్), సః+అపి = ఆ కృష్ణుడు కూడా, ఉడు–నాయకస్య : ఉడు = నక్షత్రాలయొక్క (తారకాప్యుడు వా స్త్రియామ్–అమర–దిక్–21), నాయకస్య = నాయకుడైన చంద్రునియొక్క, కులో... కృతిః : కుల = వంశమందు, ఉద్భవ = పుట్టినట్టి (యాదవులకు)వారికి, అలంకృతిః = నగ వంటి వాడు (కులే ఉద్భవాః తేషామ్ అలంకృతిః), తత్ = కాబట్టి, ఏతయోః = ఈ ఇద్దరికీ, పరంపరా–యోగ్యమ్ : పరంపరా = వంశపరంపరకు, యోగ్యమ్ = తగినట్టి, యోగమ్ = కలయికగా, అవైత = గ్రహించండి. (అవ+ఆ+ఇ గతౌ పరస్మైపది–లోట్–మ.బ.)

**తా ॥** ఈ రుక్మిణి భీష్మకుని వంశ మనే సముద్రంలో పుట్టిన రత్నం. ఈ కృష్ణుడు చంద్ర వంశానికి అలంకారం. ఈ ఇద్దరి కలయిక పరంపరాగతమైన యోగ్యతకు అనుగుణమైనదని గ్రహించండి.

**వి :** 1. రత్నానికి సువర్ణయోగముంటేనే కళ. సువర్ణానికి రత్నసాహచర్యం అధిక శోభాకరం. కాబట్టి ఆ ఇద్దరి కలయిక యోగ్యమైనది.

2. కృష్ణుని పితామహుడు శూరసేనుడు. ఆయన కూతురు పృథ. వసుదేవుని చెల్లెలు. కృష్ణునికి మేనత్త. ఆమెను కుంతిభోజుడు దత్తత తీసికొన్నాడు. కుంతిభోజుడు శూరసేనుని సోదరికి భర్త. భీష్మకుడు కూడా భోజవంశంవాడే. ఆ భోజవంశస్థులకు (భీష్మకుని వంశం) యాదవులకూ పరంపరంగా సంబంధబాంధవ్యాలున్నాయి.

3. ఆమె రత్నం. ఈయన అలంకారం కాబట్టి ఈ రెండింటి (ఆ ఇద్దరి) కలయికను వర్ణించటం సమాలంకారం. **'సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయో రప్యనురూపయోః'**–(కు. 91)

| | | | |
|---|---|---|---|
| 4. **అవైత :** | అవైతు | అవైతామ్ | అవయన్తు |
| | అవైహి | అవైతమ్ | **అవైత** |
| | అవాయాని | అవాయావ | అవాయామ |

'**అవైహీత్యత్ర వృద్ధిరసాధురేవ**' అని వైయాకరణసిద్ధాంతకౌముది అవైహిరూపాన్ని అంగీకరించలేదు. అటువంటిదే 'అవైత' కూడా. కానీ ప్రకృతశ్లోకంలో కవి వృద్ధిమార్గాన్ని ('**ఏత్యేధత్యూట్సు**' సూత్రంద్వారా విధించిన వృద్ధి మార్గాన్ని) అనుసరిస్తూ, సూత్రప్రమేయాన్ని విస్తరిస్తూ **అవైత** అని ప్రయోగించటం జరిగింది.

5. ఛందస్సు - ఉపజాతి. (1వ పాదం ఇంద్రవజ్ర, 2,3,4 పాదాలు ఉపేంద్రవజ్ర.) *

**శ్లో॥ పద్మాలయా సా కిల పావనాఙ్గీ - నారాయణోఽయం నవనీరదాభః ।**
**తేనానయోః సుస్థిరమేవ యోగం - మన్యామహేఽన్యోన్యవిభూతిహేతుమ్ ॥ 34**

**అ :** రుక్మిణీకృష్ణుల పరస్పరయోగ్యతను ప్రకారాంతరంగా ప్రస్తావించటం. -ఇంద్రవజ్ర.

**అ :** సా పావన+అంగీ పద్మ+ఆలయా నవ-నీరద+ఆభః అయం నారాయణః కిల తేన అన్యోన్య-విభూతి-హేతుమ్ అనయోః యోగం సుస్థిరమ్ ఏవ మన్యామహే.

**ప్ర :** సా = ఆ, పావన+అంగీ = పవిత్ర శరీరంగల రుక్మిణి (పావనాని అంగాని యస్యాః సా) (ఈ పవిత్రత సాముద్రికతకు సంబంధించినది. చక్కదనం గలది అని భావం), పద్మ+ఆలయా = లక్ష్మి (పద్మమ్ ఆలయః యస్యాః సా) (లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీ ర్హరిప్రియా-అమరకోశం), నవ-నీరద-ఆభః : నవ = నూతనమైన, నీర-ద = మేఘం వంటి, ఆభః = కాంతిగల (నవశ్చ అసౌ నీరదః, తస్య ఆభా ఇవ ఆశా యస్య సః), అయమ్ = ఈ కృష్ణుడు, నారాయణః కిల = నారాయణుడే గదా! (నారాః అయనం యస్య సః), తేన = అందువల్ల, అన్యోన్య-విభూతి-హేతుమ్ : అన్యోన్య = పరస్పరం, విభూతి = ఐశ్వర్యానికి (విభూతిర్భూతిరైశ్వర్యం-అమరకోశః-స్వర్గ-36), హేతుమ్ = కారణమైన, అనయోః = ఈ ఇద్దరియొక్క, యోగమ్ = కలయికను, సుస్థిరమ్-ఏవ = గట్టిగా నిలిచేదిగానే, మన్యామహే = భావిస్తున్నాం. (మను జ్ఞానే దివాది-ఆత్మనేపది-లట్-ఉ.బ.)

**తా ॥** ఈ పావనాంగి పద్మాలయ (లక్ష్మి). క్రొక్కారు మొయిలు మెరుగు గల ఈ కృష్ణుడు నారాయణుడు. పరస్పరం ఐశ్వర్యప్రదమైన ఈ ఇద్దరి కలయికను దృఢబంధంగా భావిస్తున్నాం.

**వి :** 1. శ్లో॥ పద్మప్రియే పద్మిని పద్మహస్తే - **పద్మాలయే** పద్మదళాయతాక్షి ।
విష్ణుప్రియే విష్ణుమనోఽనుకూలే - త్వత్పాదపద్మం మయి సంనిధత్స్వ॥ **-శ్రీసూక్తం**

2. కృష్ణుడు నారాయణుడు - అంటే జలాధివాసి. రుక్మిణి పద్మాలయ - అంటే జలజాధివాసిని. జలంలో నారాయణుడు, జలజంలో రుక్మిణి. కాబట్టి యోగ్యమయిన, స్థిరమైన బంధం. పద్మం నీటబుట్టి నీటికి అందాన్నిస్తుంది. నీరు పద్మానికి పుట్టుకనిచ్చి ఆ పద్మంతో అందగిస్తాయి.

3. వివాహం వధూవరులకు ఇద్దరికి మాత్రమే కాదు. ఇద్దరి వంశాలకు విభూతి హేతువు కావాలి.

| | | | |
|---|---|---|---|
| 4. **మన్యామహే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | మన్యే | మన్యావహే | **మన్యామహే.** |

*

**శ్లో॥ ఆర్యః స్వభార్యాం యది భారకార్యే - నైవోపదిశ్యాన్న పునః కదాఽపి ।**
**ఏనాం త్యజేజ్జాత్వపి నాత్ర కుప్యే-ద్ధృష్ణోతు తర్హ్యబ్జముఖీకరం నః ॥ 15-35**

**అ :** రుక్మిణిపక్షం వాళ్ళు కృష్ణునకు కొన్ని నిబంధనలు పెట్టడం – అదొక వేడుక. –ఇంద్రవజ్ర.

**అ :** ఆర్యః స్వ–భార్యాం యది భార–కార్యే న ఏవ ఉపదిశ్యాత్ పునః కదా అపి ఏనాం న త్యజేత్ జాతు అపి అత్ర న కుప్యేత్ తర్హి నః అబ్జ–ముఖీ–కరం గృహ్ణాతు.

**ప్ర :** ఆర్యః = పూజ్యుడు అయిన కృష్ణుడు, స్వ–భార్యామ్ = తన ఆలిని, భార–కార్యే = బరువైన పనిలో (భారం చ తత్ కార్యం, తస్మిన్), యది న–ఏవ–ఉపదిశ్యాత్ = ఆదేశించ కుండా వుండే టట్లయితే (ఉప–దిశ అతిసర్జనే–పరస్మైపది–ఆశీర్లిజ్–ప్ర.ఏ.), పునః = ఇంకా, కదా+అపి = ఎప్పుడు కూడా, ఏనామ్ = ఈమెను, యది న త్యజేత్ = విడువకుండేటట్లయితే (త్యజ్ హానౌ–పరస్మైపది–విధిలిజ్–ప్ర.ఏ.), జాతు+అపి = ఎప్పుడు కూడా, అత్ర = ఈమె విషయంలో, యది న కుప్యేత్ = కోపించకుండేటట్లయితే (కుప్ క్రోధే–దివాది–పరస్మైపది–విధిలిజ్–ప్ర.ఏ.), తర్హి = అప్పుడు (ఆ మేరకు), నః = మాయొక్క, అబ్జ–ముఖీ–కరమ్ = పద్మాననయొక్క చేతిని, గృహ్ణాతు = గ్రహించాలి. (గ్రహ ఉపాదానే–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**తా ॥** పూజ్యుడయిన ఈ కృష్ణుడు తన భార్యను ఎప్పుడూ బరువుపనులలో నియోగించ కూడదు. ఎప్పుడూ కూడా విడిచివుండకూడదు. ఈమెపై ఎప్పుడూ కోపపడకూడదు. అలా అయితే మా పద్మాననతో పాణిగ్రహణం చేయవచ్చు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. ఉపదిశ్యాత్ :** | **ఉపదిశ్యాత్** | ఉపదిశ్యాస్తామ్ | ఉపదిశ్యాసుః |
| | ఉపదిశ్యాః | ఉపదిశ్యాస్తమ్ | ఉపదిశ్యాస్త |
| | ఉపదిశ్యాసమ్ | ఉపదిశ్యాస్వ | ఉపదిశ్యాస్మ |
| **త్యజేత్ :** | **త్యజేత్** | త్యజేతామ్ | త్యజేయుః |
| | త్యజేః | త్యజేతమ్ | త్యజేత |
| | త్యజేయమ్ | త్యజేవ | త్యజేమ |
| **కుప్యేత్ :** | **కుప్యేత్** | కుప్యేతామ్ | కుప్యేయుః |
| | కుప్యేః | కుప్యేతమ్ | కుప్యేత |
| | కుప్యేయమ్ | కుప్యేవ | కుప్యేమ |
| **గృహ్ణాతు :** | **గృహ్ణాతు**/గృహ్ణీతాత్ | గృహ్ణీతామ్ | గృహ్ణన్తు |
| | గృహాణ/గృహ్ణీతాత్ | గృహ్ణీతమ్ | గృహ్ణీత |
| | గృహ్ణాని | గృహ్ణావ | గృహ్ణామ. |

*

**శ్లో॥సన్దేశమాత్రమభివీక్ష్య హరే! గృహం నః – సంప్రేషయిష్యసి కరిష్యసి నాన్యపత్నీమ్ ।**
**బన్ధూన్ స్మరిష్యసి విభో! యది విశ్వదో న–స్త్వాం తర్హి వల్గువదనా వరయేద్వరిష్ఠమ్॥36**

**అ :** రుక్మిణి కరగ్రహణానికై కృష్ణునకు మరికొన్ని నిబంధనలు. –వసంతతిలక.

**అ :** విభో! హరే! విశ్వదః (త్వమ్) సందేశ మాత్రమ్ అభివీక్ష్య నః గృహం యది సంప్రేషయిష్యసి. అన్య–పత్నీం (యది) న కరిష్యసి. బన్ధూన్ నః (యది) స్మరిష్యసి తర్హి వల్గువదనా వరిష్ఠం త్వాం వరయేత్.

**ప్ర :** విభో! = ప్రభూ, హరే! = కృష్ణా!, విశ్వ–దః = సమస్తాన్నీ ఇచ్చే (విశ్వం దదాతీతి), సందేశ–మాత్రమ్ = కేవలం కబురును (లేఖను), అభి–వీక్ష్య = చూసి (అభి–వి–ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), నః = మాయొక్క, గృహమ్ = ఇంటికి, యది సంప్రేషయిష్యసి = పంపగలిగితే (సమ్–ప్ర–ఇష్ గతౌ–దివాది–పరస్మైపది–ణిచ్–ల్రుట్–మ.ఏ.), అన్య–పత్నీమ్ = మరొక భార్యను, యది న కరిష్యసి = స్వీకరించకుండేటట్లయితే (కృ కరణే–పరస్మైపది–ల్రుట్–మ.ఏ.), బన్ధూన్ = బంధువులమైన, నః = మమ్ము, యది స్మరిష్యసి = తలచుకొనేటట్లయితే (స్మృ చిన్తాయాం–

భ్వాది–పరస్మైపది–ల్రుట్–మ.ఏ.), తర్హి = అప్పుడు, వల్గు–వదనా = అందమైన మోముగల రుక్మిణి (వల్గు వదనం యస్యాస్సా), వరిష్ఠమ్ = మేటివి అయిన, త్వామ్ = నిన్ను, వరయేత్ = వరింపగలదు. (వృ–వరణే చురాది–పరస్మైపది–విధిలిఙ్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! నీవు అన్నీ ఇవ్వగలవాడవు. ప్రభువువు. మా సందేశమాత్రంతో రుక్మిణిని పుట్టింటికి పంపగలిగేటట్లయితే, మరొక కాంతను నీవు స్వీకరించకుండా వుండేటట్లయితే, బంధువులమైన మమ్మ తలచుకొంటూ వుండేటట్లయితే మా అందగత్తె మేటివరుడవైన నిన్ను వరింపగలదు.

**వి :** 1. వివాహ సందర్భాలలో కానీ, నిశ్చితార్థసందర్భాల్లో కానీ ఇటువంటి ప్రస్తావనలు వస్తుంటాయి. వీటిలో కొన్ని ప్రధానవ్యక్తులు ప్రస్తావించేవి. మరికొన్ని ఎవరో కల్పించుకొని సరదాగా అడిగేవి. కాబట్టి ఇవన్నీ తరువాత్తరువాత నిలిచేవయినా కాకపోయినా జరుగుతూనే వుంటాయి. ఆ సామాజిక వాతావరణాన్ని ప్రతిబింబింప జేస్తున్నాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **సంప్రేషయిష్యసి :** | సంప్రేషయిష్యతి | సంప్రేషయిష్యతః | సంప్రేషయిష్యన్తి |
| | **సంప్రేషయిష్యసి** | సంప్రేషయిష్యథః | సంప్రేషయిష్యథ |
| | సంప్రేషయిష్యామి | సంప్రేషయిష్యావః | సంప్రేషయిష్యామః |

**కరిష్యసి :** 15–32వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **స్మరిష్యసి :** | స్మరిష్యతి | స్మరిష్యతః | స్మరిష్యన్తి |
| | **స్మరిష్యసి** | స్మరిష్యథః | స్మరిష్యత |
| | స్మరిష్యామి | స్మరిష్యావః | స్మరిష్యామః |
| **వరయేత్ :** | **వరయేత్** | వరయేతామ్ | వరయేయుః |
| | వరయేః | వరయేతమ్ | వరయేత |
| | వరయేయమ్ | వరయేవ | వరయేమ. |

*

**శ్లో॥ బ్రహ్మాణ్డాఖ్యగృహం చతుర్దశలసత్ప్రాసాదశోభం హరేః**
**సాధ్వీయం సతతం విచారయతు సన్మధ్యే గృహస్యోచితమ్ ।**
**స్వర్ణాద్రిక్షితిధాన్యరత్నలవణక్షీరేక్షుసర్పిర్దధి–**
**స్వాదూదాది సుతాంశ్చ పద్మజముఖాంస్తేషాం ధురం మన్దిరమ్ ॥ 15–37**

**అ :** వరుని పక్షం వారు కృష్ణుని సంపన్నతను వర్ణిస్తూ ప్రసంగించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఇయం సాధ్వీ చతుర్దశ–లసత్–ప్రాసాద–శోభం హరేః బ్రహ్మాండ+ఆఖ్య–గృహం విచారయతు. సత్–మధ్యే గృహస్య ఉచితం స్వర్ణ+అద్రి–క్షితి–ధాన్య–రత్న–లవణ–క్షీర+ఇక్షు సర్పిః–దధి–స్వాదు–ఉదాది విచారయతు. పద్మ–జ–ముఖాన్ సుతాన్ చ విచారయతు. తేషాం ధురం మందిరం చ విచారయతు.

**ప్ర :** ఇయమ్ = ఈ, సాధ్వీ = పతివ్రత (భవిష్యద్దృష్టితో ఈ పదప్రయోగం), చతుర్దశ... శోభమ్ : చతుర్దశ = పదునాలుగు, లసత్ = ప్రకాశిస్తున్న, ప్రాసాద = భవనాలయొక్క, శోభమ్ = శోభగల (పదునాలుగు లోకాలే పదునాలుగు భవనాలు) (చతుర్దశ లసన్తః చ తే ప్రాసాదాః, తేషాం శోభా యస్య తత్), హరేః = కృష్ణునియొక్క, బ్రహ్మాండ+ఆఖ్య–గృహమ్ = బ్రహ్మాండమనే ఇంటిని గూర్చి, సతతమ్ = నిరంతరంగా, విచారయతు = ఆలోచించాలి. సత్+మధ్యే : సత్ = బ్రహ్మాండమనే ఇంటియొక్క, మధ్యే = నడుమ (సతః మధ్యః తస్మిన్), గృహస్య = ఇంటికి, ఉచితమ్ = తగినట్టి, స్వర్ణాద్రి... దాది : స్వర్ణ+అద్రి = బంగారుకొండ, క్షితి = నేల, ధాన్య = ధాన్యం,

రత్న = రత్నాలు, లవణ = ఉప్పు (సముద్ర రూపంలో), క్షీర = పాలు, ఇక్షు = చెరకు, సర్పిః = నెయ్యి, దధి = పెరుగు, స్వాదు = రుచికరమైన, ఉద+ఆది = నీరు మొదలగునవి (స్వర్ణాద్రిశ్చ క్షితిశ్చ ధాన్యాని చ రత్నాని చ లవణం చ క్షీరం చ ఇక్షుః చ సర్పిశ్చ దధి చ స్వాదు చ తద్ ఉదకం చ ఆదీని యస్య తత్), పద్మజ-ముఖాన్ = బ్రహ్మ మొదలయిన (పద్మజః ముఖం యేషాం తాన్), సుతాన్+చ = పిల్లలను, తేషామ్ = వాటి(రి)యొక్క, ధురమ్ = భారాన్ని, మందిరమ్ చ = మందిరాన్ని గూర్చి కూడా, విచారయతు = ఆలోచించండి. (వి-చర సంశయే-చురాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ సాధ్వి రుక్మిణి కృష్ణుని ఇంటిని గూర్చి ఆలోచించాలి. దాని పేరు బ్రహ్మాండం. దానిలోని పదునాలుగు లోకాలు పదునాలుగు భవనాలు. వాటి శోభను గూర్చి ఆలోచించాలి. ఆ బ్రహ్మాండగృహమధ్యంలో గృహానికి తగిన బంగారుకొండ, భూమి, ధాన్యాలు, రత్నాలు, ఉప్పు, పాలు, చెరుకు, నేయి, పెరుగు, నీళ్ళు (ఇవన్నీ సముద్రాలు) వస్తువులను గురించి ఆలోచించాలి. ఆ ఇంటిలోని పిల్లలు బ్రహ్మ మొదలయినవారు, వారిని గూర్చి ఆ భారాన్ని గూర్చి, వారి మందిరాలను గూర్చి ఆలోచించాలి.

**వి :** 1.**విచారయతు :**

| | | | |
|---|---|---|---|
| **విచారయతు**/విచారయతాత్ | విచారయతామ్ | విచారయన్తు | |
| విచారయ/విచారయతాత్ | విచారయతమ్ | విచారయత | |
| విచారయాణి | విచారయావ | విచారయామ. | * |

**శ్లో॥ కార్యం గృహిణ్యా గృహకృత్యమేత-న్నో భారకార్యన్యజనైరసాధ్యమ్ ।**
**తన్వీ తదేతత్సకలం స్వలోల-లీలాకటాక్షేణ కరిష్యతీయమ్ ॥ 15-38**

**అ :** వరపక్షం వారి వచనాలే - వధూపక్షం వారి మాటలకు సమాధానాలు. -ఇంద్రవజ్ర.

**అ :** ఏతత్ గృహ-కృత్యం గృహిణ్యా కార్యమ్, అన్య-జనైః అసాధ్యం భార-కారి నో. ఇయం తన్వీ తత్ ఏతత్ సకలం స్వ-లోల-లీలా-కటాక్షేణ కరిష్యతి.

**ప్ర :** ఏతత్ = ఈ, గృహ-కృత్యమ్ = ఇంటిపని (గృహస్య కృత్యమ్), గృహిణ్యా = గృహిణి చేతనే, కార్యమ్ = చేయదగినది. అన్య-జనైః = ఇతరులచే (అన్యే చ తే జనాః, తైః), అసాధ్యమ్ = సాధింపబడలేనిది. (అయినా), భారకారి = కష్టాన్ని కలిగించేది, నో (భవతి) = కాదు. ఇయం తన్వీ = ఈ కాంత, తత్ ఏతత్ సకలమ్ = ఆ పని అంతా, స్వ... కటాక్షేణ : స్వ = తనయొక్క, లోల = చంచలమైన, లీలా = విలాసవంతమైన, కటాక్షేణ = కడగంటి చూపుతో (స్వస్య లోలః లీలాయుతశ్చ కటాక్షః, తేన), కరిష్యతి = చేయగలదు. (కృ కరణే పరస్మైపది-లృట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇది ఇల్లాలు చేయవలసిన పని. ఇతరులు చేయగలది కాదు. కానీ ఈమెకు భారమేమీ కాదు. కేవలం చంచలం, విలాసవంతమైన తన కడకంటి చూపుతోనే ఆపని చేయ (చేయించ)గలదు.

**వి :** 1. బరువైన పనులు ఈమెకు చెప్పకూడదన్న (35వ శ్లోకం) ప్రతిపాదనకిది సమాధానం. ఇంటిపనులు ఇల్లాలే చేయాలన్నది ఇక్కడ నీతి. అయితే ఇంటిపనులు అనే దానికి ప్రజలు ఇచ్చుకొనే నిర్వచనం మీద దీని యుక్తి యుక్తత ఆధారపడి వుంటుంది.

2. **కరిష్యతి :** 15-32వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ నైనాం సంసది సన్త్యజేన్న రహసి స్వైరావతారేషు వా**
**స్నానాభ్యఙ్జనభోజనాదివివిధక్రీడాసు వాఽస్యై దిశేత్ ।**

**స్వాఙ్గాశ్లేషసుఖం విభూషణగతం బిమ్బోష్ఠజం చామృతం**
**వంశాద్యాశ్రితమేతయా విరహితం దేశం పరం సన్త్యజేత్ ॥ 15-39**

**అ :** వరునిపక్షం వారు (కృష్ణుని అనుచరులకు) వధూపక్షం వారికి కృష్ణుని ప్రవృత్తిని గురించి మరిన్ని హామీల నివ్వటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** (కృష్ణః) ఏనాం సంసది న సంత్యజేత్. రహసి (న సంత్యజేత్). స్వైర+అవతారేషు వా (న సంత్యజేత్). స్నాన+అభ్యంజన-భోజన+ఆది-వివిధ-క్రీడాసు వా (న సంత్యజేత్). విభూషణ-గతం స్వ+అంగ+ఆశ్లేష-సుఖమ్ అస్యై దిశేత్. వంశ+ఆది+ఆశ్రితం బింబ+ ఓష్ఠజం చ అమృతమ్ అస్యై దిశేత్. పరమ్ ఏతయా విరహితం దేశం సంత్యజేత్.

**ప్ర :** (కృష్ణః = కృష్ణుడు) ఏనామ్ = ఈమెను, సంసది = సభలో, న సంత్యజేత్ = విడువకుండు గాక (సమ్-త్యజ్-పరస్మైపది-విధిలిఙ్-(ప్ర.ఏ.), రహసి = ఏకాంతంలో, న (సంత్యజేత్) = విడువకుండుగాక, స్వైర+అవతారేషు వా : స్వైర = స్వేచ్ఛగా స్వీకరించే, అవతారేషు వా = అవతారాలలో కానీ (స్వైరాణి చ తాని అవతారాణి, తేషు), స్నానా... క్రీడాసు వా : స్నాన = స్నానం, అభ్యంజన = తలంటుస్నానం, భోజన+ఆది = భోజనం మొదలుగా గల, వివిధ-క్రీడాసు వా = రకరకాల ఆటలలో కానీ (స్నానం అభ్యంజనం భోజనం చ ఆదౌ యాసాం తాః, వివిధాశ్చ తాః క్రీడాః , తాసు), విభూషణ-గతమ్ = నగలలో నున్నట్టి (విభూషణేషు గతమ్), స్వ+అంగ+ఆశ్లేష-సుఖమ్ = తన శరీరాన్ని కౌగిలించిన సుఖాన్ని (స్వస్య అంగాని, తేషామ్ ఆశ్లేషః, తేన సుఖమ్), అస్యై = రుక్మిణికి, దిశేత్ = దక్కించాలి. వంశ+ఆది+ఆశ్రితమ్ = వేణువు మొదలయిన వస్తువుల కంటిన (వంశః ఆదౌ యేషాం, తేషు ఆశ్రితమ్), బింబ+ఓష్ఠ-జమ్ = దొండపండువంటి పెదవిపై పుట్టిన (బింబమ్ ఇవ ఓష్ఠః, తస్మిన్ జాయత ఇతి, తమ్), అమృతం చ = అమృతాన్ని కూడా, (అస్యై = రుక్మిణికి), దిశేత్ = దక్కించాలి, పరమ్ = అంతేగాక, ఏతయా = ఈ రుక్మిణిచే, విరహితమ్ = లోపింపజేయబడిన (లేని), దేశమ్ = తావును, సంత్యజేత్ = విడిచిపెట్టాలి.

**తా ॥** సభలో కూడా రుక్మిణిని వదలరాదు. ఏకాంతంలో కూడా ఈమెను వదలరాదు. స్వేచ్ఛగా అవతారాలను స్వీకరించినప్పుడు కూడా వదలకూడదు. స్నానభోజనాదులలో కాని వివిధ క్రీడల విషయంలో కానీ 'ఆభరణ సంశ్లేష సుఖాన్నీ, అంగ సంశ్లేష సుఖాన్నీ' రుక్మిణికి ఇవ్వాలి. వేణువు మొదలైన వాద్యాల కంటిన బింబోష్ఠజమైన అమృతాన్ని రుక్మిణికే దక్కనివ్వాలి. రుక్మిణిలేనిచోట తానుండరాదు.

**వి :** 1. రుక్మిణీకృష్ణుల నిరంతరాయసాహచర్యాన్నే వరపక్షం వారు కూడా విధించినట్లుగా నొక్కి చెప్తున్నారు. 35వ శ్లోకంలోని ప్రతిపాదనకే ఇది ఒప్పుదల.

| | | | |
|---|---|---|---|
| 2. **సంత్యజేత్ :** | **సంత్యజేత్** | సంత్యజేతామ్ | సంత్యజేయుః |
| | సంత్యజేః | సంత్యజేతమ్ | సంత్యజేత |
| | సంత్యజేయమ్ | సంత్యజేవ సంత్యజేమ. | |
| **దిశేత్ :** | **దిశేత్** | దిశేతామ్ | దిశేయుః |
| | దిశేః | దిశేతమ్ | దిశేత |
| | దిశేయమ్ | దిశేవ | దిశేమ. |

*

**శ్లో॥ క్రుద్ధోఽపి సర్వభువనాయ న భీష్మపుత్ర్యాం**
**క్రోధం కరిష్యతి పరం పరిరభ్య దోర్భ్యామ్ ।**

**ఏనాం తదాపి రమయేత్ కిల కోమలాఙ్గీం**
**కోపోఽస్య తత్ర య ఇమాం కలయేద్వియుక్తామ్ ॥ 15-40**

**అ :** వధూపక్షం వారికి వరపక్షం వారు మాట ఇవ్వటం. రుక్మిణిపై కృష్ణుడు కినుక బూనడని. -వసంతతిలక.

**అ :** (కృష్ణః) సర్వ-భువనాయ క్రుద్ధః అపి భీష్మ-పుత్ర్యాం క్రోధం న కరిష్యతి పరం తదా అపి ఏనాం కోమల+అంగీం దోర్భ్యాం పరిరభ్య రమయేత్ కిల. యః ఇమాం వియుక్తాం కలయేత్ తత్ర అస్య కోపః (భవతు)

**ప్ర :** (కృష్ణః = కృష్ణుడు) సర్వ-భువనాయ : సర్వ = సమస్తమైన, భువనాయ = లోకంపై, క్రుద్ధః+అపి = కోపించిన వాడైనా, భీష్మ-పుత్ర్యామ్ = రుక్మిణిపై, క్రోధమ్ = కోపాన్ని, న కరిష్యతి = చేయడు (చూపడు) (కృ కరణే పరస్మైపది-లృట్-ప్ర.ఏ.), పరమ్ = పైపెచ్చు, తదా అపి = ఆ సమయంలో కూడా, ఏనామ్ = ఈ, కోమల+అంగీమ్ = కోమలాంగిని (రుక్మిణిని), దోర్భ్యామ్ = భుజాలతో, పరిరభ్య = కౌగిలించుకొని (పరి-రభ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), రమయేత్ కిల = ఆనందింపజేయగలడు గదా! (రమ్ క్రీడాయాం-ణిచ్-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), యః = ఎవడయితే, ఇమామ్ = ఈ రుక్మిణిని, వియుక్తామ్ = విడిపోయినదానినిగా, కలయేత్ = చేస్తాడో (కల క్షేపే చురాది-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), తస్య = ఆ వ్యక్తిమీద, అస్య = ఈ కృష్ణునికి, కోపః (భవతు) = కోపం గలుగు గాత.

**తా ॥** కృష్ణునకు సమస్తలోకాలమీద కోపగించినా ఈ రుక్మిణిపై కోపగించడు. పైపెచ్చు ఆ సమయంలో కూడా ఈమె భుజాలతో కౌగిలించుకొని ఆనందింపజేయగలడు. ఈమెతో వియోగాన్ని కలిగించే ప్రయత్నంచేసే వారిమీదనే ఈయన కోపాన్ని ప్రదర్శిస్తాడు.

**వి :** 1. కోపమన్నది ఒక మానసిక ప్రతిక్రియ. కాబట్టి అది అప్రయత్నంగానే కలుగుతుంది. కానీ దానిని సప్రయత్నంగా నివారించుకొనగలగాలి. సత్త్వదృష్టి పెరిగితే అది సాధ్య పడుతుంది.

పురాణగాథలను పరిశీలిస్తే కృష్ణుడు ఎక్కడా తీవ్రకోపాన్ని ప్రదర్శించినట్లు కనిపించదు.

2. **కరిష్యతి :** 15-38వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **రమయేత్ :** | **రమయేత్** | రమయేతామ్ | రమయేయుః |
| | రమయేః | రమయేతమ్ | రమయేత |
| | రమయేయమ్ | రమయేవ | రమయేమ |
| **కలయేత్ :** | **కలయేత్** | కలయేతామ్ | కలయేయుః |
| | కలయేః | కలయేతమ్ | కలయేత |
| | కలయేయమ్ | కలయేవ | కలయేమ. |

*

**శ్లో॥ కేశం ప్రగృహ్య కరజైః కుచకుమ్భపార్శ్వే**
**కుర్వన్ వ్రణాని మృదులోష్ఠపుటం స దంశన్ ।**
**దన్తక్షతం విరచయేద్దయితః స్వపుంసాం**
**క్రోధం తదా న కలయధ్వమసౌ విలాసః ॥ 15-41**

**అ :** వధూపక్షం వారికి వరపక్షం వారు మరొక సూచన చేయటం. -వసంతతిలక.

**అ :** స్వ-పుంసాం దయితః సః కేశం ప్రగృహ్య కర-జైః కుచ-కుంభ-పార్శ్వే వ్రణాని కుర్వన్ మృదుల+ఓష్ఠ-పుటం దంశన్ దంత-క్షతం విరచయేత్ తదా క్రోధం న కలయధ్వమ్. అసౌ విలాసః.

**ప్ర :** స్వ-పుంసామ్ = తన మనుషులకు (భక్తులకు), దయితః = ఇష్టుడైన, సః = ఆ కృష్ణుడు, కేశమ్ = (రుక్మిణియొక్క) జుట్టును, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కర-జైః = గోళ్ళతో, కుచ-కుంభ-పార్శ్వే : కుచ-కుంభ = కుండలవంటి రొమ్ములయొక్క, పార్శ్వే = సమీపంలో/ప్రక్కన (కుచౌ ఏవ కుంభౌ తయోః పార్శ్వం తస్మిన్), వ్రణాని = గాయాలను, కుర్వన్ = చేస్తూ (కృ ధాతువుపై శతృ ప్రత్యయం), మృదుల+ఓష్ఠ-పుటమ్ : మృదుల = సున్నితమైన, ఓష్ఠ-పుటమ్ = పెదవి అనే దొప్పను, దంశన్ = కొరుకుతూ (దంశ్ ధాతువుపై శతృ ప్రత్యయం), యదా = ఎప్పుడు, దంత-క్షతమ్ = పంటిగాయాన్ని (దంతైః క్షతమ్), విరచయేత్ = చేస్తాడో (వి-రచ ప్రతియత్నే-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), తదా = అప్పుడు, క్రోధమ్ = క్రోధంగా, న కలయధ్వమ్ = అనుకోకండి. (కల క్షేపే-చురాది-ఆత్మనేపది-లోట్-మ.బ.), అసౌ = అది, విలాసః = క్రీడా వినోదమే.

**తా ॥** నిజభక్తవల్లభుడైన కృష్ణుడు రుక్మిణి జుట్టు పట్టుకొని రొమ్ముల సమీపంలో గోళ్ళతో గాయాలు చేసి, మృదువయిన పెదవిని కొరికి పళ్ళతో గాయం చేసినపుడు మీరు అది కోపమని భావించకూడదు. విలాసక్రీడ మాత్రమే అది.

**వి :** 1. ఈ శ్లోకాన్ని గురించి కొంత చర్చించవలసిన అవసరముంది.

కృష్ణునకు రుక్మిణిమీద కోపం వచ్చే ప్రసక్తి లేదని ముందటి శ్లోకంలో ప్రకటించారు. ఇప్పుడు ప్రణయకలహాన్ని మీరు కలహంగా భావించకూడదని పై అభిప్రాయానికి ఒక సవరణ. ఆ సవరణ కూడా ప్రకటన మాత్రంగా కాక వర్ణనాత్మకంగా వుంది. అంత వర్ణన ఆ విషయంలో అవసరమా అన్నది ప్రశ్న.

కావ్యాలలో ఇటువంటి సందర్భాలు కొన్ని లేకపోలేదు. అవి విమర్శకుల విమర్శకు గురికాక పోలేదు.

నంది తిమ్మన పారిజాతాపహరణంలో నారదునిచేత రుక్మిణికి వివరంగా రతిక్రీడా విశేషాలు చెప్పిస్తాడు. నారదుడిచ్చిన పారిజాతకుసుమాన్ని కృష్ణుడు రుక్మిణి కివ్వగా దానిని ఆమె ధరించింది. అప్పటి ఆమె వెలుగును నారదుడు వర్ణించటం సందర్భంగా-

చ. అళినీలాలక! నీవు నీపతి రహస్యక్రీడ వర్తించు వే
ళ లతాంతాయుధసంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వలదీపాంకురమై రతిశ్రమతనూసంజాతధారాళ ఘ
ర్మలవంబుల్దొలగింపఁగా సురటియై రంజిల్లు నిచ్చాగతిన్. - పారిజాతాపహరణము 1/60

ఈ సందర్భంలో ఇటువంటి పద్యం నారదునివంటి దేవర్షిద్వారా చెప్పించటం విమర్శకులు అంగీకరింప లేకపోయారు. ఇటువంటి వర్ణనలు చేయటం అవి కావ్యశోభ కోసమనో, అంతరార్థాలు వేరే వున్నాయనో సమర్థించుకొనటం 'పరోక్షప్రియా వై దేవాః' అని దానికి దేవతలను అడ్డుపెట్టుకోవటం సంస్కృతాంధ్ర కవులలో, విమర్శకులలో అక్కడక్కడ కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **విరచయేత్ :** | **విరచయేత్** | విరచయేతామ్ | విరచయేయుః |
| | విరచయేః | విరచయేతమ్ | విరచయేత |
| | విరచయేయమ్ | విరచయేవ | విరచయేమ |
| **కలయధ్వమ్ :** | కలయతామ్ | కలయేతామ్ | కలయన్తామ్ |
| | కలయస్వ | కలయేథామ్ | **కలయధ్వమ్** |
| | కలయై | కలయావహై | కలయామహై. |

*

**శ్లో॥ ప్రాయః స న ప్రేషయతి స్వభక్త-గేహేష్విమాం తేఽపి న తాం లషన్తి ।**
**అథ ప్రదత్తామపి తామిదానీం - ధీరాః! పరావృత్య న కిం దిశధ్వమ్ ॥ 15-42**

**అ :** ఇతరుల ఇండ్లకు రుక్మిణిని పంపకూడదన్న ఆంక్షగురించి వరపక్షం వాళ్ళు హామీ ఇవ్వటం.

**అ :** సః ప్రాయః స్వ-భక్త-గేహేషు ఇమాం న ప్రేషయతి తే అపి తాం న లషన్తి ధీరాః । అథ ప్రదత్తామ్ అపి తామ్ ఇదానీం పరావృత్య న దిశధ్వం కిమ్?

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, ప్రాయః = సాధారణంగా, స్వ-భక్త-గేహేషు : స్వ = తనయొక్క, భక్త = భక్తులయొక్క, గేహేషు = ఇండ్లకు (స్వస్య భక్తాః, తేషాం గేహాని, తేషు), ఇమామ్ = ఈ రుక్మిణిని, న ప్రేషయతి = పంపడు (ప్ర-ఇష్ గతౌ దివాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తే అపి = ఆ భక్తులు కూడా, తామ్ = ఆమెను (సంపదను), న లషన్తి = కోరుకొనరు. (లష కాన్తౌ పరస్మైపది-లట్-ప్ర.బ.), ధీరాః = ధీరులారా!, ఇదానీమ్ = ఇప్పుడు, అథ = రుక్మిణీ ప్రదానం చేసిన తర్వాత, ప్రదత్తామ్-అపి = ఇవ్వబడినదైనా, తామ్ = ఆమెను, పరావృత్య = వెనుకడుగువేసి, న దిశధ్వం కిమ్? = ఇవ్వరా ఏమిటి? (దిశ అతిసర్జనే-ఆత్మనేపది-లోట్-మ.బ.)

**తా ॥** కృష్ణుడు సాధారణంగా తన భక్తుల ఇళ్ళకు రుక్మిణిని (లక్ష్మిని) పంపడు. వారు కూడా ఆ లక్ష్మిని కోరుకొనరు. అయినా మీరు ధీరులు. ఇప్పుడు రుక్మిణిని ఇచ్చిన తరువాత మాట తప్పి ఆమెను ఇవ్వమంటారా ఏమిటి?

**వి :** 1. శ్లోకం లౌకిక వ్యవహారానికి చక్కని ప్రతిరూపం. పేదవాళ్ళ ఇళ్ళకు వెళ్ళటం అగౌరవంగా భావించే సంపన్నులున్నారు. సంపన్నులు తమ ఇంటికి వస్తే కంగారుపడే పేదవాళ్ళున్నారు. అది లౌకికస్థితి. కానీ కృష్ణుడి విషయంలో ఇది కొంత విలక్షణం. తాను అనుగ్రహించదలచిన భక్తుని ఇంట సంపదల నుంచడు భగవంతుడు. ఆ భక్తులు కూడా సంపదలను కోరుకోరు. భగవత్ సాన్నిధ్యాన్ని తప్ప. అందుకే కృష్ణతత్త్వం, భక్తతత్త్వం తెలిసిన వారుగా వారు ఆ హామీ నివ్వటం.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రేషయతి :** | **ప్రేషయతి** | ప్రేషయతః | ప్రేషయన్తి |
| | ప్రేషయసి | ప్రేషయథః | ప్రేషయథ |
| | ప్రేషయామి | ప్రేషయావః | ప్రేషయామః |
| **లషన్తి :** | లషతి | లషతః | **లషన్తి** |
| | లషసి | లషథః | లషథ |
| | లషామి | లషావః | లషామః |
| **దిశధ్వమ్ :** | దిశతామ్ | దిశేతామ్ | దిశన్తామ్ |
| | దిశస్వ | దిశేథామ్ | **దిశధ్వమ్** |
| | దిశై | దిశావహై | దిశామహై |

3. ఛందస్సు - ఉపజాతి. 1-2-4 పాదాలు ఇంద్రవజ్ర. 3 పాదం ఉపేంద్రవజ్ర. *

**శ్లో॥ నైవాన్యాం వరయేత్కన్యాం పూర్ణోఽయం పురుషాగ్రణీః ।**
**వృతోఽప్యన్యాఙ్గనాదేహే రమయేత్ప్రేయసీమిమామ్ ॥ 15-43**

**అ :** మరొక స్త్రీని కృష్ణుడు వరించకూడదన్న ఆంక్షకు సమాధానం. -పథ్యావక్త్రమ్.

**అ :** పూర్ణః అయం పురుష+అగ్రణీః అన్యాం కన్యాం న వరయేత్. వృతః అపి అన్య+అంగనా -దేహే ఇమాం ప్రేయసీం రమయేత్.

**ప్ర :** పూర్ణః=పూర్ణ(కాము)డైన (కోరికలు తీరిన) (ప్రజయా హి మనుష్యః పూర్ణః-బ్రహ్మాదులు కూడా ఆయన సంతతియే గదా!), అయమ్ = ఈ, పురుష+అగ్రణీః = పురుషోత్తముడు (పురుషాణామ్ అగ్రణీః), అన్యామ్ = మరొక, కన్యామ్ = పడతిని, న వరయేత్ = వరింపడు. (వృ వరణే చురాది-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.), వృతః-అపి = (ఇతరులచే) వరింపబడినా, అన్య+అంగనా-దేహే : అన్య+అంగనా = మరో కాంతయొక్క, దేహే = శరీరంలో (అన్యా చ సా అంగనా, తస్యాః దేహః, తస్మిన్), ఇమామ్ = ఈ, ప్రేయసీమ్ = ప్రేయసి (రుక్మిణి)నే, రమయేత్ = వినోదింపజేస్తాడు. (రమ్ క్రీడాయాం-ణిచ్-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.)

**తా ॥** పరిపూర్ణకాముడయిన ఈ పురుషోత్తముడు మరొక కన్యను వరించడు. ఒకవేళ తననెవరైనా (అగతికగత న్యాయంతో) వరించినా వారి శరీరంలో రుక్మిణీ భావనతోనే వారిని వినోదపరుస్తాడు.

**వి :** 1. నరకుని చెరలో నున్న కన్యలను చేరదీయటంలోనూ, గోపికలతో రాసక్రీడలు సలపటంలోనూ, అష్టభార్యలతో గృహస్థుడుగా జీవించటంలోనూ అనివార్యత - ప్రధానంగా తానే వరింపబడటం - కనిపిస్తుంది. వాస్తవానికి రుక్మిణి విషయంలో కూడా చొరవ అంతా రుక్మిణిదే గదా! '**న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్**' అని కాళిదాస వచనం. రత్నం వెదుకబడుతుందే కాని తాను వెతకదు.

2. **వరయేత్ :** 15-36వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

**రమయేత్ :** 15-40వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సదాఽపరోక్షీకృతసర్వవిశ్వః - కథం స్మరేద్వః స్మరణీయశీలః ।**
**తథాపి యుష్మాసు కృపాం స కుర్యాత్ - స్మృతేః ఫలం స్వాంఘ్రియుగాశ్రయేషు॥44**

**అ :** బంధువులను తలచుకోవటం మాత్రం కుదరదని సహేతుకంగా వరపక్షంవారు వివరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సదా అపరోక్షీకృత-సర్వ-విశ్వః స్మరణీయ-శీలః సః వః కథం స్మరేత్. తథా అపి స్వ+అంఘ్రి-యుగ+ఆశ్రయేషు యుష్మాసు స్మృతేః ఫలం కృపాం కుర్యాత్.

**ప్ర :** సదా = ఎల్లప్పుడు, అప... విశ్వః : అపరోక్షీకృత = ప్రత్యక్షం చేసికొన్న, సర్వ = సమస్తమైన, విశ్వః = ప్రపంచమూ గలవాడు (అపరోక్షీకృతం సర్వం విశ్వం యేన సః), స్మరణీయ-శీలః : స్మరణీయ = తలచుకొనదగిన, శీలః = నడవడిగలవాడు అయిన (స్మరణీయం శీలం యస్య సః), సః = ఆ కృష్ణుడు, వః = మిమ్ము, కథమ్ = ఎట్లు, స్మరేత్ = తలవగలడు? (స్మృ చింతాయాం-భ్వాది-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.) (సమస్త విశ్వమూ ప్రత్యక్షమే అయినప్పుడు ఇక స్మరణానికి తావెక్కడ?), తథా అపి=అయినా కూడా, స్వ... ఆశ్రయేషు : స్వ = తనయొక్క, అంఘ్రి = పాదాలయొక్క, యుగ = జంటయే, ఆశ్రయేషు = ఆశ్రయంగా గలవారైన (స్వస్య అంఘ్ర్యోః యుగమ్ ఆశ్రయః యేషాం తేషు), యుష్మాసు = మీయందు, స్మృతేః = స్మృతియొక్క, ఫలమ్ = ఫలితరూపమైన, కృపామ్ = దయను, కుర్యాత్ = చూపగలడు. (కృ కరణే పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు సమస్తవిశ్వాన్నీ అపరోక్షం చేసికొన్నవాడు. తాను స్మరింపదగినవాడే కానీ స్మరించవలసినవాడు కాదు. ఇక మిమ్ములనెలా తలచుకొనగలడు. కానీ మీరు ఆయన పాదాలను ఆశ్రయించినవారు, కాబట్టి మీపై అనుగ్రహంతో స్మరణ ఫలితమైన కరుణను మీపై చూపగలడు.

**వి :** 1. స్మరణ తద్వారా కరుణ - ఇది గొలుసుకట్టు. దానికన్న ప్రత్యక్షంగా కరుణనే కురిపించటం. ఇది దగ్గరదారి.

**శరణం భవ కరుణాం మయి - కురు దీనదయాళో**
**కరుణారస వరుణాలయ - కరిరాజ కృపాళో ---**

అని నారాయణతీర్థులు కృష్ణలీలాతరంగిణిలో కోరినది దానినే గదా!

2. ఇక్కడ తార్కికస్మరణాన్ని గురించి కవి ప్రస్తావించాడు. '**సంస్కారజన్యం జ్ఞానం స్మృతిః**' అని తార్కికసమ్మతం స్మృతిలక్షణం. అనుభూతపూర్వమై అప్పుడులేక కారణాంతరాల వల్ల మరల గుర్తుకు రావటం స్మరణం. కృష్ణుడికి అసలు విస్మృతికి అవకాశమే లేకపోతే స్మృతికి తావెక్కడ?

అయితే గాఢానుభూతుల విషయంలో (ఆధ్యాత్మిక-రసానందానుభూతుల విషయంలో) ఈ స్మరణం అప్రధానమని కాళిదాసూ, అభినవగుప్తుడూ అభిప్రాయపడ్డారు.

శ్లో॥ రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యుత్సుఖితోఽపి జన్తుః ।
**తచ్చేతసా స్మరతి నూనమబోధపూర్వం**
భావస్థిరాణి జననాంతరసౌహృదాని ॥ – అభిజ్ఞానశాకున్తలమ్ – 5/2

**"అత్ర హి స్మరతీతి యా స్మృతిరుపదర్శితా సా న తార్కికప్రసిద్ధా! పూర్వమేతస్యార్థస్య అననుభవాత్ । అపి తు ప్రతిభానాపరపర్యాయసాక్షాత్కారస్వభావేయమితి."**

(నాట్యశాస్త్రం-అభినవభారతి-6 అధ్యాయం-రససూత్రవ్యాఖ్య.)

| | | | |
|---|---|---|---|
| 3. **స్మరేత్ :** | **స్మరేత్** | స్మరేతామ్ | స్మరేయుః |
| | స్మరేః | స్మరేతమ్ | స్మరేత |
| | స్మరేయమ్ | స్మరేవ | స్మరేమ |
| **కుర్యాత్ :** | **కుర్యాత్** | కుర్యాతామ్ | కుర్యుః |
| | కుర్యాః | కుర్యాతమ్ కుర్యాత | |
| కుర్యామ్ | కుర్యావ | కుర్యామ. | * |

**శ్లో॥ న పారిబర్హం బహు దాతుమీశా-రథాశ్వహస్త్యాదిబలాని చాస్మై ।**
**ఇమాం పరం పద్మముఖీం దిశామ-స్తిథిజ్ఞమాహూయ తిథిర్విచార్యతామ్ ॥15-45**

**అ :** వధూపక్షం వారు తమ లేమిని వివరిస్తూ మాటాడటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అస్మై బహు పారిబర్హం, రథ+అశ్వ-హస్తి+ఆది-బలాని చ దాతుం న ఈశాః. పరమ్ ఇమాం పద్మ-ముఖీం దిశామః. తిథి-జ్ఞమ్ ఆహూయ తిథిః విచార్యతామ్.

**ప్ర :** అస్మై = ఈ కృష్ణునకు, బహు = ఎక్కువగా, పారిబర్హమ్ = రాజులకు తగిన సొమ్మును (పరిచ్ఛదే నృపార్హేఽర్థే పరిబర్హోఽవ్యయాః పరే-హలాయుధకోశః), రథా... బలాని చ:రథ = రథాలు, అశ్వ = గుర్రాలు, హస్తి = ఏనుగులు, ఆది = మొదలుగా గల, బలాని=సేనను కూడా (రథాశ్చ అశ్వాశ్చ హస్తినశ్చ ఆదౌ యేషాం తాని చ తాని బలాని), దాతుమ్ = ఇవ్వటానికి (దా ధాతువుపై తుమున్ ప్రత్యయం), న ఈశాః = సమర్థులం కాదు, పరమ్ = అయితే, ఇమామ్ = ఈ, పద్మ-ముఖీమ్ = కమలనయనను (రుక్మిణిని), దిశామః = ఇస్తాము (దిశ అతిసర్జనే పరస్మైపది-లట్-ఉ.బ.), తిథి-జ్ఞమ్ = జ్యోతిష్కుని, ఆహూయ = పిలిపించి (ఆ-హు ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తిథిః = ముహూర్తం, విచార్యతామ్ = నిర్ణయింపబడుగాత. (వి-చర గతిభక్షణయోః కర్మణి-ఆత్మనేపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ కృష్ణుని స్థాయికి తగినట్లుగా మేము కట్నమివ్వలేము. రథాలు, గుఱ్ఱాలు, ఏనుగులు మొదలయిన సేనలను

కూడా కానుక చేయలేము. మా రుక్మిణిని మాత్రమే ఇస్తాం. జ్యోతిష్కుని పిలిపించి ముహూర్తాన్ని నిర్ణయించండి.

**వి :** 1. వరుడికి కట్నం, వధువుకు కట్నం ఇవి చక్రంలా తిరుగుతుంటాయి. మహాభారత కాలంలో కన్యాశుల్కమిచ్చి మాద్రితో పాండువుపెళ్ళి జరిపించాడు భీష్ముడు. ప్రకృతం తన కాలంలోని వరకట్నాన్ని గురించి ప్రస్తావిస్తున్నాడు కవి. గురజాడ అప్పారావు తన కాలంలోని కన్యాశుల్కాన్ని నిరసిస్తూ నాటకరచన చేశాడు. తరువాతి కాలంలో మళ్ళీ వరకట్నం తెరమీదకు వచ్చింది. ఇప్పుడు వరకట్నం అప్రధానమయింది. కన్యాశుల్కం ఇంకా ప్రవేశించలేదు. ప్రారంభం కావటానికి ఎక్కువ సమయం పట్టకపోవచ్చు.

| | | | |
|---|---|---|---|
| 2. **దిశామః :** | దిశతి | దిశతః | దిశన్తి |
| | దిశసి | దిశథః | దిశథ |
| | దిశామి | దిశావః | **దిశామః** |
| **విచార్యతామ్ :** | **విచార్యతామ్** | విచార్యేతామ్ | విచార్యన్తామ్ |
| | విచార్యథాః | విచార్యేథామ్ | విచార్యధ్వమ్ |
| | విచార్యై | విచార్యావహై | విచార్యామహై. |

*

**శ్లో॥ న పారిబర్హం స వృణోతి పూర్ణ-సుఖః పరం కాఙ్క్షతి తత్కటాక్షమ్ ।**
**విరిఞ్చవైరిఞ్చముఖామరాణా-మగణ్యభాగ్యం హి యతో బభూవ ॥ 15-46**

**అ :** కట్నమివ్వలేమన్న దానికి వరుని వైపునుండి సమాధానం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పూర్ణ-సుఖః సః పారిబర్హం న వృణోతి పరం తత్కటాక్షం కాంక్షతి. యతః విరించ-వైరించ-ప్రముఖ+అమరాణాం అగణ్య-భాగ్యం బభూవ హి.

**ప్ర :** పూర్ణ-సుఖః = నిండైన సుఖంగల (పూర్ణం సుఖం యస్య సః), సః = ఆ కృష్ణుడు, పారిబర్హమ్ = కట్నాన్ని, న వృణోతి = ఆశించడు. (వృ వరణే-స్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), పరమ్ = అయితే, తత్-కటాక్షమ్ = ఆమె కడగంటిచూపును (తస్యాః కటాక్షః, తమ్), కాంక్షతి = కోరుతున్నాడు. (కాంక్ష్ కాంక్షాయాం-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యతః = ఏ కటాక్షంనుండి, విరించ... రాణామ్ : విరించ = బ్రహ్మ, వైరించ = శివుడు, ముఖ = ప్రధానులయిన, అమరాణామ్ = దేవతలకు (విరించశ్చ వైరించశ్చ ముఖే యేషాం తే, తే చ తే అమరాః, తేషామ్), అగణ్య-భాగ్యమ్ : అగణ్య = లెక్కింపరాని, భాగ్యమ్ = అదృష్టం (సంపద), బభూవ హి = కలిగిందో (భూ సత్తాయాం-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు పూర్ణసుఖుడు. ఆయన కట్నాలు ఆశించడు. ఆ రుక్మిణియొక్క కటాక్షాన్ని మాత్రమే కోరుతున్నాడు. ఆ కటాక్షంనుండియే గదా బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలకు లెక్క కందనంత భాగ్యం కలిగింది.

**వి :** 1. కృష్ణుడు పూర్ణసుఖుడు. కృష్ణవచనమే ప్రమాణం-

శ్లో॥ న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ - భగవద్గీత 3/22

2. రుక్మిణీ(లక్ష్మీ)కటాక్షవైభవం, తత్ఫలం ఊహకందవు. బ్రహ్మాదుల కందరికీ ఆ కటాక్షంద్వారానే భాగ్యసిద్ధి- పరాశరభట్టరు ఆ వైభవాన్ని వివరించిన శ్లోకం-

శ్లో॥ అపాంగా భూయాంసో యదుపరి పరంబ్రహ్మ తదభూ-
దమీ యత్ర ద్విత్రాస్స చ శతమఖాదిస్తదధరాత్ ।

అతః శ్రీరామ్నాయస్తదుభయముశంస్త్వాం ప్రణిజగౌ
ప్రశస్తిస్సా రాజ్ఞో యదపి చ పురీకోశకథనమ్ ॥ – శ్రీగుణరత్నకోశః – 30

| | | | |
|---|---|---|---|
| 3. **వృణోతి :** | **వృణోతి** | వృణుతః | వృణ్వన్తి |
| | వృణోసి | వృణుథః | వృణుథ |
| | వృణోమి | వృణువః | వృణుమః |
| **కాఙ్క్షతి :** | **కాఙ్క్షతి** | కాఙ్క్షతః | కాఙ్క్షన్తి |
| | కాఙ్క్షసి | కాఙ్క్షథః | కాఙ్క్షథ |
| | కాఙ్క్షామి | కాఙ్క్షావః | కాఙ్క్షామః |
| **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ యద్వక్త్రేవిధు మామనన్తి సుబుధం ముగ్ధస్మితే హస్తయో-**
**రుద్యద్వ్యోమమణిం గురుం కటితటే మధ్యం చ కావ్యాస్పదమ్ ।**
**యత్పాదస్పృశి మఙ్గలం పదతలే కేతుం గతౌ మన్దగం**
**యద్రోచిశ్చకితం తమస్తదనయోర్నిత్యం ముహూర్తోదయః ॥ 15–47**

**అ :** రుక్మిణీకృష్ణుల వివాహముహూర్తపరామర్శ. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యద్–వక్త్రే = ఏ రుక్మిణీకృష్ణులయొక్క ముఖంపై (జాత్యేకవచనం), విధుమ్ = చంద్రుని, ఆమనన్తి = చెప్తున్నారో (ఆ–మ్నా అభ్యాసే–భ్వాది–పరస్మైపది–లట్–(ప్ర.బ.), ముగ్ధ–స్మితే = అమాయకపు చిఱునవ్వులో, సు–బుధమ్ = మంచిజ్ఞానిని, ఆమనన్తి – హస్తయోః = చేతులలో, ఉద్యత్–వ్యోమ–మణిమ్ : ఉద్యత్ = ఉదయిస్తున్న, వ్యోమ–మణిమ్ = సూర్యుని, ఆమనన్తి , కటి–తటే = కటి అంచున, గురుమ్ = భారాన్ని (గురువును), ఆమనన్తి, మధ్యమ్ = నడుమును, కావ్య+ఆస్పదమ్ = వర్ణించడానికి తగినదిగా (శుక్రుని) (కావ్యస్య ఆస్పదః తమ్), ఆమనన్తి, యత్–పాద–స్పృశి = ఎవరి పాదాల తాకిడిలో, మంగలమ్ = శుభంగా (కుజుని), ఆమనన్తి, పదతలే = అరికాలిలో, కేతుమ్ = పతాకారేఖలను (కేతువును), ఆమనన్తి, గతౌ = నడకలో, మందగమ్ = నెమ్మదిని (శనిని), తమః = చీకటిని (రాహువు), యద్–రోచిః చకితమ్ = ఎవరికాంతికి తడబడిన వానినిగా, ఆమనన్తి, తత్ = కాబట్టి, అనయోః = ఆ రుక్మిణీకృష్ణులకు, నిత్యమ్ = ప్రతిదినమూ, ముహూర్త+ఉదయః = ముహూర్తం వున్నట్టే.

**తా ॥** ఆ రుక్మిణీకృష్ణుల ముఖంలో చంద్రుడు, చిఱునవ్వులో బుధుడు, చేతులలో సూర్యుడు, మొల అంచుల గురువు, మధ్యలో కావ్యా(శుక్ర)స్పదత్వం, పాదాలు తాకితే మంగలం (కుజుడు), అరికాళ్ళలో కేతువు, నడకలో మందగతి (శని) వున్నారో ఎవరి కాంతివల్ల చీకటి (రాహువు) కూడా భయపడి తడబడుతుందో వారికీ ప్రతిదినమూ సుముహూర్తమే.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **ఆమనన్తి :** | ఆమనతి | ఆమనతః | **ఆమనన్తి** |
| | ఆమనసి | ఆమనథః | ఆమనథ |
| | ఆమనామి | ఆమనావః | ఆమనామః. |

*

**శ్లో॥ యదీయవీక్షావిషయస్య నిత్యం - విధోర్బలం తారబలం చ సుష్ఠు ।**
**యదీయతారం జపతస్తదస్య - సదా ముహూర్తోదయమేవ మన్యే ॥ 15-48**

**అ :** రుక్మిణీకృష్ణుల వివాహానికి సదా ముహూర్తస్థితి అని ప్రతిపాదన. -ఉపేంద్రవజ్ర.

**అ :** యదీయ-వీక్షా-విషయస్య నిత్యం విధోః బలమ్ (అస్తి) యదీయ-తారం జపతః సుష్ఠు తారబలమ్ (అస్తి) తద్ అస్య సదా ముహూర్త+ఉదయమ్ ఏవ మన్యే.

**ప్ర :** యదీయ-విషయస్య : యదీయ = ఎవరియొక్క, వీక్షా = కటాక్షానికి, విషయస్య = విషయమై (చూడబడే వాడై) యదీయా చ సా వీక్షా, తస్యాః విషయః, తస్య), నిత్యమ్ = ఎల్లప్పుడు, విధోః = చంద్రునికి, బలమ్ (అస్తి) = బలమున్నదో, యదీయ-తారమ్ : యదీయ = ఎవరికి చెందిన, తారమ్ = ఓంకారాన్ని (ఓంకారః ప్రణవస్తారః -వైజయన్తీ-భూమి-233), జపతః = జపించేవారికి, సుష్ఠు = బలిష్ఠంగా, తారబలమ్ = తారాబలం, (అస్తి = కలుగునో), తత్ = ఆ కారణం వలన, అస్య = ఈ కృష్ణునికి, సదా = అన్నివేళలా, ముహూర్త+ఉదయమ్-ఏవ = ముహూర్తంయొక్క కుదిరికయే అని, మన్యే = భావిస్తున్నాను. (మను జ్ఞానే-దివాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** ఎవరి కంటబడి నిత్యమూ చంద్రుడికి బలం కలుగుతుందో, ఎవరి ప్రణవాన్ని జపిస్తున్నందువల తారలకు బలం కులుగుతుందో అటువంటి కృష్ణునికి అన్నివేళలా సుముహూర్తమే.

**వి :** 1. ముహూర్తనిర్ణయసమయంలో చంద్రబలానికీ, తారాబలానికీ ప్రాధాన్యమిస్తారు. జన్మనక్షత్రానికీ, ఆనాటి ముహూర్తనక్షత్రానికీ వున్న సంబంధవిశేషాలే చంద్రబలం, తారాబలం. జన్మనక్షత్రంనుండి ఆనాటి నక్షత్రంవరకు లెక్కించి తొమ్మిదితో భాగింపగా శేషం - (1) జన్మతార (2) సంపత్తార (3) విపత్తార (4) క్షేమతార (5) ప్రత్యక్తార (6) సాధనతార (7) నైధనతార (8) మిత్రతార (9) పరమమిత్రతార. వీటిలో విపత్తార, ప్రత్యక్తార, నైధనతారలను సర్వవిషయాలలో పరిహరిస్తారు. జన్మతారను కొన్నింటికి అంగీకరిస్తారు. ఇది ప్రాథమికవిషయం.

చంద్రబలం జన్మరాశినుండి చంద్రుడున్న రాశికి గల సంబంధానికి సంబంధించినది. జన్మరాశినుండి 1,3,6,7,10,11 స్థానాలలో చంద్రస్థితిని చంద్రబలానికి అనుకూలంగా భావిస్తారు. వివాహముహూర్తవిషయంలో చంద్రుడు మరే గ్రహంతోనూ కలవకూడదన్న నియమం కూడా వుంది. దాన్ని సగ్రహచంద్రదోషంగా (కలిసివుంటే) పరిగణిస్తారు.

అయితే కార్యక్రమాలను ప్రారంభించేటప్పుడు పురోహితులు ఒక శ్లోకంతో ముహూర్త ప్రస్తావన, నారాయణాంఘ్రిసేవన చేస్తారు.

**శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ - తారాబలం చంద్రబలం తదేవ ।**
**విద్యాబలం దైవబలం తదేవ - లక్ష్మీపతే తేఽంఘ్రియుగం స్మరామి ॥**

నారాయణాంఘ్రిస్మరణమే ముహూర్తం. అదే సుదినం. తారాబలమూ, చంద్రబలమూ, విద్యాబలమూ, దైవబలమూ కూడా అదే. ఈ శాస్త్రాలు ఎంతగొప్పవైనా, శాస్త్రజ్ఞులు ఎంతటి వారైనా అంతా మానవులే కాబట్టి మానవీయదోషాలకు అవకాశముండవచ్చని నారాయణ పాదస్మరణాన్నే ముహూర్తంగా భావించటం ఉత్తమం.

2. మన్యే : 15-34వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

*

**శ్లో॥ ద్విత్రైర్దినైరన్తరితాఽపి సాఽభూ-జ్జ్యోతిష్పథజ్ఞోక్తతిథిః క్షణాభా ।**
**ఉద్యన్మహర్థిం మిషతాం జనానాం - భైష్మ్యాస్తు కల్పాయుతసమ్మితాఽఽసీత్ ॥49**

**అ :** ముహూర్తవేళవరకు రుక్మిణికి కాలం గడవటం కష్టం కావటం. -ఇంద్రవజ్ర.

**అ :** జ్యోతిష్పథ-జ్ఞ+ఉక్త-తిథిః ద్విత్రైః దినైః అంతరితా అపి ఉద్యత్+మహో-బుద్ధిం మిషతాం జనానాం సా క్షణ+ఆభా అభూత్. భైష్మ్యాః తు కల్ప+అయుత-సమ్మితా ఆసీత్.

**ప్ర :** సా = ఆ, జ్యోతి... తిథిః : జ్యోతిః = నక్షత్రాలయొక్క, పథ = మార్గాన్ని, జ్ఞ = ఎరిగిన వారిచే (జ్యోతిష్కులచే), ఉక్త = చెప్పబడిన, తిథిః = రోజు (ముహూర్తం) (జ్యోతిషాం పన్థానం జానన్తీతి, తైః ఉక్తా తిథిః), ద్విత్రైః = రెండు, మూడు (ద్వౌ వా త్రయో వా మానం యేషాం తాని, ద్విత్రాణి, తైః), అంతరితా అపి = వ్యవధి కలదైనా, ఉద్యత్-మహో-బుద్ధిమ్ : ఉద్యత్ = రానున్న, మహో+బుద్ధిమ్ = గొప్ప అభివృద్ధిని, మిషతామ్ = గమనిస్తున్న, జనానామ్ = జనులకు, క్షణ+ఆభా = క్షణకాలంతో సమానంగా, అభూత్ = అయింది. (భూ సత్తాయాం పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), భైష్మ్యాః+తు = రుక్మిణికయితే, కల్ప+అయుత-సమ్మితా : కల్ప+ఆయుత = పదివేల కల్పాలతో, సమ్మితా = సమానమైనదిగా, ఆసీత్ = ఉండింది. (అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** జ్యోతిష్కులు పెట్టిన ముహూర్తానికి రెండు మూడు రోజులే వ్యవధి వుంది. అయితే జరుగబోయే మహాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొన్న వారికి ఆ రెండు మూడు రోజులు క్షణంలో గడిచిపోయాయి. రుక్మిణికి మాత్రం ఆ సమయమే పదివేల కల్పాలతో సమానమైంది.

**వి :** 1. **అభూత్ :**

| | | | |
|---|---|---|---|
| | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూతమ్ | అభూవ | అభూమ |

**ఆసీత్ :** 15-29వ శ్లోకవ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ తామ్బూలపత్రం కిల పూగయుక్త-మాసీద్వివాహోత్సవనిర్ణయాయ ।**
**చేతస్సు నిశ్చాయయతి స్మ యూనాం - మాఙ్గల్యదీక్షోత్సవమేతదేవ ॥ 15-50**

**అ :** నిశ్చయతాంబూల ప్రస్తావన. -ఇంద్రవజ్ర.

**అ :** పూగ-యుక్తం తాంబూల-పత్రం వివాహ+ఉత్సవ-నిర్ణయాయ ఆసీత్ కిల. యూనాం చేతస్సు ఏతద్ ఏవ మాంగల్య-దీక్షా-ఉత్సవం నిశ్చాయయతి స్మ.

**ప్ర :** పూగ-యుక్తమ్ : పూగ = వక్కలతో, యుక్తమ్ = కూడిన (పూగైః యుక్తమ్), తాంబూల-పత్రమ్ = తమలపాకు (జాత్యేక వచనం), వివాహ+ఉత్సవ-నిర్ణయాయ = పెండ్లివేడుక యొక్క నిశ్చయం కోసం (వివాహ ఇతి ఉత్సవః, తస్య నిర్ణయః, తస్మై), ఆసీత్ కిల = జరిగింది గదా!, యూనామ్ = యువకులయొక్క, చేతస్సు = మనస్సులలో, ఏతద్-ఏవ = ఇదియే, మాంగల్య-దీక్షా+ఉత్సవమ్ = మాంగల్యదీక్షను స్వీకరించే వేడుకను, నిశ్చాయయతి స్మ = నిర్ణయింపజేసింది.(నిస్ చి చయనే-స్వాది-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** వివాహమహోత్సవనిర్ణయం కోసం వక్కలతో కూడిన తమలపాకులు (తాంబూలం). ఉణ్ణాయి. ఆ తాంబూలమే యువకులలో వివాహదీక్షను నిశ్చయింపజేసింది.

**వి :** 1. తాంబూలాలు పుచ్చుకోవటం (తీసికోవటం), తాంబూలాలు ఇవ్వటం గతంలో వాడేవారు. 'తాంబూలాలిచ్చేశాను తన్నుకు చావండి' అంటాడు కన్యాశుల్కంలో అగ్నిహోత్రావధానులు. ఈ ప్రక్రియ ఇరువురి మధ్య వివాహనిశ్చయాన్ని ఇరువురూ అంగీకరించేది. ప్రస్తుతం నిశ్చితార్థమన్న పదాన్ని విస్తృతంగా వాడుతున్నారు. అది కూడా మరుగున పడి Engagement అన్న ఆంగ్లపదం ముందుకు వచ్చింది.

తాంబూలమివ్వటాన్ని ఇద్దరిమధ్య ఏర్పడిన ఒప్పందంగా ఇతరత్ర కూడా వాడు తుంటారు.

2. **ఆసీత్ :** 15-29వ శ్లోకవ్యాఖ్య చూడుదు.

| | | | |
|---|---|---|---|
| **నిశ్చాయయతి:** | **నిశ్చాయయతి** | నిశ్చాయయతః | నిశ్చాయయన్తి |
| | నిశ్చాయయసి | నిశ్చాయయథః | నిశ్చాయయథ |
| | నిశ్చాయయామి | నిశ్చాయయావః | నిశ్చాయయామః. |

*

**శ్లో॥ తతః క్రమేణోభయవర్గనార్యో - గృహే గృహే తైలయుతాం హరిద్రామ్ ।
దదుర్వివాహోత్సవమూలభూతాం - పరస్పరం స్నేహమివార్పయన్త్యః ॥ 15-51**

**అ :** ఇరువైపుల ముత్తయిదువలు పసుపు పంచటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** తతః క్రమేణ ఉభయ-వర్గ-నార్యః వివాహ+ఉత్సవ-మూల-భూతాం తైల-యుతాం హరిద్రాం స్నేహం పరస్పరమ్ అర్పయన్త్యః ఇవ గృహేః గృహే దదుః.

**ప్ర :** తతః = ఆ తరువాత, క్రమేణ = క్రమంగా (ప్రారంభంగా), ఉభయ-వర్గ-నార్యః : ఉభయ-వర్గ = రెండువైపులకు (వరపక్షం, వధూపక్షం) చెందిన, నార్యః = స్త్రీలు, తైల-యుతామ్ = నూనెతో కూడిన (తైలేన యుతా, తామ్), హరిద్రామ్ = పసుపును, వివాహ... భూతామ్ (సతీమ్) : వివాహ+ఉత్సవ = పెండ్లివేడుకకు, మూల-భూతామ్ (సతీమ్) = మూలమైన దానినిగా, పరస్పరమ్ = ఒకరికొకరు, స్నేహమ్ = మైత్రిని, అర్పయన్త్యః ఇవ = ఇస్తున్నట్లుగా, గృహే గృహే = ఇంటింటా, దదుః = ఇచ్చారు. (దా దానే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**తా ॥** ఆ తర్వాత మెల్లగా ఇరుపక్షాలకు చెందిన స్త్రీలు నూనె, పసుపు ఇంటింటా పంచి పెట్టారు. అది పెండ్లివేడుకలకు ప్రారంభకార్యక్రమం. నూనెతో (స్నేహంతో) కూడిన పసుపును ఇవ్వటం స్నేహాన్ని (మైత్రిని) పెంపొందించుకోవటాన్ని సూచిస్తోంది.

**వి :** 1. ఈనాటికి కూడా పసుపు దంచటం లేదా పసుపుకొట్టడంతో పెండ్లి పనులు ప్రారంభించటం తెలుగునేలలో ఆనవాయితీ. నూనె తలంటుకోసం.

2. స్నేహాన్ని అర్పిస్తున్నట్లుగా - ఇది ఉత్ప్రేక్షాలంకారం. స్నేహ పదానికి నూనె, మైత్రి అని రెండర్థాలు. కాబట్టి శ్లేషాలంకారం. వెరసి శ్లేషమూలకమైన ఉత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **దదుః :** | దదౌ | దదతుః | **దదుః** |
| | దదిథ/దదాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ. |

*

**శ్లో॥ కన్యావరౌ చక్రతురర్థకామా-వన్యేద్యురర్చాం పితృదేవతానామ్ ।
మన్యేఽహమన్యోన్యమమూ తదగ్రే - చీర్ణోత్సవౌ సమ్ప్రతి జాతలజ్జౌ ॥15-52**

**అ :** వధూవరులు పితృదేవతలను అర్చించటం - కవి సంభావన. -ఇంద్రవజ్ర.

**అ :** అర్థ-కామౌ కన్యా-వరౌ అన్యేద్యుః పితృదేవతానామ్ అర్చాం చక్రతుః తద్-అగ్రే అన్యోన్యం చీర్ణ+ఉత్సవౌ అమూ సంప్రతి జాత-లజ్జౌ (అర్చాం చక్రతుః) (ఇతి) అహం మన్యే.

**ప్ర :** అర్థ-కామౌ = అర్థకామస్వరూపులైన (అర్థశ్చ కామశ్చ), కన్యా-వరౌ = వధూవరులు (కన్యా చ వరశ్చ), అన్యేద్యుః = మరునాడు, పితృదేవతానామ్ = పితృదేవతలయొక్క, అర్చామ్ = పూజను, చక్రతుః = చేశారు. (కృ కరణే పరస్మైపది-లిట్-ప్ర.ద్వి), తద్-అగ్రే = వారియెదుట (తేషామ్ అగ్రే), అన్యోన్యమ్ = పరస్పరం, చీర్ణ+ఉత్సవౌ : చీర్ణ = జరిపింపబడిన, ఉత్సవౌ = పెండ్లివేడుక గల (చీర్ణః ఉత్సవః యయోః తౌ) (గతంలోనే లక్ష్మీనారాయణుల వివాహం దేవతాసమక్షంలో జరిగింది కదా!), అమూ = ఆ రుక్మిణీకృష్ణులు, సంప్రతి = ఇప్పుడు, జాత-లజ్జౌ = సిగ్గు

కలిగినవారై (జాతా లజ్జా యయోః, తౌ), (అర్చాం చక్రతుః = పూజ చేశారు), (ఇతి = అని), అహమ్ = నేను, మన్యే = అనుకొంటున్నాను. (మను జ్ఞానే-దివాది-ఆత్మనేపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** అర్థకామస్వరూపులైన రుక్మిణీకృష్ణులు మరునాడు పితృదేవతాసమర్చన చేశారు. వారు అంతకుముందే సకలదేవతాసమక్షంలో వివాహమైనవారు. మరల ఇప్పుడు వధూవర రూపంతో వారిముందు నిలవటానికి సిగ్గుపడుతున్నట్టు వారి కంట బడకుండా వుండేందుకు అర్చన చేశారు అని నేను (కవి) భావిస్తున్నాను.

**వి :** 1. వివాహానికి ముందు పితృదేవతాసమర్చనను **నాందీముఖపూజ** అని వ్యవహరిస్తారు. ఇది పురోహితుడైనా, ఇంటిలో వున్న పెద్దవారెవరైనా చేస్తారు. ఆయా వంశాచారాలకు అనుగుణంగా దీనిని నిర్వర్తించుకొంటారు. నాందీశ్రాద్ధమని కూడా దీనికి వ్యవహారం.

2. అహం మన్యే – అని కవి వాచా అది నా ఊహ అన్నందువల్ల ఇది ఉత్ప్రేక్షాలంకారం.

రుక్మిణీకృష్ణులు సిగ్గుపడటానికి వాస్తవంగా గతంలో పెండ్లి జరిగినా ఇప్పుడు మరల వధూవరులు కావటం కారణం కాకపోవచ్చు. సిగ్గు దానికి ఏ విధమైన సంబంధం లేకపోవచ్చు. అయినా ఆ సంబంధాన్ని కల్పించినందువల్ల అది సంబంధాతిశయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**'-(కు. 39)

| | | | |
|---|---|---|---|
| 3. **చక్రతుః :** | చకార | **చక్రతుః** | చక్రుః |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ |

**మన్యే :** 15-34వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ అథ స్నాతకసాధర్మ్యం సంప్రాప్య యదునన్దనః ।**
**స్నాతుం జిగమిషుస్తీర్థం ప్రీత్యేత్థం ప్రత్యషిధ్యత ॥ 15-53**

**అ :** స్నాతకం, కాశీయాత్ర ప్రస్తావన. -పథ్యావక్త్రమ్.

**అ :** అథ స్నాతక-సాధర్మ్యం సంప్రాప్య. స్నాతుం తీర్థం జిగమిషుః యదు-నందనః ప్రీత్యా ఇత్థం ప్రత్యషిధ్యత.

**ప్ర :** అథ = అటుతర్వాత, స్నాతక-సాధర్మ్యమ్ : స్నాతక = స్నాతకునితో, సాధర్మ్యమ్ = సమానత్వాన్ని, సంప్రాప్య = పొంది (సమ్-ప్ర-ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), స్నాతుమ్ = స్నానానికై, తీర్థమ్ = తీర్థానికి, జిగమిషుః = వెళ్ళగోరినవాడై (గన్తుమ్ ఇచ్ఛుః జిగ-మిషుః), యదు-నందనః = కృష్ణుడు, ప్రీత్యా = ప్రేమపురస్సరంగా, ఇత్థమ్ = ఈ విధంగా, ప్రతి+అషిధ్యత = నిరోధింపబడ్డాడు (ప్రతి-సిధ్ గత్యామ్-భ్వాది-కర్మణి-ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఆపై కృష్ణుడు స్నాతకసమానత్వాన్ని పొంది తీర్థస్నానం కోసం బయలుదేరాడు. అయితే ప్రీతి పురస్సరంగా నిరోధింపబడ్డాడు. (వధూపక్షం వారిచే-వధూ సోదరునిచే)

**వి :** 1. స్నాతకవ్రతమన్నది దాదాపు పెళ్ళిరోజు (రాత్రి ముహూర్తమైనా, పగటి ముహూర్తమైనా సరే) పెళ్ళికి ముందు జరుపుతున్న కార్యక్రమం. వాస్తవానికిది గురుసన్నిధిలో అధ్యయనాన్ని ముగించిన తరువాత, అక్కడే జరిగే పని. అప్పటితో బ్రహ్మచారికున్న జీవననిబంధనలు తొలగిపోతాయి. ఆపై స్వేచ్ఛగా గృహస్థధర్మానికి సిద్ధపడటం. అందుకే ఈనాడు స్నాతకంలో వరునిపై వున్న నిబంధనలన్నీ తొలగినందుకు గుర్తుగా కొంత అలంకరణ, తాంబూలాది సేవనం కనిపిస్తుంది. అయితే తరువాత్తరువాత అధ్యయనవిధానంలో మార్పులు వచ్చాయి. తైత్తిరీయోపనిషత్తులో "**సత్యం వద, ధర్మం చర...**' అంటూ గురువు స్నాతకోపన్యాసం చేయటం చూడవచ్చు.

2. స్నాతకులు మూడురకాలు – "**విద్యాస్నాతకో, వ్రతస్నాతకో విద్యావ్రతస్నాతకః**" ఇతి. "**యః సమాప్యవేదమసమాప్య వేదవ్రతాని సమావర్తతే స విద్యాస్నాతకః। యస్తు సమాప్య వ్రతాని అసమాప్య వేదం సః వ్రతస్నాతకః। యః పునరుభయం స విద్యావ్రతస్నాతకః**"ఇతి– **స్మృతిముక్తాఫలమ్ – పు 119**

3. ఇంటిలో వ్రతం పూర్తయిన వెంటనే కాశీయాత్ర అన్న కార్యక్రమం ప్రారంభ మవుతుంది. అప్పుడు వధువు సోదరుడు (కాబోయే బావమరిది) వచ్చి (కాబోయే) బావను బ్రతిమిలాడి కాశీయాత్రాభిలాషనుండి మళ్ళించి, కాళ్ళు కడిగి ముహూర్తానికి తీసికొనిపోతాడు. ఈ కార్యక్రమమంతా క్రియాప్రధానమై వేడుకగా జరుగుతుంది.

4. **ప్రత్యషిధ్యత : (ప్రతి+అషిధ్యత)**

| | | |
|---|---|---|
| **ప్రత్యషిధ్యత** | ప్రత్యషిధ్యేతామ్ | ప్రత్యషిధ్యన్త |
| ప్రత్యషిధ్యథాః | ప్రత్యషిధ్యేథామ్ | ప్రత్యషిధ్యధ్వమ్ |
| ప్రత్యషిధ్యే ప్రత్యషిధ్యావహి | ప్రత్యషిధ్యామహి. | * |

**శ్లో॥ పరిహృతభవపాశ! శ్రీశ! మా యాహి శౌరే!**
**త్రిభువనపరిగీతం తీర్థజాతం త్వయీశే! ।**
**వ్రజతి సకలమాసీత్ పృష్ఠతః స్పష్టయుష్మ-**
**చ్చరణవరణభూమ్యాం క్వాస్తి తీర్థం త్వదగ్రే॥ 15–54**

**అ :** కృష్ణుని కాశీయాత్రను నివారించే మాటలు. –మాలిని.

**అ :** పరిహృత–భవ–పాశ ! శ్రీ+ఈశ ! శౌరే! మా యాహి. ఈశే త్వయి వ్రజతి (సతి) త్రిభువన–పరిగీతం సకలం తీర్థ–జాతం పృష్ఠతః ఆసీత్. స్పష్ట–యుష్మత్–చరణ–వరణ–భూమ్యాం త్వద్–అగ్రే తీర్థం క్వ అస్తి.

**ప్ర :** పరిహృత–భవ–పాశ! : పరిహృత = పరిహరింపబడిన, భవ = సంసారమనే, పాశ! = బంధనాలు గలవాడా! (పరిహృతాః భవస్య పాశాః యేన సః, తస్మాత్ సంబుద్ధిః), శ్రీ+ఈశ! = లక్ష్మీవల్లభా! (శ్రియః ఈశః, తస్మాత్ సంబుద్ధిః), శౌరే = కృష్ణా! మా యాహి = వెళ్ళవద్దు (యా ప్రాపణే–పరస్మైపది–లోట్–మ.ఏ.), ఈశే = ప్రభువు అయిన, త్వయి = నీవు, వ్రజతి (సతి) = వెళ్తుంటే, త్రి–భువన–పరిగీతమ్ : త్రిభువన = మూడులోకాలచే, పరిగీతమ్ = స్తుతింపబడిన, సకలమ్ = సమస్తమైన, తీర్థ–జాతమ్ = తీర్థసమూహం, పృష్ఠతః = వెనుకగా, స్పష్ట... భూమ్యామ్ : స్పష్ట = స్పష్టమైన, యుష్మత్ = నీయొక్క, చరణ = పాదాలయొక్క, వరణ = ఎంపికగలిగిన, భూమ్యామ్ = నేలపై, ఆసీత్ = వుంది. (అస భువి పరస్మైపది), త్వద్–అగ్రే = నీ ఎదుట, తీర్థమ్ = పవిత్రజలస్థానం, క్వ = ఎక్కడ, అస్తి? = వుంది? (అస భువి పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! లక్ష్మీవల్లభా! నీవు భావపాశాలను పరిహరింపగలవాడవు. వెళ్ళవద్దు. ప్రభువువైన నీవు వెళ్తుంటే త్రిలోకాలలోనూ ప్రసిద్ధికెక్కిన సకలతీర్థాలు నీ అడుగుల ముద్రలను గుర్తించి అవి పడిన నేలపై నీ వెనుకనే వున్నాయి. ఇక నీ ఎదురుగా తీర్థ మెక్కడుంది. (నీవు వెళ్ళి స్నానం చేయటానికి?)

**వి :** 1. సకలతీర్థాలు నీ వెనుకనే వున్నాయి కాబట్టి నీవు ముందుకు పోయినా నీ ముందు తీర్థ మెక్కడున్నదని ఒక భావం. నీ ముందు ఏ తీర్థం నిలవగలదు? నీవే మహాతీర్థం అని మరొక భావం. సకలనదీమతల్లి అయిన గంగయే నీ పాదాలనుండి పుట్టినప్పుడు ఇక నువ్వు స్నానం చేయగల పవిత్రతీర్థమెక్కడుంటుందని మరో భావం.

ఇది స్తుతిలా కనిపిస్తున్నా ఒక వాస్తవమే గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **యాహి :** | యాతు/యాతాత్ | యాతామ్ | యాన్తు |
| | **యాహి**/యాతాత్ | యాతమ్ | యాత |
| | యాని | యావ | యామ |
| **వ్రజతి :** | **వ్రజతి** | వ్రజతః | వ్రజన్తి |
| | వ్రజసి | వ్రజథః | వ్రజథ |
| | వ్రజామి | వ్రజావః | వ్రజామః |
| **అస్తి :** | **అస్తి** | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః. |

*

**శ్లో॥యర్హీశ! తే సకలతీర్థనిషేవణేచ్ఛా - తర్హి త్వదీయమునయః కిల తత్ర తత్ర ।**
**త్వాం స్నాపయన్తి జలమధ్యగతం వివేకైః - కుర్వన్తి తత్తవ కిమద్య విధేయమస్తి॥55**

**అ :** కృష్ణుని ప్రయాణాన్ని నివారించే మాటలు. -వసంతతిలక.

**అ :** ఈశ ! యర్హి తే సకల-తీర్థ-నిషేవణ-ఇచ్ఛా తర్హి త్వదీయ-మునయః తత్ర తత్ర త్వాం స్నాపయన్తి వివేకైః జల-మధ్య-గతం కుర్వన్తి కిల. తత్ తవ అద్య విధేయం కిమ్ అస్తి.

**ప్ర :** ఈశ ! = ప్రభూ, యర్హి = ఒకవేళ, తే = నీకు, సకల... చ్ఛా : సకల-తీర్థ = సర్వ తీర్థాలయందు, నిషేవణ = స్నానమాడుటలో, ఇచ్ఛా = కోరిక వుంటే (సకలాని చ తాని తీర్థాని, తేషు నిషేవణం తస్మిన్, ఇచ్ఛా), తర్హి = అప్పుడు, త్వదీయ-మునయః = నీ మునులు, తత్ర తత్ర = ఆయా తీర్థాలలో, త్వామ్ = నిన్ను, స్నాపయన్తి = స్నానమాడించ గలరు (అభిషేకాదులద్వారా) (స్నా శౌచే ణిచి-పరస్మైపది-లట్-ప్ర.బ.), వివేకైః = తమ విచారణలతో (ధ్యానాదులతో), జల-మధ్య-గతమ్ = నీటిమధ్యనిలిచిన వానినిగా (జలస్య మధ్యః, తస్మిన్ గతః, తమ్), కుర్వన్తి = చేస్తారు. (కృ కరణే పరస్మైపది-లట్-ప్ర.బ.), తత్ = అందువల్ల, తవ = నీకు, అద్య = ఇప్పుడు, విధేయమ్ = చేయదగినది, కిమ్-అస్తి? = ఏముంది? (అస భువి-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ప్రభూ! నీకు ఒకవేళ సమస్తతీర్థాలలో స్నానమాడాలని కోరిక అయితే నీ భక్తులైన మునులు నిన్ను ఆయా తీర్థాలలో అభిషేకరూపంలో స్నానమాడింపగలరు. తమ విచారణలతో నిన్ను నీటిమధ్య ముంచగలరు. ఇక ఇంకా నీవు చేయవలసిన దేముంది?

**వి :** 1. నారదమహర్షి అశేషతీర్థజలాలను కృష్ణుని శిరస్సుపై చల్లటాన్ని మాఘుడు చక్కగా వర్ణించాడు-

శ్లో॥ **అశేషతీర్థోపహృతాః** కమండలో - ర్నిధాయ పాణావృషిణాభ్యుదీరితాః ।
అఘౌఘవిధ్వంసవిధౌ పటీయసీ - ర్నతేన మూర్ధ్నా హరిరగ్రహీదపః ॥

నారదుని కమండలంలోనే సర్వతీర్థజలాలున్నాయి. అటువంటి మునుల విషయమే వధూపక్షం వారు ప్రస్తావించింది.

| | | | |
|---|---|---|---|
| 2. **స్నాపయన్తి :** | స్నాపయతి | స్నాపయతః | **స్నాపయన్తి** |
| | స్నాపయసి | స్నాపయథః | స్నాపయథ |
| | స్నాపయామి | స్నాపయావః | స్నాపయామః |
| **కుర్వన్తి :** | కరోతి | కురుతః | **కుర్వన్తి** |
| | కరోషి | కురుథః | కురుథ |
| | కరోమి | కుర్వః | కుర్మః |

అస్తి : 15-54వ శ్లోకవ్యాఖ్య చూడుదు. *

**శ్లో॥ యత్ర త్వదీయగుణకీర్తననర్తనాది**
**తత్రైవ తీర్థనికరాః కిల సంవసన్తి ।**
**యత్రార్పయన్తి సుజనాః సుకృతం సమస్తం**
**తస్యేశ! తే సకలమాకలయామి పూర్ణమ్ ॥** **15-56**

**అ :** కృష్ణుని ప్రయాణాన్ని నివారించే మాటలు స్తుతిరూపంగా. -వసంతతిలక.

**అ :** యత్ర త్వదీయ-గుణ-కీర్తన-నర్తన+ఆది తత్ర ఏవ తీర్థ-నికరాః సంవసన్తి కిల. ఈశ ! సుజనాః సమస్తం సుకృతం యత్ర అర్పయన్తి తస్య తే సకలం పూర్ణమ్ ఆకలయామి.

**ప్ర :** యత్ర = ఎక్కడైతే, త్వదీయ... నాది : త్వదీయ = నీయొక్క, గుణ = గుణాలయొక్క, కీర్తన = గానమూ, నర్తన = నృత్యమూ, ఆది = మొదలగునవి వుండునో (త్వదీయానాం గుణానాం కీర్తనం నర్తనం చ ఆదౌ యస్య తత్), తత్ర-ఏవ = అక్కడే, తీర్థ-నికరాః = తీర్థ సమూహాలు (తీర్థానాం నికరాః), సంవసన్తి కిల = వుంటాయి గదా! (సమ్ వస్ నివాసే పరస్మైపది-లట్-ప్ర.బ.), ఈశ!=ప్రభూ!, సుజనాః = మంచివారు, సమస్తమ్ = సంపూర్ణ మైన, సుకృతమ్ = పుణ్యాన్ని, యత్ర = ఎవనియందు, అర్పయన్తి = అర్పిస్తారో (ఋ గతౌ ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.బ.), తస్య తే = అటువంటి నీకు, సకలమ్ = అంతా, పూర్ణమ్ = ముగిసినట్లుగా, ఆకలయామి = భావిస్తున్నాను. (ఆ-కల క్షేపే-చురాది-పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** కృష్ణా! ఎక్కడ నీ గుణకీర్తన, దానికి తగిన నృత్యం మొదలయినవి సాగుతుంటాయో అక్కడ సకలతీర్థాలూ నివసిస్తాయి. సజ్జనులు తమ సమస్తసుకృతాన్ని ఎవరియందు సమర్పిస్తారో అటువంటి నీకు సకలకృత్యాలు పరిపూర్ణాలయినట్లు భావిస్తున్నాను.

**వి :** 1. శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైర్వా - బుద్ధ్యాత్మనా వానుసృత స్వభావాత్ ।
కరోతి యద్యత్సకలం పరస్మై - నారాయణాయేతి సమర్పయేత్తత్ ॥ - భాగవతమ్ 11/2/36

దీన్నే కొంచెం మార్చి వా ప్రకృతేః (వానుసృత) కరోమి (కరోతి) సమర్పయామి (సమర్పయేత్తత్) అని ఉత్తమపురుషలో చెప్తూ సమస్తాన్నీ నారాయణసమర్పణ చేస్తాం సంధ్యావందనం ముగింపులో.

శ్లో॥ ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్ ।
**సర్వదేవనమస్కారః కేశవం** ప్రతిగచ్ఛతి ॥

ఈ రీతిగా సజ్జనులు సమస్తాన్నీ నారాయణార్పణ చేస్తుంటారు. ఆ సుకృతాలన్నీ ఆయన దగ్గర ప్రోగులై వుంటాయి గదా!

| | | | |
|---|---|---|---|
| 2. **సంవసన్తి :** | సంవసతి | సంవసతః | **సంవసన్తి** |
| | సంవససి | సంవసథః | సంవసథ |
| | సంవసామి | సంవసావః | సంవసామః |
| **ఆకలయామి :** | ఆకలయతి | ఆకలయతః | ఆకలయన్తి |
| | ఆకలయసి | ఆకలయథః | ఆకలయథ |
| | **ఆకలయామి** | ఆకలయావః | ఆకలయామః. |

*

**శ్లో॥ గఙ్గాదితీర్థనికరాః కిల యత్పదాబ్జ-సఙ్గాత్ పునన్తి భువి తానపి పావయన్తి ।**
**అఙ్గానుషఙ్గకరణాద్భవదన్తరఙ్గాః - కిం గాహనేన తవ తీర్థచయేషు తస్య ॥15-57**

**అ :** కృష్ణ మాహాత్మ్యాన్ని ప్రకటిస్తూ ప్రయాణాన్ని నివారించే మాటలు. -వసంతతిలక.

**అ :** గంగా+ఆది-తీర్థ-నికరాః యత్-పద+అబ్జ-సంగాత్ పునన్తి తాన్ అపి భవద్-అంతరంగాః అంగ+అనుషంగ-కరణాత్ భువి పావయన్తి. తస్య తవ తీర్థ-చయేషు గాహనేన కిమ్?

**ప్ర :** గంగా... నికరాః : గంగా+ఆది = గంగ మొదలుగా గల, తీర్థ-నికరాః = తీర్థ సమూహాలు (గంగా ఆతౌ యేషాం తే తే చ తౌ తీర్థానాం నికరాః), యత్... సంగాత్ : యత్ = ఎవనియొక్క, పదా+అబ్జ = పాదపద్మాలయొక్క, సంగాత్ = చేరిమిచే (యస్య పదే ఏవ అబ్జే, తయోః సంగః, తస్మాత్), పునన్తి = పవిత్ర మవుతున్నాయో (పూ పవనే-క్ర్యాది-పరస్మైపది-లట్-ప్ర.బ.), తాన్-అపి = వాటిని కూడా, భవద్-అంతరంగాః = నీ భక్తులు (నిన్ను) మనస్సులో నింపుకొన్న వారు (భవాన్ అంతరంగే యేషాం తే), అంగ... కరణాత్ : అంగ = శరీరంతో, అనుషంగ = కలయికను, కరణాత్ = చేయటంవల్ల (అంగేన అనుషంగః, తస్య కరణం, తస్మాత్), భువి = లోకంలో, పావయన్తి = పవిత్రం చేస్తున్నాయి. (పూ పవనే-క్ర్యాది-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), తస్య-తవ = అటువంటి నీకు, తీర్థ-చయేషు = తీర్థసమూహాలలో (తీర్థానాం చయాః, తేషు), గాహనేన = మునుగుటతో, కిమ్? = ఏం లాభం?

**తా ॥** గంగ మొదలయిన పుణ్యతీర్థసమూహాలు నీ పాదస్పర్శతో పవిత్రమవుతున్నాయి. అటువంటి గంగాదులను కూడా నిన్ను మనస్సులో నిలుపుకొన్న భక్తులు నీ శరీరసంబంధం వల్ల పవిత్రం చేయగలుగుతున్నారు. ఇక నువ్వు అటువంటి తీర్థాలలో స్నానం చేయటం వల్ల ప్రయోజనమేముంది?

**వి :** 1. గంగాది తీర్థాలు విష్ణువుయొక్క పదాబ్జ (శరీర) స్పర్శ. భక్తులకు (ఋషులకు) నారాయణునితో అంతరంగస్పర్శ. కాబట్టి శరీరస్పర్శగల గంగాదులను కూడా తాము పవిత్రీకరింపగలుగుతున్నారు.

ఇది సారాలంకారం. విష్ణువు గంగాదులు భక్తులు (మునులు). ఒకరిని మించిన పవిత్రత మరొకరిలో ప్రదర్శించినందువల్ల ఇది సారాలంకారం. '**ఉత్తరోత్తరముత్కర్షః సార ఇత్యభిధీయతే**' - (కు. 108)

| | | | |
|---|---|---|---|
| 2. **పునన్తి :** | పునాతి | పునీతః | **పునన్తి** |
| | పునాసి | పునీథః | పునీథ |
| | పునామి | పునీవః | పునీమః |
| **పావయతి :** | **పావయతి** | పావయతః | పావయన్తి |
| | పావయసి | పావయథః | పావయథ |
| | పావయామి | పావయావః | పావయామః. |

*

**శ్లో॥ యద్రోమకూపమపి పూరయితుం న శేకు-**
**ర్బ్రహ్మాణ్డఖర్పరశతాయుతకోటయోఽపి ।**
**గఙ్గాఽపి యచ్చరణసన్నఖసేకమాత్రం**
**తత్ క్వాస్తి మజ్జనవిధౌ తవ తీర్థముర్వ్యామ్ ॥ 15-58**

**అ :** కృష్ణమహత్త్వవర్ణన పురస్సరంగా ప్రయాణాన్ని నివారించే పలుకులు. -వసంతతిలక.

**అ :** బ్రహ్మ+అండ-ఖర్పర-శత+అయుత-కోటయః అపి యద్-రోమ-కూపమ్ అపి పూరయితుం న శేకుః గంగా అపి యత్+చరణ-సత్-నఖ-సేకమాత్రం తత్ తవ మజ్జన-విధౌ ఉర్వ్యాం తీర్థం క్వ అస్తి.

**ప్ర :** బ్రహ్మాండ... కోటయః-అపి : బ్రహ్మ+అండ-ఖర్పర = బ్రహ్మాండమనే భాండాలయొక్క, శత+ఆయుత-కోటయః అపి = పదిలక్షల కోట్లు అయినా, యత్ = ఎవనియొక్క, రోమ-కూపమ్ = వెంట్రుక రంధ్రాన్ని, పూరయితుమ్ = నింపటానికి, న శేకుః = సమర్థాలు కావో (చాలవో), (శక్ శక్తౌ-స్వాది-పరస్మైపది-లిట్-ప్ర.బ.), గంగా అపి = గంగ కూడా, యచ్చ... మాత్రమ్ : యత్ = ఎవనియొక్క, చరణ = కాలియొక్క, సత్ = నిర్మలమైన, నఖ = గోటిని, సేకమాత్రమ్ = తడుపుట మాత్రమే (చేయగలదో) (యస్య చరణస్య సన్ చ అసౌ నఖః, తస్య కేవలం సేకః), తత్ = కాబట్టి, తవ = నీకు, మజ్జన-విధౌ = స్నానవిధికి తగిన (మజ్జనస్య విధిః, తస్మిన్), తీర్థమ్ = తీర్థం, ఉర్వ్యామ్ = భూమిపై, క్వ = ఎక్కడ, అస్తి = ఉంది? (అస భువి పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణా! పదిలక్షలకోట్ల బ్రహ్మాండాలైనా నీ వెంట్రుక పుట్టడానికి ఆధారమైన రంధ్రాన్ని పూడ్చలేవు. గంగానది కూడా నీ పాదనఖాన్ని కేవలం తడపగలదు. అటువంటి నీవు స్నాన మాడటానికి తగిన తీర్థం భూమిపై ఎక్కడుంది?

**వి :** 1. కృష్ణుని రోమకూపం ఆధారం. పదిలక్షల కోట్ల బ్రహ్మాండాలు ఆధేయం. ఒక బ్రహ్మాండమే సాధారణంగా ఒక రోమకూపంకన్న లెక్కకు అందనంత పెద్దది. అటువంటివి పదిలక్షలకోట్లు కూడా రోమకూపాన్ని నింపలేవని వర్ణించటం అధికాలంకారం. '**పృథ్వాధేయాద్యదాధారాధిక్యం తదపి సమ్మతమ్**' - (కు.96)

గంగా విషయం కూడా అంతే. ఆ కృష్ణుని గోటినుండి పుట్టి విస్తరించిందది. కానీ ఆ గోటిని తడపటానికి మాత్రమే పరిమితం కావటం ఆధారాధిక్య వర్ణనమే.

| | | | |
|---|---|---|---|
| 2. **శేకుః :** | శశాక | శేకతుః | **శేకుః** |
| | శేకిథ | శేకథుః | శేక |
| | శశాక/శశక | శేకివ | శేకిమ |

**అస్తి :** 15-54వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ భ్రూకాశీం వరనాభిమానసవతీం హారావళీజాహ్నవీం**
**నీవీదివ్యసరస్వతీం ప్రవిలసద్రోమాలిసూర్యాత్మజామ్ ।**
**కాఞ్చీశోభికటిం కుచోచ్చబదరీం నేత్రాన్తయుగ్మప్రభా-**
**కావేర్యన్తరగాస్యచన్ద్రసరసీం యాత్రాఽస్తు భైష్మీం ప్రతి ॥ 15-59**

**అ :** భీష్మపుత్రిని సేవించటమే సకలతీర్థసేవనమని కవి ప్రతిపాదన వధూపక్షం వారి ద్వారా. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** భ్రూ-కాశీం వర-నాభి-మానసవతీం హార+ఆవళీ-జాహ్నవీం నీవీ-దివ్య-సరస్వతీం ప్రవిలసద్-రోమ+ఆలి-సూర్య+ఆత్మజాం కాంచీ-శోభి-కటిం కుచ+ఉచ్చ-బదరీం నేత్ర+ అంత-యుగ్మ-ప్రభా-కావేరీ+అంతర-గ+ఆస్య-చంద్ర-సరసీం భైష్మీం ప్రతి యాత్రా అస్తు.

**ప్ర :** భ్రూ-కాశీమ్ : భ్రూ = కనుబొమలనే, కాశీమ్ = కాశీ గలదీ (భ్రూః ఏవ కాశీ యస్యాస్తామ్), వర-వతీమ్ : వర = శ్రేష్ఠమైన, నాభి = బొడ్డు అనే, మానసవతీమ్ = మానససరోవరం గలదీ (వరః నాభిరేవ మానసమ్ అస్యాః అస్తి ఇతి, తామ్), హారా... వీమ్ : హార = ముత్యాలసరాలయొక్క, ఆవళీ = పేటలు అనే, జాహ్నవీమ్ = గంగానదిగలదీ (హారాణామ్ ఆవళీ ఏవ జాహ్నవీ యస్యాస్తామ్), నీవీ-దివ్య-సరస్వతీమ్ : నీవీ = కోకముడి అనే, దివ్య = ఒప్పిదమైన, సరస్వతీమ్ = సరస్వతి గలదీ (నీవీ ఏవ దివ్యా సరస్వతీ యస్యాస్తామ్), ప్రవిల... జామ్ : ప్రవిలసత్ = ప్రకాశిస్తున్న, రోమ+ఆలి = వెంట్రుకల వరుస అనే, సూర్య+ఆత్మజామ్ = యమున గలదీ (ప్రవిలసన్తీ రోమ్ణామ్ ఆలిః ఏవ

సూర్యస్య ఆత్మజా యస్యాస్తామ్), కాంచీ-శోభి-కటిమ్ : కాంచీ = మొలనూలితో, శోభి = ప్రకాశిస్తున్న, కటిమ్ = కటి ప్రదేశం గలదీ (కాంచ్యా శోభినీ కటిః యస్యాస్తామ్), కుచ+ఉచ్చ-బదరీమ్ : కుచ = రొమ్ములనే, ఉచ్చ = ఎత్తైన, బదరీమ్ = రేగుపండ్లు (బదరి) గలదీ (కుచౌ ఏవ ఉచ్చే బదర్యౌ యస్యాః తామ్), నేత్రా... సరసీమ్ : నేత్ర = కళ్ళయొక్క, అంత = కొనలయొక్క, యుగ్మ = జతయొక్క, ప్రభా = కాంతి అనే, కావేరీ+అంతర-గ = కావేరి పాయల మధ్యనున్న, ఆస్య = ముఖమనే, చంద్ర-సరసీమ్ = చంద్రసరస్సు గలదీ అయిన (నేత్రయోః అంతయోః యుగ్మయోః ప్రభే ఏవ కావేర్యాః అంతరం మధ్యం గచ్ఛతీతి - తత్ ఆస్యమేవ చంద్రసరసీ యస్యాస్తామ్), భైష్మీం ప్రతి = రుక్మిణిని గూర్చి, యాత్రా = (నీ) కాశీయాత్ర, అస్తు = ఉండుగాక! (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** తీర్థయాత్ర తప్పదంటే నువ్వు రుక్మిణి దగ్గరకే నడు. ఆమె యందే అన్ని తీర్థాలు ఉన్నాయి. ఆమె కనుబొమలే కాశి (ఆకారాన్ని బట్టి), నాభియే మానససరస్సు (లోతును బట్టి). ముత్యాలహారాలే గంగ (తెల్లని రంగును బట్టి). నీవియే సరస్వతి. (పసిమిని బట్టి ఆమె పీతాంబరధారిణి). ఆమె కటి కాంచితో ప్రకాశిస్తుంది. ఆమె స్తనాలే బదరీ ఫలాలు. ఆమె కనుకొనల కాంతి కావేరియొక్క రెండు పాయలు. ఆ మధ్యనున్న ముఖం చంద్ర సరస్సు.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. అస్తు :** | **అస్తు/స్తాత్** | స్తామ్ | సన్తు | |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త | |
| | అసాని | అసావ | అసామ. | * |

**శ్లో॥ క్షేత్రే త్వమస్మిన్ పరిగృహ్య భైష్మ్యాః**
**పాణిం జగత్యప్రతిమం తదేతత్ ।**
**తీర్థం విధేహీశ! న కృష్ణ! యాత్రాం**
**వ్యాప్తస్య తే సంప్రతి నన్దయామః ॥ 15-60**

**అ :** కృష్ణుని కాశీయాత్రను వధూపక్షం వారు నివారించటం. -ఇంద్రవజ్ర.

**అ :** ఈశ ! అస్మిన్ క్షేత్రే త్వం భైష్మ్యాః పాణిం పరిగృహ్య తద్ ఏతత్ తీర్థం జగతి అప్రతిమం విధేహి. కృష్ణ! సంప్రతి వ్యాప్తస్య తే యాత్రాం న నందయామః

**ప్ర :** ఈశ! = ప్రభూ!, అస్మిన్ = ఈ, క్షేత్రే = మూలమాధవక్షేత్రంలో, త్వమ్ = నీవు, భైష్మ్యాః = రుక్మిణియొక్క (భీష్మస్య అపత్యం స్త్రీ తస్యాః), పాణిమ్ = చేతిని, పరిగృహ్య = పట్టి, తత్-ఏతత్ = ఈ, తీర్థమ్ = తీర్థాన్ని (రుక్మిణి సర్వతీర్థస్వరూప కాబట్టి ఆమె వివాహం ఈ ప్రదేశాన్ని తీర్థం చేస్తుంది.), జగతి = లోకంలో, అప్రతిమమ్ = సాటిలేని దానినిగా (నాస్తి ప్రతిమా యస్య తత్), విధేహి = చేయి. కృష్ణ = కృష్ణా! సంప్రతి = ఇప్పుడు, వ్యాప్తస్య = (విశ్వమంతా) వ్యాపించివున్న, తే = నీయొక్క, యాత్రామ్ = యాత్రను, న నందయామః = ఒప్పుకోము (నంద్ సమృద్ధౌ-పరస్మైపది-లట్-ఉ.బ.)

**తా ॥** కృష్ణా! ప్రభూ! ఈ మూలమాధవక్షేత్రం లోనే నీవు రుక్మిణి పాణిగ్రహణం చేసి ఈ తావును జగతిలో అసమానమైన తీర్థాన్ని చేయి. వ్యాపనశీలుడవైన నీ యాత్రను మేము ఇప్పుడంగీకరింపము.

**వి :** 1. శ్లో॥ యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపి వా ।
అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ॥ - పురుషసూక్తమ్.

ఆ రీతిగా మొత్తంగ వ్యాపించివున్న నారాయణుడు ఇక ఎక్కడి కని యాత్ర చేయగలడు?

| | | | | |
|---|---|---|---|---|
| 2. **విధేహి :** | దధాతు/దత్తాత్ | దత్తామ్ | దధతు | |
| | **ధేహి**/ధత్తాత్ | ధత్తామ్ | ధత్త | |
| | దధాని | దధావ | దధామ | |
| **నందయామః :** | నందయతి | నందయతః | నందయన్తి | |
| | నందయసి | నందయథః | నందయథ | |
| | నందయామి | నందయావః | **నందయామః.** | * |

**శ్లో॥ నిత్యం నిజోరుస్థితభీష్మపుత్రీ-నృత్యద్ఘనోత్తుఙ్గకుచగ్రహస్య ।**
**ప్రత్యూహశాన్తీరివ కాంక్షమాణ-శ్చక్రే స శౌరిర్ గ్రహశాన్తికర్మ ॥ 15-61**

**అ :** కృష్ణుడు గ్రహశాంతి కర్మను చేయటం (నవగ్రహారాధన) -ఇంద్రవజ్ర.

**అ :** సః శౌరిః నిత్యం నిజ+ఊరు-స్థిత-భీష్మ-పుత్రీ-నృత్యద్-ఘన+ఉత్తుంగ-కుచ-గ్రహస్య ప్రత్యూహ-శాంతీః కాంక్షమాణః ఇవ గ్రహ-శాంతి-కర్మ చక్రే.

**ప్ర :** సః = ఆ, శౌరిః = కృష్ణుడు (శూరస్య అపత్యం పుమాన్), నిత్యమ్ = ఎల్లప్పుడూ, నిజో... గ్రహస్య : నిజ = తనయొక్క, ఊరు = తొడలపై, అవస్థిత = వున్నట్టి, భీష్మ-పుత్రీ = రుక్మిణియొక్క, నృత్యత్ = నర్తిస్తున్న, ఘన = గట్టివైన, ఉత్తుంగ = ఎత్తైన, కుచ = రొమ్ములయొక్క, గ్రహస్య = పట్టుటలో, ప్రత్యూహ-శాన్తీః = విఘ్నశాంతిని, కాంక్షమాణః ఇవ = కోరుతున్నట్లుగా (కాంక్ష్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), గ్రహ-శాంతి-కర్మ = నవగ్రహశాంతికర్మ, చక్రే = చేశాడు. (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు నవగ్రహశాంతి కర్మను ఆచరించాడు. ఎందుకంటే నిరంతరమూ తన తొడలపై నున్న రుక్మిణియొక్క నర్తనమాడుతున్న స్తనాలను పట్టుకోవటంలో విఘ్నాలు కలుగకూడదని విఘ్నశాంతి చేయడానికట.

**వి :** 1. నవగ్రహశాంతికర్మను వ్యవహారంలో కేవలం నవగ్రహ అని చాలా ప్రాంతాలలో అంటారు. దీన్ని దాదాపు స్నాతకానికి ముందే చేసికొంటారు తదంగంగా కానీ విడిగా కానీ... ఇది అనుబంధకార్యక్రమమే కాని విధిగా నిర్వహింపవలసినదేమీ కాదు.

2. చక్రే- ధాతువును ఆత్మనేపదిగా వాడటంలో అందముంది. కృ ధాతువు ఉభయపది. ఞిత్తు. '**స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే**' (అష్టాధ్యాయి 1-3-78) అనే సూత్రంతో క్రియాఫలం కర్తకు చెందేటట్లయితే ఞిత్తు అయిన ధాతువు ఆత్మనేపది అవుతుంది. ఇక్కడ విఘ్నశాంతి కర్మ క్రియ. తత్ఫలం నిర్విఘ్నంగా రుక్మిణీ కుచగ్రహణం. అది కృష్ణునకే చెందింది. కృష్ణుడు అభిలషిస్తున్నది కూడా. కాబట్టి ఇక్కడ ఆత్మనేపదిగా ఆ ధాతువును వాడటంలో ఔచిత్యముంది.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే | |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే | |
| | చక్రే | చకృవహే | చకృమహే. | * |

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**

**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సర్గః పఞ్చదశో ముదామయమభూత్ స్వర్గీశ్వరాణాం కులే ॥ 15-62**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** అయమ్ = ఈ, పంచదశః సర్గః = పదిహేనవ సర్గ, స్వర్గి+ఈశ్వరాణామ్ = దేవతలయొక్క, కులే = సమూహమందు, ముదామ్ = ఆనందాలకై, అభూత్ = నిలిచింది.

ఇతి శ్రీవాదిరాజతీర్థ ప్రణీత రుగ్మిణీశవిజయే పంచదశః సర్గః.

ఇది శ్రీమత్కవికులతిలకశ్రీమద్వాదిరాజతీర్థశ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పదిహేనవసర్గ.

**శ్రీః**





# శ్రీః

# షోడశః సర్గః

**శ్లో॥ స్వయంవరసముద్యోగే స్వయమ్భుప్రముఖాన్ సురాన్ ।**
**సమాగతాన్ సమీక్ష్యేత్థం బభాషే రుక్మిణీం సఖీ ॥** **16-1**

**అవతారిక :** రుక్మిణీస్వయంవరం-సఖిని రుక్మిణికి రాజులకు పరిచయం చేయటానికి ప్రారంభించటం. (ఇదంతా రుక్మిణి ఊహగా మనం భావించాలి.) -పథ్యావక్త్రమ్.

**అన్వయక్రమం :** స్వయంవర-సముద్యోగే సమాగతాన్ స్వయంభు-ప్రముఖాన్ సురాన్ సమీక్ష్య సఖీ ఇత్థం రుక్మిణీం బభాషే.

**ప్రతిపదార్థం :** స్వయం... ద్యోగే : స్వయమ్ = సొంతంగా, వర = వరించుట అను, సముద్యోగే = ప్రయత్నమందు (స్వయం వరే సముద్యోగః, తస్మిన్), సమాగతాన్ = వచ్చినట్టి, స్వయంభు-ప్రముఖాన్ = బ్రహ్మ మొదలుగా గల (స్వయం భవతీతి స్వయంభుః సః ప్రముఖః యేషు, తాన్), సురాన్ = దేవతలను, సమీక్ష్య = చూసి (చూపి), సఖీ = చెలి (రుక్మిణి బుద్ధియే), ఇత్థమ్ = ఇలా, రుక్మిణీమ్ = రుక్మిణితో, బభాషే = పలికింది. (భాష వ్యక్తాయాం వాచి-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తాత్పర్యం ॥** స్వయంవరప్రయత్నంలో వున్న రుక్మిణికి స్వయంవరానికి వచ్చిన బ్రహ్మాది దేవతలను చూపి సఖి ఇలా చెప్పింది.

**విశేషాలు :** 1. రుక్మిణికి సంబంధించి స్వయంవరాన్ని ఏర్పాటుచేసి, సభ చేయటం వంటి వాటికి అవకాశమే లేదు. కాబట్టి ఇదంతా రుక్మిణి ఊహలకు సంబంధించిన విషయం. ఇక్కడ సఖి కూడా రుక్మిణి బుద్ధియే. ఇదే సర్గలోని 17వ శ్లోకంలో ఆ విషయం స్పష్ట మవుతుంది.

క్షత్రియకాంతల విషయంలో స్వయంవర మన్నది ఒకనాటి ఆచారం. స్త్రీకి తనకు నచ్చిన వారిని స్వేచ్ఛగా భర్తగా ఎన్నుకొనే అవకాశముండేది. క్రమక్రమంగా స్త్రీలకు ఆ స్వాతంత్ర్యాన్ని లేకుండా చేసింది సమాజం. ఈ స్థితి చాలాకాలం నుండీ కొనసాగుతోంది వర్ణభేదం లేకుండా. ఇప్పుడిప్పుడే కొంచెం మార్పు కనిపిస్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **బభాషే :** | **బభాషే** | బభాషాతే | బభాషిరే |
| | బభాషిషే | బభాషాథే | బభాషిధ్వే |
| | బభాషే | బభాషివహే | బభాషిమహే. |

*

**శ్లో॥ కల్పాదివార్ష్ణు కమనీయఫణీన్ద్రతల్పే**
**లక్ష్మ్యా సహాదిపురుషస్య కృతాలయస్య ।**
**ముక్తౌఘసేవితపదః కిల నాభిదేశాత్**
**పద్మం పురాఽజని తతః సఖి! పద్మయోనిః ॥ 16-2**

**అ :** విష్ణునాభికమలంనుండి బ్రహ్మపుట్టుకను వివరించటం. -వసంతతిలక.

**అ :** సఖి! పురా కల్ప+ఆది-వార్ష్ణు కమనీయ-ఫణీ+ఇంద్ర-తల్పే లక్ష్మ్యా సహ కృత+ఆలయస్య ముక్తా+ఓఘ-సేవిత-పదః ఆది-పురుషస్య నాభి-దేశాత్ పద్మమ్ అజని కిల. తతః పద్మ-యోనిః (అజని).

**ప్ర :** సఖి! = చెలీ!, పురా = గతంలో, కల్ప+ఆది-వార్ష్ణు : కల్ప = బ్రహ్మకల్పంయొక్క, ఆది = మొదటనున్న, వార్ష్ణు = నీటిలో (ప్రలయకాలజలంలో) (కల్పస్య ఆదిః, తస్య వారీణి, తేషు), కమనీయ... తల్పే : కమనీయ = అందమైన, ఫణీంద్ర = ఆదిశేషుడనే, తల్పే = పక్కపై (కమనీయం చ తత్, ఫణీంద్రః ఏవ తల్పం, తస్మిన్), లక్ష్మ్యా సహ = లక్ష్మితో కూడి, కృత+ఆలయస్య = నివసిస్తున్నవాడూ (కృతః ఆలయః యేన తస్య), ముక్తౌ... పదః : ముక్తా = ముత్యాలయొక్క, ఓఘ = సమూహంచే, సేవిత = సేవింపబడిన, పదః = పాదాలు గలవాడూ అయిన (ముక్తానామ్ ఓఘః, తేన సేవితౌ పాదౌ యస్య తస్య), ఆది-పురుషస్య = పురాణపురుషుడైన నారాయణునియొక్క (ఆదిశ్చ అసౌ పురుషః, తస్య), నాభి-దేశాత్ = బొడ్డునుండి, పద్మమ్ = తామర, అజని = పుట్టింది. (జనీ ప్రాదుర్భావే ఆత్మనేపది-లుజ్-(ప్ర.ఏ.), తతః = దానినుండి, పద్మ-యోనిః = బ్రహ్మ (పద్మం యోనిః యస్య సః), (అజని = పుట్టాడు.)

**తా ॥** ప్రళయకాలం ముగిసిన తర్వాత కల్పప్రారంభకాలంలో లక్ష్మితో కలిసి ఆదిశేషునిపై శయనించి వుండగా ముత్యాలు సేవిస్తున్న పాదాలుగల ఆ ఆదిపురుషుని నాభికమలం నుండి ఒక పద్మం పుట్టిందిగదా! దానినుండి బ్రహ్మ పుట్టాడు.

**వి :** 1. బ్రహ్మ విష్ణునాభికమలంనుండి పుట్టిన విషయాన్ని పురాణాలు ప్రస్తావించాయి.

శ్లో॥ **త్వన్నాభికమలాద్బ్రహ్మా భవిష్యతి** ప్రజాపతిః ।
స కర్తా సర్వలోకస్య రజోగుణసమన్వితః ॥ - దేవీభాగవతమ్ - 1/16/4

దేవి విష్ణువుతో పలికిన మాట అది. ఇంకా ఇతర పురాణాలలో కూడా ఈ ప్రస్తావన కనిపిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **అజని :** | **అజని/అజనిష్ట** | అజనిషాతామ్ | అజనిషత |
| | అజనిష్ఠాః | అజనిషాథామ్ | అజనిధ్వమ్ |
| | అజనిషి | అజనిష్వహి | అజనిష్మహి. |

*

**శ్లో॥ ఆత్మాభిధః స్వయమితి ప్రథితో హ్యవాచ్య-**
**స్తాతోఽస్య యన్మురరిపుస్తదముం మునీన్ద్రాః ।**
**ఖ్యాత్యా స్వయమ్భువమజం విదురాత్మయోనిం**
**చేతఃస్థితశ్రుతితతిం సఖి! వేదగర్భమ్ ॥ 16-3**

**అ :** బ్రహ్మ మహత్త్వానికి మూలం విష్ణుపుత్రుడు కావటమే అని వివరించటం. -వసంతతిలక.

**అ :** యత్ ఆత్మా+అభిధః స్వయమ్ ఇతి ప్రథితః అ-వాచ్యః ముర-రిపుః అస్య తాతః తత్ ముని+ఇంద్రాః ఖ్యాత్యా అముం స్వయం-భువమ్ అజమ్ ఆత్మ+యోనిం చేతః+స్థిత-శ్రుతి-తతిం వేద-గర్భం విదుః.

**ప్ర :** యత్ = ఏ కారణంవలన, ఆత్మా+అభిధః = పరమాత్మ అని పేరు గలవాడూ (ఆత్మా జీవే ధృతౌ దేహే స్వభావే

పరమాత్మని, వైజయన్తీ-పుంలింగ-12), స్వయమ్ ఇతి = స్వయం అని, ప్రథితః = పేరుగలవాడు (స్వయమ్ అన్నది బ్రహ్మకూ, శివునికీ కూడా పేరు. The Practical Sanskrit English Dictionary-V.S.Apte-P.1160), అవాచ్యః = 'అ' పదంతోచెప్పబడేవాడు అయిన (అః స్యాద్ బ్రహ్మణి విష్ణీశ కూర్మాంకణరణేషు చ - నానార్థమంజరీ-పంక్తి 11) (అ ఇతి శబ్దేన వాచ్యః), ముర-రిపుః = కృష్ణుడు (మురస్య రిపుః), అస్య = ఈయనకు, తాతః హి = తండ్రి గదా!, తత్ = అందువల్ల, ముని+ఇంద్రాః = ఋషిశ్రేష్ఠులు, ఖ్యాత్యా = పేరునుబట్టి, స్వయంభువమ్ = స్వయంభువునిగా (స్వయం భూః యస్య, తమ్), అజమ్ = అజునిగా (అత్ జాతః అజః, తమ్), ఆత్మ-యోనిమ్ = ఆత్మయోనిగా (ఆత్మా యోనిః యస్య తమ్), అముమ్ = ఆయనను, విదుః = తెలిసికొంటున్నారు. (విద జ్ఞానే-అదాది-పరస్మైపది-లట్-ప్ర.బ.), సఖి! = చెలీ, చేతః... తతమ్ : చేతః = మనస్సులో, స్థిత = వున్నట్టి, శ్రుతి = వేదాలయొక్క, తతిమ్ = సముదాయం గలవాడని, వేద-గర్భమ్ = వేదగర్భునిగా (వేదాః గర్భే యస్య, తమ్), (విదుః = తెలిసికొంటున్నారు.) (విద జ్ఞానే-అదాది-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** నారాయణుడికి ఆత్మ అనీ, స్వయం అనీ, 'అ' అని కూడా పేరు. ఆయన ఈ బ్రహ్మకు తండ్రి. కాబట్టి మునిశ్రేష్ఠులు ఈ బ్రహ్మను పేరునుబట్టి స్వయంభువు అనీ, అజుడనీ, ఆత్మయోని అనీ గ్రహిస్తారు. ఈయన మనస్సులో ఆ నారాయణునికి మూలమైన వేదరాశి వుండటం వల్ల ఈయనను వేదగర్భుడని కూడా అంటారు.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **విదుః :** | వేద | విదతుః | విదుః |
| | వేత్థ | విదథుః | విద |
| | వేద | విద్వ | విద్మ. |

*

**శ్లో॥ మహోర్మిసజ్ఘాతశతాతతామ్భ-స్యదృష్టసద్విష్టరపద్మమూలః ।**
**విధిర్విధిజ్ఞో విజితాక్షవృత్తి-స్తపః స తేపే పితరం దిదృక్షుః ॥ 16-4**

**అ :** బ్రహ్మ తన ఆసనమైన పద్మంయొక్క మూలం తెలిసికోవడానికి తపస్సు చేయటం.

**అ :** మహా+ఊర్మి-సంఘాత-శత-ఆతత+అంభసి అదృష్ట-సద్-విష్టర-పద్మ-మూలః విధిజ్ఞః విజిత+అక్ష-వృత్తిః సః విధిః పితరం దిదృక్షుః తపః తేపే.

**ప్ర :** మహోర్మి... తాంభసి : మహా+ఊర్మి = గొప్ప అలలయొక్క, సంఘాత = సమూహాలయొక్క, శత = వందలచేత, ఆతత = వ్యాపించిన, అంభసి = నీటిలో (మహాన్తశ్చ తే ఊర్మయః, తేషాం సంఘాతః, తేషాం శతాని, తైః ఆతతం చ తద్ అంభః, తస్మిన్), అదృష్ట... మూలః : అదృష్ట = కనబడని, సద్-విష్టర = (తన) మంచి ఆసనమైన, పద్మ = తామరలయొక్క, మూలః = మొదలు (కారణం)గలవాడూ, (అదృష్టం సచ్చ తద్ విష్టరం, తచ్చ తత్ పద్మం, తస్య మూలం యేన సః), విధి-జ్ఞః = (దానికి), తగిన కర్తవ్యం తెలిసినవాడూ (విధిం జానాతి ఇతి), విజిత+అక్ష-వృత్తిః : విజిత = గెలువబడిన, అక్ష = ఇంద్రియాలయొక్క (ఇంద్రియం త్వక్ష రేతసోః-నానార్థరత్నమాలా-పంక్తి 1844), వృత్తిః = ప్రవృత్తి గలవాడూ అయిన (విజితా అక్షాణాం వృత్తిః యేన సః), సః విధిః = ఆ బ్రహ్మ, పితరమ్ = తండ్రిని, దిదృక్షుః (సన్) = చూడగోరినవాడై (ద్రష్టుమిచ్ఛుః), తపః = తపస్సును, తేపే = తపించాడు (చేశాడు) (తప దాహే ఐశ్వర్యే వా-దివాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** వందల కొలదిగ అలల సమూహాలుగల ఆ సాగరజలంలో తన సుఖాసనమైన తామరయొక్క మూలం కనిపించకపోవటంతో తండ్రిని చూడగోరి కర్తవ్య మెరిగిన ఆ బ్రహ్మ ఇంద్రియప్రవృత్తులను జయించి (అదుపులో నిలుపుకొని) తపస్సు చేశాడు.

**వి :** బ్రహ్మకు పద్మమూలం కనబడనందువల్ల సృష్టినిర్మాణంపై మనసు నిలువలేదు. ఆ సమయంలో-

'జలమధ్యంబుననుండి యక్షరసమామ్నాయంబున స్పర్శంబులందు షోడశాక్షరంబును మఱియు నేకవింశాక్షరంబు నైన నీ యక్షరద్వయంబువలన నగుచు, మహామునిజనధనంబైన **తప** యను శబ్దంబు రెండుమారులుచ్చరింపంబడి వినంబడిన, నట్టి శబ్దంబు పలికిన పురుషుని వీక్షింపగోరి నలుదిక్కులకుం జని వెదకి యెందునుం గానక, మరలి నిజాస్థానంబైన పద్మంబు నందాసీనుండై యొక్కించుక చింతించి యట్టి శబ్దంబు దన్నుఁ దపంబు సేయుమని నియమించుటగాఁ దలఁచి" (పోతనభాగవతము 2/226) తపస్సు చేశాడు. బ్రహ్మ.

తపస్సు చేసేవాడు స్వయంవరానికి తగడని సఖి ఆలోచన కాబోలు–

| | | | |
|---|---|---|---|
| 2. **తేపే :** | **తేపే** | తేపాతే | తేపిరే |
| | తేపిషే | తేపాథే | తేపిధ్వే |
| | తేపే | తేపివహే | తేపిమహే. |

*

**శ్లో॥ అథాంబుకల్లోలవిలోలడోలా–న్తరస్థనాగాధిపభోగశయ్యామ్ ।**
**ఫణాసహస్రామలరత్నరశ్మి–తృణీకృతార్కోడుపలక్షలక్ష్మీమ్ ॥ 16-5**

**అ :** బ్రహ్మ నారాయణుని శయ్య అయిన ఆదిశేషుని సందర్శించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అథ అంబు–కల్లోల–విలోల–డోలా+అన్తర–స్థ–నాగ+అధిప–భోగ–శయ్యాం ఫణా–సహస్ర+అమల–రత్న–రశ్మి–తృణీకృత+అర్క+ఉడు–ప–లక్ష–లక్ష్మీమ్.

**ప్ర :** అథ = ఆ తరువాత, (సః = ఆ బ్రహ్మ), ఫణా... లక్ష్మీమ్ : ఫణా = పడగలయొక్క, సహస్ర = సహస్రమందున్న (వేయి పడగలమీది), అమల = నిర్మలమైన, రత్న = రత్నాలయొక్క, రశ్మి = కిరణాలచే, తృణీకృత = లెక్కచేయబడని, అర్క = సూర్యునియొక్క, ఉడు–ప = చంద్రునియొక్క, లక్ష = లక్షలయొక్క, లక్ష్మీమ్ = కాంతిగల (ఫణానాం సహస్రే (స్థితానాం) రత్నానాం రాశిభిః తృణీకృతా, అర్కశ్చ ఉడుపశ్చ, తయోః లక్షస్య లక్ష్మీః యస్యాః, తామ్), అంబు... శయ్యామ్ : అంబు = నీటియందలి, కల్లోల = పెద్ద అలలు అనే (మహత్సు ఉల్లోలకల్లోలౌ–అమరకోశః –వారి–6), విలోల = చంచలమైన, డోలా = ఊయలయొక్క, అంతర–స్థ = మధ్యలోనున్న, నాగ+అధిప = ఆదిశేషునియొక్క, భోగ = పడగ అనే, శయ్యామ్ = పక్కను, (అపశ్యత్ = చూశాడు – 6వ శ్లోకంనుండి అపశ్యత్ పదాపకర్ష) (అంబుని కల్లోలాః ఏవ విలోలా డోలా, తస్యాః అంతరే తిష్ఠతీతి, తస్య నాగానామ్ అధిపస్య భోగ ఏవ శయ్యా, తామ్)

**తా ॥** తపస్సు ముగిసిన తరువాత బ్రహ్మ ఆదిశేషుని పడగ అనే పక్కను చూశాడు. అది ఆదిశేషుని వేయిపడగలమీదున్న రత్నాలకిరణాలతో లక్షసూర్యచంద్రులకాంతిని తృణీకరిస్తోంది. ఆ ప్రళయకాలజలనిధిలోని మహాతరంగాలనే ఉయ్యాల మధ్యలోని ఆదిశేషుని పడగయే.

**వి :** 1. సూర్యకాంతీ, చంద్రకాంతీ విడివిడిగానే బృహత్తరమైనవి. అవి రెండూ కలిసినా, అటువంటి సూర్యచంద్రులసంఖ్య లక్ష అయినా ఆ వేయి పడగల కాంతికి క్రిందేనట. పరమాత్మతోడి (నారాయణునితో) నిత్యసాహచర్యం ఆ కాంతికి కారణం. సూర్యచంద్రులు ఆ నారాయణుని కళ్ళే అయినా వాటికి ఆశ్రయమైన నారాయణునికే ఆధారంగా కనిపించేది ఆ ఆదిశేషుని పడగ. *

**శ్లో॥ అపశ్యదస్యాం సహ సిన్ధుపుత్ర్యా – శయానమమ్భోజవిశాలనేత్రమ్ ।**
**మనోజ్ఞదోర్దణ్డసహస్రభాసం – ప్రవాలమృద్వంఘ్య్రరుణీకృతాశమ్ ॥ 16-6**

**అ :** బ్రహ్మ నారాయణుని సందర్శించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అస్యాం సింధు–పుత్ర్యా సహ శయానమ్ అంభః+జ–విశాల–నేత్రం మనః+జ్ఞ–దోః+దండ–సహస్ర–భాసం ప్రవాల–మృదు+అంఘ్రి+అరుణీకృత+ఆశమ్ (విష్ణుమ్) అపశ్యత్.

**ప్ర :** అస్యామ్ = ఆ ఆదిశేషుని పడగ అనే పడకపై, సింధు–పుత్ర్యా సహ = లక్ష్మితో కూడా (సిన్ధోః పుత్రీ, తయా), శయానమ్ = శయనించి వున్నవాడూ (శీ ధాతువుపై శానచ్ ప్రత్యయం), అంభః... నేత్రమ్ : అంభోజ = తామరలవంటి, విశాల = వెడల్పయిన, నేత్రమ్ = కన్నులు గలవాడూ (అంభోజే ఇవ విశాలే నేత్రే యస్య, తమ్), మనోజ్ఞ... భాసమ్ : మనోజ్ఞ = అందమైన, దోర్దండ = భుజదండాలయొక్క, సహస్ర = వేయిచేత (వేయి భుజదండాలతో), భాసమ్ = వెలుగొందుతున్నవాడూ (మనోజ్ఞానాం దోర్దండానాం సహస్రస్య భాః యస్య తమ్), ప్రవాల... తాశమ్ : ప్రవాళ = చివురులవలె, మృదు = సున్నితమైన, అంఘ్రి = పాదంచేత, అరుణీకృత = ఎఱ్ఱగా చేయబడిన, ఆశమ్ = దిక్కులుగలవాడూ అయిన (ప్రవాళవత్ మృదునా అంఘ్రిణా అరుణీకృతాః ఆశాః యేన తమ్), (విష్ణుమ్ = విష్ణువును), అపశ్యత్ = చూశాడు. (దృశ్ ప్రేక్షణే పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.)

**తా ॥** ఆ ఆదిశేషుని పడగ అనే పడకమీద లక్ష్మితో పాటు పడుకొని వున్న విష్ణువును చూశాడు బ్రహ్మ. ఆ విష్ణుమూర్తి కమలాయతాక్షుడు. అందమైన వేయిభుజాలతో వెలుగొందు తున్నవాడు. చివురుటాకులవంటి తన పాదాల ఎఱ్ఱదనంచేత దిక్కులనన్నింటినీ ఎఱ్ఱగా కనిపింపజేస్తున్నవాడు.

**వి :** 1. బ్రహ్మచూసిన నారాయణస్వరూపాన్ని భాగవతం (ద్వితీయస్కంధం–9వ అధ్యాయం శ్లో.9–16) ఏడు శ్లోకాలలో వర్ణించింది. ఆ మూలానికి తనదైన భక్తినీ, వర్ణనాచాతుర్యాన్ని జోడించి 11 గద్య పద్యాలలో వర్ణించాడు పోతన. వాటి ముగింపు పద్యాలు–

మ. సతతజ్ఞానరమాయశోబలమహైశ్వర్యాది యుక్తుం జగ
త్పతి యజ్ఞేశు ననంతు నచ్యుతు దళత్పంకేరుహాక్షుం శ్రియః
పతి నాద్యంతవికారదూరుఁ గరుణాపాథోనిధిన్ సాత్త్వతాం
పతి వర్ధిష్ణు సహిష్ణు విష్ణు గుణవిభ్రాజిష్ణు రోచిష్ణునిన్.

మ. దరహాసామృతపూరితాస్యు నిజభక్తత్రాణపారాయణు
న్నరుణాంభోరుహపత్రలోచనునిఁ బీతావాసుఁ ద్రైలోక్య సుం
దరు మంజీర కిరీట కుండల ముఖోద్యద్భూషు యోగీశ్వరే
శ్వరు లక్ష్మీయుతవక్షుఁ జిన్మయు దయాసాంద్రుం చతుర్బాహునిన్. –పోతన భాగవతము 2/236,237

| | | | |
|---|---|---|---|
| 2. **అపశ్యత్ :** | **అపశ్యత్** | అపశ్యతామ్ | అపశ్యన్ |
| | అపశ్యః | అపశ్యతమ్ | అపశ్యత |
| | అపశ్యమ్ | అపశ్యావ | అపశ్యామ. |

*

**శ్లో॥ సువర్ణవర్ణామ్బరశోభిమధ్య–మగణ్యలావణ్యసముద్రహృద్యమ్ ।**
**విశాలనీలాచలకల్పమల్ప–స్మితాననాధఃకృతచన్ద్రదర్పమ్ ।** **16–7**

**అ :** బ్రహ్మ నారాయణుని సందర్శించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సువర్ణ–వర్ణ+అంబర–శోభి–మధ్యమ్ అగణ్య–లావణ్య–సముద్ర–హృద్యమ్ విశాల–నీల+అచల–కల్పమ్ అల్ప–స్మిత+ఆనన+అధః–కృత–చంద్ర–దర్పమ్.

**ప్ర :** సువర్ణ... మధ్యమ్ : సువర్ణ–వర్ణ = బంగారువన్నెగల, అంబర = వస్త్రాలతో, శోభి = ప్రకాశిస్తున్న, మధ్యమ్ = నడుముగలవాడూ (సువర్ణస్య వర్ణ ఇవ వర్ణః యస్య తచ్చ తత్ అంబరం తేన శోభీ మధ్యః యస్య, తమ్), అగణ్య...

హృద్యమ్ : అగణ్య = లెక్కింపరాని, లావణ్య-సముద్ర = సౌందర్యసాగరంచేత, హృద్యమ్ = మనోజ్ఞమైనవాడూ (అగణితం లావణ్యమ్ ఏవ సముద్రః, తేన హృద్యమ్), విశాల... కల్పమ్ : విశాల = నిడుద అయిన, నీల+అచలకల్పమ్ = నల్లకొండవంటి వాడూ, అల్ప... దర్పమ్ : అల్ప-స్మిత = చిఱునవ్వుగల, ఆనన = మొగంతో, అధఃకృత = అణగద్రొక్కబడిన, చంద్ర = చంద్రునియొక్క, దర్పమ్ = పొగరుగలవాడూ అయిన (అల్పం స్మితం యస్మిన్, తేన ఆననేన అధఃకృతః చంద్రస్య దర్పః యేన, తమ్), (విష్ణుమ్ = విష్ణువును, అపశ్యత్ = చూశాడు.)

**తా ॥** ఆ ఆదిశేషశయ్యపై నున్న నారాయణుడుని నడుము బంగారువన్నెగల వస్త్రాలతో శోభిస్తోంది. అంతులేని అందంతో ఆ నారాయణుడు శోభిస్తున్నాడు. పెద్ద నల్లకొండవంటి తాను చిఱునవ్వు మోముతో చంద్రుని పొగరు అణుస్తున్నాడు. *

**శ్లో॥ పరిస్ఫురత్కుణ్డలహారకాఞ్చీ-కిరీటముద్రాఙ్గదనూపురాద్యైః ।**
**విరాజితం తిగ్మమరీచిరోచిః-శరీరసమ్భాసితసర్వదేశమ్ ॥ 16-8**

**అ :** బ్రహ్మ నారాయణుని సందర్శించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పరిస్ఫురత్-కుండల-హార-కాంచీ-కిరీట-ముద్రా+అంగద-నూపుర+ఆద్యైః విరాజితం తిగ్మ-మరీచి-రోచిః-శరీర-సంభాసిత-సర్వ-దేశమ్.

**ప్ర :** పరిస్ఫురత్... రాద్యైః : పరిస్ఫురత్ = చుట్టూ వెలుగుతున్న, కుండల = చెవికమ్మలు, హార = ముత్యాలపేటలు, కాంచీ = మొలనూలు, కిరీట = కిరీటమూ (బొమికమూ), ముద్రా = ఉంగరం (ఉంగరంలోని అక్షరాలను రాజముద్రలుగా వాడుతారు కాబట్టి ముద్రపదం ఉంగరాన్ని తెలుపుతుంది.), అంగద = భుజకీర్తులు, నూపుర = కడియాలు, అద్యైః = మొదలుగా గల ఆభరణాలచే (పరిస్ఫురన్తః కుండలాని, హారాః కాంచ్యః కిరీటాని, ముద్రాః అంగదాని నూపురాశ్చ ఆదౌ యేషాం, తైః), విరాజితమ్ = వెలుగొందుతున్నవాడును, తిగ్మ... దేశమ్ : తిగ్మమరీచి = సూర్యునియొక్క, రోచిః = కిరణంవంటి కిరణ మనే, శరీర = శరీరంచేత, సంభాసిత = వెలుగొందజేయబడిన, సర్వ-దేశమ్ = సమస్తప్రదేశమూ గలవాడూ అయిన (తిగ్మాః మరీచయః యస్య తస్య రోచీరివ రోచిః యస్య తత్ చ తత్ శరీరం తేన సంభాసితః సర్వః దేశః యేన, తమ్), (విష్ణుమ్ = నారాయణుని, అపశ్యత్ = చూశాడు.)

**తా ॥** నారాయణుడు కుండలాలు, హారాలు, కాంచి, కిరీటం, అంగుళీయకం, అంగదాలు, కడియాలు మొదలగు ఆభరణాలతో వెలుగొందుతున్నాడు. సూర్యకిరణంవంటి తన కాంతియే శరీరంకాగా, దానితో సమస్తప్రదేశాన్నీ ప్రకాశింపజేస్తున్నాడు.

**వి :** 1. భాగవతంలో వివిధాభరణాలనూ, వస్త్రాలనూ, మందహాసాదులను ప్రస్తావిస్తూ బ్రహ్మచూసిన **నారాయణ** వర్ణనముంది 2/9/15లో.

**శ్లో॥ భృత్యప్రసాదాభిముఖం దృగాసనం - ప్రసన్నహాసారుణలోచనాననమ్ ।**
**కిరీటినం కుండలినం చతుర్భుజం - పీతాంబరం వక్షసి లక్షితం శ్రియా ॥ ***

**శ్లో॥ విశాలవక్షఃస్థలశోభిరత్నం - విముక్తశక్రార్కవిరిఞ్చిముఖ్యైః ।**
**విచిత్రభూషావలిభూషితాఙ్గై-ర్వివృద్ధభక్త్యాఽవనతైః పరీతమ్ ॥ 16-9**

**అ :** బ్రహ్మ నారాయణుని సందర్శించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** విశాల-వక్షః-స్థల-శోభి-రత్నం విచిత్ర-భూషా+ఆవలి-భూషిత+అంగైః వివృద్ధ-భక్త్యా అవనతైః విముక్త-శక్ర+అర్క-విరించి-ముఖ్యైః పరీతమ్.

ప్ర : విశాల... రత్నమ్ : విశాల = విశాలమైన, వక్షఃస్థల = రొమ్ముపై, శోభి = ప్రకాశిస్తున్న, రత్నమ్ = (కౌస్తుభ)మణిగలవాడూ (విశాలం చ తత్ వక్షః స్థలం, తస్మిన్ శోభి రత్నం యస్య తమ్), విచిత్ర... తాంగైః : విచిత్ర = రంగురంగుల (వివిధరూపాలుగల), భూషా = నగలయొక్క, ఆవలి = సమూహంచేత, భూషిత = అలంకరింపబడిన, అంగైః = అవయవాలుగలవారూ (విచిత్రాణాం భూషణానామ్ ఆవల్యా భూషితాని అంగాని యేషాం తైః), వివృద్ధ-భక్త్యా : వివృద్ధ = బాగా పెరిగిన, భక్త్యా = భక్తిచేత, అవనతైః = వంగినవారూ అయిన, విముక్త... ముఖ్యైః : విముక్త = ముక్తినందిన, శక్ర = ఇంద్రుడు, అర్క = సూర్యుడు, విరించి = బ్రహ్మ, ముఖ్యైః = ప్రధానంగా గల దేవతలచే, పరీతమ్ = కూడియున్న, (విష్ణుమ్ = నారాయణుని, అపశ్యత్ = చూశాడు.)

**తా ॥** ఆదిశేషుని పడగపడకపై పడుకొనివున్న నారాయణుని వక్షఃస్థలంపై కౌస్తుభమణి శోభిస్తోంది. వివిధాభరణాలు ధరించి భక్తిభావంతో వినమ్రులై ఇంద్రుడు, సూర్యుడు, బ్రహ్మ మొదలగు దేవతలు ఆయన చుట్టూ నిలిచివున్నారు.

**వి :** 1. తన పార్శ్వచరులు (పార్షదులు) అయిన సునందాదులతో కూడా కూడివున్నట్లు భాగవతం వివరిస్తుంది.

సీ. సలలితేందీవరశ్యామాయమానోజ్జ్వ - లాంగులు నవ్యపీతాంబరులును
ధవళారవిందసుందరపత్రనేత్రులు - సుకుమారతనులు భాసురవినూత్న
రత్నవిభూషణగ్రైవేయ కంకణ - హారకేయూరమంజీరధరులు
నిత్యయౌవనులు వినిర్మలచరితులు - రోచిష్ణులును హరిరూపధరులు

తే. నగు సునందుండు నందుండు నర్హణుండు - ప్రబలుఁడును మొదలగు నిజపార్శ్వచరులు
మఱియు వైదూర్యవిద్రుమామలమృణాల - తుల్యగాత్రులుఁ దను భక్తితో భజింప.

- పోతనభాగవతము 2/228. *

**శ్లో॥ ఉన్నాలాబ్జవరాతపత్రమహిరాడున్నమ్రసింహాసనం**
**సన్నద్ధోర్జితముక్తభృత్యనికరం మాన్యోర్మిసచ్చామరమ్ ।**
**సన్నాదాభిధదున్దుభిం శుభయశశ్చిహ్నోక్తిభిర్వన్దివత్**
**తన్నారాయణచక్రవర్తినమసావున్మీలితాక్షం వ్యధాత్ ॥** **16-10**

**అ :** బ్రహ్మ తన మాటలతో నారాయణుని మేల్కొల్పటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అసౌ ఉత్+నాల+అబ్జ-వర+ఆతప-త్రమ్ అహిరాట్-ఉన్నమ్ర-సింహాసనం సన్నద్ధ+ ఊర్జిత-ముక్త-భృత్య-నికరం మాన్య+ఊర్మి-సత్-చామరం తత్+నాద+అభిధ-దుందుభిం నారాయణ-చక్ర-వర్తినం వందివత్ శుభ-యశః-చిహ్న+ఉక్తిభిః ఉత్+మీలిత+అక్షం వ్యధాత్.

ప్ర : అసౌ = ఆ బ్రహ్మ, ఉన్నా... పత్రమ్ : ఉత్+నాళ = పైకిలేచిన తామరతూడుగల, అబ్జ = తామరయే, వర = శ్రేష్ఠమైన, ఆతప-త్రమ్ = గొడుగుగా గలవాడూ (ఉద్గతం నాళం యస్య తత్ చ తత్ అబ్జమ్ ఏవ వరమ్ ఆతపత్రం యస్య తమ్), అహి... సింహాసనమ్ : అహి-రాట్ = ఆదిశేషు డనే, ఉత్+నమ్ర = ఎత్తైన, సింహ+ఆసనమ్ = సింహాసనం గలవాడూ (అహీనాం రాట్ స ఏవ ఉన్నమ్రం సింహాసనం యస్య తమ్), సన్నద్ధో... నికరమ్ : సన్నద్ధ = సన్నద్ధులై, ఊర్జిత = శక్తిమంతులై, ముక్త = మోక్షాన్ని పొందినవారు అనే, భృత్య = సేవకులయొక్క, నికరమ్ = సమూహంగలవాడూ (సన్నద్ధాః ఊర్జితాశ్చ తే ముక్తాః ఏవ భృత్యాః, తేషాం నికరః యస్య తమ్), మాన్యో... మరమ్ : మాన్య = గౌరవింపదగిన, ఊర్మి = అలలే, సత్+చామరమ్ = మంచివీవెనలుగా గలవాడూ (మాన్యాః చ తే ఊర్మయః ఏవ సన్తి చ తాని చామరాణి యస్య తమ్), సన్నా... దుందుభిమ్: సత్+ నాద = (అలలయొక్క) మంచిధ్వని అని, అభిద = పేరుగల, దుందుభిమ్ = దుందుభులు గలవాడూ అయిన (సన్ చ అసౌ

నాదః, స ఏవ అభిధా యస్య సః సన్నాదాభిధః దుందుభిః యస్య, తమ్), తత్–నారాయణ–చక్రవర్తినమ్ : తత్ = ఆ, నారాయణ–చక్రవర్తినమ్ = నారాయణుడనే (విశ్వ) సార్వభౌముని, వందివత్ = స్తుతిపాఠకునివలె (నందీ వందీ ద్వౌ వృషభే వంశజ్ఞే స్తుతిపాఠకే – నానార్థమంజరీ–పంక్తి–834), శుభ... క్తిభిః : శుభ = మంగళకరమైన, యశః = కీర్తియే, చిహ్న = గుర్తుగాగల (కళంకాంకౌ లాంఛనం చ చిహ్నం – అమరకోశః – దిక్–17), ఉక్తిభిః = పలుకులతో (శుభాని యశాంసి చిహ్నాని యాసాముక్తీనాం తాభిః), ఉన్మీలిత+అక్షమ్ = కనులు తెరిచిన వానిగా (ఉన్మీలితే అక్షిణీ యేన తమ్), వి+అధాత్ = చేశాడు. (వి ధా ధారణపోషణయోః పరస్మైపది–లుజ్–ప్ర.ఏ.)

**తా ॥** ఆదిశేషునిపై నున్న నారాయణునకు తామరతూడే గొడుగు. ఆదిశేషుని పడగయే సింహాసనం. వైష్ణవాన్ని పాటించి (సన్నద్ధులై) ముక్తినందినవారే అక్కడ భృత్యులు. ఎగిసిపడే అలలే వీవెనలు. అలల ధ్వనులే దుందుభినాదాలు. అటువంటి నారాయణచక్రవర్తిని బ్రహ్మ నారాయణుని యశస్సును గానం చేస్తున్న శుభవచనాలతో మేల్కొల్పాడు.

**వి :** 1. నిదురిస్తున్న పిల్లలనయినా, పెద్దలనయినా మేల్కొల్పడం సర్వసాధారణం. మేల్కొలుపు నచ్చక జరత్కారువు కోపించినందువల్ల జరత్కారువు (భార్య) జీవితం భర్తృవియోగానికి గురి అయింది. అయితే నిదురలేపని కారణంగా కర్ణుడు పరశురాముని శాపానికి గురి అయ్యాడు. మానవీయంగా ఇలా వుంటే మేల్కొలుపు అన్నది దేవతావిషయంగా సుప్రభాత రూపాన్ని సంతరించుకొని దేవాలయాలలోనూ, ఇళ్ళలోనూ కూడా నిత్యమూ ప్రతిధ్వనిస్తుంది. విశ్వామిత్రుడు అరణ్యప్రయాణంలో రాముని మేల్కొలుపుతాడు.

**శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే ।**
**ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్ ॥** – రామాయణం–బాలకాండం–23/2

ఆ శ్లోకమే ఈనాటికీ సుప్రభాతరచనకూ, సుప్రభాతాల బాణీకీ మూలమైంది. అవునుమరి–

శ్లో॥ యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణకథా లోకేషు ప్రచరిష్యతి ॥ – రామాయణం–బాలకాండం–2/36

అని బ్రహ్మవాక్కు.

| | | | |
|---|---|---|---|
| 2. **వ్యధాత్ :** | **వ్యధాత్** | వ్యధాతామ్ | వ్యధుః |
| | వ్యధాః | వ్యధాతమ్ | వ్యధాత |
| | వ్యధామ్ | వ్యధావ | వ్యధామ. |

*

**శ్లో॥ రమారమేశానుగృహీత ఏషః – క్రమాత్ ససర్జాగ్ర ఇదం సమస్తమ్ ।**
**సదాఽచ్యుతాఙ్ఘ్రిస్మరణేన ధన్య–స్తదీయభక్తేష్వయమగ్రగణ్యః ॥ 16–11**

**అ :** బ్రహ్మను నిర్దేశిస్తూ సఖీవచనం రుక్మిణితో. –ఉపేంద్రవజ్ర.

**అ :** రమా–రమా+ఈశ+అనుగృహీతః ఏషః అగ్రే క్రమాత్ ఇదం సమస్తం ససర్జ. సదా అచ్యుత+అంఘ్రి–స్మరణేన ధన్యః అయం తదీయ–భక్తేషు అగ్ర–గణ్యః.

**ప్ర :** రమా... గృహీతః : రమా = లక్ష్మిచేతను, రమా+ఈశ = నారాయణునిచేతను, అనుగృహీతః = అనుగ్రహింపబడిన (రమా చ రమాయాః ఈశశ్చ రమారమేశౌ, తాభ్యామ్ అనుగృహీతః), ఏషః = ఈ బ్రహ్మ, అగ్రే = ఆ తరువాత, క్రమాత్ = ఒకదానివెంట ఒకటిగా, ఇదమ్ = ఈ, సమస్తమ్ = సర్వాన్ని (విశ్వాన్ని), ససర్జ = సృష్టించాడు. (సృజ విసర్గే తుదాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), సదా = ఎల్లప్పుడు, అచ్యుత... స్మరణేన: అచ్యుత = విష్ణువుయొక్క, అంఘ్రి = పాదాలయొక్క, స్మరణేన = తలంపుతో (అచ్యుతస్య అంఘ్రీ, తయోః స్మరణం, తేన), ధన్యః = పుణ్యాన్ని పొందిన (సుకృతీ పుణ్యవాన్ ధన్యః–అమరకోశః–విశేష్య–3) (ధనం లబ్ధః ధన్యః), అయమ్ = ఈ

బ్రహ్మ, తదీయ–భక్తేషు = ఆ విష్ణుభక్తులలో (తదీయశ్చ తే భక్తాః తేషు), అగ్ర–గణ్యః = ముందు లెక్కింపదగినవాడు (అగ్రే గణయితుం యోగ్యః).

**తా ॥** లక్ష్మీనారాయణుల అనుగ్రహానికి పాత్రుడైన ఈ బ్రహ్మ ఆ తరువాత ఒకటొకటిగా ఈ సమస్తవిశ్వాన్నీ సృష్టించాడు. నారాయణపాదస్మరణంచేత ధన్యుడైన ఈ బ్రహ్మ ఆ విష్ణుభక్తులలో అగ్రగణ్యుడు.

**వి :** 1. బ్రహ్మ విశ్వాన్ని సృష్టించగలగటం నారాయణుని అనుగ్రహంయొక్క ఫలరూపమే. బ్రహ్మ తానై తన మానసపుత్రుడైన నారదునకు ఆ విషయాన్ని వివరించాడు.

శా. నానాస్థావరజంగమప్రకరముల్ నాయంత నిర్మింప వి
జ్ఞానం బేమియు లేక తొట్రువడఁగా నాకున్ సమస్తాను సం
ధానారంభవిచక్షణత్వము మహోదారంబుగా నిచ్చె ము
న్నే నా యీశ్వరునాజ్ఞఁ గాక జగముల్ నిర్మింప శక్తుండనే. – పోతనభాగవతము 2/81

2. నారాయణాంఘ్రిస్మరణతో ధన్యుడైన వాడు బ్రహ్మ. ఆ ధన్యతా (పుణ్య) ఫలితాన్ని తానై ప్రకటిస్తున్న తీరు– భాగవతమ్ 2/6/33

శ్లో॥ న భారతీ మేఽఙ్గ మృషోపలక్ష్యతే – న వై క్వచిన్మే మనసో మృషా గతిః ।
న మే హృషీకాణి పతంత్యసత్పథే – యన్మే హృదౌత్కంఠ్యవతా ధృతో హరిః ॥

'నా మాట ఎప్పుడూ అసత్యం కాదు. నా మనస్సు ఎప్పుడూ అసత్యం వైపు నడవదు. నా ఇంద్రియాలు అసన్మార్గంలో ఎప్పుడూ పడవు. నేను మనసా హరిని ధరించాను కాబట్టి' – హరిస్మరణఫల మిలావుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 3. **ససర్జ :** | **ససర్జ** | ససృజతుః | ససృజుః |
| | ససర్జిథ/సస్రష్ఠ | ససృజథుః | సస్రజ |
| | ససర్జ | ససృజివ | ససృజిమ. |

*

**శ్లో॥ అయం సఖి! ప్రాణగణాధినాథః – స్వయమ్భువా సర్వగుణైః సమానః ।**
**శివాదిదేవా వ్యవదన్త పూర్వం – తతోఽస్య సత్త్వం ప్రకటీబభూవ ॥ 16–12**

**అ :** రుక్మిణికి వాయుదేవుని పరిచయం చేస్తేన్న సఖి. –ఉపేంద్రవజ్ర.

**అ :** సఖి! అయం ప్రాణ–గణ+అధినాథః సర్వగుణైః స్వయంభువా సమానః పూర్వం శివ+ఆది–దేవాః వ్యవదన్త తతః అస్య సత్త్వం ప్రకటీబభూవ.

**ప్ర :** సఖి! = చెలీ!, అయమ్ = ఈయన, ప్రాణ... నాథః : ప్రాణ = ఇంద్రియాల/ప్రాణాల యొక్క (హృషీకమింద్రియం ప్రాణః–వైజయన్తీ–బ్రాహ్మణ–203), గణ = సమూహానికి, అధినాథః = శాసకుడు/ముఖ్యప్రాణుడు (ప్రాణానాం గణః తస్య అధినాథః), సర్వ–గుణైః = సమస్త గుణాలతో (సర్వే చ తే గుణాః తైః), స్వయంభువా = బ్రహ్మతో, సమానః = సమానుడు. పూర్వమ్ = గతంలో (ఒకప్పుడు), శివ+ఆది–దేవాః = శివుడు మొదలైన దేవతలు, వి+అవదన్త = వివాదపడిరి. (వి–వద్–వ్యక్తాయాం వాచి, ఆత్మనేపది–లఙ్–ప్ర.బ.), తతః = ఆ కారణంగా, అస్య = ఈ ముఖ్యప్రాణునియొక్క, సత్త్వమ్ = శక్తి, ప్రకటీబభూవ = బయటపడింది. (తెలియవచ్చింది). (ప్రకటీ–భూ సత్తాయాం పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** చెలీ! ఇంద్రియాలకూ, ప్రాణాలకూ అధినాథుడైన ఈ ముఖ్యప్రాణుడు సర్వగుణాలలో బ్రహ్మతో సమానుడు. ఒకప్పుడు శివుడు మొదలయిన దేవతలమధ్య 'ఎవరుగొప్ప' అన్న వివాదమేర్పడితే అప్పుడు ముఖ్యప్రాణుని సత్త్వం వ్యక్తమయింది.

**వి :** 1. దేవతలమధ్య, ఇంద్రియాలమధ్య గతంలో ఏర్పడిన ఈ వివాదాంశాన్ని బృహదారణ్య-కోపనిషత్తు తెలియజేస్తుంది- (దేవతలమధ్య)

జ్వలిష్యామ్యేవాహమిత్యగ్నిర్దధ్రే. తప్స్యామ్యహమిత్యాదిత్యః, భాస్యామ్యహమితి చంద్రమాః ఏవమన్యా దేవతా యథాదైవతమ్. సః యథైషాం ప్రాణానాం మధ్యమః ప్రాణః ఏవమేతాసాం దేవతానాం వాయుః నిమ్లోచన్తి హ్యన్యా దేవతాః. న వాయుః సైషా నస్తమితా దేవతా వాయుః.

(ఇంద్రియాలమధ్య :) ప్రజాపతిర్హి కర్మాణి ససృజే. తాని సృష్టాని అన్యోన్యేనాస్పర్ధన్త. వదిష్యామ్యేవాహమితి వాగ్దధ్రే ద్రక్షామ్యహమితి చక్షుః, శ్రోష్యామ్యహమితి శ్రోత్రమ్ ఏవ- మన్యాని కర్మాణి యథాకర్మ. తాని మృత్యుః శ్రమో భూత్వోపయేమే. తాన్యాప్నోత్, తాన్యాప్త్వా మృత్యురవారున్ధ. తస్మాచ్ఛ్రామ్యత్యేవ వాక్, శ్రామ్యతి చక్షుః, శ్రామ్యతి శ్రోత్రమ్, అథేమమేవ నాప్నోద్యోయం మధ్యమః ప్రాణః, తాని జ్ఞాతుం దధ్రిరే. అయం వై నః శ్రేష్ఠః యః సంచరంశ్చాసంచరంశ్చ న వ్యథతే... **- బృహదారణ్యకోపనిషత్తు - 1/5/22,21**

దేవతలు వాయువునే తమలో అధికునిగా అంగీకరించారు. ఇంద్రియాలు (కర్మలు) కూడా ప్రాణాన్నే తమలో ఉన్నతంగా అంగీకరించాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రకటీబభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ హరేర్మనుం జీవనికాయకాయే - జపన్నయం జీవయతీహ విశ్వమ్ ।**
**నిజాఙ్కమారోప్య కిలైనమార్యే! - జగత్పతిర్జాతసుఖం విధత్తే ॥ 16-13**

**అ :** రుక్మిణిసఖి వాయువైశిష్ట్యాన్ని వివరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** హరేః మనుం జీవ-నికాయ-కాయే జపన్ అయమ్ ఇహ విశ్వం జీవయతి. ఆర్యే! జగత్-పతిః ఏనం నిజ+అంకమ్ ఆరోప్య జాత-సుఖం విధత్తే కిల.

**ప్ర :** హరేః = హంసయొక్క (శబ్దార్థకల్పతరుః-పు-1609), మనుమ్ = మంత్రాన్ని, జీవ... కాయే : జీవ = ప్రాణులయొక్క, నికాయ = సమూహంయొక్క, కాయే = శరీరమందు (జీవానాం నికాయః, తస్య కాయే), జపన్ = జపిస్తూ (జప్ ధాతువుపై శతృ ప్రత్యయం), అయమ్ = ఈ ముఖ్యప్రాణుడు, విశ్వమ్ = ప్రపంచాన్ని, జీవయతి = జీవింపజేస్తాడు. (జీవ్ ప్రాణధారణే-ణిచి-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఆర్యే! = పూజ్యురాలా! (అమ్మా!), జగత్-పతిః = విశ్వభర్త అయిన విష్ణువు, ఏనమ్ = ఈ ముఖ్యప్రాణుని, నిజ+అంకమ్ = తన ఒడిలో, ఆరోప్య = పెట్టుకొని, జాత-సుఖమ్ = ఆనందించినవానినిగా (జాతం సుఖం యస్మిన్, తమ్), విధత్తే కిల = చేస్తాడు గదా! (వి-ధా ధారణపోషణయోః-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ ముఖ్యప్రాణుడు ప్రాణులదేహాలలో వుండి హంసమంత్రాన్ని (ఉచ్ఛ్వాసనిశ్వాసలు) జపిస్తూ విశ్వాన్ని జీవింపజేస్తాడు. ఆర్యా! విష్ణువు ఈ ముఖ్యప్రాణుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని ఆనందింపజేస్తాడు.

**వి :** 1. సోఽహమ్-అన్నది హంసమంత్రం అక్షరరూపంగా. అది ఈశావాస్యోపనిషద్వాక్యం-16

శ్లో॥ పూషన్నేకర్షే యమ సూర్యప్రాజాపత్యవ్యూహరశ్మీన్ సమూహ తేజః ।
యత్తే రూపం కళ్యాణతమం తత్తే పశ్యామి **యోసావసౌ పురుషః సోఽహమస్మి** ॥

2. హంసగాయత్రి : ఓం హంస హంసాయ విద్మహే-పరమహంసాయధీమహి తన్నో హంసః ప్రచోదయాత్।

3. శ్లోకరూపంగా హంసమంత్రం :

శ్లో॥ ముఖ్యప్రాణో మమ గురుస్తస్య హంసాత్మనో హరేః ।
అహర్నిశం చ జపతః స్యాత్ కదా మతిరన్యథా ॥ -సరసభారతీవిలాసం-8/74,75

4. శ్వాసరూపంగా జపపరామర్శ :

శ్లో॥ శ్వాసరూపో జపో నిత్యముభయోర్విద్వదజ్ఞయోః ।
ఏకవింశత్సహస్రాత్మా సషట్శతమహర్నిశమ్ ॥ - తంత్రసారసంగ్రహః

5. **జీవయతి : జీవయతి** జీవయతః జీవయన్తి
జీవయసి జీవయథః జీవయథ
జీవయామి జీవయావః జీవయామః

| | | | | |
|---|---|---|---|---|
| **విధత్తే** | : | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | | విధత్సే | విదధాథే | విదధధ్వే |
| | | విదధే | విదధ్వహే | విదధ్మహే. |

*

**శ్లో॥ క్వచిద్ధి రక్షోవశతా సురాణాం - భవేదముష్మిన్న కదాఽపి సాఽస్తి ।**
**అయం కిలాచ్ఛిన్నముకున్దధర్మో - విరిఞ్చితామేష్యతి భావికల్పే ॥ 16-14**

**అ :** ఇతర దేవతలకన్న వాయుదేవునకున్న వైశిష్ట్యాన్ని సఖి రుక్మిణికి చెప్పటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సురాణాం క్వచిత్ రక్షః+వశతా భవేత్ హి. అముష్మిన్ సా కదా అపి న అస్తి. అచ్ఛిన్న-ముకుంద-ధర్మః అయం భావి-కల్పే విరించితామ్ ఏష్యతి.

**ప్ర :** సురాణామ్ = దేవతలకు, క్వచిత్ = అక్కడక్కడ, రక్షః+వశతా = రాక్షసులకు లోబడుట (రక్షసాం వశతా), భవేత్ హి = జరుగుతుంది గదా! (భూ సత్తాయాం-పరస్మైపది-విధిలిజ్-(ప్ర.ఏ.), అముష్మిన్ = ఇతనియందు, సా = అది (రాక్షసాధీనత్వం), కదా-అపి = ఎప్పుడూకూడా, న-అస్తి = లేదు (అస భువి-పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), అచ్ఛిన్న-ముకుంద-ధర్మః : అచ్ఛిన్న = ఎడతెగని, ముకున్ద-ధర్మః = వైష్ణవధర్మాలుగల (అచ్ఛిన్నాః ముకున్దసంబంధినః ధర్మాః యస్య సః), అయమ్ = ఈ ముఖ్యప్రాణదేవర, భావి-కల్పే = రాబోవు కల్పంలో (భావీ చ సః కల్పః, తస్మిన్), విరించితామ్ = బ్రహ్మత్వాన్ని/నలువదనాన్ని, ఏష్యతి = పొందగలడు (ఇ గతౌ-పరస్మైపది-లృట్-(ప్ర.ఏ.).

**తా ॥** దేవతలు అక్కడక్కడ (అప్పుడప్పుడు) రాక్షసులకు లోబడటం కనిపిస్తుంది. కానీ ఈ ముఖ్యప్రాణుడు ఎప్పుడూ రాక్షసులకు లొంగలేదు. ఎడతెగనిరీతిగా వైష్ణవధర్మాలను పాటించే ఈ ముఖ్యప్రాణుడు రాబోయే కల్పంలో బ్రహ్మ కాగలడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. భవేత్ :** | **భవేత్** | భవేతామ్ | భవేయుః |
| | భవేః | భవేతమ్ | భవేత |
| | భవేయమ్ | భవేవ | భవేమ |
| **అస్తి :** | అస్తి | స్తః | సన్తి |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **ఏష్యతి :** | **ఏష్యతి** | ఏష్యతః | ఏష్యన్తి |
| | ఏష్యసి | ఏష్యథః | ఏష్యథ |
| | ఏష్యామి | ఏష్యావః | ఏష్యామః. |

*

**శ్లో॥ పయోఽబ్ధిజం దుర్విషహం విషం ప్రాక్ - స్వయం పపౌ నష్టజవం శివోఽల్పమ్ ।
విముక్తిమప్యేష హరేర్నిదేశాత్ - ప్రియాయ దాతుం ప్రభురమ్బుజాక్షి! ॥ 16-15**

**అ :** సముద్రమథనసమయంలో పుట్టిన విషంలో ఎక్కువభాగం త్రాగింది వాయుదేవుడే అని సఖి వివరించటం.
-ఉపేంద్రవజ్ర.

**అ :** అంబుజ+అక్షి పయః+అబ్ధి-జం దుర్విషహం విషం ప్రాక్ స్వయం పపౌ. నష్ట-జవమ్ అల్పమ్ శివః పపౌ. హరేః నిదేశాత్ ఏషః ప్రియాయ విముక్తిమ్ అపి దాతుం ప్రభుః.

**ప్ర :**అంబుజ+అక్షి=కమలనయనా! (అంబుజే ఇవ అక్షిణీ యస్యాస్సా, తస్మాత్ సంబుద్ధిః), ఏషః = ఈ ముఖ్యప్రాణుడు, పయః+అబ్ధి-జమ్ = పాల-కడలిలో-పుట్టిన (పయసామ్ అబ్ధిః, తస్మిన్ జాయతే ఇతి, తమ్), దుర్విషహమ్ = సహింపరాని, విషమ్ = విషాన్ని (హాలాహలాన్ని), ప్రాక్ = ముందుగా, స్వయమ్ = తనంతతానుగా, పపౌ = త్రాగాడు. (పా పానే-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), శివః = శంకరుడు, నష్ట-జవమ్ = తీవ్రత తగ్గిన (నష్టః జవః యస్మిన్ తత్), విషమ్ = విషాన్ని, అల్పమ్ = కొద్దిగా (వాయువు త్రాగగా మిగిలినదాన్ని), (పపౌ = త్రాగాడు). (ఏషః = ఈ ముఖ్యప్రాణుడు.) హరేః = విష్ణువుయొక్క, నిదేశాత్ = ఆజ్ఞతో, ప్రియాయ = ఇష్టునకు (భక్తునకు), విముక్తిమ్ = మోక్షాన్ని, దాతుమ్-అపి = ఇవ్వటానికి కూడా, ప్రభుః = సమర్థుడు.

**తా ॥** కమలనయనా! పాలకడలిలో పుట్టిన భరింపరాని విషాన్ని ముందుగా త్రాగింది ముఖ్యప్రాణదేవరయే. ఆ తరువాత మిగిలిపోయి, తీవ్రత తగ్గిన ఆ విషాన్ని శంకరుడు కొద్దిగా త్రాగాడు. విష్ణువు అనుమతితో తన భక్తుడికి విముక్తిని ప్రసాదించటానికి కూడా ఈయన సమర్థుడు.

**వి :** 1. పాలకడలిని చిలికినప్పుడు పుట్టిన హాలాహలాన్ని శివుడు మ్రింగినట్లు భాగవతకథనం-

శ్లో॥ పుంసః కృపయతో భద్రే సర్వాత్మా ప్రీయతే హరిః ।
ప్రీతే హరౌ భగవతి **ప్రీయేఽహం సచరాచరః ॥**

శ్లో॥ **తస్మాదిదం గరం భుంజే** ప్రజానాం స్వస్తిరస్తు మే ॥ - భాగవతమ్-8/7/40

మహాభారతతాత్పర్యనిర్ణయం మరొకరీతిగా ఆ అంశాన్ని ప్రతిపాదిస్తుంది.

హాలాహలం పుట్టినప్పుడు నారాయణుని ఆదేశంతో వాయువు దానిని చేతికి తీసికొన్నాడు. దానిలో కొంత నలిపాడు. దాని తీవ్రత తగ్గింది. దానిలో కొంత శివునకిచ్చాడు. శివుడు అది కంఠానికి తగలగానే మూర్ఛపోయాడు. అప్పుడు నారాయణుని ఆజ్ఞతో వాయువు దానిని త్రాగాడు. శివుడిచేతిలో మిగిలింది కలి అయి వ్యాపించింది. వాయువుకు ఏమీ కాలేదు.

శ్లో॥ కలేః స్వరూపం తదతీవ దుఃసహం వరాద్విధాతుః సకలైశ్చ దుఃస్పృశమ్ ।
కరే విమథ్యాస్తబలం విధాయ దదౌ స కించిద్గిరిశాయ వాయుః ॥

శ్లో॥ స తత్ పిబత్ కంఠగతేన తేన నిపాతితో మూర్ఛిత ఆశు రుద్రః ।
హరేః కరస్పర్శబలాత్ స సంజ్ఞామవాప నీలోఽస్య గళస్తదాసీఽఽత్ ॥

శ్లో॥ అథ త్వదాజ్ఞాం పురతో నిధాయ నిధాయ పాత్రే తపనీయరూపే ।
స్వయం త్వ నిర్మథ్య బలోపపన్నం పపౌ స వాయుస్తదుతాస్య జీర్ణమ్ ॥

- మహాభారతతాత్పర్యనిర్ణయః - 10/14-16

ఋగ్వేదంలోని దశమమండలంలోని 136వ సూక్తం (కేశి సూక్తం) మహాభారతతాత్పర్య నిర్ణయభావప్రకాశికలో ఈ ప్రతిపాదనకు ఉపబలకంగా ప్రకృతకవిచేత వ్యాఖ్యానింపబడింది. ఆ సూక్తంలోని చివరి ఋక్కు-

శ్లో॥ వాయురస్మా ఉపామన్థత్ పినష్టి స్మ కునన్నమా ।
కేశీ విషస్య పాత్రేణ యద్రుద్రేణాపిత్సహ ॥

| | | | | |
|---|---|---|---|---|
| 2. **పపౌ :** | **పపౌ** | పపతుః | పపుః | |
| | పపిథ/పపాథ | పపథుః | పప | |
| | పపౌ | పపివ | పపిమ. | * |

**శ్లో॥ ఇహావతీర్యాథ హనూమదాఖ్యో - వ్యధత్త సేవాం స తు భీమరూపః ।**
**విభోర్విధత్తేఽద్య స మధ్వరూపీ - విధాస్యతేఽన్యైస్త్రిదశైరసాధ్యామ్ ॥ 16-16**

**అ :** సఖి రుక్మిణికి వాయువే హనుమద్రూపంలో అవతరించాడని వినిపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ఇహ అవతీర్య హనూమద్-ఆఖ్యః (సన్) విభోః అన్యైః త్రిదశైః అసాధ్యాం సేవాం వ్యధత్త. భీమరూపః (సన్) అద్య విభోః సేవాం విధత్తే. మధ్వ-రూపీ (సన్) విభోః సేవాం విధాస్యతే.

**ప్ర :** సః = ఆ ముఖ్యప్రాణుడే, ఇహ = ఈ లోకంలో, అవతీర్య = అవతరించి, హనూమద్-ఆఖ్యః (సన్) హనూమంతుడను పేరుతో, విభోః = ప్రభువునకు (రామునకు), అన్యైః = ఇతరులైన, త్రిదశైః = దేవతలచేత (తిస్రః దశాః యేషాం తైః), అసాధ్యామ్ = సాధింపరాని, సేవామ్ = సేవను, వి+అధత్త = చేశాడు (వి-ధా ధారణపోషణయోః-ఆత్మనేపది-లజ్-(ప్ర.ఏ.), భీమ-రూపః (సన్) = భీమసేన రూపుడై (భీమ ఇతి రూపమ్ అస్య ఇతి), అద్య= ఇప్పుడు, విభోః = ప్రభువుకు (కృష్ణునకు), (సేవామ్ = సేవను, విధత్తే = చేస్తున్నాడు.), సః = ఆ ముఖ్యప్రాణుడే, మధ్వ-రూపీ (సన్) = మధ్వాచార్యరూపుడై, విభోః = వేదవ్యాసునకు, (సేవామ్ = సేవను), విధాస్యతే = చేయగలడు. (వి-ధా ధారణపోషణయోః ఆత్మనేపది-ల్బట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ ముఖ్యప్రాణుడే ఈ భూలోకంలో హనుమంతుడను పేరుతో పుట్టి రాముని సేవించాడు. ఇప్పుడు భీమసేనరూపంతో పుట్టి కృష్ణుని సేవిస్తున్నాడు. రాబోయే రోజులలో మధ్వాచార్యరూపంతో పుట్టి వేదవ్యాసుని సేవింపగలడు.

**వి :** 1. హనుమంతుడు, భీమసేనుడు, మధ్వాచార్యుడు ముగ్గురూ ముఖ్యప్రాణుని అవతారరూపాలే అని మాధ్వవిశ్వాసం. వారి వారి విశిష్టగుణగణాలే అందుకు ప్రమాణం-

**హనూమద్ గుణవర్ణన :**

శ్లో॥ జ్ఞానే విరాగే హరిభక్తిభావే - ధృతిస్థితిప్రాణబలేషు యోగే
బుద్ధౌ చ నాన్యో హనుమత్సమానః - పుమాన్ కదాచిత్ క్వ చ కశ్చ నైవ॥

**భీమసేనవర్ణన :**

శ్లో॥ భీమసేనసమో నాస్తి సేనయోరుభయోరపి ।
పాండిత్యే చ పటుత్వే చ శూరత్వే చ బలేఽపి చ ॥ - మహాభారతతాత్పర్యనిర్ణయః 2/143,152

**మధ్వాచార్యుని వ్యాససేవ :**

శ్లో॥ అద్యాపి బదరీశైలే బదరీషండమండితే ।
మధ్యే మునీనామధ్యాస్తే విద్వాన్ వ్యాసస్య సన్నిధౌ ॥ - సరసభారతీవిలాసః-7/10

| | | | |
|---|---|---|---|
| 2. **విధత్తే :** | వ్యధత్త | వ్యదదాతామ్ | వ్యదదత |
| | వ్యధత్థాః | వ్యదధాథామ్ | వ్యధదధ్వమ్ |
| | వ్యదధి | వ్యదధ్వహి | వ్యదధ్మహి. |

| | | | | |
|---|---|---|---|---|
| **విధాస్యతే :** | **విధాస్యతే** | విధాస్యేతే | విధాస్యన్తే | |
| | విధాస్యసే | విధాస్యేథే | విధాస్యధ్వే | |
| | విధాస్యే | విధాస్యావహే | విధాస్యామహే. | * |

**శ్లో॥ స్వబుద్ధిసఖ్యేత్థముదీరితా సా - కృపాకటాక్షేణ నిరీక్ష్య భైష్మీ ।**
**నిజాఙ్ఘ్రిపద్మావనతౌ సుతౌ తౌ - స్వకాన్తమేతత్ప్రభుమేవ మేనే ॥ 16-17**

**అ :** బ్రహ్మనూ, వాయువునూ (తన కుమారులే) దయతో చూసి రుక్మిణి ముందుకు సాగటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సా భైష్మీ స్వ-బుద్ధి-సఖ్యా ఇత్థమ్ ఉదీరితా (సతీ) నిజ+అంఘ్రి-పద్మ+అవనతౌ తౌ సుతౌ కృపా-కటాక్షేణ నిరీక్ష్య ఏతత్-ప్రభుమ్ ఏవ స్వ-కాంతం మేనే.

**ప్ర :** సా భైష్మీ = ఆ రుక్మిణి (భీష్మస్య అపత్యం స్త్రీ), స్వ-బుద్ధి-సఖ్యా : స్వ = తనయొక్క, బుద్ధి = ఆలోచన అనే, సఖ్యా = చెలిచేత (స్వస్య బుద్ధి, స్వబుద్ధిః సా ఏవ సఖీ, తయా), ఉదీరితా (సతీ) = చెప్పబడినదై (ఉత్-ఈర్ ధాతువుపై క్త ప్రత్యయం), నిజాం... న తౌ : నిజ = తనయొక్క, అంఘ్రి-పద్మ = పాదపద్మాలపై, అవనతౌ = వ్రాలిన (స్వస్యాః అంఘ్రీ ఏవ పద్మే, తయోః అవనతౌ), తౌ = ఆ, సుతౌ = కుమారులను (బ్రహ్మ, వాయువులను), కృపా-కటాక్షేణ : కృపా = అనుగ్రహంతో కూడిన, కటాక్షేణ = కడగంటి చూపుతో (కృపయా భరితః కటాక్షః, తేన), నిరీక్ష్య = చూసి (నిర్-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఏతత్-ప్రభుమ్-ఏవ = ఈ కృష్ణునే, స్వ-కాంతమ్ = తన భర్తనుగా (స్వస్యాః కాంతః, తమ్), మేనే = భావించింది. (మను జ్ఞానే దివాది-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** బ్రహ్మను గురించీ, వాయువును గురించీ తన బుద్ధి అనే సఖి చెప్పిన మాటలు విని రుక్మిణి తన పాదాలచెంత వినమ్రులైన వారిని కరుణాకటాక్షంతోచూసి, కృష్ణుడే తన భర్త అని భావించింది.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. మేనే :** | **మేనే** | మేనాతే | మేనిరే | |
| | మేనిషే | మేనాథే | మేనిధ్వే | |
| | మేనే | మేనివహే | మేనిమహే. | * |

**శ్లో॥ భవోఽయమబ్జాసనలబ్ధజన్మా - విహఙ్గరాజోఽయమహీశ్వరోఽయమ్ ।**
**సమానవిజ్ఞానబలప్రమోదా - ముకున్దసేవాభిరతాః కిలైతే ॥ 16-18**

**అ :** రుక్మిణిసఖి శివాదులను గూర్చి చెప్పటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అయమ్ అబ్జ+ఆసన-లబ్ధ-జన్మా భవః అయం విహంగ-రాజః అయమ్ అహి+ఈశ్వరః ఏతే సమాన-విజ్ఞాన-బల-ప్రమోదాః ముకుంద-సేవా+అభిరతాః కిల.

**ప్ర :** అయమ్ = ఈయన, అబ్జ... జన్మా : అబ్జ+ఆసన = బ్రహ్మనుండి, లబ్ధ = పొందిన, జన్మా = పుట్టుకగల (అప్సు జాయత ఇతి అబ్జం, తత్ ఆసనం యస్య సః అబ్జాసనః, తస్మాత్ లబ్ధం జన్మ యస్య సః), భవః = శివుడు, అయమ్ = ఈయన, విహంగ-రాజః = పక్షిరాజు (విహంగానాం రాజా), అయమ్ = ఈయన, అహి+ఈశ్వరః = నాగరాజు (అహీనామ్ ఈశ్వరః), ముకున్ద-సేవా+అభిరతాః : ముకున్ద = కృష్ణునియొక్క, సేవా = పరిచర్యయందు, అభిరతాః = ప్రీతిగలిగిన (ముకున్దస్య సేవా, తస్యామ్ అభిరతాః), ఏతే = వీరు, సమాన... ప్రమోదాః : సమాన = తుల్యమైన, విజ్ఞాన = తెలివి, బల = శక్తి, ప్రమోదాః-కిల = ఆనందమూ గలవారు గదా! (సమానం విజ్ఞానం బలం ప్రమోదశ్చ యేషాం తే)

**తా ॥** ఈయన భవుడు. బ్రహ్మ కుమారుడు. ఈయన పక్షిరాజు. ఈయన నాగరాజు. వీళ్ళందరూ విష్ణుసేవాసక్తులు. జ్ఞానంలో, బలంలో, ఆనందంలో సమానులు.

**వి :** 1. శివుడు, విష్ణువు మనవడు. గరుడుడు వాహనం. ఆదిశేషుడు శయ్య. ఇక వీరిలో ఎవరినో ఒకరిని వరించే అవకాశమేముంటుంది?

*

**శ్లో॥ శర్వః సుపర్వరిపుగర్వవిభేదదక్షః - పూర్వం పురత్రయమయం కిల దేవ్యజైషీత్ ।**
**హర్యఙ్ఘ్రితీర్థపరిపూతకపర్దమేనం - గౌర్యత్యసాధ్యమపి తం వశయామ్బభూవ ॥19**

**అ :** శివుని గొప్పతనాన్నీ, పార్వతి తపోదీక్షను సఖి రుక్మిణికి తెలియజేయటం. (శివ ఘనతను విడిగా చెప్పటం)
-వసంతతిలక.

**అ :** అయం శర్వః సుపర్వ-రిపు-గర్వ-విభేద-దక్షః దేవి! అయం కిల పూర్వం పుర-త్రయమ్ అజైషీత్. హరి+అంఘ్రి-తీర్థ-పరిపూత-కపర్దమ్ అతి+అసాధ్యమ్ అపి తమ్ ఏనం గౌరీ వశయాంబభూవ.

**ప్ర :** అయమ్ = ఈ, శర్వః = శివుడు (శృణాతి ఇతి శర్వః = హింసించువాడు), సుపర్వ... దక్షః : సుపర్వ = దేవతలయొక్క, రిపు = శత్రువులైన రాక్షసులయొక్క, గర్వ = పొగరును, విభేద = బ్రద్దలుచేయటంలో, దక్షః = సమర్థుడు (సుపర్వాణాం రిపవః, తేషాం గర్వః, తస్య విభేదనే దక్షః. దక్ష పదం దక్షునీ, దక్షాధ్వరధ్వంసాన్నీ స్ఫురింపజేస్తూ శత్రుశబ్దానికి అప్రియకారి అన్న అర్థాన్నిస్తుంది.), దేవి = స్వామినీ! (రుక్మిణీ!), పూర్వమ్ = గతంలో, పుర-త్రయమ్ = మూడు నగరాలనూ (పురాణాం త్రయమ్), అజైషీత్ కిల = గెలిచాడు గదా! (జి-జయే-పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.), హర్య... కపర్దమ్ : హరి = విష్ణువుయొక్క, అంఘ్రి-తీర్థ = పాదతీర్థంచే (గంగచే), పరిపూత = పవిత్రమైన, కపర్దమ్ = జటాజూటంగల (హరేః అంఘ్రేః తీర్థేన పరిపూతః కపర్దః యస్య తమ్) (కపర్దోఽస్య జటాజూటః అమరకోశః-స్వర్గ-35), తమ్-ఏనమ్ = ఆ ఈ శివుని, అతి+అసాధ్యమ్-అపి = సాధించటానికి వీలుకాని వాడైనా, గౌరీ = పార్వతి, వశయామ్బభూవ = లొంగదీసికొన్నది. (వశయామ్-భూ సత్తాయామ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈశ్వరుడు దేవతాశత్రువులైన రాక్షసుల గర్వాన్ని అణచివేయటంలో సమర్థుడు. గతంలో మూడు నగరాలను గెలిచినవాడు. హరిపాదతీర్థంతో పవిత్రమైన జటాజూటం గల ఈ శివుడు అసాధ్యుడైనా పార్వతి లోబరచుకొనగలిగింది.

**వి :** 1. శివుడికి పురారి అన్నపేరు రాక్షస (త్రిపురాసుర) సంహారంవల్లనే వచ్చింది.

**త్రిపురసంహారప్రస్తావన** **తైత్తిరీయసంహిత**లోనే (కృష్ణయజుర్వేద సంబంధి) కనిపిస్తుంది.

"తేషామసురాణాం **త్రిస్రః పుర ఆసన్న**యస్మయ్యవమాఽథ రజతాఽథ హరిణీ, తా దేవా జేతుం నాశక్నువన్తా ఉపసదైవాజిగీషన్తస్మాదాహుః యశ్చైవం వేద యశ్చ నోపసదా వై మహాపురం జయన్తీతి, త ఇషగ్ం సమస్కుర్వతాగ్ని మనకిగ్ం సోమగ్ం శల్యం విష్ణుం తేజనం తేఽబ్రువన్ క ఇమా మసిష్యతీతి (1) **రుద్ర ఇత్యబ్రువన్ రుద్రో వై కరూరః సోఽస్యత్వితి, సోఽబ్రవీద్వరం వృణా అహమేవ పశూనామధిపతిరసానీతి** తస్మాద్రుద్రః పశూనామధిపతిస్తాగ్ం రుద్రోఽవాస్పృజత్స **త్రిస్రః పురో భిత్త్వైభ్యో లోకేభ్యోఽసురాన్ ప్రాణుదత-**

- తైత్తిరీయ సంహిత - 8/2/3

2. అసాధ్యుడైన శివుని పార్వతి సాధించుకొనగలగటంలో ఆమెకున్న అనన్యభక్తి, దృఢ భావబంధం అచలిత విశ్వాసం కారణాలు. పార్వతి తానే ప్రకటించిన కారణాలు కాళిదాసు మాటల్లో-

శ్లో॥ వివక్షతా దోషమపి చ్యుతాత్మనా - త్వయైకమీశం ప్రతి సాధు భాషితామ్ ।
యమామనన్త్యాత్మభువోఽపి కారణం - కథం స లక్ష్యప్రభవో భవిష్యతి ॥

శ్లో॥ అలం వివాదేన యథా(శ్రుతస్త్వయా – తథా విధస్తావదశేషమస్తు సః ।
మమాత్ర భావైకరసం మనఃస్థితం – న కామవృత్తిర్వచనీయమీక్షతే ॥ – కుమారసంభవం – 5/81,82

| | | | |
|---|---|---|---|
| 3. **అజైషీత్ :** | **అజైషీత్** | అజైష్టామ్ | అజైషుః |
| | అజైషీః | అజైష్టమ్ | అజైష్ట |
| | అజైషమ్ | అజైష్వ | అజైష్మ |
| **వశయామ్ బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ పుచ్ఛేన కచ్ఛపతనోః పవనస్య పృష్ఠ-మచ్ఛోఽవలమ్బ్య సరిదర్ణవశైలపూర్ణామ్ ।**
**సిద్ధార్థఖణ్డమివ కుణ్డలిరాట్ సుపృథ్వీం – పృథ్వీమయం కిల బిభర్తి ఫణాతపత్రే॥20**

**అ :** ఆదిశేషుని గొప్పతనాన్ని సఖి రుక్మిణికి తెలియజేయటం (విడిగా). –వసంతతిలక.

**అ :** అచ్ఛః కుండలి–రాట్ కచ్ఛప–తనోః పవనస్య పృష్ఠం పుచ్ఛేన అవలంబ్య సరిద్–అర్ణవ–శైల–పూర్ణాం సుపృథ్వీం ఫణా+ఆతపత్రే సిద్ధార్థ–ఖండమ్ ఇవ బిభర్తి కిల.

**ప్ర :** అచ్ఛః = నిర్మలుడైన, కుండలి–రాట్ = నాగరాజు (కుండలీనాం రాట్), కచ్ఛప–తనోః = తాబేటి రూపాన్ని ధరించిన (కచ్ఛపస్య తనుః ఇవ తనుః యస్య సః), పవనస్య = ముఖ్య ప్రాణునియొక్క, పృష్ఠమ్ = వీపును, పుచ్ఛేన = తోకతో, అవలంబ్య = పట్టుకొని, సరిద్... పూర్ణామ్ : సరిద్ = నదులు, అర్ణవ = సముద్రాలు, శైల = కొండలతో, పూర్ణామ్ = నిండినట్టి (సరిద్భిః అర్ణవైః శైలైశ్చ, పూర్ణామ్), సు–పృథ్వీమ్ = చాలా విశాలమైన భూమిని, ఫణా+ఆతపత్రే : ఫణా = పడగ అనే, ఆతప–త్రే = గొడుగుపై, సిద్ధార్థ–ఖండమ్ ఇవ : సిద్ధార్థ = తెల్ల ఆవగింజయొక్క (సిద్ధార్థస్త్వేష ధవళః–అమరకోశః–వైశ్య–18), ఖండమ్–ఇవ = ముక్కనువలె, బిభర్తి కిల = భరిస్తున్నాడు గదా! (భృ ధారణపోషణయోః –జుహోత్యాది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** పవిత్రుడైన ఈ నాగరాజు కూర్మరూపాన్ని ధరించిన నారాయణుని వీపును తన తోకతో పట్టుకొని నదులతో, సముద్రాలతో, కొండలతో కూడి బాగా విశాలమైన ఈ భూమిని తెల్ల ఆవగింజ ముక్కలాగా భరిస్తాడు గదా!

**వి :** 1. భూమి విశాలమైనది. నదులు, సముద్రాలు, కొండలతో సహా. అయితే అంత విశాలమైన భూమిని ఆవగింజముక్కలాగా తన పడగపై ధరిస్తున్నాడు నాగరాజు. ఆధేయమే పెద్దది అయి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంటే దాన్ని ఆవగింజముక్కలాగా పడగ భరిస్తోందంటే ఇక ఆ పడగ ఎంత విశాలమై వుండాలి?

కాబట్టి విశాలమైన ఆధేయంకన్న ఆధారం మరీ విశాలమని వర్ణించటంతో అది అధికాలంకారమవుతుంది. **'పృథ్వాధేయాద్యదాధారాధిక్యం తదపి తన్మతమ్'** – (కు.66)

2. సిద్ధార్థ పదానికి తెల్లఆవాలు అని అర్థమయినా ఇక్కడ కవి వివక్ష ఆవాలు అని మాత్రమే కావచ్చు. తెల్ల, నల్ల అని గుణవిశేషానికి ప్రాధాన్యముండక పోవచ్చు. ఎందుకంటే ఇక్కడ వైశాల్యప్రస్తావనమే కానీ వర్ణ (రంగు) ప్రస్తావన అవసరం లేదు.

| | | | |
|---|---|---|---|
| 3. **బిభర్తి :** | **బిభర్తి** | బిభృతః | బిభ్రతి |
| | బిభర్షి | బిభృథః | బిభృథ |
| | బిభర్మి | బిభృవః | బిభృమః. |

*

శ్లో॥ సోఽయం గరుజ్జనిమరుజ్జవచాలితాద్రి-
దీ్వపామ్బురాశిరహివర్ణ్యబలః సుపర్ణః ।
ప్రాదాన్నిరుధ్య బలినా బలినా సమం యో
గోమన్తమూర్ధ్ని ముకుటం నిజదేవతాయై ॥ 16-21

అ : గరుడుని మహత్త్వాన్ని సఖి వర్ణించటం. -వసంతతిలక.

అ : అహి-వర్ణ్య-బలః గరుత్-జని-మరుత్-జవ-చాలిత+అద్రి-ద్వీప+అంబు-రాశిః అయం సః సుపర్ణః యః బలినా బలినా సమం నిరుధ్య గోమంత-మూర్ధ్ని నిజ-దేవతాయై ముకుటం ప్రాదాత్.

ప్ర : అహి-వర్ణ్య-బలః : అహి = పాములచే, వర్ణ్య = వర్ణింపదగిన, బలః = బలంగల వాడూ (అహిభిః వర్ణ్యం బలం యస్య సః), గరు.... రాశిః : గరుత్ = రెక్కల నుండి, జని = పుట్టిన, మరుత్ = గాలియొక్క, జవ = వేగంచేత, చాలిత = కదలింపబడిన, అద్రి = కొండలు, ద్వీప = ద్వీపాలు, అంబు-రాశిః = సముద్రాలు గలవాడూ అయిన (గరుద్భ్యాం జనిః యస్య సః, చ అసౌ మరుత్ చ, తస్య జవః, తేన చాలితాః అద్రయః ద్వీపాః అంబూనాం రాశయః చ యేన సః), అయమ్ = ఈయన, సః = ఆ, సుపర్ణః = గరుత్మంతుడు, యః = ఎవరయితే, బలినా = శక్తిమంతుడైన, బలినా సమమ్ = బలితో, నిరుధ్య = పోరాడి, గోమంత-మూర్ధ్ని : గోమంత = గోమంతమనే కొండయొక్క, మూర్ధ్ని = పై భాగాన (గోమన్తస్య మూర్ధ్నా తస్మిన్), నిజ-దేవతాయై = తన దేవుడైన కృష్ణునకు (నిజా చ సా దేవతా, తస్యై), ముకుటమ్ = కిరీటాన్ని, ప్ర+అదాత్ = ఇచ్చాడో! (ప్ర-దా దానే-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఈయన పక్షిరాజు. తన రెక్కలనుండి వెలువడిన గాలియొక్క వేగంచేత కొండలను, ద్వీపాలనూ, సముద్రాలనూ కదిలించగలవాడు. బలిష్ఠుడైన బలితో పోరాడి గోమంత పర్వత శిఖరంపై తన స్వామి అయిన కృష్ణునకు కిరీటాన్ని అందించాడు.

**వి :** 1. గరుడుని రెక్కల శక్తిని గురించి మహా భారతంలోని **గరుడోపాఖ్యానం**లో రెండు చక్కని పద్యాలున్నాయి.

ఉ. ఆతత **పక్షమారుత రయప్రవికంపిత ఘూర్ణితాచల**
**వ్రాత మహార్ణవుండు**, బలవన్నిజదేహసముజ్జ్వలప్రభా
ధూత పతంగతేజుఁడు దితుండయి తార్క్ష్యుడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్. – ఆదిపర్వం-2/37

ఇది గరుడుడు పుట్టిన సమయంలోనిది కవివచనం.

ఇంద్రుడితో తనశక్తిని గురించి తానే చెప్తున్న పద్యం మరొకటి-

ఉ. స్థావరజంగమప్రవితతంబగు భూవలయంబునెల్ల నా
లావునఁ బూని తాల్తు **నవిలంఘ్యపయోధిజలంబులెల్లర**
**త్నావళితోన చల్లుదు బృహన్నిజపక్ష సమీరణంబునన్**
దేవగణేశ ! యీక్షణమ త్రిమ్మరివత్తుఁ ద్రివిష్టపంబులన్. -ఆదిపర్వం-2/113

2. బలి ప్రహ్లాదుని మనుమడు, విరోచనుని కొడుకు. మహాబలి అని కూడా ఈయనకు వ్యవహారం. ఒకసారి కృష్ణుడు గోమంతగిరిపై వున్నప్పుడు ఈ బలి ఆయన కిరీటాన్ని అపహరించాడనీ, గరుడుడు దాన్ని తిరిగి తెచ్చి కృష్ణునకు సమర్పించాడనీ పురాణగాథ.

**కర్ణాటక రాష్ట్రంలోని మాండ్యజిల్లాలోని తిరునారాయణపురం (మేల్కోటి)లో కావేరీతీరాన యాదగిరి**

**పాదాలదగ్గరవున్న తిరునారాయణ పెరుమాళ్ దేవాలయంలో 'వైరముడి' (గరుడుడు తెచ్చిన వజ్రకిరీటాన్ని ధరింపజేయటం) ఉత్సవాన్ని ప్రతిసంవత్సరం జరుపుతుంటారు.**

3. **ప్రాదాత్ (ప్ర+అదాత్) :**

| | | |
|---|---|---|
| **ప్రాదాత్** | ప్రాదాతామ్ | ప్రాదుః |
| ప్రాదాః | ప్రాదాతమ్ | ప్రాదాత |
| ప్రాదామ్ | ప్రాదావ | ప్రాదామ. |

*

**శ్లో॥ స విష్ణువాహత్వమవాప తార్క్ష్య-స్తపోభిరప్యన్యసురైరసాధ్యమ్ ।**
**తదీయతల్పత్వమహీశ్వరోఽయం - విముక్తిమార్గౌ కిల తౌ సురాణామ్ ॥ 16-22**

**అ :** సః తార్క్ష్యః అన్య-సురైః తపోభిః అపి అసాధ్యం విష్ణు-వాహత్వమ్ ఆప. అయమ్ అహి+ఈశ్వరః తదీయ-తల్పత్వమ్ ఆవాప. తౌ సురాణాం విముక్తి-మార్గే కిల.

**ప్ర :** సః తార్క్ష్యః = ఆ గరుత్మంతుడు, అన్య-సురైః = ఇతరదేవతలచే (అన్యే చ తే సురాః తైః), తపోభిః అపి = తపస్సులచేతగూడా, అసాధ్యమ్ = సాధింపవీలుగానీ, విష్ణు-వాహత్వమ్ = విష్ణువుకు వాహనం కావటాన్ని, ఆవాప = పొందాడు. (అవ+ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), అయమ్ = ఈ, అహి+ఈశ్వరః = నాగరాజు, తదీయ-తల్పత్వమ్ : తదీయ = ఆ విష్ణువుయొక్క, తల్పత్వమ్ = పడకగా వుండటాన్ని (తదీయం చ తత్ తల్పం, తస్య భావః ), (ఆవాప = పొందాడు), తౌ = ఆ ఇద్దరూ, సురాణామ్ = దేవతలకు, విముక్తి-మార్గౌ కిల = మోక్షానికి బాటలు కదా! (విముక్తేః మార్గౌ)

**తా ॥** గరుత్మంతుడు విష్ణువునకు వాహన మయ్యాడు. నాగరాజు శయ్య అయ్యాడు. దేవతలు తపస్సు చేసినా దీనిని సాధించలేరు. నా గరుడుడు, నాగరాజులు దేవతలకు ముక్తిమార్గాలు.

**వి :** 1. **ఆప :**

| | | |
|---|---|---|
| **ఆప** | ఆపతుః | ఆపుః |
| ఆపిథ | ఆపథుః | ఆప |
| ఆప | ఆపివ | ఆపిమ |

2. ఛందస్సు - ఉపేంద్రవజ్ర.

*

**శ్లో॥ గరుత్మదంసాచలనీలమేఘం - ఫణీంద్రహారోచ్చయనీలరత్నమ్ ।**
**ఉమేశహంసప్రియపాదపద్మం - పతిం సతీ సా చకమే రమేశమ్ ॥ 16-23**

**అ :** రుక్మిణి దేవతలనందరినీ తిరస్కరించి కృష్ణుని పతిగా వరించటం (కవి వచనం).

**అ :** సా సతీ గరుత్మద్-అంస+అచల-నీల-మేఘం ఫణి+ఇంద్రహార+ఉచ్చయ-నీల-రత్నమ్ ఉమేశ-హంస-ప్రియ-పాద-పద్మం రమా+ఈశం పతిం చకమే.

**ప్ర :** సా సతీ = ఆ రుక్మిణి, గరుత్మద్... మేఘం : గరుత్మత్ = గరుడునియొక్క, అంస = భుజమనే, అచల = కొండమీదున్న, నీల-మేఘమ్ = నల్లనిమబ్బువంటివాడూ (గరుత్మతః అంస ఏవ అచలః, తస్మిన్ నీలశ్చ అసౌ మేఘః ఇవ, తమ్), ఫణీ... రత్నమ్ : ఫణి+ఇంద్ర = నాగరాజు అనే, హార = హారాలయొక్క, ఉచ్చయ = సమూహానికి, నీల-రత్నమ్ = నీలమణివంటివాడూ (ఫణీనామ్ ఇంద్రః, తస్య హారాణామ్ ఉచ్చయః, తస్మిన్ నీలం చ రత్నమ్ తత్ ఇవ తమ్), ఉమేశ... పద్మమ్ : ఉమా+ఈశ = శంకరుడనే, హంస = హంసకు, ప్రియ = ఇష్టమైన, పాద-పద్మమ్ = పాదకమలాలుగలవాడూ అయిన (ఉమాయాః ఈశః స ఏవ హంసః తస్య ప్రియౌ పాదౌ ఏవ పద్మే

యస్య తమ్), రమా+ఈశమ్ = లక్ష్మీవల్లభుని, పతిమ్ = భర్తనుగా, చకమే = కోరుకొన్నది. (కమ్ కాన్తౌ (ఇచ్ఛా)-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి (బ్రహ్మ గరుడనాగరాజులను కాదని) లక్ష్మీవల్లభుని భర్తగా కోరుకొన్నది. ఆయన గరుడుని భుజా లనే కొండపై నీలమేఘంలా కనిపిస్తున్నాడు. నాగరాజుయొక్క హారాల సమూహానికి ఇంద్రనీలమణిలా భాసిస్తున్నాడు. శంకరుడనే హంసకు నచ్చిన పాదపద్మాలతో వెలుగొందుతున్నాడు.

**వి :** 1. అంస-అచల, ఫణీంద్ర-హార, ఉమేశ-హంస, పాద-పద్మ - ఈ నాలుగు తావులలో రూపకాలంకారం. గరుత్మంతుని భుజాలపై అచలత్వాన్ని, నాగరాజులో హారత్వాన్ని, ఉమేశునిలో హంసత్వాన్ని, పాదాలలో పద్మత్వాన్ని ఆరోపించినందువల్ల. నీలమేఘమ్ అన్నచోట లుప్తోపమాలంకారం. నీలరత్న మన్నప్పుడు కూడా లుప్తోపమయే. నీలమేఘం వంటివాడు, నీలరత్నంవంటివాడు అనకుండా నీలమేఘం, నీలరత్నం అని మాత్రమే స్వీకరిస్తే అప్పుడు రూపకాతిశయోక్త్యలంకారమవుతుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **చకమే :** | **చకమే** | చకమాతే | చకమిరే | |
| | చకమిషే | చకమాథే | చకమిధ్వే | |
| | చకమే | చకమివహే | చకమిమహే. | * |

**శ్లో॥ త్రివిష్టపేశోఽయమభూద్బలారి-స్త్రివిక్రమశ్రీచరణప్రసాదాత్ ।**
**విమథ్నతా తేన పయఃపయోధిం - విచిత్రసౌభాగ్యవృతః కృతోఽసౌ ॥ 16-24**

**అ :** ఇంద్రుని గురించి సఖి రుక్మిణికి చెప్పటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అయం బల+అరిః త్రి-విక్రమ-శ్రీ-చరణ-ప్రసాదాత్ త్రి-విష్టప+ఈశః అభూత్. పయః+పయోధిం విమథ్నతా తేన అసౌ విచిత్ర-సౌభాగ్య-వృతః కృతః.

**ప్ర :** అయమ్ = ఈ, బల+అరిః = ఇంద్రుడు (బలస్య అరిః), త్రివి... ప్రసాదాత్ : త్రివిక్రమ = నారాయణునియొక్క, శ్రీ = శుభకరాలయిన, చరణ = పాదాలయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహంతో (త్రివిక్రమస్య శ్రియౌ చ తౌ చరణౌ తయోః ప్రసాదాత్), త్రివిష్టప+ఈశః = స్వర్గాధిపతి (త్రివిష్టపస్య ఈశః) అభూత్ = ఆయెను (భూ సత్తాయామ్-లుఙ్-ప్ర.ఏ.), పయః+పయోధిమ్ = పాలకడలిని (పయాంసి ఏవ పయాంసి తాని ధీయన్తే అస్మిన్నితి తమ్), విమథ్నతా = చిలుకుతున్న, తేన = ఆ విష్ణువుచే, అసౌ = ఆ ఇంద్రుడు, విచిత్ర... వృతః : విచిత్ర = వింతలయిన, సౌభాగ్య = సంపదలచే, వృతః = వరింపబడినవాడుగా (విచిత్రైః సౌభాగ్యైః వృతః), కృతః = చేయబడ్డాడు. (కృ ధాతువుపై క్త ప్రత్యయం కర్మార్థకంలో)

**తా ॥** ఈ ఇంద్రుడు నారాయణశ్రీచరణానుగ్రహంవల్ల స్వర్గాధిపతి అయ్యాడు. పాలకడలిని మథించినపుడు అంతులేని సౌభాగ్యం ఈ ఇంద్రుని వరించింది.

**వి :** 1. పాలకడలినుండి పుట్టిన అమృతం ఇంద్రుని అధీనంలోనే వుంటుంది. కామధేనువు వేల్పుమునుల దగ్గరుంటే కల్పవృక్షం, ఐరావతం ఇంద్రునిదగ్గరే వుంటాయి. సముద్రమథన ఫలితమైన అమృతం, సర్వఫలప్రదాత్రి అయిన కల్పవృక్షం తన అధీనంలో వుంటే అంతకన్న కావలసినదేముంటుంది ఇంద్రుడికి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ | |
| | అభూః | అభూతమ్ | అభూత | |
| | అభూవమ్ | అభూవ | అభూమ. | * |

**శ్లో॥ కల్పద్రుమః కరివరః కవివర్ణ్యవాజీ**
**నిత్యం వశేఽస్య కిల దేవి! సభాం స దైవీమ్ ।**
**మధ్యే మహాసనగతః పరిపాత్యజస్ర-**
**మిన్ద్రోఽయమిన్ద్రపదయోగ్యమహావిభూతిః॥ 16-25**

**అ :** ఇంద్రవైభవాన్ని రుక్మిణికి సఖి తెలియజేయటం. -వసంతతిలక.

**అ :** దేవి! కల్ప-ద్రుమః కరి-వరః కవి-వర్ణ్య-వాజీ నిత్యమ్ అస్య వశే (సన్తి) కిల. ఇంద్ర-పద-యోగ్య-మహా-విభూతిః సః అయమ్ ఇంద్రః మధ్యే మహాసనగతః దైవీం సభామ్ అజస్రం పరిపాతి.

**ప్ర :** దేవి! = ఆర్యా!, కల్ప-ద్రుమః = కల్పవృక్షం (కల్ప ఇతి ద్రుమః), కరివరః = శ్రేష్ఠగజం ఐరావతం (కరీణాం వరః ), కవి-వర్ణ్య-వాజీ : కవి = కవులచే, వర్ణ్య = వర్ణింపదగిన, వాజీ = గుఱ్ఱం (ఉచ్చైశ్రవసం) (కవిభిః వర్ణ్యశ్చ అసౌ వాజీ), నిత్యమ్ = ఎప్పుడూ, అస్య = ఆ ఇంద్రునికి, వశే = లోబడి (నవి), (సన్తి = వుంటాయి), ఇంద్ర... విభూతిః : ఇంద్ర = ఇంద్రు డనే, పద = స్థానానికి, యోగ్య = సముచితమైన, మహావిభూతిః = మేటి సంపదగల (ఇంద్ర ఇతి పదం తస్య యోగ్యా మహతీ చ సా విభూతిః యస్య తమ్), సః+అయమ్-ఇంద్రః = ఆ ఈ ఇంద్రుడు, మధ్యే = సభామధ్యంలో, మహా+ఆసన-గతః = గొప్ప ఆసనంపై నుండి (మహశ్చ తత్ ఆసనం తస్మిన్ గతః), దైవీం-సభామ్ = దివ్యసభను-సుధర్మను (స్యాత్సుధర్మా దేవసభా-అమరకోశః-స్వర్గ-48), అజస్రమ్ = ఎల్లప్పుడు, పరిపాతి = చక్కగా పాలిస్తున్నాడు. (పరి పా రక్షణే - అదాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** దేవీ! కల్పవృక్షం, ఐరావతం, కవులు వర్ణింపదగిన గుఱ్ఱం (ఉచ్చైశ్రవసం) ఎప్పుడూ ఈ ఇంద్రుని అధీనంలో వుంటాయి. ఇంద్రపదవికి తగిన మహైశ్వర్యంతో సభామధ్యంలో సింహాసనంపై ఆసీనుడై ఈ ఇంద్రుడు దేవసభను (సుధర్మను) పరిపాలిస్తుంటాడు.

**వి :** 1. **ఇంద్రపదయోగ్యమహావిభూతి** ఋగ్వేదంలో కనిపిస్తుంది. ఋగ్వేదంలోని సూక్తాలలో దాదాపు నాలుగవభాగం ఇంద్రపరంగా కనిపిస్తాయి. అగ్ని తర్వాత అంతటి స్థానం ఇంద్రునకు ఋగ్వేదంలో కనిపిస్తుంది. తరువాత్తరువాత పురాణాల కాలంలో ప్రజలకు స్వర్గం మీద మోజు పెరగటం, స్వర్గాధిపతి అయిన ఇంద్రుని విలువ మాత్రం తగ్గటం కనిపిస్తుంది. బ్రహ్మ, విష్ణు, శివాది దేవతలను ప్రధానులను చేస్తూ ఇంద్రుని స్థానాన్ని తగ్గించటం, అదేపనిగా వాళ్ళమీద ఆధారపడినట్లు చిత్రించటం పురాణాలలో కనిపిస్తుంది. వేదకాలంలో ప్రజలకవసరమైన ప్రాకృతిక ప్రయోజనాలతో సంబద్ధమైన ఇంద్రశక్తి, పురాణాల కాలంలో యజ్ఞాలప్రయోజన ప్రాకృతికప్రయోజనాలను ప్రక్కన పెట్టి స్వర్గప్రాప్తికి పరిమితమైంది. దానితో ప్రజలు ఇంద్రుని కూడా పట్టించుకోనంతగా ఇంద్ర (స్వర్గ)లోకం మీద దృష్టిపెట్టారు. "స్వర్గే లోకే న భయం కించనాస్తి, న తత్ర త్వం జరయా బిభేషి" (కఠోపనిషత్తు) వంటి ఉపనిషద్వచనాలు కూడా ప్రజల ఆరాటానికి దోహదం చేశాయి. అందుకే ఈనాడు ప్రజల కార్యక్రమాలు పుణ్యాన్నీ, స్వర్గాన్నీ దాటి వెళ్ళటం లేదు.

| | | | |
|---|---|---|---|
| 2. **పరిపాతి :** | **పరిపాతి** | పరిపాతః | పరిపాన్తి |
| | పరిపాసి | పరిపాథః | పరిపాథ |
| | పరిపామి | పరిపావః | పరిపామః. |

*

**శ్లో॥ అయం సురాణాం గురురేష ధర్మః - సుధాకరోఽసౌ స సహస్రరశ్మిః ।**
**అయం చ రత్నాకరశబ్దితోఽగ్ర్యే! - మహత్త్వమేషామభిధైవ వక్తి ॥ 16-26**

**అ :** బృహస్పతి మొదలగువారిని సఖి పరిచయం చేయటం (రుక్మిణికి). –ఉపేంద్రవజ్ర.

**అ :** అగ్ర్యే! అయం సురాణాం గురుః ఏషః ధర్మః అసౌ సుధాకరః సః సహస్రరశ్మిః అయం చ రత్న+ఆకర–శబ్దితః ఏషాం మహత్త్వమ్ అభిధా ఏవ వక్తి.

**ప్ర :** అగ్ర్యే! = శ్రేష్ఠురాలా! అయమ్ = ఈయన, సురాణామ్ = దేవతలకు, గురుః = గురువు (బృహస్పతి), ఏషః = ఈయన, ధర్మః = యముడు (ధర్మాః పుణ్యయమన్యాయ–స్వభావాచారసోమపాః–అమరకోశః–నానార్థ–140), అసౌ = ఆయన, సుధాకరః = చంద్రుడు (సుధా కరేషు యస్య సః), సః = ఆయన, సహస్ర–రశ్మిః = సూర్యుడు (సహస్రాణి రశ్మయః యస్య సః), అయమ్ = ఈయన, రత్నాకర–శబ్దితః : రత్నాకర = రత్నాకరుడు (సముద్రుడు) అని, శబ్దితః = పిలువబడేవాడు, ఏషామ్ =వీరియొక్క, మహత్త్వమ్ = గొప్పతనాన్ని, అభిధా ఏవ = పేరే, వక్తి = చెప్తుంది. (వచ పరిభాషణే పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** చెలీ! శ్రేష్ఠురాలా! ఈయన దేవగురువు. ఈయన యమధర్మరాజు. ఆయన చంద్రుడు. ఆయన సూర్యుడు. ఈయన వరుణుడు, రత్నాకరుడు కూడా. వీళ్ళపేర్లే వీళ్ళ గొప్పతనాన్ని తెలియజేస్తాయి.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. వక్తి :** | **వక్తి** | వక్తః | – | |
| | వక్షి | వక్థః | వక్థ | |
| | వచ్మి | వచ్వః | వచ్మః. | * |

**శ్లో॥ ఇమే సురాః శ్రీపతినిత్యసేవా–వియోగభీత్యాఽనిమిషా వినిద్రాః ।**
**ప్రపేదిరే తత్కరుణాప్రభూత–సుధారసాస్వాదనతోఽమరత్వమ్ ॥ 16–27**

**అ :** దేవతల అనిమిషత్వానికి కారణాన్ని సఖి రుక్మిణికి విన్నవించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రీపతి–నిత్య–సేవా–వియోగ+భీత్యా అనిమిషాః వినిద్రాః ఇమే సురాః తత్–కరుణా–ప్రభూత–సుధా–రస+ఆస్వాదనతః అమరత్వం ప్రపేదిరే.

**ప్ర :** శ్రీపతి... భీత్యా : శ్రీ–పతి = విష్ణువుయొక్క, నిత్య–సేవా = ప్రతిదినసేవయందలి, వియోగ = ఎడబాటు వలని, భీత్యా = భయంతో (శ్రీపతేః నిత్యాయాః సేవాయాః వియోగాత్ భీత్యా), అనిమిషాః = రెప్పపాటులేనివారూ, వినిద్రాః = కునుకుపట్టనివారూ అయిన, ఇమే = ఈ, సురాః = దేవతలు, తత్... స్వాదనతః : తత్ = ఆ శ్రీపతియొక్క, కరుణా = అనుగ్రహంచేత, ప్రభూత = పుట్టిన, సుధా–రస = అమృతరసంయొక్క, ఆస్వాదనతః = త్రాగుటచేత, అమరత్వమ్ = దేవత్వాన్ని, ప్రపేదిరే = పొందారు.

**తా ॥** దేవతలు శ్రీపతినిత్యసేవలలో వియోగమేర్పడుతుందేమో అన్న భయంతో రెప్పవాల్చటం లేదు. కునుకు తీయటం లేదు. ఆ శ్రీపతి కరుణతో పుట్టిన అమృతాన్ని త్రాగినందువల్లనే వీరికి అమరత్వం సిద్ధించింది.

**వి :** 1. దేవతలు అమృతాన్ని పొందటంలో నారాయణుని దోహదం చాలా వుంది. ఆలోచన చెప్పటంతో ప్రారంభించి, కూర్మరూపాన్ని ధరించి, మోహినీరూపంతో దానిని పంచిపెట్టటం వరకు అంతా ఆయన అనుగ్రహమే. దేవతలకైనా, మానవులకైనా ఎవరో ఒక సమర్థుడు పూనుకొన్నప్పుడే సఫల మవుతాయి.

2. ఇది **అతిశయోక్త్యలంకారం**. దేవతల అనిమిషత్వానికి వాస్తవంగా కారణం శ్రీపతిసేవా వియోగభయం కాదు. ఆ రెండింటికీ సంబంధంలేకపోయినా సంబంధాన్ని కల్పించి నందువల్ల అది అతిశయోక్తి, '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' – (కు.39)

| | | | | |
|---|---|---|---|---|
| 3. **ప్రపేదిరే :** | ప్రపేదే | ప్రపేదాతే | **ప్రపేదిరే** | |
| | ప్రపేదిషే | ప్రపేదాథే | ప్రపేదిధ్వే | |
| | ప్రపేదే | ప్రపేదివహే | ప్రపేదిమహే. | * |

**శ్లో॥ మరుత్వదత్యుచ్ఛ్రితభాగ్యహేతుం - సురౌఘసఞ్జీవనమూలభూతమ్ ।**
**నరాంస్తృణీకృత్య జగామ భైష్మీ - పరిస్ఫురద్భూషణభూషణాఙ్గీ ॥ 16-28**

**అ :** రుక్మిణి కృష్ణునే వరించిందని కవివచనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పరిస్ఫురత్-భూషణ-భూషణ+అంగీ భైష్మీ నరాన్ తృణీకృత్య మరుత్వద్-అత్యుచ్ఛ్రిత-భాగ్య-హేతుం సుర+ఓఘ-సంజీవన-మూల-భూతం (కృష్ణం ప్రతి) జగామ.

**ప్ర :** పరి... ణాంగీ : పరిస్ఫురత్ = వెలుగొందుతున్న, భూషణ = నగలకు, భూషణ = ఆభరణమైన, అంగీ = శరీరావయవాలుగల (పరిస్ఫురతాం భూషణానాం భూషణమ్ అంగం యస్యాస్సా), భైష్మీ = రుక్మిణి, నరాన్ = నరులను, తృణీకృత్య = గడ్డిపరకగా తిరస్కరించి, మరు... హేతుమ్ : మరుత్వద్ = ఇంద్రునియొక్క (ఇంద్రో మరుత్వాన్ మఘవా-అమరకోశః-స్వర్గ-41), అతి+ఉచ్ఛ్రిత = బాగా పెరిగిన (జాతోన్నద్ధ ప్రవృద్ధేషు స్యాదుచ్ఛ్రిత ఉత్థితః-నానార్థమంజరీ-పంక్తి-781), భాగ్య = సంపదకు, హేతుమ్ = కారణమైనవాడై, సురౌ... భూతమ్ : సుర+ఓఘ = దేవగణంయొక్క, సంజీవన = అమృతానికి (సమ్యక్ జీవన్తి అనేన), మూల-భూతమ్ = కారణమైనవాడూ అయిన కృష్ణుని దగ్గరకే, జగామ = వెళ్ళింది. (గమ్ గతౌ -పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి నరులను కూడా తృణీకరించి వరించటానికై కృష్ణునిదగ్గరకే వెళ్ళింది. ఎందుకంటే ఇంద్రుని మహోన్నతవైభవానికి కారణం కృష్ణుడే. దేవగణానికి సంజీవన కారణం కూడా కృష్ణుడే.

**వి :** 1. తానెంతవాడు అన్నదానికన్న తనవారెంతటివారు అన్నది మనుషులకయినా, దేవతలకైనా, రాక్షసులకైనా విలువ పెంచుతుంది. గురుపాండిత్యాన్ని శిష్యులపాండిత్యాన్ని బట్టి నిర్ణయించాలని కాళిదాసు మాళవికాగ్నిమిత్రంలో ప్రస్తావిస్తాడు.

శ్లో॥ శిష్టాక్రియా కస్య చిదాత్మసంస్థా - సంక్రాన్తిరన్యస్య విశేషయుక్తా ।
యస్యోభయం సాధు స శిక్షకాణాం - ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ ॥ - మాళవికాగ్నిమిత్రమ్-1/16

క. ధనపతి సఖుఁడై యుండియు
నెనయంగా శివుఁడు భిక్షమెత్తఁగ వలసెన్
దనవారికెంత యున్నను
దన భాగ్యమె తనది కాదె తథ్యము సుమతీ!

అంటాడు బద్దెన. కుబేరుడు శివుని మిత్రడు అయినా శివుడు ఆదిభిక్షువే.

కాబట్టి తనను నమ్ముకొన్న దేవతలను సంపన్నులను చేయగలగటం కృష్ణుని ప్రధానార్హత. అవతారాలను స్వీకరించటంలో అదే కనిపిస్తుంది. అందువల్లనే ఆశ్రితపక్షపాతమన్నది ఒక విలువగా చెలామణిలోనికి వచ్చింది.

| | | | |
|---|---|---|---|
| 2. **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ అయం ముకున్దః సఖి! చిత్రమోద-మయావ్యయాఙ్గోఽఖిలదోషశూన్యః ।**
**అవాతరద్విశ్వజనస్య గుప్త్యై - గుణాంబురాశిః కిల భూతలేఽస్మిన్ ॥ 16-29**

**అ :** రుక్మిణిసఖి కృష్ణుని మహత్త్వాన్ని వర్ణిస్తూ పరిచయం చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సఖి! అయం ముకున్దః చిత్-ప్రమోదమయ+అవ్యయ+అంగః అఖిల-దోష-శూన్యః గుణ+అంబు-రాశిః విశ్వ-జనస్య గుప్త్యై అస్మిన్ భూతలే అవాతరత్ కిల.

**ప్ర :** సఖి! = చెలీ!, అయమ్ = ఈ, ముకున్దః = కృష్ణుడు/ మోక్షప్రదాత (ముకుం దదాతీతి), చిత్ప్ర... యాంగః : చిత్ = జ్ఞానం (చిద్ జ్ఞప్తిః జ్ఞానం చ-వైజయన్తీ-బ్రాహ్మణ-164), ప్రమోద-మయ = ఆనందమయమూ, అవ్యయ = నశ్వరమూ అయిన, అంగః = అవయవాలు గలవాడు (చిచ్చ ప్రమోదశ్చ చిత్ప్రమోదౌ, తౌ ఏవ తన్మయాని అవ్యయాని చ అంగాని యస్య సః), అఖిల-దోష-శూన్యః : అఖిల = సమస్తమైన, దోష = దోషాలు, శూన్యః = లేనివాడు. (అఖిలైః దోషైః శూన్యః), గుణ+అంబు-రాశిః = గుణసముద్రుడు (గుణైః అంబూనాం రాశిరివ), విశ్వ-జనస్య = సమస్తజనంయొక్క, గుప్త్యై = రక్షణకై, అస్మిన్ భూతలే = ఈ భూలోకంలో, అవ+అతరత్ కిల = అవతరించాడు గదా! (అవ తౄ ప్లవనతరణయోః-పరస్మైపది-లజ్-ప్ర.ఏ.)

**తా ॥** చెలీ! ఈ ముకుందుడు జ్ఞానానందమయస్వరూపుడు. ఏ దోషమూ లేనివాడు. గుణసాగరుడు. లౌకికజనులసంరక్షణకోసం ఈ భూతలంలో అవతరించినవాడు.

**వి :** 1. జ్ఞానిగా, ఆనందస్వరూపునిగా, జ్ఞానానందస్వరూపునిగ నిలవగలగటం అంత తేలిక అయిన విషయం కాదు. కర్మఫలసంన్యాసికి మాత్రమే అది సాధ్యం. కృష్ణుడు తత్స్వరూపుడు కాబట్టి అది సాధ్యమైంది.

శ్లో॥న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషులోకేషు కించన ।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి ॥ - భగవద్గీతా - 3/22

| | | | |
|---|---|---|---|
| 2. **అవాతరత్ :** | **అవాతరత్** | అవాతరతామ్ | అవాతరన్ |
| | అవాతరః | అవాతరతమ్ | అవాతరత |
| | అవాతరమ్ | అవాతరావ | అవాతరామ. |

*

**శ్లో॥ జగజ్జనిస్థేమలయాదిధర్మా - భవన్త్యముష్మాత్ కిల శాస్త్రయోనేః ।**
**అముష్య సామ్యం కతమః సురాణా-ముపైతి యద్రోమసు విశ్వకోశాః ॥ 16-30**

**అ :** కృష్ణుని మహిమాతిశయాన్ని సఖి రుక్మిణికి ప్రకారాంతరంగా వివరించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** జగత్-జని-స్థేమ-లయ+ఆది-ధర్మాః శాస్త్ర-యోనేః అముష్మాత్ భవన్తి కిల. యద్-రోమసు విశ్వ-కోశాః (తస్య) అముష్య సామ్యం సురాణాం కతమః ఉపైతి.

**ప్ర :** జగ... ధర్మాః : జగత్ = విశ్వంయొక్క, జని = పుట్టుక (జనిరుత్పత్తిరుద్భవః అమరకోశః-కాల-31), స్థేమ = నిలకడ, లయ = వినాశం, ఆది = మొదలయిన, ధర్మాః = లక్షణాలు (జగతః జనిః స్థేమా లయః చ ఆదౌ యేషాం తే చ తే ధర్మాః) ఆది పదం అవాంతరంగా వచ్చే చిన్న చిన్న తేడాలను సూచిస్తుంది.), శాస్త్ర-యోనేః = శాస్త్రం ప్రమాణంగా గల (శాస్త్రం యోనిః యస్య తస్మాత్), అముష్మాత్ = ఈయనద్వారా, భవన్తి కిల = కలుగుతాయి కదా! (భూ సత్తాయాం పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యద్-రోమసు = ఎవని రోమకూపాలలో, విశ్వ-కోశాః = బ్రహ్మాండాలు (కలవో), (తస్య) అముష్య = ఆ ఈయనకు, సామ్యమ్ = పోలికను, సురాణామ్ = దేవతలలో, కతమః = ఎవడు, ఉప+ఏతి = పొందగలడు. (ఉప-ఇ గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** విశ్వంయొక్క పుట్టుక, నిలకడ, అంతం మొదలుగాగల ధర్మాలు ఈయన ద్వారానే జరుగుతున్నాయి. ఈయన శాస్త్రమే ప్రమాణమైనవాడు. ఈయన రోమకూపంలోనే బ్రహ్మాండకోశాలుంటాయి. ఇటువంటి ఈయనతో దేవతలలో ఎవరు పోలికను పొందగలరు?

**వి :** బ్రహ్మసూత్రాలలోని రెండవ సూత్రం, మూడవ సూత్రం – '**జన్మాద్యస్యయతః**', '**శాస్త్రయోనిత్వాత్**' ఈ శ్లోకానికి మూలం. విష్ణుసహస్రనామస్తోత్రంలోని మొదటిశ్లోకం ఈ విషయాన్ని విస్తృతరూపంలో చెపుతుంది.

**శ్లో॥ విశ్వం విష్ణుర్వషట్కారః భూతభవ్యభవత్ప్రభుః ।**
**భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥**

| | | | |
|---|---|---|---|
| 2. **భవన్తి :** | భవతి | భవతః | **భవన్తి** |
| | భవసి | భవథః | భవథ |
| | భవామి | భవావః | భవామః |
| **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయన్తి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః. |

*

## శ్లో॥ సమస్తవేదాః కిల సేతిహాసాః – పురాణయుక్తాః స్మృతిభిః సహైనమ్ ।
## సమానశూన్యం ప్రభుమామనన్తి – ప్రమథ్య యోఽబ్ధిం లభతే స్మ లక్ష్మీమ్ ॥ 31

**అ :** కృష్ణుని మహిమాతిశయాన్ని వివరించటమే. –ఉపేంద్రవజ్ర.

**అ :** యః అబ్ధిం ప్రమథ్య లక్ష్మీం లభతే స్మ (తమ్) ఏనం స+ఇతిహాసాః పురాణ–యుక్తాః సమస్త–వేదాః స్మృతిభిః సహ సమాన–శూన్యం ప్రభుమ్ ఆమనన్తి కిల.

**ప్ర :** యః = ఎవరయితే, అబ్ధిమ్ = సముద్రాన్ని (అపః ధీయన్తే అస్మిన్ ఇతి), ప్రమథ్య = చిలికి, లక్ష్మీమ్ = లక్ష్మిని, లభతే–స్మ = పొందాడో (లభ్ ప్రాప్తౌ ఆత్మనేపది–లట్–ప్ర.ఏ. '**లట్ స్మే**' (అష్టాధ్యాయి 3–2–118) సూత్రంతో భూతకాలార్థం), (తమ్) ఏనమ్ = ఆ ఈయనను, స+ఇతిహాసాః = ఇతిహాసాలతో కూడినవీ (ఇతి హ ఆస ఇతి), పురాణ–యుక్తాః : పురాణ = పురాణాలతో, యుక్తాః = కూడినవీ అయిన (పురా అపి నవం, తైః యుక్తాః), సమస్త–వేదాః = అన్ని వేదాలూ (సమస్తాః చ తే వేదాః), స్మృతిభిః సహ = స్మృతులతో కూడా, సమాన–శూన్యమ్ = సాటిలేని (సమానేన శూన్యః, తమ్), ప్రభుమ్ = ప్రభువునుగా, ఆమనన్తి కిల = చెప్తున్నాయి గదా! (ఆ మ్నా అభ్యాసే (వైదిక్యాం స్తుతౌ) పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** సముద్రాన్ని చిలికి లక్ష్మిని పొందినవాడు ఈయన. ఇతిహాసాలతో, పురాణాలతో, స్మృతులతో కూడిన సమస్తవేదాలు ఈయనను సాటిలేని దైవంగా చెప్తున్నాయి.

**వి :** 1. ఇతిహాసాలు రామాయణ భారతాలు (2), పురాణాలు (18) –

భద్వయం మద్వయం చైవ బ్రత్రయమ్ వచతుష్టయమ్ । అనాపలింగకూస్కాని పురాణాని....

1. భవిష్యపురాణం 2. భాగవతపురాణం 3. మత్స్యపురాణం 4. మార్కండేయపురాణం 5. బ్రహ్మపురాణం 6. బ్రహ్మవైవర్తపురాణం 7. బ్రహ్మాండపురాణం 8. వరాహపురాణం 9. వామనపురాణం 10. విష్ణుపురాణం 11. వాయుపురాణం 12. అగ్నిపురాణం 13. నారదపురాణం 14. పద్మపురాణం 15. లింగపురాణం 16. గరుడపురాణం 17.కూర్మపురాణం 18. స్కాందపురాణం

స్మృతిగ్రంథాలు చాలా ఉన్నాయి. ఇవీ, వీటితో గూడిన వేదాలలో ప్రధానంగా ప్రతిపాదిస్తున్న విషయం నారాయణ సంబంధియే. '**తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః. దివీవ చక్షురాతతమ్**' అని ఋగ్వేదం చెప్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **లభతే :** | **లభతే** | లభేతే | లభన్తే |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభే | లభావహే | లభామహే |
| **ఆమనన్తి :** | ఆమనతి | ఆమనతః | **ఆమనన్తి** |
| | ఆమనసి | ఆమనథః | ఆమనథ |
| | ఆమనామి | ఆమనావఃఆమనామః. | * |

**శ్లో॥ యదీయపాదోఽణ్డకటాహభేదీ - విధాతృహస్తార్ఘ్యణసారవేదీ ।**
**మృగాక్షి! సోఽయం వివిధావతార-వియోజితాత్యుద్ధతభూమిభారః ॥ 16-32**

**అ :** కృష్ణుని పాదపద్మవైభవాన్ని వివరించటం, నారాయణుని అవతారలక్ష్యాన్నీ తెలియ జేయటం.

**అ :** మృగ+అక్షి! అండ-కటాహ-భేదీ యదీయ-పాదః విధాతృ-హస్త+అర్ఘ్యణ-సార-వేదీ సః అయం వివిధ+అవతార-వియోజిత+అతి+ఉద్ధత-భూమి-భారః

**ప్ర :** మృగ+అక్షి! = జింకకనులదానా!, అండ... భేదీ : అండ = బ్రహ్మాండమనే, కటాహ = ఒకానొకపాత్రను, భేదీ = బ్రద్దలుచేసే (అండమితి కటాహః, తస్య భేదీ), యదీయ-పాదః : యదీయ = ఏ కృష్ణునియొక్క, పాదః = కాలు, విధాతృ... వేదీ : విధాతృ = బ్రహ్మయొక్క, హస్త = చేతియొక్క, అర్ఘ్యణ = పూజయందలి (పూజనమస్యా పచితి సపర్యా-ర్చార్హణాస్సమాః అమరకోశః-బ్రహ్మ-34), సార = బలంయొక్క, వేదీ = జ్ఞానంగల (విధాతృః హస్తస్య అర్ఘ్యణస్య సారస్య వేదీ), సః అయమ్=ఆ ఈ కృష్ణుడు, వివిధా... భారః: వివిధ = రకరకాలయిన, అవతార = అవతారాలచేత, వియోజిత = పోగొట్టబడిన, అత్యుద్ధత = తీవ్రమైన, భూమి = పుడమియొక్క, భారః = భారంగలవాడు (భూభారాన్ని తొలగించిన వాడు) (వివిధైః అవతారైః వియోజితః అత్యుద్ధతశ్చ అసౌ భూమేః భారః యేన సః).

**తా ॥** బ్రహ్మాండభాండాన్ని బ్రద్దలు చేసిన ఈ కృష్ణుని పాదం బ్రహ్మచేతి పూజలోని సారం తెలిసినది. మృగనయనా! ఈ కృష్ణుడు వివిధావతారాలు ధరించి తీవ్రమైన ఈ భూభారాన్ని తొలగించేవాడు.

**వి :** 1. వామనరూపుడై నారాయణుడు బలిదానం స్వీకరించి బ్రహ్మాండాతసంవర్ధి అయినప్పుడు బ్రహ్మ ఆ ఊర్ధ్వపాదాన్ని సమర్చించాడు. అన్నమయ్య కొనియాడిన బ్రహ్మకడిగిన పాదమదే- ఆ సమర్చణను పోతన పద్యాలలో పరిశీలిద్దాం-

మ. తన పుట్టిల్లిదె పొమ్మటంచు నజుఁడుం దన్నాభిపంకేరుహం
బు నిరీక్షించి నటించి యున్నతపదంబుంజూచి తత్పాద సే
చనముంజేసెఁ గమండలూదకములం జల్లించి తత్తోయముల్
వినువీథిం బ్రవహించె దేవనదినా విశ్వాత్ము కీర్తిప్రభన్.

సీ. యోగమార్గంబున నూహించి బహువిధ - పుష్పదామంబులఁ బూజచేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి - ధూపదీపములఁ దోడ్తోన నిచ్చి
భూరి లాజాక్షతంబులు సల్లి ఫలములు - గానుకలిచ్చి రాగములఁ బొగడి
శంఖాదిరవముల జయఘోషములు సేసి - **'కరుణాంబునిధి! త్రివిక్రమ'** యటంచు

ఆ. బ్రహ్మమొదలు లోకపాలురు గొనియాడి
రెల్ల దిశల వనచరేశ్వరుండు
జాంబవంతుఁ దరిగి చాటె భేరీధ్వని
వెలయఁ జేసి విష్ణువిజయ మనుచు. -పోతనభాగవతము 8/628,630. *

**శ్లో॥ వివేకసఖ్యేతి విబోధితా సా - బభూవ తూష్ణీం కమలాఽఽత్తమాలా ।**
**ప్రహర్షచిహ్నాని పరం తదోచుః - ప్రభుం తమాకాంక్షతి రుగ్మిణీతి ॥ 16-33**

**అ :** కృష్ణుని మహత్త్వాన్ని విని రుక్మిణి మౌనంతో తన అభిప్రాయాన్ని ప్రకటించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** వివేక-సఖ్యా ఇతి విబోధితా సా ఆత్త-మాలా కమలా తూష్ణీం బభూవ. తదా ప్రహర్ష-చిహ్నాని పరం రుగ్మిణీ ప్రభుమ్ ఆకాంక్షతి ఇతి ఊచుః.

**ప్ర :** వివేక-సఖ్యా = (తన) వివేకమనే చెలిచేత, ఇతి = ఈ రీతిగా, విబోధితా = తెలుపబడిన, సా = ఆ, ఆత్త-మాలా = మాలను చేపట్టి (ఆత్తా మాలా యయా సా), కమలా = రుక్మిణి, తూష్ణీం బభూవ = మిన్నకుండెను. (భూ సత్తాయామ్-పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), తదా = అప్పుడు, ప్రహర్ష-చిహ్నాని = ఆనందసంకేతాలు (ప్రహర్షస్య చిహ్నాని), పరమ్ = మాత్రమే, రుగ్మిణీ = రుక్మిణి, ప్రభుమ్ = ప్రభువైన కృష్ణుని, ఆకాంక్షతి-ఇతి = కోరుతోంది అని (ఆ+కాంక్ష్ కాంక్షాయామ్ పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), ఊచుః = పలికాయి. (వచ పరిభాషణే అదాది-పరస్మైపది-లిట్-(ప్ర.బ.)

**తా ॥** తన వివేకసఖి అలా ప్రబోధించగా రుక్మిణి పూలమాలను చేతబట్టి మౌనంగా నిలబడింది. (తాను చెప్పక పోయినా) తన (మేన కనిపిస్తున్న) ఆనందచిహ్నాలు ఆమె కృష్ణునే కోరుతోందన్న విషయాన్ని తెలియజేస్తున్నాయి.

**వి :** 1. కంటిచూపులు, పెదవుల కదలికలు, పైకొనే పులకరింతలు, నడకలోని నిదానం, కదలికలలోని కాంతి మనస్సులోని భావాన్ని తెలియజేస్తాయి. దుష్యంతుడు శకుంతల చెప్పకపోయినా ఆమెకు తనపై వలపు గలదని హేతుబద్ధంగా ఆలోచిస్తున్న శ్లోకం-

శ్లో॥ వాచం న మిశ్రయతి యద్యపి మే వచోభిః
కర్ణం దదాత్యభిముఖం మయి భాషమాణే ।
కామం న తిష్ఠతి మదానన సంముఖీనా
భూయిష్ఠమన్యవిషయా నతు దృష్టిరస్యాః ॥ - అభిజ్ఞానశాకున్తలం-1/26

2. **బభూవ :** 16-19వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **ఊచుః :** | ఉవాచ | ఊచతుః | **ఊచుః** |
| | ఉవచిథ/ఉవక్థ | ఊచథుః | ఊచ |
| | ఉవాచ/ఉవచ | ఊచివ | ఊచిమ |
| **ఆకాంక్షతి:** | **ఆకాంక్షతి** | ఆకాంక్షతః | ఆకాంక్షన్తి |
| | అకాంక్షసి | అకాంక్షథః | ఆకాంక్షథ |
| | ఆకాంక్షామి | ఆకాంక్షావః | ఆకాంక్షామః. |

*

**శ్లో॥ తయోర్ముహూర్తావధి మధ్యదత్త-పటం వినిర్భిద్య మిథః స్పృశన్త్యః ।**
**ప్రభాః సదాఽఖణ్డితయోగభాగ్యం - విబోధయన్తి స్మ వివేకభాజః ॥ 16-34**

**అ :** మధ్యలో తెరపట్టినా రుక్మిణీకృష్ణులకాంతి పరస్పరం ప్రసరించటాన్ని వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ముహూర్త+అవధి తయోః మధ్య-దత్త-పటం వినిర్భిద్య మిథః స్పృశన్త్యః ప్రభాః వివేక-భాజః సదా అఖండిత-యోగ-భాగ్యం విబోధయన్తి స్మ.

**ప్ర :** ముహూర్త+అవధి = వివాహముహూర్తసమయంవరకు (ముహూర్తః అవధి యథా భవతి తథా), తయోః = ఆ రుక్మిణీకృష్ణులయొక్క, మధ్య-దత్త-పటమ్ : మధ్య = అంతరంగా (నడుమ), దత్త = నిలుపబడిన, పటమ్ =

వస్త్రాన్ని (తెరను), వినిర్భిద్య = చీల్చుకొని (వి-నిర్-భిద్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), మిథః = పరస్పరం, స్పృశన్త్యః = తాకుతున్న, ప్రభాః = కాంతులు, వివేక-భాజః = వివేకులకు (వివేకం భజన్తి ఇతి, తాన్), సదా = ఎల్లప్పుడు, అఖండిత-యోగ-భాగ్యమ్ : అఖండిత = ఎడతెగని, యోగ = కలయికయొక్క, భాగ్యమ్ = భాగ్యాన్ని (అదృష్టాన్ని) (అఖండితశ్చ అసౌ యోగః, తస్య భాగ్యమ్), విబోధయన్తి స్మ = తెలియజేసింది. (వి బుధ అవగమనే-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.బ.) 'స్మ' కలయిక వల్ల భూతకాలార్థం.

**తా ॥** రుక్మిణీకృష్ణులమధ్య తెరపట్టారు. ముమూర్తం అయిన వెంటనే దానిని తీస్తారు. అప్పటివరకు ఆ రుక్మిణీ కృష్ణుల కాంతులు తెరను చీల్చుకొని పరస్పరం తాకుతున్నాయి. తాకుతూ అవి ఆ ఇద్దరియొక్క అఖండయోగాన్ని (విడదీయరాని కలయికను) జ్ఞానులకు తెలుపుతున్నాయి.

**వి :**1. ముహూర్తం అయ్యేదాకా వధూవరులమధ్య తెర పట్టడం పాక్షికమైన ఒక సంప్రదాయం. (కొన్ని కులాలలో, కొన్ని శాఖలలో ఈ తెరపట్టడముండదు.) వధువు వరుని ప్రక్కన కూర్చున్న తరువాత తెరపట్టి, వరుని మధుపర్కంతో సత్కరిస్తారు. ఆపై ముహూర్తసమయంలో వధూవరులు పరస్పరం తలలపై గుడజీరకమిశ్రమాన్ని పెట్టిన వెంటనే తెరను తొలగిస్తారు. వధూవరపరస్పరదర్శనం కోసం వరుడు వధువును చూసేటప్పుడు-

'**అభ్రాతృఘ్నీం వరుణాపతిఘ్నీం బృహస్పతే ఇంద్రా పుత్రఘ్నీం లక్ష్యంతామస్యై సవితస్సువ**' - అనే మంత్రాన్ని, వధువు వరుని చూసేటప్పుడు

'**అఘోరచక్షురపతిఘ్నేధి; శివాపతిభ్యస్సుమనా స్సువర్చాః, జీవ సూర్దేవకామాస్యోనా శంనోభవ ద్విపదే శం చతుష్పదే**' - అనే మంత్రాన్ని పఠిస్తారు.

| | | | |
|---|---|---|---|
| 2. **విబోధయన్తి :** | విబోధయతి | విబోధయతః | **విబోధయన్తి** |
| | విబోధయసి | విబోధయథః | విబోధయథ |
| | విబోధయామి | విబోధయావః | విబోధయామః. |

*

**శ్లో॥ సీతాస్వయంవరమహోత్సవగానకాలే**
**జాతౌ రమాపులకమాధవమన్దహాసౌ ।**
**సా జానకీయమయమేవ హి రామచన్ద్రః**
**కిం తన్ముహూర్తకథయేతి హి శంసతః స్మ॥ 16-35**

**అ :** ఆ జానకీరాములే ఈ రుక్మిణీ కృష్ణులని చెప్తున్నట్లున్నవని పులకమందహాసాల సంభావన.-వసంతతిలక.

**అ :** సీతా-స్వయంవర-మహా+ఉత్సవ-గాన-కాలే జాతౌ రమా-పులక-మాధవ-మంద-హాసౌ ఇయం సా జానకీ అయమ్ ఏవ హి రామచంద్రః తత్+ముహూర్త-కథయా కిమ్ ఇతి శంసతః స్మ.

**ప్ర :** సీతా... కాలే : సీతా = సీతయొక్క, స్వయంవర-మహా+ఉత్సవ = స్వయంవర మహోత్సవంయొక్క, గాన = గానంచేసే, కాలే = సమయంలో (ముత్తయిదువలు సీతాస్వయంవరానికి సంబంధించిన పాటలు పాడుతున్నప్పుడు) (సీతాయాః స్వయంవరః ఏవ మహాన్ చ సః ఉత్సవః, తస్య గానస్య కాలే), జాతౌ = పుట్టినట్టి, రమా... హాసౌ = రమా = రుక్మిణియొక్క, పులక = పులకరింత, మాధవ = కృష్ణునియొక్క, మంద-హాసౌ = చిఱునవ్వు (రమాయాః పులకః మాధవస్య మందశ్చాసౌ హాసశ్చ), ఇయమ్ = ఈమె, సా జానకీ = ఆ సీత (జనకస్య అపత్యం స్త్రీ), అయమ్-ఏవ = ఇతడే (కృష్ణుడే), రామచంద్రః హి = రాముడు గదా!, తత్-ముహూర్త-కథయా = రుక్మిణీకృష్ణులవివాహముహూర్త ప్రస్తావనతో, కిమ్ = ఏం లాభం, ఇతి = అని, శంసతః స్మ = చెప్పాయి. (శంస్ స్తుతౌ పరస్మైపది-లట్-ప్ర.ద్వి.)

**తా ॥** పెండ్లివేడుకలలో భాగంగా ముత్తయిదువలు సీతాస్వయంవరమహోత్సవాన్ని గురించి పాడుతుంటే ఆ పాటలు విన్న రుక్మిణికి శరీరం పులకించింది. కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు. ఆ పులకరింత, ఆ మందహాసం కూడా వీళ్ళే సీతారాములు గదా! ఇక వివాహముహూర్త ప్రస్తావనం అదనంగా ఎందుకు అని చెప్తున్నాయట.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. శంసతః :** | శంసతి | **శంసతః** | శంసన్తి | |
| | శంససి | శంసథః | శంసథ | |
| | శంసామి | శంసావః | శంసామః. | * |

**శ్లో॥ ఆసీత్పరస్పరనిరీక్షణకర్మకాలే - భైష్మీముఖామ్బుజగతం నయనం మురారేః ।**
**తస్యాశ్చ నాభిసరసీనిలయం తదేత-ద్యుక్తం యదర్కదృగసావియముత్పలాక్షీ ॥36**

**అ :** రుక్మిణీకృష్ణుల అన్యోన్యసందర్శన విశేషవర్ణన. -వసంతతిలక.

**అ :** పరస్పర-నిరీక్షణ-కర్మ-కాలే ముర+అరేః నయనం భైష్మీ-ముఖ+అంబుజ-గతమ్ ఆసీత్. తస్యాః (నయనం) చ నాభి-సరసీ-నిలయం (ఆసీత్) తద్ ఏతత్ యుక్తం యత్ అసౌ అర్క-దృక్, ఇయమ్ ఉత్పల+అక్షీ.

**ప్ర :** పరస్పర... కాలే : పరస్పర = ఒకరినొకరు, నిరీక్షణ = చూసుకొనే, కర్మ = పనియొక్క, కాలే = సమయంలో (ఒకరినొకరు చూచుకొనేటప్పుడు) (పరస్పరం నిరీక్షణమ్ ఏవ కర్మ, తస్య కాలః, తస్మిన్), ముర+అరేః = కృష్ణునియొక్క, నయనమ్ = నేత్రం, భైష్మీ... గతమ్ : భైష్మీ = రుక్మిణియొక్క, ముఖ+అంబుజ = వదనపద్మంపైకి, గతమ్ = ప్రసరించిందిగా, ఆసీత్= అయింది. (అస భువి పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), తస్యాః = ఆ రుక్మిణియొక్క, నయనం చ = కన్నుకూడా, (మురారేః = కృష్ణునియొక్క), నాభి-సరసీ-నిలయమ్ : నాభి = బొడ్డు అనే, సరసీ = సరస్సే, నిలయమ్ = ఇల్లుగా (నివాసంగా), (ఆసీత్ = అయింది), తద్-ఏతద్ = ఆ ఈ స్థితి, యుక్తమ్ = తగినది. యత్ = ఎందుకంటే, అసౌ = ఆ కృష్ణుడు, అర్కదృక్ = కంట సూర్యుడు గలవాడు (అర్కః దృశి యస్య సః), ఇయమ్ = ఈ రుక్మిణి, ఉత్పల+అక్షీ = కలువలవంటి కన్నులు గలది. (ఉత్పలే ఇవ అక్షిణీ యస్యాః సా)

**తా ॥** ముహూర్తసమయంలో వధూవరులు ఒకరి నొకరు చూచుకొంటున్నప్పుడు కృష్ణుని కన్ను రుక్మిణి ముఖపద్మంపై పడింది. ఆ రుక్మిణి (ఉత్పలాక్షి) కన్ను కృష్ణుని నాభిసరస్సుపై పడింది. అవునుమరి ఆయన సూర్యనేత్రుడు. ఈమె ఉత్పలాక్షి. (కృష్ణుని కంట సూర్యుడున్నందున ముఖపద్మం వైపు చూపు. ఆమె కన్ను కలువకాబట్టి సరస్సువైపు చూపు).

**వి :** 1. కన్నులను, చూపులను వర్ణించటంలో కవులు ఎంతో భావుకతను ప్రదర్శిస్తుంటారు. ఈ శ్లోకంలో కృష్ణుని అర్కదృక్కు అనటానికి '**చక్షోః సూర్యో౨ జాయత**' అన్న పురుషసూక్త వాక్యమాధారం. కాబట్టి అర్థదృష్టిలోఇది అన్యచ్ఛాయాయోని. రుక్మిణిని ఉత్పలాక్షి అనటం కవి సాంప్రదాయికమైన ఒక పోలిక.

సీతచూపు ఐశ్వర్యాన్ని కలిగించాలంటూ చేసిన ఒక అందమైన దీవెన-

**శ్లో॥ పాణిగ్రహావసర ఏవ దృఢోపగూఢా - రాగస్పృశా రఘుపతేర్నయనాంచలేన ।**
**లజ్జావశాన్నవ వధూరివ సంకుచన్తీ - దృష్టిర్మహీదుహితురస్తు విభూతయే వః ॥**

- శృంగారతిలకభాణః(రామభద్రదీక్షితులు)-1

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ | |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త | |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. | * |

**శ్లో॥ గుడాన్వితాభిః శుభజీరికాభిః - పరస్పరం వర్షతి బన్ధువర్గే ।**
**వక్షఃస్థితామ్భోధిసుతాజితస్త-త్పఙ్క్త్యైః ప్రయుక్తం ప్రథమం బభార ॥ 16-37**

**అ :** ముహూర్తకాలంలో జీలకర్ర–బెల్లం మిశ్రమాన్ని వధూవరులపై చల్లటం.

**అ :** గుడ+అన్వితాభిః శుభ–జీరికాభిః బన్ధు–వర్గే పరస్పరం వర్షతి (సతి) వక్షః–స్థిత+ అమ్భోధి–సుతా–జితః తత్–పక్ష్యైః ప్రయుక్తం ప్రథమం బభార.

**ప్ర :** గుడ+అన్వితాభిః : గుడ = బెల్లంతో (గుడో గోళేక్షు పాకయోః–అమర–నానార్థ–42) (గుడేన అన్వితాః తాభిః ), అన్వితాభిః = కూడినట్టి, శుభ–జీరికాభిః : శుభ =మంగళప్రదమైన, జీరికాభిః = జీలకర్రతో (జీరకో జీరణోఽజాజీ కణా–అమర–వైశ్య–36), శుభాశ్చ తాః జీరికాః, తాభిః), బన్ధు–వర్గే = బంధుసమూహం (బంధూనాం వర్గః, తస్మిన్), పరస్పరమ్ = ఒకరిపై ఒకరు, వర్షతి (సతి) = చల్లుతుండగా, వక్షః... జితః : వక్షః స్థిత = రొమ్ముపైనున్న, అమ్భోధి–సుతా = కడలికూతురుచేత, జితః = ఓడింపబడిన (వక్షసి స్థితా చ సా అమ్భోధేః సుతా, తయా జితః), తత్–పక్ష్యైః = ఆ రుక్మిణి వైపువారిచే, ప్రయుక్తమ్ = ప్రయోగింపబడినట్టి, ప్రథమమ్ = తొలిభారాన్ని, బభార = భరించాడు. (భృ భరణే భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** వధూవరుల బంధుసమూహం రుక్మిణీకృష్ణులపై పరస్పరం బెల్లం కలిపిన జీలకర్రను చల్లారు. అవి భరిస్తూ అప్పటికే తన రొమ్ముపై నున్న లక్ష్మిచేత ఓడింపబడిన కృష్ణుడు, లక్ష్మివైపు వారి భారాన్ని మొదటిసారిగా భరించాడు.

**వి :** 1. వధూవరులపై అక్షతలు చల్లి ఆశీర్వదించటం ప్రస్తుతం మనకున్న సంప్రదాయం సుమూహూర్తం తర్వాత. ఇక్కడ కవి ముహూర్తవేళలో వధూవరులపై బంధువర్గం బెల్లంతో కూడిన జీలకర్రను చల్లినట్లు వర్ణిస్తున్నాడు. బహుశః అది ఆనాటి సంప్రదాయం కావచ్చు. అదే తరువాత కాలంలో రూపాంతరాన్ని పొంది బెల్లం, పసుపు, జీలకర్ర కలిపిన ముద్దను/మిశ్రమాన్ని (లేహ్యానికి దగ్గరగా, వుండకు దూరంగా) వధూవరులు ఒకరి తలపై ఒకరు పల్చటి బిళ్ళలాగా పెట్టడంగా పరిణమించి వుండవచ్చు. ఆ సమయంలో చెప్పే మంత్రం.

**శ్లో॥ ధ్రువం తే రాజా వరుణో – ధ్రువం దేవో బృహస్పతిః ।**
**ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ – రాష్ట్రం ధారయతాం ధ్రువమ్ ॥**

| | | | |
|---|---|---|---|
| 2. **బభార :** | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ |

3. ఛందస్సు – ఉపజాతి (1,2 పాదాలు ఉపేంద్రవజ్ర.,3,4 పాదాలు ఇంద్రవజ్ర. *

**శ్లో॥ ఆకణ్ఠమాపాదతలాన్మురారే–ర్నేత్రాన్తనీలోత్పలచారుమాలామ్ ।**
**శ్రీః సన్దధే తత్క్షణహృష్టరోమ–సత్కఞ్చుకం శ్రీపతిరాత్మపత్న్యామ్ ॥ 16–38**

**అ:** వధూవరులైన రుక్మిణీ కృష్ణుల పరస్పరవీక్షా వర్ణనం. –ఇంద్రవజ్ర.

**అ :** శ్రీః నేత్ర+అంత–నీల+ఉత్పల–చారు–మాలామ్ ముర+అరేః ఆపాదతలాత్ ఆ–కంఠం సన్దధే. శ్రీపతిః తత్–క్షణ–హృష్ట–రోమ–సత్–కంచుకమ్ ఆత్మ–పత్న్యామ్ (సన్దధే).

**ప్ర :** శ్రీః = లక్ష్మి (రుక్మిణి), నేత్రా... మాలామ్ : నేత్ర+అన్త = కనుగొన లనే, నీల+ఉత్పల =నల్లకలువల యొక్క, చారు = అందమైన, మాలామ్ = మాలను (నేత్రయోః అన్తాః ఏవ నీలాని చ తాని ఉత్పలాని, తేషాం చార్వీ చ సా మాలా, తామ్), ముర+అరేః = కృష్ణునియొక్క, ఆపాద–తలాత్ = పాదాలనుండీ, ఆ కంఠమ్ = మెడవరకు, సన్దధే = వేసింది. (సమ్–ధా ధారణ పోషణయోః–ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), శ్రీపతిః = లక్ష్మీపతి (కృష్ణుడు), ఆత్మ–పత్న్యామ్ = తన భార్యపై, తత్... కంచుకమ్ : తత్–క్షణ = ఆ సమయంలో, హృష్ట = రోమాంచితమైన

(నిక్కబొడుచుకొన్న) (హలాయుధకోశః-పు-739), రోమ = రోమాల (వెం(ట్రుకల)తో, సత్-కంచుకమ్ = మంచి రవికను (కవచాన్ని), (సన్దధే = కల్పించాడు.)

**తా ॥** రుక్మిణి తన కడగంటి చూపు లనే నల్లకలువల దండను కృష్ణుని కాలినుండి మెడ దాకా అలంకరించింది. కృష్ణుడు ఆ క్షణంలో తనలో కలిగిన రోమాంచ మనే కంచుకంతో రుక్మిణిని అలంకరించారు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. సన్దధే :** | **సన్దధే** | సన్దధాతే | సన్దధిరే |
| | సన్దధిషే | సన్దధాథే | సన్దధిధ్వే |
| | సన్దధే | సన్దధివహే | సన్దధిమహే. |

*

**శ్లో॥ ఉగ్రోఽయం సఖి! చఞ్చలోఽయమమలే సోఽయం రమే గూఢపా-**
**ద్వృద్ధోఽసౌ జ్వలనోఽయమేష తపనః సద్వక్రతుణ్డో హ్యసౌ ।**
**ముగ్ధేఽదన్తక ఏష దేవి! జలరాట్ గోత్రాసహోఽసౌ క్షితా-**
**విత్యాద్యాభిధయైవ ధిక్కృతసురా శ్రీరాససాదాచ్యుతమ్ ॥ 16-39**

**అ :** అన్యదేవతలలో దోషారోపణతో వారిని కాదని కృష్ణునే రుక్మిణి వరించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సఖి! అయమ్ ఉగ్రః అమలే అయం చంచలః రమే సః అయం గూఢ-పాత్ అసౌ వృద్ధః అయం జ్వలనః ఏషః తపనః అసౌ సద్-వక్ర-తుండః ముగ్ధే ఏషః అదన్తకః దేవి! జలరాట్ అసౌ క్షితౌ గోత్ర+అసహః ఇతి+ఆది+ఆభిధయా ఏవ ధిక్-కృత-సురా శ్రీః అచ్యుతమ్ ఆససాద.

**ప్ర :** సఖి! = చెలీ!, అయమ్ = ఈయన, ఉగ్రః = క్రూరుడు (శివుడు) (ఉగ్రః కపర్దీ శ్రీకంఠః-అమరకోశః-స్వర్గ-32), అమలే = నిర్మలా, అయమ్ = ఈయన, చంచలః = నిలకడలేనివాడు (మాతరిశ్వా సదాగతిః-అమర-స్వర్గ-61), రమే = లక్ష్మీ, అయమ్ = ఈయన, గూఢ-పాత్ = పాదాలు మాటుగా వుండేవాడు (గూఢే పాదౌ యస్య సః) (ఆదిశేషువు) (బిలౌ కా గూఢపాచ్చక్రీ-వైజయన్తీ-సరీసృప-6), అసౌ = ఈయన (బ్రహ్మ), వృద్ధః = ముదుసలి (పరమేష్ఠీ పితామహః-అమర-స్వర్గ-16), అయమ్ = ఈయన, జ్వలనః = మండిపడేవాడు (అగ్ని), ఏషః = ఈయన, తపనః = వేడెక్కించేవాడు (సూర్యుడు), అసౌ = ఈయన, సద్-వక్ర-తుండః = వంకరమొగం వాడు (గరుడుడు), ముగ్ధే = ముద్దరాలా!, ఏషః = ఈయన, అదన్తకః = దంతాలు లేనివాడు (పూష), దేవి = స్వామిని!, అసౌ = ఈయన, జల(డ) రాట్ = జలాధిపతి (వరుణుడు) (జడులకు రాజు), అసౌ = ఈయన, క్షితౌ = భూమిపై, గోత్ర+అసహః = కొండలకు శత్రువు (ఇంద్రుడు) (తనవారి ఎదుగుదల సహింపడు), ఇతి+ఆది+అభిధయా ఏవ : ఇతి+ఆది = ఇలా మొదలై, ఆభిధయా ఏవ = పేరుతోనే, ధిక్-కృత+సురా : ధిక్ కృత = తిరస్కరింపబడిన, సురా = దేవతలు గలదై (ధిక్కృతాః సురాః యయా సా), శ్రీః = రుక్మిణి, అచ్యుతమ్ = కృష్ణుని, ఆససాద = సమీపించింది (ఆ సద్ విశరణగత్యవసాదనేషు-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** సఖి! ఈయన ఉగ్రుడు. నిర్మలా! ఈయన చంచలుడు. లక్ష్మీ! ఈయన గూఢపాదుడు. ఈయన వృద్ధుడు. ఈయన జ్వలనుడు. ఈయన తపనుడు. ఈయన వక్రతుండుడు. ముద్దరాలా! ఈయన అదంతకుడు. దేవి! ఈయన జల(డ) రాజు. ఈయన గోత్రాసహుడు అని పేరుతోనే దేవతలను ధిక్కరించి రుక్మిణి కృష్ణుని సమీపించింది.

**వి :** 1. శ్లోకంలో సఖి రుక్మిణికి ఆ యా దేవతలలోని లోపాన్ని గూఢంగా చెప్తోంది. కేవలం వారిని వారి పేరుతో పరిచయం చేస్తూ, ఆయా పదాలయోగశక్తిద్వారా వచ్చే అర్థాన్ని అందులోని లోపాన్ని నొక్కి చెప్పటంద్వారా వారు వరణీయులు కారని సూచిస్తోంది. ఇది గూఢోక్త్యలంకారం. '**గూఢోక్తిరన్యోద్దేశ్యం చేద్యదన్యం ప్రతికథ్యతే**' - (కు. 154)

ఆయా దేవతలను పరిచయం చేస్తూ కవి ప్రయోగించిన విశేష్యపదాలన్నీ సాభిప్రాయాలే కాబట్టి ఇక్కడ పరికరాంకురాలంకారం కూడా వుంది. '**సాభిరపాయవిశేష్యేతు భవేత్పరి-కరాంకురః**' -(కు. 63)

గూఢోక్త్యలంకారంలో చెలి రుక్మిణికి ఆయా లోపాలను ధ్వనింపజేసిందే కానీ ఆ లోపాలున్నట్లు వాచ్యం చేయలేదు. అది వాచ్యంగా కూడా వుంటే వివృతోక్త్యలంకార మవుతుంది. దాదాపు ఇదే సందర్భంలో (లక్ష్మీస్వయంవర సందర్భంలోని) దాదాపు ఇదే రీతిగా వుండి ప్రసిద్ధమైన ఒక శ్లోకం-

శ్లో॥ వత్సే మా గావిషాదం శ్వసన **మురుజవం** సంత్యజోర్ధ్వప్రవృత్తం
**కంపః** కో వా గురుస్తే కిమిహ **బలభిదా జృంభితే**నాత్ర యాహి ।
ప్రత్యాఖ్యాతం సురాణామితి భయశమనచ్ఛద్మనా కారయిత్వా
యస్మై లక్ష్మీ మదాద్వః స దహతు దురితం మన్థముగ్ధః పయోధిః ॥

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆససాద :** | **ఆససాద** | ఆసేదతుః | ఆసేదుః | |
| | ఆసేదిధ/ఆససత్థ | ఆసేదథుః | ఆసేద | |
| | ససాద | ఆసేదివ | ఆసేదిమ. | * |

**శ్లో॥ వేధా వైదికమౌళిరేష పవనో మన్త్రం జపన్ సన్తతం**
**శర్వోఽసౌ సువిరక్తధీః స మఘవా వ్యాపారభారాకులః ।**
**సూర్యః పర్యటనప్రియః స తు శశీ దోషాకరోఽసౌ స్మరోఽ -**
**నఙ్గశ్చేత్యఖిలానుపేక్ష్య కమలా వవ్రే యదూనామ్పతిమ్ ॥ 16-40**

**అ :** అన్యదేవతలలో దోషారోపణచేయటమే. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** వేధాః వైదిక-మౌళిః ఏషః పవనః సంతతం మన్త్రం జపన్ (తిష్ఠతి) అసౌ శర్వః సు-విరక్త-ధీః సః మఘవా వ్యాపార-భార+ఆకులః సూర్యః పర్యటన-ప్రియః సః శశీ తు దోషా (ష)+ఆకరః అసౌ స్మరః అనంగః చ ఇతి అఖిలాన్ ఉపేక్ష్య కమలా యదూనాం పతిం వవ్రే.

**ప్ర :** వేధాః = బ్రహ్మ ('స్రష్టా ప్రజాపతిర్వేధాః'-అమరకోశః-స్వర్గ-17), వైదిక-మౌళిః = ఛాందసశ్రేష్ఠుడు (వైదికుడన్నా, ఛాందసుడన్నా వ్యాకరణం మేరకు ప్రశంసార్థకమే. కానీ వ్యవహారంలో అర్థవిపరిణామమేర్పడి ఒకవిధమైన అజ్ఞానికి ఛాందసుడనీ, వైదికుడని పేరు స్థిరపడింది.), ఏషః = ఈ, పవనః = ముఖ్యప్రాణుడు, సంతతమ్ = ఎల్లప్పుడు, మంత్రమ్ = హరి (హంస) మంత్రాన్ని, జపన్ (తిష్ఠతి) = జపిస్తుంటాడు. అసౌ = ఈ, శర్వః = శంకరుడు, సువిరక్త-ధీః = వైరాగ్యబుద్ధిగలవాడు (సుష్ఠు విరక్తా ధీః యస్య సః), సః = ఆ, మఘవా = ఇంద్రుడు ('ఇంద్రో మరుత్వాన్ మఘవా' - అమరకోశః-స్వర్గ-41), వ్యాపార-భార+ఆకులః : వ్యాపార = పనియొక్క, భార = ఒత్తిడితో, ఆకులః = కలతపడేవాడు (వ్యాపారస్య భారేణ ఆకులః), సూర్యః = సూర్యుడు, పర్యటన-ప్రియః : పర్యటన = తిరుగుట, ప్రియః = ఇష్టమైనవాడు (పర్యటనే ప్రియః), సః = ఆ, శశీ తు = చంద్రుడైతే (శశః అస్మిన్ అస్తి ఇతి), దోషా (ష) + ఆకరః = దోషాలయుడు (దోషా అంటే రాత్రి. దోషః అంటే తప్పు. సవర్ణదీర్ఘసంధి రెండింటినీ తనలో ఇముడ్చుకొంటుంది. అసౌ స్మరః = ఈ మన్మథుడు, అనంగః = దేహం లేనివాడు (న సన్తి అంగాని యస్య సః), ఇతి = అని ఈ రీతిగా, అఖిలాన్ = అందరినీ, ఉపేక్ష్య = తృణీకరించి/గమనించకుండానే, కమలా = లక్ష్మి, యదూనాం పతిమ్ = యదుపతి అయిన కృష్ణుని, వవ్రే = వరించింది. (వృ వరణే-స్వాది ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ బ్రహ్మ వైదికశిరోమణి (చాదస్తుడు). ఈ పవనుడు ఎప్పుడూ మంత్రజపం చేస్తుంటాడు. ఈ శంకరుడు

విరక్తుడు. ఈ ఇంద్రుడికి పనిభారం ఎక్కువ. ఎప్పుడూ హడావుడి. ఈ సూర్యుడు తిరుగుతూనే వుంటాడు. ఇక ఈ చంద్రుడు దోషాకరుడు. ఈ మన్మథుడికి అసలు శరీరమే లేదు. ఇలా ఆలోచించి వారినందరినీ కాదని రుక్మిణి యదుపతినే వరించింది.

**వి :** 1. వైదికులంటే తేలికభావం ఈ కావ్యరచనాకాలంనాటికే వుంది. తనకూ, ఇతరులకూ కూడా పనికిరాని జీవితాలను వైదికుని చేతి విడెం (తాంబూలంతో)తో పోలుస్తాడొక తెలుగు కవి. బ్రహ్మ వేదాభ్యాసంవలన జడుడైపోయాడనీ, సౌందర్యమార్మికత తానెరుగడనీ కాళిదాసు విక్రముని ద్వారా చెప్పించాడు-

శ్లో॥ అస్యాః సర్గవిధౌ ప్రజాపతిరభూచ్చంద్రోను కాంతప్రభః
శృంగారైకరసః స్వయం ను మదనో మాసోను పుష్పాకరః ।
**వేదాభ్యాసజడః** కథం ను విషయ**వ్యావృత్తకౌతూహలో**
నిర్మాతుం ప్రభవేన్మనోహరమిదం రూపం పురాణోమునిః ॥ - విక్రమోర్వశీయమ్ - 1/9

ఆ వేదాభ్యాసజడత్వాన్నే ఇక్కడ వైదికపదంద్వారా రుక్మిణి బుద్ధి భావించింది.

2. బ్రహ్మాదిదేవతలలో ప్రతిపాదించిన లోపాలన్నీ వాస్తవానికి లోపాలు కావు. వారి వారికి నియమింపబడిన కర్తవ్యాలు. గుణాలు కూడా. అయితే రుక్మిణి స్వానుకూలత లేదని వాటిని దోషాలుగా భావిస్తోంది. కాబట్టి ఇది లేశాలంకారం. '**లేశః స్యాద్దోషగుణయోః గుణదోషత్వకల్పనమ్**' - (కు.138)

| | | | |
|---|---|---|---|
| 3. **వవ్రే :** | వవ్రే | వవ్రాతే | వవ్రిరే |
| | వవృషే | వవ్రాథే | వవృధ్వే |
| | వవ్రే | వవృవహే | వవృమహే. |

*

**శ్లో॥ పుత్త్రో యస్య స పద్మభూః ఫణిపతిః శయ్యా ఖగేశో రథః**
**శమ్భుర్యచ్చరణామ్బుమౌళిరగభిత్ తద్దత్తసామ్రాజ్యభుక్ ।**
**నిత్యం యత్పదసంగతౌ విధురవీ యద్వల్లభా శ్రీవధూ-**
**స్తం వర్యం వరయామ్బభూవ సుదతీ సా ద్వారకానాయకమ్ ॥ 16-41**

**అ :** అన్యదేవతలు ద్వారకానాయకునికి లోబడినవారే అని నిరూపించుట-ఆ కారణంగా రుక్మిణి కృష్ణుని వరించుట.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** సః పద్మ-భూః యస్య పుత్త్రః ఫణిపతిః (యస్య) శయ్యా ఖగ+ఈశః (యస్య) రథః శంభుః (యస్య) చరణ+అంబు-మౌళిః అగ-భిత్ తద్-వృత్త-సామ్రాజ్య-భుక్ విధు-రవీ నిత్యం యత్-పద-సంగతౌ శ్రీ-వధూః యద్-వల్లభా తం వర్యం ద్వారకా-నాయకం సా సుదతీ వరయామ్బభూవ.

**ప్ర :** సః పద్మ-భూః = ఆ బ్రహ్మ (పద్మాత్ భవతి ఇతి), యస్య = ఎవనికి, పుత్త్రః = కుమారుడో, ఫణి-పతిః = నాగరాజు (ఫణీనాం పతిః), (యస్య = ఎవనికి), శయ్యా = పడకయో, ఖగ+ఈశః = పక్షిరాజు (ఖగానామ్ ఈశః), (యస్య = ఎవనికి), రథః = వాహనమో, శంభుః = శివుడు, యత్ = ఎవనియొక్క, చరణ+అంబు-మౌళిః : చరణ = పాదంయొక్క, అంబు = నీరు, మౌళిః = తలదాల్చినవాడో (చరణస్య అంబు, తత్ మౌళౌ యస్య సః), అగ-భిత్ = నగభేది అయిన ఇంద్రుడు (అగాన్ భినత్తి ఇతి), తద్-దత్త-సామ్రాజ్య-భుక్ : తత్ = ఆ కృష్ణునిచే, దత్త = ఇవ్వబడిన, సామ్రాజ్య = మహాప్రభుత్వాన్ని, భుక్ = భుజించే (పాలిచే)వాడో (తేన దత్తం సామ్రాజ్యం భునక్తి ఇతి), విధు-రవీ = చంద్రుడూ, సూర్యుడూ (విధుశ్చ రవిశ్చ), నిత్యమ్ = ఎల్లప్పుడూ, యత్-పద-సంగతౌ = యత్ = ఎవనియొక్క, పద = పదాన్ని/ఆకాశాన్ని (విష్ణుపదం), సంగతౌ = పొందివున్నవారో, శ్రీ-

వధూః = లక్ష్మీపతి, యద్–వల్లభా = ఎవని కిష్టురాలో, తమ్ = ఆ, వర్యమ్ = వరణీయుడైన, ద్వారకా–నాయకమ్ = ద్వారకాధిపతిని (ద్వారకాయాః నాయకః, తమ్), సా = ఆ, సుదతీ = మంచి పలువరుసగల రుక్మిణి, వరయామ్బభూవ = వరించింది (వృ వరణే భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** రుక్మిణి ద్వారకానాయకుడైన కృష్ణుని వరించింది. బ్రహ్మ ఆయన కొడుకు. ఆదిశేషుడు ఆయనకు శయ్య. ఖగపతి ఆయన రథం. శంకరుడు ఆయన పాదంనుండి పుట్టిన గంగను తలదాల్చినవాడు. ఇంద్రుడు ఆయన ఇచ్చిన సామ్రాజ్యాన్ని అనుభవించేవాడు. సూర్యచంద్రులెప్పుడూ విష్ణుపదాన్ని (ఆకాశాన్ని) ఆశ్రయించి వుండేవాళ్ళు. ఆయనకు లక్ష్మి అంటే మక్కువ. అటువంటి వాడు కాబట్టి రుక్మిణి ఆయనను వరించింది.

**వి :** 1. వాదిరాజకృతమైన మంగళాష్టకంలోని శ్లోకాలలో ఒకటి దాదాపు ఇలాగే వుంటుంది.

శ్లో॥ లక్ష్మీర్యస్య పరిగ్రహః కమలభూః సూనుర్గరుత్మాన్ రథః
పౌత్రశ్చంద్రవిభూషణః సురగురుః శేషశ్చ శయ్యా పునః ।
బ్రహ్మాండం వరమందిరం సురగణా యస్య ప్రభోస్సేవకాః
స త్రైలోక్యకుటుంబపాలనపరః కుర్యాద్ధరిర్మంగళమ్ ॥

2. **వరయామ్బభూవ (వరయామ్–బభూవ) :** 16–19వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యా వై చమ్పకసమ్పదాఽబ్జవసతేర్దూర్వాశ్రియా స్వాత్మనః**
**కేతక్యా విభవేన కృత్తివసనస్యామ్భోజకాన్త్యా విధోః ।**
**సన్నీలోత్పలశోభయా దినమణేః శ్రీమత్తులస్యాఽమతా**
**హేరమ్బస్య హరేః పరం సముచితా సా మాలికా శోభతే ॥ 16–42**

**అ : వరమాలా శోభా వర్ణన.** –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యా వై చంపక–సంపదా అబ్జ–వసతేః అమతా దూర్వా–శ్రియా స్వ+ఆత్మనః (అమతా) కేతక్యా విభవేన కృత్తి–వసనస్య (అమతా) అంభోజ–కాన్త్యా విధోః (అమతా) సత్–నీల+ఉత్పల–శోభయా దిన–మణేః (అమతా) శ్రీమత్–తులస్యా హేరంబస్య (అమతా) పరం హరేః సముచితా సా మాలికా శోభతే.

**ప్ర :** యా మాలికా వై = ఏ మాలిక (వై పాదపూరణార్థం), చంపక–సంపదా = సంపెంగ పూల సంపదచే (చంపకానాం సంపత్, తయా), అబ్జ–వసతేః = బ్రహ్మకు (అప్సు జాయత ఇతి అబ్జం, తత్ వసతిః యస్య తస్య), అమతా = నచ్చదో, దూర్వా–శ్రియా = గరిక వెలుగుతో (దూర్వాయాః శ్రీః, తయా), స్వ+ఆత్మనః = తనకు, అమతా = నచ్చదో, కేతక్యాః = మొగలియొక్క, విభవేన = సంపదచే, కృత్తి–వసనస్య = శివునకు (గజచర్మధారికి) (కృత్తి వసనం యస్య తస్య) (మృత్యుంజయః కృత్తివాసాః' – అమరకోశః–స్వర్గ–31), అమతా = నచ్చదో, అంభోజ–కాన్త్యా : అంభోజ = తామరలయొక్క, కాన్త్యా = శోభతో (అంభోజానాం కాంతిః, తయా), విధోః = చంద్రుడికి, అమతా = నచ్చదో, సత్... శోభయా : సత్ = మంచివైన, నీల+ఉత్పల = నల్లకలువలయొక్క, శోభయా = కాంతితో (సన్తి చ తాని నీలాని చ తాని ఉత్పలాని తేషాం శోభా, తయా), దిన–మణేః = సూర్యునికీ (దినస్య మణిః, తస్య), అమతా = నచ్చదో, శ్రీమత్–తులస్యా : శ్రీమత్ =శోభాయుతమైన, తులస్యా = తులసిచేత (శ్రీమతీ చ సా తులసీ, తయా), హేరంబస్య = వినాయకునికి, అమతా = నచ్చదో, పరమ్ = కేవలం, హరేః = నారాయణునికే, సముచితా = తగినదో, సా = ఆ, మాలికా = మాల, శోభతే = ప్రకాశిస్తోంది. (శుభ దీప్తౌ–భ్వాది–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి చేతిలోని మాల కృష్ణునకు మాత్రమే తగినది. ఎందుకంటే దానిలో సంపెంగ పూలున్నాయి. అవి

బ్రహ్మకు నచ్చవు. గరిక వుంది. అది తనకు (దుర్గకు) నచ్చదు. మొగలి రేకులున్నాయి. అవి శివుడికి నచ్చవు. తామరలున్నాయి. అవి చంద్రుడికి నచ్చవు. కలువలున్నాయి. అవి సూర్యుడికి నచ్చవు. తులసి వుంది. అది గణపతికి నచ్చదు. ఆ మాల శోభిస్తోంది రుక్మిణి చేతిలో.

**వి :** 1. కొన్ని పురాణగాథలను బట్టి, కొన్ని కవిసమయాలను బట్టీ కొన్ని కొన్ని పూలు కొందరు కొందరు దేవతలకు సమ్మతం కాదు. దుర్గకు దూర్వా, శివుడికి మొగలి, వినాయకుడికి తులసి... ఇవి పౌరాణిక విషయాలు. చంద్రుడికి తామరలు, సూర్యుడికి కలువలు – నచ్చకపోవటం కవి సమయాలు.

శ్లో॥ **దూర్వాభిర్నార్చయేద్దుర్గాం న కేతక్యా చ శంకరమ్ ।**
**నాక్షతైరర్చయేద్విష్ణుం న తులస్యా వినాయకమ్ ॥**

| | | | |
|---|---|---|---|
| 2. **శోభతే :** | **శోభతే** | శోభేతే | శోభన్తే |
| | శోభసే | శోభేథే | శోభధ్వే |
| | శోభే | శోభావహే | శోభామహే. |

*

**శ్లో॥ హరేః ప్రసాదైకభుజాం సురాణా–మిమాం ప్రదాస్యామి కథం త్వితీవ ।**
**రమా ప్రమోదోత్థితరోమరాజిః – సమర్పయామాస ముకున్దకణ్ఠే ॥ 16–43**

**అ :** రుక్మిణి వరమాలను కృష్ణుని మెడలో వేయటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** ప్రమోద+ఉత్థిత–రోమ–రాజిః రమా హరేః ప్రసాద+ఏక–భుజాం సురాణామ్ ఇమాం కథం తు ప్రదాస్యామి ఇతి ఇవ ముకున్ద–కంఠే సమర్పయామాస.

**ప్ర :** ప్రమో... రాజిః : ప్రమోద = ఆనందంచేత, ఉత్థిత = నిక్కబొడుచుకొన్న, రోమ = వెంట్రుకలయొక్క, రాజిః = సమూహంగల (ప్రమోదేన ఉత్థితా రోమ్ణాం రాజిః యస్యా స్సా), రమా = లక్ష్మి (రుక్మిణి), హరేః = కృష్ణునియొక్క, ప్రసాద+ఏక–భుజామ్ : ప్రసాద+ఏక = అనుగ్రహాన్ని మాత్రమే, భుజామ్ = అనుభవించే (ప్రసాదమ్ ఏకమేవ భుంజత ఇతి, తేషామ్), సురాణామ్ = దేవతలకు, ఇమామ్ = ఈ మాలను, కథం తు = ఏ రీతిగా, ప్రదాస్యామి = ఇవ్వగలను (ప్ర దా దానే పరస్మైపది–లృట్–ఉ.ఏ.), ఇతి+ఇవ = అన్నట్లుగా, ముకున్ద–కంఠే = కృష్ణుని మెడలో, సమర్పయామాస = అర్పించింది. (వేసింది) (సమ్–ఋ గతౌ – ణిచి–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** రుక్మిణి ఆనందరోమాంచితమైన శరీరంతో ఆ మాలను కృష్ణుని మెడలో వేసింది. మిగిలిన దేవతలందరూ ఆ కృష్ణుని అనుగ్రహాన్ని అనుభవిస్తున్నారు కాబట్టి వారికి ఈ మాలను ఎలా ఇవ్వగలను అని రుక్మిణి భావించినట్లుంది.

**వి :** 1. శ్లోకంలో ఉత్ప్రేక్షాలంకారముంది. 'ముకుందుని అనుగ్రహాన్ని అనుభవిస్తున్న ఇతర దేవతలకు ఈ మాల నెలా సమర్పిస్తాను అని రుక్మిణి భావించినట్లు' అన్నది కవి సంభావన. ఉక్తి వైచిత్రిలో అది సంభావనయే కాని 'వధువు మనస్సులో అది వాస్తవం కావచ్చు. ఉత్తముని కోరుకోవటం అనుచితమేమీ కాదుగదా!'

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రదాస్యామి :** | ప్రదాస్యతి | ప్రదాస్యతః | ప్రదాస్యన్తి |
| | ప్రదాస్యసి | ప్రదాస్యథః | ప్రదాస్యథ |
| | **ప్రదాస్యామి** | ప్రదాస్యావః | ప్రదాస్యామః |

**సమర్పయామాస :**

| | | |
|---|---|---|
| సమర్పయామాస | సమర్పయామాసతుః | సమర్పయామాసుః |
| సమర్పయామాసిథ | సమర్పయామాసథుః | సమర్పయామాసిథ |
| సమర్పయామాస | సమర్పయామాసివ | సమర్పయామాసిమ. |

*

శ్లో॥ సా ధారామ్బుకదమ్బకేన సహ సుప్రేమాశ్రుధారాం హరే-
ర్భ్రాజన్మాలికయా సమం ప్రణయసన్మాలాం సునీరాజనమ్ ।
నేత్రాన్తేన శుచిస్మితామృతరసైర్నైవేద్యమావేద్య త-
త్పార్శ్వం మన్దముపాశ్రయత్ఫలమివ వ్యాలోలహారోజ్జ్వలా ॥ 16-44

అ : రుక్మిణి కృష్ణునకు దగ్గర కావటం. -శార్దూలవిక్రీడితమ్.

అ : వ్యాలోల-హార-ఉజ్జ్వలా సా హరేః ధారా+అంబు-కదంబకేన సహ సు-ప్రేమ+అశ్రు-ధారాం హరేః (ఆవేద్య), భ్రాజత్+మాలికయా సహ ప్రణయ-సత్-మాలామ్ (ఆవేద్య), నేత్ర+అన్తే, న సునీరాజనమ్ (ఆవేద్య) శుచి-స్మిత+అమృత-రసైః నైవేద్యమ్ ఆవేద్య ఫలమ్ ఇవ తత్-పార్శ్వం మన్దమ్ ఉపాశ్రయత్.

ప్ర : వ్యాలోల-హార+ఉజ్జ్వలా : వ్యాలోల = కదలాడుతున్న, హార = ముత్యాలహారాలతో, ఉజ్జ్వలా = వెలుగొందుతున్న (వ్యాలోలైః హారైః ఉజ్జ్వలా), సా = ఆ రుక్మిణి, హరేః = కృష్ణునికి, ధారా+అంబు-కదంబకేన సహ : ధారా+అంబు = ధారాజలంయొక్క, కదంబకేన సహ = సమూహంతోపాటు, సు... ధారామ్ : సు-ప్రేమ = అచ్చపు వలపుతో కూడిన, అశ్రు-ధారామ్ = బాష్ప(కన్నీటి)ధారను, ఆవేద్య = నివేదించి, భ్రాజత్... సమమ్ : భ్రాజత్ = ప్రకాశిస్తున్న, మాలికయా సహ = మాలతో పాటు (భ్రాజన్తీ చ సా మాలికా, తయా సమమ్), ప్రణయ-సత్+మాలామ్ : ప్రణయ = వలపు అనే, సత్+మాలామ్ = నలగని పూలమాలను, ఆవేద్య = అర్పించి, నేత్ర+అన్తేన = కనుగొనలతో (నేత్రయోః అన్తః, తేన), సునీరాజనమ్ = మంచిహారతిని, ఆవేద్య = అర్పించి, శుచి... రసైః : శుచి-స్మిత = నిర్మలమైన చిఱునవ్వు అనే, అమృత-రసైః = అమృతరసాలతో (శుచీని చ తాని స్మితాని ఏవ అమృతస్య రసాః, తైః ), నైవేద్యమ్ = నివేదనను, ఆవేద్య = సమర్పించి, ఫలమ్-ఇవ = దాని ఫలితమన్నట్లు, తత్-పార్శ్వమ్ = ఆ కృష్ణుని ప్రక్కను, మన్దమ్ = మెల్లగా, ఉప+ఆశ్రయత్ = ఆశ్రయించింది. (ఉప-శ్రి సేవాయామ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.).

తా ॥ రుక్మిణి కన్యాదానం చేస్తున్న, ధారాజలసమూహంతోపాటు తన ప్రేమాశ్రుధారలనూ, వరమాలతోపాటు తన వలపుదండనూ, కనుగొనలతో ఆనందనీరాజనాన్నీ, అచ్చపు చిఱునవ్వు లనే అమృతరసాలతో నైవేద్యాన్నీ కృష్ణునికి సమర్పించి ఆ పూజాఫలితంగా ఆయన పార్శ్వభాగాన్ని మెల్లగా ఆశ్రయించింది.

వి : 1. రుక్మిణి తాను చేసిన భౌతికసాంకేతికపూజాఫలితాన్ని వెంటనే పొందింది. కృష్ణ సామీప్యప్రాప్తి రూపంగా-

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపాశ్రయత్ :** | **ఉపాశ్రయత్** | ఉపాశ్రయతామ్ | ఉపాశ్రయన్ |
| | ఉపాశ్రయః | ఉపాశ్రయతమ్ | ఉపాశ్రయత |
| | ఉపాశ్రయమ్ | ఉపాశ్రయావ | ఉపాశ్రయామ. |

*

శ్లో॥ నార్యోఽక్షతాన్ ప్రవవృషుర్నవకుఙ్కుమాభాన్
సఙ్గీతమఙ్గళకథాః సమలఙ్కృతాఙ్గ్యః ।
సౌవర్ణవిష్టరగతౌ సదయైరపాఙ్గైః
కన్యావరౌ చ ఫలమక్షయమేవ తాసామ్ ॥ 16-45

అ : స్త్రీలు కుంకుమాక్షతలను వధూవరులపై చల్లుట. -వసంతతిలక.

అ : సమలంకృత+అంగ్యః సంగీత-మంగళ-కథాః నార్యః నవ-కుంకమ+ఆభాన్ అక్షతాన్ ప్రవవృషుః సౌవర్ణ-విష్టర-గతౌ కన్యా-వరౌ చ సదయైః అపాంగైః తాసామ్ అక్షయం ఫలమ్ ఏవ ప్రవవృషుః.

ప్ర : సమ్-అలంకృత+అంగ్యః = చక్కగా అలంకరించుకొన్న శరీరాలు గలవారూ, (సమ్యక్ అలంకృతాని అంగాని యాసాం తాః), సంగీత-మంగళ-కథాః : సంగీత = చక్కగా పాడిన, మంగళ = శుభప్రదమైన, కథాః = కథలు

గలవారు అయిన (సమ్యక్ గీతాః మంగళాశ్చ తాః కథాః), నార్యః = స్త్రీలు, నవ-కుంకమ-ఆభాన్ : నవ = కొత్తదైన, కుంకుమ+ఆభాన్ = కుంకుమ కాంతిగల (నవస్య కుంకుమస్య ఆభా యేషాం తాన్), అక్షతాన్ = అక్షతలను, ప్రవవృషుః = చల్లారు. సౌవర్ణ-విష్టర-గతౌ : సౌవర్ణ = బంగారుతో చేసిన, విష్టర = పీటలపై, గతౌ = వున్న (సౌవర్ణయోః విష్టరయోః గతౌ), కన్యా-వరౌ చ = వధూవరులు కూడా (కన్యా చ వరశ్చ), సదయైః = అనుగ్రహంతో కూడిన, అపాంగైః = కడగంటి చూపులతో, తాసామ్ = ఆ స్త్రీలకు, అక్షయమ్ = నశింపని, ఫలమ్-ఏవ = ఫలితాన్నే, ప్రవవృషుః = కురిపించారు. (ప్ర-వృష్-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.బ.).

**తా ॥** చక్కగా అలంకరించుకొన్న స్త్రీలు మంగళగీతాలు చక్కగా పాడారు. ఆపై నవ కుంకుమశోభగల అక్షతలను వధూవరులపై చల్లారు. ఆ వధూవరులు కూడా బంగారు పీటలపై కూర్చొని ఆ స్త్రీలకు దయతో కూడిన కడగంటి చూపులతో అక్షయఫలితాన్ని ఇచ్చారు.

**వి :** 1. పెండ్లి వేడుకలలో స్త్రీలు వివిధసందర్భాలలో పాటలు పాడటం తెలుగువారి సంప్రదాయాలలో ఒకటి. ఈ మధ్య అది అదృశ్యమై పోయింది (దాదాపు). ఈ పాటలలో పారమార్థికత వుంటుంది. లౌకిక విషయబోధ, అధిక్షేపణ, సరదాలు, ముచ్చట్లు అన్ని కలగలిసి వుంటాయి. మచ్చుకు-

**శ్రీరాగం స్వరాలు - ఝంపెతాళం.**

లక్ష్మీ కళ్యాణ వైభోగమే - రామ కళ్యాణ వైభోగమే॥ లక్ష్మీ॥

మూడుదోసిళ్ళ ముత్యాలు ముంచి
శ్రీరాము సీతపై తలంబ్రాలు ఉంచె ॥ లక్ష్మీ॥

మాలలు మార్చిరి మహిపతులు చూడ
బాలలందరు గూడి చాల పాటలు పాడ ॥ లక్ష్మీ॥

కొంగుముళ్ళను వేసి గొబ్బున వసిష్ఠుండు
పొంగు వియ్యంబు పోషింపజేసెనూ ॥ లక్ష్మీ॥

మేలైన ఫలదానం తాంబూలముతొ నపుడు
మేలుగ పొగిడిరి భూపాలురపుడు ॥ లక్ష్మీ॥

అరివేణి లొణకంగ హరియు సీతమ్మయు
మరి బాగుచుట్టిరి పెండ్లి పందిటను ॥ లక్ష్మీ॥

తల మూసిపేర్లు తగ నడిగిరపుడు
తలవంచి సీతమ్మ శ్రీరాముడనెను ॥ లక్ష్మీ॥

మగువకు తగినటు పురుషుడు బలికె
తగునని భూపతులు తలలూపిరపుడు ॥ లక్ష్మీ॥

ఇద్దరినీ కూర్చిన సృష్టికర్త నపుడు
బుద్ధిమంతుడని పొగడిరందరునూ ॥ లక్ష్మీ॥

మంగళహారతులు మరియెత్తగానూ
పొంగుచు వనితలు ఆనందముతోనూ ॥ లక్ష్మీ॥

-పెళ్ళిపాటలు (డా॥ ఎ. అనసూయాదేవి) పుట.4,5

ఇటువంటివి ప్రాంతీయభాషన్నింటిలోనూ వుండవచ్చు. గ్రంథరూపంగా కన్న మౌఖిక సాహిత్యంగా వీటికి మనుగడ ఎక్కువ. అంతరించి పోయే అవకాశమూ ఎక్కువే.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రవవృషః :** | ప్రవవర్ష | ప్రవవృషతుః | **ప్రవవృషః** |
| | ప్రవవర్షిథ | ప్రవవృషథుః | ప్రవవృష |
| | ప్రవవర్ష | ప్రవవృషివ | ప్రవవృషిమ. |

*

**శ్లో॥ గృహీతపాణీ కిల చక్రతుస్తౌ - ప్రదక్షిణం లాజసమేధితాగ్నేః ।**
**వధూవరౌ రమ్యరహస్యగోష్ఠ్యాం - విధాతుమాత్మీయమివాస్యగం తమ్ ॥ 16-46**

**అ :** రుక్మిణీకృష్ణులు అగ్నికి ప్రదక్షిణం చేయటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** గృహీత-పాణీ తౌ వధూ-వరౌ ఆస్య-గం తం రమ్య-రహస్య-గోష్ఠ్యామ్ ఆత్మీయం విధాతుమ్ ఇవ లాజ-సమేధిత+అగ్నేః ప్రదక్షిణం చక్రతుః కిల.

**ప్ర :** గృహీత-పాణీ : గృహీత = గ్రహింపబడిన, పాణీ = చేతులుగల (పాణిగ్రహణం చేసిన) (గృహీతౌ పాణీ యాభ్యాం తౌ), తౌ = ఆ, వధూ-వరౌ = వధూవరులు (వధూశ్చ వరశ్చ), ఆస్య-గమ్ = ముఖంలోనున్న (ఆస్యం గచ్ఛతీతి, తమ్), తమ్ = ఆ అగ్నిని, రమ్య... గోష్ఠ్యామ్ : రమ్య = రమణీయమైన, రహస్య-గోష్ఠ్యామ్ =ఏకాంత చర్చలలో (రమ్యా చ సా రహస్యే గోష్ఠీ, తస్యామ్), ఆత్మీయమ్ = తనవానినిగా (ఎవరికి వారు), విధాతుమ్-ఇవ = చేసుకోవటానికన్నట్లు, లాజ-సమేధిత+అగ్నేః : లాజ = పేలాలచే, సమేధిత = వృద్ధిపొందింపబడిన, అగ్నేః = అగ్నికి, ప్రదక్షిణమ్ = ప్రదక్షిణను (చుట్టూ తిరగటాన్ని), చక్రతుః కిల = చేశారు. (ప్ర-కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర.ద్వి.)

**తా ॥** పాణిగ్రహణం తరువాత వధూవరులు పేలాలతో ఎగిసిమండుతున్న (లాజహోమం ముగిసింది) అగ్నికి ప్రదక్షిణం చేశారు. నారాయణుని ముఖంలో వున్న అగ్నిని భవిష్యత్తులో ఏకాంతగోష్ఠిలో తనవాడుగా నిలిచేందుకై అగ్నిని మంచి చేసికొన్నట్లుందది.

**వి :** 1. ఆస్యగమ్ - పురుషసూక్తమ్.

**శ్లో॥ చంద్రమా మనసో జాతః చక్షోః సూర్యో అజాయత ।**
**ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥** **- ఋగ్వేదం 10/90/14.**

2. పాణిగ్రహణమంత్రాలు :

శ్లో॥ గృభ్ణామి తే సుప్రజాస్త్వాయ హస్తం మయా పత్యా జరదృష్టిర్యథా సః ।
భగో ఆర్యమా సవితా పురంధిర్మహ్యం త్వా దుర్గార్హపత్యాయ దేవాః ॥

శ్లో॥ తే హ పూర్వే జనాసో యత్ర పూర్వవహో హితాః ।
మూర్ధన్వాన్ యత్ర సౌభ్రవః పూర్వో దేవేభ్య ఆతపత్ ॥

శ్లో॥ సరస్వతి ప్రేదమవ సుభగే వాజినీవతి ।
తాం త్వా విశ్వస్య భూతస్య ప్రగాయామస్యగ్రతః ॥

శ్లో॥ య ఏతి ప్రదిశస్సర్వా దిశోను పవమానః ।
హిరణ్యహస్తో ఐరమ్మస్స త్వా మన్మనసం కృణోతు ॥

ఈ మంత్రాలు చెప్పి చివరలో పాణిగ్రహణం చేయటం-

ఆ తర్వాత సప్తపది. ఆ తర్వాత ప్రధానహోమాలు. ఇవి 16 ఆజ్యాహుతులు.

| | | | |
|---|---|---|---|
| 2. **చకార :** | **చకార** | చక్రతుః | చక్రుః |
| | చకర్థ | చక్రథుః | చక్ర |
| | చకార/చకర | చకృవ | చకృమ. |

*

**శ్లో॥ తతశ్చతుర్థే దివసే కిలైతౌ - చిరం రతౌ తల్పతనౌ ఫణీన్ద్రే ।**
**విలమ్బిని క్ష్మాం వహతేతి నూనం - ప్రచక్రతుర్నాగబలిం ప్రహృష్టౌ ॥ 16-47**

**అ :** నాగబలి (నాగవల్లి/నాకబలి) కార్యక్రమం. -ఉపేంద్రవజ్ర.

**ఆ :** తతః చతుర్థే దివసే ప్రహృష్టౌ ఏతౌ చిరం రతౌ (సత్యాం) తల్ప-తనౌ ఫణి+ఇంద్రే విలంబిని క్ష్మాం వహత ఇతి నాగ-బలిం ప్రచక్రతుః కిల.

**ప్ర :** తతః = అటు తరువాత, చతుర్థే = నాలుగవ, దివసే = నాడు, ప్రహృష్టౌ = ఆనందించిన, ఏతౌ = ఈ ఇద్దరూ (రుక్మిణీకృష్ణులు), చిరమ్ = ఎక్కువసేపు, రతౌ (సత్యామ్) = రమిస్తుండగా, తల్ప-తనౌ = (వారికి) పడక అయిన శరీరంగల (తల్ప రూపా తనుః యస్య తస్మిన్), ఫణి+ఇంద్రే = ఆదిశేషుడు (ఫణీనామ్ ఇన్ద్రః, తస్మిన్), విలంబిని = జాగు చేస్తే, క్ష్మామ్ = భూమిని, వహత-ఇతి = మోయండి అని (వహ ప్రాపణే పరస్మైపది-లోట్-మ.బ.), నాగ-బలిమ్ = ఏనుగులకు బలిని, ప్రచక్రతుః కిల = చేశారు గదా! (ప్ర-కృ కరణే-పరస్మైపది-లిట్-ప్ర.ద్వి.)

**తా ॥** ఆ తరువాత నాలుగవ రోజున ఆనందంతో రుక్మిణీ కృష్ణులు ఎక్కువ కాలం క్రీడిస్తుంటే, వాళ్ళకు పడకగా వున్న ఆదిశేషుడు (కర్తవ్యంలో) జాగు చేస్తే 'మీరు భూభారాన్ని వహించండి' అని దిగ్గజాలకు చెప్తున్నట్లు నాగబలి కార్యక్రమాన్ని చేశారు.

**వి :** 1. **నాగబలి** కార్యక్రమాన్నే ఇప్పుడు నాగవల్లి, నాగవిల్లి, నాకబలి (ఇంకా ఏమైనా వున్నాయేమో) అని వ్యవహరిస్తుంటారు. దీన్ని ఏనుగులకిచ్చే బలిగా కవి ప్రతిపాదిస్తున్నందు వలన నాగబలి పదం హేతుబద్ధమే. (దానికి కారణాన్ని కూడా సంభావించటం వలన ఇది ఉత్ప్రేక్షాలంకారం. నూనం పదం ఉత్ప్రేక్షావాచకం)

ఈ నాగవల్లిలో క్రియాభాగమే ప్రధానం. నాగబలి కార్యక్రమంలో నాగ/నాక బలి ఒక అంశం. **పెళ్ళికూతురు కాలికి మెట్టెలు తొడిగించటం, మెడలో నల్లపూసలు కట్టడం నాగవల్లిలో భాగమే.** ఫలదానతాంబూలాలు దంపతులచే మిథునాలకు ఇప్పించటం, సదస్యాన్ని జోడించి పెద్దలకు, పండితులకు సత్కారాలు జరిపించటం కూడా దీనిలో భాగమే.

| | | | |
|---|---|---|---|
| 2. **వహత :** | వహతు/వహతాత్ | | వహతామ్ వహన్తు |
| | వహ/వహతాత్ | వహతమ్ | **వహత** |
| | వహాని | వహావ | వహామ |

**ప్రచక్రతుః :** 16-46వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సా మన్దస్మితమౌక్తికేన సదపాఙ్గాఖ్యైర్వ్రయైర్వృత్పురా**
**వక్షోజద్విరదేన కాయకనకేనోద్భూతరోమానుగైః ।**
**తత్సంసక్తమనోరథేన వివిధాఙ్గశ్రీవిచిత్రామ్బరై-**
**స్తద్యోగ్యామృతసాధనాధరభువా సన్తర్పయామాస తమ్ ॥ 16-48**

**అ :** రుక్మిణి మందహాసాదులతో కృష్ణుని ఆనందింపజేయటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సా మంద-స్మిత-మౌక్తికేన సద్-అపాంగ+ఆఖ్యైః హయైః హృత్-పురా వక్షోజ-ద్విరదేన కాయ-కనకేన ఉద్భూత-రోమ+అనుగైః తత్-సంసక్త-మనోరథేన వివిధ+అంగ-శ్రీ-విచిత్ర+అంబరైః తద్+యోగ్య+అమృత-సాధన-అధర-భువా తం సంతర్పయామాస.

**ప్ర :** సా=ఆ రుక్మిణి, మంద-స్మిత-మౌక్తికేన : మంద-స్మిత = చిఱునవ్వు అనే, మౌక్తికేన = ముత్యంతో, సద్... ఆఖ్యైః : సద్-పాంగ = చక్కని కడగంటిచూపు అని, ఆఖ్యైః = పేరుగల, హయైః = గుఱ్ఱాలతో (సన్తః అపాంగాః ఇతి ఆఖ్యా యేషాం తైః), హృత్-పురా = హృదయనగరంతో (హృత్ ఏవ పూః, తేన), వక్షోజ-ద్విరదేన = రొమ్ము అనే ఏనుగుతో (వక్షోజ ఏవ ద్విరదః, తేన), కాయ-కనకేన = శరీర మనే బంగారుతో (కాయ ఇతి కనకం తేన), ఉద్భూత-రోమ+అనుగైః : ఉద్భూత = పొడమినట్టి, రోమ = వెంట్రుక లనే, అనుగైః = అనుచరులతో (ఉద్భూతాని రోమాణి ఏవ అనుగాః, తైః), తత్-సంసక్త-మనః+రథేన : తత్ = ఆ కృష్ణునిపై, సంసక్త = తగుల్కొన్న, మనః = మనస్సు అనే, రథేన = రథంతో (తస్మిన్ సంసక్తం మనః ఏవ రథః, తేన), వివిధ... అంబరైః : వివిధ+అంగ = అనేక శరీరావయవాలయొక్క, శ్రీ = కాంతులనే, విచిత్ర+అంబరైః = రంగురంగుల వస్త్రాలతో, తత్... భువా : తత్ = ఆ కృష్ణునకు, యోగ్య = తగినట్టి, అమృత = అమృతాన్ని, సాధన = సాధించే, అధర = పెదవి అనే, భువా = భూమితో, తమ్ = ఆ కృష్ణుని, సంతర్పయామాస = ఆనందింపజేసింది. (సమ్-తృప్ తృప్తౌ-చురాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** ఆ రుక్మిణి తన చిఱునవ్వు అనే ముత్యంతో కడగంటి చూపులనే గుఱ్ఱాలతో హృదయమనే పురంతో, రొమ్ము అనే ఏనుగుతో, శరీరమనే బంగారంతో, నిక్కబొడుచుకున్న వెంట్రుకలనే అనుచరులతో, కృష్ణునిపై లగ్నమైన మనస్సనే రథంతో, వివిధావయవాల కాంతులనే విచిత్రవస్త్రాలతో ఆ కృష్ణునకు తగిన అమృతాన్ని సాధించుకొనే అధరమనే భూమితో కృష్ణుని ఆనందింపజేసింది.

**వి :** 1. శ్లోకమంతా రూపకాలంకారభూయిష్టం. అయితే అవయవ+అవయవి విభాగం కనిపించటం లేదు కాబట్టి సావయవరూపకమనలేము.

2. **సంతర్పయామాస :**

| | | |
|---|---|---|
| సంతర్పయామాస | సంతర్పయామాసతుః | సంతర్పయామాసుః |
| సంతర్పయామాసిథ | సంతర్పయామాసిథుః | సంతర్పయామాస |
| సంతర్పయామాస | సంతర్పయామాసివ | సంతర్పయామాసిమ. |

*

**శ్లో॥ జ్వలత్కలాపాః స్ఫురదఙ్గలేపా - విచిత్రవస్త్రాః స్మితశోభివక్త్రాః ।**
**స్వయంవరే తత్ర నరాశ్చ నార్యో - వధూవరాభాః కిల సఞ్చరన్తి ॥ 16-49**

**అ :** అతిథులందరూ ఉరకలెత్తే ఉత్సాహంతో వధూవరులుగానే కనిపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** జ్వలత్-కలాపాః స్ఫురద్-అంగలేపాః విచిత్ర-వస్త్రాః స్మిత-శోభి-వక్త్రాః నరాః నార్యః చ తత్ర స్వయంవరే వధూ-వర+ఆభాః (సన్తః) (సత్యః) సంచరన్తి కిల.

**ప్ర :** జ్వలత్-కలాపాః : జ్వలత్ = ప్రకాశిస్తున్న, కలాపాః = నగలు గలవారూ (కలాపో భూషణే బర్హే-అమరకోశః-నానార్థ-131) (జ్వలన్తః కలాపాః యేషాం తే/యాసాం తాః), స్ఫురద్-అంగ-లేపాః : స్ఫురద్ = వెలుగొందుతున్న, అంగలేపాః = మైపూతలుగలవారూ (స్ఫురన్తః అంగానాం లేపాః యేషాం తే/ యాసాం తాః), విచిత్ర-వస్త్రాః:విచిత్ర = రంగు రంగుల, వస్త్రాః = బట్టలు గలవారూ (విచిత్రాణి వస్త్రాణి యేషాం తే/ యాసాం తాః ), స్మిత-శోభి-వక్త్రాః : స్మిత = చిఱునవ్వులతో, శోభి = ప్రకాశిస్తున్న, వక్త్రాః = ముఖాలు గలవారూ అయిన (స్మితైః శోభీని వక్త్రాణి యేషాం తే/ యాసాం తాః), నరాః = మగవారు, నార్యః చ = స్త్రీలూ, తత్ర = అక్కడ, స్వయంవరే =

స్వయంవరంలో, వధూ–వర–ఆభాః (సన్త)/(సత్యః) : వధూ–వర = వధూవరులతో, ఆభాః = పోలిక గలవారై (ఆభా ప్రఖ్యోపమాభిఖ్యా'–వైజయన్తీ–అర్థవత్–122), సంచరన్తి కిల = తిరుగుతున్నారు గదా! (సమ్–చర గతిభక్షణయోః –భ్వాది–పరస్మైపది–లట్–ప్ర.బ.).

**తా ॥** ఆ స్వయంవరంలో ఆడా మగా అందరూ నగలతో, మైపూతలతో, విచిత్ర వస్త్రాలతో, చిఱునవ్వులతో అందగించిన ముఖాలతో వధూవరుల లాగానే తిరుగుతున్నారు.

| | | | | |
|---|---|---|---|---|
| **వి :** 1. **సంచరంతి :** | సంచరతి | సంచరతః | **సంచరన్తి** | |
| | సంచరసి | సంచరథః | సంచరథ | |
| | సంచరామి | సంచరావః | సంచరామః. | * |

**శ్లో॥ స్వర్గిభిర్గీయమానః స్వం దుర్గమావిశ్య దుర్గమమ్ ।**
**భగ్నదుర్జనదర్పోఽసౌ రుగ్మిణీరమణో బభౌ ॥ 16–50**

**అ :** కృష్ణుడు తన కోటకు చేరటం. –పథ్యావక్త్రమ్.

**అ :** స్వర్గిభిః గీయమానః భగ్న–దుర్జన–దర్పః అసౌ రుక్మిణీ–రమణః దుర్గమం స్వం దుర్గమ్ ఆవిశ్య బభౌ.

**ప్ర :** స్వర్గిభిః = దేవతలచే (స్వర్గః యేషామ్ అస్తీతి, తైః), గీయమానః = స్తుతింపబడువాడు (గై ధాతువుపై కర్మణి–శానచ్ ప్రత్యయం), భగ్న–దుర్జన–దర్పః : భగ్న = భంగపడిన, దుర్జన = చెడ్డవారియొక్క, దర్పః = పొగరుగలవాడూ అయిన (భగ్నః దుర్జనానాం దర్పః యస్మాత్ సః), అసౌ = ఆ, రుక్మిణీ–రమణః = కృష్ణుడు (రుక్మిణ్యాః రమణః), దుర్గమమ్ = (ఇతరులు) చొరరాని (దుష్టః గమః యస్య తత్), స్వమ్ = తనయొక్క, దుర్గమ్ = కోటను, ఆవిశ్య = ప్రవేశించి (ఆ–విశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), బభౌ = ప్రకాశించాడు. (భా దీప్తౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు దుర్జనుల దర్పాన్ని అణిచి, దేవతలచే స్తుతింపబడుతూ దుర్గమమైన తన దుర్గంలో ప్రవేశించి ప్రకాశించాడు.

**వి :** 1. '**రుక్మిణీరమణః**' అన్న పదం రుక్మిణితో కలసి అన్న భావాన్ని సూచిస్తుంది.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **బభౌ :** | **బభౌ** | బభతుః | బభుః | |
| | బభిథ/బభాథ | బభథుః | బభ | |
| | బభౌ | బభివ | బభిమ. | * |

**శ్లో॥ స్వఫేనకాన్త్యా సితపార్శ్వయుగ్మః – శిఖాభిరౌర్వస్య సుపీతమధ్యః ।**
**సితేతరోఽన్యత్ర స భూతధాత్ర్యా – విచిత్రవస్త్రశ్రియమాతనోతి ॥ 16–51**

**అ :** సముద్రవర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** స్వ–ఫేన–కాన్త్యా సిత–పార్శ్వ–యుగ్మః ఔర్వస్య శిఖాభిః సుపీత–మధ్యః అన్యత్ర సిత+ఇతరః సః భూతధాత్ర్యాః విచిత్ర–వస్త్ర–శ్రియమ్ ఆతనోతి.

**ప్ర :** స్వ–ఫేన–కాన్త్యా : స్వ = తనయొక్క, ఫేన = నురుగుయొక్క, కాన్త్యా = వెలుగుతో, సిత–పార్శ్వ–యుగ్మః : సిత = తెల్లనైన, పార్శ్వ = అంచులయొక్క (స్పృశ్యతే ఇతి పార్శ్వమ్–**స్పృశ్ ధాతువుపై శ్వణ్ ప్రత్యయం, ధాతువుకు 'పృ' ఆదేశం**), యుగ్మః = జంటగలవాడూ, ఔర్వస్య = బడబాగ్నియొక్క (ఔర్వస్తు బాడబో బడబానలః–అమరకోశః–స్వర్గ–56), శిఖాభిః = జ్వాలలచే, సుపీత–మధ్యః : సుపీత = పసుపువన్నెగల, మధ్యః = మధ్యభాగంగలవాడూ (సుపీతః మధ్యః యస్య సః), అన్యత్ర = వేరుతావులలో, సిత+ఇతరః = నల్లనివాడూ అయిన (సితాత్ ఇతరః (వర్ణః

) యస్య సః), సః = ఆ సముద్రం, భూత-ధాత్ర్యాః = భూమికి (భూతాని దధాతి ఇతి, తస్యాః), విచిత్ర-వస్త్ర-శ్రియమ్ : విచిత్ర = రంగురంగుల, వస్త్ర = వస్త్రం (బట్ట)యొక్క, శ్రియమ్ = శోభను (విచిత్రం చ తద్ వస్త్రం, తస్య శ్రీః, తామ్), ఆతనోతి = కలిగిస్తోంది. (ఆ-తనూ విస్తారే పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** ఆ సముద్రం తన నురుగులు తెల్లని అంచుగా, తనలోని బడబాగ్ని వలన మధ్యలో ముదురు పసుపుపచ్చగా కనిపిస్తూ నేలకు రంగురంగుల వస్త్రం కట్టినట్లు శోభను సమకూర్చుతోంది.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. ఆతనోతి :** | **ఆతనోతి** | ఆతనుతః | ఆతన్వన్తి |
| | ఆతనోషి | ఆతనుథః | ఆతనుథ |
| | ఆతనోమి | ఆతనువః/అతన్వః | అతనుమః/అతన్మః. * |

**శ్లో॥ అసహ్యవహ్నివ్యథితోఽపి వార్ధి-రనన్తరత్నాన్యుదరే పిధాయ ।**
**న జాతు పానీయమపి ప్రదత్తే - ధనస్య లాభాదధికో హి లోభః ॥ 16-52**

**అ :** సముద్రవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** వార్ధిః అసహ్య-వహ్ని-వ్యథితః అపి అనన్త-రత్నాని ఉదరే పిధాయ జాతు పానీయమ్ అపి న ప్రదత్తే. హి. ధనస్య లాభాద్ లోభః అధికః (భవతి).

**ప్ర :** వార్ధిః = సముద్రుడు, అసహ్య-వహ్ని-వ్యథితః అపి : అసహ్య = భరింపరాని, వహ్ని = అగ్నిచే (బడబాగ్నిచే), వ్యథితః అపి = బాధింపబడినా (అసహశ్చ అసౌ వహ్నిః తేన వ్యథితః), అనన్త-రత్నాని = అంతులేని రత్నాలను (అనన్తాని చ తాని రత్నాని), ఉదరే = కడుపులో (లోన), పిధాయ = దాచికొని (అపి-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), జాతు = ఎప్పుడు కూడా, పానీయమ్ అపి = (త్రాగు) నీటిని కూడా, న ప్రదత్తే = ఇవ్వడు. (ప్ర దా దానే ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.), హి = అది తగినదే, ధనస్య = డబ్బుయొక్క, లాభాత్ = ప్రాప్తికంటే, లోభః = పిసినారితనం, అధికః = ఎక్కువ (గా వుంటుంది.)

**తా ॥** సముద్రంలోపల బడబాగ్ని వుంటుంది. రత్నాలూ వుంటాయి. సముద్రుడు ఆ అగ్నితో బాధపడుతూ కూడా తనలోన అనన్తరత్నాలను దాచుకొని ఎప్పుడూ త్రాగటానికి కూడా నీరు అందివ్వడు. నిజమే. ధనలాభం కన్న ధనలోభం శక్తిమంతమైనది.

**వి :** 1. సముద్రం నిండా నీళ్ళే. కానీ ఉప్పగా వుంటాయి. త్రాగటానికి పనికిరావు. సముద్రంలోపల రత్నాలున్నాయి. కానీ తెచ్చుకోలేము. సముద్రగర్భంలో బడబాగ్ని వుంది. దాన్ని చల్లార్చలేము. వీటిని దృష్టిలో పెట్టుకొని సముద్రానికి చేతనలక్షణాన్ని కల్పించి వర్ణించిన శ్లోకమిది.

సముద్రాలు, పర్వతాలు, నేల - ఈ మూడింటికీ రత్నాలకు నిలయాలన్న పేరు. రత్నాకరుడు సముద్రుడు. రత్నగర్భ భూమి. రత్నప్రభవుడు హిమాలయుడు. భారతీయుల ఈ భావన సాంకేతికం కూడా కావచ్చు. **ఎత్తులకు ఎదగగలిగినా, లోతుల్లోనికి దిగ గలిగినా, అంతరాంతరాల్లో త్రవ్వి చూడగలిగినా సంపదలు సమకూరుతాయి అన్న అంతరార్థమిక్కడ వుండవచ్చు.**

2. శ్లోకంలోని పూర్వార్ధంలో కాళిదాస శ్లోకప్రభావం (అనన్తరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్ -కుమారసంభవం 1-3) కనిపిస్తుంది. ఉత్తరార్ధం సముద్రజల- సహజతత్త్వాన్ని వర్ణించటం లోభి స్వభావంతో పోల్చుతూ.

3. మొదటి మూడుపాదాలూ విశేషవిషయం, నాలుగవపాదం సామాన్యవిషయం. రెండింటినీ కలిపినందువల్ల అర్థాంతరన్యాసాలంకారం. (కు. 122)

| | | | |
|---|---|---|---|
| 4. **ప్రదత్తే :** | **ప్రదత్తే** | ప్రదదాతే | ప్రదదతే |
| | ప్రదత్సే | ప్రదదాథే | ప్రదదధ్వే |
| | ప్రదదే | ప్రదద్వహే | ప్రదద్మహే. |

*

**శ్లో॥ సరిత్పతిస్తన్ముఖతో హి వేలాం – విలఙ్ఘయత్యత్ర వివేకహీనః ।**
**తథా హి నార్యా సహ సఙ్గతానాం – కుతో వివేకః కుత ఏవ వేలా ॥ 16-53**

**అ :** సముద్రవర్ణన. –ఉపేంద్రవజ్ర.

**అ :** అత్ర సరిత్–పతిః తత్+ముఖతః హి వేలాం వివేక–హీనః విలంఘయతి. తథా హి నార్యా సహ సంగతానాం వివేకః కుతః వేలా కుతః?

**ప్ర :** అత్ర = ఇక్కడ, సరిత్–పతిః = నదీవల్లభుడు (సరితాం పతిః), తత్–ముఖతః = నదీముఖంగానే (నది సముద్రంలో కలిసేచోటు నదీముఖం–'**నదీముఖేనేవ సముద్రమావిశత్**' (రఘువంశం 3/28) కాళిదాస ప్రయోగం), వేలామ్ = చెలియలికట్టను/ మర్యాదను, వివేక–హీనః (సన్) = వివేకశూన్యుడై, విలంఘయతి = అతిక్రమిస్తున్నాడు. (వి–లంఘ్–భాషాయాం దీప్తౌ సీమాతిక్రమణే చ–చురాది–పరస్మైపది–లట్–ప్ర.ఏ.), తథా హి = అది యుక్తమే. నార్యా సహ = స్త్రీతో, సంగతానామ్ = కూడినవారికి, వివేకః = వివేకం, కుతః? = ఎక్కడనుండి వస్తుంది?వేలా = మర్యాద (చెలియలికట్ట), కుతః? = ఎక్కడనుండి వస్తుంది?

**తా ॥** వివేకహీనుడైన నదీవల్లభుడు (సముద్రుడు) నదీముఖంగానే చెలియలికట్టను (మర్యాదను) అతిక్రమిస్తున్నాడు. నిజమే. స్త్రీతో కూడినవారికి వివేకమెలా వుంటుంది? మర్యాద ఎలా తెలుస్తుంది.

**వి :** 1. '**కామార్తా హి ప్రకృతి కృపణాశ్చేతనాశ్చేతనేషు**' – అంటాడు కాళిదాసు. ఇక్కడ కవి ధర్మాధర్మవివేకం కూడా నశిస్తుందనీ, మర్యాదలనుగూడా మరచిపోతాడనీ ప్రతిపాదిస్తున్నాడు. ఇక్కడ స్త్రీ సమాగమ మన్నది కన్ను మిన్ను గానని కామప్రవృత్తిలో మాత్రమే వర్తించే విషయం. కేవలం స్త్రీ సమాగమమన్నది వివేకాన్ని పోగొడుతుందనలేము. అదే నిజమయితే గృహస్థాశ్రమానికి అర్థమే లేదు.

తే. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు – పరసతీసంగమము; ధర్మపథమునందు
బరగువారలు పరిహరింపంగఁ గనియు – వినియుఁ దెలియవె యిది **దుర్వివేకమగుట**.

– భారతము–విరాటపర్వం–2/69

అని ద్రౌపది కీచకునితో చెప్పిన కామోద్రేకం, తత్ఫలంగా వచ్చే దుర్వివేకం–వీటినే కవి వివక్షగా మనం భావించాలి.

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారముంది విశేషసామాన్యవిషయాలకలయిక వల్ల–

| | | | |
|---|---|---|---|
| 3. **విలంఘయతి :** | **విలంఘయతి** | విలంఘయతః | విలంఘయన్తి |
| | విలంఘయసి | విలంఘయథః | విలంఘయథ |
| | విలంఘయామి | విలంఘయావః | విలంఘయామః. |

*

**శ్లో॥ బహూపభోగ్యాఽపి సరిత్సముద్ర–తటే న సా కణ్టకితోపకణ్ఠా ।**
**రహస్యుపాహూయ విటాన్ స్వభర్తృ–తటే సదాచారపరా హి కాశ్చిత్ ॥ 16-54**

**అ :** నదీప్రవృత్తిని పుంశ్చలీప్రవృత్తితో పోల్చటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** సరిత్ బహు+ఉపభోగ్యా అపి సముద్ర–తటే కంటకిత+ఉపకంఠా సా న. కాశ్చిత్ రహసి విటాన్ ఉపాహూయ స్వ–భర్తృ–తటే సద్+ఆచార–పరా హి.

**ప్ర :** సరిత్ = నది, బహు+ఉపభోగ్యా అపి : బహు = అనేకులచే, ఉపభోగ్యా అపి = అనుభవింపదగినదైనను (స్నానం, పానం మొదలగు భోగాలు) (బహుభిః ఉపభోక్తుం యోగ్యా), సముద్ర-తటే = సముద్రం ఒడ్డున (సముద్రస్య తటం, తస్మిన్), కంటకిత+ఉపకంఠా : కంటకిత = ముళ్ళుగా చేయబడిన, ఉపకంఠా = సామీప్యంగల (కంటకితమ్ ఉపకంఠం యస్యాస్సా), సా = ఆ నది, (బహూపభోగ్యా) న = అందరూ అనుభవింపదగినది కాదు. (నీళ్ళలోని ఉప్పదనం, తీరంలోని ముళ్ళు అందుకు కారణం), కాశ్చిత్ = కొంతమంది స్త్రీలు, రహసి = ఒంటరిగా/ ఏకాంతంలో, విటాన్ = విటులను, ఉప+ఆహూయ = దగ్గరకు పిలిచినా, స్వ-భర్తృ-తటే = తమ భర్తల దగ్గర (స్వాసాం భర్తౄణాం తటే), సద్-ఆచార-పరాః+హి = సదాచారపరాయణలే గదా! (సతి ఆచారే పరాః)

**తా ॥** నది జన్మస్థానంలో లేదా సముద్రాన్ని చేరకుముందు అందరూ అనుభవించటానికి అనువుగా వుంటుంది. అయితే సముద్రం దగ్గర ఆ తీరప్రాంతమంతా కంటకితమై అనుభవించటానికి వీలుకాకుండా వుంటుంది. కొందరు స్త్రీలంతే. ఏకాంతంలో విటులను ఆహ్వానిస్తారు. తమ భర్తల దగ్గర సదాచారపరులుగా ప్రవర్తిస్తారు. *

**శ్లో॥స్వీయాశాయువతిముపేత్య రాగభాజ-స్తోయేశః సుహృదపి వీక్ష్య నాశమిన్దోః ।**
**ఆనన్దాదనిశముపైతి వృద్ధిముచ్చై-రేకస్యామభిరతిమిచ్ఛతోః క్వ మైత్రీ ॥ 16-55**

**అ :** సముద్రవర్ణనమే. -ప్రహర్షిణి.

**అ :** సుహృత్ తోయ+ఈశః స్వీయ+ఆశా-యువతిమ్ ఉపేత్య రాగ-భాజః ఇన్దోః నాశం వీక్ష్య ఆనందాత్ అనిశమ్ ఉచ్చైః వృద్ధిమ్ ఉపైతి. ఏకస్యామ్ అభిరతిమ్ ఇచ్ఛతోః మైత్రీ క్వ?

**ప్ర :** సుహృత్ = మిత్రుడైన (శోభనం హృత్ యస్య సః), తోయ+ఈశః = జలాధిపతి (సముద్రుడు) (తోయానామ్ ఈశః), స్వీయ+ఆశా-యువతిమ్ : స్వీయ = తనయొక్క, ఆశా = దిక్కు అనే (దిశస్తు కకుభః కాష్ఠా ఆశా-అమర-దిగ్-1), యువతిమ్ = యువతిని, ఉపేత్య = పొంది, రాగ-భాజః = అనురక్తిని పొందిన (రాగం భజతీతి తస్య), ఇన్దోః = చంద్రునియొక్క, నాశమ్ = నాశనాన్ని, వీక్ష్య = చూసి (వి-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఆనందాత్ = ఆనందంతో, అనిశమ్ = ఎల్లప్పుడూ, ఉచ్చైః = పైకి, వృద్ధిమ్ = పొంగును, ఉపైతి = పొందుతున్నాడు. ఏకస్యామ్ = ఒకే స్త్రీయందు, అభిరతిమ్ = సంగమాన్ని, ఇచ్ఛతోః = కోరుతున్న ఇద్దరికీ, మైత్రీ = స్నేహం, క్వ = ఎలా కుదురుతుంది?

**తా ॥** సముద్రుడు చంద్రునకు మిత్రుడు. అయినా తనదైన దిక్కుపై అనురాగాన్ని పొందిన చంద్రుని వినాశనాన్ని చూసి గొప్పగా పొంగిపోతున్నాడు ఆనందంతో. ఒకే స్త్రీకి ఇద్దరి అనురక్తి ఎలా పొసగుతుంది?

**వి :** 1. చంద్రుడు అస్తమించేటప్పుడు సముద్రం పొంగుతుంది. సముద్రుడు జలరూపం కాబట్టి వరుణ స్వరూపం. వరుణదిక్కు పశ్చిమం. అక్కడ చంద్రుడు అస్తమిస్తూ ఎఱ్ఱబడు తున్నాడు. అది అనురాగం. అక్కడే అస్తమిస్తున్నాడు అది నాశం. సముద్రం పొంగుతోంది. అది ఆనందానుభవం. ఇంతటి స్థితికి కారణం సముద్రుడికీ, చంద్రుడికీ వారుణిపై ఆసక్తి కలగటమే.

ఈ విషయాన్ని అర్థాంతరన్యాసంతో '**ఏకస్యామభిరతిమిచ్ఛతోః క్వ మైత్రీ**' అని సమర్థించినందువల్ల ఇది అర్థాంతరన్యాసాలంకారం. '**ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్య విశేషయోః**' - (కు. 122)

2. ఒకే కాంతపై పలువురికి అనురాగం రసాభాసం. అది అనుచితవిభావాన్ని ఆశ్రయించి వుంటుంది కాబట్టి. పరస్పరం తెలియకుండా అనేక పురుషులకు ఒక స్త్రీపై అనురాగ ముండటం రసాభాసం కాకపోవచ్చు. కానీ ఇక్కడ అది సముద్రుడికి తెలిసిన విషయం. తద్వైఫల్యానికి తాను పొంగిపోతున్నాడు కూడా.

| | | | |
|---|---|---|---|
| 3. **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయన్తి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః. * |

**శ్లో॥ అన్తః కృతాన్తోపమవాడవాగ్ని-సన్తప్తగాత్రోఽపి ముదేవ గర్జన్ ।**
**ఫేనస్మితశ్రీర్గగనస్పృగూర్మి-ర్గామ్భీర్యమావేదయతీవ వార్ధిః ॥ 16-56**

**అ :** గాంభీర్య కారణంగా సముద్ర ప్రస్తుతి. -ఇంద్రవజ్ర.

**అ :** అన్తః కృతాన్త+ఉపమ-వాడవ+అగ్ని-సన్తప్త-గాత్రః అపి వార్ధిః ముదా+ఇవ గర్జన్ ఫేన-స్మిత-శ్రీః గగన-స్పృక్+ఊర్మిః గాంభీర్యమ్ ఆవేదయతి+ఇవ.

**ప్ర :** అన్తః = లోపల, కృతాన్త... గాత్రః : కృతాన్త+ఉపమ = యమునితో పోలికగల, వాడవ+అగ్ని = బడబాగ్నిచేత, సన్తప్త = తపింపజేయబడిన, గాత్రః-అపి = శరీరంగలవాడై నను (కృతాన్తేన ఉపమః బాడవ ఇతి అగ్నిః, తేన సంతప్తః), వార్ధిః = సముద్రుడు, ముదా ఇవ = ఆనందంతోనో అన్నట్లు, గర్జన్ = ఘోషిస్తూ, ఫేన-స్మిత-శ్రీః : ఫేన = నురుగు అనే, స్మిత = చిఱునవ్వుయొక్క, శ్రీః = శోభగలవాడు, గగన-స్పృక్+ఊర్మిః సన్ : గగన = ఆకాశాన్ని, స్పృక్ = తాకుతున్న, ఊర్మిః (సన్) = అలలుగలవాడు అయి, గాంభీర్యమ్ = గాంభీర్యాన్ని, ఆవేదయతి+ఇవ = చెప్తున్నట్లుంది. (ఆ-విద్ జ్ఞానే-అదాది-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** సముద్రుడిలోపల యమునితో సమానమైన బడబాగ్ని వుంది. దానితో సముద్రుని శరీరం తపిస్తోంది. అయినా ఆనందంతో గర్జిస్తున్నట్టు ఘోషపెడుతూ నురుగు లనే చిఱు-నవ్వుల శోభతో, ఆకాశాన్ని అంటే అలలతో సముద్రుడు తన గాంభీర్యాన్ని ప్రదర్శిస్తున్నట్లుంది.

**వి :** 1. గర్జన్ ఇవ, ఆవేదయతి ఇవ - రెండుచోట్ల ఉత్ప్రేక్షాలంకారం. లోపల ఎంత తపన వున్నా పైకి ఆనందంగానే కనబడే ప్రయత్నం చేస్తున్నాడు సముద్రుడు. గంభీర లక్షణమలాగే వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆవేదయతి :** | **ఆవేదయతి** | ఆవేదయతః | ఆవేదయన్తి |
| | ఆవేదయసి | ఆవేదయథః | ఆవేదయథ |
| | ఆవేదయామి | ఆవేదయావః | ఆవేదయామః. * |

**శ్లో॥ అసేవ్యతాం దోషిసఖిత్వజాతాం - జహార కృష్ణః స్వగృహస్య సిన్ధోః ।**
**ఇతి స్మ చిత్రం న యతస్తదిష్టా - హరన్తి పాపాని మహాన్తి హృష్టాః ॥ 16-57**

**అ :** సముద్రవర్ణనమే. -ఉపేంద్రవజ్ర.

**అ :** 'కృష్ణః స్వ-గృహస్య సిన్ధోః దోషి-సఖిత్వ-జాతామ్ అసేవ్యతాం జహార.' ఇతి చిత్రం న (భవతి) స్మ. యతః తద్-ఇష్టాః హృష్టాః (సన్తః) మహాన్తి పాపాని హరన్తి.

**ప్ర :** కృష్ణః = కృష్ణుడు, స్వ-గృహస్య = తన ఇల్లైన (స్వస్య గృహం, తస్య), సిన్ధోః = సముద్రునికి, దోషి-సఖిత్వ-జాతామ్ : దోషి = చంద్రునియొక్క, సఖిత్వ = మిత్రత్వంచేత, జాతామ్ = కలిగిన, అసేవ్యతామ్ = సేవింపబడరానితనాన్ని (సేవితుం యోగ్యః సేవ్యః, స న భవతీతి అసేవ్యః, తస్య భావః, తామ్) (ఉప్పదనాన్ని), జహార = అపహరించాడు. (హృ హరణే-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఇతి = అన్నది, చిత్రమ్ = ఆశ్చర్యకరంగా, న (భవతి) స్మ = కాలేదు. యతః = ఎందుకంటే, తద్-ఇష్టాః = ఆ (కృష్ణ) భక్తులు, హృష్టాః (సన్తః) = ఆనందింప జేయబడినవారై, మహాన్తి = పెద్దపెద్ద, పాపాని = పాపాలను, హరన్తి = తొలగిస్తారు. (హృ-హరణే భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుడు తన ఇల్లైన సముద్రానికి దోషాకరుడైన చంద్రుని సాహచర్యంవల్ల కలిగిన అసేవ్యతను (చెడ్డవారితో స్నేహం చేయటమన్న దోషం) తాను తొలగించాడు. (ఆ జలాన్ని త్రాగటానికి వీలుగా చేశాడు). అయితే దాన్లో ఆశ్చర్యకరమైన దేదీ లేదు. ఎందువల్లనంటే కృష్ణభక్తులు కూడా ఆనందింపజేయబడినవారై పెద్దపెద్దపాపాలను కూడా తొలగింప గలుగుతారు.

**వి :** 1. **శ్లో॥ ప్రహ్లాదనారదపరాశరపుండరీక-వ్యాసాంబరీషశుకశౌనకభీష్మదాల్భ్యాన్ ।**
**రుక్మాంగదార్జునవసిష్ఠవిభీషణాదీన్ - పుణ్యామిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥**

అని యొక ప్రాచీనశ్లోకం. భక్తజనస్మరణం. వీళ్ళలో సామాన్యులు అంటూ అనవలసిన వాళ్ళు ఎవ్వరూ లేరు. వీళ్ళంతా ప్రాతఃస్మరణీయులు.

| | | | |
|---|---|---|---|
| 2. **హరన్తి :** | హరతి | హరతః | **హరన్తి** |
| | హరసి | హరథః | హరథ |
| | హరామి | హరావః | హరామః |
| **జహార :** | **జహార** | జహ్రతుః | జహ్రుః |
| | జహర్థ | జహ్రథుః | జహ్ర |
| | జహార/జహర | జహృవ | జహృమ. |

*

**శ్లో॥ పురాఽప్యజేయో మురజిత్ కిలాత్ర - పురీం విధాయాభవదత్యజేయః ।**
**మమేత్థమాభాతి కళత్రవస్త్ర-కృతాలయం కః ఖలు జేతుకామః ॥ 16-58**

**అ :** భార్య కొంగుచాటుభర్తను ఎవ్వరూ జయించలేరని వినోదప్రతిపాదన. -ఉపేంద్రవజ్ర.

**అ :** పురా అపి అజేయః ముర-జిత్ అత్ర పురీం విధాయ అత్యజేయః అభవత్ కిల. మమ ఇత్థమ్ ఆభాతి. కళత్ర-వస్త్ర-కృత+ఆలయం జేతు-కామః కః ఖలు.

**ప్ర :** పురా అపి = గతంలో కూడా, అజేయః = గెలువరాని, ముర-జిత్ = కృష్ణుడు (మురం జితవాన్ ఇతి), అత్ర = ఈ సముద్రంలో, పురీమ్ = నగరాన్ని, విధాయ = నిర్మించి (వి-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), అతి+అజేయః = మరీ గెలువరానివాడుగా, అభవత్ కిల =అయ్యాడు గదా! మమ = నాకు, ఇత్థమ్ = ఇలా, ఆభాతి = స్ఫురిస్తోంది (ఆ భా దీప్తౌ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), కళత్ర... ఆలయమ్ : కళత్ర = భార్యయొక్క, వస్త్ర = వస్త్రం (కొంగు) మాటును, కృత+ఆలయమ్ = నివాసం చేసుకొన్న (దాగిన) వానిని (కళత్రస్య వస్త్రే కృతః ఆలయః యేన తమ్), జేతు-కామః = గెలువగోరేవాడు (జేతుం కామః), కః ఖలు? = ఎవడుంటాడు?

**తా ॥** కృష్ణుడు మొదటే అజేయుడు, ఆపై సముద్రంలో ద్వారకానగరాన్ని నిర్మించి అత్యజేయుడు అయ్యాడు. నాకిలా అనిపిస్తోంది. పెళ్ళాం కొంగుచాటు మనిషిని గెలవాలని ఎవడనుకొంటాడు.

**వి :** 1. భూమి విష్ణుపత్ని. సముద్రం నేలకు రంగురంగుల వస్త్రంలా వున్నదని కవి ఇంతకు ముందే (51వ శ్లోకం) వర్ణించటం జరిగింది. ఆ సముద్రంలో నగరాన్ని నిర్మించిన కృష్ణుడు భార్య కొంగుచాటున నివాసమేర్పరచుకొన్నట్లు అయింది. అందుకే కవి వేసిన పై ఛలోక్తి.

2. ఈ శ్లోకంలో కూడా అర్థాంతరన్యాసమే.

| | | | |
|---|---|---|---|
| 3. **అభవత్ :** | **అభవత్** | అభవతామ్ | అభవన్ |
| | అభవః | అభవతమ్ | అభవత |
| | అభవమ్ | అభవావ | అభవామ |
| **ఆభాతి :** | **ఆభాతి** | ఆభాతః | ఆభాన్తి |
| | ఆభాసి | ఆభాథః | ఆభాథ |
| | ఆభామి | ఆభావః | ఆభామః. |

*

**శ్లో॥ స రమ్యఫేనాసవశోభివక్త్ర-స్తరఙ్గహస్తైర్జఘనం నదీనామ్ ।**
**విధూదయే సంస్పృశతీన్దుదృష్ట్యా - న కస్య కామః సరసస్య హి స్యాత్ ॥ 16-59**

**అ :** సముద్రవర్ణనమే, కాముకప్రవృత్తిని ప్రతిఫలింపజేస్తూ. -ఉపేంద్రవజ్ర.

**అ :** రమ్య-ఫేన+ఆసవ-శోభి-వక్త్రః సః విధు+ఉదయే తరంగ-హస్తైః నదీనాం జఘనం సంస్పృశతి. హి. ఇందు-దృష్ట్యా సరసస్య కస్య కామః న స్యాత్.

**ప్ర :** రమ్య... వక్త్రః : రమ్య = అందమైన, ఫేన = నురుగు అనే, ఆసవ = కల్లుతో, శోభి = ప్రకాశిస్తున్న, వక్త్రః = ముఖంగల (రమ్యశ్చ అసౌ ఫేనః, స ఏవ ఆసవః, తేన శోభి వక్త్రం యస్య సః), సః = ఆ సముద్రుడు, విధు+ఉదయే : విధు = చంద్రునియొక్క, ఉదయే = ఉదయవేళయందు, తరంగ-హస్తైః : తరంగ = అలలు అనే, హస్తైః = చేతులతో (తరంగా ఏవ హస్తాః, తైః), నదీనామ్ = నదులయొక్క, జఘనమ్ = తీరాన్ని (కటి ప్రదేశాన్ని), సంస్పృశతి = చక్కగా తాకుతున్నాడు. (సమ్-స్పృశ్ సంస్పర్శనే భ్వాది పరస్మైపది-లట్-ప్ర.ఏ.), ఇందు-దృష్ట్యా = చంద్రుని చూచినప్పుడు (ఇందోః దృష్టిః, తయా), సరసస్య = రసదృష్టిగల, కస్య = ఎవనికి, కామః = కామం (కోరిక), న స్యాత్ = లేకుంటుంది? (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ఏ.).

**తా ॥** సముద్రుడు నురుగు లనే కల్లుతో శోభిస్తున్న ముఖంతో, చంద్రుడుదయించినప్పుడు తన అలలు అనే చేతులతో నదుల తీరమనే జఘనాన్ని బాగా స్పృశించాడు. నిజమే. చంద్రుడు కనిపించినప్పుడు ఏ సరసుని దృష్టిలో కామం ప్రకోపించదు?

**వి :** 1. కల్లుముంతపై నురుగులు చూసివుంటే కడలి నురుగులను ఆసవంతో పోల్చటంలోని సొగసు తెలుస్తుంది. ఈ దేశంలో అనాదిగా కల్లు వినియోగంలో వుంది. కాళిదాసు రఘుమహారాజు జైత్రయాత్రను వర్ణిస్తూ '**నారికేళాసవం యోధాః శాత్రవం వపపుర్యశః**' (రఘువంశం - 4/42) అని కొబ్బరికల్లును గూర్చి ప్రస్తావిస్తాడు.

2. సముద్రుడు చంచలతరంగాలతో కూడినవాడు అయినా స్థిరగంభీరుడు. అటువంటి వాడు నదీజఘనస్పర్శ చేయటమేమిటని సంశయించవచ్చు. అందుకే ఆ విషయాన్ని సమర్థిస్తూ '**ఇందుదృష్ట్యా సరసస్య కస్య కామః న స్యాత్**' అని ప్రకటించాడు. కాబట్టి ఇది కావ్యలింగాలంకారం. '**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**' - (కు. 121)

| | | | |
|---|---|---|---|
| 3. **సంస్పృశతి :** | **సంస్పృశతి** | సంస్పృశతః | సంస్పృశన్తి |
| | సంస్పృశసి | సంస్పృశథః | సంస్పృశథ |
| | సంస్పృశామి | సంస్పృశావః | సంస్పృశామః. |

*

**శ్లో॥ సితేతరః పీతకృశానుమధ్యః - సహస్రశః శ్లిష్టతనుర్నదీభిః ।**
**అనేకయోషిత్పరితోషదాయీ - స పీతవాసా ఇవ భాసతేఽబ్ధిః ॥ 16-60**

**అ :** సముద్రునిలో దక్షిణనాయకత్వవర్ణన. -ఉపేంద్రవజ్ర.

**అ :** సిత+ఇతరః పీత–కృశాను–మధ్యః సహస్రశః నదీభిః శ్లిష్ట–తనుః సః అబ్ధిః అనేక–యోషిత్–పరితోష–దాయీ పీతవాసాః ఇవ భాసతే.

**ప్ర :** సిత+ఇతరః = నల్లనివాడు (సితాత్ ఇతరః), పీత–కృశాను–మధ్యః : పీత = పసుపువన్నె గల, కృశాను = అగ్ని (ఆశ్రయాశో వాతసఖః కృశానుర్వాతసారథిః–వైజయన్తీ–స్వర్గ–17), మధ్యః = మధ్యలో గలవాడు (పీతః కృశానుః మధ్యే యస్య సః), సహస్రశః = వేలకొలదిగ, నదీభిః = నదులచే, శ్లిష్ట–తనుః : శ్లిష్ట = కౌగిలింపబడిన, తనుః = శరీరంగలవాడూ అయిన (శ్లిష్టా తనుః యస్య సః), సః = ఆ, అబ్ధిః = సముద్రుడు, అనేక... దాయీ : అనేక = చాలామంది, యోషిత్ = స్త్రీలకు, పరితోష = ఆనందాన్ని, దాయీ = ఇచ్చునట్టి (అనేకాసాం యోషితాం పరితోషస్య దాయీ), పీతవాసాః ఇవ = నారాయణునిలాగా, భాసతే = ప్రకాశిస్తున్నాడు. (భాస్ దీప్తౌ–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** నల్లనివాడై మధ్యలో పచ్చని బడబాగ్ని కలిగి అనేక నదీకాంతలచే కౌగిలింపబడిన శరీరంగల సముద్రుడు అనేక కాంతలకు ఆనందాన్ని కల్గించే పీతాంబరునివలె ప్రకాశిస్తున్నాడు.

**వి :** 1. సముద్రుడికీ, పీతాంబరుడికీ బింబప్రతిబింబభావంతో పోలిక. ఉపమాలంకారం.

2. కృష్ణుడు దక్షిణనాయకుడు. '**అనేకాసు నాయికాసు అవైషమ్యేణ స్నేహానువర్తీ దక్షిణ–నాయకః**' అని ఆలంకారిక నిర్వచనం. అనేకయోషిత్పరితోషదాయిత్వం కృష్ణునిలోని విశేషగుణం. కవులూ, భక్తులూ గూడా దాన్ని ప్రత్యేకించి ప్రస్తుతిస్తుంటారు.

శ్లో॥ అంగనామంగనామంతరే మాధవో – మాధవం మాధవం చాన్తరే చాంగనా ।
ఇత్థమాకల్పితే మండలే మధ్యగః – సంజగౌ వేణునా దేవకీనందనః ॥ – కృష్ణకర్ణామృతం – 2/35

హరరిహ ముగ్ధవధూనికరే విలాసిని విలసతి కేళిపరే
శ్లిష్యతి **కామపి** చుంబతి **కామపి** రమయతి **కామపి** రామామ్
పశ్యతి సస్మితచారుతరా**మపరా**మనుగచ్ఛతి వామామ్ ॥ – గీతగోవిందం.

శేషశైలావాసా శ్రీవేంకటేశ
శయనించు మా అయ్య శ్రీ చిద్విలాసా...
శ్రీదేవివంకకు చిలిపిగా చూడకు
అలిమేలుమంగకు అలుక రానీయకు
**ముద్దుసతులిద్దరినీ** ఇరువైపులా చేర్చి
మురిపించి లాలించి ముచ్చటల తేల్చి... **– ఆచార్య ఆత్రేయ.**

| | | | |
|---|---|---|---|
| 3. **భాసతే :** | **భాసతే** | భాసేతే | భాసన్తే |
| | భాససే | భాసేథే | భాసధ్వే |
| | భాసే | భాసావహే | భాసామహే. |

*

## శ్లో॥ వర్త్మనీత్థం వారిరాశిం వర్ణయన్తో మునీశ్వరాః । సమేత్య తాం ద్వారవతీం ముదా కృష్ణముపాసతే ॥ 16–61

**అ :** మహర్షులు ద్వారకకు చేరి కృష్ణుని సేవించటం. –పథ్యావక్త్రమ్.

**అ :** ఇత్థం వర్త్మని వారి–రాశిం వర్ణయన్తః ముని+ఈశ్వరాః తాం ద్వారవతీమ్ సమేత్య ముదా కృష్ణమ్ ఉపాసతే.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, వర్త్మని = దారిలో, వారి–రాశిమ్ = సముద్రాన్ని (వారీణాం రాశిః తమ్), వర్ణయన్తః = వర్ణిస్తూ, ముని+ఈశ్వరాః = ఋషిశ్రేష్ఠులు, తామ్ = ఆ, ద్వారవతీమ్ = ద్వారకకు, సమేత్య = చేరి, ముదా =

ఆనందంతో, కృష్ణమ్ = కృష్ణుని, ఉప+ఆసతే = సేవిస్తున్నారు. (ఉప-ఆస్ ఉపవేశనే-లట్-ప్ర.బ.).

**తా ॥** ఈ రీతిగా సముద్రాన్ని వర్ణిస్తూ దారి కడచిన మునీశ్వరులు ద్వారకకు చేరి ఆనందంతో కృష్ణుని సేవిస్తున్నారు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. ఉపాసతే :** | ఉపాస్తే | ఉపాసాతే | **ఉపాసతే** |
| | ఉపాస్సే | ఉపాసాథే | ఉపాధ్వే |
| | ఉపాసే | ఉపాస్వహే | ఉపాస్మహే. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గో ముదాం షోడశః ॥ 16-62**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** షోడశః ముదాం సర్గః = పదహారవ ఆనందావిర్భావం, కలిగింది- (మిగిలినది ప్రథమసర్గాంతశ్లోకం వలెనె. *

ఇతి శ్రీవాదిరాజతీర్థప్రణీతరుగ్మిణీశవిజయే షోడశః సర్గః.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పదహారవ సర్గ.

శ్రీః





# శ్రీః
# సప్తదశః సర్గః

**శ్లో॥ స్వభజకాబ్జకులోదయహేతవే - జలనిధౌ వరభోగినికేతనే ।**
**భవమహానలముక్తభయానుగ-చ్ఛవిపదేఽవిపదే లసతే నమః॥ 17-1**

**అ :** మునికృత-ముకుందస్తుతి, కృష్ణపరంగా కూడా. (ఇక్కడనుండి 24వ శ్లోకం వరకు ఉభయపరంగా శ్లోకాన్వయం.) - ద్రుతవిలంబితమ్.

**అ :** స్వ-భజక+అబ్జ-కుల+ఉదయ-హేతవే భవ-మహా+అనల-ముక్త-భయ+అనుగ+ ఛవి-పదే జల-నిధౌ వర-భోగి-నికేతనే లసతే అవిపదే (మూలరూపాయ) (నారాయణాయ) నమః

**ప్ర :** స్వ... హేతవే : స్వ = తనయొక్క, భజక = భక్తులనే/భక్తుడైన, అబ్జ = తామరలయొక్క/బ్రహ్మయొక్క, కుల = సమూహంయొక్క/గోత్రంయొక్క, ఉదయ = వికాసానికి, హేతవే = కారణమైనవాడూ, భవ... పదే : భవ = సంసారమనే, మహా+అనల = కారుచిచ్చునుండి, ముక్త-భయ = విముక్తులైన, అనుగ = సేవకులయొక్క, ఛవి = కాంతికి, పదే = స్థానమైన, జల-నిధౌ = సముద్రమందు, వర-భోగి-నికేతనే : వర = శ్రేష్ఠమైన, భోగి = ఆదిశేషుడనే, నికేతనే = ఇంటిలో, లసతే = ప్రకాశిస్తున్న, అవిపదే = విపత్తులు లేని (నారాయణునికి), నమః = నమస్కారం.

**కృష్ణపరంగా** : స్వ... హేతవే : స్వ = తనయొక్క, భజక = భక్తుడైన, అప్-జ = చంద్రునియొక్క, కుల = వంశంయొక్క, ఉదయ = అభ్యుదయానికి, హేతవే = కారణమై, జలనిధౌ = ద్వారకా-సముద్రంలో, వర-భోగి-నికేతనే : వర = శ్రేష్ఠులైన, భోగి = సుఖించేవారియొక్క, నికేతనే = స్థానమందు, భవ... పదే : భవ = శివునిచే ప్రయుక్తమైన, మహానల = కార్చిచ్చు వలని, ముక్త-భయ = భయంతొలగిన, అనుగ = అనుచరులైన యాదవులయొక్క, ఛవి = కాంతికి, పదే = స్థానమైన, లసతే = ప్రకాశిస్తున్న, అవిపదే = విపత్తులు లేని - కృష్ణునకు, నమః = నమస్సు.

**తా ॥** తనభక్తుడైన బ్రహ్మయొక్క గోత్రాభివృద్ధికై (సృష్టి సంపాదనకై) (తనభక్తు లనే తామరల సమూహానికి వికాసహేతువై) భవాగ్ని భయంనుండి విముక్తులైన అనుచరుల కాంతికి తావలమైన సముద్రమందలి ఆదిశేషనికేతనంలో ప్రకాశిస్తూ సంసారవిపద్రహితుడవైన నీకు నమస్కారం.

తనను సేవించే సోమ (చంద్ర) వంశాభివృద్ధి కారకుడవై, ద్వారవతీ సముద్రంలో నివసించే భోగులకు స్థానమై, శివుడు ద్వారకానాశనానికి ప్రయోగించిన కార్చిచ్చు (కృత్య) భయంనుండి విముక్తులైన అనుచరులైన యాదవుల కాంతికి ఆకరమైన ద్వారవతీ పట్టణంలో ప్రకాశిస్తూ సంసారవిపద్దూరుడవైన నీకు నమస్కారం. కృష్ణా! *

**శ్లో॥ కుశకృతస్థలసిద్ధపురీశ్వరం - కఠినతత్త్వగతిశ్రమదాయుధమ్ ।**
**జనకకర్దమశోభిగృహాఙ్గణే - మునిజనా నిజనాథమముం జగుః ॥ 17-2**

**అ :** మునికృత ముకుందస్తుతి. (కపిలరూపంతోపాటు) - ద్రుతవిలంబితమ్.

**అ :** కుశ-కృత-స్థల-సిద్ధ-పురీ-ఈశ్వరం కఠిన-తత్త్వ-గతి-శ్రమ-ద+ఆయుధమ్ అముం జనక-కర్దమ-శోభి-గృహ+అంగణే ముని-జనాః నిజనాథం జగుః.

**ప్ర :** కుశ... శ్వరమ్ : కుశ = దర్భలచే, కృత = చేయబడిన (ఆచ్ఛాదింపబడిన), స్థల = ప్రదేశంగల, సిద్ధ-పురీ = సిద్ధపురి అనే ఆశ్రమానికి, ఈశ్వరమ్ = పాలకుడు, కఠిన... దాయుధమ్ : కఠిన = తెలియుట కష్టమైన, తత్త్వ = తత్త్వాలయొక్క, గతి = అవగతి (తెలియుట)లోని, శ్రమ = ఖేదాన్ని, ద = ఖండించే, ఆయుధమ్ = ఆయుధం వంటివాడు, జనక... గృహాంగణే : జనక = ప్రజాపతి అయిన, కర్దమ = కర్దమునియొక్క, శోభి = వెలుగొందుతున్న, గృహ+అంగణే = ఇంటిముంగిట, ముని-జనాః = మహర్షులు, అముమ్ = ఈయనను, నిజ-నాథమ్ = తమ ప్రభువుగా, జగుః = గానం చేశారు. (గై శబ్దే పరస్మైపది-లిట్-ప్ర.బ.)

**కృష్ణపరంగా** : కుశ... రీశ్వరమ్ : కుశ = కుశు డనే రాక్షసునిచే, కృత = సిద్ధంచేయబడిన, స్థల = ప్రదేశంలో (కుశస్థలిలో), సిద్ధ = సిద్ధించిన, పురీ = ద్వారవతీ నగరికి, ఈశ్వరమ్ = ప్రభువు, కఠిన... యుధమ్ : కఠిన = కఠినమైన, తత్ = ఆ రాక్షసునియొక్క, త్వక్ = చర్మానికి, అతిశ్రమద = చాలా శ్రమనిచ్చిన, ఆయుధమ్ = ఆయుధం (చాపం)గలవాడూ అయిన, అముమ్ = ఈ కృష్ణునిగూర్చి, జనక... గణే : జనక = నందునియొక్క, కర్దమ = బురదతో, శోభి = ప్రకాశిస్తున్న, గృహ+అంగణే = ఇంటివాకిట, ముని-జనాః : మునులు, నిజ-నాథమ్ = తమకు గతి జగుః = గానం చేశారు.

**తా ॥** సిద్ధపురి అని పేరుగల కపిలాశ్రమం అంతటా దర్భలు పరచబడి వుంటుంది. దానికి రక్షకుడు కపిలుడు. కఠినతత్త్వాలను అర్థంచేసుకొనే శ్రమను పోగొట్టే ఆయుధం తాను. కర్దమ ప్రజాపతి యొక్క గృహప్రాంగణంలో మునిజనులు ఈయనను తమ నాథునిగా కీర్తిస్తారు.

కృష్ణుడు కుశస్థలి అనే తావులో (కుశుడనే దైత్యుడు సిద్ధంచేసినచోట) ద్వారవతిని నిర్మించాడు. కఠినమైన ఆ రాక్షసుని చర్మానికి మిక్కిలి క్లేశాన్ని కలిగించిన చాపాన్ని ధరించినవాడు. తండ్రి అయిన నందుని ఇంటి ముంగిట బురదలో మునిజనులంతా ఈ కృష్ణుని తమకు దిక్కుగా ఎంచి కీర్తిస్తున్నారు.

**వి :** 1. పాడిపంటలకు నెలవైన ఇంటి ప్రాంగణాలలో బురద, లేదా తేమగా లేదా తడిపొడిగా వుండటం సహజం. అది ఆనాటి పిల్లలకు క్రీడావిశేషాలకు అనువుగా ఉండేది. ఆడుతూ, పాడుతూ పడుతూ లేస్తూ వున్న పిల్లలకు శరీరానికి గాయాలు కాకుండా సహకరించేది. ఈనాడు అసలు మట్టి కనిపించని ముంగిళ్ళను తయారుచేసికొంటున్నాం. పిల్లలు స్వేచ్ఛగా ఆడుకొనే అవకాశాన్ని దూరం చేస్తున్నాం.

నందుని ఇల్లు గోకులంలో. పాడి వారికి ప్రధానజీవిక. కాబట్టి కర్దమం (బురద) వుండటం అతి సహజం.

| | | | |
|---|---|---|---|
| **2. జగుః :** | జగౌ | జగతుః | **జగుః** |
| | జగిథ/జగాథ | జగథుః | జగ |
| | జగౌ | జగివ | జగిమ. |

*

**శ్లో॥ యమజనిం భజ తాపసవిగ్రహం - ప్రకటితం నిజచిద్ఘనమూర్తితః ।**
**నరధృతం గిరిమూర్ధని యత్పదం - విలసతే లసతేద్యనఖేన్దునా ॥ 17-3**

**అ :** మునికృతముకుందస్తుతి (నారాయణునితోపాటు) - ద్రుతవిలంబితమ్.

**అ :** గిరి-మూర్ధని నర-ధృతం యత్-పదం లసతా ఈడ్య-నఖ+ఇందునా విలసతే (తం) యమజనిం నిజ-చిత్-ఘన-మూర్తితః ప్రకటితం తాపస-విగ్రహం భజ.(నారాయణపక్షంగా)

**ప్ర :** గిరి-మూర్ధని = శతశృంగపర్వతంపై, నర-ధృతమ్ = నరునిచే ధరింపబడి, యత్-పదమ్ = ఏ చరణం, లసతా = ప్రకాశిస్తున్న, ఈడ్య-నఖ+ఇందునా : ఈడ్య = స్తుతింప దగిన, నఖ+ఇందునా = గోళ్ళు అనే చంద్రునిచే, విలసతే = ప్రకాశిస్తోందో. (లస్-శిల్పయోగే భ్వాది-ఆత్మనేపది-లట్-(ప్ర.ఏ.), తమ్ = ఆ, యమ-జనిమ్ = ధర్ముని ద్వారా పుట్టినవాడూ, నిజ-మూర్తితః : నిజ = తనయొక్క, చిద్ = జ్ఞానంచేత, ఘన = నిబిడమైన, మూర్తితః = మూర్తి అనుపేరుగల ధర్ముని భార్యనుండీ, ప్రకటితమ్ = వెలువడిన, తాపస-విగ్రహమ్ = మునిరూపుడైన నారాయణుని, భజ = సేవించు.

**కృష్ణపరంగా** : **అ :** యమ్ అజనిం భజత సః నిజ చిద్-ఘన-మూర్తితః ప్రకటితం విగ్రహమ్ ఆప యత్ పదం గిరి-మూర్ధని నరధృతం (సత్) లసతా ఈడ్య-నఖ+ఇందునా విలసతే.

**ప్ర :** యమ్ = ఏ, అజనిమ్ = పుట్టుకలేని వానిని, భజత = సేవిస్తున్నారో, సః = ఆ కృష్ణుని, నిజ.. తః : నిజ = తనయొక్క, చిద్ = జ్ఞానంచేత, ఘన = సాంద్రమైన, మూర్తితః = మూలస్వరూపంనుండి, ప్రకటితమ్ = వఎతిలువడిన, విగ్రహమ్ = దేహాన్ని, ఆప = పొందాడు. (ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.), యత్ = ఎవనియొక్క, పదమ్ = పాదం, గిరి = మాటలో (స్తుతిరూపంగా), మూర్ధని = తలపై, నర-ధృతం (సత్) = అర్జునునిచే ధరింపబడినదై, లసతా = ప్రకాశిస్తున్న, ఈడ్య... నా : ఈడ్య = స్తుతింపదగిన, నఖ+ఇందునా = నఖ చంద్రునిచే, విలసతే = ప్రకాశిస్తోందో.

**తా ॥** ధర్మునికీ, ఆయన భార్య అయిన మూర్తి అనుపేరుగల జ్ఞానమూర్తికీ జన్మించిన తాపసస్వరూపుడైన నారాయణుని సేవించండి. శతశృంగపర్వతశిఖరంపై నరునిచేత ధరింపబడిన ఆయన పాదం ప్రకాశమానమైన నఖచంద్రునితో విలసిల్లుతోంది.

కృష్ణుడు పుట్టుకలేనివాడు. స్వాభావికమైన తన మూలమూర్తినుండి విగ్రహాన్ని (రూపాన్ని) పొందినవాడు. అర్జునునిచేత మాటలచే స్తుతింపబడి శిరసావహించిన పాదం గలవాడు. ఆ పాదనఖాలు చంద్రునివలె కాంతిమంతాలై ప్రకాశిస్తున్నాయి. ఆయనను సేవించండి.

**వి :** 1. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **భజ/త :** | భజతు/భజతాత్ | భజతామ్ | భజన్తు |
| | **భజ**/భజతాత్ | భజతమ్ | భజత |
| | భజాని | భజావ | భజామ |
| **ఆప :** | **ఆప** | ఆపతుః | ఆపుః |
| | ఆపిథ | ఆపథుః | ఆప |
| | ఆప | ఆపివ | ఆపిమ |
| **విలసతే :** | **విలసతే** | విలసేతే | విలసన్తే |
| | విలససే | విలసేథే | విలసధ్వే |
| | విలసే | విలసావహే | విలసామహే |

*

**శ్లో॥ విమలదత్తపదః ప్రణతార్జునా-భ్యుదయహేతురమానవయోగధృత్ ।**
**హృది ధృతః సుధియా హ్యనసూయయా - స భవతాద్భవతాపహరో మమ॥17-4**

**అ :** దత్తాత్రేయస్తుతి – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** విమల–దత్త–పదః ప్రణత+అర్జున+అభ్యుదయ–హేతుః అమానవ–యోగ–ధృత్ (అమానవయః+అగ–ధృత్) సుధియా అనసూయయా హృది ధృతః సః మమ భవ–తాప–హరః భవతాత్.

**ప్ర :** విమల–దత్త–పదః : విమల = నిర్మలమైన, దత్త = 'దత్త' అనే, పదః = పేరుగలవాడు, ప్రణత... హేతుః : ప్రణత = నమస్కరించిన, అర్జున = కార్తవీర్యార్జునునియొక్క, అభ్యుదయ = అభివృద్ధికి, హేతుః = కారణమైనవాడు, అమానవ–యోగ–ధృత్ : అమానవ = దివ్యమైన, యోగ–ధృత్ = యోగధారి, సుధియా = మంచి బుద్ధిగల, అనసూయయా = అనసూయచేత, హృది = గర్భమందు, ధృతః = ధరింపబడిన వాడు అయిన, సః = ఆ దత్తాత్రేయుడు, మమ = నాకు, భవ–తాప–హరః : భవ = సంసారంలోని, తాప = తాపాలను, హరః = పోగొట్టేవాడుగా, భవతాత్ = అగుగాక. (భూ సత్తాయాం–భ్వాది–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**కృష్ణపరంగా** : విమల–దత్త–పదః : విమల = నిర్మలులకే (చక్రాంకితులకే), దత్త = ఇవ్వబడిన, పదః = స్థానం గలవాడు, ప్రణత... హేతుః : ప్రణత = నమస్కరించిన, అర్జున = కౌంతేయుడైన అర్జునునకు, అభ్యుదయ–హేతుః = అభివృద్ధికి కారణమైన వాడు, అమాన–వయః+అగ–ధృత్ : అమాన = లెక్కలేనన్ని, వయః = పక్షులుగల, అగ = (గోవర్ధన) పర్వతాన్ని, ధృత్ = ధరించినవాడు, అనసూయయా = అసూయలేని, సుధియా = సుజ్ఞానంచే, హృది = (భక్తుల) హృదయాలలో, ధృతః = ధరింపబడినవాడు అయిన, సః = ఆ కృష్ణుడు, భవ–తాప–హరః = సంసారతాపాన్ని పోగొట్టేవాడుగా, భవతాత్ = అగుగాక.

**తా ॥** దత్తాత్రేయుడనే నిర్మలమైన పేరుగలవాడు, భక్తుడైన కార్తవీర్యార్జునకు అభ్యుదయానికి కారణమైనవాడు, దివ్యయోగధారి, మంచి జ్ఞానంగల అనసూయచే గర్భాన ధరింపబడినవాడు అయిన దత్తాత్రేయుడు నా సంసారతాపాన్ని తొలగించుగాత!

చక్రాంకితులై పవిత్రమైన వారికే ద్వారకలో స్థానమిచ్చినవాడు, అర్జునుని అభ్యుదయానికి కారణమైనవాడు, లెక్కలేనన్ని పక్షులకు వాసయోగ్యమైన గోవర్ధనగిరిని ధరించినవాడు, అసూయలేని సమ్యగ్జ్ఞానం గల భక్తులచే హృదయంలో ధరింపబడేవాడు అయిన కృష్ణుడు నా సంసారతాపాన్ని తొలగించుగాత!

**వి :** 1. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **భవతాత్ :** | భవతు/**భవతాత్** | భవతామ్ | భవన్తు |
| | భవ/భవతాత్ | భవతమ్ | భవత |
| | భవాని | భవావ | భవామ |

*

**శ్లో॥ భరతశాస్త్రవిశారదతాకరం – ప్రియకృతం పితృవన్నవయోగినామ్ ।**
**యమృషభం సుమతిర్ధి జయన్త్యగాత్ – సుమధురా మధురాధిపమన్తికే ॥ 17-5**

**అ :** ఋషభావతారాన్ని వర్ణించటం – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** భరత–శాస్త్ర–విశారదతా–కరం నవ–యోగినాం పితృవత్ ప్రియకరం మధుర+అధిపం యమ్ ఋషభం సుమధురా సుమతిః జయన్తీ అన్తికే అగాత్ (తం భజత).

**ప్ర :** భరత... కరమ్ : భరత = భరతుని (తన కుమారుని), శాస్త్రవిశారదతా = శాస్త్రంలో నిపుణునిగా, కరమ్ = చేసినవాడు, నవ–యోగినామ్ = తొమ్మిదిమంది యోగులకు, పితృవత్ = తండ్రివంటివాడై, ప్రియకరమ్ = ప్రియాన్ని కల్గించే వాడు, మధురా+అధిపమ్ : మధురా = మధురవాక్కులు గలవారికి, అధిపమ్ = ప్రభువు అయిన,

యమ్ = ఏ, ఋషభమ్ = ఋషభరూపుడైన హరిని, సుమధురా = అందమైనదీ, సుమతిః = బుద్ధిమతి అయిన, జయన్తీ = జయన్తి అనుపేరుగల కాంత, అన్తికే = దగ్గరకు (భార్యగా), అగాత్ – హి = వెళ్ళిందో (ఇ గతౌ పరస్మైపది–లుఙ్–(ప్ర.ఏ.), (తమ్ = ఆయనను, భజత = సేవించండి).

**కృష్ణపరంగా** : భరత... కరమ్ : భరత–శాస్త్ర = నాట్యశాస్త్రంలో, విశారదతా–కరమ్ = నేర్పు కల్గించేవాడు, పితృవత్ = తండ్రివలె, నవ–యోగినామ్ = నూతనయోగులకు, ప్రియకృతమ్ = ఇష్టాన్ని సమకూర్చేవాడు, మధుర+అధిపమ్ = మథురాధిపతి అయిన, యమ్ = ఏ, ఋషభమ్ = శ్రేష్ఠుడైన కృష్ణుని, సుమధురా = బాగా తీయనదై, జయన్తీ = విజయశీలమైన, సుమతిః = మంచిబుద్ధి, అన్తికమ్ = దగ్గరకు, అగాత్ హి = చేరింది గదా!

**తా ॥** తన కుమారుడైన భరతుని శాస్త్రనిపుణుని చేస్తూ, తొమ్మిదిమంది యోగులకు తండ్రి వంటివాడై ప్రియాన్ని కలిగిస్తూ మధురవాగధిపుడైన ఋషభునికి అందమైనదీ, సుమతి అయిన జయన్తి భార్యగా దగ్గరైంది.

భరతుని నాట్యశాస్త్రంలో నేర్పును కలిగిస్తూ (గోపికలకు), నూతనంగా యోగాభ్యాసాన్ని ఆరంభిస్తున్న వారికి ప్రియాన్ని కలిగిస్తూ మథురాధిపుడై శ్రేష్ఠుడైన కృష్ణుని సన్నిధికి సుమధురం, జయశీలమైన బుద్ధి చేరింది.

**వి :** 1. నవ (తొమ్మిదిమంది) యోగులను గురించి భాగవతమిలా వివరించింది–

శ్లో॥ నవాఽభవన్మహాభాగా మునయోఽహ్యర్థశంసినః ।
శ్రమణా వాతరశనా ఆత్మవిద్యా విశారదాః ॥

శ్లో॥ **కవిర్హరిరంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయనః ।**
**ఆవిర్హోత్రోఽథ ద్రుమిలశ్చమసః** కరభాజనః ॥

శ్లో॥ త ఏతే భగవద్రూపం విశ్వం స చరాచరాత్మకమ్ ।
ఆత్మనోఽవ్యతిరేకేణ పశ్యంతో వ్యచరన్మహీమ్ ॥ – భాగవతమ్ 11/2/20–22

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **అగాత్ :** | **అగాత్** | అగాతామ్ | అగుః |
| | అగాః | అగాతమ్ | అగాత |
| | అగామ్ | అగావ | అగామ. |

*

## శ్లో॥ జనకదోషముపేత్య స శర్వరీ–త్యనుభవం జననీమపి హర్షయన్ ।
## ఘటయతే దృశి బాలవపుఃస్ఫుర–త్సురసదో రసదోహకృదన్వహమ్ ॥ 17-6

**అ :** శిశు(శింశు) మారావతారవర్ణనం – కృష్ణపరంగాకూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** అను–భవం జనక–దోషమ్ ఉపేత్య శర్వరీ+ఇతి జననీమ్ అపి హర్షయన్ అన్వహం రస–దోహ–కృత్ బాల–వపుః–స్ఫురత్–సుర–సదః దృశి ఘటయతే.

**ప్ర :** అనుభవమ్ = అవతరించినట్టి, జనక–దోషమ్ = ప్రజాపతి అయిన దోషుని, ఉపేత్య = చేరి, శర్వరీ ఇతి = శర్వరి అనుపేరుగల, జననీమ్–అపి = తల్లిని గూడా, హర్షయన్ = ఆనందింపజేస్తూ, అన్వహమ్ = ప్రతిదినమూ, రస–దోహ–కృత్ = అద్భుతరసాన్ని పిండుతూ/పిండిస్తూ, సః = ఆ శిశుమారుడు, బా(వా)ల... సదః : వాల = తోకయందు, వపుషి = శరీరమందు కూడా, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, సుర = (జ్యోతిశ్చక్రమండలి) దేవతలయొక్క, సదః = సదస్సును, దృశి = కళ్ళకు, ఘటయతే = చూపిస్తాడు. (కట్టిస్తాడు) (ఘట–సంఘాతే–చురాది–ఆత్మనేపది–లట్–(ప్ర.ఏ.)

**కృష్ణపరంగా** : అన్వహమ్ = ప్రతిదినమూ, స్ఫురత్... కృత్ : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, సుర = దేవతలయొక్క, సదః = సభయందలి, రస = సుఖాన్ని, దోహ-కృత్ = పిండించే-వాడూ/పిండేవాడు, బాల-వపుః = బాలరూపుడు అయిన, సః = ఆ కృష్ణుడు, జనక-దోషమ్ = తండ్రి (నందుని)యొక్క చేతిని, ఉపేత్య = చేరి (లాలననంది), జననీమ్ అపి = యశోదను కూడా, హర్షయన్ = ఆనందింపజేస్తూ, దృశి = దృష్టిలో, శర్వరీ-ఇతి = శివుడు అనే (దిగంబరత్వాది లక్షణాలతో), అనుభవమ్ = అనుభవాన్ని, ఘటయతే = సమకూర్చుతున్నాడు.

**తా ॥** అవతరించిన ప్రజాపతి అయిన దోషుని (తండ్రిని) పొంది, ఆపై శర్వరిని (తల్లిని) ఆనందింపజేస్తూ శింశుమారుడు అవతరించాడు. ఆయన తన తోకపై, శరీరంపై కూడా అద్భుతరసావహమైన జ్యోతిర్మండలసదస్సును కల్పిస్తాడు.

ప్రతిదినమూ తనను దర్శించేవారికి సురలోక సుఖాలను కలిగిస్తూ, బాలరూపధారియై, నందగోపుని చేతిని చేరి, ఆ తరువాత యశోదను ఆనందింపజేస్తూ దిగంబరత్వాది లక్షణాలతో తాను శివుడన్న అనుభూతిని కళ్ళకు కట్టిస్తున్నాడు.

**వి : 1. శిశుమారమన్నది ఒక నక్షత్రకూటమి.** దాని తోకభాగాన ధ్రువనక్షత్రముంటుంది. అది తాను తిరుగుతూ సూర్యాదులను త్రిప్పుతుంది. నక్షత్రాలు ధ్రువుని అనుసరిస్తూ చక్రాకృతిలో తిరుగుతుంటాయి. సూర్యుడు ధ్రువుడిమీదా, ధ్రువుడు శిశు(శింశు)మారం మీదా, శిశుమారుడు విష్ణువుమీద ఆధారపడివుంటారు. (విష్ణుపురాణం)

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **ఘటయతే :** | **ఘటయతే** | ఘటయేతే | ఘటయన్తే | |
| | ఘటయసే | ఘటయేథే | ఘటయధ్వే | |
| | ఘటయే | ఘటయావహే | ఘటయామహే | * |

**శ్లో॥ విజనితాపదవద్యవనాయ యో - హ్యగదపాణిరభూచ్ఛమదాయకః ।**
**ఉదధిరత్నమముం సహజశ్రియం - హృది భజేదిభజేడ్యగతిం కృతీ ॥ 17-7**

**అ :** ధన్వంతరిస్తుతి - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** యః అగద-పాణిః (సన్) విజనిత+ఆపద్-అవద్య-వనాయ శమ-దాయకః అభూత్ హి. ఉదధి-రత్నం, సహ-జ-శ్రియమ్ ఇభ-జ+ఈడ్య-గతిమ్ అముం కృతీ హృది భజేత్.

**ప్ర :** యః = ఎవరయితే, అగద-పాణిః (సన్) = ఔషధహస్తుడై, విజనిత+ఆపద్-అవద్య-వనాయ : విజనిత = తీవ్రంగా కలిగిన, ఆపద్ = ఆపదలు (వ్యాధులు) అనే, అవద్య = దోషాలు అనే, వనాయ = అడవికి, శమ-దాయకః = నాశాన్ని కల్గించేవాడుగా, అభూత్ హి = అయ్యాడో (భూ సత్తాయాం భ్వాది-పరస్మైపది-లుజ్-ప్ర.ఏ.), ఉదధి-రత్నమ్ = (పాల)కడలిలో పుట్టినవాడు, సహ-జ-శ్రియమ్ = లక్ష్మి తోబుట్టువు, ఇభ-జ+ఈడ్య-గతిమ్ : ఇభజ = గున్న ఏనుగువంటి, ఈడ్య-గతిమ్ = ప్రశంసింపదగిన నడకగలవాడు అయిన, అముమ్ = ఈ ధన్వంతరిని, కృతీ = నేర్పరి, హృది = మనస్సులో, భజేత్ = సేవించుగాత (భజ సేవాయాం-భ్వాది-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.)

**కృష్ణపరంగా** : యః = ఎవరయితే, వి-జని-తాపవత్ : వి = పక్షియొక్క, జని = పిల్లకు, తాపదవత్ = తాపాన్ని కల్గించేవాడిలాగా, అగద-పాణిః = చేత గద లేనివాడై, యవనాయ = కాలయవనునికి, శమ-దాయకః = మృత్యువు నిచ్చేవాడుగా, అభూత్ హి = అయ్యాడో, సహజ-శ్రియమ్ = స్వాభావికసంపదగలవాడు, ఇభ-జ+ఈడ్య-గతిమ్ : ఇభజ = ఏనుగు (కువలయాపీడం)చే, ఈడ్య = స్తుతింపదగిన, గతిమ్ = నడకగలవాడు,

ఉదధి-రత్నమ్ : ఉదధి = సముద్రానికి, రత్నమ్ = అలంకారస్వరూపుడూ అయిన, అముమ్ = ఈ కృష్ణుని, కృతీ = నేర్పరి, హృది = మనస్సులో, భజేత్ = సేవించాలి.

**తా ॥** ధన్వంతరి తీవ్ర వ్యాధులనే వనాలకు నాశాన్ని కలిగించేవాడు. చేత ఔషధాలు పట్టినవాడు. సముద్రరత్నం వంటివాడు. లక్ష్మికి తోబుట్టువు. బాలగజగమనుడు. అటువంటి ధన్వంతరిని నేర్పరి మనసా స్మరించాలి.

కృష్ణుడు పక్షిపిల్లను చంపేవాడిలాగా గదకూడా చేతబట్టకుండా కాలయవనుని చంపించిన వాడు. స్వాభావికమైన సంపదగలవాడు. కువలయాపీడంచేత గూడా స్తుతింపబడిన నడకగలవాడు. సముద్రానికి అలంకారం వంటివాడు. అటువంటి కృష్ణుని నేర్పరి మనసా సేవించాలి.

**వి :** 1. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ |
| **భజేత్ :** | **భజేత్** | భజేతామ్ | భజేయుః |
| | భజేః | భజేతమ్ | భజేత |
| | భజేయమ్ | భజేవ | భజేమ. |

*

**శ్లో॥ మధురయాజిత! దానవసద్గిరా-వశనికాయ! గతాగమసాధక! ।**
**నరతురఙ్గమహర్షకరాకృతే! - భవగతావగతాఖిల! పాహి నః ॥ 17-8**

**అ :** హయగ్రీవస్తుతి - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** మధు-రయ-అజిత దానవ-సద్-గిరౌ అశని-కాయ గత+ఆగమ-సాధక భవ-గత అవగత+అఖిల నర-తురంగమ-హర్ష-కర+ఆకృతే నః పాహి.

**ప్ర :** మధు-రయ+అజిత : మధు = మధువనే రాక్షసునియొక్క, రయ = వేగంచేత, అజిత = జయింపబడని వాడా!, దానవ-సద్-గిరౌ : దానవ = రాక్షసులయొక్క, సద్ = సభ అనే, గిరౌ = కొండమీద, అశని-కాయ = వజ్రం వంటి శరీరం గలవాడా!, గత+ఆగమ-సాధక : గత = పోయిన, ఆగమ = వేదాలను, సాధక = సాధించినవాడా, భవ-గత = సంసారంనుండి తొలగిన వాడా!, అవగత+అఖిల! = అంతా తెలిసిన వాడా!, నర-తురంగమ-హర్షకర+ఆకృతే : నర = నరులకూ, తురంగమ = గుఱ్ఱాలకూ, హర్షకర = ఆనందకరమైన, ఆకృతే! = ఆకారంగలవాడా! (హయగ్రీవా!), నః = మమ్ము, పాహి = రక్షించు. (పా రక్షణే-అదాది-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**కృష్ణపరంగా** : మధురయా = తీయని, సద్-గిరా = మంచిమాటతో, జిత-దానవ : జిత = జయింపబడిన, దానవ = దుర్యోధనుడు గలవాడా!, వశ... సాధక : వశ = అధీనులైన, నికాయ = సమూహానికి (పాండవులకు), గత = కోల్పోయిన, ఆగమ = రాబడిని, సాధక = (తిరిగి) సాధించినవాడా!, నర... రాకృతే : నర = అర్జునునియొక్క, తురంగమ = అశ్వాలకు, హర్ష-కర = ఆనందాన్ని కల్గించే, ఆకృతే! = ఆకారం గలవాడా!, భవ -గతౌ = సంసారగమనంలో కూడా (లౌకికజీవితంలో కూడా), అగత+అఖిల! = తొలగని పూర్ణత్వం గలవాడా! కృష్ణ!, నః = మమ్ము, పాహి = రక్షించు.

**తా ॥** మధురయాజితా! దానవసభ అనే పర్వతానికి వజ్రపాతం వంటివాడా! పోయిన వేదాలను తిరిగితెచ్చిన వాడా! భవగతా! సర్వజ్ఞా! హయగ్రీవా! మమ్ము కాపాడు.

కృష్ణా! నీవు మధురసద్వచనాలతో దానవుడైన దుర్యోధనుని వంచించిన వాడవు. నీకు లోబడి నిలిచిన పాండవులు కోల్పోయిన రాజ్యాదులను తిరిగి సాధించి పెట్టినవాడవు. అర్జునుని గుఱ్ఱాలకు ఆనందాన్ని కలిగించే ఆకారాన్ని ధరించిన వాడవు. లౌకికజీవితంలో కూడా సర్వజ్ఞత్వాన్ని కోల్పోనివాడవు. మమ్ము కాపాడు.

**వి :** 1. కృష్ణుడు మధురవచనాలతో దుర్యోధనుని వంచించిన క్రమం–

అర్జునదుర్యోధనులు కృష్ణుని సహాయానికై వెళ్ళినప్పుడు కృష్ణుడు తననూ, సేననూ కలిపి రెండు భాగాలు చేసి చెరియొకటి తీసికొమ్మని, అర్జునునికి ముందు అవకాశమిచ్చాడు. అప్పుడు చూపిన నియమం–

క. నాపాటియ పదివేవురు – గోపాలురు గలరు సమరకోవిదబాహా
టోపాభిరామమూర్తులు – చాపాధ్యాయకళావిశారదచిత్తుల్.

క. నారాయణాభిధానులు – **వారలు గయ్యంబు సేయువారొక్కెడ నే**
**నూరక నిరాయుధవ్యా – పారతమై నుండువాఁడఁ** బరమాప్తుఁడనై.

– ఆంధ్రమహాభారతము–ఉద్యోగ–1/73,74

ఆ మాటలతో అర్జునుడు కృష్ణునే కోరుకొన్నాడు. అర్జునుని అమాయకుడిగా భావించాడు దుర్యోధనుడు.

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **పాహి :** | పాతు/పాతాత్ | పాతామ్ | పాన్తు |
| | **పాహి**/పాతాత్ | పాతమ్ | పాత |
| | పాని | పావ | పామ. |

*

**శ్లో॥ ప్రణతవిప్రజనామ యతోఽకరో–న్నను జలాన్తరవర్తి నిజాస్పదమ్ ।**
**విమలభీమరథీప్సితదాయకః – స్వవిజితోఽవిజితోఽప్యయమచ్యుతః ॥ 17–9**

**అ :** పాండురంగవర్ణన – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** యతః జల+అంతర–వర్తి నిజ+ఆస్పదం ప్రణత–విప్ర–జ–నామ అకరోత్ నను. విమల–భీమ–రథీ+ఈప్సిత–దాయకః అయమ్ అచ్యుతః స్వ–విజితః అపి అవిజితః.

**ప్ర :** యతః = ఏ కారణంచేత, జల–అంతర–వర్తి = నీటిలోపల వున్న, నిజ+ఆస్పదమ్ = తన ఇంటికి, ప్రణత–విప్రజ–నామ : ప్రణత = వినమ్రుడైన (భక్తుడైన), విప్ర = బ్రాహ్మణుని వల్ల (పుండరీకుడు), జ = పుట్టిన, నామ = పేరును (పుండరీక దేవాలయం), అకరోత్–నను = చేశాడు గదా! (కృ కరణే–పరస్మైపది–లఙ్–ప్ర.ఏ.), విమల... దాయకః : విమల = నిర్మలమైన, భీమరథీ = భీమరథీనదికి, ఈప్సిత = కోరినది, దాయకః = ఇచ్చిన, అయమ్ = ఈ, అచ్యుతః = పాండురంగడు, అవిజితః–అపి = ఓటమి లేనివాడైనా, స్వ–విజితః : స్వ = తన భక్తులచే, విజితః = గెలువబడినవాడే.

**కృష్ణపరంగా** : ప్రణత... యతః : ప్రణత = నమస్కరించిన, విప్ర–జన = బ్రాహ్మణులయొక్క, ఆమయతః = ఇబ్బందులవల్ల, నిజ+ఆస్పదమ్ = తమపట్టణాన్ని, జల+అంతర–వర్తి = సముద్రజలాల మధ్యనున్న దానినిగా, అకరోత్–నను = చేశాడు గదా! విమల... దాయకః : విమల = నిర్మలుడైన, భీమ = భీముడనే, రథీ = మహారథికి, ఈప్సిత–దాయకః = కోరినదిచ్చిన, అయమ్ = ఈ, అచ్యుతః = కృష్ణుడు, అవిజితః అపి = (శత్రువులు) గెలవలేని వాడైనా, స్వ–విజితః = తనవారిచే, విజితః = గెలువబడినవాడే!

**తా ॥** పుండరీకతీర్థజలంలో వుండే తన నివాసానికి పాండురంగడు పుండరీకదేవాలయమని తన భక్తుని పేరే వుంచాడు. విమలభీమరథీనదికి తాను కోరినదిచ్చాడు. తాను శత్రువులు గెలువరాని వాడైనా భక్తులకు లొంగినవాడే.

తన భక్తులైన విప్రజనులు పడుతున్న ఇబ్బందులను చూసి సముద్రజలాలమధ్యలో తన పట్టణాన్ని (ద్వారకను) కట్టించాడు కృష్ణుడు. మహారథి అయిన భీముని అభీష్టాన్ని నెరవేర్చాడు. తాను శత్రువులకు అవిజితుడైనా భక్తులకు విజితుడే.

**వి :** 1. పుండరీకక్షేత్రం భీమరథీనదీతీరంలో వుంది.

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **అకరోత్ :** | **అకరోత్** | అకురుతామ్ | అకుర్వన్ |
| | అకరోః | అకురుతమ్ | అకురుత |
| | అకరవమ్ | అకుర్వ | అకుర్మ. |

*

**శ్లో॥ రుచిర! కేశవ! శమ్బరధామ తే - లసతి మారమణోఽసి సమాకృతే! ।**
**సకలగోకులపాలక! దుష్కృతిం - పరిహరారిహరాఖిలవాస! నః ॥ 17-10**

**అ :** కేశవవర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** రుచిర! కేశవ! తే శంబర-ధామ లసతి సమ+ఆకృతే మా-రమణః అసి. సకల-గోకుల-పాలక అరిహర అఖిలవాస దుష్కృతిం పరిహర.

**ప్ర :** రుచిర = అందమైన వాడా!, కేశవ = కేశవా!, తే = నీయొక్క, శంబర-ధామ = నీర మనే ఇల్లు, లసతి = ప్రకాశిస్తోంది. (లస దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సమ+ఆకృతే = సమానమైన ఆకృతిగలవాడా! మా-రమణః = లక్ష్మీరమణుడవుగా, అసి = ఉన్నావు. (అస భువి పరస్మైపది-లట్-మ.ఏ.), సకల-గోకుల-పాలక : సకల = సమస్తమైన/కళలతో, గోకుల = శాస్త్రాలకు, పాలక = రక్షకుడా!, అరి-హర = శత్రుసంహారకా! అఖిల-వాస = అంతటా వుండేవాడా!, నః = మాయొక్క, దుష్కృతిమ్ = పాపాన్ని, పరిహర = తొలగించు. (పరి-హృ హరణే-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**కృష్ణపరంగా** : రుచిర-కేశ = అందమైన కేశపాశం గలవాడా!, మార-మనః+అసి-సమ+ఆకృతే : మార = మదనునియొక్క, మనః = మనస్సునకు, అసి-సమ = కత్తితోసమానమైన, ఆకృతే = ఆకారం గలవాడా!, తే = నీకు, వశమ్ = అధీనమైన, వర-ధామ = గొప్ప మేడ, లసతి = ప్రకాశిస్తోంది. సకల-గోకుల-పాలక = సమస్త గోకులానికీ రక్షకుడా!, అఖిల-వాస : అఖిల = నశించని, వాస = నివాసం గలవాడా! కృష్ణా! నః = మాయొక్క, దుష్కృతిమ్ = పాపాన్ని, పరిహర = తొలగించు.

**తా ॥** అందమైనవాడా! కేశవా! జలరూపమైన నీ ఇల్లు ప్రకాశిస్తోంది. సమానమైన ఆకృతి గలవాడా ! నీవు మా రమణుడవు. కలలతో సహా శాస్త్రసమూహాలను సంరక్షించే వాడవు. అరిహరుడవు. అఖిల నివాసుడవు. మా పాపాన్ని పరిహరించు.

రుచిరకేశ ! నీవు మదనుని మనస్సుకు కత్తితో సమానమైన ఆకారం గలవాడవు. నీ అధీనంలో గొప్పమేడ వెలుగొందుతోంది. సకల గోకులాన్ని రక్షించే వాడవు నీవు. సర్వత్ర వసించేవాడవు. కృష్ణా! మా పాపాన్ని పరిహరించు.

**వి :** 1. మా **రమణః- మార మనః** - మొదటి పదంలో ణకారం రెండవ పదంలో నకారం. ణ కారం మార మనః అని విడగొట్టినందువల్ల తొలగిపోతుంది. ఎందుకంటే ణత్వాన్ని విధించే "**రషాభ్యాం నోణస్సమానపదే**" సూత్రంతో రకార నకారాలు ఒకే పదంలో వున్నప్పుడు మాత్రమే ణత్వ ప్రసక్తి. మార- మనః విడగొట్టినప్పుడు రకారమొక

పదంలో, నకారం వేరొకపదంలో వున్నట్టవుతుంది. అందువల్ల ణత్వం రాదు. సభంగశ్లేష కాబట్టి ముద్రణలో ఒక్క అక్షరాన్నే నిలిపారు.

అలాగే **శంబరధామ-వశం వర ధామ** అన్నప్పుడు ఒకచోట బకారం, ఒకచోట వకారం అవసరం. శ్లేషప్రయోగ వేళలో వబలకు, అభేదాన్ని భావించి ప్రయోగించవచ్చు.

| | | | |
|---|---|---|---|
| 2. **లసతి :** | **లసతి** | లసతః | లసన్తి |
| | లససి | లసథః | లసథ |
| | లసామి | లసావః | లసామః |
| **అసి :** | అస్తి | స్తః | సన్తి |
| | **అసి** | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **పరిహర :** | పరిహరతు/పరిహరతాత్ | పరిహరతామ్ | పరిహరన్తు |
| | **పరిహర**/పరిహరతాత్ | పరిహరతమ్ | పరిహరత |
| | పరిహరాణి | పరిహరావ | పరిహరామ |

3. చతుర్థపాదంలో పాదమధ్యయమకం. *

**శ్లో॥ మధుమదక్షయ! మాల్యసువిస్తృతే! - కుజనమానసమాప్తిదవిక్రమ! ।**
**సుఖద! వామన! సోమరసార్థిషు - శ్రియముదాయ! ముదాఽఽర్జయసేఽవనౌ ॥11**

**అ :** మధుసూదనస్తుతి - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** మధు-మద-క్షయ! మా+అలి+అసు విస్తృతే! కు-జన-మాన-సమాప్తి-ద-విక్రమ! సోమ-రస-అర్థిషు సుఖ-ద! వామన! ఉదాయ (ఉత్+అయ)! అవనౌ ముదా శ్రియమ్ ఆర్జయసే.

**ప్ర :** మధు-మద-క్షయ : మధు = మధువనే రాక్షసునియొక్క, మద = పొగరును, క్షయ = నశింపజేసినవాడా!, మా = లక్ష్మి అనే, ఆలి = సఖియొక్క, అసు = ప్రాణాలను, విస్తృతే = విస్తరింపజేసినవాడా!, కు = భూమికి, జన = లోకానికి (లోకపదం జన, భువనాలకు వాచకం కాబట్టి జన పదాన్ని లోకానికి ఉపలక్షకంగా స్వీకరించటం), మాన = ప్రమాణానికి/కొలతకు, సమాప్తి-ద = ముగింపునిచ్చే, విక్రమ! = అడుగులు గలవాడా?, సోమ-రస-అర్థిషు : సోమ రస = సోమలతా రసాన్ని, అర్థిషు = యాచించుటయే స్వభావమైన దేవతలకు, సుఖ-ద! = సుఖాన్ని ఇచ్చేవాడా!, వామన! = వామనావతారా!, ఉదాయ! = గొప్ప భాగధేయంగలవాడా!, అవనౌ = భూమిపై, ముదా = ఆనందంతో, శ్రియమ్ = లక్ష్మిని (సంపదను) ఆర్జయసే = పొందుతున్నావు.

**కృష్ణపరంగా** : మధుమత్-అక్షయ-మాల్య-సువిస్తృతే! : మదుమత్ = మకరందం గలదీ, అక్షయ = వాడనిదీ అయిన, మాల్య = వనమాలయొక్క, సువిస్తృతే = విస్తృతిగలవాడా! (పొడవైన వనమాల ధరించినవాడా!), కుజన-మాన-సమాప్తి-ద-విక్రమ : కుజన = చెడ్డవారియొక్క, మాన = అహంకారానికి, సమాప్తి-ద = ముగింపుపలికే, విక్రమ! = పరాక్రమం గలవాడా!, అమర-సార్థిషు : అమర = దేవతలకు, సార్థిషు = సహాయపడే వారియందు, అమనసః = మనస్సు లేనివాని (ఇష్టం లేనివాని)యొక్క, సుఖ-దవ = సుఖానికి దావాగ్ని వంటివాడా!, వామన = వామనరూపా!, ఉదాయ = ఉన్నతభాగధేయా!, కృష్ణా!, అవనౌ = భూమిపై, ముదా = ఆనందంతో, శ్రియమ్ = సంపదను, ఆర్జయసే = పొందుతున్నావు. (ఆ+అర్జ అర్జనే సంపాదనే చ భ్వాది-ణిచ్-ఆత్మనేపది-లట్-మ.ఏ.)

**తా ॥** మధుమదాన్ని అణచినవాడా!, లక్ష్మి అనే చెలికి ప్రాణేశ్వరా! భూమికి, మూడులోకాల కొలతకు ముగింపు నిచ్చినవాడా! సోమరసాన్ని అర్జించటమే స్వభావమైన దేవతలకు సుఖాన్ని ఇచ్చేవాడా!, వామనా! సద్భాగధేయా! భూమిపై ఆనందంగా సిరిని సంపాదిస్తున్నావు.

మకరందం గలిగి వాడిపోని వనమాల మెడనుండి జానువులదాకా వ్యాపించిన వాడా! చెడ్డవారి అహంకారానికి ముగింపు పలికేవాడా! దేవతాసహాయకులు నచ్చనివారి సుఖానికి దావాగ్నివంటివాడా! వామనరూపా! భూలోకంలో ఆనందంతో సంపదలను సమార్జిస్తున్నావు.

వి : 1. **ఆర్జయసే :** ఆర్జయతే ఆర్జయేతే ఆర్జయన్తే
**ఆర్జయసే** ఆర్జయేథే ఆర్జయధ్వే
ఆర్జయే ఆర్జయావహే ఆర్జయామహే

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం. *

**శ్లో॥ కరణపాలనశీల! నతే స్థితిం - జలజనాభ! వదన్తి కమాశ్రితాః ।**
**విదురమీ వరదామధరోదర! - ప్రియజుషో(ఽ)యజుషోఽగ్నిబలానివ ॥12**

**అ :** పద్మనాభస్తుతి - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** కరణ-పాలన-శీల జలజ-నాభ కమ్ ఆశ్రితాః నతే స్థితిం వదన్తి. వర-దామ-ధర+ఉదర ప్రియ-జుషః అమీ యజుషః అగ్ని బలాన్ ఇవ విదుః.

**తా ॥** కరణ-పాలన-శీల : కరణ = ఇంద్రియాలను, పాలన = రక్షించుట, శీల! = స్వభావంగా గలవాడా! (హృషీకేశా!), జలజ-నాభ! = పద్మనాభ!, కమ్ = ముఖ్యప్రాణుని, ఆశ్రితాః = ఆశ్రయించినవారు, నతే = భక్తునియందు, స్థితిమ్ = ఉనికిని, వదన్తి = చెప్తున్నారు. (వద వ్యక్తాయాం వాచి-పరస్మైపది-లట్-ప్ర.బ.), వర-దామ-ధర+ఉదర : వర = శ్రేష్ఠమైన, దామ = మాలను, ధర = ధరించిన, ఉదర! = పొట్టగలవాడా!, ప్రియ-జుషః = నీకు నచ్చేవి చేసే వారైన, అమీ = ఈ మాధ్వశిష్యులు, యజుషః = యజుర్వేదం నుండి, అగ్నిబలాన్ ఇవ = అగ్నిబలాలనువలె, విదుః = తెలిసికొంటున్నారు.

**కృష్ణపరంగా** : క-రణ-పాలన-శీలన : క = వాయుదేవుని కొరకు (ఆయన కుమారుని కోసం), రణ = యుద్ధాన్ని, పాలన-శీలన = కొనసాగించిన స్వభావం గలవాడా!, భవద్-అన్తికమ్ = నీ దగ్గరకు, ఆశ్రితాః = వచ్చినవారూ, అధర+ఉదర-ప్రియ-జుషః = క్రింది అవయవం, ఉదరం-వీటి ప్రీతికై పనిచేసేవారూ అయిన, అమీ = ఈ, జల(డ)-జనాః = మూర్ఖజనులు, వర-దామ్ = వరాన్ని ఇచ్చే, తే = నీయొక్క, స్థితిమ్ = ఉనికిని, న విదుః = తెలియుట లేదు (అందువలననే), అయజుషః = యజుర్వేదం తెలియనివారు, అగ్నిబలాన్ ఇవ = అగ్నిబలాలను వలె, న వదన్తి = చెప్పటం లేదు.

**తా ॥** ఇంద్రియరక్షణస్వభావా! జలజనాభ! ముఖ్యప్రాణుని ఆశ్రయించినవారు భక్తుని యందు నీ ఉనికిని చెప్తున్నారు. వరదామోధరోదరా! నీకు నచ్చేటట్లు ప్రవర్తించే ఈ మధ్వశిష్యులు మాత్రం యజుర్వేదాభ్యాసం ద్వారా అగ్నిబలాలను గ్రహించినట్లు నీ ఉనికిని తెలిసికొంటున్నారు.

వాయుదేవుని కోసం జరాసంధునితో యుద్ధాన్ని కొనసాగించినవాడవు నీవు (భీముని ద్వారా చంపించాలని). నీ దగ్గరకు వచ్చినవారు కూడా కేవలం ఇంద్రియప్రీతికై పనిచేసే మూర్ఖజనులు. అందుకే వరాలనిచ్చే నీ స్థితిని తెలియలేకున్నారు. యజుర్వేదాభ్యాసం లేనివారు అగ్నిబలాన్ని చెప్పలేనట్లు చెప్పలేకపోతున్నారు.

**వి :** 1. జరాసంధుడు 17 సార్లు మధురపై దండెత్తాడు. పదిహేడు సార్లూ ఓడిపోయాడు. అయితే కృష్ణుడు జరాసంధుని చంపలేదు. భీమునిచేతనే చంపించాలని ఆగాడు.

ఇక్కడొక కారణం. భారతంలోని సమానమైన బలంగలవారు అయిదుగురున్నారని వాళ్ళలో ముందు ఎవరో ఒకరిని చంపినవారు మిగిలిన ముగ్గురినీ చంపుతాడనీ, ఆ అయిదుగురిలో జరాసంధుడు, భీముడూ ఉన్నారని అప్పటికే వారిలోని బకాసురుని భీముడు చంపాడు కాబట్టి మిగిలిన వారిని భీముడే చంపుతాడని లోకంలో అనుకొంటుంటారు. కానీ భారతంలో బలరాముడు, భీముడు, శల్యుడు, కీచకుడు సమాన బలురని వుంది.

అ. **సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు – హలధరుఁడు** సమానబలము వార
లొండొరులను గెలుచు నుత్సాహమును గల – రుద్ధతులును బాహుయుద్ధపరులు.

క. ఈ నలువుర భుజశక్తుల – తోనెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం
గానము కావున వీరల – లోనన యొండొరులకని గెలుపు సమకూరున్.

– ఆంధ్రమహాభారతము–విరాట–3/114,115

కాబట్టి కీచకుని చంపినవాడు భీమసేనుడే కావచ్చునని హేతువును ప్రతిపాదించాడు దుర్యోధనుడు.

జరాసంధుని చంపలేకపోవటానికి కృష్ణుడు తానే కారణాన్ని చెప్పాడు.

ఉ. అమ్మగధేశు నుగ్రబలు **నాయుధయుద్ధమునన్ జయింపగా**
**నిమ్మహి నోపరెవ్వరు**, నుమేశ్వరుఁ డట్టి వరమ్ము వానికిన్
నెమ్మిన యిచ్చెఁ గావున వినీతుఁడు **వాయుసుతుండు మల్లయు**
**ద్ధమ్మున నోర్చునాతని** నుదగ్రమహాభుజశక్తి యేర్పడన్.

– ఆంధ్రమహాభారతము–సభా–1/162

ఆయుధయుద్ధంలో జరాసంధుని ఎవ్వరూ గెలవలేరు. అది ఆయనకున్న వరం. వాయుసుతుడు మాత్రం మల్లయుద్ధంలో గెలవగలడు – కృష్ణుని ఆలోచన.

| | | | |
|---|---|---|---|
| 2. **వదన్తి :** | వదతి | వదతః | **వదన్తి** |
| | వదసి | వదథః | వదథ |
| | వదామి | వదావః | వదామః |
| **విదుః :** | వేద | విదతుః | **విదుః** |
| | వేత్థ | విదథుః | విద |
| | వేద | విద్వ | విద్మ |

*

**శ్లో॥ శుభసముద్రకరం భజతాం ముదే – ప్రియమృగాజినతాఽఖిలదైవతమ్ ।**
**వరయతే స్థిరభూతిమహో ముహు–ర్విభజతే భజతేఽత్యరుచిప్రదా ॥ 17–13**

**అ :** వేదవ్యాసావతారవర్ణన – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** విభజతే (యస్మై)+అరుచి–ప్రదా ప్రియ–మృగ+అజినతా అఖిలదా–ఏవ, భజతాం ముదే శుభ–స–ముద్ర–కరం, వరయతే స్థిర–భూతిం తమ్ అహో ఇతి ముహుః భజత.

**ప్ర :** విభజతే = విడదీస్తున్న, యస్మై = ఎవనికి, అరుచి–ప్రదా = అనిష్టాన్ని కలిగిస్తున్న ప్రియ–మృగ–అజినతా = ఇష్టమైన మృగచర్మధారిత్వం, అఖిల–దా+ఏవ = మోక్షప్రదమో, భజతామ్ = సేవించేవారికి, ముదే = ఆనందంకోసం, శుభ–స–ముద్ర–కరమ్ : శుభ = శుభప్రదమైన, స–ముద్ర = ముద్రతో కూడిన, కరమ్ = చేయిగలవాడూ, వరయతే = సంన్యాసికి, స్థిర–భూతిమ్ = నిశ్చల (జ్ఞాన) సంపదయు అయిన, తమ్ = ఆ వ్యాసుని, అహో ఇతి = అద్భుతమనుకొని, ముహుః = మాటిమాటికి, భజత = సేవించండి.

**కృష్ణపరంగా :** భజతామ్ = సేవించేవారికి, ముదే = ఆనందంకోసం, శుభ-సముద్ర-కరమ్ : శుభ = మంగళప్రదమైన, సముద్ర-కరమ్ = సముద్రాన్ని కల్పించినవాడు, ఆజి... దైవతమ్ : ఆజి = యుద్ధమందు, నత = నమ్రులైన, అఖిల-దైవతమ్ = సర్వదేవతలూ గలవాడు, ప్రియమ్ = ఇష్టమైన వాడు అయిన కృష్ణుని, స్థిర-భూతి-మహః = నిత్యభస్మధారి అయిన శివుని తేజస్సు, భజతే = సేవించేవానికి, అత్యరుచి-ప్రదా = అసలు ఇష్టంలేని, ఋక్ = ఋగ్వచనం, స్థిర-భూతిమ్ = నిశ్చల సంపదగల శివుని, ముహుః = పదే పదే, విభజతే = కృష్ణునికన్న వేరు చేసి చూపుతుంది.

**తా ॥** వ్యాసమహర్షి కృష్ణాజినాన్ని చాలా ఇష్టంగా ధరించేవాడు. దానిని శరీరంనుండి విడదీయాలంటే అప్రియంగా భావించేవాడు. బ్రహ్మవిద్యను వదలటం వంటిది ఆయనకు కృష్ణాజినాన్ని వదలటం. ఆయననూ నిత్యమూ భజించాలి. శుభకరమైన చిన్ముద్రను చేతితో పట్టి తనను కోరిన ఉత్తమాచార్యులకు జ్ఞానసంపదను కలిగించేవాడు ఆయన.

కృష్ణుడు తనను సేవిస్తున్న యాదవులకు శుభసముద్రకరుడు, ద్వారకచుట్టూ వున్న నీటిని వినియోగయోగ్యంగా చేసినవాడు. సర్వదేవతలు వినమ్రులై నిలిచే వాడు తాను. నిత్యమూ భస్మధారి అయిన శివుని తేజస్సును సేవించేవారికి అసలు నచ్చని ఋగ్వచనాలు ఆ శివుని కృష్ణునినుండి వేరుచేసి చూపుతుంటాయి. కృష్ణుడు సర్వదేవతావిజేత కావటమే ఆ వచనాలకు మూలం.

**వి : 1. భజత :** 17-3వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం. *

**శ్లో॥ భజకభావివిరిఞ్చకృతే ప్రియ-ప్రణయపాశవృతస్త్వమథేష్యసి ।**
**తదవనిం శివరూప్యమితోఽబ్ధిగః - కుమతినామతినాశనదండధృత్ ॥ 17-14**

**అ :** శివరూప్యపీఠంలోని కృష్ణవర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** ప్రియప్రణయ! పాశ-వృతః కుమతినామ్ అతినాశన-దండ-ధృత్ త్వమ్ అథ భజక-భావి-విరించ-కృతే అబ్ధిగః ఇతః తద్-అవనిం శివ-రూప్యమ్ ఏష్యసి.

**తా ॥** ప్రియ-ప్రణయ : ప్రియ = ఇష్టులైన, ప్రణయ = భక్తులుగలవాడా!, (భక్తవత్సలా), పాశ-వృతః = (ఒకచేతితో) పాశాన్ని ధరించినవాడవై, కు-మతినామ్ = చెడ్డవారికి/అపసిద్ధాంతాలు గలవారికి (మాయావాదులకు), అతినాశన-దండ-ధృత్ = అత్యంతమూ నాశకరమైన దండాన్ని ధరించిన వాడవై (మరొక చేతిలో), త్వమ్ = నీవు, భజక-భావి-విరించ-కృతే : భజక = సేవకుడైన, భావి = కాబోయే, విరించ-కృతే = బ్రహ్మకై, (మధ్వాచార్యులు కాబోయే బ్రహ్మ అని మధ్వవిశ్వాసం), అబ్ధి-గః = సముద్రమార్గాన ప్రయాణించి, ఇతః = ఇప్పటితర్వాత (కొంతకాలం తర్వాత), తద్-అవనిమ్ = ఆయన స్వస్థలమైన, శివరూప్యమ్ = శివరూప్యమనే గ్రామానికి, ఏష్యసి = చేరగలవు. (ఇ గతౌ పరస్మైపది-ల్యట్-ప్ర.ఏ.)

**కృష్ణపరంగా :** శివ-రూపీ = మంగళ స్వరూపుడవై, కుమతినా = కుత్సిత బుద్ధిగల కంసాదులచే, అమితః = తెలియబడని, అమతి-నాశన-దండ-ధృత్ : అమతి = అజ్ఞానాన్ని, నాశన = నశింపజేసే, దండ-ధృత్ = శిక్షను అమలుచేస్తూ, త్వమ్ = నీవు, అథ = రాబోయే కాలంలో, అబ్ధిగః (సన్) = సముద్రంలోనే వుండి, భజక-భావి-విరించ-కృతే : భజక = సేవకుడు, భావి = భావంగలవాడు (భక్తుడు) అయిన, విరించ-కృతే = బ్రహ్మకోసం, ప్రియ... వృతః (సన్) : ప్రియ = భక్తులయందలి, ప్రణయ = ప్రేమ అనే, పాశ = పాశంతో, వృతః = కూడినవాడవై, తద్-అవనిమ్ = భక్తులున్నచోటికే, ఏష్యసి = చేరగలవు.

**తా ॥** భక్తవత్సలా! ఒకచేత పాశాన్ని, మరొకచేత అపసిద్ధాంతాలను నాశనంచేసే దండాన్ని ధరించి, నీ సేవకుడు భావిబ్రహ్మ అయిన మధ్వాచార్యునికై ఈ ద్వారవతినుండి సముద్రమార్గంలో ఆయన స్వస్థలమైన శివరూప్యగ్రామానికి వెళ్ళబోతున్నావు.

శివస్వరూపా! కుమతులైన కంసాదులు తెలియని అజ్ఞానవినాశకమైన శిక్షను చేబూనిన వాడవు నీవు. రాబోయే బ్రహ్మదినంలో కూడా సముద్రంలోనే నిలిచి కూడా భక్తుల ప్రేమ పాశాలకు చిక్కి ఆ భక్తులున్నచోటికే వెళ్ళగలవు. (అక్కడ అవతరించగలవు.)

**వి :** 1. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఏష్యసి :** | ఏష్యతి | ఏష్యతః | ఏష్యన్తి |
| | **ఏష్యసి** | ఏష్యథః | ఏష్యథ |
| | ఏష్యామి | ఏష్యావః | ఏష్యామ. |

*

**శ్లో॥ భువనవాస్యనిశం మనుసంస్తుతో - విధివిరోధివినాశకృదన్వహమ్ ।**
**అనిమిషప్రభురాగమహర్షదో - నిజవశో జవశోభితసాగరః ॥ 17-15**

**అ :** మత్స్యావతారవర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** అనిశం భువన-వాసీ అన్వహం మను-సంస్తుతః విధి-విరోధి-వినాశ-కృత్ ఆగమ-హర్ష-దః జవ-శోభిత-సాగరః అనిమిష-ప్రభుః నిజ-వశః (అస్తు).

**ప్ర :** అనిశమ్ = ఎల్లప్పుడూ, భువన-వాసీ = నీటియందుండువాడు (భువనే వాసః అస్య అస్తీతి), (విషం పాథోఘనపదం భువనం జీవనం వనమ్-వైజయన్తీ-జల-2), అను+అహమ్ = ప్రతిదినమూ, మను-సంస్తుతః : మను = (వైవస్వత) మనువుచే, సంస్తుతః = స్తుతింపబడినవాడూ, విధి... కృత్ : విధి = బ్రహ్మయొక్క, విరోధి = శత్రువుయొక్క (వేదాల నపహరించిన సోమకాసురునియొక్క), వినాశ = నాశనాన్ని, కృత్ = చేసినవాడు, ఆగమ-హర్ష-దః : ఆగమ = వేదాలకు, హర్ష-దః = ఆనందాన్ని ఇచ్చినవాడు, జవ-శోభిత-సాగరః : జవ = వేగంచేత, శోభిత = ప్రకాశింపజేయబడిన, సాగరః = సముద్రం గలవాడు అయిన, అనిమిష-ప్రభుః : అనిమిష = చేపలకు, ప్రభుః = రాజు (మత్స్యరాజు), నిజ-వశః = భక్తవశుడై, (అస్తు = ఉండుగాత!).

**కృష్ణపరంగా :** అనిశమ్ = ఎల్లప్పుడూ, భువన-వాసీ = లోకాలలో నివసించేవాడు, అన్వహమ్ = ప్రతిదినమూ, మను-సంస్తుతః : మనునా = (కృష్ణ) మంత్రంతో, సంస్తుతః = స్తుతింపబడేవాడు, విధి... కృత్ : విధి = విహితకర్మలను అనుష్ఠించటానికి, విరోధి = విరోధులను, వినాశ-కృత్ = నాశనం చేసేవాడు (యాగాదికర్మలు విధి విహితాలు. వాటిని వ్యతిరేకించేవారు లేదా వాటికి ప్రతిబంధకంగా నిలిచినవారు విధివిరోధులు.), ఆగమ-హర్షదః : ఆగమ = రాకచేత, హర్షదః = ఆనందాన్ని కలిగించేవాడు, జవ-శోభిత-సాగరః : జవ = వేగంచేత, శోభిత = ప్రకాశింపజేయబడిన, సాగరః = సముద్రంగలవాడు, అనిమిష-ప్రభుః : అనిమిష = దేవతలకు, ప్రభుః = అధిపతి అయిన కృష్ణుడు, నిజ-వశః = భక్తవశుడై, అస్తు = నిలుచుగాక.

**తా ॥** నిత్యమూ జలనివాసి. ప్రతిదినమూ వైవస్వతమనువుచే స్తుతింపబడినవాడు, బ్రహ్మనుండి వేదాలను అపహరించి, విరోధి అయిన సోమకాసురుని నాశనం చేసినవాడు, వేదాలకు ఆనందాన్ని (మరలా ఉనికిని) కలిగించినవాడు, తన వేగంచేత సముద్రానికి శోభను కలిగించినవాడు అగు మత్స్యరూపంలోని కృష్ణుడు భక్తవశుడై నిలుచుగాక.

కృష్ణుడు నిత్యమూ సర్వలోకనివాసి. మంత్రాలచే స్తుతింపబడేవాడు. విధివిహితయాగాది కర్మలను

అడ్డగించేవారిని నశింపజేసేవాడు. తనరాకచేత (గోపికలకు, పాండవాదులకు) ఆనందాన్ని కలిగించినవాడు. ద్వారకకు రాకపోకలు జరిపే వేగంతో సాగరాన్ని శోభింపజేసేవాడు, దేవతలకు అధిపతి. అటువంటి కృష్ణుడు భక్తవశుడై నిలుచుగాక.

**వి :** 1. మహాభారతం వనపర్వంలోని 187వ అధ్యాయంలో మత్స్య జననం – వైవస్వత మనువు దగ్గర చేరి పెరగటం – ఆ పై కడలిలో చేరి ప్రళయకాలంలో వైవస్వతమనువును ప్రళయజలంనుండి దూరంగా తీసికొనిపోయి, మరలా సర్వసృష్టికీ అవకాశాన్ని కల్పించటం – ఈ కథ అంతా వుంది. *

**శ్లో॥ భుజగదిక్కరిభారజశోకహృ–త్సురమనోరథపూరణకారణః ।**
**స్వమతవారినిధేర్మథనే పటు–ర్గిరిధరోఽరిధరోఽయమిహాగతః ॥ 17–16**

**అ :** కూర్మావతారవర్ణన – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** భుజగ–దిక్–కరి–భార–జ–శోక–హృత్ సుర–మనః+రథ–పూరణ–కారణః స్వ–మత–వారి–నిధేః మథనే పటుః గిరి–ధరః అరి–ధరః అయమ్ ఇహ ఆగతః.

**ప్ర :** భుజగ... కారణః : భుజగ = ఆదిశేషుడు, దిక్–కరి = దిగ్గజాలు, భారజ = బరువువలన పుట్టిన, శోక = దుఃఖాన్ని, హృత్ = హరించేవాడూ, సుర–మనో... కారణః : సుర = దేవతలయొక్క, మనోరథ = కోరికలను, పూరణ = తీర్చటానికి, కారణః = హేతువైనవాడూ, స్వ... నిధేః : స్వ = తనకు, మత = ఇష్టమైన, వారి–నిధేః : సముద్రంయొక్క, మథనే = చిలుకుటయందు, పటుః = సమర్థుడూ, గిరి–ధరః = కొండను ధరించినవాడూ అయిన, అరి–ధరః = చక్రధారి (నారాయణుడు), అయమ్ = ఈ కూర్మంగా, ఇహ = ఇక్కడకు, ఆగతః = వచ్చాడు.

**కృష్ణపరంగా :** భుజగ... హృత్ : భుజగ = ఆదిశేషునియొక్క, దిక్–కరి = దిగ్గజాలయొక్క, భార–జ = బరువుచే ఏర్పడిన, శోక–హృత్ = దుఃఖాన్ని పోగొట్టేవాడు (భూ భారాన్ని తగ్గించటం ద్వారా వాటి భారాన్ని తగ్గించేవాడు), సుర... కారణః : సుర = దేవతలయొక్క, మనోరథ = కోరికలను, పూరణ = తీర్చుటకు, కారణః = కారణమైనవాడు, సు+అమత... నిధేః : సు+అమత = బాగా నచ్చని శత్రువులు అనే, వారి–నిధేః : సముద్రంయొక్క, మథనే = హింసించుటయందు (సంహరించుటయందు), పటుః = సమర్థుడు, గిరి–ధరః = గోవర్ధనగిరిధారి, అరి–ధరః : అరి = శత్రువులకు, ధరః = భూమివలె నిశ్చలుడు అయిన (అరీణాం ధరా ఇవ = అరిధరః), అయమ్ = ఈ కృష్ణుడు, ఇహ = ద్వారవతికి, ఆగతః = వచ్చాడు.

**తా ॥** ఆదిశేషుడు, దిగ్గజాలు భూమినీ, కొండలనూ మోసేవి. ఆ కొండను కవ్వం చేసి చిలుకుతుండటంతో ఆ ఆదిశేషుడూ, దిగ్గజాలు భారాన్ని మోయలేక దుఃఖించాయి. వాటి శోకాన్ని తొలగించింది ఆదికూర్మరూపంలోని నారాయణుడు. కాబట్టి తచ్ఛోకహర్త. దేవతల మనోరథాలను పూరించటానికి కారణమైనవాడు. తనకు నచ్చిన సముద్రాన్ని చిలకటంలో సమర్థుడు. ఆ మందరపర్వతాన్ని ధరించిన సుదర్శనచక్రధారి ఇప్పుడు ఇక్కడ కూర్మరూపంలో వచ్చాడు.

కృష్ణుడు తన అవతరణంతో దుష్టులను శిక్షించి భూభారాన్ని తొలగించి తద్వారా ఆదిశేష–దిగ్గజాల శోకాన్ని హరించేవాడు. దేవతల మనోరథాలు తీరటానికి కారణమైనవాడు. శత్రువు లనే సముద్రాన్ని మథించటంలో నేర్పరి. గోవర్ధనగిరిధారి. సుదర్శనచక్రధారి. ఆయన కృష్ణరూపంలో ఇప్పుడిక్కడకు వచ్చాడు. *

**శ్లో॥ స్వవశగో రిపుభీషణచేష్టితో – వరవరాహతయా దవకృద్ద్విషామ్ ।**
**మఖసహాయకృతిర్ధరయాఽర్చితః – కమలయాఽమలయాఽయమహో వృతః ॥17**

**అ :** వరాహావతారవర్ణనం – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** స్వ–వశ–గో–రిపు–భీషణ–చేష్టితః వర–వరాహతయా ద్విషాం దవ–కృత్ మఖ–సహాయ–కృతిః ధరయా అర్చితః అయమ్ అమలయా కమలయా వృతః అహో!

**ప్ర :** స్వవశ... చేష్టితః : స్వ = తనకు, వశ = లొంగివున్న, గో = భూమికి, రిపు = శత్రువులకు (హిరణ్యాక్షునికి), భీషణ = భయంకరమైన, చేష్టితః = ప్రవర్తన గలవాడూ, వర–వరాహతయా : వర = శ్రేష్ఠమైన, వరాహతయా = వరాహత్వంతో, ద్విషామ్ = శత్రువులకై (రాక్షసులకై), దవ–కృత్ = నిప్పునుమిసేవాడు, మఖ–సహాయ–కృతిః : మఖ = యాగానికి, సహాయ = సహకరించేవాటిని, కృతిః = చేయువాడు, ధరయా = భూమిచేత, అర్చితః =పూజింపబడినవాడు అయిన, అయమ్ = ఈ, వరాహః = వరాహమూర్తి, అమలయా = నిర్మల అయిన, కమలయా = లక్ష్మిచేత, వృతః = వరింపబడ్డాడు. అహో! = ఆశ్చర్యం.

**కృష్ణపరంగా :** స్వ–వశ = తనకు లోబడివున్న, గో = గోవులకు, రిపు = శత్రువులైన పులి మొదలగు వాటికి, భీషణ = భయాన్ని కల్గించే, చేష్టితః = చేష్టలుగలవాడు, ద్విషామ్ = శత్రువులకు, వర–వర+అహత–యాదవ–కృత్ : వర = శ్రేష్ఠులైన వారికిచ్చిన, వర = వరాలచేత, అహత = కొట్టబడని, యాదవ–కృత్ = యాదవులను చేసేవాడు (శ్రేష్ఠవరాలు కూడా కృష్ణుడున్నంతవరకు యాదవులపై పనిచేయవని భావం), మఖ... కృతిః : మఖ–సహ = యాగం చేయటానికి తగినవారైన పాండవులకు, ఆయ–కృతిః = ఆదాయాన్ని సమకూర్చినవాడు, ధరయా = భూమిచే (నరకుని తల్లిచే), అర్చితః = పూజింపబడినవారు అయిన, అయమ్ = ఈ కృష్ణుడు, అమలయా = నిర్మల అయిన, కమలయా = లక్ష్మిచే, వృతః = వరింపబడ్డాడు.

**తా ॥** తన అదుపులో నున్న భూమికి శత్రువైన హిరణ్యాక్షుడికి భీకరమైన చేష్టలుగలదీ, మేటివరాహం కాబట్టి శత్రువులపై నిప్పుకురిసేదీ, యాగానికి అవసరమైన సాధనసంపత్తిని తన శరీరావయవాల నుండీ సమకూర్చేదీ, భూమిచేత పూజింపబడినదీ అయిన ఆదివరాహం (విష్ణువు) నిర్మల అయిన కమలచే వరింపబడింది. ఆశ్చర్యకరం.

తన మందలోనున్న ఆవులకు శత్రువులైన శార్దూలాది జంతువులకు భయాన్ని కల్గించేవాడు, దేవతల మేటి మేటివరాలైనా (దైత్యులకిచ్చినవి) యాదవులను ఏమీ చేయలేనట్లు యాదవులను కాచేవాడు, యాగం చేయటానికి తగినవారైన పాండవులకు యాగానికి అవసరమైన ఆదాయాన్ని సమకూర్చినవాడు అయిన కృష్ణుడు నిర్మల అయిన లక్ష్మిచే వరింపబడ్డాడు. ఆహా! అద్భుతం.

**వి :** 1. పాండవులు రాజసూయాన్ని సంకల్పించి నప్పుడు సర్వాత్మనా దర్శకత్వం వహించి పూర్తి చేయించింది కృష్ణుడే.

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకమ్. *

**శ్లో॥ అరిహిరణ్యకసంక్షయకారకం – నరమృగాధిపమద్భుతచేష్టితమ్ ।**
**అఘకృదింద్రకృతార్చనతోషితం – భజ మనోఽజమనోహరవిక్రమమ్ ॥17–18**

**అ :** నృసింహావతారవర్ణనం – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** అరి–హిరణ్యక–సంక్షయ–కారకమ్ అద్భుత–చేష్టితమ్ అఘ–కృత్+ఇంద్ర–కృత+అర్చన–తోషితమ్ అజ–మనోహర–విక్రమం నర–మృగ+అధిపం మనః భజ.

**ప్ర :** అరి... కారకమ్ : అరి = శత్రువైన, హిరణ్యక = హిరణ్యకశిపునియొక్క, సంక్షయ = వినాశానికి, కారకమ్ = కారణమైనవాడు, అద్భుత–చేష్టితమ్ : అద్భుత = వింతగొలిపే, చేష్టితమ్ = చేష్టలుగలవాడు, అఘ... తోషితమ్ : అఘ–కృత్ = పాపం చేసిన, ఇంద్ర = ఇంద్రునిచే, కృత = చేయబడిన, అర్చన = పూజచే, తోషితమ్

= ఆనందింపజేయబడినవాడు, అజ... విక్రమమ్ : అజ = బ్రహ్మయొక్క, మనః = మనస్సును, హర = దొంగిలించే, విక్రమమ్ = పరాక్రమంగలవాడు (బ్రహ్మ స్తుతులనందినవాడని భావం), నర-మృగ+అధిపమ్ = నృసింహుని, మనః = ఓ మనసా!, భజ = సేవించు.

**కృష్ణపరంగా :** అరి = శత్రువులయొక్క, హిరణ్యక = సువర్ణంయొక్క (బంగారాన్ని), సంక్షయ = తగ్గుదలకు, కారకమ్ = కారణమైనవాడు, అద్భుత-చేష్టితమ్ : అద్భుత = ఆశ్చర్యకరాలైన, చేష్టితమ్ = చేష్టలుగలవాడు (గోవర్ధనోద్ధరణం మొదలైనవి), అఘ... తోషితమ్ : అఘకృత్ = పాపంచేసిన, ఇంద్ర = ఇంద్రునియొక్క (ఇంద్రోత్సవనిషేధం కారణంగా కృష్ణుని తిరస్కరించి ఇంద్రుడు పాపంచేశాడు), ఇంద్ర = ఇంద్రునిచేత, కృత = చేయబడిన, అర్చన = పూజచే, తోషితమ్ = ఆనందింపజేయబడినవాడు, అజ... విక్రమమ్ : అజ = మన్మథునియొక్క, మనోహర = అందమైన, విక్రమమ్ = నడకగలవాడు అయిన, నర-మృగ+అధిపమ్ = నరసింహుని, మనః = మనసా, భజ = సేవించు.

**తా ॥** మనసా! తన శత్రువైన హిరణ్యకశిపుని వినాశనానికి కారణమైనవాడు, అద్భుతమైన చేష్టలుగలవాడు, పాపంచేసిన ఇంద్రుని అర్చనలచేతకూడా ఆనందించినవాడు, బ్రహ్మ మనస్సునుకూడా దొంగిలించిన పరాక్రమం గలవాడు అయి నృసింహుని సేవించు.

మనసా! తనశత్రువులయొక్క బంగారాన్ని (సంపదను) సంక్షయింపజేసేవాడు, ఆశ్చర్య-కరాలైన చేష్టలు గలవాడు, తన విషయంలో తప్పుచేసిన ఇంద్రుని అర్చనలచేత కూడా ఆనందించినవాడు, మదనుని నడకవంటి అందమైన నడకగలవాడు అయిన కృష్ణుని సేవించు.

**వి :** 1. వృత్రాసురుని సంహరించినందువలన ఇంద్రునికి బ్రహ్మహత్యాపాతక మంటుకొంది. దానితో ఇంద్రపదవిని కోల్పోయాడు. నహుషుడు ఇంద్రుడయ్యాడు. బ్రహ్మహత్యాపాతకాన్ని భూమికీ, చెట్లకూ, స్త్రీలకూ సమభాగాలను పంచి పెట్టాడు వారిని అభ్యర్థించి వారి అంగీకారంతో.

2. **భజ :** 17-13వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ బలహృదార్తిహరోఽనుజనిః ప్రభు-ర్బలిపరాజయకృజ్జయకృత్ సతామ్ ।**
**అవనిజాతపలాశసుదండధృ-గ్భువనపావనపాదసరోరుహః ॥ 17-19**

**అ :** వామనావతారవర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** బల-హృత్+ఆర్తి-హరః అనుజనిః బలి-పరాజయ-కృత్ సతాం జయ-కృత్ అవని-జాత-పలాశ-సుదండ-ధృగ్ భువన-పావన-పాద-సరః+రుహః (నః) ప్రభుః.

**ప్ర :** బల...హరః : బల-హృత్ = బలాసురుని చంపిన ఇంద్రునియొక్క, ఆర్తి-హరః : ఆర్తిని పోగొట్టినవాడు, అనుజనిః = తమ్ముడు (ఉపేంద్రుడు), బలి... కృత్ : బలి = బలిరాక్షసుడికి, పరాజయ-కృత్ = (వామనరూపంలో) ఓటమిని కలిగించినవాడు, సతామ్ = మంచివారికి (దేవతలకు), జయ-కృత్ = గెలుపును కలిగించిన వాడు, అవని... ధృగ్ : అవని-జాత = భూమిలో పుట్టిన, పలాశ = మోదుగయొక్క, సుదండ = దండాన్ని (బ్రహ్మచారి ధరింపవలసిన దండం), ధృగ్ = ధరించినవాడు, భువన... రుహః : భువన = లోకాలను, పావన = పవిత్రంచేసే (పాదప్రక్షాళనజలమైన గంగరూపంతో) పాద-సరోరుహమ్ = పాదపద్మం గలవాడు అయిన వామనుడు, నః = మనకు, ప్రభుః = స్వామి.

**కృష్ణపరంగా :** బల... హరః : బల = బలరామునియొక్క, హృత్ = మనస్సులోని, ఆర్తి = దుఃఖాన్ని, హరః = పోగొట్టేవాడు (బలరాముని సుఖంగా వుంచేవాడు), అనుజనిః = సోదరుడు (తమ్ముడు), బలి... కృత్ : బలి = బలవంతులైన కంసాదులకు, పరాజయ = ఓటమిని, కృత్ = కలిగించినవాడు, సతామ్ = సజ్జనులకు

(పాండవాదులకు), జయ–కృత్ = గెలుపును కలిగించేవాడు, అవని... ధృక్ : అవని = భూమిపై, జాత = పుట్టిన, పల+అశ = మాంసభోజనులయిన రాక్షసులకు, సు–దండ–ధృక్ = చక్కగా శిక్షించేవాడు, భువనప+అవన–పాద–సరోరుహమ్ : భువన–ప = లోకరక్షకుడైన అర్జునునికి, అవన = రక్షణ కలిగించిన, పాద–సరోరుహః = పాదపద్మం గలవాడు అయిన కృష్ణుడు, నః = మనకు, ప్రభుః = స్వామి.

**తా ॥** ఇంద్రుని దుఃఖాన్ని పోగొట్టే ఉపేంద్రుడు, బలికి పరాజయాన్ని కలిగించినవాడు, దేవతలకు జయాన్ని అందించినవాడు, నేలనుండి పుట్టిన పలాశదండాన్ని ధరించినవాడు, భువనాన్ని పావనం చేసిన (పాదప్రక్షాళన జలరూపమైన గంగద్వారా) పాదపద్మం గలవాడు అయిన వామనుడు మనకు ప్రభువు.

బలరాముని క్లేశాన్ని తొలగించి సుఖంగా నిలిపేవాడు. ఆయన తమ్ముడు, బలవంతులకు ఓటమిని చవిచూపినవాడు, పాండవాది సత్పురుషులకు గెలుపునందించినవాడు, భూలోకంలో పుట్టి మాంసభక్షకులైన రాక్షసులను తగినరీతిగా దండించేవాడు, క్షత్రియుడైన అర్జునునికి రక్షణను కల్పించిన పాదపద్మంగల వాడు అయిన కృష్ణుడు మనకు ప్రభువు.

**వి :** 1. కురుక్షేత్ర సంగ్రామం నిశ్చితమైన తరువాత అర్జునుడు, దుర్యోధనుడు – ఇద్దరూ కృష్ణసహాయాన్ని అభ్యర్థించటానికి వెళ్ళారు ఆ సమయంలో కృష్ణుడు నిద్రిస్తున్నాడు (నటిస్తున్నాడేమో!) ముందుగా వచ్చిన దుర్యోధనుడు తలవైపు కూర్చున్నాడు. తరువాత వచ్చిన అర్జునుడు పాదాలవైపు కూర్చున్నాడు. కృష్ణుడు నిదురనుండి లేచి ముందుగా అర్జునుని చూశాడు. దుర్యోధనుడు ముందువచ్చినా, తాను ముందు చూసింది అర్జునుని కాబట్టి అర్జునునికే సహాయాన్ని కోరుకోవటంలో తొలి అవకాశమన్నాడు కృష్ణుడు. అర్జునుడు కృష్ణుడు విభజించిన వాటిలో సైన్యాన్ని కాదని కృష్ణుని కోరుకొన్నాడు. సైన్యం దుర్యోధనుడికి దక్కింది. *

**శ్లో॥ యుధి సహస్రకరోర్జితబాణహృత్–పరశురర్జునసత్క్షితిదాయకః ।**
**కుభరసంహరణోగ్రరణాగ్రణీ–ర్ద్విజభవోఽజభవోన్నతిదాయకః ॥ 17–20**

**అ :** పరశురామావతారవర్ణనం – కృష్ణపరంగా కూడా. – ద్రుతవిలంబితమ్.

**అ :** యుధి సహస్ర–కర+ఊర్జిత–బాణ–హృత్–పరశుః అర్జున–సత్–క్షితి–దాయకః కు–భర–సంహరణ+ఉగ్ర–రణ+అగ్రణీః ద్విజ–భవః అజ–భవ+ఉన్నతి–దాయకః.

**ప్ర :** యుధి=యుద్ధంలో, సహస్ర... పరశుః : సహస్ర–కర=వేయి చేతులుగల కార్తవీర్యుని యొక్క, ఊర్జిత = చేవగల, బాణ = బాణాలను, హృత్ = హరించే, పరశుః = గొడ్డలిగలవాడూ, అర్జున–సత్–క్షితి–దాయకః : అర్జున = కార్తవీర్యునకు, సత్ = తగిన, క్షితి = నాశనాన్ని (క్షి ధాతువుపై క్తిన్ ప్రత్యయం), దాయకః = ఇచ్చువాడూ, కు–భర... గ్రణీః : కు–భర = భూపాలకులను, సంహరణ = చంపుటయే లక్ష్యమైన, ఉగ్ర–రణ = తీవ్రయుద్ధంలో, అగ్రణీః = ముందునిలిచినవాడూ, ద్విజ–భవః = బ్రాహ్మణవంశంలో పుట్టిన పరశురాముడు, అజ... దాయకః : అజ = బ్రహ్మకూ, భవ = శివునకూ, ఉన్నతి = హెచ్చుదలను, దాయకః = ఇచ్చువాడు.

**కృష్ణపరంగా :** యుధి = యుద్ధంలో, సహస్రకర+ఊర్జితబాణ–హృత్–పరశుః = వేయిచేతులు గల మేటి బాణాసురుని హృదయానికి గొడ్డలివంటివాడు; అర్జున–సత్–క్షితి–దాయకః = అర్జునునకు తగిన భూమి (రాజ్యం) నిచ్చినవాడు; కు–భర–సంహరణ+ఉగ్రరణ+అగ్రణీః = భూభారాన్ని సంహరించే తీవ్రయుద్ధాలలో ముందుండేవాడు; ద్విజ–భవః = బ్రాహ్మణులకు శుభాలు గల్గించేవాడు; అజ–భవ+ఉన్నతి–దాయకః = శివునకు (అజుని నుండి పుట్టినవాడు శివుడు) ఔన్నత్యాన్ని కల్గించేవాడు.

**తా ॥** పరశురాముడు యుద్ధంలో సహస్రబాహువయిన కార్తవీర్యార్జునుని బాణాలను ఖండించి చివరకు ఆయనను

కూడా నశింపజేసిన వాడు. రాజులను సంహరించటానికి (21 మార్లు) తీవ్రయుద్ధాలు చేసి అగ్రగామియై నిలిచిన వాడు. బ్రాహ్మణుడు. శివునకు ఉన్నతిని అందించినవాడు.

కృష్ణుడు వేయిబాహువులు గల బాణాసురుని పాలిటి గొడ్డలి వంటివాడు. అర్జునునకు తగినరీతిగా రాజ్యభాగమిచ్చినవాడు. భూభారాన్నిసంహరించటానికి తీవ్రరణాలు చేసి గెలిచి ముందు నిలిచినవాడు. బ్రహ్మపుట్టుకకు మూలమైన వాడు. శివునకు (కైలాసయాత్రద్వారా) ఉన్నతిని కల్పించినవాడు.

**వి :** 1. శ్లోకంలో బాణ, అర్జున శబ్దాలు శ్లిష్టాలు. రెండు అర్థాల నిచ్చేవి. పరశురాముని కథ వాచ్యం. అది స్ఫురించినతర్వాత రెండవ అర్థం శబ్దశక్తిమూలధ్వని ద్వారా వ్యక్త మవుతుంది.

2. చతుర్థపాదంలో మాత్రం పాదమధ్యయమకం. *

**శ్లో॥ అహిమకాన్తిమతః కలయా కులం - వ్యతనుతాధికభూషితమఞ్జసా ।**
**అభయమన్యదశాస్యసుఖణ్డనః - క్షితిసుతాతిసుతాపభిదాకృతిః ॥ 17-21**

**అ :** రామావతారవర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** అహిమ-కాంతి-మతః కులం కలయా అధిక-భూషితం వ్యతనుత. అన్య-దశ+ఆస్య-సుఖండనః క్షితి-సుతా+అతిసుతాప-భిద్-ఆకృతిః (సన్) (సః) అంజసా అభయం వ్యతనుత.

**రామపరంగా :** అహిమ-కాంతి-మతః = వేడివెలుగులుగల సూర్యునియొక్క, కులమ్ = వంశాన్ని, కలయా = తన అంశతో (కలా తు షోడశో భాగః - అమరకోశః-దిక్-15), అధిక-భూషితమ్ : అధిక = ఎక్కువగా, భూషితమ్ = అలంకరింపబడినదిగా, వి+అతనుత = చేశాడు. (వి-తన్ విస్తారే ఆత్మనేపది-లఙ్-ప్ర.ఏ.), అన్య-దశాస్య-సుఖండనః : అన్య = వైరి అయిన, దశ+ఆస్య = దశకంఠుని (రావణుని), సుఖండనః = చక్కగా ఖండించిన వాడు, క్షితి... దాకృతిః (సన్) : క్షితి-సుతా = భూసుత (సీత)యొక్క, అతిసుతాప = మిక్కుటమైన తీవ్రతాపాన్ని, భిద్ = బ్రద్దలుచేసిన, ఆకృతిః = ఆకారంగలవాడై, సః = ఆ రాముడు, అంజసా = శీఘ్రంగా, అభయమ్ = అభయాన్ని, వి+అతనుత = కల్గించాడు.

**కృష్ణపరంగా :** క్షితి-సుత-అతిసుతాప-భిద్-ఆకృతిః : క్షితి = భూమియొక్క, సుత = కొడుకయిన నరకుని యొక్క, అతిసుతాప = మిక్కిలి క్లేశానికీ, భిదా = చీలటానికి కారణమైన, ఆకృతిః = ఆకారం (కృష్ణుడు), అన్య-దశా-అసి+అసు-ఖండనః : అన్య = శత్రువులయొక్క, దశా = స్థితిని, అసి = కత్తులను, అసు = ప్రాణాలనూ, ఖండనః = ఖండించేవాడై, క-లయ+ఆకులమ్ : క = పడగల (తలల)యొక్క, లయ = నాశంచేత, ఆకులమ్ = కలతపడి, అకాన్తిమ్ = కళతప్పిన, అహిమ్ = పామును (కాళియుని), అతః = తానున్నచోటునుండి (మడుగునుండి), అధిక-భూ-ఉషితమ్ : అధిక-భూ = ఎక్కువైన (స్వస్థలమైన) భూమియందు, ఉషితమ్ = నివసించేవానిగా (వస్ ధాతువుపై క్త ప్రత్యయం-సంప్రసారణం), వ్యతనుత = చేశాడు. అంజసా = శీఘ్రంగా, అభయమ్ = భయంలేని వానినిగా, వ్యతనుత = చేశాడు.

**తా ॥** రాముడు తన పుట్టుకతో వేయివెలుగుల దొర వంశాన్ని మిక్కిలిగా వెలుగొందజేశాడు. శత్రువైన దశకంఠుని శిరస్సులను ఖండించాడు. సీత తాపాన్ని పోగొట్టి వేగంగా అభయాన్ని కల్గించాడు.

కృష్ణుడు భూసుతుడైన నరకుని బాధలకు, అతనిని సంహరించటానికీ కారణమైన శరీరాన్ని ధరించినవాడు. శత్రువులస్థితిని, కత్తులనూ, ప్రాణాలనూ కూడా ఖండించినవాడు. పడగల నాశనంచేత కలతపడిన కాళియుని మడుగులోనుండి గెంటి స్వస్థలానికి పంపిన వాడు. శీఘ్రంగా తన కాలిగుర్తులను పడగపై నిలిచి అభయాన్ని కల్పించినవాడు.

**వి :** 1. ఈ శ్లోకంలో శ్లేష వినియోగం ఎక్కువగా కనిపిస్తుంది. ఎక్కువ సభంగశ్లేష. అనగా పదాలవిరుపు ఏ అర్థానికి ఆ అర్థానికి వేరువేరుగా వుంటుంది. ఉదా॥ రామపరంగా **కలయా కులం** వేరువేరుగా వున్న రెండు పదాలు. క-లయ-ఆకులం అని మూడుపదాలుగా మారాయి. రెండూ స్వత్వాన్ని కోల్పోయాయి. '**అన్య-దశ.ఆస్య-సుఖండన**' పదం అన్య-దశా-అసి-అసు-ఖండనః అయింది. '**భూషిత**' పదం భూ+ఉషితం అయింది.

2. చతుర్థపాదంలో మాత్రం పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **వి+అతనుత :** | **వ్యతనుత** | వ్యతన్వాతామ్ | వ్యతన్వత |
| | వ్యతనుథాః | వ్యతన్వాథామ్ | వ్యతనుధ్వమ్ |
| | వ్యతన్వి | వ్యతన్వహి/వ్యతనువహి | వ్యతన్మహి/వ్యతనుమహి * |

**శ్లో॥ రుచిరభారతపుణ్యకథోదయః - శుకసుభాషణతోషణకారణః ।**
**విమలధర్మశుభస్థితికృత్ క్షితా-వయమసౌ యమసౌహృదకృన్నృణామ్ ॥ 17-22**

**అ :** కృష్ణావతారవర్ణన - వేదవ్యాసపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** రుచిర-భారత-పుణ్య-కథా+ఉదయః శుక-సుభాషణ-తోషణ-కారణః క్షితౌ నృణాం విమల-ధర్మ-శుభ-స్థితి-కృత్ యమ-సౌహృద-కృత్ అసౌ అయమ్.

**ప్ర :** రుచిర... దయః : రుచిర = ఆస్వాదనీయమైన, భారత = అర్జునునియొక్క, పుణ్య-కథా = పవిత్రగాథయొక్క (గీతోత్పత్తికి), ఉదయః = పుట్టుకకు కారణమైనవాడు, శుక... కారణః : శుక = శుకమునిలా, సుభాషణ = మంచిమాటలచే, తోషణ = ఆనందింపజేయటానికి, కారణః = కారణమైనవాడు, క్షితౌ = భూలోకంలో, నృణామ్ = మనుషులకు, విమల-ధర్మ-శుభ-స్థితి-కృత్ : విమల-ధర్మ = నిష్కలంకమైనధర్మంగల ధర్మరాజుకు, శుభ-స్థితి-కృత్ = శుభస్థితిని (రాజ్యలబ్ధిని) కలిగించినవాడు, యమ-సౌహృద-కృత్ : యమ = కవలలైన నకుల సహదేవులతో, సౌహృద-కృత్ = మైత్రి నెరపినవాడు అయిన, అసౌ = కృష్ణుడు, అయమ్ = ఈయనే (ఇప్పుడు ద్వారకలోనున్న వాడే)

**వ్యాసపరంగా :** రుచిర... దయః : రుచిర=మనోహరమైన, భారత = భారతమనే, పుణ్య-కథా = పవిత్రమైన కథావిర్భావానికి, ఉదయః = కారణమైనవాడు, శుక... కారణః : శుక = శుకమునియొక్క, సుభాషణ = మంచిమాటలే, తోషణ - కారణః = ఆనందకారణంగా గలవాడూ, క్షితౌ = భూలోకంలో, విమల... కృత్ : విమల = నిర్మలమైన, ధర్మ = ధర్మాన్ని, శుభ-స్థితి = చక్కని స్థితిని, కృత్ = కల్గించేవాడూ, నృణామ్ = మనుష్యులకు, యమ-సౌహృద-కృత్ : యమ = యమునితో, సౌహృద = మైత్రిని, కృత్ = కల్పించేవాడు అయిన, అసౌ = వ్యాసమహర్షి, అయమ్ = ఈయనే.

**తా ॥** కృష్ణుడు అర్జునునకు తాను చెప్పిన రుచిర పుణ్యకథావిర్భావానికి కారణమైనవాడు. శుకమునిలా మంచిమాటలతో ఆనందింపజేయటానికి కారణమైనవాడు. (భూలోకంలో మానవులకు నిర్మల శుభస్థితిని కల్గించేవాడు). ధర్మజునికి శుభస్థితిని కల్గించినవాడు. కవలలతో మైత్రిని నెరపినవాడు.

వ్యాసమహర్షి మహాభారతమనే పుణ్యకథయొక్క పుట్టుకకు కారణమైనవాడు. తన కొడుకైన శుకుని మంచిమాటలే ఆనందకారణంగా గలవాడు. భూలోకంలో నిష్కలంకధర్మాలనూ, శుభస్థితిహేతువులకు కలిగించినవాడు. మనుషులకు యమునితో సౌహృదాన్ని కల్పించినవాడు. (ధర్మబద్ధమైన జీవికి మృత్యుభయముండదని కవి వివక్ష. మృత్యువు వేరే. మృత్యుభయం వేరే. మృత్యువు అనివార్యం. మృత్యుభయాన్ని మాత్రం వదిలించుకోవాలి.)

**వి :** 1. శ్లోకంలో ధర్మజుని, అర్జునుని, నకులసహదేవులను ప్రస్తావించాడు కవి. భీముడు వాయుసుతుడు కాబట్టి, ముఖ్యప్రాణసుతుని విడిగా భావించివుండవచ్చు.

2. వ్యాసమహర్షి మహాభారతాన్ని ధర్మశుభస్థితికారకంగా చిత్రీకరించాడు. ధర్మంతోపాటు ఇతర పురుషార్థాలకూ అది మూలమే-

క. వేదములకు నఖిలస్మృతి - వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులను దా - మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్.

- ఆంధ్రమహాభారతము-విరాట-1/4

3. చతుర్థపాదంలోమాత్రం పాదమధ్యయమకం. *

**శ్లో॥ భువి తథాగత ఏష యథాఽమ్బరం - స్వవిదితో నవమాకృతిరాత్మనః ।**
**సకలవిత్ ఖలసఞ్చయవఞ్చకః - స్వమతిదో మతిదోషహరోఽస్తు నః ॥ 17-23**

**అ :** బుద్ధావతారవర్ణన-కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** స్వ-విత్ యథా అంబరం తథా భువి ఇతః ఆత్మనః నవమ+ఆకృతిః సకల-విత్ ఖల-సంచయ-వంచకః ఏషః స్వ-మతిదః తథాస్తగః నః మతి-దోష-హరః అస్తు.

**ప్ర :** స్వ-విత్ = తననెరిగినవాడై, యథా = ఏ రీతిగా, అంబరమ్ = ఆకాశంపై, తథా = ఆ రీతిగా, భువి = నేలపై, ఇతః = వ్యాపించిన, ఆత్మనః = పరమాత్మయొక్క, నవమ+ఆకృతిః = తొమ్మిదవ అవతారమైన వాడూ, సకల-విత్ = సర్వజ్ఞుడు, ఖల-సంచయ-వంచకః : ఖల = దుర్మార్గులయొక్క, సంచయ = సమూహానికి, వంచకః = మోసగాడూ, సు+అమతి-దః = చక్కని మిథ్యాజ్ఞానాన్ని ఇచ్చేవాడు అయిన, ఏషః = ఈ, తథాగతః = బుద్ధుడు (సర్వజ్ఞః సుగతో బుద్ధో ధర్మరాజస్తథాగతః-అమరకోశః-స్వర్గ-13), నః = మనయొక్క, మతి-దోష-హరః : మతి = బుద్ధిలోని, దోష = దోషాలను, హరః = తొలగించువాడుగా, అస్తు = నిలుచుగాక! (అస భువి అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**కృష్ణపరంగా :** యథా = ఏ రీతిగా, అంబరమ్ = ఆకాశమో, తథా = ఆ రీతిగా (నిర్లేపంగా), భువి = నేలపైకి, ఆగతః = అవతరించినవాడు, స్వ-విదితః : స్వ = తన భక్తులచే, విదితః = తెలియబడినవాడు, ఆత్మనః = పరమాత్మయొక్క, అనవమ+ఆకృతిః : అనవమ = శ్రేష్ఠమైన (శబ్దార్థకల్పతరుః-పు-77), ఆకృతిః = రూపమైనవాడు, సకల-విత్ = సర్వజ్ఞుడు, ఖల-సంచయ-వంచకః : ఖల = దుర్మార్గులయొక్క, సంచయ = సమూహానికి, వంచకుడు = మోసగాడు, స్వ-మతి-దః : స్వ = తనకు సంబంధించిన, మతి = బుద్ధిని, దః = ఇచ్చేవాడు అయిన కృష్ణుడు, నః = మనయొక్క, అమతి-దోష-హరః : అమతి = అజ్ఞానమనే, దోష = దోషాన్ని, హరః = పోగొట్టేవాడుగా, అస్తు = నిలుచుగాక!

**తా ॥** బుద్ధుడు ఆత్మజ్ఞాని. నింగినేలలపై వ్యాపించిన వాడు (మొత్తం శూన్యమన్నవాడు). పరమాత్మయొక్క తొమ్మిదవ అవతారం. సర్వజ్ఞుడు. ఖలుల గుంపులను మోసగించేవాడు. మిథ్యాజ్ఞానాన్ని అందించేవాడు. అటువంటివాడు మనమతిలోని దోషాలను హరించుగాత!

కృష్ణుడు ఆకాశంలాగా నిర్లేపుడై భూమికి అవతరించినవాడు. తనభక్తులచే తెలియబడే వాడు. పరమాత్మయొక్క శ్రేష్ఠమైన రూపం. సర్వవేత్త. ఖలులను వంచించేవాడు. తనతత్త్వాన్ని అందరికీ అందజేసేవాడు. అటువంటి కృష్ణుడు మన అజ్ఞానదోషాన్ని తొలగించుగాత!

**వి :** 1. బుద్ధునిది మాయావాదం. బౌద్ధానికి, అద్వైతానికి స్వల్పభేదమే కనిపిస్తుంది. అందుకే అద్వైతాన్ని ప్రచ్ఛన్నబౌద్ధమని కూడా వ్యవహరిస్తుంటారు. ఇక కృష్ణతత్త్వం ప్రధానంగా శరణాగతికి సంబంధించినది. అంతేకాదు. స్వతఃప్రమాణబుద్ధి మొదటిమార్గం. అది కుదరనప్పుడు శరణాగతి. ఇదే కృష్ణతత్త్వంలోని ప్రధానాంశం.

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **అస్తు :** | **అస్తు**/స్తాత్ | స్తామ్ | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ. |

*

**శ్లో॥ వితత! విష్ణుయశోజననాఞ్జసా - కృతయుగోన్నతిదాతృకరోర్జిత! ।**
**ద్విజసుహృత్కలికాననదైన్యహే-త్వసిధరాసి ధరాభయకారకః ॥ 17-24**

**అ :** కల్కివర్ణన - కృష్ణపరంగా కూడా. - ద్రుతవిలంబితమ్.

**అ :** వితత! విష్ణుయశః+జనన! అంజసా కృత-యుగ+ఉన్నతి-దాతృ-కర+ఊర్జిత! ద్విజ-సుహృత్-కలి-కానన-దైన్య-హేతు+అసి-ధర! ధరా+అభయ-కారకః అసి.

**ప్ర :** వితత! = వ్యాపించినవాడా!, విష్ణుయశః = విష్ణుయశునినుండి, జనన = పుట్టుక గలవాడా!/ విష్ణుయశునికుమారుడా! (విష్ణుయశసః జననం యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), అంజసా = అనాయాసంగా (శబ్దార్థకల్పతరుః-పు-119), కృత.. ర్జిత : కృత యుగ = కృతయుగమందలి, ఉన్నతి = ఉన్నతివంటి ఉన్నతిని, దాతృ = ఇచ్చే, కర = చేతులచే, ఊర్జిత! = బలిష్ఠుడా!, ద్విజ... ధర! : ద్విజ = బ్రాహ్మణులయొక్క, సు-హృత్ = మంచి మనస్సులలోని, కలి = కలినే/కలహమనే (ధర్మాధర్మసంఘర్షణం), కానన = అడవియొక్క, దైన్య = వినాశనానికి (దీయతే ఇతి దీనః, తస్య భావః దైన్యం, దీఙ్-ధాతువునకు క్షయమని అర్థం), హేతు = కారణమైన, అసి = కత్తిని, ధర = ధరించినవాడా!, ధరా+అభయ-కారకః : ధరా = భూమికి (భూమిమీద ప్రజకు), అభయ = అభయాన్ని, కారకః = కల్పించేవాడవుగా, అసి = ఉన్నావు. (అస భువి అదాది-పరస్మైపది-లట్-మ.ఏ.)

**కృష్ణపరంగా :** వితత-విష్ణు-యశః-జనన : వితత = వ్యాప్తమైన, విష్ణు = నారాయణుని యొక్క, యశః = కీర్తినుండియే, జనన = పుట్టుకగలవాడా! (విततస్య విష్ణోః యశసః జననం యస్య సః, తస్మాత్ సంబుద్ధిః), అంజసా-కృత... ర్జిత : అంజసా = వేగంగా, కృత = చేయబడిన, యుగ = కాడివంటి, ఉన్నతి = ఔన్నత్యంగలవాడవై, దాతృ = ఇచ్చునట్టి, కర = చేతిచే, ఊర్జిత! = బలిష్ఠుడా!, ద్విజ... కానన : ద్విజ = నక్షత్రాలకు, సుహృత్ = మిత్రుడైన చంద్రునియొక్క, కలికా = కళవంటి, ఆనన! = ముఖంగలవాడా!, దైన్య-హేతు+అసి ధర : దైన్య = (శత్రువుల) దైన్యానికి, హేతు = కారణమైన, అసి = కత్తిని, ధర = ధరించినవాడా!, ధరా+అభయ-కారకః = భూప్రజల కభయాన్ని కల్పించిన వాడవుగా, అసి = ఉన్నావు.

**తా ॥** కలీ! నీవు వ్యాప్తి నందినవాడవు. (అవతరించటానికి ముందే దాని పరిగణన జరిగిపోయింది.) విష్ణుయశుని కుమారుడవు. అనాయాసంగా కృతయుగంలోని ఔన్నత్యం వంటి ఔన్నత్యాన్ని కలిగించగల చేతులతో బలిష్ఠుడవు. బ్రాహ్మణుల మనస్సులలోని కలి అనే (ధర్మాధర్మసంఘర్షణమనే) కాననాన్ని ఖండించటానికి కారణమైన కత్తిని చేతబట్టిన వాడవు. భూమికి అభయకారకుడవు.

కృష్ణా! జగద్వ్యాప్తమైన విష్ణుకీర్తితో జనించినవాడవీవు. వేగంగా బండికాడివంటి ఔన్నత్యాన్ని, పురుషార్థాలను ప్రసాదించే చేతులతో సంపన్నుడవు. చంద్రకళవంటి ముఖంతో వెలిగేవాడవు. శత్రువుల దైన్యానికి కారణమైన కత్తిని పట్టినవాడవు. భూప్రజకు అభయమిచ్చినవాడవు.

**వి :** 1. కలి అంటే కలిపురుషుడు. ఆ కలి ప్రవేశిస్తే పతనం తప్పదని పురాణప్రతీతి. నలుని అంతటివాడు కూడా ఆ కలి ప్రభావంవలననే తన సర్వస్వాన్నీ కోలుపోయి, విరూపిగా కూడా మారాడు.

కల్కి పుట్టుకను గురించి విష్ణువు బ్రహ్మకు ఇచ్చిన మాట-

శ్లో॥ శంభలే **విష్ణుయశసో** గృహే ప్రాదుర్భవామ్యహమ్ ।
సుమత్యాం మాతరి విభో! కన్యాయాం త్వన్నిదేశతః ॥

శ్లో॥ చతుర్భిర్భ్రాతృభిర్దేవ కరిష్యామి కలిక్షయమ్ ।
భవన్తో బాంధవా దేవాః స్వాంశేనావతరిష్యథ ॥

శ్లో॥ ఇయం మమ ప్రియా లక్ష్మీః సింహలే సంభవిష్యతి ।
బృహద్రథస్య భూపస్య కౌముద్యాం కమలేక్షణా ।
భార్యాయాం మమ భార్యైషా పద్మానామ్నీ జనిష్యతి ॥ – కల్కిపురాణమ్–2/4–6

2. చతుర్థపాదంలో పాదమధ్యయమకం.

3. **అసి :** 17–10వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఇత్థం సరససల్లాపైః సంస్తువన్తః సతాం పతిమ్ ।**
**ప్రత్యహం తత్పదామ్భోజమీక్షమాణా వసన్తి తే ॥ 17–25**

**అ :** మునులు ద్వారకలోనే నివసించుట. – పథ్యావక్త్రమ్.

**అ :** ఇత్థం సరస–సల్లాపైః సతాం పతిం సంస్తువన్తః తే ప్రత్యహం తత్–పద+అమ్భోజమ్ ఈక్షమాణాః (సన్తః) వసన్తి.

**ప్ర :** ఇత్థమ్ = ఈ రీతిగా, సరస–సల్లాపైః = ఆత్మీయసంభాషణలతో(సరసాశ్చ తే సల్లాపాః తైః), సతామ్ = సజ్జనులయొక్క, పతిమ్ = ప్రభువును, సంస్తువన్తః = చక్కగా స్తుతిస్తూ, తే = ఆ మునులు, ప్రత్యహమ్ = ప్రతిదినమూ (అహని అహని), తత్–పద+అమ్భోజమ్ : తత్ = ఆ కృష్ణునియొక్క, పద+అమ్భోజమ్ = పాదపద్మాన్ని, ఈక్షమాణాః (సన్తః) = దర్శిస్తున్నవారై, వసన్తి = నివసిస్తున్నారు. (వస నివాసే పరస్మైపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ఈ రీతిగా సరససల్లాపాలతో సజ్జనప్రభువైన కృష్ణుని స్తుతిస్తూ, ప్రతిదినమూ ఆయన పాదపద్మాన్ని సందర్శించుకొంటూ మునులు ఆ ద్వారకలోనే నివసిస్తున్నారు.

**వి :** 1. మౌనవ్రతిని ముని అంటాం. మరి ఈ మునులు స్తుతిస్తున్నారు. అదీ 'సంస్తువన్తి'. అంటే మనం గ్రహించవలసిన అంశమొకటి. మౌనమంటే అసలు మాటాడకపోవటమని కాదు అర్థం. అవసరాన్ని మించి మాటాడకపోవటం మాత్రమే. నారాయణస్మరణానికి అవసరం, అనవసరం అన్న విచికిత్స లేదు. కాబట్టి నిత్యమూ నారాయణస్తుతి చేస్తూవున్నా కూడా మునిత్వానికి భంగం లేదు.

| | | | |
|---|---|---|---|
| 2. **వసన్తి :** | వసతి | వసతః | **వసన్తి** |
| | వససి | వసథః | వసథ |
| | వసామి | వసావః | వసామః. * |

**శ్లో॥ ఇహాఖిలైశ్వర్యసుభోగవృద్ధేః – పరత్ర నిఃశ్రేయససౌఖ్యసిద్ధేః ।**
**మహః పరం ద్వారమవాప్య పృథ్వ్యా–మసౌ పురీ ద్వారవతీ బభూవ ॥ 17–26**

**అ :** ద్వారవతీవర్ణన ప్రారంభం. ద్వారవతీనామవైశిష్ట్యప్రతిపాదనం. – ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ అఖిల+ఐశ్వర్య–సుభోగ–వృద్ధేః పరత్ర నిశ్శ్రేయస–సౌఖ్య–సిద్ధేః పరం ద్వారం మహః అవాప్య పృథ్వ్యామ్ అసౌ పురీ ద్వారవతీ బభూవ.

ప్ర : ఇహ = ఈ లోకంలో, అఖిలై... వృద్ధేః : అఖిల = సమస్తమైన, ఐశ్వర్య = ప్రభుత యొక్కయు, సుభోగ = మంచి భోగాలయొక్కయు, వృద్ధేః = పెరుగుదలకూ (అఖిలస్య ఐశ్వర్యస్య సుభోగానాం చ వృద్ధేః), పరత్ర = పరలోకంలో, నిఃశ్రేయస = మోక్షసంబంధమైన, సౌఖ్య = సుఖంయొక్క, సిద్ధేః = ప్రాప్తికి (నిశ్శ్రేయసి సౌఖ్యం, తస్య సిద్ధిః, తస్యాః ), పరమ్ = అత్యున్నతమైన, ద్వారమ్ = ద్వార (మార్గ)మైన, మహః = (కృష్ణరూప) తేజస్సును, అవాప్య = పొంది (అవ+ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), పృథ్వ్యామ్ = భూమిపై, అసౌ = ఈ, పురీ = నగరి, ద్వారవతీ = ద్వారంగలదిగా, బభూవ = అయింది. (భూ సత్తాయాం-భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇహలోకంలో సమస్తైశ్వరాలకూ, సుఖభోగాలకూ; పరలోకంలో మోక్షసుఖప్రాప్తికి పరమద్వారమైన కృష్ణరూపతేజస్సు అక్కడుంది కాబట్టి ఆ నగరానికి ద్వారవతీ అని పేరు వచ్చింది.

**వి :** 1. ప్రతినగరంలోనూ ద్వారాలుంటాయి కాబట్టి వాటిని కూడా ద్వారవతులనవచ్చు గదా అంటే ఇహపరప్రేయశ్శ్రేయసాధకమైన ద్వారం-అదీ తేజోరూపం మాత్రమేగాక మానుషరూపం కూడా అయివుండటం వలన- అక్కడుండటం వలన వైశిష్ట్యాన్ని బట్టి అది ద్వారవతి అయింది.

| | | | |
|---|---|---|---|
| 2. **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ యతోఽభితోఽచ్ఛస్ఫటికావదాత-లసత్కవాటాన్తరితాఽపి సేయమ్ ।**
**పురీ నృణాం ద్వారవతీవ భాతి - తతోఽపి తాం ద్వారవతీం వదన్తి ॥ 17-27**

**అ :** ఆ నగరిని ద్వారవతి అని వ్యవహరించటానికి మరొక కారణాన్ని ప్రతిపాదించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** (సా ఇయం పురీ) యతః అభితః అచ్ఛ-స్ఫటిక+అవదాత-లసత్-కవాట+అన్తరితా అపి నృణాం ద్వారవతీ ఇవ భాతి తతః అపి తాం ద్వారవతీం వదన్తి.

ప్ర : సా-ఇయమ్ = ఆ ఈ, పురీ = నగరి (ద్వారవతి), యతః = ఏ కారణంచేత, అభితః = చుట్టూ (అభితః శీఘ్రసాకల్య... నానార్థమంజరీ-పంక్తి 789), అచ్ఛ = నిర్మలమైన, స్ఫటిక = పటికపురాళ్ళచే, అవదాత = శుభ్రమై (అవదాతస్సితే పీతే శుద్ధో-అమరకోశః-నానార్థ-81), లసత్ = ప్రకాశిస్తున్న, కవాట = తలుపులచే, అన్తరితా అపి = మూయబడినా, నృణామ్ = జనులకు, ద్వారవతీ ఇవ = ద్వారం (దారి) ఉన్నట్లే, భాతి = భాసిస్తుంది. తతః = అందువలన, తామ్ = దానిని, ద్వారవతీమ్ = ద్వారవతి అని, వదన్తి = అంటున్నారు. (వద వ్యక్తాయాం-భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ఆ నగరం చుట్టూ నిర్మలమైన పటికపు రాళ్ళతో శుభ్రమైన తలుపులుంటాయి ద్వారాలకు. ఆ తలుపులను మూసినా కూడా తెరిచివున్నట్లే వుంటుంది కాబట్టి దానిని ద్వారవతి అన్నారు.

**వి :** 1. ఈ భ్రాంతి తెలుగువారికి బాగా పరిచయమైనదే. 'మయసభ'లో దుర్యోధనుని ఏకపాత్రాభినయం తెలుగు నాటకరంగంపై సుపరిచితం. దానికి మూలమైన నన్నయ వచనం-

"దాని యపూర్వరమణీయతకు విస్మితుండగుచు నయ్యయి ప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు **వివృతంబైన** ద్వారదేశంబు **సంవృతంబుగా** వగచి చొరనొల్లక, సంవృతంబైనదాని **వివృతంబుగా** వగచి **చొరంబోయి** లలాట ఘట్టిత గృహద్వారుండయి, **సమప్రదేశం బున్నతంబుగా** వగచి యెక్క సమకట్టి, నీలాశ్మరశ్మిస్థగితంబైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానంబెగఁ ద్రోచికొని, స్ఫటికదీప్తిజాలపరివృతంబైన **జలాశయంబు స్థలంబుగా** వగచి కట్టిన పుట్టంబు దడియంజొచ్చి" - మహాభారతము-సభాపర్వము-2/86

2. శ్లోకంలో భ్రాంతిమదలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **భాతి :** | **భాతి** | భాతః | భాన్తి |
| | భాసి | భాథః | భాథ |
| | భామి | భావః | భామః |
| **వదన్తి :** | వదతి | వదతః | **వదన్తి** |
| | వదసి | వదథః | వదథ |
| | వదామి | వదావః | వదామః. |

*

**శ్లో॥ యతః కవాటే వివృతేఽపి సేయం - పురీ కవాటాన్తరితేవ భాతి ।**
**హరిన్మణీనాం ప్రభయా మహత్యా - కథం ను సా ద్వారవతీతి మన్యే ॥ 17-28**

**అ :** ద్వారక ద్వారవతీత్వాన్ని నిరాకరించినట్లు వర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** సా ఇయం పురీ యతః కవాటే వివృతే అపి మహత్యా హరిత్+మణీనాం ప్రభయా కవాట+అన్తరితా ఇవ భాతి సా పురీ ద్వారవతీ ఇతి కథం మన్యే.

**ప్ర :** సా+ఇయమ్ పురీ = ఆ ఈ ద్వారక, యతః = ఏ కారణంవల్ల, కవాటే = తలుపు, వివృతే అపి = తెరవబడివున్నా, మహత్యా = అధికమైన (గొప్పదైన), హరిత్+మణీనామ్ = పచ్చలయొక్క, ప్రభయా = కాంతిచేత, కవాట+అంతరితా ఇవ = తలుపు మూసి వున్నట్లుగానే, భాతి = ప్రకాశిస్తుందో (భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సా పురీ = ఆ నగరి, కథమ్ = ఏ రీతిగా, ద్వారవతీ ఇతి = ద్వారవతి అని వ్యవహరింపబడుతుంది?, మన్యే = అని భావిస్తున్నాను. (మన్ జ్ఞానే-దివాది-ఆత్మనేపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** ద్వారవతిలో ద్వారాల తలుపులు తెరిచివున్నా హరిన్మణుల (పచ్చల) యొక్క గాఢమైన కాంతివలన ఆ తలుపులు మూసివున్నట్లే కనిపిస్తున్నాయి కాబట్టి అది ఇక ద్వారవతి ఎలా అవుతుంది? అని నేను భావిస్తున్నా.

**వి :** 1. తలుపులు తెరచివున్నా మూసివున్నట్లు కనిపించటం తలుపులలోని లోపం కాదు. ద్రష్టలలోని లోపం మాత్రమే. అందుకే అది భ్రాంతి. భ్రాంతి వుంది కాబట్టి భ్రాంతిమదలంకారం. 'మన్యే' పదం ద్వారా ఉత్ప్రేక్షాలంకారం వాచ్యమైంది. శ్లోకంలో భ్రాంతిమదలంకారం, ఉత్ప్రేక్షాలంకారం రెండూ కనిపిస్తున్నాయి.

2. **భాతి :** 17-27వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **మన్యే :** | మన్యతే | మన్యేతే | మన్యన్తే |
| | మన్యసే | మన్యేథే | మన్యధ్వే |
| | **మన్యే** | మన్యావహే | మన్యామహే. |

*

**శ్లో॥ యదీయరత్నావృతహైమవప్ర-సకాశమభ్యేత్య నివర్తతే స్మ ।**
**సముద్యతాసీన్ ప్రతిబిమ్బరాశీన్ - నిరీక్ష్య దీనా బహుశోఽరిసేనా ॥17-29**

**అ :** ద్వారవతి సంపన్నత రక్షణవిషయంలోనూ అనుకూలమై కనిపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** బహుశః అరి-సేనా యదీయ-రత్న+ఆవృత-హైమ-వప్ర-సకాశమ్ అభ్యేత్య సముద్యత+అసీన్ ప్రతిబింబ-రాశీన్ నిరీక్ష్య దీనా (సతీ) నివర్తతే స్మ.

**ప్ర :** బహుశః = చాలా సార్లు, అరి-సేనా = శత్రుసైన్యం, యదీయ... సకాశమ్ : యదీయ = ఏ నగరానికి చెందిన, రత్న = మణులతో, ఆవృత = కప్పబడిన, హైమ = సువర్ణమయమైన, వప్ర = ప్రాకారంయొక్క

సకాశమ్ = దగ్గరకు (యస్య సంబంధినః రత్నైః ఆవృతస్య హైమస్య చ తస్య వప్రస్య సకాశమ్), అభ్యేత్య = వచ్చి (అభి+ఆ–ఇ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), సముద్యత+అసీన్ = ఎత్తిపట్టిన కత్తులుగల (సముద్యతాః అసయః యైః తాన్), ప్రతిబింబ–రాశీన్ = ప్రతిబింబాల సమూహాలను (ప్రతిబింబానాం రాశయః, తాన్), నిరీక్ష్య = చూసి (నిర్–ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), దీనా (సతీ) = బెదరినదై, నివర్తతే స్మ = వెనుదిరిగింది. (ని–వృతు వర్తనే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.) **'లట్ స్మే'** (అష్టాధ్యాయి 3–1–118) సూత్రంతో భూతకాలార్థం.

**తా ॥** ద్వారకపై (దాడిచేయటానికి) శత్రుసేన అనేక పర్యాయాలు రత్నఖచితసువర్ణ ప్రాకారం దాకా వచ్చి అక్కడ కత్తి ఎత్తిపట్టిన ప్రతిబింబసమూహాలను చూసి బెదరిపోయి వెనుదిరిగింది.

**వి :** 1. రత్నాలలో ప్రతిబింబాలను చూసి వాస్తవంగా భావించి భయపడి వెనుదిరగటం భ్రాంతి. కాబట్టి భ్రాంతిమదలంకారం.

అయితే ఈ ప్రతిబింబాలు ఎవరివి? రత్నాలు పొదిగింది ప్రాకారానికి లోపలనా? వెలుపలనా? వెలుపల అయితే లోనున్న వారి ప్రతిబింబాలు కనిపించవు గదా? బయటే వుంటే సాక్షాత్తూ బింబాలే కనిపిస్తుంటే ప్రతిబింబాల ప్రసక్తి లేదుగదా! ఒకవేళ బింబాలు లోపల వుంటే బయటకు కనిపించే అవకాశమేది? అసలు అలంకరణలు బయట చేసుకొంటారు కానీ లోపల కాదు గదా!

కాబట్టి ఈ ప్రతిబింబాలు శత్రుసేనలవే. వారు బయటవున్నారు కాబట్టి వారి ప్రతిబింబాలే రత్నాలలో కనిపిస్తున్నాయి ఛాయామాత్రంగా. రత్నబాహుళ్యంచేత అనేక ఛాయా ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. అందుకని వారు బెదరిపోతున్నారు. మాయలో మన నీడను చూసి మనమే భయపడతామని కవి వివక్ష. దాన్ని వ్యంగ్యంగా వదలివేశాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **నివర్తతే :** | **నివర్తతే** | నివర్తేతే | నివర్తన్తే |
| | నివర్తసే | నివర్తేథే | నివర్తధ్వే |
| | నివర్తే | నివర్తావహే | నివర్తామహే. |

*

**శ్లో॥ ముక్తావలీరాజితసర్వగేహా – నిత్యం ప్రమోదాశనసత్సమూహా ।**
**దుష్టైరగమ్యా దయితా మురారే–ర్ముక్తిప్రభా ద్వారవతీ పురీ సా ॥ 17–30**

**అ :** ద్వారవతీ వైభవవర్ణన. – ఇంద్రవజ్ర.

**అ :** ముక్త+ఆవలీ–రాజిత–సర్వ–గేహా నిత్యం ప్రమోద+అశన–సత్–సమూహా దుష్టైః అగమ్యా మురారేః దయితా సా ద్వారవతీ పురీ ముక్తి–ప్రభా.

**ప్ర :** ముక్తా... గేహా : ముక్త = ముత్యాలయొక్క, ఆవలీ = వరుసలచే (ఆలీ శ్రేణ్యావలీ పంక్తిః–హలాయుధకోశః–721), రాజిత = వెలుగొందజేయబడిన, సర్వ = సమస్తమైన, గేహా = ఇళ్ళుగలదీ (ముక్తానామ్ ఆవలీభిః రాజితాని సర్వాణి గేహాని యస్యాం సా), నిత్యమ్ = ఎల్లప్పుడూ, ప్రమో... మూహా : ప్రమోద = ఆనందమే, అశన = ఆహారంగాగల, సత్ = సజ్జనులయొక్క, సమూహా = సమూహాలు గలదీ, (ప్రమోద ఏవ అశనం యేషాం తే చ తే సతాం సమూహాః యస్యాం సా), దుష్టైః = చెడ్డవారిచే, అగమ్యా = చేరరానిదీ, ముర+అరేః = కృష్ణునికి, దయితా = ఇష్టమైనదీ అయిన, సా = ఆ, ద్వారవతీ పురీ = ద్వారవతీ నగరి, ముక్తి–ప్రభా = ముక్తికాంతి. (ముక్తేః ప్రభా ఇవ ప్రభా యస్యాస్సా).

**తా ॥** ద్వారవతిలోని అన్ని ఇళ్ళు ముత్యాలవరుసలతో అలంకరింపబడ్డాయి. నిత్యమూ ఆనందమే ఆహారంగా సజ్జనుల సమూహాలు విలసిల్లుతుంటాయి. అది చెడ్డవారికి చొరరానిది. కృష్ణునకిష్టమైనది. అది ముక్తిస్థలమైన వైకుంఠంయొక్క కాంతివంటి కాంతి గలది.

**వి :** 1. ముక్తిప్రభా – ఇది లుప్తోపమాలంకారం. ధర్మోపమానవాచకలుప్త. అనగా సాధారణ ధర్మం, ఉపమానం, ఉపమావాచకం మూడూ లోపించాయి. ఎలా?

ముక్తేః ప్రభా ఇవ ప్రభా యస్యాః సా అని విగ్రహవాక్యం; విగ్రహవాక్యంలో 'ప్రభా' అన్న ఉపమానపదం, 'ఇవ' అన్న ఉపమావాచకం రెండూ సమాసరూపంలో కనిపించవు. లోపించాయి. అంటే ఉపమానం, ఉపమావాచకం రెండూ లోపించినట్లు. ముక్తిస్థలానికి, ద్వారవతికి సాధర్మ్యంకూడా చెప్పబడలేదు కాబట్టి ధర్మోపమానవాచకలుప్తాలంకారం.

ఒకవేళ ద్వారవతికి ప్రయోగించిన విశేషణాలను, ముక్తిస్థలానికి (వైకుంఠానికి) కూడా అన్వయింపదలిస్తే సాధారణధర్మమున్నట్లవుతుంది. అప్పుడు వాచకోపమానలుప్త అవుతుంది. *

**శ్లో॥ విచిత్రరత్నావృతవప్రసౌధ–గృహాఙ్గనాగోపురవాపికౌఘమ్ ।**
**ఇదం పురీరత్నమవాప్య నూనం – బభూవ రత్నాకరశబ్దితోఽబ్ధిః ॥ 17–31**

**అ :** సముద్రుడు రత్నాకరుడు కావటానికి ద్వారవతియే కారణమని సంభావించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** అబ్ధిః విచిత్ర–రత్న+ఆవృత–వప్ర–సౌధ–గృహ+అంగనా–గోపుర–వాపికా+ఓఘమ్ ఇదం పురీ+రత్నమ్ అవాప్య నూనం రత్నాకర–శబ్దితః బభూవ.

**ప్ర :** అబ్ధిః = సముద్రుడు (అపః ధీయన్తే అస్మిన్ ఇతి), విచిత్ర... కౌఘమ్ : విచిత్ర = రంగురంగుల, రత్న = రత్నాలచే, ఆవృత = కప్పబడిన, వప్ర = ప్రాకారాలూ, సౌధ = మేడలూ, గృహ = ఇళ్ళు, అంగనా = స్త్రీలు, గోపుర = గోపురాలు, వాపికా = దిగుడుబావులు – వీటియొక్క, ఓఘమ్ = సమూహంగలదై (విచిత్రైః రత్నైః ఆవృతాః వప్రాః సౌధాని గృహాణి అంగనాః గోపురాణి వాపికాః చ తాసామ్ ఓఘః యస్మిన్ తత్), ఇదమ్ = ఈ, పురీ–రత్నమ్ = శ్రేష్ఠనగరాన్ని (నగరరత్నాన్ని), అవాప్య = పొంది, నూనమ్ = నిశ్చితంగా, రత్నాకర–శబ్దితః = రత్నాకరుడని వ్యవహరింపబడేవాడుగా, బభూవ = అయ్యాడు.

**తా ॥** ద్వారవతిలోని ప్రాకారాలు, మేడలు, ఇళ్ళు, స్త్రీలు, గోపురాలు, దిగుడుబావులు – వీటి సమూహమంతా విచిత్రరత్నాలచే అలంకరింపబడివుంది. అటువంటి నగరరత్నం తనలో వున్నందువల్లనే సముద్రుడికి రత్నాకరుడని పేరు వచ్చింది.

**వి :** 1. **నూనమ్** పదప్రయోగం ఉత్ప్రేక్షాలంకారాన్ని వ్యక్తం చేస్తుంది. హేతువు ఊహించాడు కాబట్టి హేతూత్ప్రేక్షాలంకారం.

2. **బభూవ :** 17–26వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సముద్రముత్సృజ్య పురీం ప్రవిష్టా – బలేన ముక్తావలిరాశుగస్య ।**
**భవాబ్ధిముల్లంఘ్య మరుద్బలాప్త–వికుంఠముక్తావలివద్విరేజే ॥ 17–32**

**అ :** ద్వారవతికి ముక్తావళిశోభను వర్ణించటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** సముద్రమ్ ఉత్సృజ్య ఆశు–గస్య బలేన పురీం ప్రవిష్టా ముక్త+ఆవలిః భవ+అబ్ధిమ్ ఉల్లంఘ్య మరుద్–బల+ఆప్త–వికుంఠ–ముక్త+ఆవలివత్ విరేజే.

**ప్ర :** సముద్రమ్ = కడలిని, ఉత్సృజ్య = వీడి, ఆశుగస్య = గాలియొక్క (ఆశు గచ్ఛతి ఇతి, తస్య), బలేన = వేగంతో, పురీమ్ = నగరిలో, ప్రవిష్టా = ప్రవేశించిన, ముక్త+ఆవలిః = ముత్యాల మొత్తం (ముక్తానామ్ ఆవలిః), భవ+అబ్ధిమ్ = సంసారసాగరాన్ని (భవః ఏవ అబ్ధిః, తమ్), ఉల్లంఘ్య = దాటి, మరుద్... వత్ :

మరుద్ = ముఖ్యప్రాణునియొక్క, బల = అనుగ్రహంతో, ఆప్త = పొందిన, వికుంఠ = వైకుంఠంగల, ముక్త = ముక్తులయొక్క, ఆవలివత్ = సమూహంలాగా, విరేజే = ప్రకాశించింది. (వి-రాజ్ దీప్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ద్వారవతి పొంతనవున్న సముద్రంమీదనుండి వీచిన గాలి సముద్రంలోని ముత్యాల సమూహాన్ని బలంగా నెట్టింది. అది సముద్రాన్ని విడిచి నగరిలో ప్రవేశించింది. ఆ ముక్తావలి ముఖ్యప్రాణుని అనుగ్రహంతో భవసాగరాన్ని వీడి వైకుంఠాన్ని చేరిన ముక్తావళి (ముక్తినందిన వారి సమూహం) లాగా ప్రకాశించింది.

**వి :** 1. శ్లోకంలో ముక్తావళికి ముక్తావళితో పోలిక. ముక్త+ఆవలి (ముత్యాల మొత్తం) ఉపమేయం. ముక్తుల సమూహం ఉపమానం. సముద్రానికి సంసారంతో పోలిక. అయితే మరల భవ+అబ్ధి అని రూపకాన్ని కూడా వాడటం లౌకికప్రసిద్ధిని అనుసరించి దానిని మరువలేకపోవటం. ఉభయత్ర మరుత్ (గాలి, ముఖ్యప్రాణ) కరణం. ద్వారకకు వైకుంఠంతో పోలిక. కాబట్టి ఇది **పూర్ణోపమ**. అయితే ఉపమావాచక '**వతి**' ప్రత్యయం కాబట్టి ఆర్థి ఉపమ.

| | | | |
|---|---|---|---|
| 2. **విరేజే :** | **విరేజే** | విరేజాతే | విరేజిరే |
| | విరేజిషే | విరేజాథే | విరేజిధ్వే |
| | విరేజే | విరేజివహే | విరేజిమహే. |

*

**శ్లో॥ తరుం మదీయం నయతూచ్చమత్స్వః-పురీం న నేతుం భవతే సమర్థః ।**
**మరుత్వతేరిత ఏవ నూనం - పురీమిమాం రమ్యతమాం చకార ॥ 17-33**

**అ :** ద్వారవతి స్వర్గంకన్న రమ్యతరమని వర్ణించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** మదీయం తరుం నయతు ఉచ్చమత్-స్వః-పురీం నేతుం సమర్థః (సన్) న భవతే ఇతి మరుత్వతా ఈరితః ఏవ (కృష్ణః) ఇమాం పురీం నూనం రమ్యతమాం చకార.

**ప్ర :** మదీయమ్ = నాయొక్క, తరుమ్ = చెట్టును (పారిజాతాన్ని), నయతు = కొనిపో (నీ ప్రాపణే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), ఉచ్చ-మత్-స్వః-పురీమ్ : ఉచ్చ = ఉన్నతమైన, మత్ = నాయొక్క, స్వః-పురీమ్ = స్వర్గపురిని (అమరావతిని), నేతుమ్ = కొనిపోవటానికి (నీ ధాతువుపై తుమున్ ప్రత్యయం), సమర్థః (సన్) = సమర్థుడవై, న భవతే = పొందలేవు (భూ ప్రాప్తౌ-చురాది-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), ఇతి = అని, మరుత్వతా = ఇంద్రునిచే (ఇంద్రో మరుత్వాన్ మఘవా-అమరకోశః-స్వర్గ-41), ఈరితః ఏవ = ప్రేరేపింపబడే (కృష్ణః = కృష్ణుడు), ఇమాం-పురీమ్ = ఈ (ద్వారవతీ) నగరాన్ని, నూనమ్ = నిశ్చితంగా, రమ్యతమామ్ = పరమసుందరంగా, చకార = చేశాడు. (కృ కరణే ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఇంద్రుడు '**నా పారిజాతవృక్షాన్ని తీసికొనిపో ఉన్నతమైన నా అమరావతిని మాత్రం తీసికొని పోలేవు**' అని కృష్ణునితో అన్నాడు. ఇంద్రుడలా ప్రేరణచేసినందువల్లనే కృష్ణుడు ద్వారవతిని రమణీయతమమైన నగరంగా చేశాడు, ఇది నిశ్చితం.

**వి :** 1. పారిజాతాన్ని ఇంద్రుడు కృష్ణునికి కానుకగా ఇచ్చినట్లు భాగవతవచనం. సత్యభామ కోసం ఇంద్రునితో పోరాడి కృష్ణుడు పారిజాతాన్ని తెచ్చినట్టు మరొక ప్రసిద్ధగాథ. ఈ రెండవగాథకు సంబంధించి ఇంద్రుడు కృష్ణునితో అన్నమాటలు కావచ్చు ఇవి. ఆ ఇంద్రుని అధిక్షేపణకు సమాధానంగా కృష్ణుడు ద్వారకను పరమరమణీయంగా తీర్చిదిద్దివుండవచ్చు.

2. **భ్వాదిగణంలోని భూ ధాతువు పరస్మైపది. కానీ చురాదులలోని భూ ధాతువు స్వతహాగా పరస్మైపదమైనా కొన్నితావుల ఆత్మనేపదంగా కూడా దానికి ప్రయోగముంటుంది. ఆ మేరకు భవతే అని రూపం. ఇది ప్రాప్త్యర్థకం.**

| | | | |
|---|---|---|---|
| 3. **భవతే :** | **భవతే** | భవేతే | భవన్తే |
| | భవసే | భవేథే | భవధ్వే |
| | భవే | భవావహే | భవామహే. |

*

**శ్లో॥ అధిష్ఠితాః పోతమమూం శ్రయన్తే – స్వకార్యలాభాయ వణిక్సమూహాః ।**
**స్వరూపలబ్ధ్యై హరిపాదపోత–కృతాశ్రయాః సిద్ధజనాశ్చ దూరాత్ ॥ 17–34**

**అ :** వణిక్కులు, సిద్ధులూ ద్వారవతిని, హరిపాదాలను ఆశ్రయించటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** పోతమ్ అధిష్ఠితాః వణిక్–సమూహాః స్వ–కార్య–లాభాయ దూరాత్ అమూం శ్రయన్తే. హరి–పాద–పోత–కృత+ఆశ్రయాః సిద్ధ–జనాః చ స్వ–రూప–లబ్ధ్యై అమూం శ్రయన్తే.

**ప్ర :** పోతమ్ = నావను, అధిష్ఠితాః = ఎక్కిన, వణిక్–సమూహాః = వ్యాపారుల సమూహాలు (వణిజాం సమూహాః ), స్వ–కార్య–లాభాయ : స్వ = తమయొక్క, కార్య = వ్యాపృతిలోని, లాభాయ = లాభంకోసం (స్వేషాం కార్యం తస్మిన్ లాభాయ ), దూరాత్ = దూరంనుండీ (వచ్చి), అమూమ్ = ఈ ద్వారవతిని, శ్రయన్తే = ఆశ్రయిస్తున్నారు. హరి... శ్రయాః : హరి = కృష్ణుని, పాద = చరణమనే, పోత = నావపై, కృత = ఏర్పరచుకొన్న, ఆశ్రయాః = ఆశ్రయంగలవారైన (హరేః పాద ఏవ పోతః తస్మిన్ కృతః ఆశ్రయః యైస్తే), సిద్ధ–జనాః చ = సిద్ధులు కూడా (సిద్ధాశ్చ తే జనాశ్చ), స్వరూప–లబ్ధ్యై = ఆత్మజ్ఞానప్రాప్తికై, అమూమ్ = ఈ ద్వారవతిని, శ్రయన్తే = ఆశ్రయిస్తున్నారు. (శ్రి సేవాయామ్ ఆత్మనేపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ఓడలనెక్కి వ్యాపారవేత్తలు తమ లాభాల కోసం ద్వారవతికి చేరుతున్నారు. సిద్ధులు కూడా కృష్ణచరణమనే నావనెక్కి కృష్ణస్వరూపప్రాప్తికై ఆత్మజ్ఞానప్రాప్తికి (సారూప్యముక్తికై) ద్వారవతిని ఆశ్రయిస్తున్నారు.

**వి :** 1. వ్యాపారవేత్తలు ఐహిక ధనలాభానికీ, సిద్ధులు ఆముష్మికజ్ఞానలాభానికీ ద్వారవతిని ఆశ్రయిస్తున్నారు. అది ఉభయఫలదాయిని.

2. శ్లోకద్వితీయార్థంలో హరిపాదంలో పోతత్వారోపణం రూపకాలంకారం. వణి–క్సమూహాలకూ, సిద్ధజనాలకూ కూడా ఆశ్రయణరూపమైన ఏకధర్మాన్వయం వలన తుల్యయోగితాలంకారం. '**వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితా**' – (కు.44)

| | | | |
|---|---|---|---|
| 3. **శ్రయన్తే :** | శ్రయతే | శ్రయేతే | **శ్రయన్తే** |
| | శ్రయసే | శ్రయేథే | శ్రయధ్వే |
| | శ్రయే | శ్రయావహే | శ్రయామహే. |

*

**శ్లో॥ ఇమామధిశ్రిత్య పురీం పరత్ర – విముక్తిమేవ వ్రతినో వ్రజన్తి ।**
**పురాఽపి నాకాధికలోకభాజాం – కథం స తేషాం బహుమానపాత్రమ్ ॥ 17–35**

**అ :** ద్వారకను ఆశ్రయించిన యతులు స్వర్గాన్ని కూడా అపేక్షించరనుట. –ఉపేంద్రవజ్ర.

**అ :** వ్రతినః ఇమాం పురీమ్ అధిశ్రిత్య పరత్ర విముక్తిమ్ ఏవ వ్రజన్తి. పురా అపి నాక+అధిక–లోక–భాజాం తేషాం స కథం బహుమానపాత్రమ్ (భవతి).

**ప్ర :** వ్రతినః = యతులు, ఇమామ్ = ఈ, పురీమ్ = నగరిని (ద్వారవతిని), అధిశ్రిత్య = ఆశ్రయించి, పరత్ర = పరలోకంలో, విముక్తిమ్–ఏవ = మోక్షాన్నే, వ్రజన్తి = చేరుతున్నారు. (వ్రజ్ గతౌ పరస్మైపది–లట్–ప్ర.బ.), పురా–అపి = ముందు కూడా (ముందే), నాక... భాజామ్ : నాక = స్వర్గం కన్న, అధిక = ఎక్కువైన, లోక =

లోకాన్ని, భాజామ్ = పొందినట్టి, తేషామ్ = వారికి, సః = అది (స్వర్గం), కథమ్ = ఎట్లు, బహుమాన–పాత్రమ్ : బహుమాన = మన్నించి కోరుకొనుటకు, పాత్రమ్ = తగినదిగా (బహుమానస్య పాత్రమ్), (భవతి = కాగలదు)

**తా ॥** ద్వారవతిని ఆశ్రయించిన యతులు పరలోకంలో ముక్తినే పొందుతున్నారు. స్వర్గంకన్న మిన్న అయిన స్థానం ముందే లభించినవారికి ఇక స్వర్గంతో పని ఏముంది?

**వి :** 1. స్వర్గం పుణ్యఫలానుభవస్థానం. కాకపోతే అది నిరామయం. ప్రతిబంధకరహితం. ఇహలోకంలో కూడా సుఖానుభవమున్నా అది నిరాఘాతం కాదు. కానీ స్వర్గంలో పుణ్యం పూర్తయ్యేదాకా సుఖించవచ్చు, వేరే శరీరంతో. అక్కడ కూడా సుఖానికి కరణాలుంటాయి. కాబట్టి దాని విలువ తక్కువ. ముక్తిలో తనలో తాను ఆనందించగలగటం. ఆత్మానందం. అనన్యాపేక్షం. కాబట్టి దానిముందు స్వర్గసుఖాలు దిగదుడుపే.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **వ్రజన్తి :** | వ్రజతి | వ్రజతః | **వ్రజన్తి** | |
| | వ్రజసి | వ్రజథః | వ్రజథ | |
| | వ్రజామి | వ్రజావః | వ్రజామః. | * |

**శ్లో॥ గుణేన యస్యాః శ్రుతిసఙ్గతేన – స్వకోటిమాత్రేణ వినమ్రవక్రా ।**
**అవద్యసఞ్ఛాదనవైఖరీజ్ఞా – బభార కాశీ ధనుషోఽనుకారమ్ ॥ 17–36**

**అ :** ద్వారకావైభవవర్ణనం. – ఉపేంద్రవజ్ర.

**అ :** శ్రుతి–సంగతేన స్వ–కోటి–మాత్రేణ యస్యాః గుణేన వినమ్ర–వక్రా అవద్య–సంఛాదన–వైఖరీ–జ్ఞా కాశీ ధనుషః అనుకారం బభార.

**ప్ర :** శ్రుతి–సంగతేన : శ్రుతి = వేదంతో/చెవితో, సంగతేన = కూడినట్టి/తాకినట్టి (శ్రుత్యా సంగతః తేన), స్వ–కోటి–మాత్రేణ : స్వ = తనయొక్క, కోటి–మాత్రేణ = కేవలం (సంఖ్య) అయిన/అగ్రభాగం (కొన) అయిన, గుణేన = గుణంతో/అల్లెత్రాటితో, వినమ్ర–వక్రా = తలవాల్చినదై/వంచబడినదై (వినమ్రం వక్త్రం యస్యాః సా (యేన తత్), కాశీ = కాశీనగరి, అవ... జ్ఞా : అవద్య = దోషాన్ని, సంఛాదన = కప్పిపుచ్చుకొనే, వైఖరీ = విధానాన్ని, జ్ఞా = తెలిసినదై (అవద్యస్య సంఛాదనస్య వైఖరీం జానాతి ఇతి) (కాశీ, విల్లు కూడా), ధనుషః = వింటియొక్క, అనుకారమ్ = ఆకారాన్ని (కాశీ)/స్వరూపాన్ని (విల్లు), బభార = భరించింది/ధరించింది. (భృ భరణే–భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** ద్వారవతి వేదసమన్వితగుణాలు కోటికిపైగా కలది. అందువల్ల కాశీపురి తనకన్న ద్వారవతి కోటి ప్రమాణమైన గుణాలతో అధికమైనదని భావించి తలవాల్చింది దానిముందు. అంతేగాదు తనను సేవించేవారి పాపాలను పోగొడుతూ దోషాలను కప్పిపుచ్చే పద్ధతిని కూడా నేర్చింది. తాను ధనురాకారాన్ని పొందింది.

విల్లుకూడా చెవిదాకా లాగబడిన అల్లెత్రాడు గలదై కొనలు వంగి నమ్రీభావాన్ని పొందింది. అందుకే ఆ లక్షణానికి అనుగుణంగా ధనుస్స్వరూపాన్ని పొందింది.

**వి :** 1. శ్లోకంలో ధనుస్స్వరూపాన్ని పొందిందని ద్వారవతీ వైభవవర్ణనం ప్రధానాంశం. అయితే గుణశ్రుతి–కోటి పదాలకున్న రెండు అర్థాల కారణంగా వాచ్యార్థం నియంత్రితమైన తరువాత రెండో అర్థం – వింటికి సంబంధించినది – స్ఫురించటం శబ్దశక్తిమూలధ్వని. ఆ ధ్వనిద్వారా కాశీకి, వింటికి పోలిక ధ్వనిస్తుంది. అందువల్ల ఇది శబ్దశక్తిమూల అలంకారధ్వని.

2. ద్వారకను మచ్చుగా తీసికొని వర్ణించటం అక్కడక్కడా కావ్యాలలో కనిపిస్తుంది. ఇంద్రప్రస్థాన్ని వర్ణిస్తూ చేమకూర వేంకటకవి....

ఉ. ద్వారకముద్దు చెల్లెలంట తన్నగరీమణి సృష్టి యన్నిటం
దీరుగడైనచో నిదియ నేర్పుల మేరని యెంచి చేసెఁ బో
ధారుణి విశ్వకర్మ మఱి దానికి నెక్కడ నీడు లేని సిం
గారము గల్గుటందు వెనుకన్ సృజియింపక యుండుటే సుమీ! – విజయవిలాసము

| | | | |
|---|---|---|---|
| 3. **బభార :** | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ. |

*

**శ్లో॥ సుధర్మపుఞ్జావనమూలభూత-మిహాచ్యుతం వీక్ష్య కృతాధివాసమ్ ।**
**సభాం సుధర్మాం ప్రదదౌ పురీవత్ - స్వసంసదత్యుచ్చసభాభియేవ ॥ 17-37**

**అ :** ద్వారవతికి ఇంద్రుడు సుధర్మను ఇవ్వటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** సుధర్మ-పుంజ+అవన-మూల-భూతమ్ అచ్యుతమ్ ఇహ కృత+అధివాసం వీక్ష్య పురీవత్ స్వ-సంసద్-అతి+ఉచ్చ-సభా-భియా ఇవ సుధర్మాం సభాం ప్రదదౌ.

**ప్ర :** (ఇంద్రః = ఇంద్రుడు), సుధర్మ... భూతమ్ : సుధర్మ = మంచి ధర్మాలయొక్క, పుంజ = సమూహంయొక్క, అవన = రక్షణయొక్క, మూల-భూతమ్ = కారణమైన (సుధర్మాణామ్ పుంజస్య అవనే మూలభూతః, తమ్), అచ్యుతమ్ = కృష్ణుని, ఇహ = ఇక్కడ – ద్వారకలో, కృత+అధివాసమ్ = నివసిస్తున్న వానిని (కృతః అధివాసః యేన తమ్), వీక్ష్య = చూసి, పురీవత్ = నగరంలాగే, స్వ... భియా-ఇవ : స్వ = తనయొక్క, సంసద్ = సభకన్న, అతి+ఉచ్చ = బాగా గొప్పదైన, సభా = సభ ఏర్పడుతుందన్న, భియా-ఇవ = భయంచేతనో అన్నట్లు (స్వస్య సంసద్, తస్యాః అత్యుచ్చా చ సా సభా, తస్యాః భీః, తయా ఇవ), సుధర్మామ్ = సుధర్మ మనే, సభామ్ = సభను, ప్రదదౌ = ఇచ్చాడు. (ప్ర దా దానే భ్వాది-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** సుధర్మసమూహసంరక్షణకు కారణమైన వాడు కృష్ణుడు. తానిప్పుడు ద్వారకలో నివసిస్తున్నాడు. అది చూసి ఇంద్రుడు భయపడ్డాడు. ఎందుకంటే అప్పటికే ద్వారక అమరావతిని మించిపోయింది. కృష్ణుని సభ కూడా తన సభను మించి పోతుందేమో అని ఇంద్రుని భయం. ఆ భయంతోనో అన్నట్లు ఇంద్రుడు తన సుధర్మ (సభా భవనం) ను కృష్ణుని కిచ్చాడు.

**వి :** 1. ధర్మం మనస్సు-వాక్కు-చేష్టలతో ముడిపడి వుంటుంది. వీటితో దేనితోనూ సంబంధంలేకుండా ధర్మం నిలువలేదు. అర్థకామాలు త్రికరణశుద్ధితో ధర్మంతో బంధాన్ని పొందుతాయి. అందుకే 'విహిత**కర్మజన్యః** ధర్మః' అని తార్కికులు ధర్మాన్ని నిర్వచిస్తారు. విహితకర్మయే ధర్మం అని స్థూలంగా ధర్మనిర్వచనం కాబట్టి సత్కర్మ సంరక్షకుడు కృష్ణుడు.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ – భగవద్గీత – 4/8

అని ధర్మసంస్థాపన తన లక్ష్యమని కృష్ణుడు ప్రకటించాడు. దానికి తగిన సమయాన్ని కూడా తానే నిర్దేశించాడు.

శ్లో॥ యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత! ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥ – భగవద్గీత – 4/7

కృష్ణుడు అవతరించిన సర్వసన్నివేశాలలోనూ సాధుపరిత్రాణం, దుష్టవినాశనం తదుభయఫలరూపంగా ధర్మసంస్థాపనం – ఈ లక్షణాలే కనిపిస్తాయి.

2. శ్లో॥ సుధర్మాం పారిజాతం చ మహేంద్రః ప్రాహిణోద్ధరేః ।
యత్ర చావస్థితో మర్త్యో మర్త్యధర్మైర్న యుజ్యతే ॥ – భాగవతమ్ 10/50/55

ఇంద్రుడు సుధర్మనూ, పారిజాతాన్నీ కూడా కృష్ణునకిచ్చాడు. తన భయం తనది. భయానికి కారణం శ్లోకంలోని రెండవపాదంలో కనిపిస్తుంది. అక్కడి మర్త్యుడు మర్త్యధర్మాలతో వుండడట. ఇక దేవదానవ ధర్మాలలో ఒకటుండాలి. ఏదైనా ఇంద్రుడి కిబ్బందియే. అందుకే సుధర్మ రక్షకుడైన కృష్ణునికి ముందుగానే సుధర్మనిచ్చాడు.

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రదదౌ :** | ప్రదదౌ | ప్రదదతుః | ప్రదదుః |
| | ప్రదదిథ/ప్రదదాథ | ప్రదదథుః | ప్రదద |
| | ప్రదదౌ | ప్రదదివ | ప్రదదిమ. |

*

**శ్లో॥ పురీమగమ్యాం పరిఖీకృతాబ్ధిం – నిశమ్య కృష్ణస్య నిరూఢచిన్తః ।**
**స మాగధోఽభూదిహ యోగ్యనామా – క్రమాజ్జరాసంహితగాత్రసీమా ॥ 17–38**

**అ :** ద్వారకపటిష్ఠత తెలిసి జరాసంధుడు సార్థకనామధేయుడు కావటం. – ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ పరిఖీకృత+అబ్ధిమ్ అగమ్యాం కృష్ణస్య పురీం నిశమ్య నిరూఢ–చిన్తః సః మాగధః క్రమాత్ జరా–సంహిత–గాత్ర–సీమా యోగ్య–నామా అభూత్.

**ప్ర :** ఇహ = ఇక్కడ (ఈ నూతన నిర్మాణంలో), పరిఖీకృత+అబ్ధిమ్ : పరిఖీకృత = అగడ్తగా చేయబడిన (అపరిఖా పరిఖా సంపన్నా–'**కృభ్వస్తియోగే సంపద్య కర్తరి చ్విః**' – (అష్టాధ్యాయి 5–4–50) 'అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్' – వార్తికం (3340), అబ్ధిమ్ = సముద్రంగలదీ (పరిఖీకృతః అబ్ధిః యయా తమ్), అగమ్యామ్ = (అందువలననే) చొరరానిదీ అయిన, కృష్ణస్య = కృష్ణునియొక్క, పురీమ్ = నగరిని (ద్వారవతిని) గూర్చి, నిశమ్య = విని, నిరూఢ–చిన్తః : నిరూఢ = (మనస్సులో) నాటుకొన్న, చిన్తః = వేదన కలవాడై (నిరూఢా చిన్తా యస్మిన్ సః), సః = ఆ, మాగధః = మాగధుడు (జరాసంధుడు), క్రమాత్ = కాలం గడిచే కొద్దీ, జరా... సీమా:జరా = ముసలితనంతో, సంహిత = కూడిన, గాత్ర–సీమా = శారీరకమర్యాదలు గలవాడై (జరయా సంహితం గాత్రస్య సీమ యస్య సః), యోగ్య–నామా = సార్థకనామధేయుడుగా (అర్థమును అన్వర్థం, తచ్చ తత్ నామ యస్య సః), అభూత్ = అయ్యాడు. (భూ సత్తాయామ్ భ్వాది–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** ద్వారకకు సముద్రమే అగడ్త. అందువల్ల అది ఇతరులకు చొరరానిది. ఆ విషయం తెలిసిన జరాసంధునిలో వేదన నెలకొన్నది. ఆ వేదనతో క్రమంగా వార్ధక్యం ఆయన శరీరంలో చొరబడింది. సంధిబంధాలు శిథిలమయ్యాయి. జరాసంధుడన్న పేరు సార్థకమైంది.

**వి :** 1. జరాసంధత్వం జరాసంధుడికి నైసర్గికం. అయితే అది చింత కారణంగా ఏర్పడిందని కారణసంభావన చేసినందువల్ల **హేతూత్ప్రేక్ష** ధ్వనిస్తుంది. జరాసంధత్వం వయోధర్మం. చింతకు దానికి సంబంధంలేదు. అయినా సంబంధాన్ని కల్పించినందువల్ల ఇది సంబంధాతిశయోక్తి. జరాసంధత్వం పుట్టుకతోనే సిద్ధించినదైనా ఇప్పుడు అది నిజంగా జరాసంహితత్వమైనదని విధించటం విధ్యలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవన్ | అభూవ | అభూమ. |

*

**శ్లో॥ సితానులేపామ్బరమాల్యహారాః – శుచిస్మితా వారవధూర్వ్రజన్తీః ।**
**ఇహోదితేన్దుద్యుతితోఽతిరిక్తా – న యామికా లక్షయితుం క్షమన్తే ॥ 17–39**

**అ :** అభిసారికాగమన వర్ణన. – ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ యామికాః సిత+అనులేప+అంబర-మాల్య-హారాః శుచి-స్మితాః వ్రజన్తీః వార-వధూః ఉదిత+ఇన్దు-ద్యుతితః అతిరిక్తాః లక్షయితుం న క్షమన్తే.

**ప్ర :** ఇహ = ఈ ద్వారకలో, యామికాః = పహర వేయువారు (శబ్దార్థకల్పతరుః-పుట-1210), సితా.. హారాః : సిత = తెల్లని, అనులేప = మైపూతలూ, అంబర = బట్టలూ, మాల్య = పూలమాలలూ, హారాః = ముత్యాలసరాలూ గలవారూ (సితాః అనులేపాః అంబరాణి మాల్యాని హారాశ్చ యాసాం తాః), శుచి-స్మితాః : శుచి = శుభ్రమైన, స్మితాః = చిఱునవ్వులు గలవారూ (శుచీని స్మితాని యాసాం తాః), వ్రజన్తీః = వెళ్తున్నవారైన (అభిసరిస్తున్నవారు), వార-వధూః = వారకాంతలను, ఉదిత+ఇందు-ద్యుతితః : ఉదిత = ఉదయించిన, ఇందు-ద్యుతితః = చంద్రుని కిరణాల నుండి (ఉదితాః చ తాః ఇందోః ద్యుతయః తతః), అతిరిక్తాః = వేరైన వారినిగా (భిన్నలనుగా), లక్షయితుమ్ = గుర్తించటానికి, న క్షమన్తే = సమర్థులు కారు. (క్షమ్ సహనే-భ్వాది-ఆత్మనేపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ద్వారకలోని వారకాంతలు తెల్లని మైపూతలతో, వస్త్రాలతో, పూలమాలలతో, ముత్యాలహారాలతో చిఱునవ్వులు చిందిస్తూ అభిసారికలై వెళ్తుంటే అక్కడి రాత్రిపూట పహరా (కాపలా) వేసేవారు చంద్రకిరణాలు విస్తరించిన తరువాత వాటి నుండి వీరిని వేరుచేసి గుర్తించలేకపోతున్నారు.

**వి :** 1. ఇక్కడ కాంతలలో అభిసారికాలక్షణాలనూ, వారకాంతా లక్షణాలను కూడా ప్రదర్శించాడు.

అభిసారిక తప్పని సరిగా వారకాంత కావలసిన అవసరం లేదు. కులస్త్రీ అయినా కావచ్చు.

భరతుడు నాట్యశాస్త్రంలో-

శ్లో॥ వేశ్యాయాః కులజాయాశ్చ ప్రేష్యాయాశ్చ ప్రయోక్తృభిః ।
ఏభిర్భావవిశేషైస్తు కర్తవ్యమభిసారణమ్ ॥

శ్లో॥ సమదా మృదుచేష్టా చ తథా పరిజనావృతా ।
నానాభరణచిత్రాంగీ గచ్ఛేద్వేశ్యాంగనా శనైః ॥ ...

శ్లో॥ గత్వా సా చేద్యదా తత్ర పశ్యేత్సుప్తం ప్రియం తదా ।
అనేన తూపచారేణ తస్య కుర్యా త్ప్రబోధనమ్ ॥

శ్లో॥ అలంకారేణ కులజా వేశ్యా గంధైస్తు శీతలైః ।
ప్రేష్యా తు వస్త్రవ్యజనైః కుర్వీత ప్రతిబోధనమ్ ॥

-నాట్యశాస్త్రమ్-22/226-227,230,231

ఈ శ్లోకంలోని నాయిక వారకాంత, అభిసారిక.

అభిసారికలలో మూడు భేదాలు. తమోభిసారిక, జ్యోత్స్నాభిసారిక, దివసాభిసారిక. పగటిపూట ప్రియునికై బయలుదేరితే దివసాభిసారిక. చీకటిలో బయలుదేరితే తమోభిసారిక. వెన్నెలలో బయలుదేరితే జ్యోత్స్నాభిసారిక. రాత్రి బయలుదేరిన కాంత ఆనాటి వాతావరణానికి (చీకటి వెన్నెలలకు) తగినట్లుగా తన్ను తాను తీర్చుకోవాలి.

శ్లో॥ మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియమ్ ।
**జ్యోత్స్నాతమస్వినీయానయోగ్యాంబరవిభూషణా** ॥
స్వయం వాభిసరేద్యాతు సా భవేదభిసారికా ॥ -రసార్ణవసుధాకరః-1/134,135.

ప్రకృతశ్లోకంలోని నాయిక జ్యోత్స్నాభిసారిక కాబట్టి సితానులేపాంబరమాల్యహారయై వెళ్తోంది.

| | | | |
|---|---|---|---|
| 2. **క్షమన్తే :** | క్షమతే | క్షమేతే | **క్షమన్తే** |
| | క్షమసే | క్షమేథే | క్షమధ్వే |
| | క్షమే | క్షమావహే | క్షమామహే. |

*

**శ్లో॥ కావ్యోచితశ్లోకమపేక్షమాణా - విచారయన్తీహ పదే పదేఽర్థాన్ ।**
**విద్వజ్జనానన్దకరాన్ మనోజ్ఞా - బుధా వదాన్యాశ్చ పురే మురారేః ॥ 17-40**

**అ :** ద్వారకలోని విద్వజ్జనవర్ణన. - ఉపజాతి (1,3 ఇంద్రవజ్ర. 2-4 ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ ముర+అరేః పురే మనః+జ్ఞాః బుధాః వదాన్యాః చ కావ్య+ఉచిత-శ్లోకమ్ అపేక్షమాణాః (సన్తః) పదే పదే విద్వత్-జన+ఆనంద-కరాన్ అర్థాన్ విచారయన్తి.

**ప్ర :** ఇహ = ఇక్కడ, ముర+అరేః = కృష్ణునియొక్క, పురే = నగరమందు, మనః+జ్ఞాః = (ఇతరుల) మనసెరిగిన, బుధాః = పండితులు/కవులు, వదాన్యాః చ = దాతలు కూడా (వదన్తి దాస్యామః ఇతి వదాన్యాః - వద ధాతువుపై '**వదేరాన్యం**' (ఉణాది-622) సూత్రంచే ఆన్య ప్రత్యయం), కావ్య... కమ్ : కావ్య = కావ్యానికి, ఉచిత = తగినట్టి, శ్లోకమ్ = శ్లోకాన్ని/కీర్తిగల నాయకుని (కావ్యస్య ఉచితశ్చ అసౌ శ్లోకః తమ్/కావ్యస్య ఉచితః శ్లోకః యస్య తమ్), అపేక్షమాణాః (సన్తః) = వెదుకుతున్నవారై, విద్వత్... కరాన్ : విద్వత్+జన = పండితజనానికి, ఆనంద-కరాన్ = ఆనందాన్ని కల్గించే (విద్వాంసః చ తే జనాః విద్వజ్జనాః, తేషామ్ ఆనందం కుర్వన్తీతి, తాన్), అర్థాన్ = అర్థాలను, పదే పదే = ప్రతిపదంలోనూ/ఎల్లప్పుడూ, విచారయన్తి = ఆలోచిస్తున్నాయి (వి-చర భక్షణయోః -భ్వాది-ణిచ్-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ద్వారకలోని కవులూ, దాతలూ కూడా పరుల మనస్సుల నెరిగినవారు. కావ్యానికి తగిన శ్లోకాలను అన్వేషిస్తూ కవులూ, వర్ణింపదగిన కీర్తిగలవారిని వెదుకుతూ వదాన్యులూ కూడా పండితజనాలకు ఆనందాన్ని కల్గించగల అర్థాలను/ద్రవ్యాలను ప్రతి పదంలోనూ/అన్ని వేళలా, అన్నీ తావులా ఆలోచిస్తున్నారు.

**వి :** 1. కావ్యరచనవేళలో పదాల ఎంపిక ఒక ప్రధానమైన విషయం. వామనుడు '**కావ్యాలంకారసూత్ర**' గ్రంథంలో అవేక్షణాన్ని కావ్యాంగంగా చెప్పాడు. సోదాహరణంగా వివరించాడు కూడా. (కావ్యాంగాలు మూడు. లోకం, విద్య, ప్రకీర్ణం. ప్రకీర్ణాలలో ఒకటి అవేక్షణం)

**పదాదానోద్ధరణమవేక్షణమ్** ॥

అత్ర శ్లోకా :

శ్లో॥ ఆధానోద్ధరణే తావత్ యావద్దోలాయతే మనః ।
పదస్య స్థాపితే స్థైర్యే హన్త సిద్ధా సరస్వతీ ॥

శ్లో॥ యత్పదాని త్యజంత్యేవ పరివృత్తి సహిష్ణుతామ్ ।
తం శబ్దన్యాసనిష్ణాతాః శబ్దపాకం ప్రచక్షతే ॥ - కావ్యాలంకారసూత్రాణి-1/3/15

తగినపదాన్ని - మార్చటాన్ని సహించని పదాన్ని - ప్రయోగించగలగటం శబ్దపాకం. పదవిషయంలో మనస్సు సంశయిస్తున్నంతసేపు ఉత్తమశ్లోకరచన కుంటుపడుతుంది.

వదాన్యులు ఉత్తముని కోసం అన్వేషించటం మటువంటిదే. వాల్మీకి అంతటి వాడు కూడా ఆ విషయమై నారదునితో విచారణ చేశాడు.

కావ్యరచనలో ఎన్నుకొనవలసిన పదాల విలువలను పింగళి సూరన చక్కగా వివరించాడు.

**లయవిభాతి-**

చలువగల వెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను సౌరభము చలువయుఁ దలిర్పం
బొలుపెసఁగు కప్పరపుఁ బలుకులకుఁ గోమలత నెలకొనిన సౌరభము చలువపసయుం గో

మలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు మలయ పవనంపుఁ గొదమలకు మధురత్వం
బలవడిన నీడు మతి కలదనఁగ వచ్చుఁ గడువెలయఁ గలయాసుకవి పలుకులకు నెంచన్.

–కళాపూర్ణోదయము – 1/82

| | | | |
|---|---|---|---|
| 2. **విచారయన్తి :** | విచారయతి | విచారయతః | **విచారయన్తి** |
| | విచారయసి | విచారయథః | విచారయథ |
| | విచారయామి | విచారయావః | విచారయామః. |

*

**శ్లో॥ యదఙ్ఘ్రితీర్థేన యదీయనామ్నో – బలేన కాశీ ప్రథితా కిలాసీత్ ।**
**మురద్విషస్తస్య నివాసభూతా – పురీ త్రిలోక్యామియమద్వితీయా ॥ 17-41**

**అ :** కృష్ణనివాసకారణంగా ద్వారకకు అద్వితీయత్వవర్ణన. – ఉపేంద్రవజ్ర.

**అ :** యద్–అంఘ్రి–తీర్థేన యదీయ–నామ్నః బలేన కాశీ ప్రథితా ఆసీత్ కిల, తస్య ముర–ద్విషః నివాస–భూతా ఇయం పురీ త్రి–లోక్యామ్ అద్వితీయా (అస్తి).

**ప్ర :** యద్–అంఘ్రి–తీర్థేన : యద్ = ఎవనియొక్క, అంఘ్రి–తీర్థేన = పాదతీర్థంతో (గంగానదితో), యదీయ–నామ్నః : యదీయ = ఎవనియొక్క, నామ్నః = పేరుయొక్క, బలేన = బలంతో (కాశిలో ముక్తికి రామనామోపదేశమే కారణమని ప్రతీతి. రామనామం కృష్ణనామమే), కాశీ = కాశీనగరి, ప్రథితా = ప్రసిద్ధమైనదిగా, ఆసీత్ కిల = అయిందో, తస్య = ఆ, మురద్విషః = కృష్ణునికి, నివాస–భూతా = నివాసమైన (నివాసాయ భూతా), ఇయం పురీ = ఈ ద్వారవతి, త్రిలోక్యామ్ = మూడులోకాలలో, అద్వితీయా = సాటిలేనిది. (నాస్తి ద్వితీయా యస్యాః సా).

**తా ॥** కృష్ణుని పాదంనుండి పుట్టిన గంగచేత, కృష్ణసంబద్ధమైన రామనామంచేత కాశీపురి ప్రసిద్ధమైంది. అటువంటి కృష్ణునికి నివాసస్థానమైన ద్వారవతి మూడులోకాలలోనూ సాటిలేనిది కదా?

**వి :** 1. విశ్వేశ్వరుడు కూడా తారకమంత్రాన్నే జపిస్తుంటాడు. అందువల్ల రాముడు రామేశ్వరంలో శివప్రతిష్ఠచేశాడు.

శ్లో॥ యం ధ్యాయన్ తారకబ్రహ్మమంత్రం జపతి ధూర్జటిః ।
అథోత్తారాయ కాకుత్స్థః పూజయామాస తం కిల ॥ – తీర్థప్రబంధం–దక్షిణ–23

| | | | |
|---|---|---|---|
| 2. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ. |

*

**శ్లో॥ చలద్భ్రువశ్చఞ్చలనేత్రపాతై–ర్జనాన్ సమానాన్ వశయన్తి తస్యామ్ ।**
**స్మరోచ్చలత్కార్ముకలగ్ననీలో–త్పలేషుఘాతైరివ వారవధ్వః ॥ 17-42**

**అ :** ద్వారకలోని వారవనితల వర్ణన. – ఉపేంద్రవజ్ర.

**అ :** తస్యాం చలద్–భ్రువః వార–వధ్వః సమానాన్ జనాన్ చంచల–నేత్ర–పాతైః స్మర+ఉచ్చలత్–కార్ముక–లగ్న–నీల+ఉత్పల+ఇషు+ఘాతైః ఇవ వశయన్తి.

**ప్ర :** తస్యామ్ = ఆ ద్వారవతియందు, చలద్–భ్రువః : చలద్ = కదులుతున్న, భ్రువః = కనుబొమలుగల (చలన్త్యః భ్రువః యాసాం తాః), వార–వధ్వః = వారకాంతలు (వారాశ్చ తాః వధ్వః – వారశబ్దవరణీయార్థకం–హలాయుధకోశః–పు–603), స–మానాన్ = అభిమానవంతులయిన (మానేన సహితాః, తాన్), జనాన్ =

ప్రజలను, చంచల–నేత్ర–పాతైః : చంచల = నిలకడలేని, నేత్ర–పాతైః = (కంటి) చూపులతో (చంచలాని చ తాని నేత్రాణాం పాతాని), స్మరో... ఘాతైః ఇవ : స్మర = మదనునియొక్క, ఉచ్చలత్ = కదులుతున్న, కార్ముక = వింటిపై, లగ్న = సంధించిన, నీల+ఉత్పల = నల్లకలువ లనే, ఇషు = బాణాలయొక్క, ఘాతైః ఇవ = దెబ్బలచేతనో అన్నట్లు, వశయన్తి = లోగొంటున్నారు. (వశ కాన్తౌ–ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ద్వారకలోని వెలయాండ్రు కనుబొమలు కదిలిస్తూ తమ లోలాపాంగవీక్షణాలతో అభిమానవంతులైన ప్రజలను కూడా మదనుడు తన కార్ముకంపై సంధించి విడిచిన నల్లకలువ లనే బాణాల దెబ్బలచేతనో అన్నట్లు లొంగదీసికొనగలుగుతున్నారు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. వశయన్తి :** | వశయతి | వశయతః | **వశయన్తి** |
| | వశయసి | వశయథః | వశయథ |
| | వశయామి | వశయావః | వశయామః. * |

**శ్లో॥ స్వగోపురౌఘైరియమున్మయూఖై–ర్దివం వ్యతీయాయ న తద్విచిత్రమ్ ।**
**ముకున్దమన్తర్హృది ధారయన్త్యా – విచిత్రతీర్థాని చ సంస్పృశన్త్యాః ॥ 17-43**

**అ :** స్వర్గాన్ని అంటుతున్న పురీగోపురకిరణవర్ణన. – ఉపేంద్రవజ్ర.

**అ :** ఇయమ్ ఉత్+మయూఖైః స్వ–గోపుర+ఓఘైః దివం వ్యతీయాయ. ముకున్దమ్ అంతః+హృది ధారయన్త్యాః విచిత్ర–తీర్థాని సంస్పృశన్త్యాః తద్ విచిత్రం న.

**ప్ర :** ఇయమ్ = ఈ ద్వారక, ఉత్+మయూఖైః = పైకి ప్రసరిస్తున్న కిరణాలు గల, స్వ–గోపుర–ఓఘైః = తన గోపురసమూహాలతో, దివమ్ = స్వర్గాన్ని, వి+అతి+ఇయాయ = మించిపోయింది. (వి–అతి+ఇ గతౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), ముకున్దమ్ = కృష్ణుని (ముకుం దదాతి ఇతి), అంతః హృది = మనస్సులో, ధారయన్త్యాః = ధరిస్తున్నదీ, విచిత్ర–తీర్థాని = విచిత్రతీర్థాలను (విచిత్రాణి చ తాని తీర్థాని తాని), సంస్పృశన్త్యాః = తాకుతున్నదీ–అయిన ద్వారకకు, తత్ = ఆ మించిపోవటం, న విచిత్రమ్ = ఆశ్చర్యకరం గాదు.

**తా ॥** ద్వారవతి పైకి ప్రసరిస్తున్న కాంతులుగల గోపురసమూహాలతో స్వర్గాన్ని దాటిపోయింది. అవును మరి. మనస్సులో ముకుందుని నిలుపుకొని విచిత్రతీర్థాలను స్పృశిస్తున్న అది అలా స్పృశించటంలో ఆశ్చర్యమేముంది.

**వి : 1.** ముకుందపద మిక్కడ సాభిప్రాయవిశేష్యం. ముకుందుడంటే మోక్షమిచ్చేవాడు. మోక్షమిచ్చేవాడు మనస్సులోనే వున్నపుడు స్వర్గాన్ని దాటిపోవటంలో ఆశ్చర్యమేముంది? సాభిప్రాయవిశేష్యప్రయోగంవల్ల పరికరాంకురాలంకారం. "**సాభిప్రాయవిశేష్యే తు భవేత్పరికరాంకురః**" – (కు.63)

గోపురకాంతులకు స్వర్గాన్ని అతిక్రమించటంతో సంబంధంలేకపోయినా అతిక్రమిస్తున్నట్లు వర్ణించటంవలన సంబంధాతిశయోక్తి అలంకారం కూడా. "**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్.**" – (కు.39)

శ్లోకంలోని పూర్వార్ధం అతిశయోక్తిగా భాసించినా ఆ భావాన్ని వాస్తవికంగా ఆలోచిస్తే దానికి సమర్థన అవసరమవుతోంది. ఉత్తరార్ధం ఆ సమర్థనను అందిస్తుంది. కాబట్టి అది కావ్యలింగాలంకారం. "**సమర్థనీయస్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్**" – (కు.121)

| | | | |
|---|---|---|---|
| 2. **వ్యతీయాయ** : | **వ్యతీయాయ (వి+అతి+ఇయామ్)** | వ్యతీయతుః | వ్యతీయుః |
| | వ్యతీయియథ/వ్యతీయేథ | వ్యతీయథుః | వ్యతీయ |
| | వ్యతీయాయ/వ్యతీయయ | వ్యతీయివ | వ్యతీయిమ. * |

శ్లో॥ పుష్పీకృత్య శరాసనం రతిపతేః పఞ్చత్వభాజః శరాం-
స్తత్సేనామబలాం విధాయ సచివం తూష్ణీం వసన్తం క్వచిత్ ।
తన్మిత్రం క్షయభాజనం తదనుగాన్ మాధుర్యధుర్యాన్ గిరాఽ
నఙ్గీకృత్య చ తం జనోఽత్ర చరతి బ్రహ్మాస్త్రవాన్ ప్రత్యహమ్ ॥ **17-44**

అ : ద్వారవతి యందలి జనం మదనుని జయించిన తీరును వర్ణించుట. – శార్దూలవిక్రీడితమ్

అ : రతి–పతేః శర+ఆసనం పుష్పీకృత్య శరాన్ పంచత్వ–భాజః విధాయ తత్–సేనామ్ అబలాం విధాయ సచివం క్వచిత్ తూష్ణీం వసన్తం విధాయ, తత్–మిత్రం క్షయ–భాజనం విధాయ, తద్–అనుగాన్ గిరా మాధుర్య–ధుర్యాన్ విధాయ తమ్ అనంగీకృత్య చ అత్ర జనః ప్రత్యహం బ్రహ్మాస్త్రవాన్ చరతి.

ప్ర : రతి–పతేః = మదనునియొక్క (రత్యాః పతిః, తస్య), శర+ఆసనమ్ = వింటిని (శరస్య ఆసనమ్), పుష్పీకృత్య = పూవుగా చేసి (మదనుడు వాస్తవంగా పుష్పధన్వుడే) (అపుష్పం పుష్పం సంపద్యతే తత్ తథా కృత్వా), శరాన్ = బాణాలను, పంచత్వ–భాజః : పంచత్వ = అయిదుగా వుండటాన్ని/మరణించటాన్ని, భాజః = పొందిన వానినిగా, విధాయ = చేసి (మదనుడు పంచబాణుడే కదా!), తత్–సేనామ్ = ఆ మదనుని సేనను, అబలామ్ = స్త్రీనిగా/ బలహీనమైనదిగా, విధాయ = చేసి (మదనుని సేన అబలయే ప్రధానంగా), సచివమ్ = మంత్రిని, క్వచిత్ = ఎక్కడో, తూష్ణీమ్ = గమ్మున (ఏ పనీ లేకుండా, వేగంగా), వసన్తమ్ = వసించేవానినిగా/వసంతునిగా, విధాయ = చేసి, తత్+మిత్రమ్ = అతని మిత్రుడైన చంద్రుని (తస్య మిత్రమ్), క్షయ–భాజనమ్ = క్షీణతను పొందిన వానినిగా (కృష్ణపక్షంలో చంద్రుడు క్షీణిస్తాడు) (క్షయస్య భాజనమ్), విధాయ = చేసి, తద్+అనుగాన్ = ఆ వసంతుని అనుసరించే వారిని (శుకపికాదులను) (తస్య అనుగాస్తాన్), గిరా = పలుకులతో, మాధుర్య–ధుర్యాన్ = మధురంగా పలికే వారినిగా (మాధుర్యేణ ధుర్యాః, తాన్), విధాయ = చేసి, తమ్ = అతనిని, అనంగీకృత్య చ = అనంగునిగా కూడా (శరీరరహితుని) చేసి, అత్ర = ఈ ద్వారకలో, జనః = ప్రజ, ప్రత్యహమ్ = ప్రతిదినమూ (అహని అహని), బ్రహ్మ+అస్త్రవాన్ (సన్) = బ్రహ్మాస్త్రంగలదై, చరతి = తిరుగుతోంది. (చర గతి భక్షణయోః–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

తా ॥ రతిపతి అయిన మదనునియొక్క వింటిని పుష్పీకరించి, బాణాలకు పంచత్వాన్ని కల్పించి, సేనను అబలను చేసి, మంత్రిని (వసంతుని) ఎక్కడో మిన్నకుండేటట్లు చేసి, మిత్రుని క్షయభుక్కును చేసి, అనుచరులను తీయని మాటలతో లొంగజేసి, అసలు మదనునే అనంగుని చేసి ఆ ద్వారకలోని ప్రజ నిత్యమూ బ్రహ్మాస్త్రవంతమై తిరుగుతోంది.

వి : 1. పై శ్లోకంలోని శ్లిష్ట పదాలలో '**వసన్తం**' విలక్షణమైనది. అది ఒక అర్థంలో 'వసత్' శతృ ప్రత్యయాంత శబ్దం. ద్వితీయావిభక్తిలో మాత్రమే వసన్తమ్–అవుతుంది. ఈ శతృ ప్రత్యయాంతం విశేషణంగా మాత్రమే అన్వయిస్తుంది. వసన్తపదం మాత్రం విశేష్యం.

మిగిలిన పదాలు పుష్పీకృత్య, పంచత్వభాజః, విధాయ, అబలాం, క్షయభాజనం, మాధుర్యధుర్యాన్, అనంగీకృత్య ఇవన్నీ స్వాభావికంగానేవున్న అర్థాలకు మరల తత్తత్వవిధానం. అది విధ్యలంకారమవుతుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **చరతి :** | **చరతి** | చరతః | చరన్తి |
| | చరసి | చరథః | చరథ |
| | చరామి | చరావః | చరామః. |

*

శ్లో॥ స్మరస్య భార్యామపహృత్య విష్ణోః – స్నుషాం తదంఘ్ర్యబ్జయుగే నిధాయ ।
జయం స్వకీయం భువి దర్శయన్త–శ్చరన్తి తస్యాం పరిపన్థిశూన్యాః ॥ **17-45**

**అ :** ద్వారవతిలో కామవిజేతల ప్రవృత్తిని వర్ణించటం. –ఉపేంద్రవజ్ర.

**అ :** తస్యాం పరిపన్థి–శూన్యాః స్మరస్య భార్యామ్ అపహృత్య విష్ణోః స్నుషాం తద్–అంఘ్రి+అబ్జ–యుగే నిధాయ స్వకీయం జయం భువి దర్శయన్తః (సన్తః) చరన్తి.

**ప్ర :** తస్యామ్ = ఆ ద్వారకలో, పరిపన్థి–శూన్యాః : శత్రురహితులై (పరిపన్థిభిః శూన్యాః) (శ్లోకంలో ఇదే విశేషణం, ఇదే విశేష్యం. మరో విశేష్యం లేదు. కవి వివక్షనుబట్టి, ప్రతిపాద్య విషయాన్ని బట్టి నిష్కామయోగులు అన్నదానిని విశేష్యంగా భావించాలి.), స్మరస్య = మదనునియొక్క, భార్యామ్ = రతిని, అపహృత్య = (మనస్సులనుండి) తొలగించి (అప–హృ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), విష్ణోః = కృష్ణునియొక్క, స్నుషామ్ = కోడలిని, తద... యుగే : తద్ = ఆ కృష్ణునియొక్క, అంఘ్రి+అబ్జ = పాదకమలాలయొక్క, యుగే = జంట యందు (తస్య అంఘ్రీ ఏవ అబ్జే, తయోః యుగం, తస్మిన్), నిధాయ = నిలిపి, స్వకీయమ్ = తమయొక్క, జయమ్ = గెలుపును (కామునిపై విజయాన్ని–నిష్కాముకత్వాన్ని), దర్శయన్తః = ప్రదర్శిస్తూ, చరన్తి = తిరుగుతున్నారు. (చర గతి భక్షణయోః–పరస్మైపది–లట్–ప్ర.బ.).

**తా ॥** మదనుని జయించి బ్రహ్మాస్త్రంతో ప్రత్యహం సంచరిస్తున్న ప్రజలు–(గతశ్లోకంనుండి కర్తృపదాన్ని స్వీకరించి, దానిని బహువచనాంతం చేసికొంటే) శత్రురహితులై మదనుని భార్యను (రతిని–కోరికను) తమనుండి తొలగించి, ఆ కృష్ణుని కోడలిని కృష్ణచరణకమలాలకే సమర్పించి మదనునిపై తమ విజయాన్ని (నిష్కాముకత్వాన్ని) ప్రదర్శిస్తూ సంచరిస్తుంటారు.

**వి : 1. చరన్తి :** 17–44వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ మారం దర్పకరం ప్రతర్క్య సుహృదం మత్వా జగన్మోహనం**
**సేనాం చ ప్రమదాం శరాంశ్చ విషమాంస్తస్యానుగాన్ వ్యోమగాన్ ।**
**కోదణ్డం సుమనస్సమూహవినుతం తైః పూరితం సారథిం**
**సేనాం తామవలమ్బ్య తస్య వశగాస్తస్యాం రమన్తేఽపరే ॥ 17–46**

**అ :** ద్వారవతిలోని కామిజనప్రవృత్తి వర్ణన. – శార్దూలవిక్రీడితమ్.

**అ :** తస్యామ్ అపరే మారం దర్ప–కరం ప్రతర్క్య, సుహృదం జగత్+మోహనం మత్వా, సేనాం చ ప్రమదాం, శరాన్ చ విషమాన్, తస్య అనుగాన్ వ్యోమ–గాన్ కోదండం సుమనః–సమూహ–వినుతం, సారథిం తైః పూరితం మత్వా తాం సేనామ్ అవలంబ్య తస్య వశగాః రమన్తే.

**ప్ర :** తస్యామ్ = ఆ ద్వారకలో, అపరే = ఇతరులు (కాముకులు), మారమ్ = మదనుని (మారయతి (స్వ శత్రుమ్) ఇతి మారః), దర్ప–కరమ్ = గర్వం కల్గించే వానిగా (దర్పయతి ఇతి దర్పః), ప్రతర్క్య = ఆలోచించి, సుహృదమ్ = (మదనుని) మిత్రుడైన చంద్రుని, జగత్+మోహనమ్ : జగత్ = ప్రపంచానికి, మోహనమ్ = మోహం కల్గించే వానినిగా, మత్వా = భావించి, సేనాం చ = సేనను కూడా, ప్రమదామ్ = బాగా మదించిన దానినిగా (ప్రకృష్టః మదః యస్యాః తామ్), శరాన్ = బాణాలను, విషమాన్ = సహింపరానివిగానూ, తస్య = ఆ మదనునియొక్క, అనుగాన్ = అనుచరులను (అను గచ్ఛన్తి ఇతి, తాన్), వ్యోమ–గాన్ = ఖేచరులనుగానూ (వ్యోమ్ని గచ్ఛన్తీతి తాన్), కోదండమ్ = వింటిని, సుమనః+సమూహ–వినుతమ్ : సుమనస్సమూహ = సుమనస్సమూహమైనందువల్ల, వినుతమ్ = స్తుతింబడిన దానిగానూ (సుమనశ్శబ్దానికి దేవతలనికూడా అర్థం. దేవతలచే నుతింపబడిన అని వ్యంగ్యం), తైః = ఆ కోదండబాణాలచే, పూరితమ్ = నింపబడిన వానిగా, సారథిమ్ = మదనసారథిని (వసంతుని), మత్వా = భావించి, తామ్ = ఆ, సేనామ్ = సేనను, అవలంబ్య =

ఆశ్రయించి, తస్య = ఆ మదనునికి, వశగాః = లోబడినవారై (వశే గచ్ఛన్తీతి), రమన్తే = క్రీడిస్తున్నారు. (రమ్ క్రీడాయాం ఆత్మనేపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ఆ ద్వారకలోనే కాముకులు మాత్రం మారుని దర్పకరునిగా భావించి (భయపడి), ఆ మదనుని మిత్రుని జగన్మోహనునిగా భావించి, ఆయన సేనను ప్రమదనుగా, బాణాలను విషమాలుగా, అనుచరులను వ్యోమచరులనుగా, కోదండాన్ని సుమనస్సమూహవినుతంగా, ఆయన సారథిని ఆ కోదండశరాలతో నింపబడినవానిగా భావించి ఆ సేనను ఆశ్రయించి, దానికి లోబడి ఆనందంగా క్రీడిస్తున్నారు.

| వి : 1. **రమన్తే :** | రమతే | రమేతే | **రమన్తే** |
|---|---|---|---|
| | రమసే | రమేథే | రమధ్వే |
| | రమే | రమావహే | రమామహే. |

*

**శ్లో॥ తచ్ఛాస్త్రశ్రవణోత్సవేన కతిచిత్సఙ్కీర్త్య సంస్మృత్య తం**
**తత్పాదాబ్జనిషేవయా చ సుధియస్తస్యార్చయా కేచన ।**
**సఖ్యేనాప్యపరే ప్రణమ్య బహుశః కేచిచ్చ దాసాస్తవే-**
**త్యాత్మానం చ నివేద్య మోక్షనిరతాః సన్త్యత్ర కృష్ణార్చకాః ॥ 17-47**

**అ :** నవవిధభక్తిమార్గాలలో ద్వారవతిలోని భక్తులు కృష్ణుని సేవించటం. - శార్దూలవిక్రీడితమ్.

**అ :** కతిచిత్ తత్-శాస్త్ర-శ్రవణ+ఉత్సవేన కతిచిత్ సంకీర్త్య కతిచిత్ తం సంస్మృత్య కేచన సుధియః తత్-పాద+అబ్జ-నిషేవయా కేచన తస్య అర్చయా అపరే సఖ్యేన కేచిత్ బహుశః ప్రణమ్య కేచిత్ చ తవ దాసాః ఇతి ఆత్మానం నివేద్య చ కృష్ణ+అర్చకాః మోక్ష నిరతాః (సన్తః) అత్ర సన్తి.

**ప్ర :** కతిచిత్ = కొందరు, తత్... ఉత్సవేన : తత్ = ఆ కృష్ణునియొక్క, శాస్త్ర = (వైష్ణవ) తత్త్వంయొక్క, శ్రవణ = వినుట అనే, ఉత్సవేన = పండుగతో, కతిచిత్ = కొందరు, సంకీర్త్య = స్తుతించి, కతిచిత్ = కొందరు, తమ్ = ఆ కృష్ణుని, సంస్మృత్య = తలచుకొని, కేచన = కొంతమంది, సుధియః = బుద్ధిమంతులు (శోభనా ధీః యేషాం తే), తత్... వయా : తత్ = ఆ కృష్ణునియొక్క, పాద+అబ్జ = చరణకమలాలయొక్క, నిషేవయా = సేవతో, కేచన = కొందరు, తస్య = కృష్ణునియొక్క, అర్చయా = సమర్చనతో, అపరే = మరికొందరు, సఖ్యేన అపి = స్నేహంతో కూడా, కేచిత్ = కొందరు, బహుశః = చాలాసార్లు, ప్రణమ్య = నమస్కరించి, కేచిత్ చ = కొందరేమో, తవ = నీకు, దాసాః ఇతి = దాసులమనీ, ఆత్మానమ్ చ = తమను కూడా, నివేద్య = సమర్పించి, కృష్ణ+అర్చకాః : కృష్ణభక్తులు, మోక్ష-నిరతాః (సన్తః) = మోక్షాసక్తులై, అత్ర = ఈ ద్వారకలో, సన్తి = ఉన్నారు. (అస భువి భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ఆ ద్వారకలో కృష్ణభక్తులై, మోక్షాసక్తులైన ప్రజలు కొందరు కృష్ణుని గురించి వింటూ, కొందరు కీర్తిస్తూ, కొందరు స్మరిస్తూ, కొందరు ధీమంతులు సమర్చన చేస్తూ, కొందరు స్నేహభావాన్ని ప్రదర్శిస్తూ, కొందరు పదే పదే నమస్కరిస్తూ, కొందరు దాస్యం చేస్తూ, కొందరు ఆత్మనివేదన చేస్తూ తమ భక్తిభావాన్ని ప్రదర్శిస్తున్నారు.

**వి :** 1. ఈ నవవిధభక్తి భావాలనూ ప్రహ్లాదునిచేత హిరణ్యకశిపునకు చెప్పిస్తాడు వ్యాసమహర్షి.

శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥ - భాగవతమ్ 7/5/23

దీనికి తోడు మరింత విస్తృతంగా ఆ సాన్నిహిత్యసంపాదనమార్గాన్ని చెప్పాడు పోతన.

శా. **కామోత్కంఠత** గోపికల్ **భయముచేఁ** గంసుండు **వైరిక్రియా**
**సామాగ్రిన్** శిశుపాల ముఖ్యనృపతుల్ **సంబంధులై** వృష్ణులున్
**బ్రేమన్** మీరలు **భక్తినే**ము నిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యానగరిష్ఠుడైన హరిఁ జెందన్ వచ్చు ధాత్రీశ్వరా. –పోతనభాగవతము–7/18

2. సన్తి : 17–10వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ అఙ్గీకారగిరాం శ్రుతావభిరతాః సఙ్కీర్త్య తా మానినీ–**
**స్తత్పాదౌ పరిగృహ్య వన్దనమహో కృత్వా త్వదీయా వయమ్ ।**
**త్వద్దాసా వయమిత్యుదీర్య మనసాఽతీతాం స్మరన్తే రతిం**
**నీవీమోక్షఫలాయ సఖ్యకుశలాః కేచిచ్చ రామార్చకాః ॥ 17–48**

**అ :** భక్తిమార్గాలనే రక్తిమార్గాలుగా కూడా కాముకప్రవృత్తిలో సమన్వయపరచటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** అంగీకార–గిరాం శ్రుతౌ అభిరతాః (సన్తః) తాః మానినీః సంకీర్త్య తత్–పాదౌ పరిగృహ్య వందనం కృత్వా అహో! త్వదీయాః వయం త్వద్ దాసాః వయమ్ ఇతి ఉదీర్య అతీతాం రతిం మనసా స్మరన్తః సఖ్యకుశలాః కేచిత్ చ నీవీ–మోక్ష–ఫలాయ రామా+అర్చకాః (సన్తి).

**ప్ర :** అంగీకార–గిరామ్ = ఒప్పుకోలు మాటలను (అంగీకారస్య గిరః, తాసామ్), శ్రుతౌ = వినుటయందు, అభిరతాః (సన్తః) = ఆసక్తిగలవారై, తాః=ఆ, మానినీః=కాంతలను, సంకీర్త్య = స్తుతించి, తత్–పాదౌ : తత్ = ఆ మానినులయొక్క, పాదౌ = పాదాలను, పరిగృహ్య = పట్టి, వందనమ్ = నమస్కారాన్ని, కృత్వా = చేసి, అహో = ఆశ్చర్యకరంగా, వయమ్ = మేము, త్వదీయాః = నీవారము, వయమ్ = మేము, త్వద్–దాసాః = నీ దాసులం, ఇతి = అని, ఉదీర్య = చెప్పి, అతీతామ్ = అనుభూతపూర్వమైన, రతిమ్ = రతిని, మనసా = మనస్సుతో, స్మరన్తః = తలచుకొంటూ, సఖ్య–కుశలాః : సఖ్య = మైత్రియందు, కుశలాః = నేర్పుగల (సఖ్యే కుశలాః), కేచిత్ చ = కొందరుకూడా, నీవీ–మోక్ష–ఫలాయ : నీవీ = కోకముడియొక్క, మోక్ష = ముక్తియొక్క, ఫలాయ = ఫలితంకోసం, రమా(మ)+అర్చకాః : రామా(మ) = కాంతలయొక్క/రామునియొక్క, అర్చకాః = సేవకులు (గా), (సన్తి = ఉన్నారు.)

**తా ॥** (ఆ ద్వారకలో కృష్ణార్చకులతో పాటు రామార్చకులు (రామా+అర్చకులు = స్త్రీలనర్చించేవారు) కూడా వున్నారు. ఆ రామార్చకులు స్త్రీల నడిగి వాళ్ళ అంగీకారాన్ని వినుటయందు ఆసక్తిగలవారై, వారు కోపనలయితే వారిని పొగుడుతూ, వారి కాళ్ళు పట్టుకొంటూ, వారికి నమస్కరిస్తూ, 'మేము నీవారం, నీ దాసులం' అంటూ మాటనిస్తూ, గడచిపోయిన అనుభవాలను తలచుకొంటూ మైత్రీనిపుణులై వారి నీవీమోక్షణఫలాన్ని కోరుకొంటున్నారు.

**వి :** 1. పూర్వశ్లోకంలో భక్తులలో నవవిధభక్తిమార్గాలను ప్రదర్శించిన కవి ఈ శ్లోకంలో నవవిధరక్తిమార్గాలను ప్రదర్శిస్తున్నాడు. అందులో కాముకప్రవృత్తి వివరింపబడింది. నాయికలలోని మనోగతిని బట్టి నాయకుడు–అనుకూలుడైనా, దక్షిణుడైనా–తదనుగుణంగా వారిని అనునయించే మార్గాన్ని ఎన్నుకొంటాడు, పాదాభివందనంతో సహా. పాదాభివందనం ద్వారకలోని రామార్చకులే కాదు ద్వారకా నిర్మాత అయిన కృష్ణుడు కూడా ఆచరించి చూపిందే. కాబట్టి అందులో గుణదోషచర్చకు అవకాశం లేదు. అదొక ప్రతిక్రియ మాత్రమే.

పారిజాతాపహరణకావ్యంలో తిమ్మన కృష్ణునిచేత సత్యపాదాభివందనం చేయించటమే కాక ఆమె వామపాదంతో ఆ తలను తొలగద్రోసినా అంతకంటే మృదువుగా ఆమెను అనునయింపజేసిన తీరు అద్భుతావహం.

**చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యఁపుఁ గిన్కఁ బూని తాఁ**
**చినయది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ**

త్తనుపులకాగ్రకంటకవితానము దాకిన నొచ్చు నంచు నే
ననియెద నల్కమానవుగదా యిఁకనైన నరాళకుంతలా! - పారిజాతాపహరణం-1/123

2. రామా+అర్చక, రామ+అర్చక అని రెండురకాలుగానూ విభజన కవకాశముండి రామపదం దశరథరాముని ధ్వనింపజేస్తుంది. తద్ద్వారా శ్లోకంలోని రక్తివిధానమంతా తనకు నైసర్గికమైన భక్తివిధానంగా కూడా అన్వయించి రాముని అర్చనను వ్యక్తంచేస్తుంది. ఇది శబ్దశక్తిమూలధ్వని. *

**శ్లో॥ ప్రాకారాద్బహిరత్ర వారిధిరయం ప్రాప్యామ్బుదైరర్పితం**
**స్వాతౌ వారి తతశ్చిరేణ హృదయే ముక్తామయో జాయతే ।**
**అన్తర్హస్తపుటేషు విప్రజలధిః కృష్ణాబ్దవృష్టం సదా**
**విత్తామ్బు ప్రతిపద్య తత్క్షణమహో ముక్తామయో జాయతే ॥ 17-49**

**అ :** ద్వారకకు వెలుపల, లోనా కూడా ముక్తామయత్వప్రాప్తివర్ణన. - శార్దూలవిక్రీడితమ్.

**అ :** అత్ర ప్రాకారాద్ బహిః అయం వారిధిః స్వాతౌ అంబుదైః అర్పితం వారి ప్రాప్య తతః చిరేణ హృదయే ముక్తా-మయః జాయతే. అన్తః విప్రజలధిః హస్త-పుటేషు కృష్ణ+అబ్ద-వృష్టం విత్త+అంబు సదా ప్రతిపద్య తత్-క్షణం ముక్త+ఆమయః జాయతే. అహో.

**ప్ర :** అత్ర = ఈ ద్వారకలో, ప్రాకారాద్ = ప్రహరీకి, బహిః = వెలుపల, అయమ్ = ఈ, వారిధిః = సముద్రం, స్వాతౌ = స్వాతి నక్షత్రంలో, అంబుదైః = మేఘాలచే (అంబు దదతి ఇతి అంబుదాః, తైః), అర్పితమ్ = కురిపింపబడిన, వారి = నీటిని, ప్రాప్య = పొంది. (ప్ర-ఆప్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తతః = ఆ తరువాత, చిరేణ = చాలా కాలానికి, హృదయే = లోన, **ముక్తా-మయః** = మౌక్తికమయంగా, జాయతే = అవుతుంది. (జనీ ప్రాదుర్భావే ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.), అన్తః = కోట (నగరి)లోపల, విప్ర-జలధిః = బ్రాహ్మణు లనే సముద్రం (విప్రా ఇతి జలధిః), హస్త-పుటేషు = చేతు లనే దొప్పలలో (హస్తా ఏవ పుటాని, తేషు), కృష్ణ+అబ్ద-వృష్టమ్ : కృష్ణ = కృష్ణు డనే, అబ్ద = మేఘంచేత, వృష్టమ్ = కురిపించబడిన, విత్త+అంబు = డబ్బు అనే నీటిని (విత్తమేవ అంబు తత్), సదా = ఎల్లప్పుడు, ప్రతిపద్య = పొంది, తత్-క్షణమ్ = వెంటనే, **ముక్త.అమయః** : ముక్త = విడిపింపబడిన, ఆమయః = (ఆమ) రోగం గలదిగా (ముక్తః ఆమయః యస్మాత్ సః), జాయతే = అవుతుంది. అహో = ఆశ్చర్యకరం.

**తా ॥** ద్వారకాప్రాకారం వెలుపల కడలి స్వాతివానలో మేఘాలు కురిసిన నీటిని తనలో దాచుకొని చాలా కాలానికి ముక్తామయ మవుతుంది. (స్వాతి చినుకులు ముత్తెపుచిప్పలో పడిన తరువాత చాలా కాలానికి అవి ముత్యాలుగా రూపొందుతాయి.), కాని ద్వారకలోపల బ్రాహ్మణులు అనే కడలి తన చేతు లనే దొప్పలలో కృష్ణు డనే మేఘం కురిపించిన ధన మనే నీటిని గ్రహించి తత్క్షణం ముక్తామయ మవుతుంది. (ఆమయ విముక్తిని పొందుతుంది.)

**వి :** 1. కృష్ణసాన్నిహిత్యంలోని తరతమభేదాలను శ్లోకం వివరిస్తోంది. ద్వారక కృష్ణనివాసం. ద్వారకకున్న ప్రాకారానికి అటు, ఇటు (బయల-లోపల) నిలవటం లోని భేదం కనిపిస్తోంది శ్లోకంలో. అంతర్గతకృష్ణత్వం సద్యః ఫలదాయి. బహిర్గత కృష్ణత్వం (బహిర్గతంగా అయిన సంబంధమున్నది కాబట్టి) చాలా కాలానికి ఫలితాన్ని ఇచ్చేది.

2. శ్లోకంలోని ఉత్తరార్ధంలో హస్త-పుట, విప్ర-జలధి, కృష్ణ+అబ్ద, విత్త+అంబు - ఇవన్నీ రూపకాలు. ఈ రూపకాలంకారాలు, ముక్తామయ శబ్దంలోని శ్లేష ఈ రెండింటిద్వారా వ్యతిరేకాలంకారం ధ్వనిస్తుంది. లోపల కృష్ణాబ్దం కురిపించిన విత్తాంబువూ ముక్తామయ మవుతుంది. వెలుపల స్వాతివాన కూడా ముక్తామయత్వానికి కారణమై సముద్రాన్ని ముక్తామయం చేస్తుంది కానీ ఆలస్యంగా. ఇది విశేషం కాబట్టి వ్యతిరేకాలంకారం. వాచ్యంగా లేదు కాబట్టి ధ్వనిరూపం.

| | | | | |
|---|---|---|---|---|
| 3. **జాయతే :** | **జాయతే** | జాయేతే | జాయన్తే | |
| | జాయసే | జాయేథే | జాయధ్వే | |
| | జాయే | జాయావహే | జాయామహే. | * |

**శ్లో॥ ఆశాసక్తజనాశుగేన జవినోపాన్తే రజో జృమ్భయం-**
**స్తేనైవోగ్రతమః సృజన్ శుభదృశామప్యాన్ధ్యమాపాదయన్ ।**
**అన్తఃస్తమ్భితసత్త్వవృత్తిరనిశం సంసారవారాశివత్**
**ప్రత్యూహీభవతి త్రిధామనగరప్రాప్తౌ జలౌఘాశ్రయః ॥ 17-50**

**అ :** ద్వారకకు పరిఖ అయిన సముద్రం ద్వారకలో ప్రవేశించటానికి ప్రతిబంధకమగుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** జవినా ఆశా+ఆసక్త-జన+ఆశు-గేన ఉపాన్తే రజః జృంభయన్ తేన ఏవ ఉగ్ర-తమః సృజన్ శుభ-దృశామ్ అపి ఆన్ధ్యమ్ ఆపాదయన్ అన్తః-స్తంభిత-సత్త్వ-వృత్తిః (సన్) అనిశం జల+ఓఘ+ఆశ్రయః సంసార-వారాశివత్ త్రిధామ-నగర-ప్రాప్తౌ ప్రత్యూహీభవతి.

**ప్ర :** జవినా = వేగవంతుడై (జవః అస్య అస్తీతి జవీ, తేన), ఆశా... గేన : ఆశా = దిక్కులయందు (ఆశాః కకుభః కాష్ఠాః-హలాయుధకోశః-100), ఆసక్త = తగుల్కొన్న, జన = జనంగలిగిన, ఆశు-గేన = గాలిచేత (ఆశాసు ఆసక్తాః జనాః యస్య సః చ అసౌ ఆశు గచ్ఛతీతి, తేన), ఉపాన్తే = సమీపంలో (తీరంలో) (ఉపాన్తే విప్రకృష్టే తు-వైజయన్తీ-అర్థవత్-142), రజః = దుమ్మును, జృంభయన్ = రేపుతూ, తేన+ఏవ = దానితోనే, ఉగ్ర-తమః = కారుచీకటిని (ఉగ్రం చ తత్ తమః), సృజన్ = సృష్టిస్తూ, శుభ-దృశామ్ అపి = మంచిచూపుగలవారికి కూడా (శుభాః దృశః యేషాం తేషామ్), ఆన్ధ్యమ్ = చీకటిని, ఆపాదయన్ = కలిగిస్తూ, అన్తః = లోపల, స్తంభిత-సత్త్వ-వృత్తిః (సన్) : స్తంభిత = నిలిపివేయబడిన, సత్త్వ = జంతువులయొక్క, వృత్తిః = ప్రవర్తనగలదై (స్తంభితా సత్త్వానాం వృత్తిః యేన సః), అనిశమ్ = ఎల్లప్పుడూ, జల+ఓఘ+ఆశ్రయః = సముద్రం (జలానామ్ ఓఘస్య ఆశ్రయః), సంసార-వారాశివత్ = సంసారసాగరంలా (సంసారః ఏవ వారాశిః తద్వత్), త్రి... ప్రాప్తౌ : త్రిధామ = కృష్ణునియొక్క, నగర = నగరానికి, ప్రాప్తౌ = చేరుటయందు, (త్రీణి ధామాని యస్య తస్య నగరస్య ప్రాప్తిః, తస్యామ్), ప్రత్యూహీ భవతి = ఆటంకమవుతోంది. (అప్రత్యూహః ప్రత్యూహః సంపద్యతే) (ప్రత్యూహీ-భూ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ద్వారకను చుట్టివున్న సముద్రం తన తీరంలోని సుడిగాలితో ప్రజలను దూరంగా నెట్టివేస్తూ దుమ్ము రేగగొడుతూ, గాఢాంధకారాన్ని కల్పిస్తూ కంటిచూపు బాగా వున్నవారికి కూడా గ్రుడ్డితనాన్ని కలిగిస్తూ, సాగరజలాలలోని జంతువుల ప్రవర్తనను స్తంభింపజేస్తూ అనుదినమూ సంసారసాగరంలాగా కృష్ణనగరి అయిన ద్వారకను చేరటానికి అడ్డంకిగా నిలుస్తోంది.

**వి :** 1. కృష్ణభక్తులకు ముక్తిస్థానాలు మూడు. అవి **అనంతాసనం, వైకుంఠం, శ్వేతద్వీపం.** అనంతాసనం బ్రహ్మాండానికి ఉత్తరంగా వుంటుంది. వైకుంఠం బ్రహ్మలోకానికి పైభాగాన వుంటుంది. భూమండలంలో పుష్కరద్వీప శకద్వీపాలమధ్య శ్వేతద్వీపముంటుంది.

**శ్లో॥ అంతర్యామీ త్రిధామాన్తః సాక్షీ త్రిగుణ ఈశ్వరః ।**
**యోగిగమ్యః పద్మనాభః శేషశాయీ శ్రియఃపతిః ॥** -పద్మపురాణాంతర్గతవాసుదేవసహస్రనామస్తోత్రమ్.

**శ్లో॥ ప్రభూతస్త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్ ॥** -మహాభారతాంతర్గతవిష్ణుసహస్రనామస్తోత్రమ్. *

శ్లో॥ ఉత్తుఙ్గోర్మికరానుషక్తవిలసచ్చక్రాఙ్కశఙ్ఖః స్ఫుర-
ద్రత్నౌఘావృతగాత్రవాస్యనిమిషః ఫేనానులేపోజ్జ్వలః ।
స్వాసక్తైర్జలసఞ్చయైరపి మహాపాపాని నిర్మూలయన్
వార్ధిః కృష్ణ ఇవావతీహ పరితో యోగీన్ద్రజిహ్వోత్సవః ॥ **17-51**

**అ :** ద్వారక చుట్టువున్న సముద్రం కృష్ణునిలా ద్వారకను రక్షిస్తోందని వర్ణించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఉత్తుంగ+ఊర్మి–కర+అనుషక్త–విలసత్–చక్ర+అంక–శంఖః స్ఫురత్–రత్న+ఓఘ+ఆవృత–గాత్రవాసి+అనిమిషః ఫేన+అనులేప+ఉజ్జ్వలః స్వ+ఆసక్తైః జల–సంచయైః అపి మహా–పాపాని నిర్మూలయన్ యోగి+ఇంద్ర–జిహ్వా+ఉత్సవః (సన్) వార్ధిః కృష్ణ ఇవ ఇహ పరితః అవతి.

**ప్ర :** ఉత్తుంగో... శంఖః : ఉత్తుంగ = పైకెగసిపడుతున్న, ఊర్మి = అలలు అనే/అలల వంటి, కర = చేతులలో, అనుషక్త = తగిలివున్నవీ, విలసత్ = ప్రకాశిస్తున్నవీ అయిన, చక్ర+అంక = చక్రరూపాలు/సుదర్శనచక్రాంకం, శంఖః = శంఖాలూ గలవాడై/శంఖం గలవాడై (ఉత్తుంగాః ఊర్మయః ఏవ కరాః, తేషు ఆసక్తాః విలసన్తశ్చ తే చక్రాంకాః శంఖాశ్చ యస్య సః), కృష్ణపక్షంలో – (ఉత్తుంగాః చ తే ఊర్మయః, తద్వత్ కరౌ, తయోః ఆసక్తౌ చక్రస్య అంకః శంఖశ్చ యస్య సః), స్ఫుర... మిషః : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, రత్న = మణులయొక్క, ఓఘ = సమూహంచేత, ఆవృత = ఆవరింపబడిన, గాత్ర = శరీరమందు, వాసి = నివసిస్తున్న, అనిమిషః = చేపలు/దేవతలు గలవాడై, (సముద్రుడు రత్నాకరుడు. కృష్ణుని శరీరాన్ని రత్నాభరణాలు ఆవరించి వున్నాయి) (స్ఫురతాం రత్నానామ్ ఓఘేన ఆవృతే గాత్రే వసన్తీతి తే చ తే అనిమిషాః యస్య సః), ఫేనా... జ్జ్వలః : ఫేన = నురుగు అనే/నురుగువంటి, అనులేప = మైపూతచే, ఉజ్జ్వలః = ప్రకాశిస్తున్నవాడై, (ఫేన ఏవ అనులేపః/ఫేనవత్ అనులేపః తేన ఉజ్జ్వలః), స్వ+ఆసక్తైః = తనకు సంబంధించిన, జల(డ)–సంచయైః అపి = జలసమూహాలచే (తీర్థాలచే)/జడుల సమూహాలచే కూడా, మహా–పాపాని = మేటి పాపాలను, నిర్మూలయన్ = నిర్మూలిస్తూ, యోగీంద్ర... త్సవః (సన్) : యోగి+ఇంద్ర = యోగిశ్రేష్ఠులయొక్క, జిహ్వా = నాలుకకు, ఉత్సవః (సన్) = పండుగవంటివాడై (యోగీంద్రాణం జిహ్వాయాః ఉత్సవః), వార్ధిః = సముద్రుడు, కృష్ణః ఇవ = కృష్ణునిలా, ఇహ = ఈ ద్వారకను, పరితః = చుట్టూ, అవతి = రక్షిస్తున్నాడు. (అవ రక్షణాదిషు–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** సముద్రం కృష్ణునిలా ద్వారకకు చుట్టూ నిలిచి కాపాడుతూ వుంది. సముద్రానికి ఎత్తైన అలలు అనే చేతులు, అలలకు తగిలి చక్రాంకాలైన గవ్వలు శంఖాలూ వున్నాయి. కృష్ణుని అలలవంటి చేతులలో చక్రాంకం, పాంచజన్యశంఖం వున్నాయి. రత్నాలతో ప్రకాశిస్తున్న సముద్రుని శరీరంలో చేపలు నివసిస్తున్నాయి. కృష్ణునిశరీరంపై రత్నాల ఆభరణాలు వాటిపై (ఎదుటనున్న) దేవతల ప్రతిబింబాలు కనిపిస్తున్నాయి. ఇద్దరి శరీరాలూ (కృష్ణసముద్రాలు) ఫేనానులేపంతో ప్రకాశిస్తున్నాయి. తనలోని తీర్థాలతో సముద్రుడు మహాపాపాలను కూడా పోగొడితే, కృష్ణుడు తన భక్తులు జడులైనా వారిద్వారా కూడా పాపాలను పోగొట్టగలవాడు. యోగీంద్రుల నాలుకలకు ఇద్దరూ కూడా పండువులాంటివారే.

**వి :** 1. **'వార్ధిః కృష్ణ ఇవ'** – ఇది ఉపమాలంకారం. సాధర్మ్యప్రదర్శనలో శ్లేషాలంకార సహకారముంది. కాబట్టి శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారమీశ్లోకంలో.

2. శ్లోకంలో సముద్రంలోని చక్రతీర్థప్రస్తావనముంది. చక్రతీర్థమహిమ తీర్థప్రబంధంలో కనిపిస్తుంది.

శ్లో॥ చక్రతీర్థస్య మహిమా వర్ణితుం కేన శక్యతే ।
యచ్ఛిలామపి సంగేన విధత్తే విశ్వవందితామ్ ॥ – తీర్థప్రబంధ–1/95

| | | | | |
|---|---|---|---|---|
| 3. **అవతి :** | **అవతి** | అవతః | అవన్తి | |
| | అవసి | అవథః | అవథ | |
| | అవామి | అవావః | అవామః. | * |

**శ్లో॥ సచ్చక్రా కరపుష్టరమ్యకటకా భోగీన్ద్రభోగాస్పదా**
**నేత్రస్థానగతేన్ద్వినా కనకసద్వప్రాతిపీతామ్బరా ।**
**భాతి స్వోదరవాసిహంసగమనా సేయం సుధర్మావహా**
**విష్ణోరాకృతివత్ సముద్రహృదయే లక్ష్మీధరాలిఙ్గితా ॥ 17-52**

**అ :** ద్వారవతీవర్ణన. – శార్దూలవిక్రీడితమ్.

**అ :** సత్+చక్రా కర–పుష్ట–రమ్య–కటకా భోగీ+ఇంద్ర–భోగ–ఆస్పదా నేత్ర–స్థాన–గత–ఇందు+ఇనా కనక–సద్–వప్ర+అతిపీత+అంబరా స్వ+ఉదర–వాసి–హంస–గమనా సుధర్మ(ర్మా)+ఆవహా లక్ష్మీ–ధర+ఆలింగితా సా ఇయం విష్ణోః ఆకృతివత్ సముద్ర–హృదయే భాతి.

**ప్ర :** సత్+చక్రా : సత్ = సజ్జనులయొక్క/మంచి, చక్రా = సమూహంగలదీ/సుదర్శన చక్రంగలదీ (సతాం చక్రం/సత్ చ తత్ చక్రం యస్యాః సా), కర... కటకా : కర = పన్నుచేత/చేతిచే, పుష్ట = పోషింపబడిన/సంపన్నంచేయబడిన, రమ్య = అందమైన, కటకా = సేనగలదీ/కడియాలు గలదీ (కరేణ పుష్టం రమ్యం కటకం యస్యాస్సా), భోగి... ఆస్పదా : భోగి+ఇంద్ర = మేటివిలాసవంతులయొక్క/ఆదిశేషునియొక్క, భోగ = భోగాలకు (సుఖాలకు)/పడగయే, ఆస్పదా = చోటైనదీ/నెలవైనదీ, నేత్ర... ఇనా : నేత్ర–స్థాన = సోరణగండ్లలో/కంటితావులో, గత = నిలిచిన, ఇందు = చంద్రుడూ, ఇనా = సూర్యుడూ గలదీ (నేత్రాణాం (నేత్రయోః) స్థానే గతౌ ఇందుః ఇనశ్చ యస్యా స్సా), కనక... పీతాంబరా : కనక = సువర్ణమయమైన, సద్–వప్ర = మంచి కోటలతో/మంచి కోటల్లాగా, అతి పీత = మిక్కిలి పచ్చనైన, అంబరమ్ = ఆకాశంగలదీ/వస్త్రం గలదీ (కనకమయైః సద్వప్రైః/కనకసద్వప్రవత్ పీతమ్ అంబరం యస్యాస్సా), స్వోదర... గమనా : స్వ = తనయొక్క, ఉదర = లోపల/ఉదరస్థానంలో, వాసి = వసిస్తున్న, హంసగమనా = హంసగమనలు (స్త్రీలు) గలదీ/ హంసవాహనుడు (బ్రహ్మ) గలదీ (స్వస్యాః/స్వస్య ఉదరే వాసిన్యః/వాసీ హంసగమనాః /హంసగమనః యస్యాం సా), సుధర్మా (ర్మ)+ఆవహా : సుధర్మా(ర్మ) = సుధర్మను (సభ)/మంచి ధర్మాలకు, ఆవహా = వహించేదీ/ఆస్పదమైనదీ (సుధర్మామ్ ఆవహతీతి/సుధర్మాణామ్ ఆవహా), లక్ష్మీ–ధర(రా)+ఆలింగితా : లక్ష్మీధర(రా) = విష్ణువుచే/శ్రీభూ దేవులచే, ఆలింగితా = కౌగిలింపబడిందీ (లక్ష్మీధరేణ/లక్ష్మ్యా ధరయా చ ఆలింగితా), సా+ఇయమ్ = ఆ ఈ ద్వారక, విష్ణోః = విష్ణువుయొక్క, ఆకృతివత్ = ఆకారంలా, సముద్ర–హృదయే = సాగరమధ్యంలో (సముద్రస్య హృదయం, తస్మిన్), భాతి = ప్రకాశిస్తోంది. (భా దీప్తౌ పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** సముద్రహృదయంలోనున్న ద్వారక విష్ణువుయొక్క ఆకృతిలా ప్రకాశిస్తోంది. ద్వారక సజ్జనసమూహం గలది. విష్ణువు సుదర్శనచక్రం గవలవాడు. ద్వారక ప్రజలు కట్టిన పన్నులతో సంపన్నమైన సేనగలది. విష్ణువు చేతికాంతితో కటకాలకాంతిని వర్ధిల్లజేసేవాడు. విలాసవంతుల విలాసాలకు ద్వారక ఆస్పదం. విష్ణువుకు ఆదిశేషుని పడగయే నెలవు. ద్వారకలోని భవనాల సోరణగండ్లనుండి సూర్యచంద్రకాంతలు ప్రసరిస్తున్నాయి. విష్ణువు కళ్ళలో సూర్యచంద్రులుంటారు. ద్వారకలోని బంగారుకాంతులతో గగనసీమ బంగారు వన్నెను పొందుతోంది. బంగారు కోటల వంటి పీతాంబరం గలవాడు కృష్ణుడు. తనలో నివసిస్తున్న హంసగమనలు గలది ద్వారక. తన నాభిలో హంసగమనుడున్నవాడు విష్ణువు. ద్వారక సుధర్మకు, విష్ణువు సుధర్మాలకు నెలవు. ద్వారక లక్ష్మీధరుని (కృష్ణుని) కౌగిలించినది. కృష్ణుడు లక్ష్మీ–ధరలను కౌగిలిచినవాడు.

**వి : 1. విష్ణోః ఆకృతివత్** – ఇది ఉపమాలంకారం. అయితే ఉపమావాచకం 'వతి' ప్రత్యయం చేత ప్రతిపాదింపబడింది గాబట్టి ఆర్థీ–ఉపమ. దానికి శ్లేషాలంకారం సహకరిస్తోంది. ద్వారకకు విష్ణువుకు సాధర్మ్యాన్ని వర్ణించటంలో శ్లేష–దాదాపు అభంగశ్లేష–పాత్ర మిక్కుటం. కాబట్టి శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారమిది.

2. **భాతి :** 17–27వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యే పురారిరిపుణాఽనయే పురా – సఙ్గతాః మ్రనయానాః స్మ సఙ్గతాః ।**
**కాన్తయా సహ వరాలకాన్తయా – తేఽపి రేచకభృతోఽత్ర తేపిరే ॥ 17–53**

**అ :** ద్వారకలో విలాసవంతులు కూడా ప్రాణాయామపరాయణులని వర్ణించటం. –రథోద్ధత (రనరలగ)

**అ :** యే పురా సంగ–తామ్ర–నయనాః (సన్తః) పుర+అరేః రిపుణా అనయే సంగతాః స్మ తే అపి అత్ర రేచక–భృతః వర+అలక+అంతయా కాంతయా సహ తేపిరే.

**ప్ర :** యే = ఎవరయితే, పురా = గతంలో, సంగ–తామ్ర–నయనాః : సంగ = స్త్రీ సమాగమంచేత, తామ్ర = ఎఱ్ఱబడిన, నయనాః (సన్తః) = కళ్ళు గలవారై (సంగేన తామ్రాణి నయనాని యేషాం తే), పుర+అరేః = శివునియొక్క, రిపుణా = శత్రువైన మదనునితో, అనయే = అపమార్గంలో, సంగతాః స్మ = కలిసినట్లు ప్రసిద్ధిగలదో, తే అపి = వారుగూడా, అత్ర = ఈ ద్వారకలో, రేచక–భృతః = రేచకాన్ని (ప్రాణాయామాన్ని) స్వీకరించి, వర... అన్తయా : వర = అందమైన, అలక = ముంగురులయొక్క, అన్తయా = కొనలుగల (వరాశ్చ తే అలకానామ్ అన్తాః యస్యాః తయా), కాన్తయా సహ = స్త్రీ (భార్య)తోపాటు, తేపిరే = తపస్సు చేశారు. (తప సంతాపే–దివాది–ఆత్మనేపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** గతంలో స్త్రీసమాగమం చేత ఎఱ్ఱబడిన కన్నులుగలిగి, అపమార్గంలో పురారిశత్రువైన మదనునితో స్నేహంచేసిన వారుకూడా ఇప్పుడు ద్వారకలో అందమైన ముంగురుల కొనలు గల కాంతలతో సహా రేచకాన్ని స్వీకరించి తపస్సు చేస్తున్నారు.

**వి : 1.** ఇక్కడ రేచకపదం ప్రాణాయామానికి ఉపలక్షకం. ప్రాణాయామం ప్రాకృత, వైకృత, కుంభక భేదాలతో త్రివిధం.

"**రేచక మనఁగా ప్రాణవాయువును మూలాధారమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము సుషుమ్నా నాళద్వారముగా నుత్థాపనము చేయుట, పూరకమనఁగా బ్రహ్మరంధ్రపర్యంతమూ రేచించిన వాయువును మరల సుషుమ్నానాళద్వారముగా మూలాధారమునఁజేర్చుట. కుంభకమనఁగా రేచించిన వాయువును బ్రహ్మరంధ్రమందు మాత్రాసంఖ్యగ నిలుపుట.**"– –శ్రీ సీతారామాంజనేయసంవాదము–టీక–పుట–122

2. ప్రతిపాదంలోనూ ఆద్యంతయమకాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **తేపిరే :** | తేపే | తేపాతే | **తేపిరే** |
| | తేపిషే | తేపాథే | తేపిధ్వే |
| | తేపే | తేపివహే | తేపిమహే. |

*

**శ్లో॥ చరన్తి తస్యాం బహుమానయుక్తా – బుధా విదగ్ధా బహుమానయుక్తాః ।**
**గజాశ్చ మత్తా బహుశస్తరఙ్గా – బహిశ్చ సిన్ధోర్బహుశస్తరఙ్గాః ॥ 17–54**

**అ :** ద్వారకవర్ణనమే. –ఉపేంద్రవజ్ర.

**అ :** తస్యాం బహు–మాన–యుక్తాః బుధాః బహు–మాన–యుక్తాః విదగ్ధాః; బహు–శస్త–రంగాః మత్తాః చ గజాః, బహిః సిన్ధోః బహుశః తరంగాః చ చరన్తి.

**ప్ర :** తస్యామ్ = ఆ ద్వారకలో, బహు–మాన–యుక్తాః : బహు = అనేకమైన, మాన = ప్రమాణాలతో (శాస్త్రాది చర్చల విషయంలో), యుక్తాః = కూడిన (బహుభిః మానైః యుక్తాః), బుధాః = పండితులు, బహు–మాన–యుక్తాః : బహు = ఎక్కువైన, మాన = అభిమానంతో, యుక్తాః = కూడుకొన్న (బహునా మానేన యుక్తాః), విదగ్ధాః = తెలివైనవారు; బహు–శస్త–రంగాః : బహు = ఎంతో, శస్త = ప్రసిద్ధికెక్కిన, రంగాః = రంజన ద్రవ్యాలుగలవీ, (బహు శస్తం రంగం యేషాం తే), మత్తాః చ = మదించినవీ అయిన, గజాః = ఏనుగులూ, బహిః = వెలుపల, సిన్ధోః = సముద్రంయొక్క, బహుశః = చాలా, తరంగాః చ = అలలూ కూడా, చరన్తి = కదులుతున్నాయి (రు). (చర గతిభక్షణయోః పరస్మైపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ఆ ద్వారకలో కృష్ణతత్త్వనిరూపకాలైన ప్రమాణాలు ఎన్నో తెలిసిన పండితులూ, అభిమానధనులైన మేధావులూ తిరుగుతున్నారు. చాలా ప్రసిద్ధికెక్కిన గైరికాది రంజన ద్రవ్యాలు గల మదపుటేనుగులూ, నగరివెలుపల లెక్కలేనన్ని కడలి అలలు తిరుగుతున్నాయి.

**వి :** 1. శ్లోకంలో తుల్యయోగితాలంకారం. **వర్ణ్యానామితరేషాం వా ధర్మైక్యం తుల్యయోగితాః** – (కు.44), కేవలం ప్రకృతవిషయాలకు కానీ, కేవలం అప్రకృతవిషయాలకు కానీ ఒకే ధర్మాన్ని వర్ణించటం తుల్యయోగిత. ఇక్కడ చరించుట అన్న ధర్మం బుధులకూ, విదగ్ధులకూ, మదపుటేనుగులకూ, అలలకూ అన్వయించినందువల్ల, అవి అన్నీ ప్రకృతం వర్ణింపదగిన విషయాలే కావటంవల్ల ఇది తుల్యయోగితాలంకారం.

2. శ్లోకంలో యమకాలంకారం కూడా–పాదాన్తరూపంలో.

| 3. **చరన్తి :** | చరతి | చరతః | **చరన్తి** |
|---|---|---|---|
| | చరసి | చరథః | చరథ |
| | చరామి | చరావః | చరామః. |

*

**శ్లో॥ అఙ్గనాలమలకావలిభృఙ్గం – మన్దహాసమధు మన్మథబాణమ్ ।**
**అఙ్గనాఽలమమలం ముఖపద్మం – బిభ్రతీ వశయితుం జగదస్యామ్ ॥ 17–55**

**అ :** ద్వారకయందలి అందగత్తెల ముఖకమలాన్ని వర్ణించటం. – రథోద్ధత. (రనరలగ).

**అ :** అస్యామ్ అంగ–నాళం అలక+ఆవలి–భృంగం మంద–హాస–మధు మన్మథ–బాణమ్ అమలం ముఖ–పద్మం బిభ్రతీ అంగనా జగద్ వశయితుమ్ అలమ్.

**ప్ర :** అస్యామ్ = ఈ ద్వారకయందు, అంగ–నాళమ్ = శరీరమే తూడుగా గలదీ (అంగమేవ నాళం యస్య తత్), అలక+ఆవలి–భృంగమ్ : అలక+ఆవలి = ముంగురుల వరసయే, భృంగమ్ = తుమ్మెదగా గలదీ (అలకానామ్ ఆవలిః ఏవ భృంగః యస్య తత్), మంద–హాస–మధు : మంద–హాస = చిఱునవ్వే, మధు = మకరందంగా గలదీ (మందశ్చ అసౌ హాసః, స ఏవ మధు యస్య తత్), మన్మథ–బాణమ్ = మదనుని బాణం అయినదీ, అమలమ్ = నిర్మలమైనదీ అయిన, ముఖ–పద్మమ్ = మోముతామరను, బిభ్రతీ = ధరిస్తున్నా, అంగనా = కాంత, జగత్ = ప్రపంచాన్ని, వశయితుమ్ = లొంగదీసికొనుటకు, అలమ్ = సమర్థమైనది.

**తా ॥** ఆ ద్వారకలోని కాంత తన ముఖపద్మంతో ప్రపంచాన్నే లొంగదీసికొనగలది. ఆ ముఖపద్మానికి ఆ కాంతశరీరమే తూడు. ముంగురుల వరుసలే తుమ్మెద. మందహాసమే పూదేనె. అది నిర్మలమైన మదనబాణం వంటిది.

**వి :** 1. ముఖపద్మం – రూపకం. పద్మావయవాలైన నాళం, భృంగం, తేనె వీటికన్నిటికీ, ఉపమానపక్షంలో శరీరం, ముంగురులు, మందహాసమున్నాయి. కాబట్టి ఇది సావయవ రూపకాలంకారం.

2. ప్రథమతృతీయపాదాదియమకం. *

**శ్లో॥న మునయోఽనుయయుర్మనసా చ యం - తమపి లబ్ధుమిమామనసా చయమ్ ।**
**దధదుపైతి జనః సహ జాయయా - విఘటితా ప్రకృతిః సహజా యయా ॥ 56**

**అ :** ద్వారవతి సాధారణజనులకు కూడా సులభమైన దనుట. - ద్రుతవిలంబితమ్.

**అ :** మునయః యం మనసా అపి చ న అనుయయుః తమ్ అపి లబ్ధుమ్ అనసా చయం దధత్ జనః జాయయా సహ యయా సహజా ప్రకృతిః విఘటితా (తామ్) ఇమామ్ ఉపైతి.

**ప్ర :** మునయః = ఋషులు, యమ్ = ఎవనిని, మనసా అపి చ = మనస్సుతో కూడా, న అనుయయుః = అనుసరించలేదో (అను+యా ప్రాపణే పరస్మైపది-లిట్-ప్ర.బ.), తమ్ అపి = ఆ కృష్ణునికూడా, లబ్ధుమ్ = చేరటానికై, అనసా = బండితో, చయమ్ = గుంపును, దధత్ = ధరిస్తూ (గుమిగూడి), జనః = ప్రజ, జాయయా సహ = భార్యతో కూడా, యయా = దేనిచేత, సహజా = నైసర్గికమైన, ప్రకృతిః = స్వభావం, విఘటితా = తొలగింపబడినదై, (తామ్) ఇమామ్ = ఆ ఈ ద్వారకను, ఉపైతి = చేరుతోంది.

**తా ॥** మునిజనులు కూడా సాధారణంగా మనసా కూడా అనుసరించటానికి వీలు కానివాడు కృష్ణుడు. అయితే అటువంటి కృష్ణుని చేరటానికి జనం గుంపులుగా బండిలో సంబారాల నుంచుకొని అందరూ దర్శించటానికి వీలుకాదన్న ద్వారకా ప్రకృతిని తొలగిస్తూ, ఆ ద్వారకను చేరుతోంది.

**వి :** 1. కృష్ణదర్శనంకోసం ద్వారకలోనికి ప్రవేశించటం కష్టమన్న స్వాభావికప్రకృతిని నిరసిస్తూ భక్తజనాన్ని తనలో చొరనిస్తోంది ద్వారక. యోగులకు కూడా అలబ్ధమైన కృష్ణసాక్షాత్కారం అక్కడ లభిస్తోందని తాత్పర్యం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపైతి :** | **ఉపైతి** | ఉపేతః | ఉపయాన్తి |
| | ఉపైషి | ఉపేథః | ఉపేథ |
| | ఉపైమి | ఉపేవః | ఉపేమః. |

*

**శ్లో॥ పరమాప రమా యస్యామాశ్రమం మా శ్రమం దివి ।**
**నివసన్నివ సంవేత్తి సర్వదా సర్వదానతః ॥ 17-57**

**అ :** ద్వారవతీ వైభోగవర్ణనం. - పథ్యావక్త్రమ్.

**అ :** యస్యాం రమా పరమ్ ఆశ్రమమ్ ఆప, (జనః) సర్వ-దానతః సర్వదా దివి నివసన్-ఇవ శ్రమం మా సంవేత్తి.

**ప్ర :** యస్యామ్ = ఏ నగరియందు, రమా = లక్ష్మి, పరమ్-ఆశ్రమమ్ = గొప్ప ఆశ్రమాన్ని (గృహస్థాశ్రమాన్ని), ఆప = పొందిందో (ఆప్ వ్యాప్తౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), (జనః = ప్రజ), సర్వ-దానతః : సర్వ = అన్నింటిని, దానతః = సమకూర్చుటవలన, సర్వదా = ఎల్లప్పుడు, దివి = స్వర్గంలో, నివసన్-ఇవ = నివసిస్తున్నట్లుగా, శ్రమమ్ = శ్రమను, మా సంవేత్తి = పొందదు. (సమ్ విద్ జ్ఞానే-అదాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ద్వారకలో లక్ష్మి నిత్యనివాసిని. అక్కడ సర్వసంభారాలు అందుబాటులో వున్నందువలన జనం అక్కడ నివసించటాన్ని సర్వనివాసంగా భావిస్తారు. శ్రమనసలు ఎరుగరు.

**వి :** 1. నాల్గుపాదాలలోనూ దేనికదిగా పాదాది యమకం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆప :** | **ఆప** | ఆపతుః | ఆపుః |
| | ఆపిథ | ఆపథుః | ఆప |
| | ఆప | ఆపివ | ఆపిమ |

| | | | |
|---|---|---|---|
| **సంవేత్తి :** | **సంవేత్తి** | సంవిత్తః | సంవిదన్తి |
| | సంవేత్సి | సంవిత్థః | సంవిత్థ |
| | సంవేద్మి | సంవిద్వః | సంవిద్మః. * |

**శ్లో॥ నివారయన్తీహ భటా యథేశో - నవీనమార్గే విశతః కృతాన్తే ।**
**న చేత్ క్షిపన్తీహ వృకా ఇవార్తా - నవీనమార్గే విశతః కృతాన్తే ॥ 17-58**

**అ :** ద్వారకలోని కృష్ణసైనికుల పనితీరును వర్ణించటం. - ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ భటాః, ఈశః కృతాన్తే నవీన-మార్గే విశతః యథా (తథా) నివారయన్తి. [(న చేత్ అమార్గే విశతః వృకాః ఆర్తాన్ అవీన్ ఇవ కృతాన్తే క్షిపన్తి.] (న చేత్ వృకాః ఇవ ఆర్తాః న, (కిన్తు) వి+ఇన-మార్గే విశతః కృతాన్తే క్షిపన్తి.)

**ప్ర :** ఇహ = ద్వారవతి యందు, భటాః = సైనికులు, ఈశః = ఈశ్వరుడు, కృత+అన్తే = కృతయుగాంతంలో, నవీన-మార్గే = నూతనవైష్ణవమార్గంలో, విశతః = ప్రవేశిస్తున్నవారిని, యథా = ఏ రీతిగా, (నివారయతి = నివారిస్తాడో), (తథా = అలా), నివారయన్తి = నివారిస్తున్నారు. (ని వృ ఆవరణే-చురాది-పరస్మైపది-లట్-ప్ర.బ.), న చేత్ = నిలువకపోతే, వృకాః ఇవ = తోడేళ్ళలా, ఆర్తాః = దీనులుగా, న (భవన్తి) = కావటంలేదు. (కిన్తు = అయితే), వి+ఇన-మార్గే : వి = పక్షులయొక్క, ఇన = సూర్యునియొక్క, మార్గే = దారిలో (ఆకాశమార్గంలో) (వీనామ్ ఇనస్య చ మార్గః, తస్మిన్), విశతః = ప్రవేశిస్తున్నవారిని, కృతాన్తే = యమునియందు (యమలోకంలోనికి), క్షిపన్తి = విసురుతున్నారు. (క్షిప్ ప్రేరణే-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** శివుడు కృతయుగాంతంలో నూతనవైష్ణవమార్గంవైపు వెళ్తున్నవారిని (అధర్మం వైపని కవి వివక్ష) నివారించినట్లు కృష్ణభటులు ద్వారకలో అక్రమంగా ప్రవేశించబోయే వారిని నివారిస్తున్నారు. భూమార్గంలో కుదరక గగనమార్గంలో ప్రవేశించదలచుకొన్నవారిని కూడా కృతాంతుని సన్నిధికి పంపుతున్నారు.

**వి :** 1. విష్ణుతత్త్వానికి భిన్నమైనవి ఏవైనా నవీనమార్గాలుగా (అధర్మమార్గాలుగా) వైష్ణవ పరిగణనం.

శ్లో॥ పరమో విష్ణురేవైకస్తద్జ్ఞానం మోక్షసాధనమ్ ।
శాస్త్రాణాం నిర్ణయస్త్వేషః తదన్యన్మోహనాయ హి ॥

శ్లో॥ జ్ఞానం వినా తు యా ముక్తిః సామ్యం చ మమ విష్ణునా ।
తీర్థాదిమాత్రతో జ్ఞానం మమాధిక్యం చ విష్ణుతః ॥

శ్లో॥ అభేదశ్చాస్మదాదీనాం ముక్తానాం హరిణా తథా ।
ఇత్యాది సర్వం మోహాయ కథ్యతే పుత్ర నాన్యథా ॥

- మహాభారతతాత్పర్యనిర్ణయః-1/53-55

2. ద్వితీయ, చతుర్థపాదాలలో పాదయమకం.

| | | | |
|---|---|---|---|
| 3. **నివారయన్తి :** | నివారయతి | నివారయతః | **నివారయన్తి** |
| | నివారయసి | నివారయథః | నివారయథ |
| | నివారయామి | నివారయావః | నివారయామః. |
| **క్షిపన్తి :** | క్షిపతి | క్షిపతః | **క్షిపన్తి** |
| | క్షిపసి | క్షిపథః | క్షిపథ |
| | క్షిపామి | క్షిపావః | క్షిపామః. * |

**శ్లో॥ తనోతి సా కోపిని శాన్తభావం - మనస్సు యః కోఽపి నిశాన్తభావమ్ ।**
**ఖగాశ్చ యస్యాం కలశాలికణ్ఠా - గృహాశ్చ భాస్వత్కలశాలికంఠాః ॥ 17-59**

**అ :** ద్వారవతీ స్వభావవైభవవర్ణన. - ఉపేంద్రవజ్ర.

**అ :** సా కోపిని శాంత-భావం తనోతి. యః కః అపి మనస్సు నిశా-అన్త-భావం తనోతి. యస్యామ్ ఖగాః చ కల-శాలి-కణ్ఠాః గృహాః చ భాస్వత్-కలశ-అలి-కంఠాః (భవన్తి).

**ప్ర :** సా = ఆ ద్వారవతి, కోపిని = కోపంగలవానియందు (కోపః అస్య అస్తి ఇతి, తస్మిన్), శాంత-భావమ్ = శాంతస్వభావాన్ని, తనోతి = కలిగిస్తుంది (పెంచుతుంది) (తన్ విస్తారే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యస్యామ్ = దేనియందు, యః కః+అపి = ఎవరైనా, మనస్సు = మనస్సులలో (ఆలోచనలలో) నిశా+అన్త-భావమ్ = ఉదయవేళాస్వభావాన్ని (నిశాయాః అన్తః, తస్య భావస్తమ్), తనోతి = కలిగిస్తుంది. ఖగాః చ = పక్షులు కూడా, కల-శాలి-కంఠాః : కల = అవ్యక్తమధురస్వరం (ధ్వనౌ తు మధురాస్ఫుటే కలః-అమరకోశః-నాట్య-2), శాలి = కల, కంఠాః = కంఠాలుగలవి. (కలేన శాలినః కంఠాః యేషాం తే), గృహాః చ = ఇళ్లు కూడా, భాస్వత్... కంఠాః : భాస్వత్ = ప్రకాశిస్తున్న, కలశ = కలశాలయొక్క, అలి = శ్రేణిగల, కంఠాః = కంఠభాగం కలవి.

**తా ॥** ఆ ద్వారవతి కోపంగలవారిలోనూ శాంతస్వభావాన్ని కలిగించగలది. అక్కడ ఎవరి మనస్సులలోనైనా అభ్యుదయభావాలే వుంటాయి. అక్కడి పక్షులు అవ్యక్తమధురస్వరంగల కంఠాలు గలవి. అక్కడి ఇళ్ళు కలశాల వరుసలతో అలంకరింపబడిన కంఠభాగాలు గలవి.

**వి :** 1. శ్లేష సహకృతమైన తుల్యయోగితాలంకారం, నాల్గు పాదాలలోనూ పాదాంతయమకం శ్లోకంలో వున్నాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **తనోతి :** | **తనోతి** | తనుతః | తన్వన్తి | |
| | తనోషి | తనుథః | తనుథ | |
| | తనోమి | తనువః/తన్వః | తనుమః/తన్మః. | * |

**శ్లో॥ భిత్తిస్థరత్నఫలితప్రతిరూపచిత్ర -**
**చిత్రాః సుశోభినవరత్నరుచా దధానాః ।**
**రఙ్గానుషఙ్గరమణీయమివ ప్రదేశం**
**యస్యాం విభాన్తి మురజిల్లలనానివాసాః ॥ 17-60**

**అ :** ద్వారవతిలోని కృష్ణకాంతల భవనాలవర్ణన. - వసంతతిలక.

**అ :** యస్యాం భిత్తి-స్థ-రత్న-ఫలిత-ప్రతిరూప-చిత్ర-చిత్రాః ముర-జిత్-లలనా-నివాసాః సుశోభి-నవ-రత్న-రుచా రంగ+అనుషంగ-రమణీయం ప్రదేశం దధానాః ఇవ విభాన్తి.

**ప్ర :** యస్యామ్ = ఏ ద్వారకయందు, భిత్తి... చిత్రాః : భిత్తి-స్థ = గోడలపైనున్న, రత్న = రత్నాలయందు, ఫలిత = ప్రతిబింబించిన, ప్రతిరూప = ప్రతిబింబాలు అనే, చిత్ర = చిత్రరచనలచే, చిత్రాః = విచిత్రమైన (భిత్తిషు తిష్ఠన్తీతి, తాని చ తాని రత్నాని, తేషు ఫలితాని ప్రతిరూపాణి ఏవ చిత్రాణి, తైః చిత్రాః), మురజిత్-లలనా-నివాసాః : మురజిత్ = కృష్ణునియొక్క, లలనా = స్త్రీలయొక్క, నివాసాః = ఇళ్ళు (మురజితః లలనాః తాసాం నివాసాః), సుశోభి... రుచా : సుశోభి = మిక్కిలి ప్రకాశిస్తున్న, నవరత్న = తొమ్మిది రత్నాలయొక్క, రుచా = కాంతితో (నవాని చ తాని రత్నాని, తేషాం రుక్, తయా), రంగ+అనుషంగ-రమణీయమ్ : రంగ = ముగ్గులయొక్క, అనుషంగ = కలయికతో, రమణీయమ్ = అందమైన (రంగైః అనుషంగేణ రమణీయః, తమ్), ప్రదేశమ్ = తావును, దధానాః ఇవ = ధరిస్తున్నట్లుగా, విభాన్తి = విశేషంగా ప్రకాశిస్తున్నాయి. (వి-భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ద్వారకలో కృష్ణుని అంతఃపురకాంతల నివాసభవనాలలోని గోడలపై నున్న రత్నాలలో ఆ కాంతల రూపాలు ప్రతిబింబితాలై నవరత్నారుచిగల ముగ్గులతో కూడిన ప్రదేశాల్లాగా అవి ప్రకాశిస్తున్నాయి.

**వి :** 1. శ్లోకంలో ఉత్ప్రేక్షాలంకారముంది. ఇవ శబ్దం ఉత్ప్రేక్షావ్యంజకం.

2. రత్నస్తంభాలు, రత్నాలు పొదిగిన గోడలు, వాటిపై ప్రతిబింబాలు ప్రాచీనకాల శోభను, సంపన్నతను తెలియజేస్తాయి. కృష్ణుని ఉనికి ద్వాపరయుగంలో. కథాకాలానికి సంబంధించిన వైభవమైనా, రచనాకాలానికి సంబంధించిన వైభవమైనా ఆనాటి సంపన్నతకు అది గుర్తు. మాఘుడు కూడా కృష్ణకథాసందర్భంలో ఇటువంటి వర్ణననే చేశాడు-

శ్లో॥ రత్నస్తంభేషు సంక్రాంత - ప్రతిమాస్తే చ కాశిరే ।
ఏకాకినోఽపి పరితః - పౌరుషేయవృతా ఇవ ॥ - శిశుపాలవధమ్-2/4.

| | | | |
|---|---|---|---|
| 3. **విభాన్తి :** | విభాతి | విభాతః | **విభాన్తి** |
| | విభాసి | విభాథః | విభాథ |
| | విభామి | విభావః | విభామః. |

*

**శ్లో॥ సౌహార్దనృత్యదురుకేకినికాయశోభి-సౌధేషు యత్ర రుచిరాచలశృఙ్గబుద్ధ్యా ।**
**సంసక్తమభ్రనిచయం పరితః పతన్త్యః - స్వస్పర్ధిగాత్రమజయన్మరుతా పతాకాః॥61**

**అ :** ద్వారవతిలోని సౌధవర్ణన. - వసంతతిలక.

**అ :** యత్ర సౌహార్ద-నృత్యద్-ఉరు-కేకి-నికాయ-శోభి-సౌధేషు రుచిర+అచల-శృంగ-బుద్ధ్యా సంసక్తమ్ స్వ-స్పర్ధి-గాత్రమ్ అభ్ర-నిచయం పరితః పతన్త్యః పతాకాః మరుతా అజయన్.

**ప్ర :** యత్ర = ఏ నగరిలో, పతాకాః = పతాకలు, సౌహార్ద... సౌధేషు : సౌహార్ద = మైత్రీభావంతో (సుహృదః భావః సౌహార్దమ్), నృత్యత్ = నృత్యంచేస్తున్న, ఉరు = గొప్ప, కేకి = నెమళ్ళయొక్క, నికాయ = గుంపుతో, శోభి = ప్రకాశిస్తున్న, సౌధేషు = భవనాలలో, (సౌహార్దేన నృత్యన్తః ఉరవశ్చ తే కేకినః, తేషాం నికాయేన శోభీని సౌధాని, తేషు), రుచిర... బుద్ధ్యా : రుచిర = అందమైన, అచల = కొండలయొక్క, శృంగ = కొమ్ములనే, బుద్ధ్యా = ఆలోచనతో (భావనతో) (రుచిరాణి చ తాని అచలానాం శృంగాణి, తద్బుద్ధిః, తయా), సంసక్తమ్ = లగ్నమైనదీ (చిక్కుకొన్నదీ), స్వ-స్పర్ధి-గాత్రమ్ : స్వ = తమతో, స్పర్ధి = పోటీపడుతున్న, గాత్రమ్ = శరీరంగలదీ అయిన, అభ్ర-నిచయమ్ = మేఘసమూహాన్ని (అభ్రాణాం నిచయస్తమ్), పరితః = చుట్టూ, పతన్త్యః = పడుతూ (రెపరెపలాడుతూ) మరుతా = గాలితో, అజయన్ = గెలిచారు. (జి జయే పరస్మైపది-లజ్-ప్ర.బ.)

**తా ॥** ద్వారకలోని సౌధాగ్రభాగాలలో నెమళ్ళు నాట్యమాడుతున్నాయి. ఆ సౌధాలను చూసి అందమైన కొండకొమ్ములు అనుకొని మేఘాలు వచ్చి వాటికి తగుల్కొంటున్నాయి. అది చూసి అక్కడున్న పతాకలు తమ శరీరంతో అవి పోటీపడుతున్నట్టు భావించి, వాటిని చుట్టుముట్టి పతాకలు తమ కదలికల వల్ల పుట్టిన గాలితో వాటిని గెలుస్తున్నాయి.

**వి :** 1. సౌధోపరిభాగాలలో నాట్యమాడుతున్న నెమళ్ళను చూసి అందమైన గిరిశిఖరాలని మేఘాలు భావించటం భ్రాంతిమదలంకారం. అయితే దీనిద్వారా సౌధాలు చాలా ఎత్తైనవన్నది ధ్వనిస్తుంది. పతాకలు తమంతతాము గాలికి ఎగురుతున్నాయి కానీ వాటినుండి పుట్టిన గాలి ద్వారా ఆ మేఘాలను జయిస్తున్నాయనటం అతిశయోక్తి. జడపదార్థమైన పతాకకు జయేచ్ఛను, జయసిద్ధిని వర్ణించటం వక్రోక్త్యలంకారం. 'సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః' - (కావ్యాలంకారసూత్రాణి-4/3/8)

| | | | |
|---|---|---|---|
| 2. **అజయన్ :** | అజయత్ | అజయతామ్ | **అజయన్** |
| | అజయః | అజయతమ్ | అజయత |
| | అజయమ్ | అజయావ | అజయామ. * |

**శ్లో॥ యస్యాం సువర్ణవరవేష్టనభాజితేజః-ప్రద్యోతితామ్బరహరిన్మణివిద్రుమాద్యైః ।**
**రత్నైర్నవైర్నవవిధైః ఖచితే సహన్తే - ప్రాసాదమూర్ధ్ని న బుధాః కపిశీర్షనామ ॥62**

**అ :** ద్వారవతిలోని ప్రాసాదాల వర్ణనం. - వసంతతిలక.

**అ :** యస్యాం బుధాః సువర్ణ-వర-వేష్టన-భాజి-తేజః-ప్రద్యోతిత+అంబర-హరిత్+మణి-విద్రుమ+ఆద్యైః నవ-విధైః నవైః రత్నైః ఖచితే ప్రాసాద-మూర్ధ్ని కపి-శీర్ష-నామ న సహన్తే.

**ప్ర :** యస్యామ్ = ఏ ద్వారకలో, బుధాః = పండితులు, సువర్ణ... మాద్యైః : సువర్ణ = బంగారుతో చేసిన, వర = శ్రేష్ఠమైన, వేష్టన = ఆచ్ఛాదనఫలకాలపై (టైల్స్), భాజి = చేరివున్న, తేజః = దీప్తులచే, ప్రద్యోతిత = వెలుగొందజేయబడిన, అంబర = ఆకాశంగల, హరిత్+మణి = పచ్చలు, విద్రుమ = పగడాలు, ఆద్యైః = మొదలుగాగల, (సువర్ణమయాని వరాణి చ తాని వేష్టనాని, తాని భజతీతి, తచ్చ తత్ తేజః, తేన ప్రద్యోతితం అంబరం యై స్తే చ తే హరిన్మణయః విద్రుమాశ్చ ఆదౌ యేషాం తైః), నవ-విధైః = తొమ్మిది రకాలైన (నవ చ తే విధాః, తైః), రత్నైః = రత్నాలచే, ఖచితే = పొదగబడిన, ప్రాసాద-మూర్ధ్ని = మేడల పై భాగానికి, కపి-శీర్ష-నామ = కపి శీర్షమనే పేరును, న సహన్తే = సహింపరు. (సహ మర్షణే-ఆత్మనేపది-లట్-ప్ర.బ.)

**తా ॥** ద్వారవతిలోని ప్రాసాదాగ్రభాగంలో బంగారుపలకలను పరిచి వాటిపై నవరత్నాలను పొదిగి వున్నారు. వాటికాంతులు ఆకాశాన్ని ప్రకాశింపజేస్తున్నాయి. అటువంటి ప్రాసోదోపరి భాగాన్ని కపిశీర్షమనటాన్ని పండితులు సహించటంలేదు. (అంగీకరింపలేకపోతున్నారు.)

**వి : 1. కపిశీర్షమ్** = ప్రాకారాగ్రే, కోటకొమ్ము (శబ్దార్థకల్పతరుః-పు-424), కపిశీర్షమంటే గోడపై చివర అని ఆంధ్రవాచస్పత్యము (ద్వితీయ సంపుటం-728). ఇప్పుడు మనం వ్యవహరించే 'పిట్టగోడ' కావచ్చు. బంగారు పలకలతో కప్పి, ఆపై రత్నాలు పొదగబడి వున్నదానిని కపిశీర్షమనటం పండితులకు నచ్చకపోవటం కపి పదాన్ని తక్కువగా భావించటం. 'కోతిచేష్టలు' మనం వ్యవహరిస్తుంటాం. దుర్మార్గతలేని అల్లరి పనులు చేసేవాళ్లను చూసి. వాల్మీకి రామాయణంలో హనుమత్పాత్రను గొప్పగా చిత్రీకరించికూడా మండోదరిని చూసి సీత అని తాను భ్రమించినప్పుడు చేసిన చేష్టలను కుప్పిగంతుల్లాగానే వర్ణించారు గదా!

శ్లో॥ ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం - ననన్ద చిక్రీడ జగౌ జగామ ।
స్తంభానరోహన్నిపపాత భూమౌ - సందర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్॥

- సుందరకాండమ్-10/54

అందువల్ల కాబోలు అక్కడి పండితులు కపిశీర్షపదాన్ని అంగీకరించటంలేదు.

| | | | |
|---|---|---|---|
| 2. **సహన్తే :** | సహతే | సహేతే | **సహన్తే** |
| | సహసే | సహేథే | సహధ్వే |
| | సహే | సహావహే | సహామహే. * |

**శ్లో॥ నయతి న యతిరన్యద్భోజ్యమాత్రాన్నమాత్రాత్**
**చరతి చ రతిభర్త్రా ప్రేరితో నైవ భోగ్యే ।**

**జనిమజనిమతజ్ఞః సన్తరత్యేవ చాన్తే**
**యమభయమభయాప్త్యా స్వస్థవృత్తిర్న వేత్తి ॥** **17-63**

**అ :** ద్వారకలోని సంన్యాసి ప్రవృత్తివర్ణనం. – మాలిని.

**అ :** యతిః భోజ్యమాత్ర-అన్న మాత్రాత్ అన్యత్ న నయతి. రతి-భర్త్రా ఏవ ప్రేరితః భోగ్యే న చరతి. అజని-మత-జ్ఞః (సన్) అన్తే జనిం సంతరతి ఏవ. అభయ+ఆప్త్యా స్వస్థ-వృత్తిః (సన్) యమ-భయం న వేత్తి.

**ప్ర :** యతిః = సంన్యాసి, భోజ్యమాత్ర-అన్నమాత్రాత్ : భోజ్యమాత్ర = తినటానికి తగినంత, అన్నమాత్రాత్ = అన్నంకంటె, అన్యత్ = మరొకటి, న నయతి = తీసికొనడు. (నీ ప్రాపణే పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), రతి-భర్త్రా ఏవ = రతిపతి (మదనుని) చేతనే, ప్రేరితః సన్ అపి = రెచ్చగొట్టబడినా, భోగ్యే = విషయవాంఛలపై, న చరతి = ప్రవర్తించడు. (చర గతి భక్షణయోః-పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), అజని-మత-జ్ఞః (సన్) : అజని = బ్రహ్మయొక్క, మత-జ్ఞః (సన్) = సిద్ధాంతం తెలిసినవాడై (అజనేః మతం జానాతీతి), అన్తే = దేహాన్ని విడిచినప్పుడు, జనిమ్ = జన్మను, సంతరతి+ఏవ = దాటిపోతాడు (జనన మరణచక్రాన్ని) సమ్-తౄ ప్లవనతరణయోః-పరస్మైపది-లట్-(ప్ర.ఏ.), అభయ+ఆప్త్యా : అభయ = పరమాత్మను, ఆప్త్యా = పొందుటచే (నాస్తి భయం యస్మాత్ సః, తస్య ఆప్తిః, తయా), స్వస్థ-వృత్తిః (సన్) = నెమ్మదిగా వున్నవాడై (స్వస్తా వృత్తిః యస్య సః), యమభయమ్ = యమునివలన భయాన్ని (యమాత్ భయమ్), న వేత్తి = తెలియదు. (విద్ జ్ఞానే-అదాది-పరస్మైపది-లట్-(ప్ర.ఏ.)

**తా ॥** ద్వారకలోని సంన్యాసి ఆకలి తీరటానికి అవసరమైనంత అన్నాన్ని మాత్రమే తీసికొంటాడు. మన్మథుడే రెచ్చగొట్టినా విషయభోగాలవైపు వెళ్ళడు. ద్వైత (మధ్వ) సిద్ధాంతం తెలిసి ప్రయాణాంతకాలంలో విముక్తి పొందుతాడు. పరమాత్మను చేరినందువల్ల యమ భయాన్ని అసలు పొందడు.

**వి :** 1. ప్రాణికి ఆహారం ప్రాణధారణకు మాత్రమే. అది వాతావరణపరిస్థితులవల్ల, అభిరుచులలోని వైవిధ్యం వల్ల, సుఖలబ్ధికి దానిని కూడా సాధనంగా స్వీకరించినందువల్ల ఆహారపానీయాల విషయంలో అనంతత ఏర్పడింది. ఆ స్థితిలో జీవితంలోని ఆయా ఆశ్రమాలకు అనుగుణంగా ఆహారాన్ని స్వీకరించటానికి కూడా కొన్ని నియమాలు ఏర్పరచారు.

సంన్యాసి ఆహారాన్ని గ్రహించటంలో పాటించవలసిన నియమాలు-

**భిక్షార్థీ గ్రామమియాత్ । జఘన్యమనివృత్తం చరేత్ । నివృత్తాశీః ।**

– **గౌతమధర్మసూత్రాణి** 1/3/13-15

భిక్షకోసం గ్రామానికి వెళ్ళాలి. భిక్షపెట్టడంలో ఆలస్యమైతే వెనుదిరిగి రెండోసారి వెళ్ళకూడదు. అధికభిక్షకోసం దీవెనలిచ్చే పనికి పూనుకోగూడదు.

ఆహారవిహారాల విషయంలో సంన్యాసులకు మనువు ప్రతిపాదించిన నియమాలు గమనించండి- **భిక్షాకాలవిధి-**

శ్లో॥ విధూమే సన్నముసలే వ్యంగారే భుక్తవజ్జనే ।
వృత్తే శరావసంపాతే భిక్షాం నిత్యం యతిశ్చరేత్ ॥

**భిక్షాసమయంలోని మనస్థితి-**

శ్లో॥ అలాభే న విషాదీ స్యాల్లాభే చైవ న హర్షయేత్ ।
ప్రాణయాత్రికమాత్రః స్యాత్ మాత్రాసంగాద్వినిర్గతః ॥ **-మనుస్మృతి**-6/56,57

**భోగవిషయంలో-**

శ్లో॥ అల్పాన్నాభ్యవహారేణ రహః స్థానాసనేన చ ।
ప్రియమాణాని విషయైరింద్రియాణి నివర్తయేత్ ॥

శ్లో॥ ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ ।
అహింసయా చ భూతానామమృతత్వాయ కల్పతే - మనుస్మృతి-6/59,60

ఈ యమభయప్రసక్తి భజగోవిందంలోకూడా కనిపిస్తుంది.

శ్లో॥ భగవద్గీతా కించిదధీతా - గంగాజలలవకణికా పీతా ।
సకృదపి యేన **మురారిసమర్చా** - క్రియతే తస్య యమేన న చర్చా ॥ - **భజగోవిందం**-20

2. నాలుగుపాదాలలోనూ పాదాదియమకాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 3. **నయతి :** | **నయతి** | నయతః | నయన్తి |
| | నయసి | నయథః | నయథ |
| | నయామి | నయావః | నయామః |
| **చరతి :** | **చరతి** | చరతః | చరన్తి |
| | చరసి | చరథః | చరథ |
| | చరామి | చరావః | చరామః |
| **సంతరతి :** | **సంతరతి** | సంతరతః | సంతరన్తి |
| | సంతరసి | సంతరథః | సంతరథ |
| | సంతరామి | సంతరావః | సంతరామః |
| **వేత్తి :** | **వేత్తి** | విత్తః | విదన్తి |
| | వేత్సి | విత్థః | విత్థ |
| | వేద్మి | విద్వః | విద్మః. |

*

**శ్లో॥ న వహతి హృది తోషం వైరివధ్వాః కపోలే**
**నవహతిమవలోక్య శ్వాసవిశ్రాన్తవాక్యా ।**
**సముదితరవిదృష్టివ్రీడవిభ్రాన్తనేత్రా**
**సముదితరవరాజ్ఞీ భావమావిష్కరోతి ॥** **17-64**

**అ :** ద్వారకలోని దక్షిణనాయకుని భార్యల స్వభావాన్ని వర్ణించటం. -మాలిని.

**అ :** వైరి-వధ్వాః కపోలే నవ-హతిమ్ అవలోక్య శ్వాస-విశ్రాంత-వాక్యా హృది తోషం న వహతి. సముదిత-రవి-దృష్టి-వ్రీడ-విభ్రాంత-నేత్రా (సతీ) సముత్-ఇతర-వర-అంగీ భావమ్ ఆవిష్కరోతి.

**ప్ర :** వైరి-వధ్వాః = సవతియొక్క (వైరిణీ చ సా వధూః, తస్యాః), కపోలే = చెక్కిలిపై, నవ-హతిమ్ = కొత్తగాయాన్ని (నవా చ సా హతిః, తామ్), అవలోక్య = చూసి (అవ-లోక్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శ్వాస... వాక్యా : శ్వాస = ఊర్పుచే, విశ్రాంత = ఆగిన, వాక్యా = మాటగలదై (శ్వాసేన విశ్రాంతం వాక్యం యస్యాస్సా), హృది = ఎడదలో, తోషమ్ = ఆనందాన్ని, న వహతి = పొందుటలేదు. (వహ్ ప్రాపణే-భ్వాది-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), సముదిత... నేత్రా (సతీ), : సముదిత = పుట్టిన, రవి = ప్రొద్దుయొక్క, దృష్టి = చూచుటచేత (పుట్టిన), వ్రీడ = సిగ్గుచేత, విభ్రాంత = అటుఇటు కదులుతున్న, నేత్రా = కన్నులుగలదై (సముదితస్య రవేః దర్శనేన వ్రీడయా విభ్రాంతే నేత్రే యస్యాస్సా), స-ముత్ = సంతసంతో గూడినదై (ముదా సహ వర్తత

ఇతి), ఇతర-వర+ అంగీ = ఆ రెండవ కాంత (ఇతరా చ సా వరాణి అంగాని యస్యాః సా), భావమ్ = విలాసాన్ని, ఆవిష్కరోతి = ప్రకటిస్తోంది. (ఆవిః+కృ కరణే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** ఒక కాంత తన సవతియొక్క చెక్కిలిపై క్రొత్త గాయాన్ని చూసి, నిట్టూర్పుతోనే మాటను ఆపింది. ఆనందాన్ని కోల్పోయింది. తెల్లవారగానే సూర్యుని చూసి సిగ్గుతో కళ్ళు రెపరెపలాడుతుండగా ఆ కాంత (సవతి) తనలోని విలాసాన్ని ప్రకటిస్తోంది.

**వి :** 1. నాలుగు పాదాలలోనూ పాదాది యమకమే.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆవిష్కరోతి :** | **ఆవిష్కరోతి** | ఆవిష్కురుతః | ఆవిష్కుర్వన్తి |
| | ఆవిష్కరోషి | ఆవిష్కురుథః | ఆవిష్కురుథ |
| | ఆవిష్కరోమి | ఆవిష్కుర్వః | ఆవిష్కుర్మః. |

*

**శ్లో॥ విహాయ సాలోక్యముదారమన్తే - విహాయసాఽఽలోక్య ముదా రమన్తే ।**
**మహీశకన్యాసకలార్థరూప-మహీశకన్యాసకలార్థరూపమ్ ॥ 17-65**

**అ :** ఖేచరులు ద్వారకవైభవాన్ని చూసి ఆనందించటం. - ఉపేంద్రవజ్ర.

**ప :** విహాయ సాలోక్యమ్ ఉదారమ్ అన్తే - విహాయసా ఆలోక్య ముదా రమన్తే ।
మహీ+ఈశ-కన్యా-సకల+అర్థ-రూపమ్-అహి+ఈశ-క-న్యాస-కలా+అర్థ-రూపమ్॥

**అ :** (ఖేచరాః) అహి+ఈశ-క-న్యాస-కళా-అర్థ-రూపం మహీ+ఈశ-కన్యా-సకల-అర్థ-రూపం విహాయసా ఆలోక్య అన్తే ఉదారం సాలోక్యం విహాయ ముదా రమన్తే.

**ప్ర :** ఖేచరాః = దేవతావిశేషాలు, అహీశ... రూపమ్ : అహి = ఆదిశేషువు, ఈశ = శివుడు, క = బ్రహ్మ-వీరియొక్క, న్యాస = సంన్యాసరూపమైన, కళా = (నేర్పుతో గూడిన) విద్యయొక్క, అర్థ-రూపమ్ = అర్థస్వరూపుడూ (అహిశ్చ ఈశశ్చ కశ్చ అహీశకాః, తేషాం న్యాసః ఏవ కళా, తస్యాః అర్థస్య రూపం యస్య తమ్), మహీశ... రూపమ్ : మహీ+ఈశ = రాజులయొక్క, కన్యా = కుమార్తెలయొక్క, సకల = సర్వవిధాలైన, అర్థ = పురుషార్థాల యొక్క, రూపమ్ = రూపంగలవాడూ అయిన కృష్ణుని (మహ్యాః ఈశాః, తేషాం కన్యాః, తాసాం సకలాః అర్థాః యేభ్యః, తాని చ తాని రూపాణి యస్య, తమ్), విహాయసా = ఆకాశంనుండి, ఆలోక్య = చూసి, అన్తే = చివర లభించే, ఉదారమ్ = అధికమైన (గొప్పదైన) సాలోక్యమ్ = సాలోక్యరూపమైన మోక్షాన్ని, విహాయ = విడిచి (వి-హా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ముదా = ఆనందంతో, రమన్తే = క్రీడిస్తున్నారు.

**తా ॥** ఖేచరులు కొందరు ఆదిశేషుడు, ఈశుడు, బ్రహ్మ మొదలగువారి సంన్యాసరూపమైన విద్యకు అర్థ (ఫల) స్వరూపుడూ, (నరకుని నుండి విడిపించిన) రాజకన్యకలకు సకల పురుషార్థస్వరూపుడూ అయిన కృష్ణుని గగనతలంనుండి చూసి తమకు లభించిన ఉదారమైన సాలోక్యమోక్షాన్ని కూడా కాదని ఆనందంగా వినోదిస్తున్నారు.

**వి :** 1. సాలోక్యముక్తిలో విష్ణుదర్శనం నిత్యంగా లభిస్తుంది. అయితే అక్కడ నారాయణుడొక్కడే. ఇక్కడయితే తన లీలావిలాసంతో కృష్ణుడు తన కాంతలకు అందరకూ విడివిడిగా ఎవరికి వారికి తానొక్కడుగా కనిపిస్తున్నాడు. అన్ని రూపాలనూ ఒక్కసారే చూడవచ్చు గగనచారులు. అందువల్ల వారికి సాలోక్యముక్తికన్న ద్వారకలో కృష్ణసందర్శనం ఆనందకరమవుతోంది.

శ్లో॥ అంగనామంగనామంతరే మాధవో - మాధవం మాధవం చాన్తరేణాంగనా ॥ **- కృష్ణకర్ణామృతం-**

శ్లిష్యతి కామపి చుంబతి కామపి రమయతి కామపి రామాం
పశ్యతి సస్మితచారుతరామపరామనుగచ్ఛతి వామామ్- **గీతగోవిందం.**

అంటూ మధురభక్తితో లీలాశుకయోగి, జయదేవుడు సందర్శించినదీ వైభవాన్నే.

2. ప్రథమద్వితీయ పాదాలలోనూ, తృతీయ చతుర్థ పాదాలలోనూ విడిగా పాదయమకాలంకారం.

3. సాలోక్యముక్తి అన్నది నాలుగు ముక్తిమార్గాలలో ఒకటి. అయినా ఆ ముక్తిమార్గాన్ని కూడా వదలివేయటానికి సిద్ధపడటం గుణాన్ని దోషీకరించటం. అది లేశాలంకారం. '**లేశః స్యాద్దోషగుణయోర్గుణదోషత్వకల్పనమ్**'- (కు. 138)

| | | | |
|---|---|---|---|
| 4. **రమన్తే :** | రమతే | రమేతే | **రమన్తే** |
| | రమసే | రమేథే | రమధ్వే |
| | రమే | రమావహే | రమామహే. |

*

**శ్లో॥ మదభ్రమత్తారవిశఙ్కినేత్ర-మదభ్రమత్తా రవిశఙ్కినేఽత్ర ।**
**ప్రాయోజయద్యా నగధీరచిత్తం - ప్రాయోఽజయద్యానగధీరచిత్తమ్ ॥ 17-66**

**అ :** ద్వారవతిలోని స్త్రీశక్తి వర్ణన. - ఉపజాతి. (1,2పాదాలు ఉపేంద్రవజ్ర. 3,4పాదాలు ఇంద్రవజ్ర.)

**ప :**మద-భ్రమత్-తార-విశంకి-నేత్రమ్ అదభ్ర-మత్తా రవి-శంకినే అత్ర । ప్రాయోజయద్ యా నగ-ధీర-చిత్తం ప్రాయః అజయద్ యాన-గ-ధీః అచిత్-తమ్॥

**అ :** అత్ర అదభ్ర-మత్తా అచిత్ యా రవి-శంకినే మద-భ్రమత్-తార-విశంకి-నేత్రం ప్రాయోజయత్ యాన-గ-ధీః (సా) నగ-ధీర-చిత్తం తమ్ అజయత్.

**ప్ర :** అత్ర = ఆ ద్వారవతిలో, అదభ్ర-మత్తా : అదభ్ర = ఎక్కువగా (పుష్కలం పుష్ప మదభ్రమ్-హలాయుధకోశః -701), మత్తా = మత్తెక్కినదై, అచిత్ = తెలివిడి లేనిదై (నాస్తి చిత్ యస్యాస్సా), యా = ఏ కాంత, రవి+శంకినే : రవి = సూర్యుని (చూసి), శంకినే = అనుమానిస్తున్న (వానిపై), మద... నేత్రమ్ : మద = మత్తుతో, భ్రమత్ = తిరుగుతున్న, తార = కనుపాపనూ, శంకిత = సంశయిస్తున్న, నేత్రమ్ = కంటినీ కూడా (మదేన భ్రమత్ తారం యస్య, తచ్చ తత్ విశంకి నేత్రం చ), ప్రాయోజయత్ = ప్రయోగించిందో, యాన-గ-ధీః : యాన-గ = దేవతలయొక్క, ధీః = (తనయందు) బుద్ధిగల, సా = ఆమె, నగ-ధీర-చిత్తమ్ : నగ = కొండవలె, ధీర = నిశ్చలమైన, చిత్తమ్ = మనస్సుగల (నగవత్ ధీరం చిత్తం యస్య సః, తమ్), తమ్ = ఆ పురుషుని, అజయత్ = గెలిచింది. (జి జయే పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** ఒక కాంత - విమానాలలో సంచారం చేసే దేవతల దృష్టి కూడా ఆమెపై వుంటుంది - మద్యపానం చేత బాగా మత్తెక్కి, వివేకాన్ని కోల్పోయి కూడా, మత్తుతో తిరుగుతున్న కనుపాపలూ, కన్నులూ గలదై సూర్యుడు కనిపించినా జనమంతా తన్ను చూస్తూన్నారేమో అని అనుమానిస్తున్న నగధీర పురుషుని కూడా గెలవగలుగుతోంది.

**వి :** 1. సూర్యుని చూస్తేనే జనం చూస్తున్నారేమో అని శంకించేవాడు నగధీరచిత్తుడెలా కాగలడు? అతని నామె ఎలా జయించగలదు?

**శ్లో॥ వేదా ద్వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ ।**
**తాసు తేష్వప్యనాసక్తః సాక్షాద్భర్గో నరాకృతిః ॥**

'బ్రహ్మ దృష్టిలో కాంతాకనకాలు' రెండే భ్రాంతి స్థానాలు. ఆరెండింటిపై ఆసక్తి లేకపోతే సాక్షాత్తూ శివస్వరూపుడే' - అందుకే కాంతా వ్యామోహాన్ని తీవ్రంగా వ్యతిరేకించేవారు కనకానికి లొంగిపోవటం, కనకంపై యావలేనివారు కాంతలకు లొంగిపోవటం లోకంలో చూస్తున్నాం. రెండింటినీ గెలిచినవారు లేరా? ఉన్నారు. వారు సాక్షాత్తూ పరమాత్మస్వరూపులు.

2. ప్రథమద్వితీయపాదాలలోనూ, తృతీయ చతుర్థపాదాలలోనూ విడిగా పాదయమకం.

| | | |
|---|---|---|
| 3. **అజయత్ : అజయత్** | అజయతామ్ | అజయన్ |
| అజయః | అజయతమ్ | అజయత |
| అజయమ్ | అజయావ | అజయామ. |

*

**శ్లో॥ సరసా విలసద్ధారసరసారశిరోధరాః ।**
**నయనైర్వశయన్త్యస్యాం నయనైపుణ్యజిష్ణుభిః ॥** **17-67**

**అ :** ద్వారకలోని స్త్రీశక్తివర్ణన. – పథ్యావక్త్రమ్.

**అ :** అస్యాం సరసాః విలసద్–హార–సర–సార–శిరః+ధరాః (కాన్తాః) నయ–నైపుణ్య–జిష్ణుభిః నయనైః వశయన్తి.

**ప్ర :** అస్యామ్ = ఈ నగరియందు, సరసాః = శృంగారవతులూ (రసేన సహితాః), విలసద్... ధరాః : విలసద్ = ప్రకాశిస్తున్న, హార–సర = ముత్యాల సరాలచే, సార = అందమైన (బలిష్ఠమైన), శిరోధరాః = మెడలుగలవారూ అయిన (విలసద్భిః హారాణాం సరైః సారాః శిరసాం ధరాః యాసాం తాః), నయ... జిష్ణుభిః : నయ = నీతిచే, నైపుణ్య = నేర్పుచే, జిష్ణుభిః = జయశీలంగల, నయనైః = కళ్ళతో, వశయన్తి = లొంగదీసికొంటున్నారు (వశ్ కాన్తౌ–ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.బ.)

**తా ॥** ద్వారవతిలోని శృంగారరసపరిపూర్ణమైన కాంతలు మెడనిండా ముత్యాలపేరులు ధరించి నడతనేర్పులతో జయశీలాన్ని సాధించుకొన్న కళ్ళతో (మగవారిని) వశపరచు కొంటున్నారు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. వశయన్తి :** | వశయతి | వశయతః | **వశయన్తి** |
| | వశయసి | వశయథః | వశయథ |
| | వశయామి | వశయావః | వశయామః. |

*

**శ్లో॥ సేయం పురీ వితనుతే విషయోపభోక్తుః**
**ప్రాయః ఫలేన సమతాం విషయోజ్ఝితస్య ।**
**యత్కృష్ణసఙ్గతవధూషు లలామలేపైస్త–**
**ద్ధ్యానధూతదురితేషు చ తస్య సామ్యమ్ ॥** **17-68**

**అ :** విషయాసక్తులకూ, విరక్తులకూ కూడా ద్వారక సమానఫలాన్ని ఇవ్వటం. –వసంతతిలక.

**అ :** సా ఇయం పురీ విషయ+ఉపభోక్తుః విషయ+ఉజ్ఝితస్య చ ప్రాయః ఫలేన సమతాం వితనుతే. యత్ కృష్ణ–సంగత–వధూషు లలామ–లేపైః తద్–ధ్యాన–ధూత–దురితేషు తస్య సామ్యం చ.

**ప్ర :** సా ఇయమ్ పురీ = ఆ ఈ ద్వారక, విషయ+ఉపభోక్తుః = కాముకులకు (విషయాణాముపభోక్తా, తస్య), విషయ+ఉజ్ఝితస్య చ = విరక్తునకు కూడా (విషయానుజ్ఝితః, తస్య), ప్రాయః = దాదాపు, ఫలేన = ఫలకారణంగా, సమతామ్ = సమానత్వాన్ని, వితనుతే = కలిగిస్తుంది. (వి–తన్ విస్తారే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), యత్ = ఎందుకంటే, కృష్ణ–సంగత–వధూషు : కృష్ణ = కృష్ణునితో, సంగత = కలిసిన, వధూషు = కాంతలలో (కృష్ణేన సంగతాః చ తాః వధ్వః, తాసు), లలామ–లేపైః = శ్రేష్ఠమైన మైపూతలతో (ఆ మైపూతలు వారికంటుకొని వారికి కృష్ణునితో పోలిక), తద్... దురితేషు : తద్ = ఆ కృష్ణునియొక్క, ధ్యాన = తలపుచేత, ధూత = తొలగింపబడిన, దురితేషు = పాపాలుగలవారికి, తస్య = ఆ కృష్ణునితో, సామ్యం చ = సారూప్యముక్తి కూడా.

**తా ॥** ఆ ద్వారకలో విషయాసక్తులకూ, విషయవిరక్తులకూ కూడా సమానమైన ఫలితమే. ఎలా అంటే కృష్ణునితో కలిసిన కాంతలకు ఆ కౌగిలింతవలన కృష్ణుని శరీరంమీద చందనాదులు అంటి కృష్ణునితో సామ్యం. కృష్ణధ్యానంచేత పాపాలు నశించిన విరక్తులకు కృష్ణునితో సారూప్యం.

**వి :** 1. రామునిలా బ్రతకటం చాలా తేలిక. నిజానికి అటువంటి వ్యక్తులు సమాజంలో చాలామందే వుంటారు. కానీ **కృష్ణునిలా జీవించటం చాలకష్టం. ప్రవృత్తిని, సంస్కృతిని, నాగరికతను, వైయక్తిక విశేషాలను నాలుగింటినీ సమన్వయం చేసుకొనగలిగితేనే కృష్ణునిలా బ్రతకగలం.** అది చాలా కష్టం. ముందుగా సదసద్విభాగానికి భిన్నంగా పదార్థ, పదార్థధర్మాలను అర్థంచేసికొనగలగాలి. భిన్నపదార్థాల మధ్యగల సాదృశ్య వైదృశ్యపరిజ్ఞానం, వాటి మిశ్రణం, అసలు కుదరని దానిని దూరం చేయగలగటం – ఇదంతా తెలియాలి. దీన్నే జీవనశాస్త్రమనో, జీవనవేదమనో అనవచ్చు. తత్త్వశాస్త్రం, మనస్తత్త్వశాస్త్రం–ఈ రెండింటినీ దాపరికం లేకుండా అంగీకరించగలగటం, స్వీకరించగలగటం, సామాజిక వికాసశాస్త్రంతో దానిని సమన్వయపరచగలగటం చేతనైతేనే కృష్ణతత్త్వ–మర్థమవుతుంది.

భోగులకూ, యోగులకూ కూడా తనతో సాదృశ్యాన్ని గల్పించగలగటమంటే అది విశిష్టమైన తత్త్వమని అర్థం. ఆలంకారికపరిభాషలో ఇది తుల్యయోగితాలంకారం. '**హితాహితే వృత్తి తౌల్యమపరా తుల్యయోగితా**" – (కు.46)

| | | | |
|---|---|---|---|
| 2. **వితనుతే :** | **వితనుతే** | వితన్వాతే | వితన్వతే |
| | వితనుషే | వితన్వాథే | వితనుధ్వే |
| | వితన్వే | వితనువహే | వితనుమహే. |

*

**శ్లో॥ దన్తక్షతం వీక్ష్య నవం నవోష్ఠే – చిన్తా దురన్తా సమభూత్ సపత్న్యాః ।**
**అన్యా తదాచ్ఛాదనయుక్తిశూన్యా – తన్వీ ముహుర్దర్శయతీహ దైన్యమ్ ॥ 69**

**అ :** విషయభోక్తలకు, విషయవిరక్తులకు సమాన ఫలమని నిరూపించటం. –ఇంద్రవజ్ర.

**అ :** ఇహ నవోష్ఠే నవం దంత–క్షతం వీక్ష్య సపత్న్యాః దురన్త–చిన్తా సమభూత్. అన్యా తద్+ఆచ్ఛాదన–యుక్తి–శూన్యా తన్వీ ముహుః దైన్యం దర్శయతి.

**ప్ర :** ఇహ = ఈ ద్వారకలో, నవోష్ఠే = నూతననాయిక (ముద్దరాలి)యొక్క పెదవిపై, నవమ్ = కొత్త, దంత–క్షతమ్ = పంటిగాటును (దన్తస్య క్షతమ్), వీక్ష్య = చూసి, సపత్న్యాః = సవతికి, దురన్త–చిన్తా : దురన్త = అంతులేని, చిన్తా = వేదన, సమ్–అభూత్ = కలిగింది. (సమ్+భూ సత్తాయాం–భ్వాది–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.), అన్యా తన్వీ = మరొకతె (పంటిగాటు కలది), తద్... శూన్యా : తద్ = ఆ పంటిగాటును, ఆచ్ఛాదన = కప్పివేయుటలో, యుక్తి–శూన్యా = ఉపాయం లేనిదై, ముహుః = మాటిమాటికి, దైన్యమ్ = దీనత్వాన్ని, దర్శయతి = కనుపింపజేస్తోంది. (దృశ్ ప్రేక్షణే–ణిచ్–పరస్మైపది–లట్–ప్ర.ఏ.) 'ఓత్వోష్ఠయోః సమాసేవా' నవోష్ఠే, నవౌష్ఠే రెండు రూపములు సాధువులే.

**తా ॥** నూతన యువతి పెదవిపై దంతక్షతాన్ని చూసి సవతి దురంతమైన వేదనను అనుభవించింది. కానీ ఆ పంటిగాటు గల యువతి మాత్రం దానిని కప్పిపుచ్చుకొనే ఉపాయం దొరకక దీనత్వాన్ని ప్రదర్శిస్తోంది.

**వి :** 1. సుఖపడిన–మనభాషలో–యువతికీ దైన్యమే. ఆమెను చూసి కలతపడిన కాంతకూ దైన్యమే. అనుభవిస్తున్నా, అనుభవాన్ని గురించి ఆలోచిస్తున్నా ఫలితమొక్కటే.

శ్లో॥ కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్ ।
ఇంద్రియార్థాన్ విమూఢాత్మా మిథ్యాచారస్స ఉచ్యతే ॥ – భగవద్గీత –3/6

శ్లోకంలో ప్రతిపాదించిందీ అంశాన్నే. ఇంద్రియాలను నియంత్రించి మనస్సులో ఇంద్రియార్థాలను గురించి ఆలోచిస్తుంటే దానిని మిథ్యాచార మన్నాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **సమభూత్ :** | **సమభూత్** | సమభూతామ్ | సమభూవన్ |
| | సమభూః | సమభూతమ్ | సమభూత |
| | సమభూవమ్ | సమభూవ | సమభూమ. |
| **దర్శయతి :** | **దర్శయతి** | దర్శయతః | దర్శయన్తి |
| | దర్శయసి | దర్శయథఃదర్శయథ | |
| | దర్శయామి | దర్శయావః | దర్శయామః. * |

**శ్లో॥ వాచా యః కీర్తితోఽలం దివిజవరసభారాధితానాం మునీనాం**
**జన్మాన్తాద్యేనసాం యో రచయతి విహతిం చిత్ఫలం సుప్రగీతః ।**
**రుగ్భేదీ ప్రౌఢసద్వాగ్మిషు వివిధసువాణీవిలాసైః ప్రతర్క్యః**
**శస్తోఽస్త్వాదౌ తథాఽన్తే విమలయతితతేర్జల్పశుద్ధౌ సహాయః ॥ 17-70**

**అ :** కృష్ణమహత్వవర్ణన. – స్రగ్ధర.

**అ :** యః దివిజ–వర–సభా+ఆరాధితానాం మునీనాం వాచా అలం కీర్తితః, యః సుప్రగీతః చిత్–ఫలం జన్మ+అన్త+ఆది+ఏనసాం విహతిం రచయతి, (యః) రుగ్–భేదీ (యః) ప్రౌఢ–సద్–వాగ్మిషు వివిధ–సువాణీ–విలాసైః ప్రతర్క్యః (యః) ఆదౌ తథా అన్తే విమల–యతి–తతేః జల్ప–శుద్ధౌ సహాయః శస్తః (సః) (కృష్ణః) అస్తి.



**ప్ర :** యః = ఎవరయితే, దివిజ... తానామ్ : దివిజ-వర = దేవశ్రేష్ఠుల యొక్క, సభా = కొలువులో, ఆరాధితానామ్ = ఆరాధింపబడిన (దివిజేషు వరాః, తేషాం సభా, తస్యామ్ ఆరాధితాః, తేషామ్), మునీనామ్ = ఋషులయొక్క, వాచా = మాటలచే (జాత్యేకవచనం), అలమ్ = తగినంతగా, కీర్తితః = స్తుతింపబడినవాడో, సు-ప్రగీతః = చక్కగా గానంచేయబడిన, యః = ఎవరయితే, చిత్-ఫలమ్ = జ్ఞానఫలమైన (చితః ఫలమ్), జన్మా... నసామ్ : జన్మ = పుట్టుకయొక్క, అంత = ముగింపు, ఆది = మొదలు-అనే, ఏనసామ్ = పాపాలయొక్క, విహతిమ్ = నాశనాన్ని, రచయతి = కల్పిస్తాడో (రచ ప్రతియత్నే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యః = ఎవరయితే, రుగ్-భేదీ : రుగ్ = రోగాన్ని, భేదీ = బ్రద్దలుచేయువాడో (రుజం భినత్తి ఇతి), యః = ఎవరయితే, ప్రౌఢి-సద్-వాగ్మిషు : ప్రౌఢి = సమర్థతగల, సద్ = మంచి, వాగ్మిషు = మాటకారులమధ్య, వివిధ-సువాణీ-విలాసైః : వివిధ = చాలారకాలయిన, సువాణీ = మంచిమాటలయొక్క, విలాసైః = గడుసుదనాలచే (వివిధాశ్చతే సువాణీనాం విలాసాః, తైః), ప్రతర్క్యః = తర్కింపదగినవాడో, యః = ఎవరయితే, ఆదౌ = మొదట, తథా = అలాగే, అన్తే = చివరలో, విమల-యతి-తతేః : విమల = నిర్మలమైన, యతి = యోగులయొక్క, తతేః = సమూహానికి (విమలా శ్చ తే యతయః, తేషాం తతిః, తస్యాః), జల్ప-శుద్ధౌ : జల్ప = మాటయొక్క, శుద్ధౌ = పవిత్రతయందు, (జల్పస్య శుద్ధిః తస్యామ్), సహాయః = సహాయకుడుగా, శస్తః = ప్రసిద్ధిచెందినవాడో (శస్ ధాతువుపై క్త ప్రత్యయం), (సః = అటువంటి, కృష్ణః = కృష్ణుడు), అస్తి = ఉన్నాడు.

**తా ॥** కృష్ణుడు ద్వారకలో నివసిస్తున్నాడు. ఎటువంటివాడు? ఆయన దేవతలు కూడా ఆరాధించే మునులచేత బాగా ప్రశంసింపబడేవాడు. జ్ఞానఫలమైన జననమరణపాపాలను నశింపజేయగలవాడు. రోగనాశకుడు. ప్రౌఢులైన వాగ్మల సభలలో వివిధ వాగ్విలాసాలతో తర్కింపబడేవాడు. విమలయోగి సమూహానికి వాగ్విశుద్ధికి తోడుపడేవాడు.

**వి :** 1. కృష్ణుని స్తుతించటంవల్ల, స్మరించటం వల్ల పాపవినాశనం, రోగవిమోచనం, వాగ్విశుద్ధి - ఫలితాలని ఈ శ్లోకంలోని ప్రతిపాదన.

**శ్లో॥ రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।**
**భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥**

**శ్లో॥ న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్ ।**
**జన్మమృత్యుజరావ్యాధి భయం నైవోపజాయతే ॥** -విష్ణుసహస్రనామస్తోత్రం-ఉత్తరపీఠిక-8/11

2. శ్లోకం పద్మబంధంలో వుంది. ఆబంధంలో 'వాదిరాజరచితః రుగ్మిణీశవిజయః' - అన్న వాక్యం కనిపిస్తుంది. ప్రాచీనకవులలో అక్కడక్కడ ఇటువంటి బంధకవిత్వం, నామనిర్దేశాదికం కనిపిస్తాయి. (పద్మబంధం)

| | | | |
|---|---|---|---|
| 3. **రచయతి :** | **రచయతి** | రచయతః | రచయన్తి |
| | రచయసి | రచయథః | రచయథ |
| | రచయామి | రచయావః | రచయామః. |

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సర్గః సప్తదశో ముదామయమభూత్ స్వర్గీశ్వరాణాం కులే ॥ 17-71**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** స్వర్గీ–ఈశ్వరాణామ్ = దేవతలయొక్క, కులే = సమూహంలో, అయమ్ = ఈ, సప్తదశః సర్గః = పదిహేడవసర్గ, ముదామ్ అభూత్ = ఆనందకారణమైనది. (మిగిలినది ప్రథమసర్గాంతశ్లోకం వలెనే. *

**– ఇతి శ్రీవాదిరాజతీర్థప్రణీతరుగ్మిణీశవిజయే సప్తదశః సర్గః. –**

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పదిహేడవ సర్గ.

**శ్రీః**





# శ్రీః
# అష్టాదశః సర్గః

శ్లో॥ రక్తాత్మీయతలత్విషా ప్రవిలసత్స్వీయోర్ధ్వభాగశ్రియా
స్వచ్ఛేన్దుచ్ఛవివృత్తసన్నఖరుచా స్వాసక్తభూషావలేః ।
యచ్ఛన్త్యద్భుతరత్నబన్ధనమహః శ్రీరుగ్మిణీకృష్ణయో-
ర్దమ్పత్యోః పదపఙ్కజాని భజతాం సమ్పత్కరాణి ధ్రువమ్ ॥ **18-1**

**అ :** రుక్మిణీకృష్ణుల పాదవర్ణనం - ఆ పదపంకజాలు సంపత్ప్రదాలు కావాలని ఆశంస.-శార్దూలవిక్రీడితమ్.

**అ :** రక్త+ఆత్మీయ-తల-త్విషా ప్రవిలసత్-స్వీయ+ఊర్ధ్వ-భాగ-శ్రియా సు+అచ్ఛ+ఇన్దు-ఛవి-వృత్త-సత్+నఖ-రుచా స్వ+ఆసక్త-భూషా+ఆవలేః అద్భుత-రత్న-బన్ధన-మహః దంపత్యోః యచ్ఛన్తి. శ్రీ-రుగ్మిణీ-కృష్ణయోః పద-పంకజాని భజతాం ధ్రువం సంపత్-కరాణి.

**ప్ర :** రక్తా... త్విషా : రక్త = ఎఱ్ఱనైన, ఆత్మీయ = తమవైన, తల = (అరికాళ్ళయొక్క) ఉపరితలంయొక్క (క్రిందిభాగం), త్విషా = కాంతిచేత (త్విట్ కాంతి జ్వాలయోస్త్రియామ్-నానార్థమంజరి-1730) (రక్తా చ సా ఆత్మీయానాం తలానాం త్విట్, తయా), ప్రవిల... శ్రియా : ప్రవిలసత్ = చక్కగా ప్రకాశిస్తున్న, స్వీయ = తమయొక్క, ఊర్ధ్వ-భాగ = ఉపరితలంయొక్క, శ్రియా = కాంతితో (ప్రవిలసన్తీ స్వీయయోః ఊర్ధ్వయోః భాగయోః శ్రీః, తయా), స్వచ్ఛే... రుచా : సు+అచ్ఛ = నిష్కలంకమైన, ఇన్దు = చంద్రునియొక్క, ఛవి = కాంతిగలిగి, వృత్త = గుండ్రంగా వున్న, సత్ = మంచి, నఖ = గోళ్ళయొక్క, రుచా = కాంతిచేత (స్వచ్ఛస్య ఇన్దోః ఛవి రివ ఛవి యేషాం తే, తే చ తే వృత్తాః సన్తశ్చ నఖాః తేషాం రుచిః, తయా), స్వా... వలేః : స్వ+ఆసక్త = తమకు తగిలివున్న, భూషా వలేః = నగలయొక్క, (స్వేషు ఆసక్తానాం భూషాణామ్ ఆవలిః, తస్యాః), అద్భుత... మాహః : అద్భుత = ఆశ్చర్యకరమైన, రత్న = రత్నాలయొక్క, బన్ధన = కూర్పుచేత కలిగిన, మహః = కాంతిని (అద్భుతానాం రత్నానాం బన్ధనేన జాతం మహః, తత్), **యచ్ఛన్తి** = ఇస్తున్న (క్రియాపదం కాదిది. దాణ్ (యచ్ఛ ఆదేశం) ధాతువుపై శతృప్రత్యయం. నపుంసకలింగ-ప్రథమా విభక్తి బహువచనం-శ్లోకంలోని 'పదపంకజాని'కి విశేషణం.), దంపత్యోః = దంపతులైన, శ్రీ-రుక్మిణీ-కృష్ణయోః = శ్రీ రుక్మిణీకృష్ణులయొక్క, పద-పంకజాని = పాదపద్మాలు, భజతామ్ = సేవించేవారికి (భక్తులకు), సంపత్-కరాణి = సంపదలను కల్గించేవి. ధ్రువమ్ = నిశ్చయం.

**తా ॥** శ్రీ రుక్మిణీకృష్ణులు పాదపద్మాలు నిశ్చితంగా తమను ఆశ్రయించినవారికి సంపదలు కలిగించగలవి. అవి తమను అలంకరించివున్న ఆభరణాలకే అద్భుతరత్నకాంతులను కలిగించగలవి. అరికాళ్ళలోని ఎఱ్ఱదనంతో

పైభాగంలోని కాంతులతో, స్వచ్ఛమైన చంద్రకాంతివంటి కాంతిగల గోళ్ళకాంతులతో ఆ నగలకు ఆ రత్నకాంతులు కలుగు తున్నాయి.

**వి :** 1. పాదతలం, పాదోపరితలం, గోళ్ళు – ఈ మూడింటికాంతులు ఆభరణాలకు సంక్రమించినట్లు వర్ణించటం ద్వారా శ్లోకంలో ఉల్లాసాలంకారం కనిపిస్తోంది. '**ఏకస్య గుణదోషాభ్యాముల్లాసోఽన్యస్య తౌ యది**' – (కు. 133)

శ్రీ రుక్మిణీకృష్ణుల పాదపంకజాలు హేతువులు. ఆ హేతువుల ద్వారా జరిగే పని సంపత్కరణం. ఇది హేతుమత్తు. హేతు, హేతుమత్తులను కలిపి వర్ణించటం వలన ఇది హేత్వలంకారం. '**హేతోః హేతుమతా సార్థవర్ణనం హేతురుచ్యతే**' – (కు. 167)

2. దేవతావర్ణనను పాదవర్ణనతో ప్రారంభించాలని మానవవర్ణన కేశాదిగా వుండాలనీ విద్వత్సమ్మతమైన నియతి. ఆమేరకే ఇక్కడ రుక్మిణీకృష్ణుల పాదవర్ణనతో వారిని వర్ణించటం (శారీరకంగా) ప్రారంభమైంది. శంకరాచార్యుల కృతిలో కూడా శ్రీవిష్ణుపాదాదికేశాంతస్తోత్ర మని నామనిర్దేశంతోనే స్తోత్రం కనిపిస్తుంది. మహాకవి కాళిదాసు కుమారసంభవంలో పార్వతిని వర్ణిస్తూ పాదవర్ణనతోనే ప్రారంభిస్తాడు–

**శ్లో॥ అభ్యున్నతాంగుష్ఠనఖప్రభాభి–ర్నిక్షేపణాద్రాగమివోద్గిరన్తౌ ।**
**ఆజహ్రతుస్తచ్చరణౌ పృథివ్యాం – స్థలారవిందశ్రియమవ్యవస్థామ్ ॥** – కుమారసంభవమ్ – 1/33*

**శ్లో॥ లక్ష్మీస్తనస్ఫురితకుఙ్కుమపఙ్కసఙ్గే – భక్త్యా స్మరన్మునిమనస్సరసీనిరూఢే ।**
**ఉత్తుఙ్గరమ్యనఖమౌక్తికపుఞ్జశోభే – రక్తాఙ్గులీపరిలసద్దలపఙ్క్తికాన్తే ॥ 18–2**

**అ :** కృష్ణపాదకమలవర్ణన. (2–10వరకు) –వసంతతిలక.

**అ :** లక్ష్మీ–స్తన–స్ఫురిత–కుంకుమ–పంక–సంగే భక్త్యా స్మరత్+ముని–మనః+సరసీ–నిరూఢే ఉత్తుంగ–రమ్య–నఖ–మౌక్తిక–పుంజ–శోభే రక్త+అంగులీ–పరిలసత్+దల–పంక్తి–కాంతే.

**ప్ర :** లక్ష్మీ... సంగే : లక్ష్మీ = రుక్మిణియొక్క, స్తన = రొమ్ములయందు, స్ఫురిత=ప్రకాశింప జేయబడిన, కుంకుమ = కుంకుమ అనే, పంక = బురదతో, సంగే = కూడినదీ (లక్ష్మ్యాః స్తనయోః స్ఫురితం కుంకుమం, తదేవ పంకః, తేన సంగః యస్య, తస్మిన్), భక్త్యా = భక్తిచే, స్మర... నిరూఢే : స్మరత్ = తలచుచున్న, ముని = ఋషులయొక్క, మనః = మనస్సు అనే, సరసీ = సరస్సునందు, నిరూఢే = నాటినదీ (స్మరన్తశ్చ తే మునయః, తేషాం మనాంసి ఏవ సరస్యః, తాసు నిరూఢం, తస్మిన్), ఉత్తుంగ... శోభే : ఉత్తుంగ = ఉన్నతమైనవీ, రమ్య = అందమైనవీ అయిన, నఖ = గోళ్ళు అనే, మౌక్తిక = ముత్యాలయొక్క, పుంజ = సమూహంయొక్క, శోభే = శోభగలదీ (ఉత్తుంగాః రమ్యాశ్చ తే నఖా ఏవ మౌక్తికాని, తేషాం పుంజః, తస్య శోభాయస్య తస్మిన్), రక్తా... కాంతే : రక్త = ఎఱ్ఱని, అంగులీ = వ్రేళ్ళు అనే, పరిలసత్ = ప్రకాశిస్తున్న, దళ = ఆకులయొక్క (పత్రం పలాశం ఛదనం దళం – అమరకోశః–వనౌషధి–114), పంక్తి = వరుసచేత, కాంతే = అందమైనదీ అయిన, (కృష్ణ+అంఘ్రి–చారు–కమలే–అని 5వ శ్లోకంతో అన్వయం)

**తా ॥** కృష్ణుని పాదకమలం రుక్మిణీస్తనాలపై భాసిస్తున్న కుంకుమపంకం తగిలివుంది. భక్తితో తనను (కృష్ణుని) స్మరిస్తున్న మునిజనుల మానససరస్సులో గట్టిగా నాటుకొన్నది. ఉన్నతాలై అందమైన గోళ్ళు అనే ముత్యాలశోభగలది. ఎఱ్ఱటివ్రేళ్ళు అనే ఆకులవరుసలచే అందమైనది. *

**శ్లో॥ ప్రీత్యా క్వణద్వదనహంసకదమ్బజృమ్భి–ముక్తాఫలోల్లసితకిఙ్కిణిముఖ్యభూషే ।**
**తద్వక్త్రజాతకవిగీతమనోజ్ఞరేఖా–కల్పధ్వజాఙ్కుశయవాశనిలక్ష్మలక్ష్యే ॥ 18–3**

**అ :** ప్రీత్యా క్వణద్–వదన–హంస–కదంబ–జృంభి–ముక్తా–ఫల+ఉల్లసిత–కింకిణి–ముఖ్య–భూషే తద్–వక్త్ర–జాత–కవి–గీత–మనోజ్ఞ–రేఖా–కల్ప–ధ్వజ+అంకుశ–యవ+అశని–లక్ష్మలక్ష్యే.

ప్ర : ప్రీత్యా = ప్రేమతో, క్వణద్... భూషే : క్వణద్ = నినదిస్తున్న, వదన = నోళ్ళుగల, హంస = హంసలయొక్క, కదంబ = గుంపులవలె, జృంభి = విస్ఫుటిస్తున్న, ముక్తా-ఫల = ముత్యాలవలె, ఉల్లసిత = ప్రకాశిస్తున్న, కింకిణీ-ముఖ్య = మువ్వలు మొదలైన, భూషే = అలంకారాలు గలదీ (క్వణన్తి వదనాని యేషా తే, తే చ తే హంసాః , తేషాం కదంబః, తద్వత్ జృంభిన్యః ముక్తాఫలైః ఉల్లసితాః చ తాః భూషాః, యస్య తస్మిన్), తద్వక్త్ర... లక్ష్యే : తద్ = ఆ హంసలయొక్క, వక్త్ర = ముక్కులనుండి, జాత = పుట్టినవీ, కవి = కవులచే, గీత = వర్ణింపబడినవీ అయిన, మనోజ్ఞ-రేఖా = అందమైన రేఖలతో, కల్ప = సమానమైన, ధ్వజ = పతాకలూ, అంకుశ = అంకుశాలూ, యవ = యవలూ (ధాన్యవిశేషం), అశని = వజ్రాయుధం, లక్ష్మ = ఈ గుర్తులతో, లక్ష్యే = గుర్తింపదగినదీ అయిన (కృష్ణాంఘ్రిచారు-కమలే... 5వ శ్లోకంతో అన్వయం)

**తా ॥** కృష్ణుని ఆ పాదకమలానికి నూపురాలు ఉన్నాయి. వాటిలోని ముత్యాలు తెల్లగా ప్రకాశిస్తూ నినదించే హంసలముక్కుల్లాగా శోభిస్తున్నాయి. అరికాలిపై కవులు వర్ణింపదగిన అందమైన రేఖలు - ధ్వజం, అంకుశం, యవలు, వజ్రాయుధం - ఇటువంటి గుర్తులు కనిపిస్తున్నాయి.

**వి : 1. అరికాలిలో వుండవలసిన శుభచిహ్నాలను గురించి సాముద్రికశాస్త్రమిలా చెప్తోంది.**

శ్లో॥ చంద్రార్ధం కలశం త్రికోణధనుషీ ఖం గోష్పదం ప్రోష్ఠికం
శంఖం సవ్యపదేఽథ దక్షిణపదే కోణాష్టకం స్వస్తికమ్ ।
చక్రం ఛత్రయవాంకుశం ధ్వజకులిశం జంబూర్ధ్వరేఖాంబుజం
బిభ్రాణో హరిరూనవింశతిమహలక్ష్మ్యార్చితాంఘ్రిర్భవేత్ ॥ - బృహత్సాముద్రికశాస్త్రమ్-23

అరికాళ్ళలో వుండే శుభచిహ్నాలు ఊనవింశతి (19). అవి **ఎడమకాలిలో** - అర్ధచంద్రుడు, కలశం, త్రికోణం, ధనుస్సు, సున్న, చేప, ఆవుగిట్ట, శంఖం. **కుడికాలిలో** - అష్టకోణం, తిలకం, చక్రం, ఛత్రం, యవలు, అంకుశం, ధ్వజం, వజ్రం, జంబువు, ఊర్ధ్వరేఖ, కమలం. (19)

2. ఛందస్సు - వసంతతిలక. *

**శ్లో॥ ఉన్మీలితే విమలబోధదినేశభాసా - సన్మాననీయగుణభాజి కలఙ్కిదూరే ।**
**సౌరభ్యలుబ్ధపవనేన సదా పరీతే - కారుణ్యమాన్యమకరన్దమహాప్రవాహే ॥ 18-4**

**అ :** విమల-బోధ-దిన+ఈశ-భాసా ఉన్మీలితే సత్+మాననీయ-గుణ-భాజి కలంకి-దూరే సౌరభ్య-లుబ్ధ-పవనేన సదా పరీతే కారుణ్యమాన్య-మకరంద-మహా-ప్రవాహే.

ప్ర : విమల... భాసా : విమల = నిర్మలమైన, బోధ = జ్ఞానమనే, దిన+ఈశ = సూర్యునియొక్క, భాసా = కాంతిచే (విమలశ్చ అసౌ బోధః, స ఏవ దినేశః, తస్య భాః, తయా), ఉన్మీలితే = వికసింపజేయబడినదీ, సన్మా... భాజి : సత్ = సజ్జనులచే, మాననీయ = గౌరవింపదగిన, గుణ = గుణాలను, భాజి = సేవించేదీ (సతాం మాననీయాన్ గుణాన్ భజతీతి, తస్మిన్), కలంకి-దూరే : కలంకి = మలినాత్ములకు / చంద్రునికి, దూరే = చేరరానిదీ, సౌరభ్య... పవనేన : సౌరభ్య = పరిమళమందు, లుబ్ధ = లోభంగల, పవనేన = ముఖ్యప్రాణునిచే (సౌరభ్యే లుబ్ధః చ అసౌ పవనః, తేన), సదా = ఎల్లప్పుడూ, పరీతే = కూడినదీ, కారుణ్య... ప్రవాహే : కారుణ్య = జాలియే, మాన్య = అభినందింపదగిన, మకరంద = మకరందంయొక్క, మహా-ప్రవాహే = పెద్ద ప్రవాహంగలదీ అయిన (కారుణ్యమేవ మాన్యః మకరందః తస్య, మహాన్ చ అసౌ ప్రవాహః, తస్మిన్), (కృష్ణాంఘ్రి చారుకమలే - 5వ శ్లోకంతో అన్వయం)

**తా ॥** విమలజ్ఞానమనే సూర్యకాంతిచేత వికసింపజేయబడినది, (పాదాలు నిర్మలజ్ఞాన విషయాలు - కమలం సూర్యకాంతిచే వికసింపజేయబడింది), సజ్జనులు గౌరవింపదగిన (ఆదరింపదగిన) గుణాలు గలది పాదం

(కృష్ణపాదం), బ్రహ్మకడిగిన పాదం కాబట్టి మాననీయం – కమలం సౌరభాదులవలన ఆదరింపదగింది), కళంకి దూరమైనదీ, (మలినాత్ములకు అందనిది ఆ పాదం, చంద్రుడికి దూరమైనది కమలం), పరిమళలోభంలో సదా పవనుదు సేవించేది (ముఖ్య ప్రాణసేవితం కృష్ణపాదం, వాయువు సేవించేది కమలం) కారుణ్యమనే మకరందప్రవాహం గలది అయిన కృష్ణపాదం...

**వి :** 1. ఛందస్సు – వసంతతిలక. *

**శ్లో॥నిత్యానుషక్తనిజభృత్యవిలోచనాఖ్య-మత్తానురక్తమధుపైః సతతం గృహీతే ।**
**సత్కర్ణికోజ్జ్వలతలత్విషి సన్తతం స్యాత్ – కృష్ణాఙ్ఘ్రిచారుకమలే మమ చిత్తభృఙ్గః ॥ 5**

**అ :** నిత్య+అనుషక్త–నిజ–భృత్య–విలోచన+ఆఖ్య–మత్త+అనురక్త–మధుపైః సతతం గృహీతే సత్–కర్ణికా+ఉజ్జ్వల–తల–త్విషి కృష్ణ+అంఘ్రి–చారు–కమలే మమ చిత్త–భృంగః సంతతం స్యాత్.

**ప్ర :** నిత్యా... మధుపైః : నిత్య = నిరంతరమూ, అనుషక్త = తగుల్కొనిన, నిజ = తనయొక్క, భృత్య = సేవకు (భక్తు)లయొక్క, విలోచన+ఆఖ్య = కళ్ళు అనబడే, మత్త = మదించినవీ, అనురక్త = ప్రీతిగలవీ అయిన, మధుపైః = తుమ్మెదలచే (నిత్యమ్ అనురక్తానాం నిజానాం భక్తానాం విలోచనాని ఇతి ఆఖ్యాః మత్తాః అనురక్తాశ్చ మధుపాః, తైః), సతతమ్ = ఎల్లప్పుడూ, గృహీతే = స్వీకరింపబడినదీ, సత్... త్విషి : సత్ = మంచి, కర్ణికా = తామరదుద్దులా, ఉజ్జ్వల = ప్రకాశవంతమైన, తల = పాదతలం (అరకాలు) యొక్క, త్విషి = కాంతిగలదీ (సతీ చ సా కర్ణికా, తద్వత్ ఉజ్జ్వలస్య పాదతలస్య త్విట్ యస్మిన్ తస్మిన్), కృష్ణా... కమలే : కృష్ణ = కృష్ణునియొక్క, అంఘ్రి = కాలు అనే, చారు = అందమైన, కమలే = తామరయందు (కృష్ణస్య అంఘ్రిః ఏవ చారు చ తత్కమలం, తస్మిన్), మమ = నాయొక్క, చిత్త–భృంగః = మన స్సనే తుమ్మెద, సంతతమ్ = సర్వదా, స్యాత్ = నిలుచుగాత (అస భువి పరస్మైపది–లోట్–ప్ర.ఏ.)

**తా ॥** నిరంతరమూ తగుల్కొనిన తన భక్తులనే మదించిన తుమ్మెదలచే స్వీకరింపబడినది, మంచి కర్ణికవంటి ఉజ్జ్వలకాంతిగలదీ అయిన కృష్ణపాదకమలంపై నా మనస్సు అనే తుమ్మెద ఎల్లప్పుడూ నిలుచుగాక!

**వి :** 1. అంఘ్రికమలం, చిత్తభృంగం, విలోచన మధుపాలు ఇవి రూపకాలంకారాలు. పాదంలో కమలత్వాన్నీ, చిత్తంలో భృంగత్వాన్నీ, కళ్ళలో మధుపత్వాన్నీ ఆరోపించటం జరిగింది.

| | | | |
|---|---|---|---|
| 2. **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ |

3. ఛందస్సు – వసంతతిలక. *

**శ్లో॥ శఙ్ఖామ్భోజనిధీ సమీహితధనప్రత్యర్పణేనాఙ్కుశం**
**హస్తిన్యాన్తరకర్షణేన దితిజప్రధ్వంసనేనాశనిమ్ ।**
**నిర్జిత్య ధ్వజముత్పతాకమదధాద్యః కృష్ణపాదో ముదా**
**ప్రాయస్తేఽపి చ తస్య లక్షణగణవ్యాజేన భేజుస్తలమ్ ॥ 18-6**

**అ :** యః కృష్ణ–పాదః శంఖ+అంభోజ–నిధీ సమీహిత–ధన–ప్రత్యర్పణేన, అంకుశం హస్తినీ+అంతర–కర్షణేన అశనిం దితి–జ–ప్రధ్వంసనేన నిర్జిత్య ఉత్పతాకమ్ ధ్వజమ్ అదధాత్ తస్య తలం తే అపి ప్రాయః లక్షణ–గణ–వ్యాజేన ముదా భేజుః చ.

**ప్ర :** యః = ఏ, కృష్ణ–పాదః :కృష్ణ = కృష్ణునియొక్క, పాదః = చరణం (కృష్ణస్య పాదః), శంఖ... నిధీ : శంఖ = శంఖమూ, అమ్భోజ = పద్మమూ అను, నిధీ = నిధులను (శంఖశ్చ అంభోజశ్చ శంఖాంభోజే, త ఏవ నిధీ), సమీ... ణేన : సమీహిత = కోరినట్టి, ధన = సొమ్ములయొక్క, ప్రత్యర్పణేన = దానంచేతా (సమీహితస్య ధనస్య ప్రత్యర్పణేన), అంకుశమ్ = అంకుశాన్ని, హస్తినీ... కర్షణేన : హస్తినీ = హస్తినీజాతిస్త్రీలయొక్క, ఆంతర = మనస్సులను, కర్షణేన = లాగుటచేతా (హస్తినీనామ్ ఆంతరస్య కర్షణం, తేన), అశనిమ్ = వజ్రాయుధాన్ని, దితి... నేన : దితి–జ = దైత్యులయొక్క, ప్రధ్వంసనేన = వినాశనంచేతా (దితిజానాం ప్రధ్వంసనం, తేన), నిర్జిత్య = గెలిచి (నిర్–జి ధాతువుపై ల్యప్ ప్రత్యయం), ఉత్పతాకమ్ = పతాకం రెపరెపలాడేటట్లు, ధ్వజమ్ = ధ్వజాన్ని, అదధాత్ = ధరించిందో, తస్య = ఆ పాదంయొక్క, తలమ్ = అరికాలిని (అధస్తలాన్ని) తే అపి = అవి కూడా, ప్రాయః = బహుశః, లక్షణ–గణ–వ్యాజేన : లక్షణ = (శుభ) చిహ్నాలయొక్క, గణ = సమూహ మనే, వ్యాజేన = సాకుతో, ముదా = ఆనందంతో, భేజుః చ = ఆశ్రయించాయి. (భజ సేవాయాం పరస్మైపది–లిట్–ప్ర.బ.)

**తా ॥** కృష్ణపాదం తనభక్తులకు వారు కోరినదిచ్చుట ద్వారా శంఖ, పద్మనిధులనూ; హస్తినీ జాతిస్త్రీల మనస్సులను ఆకర్షించటం ద్వారా అంకుశాన్నీ; రాక్షసులను ధ్వంసం చేయటం ద్వారా వజ్రాయుధాన్ని; గెలిచి ధ్వజమెత్తి పతాకాన్ని రెపరెపలాడించింది. అవి కూడా శుభలక్షణాలు అన్న సాకుతో ఆ పాదతలాన్ని ఆనందంగా ఆశ్రయించాయి.

**వి :** 1. నవనిధులలో శంఖమూ, పద్మమూ కూడా పరిగణింపబడ్డాయి. **నవనిధులు** ఇవి–

శ్లో॥ మహాపద్మశ్చ పద్మశ్చ శంఖో మకరకచ్ఛపౌ ।
ముకున్దకున్దనీలాశ్చ వరశ్చ నిధయో నవ ॥

2. **హస్తినీజాతిస్త్రీ లక్షణం**–

శ్లో॥ స్థూలాధరా స్థూలనితంబభాగా – స్థూలాంగులీ స్థూలకుచా సుశీలా ।
కామోత్సుకా గాఢరతిప్రియా యా – నితాంతభోక్త్రీ కరిణీ మతా సా ॥

శ్లో॥ పద్మినీ పద్మగంధా చ మీనగంధా చ చిత్రిణీ ।
శంఖినీ క్షారగంధా చ మదగంధా చ హస్తినీ ॥ – రతిమంజరీ – 7,8

3. **భేజుః :**

| | | |
|---|---|---|
| బభాజ | భేజతుః | **భేజుః** |
| భేజిథ/బభక్థ | భేజథుః | భేజ |
| బభాజ/బభజ | భేజివ | భేజిమ |

4. ఛందస్సు – శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ ధర్మా విరుద్ధగతయోఽపి హరౌ విరోధం – సన్త్యజ్య సన్తి బహుశస్త్వితి బోధయన్తౌ ।**
**పద్మస్థచన్ద్రకలికాద్యుతిమన్నఖాఙ్కౌ – శ్రీరుగ్మిణీశచరణౌ శరణం మమ స్తామ్ ॥7**

**అ :** విరుద్ధ–గతయః ధర్మాః అపి హరౌ విరోధం సన్త్యజ్య బహుశః సన్తి ఇతి బోధయన్తౌ పద్మ–స్థ–చంద్ర–కలికా–ద్యుతిమత్+నఖ+అంకౌ శ్రీ–రుగ్మిణీ+ఈశ చరణౌ మమ శరణం స్తామ్.

**ప్ర :** విరుద్ధ–గతయః : విరుద్ధ = ఒకదానికొకటి పొసగని, గతయః = నడతగల (విరుద్ధా గతయః యేషాం తే), ధర్మాః అపి = ధర్మాలుకూడా, హరౌ = కృష్ణునివిషయంలో (విషయ సప్తమీ), విరోధమ్ = పొసగమిని, సన్త్యజ్య = వీడి (సమ్–త్యజ్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), బహుశః = అనేకత్ర, సన్తి = వున్నాయి (అస భువి పరస్మైపది–లట్–ప్ర.ఏ.), ఇతి = అని, బోధయన్తౌ = తెలియజేస్తున్న, పద్మ... ఖాంకౌ : పద్మ–స్థ = తామరయందున్న,

చంద్ర-కలికా = చంద్రకళయొక్క, ద్యుతిమత్ = కాంతిగల, నఖ+అంకౌ = గోళ్ళే గురుతులుగా గల, శ్రీ... చరణౌ = కృష్ణుని పాదాలు, మమ = నాకు, శరణమ్ = గతిగా/ ఇల్లుగా (శరణం గృహరక్షిత్రోః-అమరకోశః-నానార్థ-54), స్తామ్ = వుండుగాక! (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ద్వి.)

**తా ॥** పరస్పరం విరుద్ధత గల ధర్మాలయినా కృష్ణవిషయంలో ఆ వైరుధ్యాన్ని వీడి కలిసి మనుగడ సాగిస్తాయని తెలియజేస్తున్నట్లుగా పద్మంమీద చంద్రకళ లన్నట్లుగా గోళ్ళున్న కృష్ణపాదం నాకు శరణమగుగాక.

**వి :** 1. శ్లోకం చివర 'మమాస్తామ్' అన్న పాఠం ముద్రిత ప్రతిలో కనిపిస్తుంది. కానీ పూర్వాపరశ్లోకపరిశీలన చేస్తే అది 'ఆస్తామ్' అని భూతకాలంలో కాకుండా లోట్ (రూపంలో విధి...) వుంటే బాగుంటుందనిపించింది. అందుకని 'ఆస్తామ్' పాఠాన్ని స్తామ్‌గా మార్చటం జరిగింది.

2. ప్రసిద్ధమైన శ్రీవేంకటేశ్వర ప్రతిపత్తిలో శ్లోకాల చతుర్థపాదం '**శ్రీవేంకటేశ! చరణౌ శరణం ప్రపద్యే**' అని వినిపిస్తుంది. బహుశః వాదిరాజశ్లోకం (ప్రస్తుతం) '**శ్రీ రుగ్మిణీశచరణౌ శరణం మమ స్తామ్**' ఆ ప్రపత్తిని ప్రభావితం చేసివుండవచ్చు.

3. రాజానుగతభృత్యన్యాయం మేరకు పరస్పరవిరుద్ధగమనంగల ధర్మాలు కూడా మరో అంగికి అంగాలుగా మారినప్పుడు విరోధం లేకుండానే ప్రవర్తిస్తాయి. పార్వతీముఖంలో కూడా చంద్ర-పద్మ+ఉభయగత లక్షణాలున్నాయనీ, రెండూ పార్వతికి ప్రీతిని కలిగిస్తున్నాయనీ వర్ణిస్తాడు కాళిదాసు-

శ్లో॥ చంద్రం గతా పద్మగుణాన్న భుంక్తే - పద్మాశ్రితా చాంద్రమసీమభిఖ్యామ్ ।
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా - ద్విసంశ్రయాం ప్రీతిమవాప లక్ష్మీః ॥ - కుమారసంభవం 1/43.

| | | | |
|---|---|---|---|
| 4. **సన్తి :** | అస్తి | స్తః | **సన్తి** |
| | అసి | స్థః | స్థ |
| | అస్మి | స్వః | స్మః |
| **స్తామ్ :** | అస్తు/స్తాత్ | **స్తామ్** | సన్తు |
| | ఏధి/స్తాత్ | స్తమ్ | స్త |
| | అసాని | అసావ | అసామ |

3. ఛందస్సు - వసంతతిలక. *

**శ్లో॥ మూర్ధ్న్యర్పితస్వసదృశం హరిపాదపద్మ-**
**మాశఙ్క్య నామ్బుజకులం సహతే శశాఙ్కః ।**
**స్వస్పర్ధి తచ్చ శశినా వశినాఽనురక్తం**
**మత్వా మనస్యధిత తత్ర తదప్యమైత్రీమ్ ॥ 18-8**

**అ :** శశాంకః మూర్ధ్ని-అర్పిత-స్వ-సదృశం స్వస్పర్ధి హరి-పాద-పద్మమ్ ఆశంక్య అంబుజ-కులం న సహతే. తత్ చ వశినా శశినా అనురక్తం మత్వా మనసి అమైత్రీం తత్ర అధిత.

**ప్ర :** శశాంకః = చంద్రుడు, మూర్ధ్ని = తలపై/చివరన, అర్పిత-స్వ-సదృశమ్ : అర్పిత = నిలుపబడిన (మూర్ధ్ని+అర్పిత = తలకెత్తుకున్న), స్వ-సదృశమ్ = తనతో సమానుడుగలదై (మూర్ధ్ని అర్పితః స్వేన సదృశః యేన తమ్), స్వ-స్పర్ధి = తనతో తలపడుతున్న దానినిగా, హరి-పాద-పద్మమ్ : హరి = కృష్ణునియొక్క, పాద-పద్మమ్ = చరణకమలాన్ని, ఆశంక్య = శంకించి, అమ్బుజ-కులమ్ = తామరల జాతిని, న సహతే = సహింపడు.

(సహ మర్షణే ఆత్మనేపది–లట్–(ప్ర.ఏ.), తత్–చ = ఆ హరిపాదపద్మాన్ని, వశినా = లోబడివున్న, శశినా = చంద్రునితో, అనురక్తమ్ = అనురాగం గలదానినిగా, మత్వా = భావించి, తత్ర = చంద్రుని విషయంలో, తద్–అపి = ఆ పద్మం కూడా, మనసి = మనస్సులో, అమైత్రీమ్ = శత్రుత్వాన్ని, అధిత = ధరించింది. (ధా ధారణ పోషణయోః–ఆత్మనేపది–లుఙ్–(ప్ర.ఏ.)

**తా ॥** హరిపాదపద్మం తనవంటివాణ్ణి (గోళ్ళను) తలకెత్తుకుంటుంది. అయినా కూడా ఇతరప్రదేశాల్లో పద్మం తనను కాదంటూనే వుంటుందని కమలజాతిపై శత్రుత్వాన్ని వహించాడు. ఆ పద్మం కూడా హరిపాదపద్మం దగ్గర అయితే చంద్రుడు లోబడి వుంటాడు కానీ ఇతరత్ర అలా కాదని భావించి చంద్రుని విషయంలో శత్రుత్వాన్ని వహించింది.

**వి :** 1. చంద్రుడికీ, తామరలకు నైసర్గికంగానే శత్రుత్వమన్నది కవి సమయం. ఆ కవి సమయాన్ని కారణకల్పనద్వారా కవి సమర్థిస్తున్న వైనం శ్లోకంలో కనిపిస్తుంది. లేని సంబంధాన్ని కవి కల్పించటం వలన ఇది సంబంధాతిశయోక్త్యలంకారం. "**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**" – (కు.39)

| | | | |
|---|---|---|---|
| 2. **అధిత :** | **అధిత** | అధిషాతామ్ | అధిషత |
| | అధిథాః | అధిషాథామ్ | అధిధ్వమ్ |
| | అధిషి | అధిష్వహి | అధిష్మహి |
| **సహతే :** | **సహతే** | సహేతే | సహన్తే |
| | సహసే | సహేథే | సహధ్వే |
| | సహే | సహావహే | సహామహే |

3. ఛందస్సు – వసంతతిలక. *

**శ్లో॥అఙ్గీకృతః కమలయోచ్చగతిః సదేతి – సన్దర్శనాయ కమలాకరసఙ్గతం ప్రాక్ ।**
**పశ్చాత్ క్రమేణ కుచఫాలకచాగ్రలగ్నం – శ్రీకృష్ణపాదకమలం కురుతాచ్ఛ్రియం నః ॥9**

**అ :** కమలయా అంగీకృతః సదా ఉచ్చ–గతిః (భవతి) ఇతి సందర్శనాయ ప్రాక్ కమలా – కర–సంగతం పశ్చాత్ క్రమేణ కుచ–ఫాల–కచ+అగ్ర–లగ్నం శ్రీ–కృష్ణ–పాద–కమలం నః శ్రియం కురుతాత్.

**ప్ర :** కమలయా = లక్ష్మిచేత, అంగీకృతః = అంగీకరింపబడిన / ఆదరింపబడిన వాడు, సదా = ఎల్లప్పుడూ, ఉచ్చ–గతిః = పైకివెళ్ళేవాడు (ఉచ్చా గతిః యస్య సః), (భవతి = కాగలడు), ఇతి = అని, సందర్శనాయ = చూపుటకై, ప్రాక్ = ముందుగా,, కమలా–కర–సంగతమ్ : కమలా = లక్ష్మియొక్క, కర = చేతితో, సంగతమ్ = కలిసినదై (కమలాయాః కరేణ సంగతమ్), పశ్చాత్ = ఆ తరువాత, క్రమేణ = క్రమంగా, కుచ... లగ్నమ్ : కుచ = రొమ్ములపై, ఫాల = నుదుటిపై, కచ+అగ్ర = వేణీభారంపై, లగ్నమ్ = తగిలిన (కుచయోః ఫాలే కచానామ్ అగ్రేషు చ లగ్నమ్), శ్రీ–కృష్ణ–పాద–కమలమ్ = కృష్ణుని చరణపద్మం, నః = మనకు, శ్రియమ్ = సంపదను, కురుతాత్ = కలిగించును గాక! (కృ కరణే–పరస్మైపది–లోట్–(ప్ర.ఏ.)

**తా ॥** లక్ష్మియొక్క అంగీకారాన్ని పొందినవాడు (లక్ష్మి అనుగ్రహానికి పాత్రమైనవాడు) ఉచ్చస్థితిని పొందగలడని ప్రదర్శించటానికన్నట్లు ముందుగా లక్ష్మిచేతితో కూడిన కృష్ణ పాదకమలం క్రమంగా ఆమె రొమ్ములను, నుదుటిని, వేణీభారాన్ని కూడా తాకగలిగింది.

**వి :** 1. పోతన భాగవతంలో కృష్ణుని చేతికి ఆ లక్ష్మీతనుస్పర్శను అనుగ్రహించి, దాని వైశిష్ట్యాన్ని వర్ణించి చూపాడు.

**శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ**
**బాదాబ్జంబులపైఁ గపోలకటిపైఁ బాలిండ్లపై నూత్న మ**
**ర్యాదంజెందు కరంబు గ్రిందగుట మీఁదై నా కరంబుంట మే**
**ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే! కాయంబు నాపాయమే?** – పోతనభాగవతము – 8/591

ఇచ్చిపుచ్చుకొనే విషయంలో చేతులు క్రిందుమీదులు కావటమన్నది తెలుగువారి వ్యవహారంలో ప్రసిద్ధమైన పదబంధం. దానిని పోతన స్వకపోలకల్పితభావనలో చక్కగా ఉపయోగించుకొన్నాడు. ఇక్కడ ఆ చేతికి క్రిందుమీదులు కూడా చూపించాడు పోతన తాను భావించిన దృశ్యాన్ని బట్టి. వాదిరాజుతీర్థరు తాను భావించిన అనుగ్రహవిశేషాన్ని బట్టి కేవలం ఉన్నతిని మాత్రమే ప్రదర్శించారు.

2. శ్లోకంలో నిదర్శనాలంకారముంది. ఒక క్రియద్వారా మంచినో, చెడునో ప్రదర్శించి సదసద్బోధన చేయటం నిదర్శనాలంకారభేదాలలో ఒకటి. లక్ష్మి అనుగ్రహాన్ని పొందినవాడు ఉన్నతిని పొందుతాడన్న సదర్థాన్ని శ్లోకంలో క్రియతో ప్రదర్శించటం జరిగింది. '**అపరాం బోధనం ప్రాహుః క్రియయాఽసత్సదర్థయోః**' – (కు. 55)

| | | | |
|---|---|---|---|
| 3. **కురుతాత్ :** | కరోతు/కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| | కురు/కురుతాత్ | కురుతమ్ | కురుత |
| | కరవాణి | కరవావ | కరవామ |

4. చంధస్సు – వసంతతిలక. *

**శ్లో॥ భిన్నప్రవాలసదృశీ పరితః స్ఫురన్తీ – రమ్యాఽఙ్గులీదలచయద్యుతిరిన్దిరాయాః ।**
**పాదామ్బుజే సహజరాజదలక్తకాఙ్క–కాన్తిం తనోతి నఖమణ్డలమణ్డనార్హామ్॥ 10**

**అ :** భిన్న–ప్రవాల–సదృశీ పరితః స్ఫురన్తీ ఇందిరాయాః రమ్య+అంగులీ–దల–చయ–ద్యుతిః పాద+అంబుజే నఖ–మండల–మండన–అర్హామ్ సహజ–రాజద్–అలక్తక+అంక–కాన్తిం తనోతి.

**ప్ర :** భిన్న... సదృశీ : భిన్న–ప్రవాళ = పగడపు ముక్కతో, సదృశీ = సమానమైనదీ (భిన్నేన ప్రవాళేన సదృశీ), పరితః=చుట్టూ, స్ఫురన్తీ=వెలుగుతున్నదీ, రమ్యా = మనోహర మైనదీ అయిన, ఇందిరాయాః = లక్ష్మియొక్క, అంగులీ–దల–చయ–ద్యుతిః : అంగులీ–దళ = వ్రేళ్ళనే ఆకులయొక్క, చయ = సమూహంయొక్క, ద్యుతిః = కాంతి, పాద+అంబుజే = పాదపద్మమందు (పాద ఏవ అంబుజం, తస్మిన్), నఖ... అర్హామ్ : నఖ–మండల = గోళ్ళ సమూహాన్ని (మండలము = సమూహము–ఆంధ్రవాచస్పత్యము – 4/1970), మండన = అలంకరించుటకు, అర్హామ్ = తగినదైన, సహజ... కాన్తిమ్ : సహజ = సహజమైన, రాజత్ = ప్రకాశిస్తున్న, అలక్తక+అంక = పారాణి గుర్తులయొక్క, కాన్తిమ్ = శోభను, తనోతి = విస్తరింపజేస్తోంది. (తన్ విస్తారే–పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని పాదాన్ని తాకిన రుక్మిణి చేతివ్రేళ్ళకాంతి పగడపుముక్కల శోభతో మనోహరమై ఆ కాలిగోళ్ళను అలంకరించటానికి తగినదై సహజమైన పారాణికళను వ్యాపింపజేస్తోంది.

**వి :** 1. వ్రేళ్ళ ఎఱ్ఱదనం పాదాలకు పారాణిగా కనిపించటం ఉల్లాసాలంకారం. '**ఏకస్య గుణదోషాభ్యాముల్లాసోఽన్యస్య తౌ యది**' – (కు. 133)

| | | | |
|---|---|---|---|
| 2. **తనోతి :** | **తనోతి** | తనుతః | తన్వన్తి |
| | తనోమి | తనుథః | తనుథ |
| | తనోమి | తనువః/తన్వః | తనుమః/తన్మః |

3. ఛందస్సు – వసంతతిలక. *

**శ్లో॥ అన్తఃసమాపూరితబహ్వనన్త-సౌన్దర్యశేషైరివ పూర్యమాణైః ।**
**పుష్టోర్ధ్వభాగే పరితః సువృత్తే - జఙ్ఘే తయోః స్తాం స్ఫుటమన్తరఙ్గే ॥ 18-11**

**అ : కృష్ణజంఘావర్ణన.** -ఇంద్రవజ్ర.

**అ :** పూర్యమాణైః అన్తః-సమాపూరిత-బహు+అనన్త-సౌందర్య-శేషైః ఇవ పుష్ట-ఊర్ధ్వ-భాగే పరితః సువృత్తే తయోః జంఘే అన్తరంగే స్ఫుటం స్తామ్.

**ప్ర :** పూర్యమాణైః = నింపబడుతున్న, అన్తః... శేషైః ఇవ : అన్తః = లోన, సమాపూరిత = పూర్తిగా నింపబడిన, బహు = అతిశయించిన, అనన్త = అంతులేని, సౌందర్య = అందాలయొక్క, శేషైః ఇవ = మిగులదలలతో అన్నట్లు (అన్తః సమ్యక్ ఆపూరితం బహు అనన్తం చ సౌన్దర్యం తస్య శేషైః ఇవ), పుష్ట+ఊర్ధ్వ-భాగే : పుష్ట = బలిసిన, ఊర్ధ్వ-భాగే = పై భాగాలు గలిగి, పరితః = చుట్టూ, సువృత్తే = బాగా గుండ్రంగా వున్న, తయోః = ఆ రుక్మిణీకృష్ణులయొక్క, జంఘే = పిక్కలు, అంతరంగే = మనస్సులో, స్ఫుటమ్ = స్పష్టంగా, స్తామ్ = నిలుచుగాక! (అస భువి పరస్మైపది-లోట్-ప్ర.ద్వి.)

**తా ॥** సౌందర్యాన్ని లోపల నింపుతూ, చక్కగా నింపిన ఆ అనన్తసౌందర్యరాశిలో మిగిలిన భాగాలతో నిర్మించినట్లుగా బాగా బలిసి, గుండ్రంగా వున్న పైభాగాలు కలిగిన ఆ రుక్మిణీకృష్ణుల పిక్కలు నా మనస్సులో దృఢంగా నిలుచుగాక!

**వి :** 1. సువృత్తత జంఘాసౌందర్యంలో ప్రధానపాత్ర వహిస్తుంది. విష్ణుపాదాదికేశాంతస్తోత్రంలో ఆదిశంకరాచార్య కృతజంఘావర్ణన-18

శ్లో॥ శ్రీమత్యౌ **చారువృత్తే** కరపరిమలనానందహృష్టే రమాయాః
సౌందర్యాఢ్యేంద్రనీలోపలరచితమహాదండయోః కాన్తిచోరే ।
సూరీంద్రైః స్తూయమానే సురకులసుఖదే సూదితారాతిసంఘే
జంఘే నారాయణీయే ముహురపి జయతామస్మదంహో హరన్త్యౌ ॥

2. **స్తామ్ :** 18-7వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ పూర్ణస్య తజ్జాను నిజప్రచారైః - సానన్దనన్దావసథాఙ్గణే ప్రాక్ ।**
**చూర్ణీకృతానేకరజోఽస్మదీయ-మేనో ధునోత్వద్య హృదఙ్గణస్థమ్ ॥ 18-12**

**అ : కృష్ణ జాను (మోకాళ్ళు) వర్ణనం.** -ఇంద్రవజ్ర.

**అ :** ప్రాక్ స+ఆనంద-నంద+అవసథ+అంగణే నిజ-ప్రచారైః చూర్ణీకృత+అనేక-రజః తత్ పూర్ణస్య జాను అద్య హృద్-అంగణ-స్థమ్ అస్మదీయమ్ ఏనః ధునోతు.

**ప్ర :** ప్రాక్ = గతంలో, సానంద... గణే : స+ఆనంద = ఆనందంతో కూడిన, నంద = నందగోపునియొక్క, అవసథ = ఇంటియొక్క (శబ్దార్థకల్పతరుః-పు-52), అంగణే = ముంగిలియందు (ఆనందేన సహితస్య నందస్య అవసథస్య అంగణం, తస్మిన్), నిజ-ప్రచారైః = తన నడకలతో (నిజస్య ప్రచారాః, తైః), చూర్ణీ... రజః : చూర్ణీకృత = పొడిచేయబడిన, అనేక-రజః = చాలా ధూళిగల (చూర్ణీకృతమ్ అనేకం రజః యేన సః), తత్ = ఆ, పూర్ణస్య = పరిపూర్ణుడైన కృష్ణునియొక్క, జాను = మోకాలు, అద్య = ఇప్పుడు, హృద్-అంగణ-స్థమ్ = హృదయపు ముంగిలిలో నున్న (హృదేవ అంగణం, తస్మిన్ తిష్ఠతీతి తమ్), అస్మదీయమ్ = మాయొక్క, ఏనః = పాపాన్ని, ధునోతు = ఊడ్చివేయు గాత! (ధూ కంపనే-స్వాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** పూర్వం ఆనందభరితుడైన నందుని ఇంటి ముంగిట తన నడకలతో (దోగాడుటలతో) ఎంతో ధూళిని చూర్ణం చేసిన ఆ మోకాలు ఇప్పుడు నా హృదయాంగణంలో వున్న పాపాన్ని తొలగించు గాక!

| | | | |
|---|---|---|---|
| వి : 1. **ధునోతు :** | **ధునోతు**/ధునుతాత్ | ధునుతామ్ | ధున్వన్తు |
| | ధును/ధునుతాత్ | ధునుతమ్ | ధునుత |
| | ధునవాని | ధునవావ | ధునవామ |

2. ఛందస్సు - ఇంద్రవజ్ర. *

**శ్లో॥ సత్కాన్త్యా హరినీలకాఞ్చనసమౌ హస్తీన్ద్రహస్తోపమౌ**
**విష్వగ్వర్తులతాగుణేన మృదుతాధర్మేణ కున్దస్రజః ।**
**కల్పౌ యద్యపి రుగ్మిణీమురభిదోరూరూ కథఞ్చిత్ తులా**
**లావణ్యేన పరస్పరం పరమితి ద్వన్ద్వాత్మతాం బిభ్రతౌ ॥ 18-13**

**అ : రుక్మిణీకృష్ణుల ఊరువుల వర్ణనం.** -శార్దూలవిక్రీడితమ్.

**అ :** రుగ్మిణీ-మురభిదోః ఊరూ సత్-కాన్త్యా హరి-నీల-కాంచన-సమౌ విష్వగ్-వర్తులతా-గుణేన హస్తీ+ఇంద్ర-హస్త+ఉపమౌ మృదుతా-ధర్మేణ కుంద-స్రజః కల్పౌ యది అపి (భవతః) తథాపి పరం లావణ్యేన పరస్పరం తులా ఇతి ద్వంద్వ+ఆత్మతాం బిభ్రతౌ (బభూవతుః)

**ప్ర :** రుగ్మిణీ-మురభిదోః = రుక్మిణీకృష్ణులయొక్క (రుగ్మిణీ చ మురభిత్ చ, తయోః), ఊరూ = తొడలు, సత్-కాన్త్యా = మంచి వెలుగుతో, హరి... సమౌ : హరినీల = ఇంద్రనీలమణితోనూ, కాంచన = బంగారంతోనూ, సమౌ = సమానమైనవి. (హరినీలేన కాంచనేన చ సమౌ), విష్వక్... గుణేన : విష్వక్ = అంతట, వర్తులతా-గుణేన = గుండ్రదనంతో, హస్తీ... ఉపమౌ : హస్తీ+ఇంద్ర = ఏనుగుయొక్క, హస్త = తొండంతో, ఉపమౌ = పోలికగలవి, మృదుతా-ధర్మేణ = మెత్తదనంతో, కుంద-స్రజః : మొల్లపూల మాలలకు, కల్పౌ = సమానమైనవి, కథంచిత్ = ఏదో రీతిగా, యది+అపి (భవతః) = అయినప్పటికీ, లావణ్యేన = అందంతో, పరమ్ = కేవలం, పరస్పరమ్ తులా = ఒకదానితో ఒకటి సమానమని, ద్వంద్వ+ఆత్మతామ్ = రెండు రెండుగా వుండటాన్ని, బిభ్రతౌ = భరించాయి.

**తా ॥** రుక్మిణీకృష్ణుల తొడలు కాంతిలో ఇంద్రనీలమణులతోనూ (కృష్ణ) బంగారంతోనూ (రుక్మిణి) సమానం. వర్తులత్వంలో ఏనుగు తొండాలతో సమానం. మృదుత్వంలో కుందకుసుమమాలలతో సమానం. ఈ సామ్యంకూడా ఏదోవిధంగా సరిపెట్టుకొనదగ్గదే కానీ పూర్తిగా కాదు. అయితే అందంలో మాత్రం ఒకదానితో ఒకటి (పరస్పరం) సమానమే (కానీ మరేదీ లేదు). అందుకే అవి జంటలుగానే ఏర్పడ్డాయి.

**వి :** 1. సృష్టిలోని ఏ రెండు వస్తువులూ సమానం కాకపోయినా బాహ్యంగా కనిపించే రూపగుణాదులలోని ఈషత్సామ్యాన్ని బట్టి పోలికను వర్ణిస్తారు కవులు. కొన్ని సందర్భాలలో పోలికను కొన్ని సమయాల్లో ఉపమానపోలికను కుదరదని తిరస్కరిస్తూ చమత్కరిస్తారు. అటువంటిదే ఈ శ్లోకంలోని '**కథంచిత్**' పదం. ఏదో ఒకరీతిగా "సర్దుకుందాంలే" అంటూ పోలికను ప్రతిపాదించటం. వాస్తవంగా చూస్తే కుదరదని చెప్పటమే అక్కడ లక్ష్యం. ఆ తిరస్కారాన్ని హేతుబద్ధంగా చూపితే అదొక అందం. కాళిదాసు పార్వతి తొడలను వర్ణిస్తూ అటువంటి తిరస్కారాన్నే ప్రతిపాదిస్తాడు. (కుమారసంభవం - 1/36)

శ్లో॥ నాగేన్ద్రహస్తాస్త్వచికర్కశత్వా-దేకాంతశైత్యాత్కదళీవిశేషాః ।
లబ్ధ్వాపి లోకే పరిణాహి రూపం - జాతాస్తదూర్వోరుపమానబాహ్యాః ॥ *

**శ్లో॥ ఊరూ సమారోప్య మరుద్గణేశ-మారఞ్జయన్తౌ దిశతాం సుఖం మే ।**
**వైరివ్రజం సంహరతాం మురారేః - స్వారాతిరక్షఃక్షయమూలభూమీ ॥ 18-14**

**అ : కృష్ణుని తొడలవర్ణనం.** –ఇంద్రవజ్ర.

**అ :** మరుద్–గణ+ఈశం సమారోప్య ఆరంజయన్తౌ ముర+అరేః ఊరూ మే సుఖం దిశతామ్. స్వ+అరాతి–రక్షః –క్షయ–మూల–భూమీ మే వైరి–వ్రజం సంహరతామ్.

**ప్ర :** మరుద్–గణ+ఈశమ్ : మరుద్+గణ = మరుద్గణాలకు, ఈశమ్ = ప్రభువును (ముఖ్య ప్రాణుని) (మరుద్గణానామ్ ఈశః, తమ్), సమారోప్య = నిలిపికొని, ఆరంజయన్తౌ = రంజింపజేస్తున్న, ముర+అరేః = కృష్ణునియొక్క, ఊరూ = తొడలు, మే = నాకు, సుఖమ్ = సుఖాన్ని, దిశతామ్ = ఇచ్చుగాక (దిశ అతిసర్జనే–పరస్మైపది–లోట్–ప్ర.ద్వి.), స్వ+అరాతి... భూమీ : స్వ = తనయొక్క, అరాతి = శత్రువైన, రక్షః = రాక్షసుని, క్షయ = నిర్మూలించటానికి, మూలభూమీ = ఆధార ప్రదేశమగు, ఊరూ = తొడలు, వైరి = శత్రువులయొక్క, వ్రజమ్ = సమూహాన్ని, సంహరతామ్ = సంహరించుగాక! (సమ్–హృ హరణే పరస్మైపది–లోట్–ప్ర.ద్వి.)

**తా ॥** ముఖ్యప్రాణదేవరను నిలుపుకొని (భక్తులను) రంజింపజేస్తున్న కృష్ణుని ఊరువులు (తొడలు) నాకు సుఖాన్ని ఇచ్చుగాక! తన శత్రువైన రాక్షసుని (హిరణ్యకశిపుని) చంపటానికి మూలమైన ఆ తొడలు కృష్ణుని శత్రుసమూహాన్ని సంహరించుగాత!

| | | | |
|---|---|---|---|
| **వి :1. దిశతామ్ :** | దిశతు/దిశతాత్ | **దిశతామ్** | దిశన్తు |
| | దిశ/దిశతాత్ | దిశతమ్ | దిశత |
| | దిశాని | దిశావ | దిశామ |
| **సంహరతామ్ :** | సంహరతు/సంహరతాత్ | **సంహరతామ్** | సంహరన్తు |
| | సంహర/సంహరతాత్ | సంహరతమ్ | సంహరత |
| | సంహరాణి | సంహరావ | సంహరామ |

*

**శ్లో॥ అపరిమితసుఖౌఘం స్వాశ్రితాయా రమాయాః**
**శతగుణితవికాసం వాససః స్వాశ్రితస్య ।**
**అపగతనిజలాభః సన్తతం యో విధత్తే**
**స కిల మురభిదూరుః కారణం వైశ్యజాతేః ॥** **18–15**

**అ : కృష్ణుని ఊరువులవర్ణనం.** –మాలిని.

**అ :** యః స్వ+ఆశ్రితాయాః రమాయాః సంతతమ్ అపరిమిత–సుఖ+ఓఘం విధత్తే. అపగత–నిజ–లాభః స్వ+ఆశ్రితస్య వాససః శత–గుణిత–వికాసం విధత్తే సః మురభిద్–ఊరుః వైశ్య–జాతేః కారణం కిల.

**ప్ర :** యః = ఏదయితే, స్వ+ఆశ్రితాయాః = తనను ఆశ్రయించిన, రమాయాః = లక్ష్మికి, సంతతమ్ = ఎల్లప్పుడూ, అపరి... ఓఘమ్ : అపరిమిత = అనంతమైన (పరిమితి లేని), సుఖ+ఓఘమ్ = సుఖసమూహాన్ని, విధత్తే = కలిగిస్తుందో (వి–ధా ధారణపోషణయోః–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.), అపగత–నిజ–లాభః : అపగత = తొలగిన, నిజ = తనయొక్క, లాభః = లాభంగలదై, స్వ+ఆశ్రితస్య = తనను ఆశ్రయించినవానియొక్క, వాససః = వస్త్రానికి, శత... వికాసమ్ : శత–గుణిత = వందరెట్లు ఎక్కువగా, వికాసమ్ = దీప్తిని, విధత్తే = కలిగిస్తుందో, సః = ఆ, మురభిద్+ఊరుః = కృష్ణుని తొడ, వైశ్య–జాతేః = వైశ్యజాతికి, కారణం కిల = కారణంగదా! (అని ఆశ్చర్యప్రకటనం)

**తా ॥** కృష్ణుని తొడ తనను ఆశ్రయించిన లక్ష్మికి ఎప్పుడూ అంతులేని సుఖసమూహాలను అందిస్తుంది. తనను ఆశ్రయించిన బట్టలకు కూడా లాభదృష్టి లేకుండా వందరెట్లు ఎక్కువగా వికాసాన్ని కలిగిస్తుంది. అటువంటి ఊరువు వైశ్యజాతి పుట్టుకకు కారణం గదా!

**వి :** 1. వైశ్యజాతికి ప్రధానవ్యాపృతి వాణిజ్యం. వాణిజ్యంయొక్క ప్రధానలక్ష్యం లాభం. అటువంటి లాభప్రధానమైన వృత్తిగల వైశ్యజాతి లాభదృష్టిలేని కృష్ణుని ఊరువునుండి పుట్టడం ఆశ్చర్యకరమని కవి ఉద్దేశం.

2. **బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్ - బాహూ రాజన్యః కృతః ।**
**ఊరూ తదస్య యద్వైశ్యః - పద్భ్యాగ్ం శూద్రోఽజాయత ॥** **- పురుషసూక్తమ్.**

ఇక్కడ కవివివక్షకు ఈ పురుషసూక్తవచనం ఆధారం.

| | | | |
|---|---|---|---|
| 3. **విధత్తే :** | **విధత్తే** | విదధాతే | విదధతే |
| | విధత్సే | విదధాథే | విదధధ్వే |
| | విదధే | విదధ్వహే | విదధ్మహే. |

*

**శ్లో॥ సువర్ణవర్ణామ్బరభాసి భైష్మీ-ముకున్దయోః పాతు కటిద్వయం నః ।**
**సుసాన్ద్రసన్ధ్యాఘనసఙ్గి శృఙ్గ-మివోల్లసత్కాఞ్చననీలగిర్యోః ॥ 18-16**

**అ : రుక్మిణీకృష్ణుల కటివర్ణన.** -ఉపేంద్రవజ్ర.

**అ :** సువర్ణ-వర్ణ-అంబర-భాసి సుసాంద్ర-సంధ్యా-ఘన-సంగి ఉల్లసత్-కాంచన-నీల-గిర్యోః శృంగమ్ ఇవ భైష్మీ-ముకున్దయోః కటి-ద్వయం నః పాతు.

**ప్ర :** సువర్ణ... భాసి : సువర్ణ = బంగారంవంటి, వర్ణ = రంగుగల, అంబర = వస్త్రంతో, భాసి = ప్రకాశిస్తున్నదీ (సువర్ణవత్ వర్ణం యస్య, తచ్చ తత్ అంబరం, తేన భాసి), సుసాంద్ర... సంగి : సుసాంద్ర = బాగా దట్టమైన, సంధ్యా = సంజెవేళలోని, ఘన = మేఘంతో, సంగి = చేరిమిగలదీ అయిన (సు సాంద్రస్య సంధ్యాకాలీనస్య ఘనస్య సంగః అస్య అస్తీతి), ఉల్లసత్... గిర్యోః : ఉల్లసత్ = ప్రకాశిస్తున్న, కాంచన-నీలగిర్యోః = మేరుగిరి, నీలగిరులయొక్క (ఉల్లసన్తౌ కాంచనశ్చ నీలగిరిశ్చ తయోః), శృంగమ్-ఇవ = కొమ్ములా వున్న, భైష్మీ-ముకున్దయోః = రుక్మిణీకృష్ణులయొక్క (భైష్మీ చ ముకున్దశ్చ, తయోః), కటి-ద్వయమ్ = మొలలజంట, నః = మనలను, పాతు = రక్షించుగాత! (పా రక్షణే అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** పీతాంబరాలతో ప్రకాశిస్తూ సంధ్యాకాలంలోని దట్టమైన మేఘాలతో కూడి ప్రకాశిస్తున్న మేరుగిరి నీలగిరుల శృంగంలా వున్న రుక్మిణీకృష్ణుల కటిద్వయం మనలను కాపాడుగాత!

**వి :** 1. రుక్మిణీకృష్ణుల కటిద్వయానికి మేరుగిరి నీలగిరుల శృంగానికీ పోలిక. ఉపమాలంకారం. పీతాంబరాలతో భాసించటం, సాంధ్యమేఘకాంతితో కలిసి వుండటం ఉపమేయోపమానాలలోని సాధర్మ్యం. ఆ రెండింటికీ బింబప్రతిబింబభావం.

| | | | |
|---|---|---|---|
| 2. **పాతు :** | **పాతు**/పాతాత్ | పాతామ్ | పాన్తు |
| | పాహి/పాతాత్ | పాతమ్ | పాత |
| | పాని | పావ | పామ. |

3. ఛందస్సు - ఉపేంద్రవజ్ర. *

**శ్లో॥ పీతామ్బరాలఙ్కృతమగ్ర్యరత్న-స్యూతస్ఫురత్కిఙ్కిణిమేఖలాద్యైః ।**
**జాతప్రభం పీనలసన్నితమ్బం - చేతః! సదా చిన్తయ చిన్మయస్య ॥ 18-17**

**అ : కృష్ణుని నితంబవర్ణన.** -ఇంద్రవజ్ర.

**అ :** చేతః! పీత+అంబర+అలంకృతమ్ అగ్ర్య-రత్న-స్యూత-స్ఫురత్-కింకిణి-మేఖలా-ఆద్యైః జాత-ప్రభం చిన్మయస్య పీన-లసత్+నితంబం సదా చిన్తయ.

**ప్ర :** చేతః! = మనసా!, పీత... కృతమ్:పీత+అంబర=పసుపువన్నె ఉడుపులతో, అలంకృతమ్ = అలంకరింపబడినదీ (పీతం చ తత్ అంబరం, తేన అలంకృతమ్), అగ్ర్య... లాద్యైః : అగ్ర్య = శ్రేష్ఠమైన, రత్న = రత్నాలతో, స్యూత = కుట్టబడి (సివ్ ధాతువుపై క్త ప్రత్యయం), స్ఫురత్ = ప్రకాశిస్తున్న, కింకిణి = మువ్వలతో కూడిన, మేఖలా = మొలనూలు, ఆద్యైః = మొదలగువానితో (అగ్ర్యాణి చ తాని రత్నాని తైః స్యూతాని స్ఫురన్తి కింకిణి మేఖలాద్యాని తైః), జాత-ప్రభమ్ : జాత = పుట్టిన (జన్ ధాతువుపై క్త ప్రత్యయం), ప్రభమ్ = కాంతిగలదీ అయిన (జాతా ప్రభా యస్మిన్ తమ్), చిత్+మయస్య = జ్ఞానమయుడైన కృష్ణునియొక్క, పీన-లసత్+నితంబమ్ : పీన = బలిసినదై, లసత్ = ప్రకాశిస్తున్న, నితంబమ్ = పిరుదును (పీనః లసన్ చ అసౌ నితంబః, తమ్), సదా = ఎల్లప్పుడు, చిన్తయ = భావించు/గ్రహించు (చిత్ సంజ్ఞానే-భ్వాది-ణిచ్-పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** మనసా! పీతాంబరంతో, మేలిమిరతనాలు గ్రుచ్చిన మువ్వలమొలనూలు వంటి ఆభరణాలతో కాంతిమంతమైన చిన్మయస్వరూపుడైన కృష్ణుని పీననితంబాన్ని సదా స్మరించు.

**వి : 1. చిన్తయ :**

| | | | |
|---|---|---|---|
| చిన్తయతు/చిన్తయతాత్ | చిన్తయతామ్ | చిన్తయన్తు | |
| **చిన్తయ**/చిన్తయతాత్ | చిన్తయతమ్ | చిన్తయత | |
| చిన్తయాని | చిన్తయావ | చిన్తయామ. | * |

**శ్లో॥ ఆపాదపద్మం పరిలమ్బమానా - నీవీ రమాయా రమణీయకాఞ్చ్యాః ।**
**విష్వక్స్ఫురద్రత్నగణస్య మధ్య-లక్ష్మ్యా వినమ్రా ఇవ భాతి భాసః ॥ 18-18**

**అ : రుక్మిణీ నీవీ వర్ణన.** -ఇంద్రవజ్ర.

**అ :** ఆపాద-పద్మం పరిలంబమానా రమాయాః నీవీ రమణీయ-కాంచ్యాః విష్వక్-స్ఫురత్-రత్న-గణస్య మధ్య-లక్ష్మ్యా వినమ్రాః భాసః ఇవ భాతి.

**ప్ర :** ఆపాద-పద్మమ్ = చరణకమలంవరకు, పరిలంబమానా = వ్రేలాడుతున్న, రమాయాః = రుక్మిణియొక్క, నీవీ = కోకముడి, రమణీయ-కాంచ్యాః : రమణీయ = అందమైన (రమ్ ధాతువుపై అనీయర్ ప్రత్యయం), కాంచ్యాః = మొలనూలియొక్క, విష్వక్... గణస్య : విష్వక్ = అంతటా, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, రత్న-గణస్య = రత్నసమూహంయొక్క, మధ్య-లక్ష్మ్యా = మధ్యనున్న (కేంద్రీకృతమైన) శోభతో, వినమ్రాః = క్రిందుజేయబడిన, భాసః ఇవ = కాంతులవలె, భాతి = ప్రకాశిస్తోంది. (భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** రుక్మిణి కోకముడి (ముడివేయగా మిగిలిన ఆ కొనలు) పాదపద్మంవరకు వ్రేలాడుతోంది. అది ఆమె మొలనూలిలోని రత్నసమూహాలయొక్క కేంద్రీకృతకాంతిచేత క్రిందుజేయబడిన సువర్ణకాంతిలా ప్రకాశిస్తోంది.

**వి :** 1. శ్లోకంలో ఉత్ప్రేక్షాలంకారముంది. వ్రేలాడుతున్న కోకముడిని కాంచీ సువర్ణకాంతిగా సంభావించటంవలన ఇది ఉత్ప్రేక్ష. ఇది వస్తుమాత్రం కాబట్టి వస్తూత్ప్రేక్ష.

2. **భాతి :**

| | | | |
|---|---|---|---|
| **భాతి** | భాతః | భాన్తి | |
| భాసి | భాథః | భాథ | |
| భామి | భావః | భామః. | * |

**శ్లో॥ వ్రజభువి బాహుపాశైర్యన్న బద్ధం మురారే-**
**స్తదుదరమధునాऽऽసీత్ సన్తతం భీష్మపుత్ర్యాః ।**
**పులకితకరచారుప్రేమదామ్నా నిబద్ధం**
**ప్రభురపి వశమేతి ప్రేమభారైరుదారైః ॥ 18-19**

**అ : కృష్ణుని ఉదర వర్ణన.** -మాలిని.

**అ :** యత్ వ్రజ-భువి బహు-పాశైః న బద్ధం తద్ మురారేః ఉదరమ్ అధునా సంతతం భీష్మ-పుత్ర్యాః పులకిత-కర-చారు-ప్రేమ-దామ్నా నిబద్ధమ్. ఉదారైః ప్రేమ-భారైః ప్రభుః అపి వశమ్ ఏతి.

**ప్ర :** యత్ = ఏది (ఏ ఉదరం), వ్రజ-భువి = గోకులంలో (వ్రజస్య భూః, తస్యామ్), బహు-పాశైః : ఎన్నో త్రాళ్ళతోనూ (బహవః చ తే పాశాః, తైః), న బద్ధమ్ = కట్టుబడలేదో, తత్ = అది(అ), ముర+అరేః = కృష్ణునియొక్క, ఉదరమ్ = పొట్ట, అధునా = ఇప్పుడు, బద్ధమ్ ఆసీత్ = కట్టబడినది, (అస-భువి-పరస్మైపది-లజ్-ప్ర.ఏ.), సంతతమ్ = ఎల్లప్పుడూ, భీష్మ-పుత్ర్యాః = భీష్మపుత్రిక అయిన రుక్మిణియొక్క (భీష్మస్య పుత్రీ, తస్యాః), పులకిత... దామ్నా : పులకిత = పులకరించిన, కర = చేయి అనే, చారు = అందమైన, ప్రేమ-దామ్నా = ప్రేమపాశంచే (పులకితశ్చ అసౌ కరః, స ఏవ చారు ప్రేమాఖ్య దామ, తేన), నిబద్ధమ్ = బంధింపబడింది. ఉదారైః = అధికమైన, ప్రేమ-భారైః = ప్రణయాతిశయాలచేత (ప్రేమ్ణః భారాః, తైః), ప్రభుః+అపి = సమర్థుడు (విడిపించుకొనటంలో) అయినా, వశమ్ ఏతి = లొంగిపోతాడు. (ఇ గతౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** గోకులంలో ఎన్ని పాశాలతోనూ బంధింపబడని కృష్ణుని ఉదరం ఇప్పుడు రుక్మిణియొక్క చేయి అనే అందమైన ప్రేమపాశానికి లొంగిపోయింది. తప్పించుకొనే సమర్థత గలవాడైనా ఉదారమైన ప్రేమపాశాలకు లోబడుతాడు.

**వి :** 1. గోకులంలో కృష్ణుని బంధింపలేకపోయినవి భౌతికమైన పాశాలే కాదు, భావికపాశాలు కూడా. యశోదతో అయినా, నందునితో అయినా, గోపికలతో అయినా, ఇతర బంధు-మిత్రులతో అయినా కృష్ణునకున్న బంధం నరానుకరణరూపమే. కాబట్టి వాస్తవికతలో కృష్ణునకు ఏ బంధమూ వుండదు. మరి రుక్మిణివిషయంలో కూడా అదే నరానుకారత్వాన్ని అంగీకరించాలి గదా! అవును రుక్మిణి, రుక్మిణీహరణం, ఆమె ప్రేమపాశాలు ఇవన్నీ నరానుకరణలే. అసలు విషయం వేరు. శక్తిరూపమైన (లక్ష్మీరూపమైన) రుక్మిణి భావికంగా నిరంతరాయంగా కృష్ణునితో కలిసే వుంటుంది. ఆ శక్తికి ఆధారభూతుడు కృష్ణుడు.

2. శ్లోకంలో అర్థాంతరన్యాసాలంకారం. మొదటిమూడు పాదాలలోని విశేషవిషయానికి నాలుగవ పాదంలోని సామాన్యవిషయాన్ని జోడించటం వలన అర్థాంతరన్యాసం.

గోకులంలో కృష్ణుని బంధించిన పాశాలకూ రుక్మిణి ప్రేమ పాశాలకు పోలిక ధ్వనిస్తుంది. ఆ పోలికలో కొంత విశేషంకూడా వుంది. అవి మామూలు పాశాలు. ఇవి ప్రేమపాశాలు. కాబట్టి వ్యతిరేకాలంకారధ్వని. ప్రేమపాశాలు అనటంలో ప్రేమలో పాశత్వాన్ని ఆరోపించటం ద్వారా రూపకం కూడా.

| | | | |
|---|---|---|---|
| 3. **ఆసీత్ :** | **ఆసీత్** | ఆస్తామ్ | ఆసన్ |
| | ఆసీః | ఆస్తమ్ | ఆస్త |
| | ఆసమ్ | ఆస్వ | ఆస్మ |
| **ఏతి :** | **ఏతి** | ఇతః | యన్తి |
| | ఏషి | ఇథః | ఇథ |
| | ఏమి | ఇవః | ఇమః. |

*

**శ్లో॥ అఙ్కస్థితోదధిసుతోచ్చకరాఙ్గులీనాం - కాన్తిస్త్రిధోదరగతేవ వలిర్విరేజే ।**
**నాభిం ప్రవిశ్య శనకైరుదితా తదీయ-నేత్రాన్తకాన్తిరివ రోమలతా చ తన్వీ ॥18-20**

**అ : కృష్ణుని త్రివళిని, నూగారును వర్ణించటం.** -వసంతతిలక.

**అ :** అంక-స్థిత-ఉదధి-సుతా-ఉచ్చ-కర+అంగులీనాం కాంతిః త్రిధా ఉదర-గతా+ఇవ వలిః విరేజే. తన్వీ రోమ-లతా చ నాభిం ప్రవిశ్య శనకైః ఉదితా తదీయ-నేత్ర+అంత-కాంతిః ఇవ విరేజే.

**ప్ర :** అంక... లీనామ్ : అంక = తొడపైభాగంలో, స్థిత = ఉన్నట్టి, ఉదధి-సుతా = కడలికూతు (రుక్మిణి)యొక్క, ఉచ్చ = పొడవైన, కర+అంగులీనామ్ = చేతివ్రేళ్ళయొక్క (చేతివ్రేళ్లలో పొడవైనవి మూడు-చూపుడువ్రేలు, నడిమివ్రేలు, ఉంగరపు వ్రేలు), కాంతిః = శోభ, త్రిధా = మూడుగా, ఉదర-గతా ఇవ = ఉదరంపై నిలిచినట్లు, వలిః = ముడత (నడుముపై కనిపించే ముడతలు మూడు.), విరేజే = ప్రకాశించింది. (రాజ్ దీప్తౌ ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), తన్వీ = సన్ననైన, రోమ-లతా చ = నూగారుగూడా (రోమ్ణాం లతా), నాభిమ్ = బొడ్డును, ప్రవిశ్య = ప్రవేశించి (ప్ర-విశ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), శనకైః = మెల్లగా (అశీఘ్రే శనకైశ్శనైః-వైజయన్తీ-శేష-16), ఉదితా = పైకివచ్చిన, తదీయ... కాంతిః ఇవ : తదీయ = ఆ రుక్మిణియొక్క, నేత్ర+అన్త = కనుగొనలచివరలలోని, కాన్తిః ఇవ = కాంతిలా, (విరేజే = ప్రకాశించింది.)

**తా ॥** తన అంకంపై వున్న రుక్మిణి పొడవైన చేతివ్రేళ్ళ కాంతి-ప్రధానంగా పొడవుగా కనిపించే మూడు నడిమివ్రేళ్ళ కాంతి-మూడు పాయలై ఉదరంపైకి వచ్చినట్లు కృష్ణుని ఉదరం కనిపిస్తోంది. నాభిలో దూరి మెల్లగా పైకివచ్చిన ఆ రుక్మిణి కనుకొనల కాంతి అన్నట్లుగా కృష్ణుని నూగారు వెలుగొందుతోంది.

**వి :** 1. స్పష్టమైన త్రివళీ, కాంతిమంతమైన నూగారు శరీరసౌష్ఠవంతో పాటు సమీచీనమైన శరీరనిర్మాణాన్ని సూచిస్తాయి. శరీరసౌందర్యంతో ఆరోగ్యాన్ని కూడా ప్రకటిస్తాయి.

2. శ్లోకం పూర్వార్ధంలోనూ, ఉత్తరార్ధంలోనూ కూడా ఇవ పదం ఉత్ప్రేక్షావ్యంజకమే. రెండూ - మూడుపాయలుగా ప్రసరించిన కరాంగులి కాంతి అన్నట్లు, కనుకొనల కాంతి అన్నట్లు - కూడా వస్తూత్ప్రేక్షలే.

| | | | |
|---|---|---|---|
| 3. **విరేజే :** | **విరేజే** | విరేజాతే | విరేజిరే |
| | విరేజిషే | విరేజాథే | విరేజిధ్వే |
| | విరేజే | విరేజివహే | విరేజిమహే. |

*

## శ్లో॥ సువర్ణవర్ణోదరమధ్యలగ్నా - మనోజ్ఞరోమావలిరిన్దిరాయాః ।
## జిగాయ వక్షోజకరీన్ద్రకుమ్భ-యుగావతీర్ణాం మదవారిధారామ్ ॥ 18-21

**అ : రుక్మిణి నూగారును వర్ణించటం.** -ఉపేంద్రవజ్ర.

**అ :** సువర్ణ-వర్ణ+ఉదర-మధ్య-లగ్నా ఇందిరాయాః మనోజ్ఞ-రోమ+ఆవలిః వక్షః+జ-కరీ+ఇంద్ర-కుంభ-యుగ-అవతీర్ణాం మద-వారి-ధారాం జిగాయ.

**ప్ర :** సువర్ణ... లగ్నా : సువర్ణ = బంగారంయొక్క, వర్ణ = వన్నెగల, ఉదర = పొట్టయొక్క, మధ్య = నడుమ, లగ్నా = తగిలివున్నట్టి (సువర్ణస్య వర్ణవత్ వర్ణః యస్య, తచ్చ తత్ ఉదరం, తస్య మధ్యే లగ్నా), ఇందిరాయాః = రుక్మిణియొక్క, మనోజ్ఞ-రోమ-ఆవలిః = అందమైన నూగారు (మనోజ్ఞా చ సా రోమ్ణామ్ ఆవలిః), వక్షో... తీర్ణామ్ : వక్షోజ = రొమ్ము లనే, కరీ+ఇంద్ర = మదపుటేనుగులయొక్క, కుంభ = కుంభస్థలాలయొక్క, యుగ = జంటనుండి, అవతీర్ణామ్ = వెలువడిన (వక్షోజౌ ఏవ కరీంద్రస్య కుంభౌ, తయోః యుగం తస్మాత్ అవతీర్ణా, తామ్), మద-వారి-ధారామ్ = మదజలధారను, జిగాయ = జయించింది. (జి జయే పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణియొక్క బంగారువన్నెగల ఉదరం మధ్య ఏర్పడిన అందమైన నూగారు రొమ్ము లనే మదపుటేనుగుల కుంభయుగ్మంనుండి కారిన మదజలధారను జయించింది.

**వి :** 1. మదవారిధారను జయించింది అనటంలో ఒక పోలిక, కొంత ఆధిక్యం ధ్వనిస్తుంది. వక్షోజాలలో

మదపుటేనుగుల కుంభస్థలత్వాన్ని ఆరోపించటం రూపకం. అయితే ఆ రూపకం వల్ల నూగారువన్నెకు ఉపయోగమేమీలేదు. అది సఫలం కావాలంటే ఆ స్తనాగ్రచూచుక కాంతిగా నూగారును భావించుకోవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జిగాయ :** | **జిగాయ** | జిగ్యతుః | జిగ్యుః | |
| | జిగయిథ/జిగేథ | జిగ్యథుః | జిగ్య | |
| | జిగాయ/జిగయ | జిగ్యివ | జిగ్యిమ. | * |

**శ్లో॥ సద్రోమావలినీలరత్నలతికాం తన్నాభివాపీతటా-**
**దుద్యన్తీం విలసత్కుచాచలతటీద్వన్ద్వాన్తరప్రాప్తయే ।**
**మధ్యే వ్యోమవశాదలబ్ధసరణిం ధర్తుం విధాత్రా కృతాం**
**స్నిగ్ధాష్టాపదయష్టిమబ్ధిదుహితుర్మృద్వీ వలిః స్పర్ధతే ॥ 18-22**

**అ : రుక్మిణి త్రివలివర్ణన.** -శార్దూలవిక్రీడితమ్.

**అ :** అబ్ధి-దుహితుః మృద్వీ వలిః విలసత్-కుచ+అచల-తటీ-ద్వన్ద్వ+అంతర-ప్రాప్తయే తత్+నాభి-వాపీ-తటాత్ ఉద్యన్తీం మధ్యే వ్యోమ-వశాత్ అలబ్ధ-సరణిం సద్-రోమ+ఆవలి-నీల-రత్న-లతికాం ధర్తుం విధాత్రా కృతాం స్నిగ్ధ-అష్టాపద-యష్టిం స్పర్ధతే.

**ప్ర :** అబ్ధి-దుహితుః : అబ్ధి = సముద్రంయొక్క, దుహితుః = కుమార్తెయొక్క (ఆపః ధీయన్త అస్మిన్ ఇతి, తస్య దుహితా, తస్యాః), మృద్వీ = సన్నని, వలిః = కడుపు మీది ముడుత, విలసత్... ప్రాప్తయే : విలసత్ = ప్రకాశిస్తున్న, కుచ = రొమ్ము లనే, అచల = కొండలయొక్క, తటీ = అంచులయొక్క, ద్వన్ద్వ = జంటయొక్క, అంతర = మధ్యభాగాన్ని, ప్రాప్తయే = పొందుటకై (విలసన్తౌ కుచౌ ఏవ అచలౌ, తయోః తట్యోః ద్వన్ద్వస్య అంతరస్య ప్రాప్తయే), తత్-నాభి-వాపీ-తటాత్ : తత్ = ఆ రుక్మిణియొక్క, నాభి = బొడ్డు అనే, వాపీ = దిగుడుబావియొక్క (నిదాన ముదపానం చ వాప్యాహోవశ్చ కథ్యతే-హలాయుధకోశః-684), తటాత్ = అంచునుండి (తస్యాః నాభిః ఏవ వాపీ, తస్యాః తటం, తస్మాత్), ఉద్యన్తీమ్ = పైకి వెళ్తూ, మధ్యే = నడిమిదారిలో, వ్యోమ-వశాత్ = ఆకాశానికి లోగి (వ్యోమ్నః వశం, తస్మాత్) మధ్యం శూన్యమైనందువల్ల), అలబ్ధ-సరణిమ్ : అలబ్ధ = పొందబడని, సరణిమ్ = మార్గంగల (అలబ్ధః సరణిః యయా, తామ్), సద్... లతికామ్ : సద్ = (ప్రాకి)వున్న, రోమ = వెంట్రుకలయొక్క, ఆవలి = వరుస అనే, నీల-రత్న = నీలరత్నాలయొక్క, లతికామ్ = తీవెను (సతీ చ సా రోమ్ణామ్ ఆవలిః, సా ఏవ నీల-రత్న-లతికా, తామ్), ధర్తుమ్ = పట్టుకొనటానికై (ధృ ధాతువుపై తుమున్ ప్రత్యయం), విధాత్రా = బ్రహ్మచేత, కృతామ్ = కల్పింపబడిన, స్నిగ్ధ+అష్టాపద-యష్టిమ్ : స్నిగ్ధ = మృదువైన, అష్టాపద = బంగారుతో చేసిన, యష్టిమ్ = కడ్డీతో (స్నిగ్ధా చ సా అష్టాపదయష్టిః, తామ్), స్పర్ధతే = సంఘర్షిస్తోంది. (స్పర్ధ సంఘర్షే-ఆత్మనేపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కడలికూతురయిన రుక్మిణియొక్క కడుపుమీది సన్నని ముడుత స్తనా లనే కొండల అంచుల జంట మధ్య చేరాలని, ఆమె బొడ్డు అనే దిగుడుబావి నుండి మెల్లగా పైకి పోవటం ప్రారంభించింది. అక్కడ దారిలో ఆకాశం (నడుము-శూన్యం) అడ్డువచ్చింది. దారి దొరకలేదు. దానితో నూగారు అనే నీలరత్నలతను ఆధారంగా పట్టుకొని వెళ్ళటానికి బ్రహ్మ సృష్టించిన అష్టాపద యష్టితోపోటీ పడుతోంది.

**వి :** 1. రోమావలిలో రత్నలతికాత్వాన్ని, నాభిలో వాపీత్వాన్ని, కుచాలలో అచలతాన్ని, మధ్యలో వ్యోమత్వాన్ని, త్రివళిలో అష్టాపదయష్టిత్వాన్ని ఆరోపించటం వలన ఇది రూపకాలంకారం.

'**ధర్తుం విధాత్రా కృతామ్**' అన్నచోట ధర్తుమివ అని ఉత్ప్రేక్షాలంకారం ధ్వనిస్తుంది. శరీరనిర్మాణానికి పట్టుకోవటమన్న

సంభావనకు సంబంధంలేకపోయినా వున్నట్లు వర్ణించినందువల్ల ఇది సంబంధాతి-శయోక్త్యలంకారం. '**సంబంధాతిశయోక్తిః స్యాదయోగే యోగకల్పనమ్**' (కు. 39)

శ్లోకంలోని రూపకాలంకారాలలో ఉపమానం - ఉపమేయం రెండూ వాచా కనిపిస్తాయి. అలాకాక ఉపమేయాన్ని కప్పిపుచ్చి ఉపమానాన్ని మాత్రమే చెపితే అది రూపకాతిశయోక్త్యలంకార మవుతుంది. అలా రూపకాతిశయోక్తిని-దాదాపు ఇవే వర్ణ్యవిషయాలతో-గమనించండి.

**శ్లో॥ వాపీ కాపి స్ఫురతి గగనే తత్పరం సూక్ష్మపద్యా**
**సోపానాలీమధిగతవతీ కాంచనీమైంద్రనీలీ ।**
**అగ్రే శైలౌ సుకృతిసుభగౌ చందనచ్ఛన్నదేశౌ**
**తత్రత్యానాం సులభమమృతం సన్నిధానాత్సుధాంశోః ॥**

| | | | |
|---|---|---|---|
| 2. **స్పర్ధతే :** | **స్పర్ధతే** | స్పర్ధేతే | స్పర్ధన్తే |
| | స్పర్ధసే | స్పర్ధేతే | స్పర్ధధ్వే |
| | స్పర్ధే | స్పర్ధావహే | స్పర్ధామహే. * |

**శ్లో॥ శ్రీభూకటాక్షోత్పలమబ్జభూద్వి-రేఫాలయామ్భోరుహమచ్యుతస్య ।**
**నాభిహ్రదం వృత్తమగాధమచ్ఛ-శోభామ్బుపూర్ణం విశ చిత్తమీన! ॥ 18-23**

**అ : కృష్ణుని నాభిని వర్ణించటం.** -ఇంద్రవజ్ర.

**అ :** చిత్త-మీన శ్రీ-భూ-కటాక్ష+ఉత్పలమ్ అబ్జ-భూ-ద్విరేఫ+ఆలయ+అంభోరుహం వృత్తమ్ అగాధమ్ అచ్ఛ-శోభా+అంబు-పూర్ణమ్ అచ్యుత నాభి-హ్రదం విశ.

**ప్ర :** చిత్త-మీన!:చిత్త = మన స్సనే, మీన = చేపా!(చిత్తమ్ ఏవ మీనః, తస్మాత్ సంబుద్ధిః), శ్రీ... ఉత్పలమ్ : శ్రీ = లక్ష్మియొక్క, భూ = భూమియొక్క, కటాక్ష = చూపు లనే, ఉత్పలమ్ = కలువలు గలదీ (శ్రీశ్చ భూశ్చ తయోః కటాక్షాః ఏవ ఉత్పలాని యస్మిన్ తత్), అబ్జ... రుహమ్ : అబ్జ-భూ = బ్రహ్మ అనే, ద్విరేఫ = తుమ్మెదకు, ఆలయ = నివాస్థలమైన, అమ్భోరుహమ్ = పద్మంగలదీ (అబ్జే భవతీతి, స ఏవ ద్విరేఫః, తస్య ఆలయః చ తత్ అమ్భోరుహం యస్మిన్ తత్), వృత్తమ్ = గుండ్రనిదీ, అగాధమ్ = లోతైనదీ, అచ్ఛ-శోభా+అంబు-పూర్ణమ్ : అచ్ఛ = నిర్మలమైన, శోభా = కాంతి అనే, అంబు = నీటితో, పూర్ణమ్ = నిండినదీ అయిన (అచ్ఛా శోభా ఏవ అంబు, తేన పూర్ణమ్), అచ్యుతస్య = కృష్ణునియొక్క, నాభి-హ్రదమ్ = బొడ్డు అనే మడుగు లోనికి (నాభిః ఏవ హ్రదః, తమ్), విశ = ప్రవేశించు (విశ ప్రవేశనే పరస్మైపది-లోట్-మ.ఏ.)

**తా ॥** హృదయమీనమా! కృష్ణునియొక్క నాభి అనే మడుగులోనికి ప్రవేశించు. దానిలో శ్రీదేవి భూదేవుల కటాక్షాలనే కలువలు ఉన్నాయి. బ్రహ్మ అనే తుమ్మెదకు నివాసమైన తామరలున్నాయి. అది గుండ్రనిదీ, లోతైనదీ, నిర్మలకాంతిజలంతో నిండినది.

**వి :** 1. నాభిని మడుగుతో పోల్చుతూ నాభిలో హ్రదత్వాన్ని ఆరోపించటంవల్ల ఇది రూపకాలంకారం. అలాగే కటాక్షాలలో ఉత్పలత్వాన్నీ, బ్రహ్మలో ద్విరేఫత్వాన్నీ, శోభలో అంబుత్వాన్నీ కూడా ఆరోపించి దీనిని సావయవరూపకం చేశాడు కవి.

| | | | |
|---|---|---|---|
| 2. **విశ :** | విశతు/విశతాత్ | విశతామ్ | విశన్తు |
| | **విశ**/విశతాత్ | విశతమ్ | విశత |
| | విశాని | విశావ | విశామ. * |

**శ్లో॥ ఉద్దీప్తహారాన్తరరత్నకాన్త్యా - హృద్యం మనోజ్ఞోదరబన్ధబద్ధమ్ ।**
**తద్విశ్వపిత్రోస్త్రివలి త్రికాలం - శర్మాణి నిర్మాతు కృశోదరం నః ॥ 18-24**

**అ : రుక్మిణీకృష్ణుల ఉదరవర్ణన.** -ఇంద్రవజ్ర.

**అ :** ఉద్దీప్త-హార+అన్తర-రత్న-కాన్త్యా హృద్యం మనః+జ్ఞ+ఉదర-బన్ధ-బద్ధం త్రివలి విశ్వ-పిత్రోః తత్ కృశ+ఉదరం త్రి-కాలం నః శర్మాణి నిర్మాతు.

**ప్ర :** ఉద్దీప్త... కాన్త్యా : ఉద్దీప్త = బాగా ప్రకాశిస్తున్న, హార = ముత్యాలహారాలయొక్క, అంతర = మధ్యనున్న, రత్న = మణులయొక్క, కాన్త్యా = కాంతితో (ఉద్దీప్తానాం హారాణామ్ అన్తరే విద్యమానానాం రత్నానాం కాంతిః , తయా), హృద్యమ్ = మనోహరమైనదీ, మనో... బద్ధమ్ : మనః+జ్ఞ = అందమైన (మనసా జ్ఞాయత ఇతి మనోజ్ఞః), ఉదర-బన్ధ = ఒడ్డాణంచే, బద్ధమ్ = గట్టిగ బిగింపబడినదీ (మనోజ్ఞేన ఉదరబన్ధేన బద్ధః, తమ్), త్రివలి = (తిస్రో వలయో యస్య తత్ - త్రివలి) మూడు ముడుతలు గల, విశ్వ-పిత్రోః : విశ్వ = జగత్తుయొక్క, పిత్రోః = తల్లిదంద్రులయొక్క, తత్ = ఆ, కృశ+ఉదరమ్ = సన్నని ఉదరం, త్రి-కాలమ్ = మూడు (భూత, భవిష్యద్, వర్తమాన) కాలాలలో, నః = మనకు, శర్మాణి = సుఖాలను, నిర్మాతు = కలిగించుగాత! (నిర్ మాజ్ మానే-అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** ప్రజ్వలిస్తున్న హారరత్నకాంతితో మనోహరమైన అందమైన ఒడ్డాణం కలిగి త్రివళితో అందగిస్తున్న విశ్వపితల సన్నని ఉదరం త్రికాలాల్లోనూ మనకు సుఖాలను కలిగించుగాత!

| | | | |
|---|---|---|---|
| **వి : 1. నిర్మాతు :** | **నిర్మాతు**/నిర్మాతాత్ | నిర్మాతామ్ | నిర్మాన్తు |
| | నిర్మాహి | నిర్మాతమ్ | నిర్మాత |
| | నిర్మాణి | నిర్మావ | నిర్మామ. |

*

**శ్లో॥ గర్భస్థసర్వభువనావపి తావిదానీం**
**ప్రద్యుమ్నముఖ్యజనకావితి సూచనాయ ।**
**విశ్వైకమన్దిరమపి స్మ దధత్ తదీయం**
**మధ్యం ముదే భవతు మన్మథగాత్రమాత్రమ్॥ 18-25**

**అ : కృష్ణుని నడుమును వర్ణించుట.** -వసంతతిలక.

**అ :** తౌ గర్భ-స్థ-సర్వ-భువనౌ అపి ఇదానీం ప్రద్యుమ్న-ముఖ్య-జనకౌ ఇతి సూచనాయ విశ్వ+ఏక-మందిరమ్ అపి మన్మథ-గాత్ర-మాత్రం దధత్స్మ తదీయం మధ్యం ముదే భవతు.

**ప్ర :** తౌ = ఆ రుక్మిణీకృష్ణులు, గర్భ... భువనౌ అపి : గర్భ-స్థ = కడుపులోనున్న, సర్వ = సమస్తమైన, భువనౌ అపి = లోకాలుగలవారైనా (గర్భే తిష్ఠన్తీతి, తాని చ సర్వాణి భువనాని యయోః తౌ), ఇదానీమ్ = ఇప్పుడు, ప్రద్యుమ్న-ముఖ్య-జనకౌ : ప్రద్యుమ్న-ముఖ్య = ప్రద్యుమ్నుడే ముఖ్యంగా గలవారికి (ప్రద్యుమ్నః ముఖ్యః యేషాం తేషాం జనకౌ), జనకౌ = తల్లిదంద్రులు, ఇతి = అని, సూచనాయ = సూచించటానికై, విశ్వ-ఏక-మందిరమ్ అపి : విశ్వ = ప్రపంచానికి, ఏక-మందిరమ్ అపి = ఒకే మందిరమైనా, మన్మథ-గాత్ర-మాత్రమ్ = మన్మథుని శరీరాన్ని మాత్రమే (మన్మథస్య గాత్రం, కేవలం మన్మథగాత్రం మన్మథగాత్రమాత్రమ్), దధత్ **(స్మ)** = మోస్తూ (ధరిస్తూ), తదీయమ్ = ఆ రుక్మిణికృష్ణులయొక్క, మధ్యమ్ = నడుము. ముదే భవతు = ఆనందకరమగుగాక! (భూ సత్తాయాం భ్వాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణీకృష్ణుల గర్భంలో సమస్తభువనాలూ ఉన్నాయి. ప్రస్తుతం ప్రద్యుమ్నాదులకు జనకులు వారు. ఆ విషయాన్ని సూచించటానికై విశ్వైక మందిరమయిన తమ మధ్యభాగంలో మన్మథుని శరీరాన్ని మాత్రమే ధరించారు. (మన్మథుడు అనంగుడు కాబట్టి రుక్మిణీకృష్ణుల నడుము కూడా శూన్యం- బాగా సన్నం- అని కవి వివక్ష. అటువంటి నడుము (మనకు) ఆనందాన్ని కలిగించుగాక!

**వి :** 1. శ్లోకంలో 'స్మ' పదం విలక్షణంగా ప్రయోగింపబడినట్లు కనిపిస్తోంది. క్రియాపదం భవతు (లోట్ ప్రయోగం) కాబట్టి దానితో 'స్మ'ను కలిపి భూతకాలార్థాన్ని స్వీకరించటానికి వీలు లేదు. '**లట్స్మే**' సూత్రంద్వారా లట్ రూపంతో మాత్రమే ఆ కలయికకు అవకాశం. ఇక '**తు హి చ స్మవై**' పాదపూరణే అన్న నియమాన్ని బట్టి పాదపూరణమాత్ర ప్రయోజకంగా దీనిని స్వీకరించాలి.కవి మరొకరీతిగా దానిని వివక్షించి వుండవచ్చు. 'దధత్' అన్నది శతృ ప్రత్యయాంతం. శతృ ప్రత్యయం '**లటః శతృ శానచావ ప్రథమా సమానాధికరణే**' అని లట్ లకారానికే విధింపబడింది. కాబట్టి అసమాప్త్యర్థంలోకూడా 'దధత్' పదాన్ని లడంతంగానే భావించి దానిపై స్మ చేర్చి వుండవచ్చు. 'దధత్' పదం భూతకాలికాసమాప్త్యర్థక మవుతుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **భవతు :** | **భవతు**/భవతాత్ | భవతామ్ | భవన్తు |
| | భవ/భవతాత్ | భవతమ్ | భవత |
| | భవాని | భవావ | భవామ. |

*

**శ్లో॥ సత్తర్కమాత్రకలితం సకలాపవర్గం**
**మధ్యం ముదేఽస్తు మధుకైటభమర్దనస్య ।**
**తద్రమ్యనాభివివరాభ్యుదితామ్బరస్య**
**పద్మోపభోగపరిణామ ఇవోపరిష్టాత్ ॥** **18-26**

**అ : కృష్ణుని నడుమును వర్ణించటం.** -వసంతతిలక.

**అ :** సత్-తర్క-మాత్ర-కలితం సకల+అపవర్గం తద్-రమ్య-నాభి-వివర+అభ్యుదిత+ అంబరస్య ఉపరిష్టాత్ పద్మా+ఉపభోగ-పరిణామః ఇవ (స్థితం) మధు-కైటభ-మర్దనస్య మధ్యం ముదే అస్తు.

**ప్ర :** సత్... కలితమ్ : సత్ = మంచి (హేత్వాభాసం కాకుండా హేతుబద్ధమైన) తర్కమాత్ర = తర్కంచేతనే (వ్యాప్యారోపేణ వ్యాపకారోపస్తర్కః, ఇది వ్యతిరేకనిశ్చయానికి మూల మవుతుంది.), కలితమ్ = కూడినదీ (సతా తర్కమాత్రేణ కలితః, తమ్), సకల+అపవర్గమ్ : సకల = అందరికీ, అపవర్గమ్ = మోక్షకారణమైనదీ (సకలానామ్ అపవర్గః యస్మాత్ తమ్), (ధర్మార్థకామాలకు త్రివర్గమనీ, మోక్షానికి అపవర్గమనీ పేరు), తద్... తాంబరస్య : తద్ = ఆ కృష్ణునియొక్క, రమ్య = అందమైన, నాభి = బొడ్డుయొక్క, వివర = రంధ్రంనుండి (సుషిరం వివరం బిలమ్-అమరకోశః-పాతాళ-1), అభ్యుదిత = పొడమిన, అంబరస్య = ఆకాశంయొక్క (తస్య రమ్యాత్ నాభేః వివరాత్ అభ్యుదితం చ తత్ అంబరం, తస్య), ఉపరిష్టాత్ = పైన, పద్మా... ణామః+ఇవ : పద్మా = రుక్మిణికి, ఉపభోగ్య = అనుభవింప దగిన, పరిణామః+ఇవ = పరిపాకంలాగా (పద్మయా ఉపభోగ్యస్య పరిణామః), మధు-కైటభ-మర్దనస్య = మధుకైటభులను చంపిన కృష్ణునియొక్క (మధుకైటభయోః మర్దనః, తస్య), మధ్యమ్ = నడుము, ముదే-అస్తు = ఆనందకరమగుగాక (అస-భువి-అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** సరియైన తర్కంవలన మాత్రమే సిద్ధించినదీ, సమస్త జనులకూ మోక్షహేతువయినదీ అయిన (నడుము) ఆ నాభివివరంనుండి పుట్టిన ఆకాశంయొక్క పైభాగాన రుక్మిణి అనుభవానికి యోగ్యమైన పరిణామంలాగా వుంది. అది మనకు ఆనందకరమగుగాక!

**వి :** 1. ఆకాశం నాభివివరంలోనుండి పుట్టింది. నాభివివరం శూన్యం. కాబట్టి ఆ శూన్యంలోనుండి పుట్టిన ఆకాశమూ శూన్యమే. '**పూర్ణాత్ పూర్ణముదచ్యతే**' – సహజంగా ఆకాశం శూన్యమే. అయితే రుక్మిణి ఆ నడుముపై చేయివేసి ఆ పట్టును – ఆధారాన్ని – అనుభవిస్తోంది గదా! నడుము లేకపోతే పట్టు దొరకటమన్నది లేదుగదా! (ఇదే తర్కం). మరి ఎలా కుదిరింది? అందుకే '**పద్మోపభోగ్యపరిణామ**' మన్న విశేషణం. ఆ శూన్యం రుక్మిణి అనుభవానికి తగినట్లు పరిణమించింది. మనకు దక్కాలని విధి నిర్ణయమైతే అది ఎలాగైనా దక్కుతుంది అని హర్షవర్ధనుని మాట–

శ్లో॥ ద్వీపాదన్యస్మాదపి మధ్యాదపి జలనిధేః దిశోఽప్యన్తాత్।
ఆనీయ ఝటితి ఘటయతి విధిరభిమతమభిముఖీ భూతః ॥ – రత్నావళి–1/6

2. **అస్తు :** 18–7వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ లక్ష్మీముకున్దతనువృత్తమనోజ్ఞమధ్య-**
**ముద్వీక్ష్య శిక్షితధియః కవయోఽపి యస్మాత్ ।**
**కిఞ్చాస్తి నేతి ఖలు సన్దిహతేఽధునాపి**
**సన్దేహసంజ్ఞితమభూదత ఏవ మధ్యమ్॥ 18–27**

**అ :** రుక్మిణీకృష్ణుల నడుమును వర్ణించటం. –వసంతతిలక.

**అ :** యస్మాత్ శిక్షిత–ధియః కవయః అపి లక్ష్మీ–ముకున్ద–తను–వృత్త–మనోజ్ఞ–మధ్యమ్ ఉద్వీక్ష్య, కిఞ్చ అస్తి న ఇతి అధునా అపి సందిహతే అతః ఏవ మధ్యం సందేహ–సంజ్ఞితమ్ అభూత్.

**ప్ర :** యస్మాత్ = ఏ కారణంవలన, శిక్షిత–ధియః = నేర్పరి అయిన బుద్ధిగల (శిక్షితాః ధియః యేషాం తే), కవయః అపి = కవులు (వర్ణనా నిపుణులు) కూడా, లక్ష్మీ... మధ్యమ్: లక్ష్మీ ముకుంద = రుక్మిణీకృష్ణులయొక్క, తను = సూక్ష్మమూ, వృత్త = గుండ్రదనమూ గలిగి, మనోజ్ఞ = అందమైన, మధ్యమ్ = నడుమును (లక్ష్మీః చ ముకున్దశ్చ తయోః తను వృత్తం మనోజ్ఞం చ మధ్యమ్, తత్), ఉద్వీక్ష్య = చూసి (ఉత్–వి–ఈక్ష ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కించ = అయితే, అస్తి? = ఉన్నదా? న = లేదా?, ఇతి = అని, అధునా అపి = ఇప్పుడు కూడా, సన్దిహతే = సందేహిస్తున్నారో (సమ్+దిహ్ ఉపచయే–లట్–ప్ర.బ.), అతః–ఏవ = అందు వలననే, మధ్యమ్ = నడుము, సందేహ–సంజ్ఞితమ్ = 'సందేహ' మను పేరు గలది (సందేహః = దేహమధ్యము శబ్దార్థకల్పతరుః–1590) (సందేహ ఇతి సంజ్ఞితమ్), అభూత్ = అయినది (భూ సత్తాయామ్ భ్వాది–పరస్మైపది–లుఙ్–ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణీ కృష్ణులు నడుము వర్తులం, సూక్ష్మం. దానిని చూసి బాగా నేర్పుగల ధీమంతులైన కవులు కూడా నేటికీ కూడా ఉందా? లేదా? అని సందేహిస్తుంటారు. అందువల్లనే దానికి సందేహమన్న పేరు కలిగింది.

**వి :** 1. నడుమును వర్ణించటంలో నాటికీ నేటికీ కవుల దృష్టి దాని అస్తిత్వం మీదనే వుంటుంది. శరీరంలోని ఉత్తరాధరభాగాలకు అనుసంధానమొకటి వుండక తప్పదు కాబట్టి నడుము సన్నగా వుండటం సౌందర్యసంకేతంగా భావిస్తున్నారు కాబట్టి ఇటువంటి చమత్కారాలకు అవకాశం వచ్చింది.

శ్రీహర్షుడు నైషధకావ్యంలో దమయంతిని వర్ణిస్తూ **అస్తినాస్తి** సంశయాన్ని వాచా ప్రకటిస్తారు.

**శ్లో॥ సరసీః పరిశీలితుం మయా – గమికర్మీకృతనైకనీవృతా ।**
**అతిథిత్వమనాయి సాదృశోః – సదసత్సంశయగోచరోదరీ ॥** – నైషధమహాకావ్యమ్ – 2/40

2. విధ్యలంకార మిక్కడ. నడుముకున్న '**సందేహ**' పదాన్ని సందేహమున్నది కాబట్టి 'సందేహ'మైనదని విధించటంవలన ఇది విధ్యలంకారం. '**సిద్ధస్యైవ విధానం యత్తమాహుర్విధ్యలంకృతిమ్**" – (కు.166)

| | | | |
|---|---|---|---|
| 3. **సందిహాతే :** | సందిగ్ధే | సన్దిహాతే | **సన్దిహతే** |
| | సంధిక్షే | సన్దిహాథే | సంధిగ్ధ్వే |
| | సందిహే | సందిహ్వహే | సందిహ్మహే. * |

**శ్లో॥ మధ్యం మనోజ్ఞం మృదులం సువృత్తం - బుద్ధౌ సదా తిష్ఠతు యత్కృశత్వమ్ ।**
**ఉద్వీక్ష్య తత్పూర్తివిధిత్సయైవ - పద్మా కరాబ్జేన సదాఽఽలిలిఙ్గే ॥ 18-28**

**అ :** కృష్ణుని నడుమును వర్ణించటం. -ఇంద్రవజ్ర.

**అ :** సువృత్తం మృదులం మనోజ్ఞం మధ్యం సదా బుద్ధౌ తిష్ఠతు యత్-కృశత్వమ్ ఉద్వీక్ష్య తత్-పూర్తి-విధిత్సయా ఏవ పద్మాకర+అబ్జేన సదా ఆలిలింగే.

**ప్ర :** సువృత్తమ్ = బాగా గుండ్రనిదీ, మృదులమ్ = మృదువైనదీ, మనోజ్ఞమ్ = అందమైనదీ అయిన, మధ్యమ్ = నడుము, సదా = ఎల్లప్పుడూ, బుద్ధౌ = మతిలో, తిష్ఠతు = నిలుచుగాక! (స్థా గతి నివృత్తౌ-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), యత్-కృశత్వమ్ : యత్ = దేనియొక్క, కృశత్వమ్ = చిక్కివుండటాన్ని, ఉద్-వి-ఈక్ష్య = గమనించి (ఉద్-వి-ఈక్ష్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తత్-పూర్తి-విధిత్సయా+ఇవ : తత్ = దానియొక్క, పూర్తి = నిండుదనాన్ని, విధిత్సయా-ఏవ = కల్పింపగోరినట్లుగానే (తస్యాః పూర్తిః, తాం విధాతుమ్ ఇచ్ఛా, తయా ఏవ), పద్మా=రుక్మిణి (లక్ష్మి), కర+అబ్జేన = కరకమలంతో (కరః ఏవ అబ్జం, తేన), సదా = ఎల్లప్పుడూ, ఆలిలింగే = కౌగిలించింది. (ఆ-లింగ్ గతౌ-భ్వాది-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని నడుములోని వర్తులత్వమూ, మృదుత్వమూ, అందమూ ఎప్పుడూ మనస్సులో నిలవాలి. ఆ నడుంయొక్క కృశత్వాన్ని చూసి దానికి నిండుదనాన్ని కల్గించాలన్న కోరికతోనే రుక్మిణి ఎప్పుడూ చేతితో ఆ నడుమును కౌగిలించుకొని వుంటుంది.

**వి :** 1. కృష్ణుడు పూర్ణుడు, పూర్ణునిలో అపరిపూర్తిని రుక్మిణి అంగీకరించలేకపోయింది. అందుకే ఆ లోపాన్ని పూర్తిచేయదలచుకొన్నది. అంతేకాదు. లౌకికంగా పరిశీలించినా '**ప్రజయా హి మనుష్యః పూర్ణః**' అని శాస్త్రవచనం. ప్రజ (సంతతిని)ను పొందాలంటే ధర్మపత్ని అవసరం. ఆ రీతిగా ఆ లోపాన్ని పూర్తిచేయటంలో రుక్మిణి పాత్ర అనివార్యం. అది గుర్తించి రుక్మిణి చేతితో ఆ నడుమును సదా కౌగిలిస్తోంది. చేయూతనిస్తోంది. దానిని రుక్మిణి ఆకాంక్షగానే ప్రతిపాదిస్తూ కవి 'విధిత్సయా ఇవ' అని ఉత్ప్రేక్షించాడు. ఇది హేతూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **తిష్ఠతు :** | **తిష్ఠతు**/తిష్ఠతాత్ | తిష్ఠతామ్ | తిష్ఠన్తు |
| | తిష్ఠ/తిష్ఠతాత్ | తిష్ఠతమ్ | తిష్ఠత |
| | తిష్ఠాని | తిష్ఠావ | తిష్ఠామ |
| **ఆలిలింగే :** | **ఆలిలింగే** | ఆలిలింగాతే | ఆలిలింగిరే |
| | ఆలిలింగిషే | ఆలిలింగాథే | ఆలిలింగిధ్వే |
| | ఆలిలింగే | ఆలిలింగివహే | ఆలిలింగిమహే. * |

**శ్లో॥ వక్షః సురక్షాం కురుతాన్మురారేః - సద్వర్ణ్యలావణ్యగుణైకధామ ।**
**తత్యాజ యన్నైవ చిరం సపత్నీ-వక్షోజలబ్ధాఙ్కమపి స్మ లక్ష్మీః ॥ 18-29**

**అ : కృష్ణుని వక్షఃస్థలవర్ణన.** -ఇంద్రవజ్ర.

**అ :** సద్-వర్ణ్య-లావణ్య-గుణ+ఏక-ధామ. ముర+అరేః వక్షః సురక్షాం కురుతాత్ యత్ చిరం సపత్నీ-వక్షః+జ-లబ్ధ+అంకమ్ అపి లక్ష్మీః న ఏవ తత్యాజ స్మ.

**ప్ర :** సద్... ధామ : సద్ = సజ్జనులచే, వర్ణ్య = స్తుతింపదగిన (వర్ణయితుం యోగ్యః వర్ణ్యః – వర్ణ క్రియా విస్తారగుణవచనేషు), లావణ్య–గుణ = సౌందర్యగుణానికి, ఏక = అద్వితీయమైన, ధామ = నివాసమైన (సద్భిః వర్ణ్యః చాసౌ లావణ్యగణః, తస్య ఏకం ధామ), ముర+అరేః = కృష్ణునియొక్క, వక్షః = చాతీ, సు–రక్షామ్ = మంచి రక్షణను, కురుతాత్ = చేయుగాత! (కృ కరణే–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.), లక్ష్మీః = లక్ష్మి, యత్ = దేనిని, సపత్నీ... కమ్ అపి : సపత్నీ = సవతియొక్క, వక్షోజ = రొమ్ములవలన, లబ్ధ = పొందిన, అంకమ్ అపి = గుర్తుగలదయినా (ఉత్సంగచిహ్నయోరంకః–అమరకోశః–నానార్థ–4), న తత్యాజ ఏవ = విడువనే విడువలేదు. (త్యజ హానౌ పరస్మైపది–లిట్–ప్ర.ఏ.) స్మ–పాదపూరణమాత్రప్రయోజకం.

**తా ॥** సజ్జనులు స్తుతింపదగిన అద్వితీయలావణ్యధామమైన కృష్ణుని వక్షఃస్థలం మంచి రక్షణను కలిగించు గాత! లక్ష్మి తన సవతియొక్క వక్షోజముద్రలు కలిగివున్నా ఆ కృష్ణుని వక్షఃస్థలాన్ని అసలు విడువనే లేదు.

**వి :** 1. సపత్నుల మధ్య అభిప్రాయభేదాలు సహజం. ఎవరికి వారు తమదే పైచేయి కావాలని ఆశించటం కూడా సహజం. ఆ సహజప్రవృత్తి వేదకాలం నాటిది. వైదిక సంస్కృతిలో అది కూడా ఒక భాగమే అనాలేమో!

ఋగ్వేదం దశమమండలంలోని 146వ సూక్తం **ఇంద్రాణీసూక్తం** – అటువంటి కోరికలకు సంబంధించినదే. తన సపత్నిని బాధించటానికై చేసే ప్రార్థన.

ఇమాం ఖనామ్యోషధిం వీరుధం బలవత్తమామ్ ।
**యయా సపత్నీం బాధతే** యయా సంవిన్దతే పతిమ్ ॥

ఉత్తానపర్ణే సుభగే దేవజూతే సహస్వతి ।
సపత్నీం మే పరాధమ **పతిం మే కేవలం కురు** ॥

**ఉత్తరాహముత్తర ఉత్తరేదుత్తరాభ్యః ।**
**అథాసపత్నీ యా మమాధరా సాధరాభ్యః ॥**

న హ్యస్యా నామగృభ్ణామి నో అస్మిన్రమతే జనే ।
పరామేవ పరావతం సపత్నీం గమయామసి ॥

అహమస్మి సహమానాథ త్వమసి సాసహిః ।
ఉభే సహస్వతీ భూత్వా సపత్నీం మే సహావహై ॥

ఉప తేఽధాం సహమానామభిత్వాధాం సహీయసా ।
మామనుప్రతే మనోవత్యం గౌరివ ధావతు పథా వారివ ధావతు ॥

అటువంటి స్థితిలో కూడా లక్ష్మి సపత్నీ వక్షోజాంకం కనిపిస్తున్నా కూడా కృష్ణుని వీడకుండా నిలవటం సాధారణదృష్టికి ఆశ్చర్యకరం. అందుకే పరిత్యాగ ప్రస్తావనను తెచ్చి నిషేధించటం.

అలంకారశాస్త్రమర్యాద ననుసరించి ఇక్కడ కనిపిస్తున్న కృష్ణుడు ధృష్టుడు (శృంగారనాయక భేదాలలో ఒకటి) కావ్యనాయకులు అనుకూలుడు (ఏకనాయిక) తదితరులు (బహునాయికలు గలవారు). తదితరులలో దక్షిణుడు, ధృష్టుడు, శఠుడు అని మూడు భేదాలు. నాయికాంతర ప్రణయచిహ్నాలు కనిపిస్తున్నా ప్రకృతనాయిక దగ్గర బెదరని వాడు ధృష్టుడు. లక్ష్మి (నాయిక) స్వాధీనపతిక. అందుకే విడువకపోవటం.

2. శ్లోకంలో విశేషోక్త్యలంకారం. తగినంత కారణమున్నా కార్యోత్పత్తి లేకపోవటం విశేషోక్తి. సవతి పోరు కనిపిస్తున్నా (కారణం) భర్తను ఎడబాయక (కార్యం) పోవటం వలన ఇది విశేషోక్తి. "**కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే**" – (కు. 83)

3. **కురుతాత్ :** 18-9వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **తత్యాజ :** | **తత్యాజ** | తత్యజతుః | తత్యజుః |
| | తత్యజిథ/తత్యక్థ | తత్యజథుః | తత్యజ |
| | తత్యాజ/తత్యజ | తత్యజివ | తత్యజిమ. |

*

**శ్లో॥ ఆలిఙ్గితప్రియతమాకుచకుఙ్కుమాఙ్క-లక్ష్యం జిగాయ వసుదేవసుతస్య వక్షః ।**
**మత్తస్ఫురత్పరిణతద్విపధాతురక్త-కుమ్భాఙ్కజృమ్భిహరినీలవిశాలవప్రమ్ ॥ 30**

**అ : కృష్ణుని వక్షఃస్థలవర్ణనం.** -వసంతతిలక.

**అ :** ఆలింగిత-ప్రియతమా-కుచ-కుంకుమ+అంక-లక్ష్యం వసుదేవ-సుతస్య వక్షః మత్త-స్ఫురత్-పరిణత-ద్విప-ధాతు-రక్త-కుంభ+అంక-జృంభి-హరినీల-విశాల-వప్రం జిగాయ.

**ప్ర :** ఆలింగిత... లక్ష్యమ్ : ఆలింగిత = కౌగిలించుకొనబడిన, ప్రియతమా = పరమ-ప్రియురాలైన రుక్మిణియొక్క, కుచ = రొమ్ములపైనున్న, కుంకుమ = కుంకుమయొక్క, అంక = మరకచే, లక్ష్యమ్ = గుర్తింపదగిన (ఆలింగితాయాః ప్రియతమాయాః కుచయోః కుంకుమస్య అంకేన లక్ష్యమ్), వసుదేవ-సుతస్య = కృష్ణునియొక్క (వసుదేవస్య సుతః తస్య), వక్షః = వక్షఃస్థలం, మత్త... వప్రమ్ : మత్త = మదించిన, స్ఫురత్ = ప్రకాశిస్తున్న, పరిణత = దంతంతో అడ్డంగా కొట్టే (తిర్యగ్దంతప్రహారస్తు గజః పరిణతో మతః-హలాయుధకోశః-220), ద్విప = ఏనుగుయొక్క, ధాతు = ధాతువులచే, రక్త = ఎఱ్ఱనైన, కుంభ = కుంభస్థలంపైనున్న, అంక = మరకతో, జృంభి = అతిశయించిన, హరి-నీల = ఇంద్రనీలపర్వతంయొక్క, విశాల=విశాలమైన, వప్రమ్ = కొండనెత్తాన్ని, జిగాయ = జయించింది.

**తా ॥** కృష్ణుని వక్షఃస్థలం రుక్మిణియొక్క, కౌగిలింతచేత ఏర్పడిన కుంకుమమరకతో కనిపిస్తూ వుంది. అది వప్ర క్రీడపై ఆసక్తితో కొండ చరియలను ఒరుసుకొని ధాతురసంతో ఏర్పడిన ఎఱ్ఱని మరకతో ప్రకాశిస్తున్న ఏనుగు కుంభస్థలంతో అతిశయించిన హరినీలపర్వతంయొక్క వప్రాన్ని జయించింది.

**వి :** 1. కృష్ణుని వక్షఃస్థలం హరినీలవప్రాన్ని జయించిదనటం ద్వారా ఆ రెండింటిమధ్య పోలిక వ్యక్తమవుతుంది. అది ఉపమాలంకారధ్వని. అది కవి ప్రౌఢోక్తి నిష్పన్నమయిన వస్తుకృతాలంకారధ్వని. అది అర్థశక్తిమూలధ్వని భేదాలలో ఒకటి.

| | | | |
|---|---|---|---|
| 2. **జిగాయ :** | **జిగాయ** | జిగ్యతుః | జిగ్యుః |
| | జిగయిథ/జిగేథ | జిగ్యథుః | జిగ్య |
| | జిగాయ/జిగయ | జిగ్యివ | జిగ్యిమ. |

*

**శ్లో॥ వక్షో విశాలం హరినీలనీలం - లక్ష్మీగృహం చన్దనచర్చితం తత్ ।**
**సత్కౌస్తుభోద్భాసకమస్తు చిత్తే - విస్తీర్ణభూషావలి విట్ఠలస్య ॥ 18-31**

**అ : కృష్ణుని వక్షఃస్థలవర్ణనం.** -ఇంద్రవజ్ర.

**అ :** విశాలం హరినీల-నీలం లక్ష్మీ-గృహం చందన-చర్చితం సత్-కౌస్తుభ+ఉద్భాసకం విస్తీర్ణ+భూషణ+ఆవలి విట్ఠలస్య వక్షః చిత్తే అస్తు.

**ప్ర :** విశాలమ్ = నిడుద అయినదీ, హరినీల-నీలమ్ = ఇంద్రనీలంవలె నీలవర్ణంగలదీ (హరినీలవత్ నీలమ్), లక్ష్మీ-గృహమ్ = లక్ష్మికి నివాసమూ (లక్ష్మ్యాః గృహమ్), చందన-చర్చితమ్ = గంధపు పూతగలదీ (చందనేన చర్చితమ్), సత్... ఉద్భాసకమ్ : సత్ = నిర్మలమైన, కౌస్తుభ = కౌస్తుభమణిని, ఉద్భాసకమ్ = ప్రకాశింపజేసేదీ (సతః కౌస్తుభస్య ఉద్భాసకమ్) (కౌస్తుభం స్వతః అలంకారమైనా కృష్ణవక్షఃస్థలంపై అలంకార్యమయింది), విస్తీర్ణ...

ఆవలి : విస్తీర్ణ = వ్యాపించిన, భూషణ = నగలయొక్క, ఆవలి = సమూహంగలదీ అయిన (విస్తీర్ణానాం భూషణానామ్ ఆవలిః యస్య తత్), విట్ఠలస్య = విట్ఠలునియొక్క, వక్షః= వక్షఃస్థలం, మమ = నాయొక్క, చిత్తే = మనస్సులో, అస్తు = ఉండుగాత! (అస భువి అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని వక్షఃస్థలం విశాలమైనది. ఇంద్రనీలమణిలాగా నల్లనిది. లక్ష్మికి నివాసస్థానం. చందనచర్చితం. కౌస్తుభాన్నే ప్రకాశింపజేసేది. నిండుగా నగలు గలది. ఆ కృష్ణవక్షఃస్థలం నామనస్సులో నిలుచుగాక!

**వి :** 1. శ్లోకంలోని వర్ణన రఘువంశంలోని పాండ్యరాజవర్ణనను గుర్తుచేస్తోంది.

శ్లో॥ పాండ్యోఽయమంసార్పితలంబహారః - కప్తాంగరాగో హరిచందనేన ।
ఆభాతి బాలాతపరక్తసానుః - స నిర్ఝరోద్గార ఇవాద్రిరాజః ॥ - రఘువంశం-6/60

2. **అస్తు :** 18-7వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సౌవర్ణరమ్యకలశోపమితం మనోజ్ఞం**
**వక్షోజకుడ్మలయుగం జయతీన్దిరాయాః ।**
**యచ్చర్చితోఽపి నవకుఙ్కుమరాశిరాసీ-**
**ద్వక్షోఽనులేపనమణిః పురుషోత్తమస్య ॥ 18-32**

**అ : కృష్ణుని వక్షఃస్థలవర్ణనం.** -వసంతతిలక.

**అ :** సౌవర్ణ-రమ్య-కలశ+ఉపమితం మనః+జ్ఞం ఇందిరాయాః వక్షః+జ-కుడ్మల-యుగం జయతి. యత్ చర్చితః అపి నవ-కుంకుమ-రాశిః పురుష+ఉత్తమస్య వక్షః+అనులేపన-మణిః ఆసీత్.

**ప్ర :** సౌవర్ణ... తమ్ : సౌవర్ణ = బంగారంతో చేసిన (సువర్ణస్య వికారః), రమ్య = అందమైన, కలశ = కలశాలతో, ఉపమితమ్ = పోల్చబడినదీ (సౌవర్ణశ్చ రమ్యశ్చ అసౌ కలశః, తేన ఉపమితమ్), మనోజ్ఞమ్ = మనోహరమైనదీ అయిన, ఇందిరాయాః = రుక్మిణియొక్క, వక్షో... యుగమ్ : వక్షోజ = రొమ్ము లనే, కుడ్మల = మొగ్గలయొక్క, యుగమ్ = జంట (వక్షోజౌ ఏవ కుడ్మలే తయోః యుగమ్), జయతి = వర్ధిల్లుతోంది. (జి జయే పరస్మైపది-లట్-ప్ర.ఏ.), యత్-చర్చితః అపి : యత్ = దేనియందు, చర్చితః అపి = అలదబడిననూ, నవ... రాశిః : నవ = క్రొత్తదైన, కుంకుమ = కుంకుమయొక్క, రాశిః = కుప్ప (నవస్య కుంకుమస్య రాశిః), పురుష+ఉత్తమస్య = పురుషశ్రేష్ఠుడైన కృష్ణునకు (పురుషాణాముత్తమః తస్య), వక్షః... మణిః : వక్షః = గుండెలపై, అనులేపనమణిః = పైపూతలలో మేటిగా, ఆసీత్ = అయినదో! (అస భువి అదాది-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణియొక్క రొమ్ము లనే మొగ్గలజంట బంగారు కలశాలతో పోలికగలది. అది ఉత్కృష్టంగా వెలగొందుతోంది. ఆ రొమ్ముపై అలదిన కుంకుమరాశి పురుషోత్తముని గుండెలపై అలంకారమణి అయింది.

**వి :** 1. ఈ శ్లోకం శ్రీ వేంకటేశ్వరసుప్రభాతంలోని అవాంతరభాగమైన శ్రీవేంకటేశస్తోత్రం లోని శ్లోకాన్ని గుర్తుకు తెస్తుంది.

**శ్లో॥ కమలాకుచచూచుకకుంకుమతో - నియతారుణితాతులనీలతనో ।**
**కమలాయతలోచనలోకపతే - విజయీభవ వేంకటశైలపతే ॥**

2. **ఆసీత్ :** 18-19వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఆచ్ఛాదితోరఃస్థలమూలదేశం - జాతస్య యస్యాఖిలధర్మగోప్తా ।**
**శౌరిః కరం యచ్ఛతి తం రమాయా-శ్చారుస్తనం వర్ణయితుం క ఈశః ॥33**

**అ :** రుక్మిణీవక్షోవర్ణనం. -ఇంద్రవజ్ర.

**అ :** ఆచ్ఛాదిత+ఉరః-స్థల-మూల-దేశం జాతస్య యస్య అఖిల-ధర్మ-గోప్తా శౌరిః కరం యచ్ఛతి తం రమాయాః చారు-స్తనం వర్ణయితుం క ఈశః?

**ప్ర :** ఆచ్ఛా... దేశమ్ : ఆచ్ఛాదిత = కప్పబడిన (ఆక్రమింపబడిన), ఉరఃస్థల = వక్షస్థల మనే, మూల = (తనకు) కారణమైన, దేశమ్ = ప్రదేశంగలదిగా, జాతస్య = పుట్టిన, యస్య = ఏ వక్షోజానికి, అఖిల-ధర్మ-గోప్తా = సమస్త-ధర్మ-రక్షకుడైన, శౌరిః = కృష్ణుడు, కరమ్ = చేతిని/బలిని (భాగధేయో బలిః కరః-హలాయుధకోశః-433), యచ్ఛతి = ఇస్తాడో (దాణ్ దానే పరస్మైపది లట్-ప్ర.ఏ.-ధాతువుకు యచ్ఛ ఆదేశం), తమ్ = ఆ, రమాయాః = లక్ష్మియొక్క, చారు = అందమైన, స్తనమ్ = రొమ్మును, వర్ణయితుమ్ = వర్ణించటానికి, కః = ఎవడు, ఈశః = సమర్థుడు?

**తా ॥** రుక్మిణి వక్షోజం వక్షస్థలాన్ని ఆక్రమించి కప్పివేసింది. అది వక్షోజం. అంటే వక్షస్థలం నుండి పుట్టింది. అయినా వక్షస్థలాన్ని ఆక్రమించింది. అటువంటి ఆ వక్షోజానికి సకలధర్మ రక్షకుడైన కృష్ణుడు కరాన్ని (బలిని) ఇస్తున్నాడు అంటే అటువంటి ఆ రుక్మిణీ చారుస్తనాన్ని వర్ణించటానికి ఎవరికి సామర్థ్యముంటుంది?

**వి :**1. 'కర' శబ్దానికి చేయి అని, బలి అని రెండు అర్థాలు. **చేయి** అనే వాచ్యార్థం నియంత్రితమైన తరువాత రెండవ అర్థం **బలి** అనేది స్ఫురిస్తుంది. అది ధ్వని. శబ్దశక్తివలన ఏర్పడింది కాబట్టి శబ్దశక్తిమూలధ్వని.

శ్లో॥ అనేకార్థస్య శబ్దస్య వాచకత్వే నియన్త్రితే ।
సంయోగాద్యైరవాచ్యార్థధీకృద్వ్యాపృతిరంజనమ్ ॥ - కావ్యప్రకాశః-2/19

| 2. **యచ్ఛతి :** | **యచ్ఛతి** | యచ్ఛతః | యచ్ఛన్తి |
|---|---|---|---|
| | యచ్ఛసి | యచ్ఛథః | యచ్ఛథ |
| | యచ్ఛామి | యచ్ఛావః | యచ్ఛామః. |

*

**శ్లో॥ ఉద్యన్మనోజ్ఞముఖనిర్మలపూర్ణచన్ద్ర-**
**ముద్వీక్ష్య మన్దహసితామృతశోభిబిమ్బమ్ ।**
**బిభ్రత్సదా ముకులితామ్బుజకోశకాన్తిం**
**పుష్ణాతు విశ్వజననీకుచమణ్డలం నః॥ 18-34**

**అ : రుక్మిణీ కుచమండలవర్ణనం.** -వసంతతిలక.

**అ :** మంద-హసిత+అమృత-శోభి-బింబమ్ ఉద్యత్+మనః+జ్ఞ-ముఖ-నిర్మల-పూర్ణ-చంద్రమ్ ఉద్వీక్ష్య సదా ముకులిత+అంబుజ-కోశ-కాన్తిం బిభ్రత్ విశ్వ-జననీ-కుచ-మండలం నః పుష్ణాతు.

**ప్ర :** మంద... బింబమ్ : మంద-హసిత = చిఱునవ్వు అనే, అమృత = అమృతంతో, శోభి = ప్రకాశించే, బింబమ్ = మండలంగల, (మందం చ తత్ హసితం, తదేవ అమృతం, తేన శోభి మండలం యస్య తత్), ఉద్యత్... చంద్రమ్ : ఉద్యత్ = పైకివస్తున్న, మనోజ్ఞ = అందమైన, ముఖ = ముఖ మనే, నిర్మల = నిష్కలంకమైన, పూర్ణ-చంద్రమ్ = నిండుచందురుని (ఉద్యత్ మనోజ్ఞం చ ముఖమ్ ఏవ నిర్మలః పూర్ణశ్చ అసౌ చంద్రః తమ్), ఉద్వీక్ష్య = చూసి, సదా = ఎల్లప్పుడు, ముకు... కాంతిమ్ : ముకుళిత = ముడుచుకున్న, అంబుజ-కోశ = తామరమొగ్గయొక్క, కాంతిమ్ = కాంతిని (ముకుళితస్య అంబుజస్య కోశస్య కాంతిః, తామ్), బిభ్రత్ = భరిస్తూ (భృ ధాతువుపై శతృ ప్రత్యయం), విశ్వ... మండలమ్ : విశ్వ-జననీ = జగన్మాతయొక్క, కుచ-మండలమ్ = స్తనమండలం (విశ్వస్య జనన్యాః కుచయోః మండలమ్), నః = మనలను, పుష్ణాతు = పోషించుగాత! (పుష్ పుష్టౌ-క్ర్యాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** చిఱునవ్వు అనే అమృతంతో శోభించే బింబంగల అందమైన ముఖ మనే నిర్మల పూర్ణచంద్రుని చూచి ఎల్లప్పుడూ తామరమొగ్గల కాంతిని ధరించే జగన్మాతస్తనమండలం మనలను పోషించుగాత!

**వి :** 1. ముఖచంద్రుడు కంటబడుతున్నాడు కాబట్టి స్తనాలు తామరమొగ్గలుగానే వున్నాయి కానీ వికసించటంలేదు. అది నిత్యయౌవనసూచిక.

2. ముఖంలో నిర్మలపూర్ణచంద్రత్వారోపణం. మందస్మితంతో అమృతత్వారోపణం రూపకాలు. కుచమండలంలో అంబుజకోశత్వారోపణం వాచా లేదు కానీ ధ్వనిస్తుంది.

స్తనమండలం అంబుజకోశకాంతితో సదా నిలువటానికి నిర్మల ముఖపూర్ణచంద్ర దర్శనం కారణం కాదు. కారణం కానిదాన్ని కారణంగా చెప్పటం వలన అది ఉత్ప్రేక్షాలంకారం. అయితే అది ధ్వనిరూపం. చంద్రపద్మాలకు వైరమన్న కవిసమయాన్ని చక్కగా వినియోగించు కొని చేసిన రమణీయవర్ణనమిది.

| | | | |
|---|---|---|---|
| 3. **పుష్ణాతు :** | **పుష్ణాతు**/పుష్ణీతాత్ | పుష్ణీతామ్ | పుష్ణన్తు |
| | పుష్ణాణ/పుష్ణీతాత్ | పుష్ణీతమ్ | పుష్ణీత |
| | పుష్ణాని | పుష్ణావ | పుష్ణామ. |

*

**శ్లో॥ సద్వంశజాతః సుగుణః సువృత్త-రత్నోఽపి హారః కమలాకుచాన్తే ।**
**నైవావకాశం లభతే కులేన - కిం వా గుణౌఘైః కఠినోపకణ్ఠే ॥ 18-35**

**అ : రుక్మిణీ కుచకాఠిన్యవర్ణనం.** -ఇంద్రవజ్ర.

**అ :** సద్-వంశ-జాతః సుగుణః సువృత్త-రత్నః అపి హారః కమలా-కుచ+అన్తే అవకాశం న ఏవ లభతే. కఠిన+ఉపకంఠే కులేన గుణ+ఓఘైః వా కిం లభతే.

**ప్ర :** సద్-వంశ-జాతః = మంచి వంశంలో/వెదురులో పుట్టినదీ (సతి వంశే జాతః), సుగుణః = సద్గుణం/ త్రాడు గలదీ (శోభనః గుణః యస్య సః), సువృత్త-రత్నః అపి : సువృత్త = బాగా గుండ్రనయిన, రత్నః అపి = రత్నం గలదీ (సువృత్తం రత్నం యస్య సః) అయినా, హారః = ముత్యాలసరం, కమలా-కుచ-అన్తే : కమలా = రుక్మిణియొక్క, కుచ+అన్తే = రొమ్ములమధ్య, అవకాశమ్ = సందును, న లభతే = పొందుట లేదు. (లభ్ ప్రాప్తౌ-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.), కఠిన+ఉపకంఠే : కఠిన = కఠినాత్ములయొక్క/కఠినమైన, ఉపకంఠే = సమీపంలో/ గొంతుదగ్గర (కఠినానాం కఠినస్య వా ఉపకంఠే), కులేన = వంశంచేతగానీ, గుణ+ఓఘైః = గుణసమూహాలచేతగానీ (గుణానామ్ ఓఘాః తైః), కిమ్? = ప్రయోజనమేముంటుంది?

**తా ॥** రుక్మిణి మెడలోని ముత్యాలహారం మంచి వంశంలో (వెదురు-కులం) పుట్టింది. సుగుణం (గుణాలు-దారం) గలది. సువృత్తనాయకరత్నం గలది. అయినా రుక్మిణి స్తనాలమధ్యలో (నిలవటానికి) దానికి అవకాశమే దొరకలేదు. అంతేమరి. కఠినులదగ్గర వంశానికీ, గుణసమూహాలకూ విలువ ఏముంటుంది?

**వి :** 1. ముత్యాలహారానికి అవకాశం దొరకలేదు. ఎన్ని అర్హతలున్నా అన్నది విశేషవిషయం. కఠినాత్ముల దగ్గర అర్హతలకు విలువలేదన్నది సామాన్యవిషయం. విశేషసామాన్యవిషయాల కలయికవల్ల ఇది అర్థాంతర-న్యాసాలంకారం. **ఉక్తిరర్థాంతరన్యాసః స్యాత్సామాన్యవిశేషయోః**

సద్వంశజాతత్వం, సగుణత్వం, సువృత్తరత్నత్వమున్నా హారానికి అవకాశం లభించలేదు. అంటే కారణమున్నా కార్యం జరగలేదు. అది విశేషోక్త్యలంకారం. '**కార్యాజనిర్విశేషోక్తిః సతి పుష్కలకారణే**' -(కు.83)

2. శ్లో॥ అన్యోన్యముత్పీడయదుత్పలాక్ష్యాః - స్తనద్వయం పాండు తథా ప్రవృద్ధమ్ ।
మధ్యే యథా శ్యామముఖస్య తస్య - **మృణాలసూత్రాంతరమప్యలభ్యమ్** ॥

- కుమారసంభవమ్ - 1/40

ప్రకృత కవి ముత్యాలహారానికి చోటు దొరకలేదంటే కాళిదాసు తామరతూటికి కూడా చోటులేదన్నాడు. అయితే దానికి కారణాన్ని కాళిదాసు వాచ్యంగా చెప్పాడు. వాదిరాజు దాన్ని వ్యంగ్యంగానే వుంచాడు.

| | | | |
|---|---|---|---|
| 3. **లభతే :** | **లభతే** | లభేతే | లభన్తే |
| | లభసే | లభేథే | లభధ్వే |
| | లభే | లభావహే | లభామహే. |

*

**శ్లో॥ శార్ఙ్గస్య గ్రహణే మనోరమగుణస్యాకర్షణే సాయక-**
**స్యాదానే యుధి మాధవస్య ఫలితాః సన్ధానకర్మణ్యపి ।**
**చత్వారః కబరీం ప్రగృహ్య కమలామాలిఙ్గ్య గణ్డస్థలీం**
**సంగృహ్యాధరజామృతం చ పిబతో హస్తా రహః కేలిషు ॥ 18-36**

**అ :** కృష్ణుని **బాహువులను** వర్ణించటం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యుధి శార్ఙ్గస్య గ్రహణే మనః+రమ-గుణస్య ఆకర్షణే సాయకస్య ఆదానే సన్ధాన-కర్మణి అపి ఫలితాః చత్వారః మాధవస్య హస్తాః రహః-కేలిషు చ కబరీం ప్రగృహ్య కమలామ్ ఆలింగ్య గండ-స్థలీం సంగృహ్య అధరజ+అమృతం పిబతః (ఫలితాః)

**ప్ర :** యుధి = యుద్ధంలో, శార్ఙ్గస్య = శార్ఙ్గమనే వింటిని, గ్రహణే = పట్టుకొనుటలో, మనః... ఆకర్షణే : మనోరమ = అందమైన, గుణస్య = అల్లెత్రాటియొక్క, ఆకర్షణే = లాగుటయందు, సాయకస్య = బాణంయొక్క, ఆదానే = తీసికొనుటయందు, సన్ధాన-కర్మణి అపి = ఎక్కుపెట్టటంలో కూడా (సన్ధానమితి కర్మ, తస్మిన్), ఫలితాః = ఫలించిన, చత్వారః = నాలుగు, మాధవస్య = కృష్ణునియొక్క, హస్తాః = చేతులు (నాలుగు చేతులతో నాలుగు పనులు నిరంతరాయంగా-శతపత్రపత్రశతవేధన్యాయంగా ఒకేసారి), రహః-కేళిషు చ = ఏకాంత క్రీడలయందుకూడా (రహసి క్రీడాః, తాసు), కబరీమ్ = (రుక్మిణియొక్క) కొప్పును, ప్రగృహ్య = పట్టుకొని (ప్ర-గ్రహ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కమలామ్ = రుక్మిణిని, ఆలింగ్య = కౌగిలించుకొని, గండ-స్థలీమ్ = చెక్కిలిని (గండస్య స్థలీ, తామ్), సంగృహ్య = దగ్గర తీసికొని, అధర-జ+అమృతమ్ = వాతెరపైనున్న అమృతాన్ని, పిబతః చ = త్రాగుతున్న వానికి కూడా, ఫలితాః = ఫలించాయి.

**తా ॥** కృష్ణుని చేతులు నాలుగు. రణరంగంలో శార్ఙ్గధనుస్సును స్వీకరించటంలో, అల్లెత్రాటిని లాగి బిగించటంలో, బాణాన్ని తీసికోవటంలో, బాణాన్ని ఎక్కుపెట్టడంలో ఆ నాలుగు చేతులూ ఒకేసారి పనిచేసి సత్ఫలితాలనిస్తాయి. ఆ నాలుగు చేతులే రుక్మిణితోనున్న రహః క్రీడా సమయంలో కొప్పుపట్టుకోవటం, ఆమెను కౌగిలించుకొనటం, చెక్కిలిని చేరువకు తెచ్చుకోవటం, అధరామృతాన్ని త్రాగటంలో కూడా ఫలించాయి.

**వి :** 1. నాయకగుణాలలో వైదగ్ధ్యమొకటి "**కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం పరికీర్త్యతే**" (ప్రతాపరుద్రీయమ్-నాయకప్రకరణం). చేసే పనులను చతురతతో చేయటం వైదగ్ధ్యం. నాలుగు చేతులనూ వినియోగించి యుద్ధంలో చూపిన నేర్పునే కృష్ణుడు శృంగారవిషయంలో కూడా చూపటం చతురత. అది కృష్ణునిలో పుష్కలంగా కనిపిస్తుంది.
*

**శ్లో॥హస్తాః స్ఫురన్మరకతద్యుతయోఽతిదీర్ఘాః - కృష్ణస్య రమ్యనఖమౌక్తికశోభమానాః ।**
**యచ్ఛన్తు నః ఫలితపుష్పితపారిజాత-శాఖాసమానవిభవా విభవోఽఖిలార్థాన్॥ 37**

**అ :** కృష్ణబాహువర్ణనం. -వసంతతిలక.

**అ :** స్ఫురత్+మరకత-ద్యుతయః రమ్య-నఖ-మౌక్తిక-శోభమానాః ఫలిత-పుష్పిత-పారిజాత-శాఖా-సమాన-విభవాః విభవః అతిదీర్ఘాః కృష్ణస్య హస్తాః నః అఖిల+అర్థాన్ యచ్ఛన్తు.

**ప్ర :** స్ఫురత్... ద్యుతయః : స్ఫురత్ = ప్రకాశిస్తున్న, మరకత = మరకతమణుల యొక్క, ద్యుతయః = కాంతిగలవీ (స్ఫురతాం మరకతానాం ద్యుతిరివ ద్యుతిః యేషాం తే), రమ్య... శోభమానాః : రమ్య = అందమైన, నఖ = గోళ్ళు అనే, మౌక్తిక = ముత్యాలతో, భాసమానాః = ప్రకాశించేవీ (రమ్యాః చ తే నఖాః ఏవ మౌక్తికాని, తైః భాసమానాః), ఫలిత... విభవాః : ఫలిత = ఫలించినవీ, పుష్పిత = పూచినవీ అయిన, పారిజాత-శాఖా = కల్పవృక్షపు కొమ్మలతో, సమాన = సమానమైన, విభవాః = సంపదగలవీ (ఫలితాః పుష్పితాశ్చ తాః పారిజాతస్య శాఖాః, తాభిః సమానః విభవః యేషాం తే), విభవః = సమర్థతగలవీ (విభు శబ్దం మీద ప్రథమావిభక్తిబహువచనం), అతిదీర్ఘాః = బాగా పొడవైనవీ అయిన, కృష్ణస్య = కృష్ణునియొక్క, హస్తాః = చేతులు, నః = మనకు, అఖిల+అర్థాన్ = అన్నీ పురుషార్థాలనూ (ధర్మ-అర్థ-కామ-మోక్షాలను), యచ్ఛన్తు = ఇచ్చుగాక! (దాణ్ దానే-భ్వాది-పరస్మైపది-లోట్-(ప్ర.బ.) "పాఘ్రాధ్మాస్థామ్నా**దాణ్** దృశ్యర్తి సర్తిశదసదాం పిబజిఘ్రధమతిష్ఠమన-**యచ్ఛ**పశ్యర్ఛధేశీయసదాః" (అష్టాధ్యాయి 7-3-78) సూత్రంతో ధాతువుకు '**యచ్ఛ**' - ఆదేశం.

**తా ॥** కృష్ణుని హస్తాలు చాలా పొడవైనవి. మరకత కాంతులు గలవి. అందమైన గోళ్ళు అనే ముత్యాలతో ప్రకాశించేవి. పుష్పించి, ఫలించివున్న, పారిజాతవృక్షపు కొమ్మలవంటివి. సమర్థత గలవి. అటువంటి చేతులు మాకు సమస్తపురుషార్థాలను అందించుగాత!

**వి :** 1. సకల పురుషార్థాలను ఇవ్వాలని అభిలాష. పురుషార్థాలు నాలుగు. ఆ నాలుగింటిని ఇవ్వగల సమర్థతగల చేతులవి. ఏమిటా సామర్థ్యం? అవి నాలుగుగా వుండటమే. నాలుగు పురుషార్థాలనూ ఇవ్వటానికి నాలుగు చేతులు.

| | | | |
|---|---|---|---|
| 2. **యచ్ఛన్తు :** | యచ్ఛతు/యచ్ఛతాత్ | యచ్ఛతామ్ | **యచ్ఛన్తు** |
| | యచ్ఛ/యచ్ఛతాత్ | యచ్ఛతమ్ | యచ్ఛత |
| | యచ్ఛాని | యచ్ఛావ | యచ్ఛామ. |

*

**శ్లో॥ చక్రం హరేర్మర్దితదైత్యచక్రం - శఙ్ఖః స్వనైర్ధిక్కృతదైత్యశఙ్ఖః ।**
**పద్మం చ విధ్వస్తపరాస్యపద్మం - గదా చ సా పాపగదాపహన్త్రీ ॥ 18-38**

**అ :** కృష్ణ శంఖ, చక్ర,గదా,పద్మ వర్ణన. -ఇంద్రవజ్ర.

**అ :** హరేః చక్రం మర్దిత-దైత్య-చక్రమ్. శంఖః స్వనైః ధిక్-కృత-దైత్య-శంఖః పద్మం చ విధ్వస్త-పర+ఆస్య-పద్మం, సా గదా చ పాప-గద+అపహన్త్రీ.

**ప్ర :** హరేః = కృష్ణునియొక్క, చక్రమ్ = చక్రం (సుదర్శనం), మర్దిత-దైత్య-చక్రమ్ : మర్దిత = సంహరింపబడిన, దైత్య = రాక్షసులయొక్క, చక్రమ్ = సమూహం గలది (మర్దితం దైత్యానాం చక్రం యేన తత్), శంఖః = శంఖం, స్వనైః = ధ్వనులతో, ధిక్-... శంఖః : ధిక్-కృత = తిరస్కరింపబడిన, దైత్య = దితిసుతులయొక్క, శంఖః = శంఖం (సంఖ్యావాచకం) గలది. (ధికకృతః దైత్యానాం శంఖః యేన సః), పద్మమ్ చ = పద్మం కూడా, విధ్వస్త... పద్మమ్ : విధ్వస్త = ధ్వంసం చేయబడిన, పర = శత్రువులయొక్క, ఆస్య-పద్మమ్ = ముఖకమలాలు గలది. (విధ్వస్తాని పరేషామ్ ఆస్యాని ఏవ పద్మాని యేన తత్), సా = ఆ, హరేః = కృష్ణునియొక్క, గదా చ = గద కూడా, పాప-గద-అపహన్త్రీ : పాప = పాప మనే, గద = రోగాన్ని (రోగవ్యాధిగదామయాః-అమర-మనుష్య-51), అపహన్త్రీ = పోగొట్టేది. (అప-హన్ ధాతువుపై శతృప్రత్యయం- స్త్రీ ప్రత్యయాంతం). (పాపమేవ గదః, తస్య అపహన్త్రీ)

**తా ॥** కృష్ణుని సుదర్శనచక్రం దైత్యచక్రాన్ని సంహరించేది. కృష్ణుని శంఖం (పాంచజన్యం) శంఖసంఖ్యాకులైన రాక్షసులను తన ధ్వనులతోనే తిరస్కరించేది. కృష్ణుని పద్మం కూడా పరుల ముఖపద్మాలను ధ్వంసం చేసేది. కృష్ణుని గద పాపమనే వ్యాధులనే అపహరించేది.

**వి :** 1. **శంఖం** : సంఖ్యామానం-

1. ఒకటి 2. పది 3. వంద (శతం) 4. వేయి (సహస్రం) 5. పదివేలు (అయుతం) 6. లక్ష (నియుతం) 7.పదిలక్షలు (ప్రయుతం) 8. నూరులక్షలు (కోటి) 9. పదికోట్లు (అర్బుదం) 10. 100 కోట్లు (న్యర్బుదం) ఇలా పదిపదిగా గుణిస్తూ పోతే ఖర్వం, మహాఖర్వం; **పద్మం**, మహాపద్మం; క్షోణి, మహాక్షోణి; **శంఖం**, మహాశంఖం; ... ... ...

2. తన చక్ర, శంఖ, గదా, పద్మాలుండగా ఆపేర మరొకటి వుండరాదన్నది కృష్ణుని ఆంతర్యం కాకపోయినా తమవంటిది మరొకటుండరాదన్నది వాటి ఆలోచన-అసహనం కావచ్చు. అటువంటి అసహనదృష్టి వుంది కాబట్టియే అవి ఇంకా అంగాలుగానే వున్నాయని అంగి కాలేకపోతున్నాయని ధ్వని. అచేతనాలకు చేతనత్వాన్ని కల్పించి చేసిన వర్ణన చేతనగల మానవులకు సరసంగా హితబోధ. *

**శ్లో॥ ద్విషామసహ్యోఽపి నిజప్రహర్ష-కరోఽస్య ఖడ్గః కిల నన్దకాఖ్యః ।**
**వియుక్తనారీపరితాపకారీ - కిమిన్దురానన్దకరో న లోకే ॥ 18-39**

**అ :** కృష్ణునియొక్క నందకఖడ్గాన్ని వర్ణించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ద్విషామ్ అసహ్యః అపి నందక+ఆఖ్యః అస్య ఖడ్గః నిజ-ప్రహర్ష-కరః కిల. లోకే వియుక్త-నారీ-పరితాప-కారీ ఇన్దుః ఆనంద-కరః న (భవతి) కిమ్?

**ప్ర :** ద్విషామ్ = శత్రువులకు, అసహ్యః = భరింపరానిది (సోఢమ్ అర్హః సహ్యః తన్నభవతీతి అసహ్యః), అపి = అయినా, నందక+ఆఖ్యః = నందకమనే పేరుగల (నందక ఇతి ఆఖ్యా యస్య సః), అస్య = కృష్ణునియొక్క, ఖడ్గః = కత్తి, నిజ... కరః కిల : నిజ = తనవారికి (భక్తులకు), ప్రహర్ష = ఆనందాన్ని, కరః కిల = కలిగించగలిగేదే గదా! (నిజానాం ప్రహర్ష కరః), లోకే = లోకంలో, వియుక్త... కారీ : వియుక్త = విడవడిన, నారీ = స్త్రీలకు, పరితాప = వేదనను, కారీ = కల్గించే (వియుక్తానాం నారీణాం పరితాపం కరోతి ఇతి), ఇందుః = చంద్రుడు, ఆనంద-కరః = ఆనందింపజేసేవాడుగా, న (భవతి) కిమ్? = కాదా?

**తా ॥** కృష్ణుని కత్తిపేరు నందకం. నందకమంటే ఆనందింపజేసేది. శత్రువులకు అది అసహ్యమైనా కృష్ణభక్తులకు మాత్రం ఆనందకరమే. లోకంలో చంద్రుడు విరహిణులకు తాపాన్ని కలిగించేవాడే. కానీ ఇతరులకు ఆనందాన్ని కలిగించేవాడే గదా! *

**శ్లో॥ శరైరపారై రిపువర్గదైన్య-కరోఽస్య చాపస్త్రినతో మురారేః ।**
**తథాహి సద్వంశభవా గుణాఢ్యా - నతాః సమర్థా అపి సర్వసన్ధౌ ॥ 18-40**

**అ :** కృష్ణచాపవర్ణనం. -ఉపేంద్రవజ్ర.

**అ :** అపారైః శరైః రిపు-వర్గ-దైన్య-కరః అస్య ముర+అరేః చాపః త్రి-నతః. తథాహి సద్-వంశ-భవాః గుణ+ఆఢ్యాః సమర్థాః అపి సర్వ-సన్ధౌ నతాః.

**ప్ర :** అపారైః = అంతులేని, శరైః = బాణాలతో, రిపు... కరః : రిపు = శత్రువులయొక్క, వర్గ = సమూహానికి, దైన్య = దీనత్వాన్ని, కరః = కలిగించే, అస్య = ఈ, మురారేః = కృష్ణునియొక్క, చాపః = విల్లు, త్రి-నతః : త్రి

= మూడుతావులలో, నతః = వంగినది (రెండుచివరలా, మధ్యలో) (త్రిషు నతః), తథాహి = అది యుక్తమే. సద్-వంశ-భవాః : సద్ = మంచి, వంశ = వంశమందు/వెదురునుండి, భవాః = పుట్టినవారు/పుట్టినవి (సతి వంశే భవాః), గుణ+ఆఢ్యాః : గుణ = సద్గుణాలచే/అల్లెత్రాటిచే, ఆఢ్యాః = బలిష్ఠులైనా/సంపన్నమైనవైనా, సమర్థాః-అపి = సమర్థులైనా/సమర్థమైనవైనా, సర్వ-సంధౌ = అన్ని కలయికలలోనూ/అన్ని సంధులలోనూ, నతాః = వంగి వుంటారు/వుంటాయి.

**తా ॥** కృష్ణుని విల్లు అపరిమితమయిన బాణాలతో శత్రుసమూహాలకు దీనత్వాన్ని కలిగించ గలది. అయినా అది త్రినతం. (మూడు ప్రాంతాలలోనూ వంగి వుంటుంది.) నిజమే మరి. సద్వంశంలో పుట్టి, గుణసంపదగలిగి, సమర్థులైనవారు/ సమర్థమైనవి సర్వసంధులలోనూ వినమ్రతతోనే వుంటారు/వుంటాయి. *

**శ్లో॥ హస్తా హరేః కటకకఙ్కణముద్రికాద్యై-**
**ర్దీప్తాః సుదర్శనగదామ్బుజశఙ్ఖశోభాః ।**
**వృత్తాస్త్రిరేఖమణిబన్ధరుచోఽతిదీర్ఘా**
**రక్తాబ్జకోమలతలా మమ మానసే స్యుః ॥ 18-41**

**అ :** కృష్ణ కర వర్ణన. -వసంతతిలక.

**అ :** కటక-కంకణ-ముద్రికా+ఆద్యైః దీప్తాః సుదర్శన-గదా+అంబుజ-శంఖ-శోభాః వృత్తాః త్రి-రేఖ-మణి-బన్ధ-రుచః రక్త+అబ్జ-కోమల-తలాః అతిదీర్ఘాః హరేః హస్తాః మమ మానసే స్యుః.

**ప్ర :** కటక... కాద్యైః : కటక = కడియాలు, కంకణ = గాజులు, ముద్రికా = ఉంగరాలు, ఆద్యైః = మొదలగు (నగలచే) (కటకాని చ కంకణాని చ ముద్రికాశ్చ ఆదౌ యేషాం తైః), దీప్తాః = ప్రకాశించేవీ, సుదర్శన... శోభాః : సుదర్శన = సుదర్శనచక్రం, గదా = కౌమోదకీగద, అంబుజ = తామర, శంఖ = పాంచజన్యం - వీటియొక్క, శోభాః = కాంతిగలవీ, (సుదర్శనశ్చ గదా చ అంబుజం చ శంఖశ్చ తేషాం శోభా యేషాం తే), వృత్తాః = మాంసలములూ, త్రి... రుచః : త్రి-రేఖ = మూడు గీతలుగల, మణిబంధ = మణికట్టుయొక్క, రుచః = కాంతిగలవీ (తిస్రః రేఖాః యస్య, సః చ అసౌ మణిబంధః, తస్య రుచః యేషాం తే), అతిదీర్ఘాః = మిగుల పొడవైనవీ, రక్తా... తలాః : రక్త+అబ్జ = ఎఱ్ఱతామరవలె, కోమల = సున్నితమైన, తలాః = ఉపరిభాగం (అరచేయి)గలవీ అయిన (రక్తం చ తద్ అబ్జం, తద్వత్ కోమలం తలం యేషాం తే), హరేః = కృష్ణునియొక్క, హస్తాః = చేతులు, మమ = నాయొక్క, మానసే = మనస్సునందు, స్యుః = ఉండుగాక! (అస భువి-అదాది-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.బ.).

**తా ॥** కృష్ణుని చేతులు కడియాలతో, కంకణాలతో, ఉంగరాలతో దీప్తిమంతమైనవి. సుదర్శన చక్రం, కౌమోదకీగద, అంబుజం, పాంచజన్యశంఖం వీటి శోభగలవి. పరిపుష్టమైనవి. మణికట్టుపై స్పష్టంగా మూడు రేఖలు గలవి. వాటి కాంతులు గలవి. చాలా పొడవైనవి. ఎఱ్ఱతామరలా సున్నితమైన అరచేతులు గలవి. ఆ చేతులు నా మనస్సులో నిలవాలి.

**వి :** 1. మనస్సులో ఆ నాలుగు చేతులు నిలిచినందువలన ఫలితం **నిర్మోహత్వప్రాప్తి**. ఆ నాలుగు చేతులు నాలుగు పురుషార్థాల నివ్వగలవి. అవి మనస్సులో నిలిస్తే ఇక ఏ కోరికలూ మనస్సులోనికి రావు మోక్షకాంక్షతో సహా.

ఆ విషయాన్ని విష్ణుపాదాదికేశాంతస్తోత్రం (శంకరవిరచితం)-33 లో స్పష్టం చేయ బడింది. వాచా-

శ్లో॥ విశ్వత్రాణైకదీక్షాస్తదనుగుణగుణక్షత్రనిర్మాణదక్షాః
కర్తారో దుర్నిరూపాః స్ఫుటగురుయశసాం కర్మణామద్భుతానామ్ ।

శార్ఙ్గం బాణం కృపాణం ఫలకమరిగదే పద్మశంఖే సహస్రం
బిభ్రాణాః శస్త్రజాలం మమ దధతు హరేర్బాహవో మోహహానిమ్ ॥

2. **స్యుః :** స్యాత్ స్యాతామ్ **స్యుః**
స్యాః స్యాతమ్ స్యాత
స్యామ్ స్యావ స్యామ. *

**శ్లో॥ భైష్మ్యాః క్వణత్కనకకఙ్కణరఞ్జితో మే**
**హస్తః సమస్తఫలదస్తనుతాదభీష్టమ్ ।**
**యేనానిశం రహసి బన్ధమపేక్షమాణః**
**శ్రీశోఽఖిలం హరతి పూర్ణమనోరథోఽపి॥ 18-42**

**అ :** రుక్మిణీహస్తవర్ణనం. -వసంతతిలక.

**అ :** క్వణత్-కనక-కంకణ-రంజితః సమస్త-ఫలదః భైష్మ్యాః హస్తః మే అభీష్టం తనుతాత్. పూర్ణ-మనోరథః అపి శ్రీ-ఈశః అనిశం రహసి యేన బన్ధమ్ అపేక్షమాణః అఖిలం హరతి.

**ప్ర :** క్వణత్... రంజితః : క్వణత్ = సవ్వడిచేస్తున్న (క్వణ్ ధాతువుపై శతృ ప్రత్యయం), కనక-కంకణ = బంగారు గాజులచే, రంజితః = ప్రకాశింపజేయబడినదీ (క్వణద్భిః కనకమయైః కంకణైః రంజితః), సమస్త-ఫల-దః : సమస్త = అన్ని, ఫల = ఫలితాలను, దః = ఇచ్చునదీ అయిన (సమస్తాని ఫలాని దదాతి ఇతి), భైష్మ్యాః = రుక్మిణియొక్క (భీష్మస్య అపత్యం స్త్రీ, తస్యాః), హస్తః = చేయి, మే = నాయొక్క, అభీష్టమ్ = కోరికను, తనుతాత్ = సమకూర్చుగాక (తన్ విస్తారే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), పూర్ణ-మనోరథః అపి : పూర్ణ = తీరిన, మనోరథః అపి = కోరికలు తీరినవాడైనా (పూర్ణాః మనోరథాః యస్య సః), శ్రీ+ఈశః = లక్ష్మీపతి (శ్రియః ఈశః ), అనిశమ్ = ఎల్లప్పుడు, రహసి = ఏకాంతంలో, యేన = దేనితో (ఏ చేతితో), బన్ధమ్ = కలివిడిని (కౌగిలింతను), అపేక్షమాణః (సన్) = కోరుతూ (అప+ఈక్ష్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), అఖిలమ్ = సమస్తాన్నీ (జగత్తును), హరతి = ఉపసంహరిస్తాడో? (హృ హరణే-పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** బంగారుగాజులచే రంజింపజేయబడి, (ఆశ్రితులకు) సమస్తఫలాలనూ ఇవ్వగల రుక్మిణిచేయి నా అభీష్టాన్ని సమకూర్చుగాత! ఆ చేతితో ఏకాంతంలో ఎల్లప్పుడూ బంధాన్ని కోరుతూనే పూర్ణమనోరథుడైనా కృష్ణుడు సమస్తజగత్తునూ ఉపసంహరిస్తున్నాడు.

**వి :** 1. శ్లో॥ యతస్సర్వాణి భూతాని భవన్త్యాది యుగాగమే ।
యస్మింశ్చ ప్రళయం యాన్తి పునరేవ యుగక్షయే ॥ - విష్ణుసహస్రనామస్తోత్రమ్.

యుగాంతకాలంలో సమస్తవిశ్వమూ ఆయనలో చేరిపోతుంది. అది కృష్ణుని చికీర్ష కాదు. అయినా రుక్మిణీకరబన్ధనాన్ని కోరి కృష్ణుడు ఆ పనిచేస్తున్నాడనటం కాని కారణాన్ని కారణంగా సంభావించటం. అది హేతూత్ప్రేక్ష. అయితే అది ధ్వనిరూపం.

2. ఇది కృష్ణుని నరానుకరణం. కోరికలకు హద్దులుండవన్నది మానవీయమైన పరిభావన. ఇక్కడ కృష్ణుని విషయంలో కూడా పూర్ణమనోరథుడైనా లక్ష్మీకరగ్రహణకాంక్ష ఇంకా మిగిలివున్నదనటం మానవాకృతిలో వున్నాడు కాబట్టి నరానుకరణం. అయితే జగదుపసంహారం నరానుకరణం కాదు గదా! నిజమే. ఉభయలక్షణాలనూ కవి నిర్దేశిస్తున్నా డీ శ్లోకంలో.

| | | | |
|---|---|---|---|
| 3. **తనుతాత్ :** | తనోతు/**తనుతాత్** | తనుతామ్ | తన్వన్తు |
| | తను/తనుతాత్ | తనుతమ్ | తనుత |
| | తనవాని | తనవావ | తనవామ |
| **హరతి :** | **హరతి** | హరతః | హరన్తి |
| | హరసి | హరథః | హరథ |
| | హరామి | హరావః | హరామః. |

*

**శ్లో॥ వృత్తే త్రిరేఖే రత్నౌఘదీప్తే శ్రీశ్రీశకన్ధరే ।**
**విష్వక్స్రవద్రత్నచిత్రౌ జిగ్యతుః శఙ్ఖశేవధీ ॥ 18-43**

**అ :** రుక్మిణీకృష్ణకంఠవర్ణన. -పథ్యావక్త్రమ్.

**అ :** వృత్తే త్రి-రేఖే రత్న+ఓఘ-దీప్తౌ శ్రీ-శ్రీశ-కంధరే విష్వక్-స్రవద్-రత్న-చిత్రౌ శంఖ-శేవధీ జిగ్యతుః.

**ప్ర :** వృత్తే = గుండ్రనివీ, త్రి-రేఖే = మూడు గీతలు గలవీ (తిస్రః రేఖాః యయోస్తే), రత్న+ఓఘ-దీప్తే : రత్న+ఓఘ = రత్నసమూహంయొక్క, దీప్తే = వెలుగు గలవీ (రత్నానామ్ ఓఘః, తస్య దీప్తిః యయోస్తే), శ్రీ-శ్రీశ-కంధరే = రుక్మిణీకృష్ణుల గొంతుకలు, విష్వక్... చిత్రౌ : విష్వక్ = అంతటా (పరితస్సర్వతోవిష్వక్-హలాయుధకోశః-874), స్రవద్ = ప్రసరిస్తున్న, రత్న = రత్నాలతో, చిత్రౌ = చిత్రవర్ణాలుగలవీ అయిన, శంఖ-శేవధీ = శంఖం, శేవధి అనే నిధులను, జిగ్యతుః = గెలిచాయి. (జి జయే పరస్మైపది-లిట్-ప్ర.ద్వి.)

**తా ॥** రుక్మిణీకృష్ణుల కంఠాలు వర్తులాలు. మూడు రేఖలు (స్పష్టంగా) కలవి. రత్న సమూహాలతో ప్రకాశించేవి. అన్ని దిక్కులా ప్రసరిస్తున్న రత్నకాంతులతో చిత్రవర్ణం గలవి. అవి శంఖం, శేవధి అనే నిధులను జయించాయి.

**వి :** 1. **జిగ్యతుః :** 18-21వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ రత్నౌఘరమ్యేణ పరిశ్రితేన - చిరేణ దీప్తం నిజభూషణేన ।**
**వృత్తం త్రిరేఖం వరహారజుష్టం - నిత్యం స్మర శ్రీరమణస్య కణ్ఠమ్ ॥ 18-44**

**అ :** కృష్ణకంఠవర్ణనం. -ఉపజాతి (1,3,4 ఇంద్రవజ్ర, 2 ఉపేంద్రవజ్ర.

**అ :** రత్న+ఓఘ-రమ్యేణ పరిశ్రితేన నిజ-భూషణేన చిరేణ దీప్తం వృత్తం త్రిరేఖం వర-హార-జుష్టం శ్రీ-రమణస్య కంఠం నిత్యం స్మర.

**ప్ర :** రత్న+ఓఘ-రమ్యేణ : రత్న+ఓఘ = రత్నసమూహంచేత, రమ్యేణ = అందమైనదీ (రత్నానామోఘః, తేన రమ్యం, తేన), పరిశ్రితేన = (మెడను) చుట్టివున్నదీ అయిన, నిజభూషణేన = కంఠాభరణంతో, చిరేణ = సుదీర్ఘంగా, దీప్తమ్ = వెలుగొందేదీ, వృత్తమ్ = గుండ్రనిదీ, త్రిరేఖమ్ = మూడురేఖలు గలదీ, వర-హార-జుష్టమ్ = గొప్ప హారంతో కూడినదీ అయిన (వరేణ హారేణ జుష్టమ్), శ్రీ-రమణస్య = లక్ష్మీపతియొక్క (శ్రియః రమణస్తస్య), కంఠమ్ = కంఠాన్ని, నిత్యమ్ = ఎల్లప్పుడూ, స్మర = తలచుకో (స్మృ చింతాయామ్-భ్వాది-పరస్మైపది-లోట్-మ.ఏ.).

**తా ॥** కృష్ణుని కంఠం రత్నసమూహంతో రమణీయమై క్రొత్తకరుకు చెదరని వెలుగుతో కూడిన కంఠాభరణంతో అలంకరింపబడింది. స్పష్టమైన మూడు రేఖలతో కూడి, గుండ్రనై శోభిస్తోంది. అటువంటి ఆ కంఠాన్ని స్మరించు.

| | | | |
|---|---|---|---|
| **వి :** 1. **స్మర :** | స్మరతు/స్మరతాత్ | స్మరతామ్ | స్మరన్తు |
| | **స్మర**/స్మరతాత్ | స్మరతమ్ | స్మరత |
| | స్మరాణి | స్మరావ | స్మరామ. |

*

శ్లో॥ సన్నీలోత్పలచారుచమ్పకలసజ్జాతిస్ఫురన్మల్లికా-
రక్తాశోకమృదుప్రసూనరచితా రమ్యాబ్జరాజన్ముఖీ ।
ముక్తా నీలమణిప్రవాలవిలసన్మాణిక్యహేమోజ్జ్వలా
భర్త్రంసార్పితరుగ్మిణీకరతలేవాభాతి మాలా విభోః ॥ **18-45**

**అ :** కృష్ణ వనమాలా వర్ణన. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** సత్+నీల+ఉత్పల-చారు-చంపక-లసత్-జాతి-స్ఫురత్-మల్లికా-రక్త+అశోక-మృదు-ప్రసూన-రచితా రమ్య+అబ్జ-రాజత్-ముఖీ విభోః మాలా ముక్తా నీల-మణి-ప్రవాల-విలసత్-మాణిక్య-హేమ-ఉజ్జ్వలా భర్తృ+అంస+అర్పిత-రుగ్మిణీ-కర-తలా ఇవ ఆభాతి.

**ప్ర :** సన్నీ... రచితా : సత్ = మంచి, నీల+ఉత్పల = నల్లకలువలూ, చారు = అందమైన, చంపక = సంపంగులూ, లసత్ = ప్రకాశిస్తున్న, జాతి = జాజిపూలూ, స్ఫురత్ = శోభిస్తున్న, మల్లికా = మల్లికలూ, రక్త+అశోక = ఎఱ్ఱని అశోకకుసుమాలూ (ఇవి కాక) మృదు = సున్నితమైన, ప్రసూన = పూలచే, రచితా = కూర్పబడినదీ (సన్తి చ తాని నీలోత్పలాని చ, చారూణి చ తాని చమ్పకాని చ, లసన్త్యః చ తాః జాతయశ్చ, స్ఫురన్త్యశ్చ తాః మల్లికాశ్చ, రక్తాని చ తాని అశోకాని చ, మృదూని చ తాని ప్రసూనాని చ, తైః రచితా), రమ్యా... ముఖీ : రమ్య = అందమైన, అబ్జ = తామరలచే, రాజత్ = ప్రకాశిస్తున్న, ముఖీ = అగ్రభాగం గలదీ అయిన (రమ్యాభ్యామ్ అబ్జాభ్యాం రాజత్ ముఖం యస్యాస్సా), విభోః = కృష్ణునియొక్క, మాలా = (వన)మాల/ పూదండ, ముక్తా...జ్జ్వలా : ముక్తా = ముత్యాలూ, నీల-మణి = ఇంద్రనీలమణులూ, ప్రవాళ = పగడాలూ, విలసత్ = ప్రకాశిస్తున్న, మాణిక్య = మాణిక్యాలూ, హేమ = బంగారం-వీటిచే, ఉజ్జ్వలా = దీప్తిమంతమై, భర్త్రం... తలా-ఇవ : భర్తృ = వల్లభుడైన కృష్ణునియొక్క, అంస = భుజాలపై, అర్పిత = సమర్పింపబడిన, రుక్మిణి = రుక్మిణియొక్క, కరతలా+ఇవ = అరిచేతులు గలదిగా, ఆభాతి = ప్రకాశిస్తోంది. (ఆ భా దీప్తౌ పరస్మైపది-లట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని వనమాల నీలోత్పలాలతో, అందమైన చంపకకుసుమాలతో, జాజిపూలతో, మల్లికలతో రక్తాశోకకుసుమాలతో ఇంకా ఎన్నో సున్నితమైన పూలతో ఎదట రెండు తామరలతో విరాజిల్లుతోంది. అది ముత్యాలతో, నీలమణులతో, పగడాలతో, మాణిక్యాలతో, సువర్ణంతో ప్రకాశిస్తూ కృష్ణునిమెడపై వేసిన రుక్మిణి కరతలాలవలె భాసిస్తోంది.

**వి :** 1. వస్తూత్ప్రేక్షాలంకారం.

| | | | |
|---|---|---|---|
| 2. **ఆభాతి :** | **ఆభాతి** | ఆభాతః | ఆభాన్తి |
| | ఆభాసి | ఆభాథః | ఆభాథ |
| | ఆభామి | ఆభావః | ఆభామః. |

*

శ్లో॥ బన్ధోజ్ఝితాయా అపి సిన్ధుపుత్ర్యా - మాఙ్గల్యసూత్రం కిల నిత్యబద్ధమ్ ।
ముగ్ధాబలామోహనకణ్ఠయోగే - మోక్షోఽప్యనాకాఙ్క్షిత ఏవ నూనమ్ ॥ **18-46**

**అ :** రుక్మిణీమంగళసూత్రవర్ణనం. -ఇంద్రవజ్ర.

**అ :** బన్ధ+ఉజ్ఝితాయాః అపి సిన్ధు-పుత్ర్యాః మాంగల్య-సూత్రం నిత్య-బద్ధం కిల. ముగ్ధా+అబలా-మోహన-కంఠ-యోగే మోక్షః అపి అనాకాంక్షితః ఏవ నూనమ్.

**ప్ర :** బన్ధ+ఉజ్ఝితాయాః అపి = బంధాన్ని విడిచిపెట్టినా (బన్ధః ఉజ్ఝితః యయా, తస్యాః), సింధు-పుత్ర్యాః =

రుక్మిణికి (సిన్ధోః పుత్రీ, తస్యాః), మాంగల్య-సూత్రమ్ = మంగళసూత్రం, నిత్య-బద్ధమ్ కిల = ఎప్పుడూ కట్టబడి వుండేదే గదా!, ముగ్ధా... యోగే (సతి) : ముగ్ధ = ముద్దరాలైన, అబలా = స్త్రీయొక్క, మోహన = అందమైన, కంఠ = కంఠంతో, యోగే (సతి) = కలయికలో (ముగ్ధాయాః అబలాయాః మోహనేన కంఠేన యోగః తస్మిన్), మోక్షః+అపి = ముక్తికూడా, అనాకాంక్షితః ఏవ =కోరబడనిదే! (కాంక్షితః న భవతీతి), నూనమ్ = నిశ్చితం.

**తా ॥** రుక్మిణి నిత్యముక్త. అయినా ఆమెకంఠంలో మాంగల్యసూత్రం నిత్యబద్ధమై వుంటుంది. (నిత్యముక్త అయిన రుక్మిణితో మరి బంధమేమిటంటే) ముద్దరాలైన కాంతయొక్క అందమైన కంఠాన్ని కౌగిలించివుంటే విముక్తిని కోరుకోము గదా! (విముక్తి సంసారబంధంనుండియేకాక ఆ కంఠబంధంనుండి కూడా అని చమత్కారం)

**వి :** 1. పూర్వార్ధంలో ప్రతిపాదించిన విశేషవిషయాన్ని ఉత్తరార్ధంలోని సామాన్యవిషయంతో కవి సమర్థించి నందువల్ల ఇది **అర్థాంతరన్యాసాలంకారం.**

ఉత్తరార్ధంలో ప్రతిపాదించిన అంశం నరానుకరణకు చెందిందే కాక దివ్యత్వానికి కూడా సంబంధించినదే. దేవతలు నిత్యముక్తులు. కానీ సంన్యాసాన్ని బోధించినవారు కానీ, పాటించినవారు కానీ కారు. ఇది మానవులు తెచ్చిపెట్టుకొన్న విలువ. దివ్యప్రబోధంతో నిత్యముక్తత్వం మాత్రమే. దానికి సంన్యాస, సంసార భేదమసలుండదు. అది అందరూ అందుకొనవలసిన ఒక మానసిక దశావిశేషం.

ఆ దశను చేరుకొనే ప్రయత్నంలో మనవైఫల్యాలనూ, బలహీనతలనూ కప్పిపుచ్చుకొనే ప్రయత్నంలో సంసార, సంన్యాసాల మధ్య కొట్టుమిట్టాడుతూ చివరకు సంసారం వైపే మొగ్గుచూపుతాం. మళ్ళీ దాన్నే వ్యతిరేకిస్తుంటాం. అంతేకానీ ఈ ద్వంద్వాలకు సమన్వయాన్ని చేసి చూపిన దివ్యప్రవృత్తిని కానీ, దివ్యబోధనలను కానీ పరిశీలించి చూసే ప్రయత్నం చేయం.

ఈ కంఠాశ్లేషణనూ, అందునా స్వయంగ్రహాశ్లేషణనూ **మాఘకవి** ఎంత అందంగా వర్ణించాడో చూడండి-

శ్లో॥ సముత్క్షిపన్ యః పృథివీభృతాం వరం - వరప్రదానస్య చకార శూలినః ।
త్రసత్తుషారాద్రిసుతా ససంభ్రమ-స్వయంగ్రహాశ్లేషసుఖేన నిష్క్రయమ్ ॥

- శిశుపాలవధమ్ - 1/150*

**శ్లో॥ సన్నీలరత్నరుచిరం సతతం శ్రియై స్యా-**
**న్మాఙ్గల్యసూత్రమిహ మఙ్గళదేవతాయాః ।**
**యత్కణ్ఠదేశధృతమబ్జదళాయతాక్ష్యా**
**న ప్రాగ్వ్యయుంక్త న వియోక్ష్యతి నో వియుంక్తే ॥** **18-47**

**అ :** రుక్మిణీ మాంగల్యసూత్రశక్తివర్ణన. -వసంతతిలక.

**అ :** సత్+నీల-రత్న-రుచిరం మంగళ-దేవతాయాః మాంగల్య-సూత్రమ్ ఇహ సతతం శ్రియై స్యాత్. యత్ అప్+జ-దళ+ఆయత+అక్ష్యా కంఠ-దేశ-ధృతం ప్రాక్ న వ్యయుంక్త న వియోక్ష్యతి నో వియుంక్తే.

**ప్ర :** సన్నీ... రుచిరమ్ : సత్ = మంచి (జాతికి చెందిన), నీల-రత్న = నీలమణితో, రుచిరమ్ = అందమైన (సతా నీలేన రత్నేన రుచిరమ్), మంగళ-దేవతాయాః = లక్ష్మి(రుక్మిణి) యొక్క (మా రమా మంగళదేవతా- అమరకోశః), మాంగల్య-సూత్రమ్ = మంగళసూత్రం, ఇహ = ఈ లోకంలో, సతతమ్ = ఎల్లప్పుడూ, శ్రియై స్యాత్ = సంపదల కొఱకగు గాక! (అస భువి-అదాది-పరస్మైపది-విధిలిఙ్-ప్ర.ఏ.), యత్ = ఏదయితే, అబ్జ- దళ+ఆయత+అక్ష్యా : అబ్జ = తామరయొక్క, దళ = రేకులలాగా, ఆయత = విశాలమైన, అక్ష్యా = కన్నులుగల రుక్మిణిచే (అబ్జస్య దళే ఇవ విశాలే నేత్రే యస్యాః, తయా), కంఠ-దేశ-ధృతం(సత్) = కంఠాన ధరింపబడినదై

(కంఠస్య దేశః, తస్మిన్ ధృతమ్), ప్రాక్ = గతంలో, న వ్యయుంక్త = విడువడలేదు, న వియోక్ష్యతి = భవిష్యత్తులో విడువడదు, న వియుంక్తే = ఇప్పుడూ విడువడిలేదు. (మూడు యుజ్ యోగే-రుధాది-ధాతురూపాలే. లఙ్-ల్ఋట్-లట్ లకారాలకు చెందినవి.)

**తా ။** మంగళదేవత అయిన రుక్మిణి కంఠంలోని నీలరత్నరుచిరమైన మంగళసూత్రం ఇహలోకంలో నిరంతరమూ సంపదల కొలకగు గాక. ఆ కమలదళాయతాక్షి కంఠంలోని ఆ మంగళసూత్రం గతంలో ఎప్పుడూ ఎడబాయలేదు. భవిష్యత్తులోనూ విడిపోదు. వర్తమానంలో కూడా కంఠాన్ని అలంకరించే వుంది.

**వి :** 1. దాక్షిణాత్యులకు మంగళసూత్రంమీద భక్తివిశ్వాసాలు ఎక్కువ. కలలో కూడా అది లేకపోవటమంటే భయపడతారు. మంగళసూత్రం గట్టిగా వుంటే భర్తకు రక్షణ వున్నట్లే అని అటునుంచి ఇటు దృఢత్వాన్ని నిర్ధారించుకొనే మనస్స్థితి

హాలాహలం చెలరేగినప్పుడు పార్వతికూడా ఆ మంగళసూత్రం మీదున్న విశ్వాసంతోనే తన భర్తను హాలాహలం మ్రింగటానికి అనుమతిచ్చిందట.

క. మ్రింగెడువాఁడు విభుండని - మ్రింగెడిదియు గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ - మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో? -పోతనభాగవతము-8/241

ఈ విశ్వాసం అప్పటికీ, ఇప్పటికీ అప్రతిహతంగా సాగుతోంది. ఇది భాగవతం మూలంలో లేని విషయం. హాలాహలపానం వల్ల హరిమెప్పు పొందవచ్చునన్నదే మూలంలో కనిపించే అంశం-

శ్లో॥ ప్రీతే హరౌ భగవతి ప్రీయేఽహం సచరాచరః ।
తస్మాదిదం గరం భుంజే ప్రజానాం స్వస్తిరస్తు మే ॥ - భాగవతమ్ 8/7/40

| | | | |
|---|---|---|---|
| 2. **వ్యయుంక్త :** | **వ్యయుంక్త** | వ్యయుంజాతామ్ | వ్యయుంజత |
| | వ్యయుంక్థాః | వ్యయుంజాథామ్ | వ్యయుంగ్ధ్వమ్ |
| | వ్యయుంజి | వ్యయుంజ్వహి | వ్యయుంజ్మహి |
| **వియోక్ష్యతి :** | **వియోక్ష్యతి** | వియోక్ష్యతః | వియోక్ష్యన్తి |
| | వియోక్ష్యసి | వియోక్ష్యథః | వియోక్ష్యథ |
| | వియోక్ష్యామి | వియోక్ష్యావః | వియోక్ష్యామః |
| **వియుంక్తే :** | **వియుంక్తే** | వియుంజాతే | వియుంజతే |
| | వియుంక్షే | వియుంజాథే | వియుంగ్ధ్వే |
| | వియుంజే | వియుంజవహే | వియుంజమహే. * |

**శ్లో॥ దూరే విధూయ హరిణం సుభగం తదీయ-**
**నేత్రం స్వబిమ్బఖచితం వితనోతు చన్ద్రః ।**
**సామ్యం తథాపి న సమేతి శుచిస్మితస్య**
**లోలాలకస్య కమలాచ్యుతసన్ముఖస్య ॥** **18-48**

**అ :** చంద్రుడు రుక్మిణీకృష్ణముఖంతో సామ్యాన్ని పొందలేడనుట. -వసంతతిలక.

**అ :** చంద్రః హరిణం దూరే విధూయ సుభగం తదీయ-నేత్రం స్వ-బింబ-ఖచితం వితనోతు. తథా అపి శుచి-స్మితస్య లోల+అలకస్య కమలా+అచ్యుత-సత్+ముఖస్య సామ్యం న సమేతి.

ప్ర : చంద్రః = చంద్రుడు, హరిణమ్ = జింకను, దూరే = (తననుండి) దూరంగా, విధూయ = విడిచి, సుభగమ్ = మనోహరమైన, తదీయ–నేత్రమ్ = దాని కంటిని (తదీయస్య నేత్రమ్), స్వ–బింబ–ఖచితమ్ : స్వ = తనయొక్క, బింబ = బింబంలో (రూపంలో), ఖచితమ్ = పొదగబడినదిగా (స్వస్య బింబం, తస్మిన్ ఖచితమ్), వితనోతు = కల్గించుగాత! (వి+తన్ విస్తారే–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.), తథాపి = అయినప్పటికీ, శుచి–స్మితస్య : శుచి = నిర్మలమైన, స్మితస్య = చిఱునవ్వుగలదీ (శుచి స్మితం యస్మిన్ తస్య), లోల+అలకస్య : లోల = చంచలమైన, అలకస్య = ముంగురులుగలదీ అయిన, కమలా+అచ్యుత–సమ్ముఖస్య = లక్ష్మీ నారాయణులయొక్క మంచి ముఖానికి (కమలా చ అచ్యుతశ్చ, తయోః సచ్చ తత్ ముఖం, తస్య), సామ్యమ్ = పోలికను, న సమేతి = పొందలేదు. (సమ్–ఇ గతౌ పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** చంద్రుడు తనలోని జింకను నెట్టివేసి దాని కంటిని మాత్రం స్వీకరించి తనబింబంలో అమర్చుకొన్నాకూడా చిఱునవ్వుతో, కదులుతున్న ముంగురులతో శోభిస్తున్న లక్ష్మీనారాయణవదనానికి సమానం కాలేదు.

**వి :** 1. ఇక్కడ కవికల్పతోపమను సంభావించి నిషేధించటం కనిపిస్తోంది. చంద్రుడు ఉపమానం. అయితే మృగాన్ని దూరంచేసి దాని కంటిని మాత్రం తనలో పొదువుకోవాలి. ఇది కవికల్పితస్వరూపం. ఆ స్థితిలో కూడా పోలిక కుదరదని తిరస్కరించటం వలన సంభావిత నిషిద్ధాలంకారమిక్కడ. సామ్యాన్ని పొందలేదనటం ద్వారా సామ్యప్రతిపాదన ప్రయత్నం వ్యక్తమవుతోంది కాబట్టి ఉపమాలంకారమిక్కడ ధ్వనిస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 2. **వితనోతు :** | **వితనోతు**/వితనుతాత్ | వితనుతామ్ | వితన్వన్తు |
| | వితను/వితనుతాత్ | వితనుతమ్ | వితనుత |
| | వితనవాని | వితనవావ | వితనవామ |
| **సమేతి :** | **సమేతి** | సమితః | సంయన్తి |
| | సమేషి | సమిథః | సమిథ |
| | సమేమి | సమివః | సమిమః. |

*

**శ్లో॥ మాణిక్యసంశోభిముఖం సదాఽన్తః – శాణాగమోద్భాసితమౌక్తికాఢ్యమ్ ।**
**మానార్హనీలోపలసత్కరణ్డం – శ్రీనాథగణ్డద్వయమాజిగాయ ॥ 18–49**

**అ :** కృష్ణుని చెక్కిలిని వర్ణించటం. –ఇంద్రవజ్ర.

**అ :** శ్రీ–నాథ–గండ–యుగం మాణిక్య–సంశోభి–ముఖం సదా అన్తః శాణ+ఆగమ+ ఉద్భాసిత–మౌక్తిక+ఆఢ్యం మాన+అర్హ–నీల+ఉపల–సత్–కరండమ్ ఆజిగాయ.

ప్ర : శ్రీ–నాథ–గండ––యుగమ్ : శ్రీనాథ = కృష్ణునియొక్క, గండ–యుగమ్ = చెక్కిలిదోయి, మాణిక్య–సంశోభి–ముఖమ్ : మాణిక్య = కెంపులా, సంశోభి = ప్రకాశించే, ముఖమ్ = ముఖం కలదీ (మాణిక్యేన సంశోభి ముఖం యస్య తత్), సదా = ఎల్లప్పుడూ, అన్తః = లోన, శాణా... ఢ్యమ్ : శాణ = ఒరిపిడియొక్క (శాణస్తు నికషః కషః–అమర–శూద్ర–32), ఆగమ = రాకచే, ఉద్భాసిత = ప్రకాశింపజేయబడిన, మౌక్తిక = ముత్యాలచే, ఆఢ్యమ్ = సంపన్నమైనదీ అయిన, మానా... రండమ్ : మాన+అర్హ = గౌరవింపదగిన, నీల+ఉపల = నీలరత్నంతో చేసిన, సత్–కరండమ్ = మంచి బరిణెను, ఆజిగాయ = పూర్తిగా జయించింది. (ఆ+జి జయే–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణునియొక్క చెక్కిలి మాణిక్యంలా వెలుగొందుతున్న ముఖంతో, లోపల మంచి ముత్యాలను నింపిన నీలమణితో చేసిన బరిణెలా ప్రకాశిస్తోంది.

**వి :** 1. మాణిక్యం – 'దీనికి సింహళము, కాలపురము, ఆంధ్రము, తుంబురము ఇవి నాలుగు జన్మదేశములు.

సింహళమునందుఁ బుట్టిన కెంపు రక్తవర్ణము కలది. అది పద్మరాగము. అది ఉత్తమము. కాలపురమునందు పుట్టినది పసుపుదాళు కలది. అది కురువిందము. అది మధ్యమము. ఆంధ్రమునందు పుట్టినది అశోకపుచిగురుదాళు గలది అది సౌగంధికము. అదియు మధ్యమము. తుంబురమునఁ బుట్టినది నీలపుదాళుగలది. అది నీలగంధి. అది అధమము. - ఆంధ్రవాచస్పత్యము-నాలుగవ సంపుటము-2024

| | | | | |
|---|---|---|---|---|
| 2. **ఆజిగాయ :** | **ఆజిగాయ** | ఆజిగ్యతుః | ఆజిగ్యుః | |
| | ఆజిగయిథ/ఆజిగేథ | ఆజిగ్యథుః | ఆజిగ్య | |
| | ఆజిగాయ/ఆజిగయ | ఆజిగ్యివ | ఆజిగ్యిమ. | * |

**శ్లో॥ చన్ద్రోపమం శ్రీరమణస్య సౌఖ్య-సన్దోహదం రఞ్జితమోష్ఠభాసా ।**
**సౌన్దర్యదుగ్ధామ్బుధిఫేనకల్పం - మన్దస్మితం మన్దయతాదఘం నః ॥ 18-50**

**అ :** కృష్ణుని చిఱునవ్వును వర్ణించటం. -ఇంద్రవజ్ర.

**అ :** చంద్ర+ఉపమం సౌఖ్య-సందోహ-దం ఓష్ఠ-భాసా రంజితం సౌందర్య-దుగ్ధ+ అంబుధి-ఫేన-కల్పం శ్రీ-రమణస్య మంద-స్మితం నః అఘం మన్దయతాత్.

**ప్ర :** చంద్ర+ఉపమమ్ = చంద్రునితో పోలికగలదీ (చంద్రః ఉపమా యస్య తమ్), సౌఖ్య-సందోహ-దమ్ : సౌఖ్య = సుఖాలయొక్క, సందోహ-దమ్ = సమూహాన్ని ఇచ్చేదీ (సౌఖ్యానాం సందోహం దదాతీతి తమ్), ఓష్ఠ-భాసా = పెదవి కాంతితో (ఓష్ఠస్య భాః తయా), రంజితమ్ = ఎఱ్ఱగా జేయబడినదీ, సౌందర్య... కల్పమ్ : సౌందర్య = అందమనే, దుగ్ధ+అంబుధి = పాలకడలియొక్క, ఫేనకల్పమ్ = నురుగువంటిదీ అయిన (సౌందర్యమేవ దుగ్ధస్య అంబుధిః, తస్య ఫేనేన ఈషదూనమ్), శ్రీ-రమణస్య = లక్ష్మీవల్లభునియొక్క, మన్ద-స్మితమ్ = చిఱునవ్వు (మందం చ తత్ స్మితమ్), నః = మనయొక్క, అఘమ్ = పాపాన్ని, మన్దయతాత్ = పోగొట్టుగాక! (మన్ద స్తుతిమోదమదస్వప్నకాంతిగతిషు భ్వాది-పరస్మైపది-ణిచ్-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని చిఱునవ్వు చంద్రునితో పోలికగలది. సౌఖ్యసందోహసంధాయకం. వాతెర కాంతితో ఎఱ్ఱబడినది. సౌందరసాగరం యొక్క నురుగుతో సమానమైనది. ఆ చిఱునవ్వు మన పాపాన్ని పోగొట్టుగాక!

**వి :** 1. అన్యదేవతలలో కనిపించిన చిఱునవ్వు కృష్ణుని ముఖంలో నిరంతరమూ వుంటుందని సర్వజగద్భావన-

శ్లో॥ తత్కైశోరం తచ్చ వక్త్రారవిన్దం - తత్కారుణ్యం తే చ లీలాకటాక్షాః ।
**తత్సౌందర్యం సా చ మన్దస్మితశ్రీః - సత్యం సత్యం దుర్లభం దైవతేషు** ॥ - శ్రీకృష్ణకర్ణామృతమ్ - 1/55

| | | | | |
|---|---|---|---|---|
| 2. **మన్దయతాత్ :** | మందయతు/మందయతాత్ | మందయతామ్ | మన్దయన్తు | |
| | మందయ/మందయతాత్ | మందయతమ్ | మందయత | |
| | మందయాని | మందయావ | మందయామ. | * |

**శ్లో॥ స్వచ్ఛా మృదుస్మితదశాకలితైకదేశా - లక్ష్మీకపోలలలితక్షతహేతుభూతా ।**
**సత్కున్దకుట్మలసమా నిబిడా మమాన్తః - కృష్ణస్య రమ్యరదనావళిరావిరస్తు ॥ 51**

**అ : కృష్ణుని పలువరుసను వర్ణించటం.** -వసంతతిలక.

**అ :** స్వచ్ఛా మృదు-స్మిత-దశా+ఆకలిత+ఏక-దేశా లక్ష్మీ-కపోల-లలిత-క్షత-హేతు-భూతా సత్-కుంద-కుట్మల-సమా నిబిడా కృష్ణస్య రమ్య-రదన+ఆవలిః మమ అన్తః ఆవిరస్తు.

**ప్ర :** స్వచ్ఛా = నిర్మలమైనదీ, మృదు... దేశా : మృదు-స్మిత = చిఱునవ్వుయొక్క, దశా = దశయందు (స్థితిలో), ఆకలిత = వెలుగుచూసిన, ఏక-దేశా = కొంతమేర కనిపించేదీ (మృదు చ తత్ స్మితం, తస్య దశాయామ్

ఆకలితః ఏకాశ్చాసౌ దేశః యస్యాస్సా), లక్ష్మీ... భూతా : లక్ష్మీ = రుక్మిణియొక్క, కపోల = చెక్కిళ్ళపై, లలిత = మనోజ్ఞమైన, క్షత = గాటుకు, హేతు-భూతా = కారణమైనదీ (లక్ష్మ్యాః కపోలే లలితస్య క్షతస్య హేతుభూతా), సత్-కుంద... సమా : సత్ = మంచి, కుంద = మల్లెలయొక్క, కుట్మల = మొగ్గలతో, సమా = సమానమైనదీ (సద్భిః కుందస్య కుట్మలైః సమా), నిబిడా = దట్టమైనదీ అయిన, కృష్ణస్య = కృష్ణునియొక్క, రమ్య-రదన-ఆవలిః = అందమైన పలువరుస (రమ్యాణామ్ రదనానామ్ ఆవలిః), మమ = నాయొక్క, అన్తః = లోన, ఆవిరస్తు = ప్రత్యక్షమై నిలుచుగాక! (ఎల్లప్పుడూ చెదరకుండుగాక!) (ఆవిః+అస్ భువి-అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.).

**తా ॥** కృష్ణుని పలువరుస నిర్మలమైనది. చిఱునవ్వు నవ్వినప్పుడు కొంతభాగం మాత్రమే కనిపించేది. లక్ష్మి చెక్కిళ్ళపై అందమైన గాట్లకు కారణమైనది. మంచి మల్లెమొగ్గలతో సమానమై సాంద్రంగా (మధ్యలో తొర్రలు లేకుండా) వున్నది. అటువంటి ఆ మనోజ్ఞమైన పలువరుస నాలో ప్రత్యక్షమై వుండుగాక.

**వి : 1. ఆవిః+అస్తు :** 18-7వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ సన్మాన్యలావణ్యమరన్దసాన్ద్ర-మమ్లానసచ్చమ్పకసమ్పదం నః ।**
**మన్మానసే స్యాల్లసదున్నతాగ్రం - సౌమ్యస్య నాసాపుటమచ్యుతస్య ॥ 18-52**

**అ :** కృష్ణునియొక్క నాసాపుటాన్ని వర్ణించటం. -ఇంద్రవజ్ర.

**అ :** సత్+మాన్య-లావణ్య-మరంద-సాంద్రమ్ అమ్లాన-సత్-చంపక-సంపదమ్ లసత్+ ఉన్నత+అగ్రం సౌమ్యస్య అచ్యుతస్య నాసా-పుటమ్ అంతః మత్+మానసే స్యాత్.

**ప్ర :** సన్మా... సాంద్రమ్ : సత్ = సజ్జనులచే, మాన్య = మన్నింపదగిన, లావణ్య = సౌందర్య మనే (లవణస్య భావః లావణ్యమ్), మరంద = మకరందంతో (మరన్దః-పూదేనె-శబ్దార్థకల్పతరుః-1162), సాంద్రమ్ = దట్టమైనదీ, అమ్లాన... సంపదమ్ : అమ్లాన = వాడని, సత్ = మంచి, చంపక = సంపంగియొక్క, సంపదమ్ = సంపదగలదీ (అమ్లానస్య సచ్చంపకస్య సంపదివ సంపత్ యస్య తత్), లసద్-ఉన్నత+అగ్రమ్ : లసత్ = శోభిస్తున్న, ఉన్నత = ఎత్తైన, అగ్రమ్ = కొనగలదీ (లసత్ ఉన్నతమ్ అగ్రం యస్య తత్), సౌమ్యస్య = సౌమ్యుడైన, అచ్యుతస్య = కృష్ణునియొక్క, నాసా-పుటమ్ = ముక్కుపుటం, మత్+మానసే = నా మనస్సులో (మమ మానసం, తస్మిన్), స్యాత్ = నిలుచుగాత! (అస భువి భ్వాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని నాసాపుటం మాన్యలావణ్యమకరందంతో దట్టమై వాడని సంపెంగపూవు సంపదవంటి సంపద గలది. ఉన్నతమై కొనదేరినది. సౌమ్యుడైన కృష్ణునియొక్క ఆ నాసాపుటం నా మనస్సులో నిలిచి వుండుగాక!

**వి : 1.** ముక్కును సంపెంగతో పోల్చటం కవిలోకంలో ప్రసిద్ధం. స్త్రీపురుషభేదం లేకుండా ఆ పోలికను తీసికొంటుంటారు. ముక్కుకు-సంపెంగకూ పోలికను చెపుతూ రామరాజ భూషణుడు వ్రాసిన పద్యం ఆంధ్రసాహిత్యంలో ప్రసిద్ధం-

శా. నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్ కాఁకందపంబంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమనస్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేక్షణమాలికామధుకరీపుంజంబు లిర్వంకలన్.

**2. స్యాత్ :** 18-5వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ వ్యక్తాతికోమలమనోరమవర్ణపూర్ణం**
**శ్రుత్యర్థవృత్తి మధురస్వరమత్యగాధమ్ ।**

**సత్క్లేశదుర్విషశమేఽమృతవర్షకల్పం**
**తత్త్వం నిజం హరివచః పరిబోధయేన్మామ్॥** **18-53**

**అ : కృష్ణుని వాగ్వైఖరిని వర్ణించటం.** -వసంతతిలక.

**అ :** వ్యక్త+అతికోమల-మనః+రమ-వర్ణ-పూర్ణం శ్రుతి+అర్థ-వృత్తి మధుర-స్వరమ్ అతి+అగాధమ్ సత్-క్లేశ-దుర్విష-శమే అమృత-వర్ష-కల్పం హరి-వచః మాం నిజం తత్త్వం పరిబోధయేత్.

**ప్ర :** వ్యక్తా... పూర్ణమ్ : వ్యక్త = స్పష్టమై, అతికోమల = బాగా మృదువై, మనో-రమ = మనస్సును రంజింపజేసే, వర్ణ = అక్షరాలతో, పూర్ణమ్ = నిండినదీ (వ్యక్తైః అతికోమలైః మనోరమైశ్చ వర్ణైః పూర్ణమ్), శ్రుతి+అర్థ-వృత్తి : శ్రుతి+అర్థ = వేదార్థమందు, వృత్తి = నిలిచినదీ (శ్రుతీనామ్ అర్థే వృత్తిః యస్య తత్), మధుర-స్వరమ్ = తీయనిగొంతుక గలదీ (మధురః స్వరః యస్య తత్), అతి+అగాధమ్ = బాగా లోతైనదీ, సత్... శమే : సత్ = సజ్జనులయొక్క, క్లేశ = కష్టాలు అనే, దుర్విష = పాడు విషంయొక్క, శమే = తొలగుట/శమించుట యందు (సతాం క్లేశాః ఏవ దుర్విషం, తస్య శమః, తస్మిన్), అమృత-వర్ష-కల్పమ్ = అమృతవృష్టితో సమానమైనదీ అయిన (అమృతస్య వర్షః, ఈషదూనః అమృతవర్షః అమృతవర్షకల్పః తమ్), హరి-వచః = కృష్ణునిమాట (హరేః వచః), నిజమ్ = తనదైన, తత్త్వమ్ = తత్త్వాన్నీ, మామ్ = నాకు, పరిబోధయేత్ = అంతటా తెలియజేయుగాత! (పరి-బుధ్ అవగమనే-దివాది భ్వాది-పరస్మైపది-విధిలిజ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని మాట నాకు అంతటా ప్రబోధకమగుగాక. తన తత్త్వాన్ని తెలియజేయుగాక. ఆ మాట స్పష్టమైనది. మృదువైనది. మనోరంజక వర్ణాలతో నిండినది. అది వేదప్రతిపాదిత-మైన అర్థంలోనే నిలిచివుంటుంది. ఎంతో లోతైనది. కానీ మధురస్వరభూషితం. సజ్జనుల క్లేశాలు అనే పాడువిషాన్ని శమింపజేయటంలో అమృతవృష్టితో సమానమైనది.

**వి :** 1. కృష్ణుడు తన తత్త్వాన్ని భగవద్గీత-తృతీయాధ్యాయంలో స్పష్టంగా వివరిస్తాడు అర్జునునికి. ప్రాణికి అది ఎవరయినా, ఏదయినా కర్మ అనివార్యమనీ ఆ కర్మను పాటించటంలోని మెలకువలే జీవితతత్త్వాలనీ ఆ అధ్యాయం సూచిస్తుంది. ఆ తత్త్వాన్నే 18వ అధ్యాయంలో ప్రబోధరూపంగా మరల వినిపిస్తాడు కృష్ణుడు అర్జునునికి-

శ్లో॥ స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః ।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విన్దతి తచ్ఛృణు ॥

శ్లో॥ యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్ ।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః ॥

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

శ్లో॥ సహజం కర్మ కౌన్తేయ సదోషమపి న త్యజేత్ ।
సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః ॥ - భగవద్గీత-18/45-48

2. **పరిబోధయేత్ :**

| | | |
|---|---|---|
| **పరిబోధయేత్** | పరిబోధయేతామ్ | పరిబోధయేయుః |
| పరిబోధయేః | పరిబోధయేతమ్ | పరిబోధయేత |
| పరిబోధయేయమ్ | పరిబోధయేవ | పరిబోధయేమ. |

*

**శ్లో॥ నానావిధానుపమరత్నవిచిత్రితాభ్యాం**
**మీనోపమోజ్జ్వలహిరణ్మయకుణ్డలాభ్యామ్ ।**

**శ్రీనాథకర్ణయుగలం సుభగం భవార్త్యా**
**దీనస్య మే గిరమిమాం శృణుతాచ్ఛ్రితస్య॥** **18-54**

**అ : కృష్ణుని చెవులను వర్ణించటం.** -వసంతతిలక.

**అ :** నానా-విధ+అనుపమ-రత్న-విచిత్రితాభ్యాం మీన+ఉపమ+ఉజ్జ్వల-హిరణ్మయ-కుండలాభ్యాం సుభగం శ్రీ-నాథ-కర్ణ-యుగలం భవ+ఆర్త్యా దీనస్య శ్రితస్య మే ఇమాం గిరం శృణుతాత్.

**ప్ర :** నానా... తాభ్యామ్ : నానా-విధ = చాలారకాలయిన, అనుపమ = సాటిలేని, రత్న = రత్నాలతో, విచిత్రితాభ్యామ్ = విశేషంగా చిత్రింపబడిన (నానావిధాని అనుపమాని చ తాని రత్నాని, తైః విచిత్రితే-తాభ్యామ్), మీనో...కుండలాభ్యామ్ : మీన+ఉపమ = చేపలతో పోలిక గలవై, ఉజ్జ్వల = ప్రకాశిస్తున్న, హిరణ్మయ = బంగారంతో చేసిన, కుండలాభ్యామ్ = చెవికమ్మలతో (మీనే ఏవ ఉపమా యయోస్తే చ తే ఉజ్జ్వలే హిరణ్మయే చ కుండలే, తాభ్యామ్), సుభగమ్ = మనోహరమైన, శ్రీ... యుగలమ్ : శ్రీనాథ = లక్ష్మీ వల్లభునియొక్క, కర్ణ = చెవుల, యుగలమ్ = జంట, భవ+ఆర్త్యా = సంసారబాధతో (భవే ఆర్తిః తయా), దీనస్య = దీనుడనై, శ్రితస్య = ఆశ్రయించిన, మే = నాయొక్క, ఇమామ్ =ఈ, గిరమ్ = మాటను, శృణుతాత్ = ఆలకించుగాత! (శ్రు శ్రవణే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని చెవులు ఎన్నో విలువైన రత్నాలు పొదిగిన, మీనాకృతిలో శోభిస్తున్న బంగారు చెవికమ్మలతో అందంగా కనిపిస్తున్నాయి. అటువంటి ఆ చెవులు భవార్తితో దీనుడనై తమను ఆశ్రయించిన నా మాటను ఆలకించుగాత!

| | | | |
|---|---|---|---|
| **వి : 1. శృణుతాత్:** శృణోతు/**శృణుతాత్** | శృణుతామ్ | శృణ్వన్తు | |
| శృణు/శృణుతాత్ | శృణుతమ్ | శృణుత | |
| శృణవాని | శృణవావ | శృణవామ. | * |

**శ్లో॥ అమ్భోజకోమలవిశాలసుదీర్ఘపత్ర-**
**సమ్భాసమానమలిరాజదధీరతారమ్ ।**
**శమ్భుప్రభృత్యమరవాఞ్ఛితవల్గువీక్షం**
**జృమ్భన్ముకున్దనయనం ముహురీక్షతాం మామ్ ॥** **18-55**

**అ : ముకున్దనయనవర్ణనం.** -వసంతతిలక.

**అ :** అంభోజ-కోమల-విశాల-సుదీర్ఘ-పత్ర-సంభాసమానమ్ అలి-రాజత్-అధీర-తారం శంభు-ప్రభృతి+అమర-వాంఛిత-వల్గు-వీక్షం జృంభత్-ముకున్ద-నయనం మాం ముహుః ఈక్షతామ్.

**ప్ర :** అంభోజ... మానమ్ : అంభోజ = తామరయొక్క, కోమల = మృదువులూ, విశాల = విశాలాలూ, సుదీర్ఘ = పొడవైనవి అయిన, పత్ర = రేకులలాగా, సంభాసమానమ్ = ప్రకాశించేదీ (అంభసి జాతం, తస్య కోమలం విశాలం సుదీర్ఘం చ తత్ పత్రం, తద్వత్ సంభాసమానమ్), అలి... తారమ్ : అళిరాజత్ = తుమ్మెదరేనిలా, అధీర-తారమ్ = కదులుతున్న కనుపాప గలదీ (అళీనాం రాజా, తద్వత్ అధీరం తారం యస్య తత్), శంభు... వీక్షమ్ : శంభు = శివుడు, ప్రభృతి = మొదలుగాగల, అమర = దేవతలచే, వాంఛిత = కోరబడిన, వల్గు = చక్కని, వీక్షమ్ = చూపుగలదీ అయిన (శంభుః ప్రభృతిః యేషాం, తే చ తే అమరాః, తైః వాంఛితం వల్గు చ సా వీక్షా యస్మిన్ తత్), జృంభత్-ముకున్ద-నయనమ్ : జృంభత్ = వికసిస్తున్న (తెరచుకుంటున్న), ముకున్ద-

నయనమ్ = కృష్ణునికన్ను (జృంభత్ చ తత్ ముకున్దస్య నయనమ్), మామ్ = నన్ను, ముహుః = పదే పదే, ఈక్షతామ్ = చూచుగాక! (ఈక్ష్ దర్శనే-ఆత్మనేపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** సున్నితమైనదీ, విశాలమైనదీ, పొడవైనదీ అయిన తామరరేకులా ప్రకాశిస్తూ, కదిలే తుమ్మెదలా చలిస్తున్న కనుపాపగలదై, శివుడు మొదలుగా గల దేవతలుకూడా కోరే చక్కని చూపుగల కృష్ణనయనం నన్ను పదేపదే చూచుచుండుగాక!

**వి :** 1. కృష్ణుడు నిత్యలక్ష్మీసన్నిహితుడు కాబట్టి ఇహపరాలకు సంబంధించి దేనిని కోరేవారికయినా ఆ కటాక్షం ఫలదాయక మవుతుంది.. ముకున్దనయనానికి '**జృంభద్**'-విశేషణం కవితౌచిత్యం కోసమే కానీ అనివార్యం కాదు. దివ్యత్వాన్ని అంగీకరించిన తరువాత రెప్పపాటుకు అవకాశమే లేదు గదా! లౌకికదృష్టితో ఆలోచించినా కృష్ణుడు శయన (నిద్రా) స్థితిలో వున్నప్పుడే కృష్ణజయంతిని జరుపుకొంటున్నాం. విశేషపూజలూ నిర్వహిస్తున్నాం. ఆషాఢశుద్ధ-ఏకాదశి (శయనైకాదశి) నుండి, కార్తీకశుద్ధ-ఏకాదశి (ఉత్థానైకాదశి) వరకు శయనస్థితిగదా!

| | | | |
|---|---|---|---|
| 2. **ఈక్షతామ్ :** | **ఈక్షతామ్** | ఈక్షేతామ్ | ఈక్షన్తామ్ |
| | ఈక్షస్వ | ఈక్షేథామ్ | ఈక్షధ్వమ్ |
| | ఈక్షై | ఈక్షావహై | ఈక్షామహై. |

*

**శ్లో॥ వక్రాలకం మణిమయోజ్జ్వలపట్టబన్ధం - కస్తూరికాతిలకభూషితమచ్యుతస్య ।**
**విస్తీర్ణమీషదుదితాలికయుగ్మమిష్ట-మస్మాకఫాలలిఖితం కురుతాల్లలాటమ్ ॥ 56**

**అ :** అచ్యుతలలాటవర్ణనం. -వసంతతిలక.

**అ :** వక్ర+అలకం మణిమయ+ఉజ్జ్వల-పట్ట-బన్ధం కస్తూరికా-తిలక-భూషితం విస్తీర్ణమ్ ఈషద్-ఉదిత+అలిక-యుగ్మమ్ అచ్యుతస్య లలాటమ్ అస్మాక-ఫాల-లిఖితమ్ ఇష్టం కురుతాత్.

**ప్ర :** వక్ర+అలకమ్ : వక్ర = వంకరలు తిరిగిన, అలకమ్ = ముంగురులు గలదీ, (వక్రాః అలకాః యస్య తత్), మణిమయ... బన్ధమ్ : మణిమయ = మణులతో గూడిన, ఉజ్జ్వల = ప్రకాశవంతమైన, పట్ట-బంధమ్ = నుదుటకట్టేగుడ్డ (తలపాగా వంటిది. లేదా బాసికం వంటిది. స్థాయీ సంకేతం) (మణిమయైః ఉజ్జ్వలః పట్టబన్ధః యస్య తమ్), కస్తూరికా... భూషితమ్ : కస్తూరికా = పునుగుతో పెట్టిన, తిలక = తిలకం (నామం)తో, భూషితమ్ = అలంకరింపబడినదీ, విస్తీర్ణమ్ = విశాలమైనదీ, ఈషద్... యుగ్మమ్ : ఈషద్ = స్వల్పంగా, ఉదిత = పైకి కనిపిస్తున్న, అలిక-యుగ్మమ్ = నుదుటి రెండు అంచులు గలదీ అయిన (ఈషద్ ఉదితమ్ అలికయోః యుగ్మం యస్య తత్), అచ్యుతస్య = కృష్ణునియొక్క, లలాటమ్ = నుదురు, అస్మాక-ఫాల-లిఖితమ్ : అస్మాక = మనయొక్క, ఫాల = నుదుటిపై, లిఖితమ్ = వ్రాయబడినదానిని, ఇష్టమ్ = నచ్చినదిగా, కురుతాత్ = చేయుగాత! (కృ కరణే పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని లలాటం ఉంగరాల ముంగురులతో, మణులతో ప్రకాశిస్తున్న బాసికంతో, కస్తూరీ తిలకంతో వెలుగొందుతూ; విశాలమై, కొంచెంగా పైకి కనిపిస్తున్న నుదుటి అంచులు గలదై శోభిస్తోంది. ఆ లలాటం మన లలాటంపై నున్న వ్రాతను మనకు ఇష్టమైనట్లు చేయుగాత!

**వి :** 1. శ్లో॥ **హరిణాపి** హరేణాపి బ్రహ్మణా త్రిదశైరపి ।
లలాటలిఖితా రేఖా న శక్యా పరిమార్జితుమ్ ॥ అని ఆర్యవచనం.

హరిహరులకైనా బ్రహ్మకైనా దేవతలకయినా నుదుటివ్రాతను మార్చటం కుదరదని భావం. చివరకు వారైనా సూర్యునితో సహా కర్మకు అధీనులై మాత్రమే ప్రవర్తిస్తుంటారని భర్తృహరి ప్రతిపాదిస్తాడు.

శ్లో॥ బ్రహ్మా యేన కులాలవన్నియమితో బ్రహ్మాండభాండోదరే
విష్ణుర్యేన దశావతారగహనే క్షిప్తః సదా సంకటే ।
రుద్రో యేన కపాలపాణిపుటకే భిక్షాటనం కారితః
సూర్యో భ్రామ్యతి నిత్యమేవ గగనే తస్మై నమః కర్మణే ॥

మరి మన నుదుటివ్రాతను మార్చమని కృష్ణుని ప్రార్థిస్తే అది నెరవేరటం సాధ్యమేనా? అని ప్రశ్నిస్తే అచంచలభక్తివిశ్వాసాలకు అన్నీ సాధ్యమే అని భక్తిమార్గం ప్రబోధిస్తుంది. ఆ భావమే ప్రకృతశ్లోకంలోని అభ్యర్థనలో కనిపిస్తుంది. ఈ భావానికి అర్థవాదాలుగా అనేకకథలు పురాణాలలో కనిపిస్తాయి.

2. **కురుతాత్ :** 18-9వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ శ్యామం త్రివక్రం విధిముఖ్యదేవ-సామ్రాజ్యవిశ్రాణనహేతులీలమ్ ।**
**కామాగ్ర్యచాపాకృతి కామతాత-భ్రూమణ్డలం ఖణ్డయతాదఘం నః ॥ 18-57**

**అ :** కృష్ణుని భ్రూమండలాన్ని వర్ణించటం. -ఇంద్రవజ్ర.

**అ :** శ్యామం త్రి-వక్రం విధి-ముఖ్య-దేవ-సామ్రాజ్య-విశ్రాణన-హేతు-లీలం కామ+అగ్ర్య-చాప+ఆకృతి కామ-తాత-భ్రూ-మండలం నః అఘం ఖండయతాత్.

**ప్ర :** శ్యామమ్ = చామనచాయగలదీ, త్రివక్రమ్ = మూడువంకరలు గలదీ (త్రయః వక్రాః యస్య తత్), విధి... లీలమ్ : విధి = బ్రహ్మ మొదలగు, ముఖ్య-దేవ = ప్రధానదేవతలకు, సామ్రాజ్య = సామ్రాజ్యంయొక్క, విశ్రాణన = ఈవికి (విశ్రాణనం విహాపితమంహతి-రపవర్జనం వితరణం చ-హలాయుధకోశః-419), హేతు = కారణమైన, లీలమ్ = విలాసంగలదీ (విధ్యాది ముఖ్యానాం దేవానాం సామ్రాజ్యస్య విశ్రాణనే హేతుః లీలా యస్య తత్), కామా... కృతి : కామ = మదనునియొక్క, అగ్ర్య = శ్రేష్ఠమైన, చాప = వింటియొక్క, ఆకృతి = ఆకృతిగలదీ అయిన (కామస్య అగ్ర్యస్య చాపస్య ఆకృతిరివ ఆకృతిః యస్య తత్), కామ... మండలమ్ : కామతాత = మదనుని తండ్రియొక్క (కృష్ణునియొక్క), భ్రూ-మండలమ్ = మండలాకృతిలోని కనుబొమలు, నః = మనయొక్క, అఘమ్ = పాపాన్ని, ఖండయతాత్ = ఖండించు (నరికివేయు) గాత! (ఖండ్ ఖండనే చురాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుని భ్రూమండలం చామనచాయగలది. త్రివక్రత గలది. బ్రహ్మమొదలుగాగల ప్రధానదేవతలకు సామ్రాజ్యాన్ని పంచిపెట్టడానికి కారణమైన లీలగలది. మన్మథుని మేటివింటివంటి ఆకృతి గలది. అటువంటి ఆ భ్రూమండలం మన పాపాలను ఖండించుగాత!

**వి :** 1. ఇతరులకు ఔన్నత్యాన్ని, ఐశ్వర్యాన్నీ, సమకూర్చిపెట్టగలగటం **విశ్రాణనం**. అదికూడా నాయకుని కుండవలసిన గుణాలలో ఒకటి. '**యద్విశ్రాణనతాచ్ఛీల్యమౌదార్యం తన్నిగద్యతే**' - (ప్రతాపరుద్రీయమ్'-నాయక ప్రకరణమ్) అని ప్రతాపరుద్రీయం నాయకగుణాలలో ఒకటి అయిన ఔదార్యాన్ని నిర్వచించింది. ఆ ఔదార్యఫలం బ్రహ్మాది దేవతలకు సామ్రాజ్యాధిపత్యప్రాప్తి. లక్ష్మీకటాక్షంవలన పదార్థాలకు బ్రహ్మత్వాదిప్రాప్తి అని శ్రీగుణరత్నకోశం (30) చెప్తోంది. లక్ష్మీకటాక్షమన్నా లక్ష్మీనారాయణకటాక్షమన్నా నారాయణకటాక్షమన్నా పెద్దతేడా లేదు. లక్ష్మి ప్రసారరూపమయితే నారాయణుడు వాహికారూపుడు.

2. **ఖండయతాత్ :**

| | | |
|---|---|---|
| ఖండయతు/**ఖండయతాత్** | ఖండయతామ్ | ఖండయన్తు |
| ఖండయ/ఖండయతాత్ | ఖండయతమ్ | ఖండయత |
| ఖండయాని | ఖండయావ | ఖండయామ. |

*

**శ్లో॥ స భవతు యశసే ప్రవాళకాన్తి-ర్మృదులతరః సరసోఽధరో మురారేః ।**
**యదుదితరసలుబ్ధధీరవాత్సీ-దురసి రమాఽఽననపద్మచుమ్బివేణౌ ॥ 18-58**

**అ :** మురారి అధరాన్ని వర్ణించటం. -పుష్పితాగ్ర.

**అ :** ప్రవాళ-కాంతిః మృదుల తరః సః ముర+అరేః సరసః అధరః యశసే భవతు. రమా యద్-ఉదిత-రస-లుబ్ధ-ధీః ఉరసి ఆనన-పద్మ-చుంబి-వేణౌ అవాత్సీత్.

**ప్ర :** ప్రవాల/ప్రవాళ-కాంతిః = పగడాలయొక్క, కాంతిః = కాంతివంటికాంతిగల (ప్రవాళస్య కాన్తిరివ కాన్తిః యస్య సః), మృదుల-తరః = సున్నితమైనదీ (తరప్ ప్రత్యయం రెండింటిమధ్య వ్యత్యాసాన్ని చెప్పేది. పైపెదవి మృదువైతే క్రిందిపెదవి మృదుతరం), సరసః = రసవంతమూ అయిన, సః మురారేః = ఆ కృష్ణునియొక్క, అధరః = వాతెర (క్రిందిపెదవి), యశసే భవతు = కీర్తిని కల్గించుగాత! (భూ సత్తాయాం భ్వాది-పరస్మైపది-లోట్-(ప్ర.ఏ.), రమా = రుక్మిణి (లక్ష్మి), యద్... ధీః : యద్ = దేనినుండి, ఉదిత = పుట్టిన, రస = రసమందు, లుబ్ధ = ఆశపడిన, ధీః = బుద్ధిగలదై (యస్మాద్ ఉదితః చ అసౌ రసః తస్మిన్ లుబ్ధా ధీః యస్య సః), ఉరసి = గుండెపై, ఆనన... వేణౌ : ఆనన = వదనాన్ని, పద్మ = పద్మంలా, చుంబి = ముద్దాడే, వేణౌ = పిల్లనగ్రోవిలో, అవాత్సీత్ = వసించింది. (వస నివాసే పరస్మైపది-లుఙ్-(ప్ర.ఏ.)

**తా ॥** పగడపు వన్నె కలిగి సరసమై, మృదువైన కృష్ణుని పెదవి కీర్తికరమగుగాక. ఆ పెదవి నుండి జాలువారిన రసంమీద లోభంతో లక్ష్మి కృష్ణుని హృదయంపై, ముఖాన్ని ముద్దాడే వేణువులో నివసించింది.

**వి : 1. భవతు :** 18-25వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **అవాత్సీత్ :** | **అవాత్సీత్** | అవాత్తామ్ | అవాత్సుః |
| | అవాత్సీః | అవాత్తమ్ | అవాత్త |
| | అవాత్సమ్ | అవాత్స్వ | అవాత్స్మ. |

*

**శ్లో॥ సమ్పక్వబిమ్బసమరమ్యతమాధరోష్ఠః - సత్సమ్పదే భవతు సాత్వతరాజరాజ్ఞ్యాః ।**
**యత్సమ్భవామృతకణేన ఫణీన్ద్రతల్పః - కృష్ణః స నిత్యమజరామరణో బభూవ ॥59**

**అ :** రుక్మిణి అధరవర్ణన. -వసంతతిలక.

**అ :** సాత్వత-రాజ-రాజ్ఞ్యాః సంపక్వ-బింబ-సమ-రమ్యతమ+అధర+ఓష్ఠః సత్-సంపదే భవతు. యత్-సంభవ-అమృత-కణేన ఫణి-ఇంద్ర-తల్పః సః కృష్ణః నిత్యమ్ అజర+అమరణః బభూవ.

**ప్ర :** సాత్వతరాజ-రాజ్ఞ్యాః : సాత్వత-రాజ = కృష్ణునియొక్క, రాజ్ఞ్యాః = రాణికి (సాత్వతానాం రాజా, తస్య రాజ్ఞీ, తస్యాః), సంప... రోష్ఠః : సంపక్వ = బాగా పండిన, బింబ = దొండపండుతో, సమ =సమానమైన, రమ్యతమ = మరీ అందమైన, అధర+ఓష్ఠః = క్రీబెదవి (సంపక్వేన బింబేన సమశ్చ అసౌ రమ్యతమః అధరశ్చ అసౌ ఓష్ఠః ), సత్-సంపదే = సజ్జనుల సంపదకై, భవతు = ఉండుగాక (భూ సత్తాయామ్-భ్వాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), యత్స... కణేన : యత్ = దేనిమీద, సంభవ = పుట్టినట్టి, అమృత-కణేన = సుధాబిందువుతో, ఫణీ+ఇంద్ర-తల్పః = శేషశాయి అయిన (ఫణీనామ్ ఇంద్రః తల్పం యస్య సః), సః = ఆ, కృష్ణః = కృష్ణుడు, నిత్యమ్ = శాశ్వతంగా, అజరామరణః = జరామరణాలు లేనివాడుగా (జరా చ మరణం చ జరామరణే, తే న భవతః యస్య సః), బభూవ = అయ్యాడు. (భూ సత్తాయామ్ భ్వాది-పరస్మైపది-లిట్-(ప్ర.ఏ.)

**తా ॥** బాగా పండిన దొండపండుతో సమానమైన రుక్మిణి క్రీబెదవి సజ్జనులకు సంపత్కరం కావాలి. ఆ పెదవి మీద పుట్టిన సుధాబిందువు వలననే శేషశాయి అయిన కృష్ణుడు జరామరణాలు లేనివాడయ్యాడు.

**వి :** 1. శ్లోకంలో **ఫణీంద్రతల్పః** – అన్నది సాభిప్రాయవిశేషణం. ఫణీంద్రతల్పత్వం ద్వారా నిత్యమూ విషానికి దగ్గరగా వుండటం వ్యక్తమవుతుంది. విషసాన్నిహిత్యమున్నా కూడా జరామరణాలు లేకపోవటానికి కారణం రుక్మిణి వాతెరమీది సుధాబిందువే గదా! దానిశక్తి ఎంతటిదో వ్యక్తం చేసే విశేషణం '**ఫణీంద్రతల్పః**' అన్నది. కాబట్టి అది సాభిప్రాయం. '**అలంకారః పరికరః సాభిప్రాయవిశేషణే**' – (కు.62)

రుక్మిణి పెదవినుండి పుట్టిన సుధాబిందువు శక్తిముందు ఆదిశేషుని విషం కూడా పనిచేయదు. ఆ అధరామృతం కాదు, ఆ స్పర్శలోనే మత్తెక్కించే శక్తి వున్నదని ఒక కవి చమత్కరించిన శ్లోకాన్ని చూడండి–

**శ్లో॥ హాలాహలో నైవ విషం విషం రమా – జనాః పరం వ్యత్యయమత్ర మన్వతే ।**
**నిపీయ జాగర్తి సుఖేన తం శివః – స్పృశన్నిమాం ముహ్యతి నిద్రయా హరిః ॥**

"హాలాహలం విషంకాదు. లక్ష్మియే విషం. కాకపోతే ప్రజలు తారుమారుగా అనుకొంటున్నారు. అంతే. ఎందుకంటే విషం త్రాగిన శివుడు సుఖంగా మేలుకొని వుంటే, లక్ష్మిని స్వీకరించిన విష్ణువు మాత్రం మత్తుతో నిద్రపోతున్నాడు" (నాలుగు నెలల నిద్ర–లోకవ్యాప్తమైన క్షీరసాగరశయనం).

2. **భవతు :** 18–25వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| **బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః |
| | బభూవిథ | బభూవథుః | బభూవ |
| | బభూవ | బభూవివ | బభూవిమ. |

*

**శ్లో॥ సౌవర్ణరమ్యఫలకోపమితః కపోలః**
**సౌభాగ్యదో భవతు రఞ్జితకుణ్డలశ్రీః ।**
**యచ్చుమ్బనం విరచయన్ విగతాన్యతృష్ణః**
**కృష్ణో బభూవ సరసః కిల నిత్యతృప్తః॥** **18–60**

**అ :** రుక్మిణీకపోలవర్ణనం. –వసంతతిలక.

**అ :** సౌవర్ణ–రమ్య–ఫలక+ఉపమితః రంజిత–కుండల–శ్రీః కపోలః సౌభాగ్య–దః భవతు. యత్+చుంబనం విరచయన్ సరసః కృష్ణః విగత–అన్య+తృష్ణః (సన్) నిత్య–తృప్తః బభూవ కిల.

**ప్ర :** సౌవర్ణ... మితః : సౌవర్ణ = స్వర్ణవికారమైన, రమ్య = అందమైన, ఫలక = పలకతో, ఉపమితః = పోల్చబడినట్టిదీ, రంజిత... శ్రీః : రంజిత = ఎఱ్ఱచేయబడిన, కుండల = చెవికమ్మలయొక్క, శ్రీః = శోభగలదీ అయిన (రంజితా కుండలయోః శ్రీః యేన సః), కపోలః = (రుక్మిణియొక్క) చెక్కిలి, సౌభాగ్య–దః = సౌభాగ్యాన్ని ఇచ్చేదిగా, భవతు = అగు గాక! (భూ సత్తాయాం–భ్వాది–పరస్మైపది–లోట్–ప్ర.ఏ.), యత్+చుంబనమ్ : యత్ = దేనియొక్క, చుంబనమ్ = ముద్దిడటాన్ని, విరచయన్ = చేస్తూ, సరసః = రసజ్ఞానంగల, కృష్ణః = కృష్ణుడు, విగత+అన్య–తృష్ణః = ఇతరకాంక్షలు లేనివాడూ (విగతా అన్యా తృష్ణా యస్మాత్ సః), నిత్య–తృప్తః = నిత్యతృప్తుడూ (నిత్యా తృప్తిః యస్మిన్ సః), బభూవ కిల = అయ్యాడు గదా! (భూ సత్తాయామ్–భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ॥** రుక్మిణి చెక్కిలి అందమైన బంగారు పలక వంటిది. కుండలాల కాంతిని రంజింపజేయగలది. సౌభాగ్యదాయి. ఆ చెక్కిలిని ముద్దాడి కృష్ణుడు ఇతరకాంక్షల నన్నింటినీ విడిచి నిత్యతృప్తుడై నిలువగలుగుతున్నాడు.

**వి :** 1. **భవతు :** 18–25వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

**బభూవ :** 18–59వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సఞ్జాతః సురమణ్డలీషు మహితః సర్గోఽయమష్టాదశః ॥ 18-61**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** మహితః = గొప్పదయిన, అయమ్ = ఈ, అష్టాదశః సర్గః = పదునెనిమిదవ సర్గ-(మిగిలినది ప్రథమసర్గాంతశ్లోకం వలెనె.) *

ఇతి శ్రీవాదిరాజతీర్థప్రణీతరుగ్మిణీశవిజయే అష్టాదశః సర్గః.

ఇది శ్రీమత్కవికులతిలక శ్రీమద్వాదిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పదునెనిమిదవ సర్గ.

**శ్రీః**





# శ్రీః
# ఏకోనవింశః సర్గః

శ్లో॥ దన్తక్షతైః కృతపదం ప్రవిభాతి దేవ్యా - గణ్డస్థలం ప్రియవశీకరణోచితస్య ।
ముష్ణత్ప్రభాం కనకయన్త్రవరస్య వశ్య-కర్మార్ఘరక్తరసతో రచితాక్షరస్య ॥ 19-1

**అవతారిక :** రుక్మిణి గండస్థలాన్ని వర్ణించటం. -వసంతతిలక.

**అన్వయక్రమం :** దంత-క్షతైః కృత-పదం వశ్య-కర్మ+అర్ఘ-రక్త-రసతః రచిత+అక్షరస్య ప్రియ-వశీకరణ+ఉచితస్య కనక-యంత్ర-వరస్య ప్రభాం ముష్ణత్ దేవ్యాః గండ-స్థలం ప్రవిభాతి.

**ప్రతిపదార్థం :** దంత-క్షతైః : దంత = దంతాలయొక్క, క్షతైః = గాయాలతో (దంతానాం క్షతాని తైః), కృత-పదమ్ = అడుగిడబడిన (కృతం పదం యేన తత్), వశ్య... రసతః : వశ్య-కర్మ = వశీకరణ కర్మకు, అర్ఘ = తగినట్టి, రక్త = ఎఱ్ఱని, రసతః = రసం (నీళ్ళ)తో (ఎఱ్ఱని నీరంటే కుంకుమకలిసిన నీరు), (వశ్యానుకూలే కర్మణి అర్ఘః రక్తశ్చ అసౌ రసః తేన), రచిత+అక్షరస్య : రచిత = వ్రాయబడిన, అక్షరస్య = అక్షరాలు కలిగిన (రచితాని అక్షరాణి యస్మిన్, తస్య), ప్రియ... ఉచితస్య : ప్రియ = వల్లభుని, వశీకరణ = వశం చేసికోవటానికి, ఉచితస్య = యోగ్యమైన (ప్రియస్య వశీకరణే ఉచితః, తస్య), కనక-యంత్ర-వరస్య : కనక = బంగారు రేకుపై వ్రాసిన, యంత్ర-వరస్య = శ్రేష్ఠయంత్రంయొక్క (కనకేన రచితశ్చ అసౌ యంత్రేషు వరః, తస్య), ప్రభామ్ = కాంతిని, ముష్ణన్ = దొంగిలిస్తూ, దేవ్యాః = రుక్మిణియొక్క, గండస్థలమ్ = చెక్కిలి, ప్రవిభాతి = ప్రకాశిస్తోంది. (ప్ర-వి-భా దీప్తౌ-పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తాత్పర్యం ॥** రుక్మిణి చెక్కిలిపై దంతక్షతాలు కనిపిస్తున్నాయి. వాటితో ఆ చెక్కిలి శోభిస్తోంది. చెక్కిలి బంగారు రేకులా వుంది. దంతక్షతాలు ఆ యంత్రంపై కుంకుమరసంతో వ్రాసిన అక్షరాలలాగా వున్నాయి. దానితో ఆ సన్నివేశం ప్రియుని లొంగదీసికొనటానికి తగిన వశీకరణయంత్రంలా కనిపిస్తోంది.

**విశేషాలు :** 1. దేవతలను ఆరాధించటంలో మూడు మార్గాలు. మంత్ర, తంత్ర, యంత్రాలు. ఉపాసనా మాత్ర పరిమితమైనవి మంత్రాలు. తపోజపాదులు కేవలం మంత్ర సంబంధమైనవి. ఇక క్రియాత్మకమైన షోడశోపచారపూజాదులలో మంత్రాలతో పాటు కొంత క్రియాకలాప ముంటుంది. మానసికపూజ కేవలం మంత్రాత్మకం. ఇది సాత్త్వికం.

యాంత్రికపూజలు కొంత రాజసంతో కూడి వుంటాయి. శ్రీచక్రోపాసన వంటివి యాంత్రిక పూజలు.

రాజసతామసాల కలయికతో కూడిన అర్చనావిధానం తాంత్రికం. ఇక్కడ కోరికలు, వాటిని సాధించుకోవటానికి నిర్దేశించిన మార్గాలు కూడా తీవ్రంగానే వుంటాయి.

| | | | |
|---|---|---|---|
| 2. **ప్రవిభాతి :** | **ప్రవిభాతి** | ప్రవిభాతః | ప్రవిభాన్తి |
| | ప్రవిభాసి | ప్రవిభాథః | ప్రవిభాథ |
| | ప్రవిభామి | ప్రవిభావః | ప్రవిభామః. |

*

**శ్లో॥ అన్తర్నిగూఢకనకాఙ్కురితాననోఽపి**
**నాసావిభూషణమణిర్మురవైరిపత్న్యాః ।**
**ముక్తామయః కిల మనోజ్ఞవధూసుధార్ద్ర-**
**బిమ్బోష్ఠచుమ్బివదనస్య సదాఽఽమయః క్వ ॥ 19-2**

**అ :** రుక్మిణి ముక్కుపుడకను వర్ణించటం. -వసంతతిలక.

**అ :** ముర-వైరి-పత్న్యాః నాసా-విభూషణ-మణిః అంతః+నిగూఢ-కనక+అంకురిత+ఆననః అపి ముక్తామయః కిల. సదా మనః+జ్ఞ-వధూ-సుధా+ఆర్ద్ర-బింబ+ఓష్ఠ-చుంబి-వదనస్య ఆమయః క్వ?

**ప్ర :** ముర-వైరి-పత్న్యాః : ముర-వైరి = కృష్ణునియొక్క, పత్న్యాః = భార్యయొక్క (మురస్య వైరీ, తస్య పత్నీ, తస్యాః), నాసా... మణిః : నాసా-విభూషణ = ముక్కుపుడకలోని (సింఘినీ నాసికా నాసా-హలాయుధకోశః-521), మణిః = రత్నం, అంతః... ఆననః అపి : అంతః = లోన (రంధ్రంలో), నిగూఢ = చాటుగా వుండి, కనక = బంగారు ద్వారా, అంకురిత = మొలచినట్టి, ఆననః అపి = మోము గలదైనా (అంతః నిగూఢేన కనకేన అంకురితమ్ ఆననం యస్య సః), ముక్తా(క్త)-మ(ఆమ)యః కిల : ముత్యాలతో కూడినది/ వ్యాధినుండి విముక్తిగలది గదా!, సదా = ఎల్లప్పుడు, మనో... వదనస్య : మనోజ్ఞ = అందమైన, వధూ = స్త్రీలయొక్క, సుధా = అమృతంతో, ఆర్ద్ర = తడిసిన, బింబ = దొండపండువంటి, ఓష్ఠ = పెదవిని, చుంబి = ముద్దాడుతున్న, వదనస్య = ముఖంగల-దా(వా)నికి, ఆమయః = వ్యాధి (అనారోగ్యం) (వ్యాధి వ్యాధ్యామయాః-వైజయన్తీ-భూత-138), క్వ = ఎక్కడిది?

**తా ॥** రుక్మిణి ముక్కుపుడకలోని మణి నాసాపుటంలో నిగూఢంగా వున్న బంగారు కడ్డినుండి ముఖంమాత్రమే పైకి కనిపిస్తూ **ముక్తామయమై** వుంది. (అది పెదవిని దాదాపు తాకుతున్నట్టుగా వుంది.) నిత్యమూ అందమైన స్త్రీయొక్క సుధార్ద్రమైన పెదవి దొండపండును ముద్దాడే దానికి ఆమయానికి (అనారోగ్యానికి) అవకాశమెక్కడ?

**వి :** 1. ముక్కుపుడకలను రెండురకాలుగా ధరిస్తారు. ముక్కుకుడివైపు భాగాన అంచుకు కొంచెం పైగా రంధ్రం వేసి బయటనుండి ముక్కుపుడకకాడను లోనికి చొప్పించి అక్కడ మరను బిగించటం. ఈ పద్ధతిలో అది అధరాన్ని తాకే అవకాశం తక్కువ. మరొక పద్ధతి ముక్కు పుటాలను రెండింటినీ వేరు చేస్తూ మధ్యనున్న గోడకు (దళసరి భాగానికి కాకుండా దానికి క్రిందుగా రంధ్రం వేసి దానిలోనుండి దూర్చిన వృత్తాకారానికి మిగిలిన భాగాన్ని వ్రేలాడదీయటం. ఈ పద్ధతిలో అది పెదవులను తాకే అవకాశముంటుంది. *

**శ్లో॥ ముక్తాత్మకోఽపి మృదులోష్ఠపుటానుషక్తో**
**నిత్యం యదుల్లసదపాఙ్గశరేణ భిన్నః ।**
**నాసావిభూషణమణిః పరిలమ్బతేఽస్యా**
**దేవ్యాః కిమచ్యుతవశీకరణే ప్రయాసః ॥ 19-3**

**అ :** రుక్మిణి ముక్కుపుడకను వర్ణించటం. -వసంతతిలక.

**అ :** ముక్త+ఆత్మకః అపి మృదుల+ఓష్ఠ-పుట+అనుషక్తః నాసా-విభూషణ-మణిః నిత్యం యద్-ఉల్లసద్-అపాంగ-శరేణ భిన్నః (సన్) పరిలంబతే అస్యాః దేవ్యాః అచ్యుత-వశీకరణే ప్రయాసః కిమ్?

**ప్ర :** ముక్త+ఆత్మకః అపి : ముక్త = ముత్యంగా/విముక్తమైన, ఆత్మకః అపి = రూపం గలదైనా/ స్వభావం గలవాడైనా, మృదు... షక్తః : మృదుల = సున్నితమైన, ఓష్ఠ-పుట = పై పెదవి అనే దొప్పపై, అనుషక్తః = లగ్నమైన, నాసా... మణిః : నాసా-విభూషణ = ముక్కుపుడకలోని, మణిః = మణి, నిత్యమ్ = ఎల్లప్పుడూ, యద్... శరేణ : యత్ = ఏ రుక్మిణియొక్క, ఉల్లసద్ = ప్రకాశిస్తున్న, అపాంగ = కడగంటి చూపు అనే, శరేణ = బాణంతో, భిన్నః సన్ = చీల్చబడినదై, పరిలంబతే = వ్రేలాడుతోందో, అస్యాః = ఆ, దేవ్యాః = రుక్మిణికి, అచ్యుత-వశీకరణే : అచ్యుత = కృష్ణుని, వశీకరణే = లొంగదీయుటలో, ప్రయాసః కిమ్? = కష్టమా?

**తా ॥** ఆ రుక్మిణి ముక్కుపుడక ముక్తాత్మకం (ముత్యాలస్వరూపం, విముక్తస్వరూపం కూడా). అయినా నిత్యమూ మృదువైన ఆమె పెదవికి తగులుతూ వుంటుంది. ఆమె కడకంటిచూపు అనే బాణకాంతులతో కలిసి వుంటుంది. కాబట్టి ఆ ముక్కుపుడకకు ఆ అచ్యుతుని-తాను అచ్యుతుడైనా సరే - వశం చేసికోవటంలో ప్రయాస ఏముంటుంది?

| | | | |
|---|---|---|---|
| **వి : 1. పరిలంబతే :** | **పరిలంబతే** | పరిలంబేతే | పరిలంబన్తే |
| | పరిలంబసే | పరిలంబేథే | పరిలంబధ్వే |
| | పరిలంబే | పరిలంబావహే | పరిలంబామహే. * |

**శ్లో॥ నాసాఖ్యచమ్పకభియా చలితస్య నేత్ర-**
**చార్వంబుజార్పితహృదా చ సముత్సుకస్య ।**
**భృఙ్గస్య సమ్పదమధీరజవస్య ముష్ణన్**
**లక్ష్మీం తనోతు యదుపుఙ్గవరాజ్ఞ్యపాఙ్గః ॥** **19-4**

**అ :** రుక్మిణీ కటాక్షవర్ణనం. -వసంతతిలక.

**అ :** నాసా+ఆఖ్య-చంపక-భియా చలితస్య నేత్ర-చారు+అంబుజ+అర్పిత-హృదా సముత్సుకస్య అధీర-జవస్య చ భృంగస్య సంపదం ముష్ణన్ యదుపుంగవ-రాజ్ఞి+అపాంగః లక్ష్మీం తనోతు.

**ప్ర :** నాసా... భియా : నాసా+ఆఖ్య = ముక్కు అనే, చంపక = సంపెంగపువ్వు వలని, భియా = భయంతో (నాసా ఆఖ్యా యస్య తత్ నాసాఖ్యం, తదేవ చంపకం, తస్మాత్ భీః, తయా), చలితస్య = కదలిపోయి, నేత్ర... హృదా : నేత్ర = కన్ను అనే, చారు = అందమైన, అంబుజ = పద్మంపై, అర్పిత = సమర్పింపబడిన, హృదా = మనస్సుతో (నేత్రమేవ చారు అంబుజం, తస్మిన్ అర్పితం చ తత్ హృదయం తేన), సముత్సుకస్య చ = ఉత్సుకత్వం గలదీ, అధీర-జవస్య : అధీర = ధైర్యంగా సాగని, జవస్య = వేగం గలదీ అయిన (అధీరః జవః యస్య తస్య), భృంగస్య = తుమ్మెదయొక్క, సంపదమ్ = శోభను/సంపదను, ముష్ణన్ = దొంగిలిస్తూ (ముష్ ధాతువుపై శతృ ప్రత్యయం), యదు... పాంగః : యదుపుంగవ = యదుశ్రేష్ఠుడైన కృష్ణునియొక్క (యదూనాం పుంగవః), రాజ్ఞి = రాణి అయిన రుక్మిణియొక్క, అపాంగః = కడగంటిచూపు, లక్ష్మీమ్ = కాంతిని/సంపదను, తనోతు = విస్తరింపజేయుగాత.

**తా ॥** రుక్మిణియొక్క అపాంగం సంపదను విస్తరింపజేయుగాత (అని కవి అభ్యర్థన.) ఆ అపాంగం తుమ్మెదలా వుంది. ముక్కు అనే చంపకాన్ని చూసి భయపడుతూ దూరంగా వెళ్ళబోతూ, మళ్ళీ అందమైన కన్ను అనే తామరపై మనస్సుపడి ముందుకు వెళ్ళలేకపోతూ వున్న ఆ యదుపుంగవుని రాణి (రుక్మిణి) సంపదను వర్ధిల్లజేయుగాత.

**వి :** 1. లక్ష్మిని వర్ధిల్లజేసే ఆ లక్ష్మికటాక్షం ఎంత శక్తిమంతమో లక్ష్మీసహస్రం చెపుతుంది–

**శ్లో॥ ప్రాగేవ స్యాత్ప్రార్థితార్థస్య సిద్ధిః – పశ్చాదంబ! త్వత్కటాక్షోపలంభః ।**
**దృష్టాంతో నస్తత్ర తే దృష్టిపాతాత్ – ప్రాగమ్భోధిం లంఘయన్ పావమానిః ॥– లక్ష్మీసహస్రమ్–40**

లక్ష్మిని ప్రార్థించినవారికి ముందు అర్థసిద్ధి, ఆపై కటాక్షలాభమట. అంతవేగంగా అన్నమాట. దృష్టాంతం ఆంజనేయుడు ముందుగా సముద్రలంఘనమనే అర్థాన్ని పొందటం, ఆపై లక్ష్మిని (సీతను) చూడటం. అది ఆ కటాక్షప్రభావం.

| | | | |
|---|---|---|---|
| 2. **తనోతు :** | **తనోతు**/తనుతాత్ | తనుతామ్ | తన్వన్తు |
| | తను/తనుతాత్ | తనుతమ్ | తనుత |
| | తనవాని | తనువావ | తనువామ. |

*

**శ్లో॥ స్వర్ణాఙ్గీ వరనీలరత్నసదృశాపాఙ్గీ ప్రవాలోల్లస-**
**త్పాదా యా స్మితమౌక్తికా మరకతస్కంధాభనీలా జటా ।**
**వైడూర్యాగ్ర్యనఖా నఖక్షతలసన్మాణిక్యపుష్పోష్ఠస-**
**ద్గోమేదా రదవజ్రరుక్ సురతరుం నాస్యై దదౌ శ్రీపతిః ॥ 19–5**

**అ :** రుక్మిణీ పారిజాతవర్ణనం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** యా స్వర్ణ+అంగీ వర–నీల–రత్న–సదృశ+అపాంగీ ప్రవాళ+ఉల్లసత్–పాదా స్మిత–మౌక్తికా వైడూర్య+అగ్ర్య–నఖా నఖ–క్షత–లసత్–మాణిక్య–పుష్పా ఓష్ఠ–సద్–గోమేదా రద–వజ్ర–రుక్ యస్యాః జటాః మరకత–స్కంధ–ఆభ–లీలాః అస్యై శ్రీపతిః సుర–తరుం న దదౌ.

**ప్ర :** యా = ఏ రుక్మిణి, స్వర్ణ+అంగీ = బంగారువంటి శరీరంగలదీ (స్వర్ణవత్ అంగం యస్యా స్సా), (పారిజాతం కూడా సువర్ణశరీరం గలది), వర... పాంగీ : వర = శ్రేష్ఠమైన, నీల–రత్న = ఇంద్రనీలమణితో, సదృశ = సమానమైన, అపాంగీ = కడకంటిచూపులు గలదీ (వరేణ నీలరత్నేన సదృశః అపాంగః యస్యాస్సా) (పారిజాతపు ఆకులు కూడా ఇంద్రనీలసదృశాలు), ప్రవాల+ఉల్లసత్–పాదా : ప్రవాళ = పగడాలవలె, ఉల్లసత్ = ప్రకాశించే, పాదా = కాళ్ళుగలదీ (ప్రవాళవత్ ఉల్లసన్తౌ పాదౌ యస్యాస్సా) (పారిజాతపు మొదలుకూడా పగడాలవన్నె గలది), స్మిత–మౌక్తికా : స్మిత = చిఱునవ్వు అనే, మౌక్తికా = ముత్యాలు గలదీ (పారిజాతం చిఱునవ్వుల వంటి ముత్యాలు గలది) (స్మితమేవ మౌక్తికం యస్యాస్సా), వైడూర్య–అగ్ర్య–నఖా : వైడూర్య = వైడూర్యంవలె (పిల్లికన్ను రత్నం), అగ్ర్య = మేలైన, నఖా = గోళ్ళు గలదీ (వైడూర్యవత్ అగ్ర్యాః నఖాః యస్యాస్సా) (పారిజాతం కూడా వైడూర్యాలు గలది), నఖ... పుష్పా : నఖ–క్షత = గోటిగాట్లు అనే, లసత్ = ప్రకాశించే, మాణిక్య–పుష్పా = మాణిక్యపుష్పాలు గలదీ (నఖానాం క్షతాని ఏవ లసన్తి మాణిక్యపుష్పాణి యస్యాస్సా) (పారిజాతం దగ్గర కూడా మాణిక్యపుష్పాలున్నాయి), ఓష్ఠ–సత్+గోమేదా : ఓష్ఠ = పెదవి అనే, సత్ = మంచి, గోమేదా = గోమేధికం గలదీ (ఓష్ఠ–మేవ సత్ గోమేదం యస్యాస్సా) (పారిజాతం దగ్గర కూడా గోమేదికాలుంటాయి), రద–వజ్ర–రుక్ : రద = దంతాలు అనే (ఏకార్థాః కథ్యన్తౌ దశనద్విజరదరదనాః–హలాయుధకోశః–527), వజ్ర = వజ్రాలయొక్క, రుక్ = కాంతిగలదీ (రదా ఏవ వజ్రాణి, తేషాం రుక్ యస్యాః సా) (పారిజాతం దగ్గర కూడా వజ్రాలుంటాయి), యస్యాః = ఏ రుక్మిణియొక్క, జటాః = జడలు, మరకత... నీలాః : మరకత = మరకతాలతో కూడిన, స్కంధ = బోదెయొక్క, ఆభ = కాంతివంటికాంతితో, నీలాః = నల్లనైనవో (మరకతయుక్తస్య ఆభా ఇవ ఆభా యాసాం తాః), అస్యై = ఆమెకు, అసౌ శ్రీపతిః = ఆ కృష్ణుడు, సుర–తరుమ్ = పారిజాతాన్ని, న దదౌ = ఇవ్వలేదు.

**తా ॥** రుక్మిణి సువర్ణాంగి. ఇంద్రనీలరత్నాలవంటి కడగంటి చూపులు గలది. ప్రవాళాలవలె ప్రకాశించే పాదాలు

గలది. చిఱునవ్వుల ముత్యాలతో, వైదూర్యాల వంటి మేటిగోళ్ళతో, నఖక్షతాలు అనే ప్రకాశించే మాణిక్యపుష్పాలతో, పెదవి అనే గోమేదంతో, బోదెవంటి కాంతిగల జడలతో ప్రకాశించేది. పారిజాతతరువులాగా నవరత్నాలతో కూడింది. ఆ విషయాన్ని గ్రహించాడు కాబట్టియే సముద్రాన్ని చిలికినప్పుడు పుట్టిన పారిజాతవృక్షాన్ని కృష్ణుడు లక్ష్మి కివ్వలేదు.

**వి : 1. శ్రీశగుణదర్పణస్తోత్రం**లో వాదిరాజతీర్థరు హరిప్రియను నాలుగు పాయల జడతో/నాలుగు జడలతో వున్నట్టు వర్ణించాడు-

శ్లో॥ చతుష్కపర్దా యా దేవీ ౨ చతురాస్యాదిభిః స్తుతా ।
చతుర్వేదోదితగుణా చతుర్మూర్తేర్హరేః ప్రియా ॥ - శ్రీశగుణదర్పణం-17

| | | | |
|---|---|---|---|
| 2. **దదౌ :** | **దదౌ** | దదతుః | దదుః |
| | దదిథ/దదాథ | దదథుః | దద |
| | దదౌ | దదివ | దదిమ. |

*

**శ్లో॥ కార్శ్యం కాయే మనోజ్ఞే కచభరకరయోర్లమ్బమానత్వదైర్ఘ్యే**
**చక్షుర్మధ్యోరుదేశేష్వధికచపలతాదృశ్యతామార్దవాని ।**
**తత్తేతాని క్రమేణ ద్విరదపరిలసత్కుమ్భశోభాపహారి-**
**ణ్యస్తి స్తః సన్తి లక్ష్మ్యాః కుచకలశతటే నాస్తి నస్తో న సన్తి ॥ 19-6**

**అ :** రుక్మిణి శారీరకసౌభాగ్యవర్ణనం. -స్రగ్ధర.

**అ :** లక్ష్మ్యాః మనోజ్ఞే **కాయే**[1] (యత్) కార్శ్యమ్[1] అస్తి, **కచ-భర**-కరయోః[2] (యే) లంబమానత్వ-దైర్ఘ్యే[2] (స్తః) చక్షుః[3]-మధ్య[3]+ఊరుదేశేషు[3](యాని) **అధికచపలతా[3]+ అదృశ్యతా[3]-మార్దవాని[3]** (సన్తి) (తాని) ద్విరద-పరిలసత్-కుంభ-శోభా+అపహారిణి కుచ-కలశ-తటే [(1,2,3)] క్రమేణ న **అస్తి[1] న స్తః[2] న సన్తి[3]** (1.కాయే (స్థితం) కార్శ్యం, కుచకలశతటే నాస్తి 2. కచభర-కరయోః (స్థితే) లంబమానత్వ-దైర్ఘ్యే కుచకలశతటే న స్తః 3. చక్షుః-మధ్య-ఊరుదేశేషు (స్థితాని) అధికచపలతా అదృశ్యతా-మార్దవాని కుచకలశతటే న సన్తి)

**ప్ర :** లక్ష్మ్యాః = రుక్మిణియొక్క, మనః+జ్ఞే = అందమైన (మనసా జ్ఞాయతే ఇతి, తస్మిన్), కాయే = శరీరమందు, (యత్ = ఏ), కార్శ్యమ్ = చిక్కిపోయి వుండటం, అస్తి = వున్నదో (అస భువి అదాది పరస్మైపది-లట్-ప్ర.ఏ.), కచభర-కరయోః = వేనలియందు, చేతులయందు (కచానాం భరః, స చ కరశ్చ, కచభరకరౌ-తయోః), (యే = ఏ), లంబమానత్వ-దైర్ఘ్యే : లంబమానత్వ = వ్రేళాడుట, దైర్ఘ్యే = దీర్ఘత్వం (పొడవరితనం) (లంబమానత్వం చ దైర్ఘ్యం చ), స్తః = కలవో (అస భువి అదాది పరస్మైపది-లట్-ప్ర.ద్వి.), చక్షుః... దేశేషు : చక్షుః = కళ్ళు, మధ్య = నడుము, ఊరుదేశేషు = తొడలప్రాంతంలో (చక్షుషీ చ మధ్యశ్చ ఊర్వోః దేశశ్చ, తేషు), (యాని = ఏ), అధికచపలతా... మార్దవాని : అధిక-చపలతా = ఎంతో నిలకడలేనితనం, అదృశ్యతా = కనిపించకపోవటం, మార్దవాని = మృదుత్వం (అధికా చ సా చపలతా చ అదృశ్యతా చ మార్దవం చ), సన్తి = కలవో (అస భువి అదాది పరస్మైపది-లట్-ప్ర.ఏ.), (తాని = అవి), ద్విరద... హారిణి : ద్విరద = ఏనుగుయొక్క, పరిలసత్ = ప్రకాశిస్తున్న, కుంభ = కుంభస్థలంయొక్క, శోభా = కాంతిని, అపహారిణి = అపహరించే (ద్వౌ రదౌ యస్య సః, తస్య పరిలసన్ చ అసౌ కుంభః, తస్య శోభామ్ అపహరతీతి, తస్మిన్), కుచ-కలశ-తటే = రొమ్ము అనే కలశం అంచున (కుచః ఏవ కలశః తస్య తటే), క్రమేణ = క్రమంగా, న అస్తి = లేదు (కృశత్వం), న స్తః = లేవు (లంబమానత-దైర్ఘ్యం), న సన్తి = లేవు (అధికచపలత-అదృశ్యత-మార్దవం)

**తా ॥** రుక్మిణిది అందమైన శరీరం. ఆ శరీరంలో కృశత్వం (సన్నదనం) ఆ శరీరంలో వుంటుంది. వెంట్రుకలు

వ్రేలాడుతుంటాయి. చేతులు పొడవుగా వుంటాయి. కళ్ళలో చపలత్వం, నడుములో కనిపించకపోవటం, తొడలలో మార్దవం వుంటాయి. అంతే కానీ ఏనుగు కుంభస్థలంవంటి ఆమె రొమ్ముల్లో కృశత్వం కానీ, లంబమానత్వంకానీ, దైర్ఘ్యం కానీ, చపలత్వంకానీ, అదృశ్యత్వం కానీ మార్దవం కానీ వుండవు.

**వి :** 1. ఏ శరీరావయవం ఎలా వుంటే సొగసుగా వుంటుందో ఆ శరీరావయవాలు అలాగే వున్నాయి రుక్మిణికి. ఒకచోట గుణంగా కనిపించేది మరొకచోట గుణం కాదు. పైపెచ్చు లోపం కూడా అవుతుంది. ఆ విషయాన్నే కవి ప్రతిపాదిస్తున్నాడు. శరీరంలో కేశాలలో, చేతులలో, కళ్ళలో, నడుములో, తొడలలో కనిపించే గుణాలు (వాటిని అందగింపజేసేవి) ఆమె రొమ్ములలో లేవు. ఎందుకంటే అవి ఆ విషయంలో లోపాలవుతాయి.

**శ్లోకంలో వర్ణింపబడిన విషయం కన్న వర్ణించిన తీరులో అందముంది.**

| | | | | |
|---|---|---|---|---|
| 2. **అస్తి :** | **అస్తి** | **స్తః** | **సన్తి** | |
| **స్తః :** | అసి | స్థః | స్థ | |
| **సన్తి:** | అస్మి | స్వః | స్మః. | * |

**శ్లో॥ భ్రూమధ్యలగ్నమృగనాభిలలామరేఖా - శ్రీశ్రీశయోరనుకరోతి హి నీలనీలా ।**
**శాణోపలోపరిగతం రణధీరమార-చాపానుషక్తమసితోత్పలచారుబాణమ్॥ 19-7**

**అ :** రుక్మిణీకృష్ణుల లలాటంపైనున్న తిలకరేఖావర్ణనం. -వసంతతిలక.

**అ :** నీల-నీలా శ్రీ-శ్రీశయోః భ్రూ-మధ్య-లగ్న-మృగనాభి-లలామ-రేఖా శాణ+ఉపల+ ఉపరిగతం రణ-ధీర-మార-చాప+అనుషక్తమ్ అసిత+ఉత్పల-చారు-బాణమ్ అనుకరోతి హి.

**ప్ర :** నీల-నీలా = మరీనల్లనైన (నీలాయాః అపి నీలా), శ్రీ-శ్రీశయోః = లక్ష్మీ-నారాయణులయొక్క (శ్రీశ్చ శ్రియః ఈశశ్చ, తయోః), భ్రూ... రేఖా : భ్రూ-మధ్య = కనుబొమలమధ్యలో, లగ్న = అంటియున్న, మృగనాభి-లలామ = కస్తూరీతిలకంయొక్క, రేఖా = రేఖ (నిలుపుబొట్టు), శాణో... గతమ్ : శాణ+ఉపల = ఒరిపిడిరాయియొక్క (శాణః కర్షోపలే-నానార్థరత్నమాలా-పంక్తి-429) (శాణమంటేనే ఒరిపిడిరాయి అని అర్థం. మరల ఉపల పదప్రయోగం స్పష్టతకోసం). ఉపరి-గతమ్ = పైభాగాన వున్నదీ (శాణస్య ఉపలః, తస్య ఉపరి గతః, తమ్), రణ... షక్తమ్ : రణ = యుద్ధమందు, ధీర = ధీరుడైన, మార = మదనునియొక్క, చాప = వింటిపై, అనుషక్తమ్ = అనుసంధింపబడినదీ అయిన (రణే ధీరశ్చ అసౌ మారః, తస్య చాపే అనుషక్తః, తమ్), అసితో... బాణమ్ : అసిత+ఉత్పల = నల్లకలువ అనే, చారు = అందమైన, బాణమ్ = బాణాన్ని (అసితం చ తత్ ఉత్పలమ్, తదేవ చారుః బాణః, తమ్), అనుకరోతి = అనుకరిస్తోంది. (అను-కృ కరణే పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** రుక్మిణీకృష్ణుల కనుబొమల మధ్యనున్న కస్తూరీతిలకరేఖ నల్లనల్లనై ఒరిపిడిరాయిపై సానపెట్టబడి, రణధీరుడైన మన్మథుని వింటికి అనుసంధింపబడిన నీలోత్పలబాణాన్ని అనుకరిస్తోంది.

**వి :** 1. కవులకు విశేషించి భక్తిభావంతో, ఆర్తితో నారాయణుని నుతించే వారికి కృష్ణుని తిలకంపై ప్రత్యేక గౌరవం కనిపిస్తుంది.

'**కస్తూరీతిలకం లలాటఫలకే**' అని కృష్ణకర్ణామృతమంటే, '**కలితకస్తూరీతిలకకమనీయ ఫాలఫలక లలితత్రివళి-పులక లక్ష్మీపాలక**' అని కృష్ణలీలాతరంగిణి వర్ణిస్తుంది. భక్తిభావంతో తన్మయత్వాన్ని పొంది కళ్ళు మూసికొన్నా లోపల దర్శించగలిగేది సంభావితరూపాన్నే. రూపమంటే ప్రధానంగా ముఖమే. ముఖంలో కొట్టవచ్చినట్టు కనిపించేది తిలకమే.

2. శ్లోకంలో ఉపమాలంకారముంది. ఉపమావాచకం శాబ్దికంగా లేకపోయినా '**అనుకరోతి**' అన్న క్రియాపదం

ద్వారా అది ఆర్థికమవుతోంది. కాబట్టి ఆర్థీ+ఉపమ. ఉపమేయకక్ష్యలో కనుబొమల నడిమిప్రదేశం, లలాటం, తిలకరేఖ. ఉపమాన కక్ష్యలో చాపం, శాణోపలం, నీలోత్పలశరం.

| | | | |
|---|---|---|---|
| 3. **అనుకరోతి :** | **అనుకరోతి** | అనుకురుతః | అనుకుర్వన్తి |
| | అనుకరోషి | అనుకురుథః | అనుకురుథ |
| | అనుకరోమి | అనుకుర్వః | అనుకుర్మః. * |

**శ్లో॥ నిత్యం పరస్పరమనోరమగాత్రసఙ్గా-న్మత్తాలిరక్తసరసీరుహకాన్తిమన్తౌ ।**
**లక్ష్మీరమారమణయోర్జగదాదిపిత్రో-రస్మాకమీప్సితఫలం కురుతాం కటాక్షౌ ॥ 8**

**అ :** రుక్మిణీకృష్ణుల కటాక్షానుగ్రహప్రార్థన. -వసంతతిలక.

**అ :** నిత్యం పరస్పర-మనః+రమ-గాత్ర-సంగాత్ మత్త+అలి-రక్త-సరసీరుహ-కాన్తి-మన్తౌ జగద్-ఆది-పిత్రోః లక్ష్మీ-రమా-రమణయోః కటాక్షౌ అస్మాకమ్ ఈప్సిత-ఫలం కుర్యాత్.

**ప్ర :** నిత్యమ్ = ఎల్లప్పుడూ, పరస్పర... సంగాత్ : పరస్పర = అన్యోన్యం, మనోరమ = మనస్సులనానందింపజేసే, గాత్ర = శరీరాలయొక్క, సంగాత్ = కలయికవల్ల (పరస్పరం మనోరమయోః గాత్రయోః సంగః, తస్మాత్), మత్తాలి... మన్తౌ : మత్త = మదించిన, అలి = తుమ్మెద, రక్త-సరసీరుహ = ఎఱ్ఱతామరవంటి, కాన్తిమన్తౌ = కాంతిగలవీ (మత్తశ్చ అసౌ అలిః, స చ రక్తం చ తత్ సరసీరుహం చ, తే ఇవ కాన్తి మన్తౌ), జగద్-ఆది-పిత్రోః : జగత్ = విశ్వానికి, ఆది-పిత్రోః = తొలి తల్లిదండ్రులైన (జగతః ఆదీ పితరౌ, తయోః), లక్ష్మీ... రమణయోః = లక్ష్మీనారాయణులయొక్క (లక్ష్మీ చ రమాయాః రమణః చ, లక్ష్మీరమారమణౌ, తయోః), కటాక్షౌ = కడగంటిచూపులు, అస్మాకమ్ = మనకు, ఈప్సిత-ఫలమ్ = పొందగోరిన ఫలితాన్ని (ఆప్తుమ్-ఇష్టమ్, తచ్చ తత్ ఫలం చ), కురుతామ్ = చేయుదురు గాక! (కృ కరణే-పరస్మైపది-లోట్-ప్ర.ద్వి.)

**తా ॥** జగత్తునకు తొలితల్లిదండ్రులయిన లక్ష్మీనారాయణుల కటాక్షాలు మన కోరికలను తీర్చుగాత! ఆ కటాక్షాలు నిరంతరమూ పరస్పరశరీర స్పర్శగలవి. అందువలన మదించిన తుమ్మెద, ఎఱ్ఱతామరవంటి కాంతిగలవి.

**వి :** 1. లోకంలో లక్ష్మీకటాక్షమంటే సంపదలు సమకూరటమే అన్న అభిప్రాయం గాఢంగా వుంటుంది. కానీ పరమపదమైన మోక్షం కావాలన్నా లక్ష్మీకటాక్షమే అవసరం. ఆ కటాక్షం లేక - ఆమెను శరణుగోరనందువల్ల - బ్రహ్మ శివాదులు కూడా ఇంకా మోక్షాన్ని పొందలేక పోతున్నారని దయాశతకమంటోంది-

శ్లో॥ దివ్యాపాంగం దిశసి కరుణే యేషు సద్దేశికాత్మా
క్షిప్రం ప్రాప్తా వృషగిరి పతిం క్షత్రబన్ధ్వాదయస్తే ।
విశ్వాచార్యా విధిశివముఖాః స్వాధికారోపరుద్ధాః
మన్యే మాతా జడ ఇవ సుతే వత్సలా మాదృశే త్వమ్ ॥ - దయాశతకమ్-50

| | | | |
|---|---|---|---|
| 2. **కురుతామ్ :** | కరోతు/కురుతాత్ | **కురుతామ్** | కుర్వన్తు |
| | కురు/కురుతాత్ | కురుతమ్ | కురుత |
| | కరవాణి | కరవావ | కరవామ. * |

**శ్లో॥ రక్తా రమారామకటాక్షలక్ష్మీ-ర్లక్షీకరోత్వస్మదమిత్రవర్గమ్ ।**
**సైవానురక్తా విధిశర్వపూర్వ-సౌభాగ్యదాత్రీ శరణాగతం మామ్ ॥ 19-9**

**అ :** అమిత్రనాశాన్ని తమరక్షణను ప్రార్థించటం. (రుక్మిణీకృష్ణుల కటాక్షశోభను)

**అ :** రమా-రామ-కటాక్ష-లక్ష్మీః రక్తా (సతీ) అస్మద్-అమిత్ర-వర్గం లక్షీకరోతు. విధి-శర్వ-పూర్వ-సౌభాగ్య-దాత్రీ సా ఏవ అనురక్తా (సతీ) శరణాగతం మాం లక్షీకరోతు.

**ప్ర :** రమా-రామ-కటాక్ష-లక్ష్మీః : రమా-రామ = రుక్మిణీకృష్ణులయొక్క, కటాక్ష-లక్ష్మీః = కడగంటిచూపులకాంతి (రమా చ రామశ్చ తయోః కటాక్షస్య లక్ష్మీః), రక్తా (సతీ) = (కోపంతో) ఎఱ్ఱనిదై, అస్మద్-అమిత్ర-వర్గమ్ : అస్మద్ = మనయొక్క (సంస్కృత భాషలో మేము, మనం ఈ రెండింటికీ ఒకటే పదం. తెలుగులో మాత్రం '**భూయ ఉభయార్థవాచీ య కశ్చిద్భవతి నిత్యబహువచనః**' (ఆంధ్రశబ్దచింతామణి-హలన్త-7), అంటూ 'మనం' శబ్దాన్ని నిర్దేశించారు. తెలుగులోని విలువైన పదమది. అమిత్ర-వర్గమ్ = శత్రు సమూహాన్ని (అస్మాకమ్ అమిత్రస్య వర్గః తమ్), లక్షీకరోతు = గురిచేయుగాక! (లక్షీ-కృ కరణే-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.) (అలక్షం లక్షం కరోతు ఇతి), విధి... దాత్రీ : విధి = బ్రహ్మ, శర్వ = శివుడు, పూర్వ = ముందుగాగల దేవతలకు, సౌభాగ్య-దాత్రీ = సౌభాగ్యాన్ని ఇచ్చే, సా ఏవ = ఆ కటాక్షలక్ష్మియే, అనురక్తా (సతీ) = అనురక్తి (దయ) గలదై, శరణ+ఆగతమ్ = శరణుజొచ్చిన, మామ్ = నన్ను, లక్షీ కరోతు = గమనించుగాత!

**తా ॥** లక్ష్మీనారాయణుల (రుక్మిణీకృష్ణుల) కటాక్షకాంతి మన శత్రువర్గాన్ని కోపంతో చూచుగాత! బ్రహ్మశివాదులకు కూడా సౌభాగ్యాన్ని ఇవ్వగల అదే కటాక్షకాంతి శరణా గతుడనైన నన్ను అనురక్తితో చూచునుగాక!

**వి :** 1. అందరూ బాగుండాలని ఆశిస్తూ కూడా మనం బాగుండాలి, మన శత్రువులు బాగుండకూడదు అన్న కోరిక దైవారాధనలో ఒక భాగమైంది. ఆ శత్రువులు అంతశ్శత్రువులు కావచ్చు. బాహ్య శత్రువులూ కావచ్చు.

"ఉత్తరాహముత్తర ఉత్తరేదుత్తరేభ్యః । అథా సపత్నీ యా మమాధరా సాధరాభ్యః"-ఋగ్వేదము 10/146/3

అని తన సవతి తనకన్న తక్కువ కావాలనీ, తాను ఆమెను మించి పోవాలనీ ఒక స్త్రీ కోరిక.

"ప్రతిష్ఠాసి ప్రతిష్ఠావంతో భూయాస్మ మా ప్రతిష్ఠాయాచ్ఛితన్మిహ్యా ప్రతిష్ఠస్య భూయాద్యోస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మః"...

సుమిత్రా న ఓషధయస్సన్తు దుర్మిత్రా స్తస్మై భూయాసుర్యోస్మాం ద్వేష్టి యం చ వయం ద్విష్మః" - (శాంతిమంత్రాలు)

ప్రతిష్ఠ కానీ ఓషధీ సహకారం కానీ తనను ద్వేషించేవారికి కానీ, తాను ద్వేషించేవారికి కానీ వుండకూడదని కోరిక.

ప్రస్తుతశ్లోకంలో అటువంటి భావన కనిపిస్తున్నా 'శరణాగతమ్' అన్న పదం ఇక్కడ తాను ఆశించినవి పొందటానికి అర్హతను కలిగిస్తుంది.

2. **లక్షీకరోతు : లక్షీకరోతు**/లక్ష్మీకురుతాత్ లక్షీకురుతామ్ లక్షీకుర్వన్తు
లక్షీకురు/లక్షీకురుతాత్ లక్షీకురుతమ్ లక్షీకురుత
లక్షీకరవాణి లక్షీకరవావ లక్షీకరవామ

3. ఛందస్సు - ఇంద్రవజ్ర. *

**శ్లో॥ ముకుటరవిభియాఽధోలమ్బమానం ముఖేన్దు-**
**ప్రవిలసదురుభాసా చోన్ముఖం తన్ముఖస్థమ్ ।**
**కుటిలమలకరాశిం కర్ణనీలోత్పలశ్రీ-**
**పరిహృతనిజదైన్యం తర్కయామ్యన్ధకారమ్ ॥** **19-10**

**అ :** రుక్మిణీకృష్ణుల అలక (కేశ) రాశిని వర్ణించటం. -మాలిని.

**అ :** తత్+ముఖస్థం కుటిలమ్ అలక-రాశిం ముకుట-రవి-భియా అధః లంబమానం ముఖ+ఇన్దు-ప్రవిలసద్-ఉరు-భాసా చ ఉన్ముఖం కర్ణ-నీల+ఉత్పల-శ్రీ-పరిహృత-నిజ-దైన్యమ్ అన్ధకారం తర్కయామి.

**ప్ర :** తత్+ముఖస్థమ్ : తత్ = ఆ రుక్మిణీకృష్ణులయొక్క, ముఖ-స్థమ్ = ముఖమందున్న (ముఖే తిష్ఠతీతి, తమ్), కుటిలమ్ = వంకరతిరిగిన, అలక-రాశిమ్ = కురుల సమూహాన్ని, ముకుట-రవి-భియా : ముకుట = కిరీట మనే, రవి = సూర్యునివలని, భియా = భయంతో (ముకుటమ్ ఏవ రవిః, తస్మాత్ భీః, తయా), అధః=క్రిందకు, లంబమానమ్ = వ్రేలాడుతున్నదై (లమ్బ్ ధాతువుపై శానచ్ ప్రత్యయం), ముఖే... భాసా : ముఖ+ఇన్దు = ముఖచంద్రునియొక్క, ప్రవిలసత్ = ప్రకాశిస్తున్న, ఉరు = ఎక్కువైన, భాసా = కాంతితో (ముఖమ్ ఏవ ఇన్దుః, తస్య ప్రవిలసతీ ఉర్వీ చ సా భాః, తయా), ఉత్+ముఖమ్-చ = పైకి వెళ్ళినదీ, కర్ణ... దైన్యమ్ : కర్ణ = చెవులు అనే, నీల+ఉత్పల = నల్లకలువలయొక్క, శ్రీ = శోభతో, పరిహృత = తొలగింపబడిన, నిజ = తనయొక్క, దైన్యమ్ = దీనత్వం గలదీ అయిన (కర్ణౌ ఏవ నీలే చ తే ఉత్పలే, తయోః శ్రీః, తయా పరిహృతం నిజస్య దైన్యం యేన, తమ్), అన్ధకారమ్ = చీకటిగా, తర్కయామి = భావిస్తున్నాను. (తర్క్ వితర్కే చురాది పరస్మైపది-లట్-ఉ.ఏ.)

**తా ॥** వంకలు తిరిగిన రుక్మిణీకృష్ణుల ముంగురులను అంధకారం అని నేను భావిస్తున్నాను. ఆ అంధకారం ముందుగా పైకి వెళ్ళాలని భావించింది. కానీ కిరీటమనే సూర్యుని చూసి భయపడి క్రిందకు వెళ్ళాలను కొన్నది. అయితే అక్కడ ముఖచంద్రుని (వెన్నెల) వెలుగును చూసి మరల పైకి ప్రాకింది. ఇలా ఊగిసలాడుతున్నప్పుడు చెవులు అనే నల్లకలువలకాంతి దానికి సహకరించి దాని దైన్యాన్ని పోగొట్టింది.

**వి :** 1. కురులను చీకటితో పోల్చటం - అదీ పారిపోయిన చీకటితో - మనోహరవర్ణనం. ఇతరత్ర స్థానం దొరకక కడకు అది కేశపాశాన్ని ఆశ్రయించినదని వర్ణించటాన్ని మరోచోట కూడా చూడవచ్చు-

**శ్లో॥ ఉన్మీలద్వదనేన్దు కాన్తివిసరైర్దూరే సముత్సారితం**
**భగ్నం పీనకుచస్థలస్య చ రుచా హస్తప్రభాభిర్హతమ్ ।**
**ఏతస్యాః కలవింకకంఠకదలీకల్పం మిలత్కౌతుకా-**
**దప్రాప్తాంగసుఖం రుషేవ సహసా కేశేషు లగ్నం తమః ॥**

చీకటి ముఖాన్ని తాకాలనుకొన్నది. కానీ ముఖచంద్రకాంతి దూరంగా నెట్టివేసింది. గుండెలపై చేరాలనుకొన్నది. కానీ కుచకాంతి నెట్టివేసింది. చేయి పట్టుకోవాలనుకొన్నది. కానీ కరకాంతులు త్రోసి వేశాయి. ఇకముందువుంటే లాభం లేదనుకొని అలిగి కనబడకుండాపోయినట్లు వెనకకు వెళ్ళి దాగింది. రామరాజభూషణుడు కూడా **వసుచరిత్రలో** గిరకవేనలిని చంద్రకాంతికి భయపడి వెనుక దాగిన చీకటిలా వుందని వర్ణిస్తాడు.

బొమవిలు చూపుతూపులును బూని మృగాంకుని గెల్చి యింతిమో
మమృతము మందహాసమున నచ్చుపుడాలు కపోలలీల ఫా
లమునఁ గలావిలాసమఖిలంబుఁ గొనంగని వెన్కఁ జొచ్చె న
**య్యమృతగభస్తి భీతతిమిరావళి వేనలి** పెంపు సొంపునన్. - వసుచరిత్ర 2/71

| | | | |
|---|---|---|---|
| 2. **తర్కయామి :** తర్కయతి | తర్కయతః | తర్కయన్తి | |
| తర్కయసి | తర్కయథః | తర్కయథ | |
| **తర్కయామి** | తర్కయావః | తర్కయామః. | * |

**శ్లో॥ ఉత్తుఙ్గనీలచమరీమృగవాలభార-కల్పం స్ఫురద్వివిధరత్నలసత్కిరీటమ్ ।**
**ఉత్ఫుల్లపుష్పనికరాకరముజ్జ్వలన్తం - నిత్యం స్మరామి కమలాచ్యుతమౌలిదేశమ్ ॥11**

**అ : రుక్మిణీకృష్ణుల కొప్పుల వర్ణన.** -వసంతతిలక.

**అ :** ఉత్-తుంగ-నీల-చమరీమృగ-వాల-భారకల్పం స్ఫురద్-వివిధ-రత్న-లసత్-కిరీటమ్ ఉత్ఫుల్ల-పుష్ప-నికర+ఆకరమ్ ఉజ్జ్వలన్తం కమలా+అచ్యుత-మౌళి-దేశం నిత్యం స్మరామి.

**ప్ర :** ఉత్తుంగ... కల్పమ్ : ఉత్తుంగ = ఉన్నతమైన, నీల = నల్లని, చమరీ-మృగ = చమరీమృగం (ఆడ సవరపుమెకం)యొక్క, వాల = తోకయొక్క, భార-కల్పమ్ = బరువు (వెంట్రుకలచే ఏర్పడినది)తో సమానమైనదీ (ఉత్తుంగః నీలశ్చ అసౌ చమరీ ఇతి మృగః, తస్య భారేణ కల్పమ్), స్ఫురత్... కిరీటమ్: స్ఫురత్ = వెలుగుతున్న, వివిధ = రకరకా-లయిన, రత్న = మణులతో, లసత్ = ప్రకాశిస్తున్న, కిరీటమ్ = కిరీటంగలదీ (స్ఫురన్తి చ వివిధాని రత్నాని చ తైః లసత్ కిరీటం యస్మిన్, తమ్), ఉత్ఫుల్ల... కరమ్:ఉత్ఫుల్ల = వికసించిన, పుష్ప = పూలయొక్క, నికర = సమూహానికి, ఆకరమ్ = నిలయమైనదీ (ఉత్ఫుల్లానాం పుష్పాణామ్ నికరస్య ఆకరః, తమ్), ఉజ్జ్వలన్తమ్ = ప్రకాశిస్తున్నదీ అయిన, కమలా... దేశమ్ : కమలా+అచ్యుత = రుక్మిణీకృష్ణులయొక్క, మౌళి-దేశమ్ = వేనలితావును, నిత్యమ్ = ఎల్లప్పుడూ, స్మరామి = తలస్తున్నాను. (స్మృ చిన్తాయాం-భ్వాది-పరస్మైపది-ఉ.ఏ.)

**తా ॥** రుక్మిణీకృష్ణుల మౌళిదేశాన్ని సదా స్మరిస్తున్నాను. అది చమరీమృగంయొక్క తోకలాగా ఒత్తైనది. వివిధరత్నాలంకృతమైన కిరీటంతో ప్రకాశించేది. వికసించిన పూలమొత్తాలతో ఉజ్జ్వలమైనది.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. స్మరామి :** | స్మరతి | స్మరతః | స్మరన్తి |
| | స్మరసి | స్మరథః | స్మరథ |
| | **స్మరామి** | స్మరావః | స్మరామః. |

*

**శ్లో॥ ఇత్థం జామ్బవతీమువాహ స విభుః సల్లక్షణాం లక్షణాం**
**సత్యాం సర్వగుణాకరాం శశిముఖీం నీలాం చ నీలాలకామ్ ।**
**కాళిన్దీం కలకణ్ఠకణ్ఠనినదాం స్వాం మిత్రవిన్దాం తథా**
**బాలా భూమిసుతాహృతాశ్చ బహుశో ద్వారావతీవల్లభః ॥ 19-12**

**అ :** జాంబవత్యాది వనితలతో కృష్ణుని వివాహానికి సంబంధించిన ప్రస్తావన.

**అ :** విభుః సః ద్వారావతీ-వల్లభః ఇత్థం జాంబవతీమ్ ఉవాహ. సత్-లక్షణాం లక్షణాం సర్వ-గుణ+ఆకరాం సత్యాం శశి-ముఖీం నీలాం నీల+అలకాం కాళిన్దీం కలకంఠ-కంఠ-నినదాం స్వాం మిత్రవిన్దాం తథా భూమి-సుత+ఆహృతాః బహుశః బాలాః చ ఉవాహ.

**ప్ర :** విభుః = ప్రభువైన, సః = ఆ, ద్వారావతీ-వల్లభః = ద్వారకాధీశుడు (కృష్ణుడు) (ద్వారావత్యాః వల్లభః), ఇత్థమ్ = ఈ రీతిగా (ఇదే రీతిగా), జాంబవతీమ్ = జాంబవతిని, ఉవాహ = పెళ్ళిచేసికొన్నాడు. సత్+లక్షణామ్ = మంచి లక్షణాలుగల (సన్తి లక్షణాని యస్యాం, తామ్), లక్షణామ్ = లక్షణనూ, సర్వ-గుణ+ఆకరామ్ : సర్వ-గుణ = సమస్తగుణాలకూ, ఆకరామ్ = నిలయమైన (సర్వే చ తే గుణాః, తేషామ్ ఆకరా, తామ్), సత్యామ్ = సత్యభామనూ, శశి-ముఖీమ్ = చంద్రముఖి అయిన (శశీ ఇవ ముఖం యస్యాస్తామ్), నీలామ్ = నీలనూ, నీల+అలకామ్ = నల్లని ముంగురులు గల (నీలాః అలకాః యస్యాస్తామ్) (అలకః పురోలంబనకుంతలే-నానార్థమంజరీ-పంక్తి 172), కాళిన్దీమ్ = కాళిందిని, కల... నినదామ్ : కలకంఠ = కోకిలవంటి, కంఠ-నినదామ్ = కంఠధ్వనిగల (కలకంఠవత్ కంఠస్య నినదః యస్యాస్తామ్), స్వామ్ = తనదైన (మేనరికం వల్ల), మిత్రవిందామ్ = మిత్రవిందనూ, తథా = అలాగే (భద్రనూ), భూమి+సుత+ఆహృతాః : భూమి-సుత =

నరకాసురునినుండి, ఆహృతాః = కొనితేబడిన (భూమేః సుతః, తస్మాద్ ఆహృతాః), బహుశః = చాలామంది, బాలాశ్చ = కన్యలను కూడా, ఉవాహ = పెండ్లాడాడు. (వహ ప్రాపణే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** ప్రభువైన ఆ కృష్ణుడు జాంబవతినీ, సలక్షణాలు గల లక్షణనూ, సర్వగుణనిలయ అయిన సత్యభామనూ, చంద్రముఖి అయిన నీలనూ, నీలాలక అయిన కాళిందినీ, కలకంఠకంఠధ్వనిగలదీ, తనదీ అయిన మిత్రవిందనూ, భద్రనూ, నరకునినుండి విడిపించుకొనివచ్చిన చాలామంది వనితలను వివాహమాడాడు.

**వి :** 1. కృష్ణుని భార్యలలో 1. రుక్మిణి విదర్భరాజకుమారి, రాక్షసవివాహం ద్వారా కృష్ణుని భార్య అయింది. 2. జాంబవతి. జాంబవంతుని పుత్రి. శ్యమంతకమణిని వెదుకుతూ కృష్ణుడు వెళ్ళినపుడు జాంబవంతుడు తన దగ్గరకు చేరిన ఆ మణినీ, జాంబవతినీ కూడా కృష్ణునకిచ్చాడు. 3. సత్యభామ. సత్రాజిత్తు కుమార్తె. శ్యమంతకమణిని తిరిగి తెచ్చి సత్రాజిత్తునకు ఇచ్చినపుడు సత్రాజిత్తు సత్యను కృష్ణునకిచ్చాడు. 4. నీల (నాగ్నజితి) నగ్నజిత్ పుత్రి. స్వయంవరంలో ఏడు ఎద్దులను ఓడించి కృష్ణుడు ఆమెను సాధించుకొన్నాడు. నీలను గురించి నీలాసూక్తమొకటి తైత్తిరీయసంహితలో వుంది. 'తిరుప్పావై'లో కూడా ఒక పాశురంలో నీలాప్రస్తావన వుంది. కూచిమంచి తిమ్మకవి. 'నీలాసుందరీపరిణయ'మన్న పేరుతో అచ్చతెనుగు కబ్బాన్ని రచించాడు. 5. కాళింది. సూర్యసుత. కఠోరతపస్సు చేసి కృష్ణుని భర్తను చేసికొంది. 6. మిత్రవింద. జయసేనుని పుత్రిక. స్వయంవరంలో కృష్ణుని ఎన్నుకొన్నది. తండ్రి, సోదరులు అంగీకరించకపోవటంతో వారితో పోరాడి ఓడించి కృష్ణుడు ఆమెను వివాహమాడాడు. 7. లక్షణ. మద్రదేశానికి చెందిన బృహత్సేనుని కుమార్తె. స్వయంవరంనుండి ఆమెను కృష్ణుడు అపహరించాడు. 8. భద్ర. కేకయ దేశానికి చెందిన స్త్రీ. కృష్ణుని మేనత్త అయిన శ్రుతకీర్తికి దృష్టకేతువు ద్వారా పుట్టిన కూతురు.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉవాహ :** | **ఉవాహ** | ఊహతుః | ఊహుః |
| | ఉవహిథ/ఉవోఢ | ఊహథుః | ఊహ |
| | ఊవాహ | ఊహివ | ఊహిమ |

3. ఛందస్సు – శార్దూలవిక్రీడితమ్. *

**శ్లో॥ కస్మాన్ముహ్యథ మానవాః! మురభిదః సర్వోత్తమత్వే పురా**
**యః పద్మాసనధూర్జటిప్రభృతిభిః కార్యాక్షమైః ప్రార్థితః ।**
**గర్భే గీర్భిరభిష్టుతః ఫణిఫణే నృత్యంశ్చ యః సేవితః**
**సద్వేణుం రణయంశ్చ నమ్రతనుభిర్యో విస్మితైరీక్షితః ॥ 19-13**

**అ :** కృష్ణుని సర్వోత్తమత్వాన్ని ప్రకారాంతంగా నిరూపించటం. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** మానవాః! పురా యః కార్య+అక్షమైః పద్మ+ఆసన–ధూర్జటి–ప్రభృతిభిః ప్రార్థితః, (యః), గర్భే గీర్భిః అభిష్టుతః ఫణి–ఫణే నృత్యన్ చ యః సేవితః, సద్–వేణుం రణయన్ విస్మితైః నమ్ర–తనుభిః యః ఈక్షితః చ (తస్య) ముర–భిదః సర్వ+ఉత్తమత్వే కస్మాత్ ముహ్యథ.

**ప్ర :** మానవాః = మానవులారా!, పురా = పూర్వం, కార్య+అక్షమైః : కార్య = పనియందు, అక్షమైః = అసమర్థులైన (కార్యేషు అక్షమాః, తైః), పద్మా... ప్రభృతిభిః : పద్మ+ఆసన = బ్రహ్మ (పద్మమ్ ఆసనం యస్య సః), ధూర్జటి = శివుడు (ధూః జటిః యస్య సః), ప్రభృతిభిః = మొదలగువారిచే (పద్మాసనః ధూర్జటిశ్చ, ఏతత్ ప్రభృతయః, తైః), ప్రార్థితః = అర్థింపబడెనో, యః = ఎవరయితే, గర్భే = తల్లికడుపున వున్నప్పుడే, గీర్భిః = మాటలతో, అభిష్టుతః = స్తుతింపబడెనో (అభి+స్తు ధాతువుపై క్త ప్రత్యయం), ఫణి–ఫణే = పాము పడగపై (ఫణినః ఫణః తస్మిన్), నృత్యన్ = నర్తిస్తూ (నృత్ ధాతువుపై శతృ ప్రత్యయం), యః = ఎవరయితే, సేవితః = సేవింపబడెనో, సద్–వేణుమ్ = మంచి వేణువును, రణయన్ = మ్రోయిస్తూ, విస్మితైః = చకితాలయిన, నమ్ర–

తనుభిః = (వినయంతో) వంగిన శరీరాలుగలవారిచే (నమ్రాః తనవః యేషాం తైః), ఈక్షితః చ = చూడబడెనో (ఈక్ష ధాతువుపై క్త ప్రత్యయం), తస్య = ఆ, మురభిదః = కృష్ణునియొక్క, సర్వ+ఉత్తమత్వే = అందరిలో గొప్పవాడనుటలో, కస్మాత్ = ఎందువలన, ముహ్యథ = మోహానికి లోనవుతున్నారు? (ముహ్ వైచిత్యే-దివాది-పరస్మైపది-లట్-మ.బ.)

**తా॥** మానవులారా! మురారిని సర్వోత్తముడనుటంలో ఎందుకు మూఢులవుతున్నారు? బ్రహ్మ, శివుడు మొదలగు దేవతలు తమ పనిని చేసికోవటం చేతకాక ఆయనను ప్రార్థించారు. దేవకీగర్భంలో వున్నప్పుడే ఆయనను స్తుతించారు. కాళియుని పడగలపై నాట్యమాడు తున్నప్పుడు ఆయనను సేవించారు. వేణువును మ్రోయిస్తున్నపుడు వినమ్రతతో వంగి నిలిచి ఆయనను ఆశ్చర్యంగా చూశారు. ఇదంతా గతంలోనే జరిగింది.

**వి :** 1. ఇక్కడ కవి నాలుగు సన్నివేశాలలో బ్రహ్మాదిదేవతలు కృష్ణుని (నారాయణుని) ఆశ్రయించటాన్ని ప్రస్తావించి ఆయన సర్వోత్తమత్వానికి అవే కారణాలు అంటూ ఉదాహరిస్తున్నాడు.

1. బ్రహ్మాదిదేవతలు ఆయన సన్నిధికేగి ప్రార్థించటం-

శ్లో॥ బ్రహ్మా తదుపధార్యాథ సహ దేవైస్తయా సహ ।
జగామ సత్రిణయనః తీరం క్షీరపయోనిధేః ॥

శ్లో॥ తత్ర గత్వా జగన్నాథం దేవదేవం వృషాకపిమ్ ।
పురుషం పురుషసూక్తేనోపతస్థే సమాహితః ॥ - భాగవతం 10/1/19,20

2. దేవకీగర్భమందున్నప్పుడే బ్రహ్మాదులు స్తుతించటం

మ. గురుపాఠీనమవై జలగ్రహమవై కోలంబవై శ్రీనృకే
సరివై భిక్షుఁడవై హయాననుఁడవై క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుఁడవై దయాగుణగణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెదమిలాభారంబు వారింపవే. - పోతనభాగవతము 10/100

3. కాళీయమర్దనసమయంలో బ్రహ్మాదులు ప్రత్యక్షంగా లేరు కానీ దేవతాస్త్రీలు, కాళియుని పత్నులు కృష్ణస్తుతిచేయటం కనిపిస్తుంది.

శ్లో॥ తం నర్తుముద్యతమవేక్ష్య తదా తదీయ
గంధర్వసిద్ధసురచారణదేవవధ్వః ।
ప్రీత్యా మృదంగపణవానకవాద్యగీత
పుష్పోపహార**నుతిభిః** సహసోపసేదుః ॥ -భాగవతం 10/14/27

కాళియపత్నులు చేసిన స్తుతి...

ఉ. ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందఁగా
నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము
న్నొల్లరు యోగసిద్ధి మఱియొందు భవంబుల నొందనీని నీ
సల్లలితాంఘ్రిరేణువుల సంగతినొందిన ధన్యులెప్పుడున్. -పోతనభాగవతము 10/676

4. వేణుగానశ్రవణం ద్వారా బ్రహ్మాదులు కూడా గోపికల్లాగా కలతపడటం-

శ్లో॥ సవనశస్తదుపధార్య సురేశాః - శక్రశర్వపరమేష్ఠిపురోగాః ।
కవయ ఆనతకంధరచిత్తాః - కశ్మలం యయురనిశ్చితతత్త్వాః ॥ - భాగవతమ్ 10/35/15

2. సాహిత్యవిశ్వంలో కూడా విష్ణుస్తుతికి తొలిస్థానం. శివస్తుతిది రెండవస్థానం. బ్రహ్మకు మూడవస్థానం. మూడవస్థానం వరుసక్రమంలోనే కానీ స్తుతులంతగా కనిపించవు. సమాజంలో అసలు అభిషేకాలూ, వ్రతాలూ శివకేశులకే గానీ బ్రహ్మకు సంబంధించిన అర్చనావిధులేవీ కనిపించవు. క్రతువులలో మాత్రం బ్రహ్మ ఆవాహన, విసర్జనలుంటాయి.

| | | | |
|---|---|---|---|
| 3. **ముహ్యథ :** | ముహ్యతి | ముహ్యతః | ముహ్యన్తి |
| | ముహ్యసి | ముహ్యథః | **ముహ్యథ** |
| | ముహ్యామి | ముహ్యావః | ముహ్యామః. |

*

**శ్లో॥ కృష్ణాయామపి తైర్నతైః పరివృతం దృష్ట్వా శ్వఫల్కాత్మజో**
**యం తుష్టావ గుణైరబద్ధమితరాన్ బద్ధానుదీర్య స్ఫుటమ్ ।**
**సేవాతుష్టహృదోఽపి దేవనికరాదప్రాప్తముక్తిం ప్రభు-**
**ర్యః ప్రాదాన్ముచుకున్దభూమిపతయే తైర్నిద్రితాయాప్యలమ్ ॥ 19-14**

**అ :** అక్రూరునకు యమునలో కనిపించిన కృష్ణునీ, ముచుకుందునకు మోక్షమిచ్చిన కృష్ణునీ నుతించుట.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణాయామ్ అపి శ్వఫల్క+ఆత్మజః నతైః తైః పరివృతం యం గుణైః అబద్ధమ్ ఇతరాన్ బద్ధాన్ స్ఫుటమ్ ఉదీర్య తుష్టావ, యః ప్రభుః సేవా-తుష్ట-హృదః అపి దేవ-నికరాత్ అప్రాప్త-ముక్తిం తైః అలం నిద్రితాయ అపి ముచుకున్ద-భూమి-పతయే ప్రాదాత్... (తస్య సర్వోత్తమత్వే కస్మాత్ ముహ్యథ?)

**ప్ర :** కృష్ణాయామ్ అపి = యమునానదిలో కూడా, శ్వఫల్క+ఆత్మజః = శ్వఫల్కుని కొడుకైన అక్రూరుడు (శ్వఫల్కస్య ఆత్మజః), నతైః = నమస్కరించిన, తైః = వారిచే (బ్రహ్మాదులచే), పరివృతమ్ = చుట్టబడిన (పరి-వృ ధాతువుపై క్త ప్రత్యయం), యమ్ = ఏ కృష్ణుని, గుణైః = సత్వరజస్తమోగుణాలచే, అబద్ధమ్ = బంధింపబడని వానినిగానూ, ఇతరాన్ = ఇతరులను, బద్ధాన్ = బంధింపబడిన వారినిగానూ, స్ఫుటమ్ = స్పష్టంగా, ఉదీర్య = చెప్పి (ఉద్-ఈర్ ధాతువుపై ల్యప్ ప్రత్యయం), తుష్టావ = స్తుతించాడో (స్తు స్తుతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), యః ప్రభుః = ఏ స్వామి, సేవా-తుష్ట-హృదః అపి : సేవా = సేవచేత, తుష్ట = ఆనందించిన, హృదః-అపి = మనస్సుగల, దేవ-నికరాత్ = దేవతాసమూహంనుండీ (దేవానాం నికరః, తస్మాత్), అప్రాప్త-ముక్తిమ్ : అప్రాప్త = లభించని, ముక్తిమ్ = మోక్షాన్ని, తైః = ఆ దేవతలచే, అలమ్ = తగినంతగా, నిద్రితాయ అపి = నిద్రింపజేయబడినా, ముచుకున్ద-భూమి-పతయే = ముచుకుందరాజుకు (ముచుకున్ద ఇతి భూమేః పతిః తస్మై), ప్ర+అదాత్ = ఇచ్చాడో (ప్ర-దా దానే జుహోత్యాది-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), తస్య = ఆ, ముర-భిదః = కృష్ణునకు, సర్వ+ఉత్తమత్వే = అందరికన్న మిన్న అనటంలో, కస్మాత్ = ఎందుకు? ముహ్యథ = మోహానికి లోనవుతున్నారు?

**తా ॥** యమునానదిలో అక్రూరుడు కృష్ణుని సందర్శించ గలిగాడు. అప్పుడు బ్రహ్మాదిదేవతలు వినమ్రతతో కృష్ణుని చుట్టూ నిలిచి వున్నారు. అప్పుడే చెప్పాడు అక్రూరుడు కృష్ణుడు గుణబద్ధుడు కాడనీ, ఇతర దేవతలు గుణబద్ధులనీ, అలాగే తన సేవలచేత ఆనందించిన దేవతలు కూడా ఇవ్వలేని ముక్తిని నిద్రకు లోనుజేయబడిన ముచుకుందునకు కృష్ణుడు ఇవ్వగలిగాడు. అయినా మానవులారా! మీకింకా మోహమెందుకు? కృష్ణుని సర్వోత్తమత్వాన్ని అంగీకరించటంలో.

**వి :** 1. అక్రూరుడు యమునలో సందర్శించిన కృష్ణుని రూపం-

సీ. ఆ భోగిభోగపర్యంకమధ్యంబున - వలనొప్పు పచ్చని వలువవాని
మేఘంబుపైనున్న మెఱుఁగు చందంబున - నురమున శ్రీదేవి యొప్పువాని
మునరు తేటులు విప్ప ముఖచతుష్కముగల - తనయుఁ డాడెడి బొడ్డుఁ దమ్మి వాని
కదలిన బహుపదక్రమవిశేషంబుల - రవము చూపెడి నూపురములవాని.

**జలజగర్భరుద్రసనకసనందన** - సద్ద్విజామరప్రశస్యమాన
చరతుఁడైన వాని సౌందర్యఖనియైన - వాని నొక్క పురుషవర్యుఁ గాంచి. -పోతనభాగవతము 10/1230

2. ముచుకుందునకు ముక్తినివ్వటం-

దేవతలకు కాపుదలగా నిలిచి రాక్షసులనుండి కాపాడేవాడు మోక్షంకావాలని వారిని వరమడిగితే వారు-

క. వరమిచ్చెదమర్థింపుము - ధరణీశ్వర! మోక్షపదవిదక్కను మే మె
వ్వరమును విభులము గామీ - శ్వరుఁ డగు హరిదక్క మోక్షసంగతిఁ జేయన్. -పోతనభాగవతము 10/1642

అనగా దీర్ఘనిద్రను వారినుండి కోరుకొని ఆ నిద్రలో వుండగా-

కాలయవనుని వెంటబడిన కృష్ణుడు ఆ గుహలో ప్రవేశించి అదృశ్యుడు కాగా, కాలయవనుడు ముచుకుందుని లేపి ఆ కంటిమంటతో బూడిదయ్యాడు. అప్పుడు కృష్ణుడు ముచుకుందునకు మోక్షాన్ని అనుగ్రహించాడు భవిష్యజ్జన్మలో-

| | | | |
|---|---|---|---|
| 3. **తుష్టావ :** | **తుష్టావ** | తుష్టువతుః | తుష్టువుః |
| | తుష్టోథ | తుష్టువథుః | తుష్టువ |
| | తుష్టావ | తుష్టువ | తుష్టుమ |
| **ప్రాదాత్ :** | **ప్రాదాత్** | ప్రాదాతామ్ | ప్రాదుః |
| | ప్రాదాః | ప్రాదాతమ్ | ప్రాదాత |
| | ప్రాదామ్ | ప్రాదావ | ప్రాదామ. |

*

**శ్లో॥ యః కల్పాంఘ్రిపమాహరన్ సురవరాన్ వ్యద్రావయత్ సేశ్వరాన్**
**యో భస్మీకృతభస్మదానవపతిః శమ్భుం పురాఽపాలయత్ ।**
**యోగీంద్రాదృతవైభవో భృగుమునిర్యచ్ఛ్రైష్ఠ్యమస్పష్టయత్**
**తం భక్త్యా భజతాజితం మధుజితం కైవల్యకామా జనాః! ॥ 19-15**

**అ :** కృష్ణుని సర్వోత్తమత్వనిరూపణం మరికొన్ని కారణాలతో. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** కైవల్య-కామాః జనాః! కల్ప-అంఘ్రి-పమ్ ఆహరన్ స+ఈశ్వరాన్ సుర-వరాన్ వ్యద్రావయత్ యః పురా భస్మీకృత-భస్మ-దానవ-పతిః (సన్) శంభుమ్ అపాలయత్ యోగి+ఇన్ద్ర+ఆదృత-వైభవః భృగు-మునిః యత్+శ్రైష్ఠ్యమ్ అస్పష్టయత్ తమ్ అజితం మధుజితం భక్త్యా భజత.

**ప్ర :** కైవల్య-కామాః = మోక్షాన్ని కోరుతున్న (కైవల్యం కామయన్త ఇతి), జనాః = జనులారా! యః = ఎవరయితే, కల్ప+అంఘ్రి-పమ్ = కల్పవృక్షాన్ని (అంఘ్రిభిః పిబతీతి, కల్ప ఇతి అంఘ్రిపః తమ్) (వృక్షోంఘ్రిపః క్షితిరుహః -హలాయుధకోశః-177), ఆహరన్ = కొనివస్తూ, స+ఈశ్వరాన్ = ఈశ్వరునితో సహ, సుర-వరాన్ = దేవశ్రేష్ఠులను (సురాణాం వరాః, తాన్), వి+అద్రావయత్ = పారద్రోలాడో (వి-ద్రు గతౌ ణిచ్-పరస్మైపది-లఙ్-ప్ర.ఏ.), యః = ఎవరయితే, పురా = గతంలో, భస్మీ... పతిః (సన్) : భస్మీకృత = బూదిచేయబడిన, భస్మ-

దానవ-పతిః (సన్) = భస్మాసురరాజుగలవాడై, శంభుమ్ = శివుని, అపాలయత్ = రక్షించాడో (పాల్ రక్షణే-పరస్మైపది-లఙ్-(ప్ర.ఏ.), యోగీ... వైభవః : యోగి+ఇంద్ర = యోగివరులచే, ఆదృత = ఆదరింపబడిన, వైభవః = వైభవంగల (యోగీన్ద్రైః ఆదృతం వైభవం యస్య సః), భృగు-మునిః = భృగుమహర్షి, యత్+శ్రైష్ఠ్యమ్ = ఎవని శ్రేష్ఠతను, అస్పష్టయత్ = స్పష్టంచేశాడో (స్పశ్ బాధనస్పర్శనయోః ధాతువుపై క్త ప్రత్యయం '**స్పష్ట**' రూపం-అది నామధాతువు-లఙ్-(ప్ర.ఏ.), తమ్ = ఆ, అజితమ్ = ఓటమి నెరుగని, మధు-జితమ్ = కృష్ణుని (మధుం జితవాన్ ఇతి, మధుజిత్-తమ్), భక్త్యా = భక్తితో, భజత = సేవించండి. (భజ సేవాయాం పరస్మైపది-లోట్-మ.ఏ.).

**తా ॥** మోక్షార్థులైన జనులారా! మురారిని భక్తితో సేవించండి. ఆయన, తాను కల్పవృక్షాన్ని స్వర్గంనుండి కొనిపోతూ శివునితో సహ దేవతాశ్రేష్ఠులను జయించాడు. భస్మాసురుని బూడిదచేసి ఆ దానవునినుండీ పరమశివుని కాపాడాడు. యోగివర్యులందరూ ఆదరించే వైభవంగల భృగుమహర్షి కూడా ఆయన శ్రేష్ఠతను స్పష్టం చేశాడు.

**వి :** 1. కృష్ణుడు సత్యభామ అలక తీర్చటానికై పారిజాతాన్ని స్వర్గంనుండి తెస్తాడు. అప్పుడు ఇంద్రునితో పోరు. కానీ శంకరుని ప్రస్తావన ఆ సందర్భంలో వుండదు. పారిజాతాపహరణ కథ హరివంశంలో వుంటుంది. కానీ బాణాసురుని నుండి అనిరుద్ధుని విడిపించే సందర్భంలో బాణునకు సహాయంగా వచ్చిన శంకరునితో కృష్ణుని పోరు. శంకరుని లొంగుబాటు కనిపిస్తుంది.

శ్రీరుద్ర ఉవాచ :

శ్లో॥ అహం బ్రహ్మాథ విబుధా మునయశ్చామలాశయాః ।
సర్వాత్మనా ప్రపన్నాస్త్వామాత్మానం ప్రేష్ఠమీశ్వరమ్ ॥ ... ...

శ్లో॥ అయం మమేష్టో దయితోఽనువర్తీ - మయాఽభయం దత్తమముష్య దేవ ।
సంపాద్యతాం తద్భవతః ప్రసాదో - యథా హి తే దైత్యపతౌ ప్రసాదః ॥- భాగవతమ్ 10/63/43,45

2. భస్మాసురుడి అసలు పేరు వృకాసురుడు. ఆ దానవుడికి వరమిచ్చి ఇబ్బంది కొనితెచ్చు కొన్నప్పుడు ఆ సంకటంనుండి శివుని బయటపడవేసింది నారాయణుడే.

శ్లో॥ ఇత్థం భగవతశ్చిత్రైర్వచోభిః స సుపేశలైః ।
భిన్నధీర్విస్మితః శీర్ష్ణి సహస్తం కుమతిర్న్యధాత్ ॥

శ్లో॥ అథాఽతద్భిన్నశిరా వజ్రాహత ఇవ క్షణాత్ ।
జయశబ్దో నమశ్శబ్దః సాధుశబ్దో2భవద్దివి ॥

శ్లో॥ ముముచుః పుష్పవర్షాణి హతే పాపే వృకాసురే ।
దేవర్షిపితృగంధర్వా మోచితస్సంకటాచ్ఛివః ॥ - భాగవతమ్ 10/88/35-37

3. త్రిమూర్తులలో ఎవరు గొప్ప? అన్న మీమాంసతో దానిని నిర్ణయించటానికి దేవతలు భృగుమహర్షిని నియమించగా ఆయన తనదైన శైలితో నారాయణుడే సర్వోన్నతుడని నిర్ణయించాడు.

| | | | |
|---|---|---|---|
| 4. **వ్యద్రావయత్ :** | **వ్యద్రావయత్** | వ్యద్రావయతామ్ | వ్యద్రావయన్ |
| | వ్యద్రావయః | వ్యద్రావయతమ్ | వ్యద్రావయత |
| | వ్యద్రావయమ్ | వ్యద్రావయావ | వ్యద్రావయామ |
| **అపాలయత్ :** | **అపాలయత్** | అపాలయతామ్ | అపాలయన్ |
| | అపాలయః | అపాలయతమ్ | అపాలయత |
| | అపాలయమ్ | అపాలయావ | అపాలయామ |

| | | | |
|---|---|---|---|
| **అస్పృష్టయత్ :** | **అస్పృష్టయత్** | అస్పృష్టయతామ్ | అస్పృష్టయన్ |
| | అస్పృష్టయః | అస్పృష్టయతమ్ | అస్పృష్టయత |
| | అస్పృష్టయమ్ | అస్పృష్టయావ | అస్పృష్టయామ |
| **భజత :** | భజతు/భజతాత్ | భజతామ్ | భజన్తు |
| | భజ/భజతాత్ | భజతమ్ | **భజత** |
| | భజాని | భజావ | భజామ. * |

**శ్లో॥ కైలాసయాత్రాదిభిరూనభావో - యద్యస్య తర్హ్యేకవచో వృథా స్యాత్ ।**
**లీలేతి వాచ్యం భవతా వయం తు - పౌత్రాలయప్రాప్తిముపేక్షయామః ॥ 19-16**

**అ :** శివునికన్న కృష్ణునకు న్యూనతను శంకించి పరిహరించటం. -ఇంద్రవజ్ర.

**అ :** యది కైలాస-యాత్రా+ఆదిభిః అస్య ఊనభావః తర్హి ఏక-వచః వృథా స్యాత్. భవతా లీలా ఇతి వాచ్యం వయం తు పౌత్ర+ఆలయ-ప్రాప్తిమ్ ఉపేక్షయామః

**ప్ర :** యది = ఒకవేళ, కైలాస-యాత్రా+ఆదిభిః = కైలాసయాత్ర మొదలగువాటిచే (కైలాసం ప్రతి యాత్రా ఆదౌ యేషాం తైః), అస్య = ఈ కృష్ణునకు, ఊన-భావః = తక్కువదనమైతే, తర్హి = అప్పుడు, ఏక-వచః = ఒకటే అనుమాట (శివకేశవాభేదవచనం), వృథా స్యాత్ = వ్యర్థమవుతుంది. (అస భువి-అదాది-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), భవతా = నీచే, లీలా ఇతి = వినోదమని (కైలాసయాత్ర), వాచ్యమ్ = చెప్పదగినది. వయం తు = మేమైతే, పౌత్ర+ఆలయ-ప్రాప్తిమ్ = మనుమని ఇంటికి వెళ్ళటాన్ని, ఉపేక్షయామః = అసలు పట్టించుకోము. (ఉప+ఈక్ష దర్శనే-ణిచి-పరస్మైపది-లట్-ఉ.బ.).

**తా ॥** కృష్ణుడు కైలాసయాత్రద్వారా శంకరుని దగ్గరకు వెళ్ళాడు కాబట్టి శంకరుని కన్న కృష్ణుడు తక్కువ అనేటట్లయితే శివకేశవులకు భేదంలేదు అనేమాట వ్యర్థమైపోతుంది. తక్కువవాడు సమానుడు కాలేడు గదా! మరి శివునిదగ్గరకు కృష్ణుడు ఎందుకు వెళ్ళాడంటే అదొక లీలగా మీరంటారు. మేముమాత్రం అసలు పట్టించుకోము. ఎందుకంటే తాత మనవడి ఇంటికి వెళ్లాడు. అంతేకదా!

**వి :** 1. కృష్ణుడు శంకరుని ఆరాధించి సంతానాన్ని పొందినట్లు చెప్పటం, రామేశ్వరాదుల్లో శివలింగ ప్రతిష్ఠచేయటం వంటివి శంకరుని ఆధిక్యాన్ని ప్రకటిస్తున్నాయి గదా అంటే అది లీలమాత్రమే అని కవి సమర్థిస్తున్నాడు. మనవడి ఇంటికి తాత వెళ్ళటాన్ని గురించి అసలు పట్టించుకోనవసరం లేదనీ, దానిని మేము ఉపేక్షిస్తామని కవి కృష్ణుని సర్వోన్నతత్వాన్ని నిర్ధారిస్తున్నాడు.

| | | | |
|---|---|---|---|
| 2. **ఉపేక్షయామః :** | ఉపేక్షయతి | ఉపేక్షయతః | ఉపేక్షయన్తి |
| | ఉపేక్షయసి | ఉపేక్షయథః | ఉపేక్షయథ |
| | ఉపేక్షయామి | ఉపేక్షయావః | **ఉపేక్షయామః.** * |

**శ్లో॥ యుధిష్ఠిరస్యాలయమేవ గచ్ఛం-స్తథా ద్విజాదీన్ యమినః సమర్చన్ ।**
**తతోఽపి నీచః కిమయం నృలోకే - నరానుకారార్థమిదం హి సర్వమ్ ॥ 19-17**

**అ :** కృష్ణుని మానవతాప్రవృత్తిని మానవలక్షణానుకరణమాత్రంగా ప్రతిపాదించటం.

**అ :** యుధిష్ఠిరస్య ఆలయమ్ ఏవ గచ్ఛన్, తథా ద్విజ+ఆదీన్ యమినః సమర్చన్ అయం తతః అపి నీచః కిమ్? ఇదం సర్వం నృ-లోకే నర+అనుకార+అర్థం హి.

**ప్ర :** యుధిష్ఠిరస్య = ధర్మరాజుయొక్క (యుధిష్ఠిరః తస్య), ఆలయమ్ = ఇంటికి, గచ్ఛన్ = వెళ్తూ, తథా = అదేవిధంగా, ద్విజ+ఆదీన్ = బ్రాహ్మణుడు మొదలుగాగల (ద్విజాః ఆదౌ యేషాం తాన్), యమినః = మునులను (బ్రహ్మర్షులైన నారదాదులను), సమర్చన్ = పూజిస్తూ/గౌరవిస్తూ, అయమ్ = ఈ కృష్ణుడు, తతః అపి = వారికన్న కూడా, నీచః కిమ్? = తక్కువవాడా?, ఇదం సర్వమ్ = ఇదంతా (ఈ ప్రవర్తన అంతా), నృ-లోకే = మానవలోకంలో (నృణాం లోకః తస్మిన్), నర+అనుకార+అర్థం హి : నర = మానవుని యొక్క, అనుకార+అర్థం హి = అనుకరణమే ప్రయోజనంగా గలది గదా! (నరాణామ్ అనుకారః ఏవ అర్థం యస్య తత్)

**తా ॥** కృష్ణుడు యుధిష్ఠిరుని ఇంటికి వెళ్ళాడు. బ్రహ్మర్షులను అర్చించాడు. అంతమాత్రంచేత వారికన్న తక్కువవాడు అందామా? మానవలోకంలో వున్నాడు కాబట్టి మానవవృత్తిని తాను అనుసరించటమే ఇదంతా.

**వి :** 1. శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥ - భగవద్గీత - 3/21

అనిగీతలో తాను చెప్పినట్లు నరులకు ఆదర్శంగా నిలవటం కోసమే కృష్ణుని మానవానుకరణరూపమైన ప్రవర్తనం. అది న్యూనతకు కారణం కాలేదు. *

**శ్లో॥ యదీహ శఙ్కా విపరీతభావే - తదా నరాః సన్తి కిమాత్మలోకాత్ ।**
**పయోఽబ్ధితీరం వ్రజతో విధాతుః - శివస్య చ స్వాలయతో గతస్య ॥19-18**

**అ :** కృష్ణుని ప్రవర్తనలాగా బ్రహ్మాదుల ప్రవర్తన కూడా నరానుకారార్థమెందుకు కాకూడదు? అని ప్రశ్నించి సమాధానమివ్వటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఇహ విపరీత-భావే శంకా యది తదా ఆత్మ-లోకాత్ పయః+అబ్ధి-తీరం వ్రజతః విధాతుః స్వ+ఆలయతః గతస్య శివస్య చ నరాః సన్తి కిమ్?

**ప్ర :** ఇహ = ఈ విషయంలో, విపరీత-భావే = తారుమారుచేసి ఆలోచించటంలో (విపరీతశ్చ అసౌ భావః, తస్మిన్), శంకా యది = అనుమానమున్నట్లైతే, తదా = అప్పుడు, ఆత్మ-లోకాత్ = తన సత్యలోకంనుండి (ఆత్మనః లోకః, తస్మాత్), పయః+అబ్ధి-తీరమ్ = పాలకడలి ఒడ్డుకు (పయసామ్ అబ్ధేః తీరమ్), వ్రజతః = వెళ్తున్న, విధాతుః = బ్రహ్మకు, స్వ+ఆలయతః = తనకైలాసంనుండి (స్వస్య ఆలయాత్), గతస్య = వెళ్ళిన, శివస్య చ = శివునికీ కూడా, నరాః సన్తి కిమ్? = మానవులున్నారా? (అస భువి-అదాది-పరస్మైపది-లట్-ప్ర.బ.)

**తా ॥** కృష్ణుని కైలాసయాత్ర కృష్ణునకు న్యూనత్వాన్ని కల్గించదన్నట్లుగానే, బ్రహ్మశివాదులు క్షీరసాగరతీరానికి వెళ్ళటం కూడా వారికి న్యూనత్వాన్ని కల్గించదనవచ్చు గదా! అది కూడా నరానుకరణమే గదా అంటే నిజమే. కానీ వారు అక్కడ ఏ నరులను అనుకరించారు? అసలు అక్కడ నరులే లేరు గదా! (కాబట్టి వారు కృష్ణుని ప్రార్థించటం కృష్ణుని సర్వోన్నతత్వానికి సంకేతమే)

**వి :** 1. సన్తి :19-6వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ ఉక్తాః కిమర్థాః నరదృష్టిగమ్యాః - స్వస్థానసంస్థై రచితాః సమస్తాః ।**
**అత్రాప్యదృశ్యాకృతిభిర్మునీంద్ర-విజ్ఞానదృష్టేరపి దూరదూరైః ॥ 19-19**

**అ :** రుద్ర బ్రహ్మాదుల నరానుకారార్థత్వాన్ని మరోరీతిగా కూడా ఖండించటం. -ఇంద్రవజ్ర.

**అ :** స్వస్థాన-సంస్థైః రచితాః ఉక్తాః అర్థాః సమస్తాః నర-దృష్టి-గమ్యాః కిమ్? అత్ర అపి అదృశ్య+ఆకృతిభిః ముని+ఇంద్ర-విజ్ఞాన-దృష్టేః అపి దూర-దూరైః (రచితాః అర్థాః నర-దృష్టి-గమ్యాః కిమ్?)

ప్ర : స్వ-స్థాన-సంస్థైః : స్వ-స్థాన = తమ తమ తావులందే, సంస్థైః = ఉన్నట్టి బ్రహ్మాదులచే (స్వేషాం స్థానాని, తేషు సమ్యక్ తిష్ఠంతీతి, తైః), రచితాః = చేయబడిన, ఉక్తాః అర్థాః = (ముందు) చెప్పిన పనులు, సమస్తాః = అన్నీ, నర-దృష్టి-గమ్యాః కిమ్ : నర = నరులయొక్క, దృష్టి = చూపులచే, గమ్యాః కిమ్? = చేరదగినవా?, అత్ర+అపి = ఈ లోకంలో కూడా, అదృశ్య+ఆకృతిభిః = కనిపించని రూపాలతో వున్న (అదృశ్యాః ఆకృతయః యేషాం తైః), ముని... దృష్టేః అపి : ముని+ఇంద్ర = ఋషిశ్రేష్ఠులయొక్క, విజ్ఞాన-దృష్టేః అపి = తెలివి కనుకలికి కూడా (మునీనాం ఇంద్రాః తేషాం విజ్ఞానమ్ ఏవ దృష్టిః తస్యాః), దూర-దూరైః = మరీ దూరంగా వున్న బ్రహ్మాదులచే (దూరాదపి దూరాః, తైః), (రచితాః = చేసిన, అర్థాః = పనులు, నర-దృష్టి-గమ్యాః కిమ్ = నరులకు కనిపించేవా?)

**తా ॥** (బ్రహ్మశివులకు ఆయా లోకాలలో నరులు లేకున్నా ఈ లోకంలోని నరుల అనుకరణం కోసం వారి పనులు అనలేము) ఎందుకంటే వారి వారి స్థానాలలో స్థిరంగా వుండి వారు చేసిన పనులు ఈ లోకంలోని నరులకు కనిపించేవి కావు. వారు ఈ లోకంలోనికి వచ్చి చేసిన పనులైనా వారు అదృశ్యరూపులు కాబట్టి ఇక్కడి మహర్షుల జ్ఞానదృష్టికి కూడా కనిపించనంత దూరంలో వారున్నారు. *

**శ్లో॥ పురోగ్రభస్మాసురఘాతకాలే - నరానుకారస్య హి కాస్తి యుక్తిః ।**
**మునేశ్చ సత్తత్త్వవిచారహేతో-ర్గతస్య మర్త్యానుకృతిః కిమర్థా ॥ 19-20**

**అ :** శివునిలో, భృగుమహర్షిలో నరానుకరణాన్ని అధిక్షేపించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** పురా ఉగ్ర-భస్మాసుర-ఘాత-కాలే నర+అనుకారస్య యుక్తిః కా (అస్తి)? సత్-తత్త్వ-విచార-హేతోః గతస్య మునేః చ మర్త్య+అనుకృతిః కిమర్థా?

**ప్ర :** పురా=పూర్వం, ఉగ్ర-భస్మ+అసుర-ఘాత-కాలే : ఉగ్ర = భయంకరుడైన, భస్మ+అసుర = భస్మాసురుని (వృకాసురుని)యొక్క, ఘాత-కాలే = సంహారసమయంలో (ఉగ్రస్య భస్మాసురస్య ఘాతస్య కాలః, తస్మిన్), నర+అనుకారస్య = నరులను అనుకరించటంలో (పారిపోవటంలో), యుక్తిః = ఉపపత్తి, కా? = ఏది?, సత్... హేతోః : సత్ = వాస్తవికమైన, తత్త్వ = తత్త్వాన్ని, విచార = విచారణ, హేతోః = కారణంగా (సచ్చ తత్ తత్త్వం తస్య విచారః స ఏవ హేతుః తస్య), గతస్య = వెళ్ళినట్టి, మునేః చ = ఋషి అయిన భృగువునకు, మర్త్య+అనుకృతిః = మానవానుకరణం (మర్త్యస్య అనుకృతిః), కిమర్థా? = ఎందుకోసం?

**తా ॥** పూర్వం భస్మాసురుని సంహరించే సమయంలో శివుడు నరుని అనుకరించటంలో (పారిపోవటంలో) యుక్తి ఏముంది? త్రిమూర్తులలో ఎవరు మిన్న అనే తత్త్వాన్ని విచారించటానికి వెళ్ళిన భృగుమహర్షికి నరానుకరణమెందుకు?

**వి :** 1. దేవతలయినా, మానవాకృతితో అవతరించినప్పుడు చేస్తున్న నరానుకరణం నరులకు మార్గదర్శకం కావాలి. శివుడు తనను తాను రక్షించుకొనే ప్రయత్నం చేయకుండా పారిపోవటం ఏవిధమైన ఆదర్శమవుతుందని కవి ప్రశ్న.

2. **అస్తి :** 19-6వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ మర్త్యానుకారోఽపి హి మర్త్యలోకం - ప్రాప్తస్య యుక్తో నరదృష్టిమార్గే ।**
**కైలాసశైలం స్వజనస్య మధ్యే - విజ్ఞాప్య కృష్ణోఽగమదాగమచ్చ ॥ 19-21**

**అ :** కృష్ణుని మర్త్యానుకరణంలోని ఔచిత్యాన్ని వివరించటం. -ఇంద్రవజ్ర.

**అ :** హి మర్త్య-లోకం ప్రాప్తస్య మర్త్య+అనుకారః అపి యుక్తః (తతః) స్వ-జనస్య మధ్యే నర-దృష్టి-మార్గే విజ్ఞాప్య కృష్ణః కైలాస-శైలమ్ అగమత్ ఆగమత్ చ.

**ప్ర :** హి = ఏ కారణంగా, మర్త్య - లోకమ్ = మానవ లోకానికి (మర్త్యానాం లోకః, తమ్), ప్రాప్తస్య = చేరినవానికి, మర్త్య+అనుకారః అపి = మానవులను అనుకరించుట కూడా (మర్త్యానామ్ అనుకారః), యుక్తః = తగినదో, తతః = ఆ కారణంగా, స్వజనస్య మధ్యే = తనవారిలో, నర-దృష్టి-మార్గే : నర = మానవులయొక్క, దృష్టి = దర్శనాన్ని అనుసరించిన, మార్గే = పద్ధతిలో, విజ్ఞాప్య = తెలిపి, కైలాస-శైలమ్ = కైలాసపర్వతానికి (వెండి కొండకు) కైలాస ఇతి శైలః, తమ్), అగమత్ = వెళ్ళాడు, ఆగమత్ చ = (తిరిగి) వచ్చాడు. (ఆ గమ్ గతౌ-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** కృష్ణుడు మర్త్యలోకంలో అవతరించి వున్నాడు కాబట్టి మర్త్యానుకరణం కృష్ణునకు సమంజసమే. అందుకే కృష్ణుడు మానవప్రవర్తనను అనుకరిస్తూ తనవారి మధ్యలో తన కైలాసయాత్రను గురించి ప్రకటించియే కైలాసపర్వతానికి వెళ్ళాడు, తిరిగి వచ్చాడు కూడా.

| | | | | |
|---|---|---|---|---|
| **వి : 1. ఆ+అగమత్ :** | **అగమత్** | అగమతామ్ | అగమన్ | |
| | అగమః | అగమతమ్ | అగమత | |
| | అగమమ్ | అగమావ | అగమామ. | * |

**శ్లో॥ యదా స పుత్రం నిజనాభిజాత-కుశేశయాత్ ప్రాగ్జనయామ్బభూవ ।**
**తదా శివః కుత్ర వరస్య దాతా - తదీయఫాలాన్తరజన్మభూమిః ॥ 19-22**

**అ :** శివారాధనవల్లనే కృష్ణుడికి పుత్రప్రాప్తి కాబట్టి శివునకు కృష్ణునకన్న ఆధిక్యమెందు కుండదు? అని శంకించి ఖండించటం. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః ప్రాక్ నిజ-నాభి-జాత-కుశేశయాత్ యదా పుత్రం జనయామాస తదా తదీయ-ఫాల+అంతర-జన్మ-భూమిః వరస్య దాతా శివః కుత్ర?

**ప్ర :** సః = ఆ కృష్ణుడు, ప్రాక్ = పూర్వం, నిజ... యాత్ : నిజ = తనయొక్క, నాభి = బొడ్డునుండి, జాత = పుట్టిన, కుశేశయాత్ = నూరురేకుల తామరనుండి (శతపత్రం కుశేశయమ్-అమరకోశః-వారి-40) (నిజస్య నాభిః తస్మాత్ జాతం చ తత్ కుశేశయం తస్మాత్), యదా = ఎప్పుడు, పుత్రమ్ = కుమారుని (బ్రహ్మను) జనయామ్బభూవ = కన్నాడో (జనీ ప్రాదుర్భావే-ణిచ్-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), తదా = అప్పుడు, తదీయ... భూమిః : తదీయ = ఆ బ్రహ్మయొక్క, ఫాల+అంతర = నుదుటినడిమితావే, జన్మ-భూమిః = పుట్టుకతావుగా గలవాడూ (తదీయం ఫాలస్య అంతరమేవ జన్మనః భూమిః యస్య సః), వరస్య = వరానికి, దాతా = దాత అయిన, శివః = శంకరుడు, కుత్ర? = ఎక్కడున్నాడు?

**తా ॥** నారాయణుడు (కృష్ణుడు) తన నాభినుండి పుట్టిన తామరనుండి బ్రహ్మను కన్నప్పుడు ఆ బ్రహ్మ నుదుటినుండి పుట్టిన శివుడు-వరదాత-ఎక్కడున్నాడు?

**వి :** 1. శివుని వరంతో కృష్ణుడు సంతానాన్ని పొందాడన్న అభిప్రాయానికే ఇది ఖండన. కృష్ణుని మనుమడుగా వున్నవాడు కృష్ణునికి సంతానప్రాప్తికి వరమివ్వట మేమిటన్నది యుక్తి.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **జనయామ్ బభూవ :** | **బభూవ** | బభూవతుః | బభూవుః | |
| | బభూవిథ | బభూవథుః | బభూవ | |
| | బభూవ | బభూవివ | బభూవిమ. | * |

**శ్లో॥ యద్వాహనీభూతగరుత్మదోజో - విద్రావయామాస పినాకపాణిమ్ ।**
**తస్య ప్రసాదాత్ స సుతం జగామే-త్యుక్తిర్న విద్వజ్జనమాననీయా ॥ 19-23**

**అ :** శివానుగ్రహంవలన కృష్ణుడు సంతతిని పొందాడనటం పండితసమ్మతం కాదనుట. -ఇంద్రవజ్ర.

**అ :** యద్-వాహనీభూత-గరుత్మద్-ఓజః పినాక-పాణిం విద్రావయామాస సః తస్య ప్రసాదాత్ సుతం జగామ ఇతి ఉక్తిః విద్వత్-జన-మాననీయా న (భవతి).

**ప్ర :** యద్... దోజః : యద్ = ఎవనియొక్క, వాహనీభూత = వాహనమైన, గరుత్మత్ = గరుడునియొక్క, ఓజః = బలం (ఓజో దీప్తౌ బలే అమరకోశః-నానార్థ-235) (యస్య వాహనీభూతః చ అసౌ గరుత్మాన్, తస్య ఓజః), పినాక-పాణిమ్ = శివుని (పినాకః పాణౌ యస్య, తమ్), వి-ద్రావయామాస = పరుగెత్తింపజేసిందో (వి-ద్రు గతౌ ణిచ్ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), సః = ఆ కృష్ణుడు, తస్య = ఆ శివునియొక్క ప్రసాదాత్ = అనుగ్రహం వల్ల, సుతమ్ = కొడుకును, జగామ = పొందాడు (గమ్ గతౌ పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), ఇతి = అనే, ఉక్తిః = మాట (వచ ధాతువుపై క్తిన్ ప్రత్యయం), విద్వత్+జన-మాననీయా : విద్వత్+జన = పండితజనంచేత, మాననీయా = గౌరవింపదగినది (విద్వాంసః చ తే జనాః, తైః మాననీయా), న (భవతి) = కాలేదు.

**తా ॥** కృష్ణునకు వాహనమైన గరుడుని బలం శంకరుని పరుగెత్తింపజేసింది. అటువంటప్పుడు ఆ శంకరుని అనుగ్రహం వల్ల కృష్ణుడు కుమారుని పొందాడన్న మాటను పండితులు ఆదరించరు.

**వి :** 1. కృష్ణుడు సత్యభామకోసం పారిజాతాన్ని తెచ్చే సందర్భంలో గరుత్మంతుని పరాక్రమ వర్ణన కనిపిస్తుంది.

శ్లో॥ శివం చ శక్రార్థముపాగతం హరి-ర్వ్యద్రావయచ్ఛార్ఙ్గవినిస్సృతైశ్శరైః ।
**సవాహనో దూరతరే నిపాతితో - గరుత్మతా శంభురగాచ్ఛరాహతః ॥**

- మహాభారతతాత్పర్యనిర్ణయః - 20/129

2. **విద్రావయామాస :**

| | | | |
|---|---|---|---|
| | విద్రావయామాస | విద్రావయామాసతుః | విద్రావయామాసుః |
| | విద్రావయామాసిథ | విద్రావయామాసథుః | విద్రావయామాస |
| | విద్రావయామాస | విద్రావయామాసివ | విద్రావయామాసిమ |
| **జగామ :** | **జగామ** | జగ్మతుః | జగ్ముః |
| | జగమిథ/జగన్థ | జగ్మథుః | జగ్మ |
| | జగామ/జగమ | జగ్మివ | జగ్మిమ. |

*

**శ్లో॥ మదన్యసేవైహికకామదాత్రీ-త్యుదీరయన్ సర్వసురాగ్రగణ్యః ।**
**స్వపౌత్రయాత్రాం విరచయ్య సూను-మవాప పాపౌఘతమిస్రభానుః ॥ 19-24**

**అ :** శివపూజ తన పూజకన్న తక్కువదే అని నిరూపించటానికే కృష్ణుడు శివుని ఆరాధించాడనుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** మద్-అన్య-సేవా ఐహిక-కామ-దాత్రీ ఇతి ఉదీరయన్ సర్వ-సుర-అగ్ర-గణ్యః పాప+ఓఘ-తమిస్ర-భానుః (కృష్ణః) స్వ-పౌత్ర-యాత్రాం విరచయ్య సూనుమ్ అవాప.

**ప్ర :** మద్-అన్య-సేవా : మద్-అన్య = నాకన్న ఇతరులయొక్క, (మత్ అన్యేషాం సేవా), సేవా = సేవించుట (పూజించుట), ఐహిక-కామ-దాత్రీ : ఐహిక = ఈ లోకానికి చెందిన, కామ = కోరికలను (మాత్రమే), దాత్రీ = ఇచ్చేది (ఐహికానాం కామానాం దాత్రీ), ఇతి = అని, ఉదీరయన్ = చెప్తూ (ఉద్ ఈర్ ధాతువుపై శతృ

ప్రత్యయం), సర్వ... గణ్యః : సర్వ-సుర = దేవతలందరిలో, అగ్ర = ముందుగా, గణ్యః = లెక్కింపదగినవాడూ (సర్వే చ తే సురాః, తేషామ్ అగ్రే గణ్యః), పాపౌ... భానుః : పాప = పాపాలయొక్క, ఓఘ = సమూహ మనే, తమిస్ర = చీకటికి, భానుః = సూర్యునివంటివాడూ అయిన (పాపానామ్ ఓఘః, స ఏవ తమిస్రం, తస్య భానుః), (కృష్ణః = కృష్ణుడు), స్వ-పౌత్ర-యాత్రామ్ = తన మనవడి దగ్గరకు ప్రయాణాన్ని (స్వస్య పౌత్రః తం ప్రతి యాత్రా, తామ్), విరచయ్య = చేసి, సుతమ్ = కొడుకును, అవ+ఆప = పొందాడు. (అవ ఆప్ వ్యాప్తౌ-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥ 'నన్ను తప్ప ఇతరులను ఎవరిని సేవించినా అది ఐహికసుఖాలను మాత్రమే ఇవ్వగలదు'** అని చెప్పటానికి సర్వదేవాగ్రగణ్యుడు, పాపసమూహమనే చీకటికి సూర్యుడు అయిన కృష్ణుడు తనమనవడైన శంకరుని దగ్గరకు ప్రయాణం చేసి ఆయన అనుగ్రహంతో కుమారుని పొందాడు.

**వి :** 1. కృష్ణుని తప్ప ఇతరులను సేవిస్తే లౌకికకామాలు తీరవచ్చును కానీ పారమార్థికమై పరమపురుషార్థమైన మోక్షసిద్ధిమాత్రం తనను సేవిస్తేనే కలుగుతుంది అని కృష్ణ వివక్ష.

శ్లో॥ కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽ**న్యదేవతాః** ।
తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా ॥

శ్లో॥ బహూనాం జన్మనా మన్తే **జ్ఞానవాన్ మాం ప్రపద్యతే** ।
**వాసుదేవస్సర్వమితి** స మహాత్మా సుదుర్లభః ॥ - భగవద్గీత - 3/19,20

చిల్లర కోరికలు గలవారు చిల్లరదేవుళ్ళను ఆశ్రయిస్తారు. జ్ఞాని 'వాసుదేవుడే సర్వ'మని గ్రహించి చాలా జన్మల తరువాత నన్ను చేరుతాడు- అని చెప్పటంలోని ఆంతర్యాన్ని స్వపౌత్ర యాత్రారూపంగా చేసి చూపాడని కవి ప్రతిపాదన.

| | | | |
|---|---|---|---|
| 2. **అవాప :** | **అవాప** | అవాపతుః | అవాపుః |
| | అవాపిథ | అవాపథుః | అవాప |
| | అవాప | అవాపివ | అవాపిమ. |

*

**శ్లో॥ ఆనన్దామ్బుధిమగ్నమూర్తిరుదయన్మోదాశ్రుధారాజలం**
**భర్త్రఙ్ఘ్రౌ ప్రణిధాయ కాయకనకం కృష్ణార్పితం యాఽతనోత్ ।**
**యా తద్గాత్రహరిన్మణిం కరవశం చక్రేఽనవాప్తోఽనయా**
**కోఽర్థో యా కమలా విముక్తకబరీ గర్భే దధార స్మరమ్ ॥ 19-25**

**అ :** రుక్మిణికి పురుషార్థసంప్రాప్తి. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ఆనంద+అంబుధి-మగ్న-మూర్తిః యా ఉదయత్+మోద+అశ్రు-ధారా-జలం భర్తృ+అంఘ్రౌ ప్రణిధాయ, కాయ-కనకం కృష్ణ+అర్పితమ్ అతనోత్ యా తద్-గాత్ర-హరిత్+మణిం కర-వశం చక్రే యా కమలా విముక్త-కబరీ స్మరం గర్భే దధార అనయా కః అర్థః అనవాప్తః?

**ప్ర :** ఆనంద... మూర్తిః : ఆనంద+అంబుధి = ఆనందసాగరంలో, మగ్న = మునిగిన, మూర్తిః = శరీరంగలదై (ఆనంద ఏవ అంబుధిః, తస్మిన్ మగ్నా మూర్తిః యస్య సః), యా = ఎవర్తుక, ఉదయ... జలమ్ : ఉదయత్ = ఉబుకుతున్న, మోద+అశ్రు = ఆనందబాష్పాల యొక్క, ధారా = ధారగానున్న, జలమ్ = నీటిని (ఉదయతాం మోదేన జాతానామ్ అశ్రూణామ్ ధారాయాః జలమ్), భర్తృ+అంఘ్రౌ = భర్తకాలిపై (భర్తుః అంఘ్రిః, తస్మిన్), ప్రణిధాయ = నిలిపి (ప్ర-ని-ధా ధాతువుపై ల్యప్ ప్రత్యయం), కాయ-కనకమ్ = శరీరమనే బంగారాన్ని (కాయ

ఏవ కనకమ్), కృష్ణ+అర్పితమ్ : కృష్ణ = కృష్ణుని కొరకు, అర్పితమ్ = సమర్పింపబడిన దానినిగా, అతనోత్ = చేసిందో (తనూ విస్తారే పరస్మైపది లజ్ ప్ర.ఏ.), యా = ఎవర్తుక, తద్... మణిమ్ : తద్ = ఆయనయొక్క, గాత్ర = శరీరమనే, హరిత్+మణిమ్ = పచ్చను (తస్య గాత్రం, తదేవ హరిన్మణిః, తమ్), కర–వశమ్ = చేతికి చిక్కినదిగా (కరస్య వశః తమ్), చక్రే = చేసికొన్నదో (కృ కరణే ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.), యా కమలా = ఏ లక్ష్మి, విముక్త–కబరీ (సతీ) : విముక్త = విడివడిన, కబరీ (సతీ) = కొప్పుగలదై (విముక్తా కబరీ యస్యాస్సా), స్మరమ్ = మదనుని, గర్భే = గర్భమందు, దధార = ధరించిందో (ధృ ధారణే భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.), అనయా = ఆ ఈ రుక్మిణిచే, కః అర్థః = ఏ పురుషార్థం, అనవాప్తః? = పొందబడలేదు!

**తా ॥** రుక్మిణి ఆనందసాగరంలో మునిగి ఆనందాశ్రుధారాజలంతో కృష్ణునిపాదాలపై తన శరీరమనే బంగారాన్ని సమర్పించింది. ఆయన శరీరమనే ఇంద్రనీలమణిని తన చేతులలోనికి తెచ్చుకొన్నది. విముక్త కబరియై మదనుని తన గర్భమందు ధరించింది. ఇక ఆమె పొందని అర్థమేముంది?

**వి :** 1. శ్లోకంలో రుక్మిణీ పరంగా మూడు విశేషణాలు కనిపిస్తున్నాయి. అవి మూడు ధర్మ–అర్థ–కామ పురుషార్థ సూచకాలు... అందుకే 'కః అర్థః అనవాప్తః?' అని కవి ప్రశ్నించింది. ఇక నాలుగవ పురుషార్థం మోక్షం. ఈ మూడు పురుషార్థాలూ సాధనాలయితే నాలుగవది సాధ్యం. ఇవి ధర్మబద్ధంగా అహంకారమమకారదూరంగా ఆచరింపగలిగితే అదికూడా సిద్ధించినట్లే.

2. ఆనందాంబుధి (ఆనందమనే సాగరం) కాయకనకం (శరీరమనే బంగారం), గాత్ర–హరిన్మణి (శరీరమనే పచ్చను) ఇవన్నీ రూపకాలంకారాలు, ఉపమేయాలలో ఉపమానత్వాన్ని ఆరోపించినందువల్ల.

| | | | |
|---|---|---|---|
| 3. **అతనోత్ :** | **అతనోత్** | అతనుతామ్ | అతన్వన్ |
| | అతనోః | అతనుతమ్ | అతనుత |
| | అతనవమ్ | అతనువ/అతన్వ | అతనుమ/అతన్మ |
| 4. **చక్రే :** | **చక్రే** | చక్రాతే | చక్రిరే |
| | చకృషే | చక్రాథే | చకృఢ్వే |
| | చక్రే | చకృవహే | చకృమహే |
| **దధార :** | **దధార** | దధ్రతుః | దధ్రుః |
| | దధర్థ | దధ్రథుః | దధ్ర |
| | దధార/దధర | దధృవ | దధృమ. |

*

**శ్లో॥ గర్భం బభార గజరమ్యగతిః స్వకాన్తా–న్మధ్యే మనోజ్ఞమదనాత్మకమబ్ధిపుత్త్రీ ।**
**హృద్యప్యయోగచకితే హృదయంగమస్య – మర్త్యానుకారచరితస్య తమేవ తన్వీ॥26**

**అ :** రుక్మిణి గర్భవతి కావటం. –వసంతతిలక.

**అ :** గజ–రమ్య–గతిః అబ్ధి–పుత్త్రీ మధ్యే మనోజ్ఞ–మదన+ఆత్మకం గర్భం స్వ–కాంతాత్ బభార. హృదయంగమస్య మర్త్య+అనుకార–చరితస్య అయోగ–చకితే హృది అపి తమ్ ఏవ బభార.

**ప్ర :** గజ–రమ్య–గతిః : గజ = ఏనుగుయొక్క, రమ్య = అందమైన, గతిః = నడకగల (గజస్య రమ్యా చ సా గతిః ఇవ గతిః యస్యాస్సా), అబ్ధి–పుత్త్రీ = కడలి కూతురు (అబ్ధేః పుత్త్రీ), తన్వీ = సన్ననిది అయిన రుక్మిణి, మధ్యే = కడుపున, మనః... ఆత్మకమ్ : మనోజ్ఞ = అందమైన, మదన+ఆత్మకమ్ = మన్మథస్వరూపమైన (మనోజ్ఞస్య మదనస్య ఆత్మకః, తమ్), గర్భమ్ = గర్భాన్ని, స్వ–కాంతాత్=తన భర్తద్వారా (స్వస్య కాంతః తస్మాత్),

బభార = ధరించింది. (భృ భరణే భ్వాది పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), హృదయంగమస్య = మనోహరమైన, మర్త్య+అనుకార-చరితస్య = మానవులను అనుకరించే నడవడిగల కృష్ణునియొక్క (మర్త్యస్య అనుకారం, తచ్చ చ తత్ చరితం యస్య తస్య), అయోగ-చకితే : అయోగ = వియోగంచేత, చకితే = బెదిరిన (అయోగేన చకితం, తస్మిన్), హృది+అపి = మనస్సులో గూడ, తమ్-ఏవ = దానినే (కామరూపగర్భాన్నే - కామ ప్రవృత్తినే) (బభార = ధరించింది).

**తా ॥** గజగామిని అయిన రుక్మిణి అందమైన కామస్వరూపమైన గర్భాన్ని తన భర్తద్వారా పొందింది. మర్త్యునివలె ప్రవర్తించటానికే ఇష్టపడే నడవడిగల కృష్ణునితో (శారీరక) వియోగాన్ని గురించి భయపడుతూ తన మనస్సులో కూడా కామ (కోరిక) రూపమైన గర్భాన్ని ధరించింది.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. బభార :** | **బభార** | బభ్రతుః | బభ్రుః |
| | బభర్థ | బభ్రథుః | బభ్ర |
| | బభార/బభర | బభృవ | బభృమ. |

*

**శ్లో॥ మారం కుమారం సుషువేఽథ భైష్మీ - శౌరేర్జితారేరనురూపరూపమ్ ।**
**ప్రాచీవ శోచిశ్శతపూరితాశం - ప్రాచాం సువాచాం విషయం నిశేశమ్ ॥ 19-27**

**అ :** రుక్మిణికి కొడుకు పుట్టడం. -ఇంద్రవజ్ర.

**అ :** అథ ప్రాచీ శోభితశ్శత-పూరితాశం ప్రాచాం సువాచాం విషయం నిశా+ఈశమ్ ఇవ. భైష్మీ జిత+అరేః శౌరేః అనురూప-రూపం మారం కుమారం సుషువే.

**ప్ర :** అథ = అటుతర్వాత, ప్రాచీ=తూర్పుదిక్కు, శోచిః-శత = వందకిరణాలతో (రోచిశ్శోచిరుభే క్లీబే-అమరకోశః -కాల-34), పూరిత = నింపబడిన, ఆశమ్ = దిక్కులు గలవాడూ (పూరితాః ఆశాః యేన తమ్), ప్రాచామ్ = ప్రాచీనులయొక్క, సువాచామ్ = మంచిమాటలకు, విషయమ్ = విషయమైనవాడూ అయిన, నిశా+ఈశమ్ ఇవ = చంద్రునివలె (నిశాయాః ఈశః తమ్), భైష్మీ = రుక్మిణి, జిత+అరేః = జయింపబడిన శత్రువులుగల (జితాః అరయః యేన తస్య), శౌరేః = కృష్ణునకు, అనురూప-రూపమ్ : అనురూప = తగినట్టి, రూపమ్ = రూపంగల (అనురూపం రూపం యస్య తమ్), మారమ్ = మదనుని, కుమారమ్ = కుమారునిగా, సుషువే = కన్నది. (సూ ప్రాణిగర్భవిమోచనే-అదాది-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.).

**తా ॥** వందలకిరణాలతో దిక్కులను నింపుతూ ప్రాచీనులైన కవుల వాక్కులకు విషయమైన చంద్రుని ప్రాచీదిక్కు ప్రసవించినట్లు మురారికి అనురూపమైన రూపంగల మారకుమారుని రుక్మిణి ప్రసవించింది.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. సుషువే :** | **సుషువే** | సుషువాతే | సుషువిరే |
| | సుషువిషే | సుషువాథే | సుషువిధ్వే |
| | సుషువే | సుషువివహే | సుషువిమహే. |

*

**శ్లో॥ యః కర్ణే నిజచిహ్నమున్నతశరాన్ దన్తోష్ఠదృగ్దోఃపదే**
**స్వాంగం మధ్యతనౌ భ్రువోర్వరధనుర్మౌర్వీం లసత్కున్తలే ।**
**మాల్యే మన్త్రిణమాననే చ సుహృదం వాక్యేఽర్పయిత్వా శుకం**
**తద్గాత్రం రచయామ్బభూవ స సుతస్తస్య స్మరోఽభూత్కిల ॥ 19-28**

**అ :** స్మరుడు కృష్ణునికి కుమారుడు కావటంలోని విశేషం. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యః (కృష్ణస్య) కర్ణే నిజ-చిహ్నమ్ దంత+ఓష్ఠ-దృగ్-దోః-పదే ఉన్నత-శరాన్ మధ్య-తనౌ స్వ+అంగం

భ్రువోః వర-ధనుః లసత్-కుంతలే మౌర్వీం మాల్యే మంత్రిణమ్ ఆననే చ సుహృదం వాక్యే శుకమ్ అర్పయిత్వా తద్-గాత్రం రచయామ్బభూవ సః స్మరః తస్య సుతః అభూత్ కిల.

**ప్ర :** యః = ఎవడయితే, కర్ణే = చెవియందు, నిజ-చిహ్నమ్ = తన ధ్వజం గుర్తును (మకరాన్ని) (మదనుడు మకరలాంఛనుడు, చెవినగలు మకరకుండలాలు), దంతో... పదే : దంత = పళ్ళు, ఓష్ఠ = పెదవి, దృగ్ = చూపులు, దోః = భుజాలు, పదే = పాదాలు - వీటియందు (దంతాశ్చ ఓష్ఠశ్చ దృశౌ చ దోశ్చ పదంచ తస్మిన్ - '**ద్వంద్వశ్చ ప్రాణితూర్య-సేనాంగానామ్**' (అష్టాధ్యాయి 2-4-2) సూత్రంతో ఏకవద్భావం), ఉన్నత-శరాన్ = మేటి అమ్ములను (మల్లిక, మామిడి, కలువ, తామర, అశోకాలను), మధ్య-తనౌ = నడుముపై (మన్మథుని శరీరం కనిపించదు. ఆయన అనంగుడు గదా), స్వ అంగమ్ = తన శరీరాన్ని (స్వస్య అంగమ్), భ్రువోః = కనుబొమలపై, వర-ధనుః = మేటి వింటిని (వరం చ తత్ ధనుః), లసత్-కుంతలే : లసత్ = ప్రకాశిస్తున్న, కుంతలే = కురులయందు (జాత్యేకవచనం), మౌర్వీమ్ = అల్లెత్రాటిని (తుమ్మెదల బారు మదనుని అల్లెత్రాడు), మాల్యే = వనమాలయందు, మన్త్రిణమ్ = మంత్రినీ (వసంతునీ), ఆననే = ముఖంలో, సుహృదమ్ = మిత్రునీ, వాక్యే = మాటలో, శుకమ్ = చిలుకను, అర్పయిత్వా = అర్పించి, తద్-గాత్రమ్ = ఆ (కృష్ణుని) శరీరాన్ని, రచయామ్బభూవ = రచించాడో (రచ ప్రతియత్నే-పరస్మైపది-లిట్-ప్ర.ఏ.), సః స్మరః = ఆ మదనుడు, తస్య = ఆ కృష్ణునకు, సుతః = కుమారుడు, అభూత్ కిల = అయ్యాడు గదా! (భూ సత్తాయాం-భ్వాది-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా ॥** మదనుడు చెవిలో తనలాంఛనాన్ని, పలువరుసలో మల్లెలను, పెదవులలో మావిని, చూపులలో కలువలను, భుజాలలో అరవిందాలను, పాదాలలో అశోకాన్ని, నడుములో తన శరీరాన్ని, కనుబొమలలో తన వింటినీ, కురులలో తుమ్మెదల బారును, మాలలలో తన మంత్రినీ, ముఖంలో తనమిత్రునీ, మాటలలో చిలుకను సమర్పించి కృష్ణుని శరీరాన్ని నిర్మించాడో ఆ మదనుడే ఇప్పుడు ఆ కృష్ణుని కొడుకయ్యాడు గదా!

**వి :** 1. **రచయామ్బభూవ :** 19-22వ శ్లోకవ్యాఖ్య చూడుడు.

| | | | |
|---|---|---|---|
| 2. **అభూత్ :** | **అభూత్** | అభూతామ్ | అభూవన్ |
| | అభూః | అభూతమ్ | అభూత |
| | అభూవమ్ | అభూవ | అభూమ. |

*

## శ్లో॥ తారుణ్యలావణ్యసువీర్యధైర్య-కారుణ్యముఖ్యైర్ద్రవిణైః ప్రకృష్టః ।
## ప్రద్యుమ్ననామార్థమసౌ కుమారః - ప్రద్యుమ్నముఖ్యాంశయుతః పిపర్తి ॥19-29

**అ :** ప్రద్యుమ్నుని సార్థకనామధేయత్వకథనం. -ఇంద్రవజ్ర.

**అ :** తారుణ్య-లావణ్య-సువీర్య-ధైర్య-కారుణ్య-ముఖ్యైః ద్రవిణైః ప్రకృష్టః ప్రద్యుమ్న-ముఖ్య-అంశ-యుతః అసౌ కుమారః ప్రద్యుమ్న-నామ-అర్థం పిపర్తి.

**ప్ర :** తారుణ్య... ముఖ్యైః : తారుణ్య = యౌవనం, లావణ్య = సౌందర్యం, సువీర్య = మంచి పరాక్రమం, ధైర్య = ధైర్యం, కారుణ్య = జాలి, ముఖ్యైః = మొదలగునవి ప్రధానమైన, ద్రవిణైః = సొమ్ములతో, ప్రకృష్టః = మిన్నయై, ప్రద్యుమ్న... యుతః : ప్రద్యుమ్న = ప్రద్యుమ్న(విష్ణువు)ని యొక్క, ముఖ్య+అంశ = ప్రధానాంశతో, యుతః = కూడియున్న (ప్రద్యుమ్నస్య ముఖ్యేన అంశేన యుతః), అసౌ = ఈ, కుమారః = కుమారుడు, ప్రద్యుమ్న-నామ+అర్థమ్ = 'ప్రద్యుమ్నుడు' అనే పేరుయొక్క అర్థాన్ని (ప్రకృష్టం ద్యుమ్నం యస్య సః ప్రద్యుమ్నః స ఇతి నామ్నః అర్థమ్), పిపర్తి = పాటిస్తున్నాడు. (పౄ పాలనపూరణయోః- పరస్మైపది-లట్-ప్ర.ఏ.).

**తా ॥** ప్రద్యుమ్నుడు ప్రద్యుమ్నుని (నారాయణుని)లోని ముఖ్యాంశతో పుట్టినవాడు. తారుణ్యం, లావణ్యం, వీర్యం,

ధైర్యం, కారుణ్యం వంటి గుణా లనే సొమ్ములతో అతిశయిస్తున్నవాడు. కాబట్టి ప్రద్యుమ్న నామాన్ని సార్థకం చేసికొన్నవాడు.

| | | | |
|---|---|---|---|
| వి : 1. పిపర్తి : | **పిపర్తి** | పిపూర్తః | పిపురతి |
| | పిపర్షి | పిపూర్థః | పిపూర్థ |
| | పిపర్మి | పిపూర్వః | పిపూర్మః. * |

**శ్లో॥ స రుగ్మవత్యాం కిల రుగ్మిపుత్ర్యాం - హరేః సుతోఽజీజనదాత్మజాతామ్ ।**
**అసూత తం యాఽమలహేమకల్ప-మసౌ స్వనామోచితమేవ బభ్రే ॥ 19-30**

**అ :** ప్రద్యుమ్నునకు రుగ్మవతియందు కొడుకు పుట్టుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః హరేః సుతః రుగ్మి-పుత్ర్యాం రుగ్మవత్యాం ఆత్మ-జాతమ్ అజీజనత్. యా అమల-హేమకల్పమ్ (సుతమ్) అసూత. అసౌ (రుగ్మవతీ) స్వ-నామ ఉచితమ్ ఏవ బభ్రే.

**ప్ర :** సః = ఆ, హరేః = కృష్ణునియొక్క, సుతః = కుమారుడు (ప్రద్యుమ్నుడు), రుగ్మి-పుత్ర్యామ్ = రుక్మియొక్క కుమార్తె అయిన (రుగ్మిణః పుత్రీ, తస్యామ్), రుగ్మవత్యామ్ = రుగ్మవతియందు, ఆత్మజాతమ్ = కుమారుని, అజీజనత్ = కన్నాడు. (జనీ ప్రాదుర్భావే ణిచ్-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.), యా = ఎవర్తుక, అమల-హేమకల్పమ్ = విశుద్ధసువర్ణంతో సమానమైన, తమ్ = కుమారుని, అసూత = ప్రసవించిందో (సూ ప్రాణిగర్భవిమోచే-ఆత్మనేపది-లుఙ్-ప్ర.ఏ.), అసౌ = ఆ రుగ్మవతి, స్వ-నామ = తన పేరునకు (స్వస్య నామ), ఉచితమ్ ఏవ = తగినదానినే, బభ్రే = భరించింది. (భృ భరణే భ్వాది-ఆత్మనేపది-లిట్-ప్ర.ఏ.)

**తా ॥** ఆ ప్రద్యుమ్నుడు రుగ్మి కూతురయిన రుగ్మవతి యందు కొడుకును కన్నాడు. బంగారం వంటి కొడుకును కన్న ఆ రుగ్మవతి తన పేరును సార్థకం చేసికొన్నది (రుగ్మమ్ అస్యాః అస్తీతి రుగ్మవతీ = బంగారు గలది).

| | | | |
|---|---|---|---|
| వి : 1. అజీజనత్ : | **అజీజనత్** | అజీజనతామ్ | అజీజనన్ |
| | అజీజనః | అజీజనతమ్ | అజీజనత |
| | అజీజనమ్ | అజీజనావ | అజీజనామ |
| బభ్రే : | **బభ్రే** | బభ్రాతే | బభ్రిరే |
| | బభృషే | బభ్రాథే | బభృఢ్వే |
| | బభ్రే | బభృవహే | బభృమహే. * |

**శ్లో॥ సపత్నసైన్యైరనిరుద్ధమాజౌ - యమామనన్తి హ్యనిరుద్ధసంజ్ఞమ్ ।**
**సదాఽఽశ్రితాభీప్సితవిత్తరాశి-ప్రదానకాలేఽప్యనిరుద్ధమన్యైః ॥ 19-31**

**అ :** ప్రద్యుమ్నకుమారుడైన అనిరుద్ధునకు అన్వర్థనామధేయత. -ఉపేంద్రవజ్ర.

**అ :** ఆజౌ సపత్న-సైన్యైః అనిరుద్ధం సదా ఆశ్రిత+అభీప్సిత-విత్త-రాశి-ప్రదాన-కాలే అపి అన్యైః అనిరుద్ధం యం హి అనిరుద్ధ-సంజ్ఞమ్ ఆమనన్తి.

**ప్ర :** ఆజౌ = యుద్ధంలో, సపత్న-సైన్యైః సపత్న = శత్రువులయొక్క (ద్విషౌ వైరి సపత్నారి-అమరకోశః-క్షత్ర-10), సైన్యైః = సేనలచేత, అనిరుద్ధమ్ = అడ్డగింపబడనివాడూ, సదా = ఎల్లప్పుడు, ఆశ్రిత... కాలే అపి : ఆశ్రిత = ఆశ్రయించినవారియొక్క, అభీప్సిత = కోరిక అయిన, విత్త = ద్రవ్యంయొక్క, రాశి = మొత్తంయొక్క, ప్రదాన-కాలే అపి = ఇచ్చే సమయంలోకూడా, అన్యైః = ఇతరులచే, అనిరుద్ధమ్ = అడ్డగింపబడనివానినిగా, యమ్ = ఎవనిని, అనిరుద్ధ-సంజ్ఞమ్ = అనిరుద్ధడన్నపేరుతో, ఆమనన్తి = వ్యవహరిస్తున్నారో! (ఆ మన్ అవబోధనే-తుదాది-పరస్మైపది-లట్-ప్ర.బ.).

**తా ॥** ఆ ప్రద్యుమ్నుని కుమారుని అనిరుద్ధుడని వ్యవహరిస్తారు. ఆయన యుద్ధంలో శత్రువులచేత అనిరుద్ధుడు. ఆశ్రితుల అభీష్టానికి అనుగుణంగా విత్తరాశిని ఇచ్చేటప్పుడు కూడా ఇతరులచే అనిరుద్ధుడే.

| | | | | |
|---|---|---|---|---|
| **వి :** 1. **ఆమనన్తి :** | ఆమనతి | ఆమనతః | **ఆమనన్తి** | |
| | ఆమనసి | ఆమనథః | ఆమనథ | |
| | ఆమనామి | ఆమనావః | ఆమనామః. | * |

**శ్లో॥ ఉషాభిధాయాం స చ వజ్రసంజ్ఞ-మజీజనద్వైరినగౌఘవజ్రమ్ ।**
**తమఃసమున్మూలనముజ్జ్వలన్త-ముషస్యశీతాంశుమివోదయాద్రిః ॥ 19-32**

**అ :** అనిరుద్ధునకు ఉషయందు వజ్రుడు పుట్టుట. -ఉపేంద్రవజ్ర.

**అ :** సః చ ఉదయ+అద్రిః ఉషసి తమః+సమున్మూలనమ్ ఉజ్జ్వలన్తమ్ అశీత+అంశుమ్ ఇవ ఉషా+అభిధాయాం వైరి-నగ+ఓఘ-వజ్రం వజ్ర-సంజ్ఞమ్ అజీజనత్.

**ప్ర :** సః చ = ఆ అనిరుద్ధుడు కూడా, ఉదయ+అద్రిః = ఉదయపర్వతం, ఉషసి = వేకువన, తమః... నమ్ : తమః = చీకటిని, సమున్మూలనమ్ = తొలగింపజేసేవాడూ (తమసః) సమున్మూలనం యస్మాత్ తమ్), ఉజ్జ్వలన్తమ్ = ప్రకాశించేవాడూ అయిన, అశీత+అంశుమ్ ఇవ = సూర్యునిలా, (అశీతాః అంశవః యస్య తమ్), ఉషా+అభిధాయామ్ = ఉషయందు (ఉషేతి అభిధా యస్యాః తస్యామ్), వైరి... వజ్రమ్ : వైరి = శత్రువు లనే, నగ = కొండలయొక్క, ఓఘ = సమూహానికి, వజ్రమ్ = వజ్రాయుధం వంటివాడై, వజ్ర-సంజ్ఞమ్ = వజ్రుడనే పేరుగల, సుతమ్ = కుమారుని, అజీజనత్ = కనెను. (జనీ ప్రాదుర్భావే-ణిచ్-పరస్మైపది-లుఙ్-ప్ర.ఏ.)

**తా॥** ఉదయాద్రి ఉషఃకాలంలో చీకట్లను పారద్రోలే ప్రకాశవంతుడైన సూర్యుని ప్రసవించినట్లు అనిరుద్ధుడు ఉషయందు శత్రుపర్వతసమూహానికి వజ్రాయుధంవంటి వజ్రుణ్ణి కన్నాడు.

**వి :** 1. 'వైరినగ' (శత్రుపర్వత) మన్నచోట రూపకాలంకారం.

ఉదయపర్వతం సూర్యునివలె అనిరుద్ధుడు వజ్రుణ్ణి కన్నాడనటంలో ఉపమాలంకార ముంది.

2. **అజీజనత్ :** 19-30వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ యః పృథ్వీపతిమౌళిరత్నఘటితశ్రీపాదపీఠః క్షితౌ**
**యః స్వర్గీశ్వరఫాలమణ్డనకరశ్రీపాదరేణుర్దివి ।**
**యః శ్రేయఃపథపాన్థసజ్జనమనఃపాథేయగేయోదయ-**
**స్తస్య ద్వారవతీ పురీ ప్రియతమా సేయం బభూవాసమా ॥ 19-33**

**అ :** ద్వారావతి కృష్ణునకు ఇష్టమైనదనుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** యః క్షితౌ పృథ్వీ-పతి-మౌళి-రత్న-ఘటిత-శ్రీ-పాద-పీఠః యః దివి స్వర్గి+ఈశ్వర-ఫాల-మండన-కర-శ్రీ-పాద-రేణుః. యః శ్రేయః-పథ-పాన్థ-సత్-జన-మనః-పాథేయ-గేయ+ఉదయః తస్య ద్వారవతీ పురీ ప్రియతమా. సా ఇయమ్ అసమా బభూవ.

**ప్ర :** యః = ఎవరయితే, క్షితౌ = భూమిపై, పృథ్వీ... పీఠః : పృథ్వీ-పతి = రాజులయొక్క, మౌళి = కిరీటాలయందలి, రత్న = రత్నాలతో, ఘటిత = కూర్చబడిన, శ్రీ = శోభగల, పాద-పీఠః = పాదపీఠం గలవాడో (పృథ్వ్యాః పతయః, తేషాం మౌళిషు స్థితైః రత్నైః ఘటితా శ్రీః యస్య, స చ అసౌ పాదయోః పీఠః యస్య సః), యః =

ఎవరయితే, దివి = స్వర్గలోకంలో, స్వర్గీ... రేణుః : స్వర్గి+ఈశ్వర = దేవేంద్రునియొక్క, ఫాల = నుదుటికి, మండన–కర = అలంకరణను కూర్చే, శ్రీ = మంగళకరమైన, పాద–రేణుః = పాద ధూళి గలవాడో (స్వర్గిణామ్ ఈశ్వరస్య ఫాలస్య మండనం కరోతీతి స చాసౌ శ్రీపాదరేణుః యస్య సః), యః = ఎవరయితే, శ్రేయః... దయః : శ్రేయః పథ = మోక్షమార్గంలో, పాన్థ = బాటసారులైన, సత్–జన = సత్పురుషులయొక్క, మనః = మనస్సులకు, పాథేయ = దారిబత్తెమైన (పథి హితమ్), గేయ+ఉదయః = కీర్తనల పుట్టుక గలవాడో (శ్రేయసః పథి పాన్థానాం సతాం చ తేషాం జనానాం మనసాం పాథేయస్య గేయస్య ఉదయః యస్య సః), తస్య = ఆ కృష్ణునకు, సా ఇయమ్ = ఆ ఈ, అసమా = సాటిలేని, ద్వారావతీ పురీ = ద్వారకానగరి, ప్రియతమా = మరీ ఇష్టమైనదిగా, బభూవ = అయింది. (భూ సత్తాయామ్ భ్వాది–పరస్మైపది–లిట్–ప్ర.ఏ.)

**తా ။** భూలోకంలో రాజులందరూ ఆయనకు మ్రొక్కి తమ కిరీటరత్నకాంతులతో ఆ పాదపీఠాన్ని శోభింపజేస్తారు. స్వర్గలోకంలో దేవేంద్రుని నుదుటికి అలంకారంగా ఆయన శ్రీపాదరేణువు వుంటుంది. మోక్ష మార్గంలో పయనిస్తున్న మంచి బాటసారుల మనస్సులకు ఆయనను గురించి కీర్తించటమే పాథేయం. అటువంటి కృష్ణునకు ఇష్టమైనది ద్వారావతి. అది సాటిలేనిది.

**వి :** 1. ద్వారవతికి, అక్కడి ప్రజలకు, కృష్ణునకు అవిభాజ్యమైన సంబంధం. అందుకే ఆ నగరి నిరుపమానమయింది. హరియే తమ సర్వస్వమని భావిస్తున్న ద్వారకావాసుల ప్రవృత్తిని పోతన మనోహరంగా చిత్రించారు.

సీ. ఆసక్తి కృష్ణముఖావలోకనమంద – హరిపాదసేవనమంద చింత
వెఱపు నారాయణవిముఖకార్యములంద – పారవశ్యము విష్ణుభక్తియంద
బాష్పనిర్గతి చక్రిపద్యసంస్తుతులంద – పక్షపాతము శార్ఙ్గి భక్తులంద
లేమి గోవిందాన్యలీలాచరణమంద – శ్రమము గోవిందపూజనములంద

తే. బంధ మచ్యుతేతరదుష్టపథములంద – జ్వరము మాధవవిరహితక్షణములంద
మత్సరము లీశకైంకర్యమతములంద – నరవరోత్తమ! వినుము తన్నాగరులకు. – 10/1609

2. **బభూవ :** 19–22వ శ్లోకవ్యాఖ్య చూడుడు. *

**శ్లో॥ మధ్యే సముద్రం మణిమఞ్జుమౌళి–విద్యోతితాశాదశకః స దేవః ।**
**అద్యాపి భైష్మ్యా సహ భాసయంస్తా–మాద్యః పుమానార్యవృతః కిలాస్తే ॥ 19–34**

**అ :** సముద్రమధ్యంలో భాసిస్తున్న రుక్మిణీకృష్ణుల వర్ణన. –ఇంద్రవజ్ర.

**అ :** మణి–మంజు–మౌళి–విద్యోతిత+ఆశా–దశకః ఆద్యః పుమాన్ ఆర్య–వృతః సః దేవః అద్య అపి మధ్యే సముద్రం తాం భాసయన్ భైష్మ్యా సహ ఆస్తే కిల.

**ప్ర :** మణి... దశకః : మణి = రత్నాలతో, మంజు = మనోహరమైన, మౌళి = కిరీటంతో (చూడా కిరీటం కేశాశ్చ సంయతా మౌళయస్త్రయః–అమరకోశః–నానార్థ–194), విద్యోతిత = వెలుగొందజేయబడిన, ఆశా–దశకం = పదిదిక్కులూ గలవాడూ (మణిభిః మంజునా మౌళినా విద్యోతితానామ్ ఆశానాం దశకః యస్య సః), ఆద్యః = తొలివాడైన (ఆదౌ భవః), పుమాన్ = పురుషుడు, ఆర్య–వృతః : ఆర్య = పూజ్యులచే, వృతః = చుట్టబడినవాడూ అయిన (ఆర్యైః వృతః), సః దేవః = ఆ స్వామి (కృష్ణుడు), అద్య అపి = నేడుకూడా, మధ్యే–సముద్రమ్ = కడలినడుమ, తామ్ = ఆ ద్వారవతిని, భాసయన్ = వెలిగింపజేస్తూ (భాస్–ణిచ్–ధాతువుపై శతృప్రత్యయం), భైష్మ్యా సహ = రుక్మిణితోపాటు, ఆస్తే కిల = ఉన్నాడుగదా! (ఆస్ ఉపవేశనే–ఆత్మనేపది–లట్–ప్ర.ఏ.).

**తా ॥** తన కిరీటరత్నకాంతులతో దశదిశలను వెలిగింపజేస్తూ ఆ పురాణపురుషుడు పూజ్యులందరూ తన చుట్టూ నిలిచివుండగా రుక్మిణితో కలిసి, ఆ ద్వారవతిని వెలిగింపజేస్తూ సముద్రమధ్యంలో వసిస్తున్నాడు.

| | | | |
|---|---|---|---|
| **వి : 1. ఆస్తే :** | **ఆస్తే** | ఆసాతే | ఆసతే |
| | ఆస్సే | ఆసాథే | ఆధ్వే |
| | ఆసే | ఆస్వహే | ఆస్మహే. |

*

**శ్లో॥ కుశస్థలీ సా కుశలైకగమ్యా - ప్రశస్తకీర్తేః ప్రథితా పురీయమ్ ।**
**శరీరిణాం సర్వపుమర్థసార్థ-కరీ నరీనర్తు మదన్తరఙ్గే ॥ 19-35**

**అ :** ద్వారక తన మనస్సులో సదా నిలవాలని కవి ప్రార్థన. -ఉపేంద్రవజ్ర.

**అ :** శరీరిణాం సర్వ-పుమ్-అర్థ-సార్థ-కరీ కుశల+ఏక-గమ్యా ప్రథితా ప్రశస్త-కీర్తేః సా ఇయం కుశ-స్థలీ పురీ మద్-అంతరంగే నరీనర్తు.

**ప్ర :** శరీరిణామ్= ప్రాణులకు, సర్వ... కరీ : సర్వ = సమస్తమైన, పుమ్-అర్థ = పురుషార్థాల యొక్క, సార్థ = సమూహాన్ని (సార్థస్తు వణి క్సంఘే చ సంహతౌ - నానార్థరత్నమాలా-పంక్తి-580), కరీ = కలిగించునదీ (సర్వేషాం పుమార్థానాం సార్థస్య కరీ), కుశల+ఏక-గమ్యా : కుశల+ఏక = సమర్థుడు మాత్రమే, గమ్యా = చేరదగినదీ (కుశలేన ఏకేన గమ్యా), ప్రథితా = ప్రసిద్ధమైనదీ అయిన, ప్రశస్త-కీర్తేః : ప్రశస్త = నుతింపబడిన, కీర్తేః = కీర్తిగల కృష్ణునియొక్క (ప్రశస్తా కీర్తిః యస్య తస్య), సా-ఇయమ్ = ఆ ఈ, కుశస్థలీ పురీ = ద్వారవతినగరం, మద్+అన్తరంగే = నా హృదయంలో, నరీనర్తు = నాట్యమాడుగాత! (నృత్ గాత్రవిక్షేపే-యఙ్లుకి-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** కుశస్థలి (ద్వారక) సర్వపురుషార్థాలనూ కల్గించగలది. సమర్థులు మాత్రమే చేరగలది. జగత్ప్రసిద్ధం. లోకనుతమైన కీర్తిగల కృష్ణుని పురమది. ఆ ద్వారక నా హృదయంలో నృత్యమాడుగాత!

| | | | |
|---|---|---|---|
| **వి : 1. నరీనర్తు :** **నరీనర్తు**/నరీనృత్తాత్/నరీనృతీతు | నరీనృత్తామ్ | నరీనృతతు |
| | నరీనృద్ధి/నరీనృత్తాత్ | నరీనృత్తమ్ | నరీనృత్త |
| | నరీనృతాని | నరీనృతావ | నరీనృతామ. |

*

**శ్లో॥ వన్దారుద్విజవర్యవాఞ్ఛితనిజధ్యానః క్షమాశఙ్కరః**
**స్వర్వాగ్మివ్రజవర్ణ్యదిగ్వితతికృత్కర్మౌఘరాజత్కరీ ।**
**రుద్రాణీపతిమాన్యరాజితగతిః సత్యాసహాయః సతాం**
**తాం రేమే వరదః స్వబన్ధురుచిరాం రక్షన్ పురీమద్భుతామ్ ॥ 19-36**

**అ :** కృష్ణద్వారవతీబంధం-కృష్ణమహానుభావత. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** వందారు-ద్విజ-వర్య-వాంఛిత-నిజ-ధ్యానః క్షమా-శం-కరః స్వః+వాగ్మి-వ్రజ-వర్ణ్య-దిగ్-వితతి-కృత్-కర్మ+ఓఘ-రాజత్-కరీ రుద్రాణీ-పతి-మాన్య-రాజిత-గతిః సత్యా-సహాయః సతాం వర-దః స్వ-బన్ధు-రుచిరామ్ అద్భుతాం తాం పురీం రక్షన్ రేమే.

**ప్ర :** వందారు... ధ్యానః : వందారు = నమస్కరణస్వభావంగల, ద్విజ-వర్య = బ్రాహ్మణ శ్రేష్ఠులచే, వాంఛిత = కోరబడిన, నిజ-ధ్యానః = తనధ్యానంగలవాడు (వందారుభిః ద్విజవర్యైః వాంఛితం నిజస్య ధ్యానం యస్య సః), క్షమా-శం-కరః : క్షమా = భూమికి (గౌరిలాకుంభినీ క్షమా - అమరకోశః-భూమి-4), శం = సుఖాన్ని, కరః = కలిగించేవాడు (క్షమాయాః శం కరోతీతి), స్వర్వా... కరీ : స్వః = స్వర్గమండలి, వాగ్మి = మాటకారులయొక్క,

వ్రజ = సమూహంచేత, వర్ణ్య = వర్ణింపదగిన, దిగ్ = దిక్కులయందు, వితతి–కృత్ = విస్తరించిన, కర్మ = పనులయొక్క, ఓఘ = సమూహంచేత, రాజత్ = ప్రకాశించే, కరీ = ఏనుగులు గలవాడూ (స్వః వాగ్మినాం వ్రజేన వర్ణ్యాని, దిశాం వితతిం కృన్తి చ తాని కర్మాణి, తేషామ్ ఓఘైః రాజత్ కరీ అస్య అస్తీతి), రుద్రాణీ... గతిః : రుద్రాణీ–పతి = శివునిచే, మాన్య = గౌరవింపదగిన, రాజిత = ప్రకాశించే, గతిః = గమనంగలవాడూ (రుద్రాణీపతినా మాన్యా రాజితా చ గతిః యస్య సః), సత్యా–సహాయః = సత్యభామతోడుగా గలవాడూ (సత్యా సహాయః యస్య సః), సతామ్ = సజ్జనులకు, వర–దః = వరదాత (వరాన్ దదాతీతి), స్వ–బంధు–రుచిరామ్ : స్వ = తనయొక్క, బంధు = బంధువులకు, రుచిరామ్ = ఇష్టమైనదీ (స్వస్య బంధవః, తేషాం రుచిరా, తామ్), అద్భుతామ్ = అద్భుతమైనదీ అయిన, తామ్ = ఆ, పురీమ్ = నగరిని, రక్షన్ = రక్షిస్తూ, రేమే = క్రీడించాడు. (రమ్ క్రీడాయాం ఆత్మనేపది–లిట్–ప్ర.ఏ.).

**తా ॥** నమస్కరణశీలురైన ద్విజశ్రేష్ఠులచే కోరబడిన నిజధ్యానశీలత గలవాడూ, భూమికి శుభంకరుడూ, దేవలోకంలోని వాగ్మలచే వర్ణింపబడిన, దిగంతవిస్తృతమైన కర్మసమూహా లనే గజరాజులు గలవాడూ, శంకరునిచే సమ్మానింపబడిన కైలాసయాత్రగలవాడూ, సత్యభామా సహాయుడూ, వరదుడు అయిన కృష్ణుడు తన బంధువులు మెచ్చిన ఆ అద్భుతమైన ద్వారకను రక్షిస్తూ ఆనందించాడు.

**వి :** 1. ఇది చక్రబంధశ్లోకం.

| | | | | |
|---|---|---|---|---|
| 2. **రేమే :** | రేమే | రేమాతే | రేమిరే | |
| | రేమిషే | రేమాథే | రేమిధ్వే | |
| | రేమే | రేమివహే | రేమిమహే. | * |

**శ్లో॥ కృష్ణస్యోదయవర్ణనైః సుచరితస్తోమస్తవైః సూక్తిభిః**
**సుశ్లోకైః సుభగా రసైశ్చ వివిధైః స్వానందసర్గైర్వృతా ।**
**దుష్టాగమ్యనిజార్థతోషితఖగా సాఽస్యాః కృతేర్వైఖరీం**
**బిభ్రాణేవ విభాతి విట్ఠలపురీ విష్వక్సువర్ణోజ్జ్వలా ॥ 19–37**

**అ :** కావ్యవైశిష్ట్యవర్ణన–కావ్యవైఖరిని ధరిస్తున్న విట్ఠలపురీ ప్రస్తావన. –శార్దూలవిక్రీడితమ్.

**అ :** కృష్ణస్య ఉదయ–వర్ణనైః సు–చరిత–స్తోమ–స్తవైః సూక్తిభిః సుశ్లోకైః సుభగా, వివిధైః రసైః సు+ఆనంద–సర్గైః చ వృతా దుష్ట+అగమ్య–నిజ+అర్థ–తోషిత–ఖగా విష్వక్–సువర్ణ+ఉజ్జ్వలా సా విట్ఠల–పురీ అస్యాః కృతేః వైఖరీం బిభ్రాణా ఇవ విభాతి.

**ప్ర :** కృష్ణస్య = కృష్ణునియొక్క, ఉదయ–వర్ణనైః = అభ్యుదయవర్ణనలచే (ఉదయస్య వర్ణనాని, తైః), సుచరిత... స్తవైః : సుచరిత = సచ్చరిత్రల (నడవడుల)యొక్క, స్తోమ = సమూహం యొక్క, స్తవైః = స్తోత్రాలచే (సుచరితానాం స్తోమః, తస్య స్తవైః), సూక్తిభిః = మంచి మాటలచే, సుశ్లోకైః = మంచి పనులచే/ మనుషులచే/మంచిశ్లోకాలతో, సుభగా = మనోహర మైనదీ, సు+ఆనంద–సర్గైః : సు+ఆనంద = సదానందాన్ని, సర్గైః = సృష్టించే/(సమీచీనస్య ఆనందస్య సర్గః యేభ్యః తైః) (సదానందకరసర్గలతో), వివిధైః రసైః = అనేక రసాలతో, వృతా = కూడినదీ, దుష్టా... ఖగా : దుష్ట = చెడ్డవారిచే, అగమ్య = పొందరాని, నిజ = తనయొక్క, అర్థ = ఫలాలచే, తోషిత = ఆనందింపజేయబడిన, ఖగా = పక్షులు గలదీ/దేవతలుగలదీ (దుష్టైః అగమ్యైః నిజస్య అర్థైః తోషితాః ఖగాః యయా సా), విష్వక్–సువర్ణ+ఉజ్జ్వలా : విష్వక్ = అంతటా, సువర్ణ = బంగారుతో/మంచి అక్షరాలతో, ఉజ్జ్వలా = ప్రకాశించేదీ అయిన (విష్వక్ సువర్ణేన ఉజ్జ్వలా), విట్ఠలపురీ = విట్ఠలపురం, అస్యాః = ఈ, కృతేః =

కావ్యంయొక్క, వైఖరీమ్ = విధానాన్ని, బిభ్రాణా ఇవ = భరిస్తున్నట్టుగా, విభాతి = ప్రకాశిస్తోంది. (వి–భా దీప్తౌ పరస్మైపది–లట్–ప్ర.ఏ.)

**తా ॥** విట్ఠలనగరం ఏతత్కావ్య వైఖరిని అనుసరిస్తోంది. ఉభయత్ర కృష్ణాభ్యుదయవర్ణనలే. ఉభయత్ర సుచరితసమూహాల స్తోత్రాలే. ఉభయత్ర సూక్తులు, సచ్ఛ్లోకసముదాయం. ఉభయత్ర ఆనందసర్గం, వివిధరసాలసమ్మేళనం. దుష్టులకు అగమ్యమైన సత్ఫలాలు ఒకచోట అయితే అపండితులకు అర్థంకాని సదర్థాలు మరొకవైపు. ఉభయత్ర ఖేచరానందం. ఉభయత్ర సువర్ణ+ఉజ్జ్వలత.

**వి :** 1. శ్లేషానుప్రాణితమైన ఉపమాలంకారం. విట్ఠలపురికీ, కావ్యానికీ పోలిక.

| | | | |
|---|---|---|---|
| 2. **విభాతి :** | **విభాతి** | విభాతః | విభాన్తి |
| | విభాసి | విభాథః | విభాథ |
| | విభామి | విభావః | విభామః. |

*

**శ్లో॥ యస్మిన్ మఙ్గళదేవతాఽఖిలజగన్మాతా రమా నాయికా**
**పద్మాపద్మభవాదిసేవ్యచరణస్తద్వల్లభో నాయకః ।**
**అశ్వగ్రీవదయాపయోఽబ్ధిఫలితం ప్రాగ్ర్యోక్తిరత్నోజ్జ్వలం**
**తద్దాసానుగవాదిరాజరచితం కావ్యం విభావ్యం బుధైః ॥ 19–38**

**అ :** కావ్యవైశిష్ట్యప్రకటన–కావ్యకర్తృనామప్రకటనం. –శార్దూలవిక్రీడితమ్.



**అ :** యస్మిన్ మంగళ-దేవతా అఖిల-జగత్+మాతా రమా నాయికా పద్మా-పద్మ-భవ+ఆది-సేవ్య-చరణః తద్-వల్లభః నాయకః (తత్) అశ్వ-గ్రీవ-దయా-పయః+అబ్ధి-ఫలితం ప్ర+అగ్ర్య+ఉక్తి-రత్న+ఉజ్జ్వలం తద్-దాస+అనుగ-వాదిరాజు-రచితం కావ్యం బుధైః విభావ్యం (భవతి).

**ప్ర :** యస్మిన్ = దేనియందు, మంగళ-దేవతా = శుభకరదేవతా (మంగలానాం దేవతా), అఖిల-జగత్-మాతా = అన్ని లోకాలకు తల్లీ అయిన (అఖిలస్య జగతః మాతా), రమా = రుక్మిణి, నాయికా = నాయికయో, పద్మా... చరణః : పద్మా = లక్ష్మి, పద్మభవ = బ్రహ్మ (తమ్మిచూలి), ఆది = మొదలుగాగల వారిచే, సేవ్య = సేవింపదగిన, చరణః = పాదాలుగల, (పద్మా చ పద్మభవశ్చ పద్మాపద్మభవౌ, తౌ ఆదౌ యేషాం తైః, సేవ్యౌ చరణౌ యస్య సః ), తద్-వల్లభః = ఆమెభర్త (కృష్ణుడు), నాయకః = నాయకుడో, అశ్వ... ఫలితమ్ : అశ్వగ్రీవ = హయవదనునియొక్క, దయా = కృప అనే, పయః+అబ్ధి = పాలకడలియొక్క, ఫలితమ్ = ఫలరూపమూ (అశ్వగ్రీవస్య దయా ఏవ పయసామ్ అబ్ధిః, తస్య ఫలితమ్), ప్రాగ్ర్య... ఉజ్జ్వలమ్ : ప్రాగ్ర్య = మిక్కిలి శ్రేష్ఠమైన, ఉక్తి-రత్న = మాట లనే రత్నాలతో, ఉజ్జ్వలమ్ = ప్రకాశించేదీ (ప్రాగ్ర్యాః ఉక్తయః ఏవ రత్నాని, తైః ఉజ్జ్వలమ్), తద్దా... రచితమ్ : తద్-దాస = కృష్ణునిదాసులను, అను-గ = అనుసరించే, వాదిరాజ = వాదిరాజుచే, రచితమ్ = వ్రాయబడినదీ అయిన (తస్య దాసాన్ అనుగచ్ఛతీతి, స చ అసౌ వాదిరాజః, తేన రచితమ్), కావ్యమ్ = రుగ్మిణీశవిజయకావ్యం, బుధైః = పండితులచే, విభావ్యమ్ = స్వీకరింపదగింది.

**తా ॥** ఈ రుగ్మిణీశవిజయకావ్యంలో సకలజగన్మాత, మంగళదేవత అయిన రుక్మిణి నాయిక. లక్ష్మి, బ్రహ్మ మొదలయినవారు సేవించే పాదాలుగల రుక్మిణీవల్లభుడు నాయకుడు. ఈ కావ్యం హయగ్రీవకృపాపయోధి ఫలితం. మేలిమి మాటలు అనే రత్నాలతో ప్రకాశించేది. కృష్ణుని దాసులను అనుసరించి నడిచే వాదిరాజుచే రచింపబడింది. పండితులు ఆదరింప దగినదీ కావ్యం.

**వి :** 1. శ్లో॥ పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి ।
న కశ్చిత్తాదృశః పూర్వైః ప్రబంధాభరణీకృతః ॥

శ్లో॥ ప్రబంధానాం ప్రబంధౄణామపి కీర్తి ప్రతిష్ఠయోః ।
మూలం విషయభూతస్య నేతుర్గుణనిరూపణమ్ ॥ -ప్రతాపరుద్రీయమ్-నాయక-6,7

ప్రబంధాలకు కానీ, ప్రబంధకర్తలకు కానీ కీర్తిప్రతిష్ఠలకు కారణం నాయకగుణ నిరూపణమే. పుణ్యాత్ముని చరితమే కావ్యోదాహరణంగా నిలవడానికి యోగ్యతగలది.

మహాకావ్యరచన చేయదలచిన వాల్మీకి కూడా కావ్యనాయకుని స్వీకరించేందుకు నారదుని అడిగిన ప్రశ్నలో పదహారు గుణాలను ప్రస్తావిస్తాడు.

శ్లో॥ కోఽన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్ ।
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః ॥

శ్లో॥ చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః ।
విద్వాన్ కః కస్సమర్థశ్చ కశ్చైకప్రియదర్శనః ॥

శ్లో॥ ఆత్మవాన్ కో జితక్రోధః ద్యుతిమాన్ కోఽనసూయకః ।
యస్య బిభ్యతి దేవాశ్చ జాతరోషస్య సంయుగే ॥ - రామాయణం-బాల-1/2-4

ఇక సాక్షాత్తూ లక్ష్మీనారాయణులే కావ్యనాయికానాయకులైనపుడు ఇక ఆ కావ్య వైశిష్ట్యాన్ని గూర్చి చెప్పవలసినదేముంటుంది? *

శ్లో॥ కృష్ణః కావ్యకృతే స్వహస్తకమలచ్ఛత్రం ప్రదద్యాత్ ప్రభుః
సచ్ఛాస్త్రాభిధరమ్యరాజ్యపదవీం సుజ్ఞానయానం ముదా ।
స్వాంఘ్ర్యారాధనకఙ్కణం కరయుగే కైఙ్కర్యహారం గలే
స్వాత్మానం హృది నిత్యచిన్తనధనం సద్యుక్తిరత్నాన్యపి ॥ **19-39**

**అ :** కావ్యకర్త కావ్యనిర్మాణఫలంగా లౌకికభోగ్యవస్తుతుల్యమైన అలౌకికవస్తుసముదాయాన్ని కోరుట.
-శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రభుః కృష్ణః కావ్య-కృతే స్వ-హస్త-కమల+ఛత్రం సత్+శాస్త్ర+అభిధ-రమ్య-రాజ్య-పదవీం సుజ్ఞాన-యానం కర-యుగే స్వ+అంఘ్రి+ఆరాధన-కంకణం గలే కైంకర్య-హారం హృది స్వ+ఆత్మానం నిత్య-చిన్తన-ధనం సద్-యుక్తి-రత్నాని అపి ముదా ప్రదద్యాత్.

**ప్ర :** ప్రభుః = నాయకుడైన, కృష్ణః = కృష్ణుడు, కావ్య-కృతేః = కావ్యకర్తకు (కావ్యం కరోతీతి, తస్మై), స్వ... ఛత్రమ్ : స్వ-హస్త = తన చేయి అనే, కమల = కమల మనే, ఛత్రమ్ = గొడుగునూ (స్వస్య హస్తః ఏవ కమలం, తదేవ ఛత్రమ్), సత్... పదవీమ్ : సత్ = మంచి, శాస్త్ర = శాస్త్ర మనే, అభిధ = పేరుగల, రమ్య = రమణీయమైన, రాజ్య-పదవీమ్ = రాజ్యపదవిని (సత్ చ తత్ శాస్త్రం, తదభిధా రమ్యా చ సా రాజ్యస్య పదవీ తామ్), సుజ్ఞాన-యానమ్ : సుజ్ఞాన = సద్ జ్ఞాన మనే, యానమ్ = పల్లకీని (సుజ్ఞానమేవ యానమ్, తత్), కర-యుగే : కర = చేతులయొక్క, యుగే = జంటయందు (కరయోః యుగం, తస్మిన్), స్వ... కంకణమ్:స్వ=తనయొక్క, అంఘ్రి+ఆరాధన = పాదాల ఆరాధన మనే, కంకణమ్ = గాజును (స్వస్య అంఘ్ర్యోః ఆరాధనమ్ ఏవ కంకణమ్-తత్), గలే = కంఠంలో, కైంకర్య-హారమ్ = సేవ అనే హారాన్ని (కైంకర్యమేవ హారః , తమ్), హృది = మనస్సులో, స్వ+ఆత్మానమ్ = తననూ, నిత్య-చిన్తన-ధనమ్ : నిత్య = నిరంతరంగా, చిన్తన = తలచుకొనుట అనే, ధనమ్ = సొమ్మును, సద్-యుక్తి-రత్నాని అపి : సద్-యుక్తి = మంచి యుక్తులు అనే, రత్నాని-అపి = రత్నాలను కూడా (సత్యః చ తాః యుక్తయః ఏవ రత్నాని), ముదా = ఆనందంతో, ప్రదద్యాత్ = ఇచ్చునుగాక (ఇవ్వాలి) (ప్ర-దా దానే పరస్మైపది విధి లిఙ్-ప్ర.ఏ.).

**తా ॥** ఈ కావ్యనాయకుడైన కృష్ణుడు కావ్యకర్తకు తన కరకమల మనే గొడుగును, సచ్ఛాస్త్రా లనే మనోహరరాజ్యపదవిని, మంచిజ్ఞాన మనే పల్లకిని, తన పాదారాధన మనే గాజులను చేతులకూ, కంఠంలో కైంకర్యమనే హారాన్ని, హృదయంలో తననూ, నిత్యచింతనమనే ధనాన్నీ, సద్యుక్తు లనే రత్నాలను ఆనందంగా ఇచ్చుగాక!

**వి :** 1. శాస్త్రాభిధరమ్యరాజ్యపదవీం, సుజ్ఞానయానం ఆరాధనకంకణం, కైంకర్యహారం, చిన్తనధనం యుక్తిరత్నాని - ఇవన్నీ రూపకాలు. హస్తకమలచ్ఛత్రం అన్నచోట రూపకం మీద రూపకం చేతిలో కమలత్వారోపణ, ఆపై దానిలో ఛత్రత్వారోపణ.

కవి కోరిన ఉపమానస్థానవైభవాలన్నీ లౌకికసుఖభోగాలకు సంకేతాలు. కవి ఆ లౌకికభోగాలు అనిపించే పారలౌకికవైభవాన్నే కోరుతున్నాడు.

2. **ఇది కావ్యఫలశ్రుతి. కావ్యరచనాఫలశ్రుతి.**

పఠితలకూ, శ్రోతలకూ కలిగే ఫలాన్ని ఇతర ప్రదేశాలనుండీ గ్రహించాలి. విష్ణు సహస్రనామం నారాయణనామస్తోత్రఫలాన్ని ఇలా వివరిస్తుంది గదా!

శ్లో॥ య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్కించిత్సోఽముత్రేహ చ మానవః ॥ ... ...

శ్లో॥ ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజామ్ ॥ ... ... - విష్ణుసహస్రనామం-ఫలశ్రుతి-2,4

| | | | |
|---|---|---|---|
| 3. **ప్రదద్యాత్ :** | **ప్రదద్యాత్** | ప్రదద్యాతామ్ | ప్రదద్యుః |
| | ప్రదద్యాః | ప్రదద్యాతమ్ | ప్రదద్యాత |
| | ప్రదద్యామ్ | ప్రదద్యావ | ప్రదద్యామ. |

*

**శ్లో॥ హంసానాం హృదయంగమం కవిలసద్భృఙ్గాదృతం మౌక్తిక-**
**ప్రఖ్యాగ్ర్యోక్తినవం ప్రబన్ధజలజం పాదేఽర్పితం స్యాద్ధరేః ।**
**లక్ష్మీరమ్యకరే వరామరతతేః సన్మానసే శారదా-**
**నన్దం తత్పవనః స్వహృత్కృతగుణం విస్తారయత్వఞ్జసా ॥ 19-40**

**అ :** తాను నిర్మించిన కావ్యకమలంయొక్క సౌరభాన్ని ముఖ్యప్రాణదేవర చక్కగా వ్యాపింపజేయాలని కవి ఆకాంక్షించుట. -శార్దూలవిక్రీడితమ్.

**అ :** ప్రబన్ధ-జలజం హంసానాం హృదయంగమం, కవి-లసద్-భృంగ+ఆదృతం మౌక్తిక-ప్రఖ్య+అగ్ర్య+ఉక్తి-నవం (సత్) హరేః పాదే లక్ష్మీ-రమ్య-కరే వర+అమర-తతేః సత్+మానసే అర్పితం స్యాత్. శారదా+ఆనందం తత్ పవనః స్వ-హృత్-కృత-గుణమ్ అంజసా విస్తారయతు.

**ప్ర :** ప్రబన్ధ-జలజమ్ = కావ్యపద్మం (ప్రబన్ధ ఇతి జలజమ్), హంసానామ్ = హంసలకు/పరివ్రాజకులకు, హృదయంగమమ్ = మనస్సుకు నచ్చేదీ, కవి-లసద్-భృంగ+ఆదృతమ్ : కవి = కవులు అనే/ జలపక్షులచే, లసద్+భృంగ = వెలుగొందే తుమ్మెదలచే, ఆదృతమ్ = ఆదరింపబడినదీ (కవయః ఏవ లసన్తశ్చ తే భృంగాః, తైః ఆదృతమ్), మౌక్తిక... నవమ్ : మౌక్తిక-ప్రఖ్య = ముత్యాలవలె, అగ్ర్య = శ్రేష్ఠమైన, ఉక్తి = మాటలతో, నవమ్ (సత్) = నూతనమైనదై (మౌక్తికప్రఖ్యాః అగ్ర్యాః చ తాః ఉక్తయః, తాభిః నవమ్), హరేః = కృష్ణునియొక్క, పాదే = చరణంపై, లక్ష్మీ-రమ్య-కరే : లక్ష్మీ = రుక్మిణియొక్క, రమ్య-కరే = అందమైన చేతియందు (లక్ష్మ్యాః రమ్యః చ అసౌ కరః, తస్మిన్), వర+అమర-తతేః : వర = శ్రేష్ఠులైన, అమర = దేవతలయొక్క, తతేః = సమూహానికి (వరాశ్చ తే అమరాః, తేషాం తతిః, తస్యాః), సత్+మానసే = మంచి మనస్సునందు (జాత్యేకవచనం), అర్పితం స్యాత్ = అర్పింపబడుగాక! (అస భువి-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.), పవనః = ముఖ్యప్రాణుడు, శారదా+ఆనందమ్ : శారదా = సరస్వతికి, ఆనందమ్ = ఆనందహేతువైన (శారదాయాః ఆనందః యస్మాత్ తత్), తత్ = ఆ కావ్యాన్ని, స్వ... గుణమ్ : స్వ = తనయొక్క, హృత్ = హృదయంచేత, కృత = కల్పింపబడిన, గుణమ్ = పరిమళం వంటి గుణాలు గలదానినిగా చేసి (స్వేన హృదా కృతః గుణః యస్మిన్ తత్), అంజసా = చక్కగా (బాగా), విస్తారయతు = వ్యాపింపజేయుగాత! (వి-స్తృ ఆచ్ఛాదనే-ణిచ్-పరస్మైపది-లోట్-ప్ర.ఏ.)

**తా ॥** ఈ కావ్యపద్మం పరమహంసలకు హృదయంగమం. (కవులకూ) కవు లనే తుమ్మెదలకూ ఆదరణ యోగ్యం. (ముత్యాలకు) ముత్యాలవంటి మాటలకు నెలవు. ఇది కృష్ణుని చరణాలపై, లక్ష్మీ కరయుగ్మంపై, దేవతాతతి మనస్సులపై సమర్పింపబడి, శారదకే ఆనందకారణమై ముఖ్యప్రాణదేవరచేత తన హృదయంచే కల్పింపబడిన సౌరభాదిగుణాలు గలదై బాగా వ్యాప్తిని పొందుగాక!

**వి :** 1. శ్లేషానుప్రాణితమైన సావయవరూపకాలంకార మీ శ్లోకంలో.

2. కమలం హంసలకు హృదయంగమం. హంస కమలభవుని వాహనం. అయినా దానికి ఆ తామరతూడు లంటే ఇష్టం. అది గుణమే కావచ్చు. కానీ జాలిచూపవలసిన అంశంగా భావించాడు భాస్కరశతకకర్త.

ఉ. వంచన యింతలేక యెటువంటి మహాత్ముల నాశ్రయించినం
గొంచెమె కాని మేలు సమకూడ**దదృష్టము లేని వారికిన్**
సంచితబుద్ధి బ్రహ్మననశంబును వీఁపున మోచునట్టి **రా**
**యంచకుఁ** దమ్మితూండ్లు దినరాయెఁ గదా ఫలమేమి భాస్కరా!

3. ఉక్తినవత్వం కావ్యానికి ప్రాణం. కథ ప్రాచీనమైనా కథనంలో ఉక్తివైచిత్ర్యముండాలి. అప్పుడు కావ్యానికి నవత్వం సిద్ధిస్తుంది.

శ్లో॥ దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రసపరిగ్రహాత్ ।
సర్వే నవా ఇవాభాన్తి మధుమాస ఇవ ద్రుమాః ॥ – ధ్వన్యాలోకః 4/4

శ్లో॥ న చ తేషాం ఘటతేఽవధిః న చ తే దృశ్యన్తే కథమపి పునరుక్తాః ।
యే విభ్రమాః ప్రియాణామర్థా వా సుకవివాణీనామ్ ॥ – ధ్వన్యాలోకః 7 కారికావృత్తి

కావ్యార్థాలకు పునరుక్తులన్నవి లేవు. వక్తృప్రతిభావిశేషంతో ఏ భావమైనా, అంతుకు ముందెందరు స్పృశించినదైనా నవీనత్వాన్ని సంతరించుకొంటుంది. రసవత్తను సాధించటం మీదనే కవిదృష్టి వుంటే మధుమాసంలోని తరువుల్లాగా కావ్యగతభావాలు కూడా వినూతనంగా పల్లవిస్తాయి. అందువల్లనే అక్షరాల సంఖ్య ఏబదికి మించకపోయినా కావ్యాలు మాత్రం వేలకువేలు సిద్ధమవుతున్నాయి.

| | | | |
|---|---|---|---|
| 4. **స్యాత్ :** | **స్యాత్** | స్యాతామ్ | స్యుః |
| | స్యాః | స్యాతమ్ | స్యాత |
| | స్యామ్ | స్యావ | స్యామ |
| **విస్తారయతు :** | **విస్తారయతు**/విస్తారయతాత్ | విస్తారయతామ్ | విస్తారయన్తు |
| | విస్తారయ/విస్తారయతాత్ | విస్తారయతమ్ | విస్తారయత |
| | విస్తారయాణి | విస్తారయావ | విస్తారయామ. |

*

**శ్లో॥ రోమ్ణాం హర్షణకారిణి శ్రవణతః పాపౌఘవిధ్వంసిని**
**ప్రేమ్ణా చిన్తయతాం విచిత్రవిమలశ్లాఘ్యార్థసన్దాయిని ।**
**సఞ్జాతే భువి రుగ్మిణీశవిజయే సద్వాదిరాజోదితే**
**సర్గోఽభూత్ సురమణ్డలీషు సుతరామేకోనవింశో ముదామ్ ॥ 19-41**

**అ :** సర్గాంతశ్లోకం.

**తా ॥** ఏకోనవింశః = పందొమ్మిదవ దయిన, ముదామ్ = ఆనందాలయొక్క, సర్గః = సర్గ/సృష్టి, అభూత్ = అయింది – (మిగిలినది ప్రథమసర్గాంతశ్లోకం వలెనె.)

ఇతి శ్రీవాదిరాజతీర్థప్రణీతరుగ్మిణీశవిజయే ఏకోనవింశః సర్గః. *

ఇది శ్రీమత్కవికులతిలకశ్రీమద్వాజిరాజతీర్థ శ్రీచరణవిరచితమైన శ్రీరుక్మిణీశవిజయ మహాకావ్యంలో పందొమ్మిదవ సర్గ.

**శ్రీః**

***

# అకారాది శ్లోకానుక్రమణిక

## ద

## శ



## స

**శ్రీః**